# భారతి

## సచిత్రమాసపత్రిక

సంపాదకుడు

కా. నాగేశ్వరరావు



సంపుటము ౫, భాగము ౧.

ఆంధ్రపత్రికాముద్రాలయము - మద్రాసు

౧౯౨౮

# భారతి - పంచమసంపుటము — భా. ౧.

## వ్యాసముల అకారాది సూచి

ప

---

# భారతి - పంచమ సంపుటము - భా. ౧.

## వ్యాసకర్తల అకారాది సూచి

# విషయానుక్రమణిక

# చిత్రములు

త్రివర్ణచిత్రములు:—సిద్ధార్థుడు; నాట్యస్త్రీలు; ప్రాచీనభారతీయవస్త్రధారణవిధానము, వసంతఋతువు, అశ్వమేధయాగమునకు శ్వేతాశ్వమును విడుచుట.

సాధారణచిత్రములు:—డాక్టరు అన్సారీగారు, శ్రీ ముత్తురంగ మొదలియారుగారు; లక్ష్మి, సీతా రామ లక్ష్మణులు; *పానశాలచిత్రములు ౪; మొగలుచక్రవర్తుల యుద్ధచిత్రములు ౮; డాక్టరు అన్సారీగారి ఆగమనము; అఖిలభారతపారిశ్రామికవాణిజ్య ప్రదర్శన ప్రారంభోత్సవము; జాతీయ సేవాదళము; బెజవాడ దృశ్యములు ౧౬; ఇతరచిత్రములును.

---

*ఈచిత్రములు నాలుగిటిలో మొదటిది 'ది టైమ్సు ఆఫ్ ఇండియా ౧౯౨౭ సంవత్సరాది సంచికలోని త్రివర్ణ చిత్రమునుండియు, తక్కిన మూడును, ఎడ్మండు డూలకుగారి త్రివర్ణచిత్రములనుండియు గ్రహింపబడినవి.





సిద్ధార్థుడు - నాట్యస్త్రీలు

చిత్రకారుడు: శ్రీ చా. సత్యనారాయణగారు, రాజమండ్రి.



చెన్నపట్టణము, జనవరి ౧౯౨౮

సంపుటము ౫ ప్రభవ సంవత్సరము పుష్యమాసము సంఖ్య ౧

# స్వవిషయము



స్వవిషయ ప్రశంస స్వాభిమాన పరమై, యపోహాలకు గారణమై యుండును. ఆ ప్రశంస ఉప్పులేక ముప్పందుము త్రాగిన కథ చందమున నుండును. పెద్దపెద్ద యాలోచనలతోను, మాటలతోను, ప్రగల్భములతోను నారంభమైన ప్రయత్నములు సామాన్య ఫలమును గలిగియుండును. కోరికకును, ఫలమునకును గల వ్యత్యస్తము; సంకల్ప దార్బల్యమునందును, ఆదరణాభావమునందును గోచరంబగుచుండును. కార్యారంభమునందుగల్ల పరమోత్సాహము కాలక్రమమ్మున సన్నగిలుచున్నది. కొన్ని సమయములయందుత్సాహము పోయి నిరుత్సాహమును, కార్యపరత్వము పోయి వైరాగ్యస్వభావమును నేర్పడుచున్నవి. తమలోపములను మఱచి పరనిందలతో స్వంతృప్తినిం బొందుచుటను తటస్థించుచున్నది. గీతా [illegible]

శాస్త్ర ముపదేశించిన విధమున నిందా స్తోత్రములను, లాభ నష్టములను లక్ష్యము చేయక స్వధర్మనిర్వహణమును జేయుటయే మానవ ధర్మాభ్యుదయమునకు సాధనంబుగ నున్నది.

శ్లో. కర్మణ్యే వాఽధికారస్తే మా ఫలేషు కదాచన;
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి.
—గీ. అ. ౨, శ్లో. ౪౭.

విశ్వకల్యాణమహోత్సవ మఖండవైభవముతో నడుచుచున్నది. గ్రహతారాగణములు దివ్యమంగళహారతుల నర్పించుచున్నవి. బ్రహ్మాండగోళములు విశ్వశ్రుతిని మేళవించి పాడుచున్నవి. భూతజాలము లానంద నాట్యమును జేయుచున్నవి. మహానుభావులు విశ్వకల్యాణ మహోత్సవమును సందర్శించుచు బ్రహ్మానందమును బొందుచున్నారు. వారి దివ్యానుభవము సాహిత్యరూపమున మానవకల్యాణమునకు సాధనం బగుచున్నది. మహానుభావుల దివ్యసాహిత్యమువలె సామాన్యుల స్వల్పసాహిత్యములును కల్యాణమహోత్సవమును మంగళప్రదము చేయుచున్నవి. అనంతములైన స్వల్ప దీపావళులు విశ్వమహోత్సవము నానందప్రదము చేయుచున్నవి. భక్తియుక్తములైన హారతులు చిన్నవైనను సంప్రీతిని గలుగజేయుచున్నవి. శక్త్యనుసారముగను, భక్తిపూర్వకముగను విశ్వకల్యాణమున కాత్మార్పణము చేయుట పరమార్థమునకు సాధనంబుగ నున్నది. ప్రభులింగలీలలు హృద్యముగ వర్ణించిన సాహిత్య ధర్మము విశ్వకల్యాణమునకు సాహిత్యప్రయోజనమును విశదము చేయుచున్నది. సర్వతోముఖమైన మానవకల్యాణమునకు సాహిత్యకళావికాసములు సాధనములుగ నున్నవి. మానవాభ్యుదయమునకు మూలాధారములైన యాసాహిత్యకళావికాసములు ఆంధ్రాభ్యుదయమునకును సాధనములుగ నున్నవి. ఆసాధనంబుల నన్వేషించి రూపరేఖావిలాసంబులను గల్పించుట కనంతమైన సాధనసామగ్రి బయలుదేరుచున్నది. ఆంధ్రాభ్యుదయమునకు వెలువడుచున్న సాధనంబులందు భారతియును నొక సాధనముగ నున్నది.

భారతి రుధిరోద్గారి సంవత్సరము పుష్యమాసమునందు పుట్టినది. అపుడు కాకినాడయందు ౩౮-వ భారతజాతీయమహాసభ గూడినది. ప్రథమసంపుటమునందలి మొదటి సంచిక యందు స్వవిషయ సందర్భమున వ్రాసిన భావములు వర్తమానకాలమునందు సంస్మరింపదగి యున్నవి.

"ఆంధ్రదేశమునజన హృదయ ముత్సాహపూరితమై వర్తమానసమయమునందు భావకర్మరంగములందు నిర్మాణమార్గము నవలంబించుటకు పరితపించుచున్నది. కళాభిజ్ఞులు కళాభ్యుదయమునకుఁ బాటుపడుచున్నారు; పండితులు శాస్త్రపరిశోధనలకుఁ బూనుకొనుచున్నారు; కవులు మనోభావములను వర్ణించుచున్నారు; గాయకులు పాడుచున్నారు; చిత్రకారులు చిత్రించుచున్నారు; శాస్త్రజ్ఞులు పరిశోధించుచున్నారు. అన్నిదిశలయందును జిజ్ఞాస కాంతులు ప్రసరించుచున్నవి. అన్ని కులములవారును, మతములవారును ఆత్మోపలబ్ధిని బడయఁగోరుచున్నారు. ఆంధ్రహృదయమునందు స్వకీయమైన స్వరూప స్వభావ

ములను నిర్ణయించి స్వధర్మము నారాధింపవలయునను సంకల్పము గలిగెనది. ఆసంకల్పమును సఫలముచేయుటకు చిత్రకారులు, పండితులు, పరిశోధకులు, కళాప్రవీణులు, ప్రచారకులు చేయుచున్న పరిశ్రమ దేశవ్యాప్తమై ప్రజాపోషణమును బడయుచున్నది. దేశవ్యాప్తములైన ప్రయత్నముల నేకముఖమునను నాంధ్రప్రపంచమునకు స్వాయత్తముచేసి ప్రజాదృష్టిని నవజీవన ప్రవృత్తియందు లగ్నము చేయవలసిన యవసరము గలిగెనది. ఆయవసరమును సఫలము చేయుట కాంధ్రప్రపంచము పూర్వాపర సంస్కారములను సమన్వయమును జేయుటకుఁ బూనుకొనుచున్నది. ఆంధ్రప్రవృత్తిని పరిశీలించునపు డీవిషయము సువ్యక్తమగుచున్నది.”

భారతికి నాలుగేండ్లు నిండినవి. చెన్నపురియందు ౪౨-వ భారతజాతీయ మహాసభ ఇపుడు కూడుచున్నది. అప్పటికిని ఇప్పటికిని దేశపరిస్థితులందు విశేషమైన మార్పు గలిగినది. కాకినాడ కాంగ్రెసు సమయమునందు ప్రజలయందుగల యుత్సాహమును, సంయోగమును నిపుడు సన్నగిలినవి. ఎక్కడ జూచినను నంతఃకలహములు, ద్వేషగీతములు పెచ్చుపెరుగుచున్నవి. సహాయ నిరాకరణోద్యమము నామమాత్రావశిష్టముగ నున్నది. ఇప్పటికిని సంపూర్ణ సహాయ నిరాకరణవాదులు కొందరు నిలిచియున్నను చిత్తసంస్కారము సంకుచితముగ నున్నది. అసహాయోద్యమము నిర్ణయించిన త్రివిధబహిష్కారములును నంతరించినవి. శాసనసభాప్రవేశ మసహాయోద్యమమును నిర్వీర్యము చేసినది. స్వరాజ్యపక్షమును కాంగ్రెసుపక్షమును నేకభావము నారాధించినవి. ప్రతిష్టంభనము, ప్రతిఘటనము పోయి సహకారము వర్ధిల్లినది. సందిగ్ధమైన గౌహతితీర్మానము పరమానర్థములకు మూలమైనది. శాసనసభ్యులందు శాసనకర్తల మనుసహంకారము ప్రబలినది. వారికాలము ప్రశ్నలతోను నుపప్రశ్నలతోను, చిత్తుశాసనములతోను సరిపోవుచున్నది. ప్రజలు బోర్డుమెంబరు పదవులతోను, కక్షలతోను పెనుగులాడుచున్నారు. దేశమునం దంతటను నాయకులు బయలుదేరి ప్రజాహృదయములందు సంక్షోభమును గలుగజేయుచున్నారు. దేశమంతయును రాజ్యాంగాందోళనమునందు లగ్నమైన సమయమునందు సాహిత్యకళాభ్యుదయము సహజముగ వెనుకబడుచున్నది. రాజకీయ రంగమువలెను సాహిత్యార్థికాది రంగములును వాగ్వివాదములతో నిండి కార్యఘటనము దుస్తర మగుచున్నది. భారతి బాలారిష్టములను దాటినను సకలాంగ సౌష్ఠవమును గలిగి చాలినంత వికాసమును బొందకుండుట సంతాపకరముగ నున్నది.

గతించిన నాలుగేండ్లయందును త్రివర్ణఫలకములను, చిత్రములను తయారుచేయుటయందు కొంత కౌశలము సాధ్యమైనది. ప్రజాహృదయమునందు ప్రజ్వలించుచున్న భావవికాసమును కల్పనాకథలు, గీతములు, విమర్శనలు, పరిశోధనలు విశదము చేయుచున్నవి. చిత్రకళాభ్యుదయమును గత సంవత్సరమునందు ప్రచురించిన చిత్రపటములు విశదము చేయుచున్నవి. ఆంధ్రచిత్రకళ ప్రత్యేకము

వ్యక్తిత్వమును గలిగి వికాసమును బొందుచున్నది. గీతములు, కావ్యములు ప్రజాహృదయమునందు గలుగుచున్న మహాసంచలనమునకు నిదర్శనములుగ నున్నవి. క్రైస్తవులు, మహమ్మదీయులు, స్త్రీలు, బ్రాహ్మణేతరులు వ్రాసిన గద్య పద్యములు సర్వవ్యాప్తమైన సంచలనమును సువ్యక్తము చేయుచున్నవి. సర్వవ్యాప్తమైన సంచలనము ప్రత్యక్షముగ నున్నను సుస్థిరమును, సువిశాలమును నైన విజ్ఞానవ్యాపనము సాధ్యము గాకున్నది.

కార్యమునకును సంకల్పమునకునుగలయంతరమును గతకాలానుభవము విశదము చేయుచున్నది. ప్రజాహృదయమునందు ప్రత్యభిజ్ఞానము పరిస్ఫుటము గాకున్నది. ప్రజాలక్ష్యము పరసంస్కారమునందు లగ్నమగుచున్నటులు స్వీయసంస్కారమునందు లగ్నము గాకున్నది. ప్రజాలక్ష్యమును స్వీయసంస్కారమునందు లగ్నముచేసి ప్రత్యభిజ్ఞానమును గలుగజేయుటకు సర్వతోముఖమైన విజ్ఞానవ్యాపన మవసరంబుగ నున్నది. ఏతత్కార్యసాఫల్యమునకు బాటుపడుచున్న సాధకులు భారతీమతల్లి ధన్యవాదములకు బాత్రులు. ఆంధ్రభాషారాధకులును, చిత్రకళోపాసకులును, సాహిత్య విశారదులును భారతిని బోషించుటకు జేయుచున్న సహాయమునకు వారికి కృతజ్ఞతాంజలులను సమర్పించుచున్నాము. భారతీసేవయందు నిమగ్నమై నిర్విఘ్నముగ ప్రచురణమునకు దోడ్పడుచున్న కార్యనిర్వాహకవర్గమును ప్రశంసలకు పాత్రముగ నున్నది. భారతి చిరంజీవియై ఆంధ్రసాహిత్య కళాభ్యుదయమునకు వినియోగపడుటకు భగవంతు డనుగ్రహించుగాత !

---

# భారతీపత్రికా జయతు

బాలకవిః చిదిరేమఠీయ వీరభద్రశర్మా

(ప్రశ్నాః) (బహిరాలాపబంధః) (ఉత్తరాణి)

౧॥ క్రో వత్సరః ఖలు గతే ద్విజ, చిత్రభానౌ?

కా పత్రికా సురుచిరా కథయాంధ్రదేశే?

కిం యాచతే స పతితో జలధౌ భయార్తః?

కేనాప్నువంతి యతినో సువరంచ మోక్షమ్?

౨॥ కా సర్వదేశవిషయం ప్రకటీకరోతి?

కస్మిం శ్చరంతి విబుధా నిఖిలాః ప్రకామమ్?

కః కృష్ణబోధసునయా ఘనసౌఖ్య మాప?

విద్వాన్న కా కిమితి చాఽశిష మాతనోతి?

3॥ కత్యద్య గాంగవిబుధస్య సుకీర్తి రత్ర?




చైషా మ్మదీయవచసాం విబుధా వదంతు
త్ర్యర్ణాత్మకాని నితరాం స్వయ ముత్తరాణి
పత్రస్య చాస్య విజయోఽస్తు తదీయమధ్యే.

## దీవెన

బొడ్డు బాపిరాజు గారు

శ్రీకంఠు డభిమతశ్రేయంబు లొనగూర్చ
భారతీనేత శుభంబు బెనుచు
రమణీపరిష్కృతోరస్కు డున్నతులిచ్చు
తీరనిభద్రముల్ గౌరియొసగు
పలుకులచేడియ భారతీనామంబు
త్రిజగంబులందు సుస్థిరము జేయు
కమలగేహినికృపా కలితహృదబ్జమై
కలిమిగటాక్షించి గాచుచుండు
గురుతగని, పెరపత్రికల్ గొలువునెఱపి
జయపతాకంబు బూన, సజ్జనులపాళి
యవని గైవారమిడగ సత్కవులుపొగడ
ముదముదళుకొత్త, భారతీ పొదలుమమ్మ!
క్రమముగా నాలుగేండ్లప్రాయమును గొంటి,
తొడరి యికపయి, కళల నితోధికంపు
సొంపు, సంపద, నింపుచు బెంపుగాంచి,
తెలుగునాటికి దీపమై దేజరిలుమ!

భారతియని తనపేర్మి, గౌరవమునదనరు పత్రికారాజమ్మున్
శ్రీరమణికోడ లెప్పుడు, వారని దయ నోముగాత వసుధాస్థలిపై.
ధారుణి సత్కవిత్వము, సుధామధురాయిత గానవైదుష్మి,
చారుతరాంధ్రశిల్పమును సర్వజనాదరణీయవృత్తి సొం
పారెడు సాహితీపటిమ నాదృతి ఘోషణజేయుపట్ల, నా
భారతి వీవెకావె, ప్రతిభారతి, భద్రమునీకు భారతీ!

---




## శ్రీ వేంకటపార్వతీశ్వర కవులు

శ్రావ్యార్థపద విశిష్టుఁడనైన నేనేడ? పరమార్థతత్త్వ విస్ఫురణమేడ?
గురుతమోగుణకళంకుఁడనైన నేనేడ? కల్యాణగుణధామ కలనమేడ?
మలినదుర్భావ దుర్మదుఁడైన నేనేడ? శుద్ధస్వభావవిస్ఫూర్తియేడ?
సతతవైరస్యభాజనుఁడైన నేనేడ? ఆనందమయరసావాప్తియేడ?
కవిత గట్టి పాడఁగల నంతియేకాని-పలుకుఁ దలఁపుఁగూడఁ బడయరాని
నిన్నుఁ దనియఁజేయ నేనేడ? నీవేడ?-పావనస్వభావ, దేవదేవ!

సీ. గుణరూపపరిహీణ గోమాయువును నేను త్రిభువనావన కామధేను వీవు
నిష్ప్రచ్చరంపుఁ జౌడుప్పు పట్టును నేను కమనీయ కేదారఖండ మీవు
కలుషిప్రధూపితాంగారమూర్తిని నేను ఆర్తచింతామణీ మూర్తి వీవు
ఈడుపుగాళ్ల కొల్లేటి కొంగను నేను పరమహంసస్వరూపంబ వీవు
నాకు నీకును నెంత యంతరము గలదొ-తెలిసికొంటి నీనాఁటికిఁ దెలిపికొంటి
నీవు నన్నింక నేనాఁటి కేలికొనెదొ?-సత్కృపాధామ, దేవతాసార్వభౌమ!

సీ. కఱకురాగుట్టల యిఱుకుసందులనుండి తేటనీ రొలయించు తీరు గాక
పరుసంపుగుంపుల చెఱకుగట్టులనుండి పానకం బొలికించుపగిది గాక
అగ్గికొండలతండమై నిండునెలనుండి చలువవెన్నెల నించు జాడగాక
కటికిచీఁకటికారు క్రమ్ముమబ్బులనుండి మెఱుఁగుతీఁగలఁ బెంచు సరణిగాక
కలుషమతికి నాకుఁ గవితాసవముగూర్చి-వికృతి దీర్పలేక విసుగుకంటె
భక్తిరసముఁగూర్చి పాడించుకోరాదె!-పావనస్వభావ దేవదేవ!

సీ. కొనకొమ్మ దెమలించి కోసికోఁజాలక తావిగొజ్జఁగిఁ గాలఁ దన్నుకొంటి
చిఱుజీడి నెడలించి సేవింపఁగాలేక తీయమామిడిమోకఁ ద్రెంచుకొంటి
అలఁతి పుప్పొడిఁ దేర్చి యారగింపఁగలేక పువ్వుఁదేనియఁ బాఱఁబోసికొంటి
పలుకుఁదీఁగ లమర్చి పాడుకోఁజాలక కనకవల్లకి మంటఁ గలిపికొంటి

దూరదృష్టిలేక దుర్బలబుద్ధినై-నీ ప్రసాదమెల్ల నీటఁ గలిపి
యాసఁదీఱ కిట్టు లల్లాడు నన్నెట్టు-లాదరింతువయ్య, యాదిదేవ?

సీ. కలనిస్వనముల లోకంబెల్లఁ దనియించు కోకిల మెదురింటఁ గాకులేల?
గుణగౌరవంబులఁ గులమెల్ల వెలయించు క్రొత్తడిసరియింటఁ గులటలేల?
ఘనపరిమళములఁ గడలెల్ల నెలయించు క్రొవ్విరినడిమింటఁ బ్రువ్వులేల?
ధవళకాంతుల దిగంతరమెల్ల నలరించు మరుమామపొరుగింట మబ్బులేల?
పరమమైన భక్తిభావంబుపాలింట-విషయవాంఛలేల? వికృతులేల?
మంచివెనుకఁ జెడ్డ లుంచిలీలెదవేల?-అద్భుతస్వభావ, ఆదిదేవ!

సీ. తలఁపులోఁ గలుషంబు తగ్గునో తగ్గదో నెఱిదప్పి తలమెల్ల నరసిపోయె
మనసులో మమతలు మాయునో మాయవో సిరిదప్పి చూపెల్లఁ జెదరిపోయె
మొదటిలో దోషంబు వదలునో వదలదో కుసిదప్పి పండ్లెల్ల వసిలిపోయె
ఎడఁదలో నాసలు వెడలునో వెడలవో ససిదప్పి మేనెల్ల సడలిపోయె
ఇంతపుట్టెనింక నేమగునో యంచుఁ-గుమిలి కుమిలి యేడ్చి క్రుంగి క్రుంగి
నిన్ను శరణుగంటి నీదె భారంబంటి-తేర్పు మెట్టులైన దేవదేవ!

సీ. ఆచేత నీచేత నందించుటేకాని నీ చేయి నాచేత నిలుపవేమి?
ఆనోట నీనోట ననిపించుటేకాని నీనోట నాకు విన్పింపవేమి?
ఆమూర్తి నీమూర్తి నలికించుటేకాని నీమూర్తి నాకుఁ గాన్పింపవేమి?
ఆయింట నీయింట నాడించుటేకాని నీయింట ననుఁ జేరనీయవేమి?
పట్టువిడువఁడంచుఁ దిట్టిపోయునటంచుఁ-గొట్టునంచుఁ దగవుఁ బెట్టునంచు
దిగులుపుట్టెనేమొ దిద్దుకోలేవయ్య-పావనస్వభావ, దేవదేవ!

సీ. తెమ్మెరల్ వలపులఁ గ్రుమ్మరించుచునుండఁ గ్రొన్ననయేమూల నున్ననేమి?
వెన్నెలల్ చలువల వెలువరించుచునుండ జాబిల్లి యేత్రోవఁ జన్ననేమి?
పలుకులు జుంటితేనెలఁ జూఱిలిడుచుండ మరుతేజి యేకొమ్మ మన్ననేమి?
కవితలు సరసంపుఁ గళల నీనుచునుండఁ గవిరత్న మేచాయఁ గన్ననేమి?
నీకటాక్షంబులే జీవలోకమునకుఁ-జింతితార్థంబు లొసఁగి రక్షించుచుండ
నీవెచటనున్న నెటులున్న నేమిలోటు?-సత్కృపాధామ, దేవతా సార్వభౌమ!

---



# రూపకములు-లక్షణములు

మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు

రమారమి రెండువేలయేళ్ల క్రిందట భరతఖండమున సంస్కృతభాషలో రూపకము లవతరించినట్లు కనఁబడుచున్నది. అట్టివాటిలో మొదటివి భాసునికృతులని యీ క్రింది బాణభట్టు వచనమునఁ దెలియుచున్నది.

"సూత్రధార కృతారంభై
ర్నాటకై ర్బహుభూమికైః,
సపతాకై ర్యశో లేభే
భాసో దేవకులైరివ."

దీనిని బట్టి భాసునికి మున్ను సూత్రధారకృత ప్రస్తావనాదులు లేని కొన్నిరూపకము లుండియున్నట్లును, సూత్రధారునిచే నారంభింపఁబడిన రూపకములు రచించినవారిలో భాసుఁ డాద్యుఁ డన్నట్లును తెలియుచున్నది.

ఆకాలమందలి నాగరికుల యభిరుచికిఁ దగినట్టి రూపకరచనాపద్ధతులను, నాట్యరంగపద్ధతులను భరతాచార్యులు తమ నాట్యశాస్త్రమున వివరించియున్నారు. భాసుని రూపకములు ముందో, భరతనాట్యశాస్త్రము ముందో నిర్ణయించుట కిది యదను కాదు గాని, ప్రదర్శనరమ్యములై ప్రాజ్ఞలోకమును రంజింపఁజేసిన రూపకములలో మొదటివి భాసుని రూపకములే యని తోఁచుచున్నది. అవి స్వప్నవాసవదత్త, అవిమారకము, ప్రతిజ్ఞాయౌగంధరాయణము మొదలైనవి. తరువాత ఖ్యాతి గాంచిన వాటిలో శాకుంతలము, మృచ్ఛకటికము, ముద్రారాక్షసము, ఉత్తరరామచరితము మొదలగు కొన్నిమాత్రమే అత్యుత్తమములు.

ప్రాచీనకవులు కొన్నికొన్ని చిన్నవిషయములందు స్వాతంత్ర్యము వహించినను చాలవఱకు రూపకరచనాపద్ధతికి భరతనాట్యశాస్త్రమునే ప్రమాణముగా గ్రహించిరని చెప్పవచ్చును. కాని యది వివిధములైన నాట్యధర్మములను పలుతెఱంగుల నుపదేశించు పెద్దగ్రంథమగుటచే, రూపకలక్షణము సుబోధకముగా సులభముగా నుండవలెనన్న యుద్దేశముతో నాట్యశాస్త్రమందలి బహువిషయములను సంగ్రహించి, రత్నావళీ శాకుంతలాది పూర్వరూపకములను పరిశోధించి, నాట్యశాస్త్రమునకు వెయ్యేళ్లకుఁ దరువాత భోజమహారాజు పెత్తండ్రియైన ముంజుని యాస్థానము

లోని ధనంజయుఁడు దశరూపక మనుపేర రూపకలక్షణమును రచియించెను. దీని తరువాత బయల్పడిన యాలంకారిక లక్షణములలోని రూపక నాయక రసాది లక్షణములైనను ప్రభిన్నములుగాక యీపద్వైవిధ్యముగా నొక్క-రీతినే యున్నవనుట నిక్క-ము. అనఁగా, మొత్తమువీఁద భరతనాట్యశాస్త్రము మొదలుగాఁ గడపటి రూపకలక్షణము వఱకును మన దేశమున రూపకరచనా పద్ధతియందు పెద్ద మార్పులు సూచించు లక్షణము వేఱుగా లేదనియే చెప్పవలసి యున్నది.

రూపకముయొక్క- ప్రదర్శనరమ్యత, లేక సభారంజకత్వ మను ధర్మము కవి ప్రతిభాధీనమైన తద్రచనయం దున్నదిగాని కేవలము లక్షణమందు లేదనుట నిక్క-ము. ఇట్లనుటచే లక్షణము ననుసరింపక యథేష్టముగా రచియింపవచ్చుననియు, అట్లు పూర్వులు రచియించిరనియుఁ దలఁపరాదు. ఈకాలమువారు మనపూర్వరూపకలక్షణము ప్రదర్శనోచితము, సభారంజకము నైన రచనకు సహకారిగా లేదని యాక్షేపించుచున్నను, తొల్లి నాట్యరంగముల కెక్కి- ఖ్యాతివహించిన శాకుంతలాది రూపకములు కొన్ని యాంధ్రములై నేఁడు గూడ సభారంజకము లగుచున్నవనుట ప్రాజ్ఞలోక మెఱుఁగనిదిగాదు. మఱియు, రూపకలక్షణమును 'తూచా' తప్పకుండఁగా రచియించినామని పీఠికలలో పెద్ద బడాయి చూపిన వారి కొన్ని కృతులు ప్రదర్శనమునకుఁ గాదు గదా, చదువుటకైనను రుచిగొల్పని స్థితిలో నుండుటయు, సంస్కృతరూపకలక్షణమును పూర్తిగా ననుసరింపకపోయినను మఱికొన్ని యీనాఁటి నాటకములు ప్రదర్శన రమ్యము లగుచుండుటయు మనకుఁ దెలియనిది గాదు. ఈపట్టున చదువునపుడు మనోహరములుగా నుండు కొన్ని నాటకములు నాట్యరంగమ్మున రక్తి కట్టకుండుటయు, చదువ నింపుగాని కొన్ని మెట్లో రక్తికట్టుటయు కనిపెట్టిన కొందఱు, నటులు సమర్థులయినచో నెట్టి నీరస నాటకమైనను ప్రదర్శనరమ్యమగుననియు, వా రసమర్థులైనచో నెట్టి సరసనాటకమైనను ప్రదర్శనరమ్యము కాఁజాల దనియుఁ దలంచుట కలదు. ప్రదర్శనరమ్యత కొంత నటుల నైపుణినిబట్టికూడ నుండునని తలంపవచ్చును గాని, అది కేవలము వారి యధీనమే యని చెప్పుట మాత్రము పొరపాటు. అయినను రూపకము రంగస్థలమునరక్తికట్టుటయుఁ గట్టకపోవుటయు నటుల యధీనమను మాట యటుండ నిచ్చి, ముందుగా లక్షణమునకును రూపకరచనకును గల సంబంధమునుగూర్చి యాలోచింతము.

ఆంధ్రమున రూపకలక్షణములేని లోపమును కనిపెట్టి కీర్తిశేషులైన మహారాజా సర్ వెలుగోటి రాజగోపాలకృష్ణ యాచేంద్ర బహదరు వెంకటగిరిరాజా వారి సమాదరణమున నేను 1915 లో దశరూపకము తెలిఁగించినాను. అప్పటికి తెలుఁగున నాటకములు రచియించువారు చాలవఱకు సంస్కృత

నాటక రచనాపద్ధతినే యనుసరించుట కలదు. తరువాతఁ గొందఱు స్వతంత్రించి తమనాటక రచనమున సంస్కృ తాంగ్ల నాటక రచనా సంప్రదాయములకు సాంకర్యము గలిగింపఁ జొచ్చిరి. ఇపుడిపుడు కొంద ఱేసంప్రదాయము ననుసరింపక యథేష్టముగా నాటకములు రచించుచున్నారు. దీనిని గనిపెట్టిన కొందఱు మిత్రులు ఆంధ్రదశరూపకమందలి ప్రధాన లక్షణముల సారమును కొన్ని వ్యాసములుగా రచియించి ప్రకటించవలసినదని కోరినందున నాటకరచనా సంప్రదాయమును మూఁడు వ్యాసములుగా నీభారతిలోఁ బ్రకటింపఁబూని నాను.

ఉ. వీనులవిందు కన్నుఁగవ
వేడుక నాలుకతీపియై కథా
ధీనముగాఁగ బుద్ధి రస
దీప్తముగాఁగ మనంబు మేను భా
వానుగతంబు గాఁగఁ గతి
నాత్మునకైన ముదంబు నీతివి
జ్ఞాన మొసంగు కావ్యము ని
జంబుగ రూపక మెంచిచూడఁగన్.

చ. కవిచతురాననప్రతిభఁ
గల్పితమైన విచిత్రసృష్టికిం
దవిలిన దేశకాలసుర
దానవమానవవృత్తి మెల్ల ని
క్కువ మనునట్లుగా నెదుటఁ
గూరిచి చూపఁ ఉ చిత్తముర్క సుఖా
ర్ణవమున నోలలార్చు కృతి
రాజము రూపకమే తలంపఁగన్.

అనునట్లు త్రివిధకావ్యములలో నుత్తమ మని వన్నె కెక్కిన రూపకము సకలజన మనో రంజకము గావలెనన్నచో, అది ఏవో కొన్ని నియమములకు లోఁబడియున్న నే యట్లగును గాని లేకున్నఁ గాదనుట ధ్రువము.

రూపకరచనకు వస్తువు, లేక కథ, నాయ కాదిపాత్రములు, రసము అనునవి ప్రధాన విషయములు. నాయకాదులు లేక కథయే యుండదు. ఆనాయకాదుల చేష్టల ననుసరించియే కాని రసము జనింపదు. అందుచే నివి మూఁడును అవినాభావసంబంధము గలవైనను, వీటిలోని యంతర్భేదములను సుబోధకముగా వివరించుటకై పూర్వలాక్షణికులు వీటిని విభజించి నిరూపించియున్నారు. అందు వస్తువు ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రము అని మూఁడువిధములు. పురాణేతిహాసాది ప్రసిద్ధమైనకథ ప్రఖ్యాతమనియు, కేవలకల్పితకథ ఉత్పాద్యమనియు, రెండును కలిసినకథ మిశ్రమనియుఁ జెప్పఁబడును. ఇం దెట్టి యితివృత్తము నాటకము, ప్రకరణము, భాణము, ప్రహసనము, డిమము, వ్యాయోగము, సమవాకారము, వీథి, అంకము, ఈహామృగము అను దశవిధరూపకములలో నెం దెం దుపయోగింపఁ దగు ననువిషయమును పూర్వు లీక్రిందివిధముగా నిర్ణయించినారు.

"నాటక డిమ వ్యాయోగ సమవాకార ములందు ప్రఖ్యాత వృత్తము, ప్రకరణభాణ ప్రహసన వీథిరూపకములందు ఉత్పాద్యము,

ఈహామృగమున మిశ్రవృత్తము, ఉపయో గింపపలెను. అంకమనెడి రూపకమున ప్రఖ్యాతముగాని ఉత్పాద్యము కాని వాడవలెను. సంకీర్ణరూపకములలో నాటికా నాట్యరాసక ములు మొదలగు కొన్నిటియందు ఉత్పాద్యమే వాడవలెను." మఱియు చివరకంట నుండు నితివృత్త మాధికారిక మనియు, ప్రసంగ వశ మున వచ్చిన యితివృత్తము ప్రాసంగిక మనియు నిర్ణయించి, ఇందుకు రామాయణకథయందలి సీతారామవృత్తాంతమును, సుగ్రీవ విభీష ణాదివృత్తాంతమును ఉదాహరించియున్నారు.

ఇట్లు ఇతివృత్తరూపక నిర్ణయము కనఁ బడుచున్నను, ఇప్పటివారు పెక్కండ్రు ఇతి వృత్త మెట్టిదైనను తాము రచియించు రూప కము లన్నిటికిని నాటక మనునామమే పెట్టు చున్నారు. ఇతివృత్త భేదమునుబట్టి రూపక నామభేదమును పాటింపకున్నారు. కాని లక్ష ణము పూర్వోక్తవిధముగా నున్నను తదతి క్రమణము కొంచెమో గొప్పో ప్రాచీన సం స్కృతరూపకములలోఁ గూడ గోచరింపక పోదు. చూడుఁడు—

కాళిదాసు భారతప్రసిద్ధమైన శకుంతలా దుష్యంతకథను ప్రధానముఁగాఁ దీసికొనియు, అందు నాటకరచన కనుకూలములగు కొన్ని చిన్నమార్పులు గావించియు, పైఁగా అంగుళీ యకవృత్తాంతము, సానుమతి శకుంతలను గొనిపోవుట, దుష్యంతుని యింద్రలోకగమన ము, మారీచాశ్రమకథ మొదలగువిషయ ములను గల్పించి, తనకల్పన కనుగుణముగాఁ దననాటకమునకు అభిజ్ఞానశాకుంతలమను పేరు పెట్టి, శాకుంతలములోని యితివృత్తమును మిశ్రముఁ గావించెను. మఱియు నిట్లే భవభూతి ఉత్తరరామాయణకథను ప్రధానముగాఁ గై కొని, తిరస్కరిణీ విద్యచే సీతారామ సమా గమమును, జాహ్నవీ వసుంధరాచర్యను, అంత ర్నాటకకథను కల్పించి యందలి యితివృత్త మును మిశ్రముఁ గావించెను.

మఱియు, నాటకమునందు దివ్యుఁడుగాని రాజర్షిగాని నాయకుఁడు కాఁదగునని పూర్వ లక్షణములు చెప్పుచుండఁగా, విశాఖదత్తుఁడు ముద్రారాక్షసములో బ్రాహ్మణుఁడైన మంత్రి రాక్షసుని నాయకునిఁగా నొనరించెను. (ఇందు చంద్రగుప్తుఁడు ప్రధాననాయకుఁడును గాఁడు, రాజర్షియుఁ గాఁడు.) మఱియు, వీరశృంగార ములలో నేదైన నొకటి నాటకమునఁ బ్రధాన రసము గాఁదగునని లక్షణము. కాని పూర్వ కవులు రసవిషయమునఁ గూడ స్వాతంత్ర్యము చూపకపోలేదు. ఇందుకు ఉత్తరరామచరిత ములోని కరుణ విప్రలంభశృంగారసాంకర్య మును, నాగానందములోని శృంగార శాంత రససాంకర్యమును ఉదాహరణములు. వీటిలో మొదటి దానియందు విప్రలంభము అంగి యనియు, కరుణము అంగమనియుఁ జెప్పుట సమంజసముగాఁ గనఁబడదు. అదియును గాక, యందలి ప్రధానరసము కరుణమే యనునట్లు భవభూతియే "ఏకో రసః కరుణ ఏవ" అను

శ్లోకమున సూచించియున్నాఁడు. నాగానంద ములోని నాయక రసౌచిత్యములను గూర్చి ధనంజయమతమును నా యాంధ్రదశరూపక మున వివరించియున్నాను. చూడఁదగును. ఇట్లు విశేషప్రతిభాశాలులైన పూర్వ మహా కవులు తమ రూపకములు సుమనోమనోహ రము లగునట్లుగా వృత్తనాయక రసములను బోషించుచుఁ గావించిన రచనలకు లక్షణ మడ్డుపడలేకపోయినదనియు, వారి రచనావిశే షములను బట్టి లక్షణమే తనలోని లోపము లను సరిదించుకొనవలసి వచ్చినదనియుఁ జెప్ప వలసి వచ్చెను. అందుచే నట్టివానికి లక్షణాతి క్రమణదోష మాపాదింపరాదు. ఇట్లే ఆధుని కులు రచియించిన నాటకములలో పండిత పామర సాధారణ రంజకములైన వేవేని కల వేని యందు లక్షణాతిక్రమదోష మున్నను పరి గణింపఁ దగినది కాదు.

ఏపద్ధతియు లేక, వస్తునాయక రస శుద్ధి లేక, పాత్రౌచిత్యాదు లెఱుఁగక, యిష్టము వచ్చినట్లు రచియించిన నేఁటి కొన్ని నాటకా భాసములలో నట్టిదోష మున్నదని పరిగ ణించుట యావశ్యకమే కాదు. ఇఁకనో కొంత వఱకు జనరంజకము, రంగస్థలోచితము నగు రీతిని రచింపఁబడినట్లుగాఁ గనఁబడుచున్న కొన్ని నాటకములలోఁ గథాపాత్ర రసౌచిత్య ములందుఁ గొన్నిదోషములున్నవని సందర్భ మునుబట్టి చెప్పవలసి వచ్చినది. అట్టివానిని బేర్కొనుట యుచితము కాదుగాని, రూపక కర్తలు ముఖ్యముగా వస్తుపాత్ర రసపోషణ మందు జాగరూకులై రూపకము హృదయంగ మముగా నుండునట్లు ప్రయత్నింపవలసి యుం డుననిమాత్ర విన్నవింతును. రూపకరచనము సామాన్యమైనది గాదు. మహాకవి భవభూతి యంతటివాఁడు మన దృష్టికి దివ్యముగా నున్నట్లు కనఁబడుచున్న మాలతీ మాధవ మును రచియించి, అది యాకాలమందలివిమ ర్శకుల యాక్షేపములకు లోనుగావలసి వచ్చు టచేతనే కాఁబోలును,

> "యేనామ కేచిదిహ నః ప్రథయంత్యవజ్ఞాం
> జానంతి తే కిమపి తాన్ప్రతి నైష యత్నః;
> ఉత్పత్స్యతే మమతు కోఽపి సమానధర్మా
> కాలోహ్యయం నిరవధిర్విపులాచ పృథ్వీ."

అని ప్రస్తావనలోఁ దెలిపియున్నాఁడు. అంతటి వాఁడే యట్లు సంకోచించి యుండఁగా నిఁక సామాన్యులమాట చెప్పెడిదేమి?

మ. ఇతివృత్తంబు తెఱంగెఱుంగక రసం
బీక్షింప కంకాది ప
ద్ధతి భావింపక పాత్రధర్మముల పొం
తం బోక యౌచిత్య సం
గతి నర్థింపక యిచ్చవచ్చిన గతిం
గర్వించి క్రీడించు దు
ష్కృతు లాకాశపురాణ మిత్రములు తు
ష్టిం జేయఁగాఁ జాలునే?

అనుట కుదాహరణము లైన రూపకములు రూపకము లనిపించుకోవు. కూలంకషమైన సాహిత్యజ్ఞానము, వాఙ్మయ పరిశోధకత్వము,

సందర్భోచిత పదగుంభన సామర్థ్యము, పాత్రౌచిత్యవిజ్ఞానము, రసపోషణనైపుణి, లోకజ్ఞానము ననుధర్మములు కలిగి రచియించిన నాటకము పఠనరమ్యమును, ప్రదర్శనరమ్యమును అగునుగాని, నాలుగు పద్యములు, పదిపాటలు, నడుమనడుమ నేవో కొన్ని మాటలును అతికి దినమున కొకటిచొప్పున రచియించిన నాటకములు నాటకము లగునా ?

ఇతివృత్తమును కవి రూపకోచితముగా మార్చుకొనవచ్చునని పూర్వరూపకములవలన దెలియుచున్నది గాని, అర్జునుఁడు, శ్రీకృష్ణుఁడు మొదలగు ధీరోదాత్తపాత్రములను పామరాతి పామరపాత్రములను జేయునట్టి మార్పు హృద్యమగునా ? సీతవంటి యత్యుత్తమనాయిక భర్తతోఁ గాని యితరులతోఁ గాని సంభాషించుట యెంతో యుదాత్తమై, గంభీరమై, రసోచితమై యుండఁదగియుండఁగా, ఇప్పటి కొన్నిరూపకములలో ఆపాత్ర మెంత నీచముగాఁ జేయఁబడినదో పరిశీలించినవారికి పాత్రపోషణ మీకాలమున నేదారిని బడి పోవుచున్నదో తెలియఁగలదు. ప్రదర్శన సమయమందు సామాజికుల హృదయమునం దాయా రస ముద్బుద్ధమగునట్లు రచియించుటయే రూపకముయొక్క ముఖ్యోద్దేశమై యుండఁగా, తొలుత కథాసన్నివేశమే రసౌచితికి భంగకరమగునట్లు రూపకము రచియించుట యెట్టిదో యూహింపుఁడు. కావున 'నాటకాంతం కవిత్వ'మ్మను నార్యోక్తియందలి విలువ తెలిసి, దానికిఁ గావలసిన సాధనసామగ్రి సంగ్రహించి, ప్రదర్శనమునఁ దెలియవచ్చు లోపములను గ్రహించి, యపుడు రూపకమును రచియించినచో నది సహృదయహృదయంగమ మగునుగాని, లేకున్నఁ బరిహాసాస్పద మగు ననుటలో నాశ్చర్య మేమియు లేదు.

ఇపుడు కల్పిత కథల కనుగుణములైన రూపకనామములను పెట్టక యిప్పటివారు దృశ్యకావ్యములకెల్ల నాటకనామమే పెట్టుచున్నారు. కానిండు. ఇం దంతగా హానిలేదనవచ్చును. నాటకమునందలి యితివృత్తము ప్రఖ్యాతమేకాక ఉత్పాద్యమో, మిశ్రమో కావచ్చును. దానికిని శంకింప వలదు. కాని గ్రహించిన కథను పెంచికాని, కుదించికాని రచించుటలో పాత్రపోషణము సముచితముగా నుండవలెను. దృశ్యకావ్యములు కేవలము పామరజను లానందించుటకై రంగస్థలమునఁ బ్రదర్శింపఁబడుచున్న వనియు, ప్రదర్శనము కేవలము ధనాకర్షణమున కనియుఁ దలంపరాదు. ఏకథ గ్రహించినను అందలి నాయికానాయకాదులచర్య స్వభావసిద్ధమగున ట్లుండవలెను. ఆపాత్రములప్రవర్తనములు నైజములుగా నున్నట్లు తోఁచిననేకాని సభ్యులహృదయముల రస ముద్బుద్ధముగాదు. సామాజికులు రసపరవశులు గారా, ఆప్రదర్శనము నిజమైన ప్రదర్శనమేకాదు. వేషములచేతను, నృత్తగీతవాద్యములచేతను, పాటలచేతను సభ్యులకుఁ గలుగు నానందము నిజమైన ప్రదర్శనఫలము



౧. డాక్టరు యమ్. ఏ. అన్సారీగారు, అధ్యక్షుడు
నలువదిరెండవ అఖిలభారతజాతీయమహాసభ, చెన్నపురి



౨. శ్రీయుత ముత్తురంగ మొదలియారుగారు ఆహ్వానసంఘాధ్యక్షులు

నలుబదిరెండవ అఖిలభారతజాతీయ మహాసభ, చెన్నపురి

గాదు. సభ్యుల హృదయమును కథామయ ముఁ గావించి, దాని నాయారసమున ముంచు నట్టి ప్రదర్శనమే ప్రదర్శనము.

కావున రసికహృదయముల నాకర్షించు నదియు, ఏదేని యొకయుత్తమ ధర్మమును బోధించునదియు నగు కథను గ్రహించి, అందు లోకవిరుద్ధములు, స్వభావ విరుద్ధములు నగు మార్పులు గావింపక, ప్రదర్శనౌచితికిఁ గావలసిన మార్పులు నైజము లనఁదగినట్లుగాఁ గావించి, దానిని రంగములుగాను, అంకములుగాను విభజించునపుడు పూర్వోత్తర సందర్భములకు విరోధము గలుగకుండఁ గథ తీఁగ సాగినట్లు సాగుట చూచి, పాత్ర సంభాషణ మందుఁ గథాప్రధానోద్దేశమునకు భంగము గలుగకుండఁగాఁ బాత్రోచితముగ గంభీరము, నుదాత్తము నైనసంభాషణము కల్పించి, రసముపై దృష్టినిలిపి, చాతుర్యము మీఱ దృశ్యకావ్యము రచియించుట శ్లాఘ్యమగును.

---

## వియోగరాధిక

౨

శ్రీ శేషాద్రిరమణ కవులు

గలుగల్లుమంచును గజ్జెలు మ్రోయ-వేణువు కెంగేల వెలయుచునుండ
ఆలగుంపులతోడ నరుగుచునుండు-బాలకృష్ణుఁడు కనంబడక యున్నాఁడు.

చిన్నారిమోముఁనఁ జిఱునవ్వు చిలుక-వలిపెంపుఁ బచ్చని వలెవాటు జాఱ
మునికోలతో నేఁగు ముద్దుకృష్ణుండు-చూపింప రమ్మ యెచ్చోట నున్నాఁడొ

ఆలింతుఁ గృష్ణుని యమృతగానంబు-దర్శింతుఁ గృష్ణుని దైవతేజంబు
వీక్షింతుఁ గృష్ణుని విమలరూపంబు-అనుభవించెదను బ్రహ్మానందసుఖము

గోపికాంకములందుఁ గులుకుచిన్నారి-నందుని చిరతరానందఫలంబు

భువనమోహనుఁడైన పురుషోత్తముండు-మాబాలకృష్ణుండు మధురలో లేఁడు
ఎందుండెనో కృష్ణు నెఱిఁగింప రమ్మ,-వల్లవీసతులార బాలగోపాలు.

---



# సీతారాములు - వాల్మీకిభవభూతులు

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

౧

శ్రీరాములవారి పత్నియుఁ, బరమపతివ్రతయు నగు జానకినిగూర్చి పట్టణములలోనను, బల్లెలలోనను బెద్దయపవాద మొకటి కల్గినది. రావణాసురుఁడు కొంతకాలము లంకలో నుంచికొనిన పుడమిపట్టి నేలుకొనుట గొప్పతప్పని శ్రీరాముని చరిత్రమును పౌరజానపదులెల్లరు నెక్కడఁ జూచినను నిందింప సాగిరి. అది భద్రుఁ డనుచారునివలన శ్రీరాములవారికిఁ దెలిసినది. అది యసత్య మగునో యని పలువురను శ్రీరాములవారు విచారించిరి. నిజమని తేలినది. తన ప్రవర్తనమును దుష్టముగా సమర్థించెడి ప్రజలు రాజైన తన్నుఁ బ్రమాణముగాఁ గొని యధర్మప్రవర్తను లగుదురని శ్రీరాముఁడు భావించెను. ఈయెడఁ దాను జేయవలసిన కృత్యమునుగూర్చి స్వయముగ శక్తికొలఁది నాలోచించుకొనెను. అప్పుడు, సీత గర్భిణియైయుండి యాశ్రమవాసమును దౌహృదముగాఁ గోరియున్న సంగతి యయ్యనఘుని జ్ఞప్తికిఁ దట్టెను.

సీతామహాదేవికి ఋషివాటికలకన్న సౌధము లిష్టములు కావు. జానకికి ఋషికన్యకలకన్న నంతఃపురతరుణు లింపునింపరు. శ్రీరామపత్నికిఁ గోమయలిప్తవేదికలవలె గచ్చుటరుగులు సొంపుగ నుండవు. నదీప్రవాహములం జూచుకొనుచుఁ, బచ్చికబయళ్లలోఁ దిరుగుచు, జింకపరువుల నదలించుచుఁ, గాననవిహంగకూజితము లాలకించుచుఁ, గాలక్షేపము సేయుట సీతకు జీవితఫలముగాఁ దోఁచుచుండును. ఋషుల ధర్మపురాణము లాయమకుఁ గర్ణరసాయనములు. కావుననే గర్భవతియైయుండి యామె ఋష్యాశ్రమనివాసమును గోరికొనినది. ఇట్టి సీతప్రకృతిని జిరకాలసన్నిహితపరిచితుఁడగు శ్రీరామచంద్రుఁ డెఱుంగును. ఇతరులగు మనమందఱము మన భావములతోఁ బోల్చుకొని పెఱరాచకన్నియలకుంబలె నామెకును రాజభోగములందును, రాజ్యాధికారములందును రక్తి గలిగియుండునని తలంచెదము. కావుననే సీత నడవులకంపుటచే శ్రీరాముఁ డతికఠోరహృదయుఁడుగ మనకుఁ గన్పట్టుచుండును. కాని శుద్ధసత్త్వవిలసితమై, సుఖకళానుభవరసికమై యుండు జానకి దివ్యప్రకృతిని శ్రీరామచంద్రుని వలె లాఁతివా రెవ రెఱుంగఁగలరు?

అప్పుడు శ్రీరాములవా రాయమను ఋష్యాశ్రమములలో విడిచిపెట్టి, పౌరజాన

పదులకు ధర్మవిశ్వాసమును బ్రబలఁజేయుచు, రాజధర్మమైన ప్రజారంజకత్వమును నిల్పుకోఁదలఁచెను. సీత ప్రకృతినిబట్టి సీత కది యెక్కువ క్లేశకరము కాదనియు నెంచియుండును. ధర్మసూక్ష్మము లెఱిఁగి చాలకాల మరణ్యవాససహచరియునై యున్న జానకి తన ధర్మనిర్వాహణము నెడ ననుమోదమునే చూపు ననుకొనియుండును. లక్ష్మణుఁ డడవిలో దింపి రామాజ్ఞను జెప్పినప్పుడు సీత శ్రీరామునితోఁ జెప్పుమని, "పౌరాపవాదమువలన శ్రీరామచంద్రునకుఁ గళంకము గలిగిన నేనుమాత్రము బరిహరించవలసినదానను గానా" అనినది. మఱియుఁ బ్రజలను సోదరులవలెఁ జూచుకొనుచు ధర్మప్రవర్తనుల జేయుటకుఁ జేసిన యీపని పరమధర్మ మనినది. లోకమునఁ గీర్తికన్న మిన్న లేదనినది. జానకియొక్క యిట్టిపవిత్రభావము మనస్సునఁ బట్టియుండుటం బట్టియే దాశరథి పామరు లగు ప్రజ లధర్మపథమున కభిముఖులు కాకుండుటకు సీతను గంగకు దక్షిణముగాఁ దమసా నదియొడ్డున నున్న వాల్మీకి తపోవనమున నిర్జనముగా నుండు నెడ దించిరమ్మని లక్ష్మణున కాజ్ఞ యొసఁగెను. సీతను లక్ష్మణుఁడు దించివచ్చిన చోటు వాల్మీకి యాశ్రమమున కెక్కువ దూరమున లేదు. ఇక్ష్వాకువంశమున గౌరవము గలిగి, దశరథున కిష్టసఖుఁడై, శ్రీరామచంద్రుని సుచరిత్రము నెఱిఁగియున్నవాఁడు వాల్మీకి. అమ్మహర్షి యి మ్మహాపతివ్రతామణి యోగక్షేమము లరయఁగలఁడని శ్రీరాములవా రూహించి యుందురేమో! శ్రీరాముఁడు మోమోడి సీత కీయంశము నగరమునఁ దెలుపలేక పోయెను.

లక్ష్మణుఁ డవనిజను గంగ యవ్వలి యొడ్డునఁగల వాల్మీకి తపోవనమున దించి, శ్రీరామాజ్ఞను జెప్పలేక ఖిన్నుఁడై యేడ్చుచుండెను. సీత నిర్బంధముచే నెట్టకేలకు శ్రీరామాజ్ఞ నిట్లు వచించెను: "సభా మధ్యమున శ్రీరాముఁడు నిన్నుఁగూర్చి దేశములో వ్యాపించియున్న దారుణాపవాదమును విని, సంతప్తహృదయుఁడై నన్నీపనికి నియోగించినాఁడు. నేను నిన్నిచ్చట వదలిపెట్టి పోవలసినవాఁడనై యున్నాను. ఈగంగాతీరమున నిది పవిత్రమును, రమణీయమునైన బ్రహ్మర్షుల తపోవనము. మహాయశస్సంపన్నుఁడు, విప్రుఁడు వాల్మీకిమహర్షి యిచటఁ గలఁడు. ఆయన మాతండ్రిగారి కిష్టసఖుఁడు. ఆయనపాదముల నీడ నీ వుపవాసపరాయణురాలవై సుఖముగ నుండుము; శ్రీరాముని హృదయమున నిల్పికొని పతివ్రతవై మనుము. నీకు మంచి శ్రేయస్సు గలుగును."

ఇట్లు సెప్పి లక్ష్మణుఁ డేఁగినపిదప శ్రీరామవియోగదుఃఖమునమూర్ఛిలి లేచి, జానకి యేడ్చుచుండఁగాఁ బుషికుమారులు చూచి, పోయి వాల్మీకికిఁ జెప్పిరి. ఆయన దివ్యదృష్టితో నంతయు నెఱింగి, యర్ఘ్యముఁ గొనివచ్చి, "నీవు శ్రీరాముని భార్యవు; దశరథుని కోడ

లవు; నీయందే పాపమునులేదు : నే నెఱుఁగుదును. నాపరిసరమునకుఁ జేరినావు. కావున నీ విఁక నాకులపడవలదు. మాయాశ్రమసమీపమున నొకకొందఱు స్త్రీలు తపశ్చర్యాపరాయణలై యున్నారు. వారియొద్ద నీవు సుఖముగ నుండవచ్చును; రమ్మ" అని యామెను దోడుకొనిపోయెను. సీతయు ఋషివెంటఁ బోయి, యా తాపస స్త్రీల సందర్శనముఁ జేసెను. వాల్మీకి యామె కులగోత్రములఁ నెల్లఁ జెప్పి, యామెయోగక్షేమముల నరయుచుండుఁడని వారల కప్పగించెను.

౨

శత్రుఘ్నుఁడు లవణాసురునిఁ జంపఁబోవుచు, వాల్మీకి యాశ్రమములో నొక రాత్రి నివసించెను. ఆరాత్రియందే కుశలవులు పుట్టిరి. అయ్యుదంతమునువిని యానందపడి, శత్రుఘ్నుఁడరిగియుండెను. ఇట్టిసందర్భములంబట్టి చూచిన జానకీవృత్తాంత మయోధ్యకుఁ దెలియవచ్చుచునే యుండవచ్చును. కాని శ్రీరామ చంద్రుఁడు పరార్థ తత్పరుఁ డగుటచే భ్రాంతులై యున్న ప్రజలలో నధర్మదృష్టి యేర్పడునో యను భయమునను, అపవాదభీరుత్వ మను ధర్మమును నెలకొల్పుటయందలి దీక్షచేతను, సీతయోగక్షేమముల నరయుట మొదలైన యంశములను బూర్తిగ వదులుకొని యుండును. బంగారు సీత ప్రతిమను బెట్టుకొని యజ్ఞము లొనర్చుచుండె. ఇది సీతారాముల విశుద్ధ ప్రణయమును సూచించుచున్నది. ధర్మమునకు సామ్రాజ్యము నిచ్చి యనురాగమును దృణీకరించుట ధార్మికులచరిత్రలలోని పవిత్ర చిహ్నము.

ఈరీతినున్న వాల్మీకిరచననుబట్టి చూచిన నుత్తరరామచరిత్ర నాటకమునందుఁ గన్పట్టినంత కాఠిన్యము శ్రీరామచంద్రుని యెడ మనకుఁ గన్పట్టదు. "సౌమిత్రీ! నా భర్త యొక్క రాజవంశమునకు హాని వచ్చును గాన నేను గంగలోఁ బడి ప్రాణహత్యఁ జేసికొనను" అనిన సీత సౌశీల్యగరిమయు భగ్నము గాదు. భవభూతి సీతచేత,

'హా ఆర్యపుత్ర! కుమారలక్ష్మణ! ఏకాకినీం అశరణాం ఆసన్నప్రసవవేదనాం హతాశాం శ్వాపదా అభిలషంతి'

అనిపించుచున్నాఁడు. శోచనీయదశయొక్క పరమావధియే సీతయందుఁ జూపఁబడినది. ఘోరారణ్యములో దిక్కులేక యొంటిగ విడిచి పెట్టఁబడుట, ప్రసవకాలబాధ యేర్పడుట, దుష్టమృగములు తనమాంసమునకై వచ్చుచుండుట - ఈస్థితికంటె నింకొకకష్టము లోకమునఁ గలదా ? ఇట్టికష్టములకుఁ దాళఁజాలక జానకి గంగలోఁ బడినది. ఎంతటియాపద ! సీత నిట్టి యాపదకు గుఱి యగునట్లు చేసిన శ్రీరాముల వారిని భగవంతుఁ డనెడిదృష్టి విడనాడి చూచితిమేని, ఆయనకన్నఁ గఠినుఁడును, ఆలోచన లేనివాఁడును, స్తుతిప్రియుఁడును గనుపట్టఁడు. పలుచోట్ల నీప్రసంగమును దెచ్చి భవభూతి యీ మహావిపత్తును మన చెవుల కతికఠోర

ముగ వినిపించుచుండును. లవుడు చదివిన రామాయణశ్లోకమువలన సీత జ్ఞప్తికిరాఁగా, జనకుఁ డనుచున్నాఁడు:

"నూనం త్వయా పరిభవంచ వనంచ ఘోరం
తాంచ వ్యథాం ప్రసవకాలకృతా మవా
ప్య, క్రవ్యాద్గణేషు పరితః పరివారయ
త్సు, సంత్రస్తయా శరణమిత్యసకృత్స్మృ
తోఽహమ్."

ఇందులోఁ బైకష్టములలో లోకులయప వాదమువలనఁ గలిగిన యవమాన మొకటి చేర్పఁబడినది. సీతయు నిట్టిభావము గలిగి యుండినట్లు "ససహే ప్యే అనుభవితుం జీవ లోకస్య పరిభవం" అనుచున్నది.

శ్రీరాముఁడును సీతకుఁ దాను గలిగించిన యాపదనుగూర్చి యిట్లనుచున్నాఁడు:

"శైశవాత్ప్రభృతి పోషితాం ప్రియాం,
సౌహృదాదపృథగాశ్రయా మిమామ్;
ఛద్మనా పరిదదామి మృత్యవే,
సౌనికే గృహశకుంతికా మివ."

మఱొకచో—

"విస్రంభా దురసి నిపత్య జాతనిద్రాము
న్ముచ్య ప్రియగృహిణీంగృహస్యశోభామ్,
ఆతంకస్ఫురితకఠోరగర్భగుర్వీమ్,
క్రవ్యాద్భ్యోబలిమివ దారుణః క్షిపామి."

అనుచున్నాఁడు. మఱియొకచో—

"క్రవ్యాద్భి రంగలతికా నియతం విలుప్తా"

అని తలంచుచున్నాఁడు. తృతీయాంకమున వాసంతి యిట్లు విలపించుచు రాముని దూషించు చున్నది:

"అయి కఠోర, యశః కిల తే ప్రియం,
కి మయశో నను ఘోర మతఃపరమ్;
కి మభవ ద్విపినే హరిణీదృశః,
కథయ నాథ, కథం బత మన్యసే."

ఈసందర్భముల వలన వాల్మీకి సాయమున కవకాశము గలుగునట్లు వాల్మీకితపోవనసమీపమున సీతను లక్ష్మణుఁడు రామాజ్ఞచే వదలివచ్చె ననుమాటయే పూర్తిగా భవభూతిచే విడనాడఁబడినట్లు కన్పట్టును. దీనిచే భవభూతిగారి కేమి సిద్ధించినది? రససమృద్ధి సిద్ధించినది. సాధించఁదలఁచుకొనినది శోకాతిశయము. దాని కాలంబనమైన సీత నతి శోచ్య దశలోఁ జూపవలెను. అం దుద్దీపనములుగ వెనుకఁ జెప్పఁబడిన దారుణాపదలన్నియు సీత యందుఁ గూర్పఁబడినవి. దీనివలస శ్రీరామచంద్రులవారి కత్యంత కఠోరత కళంకముగా నేర్పడుచున్నది.

"సఖ ల్వద్యైవ సౌమిత్రే!
జీవితం జాహ్నవీజలే,
త్యజేయం రాజవంశస్తు
భర్తు ర్మే పరిహాస్యతే."

అను సీత శుద్ధబుద్ధి మాసిపోవుచున్నది. కాని దాని పైపునకుఁ గవిదృష్టి ప్రసరించలేదు; రసప్రవాహమున నిమీలితనేత్రుఁడై యోలలాడుచున్నాఁడు. ఇచ్చట సహృదయులును శ్రీరామ పాత్రౌచిత్యము మనసునకుఁ దాఁకనంతటి

తన్మయత వహింపవలయునని కవికోరికయై యుండవచ్చును.

జనకుని యౌచిత్యము సైత మొక విధముగఁ గన్పట్టుచున్నది. బ్రహ్మవేత్త యగు జనకుఁడు జ్ఞానవైరాగ్య నిధిగాఁ జూపఁబడ వలసియుండ, సీతాశోకమున మిగుల ఖేద మందుచున్నట్లు ప్రదర్శింపఁబడుచున్నాఁడు:

"న మే నికృంతతి మర్మాణి క్రకచ ఇవ మన్యు ర్వీరమతి; ప్రత్యగ్ర ఇవ మే దుఃఖసంవేగో న శామ్యతి"

ఇత్యాది చతుర్థాంక వాక్యము లీయంశమునఁ బ్రమాణములు.

మఱియు శోకాతిశయమునం గలిగిన కోపముగూడ జనకునందుఁ జూపఁబడినది. కౌసల్య దుఃఖలజ్జాది పరవశయై వసిష్ఠాశ్రమమునఁ దన్నుఁ జూచుటకు వచ్చి యీ యవస్థలో జనకు నెట్లు కనుఁగొనుదునా? అని సంశయించుచు నధోముఖియై యున్నది. అప్పు డామెను జూచి జనకుఁడు నిందాగర్భముగాఁ 'బ్రజాపాలకుని తల్లి కారోగ్యమా' అనుచున్నాఁడు. ఈనిష్ఠుర వాక్యముచే సగము చచ్చియున్న కౌసల్య పూర్తిగాఁ జచ్చిపోయినది.

"లక్ష్మణుఁడు సీత నడవిలో వదలె" నని రామాయణకథను లవుఁడు చెప్పఁగా,

"ఏతద్వై శసవజ్రఘోరపతనం శశ్వన్మమోత్పశ్యతః, క్రోధస్య జ్వలితుం ఝుటి త్యవసర శ్చాపేన శాపేన వా."

అని జనకుఁడు శాపముఁ బెట్టఁబోవుచున్నాఁడు. చూడుఁడు: ఎంతటి వ్యాకులత్వమును, ఎంతటి శోకమోహ పారవశ్యమును బ్రహ్మవేత్త యందుఁ జూపుచున్నాఁడో!

దీనివలన నిట్టి జ్ఞాను లజ్ఞాన బలమును సైతము తలక్రిందులు సేయఁగలిగిన శోకమును సమృద్ధిగఁ జూపఁగలిగి, సీత యెంతటి ఘోరాపదలపాలయినదో మనకుఁ జూపుచున్నాఁడు. ఇవి రససిద్ధులగు మహాకవులపోకడలై యుండును.

రసప్రవాహములందును, అలంకారరంజనములందును సర్వార్థమును జరిత్రముగఁ దీసికొనరాదు. చమత్కారకాంశమును వేఱుపఱచి వాస్తవార్థమునఁ దిగి పాత్రౌచిత్యానుసంధానము సేయవలెను. ఇట్టిదృష్టి నుపయోగించితిమేని వాల్మీకిప్రోక్తమును భవభూతి యన్యథా చేసినదెల్ల రసపోషణమునకే కాన సీతారామ పాత్రౌచితి వాల్మీకి ప్రోక్తమందే ఆయత్తమై యుండును.



## సృష్టిచిత్రము-మానవుఁడు

దొంతరాజు వెంకట్రామయ్య గారు

అవతారభేదములచే-భువనముల సృజించి పెంచి పాలియించి స్వతం
త్రవిహారస్థితుఁడై చను-భువనాధిపు నతులభక్తిఁ బూజింతు మదిన్.

పరిపరిరీతులన్ మదిని భావనసేయ ననంత మద్భుతా
కరమగు సృష్టిచిత్రము; జగన్నుతులౌ సురలంతవారలున్
గరము నచింతితక్రమముగాఁ బరికింత్రు; తదీయవర్ణనా
నిరతిమెయిన్ జతుఃశ్రుతులు నేరకయున్నవి నాకు శక్యమే?

ఐన సూరిజనైక సంహతి కృపావి-లసనమున నిందు స్థాలీపులాకరీతి
సృష్టికలశాబ్ధినున్న వైచిత్ర్యరత్న-వితతియందునఁ గొన్నింటి విన్నవింతు.

వివిధస్థావరజంగమప్రకరమౌ విశ్వప్రపంచంబునన్
భువనాతీతుఁ డొకండు కర్తయయి తాఁ బుట్టింపనేఁ; గానిచో
నవనిన్ గారణహీన కార్యసముదాయం బేక్రియన్ గల్గు! నా
రవి లేకున్నయెడన్ బ్రకాశిలు నొకో బ్రహ్మాండ ముత్తేజమై!

అణుమాత్రుం డభవుం డనాముఁ డతనుం డవ్యక్తుఁ డాద్యుండు ని
ర్గుణుఁ డం చెయ్యెడ వానిఁ జెప్పుదురు ప్రాజ్ఞుల్ వాఁ డెటుల్ కార్యకా
రణరూప ప్రకృతిప్రవర్తకుఁడు నై రాజిల్లె! దుర్జ్ఞేయ మౌ
గణుతింపంగఁ దదీయధీవిభవ విజ్ఞాన ప్రభావోన్నతుల్.

ఆకసంబున వాయువు; నందుఁ దేజ-మందు జలమును; జలమున నవని గలిగి
యవియె గుణయుక్తతను జెంది యఖిలమైన-సృష్టి కాధార మగునఁట, చిత్ర మహహ!

వేల్పులపెద్ద కేల యెదవెన్ దొలుదొల్త ప్రపంచసృష్టి సం
కల్పము ? ఎన్ని భాగములుగా విభజించి యతండు నేక్రియన్

గల్పెను భూతకోటిని? జగంబుల నెట్లు సృజించెఁ? దత్కృతుల్
స్వల్పమె కాంచ నన్యులకు నాసకలజ్ఞుఁడు వాఁడె తక్కఁగన్.

పూర్వకర్మానుగుణమునఁ బురుషశుక్ల-బిందుయుతుఁడై వధూగర్భమందుఁ జొచ్చి
పిండమై నవమాసముల్ నిండినంత-శిశువుగా భూమిఁ బడునఁట జీవుఁ డహహ!

మునుమును జీవుఁ డెవ్వఁడొకొ? పూర్వభవం బెటులగ్గె? తత్పురా
తనభవపాపకర్మసముదాయఫలంబున నెట్లు పిండమై
ఘనకృమిమూత్రరక్తమయ గర్భమునన్ మనఁగగ్లె? ధాత్రి నే
యనువున జన్మమొందెఁ? గడు నబ్బురమౌ సకలంబుఁ జూచినన్.

పురుషుఁడు గల్గునో నెలఁత పుట్టునొ రా దెఱుఁగంగ; నీశుస
త్కరుణ విభూతిమై శిశువు గర్భము వెల్వడునంతకున్ బ్రవి
స్తరతర మాతృసూతిజనితంబగు వేదన దుస్సహం బగున్
దెలివలకున్ బునర్భవ సదృక్షము లౌను సుఖప్రసూతముల్

జననము మొదలుగ జననీ-జనకాది సమస్తబంధుజనకోటికి న
త్యనుపమలీల నొకానొక-యనురాగవిశేష మొదవు నల చిఱుతలపై.

అలుకలసొంపు లేనగవు లాటలు వచ్చియురాని ముద్దు ప
ల్కులనయగారమున్ నగలు లోనుగఁ బూపఁదనంపుఁ జెయ్దముల్
కలకలలాడు నెమ్మొగము కౌతుకహర్షరసైకపాళికిన్
నిలయములై నిరంతర మనిర్వచనీయ సుఖంబుఁ గొల్పెడిన్.

ఏకాకృతులయ్యు నసంఖ్యాకజనం బందు నరయఁగా నేర్తు మహో!
యాకాంక్షితమనుజుని; నెపు-డే కాని ప్రమాద మొదవ దేమాత్రంబున్.

తనురుచియో విలోకనమొ దైర్ఘ్యమొ హ్రస్వమొ కంఠనాద మా
ననమొ కృశంబొ లావొ గమనంబొ యొకొక్కరి కీవిధంబు ను
ర్విని నొకఁ డొండు నూతనవిభేదవిశేషముతోడ సృష్టిఁ జే
సిన జలజాతసంభవుని శిల్పితనంబు నుతింపఁ జెల్లదే!

పౌనఃపున్యంబుగను ది-వానిశలు నిరంతరంబు వర్తిలుచున్నన్
మానవుఁడు విసువుఁ జెందఁడు-దైనందిన నూత్నసరణిఁ దలఁచుచునుండున్.

ధరణి జనించిన పిదపన్-మరణము ధ్రువమంచుఁ దెలిసి మర్త్యుం డకటా!
స్థిరతరముగ జీవించెడు-కరణిన్ గావించు నతఁడు కార్యములెల్లన్.

నేఁ డైశ్వర్యయుతుండగు-వాఁ డెల్లి దరిద్రుఁడగుట పరమదరిద్రున్
గూడుట సిరిత్రుటి లోనన-చూడమె సతతంబు భువిని జోద్యం బలరన్.

అక్కజమా నొకొక్కని గుణావళి నెన్నఁగ; మానసంబునం
దక్కటికం బెఱుంగఁడు, పరార్థము నెప్పుడు పాయసంబుగా
మెక్కఁగఁజూచు నన్యులకు మేలొనరింపఁ దలంపఁడెందుఁ దా
నొక్కఁడె యుట్టిగట్టుకొని యూఁగఁగలండొ మహీతలంబునన్.

అతులితైశ్వర్యవిభవ సమన్వితునకు-వలయునన్నను దనయులు గలుగకుండ్రు
బిచ్చమునఁగాని గడవని పేదవాని-పడఁతి పిల్లలకోడి యయ్యెడు నదేల!

పరిపాటియగుట నివిధరఁ-గరమరుదుగఁ దోఁపకుండుఁగాక మనీషన్
బరిపరివిధముల నరసినఁ-బరమాద్భుత మొదవకున్నె ప్రాజ్ఞులకెల్లన్.

తలఁచిన కార్యముల్ సఫలతన్ గనెనేని స్వకీయ శేముషీ
కలితమహాప్రభావ పటుగర్వితచిత్తుఁ డగున్ నరుండు ని
ష్ఫలితములైనచోఁ దనయశక్తికతంబునఁగాక యొండు తాఁ
దలఁచిన దైవ మింకొకటి తాను దలంచె నటంచు నెంచెడిన్.

కాయము లస్థిరంబులు జగంబున నాయువు వారిబుద్బుద
ప్రాయమటం చెఱింగియును అన్యులనోళులఁ గొట్టి యొంతయున్
మాయలఁ బన్నుచున్ దురితమార్గవిహారవిచారచిత్తుఁడై
పాయక మానవుం డెపుడు పాపధనంబులఁ గూర్చు నక్కటా!

చతురంభోనిధిమేఖలావలయితక్ష్మామండలీపాలనా
చతురుం డైనను గేవలం బనిశభిక్షాసాధనక్లేశజీ

వితుఁ డౌ దుర్గతుఁడైన మృత్యువునకుఁ భీతిల్లు నెవ్వారలుఁ
మతి నూహింప సమంబె పో మరణసంప్రాప్తానుభావంబునన్

సిరులను నిర్ధనుం డభిలషించును; సంపద కల్గెనేనియుఁ
ధరణీపతిత్వ మాసగొను; ధాత్రివిభుం డగునేని స్వర్గముఁ
స్థిరముగఁ గోరు; నయ్యదియుఁ జేకుర నింద్రపదంబు; నీగతిఁ
నరునకుఁ దృప్తి లేదు మరణంబు తుదన్ ఘటియిల్లు నంతకున్.

సకలజ్ఞుండ నిరంకుశ ప్రతిభుడన్ సంపద్వరిష్ఠుండ నా
కిఁక ధాత్రిన్ సముఁ డెవ్వఁ డంచు నరుఁ డెంతే దుర్మదుండై కృతాం
తకుఁ డత్యుగ్రతఁ బైకొనంగఁ దను వంతం బొందు కాలంబునం
దకటా! తత్సకలంబు స్వప్నగతవృత్తాంతంబుగా నయ్యెడిన్.

తనసుకృతంబుపెంపునను ధారుణి నొక్కఁడు జ్ఞానవంతుఁడై
మనుచుఁ బ్రపంచసౌఖ్యముల మాని తిరంబుగ సాధువృత్తిమై
నెనసినఁ దెల్విమాలి యిహిహీ! యని పల్కుచు వేదురుం డటం
చనవరతంబు వానిఁ బరిహాస మొనర్తురు మూఢు లక్కటా!

భువి మరణించువానికయి పొక్కుచు నుంద్రు; తదీయరోదనా
రవ మతఁ డాలకించునొ ? తిరంబుగ నిల్పెదరొక్కొ తాము ! ప్రే
మవిలసనైకబాంధవ మమత్వము మానరుగాక యక్కటా
వివిధఋణానుబంధములు వీడిన నెవ్వరి కెవ్వరయ్యెడిన్.

* * * * * * * * *

అరిషడ్వర్గములన్ జయించి సుకృతవ్యాపారపారీణుఁడై
పరులందున్ దనయందు వోలె సమభావం బుంచి యేకాలమం
దరవిందాక్షుపదారవిందమకరందాస్వాదనాసక్తుఁడై
ధరపైనన్ మనునట్టి మానవుఁడె పో ధన్యాత్మకుం డయ్యెడన్.

---

# మేఘసందేశము

నేలటూరు రామదాసయ్యంగారు, యం.ఏ., యల్.టీ.

బ్రహ్మశ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు మునుపు ఎన్నఁడో మేఘములో ఎచ్చరించిన సందియములం గూర్చి శ్రీ. బులుసు వేంకటరమణయ్యగారు భాద్రపద భారతియందు వ్రాసిన సమాధానముం జదివి, కుతూహలితుండనై, ఆపిచ్చయ్యశాస్త్రిగారి వ్రాఁతను అంతకుఁ బూర్వము చదివియుండని వాఁడను, సంపాదించుకొని చదివితిని. అంతట ఆరెంటింగూర్చి నాకును ఒక్కమాట చెప్ప నవకాశము గలదని ఎంచి ఇట్లు వ్రాయుచున్నాను.

సందేహములకు సమాధానము ప్రాయికముగా సరిపడినదని తలంచెదను గాని, రాజహంసలం గూర్చిన యుపన్యాసము అసమగ్రమనియు, ప్రక్షిప్తములంగూర్చినది 'ధూమజ్యోతి రాది సన్నిపాతమును, జడము నగు మేఘము ఎట్లు మాటాడ నేర్చెనని యాక్షేపింపకుందురు గాక!' అను వాక్యము కలిగి యుండుటచేతను ప్రక్షిప్తములు కావనుటకుం బన్నిన యుక్తులు దుర్బలము లగుటచేతను సమాధిం గూర్పఁదనియు ఎంచి నేను దీని నారంభించుచున్నాను.

1. తొలుత ఇంద్రధనువుం గూర్చిన వేంకటరమణయ్యగారి యుక్తికి స్పష్టతకై ఇంచుక వివరణము—ఈధనువునకు, తూర్పుననో పడమటనో అఖండాకారము కుదిరినపుడు ఎప్పుడును ఒకకోటియుత్తరమునను, రెండవది దక్షిణమునను నేల నవగాఢమై, మధ్యభాగము ఆకసము నడుమ నుండును. దానిని ఉత్తరాభిముఖముగా నుండువాఁడు ఉత్తరమున, చెట్టునుండియో పుట్టనుండియో, యథాసంభవముగా 'ప్రభవించి', ఆకసము నడిమికి లేచి అటనుండి మరల దక్షిణముగా వంగి ముగియుదానింగాఁ గాని, దక్షిణాభిముఖుఁడు ఏతద్విపరీతమైన దానింగాఁ గాని తలంపవచ్చును. ఇట యక్షుఁడును మేఘుఁడును ఉత్తరాభిముఖులు. ఆధనువును అఖండముగాదు, ఖండమే. కావుననే దానిం దాల్చి మేఘుఁడు

'నల్లనివాఁడు......కృపారసంబు పైఁ
జల్లెడువాఁడు మౌళి పరిసర్పిత పింఛమువాఁడు...'

నగు గోపవేషునిం బురణించుట. గోపవేషుఁడు 'బర్హిబర్హమును' 'అవచూడము' (=తురాయి)గా ధరించుట ప్రసిద్ధము. నిడుపై, ఖండమగుటచే ఇంచుక కుడివాలుపు గల్గు బొమ్మకొరడు, పాద(=పావు) వలయముగా నుండునది ఈమేఘునికి పద్మరాగాదిమణ్యుజ్జ్వలమైన 'తురాయి'గా రాణించును. ఆసౌభాగ్యమును ఇట మహాకవి తలపించినాఁడు; దానిం జూపి యక్షుఁడు మేఘునిం దెలిపించినాఁడు. నల్లని మూర్తియు, సిగపైని మణుల తళుకు తురాయియు పరభాగముచే ఒండొంటికి ఉత్కర్షం గూర్చును. కావుననే

'శ్యామం వపు రతితరాం కాన్తి మాపత్స్యతే తే
బర్హేణేవ స్ఫురితరుచినా గోపవేషస్య విష్ణోః' 1.15

అనుట. అట్లుగాక తూర్పునం దోఁచు నింద్రధనురాకారమును, ఖండమునేని అఖండమునేని, మేఘునికి ఆభరణీకరింప వలయునేని, మేఘునికి తూర్పుపయనము చెప్పి, దానిని 'నెలవంక' 'చందురునంక' అను పేరుల నెలయు నాభరణముగా, ఈశ్వరుని తలనుండుదానింగాని, సరస్వతి తలనుండుదానింగాని మించినదానింగా నుత్ప్రేక్షింపఁదగును. మఱి యాగోపవేషునికేని – ఇతరులకేని – బర్హముతో అట్టినగను రచించుట దృష్టశ్రుతచరముగాదు. ఉత్తరము పోవువానింగూర్చి ఇట నది ప్రసక్తమునుంగాదు. బర్హావతంససామ్యము గలధనుఃఖండము ఉత్తరముననేకాని దక్షిణముననే కాని కలుగును గావునను, (ప్రాక్పశ్చిమములం గలుగదు గావునను) ఉత్తరాశాప్రస్థితుఁడగు మేఘునికై 'ఉత్తరము'న నున్న దానింగా వ్యాఖ్యానించుట కరము సమంజసము; హృదయంగమమును.

ఇట మూలమున 'ఉత్తర' మన లేదు. 'ఏతత్' 'పురస్తాత్' 'ప్రభవతి' అని కలదు. "ఏతత్–ఇతి హస్తేన

నిర్దేశః; పురస్తాత్–అగ్రే; ప్రభవతి–ఆవిర్భవతి." అని సంజీవని. ఈమూఁటిచేతను ఉత్తరమే సూచింపఁబడిన దనియు ఉత్తరమైననే ధనుఃఖండమునకు చూడాబర్హా సామ్యము కలుగుననియు శ్రీమద్వేంకటరాయశాస్త్రిల వారి సంజీవనీచేటిక.

"ఆకైలాసాద్బిసకిసలయచ్ఛేదపాథేయవన్తః
సంపత్స్యన్తేనభసిభవతోరాజహంసాఃసహాయాః–1.11

2. "రాజహంసలు నీకు దారిలో సహాయులు(=సయాత్రులు=తోడిబాటసారులు) అగుదురు" అని కాళిదాసుమాటయు, మల్లినాథు టీకయు; "అట్టి యుత్తముల 'సహవాసము' నీకు దారిపొడుగునను కలుగును" అని శ్రీమద్వేంకటరాయ శాస్త్రిలవారి వివరణము; మఱి మేఘహంసలకు విరోధము కవిసమయప్రసిద్ధమై యుండ వారికి ఈసహాయత్వము ఎట్లు ఉత్ప్రేక్షింపఁబడును అని యాక్షేపము; పగ వానకారునకును హంసకుంగాని మేఘమునకును హంసకును కాదు; అట్లుకాక, శాత్రవమున్నను ఏమి? ఇటను మైత్రి చెప్పఁబడలేదు; సయాత్రతమాత్రము చెప్పఁబడినది అని సమాధానము—ఇది ఇప్పటికిఉన్న గ్రంథము. మఱి నాకు వివక్షితమేమనఁగా:—

మేఘహంసలకు అన్యోన్యవైరము కవిసమయములందు ఆలంకారికులచే ఎందును పరిగణితము కాదు. హంసలం గూర్చి కవి సమయములం జెప్పఁబడినది ఏమనఁగా:—

(అ)"అసతోఽపి సామాన్యస్య నిబన్ధో యథా:......
జలాశయమాత్రేహంసాదీనామ్."

(ఆ) "జలధరసమయే మానసం యాన్తి హంసాః."

[వానకారున హంసలు మానసమునకు ఏఁగును–అనియు; లేనివైనను హంసలును (తామరలుం గలువలును) ఏజలాశయమందును ఉండుట–అనియు.] మఱి జలధరహంసలకు శాత్రవముం జెప్పవలసినది అని యనుశాసనములేదు. ఈకవి సమయములు పుట్టుటకుం జెరుఁగుటకును కారణమైన పరమార్థము ఇంచించుక సృష్టివైచిత్రియందు కలిగియుండుననిఁ యూహింపఁబడును. సర్వకాలమందును కలిగినదైనను, నెమళ్ళయాటయుం బాటయు వర్షాకాలమున మెండుకొని అధికదర్శనీయముగా నుండఁబోలును; కావున దానిని వర్షర్తువునకు నియమింపఁబోలును. కృష్ణశుక్లపక్షములయందు వెన్నెలచీకటులు సమానమైనను కృష్ణపక్షమున సాయంకాలము మొదలుకొని క్రమముగాఁ దలుగునవగుటచేతను,శుక్లపక్షమున అట్లే పెరుఁగునవగుటచేతను, వెన్నెలకై కృష్ణపక్షమునకన్న శుక్లపక్షము జనులకు (కవులకును), నిశాస్వరామణీయక ప్రియము లగు మనోహరమగుటచే వెన్నెలకలిమిని శుక్లపక్షమునకు నియమింపఁబోలును. తామరలుం,గలువలును,హంసలునుకొన్నికొలఁకులందుమాత్రము ఉండుననియు,నదులలో ప్రాయికముగా లేనివియు అయినను, అవి కలిగియున్న జలాశయముల రామణీయకాతిశయమును భావించి నదులయందును వానికలిమిని భావించుట యాహ్లాదకరమని కవులు గ్రహించియుండఁబోలును. హంసలు వేదములయు, కావ్యములయు ప్రపంచమునఁదప్ప, ఈలోకమున ఎవ్వరును ఎప్పుడును తాత్త్వికముగా చూచినవి కానని తలంచెదను. 'మానసౌకము' లనుట హిమవంతమునకు ఆవలిదైన మానస(సరోవర)మునందు కాపురముండునవగుటచేతనో, కవులయు (సహృదయులయు)మానసములందు మాత్రమే(ఈజగమునందుఁగాదు) కాపురముండునవగుటచేతనో! కొందఱు హంసలు బాతులజాతివి కాఁబోలును అందురు. కాని సరూపత మొదలగునది ఇంచించుక యున్నను, బాతులకు అలవిపడనిది ఎంతదూరమైనను ఎక్కు–వాల్పక యెగురు పాటవము హంసలయందు సంభావితమగుటచేత, అవి వేఱే; ఎవరికిని ఎన్నఁడును కంటఁబడనివే! యుగాంతరములందు ఉండి, ఇప్పుడు సృష్టిలో లోపముం జెందినవి అనుకొందమా? ఎట్లైనను కవులకై హంసల సద్భావమును అంగీకరింతుముగాక. మఱి యాకావ్యలోకమున హంసలు వర్షర్తువున మానసమునకుం బోవుట కేవలము అసన్నిబంధనకాదు; అందును ఇంచుక నిజము కలిగియుండఁబోలును. అట్లేకదా మల్లినాథసూరి (మేఘ I. 11) ఆనతిచ్చినాఁడు—

"కాలాన్తరే మానసస్య హిమదుష్టత్వాత్, హిమస్యచ హంసానాం రోగహేతుత్వాత్ అన్యత్ర గతా

హంసాః పునర్వర్షాసు మానసమేవ గచ్ఛన్తీతి ప్రసిద్ధిః"

"ఇతరకాలమందు మానససరస్సులో మంచు ఉండును; మంచుహంసలకు రోగకారి; కనుక హంసలు ఇతరకాలమును ఇతరస్థలములయందుఁ గడపి వర్షాకాలమందు మానససరస్సునకు వచ్చును అని ప్రసిద్ధి." కావుననే హంసను మానసౌకమనుట. మానసౌకమనుటకుం గలము మఱియొకటి యేమనఁగా: మానసమందలి నీరు పటికపుఁ దునియలవలె ఎల్లప్పుడును నిర్మలముగా నుండును; బంగారుతామరల నీనును. జలనైర్మల్యమును తామరలును వానికిఁ బ్రియములు. తదితరజలాశయములయందును అవి యుండుచోటుల నవి విహరించుట కలదు. వానకారున క్రొత్తనీటిచేసకలజలాశయములును—మానసముతప్ప—కలఁగిపోవును; హంసలకు వాసానర్హములగును. కావున అవియెల్లెడలను సంచారముమాని తమసొంతయింటికి, మానసమునకే పోవును. మరల శరత్తువచ్చి నీళ్లు అంతటను తేటి నిర్మలములు కాఁగానే అవి యెల్లెడలం గ్రుమ్మరఁజొచ్చును. కనుఁడు—

"వాపీ చాస్మిన్ మరకతశిలాబద్ధసోపానమార్గా
హైమైశ్ఛన్నా వికచకమలైః స్నిగ్ధవైడూర్యనాలైః;
యస్యాస్తోయే కృతవసతయో మానసం సన్నికృష్టం
నాధ్యాస్యన్తి వ్యపగతశుచ స్త్వామపి ప్రేక్ష్య హం
[సాః" II-15

"త్వాం ప్రేక్ష్యఅపి, వ్యపగతశుచః—వర్షాకాలేఽప్యకలుషజలత్వాత్ వీత దుఃఖాఃసన్తః" "నిన్నుఁ జూచియుంగూడ, పోయిన దుఃఖముగలవై, అనఁగా వర్షాకాలమందును ఆబావిజలము అకలుషముగానుండుటచే దుఃఖములేనివై" అని కాళిదాస మల్లినాథులు తెలిపినారు. అట్లే రామాయణమునను వర్షర్తువున "సంప్రస్థితా మానసవాస లుబ్ధాః" కిష్కిం.—28-17 అనియు "నవంజలంపర్వతధాతుతామ్రం" అనియు, శరత్తున "వ్యపేతపంకాసు సవాలుకాసు,ప్రసన్నతోయాసు... దీషు హృష్టా నిపతంతి హంసాః" కిష్కిం—30-43. న అనియుం జెప్పఁబడినది. కావున ప్రసన్నసరః ప్రియత,

కలుషజలద్వేషము, అట్లే రోగకారి హిమద్వేషమును వట్టి యుత్ప్రేక్షగాదు; మఱి హంసస్వభావకథనమును ఆకవి సమయములకు నిదానమును. ఇట్లు మేఘాగమ హంసాపగమయోగపద్యము ప్రకృతిలో నున్నది. దీనిని కవులు ఎల్లెల్లెనియు,—మైత్రిగాఁగాని,శాత్రవముగాఁగాని, సయాత్రతగాఁగాని—దానికి దానికి తగిన సంవిధానమును సామగ్రిని కల్పించి ప్రతిభకొలఁదియు వ్రాయఁదగును. పిచ్చయ్యగారి యుదాహరణములయందును మేఘహంసవిరోధము ఏకాంతముగా సిద్ధింపదు. "ఘనశంక"—శంకసందియము, భయమేగాదు. "కిన్కన్ బోలె"— 'పోలె' ననుటచే కిన్కయుత్ప్రేక్షితము కాని ప్రకృతి సిద్ధముగాదు."అండపిండఖండములనఁగన్—'అనఁగన్' అనుట ఉత్ప్రేక్షావాచకము. ఆవిరోధము ప్రకృతిసిద్ధమేని ఈగర్భస్రావమునిజముగానే ఏలవర్ణితము గాదు? అట్లే తక్కినవియు. ఒకవేళ ఈయుదాహరణములయందువైరమే, హంసలభయమే,తత్కందికితయునే యుండుఁగాక, అది కాళిదాసుచెప్పిన సహాయతకు ఆక్షేపోద్ధాపకము కానేల? మఱియు ఒక్కడేకవి ఒక్కడ వైరమును, ఒక్కడ సహాయతనుంగూడఁ జెప్పరాదా? ఆమాత్రకు కవిసమయోల్లంఘనము ఏలకలుగును? హంసల మానసగమనమును చెప్పవలయుటమాత్రమే సమయముగాని దానిని వైరకార్యముగానే చెప్పవలయు నను నియమమును సమయమా? ఆదికవి వాల్మీకిముని యూరక "సంప్రస్థితా మానసవాసలుబ్ధాః" అని యావాసలోభముం జెప్పెను గాని, మేఘములు ఉఱుముచునేయున్నను, మేఘభయమును చెప్పఁడాయెను. విక్రమోర్వశీనాలవయంకమున సంవిధానము ఈమేఘమందలి దానిని అతిమాత్రముగా పోలినట్టిది. అందును పురూరవుఁడు ప్రియాప్రవృత్తిని హంసవలన నెఱుంగుచోట ఇట్లున్నది.

(ఆంధ్రానువాదము)—"అహో, దక్షిణమున ప్రియాచరణన్యాసమును అంచెరవళి తెల్పుచున్నది! కానీ, అటకేఁగెదను. (పరిక్రమించి)......[దిక్కులుసూచి] అయ్యో, ఇసీ ఇసీ,

క. జలదముల నిర్గళోను ది
క్కులఁ గన్గొని మానసమునకు సముత్సుకతన్

వెలలెడి మదకలహంసల
కలరుతమిది, యందెరవళిగాదాయెఁ గటా!

కానీ, మానసోత్సుకములయిన యీపక్షులు సరస్సు నుండి ఎగిరి పోకమునుపే వీనివలన ప్రియావృత్తాంతమును తెలిసికొనవలయును ... ... ఓహోయి, జలవిహంగ మరాజా,

తే. పోవుదువుగాక మానసమునకు వెనుక,
వదలు బత్తెంపు బిసముఁ, గొనెదవు పిదప,
తీర్థుఁగాక నావగ.........

నీవు తలయెత్తి మిన్ను సూచుటచేత 'మానసోత్సుకుఁడను, నేను చూడనయితిని.' అని పల్కెదవా?......

క. నాకొమ్మ నిమ్మ హంసప,
క్షైకొంటె తదీయమైన కాంతగతంబున్.

... ... ... ...

(విహసించి) ఇది దొంగలను దండించువాఁడు రాజు అని భయముచేత ఎగిరిపోయినది."

ఇటు "జలదముల నిర్గుకొను దిక్కులఁ గన్గొనుటను" చెప్పినను, కాళిదాసు జలదములు జడిపించుటం జెప్పడు; ఆపయనమునకు మానసోత్సుకతను మాటిమాటికిం జెప్పినాఁడు గాని, పురూరవుఁడు, కాదా, కాళిదాసు హంస మిన్ను చూచుటచేత "మానసోత్సుకుఁడను, నేను చూడనయితిని" అను కారణముకన్న "ఈ మేఘములయడావడికి కలగుండు వడె యేమియుంజూడనైతినందువా" అని యేల యనిపించి యుండరాదు? కడపట అది యెగిరియేపోఁగా, పురూరవుఁడు తన దండనకు భయపడిపోయె నని నవ్వెను గాని మేఘగర్జకు చెదరి పోయెనని జాలిగొనఁడుగదా! అట్లే మల్లికామారుత నవమాంకమున ఇదే సంవిధానము! ప్రావృడాగమమును గలదు; మఱి మింటం బాఱుతెంచు హంసలంగూర్చి జలధరదర్శన గర్జాశ్రవణాది భయకార్యము ఉత్ప్రేక్షితము గాదు. మఱి—

"ఏమవోఽ్యమని మానసం జిగమిషుర్హంసాళి రుడ్డీయతే
చంద్వాగ్రే శ్వేర శైశ్వే విద్రుమసత్రైః—"

అని మానసజిగమిషమాత్రము చెప్పఁబడినది. ఇట్లు వర్షలో హంసల యపక్రమణముం జెప్పినారకాని, మేఘము లున్నను అవి యుఱిమినను మెఱసినను వానివలని భయము చెప్పకయు రాజదండనాది భయముంగాని వట్టి మానసోత్కంఠంగాని చెప్పినారు. ఈ 'రాజహంసాః సహాయాః' అన్న యెడను మహాకవికి అందే తాత్పర్యమని

"తచ్ఛ్రుత్వా తే శ్రవణసుభగం గర్జితం మానసోత్కాః"

అని మానసోత్కంఠ సూచించినది. కావున ఆవైరము అందు ఆయాకవి యుత్ప్రేక్షితముకాని ప్రకృతిసిద్ధమేనియు దాటరాని కవిసమయమేనియుం గాదు. కావుననే మల్లినాథపాదులవారేనియు, వేంకటరాయపాదులవారేనియు వ్యాఖ్యానించుచో "రాజహంసాః సహాయాః" అనుటయందు దోషమును ఎంచక "జలధరసమయే మానసం యాన్తి హంసాః" అను కవి సమయమునుగాని "కాలాన్తరే మానసస్య హిమదుష్టత్వాత్" ఇత్యాది ప్రసిద్ధినిగాని ఆశ్రయించి మహాకవి ఇటం గల్పించిన సహాయభావమునకు అనుగుణమగు పదప్రయోజనాదిస్వారస్య వివరణమును సమకూర్చినారు. అంతియకాక పూర్వమేఘమున "వీచిక్షోభ స్తనిత విహగశ్రేణికాంచీగుణ యగు నిర్వింధ్యానదింగూడి రసాభ్యంతరుఁడవు కమ్ము" అన్న 29 వ శ్లోకమునను, "ఏయుజ్జయినియందు ప్రాభాతికశిప్రావాతము సారసముల పటుమదకలకూజితమును సంతానించుచున్నట్టిది... స్త్రీల సురతగ్లానిని హరించునో ఆయుజ్జయినియందు..." అన్న 32 వ శ్లోకమునను గీర్వాణాంధ్ర వ్యాఖ్యాతృచక్రవర్తులిరువురును దోసమని యెంచక కాళిదాసు మేఘప్రలోభనార్థము యక్షునిచేఁ బలికించిన నిర్వింధ్యాసౌభాగ్యమందలి మొలనూలి గంటయైన 'విహగమును' శిప్రావాతమందలి కూజితానురసనమునకుం బ్రభవమైన 'సారసమును', "విహగానాం=హంసానాం, సారసానాం=హంసానాం. చక్రాఙ్గః సారసో హంసః-ఇతి శబ్దార్ణవే" అని హంసనుగానే వివరించినారు. మఱియు అందే 24 వ శ్లోకమున "దశార్ణదేశము నీవు (మేఘుఁడు) ఆసన్నము కాగానే......కతిపయ దినస్థాయిహంస కాఁగలదు." అనియు; 61 వ శ్లోకమున

"హంసద్వారం భృగుపతియశో వర్త్మ యత్క్రౌఞ్చరన్ధ్రమ్, తేనోదీచీం దిశమనుసరేః..."

అని క్రౌంచబిలమగు హంసద్వారముగుండ నీవు (మేఘుఁడు) ఉత్తరమునకు బొమ్ము అనియు, కంఠోక్తముగా మేఘుని చెవిసోఁకఁ బ్రియంకరముగానే హంసనామగ్రహణము సేయఁబడినది. "కతిపయదినస్థాయి" అనుటచే మేఘహంసల వైరముగాని, వైరమైననే స్ఫురింపఁజేయ వలయు మేఘజేతృత్వముగాని హంసలకాందిశీకత్వముగాని సూచింపఁబడలేదు. వైరమందును, జేతృతాకాందిశీకతల యందును కవికిఁ దాత్పర్యము లేమిచేతనే "కొన్నాళ్లైనను హంసలు ఉండుట"ను చెప్పుట. చిత్రకూటప్రాంతమున సహాయము లేదైనవి; దశార్ణమున తర్వాత కొన్నాళ్ళనిలుకడమీఁద తరలునవిగాఁ జెప్పఁబడినవి. 'కతిపయ' అన్నను 'స్థాయి' అనుటచే ఆపాతముగా కవివాక్యమున ఆద్వేష స్ఫురణలేదు. 'స్థాయి' అన్నను 'కతిపయ' అనుటచే మానసప్రస్థానకవిసమయము నిర్వ్యాఘమైనది. [ఆప్రస్థానమునకు క్రొత్తనీటిచే కొలఁకులు కలఁగిపోవుట మొదలగు భావియుపద్రవము నిజమైన కారణముగుఁ గాక.] తరువాత 'హంసద్వార'మునసే పొమ్మనుట యందును ద్వేష స్ఫురణలేదు. ద్వేషము సిద్ధమేని ఆపేరి బిలముగుండ నేలపొమ్మనును? ఆద్వేషమున తాత్పర్యమున్న ఆబిలముగుండ 'హంసలం దఱుముచు' ఉత్తరమునకుం బొమ్ము, అని యేల చెప్పఁడు? మఱి మైత్రియు సహాయతయు, 'రాజహంసాః సహాయాః' అన్న మాటయునే తలఁపునకు తేఁబడినదని గ్రహింపఁదగియున్నది. ఉత్తరమేఘమునను 15 వ శ్లోకమున హంసప్రస్తావము కలదు. ఇట్లు—

"యస్యాస్తోయే కృతవసతయో మానసం సన్నికృష్టం నాధ్యాస్యన్తి వ్యపగతశుచ స్త్వామపి ప్రేక్ష్య హంసాః"

'తోయే'-నీటియందు – అనుటచే ఎండైనను (మేఘుని వలన కలుగు) తోయకాలుష్యము హంసలకు దుఃఖకారణమనియు, దానిని మేఘుఁడు ఇందును, మానసమందుం బోలెనే కలిగింపఁ జాలఁడనియు, తత్త్వము చెప్పఁబడినదికాని కవివాకుచే తదుభయవైరము ఉత్ప్రేక్షితమేని, ఆక్షిప్తమేని కాదు. "జలధరసమయే మానసం యాన్తి హంసాః" అనుకవి సమయమును నిర్వాహము సేయుచు ఇందు మేఘునితోడనే చెప్పుమాటలలో—పొగడ్త, వశీకరణము, ప్రణయము, ప్రలోభనము కలిగినవానిలో—ఈ క్రిందికల్పనలు సేయఁబడినవి—

(అ) మానసోత్సుకములై రాజహంసలు వింట నీకు సహాయములగును.

(ఆ) నీవు ఆసన్నుఁడవు కాఁగా దశార్ణము కతిపయదినస్థాయి హంసమగును.

(ఇ) నీవు చేరఁబోఁగా నిర్వింధ్య హంసశ్రేణీ రశనా కలాపముతో నీకు ఉపభోగార్హ యగును.

(ఈ) నీకు ఉజ్జయినియందు శిప్రావాతమున పటుమదకలమగు హంసకూజితము వినంబడును.

(ఉ) నీవు హంసద్వారముగుండనే దూరి ఉత్తరమునకుఁ బొమ్ము.

(ఊ) నాయింటనుండు వాపిలోని హంసలు, ఆనీట నిరవుకొన్నవై, నిన్నుఁ జూచియు, దుఃఖము చెందవు; మానసమునకై యువ్విళులూరవు.

ఇవియు ప్రకృతిలోని మేఘములరాకను, హంసల పోకను కలిపి నిమిత్తనైమిత్తిక సంబంధమునేని, జేతృజిత సంబంధమునేని ఉత్ప్రేక్షించినారు అని పిచ్చయ్యగారు చెప్పు నుదాహరణములపాటిదె హృదయంగమములే యగును.

తుల్యయోగక్షేమమైన మఱియొక యుదాహరణముం జెప్పెదను. విరహులకు చంద్రమలయానిలాద్యుద్దీపనములన్నియు అపకారులుగా మహాకవులు వర్ణించి వీరిచే వానిని ఉపాలంభింపింతురు. విప్రయోగమున ఉద్దీపక సాన్నిధ్యము బాధం గలిగించునదే. దీనికి కావ్యములందంతయు పరశ్శతముగా ఉదాహరణములు గలవు.

"చన్ద్రశ్చణ్డకరాయతే, మృదుగతి ర్వాతోఽపి వజ్రాయతే, మాల్యం సూచికులాయతే, మలయజాలేపః స్ఫులింగాయతే; ఆలోకస్తిమిరాయతే విధివశాత్ ప్రాణోఽపి భారాయతే, హా, హన్త ప్రమదావియోగసమయః కల్పాన్తకాలాయతే,"

ఇట్లు ఎన్నియెడలనో చెప్పిన కాళిదాసు శాకుంతలమున మూఁడవ యంకమున అయోగదుఃఖితుఁడగు దుష్యంతుని అచ్చటనే అప్పుడే చంద్రమదనుల నుపాలంభించినవానిని మాలినీతరంగవాతముచే అలరించినాఁడు. ఇట్లు—

"శక్య మరవిందసురభిః కణవాహీమాలినీతరఙ్గాణామ్.
అఙ్గై రనఙ్గతప్తై రవిరళ మాలిఙ్గితుం పవనః."

మఱి 'ప్రజాయతే' యని యనలింప లేదు. అట్లే మాళవికలో అట్టివాఁడే యగు నగ్నిమిత్రునిచే వసంతుని యాభిజాత్యమును మలయవాతంపుసుఖస్పర్శను ఉగ్గడింపించినాఁడు. ఇట్లు—

"అభిజాతఃఖలు వసన్తః,
ఆమత్తానాం శ్రవణసుభగైః కూజితైః కోకిలానాం
సానుక్రోశం మనసిజరుజః సహ్యతాంపృచ్ఛతేవ;
అఙ్గే చూతప్రసవసురభి ర్దక్షిణో మారుతో మే.
సాన్ద్రస్పర్శః కరతల ఇవ వ్యాపృతో మాధవేన."

మఱియు నట్లే రామాయణమున వాల్మీకి చెప్పినది, మాల్యవంతముమీఁద వర్షర్తువునందే రాముని యేడ్పులో వానగాలిఁ గూర్చి, అత్యంతోద్దీపక మైన దానిం గూర్చియే ఈమాట—

"మేఘోదరవినిర్ముక్తాః కల్హారసుఖశీతలాః
శక్య మంజలిభిః పాతుం వాతాః కేతకిగంధినః."

అందే పంపాతీరమున వాసంతమలయానిలముం గూర్చియు

"సఏష సుఖసంస్పర్శో వాతి చందనశీతలః,
గంధమభ్యావహన్ పుణ్యం శ్రమాపనయనో ఽనిలః."

గీతగోవిందమున వియోగవిహ్వలయగు రాధికకు చంద్రుఁడు బాధను దొలఁగించుచుఁ గలిగించుచు నున్నాఁడు.—

"విరహపాణ్డు మురారిముఖామ్బుజ
ద్యుతిరయం తిరయ న్నపి వేదనామ్;
విధు రతీవ తనోతి మనోభువః
సుహృదయే హృదయే మదనవ్యథామ్."

వృత్త మిట్లుండ, "ఉద్దీపకములకును, విరహులకును కయ్యమునే చెప్పవలయును గాని నెయ్యముం జెప్పరాదు; కవి సమయము అట్టిది" యని పెనంగనగునా? కవులు ఇచ్చబడి యుత్ప్రేక్షింతురు. ఏయుత్ప్రేక్షితమునుండి ఎక్కడ ఏయేభావము వ్యంగ్యమని గ్రహింపఁదగునో ఆయాభావమును సహృదయులు గ్రహింతురు.

మఱియు పిచ్చయ్యశాస్త్రిగారి యీహంసమేఘవైరనిబంధన మార్గముంబట్టి నాకు అడుగవలసినది యొకటిగలదు. ఏమనఁగా,—ఎట్టికవుల యుత్ప్రేక్షంబట్టి "హంసను వైరియగు మేఘునికి సహాయముగా చెప్పినాఁడేమి?" అని యీయాక్షేపణ లేపఁబడినదో అట్టియుత్ప్రేక్షంబట్టియే మేఘవాయువులకు ఆనుకూల్యము, మైత్రి, "మేఘమునకు వాయునేతృత్వము— ఇట్టివి చెప్పఁబడినవేమి ఈకావ్యమున?" అనియు ఏల యాక్షేపణ లేపఁబడలేదో? ఇందు సందేశహరణార్థము మేఘాభిముఖ్యమును కోరినాఁడు యక్షుఁడు; మేఘహంస వైరద్వితయమున వైరము నంగీకరింతుమేనియు, మేఘము జేత, హంసపరారి యగునది. కావున హంస నామగ్రహణము మేఘమునకు భయావహము గాదు; దాన మేఘునివలన యక్షునికి కార్యభంగము కలుగదు; అట్లుగాక వాయు మేఘవైరి ద్వితయమున వాయువునకు మేఘము లోకువ; వాయువుపేరు విన్నను దాఁ బలాయనము కావలయును; వాయువు మేఘములం బటాపంచ లు చేయునుగదా!

విఘ్నేశపూజ:—"విఘ్నాద్రౌఘ ఘనప్రచండ పవనో విఘ్నేశ్వరః పాతు మాం."

"ప్రళయాంభోధరముక్త సాంద్రవిసర త్పాషాణవర్షంబు మి, క్కిలియై శైలము గప్పునట్లు నరునక్షీణాస్త్ర
సంతాన మి, ట్టలమై కప్పెఁ దీవ్రమారుతము గాఢ
వ్యాప్తి జీమూతమం,డలిఁబోలెన్ విరియించె భాను
జుఁ డవష్టంభోజ్జ్వలాకారుఁడై."

తిక్కనగారి విరాటపర్వము.

"కరితురగసమితిఁ గార్కొని
కురువీరుల మొనలు మొగులు కొమరునఁ గవియన్
శరవేగంబున నరుఁ డు
ద్ధురమారుత చండభంగిఁ దోఁపఁ దెరల్చెన్."



లక్ష్మి
చిత్రకారుడు; శ్రీ వరదా వెంకటరత్నముగారు, రాజమండ్రి.




సీతా రామ లక్ష్మణులు

చిత్రకారుడు: శ్రీ వరదా వెంకటరత్నముగారు, రాజమండ్రి.

ద్రోణ.—

"అదలిచి లక్ష్మణుండు విజయాత్మజుఁ డాఁకినఁ జూచి యుమ్మలం, బొదవఁగఁ బుత్రుఁ బెట్టి చన నోపక క్రమ్మఱు రాజుఁగాంచి యం,బుదములు గొండపై నడరుపోలిక నన్నరుపట్టి నంపఱుం, బొదువ నతండు ఘోరశరఘూరిసమీరమునం దెరల్చుచున్".

పంచతంత్ర కాకోలూకీయమున 12-వ కథలో సూర్యునికి పర్జన్యుఁడు తాళఁగాని పగవాఁ డనియు, పర్జన్యునికి వాయువు, అట్టివాఁడనియు, ఇట్లు ఒక పరంపర ఉపజీవింపఁబడినది. ఇట్టికల్పనలు వాఙ్మయమున లెక్కలేనివి గలవుగదా. కావున ఈ సందేశమున వాయువుపేరును మేఘుని చెవిని వేయుటయు ఆత్మోపకారకము గాదా? మఱి మేఘమునం గాళిదాసు ఎట్లెట్లు మేఘుని పురస్కరించుకొని అనిలుని ఎచ్చరించినాఁ డనఁగా—

1. I 8. త్వామారూఢం పవనపదవీం.

2. ,, 9. మన్దం మన్దం నుదతి పవన శ్చానుకూలః.

3. ,, 14. అద్రేః శృఙ్గం హరతి పవనః.

4. ,, 37. ధూతోద్యానం కువలయరజోగన్ధిభి ర్గన్ధవత్యా స్తోయక్రీడానిరతయువతిస్నానతిక్తై ర్మరుద్భిః.

5. ,, 46. నీచై ర్వాస్యత్యుపజిగమిషో ర్దేవపూర్వం గిరిం తే, శీతో వాతః పరిణమయితా కాననోదుమ్బరాణాం.

6. ,, 66. శబ్దాయన్తే మధురమనిలైః కీచకాః పూర్యమాణాః

7. ,, 66. ధున్వన్ కల్పద్రుమకిసలయా న్యంశుకానీవ వాతైః.

8. II. 6. మన్దాకిన్యాః సలిలశిశిరైః సేవ్యమానా మరుద్భిః.

9. ,, 9. నేత్రా నీతాః సతతగతినా యద్విమానాగ్రభూమీ........జలముచః...జర్జరా నిష్పతన్తి.

10. ,, 37. తా ముద్ధాప్యస్య జలకణికాశీతలే నానిలేన

11. I. 20. అన్తఃసారం ఘన, తులయితుం నానిలః శక్ష్యతి త్వామ్.

12. ,, 57. తం చేద్వాయౌ సరతి సరళస్కన్ధసంఘట్టజన్మా, బాధేతోల్కాక్షపితచమరీవాలభారో దవాగ్నిః, అర్హ స్యేనం శమయితు మలం వారిధారాసహస్రైః.

ఈ మేఘుఁడు గాలిపై నెక్కి విహరించునఁట; గాలి ఈయనకు "మోటారుకారు", కాదా "ఏరోప్లేను!" మేఘునికి గాలి కరమనుకూలుఁడఁట! దారిలో పరిమళములు మోచి తెచ్చి మేఘుని సేవించునఁట! శివతాండవము కచ్చేరిలో ఆ మేఘుఁడు ఉఱుముమద్దెలను వాయింపఁగా అతనితో కలసి యుద్ధిగా గాలి తిత్తి యూఁదునఁట! మేఘునిగాలి, నాయకుని విటాదికామసహాయులు దొంగదారుల నాయికలకడకుం గొనిపోవునట్లు అలకమేడలలోనికి రహఃక్రీడలకుం దార్చునఁట! మేఘునికి చేతిలో గాలి యక్షిని లేపుటకైన వీచోపుగా పనికివచ్చునఁట! మఱియొకచోట వాయువు ఈ 'ఘనుని' కదలింపఁజాలఁడఁట! వేఱొకచోట (పెను) గాలి అగ్నితోకూడి కావించు మహానర్థమును మేఘుఁడు వారించి గాలిని (అగ్నిని) దండింపవలయునఁట!

కాళిదాసు ఒక్కఁడే కాఁడు; ఆయనశిష్యుఁడు, పదవాక్యప్రమాణ పారావారపారీణుఁడు, ఉత్తరరామచరిత రచనచే గురువును మించిపోయినవాఁడు, మహాకవి భవభూతి మాలతి నవమాంకమున మాధవమదనోన్మాదమున మేఘసందేశము ననుకరించినయెడ చెప్పినాఁడు, మేఘునిం గూర్చి మాధవవాక్యము—

"కచ్చి త్సౌమ్య ప్రియసహచరీ విద్యు దాలిఙ్గతి త్వాం?
మానిర్ముక్తః ప్రణయసుముఖా శ్చాతకా వా భజన్తే?
పౌరస్త్యో వా సుఖయతి మరుత్ సాధు సంవాహనాభిః?
ర్విష్వగ్బిభ్రత్ సురపతిధను ర్లక్ష్మ లక్ష్మీవదేతత్?

"బాబూ, జలదా, నిన్ను ఈతూర్పుగాలి చక్కఁగా సంవాహనములచేత (శ్రమాపనోదముచేసి) సుఖపెట్టుచున్నదా?" అనఁగా మేఘునికి కామివార్తాహరణోప

[న.

కారికి గాలి సంవాహకుఁడగు జెట్టి! ఆ భారతాద్యుదాహరణములందు గాలి మేఘములం బటాపంచలు చేయుటను ఆకవులు ఉత్ప్రేక్షించుట హృదయంగమమేని ఈ ప్రకరణమున నీసర్వప్రకారవాయుమేఘమైత్రి హృదయంగమతరమగును. "ఇతరులు వైరముం జెప్పిన వీరు మైత్రిని చెప్పినారేమి?" అని యాక్షేపించిన నెట్లు? గాలి మేఘములకు వైరము కవిసమయ మన్న నెట్లు? అది యెందేని కలదా? మేఘహంసవైరముగాని వాయుమేఘవైరముగాని కవిసమయము గాదు. మేఘములరాకయు, హంసలపోకయు, వాయువు మేఘమును ఎసరఁ గొట్టుటయు, పర్వించుటయు, వాన కురియుటయు, కురియకపోవుటయు, ప్రకృతిలో కలిగియున్నట్టి తత్త్వము. వీన దేనినేని ఎట్లేని ప్రతిభగలకవి మనోహరముగా కల్పించును.

ఈమేఘహంస మైత్రీవైరప్రస్తావమున కాళిదాసమహాకవి చూపిన మెలఁకువకై ఒక్క ఎచ్చరికం జేసెదను. ఇందలి మేఘము "ఆషాఢప్రథమదివస"మందు వచ్చినది. ఆషాఢము ఎండఋతువు రెండవ నెలయకాని వర్ష కాదు; వర్షవేళు; ఇఁక నెలదినములకు రానున్నది, అని "ప్రత్యాసన్నే నభసి" అనుటచే సూచించినాఁడు. ఇది వేసంగియకాని వర్షర్తువుకాదు అని గ్రంథము పొడుగునను స్పష్టముగా సూచించినాఁడు. "ఆసారప్రశమిత వనోపప్లవమ్" (I.-17)అనియు, "సరళస్కన్ధసంఘట్టజన్మాదవాగ్నిః" (1-57) అనియు, ఘర్మైక ప్రభవమగు కాఱుచిచ్చుం జెప్పియు; "తాభ్యోమోక్షస్తవ యది సఖే, ఘర్మలబ్ధస్య న స్యాత్, (1. 65) అని "ఘర్మము"ను సాక్షాత్తుగా చెప్పియు; "ఘర్మాన్తే వైవద బత కథం వాసరాణి వ్రజేయుః" (II. 47)="ఇక ఈఘర్మము పోయి వర్షర్తుదినములు 'దిక్సంసక్తప్రవిరళఘనావ్యక్తసూర్యాతపములు" వచ్చిన నేనెట్లోర్వఁగలను?" అను నర్థముం జెప్పియు; ఎండకాల మగుటను రూఢిసేసినాఁడు. కావున ఇది "జలధరసమయ"మేఘముగాదు, ఘర్మసమయప్రాప్తము; ఈయేఁటికి తొలిమేఘము. మల్లినాథసూరియు ఒక్కశ్లోకవ్యాఖ్యలో దీనిని "ప్రాథమిక మేఘత్వాత్" అని నిర్దేశించినాఁడు. అయినను కాళిదాసే 'ప్రథమ' మేఘమందలి తన తాత్పర్యమును విక్రమోర్వశిలో ఉన్మత్తపురూరవుని మేఘమునుం గూడ గంధమాదన శైలగతమును "నవజలధరః సన్నద్ధః" అని "నవ"మని విశేషించి రూఢిసేనాసిడు. తాను కవికులగురువుగదా, ఇఁక తచ్ఛిష్యులును—

భవభూతి మాలతిలో బృహద్ద్రోణీ శైలపృష్ఠగతుఁడును, మదనోన్మత్తుఁడు నగు మాధవునిచే

(1) "అయ మచిరధాతరాజ పట్టరుచిర మాంసలచ్ఛవిర్నవ జలధరః"

(2) "శ్రయతి శిఖర మద్రే ర్నూతనస్తోయవాహః"

(3) "నవజలధర ప్రభంజనస్య..."

(4) "అయ మభినవమేఘశ్యామలోత్తుంగసానుః"

అనియు, వీరచరితమున మాల్యవత్పృష్ఠగతుఁడును, విరహోగాతి విహ్వలుఁడును అగు రామునిచే

(5) "అపిచ విఘటమాన ప్రౌఢతాపింఛనీలః
శ్రయతి శిఖర మద్రేర్నూతన స్తోయవాహః"

అనియు, ఉత్తరరామచరితమున చిత్రదర్శనఘట్టమున ఈదశయే పరామృష్టమగుచుండఁగా ఆచిత్తరువుం గూర్చి లక్ష్మణునిచే

(6) "సోఽయం శైలః కకుభసురభి ర్మాల్యవాన్నామ యస్మిన్, నీలస్స్నిగ్ధః శ్రయతి శిఖరం నూతనస్తోయవాహః"

అనియు, మురారి అనర్ఘరాఘవమున అక్కడనే ఆరామునిచేతనే—

(7) "అభినవ ఘనవ్యూహఘోరస్కః ప్రవర్షతి మాల్యవాన్"

అనియు, ఉద్దండకవి మల్లికయందు ఒకకొండ నెత్తమందే యున్న మదనోన్మత్తమారుతునిచే

(8) "ప్రథమజలధరధారాసేకోచ్ఛ్వసిత సురభిళ..."

అనియు కరము మెలఁకువతో నవనూతనాభినవప్రథమాది శబ్దములచే మేఘమును విశేషించినారు. భవభూతిమాలతిలో మఱియు స్పష్టముగా ఘరమనుగాదు, వర్ష

యుం గాదు, మఱి పేర్మివర్షలసంధి అని కాళిదాసుని యాషాఢమునే ఇట్లు సూచించినాఁడు.

(9)" ఘర్మాంభోవిగమాగమ వ్యతికర శ్రీవాహినో వా
[సరాః" అని.

"There is no leap in nature; the passage from season to season is very gradual" అని యాంగ్లాభియుక్తవ్యవహారము కలదు. కావున ఋతువు వచ్చుటకును, వెలయుటకుం, బోవుటకును కాల క్రమము గలదు. దానం జేసియే వర్షలో పూర్వతరమాస మగు నాషాఢమును, ఉత్తరమగు నాశ్వయుజమునుం గలుపుకొని వర్ష నాలుగుమాసములం బరిమిత మందురు. అట్లే రామాయణమున—

"ప్రవృత్తాః సౌమ్యచత్వారో మాసా వార్షికసంజ్ఞకాః" అని. మఱియు పెద్దల సుభాషితమున—

"వర్షార్థమష్టౌ ప్రయతేత మాసాన్"

అని ఎనిమిదిని గ్రహించుటచే పరిశిష్టము నాలుగు నెలల కాలము వర్ష. ఇదెల్ల తొలిమేఘమునకును, ఆషాఢమున తద్దర్శనమునకును ఉపపత్తి, కాదా, సూచన. ఇట్లు ఈమహాకవి కుటుంబము విడువక ఆశ్రయించిన యీతొలకరి తొలిమేఘము కేవల "జలధరసమయ" మేఘము వలెఁగాక, హంసలకు తనరాకచే తమకు రోగకారియో, ఒంటునగను అనిష్టావహమో అను వర్షర్తువుయొక్క ప్రత్యాసత్తినిసూచించి, సుభగమంద్రగర్జలచే మేలుకొలిపి, అంతట మానససరోయాత్రకు తామరతూటిబత్తెము మొదలగు సరంజామునేసికొని, అట్టి యుపకారియగు తన తోడనే మిక్కిలి చెలిమితో సయాత్రులుగా వచ్చు నా హంసరాజులే తోడుగా మానసము దాఁటి కైలాసము నొడిలోనున్న యలకలో ప్రవేశించుటను కవి భావించియున్న, ఇంతకన్నను సరసతరమును, ప్రౌఢతరము నగు కల్పనను మఱియెవఁడు సేయఁగలఁడు? సందేహములేల ? సర్వము అనవద్యమే, ఉపపన్నమే యని సంతోషింపఁదగును.

3. మఱి ప్రక్షిప్తములం గూర్చి:—

"తత్సందేశం జలధరవరో దివ్యవాచా చచక్షే"

"శ్రుత్వా వార్తాం జలదకథితాం తాంధనేశోఽపిసద్యః" అనునవి ప్రక్షిప్తము లనుటకు పిచ్చయ్యగారు చెప్పిన యుపపత్తి ప్రాయికముగా సరిగానే యున్నది. అవి ప్రక్షిప్తములని పెద్దలు చిరకాలముగా చెప్పుచునే యున్నారు. ప్రక్షిప్తము లనుటకు ప్రబలమైన సంప్రదాయము గలదు. నేను 1911_వ సంవత్సరమున బి. ఏ. పరీక్షకు ఉత్తరమేఘముం జదివినపుడు అట్లే నేర్చుకొంటిని. అవి ప్రక్షిప్తము లను చిరంతనప్రతీతిని మహామహోపాధ్యాయ (ఇప్పుడు "కళాప్రపూర్ణ") వేదము వేంకటరాయ శాస్త్రులవారును 1902_వ సంవత్సరమున తాము ప్రకటించిన యాంధ్రవ్యాఖ్యానమునకు ఉపోద్ఘాతమున ఉదాహరించినారు:—"మత్పూర్వముద్రకులలో నంపర్గికారపండితులు ఉ. మే. (47) ధారాసిక్త, (56) తత్సందేశం జలధర, (57) శ్రుత్వావార్తామ్ - అను శ్లోకములు ప్రక్షిప్తము లనియు, వానికి మల్లినాథసూరి వ్యాఖ్య సేయలేదనియు తెలిపి, వానిని గ్రంథములో ముద్రింపలేదు" అని. కావున అవి ప్రక్షిప్తములని ఈ ప్రభవనామసంవత్సరమున సిద్ధాంతించుట పిష్టపేషణము కాఁబోలును. అయినను "మర్దనం గుణవర్ధనమ్" "దంపిన దానినే దంచిన మఱియు మెదుగును" అని సంతోషింతుము గాక!

ప్రక్షిప్తములే యనుటకు కవి 'ధూమజ్యోతిరా'ది తనసొంతవాక్యముచేతను, యక్షునిచే మేఘమును మేఘముగా కరణవిహీనముగానే అధ్యవసింపించి, "కలభతనుతాం గత్వా క్రీడాశైలే" "విద్యుదున్మేషదృష్టిః" "స్తనితవిముఖః" "భిన్నవిద్యుత్కళత్రః" "స్తనితవచనైః ... వక్తుం...ప్రక్రమేథాః"

అను మొదలగు వాక్యములచేతను ఉపపత్తిని పుష్కలముగానే సమకూర్చినాఁడు. దానింబట్టియే మేఘునికి నోరెక్కడిది, దివ్యవాక్కేమి? ఇవి ప్రక్షిప్తములే అని ప్రక్రమము ఉపన్యస్తమగుచుండఁగా బులుసు వేంకటరమణయ్యగారు 'అచేతనమైన మేఘము ఎట్లు మాటాడ నేర్చును' అని ఆక్షేపింపకుందురు గాక" అని బ్రతిమాలు

కొందురేని జిజ్ఞాసువులు ఎట్లు సమాధానపడుదురు? మఱియు,

"ఇష్టాన్ దేశాన్ జలద, విచర ప్రావృషా సంభృతశ్రీ
ర్మాభూ దేవం క్షణమపిచ తే విద్యుతా విప్రయోగః"

అను వాక్యమే కావ్యాంతమనియు, అందు యథాశాస్త్రముగా ఆశీస్సు నాయకేచ్ఛానురూపమైనట్టిది ప్రయోగింపఁబడినదనియు మల్లినాథులవారు ఆనతిచ్చినారు. అంతట కావ్యము ముగియునేని ఏయమంగళ ప్రసక్తియును లేదు. కావున మంగళావసాన సంపాదనార్థము రచింపఁబడినవి ఆశ్లోకములు కాళిదాసీయములే, ప్రక్షిప్తములు గావు అనుట పొసఁగదు. ఇంకొకమాట: ఆ రెండుశ్లోకములును లేకున్న కావ్యమునకు ఇతివృత్త పూర్తియుండదు; 'కథ త్రెంచినట్లగును' అనుటయుం బొసఁగదు. ఇట్టి సందేశకావ్యమునకుం దగిన యుపసంహారమనియే కదా "ఇష్టాన్ దేశాన్ జలద..." ఇత్యాదియందలి యాశీర్వాదమును మల్లినాథులవారు నిర్దేశించినారు? సందేశకావ్యమున కథ యేమి? అది త్రెంచినట్లగుట యేమి? సందేశమే కథ; అది ముగియుటయే కావ్యావసానము. మఱి యాయున్మత్తసందేశమునకు పతితల యాభిముఖ్యము కలుగుటకు సంవిధానము కుదుర్చు మాత్రకే "కశ్చిత్కాన్తా" (1), "తస్మిన్నద్రౌ" (2), "తస్య స్థిత్వా"(3), "ప్రత్యాసన్నే నభసి" (4)–అను చతుఃశ్లోకిని తరువాతి శతాధిక గ్రంథమునకు ఉపక్రమముగా వ్రాయుట. ఈ వెఱ్ఱిప్రలపితమునకు చేయి వాయి లేని మేఘుని ఉద్దేశించిన దానికి అది నాయికకు అందుటయా సరియైన పర్యవసానము, కథను తెగనీకుండునది? మేఘకావ్యసంవిధానము ఆమహాకవికి ఎంతప్రియమో కాని, విక్రమోర్వశి నాలవ యంకములోని– (అనువాదము)

"అసితకంఠముఁ, బికి, నంచ, రథాంగముఁ,
దుమ్మెదఁ, గరి, గిరి, ధునిని, కురంగము,
నినుఁగూర్చి వనిలోన నేను భ్రమించుచుఁ
బరువెడినడిగితిఁ బరిదేవించుచు"

అను యాచనల సత్తికి గ్రుచ్చఁబడిన పఱిమొక మొగ్గయనందగినదానిని ఈ మేఘయాచనను శతాధికశ్లోక గ్రంథముగా విరియించినాఁడు. అందు పురూరవునిమాట విని ప్రియాప్రవృత్తిని ఇందొక్కటియైనను తెల్పెనా, ఇపు డీమేఘమాత్రము సందేశమును అట్లే అందించె ననుటకు? మేఘకావ్యమును మాలతి నవమాంకమున అనుకరించినాఁడే, అందు భవభూతియు మేఘముచేత సందేశమును తప్పక ప్రియకు అందింపఁడుగదా! మేఘసందేశము కేవలము మదనోన్మాదవికారమే, ఒండుగాదు (కావున ప్రకృతములు ప్రక్షిప్తములే) అనుటకు మిగుల దృఢమైన పరామర్శను శ్రీ మన్మల్లినాథ పాదులవారు, "మేఘేగతేంవయః" అన్నవారు, నైషధచరిత నాలవసర్గలోని దమయంతీమదనోన్మాదప్రలపితమైన

"కురు కరే గురు మేక మయోఘనం
బహి రతో ముకురంచ కురుష్వ మే;
విశతి తత్ర యదైవ విధుస్తదా
సఖి, సుఖా దహితం జహి తం ద్రుతమ్."

[గీ. ప్రాణసఖులార, వెన్నెలబయలికిపుడు
పంచుటద్దంబుఁ గోలయుఁ గొంచురండు;
చొరుఁ డలచంద్రుఁ డద్దంబుసొచ్చినపుడ
వంచనములేక వ్రేయుఁడీ పొంచియుండి.]

అను శ్లోకముక్రిందిజీవాతువున

"అత్ర చంద్రప్రహారాదిప్రలాపాః మేఘసందేశాదివత్ మదనోన్మాదవికారాః ఇత్యనుసన్ధేయమ్."

అని పొందుపఱిచినారు. అంతకన్న గ్రాహ్యవాక్యము కలుగునా?

మఱి వ్యాఖ్యాతలను మహామహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రులవారు వానిని ప్రక్షిప్తములనక కాళిదాసీయములేయని గ్రహించినారని ఒక చిన్న యుపన్యాసము పిచ్చయ్యగారిది కలదు. అది కేవలము నిరాస్పదమైనది. ఏలన,—

(1) ఉ. మే. 47, 56, 57 శ్లోకములు ప్రక్షిప్తములనియు, వానికి మల్లినాథసూరి వ్యాఖ్య సేయలేదనియు తెలిపి, వానిని సంవర్గికారపండితుఁడు ముద్రింపలేదఁట. మఱి తాము—అనఁగా శ్రీశాస్త్రులవారు—వానిని విడువ నిచ్చగింపక ముద్రించినారఁట. విడువ నిచ్చ

గింపమిం జెప్పుటచేతను, ఆశ్లోకవ్యాఖ్యలయందును ఇంచించుక పదప్రయోజనాది స్వారస్యవివరణమును వ్రాయుటచేతను వానిని వారు ప్రక్షిప్తములుగా గ్రహింపరైరి అని పిచ్చయ్యగారి వాదము. నేనందును—గ్రంథమునం గ్రుచ్చుటయు, వ్యాఖ్యనేయుటయు ప్రక్షిప్తములగుటను అంగీకరింపమియగునా? ప్రక్షిప్తత వ్యాఖ్యలేమికేని, వ్యాఖ్యలేమి ప్రక్షిప్తతకేని, వ్యభిచారము లేని గుఱుతులా? ఎన్నింటిని ప్రక్షిప్తము లనుచునే మల్లినాథులవారు వ్యాఖ్యానించి గ్రంథమునం గ్రుచ్చినారు! వానికి శ్రీశాస్త్రులవారు పదప్రయోజనాది వివరణసమేతముగా వ్యాఖ్య వ్రాసినారు! కావున శ్రీశాస్త్రులవారు వీనిని 'విడువ నిచ్చగింపమియు', వీని 'వివరణవిశేషము'ను తదప్రక్షిప్తతాంగీకార సమర్థకము గాదు. పూర్వమేఘమందలి "పశ్చాదుచ్చైర్భుజతరువనం..."అను వాకము వ్యాఖ్యలో కడపటి వాక్యము—

"ఈయాక్షేపించినది జరుగుచునే యుండును. మనుష్యులకు గోచరింపదు గాని దివ్యులకు గోచరించును. మేఘుఁడు దివ్యుఁడు గాన (తత్సందేశం జలధరవరో దివ్యవాచా చచక్షే) అతనికి గోచరించును అని సమాధానము కవి హృదయము." అని ఇందు తచ్ఛ్లోకావయవగ్రహణమును వారు ప్రకృతములం బ్రక్షిప్తములుగాఁ గొనమికి సూచకము గాదు. ప్రక్షేపించినవారును "జాతం వంశే భువనవిదితే"త్యాది యక్షవాక్యమునం దోఁచు మేఘుని దివ్యతను ఊఁదిరేకదా ఆ ప్రక్షిప్తమును అట్లు అల్లినారు! కావున తాము ఇందు స్వారస్యముని చెప్పిన మేఘుని దివ్యత ప్రక్షేపించినవారు అందు కల్పించిన దివ్యతవంటిది, యక్షమనోగతమైనట్టిది, అనుట మాత్రమే శ్రీశాస్త్రులవారి హృదయము. ప్రకృతశ్లోకద్వయము అప్రక్షిప్తము అని వారెందును అనలేదు.

(2) "'తత్సందేశం' శ్లోకమును తమ ముద్రణమునఁ దొలఁగింపక పోవుటయేకాక శ్రీశాస్త్రులవారు 'బొంబాయి ముద్రణమును, మదరాసు తెలుఁగు ముద్రణమును బరికించి ఒక దాన లేనిదానిని మఱియొకదాన గ్రహించి యీముద్రణమును ఆరెంటికంటెను పుష్కలము గావించితి', ననుచు 'ఋతుత్వావార్త'ను గూడఁ జేర్చిరి. కాని అప్రసక్తములును, కథావిరుద్ధములును అగు వానిని జేర్చుటవలన పుష్కలతకుమారు వికృతి వాటిల్లునేమో" అని పిచ్చయ్యగారి యుపన్యాసము.

ఈపుష్కలముం గావించిన శాస్త్రులవారి మాటను పిచ్చయ్యగారు ఉదాహరించిన తెలుఁగున అసత్యము కలదు. అది "శ్లోకములం" గూర్చి శ్రీశాస్త్రులవారు వ్రాసినమాట గాదు. దానికి అన్వయసహిత పూర్వవాక్యము ఇదిగో—

"వ్యాఖ్యానములో బొంబాయి ముద్రణమునకును, మదరాసు తెలుఁగు ముద్రణమునకును 'భేదములు' మెండుగాఁ గలవు. నేను రెంటినిం బరికించి..." ఇత్యాది.

కాఁగా అది 'వ్యాఖ్యానములం' గూర్చినమాట. వ్యాఖ్యానమును పుష్కలము గావించుకొనుట యనఁగా నేమి? ఈప్రక్షిప్తతా విచారణకు ఎడములేని రఘుభారవ్యాది కావ్యములలో నేదే నొక్కసర్గకు మన ప్రాఁత తెలుఁగు ప్రతిని, బొంబాయి ప్రతిని సరిదిం బోల్చి వ్యాఖ్యం బరికించిన ప్రాయికముగా మన తెలుఁగుప్రతియందు బొంబాయి దానం దప్పిపోయిన ప్రధానవాక్యములును, వాక్యావయవములును, సాధీయములగు పాఠములును ఉపలబ్ధము లగుట అనుభవము గల వారికి విదితమే. అందందు ఎందేని అరుదుగా తెలుఁగు ప్రతిని బొంబాయిదే మించుటయుం గలదు. కావున వ్యాఖ్యను పుష్కలముం గావించుకొనుట యనఁగా అట్టిది. శ్రీ శాస్త్రులవారి వాక్యమున "భేదములు" అను పదమును అరసికొనవలయును.

మఱియు మల్లినాథులవారు 'మన' పెద్దిభట్టుగారు. వారి వ్యాఖ్య ఆ ఉత్తరమేఘము. 47, 56, 57 శ్లోకముల కప్రక్షిప్తముల కైనను మన తెలుఁగుదేశమున ఎందేనిప్రతులలో దొరకఁబోలును. బొంబాయివారికి దొరకకుండవచ్చును. కావున ప్రక్షిప్తము లైనను కవన సౌభాగ్యము గల్గి వ్యాఖ్యయుఁ గలిగియున్న విడువ నిచ్చ పొడమకుండును; ముద్రింపఁబడును. అందుల కేమి

గాని, "తత్సందేశం" "శ్రుత్వావార్తాం" అన్న శ్లోకవ్యాఖ్యలకు ఆదియందో, అంతమందో "ప్రక్షిప్తమ్" అన్న జ్ఞాపికయుండి మనకు సంజీవనియందు ఇప్పుడు నష్టమై యుండఁబోలును.

అంతియకాని ఆవ్యాఖ్య, పెద్దిభట్టు పేరనే మనకు దొరకినట్టిది, వారిది కాదనుటకుం బ్రమాణము లేదు. ఏ ప్రక్షిప్తశ్లోక వ్యాఖ్యానములోను అది ప్రక్షిప్త మేలాకో, తద్గానాదానములకుం గతమేమో చెప్పువాఁడుక లేదు. ఇప్పుడు వలయునేని ఏప్రక్షిప్తముం గూర్చియు—ఈరెంటింగూర్చిమాత్రమే కాదు—అది యనావశ్యక మనియేని, అప్రసక్త మనియేని, పునరుక్తప్రాయ మనియేని, అల్పరస మనియేని, పూర్వోత్తరవిరుద్ధ మనియేని—ఇట్లు ఎంతవాదముసేయుటకేని అవకాశముగలదు. "ప్రాప్యావన్తీ నుదయనకథా కోవిదగ్రామవృద్ధాన్ "I. 31. అన్న యద్భుతపరామర్శ మైనంతట, "ప్రద్యోతస్య ప్రియదుహితరం వత్సరాజో౽త్ర జహ్రే" I.34. ఇత్యాది అక్కఱ లేని, చప్పనమైన, పెంపకముగదా! కథాని శేషములను ప్రసిద్ధములై నవానిం జెప్పక, "సర్వము నిజకల్పన యగుఁగాక"అనుకీర్తిని కోరిన కాళిదాసు వాక్కును కడంకను దూషించుటయుంగదా? కావున "తత్సందేశమ్" "శ్రుత్వావార్త"లకు మల్లినాథసూరి వ్యాఖ్యసేయలేదని నిర్ణయింపరాదు. పూర్ణశ్లోకములకును ఒకప్రతిలో లేని వ్యాఖ్యను పూర్ణముగానే వేఱొకదానినుండి గ్రహించుటయు, ముద్రణమును పుష్కలముం గావించుకొనుటయే. దానిచే తత్ప్రక్షిప్తతను ఆంగీకరిచుట కలుగదు. నంద ర్గికారపండితులు మానినను, వానికిని సంజీవని దొరకినందున, అవి ప్రక్షిప్తములై నను, ప్రక్షిప్తాంతరములంబోలె యథారుచి వీనిని కూడ శ్రీశాస్త్రిలవారు చేర్చినారు.

(3) శ్రీశాస్త్రిలవారు శిష్యులకు మాకు ఇవి ప్రక్షిప్తములని ముప్పదియేండ్లనుండియు సోపపత్తికముగా నేర్పినారు. వారు వ్యాఖ్యానిరపేక్షముగాను, ఇతర బహిఃసాక్ష్యముతో పనిలేకుండను, శ్లోకమందలి యంతఃసారముంబట్టి స్వతంత్రముగా కాళిదాసీయతను, తదన్యతను నిర్ణయింపఁగల ప్రతిభాధికులనుట జగమెఱింగిన మాట.

(4) భవభూతి బిల్హణాదులవలె శ్రీశాస్త్రిలవారు ను తమ యువయాటలో మేఘసందేశ విక్రమోర్వశీయచతుర్థాంకములను ఇంచుక యనుకరించి ఆసంవిధానమందలి తమ పక్షపాతాతిశయము తెలిపినారు. మఱి "శ్రుత్వా వార్తాం" "తత్సందేశ"ములను అప్రక్షిప్తములని యంగీకరింతురా? కనుఁడు—

"అనిరుద్ధుఁడు:—[పడుకనుండి దిగ్గన లేచి హర్షుండి, ఊర్ధ్వము సూచి] ఆహా, నా శోకసాధనము దొరకినది!

ఆ. కప్పుమాల్మికాఁడ, ఖండేంద్రధుళిలి నెక్కి
నెల్లఁదెల్లు వయిచి విన్ను ప్రాఁక
సురపణింతు పహహ! యఖిదరి కేళిచ్చెదఁ
జెలియ యుండుతేవుఁ జెర్పు నన్ను.

హా! లక్ష్యపెట్టఁడుగదా నిశాచరుఁడు! ఓయిద్విజరాజా,

ఆ. రెండుకరములందు రెండుచేతులు వట్టి
యువను వీచి నాకు నొసఁగవయ్య;
అట్లు నేయవేని యక్లై నన్నె యెత్తి
యువ కొసంగి సుకృత మొందవయ్య.

ఏమియుం జేయవా? కాలకూట సహోదరుఁడవు గదా. (ఊర్ధ్వమరసి) ఓయిమేఘుఁడా, నీవు ఉపకరించెద నను దువా? అట్లైని

ఆ. పకపతాయటంచుఁ బని మ్రోఁగ భీరువు-
లులికి తావు దప్పు టుర్వి నిజము;
అట్టె యుఱెమి నీవు ననఘాత్మ యురలింపు
మువను నాదు పేరుటురమనకును. [ఉఱుము.]

ఏమి? ఉవను గుర్తెఱుఁగ నందువా?

క. ఏ యువిదమేని మ్రోలను
నీయబల తటిన్మతల్లి నిసురు గనిసి య
ట్లే యున్న దావహూత రరు
వోయనఁజూపట్టునదియె యువ సుమ్మ, సఖా.

... ... ... ...

[ఇందు మేఘునికి స్తనితవచనమును, విద్యుత్ కళత్రమును కూడ మేఘకావ్యములోనివి చెప్పఁబడినవి.]

ఇంద్రధనూరాజహంసప్రక్షిప్తములంగూర్చి ఇంతయే నాకు వివక్షితము. ఇదియే నాకుం దోఁచు సిద్ధాంతము. చాలును. అయినను ఈ వ్రాఁతను ఉపసంహరింపక మును ప్రకీర్ణకముగా ఒక కొన్ని ప్రస్తావములం జేయఁ దలంపు; ఊరకతమాషాకే.—

4. (1) యక్షుఁడు దేవయోని విశేషముగదా! వానియందు మర్త్యులకు ఎట్టి విరహోన్మాదాదికమును, చిత్తవృత్తియుం జెప్పుదురో అట్టిదానినే చెప్పినాఁడే కవి, అంగీకార్యమగునా? "అస్తంగమితమహిమా"అని శాపమే సమాధానమా ?

(2) తాఁ గుబేరునిబంటు; ఇంద్రాదులను ప్రత్యక్షముగా చూచియుండఁడా? మేఘుఁడు ఆవరుసన ఇంద్రునికి కొలువుగాఁడు; ఈయక్షునికిం బరిచితుఁడు కాఁడా? తాను మేఘమును అచేతనముగా గ్రహించెనననేల? "ప్రకృతిపురుషం కామరూపం మఘోనః" అనుటయెల్ల నిజమే ఏల కారాదు? యక్షుని భావమున మేఘునికి విద్యుత్తు నిజముగానే ఏలకళత్రము కారాదు; స్తనితమే ఏల వచనము కారాదు? "నిశ్శబ్దోఽపి ప్రదిశసి జలం యాచితశ్చాతకేభ్యః" II. 54. అనుటయందలి శబ్దమును, అనఁగా స్తనితమును, తనకు బోధపడుబాసగా యక్షుఁడు ఎదురుసూచెనని ఏల తలంపరాదు? అట్టిది వినంబడనందుననే "ప్రత్యుక్తంహి ప్రణయిషు సతామీప్సితార్థక్రియైవ" అని సమాధానపడెనని ఏల యెంచరాదు? కాక శాపము దెబ్బకు ఇవన్నియును మార్పుఁ జెందినవా ?

(3) అచేతనమనియు,సచేతనమనియు యక్షుఁడు ఉన్మాదవేగమున గందరగోళపడి యుండుఁగాక. కవియు "అచేతనము కాఁబోలు"అన్నట్టు ధూమజ్యోతిరాది సన్నిపాతమనుటచేత సూచించియుండుఁగాక. అయినను కవి కడపట దివ్యరూప దివ్యవాగాదికముం జెప్పుటచే ఆమేఘము అన్ని మేఘములవంటిదికాదు, నిజముగా నట్టి మహిమగల యొక దేవతయే అని అంతవఱకు నిపుణముగా దాఁచియుంచినరహస్యమునుఅద్భుతస్ఫూర్తియగునట్టుగా తటాలున వెలువరించియుండరాదా? ఉపక్రమమున (హేమ) హంసమాత్రముగా నుండునట్టిది— అది యేదేవతయో తెలియదుగాని—తటాలున నైషధుఁడైన నళునితో ఆశ్చర్యకరముగా మనుజభాషలం బలుకదా? దూత్యము సలుపదా? "మఱి అట్టిచేతనము యగునేని సందేశము వినునంతసేపు 'ఊ' కొట్టక ఉండునా?" అని యాక్షేపణమేని,ఏల యుండరాదు? యక్షునిదశకై జాలిగొనియు తాను 'ఊ'కొట్టినను, బదులుపలికినను, ఆవెఱ్ఱివానికి వెఱ్ఱి ముదురును; వాఁడు ప్రల్లదములకుం జొరును; అది ఇఁక ముగియదు ; అట్టిది యున్మాదచేష్ట. కావుననే, 'ఊరక మాటలాడింపకుము ఆవెఱ్ఱివానిని' అనునట్టి హితవులు లోకమునం బలుకుదురు— అని ఇట్లెల్ల తాను ఎంచి యుండరాదా ? మఱియు యక్షుఁడు మేఘుని మేఘునిగానే స్తనితములతోనే సందేశము అందింపుమన్న ఆఘనుఁడు (దేవత) మనోరథాతీతముగా వాక్కులతో చెప్పుట తప్పునా ?

(4) యక్షుఁడు అలకావాసి. అచట సర్వదా సర్వర్తుసంపత్తి కలదు. అనఁగా ఏయేఋతువున నేది మనోహరమగునో అది అందు ఎల్లప్పుడు నుండును. మఱి ఇపుడు నభఃప్రత్యాసత్తికై యక్షి విపన్నకానేల? ఋతువుల గుణతారతమ్యమును,అయోగపద్యమును,క్రమప్రాప్తినింబట్టికదా ఈలోకమున విరహబాధ ఎక్కుటయుతగ్గుటయు? యక్షుఁడు, శాపహతుఁడు, తాను విరహబాధచే విపన్నుఁడగుచు, తనయున్మాదమున వర్షచే యక్షికిని ఆపద కలుగునని భ్రమసినాఁడా ? [ఇందులకు సమాధానము శ్రీశాస్త్రిలవారి యుపోద్ఘాతమున 19 వ పుటలో కలదు.]

(5) "చేతనాచేతనేషు" అన్నాఁడు కవి. చేతనమునకును ఉన్మత్తుఁడు మొఱపెట్టుకొనవచ్చును. ఆమాత్రకే ఏల యున్మత్తుఁడు కాకపోవలయును? "సౌమిత్రే, ననుసేవ్యతాం తరుతలం చండాంశురుజ్జృంభతే" ఇత్యాది ప్రసన్నరాఘవశ్లోకము రాముని యున్మత్తభాషితము గాదా? అది లక్ష్మణునితో చెప్పినది కాదా? మేఘము చేతనము కాఁగానే పిచ్చియ్యగారిమాటచే కథలకు"ఒక త్రాడు" ఏల తెగవలయును ?

రోగము పూర్వదుష్కృత నిరూఢఫలమ్ము కఠోరనారకో
ద్యోగమటంచు నజ్ఞులయి యూరక యెంతురుగాని భూజనుల్—
రోగము పృథ్విలోన నపురూప మగణ్య మలభ్య మౌమహా
యోగమటంచు సుంతయు నహో! గుఱుతింపరు కాదె యక్కటా!

అనుభవము లేని నిర్భాగ్యు నడుగనేల?-రోగి నడుగుఁడు రోగివైభోగసరణి!
ఉర్వి సర్వసర్వంసహా సార్వభౌమ-పదవికాదె చూడఁగ రోగి పదవి యహహా!

వసియింప దుర్గంధ భరితకోణమె కాని వ్యోమసౌధంబు లేకున్న నేమి?
శయనింపఁ గుక్కిమంచమె కాని, మేల్ తూఁగుటూయెల సెజ్జ లేకున్న నేమి?
భక్షింప నగ్గుజావమె కాని, పంచభక్ష్యాన్న భాగ్యంబు లేకున్న నేమి?
దీపింప నిశి గ్రుడ్డి దీపంబె కాని, విద్యుత్ప్రకాశములు లేకున్న నేమి?
రోగిరోగి యటంచును రోఁతపడుచు - హీనబుద్ధులేమనుకొన్న నేమి? రోగి
యవని మనుజేంద్రభోగంబు లనుభవించు-అనుభవించినవాఁడె సత్యం బెఱుంగు!!

ఉండుండి తననోటనుండి వెల్వడు నొక్కమాట కోటివరాలమూట కాదె?
ముఱిపించిముఱిపించి దొరలుచుండెడు నొక్కనవ్వు, మేల్ రతనాల పువ్వు కాదె?
తలచూపితలచూపి వెలికిఁ బాఱెడు నొక్కపిలుపు కోటీశుల కులుకు కాదె?
ఉంకించియుంకించి యుఱుకుచుండెడు నొక్కపనుపు రారాజు శాసనము కాదె?

రోగబాధచే లోలోనఁ గ్రుళ్లుచున్న - బహుళచింతామహావిషజ్వాలలందు
తనదుహృత్కటాహంబు దగ్ధమగుచున్న-రోగి యహహా! మహారాజభోగి కాఁడె?

నిద్రించుతఱి, కాలరుద్రుఁడైనను లోని కరిగి పల్లెత్తు మాటాడ వెఱచు!
తెలివిఁ గాంచినయంత, చలనంబు లుడిగి, బ్రహ్మాదులేనియు నట్టె యణఁగియుంద్రు!
లేచి కూర్చొనినంత, వాచిపోయినలీల దేవదానవులైనఁ దేరికాంత్రు!
నోటివాకిలిదాఁటి మాట వెల్వడినంత, త్వరఁ బూని వేయిపాదములు కదలు!
అహహా! యింక నేటికి? ననన్యాదృశమగు - నిట్టిపదవిముందఱ మనుజేంద్రపదవి
యేల?-దేవేంద్రపదవియుఁ జాలునొక్కొ?-అనుభవించినవాఁడె సత్యంబెఱుంగు!

## భృత్యనీతి

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

[ఏకాంక వచన రూపకము]

ప్రథమరంగము

[ప్రదేశము: శూద్రక మహారాజు కొలువు కూటము. రాజు మంత్రిసామంత సేనాపతిసమేతముగా కొలువైయుండును.]

రాజు

అమాత్యవర్యా, విశేషము లేమి?

మంత్రి

సార్వభౌమా, విశేషము లేమియు లేవు. దినకరకిరణములకు విచ్చిన యంధకారమువలె భవత్ప్రతాపమునకు శత్రువు లెక్కడివా రక్కడ విచ్చిపోయిరి. దేశము సుభిక్షముగ నున్నది. ప్రజలు సుఖసంతుష్టులై తమ ధర్మపాలనమును వేనోళ్ల గీర్తించుచున్నారు. పేదలకు,సాదులకు, వికలాంగులకు దా మేర్పఱచిన ధర్మసంస్థలు తమదీనదయాపరత్వమును బ్రకటించుచు జక్కగ నిర్వహింపబడు చున్నవి.

రాజు

మంచిది. అమాత్యవర్యా, రాజుకు బ్రజ శరీరము; ప్రజాసుఖమే రాజసుఖము. ప్రజలు సుఖముగా నుండిరను వినుటచే మిగుల నానందమొదవుచున్నది.

మంత్రి

ప్రజారంజకత్వ మభిలషించుటేకదా సత్ప్రభువుల లక్షణము!

సేవకుడు

(ప్రవేశించి) రాజేంద్రా, దక్షిణదేశీయుడట, రాజపుత్రు డొకడు దేవరదర్శనము సేయ నభిలషించుచున్నాడు. ఏమని దేవరయాజ్ఞ?

రాజు

వెంటనే తోడ్కొని రమ్ము.

సేవకుడు

చిత్తము.

రాజు

(రాజపుత్రుడు ప్రవేశించుచుండగా జూచి, తనలో) ఆహా! ఏమి! ఈ రాజపుత్రుని తేజము! రూపెత్తిన శౌర్యమువలె, బుంజీభవించిన భక్తివలె ప్రకాశించుచున్నాడు! ఉన్నతాకారము, వెడదయురము, ఉత్తుంగ భుజములు, దీర్ఘబాహువులు, హస్తవిన్యస్త కృపాణము ప్రతాపార్కుని స్ఫురింపజేయుచున్నది. కాని ఆనేత్రము లేమి! సాధుత్వమును, సాహసిత్వమును గూడ నొక్కుమ్మడి ప్రకటించుచున్నవి! దర్శనమాత్రమున నితనియందు బ్రేమ గలుగుచున్న దేలనో! ఆశ్చర్యముగ నున్నది. అదిగో, యాతడు సమీపించుచున్నాడు. ఆతని వృత్తాంత మరసెదను.

రాజపుత్రుడు

(ప్రవేశించి) సార్వభౌమా, నమస్కారము.

రా జు

మంచిది. రాకుమారా, ఆ యుత్తమాసనమున నాసీనుడవు కమ్ము.

రాజపుత్రుడు

చిత్తము.

(అని కూర్చుండును.)

రా జు

కుమారా, నీవాన దేశ మెద్ది?

రాజపుత్రుడు

అక్షీణకీర్తిసాంద్రంబైన దక్షిణదేశము.

రా జు

నీయభిధానము?

రాజపుత్రుడు

వీరబలుడు.

రా జు

మావలన నీకు గావలయుకార్యం బెద్ది?

రాజపుత్రుడు

సార్వభౌమా, యశోవిశాలురగు తమసన్నిధి నుద్యోగము సేయ నీయాగంతుకుని కోరిక.

రా జు

మంచిది. రాకుమారా, నీయాప్సితము నెఱవేఱును. కాని, ఏమిపని చేయుదువు?

రాజపుత్రుడు

వీరపురుషోచిత మగుపనిని.

రా జు

వేతన మేమి కోరెదవు?

రాజపుత్రుడు

దినమునకు వేయినిష్కములు.

రా జు

కుమారా! మీ సతీసంతానపరివారజన మేమాత్రము?

రాజపుత్రుడు

నేను, నాభార్య, ఒకకొమారుడు, ఒకకొమార్తె; పరివారము లేదు.

(సభ్యులు పకపక నవ్వుదురు.)

రా జు

(తనలో) ఇతడు చూడగా నభిజాతుడుగ గాన్పించుచున్నాడు. ఇంతధన మీతడు వ్యర్థముగ గోరడు. దీనియం దెద్దియో మహార్థము గలదు. కాన,ఇతడు కోరినధనము కాదనకుండ నిచ్చెదను. ఆవల నేమగునో చూచెదను.

(ప్రకాశముగా) మంచిది, వీరబలా! నీవు కోరిన సంబళ మీయబడును. నేటినుండి మా కొలువున జేరుము.

కోశాధ్యక్షా, ప్రతిదిన మీ వీరయోధునకు మన ధనాగారమునుండి సహస్రనిష్కము లొసంగుచుండుము.

కోశాధిపతి

చిత్తము, దేవరయానతి శిరసావహించెదను. యోధమహాశయా, నాతో ధనాగారమునకు దయచేయుడు. ఈదినమునకు వేతన మొసంగుదును.

రాజపుత్రుడు

ఇదిగో వచ్చుచున్నాను. సార్వభౌమా, సెలవు.

(రాజునకు నమస్కరించి నిష్క్రమించును.)

రాజు

అమాత్యవర్యా, ఈతనిగూర్చి యేమి తలంచితివి?

మంత్రి

సార్వభౌములయాజ్ఞ కెదురులేదు. కాని ఒక్క శంక: అపరిచితరాష్ట్రీయుని దూరమాలోచింపకుండ కొలువున జేర్చితిరి. మఱియు వేతన మపరిమితము. అంతియేకాక అతడు చేయవలసినపనినిగూడ దేవర నిర్ణయింపలేదు.

రాజు

అగును. నిర్ణయింపలేదు. కాని యాత డింత ధనమును వ్యర్థముగ గోరునా? దీన నెద్దియో యనూహ్యంబగు లాభము మనసామ్రాజ్యమునకు జేకూర నున్నదని తోచుచున్నది. అతడు చూచుటతోడనే మనసామ్రాజ్యమున కర్మిలిమిత్రుడుగ గాన్పించినాడు. ఆతనిరాక శుభోదర్కమను తలంపు గలుగుచున్నది.

మంత్రి

అవును. అతనియాకృతి ఆకర్షకముగనే యున్నది. దేవరతలంపు నెఱవేఱుగాక.

[కొలువుచాలించి అందఱు నిష్క్రమింతురు.]

---

ద్వితీయ రంగము

[ప్రదేశము : వీథి. శాస్త్రి అవధానుల సంభాషణ.]

శాస్త్రి

అవధానీ, ఎక్కడనుండి రాక? భూరిసంభావన దొరకినట్లు భుజము లుప్పొంగ ఆనందముతో వచ్చుచున్నావే!

అవధాని

నిజము, భూరిసంభావనయే దొరకినది. పిల్లలు, మేము సుష్ఠుగ భోజనము చేయుచున్నాము. కొన్నిదినములనుండి మాపని నిత్యపంటగానున్నది.

శాస్త్రి

మన చక్రవర్తిగారి దివాణములో నేదియైన ప్రయోజనమా?

అవధాని

దివాణములో గాదు; అపరరాధేయుడైన వీరబలుని మందిరమున.

శాస్త్రి

అత డెవడు?

అవధాని

ఎవడో వచ్చినాడు, దక్షిణదేశమునుండి యొక యోధకుమారుడు. నిత్యసహస్రనిష్కములా రాచపట్టికి వేతనము.

శాస్త్రి

నిత్యసహస్రనిష్కములే! ఎక్కడ దాచునబ్బా, అంతధనము!

అవధాని

సరి, సరి, అది ఆయనకు చాలుట లేదు.

శాస్త్రి

అంతధనమే చాలుటలేదా? ఏమి ఆశ్చర్యము! ఆయన కేమాత్రపు సిబ్బంది కలదేమి?

అవధాని

ఆమహాయోధుడు మహాభక్తుడు! మఱియు నతడు విప్రజనచింతామణి; దరిద్రజనకల్పక

ము. కాన తననిత్యభృతిలో నమ్మహాను భావుడు తనకై వినియోగించుకొనునది తురీయాంశమమాత్రమే. మిగిలిన దంతయు ధర్మముచేయుటకే వినియోగించును.

శాస్త్రి

ఆహా! ఏమివితరణము! పూర్వయుగముల బలి, శిబి, దధీచి, రాధేయాది దానశీలు రున్నట్లు పౌరాణికముగ వినుటయే కాని ప్రత్యక్షముగ జూచినది లేదు. ఈకలియుగములోగూడ నట్టి దానశౌండు లున్నారని వినుట కాశ్చర్య మగుచున్నది. ఆమహాత్ము నొకమారు దర్శించి జన్మము ధన్యము గావించుకొందును.

అవధాని

శాస్త్రీ, దర్శింపుము; తప్పక దర్శింపుము. అట్టి మహనీయుల సందర్శనము భుక్తిముక్తి దాయకము. సకలశాస్త్ర పారంగతుడవగు నీ వాయనచే ఘనమైన సత్కార మందెదవు. పండితులనిన ఆయనకు పరమగౌరవము.

శాస్త్రి

మంచిది. ఇప్పుడే వెళ్లెదను. కాని ఆయన రాజసభ కేగియుండునేమో.

శాస్త్రి

పగ లెప్పు డేగినను ఆయనదర్శనము లభించును. కాని రాత్రి వేళమాత్ర మాతనిసందర్శన మలభ్యము.

శాస్త్రి

రాత్రు లెక్కడి కేగును?

అవధాని

ఖడ్గపాణియై సార్వభౌముని యంతఃపురద్వారమున కావలి గాయును.

శాస్త్రి

అటులనా! అయితే, అవధానీ, అటు చూడుము: ఆజనసమూహ మేమిటి?

అవధాని

వారే వీరబలుని మందిరమునుండి యేతెంచు అర్థిజనులు. కాశీయాత్రకు వెళ్లియుండుటచే నీ వెఱిగియుండవు కాని, మన నగర మెట్లున్న దనుకొంటివి? పెరయూళ్లనుండి వచ్చిన యాచక జనముతో క్రిక్కిరిసి యున్నది. మన దివాణములోని శుభకార్యములకైన యింత అర్థిజనము వచ్చియుండదు. నేడు హరివాసరము. ప్రతిహరివాసరమునను వీరబలుడు దీన జనులకు వస్త్రదానము సేయును. అదిగో చూడుము: వీరబలుడొసగిన నూతనవస్త్రములను ధరించి తమ జీర్ణ చేలముల చంక నిడుకొని పేదజను లెట్లు వచ్చుచున్నారో!

శాస్త్రి

అవధానీ, వీరబలుని వితరణము వినినకొలది ఆ మహనీయుని దర్శింపవలెనను కోరిక యధికమగుచున్నది. ఇప్పుడే వెళ్లి అయనను చూచి వచ్చెదను.

అవధాని

మంచిది. వెళ్లి రమ్ము.

[ఇరువురు నిష్క్రమింతురు.]

---

## తృతీయ రంగము

[ప్రదేశము: మహారాజు శయనాగారము. రాత్రి వేళ. రాజు శయనించి యుండును. వీరబలుడు వాకిట ఖడ్గపాణియై కావలి కాయుచుండును.]

రాజు

ఎవ రక్కడ?

వీరబలుడు

అయ్యా! వీరబలుడను.

రాజు

(తనలో) వీరబలుని చరిత్ర మత్యద్భుతముగి నున్నది. దినమునకు వేయినిష్కములు వేతన మడిగినాడు. మరుదినమున నొక్కనిష్కమైన నుంచుకొనడు. పగలెల్ల అర్థిజనసత్కారముతో బుచ్చును. రేయెల్ల నా ద్వారము కడ కావలికాయును. ఏసమయమున బిలిచినను, "అయ్యా, వీరబలుడ" ననుచునే యుండును. ఈతనికి ఆహారనిద్రలుగూడ లేనట్లున్నవి! యోగమహిమో, త్యాగమహిమో, తపోమహిమో ఈతని ప్రవర్తన కేది యాధారమో తోచకున్నది. పగలు భర్తుడు; రాత్రులు యోధుడు. పవలు నల్లచీమను ద్రొక్క శంకించుసాధుపుంగవుడుగ గన్పట్టును. రేలు శాత్రవసైన్యమును నురుమాడు క్షత్రియవీరునివలె గాన్పించును. ఇం దేది నటన? ఏది సత్యము? లేక రెండువృత్తు లీతనికి స్వాభావికములేనా? వీరబలుని మరల నొక్కమాటు పల్కరింతును? (ప్రకాశముగా) ఎవ రక్కడ?

వీరబలుడు

అయ్యా, వీరబలుడను.

రాజు

వీరబలా, పగలు నిద్రపోవు, రాత్రులు నిద్రపోవు. ఇప్పుడు రెండుజాములు దాటిపోయినవి. నాయంతఃపురమున కేమియు భయము లేదు; కొంచెముసేపు విశ్రమింపుము.

వీరబలుడు

సార్వభౌమా, మీవాత్సల్యమున కెంతయు గృతజ్ఞుడను. సార్వభౌముల సొమ్ము తినుచు సార్వభౌముల రక్షణయం దేమరుట భృత్యధర్మము గాదు. ప్రభుసేవయందు ప్రమత్తుడై చరించిన సేవకుడు నరకము నందును. ప్రభూ! నా కలసట లేదు. తమరు సుఖముగా నిద్రించుడు.

రాజు

(తనలో) ఆహా! ఏమి వీరబలుని స్వామిభక్తి! నాకొఱకై ప్రాణార్పణ గావించుటకైన వెనుదీయన ట్లున్నాడే! ఆశ్చర్యము! ఆశ్చర్యము! ఇట్టి మహాత్మునిచే సేవ జేయించుకొనుటచే నా కేమిపాపము సంభవించునో! భయ మగుచున్నది.

(తెరలో స్త్రీరోదన.)

(దానిని విని) ఎక్కడనో స్త్రీరోదనము వినబడుచున్నది. (ప్రకాశముగా) ఎవ రక్కడ?

వీరబలుడు

అయ్యా, వీరబలుడను, ఏమిసెలవు?

రాజు

ఈదక్షిణపుదిక్కుగా స్త్రీరోదనము వినవచ్చుచున్నది. ఆ స్త్రీ యెవరో దుఃఖకారణ మెద్దియో విచారించి రమ్ము.

వీరబలుడు

చిత్తము, సార్వభౌముల యాజ్ఞ శిరసావహించెదను. తమరు సుఖముగా నిద్రింపుడు.

రాజు

అట్లే, వెడలుము.

(వీరబలుడు నిష్క్రమించును.)

రాజు

వీరబలుని ఋజువర్తన మారయుటకు మంచి యవకాశము లభించినది. ఇతడీ స్త్రీ నెట్లోదార్చునో గోప్యముగా నీతని వెంబడించి కనుగొనెదను.

[రాజు నిష్క్రమించును.]

---

చతుర్థ రంగము

[ప్రదేశము: పుర బాహ్యము. తల గొట్టుకొని యేడ్చుచు స్త్రీ, ఆమెను సమీపించి వీరబలుడు, ఆతని ప్రచ్ఛన్నముగా ననుసరించి రాజు ప్రవేశింతురు.]

వీరబలుడు

అమ్మా, ఎవరవు నీవు? ఈనిశాకాలమున పురుషులే రావెఱచు నిట్టినిర్జనప్రదేశమున నొంటరిగ నేడ్చుచుంటి వెందులకు?

స్త్రీ

ఎవతనైన నేమి? ఎందు కేడ్చుచున్న నేమి? అనివార్యములగు నాపదలు వివరించిమాత్ర మేమిప్రయోజనము?

వీరబలుడు

అమ్మా, దుఃఖకారణము తెలిపినగదా, అనివార్యమో నివార్యమో తెలుపనగును? తల్లీ, నీ వెవరవో తెలుపుము.

స్త్రీ

కుమారా, నే నీసామ్రాజ్యలక్ష్మిని.

వీరబలుడు

సామ్రాజ్యలక్ష్మివా! జననీ, నమస్కారము. ఈ పౌరుడు నీసేవకుడు. తల్లీ, దుఃఖకారణ మెద్దియో తెలుపవు?

స్త్రీ

కుమారా, వైధవ్యము వచ్చుననిన దుఃఖము గాదా?

వీరబలుడు

తల్లీ, నీకా? వైధవ్యమా? ఈ తనయుడు తన తనువున ప్రాణము లుండ నీ కట్టియాపద రానిచ్చునే!

స్త్రీ

కుమారా! నీ వేమిచేయగలవు? పరలోకోన్ముఖము లైయున్న సార్వభౌముని జీవములు నీ వెట్లు నిలుపగలవు?

వీరబలుడు

నాప్రాణము లర్పించియైన.

స్త్రీ

నీవు ఇనికి రావు.

వీరబలుడు

అయ్యో, తల్లీ, యిక నెట్లు?

స్త్రీ

ఎట్లును లేదు. శోకింపుచు నూరుకొనవలసినదే! శూద్రకమహారాజు మహాధార్మికుడు; అప్రతిమానప్రతాపశాలి. ఆచక్రవర్తి నన్ను బాణిగ్రహణము చేసినదిమొదలు శత్రువులయొలజడి లేక, కఱవులగాయిడి లేక, వ్యాధుల వ్యధలు లేక, నేనును నాబిడ్డలును సకలసౌఖ్యముల ననుభవించుచుంటిమి. అయ్యో! అటువంటి రాజేంద్రుడు రేపుదయ మగుసరికి అస్తమించును. అకటా! ఈవైధవ్య మెట్లు భరింతును? దుఃఖాతులునైన నాప్రజలదీనానన మెట్లు గాంతును?

వీరబలుడు

(దుఃఖముతో) అమ్మా, ఇంతటి మహారాజ కాలమృత్యువువాత బడుచుండ వ్యర్థులమై చూచుచు నూరకుండవలసినదేనా? నివారణోపాయ మెద్దియు లేదా?

స్త్రీ

ఆచరణసాధ్యములు గానియుపాయము లుండియు, కుమారా, ఏమిప్రయోజనము? మనుష్యశక్తి కవి యతీతములు.

వీరబలుడు

తల్లీ, యట్లనకుము. మహారాజు చిరంజీవియగుటకు దుర్ఘటాతిదుర్ఘటకార్యములనైన నీసేవకుడు గావింప సిద్ధమై యున్నాడు. జననీ, శంకింపక నివారింపసాధనము వివరింపుము.

స్త్రీ

కుమారా, చక్రవర్తియందు నీకుగల యసమానభక్తిచే నీప్రాణము లర్పింప నీవు సంసిద్ధుడవై యుండవచ్చును. కాని యెుకులప్రాణ మవసర మగుచో నీ వేమి చేసెదవు?

వీరబలుడు

నాసర్వస్వ మర్పించియైన, నాప్రాణములు మాఱొసగియైన నాప్రభుప్రాణముల రక్షింప ప్రయత్నింతును.

స్త్రీ

కుమారా, నీరాజభక్తి యసమానముగ నున్నది. సాహసభరితములగు నీవాక్కులు మహారాజును రక్షింపగలవని యాశను బొడమించుచున్నవి. రాజరక్షణోపాయము వివరించెదను, వినుము.

వీరబలుడు

మహాభాగ్యము.

స్త్రీ

తలిదండ్రులును, తోబుట్టువును గల యెుక యుత్తమరాజకుమారుని కాత్యాయనికి బలి యొసంగిన మహారాజు గండము తప్పును.

వీరబలుడు

తల్లీ, కృతజ్ఞుడను. రాజరక్షణోపాయమును వివరించి నన్ను ధన్యుని జేసితివి. నీవు చెప్పిన లక్షణములు గలవాడు నా కొకకుమారు

డున్నాడు. ఆతనిని కాత్యాయని కర్పించి స్వామిఋణమును దీర్చుకొందును.

స్త్రీ

కుమారా, బహుసులభముగఁ బలుకుచున్నావు. నీకొమారు డిష్టపడనిచో? నీభార్య సమ్మతింపనిచో?

వీరబలుడు

తల్లీ, అట్లేల జరుగును? నాభార్యాబిడ్డలు రాజధనమువలననే పోషింపబడుచున్నారు. రాజరక్షణకు వారేల వెనుదీయుదురు?

స్త్రీ

అయిన, కుమారా, ఒకమాట. కాత్యాయని కర్పింపబడుబాలుడు దేవి కర్పింపబడుటకు మనఃపూర్వకముగ నంగీకరించి యుండవలెను. మఱియు నతనితల్లిదండ్రులును, సోదరియుగూడ నిశ్చింతులై యుండవలెను. వధసమయమం దైన వారికడ దైన్యము కన్పడరాదు. కన్నులు తడి కారాదు. అట్లగుచో కాత్యాయని నీ యభీష్టమును తప్పక నెఱవేర్చును.

వీరబలుడు

మంచిది. తల్లీ, శోక ముడుగుము. నీసౌభాగ్యము నిలుచును. ఇంటికి వెళ్లి బలికుమారుని దోడ్కొనివత్తును.

(వీరబలుడు నిష్క్రమించును.)

రాజు

(ముందుకు వచ్చి) వీరబలునిధర్మబుద్ధి నేటికి విదితమైనది. నాకొఱకై యతడు తనప్రాణములనుగాదు తన యేకైకపుత్రుని యసువులనే యర్పింప సిద్ధమగుచున్నాడు. ఆహా! ఏమి యితని స్వామిభక్తి! అదిగో వీరబలుడు యింటికి వెడలుచున్నాడు. నేనుగూడ నతని ననుసరించెదను.

[నిష్క్రమింతురు.]



[ఉమ్రుఖయ్యాము పారసీకరుబాయతునుండి ఆంధ్రీకరింపఁబడినది. ఇందలి పద్యములవరుస రుబాయతునందువలె కాక కొంతకుఁ గొంత పూర్వాపరసబంధముపొసఁగునటుల సమకూర్పఁబడినది.]

౧

"లెమ్మోయీ మదిరాతపస్వి, దిశ లాలేఖ్యంబుగా మాఱెఁ; బా
త్రమ్ముల్ నింపుము గోస్తనీరసమునన్ రాగోదయశ్రీలు పైఁ
గ్రమ్ముల్ జీవితభాజనంబు పరిపూర్ణంబౌటకున్ మున్నె; కా
లమ్మా" నన్నరవంబువింటి మధుశాలన్ మొన్న లేఁబ్రొద్దునన్.

౨

అరుణుఁడు యామినీవిభవమంతయు గెల్చి జయాంకమట్లు క
ర్బురరమణీయకేతనముఁ బూర్వదిశం బయికెత్తె లెమ్ము; ని
ద్దురవిడి తమ్మిఱేకులటు తొంగలిఱెప్పల నెత్తి చూడు; నీ
వెఱుఁగవో తొయ్యలీ, చిరము నియ్యెలఁ గన్నులు మూయుకట్టనన్.

౩

కనుఁగొమ్మా నినుఁబోలె రాగవతియై కాంతిల్లెఁ బూర్వాశ, మో
మున నీలాలకరేఖ లొత్తుచు; నిశాభుక్తావశేషాసవం
బును సీసాలకు నింపి యొక్కసరకంబున్ ముంచి యందిమ్ము; ద
క్కనియారేపటిమాట లేటి కనుభోగ్యంబైన నేఁ డుండఁగన్.

౪

*తరుణార్కుండు సువర్ణవాగురలచేతం బాదుషాహోదివం
భరహర్మ్యపరిగర్భగోళశిఖరవ్రాతంబు బంధించె; వా
సరకైఖుస్రువు రక్తిమాసవము నాశాపాత్రఁ బూరించె; ని
త్తఱి ఘోషించె మునాది యెల్లరకుఁ బ్రాతఃపానగూఢార్థముల్.

౫

విరియుగులాబిపూలు తనప్రేయసులౌట మొగంబు లన్యులె
వ్వరుఁ గనరంచుఁ జిన్కువలిపంబుముసుంగుల దాచె మేఘుఁ; డా
విరిగొను కెంపుపానకము వేగమ గిన్నెలనింపు; "జీవితాం
బరమున నొక్కతార గనుమాసెను లెమ్మ"ని కూయుఁ బుల్గులున్.

---

* కైఖుస్రువు=పురాతనపారసీకదేశము నేలిన సుప్రసిద్ధకైనానువంశమునందలి మూడవ పాదుషా. మునాది=వేగుజామున బిగ్గఱగా నరచి మసీదులందు దైవప్రార్థనము సేయువాఁడు.

౬

ఎఱుఁగవె కాలవల్లి మనయిద్దఱిమృత్యువు లల్లుఁగొయ్యఁగాఁ
బెరుగు; గుడారమూను మన వేడ్కకు నీభువనంబు; జంటగాఁ
గరముల వారుణీభరితకాంచనపాత్రిక లందికొన్న న
ద్దిర! మన చేతఁ జిక్కవడదే చిరకాలపు సత్య మంగనా!

౭

చెలులను, బంధులన్, మధురశీధువు, నామనితోఁట వీడి యూ
హాలు నెఱుఁబ్రాకఁజాలని రహస్యపుఁజోటికిఁ బోదు వీవు; నేఁ
బలికెదఁ జెప్పరాని యొకభావము: సంధ్యలఁ దూలి రాలుపూ
వులు కృశియించుఁగాని విరఁబూయవు క్రమ్మఱ; నమ్ము మోసఖి!

౮

కాలమహార్నిశంబులను కత్తెరతో భవదాయురంబర
శ్రీలహరించు; మోముపయిఁ జిల్కను దుమ్ముదుమార; మేలకో
జాలిపడంగ; నీక్షణము సంతసమందుము; నీవు పోదు; నీ
శేలుఁబవల్లు మున్నటు చరించు నిరంతరమండలాకృతిన్.

౯

*ఆమని లేఁతమబ్బులు ప్రియంబుగ రాగవతీకపోలముల్
దేమగిలంగఁ దుంపురిలు తియ్యని వేళల లేచిరమ్మ చా
నా, మధురాసవంబుఁ దమి నానఁగ; నేఁడు విహారభూమి శో
భామయమైన యీగఱిక పచ్చగిలుంగద రేపు నీపయిన్.

౧౦

అల బహరాముగోరి మధువానిన సుందరభోగమందిరం
బుల మృగరాజు నేఁడు భయముల్ విడి క్రమ్మరు; జంబుకంబు పి
ల్లలఁగను; వన్యరాసభములన్ మృగయారతిఁ బట్టినట్టి భూ
తలపతి గోరి పట్టవడఁ దా నొకగోరి నెఱుంగుదే చెలీ!

* రాగవతి=(Tulip) ఎఱ్ఱని పూవులుపూయు పసపుజాతి పూవుల చెట్టు.

౧౧

అయయో! యెందఱిమానవోత్తముల కంఠాంకూరముల్ ద్రుంచె ని
ర్దయహా కాలము! యౌవనంబు తను సౌందర్యంబు లావణ్య మ
వ్యయమై నిల్చునె? యెన్నియెన్ని కసుఁగాయల్ రాలె నీనేల; నా
రయ లేదో విరఁబూయకే యురలి వ్యర్థంబైన లేమొగ్గలన్.

౧౨

నీవు నేనను తారతమ్య మిహమందే కాని భూగర్భ ర
త్నావాసంబున లేదు; దుర్జనుఁడు పుణ్యాత్ముండు భిక్షార్థియున్
శ్రీవాల్లభ్య ధురంధరుండు నొకటే శ్రేణిన్ సుఖాసీనులై
యావిందున్ భుజియింతు; రంతఁ గనలేమా మృత్తికన్ భేదముల్.

౧౩

జలజల మంజులార్భటుల జాల్కొనునీసెలయేటికోవలన్
మొలచిన లేఁతపచ్చికల మోటుగఁ గాలిడఁబోకు, దేవదూ
తలరుచిరాధర ప్రకృతిఁ దాల్చెనొ! సుందరమందగామినీ
లలితశరీరమృత్కణములం జిగిరించెనొ యేమొ కోమలీ!

౧౪

పొలమున నేత్రపర్వముగఁ బూచిన రాగవతీసుమంబు శో
భల విలసిల్లె సీజరున్నృపాలునిరక్తకణాలనుండి; యే
వలపుమిటారిలేఁజివురువాతెఱ నేలినపుట్టుమచ్చపై
వెలసెనొ మాయలాఁడి గురివెంద గ్రహించెను రెండురంగులన్.

౧౫

గతము గతంబె, యెన్నటికిఁ గన్నులఁ గట్టదు; సంశయాంధసం
వృతము భవిష్యదర్థము; వివేకవతీ, యొకవర్తమానమే
సతత మవశ్యభోగ్యమగు సంపద; రమ్ము, విషాదపాత్రకీ
మతమునఁ దావులేదు; క్షణమాత్ర వహింపుము పానపాత్రికన్.

* నీరక్తాస్యములు=నెత్తురు లేక పాలిపోయిన మొగములు.

౧౬

పరిశుష్కంబగు జీవనంబు రససంపన్నంబుఁగావించు ని
ర్ఝరపానీయము వారుణీరసముఁ బాత్ర న్నింపి యందిమ్మ యా
తుర దీటుం జవిగొందు; జీవితము వాతూలంబులో దివ్వె! చె
చ్చెఱఁ గానిమ్ము; గతించుఁ బ్రాయ మదిగో శీఘ్రంబుగం బ్రేయసీ!

౧౭

*సమశీతోష్ణత హాయినించె; సుఖసంస్పర్శంబుగన్ గంధవా
హము వీతెంచె; గులాబితోఁటపయి సాయంకాలచిత్రాబ్దముల్
ప్రమదాశ్రుల్ చిలికించె; బుల్బులియు "నీరక్తాస్యముల్ ద్రాక్షసా
రమునం గెంపిలఁ జేయుఁ" డంచుఁ జవులూరం బల్కె- రోజాలకున్.

౧౮

నలుదిక్కుల్ కమనీయచంద్రికల సుస్నాతంబులై తోఁచెఁ; జి
త్త లతాంతంబును బూచె; ద్రాక్షరసపాత్రం జేతికందిమ్మ యో
లలనా, వింటివి గాఁ సూక్తి: ఫలమెల్లం గాల్చు నిర్ఘాత చం
చలనూ మృత్యువు ధాన్యశాల కిపుడే సంధించె నంగారమున్.

౧౯

ఈమధుమాసశర్వరుల నిందుశిలారమణీయ వేదిఁ గాం
తామణిఁగూడి రాగవతినా వహించుము పానపాత్ర నా
రామమునందు; నీవెఱుఁగరాక లయింతు; వనాదికాల హిం
సామలిన ప్రవృత్తి మధుసారమునం గడుగంగఁ జెల్లదే.

౨౦

జిలిబిలి కమ్మగప్పురపుఁ జిన్నెల వెన్నెలగుత్తి తావులం
జిలుకుచుఁ జైత్రయామవతి చీరచెఱంగునఁ బూతపూచె; నె
చ్చెలి, యిటువంటికాల మికఁ జిక్కదు; భోగ్యము మద్య; మో ప్రి
ఢుల సమ లీనిశాప్రియుఁడు కాంతిలునో మనగోరి మిట్టలన్.

* సాకి=ఆసవపాత్ర నింపియిచ్చు యువతి.



చిత్రము ౪ [పద్యము—౨౫]

౨౧

*జీవితసార్థవాహము విచిత్రగతిం బయనించు; నందులో
నీ వొకతెప్పపాటయిన నెయ్యురతో సుఖముందువేని మో
దావహ మంతకన్నఁగలదా! మధుపాత్రిక నింపి యిమ్ము సా
ఖీ, వినరించ దేల తిలకింపని రేపును? రేయి జారెడిన్.

౨౨

యామిని నొక్కపాత్ర మధువానెద; రెంటను భాగ్యవంతుఁడన్;
నామతముల్ వివేకమును నాలుగిటన్ విడియాకు లిత్తు; నా
పై మదియుండిలేదను తపస్వి యవస్థ మునింగి తేలి ద్రా
క్షామణి ముద్దుకూఁతురిని శయ్యకుఁ దార్చెద లేఁత వెన్నెలన్.

౨౩

ప్రతిదినముం దలంచెదను రాత్రులయాం దనుతాప మొంద; ను
ద్గతరజనీకళాసుభగతం గని రేపని మార్చుకొందు; నీ
విత్తముగఁ గొన్నినాళ్లు కడవెళ్ల వసంతమువచ్చె నిప్డు డా
తతసుమనోభరంబుఁ దలఁదాలిచి; నేవగపిల్లు లెట్లొకో!

౨౪

తారాశుక్తులు రాల్చినట్టి జిగిముత్యాలట్లు పూరేకులన్
జారెన్ సన్ననిమంచుతుంపురులు; వాసంతోదయశ్రీకిఁ గాం
తారత్నం బనువైన నెచ్చెలిగ నుద్యానంబునం దోఁచె ని
త్రా, రారమ్ము, సుఖింపుమీ యదను వ్యర్థంబైన రా దెన్నఁడున్.

౨౫

విరులును బచ్చపూరి కనువిందొనరించి ముదంబుఁ గూర్చు ని
త్తఱిఁ, బరికింపు మందమును; దప్పక యింకొకనాలుగైదు వా
సరముల మట్టిలోఁ గలయు, సాఖి, సుమంబులఁ గోసికొమ్ము; బం
గరుసరకంబునన్ మదిరఁ గమ్మగ నానుము నిర్విచారతన్.

[సశేషము

# పశ్చాత్తాపము: ప్రాణత్యాగము

వేదము సదాశివయ్య గారు

౧

"శర్మా, శర్మా" అను పిలుపుతోఁ దలుపు దట్టుచున్న శబ్దము వినఁబడెను. నేనును అప్పుడే నిద్రమంచము దిగి నోటిలో పుల్ల నుంచుకొని బయటివసారాలోనికి వచ్చితిని. డాక్టరు శర్మగారి గుమ్మమున పురుషవ్యక్తి యొకఁడు తలుపుదట్టుచు పిలుచుచుండెను. వాకిట జట్కా నిలిచియుండెను. తలుపు దెఱవఁగానే ఆవ్యక్తి లోపలఁ బ్రవేశించెను. జట్కావాఁడు సామాను దించి వారి వసారాలోవేసి, బాడుగడబ్బులు చేతవేసికొని పోయెను. నేను ముఖప్రక్షాళనముముగించి ప్రాతఃకాలసంధ్యావందనమునకు పాత సబ్ కోర్టు దగ్గఱనున్న పాపమ్మ కాఫీహోటలునకుఁ బ్రయాణమైతిని. దారిలోఁ బోవుచుండఁగా డాక్టరుగారి హాలులో ఇంటివారందఱును జేరి కలవరపడుచుండిరి.

"తొందరపడకండి, గోలపెట్టకండి" అని వారింటికి వచ్చిన యతిథి యోర్పు జెప్పుచుండెను. నేనును వారి వసారాలోనికి బోయితిని. డాక్టరుతల్లిగారును, భార్యయు, మేనత్తయు నిలుచుండి యుండిరి. ఆయతిథి డిస్పెన్సరీ రూము తలుపుదట్టుచు, "శర్మా, శర్మా" అని బిగ్గఱఁగాఁ కేకలువేయుచు, తలుపుసందులో నుండి తొంగితొంగి చూచుచుండెను. నేను డాక్టరుగారి తల్లిగారితో "ఏమిటండీ, పున్నమ్మ పిన్నిగారూ, ఆలా తలుపు బ్రద్దలుకొడ్తున్నారు? ఏమిటీ మీాహన్నా, వదినెగారు దిగాలుపడ్డట్టు తోస్తున్నది!" అంటిని.

పున్నమ్మ—ఏమిటో, బాబూ, సత్యనారాయణా, రాత్రి ఎక్కడో వైద్యానికంటూ వెళ్లాడు. పన్నెండువేళాక వచ్చాటట! వాడి పెళ్లామే తలుపు తీసింది. అది వాకిట ఉన్నది. వాడు వెళ్లి ఈమందులగదిలో పరున్నాడట! చెన్నపట్నంనుంచి మా ప్రకాశరావు, మా వాడి తోడల్లుడు ఇప్పుడే వచ్చాడు మెయిలు దిగి. ఎంత పిలిచినా తలుపు తీయడం లేదు. ఎన్నడూ మొద్దునిద్ర పొయ్యేవాడు కాడు.

నేను—ఏమిటబ్బా ఈచిత్రం! అన్నగారు మహామెలకువ గలవారే.

అని తలుపు దట్టుచు "అన్నగారూ, అన్నగారూ" అని కేకలు వేసితిని. జవాబు లేదు. ఇంతలో ఇరుగుపొరుగువారు ప్రోవుపడ్డారు. తిరిగి చూచునంతలో తీర్థప్రజ యైనది. ఎదుటింటి ప్లీడరు రామసోమయాజులుగారు బిఱబిఱ వచ్చి,—

"ఏమిటి ఏమిటి సమాచారం?" అన్నారు. నేను సంగతి సందర్భములు చెప్పితిని. ప్లీడరుగారికిఁ గలిగిన సందేహము ఆయన ముఖమునందును, కన్నులలోను, ఆలోచనాపరత్వమునను గోచరించినది.

"బలవంతానైనా తలుపు తెఱిపించాలి మఱి! నా కేమిటో అనుమానంగా వుంది. గడియ లోపల వేసివుండటంచాత మనిషి లోపల వున్నాడు-సందేహం లేదు. గంటన్నరనే పట్నుంచి గాభరాతో కొట్టుకొంటూవుంటే తలుపు తెఱవకుండాపోవడ మేమిటీ! నిద్రైనా అంత మెలుకవ లేకుండా వుంటుందా?"

అని యనుచుండఁగానే డాక్టరుగారి కాంపౌండరు మామూలు వేళకు వచ్చెను. ప్లీడరు సోమయాజులుగారు అక్కడస్థితి చెప్పి వడ్రంగి నొకనిని పిలుచుకొని రమ్మనెను.

కాంపౌండరు పరుగు పరుగున వెళ్లి కొన్ని నిమిషములలో వడ్రంగిని సాధనసామగ్రితో వెంట నిడికొని వచ్చెను.

"ఈ డిస్పెన్సరీహాము తలుపు తెఱవాలోయ్" అన్నారు ప్లీడరుగారు.

"చిత్త" మని అతఁడు రెండు మూఁడు నిముసములలోనే తలుపు దెఱచెను.

ప్లీడరుగారు, ప్రకాశరావుగారు, నేను, పున్నమ్మగారు ఇంకా ఇద్దఱు ముగ్గురు ఆ గుంపులోనివారు లోనికి వెళ్లితిమి. డాక్టరు పట్టెమడతమంచముమీఁదఁ బడి నిద్రించుచుండెను. ప్రకాశరావు మంచమును సమీపించి—

"ఏమిట్రా, శర్మా, ఇంత దయ్యపునిద్రా?" అని మేల్కొల్పెను, పలుకఁడు. పొర్లించెను-శ్వాసము లేదు.

"ఇదేమిటి, ఈవిపరీతం" అనుచు విషాదాశ్చర్యములతో, ఉద్గుత్సుకతో కన్నీరు నించెను. పున్నమ్మగారు, "అబ్బాయీ, కొంప ముంచితివిగదరా!" అని చావుకేక వేసి గోడు గోడున నేడ్చుచు కుసల్లునఁ గూలఁబడెను. హాలులోనుండి రంగమ్మ, "ఏమిటండీ, అత్తయ్యా" అని పెద్దపెట్టున నేడ్చి, నఱికిన చెట్టువలె నేలఁ ద్రెళ్లెను. ఇల్లంతయు నల్లకల్లోలమాయెను. గుండెజబ్బన్నారు కొందఱు; వేదాంతాలు చెప్పినారు కొందఱు; డాక్టరుగారి మంచితనాన్ని కొనియాడినారు కొందఱు; భార్యవైధవ్యమునకు వగచినారు కొందఱు; తల్లిగారి కాల్మొటిన మనుగడకు జాలిపడ్డారు కొందఱు. ఈ వార్త బెజవాడ నాల్గుమూలల పొగవలె నావరించినది. డాక్టరుగారి స్నేహితులు వచ్చినారు. వచ్చినారు బంధువులుగూడఁ గొందఱు. సర్కిల్ ఇన్స్పెక్టరు రామానుజులునాయఁడుగూడ సర్రున సమయానికి సైకిల్ మీఁద వచ్చి దిగినాఁడు. వింతయుఁ జింతయు నారంగము నాక్రమించినవి. వచ్చినవారు, ఆబాలవృద్ధము, విచారసాగరమున మునిఁగినారు; పంచాయతీ జరిపినారు; గుండెజబ్బని నిర్ణయించినారు; దహనసంస్కారమునకుఁ గొనిపోయినారు.

౨

మఱునటిదినము సంచయనము జరగలేదు. "డాక్టరుగారి అన్నకొమారునకు బాపట్ల తాలూకాలోని పెద్దచెఱుకూరికి టెలిగ్రాము

ఇచ్చినాము. అతఁడు వచ్చేదాఁక కర్మ ఆపి పెట్టవలసిన" దన్నారు అపర కర్మాధికారులు. డాక్టరుగారితల్లిని, భార్యను ఓదార్పలేక మహా క్షోభపడుచున్నాఁడు ప్రకాశరావు. డాక్టరు గారిమేనత్త శాంతమ్మ వంటవసారాలోనుండి వచ్చి,

"వదినా, దిగినమటుక్కు- ఎంగిలి బడు దూలే. అమ్మాయీ, రంగడూ, లే—నిన్నం తా కఠినోపవాసమే కదా? పోయినవాళ్లతో మనం బోతామటమ్మా? ప్రకాశరావూ, రా బాబూ! పన్నెండేశారు."

బయటివసారాలో నాతో మాట్లాడుచు కూర్చుండిన ప్రకాశరావుగారు ఉస్సు రని నిట్టూర్పువిడుచుచు లేచి, "ప్రాణ మున్నంత వఱకు ప్రాశన తప్పదుకదా?" అనుకొనుచు, నాతో "సెలవు" అని హాలులో అడుగుఁ బెట్టెను. నేనును లేచితిని.

పోస్టుమాను వచ్చి,

"అయ్యా, ఇక్కడ కొండపూడి సూర్య ప్రకాశరావుగా రున్నారా?" అనెను.

ప్రకాశ—"జా బేమన్నా వచ్చిందా?

పోస్టు—"ఔనండి. రిజిస్టరు ఉత్తర మండి."

పోస్టు బంట్రౌతు రసీదులో సంతకము చేయించుకొని, ప్రకాశరావుగారికి జా బందిం చి వెళ్లెను.

ప్రకాశ—"ఇదేమి, మద్రాసునుంచి రీడై రెక్టు అయిందే! వీడే రాశాడు!"

అని కవరు చించి, జాబును పాఱఁజూచు చుండెను. నేను సెలవుగొని ఇంటికి వెళ్లితిని.

## 3

నాఁటి సాయంకాలము వెలుపలినుండి ఇంటికి వెళ్లితిని. గుమ్మములో నడుగుఁ బెట్ట గానే సావడిలో పిల్లవానికిఁ బాలిచ్చుచుఁ గూర్చుండియుండిన నాభార్య-

"డాక్టరు శర్మగారి తోడల్లుడు ప్రకాశ రావుగారు మిమ్మల్ని రమ్మన మని కబురు పంపారు. ఇందాక నే వచ్చి వెళ్లాడు నునిపి." అన్నది.

నేను వెంటనే శర్మగారింటికి వెళ్లినాను. ప్రకాశరావుగారు అరుగుమీఁద స్తంభము నకుఁ జేరగిలఁబడి నాకై యెదురుచూచు చుండిరి. నన్నుఁ జూచునరికి—

"సత్యనారాయణగారా! మీ కోసమే కాచుకున్నాను-రండి" అనిరి ప్రకాశరావు గారు.

బయటఁ దిరిగివచ్చిన ఆయాసము, ఈ జరిగిన విపత్తువలనఁ గలిగిన విషాదము ము ప్పిరిగొన, గాఢముగా విశ్వసించుచుఁ గూర్చుం డితిని.

"మీరు మంచివారనిన్ని, ఆప్తకోటి లోనివారనిన్ని నమ్మి ఒక పరమరహస్యం చెప్పదలచుకొన్నాను. పెదవి యేమాత్రం జాఱినా కొంప లంటుకుంటాయి."

"అన్నగారు నన్ను బాగా యెఱుగరు. శర్మగారూ, నేనూ జీవికాజీవికల్లా వుండే



చిత్రము ౨ [పద్యము—౧౬]

వారము. నేను ఈ హైస్కూల్లో సెకెండ్ అసిస్టెంటుగా వచ్చి మూడేళ్లకు పైబడ్డది. శర్మగారూ నేనూ ఒకేపర్యాయము వచ్చామన్న మాటే యీవూరికి. అప్పణ్ణుంచి ఒక తల్లికడుపున పుట్టినవాళ్లకంటే ఎక్కువగా వుండేవారము. నాసమాచారం పున్నమ్మ సిన్నిగా ర్నడగండి-తెలుస్తుంది" అంటిని.

ప్రకాశరావుగారు నా వైపునకు కొంచము జరిగి పరమరహస్యమయిన ముక్కలు రెండు నాచెవిని బడవేసి, "ఏకాంతంగా చూచుకొని తెల్లారకట్టే నా కందించండి" అని నాచే నొక కాకిత ముంచెను. నేను 'చిత్త'మని దానిం గ్రహించి, క్షణభంగురమగు జీవితముం గుఱించిన చర్చతో కొంతసేపు గడపి, సెలవు పుచ్చుకొని ఇంటికి వెళ్లితిని. ఆ కాకితము నెప్పు డెప్పుడు విచ్చిచూతమా యను నాతురతయుఁ, గుతూహలమును నా గుండెలోఁ దూఱి గందరగోళ పెట్టుచుండెను. అప్పటి నాచిత్తవృత్తిని జెప్పలేను. ఈశ్వరాస్తిక్యమును గుఱించి తర్కమునంతయు వ్యయించి, సిద్ధాంతీకరింపలేక, తుదకు 'అవాఙ్మానసగోచరము', 'అనిర్వాచ్యము' అను ముక్కలలో వేదాంతసారము తేల్చినట్టు నేనును 'అనిర్వాచ్య' మని ఒక్కముక్కలో నా చిత్తవృత్తిని మనవిచేసెదను. భోజన మయినది-బయటి వసారాగదిలోఁ బ్రవేశించి పడకకుర్చీలో బడితిని. ఇంటివారందఱు పరుండు వఱకు-ఏదో గ్రంథము చదువుచున్నట్టు నటించితిని. నే నాతురపడుకొలఁది కాలమునకు వేగముతగ్గినది. పదిగంటలయినది. రొండిలోని కాకితము తీసి, విచ్చి చదువ మొదలిడితిని. ఒక్కొకమాటయు నాగుండె నీరుచేయఁదొడఁగెను. అప్పటి నా హృదయమును మహాప్రళయ సముద్రమధ్యగత నౌకకుఁ బోల్పవచ్చును. అప్పుడే జాబున కొకనకలు వ్రాసితిని.

ఆరాత్రి నెట్లు గడపితినో నేనే యెఱుఁగుదును; నావలె మనఃక్షోభ మందువారు నెఱుఁగుదురు. ఉదయమే ప్రకాశరావుగారికి కాకితమును వాపసుచేసితిని. నాకడ నున్న నకలును ప్రచురణార్థము "భారతి"కి పంపితిని.

౪

ఆజాబిది:

"అన్నయ్యా, చరమప్రణామములు.

బాంధవ్యమునకన్న పరస్పర మైత్రియే మనలను చాలకాలముగ నడుపుచున్నది. శీలసంరక్షణము నెడ జాగ్రత్తగ నుండువారిలో నే నొకఁడనని నీ వెఱుఁగుదువు. శీలాభిజాత్యములనుగుఱించి నేను వ్రాసిన పిట్టకథలు,వ్యాసములు నీమెచ్చు వడసినవి.'నాకు శీలమునుండి చ్యుతియా? పతనమా?' యని యహంకరించుచుంటిని. నా అహంకార మడఁగినది. నీవు నాకు సహృదయుఁడవు. నా జీవిత చ్యుతిని గూర్చిన గోప్యము నీ హృదయ కరండమున భద్రపఱుచుచున్నాను.

నా సహాధ్యాయి, రంగాభట్ల శ్రీధర శాస్త్రినీకును బరిచితుఁడే. ఆతఁడు ప్లీడరీ చేయుచుండెనుగదా? ఈమధ్య అజీర్ణవ్యాధి

పీడితుండుగ నుండెను. నేనే వైద్యము చేయు చుంటిని. వారికి నాకు అరమరికలు లేవు. ఆతనిభార్య సుందరమ్మయు, నేనును సోదర న్యాయమున కూర్మితో మెలఁగెడివార మని నీవు నెఱుఁగుదువేమో? శాస్త్రి చికిత్సకై తెలుచు వారింటికి వెళ్లవలసివచ్చుచుండెడిది. అప్పుడప్పుడు తెలుచుగానని యే చెప్పవచ్చును. వారు ఆలుమగలు బలవంతముచేసి నన్ను భోజనమునకు నిలిపెడువారు. సుందరమ్మ నాతో చాల స్వేచ్ఛగా అభేదప్రతిపత్తితో మెలఁగుచుండెడిది. 'చెల్లెమ్మా' యని పిలుచుచుండిన నానాలుకకు పక్షవాతము కొట్టినది. మూఁగ సైగలు మొదలుపెట్టితిని. నా హృదయమే మాఱినది. నా చూపులలో, మాటలలో మఱుఁగుతెలుగు లేర్పడినవి. విషకిరణములు క్రక్కుచుండినవి. ఆమెయందు యథాపూర్వమేకాని మార్పగపడదు. ఆమెచనవును పురస్కరించుకొని ఏదేని వంకఁబెట్టి ఆమెను స్పృశించుచుండెడు వాఁడను. ఇంతేల: నాలో వాత్సల్యభావము మాయమై వక్రభావము మెండుకొనెను. అంతియకాదు: నాలోనుండిన దివ్యమూర్తియంతర్ధానముఁజెంది, ఆస్థానమున రాక్షసమూర్తి పీఠస్థుఁడైనాఁడు. నా చేయు వెకలిచేతలు, మాయమర్మము లెఱుఁగని సరళహృదయ, సుందరమ్మ అప్రియముగా నెంచెడిది కాదు. కాని నా దుష్ప్రియత్నము, నా ప్రయోగము ఆమెయందు సాగుచున్నవనియే భ్రమపడితిని. శాస్త్రి యనుమాన పడలేదు. ఎట్లయిన సుందరమ్మను వలపించి లేవఁదీసికొని పోవలయు నను దుర్వృత్తి క్రమక్రమముగ నాలో పడుగుపేకల వలె నల్లుకొని పోవుచుండెను. గుండెజబ్బని శాస్త్రికి నిదానము చెప్పి నమ్మించితిని. ఆతనికి గుణము కలుగలేదు. ఒకటి రెండుమాఱులు ఏకాంతమున సుందరమ్మ మానసికవృత్తినిగూర్చి యడుగ నెంతయో గుండె నిబ్బరము చేసికొంటిని. అవకాశము లెన్నిసారులో దొరకినవి, కాని సాహసింపలేకపోయితిని. రూపమున నేకాక గుణమునను ఆమె సుందరమ్మయే. ౧౫ దినముల నాఁడు నాదుష్కృతి తీవ్రరూపముం దాల్చినది. శాస్త్రికి చేనేత విషప్రయోగము చేసితిని. ఈ వీని ప్రతిబంధకము తొలఁగిన సుందరమ్మ నాదేయని భ్రమించితిని. శాస్త్రి ప్రాణోత్క్రమణ సమయమున నుండెను. నాపై ప్రణయదృక్కులను కడపటిసారి ప్రసరింపఁజేసి కనుమూసెను. "అన్నయ్యా, మీబావను బ్రదికింప లేకపోయితివికదా? దైవదుర్విలాసమునకు ఎవరేమి చేయఁగలరు? నీవు చేసిన సేవ నిర్వ్యాజము; నీఋణము జన్మజన్మమునకుఁ దీఱదు." అని రెండుచేతు లెత్తి నాకు నమస్కరించినది. భర్త మొగముమీఁద తన మొగము నాన్చి, "మీ రొక్కరే వెళ్లుచున్నారా? నేను రావద్దా?" అనుచుండఁగానే హంసశరీరమును వదలెను. ఇంటివారందఱు మూఁగిరి. దుఃఖ మాయింట వఱదలుగట్టినది. శవముతో మేము శ్మశానవాటిక చేరునంతకు-సుందరమ్మ బందరుకాలువలోఁ బడి మరణించినవార్తవచ్చినది. మేము పరువున వచ్చునప్ప

టికి ఆమెను ఎవరో గట్టునఁ బరుండఁ బెట్టియుండిరి. ఊపిరియుండెను. ఎన్నియో చికిత్సలయినవి: ప్రయోజనపడలేదు. ఆసాధ్వీమతల్లియు భర్తతోఁ బరమపద మలంకరించినది.

శాస్త్రి నాపైఁ బఱపిన కడపటిచూపులును, సుందరమ్మ ననుఁ గూర్చి చేసిన ప్రపత్తియు, నమస్కారముద్రయు శూలములై నా హృదయమును గ్రుచ్చుచున్నవి. ఐహికశిక్ష తప్పించుకొంటినే కాని ఆత్మీయముగ నేను మహాపరాధినే సుమీ!

సుందరమ్మయెడ నాకుఁ బుట్టిన దుర్వృత్తి వలన శాస్త్రిని, నా యనుంగు మిత్త్రుని, జంపితిని. 'చెల్లెమ్మా' యనుచుండిన నేనే సుందరమ్మ హత్యకును కారణమనైతిని. ఇట్టి పరమ వంచకునకు, ఘాతుకునకు, దురంతకునకు, ప్రపంచమునఁ దావులేదు. ఆముష్మికమునకును దూరుఁడనే. నాజీవితమునకు నేఁటితోఁ దుది చుక్క పెట్టితిని.

మా అమ్మను, నీమఱఁదలిని అన్నగారిల్లు చేర్పుము. సెలవు పుచ్చుకొందును. కడమ కర్తవ్యము నీకే వదలెదను. చేసినది చెప్పితిని.

22-9-'27. } నీ తమ్ముఁడు,
భారతము సుబ్రహ్మణ్యశర్మ."

---

# స్వర్భంగము

మొసలికంటి హనుమంతరావుగారు

కరుగునఁ బోసిన పుత్త్రిక [దోఁచెన్
తెఱఁగునఁ బడియుండి లేవ దిగ్గునఁ
గురుతర తద్వివరము చి [గాన్.
చ్చఱ చెఱువునఁ జూడ గుండె శకలంబులు

లేచి పతత్త్రములను ధూ
మాచితనీలానిలమును నార్చుచు నెగిరెన్
వీచీతరళముగా నది
మోచిన తదపూర్వభారమున నగ్గంబై.

పఱచిన తెక్కలపరువము [వ్రాలెన్
మెఱయఁగ నరి యరిగి శుష్కమేదిని
బిఱుసగు ఘనాగ్నిఁ గాలిన
చఱియయ కానోపు సరసిసలిలాగ్నివలెన్.

వాని యభాగ్యపుఁ జరణము
లానిన నెల వకట! భూదరావేగలుఠ
ద్ధ్వానానిలవిధురిత నిజ
సానుతలంబున వెలిరసక్షితిధరమో.

గర్జాబంధురగర్భో
త్సర్జితకీలాప్రదగ్ధధాతుచ్ఛన్నాం
త్రోర్జిత మారుతపటలము [గడున్.
జర్జరితము, ధూమ భస్మసంభృతముఁ

అగు నుదరాధోభాగం
బగు నెట్టి క్షితిధరంబో యనఁగఁ దలిర్చెన్;
పగతుఁడటఁ బోవ, రెండవ [యెన్
జగలుఁడు నవ్వానిత్రోవఁ జయ్యనఁ బో

మిత్త్రద్వంద్వం బిట్లు ప
తత్త్రప్రభ స్టికుసునదిని దాఁటుటమెల్లన్
శత్రుకృపగాఁ దలఁపక
గాత్రఘఁబననసుచుఁ బాంగెగరునంబడరెన్.

"ఈ ప్రాంతమె? యీధరణిమె? [త
యీప్రోషితవాయుతలమె? యీస్థానమె?
దీప్రామరలోకప్రతి [కన్.
భూప్రవరం"బని సితాను మొదలిడెఁ బలు

"ఈ దుఃఖాకరమగు తమ
మాదివ్యప్రభకుఁ బ్రతిగ నలవడునదే?యి
ట్లేదగుత సార్వభౌముం
డై దలఁచిన వెల్ల నుచితమని యొనరింపన్.

మన మతని కెంతదవ్వగఁ
జనుదుమొ మన కంతమేలు సారప్రతిభా
చణత మనంతటివాఁడై
ఘనబలసంపదను సాటిగానక యుండెన్.

సారానందజగమ! కడ
సారి నమస్కారమిదిమె; స్వాగతమో దు
ర్వారాభీలమహావ్యథ [యిన్.
లారా! యోనూతనాలయమ! ప్రీతిమె

ఓహో! సమగ్రనిరయమ!
యీహోవాసంపుబుద్ధి నేతెంచిన నూ
త్నాహారితు, దేశకాలా [మార్ధన్.
వ్యాహృతధీరాత్ముఁ గొనుమ! యాదర

నిరతము స్వయంప్రవృత్తం
బరయంగా మానసము, తనంతటఁ దనలో
నరకము దివముగ, మఱి దివి [చుః.
నిరయముగాఁ దోఁపఁజేయుఁ నేర్పరియగు

కాన విశార విహారుఁడ
నే నెచ్చటనున్న నేమి, నిస్తులమేఘ
ధ్వానాధికుఁ డొకఁడు వినా
న్యూనత్వము లేమి నేమి యొగి నేమయినన్.

మన మిచటనైన హాయిగ
మనవచ్చు నతండు నెట్టమానునుసూయా(?)
జనక మిది గామిఁ బాలన
మొనరింతుముగాక నిర్భయోత్సేకమునన్.

నామతమున రాజరికము
కామార్హము నరకముననుగాని, తలంపన్
స్వామిగ నిరయమె మేలగు [టన్.
స్వామిహితంబుగను త్రిదివవాసము కం

కావున నిది బహుదురితో
గ్రావాసమెయైన, వీరినాహవసహగ
త్యావశ్యక ఫలభోక్తృ
త్వావిశ్వసనీయహితుల వలదే పిలువన్.

"పిడుగడఁచెననఁగ మఱకువ
మడుగుననఁబడియున్న మిత్రమంపలిసచటన్
విడువక మనతోఁ దమతమ
పడుపు లనుభవింపఁజేయ,వలదే పిలువన్.

పునరుద్ధృతాయుధులమై [యం
గన దివి నింక నేమి గెలువఁగలుగుటో, నిర
బున మిగుల నడఁగి పోవుటో
పనివడఁ జూచెదముగాక వలదే పిలువన్.

ఇయ్యనువున సైతానన,
వియ్యముగా బెలిజిబనిమె 'విశ్వబలాన్వా
జయ్యవిభాసురసేనల [నన్.
జియ్యా! మీయొక్కపిలుపు చెవులంబడి

# మార్గదర్శి

పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

"పంతులూ, ఇక నువ్వు వెయ్యిచెప్పు, లక్ష చెప్పు. నౌకరీకోసం సిఫార్సన్నమాట నాదగ్గిర యెత్తకు. సబుజడ్జీగారు మావియ్యంకులు కనక నామాట కొట్టెయ్యక పోవడం నిజమే. కాని నేను వ్రతం పట్టాను. ఇదివరకి నన్నిందుకోసం చాలామంది ఆశ్రయించారు. అందరికీ యీమాటే చెప్పాను. వారి సందర్భో "నావల్ల కా"దని చెప్పి పొమ్మన్నాను; కాని నిన్ను పొమ్మనను. వెడితే ను వ్విపనికోసం మరివకళ్ల నాశ్రయిస్తావు. ఈపట్టు పట్టు చివరికి స్కూలు మేష్టరీ అయినా సంపాదిస్తే గాని నువ్వు తృప్తిపడవు. నువ్వు నౌకరీ చెయ్యడం నాకు సుతరామూ యిష్టం లేదు."

"విన్నావా? నీకేం లోటూ? కాలక్షేపింప రెండున్నర యకరాల భూమి వుందని చెపుతున్నావు నీకు. ఇంకేమీ? పొదుపుగా వాడుకుంటే__వేషాలు వెయ్యకపోతే సుద్దిగన్నయినా సంపాదించకపోయినా నీ తరం గడిచిపోతుంది. అంటే యీవేళే నువ్వు దిగాలుపడి కాళ్లు విరగతొక్కుకోవలసిన పని లేదు. నిదానంగా చూసుకోవచ్చు. ఇరవై రెండేళ్లే కామా నీ వయస్సూ? ఏమీ ఆధారం లేనివాడిలాగ కంగారుపడి నిక్షేపంలాంటి జీవితాన్ని పకళ్ల కమ్ముకోవలసిన యోగం లేదు. నీకు."

"స్కూలు ఫైనలులో పరీక్ష యిచ్చావు. నవయౌవనంలో ప్రవేశించావు. చేతిలో పని వుంది. నోట్లో వాక్కుంది. నీ కళ్లల్లో చక్కని తేజస్సు వుంది. తరతరాలనుంచి సంచితమైన బ్రాహ్మణ్యప్రతిభ నీలో తక్కువగా లేదు. కాని ఆత్మజ్ఞానం వున్నట్లు లేదు. ఆత్మగౌరవమూ, ఆత్మశక్తీ తెలిసినట్లు లేదు. నీకే కాదు బ్రాహ్మణసంఘాని కంతా యిప్పుడిదే లోటు. సబుకోర్టులో యిరవైరూపాయలకి నౌకరీచెయ్యడానికి సిద్ధపడుతున్నావు నువ్వు. అంటే యేమిటో తెలుసునా? పొద్దున్నుంచి__చెమట పోడ్చి పని చేస్తా నన్నమాట. శ్రమ పడడానికి తయారుగా వున్నా నన్నమాట."

"బాడిత చేత పుచ్చుకుని కర్రలు చెక్కుతాడు వడ్రంగి. సమ్మెట యెత్తి యినుము సాగకొడతాడు కమ్మరి. పట్టి పిసికి కుండలు చేస్తాడు కుమ్మరి. నూలు పోడికి బట్టలు నేస్తాడు దేవాంగి. కలం పుచ్చుకొని లెక్కలు రాస్తాడు గుమాస్తా. అంతా శ్రమే. రకంలో తప్ప రాశిలో భేదం లేదు. కాని లెక్కనవా రంతా స్వతంత్రులు. గుమాస్తా అస్వతంత్రుడు. ఇదే భేదం. అయితే పని చెయ్యడానికి ఆక్షేపణా, బద్ధకమూ లేనప్పుడు భుక్తికి లోటు లేని నువ్వు యితర్లకి సేవ చెయ్యడం యెందుకు చెప్పూ! పూటకి టికాణాలేనివాడూ, ఆకస్మికంగా సంసారం మీదపడ్డవాడూ, స్వతంత్రంగా కల్పన చెయ్యలేనివాడూ నౌకరీకి పోవడం బాగానే వుంది. కాని కల్పనాశక్తి వున్నవాడు ఆశక్తిని యితర్లకి ధారపొయ్యడానికి బదులు తనకే యెందుకుపయోగించుకోరాదూ? ఇదీ నే నడిగే మాట."

"పద్ధెనిమిదో యేట యీసమస్యే నన్నడ్డుకుంది. అప్పటి స్థితి తలుచుకుంటే యిప్పుడు కూడా శరీరం గజగజలాడిపోతుంది నాకు. ఈశ్వరానుగ్రహంచేత నేనెలాంటి దౌర్భాగ్యదశని దాటానో నువ్వెరగవు. దారిద్ర్యం యెలాంటిదో నీకేం తెలుసును? నరకబాధలలో కూడా అంతా తీవ్రమైన దుండదు. శ్రీహరీ, లోకంలో యెంతమంది దాని ఆక్రమణలో పడి బాధపడుతున్నారో? ఎదిరించి నిలవగల శక్తి వుండికూడా యెందరు దానికి లొంగిపోతున్నారో?"

"సెంటు భూమి లేదు. చేతిలో ఒంగిదమ్మిడీ లేదు. సంపాదన లేదు. ఇంకా ఆవృత్తికూడా లేదు. అప్పుడే పదిహేడో యేట పెళ్లింది. బడికి పోవడమూ,

ఆట లాడేవాణ్ణీ తప్ప వేరే ధ్యానమే లేదు. అలాంటి సమయంలో సన్నిపాతజ్వరం వచ్చి మా నాయన కాలం చేశాడు. ఆరోజు లెలా గడిచిపోయాయో నాకు తెలవదు. ఎవళ్ల యింటికి వాళ్లు వెళ్లిపోయారు. ఇక మా అమ్మా, నేనూ వున్నాం. అమ్మ అంటే పార్వతీదేవి అనుకోవేం. మాఅమ్మలాంటి అమ్మ యెవళ్లకీ వుండదు. ఇదంతా ఆవిడ చలవే. ఈసంపత్తంతా ఆవిడ దీవనవల్ల కలిగిందే."

"నాయనా! పది కుంచాల బియ్యమూ, రస వర్గాలూ వున్నాయి. నెలరోజులు గడిచిపోతాయి. తరవాత యెలా కాలం గడుస్తుందీ? ఏమాలోచించావురా?" అంది మాఅమ్మ. "తండ్రీ! బెంబేలుపడకు. నారు పోసిన యీశ్వరుడు నీరు పొయ్యకమానడు. నువ్వేలపాఠంగం పిల్లవో నాకడుపున పుట్టావు. నీనొసట కష్టం రాసి వుంది. కాని మనస్సు పాడుచేసుకోకు; ఆలోచించు." అంది.

"వక్కమాటు ప్రపంచకం అంతా గిర్రున తిరిగిపోయినట్లయింది నాకు. విచారంఅంటే యేమిటో యెరగని స్థితిలో యెన్నడనీ యేగాని లేని సంసారం హఠాత్తుగా మీద పడింది. అయితే అది యెంతదైనా లెక్కచెయ్యకుండా మోసేవాడూ మనిషే. దిగ్భ్రాంతుడై దానికింద పడి అణగారిపోయేవాడూ మనిషే. నిజంగా "మనం పెట్టి పుట్టామా లేదా?" అనీ కాదు ఆలోచించుకోవలసింది. "మనకి మగతనం వుందా లేదా?" అని చూసుకోవాలి. నల్లరాతిని చూస్తే "దీన్ని కదపగలమా?" అని భయం వేస్తుంది. సాగతీసి దాన్నొక్క తన్ను తన్నితే కాలు విరిగి పిప్పయిపోతుంది. కాని అలా కాకుండా వోపిక పట్టి దానిమీదనుంచి నడుస్తూవుంటే పిప్పయి పోయేది యీకాలికిందే పడి అది అరిగిపోతుంది."

"నా స్వంతంగా సంసారం సంగతి కూడా అంతే. రెండు కళ్లతో నే చూస్తే అది స్వాధీనంలో వుంటుంది. కళ్లు మూసుకుంటే అది వూబిలో తొక్కేస్తుంది. నేను బడాయి చెప్పుకోవటం కాదు. అనాధారస్థితిలో కూడా నాకు భయం కలగలేదు. నిలవ చేస్తామా లేదా అంటే అది వేరే సంగతి. ముందు కాలం గడిపెయ్యటం చేతనైతే అంతా మన చేతిలో వుందన్నమాటే. రోజులు గడిచిపోవడాని కనేకమార్గాలున్నాయి. లోకంలో మనుష్యులకంటే సంసారం నిర్వహించుకోటగ్గ మార్గాలధికంగా వున్నాయి. నిదానిస్తే స్వతంత్రమార్గం దొరుకుతుంది. గగ్గోలుపడితే మాత్రం చెడతాడు."

౨

"మాఅమ్మ అలా చెప్పి నాకు చద్దన్నం పెట్టేసి యింటిపనిలో ప్రవేశించింది. నేను వీధి అరుగుమీద కూచుని ఆలోచనలో పడ్డాను. అప్పటికి లోవరు సెకండరీ చదువుతున్నాను. సంసారం మీద పడ్డాక యిక చదు వేమిటి? మానాన్న మొదటే శ్రద్ధ చేస్తే అప్పటికి మెట్రిక్యులేషను అయిపోవును. కాని నాకు పధ్నాలుగో యేడు వచ్చేదాకా మానాన్న మహేంద్రవాడ విడిచిపెట్టలేదు. అప్పుడేనా 'అబ్బాయి బాగుపడే మార్గం చూడరూ?' అంటూ మాఅమ్మ పోరగా పోరగా రాజమహేంద్రవరం ప్రవేశించాడు. మానాన్న అక్కడా యిక్కడా కూడా తంబురా పుచ్చుకుని తిరగడమే; కాని రాజమహేంద్రవరం ప్రవేశిస్తే నా కంటెకంటే మంచిమార్గం దొరుకుతుందని మాఅమ్మ వుద్దేశం. దొరికేటట్లు చెయ్యాలని పట్టుదల కూడాను. నిజంగా మా అమ్మే నన్ను బాగుచేసింది; నాజీవితాని కావిడే మంచి పునాది వేసింది. ఇప్పటికి కూడా మాఅమ్మ జ్ఞాపకం— చూడమా నా వొళ్లంతా యెలా గగుర్పొడిచిందో! రక్తం గబగబ ప్రవహిస్తుంది. 'నాయనా! వూరికే కూచున్నావా?' అని నన్నడిగినట్లవుతుంది."

"విన్నావా?' మాఅమ్మ ఆత్మ యీయాభై యేళ్ల వయస్సులో కూడా నన్ను నడిపిస్తోంది. నేనీ సంపత్తు సంపాదించడంలో నాగొప్ప యేమీ లేదు. ఆవిడ కడుపున పుట్టడమే గొప్ప తపఃఫలం. అలాంటి తల్లి ఉన్నవాడికి యిక లోటేమిటి నాయనా?"

"వక్క గంట ఆలోచించాటప్పటికి నాహృదయంలో యేదో మెరుపు మెరిసినట్లయింది. నిదానించగా నా పూర్వపు సంగతి జ్ఞాపకం వచ్చింది."

"ఓహో మంచి సంగతి. అదే ఎన్నో స్థితికి తెచ్చింది. శెభాష్! నాజీవితాకాశంమీద అది ధ్రువతారలాగ యెప్పుడూ మెరుస్తూ వుంటుంది."

"ఫాల్గునపున్నానికి మహేంద్రవాడలో అమ్మవారి తీర్థం జరుగుతుంది. మాయింటి పక్కని వక చీప కోమటి వుండేవాడు. చిల్లరదుకాణంమీద మాచుని పూరు నిలుపుతూ వుండేవాడతను. అతనికి నాయీడువాడే వకకొడుకుండేవాడు. అప్పటికి నాకు పదకొండేండ్లో యేమో. మేమిద్దరమూ మూడోక్లాసు చదివి చక్కామానేశాం. నేను మామూలుప్రకారం భోజనం చేసి తిరిగేవాణ్ణి. అతను వ్యాపారంలో తండ్రి కాసరగా అవుతూ వుండేవాడు."

"ఆరోజటి తీర్థంనాడు మాఅమ్మ నాకు రెండణాలిచ్చింది. అతను పొద్దున్న మొదలు మధ్యాహ్నందాకా తండ్రితో పోరి వక అణా లెచ్చుకున్నాడు. 'వోస్, ఇంతేనా?' అన్నాను నేను. అతనికంటే నేను గొప్పవాణ్ణని నాకు గర్వం కలిగింది. ఆరెండణాలతోటే నాలు గైదురకాల పిండివంటలు కొని తినవచ్చునకదా అని పొంగిపోయాను నేను. కాని నేనెంత యీసడించినా అతడు నా అణాకే సంతోషించాడు. 'రా తీర్థంలోకి' అని నేను హుం దమును చేశాను కాని అతను 'తొందరపడ'కన్నాడు. అప్పటి కింకా జామున్నర పొద్దుంది. ఇంకో గంటకి గాని తీర్థం పూనుకోదు. అయితే 'రెండణాలూ యెప్పుడు ఖర్చుపెట్టేస్తానా?' అనే వుబలాటంలో నాకేమీ తెలియటం లేదు. మనస్సు వురకలు వేసేస్తోంది."

"నేను మళ్లీ తొందరపెట్టగా 'దుకాణాలు సర్దకుండా వెళ్లి యేం చేస్తా వయ్యా?' అన్నా డతను. అబ్బాయీ, చెప్పవద్దూ? నా కప్పుడు ఆకోమటిబిడ్డమీదా, దుకాణాలవాళ్ళమీదా కూడా చాలా కోపం వచ్చింది. 'నువ్వు రాకపోతే నేను వెళ్లలే ననుకున్నావా యేమి?' టని అందా మనుకున్నాను. 'రెండణాలు ఖర్చుపెట్టెయ్యడానికి నేను సిద్ధంగా వుండగా యింకా నుంచోబెడుతుంటా డేమి టితను?' అనిపించింది. 'చద్దన్నం తిన్నది మొదలు పోరితే గాని చేతిలో పడని యీఅణాని యిరుసు సాయంత్రందాకా ఖర్చుపెట్టడు కాబోలురా' అనుకుంటూ, అయినా యేం చేస్తాడో చూద్దామని తొందర అణుచుకొని ఆగిపోయాను."

"నన్నిక్కడే నుంచోపెట్టి పక్క కానికి తమలపాకులు కొనుకువచ్చా డతను. పక్కన దుకాణానికి పోకచెక్కలూ, లవంగాలూ, యాలక్కాయలూ, దాల్చినీ;—యిలాంటి చిల్లరసామాను తండ్రివద్దికే పుచ్చుకొని ఆకులికి సున్నం రాసి యెనిమిది కిల్లీలు కట్టి 'మరి పదవయ్యా', అని నన్ను రమ్మని 'కిల్లీలు కిల్లీ' లంటూ బయలుదేరాడు. అప్పటి కప్పుడే తెల్లని బనియన్లమీద నల్లని వుల్లిపొర చొక్కాలు తొడుక్కుని తీర్థంలో యిలాగా అలాగా తిరుగుతూ రైతుల కుర్రాళ్లు అప్పడాలు కరకర లాడిస్తున్నారు. కోమటిబిడ్డ వాళ్ల మధ్యకి వెళ్లేటప్పటి కెనిమిది కిల్లీలూ యెగిరిపోయి పళ్లెంలో ఘల్లు మని యెనిమిది డబ్బులు పడ్డాయి."

"అది చూశాటప్పటికి నావొళ్లు గరిపొడిచింది. నాలుగు డబ్బుల్లో నుంచి యింకో నాలుగు డబ్బులు పుట్టించాడతను. కాని కష్టపడితేగాని అతనికి రెండో అణా రాలే దనీ, నాకు చులాగ్గా మొదటే వచ్చిం దనీ నాకు గర్వం కలిగింది. పిండివంటలు కొని తినెయ్యాలన్న తొందర యింకా తగ్గలేదు. 'మరి రా' అన్నాను; కాని లాభం తిన్న కోమటిబిడ్డ అంటల్లో వస్తాడూ? 'నీకు తొందరగావుంటే నువ్వు పో' అని అతను మళ్లీ వూళ్లోకి మళ్ళాడు. వక మూల అప్పుడే తయారవుతూ వున్న వేడివేడి పకోడీలు 'కూపాటికి దయచెయ్యవోయి' అని నన్ను పూరిస్తూనేవున్నా, అత నింకా యేంచేస్తాడో చూద్దామని వెంట బయలుదేరాను."

"అత నీమాటు అర్ధణా తమలపాకులూ ఆరుకానుల చిల్లర సామానూ పుచ్చుకొని పదహారు కిల్లీలు కట్టి మళ్లీ తీర్థంలో పడ్డాడు. అరగంట తిరిగేటప్పటి కవి అయిపోయాయి. మళ్లీ కట్టి మళ్లీ అమ్మాడు. ఇలాగ నాలుగైదుమాట్లమ్మాడు. అంతవరకూ మొగం వేలవేసుకుని నేనతని కూడానే తిరిగాను; గాని నారెం

డణాలూ మాత్రం ఖర్చుపెట్టలేను. చివర కొక చోటు చూచుని జేబులో వున్న డబ్బు లన్నీ తీశాను. లెక్కపెట్టగా రెండు బేడకాసులూ, ఒక పావలా కాసూ, అయిదు ముద్దడబ్బులూ, తొమ్మిది విడిడబ్బులూ—మొత్తం మూడు పావలాల ముక్కానివుంది."

"లెక్క తేలేటప్పటికి నాగర్వం అంతా అణగిపోయింది. ఒక్క అణాలో పదకొం డణాల ముక్కాని సంపాదించా డతను. ఇప్పుడు నా రెండణా లెక్కువా? అతని అణా యెక్కువా? వల్లమాలిన సిగ్గు వచ్చింది నాకు. మాట్లాడలేకపోయాను. పాపం, అతను చాలా మంచివాడు. ఇందాకా నేను తొందరపడ్డట్టే యిప్పుడతను తొందరపడితే నా పనేం కావలిసిందీ? నామాటలప్పుడే మరిచిపోయా డతను. 'మరి నువ్వు కొనుక్కుంటే కొనుక్కో. నాకేమీ అక్కర్లేదు. అంతకీ వుండలేకపోతే యింటికి వెళ్ళి నాలుగు బత్తాణీగింజలు నోట్లో వేసుకుంటే పోతుం' దన్నా డతను. దీనితో నాకు ఛెళ్లున కొరడాదెబ్బ తగిలినట్లయింది. గొప్ప పరాభవం జరిగినట్లు తోచింది. కళ్ళల్లో నీళ్లు గిర్రున తిరిగిపోయాయి. చివరికి 'పద యింటికి పోదాం. నేనుకూడా యేమీ కొనుక్కోను' అని బయలు దేరాను."

"ఇంటికి వెళ్లాక అతను జరిగిం దంతా చెబుతూ డబ్బు లన్నీ వాళ్లమ్మచేతి కిచ్చాడు. నేను మాఅమ్మ కిచ్చేశాను. సంపాదించినందుకు వాళ్లమ్మా, ఖర్చుపెట్టకుండా తెచ్చియిచ్చినందుకు మాఅమ్మా సంతోషించారు. పైగా మాఅమ్మ నన్ను చేరదీసి 'నాయనా! మనం బీదవాళ్లం. వున్న డబ్బు లన్నీ ఖర్చుపెట్టుకోకూడ దమ్మా' అంటూ బుజ్జగించి ఆరాత్రి ఒక డబ్బు పెరుగు తెచ్చి నాకు ప్రత్యేకంగా పోసింది."

"ఈసంగతి నా కప్పుడు జ్ఞాపకం వచ్చింది. ఇప్పటికిగూడా పండక్కోడిగా వున్నప్పుడు నాకు జ్ఞాపకం వచ్చి యిది ఒక్కొక్క మెరుపుదెబ్బ కొడుతూనే వుంటుంది. ఇందులో యెంత వుపదేశం వుందో గ్రహించారా? మన బ్రహ్మగాళ్ళలో నాలు గింగ్లీషుముక్కలు వచ్చాయంటే నౌకరీకోసం బయలుదేరడమూ, వైదిక విద్యలు నేర్చుకుంటే సంభావన్లకి తిరగడమూ, ఏదువూ లేకపోతే కొందరు తగని వేషాలు వేసి కాని పరువు తెత్తడమూ, కొందరు దానాలకీ, శాస్త్రుర్లకీ తయారు కావడమూ సాంప్రదాయా లైపోయాయి. తక్కిన జాతుల కన్నింటికీ వృత్తు లున్నాయి గాని మన జాతి కేదీ? ఒక కాలంలో బ్రాహ్మణమతం విజృంభించడమూ, అత్యున్నతగౌరవాన్ని పొందడమూ నిజమే. అయితే మాట్లాడితే ఆపూర్వోన్నతిని తలుచుకోవడం తప్ప మన కిప్పు డేం వుందీ? మన జాతి తక్కిన ప్రపంచకం అంతటితోటీ వేరై వుండా లనీ, విలక్షణంగా వుండా లనీ, చాలా ప్రయత్నాలు చేసి ఆసాధనలో నెగ్గింది. అయితే అది యిప్పు డేమయిందో చూశావా? ఎక్కడ చూసినా బ్రాహ్మణనిందా, బ్రాహ్మణబహిష్కారమూనూ. కాలమూ, ప్రభుత్వమూ మారడంతోటే మన మాప్రత్యేకతని చంపుకోకపోవడంచేత చెర్లో చేపలు బయటపడ్డట్టిప్పుడు బయటపడిపోయాం. ఇంకా యిప్పు డేం చూశావూ నువ్వూ? ముందు తరాలవాళ్ల కింకా వున్నాయి తిప్పలు."

"దాని కేమి లే? తరవాతి కథ విను. మాఅమ్మ వోనాడు దీపావళి కింకో కథ చెప్పింది. ఒక కోమటి కొక కొడుకూ కూతురూనూ. దీపావళినాడు ఇద్దరికీ చెరో రూపాయీ యిచ్చాడు. కొడుకు కవీ యివీ కొని ఆరూపాయి ఖర్చుపెట్టేశాడు; కాని కూతురు ఆరూపాయతో తండ్రిదగ్గిరే బాణసంచా కొని దొడ్డిగుమ్మంలో కూచుంది. దీపాలు పెట్టేటప్పటి కొక రూపాయల్లా రెండయింది. కార్తీకపున్నానికి రెండల్లా నాలుగైనాయి. ఇక చెప్పే దేం వుందీ? వీథి అరుగుమీద తండ్రి కిరాణాకొట్టూ, దొడ్డిగుమ్మంలో కూతురు చిల్లరదుకాణమూనూ."

"కాలం గడిచింది. పిల్ల పెద్దదయింది. పెళ్లియింది. రజస్వల అయి కాపరానికి వెళ్లింది. వెళ్లేటప్పుడామె స్వార్జితం వెయ్యిరూపాయలు పట్టుకువెళ్లిందట."

"సెబాస్! ఎంత చక్కని కథా? ఇది కూడా జ్ఞాపకం వచ్చింది నా కప్పుడు. డబ్బుని పుట్టించడంలో

కోమట్ల కున్న నేర్పు మరెవ్వరికీ లేదు. సంపాదించడం లోను, ఖర్చుపెట్టడంలోనూ అంత జాగ్రత్తగా వుండే జాతి మనలో యింకో టేదీ? అసలు ఆర్థికనీతి కోమట్ల రక్తంలోనే వుంది."

"ఆసంగతీ, ఆకథా నాకు బలం కలిగించాయి. కథలు యథార్థాలా అంటే అది వేరే సంగతి. అవి కళ్లకి వెలుగిస్తాయి. మనస్సుకి ఉత్సాహమున్నూ కలిగిస్తాయి. బుద్ధికి కల్పనాశక్తిని పుట్టిస్తాయి. కొత్తదారి తోపిస్తాయి. కథలు వినడమూ, చదవడమూ యెప్పుడూ మందు గనుకోలేం."

3

"అర్జునుడికి శ్రీకృష్ణుని గీతోపదేశం యెలాంటిదో నాకు వాట్లసప్పలి అలాంటి దయింది. వర్తకం చెయ్యాలని బుద్ధి పుట్టింది. శ్రీహరీ! అయితే పెట్టుబడి యేదీ? చేతిలో దమ్మిడీ లేదు. వర్తకంమాత్రం చెయ్యాలి. వర్తకం అంటే యేమిటో నీకు తెలుసునా? అది చచ్చుల్లిపాయ లమ్ముకునే కోమటికి తెలవాలి గాని నాకరీ కోసం తంటాలుపడే బ్రహ్మగాడి కేం తెలుస్తుందోయి?"

"పెట్టుబడి వుంటే లాభం వచ్చినా నష్టం వచ్చినా వర్తకం అంతా చెయ్యవచ్చు. లాభం కంటే ముందు పెట్టుబడి సంపాదించడంలోనే వుంది ప్రజ్ఞ. పెట్టుబడితక్కువా. బుద్ధియెక్కువానూ. వర్తకశాస్త్రంలో యిదో సూత్రం. దీన్ననుసరించిమాడా ధనం సంపాదించవచ్చు. యాభై లక్షలు సంపాదించిన బసివిరెడ్డికి ఆది కాలంలో మూలధనం యెంతో యెరుగుదువా? ఇక్కడ మూడు మైళ్ళ వెడల్పున్న గోదావరి పుట్టినచోట యెంత వుందో తెలుసునా? ఆదృష్టి లేందే నీకు?"

"ఆర్యాపురంలో మాయింటిపక్క నొక ప్లీడరుండేవాడు. పెద్దచెయ్యే. నెల కేడెనిమిది వందలు వచ్చేవి. కాని ఖర్చులో మహాజోరుమనిషి. ఇక వెనకా ముందూ లేదు. పదేళ్ల ప్రాక్టీసయినా అద్దె యిల్లే. రెండో పెళ్లాం యిదంతా చూసింది. ఆఫీసుఖర్చులు పోను మిగిలిన దాల్లో మూడువందలు తన కిస్తేగాని అన్నం పెట్టనం దావిడ. రెండుమాసాలికి పూర్తిగా లొంగతీసింది. నామీద సంసారభారం పడేటప్పటికి ఆవిడ దగ్గిర చులాగ్గా యాభైవేలు చేరాయి. చిక్కని చెయ్యే గాని మొత్తానికి మహామంచి యిల్లాలు. నేనావిణ్ణాశ్రయించిచాను."

"అంటే వక్క రూపాయి బదు లడిగాను. 'మళ్ళీ నెల్లాళ్ళలో యిచ్చేస్తా;' నన్నాను. నామాట తీసెయ్యలే దావిడ. కానయితే సావరు కాతాలోనే ఖర్చుబ్రాసుకుందిగాని రూపాయి మాత్రం నాకిచ్చింది."

"అబ్బాయీ! నావ్యాపారాని కంతటికీ ఆవక్క రూపాయే పెట్టుబడి. నా మేడలకీ, నాభూములకీ, నాసర్వానికీ అదే మూలం. ఇప్పుడు రెండులక్షల కధికారిమై వున్న చేబోలుశంభుశాస్త్రి వర్తకం వక్కరూపాయతో మొద లయింది."

"ఆరూపాయి పుచ్చుకుని బజారుకి బయలుదేరాను. మాఅమ్మ 'జాగ్రత్తసుమా నాయనా' అని దీవించి పంపింది. బజారులో అనేకరకాల సామాను వుంది. ఏమిటి కొనడమూ? ఏది తొరగా విడుదల అవుతుందీ? ఏమీ తోచింది కాదు. ఎవళ్ళతోటీ మాట్లాడకుండా యెడా పెడా చూసుకుంటూ కోటగుమ్మందగ్గిర నుంచి మసీదుదాకానూ, మసీదుదగ్గిరనుంచి కోటగుమ్మందాకానూ నాలుగుసమాట్లు తిరిగాను. అప్పటికి నాదృష్టి బట్టల కొట్టుమీద పడింది. నవ్వు వస్తోంది కదూ నీకూ? నిజమే. ఆవక్కరూపాయీ పట్టుకుని వేలు ఖరీదు చేసే బట్టలకొట్టులోకి వెళ్ళినప్పుడు నాకూ వచ్చింది నవ్వు. తలవెంట్రుకకే పర్వతానికి ముడివేసిన కథ జ్ఞాపకం వచ్చింది. 'వస్తే పర్వతం వూడి వస్తుంది; లేకపోతే వెంట్రుక తెగిపోతుం' దన్నాట్ట యెవడో. అలాగే నేనూ 'సాగితే యింత కొట్టూ చేస్తాను; లేకపోతే రూపాయిమాత్రం పూర్తిగా పోదు' అనుకున్నాను."

"కొట్టులో అడుగు పెట్టేటప్పటి 'కేంకావాలి' అన్నాడు సాహుకారు. అప్పటికి ఒక బ్రాహ్మడు పెద్ద బేరం చేస్తున్నాడు. పెళ్ళికి బట్టలు కొనడానికి వచ్చాడాయన. 'నామాట తొందర లేదు. ముందు పెద్దబేరం

చూసుకో" అన్నాను. ఆయన బేరం లేనిదే టప్పటికి మనం యేం కొనాలో తేల్చుకోవచ్చునని చూస్తున్నాను. అరగంటలో ఆయన నూటయాభై రూపాయల సరుకు కొన్నాడు. అప్పటికి నా ఆలోచన తేలింది. తువ్వాళ్ళు చౌకగా కనపడ్డాయి. నాకలా కొకటి యిచ్చాడాయనికి. నేను నాలుగు కావాలన్నాను. బేరం చెయ్యగా నాలుగూ పద్నాలుగు అణాల కిచ్చి మిగిలిన బేడకి చిన్న అంగవస్త్రం వకటిచ్చాడు. ఆ అయిదుమూర్తులూ పట్టుకొని బయలుదేరాను."

"నేలమీద పెట్టుబడి కనక కొట్టు పెట్టుకుని కూచున్నాడతను. మరి నేనేమిటే చెయ్యడం? మూటలు పుచ్చుకుని చాలామంది దేవాంగులు వూళ్ళో తిరుగుతూ వుంటారు. నాకూ అదే వుపాయం అనుకున్నాను. ఏం? అలా చూస్తావేం? ఇంటింటికీ తిరిగి తువ్వాళ్లు అమ్మడం తప్పుగా తోస్తోందా నీకూ? చెంబుపుచ్చుకుని ప్రతీసమ్మగూ యెక్కడం కంటేనూ చెడ్డదా అదీ? కొంగు చాపుకొని ప్రతి ఆఫీసుకీ తిరగడం కంటేనూ చెడ్డదా?"

"నేను తిన్నగా యిన్నీసుపేటకి బయలుదేరాను. నాళంవారి సత్రంవగ్గరికి వచ్చాటప్పటికి నాకొక పంతులెదురై 'అవేమిటి?' టన్నాడు. 'తువ్వాళ్లు' అని చెప్పగా 'అమ్ముతావా?' అన్నాడు. మడత విప్పి చూపగా 'వక్కటే కావాలెంత కిస్తావు?' వన్నాడు. ఆరణాలు చెప్పగా అయిదణాల కడిగాడు. 'నష్టం వస్తుం'దని చెబుతూనే డబ్బుడబ్బుచొప్పున తగ్గించి చివరి కయిదణాల కొక తువ్వా లిచ్చేశా నాయనికి. బజారుదాకా వెళ్ళ నక్కర లేకపోయినందు కాయన సంతోషించాడు. వెంటనే వకటి ఖర్చయినందుకూ, వేపారిపంతులు బోణీ అయినందుకూ నేను సంతోషించాను. వర్తకం అంటే బోధపడిందా? కొన్నివాడికీ అమ్మినవాడికీగూడా తృప్తే. వర్తకం చేస్తే యెవళ్ళ కొంపా తియ్యకుండానే నాలుగు రాళ్ళు సంపాదించుకోవచ్చు."

"ఇలాగ నా వర్తకం నడివీథిలో ప్రారంభమై యిప్పుడు నడిబజారులో స్థిరపడింది. మొదట నే నే కొట్టులో రూపాయ కయిదు మూర్తులు కొన్నానో ఆకొట్టుకి పక్కనే యిప్పుడు నా సొంత కొట్టుంది. సొంతం అంటే తెలిసిందా? కొట్టూ, కొట్టులోవున్న సరుకూ గూడా నావే. అయిదువేల కాయిల్లు కొనేసి తీర్చి, మేడ కట్టి, నాకొట్టువున్న గది కాక యింకో నాలుగు గదు లద్దెకిచ్చా నిప్పుడు. మేడమీద వక మారువాడీ కాపరం పెట్టాడు. అతను ముప్ఫయ్యీ, కింది కొట్లవాళ్లు యాభయ్యీ, మొత్తం నాకొట్టు పోగా నెలకి యెనభైరూపాయలు వస్తాయా మేడవల్ల".

"మనం అప్పుడే అంత ముందుకి వెళ్లొద్దు. తరువాతి సంగతి విను. కొంచెం ముందుకి వెళ్లాటప్పటికి కొక బ్రాహ్మడు అంగవస్త్రం చాకలిదానికి వేసినందుకు పెళ్లాంమీద కోప్పడుతున్నాడు. పాపం స్నానానికి వేళ అయిం దాయనికి. అంగవస్త్రం లేదు. 'ఏపాత కండువా అయినా యీపూటకి వాడుకోండి' అంటుం దావిడ. ఆయన ఘుసఘుస లాడుతున్నాడు. నే నిదంతా కనిపెట్టి గుమ్మం యెక్కాను. ఆయన ఆగ్రహపడ్డ మొగాన్ని నావేపుకి తిప్పి "యేం వచ్చావ్?" వన్నాడు. "తువ్వాళ్లూ అంగవస్త్రాలూ కావాలా?" అనగా "చూపించు" మన్నాడు. ఇలా చూసీ, అలా చూసీ చివరి కాయన "యీదరిద్రం యెప్పుడూ వుండేదే" అంటూ అయిదణాల కాని కొక తువ్వాలూ, రెండణాల ముక్కాని కంగవస్త్రమూ పుచ్చుకుని "యిక రెండేళ్ల దాకా యిబ్బంది వుండ"దని సంతోషిస్తూ అర్ధరూపాయి కాసు నాచేతిలో పడేశాడు. నాకు లక్షరూపాయలు దొరికినంత సంతోషం వచ్చింది. అయిదుమూర్తులకీ మూడు ఖర్చుపడ్డాయి. రూపాయికీ పదమూడణాలు సొమ్ము చేతిలో పడింది. రతిమ్మా మూ డణాలకీ రెండు తువ్వాళ్ల అయివజు వుంది."

ఇంకాస్త ముందుకి వెళ్ళేటప్పటి కొక బడి పంతు లొకటే, వక ప్లీడ రొకటే పుచ్చుకుని పదణాలు చేతిలో పడేశారు. ఇలాగ సరుకు చులాగ్గా విడుదల అయిపోవడమే కాకుండా రెండు గంటలలో వకరూపాయికి యేడణాల లాభం వచ్చింది. అప్పటికి తొమ్మిదయింది. మళ్లీ బజారుకి వెళ్లి ఆరుతువ్వాళ్లూ వకఅంగవస్త్రమూ పుచ్చుకున్నాను. అర్ధణా మిగిలింది. దాన్ని

మాత్రం వూరికే మొయ్యడం యెందుకూ? ఇటూ అటూ చూడగా వకచోట చెక్కాలు కనపడ్డాయి. వర్తకు డర్ధణాకి మూడిచ్చాడు. నాళంవారి సత్రంవద్దిర బల్ల వాళ్లకి మూడూ మూడు కానుల కమ్మేసి మళ్లీ పేట లో పడ్డాను."

"పదకొం డయ్యేటప్పటికి తువ్వాళ్లూ అయి దే సణాల కమ్మేశాను. అంగాస్త్రంమాత్రం వుంది. భోజనంచేసి మళ్లీ వద్దామని యింటికి వెళ్లాను. నాళం వారి సత్రం కనపడేటప్పటికి కాపూట కక్కడే భోం చెయ్యాలని తోచింది. లోపలికి వెళ్లేటప్పటికి గుమాస్తా పద్దులు రాస్తున్నాడు. క్షణం దాటితే లాభం లేకపోవును. సమయం దాటిపోనందుకు సంతోషిస్తూ దగ్గిరికి వెళ్లగా గుమాస్తా నాపేరురాసేసి అటూ ఇటూ చూసిచివరికి "జనం యిద్ద"రని రాసుకున్నాడు. సాధార ణంగా సత్రం గుమాస్తాలు చేసే పనే గాదూ అదీ? అది నే నోరకంటితో చూసి నవ్వుకుంటూ లోపలికి చక్కా పోయాను."

"పన్నిండున్నరకి భోజనం అయింది. అరగంట సేపు సత్రంలోనే పడుకున్నాను. వకటిన్నరకి బయలు దేరి మళ్లీ బజారుకివెళ్లి, పెద్దరకం కొన్నీ, చిన్నరకం కొన్నీ తువ్వాళ్లూ, అంగాస్త్రాలూ కొని మళ్లీ పేటలోకి వెళ్లాను. సాయంత్రం ఆరుగంటలదాకా తిరగ్గా సరు కంతా అయిపోయింది. సొమ్మెమాత్రం చేరిందో లెక్కపెట్టా లని తోచింది గాని నాప్రజ్ఞని మాఅమ్మకి చూపించా లని తొందర పుట్టింది. ఎన్నివిధాల ప్రయ త్నించినా మనస్సు లొంగింది కాదు. కాళ్లలో వణుకు గూడా పుట్టింది. ఇక లాభం లేదని గబగబ యింటికి వెళ్లిపోయాను."

"మధ్యాహ్నం నే నింటికి రాకపోవడంచేత మా అమ్మ చెంగపెట్టుకుని వీథిఅరుగుమీద కూచుంది. ఆవిణ్ణి చూడడంతోటే నా కానందం పొంగిపోయింది. "మధ్యా హ్నం భోజనం చేశావా నాయనా?" అని మాఅమ్మ అడగ్గా "చెబుతాను రా" అంటూ లోపలికి వెళ్లి దీపం దగ్గిర కూచుని సంచి కుమ్మరించాను. లెక్కపెట్టగా అప్పు తెచ్చిన రూపాయి కాక యింకో రూపాయి మూడణాల కాని వుంది. వక్కక్షణందాకా నాకు శరీరం తెలిసిందికాదు. ఏం తప్పా? నాజీవితంలో కళ్లు తెరవని సమయంలో 'హరిఃఓ'మ్మని సంసారబాధ్యత వహించిన మొదటిరోజున—వక్క రూపాయి పెట్టు బడిమీద వర్తకంలో మిగిలిన మొదటి లాభ మది. ఒక సంవత్సరంలో గవర్నరుకి వచ్చే జీతంకంటే గూడా అది విలవయింది. వాస్తవంగా నాజీవితాని కది ఉన్న తి కలిగించిన గొప్ప వరం. దాన్ని తలుచుకుంటే నా కిప్పటికి గూడా ఆనందం పురకలు వేసుకుని—హాయి హాయి! ఎంత సౌఖ్య మోయి! ఇలాంటి అనుభవం లేని వాడి బతు కేం బతు కోయి! ఏం, కష్టంగా వుందా నీకూ? పోనీ తరవాతి కథ విను."

"అప్పుడు మాఅమ్మ ముఖంమీద నృత్యం చేస్తూ వున్న ఆనందజ్యోత్స్నవల్ల నాభవిష్యజ్జీవితం అంతా ప్రకాశమానంగా కనిపించింది. జయలక్ష్మి మందహాసం చేస్తూ నా మెడలో పుష్పమాల వెయ్యడానికి వయ్యారి నడకలతో వస్తూవున్నట్లు కనపడింది. "నాయనా! చదువు లేకపోతే యేమిలే? ఈశ్వరు డిలాగేనా యింత అన్నం పెడితే చాలు. నువ్వొక యింటివాడ వైతే నా కదే పదివేలు. కనడమే కాని మేము నీ కేమీ యివ్వలేకపోయాం. నీరెక్కలు చల్లగా వుండి నాలుగు డబ్బులు సంపాదించుకుంటివా, నలుగురిలోనూ తల యెత్తుకుని తిరగవచ్చు. ఉద్యోగాలకోసం నువ్వు చూడ వద్దు. చివరికి చిల్లరదుకాణం పెట్టుకున్నా నిర్విచారంగా కాలం గడిచిపోతుంది"అని మాఅమ్మ నన్ను ప్రోత్స హించింది. అయితే ఉద్యోగంకోసం సుఖమయ కల్ప నలు చేసుకుంటూ వున్న నీ కిదంతా హాస్యాస్పదంగా కనపడవచ్చు. అవునా పంతులూ? "ఇంటింటికీ తిరిగి గుడ్డ లమ్ముకుని నాలుగు డబ్బులు మిగిలే యని యింత పొంగిపోతా డేమిటిరా. యీయనా?" అని నువ్వు మన స్సులో నవ్వుకుంటున్నావు కదూ? ఎంత పాడయి పోయిం దోయి బ్రాహ్మణవర్ణం! తాలూకాకచేరీలో అటెండరుపనీ, పోలీసుస్టేషనులో కానిస్టేబులుపనీ, కోర్టులో అమీనా పనీ,—ఇంకా యిలాంటి వన్నీ

మెతుచినే అయినా బ్రాహ్మణజాతిమీద యిరెళ్లు రాళ్లు రువ్వా రంటే ఆశ్చర్యమా? "మేం అగ్రకులంవాళ్లం" అంటూనౌకరీల కెగబాకడం గొప్పే కాని బ్రాహ్మలకి చిల్లరవర్తకం నీచకం. అవును. పర్వతశిఖరంమీద "నన్నే చూసుకో" అని వొంటికాలి భరతం ఆడినవాడు కొండలోయల్లో పడిపోవడం ధర్మమే. దాని కేంలే, తరవాత చెప్పనియ్యి."

"మధ్యాహ్నం నే నింటికి వెళ్లకపోవడంచేత నాకోసం వండిన అన్నం మిగిలిపోయిందికాదూ? అది నాకు పెట్టేసి నాఅమ్మ గంజి చేసుకుని తింది. తరవాత యిద్దరమూ ఆమాటా యీమాటా చెప్పుకుని పడుకున్నాం. సగంరాత్రిదాకా నాకు నిద్ర పట్టింది కాదు. తరవాత వొళ్లు తెలవని గాఢనిద్ర పట్టింది."

"తెల్లవారింది. అప్పు తెచ్చిన రూపాయి యిచ్చెయ్యడమా? వుంచుకోవడమా? నాలుగైదు నిమిషాలు ఈవిషయం ఆలోచించాము. నెల్లాళ్ళ వాయిదా వున్నప్పు డెందుకట్టేపెట్టుకో గూడదూ? ఈలోపున ఆవక్కరూపాయీ యింకా యిరవైతొమ్మిది రూపాయీల సరుకు తెస్తుంది. రోజుకి ఒకరూపాయి పావలా లాభం తెచ్చిన రూపాయి అది. అంటే యింకా యెంత తక్కువైనా యిరవైతొమ్మిది కరుకులు పుట్టిస్తుంది. ఇలాంటి లెక్కలు కట్టడం నీకింకా చేతకాదులే. పూరికే విను. చివరి కారూపాయి అట్టేపెట్టుకోడానికే నిశ్చయించుకున్నాను."

"మళ్లీ యెడున్నరకి చద్దన్నం తిని బయలుదేరాను. అప్పటికింకా నిన్న కాతాకలిసిన సాహుకారు కొట్టు తెరవలేదు. ఈపక్కనీ, ఆపక్కనీ మరి కొందరు తెరిచారు. అక్కడి బేరా లెలా వుంటాయో చూద్దామని రెండుమూడు కొట్లకి వెళ్లాను. నాకింకా కుర్రతనం కాదూ? జాతిని పట్టే, వయస్సునిపట్టే, తెలివితేటలు చూసీ, సరకు అమ్మే మన వర్తకులు బేరంలో లొంగుతారూ? మామూలు గడుసుదనపు రాకడ లన్నీ వచ్చారు. కొందరు "మీకు కవక తక్కువ కిస్తాం" అంటూ నిన్న మూడణాల వరకి కొన్నతువ్వాళ్లు పావలాఅర్ధణా కింటగట్టా లని చూశారు. అన్నిధరలూ అలాగే వున్నాయి. వక కొట్టులో రుమాళ్లుమాత్రం చౌకగా కనబడ్డాయి. చాలా అందంగా కూడా వున్నాయి. షోకేలాలూ, కొంచెం నీటుగా వుండా లనుకునేవాళ్లూ చూస్తే విడిచిపెట్టరు. చెన్నపట్నంనుంచి తొలి నాటి సాయంత్రమే వచ్చింది సరుకు. వాట్లని మొదట నేనే చూశాను. జత రూపాయి చెప్పాడు. ఎన్నివిధాల అడిగినా దమ్మిడీకూడా తగ్గలేదు. ఏంచెయ్యనూ? సరుకు చూస్తే కళ్లు మెరిసిపోతున్నాయి. అమ్మా లని వున్న నాకే అలా వుంటే కొనా లనుకునేవాళ్ల కేలా వుండునూ? ఏమయినా సరే అని నాలుగు రుమాళ్లూ, వక అంగావస్త్రమూ పుచ్చుకుని బయలుదేరాను. తొమ్మిదింటికే అవి ఖర్చయిపోయాయి. పదణాలు మిగిలేయి. మళ్లీమళ్లీ కొని మళ్లీమళ్లీ అమ్మాను. ఆరోజంతా రుమాళ్ల బేరమే. మొదటిమాటు శాంపిలుగా మూడు జతల్లు మాత్రమే వచ్చాయి ఆకొట్టుకి. మూడో నాలుగో తప్ప మిక్కిన వన్నీ నేనే అమ్మేశాను. రెండురోజుల పూట కాసరు కయిపోయింది. ఆబేరంలో నాకయిదారు రూపాయలు మిగిలాయి. అవి ఆవక్క కొట్టులో మాత్రమే వుండడంచేతా, అక్కడేనా చాలా కొద్దిగా వుండడంచేతా, పైగా మళ్లీమళ్లీ నేనవే అడగడంచేతా, వకటి రెండుసార్లు సాహుకారు జత వక్కంటికి పావలా దాకా ధర పెంచాడు కాని లేకపోతే నాకింకా నాలుగైదు రూపాయలు మిగిలివుండును. కాకపోతే యేమీ? బేరం లాభసాటిలో వుంది కాని నష్టజాతకంలో లేదు కదూ? నాకదే చాలనుకున్నాను. మళ్లీ సరుకు భారీగా తెప్పించమనీ, చాలామట్టుకి నేనే పుచ్చుకుంటా ననీ అతనితో చెప్పి తరవాత రకం మార్చాను."

"చేతిలోకి పది రూపాయలు చేరాయి. కావలసినంత ధైర్యమూ, ఉత్సాహమూ, బలమూ, కలిగాయి. ఈమాటు వకకొట్టే అన్నమాటేమిటి? నాలుగు కొట్లూ చూశాను. ధరలు కనుక్కుని రాయితీగా యెక్కడవస్తే అక్కడే పుచ్చుకోవడం; ఇక తువ్వాళ్లనీ, రుమాళ్లనీ, అంగావస్త్రాలనీ, వక టేమిటి? ఏవి ఖర్చుపడతా యని

తోస్తే అవీ, వేళ్లలో నాలుగుడబ్బులు మిగులుతా యంటే అవీ, యెవరేని తెమ్మంటే అవీ అమ్మడం మొదలు పెట్టాను. పదిహేనురోజులు అయ్యేటప్పటికి బజారులో అరువు దొరకడమూ, ఎవరేనా అడిగినవి యిమ్మంటే అమ్మకం కాకపోయే యెడల మళ్లీ పుచ్చుకునే పద్ధతీ, మొద లయినాయి. అదివరలో చంకలో యిమిడే మూట బుజం యెక్కడం మొదలయింది. వీథిలో వెళుతూవుంటే చాలామంది "రా, పో" అని పిలవడం మొదలుపెట్టారు. రాజమండ్రిలో —వి శేషించి ఇన్నీసుపేట లోనూ, మొరకవీథినీ, నేను బట్టలవర్తకుణ్ణిగా చెలామణీ కావడం మొద లయింది."

"నెల్లాళ్లు గడిచే టప్పటికి స్త్రీలు రకరకాల రవికల గుడ్డలూ, పరికిణీగుడ్డలూ, చీరలూ, తెమ్మనడం యెక్కువయింది. రెండు మాసాలకి గిరాకీ మరీ పెరిగింది. మూడు మాసాలకి నేను బ్రాహ్మణ్ణనీ, లోవరుసెకండరీ చదివా ననీ, చాలామందికి తెలిసింది. ఆకాలంలో లోవరుసెకండరీ అంటే యిప్పుడు బి.యే. అన్నమాట. అంచేత "నీకిగ తేమిటయ్యా?" అని కొందరడిగేవారు. కొందరు "యోగం యిలా వుం"దని పరామర్శ చేసేవారు. నాకు నవ్వు వచ్చేది. మొదట్లో నేనేదేవాంగినో అనుకుని "ఏమోయి" అన్నవారంతా తరవాత "ఏమండీ!" అనీ, "ఏమయ్యా"అనీ, దగ్గరగల కొందరు చివరికి "పంతులూ" అనీ పిలిచేవారు."

"మొదట్లో నెల్లాళ్ళదాకానే నేను మనిషిదగ్గర మనిషి బేరం చెప్పాను. తరవాత అది తప్పని తెలుసుకున్నాను. కానీ మనిషి తెలివితేటల ననుసరించి వకకోటు అణా మిగిలిన వస్తువులో యింకో కోటు రెండణాలు మిగల వచ్చు. మొత్తానికి లాభం లేకుండా యెవరికీ యివ్వను. కనక మనిషిని పట్టి బేరం చెప్పడం మోసం అని తోచింది. అంచేత తరవాత వక్కటే ధర చెప్పడం మొదలుపెట్టాను. మొదట కొందరికి యిది విసమించింది కాని వోపిక పట్టాను. సంగతంతా చెప్పేటప్పటికి అంతా బాగుం దని సంతోషించారు. ఇలాగ అనిపించుకునే టప్పటికి ఖరారా నెలరోజులు పట్టేంది. ఈనెల్లాళ్ళ కష్టంవల్లా నాకు కలిగిన లాభం యేమి టంటే: తరవాత మాటదింపడం తరవాయి, కావలసిం దేదో చూసుకోవడమూ, ఎంత కావాలో యోచించుకోవడమూ, ఖరీదెంత అయిందో లెక్క చూసుకుని సొమ్మిచ్చి పంపెయ్యడమునూ అంటే నాకు తరవాత బట్టింపు వర్తకం జరిగింది. లాభంకూడా పెరిగింది."

౫

"చెప్పవచ్చిం దేమి టంటే: ఆరు మాసాలలోనూ నాకు సంసారపుఖర్చులుకూడా పోను, నూరు రూపాయలు మిగిలాయి. కోటలో వాగా వేశా ననుకున్నాను. మాఅమ్మకూడా "నాయనా! నెగ్గా" వంది; "లక్ష్మి నిన్ను వరించిం" దంది. నెల కాగానే శ్లష్టరు గారి పెళ్లానికి రూపాయి యిచ్చేశాను. నాసంగతి విని ఆవిడ చాలా సంతోషించి "రూపాయి యిచ్చే దేమి?" టని పుచ్చుకోడాని కంగీకరించింది కాదు గాని చివరికి తప్పింది కాదు. "ఇదంతా మీచలవే" అని నా కృతజ్ఞతని తెలిపి నమస్కరించగా ఆవిడ నోటురాయ నక్కర లేదు. వడ్డీకూడా పని లేదు. నీకు కావలసి నప్పుడు కావలసినంతసొమ్ము చేబదులుగా పట్టుకుని వెళ్ల వచ్చు" నని చెప్పింది".

"పదిమందీ పది రకాలు కోరుతూ వుండడంచేత యిక మూట చాలింది కాదు. అదీ కాక: కొద్దిరోజులలోనే చంకమూటని బుజంమూటగా మార్చేసినవాణ్ణి బుజంమూటని కావిడిగా మార్చెయ్యకపోతే యిక ప్రజ్ఞ యేం వుందీ? అంచేత తరవాత నెలజీతంపద్ధతిని కావిటివాణ్ణి కుదిర్చాను. విన్నావా పంతులూ? నెలజీతంపద్ధతి మీద కావిటివాణ్ణి కుదిర్చాను. ఇప్పుడు నీకుమల్లే నేనప్పుడు నాకనీకోసమే ప్రయత్నించి వుంటే బతికివున్నంత కాలమూ నౌకరుగానే వుండిపోదును. అలా కాకుండా "బ్రాహ్మణజాతిలో పుట్టి దేవాంగిలాగ యింటింటికీ మూటలు మొయ్యడం యేమిటి!" అని కొందరిచేత యీసడింపులు తిన్నా, వోపిక పట్టడంచేత మూడు మాసాలు గడిచేటప్పటికి నాకే వక నౌకరు అవసర మయి నాడు. ఇప్పుడు లెక్కలు రాయడానికి ముగ్గురు గుమా

స్తాలూ, అమ్మకం చెయ్యడానికి నలుగురు సత్రకాయలూ, గోటుపాటులు మోపడానికి కొందరూ, చిల్లర పనులు చేస్తూవుండడానికి యిద్దరు నౌకర్లూ, వీరు కాక యింటివద్గిర నలుగురూ నన్నాశ్రయించుకుని కుటుంబాలు పోషించుకుంటున్నారు."

"ఇది గర్వంతో చెప్పింది కాని, వారిని న్యూనపరచాలని చెప్పింది కాని కాదుసుమా."

"యిక్కడ యింకో సంగతి చెప్పవలసివుంది: స్వార్జితం నూరురూపాయలు నాచేతిలో వుండడం నువ్వెరుగుదువు. మహేంద్రవాడలో నాకో చిన్న స్థలమూ తాటాకుల యిల్లూ వుండేవి. ఇక నేనా వూరు కాపరానికి వెళ్ళినప్పుడు ఫాయిదా నష్టం తప్ప వాట్లవల్ల నాకేం లాభమూ? మాఅమ్మా నేనూ యీసంగతే ఆలోచించాము. వెంటనే పనిచెడి వారంరోజు లక్కడ వుండి అయిదువందల రూపాయల కమ్మేసి వచ్చేశాను. నూరు రూపాయలు సొంత శక్తివల్ల సంపాదించేదాకా మాకాసాహసం కలగలేదు. రాజమండ్రీలో మర్యాదగా కాలం గడపగలమనే ధైర్యం కలిగేక ఇక అదెందుకూ? ఆ అయిదు వందలూ, యీనందా — ఆరు వందలతో చేబోలు శంభుశాస్త్రి వర్తకం పురెక్కింది. ఆమాటు సరాసరి సీమనుంచి సరుకు తెప్పించే మారువాడీతో కాతా కలిపాను."

"ఇక యింటింటికీ వెళ్లి "యేమైనా బట్టలు కావాలా?" అని యెవర్నీ అడగడం లేదు. కావిటివాడు వెనకాల రకరకాల గుడ్డలపేర్లు చెబుతూ కేకవేస్తూ వస్తూవుండగా నేను గుబ్బగొడుగు వేసుకొని ముందు నడుస్తూ వుండడం. ఎవరేనా పిలిస్తే లోపలికి వెళ్లి కావిటివాడు కంబళీ పరిచి మూటలు విప్పగా చూచుని కావలసిన సరు కిచ్చి సొమ్ము పుచ్చుకొని లేవడం. మళ్లీ ముందు నడవడం. కడుపులో చల్ల కదలకుండానూ, ఆందోళనం లేకుండానూ నింపాదిగా తిరిగి సాయంత్రానికి పదిరూపాయలకి తక్కువ లేకుండా అమ్మి మెల్లిగా యింటికి చేరుకునేవాణ్ణి. ఖర్చులన్నీ పోను సకటున రోజుకి రూపాయిన్నర తక్కువ లేకుండా చులాగ్గా కిట్టేది."

"ఇలా సంవత్సరం తిరిగేటప్పటికి వ్యాపారం వెయ్యి రూపాయలికి దాటింది. ఇంకో సంవత్సరానికి రెండు వేలయింది. అయితే కావిటిమీదకి రెండు వేలెందుకూ? ఎంత సరిపోతే అంతే నడుపుదామంటే తక్కిన రూపాయలు పెట్టిలో పెట్టుకుని చూచుంటే యేం లాభమూ? కనక కావిడి విడిచిపెట్టెయ్యాలని తోచింది. ఇక దుకాణం పెట్టాలి. కాని రాజమండ్రీ పెద్ద బజారులో బట్టలకొట్టు పెట్టాలంటే రెండు వేలేమూలకి? కావడికి హెచ్చూ, కొట్టుకి లొచ్చూనూ. గోచీకి పెద్దా, అంగాస్త్రానికి చిన్నా అన్నకాడికి వచ్చింది నావ్యాపారం. ఏమిటి చెయ్యడం?"

"రెండు రోజు లాలోచించాను. "ఇంకా కావిడేమి రేపాటికి కొట్టు పెట్టవయ్యా" అని యిదివరకే మారువాడీ చాలామాట్లన్నాడు. "ఏరోజు అమ్మకం ఆరోజున నా కిచ్చేసేటట్లయితే నాలుగువేలు తెస్తివా పదివేల సరు కిస్తా" అని కూడా రెండు మూడు మాట్లన్నాడు. చేతిలో వున్న రెండు వేలకీ సాయం యింకో రెండువేలు కావాలి. ఎవ రిస్తారూ?"

"పక్కని ప్లీడరుగారి భార్య, సోదెమ్మగారు వుంది కాదూ? ఆవిణ్ణడుగుదామని తోచింది. మాటల్లో పోయి నావర్తకం కావిట్లోకి వచ్చాక — అందులోనూ రెండువేల దాకా పెరిగాక మాఅమ్మకీ ఆవిడకీ వకటే ప్రాణం అయిపోయింది. అస్తమానూ ఆవిడ "మీ అబ్బాయి ప్రయోజకుడండీ. మీరు అదృష్టవంతు లండీ" అనేది మాఅమ్మని. ఇంతే కాకుండా నేనావిణ్ణి "అక్కయ్యగారూ" అనడమూ, నన్నావిడ "సాహుకారు తమ్ముడూ" అనడమూ ఎక్కువైపోయింది. అదనువు ఆధారం చేసుకుని నేనూ మాఅమ్మా వకనాడు వెళ్లి ప్రస్తావన చేశాము. వెంటనే ఆవిడ "ఈమాత్రందానికి ఆలోచనా, బతిమాలడమూ యేమి టండి పిన్నిగారూ? నీకు సందేహం యెందుకు కలిగింది తమ్ముడూ?" అంటూ యినపపెట్టె తెరిచి, "నీకుకావలసినన్ని పుచ్చుకో" అని నాలుగువేల రూపాయల బాంకినోట్లు కట్టలు ముందు పడవేసింది. నా దగ్గిర వుండే రెండు వేలలోనూ అయిదు వందల దాకా సరుకే వుంది కాదూ? అంచేత తలిమ్మా

పదిహేను వందలకి సాయంత్రం నాలుగువేల పూర్తికి ఇరవై అయిదు నోట్లు తీశాను. ఆవిడ "చాలా?" అంది. "ఎప్పుడు కావలిస్తే అప్పుడే అడుగుతా" ననీ, "యిప్పటి కివి చాలు" లనీ, చెప్పగా పెట్టె వేసేసి భర్తదగ్గిరికి వెళ్ళి, "యిరవై అయిదు వందల రూపాయలు మాసాహుకారు తమ్ముడుపేర ఖర్చు రాసుకోండి; నూటికి పదణాల చొప్పున ఫాయిదా. నోటు అక్కర్లేదు. చిఠాలో సంతకం చేస్తాడు" అని చెప్పి వచ్చింది. ఆవిడ అనుగ్రహానికి నేనూ మాఅమ్మా కూడా పొంగిపోయాం. కాదూమరీ? మొదట నావర్తకానికి పెట్టుబడి యిచ్చిందీ ఆవిడే; ఇప్పుడిలాగ పుట్టి పెద్ద లోటు తీర్చిందీ ఆవిడే. అర్థాత్తూ యేమున్నమాటా? నా పురోభివృద్ధికి—నా విజయానికీ ఆవిడ చల్లని చెయ్యే ఆధారం అయింది కాదూ? అలాంటి మా అక్కగారి విషయంలో మే మెంత రుణపడివున్నామో వేరేచెప్పడం యెందుకూ? ఏం చేస్తే నే నామె రుణం తీర్చుకోగలనూ?"

"తరవాత చిఠాలో సంతకం చేసి, నాలుగు వేల రూపాయలూ మారువాడీ దగ్గిర జమ కట్టించి, "కొట్టు చూసుకుని వస్తా"నంటూ బజార్లోకి బయలుదేరాను."

"పంతులూ! నువ్వు దాన్నదృష్టం అను, మ రేమైనా అను: ఒక్కొక్కప్పుడు వరసగా మేళ్లే కలుసుతాయి. నే నిట్టే బజారులోకి వెళ్లేటప్పటికి మొదట నే నే కొట్టులో రూపాయి కయిదు పూర్తులు కొన్నా నో, దాని పక్కని రెండు దినాల్లో ఖాళీ అవుతుం దని తెలిసింది. వెంటనే యజమానితో మాట్లాడగా నెల కెనిమిది రూపాయలు అద్దెకట్టే నాకు ఖాయం చేశాడు. అద్దెచీటీ మూడేళ్లకి రాసుకున్నాం. ఆరెండు రోజులూ యథాప్రకారంగా కావిడితోటే వూళ్లో తిరిగి, యెరిగున్నవా ళ్లందరితోటీ "ఇక కావిడి పట్టించుకొని వూళ్లోకి రా"ననీ, "బజారులో ఫలానాచోట కొట్టు పెడుతున్నా"ననీ, "యేరకం బట్టలు కావలిసి మీరు బజారుకి వచ్చినా మొదట నా కొట్టుకి వచ్చి సరుకూ, ధరలూ, చూసుకోకుండా మరోకొట్టుకి వెళ్ల వ"ద్దనీ, "ఇన్నాళ్ల దాకా నా మీద అనుగ్రహం వుంచిన ట్టికముందు కూడా వుంచా"లనీ చెప్పి వచ్చాను."

౬

"అనుకున్న రోజున కొట్టు ఖాళీ అయింది. సరుకునద్దాను. అదిచూచి మొదటి కాతాదారు "వోయి పిడుగూ! వక్క రూపాయతో నా కొట్టులో కాతా పెట్టి, వర్తకం సాగించి, చివరికి నాకే పెట్టేవూ యెసరు?" అన్నాడు. కాదూ మరీ? అతని కొట్టులో వున్న సరుకు నా సరుకుకంటే గొప్పది కాదు. నాకొట్టులో ముందు వున్న వర్తకుడు చిన్నప ద్దవటంచేత పాపం అతనికి బాధ వుండేది కాదు. ఇప్పుడు పక్కని పెద్దపోటీ తగిలింది. వీధే పోయీవాళ్ల కళ్లు నాలుగురకాలూ పూటుగా వుండడంచేత మొదట నాకొట్టుమీదే పడుతున్నాయి. కాతాలు కలుపుకోవడంకోసం మొదట అందరికంటే కొంచెం చౌకగాకూడా అమ్మసాగాను నేను. ఈకారణాలచేత అత నలా అనడంలో పై పరీక్ష్యం యేమీ లేదు. కాని యెవడి బోరకింవ కెవడు తోడు కోవడం మాన్తాడూ? మనుష్యులలో స్వార్థపరత్వమే లేకపోతే యిక ప్రపంచకమే యేదీ?"

"ఇంకోసంగతి నీతో చెప్పడం మరిచిపోయాను. మారువాడీ ఏరోజు అమ్మకం ఆరోజున తనకి జమ యిమ్మన్నా డన్నాను. జ్ఞాపకంవుందా? అలా అయితే నా సంసారంయెలాజరుగుతుందీ? అక్కగారి బాకీయెలాతీరుతుందీ? చివరికి కొట్టు అద్దె యివ్వడంయెలాగా?మారువాడీతో యీసంగతులు సరుకుపుచ్చుకునేటప్పుడేచెప్పగా "ఏమంటా?"వన్నాడు. నే నింకా భాగ్యవంతులలో చేర లేదుకదూ? ఋణగ్రస్తుణ్ణే కదూ? కనక నెలకి సాతిక రూపాయలకంటే సంసారాని కెక్కువ ఖర్చు చెయ్య కూడ దనుకున్నాను. క్రమంగా నెలకి పదే సణాలు తగ్గినా, సోదెమ్మక్కగారి బాకీ అసల్లో వందా, అసలు కయిన ఫాయిదా పదిహేను రూపాయల పదణాలూ తీర్చా లనుకున్నాను. కొట్టుఅద్దె యెనిమిదిరూపాయలు, చిల్లర ఖర్చులు పది, మొత్తం "నెలకి నూటఅరవై రూపాయలు తీసుకుంటా" ననగా సరే అన్నాడు."

"నెల్లాళ్లు కొత్తగా వుంది. మూడు మాసాలు వెళ్లేటప్పటికి బేరాలు పెరిగాయి. ఆరు మాసాలకి పల్లెటూళ్ల వర్తకుల కాతాలు పెరిగాయి. సంవత్సరం తిరిగేటప్పటికి కొట్టులో తెరిపి వుండేదికాదు. అది మొదలు నేటిదాకా నాకొట్టు అలాగే జరుగుతోంది."

"రెండేళ్లకే అక్కగారి బాకీ తీర్చేశాను. మారువాడీ చిఠాలో జమా ఖర్చూ సరిపోతున్నాయి. చెన్నపట్నంలో కాతాలు కలిసాను. బొంబాయినుంచికూడా సరుకు వస్తోంది. స్వతంత్రుణ్ణయినాను."

"బెంగ తీరింది, "నాయనా! బతికి వున్నందుకు ఫలం కనపడింది. నువ్విస్థితికి రావడంకళ్లతోచూశాను.

నా తండ్రీ! ఇక నాకు విచారం లేదు" అంది మాఅమ్మ. అక్కగారు మెచ్చుకున్నారు. ఆమె భర్తకు అప్పటికి తెలిసింది శంభుశాస్త్రి ప్రయోజకత్వం."

"ఇక నాకు పెళ్ళాం రెక్కడ కమూ? ఇదివరకే కలిగివుంటుంది నీకా సందేహం. అబ్బో! యీకాలం వాళ్ళకి ప్రజ్ఞకంటె ముందు పెళ్ళాం కావాలి. తరవాత నాటకాల్లో తిరిగినా యే ఘోష్టుఘారమో చదువుతున్నా సరే. అంటే అసలు కన్యాదాతలూ నిలవ నిస్తారు టయ్యా యిప్పుడూ? ఇప్పుడు పెళ్ళికొడుకుల తండ్రుల కెంతబింకం వుంటోందో అప్పుడు పెళ్ళికూతుళ్ళ తండ్రులకంత బింకం వుండేది. ఇప్పుడు మొగపిల్లలికి బేరాలు వస్తున్నట్లు అప్పుడు ఆడపిల్లలికి వచ్చేవి. సాంప్రదాయం కలవాళ్ళు మాత్రం కన్యాదానం చేసి "దశపూర్వేషాం, దశాపరేషాం" అని సంతోషించేవారు. డబ్బో యోగ్యతో లేకపోతే అప్పుడు మొగాళ్ళకి పెళ్ళ యీది కాదు. నా యీడువా ళ్లెందరో బ్రహ్మచారులుగా వుండిపోయారు.

"సోదెమ్మ అక్కగారి కొక కూతురూ యిద్దరు కొడుకులూనూ. నాకు యిరవై మూడేళ్లు దాటేటప్పటికి—అంటే నాకూ మాఅమ్మకీ గూడా నాపెళ్లిని గురించి ఆలోచన పుట్టేటప్పటికి, సావిత్రికి పన్నెండేళ్లు నిండాయి. వారికీ కూడా పెళ్లివూహ కలిగింది. వకనాడు మాఅమ్మా, అక్కగారూ కూచుని లోకాభిరామాయణం యెత్తుకోవడంలో. నాపెళ్లిని గురించి మా అమ్మా, సావిత్రి పెళ్లిని గురించి అక్కగారూ ప్రస్తావన చేసుకున్నారట. ఆవేళ ఆసమావేశం ముగిసేటప్పటికి వా రిద్దరూ వియ్యం అందా లనుకున్నారట. ఆరాత్రి మాయింటోనూ, వారి యింటోనూ కూడా ఆలోచనలు జరిగాయి. మర్నాడు పొద్దున్న "మధ్యాహ్నంగా కా కొట్టుకి వెళ్లవ" ద్దని అక్కగారు నాకు కబురు చేశారు. ఎనిమి దయేటప్పటి కా భార్యాభర్త లిద్దరూ వచ్చి మాటలు కలిపారు. తొమ్మిదింటికి నిశ్చయాలూ, పదింటికి ముహూర్తం పెట్టించడమూ, పదకొండింటికి విందులూ అయిపోయాయి. పదిహేను రోజులకి పెళ్లి కూడా అయిపోయింది."

"సావిత్రి కాపరానికి వచ్చేటప్పటికే బజారులో మేడ కట్టేశాను. తరవాత మూడేళ్లకి పేటలో యీమేడ కట్టాను. క్రమంగా మహేంద్రవాడలో రెండు పుట్ల భూమి కొన్నాను. ఇప్పుడు సీమనుంచే సరాసరిగా నాకు సరుకు వస్తుంది."

"నా పెద్దకొడుకు కొట్టుమీద వుంటాడు. నా రెండోకొడుకు గోదామూ, సంసారమూ చూసుకుంటాడు. నా మూడో కొడు కిప్పుడు సీమలో వున్నాడు. అక్కడ వైద్యపరీక్షకి చదువుతున్నా డతను. నాకూతు ళ్లిద్దరూ కాపరాలు చేసుకుంటున్నారు."

"నా పెద్దకోడలు వక యెస్టేటు దివానుగారి కూతురు. రెండో కోడలు మన సబుజడ్జీగారి కూతురే. మూడోవాడి కింకా పెళ్లి కావాలి. నా పెద్దల్లుడు ఏలూరిలో ప్లీడరూ. నాచిన్నల్లుడు నాలాగే—అంటే యింత బట్టలవర్తకమూ చేస్తున్నాడు."

"అదిగో మానాన్నగారి తాంబూరా. వారి ఫోటో లేదు. ఆతాంబూరానే నాపూర్వపు ఆస్తిగా చూసుకుంటున్నాను. అదిగో మాఅమ్మ; నాకేసి నవ్వుతూ యెలా చూస్తోందో చూడు. చిత్రకారుడు జీవకళ లుట్టిపడేటట్టు రాశాడు పాపం. వెయ్యి రూపాయ య లిచ్చా నతనికి."

"ఇదంతా యెందుకు చెప్పానంటే? ఆలోచించు: నీకు ప్రస్తుతం నౌకరీ దొరకడమే కష్టం. దొరకినా వెంటనే స్థిరం కాదు. అయినా పాతిక రూపాయలకంటె యెక్కువ జీతం రాదు. నీజీవితంలో నెలకి వంద రూపాయల జీతం నువ్వు చూడవు. ఎందుకు వెర్రిపడతావూ? ఏదో వర్తకం చేసుకో. డబ్బు లేకపోతే డజ నగ్గిపెట్టెలూ, వంద చుట్టలూ పుచ్చుకొని పొద్దున్న స్టీమర్ల దగ్గిరా, మధ్యాహ్నం కోర్టుల దగ్గిరా, సాయంత్రం సినీమాదగ్గిరా తిరుగు. లేకపోతే వరదారావు హోటలుదగ్గిర కిళ్లీల దుకాణం పెట్టుకో. అదీ కాకపోతే కుట్టుమిషను పెట్టుకుని నాకొట్టుదగ్గిర కూర్చో. మిషను ఖరీదు నేనిచ్చేస్తాను. నువ్వు మళ్లీ యివ్వనక్కర లేదు. అదీ కాకపోతే కావిడుగుడ్డ లేవి కోరితే అవి యిస్తాను; వూళ్లో తిరుగు. దమ్మిడీ పెట్టుబడి అక్కర్లేదు. ఏరోజు లాభం ఆరోజు పట్టుకుపో. మా మేడలో వక మూల వక వసారా, వక గదీ వక చిన్న హాలూ అద్దె లేకుండా యిస్తాను కాపరంవుండు. కష్టపడు. బాగుపడు. అంతేగాని నౌకరీ యిప్పించమని నన్ను వేపకు. నీముఖంలో లక్ష్మీవిహారానికి తగిన తేజస్సు వుంది. నౌకరీలో ప్రవేశించి దాన్ని ధూళిధూసరితం చేసేసికోకు. లే. కాలం గడిచిపోతోంది. త్వరపడు. ఇన్ని చెప్పినా యింకా నీకు నౌకరీమీద వ్యామోహం తగ్గకపోతే వెళ్లిపో. నాయెదుట వుండకు."



మున్నంగి లక్ష్మీనరసింహ శర్మగారు



# రాజపుత్త్రులు

కను లెఱ్ఱఁజేసి యుగ్రముగ జూఁచినఁ జాలు
జోడుగుండ్లతుపాకు లోడవలయు;
బిఱుసుమీసలు పెనవెట్టి నిల్చినఁ జాలు
నుక్కుబాకుల కొక్కుఁ దక్కవలయు;
తొడగొట్టి కన్బొమల్ ముడివెట్టినం జాలు
నరిత్రాడు తెగి విల్లు విఱుగవలయు;
వెడఁద ఱొమ్మిచ్చి కుప్పించి దూఁకినఁ జాలు
కోటతల్పులగుట్ట గూలవలయు;
తెఱలి "దీన్ హరహరమహాదేవ" యని ర
ణాంగణమ్మున రౌద్రనాట్య మ్మొనర్చు
తరణి కులదీపకులు క్షాత్త్రధర్మరతులు
రాజపుత్త్రులు సతము "శ్రీరామరక్ష."



# ఆంధ్రులు

వినువీథి నంటి పర్వెడు పుల్గుగమి గుఱి
పెట్టి కోలను బడఁగొట్టువారు;
అలికిడిఁగట్టి బెబ్బులినెన్నుదురు మీఁదఁ
బాంచి తుపాకిఁ బ్రేలించువారు;
అడుగులజాడ వెన్నాడించి యడవిమె
కాలతోఁ జేఁజేయిఁ గలుపువారు;
ఆఁకొన్న సింగాల యనువున ననిఁ జొచ్చి
యరుల నల్లవసంత మాడువారు;
నాడు బీడు, బీడు నాడు సేయ సమర్థు
లాత్మదేశభక్తు లాంధ్రసుతులు
వెలమ రెడ్డి కమ్మ తెలఁగ దేశముఖులు
మనకుఁ బాళెగాండ్రు మన్నె దొరలు.






ఇది నిజముగా జరిగిన కథ; చిన్నదే యయ్యును, పెద్దవారికిని నీతిబోధకము.

నా క్రొత్త బంగారువాచీ మంచి ఛేపైనది; అది పదునెనిమిది నెలలు బహు ప్రశస్తముగా పనిచేసెను: ఒక్కనాఁడైనను నిలిచిపోలేదు; ఒక్క నిమిషమైనను వేళ హెచ్చుతగ్గులు చూపలేదు; ఒక్కమరమైనను చెడలేదు. వేళ తెలుపుటయందు సూర్యుఁడైనను పొరపడవచ్చునేమో కాని యది తప్పు నడుచుట యసంభవమనియు, సూర్యుఁడు లోకమున నున్నంత కాలమును విఱుగు తఱుగు లెఱుఁగక యది శాశ్వతముగా నుండుననియు నాకు దృఢవిశ్వాసము కలిగినది.

కర్మముచాలక యొకనాఁటిరాత్రి నేను దానిని త్రిప్పుట మఱచినాను. ప్రొద్దుట లేచి వాచీ చూచుకొనఁగానే మనస్సు గతుక్కుమని నాకు భీతుకుపుట్టినది. కొంత గుండెనిబ్బరము తెచ్చుకొని, వాచీ త్రిప్పి, యూహామీఁద దాదాపుగా సరియైన వేళ పెట్టి, మఱి ఫరవా లేదని మనస్సు సముదాయించుకొన్నాను.

సరిగా వేళ దిద్దుకొనవలె నన్నయుద్దేశముతో మఱునాఁటి ప్రొద్దుటనే యొక వాచీ మరమ్మతుదారు కొట్టులోనికి నే నడుగుపెట్టితిని. కుడికాలు ముందు పెట్టితినో యెడమకాలే పెట్టితినో, యది వర్జ్యసమయ మగునో కాదో నేను చెప్పలేను. కొట్టుపెద్ద నాచేతిలోనివాచీ తీసికొని వేళ దిద్దినాఁడు. దిద్ది యతఁడు నాతో, "నాలుగునిమిషములు వెనుకఁబడినది; నడక ముల్లు ముందుకు త్రోయవలెను." అన్నాడు. వలదని నివారించుటకు బహుతరముగా ప్రయత్నించినాను; వాచీ స రి గా నే న డు చు చున్న దని యనేక విధముల చెప్పి చూచినాను. ఏమి చేసినను, లాభము లేకపోయెను. ఆ శుద్ధబుద్ధావతారమునకు బోధపడిన దొ

క్కటినే : వాచీ వెనుకఁబడినది; నడకముల్లు ముందునకు త్రోయవలెను. ఎదుట నిలువఁబడి యేడ్చుచు నేను మొత్తుకొన్నను వినిపించు కొనక, యారాతిగుండె కిరాతుఁడు దయా దాక్షిణ్యములుమాని, తాను చేయఁ దలఁచు కొన్న పని తొణకక బెణఁకక నెమ్మదిగాఁ జేసి నాఁడు. అది మొదలు నావాచీ వేగముగా నడుచుచు, హెచ్చువేళ చూప నారంభించినది; దినదినమునకు దానినడక మఱింత మఱింత హెచ్చఁజొచ్చెను. వారము దినములైన సరికి తీవ్రమైన జ్వరముతోడి యుద్వేగము కలిగి, నాడి నిముసమునకు నూటయేఁబది కొట్టుకొను చుండెను. రెండు నెలలకు పట్టణమందలి తక్కినవాచీలును గడియారములును పూర్తి గా వెనుకఁబడినవి; వాని నన్నిటిని విడిచి, యది బేగీరావడుగులతో పదు నైదుదినములు ముందుకు నడుచుకొని పోయినది.

పంచాంగమునుబట్టి పండు వెన్నెలతోడి నిండుపున్నమ యుండవలసిన



కాలమున, నావాచీ కన్నులు కనిపించని యమావాస్య కటికిచీఁకటిలోనికి కాలుపెట్టుచుండెను. ఋతువులు తాఱుమాఱై శరత్కాలమున హేమంతము చొరఁబడినది. ఇంటియద్దెలు, వృత్తిపన్నులు, నౌకరుల జీతములువగైరాలు ముందుగా చెల్లించుకొనవలసివచ్చెను.

అందువలన దివాలా తీయవలసిన గతి పట్టునేమో యని జడిసి, వాచీ నడక సరిచేయించుటకై మఱొకమరమ్మతుదారు కడకు వెళ్లినాను. 'ఎప్పుడైనను మరమ్మతు చేయించినావా' యని యతఁ డడిగినాఁడు. ఎన్నఁడును మరమ్మతు కోరలేదని నేను మాఱుపలికినాను. దుమ్ముచూచిన నక్కకువలెనే యతనికినోరూఱినది. తొందరతో వాచీ వెనుకడిప్ప విప్పి, యేదో చిన్నగొట్టము కంటికి తగిలించుకొని, యతఁడు దాని మఱలలోనికి మఱల మరల చూపులు నిగిడ్చి, 'నడకముల్లు వెనుకకు త్రోయుపనియే కాక మఱలు శుభ్రపఱుచుటయు, చమురెక్కించుటయు నవసరము, వారముదినములకు రావలసిన' దని చెప్పినాఁడు.

మరమ్మతుతరువాత వాచీనడక తగ్గి, తక్కువ వేళ చూప నారంభించినది; కునికిపాట్లు పడు చున్నట్లే యది యిప్పుడుకొట్టుకొనఁజొచ్చెను. అందుమూలమున నాకు భోజనవేళ యతిక్ర మించుటయు, రెయిలుబండ్లు తప్పుటయు, నా దావాలు నాపరోక్షమున నాకు విరుద్ధముగా కోర్టువారుతీర్పు చెప్పుటయు జరుగుచువచ్చెను. క్రమక్రమముగా నేను నిన్నటిదినము లోనికి, తరువాత మొన్నటిలోనికి, అటుతరువాత



గతవారములోనికి దిగఁబడినాను. తుదకు, లోకమంతయు నాదృష్టిపథమునుండి దాఁటిపోవఁగా, నేనొక్కఁడనే తోడు నీడలేక వెనుకఁబడి, గత మాసములో దేవులాడుచున్నా నన్న యూహ నాకు కలిగినది.

ఇక్ష్వాకు బారసాలనాఁటివాఁడ ననియు, మాంధాతతో మైత్రి చేసిన నాఁడననియు, నాగుఱించి నాకనుమానములు పుట్టసాగెను.

బాగులేదని వాచీ పట్టుకొని, మఱొక మరమ్మతుదారుకడకు వెళ్లినాను. నా సమక్ష మందే యతఁడు దానిని పూర్తిగా విడఁదీసి కుప్పపోసి, యేదోగొట్టము బిగిసినదని చెప్పి, మూఁడుదినములలో బాగుచేయఁగల నన్నాఁడు. అతఁడు బాగుచేసినపిమ్మట వేళ మొత్తము మీఁద సరిపోవు తప్ప, అంతకంటె హెచ్చు లాభము కలుగలేదు. అర్ధదినము వఱకును



దాని కిప్పుడు మెయిలుబండి పరుగులాగున వెఱ్ఱిపరుగు; పరుగున్నంతసేపును, మఱి యే విషయమును మనస్సునకు తోఁచనీయకుండ



కుక్క మొఱుగులు, పందిఘుర్ఘురింపులు, గాడిద సకిలింపులును కలిసి లోపటినుండి వచ్చుచున్నట్లు ధ్వనులు. ఆ పరుగులో ప్రపంచ మందలి యేవాచీయు దానితో పందెము కట్టఁగలుగుట వట్టిది. ఆ తరువాత, తక్కిన యర్ధ దినమున అది యంతకంతకును నడక తగ్గించి, త—గ్గిం—చి, త——గ్గిం——చి, పెండ్లినడకలను, చీమనడకలను మించి, వెనుకఁబడ్డ వాచీల నన్నిటిని మరల తన్ను కలిసికొననిచ్చి, దిన ప్రమాణ మిరువదినాలుగు గంటలును పూర్తి యగుసరికి నెమ్మదిగా నియమిత స్థానమును చేరుకొని, టక్కున నిలుచును. సగటున సరియైనవేళ యే యది నడిచిన దన్నందుకు సందేహము లేదు; ఏదినమున చేయవలసిన పని యాదినమున పూర్తిగా చేయలేదని దాని యందు దోషము నిరూపించుటకు వీలు లేకుండెను. కాని, మొత్తముమీఁద దినమున కిరువదినాలుగు గంటలు నడిచినది వాచీ యనుట వలన ప్రయోజనము లేదు.

అట్టి సగటువేళతో తృప్తి పొందక, మఱొక మరమ్మతుదారుకడకు వాచీ మోసికొని పోయితిని. పెద్దసీల విఱిగిన దని యతఁడన్నాఁడు. అంతేగదా యన్నాను నేను. నిజమునకు పెద్దసీల యనఁగా నేమో నాకు తెలియదు; కాని, యపరిచితునియొద్ద నాయజ్ఞానము వెల్లడించుట నాకు సమ్మతమైనది కాదు. పెద్దసీల యతఁడు మరమ్మతు చేసినాఁడు. ఆ విషయమున నేమో వాచీ బాగుపడినది గాని, మఱియొకవిషయమునమాత్రము చెడినది. ఇప్పుడుదానికి కలిగినరోగ మేమనఁగా, అది కొంత సేపు నడుచును; కొంత సేపు మానును; మరల కొంత సేపు నడుచును; మరల కొంత సేపుమానును: ఇదే పద్ధతి. ఎప్పుడు నడుచుటో, యాఁగుటయెప్పుడో, దానిచిత్తము నా భాగ్యము. నడక మొదలైనప్పుడెల్ల గాడిద తాఁపువంటి



వెనుకతాఁపుమాత్రము తప్పదు. అదురుగుండెకు తగులకుండ గుడ్డముక్కలు కొన్ని జేబులో క్రుక్కుకొని కొన్నాళ్లు కాలక్షేపము చేసినాను.

చివరికి మఱి భరింపలేక మఱొక మరమ్మతుదారు కడకు పోయితిని. అతఁడును యంత్రములన్నియు విప్పి కుప్పపోసి, భూతదర్పణముతో వాని నన్నిటిని సావకాశముగా పరిశీలించి— వెండ్రుక బిస యఁట!— యది యేదో కొంత పాడయినట్లున్న దని చెప్పినాఁడు. అది బాగుచేసి యతఁడు వాచీకి పునర్జీవము పోసెను. ఈమాఱు మఱి నడకలో హెచ్చుతగ్గులేమియు లేకుండ వాచీ సరిగా పని చేయ సాగినది; కాని, పదిగంటలకు పది నిమి

షము లున్నదనఁగా గంటలముల్లును, నిమిష



ములముల్లును జగత్పితలగు పార్వతీ పరమేశ్వరుల లాగున విడఁదీయరాని యంత గట్టిగా నొకదాని కొకటి యంటుకొని, యక్కడనుండి రెండుముండ్లును కలిసి నడుచుచుండెను. వాచీ చూచి మహాగణిత శాస్త్రవేత్తలును గంట లెన్నియని కాని, నిమిషము లెన్నియని కాని చెప్పలేకుండిరి. ముండ్లుండియు లేనియట్లే యైనది; అంధుని ముఖమందలి సులోచనము వలె నవి యలంకారమాత్రములు.

తలయు తోఁకయులేని యీ యసందర్భపుస్థితి తొలఁగించు నూహతో మఱొక మరమ్మతుదారుకడకు నేను వెళ్లవలసి వచ్చినది. పెద్దముల్లు వంకరపోయినదనియు, ముఖ్య యంత్రము తిన్నఁగా లేదనియు, మొత్తము మీఁద మఱలన్నియు మరమ్మతు చేయవలసి యున్నదనియు నతఁడు చెప్పినాఁడు. చెప్పిన మరమ్మతులన్నియు నతఁడు చేసిన వెంటనే నా వాచీ బహుదివ్యముగా నడచెననుటకు సందేహము లేదు. కాని, యావిధమున తొమ్మిది పదిగంటలు నడిచినతరువాత, అజీర్ణముచేసిన వానికడుపులోవలె వాచీలో నేదో గందరగోళ మారంభమై, తుమ్మెదల ఝుంకారము వంటి ఝుం౦౦౦౦౦ మను శబ్దము బయలుదేఱి, ముండ్లు రెండును పరస్పరభేదము తెలియరాని యట్లు గిరగిర గిరగిర శరవేగమున తిరిగి, వాచీమీఁద సన్నని దారములతో సాలె



పురుగు పట్టు పెట్టినట్లయ్యెను.

ఆవిధముగా నిరువదినాలుగు గంటలును నాలుగునిమిషములలో పూర్తిచేసి ఢమ్మను ధ్వనితో దడాలున వాచీ యాఁగినది.

కాళ్లీడ్చుకొని, కడసారి ప్రయత్నముగా మఱొక క్రొత్తమరమ్మతుదారు కడకు పోయితిని. అతఁడు దానిని విప్పి కుప్పపోయుచుండఁగా, నాయూహలు క్రొత్తదారి త్రొక్కినవి. వాచీకొన్నధర నూటయిగువది రూపాయలు; మరమ్మతులక్రింద మఱి రెండుమూఁడు వందలైనవి; వీనిముఖము! వీఁడుమాత్రము బాగు

చేయఁగలడా? ఇట్లనుకొనుచు పరధ్యాన ముగా నే నాక్రొత్తవాని ముఖముమీఁద చూపులు నిలిపినాను. వానిది క్రొత్తమొగముకాదని నాకు తటాలున తోఁచినది. నిదానించి వెనుకటివారివలెనే యంత్రపరీక్ష చేసి, చిట్లింపుమొగముతో చిత్రికపని దాని కవసరమన్నాడు. ఒళ్లుమండి, వానిచేతిలోనివాచి దడాలున లాగుకొని, దానిని వానిమొగము మీఁద వేసికొట్టినాను. క్రిందపడి వాచీగుండ పిండియయినది. దానితో శనియు విఱుగడ యైనది. నాకు వాచీ గొడవలేకనిర్వాచీగా నున్నా నిప్పుడు.



కుల వృత్తులలో పనికిరాక స్వగ్రామము లువిడిచి వెళ్లిన కంచరులు, కమ్మరులు, వడ్రంగులు, రాతిపనివారు, టిన్ను రేకుపనివారు, వగైరా లందఱు నేమగుచున్నా రన్న సమస్యకు చిరకాలమునుండి నాకు సమాధానము దొరకక కొట్టుకొనుచుంటిని. ఇప్పుడు తెలిసినది.

పరికింపఁగా, మాయింటి వద్ద పుపన్నికై యొక ప్పుడు వచ్చి పని చేఁతకానివాఁడని నేను తగిలివేసినవాఁడే యీ వాచీ మరమ్మతుదారన్న నమ్మకము నాకు కలిగెను. వాఁడును



[చిత్రకారుఁడు: కే. యమ్. రత్నవేలుమొదలియాఁరుగారు, విశాఖపట్టణము.]

# ప్రాచీనభారతీయచిత్రకళ-మొగలుచక్రవర్తులయుద్ధచిత్రములు



౧ యుద్ధారంభము



౨. చిత్తూరు(రాజపుటానా)ముట్టడిలో మందుగస్పేలుటచే ధ్వంసమయిన బురుజు—ఎడమవైపు

# కైక

శ్రీమతి ఆ. భాస్కరమ్మగారు

అయోధ్యాపట్టణ మంతయు సదావడిగా నున్నది. వీథులను బాగుచేయువారు, బాగుచేసిన వీథులలో పందిళ్లు వేయువారు, సిద్ధమయిన పందిళ్లకు తోరణములను, పందిరి స్తంభములకు కొబ్బరి యాకులను గట్టువారు, నా స్తంభములకు నరటిబోదెలు నాటువారు, గోడలకు వెల్లలు వేయువారు, వెల్లలు వేయబడిన గోడలమీద చిత్తరువులను చిత్రించువారు, తలుపులు మొదలగువానికి రంగులువేయువారు, నగరమునంతను శృంగారించువారు నై యాపురవాసులందఱు నూపిరి త్రిప్పుకొనుటకైన తీరిక లేకయుండిరి. పట్టణమే యిట్లుండగ నిక రాజనగరుసంగతి సందడి చెప్పుట కలదియా? ఏమూల జూచినను పచ్చల తోరణములను గట్టువారే; యేవంక దిలకించినను ముత్యపుసరుల గ్రుచ్చువారే; ఏతట్టు పరికించినను జిత్రవిచిత్రములను చిత్తరువుల నిర్మించువారే; ఏదిక్కు సాగాంచినను ముత్యములలో చిత్రవిచిత్రములగు ముగ్గులను దీర్చువారే. అందరు నతితొందరతో పనులు చేయుచుండిరి.

పట్టణమంతయు నిట్టి సందడిలో నుండెను. కాని యెందుచేతనో రామునకుమాత్ర మేమియు తోచుటలేదు. సందడి యెక్కువయినకొలది, దినములు సమీపించుకొలది, రామునకుపరితాప మధికమగుచున్నది. ఏదియో చేయబోవును; చేయలేక వెనుకకు మరలును. సాయంకాల మిక రెండుగడియల ప్రొద్దున్నది. రామున కింట నేమియు తోచుటలేదు. ఉద్యానవనములోనికి వచ్చెను; నిర్మానుష్యమగు, నిశ్చలమగు, శాంతిప్రదమగు నొకలతామంటపమున నొకచంద్రకాంత శిలావేదికపై నధివసించెను; ఈక్రిందివిధముగా నాలోచింప బ్రారంభించెను: "రేపు తెల్లుండేనా నా పట్టాభిషేక మహోత్సవము? ఎంత త్వరలో సమీపించినది? ఇప్పుడు నేచేయబోవు పనియేమి? నే నీలోకమున నెందుకొఱకు జన్మించితిని? నాపూర్వజులవలె సింహాసనాధిష్ఠితుడనై భోగముల ననుభవించుటకేనా? లేక దుష్టరాక్షస సంహార మొనర్చి లోకము నుద్ధరించుటకా? పట్టాభిషిక్తుడనైనచో నాకీకార్యము సాధ్యమేనా? కాదు. ఎంతమాత్రము కాదు. రాజకార్య ధురంధరత్వ మవలంబించినపిమ్మట నిక నీవిషయమై యాలోచించుటకైన తీరిక యుండునా? దుర్మార్గులగు ఖరదూషణాదులు, క్రూరాత్ములగు రావణాదులు ఋషుల సమీపమున నున్నారా? అక్కడనే కొందఱు నక్కడనే కొందఱుగా నీయయోధ్య మొదలు కన్యాకుమారి యగ్రమువఱకు వ్యాపించియున్న దండకారణ్య మంతయు నాక్రమించుకొని యున్నారు. రావణుడు సింహళములో నున్నాడని విన్నాను. వీరినందఱ దునుముట్టింపవలయు నన్న నొకదినములోను, రెండుదినములలోను తీరు పనియా? కొన్ని నెలలు సరిపోవునా? దండకారణ్య మంతయు సంచారముచేయవలయును. కొన్ని సంవత్సరము



లందు గడపవలయును. రాక్షసులనందఱ నెవరినెవరి చంపవలయును. రాజ్యము బట్టుట సామాన్యవిషయము కాదు. అతి మహత్ప్రజ్ఞాసంయుతుడు. బ్రహ్మను, శివుని వేడి యనేకవరములను బడసెను. దేవేంద్రాదిదేవతల నందఱ బారద్రోలి స్వర్గమునుగూడ నాక్రమించుకొనె ను. అట్టివాడు సామాన్యముగా జిక్కునా? ఇవి యను కొన్న చిక్కులు. ఇవిగాక తీరా పనిలో బ్రవేశించిన తర్వాత తెలియరానికష్టము లింకా యెన్నికలుగునో యెవరికెఱుక? ఆయడవులలో నెంతకాలము సంచార మొనర్పవలయునో? ఈవిషయము తండ్రిగారితో జెప్పిన యాయన యంగీకరించునా? పిల్లలకొఱకు పరితపించి పరితపించి, యెన్నియో యుపవాసములు చేసి, వ్రతములు సల్పి, తుదకు పుత్రకామేష్టి యొనర్పగా గలిగిన సుతు లము మేము. నాతోబుట్టువులలో తండ్రిగారికి జ్యేష్ఠుడ నగుటచేత నామీద నపరిమితప్రేమ. అట్టి నన్నొక క్షణ మయిన నెడబాయుట కాయన యొప్పుకొనరు. పోనీ, ఆయనతో సవినయముగ, వెళ్లుచున్న నేను లోకమున కాదర్శపురుషు డెట్లుండవలయునో నేనే యాదర్శప్రాయు డనుగా నుండి చూపవలయునను ముఖ్యోద్దేశము గల వాడ నగుటచే పితరుల యనుజ్ఞ లేకుండ నేకార్యమును జేయజాలను. ఈవిషయములో నాకు సహాయపడువా రెవరు? తండ్రిగా రట్టివారు. అమ్మ, సుమిత్రా సాయ పడుదురేమో యనిన వారు సామాన్యస్త్రీలేకాని విశేష జ్ఞానవతులు కారు. వారికి గూడ స్వార్థపరత్వమే కాని పరోపకారచింత యించుకయును లేదు. పుత్రమోహ మమితము. వారేమియును జేయ జాలరు. ఇక మిగిలినవా రెవరు? కైక.

ఈమె అసామాన్యప్రజ్ఞాధురంధరురాలు; అఖండ విద్యావతి: సామాన్యవిద్యలలోనేకాక ధనుర్విద్యాదిసమర విద్యలలో గూడ ప్రవీణ. కొన్నికొన్ని సందర్భములలో సమరవిద్యాకోవిదులగు పురుషపుంగవులుగూడ నీమె ముందు పనికిరారు. ఈమె తండ్రియగు కేకయరాజు నకు పుత్రులు లేమికతన నీ పుత్రికయందు ప్రేమ మిక్కు టము. అందువలన నీపుత్రికను సామాన్యస్త్రీలవలె స్త్రీలకు గావలసిన సాహిత్య చిత్రకళా నృత్యగానాది విద్యలలోనే కాక తనపుత్రులతోపాటు పురుషులకు గావలసిన అశ్వపుస్వారి, రథము నడపుట, యుద్ధము చేయుట మొదలగు యుద్ధవిద్యలలోగూడ ప్రవీణు రాలిగ జేసెను. అందఱిలో కైక యెక్కువ సూక్ష్మ జ్ఞానము గలదగుటచేతను, ఆలోచనాపరురా లగుట చేతను తండ్రి కామెయం దధికానురాగము.

ఆమెసౌందర్యము నిరుపమానము. సౌందర్యము నకు దగినవిద్య; విద్యకు దగినబుద్ధి. తనలోగల యా మానుషశక్తులచేత భర్తను పూర్తిగా దనకు బద్ధునిగా జేసికొనినది. నాతండ్రి కామె చెప్పినదే మాట; ఆమె గీసి నదే గీటు. ఇది యిట్లుండ దేవతలకు సాహాయ్యముగా రాక్షససంహారమునకు దాను బోయినప్పుడు కైకకూడ నాతనికి సహాయముగా వెళ్లినది. ఆయుద్ధములో నొకా నొకసందిగ్ధసమయమున దశరథునకేమియు నుపాయము తోచలేదు. సైనికులందఱు నిర్ఘాంతులై నిలుచబడిపోయి రి. రాక్షసులందఱు నొక్కపెట్టున మీద బడనుండిరి. క్షణములో మెఱుపువలె నాపినతల్లి రథము నతిచమత్కా రముగా నడపి భర్తకు జయము నేకూర్చెను. అప్పటి యామె సమయోచితబుద్ధి, యుద్ధనిపుణత వర్ణింపదగినవి. ఆమె యద్భుతశక్తికి మెచ్చి సంతోషము బట్టజాలక నాతండ్రి యామెతో, 'రెండువరము లడుగుము. అవి యెట్టివైనను దప్పక యొసంగెద' నని చెప్పెను. అప్పుడు కైక—'నాథా! మీరు వరము లొసగుటకు నేనొనర్చిన ఘనకార్య మేమి? భార్యకు భర్త, భర్తకు భార్య సాయ పడుట లోకవిశేషమా? ఇందు నే నెవరి కేమియుపకార మొనర్చితిని? నాయర్ధశరీరమును గాపాడుకొంటిని. అం దువలన శరీరమంతయు నేబాధయు లేకుండ పరిపూర్ణ సౌఖ్యములో నుండుటయే వరము. అంతకన్న వేరేమి కావలయును?' అని పలికినదే! ఆహా! ఏమి! ఆమె సౌభాగ్యత! తల్లీ, నీసౌభాగ్యతయంతయు నీ యీయొక్క మాటలో ప్రకటితమగుచున్నది. అదిమొదలు నాతండ్రి కామె దేవివలె గాన్పించుచున్నది. ఆమె యందు నమిత మగుప్రేమమాత్రమే కాదు: గౌరవము, భయముగూడ గలవు. ఒక్కొక్కప్పు డామెప్రజ్ఞ ముందును, బుద్ధిముం

మనుతనప్రజ్ఞయు, రాజకార్యధురీణతయు నెందుకని యనుకొనుచుందును. ఆమె సలహా లేనిదే నేకార్యమును నెఱవేర్పను. ఆమెను జూచిన నాకును నట్లే తోచును. ఆమె స్త్రీయైనను ఆమెహృదయము తక్కిన స్త్రీహృదయములవలె సంకుచితముగాదు; అతివిశాలము. అది యామెస్వభావమో, విద్యాప్రభావమో చెప్పజాల. ఆమెకు నాయందెంత ప్రేమ! సవతికొమారుడనను నీర్ష్య యించుకంతయు లేదుకదా! తనకన్న పుత్రునకు భరతునికంటె నన్నే యెక్కుడుగా ప్రేమించును; గౌరవము చూపును. పెక్కుసారులు నన్ను తేరిపాఱజూచి, 'రామా! నీయందేదో తేజము ప్రకాశించుచున్నది. అద్భుతశక్తి కానఁగట్టుచున్నది. నీవు సామాన్యరాజులవలె రాజ్యము చేయుటకేర్పడినట్లు తోచుటలేదు. లోకమునంతను నుద్ధరింప నవతరించినవానివలె గన్పట్టుచున్నావు. లోకములను రాక్షసబాధ తొలగింప నీవే సమర్థుండవు' అని యనుచుండును. నా ప్రయత్నములో నామె యేమయిన దోడ్పడునేమో కనుగొందుగాక!"

## ౨

సంధ్యారాగము లెల్లెడల నల్లుకొను చుండెను. ఆ సంధ్యారాగములమధ్య నయోధ్యాపురివైభవము ద్విగుణీకృత మగుచుండెను. ఆపట్టణమున నానందమయమున సౌందర్యదేవత తాండవమాడుచుండెను. అట్టి సంతోషసమయమున, నాసౌందర్యరాశి మధ్యమున నొకచలువరాతి సౌధముపై సర్వాంగసుందరియగు నొకసుందరి తనగంభీర దృక్కుల నలుదెసల బర్వజేయుచు నిలుచుండియుండెను. ఆమెముఖచంద్రబింబ మతిగంభీరముగను, నేదియో యాలోచనతో గూడినదిగను నుండెను. మధ్యమధ్య నది మేఘావృత మగుచుండెను. ఆమె యేదో సందిగ్ధావస్థలో దను ల్వడి తెంపుగానక యవస్థపడుచున్నట్లు కనబడు చుండెను. ఆసమయములో లోకమంతయు, ముఖ్యముగా నాపట్టణవాసులు, నానందసాగరమున నోలలాడుచుండ, సౌఖ్యవారాశి మునుకలువేయుచుండ, సౌందర్యదేవతా సన్నిధానమున తాండవమాడుచుండ, [illegible] కోరికలతో నృత్యించుచుండ, నామె యొక్కతె యిట్టి సందిగ్ధావస్థలో బాధపడుచుండుటకు కారణము తెలియరాదు.

రాముడు నటకు వచ్చెను. "అమ్మా! ఏదియో దీర్ఘాలోచనలో మునిగియున్నదానివలె గాన్పించుచున్నావు. ఏమి యాలోచించుచుంటివి?"

కైక:—రామా, వచ్చితివా? పట్టాభిషేకమహోత్సవశృంగారము లన్నియు బూర్తియైనవా? రేపు తెల్లుండేకదా నీపట్టాభిషేకము? ఇకనుండి నీ కిప్పటివలె స్వేచ్ఛగా సంచరించుట కవకాశ ముండదు కాబోలు. రాజుగా నిక రాజకీయవ్యవహారములలో దగుల్కొని ప్రపంచముమాటయే మఱచిపోదు రనుకొనెదను.

రాముడు:—అమ్మా, అట్లెన్నటికి దలంపకుము. నే నెందుకొఱకై యీలోకమున జన్మించితినో, నాయుద్దేశ మేమో యావిషయమై నీతో మాట్లాడుటకే యిప్పుడిక్కడకు వచ్చితిని. నా కాలోచన చెప్పుదానవు,



నా కార్యములలో ప్రోత్సాహము చేయుదానవు, నాకు సహాయపడు దానవు నీవుగాక వేరొకరు లేరు.

కైక:—కుమారా, నీకు నే నెట్టి సాయము నొనర్పగలను? ఏదేని చేయగలిగినచో, నాబిడ్డకొఱకై, యంతకన్న నెక్కుడుగా లోకముకొఱకై, దేశముకొఱకై, నాప్రాణ మర్పింపనున్నను, తప్పక యర్పించుదాన. కాని, కుమారా! శూరుడవు, పరాక్రమశాలివి, దేశోద్ధారకుడవు, లోకరక్షకుడవు, దేవతాంశ సంభూతునివలె గన్పట్టుచున్నావు: నీకు నే నెట్టిసాయ మొనర్పగలను?

రాముడు:—అమ్మా, నీవు మొదట వాగ్దాన మొనర్చితివి. నీచేతిలోని సాయము నేనే కోరెదను. నీవు మాట దిరుగ రాదుసుమా.

కైక:—కుమారా! చెప్పుము.

రాముడు:—తల్లీ! పసితనమునుండి నాలోనిశక్తిని గ్రహించినదానవు నీవొక్కతెవుమాత్రమే అని నేను దృఢముగా జెప్పగలను. నాన్నగారికి, అమ్మకు నామీద నమితానురాగము. వారి పుత్రవ్యామోహ మసామాన్యము. ఆమోహాంధకారముచే వారి కేమియు గనుపడదు. నే నతిసుకుమారుడననియు, నడచిన కందిపోదునేమో యనియు నన్నతి గారాబముతో చూచుకొనుచుందురు. నన్నొక్కడను కదలనీయరు. తాటకాసంహారమునకు నన్ను గొనిపోవ విశ్వామిత్రుడు వచ్చి యడిగినప్పుడు చూచితివా ఎంత పరితాపపడిరో! కుఱ్ఱవాడగు రాము డేమి చేయగల డనియు, నేనే వచ్చెద ననియు జెప్పిరి. వృద్ధులగు తమకు ఆమాయలమారి తాటకను సంహరించుట తరమా? పరశురామునితో నేను పోరుచున్నప్పు డాయనపడ్డ యాతురత, పరితాపమూ తలచుకొనిన నిప్పుడుకూడ నవ్వు వచ్చుచున్నది. నాన్నగారే యట్లున్న నిక అమ్మసంగతి వేరే చెప్పవలయునా? సభలోనివారందఱూ రాము డెప్పుడు రాజగును, ఆతని చల్లనిపాలనములో మన మందఱ మెప్పుడు సౌఖ్యము లనుభవింతుము అనియే యాలోచించుచున్నారుగాని లోకము సంగతి తలంపకున్నారు.

అమ్మా! సమస్తము దెలిసినదానవు; నీకు వేరుగా నే నికేమియు చెప్ప నవసరము లేదు. ఖరదూషణాది రాక్షసులవలన బాధల ననుభవింపలేక ప్రజలందఱు నట్టుడికి నట్లుడికిపోవుచున్నారు. వీరందఱికి ప్రభువు రావణాసురు డనువాడు; లంకను పాలించుచు, నప్పుడప్పుడు మన దేశముమీదికికూడ వచ్చి ప్రజల నమితముగా హింసించుచున్నాడు. ఈరాక్షసులవలన లోకమునకు గలుగుబాధ యింతయంత అని చెప్పుటకలవికాదు. మన ఆర్యస్త్రీలమర్యాద కొంచెమైన దక్కుట లేదు. బ్రాహ్మణులకు వారి యజ్ఞయాగాదికర్మలు నెఱవేఱుట లేదు. ధర్మమంతయు నశించుచున్నది. వారిని నడమట్టించి లోకమును రక్షింపవలయునని దృఢసంకల్పము కలిగియున్నాను. ఈకార్య మొకటిరెండు దినములలోను, నెలలలోను, సంవత్సరములలోను నగునదికాదు. ఇది నెఱవేఱుటకు కొన్ని సంవత్సరములు పట్టును. ఒకచో నుండి చేయునదికూడ కాదు. దండకారణ్యమంతయు సంచరించి మూలమూలలనున్న రాక్షసులనందఱను క్రూరమృగములను వేటాడినట్లు వేటాడవలయును. ఈపనియంతయు నేను సింహాసనాధిష్ఠితుడనై రాజ్యపాలనము సేయుచు నెఱవేర్చుటకు సాధ్యమా? కావున నీపట్టాభిషేక మహోత్సవ ప్రయత్నములు నా కెంతమాత్రము సంతోషదాయకములు గానేరవు. ఎట్లయిన నీబంధనములనుండి బయటబడి లోకము నుద్ధరింపవలయును.

కైక:—ఏమి! కుమారా, రాజ్యపాలన మొనర్ప నిచ్ఛగింపవా? పట్టాభిషేకమహోత్సవము స్వీకరింపవా?

రాముడు:—అమ్మా, అంతకన్న నెక్కువ పని చేయదలంచువాని కది యెందుకు? రాజ్యపాలన మొనర్ప నిచ్ఛగింప; లోకరక్షణసేయ నిచ్ఛగించెద.

కైక:—అందులకు తండ్రిగారొప్పెదరా?

రాముడు:—అందుకనే నీసహాయ మపేక్షించుట. వారొప్పరు. వారియిష్టము లేకుండ, వారితో చెప్పకుండ నే వెళ్లినచో తండ్రి యిష్టమునకు వ్యతిరేకముగా నడచినవాడ నగుదు. నేను నాజీవితమును లోకమునకాదర్శముగజేయ నిశ్చయించితిని. తండ్రి యాజ్ఞకు వ్యతి

రేకముగా నేపనియును జేయరాదుకదా? ఆయనతో జెప్పి వెళ్లుచున్న ఆయన వెళ్లనీయరు. అది నిశ్చయము.

కైక:—ఇక నీప్రయత్న మెట్లు సాగును?

రాముడు:—తల్లీ! నాన్నగారికి నీవనిన నమితానురాగము. నీ వేదయిన నొకమాట చెప్పితివా, దానిని



"కైక:—కుమారా, రాజ్యపాలన మొనర్చ....పట్టాభిషేక....స్వీకరింపవా?"

తప్పక నెఱవేర్చి తీరుదురు. ఆయన నీకన్నడు నెదురాడి యెఱుగరు. కాబట్టి యెట్లయిన నాయనకు నచ్చజెప్పి నన్నడవులకు బంపునట్లు చేయుము.

కైక:—బాగు; రామా, బాగు. అసలే నీకు నేను సవతితల్లిని. సవతితల్లి బిడ్డల మేలుగోరి యేదయిన జెప్పినను లోకులు కీడునకనియే తలంతురు. అందులోను నిట్టిమాటా? మీ నాన్నగారి కేవిషయములోనైన నా మాట వినుదురుగాని ప్రాణమునకన్న నెక్కుడుగా జూచుకొనుచున్న నీవిషయములో నీవిధముగా చెప్పిన విందురా?

రాముడు:—ఒకవేళ మంచిగా చెప్పినచో వినరని తోచిన, వెనుక రాక్షససంహారసమయమున నీవు చూపిన యుద్ధకౌశలమునకు మెచ్చి నిన్ను రెండువరములను గోరుమని యడిగెరటకదా. అప్పుడు నీవు నీనమ్రతా, భర్తృప్రేమా, నిగర్వమూ, విశాలహృదయమూ వెల్లడియగునట్లు వానిని స్వీకరింపలేదని విన్నాను. ఆవరముల నిప్పుడిప్పుమని యడుగుము. అందొకటి నన్ను గొన్నిసంవత్సరములు అరణ్యమునకు బంపవలెననుము. లెక్కకావలయుననిన పదునాలుగుసంవత్సరములని చెప్పుము. నే జేయబోవుపని కంతకాలము కావలయు ననుకొనెదను. నే నరణ్యములకు బోయినయెడల రాజ్య మరాజకము గాకుండ రాజ్యమునకు భరతుని పట్టాభిషిక్తుని జేయునట్లు రెండవది. తండ్రిగారెట్టికష్టములనైన భరింతురు; ఎట్టియాపదలకు భయపడరు; గాని అసత్యమాడుట యనిన, ఆడినమాట తప్పుటనిన మిగుల భయపడుదురు. అసత్యమాడువాడు, మాటతప్పువాడు అని యనిపించుకొనుటకు సహింపరు. కావున నీవరముల దప్పక నొసగెదరు. ఆయన జాలిగొలుపుమాటలతో, హృదయమును గరగించు ఆవేదనతో నిదిగాక వేరొండు వరముల నడుగుమని వేడుకొందురు. ఏమయినను నీవుమాత్రము వెనుదీయకుము; జాలినొందకుము; లొంగిపోకుము. ఇది స్వార్థపరత్వము కాదు: జనోపకారము. దేశోపకారము. లోకరక్షణముకొఱకు ఒక పెద్దకార్యమును, అసామాన్యకార్యమును, లోకమునకంతకు నమితమగు మేలొసగుకార్యమును, జేయ తలపెట్టి నప్పుడు చిన్నచిన్న విషయములను లెక్కసేయరాదు.

కైక:—కుమారా, లోకులు నన్నేమని తలంతురు? కైక యెంతదుర్మార్గురాలు; ఎంతనీచురాలు; ఎంతకఠినాత్మురాలు! ఇట్టిస్త్రీ లోకములో నిదివఱకెక్కడా పుట్టియుండదు; ఇకముందుపుట్టబోదు అని యెంచరా? కేకయరాజవంశమున చెడబుట్టినదని దూషింపరా? ఆమె యసామాన్యసౌందర్యమూ, ఉన్నతవిద్యా, అద్భుతప్రజ్ఞా ఇవియన్నియు నెందుకు? కాల్పనా? అని యెంచరా? రాముడు, సకలగుణాభిరాముడు, లోకరక్షకుడగురాముడు, తనకన్నతల్లికన్న తన్నెక్కుడుగా ప్రేమించురాముడు, లోకులందఱియొక్క ప్రేమ నాక

క్షించిన రాముడు, తనకేమి యపకార మొనర్చెను? ఎట్టివారి ప్రేమనైన తనవైపున కాకర్షింపజేసికొనగల్గెను. కాని కఠినహృదయురాలను, ప్రాకృతచిత్తయును నా కైక ప్రేమమాత్రము సంపాదింప లేకపోయెనా? కైక బిడ్డలను గన్నతల్లి కాదా? స్త్రీ కాదా? అంతటి మృదు శరీరములో భగవంతు డింతటి వజ్రకాఠిన్యహృదయము నెట్లుమర్చగల్గెను? కావలయునన్న తనకుమారునకు రాజ్య మీయుమని యడుగవచ్చునుకాని యేపాప మెఱుగని రాము నరణ్యవాసమునకు బంపుమని కోరుకొందునా? అని నన్ను నిందింపరా? నే నిట్లు గోరితినని విన్న భరతుడు నన్నెంత అసహ్యించుకొనును? నన్ను జంపివేయుటకు కూడ ప్రయత్నించునేమో? ఈ యపఖ్యాతి యిప్పుడు మాత్రమే కాక శాశ్వతముగా లోకములో నిలిచిపోదా? దుష్టస్త్రీల నందఱ నాతో బోల్చరా? ఇదియేనా నా మీద నీకుగల ప్రేమ? నన్ను శాశ్వతమగు నపఖ్యాతిపాలు గమ్మనెదవా?

రాముడు:—అమ్మా, ఈ కష్టము నీ కొక్కదానికే కదా? లోకమునంతను నుద్ధరించుట కీపాటి స్వార్థత్యాగ మొనర్పజాలవా? నే నడవులలో నన్ని సంవత్సరములు సకలశ్రమల నొందుట కేర్పఱుచుకొనియుండ నీ వీమాత్రపు నింద భరింపజాలవా?

కైక:—రామా, ఎట్టికష్టములనైన భరింపవచ్చును గాని నింద మోయుట కష్టము. కష్టములు తాత్కాలికములు. నింద శాశ్వతము. నీవు పదునాలుగు సంవత్సరములు మాత్రమే శ్రమ నొందుదువు. నేను శాశ్వతాపకీర్తి పాలు గావలయును.

రాముడు:—తల్లీ! నీవన్నది నిజమే. కాని నిజముగా దుష్టహృదయులకువారి కాబాధ. ఇందు నీనేర మేమాత్రమును లేదు. నీయంతరాత్మ నిన్ను బాధింపదు. నిష్కళంక హృదయము, ప్రేమపూరితమగు మనస్సు నీ కెల్లప్పుడు సంతోషము నిచ్చుచుండును. లోకోపకారార్థమై యిట్టి స్వార్థత్యాగ మొనర్చితినిగదా యని మనస్సున కొక విధమైన గర్వము కలుగును. ఇంకేమి కావలయును? ఆనందమునకు లోటు చేసుకొనిన నీకేమి? నిజముగా నేరము చేసినవారికి పిరికితనము, దైన్యము, శిక్ష యనిన భయము; మృతియనిన బెదరు. నేరము లేని నిష్కళంక హృదయునకు పొరపాటున తనమీద నేర మారోపింపబడినను, శిక్షించుచున్నను, తుదకు మరణశిక్ష విధింపబడినను నిర్భయముగా, నిశ్చలముగా, గంభీరముగా వానినెల్ల సహించును; నవ్వుతో ప్రాణములను విడుచును. అతని కేమి కొదవ? అట్లనే, అమ్మా, నీవుకూడ ఆనిందలను నవ్వుతో భరింపవలయును.

కైక కొంతసేపు ఏమియు బలుకలేకపోయెను. చాలసేపు దీర్ఘాలోచన చేసెను. వేరు మార్గమేమైన గలదేమో యని వెదకెను. ఏమియు గాన్పించలేదు. "రామా, నీవు చెప్పినది నిజము. వేరు త్రోవ లేదు. ఒకవేళ నీవు తండ్రితో జెప్పకుండ వెళ్లినను నాయన యనేకులను చారుల నానాముఖములకు బంపి నీ వెక్కడనున్నను వెదకించి తన సన్నిధికి వచ్చునటుల నిన్ను బాధించునుగాని వదలి పెట్టరు. నీమనస్సునకు నిశ్చలత యుండదు. ఈవిధముగా నైనచో నిక నిన్ను బాధించుటకు వీలుండదు. మంచియుపాయమే. నీవు మొదట నావద్దకు వచ్చునప్పటికి నేనూ ఆవిషయమునే యాలోచించుచుంటిని. నీశక్తి నంతను వ్యర్థము చేయుదువు కాబోలు! ఈబాధల నివారించువా రికయెవరు? రాముడు కూడ రాజ్యభోగలాలసుడై యీ భోగములలో చిక్కుకొనుటకే యేర్పరచుకొనెను కాబోలు! ఈ తహతహపడు ప్రజలయార్తి దీర్చువా రెవరు? లోకము నుద్ధరించువా రెవరు? అనియే యాలోచించుచుంటిని. ఇప్పుడు నీ నిశ్చయము విన్న తరువాత నాకపరిమితానందము కలిగినది. లోకమునిమిత్త మేమి యొసగుమనినను నొసంగెదనని చెప్పితిని. నాకీర్తి నిచ్చివేయుచున్నాను. లోకోపకారార్థమై శాశ్వతాపకీర్తిని భరించెద. అందువలన నాకు గలుగునష్టము మితిస్వల్పము. అందుకు నే నొప్పుకొననిచో లోకమునకు గలుగు నష్ట మమితము." అని కైక పలికెను.

రాముడు:—అమ్మా! లోకహితార్థమై, దేశాభివృద్ధికై, ధర్మరక్షణార్థమై నేను రాజ్యమును, తలిదండ్రు

లను, సోదరులను, సమస్తమును విడిచి యరణ్యవాసము చేయబోవుచున్నాను. అందులోనే యానందమును, సుఖమును పొందగోరుచున్నాను. నీవు నదే కార్యార్థమై యపరిమితానురాగుడైన ప్రియభర్తయొక్క గాఢమగు ప్రేమను, కొమారునియొక్క మాతృభక్తిని, ప్రజలయొక్క గౌరవపున్ననలను పోగొట్టుకొనుచున్నావు. అందువలన గలుగు అపనిందలలోను, కష్టములలోను నానంద మనుభవింపనిశ్చయించుకొన్నావు. నీమీద నెంతమందికి కోపమువచ్చినను, నాప్రేమమాత్రము శాశ్వతము; గౌరవ మపరిమితము. అమ్మా! ఇక నేను సెలవుతీసికొనెద. అరణ్యవాసమునకు సిద్ధుడనై యుండెద.

## 3

రాత్రి కైక పరుండెను. నిద్రపట్టదు. అనేకాలోచనలు పోవుచుండెను. "రాముని కేమని వాగ్దత్త మొసగితిని? కోరరానికోరికలను భర్తను వేడి శాశ్వతాపఖ్యాతికి పాల్పడుటకా? భర్త యెంతో ముద్దుగా, ప్రేమతో, నామీద నాతని కాతురమందు గలిగిన యపరిమితాశ్చర్యముతో, గౌరవముతో వరముల నడుగుమని నప్పుడతివినమ్రతగలదాననై, నిగర్వనై, 'భర్తను గాపాడుకొనుట యొకటేనకార్యమా; ఇంతమాత్రమునకే వరములెందు'కని చెప్పినప్పుడాయనకు నామీద యెంతగౌరవము కలిగినది! ప్రేమ యెంత గాఢమైనది! ఎంత యాశ్చర్యముకలిగినది! నేటివరకు నిశ్చలముగానున్న యానిష్కళంక గాఢప్రేమను, ఆగౌరవమును నే డొకక్షణములో ఒకమాటలో గోల్పోవుచేనా? రేపు నే నీరెండువరములడుగుటతోడనే నాథు డెంతయాశ్చర్యపడునో? ఏమనుకొనునో? నమ్మునా? ఇంతకాలమునుండి యున్న నాయటువంటి మంచిస్వభావము ఇప్పుడిట్లు హఠాత్తుగా మారునని యెన్నడైన యెంచియుండునా? ఒకనైపున తానింతవరకు నపరిమితముగా ప్రేమించి నమ్మియున్న భార్య ఒక్కమాటుగా నిట్టిదుష్టపుకోరికలను గోరుట; మరియొకవంక ప్రాణముకన్న నెక్కుడుగా జూచుకొనుచున్న ప్రియపుత్రుని వియోగము. ఈవార్ధకములో నిట్టికష్టముల భరింప గల్గునా! ఒకవేళ వీనిని సహించలేక ప్రాణములు విడుచునేమో! ఇంతకన్న మరియొకమార్గము గానరాదు. రాముడు వెళ్లక తప్పదు. ఏదో కొంతకు త్యాగమొనర్చినగాని, బలియైనగాని యిట్టి లోకోపకారకార్యములు నెరవేరుట దుర్లభము. భర్తగారు వృద్ధులగుటచేతను, పుత్రప్రేమ గాఢమగుటచేతను, పుత్రు నెడబాసి స్థిమితముగా నుండుటకు వృథమగుశక్తి యాయన కిక లేదు. కావున నీవిషయములో కొన్ని యనర్థములు గాకమానవు. వెనుక లోకోపకారార్థమయియే భర్తప్రాణముల గాపాడితిని. ఇప్పుడునూ అందునిమిత్తమయియే ఆయన గాఢప్రేమానురాగాదులను మాత్రమే కాక తటస్థించినచో భర్తగారిని గూడ గోల్పోయెదను. లోకముకొఱకు, దేశముకొఱకు ఒకరము ప్రాణములను, మరియొకరము గౌరవకీర్తులను, నింకొకరము భోగములను త్యాగ మొనర్చెదము." ఈవిధముగా రాత్రియంతయు నామె యాలోచనలతోడనే గడిపెను. తెల్లవారి రామునిపట్టాభిషేకసమాచారమును సంతోషముతో కైకకెరింగించుటకొఱకు దశరథుడు కైకమందిరమునకు వచ్చెను. కైక రాబోవునిక్కట్టులనెల్ల దలచుకొని ఖిన్నురాలై యుండెను. ఆమెను జూచుటతోడనే దశరథునకు విసరుపుట్టెను. అయినను మామూలుప్రకారము ప్రేమతో నామెను జేరదీసికొని యావార్త నామె కెరింగించెను. కైక తనమనోభావములనెల్ల నతిగంభీర మనమునందునే యడంచుకొని రామునికోరికప్రకారము మాతని పట్టాభిషేకవిషయమై తనయనిష్టమును దెలిపి తన రెండుకోరికలను నొసగుమని వేడెను.

దశరథు డాశ్చర్యమునొందెను. ఈమె తనప్రాణప్రదమగు కైకయేనా యని సందేహము నొందెను. ఆమెను అదిగాక యింకేమయిన నడుగుమని బ్రతిమాలుకొనెను. నీయిష్టప్రకారము భరతునకు బట్టము కట్టెదను రామునింటనిలువనీయుమనెను. కాళ్లుపట్టుకొని ప్రార్థించెను. పాపము, కైకను హృదయము కరగిపోవుచుండెను. "ఛీ! ఎంతకఠినహృదయురాలను!" అని తనలో దాను దూషించుకొనుచుండెను. కాని ముందుచేయవలసిన యుత్కృష్టకార్యమును దలంచుచుండెను. రామునికోరిక తనకు బలము నొసగుచుండెను. ధైర్య మవలంబించెను.

గంభీరముగా వినపట్టును వీడలేదు. దశరథుడు మూర్ఛ నొందెను. ఈ వార్త రామునకు తెలిసి యేమియును నెఱుగనివానివలె కైకమందిరమునకు వచ్చెను. దశరథున కప్పుడే తెలివి వచ్చినది. రామునిపై అతిదీనభావముతో



జూచెను. రాముడు సంగతి యేమని ప్రశ్నించెను. కాని దశరథుడు జవాబు చెప్పలేకపోయెను. కైకయే జరిగిన సంగతి చెప్పెను. వెంటనే రాముడు "తండ్రిగారు మాట దప్పరాదు. సూర్యవంశపురాజు లెన్నడు ఆడినమాట దప్పలేదు. ఆమెకోరికప్రకారము మీరు నన్నడవులకు పంపి భరతునకు పట్టాభిషేకము చేయవలసినదే. నే నేమో అనుకొనెదనని భయపడకుడు. తలిదండ్రుల యాజ్ఞను శిరసావహించి పరమసంతోషముతో నే నిదే యేగుచున్నవాడ" నని చెప్పెను. దశరథుడు మరల మూర్ఛనొందెను. ఆయనకు మరల తెలివివచ్చినయెడల వెళ్లవద్దని విచారించెదరనియు, వెళ్లిపోయినతరువాత మనస్సు రాయిచేసికొని స్థిమితము నొందుదురనియు తలంచి, యప్పటినుండి తిన్నగా బయలుదేరి ప్రక్కన తనవారందఱితోడను వనయాత్రావాసవృత్తాంతము జెప్పెను. లక్ష్మణుడు అతికోపము జెందెను. కైకను జంపుదునని బయలుదేరెను. రాముడు నవ్వి యతనిని శాంతాత్ముని జేసెను. సీతాలక్ష్మణులు రాముని విడిచి యుండలేక వెంట బయనమయిరి. ఇంటిలోనివా రందఱు, యూరిలోనివారు కైకను నిందింప మొదలుపెట్టిరి. పాపము, కైక, యిదివరకు వీరందఱిచే నెంతయో గౌరవింపబడిన కైక, మీ రందఱిచే నపరిమితముగా ప్రేమింపబడిన కైక, దేవతవలె జూడబడిన కైక, ఒక్కసారిగా మీ రందరినుండి దూషణవాక్యములను వినవలసి వచ్చెను. మరి పది దినములకు దశరథుడు మరణించెను. తన మరణకాలసమీపమున భార్యలను ముగ్గురను బిలిచి యిందు కైక నేర మెంతమాత్రమును లేదనియు, తన కేదియో శాప ముండుటచే నీవిధముగా పుత్రవియోగ మనుభవింపలేక మృతి నొందుచుంటి ననియు, కావున నంత యుత్తమురాలగు కైక యిట్టి కోరికల గోరునా యనియు, నామెను దూషింప వలదనియు జెప్పి మృతి నొందెను. తాతగారి యింటియొద్దనుండి భరతుడు వచ్చి సంగతియంతయు విని తల్లిని మిగుల దూషించెను.

కాని ధైర్యసంపన్నురాలును, గంభీరయును, పరమార్థచింత గలదగు కైక యించుకైన చలింపక రాముని నాదర్శకపురుషుని జేయ నిశ్చయించిన దనుటచేత రహస్యమును వెలిబుచ్చక ఓర్పుతో వీని నన్నిటిని భరించుచుండెను.

---




కాశీ వ్యాసాచార్యులు గారు



విరివిగాఁ గొప్పులోఁ దుఱిమిన పచ్చని
చేమంతివిరు లొక్క చెలువు నీన
తెలిదమ్మి దంతపంక్తులకాంతి దరహాస
చంద్రిక లొకనూత్న సరణిఁ గొల్ప
పుష్పిత తనులతాభోగ ప్రసక్తికి
శుకభాష లొకవింత శోభఁ గూర్పఁ
మహిత శాద్వల రాజమార్గంబుపై బెళుకు
నడ లొక్క క్రొత్తయందం బొసంగ
మంచుసెల్లాలఁ గట్టి హేమంతసంగ
మోత్సుకత్వము మదిఁ బూని హాయలుమీఱ
నల్లనల్లన జనుల కాహ్లాద మొసఁగు
ప్రకృతి కాంతాలలామ చేరంగ వచ్చె.

పటుతరంబగు నింద్రవైభవముతోడ
బంతిగుబురులు పొలము నల్వంకలందుఁ
దలల వ్రాల్పక పుష్పనేత్రముల విచ్చి
క్షేత్రపాలకులట్లు వీక్షింపఁదొడఁగె.

ప్రసవభారంబుచేఁ గ్రిందుపడి చికాకుఁ-జెంది తల లూఁచెడి మొరపచెట్ల కపుడు
కన్నకడు పౌట నధికరాగంబుతోడ-ధాత్రి ధాత్రీత్వ మొనరఁ గైదండ యొసఁగె.



హాలికుల బాలికామణు ల
 హర్మ్యముఖమందె పొలంబుఁ జేరి దృ
గ్జలజము లప్డు మంచుతెర
 చాటున డాఁగురుమూఁత లాడఁగాఁ
పలుపడి యిచ్చవచ్చిన వి
 ధంబునఁ జూచినయట్టి బంతిపు
వ్వుల నొడినింపఁ గోసికొనఁ
 బూనిరి స్వాంతము లుల్లసిల్లఁగన్.

గడగడలాడఁజేయు చలి
 గాలికి మేను వడంకుచుండఁగా
మడతలఁ దీర్చినట్టి తమ
 మాసిన దుప్పటి మేనఁ గప్పుచున్
వడివడి నాత్మ సంతసము
 నన్ జలిమంటలు వేసికొంచుఁ బా
ల్పడి యిటు పాచిపెత్తన
 ములన్ బొనరింపఁదొడంగి రెల్లరున్.

భువిపైఁ జిందులఁద్రొక్కి పాడునెడ నా భూపాలరాగంబు, భై
రవి రాగంబుగ దానికై యదియె మారన్ "రంగరంగా! హరీ!
నవనీరేజదళాక్ష! కృష్ణ! యిఁకనైనన్ నిద్ర మేల్కొమ్మ" యం
చు విశేషంబుగఁ బాడుదాసరులు సచ్చోఁ గానరై రెల్లెడన్.

జానపదులెల్ల సంతోషసాగరమునఁ-దేలియాడంగ సంక్రాంతిదినస మొకట
సకటమునఁ జేరె; నూతనోత్సుకత మీఱ-క్రొత్తయల్లుండ్రమనులుఁ తళ్కొత్తఁ బారె.

అత్తఱిఁ గాంతలెల్లరు గృహాంగణసీమల నూత్నశోభ త
ళ్కొత్తఁగఁ గుడ్యభాగములకున్ బలుపన్నెలఁ గూర్చి కూర్చి యు
త్త్యుత్తమ పుష్పమాలల సముద్ధతి ద్వారతలంబులందు నా
యత్తమొనర్చి యొక్కక్షణమైన విరామములేక మెండియున్.

తమపెనిమిటులను గని, చిత్తములం గలకోర్కెలెల్లఁ దద్దయుఁ బ్రీతిన్
గమనీయోక్తుల నిటు చెల్ప మొదలిడిరి వేఱువేఱు ఫక్కిం గొనుచున్.

అందొక కాంత నాథుని జూసి,
"ఇరుగుపొరుగునన్ బడఁతులెల్లరుఁ బండుగనాఁటి కప్పుడే
యరిసెల వండి, తా మటికయందలి బానల నింపినార; లీ
సరి కొక వస్తువేన్ గొనవు; జాణతనం బదియేమి? పిల్లలి
త్తఱి ననుఁ బోరఁ జొచ్చిరికదా; యెటు చచ్చెద"నంచుఁ బల్కెఁ దాన్.

వేఱొక తె,
"నీకడఁ గాఁపురంబునకు నే నరుదెంచినదాది, కోకకై
వాకొనుచుంటిఁ బండుగకుఁ బండుగ; కైనను నిప్డు చేతిలోఁ
బైకము కానరాదు; పయిపండుగనాఁటికిఁ జూతులెమ్మటం
చి కరణిన్ వచించి తిపుడేనియుఁ దెత్తువ? లేద?" యంచనున్.



మఱొక్క గృహిణి,
"ఈపర్యాయమునందు నల్లుఁడును, దా
నేచాయ నున్నాఁడొ కా
నీ, పిల్లన్ వెనువెంటఁ బంపు మనఁగా
నే పంపెఁగా; రాకరా
కే, పుట్టింటికి వచ్చెఁ గుట్టదియు; నేదేన్
దోఁచిన ట్లిచ్చి కా
దా, పంపన్ వలె; యెద్దియైనఁ గొనినా
రా?" యంచుఁ బ్రశ్నించెఁ దాన్.

అన్యకాంత,
"ఏమండీ! ఇదియేమి? పండుగకు న
డ్డే యల్లునిం దెచ్చె నా
కామాక్షమ్మ మగండుఁ గూడఁ; దమ కింకన్ దీర లేదేమి? మీ
కాముద్దుల్ మఱి ముచ్చటల్ పనికిరావా? నాఁడె వియ్యంకుఁ డే
మేమో సొమ్ముల వేసెనంట; యిఁక మీ యిష్టం" బటం చేగెఁ దాన్.

ఇవ్విధంబున ముగ్ధలౌ నింతు లొకట-నల్లభులఁ జేరి సహాతహాపాటుతోడ
మంచిచెడ్డలఁ గూర్చి భాషించుకొనుచు-నుండఁగా నింతలోన వేఱొక్క చోట.

కోడిపందాలకై కొనినకత్తులను గాయించి మేల్పానఁ బట్టించువారు
అల్లుండ్రకట్నాలకై తెచ్చినపటంబు లెంచి భార్యలకుఁ జూపించువారు
భార్య పెట్టెనుపోరుఁ బడలేక నగలఁ దీయించి మెఱుంగుఁ బెట్టించువారు
మునుముందె తమకు నచ్చినకూరలెల్లఁ గోయించి తట్టలను నెత్తించువారు

ప్రాణసమముగ సతముఁ గాపాడుకొనెడి
పశుగణంబుల మేను శుభ్రం బొనర్చి
శృంగభాగంబులకు రంగు లిడెడివారుఁ
గనుఁగొనంగవచ్చె రక్కాలమందు.



తనపుత్రిం గని యొక్కకాంత "అపి వ
ద్మా! విన్మ నామాట; నీ .
వనయంబున్ బొరుగింట్లఁ బెత్తనము చే
యంబోకుమా; రేపొ నూం
పునవో, సిమగఁడే ము వచ్చునఁట; తా
మున్నే వివాహంబునన్
మన మర్యాదలఁ గూర్చి పోర" నని వ
ల్మా ర్బుద్ధిచెప్పన్ జనెన్.

"గతమాసంబున నేదో నాట్యమును బల్కన్ వచ్చి మామామను న
స్నతి నిర్బంధము చేసెఁ బంపుగకు రమ్మం చట్లొ నేమాంట సా
మెత్తకై నాఁటికిఁ జూతులెమ్మన, నశే మూంయిష్టమం చేఁగెఁ; బ్రి
స్తుత మేవార్తయు లేదుగా" యనుచు నచ్చో నల్లుఁ డొక్కం డనున్.

"చదువంగావలె మాకు నాఁటికి సెలెక్షన్ రోజులే సూమ, చూ
చద లెమ్మం చనఁ గాదుకూడదని నాచే నోట్సుపెట్టించె; నే
మది, తానెంత 'విలేజిబ్రూటో' కబురే సంసంగతే దేమిస
ల్పుదు"నం చింటరుక్లాసు బాలుఁడొకఁ డాప్తున్ బ్రచ్ఛసేయం జనెన్.

పండుగ పదిదినములపై-నుండె ననఁగ నాఁడుఁ బడుచు లొక్కట నపుడే
తండోపతండముగఁ జను-చుండిరి పుట్టిండ్ల కురుతరోత్సవ మొదవన్.

తనసోదరి వచ్చెదనని-యొనరఁగ వీక్షించుబాలుఁ డొకఁ డామెయు రాఁ
గని 'అప్పరో వచ్చితివా'-యనుచును నడువీథిఁ జిందులాడఁ దొడంగెన్.



బడిజీతంబునకంచుఁ దండ్రి ధన మం
పన్ దానిచే బాలకుల్
పటి దుస్తుల్ మఱికొన్నిటిం గొని, యపూ
ర్వంబైన సౌందర్య మే
ర్పడ, గడ్డంబును దిద్ది, సుందరశిరో
భాగంబులన్ దువ్వి యొ
క్కఁ డొకింపైన శ్వశురాలయంబులకు నేఁ
గంబూని రప్పట్టునన్.

వింతవింతగుమోముల వీథులెల్లఁ
గ్రొత్తయందంబు నాటి తళ్కొత్తుచుండ
నింతలోనఁ బురోహితు లెల్ల వెసలఁ
గ్రమ్మఁజొచ్చిరి నాఁటి సంక్రాంతి దినము.

ధర్మశాస్త్రానువిహిత షట్కర్మవితతిఁ
దత్ప్రతిగ్రహమే ముఖ్యధర్మ మనుచుఁ
దలఁచి, దర్భల నొకచంకఁ, దిలల యవల వేఱుచంకను గొని వెనువెంట లేచి.

స్నానపుమాటటుంచుఁ డీఁక, నామములో మఱిబూది రేఖలో
మేన నలందు, లోకులు భ్రమించునటుల్, గురుమధ్వరాయ! రా
మానుజ! శంకరా! యనుచు, నప్డు పురోహితు లం దపూర్వ వి
ద్యానిధులైన కొందఱు తయారయి రెల్లెడ విత్తకాంక్షచేన్.

నిజముఁ దెలిసినను, తొలుక్యము-లోఁ జనులుం గొంత వారలోన నొకండు
త్రైజతఁ "కూష్మాండం బహు-బీజాఢ్యం" బనుచు నొక్క-పేరుని యుంటిన్.

చెప్పినపాదమే మరలఁ జెప్పుచుఁ బ్రైఁగల పాద మెత్తిఁకన్
జప్పునఁ దోఁచకుంటఁ దనచాతురిఁ దంత్రములందుఁ జూపి చి
న్నప్పటి చింతనాఁటిమ నంతకుఁ బోయిన దేమొ పోవఁగా
నప్పటి కింక బుద్ధిపథమందున నెట్టులో డాఁగియుంటఁ దా
నప్పు డెఱింగి యాయమరమంజలి యాదిమ పద్యపాదముల్
చెప్పుచుఁ బాదపూరణము చేయఁదొడంగె గతాను మానుఁడై.

అంత మధ్యాహ్న వేళ నభ్యంజనాది-సకల కృత్యంబులను యథాశాస్త్రముగ నొనరిచి, నిజబంధుమిత్రులఁ గలసి జనము-లిష్టమృష్టాన్న తృప్తులై రిట్టులుండ.

కూష్మాండ దానముల్ గొని మారుబేరంబునకు నమ్మ బాడబప్రకర మొకట
నిలువయా సరకులన్నియుఁ జెల్ల, నాఁటిలాభములను జమకట్టు వైశ్యులొకట
తమకోడి నాఁటిపందెమున గెల్చెనటంచు హర్షించి యూరేఁగు హాలికులొకట
వెలలేని నగలఁ జీరెల రైకలను దాల్చి పేరంటమున కేఁగు పొలఁతు లొకట
వారలం గని, "అయ్యయో! మీర లెంత-తెలివిమాలిన 'ఫూల్సని' తలఁచునట్టి
యాంగ్ల భాషను బఠియించు నల్లు రొకట-నరయవచ్చిరి నాఁటి సాయాహ్నమందు.

ఇక్కరణిఁ, బాముపాముల-నక్క-జమును గూర్చి, జనుల నానందాబ్ధిఁ
జిక్కఁగఁ జేయుచు నిటు లోక-చక్కని సంక్రాంతిదినము చయ్యనఁ గడచెన్.





గాంధిమహాత్ముడు అహింస నుపదేశించుట

చిత్రకారుడు: శ్రీయుత ఎమ్. ఎస్. శర్మగారు, చెన్నపురి.



బుద్ధభగవానుని జీవకారుణ్యోపదేశము

చిత్రకారుడు: శ్రీయుత నా. నరసింహంగారు, చిత్రశిల్పి, శిల్పాశ్రమము, [illegible].




[౧౯౨౯ నవంబరు నెలలో అనంతపురమున సమావేశమైనది]

## రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి అధ్యక్షోపన్యాసము *

"చైతన్యం సర్వభూతానాం, నిర్వృతిం జగదాత్మనామ్,
నాదబ్రహ్మ సదానంద, మద్వితీయ ముపాస్మహే."

ఆహ్వాన సంఘాధ్యక్షులకును, సభాసదులగు మహాశయులకును, మహిళామణులకును వందనములు.

మహనీయులారా !



అతి వినయముతో నైచ్యానుసంధానముచేసి మీకు కాలహరణము చేయుట నా యుద్దేశము కాదు; కాని మోయలేని బరువును నా తలపై మోపితిరి. తామందఱును దయయుంచి తెలుఁగుదేశమున మాఱు మూలయగు నీ యనంతపురమున ఈ సమావేశము జరుప నంగీకరించి వేంచేయుట మా భాగ్యమే కాని, ఈసందర్భమున నే ననంతపురముజిల్లాలో జనించినవాఁడ నగుటయు, నాకన్న నర్హులైనమహనీయులు స్వార్థపరులై యీ భారమునుండి తప్పించుకొనుటయు, నాభాగ్య మని మాత్రము చెప్పలేను. పై రెండుతప్ప నేఁడు నాకీ గౌరవమును మీరొసఁగినందుకు వేఱు కారణములు నేనెఱుఁగను. ఎట్లును కాఁడి మెడకుఁ గట్టితిరి గావున చేతనైనంతవఱకు ఈడ్చెదను. నడుమ కుంటుపడితినా, తప్పు నాది గాదు. నాశక్తి నెఱుఁగక నియోగించిన మీ దయది.

కాని, యొకమాటమాత్రము చెప్పవలసియున్నది. ఇట్టిసభలలో అధ్యక్షపదవి నంగీకరించినవానికి తక్కిన శక్తియుక్తు లున్నను, లేకున్నను ఒక్కగుణముమాత్రము ముఖ్య

ముగా నుండవలయును; అదేదనఁగా: ఏవిద్య యభివృద్ధినిగూర్చిన చర్చకై సభ యేర్పఱుపఁబడినదో, దానియందు సంపూర్ణమైన యభిరుచి. అదిలేనివారిని అధ్యక్షులుగా నెన్నుకొనుటయుఁ గలదు; వా రంగీకరించుటయుఁ గలదు. కాని ప్రకృతసందర్భములో మిమ్ముఁగాని నన్నుఁగాని యీవిషయమున నిందించువా రుండరు. ఏలయనఁగా, సంగీతవిద్యయందు నాకుఁ గల అభిరుచి అంతు లేనిది. ఇంత యభిరుచి గలిగి నీవు సాధించిన దేమి యంటి రేని, యది వేఱుమాట. మన కభిరుచిగల వస్తువులనెల్ల మనము సాధింపఁగల్గితిమేని మనలను బట్టువా రెవరు? మఱియు రానివిద్యలందే మనుష్యుల కభిరుచి యెక్కువ. దరిద్రునికే ద్రవ్యమందు పేరాస. అది యట్లుండె.

సంగీతవిద్యయందు రుచి లేనివా రెవరు? అందును భరతఖండమున జనించిన వారికి— హిందూజాతి వారికి? అది జాతిధర్మము. తెచ్చుకోవలసిన బైటివస్తువు గాదు. విడువరాని లోపలిగుణము. 'స్వరాజ్యము నాజన్మహక్కు' అని శ్రీలోకమాన్యుఁడు వచించెను. అట్లే సంగీతము నాజన్మపుహక్కని యేహిందువైనను ధారాళముగా వచింపవచ్చును. మనుష్యులకే ఆబాలగోపాలము సంగీతమం దభిరుచి సహజము. తల్లిపాట లేనిది పిల్లవానికి నిద్ర రాదు; పిల్లఁగ్రోవి లేనిది గొల్లవానికి ప్రొద్దు పోదు. కాని జీవితములోని ప్రతికార్యముతోను సంగీతమును మనయంత దృఢముగా మేళవించినవారు ఏదేశమందును, ఏజాతియందును నే నెఱిఁగినంతవఱకు లేరు. మన తాతముత్తాతలకు ఇప్పటి యిట్టి సభలను సమాజములను ఏర్పఱుచుటగాని, అం దుపన్యాసములిచ్చి తీర్మానములు చేసి ప్రకటించుటకాని తెలియదు. కాని పాటయందు ప్రజలకు వీఁడరాని యభిమానమును అభిరుచిని గల్గించు విషయమున వారు సాధించినంతపని, మన యిట్టి సభలను ఏఁడాది కొకతూరిగాదు, దిన మొకతూరి జరిపినను సాధింపఁగలమాయని సందేహింపవలసియున్నది. చూడుఁడు: ఆ సేతుహిమాచలము హిందువులందఱును సంగీతముతో శుభకర్మములు నడపుదురు; సంగీతముతో భగవద్భజన చేయుదురు; ఇతరులకు నీతివైరాగ్యాదులను సంగీతముతో నుపదేశింతురు; సంగీతముతో చదువుదురు; సంగీతముతో తమ తమ జాతిపనులఁ జేయుదురు; సంగీతముతో బేరమాడుదురు; సంగీతముతో బిచ్చమెత్తుదురు! మనకే కాదు ప్రపంచమునకే మొదటి వాఙ్మయమగు వేదము పాడఁదగినది. ద్విజులందఱును శుభాశుభకర్మలందు దానిని పాడక తీరదు. అందును సామవేదము గానరూపము. మఱియు నిప్పటి సంగీతమును బ్రహ్మయందుండియే సృజించెనట! భగవంతుఁడు సామగానప్రియుఁడఁట. కావుననే వేదములలో నెల్ల నది శ్రేష్ఠమైనది. పెండ్లిపేరంటములలో ముందుగా ముత్తైదువలు పాటలు పాడి వధూవరులను పీఁటకుఁ బిలుతురు. నాలుగు మంగళహారతులైనను రాని యాఁ

డుది నలుఁగురిలో నలుగురితోఁ గూర్చుండ
లజ్జించును. 'మద్భక్తా యత్ర గాయన్తి తత్ర
తిష్ఠామి నారద' యని భగవంతుఁడు వచించి,
పాటలేని భజన తనకు తృప్తికరము గాదని
చాటినాఁడు. అతఁడు కురుక్షేత్ర మహాయు
ద్ధరంగమందు అర్జునున కుపదేశించిన యోగ
విద్యకు 'ఉక్త' యనక, 'ఉపదిష్ట' యనక,
'ఆజ్ఞ' యనక, 'గీత' యని పేరిడినాఁడు. ఇది
యే హరికథలు, పురాణములు మొదలగు
నుపదేశవిద్యలను గానప్రధానములఁ జేసినది.
మనలో నాదికావ్యమగు శ్రీమద్రామాయణ
మును రచించిన వాల్మీకి దానిని మొదలు
ప్రపంచమునకు వినిపించువేళ, తన మునలిశా
రీరముతో చదివినచో సారస్యము చెడునని
తలఁచియే, కుశలవుల కోమలగాత్రముచే
పాడించినాఁడు. నాఁడు మొదలు మనలో రస
భావముల కనుగుణమగు రాగలయములతో
కావ్యనాటకాదులను చదువుట యొక విద్యగా
నేర్పడినది తుదకు వీథిబడులలో సాయంకా
లము ఎక్కాలను ఏకరువుపెట్టు బాలుఁడు
గూడ ఒకవిధమైన రాగమును మఱవక యుప
యోగించును. సంగీతవాసన లేనిచదువు శ్రాద్ధ
మంత్రములవంటిదని పెద్ద లనుచుండఁగా పలు
మాఱు విన్నాము. లోకప్రసిద్ధములగు కాశ్మీ
రపు నేలువలనేతపని పాటలు పాడనిది జరు
గదఁట! అంతదూర మేల? విసరుట, మోట
గొట్టుట, కలుపుదీయుట మొదలగు నిత్యక
ర్మములందు కాఁపువారి కష్టమును మఱపించు
నట్టిది పాటకాక మఱేమి? రైల్వేస్టేషనులలో
కాఫీటీల నమ్ము మంగళూరి ఆచారి, సిగరెట్టు
చుట్టల నమ్ము సాహేబు, వీధులలో పాలుపె
రుఁగులను కాయగూరలను అమ్ము కాఁపుకల
కఁతులును, ఏదోయొక రాగములేక పనిచే
యలేరు. భిక్షాన్నపుబ్రహ్మచారి, నిత్యయా
త్రచేయు నిరుద్యోగపు బ్రాహ్మణుఁడు, భూత
భవిష్యత్తులను జెప్పు బుడుబుక్కలవాఁడు, తం
దనాలదాసరులు, కుంటి గ్రుడ్డి మొదలగుపరతం
త్రజీవులు—వీరందఱికిని ప్రాణాధారము పాట
యే. అన్ని దేశములందును యాచనావృత్తి
దుస్సహమని నిర్మూలింపఁబడుచుండఁగా, శిక్షిం
పఁబడుచుండఁగా మన దేశమందుమాత్ర మది
యింకను ప్రబలముగానే యుండుటకు ముఖ్య
కారణములలో హిందువులకుఁగల సహజమైన
గాన ప్రీతి యొకటనుటలో సందేహము లేదు.
అదియట్లుండనిండు. హిందువులందఱును పల్లవి
పాడఁగల పరమవిద్వాంసులని చెప్పరాలేదు.
ఇప్పుడు సామాన్యముగ సంగీతవిద్వాంసు లనే
కులు పాడుచుండు పల్లవియే పాటయగునేని,
అది హిందువులందఱును పాడనేర్చియుండిరేని
భరతఖండ మొక పెద్ద కురుక్షేత్రముగా పరి
ణమించి భగవంతునికి పునస్సృష్టికి మార్గ మె
న్నఁడో కలిగియుండును. మఱేమనఁగా, సా
మాన్యముగా మాటలం దుపయోగించు 'శబ్ద
ము'నకన్న మధురతరమైన 'నాద' మొకటి
కలదనియు, దానివలన భాషకు మెఱుఁగును,
మనసునకును సుఖమును గలుగుననియు, అంద
ఱివలె మన మెఱుఁగుట మాత్రమే కాక, దాని
నందఱికన్న నెక్కువగా సంసారమం దుపయో

గించుకొనుచున్నామనియు, హిందూనాగరకత కిదియొక ప్రధానలక్షణమనియు నే విన్నవించునది.

మన ధర్మసహోదరులగు మహమ్మదీయులలో స్త్రీలవిషయము మన మెఱుఁగము కాని, పురుషులుమాత్రము సంగీతమన్న చెవి గోసికొందురు. తానసేనుని పాటకు తనసామ్రాజ్యమునే ధారపోయఁబోయిన అక్బరు చక్రవర్తికథ మన మెఱుఁగనిదికాదు. ఇంగ్లీషువారు మొదలగు పరదేశీయులలో నాగరకతగల స్త్రీపురుషులందఱును సంగీతవిద్యను తప్పక నేర్చియుందురనియు, గాయకుల కా దేశమందు ఒక్కొక కచ్చేరికి వేలకొలఁది పౌనులు లభించుట కలదనియు విన్నాము. కాని, వీరిలో నెవరియందును, మనలోవలె, సంగీతము పండితపామరులకందఱికిని నిత్యయాత్రలో వీడరాని వస్తువై, మఱియు పూజ్యమై, యేర్పడినట్లు కానము సరస్వతీనారదుల చేతి వీణలు, తుంబురుచేతి తంబుర, పరమేశ్వరుని చేతి డమరుకము, శ్రీకృష్ణునిచేతి పిల్లఁగ్రోవి—ఇవన్నియు మనకు సంగీత మితరులకువలె మానుషమైన భోగ్యవస్తువుమాత్రమే కాక, దివ్యమైన పూజ్యవస్తువుగాఁగూడ నున్నదని స్పష్టముగాఁ జాటుచున్నది. ఇదిగాక, గానయోగిరాజగు త్యాగరాజు 'సంగీత జ్ఞానవిహీనులకు మోక్షము గలదా' యని ధైర్యముగా వేసిన ప్రశ్నకు 'కలద'ని నిర్భయముగా ప్రత్యుత్తర మియ్యఁగలవాఁడు ఇంకను పుట్టలేదు. ఎందుకును పనికిరాని మనుష్యులగు మనమాట యేల? శంకరనారాయణవిధులుగూడ నాదోపాసనచే నెలసిరఁట!!

సంగీతమునకు పైఁజెప్పిన ప్రాధాన్యమంతయు మన ప్రాచీనులు సాధించినది. కాని నేఁడు మన మేమి చేయుచున్నాము? వా రేర్పఱిచిన మార్గములో దాని నింకను వృద్ధిచేయుట యట్లుండ, వారిచ్చిన దానినైనను నిలుపుకొనుచున్నామా? లేదని చెప్పుటకు సిగ్గగుచున్నది. పామరులైన పల్లెటూరివా రింకను ప్రాఁతమార్గము వదలలేదు గాని, నవనాగరకులమగు మనమే యీ విషయమున నగుఁబాటు పాలగుచున్నాము. పితృపైతామహమైన యాలిబ్బి మన చేయిజారి పోవుచున్నది. దాని విలువను అతి పరిచయముచేత మనము గుర్తింపఁజాలకున్నాము. గుర్తించుటకు మార్గములును గాన రాకపోవుచున్నవి. మన చదువు సంధ్యల సంప్రదాయ మట్లున్నది. చదువులో మనకు స్వాతంత్ర్యము లేదు; సంధ్యలో నమ్మకము లేదు. సంధ్యను బోధించి దానివిలువ నెఱిఁగించువారు లేరు. చదువు చెప్పువారికి మన సంగీతము తెలియదు, కాఁబట్టదుగూడ. ఇన్నాళ్లను విశ్వవిద్యాలయాలు గుమాస్తాలనే తయారుచేయుచుండెడివి. ఇప్పుడు వారికి తోడు కూలివారిని, బేహారులను సృష్టింప మొదలుపెట్టినవి. ఇంతేకాని రసికులను సృజించుట గూడ తన ధర్మమని గుర్తించిన యూనివర్సిటీ మన దేశమం దింకను పుట్టవలసియున్నది. ఇప్పటి చదువునకు ఫలము బ్రదుకు. అనఁగా కాలక్షేపము చేయుట. అంతేకాని మనుష్యుల హృదయ

మందు పుట్టుచుండు, పుట్టవలసిన రసభావములకు సంబంధించిన కళలకు మన 'కళాశాల'లలో చో టెక్కడిది? కావుననే లక్షణముగా పద్య మొక్కటి చదువఁగల విద్యార్థి యొకఁడు నేడు దొరకుట దుర్లభ మైనది. రాగయుక్తముగా చదువవలె నను నుత్సాహము, తనకు తెలిసినంతలో శ్రావ్యముగా పదిమంది యెదుట చదువుటకు ధైర్యమును గలిగించు విద్యావిధాన మెప్పు డుండున్నది? ఇప్పటి విద్యాశాలలు నోరున్న వారినే మూఁగలనుగాఁ జేయుచున్నవి. ఇప్పటి చదువులో 'చదువుట'యే లేదు. కాననే యిప్పటి విద్యావంతుఁడు నలుగురిలో పద్యమును పద్యమువలెనే చదువుటకు సిగ్గుపడుచున్నాఁడు. ఉపన్యాస వేదికలపై, పాఠపీఠములపై విధిలేక చదువవలసి వచ్చునప్పుడు, పద్యమును పదినాళ్లు ఎండలో నెండించిన వంగవరుగువలె చేసి, గద్యము కన్నను నీరసముగా గొణఁగుట నాగరకాచారమైనది. ఇట్లుండ నిఁక పాటలు నేర్పువా రెవరు; నేర్చుకొనువా రెవరు?

మగవారము మనగతియే యిట్లుండఁగా, ఇంకను అబలలుగానున్న మన యాఁడువారి మాట వేఱే చెప్పవలయునా? మన యొప్పులను మెప్పులను నమ్ముకొన్నవారు వారు. సహజమగు శారీరసంపదయు, ఆర్ద్రహృదయమును గలవా రగుటచేత వారి కాశ యేమో యున్నది. కాని దాని నేమిచేయవలెనో, యెట్లుపయోగింపవలయునో తెలియదు. మఱియు పాటలు పాడుచు తన్నుతాను మఱచుట నాగరకలక్షణము గాదను భర్తగారి భావము భార్యకును సంక్రమింపకపోదు. ఇఁక యజమానుని చదువే యీమెయు నేర్చెనేని అడుగవలసినపని లేదు. ఇట్లగుటచేత నేటి పెండ్లిపేరంటములలో మాటలేకాని పాటలు పూజ్యమైనవి. ఆకువక్కలదండుగయే తప్ప ఐదువరాండ్రతో నిప్పుడు పనియే లేదు. ఐనను హిందూజాతిలో పుట్టినపుణ్యముచే సహజమగు గానాభిరుచిగలవా రగుటవలన, మన తరుణబ్రహ్మచారులలో కొందఱు తమధర్మపత్నులు కాఁబోవు కన్యలకు సంగీతము వచ్చియుండవలయునని యభిలాషపడుచున్నారు. పాడుటకు తమ కిష్టములేకున్నను, ఇతరులు పాడినయెడల సంతోషించు చైతన్య మింకను వారిలో మిగిలియున్నది. కాని వారి కీపెండ్లి పాటలపైనను, భజనకీర్తనలమీఁదను అసహ్యము. గ్రామోఫోనులలో తా మక్కడక్కడ వినినట్టి కోయంబత్తూరు తాయివలె పాడఁగలిగిన కోమలాంగి వారు కోరునది. వారిపాలిటికి పాట యొక పడకింటి యలంకారము. దీనివలని ఫల మేమనఁగా, అల్లుండ్రను సంపాదించునఱకును, తరువాత కొన్నాళ్లును ఆఁడబిడ్డలతండ్రి హార్మోనియమును శరణుఁజొచ్చుట తటస్థించినది. నెలకొక నాల్గురూపాయల కర్చుతో తంత్రీతంటా తెగిపోవును. ఇల్లాలు సంగీతము నేర్చుకొనుచున్న దని యల్లు డానందపడుచుండును. ఇంతేకాని ఆమె నేమి నేర్చుకొనుచున్నదని యత్తఁడుగాని యితఁడుగాని విచారింపఁడు. ఏమి

విచారింపఁగలఁడు? ఏమైన దానివిషయము తెలిసినఁగదా! అట్లగుటచే, శారీరతారతమ్య మెఱుఁగని, శ్రుతిస్వరజ్ఞానము లేని, అర్థభావముల గంధమెఱుఁగని, ఇంక నే యేవిధముగను జీవనము జరుపుకొనలేని, యెవఁడోయొకఁ డేదోశ్రుతిలో ఏవో కీర్తనలను పాఠము చెప్పి పోవుటచే, మన నేఁటి నాగరికుల యింటిబాలికలకు శ్రుతిశూన్యమైన, అర్థ మంతరించిన, భావము బ్రద్దలైన, యనిర్వచనీయమైన యసహ్యావస్తు వొకటి సంగీతమనుపేర లభించుచున్నది. తంత్రీనాదముతో మేళవింపఁదగిన వారి సుకుమారశారీరము, ఆహార్మోనియపు నిర్ఘోషము వెంట అఱవవలసివచ్చుటచే కందికుందిపోవుచున్నది. దానినే వినివిని మృదునాదమును గ్రహించు, అభినందించు శక్తియే శ్రవణేంద్రియమునకు నశించుచున్నది. ఈ హార్మోనియ మిప్పటి యనేక విద్వాంసులకే శ్రుతిజ్ఞానమును చెఱచిన దన్నప్పుడు తక్కిన వారిమాట యేల?

సామాన్యమైన యింటిపాటయే యీ యవస్థకు వచ్చినప్పుడు, ఇఁక సంగీతవిద్య గతి యేమని యడుగువా రెవరు? దాని నొక విద్యగా పాడుటకుఁగాని, వాయించుటకుఁగాని, నేర్వఁబూనుట సామాన్యమైన సాహసము గాదు. తలలోని మెదడును, దేహములోని రక్తమాంసములును దినదినమును కరఁగునట్లు కష్టించువారికి తప్ప, సోమరి సుకుమారులకు, వన్నెవిసనకఱ్ఱలకు, ఇది వలచి వచ్చు విద్య గాదు. ఆహారవిహారాదులలో నియమము గలిగి, శరీర మనస్సులను నీరోగముగా నుంచుకొన్నవాఁడు బిగువైన నరముల పట్టు గలవాఁడు, మేధావంతుఁడగు రసికుఁడు దీనిని వశీకరించుకొనఁజాలును. చిత్తరువు, కవిత్వము, విగ్రహరచన మొదలగు ఇతరకళల నాశ్రయించినవారికి వారివారి పనిని తృప్తికరముగా తీర్చుటకు కావలసినంతకాలముండును. ఆలోచించుట కవకాశము గలదు. భావప్రవాహము నిలిచినప్పుడు, దేహశక్తి తగ్గినప్పుడు, విశ్రాంతి తీసికొనవచ్చును. సర్వాంగసుందరముగా వస్తువును తయారుచేయువఱకును ఒకరికి చూపక, చేసి, తరువాత నిర్భయముగా బైలుపెట్టవచ్చును. మఱియు తాము చేసినదానిని తామే ప్రదర్శింపవలసిన నిర్బంధము లేదు. గాయకుని కట్లు గాదు. ఇతనిది ఆక్షణమం దందఱిమెదుటను జేయవలసిన కనుకట్టు గారడీవిద్య. కావలెనన్నప్పుడు కృత్రిమముగా రసభావములను తా నారోపించుకొని, యెదుటివా రెందఱైనను, వారిమనోధర్మము లెట్లుండినను, వానినెల్ల తనవంక కీడ్చుకొని, తాను తలఁచినట్లు వారి నాడించుట యతని ధర్మము. ఇంటిలో వల్లించుకొన్న కీర్తనలు వర్ణములు మొదలగునవన్నియు ఇటుక, గార మొదలగు వానివంటివే కాని, వానిని తగినట్లు చేర్చి కట్టుట యను గాయకునిపని మనయెదురనే జరుగవలయును. మఱియు ఆగంధర్వనగర మాక్షణమందే నశించును. ఇట్లు ఇతరులు రచించిన పాటలు పాడునప్పుడు అందలి రసభావములను తనయం దారోపించుకొనుట

కును, సొంతముగా రాగాలాపన, పల్లవి విస్త రింపు, స్వరకల్పన మొదలగువానిని చేయున ప్పుడు అపూర్వములైన రసభావభేదములను సృజించుటకును గాయకునికి దేహమనస్సత్త్వ శక్తులన్నియు స్వాధీనములై యుండవలయును. కావుననే ఈకీర్తనను ఈరాగమును ఇట్లే పాడఁగలనని ముందుగా ఏగాయకుఁడుగాని నమ్మియుండఁజాలఁడు. ఇట్టిసామర్థ్యమును సం పాదింపవలయునన్న దానిని గుర్తించి సంతో షింపఁగల సహృదయు లుండవలదా?

'సహృదయుల కేమి కొదవ? మేమందఱ మును గామా? చక్కని సంగీతము పాడి మా మనసు కరఁగింపఁగల సమర్థుఁ డుండెనేని అవి యేమి కరఁగ మనుచున్నవా?' అని కొందఱ నుకొనవచ్చును. సామాన్యముగ కళలవిష యమున అనేకులు విద్యావంతులే యిట్టితప్పు తలఁపులకు లోనగుదురు. కళలయం దభిమా నము గలవారెల్లా, కళలలో సుఖము గలదని యెఱిఁగినవారెల్ల సహృదయు లగుదురని న మ్మట పొరపాటు. సహృదయశబ్దమునకు రెం డర్థములు గలవు. హృదయమను పదార్థము గలవాఁడనుట యొకటి. అనఁగా కన్ను, ముక్కు, చెవి మొదలగు ఇంద్రియములకు సామాన్యముగ నేయేగుణములు- వన్నె, వాసన, నాదము మొదలగునవి—గ్రాహ్యము లగునో, అట్టివానిలో సంతోషము గలిగించు వానిని గ్రహించి సంతోషించునంతరంగము గలవాఁడనుట. ఈవిషయమున ఇంచుమిం చుగా అందఱు సహృదయులే. నలుపుకన్న నీలివన్నె దర్శనీయమని, ఉల్లికన్న మల్లి వా సన భోగ్యమని, కాంచనముకన్న కంచునా దము శ్రావ్యమని యెవరికి తెలియదు! 'ఇంచు మించుగా'నని యెందుకంటి వనఁగా, కొంద ఱికి అభ్యాసము మొదలగు దోషములచేత ఈమాత్రపు గ్రహణశక్తియు హృదయమున కుండదు. తంబూర దాసర్లకు తగినదనియు, హార్మోనియమే ఆడుబిడ్డల కలంకారమనియు భావించువారు మనలో లేరా? పొడుము వేయు వారికి పునుఁగుకన్న పొగాకువాసన సుఖము గదా! ఐనను మొత్తముమీఁద పరిశుద్ధమైన పంచేంద్రియములు గలవారందఱు సహృద యులనవచ్చును. కాని ఈమాత్రముచాలునా? పలువన్నెలు కలిపి, పెక్కు వాసనవస్తువులను జేర్చి, వివిధనాదములను మేళగించి— మను ష్యులెన్నియో విచిత్రవస్తువులను సృజింప నేర్చుకొన్నారు. వానిని చూచినప్పుడు, మూ ర్కొనునప్పుడు, విన్నప్పుడు కలుగవలసినరస భావభేదములను గ్రహించుట కందఱికినిసామ ర్థ్యము గలదా? అందుకు సంస్కారము గావ లయును. సంస్కారమనఁగా సాధన కాదు. అది కళావంతుని పని. పాటకునివలె వినువారు గూడ అరుణోదయమున లేచి అకారసాధన చేయఁబనిలేదు. మఱి సంస్కారమనఁగా చిన్న నాఁటినుండియట్టిశిల్పకౌశల్యమునువిని, చూచి, మననము చేసియుండుటచే మన హృదయము నకుఁ గలుగు నొకవిధమైన పదను. దానిచే మనము గాయకునివలె పాడలేకున్నను, పాడు నప్పు డతఁ డేయే రసభావములు మనకుఁ

గలుగవలెనని సంకల్పించి పనిచేయునో వాని నెల్ల నట్లే గ్రహించి యనుభవింపఁ గల్గు వాఁడు. ఇదే సహృదయశబ్దమునకు రెండవ యర్థము. సమానమైన హృదయము గలవాఁ డనుట. ఇట్టివానినే ప్రాచీనులు 'వాసనా పరిపక్వబుద్ధి' యనిరి.

ఈవాసనయే కళల యభివృద్ధికి జీవము. అదియే యిపుడు సంగీతవిషయమున మనలో మందగించుచున్నది. ఇందుకు కారణము ముఖ్యముగా నిప్పటివిద్యాపద్ధతియని మొదలే విన్నవించితిని. ఇందులో సంగీతమునకు ప్రాధాన్యముమాట యట్లుండ, అసలు చోటే లేదు. ఇటీవల కాశీహిందూవిశ్వవిద్యాలయమువారు ధైర్యపడి మార్గముఁ జూపఁగా, మదరాసు వారును, ఆంధ్రులును తమతమ యూనివర్సిటీ మందిరములలో సంగీతపుగాలి ప్రవేశించుటకు కొంత తలుపోరఁజేసినారని విన్నాను. ఇది యొక సంతోషవిషయమే. కాని యిందువలన అధికారులదయకు పాత్రులైన నేయొకరిద్దఱికో నెలకు ముప్పది రూపాయలు జీతము లభింపవచ్చును గాని వేఱుఫలము నాకుఁగానరాలేదు. ఎందుకంటిరా: ఇప్పటి కళాశాలలు భాగ్యవంతులగు నలుగురికే కాని పేదవారి కందని మ్రానిపండ్లు. ఆ నలుగురికైనను సంగీతము నిర్బంధ పఠనీయముగా నుంచుటకు యూనివర్సిటీవారు ధైర్యపడుదు రని నేను నమ్మను. ఒకవేళ నట్లుచేయఁగల్గినను,సామాన్యముగా నొకరిద్ద ఱుపాధ్యాయులు దానిని సఫలముగా నిర్వహింపలేరు. తక్కిన విషయములందువలె విద్యార్థులను పందలకొలఁదిగా మందచేర్చి ఒక్క గంటప్రొద్దు ఉపన్యాసమాత్రమున సంగీతమువచ్చునట్టి విద్యగాదు. మనసంగీతము పాశ్చాత్త్యుల సంగీతము వలె మేళప్రధానము గాదు. వారిలో ఎందఱుమనుష్యులో అన్ని పాటలు, అన్ని వాద్యములు. గుంపెంతయున్న నంత గొప్పతనము. సమష్టిగా నందఱునుగలిసి పాడుటచేత, వాయించుటచేత, కలుగు వివిధనాద మేళనమే వారి యుద్దిష్టఫలము. వ్యక్తులెట్లున్నను అంత బాధ లేదు. మనమార్గము వేఱు. లయము మనకు జీవము. శ్రుతి, తాళము, రాగము, భావము మొదలగువానితో గాయకుఁడు పూర్తిగా లయించి, అనఁగా తన్ను మఱచిపోవలయును. ఇందులో నేదికొఱంతయైనను పాటపస చెడును. మఱియు పాశ్చాత్త్యులలో వేయిమంది యొక మేళముగా చేరినను — ఇది అతిశయోక్తి గాదు: యుద్ధకాలములో నింగ్లండులోని యొక మేళములో పదివేల మంది యుండిరఁట! — వారందఱును ఇతరుఁడెవఁడో చేసిన పాటను కింకరులై యనువాదము చేయుదురే కాని, స్వతంత్రించి యొకసంగతివేయుటకును ఎవనికిని అధికార ముండదు. ఇట్లగుటచే వారిలో గాయకుఁడు పాటకు లొంగినవాఁడే కాని పాట గాయకునికి లొంగియుండదు. మనలో నట్లుగాక యితరులు రచించిన, లేక, తానే యెప్పుడో రచించిన, కీర్తన వర్ణాదుల నాధారముగామాత్రము గొని, యందుపై తత్కాలమున స్ఫురించుభావములను వ్యక్తపఱుచు

## ప్రాచీన భారతీయచిత్రకళ-మొగలుచక్రవర్తుల యుద్ధచిత్రములు



3. రెండవచిత్రమునందలి ధ్వంసమైన బురుజు-కుడివైపు



౪. చిత్తూరుముట్టడిలో అక్బరుచక్రవర్తి జయమల్లుని చంపుట

రాగాలాపన, స్వరకల్పన మొదలగుస్వతంత్ర సృష్టి చేయవలసి యుండును. ఇందుచే ఉపాధ్యాయుఁడు శిష్యులకు ప్రత్యేకముగా నేర్పి తయారుచేయవలసి యుండును గాని గుంపు గూర్చుటకు వీలులేదు. కనీసము ముగ్గురి కెక్కువగా నేకకాలమందు మన సంగీతము నేర్పుట అసాధ్యకార్య మని చెప్పఁగలను. ఇట్లుండుటచే శిష్యులసంఖ్యకు కావలసి నంద ఱిని ఉపాధ్యాయులను నియమించి, వారంద ఱికి తగిన విశాలమందిరములనునిర్మించి,అభ్యాస కాలమందలి వారి యపస్వరము విసుటకోర్పు గలిగి, పనిచేయించుటకు కావలసిన శక్తియు రక్తియు ఇప్పటి మన యే యూనివర్సిటీకిని యున్నట్లు నాకు తోఁపలేదు. మఱియు నిప్పటి పాఠపద్ధతికిని కళాప్రపంచమునకును వైరము. చదువునేర్పిన శాస్త్రముచేసి జీతము సంపా దింపఁదలఁచుకొన్న వారికి సంపాదించుకొనఁ గలయనుకూలములు గలవారికి ఇది వరప్రసా దము వంటిది. పరీక్షలలో ముప్పదియైదు మార్కులు సంపాదించుట గురువునకు శిష్యు నకుఁ గూడ పరమ పురుషార్థము. దానిని సాధించుటకుఁ గావలసిన క్రొత్తక్రొత్త మార్గ ములను దినదినమునువారు కనిపెట్టుచున్నారు. ఆయేఱు దాఁటినతరువాత ఆ తెప్పను తిరిగి చూడఁబనిలేదు. ఈభావము మనవారికి ఐదవ యేట అక్షరాభ్యాసమునాఁటి నుండి పుట్టి రానురానుబలసి సహజమైన జ్ఞానాభిలాష నే తెగఁదినుచున్నది. మన సర్వకళాశాల లిట్టి దుర్భావమును విద్యార్థులలో బుద్ధిపూర్వక

ముగ పెంచుచున్న వని చెప్పుట యన్యాయ మ గునుగాని, పెరుఁగుచున్న దానిని నశింపఁజేయు టకుతగినప్రయత్నములేమియుఁజేయకఇంకను ప్రాతత్రోవలోనే యున్న వనుట యసత్యము గాదు.ఇట్టి సన్నివేశములలో కళలు పెరుఁగవు. వానిని నేర్చువాఁడు నిత్యమును పరీక్షయిచ్చు టకు సిద్ధముగా నుండవలయును నిన్నటి సర్టిఫి కేటు చూపి నేఁడు సన్మానము నాశించుటకు వానికి సాధ్యములేదు. అందును సంగీతగాంధ్ర విషయమింకను గష్టము. ఒకచక్కని కావ్య మును వ్రాసినకవి మఱేమియు వ్రాయకున్నను వచ్చినవారికి దానినే వినిపించవచ్చును. ఒక మాఱువ్రాసినచిత్రమును తరువాత నెందఱి కైనను ఎన్నిమాఱులైనను చూపవచ్చును. కాని యేఁడాదిక్రింద పాడిన తోడిరాగము నకై యీదినము విద్వాంసునికి తోడావేయు వారెవరు? అతని సృష్టిమెఱపుఁదీఁగ వంటిది. అప్పుడేపుట్టి యప్పుడే నశించునది. ఎప్పుడును సాధించుచునే యుండవలయును. లేకున్న శరీ రశారీరములు రెండును స్వాధీనము తప్పును. కావున అట్లు సాధించుటకు సిద్ధమై, దానికి విరోధమైనవానినెల్ల వదలుకొనుటకు తయా రుపడినవానికి తప్ప ఇతరుల కీవిద్య ఫలింపదు. ఇప్పటి యూనివర్సిటీలలో ఇట్టి యుత్సాహ మును, త్యాగమును గలిగించు సన్నివేశము లేదనుట యసత్యమా? అట్లున్నపుడు సంగీ తముగూడ తమ 'కరికులము'లోఁ గలదని ప్రకటించుకొనుటవలని ఫలమేమి? నిజముగా వారి కభిమానము గలదేని, ఇట్టి ప్రాత

మెఱుంగుపనులను వదలి, వైద్యము, న్యాయము, గణితము మొదలగువాని కేర్పఱిచినట్లు తగినంత ద్రవ్యము వెచ్చించి ప్రత్యేకముగ గానవాదన కళాశాలలను స్థాపించు త్యాగమును జూపవలెను. 'విద్వాంసులను తయారుచేయుట మాయుద్దేశము కాదు. విద్యార్థులకు, అందుమూలమున జనసామాన్యమునకును సామాన్యమైన సంగీతాభిరుచిని గలిగించుట మా ప్రయత్నము' అని యందురేని అదియును ఫలించుట దుర్లభము. వా రిచ్చు ముప్పది రూపాయలకు మూఁడవ తరగతి విద్వాంసుఁడును లభించుట కష్టము. అట్టివాడు వారమున కొకటి రెండు గంటలు విద్యార్థులకు సరళివరుసను జెప్పుటచే వారికి లభించునదేమి? సంగీతమం దభిరుచి కాదు, అసహ్యము. అన్ని విద్యలకంటె సంగీతము ఆరంభదశయం దసహ్యామైనది. వట్టి అక్షరాభ్యాసముతో అభిరుచి గల్గునని తలఁపవచ్చునా? కావున అభిరుచి గల్గుటకు సాధనకంటె సంస్కారము ముఖ్యమని మొదలే విన్నవించితిని. దానికి యూనివర్సిటీవారు నెలకొకతూరి యైనను ప్రసిద్ధ విద్వాంసులను పిలిపించి, వారి కచ్చేరీలను విద్యార్థులు వినునట్లుచేసి, గాయకులను బహూకరింపవలయును. విద్యార్థులకు పట్టములనిచ్చు మహాసభలు మొదలగువాని యందెల్ల సంగీత మొక ముఖ్యాంగమునుగా నుంచుకొనవలయును. జీతబత్తెములిచ్చి యెందఱో పరదేశ పండితులను బిలిపించి, వేఱువేఱు విషయములందువారిచేత Extension Lectures అను పేర నుపన్యాసము లిప్పుడు ప్రతియూనివర్సిటీవారును ఇప్పించుచు, విద్యార్థులకే కాక యితర ప్రజలకును జ్ఞానాభివృద్ధికి తోడ్పడుచున్నారుగదా. అట్లే ప్రజలలో సహృదయత్వము గల్గించుటకు వేఱువేఱుకళల ప్రదర్శన మేల చేయింపరాదు? మఱియు పైయుపన్యాసములలో కొన్ని సంగీతవిద్యనుగూర్చియు జరుగుచున్నవి. కాని సంగీతకచ్చేరీ లేమి పాపము చేసినవి? వానికేల చోటులేదు? ఒక్కొకచ్చేరీ కలిగించినంత చిత్తసంస్కారమును పదియుపన్యాసములైనను గలిగింపఁ జాలవు.

విద్యావిధానమునకు ఫలము నాగరకత, నాగరకతకు ముఖ్యలక్షణము కళలయందు మంచి యభిరుచి. కావున దానిలో లేనిది దీనిలో నెందుండి వచ్చును? అట్లగుటచేత నే నేటి నాగరకులలో ననేకులకు సంగీతమన్న నౌదాసీన్యము మాత్రమే కాక కొందఱికి ద్వేషమును గలుగుచున్నది. మన కర్థముగాని వస్తువులపై అనాదరము సహజముగదా! అనాదరమునకు తరువాతిమెట్టు అసహ్యము. ఒకానొక గొప్ప విద్యాధికుఁడగు పదవీధరుఁడు హిందూసంగీతము పాచిపండ్లదాసరిపాటవంటిదే కాని, యందులో 'నవ్యత'యను కళాలక్షణములేదని నాతో పలుమాఱు వాదించుచుండెడివాఁడు. కొందఱువిద్వాంసులపాట యట్లుండుట యీ భ్రాంతికిఁ గారణము గావచ్చును. కాని యంతకన్న ముఖ్యకారణ మాపండితునిబుద్ధి ఈవిషయమున వాసనాపరిపక్వము కాకపోవుటయే. అపురూపముగ నేనొయొక పాటకచ్చేరీకిఁ

భోయి, యెవరితోడనో యేమేమో మాటలా డుచు కాలక్షేపముచేసి బైటికి వచ్చినమా త్రాన సంగీతమువంటి కళను విమర్శించుట కధికారము చాలదని మనము గుర్తింపవలసి యున్నది. పట్టపరీక్ష లెన్ని ప్యాసుచేసినను, ఇతరకళలతో మనకెంత పరిచయము ప్రావీణ్యము గల్గినను, ఈకళతో తగినంత పరిచయము గల్గువఱకును ఈవిషయమున మన మందఱమును బాలురవంటివారమే యని మనయజ్ఞానమును మన మంగీకరింపవలసియున్నది. సంగీతములో సంగతులేల యనువారు కొందఱు; శ్రుతిచేయునంతకాలము వేచియుండు ఓర్పులేక తంబురయే వలదనువారు మఱికొందఱు; చేతులతో తొడలు తట్టక గంభీరముగ పాడరాదా యని యింకఁ గొందఱు; మృదంగనాదము వినలేక తల కంటగించుకొనువారు కొందఱు: ఇట్టి స్వాజ్ఞానజ్ఞానములేని విద్యాధికులై, యధికారులై, నాగరకతకు దారిచూపువారగుటచేత, నేఁడు సంగీతాభివృద్ధికిఁ గావలసిన వాసనావంతులగు రసికులు, సహృదయులు అపురూపమగుచున్నారు. వారికిఁగల ధనవిద్యాధికార గౌరవముచేత కచ్చేరీలలో ముందు కూర్చుండఁబెట్టుకొన్నను, పాటకుఁడు ఎక్కడనో మూలలోఁ గూర్చుండి తనపాటను తదేకధ్యానముతో వినుచుండు ఏబీద ముదుసలిప్రక్కకో ఆసక్తో దృష్టి నిగిడింపవలసియున్నది. దిన దినమును ఇట్టి సంస్కారము మనజీవితము నుండి వేఱుపడి దూరమగుచున్నది. దానికై ద్రవ్యమును, కాలమును వెచ్చించుట వృథావ్యయమను భావము వేరూరుచున్నది. ఇప్పటికిని సంగీతవిద్య మనదేశములో పూర్తిగా నశింపకుండుటకు, సంగీతగాంద్రకు జీవనము జరుగుచుండుటకు, ప్రాచీన నాగరకతకుఁ జేరిన దాతలగు ప్రభువులును, ధనవంతులును కొంద ఱింకను బ్రతికియుండుటయే కారణము గాని నవనాగరకుల మగు మనము గాము. సుమారైదాఱేండ్లక్రింద చెన్నపట్టణములో నొక చెట్టియారుగారు తన కూఁతురు చెవులుగుట్టించుమహోత్సవమునందు వేలకొలఁది వెచ్చించి పదినాళ్లు ప్రసిద్ధ విద్వాంసుల సంగీతముచే పట్టణము వారి నందఱిని ఆనందసముద్రమున నోలలాడించిరఁట! మా మైసూరు మహారాజుగారు ప్రతినిత్యమును కొన్నిగంట లైనను సంగీత ప్రపంచమందు లీనమై యుందురు. ప్రతి సంవత్సరమును వారి వర్ధంతియందును, నవరాత్ర కాలమందును బైటినుండి వచ్చు విద్వాంసుల బహుమతులకై వారు వెచ్చించు ధనము కొన్నివేలకు తక్కువ గాదు. ఊరి విద్వాంసులకు నూర్లకొలఁది నెలజీతము లిచ్చుచున్నారు. మనలో ననేకులు దీనిని పిచ్చి యందురు. కాని యీ పిచ్చియే కళల యభివృద్ధికి కల్పవృక్షము వంటిది. ఈ పిచ్చియే కవిసార్వభౌముఁడగు శ్రీనాథునికి ముత్యాల పందిటిలో కనకాభిషేకము చేయించినది. బాణునివంటి కవి మనకు లభించుటకు బారువుల కొలఁది బంగారు కర్చుచేసిన మహారా

జాధిరాజ శ్రీహర్షవర్ధనుని దిదే పిచ్చియే! పాశ్చాత్య దేశములలో ప్రాచీన చిత్రకారుల చిత్రము లొక్కొక్కటి లక్షలకొలఁది పౌనుల విలువ చేయుచుండుట కిట్టి పిచ్చివాండ్రుం డుండుటనే కారణము! ఇంతయేల? ప్రపంచమునందలి సప్తవిచిత్రములలో నొకటి యనఁబడు టాజ్ మహాలను - ఇంటినిగాదు- గోరీని నిర్మించుట కెన్నియో కోట్లు వెచ్చించిన షాహాజహాను చక్రవర్తి యిట్టి పిచ్చివారి కెల్ల ప్రథమాచార్యుఁడు! కావున మన యీ యజ్ఞానమును, ఈ 'స్వాదుపరాఙ్ముఖ' త్వమును, ఈ రసద్వేషమును దూరముగాఁ జేసి బ్రదుకు ధన్యముగాఁ జేసికొను నుపాయమును మన మందఱమును నేఁడాలోచింపవలసి యున్నది.

మనమనఁగా, గానవిద్యయం దభిరుచియు, అభిమానమును గలిగి దానియం దెక్కువ పరిశ్రమచేయనివారనియు దానిని,జీవికగానుంచుకొననివారనియు నాయుద్దేశము. కాని,సంగీత విద్వాంసులు, దానిని బ్రదుకుతెరువుగా నుపయోగించుకొన్నవారు, ఈవిషయమున మన కన్న నెక్కువ పని చేయవలసి యున్నది. చక్కఁగా విని యానందించువా రుండినచో పాడఁగల విద్వాంసులు వృద్ధి యగుదురనుట సత్యమే. కాని చక్కఁగా పాడఁగలవారుండిన విని యానందించి బహూకరించు వారును ఎక్కువయగుదురనుట యంతకంటె సత్యము. కావున సంగీతవిద్యయొక్క వృద్ధినాశములకు తాము ను ముఖ్యకారణభూతులనుట విద్వాంసులు తెలుసుకొనవలసి యున్నది. నే నెఱిఁగినంతవఱకును ఇప్పటివిద్వాంసులు సంగీతపు విలువ నెఱిఁగిన సహృదయులు లేరని యితరులను దిట్టుచున్నారేకాని, అట్లు వారు లేకపోవుటకు తమదోషముగూడఁ గలదని యూహింపరు. సంగీతము రక్తిప్రధానమైన విద్యయని వారిలో ననేకులు గ్రహించి యుండలేదు. తక్కినయన్ని విద్యలవలెనేయిదియును సాత్త్విక రాజసతామసములని మూఁడు విధములుగా విభజింపవచ్చును. (౧) సాత్త్వికము కేవలాత్మోత్తారణమునకు మాత్రమే యుపయోగించునది. ఇతరులు ఎవరుగాని అభినందించుటయు నిందించుటయు లెక్కింపక, 'ఉండేది రాముఁడో సోముఁడో యొకఁ'డని నమ్మి, అతని నుపాసించుటకై, అతనియందు చిత్తవృత్తిని నిరోధించుటకై నాదోపాసన చేసిన త్యాగరాజాది మహనీయులకు మాత్రమే యది యబ్బినసొమ్ము. కర్మ, జ్ఞానము మొదలగువానివలె నిదియు నొక యోగము. భక్తి వైరాగ్యములుమాత్ర మిందు ప్రధానములు. (౨) రాజసము- ఇది శృంగారాది నవరసములును, అసంఖ్య భావములును ప్రదర్శించి, తన్మూలమున తనకును, పరులకును మనసులఁ గరఁగించి యిహలోకము నిరుపురికిసి సుఖమయముగాఁ జేయునది. ఇందు పాటకుఁడు నటునివలె నభినయించును. కావలెనన్నప్పుడు తనలో రసభావములు లేకున్నను వానినారోపించుకొని తన్మయత్వమును జెంది, వినువారికిని ఆయాభావము లుక్కివచ్చునట్లు చేయు

ను.ఇదియే కళ. (3) తామసము-రసభావముల సంబంధము లేక, కేవలము తనశక్తిని ప్రదర్శించుట మాత్రమే దీనిపని. గాయకుఁ డెంత ప్రొద్దు గ్రుక్కపట్టఁగలఁడు, ఎంత వేగముగా అకారములను పలికింపఁ గలఁడు, ఎన్ని స్థాయులలో సంచరింపఁగలఁడు, ఇతరులు చేయలేని పనులెన్ని చేయఁగలఁడు, మొదలగు చర్చ లిందువచ్చును. కాఁబట్టి యిందులో స్పర్థ ముఖ్యముగానుండును ఈమూఁడు విధములలోసాత్త్వికగానము ప్రకృతవిషయముగాదు. ఎవనియంత కువాఁడు దానినిసాధించుకోవలసిన దేకాని, దానికితరులపని లేదుగావున ఇతరులకును దానితో పనిలేదు. మనకుఁగావలసినది రాజసకళ. సంసార సుఖదుఃఖములలో మునిఁగి తేలుచున్న మనలను క్షణకాలమైనను మైమఱపించునది యదే. కాని యిప్పటి విద్వాంసులలో అనేకు లాశ్రయించినది యదిగాదు. మఱి? తామసవిద్య. వారికి కావలసినది కలహము. ప్రక్కవాద్యములవారికి పాటకుఁడును, వానికి వీరును పరాభవము గల్గించుటకే ప్రయత్నింతురు. రసభావములు సులభముగా చేతికి దొరకు పదార్థములు కావుగావున వానినిట్లు రచ్చకీడ్చుట సాధ్యముగాదు. వానిలో ప్రవేశించినవాఁడు తన్నే మఱచును. కావున ఇప్పటివిద్వాంసులపాటలో చాలవఱకు నివి వెనుకఁబడినవి. చిత్రవిచిత్రములగు పనుల కవకాశమిచ్చునదియు, జ్ఞాపకశక్తి, దేహబలము వీని నాశ్రయించినదియునగు తాళము ముందుకు వచ్చినది. దీనినే యిప్పటివా రనేకులు లయమందురు. కాని లయమనేక విధములు. లయ మనఁగా సామ్యము. భావములో లయమున్నది; శ్రుతికి లయమున్నది; తాళమునకును లయము గలదు. వరాళిని నవ్వుచు, బేగడ నేడ్చుచు పాడక, 'రామ నీసమాన మెవరు' అనునప్పుడు రామునితో యుద్ధమునకు నిల్చిన రావణాసురుని వలె నభినయింపక, రాగభావమును గాని, సాహిత్యభావమును గాని ప్రత్యక్షముగా ననుభవించినట్లు చూపుట భావలయము; ఆధారషడ్జమైన శ్రుతియందు ఏయే స్వరము లేయే స్థానమున జన్మించునో దానిని దాఁటిపోక, అన్నియు దానియందే అణఁగిన ట్లుండుట శ్రుతిలయము; ద్రుతమధ్య విళంబకాలములలో దేనినాశ్రయించిపాడుట కుపక్రమింతుమో దానినే వెనుకకీడ్వక, ముందుకు త్రోయక, తుదవఱకును నిర్వహించుట తాళలయము. తాళ మనఁగా అక్షరకాలములను లెక్కించుట మాత్రమే యర్థము. కాని నేటి విద్వాంసు లనేకులు పై లయములలో దేనిని గమనింపక, కేవల సంఖ్యాప్రధాన మగు నొక తాళమును మాత్రము ముఖ్యముగాఁ గొని, తమ పాండిత్యమునంతయు దానిలో ప్రదర్శింపఁ బ్రయత్నింతురు. ఇట్టి తాళపు పనులకు కీర్తన, వర్ణము, పదము మొదలగువానికన్న పల్లవి, అందును స్వరకల్పన, మిక్కిలి యనుకూలమై యుండుటచే వానికి ప్రాముఖ్యము వచ్చినది. ఇందుచేతనే పాటకునికి సహాయులుగా నుండవలసిన ప్రక్కవాద్యములవారు సమానులై,

కొన్ని సందర్భములందు వానికన్న ప్రధాను లై మెలఁగుచున్నారు. సంఖ్యామాత్రప్రధాన మైన సంగీతమందు మద్దెలనోరు, పాటకుని నోరు, రెండును సమానములే కదా. ఇట్లగు టచే ఏపాట పాడినను, దానికి చేతనైనన్ని యావర్తములు స్వరము వేయక, పల్లవి కర్తరిదాఁటుల పనిచూపక, నేఁడు విద్వాంసుఁడు తృప్తిపడఁడు. ఇట్లగుటచే ఇప్పటి కచ్చేరీలలో, దాక్షిణాత్యపద్ధతిలోని యనేక తాళములును, వాని యంగములును ఎఱిఁగిన వారి కేమో కొంతవఱకు ఆనందమో, ఆశ్చర్యమో కల్గునుగాని, తెలియనివారికి కలుగున దేమి? అసహ్యము. మఱేమున్నది? సభానాయకుఁడగు విద్వాంసుఁడు ఏదో జాతికిఁ జేరిన యేదో తాళములో పల్లవి నెత్తి, వేలువేలు విచిత్రవిన్యాసములతో జాతిభేదములను జూపునప్పుడు, తప్పిపోవునను భయముచే మేనంతయు చెమర్చుచుండఁగా, తొడపై తో లెగురునట్లు తట్టుచు, మొగము ముడిపెసికొని, కన్నులెఱ్ఱఁ జేసికొని, నరములన్నియు బిగించుకొని, గొంతుగరుసువాఱఁగా, చేతులు వీచుచు చేయు వికారములకు తోడుఁగా, పిడీలు మృదంగము వారును ఇట్లే ఒకరిని మించి మఱియొకరు చేయుచుండు కరకర డమడమ ధ్వనులతోడ, సభ్యులలో ఇట్టి వీరావేశము గలవారు కొందఱు శక్తికొలఁదితాళమును చేతులతో తట్టుపట పటధ్వనులును జేరి, నాదము నశించి,లయము లయించి, ఏదోయొక నిర్ఘోషమొక్కటి చెవులు దిమ్ము పట్టించుచుండఁగా, అట్టి సంగీతపు తుపానులో భావమునకు రసమునకు భ్రాంతి పడివచ్చిన రసికులకు రోఁతకాక మఱేమి కలుగును? ఇనుపయంగడిలో ఈఁగల కేమున్నది?

నిజముగా విచారించితిమేని, పల్లవి, స్వరకల్పనము ఈ రెండును దాక్షిణాత్యగాయకులు ప్రపంచమందలి సంగీతసరస్వతి కర్పించిన యమూల్యమైన సొమ్ములు. వర్ణములు, కీర్తనలు మొదలగునవి తానో యితరుఁడో మెప్పుడో కల్పించినవిగాన,వానిని పాడుటయందు తనకును, వినువారికిని గొంత యానందమున్నను పాడెడువానికి పారతంత్ర్య మెక్కువ. ప్రతిభాబలము ధారాళముగా ప్రవహించునప్పుడు స్వతంత్రసృష్టిలో నున్న యానందము అనుకరణములో నుండదు. చిత్రకారుఁడు మొదలగువారివలె గాయకునకు తాను సృజించిన వస్తువులన్నియు శాశ్వతముగా నుంచుటకు వీలులేదని మున్నే విన్నవించితినిగదా. కీర్తనల వర్ణముల వంటివి కొన్నియట్లు కల్పింపవచ్చునుగాని, వన్నెలు, భావ మొదలగు వానివలెఁగాక యితని కాధారమగు నాదము అనంతమైన, అమేయమైన వస్తువగుటచేత దానిలోని సృష్టివలె దీనిలోని సృష్టి యంతయు చేతికి దొరకదు. ఇదిగాక యది యెప్పుడో పుట్టి యప్పుడే యంతరించునది గావున దాని నప్పుడు వినఁగలవారే భాగ్యవంతులు. మఱియు ఇతరకళలవారిచేతి కందని సూక్ష్మాతిసూక్ష్మములైన రసభావభేదములను

సృజించి చూపు సామర్థ్యము సంగీతమునకుఁ గలదు. కావున ప్రతిభావంతుఁడైన గాయకునియందుఁగల యట్టి విచిత్రసృష్టి సామర్థ్యమును ప్రకటించుట కేర్పడిన యవకాశమే పల్లవి. రాగాలాపనయు నిట్టిదే కాని యందు సాహిత్యసంబంధము లేదు; తాళ లయము లేదు. పల్లవిలో నట్లుగాక అభినయము పట్టువారికివలె మూలభూతమైన భావ మొకటి, తాళబద్ధమైనది, యుండును. 'మందహాసవదన హరే శ్రీకృష్ణ' యను నొక బీజభూతమైన భావము నిచ్చుసాహిత్యపుఁదునుకను తీసికొని సమర్థుఁడగు గాయకుఁడు, శ్రీకృష్ణుని మందహాసము ఎట్టిెట్టి సన్నివేశములం దెట్లెట్లు భావభేదములను బడయునో వానినెల్ల రాగతాళలయముల సాహాయ్యముచే ప్రదర్శించి మనమనస్సులో నాటునట్లు చేయును. అతఁడు వేయు ప్రతిక్రొత్తసంగతియందును ఆచిఱునవ్వు క్రొత్తక్రొత్తగా ప్రత్యక్ష మగుచుండును. స్వరకల్పనమును ఇట్టిదే. కొన్నిరసభావముల కల్పనలను వట్టి అకారేకారములచే చూపుట యసాధ్యము. కావున సులభముగా నుచ్చరింపదగినవై, సప్తస్వరముల నూద్యక్షరములైన 'సరిగమపధని' యను నక్షరములను ప్రాచీనులు కల్పించిరి. తాళలయము స్పష్టముగా నుండు కల్పనలు ఇందులో సాధ్యమైనట్లు మఱెందును గావు. ఇట్టి యీ రెండుపద్ధతులను గల్పించిన దాక్షిణాత్యులకు గాయక ప్రపంచమే అప్పు వడియున్నది. ఇట్టిదానిని కేవలము తాళప్రధానముగా చేసి ఆధునికగాయకు లనేకులు లోకరంజకమైన తమవిద్యను తామే చెఱిచినారు. సంగీత విద్యాగురువగు భరతాచార్యని పేరులోని యక్షరములు భావరాగ తాళముల ప్రాధాన్యమును సూచించునని ప్రాచీనులనిరి. వానిలో మొదటి రెంటిని త్యజించి, కడపటి దానిని మాత్రము పాండిత్యసూచకముగా నేల నిర్ణయింపవలయునో! భావమును బ్రదర్శించుచు రాగమునం దపూర్వకల్పనలు చేయుటమాత్రము సులభమా? దానికి సాధనపని లేదా? అనుభవించినవారు అదే కష్టతరమని నిస్సందేహముగాఁ జెప్పుదురు,

ఎప్పు డిట్లు సంగీతమందు రసభావములు గాక తాళము ప్రధానమయ్యెనో, అప్పుడే సంగీతమునకు సాహిత్యమునకుఁగల సంబంధము దూరమై, సరస్వతి ఒంటిచంటిదేవత యాయెను. సాహిత్యసంస్కారములేని సంగీతము జీవాళిలేని తంబూర తంతివలె చచ్చువాఁటె యుండును. ఇదిలేని యదియునంతే. ఇవి రెండును పరస్పరము వన్నె వెట్టునట్టివస్తువులు. సంగీతమువారు సాహిత్యమునందును సాహిత్యమువారు సంగీతమునందును పూర్ణపాండిత్యము సంపాదింపఁ బనిలేదు. అది యసాధ్యము. ఇరుప్రక్కల పాలంతయు త్రాగినను మనతల్లి సరస్వతి వద్దనదు గాని మనకే అజీర్ణమేర్పడును. మఱియొకటి పూర్తిగా నేర్వఁబ్రయత్నించినవారు రెండవదాని సామాన్యమర్మములైనను తెలిసికొనవలయును. సంగీతమం దేఅక్షరముల సంబంధములేకయే రసభావములను స్పష్టముగాఁ జూపవచ్చునుగదా.

దానినే మెఱుఁగనివారికి, దానికే ప్రాధాన్య మీయనివారికి, చెక్కబొమ్మలవలె శుష్కముఖములతో రాగకీర్తనాదులను నోటినుండి జారవిడుచువారికి, సాహిత్యరసభావము లిం కెందుకు? కావున 'రామ నీసమానమెవరు' అనునది 'రబ్బనిస్సబాన బెబరు' అని మారినను ఫరవాలేదు. ఒకానొక ఘనవిద్వాంసుఁడు గొప్పసభలో 'తామరసాక్షీ నీవెపుడు వత్తువోయని, తలవాకిలిల్లుగా నిలఁబడియున్నది' అను పదమును,

'త ఆమా అరా అసా క్షీ ఇనీ'

ఇత్యాదిగా తునుకలు తునుకలుగా త్రుంచి దిక్కొకటిగా విసరివేసెను! వాగ్గేయకారకులే ఉత్తములని చెప్పి ప్రాచీనులు సాహిత్యమున కగ్రస్థాన మిచ్చిరి. త్యాగరాజు, క్షేత్రయ మొదలగువారి మనోధర్మములు సాహిత్యసంస్కారముచే నెంత సుకుమారము లైనవో మన మెఱుఁగుదుము. వారివలె సృజించు యోగ్యత లేకున్న మానెను; గాని వారు రచించిన పాటలను అర్థభావము లెఱిఁగి పాడుటకును బ్రయత్నింపఁడేని ఆ గాయకు నేమని పిలువవలెనో మెఱుఁగను! ఇట్టివారే సంగీతమునకు వచ్చిన యిప్పటి యవస్థకు మూలకారణభూతు లన్నఁ దప్పేమి?

విద్వాంసులయెడ నిట్లు దోషము లెన్నఁబూనిన నా యపరాధమున కభిమానమే కారణమని గ్రహించి వారు నన్ను మన్నింతురు గాక. ఇప్పటి గానపద్ధతి నిట్లే జరుగ నిచ్చిన నింక కొన్నాళ్లలో సంగీతమే సమయును. కావున నెవరైనను నిష్ఠురముగాఁ బలికితీఱవలయును. విద్వాంసుల కోపము నోర్వవచ్చును గాని సంగీతనాశమును ఓర్వలేము. మఱియు నేఁటి పాటకుల కందఱికిని ఈ దోషములు గలవని చెప్పలేదు. రసికులైన విద్వాంసు లనేకు లింకను బ్రతికి యున్నారు. వారివలననే సంగీతమునకు మర్యాద యింకను నిలిచి యున్నది. కాని సామాన్యముగా నిప్పటి విద్వాంసు లనేకులకుఁ గల కలహప్రియత్వమును, వారి నీరస గానపద్ధతియు, ప్రజలలో గానాభిరుచినే నశింపఁజేయుచున్నదని చెప్పక తప్పదు.

మన సంగీతమున కిట్టి యవస్థ రానీయరాదు. ఇది లోకోత్తరమైన విద్య. ఇతర దేశమువారి సంగీతము నే నెఱుఁగను గాని, విన్నంత వఱకును అది హిందువుల కళకు సాటిరాదని నా భావము. ఇది యభిమానపు మాట కాదు. అజ్ఞానపుమాట కావచ్చును. శ్రీ మైసూరు మహారాజుగారు యూరపు సంగీతమునకుఁ గూడ తమసంస్థానమం దెక్కువ ప్రోత్సాహము నొసంగుచుండుటచే మా కప్పుడప్పు డది చెవులఁ బడుచుండును. కాని యది యింకను నాచెవులకు నచ్చలేదు. మనసంగీతపురుచి మరఁగిన నామిత్రులలో నే నెఱిఁగినంతవఱకును నాకన్న పాశ్చాత్యసంగీతమందభిరుచి కలవారు కానరాలేదు. ఇఁక హిందూస్తానీగానమునకు రూపము కొంత మాఱినదిగాని ప్రాణము మనదే. మనది కర్మభూమి



Lakshmi Art, Bombay, 8.

వసంతఋతువు

చిత్రకారుడు: శ్రీ యస్. యన్. గోరక్షకర్.

గావున పారతంత్ర్యమెక్కువ. వారిది పుణ్యభూమి యగుటచే స్వతంత్రము వారిలో నధికము. క్రొత్తసంస్కారములు వారిలో వ్యాపించినంత త్వరగా మనలో వ్యాపింపవు. కావున ఆదేశమందలి మనుష్యులందువలె సంగీతమందును పరదేశీయుల సంబంధము స్పష్టముగాఁ గానవచ్చుచున్నది. ఇంతేకాని, శాస్త్రము, ఫలము, పద్ధతి మనకు వారికిని తుల్యమే. లోపములును అట్లే. మనవారు పల్లవి స్వరములతో ప్రాణము దీయుచుండఁగా, వారు తానములనుబెంచి తల నొప్పింతురు. హిందూస్తాని సంగీతమునందు కర్ణాటక సంగీతము కంటె రుచి యెక్కువ యున్నదని మన మనుకొందుము. మనగానమే మనోహరతరమని వా రనుకొందురు. మనకదియు వారికిదియు క్రొత్త. ఇంతేకాని స్వభావభేదము లేదు. ప్రకృతను వారిచింత మనకు పనిలేదు. ఇంటగెల్చి రచ్చగెల్తముగాక. మన గానము నీరస మగుచున్నది. పరస్పర ప్రాణములగు సంగీతసాహిత్యము లెడఁబడుచున్నవి. క్రమముగా పాటయందు రుచియు గౌరవమును నశింపఁ జొచ్చినవి. ఈయవస్థకు ప్రతీకారము మీరు వెదకవలయును. ఈసభలో విద్వాంసులగు సహృదయులును, సహృదయులైన విద్వాంసులును సమావేశమైనారు. ఇట్టిచో మనము సంగీతవిద్యాయోగక్షేమములను విచారింపక మఱి యెవరికి సాధ్యము ?

మనకు, అనఁగా తెలుఁగువారికి, ఈవిషయమును విచారించుట కధికారము గలదు; ఆవశ్యకతయుఁ గలదు. అధికార మేమనఁగా, నిజము చూడఁబోయిన నీవిద్య మనది. దాక్షిణాత్యసంగీతమందలి సుప్రసిద్ధరచనలలో ముక్కాలుపాలు తెలుఁగువారివే. శొంఠివారి వర్ణములు, శ్యామాశాస్త్రులు, త్యాగరాజు మొదలగువారి కీర్తనలు, రసమూర్తి యగు క్షేత్రయ మొదలగువారిపదములు తరువాతివారికి మార్గదర్శకములు మాత్రమే కాక యిప్పటికిని సాటిలేక విలసిల్లుచున్నవి. వీరి రచనల నెఱుంగనివారికి దక్షిణ సంగీతపు గాంభీర్యము, మాధుర్యము, అందఁగలవిచిత్రకల్పనల కవకాశమును అర్థము కాదన్న నసత్యము కాదు. అందును తెలుఁగువారిలో తెలుఁగువాఁడైన త్యాగరాజును మఱచిన గాయకుఁ డేచెలువునీల్గు త్రాగఁ గలఁడు? ఆగానమందిరమున కతఁడు మూలస్తంభము. మూఁడుగంటల కచ్చేరీలో రెండు గంటల ప్రొద్దైనను త్యాగరాజు కీర్తనలకు వినియోగింపక నేఁటిగాయకునికి గతిలేదు. ఇఁక సంగీతము తెలియని సాహితివారికిని, సాహితి నెఱుఁగని గాయకులకును మనస్సును గరఁగింపఁ గల్గి, రెంటి నెఱిఁగిన రసికులకు ప్రపంచమునే రసమయముగా చేయఁగల పదములను సృజించిన క్షేత్రయ మావాఁడని చెప్పుకొనఁ గల ఆంధ్రులభాగ్యమునకు మించినదేది? తక్కినవా రెవరెట్లైనను ఈ యిరువురపేళ్లును గాన ప్రపంచమందుండువఱకును ఈసంగీతము మనదని చెప్పుటలో సంకోచము మనకు పనిలేదు.

ఇదిగాక ఈ సంగీతమునకు జీవము తెలుఁగు. ఇంటిలో నేభాష మాటలాడు కొన్నను దాక్షిణాత్యులందఱును సంగీత విషయమం దాంధ్రులే. కన్నడము, మళయాళము, అరవము వీనియందు పదకీర్తనాదు లున్నను ఆవి సంగీతపునమారాధనలో నంజుకోనలసిన యూరుగాయలవంటి వంతే. ఇది ప్రపంచమునందుండువారికెల్ల స్వాభిమానమును, స్వీయాభిమానమును సహజముగాఁ గాకున్న కృత్రిమముగా నైనను గల్గించు కాలము కాఁబట్టి, యిఁకముందు ఆంధ్రేతరు లభిమాన పూరితులై తెలుఁగును వదలుకొనఁ గల్గిరేని యప్పు డెట్లగునో చెప్పలేను గాని, ఇప్పటికేమో ఆంధ్రభాషకును దాక్షిణాత్యగానమునకును వీడరాని సంబంధ మున్నది.

ఇట్టిసంబంధ మెందుచేఁ గలిగినదని విచారించుట యప్రకృతముగాదు. ఎందుకనఁగా: 'ఎన్నఁడో పూర్వికులైన త్యాగరాజాదులు తెలుఁగువారగుటచేత ఆభాషలో రచనచేయఁగా వారిభక్తులైన తరువాతివారు అంధపరంపరగా అది విడిచిన గతిలేదనుకొని దాని నేపట్టుకొని ప్రాఁకులాడిరేకాని, తక్కినభాషలకన్న నందులో విశేషమేమి?' యని అనాంధ్రులు కొందఱు తలఁపవచ్చును. కావ్యనాటకాది సారస్వత రచనలందుఁ గాని, సభావేదులం దుపన్యసించుట యందుఁగాని, ఇతరభాషలకన్న తెలుఁగున విశేషమున్నదని నేననుకొనలేదు గాని, సంగీతవిషయమున తప్పకయున్నది. 'దేశభాషలందు తెలుఁగులెస్స' యను వాక్యమునందలి సత్యము నా కిందే గోచరించుచున్నది. కారణ మేమనఁగా: తెలుఁగు అజంతభాష. ప్రతిపదమును ఇతరభాషలవలె హల్లుతోఁ గాక యచ్చుతో ముగియును. పదాంతమందు ప్రాయికముగ వచ్చు నకారము గూడ నిత్యముగాదు. ఇచ్చవచ్చినఁ దీసివేయవచ్చును. అదియుండినను పాడువారి కనుకూలమేకాని ప్రతికూలము గాదు. ఇదిగాక మన భాష సంస్కృత ప్రాకృతద్రావిడ భాషలలోని మృదువైన యక్షరములనుమాత్రము గ్రహించి కఠినములగు మహాప్రాణాక్షరములు మొదలగువానిని ప్రాయికముగ వదలుకొన్నది. క్వ, క్త మొదలగువిజాతీయాక్షరసంయోగమితరభాషలలోవలె మనభాషలో లేదనియే చెప్పవలయును. కావున కావ్యరీతులలో ఉత్తమమైన వైదర్భి మనభాషకు సహజము. ఇతరులు దానికై ప్రయత్న పడవలయును. ఇఁక సంగీతమందన్ననో, ప్రయత్నమంతయు నాదమునకై యుపయోగింపవలసియున్నది గాన అక్షరము లెంత సుఖోచ్చారణములుగానున్న నంతమేలు. మఱియు నాదమున కచ్చులు ప్రధానములు. వానిమూలముననే నాదము స్పష్టముగా వ్యక్తమగును. కావున వట్టి హలంతశబ్దములు సంగీతమునకు శత్రువులు. అట్లగుటచే గానమునందు నాదాభివ్యక్తి స్పష్టముగా నుండవలయునంటిరేని, అందుకు నేను విన్నభాషలలో తెలుఁగువంటిది లేదు. కనుకనే నాఁటినుండి నేఁటివఱకును శుద్ధ తమిళులును, శుద్ధకర్ణాటకులును

తెలుఁగులోనే తమచేతనైనంతవఱకును గీతరచనలఁ జేయుచున్నారు. కావున ద్రావిడసంగీతపు యోగక్షేమము లనఁగా ఆంధ్రభాష యోగక్షేమములే యగును. వానిని చర్చించు నధికారము మనకుఁగాక మఱెవరికి?

ఇఁక ఆవశ్యకత యున్నదంటిని. అదే మనఁగా: మొదటినుండి యాంధ్రదేశము సంగీతవిషయమున నశ్రద్ధయే చూపుచున్నట్లూహింపవలసి యున్నది. దాక్షిణాత్యగానాభివృద్ధికి ఆంధ్రులలోఁ గొందఱు వ్యక్తులు ముఖ్యకారణభూతులే; దానిని పోషించిన వారిలో దక్షిణదేశపుటాంధ్రనాయకరాజులు ముఖ్యులనుట సత్యమే; తెలుఁగుభాషయే దానికి జీవమనుట నిర్వివాదమే; కాని ఆంధ్రులు, ఆంధ్రదేశ వాసులు మొత్తము మీఁద సంగీతమునం దెక్కువ యభిమానము చూపలేదని కొందఱిమతము. ఇందుఁ గొంత సత్యమున్నదని మన మంగీకరింపకతప్పదు. త్యాగరాజు తెలుఁగువాఁడే. కాని యతనిని పెంచినది కావేరిగాని కృష్ణాగోదావరులు గావు. క్షేత్రయరసమాధురిని చూఱఁగొన్నది తంజాపూరు. శ్యామాశాస్త్రులు కంచికామాక్షమ్మకు దత్తు. త్యాగరాజుకాలమున అతని మహత్త్వమును విని తన సంస్థానమున కతని పిలిపించి ధన్యత్వము నందఁగోరిన మహారాజులు మళయాళమువారును, మైసూరువారు నఁట! ఏల? ఆకాలమం దాంధ్రదేశములో రాజులే లేరా? పోనిండు. ఇట్టి మహనీయుని వద్ద శిష్యవృత్తి చేయవలయునని తలఁచిన యా కాలపు టాంధ్రుఁ డెవఁడైన నున్నాఁడా? అతని శిష్యు లందఱు అరవవారే; లేక, అరవదేశమందున్న తెలుఁగువారు. అదియు నుండనిండు. రామరాజభూషణుఁడు 'సంగీతకళారహస్యనిధి' గదా! ఆ రహస్యము లెట్టివో, యతఁ డేమికృతులను జేసెనో, ఆంధ్రులు ప్రపంచమునకు తెలుపవలదా? తాళ్లపాకవారి తంబూరను మాత్రము వేణుగోపాల శతకకర్త వేళాకోళము చేసెనే కాని, వేలకు మించినవారి కీర్తనల వర్ణమెట్లను ఇతరులకు మనము తెలుపఁగలిగి యున్నామా? వెంకటమఖిసంప్రదాయమును స్పష్టముగాఁ దెలుపఁగలవారు దక్షిణమున వేనకువేలున్నారుగాని, మన రామామాత్యుని సతేఁడు చెడఁదిట్టినను నోరు మూసికొని యున్నామే కాని, ఆ రామామాత్యుని పద్ధతి ప్రకారము రాగాది స్వరూపము లెఱిఁగింపఁగల ఆంధ్రుఁడు నేఁ డున్నాఁడా? త్యాగరాజు మనవాఁ డనుమాట మనకు నేఁడు వచ్చినది. ఇంతే కాని నేటికిని అతనికీర్తనలం దితరుల కున్న భక్తి మన కున్నదా? ఉండనేని వానిని చక్కఁగా నర్థముచేసికోలేని యరవవారల తప్పుల తడకల మూలమును, విపరీత వ్యాఖ్యానములను నమ్మియుండవలసిన యక్కఱ లేక, మనమే వానిని చక్కఁగా ప్రకటించి యుండమా? ఈధర్మ మిదివఱకును తెనుఁగెఱిఁగినయాంధ్రుల కేలగోచరింపలేదు? మఱియు సంగీతమునుగూర్చి నేఁడు తెలుఁగున వ్రాయఁ

బడిన గ్రంథములలో తెలుఁగువారు రచించిన వెన్ని? పదికి రెండున్నవా? ఆగ్రంథము లైనను అరవ కన్నడ దేశములలో నమ్ముడు పోయినట్లు తెలుఁగుదేశమున నమ్ముడుపోవు చున్నవా? లేదని నే నెఱుఁగుదును. కాఁ బట్టియే తెలుఁగు 'త్యాగరాజహృదయము' మూఁడుసంపుటములకే నిలిచినది. ఇటీవల తెలుఁగుకీర్తనలు రచించినవా రందఱును అరవలో కన్నడులోకాని తెలుఁగువారి కీర్తన లేల వినరావు? తెలుఁగురానివారు తెలుఁగు నేర్చుకొనియందుఁకీర్తనలువ్రాసి తెలుఁగువారికే పాడుఁకొనుఁడనియిచ్చుధైర్యమునకుసంతోష పడుదముగాని,వానినితీసికొనవలసిన మనదైన్య ము నేమననలయును? మార్గదర్శకులు మన వారై, భాషమనదై, మనకే దానియం దభి మాన ముండియుండె నేని,ఆంధ్రసంగీత మనక, ద్రావిడ సంగీతమనియు కర్ణాటకసంగీతమనియు పేరు దానికి రానిచ్చియుందుమా? దానిని పో షించిన మధుర తంజావూరు నాయకులు తెలుఁగువారుగదా! కర్ణాటకరాజు లాంధ్రులై నను గాకున్నను వారిచేతిక్రింది రాజ్యము లలో ఆంధ్రరాజ్యము పెద్దదిగదా! ఆంధ్రజ నసంఖ్య యెక్కువగాదా! నేటికిని సుప్రసిద్ధ విద్వాంసులందఱు అరవవారో కన్నడులో కాని శుద్ధాంధ్రదేశ విద్వాంసు లేల బైటికి రారు? ఇటీవల శ్రీపిఠాపురపు సంగమేశ్వర శాస్త్రులవారు, శ్రీహరి నాగభూషణంపంతు లువారు, వీరివంటియొకరిద్దఱు మహావిద్వాం సులు తెలుఁగుగోడలఁ జీల్చుకొని బైటఁబడు చున్నారు; కాని మనగుంపున కా యొకరిద్దఱు చాలునా? కావున ఆంధ్రులకు సంగీతమందు ప్రతిభ లేదనియెవరునుజెప్పసాహసింపరు కాని, అది ప్రసిద్ధికి వచ్చుటకు ఆంధ్ర దేశమందు తగిన రంగస్థలము కావలసినంత ఆంధ్రు లేర్ప ఱుప లేదనియూహింపవలసియున్నది. ఇట్టియప వాదమును బోఁగొట్టుకొనుటకై పనిచేయవల సిన యావశ్యకత నేఁడు మన కున్నది.

మీకు కర్తవ్యము నుపదేశించుశక్తి నా కింతయు లేదుగాని, యీవిషయమున మన మేమి చేయవలెననుటలో నాకుఁదోఁచినయొక టిరెండు విషయములు విన్నవించుచున్నాను. మనబిడ్డలకు, మగవారుగాని ఆఁడువారుగాని, చిన్ననాఁటినుండి ధారాళముగా పాటలు పాడునట్టి యవకాశముఁ గల్పింపవలయును. చక్కనిశారీర మున్నపిల్లవారిచేత పాడించక పోవుట, వారికి సాధ్యమైనంతవఱకు సంగీతవి ద్యను జెప్పింపకపోవుట, సృష్టికర్తవిషయమున చేయు గొప్పద్రోహమని తల్లిదండ్రు లందఱును దలంపవలయును. మఱియు పాడుట మను ష్యులకొఱ కేర్పడిన విద్యగావున సామాన్య ముగా నందఱికిని మంచిశారీరమే యుండును. అది చిన్ననాఁటినుండి తగినంతపరిశ్రమ లేక పోయెనేని కృశించి పగులును. అట్లుగాకుండఁ గాపాడుట జననిజనకుల ధర్మము. ఇదిగాక చిన్ననాఁటి నుండి శారీరమునకు పరిశ్రమ నిచ్చుటచే శ్వాసకోశములు బలిష్ఠములై శరీ రారోగ్యము వృద్ధియగును. కావున బిడ్డలకు పాటనేర్పుట మనము వారి యారోగ్యమును

గానాపాడుట యగును. అనుకూల మున్న వారెల్ల తమ బిడ్డలలో సంగీతమం దభిరుచియును, శక్తియుఁ గలవారిని ప్రత్యేకముగా ఆవిద్య యందే తయారుచేయఁ బ్రయత్నింపవలయును. అనుకూలమున్న వారంటిని. అభిమాన మున్న ననుకూల మెవరికి లేదు? తమ కుమారులను బి. ఏ., యం. ఏ. లవఱకును చదివించు తల్లిదండ్రులలో ఎందఱికి నిజమైన ద్రవ్యాదిసాహాయ్యము గలదో యోచింపుఁడు. అందుకై ఒంటిపూట భుజించుచున్న వా రెందఱు లేరు? ఈకార్యమును విద్యాధికులైన గొప్పవా రుపక్రమింప వలయును. వారు ధారాళముగా సంకోచము వదలి తాము పాడుటకు మొదలు ప్రయత్నింప వలయును. సంతోషకర మగు సమస్తసన్నివేశములందును శక్తికొలఁది పాటకచ్చేరీలు చేయించి విద్వాంసులను బహూకరింపవలయును.ఏసందర్భములందైనను గాయకుని పెట్టికి పాడి పొమ్మనుట బిచ్చమెత్తుటకంటె నీచమైనదని యెల్లరును తలఁప వలయును. మఱియు గాయకుని ఒకకూలివానిఁగాఁగాక మనకు మనోవికాసమును ప్రసాదించుదాతఁగా భావింపవలయును. దారిద్ర్యమే కారణముగాసామాన్యజనులుసంగీతజ్ఞానము లోఁబడిపోకుండ ధనవంతులు వారికి తమ సెలవుచే సంగీతమును వినిపింపవలయును. ఇవన్నియుకొన్ని యేండ్లక్రింద మనమవలంబించుచుండిన పద్ధతులేకాని క్రొత్తవికావు.ఇంతకన్న ముఖ్యమై మనము గాయకులయెడఁ జేయు మహోపకారము, ధర్మము, ఒకటి యున్నది.

అదేమనఁగా,అతఁడుపాడుచున్నప్పుడుమనము శ్రద్ధగలిగి వినుచు మౌనముగా నుండుట. మీకీ మాట నవ్వు పుట్టింపవచ్చును గాని, కొందఱికెక్కడలేని చర్చలును పాటకచ్చేరీలలోనే దాపురమగును. మన మనస్సు నాకర్షించి యానందము గల్గించుటకై నిర్వంచనగా తన్ను మఱచి పనిచేయు గాయకునికి, మనము పరాకుగా మాటలాడుచుంటిమేని, తనప్రయత్నము నిష్ఫలమాయెనని ప్రాణ మెంత చివుక్కుమనునో యనుభవించినవారికే యెఱుక! వానికి మనల నాకర్షించుశక్తి లేకపోవచ్చును; కాని యట్లు చేయవలయునని నిష్కల్మష శ్రద్ధమాత్రము తప్పక యుండును. అశ్రద్ధగా పనిచేయుటకు ఏకళావంతునికిని సామాన్యముగ సాధ్యముగాదు. కళలవలనఁ గలుగు చిత్తసంస్కార మట్టిది. అందును గాయకునికిఅదియసాధ్యమనియే చెప్పవలయును. సద్యస్సంతోషము గల్గించుట వాని ధర్మము గావున వాఁడు పరాకుగా నుండ వీలేలేదు. శ్రద్ధగలవానితో మన ముదాసీనముగా వర్తించిన అతని కంతకంటె దుఃఖ ముండదు. మఱియు పాడఁగలవాని శక్తిసామర్థ్యము లన్నియు బైటికిఁ దీయుశక్తి వినువారిలో నున్నది. ఇదిగాక మనకు రుచింపనిపాట పదిమందిలో ఇతరులకు రుచింపవచ్చును. అట్టిచో సంతోషమనుభవించు ఇతరులకు మనమాటలచే విఘ్నముఁగల్గించినవార మగుదుము. కావున సభలో వచ్చి కూర్చున్నతరువాత మనకు సుఖము లేకున్నను గాయకునియెడ నవధానముంచి

ప్రోత్సహించుట ధర్మము. అది సాధ్యము గాదేని మౌనముగా సహించియుండుట మం చినడత. తుదకు సభవిడిచి పోయినను మేలే. కాని ప్రకటముగా గాయకునికి నిరుత్సాహ మును, ఇతరులకు విఘ్నమును గల్గించుచు, మాటలాడుట మనము సంగీత విద్యావిషయ మునఁ జేయు మన్నింపరాని యపరాధము.

ఇవన్నియు ప్రత్యేకముగా మన మందఱ మును జేయవలసిన పనులు. ఇదిగాక వీలైన చోట్లనెల్ల సమాజముల నేర్పఱుపవలయును. అనేకస్థలములలో పలుమాఱిట్టిసభలఁ గూర్చి ప్రకృత సంగీత పరిస్థితులను చర్చించుటయే కాక, ప్రత్యేకముగా చందాలు వేయించి విద్వాంసుల కచ్చేరీల నేర్పఱుపవలయును. కాని మొత్తముగా పదిమంది చేయు పనుల కంటె, కళల యభివృద్ధికి, వ్యక్తులు చేయు పనులే సాధనము లగును. సమాజములలో పరతంత్ర మెక్కువ; సభలలో పరోపదేశ పాండిత్య మెక్కువ. ఒకరిని చేయుమని ప్రా ర్థించుటకంటె తాము చేయుట వేయింతలు మేలు. ప్రజలు ఉదాహరణముచే గ్రహించు నట్లు ఉపదేశముచే గ్రహింపరు. సంగీతమందు అభిరుచి, యభిమానముఁ గలదని చెప్పువారి కెల్ల, దానినిగూర్చి యుపన్యసించువారి కెల్ల (ఇందులో నన్నుగూడఁ జేర్చుకొన్నాను) నా ప్రశ్న యొకటి గలదు. 'దానిని నేర్పుటకై, నేర్చినవారిని ప్రోత్సహించుటకై సొంతము గా మీరేమి చేసినారు?' అని. దీనికి మన హృదయమునకు తృప్తిగా ప్రత్యుత్తర మీ యఁగల ధైర్యమును మన మలవఱుచుకొన వలసి యున్నది.

మన యీ ప్రయత్నమునకు విద్వాం సులును నడిత్రోవ సహాయపడవలసి యున్న ది. ఎన్నేండ్లు సాధించినను, ఎన్ని విచిత్రము లను పల్లవి స్వరాదులలో చేయఁగల్గినను, సంగీతము రక్తిప్రధానమైన విద్యగాని శక్తి ప్రధానము గాదను తత్త్వమును వారు మఱవరాదు. శక్తి నొకమాఱు చూచితిమేని రెండవమాఱు చూచు నుత్సాహ ముండదు. అభినవభీమసేనుఁడు రామమూర్తిగారు ఏనుఁ గునెదపై మోఁచుట చూచితిని. సంతసించితిని. కాని మరలచూచు కోరిక లేదు. ఇట్లే సదాశివరాయలు ఒక సభలో పందెము వేసికొని పదునాఱుకళల చౌకపుపల్లవిలో అఖండముగా ఏనూరావర్తములు వేఱువేఱు జాతుల స్వరపంపకములుచేసి నిర్వహించిరఁట! ఇప్పటి విద్వాంసులెవరైన నేఁడీపని చేసిరేని ఒకమాఱుచూడ నాశగలదు. అంతేకాని, కాం భోజి, శహనా మొదలగు రాగములను రక్తిగ లిగించునట్లు పాడి చాలు ననిపించువా రున్నా రా? ఇదియే సర్కస్సునకు సంగీతమునకుఁ గల భేదము. తృప్తిలేని బ్రహ్మానందమువంటిదానిని ప్రసాదించు దివ్యవిద్య యిది. దీనిని రాతినవి ద్యగా మాఱనీక దివ్యముగా నుంచియుంచుట విద్వాంసుల ధర్మము. శక్తిని జూపుట కెంత సాధన గావలయునో రక్తిని గలిగించుట కంత కంటె నెక్కువయే కావలయును. శక్తిముఖ్య ముగా దేహముచేయునని; రక్తి మనోబుద్ధ

లకుఁ జేరినది. దేహసాధనయంతసులభము మనోబుద్ధుల సాధన కాదని వేఱ చెప్పవలయునా? ఇట్లు విద్వాంసులు సంగీతమును రక్తిప్రధానముగాఁ జేయుటయే కాక, దాని ప్రచారమునకు తాము ముఖ్యముగా తోడ్పడవలయును. ఎందుకనఁగా: ఏవిద్యను జీవితముగా నేర్పఱచుకొన్నను అందు వ్యాపారధర్మము వర్తించును. తన కిచ్చవచ్చినట్లు వస్తువులను తయారుచేసి పెట్టుకొని ప్రజలు కొనలేదని యంగలార్చు బేహారికంటె వెఱ్ఱివాఁ డింకొకఁ డుండఁడు. ప్రజలకుఁ గావలసినవానిని తయారుచేయుట వ్యాపారి మొదటిధర్మము. తా న పూర్వవస్తువులను సృజించి ప్రజల కందు రుచి పుట్టించుట యంతకంటె కష్టమైన రెండవ ధర్మము. కావున నిప్పటి విద్వాంసులు రసికులకుఁ గావలసినట్లు పాడుటయే కాక, తమపాట నర్థముచేసికొని యనుభవించు రసికులను గూడ తామే తయారుచేయవలసి యున్నది. ఇందుకై, కచేరీలలో కలహమును దూరముగాచేయుట, నేర్చినపాటల యర్థభావములను చక్కఁగా పలుమాఱు మననముచేసి స్వాధీనపఱచుకొనుట, వినవలెనని యాశించినవారికెల్ల చేతనైనంతవఱకు వినిపించుట, అంతకన్న ముఖ్యముగా నేర్వవలెనని యపేక్షించినవారికెల్ల నేర్పుట—తమ ధర్మములుగా వారు గ్రహింపవలయును. మఱియు ద్రవ్యమే ప్రధానఫలముగా భావించిన యెవ్వనికిఁ గాని సంగీతము స్వాధీనము గానేరదు. ఇది రాజస విద్యగా నున్నంతవఱకు దీనికి ఫలము పరులను సంతోషపెట్టుటయే. కావున తనకు ద్రవ్యలాభము లేదని కుళ్లుచుఁ గూర్చున్న యేగాయకుఁడు పాటలో రక్తికలిగింపఁ గలఁడు? ఇట్లని వినువారగు రసికులు విద్వాంసుల కుపవాసవ్రత ముపదేశింపరాదని మొదలే విన్నవించితినిగదా. వారిని బహూకరించుట మన ధర్మము. మన బహుమానమే ప్రధానముగా తలఁపకుండుట వారిధర్మము. ఇట్లు ఎవరెవరి ధర్మములను వారు గుర్తించిననాఁడే సంగీతమునకు కృతయుగ మేర్పడును. ప్రాచీనులు దీని నెఱిఁగి యాచరణలోనికిఁ దెచ్చియుండిరి. మనమేల తేలేము?

మహాశయులార! ఏవో కొన్ని మాటలు విన్నవించితిని. మీ కందఱకును ఇంత కాలహరణము చేయఁగల ననుకోలేదు. కాల మెంతైనదను జ్ఞానము లేకుండుట సంగీతగాండ్ర స్వభావము. దానివిషయమై మాటలాడువారికిని అది సంక్రమించునుగాఁబోలు. నేఁటి నా మాటలందలి తక్కిన పొరపాట్లతో దీనిని గూడ మీరు మన్నింపఁ గర్తలు. 'మనయాంధ్రదేశములో సంగీతము రానివా రెవరును ఉండఁగూడదని నాయభిప్రాయము'. అని, కడచిన సంవత్సరపు సభాధ్యక్షులు శ్రీ హరి నాగభూషణంపంతులుగా రొక విలువలేని మాట వచించి, ఆంధ్రగాయకోద్యమమునకు మూలసూత్రమును రచించిరి. అది మన మందఱును నిత్యమును అనువాదము చేయవలసినమంత్రమని చెప్పుచు నింతటితో ముగించుటకు మీ యనుమతిని వేఁడుచున్నాను.

---




# చిట్టిపాపఁడ

నాళము కృష్ణరావు గారు

‘చిట్టిపాపఁడ! ఎందుండి యుట్టిపడితి?’ – ‘అవతరించితి దివినుండి యవనితలము.’
‘ముద్దు నెమ్మొగ మెందుండి పుణికికొంటి?’ – ‘పూర్ణచంద్రునిలోనుండి పుణికికొంటి.’
‘చిప్పకూఁకటు లెందుండి చిదుముకొంటి?’ – ‘చిమ్మచీఁకటిలోనుండి చిదుముకొంటి.’
‘మొలకనవ్వుల నెందుండి గిలుబుకొంటి?’ – ‘తళుకువెన్నెలలోనుండి గిలుబుకొంటి.’
‘సొగసుకన్నుల నెందుండి చూఱగొంటి?’ – ‘చుక్కగుంపులలోనుండి చూఱగొంటి.’
‘చులుకుచూపుల నెందుండి చెఱవికొంటి?’ – ‘మెఱపుతీవలలోనుండి చెఱవికొంటి.’
‘కొమరుపెదవుల నెందుండి గుంజికొంటి?’ – ‘సంజకెంపులలోనుండి గుంజికొంటి.’
‘పల్లువరుసల నెందుండి కొల్లగొంటి?’ – ‘మొల్లమొగ్గలలోనుండి కొల్లగొంటి.’
‘గొనబుపలుకుల నెందుండి కూర్చుకొంటి?’ – ‘కొదమచిలుకలలోనుండి కూర్చుకొంటి.’
‘బెళుకుచెక్కుల నెందుండి మలఁచికొంటి?’ – ‘నిలువుటద్దములోనుండి మలఁచికొంటి.’
‘చిన్నినాసిక యెందుండి చిమ్ముకొంటి?’ – ‘కమ్మసంపఁగిలోనుండి చిమ్ముకొంటి.’
‘బుచ్చిగడ్డము నెందుండి పుచ్చుకొంటి?’ – ‘పువ్వుతొడిమలలోనుండి పుచ్చుకొంటి.’
‘పొలుపుపొక్కిలి యెందుండి పొదివికొంటి?’ – ‘పొన్నపువ్వులలోనుండి పొదివికొంటి.’
‘కులుకునడకల నెందుండి కొసరుకొంటి?’ – ‘గున్నయేనుఁగులోనుండి కొసరుకొంటి.’
‘చిఱుతచేతుల నెందుండి తుఱిమికొంటి?’ – ‘తొగలతూఁడులలోనుండి తుఱిమికొంటి.’
‘చిట్టిపాపఁడ! నీమేని కెట్టు కలిగె? – ఇట్టిజిగి, యిట్టి నిగనిగ, యిట్టి వలపు?’
‘తఱచి మెఱపులలోనుండి తళతళయును – మంచుబిందులలోనుండి మార్దవంబు
పదను పుష్పాదిలోనుండి పరిమళంబు – తివిచి నా మేని చెలువంబు తీర్చికొంటి.’

---

ప్రాచీన భారతీయ చిత్రకళ-మొగలు చక్రవర్తుల యుద్ధచిత్రములు



౯. చితూరుముట్టడిలో రాజపుత్రస్త్రీల అగ్నిప్రవేశము



౬. రాయసర్జనుతో అక్బరుచక్రవర్తి పోరాడుట

# సప్తద్వీపములు

వ. వెంకటరంగయ్య గారు

## సప్తద్వీపములు

జంబూప్లక్షకుశక్రౌంచశాకశాల్మలిపుష్కరాః.

## సప్తసముద్రములు

లవణేక్షుసురాసర్పిర్దధిక్షీరజలార్ణవాః

పౌరాణికసంప్రదాయమున నీ ప్రపంచమంతయు సప్తద్వీపములుగ విభజింపబడినటులు తెలియుచున్నది. జంబూద్వీప మీయేడింటికిని కేంద్రస్థానమున నున్నటులును, ఇతరద్వీపములు తదేకకేంద్రములయి ఒకదాని చుట్టు నరియొకటి యున్నటులును ఒక్కొక్కద్వీపమునకును లవణాదిసప్తసముద్రములలో నొక్కొకటియావరణమై యున్నటులును తెలియుచున్నది. ఈపౌరాణికద్వీపసముద్రవిన్యాసమున నుండగల చిత్రము నీ క్రింద జూడ నగు. ఈద్వీపసముద్రములు ఈవిన్యాసము ననుసరించి యున్నవియా, లేక యిది కేవల పౌరాణికసంప్రదాయ మాత్రమా? యథాస్థితి యెటులున్నది? యను మొదలగు నంశములను బ్రహ్మశ్రీ వేదము వేంకటాచలయ్యరు (బి.ఏ., బి. యల్.)గారు గాఢముగ విమర్శించి, ప్రమాణ సందోహసహితముగ బెంగుళూరిలో ప్రకటింపబడు "మిథిక్ సొసైటి జర్నల్" (Journal of Mythic

సప్తద్వీపములు



Society)యను సంగిలీషు త్రైమాసిక పత్రికయొక్క 1924 సం. అక్టోబరు, 1925 సం. జనవరి, ఏప్రెలు, అక్టోబరు, 1926 ఏప్రెలు, జూలై, అక్టోబరు సంచికలందు ఎనుబదినాలుగు పుటల 'క్వార్టో'యాకృతిగల గ్రంథమును వ్యాసరూపమున ప్రకాశింపజేసియున్నారు. శ్రీఅయ్యరుగారి సమ్మతానుమానపురస్సరముగ నందలి ముఖ్యాంశము లిందు సంగ్రహింపబడినవి. అయ్యరుగారు బహుభాషాకోవిదులు, సంస్కృతపండితులు. ఆన వరతగ్రంథశోధనమె వారి కత్యంతప్రియమైనదై విశ్రాంతివినోదముల నిచ్చుచుండును. వకీలువృత్తియందు కుశలులై తద్గతాధ్యవసాయమున సక్తులయి యుండియు, ప్రాక్తనవిషయప్రచారముల కడుంగడు నుత్సాహముతో పరిశ్రమ చేయుచుందురు. వ్యాసవిరచితముగ లోకమున వ్యాపించియుండు మహాభారతకోశమును ఇపుడుండు రూపమునను యామహర్షి రచించెనా, లేక వ్యాసోక్తి ప్రక్షేపదుష్టమై పూర్వాపరపరివర్తన దూషితమై మహాభారతనామమున వర్ధిల్లుచున్నదియా యను ప్రౌఢచర్చను 'క్రౌను'ఆకృతి 415 పుటల గ్రంథముగ* నింగ్లీషులో 1922 సంవత్సరమున వీరు ప్రకటించియున్నారు. ఇట్టివైదుష్య సంపదచే పెన్నారు శ్రీఅయ్యరుగారు పురాణోక్తసప్తద్వీపాదులను, అధునాతన భూగోళవిన్యాసపరిస్థితులకు యథామతి సమన్వయము చేయగడంగిరి. బ్రిటిషురాజధానియగు లండన్ నగరమున రాయల్ జియోగ్రాఫికల్ సొసైటి (Rcyal Geographical Society of London) వారి యభిమాన పురస్సరముగ ప్రచురింపబడు జియోగ్రాఫికల్ జర్నల్ (Geographical Journal) యొక్క గతసెప్టెంబరు సంచికయందు ఈగ్రంథముపై విమర్శ జరిగి యిది యెక్కువగ శ్లాఘింపబడుటయేకాక, శ్రీ అయ్యరుగారి పరిశ్రమయు, కౌశలమును మిక్కిలి కొనియాడబడినవి. వీరి సిద్ధాంతములు కొన్ని తత్తద్విషయనిర్ణాయకములుగ నంగీకరింపబడినవి.

అన్ని పురాణములందును సప్తద్వీపపరిగణన మేకరీతిగ నుండుటలేదు. అనేకములం దీక్రిందివిధముగ నున్నది:

| ద్వీపములు | ద్వీపముల నావరించిన సముద్రములు |
|---|---|
| జంబూద్వీపము | లవణసముద్రము |
| ప్లక్ష | ఇక్షు |
| శాల్మల | సురా |
| కుశ | సర్పిః |
| క్రౌంచ | దధి |
| శాక | క్షీర |
| పుష్కర | జల (మంచినీళ్లు) |

మాత్స్య పురాణములందు ప్లక్షద్వీపము వదలబడి గోమేదము చేర్చబడి యున్నది. గోమేదమును గోమేదక మనుటయు గలదు. ప్లక్షమాయెను, గోమేదకమాయెను సంఖ్య యేడింటిని మించుటలేదు. అయ్యాయి పురాణాదులలో వీనివరుస యెట్లు వివరింపబడినదియు, నీక్రింది ఫలకమున (పుట ౧౧౫) తెలియగలదు.

అన్ని పురాణాదులలోనను, జంబూద్వీపము మొదటిదిగ నున్నది. స్కాందమునదప్ప కడపటిదానియందెల్లను పుష్కరము కడపటిదిగ నున్నది. స్కాంద మాస్థానమును గోమేదమున కొసంగినది. మిగిలిన యయిదింటి స్థానములు పరిపరివిధములుగ నున్నవి. సముద్రపరిగణనమునందును ఆద్యంతములన్నిట సమానములుగ నున్నవి. మిగిలినవాని స్థానములు మారుచున్నవి. భాస్కరకృతస్థలనిరూపణమున కాకర మెద్దియో తెలియలేదు. క్రౌంచగోమేదములు దప్ప కడమద్వీపముల కాయాయివృక్షరాజములవలన ఆయా నామములు గలిగినటు లున్నది. ఉదాహరణము, జంబూ (నేరేడు) వృక్షమువలన జంబూద్వీపము ఇత్యాది విధమున జూచికొనవలయును. క్రౌంచపర్వతము తద్గతద్వీపనామమునకు కారణమైనది. గోమేదము నిష్పత్తి విచికిత్సాధీనమై యున్నది. ఆయానామ వివరణము లాయాద్వీపప్రసంగమున ముచ్చటింపబడియున్నవి. సముద్రనామముల విషయమున లవణసముద్రము

* ఇది తెలుగున ప్రకటింపబడిన బాగుగ నుండును.

## సప్తద్వీపఫలకము

| ద్వీపసముద్ర సంఖ్య | గరుడపురాణము<br>బ్రహ్మపురాణము<br>లింగపురాణము<br>బ్రహ్మాండపురాణము<br>ఆగ్నేయపురాణము<br>దేవీభాగవతము<br>శ్రీమద్భాగవతము<br>వామనపురాణము<br>విష్ణుపురాణము<br>మార్కండేయపురాణము<br>కూర్మపురాణము<br>వాయుపురాణము | | మత్స్య పురాణము | వారాహ పురాణము | స్కాంద పురాణము | పద్మ పురాణము | మహా భారతము | భాస్కరాచార్య కృతసిద్ధాంత శిరోమణి |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | జంబూద్వీపము | | జంబూ | జంబూ | జంబూ | జంబూ | జంబూ | జంబూ |
| | లవణసముద్రము | | లవణ | లవణ | లవణ | లవణ | లవణ | లవణ |
| 2 | ప్లక్షద్వీపము | | శాక | శాక | శాక | శాక | శాక | శాక |
| | ఇక్షుసముద్రము | | క్షీర | క్షీర | క్షీర | క్షీర | క్షీర | క్షీర |
| 3 | శాల్మలద్వీపము | | కుశ | కుశ | పుష్కర | కుశ | కుశ | శాల్మల |
| | సురాసముద్రము | | సర్పి | దధి | సురా | ... | ... | ... |
| 4 | కుశద్వీపము | | క్రౌంచ | క్రౌంచ | కుశ | క్రౌంచ | క్రౌంచ | కుశ |
| | సర్పిస్సముద్రము | | దధి | సర్పిః | దధి | ... | ... | ... |
| 5 | క్రౌంచద్వీపము | | శాల్మల | శాల్మల | క్రౌంచ | పుష్కర | పుష్కర | క్రౌంచ |
| | (భాగవతి ద్వాసమున) క్షీరసముద్రము | (తదితరముల యందు) దధిసముద్రము | సురా | సురా | సర్పిః | ... | ... | ... |
| 6 | శాకద్వీపము | | గోమేద | గోమేద | శాల్మల | ... | ... | గోమేధ |
| | (భాగవతి ద్వయమున) దధిసముద్రము | (తదితరముల యందు) క్షీరసముద్రము | ఇక్షు | ఇక్షు | ఇక్షు | ... | ... | ... |
| 7 | పుష్కరద్వీపము | | పుష్కర | పుష్కర | గోమేద | ... | ... | పుష్కర |
| | జలసముద్రము | | జల | జల | జల | ... | ... | ... |

తప్ప మిగిలిన వాని నామధేయములన్నియు అవిచారిత రమణీయమై యుండగలదు.

సప్తధావిభాగము పౌరాణికసంభావనయా, లేక భూగోళస్థితియందు దీని కాధారము కలదా యనియు విమర్శింపవలయును. పౌరాణికమతమును భూతలము మీది దేశరాష్ట్రములతో సమన్వయింపజేయుట కనేకులు ప్రయత్నించిరి. పదునెనిమిదియవ శతాబ్దంబున బుట్టిన "ఏషియాటిక్ సొసైటి అఫ్ బెంగాల్" అను

సమాజములో నొకడయిన కేప్టన్ విల్ఫర్డు (Captain Wilford) గారు సప్తద్వీపములనుగూర్చి యొకవ్యాసము వ్రాసి, దానియందు ద్వీపాదులవరుస నిట్లు పేర్కొనియున్నారు:

(1) జంబూ (2) కుశ (3) ప్లక్ష (4) శాల్మల (5) క్రౌంచ లేక క్రౌంచ (6) శాక (7) పుష్కరములు. క్రౌంచ మను పేరు వీరి కెట్లు లభించినదియో? విల్ఫర్డుగారి వెనుక ననేకులు అనేక పత్రికలలో ననేకవ్యాసముల ప్రకటించిరి. ఆవ్యాసములన్నియు నిపుడు సులభ్యములు గావు. ఈనడుమ దినములలో డాక్టరు అనిబిసంటమ్మగారు రచించిన మానవవంశావళి (Pedigree of Man) అను గ్రంథమున ఈవిషయమై దివ్యజ్ఞాన ధోరణి నను సరించిన యుపపాదనము కొంత గలదు. మఱియు కర్నలు జరిని, క్లార్కు, వార్డు లోనగు విమర్శకు లీవిషయమును వదలిరి. జరినిగారు సప్తద్వీపములను ఇండియా, బర్మా, చీనా, మంగోలియా దేశములలో నిమిడ్చిరి. క్లార్కుగారు పురాణోల్లేఖల సంప్రతించిరి గాని వస్తు నిర్ణయము చేయజాలరైరి. వార్డుగారు క్లార్కుగారి సిద్ధాంతముల నొకప్రక్క పూర్వపక్షము చేయుచు, సప్త ద్వీపములను సూర్యచంద్రాది సప్తగ్రహమండలములం జేర్చిరి. ఇంకొకరిచే కింటిని ఆసియా, యూరోపు, ఆఫ్రికా, అమెరికా, ఆస్ట్రేలియా ఖండములపై బంచిపెట్టి, వివాద పరిసమాప్తి గావించిరి. నెల్లూరివాస్తవ్యులగు నొక జ్యోతిష సిద్ధాంతిగారు సప్తద్వీపములకు సౌర్ణమాస్యలతోడను, సముద్రములకు వర్షలతోడను సామరస్యమును సపు కూర్చి జ్యోతిషిక సంవిధానముల నుపష్టంభకము చేయుచున్నారు.

ఈసప్తద్వీపములంగూర్చి శ్రీ వేంకటాచలయ్యరు గారి యుపపాదన మేమన:—

## ౧. జంబూద్వీపము

(Mythic Journal, 1926 October)

ఒక గొప్ప (జంబూవృక్షము) నేరేడుచెట్టు ఈద్వీపనామమునకు గారణ మయినదని పురాణములు చెప్పుచున్నవి. "జంబూ" శబ్దము జంబుక, జంబాల, జంబాలిని లోనగు వానితో సాజాత్యము కలిగి యున్నది. ఈగణమునంతయు తడి లేక తేమ కలిగి యుండుట- అనుసు, బురద, బాడి కలిగిన నేలగ నుండుట, యిత్యాదిస్వభావములు కలుగుచున్నవి. జంబుకము (నక్క) తేమగల ప్రదేశముల వరించునది. ఈయార్ద్రి భావమే వరుణపర్యాయమగు "జంబుక" మునగూడ తోచుచున్నది. "జంబుకా క్రోష్టువరుణౌ" అని యమరుడు నానార్థవర్గమున పఠించియున్నాడు. వరుణుడు సముద్రములకును, జలములకును అధిపతి యగుటయే యాతని జంబుకత్వమునకు కారణమైనది.

ఆర్యజాతుల ప్రాథమికనివేశనములు జంబూకప్పములుగ నుండియుండును. ఆకారణముచే వారానివేశనముల కీపేరు తొలుదొల్త బెట్టుకొనియుందురు. ఆర్యజాతులు ప్రప్రథమమున ఐరోపాఖండవాసులయి, చుట నుండి వలసవెడలిరని యాధునికశోధకులలో గొందరు నిర్ణయించుచున్నారు. (శ్రీ అయ్యరుగా రీమతము నవలంబించినవారు.) అచటినుండి వలసవెడలినవారు గొందరు నల్లసముద్రము (Blak sea), ఏజావుసముద్రము (Sea of Azov) ప్రాంతముల గొంతకాలము విడిసియుండిరి. ఆప్రాంతములు నీపరు, నీస్టరు, డాన్ లోనగు గొప్పగొప్పనదుల ముఖద్వారపరిసరము లగుటచే నీటబుగ్గలవలె నమితముగ చెమ్మగలిగి యుండినవి. అది కారణముగ ఆప్రదేశములకు వారు "జంబూ" అని నామకరణము జేసియుందురు. కాలక్రమమున వారాప్రదేశము వదలి తూర్పు నడచినకొలదిని ఈ "జంబూ" నామము మొదట అన్వర్థముగ వచ్చియుండుట మరచిపోయి, ప్రాచీను లుండిన దేశనామమగుటను గౌరవముతో ఆనామమునే తాము నూతనముగ విడిసిన ప్రదేశములకును వ్యాపింప జేసికొని, నల్లసముద్రము మొదలు ఇండియావరకు గల భూభాగమున కంతయు ఈపేరు పెట్టుకొనిరి.

## ౨. ప్లక్షద్వీపము

(Mythic Journal, 1926 October)

అనేకవేల యోజనముల వెడల్పును, పొడవును గలిగియుండిన ప్లక్షవృక్షము (జువ్విచెట్టు) వలన ఈద్వీప

మున క్షితిపేరు కలిగెననని పురాణనిర్వాచనము. యథార్థమున నిది పలస్గియ (Pelasgia) యను గ్రీకు శబ్దవికృతి. గ్రీకుల యొక్కయు, రోమనులయొక్కయు ఆదిమజనమునకు పలస్గియనులని పేరు. గ్రీసు దేశములోని థెస్సలి, మాసిడోనియా, ఈపైరసు లోనగునవి ఈపలస్గియనుల నివాసస్థానములని చరిత్రకారులు నిర్ణయించియున్నారు. ప్లక్షద్వీపమే నిర్ణయమున కిటు లాధారమేర్పడుచున్నది. "పలస్గియ" యనునది ఉచ్చారణ సౌలభ్యము నుద్దేశించి కాలక్రమమున "ప్లక్ష" యను రూపమును పొంది సాధువైనది.

## 3. కుశద్వీపము

బహుయోజనాంతరాయామ విస్తారములు గల కుశగుల్మములవలన ఈద్వీపనామోత్పత్తి యని పౌరాణిక ప్రవచనమై యున్నది. ద్వీపనామమగు "కుశ" శబ్దము సంస్కృతము గాదు. ఇది యమరుడు పఠించిన "అస్త్రీ కుశం కుథో దర్భః" అనుగణములోని దర్భశబ్దపర్యాయముకాదు. అనాదికాలమునుండియు "కుశ" దేశమొకటి బైబిలులోనగు ప్రాచీన గ్రంథముల బల్కరింపబడియున్నది.

కుశద్వీపము రెండు ఖండములుగ భాగింపబడినటు లున్నది. ఫేబరు (G. S. Faber) అను నాంగ్లమతాచార్యునిచే విరచితమగు "క్రైస్తవేతరుల విగ్రహారాధనాంకురములు" (Origins of Pagan Idolatry) అను గొప్పగ్రంథమున నీ రెండుఖండములగూర్చి వ్రాయబడియున్నది. అందొకటి పారసీకము, బాబిలోనియా, బాక్ట్రియా, కాష్ఘరు, ఖోటాన్, టిబెటులోనగు దేశముల నావరించియుండిన దనియు, రెండవఖండము ఆఫ్రికాఖండములోని భాగమనియు సప్రమాణముగ నాతడు దెలిపియున్నాడు. ఈద్వీపమున కింకొకటి స్మృతి యుండినను, లేకున్నను టైగ్రిసుమహానది మొదలు ఇండియా వరకుగల ప్రదేశమంతయు కుశద్వీపముగ వ్యవహరింపబడుచుండినది. ఈకుశనామవాసనయే పారసీకదేశములోజేరిన ఖుజిస్థాన్ "Khuzistan" కుశస్థానములో నిమిడియున్నది. అమరుడు సూచించిన కుశకుథల యొక్కమున కాధారముగ ఈ కుశఖండవాసులకు "కుథైట్సు" (Cuthites) అనియు ప్రాచీన నామధేయము కలిగియుండినది.

## ౪. క్రౌంచద్వీపము

**(Mythic Journal, January 1925)**

స్కందపరశురాముల శక్తి ప్రయోగములకు లక్ష్యమయిన క్రౌంచపర్వతమువలన ఈద్వీపమున కీపేరు కలిగినది. ఈ పర్వతరాజమునకు మహోన్నతమగు వంశావళియు గలదు. పితపితామహులు క్రమముగ మైనాక హిమవంతులు అయ్యరుగారు క్రౌంచద్వీప విమర్శ మతివిపులముగను, దీర్ఘముగను జేసియున్నారు. అయ్యది వారి గ్రంథమున రెండవయధ్యాయమున మొదలిడి, పదియవయధ్యాయమున ముగిసినది. గ్రంథాంతమున దీనికొరకొక యనుబంధముగూడ జేర్పబడియున్నది. అంతియకాక ఈవల వీరు రచించిన "అరవవారు-మూడువేలేండ్లక్రింద" (Tamils 3000 years ago) యను గొప్ప వ్యాసమునను దీని ప్రశంస గలదు. (Mythic Journal, 1927 April, May.)

క్రౌంచ విమర్శయందు భాషావిషయములును, భూగోళవిషయములును, పౌరాణిక విషయములును అనేకములు చర్చింపబడియున్నవి. ఈప్రకరణమున అయ్యరుగారు వ్రాసినదాని నంతయు విపులముగ వ్రాయబూనిన గ్రంథ మతివిస్తార మగుటను భీతి గలుగుచున్నది. అతిసంక్షేపము చేసినయెడల విషయ సమన్వయము కుదరకపోవు నను భీతియు గలదు. సవిస్తరముగ దెలిసికొనగోరువారు అయ్యరుగారి వ్యాసముల జూచికొనుట మేలు.

స్కందునికి క్రౌంచభేదను డను పేరు గలదు. ఈబిరుదనామము సంస్కృతగ్రంథములందు పెక్కుచోట్ల ప్రయోగింపబడి యున్నది. ఇటు లుండియు పురాణములయందు ఈక్రౌంచభేదనవృత్తాంతము బహుసంక్షేపముగ జెప్పబడి యుండుటయు, క్రౌంచపర్వతవర్ణనము విపులముగ లేకపోవుటయు, ఆశ్చర్యములుగ నున్నవి.

పురాతనయుగమునందు దేవాసురులయుద్ధము లనేకములు జరిగినవి. వానిలో ముఖ్యమగునది తారకాసురవిజయము. తారకసంహారముకొరకు కుమారసంభవము కలిగినది. పురాణప్రసిద్ధిగాంచిన యసురులందరు తారకుని పక్షమున యుద్ధముచేసి నిహతు లయినపిదప ఆత్మరక్షణకొరకు తారకుడు క్రౌంచము నాశ్రయించినట్లును, స్కందుడాకారణమున క్రౌంచభేదన మొనరించి తారకుని సంహరించెననియు నితిహాసము. ఈగాథ యొక్కొక్క పురాణములలో నొక్కొకవిధమున చెప్పబడియున్నది. క్రౌంచభేదనమున నిహతుడయినది తారకుడని యొకపురాణము; మహిషాసురుడని మరియొకటి; బాణాసురుడని యింకొకటి; మయుడని వేరొకటి.

మరియు క్రౌంచుడు మయపుత్రుడనియు, అతికఠినమాయావియనియు, ఈక్రౌంచపర్వత మాతని యునికిపట్టనియు, ఆపర్వత భేదనమున నాతడు వినాశము నొందెననియు పురాణగాథలు గలవు. దేవాసురయుద్ధములు మన పురాణములందేకాక ప్రాచీన గ్రీకుల యైతిహ్యములందును పెక్కులుగలవు. అట్టిగాథల పరిశీలించి సమన్వయములజేసిన ప్రాక్తనయావనవిద్వాంసులు అగ్నిపర్వతములు (Volcanoes) ప్రకోపించి యగ్నిజ్వాలల వెలిపుచ్చుచుండిన సందర్భములును, వానివెంట కలిగిన భూకంపములవలని యుపద్రవములును దేవాసురయుద్ధరూపముల జెప్పబడినవని నిర్ధారణ చేసియున్నారు. ఆసియా ఖండ పశ్చిమదిగ్భాగమున నుండు ఆసియా మైనరనబడు భూభాగయామ్యదేశయందు లికియా (Lycia), కైలికియా (Cilicia) అనుమండలము లున్నవి. వీనిలో కైలికియా యనుమండలమున నీదేవాసురుల యుద్ధములు జరిగినటులు వారు నిరూపించియున్నారు. అచట గొప్ప పర్వత మొకటి దైవశక్తిచే రెండుగ చీలియున్నది. కైలికియాకు పడమటనుండు లికియాయందొక కొండ గలదు. ఈపర్వతమునం దొకవిశేషము గలదు. దీనికి రెండు సురంగములు గలవు. వానినుండి నిరంతరము అగ్నిజ్వాలలు వెలువడుచుండును. ఈకొండకు గ్రీకుగాథలలో "కిమీరా" (Chimera) యని పేరు. ఇదియొక రాక్షసవ్యక్తియనియు, అగ్నిజ్వాలల గ్రక్కుచుండు ననియు, మరియు నిది రెక్కలు గలదియై స్వైరవృత్తిచే కాపురమునను చేయుచు నూళ్లమీదబడి నాశనము జేయుచుండినట్లును, దేవతాంశసంభూతుడు బెల్లరాఫన్ (Bellorophon) అను శూరుడు దీనిని హతము చేసినటులను గ్రీకుగాథ గలదు. మరియు నీపర్వతము ఆదిమధ్యాంతముల ఛాగసింహాజగరరూపముల పోలి త్రిమూర్త్యాకృతి గలదియై యుండుననియు చెప్పబడియున్నది.

సవిస్తరముగ స్కందచరిత్రము సంస్కృతమున సుగ్యము. పూర్ణచరిత్రము అరవమున నుండు కందపురాణమున గలదు. ఇటు లుండుట సమంజసమే యగును. ద్రవిడదేశమునం దనాదిగ స్కందోపాసన విశేషముగ జరుగుచున్నది. ఇందునకు బాణుని కాదంబరియు సాక్ష్యమీయగలదు. దక్షిణమండలములలోని ప్రాచీనదేవాలయము లనేకములు స్కందాయతనములు. అర్వాచీనకాలమున వీనిలో కొన్ని శివాలయములుగను, కొన్ని వైష్ణవాలయములుగను పరివర్తనమును బొందినవి.

అగస్త్యుడు దక్షిణదేశమున సంచరించుచుండినపుడు క్రౌంచుడను నసుర డొకడు, కామరూపి, మార్గమధ్యమున నామహర్షిని పలువిధముల బాధించెననియు, అదియంతయు నసుర చేష్టితమని వారు తపఃప్రభావమున కనుగొని పర్వతరూపమున బడియుండుమని వారు దైత్యుని శపింపగ నాయసుర క్రౌంచపర్వత మాయెననియు, ఆపర్వతనితంబమున నాఋషి తనదండముచే పొట్లుపొడుచుట నవి రెండుపెద్దసురంగము లయినవనియు శరవపురాణమున గలదు. ఈక్రౌంచుడు తారకాసురుని యమాత్యగణములో చేరినవాడనియును, దేవతలతోడి యుద్ధమున కపటుడు తారకుడు పర్వతరూపముననున్న క్రౌంచు నాశ్రయించెననియు, క్రౌంచుడును మాయరూపములు ధరించెననియు, శక్తిప్రయోగమున తారకుడును, క్రౌంచుడును స్కందునిచే నిహతులయిరనియు నందు జెప్పబడియున్నది.

ఈద్రావిడేతిహాసము గ్రీకుగాథలలోని "కిమీరా" (Chimera) వృత్తాంతము ననుకరించియున్నది.

అంతియకాదు: పూర్వకాలమున లికియా దేశమున కొలువబడుచుండిన ముఖ్య దేవత పేరు "అపాలో" (Apollo). అరవవారి "కందసామి"యును, గ్రీకుల "అపాలో"యును ఒకరేయనియును, క్రీస్తుశకమునకు కొన్ని శతాబ్దములకు ముందు ఇప్పటి యరవవారి పూర్వీకులు ఆలికియా దేశమునుండి యీ రాష్ట్రమునకు వచ్చి, యిక్కడనే వృద్ధి జెందిరనియు శ్రీఅయ్యరుగారి అభిప్రాయము. ఈ విషయము ననేకసాదృశ్యములతో సుబాహ్యత పూర్వము యిన 'మూడువేల వత్సరములక్రిందటి యరవలు' అను వ్యాసమున చర్చింపబడి యున్నది.

సంస్కృతపురాణములందు క్రౌంచద్వీప మేడు ఖండములుగ విభజింపబడియున్నది. వీని పేర్లొక క్రమమున ననుసరించి యున్నవి. మొదటిది కుశలము లేక కుశకము; దానిదెంబడి వామనము; మూడవది ఉష్ణము; నాల్గవది ప్రావరకము; అయిదవది అంధకారకము; ఆఱవది ముని; ఏడవది దుందుభిస్వనము. వీనిం గూర్చి అయ్యరుగారి వివరణము వక్ష్యమాణవిధమున నున్నది. ఈ నామములన్నియు ప్రాతికాలమునందు లికియా దేశములో వాడుకలోనుండిన గ్రీకునామములను యతిక్రమించి వర్ణలోపవర్ణాగమాదులను మార్పులవలన సవరించుటచే లబ్ధములయినవనియును, క్రౌంచద్వీపస్థములని పురాణోక్తములయిన పర్వతశ్రేణులనామములును అటులనే యుత్పన్నములయినవనియును వారు చెప్పుచున్నారు. ఈ యభిప్రాయమును స్థిరపరుచుటకు చాలునంతటి చర్చ వారిచే చేయబడియున్నది. అరవభాషయందు ప్రబంధలక్షణములను నిర్వచనము చేయుచో పల్లాత్తుణికులు దేశవిశేషముల నయిదుగ విభజించియున్నారు. వానిలో "కురించినిలం" అనునది యొక్కటి. ఇట్టి దేశమును వర్ణించునపుడు కవీశ్వరులు రెండు విషయములను గమనింపవలయునని చెప్పబడియున్నది. "కురించి" గణములో జేరు ప్రదేశములు ఎక్కుడుగ పర్వతభూయిష్ఠములనియును, ఆదేశములలో బూజింపబడు దేవత స్కందుడనియును జెప్పుమని నిబంధన చేయబడి యున్నది.

పయిన చెప్పబడిన లికియా దేశము ఆసియా మైనరులోని యితరభాగములకన్న మిక్కిలి పర్వతావృతము. అక్కడ పూజింపబడిన దేవత "అపాలో" యను నామముచే పేర్కొనబడిన స్కందుడు. కురించి శబ్దము ప్రాచీన లికియాలో వాడుకలోనుండి యుండవలెననియు, ఆశబ్దమును కొంచెము మార్చి క్రౌంచద్వీపమని సంస్కృతమున పేరు కల్పనచేయబడెననియు అయ్యరుగారు ఉపన్యాసమున నుడివియున్నారు.

## ౫. శాకద్వీపము

(Mythic Journal, 1926 October)

* శకులు నివసించినది శాకద్వీపము. శకులకును, స్కిథియనులకును (Scythians) సాజాత్యము గలదు. తొలుత శకులు పుష్కరద్వీపభాగమగు ధావికీఖండమున నుండిరి. అది తూర్పుతుర్కిస్థానమగుచున్నది. కాలక్రమమున శకులు కమద (Comadj)పర్వతముచెంత చేరి అచట నొక రాజ్యము స్థాపించుకొనిరి. అది ధ్వంసము యినపిదప ఇండియాకు వాయవ్యమున సిజిస్థాన్ లేక శకస్థాన్ అను నొక ప్రాశయపట్టు కుదుర్చుకొనిరి.

## ౬. శాల్మలద్వీపము

(Mythic Journal, 1926 October)

దీనికి శాల్మలి ద్వీపమనియు నామాంతరము గలదు. మూడువేల యోజనముల పొడవుగల యొక శాల్మలీవృక్షము (బూరుగుచెట్టు)వలన దీనికీపేరు గలిగెనని పౌరాణికోక్తి. ఇది సార్మతియా (Sarmatia) యను గ్రీకుశబ్దవికృతి. సార్మతియా (సౌరమతియా) యనునది రెండు భాగములుగ నుండినది. (i) యిరోపీయ సార్మతియా. (ii) ఆసియాటిక్ సార్మతియా. మొదటి

* శకులను నొకజాతివా రుండినటులు రామాయణమునందు గలదు. వీరు ఇండియాపైకి పలుమారు దండెత్తి వచ్చి దేశమునకు పలువిధముల పీడ కలుగ జేయుచుండగ విక్రమార్కుడను వీరి నోడించి నిర్మూలముచేసి 'శక' పురుషుడయినటుల హిందూదేశచరిత్రమున గలదు. ఈశకులు కొంతకాలము కాశ్మీరమును లోబరచుకొని అందురాజ్యము జేసినట్లును దేశచరిత్రమున గలదు.

భాగము డాన్‌నదియొక్క ఈశాన్యమునుండి వాఙ్గానదివరకు వ్యాపించినది. రెండవభాగము నైఋతిభాగమునకు తూర్పున నుండినది. పార్శీయులు మతమునందును, ఆచారవ్యవహారములందును హిందువుల బోలియుండిరి.

## ౭. పుష్కరద్వీపము.

**(Mythic Journal, 1926 July, Chapters XII & XIII.)**

దీనివిషయము బ్రాహ్మపురాణమున వివరింపగలదు. బ్రహ్మ కునికిపట్టగు గొప్పమఱ్ఱిచెట్టు ఈద్వీపమునందుండెనటులు పురాణములు చాటుచున్నవి. వామనగారుడములు రౌరవాది మహానరకముల నీద్వీపమున బెట్టినవి. తదితర పురాణములు దీనిని భూలోకస్వర్గమని శ్లాఘించినవి.

తూర్పు తుర్కిస్థానము, పశ్చిమటర్కిస్థానము రెండుచేరి పుష్కరద్వీప నివేశనముగనున్నవి. తుర్కిస్థానములో నెక్కువ ప్రదేశము నిర్జలమై నారకకష్టమునకు కాటపట్టుగనున్నది. కొంతభాగము తృణకాష్ఠజలసస్యాదిసమృద్ధిగలిగి స్వర్గాపవర్గదాయకమై యున్నది. ఈవిషయమున నిది యోగపద్యముగ సుఖదుఃఖముల రెంటిని గలదియగుటచే నాకనరకములపోలిక జెందినటులు వర్ణింపబడినది.

పుష్కరద్వీపమునందలి పశ్చిమఖండము మహావీతమనియు, పూర్వఖండము ధాతకీఖండమనియు పురాణములందుగలదు. మహావీత మే గ్రీకుల'మాసగెతె(Massagatae) అనునది. సకారహకారములకును' వకారగకారములకును వినిమయము అనేకభాషలయందు గాంచబడుచున్నది.

ధాతకీఖండమున కా పేరు వచ్చుకారణము నిర్ణయింప వలని గాకున్నది.

పుష్కరద్వీపమున కీపేరు కలుగుటకు హేతువు పురాణములయం దనేకవిధములుగ నున్నది. ఈశబ్దమునకు తామరపువ్వని యొక యర్థమున్నది. జగత్స్రష్టయగు బ్రహ్మ నివసించిన తామరపువ్వుండుండినదియట. స్కాందమును, దేవీభాగవతమును తామరనే ఈద్వీపనామకారణముగ అంగీకరించినవి. లింగ విష్ణు బ్రహ్మపురాణములు స్రష్టకు మఱ్ఱిచెట్టునే చూపినవి. ఈద్వీపమునకు నలుప్రక్కల తామర లమితముగ నుండుటచే ఈపేరు వచ్చినదని మాత్స్యము. పుష్కరనామాంకితమగు పర్వతశ్రేణి యుండుటకు కారణమని పాద్మమహాభారతము లుద్ఘోషించినవి. తక్కుంగల పురాణము లీశబ్దార్థ విచారమును జూపలేదు.

యథార్థముగ నిది "బుఖోరా" (Bukhora or Bokhora)వికృతిగ నున్నది. ఒకకాలమునందు బౌద్ధమతము హిమాలయమును నతిక్రమించి సమర్ఖండు, (Samarkhand), కొతాన్ (Kohtan) లోనగు మధ్యఆసియా భూములకువ్యాపించి వర్ధిల్లినది. ఇండియా దేశమునుండి యనేకు లాదేశములకు పోయి అచ్చట స్థావరములు గొని నిలిచిపోయిరి. సంస్కృతవిద్యయు, ప్రాకృతభాషయు ననట వాడుకలో నుండినవి. బౌద్ధులలోటి వారి"విహారములు"ను నడుపుచుండినవి. "విహారములు" దేశ్ర ష్మరిమై, సంస్కారభ్రష్టమై, "బుఖారా" అయినది. ఈనాటికిని మంగోలియా దేశములో బౌద్ధవిహారమునకు "బుఖారా" యను పేరు నిలిచియున్నది. బౌద్ధవిహారవ్యాప్తివలన హిమవదుత్తరప్రాంతరములకు "బుఖారా" యను పేరుగలిగినది. కాలగతిచే దేశము బౌద్ధశూన్యమయినను, బౌద్ధప్రాభవలింగమగు విహారము (బుఖారా) భూతత్త్వమున నాటుకొని నిలిచియున్నది. ఈ"బుఖారా" శబ్దము ప్రాకృతమున "పుఖారః" యను రూపమును బొంది తిరుగ సంస్కృతముల "పుష్కర"రూపమున స్వాధిష్ఠానమును బొందినది. అయితే పుష్కరవిహారైక్యము మాసిపోయినది. శబ్దములు సంస్కారహీనములయి యర్థాంతరము బొందునను వాల్మీకివాక్యము * నకిదియొక ప్రబలనిదర్శనము.

పురాణకర్తలు సప్తద్వీప విన్యాసము జెప్పుటలో ఈ'బుఖారా'ను పుష్కర మనిరి. ఐరోపీయశోధకు

* 'సంస్కారేణ యథాహీనాం వాచ మర్థాంతరంగతామ్'-సుందరకాండ.



౭. పెక్కుఫిరంగులుగల ఎగ్గుబాటు



౮. అక్బరు సేనలు రాయసర్గనును ముట్టడించుట

లనేకులు "బుఖారా" శబ్దమునకు పైన జెప్పిన నిష్పత్తినే చెప్పియున్నారు. యూజిన్‌ష్లైలరు (Eugene Schuyler) రచించిన తుర్కిస్థాన్ చరిత్రమున నిట్టులు వ్రాయబడియున్నది:— 'బుఖారా' యను మాట సంస్కృతవిహారమునుండి నిష్పన్నమయినది."

... ... ... ...

"మధ్య ఆసియాలోని యితరము లనేకములవలె నిదియు బౌద్ధవ్యాపకము యొక్క అవశిష్టచిహ్నమై యున్నది."

... ... ... ...

"ప్రాచీనకాలమందు దీనికి 'సుమి' లేక 'సుమి జైకృట్టు' అను పే రుండెనది. ఈపేరు ఆరవశతాబ్దము వరకు నిలిచియుండెనట్టుల చీనాగ్రంథకర్తలవలన దెలియుచున్నది."

"పుష్కర"శబ్దము "బుఖారా" శబ్దవికార మగుటచేతను, ఈద్వీపమునకు పుష్కరనామధేయ మేర్పడుటకుపురాణములందున హేతుక మగునట్టియు, తృప్తికర మగునట్టియు, ఏకకంఠ్యమగునట్టియు, నిష్పత్తి లభింపకపోవుటచేతను పూర్వోక్త శాకద్వీపమునకును, ఉత్తరగ్రంథమున విమర్శింపబడు గోమేదద్వీపమునకును నిది సమీపవర్తిగ నుండుటచేతను ఇత్యాదికారణములచే నీపుష్కరద్వీపస్థానము హిమవంతమున కావలివైపున మధ్యఆసియాప్రాంతముల నుండవలయునని నిర్దేశించుట కాధారము కలుగుచున్నది.

## ౮. గోమేదద్వీపము

(Mythic Journal, 1926 April, Ch.XI.)

దీనికి గోమేదక మను పేరును గలదు. మాత్స్య స్కాంద వారాహపురాణములును, సిద్ధాన్తశిరోమణియు ఈద్వీపము నంగీకరించినవి. సప్తద్వీప విన్యాసప్రకరణమున భాస్కరాచార్యు లిట్టులు చెప్పియున్నారు:—

"భూమే రర్ధం క్షారసింధో రుదక్స్థం
జంబూద్వీపం ప్రాహు రాచార్యవర్యాః;
అర్ధేఽన్యస్మిన్ ద్వీపషట్కస్య యామ్యే
క్షారక్షీరాద్యం బుధీనాం నివేశః.
శాకం తథా శాల్మల మత్ర కౌశం
క్రౌంచంచ గోమేదకపుష్కరేచ,
ద్వయోర్ద్వయో రంతర మేక మేకం
సముద్రయో ర్ద్వీప ముదాహరన్తి."

ఆచార్యుని మతమున గోమేదకము, పుష్కరమునకు ప్రక్కనయున్నది. ప్రొఫెసరు [2]డౌసన్‌గారు దీని ప్లక్షద్వీపమునకు నామాంతర మనిరి. ద్వీపపరిగణనమున ప్లక్షద్వీపమును వదలిన పురాణములే గోమేదమును పఠించియుండుటయే డౌసన్‌గారి యూహ కాధారమై యుండును. వారియూహకు ప్రమాణాంతరముల నేమియు వారు చూపియుండలేదు.

యోగవాసిష్ఠమున గోమేదప్రశంస గలదు. రోమకసిద్ధాన్తమునను ఇది యున్నట్టులు దెలియుచున్నది. అయితే ప్లక్షద్వీపము నంగీకరించినపురాణములు దానికి ద్వితీయతీర్థము నిచ్చుచున్నవి. గోమేదము ప్లక్షపర్యాయ మగునెడల గోమేద పక్షమువారు దానికి రెండవ స్థానము నిచ్చుట సహజమయియుండగ, మాత్స్యవారాహములును, సిద్ధాన్తశిరోమణియు నారవస్థానమును, స్కాంద మేడవస్థానము నర్పించుటకు కారణము లూహ్యము లగుచున్నవి. ఈవిప్రతిపత్తికి సమన్వయము కుదురలేదు.

స్కాందమొక్కటియే గోమేదశబ్దచరిత్రమునకు బూనినది. అందలి వ్యుత్పత్తివాక్యముగ నొసకమానదు.

"గోమేదనామా ప్లక్షోఽస్తి సురవర్యా యస్యాయయాః
మేదో వృద్ధింగతం కాల్యాత్తస్మా ద్గోమేదకశ్చ్యతే."

ఈశ్లోకము స్పష్టార్థముకాదు. "మేదో వృద్ధిం" అను పదములు సమాసమో, లేక వ్యస్తపదములో తెలియవలసియున్నది. ఈసందేహ మెట్టులున్నను ప్లక్షగోమేదముల ఐక్యమున కిందు కొలదిపాటి యాధార మగపడుచున్నది. డౌసన్‌గారీశ్లోకము నాశ్రయించిరి కాబోలును.

---

1 Eugene Schuyler's Turkistan 2 vol. App. II, p. 368.
2 Dictionary of Sanskrit Mythology.

గోమేదశీర్షకక్రింద శబ్దకల్పద్రుమమున ఇంకొక వచనమొకటి యుదాహరింపబడియున్నది:—

“గోమేదే గోపతిర్నామ రాజాభూత్ గోసవోద్యతః, యాజ్యోఽభూదగ్నికల్పానాం వైతథ్యానాంమనోః సుతే, సతేషు హరియజ్ఞాయ ప్రవృత్తేషు భృగూన్ సురాన్, వ్రతే తం గౌతమః కోపా దశపత్ సోఽగ్నిముత్ క్షయం, యజ్ఞవాటేస్యతా గావో దగ్ధాః కోపాగ్నినా మునేః; తస్మాదసౌ మహీ భగ్నా గోమేదస్య తతోఽభవత్.”

గోపతి గోసవము చేయబూని సురశాపము నొందుటకు పూర్వము, దీని కేమి పేరుండునో తెలిపియుండిన ఈ శ్లోకముల కెక్కుడు విలువ గలిగియుండును.

గోమేదద్వీపమునకు ధాతకీఖండము, కుముదఖండము అను రెండు ఖండములు మత్స్యపురాణమున చెప్పబడినవి. ధాతకీఖండ ముభయచరముగ కొంతపుష్కరమున, కొంత శాకమున నుండుటచే ధాతకి, గోమేదభాగమని నిశ్చయించుటకు తగినంత బలము చాలదు. కుముదఖండవిషయమున సందేహమున కవకాశము లేదు. ఇది స్థిరముగ నిలిచి కాలక్రమమున “గోమేద” వికారమును బొంది యుండును.

ఆఫ్గనిస్థానమున ఈశాన్యమున నుండునట్టియు, ఆక్ససునది ప్రవహించు పరిసరముల నుండునట్టియు దేశభాగనివాసులకు ప్రాచీన గ్రీకుగ్రంథములలో కొమెదులని పేరుండినది. క్రీస్తునకు పూర్వముండిన రాష్ట్రవిభాగ పరిస్థితులను దెలుపు దేశపటములందు గోమేదసును జూడవచ్చును.

గోమేదద్వీపప్రచారమున గోమేదనామక రత్నప్రచారము ప్రస్తుతము కాజాలదు. నవరత్నములలో నది యగ్రిమమర్యాదను బొందజాలకున్నను ఒకకాలపు నాగరకతలో దీనిపై మోహ మెక్కుడై, యెంచిచూచిన నిదియే నెరసి పోవుచు, హెచ్చువిలువగల దాయెను. ఈమణి విశేషముగ మధ్యఆసియా తుర్కిస్థాన్‌లోని ప్రదేశములలో దొరకుచుండినది. గోమేద ద్వీపము మధ్యఆసియాగతమయినందున ఈపేరీ వస్తువునకు పర్య వ్యవహారసంజ్ఞ అయి నిలిచినది. గోమేదికమునకు సరియగు ఇంగ్లీషు పేరు ఎద్దియని అయ్యరుగారు కొలదిగ విచారించి, జేడ్ “Jad” అని నిర్ణయించినారు. “Royal Geographical Society” వారి పత్రికలో అయ్యరుగారివ్యాస ప్రశంస చేయుచు గోమేదమునకు కుదిరిన ఇంగిలీషునామమే సరియని యంగీకరింపబడినది.

మొత్తమునకు, ఈదీర్ఘ విచారముయొక్క ఫలితమేమనగ: పురాణములలో నుండు భూగోళవిన్యాసము గంధర్వనగరప్రఖ్యమును కల్పితముగాక కొంతవరకైన నిజమయి యుండవచ్చును. పురాణములలో నుండునదంతయు పురాణకర్తలు కండ్లారజూచి వ్రాసినదిగ నుండదు. దేశకాలవశగముల నతిక్రమించిపోవలను లేని యాచారబద్ధులై, ఉండునది కొంతయు, వినినది కొంతయు, కొరవడినది యూహచే పూరణము చేసియు పురాణకర్తలు గ్రంథముల రచించిరి. జంబూద్వీపము చుట్టును లవణసముద్రము, దానిచుట్టును ప్లక్షద్వీపము—ఈప్రకారము ద్వీపసముద్రములు సకేంద్రములయి యుండకపోయిన పోవచ్చునుగాని, ఆపేళ్లకు సరిపోవు భూభాగములు ప్రపంచమున నుండినవని స్థాపించుటయే శ్రీఅయ్యరుగారి ముఖ్యాశయము. పురాణముల కసాధుత్వము సాధించుటగాదు. అయ్యరుగారికంటెను మనప్రాచీన గ్రంథములపై నధికతరమగు నభిమానము జూపువా రరిది. వాని నామూలాగ్రముగ జదివి శోధించుటయే ఇందుకు ప్రమాణము. కేవలాక్షర సామ్యమున వీరీగోష్ఠిచర్చ బూనినవారుకారు. అనగ, ప్లక్ష=పలస్థి, గోమేద=కుముద—ఇట్టి నిస్సారసామ్యముల నాశ్రయింపక, వారు అనేక గ్రంథముల శోధించి సమన్వయము జేయబూనిరి. విషయముల తెలియగోరువారు ఉదాహృత ‘మిథిక్ సొసైటీ జర్నల్’ సంచికల జూడనగుదురు.

ఖండాంతరవాసులు, మతాంతరులునగు పాశ్చాత్య పండితులు మనప్రాచీన గ్రంథముల శోధించి యనేకామూల్యవిషయముల మనకు దెల్పుచున్నారు. ఈనాటికి మన కొకఆంధ్ర యూనివర్సిటీ లభించినది. శ్రీ అయ్యరుగారివంటి విద్వచ్ఛిఖామణులు పురాణఖననము జేసి అగమ్యములు, అగోచరములు, దురూహ్యములు అని బాలిశత్వమున నిరసింపబడు పౌరాణిక విషయముల జర్చించి మన యూనివర్సిటికిని, విద్వన్మండలమునకును ఖ్యాతిని సంపాదింపవలెను.

# ఓపరమేశ్వరా!

ఓలేటి వేంకటరామశాస్త్రి గారు

[నూటపదియార్ల తొలిదొంతరనుండి]

ఓ పరమేశ్వరా!

నిన్నుఁ జూడవలెనంచుఁ గనులు మూయుదుఁగాని యెద్దియో వచ్చి నాయెదుటనిల్చు
నిన్నుఁ దలంపఁగ గోరి మనసు నిల్పుదుఁగాని తలఁపులేవియొ వచ్చి కలఁత వెట్టు
నిన్నుఁ గొల్వఁ దలపోసి నియమ మూనుదుఁగాని ఖేదియో దాని నిట్టట్టు చెఱచు
నిన్నుఁ జేర నొకవేళ నిర్గమింతునుగాని కఠినబంధము లేవొ కాళ్లఁ దగులుఁ
గనుల దర్శింప, భావింప, నినుభజింప - నన్ని వేళల నిన్ను నే ననుగమింపఁ
గలుగు భాగ్యంబు దొరకు టేకష్టముకద!-యిష్టఫలసిద్ధిఁగనుట నేనెప్పుడింక? ౪

ఓ పరమేశ్వరా!

కలుషవారాశిలోపలఁ గ్రుంగుచున్న నన్ లేవనెత్తఁగ నీకుఁ జేవగలదు!
దీనుండనైన నాదిక్కు-గన్గొని యిట్టె కరఁగిపోవఁగ నీకుఁ గరుణకలదు!
పొట్టకూటికిఁ బెక్కు- పోకళ్లఁబోవునన్ బోషింప నీకు విభూతి గలదు!
మనసులోనే క్రుళ్లి మ్రగ్గు నాదురవస్థఁ దెలియ నీకే దూరదృష్టి గలదు!
ఏమిలోపము? నీవు నన్నించుకంత - కొనరి కడగంటఁ జూచుటే కొఱఁతగాని
యా మహాభాగ్యమునకె నన్నాశ్రయించి-సేవసలిపెద నేమిచేసినను సరియె. ౧౧

ఓ పరమేశ్వరా!

తోడిమానవుల సంతోషంబె మనదిగాఁ దలపోసికొనెడు నుత్తముల నడుమఁ
బరులకష్టములు నాపదలును దమవిగాఁ బరితాపపడు దయాపరుల నడుమ
నన్యుల దైన్యంబు లడఁప సర్వస్వప్రదానంబు సేయుదాతలకు నడుమ
నితరులకొఱకుఁ దామిడుమలెన్నియొ కాంచి కలఁతఁ జెందని మహాత్ములకు నడుమఁ
జేరి నవ్వుడు నాకెంతొ సిగ్గువొడము-నెందులకుఁగాని వాని నన్నేటికిట్లు
కీళ్ల బొమ్మగఁ జేసి సంకిళ్లువైచి-త్రిప్పుచున్నాఁడవో దేవదేవ, నీవు? ౩౫

ఓ పరమేశ్వరా!

బొంగరంబులువోలె భువనగోళములెల్ల-గిరిగిర బయలులోఁ దిరుగుచుండ
వింతబొమ్మలరీతి జంతుజాలంబెల్ల-చిత్రప్రచారముల్ సేయుచుండ
ప్రాతక్రొత్తగఁ గ్రొత్తప్రాతగా నేవేళ-సృష్టియంతయు మార్పుఁ జెందుచుండ
తలఁచినంతనె సమస్తముఁ బుట్టియభివృద్ధిఁ-జెంది జీర్ణించి నశించుచుండ
నిత్యలీలావినోదనిర్నిద్రమగుచు-భద్రకరశాశ్వతానందముద్రమగుచు
నగుచువిలసిల్లునీమహానందమూర్తి -నెట్లుచిత్రించుకొందునాహృదయమందు! ౫౪

[ నూటపదియార్ల మలిదొంతరనుండి ]

ఓ పరమేశ్వరా !

మానావమానంబు లేనొక్క తెఱఁగుగా నెంచునాఁడేల నీ హితము నాకు ?
కష్టంబుసుఖము నొక్క విధంబుగా సమ్మ తించునాఁడేల నీదిక్కు నాకు ?
కాంచనంబును మంటి గడ్డయు నొకటిగా గాంచునాఁడేల నీకలిమి నాకు?
తానంచుఁ బరుడంచుఁ దలపోయు బుద్ధి నశించునాఁడేల నీచేత నాకు ?
అట్టి సమబుద్ధి నాకు లభ్యమగువఱకె - యేను గోరుట యీవు నాకిచ్చుటయును
అవుల"నీకిత్తుఁబుచ్చుకొ"మ్మన్న "నాకు-వలదు!పొ"మ్మాదు; నిదినీవుతలచికొనుము.

ఓ పరమేశ్వరా ! [౯౬

తనువు నేతీరున వినియోగ మొనరింప వలయునో యెఱుఁగనివాఁడ నగుట
మనసు నేవడువున మరలించి నడపింప వలయునో యెఱుఁగని వాఁడ నగుట
జీవనం బేరీతిఁ జేసి తరింపఁగా వచ్చునో తెలియనివాఁడ నగుట
భక్తి నేరీతి సంపాదించి నినుఁజేర వచ్చునో తెలియనివాఁడ నగుట
నడిగికొంటిఁ జెప్పుమని నిన్ను సర్వజ్ఞ!-చెప్పకున్న నేమి సేయువాఁడఁ?
దప్పనడతునేని దండింపఁబోకుసూ!-అజ్ఞు నన్ను దోషియని తలంచి. ౯౭

ఓ, పరమేశ్వరా !

సర్వమానవులు నాసహజన్ములేయందు హృదయంబులో భేద మెంతయున్నఁ
బరధనాదులు తృణప్రాయంబు లనుకొందు లోలోన నెంతటి లోభమున్న
సత్యమార్గముఁదప్పఁ జనదొకప్పుడు నందుఁ బలుకున దెల్ల నబద్ధమైన
సకలంబునాకే విశదమయ్యె ననుకొందు లేశమేనియుఁ దెల్వి లేక యున్న
మాటయొక్క రీతి మనసులో నొకరీతి-చెప్పటొకటి తుదకుఁ జేయుటొకటి
యతిశయంబు కొంత యభిమాన మొకకొంత-యెన్వతడిగి రేల యిచ్చినావు. ౯౮

ఓ పరమేశ్వరా !

చేయుచుంటి విచిత్ర చిత్రకల్పనముల నొకదానికొకటి యత్తుకొనకుండ
నవనవవృత్త విన్యాసంబులెల్లఁ జొ బచరించుచుంటి పూర్వములు విడిచి
గుదియించుచుంటివి పదబంధములసూత్ర తతి నియమాపేక్షఁ దలఁగఁ జేసి
పైవస్తువొకటి లోపలివస్తు వొకటిగా రచియించుచుంటి నిర్ణయము లేక
యెపుడు దుఃఖాంతమే చేయ నిచ్ఛగించి-రసమయము నల్ప నీవేదొ వ్రాయుచుంటి
ప్రస్తుతకవీంద్రుఁడవె నీదుభావకవిత-భావమెఱుఁగక నేఁ దెల్ల బోవు చుంటి! ౧౦౦

# నందకుమార వధ

ముసలికంటి సంజీవరావు గారు

హైందవచరిత్ర పఠన మొనరించినవారికి మహారాజు నందకుమారుఁడు అపరిచితుఁడుకాఁడు. యోగ్యుఁడు కాకున్నను, బహుసమర్థుఁడగు నీమహారాజుచరిత్ర యవశ్య పఠనీయము. మన దేశచరిత్రకీ యుపాఖ్యానముతో సంబంధమేమియు లేదని ప్రసిద్ధచరిత్రకారుఁడగు 'విన్సెంటు స్మిత్తు' వ్రాయును: 'ఫ్రాన్సిసు, బర్కు', 'మిల్లు' మొదలగు కాపురుషుల కారణమున నీకల్పితకథకు విపరీతప్రచార మలవడెనని యాతఁడు విలపించెను. ఇట్టి పుక్కిటి పురాణములచే 'ఇంపే', 'హేస్టింగ్సు'ల యశము కళంకితమాయెనని యాతఁడు వ్రాయసాహసించును. పరిపాలనా ధురంధరుఁడగు 'హేస్టింగ్సు', ప్రధాన న్యాయమూర్తి యగు 'ఇంపే' ప్రభువును గలసి న్యాయశాస్త్ర సాహాయ్యమునఁ గావించిన ఈ హత్య మీఁదనే బ్రిటిషు హైందవ సామ్రాజ్య మేర్పడెనను నిరాధార దురభిప్రాయమునకుఁ గారణభూతమాయెనని యాతఁడు నిరసించును. ఆ కారణముచేతనే తద్విషయము విమర్శనీయమని యెంచి, ఆమహనీయుఁడు పవిత్ర చరిత్రోద్యోగధర్మము మఱచి, తత్కార్యమునకుఁ గడంగును.

హేస్టింగ్సు సదాచారియని సమర్థింపఁ బూనుట హాస్యాస్పదము, కేవలము సాహసము. నందకుమారుఁడు కూడ సదాచారియని చెప్పరాదు. ఆతఁడు బహుసమర్థుఁడు, స్వార్థపరుఁడు, ఆశాపరుఁడు. ధనాధికారము లాసించి యాతఁడు రాజద్రోహ మొనరించెను, దేశద్రోహ మొనరించెను, అనుట సామాన్యవిషయము. కొంతకాల మాతఁడు విపులవైభవ సమన్వితుఁడై భోగభాగ్యముల ననుభవించి, తుదకు భయంకరకర్మఫల మనుభవించెను.

నందకుమారుఁడు దురాచారము లొనరించెను. కాని, ఆసమయమున దురాచారము లాచరింపనివా రెవ్వరు? క్లైవు దొంగసంతకము నొనరించి, ప్రభువయి, మాననీయుఁ డాయెను. హేస్టింగ్సు అన్ననో, క్లైవును మెప్పించి, పెక్కు సంవత్సరములు పార్లమెంటుసభ్యుల దుస్సహ దూషణములకు గుఱియై, తుదకుఁ దమలాభముకొఱకే యాతఁ డట్టిగర్హితకార్యము లొనరించెనని గ్రహించిన పార్లమెంటు సభ్యులచేతనే సగౌరవముగా విడువఁబడెను. కావున నందకుమారుఁడు దురితముల నొనరించెనని నిరసించుట అసంబద్ధము.

నందకుమారుఁడు పవిత్రబ్రాహ్మణ వంశ సంభవుఁడు, ఆచార్యుఁడు, మతగురువునై యఖిలజనసంసేవ్యుఁ డాయెను. అమిత మేధావంతుఁడు, కార్యశూరుఁడు, అధికార ధురంధరుఁడునై యాతఁడు తొలుదొల్త నాంగ్లకంపెనీ సేవకులకు మాననీయుఁడై, పూజనీయుఁడై, భయకారణుఁడునై యుండెను.

నందకుమారుఁడు మహాద్రోహ మొనరించుటచేతనే ఆంగ్లేయులకు బంగాళారాజ్య సంపాదనము సులభతర మాయెను. నందకుమారుఁడు హుగ్లీ ఫౌజుదారుఁడు. తన యేలిక యగు సురాజుద్దౌలా యాజ్ఞ ననుసరించి యాతఁడు ఫ్రెంచివారికి సాహాయ్య మొనరించెనేని, అన్యాయముగ చంద్రనగరముపై దండెత్తిన ఆంగ్లేయులు భగ్నమనోరథులై యుండెడివారు. ఫ్రెంచివారి పతనము ఆంగ్లేయులకెంతయవసరమై యుండెనో, ఎంత లాభకరముగ నుండెనో, 'మిల్లు', 'ఆర్మ్సు', 'టారను' మొదలగు చరిత్రకారుల గ్రంథములఁ జదువు వారికిఁ దెలియఁ గలదు. ఈ విషయమునే "ప్లాసీయుద్ధము"నందు సంగ్రహముగ నుదాహరించితిని.

సురాజుద్దౌలాను రాజ్యభ్రష్టు నొనరించుటకై క్లైవు మాయోపాయమునకు దొరఁకొని నిగూఢముగ బహుళ ప్రయత్నము లొనరించెను. ఆకుట్రదారులలో నందకుమారుఁ డొకఁడు. మఱియు జైత్రయాత్రా పరుఁడై బయల్వెడలిన క్లైవును వారింపఁజాలియు, వారింపవలసినవాఁడయ్యు, నందకుమారుఁడు దారి యొసంగెను.

ఆంగ్లేయుల కింతటి మహోపకార మొనరించిన నందకుమారుఁడు ఆంగ్లేయుల చేతనే వధింపబడెను. నందకుమారుఁ డొనరించిన యపరాధము దొంగసంతకము; అందులకు శిక్ష—మరణము! తద్విషయపరిశీలన మొనరించువారు అట్టి నేరమునకు మరణశిక్ష విధించుట అన్యాయమనియు, అతిసాహసమనియు నెఱుంగఁగలరు. మఱియు, నందకుమారమహారాజు అట్టినేర మొనరించినవాఁడు కాఁడనియుఁ గూడ గుర్తింపఁగలరు.

తన గుట్టుమట్టు నెఱింగిన నందకుమారుఁడు హేస్టింగ్సునకు భయకారణుఁ డాయెను. నందకుమారుఁడు మరణించుట వాంఛనీయ మాయెను. అంత నొకానొక హైందవుఁడు లేచి, నందకుమారుఁడు దొంగసంతక మొనరించెనని అభియోగము తెచ్చెను. ఈవిషయము సహజగంభీర విస్పష్టస్వరమున 'మెకాలే' యిట్లు వ్రాయును:—"మందులు, జీవిత చరిత్రకారులును దప్ప నాఁడును నేఁడును హేస్టింగ్సే యిందులకు మూలకారకుఁడని యందఱు విశ్వసింతురు."

నందకుమారుని వధను గుఱించిన యీ విషయముల గమనింపవలయును:—

1. నందకుమారుఁడు దోషియని నిరూపింపఁజాలు నాధారము లేదు.

2. దొంగసంతకము చేయువానిని వధించు నాచారము హిందూదేశమునందు లేదు; అట్టి న్యాయము ఇంగ్లాడునం దుండెను.

3. ఒకదేశపు విపరీతన్యాయము నింకొక దేశముపైఁ బ్రయోగించుట అధర్మము.

4. ఆరేండ్లక్రిందట నేర మొనరించెనని వధించుట దారుణము.

5. ఏ 'రెగ్యులేటింగు ఆక్టు' ప్రభావమునఁ బరికల్పిత ప్రధానన్యాయమూర్తిచే నందకుమార మహారాజు వధ్యుఁడాయెనో, ఆచట్టము 1773 లో అమలులోనికి వచ్చెను: అంతకు మూఁడేండ్లక్రిందట నందకుమారుఁడు నేర మొనరించెనఁట!

విమర్శయనవసరము. కాని దొంగసంతక మొనరించి క్లైవు ప్రభుబిరుదాంకితుఁడగుట న్యాయమా? లేక నందకుమారుఁడు హంతకునివలె వధ్యుఁడగుట న్యాయమా?

ఏమైనను మహారాజు నందకుమారుఁడు క్రూరపాశప్రపీడితకంఠుఁడై తెగటారెను. మరణానసరమున నామహారాజు ప్రదర్శించిన ధైర్యస్థైర్యములు నిరుపమానములు. జ్ఞానివలె,మౌనివలె నాతఁడు నిర్వికారుఁడై ముచ్చటించి, ఎప్పటియట్లు వ్రాసికొని లెక్కలు చూచికొనెను. అచట నుద్యోగభారము వహించియుండిన పరీఫు నందకుమారుని గాంభీర్యముఁ గాంచి చకితుఁడై, తాను చేయఁగల సనుపాయముల నెల్ల నిర్వ్యాజముగనొనరింపఁ బూనెను. మరణశిక్ష తెలియవచ్చినను, కారయం దేకాకియైయుండినను, పదుగురు చూడ వచ్చినను, అంత్యదిన ముదయించినను, అంత్యఘటిక యరుదెంచినను, దుర్భరవిషాదఘూర్ణిత ప్రజానముద్రము దృగ్గోచరమైనను, శనకంఠమును వేధించి ప్రాణాపహరణ మొనరింప నాహ్వానించుచున్న ఉరికంబము దయ్యమువలెఁ గట్టెదుట గోచరించుచున్నను, వన్నె దొఱుంగక, వైవర్ణ్యము నొందక, చెక్కు చెదరక, నిజాంతఃపుర సౌధాంతము నారోహించు చందమున నామరణవేదిక నారోహించు నా వీరవరేణ్యుని ధైర్యస్ఫూర్తిఁ గాంచి పాశ్చాత్యులుసహితము సహింపఁజాలకపోయిరి. తదవసరమున నందకుమార మహారాజు వ్యక్తపఱచిన చిత్తస్థైర్యమును అతిశయోక్తికిఁ బర్విడక తాఁ జూచినట్లు వ్రాసిన పరీఫుయొక్క యభివర్ణనము గమనింపఁదగియున్నది:—

"శుక్రవారముసాయంకాలము-4-8-1775-బందిఖానాయందు మహారాజు నందకుమారుఁడుండిన యంకణము నేను ప్రవేశించినంతనే, యాతఁడు లేచి యథోచితప్రణామ మాచరించెను. అనంతరము మేమిరువుర మాసీనులమైతిమి. నందకుమారుఁడు నిర్వికారుఁడై, నిశ్చలచిత్తుఁడై, యతిసరళముగ, నతిధారాళముగ నాతోఁ బ్రసంగించుటఁ గాంచి, యాతఁడు సన్నిహితమగుచుండిన మృత్యువుగుఱించి యెఱుంగఁడేమో యని శంకించితిని. కావున మానవుమనున్న ద్విభాషితో నిట్లు పలికితిని: 'నాగౌరవముకడసారివ్యక్తపఱుపనరుదెంచితిని. అత్యంత దుఃఖకరమగు రేపటి యనసరమున చిత్తశాంతమొదవు సదుపాయముల తప్పక చేయువాఁడనని నచ్చఁజెప్పుము. ఉద్యోగప్రోద్బలముచే నేనిందుఁ బాల్గొనవలసినందులకుఁ జింతించువాఁడనని యెఱింగింపుము; ఐనను, ఆతని వాంఛలనెల్ల నంతమువఱకు నరయువాఁడనని నివేదింపుము; ఆతని పల్ల

కియే, ఆతని సేనకులే తత్కార్య మొనరింతురని తెల్పుము: ఆతనిచెంత నుండవలసిన మిత్త్రుల కపాయము ఘౌరయకుండఁ జూచెద ననియుఁ బలుకుము."

ద్విభాషి నాపలుకులు నందకుమారున కెఱింగింప, నాతఁ డిట్టు లనెను:—

'మీరాకకుఁ గృతజ్ఞుఁడను. మీరొనరించు సదుపాయములకు వందనములు. విధివిధాన మవిలంఘనీయము. దైవసంకల్పము అమోఘము. సైన్యాధిపతికి, కర్నలు మాన్సనుకు, ఫ్రాన్సిసుగారికిని నావందనముల నందఁజేయుఁడు; మదీయపుత్త్రుఁడు రాజాగురుదాసును రక్షింపవలయునని ప్రార్థించితినని విన్నవింపుఁడు. ఇఁక నాతఁడే బ్రాహ్మణుల కాచార్యుఁడని తెలుపుఁడు.'

నందకుమారుని చిత్తస్థైర్య మద్భుతము: ఒక్క నిట్టూరుపైనను ఆతఁడు విడువఁడయ్యెను; కంఠము అణుమాత్త్రము చెదరకుండెను. కొన్నిగంటలక్రిందటనే తన జామాతవద్ద సెలవు గైకొనెను. నందకుమారుని నిశ్చలగాంభీర్యములఁ గాంచి, వికలహృదయుఁడనై యట నిలువఁజాలక క్రిందకుఁ బోతిని. తన మిత్త్రులు వెడలినంతనే నందకుమారుఁడు ఎప్పటి యట్లు వ్రాసికొనుచు లెక్కలుచూచికొనుచుండెనని కారాగృహాధికారి నాకుఁ జెప్పెను. ఉదయ మగునంతనే తాను మరణింతునని కృతనిశ్చయుఁడై యుండెనని నే నపుడు గ్రహించితిని. శనివారము 5 వ తారీకు 7 గంటల సమయమున జైలుచెంత నురితీయుటకు సర్వము సిద్ధమాయెనని వింటిని. 7½ గంటలకు నేను వచ్చితిని. నందకుమారుని కడసారిదర్శించుటకై యరుదెంచిన దురదృష్ట జనానీకముల విలాపాక్రోశనములు వర్ణింపనలవి కాదు. నారాక తెలిసినంతనే యాతఁడు మేడ దిగి నాచెంత కరుదెంచెను.

నందకుమారుఁడు తడయక ఉత్సాహియై యరుదెంచి యథాప్రకారము సలాము లొనరించెను. నే నొకయాసనము గ్రహించువఱకు నాతఁ డాసీనుఁడు కాఁడాయెను. ఎవ్వరో గడియారమువంకఁ జూచిరి. మహారాజు తోడనే నిలువఁబడి, మరణానంతరము తన మృతకళేబరము కనిపెట్టవలసిన మువ్వురుబ్రాహ్మణులఁ గాంచి గాఢాలింగన మొనరించెను. ఆబ్రాహ్మణులు దుర్భర విషాద నిరాశా బాధితులై ఏడ్చిరి. నందకుమారుఁడు ఇసుమంతయు నిరుత్సాహపడక, చలింపక, చెక్కుచెదరక నిలిచియుండెను. నేనపుడు నా ఘటికాయంత్త్రము చూచి ఇంకను వేళయున్నదనియు, కావలసినంత యవకాశ మొసంగెదననియు, ఆతఁడే సన్న యొనరించువఱకు వేచియుందు ననియుఁ జెప్పితిని. ఒకగంట యధికముగాఁ గూర్చుంటిమి. నందకుమారుఁడు నాతోఁ జాలసారులు మాటాడెను. రాజాగురుదాసు, సైన్యాధిపతి, కర్నలుమాన్సను, ఫ్రాన్సిసుగార్ల నుదాహరించెను. కాని ఆరాటమేమియు వ్యక్తముకాలేదు. జపమాల హస్తమున వ్రేలాడు చుండెను; నాలుక, పెదవులు గదలుచుండెను. కాన



3. జాతీయమహాసభాధ్యక్షులు డాక్టరు యమ్. ఏ. అన్సారీగారి ఆగమనమహోత్సవము

చెన్నపురి, ౨౩-౧౨-౨౭.



౪. అఖిలభారత పారిశ్రామిక వాణిజ్యప్రదర్శన ప్రారంభోత్సవము,
శ్రీ సర్ యం. సి. టి. ముత్తయ్యశెట్టిగారు ఉత్సవమును ప్రారంభించిరి.



౫. పైప్రదర్శనప్రారంభమునకు సహాయులైన జాతీయసేవాదళము,
× గుర్తుకడ నాయకుడు శ్రీ రాజారామపాండ్యగా రున్నారు.

తక్కుంగల కాలమాత్రుఁడు దైవచింతా నిమగ్నుఁ డాయెనని భావించుతును. పిమ్మట నాతఁడు నన్నుఁ దిలకించి లేచి కొండఱు జైలునౌకరుల నుద్దేశించి తా నేవిషయమైన మఱచినచో రాజాగురుదాసునవరణ చేయుమని పలికి ఉత్సాహవంతుఁడై నడచి, నిశ్చలచిత్తుఁడై యిటునటు కలయఁ జూచి, తనపల్లికి నారోహించెను. ఆవెనుక నేనును నాయిబుపరీఘురు నడచితిమి. కావున నందకుమారుని మూర్తిఁ గాంచి వర్ణించుటకవకాశము లేకపోయెను. వధ్యస్థానము సమీపించితిమి. జనసమూహ మత్యధికముగా నుండెను; ఐనను, అల్లరిచేయు సూచనమాత్రము లేకుండెను. రాజు తన పల్లకినుండియే ఒకింత పరిశీలనగా చుట్టును దిలకించెను. ఉరికొయ్య కట్టబడుటనే యుండెను; అందులకు వలయు సన్నాహములు జరుగుచునే యుండెను; నందకుమారుఁడు వానిని గాంచియు నించుకేనియుఁ జలింపలేదు. బ్రాహ్మణు లింకను రాలేదు. వారు అరుదేఱకుండ మరణింపవలయునేమో యని యాతఁ డొక్కింత తత్తఱపడెను. అంతవఱకు వేచియుందునని నేను నిబ్బరము చెప్పితిని. అంతలో బ్రాహ్మణులరుదేఱ నాతఁడేమైన రహస్యసంభాషణ మొనరింపవలసి యుండునేమో యని యెంచి, ఉద్యోగుల నంపివేయుదునని చెప్పితిని. వలదని కరసంచాలన మొనరించి, రాజాగురుదాసు గుఱించియు, తన జనానా గుఱించియు మాత్రము కొన్నిమాటలు చెప్పఁగోరెదనని యాతఁడు పలికెను. నన్నుఁ గాంచి, తన మృతకళేబర మన్యులెవ్వరు స్పృశియింపకుండఁ జూడవలయునని మఱియు మఱియు నాతఁడు కోరెను. కాని, జనానీకముఁ గాంచి యాతఁడు భ్రాంతిచెందలేదు; నిరుత్సాహపడలేదు. జనుల వక్రతచేతను, అవసరసన్నాహము లొనరించుచుండుటచేతను, కొంత యాలస్యమాయెను. నందకుమారుఁడు ఆలస్యము నపేక్షింపలేదు; అపేక్షింపకుండుటయే కాక తాను సంసిద్ధుఁడనై యుంటినని పలుమారులు చెప్పెను. తాను జూడవలసిన మిత్రులు మఱియెవ్వరైనఁ గలరాయని ప్రశ్నించితిని. అనేకులు కలరు; కాని, వారిని గాంచుట కిది యదనుగాదు, స్థలముగాదు—అని యాతఁడు బదులాడెను. ఆతఁడు చూడవలసినవాఁ డెవ్వఁడైనను జనసమూహమునం దణఁగియుండునా? నందకుమారుఁ డొకపేరు చెప్పెను; తన్నామధేయుఁడు పిలువఁబడెను. 'అవసరములేదు; బహుశః వచ్చియుండఁడు' అని యాతఁడు వెంటనే పలికెను. పిమ్మట, జనరలు క్లావరెంగు, కర్నలుమాన్సను, ఫ్రాన్సిసుగార్లకుఁ దన్ను స్మరణకుఁ దేవలయునని యాతఁడు కోరెను. నందకుమారుఁ డత్యంత స్థిరచిత్తుఁడై యుండెను. సంభాషింపని సమయమునం దాతఁడు వెనుకటియట్లు తన జిహ్వాధరములఁ గదల్చుచుండెను.

జనుల కోలాహలముచే మాట వినఁబడదు. కావున, ఆతఁడు చేయుసంజ్ఞ యేట్టిదని ప్రశ్నించితిని. హస్తచాలన మొనరింతు



౪. అఖిలభారత పారిశ్రామిక వాణిజ్యప్రదర్శన ప్రారంభోత్సవము,
శ్రీ సర్ యం. సి. టి. ముత్తయ్యశెట్టిగారు ఉత్సవమును ప్రారంభించిరి.



౫. పైప్రదర్శనప్రారంభమునకు సహాయులైన జాతీయసేవాదళము,
× గుర్తుకడ నాయకుడు శ్రీ రాజారామపాండ్యగా రున్నారు.

తక్కుంగల కాలమాతఁడు దైవచింతా నిమగ్నుఁ డాయెనని భావింతును. పిమ్మట నాతఁడు సన్నుఁ దిలకించి లేచి కొందఱు జైలునౌఖరుల నుద్దేశించి తా నేవిషయమైన మఱచినదో రాజాగురుదాసు సవరణచేయునని పలికి ఉత్సాహవంతుఁడై నడచి, నిశ్చలచిత్తుఁడై యిటునటు కలయఁ జూచి, తనపల్లకి నారోహించెను. ఆవెనుక నేనును నాయిబుపరీఘును నడచితిమి. కావున నందకుమారుని మూర్తిఁ గాంచి వర్ణించుటకవకాశము లేకపోయెను. వధ్యస్థానము సమీపించితిమి. జనసమూహ మత్యధికముగా నుండెను; ఐనను, అల్లరిచేయు సూచనమాత్రము లేకుండెను. రాజు తన పల్లకినుండియే ఒకింత పరిశీలనగా చుట్టును దిలకించెను. ఉరికొయ్య కట్టెమటనే యుండెను; అందులకు వలయు సన్నాహములు జరుగుచునే యుండెను; నందకుమారుఁడు వానిని గాంచియు నించుకేనియుఁ జలింపలేదు. బ్రాహ్మణు లింకను రాలేదు. వారు అరుదేఱకుండ మరణింపవలయునేమో యని యాతఁ డొక్కింత తత్తఱపడెను. అంతవఱకు వేచియుందునని నేను నిబ్బరము చెప్పితిని. అంతలో బ్రాహ్మణు లరుదేఱ నాతఁడేమైన రహస్యసంభాషణ మొనరింపవలసి యుండునేమో యని యెంచి, ఉద్యోగుల నంపివేయుదునని చెప్పితిని. వలదని కరసంచాలన మొనరించి, రాజాగురుదాసు గుఱించియు, తన జనానా గుఱించియు మాత్రము కొన్నిమాటలు చెప్పఁగోరెదనని యాతఁడు పలికెను. నన్నుఁ గాంచి, తన మృతకళేబర మన్యులెవ్వరు స్పృశియింపకుండఁ జూడవలయునని మఱియు మఱియు నాతఁడు కోరెను. కాని, జనాసీకముఁ గాంచి యాతఁడు భ్రాంతిచెందలేదు; నిరుత్సాహపడలేదు. జనుల వక్రతచేతను, అవసరసన్నాహము లొనరించుచుండుటచేతను, కొంత యాలస్యమాయెను. నందకుమారుఁడు ఆలస్యము నపేక్షింపలేదు; అపేక్షింపకుండుటయే కాక తాను సంసిద్ధుఁడనై యుంటినని పలుమారులు చెప్పెను. తాను జూడవలసిన మిత్రులు మఱియెవ్వరైనఁ గలరాయని ప్రశ్నించితిని. అనేకులు కలరు, కాని, వారిని గాంచుట కిది యదనుగాదు, స్థలముగాదు— అని యాతఁడు బదులాడెను. ఆతఁడు చూడవలసినవాఁ డెవ్వఁడైనను జనసమూహమునం దణఁగియుండునా? నందకుమారుఁ డొకపేరు చెప్పెను; తన్నామధేయుఁడు పిలువఁబడెను. 'అవసరములేదు; బహుశః వచ్చియుండఁడు' అని యాతఁడు వెంటనే పలికెను. పిమ్మట, జనరలు క్లావరెంగు, కర్నలుమాన్సను, ఫ్రాన్సిసుగార్లకుఁ దన్ను స్మరణకుఁ దేవలయునని యాతఁడు కోరెను. నందకుమారుఁ డత్యంత స్థిరచిత్తుఁడై యుండెను. సంభాషింపని సమయమునం దాతఁడు వెనుకటియట్లు తన జిహ్వాధరములఁ గదల్చుచుండెను.

జనుల కోలాహలముచే మాట వినఁబడదు. కావున, ఆతఁడు చేయుసంజ్ఞ యెట్టిదని ప్రశ్నించితిని. హస్తచాలన మొనరింతు

నని యాతఁడు బదులాడెను. కాని, నిర్నిమిత్త ప్రచలనము కాకుండ కరములు కట్టివేయుదురు; కావున, తన యభిప్రాయసూచకముగాఁ బాదము నాడింపవలయునని చెప్పితిని. ఇఁక నాతంక మేమియు లేదు; బాధాకరమగు కడ తంతు ఒక్కటియే మిగిలియుండెను. ఈరి కొయ్య సమీపముననే పల్లకి తేవలయు నని నే నాజ్ఞాపించితిని. కాని, తాను నడచియే వధ్యస్థానము చేరఁగోరెను. ముందు నేఁ జూచి యుండిన కంటె నందకుమారుఁడు ఈసమయముననే గంభీరతరముగ నిట్టనిలిచి నడచెను. ఆతని వదనము వస్త్రముతోఁ గప్పవలయును. ఆవిషయము కొంచెము చిక్కుగ నుండెను; కంపెనీ బ్రాహ్మణసైనికుఁ డొకఁడు చేతరుమాలు తాల్చి యరుదెంచెను; నేను వానిని జీరితిని: కాని, రాజా సమ్మతింపక, తనపాదముల చెంత సాష్టాంగ మొనరించుచుఁ బడియున్న తన సేవకునిఁ జూపి వానిచే వస్త్రాచ్ఛాదన మొనరింపుమని సంజ్ఞ చేసెను. నందకుమారుని పాదములు కొంచెము నీరసించియుండెను; ఉపరి, చేతులు బంధింపఁబడియుండెను: కావున వధ్యస్థానము నారోహించుట కష్టసాధ్యమాయెను. ఐనను, ఆతఁ డించుకేనియు విముఖత చూపలేదు. రయముననే సాగి, వేదిక నారోహించి నిట్టనిలిచెను. నందకుమారుని వదనము మూఁతపడునంతవఱకును నేను సాధ్యమగు నంత పరిశీలనతోఁ జూచితిని; ఆతని వదనమున భయభ్రాంతు లణుమాత్రమైనను గోచరించునేమో యని పరీక్షించితిని: కాని, అట్టి జాడ ఏమియుఁ గానరాదు. నాధైర్య మంతరించెను; పల్లకి నారోహించితిని. నే నుపవిష్టుఁడఁ గాకముందే నందకుమారుఁడు సన్న యొనరించెను; తోడనే, వేదిక తరలింపఁబడెను. నే నొకింత తాల్మి వహించి యటు చూచితిని:— నందకుమారుని కరములు మొదట నేఁ జూచినపు డెట్లు కట్టఁబడియుండెనో, అట్టులే యుండెను. దృష్టిగోచరములగు నాతని వక్త్రముఖభాగములు వికారముగ సంకరతిరుగలేదు. దుఃఖభాజనమగు నీవ్యాపారము పొడుగునను నందకుమారుఁడు వ్యక్తపఱిచిన నిశ్చలత, చిత్తస్థైర్యము, దృఢసంకల్పమును నే నెన్నఁడైన విని కనియుండు నుపమానములతోఁ దులతూఁగును. మృతకళేబరము సాధారణముగ నవసర మగునంత కాలము వ్రేలాడినపిమ్మట దహనము చేయుటకై బ్రాహ్మణుల కొసంగఁబడెను."

---

## బాజీప్రభువు

మద్దిపట్ల వేంకటరమణయ్య గారు

మచ్చుచల్లినపోల్కి- మైమఱచి కునుక-ముట్టడించి యుండిన విజాపురపు సేన,
గాఢతమములో రాత్రిదుర్గంబు విడిచి - బలముతోఁగూడఁ బాఱె శివాజి విభుఁడు.
రాజకీర మేఁగిన పంజరంబుకరణి - పన్హాళాకోట యుండెను బావు రనుచు;
తురకల కలంత చూచి దిక్తరుణు లెల్ల-నిరులు ముసుఁ గూడ నవ్విరి విఱుగఁబడుచు,
వెదకుచు మరాటదండును వెడలె నప్డు - డశ్వపదికుల దట్టంపు టడుగు జాడ,
బీజపురసేన సిద్ది యజీజు నడపఁ - బ్రళయకాల వేలాతీత వార్ధి భాతి.

క్రందుకొను నాత్మబలపరాగంబు వెంట - నెత్తివచ్చెడు రిపుల యుద్వృత్తి చూచి
బాజిప్రభు వను సర్దారువంకఁ దిరిగి - ముదల యిడె నా మహారాష్ట్రభూపుఁ డిట్లు.
"మీఁదఁ బడును హుటాహుటి మ్లేచ్ఛబలము-రాంగణాకోట మనము చేరకయెమున్న
కావునను దాని నీ వరికట్టవలయు - ఈ కనుమ వెంట ముందుకు రాకయుండ.
కోటలో నెల్లరముఁ జేరుకొనినతోన - వింట నాఱుపిరంగులు వేయఁబడును;
గుఱుతువిని వారిఁ గికురించి మరలిరమ్ము"-అనుచుఁ గొలఁదిసైన్యమునిల్పి చనియె శివుఁడు.

దేవతాప్రసాదం బగు పూవువలెను-క్షితిపునానతిఁ దలఁ దాల్చెఁ జెలఁగి యతఁడు;
ఇఱుకుఁద్రోవను శాత్రవుల్ చొరకయుండ-వ్యూహమును దీర్చె నాహవోత్సాహ మెసఁగ.
వనధి కల్లోలమాలలభంగిఁ దరిసె - రయచలద్యనజవన హయదళంబు;
తద్విఘాతరజోధూమతతికి నడుమ - ధ్వజపటాంచలానల శిఖావళి నటించె.
సన్న సేసె మహారాష్ట్రసైన్య భర్త - వీనుకొన దాఁక నరి లాగి విడిచి రంతఁ
బింజ పింజను గఱవంగ విశిఖవితతి - అస్త్రలాలీఢపాదవిన్యాస మమర.

వేవెలుఁగుఁ గప్పి మిడుతల పిండుపగిది - రంయ్యనుచు నాశుగాళి శాత్రవులఁ గ్రమ్మె
వర్మములు చీల్చి దేహముల్ వ్రచ్చిపాఱ - గుఱ్ఱములనుండి కొందఱు కూలి రిలను.
తడసితిమ యింక బ్రదుకు టుత్తది యటంచుఁ-దురగములఁ గొల్పి కవిసిరి తురకరాతు
లా మరాట రాణువపైకి ససమధాటి-బొబ్బరించు విండుల నోళ్లు మూసివేయ.
తమ్ము శింజినీకఠినబంధమున నుంచి - సంతత మలంచు పరిపంథిచయము ముంచె
ఝాంకరించుచు సునిశితాస్త్రములు నెంత-దూరదృష్టియొ యావిండ్ల బారు కౌర!

ఏటి కెదురీదునట్టులు మేటిశ్రమను-ఘోటకము లంప గమిఁ ద్రోసికొనుచు నడిచె;
శరము లనిమెడు వడగండ్లజడికి నోడి-మోరలను వంచుకొని కొన్ని ముందు కరిగె.

మోఁకటిలి ధనుర్ధరులకు ముందు గల్గు-ప్రాసికుల బారుటీఁటెల వాఁడిమొనలు
ప్రక్కలఁ గసుక్కుమని గాడఁబడియెఁ గొన్ని-బెగ్గడిలి కాతు లవనికి డిగ్గ నుఱుక.

కుంతకాంతారవీథిపై గుఱ్ఱములను-చంగుచంగున దూఁకించి చక్కడించి
రరుల శూరోత్తములు కొంద అంకెములను-నిట్టగా ప్రేటుప్రేటుకు నిలువఁబడుచు.

అమలకాంతిచ్ఛటలు గ్రక్కు నాయుధములు-వెచ్చవెచ్చని నెత్తురుల్ వెడలఁగ్రక్కె;
గడియక్రింద మనోజ్ఞమౌ కనుమ యపుడు-శవపరీతమై చూడ ననహ్య మయ్యె.

కనుమదారి పేరి నదీముఖాన కడరి-పోటు పొడిచె యవనదళాంభోధి వెల్లి;
క్షితిధరశ్రేణివలె నడ్డి చెదరఁగొట్టెఁ - బ్రకట విక్రమంబున మహారాష్ట్ర సేన.

పటిచిన శివాజిఁ బట్టుకో వలనుగడమి-దారికట్టిన చిఱుమూఁకఁ దఱుము లేమిఁ
జీదఱను బొందె సిద్ది యజీజు మిగుల-నిమిష మొక్కవర్షమయి త న్వేఁచుచుండ.

త్రోయఁబడియును వెనుకకుఁ దొంటికంటె-ముందునకు వచ్చు తరుశాఖచందమునను
గ్రమ్మఱించినకొలఁదిఁ బైఁ గదియఁ దొడఁగె-మ్లేచ్ఛవాహిని లెక్కకు మిక్కు లగుట.

కాలు కదలింప కూపిరి కఁగుగువఱకు-వైరులను జెండి కదళికావనమురీతిఁ
బడిన తనవారిఁ గాంచి డీల్పడక కిడిమి-డీకొనియె బాజిప్రభు వున్న మూఁకతోన.

సటలు పెఱికిన సింహంబుసరణి నతఁడు - గర్జసేయుచు సేన కగ్రమునఁ బొల్చె;
సన్నగిలిన మరాటులచాయఁ జూచి-గెలుపుబుబ్బునఁ దాఁకిరి మలకబంట్లు.

భీకరంబయి సాగె సమీక మపుడు - జానుదఘ్నమై పాఱె నస్రస్రవంతి;
ముమ్మర మ్మగు వానకాలమ్మునందు - నా కనుమవాఁగుఁ బ్రవహింప దంతపడిగ.

నీల్గిన రికాబుల నతండు నీల్గి గరులు; - గంతుకొనిన నాతని తేజి గంతుకొనిరి;
మింటి కెగసినఁ దరవారి మింటి కెగసి-రబ్రముగఁ దసీయరణవిహార వేళ.

ఆజివోహలుఁడైన యా బాజిప్రభువు-దుర్నిరీక్ష ప్రతాపంబుతో వెలింగెఁ
గలనుఁ జూచుటకో యనఁ గనుమపైకి-సూటిగా వచ్చు నినునకుఁ బోఁటియగుచు.

లేళ్లగమిబోలె వెన్నిచ్చె మ్లేచ్ఛబలము-కోలుమసఁగు మరాటశార్దూలుమ్రోల;
మరలి మగుడ మార్కొన్ సిద్దికరము వీవఁ-దద్విరుద్ధముగఁ జరింప ధ్వజపటాళి.

వెనుక డాఁగినడా లురమున ధరించి-యొరను నక్కిన యాసి బయల్ మెఱయఁజేసి
మ్రందిన తురంగయోధులఁ గ్రిందుపఱిచి-వెనుకఁ గల మ్లేచ్ఛసేన ముందునకు దూఁకె.

అహితబృందంబుతోడ రాపాడి యాడి-చందనము చందమున నోలి సన్నమైన
స్వీయసైన్యముఁ గాంచి బాజిప్రభుండు-రాంగణావైపు సారె కర్ణంబు నొగ్గె.

నృపుని దుర్గప్రవేశంబు నిలుపుసేయు-నిమిసముల మందగతికినై నెగులు నొందెఁ
గాయ మెల్ల జల్లెడరీతి గాయపడినఁ - జీరికిఁ గొనని యాశూరశేఖరుండు.

బదులు చెప్పవలసె గట్టివాయివోలె-నొక్కడా ల్పదికత్తుల కొక్కమాటె;
పదునుపెట్టవలసె తెప్పపాటులోన - కటికిమెకలు పదింటిపైఁ గత్తియొకఁడె.

అతని బుజము నూఁటను శక్తిపతగ మెగిరె; - సాముకండెల పనివాండ్రు సమ్మెకట్టె;
రథిపుఁ గూర్చిన శుభవార్త యకట! తేఁడు - గాలిపేరిటి తంతితపాలవాఁడు.

అదియ యాదనని శిరముపై నడిద మెత్తె-అఫ్జులుని పట్టి ఫజులుఖాననెడు దిట్ట;
డాలు నొడ్డినఁ దనచెంప చీలి చనఁగఁ-గస్సుమని లేచె సర్పంబుకరణి బాజి.

చేఁదుకొని కలసత్తువ చేతియందు-మిత్తి కీడగు కత్తిచే మ్లేచ్ఛునేసె;
తెలివిగల గుఱ్ఱ మవలికిఁ దొలఁగెఁ గాని - బాబుకడ కేఁగియుండును ఫజులుఖాను.

వ్రేటులు తప్పిపోవఁ దద్వేగమునను-వాజిపైనుండి యిలఁ గూలె బాజిప్రభువు
నెత్తుటను గండభాగంబు జొత్తిలంగ-శిరము బొంగరమట్టులు తిరుగుచుండ.

ప్రక్కలకుఁ జూచె మోచేతిపైని లేచి-చొరఁబడిరి లోయ స్వేచ్ఛగాఁ దురకభటులు
వీనువిందుగ నపుడేని వినఁగఁబడద-అవనిపతి దుర్గరక్షితుఁడైన గుఱుతు.

"ఆఁగుఁ డాఁగుఁ డెచ్చటి"కంచు నౌడు గఱచి-పట్టువదలిన పిడికిట వాలు నదిమి
లేవ నుంకించియును లేవలేక యాతఁడు-నడుమువిఱిగిన త్రాఁచుచందమున నోఁజె.

తనదు నిర్మలమానసదర్పణమునఁ-గేవలము శివరూపంబె గీలుకొనఁగ
"స్వామి మీయాన పాలింపఁజాలనైతిఁ-దప్పు సైరింపుఁ" డని బాజి దండ మిడియె.

అస్తమయమున నుద్యోగులట్లు వాని-యింద్రియంబులు పనులు చాలింపఁదొడఁగె
అభ్రశకలంబులందలి యర్కుపోల్కి-వచ్చుచును బోవసాగెను వాని తెల్వి.

ధామ్ము ధాం ధాముధాంధాము ధామ్ములెసఁగె-గిరిదరీముఖంబులు హాంగునెఱపుచుండ
నతని మానసవరణమ్ము నాక్రమించు-గాఢచింతాభరమ్మును గడలఁ జిమ్మ.

కాళరాత్రిలో మెఱపుఁదీఁగవలె వాని-విగతకళమైన మోమున నగవు తోఁచె;
"ధన్యమాయెను నా జీవితం" బటంచు-నరుణబింబంబుఁ జీల్చుక యరిగె నతఁడు.

---

# ఇక్ష్వాకులు

[క్రొత్త పరిశోధనము]

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

పరమపురుషుఁ డగు శ్రీరామచంద్రమూర్తి యిక్ష్వాకువంశ్యుఁడు. ఆయన కృతయుగమునాఁటివాఁడు. పురాణములందు కలియుగ రాజవంశవర్ణనలలో నిక్ష్వాకు వంశ్యులగురాజు లిర్వదితొమ్మండ్రు రాజ్యమేలిన తర్వాత ౧౫౩౦ యేం డ్లితరరాజులు రాజ్యమేలునట్లును, నటుతర్వాత నంధ్రరాజులు నన్నూట యేఁబదియేండ్లు రాజ్యమేలునట్లును గలదు. సాతవాహనుల పాలనము క్రీస్తుకు పూర్వము నూటయేఁబదియేండ్ల కారంభమై క్రీస్తుకు తర్వాత మున్నూఱేండ్లదాఁక నుండినట్లు పరిశోధకులు నిర్ణయించుచున్నారు. పురాణోక్తి సత్యమే యగునేని యిప్పటి కించుమించుగా మూఁడువేల యైదువందలయేండ్లకుఁ బూర్వమున్నవా రగుదురా యిక్ష్వాకు రాజులు! శ్రీరాములవారు కోసలాధీశ్వరులు. ఈ కలియుగపు టిక్ష్వాకురాజులుగూడఁ గోసలాధీశ్వరులగుదు రనుకొనవచ్చును. ఇది పురాణగాథ.

కొన్నియేండ్లకు ముందు కృష్ణామండలమందలి జగ్గయ్యపేటదగ్గఱ కొండమీఁదనున్న బౌద్ధస్తూపమును దొరతనమువారు త్రవ్వించిరి. దానిలో నిక్ష్వాకువంశ్యులగు రాజుల శాసనములు గొన్ని దొరకినవి. పరిశోధకులు లిపిరీతిని బట్టి వానిని క్రీ. తర్వాత మూఁడవ శతాబ్దివానినిగా నూహించిరి. అందు పురుషదత్తుఁడను నిక్ష్వాకురాజుపేరు గలదు. కడచిన వత్సరమున శ్రీశైలప్రత్యంత పర్వతమగు సిద్ధనాగార్జునుని కొండదగ్గఱ బౌద్ధస్తూపముల దొరతనమువారు త్రవ్వించిరి. అందు ఇర్వదిటికిఁ బైఁగా నిక్ష్వాకురాజుల శాసనములు దొరకినవట! అవి యింకను బ్రకటితములు గాలేదు. వానిలోని విశేషవిషయము లిఁక మీఁద వెలువడవలెను. ఇది శాసనాది చరిత్ర సాధన పరిశోధన విషయము.

ఇప్పుడే క్రొత్తగా మైసూరు దొరతనమువారు ధర్మామృతమను యొక కర్ణాట గ్రంథమును బ్రకటించిరి. అది జైనగ్రంథము. శక. ౧౦[illegible]౭ నాఁడు నయసేనాచార్యుఁడు దాని రచియించెను. దానికి మూల మేదో ప్రాకృతమున నుండియుండును. ఆ గ్రంథమునేకాదశాశ్వాసమున నిక్ష్వాకునకును, సంగ్ర దేశమునకును సంబంధించినకథ గలదు. అది యిది:—

వాసుపూజ్య తీర్థంకరుని కాలమున అంగదేశమున చంపాపురము రాజధానిగా నిక్ష్వాకువంశపవిత్రుఁడగు యశోధరమహారాజు రాజ్యమేలుచుండెను. ఆతనికి అనంతవీర్యుఁడు, శ్రీధరుఁడు, ప్రియబలుఁడు నని ముర్వురు కొడుకు లుండిరి. యశోధరుఁడు దిగ్విజయ

యాత్ర వెడలెను. దక్షిణదిక్కున మాళవ, మగధ, కర్ణాట గొల్ల(?) కరహాట గౌళ, లాట, చోళ, చేర, పాండ్య, కళింగ దేశముల జయించి కప్పములఁ గొని, వేంగీదేశమునకు వచ్చి, యా దేశపు సౌభాగ్యమునకు మెచ్చి, యశోధరుఁడు తా నక్కడనే నెలకొన నుత్సహించెను. తన ప్రాభవమునకుఁ దగినంత గొప్పగా నాదేశమందు ప్రతిపాలపురమని యొక రాజధానిని నిర్మించి యందు వసించెను. మహోన్నతముగా రాజ్యమేలెను. వార్ధకమున నాతఁడు రాజ్యభారమును బుత్త్రులపైఁ బెట్టి, తా నడవి కేఁగి, జినేంద్రసేవతోఁ గాలము గడపఁదలఁచెను. కొడుకులఁ బిలిచి యడిగెను. వారు తమకు రాజ్యము వలదనియు, జినేంద్రదీక్ష గొన యరణ్యములందుఁ దప మాదరించుచుందుమనియుఁ దెలిపిరి. ఎట్టకేలకు మూఁడవ కుమారుఁడగు ప్రియబలునకు రాజ్య మప్పగించి, యశోధరుఁడు పెద్దకొమాళ్లిద్దరితో రాజ్యము వీడి, విశ్వసేనాచార్యునికడ జినదీక్ష గొని, గురుని దేశము చొప్పున జటాశిఖరమను పర్వతము మీఁది కరిగి తపము సల్పెను. యశోధరభట్టారకుఁడును, ననంతవీర్య మునిపుంగవుఁడును, నందు అష్టకర్మల నొనర్చి పరమశ్రీ మనఃప్రియులై నిర్వాణము నందిరి. అకలంకుఁడని పేరందిన శ్రీధరాచార్యుఁడు ఆగిరిపై నుగ్రతపస్సు చేయుచుండెను. ప్రతిపాలపురమున ప్రియబలుఁడు రాజ్యమేలుచుండెను. ఒకనాఁడాతఁడు వనవిహారమునకుఁ బోయి పాముకాటుచే మృతిఁబొందెను. ఆతనికిఁ బుత్త్రసంతతి లేదయ్యెను. ఇంద్రప్రభుఁడనుమంత్రి యారాజు మృతివార్త నెవ్వరికిఁ దెలియనీయక, రాజు వనక్రీడచే బడలికఁ జెంది యంతఃపురమున నుండెనని వెల్లడించి, గుప్తముగా నౌర్ధ్వదైహిక కర్మల నొనర్చెను. తనకుమారుని రాజ్యరక్షకై నియోగించి యాయింద్రప్రభుఁడు పరిమితపరివారముతో బయల్వెడలి, కొన్ని ప్రయాణములమీఁదఁ ఋషినివాసపర్వతమును జేరెను; పరివారము నక్కడి ప్రత్యంతపర్వతమున విడియించెను; అక్కడి జినభవనములఁ బూజించెను. పర్వత మధిరోహించి శ్రీధరాచార్యుని దర్శించి, నమస్కరించి, యిట్లు విన్నవించెను: 'మునీంద్రా! మీరీగిరిపై నెలకొనియుండుట నెఱిఁగి వేంగీదేశప్రజలు పలువురు మీచరణసేవ నభిలషించి యిక్కడికి వచ్చి, పర్వతపాదమున విడిసియున్నారు. వృద్ధులు పలువురు పర్వత మధిరోహింపఁ జాలకున్నారు. మీరక్కడికి విజయంచేసి వారి నాశీర్వదించి యుద్ధరింపుఁడు." ఈమాయపుమాటల నెఱుఁగక శ్రీధరాచార్యుఁడందుల కంగీకరించి దిగి వచ్చెను. వారెల్లరు నామునీంద్రునిఁ గపటముననే ప్రతిపాలపురమునకుఁ దోడ్కొనివచ్చి, యచ్చట ప్రియబలమరణవార్త నెఱిఁగించి, సంతతి లేకపోవుటచే వంశచ్ఛేదమగుటఁ దెలిపి, సంతానముగలుగువఱకయినను సంసారమును, రాజ్యమును నంగీకరింపవలసినదిగా నిర్బంధించి వేఁడిరి. ఎట్టకేల కాతఁ డంగీకరించెను. కొన్నాళ్లకాతని కొకకొడుకు గల్గెను. ఆబాలునికి శ్రీధరుఁడు తనతండ్రి

యగు యశోధరుని పేరు పెట్టెను. పట్టముగ ట్టెను. చెఱలోనుండి విడిదలఁ బొందినవాఁడు వోలె నాతఁ డంతట సంసారముననుండి విముక్తుఁడై మరల ఋషినివాసపర్వతమునకుఁ బోయి, జినదీక్షగొని, ద్వాదశవిధ వ్రతముల నొనర్చి, నిర్వాణశ్రీసమేతుఁడై నెగడెను.

శ్రీధరాచార్యుఁడు తపఃపుకాలము వసించి తపస్సుచేసి సిద్ధిపొందుటచే ఋషినివాసపర్వతమునకు శ్రీపర్వతమని పేరయ్యెను. ఆపర్వతమునకు దక్షిణభాగమున నొకమఱ్ఱిక్రింద నుండి ముక్తిని గనుగొనుటచే నాచోటికి సిద్ధవటమని పేరయ్యెను. శ్రీధరాచార్యునకు జ్ఞానపూజ చేయవలయునని చతుర్విధదేవనికాయములు గూడినస్థలమునకు అమరావతి యని పేరయ్యెను. శ్రీధరముని తపస్సు చేయుచు నర్జునవృక్షముక్రింద నుండఁగా ఖేచరులు మల్లికాపుష్పములచేఁ బూజించిరిగాన యాస్థలమునకు మల్లికార్జున మని పేరయ్యెను. ఇంద్రప్రభుఁడాముని గపటముగ వేఁడుకొనుచు వృద్ధులు వసించిరని తెలిపిన పట్టునకు వృద్ధగిరియని పేరయ్యెను. శ్రీధరాచార్యునికుమారునిఁ జెలికాండ్రు ముండియసుతుఁడా (ముండితసుతుఁడు) యని కేరడము లాడుటచే నావంశమునకు ముండియవంశమని యుఁ దర్వాతఁ బేరయ్యెను.

ఇట్టి యిక్ష్వాకువంశపు రాజులపరంపరలో ధనదుఁడని యొకరాజుజనించెను .అతఁడు ప్రతిపాలపురము రాజధానిగా వేంగీదేశమెల్ల నేలుచుండెను. ఆదేశముననే సంఘశ్రీయని యొక బౌద్ధుడుండెను. ఆతనిపుత్త్రి కమలశ్రీయని పేరుగలది మిక్కిలి సౌందర్యవతి. ధనదుఁడామెను ప్రేమించి వివాహమాడెను. కమలశ్రీ నెట్టకేల కాతఁడు జైనమతమునకుఁ ద్రిప్పుకొనెను. తన మామ యగు సంఘశ్రీనిగూడ నాతఁడు జైనమతమునకుఁ ద్రిప్పుకొన యత్నించెను. సంఘశ్రీయంగీకరింపఁడయ్యెను. ఒకనాఁడు జినదీక్షితులైసిద్ధిని బొందిన చారణ ఋషు లంతరిక్షమునఁ బోవుచుండఁగా ధనదుఁడు వారిని సంఘశ్రీకిఁ జూపి జైనమతమున నమ్మిక పుట్టించెను. సంఘశ్రీ నగానమ్మకమున జైనమతమునఁ జేరెను. ఒకనాఁడా సంఘశ్రీకి బౌద్ధమతగురువగు బుద్ధశ్రీ యరుదెంచి బోధించి మరల నాతని బౌద్ధమతమునకుఁ ద్రిప్పెను. ధనదరాజుమరల నాతనినిజినమతమునకుఁ ద్రిప్పుకోఁజూచెను గాని లాభము లేదయ్యెను. ధనదరా జొకనాఁడు నిండుసభలో మామ నిట్లడిగెను: "నీ వానాఁడు చారణఋషు లంతరిక్షమునఁ బోవుచుండుటను జూచితివిగదా: మరల జైనమతము విడిచితివేల?" సంఘశ్రీ—"నేనుజూడ లేదు." అనెను. అనృతమాడిన యాసంఘశ్రీపైఁ గోపించి యక్కడిపురదేవతలు వచ్చి వాని రెండు గన్నులను బెఱికి వేసిరి. ఇట్లు సంఘశ్రీ యవమానితుఁడై, దుఃఖితుఁడై, కొన్నాళ్లకుఁ జనిపోయెను. ఆతఁడు నరక మందెను. వాని వంశమువా రేడుతరములదాఁకఁ



అశ్వమేధయాగముకొరకు శ్వేతాశ్వమును విడుచుట

అక్బరుచక్రవర్తి నాటి 'రజంనామా' లోని చిత్రము

బుట్టుగ్రుడ్డివాం డ్రయిరి. బహుకుటుంబముగల యాసంఘుశ్రీవంశమువా రేడుతరములదాఁక నట్లు గ్రుడ్డివా రగుటచే నాదేశమునకంధక దేశమని పేరయ్యెను. ధనదమహారాజట్లు గొన్నాళ్లు రాజ్యమేలి, తనపుత్త్రుఁడగు నింద్రగుప్తునికిఁ బట్టముగట్టి తాను దపోవనమున కరిగెను.[1]

పయికథలో వాస్తవవిషయము లేవి కాఁదగునో పరిశీలింతము.

౧. వేఁగిదేశ మిప్పుడు వేఁగినాఁడుగాఁ దలఁపఁబడు నంధ్రదేశైకభాగమే కాక పూర్వ మొకప్పుడు నేఁటికృష్ణాగుంటూరు గోదావరిమండలములు వ్యాపించిన దేశమంతటికిని బేరుగా నుండె ననుట కాధారములు పెక్కులు గలవు. కావున నిందు వేంగీదేశపద మంధ్రదేశపద పర్యాయముగా నుండుట సంగతమే.

౨. ఇందుఁ బేర్కొనఁబడిన ప్రతిపాలపురము భట్టిప్రోలు గావచ్చును. ధనదమహారాజు కథాకల్పితుఁడు గాకపోవచ్చును. అతఁడు రాజ్యమేలి యుండవచ్చును. వెలనాఁటి చోడులకు రాజధానియైనధనదుపురము(నేఁడు చందవోలు) ఆతనిపేర వెలసినది గావచ్చును. ధనదుపురము త్రిలోచనపల్లవునిచేఁ జోడరాజుల కొసఁగఁబడినట్లు శాసనము లందు గలదు. త్రిలోచనపల్లవుఁడును, గరికాలుఁ సమకాలమువారు గాన యాపురము మిక్కిలి ప్రాచీనమే యగును. భట్టిప్రోలి కది చేరువనే కలదు. దీవిసీమ యను పేర నేఁడు పేర్కొనఁబడుచున్న కృష్ణాసముద్రమధ్య ద్వీపము పూర్వము ధనదునిచేఁ గల్పింపఁబడిన దని గణపేశ్వరపు శాసనమునఁ గలదు: "ద్వీపం పురైత ద్ధనదేన సృష్టమ్" అని. ధనదుఁడు కల్పించెననఁగా నాతఁ డాద్వీపమును మనుష్యనివాసార్హముగాఁ గావించెనని యర్థమగును. గణపేశ్వర శాసనమునఁ బేర్కొనఁబడిన ధనదుఁడు ధనదపురాధిపతి యగును. క్రీస్తుకుఁ బూర్వము మూఁడవ శతాబ్ది నాఁడుకట్టఁబడినదయి యుండవచ్చునని తలఁపఁబడుచున్న భట్టిప్రోలిస్తూపము[2]నట్టడుగునఁ గల శాసనములలో 'కుబేరకుఁ'డని రాజు పేరు

1. నే నీ ధర్మామృతకథ నీయేఁడు 20–10–27 బళ్లారి ఆంధ్రసాహిత్యపరిషత్సభలో 'ఆంధ్రభాషావతార' మను వ్యాసమున వ్రాసి చదివించితిని. దాని నిందుఁ జేర్చితిని. ఇటీవల నీ కథను కర్ణాటపండితసహాయమున నించుక విరివిగాఁ దెలుఁగున వ్రాసియిచ్చుటకుఁ గోరఁగా శ్రీ నేలటూరి రమణయ్యపంతులుగా రట్లువ్రాసియిచ్చిరి.

2. భట్టిప్రోలిస్తూపమున సాక్షాద్బుద్ధదేవుని యస్థిశకలము నొక చిన్నమణికరండమునునుంచి, దాని ననర్ఘమైన స్ఫటికకరండమునం దుంచి స్వర్ణపుష్పములతో, రత్నములతో, స్వర్ణముద్రికలతో నర్చించి, పూరించి, (స్ఫటికకరండములు మూఁడున్నవిగాని యస్థిశకలముమాత్ర మొక్కదానిలోనే కలదు.) దానిని గొప్ప శిలాకరండములలో నుంచిభట్టిప్రోలి స్తూపమునడుమున నెలకొల్పి దానిపై స్తూపముగట్టిరి. బుద్ధదేవుని యస్థిశకలము వంగదేశపు బౌద్ధుల దేవళమునకు రోనాల్డుషే ప్రభువుకాలమున నొసఁగఁబడినది. తక్కిన యమూల్యవస్తువులు మద్రాసు మ్యూజియమునఁ గలవు. చెన్నపురికివచ్చు నాంధ్రులెల్లరు వీనిని దప్పక దర్శింతురుగాక! అక్కడనే యతి సుందరములైన యమరావతీస్తూప శిల్ప చిత్రములును గలవు.

గలదు. ధనద, కుబేరక పదముల యర్థసంగతి యాలోచింపఁ దగినది. తెలుఁగుదేశపు వైశ్యులకు 'కోమట్లు' అని పేరు గలదు. వారు కుబేర,ధనద వంశ్యులని వ్యవహారముగలదు. బ్రహ్మశ్రీ చిలుకూరి వీరభద్రరావు గారు 'కోమటి'పదము 'గోమటీశ్వరుఁ' డను జైన దేవతపేర నేర్పడినదని,భట్టిప్రోలిస్తూపపు కుబేరునకు వీరికి సంబంధము గలదని— రాజనరేంద్రసంచికలో వ్రాసినట్లు స్మరించుచున్నాను. ఈవిషయమును బ్రబలపఋషఁగల సాధనములను వేఱొకతూరి వెల్లడింతును.

3. బుద్ధదేవునకు 'శాక్యసింహుఁ' డని పేరు గలదు.ఆయన యిక్ష్వాకువంశమువాఁడు గావచ్చును.ఇక్ష్వాకులు శాక్యులనుటకు సాధకముగా లింగాభట్టీయ మను నామలింగానుశాసనవ్యాఖ్యానమున నీశ్లోకము గలదు:

శ్లో. శాకవృక్ష ప్రతిచ్ఛన్నం
వాసం యస్మాత్ప్రచక్రిరే,
తస్మా దిక్ష్వాకువంశ్యాస్తే
శాక్యా ఇతి సమీరితాః.[1]

చంపాపట్టణము బహు ప్రాచీనమయినది. అది యంగదేశపు రాజధాని. శ్రీమద్రామాయణకాలమున నది రోమపాదునిరాజధానిగా నుండెను. ఆకాలమున దానికి 'మాలిని' యని పేరట. భారతకాలమున నది కర్ణుని రాజధానిగా నుండెను. అప్పుడు చంపానగర మనియే దాని పేరు. పండ్రెండవ జైనతీర్థంకరుఁ డగు వాసుపూజ్యముని క్రీస్తుకుపూర్వము అయిదవ శతాబ్దిలోనో, అంత కింకను బూర్వముననో చంపా పట్టణముననే జనించి యక్కడనే నిర్వాణమందెను. క్రీస్తుకు పూర్వము అయిదవశతాబ్దిలోఁ గట్టఁబడిన వాసుపూజ్య ముని దేవళము చంపాపట్టణమున శిథిలమై నేఁటికిని గలదు. జినమత ప్రతిష్ఠాపకుఁడగు మహావీరాచార్యుఁ డాచంపాపట్టణమునఁ జాతుర్మాస్య వ్రతమును జరపెనట! చంపా చరిత్రమును గూర్చి మత్స్యపురాణమునఁ జూడదగును. వాసు పూజ్య తీర్థంకరుఁడు క్రీ.పూ. అయిదవ శతాబ్దిలోనో, యంతకుంబూర్వమో ఉన్నవాఁడుగాన, వేంగీదేశమున కిక్ష్వాకుల రాక కూడ నాకాలముననే యనఁగా, క్రీ. పూ. అయిదవ శతాబ్దిలోనో అంతకును బూర్వమో జరగినదగును.

౪, భట్టిప్రోలిస్తూప మిక్ష్వాకురాజులచే నెలకొల్పఁబడినది గావచ్చును. అది బుద్ధదేవుని యనంతర మల్పకాలమునకే వెలయింపఁబడి యుండును. అందు సాక్షాద్బుద్ధదేవుని యస్థిశకలము గలదుగదా! జగ్గయ్యపేటస్తూపమున నిక్ష్వాకురాజులశాసనము లున్నవిగావున నది వారిచేతనే వెలయింపఁబడిన దగును. ఇప్పుడు క్రొత్తగా దొరకిన సిద్ధనాగార్జునుని కొండస్తూపములలో నిక్ష్వాకులశాసనములే యనేకము లగపడుటచే నవికూడ నిక్ష్వాకులచే వెలయింపఁబడినవే యగును. ఆస్తూపములుగూడ

1. శ్రీ క్రొత్తపల్లి సూర్యరావుగా రీశ్లోకమును నాకుఁ దెలిపిరి.

ధాతుగర్భములని తెలియవచ్చుచున్నవి. ధాతుగర్భమనఁగా బుద్ధదేవుని వెండ్రుకలో, అస్థులో పెట్టికట్టినది. అమరావతీస్తూపముగూడ నిక్ష్వాకులచేత వెలయింపఁబడినదే కాఁదగును. ఇట్లనుటకు సాధనము:—అమరావతీ స్తూపమున రాజవిగ్రహములును, రాజచిత్రములును పెక్కులు గలవు. అవి యాస్తూపమును గట్టించిన వారివి గావచ్చును. జగ్గయ్యపేట స్తూపమునఁగూడ నొకరాజచిత్రము గలదు. అమరావతీ స్తూపరాజరూపములును, జగ్గయ్యపేట స్తూపరాజరూపమును నొకేతీరున నున్నవి. ఉష్ణీషబంధము, కంఠహారము, కర్ణాభరణములు, నడికట్టు మొదలగునవి సమానరీతితో నున్నవి. మహనీయమగు రాజవిగ్రహమొకటి యమరావతీస్తూపమున దొరకినది. దాని తల, చేతులు విఱిగిపోయినవి. అందు ('గోతమినమ' అని) శిథిలములయి యక్షరములు గలవు. అట్టి *విగ్రహములు మఱికొన్నింటికడఁ గూడ నక్షరములున్నవి. అవియెల్లఁ బునఃపరిశోధితములు గావలెను. అమరావతీ జగ్గయ్యపేట స్తూపములందుఁ గలరాజవిగ్రహము లిక్ష్వాకురాజులవి గానచ్చును. జగ్గయ్యపేటస్తూప మిక్ష్వాకులు గట్టించినదే యగును గాన యందలి రాజరూప మిక్ష్వాకురాజుదే యగును. అమరావతి స్తూపమునఁగూడ నట్టిరూపములే కలవుగాన యదిగూడ వారు గట్టించినదే కావచ్చును. అమరావతీ స్తూపమునఁగూడ నిక్ష్వాకుశాసనము గలదు. ఆంధ్రదేశపు స్తూపములెల్ల నిక్ష్వాకులచే వెలయింపఁబడినవే యగునేమో యని నాసంశయము. ఇది భావిపరిశోధనములవలనఁ దేలవలసి యున్నది.

౫. జైనకావ్యముగాన ధర్మామృతమున 'ధనదుని' వృత్తాంతమున కాధిక్యమును, బ్రాముఖ్యమును గల్పింపఁబడినది. సంఘశ్రీ వంశమువారినిబట్టియే వేంగీదేశమునకు 'అంధక'దేశమని పేరేర్పడిన దనుటచే నావంశము వారెంతేని ప్రాముఖ్య మందినవారలై యుండవలెనుగదా! జైనుఁడగు ధనదునికంటె బౌద్ధుఁడగు సంఘశ్రీకే వేంగీదేశమునఁ బ్రాముఖ్యమీకథనుబట్టి కాననగును. సంఘశ్రీ పరంపరవారేయీస్తూపములఁ గట్టించినవారుగాఁదగుదురు. తెలుఁగుదేశమున జినాలయములును గలవు. ధనదవంశమువారు వానిని గట్టించియుందురు. అమరావతి, గోలి, నాగార్జునుని కొండస్తూపములవరుసనే (కృష్ణానది దక్షిణపు దరిని) ములునోటి (సత్తెనపల్లి తాలూకా)లో జినేశ్వరాలయమును గలదు. అక్కడ గొప్ప దిబ్బలు గలవని 'లోకల్‌రికార్డు'లో నున్నది. అది 'జైనబస్తి'యగునేమో! 'జినేశ్వరాలయ'

* ఈవిగ్రహములను నేనును, మన్మిత్రులు శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారును గలసి పరిశీలించితిమి. ఇంక నెన్నో యపూర్వవిషయములు తెలుఁగుదేశపు స్తూపములను గూర్చి వెల్లడికావలసి యున్నవి. ఆయాస్తూపముల చిత్రములును, శాసనములును ఆంధ్రులకెల్లరకు నందుబాటులో నుంచవలెను. వానిలోని యపూర్వవిషయములను బరిశోధించుటకును, వెల్లడించుటకును దదేకతానులై తంటాలుపడుచున్న శ్రీ సోమశేఖరశర్మగారి కాంధ్రులు తోడ్పడు టావశ్యకము.

మున్నట్లుగా నాదిబ్బమీఁద శాసన మున్నది. త్రవ్వించినఁగాని తత్త్వము తెలియదు.

౬. 'అంధ'పదము బహువచనమున దేశిభాషలో 'అంధర్,' 'అంధరు'అనియుండి (కర్ణాటాంధ్రభాషాభేద మానాఁటి కేర్పడలేదు.) దానిమీఁద అంధ్రపదము పుట్టియుండవచ్చును. 'ఆంధ్ర'పదము నిన్న నేఁడు పుట్టినది. ప్రాచీనకాలమున 'అంధ్ర'పదమే కాని 'ఆంధ్ర' పదము లేనేలేదు. పండ్రెండవ తీర్థంకరుఁడును, మహావీరునికంటెఁ బూర్వుఁడునగు వాసుపూజ్యునికాలమునకుఁ గొంచెముతర్వాత (క్రీ.పూ. ౫శతాబ్ది)జరగినదిగానుండుట చేనీకథావృత్తాంతమునుబట్టి దేశమునకుఁ బేరువచ్చుటయు సంగతము గావచ్చును. దేశముపేరు దేశము నేలిన రాజులకును దర్వాత నేర్పడి యుండవచ్చును. ఈవిషయము సాతవాహనులనుగూర్చి వ్రాయుచో వివరింతును. ఐతరేయ బ్రాహ్మణగాథకు నీకథకు సమన్వయము గలదేమో కనుఁగొనవలెను. అంధ్రులు, బౌద్ధులు నయిన సంఘశ్రీ వంశమువారిమీఁది కోపముచే ధర్మామృతకథాకారు లీయంధతను వారికిఁ గల్పించి దానిఁ బట్టి తత్పూర్వమునను౦డియు నున్న దేశనామమునకు వ్యుత్పత్తిని బొందించి యుండవచ్చును.

౭. శ్రీశైల మల్లికార్జునాది నామములు శ్రీధరాచార్యాదుల మూలమున వచ్చిన వనుటను గల్పితముగాఁ జెప్పఁజాలము. మల్లినాథ, మల్లిషేణ, మల్లీశ్వరాది నామములు జైనులకును బ్రఖ్యాతముగాఁ గలవు. కావున మల్లికార్జుననామము తొలుత జైనులదయి నను గావచ్చును. శైవులాస్థలము నాక్రమించుకొని యాపేళ్లను దమపరముగాఁ జేసికొని యుండవచ్చును. అమరావతి బౌద్ధక్షేత్రమగుట ప్రఖ్యాతమే. శైవక్షేత్ర మగుటయుఁ బ్రఖ్యాతము. పూర్వము జైనక్షేత్రముగూడనయి యుండవచ్చును. ఒక మతమువారికిఁ బుణ్యక్షేత్రముగా నున్నస్థలమునే, ప్రాభవమేర్పడినప్పుడు, తదితర మతములవారును తమకును క్షేత్రమునుగాఁ జేసికొనుట గలదు. ఇప్పు డమరావతిలో నమరేశ్వరాలయము గొప్పదగు నొకకట్టడమును గప్పిపుచ్చి దానిమీఁదఁ గట్టఁబడియున్నది. అడుగున నున్న యాగొప్ప కట్టడము నలుప్రక్కలను, మీఁదను బూర్ణముగా మూసివేయఁబడియున్నది. అడుగుననున్న యాకట్టడము జైనవసతి యగునేమో! జైనుల నడఁగార్చి శైవులక్కడ వ్యాపించి యుండవచ్చును. జైనవసతిని గప్పిపుచ్చి దానిమీఁద శివాలయమును శైవులు ప్రతిష్ఠించి యుండవచ్చును. శ్రీశైలపాదమగు త్రిపురాంతక పర్వతమునకు తరుణాచలమని, కుమారాచలమని పేరు. ఇది శ్రీశైలమునకుఁ దూర్పుద్వారము. సిద్ధవటము గూడ శ్రీశైలపాదమే. దానికి దక్షిణద్వారమని పేరు. అలంపురి బాల బ్రహ్మేశ్వరమునకు పశ్చిమద్వారమని పేరు. కృష్ణాతీరమునఁ గల మాహేశ్వర క్షేత్రమునకు ఉత్తర ద్వారమని పేరు. ఈనాల్గు ద్వారములకు నడుమఁ గల పర్వతారణ్యమయప్రదేశమున కెల్ల శ్రీశైలమనియే పేరు. ప్రధానములయిన పై

చతుర్ద్వారములే కాక మఱినాల్గు ఉపద్వారము లునుగలవు. నేటి సిద్ధనాగార్జునునికొండ యీ శాన్యోపద్వారము. పయికథలోఁ గల వృద్ధగిరి సిద్ధనాగార్జునుని కొండయగునేమో! అక్కడ జినాలయములు గలవని కలదు. శ్రీశైలమున నొకపట్టు తరుణాచలనామము గలదగుటచే వృద్ధాచలముగూడ నందు వేఱొక పట్టుగాఁ బేరంది యుండఁదగును.

౮. సంఘశ్రీ రచితముగా బుద్ధస్తుతి శ్లోక మొకటి కవీంద్రవచన సముచ్చయములో నుదాహరింపఁబడి యున్నది. అది ధర్మామృత కథలోఁ జెప్పఁబడిన సంఘశ్రీ రచించినది యయినను గావచ్చును.

ఇందు 'ముండియ' వంశమని సంఘశ్రీ వంశమునకుఁ బేరున్నది. దానిఁగూర్చి సాత వాహనులఁగూర్చి వ్రాయుచో వ్రాయుదును.

ద్రవిడ దేశమునను ఆంధ్ర దేశమునను వర్తిల్లిన చోళరాజులు ఇక్ష్వాకువంశ్యులుగా శాసనములందుఁ గానవచ్చును. చంపాపుర ముననుండి వేంగీదేశమునకు క్రీస్తుకు పూర్వము ౫ వ శతాబ్దిలో వచ్చి నెలకొన్న యిక్ష్వాకురాజులకును వారికిని సంబంధ ముండ వచ్చును. వేంగినుండియే వారు నెల్లూరు, కడపమండలములకును, జోళదేశమునకును వ్యాపించియుండవచ్చును. ఆంధ్ర దేశ మిక్ష్వాకులనాఁటనుండియుఁ బ్రఖ్యాతి గన్నదని యీ ధర్మామృతకథ స్పష్టముగాఁ జెప్పుచున్నది. ఈ కథ సర్వథా విశ్వాస్యయే యని నా తలఁపు. ఏతద్గ్రంథకర్త నన్నయకుఁ దర్వాత నూఱేండ్లలోపున నున్నవాఁడు; ప్రాచీనుఁడు.

---

## కావ్యచింత

పెమ్మరాజు లక్ష్మీపతిగారు

అనఘుఁ డెవండు నాదు హృదయాపని మెత్తగ దున్ని, నారు వో
యునో ? జననీత్వ యుక్తిఁ బరమోత్సుకతన్ జనుబాలవర్షముల్
చనవున నేపయోధరము చల్లునో ? నా కెఱుఁగంగరాక య
ల్లన మెదఁ జీల్చి భావమృదు లాంకురముల్ పడగల్ నిగుడ్చెడిన్.

దిక్కులు కానరాక జిగి దేరిన యట్టి యమాస చీకటిన్
రిక్కలు నింగిపైఁ బొటకరించిన యట్టులు పుట్టు నట్టి; తొ
మొక్కొకవేళ నీతలఁపు మొల్కలు భావవియత్తలంబునం
దెక్కరణిన్ వచించెదఁ దదీయ దురూహ్యపు పుట్టుమూలమున్.

తలఁపునకైన దవ్వగుఁగదా! కడుచిట్లిన యట్టి మానసలో
పలఁ గరఁగించి మూర్తులుగ భావము లన్నియుఁ బోఁతపోయఁగా
వలఁతినిగాక పెక్కుదురవస్థలఁ దల్లడ మందు చిట్లు ని
ష్ఫలము భుజించుచున్న హతభాగ్యునకా, రసరాజ్యభోగముల్ ?

కల్లరి భావవృత్తి నొడికంబున గాలిని బోగుసేయుచున్
గల్లలుఁ బొల్లులుం గలిపి కావ్యము లల్లుటయే కవిత్వమై
చెల్లె నిసీ, యుదాత్తరసస్ఫూర్తియు సిద్ధియుఁ గాంచు నొక్కొ నీ
యల్లరి పాటకారితన మాఁడివోవుట కాక యారయన్ ?

మాటల్ చెప్పెడు మూఁగనోము లివి పోమ్మా కైత లెన్నంగ నా
ర్భాటంబుల్ మఱి యోరుగాలులును గావా ? చూడు మానాఁటియా
తాటాకుల్ మఱి నేఁటి కాగితపుఁ బొత్తంబుల్ ? మనోరాట్న మా
రాటం బారఁగఁ ద్రిప్పి యాద్యబుతవస్త్రం బేకవుల్ నేసిరో ?

పగటన్ శేయియు భావగర్భభర మొప్పన్ దాల్చువా రీకవుల్
మగచూలెంతలు; తేటమాటలను బొమ్మల్ వ్రాయు నేమాయెఁ బో
నగుఁబా టింతియకాని, యేకవులు కన్నారయ్య, కన్నార, స
ర్వగతార్థప్రకటలు ప్రవాఙ్నికరపుత్రావాప్తిగాఁ గావ్యమున్.

శోకంబున్ వెలిఁబుచ్చుచున్ జదివెఁగా శ్లోకంబు సృష్ట్యాది వా
ల్మీకిబ్రహ్మ; తదశ్రుపుష్టమయి యల్లెన్ గైత లేఁదీవలన్;
శోకాలంపసుమాళి నల్లికల మెచ్చుల్ చూపియా ? ముక్తికాం
తాకమ్రారుణగండభాగములు ముద్దాడంగ నాసించుటల్ !

---

# గోకర్ణ దేవచోడుని శిలాశాసనము

మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు

ఒకమిత్రునిదయవలన లభించిన యీ శిలా శాసనము నిజాంరాష్ట్రమునందలి ఏలేశ్వరము లోనిది. శాసనఫలకముమీద ఎగువను కుడి యెడమభాగముల సూర్య చంద్రులును, ఈ రెంటికి నడుమ లింగమును జెక్కబడినవి. హిందువులకళ సాంకేతికమైన దగుటవలన ఈ సూర్యచంద్ర సంకేతములుచేయబడినదానము ఆచంద్రార్కస్థాయిగ సాగవలయుట దెలుపు ననియు, లింగము దాత శైవుడనికాని, చేసిన దానము, శివాలయమునకో శైవమతసంస్థకో సంబంధించుననికాని తెలుపుననియు నూహింప దగును.

శాసనలిపి క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దినాటి తెలుగులిపి. ఇందు ఉ, ఊ, ఋ, ౠ, ఎ, ఐ, ఒ, ఓ, ఔలును, ఖ, ఘ, ఙ, ఛ, ఝ, ఞ, ట, ఠ, ణ, థ, ఫ, క్షలును తక్క మిగిలిన యక్షరము లన్నియు గలవు. ఆ, డ, ఢ, ద, ధ, భ, శ, ళ అనుఅక్షరములు గమనింపదగినవి. 'ఆ' అనునక్షరము యొక్క కుడివైపు చిన్నకొమ్ము దిగువకిప్పటివలె పొల్లు తిరిగి మళ్ల లేదు. కొంచెమించుమించుగ 'డ', 'ఢ', 'ద'లు అన్నియు నొక్క రీతినే యున్నవి. ఇక వాటిలో వ్యత్యాస మేదన: 'ద'వర్ణముయొక్క కుడివైపు దిగువకొమ్ము పొట్టలోనికి ప్రశ్నార్థకమువలె పొల్లుగామళ్ల లేదు; 'డ' వర్ణమునకు మళ్లినది. అదికాక, 'ద'వర్ణమున మరియొకవిశేష మేదన: దాని కుడివైపుకొమ్ము ఇప్పటివలె తలకట్టువరకు వ్యాపింపలేదు. 'ధ' ఇప్పటి 'ధ' వర్ణమువలె నే యున్నదికాని ఒత్తుమాత్రములేదు. 'డ', 'ఢ'లకుభేద మంతగ గానరాదు. 'భ'వర్ణము ఇప్పటిదానికి కొంచెము భిన్నముగ నున్నది. ఈవర్ణముయొక్క రెండువైపుల కొమ్ములును ఇప్పటివలె అడుగున బాగుగ గలియను లేదు; ఇప్పటివలె ఈ వర్ణమునకు ఒత్తును లేదు. పూర్వకాలమునకు బోయినకొలది ఈవర్ణము యొక్కకొమ్ములుతలకట్టుదగ్గరకలిసికొని అడుగున నొకదానికొకటి చాలఎడముగానున్నట్లు కనుగొనగలము. క్రమముగా వచ్చిన యక్షర పరిణామములో దీనికి పైకొమ్ములు ఒకదాని నుండియొకటి వేరయిపోయి, అడుగున సంబంధములేక ఎడముగా నున్న కొమ్ములు కలిసి కొనిపోవుటయే కాక ఒత్తుకూడ వచ్చెను. శాసనములోని 'శ' వర్ణముకూడ ఇప్పటి 'శ'వర్ణమునకు చాల భిన్నముగ నున్నది. తలకట్టు లేని 'గ'వర్ణమువలె నుండి, రెండువైపులనున్న కొమ్ములను అంటునట్లు వాటికి లోపల అడ్డముగ నొక్కగీటు గీసినయెడల అది నన్నయభట్టారకునికి పూర్వముండిన 'శ' వర్ణ రూపము. అది క్రమముగ మారి పదునొకండవశతాబ్దినాటికి మన శాసనమున గన బడు 'శ' వర్ణమువలె దయారైనది. వట్టి 'శ'

వర్ణరూపము శాసనమున ౭-వ పంక్తిలోను, ౧౬-వ పంక్తిలోను గాంచనగును. ఈయక్షరముయొక్క 'శ్రీ'రూపము మొదటిపంక్తిలోనే స్పష్టముగ గనిపించుచున్నది. ఈరూపము స్ఫుటముగ చెవిని బోలియుండుటచేతనే, దాని కారూపము సిద్ధించిననాటినుండి ఆంధ్రకవులు కావ్యములలో కర్ణములను 'శ్రీ'కారములతో బోల్చియున్నారు. కాలక్రమమున 'శ'వర్ణము మార్పుజెంది, 'శ్రీ'కారమునగూడ మార్పుసంప్రాప్తించినను, ఆంధ్రకవుల వర్ణనములలోమాత్రము మొన్నమొన్నటివరకుగూడ పదునొకండవ శతాబ్దినాటి 'శ్రీ'కారము చెక్కుచెదరక అట్లే నిలిచి యున్నది! ఇందలి'శ'వర్ణము ఇప్పటి'శ' వర్ణమునకు భిన్నముగనున్నది. పరిస్ఫుటమైన 'శ'వర్ణము౧౨-వపంక్తిలో గాననగును. ఈవర్ణము యొక్క దిగువ కొమ్ము పొల్లుతిరిగి కుడివైపున కిప్పటివలె మళ్లి రాలేదు: ఇప్పటి 'శ'వర్ణమునకువలెగాక శాసనములోని 'శ' వర్ణమునకు తలకట్టు ఎడమప్రక్క కొమ్ముపై గలదు. వెలుపలిగిలక యనబడు 'ర'వర్ణపు బొల్లుఈశాసనములో అంతట అక్షరములయొక్క తలకట్టులతోనో, కొమ్ములతోనో చేరియున్నది కాని యిప్పటివలె విడిగా లేదు. ఇయ్యది ప్రాచీనసంప్రదాయము. శాసనమున వ్రాతతప్పులు చాల గలవు.

శాసనభాష తెలుగు. మామూలుగా శాసనముల చివరనుండు, 'స్వదత్తాం పరదత్తాంవా' అను సంస్కృత శ్లోకముకూడ లేదు. భాషలో 'దత్తి' అనురూపము తప్ప మరియితరవిశేషములేవియుగాన రావు. 'దత్తి' అను రూపమిప్పటికి ప్రాతబడినను పదునేడవ శతాబ్దిలోగూడ నిది వాడుకలో నుండెననుటకు 'రాయదత్తి' మొదలగు పదములే తార్కాణము.

శాసనవిషయము

ఇది కందూరి గోకర్ణదేవచోడ మహారాజు శాసనము. ఈ గోకర్ణదేవచోడడు మహామండలేశ్వరుడు; సూర్యవంశోద్భవ కులతిలకుడు; కాశ్యపసగోత్రుడు; కరికాలాన్వయుడు; కోడూరు పురవరేశ్వరుడు. ఈతడు (ఏలేశ్వరమునందలి) ఏలేశ్వరదేవరయొక్క అంగభోగ, రంగభోగములకును, ధూపదీపనైవేద్యములకును పెద్దకోడూరు గ్రామమును దానము చేసెనన్న సంగతిని ఈశాసనము తెలుపుచున్నది.

ఇంతవరకు ఈగోకర్ణదేవచోడని ప్రత్యేకశాసనము లేవియు బయలుపడను లేదు. ప్రకటింపబడనులేదు.* ఇదియే ఈ మహారాజు యొక్క మొట్టమొదటి ప్రత్యేకశాసనము. ఇందే దీనిప్రతిష్ఠ గలదు.

* హైదరాబాదు ఆంధ్రపరిశోధక సంఘమువారు 'సుజాత' పత్రిక ౩-వ సంచికలో ప్రకటించిన 'మామిళ్లపల్లి' శాసనమొకటి ఉన్నప్పటికి, అది ప్రత్యేక యొక్క గోకర్ణుని మాత్రమే కాక అతని సోదరుడు భీముని దానమునుగూడ తెలుపుచున్నది.

# బెజవాడదృశ్యములు



౧. కృష్ణానది ఆనకట్ట, బెజవాడ



౨. బందరుకాలువయొద్ద, క్రొత్తవంతెన



3. బెజవాడ మ్యూజియం, ఇంకొకవైపు



౪. కృష్ణకాలువమీదరైలువంతెన, బెజవాడ



౧. బెజవాడ మ్యూజియం, ఒకవైపు



౨. శ్రీకాతా సుబ్బారావుగారి ఇల్లు, బెజవాడ



౩. బెజవాడ మ్యూజియం, ముందరివైపు



౪. బెజవాడపట్టణము

సాధారణముగ చోడులందరును తాము కరికాలచోడుని వంశము వారమనియు, సూర్య వంశజులమనియు జెప్పకొనుట నాడుకయే; కాని వీరిలో వేరువేరు గోత్రములవారును, వేరువేరు పురవరముల కధీశ్వరులైనవారు నున్నారు. ఈశాసనములోని దాతయైన గోకర్ణ దేవచోడ మహీపతి కోడూరుపురవరేశ్వరుడు. కమ్మనాటిని పాలించిన తెలుగు చోళు లందరును ఒఱయూరి పురవరాధీశ్వరులు. కోడూరు, ఒఱయూరు-పురవరాధీశ్వరు లనుటలో వారి కాయూళ్లు జన్మస్థలములని కాని, లేక వారిపూర్వులు చాలకాల మాయూళ్లలో నివసించిరనికాని, లేక వారి రాచరికమచ్చట ప్రారంభమైనదని కాని చెప్పవలసియుండు నను కొందును.

శాసనమువలన గోకర్ణదేవచోడ మహారాజు రాజధాని కందూరని గ్రహింపనగును. ఇది నైజాం రాజ్యమునందలి మహబూబ్ నగర్ జిల్లాలోని పానుగంటికి సమీపమున జడచర్లకు దక్షిణముగ ౨౨ మైళ్ల దూరమున గలదు.

చాళుక్య విక్రమశకము

ఈశాసనమున పేర్కొనబడిన దానకాలము చాళుక్యవర్షములు 33 అగు ప్లవ సంవత్సర ఆషాఢ శు. ౧౧ బుధవారము. ఈశాసనమానాడు పుట్టినది.

కల్యాణపురము రాజధానిగ కుంతలదేశమును బరిపాలించిన పశ్చిమచాళుక్య వంశజుడును, త్రిభువనమల్ల బిరుదాంచితుడునుఅగు (ఆఱవ) విక్రమాదిత్యుడు తాను సింహాసనమునకు వచ్చిననాటినుండి తనపేర చాళుక్య విక్రమవర్షము అనుగణితి ప్రారంభించెను. ఈ 'చాళుక్య విక్రమవర్షమే' మన శాసనమున 'చాళుక్య వర్ష'మని పేర్కొనబడినది. త్రిభువనమల్ల విక్రమాదిత్యుని శాసనములోని తేదీలన్నియు ఈ 'చాళుక్యవిక్రమవర్షము' అను గణితిలోనే తెలుపబడినవి. ఈశకము ఇప్పుడు మనమువాడుచున్న శాలివాహనశకము వంటిది. చాళుక్యవిక్రమశకము విక్రమాదిత్యుడు (కల్యాణిపుర చాళుక్యుడు)సింహాసన మెక్కిన ప్రథమసంవత్సరమునుండి ప్రారంభ మయినది. త్రిభువనమల్ల విక్రమాదిత్యుడు క్రీ. శ. ౧౦౭౬-౭౭ లో సింహాసన మెక్కుటచేత అదియే 'చాళుక్యవిక్రమశకము'న మొదటి వర్షము.

విక్రమాదిత్యుని యనంతరము కళ్యాణీపురమును పాలించిన మరికొందరు పశ్చిమ చాళుక్యప్రభువులు కూడ దానశాసనములో తేదీలు తెలుపవలసివచ్చినప్పుడు ఈ శకమునే నాడియున్నారు. అట్లుకాక వారిలో విక్రమాదిత్యునివలెనే తమపేరుతోకూడ క్రొత్తశకము నారంభించినవారును కొందరు కలరు. భూలోకమల్లు డట్టివాడే. ఇతడు 'భూలోకమల్లవర్ష' మను గణితి ప్రారంభించెను. ఈతడు సింహాసన మెక్కిన మొదటిసంవత్సరమే 'భూలోకమల్లశకము'న మొదటివర్షము. ఇట్టి యితర శకము లున్నప్పటికి, చాళుక్యవిక్రమశకమే

చాలకాలము పశ్చిమచాళుక్య భూపతుల పరి పాలనమున తరుచు వాడుకలో నుండెను.

చాళుక్యవిక్రమశకము ఏ శాసనములో వచ్చినను ఆశాసనము వేయించిన రాజుగాని, ఆశాసనమువలన దెలియవచ్చు దానమును జేసిన దాతకాని పశ్చిమచాళుక్య భూపతు లకు సామంతుడనియైనను, లేదా శాసన మున్న యాప్రదేశము పశ్చిమ చాళుక్య నృపాలురరాజ్యములోని దనియైనను మనము నిశ్చయింపవలసి యుండును.

ఈపై నుడివినదాని ననుసరించి యీ శాసనమునందలి దాతయైన మహామండ లేశ్వర కందూరిగోకర్ణ దేవచోడ మహారాజు పశ్చిమ చాళుక్యాధికారమునకు లోబడిన సామంతుడై యుండదగు నననచ్చును. శాసన ములలో నీ'చాళుక్యవిక్రమ శకము' పశ్చిమ చాళుక్య పృథివీశుల పరిపాలనాధికారములను సూచించును.

కాలనిర్ణయము

ఇక శాసనకాలమునకు సరియైనఇంగ్లీషు తేది కనుగొందము. ప్లవ సంవత్సర ఆషాఢ శు. ౧౧ లు మంగళవారమైనది కాని బుధ వార మగుటలేదు. ఆనాడు ఏకాదశి తిథి సూర్యోదయానంతరము గ. ౨౧, వి. ౩౦ లతో పూర్తియగుచున్నది. ఇట్లు వారము తేడా వచ్చినది. అదియునుగాక, అదిచాళుక్య విక్రమశకము ౪౮ కాని శాసనమున దెలిపి నట్లు 33 కాదు.

అయితే ప్లవకు పూర్వపుసంవత్సరమైన శార్వరిలో ఆషాఢ శు. ౧౧ సరిగా బుధవా రమే యగుచున్నది; కాని యిచ్చట వారము సరిపోయినను సంవత్సరము సరిపోవుటలేదు. శాసనమున దెలుపబడిన సంవత్సరము ప్లవ కాని శార్వరికాదు. ఒకవేళ సంవత్సరము పొరపా టనుకొనినను అది చాళుక్య విక్రమ వర్షము ౪౭ అగునుకాని 33 కాదు. అందు వలన ఈశాసనమున నిచ్చిన తేదీలో ఎచ్చ టనో పొరపాటు కలదు.

ప్లవంగ అనుటకు ప్లవ అని తప్పుగా వ్రాయబడినదేమో యని యూహించుచో, ప్లవంగకు తిథివారము లన్నియు సరిగా సరి పోవుచున్నవి. ప్లవంగసంవత్సర ఆషాఢ శు. ౧౧ బుధవారము సరిగా క్రీ. శ. ౧౧౨౭-వ జూన్ నెల ౨౨ వ తేది అగుచున్నది. ఆ నాడు ఏకాదశితిథి సూర్యోదయానంతరము గ. ౧౧, వి. ౩౦లతో పూర్తియగుచున్నది. శార్వరిలోను, ప్లవంగలోనుగూడ తిథి వార ములు సరిపోవుచున్నను, వ్రాత పొరపా టని సమర్థింపదగిన ప్లవంగనే సరియైన శాసనకాల సంవత్సరముగ గ్రహించుట యుక్తము.చాళు క్య విక్రమవర్షము శార్వరి, ప్లవ, ప్లవంగల లో దేనికిని సరిపోవదు.

అందువలన చిన్న వ్రాతపొరపాటుతో సంవత్సరము, తిథి, వారము అన్నియు సరి పోవుచున్నవి గనుక అది ప్లవంగసంవత్సరమే కాని ప్లవసంవత్సరము కాదని నిర్ణయింపదగు నేమో; అట్లయిన నది చాళుక్య విక్రమవర్ష ము ౫౨ అగును. దాత ఈ కాలపువాడే యని ఇతరశాసనములవలన గూడ దెలియు చున్నది. ఈశాసనమునందలి తేదీకి సరిపడిన ఇంగ్లీషుతేది క్రీ. శ. ౧౧౨౭ వ జూన్ ౨౨ వ తేది యగును.

## శాసన మూలము

( ) ఇట్టి గుర్తులలో ఒప్పులు తెలుప బడినవి.

[*] ఇట్టి గుర్తులలో మూలమున లేని యక్షరములు ఉంచబడినవి.

౧. స్వస్తి శ్రీమతుచ్చా (చా)
౨. ళుక్యవర్షము
3. లు 33 గుప్లవ స[ం*]
౪. వత్సర ఆసా(షా)డ(ఢ) సు(శు)
౫. ౧౧ బుధవారము
౬. నాండు స్వస్తి సమది(ధి)
౭. గద(త) పంచమహాశ
౮. బ్ద మహామండలే
౯. శ్వర వి(వీ)రమ(మా)హేశ్వర
౧౦. కోడూపర్వరవ
౧౧. రేశ్వర సూయ్యర్వం
౧౨. శోద్భవకుళతిలక
౧3. కాస్యపగోత్ర కరికా
౧౪. లాన్వయనామా
౧౫. దినమస్తప్రస(శ)స్తి
౧౬. శ(స)హితము శ్రీమ
౧౭. న్మహామండలేశ్వర
౧౮. కందూరి గోకర్ణ
౧౯. దేవచోడ మహారా
౨౦. జులు శ్రీ ఏలేశ్వరదే
౨౧. వర అంగభోగరంగ
౨౨. భోగములకూ(కు) ధ(ధూ)
౨3. పదీపనివేద్యముల
౨౪. కూం(కుం) బెదకోడూరు ఆ[(ఇ)చ్చి
౨౫. చంద్రార్కస్తా(స్థా)ఇ(యి) గా ఈ
౨౬. తిమి ఈదత్తి ఆచంద్రా
౨౭. ర్కముగా నడపంగల
౨౮. వారు

---

## నిరాశ

తుమ్మల సీతారామమూర్తి చౌదరి గారు

భారత సార్వభౌమపదభాసురుఁ డొక్కదినాన శంతను
క్ష్మారమణుండు వేఁటతమకంబున నయ్యమునా తరంగిణీ
తీరభయంక రాటవులఁ ద్రిమ్మరుచున్ జనకంటకంబులన్
క్రూరమృగంబులం గడిమిఁ గూల్చుచునుండెఁ బ్రచండమూర్తియై.

అయ్యవసరంబున,

మృగమదఘనసార మరు-జ్జగతీసుమ సౌరభములఁ దలఁదన్నుచు నిం
పగు తావి గుబులుకొన దా - నిఁ గదున్ ధరణీశ్వరుండు నెమ్మది మెచ్చెన్.

మెచ్చి యెచ్చటనుండి తా వచ్చె నీ య-పూర్వ సౌరభ్యమనుచు నబ్బురముగాంచి
వేఁట చాలించి యాతావి వీచునట్టి-దెసకుఁ బయనించె మూలంబు దెలియనెంచి.

చని శంతనుఁ డంతం గనుఁ-గొనె యమునం బడవ నడపుకోమలిఁ గన్యా
మణి సౌందర్యనిధిని యో - జనగంధిఁ దటిల్లతాంగి సౌజన్యఖనిన్.

అంతట నింతిసౌరభము నారసి యంటినఁ గందుమేని సొం
పెంతయు వింతగాఁ బొగడి యింపగు నాచిఱునవ్వు పొంకమున్
జింతనఁ జేసి కన్నుఁగవ చెల్వము వేమఱు నగ్గడించి భూ
కాంతుఁ డనంతరాగమునఁ గన్నియపై మది నిల్పి యిట్లనున్.

"ఎవ్వతె? వెవ్వనికూఁతుర? - వెవ్వంశము? నామధేయ మెయ్యది? తరుణీ!
మవ్వం బగు నీ దగు లే - జవ్వన మిటు లేటిపాలు సలుపం దగునే?"

అనిన నయ్యింతి సకలలక్షణసమేత - శంతనునిఁ జూచి వదనాంబుజాతసీమ
లేనగవుఁ జిఱులజ్జయు లీల వెలయ - మందమందమృదూక్తి నిమ్మాడ్కిఁ బలికె.

"ఆర్య! వసుక్ష్మాపాలక-వీర్యంబునఁ బుట్టి దాశవిభుఁ డెంతయు నౌ
దార్యంబునఁ బెంపఁగ ని-ష్కార్యం బొనరింతు నాన్నగారి యనుజ్ఞన్.

జననాథ! సత్యవతి నాఁ-డన రెద మాతండ్రి యేటిదరి నొప్పెడు నా
జనపదమున యందుం గలఁ"-డని తన వృత్తాంతమెల్ల నంగన వినిచెన్.

అత్తరుణి పల్కులన్ విని-"యుత్తమవీర్య ప్రసూత యోహో యిది" యం
చత్తిన రాగము తాల్మిని-దుత్తునియలు సేయ నృపతి తొందరపడియెన్.

ధీరుండు గాన మదన వి-కారము లోలోన నడఁచి "కైవర్తవిభుం
జేరి మిటారిపయిం గల-కోరికి నెఱిఁగించు టొప్పగు" నటం చెంచెన్. [యనిన

ఎంచి యమ్మించుబోఁడిని గాంచి "పాంథు-ననుఁ దరింపఁగఁ జేయు మోనాతి!"
నబల చిఱునవ్వు నవ్వి "రం"డనుచు నతని-నద్దరికిఁ జేర్చెఁ దననావయందు నిలిపి.

భూనాథుఁ డంత సత్యవ-తీనవలావణ్యమును మదిం జూచుచుఁ బ్ర
జ్ఞానిధి నప్పల్లెదొరం-గానఁగఁ జనె వానియింటికడకుం గడఁకన్.

తత్తఱపాటుతోడ భరతప్రభుఁ గన్గొని దాశరాజు తా
నత్తఱి యోగ్యసత్క్రియల నవ్విభునిం బరితుష్టుఁ జేసి య
త్యుత్తమ మైనపీఠమున నొప్పుగ నిల్పి యనల్పసమ్మదా
యత్తమనంబుతోడ వినయంబు నయం బెసలార నిట్లనెన్.

"అర్కసమానతేజ! భవదాగమనం బది యెంతయున్ శుభో
దర్కము గాదె? మీచరణతామరసామలరేణురాజి సం
పర్కముచేత మద్గృహము పావనమౌటది యెంత వింత? యే
తర్కము కల్గు? నాభవము ధన్యతఁ జెందె నటంచుఁ బల్కెన్.

'ఊరక రారు మహాత్ము ల-కారణముగ' ననుచు నండ్రు గావున నుడువం
గోరెద నియ్యధమునికడ - కీ రరుదేరంగ హేతు వెయ్యది? నృపతీ!

మనుజేశ్వర! భవదర్థం - బొనరింపం దగిన కార్య ముండిన దానిం
దన యోపినంతవఱకుం - బొనరింపంగలఁ డితండు పూర్ణాసక్తిన్."

అన జననాథుఁ డిట్టు లనె నల్లన నవ్వుచు "దాశరాజ! నీ
కనయము సేమమేకద? మదాత్మకు నెంతయు మోద మయ్యె నీ

వినయము నీవివేకమును విశ్రుతపూ మరియాదనుం గనుం
గొన నుచితజ్ఞు లుండుకొఱకుం గులభేద మొకండు కల్గునే?

'పాలకుఁ డీతం డనుచుఁ - బాలితుఁడను నే' నటంచు భావించెద వి
ట్లేలా భయంబు? నీవుం - బాలకుఁడవు గావె యిచటిపల్లెల కెల్లన్?

రాచఱికె మున్న వాఁడవు-నీచుండవు గావటంచు నెమ్మదియందా
లోచించియ చనుదెంచితి-నీచుట్టఱికంబుఁ గోరి నేఁ డిమ్మ్యెడకున్.

చందనగంధి సత్యవతి చక్కఁదనంబును జూచి పెండ్లియా
డం దలపోసి తండ్రివగుట న్నినుఁ గోరుట పాడి యంచు నా
సుందరితో మదాశయము సూచయుఁ జెప్పక వచ్చినాఁడ నీ
మందిరసీమ కో సుగుణమండన! న న్నెటు లాదరించెదో.

మహితభారతసామ్రాజ్యమాననీయ-సింహపీఠోపవిష్టమై చెలఁగునట్టి
భాగ్యమునకంటె నీముద్దుపట్టి కింక-వలయు సౌభాగ్యమెద్ది? కైవర్తరాజ!"

అనిన నతం డిట్లనియె:

"ధన్యుఁడ నైతి మత్సుతను దాము వరించుటఁ జేసి యోజగ
న్మాన్యచరిత్ర! యుష్మదసమానదయాపరిలబ్ధి నూత్నచై
తన్యము గల్గి మత్కులము దా నతిపావనమై వెలింగె సా
మాన్యమె నీదుబాంధవము మాకు లభించుట? రాజసత్తమా!

'గొనములకొటారు, చక్కం-దనమునకుం బట్టుఁగొమ్మ తరుణీమణి నీ
కనుకూలమైన కన్నియ'-యని వేఱ వచింపవలయునా సత్యవతిన్?

శీలము వంశగౌరవము చిత్త మెలర్చెడు సోయగంబు ల
క్ష్మీలలనా కటాక్షము ప్రసిద్ధి వహించిన బంధుమిత్రులు
న్వేలయశంబు ప్రాయము వివేకము గల్గిన యట్టివానికిన్
బాలిక నిచ్చు టర్హమని పల్కు-చునుందురు గదయ్య ధీనిధుల్!

కావున మీ కిచ్చుటకై-భావంబున సంశయింపఁ బనియేమి ధరి
త్రీవల్లభ! మత్తనయఁ -'శ్రీ వచ్చిన కాల నడ్డు' చెనఁటులు గలరే?"

అని దురాశాగ్రహంబు త న్నావరింప-"నృపుఁడు కామాతురుండౌట నిప్ప డెంతె
కైన వెనుదీయఁబోఁ డిదే యద" నటంచు-వర మొకం డిచ్చగించి భూవరున కనిమె.

"అకలంకచరిత! మత్పు-త్రిక నీకు నొసంగుటకు మది సందియ మిం
చుక లేదు గాని నా కిపు-డొకకోరికి కలదు దాని కొడఁబడవలయున్."

అని యనుచితంబు గానన్ - దనతలఁపుం దెలుప వెఱచు దాశుం గని "నీ
కనుమాన మేల? వేగై - నను దీర్చెద నోడుపు"మంచు నరపతి యనినన్.

"భూపవతంస! నీవలనఁ బుణ్యచరిత్రకు మత్కుమారికిన్
రే పుదయించు నందనుఁ డరిందముఁ డాతఁ డఖండభారత
క్ష్మాపతి నీపరోక్షమునఁ గావలె నంచుఁ దలంచినాఁడ నీ
వీపని కియ్యకొన్న నిపుడే నడపింతు వివాహతంత్రమున్.

ఇదియ మదీప్స" యటంచుం-గొదుకక దాశుండు వల్క ఘోరవరం బ
య్యది నృపునకుఁ బిడు గడఁచిన-విధమైన నతండు మిగుల విహ్వలుఁ డయ్యెన్.

అంత శంతనుండు నిజాంతర్గతంబున,

"కటకట కైవర్త విభుం-డెటువంటివరంబుఁ గోరె నిది యెంతయు దు
ర్ఘటముగదా" యంచుఁ దలఁచి-కుటిలాలకమీఁది కోర్కి కొనలిడుకతనన్.

"ఇది యసాధ్య మగుట నిం కెద్దియైనఁ గో-రంగదయ్య దాశరాజ!" యనిన
బిఱ్ఱబిగిసి యతఁడు "పృథివీశ! నా కొండు-తలఁపు లే"దటంచుఁ దా వచించె.

అంతట శంతనుం డిఁక రవంతయు లాభము లేదటం "చి నీ!
కాంతలపొందు గోరి కలకాలము మాయని దుర్యశంబు నా
ర్జింతునె? రూపవిక్రమసుశీలనయాది గుణప్రసిద్ధు ధీ
మంతులు నవ్వ నగ్రసుతు మాన్యుని రాజ్యవిదూరుఁ జేతునే?

ముద్దియమీఁదిమోహమున ముందును వెన్కయుఁ జూడఁబోక నా
పెద్దకుమారునిన్ విడిచి పిన్నకుఁ బట్టముగట్టినన్ జనుల్
'తద్దయుఁ గీర్తిగన్న హిమధామకులప్రథరూపుమాపు నీ
మొ'ద్దని బ్రువ్వఁదిట్టరొకొ? మూర్ఖుఁడనై యిటు సేయఁ దొప్పునే?"

అని వితర్కించి,

లోకాపవాదభీతియు - నాకన్నియమీఁదివలపు నంతంతకు న
స్తోకలఁ బెట్టఁగ హృదయ - వ్యాకుల మేపార నాతఁ డరిగెన్ బురికిన్.

---

## వలపుపిలుపు

దీపాల పిచ్చయ్య శాస్త్రి గారు

(అన్యాపదేశము)

క్రూరనిష్ఠుర భిల్లవాగురలఁ దవిలి-నీటుఁ గోల్పోకమున్న నామాట వినుము:
రమ్యసౌధాంతరస్థిత రత్నపంజ-రమ్ముఁ జేరి సుఖింతువో రామచిలుక!

కాన నీసుగంధకలన మెచ్చెడువార-లెవరె చిన్నిపువ్వ! యింతనైన
సౌరభమ్ము లొలయఁగా రాజశుద్ధాంత-సీమ కెక్కి.. పేరుఁ జెందఁగదవె?

పలుఁగుఱాలఁ గలసి పడియుంటి విన్నాళ్లు-మహితరాజరాజ మకుటమునకు
వన్నె వెట్టు నీవు చిన్నారిరత్నమా!-కదలి రమ్ము మేలు కలదు నీకు.

బండిగురివెందపూసల దండఁ జేరి-యొత్తిడిం బడి నీకేల తత్తఱిలఁగ
మంచిముత్తెపుఁ జేర్లపై యంచు లొరసి-ఘనతఁ గనఁజాలు మగఱాతి తునుక నీవు.

—స్వయంవరము.

---

# మన సౌరకుటుంబము

దర్భా యజ్ఞేశ్వరసోమయాజి గారు

మన సౌరకుటుంబమున ౧. సూర్యుఁడు, ౨. బుధుఁడు, ౩. శుక్రుఁడు, ౪. భూమి, ౫. అంగారకుఁడు, ౬. బృహస్పతి, ౭. శని, ౮. వరుణుఁడు, ౯. నభస్థూణుఁడు నను తొమ్మిది గ్రహము లున్నవి. వీనిలో సూర్యుఁడు ప్రధానుఁడు. సూర్యు నాధారముగఁ జేసికొని వానిచుట్టు దక్కిన గ్రహము లన్నియు నియమకాలావధులయందుఁ బ్రదక్షిణములు చేయుచుండును. భూమి కుపగ్రహముగా నున్న చంద్రునిఁ గూర్చియు, మన సౌరకుటుంబమునకు మూల పురుషుఁడైన సూర్యునిఁ గూర్చియు నే నిదివఱకు వ్రాసి యున్నాఁడను. ఇకఁ దక్కిన గ్రహములనుఁ గూర్చి కూడఁ గొంత వ్రాయ సమకట్టి యీ వ్యాస రచనకుఁ గడఁగితిని.

నక్షత్రములు: గ్రహములు, ఖగోళమును మబ్బులేని చీఁకటి రాత్రులందుఁ బరికించి చూచినచో నందు మిణుంగురులవలెఁ బ్రకాశించు తేజోరాసు లసంఖ్యాకములుగఁ బొడఁగట్టుచుండును. వీనిని శ్రద్ధతోఁ బరికించువారి కివి రెండు విధములుగఁ బ్రకాశించుచున్నట్లగపడును. ఇందు మిణుకుమిణుకుమని ప్రకాశించునవి కొన్ని, నిశ్చలమగు కాంతితోఁ బ్రకాశించునవి కొన్నియుఁ బొడఁగట్టుచుండును. ఇందు మొదటి తరగతి వానిని నక్షత్రములనియు, రెండవ తరగతి వానిని గ్రహములనియు వ్యవహరించుచున్నారు. ఏదేని యొక గ్రహమును గుర్తించి యది యేనక్షత్రకూటమున నే రిక్కకడ నున్నదో బాగుగ నిరీక్షించి జ్ఞాపకముంచికొనుము. నానాఁట నా గ్రహ మదేకాలమున కా నక్షత్రరాశిలోని యా రిక్కకడనే యుండక దానినుండి దూరదూరముగఁ బోవుచుండుటనే చూచుచుందుము. ఇది యిట్లుండ నా రాశిలోని నక్షత్రములన్నియు నొకే స్థిరపారస్పరస్థానములై ప్రకాశించుచుండుటగూడ చూచుచుందుము. ఆయా నక్షత్రములకు సంబంధించి గమనముగల వానివలెఁ బొడకట్టు ఖగోళముల గ్రహములనియు, స్థిరపారస్పరస్థానంబులం బొందియుండు ఖగోళములను నక్షత్రములనియు వివక్షించి వ్యవహరించుచున్నారు. చంద్రుఁడు స్థిరమైన కాంతితోఁ బ్రకాశించుచు, నాకసంబున సంచారము చేయుచున్నాఁడు గావున నాతనికి గ్రహసంజ్ఞ కల్గినది. ఇంతియకాక చంద్రుఁడు స్వయంప్రకాశము లేనివాఁడు. ఆతఁడు తన వెలుఁగునకై సూర్యునిమీఁద నాధారపడియున్నాఁడు. కావుననే మన కాతఁడు వృద్ధిక్షయములు గల కళలతోఁ గూడినవాఁడై (కళావంతుఁడై) మన కగపడుచున్నాఁడు. గ్రహములన్నియుఁ గూడ నిట్టి కళలు గల గోళములగుటయు, మనము వానిని స్వయంప్రకాశగుణము లేనివనియు, వానిమీఁదఁ బడు సూర్యరశ్మియే వానిని గాంతివంతముగా నొనర్చుచున్నదనియు, మన కెఱుకపడుచున్నది. ఈమూఁడు గుణముల నాధారముగఁ జేసికొని గ్రహములను గుర్తించి, యాయా గ్రహములను గూర్చిన యవలోకనముల నొనరించుచుందురు.

గురుత్వాకర్షణము: గ్రహచారము:— చెట్లనుండు కాయలన్నియు నెల్లప్పుడును భూమిమీఁదఁ బడుచుండుటనే చూచుచున్నాము. ఇంతియకాక పైకెగురవైచిన ప్రతివస్తువును గూడ భూమికేంద్రమునైపునకుఁ గదలుచు భూమిమీఁదఁ బడుచుండును. ఇట్టివిషయముల నన్నిటిని జూడ భూమి ప్రతివస్తువును దనకేంద్రమునైపున కాకర్షించుచున్నదని గ్రహింతుము. మనము భూమిపైన 16 అడుగుల యెత్తునకుఁ బోయి నిలఁబడి యచ్చటనుండి యేవస్తువును జారవిడిచినను నది భూమ్యుపరిభాగమున కొక సెకనుకాలములో వచ్చిచేరును. భూమిమీఁదనుండి పైకి చాలదూరము పోయి యీ ప్రయోగమును నిర్వర్తించితిమేని యాయా వస్తువు లచ్చటనుండి యొక సెకనులో 16 అడుగులకంటె తక్కువదూరము దిగునని యెఱుకపడుచున్నది. భూమ్యుపరిభాగమునుండి 4,000 మైళ్లదూరమునకుఁ బోయి యీ ప్రయోగమును నిర్వర్తించిన నాయా యివస్తువులు మొదటి సెకనున 4 అడుగులదూరము పడు

ను. భూమి త్రిజ్య 4000 వేలమైళ్లు. భూమిమీఁదనుండి 4000 మైళ్లు పైకిఁ బోయితిమనిన మనము భూకేంద్రము నుండి భూమ్యుపరిభాగ మెంతదూరమున్నదో దానికి రెట్టింపుదూరముపోయిన నప్పటి యాకర్షణప్రేరణము భూమ్యుపరిభాగమున నున్నదానిలో $\frac{1}{4}$ వం తుండుట చేతనే ఆయాయివస్తువులు $\frac{1}{4} \times 16 = 4$ అ. దూరము నొకసెకనులో దిగెనని. భూమ్యుపరిభాగమునుండి 8000 మైళ్లు పోయి యీప్రయోగమును చేసి చూచిన నప్పటి యీప్రేరణ పరిమాణము భూమ్యుపరిభాగముననున్న దానిలో $(1/3)^2=1/9$ వం తుండు. ఏదేని వస్తువును భూమి యాకర్షించు ప్రేరణ పరిమాణము భూకేంద్రము నుండి యావస్తువుకడ కున్నదూరముయొక్క వర్గమునకు విలోమముగా మారుచుండును. ఇంతియకాక యీ ప్రేరణ మాయావస్తువుల ద్రవ్యరాశితో సరళముగా మారుచుండును. భూమి యన్నివస్తువుల నాకర్షించుచున్నట్లే యితర గోళములుకూడ నన్నివస్తువులను దమకేంద్రముల కడ కాకర్షించుచున్నవనికూడ మనము గ్రహించుచున్నాము. గోళములయు, వస్తువులయు నీపరస్పరాకర్షణప్రేరణమునే న్యూటనుగారు గురుత్వాకర్షణ మని వ్యవహరించిరి. క్రీ. శ. 1687 ప్రాంతముననున్న గొప్ప గణితశాస్త్రజ్ఞుఁడగు: న్యూటనే యీ గురుత్వాకర్షణ తత్త్వస్వరూపనిరూపణ మొనరించి దాని నిట్లు నిర్వచించియున్నాఁడు. "ప్రపంచకమునందలి ప్రతివస్తువు ప్రతి ఇతరవస్తువును దననైపున కాకర్షించుకొను చుండును. ఈ యాకర్షణపరిమాణ మావస్తువులద్రవ్యరాసుల గుణిజముతో సరళముగాను,వానిమధ్య దూరములయొక్క వర్గమునకు విలోమముగాను మారుచుండును." ఈ గురుత్వాకర్షణ సూత్రము నొకసమీకరణముచేఁ బ్రకటింతము.

"దూ" మధ్యదూరము గల్గి, "ద, ధ" ద్రవ్యరాశి పరిమాణముఁగల రెండు వస్తువులకుఁ గల పరస్పరాకర్షణ పరిమాణము 'గ' యైనచో,

$$\text{గ} = \text{స} \frac{\text{ద}.\ \text{ధ}}{\text{దూ}^2},$$ అగును.

ఈసమీకరణమునందలి "స" యొక స్థిర పరిమాణము. ఇయ్యది మన ముపయోగించు ద్రవ్యరాశి రూపముల ననుసరించియు, పొడవు రూపముల ననుసరించియు మారుచుండును. "స" యనుదానిని గురుత్వాకర్షణ స్థిరమందురు.

ద్రవ్యరాసులను పౌనులలోను, పొడవులనడుగులలోను గొలచి వ్యవహరించినచో "స" యొక్క పరిమాణము దాదాపుగా $1.05 \times 10\text{-}9$ అగుటయు, 'గ' పౌండులలోఁ జెప్పుటయు గల్గును.

ద్రవ్యరాసులను గ్రాములలోను, పొడవులను శతాంశమీటరులలోను గొలిచి వ్యవహరించినచో 'స' యొక్క పరిమాణము దాదాపుగా $6.66 \times 10\text{-}8$ అగుటయు 'గ' డైనులలోఁ జెప్పఁబడుటయుఁ గల్గును.

ఈ గురుత్వాకర్షణసూత్రమే గ్రహములసంచారమును నిర్ణయించి, యాసంచారమునకు గ్రహణ సౌలభ్యమును గల్పించి, యీవిజ్ఞానప్రేక్షకుల నానందింపఁ జేయుచున్నది. (ఈజ్ఞానమును సంపూర్ణముగ నలవరిచికొనవలెనన్న చలకనమున (?) సంపూర్ణ పాండిత్యము సంపాదించి గతివిద్య నభ్యసించి నేర్చికొనవలెను.)

ప్రతిగ్రహమును సూర్యునిచే నాకర్షింపఁబడుచున్నదనియుఁ, బ్రతిగ్రహము సూర్యు నాకర్షించుచున్న దనియు గురుత్వాకర్షణ సిద్ధాంతము చెప్పుచున్నది. సూర్యుఁడు గ్రహముల నన్నిటిని ఆకర్షించుచుండ నివియన్నియు సూర్యునిమీఁదఁ బడి భగ్నముకాక యట్లేల తిరుగుచున్న వని మొట్టమొదట మన కెల్లరకుఁ దోఁపవచ్చును. మనగ్రహము లన్నియు జడిస్థితి నున్న వీని కన్నిటికిని యట్టి యిక్కట్టు వచ్చియుండెడిదేకాని యవి యన్నియు మన మూహింపలేనంత వేగముతో సూర్యునికిఁ బ్రదక్షిణ మొనరించుచుండుటచే యట్టివిపత్తు సంభవింపలేదు. దీనికిఁ దార్కాణముగ నొకచిన్నప్రయోగమును సూచించిరి.

భూమిమీఁద నత్యున్నతమైన యొకపర్వత మున్నదనుకొనుఁడు. దాని యగ్రము "ప" భూమ్యుపరిభాగము నుండి కొన్నివేలమైళ్లున్నదనియే భావన. దానియగ్ర

మన నొక శతఘ్నినుంచి యందొక పెద్దగుండును బెట్టి కాల్చిన నది 'హ' కడపడిన దనుము. అంతకంటె మిక్కిలి యెక్కువవేగ మా గుండునందు జనింపఁజేసిననది




"హ "కడ పడిన దనుము. దీనికిఁ గొన్ని వేల రెట్లవేళము నాగుండునందు జనింపఁజేసిన నది భూమిమీఁదఁ బడక భూమినుండి యొకే స్థిరదూరమునఁ గదలుచు దానినిఁ జుట్టివచ్చుచుఁ గొన్ని సంపూర్ణభ్రమణముల నొనర్చును. సెకనున కొక కొన్నిమైళ్ల వేగముతోఁ దిరుగాడు గ్రహము లన్నియుఁగూడ సూర్యునిచుట్టు నిట్లు దిరుగాడుచు దానిమీఁదఁ బడి భగ్నముగాకుండ నున్నవి.

"ప్రతిగ్రహమును సూర్యునిచే నాకర్షింపఁబడుచున్నది. ప్రతి గ్రహమును సూర్య నాకర్షించుచున్నది:" అను విషయములు గురుత్వాకర్షణసూత్రమువలన గ్రహించితిమి.

$\frac{\text{ప}^2}{\text{దూ}}$ (దూ=దూరము) 2 ఆకర్షణ ప్రేరణ పరిమాణముగల్గి యేదేని యొకస్థిరబిందువు దిక్కునకే యాకర్షితమై తిరుగుబిందువు శంకుచ్ఛిన్నములలో నేదియో యొక దానిమీఁద సంచారము సలుపుచుండవలెనని గణితశాస్త్రానుసారముగ ధ్రువపడుచున్నది. దీని నాధారము చేసికొని న్యూటనుగారు తమకు 150 యేండ్లకుఁ బూర్వముననున్న (క్రీ. శ. 1530) కెప్లరుగారు నిర్వచించిన సిద్ధాంతముల యాథార్థ్యము నుపపత్తులతోఁ గూడ ధ్రువపరచియున్నారు. కెప్లరుగారి గ్రహచారసిద్ధాంతములు

(1) ప్రతిగ్రహమును సూర్యుఁ డొకనాభికడనున్న అండవృత్తముమీఁద సంచరించును. (2)సూర్యుని కేంద్రమును, గ్రహముయొక్క కేంద్రమును సంధించురేఖ (గ్రహముయొక్క నాభిస్తుతి త్రిజ్య) సమకాలములలో సమానమైశాల్యములను గల్పించును. (3)ఆయాగ్రహములు సూర్యునిఁజుట్టివచ్చు కాలావధులవర్గములు సూర్యునుండి వానివానికుండు దూరమధ్యముల ఘనపరిమాణముల యనుపాతానుసారముగ నుండును.

ఈ మూఁడుసిద్ధాంతములను కెప్లరుగారు నిర్వచించిన తరువాతనుండియు శాస్త్రజ్ఞులు కొన్నికొన్ని సంశయాస్పదవిషయములను నిశ్చయాంశములుగ నుపపత్తీకరించి రుజువొనరించియున్నారు. ఇంతియకాక గ్రహములన్నియు సూర్యుని చుట్టివచ్చునపు డొకేదిశకుఁ గదలుచున్నవనియు, ప్రతిగ్రహముయొక్క కక్ష్యయుఁ గూడ నొక్కొక సమతలవర్తియగుచున్నదనియుఁ గూడ నిర్దేశింపఁబడియె.

న్యూనగ్రహములు (అంతర్గ్రహములు): బృహద్గ్రహములు:—సూర్యునికి దగ్గఱగా నుండి దానిచుట్టు తిరుగాడుగ్రహములు నాలుగున్నవి. ఇవి తక్కిన యైదు గ్రహములకంటె చిన్నవి. ఈ సౌరకుటుంబమునందలి గ్రహములన్నిటఁజిన్నవియు సూర్యునికి,దాపుగనున్నవియు నగు (1) బుధుఁడు, (2) శుక్రుఁడు, (3) భూమి, (4) అం




గారకుఁడు నను నాలుగుగ్రహములను న్యూనగ్రహములనియుఁ, దక్కిన యైదింటిని బృహద్గ్రహము లనియు వ్యవహరించుచున్నారు.

ఈవెనుకట్టిపటము న్యూన గ్రహములసంచారమును గూర్చి ప్రకటించుచున్నది. ఈ నాలుగు గ్రహములలో బుధుఁడు సూర్యునికి దగ్గఱగా నున్నాఁడు. ఇతఁడు సూర్యునికి దగ్గఱగా నున్నపుడు 286 లక్షల మైళ్ల దూరమునను, సూర్యునికి దూరముగా నున్నపుడు 433 లక్షల మైళ్ల దూరమునను నుండును. ఇతనికిని సూర్యునికిని గల దూరమధ్యము 359 లక్షల మైళ్లు. ఈ గ్రహముయొక్క వ్యాసము 2,992 మైళ్లు. దీనిసాంద్రత 6.85. దీనికి సూర్యునిచుట్టు నొకపరి తిరిగివచ్చుటకు 87.969 లేక 88 దినముల కాలము కావలెను.

సూర్యునినుండి కొంచెము దూరముగఁ బోయిన రెండవ గ్రహము శుక్రుఁడున్నాఁడు. ఇతఁడు సూర్యునికి దగ్గఱగా నున్నపుడు 655 లక్షల మైళ్ల దూరమునను, సూర్యునికి దూరముగా నున్నపుడు 675 లక్షలమైళ్ల దూరమునను నుండును. సూర్యునికిని శుక్రునికిని గల దూరమధ్యము 670 లక్షల మైళ్లు. దీనివ్యాసము 7,650 మైళ్లు. దీనిసాంద్రత 4.81. దీనికి సూర్యునిచుట్టు నొకసారి తిరిగివచ్చుటకు 224.70 లేక 225 దినములకాలము పట్టును.

సూర్యునుండి శుక్రునికంటె దూరస్థముగా నున్న గ్రహము భూమి. ఇది సూర్యునికి దగ్గఱగా నున్నపుడు 911 లక్షల మైళ్ల దూరమునను, సూర్యునికి దూరముగా నున్నపుడు 946 లక్షల మైళ్ల దూరమునను నుండును. ఈగ్రహమునకును సూర్యునికిని గల దూరమధ్యము 927 లక్షల మైళ్లు. ఇది సూర్యు నొక ప ర్యా య ము చుట్టివచ్చుటకు 365. 25 దినములను దీసికొనును. దీని వ్యాసము 7918 మైళ్లు. దీని సాంద్రత 5.66.

సూర్యునుండి భూమికంటె దూరస్థముగ నున్న గ్రహ మంగారకుఁడు. ఇది సూర్యునికి దగ్గఱగా నున్నపుడు 1280 లక్షల మైళ్ల దూరమునను, సూర్యునికి దూరముగా నున్నపుడు 1550 లక్షల మైళ్ల దూరమునను నుండును. అంగారకునికిని సూర్యునికినిగల దూరమధ్యము 1,410 లక్షల మైళ్లు. ఇది సూర్యునిచుట్టు నొకసారి తిరుగుటకు 686,98 లేక 687 దినముల కాలమును దీసికొనును. ఈగ్రహముయొక్క వ్యాసము 4,200 మైళ్లు; దీనిసాంద్రత 4.01.

పై నాల్గు గ్రహములను, నివిసూర్యునికి దగ్గఱగా నుండుటచేతను, తక్కిన వానికంటె చిన్నవిగా నుండుటచేతను, నొక కూటముగా గ్రహించి వీని నంతర్గ్రహములని పిలుచుచున్నారు. ఈనాల్గుగ్రహములలో భూమియు, శుక్రుఁడును నొకే ఘనపరిమాణముగల గ్రహములు. బుధుఁడును, నంగారకుఁడును నించుమించుగ నొకే ఘనపరిమాణము గలవారు. వీని ఘనపరిమాణములు భూమియొక్కయు, చంద్రునియొక్కయు పరిమాణములకు మధ్యస్థముగ నుండును.

తక్కిన గ్రహములైదును మిక్కిలి పెద్దవి; సూర్యునికి దూరముగనున్నవి. దీనంజేసి వీనిని బృహద్గ్రహములని వ్యవహరించుచున్నారు. అంతర్గ్రహములట్లే యీ బృహద్గ్రహములుకూడ సూర్యునిచుట్టు తిరుగుచు తేజఃపుంజముల కొఱకు వానిమీఁదనే యాధారపడియున్నవి.




బృహస్పతి సూర్యునినుండి బయటికి లెక్కించుచు పోయిన నైదవగ్రహమగును. ఇది సూర్యునికి దగ్గఱగా నున్నపుడు 4,590 లక్షల మైళ్లదూరమునను, సూర్యునికి దూరముగా నున్నపుడు 5,050 లక్షల మైళ్ల దూరమునను నుండును. బృహస్పతికిని సూర్యునికిని గల దూరమధ్యము 4820 లక్షల మైళ్లు. ఈగ్రహము సూర్యునిచుట్టు నొకపరి తిరిగి వచ్చుటకు 4,332.6 దినములు లేక 12 ఏండ్ల కాలమును దీసికొనును. దీనివ్యాసము 85,000 మైళ్లు. దీని సాంద్రత 1.38.

ఆయా గ్రహముల పరిమాణములను సులభముగా గ్రహించుటకై వానివాని పరిమాణముల నిదిగువ నీ రీతి రూపముల నవలంబించి ప్రకటించితిని

1 బుధుఁడు 2 శుక్రుఁడు 3 భూమి 4 అంగారకుఁడు (ఎఱ్ఱని గ్రహము)












బృహస్పతికంటె సూర్యునికి దూరముగా నున్న గ్రహము శని. ఇది సూర్యునికి దగ్గఱగా నున్నపుడు 8,340 లక్షల మైళ్లదూరమునను, దూరముగా నున్నపుడు 9,360 లక్షల మైళ్లదూరమునను నుండును. శనికిని సూర్యునికిని గల దూరమధ్యము 8,840 లక్షల మైళ్లు. దీనివ్యాసము 71,000 మైళ్లు. ఇది సూర్యుని చుట్టు నొకపరి తిరిగివచ్చుటకు 10,759 దినములు లేక 29 ఏండ్లకాలమును దీసికొనును. దీని సాంద్రత 0.75.

శనికంటె సూర్యునికి దూరస్థముగానున్న గ్రహము వరుణుఁడు. ఇది సూర్యునికి దగ్గఱగా నున్నపుడు 17,000 లక్షల మైళ్లదూరమునను, సూర్యునికి దూరముగా నున్నపుడు 18,600 లక్షల మైళ్లదూరమునను ఉండును. వరుణునికిని సూర్యునికిని గల దూరమధ్యము 17,800 లక్షల మైళ్లు. ఇది సూర్యుని చుట్టివచ్చుటకు 30,687 దినములు లేక 84 సంవత్సరములకాలమును దీసికొనును. దీనివ్యాసము 31,700 మైళ్లు. దీని సాంద్రత 1.28.

నభస్థానుఁడను నీగ్రహము మనసౌరకుటుంబములోని గ్రహములలో సూర్యునికి మిక్కిలి దూరస్థముగ నున్నది. ఇది సూర్యునికి దగ్గఱగ నున్నపుడు వానినుండి 27,600 లక్షల మైళ్ల దూరమునను, వానినుండి దూరస్థముగ నున్నపుడు 2,810 లక్షల మైళ్ల దూరమునను నుండును. సూర్యునికిని నభస్థానునికిని గల దూరమధ్యము 27,800 లక్షల మైళ్లు. దీనివ్యాసము 34,800 మైళ్లు. ఇది సూర్యునిచుట్టు నొకపరి తిరిగివచ్చుటకు 60,127 దినములు లేక 165 ఏండ్లను దీసికొనును. దీనిసాంద్రత 1.15.

పై గ్రహములలో భూమి కొకయుపగ్రహమునకు అంగారకునికి రెం డుపగ్రహములును, బృహస్పతి, నాలు గుపగ్రహములును, శని కెనిమిది యుపగ్రహములును, వరుణునికి నాలు గుపగ్రహములును, నభస్థానుని కొక్కయుపగ్రహమును గలవు. ఇంతియకాక సూర్యునికిని బుధునికిని మధ్య నొకగ్రహ మున్నదని యొకానొక శాస్త్రజ్ఞుఁడు వెలయించి దానికి 'వల్కన్' అని పేరిడెను. దీని యునికినిగూర్చి యిదమిత్థమని యేమి తేలలేదు. కొంద ఱయ్యది యున్నదని చెప్పుచున్నారు; మఱికొంద ఱద్దానియునికినే సందేహించుచున్నారు. అంగారకునికిని బృహస్పతికిని, మధ్య నొకకొన్ని మిక్కిలి చిన్నగ్రహముల సముదాయ మున్నదనిచూడ మన కెఱుకపడుచున్నది.

నానాఁట నీ గ్రహముల నొక్కొక్క దానినిగూర్చి నానేర్చిన విధంబునఁ బ్రకటించెద.

---

# ప్రేమవల్లరి

ఆ
బూర్లె వెంకట రమణయ్యగారు

స్నేహ కన్నులఁ గురియు నీరాగవృష్టి
మొలచి, చివురించి, పుష్పింపఁబూని యున్న
లలిత మోహనమంజుల లతల మల్లె
యల్లదే వాడి, వందురి యంతరింప
నున్నయది నీదు కోపాగ్ని నుక్కడక్క!

మొగ్గఁ దొడిగిన చిన్నారి ముద్దులతను
భయద దావానల జ్వాల భస్మమొందఁ
జేయఁజూచుట, మురిపెంపు చిన్నికూఁతు
కంఠమును బట్టి తునిమెడు కరణి గాదె?

---

# శ్రీయుత బెల్లంకొండ రామారాయకవీంద్రుఁడు

క. మార్కండేయశర్మగారు

అనవరతాన్న విద్యాదానతృప్తవి
 ద్యార్థి విరాజద్గృహాంతరుండు
వ్యాకృతి తర్క వేదాంత మీమాంసాది
 రమణీయ శాస్త్రపారంగతుండు
సకల విద్వజ్జన స్తవనీయ విషయవి
 భాసితాప్రతిమాన భాష్యకర్త
సరస సంస్కృతకావ్య చంపూముఖ శతాధి
 కగ్రంథనిర్మాణ కలితయశుఁడు
వివిధ దుర్వాదికానన వీతిహోత్రుఁ
 డాత్మవిజ్ఞానవర్తి సత్యవ్రతుండు
హరిబెల్లముకొండ వంశాబ్ధి విధుఁడు
 రామరాయ కవీంద్రుండు ధీమహితుఁడు.

విద్వత్కవికుల తిలకుఁడు, తపస్వియు, విద్వజ్జన పోషకుఁడును, విద్యార్థి జనచింతామణియునగు శ్రీయుత బెల్లముకొండ రామారాయ కవీంద్రుఁడు శాలివాహనశకము సం.౧౭౯౭ (క్రీ. శ. ౧౮౭౫) యువ సంవత్సర బహుళ అమావాస్య సోమవారమునాఁడు రాత్రికర్కాటకలగ్నమునందు జన్మించెను. గుంటూరుజిల్లా నరసారావుపేట తాలూకాపమిడిపాడు వీరినివాసగ్రామము. వీరు నియోగి బ్రాహ్మణశాఖకు చెందినవారు; ఋగ్వేదులు; ఆశ్వలాయనసూత్రులు; భారద్వాజసగోత్రులు. శ్రీరామారావుగారిపూర్వులు ౬, ౭ తరములనుండి సంస్కృతభాషయందు కావ్యనాటకాది పరిచయము చక్కఁగా కలిగియుండిరి. శ్రీరామారావుగారికి పితృ పితామహాదుల కాలములనుండి 3 అగ్రహారములు పెక్కుతావుల యీనాములును గలవు. శ్రీరామారావుగారికి బాల్యమునుండియు హయగ్రీవుఁడు ఇష్టదైవము. వీరు బ్రాహ్మముహూర్తమునందు మేల్కాంచి స్నానసంధ్యాద్యాహ్నికమును యథావిధిగ నాచరించి సహస్ర గాయత్రీజపము సల్పి కాని మఱేపనియు చేయువారుకారు. కృష్ణాతీరమునందు, పరమ పుణ్యతీర్థమగు వేదాద్రియందు 2సంవత్సరములు ఆకంఠజల మధ్యస్థులయి తపము సల్పిరని తెలియవచ్చుచున్నది. వీరు ప్రథమమున తండ్రిగారిసమీపమున కొంతకాలము కావ్యపాఠము చదివిరికాని అది మొదలుకొనియే కవిత్వము చెప్పుచుండిరట. వనపర్తి, గద్వాల మున్నగు సంస్థానములకు వార్షిక సత్కారపరిగ్రహణార్థము పోవు పండితుల కందఱకు రామారావుగారి గృహము విడిదిగృహము. విద్వాంసులతోడ విద్యాగోష్ఠిసల్పుచు యోగ్యతానుసారము వారిని సత్కరించుచు విద్యార్థులకు అన్నపానీయాదులను తనయింట నొసంగి విద్వాంసులనుగా నొనర్చిరి. శ్రీరామారావుగారి శిష్యకోటికి చేరిన శతావధానులు గుంటూరుమండలమున పలువురు గలరు. శ్రీరామారావుగారు చంపూ, భాణ, కావ్య, వ్యాకరణ, భాష్య, వ్యాఖ్యానాది గ్రంథములు దాదాపు ౭౧ ని, అనేక దేవతాస్తుత్యష్టకములను, దాదాపు ౨౧ ని, రచించిరి.

వారు రచించిన గ్రంథములలో ముద్రితములు.

గరుడసందేశము; రుక్మిణీపరిణయ చంపువు; కృష్ణలీలాతరంగిణీవ్యాఖ్య; భాగవత చంపూవ్యాఖ్య; వేదాంతకౌస్తుభము; హయగ్రీవస్తుతి; హయగ్రీవశతకవ్యాఖ్య.

భగవద్గీతాశంకరభాష్యముపైన వ్రాసిన భాష్యార్కప్రకాశికయను భాష్యవ్యాఖ్యానము ౧౬ అధ్యాయములవఱకు ముద్రితమయియున్నది. తక్కిన ౨ అధ్యాయములుకూడ శ్రీయుత దేశోద్ధారక నాగేశ్వరరావుగారు ముద్రించుచున్నారు.

ఆంధ్రదేశమునందుఁగాని, ఇతర దేశములందుఁగాని శ్రీవిద్యారణ్యుని తరువాత సర్వతోముఖమయిన ఇట్టి పాండిత్యముగల పురుషుఁ డింతవఱకు జన్మించియుండలేదు.

సిద్ధాంతకౌముదీవ్యాఖ్యయగు శరద్రాత్రియు, శ్రీభాష్యవిమర్శయు, సిద్ధాంతబిందువ్యాఖ్యయగుసిద్ధాంతసింధువు అను గ్రంథరాజములు వీరికి గల శాస్త్రపరిజ్ఞానమును, ప్రతిపక్షనిరాకరణదక్షత్వమును చక్కఁగా వెల్లడింపఁగలవు. వీరు ఆగర్భశ్రీమంతులయి పుట్టినట్లే విద్యగూడ వామదేవ, శుకయోగీంద్రాదులవలె జన్మాంతర

కృతసుకృతవిశేషముచేఁ బుట్టుకనుండియే కరచరణాదు లతోపాటు పుట్టి ముకుళావస్థతో సహజముగ నుండి యౌవన దశయందు వికసించినది. బ్రహ్మశ్రీ పురిసుళ్ళ రామ శాస్త్రి, సుబ్రహ్మణ్యశాస్త్రియను విద్వత్ సోదరద్వ యమును తన గృహమునందుంచి పోషించుచు జ్యేష్ఠుని దగ్గఱ వ్యాకరణశాస్త్రమును, కనిష్ఠునికడ తర్కశాస్త్ర మును శ్రీరామారావుగారు చదివిరి. శ్రీరామారావుగారు



గురుసమీపమున అభ్యసించిన విద్య ఇదియే. తక్కిన ధర్మ మీమాంసా, వేదాంతశాస్త్రములయందు ఇంతటి విపుల మైన పాండిత్యమును ఎటుల గడించిరో తెలియఁజాలదు. శ్రీరామారాయ కవీంద్రునకు కోపమనునది యెట్టిదో తెలి యదు. వీరి శరీరము పుటముపెట్టిన బంగారుచాయవంటి చాయ కలిగియుండును. పెదవులపఱకు వ్రేలాడు తలవెం డ్రుకలును, చిరునగవు, వికాసముగల ముఖముగలవారయి "యత్రాకృతిస్తత్రగుణాః" అను శాస్త్రమునకు లక్ష్య

భూతులయి యుందురు. ఇట్టి మహనీయులు పరీధా వినామసంవత్సర కార్తికశుక్లపక్ష నవమియందు, అనఁగా జన్మాది 3౭ సంవత్సరమునందు పాంచభౌతికమగు దేహ మును పరిత్యజించి యశశ్శరీరు లయిరి. వీరిమరణమును గూర్చి విలపించిన పద్యములలో నొకటి యీక్రింద వ్రాయుచున్నాఁడను :

ఉ. ఏగతి సంస్కృతంబిక ను వృద్ధిగనున్ మనకొండవీటవే
ఱేగతి బీదకుఱ్ఱలకు నేర్పను శాస్త్రము లభ్యసింపఁగా
సాగునె వేఱుచోటనిటు సత్రము పాండితియే పురంబులో
నేగురువద్దఁగల్గు? వచియింపుము హా గతి యేకామినవలెన్?

శ్రీరామారావుగారి భగవద్గీతా భాష్యవ్యాఖ్య ము ద్రించినంతవఱకు, అనఁగా ౧౨ అధ్యాయములవఱకు రా యల్ 8 పుటలసైజున దాదాపు 850 పుటలు కలిగి యున్నది. దానివెల రు 4-0-0. ఆగ్రంథమును స్వీకరిం చిన ఇతరగ్రంథముల ముద్రణకు ప్రోత్సాహము నొసర్చిన వా రగుదురు.



**పాఠశాలలు - మాతృభాషా ప్రాధాన్యము**

డిసెంబరు మాడరన్ రివ్యూపత్రికయందు శ్రీయుత పి. యన్. దత్తు (బి. యస్. సి. లండను) గారు "విద్యాభ్యాసము, లేక జాతి యొక్క జీవితశక్తుల దుర్వ్యయము" అను నొక వ్యాసమును ఆంగ్లమున ప్రకటించినారు. అందు వారు ఈనాడు పాఠశాలలలో ౬, లేక ౭ ఏండ్లవయసుగల బాలురకు మాతృభాషను నేర్పుటకు మొదలుపెట్టియు పెట్టకముందే విదేశీయమగు ఇంగ్లీషుభాషనుకూడ నేర్పుటకు మొదలిడుచున్నారనియు, వింత తెలుగులైన వర్ణక్రమములు, శబ్దోచ్చారణములు, అర్థర్వచనములుగల ఆవిదేశీయ భాషను అంత చిన్నతనముననే బలాత్కారముగ వారిచే జదివించుటచేత సహజముగ బలుత్రోవల పరుగులువారి వారిజీవితనిర్వహణమున వారికి దోడ్పడగల వారి సహజకోమలమయిన బుద్ధిని కొంచెపఱుచుచున్నదనియు, బాలురకు తమకు నిత్యజీవనమందు వాడుకలోనుండు విషయములను మాతృభాషయందు బోధించుట కడుసుకరమనియు, వారును దానిని శ్రమయేలేక నేర్చికొనగలుగుదురనియు, కావున నావిధముగ వారిబుద్ధిని మొలకలో నేత్రొక్కుటకంటె వారికిమాతృభాషయందే చాలినంతకృషిచేయ నవకాశము లధికముగ గల్పించినచో వారి శరీరమనోబుద్ధులు సత్వరముగ వికాసమును జెంది, పెంపొందగలవనియు, అట్టి సౌకర్యము ఇప్పటి విద్యావిధానమున లేదనియు, హైస్కూలు విద్యార్థులకు ఒకటవ ఫారము మొదలుకొని, మాయజాలనన్ని భిన్నభిన్న సారస్వతశాఖలకు జెందిన ఆంగ్లపుస్తకములను చదువవలసియున్నదనియు, ౫, ౬ ఏండ్లు, కష్టపడి చదివి హైస్కూలు తరగతులన్నియు దాటునప్పటికి వారి కాయాసారస్వతవిభాగములయందింతయేని జ్ఞానము గలుగక పోవుటయేకాక ఆరోగ్యము, మనస్సు, బుద్ధి కూడ చెడి వారు ఇకను విద్యాలాభమును బొందుటకుగాని, అంతటితో జదువునకు స్వస్తిచెప్పి జీవితమును ధైర్యముతో గడుపుకొనుటకుగాని శక్తిచాలక 'రెంటికిని జెడ్డరేవడ'లగుచున్నారనియు, మిగిలి కళాశాలలయందు బ్రవేశించినను, నాలుగైదేండ్లు వారు తమకు ప్రత్యేకాభిమానముగల ఇతర శాస్త్రములతోపాటు ఇంగ్లీషునుగూడ నిర్బం

ధముగ జదువవలసియున్నారనియు, ఇన్ని గండములు గడచి ఎట్లో పట్టభద్రులై జీవితరంగమున బ్రవేశించవలసిననాటికి శుష్కశరీరులు శూన్యప్రతిభులు, విగతోత్సాహులునై వారు విద్యాలయములనుండి వెలువడి ప్రత్యక్షమగుచున్నారనియు, వేయింట నేయిద్దరు ముగ్గురో తప్ప తక్కినవారందరు పైనుడివినట్టి దుస్థితికి బాలగుచున్నారనియు, విశ్వవిద్యాలయములు కేవలము గుమస్తాలను- యౌవన బలమునకు, పురుష శక్తికి సుమారులైన గుమస్తాలను, సూత్రధారునిచేతి తోలుబొమ్మల వలె విద్యాబుద్ధి స్వభావములయందు గాంభీర్యము, స్వాతంత్ర్యము లేక పైయధికారులెటులాడించిన నటులాడు గుమస్తాలను- తయారు చేయుచున్నవనియు, చిన్నతనముననే ఒంటను ఇంటను బట్టని ఇంగ్లీషు భాషను చిలుకలవలె వల్లించి వల్లించి బుద్ధికి గల స్వాతంత్ర్యశక్తి నశింప క్రమముగ యౌవనము ప్రాప్తించునాటికి, తమ్మును తమ తోడి జనులను నిర్వహించి తమ దేశమునకువన్నె దెచ్చుటకు సర్వవిధముల ప్రయత్నములు చేయవలసిన నాటికి, ఎందుకును బనికిరానియట్టిదుస్థితికి వచ్చుచున్నారనియు నీ మొదలయిన విషయములను విపులముగ జర్చించి తుదకిట్లు తమ వ్యాసమును ముగించినారు:

మనము మనజాతి యొక్క శారీరకమానసిక వికాసములు ఇంకను నశించి రూపుమాయకుండ కాపాడుకొనగోరుదుమేని మనము వెంటనే జాగ్రత్తపడి ఈ దేశీయ భాషయొక్క దౌర్జన్యమును, దాస్యమును సమూలముగ దులిపివేయవలెను. పాఠశాలలయందును, కళాశాలలయందును ప్రస్తుతము ఇంగ్లీషుభాషకున్న ప్రాధాన్యమును తొలగించి ఆస్థానమున మాతృభాషను నెలకొల్పి మన బాలురు తొలుదొల్త మాతృభాషయందు పాండిత్యమును గడించుకొనునట్లు చేయవలెను. తరువాత జర్మనులు, చైనావారు చేయునట్లు ఇంగ్లీషు జదివి తన్మూలమునవా భాషయందు గల ప్రత్యేకశాస్త్రములు, కళలు మొదలయినవానియందు జ్ఞానము నలవరుచుకొనుటకును చాలును. అనగా ఇంగ్లీషుకళావేత్తల విజ్ఞాన భాండాగారమునకు బ్రవేశమును గలిగింపజాలినంత చదువుకొన్న జాలును.

భారతదేశమున విద్యవచ్చినవారు చాల తక్కువగనున్నారు. ఆయున్న కొలదిమందిదుస్థితిని శ్రీదత్తుగారు చక్కగా నిరూపించినారు. దీనికి ప్రస్తుతమున్న విద్యాభ్యాస విధానమే కారణమగుచున్నది. భారతదేశమున బాలురకు చదువు మొదలుపెట్టిననాటి నుండి విదేశభాషనుకూడ ప్రారంభింపక పదియేండ్లకాలము కేవలము వారివారి మాతృభాషయందే పరిశ్రమచేసి పాండిత్యమును సంపాదించుకొని తమతమ ప్రాచీనవిజ్ఞానలాభమును బొందుటకవకాశములు గలుగునేని విద్యావ్యాప్తి యతిశయింపగలదు. ఆ కాలమున ఆంగ్లభాషయందు వెలయుచున్న వివిధవిజ్ఞానవిశేషములను బాలురకు మాతృభాషతోనే బోధింపవలెను. అట్లు బోధింపగల సమర్థులు మన దేశమున నిప్పుడు పలువురున్నారు. ముందు ౧౦, ౧౧ సంవత్సరములవరకునువారేయందుకు చాలియుందురు ఇట్టిపద్ధతి ననుసరించి విద్యనభ్యసించు బాలురు ౧౫, ౧౬ సంవత్సరముల వయసు వచ్చునప్పటికి తమ భావిజీవితమును సుకరముగ గడుపుకొనుటకు దమ కుపయోగింపగల ప్రత్యేక

శాస్త్రమునో, కళనో నిర్ణయించుకొనగలుదురు. అదిమొదలద్దానసే కృషిచేయవచ్చును. దానినిగూర్చిన విజ్ఞానమును సమగ్రముగ దెలిసికొనుటకై యొక ఇంగ్లీషునే కాదు, వలసినచో అట్టి ప్రత్యేక విజ్ఞానము విస్తారముగగల యేయితరభాషనైనను నేర్చుకొనవచ్చును. అపుడు విజాతీయ భాషలను నేర్చుకొనుట సుకరముగ నుండును. ఆసక్తిగలదేని యెట్టి దుష్కరకార్యమైనను సుకరమగుట వింతకాదు. ఇట్టివిధానమువలన బాలురబుద్ధికి స్వాతంత్ర్యము, కళలకు వికాసము తప్పక కలుగగలదు. తొలుతనే భారతీయ ప్రాచీనవిజ్ఞానము వారి హృదయముల నాటుకొనజేసియుండుటచే ఆనాటికి యువకులైన వారి యమోఘ ప్రారంభములవలన భారత జాతీయత స్వతంత్ర స్వరూపమును దాలిచి యభివృద్ధి గాంచగలదు. అప్పుడు భారతదేశమున కభ్యుదయము, అభ్యున్నతి గలుగగలదని తలపవచ్చును. మనదేశమునందలి విద్యాశాఖాధికారులును, విశ్వవిద్యాలయముల వారును, బాలురకు ఇట్టి సదవకాశములను గలిగించు విద్యావిధానముల ప్రారంభించి వారిని తమకును, దేశమునకును స్వాతంత్ర్యమును, ప్రతిష్ఠను సమకూర్చగల పురుష సింహములను జేయుటవశ్యతమము.

---

## భారతదేశము రైల్వేపరిపాలనము

మనదేశంలో ఉండే రైల్వేలలో మంచి సౌకర్యాలు ఉండవలెనంటే రైల్వేవారు అనుసరించవలసిన నియమములను చదువురాని దేశీయసోదరులకు తెలియపడచెప్పడ మొక సాధనమని "ఇండియన్ రైల్వేసు" అనుపత్రిక ఇట్లా రాసింది:

భారతదేశంలో రైల్వే అధికారం అంతా విదేశం వాళ్ల చేతుల్లో పడిపోయింది. తమసామర్థ్యాన్ని చెప్పుకొనే మాటలంతగాడవు కార్యనిర్వహణంలో కనిపించడం లేదు. వారికి నిజంగా సామర్థ్యం ఉంటే రైల్వే నిర్మాణంలో ఇన్నిలోట్లు ఎందుకు ఉంటవి? నీటికి, స్థలానికి, సౌఖ్యానికి ప్రయాణికులెందుకు కల్లాడుతారు? వర్తకులు ఎక్కువచార్జీలకు, ఇతర అసౌకర్యాలకు ఎందుకు మొరపెట్టారు? రైల్వేఉద్యోగులు, పనివాండ్రు తమకుజరిగే అక్రమాలకు దుఃఖిస్తూ రైల్వేఅధికారుల అమానుషమైన అంకుబాటు లేనిస్థితిని ఎందుకు బహిరంగంగా ఆక్షేపిస్తారు? తుపాకినుండ్ల రాజ్యాంగం అండను వాళ్లు అధికారం సాగిస్తూ ఉన్నారు. లేకుంటే వాళ్ల సామర్థ్యం ఎప్పుడో ప్రపంచానికి తెలిసిపోయేది. ఇట్లాంటి పరిపాలనావిధానాన్ని స్వాతంత్ర్యంగల ఇతర ఏదేశాలూ ఒకనిమిషమయినా ఓర్చుకోనేవికావు. ఆదేశాల్లో ప్రయాణికులు, రైల్వే ఉద్యోగులు, వర్తకులు, ఇంకా ఇతరులుగూడ రైల్వే అధికారులు తమపరిపాలన పద్ధతులను చక్కపరుచుకోవడానికి సమ్మతించకపోతే వెంటనే రైల్వేలకు స్వస్తిచెప్పేసి ఉందురు. కాని, అక్కటా, ఇది భారతదేశము కదా! ఈ దేశంప్రజల్లో నూటికి తొంభైఅయిదుమంది పిరికివారు, చదువురానివారు.

చదువువచ్చిన మిగత అయిదుమంది రైల్వేలపరిపాలనమును విమర్శించడానికి సంఘములుగ కూడిఉన్నారు కాని వారికి గట్టిపట్టుదల, చదువురాని తమసోదరులపట్ల సానుభూతి లేకుండడంచేత వారిప్రయత్నాలంతా బూడిదలో హోమంగా ఉన్నవి. ప్రయాణికులు సౌకర్యాలకు, పనివాండ్రు న్యాయానికి, వర్తకులు సరసమైనచార్జీలకు, అనుకూలమైన మార్గాలను నిర్మించడానికి తమతమ సంఘాలద్వారా అర్జీలు పెట్టుకొంటున్నారు. కాని

ఆఅర్జీలు మొక్కపోయిన ఆయుధాలు, వానివల్ల లాభం ఏమీ లేదు. రైల్వేవాళ్లంత మూర్ఖపుపట్టుదల కలిగిఉంటే వీళ్లుమాత్రం ఎందుకు అట్లా ఉండకూడదు? ఈఅర్జీలు రైల్వేవాళ్ల మూర్ఖాన్ని మరింత గట్టిచేయడంమాత్రం నిశ్చయం.

రైల్వేవాళ్లకు అర్జీ పెట్టేదానికంటే వాళ్లు చదువు రానితమసోదరప్రయాణీకులకు బోధచేయవలెను. ఇంటరు తరగతిలో, మూడోతరగతిలో ప్రయాణంచేసే చదువు వచ్చిన వాళ్లు ఒక్కొక రొక్కొకబండి (కంపార్టుమెంటు)లో ఎక్కి అందులో ఉండే చదువురాని ప్రయాణికులకు రైల్వే అధికారులు అనుసరించవలసిన నియమములనుగూర్చి బోధించవలెను. అట్లా చేస్తే క్రమంగా రైల్వే అధికార్ల మూర్ఖత్వం రూపుమాస్తుంది, వాళ్ల వాళ్లకుకావలసిన సౌకర్యాలను వాళ్లువాళ్లు పొందుతారు.

---

## భారతదేశమునయొక్క లోపభూయిష్ఠ విద్యావిధానము

డాక్టరు సుధీంద్రబోసుగారు 'స్కాలరు' అనుపత్రికలో పైవిషయమునుగూర్చి యొక వ్యాసము నీక్రిందివిషయముతో ప్రారంభించినారు.—

భారతదేశమున పరిశోధనలను సలుపుటకై పోయియుండి మరల నపుడే తిరిగివచ్చిన ప్రతిభాశాలియగు నొక అమెరికనుని నేనిటీవలనే కలుసుకొంటిని. భారతదేశాభివృద్ధియొక్క వెనుబాటునకు అక్కడి లోపభూయిష్ఠమగు విద్యావిధానమే కారణమని తన సునిశ్చితాభిప్రాయముగా నాతడు చెప్పినాడు. ఆతడు మఱియు "భారతదేశమునందలి ప్రస్తుతవిద్యావిధానము సృజించునది సుమస్త్రాలనుగాని, అరుణరక్తప్రపూర్ణులగు వివేకనిధులను గాదు. తరువాత సంభవించునది ఇది: ఈనాటి భారతీయుల కెదురొ్కనునది దారిద్ర్యమునకన్న నీచమగు మనోధైర్యముల దారిద్ర్యమే" అని అన్నాడు.

భారతీయ విద్యావిధానమువలని ముఖ్యోపద్రవమిదియని నేను తలచెదను. పౌరుషపట్టము, బుద్ధిస్వాతంత్ర్యముతప్ప తక్కిన హైస్కూలు యోగ్యతాపత్రము మొదలు బి.ఏ. వఱకుగల వివిధపట్టములను యువకులకది ప్రసాదించుచున్నది. తన్నుగూర్చికాని, తనస్వాతంత్ర్యమును గూర్చికాని యాలోచించుకొనుటకైన అవకాశమును గలిగించుశిక్షు విద్యార్థి కరుదుగనైన లభింపకున్నది.

అతని మనస్సు స్వతంత్రముగనుండక నిరంతరము నొకయూతకోలనాని యుండును. అతడు ప్రారంభప్రయత్నములు, బుద్ధిలో చురుకుదనము, స్వాతంత్ర్యము నందగాలేని వినమ్రుడగు నొకసుపుత్రా. అధికారవర్గము మార్గదర్శకమై యాతనినిదిద్దుచుండవలెను. అతడు సోమరియగు సాంఘికుడు. హంత! అతడు ఆహారపదార్థములతో నింపిన యొక గృహోపకరణము. ఈ గొప్పపొరపాటు సాధ్యవిషయములందు సహజముగ నేర్పు, సమృద్ధిగల విద్యార్థులపై లేదు;. వారిని ఇట్టి యసంగతవిద్యావిధానము పాలుచేసిన యుపాధ్యాయులపై నున్నది.

ఇట్టి యపరిష్కృత విద్యావిధానము కేవలము దుఃఖకరము. ముమ్మాటికి దుఃఖకరము. సమీచీన విద్యాబోధనవిధానముల మన మారయగలుగుదుమేని భారతీయయువకులను సమీచీన మనస్తోవల ద్రిప్ప వచ్చును. వారికి సర్వతోముఖాభివృద్ధి, వికాసము లిప్పడత్యంతావశ్యకములు.

---

## (వ్యాధుల) లక్షణములు—నివారణము

లక్షణాలంటే ఆరోగ్యసిద్ధికి ప్రకృతిచేసిన ఒక ప్రయత్నము. ఆకలిఅంటే ప్రకృతి మనకు ఆహారం కావాలని చెప్పడము; ఆకలి లేకుండడం అంటే ఆహారం అక్కరలేదని ఆమె మనకు చెప్పడము. మందగించిన ఆకలికి చురుకుపుట్టించడానికి తినేవ్యంజనాలు మొదలయిన ఉత్తేజకరపదార్థాలు నిజంగా ఆహారావశ్యకతను కలిగించకపోవడమే కాకుండా అందుకై చాలినంత జాగ్రతను తీసుకోడానికి అవకాశాన్ని కూడా కలిగించవు.

తల నొప్పి వచ్చిందంటే జీర్ణంకావడంలో ఏదో లోపం—అనగా నిద్ర తక్కువ కావడమో, ఎక్కువగా పని చేయడమో, సరిదిద్దుకోవలసిన ఏదో ఒక ఉపద్రవమో—ఉండవలె నన్నమాట. తలనొప్పి తెలియకుండా ఉండడానికి నరాలకు తిమ్మిరిని, మొద్దుతనాన్ని కలిగించే మందులను తినడంచేత బాధ పోదు. తలనొప్పికి మూలమైన కారణాన్ని నివారిస్తే మందు అవసరం లేకుండానే తలనొప్పి తనంత అదే పోతుంది. మనశరీరాన్ని కాపాడడానికి ఇట్లాటిమార్గాన్నే చాలవరకు పడిచి, రోగకారణం నిలిచి ఉండగా మందులవల్ల లాభం లేదని తెలపవచ్చును. ప్రకృతికి స్వీయమైన మందులసంచి ఒకటి ఉంది. అది: తెలివి తేటలతో ఉపయోగిస్తే ఆరోగ్యాన్ని కలిగించే పరిశుభ్రమైనగాలి, ఎండ, మంచినీరు, ఆహారము వీటితో నిండిన ప్రపంచము. కాని ప్రకృతి ఆరోగ్యానికి హెచ్చరిక ఇచ్చేటందుకు మందు ఎప్పుడు జబ్బుకు మూలమైన కారణాన్ని తొలగించుకోవడం కోరుతూ ఉంటుంది.

---

## అతిబాల్యవివాహము-విధవావివాహము

గాంధిమహాత్ముని యొకానొక యుపన్యాసము నుండి "ది హిందూ కాజ్" అనుపత్రిక ఉద్ధరించిన విషయము నీక్రింద పొందింపబడినది:

అతిబాల్యవివాహములవలన గలిగే మహాపదలవంకకు మీదృష్టిని మరల్పవలసియున్నారు. మోకాళ్లతో ప్రాకుచున్న పసుబిడ్డలకు బొట్టుకట్టి, అప్పుడే యిల్లాండ్రు కండని చెప్పుటను 'ధర్మ'మనికాని, 'శాస్త్రము లంగీకరించిన విషయ'మనికాని చెప్పకుడు. నాస్నేహితులలో బలువురు, విద్యాధికులగు న్యాయవాదులు, వైద్యశిఖామణులు, పండితులు, జ్ఞానులు నగువారు, పదునూడేండ్లైన నిండకముందే తమపిల్లలకు పెండ్లిండ్లు చేయుట నేనెఱుగుదును. (నవ్వు.) మిత్రులారా! ఇది నవ్వులాట విషయము కాదు. ఇది సిగ్గును, విషాదమును చెందవలసిన విషయము. ఇంతకన్న శోచనీయమైన విషయ మింకొకటి లేదని నేను చెప్పుచున్నాను. ఈవిషయమును మీరు నవ్వులాటగ గాక లోతుగా పర్యాలోచించవలెను. మనయువకులు ౧౪ ఏండ్లు నిండని పిల్లలను పెండ్లాడమని శపథము చేయవలెను. ఈసంస్కరణము సఫలమగుటకు వారిసహాయమే ముఖ్యము. మీరందఱు—పిన్నలు, పెద్దలు—ఈపనికై తోడ్పాటు చేయవలెను.

గంగారాముగారి ప్రఖ్యాతిని మీరు వినియే యుందురు. సుప్రసిద్ధపురుషుడు మీ (సర్) విశ్వేశ్వరయ్యగారు మైసూరులో కావించినట్లే యామహాపురుషుడును తన యంత్రనిర్మాణ తంత్రకౌశల్యముచే పంజాబులో గొప్పకార్యములను జేసినాడు. ఆతడు కావించిన ఆ యన్నికార్యములలో విధవాపునర్వివాహ విషయము ఘనతర మగుకార్యము. అట్లే మీరును మీశక్తికొలది ఈ విషయమున సహాయపడవలెను. 'విధవ అనగా ఎట్టిది?' అని నేను అడుగుచున్నాను. విధవ అనగా మనలో పూజ్యస్థానమును బడసిన యొకవ్యక్తి. మగడు మృతిచెందినమాత్రాన ఒక ౧౨, లేక ౧౪ ఏండ్ల బాలికకు వైధవ్యము ప్రాప్తించినదని మీరు చెప్పగలరా? పేదరిమిపాలయిన తండ్రి ఏకారణముచే గాని పదునూడేండ్ల తనకూతునకు పెండ్లి చేయ నెంచనేకాని, మఱియొకసంవత్సరమునకుగాని యాబిడ్డమగడు గతించునేని యామె 'విధవ' యనియు, అప్పటినుండి మరణాంతము దుర్భరవైధవ్యబాధల నామె యనుభవింపవలెననియు మీరు చెప్పగలరా? దినదినమునకు నీప్రశ్న మనదృష్టిని ఎక్కువగా ఆకర్షించుచున్నది. కాబట్టి మనము దీని నెఱుగనట్లు ఉపేక్షించి యుండగూడదు. ఈబాధను శాశ్వతికముగ జేయకుడు. మీరు పురుషులు పునర్వివాహాధికారమును గలిగి యుండ మీస్త్రీల కేల యది కాదనెదరు?

ఈ పునర్వివాహాధికారమును వారికి సమకూర్చవలసినవారు మీరేయని తెలిసికొనుడు. కాబట్టి మీ రీ పనినిజేసి మీసంఘమునకు సత్యమును నేనను కావించెదరా అని నేను మిమ్ముల నడుగుచున్నాను.

---

## విశ్వంతరజాతకము

కళింగదేశమును శిబి యనురాజు పాలించుచుండెను. వానికి సంజయుడను కుమారు డుండెను. సంజయునికి ఫుసతియందు విశ్వంతరుడను తనయు డుదయించెను. దైవజ్ఞులు బాలుని జననమునకు పూర్వమే యతడు మహాదాత కాగలడని నుడివిరి. బాల్యమునుండి విశ్వంతరుడు నిరంతరదానతత్పరుడై యుండినవాడు. యౌవనమునందు తనయొద్దనుండిన యొకగజమును, అమూల్యాభరణాలంకృతమును, అనావృష్టిబాధిత మగుతరిని కళింగరాజ్యమునకు సమృద్ధవృష్టిని కలుగజేయు ప్రభావముగల దానిని గూడ నతడు దానమున నిచ్చివేసెను. అందులకు ప్రజలు విశ్వంతరునియందు కడుక్రుద్ధులై, వానిపై పగ దీర్చుకొనువారై యుండ, తనయుని క్షేమముకొరకు సంజయుడు వానిని దేశమునుండి పంపివైచెను.

విశ్వంతరుడు, భార్యయు, తనయుడును, తనయయు, గూడ రాగా, నాలుగశ్వముల బూన్చినరథము నెక్కి పురవీథుల బోవుచుండగా కొందఱు విప్రు లతనిని మార్గమున గాంచి యాచించిరి. తత్క్షణమున రాకుమారుడు వెనుదీయక తన రథాశ్వముల వారి కొసంగెను. పాదచారియై పోవలసినవానికి సహాయార్థముగ దేవతలు వాని బిడ్డలను జూజకుడను విప్రునిరక్షణలో నుంచిరి. అనేక కష్టములపాలై బిడ్డలును, తలిదండ్రులును కాలక్రమమున శక్రునిసహాయమున స్వపురిని జేరిరి. సంజయుడును పుత్రపౌత్రుల నాదరించెను.

## హంసజాతకము

ఒకానొకకాలమున వారణాసియం దొకరాజుండెను. అతనికి క్షేమాదేవియను పత్నియుండెను. ఆ కాలమున బోధిసత్త్వుడు హంసజన్మమెత్తి తొంబదివేలహంసలకధినాథుడై యుండెను. క్షేమాదేవికి ఈ హంసాధిపుడు స్వప్నమున కానరాగా ఆయమ తనభర్తను ఆహంసను తెప్పింపుమని కోరెను. రాజు తనవ్యాధుని పిలిచి హంసకొఱకై పంపగా నతడా మహాహంసమును, దానినేనాని యగు సుముఖాఖ్య హంసమును రాజసన్నిధికి గొనివచ్చెను. అంత కాశిరాజు హంసల నాదరించి వాటి నీతిబోధను బడసెను.

కొ. నృసింహాచారి.

---

## ప్లాటినము బంగారు కంటె విలువగల లోహము

ఒకప్పు డీలోహము నుపద్రవకరముగ తలచినను ఇప్పు డిది విలువలో బంగారమును మించి యున్నది. ప్రకృతి శాస్త్రజ్ఞులు ఈలోహము ఇతరలోహములవలె నీరు, చిలుము మొదలయిన వానిచే చెడక వందలకొలది ఏండ్లు మనగల దని పరీక్షించి నిరూపించినారు. పులుసువస్తువులు, పండ్లపాచి, ఉమ్మి మొదలయినవి దీనిని బాధింపవు కావున ఎక్కువగా నిది పండ్లు కట్టుట కుపయోగించును. దీనిని స్పెయిను దేశీయులు తొలుత కనుగొని నాగరక ప్రపంచమునకు వెల్లడి చేసినారు.

'మెక్సికో' 'పనామా' (అమెరికా ఖండములోనివి) దేశములలో బంగారముకొఱకు వారు వెదకుచు దీనిని కనుగొని బంగారముతో సమానముగ బరువు గలిగినది కావున పచ్చని లోహమును మైపూతగ నిచ్చినచో బంగారమని సులభముగ మారవవచ్చునని నిరసించినారు. తరువాత కొలది కాలమునకే దాని విలువను గుర్తించి సొడి డబ్బీలు, కత్తులు, బాకులు మొదలయిన వానికి పిళ్లు, ఇంకా ఏవో ఆభరణములు చేయ మొదలిడిరి.

ఇపుడు దాని వెల బంగారమును మించిపోయినది. గనినుండి తీసి నపు డిది ఎందుకును బనికిరాని నలుకరాయివలె నుండును. క్రమముగ పరిశుద్ధిని చెందునేని సముద్రపుపాచి(స్పంజి) వలె మృదువై యుండును. అంత దాని గుండ్రని బిళ్లలుగా చేయుదురు. ప్రాతనాళ్లలో దీనిని పలుచని రేకులుగా సాగగొట్టి ఎన్నో రకముల ఆభరణములను చేయుచుండిరి. వానిలో కొన్ని (అమెరికాలో 'ఎక్వేడరు'లో నున్నవి.

---



౯. బెజవాడ కాలువలదృశ్యము



౧౧. శ్రీదుర్గావిలాసము, బెజవాడ



౧౨. ఇంద్రకీలాద్రిపర్వతమువిూదనుండు మల్లేశ్వరస్వామివారి దేవాలయము, బెజవాడ



౧౩. కృష్ణానది రైలువంతెన, బెజవాడ



౧౩. కృష్ణానది కాలువలవద్గర దృశ్యము, బెజవాడ



౧౪. కృష్ణానది, బెజవాడ



౧౫. కృష్ణానది ఆనకట్ట, బెజవాడ



౧౬. కృష్ణానది, బెజవాడ

## పుస్తకమేరువు—పుస్తకపరమాణువు

మామూలు పొడవుగల మనుష్యుడు తనవెనుక నడచిన నగపడనీ నంత పెద్ద పుస్తకమును మీరూహింపగలరా ?

అట్టి పుస్తకము ప్రపంచ మందెల్ల పెద్దదియని జనులు నమ్ముచున్నది. ఒకటిపుడు బ్రిటిషు మ్యూజియములో నున్నది. అదియొక దేశ చిత్రగ్రంథము (అట్లాసు.) రెండవ చార్లెసు రాజ్యభ్రంశానంతరము నెదర్లాండ్సులో తల దాచుకొన నేగినపుడు, అతని రాకకు జ్ఞాపకచిహ్నముగా ఆమ్స్టర్డాము వర్తకులు ఆతని కా పుస్తకమును కానుక యిచ్చిరి.

వారి దేశ చిత్రములు మిక్కిలి యథాతథముగా నుండుట, ఆకాలమునకు విపరీత మగుటచే, ఎంతయు నాశ్చర్యకరము. చిత్రములలోని వ్రాతలును, చిత్రము లగుజేంచిన వ్రాతలును లాటిను భాషలో నున్నవి. ఈగ్రంథమున ముద్రణ నైపుణ్య మపారముగా వెలయుచున్నది.

దీనికి చుక్కెదు రింకొక గ్రంథ మున్నది. దీనిని అర్ధరూపాయ నాణెముక్రింద దాచవచ్చును. దీని వెడలుపు $\frac{౧౬౬}{౧౦౦౦}$ అంగుళము; దళసరి $\frac{౬}{౧౦౦}$ అంగుళము. ఈచిన్ని పొత్తము సచిత్రమయిన అఱువది నాలుగుపుటలు గల ఉమర్ ఖయ్యామ్ 'రుబాయియతు.'

['టిట్‌బిట్సు'—నవంబరు ౨౬, ౧౯౩౭.]

---

## పొగ

చాల పట్టణములకు పొగవలని బెడద చాల విపరీతముగనే యుండును; కాని పొగలేకుండ మండు పదార్థముల యుపయోగము ప్రబలుటచే అది క్రమముగా తగ్గుచున్నది.

ఒక పట్టణమున కగు వ్యయము అందు రాలిన మసి మొత్తము ననువర్తించియుండు నను ఆశయముపై నాధారపడి రచించిన ఒక పట్టిక ననుసరించి, బరక్లీ నగరము, తలకు పౌ. ౩-౧౫ షి. వంతున ఖర్చుకాగా, పొగగాలివల్ల ఎగ్గు లనుభవించుటయం దగ్రగణ్యమగుచున్నది. రెండవది లివర్‌పూలు: దీని ఖర్చు తలకు పౌ. ౨-౭ షి. వేక్‌ఫీల్డు కొంచెము తేడాలో మూడవది: దీని ఖర్చు పౌ. ౨-౬ షి. లండనులో పాలునకు తల ఒకటికి పౌ. ౧-౬ షి. ఖర్చగును.

౧౯౧౫-౧౬ సం. లండనులో రాలిన పొగమసి చదరపు మైలునకు ౪౫౧ టన్నులు. అది ఇప్పుడు ౩౧౧ టన్నుల కంటె తక్కువకు దిగినది.

పొగ చిమ్ము అగ్నులవల్ల చలికాలపు ఎండ సగానికి సగము తగ్గిపోయినదని అంచన వేసినారు. మామూలు ఎండ కూడ ఇంచుమించు చంతే తగ్గిపోయినదట.

['టిట్‌బిట్సు' నవంబరు ౨౬, ౧౯౩౭.]

---

## సంగీతము-విష్ణు దిగంబర పలుస్కరు గారి యభిప్రాయములు

'మాధురీ'పత్రిక మార్గశీర్ష సంచికయందు శ్రీ ముకుటధర పాండేయ గారు ఉత్తర హిందూస్థానమున గానవిద్యకు నూతనోద్ధారకు లైన పండిత విష్ణుదిగంబర పలుస్కరుగారిని సందర్శించి సంగీత విషయమున తా మడిగిన ప్రశ్నలును, వా రొసగిన యుత్తరములును వివరించి యొక వ్యాసము వ్రాసినారు. అమూల్యము లగు ఆప్రశ్నోత్తరములు కొన్ని యిచట నుద్ధృతము లైనవి.

ప్రశ్న:—సంగీతమునకు ప్రధానాశయ మేమి?

ఉత్తరము:—శ్రోతల యుత్సాహమును, తన యుత్సాహమును పెంపొందించుకొనుట. సురుచికురుచి భేదముచే సంగీతము పోషకమును, శోషకమును గాగలదు; తారకమును, మారకమును గాగలదు.

ప్ర—మానవుని హృదయముపైని, సంఘముపైని సంగీతమున కెట్టి ప్రభావము గలదు ?

ఈ:—సంఘమున నే విషయమును బోధింప బూనినను సాఫల్యము సిద్ధించును. తనయొక్కయు, ఇతరుల యొక్కయు మానసముల నేకాగ్రముల గావింప నచ్చును. మంచికిగాని, చెడ్డకుగాని దీని నుపయోగింపు బాధ్యత గాయకునిపై నుండును. కావుననే ఋషులు సంగీతము నెల్లప్పుడును సత్కార్యములనే వినియోగించె డివారు.

ప్ర:—కావ్యమునకును, సంగీతమునకును అంతర మేమి ?

ఈ:—సగుణ నిర్గుణముల కెంత యంతర మున్నదో కావ్యసంగీతముల కంత యంతర మున్నది. కావ్యము సగుణ మైన, సంగీతము నిర్గుణము. కావ్యమునకు సచేత నములపై మాత్రమే ప్రభావ ముండును; ఇందును భాషా భేదము ప్రతిబంధము: ఆంగ్ల భాష యెఱుగనివాని పై నాంగ్ల కావ్యమునకు ప్రభావము కలుగదు. కాని, సంగీతమునకు చేతనాచేతనములు రెంటిపైనను ప్రభావ ముండును. సంగీతము, కావ్యమును మేళవించినచో స్వర్ణమునకు సౌగంధ్యము గలిగి నట్లుండును.

సరస్వతి వీణాపుస్తకధారిణి యగుట యీమహత్త్వ మునకు నాదర్శము. సంగీతమునకు కావ్య మక్కఱలేదు; కాని కావ్య మెుకవిధమున సంగీతగుణముల నవలంబింపక యుండజాలదు. ఇందుకు గారణ మేమన, సంగీతము స్వరప్రధానము; కావ్యము వర్ణప్రధానము: స్వరములు స్వతంత్రములు; వర్ణములు స్వరముల నపేక్షించి యుండును.

ప్ర:—సంగీతమునకు నృత్యముతో నెట్టి సంబంధ మున్నది ?

ఈ:—సం + గీతము=సంగీతము: కేవల గానమున కును చెందును; కాని నృత్యము లేక సంగీత మసంపూర్ణముగ పరిగణింతురు. కావున సంగీతమునకు నృత్యముతో గట్టిసంబంధ మున్నది. నృత్యమున గానము, వాద్యము, నృత్తము కూడియుండును. కావుననే నృత్యము సంగీతమునకు సంపూర్ణాంగ మని చెప్పుదురు. నృత్యమున రెండు విభాగము లున్నవి: ౧. ఉత్థాపనము (నాట్యము), ౨. హావభావ కటాక్షములు. కలిసికట్టుగ నృత్యమున స్పష్టభావము నుపయోగ పడును; నాట్యమున భావము తుల్యముగ నుపయోగపడును.

ప్ర:—భారతీయ సంగీతమునకు పుట్టినిల్లు వేదము కాదా ?

ఈ:—అవును, వేదమే.

ప్ర:—స్వతంత్రవిషయముగా సంగీతమునకు మొదటి గ్రంథ మేది? మొదటి ఆచార్యు డెవ్వడు?

ఈ:—సంగీతమున కాది గ్రంథము సామవేదము; ఆద్యాచార్యుడు శంకర భగవానుడు. నారదీయశిక్షయను గ్రంథమున గానవిధి వ్రాసి యున్నది.

ప్ర:—సంగీతమునకును, నాట్యమునకును సంబంధ మేమి ?

ఈ:—సంగీతభావము విడిచి నాట్య మసంపూర్ణము. స్వరమున కారోహణావరోహణములు గూర్చుట సంగీత విషయము. నాట్యము నృత్యమున నొక యంగము.

ప్ర:—ప్రాచీన భారత దేశమున నాట్యసంగీతముల కెట్టి స్థాన ముండెడిది.

ఈ:—ఉన్నతస్థాన ముండెడిది. అంతటను నాట్యాదులు జరుగుచుండెడివి.

ప్ర:—దాని పతనమునకు హేతు వేమి ?

ఈ:—మొగలుపాదుషాల దుర్వర్తనము, దుర్వ్యసనములును. తొలుత సంగీత మున్నతాశయములు నెఱవేర్చు సాధనముగ పరిగణింప బడెడిది; కాని యిప్పుడదియే విషయవిలాసముల నొక యంగముగా పరిగణింప బడ సాగినది.

ప్ర:—సంగీతపతనమున కేమి పరిణామము గల్గినది ?

ఈ:—ప్రజలయందు దౌర్బల్య మొదవినది. జనుల ఆశయములు తారుమారైనవి. ధైర్యముసడలినది. పవిత్రభావము లంతరించినవి. వేదకాలమున సంగీతమువలన సంస్కారము కల్గునను భావన యుండెడిది.

ఇప్పు డది వ్యతిరేకించినది: సంగీతమువల్ల మనుష్యుడు పాడయి పోవునను భావము ప్రజలలో నెలకొనినది.

ప్ర:—సంగీతమును పునరుద్ధరించుట కుపాయ మేమి?

ఉ:—ప్రయత్నింపవలయును.

ప్ర:—ప్రాచీనరాగరాగిణులు పాడుటకుసమయములు నిర్ణీతములై యున్నవి. ఇందులకు కారణమేమి? దీనికి విజ్ఞానముతో నేమైన సంబంధ మున్నదా?

ఉ:—నేను దీనినిగూర్చి యోచించుచున్నాను. ఇందు తప్పక యేదో తత్త్వ మున్నది; కాని పరిశోధింపక యేమియు చెప్పజాలను. నేను దీని తత్త్వము శోధింప యత్నించుచున్నాను.

ప్ర:—ప్రాచీన రాగముల కార్యముల విషయమై కల ప్రవాదముల కిప్పుడు నిదర్శనములు దొరకునా?

ఉ:—అది అసంభవము కాదు. గానవాద్యములు పలుకునపుడు తెలుపుల అద్దములు బ్రద్దలగుట నేను స్వయముగ జూచినాను. వాద్యములలో ననేకతంత్రు లుండును. పరస్పరము మేళగింపు గల తీగలు, దూరదూరముగ నున్నను, ఒకటి కదిపిన తక్కినవియు కదలును; మేళగింపు లేక దగ్గర తీగయు కదలదు. వృక్షములపై గానమునకు మంచి ప్రభావ మున్నది. ఇంతలి సత్యతను విజ్ఞానాచార్యుడు జగదీశ చంద్రబోసు మొదలగువారు నిరూపింపగలరు. దీపకరాగము* నుగూర్చిన ప్రవాదనకు ప్రత్యక్షప్రమాణము లేదు. కాని కొంతవఱకు గోచరించును: ఘర్షణ లేక ధ్వని యుద్భవింపజాలదు; ఘర్షణ మున్న చోటనే ధ్వనియుండును; ఘర్షణయు, ధ్వనియు నుండుచోట అగ్నియు నుండును.

ప్ర:—నూతనముగ రాగరాగిణుల రచించుట శాస్త్రసమ్మతమా? ఇట్లు చేయవచ్చునా?

ఉ:—రాగములు తొలుత రచించినవే, యిప్పుడును రచింపవచ్చును. క్రియ మొదట, శాస్త్రము తరువాత. కాని యిట్లు చేయుట అందఱిపనియు గాదు. ఇందులకు యోగ్యులగు నధికారులు గాలయును. స్వరము ప్రమాణబద్ధ మొనరింపక యిట్లు చేయ వీలుపడదు. రాగము జనుల రంజించుటకు సమర్థమై యుండవలయును. రెండవమాట యేమనగా, నూత్నరాగ పరిణామమునకు ప్రయోగ మావశ్యకము. ప్రయోగమువలనపరిణామ సిద్ధి లభించినను, ప్రచారము కావలయును. ఇది అనుభవముగల సజ్జనుల పని.

---

## మాయపట్టునకు ప్రోత్సాహము

భారతప్రభుత్వమువారు మిల్లుదారుల ప్రార్థనలను మొదట లక్ష్యపెట్టకున్నను, పిదప నెట్లో జపాను మున్నగు దేశముల పోటీనుండి భారతదేశపు మిల్లుల రక్షించుట యావశ్యక మనుదృష్టి వారికి కలిగినది. కొంత ముందువెనుకలాడి, చివరకు విదేశమునుండి వచ్చిన నూలిపై పౌండు ఒకటికి $1\frac{1}{2}$ అణా వంతున పన్ను హెచ్చించుటకు నిశ్చయించినారు. కాని విదేశపు నూలిపై నెక్కువపన్ను విధించుటచే చేమగ్గము నడపుకొను వారికి హాని కలుగునని చెప్పి వారు విదేశమునుండివచ్చు చేతపట్టుమీద నూటికి 15 చొప్పున నుండెడిపన్ను $2\frac{1}{2}$ కు తగ్గించివైచినారు. ఈవిధముగామాయపట్టును ప్రోత్సహించుటయందు విస్పష్టమగు నభిప్రాయ మేమన ఇప్పటివరకు జపానునూలు నుపయోగించుచుండిన హిందూ దేశపు నేతగాండ్రు ఇకమీద ఇంగ్లాండుదేశపుమాయపట్టు నుపయోగింపవలెనని. ౧౯౩౧-౩౨ లో మన దేశమునకు వచ్చిన మాయపట్టునకంటె ౧౯౩౪-౩౫లో మూడింతలు హెచ్చుగా వచ్చిన దను విషయము హిందూ దేశమునమాయపట్టు వ్యాప్తి యెంత చుఱుకుగా పెరుగుచున్నదో స్పష్టపరుచుచున్నది. దినుసులిపన్ను వెనుకటిదానిలో సగ మయిపోవుటచే వెనుకటికంటె నిప్పుడు సరుకు మిక్కుటముగ రాసాగును; ఆయుద్ధృతి ఈదేశము

---

* దీపకరాగము పాడుటచే నగ్ని యుద్భవించునని ప్రతీతి. ఒక గాయకుడు ఒక సంస్థానమున ఈరాగము పాడి పైని త్రేల గట్టిన గులేబులు వెలిగించె నని మనప్రాంతముల గూడ ప్రవాద మిప్పటికిని గలదు.

నందలి అసలు పట్టునుత్పత్తికము పడిపోవుటకు కారణము గును. చేతపట్టు మిక్కిలిగా ఇంగ్లాండు నుండియు, ఇటలీనుండియు వచ్చుచున్నది. కాని ఒకసంవత్సరమునుండి ఇంగ్లాండునుండికంటె ఇటలీనుండి దిగుమతి చాల తగ్గిపోయినది. దిగుమతిపన్ను తగ్గించుటచే తప్పక ఇంగ్లాండు సరుకే బాగుండును. కాని దీనివలన హిందూదేశమున కేమియు లాభములేదు. ఇప్పటివరకు వచ్చిన చేతపట్టువల్లనే దేశములోని అసలు పట్టుపరిశ్రమ దెబ్బతిన్నది. దానిదిగుమతి యింకను పెరిగినచో, బంగాళము, అస్సాము, బీహారు, మధ్యపరగణాలు మొదలగు ప్రాంతముల అసలుపట్టువ్యాపారమునకెట్టి దుర్దశ సంభవిల్లునో ఊహించుట కష్టముగాదు. ఇక దిగుమతిపన్నులో $7\frac{1}{2}$ లక్షల రూపాయలు తరిగిపోవునను మాట మిగిలియే యున్నది.

---

## ఒక విచిత్రమైన నాగలి



'లీడ్సు', నగరమున 'జాన్ ఫౌలరు అండు కో' వారు దీనిని నిర్మించిరి. నిలువున నున్న ఇరుసున అమర్చబడి ఎదురుత్రోవల చుట్టు రెండు తమంత దిరుగు సాధనము లున్నవి. అవి ప్రతిచాలును రెండుమారులు దున్నును. చాలు 18 అంగుళముల లోతునకు దిగును. 'న్యూబా' లోని చెఱకుతోటలకొఱకిది చేయబడినది.

---

## భారతదేశమున నిరుద్యోగము

మొన్న బెజవాడలో జరిగిన ఆంధ్రవిశ్వకళాపరిషత్తు పట్టప్రదాన మహోత్సవ సమయమున శ్రీయుతులు యస్. రాధాకృష్ణ పండితులు కావించిన మహోపన్యాస మనేక విధముల హితోపదేశకముగ నున్నది. అందు వారు ప్రస్తుతమున్న కేవల సాహిత్యవిద్యాభ్యాసవిధానమువలన భారతీయ యువకులు నిరుద్యోగులయి ఆర్థిక పారిశ్రామిక లాభములను బడయజాలక యున్నారని చెప్పిరి. ఆ పట్టున వారు చెప్పినమాట లివి:

ఆర్థిక దురవస్థలు నెమ్మదిగా వచ్చును. అవి యెప్పుడో హఠాత్తుగావచ్చి ప్రసరించుకొనవు. మనదేశీయులలోని యధికసంఖ్యాకుల దుర్భరదారిద్ర్యమును మన మూహింపజాలము గాన నందు మనకు త్వరలో నావేశాపరములు పుట్టవు. మొత్తముమీద దేశముయొక్క సంపద చాల తక్కువ ప్రమాణమున బడిపోయినది. దారిద్ర్యము విస్తరించి బీదజనులు సంకటముల కగ్గమగుచున్నారు. ఇది కేవలము బీదలదోషమే యనగూడదు. మధ్యమ తరగతులవారి నిరుద్యోగస్థితి మితిమీరుచున్నది. ఇతరదేశ యువకులు ప్రవేశము గలుగజేసికొనుచున్న ఆర్థిక పారిశ్రామికావకాశములు భారతదేశములో గానరావు.

ఐదేండ్ల మొదలు ఇరువది యేండ్ల వయస్సు గలిగిన బాలురంపఱును గ్రుడ్డిగా పాఠశాలలలో బ్రవేశించి యమిత కష్టనష్టములకు గురియై, తుదకు తత్ఫలముగ నిరుద్యోగము పాలగుచున్నారు. ఎంతయో కార్యనిర్వహణము గావలసియున్న దేశములో నీవిధముగా మనుజశక్తి వ్యర్థము గారాదు. భూదేవి తనయందు మహానిధులను, మహాశక్తులను నిమిడ్చుకొని యున్నది. సంపదను సృష్టింపవలెనవా రనేకు లున్నారు. కాని వారందరును సోమరులై యున్నారు. భారతీయులు భావములపై పర్విడుచుందురేకాని కార్యకరణమునకు దిగకుండుటచేత పారిశ్రామికాభివృద్ధికి బనికిరారని చెప్పజనదు. భారతదేశములో మేధాశక్తి యెవ్విధమునను చెడి యున్నటుల గాన్పింపదు. ఇండ్రస్ట్రియలు రివల్యూషను వచ్చువరకును యూరపు ఖండమునందుగూడ నిట్లే యున్నది. మన వ్యవసాయపద్ధతులు, ఆర్థిక సంస్థలు, పారిశ్రామికోద్యమములు, భూస్వాములకు రయితులకు గల సంబంధములు మొదలగు నన్నియును యూరపు ఇండియాల యందొక్క రీతిగనే నిర్వహింపబడినవి. ఇంతకును మనదేశ మింకను పూర్వకాలపు వ్యవసాయ యుగమునందే యున్నది. పారిశ్రామి కారంభోదయ మింకను గాలేదు.

## ప్రాచీన విజ్ఞానము ఆంధ్ర విశ్వవిద్యాలయము

ఆ యుపన్యాసముననే మఱియొక చోట ప్రాచీన విజ్ఞానమును మరల నుద్ధరించు టావశ్యక మనుచు నిట్లు నుడివిరి :

ప్రాచీన విజ్ఞాన తత్త్వమును సంపూర్ణముగ గ్రహించుట; ప్రస్తుతావసరములకు దగినటుల దానిని నూతనరూపముల వ్యాఖ్యానము సేయుట; భారతీయ రూపము చెడకుండ నిప్పు డుద్భవించిన నూతన పరిస్థితులను సమర్థించుట:— ఇవి ఇప్పు డత్యవసరముగా జేయవలసియున్న కార్యములు. వీటిని విశ్వవిద్యాలయములు సమర్థింపలేకున్నచో మఱి యెవ్వరును సమర్థింపజాలరు. అనేక విద్యలను బోధించుటతోపా టాంధ్ర విశ్వవిద్యాలయము వారు భారతీయ విజ్ఞానమునకు ప్రధాన స్థాన మొసగెదరని నమ్ముచున్నాను. ఆంధ్రుల కళావాఙ్మయ చారిత్రకాధారములను బట్టి ఆంధ్రుల చరిత్రను ప్రచురించుట యీవిశ్వవిద్యాలయము వారి ప్రప్రధాన కర్తవ్యమని నుడువ నక్కరలేదు. ఇట్టియుద్యమమునకు సంస్కృతవాఙ్మయమును, పురాణములును చాల సహాయకారులు కాగలవు. ఈ విశ్వ విద్యాలయములోని యున్నత విద్యావిధానమునం దేదే నొక ప్రాచీన భాషాపఠనము విధికృతము సేయుదురని విశ్వసించుచున్నాను.

---

## ప్రదర్శనోపన్యాసములు-గౌరాంగ సోదరులు (పిఠాపురము)

‘ప్రచారకోపన్యాసములమూలమునను, ప్రదర్శనోపన్యాసముల మూలమును విద్యాప్రబోధము గావించుట ఆంధ్రవిశ్వవిద్యాలయమువారి కర్తవ్యము’ అని యీనడుమ అనంతపురములో ఆంధ్రమహాసభవారు తీర్మానించినారు: ఈపదనైన యదనున శ్రీగౌరాంగ సోదరులు (పిఠాపురము) తమ విద్యాప్రచారక చలచిత్ర ప్రదర్శనసంస్థ (The Touring Educational Cinema)ను నెలకొల్పి ప్రదర్శనోపన్యాసముల సాగింపబూనుట యెంతయు నాదరణీయము. వీరి ప్రదర్శనము వీరి నిర్వహణచాతుర్యమును నిదర్శించినది. వీరి యంత్రము చేతదాల్చుట కనువుగ నుండి, బొమ్మలనుస్ఫుటముగచిమ్ముచుండును. విద్యార్థుల కుపకరించు చలనచిత్రములు (Film Reels) వీరికడ వివిధము లున్నవి. ‘తేలు’ ‘జపాను దేశపు కుమ్మరిపనితనము,’ ‘మణుల కోత’ మున్నగుచిత్రములు విద్యార్థులకు వినోదము గూర్చుచ క్రొత్తవిషయముల నేర్పును. ప్రత్యే

క ప్రదర్శనము లిచ్చుటకును తగిన ఫిల్ములు వీరికడ చాలగ నున్నవి. వీరియొద్ద భారత దేశమునకు సంబంధించిన చిత్రములు చాలినన్ని లేవు. మన పరిశ్రమలు, మన ప్రాచీన నిర్మాణములు, మన పుణ్యక్షేత్రములు మొదలయిన యట్టి మన జాతీయభావము నుజ్జీవింపజేయు ననేకవిషయములు ప్రదర్శించుటకు తగిన చిత్రములను వీరుశీఘ్రముగ సేకరించి కొనవలసి యున్నారు. అందుకు ధనము పుష్కలముగ కావలయును. వారికి ధనము సమకూరుటకు విద్యాసంస్థల సాహాయ్యము పరమావశ్యకము. కావున ఆంధ్ర విశ్వవిద్యాలయము వారును, ఇతరవిద్యాశాలల వారును వీరిసంస్థవలన పనిగొని వీరి యుద్యమము నుచితరీతి నాదరించి తగిన ప్రోత్సాహము నొసంగ దగుదురు.

---

## డచ్చి యువకుని యమోఘప్రారంభము

ఒక డచ్చి మాసపత్రికలో ఇదివఱకు విననిది ఒక కథ ఉన్నది. అది దక్షిణాఫ్రికాలో వజ్రములను కనుగొన్న యాతనికథను మనకు మరల జ్ఞప్తికి దెచ్చుచున్నది. ఇటీవలి 'ది రివ్యూ ఆఫ్ రివ్యూస్' పత్రికలో ఆకథ యిట్లున్నది:

అఱువదియైదు సంవత్సరములకు పూర్వము డచ్చి దేశీయుడైన 20 సంవత్సరముల వయస్సుగల దరిద్రుడగు నొకయువకుడు జీవయాత్ర గడపుటకై జావాఅను ద్వీపమునకు వెళ్లెను. కాని దరిద్రదేవత అతనిని వరించియున్నందున నొకడచ్చికంపెనీలో నుద్యోగము దొరకినను అతడు నిష్ప్రయోజకుడైనందున ఆయుద్యోగ మంతరించినది. అంత తెల్లవానికి సహజమగుగర్వమును దిగమ్రింగుకొని ఆరేబియాగుఱ్ఱముల వ్యాపారమును చేయువానిదగ్గర ఉద్యోగమునకు కుదిరెను. సింగపూరునకు ఒకచిన్నయోడపై వెళ్లుగుఱ్ఱములను జాగ్రత్తగా చూచుకొమ్మని వర్తకుడతనిని నియమించెను. సముద్రముపై పోవుచుండగా తుపాను వచ్చి ఆయోడను సుమాత్రాకు తూర్పుననున్న 'డెలీ' అనుద్వీపమునకు కొట్టివేసెను. డచ్చియువకుడు అక్కడ దిగి ఊరిలోనికి వెళ్లుచుండ ప్రజలు వానిని సుల్తాను దగ్గరికి తీసికొనివెళ్లిరి. సుల్తాను కిరసనాయిలు డబ్బామీద కూర్చుండియుండి అతనికి ఆతిథ్యమిచ్చెను. వారు ఎంతమర్యాదగా చూచుచున్నను డచ్చియువకునకు ఇంటివద్ద నున్నంత సుఖముగా నుండకుండెను. సుల్తాను వానికి పొడవైన పొగాకుచుట్ట నొకదాని నిచ్చెను. దానిని వాసన చూడగనే వానిముఖము వికసించెను. తాను హాలెండులో కాల్చినచుట్టల వాసనకంటె ఈపొగాకుచుట్టలో మంచి వాసనయున్నట్లు అతనికి తోచగట్టెను. వెంటనే ఆతడు ఈపొగాకు మీకుఎక్కడ దొరకుచున్నదిఅని సుల్తానును ప్రశ్నించెను. దానికి సుల్తాను ఈపొగాకు మాదేశమందంతట అడవివలె పెరుగునని ప్రత్యుత్తరమిచ్చెను. వెంటనే చుఱుకైన ఆయువకునియొక్క హృదయములో ఈచుట్టలతో తనదేశమున వ్యాపారము చేసినయెడల తాను మంచి లాభమును పొందవచ్చునను ఊహ జనించెను. తోడనే ఒక స్టీమరులో తనదేశము (ఆమ్‌స్టర్‌డమ్)నకు వచ్చి వితంతువగు తనతల్లికీసంగతిని తెలిపి డెలీలో ఒక చిన్న పొగాకుతోటను కొనుటకు ధనము దొరకిన చాలునని చెప్పెను. తల్లి కుమారులు ఇద్దఱు దరిద్రులే. అక్కడ ఆమె ఒక చిల్లరఅంగడివాని ఇంట్లో కూలిపనిచేసి జీవితమును గడుపుచున్నది. ఆమె ఆ యంగడి యజమానితో తనకుమారుని సంగతి నంతయు జెప్పి ఎట్లైనను వానికి సహాయము చేయవలసినదని ప్రార్థించినది. అంగడి యజమాని దగ్గర అప్పుడు సొమ్ము లేకపోయిననుగూడ స్వలాభమును గుర్తించి అతడు తన అంగడిని తాకట్టుపెట్టి కావలసిన పైకమును వానికి తెచ్చియిచ్చెను. ఆ సొమ్ము తీసికొని వెంటనే ఆ యువకుడు డెలీదేశమునకు వెళ్లి 'డచ్చి డెలీ పొగాకు కంపెనీ'

ఒకటి స్థాపించి తన నిరంతర ప్రయత్నముచే60ఏండ్లలో అపరిమితమైన లాభమును గడించెను. ఈ కంపెనీని స్థాపించి మార్గదర్శకుడైన వచ్చియువకుడు, సైన్ హైస్ అను నాతడు,లక్షలకొలదిగ ధనమును గడించి తనముసలితనమున ఇటీవలనే హాలెండు దేశమున కాలగతి జెందెను. ఆతని భాగస్వామి యను అంగడి యజమానుడు 'జాన్సను' 'క్రీమరు' అను నింకొక భాగస్థుని జేర్చుకొని అపరిమిత లాభమును పొందుచుండెను. క్రీమరు అనునాతడొకానొకప్పుడు వచ్చి అధినివేశరాజ్యములకు మంత్రి అయ్యెను.

వివేకము, ఉత్సాహము, ధైర్యము, కార్యాసక్తి, అభినివేశము గలిగి యుండువారేని యువకులు సఫలప్రయత్నులగుదు రనుటకు ఈ డచ్చియువకునికథ యొక తార్కాణము.

---

ఆంధ్రవిశ్వవిద్యాలయము – పండితసన్మానము

ఆంధ్ర విశ్వవిద్యాలయము వయస్సున పిన్నదైనను గుణమున పెద్దయయినది. తా నాచరింపవలసిన పరమ ధర్మములలో పండిత సన్మాన మొకటిగ గుర్తింపగలిగినది. మొన్న జరిగిన ప్రథమపట్ట ప్రదానమహోత్సవ సమయమున శ్రీ సర్ రఘుపతి వెంకటరత్నం నాయుడు, శ్రీమాన్ కిళాంబి రామానుజాచార్యులుగార్లకు 'డాక్టర్ ఆఫ్ లెటర్సు' బిరుదమును, బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయ శాస్త్రులుగారికి 'కళాప్రపూర్ణ' బిరుదమును నొసగి గౌరవించి తనకును, తన దేశమునకును, ప్రతిష్ఠను సంపాదించుకొనినది. తన ప్రత్యేక వ్యక్తిత్వమును ప్రకటించినది. ఇది ఎంతయు సంతోషకరమైనవిషయము. ఇట్లేలవకాశము లభించినపుడెల్ల విద్యాధికులగు నాంధ్రపండిత మహాశయులను సన్మానించుచుండు టాంధ్ర విశ్వవిద్యాలయముయొక్క ధర్మము.

విద్యాశాలలయందున్న దేశభాషా విద్వాంసులకు ఇతరపండితులకు-అనగా ఆంగ్లభౌతికశాస్త్ర రసాయన శాస్త్రాది ప్రత్యేక శాస్త్రముల యందలి పండితులకు-వలె వేతనాదికము లగు సౌకర్యముల కింతవఱకు నవకాశము కానరాదు. దేశీయవిద్యాసంస్థలయొక్క యీ దేశభాషాపండిత తిరస్కార మెంతయు శోచనీయము. ఆంధ్రదేశమునకై యేర్పడిన ఆంధ్ర విశ్వ విద్యాలయము అట్టినిందకు పాలుగాక ఆంధ్రపండితులను ఇతర పండితులతో సమానముగా వేతనాదికములచే నాదరించుట సమంజసము. ఆంధ్రశబ్దపూర్వకముగ వెలసిన యీ నూత్నవిశ్వవిద్యాలయము ఆంధ్రదేశముయొక్కయు, ఆంధ్రజనులయొక్కయు, ఆంధ్రభాషయొక్కయు అభివృద్ధికి ఎల్లవిధముల ప్రయత్నించి తన పేరును సార్థకము చేసికొనునుగాక!

---

నేరాలు—అమెరికాసంయుక్తరాష్ట్రాలు

అమెరికావారు అన్నివిషయాలలో ముందుకు సాగి ప్రపంచానికి మార్గదర్శకులవుతూ ఉన్నారు. వాళ్ల ధన, గృహ, యంత్ర, వ్యాపార, స్వాతంత్ర్యసంపదల తోపాటు అపరాధసంపదకూడ ఆకాశాన్ని అంటిపోతూ ఉంది.

అక్కడి నేరాలను ప్రభుత్వంవారు లెక్కలుపెట్టరు. అపరాధపరిశోధకులు భీమాకంపెనీల ఏజెంట్లు తలక్రిందులుగా పనిచేసి తేల్చిన లెక్కలను బట్టి, పన్నెం



౧. ఉరికంబముపై నిలువబెట్టి హంతకుని కాలు చేతులను బంధించుచున్నారు.



౨. హంతకునకుమరణదండనమునయొక్క తీర్పును చదువుచున్నాడు.



3. నల్లని బట్టతో హంతకుని మొగమును గప్పుచున్నారు.



౪. క్రిందకు పోయిన హంతకుని మృతకళేబరమును అధికారులు చూచుచున్నారు.

డేండ్లకు ముందు సంవత్సరానికి 2000 హత్యలు జరుగు చుండేవని తేలుతూఉంది. ఇపుడాసంఖ్య పదివేలకు పెరిగింది. అక్కడ నూటముప్పయివేలమంది నరహంతకులు ఉన్నారని ఒక సుప్రీంకోర్టు న్యాయాధిపతిచెప్పినాడట.



౫. మరణమందిరము. అమెరికాలో హంతకుడు తన అంతిమక్షణము నీకుర్చీపై గడపును.

గ్రేటుబ్రిటనులో నేరాలకు లెక్కలను ఉంచడం ఆచారం ఉంది. దాన్నిబట్టి, జనసంఖ్య క్రమంగా పెరుగుతూ ఉంకినా గడచినయాభయి ఏండ్లలో సంవత్సరం ఒకటింటికి ౧౫౦ హత్యలుమాత్రమే జరిగెనని తేలుతూ ఉంది. ౩౫౦౦౦ వేల జనులకు ఒకహత్యవంతున లెక్క అవుతుంది.

వీటివల్ల గ్రేటుబ్రిటనులోకంటె అమెరికాలో నేరములు ఇరువదిరెట్లు అధికంగా జరుగుచున్నవని తేలుతూంది.

ఇట్లా నేరాలు పెరగడానికి అమెరికనులుతాము '౧౭౭౬ సంవత్సరాన్నుంచిఎన్నోపనులు—సొరంగాలు తవ్వడం, వంతెనలు కట్టడం అడవులనడగార్చడం, చర్చీలు కట్టడం మొదలయినవి—చేయడంలో మునిగి ఉన్నాము. ఇక క్రమముగా ఈనేరాల విషయము చూడవలసిఉంది' అని చులకనగా చెప్తారు.

అమెరికాలో హత్యలంటే సాధారణమైన ప్రమాదాల కిందికివచ్చింది. అది మోటారులు మొదలయిన వానిచేత అయ్యేవికావు. అవి సంకల్పపూర్వకములు, నైతికములు. అవి ధనాశచే అయ్యేవి. కడచిన ఇరవై అయిదు ఏండ్లలో అక్కడ ధనం నాలుగురెట్లు పెరిగింది. ఈధనముపైగల ఆశయే ఇట్లాహత్యలను పెంచింది. హత్యఅంటే ధనపిశాచానికి ఇచ్చే నరబలి అన్నమాట.

అక్కడ నేరాలకు గురిఅయిన ధనము, హత్యలు వీనియొక్క విలువ ౧౯౧౫ వ సంవత్సరములోనూటనలువదికోట్లపౌనులు. ఇపుడుఇన్నూరుకోట్ల పౌనులయింది. అనగా తల కిరవయి పౌనులన్నమాట. ఇది అమెరికావారు కట్టినదందం పే. ఈమొత్తం అక్కడి ఆర్థికప్రపంచవలి వ్యయానికి మూడురెట్లు. ఈమొత్తంలో సగం ధననష్టంవల్ల అవుతుంది. తక్కినది న్యాయస్థానాలకు, పోలీసువారికి జైళ్లకు అపరాధపరిశోధనానికి అయ్యేవ్యయంవల్ల అవుతుంది.

చిల్లర దుకాణాలు, మోసపుకంపెనీలు, తంత్రవాదులైన ప్రతినిధులు, చమురుగనులవాండ్రు ప్రజలసొమ్మును నలభయికోట్లకుపైగా దోచుకొంటారు.

తగలపెట్టడం ఒక దురాచారం. అందువల్ల భీమాకంపెనీలు అగ్నిప్రమాదాలనుండి రక్షించడానికి చాలమందివర్తకుల అర్జీలను అంగీకరింపవు.

వాయిదాలకు బట్టలనమ్మడం ఇంకొక దురంతాన్ని తెచ్చిపెట్టుతుంది. బట్టలకాతాదార్లు దివాలాతీసి ఏడాదికి ఎనిమిదికోట్ల వెలగల సరకును అపహరించుకొని పారిపోతారు.

చెల్లుబడిగాని బ్యాంకిచెక్కులవల్ల రెండుకోట్లు నష్టము. చెక్కులలో సొమ్ముమొత్తాన్ని దిద్దడం, ఇచ్చిన సొమ్మును బ్యాంకిలో సొమ్ము లేక పోవడం, దొంగ చెక్కులుసృష్టించడం— ఇవి ఈనష్టాన్ని కలిగిస్తవి. ఇది అంచనాలెక్కలు. సరిగాచూస్తె రెండుకోట్లు యాభయిలక్షలవుతుంది.

ఇది కాకుండా రవాణాలో సరుకులను దొంగిలించడం ఒకటి. దీనివల్ల చాలానష్టం అవుతుంది. ఈవ్యాపారానికని కనిపెట్టుకుని ఉండేవాళ్లదగ్గరకి ఈసరుకంతా చేరుతుంది.

ఈదురంతాలకు తర్వాత మెట్టులోది బందిపోటు, దోపిడి.

ఒక పెండ్లి కానియువతిచేతిక్రింద బందిపోటుగాళ్లు కొందరు ఉంటారు. వీళ్లు దొంగతనం చేసేటప్పుడు తప్ప మిగిలినప్పుడు మంచి సంసారులవలె ఉంటారు. వీళ్లు కేవలం డబ్బు పిచ్చిపట్టినవాళ్లు.

అక్కడ నేరాలు సామాన్యాలుకావు. అవి సంఘాన్ని నాశనం చేసేచిన్నయుద్ధాలు. అక్కడ హత్య అంటే సామాన్య ప్రమాదాలలో లెక్క.

అక్కడ బందిపోట్లకు దోపిడిగాండ్రకు వారిని ఎదిరించే పోలీసులు మొదలయినవాళ్లకు, ఆయుధాలు మస్తుగా ఉంటవి.వాళ్లలో ఎవళ్లలో సంచలనంకలిగినా ప్రాణనష్టమే. మొదట తలపెట్టేవాళ్లది జయం. తలపెట్టడమంటే ఒక్కొక్కప్పుడు కాల్చివేయడమే.

ఇంతేకాదు అక్కడనేరాలను కనుక్కొని శిక్షించేఆచారం లేదు.

నేరాలు చేసేవాళ్లు కొత్తరకం తయారవుతున్నారు. హైస్కూలు తరగతులకు వచ్చీరాని పెద్దమనుషుల ఇండ్ల కుర్రవాండ్లే(ఆడ-మగకూడ)ఆకొత్తరకంవాళ్లు అంటే అపరాధం చిన్నతనంలోదీకాదు. మంచి వయసులోదీకాదు అనడం.

ఇంకా బయస్కోపులు. వాటిలో నీతిమారాలయిన విషయాలు. అందంగా ఉండని ఒకయువతిని, అందమైన యువతి ప్రేమిస్తుందని ఒక యువకుని, న్యాయాధిపతులు శిక్షింపక వదలి పెట్టడం, పంచాయతీదారులు నిర్దోషులను దోషులనడం, చమత్కారంగల రాజకీయనాయకులు అపరాధుల విషయంలో జోక్యం కలిగించుకోవడం ఈమొదలయిన నీతిరహితము లగు విషయాలను ప్రదర్శించడంవల్ల న్యాయపరిపాలనానికి భంగం కలుగుతుంది.

చివరది పత్రికల దుర్మార్గము. నేరములు విచారణఅయి తీర్మానం అగుటకు ముందే వాటి వివరాలను పత్రికలు ప్రకటిస్తవి. ఇంక న్యాయస్థానాల విచారణ, తీర్మానం చూడవలసిన అవసరం లేకపోతుంది. నేరం మాత్రం ప్రకటనాన్ని చెందుతుంది. కాని దానికయ్యే శిక్ష లెక్కలోకి రాదు.అందువల్ల ఏంచేసినా పరవాలేదని నిబ్బరంతోస్తుందేకాని మనస్సును కొంచెమయినాఅందోళనకలగదు.

న్యూయార్కులో ఇట్టి దుర్భరపరిస్థితులు సంభవించినందున తీవ్రమైన చర్యలు తీసుకున్నారు. అంతమాత్రంచేత మిగిలినచోట్ల నేరాలు తగ్గినవనడానికిలేదు దినదినానికి పెరుగుతూండే ఆనేరాలను తగ్గించడానికి దేశమంతా ఒకటయి ప్రయత్నిస్తే సాధ్యంకావచ్చు. అక్కడ ఆస్తికచింతను నీతిని కలిగించు విద్యలప్రచారము యింతయినా లేకుండా కేవలం లౌకిక విద్యలయందే బుద్ధిప్రవర్తించడంచేత ఇట్టిస్థితి కలిగిందని అక్కడి ప్రాజ్ఞులు బల్లగుద్ది చెప్పుతూ ఉన్నారు.

ఇందలి చిత్రములు మరణదండన చేయడంలో గ్రేటుబ్రిటనునకును అమెరికాకును గల భేదమును తెలుపుచున్నవి.

[సి.డబుల్‌యూ. విల్సనుగారు ౧౯.౩౭ నవంబరు ౨౬ వ తేది స్ఫియరులో వ్రాసిన వ్యాసంలోనుంచి.]

---

## చెన్నపురమునకు మద్రాసు అను పేరు ఎట్లు కలిగినది ?

౧౯౩౭ సం॥ డిసంబరు మూడవ తేది మద్రాసు మెయిలు దినపత్త్రికలో రైటురెవరెండు మాన్‌సినోర్ రా వి. జి. టీక్సీరాగారు పై

శీర్షికక్రింద ఒకపెద్ద వ్యాసమును ప్రకటించినారు. దానినుండి:

చెన్నపురమునందలి మైలాపూరులోనున్న సెంటు లాజరసు చర్చిని మఱల క్రొత్తగా నిర్మించుటకై ప్రాత చర్చి పునాది త్రవ్వుచుండగా ఒక చరమశిలాశాసనము దొరకినది. శాసనపుభాష. పోర్చుగీసు (బుడతకీచు) భాష.



లిపి: ఇంగ్లీషు. ఈ చిత్ర మాశాసనప్రతిబింబము.

అందలి లేఖన మిది:

ESTASEPULTAHEDEM
ELMADRAEDESUAMA
IFODE VISTEMADRA
EDELVSIABRAQVEE
LESFISERAOESTAIGR
IAASVASCVSTAS
NAERADA 637.

సంస్కరింపబడిన పై లేఖనము ఇట్లుండును:

Esta sepultura he de manuel madra e de sua mai filho de visent madra e de lusia braque eles fiserao esta sigr ja a suas custas na era de 637.

ఇంగ్లీషు అనువాదము:

This is the grave of Manual Madra and of his mother Son of Vincente Madra and of Lucy Braque. They built this church at their own expense in the year 637.

పైదానికి తెలుగు: "ఇది విన్సెంటు మద్ర లూసీబ్రేకుల కొడుకు మాన్యుయల్ మద్ర యొక్కయు, అతని తల్లియొక్కయు సమాధి. వారు తమ సొంత వ్యయముతో ఈచర్చిని 637 లో నిర్మించినారు."

ఈ 637 వ సంవత్సరమును 1637 వ సంవత్సరమగును. మద్రాసుపదముయొక్కయుత్పత్తినిగుర్తించుటకు విశ్వాస్యమగువిషయమిట్లు ఋజువైనది. ఈమద్రకుటుంబమువారు ఈ చర్చిని స్వయముగ నిర్మించుటకు చాలినంత ధనవంతులుగ నుండిరనుట స్పష్టము. వారు ఈ ప్రాంతముల యందు 17వ శతాబ్దిపూర్వపాదమున ప్రబలస్థితియందున్నారు. ఇంతకంటె మద్రాసుపదము

పుట్టుకకు చారిత్రకాధారములు లభింపలేదు. మద్ర అను కుటుంబనామముగల ఒక శ్రీమంతమగు పోర్చుగీసు కుటుంబము 1610 సం. 1857 సం. లందలివగు రెండు భిన్న కాల లేఖనములుగల ఇప్పటి అసంప్షన్ చర్చికి చేరువల నివాసము చేసి ఉండవలెను. ఆప్రాంతములకు వారు తమకుటుంబము పేరు పెట్టియుండవలెను. లేక ఇండియాలోనిఆచారము ననుసరించి జనులయినను ఆపేరు నిచ్చి యుండవలెను అను నూహ దీనివలన తేలుచున్నది.

మఱియు కర్నల్ లవ్ గారు 'పాతమద్రాసు జాడలు (1649-1800)' అను తన గ్రంథములో నొకచోట 'మొదటిపర్యాయము మద్రాసు పదము నాగు దామెల వింతుతుద్ర మద్రాసుపట్టణముయొక్క హక్కులను నిర్ధారించుచు సర్ ఫ్రాంసిస్ డేగారికి యిచ్చిన ఫర్మానాలో (1639 జూలై (ఆగస్టు ?) 22 వ తేది నెంబరు 1690 గలది) ఉపయోగింపబడిన'దనియు, ఇంకొకచోట 'అంతకుపూర్వపు పోర్చుగీసు చరిత్రకారు లెవ్వరును దాని పేరెత్తిలే'దనియు వ్రాసిరనియు ఈ రెండును మద్రాసు అనుపేరు 17 వ శతాబ్ది ప్రథమ పాదమున వాడుకలోనికి వచ్చినదనుటకు కైదండ నిచ్చుచున్నవనియు టీకీరాగారు వ్రాసిరి. దీనిని చరిత్రకారులు పరిశీలించి నిర్ధారింతురుగాక.

---

## సీసాలను చేయుయంత్రము



వారమునకు 10,00,000 సీసాలను చేయు 2 యంత్రములను లండనులో ఎలెక్ట్రికల్ కంపెనీలో ఫ్రాన్సిస్ రిక్విరను గారు కనిపెట్టిరి. యంత్రములు 'రంగులరాట్నము వలె గిరగిరతిరుగుచు కరగిన గాజుద్రావకమునుండి సీసాలను పోతపోయునట. యంత్రముచుట్టుకొలత 17 అడుగులు, ఎత్తు 15 అడుగులు. సీసాలు చేయు ఏర్పాటు ఒక్కొక్క యంత్రమున అమర్చబడినది. యంత్రము విద్యుచ్ఛక్తితో పనిచేయును.

---

టయిల్లు, ఉడికీయుఉడకని అన్నపుబిండె బోర్లపడుట, అడవిపిల్లి వచ్చి దానిని తినుట, శుకపికములు, నెమలిసీతకై ఏడ్చుచున్నట్లుండుట, జటాయువు రావణునితో పోరుట, రామసుగ్రీవుల స్నేహము, సముద్రుని గర్వభంగము, యుద్ధము ముగియుట, పిదప సీతారాములు కలిసి క్షేమించుకొనుట, ఆ యిద్దరున్న మంటపముపై రెండుపక్షులు, దంపతులు కూర్చుండుట చిత్రించబడెనట.

(21-12-27 ఆంధ్రపత్రికనుండి.)



## ఆంగ్లయువతులు-మల్లవిద్య

౧౯౨౬ వ సంవత్సరమున నొక లండను మల్లవిద్యాలయమున చక్కగా మల్లవిద్య నభ్యసించిన అవివాహిత యువతులు. వీరు తమతో సమానమగు తూకముగల ఇంగ్లాండు నందలి ఏయువకునితోనైనను మల్లపోరాటమునకు పందెమొడ్డి గోరకొందురు.

(టైమ్సు ఆఫ్ ఇండియా.)

## జావాద్వీపము-భారతీయ చిత్రకళ

జావాలో రామాయణకథయంతయు గుడిగోడలమీద చిత్రింపబడినదట. గరుడవాహనముపై లక్ష్మీసమేతుడై నారాయణుడు విహరించుట, గగనమార్గమున బరువిడుట, శంఖచక్రములు, గదహస్తమున ధరించుట, శేషశాయి భూలోకమున మరల అవతరించవలెనని ఇంద్రునితో బ్రహ్మవచ్చి కోరుట-అనగా రావణసంహారము జేయుడని గోరుట- సీతాపహరణము, మాయసన్న్యాసి, సీత తప్పించుకొని. రావణునిబారినుండి పోవుటకు చేయు ప్రయత్నములు, చిందరవందరగానున్న వంటయిల్లు...

## ప్రాచీనభారతీయ చిత్రకళ-మొగలు చక్రవర్తుల యుద్ధ చిత్రములు

చిత్రము ౧:—మహాభారతయుద్ధ ప్రారంభమున రణభేరి మ్రోగినతోడనే ఉభయసేనలును కాలించెడి సంకులసమరము. ఏనుగుపైన హౌదాలో నొకఫిరంగిని చిత్రించియుండుట యీ చిత్రమునందలి విశేషము.

నూతన యుద్ధోపకరణమగు నీఫిరంగికిని, రాక్షసుని ధనుర్యుద్ధ (ముందరి భాగమున గల) బాహాబాహి యుద్ధములకును గల తారతమ్యము చమత్కారముగా నున్నది. రేఖాచిత్రకారుడు 'దశ్వంత్'; వర్ణచిత్రకారుడు: 'తుల్సి.' ఇది రాజంనామాలోని చిత్రము.

(సంఖ్య రెండు మొదలు పదునాలుగు గల చిత్రములు 'అక్బరునామా' లోనివి.)

చిత్రము ౨,౩. ౧౫౬౮-వ సంవత్సరమున జరిగిన చిత్తూరు (రాజపుటానా) ముట్టడిలో నల్లమందు కొట్టు తగులబడి కోట యొకటి ధ్వంసమగుట.

రేఖా చిత్రకారుడు: 'మిస్కినా'; వర్ణచిత్రకారుడు: 'తురా.'

చిత్రము ౪:—ఈ చిత్రము చిత్తూరి ముట్టడిలోని యొక గొప్పవిశేషమును తెలుపుచున్నది. అక్బరు చక్రవర్తి స్వయముగ 'దురుస్త్ అందాజ్' అను కర్ణాటకపు

తుపాకితో రాజపుత్రవీరులలో నొకడగు జయమల్లుని జంపినాడు. కోటగోడపై నొకదీపమును గాంచి సాహసముతో తుపాకిని పేల్చినాడట చక్రవర్తి. అది శత్రువును గాయపఱచెనని మరునాడు చక్రవర్తికి తెలిసినది. మార్గమునుంచివచ్చి తగిలిన గుండుదెబ్బవలన జన్ముపటుకు ఇష్పగింపక జయమల్లుడు తనబంధువు భుజములపై నెక్కి మరుసటిపోరున యుద్ధరంగమునకు వచ్చి అచ్చట చచ్చెను. ఈతుపాకితో తనతండ్రి యిరువదివేల జంతువులను వధించెనని జహంగీరుచక్రవర్తి చెప్పినాడట. ఇందు ప్రాచీనాధునాతనాయుధములు, కవచములు చక్కగా నిరూపింపబడినవి. విల్లులు, ముటుకులు, అమ్ములపొదులు, కోటగోడయందలి రంధ్రములలోనుండి వెలుపలికి నిగిడియున్న తుపాకులు, ఫిరంగులు, కవచములు, ఖడ్గములు, ఈటెలు, బల్లెములు, డాళ్లు,కవచములలో నొప్పియున్న ఏనుగులు నిండు సుస్పష్టముగ జిత్రింపబడినవి. చిత్రకారు డెవ్వడో?

చిత్రము ౫:—ఈచిత్రమున కోటముట్టడి పూర్తి కావచ్చుచున్నప్పుడు రాజపుత్రస్త్రీలందరు అగ్నిప్రవేశ మొనర్చుటగానవగును. విశిష్టములైన ఫిరంగీలుపయోగింపబడినవి. కొన్నిగోడలలో నుండియును, మఱికొన్ని గోడలపై నుండియును కాల్చుచున్నట్లు చిత్రింపబడినవి. చిత్రకారు డెవ్వడో?

చిత్రము ౬:—1568 రంథంభోరుకోటను రక్షించుచున్న 'రాయ సర్‌జాన్' అను హరరాజపుత్రుని అక్బరు ఎదుర్కొనుట చిత్రింపబడినది. చిత్రకారుడు: కైమ్ కరన్'గారు.

చిత్రము ౭:—ఈచిత్రమున అక్బరు చక్రవర్తి రంథంభోరుకోటను ముట్టడించు సందర్భమున ఒకపెద్దపిరంగిని పెక్కుఎద్దులనుకట్టినబండిమీద ఒక ఎత్తయిన కొండమీదికి లాగించుకొని పోవుట చిత్రింపబడినది. అమర్చబడిన స్థలములనుండి కొన్ని ఫిరంగులు ప్రేలుచుండుట కానవగును. రేఖాచిత్రకారుడు:'ముష్కినా;'వర్ణచిత్రకారుడు: 'పరాసు'.

చిత్రము ౮:—ఈచిత్రమున రంథంభోరు గవర్నరుగారి రాజనగరును శత్రువులు కపటపిపారి ముట్టడించుట చిత్రింపబడినది. ౭-వ చిత్రములోవలెనే దీనియందును సిపాయిలు తెరచాటునుండి సరిగా గురిచూచి తుపాకులను కాల్చుట గానవగును. ఫిరంగులు ప్రత్యేకస్థలములందు అమర్చబడియున్నవి. రేఖా చిత్రకారుడు: 'ముష్కినా;' వర్ణచిత్రకారుడు: 'తూరా'

[ఇండియన్ ఆర్టు అండ్ ఇండస్ట్రీ జర్నల్ నుండి]

---

# కొన్నాళ్లకు

కొంపెల్ల జనార్దనరావు గారు

ఎంత జాలియగా రాగాలో యివి! అపార
మాధురీప్లుత నైరాశ్యమయ విలక్ష
ణస్మృతులఁ బాడుచున్నవి నాప్రయత్న
ములను కుంఠీకరించి, అశ్రులకు మ్రొక్కి.

చిగురుఁ గన్నెతనంపు మైగగురుపాటు
మనసు గరఁగిన నీరు— ఆమధుర మధురి
మమును ముంచెత్తివచ్చిన మాయక్షణము
లెంత చీఁకటియేల్బడి యేలెనో కద!

తడవుదవ్వులనుండి వైతథ్యవిధుర
వాంఛితములు నా కీనదాభద్రపీఠి
నిలిపిన నివాళివెలుఁగులఁ గళలు దేఱ
నెంత జాలియగా రాగాలో యివి!—



బ్రహ్మశ్రీయుతులు
మహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రిగారు,
'కళాప్రపూర్ణ' బిరుదాంచితులు.

బ్రహ్మశ్రీ మహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రి గారు సంస్కృతాంధ్ర భాషలయందు నిరుపమాన పాండిత్యము గలవారు. ఆంధ్రభాషకు వారొనర్చిన సేవ అపారమైనది. వారు క్రైస్తవకళాశాలలో తెలుగు పండితులుగా నుండి తెలుగుభాషను పెంపొందింపగల యువకులనేకమందికి శిక్షణ మొసంగిరి. అనేక విమర్శగ్రంథములు వ్రాసి భాషకు ఉత్కృష్టసేవ చేసిరి. వీరురచించిన ప్రతాపరుద్రీయనాటకము శాశ్వత కీర్తిని సంపాదించెను. ఇంతవార్ధక్యమునందు గూడ వీరొనర్చుచున్న భాషాసేవ అసాధారణమైనది. ఈ వయస్సునే వీరు ఆముక్తమాల్యదకు సంపూర్ణముగ వ్యాఖ్యానమును రచియించి ప్రకటించిరి. భాషాసేవ, వీరికి స్వభావసిద్ధమైనది. వీరికి ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు 'కళాప్రపూర్ణ' అను గౌరవబిరుదమును, జోడు జరీ సేలువలనొసగి సన్మానించినారు.

## సర్. ఆర్. వెంకటరత్నంనాయడుగారు

శ్రీ రఘుపతి వెంకటరత్నము నాయడుగారు, చెన్నపురి క్రైస్తవకళాశాలలో ప్రశంసనీయముగా విద్య నభ్యసించి 1899 లో సికింద్రాబాదులో మహబూబు కళాశాలకు ప్రిన్సిపాలుగా నియమింపబడిరి. పిమ్మట కాకినాడలో విఖ్యాతమగు పిఠాపురపు రాజాగారి కళాశాలకు ప్రిన్సిపాలుగా 1905 లో నియమింపబడిరి. అచట 15 ఏండ్లు పనిచేసిరి. తాలూకాబోర్డులోను మ్యునిసిపలు సంఘమునందును సభ్యులుగా నుండి స్వార్థవిరహితముగ దేశసేవను చేసిరి. 1921 లో చెన్నపురి దొరతనమువారు, నాయడుగారిని శాసనసంఘసభ్యునిగా నియమించిరి. 1924లో వారికి సర్ (నైటు) బిరుద మియ్యబడెను. చెన్నపురివిశ్వవిద్యాలయమునకు వైసుఛాన్సలరునెన్నుకొను నధికారము లభించిన పిమ్మట సెనెటువారు నాయడుగారినే మొదటి వైసుఛాన్సలరుగానెన్నుకొనిరి. వీరు దయావినయసంపన్నులగుటచే సకలజనుల ఆదరణకును పాత్రులైయున్నారు. వీరు ధర్మాచరణ నిరతులగుటచే సర్వజనసంస్తుత్యులైరి. వీరు మేధాసంపన్నులును, ఆస్తికశిరోమణులు నగుటచే సర్వజనపూజ్యులైరి. వీరికి ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు 'డాక్టర్ ఆఫ్ లెటర్సు' అను గౌరవబిరుదము నిచ్చి సన్మానించినారు.

## ది.బ. కి. రామానుజాచార్యులుగారు

శ్రీ కిళాంబి రామానుజాచార్యులు గారు చెన్నపుర రాజధానికళాశాలలో విద్యాభ్యాసమొనరించి 40 యేండ్లక్రితము విజయనగరము మహారాజావారి కళాశాలకు



శ్రీయుతులు సర్
రఘుపతి వెంకటరత్నము నాయుడుగారు,
చెన్నపురవిశ్వవిద్యాలయోపాధ్యక్షులు
'డాక్టర్ ఆఫ్ లెటర్సు' బిరుదాంచితులు.



శ్రీయుతులు ది. బ.
కిళాంబి రామానుజాచార్యులుగారు
యం. ఏ., బి. యల్.,
'డాక్టర్ ఆఫ్ లెటర్సు' బిరుదాంచితులు.

ప్రిన్సిపాలుగా నియమింపబడిరి. ఆపదవియందు ముప్పది మూడేండ్లనుండి విఖ్యాతముగా సేవచేసి 1920 లో ఆపదవిని వదలిరి. 1894 మొదలు 1921 వరకును చెన్నపురి విశ్వవిద్యాలయమున 'ఫెల్లో'గా నుండిరి. 1900 మొదలు సంస్కృతకళాశాలకు ప్రధానాచార్యులుగా నుండి శ్లాఘనీయముగా పనిచేయుచున్నారు. వీరు ప్రాచ్యవిజ్ఞానసారవేత్తలు; వినయసంపన్నులు; ఆంధ్రభాషాసాంప్రదాయజ్ఞులు. వీరికి ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు 'డాక్టర్ ఆఫ్ లెటర్సు' అను గౌరవబిరుదము నొసగి సన్మానించినారు.

# సాభిప్రాయవిశేషములు

కాంగ్రెసుయాత్ర దేశమునంతయును నాకర్షించుచున్నది. అన్ని ప్రాంతములవారును స్వరాజ్య యాత్రను జేయుటకు సిద్ధపడుచున్నారు. చెన్నపురి కాంగ్రెసు హడావిడులతో నిండుచున్నది. కాంగ్రెసు నగరనిర్మాణము పూర్తి యగుచున్నది. కాంగ్రెసు నగరము గుంపులతో నిండుచున్నది. కాంగ్రెసు గైడులు, కాంగ్రెసు సువినీరులు, కాంగ్రెసు ఆల్బములు బయలుదేరినవి. పత్రికలు సంవత్సరాది సంచికలను, ప్రత్యేక సంచికలను ప్రచురించుచున్నవి. డిసంబరు మాసాంతమునందు చెన్నపురియందు గూడనున్న మహాసభలపరంపరలు భయభ్రాంతులను గలుగజేయుచున్నవి. కాంగ్రెసుమహాసభ కంగోపాంగములుగ ననేకసభలు బయలుదేరినవి. ఆ సభల సంఖ్య దినదినము వృద్ధిని బొందుచున్నది. హిందూ మహాసభ, ఖిలాఫతు మహాసభ, సంఘసంస్కరణ సభ, గాయక మహాసభ, గ్రంథాలయ మహాసభ, పారిశ్రామిక మహాసభ, హిందీమహాసభ, హిందుస్తాని సేవాదళసభ, స్త్రీల మహాసభ, వైశ్యమహాసభ, సంస్థానప్రజలసభ, ఆస్తికసభ, బ్రహ్మజ్ఞానసభ, యువజనమహాసభ, ప్రకృతి వైద్యమహాసభ, విద్యార్థిమహాసభ, అర్యసమాజసభ, వర్ణాశ్రమధర్మసభ, సాధుసభ, జీవకారుణ్యా సభ మొదలగుసభలు గూడుచున్నవి. గానప్రదర్శనములుఖద్దరుపారిశ్రామికప్రదర్శనములుజరుగుచున్నవి. ఈగడబిడలం దేపనియును సాధ్యముగాదని యనుభవము తెలుపుచున్నను సభలసంఖ్యమాత్రము ప్రతియేటను వృద్ధిని బొందుచున్నది. సభల యభివృద్ధి కార్యసిద్ధికి ప్రతిబంధకముగ నున్నను సర్వతోముఖమైన జాతీయప్రబోధమునకు నిదర్శనముగ నున్నది. సర్వత్ర ప్రత్యక్షమగుచున్న ప్రబోధకాంతులు కాలక్రమమున హడావిడి తగ్గి కార్యరూపమును దాల్చుట సహజము. చెన్నపురియందు బయలుదేరిన సంచలనము భారతికిని వ్యాపించినది. భారతి రెండువారములు ముందుగనే వెలువడుచున్నది. ఈమహా సంచలనమునందు వ్యవస్థలు తారుమారగుచున్నవి. ప్రజలకు కర్తవ్యము గోచరముగాకున్నది. ఈ మహాసభల యందు కాంగ్రెసు మహాసభ ప్రధానస్థానము నలంకరించుట సహజముగ నున్నది.

* * * *

## ౪౨ వ భారతజాతీయ మహాసభ

గత సంవత్సరము నందు శ్రీమాన్ శ్రీనివాసయ్యంగారు రధ్యక్షులుగ నుండి చేసిన పని ప్రశంసనీయముగ నున్నది. హిందూ

మహమ్మదీయ సమస్యను నిర్ణయించుట కయ్యంగారు చేసిన ప్రయత్నములు సఫలము గాకపోయినను ప్రశంసనీయములుగ నున్నవి. గతించిన నాలుగేండ్ల యందును శ్రీనివాసయ్యంగారు చేసిన దేశసేవ వాదప్రతివాదములకు గారణంబైనను చెన్నపురి యందు కాంగ్రెసు ప్రతిష్ఠను వృద్ధిచేసినది. ఈనూతాంతమునందు శ్రీనివాసయ్యంగారి పటమును మహాజనసభా మందిరము నందు స్థాపించుట వలన వారిపట్లగల విశ్వాసము విశదమగుచున్నది. రాగల సంవత్సరమునందు డాక్టర్ అన్సారిగారు కాంగ్రెసు సింహాసనము నధిష్ఠించుచున్నారు. అన్సారిగారు సుప్రసిద్ధ మహమ్మదీయనాయకులైనను భారత జాతీయాభిమానులు; సరళస్వభావము గలవారు. వారి గౌరవప్రతిష్ఠలు హిందూమహమ్మదీయ సమస్యను పరిష్కరించుటకు వినియోగపడ వలసి యున్నవి. ఆహ్వాన సంఘాధ్యక్షులు ముత్తురంగము మొదల్యారుగారును, సభాధ్యక్షులు అన్సారిగారును దేశమును ప్రతిఘటించుచున్న ప్రధానసమస్యల పట్లను నేకాభిప్రాయమును గలిగియున్నారు. వారి నాయకత్వముక్రింద ౪౨ వ భారత జాతీయమహాసభ దిగ్విజయమును బొందుటకు భగవంతు డనుగ్రహించుగాత! స్వరాజ్యప్రాప్తికి రెండు విధములైన శత్రువులు గలరు: అంతశ్శత్రువులు ప్రథమ శత్రువులు; బాహ్య శత్రువులు ద్వితీయశత్రువులు. ఈ రెండువిధములైన శత్రువులందును అంతశ్శత్రువులు ప్రముఖులు. వాని జయించినపుడే స్వరాజ్యము సాధ్యము గాగలదు. రాజ్యాంగ సమస్యలు, సాంఘిక సమస్యలు, నిర్మాణ కార్యవిధానము పరస్పరసంబంధమును గలిగియున్నవి. నిర్మాణ కార్యవిధానము సఫలమైనపుడు సాంఘిక సమస్యయును, స్వరాజ్యసమస్యయును సఫలములు గాగలవు. ఈసమస్యలను నిర్ణయించుటయందు ముందు వెనుకలను నిర్ణయించుట యసంగతము. సాంఘికసమస్యలు నిర్ణయ మగువరకును స్వరాజ్యము నాపుటయును, స్వరాజ్యము చేకూరు వరకును సాంఘిక సమస్యల నాపుటయును నసంగతము. వివిధసమస్యలునుపరస్పరాశ్రయమువలనను త్వరితగతిని సఫలమగుట ప్రకృతి ధర్మము. భిన్నసంఘములు స్వీయ సంఘము వృద్ధిని బొందనంత వరకును స్వరాజ్యమును ప్రతిఘటించుట యవివేకము. భరతవర్షము పరాధీనస్థితియందు క్రమముగకృశించుచున్నది భారతీయులశక్తి సామర్థ్యములుకృశించిన తరువాతస్వరాజ్యస్థాపనమేసంఘమునకును ప్రయోజనకరము గాదు. హిందువులు క్షీణించినను, మహమ్మదీయులు క్షీణించినను, బ్రాహ్మణులు క్షీణించినను బ్రాహ్మణేతరులు క్షీణించినను, క్రైస్తవులుక్షీణించినను, సిక్కులుక్షీణించినను భరతమాతకు దుర్బలము గలుగుచున్నది. ఒకసంఘము పాడుపడుటవలనను రెండవ సంఘము బాగుపడజాలదు. వర్తమాన విషమ పరిస్థితులం దీధర్మము తలకెక్కకున్నది. స్టాట్యూటరి కమిషనుపట్లను, సాంఘిక ప్రాతినిధ్యముపట్లను నీసత్యము వర్తించుచున్నది.

* * * *

స్టాట్యూటరీ కమిషను

రాజ్యాంగ సంస్కరణములను పరిశీలించుట కేర్పడిన యుపసంఘమును బహిష్కరింపవలయునను సంకల్పము భారతనాయకులందు ప్రబలుచున్నది. కాంగ్రెసు నాయకులు బహిష్కరణమును బోధించుచున్నారు. అతివాదులు, యథోచిత సహకారవాదులు బహిష్కరణము నామోదించు చున్నారు. శ్రీనివాసయ్యంగారు సంపూర్ణ బహిష్కారమును బోధించుచున్నారు. ముత్తురంగ మొదల్యారుగారు స్వాగతోపన్యాసమునందు బహిష్కరించుటకుగల కారణములను సహేతుకముగను వ్యక్తముచేసిరి. వారివ్యాసమునందలి ఈభావములు వారి నిశ్చితాభిప్రాయమును విశదము చేయుచున్నవి:

మిల్నరుసంఘమును ఈజిప్టు దేశీయులు బహిష్కరించినటుల యీవిచారణసంఘమును భారతీయు లందరును బహిష్కరింపవలెననియే కాంగ్రెసుమహాసభవారాదేశము నొసంగవలసి యుండును గాని వేరొకపద్ధతిని వారెంతమాత్ర మంగీకరింపజాలరు. భారతీయుల అభిప్రాయములకు కేవలము విరుద్ధముగా నియమింపబడిన యీవిచారణసంఘములో కాంగ్రెసువా రెట్టిసంబంధము కలిగించుకొన జాలరు.

ఈభావములు దేశావృతమైన సంకల్పమును విశదము చేయుచున్నవి. అన్సారిగారు వారి భావగర్భితమైన యుపదేశములందు సంస్కరణసంఘమును బహిష్కరింపవలయునని దృఢముగ నిటులు తెలిపిరి:

మన దేశమునందు నివసించెడు వివిధ జాతులను, తన యధీనమం దుంచుకొని ఆజాతుల కన్నిటికిని సమానముగ న్యాయమును కల్పించుచు దేశమున శాంతిని నెలకొల్పుటకు బ్రిటిషు పరిపాలనము శాశ్వతముగ నుండక తప్పదని కొందరు చేయుసూచనలను గూడ మనము తిరస్కరింపక తప్పదు. అతి సున్నితము లగు ఇట్టి సమస్యల నన్నిటిని న్యాయముగను, సగౌరవముగను పరిష్కరించుటకు మనకు సామర్థ్యమును, హక్కునుగూడ కలదని మనము ప్రకటింపవలెను. కావున భయమువలనను, స్వార్థపరత్వమువలనను, విపరీత రాజకీయ భావములవలనను తప్ప రాయలుకమీషనుకు సహాయపడవలెనను టకు సహేతుకమగు కారణమేదియు కనబడదు.

సంస్కరణ సంఘమును బహిష్కరించు విషయమై ముఖ్యమైన పక్షము లన్నియును నేకాభిప్రాయమును దెలుపుచున్నవి. మితవాదులు, మహమ్మదీయులు బహిష్కరణమునకు సుముఖులుగ నున్నారు. బ్రాహ్మణేతర నాయకులు సంశయభావమును జూపుచున్నారు. మహమ్మదీయులందు గొందరు బహిష్కరణమునకు విముఖత్వమును జూపుచున్నను జిన్నాగారు, ఆలిసోదరులు మున్నగు ప్రముఖులు బహిష్కరణమునకు సుముఖత్వమును దెలుపుచున్నారు. కాంగ్రెసు మహాసభయును బహిష్కరణము నామోదించుట నిశ్చయము. ప్రజలు కాంగ్రెసుయొక్క ఆదేశమును శిరసావహించుటయును సహజము.

అన్సారిగారి యుపన్యాసము భావగర్భితమై ఆసియా రాజ్యాంగములను, భారతీయ రాజ్యాంగములను సింహావలోకనము చేయుచున్నది. భిన్నవిజ్ఞానముల సంఘర్షణమునం దాసియా ఖండమును, భరతవర్షమును నను భవించుచున్న దైన్యమును అన్సారి గారు

వ్యక్తము చేయుచున్నారు. పరాధీనస్థితి భారత సత్త్వమును నిర్వీర్యము చేసినవిధమును దేశపరిస్థితులు విశదము చేయుచున్నవి. భారతీయులు వీర్యవంతులై స్వరాజ్యమును బడయుట కైకమత్యము మూలాధారముగ నున్నది. అన్సారిగారి యుపదేశము నందు ఐకమత్యగీతము ముఖ్యస్థానము నలంకరించుచున్నది. ఇది వారి గాఢమైన దేశాభిమానమునకు నిదర్శనముగ నున్నది. హిందూమహమ్మదీయసంయోగము పట్లను అన్సారిగారికి గల సదభిప్రాయమును వారి యుపన్యాసము విశదము చేయుచున్నది. ఉభయసంఘములును మిత్రత్వమును బూననంతవరకును స్వరాజ్యము స్వప్నరాజ్యము గాని యథార్థరాజ్యము గాజాలదు. భారత రాజ్యము పరరాజ్యముగనే యుండగలదు. శాసనసభల సంబంధమున అన్సారిగారి యభిప్రాయములు సర్వజన విదితములు. వారు బహిష్కారవాదులు. అన్సారిగారి యుపన్యాసము రాజకీయపక్షముల విషయముననను, మతభేదముల విషయముననను, సాంఘికవిభేదముల సందర్భముననను దివ్యమైన ఐకమత్యగీతమును బాడుచున్నది. ఆగీతా గానమును భారతీయులందరును నేకగ్రీవముగ జేసి స్వరాజ్య సంపాదనమును జేయుట శ్రేయస్కరము. వారియుపన్యాసమునందలి కడపటివాక్యములు వారినిశ్చితాభిప్రాయములను తెలియజేయుచున్నవి.

మరల ముందడుగు నిడుటకు దేశమును సిద్ధపరుచుటలో మన మెంత మాత్రమును ఆలస్యమొనర్పగూడదు. మన రాజకీయశరీరమునందు సాంఘికరాజకీయ విభేదములనుశత్రువులు ప్రవేశించినవి. వానిని నిర్మూలించుటకు మనము శక్తిసామర్థ్యముల నన్నిటిని కేంద్రీకరించవలెను. హిందూమహమ్మదీయ వివాదములను పరిష్కరించుటకు కాంగ్రెసు స్థాయిసంఘమువారు చేసినపరిష్కారము రెండుపక్షములవారికిని న్యాయమైనదిగానున్నదిగాన రెండు మతములవారును దీని నంగీకరించి కలహముల నంతరింప జేయవలసినదని నేను వేడుకొనుచున్నాను. వెంటనే దేశమునందంతటను కాంగ్రెసు సంఘములను సక్రమముగ నేర్పరుపవలెనని నేను నొక్కి చెప్పుచున్నాను. మన దేశమునందు కాంగ్రెసు మహాసభయే ప్రధాన ప్రజాప్రతినిధి సభయై యున్నది. ఆ పేరు సర్వవిధముల దానికి సార్థకమగునట్లు అన్ని సంఘములవారును, అన్ని రాజకీయపక్షములవారును కాంగ్రెసునందు చేరవలెనని నేను ఆహ్వానించుచున్నాను. ఇంకను శాసనసభలకు వెళ్లవలెననియే కోరుచున్నవారందరను ఒక్క ప్రజాపక్షముగ నేర్పడి కాంగ్రెసువిధానమునే అనుసరించి శాసనసభలలో ప్రతికూలపక్షముగ చేయవలెనని కోరుచున్నాను. కాంగ్రెసువారును, దేశీయులందరును, రాయలుకమిషనును సంపూర్ణముగ బహిష్కరింపవలసినదని మరియొకసారి నిష్కర్షగా తెలుపుచున్నాను. భారతస్థితిని నిర్ణయించుటకు భారతీయులు బ్రిటిషువారితో కలసి పని చేయవలెనని రౌండుటేబిలు కాన్ఫరెన్సును జరుపుట ఒక్కటియే సాధనమని వెనుక కాంగ్రెసువారు తెలిపిన విషయమునే నేను మరల తెలుపుచున్నాను. స్వరాజ్య విధానమును నిర్ధారణచేయుటకు ఆసభకు సంపూర్ణాధికారము ఒసంగవలెను. ఆసభలో భారత బ్రిటిషుప్రతినిధులు కలసి ఆలోచించి దీనిని నిర్ధారణ చేయవలెను. స్వరాజ్య విధానమును కాంగ్రెసువారు వెంటనే సిద్ధపరిచి పిమ్మట నేషనలు కన్వెన్షను సమావేశపరిచి ఆ సభలో దాని నామోదింపజేయవలెనని నేను సూచించుచున్నాను.

* * *

అప్రతిహతమగు మనోస్థైర్యమును, మహోన్నతమగు మన ఆశయమును సాధించుటకు గల నిరోధముల

నన్నిటిని జయింపగలమను దృఢసంకల్పము గలిగి ప్రపంచమునందు వివిధజాతులలో సమానగౌరవమును బడయగల భారతజాతీయతను ఏర్పరచుటకు సహాయము గలుగునని నాకు తోచినందుననే ఈసాధనములను మీకు విన్నవించితిని.

*　　*　　*　　*

బహిష్కరణ విధానము

సంస్కరణసభను బహిష్కరింపవలయునని నిర్ణయించుటసులభము. కాని దానినాచరించుటసులభముగాదు. మానవులు కార్యములనునిరాకరించుటసులభము. నిరాకరించుటను ప్రయోజనకరము చేయుట దుర్లభము. సంస్కరణసంఘమును భారతీయులు మొత్తముమీద బహిష్కరించినను ఏకొలదిమందియొ సహకారప్రహసనమును ప్రదర్శించుట సులభము. చిన్ని సంఘములు సహకారమును బోధించుచున్నవి. మహమ్మదీయ నాయకులందు కొందరు సహకారమును బోధించుచున్నారు. లేబరుపక్షము సహకారము నుపదేశించుచున్నది. ఈయుపదేశములకు మూలము స్వార్థపరత్వముగాని దేశగౌరవముగాదు. దేశమధోగతిపాలగుచున్నప్పుడు స్వల్పసంఘములను, వ్యక్తులను స్వీయ లాభములు సంరక్షింపజాలవు. దేశమంతయును అధోగతిపాలై మునిగిపోవుచున్నపుడు స్వల్ప సంఖ్యాకులు నిలిచి బాగుపడజాలరు. చిరకాలానుభవము భారతీయులకే ధర్మారూఢమును గలుగజేయకుండుటయె వారి యధోగతికి కారణంబుగనున్నది. యూనియనులు, బోర్డులు, శాసనసభలు మొదలగు సంస్థలం దీసంకుచిత భావము వ్యక్తమగుచున్నది. దేశ మంతయును నాశనమును బొందుచున్నపుడు ఏకాకిమై బాగుపడుట యసంభవమని భారతీయు లిప్పటికైనను గ్రహింపకుండుట విధి కృతముగ నున్నది. సంస్కరణ సంఘమును బహిష్కరించినను, గౌరవించినను దేశమునకు గలుగగల ప్రయోజన మతిస్వల్పము. కన్సర్వేటీవు ప్రభుత్వము బ్రిటీషుప్రభుత్వమునకు భరతవర్షమునందు స్థిరాసనమును గల్పించుటకు పన్నుచున్న తంత్రములు బహిరంగ రహస్యములు. ఈపరిస్థితులందు బహిష్కారమును సార్థకముచేయుటకు దేశమునందంతటను తీవ్రమైన ప్రచార మవసరంబుగ నున్నది. ఈవిషయమునందు కాంగ్రెసుకార్యవిధానమును నిర్ణయించి కార్యాచరణమునకు బూనుకొనుట ప్రయోజనకరము.

అసహాయోద్యమము వర్తమాన సమయమునందు నామమాత్రావశిష్టముగనున్నది. శాసనసభాప్రవేశ మసహాయోద్యమ రూపమును సయితము నాశనము చేసినది. అసహాయోద్యమసారము చిరకాలము క్రితమె చెడిపోయినది. శాసనసభలయందు స్థానములను ఖాళీయుంచుటకైనను సభ్యు లంగీకరింతురను నాశ కనబడుటలేదు. శాసనసభా సభ్యులును, నితరనాయకులును దేశమునందంతటను నిర్మాణ కార్యహాసమున ప్రజలయందు కార్యోత్సాహమును గలుగజేయుట బహిష్కారమును సార్థకము చేయుటకు పరమ

సాధనముగ నున్నది. కాంగ్రెసు నిర్ధారణ చేయవలసిన విషయములందు స్వరాజ్య విధానము ముఖ్యవిషయముగా నున్నది.

* * * *

స్వరాజ్యవిధానము

శ్రీమతి బెజంటమ్మగారు కామనువెల్తు శాసనమును స్వరాజ్యవిధాన శాసనముగ నిర్ణయింపజేయుటకు విశ్వప్రయత్నములను జేయుచున్నది. ఆమె పక్షమువా రందరును కామనువెల్తుశాసనమును ఘోషించుచున్నారు. శ్రీమాన్ శ్రీనివాసయ్యంగారు గారొక స్వరాజ్యవిధానమును సిద్ధము చేయుచున్నారు. విజయరాఘవాచార్యులుగారొకవిధానమును రంగస్వామయ్యంగారొక దానిని తయారు చేసిరి. అఖిలభారత సభా జాతీయోపసంఘమీచిత్తుశాసనములనుపరిశీలించి చిత్తుశాసనమునుతయారుచేయుటయుక్తముగ నున్నది. చెన్నపురి కాంగ్రెసునందు స్వరాజ్య విధానమును సిద్ధముచేయుట సాధ్యముగాదు. సిమనుకమిషను జనవరి మాసాంతమునందు గూడనున్నది. సామ్రాజ్య శాసనసభ జనవరిమాసమునం దేమి నిర్ణయించునో చూడవలసి యున్నది. సిమనుకమిషను బహిష్కారమును సార్థకము చేయుటకును, స్వరాజ్యవిధానమును నిర్ధారణచేయుటకును అవసరదేశీయ మహాసభ బొంబాయియందో, డిల్లీయందో ఏప్రిలుమాసమునందుగూడుట అవసర మని తోచుచున్నది. స్వరాజ్యవిధానములను నిర్ణయించినను అవి ప్రజాశక్తి విజృంభించనంత వరకును కార్యరూపమును దాల్పజాలవు. స్వరాజ్యసంపాదనమునకు నిర్మాణకార్యవిధానము, ముఖ్యముగ ఖద్దరు నిర్మాణము, పరమ ప్రయోజన మని నాయకులు తాము గ్రహించుటయును, ప్రజలను ప్రోత్సహించుటయును నవసరము. గాంధిమహాత్ముడు చేయుచున్న ఈమహోపదేశమును నాయకులును, ప్రజలును సార్థకము చేయుదురు గాక!

భారతజాతీయ నిర్మాణమునకు సాధనములైన రాజ్యాంగములందునవలెను సాహిత్యకళాపరిశ్రమాదుల వికాసమునందును జాతీయలక్ష్యము లగ్నమగుచున్న విధమును కాంగ్రెసునగరమునందు గూడుచున్న మహాసభలు విశదము చేయుచున్నవి. మద్రాసు పారిశ్రామికకళాప్రదర్శనము విదేశ యంత్రప్రదర్శనముగ పరిణమించుట అనమానకరముగ నున్నది. ప్రధానస్థానము నలంకరించవలసిన ఖద్దరు ప్రదర్శనము మారుమూలకు జేరినది. జాతీయ పతాకస్థానమును యూనియన్‌జాకు ఆక్రమించినది. ఇట్టి యనుచిత కార్య మసహాయోద్య మారంభమైనతరువాత ఏజాతీయమహాసభయందును జరిగి యుండలేదు. పోలీసురాజ్యమును దీనికి తగినటులున్నది. అహమదాబాదు, బెల్గాము, కాకినాడకాంగ్రెసులందు పోలీసువారు రహస్యరూపముగ నుండిరి. ఇపుడు వారు ప్రబలముగ నున్నారు. ఈపరివర్తనము చెన్నపురికిని, కాలస్థితికిని దగినటులున్నది. ముందైనను, నిట్టియనాలోచిత కార్యములు జరుగకుండునటులు నాయకులు పూనుకొనుట ధర్మముగ నున్నది.

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No.7, Thumbu Chetty Street, G.T, Madras

# విషయానుక్రమణిక

## చిత్రములు

త్రివర్ణచిత్రములు:—చిత్రాంగి, నటరాగిణి.

సాధారణ చిత్రములు:-౪౨ వ భారతజాతీయమహాసభ-చెన్నపురి, సభామంటపసింహద్వారము*, నాయకుల సభామంటప గమనము*; కాంగ్రెసునగరమున-అధ్యక్షులు మొదలగువారు*; మరికొందరు*, జాతీయపతాకాస్థాపనము, సేనుగుప్తగారు, కీ. శే. హకీం అజ్మల్‌ఖానుగారు; శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారు*, శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయ గారు*, స్వచ్ఛందస్త్రీసేవాదళము, కే. నటరాజనుగారు*, డాక్టరు ప్రమోదనాథ బెనర్జిగారు*; పండిత జవాహిర్‌లాల్ నెహ్రూగారు, ఇబ్రహిం రహింతుల్లాగారు, పండిత మదనమోహనమాలవ్యాగారు, మహాత్మాగాంధిగారు, సేట్ జమ్నాలాల్ బజాజ్ గారు, కాంగ్రెసునగర దృశ్యము*; పానశాలచిత్రములు ౨†; ప్రాచీనభారతీయ చిత్రకళ-మొగలు చిత్రములు ౧౬, ఇతర చిత్రములును.

---

* ఈగుర్తుగల ౯ చిత్రములు, తీర్మానములలోనున్న 3 చిత్రములు, శ్రీ కే. ఏ. హెబ్బరుగారొసగినవి.

† ఈరెండుచిత్రములు టైమ్సు ఆఫ్ ఇండియా ౧౯౨౮ వ సంవత్సరపు సంవత్సరాది సంచికలోని త్రివర్ణచిత్రములనుండి గైకొనబడినవి.



తే. భావభవ పరితాపదీపనములైన, పావురంబుల కూజితారావము విని
తనగతి యిటయ్యెనంచు ముదంబుడక్కి, కన్నుగవమోడ్చి చిత్రాంగి కలతచెందె.

చిత్రకారుడు: శ్రీ గ్రంధి శేషారావుగారు.



చెన్నపట్టణము, ఫిబ్రవరి ౧౯౨౭

సంపుటము ౪ ప్రభవ సంవత్సరము మాఘమాసము సంఖ్య ౨

## భరతమాత

జి. జాహువ గారు

ప్రమథనాథుని నీరు ద్రావింపఁజాలిన వజ్రాలకొడుకులఁ బడసినావు
నరకాధిపతిగుండెఁ గరఁగింపఁజాలిన వెలఁదిమిన్నల కుగ్గుఁ బెట్టినావు
బ్రహ్మయంతటివాని నణఁకింపఁజాలిన మునుల మూఁపున నిడి మోసినావు
అంటినంతన పాప మణఁగింపఁజాలిన తీర్థకోటుల మున్గి తేలినావు
యుర్వి పుట్టకముందె నీ వుంటివేమొ-సకలశాస్త్రపురాణముల్ చదివినావు
గొనబుసిరిగల భాగ్యశాలినివి నీవు-భారతాంబామణీ, నమస్కార మమ్మ!

సీ. జలకంబులాడించు చెలికత్తెగద నీకుఁ గనకాంబుజాఢ్య గంగాభవాని
తలమీఁదిగుండు మల్లెలదండగద నీకు నత్యున్నతోరు హిమాలయంబు
పూఁతబంగారు సొమ్ములపెట్టెగద నీకు సిరివెలంది చరించు సింహళంబు
ముద్దుగారెడు నిగ్గుటద్దంబుగద నీకు నింబారు హిందూమహాంబురాశి
ఇట్టి నినుఁ జూచి బిచ్చంబుఁ బెట్టుమనుచు-నన్ని దిక్కులు యాచించుచున్నవమ్మ,
ఐకమత్యంబు గల్గి నిన్ననుభవించు-కొఱంత పూరింపవే మాకు భరతమాత!

## పుష్పాంజలి

### కాళకళభకవి

మానవల్లి రామకృష్ణకవిగారు,
యం. ఏ.

ఆంధ్రకావ్యాభివృద్ధి సరణి పరిపూర్ణముగా నెఱుఁగవలసియున్నను, ఆంధ్రులచరిత్రౌన్నత్యము సర్వాంగవిస్తృతముగాఁ దెలియఁగోరినను సంస్కృత ద్రవిళకర్ణాటాది భాషాభివృద్ధియుఁ, గళింగద్రవిళ కర్ణాటాదిరాజ్యవృద్ధి క్షీణదశలును గుర్తింపక పరితృప్తి కలుగనేరదు. కావున నాంధ్రేతర భాషావిషయములును,తదితర దేశచరిత్రాంశములును సర్వదా యుపకారకములే. కాళకళభకవి యను నపూర్వనామ మశ్రుతపూర్వమనుట యాశ్చర్యము కాదు. ఈకవినిగూర్చి యెక్కుడు విమర్శనము గానరాదు. ఇతఁడు సంస్కృతమున దోరసముద్రపురాధీశ్వరుఁడగు వీరసోమేశ్వరుని చరిత్రమును గద్యకావ్యముగా రచించెను. అయ్యది యపూర్ణముగా లభించినను జరిత్రకును గావ్యచమత్కృతికిని విమర్శనీయగ్రంథమని దానిఁగైకొనుచున్నారము.

పాశ్చాత్యచాళుక్యులలో ముఖ్యులగు నాహవమల్ల త్రిభువనమల్లుల కాలములో ననేక సేనాధిపతులు స్వస్వసైన్యములతోఁ జాళుక్యచక్రవర్తుల క్రిందఁబనిచేసి యసమానమగు యుద్ధకౌశలము సాధించి వారియనుగ్రహముచేఁ బొందిన చిన్నభూఖండములకు సామంతరాజులై వెలయుచుండిరి. భల్లాళకాకతీయులు వట్టివారే. క్రీ. శ. ౧౩౩౦ ప్రాంతములలో ద్వారసముద్రపు భల్లాళరాజ్యము, కాకతీయ ప్రభుత్వము, తురకలచేఁబడఁగాఁ దత్తత్సేనాధిపతులు చెదరిపోయి విజయనగరాది ప్రభువుల నాశ్రయించిరి; కాకున్న వెలమ రెడ్డిరాజులవలె స్వతంత్రరాజ్యములు స్థాపించుకొని కాలము గడపుచుండిరి. హిందూదేశచరిత్రమునఁగొన్ని వేలు తక్క సాధారణముగా నేరాజవంశము గాని ౨౫౦ సంవత్సరముల కధికముగా నేకచ్ఛత్రాధిపత్యము సహించియుండలేదు. రాజ్యములకును, జన్మవృద్ధిక్షీణములు జంతువులకువలెనే యనివార్యములై యుండును. నిరంతరము దిగ్విజయమిషమునను, జయలక్ష్మీకరగ్రహణవ్యాజమునను బూర్వవైరనిర్యాతన భావమునను రాజులు పరస్పరము పోరాడుచు దత్కాలమున నొక్కఁడు ప్రగల్భుఁడైన మఱునాఁడు మఱియొక్కఁడు విజయోన్నతిచే జయస్తంభము నాటును. మూఁడవనాఁడు మూల నడఁగియుండిన వేఱొకరాజు సాహసికుఁడై జయమత్తులగు పూర్వుల సులభముగా నోడించి జయపతాకతో యశఃకర్పూరమును దిక్కులఁ జల్లుచుండును.

"భుజంగ జిహ్వాచపలా నృపశ్రియః" యన్నట్లు వీరిప్రాభవము క్షణభంగుర మగు

టయకాక యనుక్షణము శంకావహ మగు చుండును. ఈరాజులు తమ యశశ్చంద్రికలఁ గావ్యబంధములనైన నిలుపఁగోరియో, కేవల రాజలాంఛనముగా గ్రహించియో కవిజనుల నాదరించి వారిచేఁ దమతమవిజయప్రశస్తిచరితముల రచియింపించి కాని, దేవతాకథలఁ జెప్పించి, తమవంశావళుల సందు ముఖాలంకారములుగాఁ జొప్పించి కాని, తమజీవితములఁ గల్పాంతస్థాయిగ నెలకొల్పఁ గడంగిరి. పుణ్యమును; బురుషార్థమును గాని కేవలరాజగాథల నెవ్వఁడు చదువును? సకల ధర్మాధర్మ విచారక్షమంబగు భారతంబును, జన్మతారకమగు భగవచ్చరిత్ర నిబంధనంబగు భాగవతరామాయణాదిప్రౌఢగ్రంథజాలంబును నొక్కపురుషాయువునకుఁ జాలినంతయుండ నున్మత్తచేష్టితపరంపరాప్రతిమానమగు రాజగాథావళిఁ దత్కాలమునందక్కఁ జదువువారు సాధారణముగా నుండరు. మఱియు వైరిరాజన్యులు ప్రబలినచోఁ దమచే విజితులైనవారి కథలు విని వాని స్థిరీకరింప నొల్లరు. కాళిదాసువంటి మహాకవియు విక్రమాదిత్యునియట్టి రాజేంద్రునికీర్తి వెలయింపఁ జేసిన కుంతలేశ్వరదౌత్యమనుకావ్యము కేవల మనాదరముచే నదృశ్యమయ్యెఁగదా. రాజులు విద్వత్సభల నడపి పోషించుచున్నందున విద్యాసంచయముతో వారిప్రశస్తులును గాలసముద్రమున భగ్ననౌకాంగములవలె నచ్చటచ్చటఁ గొట్టుకొని తీరాంతరముఁ జేరుచున్నవి. ఇట్టి రాజగాథాకావ్యములు ప్రౌఢకవితామనోజ్ఞములు గాకుండెనేని యొక్కపురుషాయుఃపరిమితకాలమైన నిలువవు. ప్రౌఢకావ్యములు నిలిచినను గేవల కావ్యవినోదులే చదివి కరుణాద్భుతశమాది మనోధర్మముల క్షణకాలముద్రిక్తులై యానందింతురు. కల్పనాకథారమణీయమగు కాదంబరినైనఁ జదువుదురుకాని హర్షవర్ధనుని కీర్తి విస్తారకమగు హర్షచరితమును గవితారసమునకైన సాధారణముగాఁ జదువరు. బిల్హణుని కీర్తి చోరశృంగారగాథారూపమున వెలయుచున్నదేకాని యతని విక్రమాంకదేవచరిత మించుక రసభరితమైనను జదువనొల్లరు. పరిమళ కాళిదాసబిరుదాంకితుని నవసాహసాంకచరితము ప్రసన్నకవితావల్లభమయ్యుఁ బఠించువారు లేరు. ఇఁక శూద్రకచరిత్ర, శాతకర్ణిహరణము, అశ్మకవంశము, దిలీపవంశము మొదలగు కావ్యరత్నములు సహితము నష్టములగుట కేవల రాజగాథాప్రలాపములగుటచే నాత్మసంస్కారకములు, విశ్రాంతచింతావినోదనములు, దత్త్వవిచారకములుఁ గాకపోవుటచేతనే యని యూహింపఁదగును. అట్టి రాజగాథాశల్యములు లభించునేని దేశచరిత్రనిర్మాణశిల్పుల కత్యంతపరితోషకరములు గావచ్చునని యీకాళకళభని వాగ్విస్తృతిఁ బ్రకటించుచున్నారము.

౧. కాళకళభుఁ డెవ్వఁడు? ౨. వీరసోమేశ్వరుఁ డెవ్వఁడు? 3. గ్రంథములోఁగల దేశకాల ప్రశంసయుఁ, ౪. గావ్యచమత్కృతియు నేవి? యను నీయంశము లీవ్యాసమున సూత్రింపఁబడును. పరమేశ్వరునికొలువున నారదుఁ డీ

కథను జెప్పినట్లున్న తత్కృథాప్రణాళికలో మఁ గవిగుఱించి,

"కాత్యాయనీచరణశేఖరేణ కాళికళభనా మ్నా కవిచక్రవర్తినా ప్రవర్తమానేన విర చితమనవద్యగద్యసందర్భంకమపి ప్రబంధ"

మనియు, గ్రంథమున నొకప్రకరణాంతమున,

"కవిరాజరాజాభినవభట్టబాణ కలికాల కాళిదాస కాహళకవిసార్వభౌమ కాళకలి కళభ సకలవిద్యాచక్రవర్తి విరచిత గద్య కర్ణామృత"

మనియు నుండుట చూడఁగాఁ గాళకళభనా మముకూడ బిరుదమనియే తోఁచుచున్నది. లేదా, కాళహస్తి యనుటకుఁ బర్యాయపదమై యుండునేమో! కాళన యనియుఁ, దిరుకాళత్తి యనియు పేరులు గలవుకదా! ద్వారసముద్ర వాసియగు నితఁడు కాళహస్తీశ్వర భక్తిద్యోత కమగు నీపేరు జన్మకాలమునఁ బొందెనాయను సందియము కలుగును. లేక కాహళకవిసార్వ భౌముఁ డనుటచే నితనిపేరు కాహళుఁ డనవచ్చునా? డిండిమాడంబరమునఁ గవితారాజ్యమే లినకవులకు డిండిములని పేరు గలిగినట్లు వీనికిఁ గాహళమే పరకవిప్రకంపనమగు చిహ్నమై తన్నామమే పౌరుషనామ మయ్యెనా? ఇతని కభినవభట్టబాణుఁడని బిరుదము కలదు. దోర సముద్రరాజులలో వీరసోమేశ్వరుని పితా మహునియొద్ద నుండిన జైనకర్ణాటకవియగు సుమనోబాణుఁ డీబిరుదము వహించెనట. కర్ణాటకవుల కున్నంత బిరుదము లేభాషా కవులకుఁ గానరావు. వారు తమగ్రంథములలో వానినెల్లఁ బ్రకటించుకొనుటయు నతివిచిత్ర ముగా నుండును. ఈకవికి విద్యాచక్రవర్తియని బిరుదము కలదు. కవులు తమబిరుదనామముల తోడనే గ్రంథరచన చేయుదురు. ఉంబేక నాముఁడగు భవభూతియు, నగస్త్యనాముఁడగు విద్యానాథుఁడును, వేంకటరాయనామకుండగు బాలసరస్వతియు బిరుదనామముల తోడనే లోకులలో ఖ్యాతిచెందిరి. విద్యాచక్రవర్తి యనువారు మువ్వురు భల్లాళరాజులసభలలో నుండిరి. వారివంశవృక్షము నిచ్చెదను.






పై వంశవృక్షముల సంబంధించి చదువ ముప్పురు విద్యాచక్రవర్తు లాకరాకరు పాత్రు లగుచు వీరభల్లాళ వీరసోమేశ్వర ముమ్మడి భల్లాళుల సభల నలంకరించినట్లు విశద మగు ను. ముమ్మడివిద్యాచక్రవర్తి పైవంశావళి లోని వంశక్రమనామముల వివరముగాఁ దన రుక్మిణీకల్యాణ మను రమణీయకావ్యమున నను గ్రహించెను. ఇతఁడు కావ్యప్రకాశాలంకార సర్వస్వము లను మహాగ్రంథములకు సంజీవనీ నామముల వ్యాఖ్యలు గూర్చెను.

"ఇతి సంజీవనీకారః"

యని పండితరాయ లితనివ్యాఖ్యానములనే దూషించెను. అట్లు దూషితము లైనను దద్వ్యాఖ్య లతిరమణీయము లనుటకు సందే హము లేదు. పండితరాయలచే ద్రవిడశిశువని దూషింపఁబడిన యప్పయదీక్షితులవారు మన కుఁ ద్రోపు డగుదురా ? ప్రభాకరునిచే

"ఇవ మజ్ఞానవిలసిత"

మని పరిహసింపఁబడిన భట్టకుమారిలపంక్తి యనాదరణీయ మగునా ? సింహములు పర స్పర మెట్లు నడచుకొన్నను మన కవి సింహ ములేకదా. ఇమ్మడివిద్యాచక్రవర్తి వీరసోమే శ్వరుని యాశ్రితుఁడు. దేవీపంచస్తవిలోఁ బ్రసి ద్ధ మగు లఘుస్తుతికిని, విరూపాక్షపంచాశిక యను ప్రత్యభిజ్ఞాశాస్త్రసారసంగ్రహమునకును వ్యాఖ్యలు కూర్చె.

మొదటివిద్యాచక్రవర్తి గ్రంథరచనావిష యము తెలియరాదు. హొయసలరాజజయగాథ లు చారుశయ్యలలోఁ గూర్చి శిలోట్టంకితము లుగా నీకవివంశ్యులు చేసినట్లు రుక్మిణీకల్యాణ మునఁ జెప్పఁబడియె. ముమ్మడివిద్యాచక్రవర్తి

"తే నోపనీయావరజో వినీతః
　　ప్రసిద్ధనామా కవిచక్రవర్తీ;
భల్లాళభూపస్య మనోఽభిరామై
　　ర్వాచాం విలాసై రతివల్లభోఽభూత్.
ఉన్మూలితస్థాపితభూమిపాల
　　దేశేషు పద్యై రుపవర్ణ్య గీతాః;
ఉట్టంకితా యేన మహాశిలాసు
　　భల్లాళభూపస్య భుజప్రతాపాః,
ఉదాహృతిత్వేన స యై ర్నిబధ్య
　　కావ్యప్రకాశాదిషు లక్షణేషు;
నివేశితా యేన జగత్సమక్షం
　　ఖ్యాతిం గతా హొయసలరాజగాథాః.
య శ్ఛత్రభద్రాసనచామరాద్యైః
　　స్సీక్షై ర్మహారాజపదై ర్బుభుక్తే;
సభాసు రాజ్ఞాం చ విపశ్చితాం చ
　　సాహిత్యరాజ్యం కవిచక్రవర్తీ."

ఇట్టి మహైశ్వర్యము ననుభవించె ననుట సంది యములేదు. ముప్పురు విద్యాచక్రవర్తులును దమతమకాలముల హొయసలరాజులకు మత గురువులును, విద్యాగురువులు నైయుండిరి. వీ రెల్లరు కాశ్మీరశైవమను ప్రతీతిగల ప్రత్యభిజ్ఞా శైవాద్వైతమతము ననుసరించి దీక్షఁ బొంది నవారు. మొదటి విద్యాచక్రవర్తి—

"విద్యాను నామ్నా భువనత్రయేఽపి
　　య శ్చక్రవర్తీ త్యుపగీతకీర్తిః;

ఆస్థానబద్ధపరివరస్య తస్య
రాజ్ఞః ప్రశస్తిః ప్రథయాంబభూవ.
అయత్నసంసిద్ధకులానుయాయీ
విద్యావతా ముఖ్యతరైస్తపోభిః;
ఉమాపతే ర్దక్షిణతో ముఖాద్య
స్సాక్షా త్ప్రపేదే పరతత్త్వదీక్షామ్.
నిరగ్నిహోత్రాః పరిమందవాచో
న కేచన బ్రహ్మవిచారశూన్యాః;
ఆసన్ననైసర్గికసిద్ధవిద్యా
ద్విజాః కులే యస్య తపోభి రిద్ధైః."

అని వర్ణింపఁదగిన జ్ఞానదీక్షాగురుండన నెగడుటయకాక వారివంశ్యులు ననూచానసంతాను లైరనుట యతిశయోక్తి కాదు. కాత్యాయనీచరణశేఖరాది విశేషణములఁ బట్టి కాళకళభుఁడు రెండవవిద్యాచక్రవర్తి కావచ్చునని తోఁచుచున్నది. ఒక్కరాజు నాస్థానమున నిరువురు విద్యాచక్రవర్తు లుండఁగలరా? ఒక్కయింట నిద్దఱు సవతులైన నుండఁగలరు కాని యొకగుహలో రెండుమగసింగము లుండఁజాలునా? కావున వీరసోమేశ్వరుని యాస్థానకవియగు విద్యాచక్రవర్తియే మనకాళకళభుఁడని యిప్పటికి నిర్ణయింతము.

హొయ్సలరాజులు వీరసోమేశ్వరుని ముత్తాతయగు వీరనరసింహుని కాలమువఱకును జైనమహాకవులనే యధికముగా నాదరించుచుండిరనియు, వీరభల్లాళుని (౧౧౭౨-౧౨౧౯ క్రీ. శ.) మొదలు శైవకవులే రాజాస్థానమున నెగ్గుచుండి రనియు నూహింపవలసియున్నది. బసవేశ్వరుని శైవమతోత్థాపనము దీనికిఁ గొంత కారణమై యుండవచ్చును. అయినను శివాద్వైతము కుమారిల శంకరాచార్యులకుఁ బూర్వమే దక్షిణదేశమున సుప్రసిద్ధమై యుండెననుటకు నాచార్యసుందర పాండ్యుఁడును, భర్తృప్రపంచుఁడును సాక్షిభూతు లగుచున్నారు. పిదపఁ బ్రత్యభిజ్ఞాసిద్ధాంతము కాశ్మీరమునుండి ద్విగుణితశక్తిమంతమై మత్తమయూరశిష్యులగు విమలశివాదులచేఁ బ్రస్థానాంతరముగా మాఱె. బసవేశ్వరుఁడు వేదప్రామాణ్యవేదకర్మల నుల్లంఘించి శివాద్వైతమున నూతనపక్కి శాసించె. పండితారాధ్యుఁడు శైవముననే ద్వైతమును సంపూర్ణముగా నంగీకరించి యద్వైతమును నిరసించి తనయభిమతమును శివతత్త్వసారమునఁ బ్రకటించుచున్నాఁడు. వీరసోమేశ్వరునికాలమున నచ్చటఁ బ్రాచీనశివాద్వైతమే ప్రబలముండెను.

హొయ్సలరాజులు క్రీ. శ. ౧౦౪౦ నుండి ౧౩౩౦ వఱకును సుమారు పదునొకండు మంది ప్రభుత్వము సేసిరి. వీరలెల్లరు తమ చుట్టునున్న రాజులతో నిరంతరము పోరుచుండి తుట్టతుదకుఁ దురుష్కులచే నందఱును గీర్తిశేషులై వంశనిశ్శేషు లైరి. ద్వారావతీపురము వీరలకు రాజధాని. దక్షిణమున గాంగ బాణ పాండ్య చోళ చేర కేరళ రాజ్యములును, దూర్పునఁ గలచురి పాశ్చాత్య ప్రాచ్యచాళుక్య తెలుఁగు చోడరాజ్యములును, నుత్తరమునఁ గలచురి సేవణ కాకతీయ వంగ గాంగ ఘూర్జర మాళవ త్రైపురరాజ్య

ములును వీరలకు నిరంతరము రణమృగయకు గహనభూములవలె నుండెను. వీరిలో మనకు ముఖ్యుఁడగు సోమేశ్వరుని తాత యగు (రెండవ) వీరభల్లాళుఁడు (౧౧౭౧–౧౨౦౬ క్రీ. శ.) మహారాష్ట్రసీమను జయించి,

"గంధద్విపై ర్యస్య విలోడ్యమానే
పంకాకులే వారినిధిం ప్రపన్నే,
గోదావరీవారిణి సేవుణానాం
(దేవగిరిరాజుల)
యయా యశోవారిధి రావిలత్వమ్"

అన్నట్లు తూర్పునంక విజయధ్వజము సారించెను.

మఱియుఁ బాండ్యరాజగు కామదేవు నోడించి చోళరాజుఁ దఱిమి పాశ్చాత్య చాళుక్య రాజగు సోమేశ్వరుఁ బరాజితుం జేసెను. మనసోమేశ్వరునితండ్రియగు (ఇమ్మడి) వీరనరసింహుఁడు (౧౨౨౦–౧౨౩౫) మకరరాజ్యమును జయించి,

"యః పాండ్య దుర్వారభుజప్రతాప
శ్చోళం చ పాండ్యం చ రణే జిగాయ."

యన్నట్లు దక్షిణదిక్కున నెక్కువగాఁ దిరిగి చోళరాజ్యమునఁ దన బావమఱఁది నిల్పి చోళరాజ్యస్థాపకబిరుదము పొందె. మన కథానాయకుఁడగు వీరసోమేశ్వరుఁడు చుట్టునున్న రాజ్యముల నన్నిటితోఁ బోరి జయాపజయములు పొందుచుండెను. ఘూర్జరరాజుల జయించి దేవికయను తద్రాజకుమారిఁ బెండ్లియాడెను. సేవుణరాజులచే నోడి పిదప నెల్లూరితెలుఁగుచోళుఁడగు తిక్కనృపాలుచేఁ బరాభూతుఁడయ్యె. కేతన దీనినే

"కర్ణాటవిభునహంకారంబు మాన్పించె"

ననియుఁ, దిక్కన నిర్వచనోత్తరరామాయణమున—

"కమలాప్తప్రతిమానమూర్తి యగు నా
కర్ణాటసోమేశుదు
ర్దమదోర్గర్వము రూపు మాపి నిజద
ర్పంబుం బ్రతిష్ఠించి లీ
లమెయిం జోళుని భూమిపై నిలిపి చో
ళస్థాపనాచార్యనా
మము దక్కం గొని తిక్కభూవిభుఁడు సా
మర్థ్యంబు చెల్లింపఁడే."

యనియు వర్ణించిరి. ఇటు సోమేశ్వరుఁడు పరాజితుఁ డగుటకుఁ గారణము సంపురాయఁడు, శంభురాజు, సాంపరాయఁడు అను నామాంతరములుగల యొక తెలుఁగురాజుతో (తెలుంగాధీశసాళువరాజులకుఁ బూర్వపురుషుఁడు) నెల్లూరితిక్కరాజుఁ గలసి సోమేశ్వరు నోడించి కాంచీపురము తాఁ గొని యొరయూరుపురమునఁ జోళరాజు నిలిపెఁ గాని సుందరపాండ్యుఁడు బల్లవరాజగు "కోపెరుంశింగదేవుఁడు" వేత్వేఱ కంచిపై దండెత్తి తిక్కరాజుఁ దఱిమివేయుచు వచ్చిరి.

కోపెరుంశింగదేవుఁడు (పెద్దరాజసింహదేవుఁడని యఱవపదమున కర్థము) పల్లవవంశస్థుఁడై యించుమించుగాఁ జుట్టురాజుల నెల్ల జయించి యుత్తరమున దాక్షారామమువఱకు

మృగయావిహారమున నరణ్యము సొచ్చి చని నట్లు దండెత్తి యచ్చటఁ దనవిజయాంకశాసనము స్థాపించెను. ఇతఁడు వీరసోమేశ్వరునే కాక యతనితండ్రియగు వీరనరసింహునికూడ నోడించి తుద కోడిపోయెను. ఇతఁడే చోళరాజగు ముమ్మడి రాజేంద్రుని జయించి తత్సింహాసనమునుండి వానిఁ దొలఁగించినందునఁ దిక్కరాజు కోపెరుంసింగదేవునితో యుద్ధము సేసి రాజేంద్రు సింహాసనమున నిలిపెను. రాజేంద్రుఁడు వీరసోమేశ్వరునకు బావమఱది కొడుకు. రాజ్యప్రవృత్తిలో బాంధవము ముఖ్యము కాదుకదా! తిక్కరాజు శంభురాజులతోఁ జేరెనని కాఁబోలు, వీరసోమేశుఁడు చోళరాజుతోఁ గలసివచ్చిన పాండ్యరాజుతోఁ గాంచీపురమునకు నాగ్నేయమున సముద్రమున నుండు మహేంద్రమంగలమను పట్టణప్రాంతమున యుద్ధముసేసినట్లు కాళకళభకవి కావ్యములోఁ ప్రధానాంశము. నారదుఁడు దాని సాక్షాత్తుగాఁ జూచి సరస్వతి వీణవాయించుచుండ నంతకంటె రుచికరముగాఁ బరమేశ్వరునితోఁ గైలాసమునఁ బార్వతీసమక్షమున వర్ణించెనఁట. అంతఁ బాండ్యరాజు కూఁతురగు లక్ష్మీదేవిప్రశంస వచ్చుస్థలమున గ్రంథము నిలిచిపోయె. శాసనములచే సోమేశుఁడు సుందరవీరపాండ్యులవలనను, రాజేంద్రునివలనను నోడింపఁబడియెనని తెలుచుండెను. పాండ్యుఁడు వీనికిఁ గాలదండ మనుటచే సోమేశుఁడు చోళదేశయుద్ధభూమిలోఁ జచ్చెనని తలఁచెదను. ౧౨౫౯ క్రీ. శ. కాలములో నితఁడు చనిపోయియుండును. మహేంద్రమంగల యుద్ధములో సోమేశుఁడు యౌవనములో నుండెననుటం జేసియు, నితఁడు మువ్వురు భార్యలఁ బరిణయమై వారియందు సంతానము వడయుటకుఁ గాలావధి వలయుటం జేసియు నితనిపుత్రులగు రామనాథ నరసింహులు ౧౨౫౮ ప్రాంతములకే యుద్ధక్రీడల నడపి శిలాశాసనములు స్థాపించినందునను మనకాళకళభకవి సూచించిన మహేంద్రమంగలయుద్ధము ౧౨౪౫ ప్రాంతములకుఁ దరువాత నడచియుండదు.

మహేంద్రమంగలము నిశ్చితముగా నెచ్చట నున్నదో తెలియరాదు. కాంచీపురసమీపమున దక్షిణసముద్రతీరమున నని కవి చెప్పుచున్నాఁడు. ఈప్రదేశ మనేకరాజులకు యుద్ధభూమియయ్యు నేఁటికి స్థలనిశ్చయము సులభముగాఁ గానరాదు.

"చోళేషు మంగల మితి ప్రథితాభిధానే
గ్రామే వసన్ పితృగురో రభిధాం దధానః;
జ్ఞానోత్తమః సకలదర్శనపారదృశ్వా
వ్యాఖ్యామిమాం వితనుతేస్ఫుటమిష్టసిద్ధ్యై."

అని జ్ఞానోత్తముఁడు తనవేదాంతవ్యాఖ్యానగ్రంథములలో వ్రాయుచున్నాఁడు. ఈమంగళనామకాగ్రహారములు ౧౦౦ చోళదేశమునఁ గలవు. ఇది యేదియో యిప్పుడు నిర్ధారింపవలనుకాదు.

గ్రంథరచనాక్రమము.— కైలాసమునఁ బార్వతియుఁ, బరమేశ్వరుండును విహరించు

చుండ, సాయంతనసమయంబున నారదుఁడు వారిసన్నిధానముఁ జొచ్చి యథావిధి నమస్కరించి, "దేవా, నాశిష్యులగు వ్యాసవాల్మీకులు భూలోకంబునఁ గాళకళభకవి రచించిన యొకకావ్యంబుఁ దెచ్చియున్నారు. దాని దేవరయవధరింపఁదగు"నని విన్నవించునంతలో దేవీసఖియగు మంజుళిక యచ్చటికి వచ్చెను. మహేశ్వరుఁ డంత సంధ్యాసమయంబగుటమఱునాఁ డుదయమున దాని విందమని చెప్పి నారదునిఁబంపి, పార్వతీమంజుళికలతో నుద్యానవనవిహారము చేసి యిల్లుచేరి, మఱునాఁడు సభలోనుండి సరస్వతీదేవి యతిమనోజ్ఞముగా వీణ వాయింపఁగా విని గానము మెచ్చి ముక్తాహార మొకటి వాగ్దేవికిఁ బ్రీతిదాయక మొసఁగెను. అంతలో నారదుఁడు సభ కేతేర నుమావిభుఁ డేల సరస్వతీగానము వినుటకు రావైతివని నారదు నడుగ నతండు "రాత్రి యాదవసోమేశ్వరునకును బాండ్యభూపతికిని దక్షిణసముద్రతీరమున యుద్ధము జరిగెను." అనవుడు మహేశ్వరుఁ డాయుద్ధప్రకారము వర్ణింపుమననట్టి యుద్ధరంగము తా నెప్పుడు చూచినది లేదని తద్వృత్తాంతమంతయు ద్వారసముద్రరాజవంశవర్ణనముతోఁ జెప్పుచున్నాఁడు. గ్రంథము పాండ్యరాజుకుమారికావివాహముతో ముగిసియుండును. ఈ గద్యకర్ణామృతములో శివుని సంధ్యావిహారఘట్టమును రచనామాధుర్యము గోచరించున ట్లుదాహరించెదను.

"అత్రాంతరే వనలతాంతరితవిగ్రహా దేవీ పరిచారికాసు కాచి త్ప్రభృతికానామ కళమధురా మిమాం గాథా మగాథయత్.

"తమసి సఖి యూథికే త్యజ
గౌరీనిశ్వసితసౌరభస్పర్ధామ్,
కి మకృత సముచ్ఛ్వసంతీ
సాసూయం మాలతీవ లతా."

అథ నిశీథసూచినీ మిమా మార్యా ముమాపతి రుమయాసహ శ్రుత్వా సమేరుతలా దుదతిష్ఠత్; ఉత్థాయచ నిజనికేతనాభిముఖో వృషభకేతనః కాంతయాసహ పరిణతహిమకరకిసలయితేన కైలాససానువర్త్మనా జగామ. గౌరీ గచ్ఛంతీ క్వచి త్కుతూహలా త్సలకమలదళశయనతలనిషణ్ణ మితరేతరాంగసంస్పర్శసుఖనిమీలితలోచనమివ నిద్రాయమాణం హంసమిథున మాశింజితనూపురేణ పదేన పస్పృశత్; తత స్తచ్చరణచాలితమపి ముహుర్నిశీథనిద్రాంతరమంథరే కథమపి కృతకళగద్గదరవ మున్మీల్య లోచనే పునరపి నిమిమీల హంసయుగళమ్; అత్రి క్వచి త్సరస్తీరసీమ్ని విరహవిధురా మధీరత(యా)విహితారవ మాళిజనేన గ్రాహయిత్వా చక్రవాకీం ప్రియసమీప మానినాయ సా; పున రానీతా ప్రియతమ మంతికగతమ ప్యజానతీ విధివశా దన్యతో యాంతీ కరుణతర మాచక్రంద చక్రవాకీ; కుత్రచి త్కాంత మనుసారతీ మంతరా కౌముదీ మదవిఘూర్ణమానలోచనా మపథప్రస్థితాం నివార్య వర్త్మని చకార చకోరీం చకోరాక్షీ; క్వచి ద్విహారవస్థితమధుకరానుశోచితాం విరచిత వివిధప్రలాపాం స్వరుచి పంకజోదరబంధనస్థాం మధుకరీం విభిద్య ము

కుళం విజయాకరేణ వినోదయామాస–ఇతి వివిధవిహారవ్యాపృతాం వినోదయన్దయితాం మదచపలచకోరలోచనపుటపాటలిమపల్లవితచంద్రికాప్రసరేణ మందమారుతాందోళితశేఫాలికాపరిమళలహరీపరిప్లవమానషట్పదేన పదేన- చంద్రికాంతదృషన్నిష్యంద శ్వేతశిశిరశైలేయసురభిశిలాతలేన నిశీథయూథికామోదవాసితవనదేవతాకుంతళేన (?) నిరన్తరవిస్మృమరక్షైతకపరాగధూసరచకోరకామినీచరణేన రజతాచలమేఖలాపథేన సవిలాస మాలయ మాజగామ గౌరీపతిః.”

కథారచన లోకాతీతమగు భంగితోఁ గూర్పఁబడియు మృదుమధురపదవిన్యాసరమణీయమగు వర్ణనాప్రఘట్ట మింపుగొలుపుచుండును. సాహిత్య మలవఱుచుకొనువారల కిది యుత్తమకావ్యములలో నొకటి యని యంగీకరింపక తప్పదు.

---

## నిర్గుణోపాసన

బొమ్మరాజు జానకిరామశర్మ గారు

స్థిరమనస్కృత దురితవిచ్ఛిత్తిఁ గలుఁగ–నాత్మవంతు లెవ్వాని నేకాంతమందు
నెలమి ధ్యానింతు రట్టి సర్వేశు నీశు–నాశ్రయించెద సప్రశ్రయాంజలినయి.

ప్రబలసంపదచేతఁ బ్రాభవముచేత–నిఖిల భోగానుభూతిచే నేర్పుచేతఁ
బడయఁగారాని పదము నేవాఁ డొసంగు–నప్పరమపదనాథు నే నాశ్రయింతు.

జాతి, మత, వర్ణ, గుణ, ధర్మ, సమితిలేక–నామరూపాభిమానభావములు లేక
ద్వంద్వములులేక యెట్టి చందములులేక–యెలమిమైనుండు నా పరమేశుఁగొలుతు.

స్నాన, భోజన, పాన, ప్రసంగ, సంగ–సౌఖ్య, దుఃఖ, ప్రచార, విచార, భోగ
యోగ, సంత్యాగ, వేష, భాషోపయోగ–రహితపదదాయకునకు శీర్షంబువంతు.

భువనకల్యాణమయమయి పూజితమయి–యఖిలసూర్యభిలషితమై యనవధియయి
యచ్ఛమై యనవద్యమై యాద్యమైన–తేజమును మానసమున స్తుతించువాఁడ.

నిస్తరంగనీరధివోలె, నిష్పవనగృ–హాగతదీపికవోలె నిరభ్రశుభ్ర
విష్ణుపదమట్లు వెలయు సంవిత్ప్రకాశు–నీశునిర్నిర్విశేషు భజించువాఁడ.

చర్మచక్షుర దృశ్యప్రచారమగుచుఁ–గలుష చిత్తానపోహ్యాత్మ విలసనమయి
నిర్మలంబయి సర్వత్ర నిండియుండు–నట్టి పరతత్త్వమూర్తికి నంజలి యిది.

చేతనమ్ములయందు నచేతనముల–ఖగములందు నగములందు మృగములందు
బ్రహ్మమందున నొక గడ్డిపరకయందు–నేకరీతిగ నున్న పరేశుఁ దలతు.

# పిల్లలమఱ్ఱిపినవీరభద్రుడు-జైమినిభారతము

టేకుమళ్ల అచ్యుతరావుగారు

శృంగార శాకుంతలము తరువాతఁ బినవీరభద్రుఁడు జైమినిభారతము రచించినట్లు కానిపించుచున్నది. ఏలయన జైమినిభారతమునందుఁ దానటకుఁ బూర్వము రచించినగ్రంథముల నుగ్గడింపక పోయినను శాకుంతలమందుఁ జేర్కొనినగ్రంథములలో జైమినిభారతము లేకపోవుటయే యీ పౌర్వాపర్యరచనా నిర్ణయమునకు ముఖ్యాధారము. కావునఁ బినవీరభద్రుని గ్రంథములలో నిప్పటివఱకు లబ్ధములైనవానియందు జైమినిభారతమే కడపటిది.

ఈజైమినిభారతము సాళువనరసింహ రాయల కంకితము చేయఁబడినది. గ్రంథాదియందలి కృతిసమర్పణభాగమును జదివినచో నొండు రెండువిశేషాంశములు గోచరించుచున్నవి.

1. వీరభద్రుఁడు నరసింహరాయల యాస్థానమం దొకకవి.

దీనికి గ్రంథమందే యాధారమున్నది. ఒకనాఁడు నృసింహరాయలు సభలోఁ గూర్చుండి జైమినిభారతము నుగుడించి వితర్కించుచు,

"తే. ఆపురాణంబు గనఁ దెనుఁగయ్యెనేనిఁ
జెప్పనేర్చినకవియుఁ బ్రసిద్ధుఁడేనిఁ
దెనుఁగునుడికారమున మించుగనియెనేనిఁ
గుందనము కమ్మవలచినచంద మగును."

అనిచెప్పి సభాసదులవంకఁ జూడ వారు నీయద్భుతపురాణమును దెనుఁగున నొక్కపినవీరభద్రుఁడే చేయనోపునని తమయేలికకు విన్నవించిన నృసింహరాయలు తనయెదుటనున్న పినవీరన్నను జూచి యిట్లు చెప్పెనఁట:

"క. అని విన్నపంబు చేసిన
ననుఁ గనుఁగొని యలరి నాధనంబు ఋణముగాఁ
దినక యుపార్జించె యశో
ధన మిటు గావలదె యాశ్రితత్వంబనుచున్."

కావున నీకవి యాశ్రితుఁడైయుండి రాయలధనమునుదిని ఋణవిముక్తుఁడగుటకుఁ గృతిరూపకమగు యశోధనము నిచ్చినట్లు తేలుచున్నది. ఇదియే యాశ్రితత్వవిధానమఁట.

(2) ఈగ్రంథము రచించుటకుఁ గవికిమాత్రమే కోరిక యుండుటగాక నరసింగరాయలకుఁ గూడ నీగ్రంథము నెవరిచేతనైనను వ్రాయించి కృతినొందఁ గుతూహలము మిక్కుటముగా నుండెను.

ఉ. ఆదట సప్త సంతతుల
యందును నొక్కొక కాలమందు వి
చ్ఛేదము గల్గు నాటిటికిఁ
జెప్ప విపర్యయ మే యుగంబునన్
లేదు కవిత్వ సంతతికి
నిక్కము తత్కవితావిలాసమున్
జాదులు నిష్టదైవము ప్ర
సాదమునా హరి కీర్తనంబునన్.

క. నామది నిరతము భారత
రామాయణ కథలఁ బ్రేమ గంజిలు నందున్
జైమిని భారత మనఁగా
భూమి నపూర్వము పురాణముల గణియింపన్.

గీ. ఆ పురాణంబు గనఁ దెనుఁగయ్యెనేనిఁ
జెప్పనేర్చిన కవియుఁ బ్రసిద్ధుఁడేనిఁ
దెనుఁగు నుడికారమున మించు గనియెనేనిఁ
గుందనము కమ్మవలచిన చంద మగును.

అని సభాసదుల మొగంబులు చూడ ననఘరించిన నారాజసత్తము చిత్తం బెఱింగి వా రిట్లని విన్నవించిరి:

క. ఏ రీతి నెఱిఁగెనో పిన
వీరన దేవర తలంపు విఖ్యాతముగాఁ
జేరును జెట్టిదియును దన
పేరుగ రచియింపఁ బూనెఁ బేశలఫణితిన్.

కావున నరసింహరాయలకును పినవీరభద్రునికినిఁ గూడ నీ పురాణముఁ దెనిఁగింప నుద్దేశము ప్రత్యేకముగఁ గలిగి నట్లు విదిత మగుచున్నది. నరసింహరాయల తలం పెఱిం గియే పినవీరన్న యీ గ్రంథమును దెనిఁగింపఁ బూనెనా యని సందేహ మచ్చోటి సభాసదులకే కాక యెల్లరకుఁ గలుగవచ్చును. పినవీరభద్రున కీ సంగతి యెట్లు తెలిసి యుండును? కేవలము మంత్రశక్తివలనను, జ్యోతిష ప్రభావమునను ప్రభువుయొక్క యంతరాలోచనఁ దెలిసి కొనె నని చెప్ప సాహసింపలేము. బహుశః నరసింగ రాయలయొద్ద చమూపతిగ నుండిన పెదవీరభద్రుఁడు రాజు మనసెఱింగి తన తమ్ముఁ డైన పినవీరన్నకుఁ జెప్పి యుండవచ్చు. ఎట్లయినను బినవీరన్న జైమినిభా రతమును దెనిఁగింప నుద్దేశించెను. నృసింహరాయ లాగ్రంథమును గృతి నొంద నిశ్చయించెను.

రాయల కీగ్రంథమందుఁ బ్రత్యేకాభిమానము గలు గుటకుఁ గారణ మేమి? అనేక పురాణము లింక నాంధ్రీ కృతములు గాకుండెనుగదా! జైమినిభారతమునే నృసిం హరాయలు వరించు టేల?

దీనికి సమాధానము జైమినిభారతమందలి కథావిష యమువలనఁ దెలియఁగలదు. జైమిని భారతమందలి కథా భాగ మేమన:—

ధర్మరాజు చేయఁదలచిన యశ్వమేధ యాగము నిమిత్తము భీమార్జునులు సలిపిన భారతదేశదిగ్విజయ మీ గ్రంథమున వర్ణింపఁబడినది. ఈదిగ్విజయము ముఖ్యముగాఁ బశ్చిమ దక్షిణభాగములందుఁ జరిగినది. అనఁగా సౌరా ష్ట్రము, మహారాష్ట్రము, కొంకణము, కేరళము, పాం డ్యము, ఇత్యాదిదేశములు జయింపఁబడినట్లు వర్ణింపఁబడి నది.

ఈదేశములను జయించినవాఁ డర్జునుఁడు. విష్ణు స్వరూపుఁడైన శ్రీకృష్ణుని సహాయమున నీయర్జునుఁ డీ దేశముల నన్నిటిని తన యన్నగారికొఱకు జయించెను. అట్లే వైష్ణవమతస్థుఁడైన సాళువ నృసింహరాయలు తన యేలిక యగు విజయనగరరాజ్య ప్రభువున కాదేశముల నన్నిటిని జయింపవలసి వచ్చెను.

ఆమహాయోధుఁడు తత్కారణమున దా నర్జును నితోఁ దుల్యుఁడని యూహించుకొని యుండవచ్చును. దానికి నిదర్శనముగఁ బినవీరన్న తన గ్రంథమున నృసింహ రాయలఁగూర్చి యిట్లు నుడివెను:—

ఉ. భారతవంశ మండనుఁడు
పాండవ గాండివముక్త బాణసం
భారతతప్రభావనుతి
పారగుఁ డంచిత గోమహీసులా
భారతదంగదాన పరి
పాక సమగ్రయశోవిలాస శో
భారతశాలి గుండ నర
పాల నృసింహుఁడు గహ్వరిస్థలిన్.

కావున నృసింహరాయ లర్జునునిపరాక్రమము చాటుచున్నగ్రంథమును గృతినొందుటకు నిచ్చగించెనని చెప్పుట సామంజస్యము నతిక్రమింపదు. *

## సాళువ నరసింహరాజు

సాళువనృసింహరాయలు విజయనగరరాజ్యము నేలిన సంగమవంశస్థులలోఁ గట్టకడపటివారైన రాజశే ఖరరాయలు, విరూపాక్షరాయలు మున్నగు వారికి ముఖ్యదండనాధుఁడుగా నుండి యనేక దేశములు జయించి సామ్రాజ్యమును విస్తరించి, తుదకుఁ దనప్రభువులు దుర్బలురై యుండుటచేఁ గేంద్రప్రభుత్వము చెడకుండు టకుఁ దానే చక్రవర్తియయ్యెను. ఈమహామహుని వంశ చారిత్రము సంస్కృతమున "సాళువాభ్యుదయ" మనెడు గ్రంథమున రాజనాథ డిండిముఁ డను నాస్థానకవి రచిం

* గ్రంథాంతమునఁ బినవీరభద్రకవి తన ప్రభువగు నృసింహరాయలను శ్రీకృష్ణుని కలియుగావతారముగ వర్ణించెను. శ్రీకృష్ణుఁ డిట్లు చెప్పెనఁట:

క. ఆసమయంబున ధర్మజ, నేసోమకులంబునను జనించి కుటిలులన్
శాసించి ధరణిపాలన, చేసెదఁ దగ సాళ్వనారసింహుఁడ నగుచున్.

చెను. కొంతవఱకు జైమిని భారతమునఁగూడ నీనృపాలుని వంశచారిత్ర మున్నది.

సాళువనృసింహరాజు వంశము చంద్రవంశము. ఈ వంశస్థులు చాలకాలమునుండి చిత్తూరుమండలములోఁ జంద్రగిరిని ముఖ్యరాజ్యస్థానముఁ జేసికొని తత్ప్రాంతదేశము నేలుచు వచ్చిరి. వీరికి మూలపురుషుఁడు వంకదేవుఁడు. అతనికొడుకు గౌతరాజు. గౌతరాజుకొడుకు గుండరాజు. గుండవిభుని కార్గురుపుత్రులు. వీరిజననక్రమము సాళువాభ్యుదయమున నొకరీతిగాను, జైమినిభారతమున మఱియొకరీతిగా నున్నది.* వారిలో మంగరాజు బుక్కరాయలపుత్రుఁడైన కంపభూపతికి సైన్యాధిపతిగనుండి దక్షిణదేశమును జయించి పరపక్షసాళ్వుఁడనుటచే సాళువబిరుదమును బొందెను. ఆకారణమున నీవంశపువారికి సాళువనామము వంశనామముగ వచ్చెను. ఈవిషయము సాళువాభ్యుదయమునను, జైమినిభారతమునను ఏకరీతిగ నుడువఁబడినది. సాళువమంగున కార్గురుకుమారులు గలిగిరి. వారిలోఁ దృతీయుఁడగు గౌతరాజునకు నలుగురుపుత్రులు జనించిరి. ఈనలుగురిలో నగ్రజుఁడగు గుండమహీపతికి తిమ్మరాజును, నృసింహరాజును జనించిరి. ఈ నృసింహరాజే జైమినిభారతమును గృతి నొందెను.

నృసింహరాజు పితృపితామహాగతంబగు చంద్రగిరి నేలుచుఁ దన భుజపరాక్రమమునఁ గళింగగజపతుల వశమై యుండిన యుదయగిరి రాజ్యభాగము నాక్రమించుకొని, తరువాత దక్షిణదిగ్జయమునకు బయలు దేఱెను. చోళరాజు యుద్ధము చేయకయే లొంగిపోయెను. పెనుగొండ దుర్గమును స్వాధీనము చేసికొనిన తురుష్కులను బాఱఁదోలి, యారాజ్యమును వశముచేసికొనెను. ఇంకఁ బశ్చిమమున మఱికొన్ని రాజ్యములనుగూడ జయించెను.

ఈమహనీయుఁడు కళింగ భూపతులకును, దురుష్క-సుల్తానులకును దుర్జయుఁడై విజయనగర రాజ్య

* సాళువాభ్యుదయము



మును క్షీణింపకుండఁ గాపాడెను. తన బాహుబలము చేతను, బుద్ధికౌశలము చేతను దక్కిన చనూనాయకుల ప్రేమాదరణంబుల కాస్పదమై వారి యంగీకారమున సామ్రాజ్యపదవిని క్రీ.వె.1487 స్వీకరించిన వాఁడయ్యెను.

## జైమినికవి

జైమిని కవి యష్టాదశపర్వయుక్తమగు భారత గ్రంథమును సంపూర్ణముగ వ్రాసెనో లేదో తెలియదు. ప్రొఫెసర్ వీబర్ అను జర్మనీ పండితుఁడు తన "సంస్కృతవాఙ్మయ చరిత్రము"న నీ గ్రంథము గుఱించి వ్రాయుచు నిట్లు నుడివెను: "అశ్వమేధికపర్వమను పేరు గల యీగ్రంథము బొంబాయిలో క్రీ. వె. 1863 లో ముద్రిత మైనది. గ్రంథాంతమందు వ్రాయఁబడిన యంశములను బట్టి గ్రంథమంతయు సమగ్రముగా విరచితమైనట్లు కాన్పించుచున్నది. కాని యిప్పటివఱకు నీ గ్రంథసంబంధమైనది యొక యశ్వమేధపర్వము తక్క వేఱు భాగము దొరకలేదు. ఈపర్వమునకుఁ గన్నడ భాషాంతరీకరణము క్రీ. వె. 13 వ శతాబ్దమునని తెలియవచ్చుచున్నది. ఆగ్రంథమునే కిట్టెలు దొరగారు తాము నాగవర్మ ఛందోగ్రంథమునకు వ్రాసిన యుపోద్ఘాతములో క్రీ. వె. 18 వ శతాబ్దమునకు త్రోసివేసిరి. ఈజైమిని గ్రంథమున శ్రీకృష్ణసంబంధమైన ప్రపత్తి ముఖ్యముగా గోచరించుచున్నది. క్రైస్తవమతసంబంధమైన పాశ్చాత్యసంసర్గములు నిశ్శంకముగాఁ గాన్పించుచున్నవి."

ఈ పండితుఁడే వేఱొకతావున నిట్లు వ్రాసెను: 'సుమంతు — జైమిని — వైశంపాయన — పైల—సూత్ర—భారత—మహాభారత— ధర్మాచార్యః' ఈవాక్యము ఇటీవలి వారిదై యుండవచ్చును. దీనినిబట్టి జైమినిభారత మిప్పటి వ్యాసమహాభారతమువలె నుండెనని నిశ్చయించుటకు వీలు లేక పోయినను జైమినికవియు వ్యాసమునివలె భారతమును సమగ్రముగా రచించియుండెనని యూహింపవచ్చును. కాని యప్పటి జైమినికవి గ్రంథమునకును నిప్పుడు వాడుకలో నున్న జైమినిభారతమునకును పోలిక చాల తక్కువగా నుండునని చెప్పవచ్చును."

ఇట్లు వీబరుపండితుఁడు మొదలగు గ్రంథకర్తలు భారతమును సమగ్రముగా జైమినికవి వ్రాసియుండ వచ్చునని యూహించుచున్నారు. కాని యీక్రింది కారణములచే నాయభిప్రాయము వేఱుగా నున్నది. జైమిని కవియని చెప్పఁబడిన మహాపురుషుఁడు భారతమందలి యశ్వమేధపర్వముతప్ప నితరపర్వములను వ్రాసియుండఁడని నాకుఁ దోఁచుచున్నది.

(1) జైమినిభారతమున అశ్వమేధపర్వమందలి యాశ్వాసాంతగద్యభాగములో "ఇతి మహాభారతే అశ్వమేధికేపర్వణి జైమినీయే" అనియున్నది. జైమిని పూర్తిగా గ్రంథమును వ్రాసియున్నయెడల "ఇతి మహాభారతే జైమినీయే అశ్వమేధికే పర్వణి" అని యుండవలసినది.

(2) గ్రంథస్వభావమునుబట్టి యశ్వమేధపర్వము దప్ప వేఱుపర్వములను జైమినికవి వ్రాసియుండఁడని యూహింపవచ్చును.

(i) గ్రంథమం దెక్కడఁ జూచినను శ్రీకృష్ణుని మాహాత్మ్యమే కానఁబడుచున్నది. వ్యాస భారతమందు శౌర్యపరాక్రమాది గుణగరిష్ఠులగు పాండవవీరాగ్రేసరులందఱు నిందు తమతమ స్వభావతేజఃపుంజముల నడఁచుకొని శ్రీకృష్ణునికై స్తోత్రపాఠములఁ జేయుచు దాసులవలె మెలఁగుచున్నారు. శత్రువుల నోడించునపుడు శ్రీకృష్ణుని బలము లేనిదే లేశమాత్రము చేయలేనట్లు వర్తించుటయే కాక దాని వెల్లడించుటయుఁ గాన్పించుచున్నది. ఇది యంతయు వ్యాసకృతికి విరుద్ధము.

కావున జైమినిభారతము వైష్ణవమతప్రాబల్యము నొందినతరువాత శ్రీమహావిష్ణుని యవతారమైన శ్రీకృష్ణునిమాహాత్మ్యము నుగ్గడించుటకు వ్రాయఁబడినగ్రంథమని చెప్పవచ్చును. శ్రీ సుద్యాగవరము క్రీ. వె. 12 శతక 13-వ శతాబ్దమున * బోపదేవుఁ డనుకవివర్యునిచే రచిం

* ఈ బోపదేవుఁడు మహారాష్ట్రప్రభువులగు దేవగిరిసంస్థానాధీశులయొద్ద నుండిన ఆస్థానకవి. ఈకవి 12-వ శతాబ్దాంతమున నుండినట్లు తెలియుచున్నది.

పఁబడినదని యొక పండితసంప్రదాయ క్రమమున వచ్చుచున్న యైతిహ్యము మనదేశమందుఁ గలదు. జైమినిభారతముఁగూడ నట్లే కొందఱుచెప్పుచున్నట్లుగాఁ దత్కాలమున వ్రాయఁబడియుండునేమో!

2. వ్యాసకృతియం దర్జునుఁడు దక్షిణహిందూరాజ్యములగు పౌండ్ర, ఆంధ్ర, ద్రవిళ, పాండ్య, కేరళములను జయించినట్లు సూచించుటయేకాని యారాజ్యముల నేలిన రాజవంశములనుగాని, యర్జునునితోఁ బోరాడినరాజులపేళ్లనుగాని యుద్ధవర్ణనలుగాని కవి చెప్పియుండలేదు. జైమినిభారతమం దట్లుగాక ముఖ్యముగా భారతవర్షములోని పశ్చిమదక్షిణభాగములనున్న హిందూరాజ్యము లర్జునాదిపాండవవీరుల నెదుర్కొనిసమరముచేసి యలఘు పరాక్రమమున వారిని డిందుపఱిచి శ్రీకృష్ణభగవానులకు శరణాగతులఁగాఁ జేసిన క్రమమంతయు నభివర్ణింపఁబడినది. కావున వ్యాసకృతిలో సూచనమాత్రమున నుడువఁబడిన పశ్చిమదక్షిణ హిందూరాజ్యముల ప్రశంసను ప్రత్యేకముగఁ బూనుకొని విపులముగ వ్రాసి యారాజ్యములకు వాసిదెచ్చుటకుఁగాను, ఎవరో మహాకవి యీగ్రంథమును వ్రాయసమకట్టెనని యూహింపవచ్చును. ఆరాజ్యముల ప్రభూతిప్రతిష్ఠల నుగ్గడించుటకు నాయా యాస్థానముల నాశ్రయించిన యొక మహాకవికిఁగాని వేఱొకరికి నీయభిలాష కలుగనేరదుకదా! కావున జైమినికవివర్యుఁడు పశ్చిమ హిందూదేశస్థుఁడో లేక దక్షిణహిందూదేశస్థుఁడో యైయుండవలెను. ఇంతియకాక దక్షిణపశ్చిమహిందూరాజ్యముల యౌన్నత్యము వర్ణించుటకు నద్దానితో శ్రీకృష్ణుని మహిమఁ బ్రకాశింపఁజేయుటకును నొక ఆశ్వమేధికపర్వమునఁ దప్ప వేఱొండుపర్వమునం దవకాశము లేదు. కావున నశ్వమేధపర్వము మాత్రమే జైమినికవి వ్రాసెననియు, నా జైమినికవి పశ్చిమ హిందూదేశస్థుఁడనియు నే నూహించుచున్నాను.*

3. మఱియొక విచిత్రాంశ మీగ్రంథమందుఁ గానఁబడుచున్నది. అశ్వమేధ దీక్షితుఁడైన యుధిష్ఠిరుఁడు సవనార్హమగు నశ్వము భద్రావతీపురమున నున్నదని విని దానిని దెచ్చుటకుఁ బవనతనయునిఁ బంపెను. భీముఁడు తత్పురాధీశ్వరుఁ డగు యౌవనాశ్వుని జయించి వీతిని దెచ్చి ధర్మనందనునికి సమర్పించెను. ఈ యుదంతము జైమినికవికల్పితమే కాని వ్యాసముని గ్రంథమం దెచ్చోటను గానము. ♦భీముని పరాక్రమవిషయ మెట్లయినను జొప్పించి యభివర్ణించుట కొకకథ కల్పింపఁబడి యుండవచ్చును. మధ్వాచార్య ప్రతిష్ఠాపితమైన వైష్ణవమతము నవలంబించినవారికి భీముఁడు ముఖ్యప్రాణదేవర గదా! కావున నీ జైమినికవి పశ్చిమదేశస్థుఁడగు మాధ్వమతస్థుఁడేమో!

## అశ్వమేధపర్వము

ధర్మనందనుని అశ్వమేధయాగ మొనరింపుమని వేదవ్యాసుఁడు పురికొల్పుటయు, తత్క్రతు నిర్వహణార్థము వలయు ద్రవ్యసముపార్జనకై మరుత్తుని కథ నివేదించుటయు, నిత్యాదిపూర్వభాగ ముభయగ్రంథములయందును సమానము. యజ్ఞాశ్వమును దెచ్చుటకుఁగాను భీముని భద్రావతీపురమునకుఁ బంపుట వ్యాసభారతమందు లేక జైమినిగ్రంథమున మాత్రమే యున్నదని యిదివఱకే చెప్పితిని. సవనాశ్వసంరక్షణమునకై వెనువెంట నర్జునునిఁ బంపుట నుభయగ్రంథములయందును సమానము. అటు తర్వాత రెండు గ్రంథములు చాలవఱకు భేదించుచున్నవి.

---

* జైమినికవి మహారాష్ట్రదేశస్థుఁడనిచెప్పుటకు గ్రంథమం దింకను చాలనాధారములు కాన్పించుచున్నవి. ఆతఁడొకచోట సింహబృహస్పతులుగూడినప్పుడు గోదావరీపుష్కరముయొక్క పాపాపహారణశక్తినిగూర్చి ప్రశంసించెను.

"సర్వతీర్థాని గచ్ఛంతి తావత్పాపప్రణాశనే, యావన్న సింహగే జీవే దృశ్యతే గౌతమీనదీ."

వేఱొకచోట భీముని వంటకముల నభివర్ణించుచు పశ్చిమ హిందూదేశమందలి భోజ్య పదార్థముల నన్నిటిని పేర్కొనెను. ఇట్లనేకములు చిన్నచిన్న నిదర్శనములుకూడ కాన్పించుచున్నవి.

♦ భీముని సూపకారకౌశలముకూడ నప్రస్తుతాంశమైనను గ్రంథాంతమున వర్ణింపఁబడినది. భీముని మాహాత్మ్యము నిరూపించుటకై వీని నన్నిటిని కవి కల్పించి యుండవచ్చును.

ప్రాయశః యీభేద మర్జునుని దిగ్విజయవిషయ మునఁ గన్పట్టుచున్నది. ఈదిగ్విజయము వర్ణించుటలో వ్యాసకవి వింధ్యోత్తర రాజ్యములకుఁ బ్రాముఖ్య మిచ్చుటయు, జైమినికవి వింధ్యమునకు దక్షిణభాగమున నున్న రాజ్యములకుఁ బ్రాముఖ్య మిచ్చుటయుఁ గాన్పించుచున్నది. వ్యాసముని త్రిగర్త, ప్రాగ్జ్యోతిష, సింధు దేశములతోఁ బ్రారంభించి తరువాత నర్జునునికుమారుఁడగు బభ్రువాహనుఁ డేలుచున్న *మణిపూరపురముఁ జెప్పెను. అటుతరువాత మగధ, వంగ, పుండ్ర, కోసలదేశములను, పడమపడి కాశి, శృంగ, కోసల, కిరాట, దాశార్ణములను చేర్కొనెను. ఈ దేశములన్నియు వింధ్యమున కుత్తర భాగమున నున్నవియే. వీనికన్నిటికిఁ గలిపి యుత్తర హిందూస్థానమని పేరిడఁబడుచున్నది. ఉత్తరదేశములను జయించినతర్వాత అర్జునుఁడు దక్షిణదిక్కునకు వెళ్లెనని వ్యాసభారతమున జెప్పఁబడినది. నిషధ ద్రవి డాంధ్ర మాహిషములును, దరువాతఁ బశ్చిమరాజ్యము లగు సౌరాష్ట్రము, గోకర్ణము, ద్వారక, గాంధారము మున్నగునవియు నర్జునుఁడు గ్రుమ్మరించినట్లు వ్యాసకృతిలో రచించిన దిగ్విజయక్రమము.

ఇంక జైమినిభారతమునందు దిగ్విజయవర్ణన ప్రారంభముననే—

ఉ. కదలెన్ దత్తురగోత్తమంబు నగర
గ్రామావనీభృన్నదీ
నదవేశంతసరిత్తటాకతట నా
నాభూమి సీమాదురా
సదకాంతార కఠోరమార్గము లవ
ష్టంభంబునం దాఁటి యా
మ్యదిశా మండలమండనం బయినయా
మాహిష్మతిన్ జేరఁగన్.

అధ్వరాశ్వము నానాదేశములుఁ గ్రుమ్మతి దక్షిణదిశనున్న మాహిష్మతీపురముఁ జేరినదఁట. ఈ మాహిష్మతీపురము నర్మదానదీతీరమున నున్నది. అనఁగా వింధ్య పర్వతములకు దక్షిణభాగమున నున్నది. కావున జైమినికవి వింధ్యపర్వతముల కుత్తరమున నున్న దేశములతోఁ బ్రసక్తిఁ బెట్టుకొనక, వాని పేళ్లయినను జెప్పకయే, దిక్క్రమముగ సూచించి, దక్షిణహిందూస్థానముతోఁ బ్రారంభించి మొట్టమొదటఁ గనుపించెడు మాహిష్మతీపట్టణముతో మొదలుపెట్టెను. వ్యాసభారతమందు దక్షిణహిందూ దేశముల పేళ్లయినను జెప్పఁబడినవి. జైమిని భారతమున నుత్తరహిందూదేశముల పేళ్లుకూడ సూచింపఁబడలేదు. ఈవిషయము ముఖ్యముగ స్మరింపఁదగినది.

మాహిష్మతీపురము తరువాత మఖాశ్వము చంపకాపురముఁ జేరెను. అటుతరువాత స్త్రీమండలము నకుఁ బోవ నాదేశపురాణియగు ప్రమీల యర్జునునితోఁ బోరి యావీరుని ప్రేమాతిశయమున కాస్పదమయ్యెను. స్త్రీమండలము తరువాత వృక్షదేశమునకును, దానిని గడచి మణిపురమునకును యజ్ఞాశ్వ మరిగెను. మణిపురము నేలెడు ప్రభువగు బభ్రువాహనుఁ డర్జునునికిఁ జిత్రాంగదయందు జనించినవాఁడు. తండ్రికొడుకులకు ఘోరసమరము సంఘటిల్లెను. అందు గంగాశాపగ్రస్తుఁడైన యర్జునుఁడు బభ్రువాహనునిచేఁ జెగి, మున్ను కుశలవులతోఁ బోరి మూర్ఛిల్లిన శ్రీరామచంద్రుని వలె సంగ్రామతలమున నొగ్గెను. § ఈసందర్భమున శ్రీరామచరిత్రము సంగ్రహముగా వ్రాయఁబడినది. ఇది వ్యాసభారతమున లేదు.

---

* వ్యాసకృతినిబట్టి యీమణిపూరపురము అస్సాందేశములోనున్న మణిపురమని కొందరి యభిప్రాయము.

§ బభ్రువాహనుని రాజ్యమగు మణిపురము లేక మణిపూరపురము రెండుగ్రంథములలోను సమానముగ నున్నది. నిజముగ నర్జునుని దిగ్విజయవిషయములో నుభయగ్రంథములయందు సమానముగ నున్నది. ఈ మణిపురపు రాజు బభ్రువాహనుని చరిత్రమే. ఐనను వ్యాసభారతమం దొకచోట మణిపురము ఉత్తర హిందూస్థానమందలి అస్సాంలోనున్న మణిపురమనియు, ఆగ్రంథమందే వేఱొకచోట దక్షిణ హిందూస్థానమందలి పాండ్యరాజ్యమందున్న మణిపూరపురమనియుఁ జెప్పబడినది. జైమినిభారతమునుబట్టి చూడఁగ నీమణిపురము మైసూరుదేశములో నున్నట్లు రైసుదొరగారు తమ "కన్నడవాఙ్మయచరిత్రము"నఁ జెప్పియున్నారు.

# ౪౨వ భారత జాతీయ మహాసభ—చెన్నపురి



సభామంటప సింహద్వారము



నాయకుల సభామంటప గమనము

కాంగ్రెసునగరమున



అధ్యక్షులు మొదలగువారు



మరికొందరు

మణిపురము విడిచి మఖాశ్వము రత్నపురముఁ జేరినది. ఆపైన సారస్వతపురమునకు, నటుతరువాతఁ గుంతల దేశమునకును బోయెను. కుంతలదేశమునఁ గృష్ణార్జునులు చంద్రహాసుఁ డనురాజుతో సఖ్యము చేసికొని, బకదాల్భ్యుఁ డను వింశతిబ్రహ్మకల్పుఁడగు వృద్ధమహామునిఁ దోడ్కొని యుత్తరదిశ కరిగి, సింధుదేశముఁ బ్రవేశించి, క్రమముగఁ గరిపురముఁ జేరిరి.

కావున పైనఁ జేర్కొనిన దేశములలో బభ్రువాహనునిరాజ్యమైన మణిపురమును, సైంధవునిరాజ్యమైన సింధుదేశమునుదప్ప వ్యాసకృతిలోనున్న దేశములతో సరిపోవున వేవియు జైమినిగ్రంథమునఁ గానరావు.

(2) మఱియొక విషయము: వ్యాసభారతమున లేని యద్భుతచర్యలు, శ్రీకృష్ణధ్యానమాహాత్మ్యములు జైమినిభారతమునఁ బ్రతికథయందు నావహించి యున్నవి. సుధన్వుఁడు తప్తతైల కటాహమునఁ ద్రోయఁబడినను నించుకైనఁ గ్రించుదనమునొందక సుఖముగ బయటకువచ్చెను. ఈయద్భుతశక్తి యతనికి నేకపత్నీవ్రతత్వమునను, సంతతకృష్ణధ్యానమానసత్వమునను గలిగెనఁట.

బభ్రువాహనుం డర్జునుని శిరంబు దెగవ్రేయ నాశిరంబును నాగకుమారు లపహరించి పాతాళంబున మఱుఁగు పెట్టిరి. అర్జునుని బ్రతికించుటకు సంజీవికరణిని దెచ్చి యతని శిరస్సునకై వెదుకగ నెచ్చోటను గాన్పింపలేదు. అప్పుడు సమస్తజనులు జనార్దనుని వేఁడుకొనిరి. ఆమహానుభావుఁడు ధ్యానపరవశుఁడై యర్జునుని యుత్తమాంగమును రమ్మని యాజ్ఞాపించెనఁట. ఆయంగము రోదసీకుహరము వదలి క్షణములోఁ గృష్ణుని పాదములయొద్దఁ బడెనఁట. ఈవృత్తాంతము వ్యాసమహాభారతములోఁ గానము. కేవలము జైమినికవి కల్పితము.

రత్నపురాధీశ్వరుఁడగు మయూరధ్వజుని కుమారులు దుర్జయులై కృష్ణార్జునుల నెదిరింప మాయారూపుఁడగు శ్రీకృష్ణుఁడు బ్రాహ్మణవేషమున బర్హిర్ధ్వజునికడ కేఁగి యారాజు మేనియందు సగ మిమ్మని వేఁడెను. ఆరాజసత్తముఁ డట్లు కానిమ్మని తనమేని సగము గోయించుకొని యదునందనున కొసఁగెను. ఇట్లనేకాద్భుతకథలు గ్రంథమందుఁ గానఁబడుచున్నవి.

కుంతలేశుఁడగు చంద్రహాసుని చరిత్రము జనరంజకముగ నుండి నిరంతర కౌతూహలముఁ గలిగించుచుండును. ఈరాజసత్తముని చరిత్రము సామాన్యముగాఁ దెలియనివా రుండరు. మంత్రియగు దుష్టబుద్ధి కుతంత్రములును, విష్ణుభక్తిపూరితుఁడగు చంద్రహాసుని యవ్యాజప్రభుభక్తియు, మంత్రికుమారుఁ డగు మదనుఁడు విషమునకు బదులుగ విషయ నిచ్చి వివాహము చేయుటయు నిత్యాదికథాంశములు సార్వజనీనములు. ఈకథయంతయు జైమినిగ్రంథమునకు నాయకమణివలె విరాజిల్లుచున్నది. ఇతర కథలు సయిత మిట్లే లోకవ్యవహార చాతుర్యమునకు నిదర్శకములుగఁ గల్పింపఁబడినవో నీగ్రంథ మెంతయో హృదయరంజకముగ నుండి వ్యాసభారతమున కింతమాత్రము వెనుదీసి యుండదు.

(3) మఱియొక యంశము గుఱించి ముచ్చటించి యీభాగమును విరమించెద.

వ్యాసభారతములో యుద్ధానంతరమున సమస్తబాంధవుల మరణమునకు శోకించుచున్న ధర్మపుత్రుని యొద్దకుఁ గృష్ణద్వైపాయనుం డేతెంచి యనేక విధంబులగు చిత్తసాంత్వన వచనంబులఁ జెప్పఁదొడంగి సత్త్వరజస్తమోగుణాదికములగు సృష్టితత్త్వ విషయములను, జననమరణాదికంబు లగు సంసృతి విషయములను, జ్ఞానకర్మయోగాదికములగు ముక్తిసాధన విషయములును, జీవయాత్రాప్రధానంబులగు ధర్మాధర్మ వివేచక విషయంబులను, ఇత్యాదిమహర్ష్యుచితంబులగు పారమార్థికభౌతికప్రధానాంశములఁ బ్రబోధించుచుఁ జిత్తసమాశ్వాసనముఁ గావించెను. జైమినిభారతమం దట్లుగాక వ్యాసభట్టారకులు వచ్చి చాతుర్వర్ణ్య ధర్మములు కొంత దెల్పి వెంటనే జారస్త్రీ లక్షణంబు లుపదేశించుటకు మొదలిడిరి. జారిణుల లక్షణములు, వారిసాంకేతికములు, బంధకీవధూటుల మాయోపాయములు, అభిసారికల కపటచేష్టితములు, ఇత్యాదికుటచేటీవిటకోటుల కుటిల నటనలఁ బ్రకటించి బంధుజన.

మరణ శోకవిహ్వలుండైన ధర్మనందనునకు మనశ్శాంతి గలుగఁజేయ యత్నించెను. ఈ రెండు గ్రంథములయందలి రసభావముల యౌచిత్యవ్యత్యాసము దీనివలన విశదము గాఁగలదు. వ్యాసభారతాన్నాయ మందలి పరమార్థగౌరవమును, రసభావసముచిత సౌందర్యంబును జైమినిభారతమందుఁ జాలవఱకు మృగ్యము. ఏతత్కారణంబునఁగూడ జైమిని గ్రంథ మర్వాచీనమనియే చెప్పనొప్పు. *

భాషాంతరీకరణము

ప్రాచీనాంధ్రకవులు భారతాది గీర్వాణగ్రంథముల నెట్లు దెనిఁగించిరో యాలాగుననే పినవీరభద్రకవి జైమినిభారతమును దెనిఁగించెను. పద్యమునకుఁ బ్రతిపద్యమును, శబ్దమునకుఁ బ్రతిశబ్దమునుఁ జెప్పక,వారు గ్రంథములను స్థూలదృష్టిని బరికించి కథాభాగము దప్పకుండ రసపోషణకొఱకు కొంత పెంచియు, కొంతతగ్గించియు, కొంతకల్పించియు, కొంతయుజ్జగించియు నిట్లు స్వతంత్రముగ మార్చి సంస్కృతగ్రంథముల నాంధ్రీకరించిరి. వీరభద్రకవియు నామార్గమునే యనుసరించి యీతద్గ్రంథమ ననువదించెను. §

మాతృకయందలి గుణదోషములు, అనుచితపరిహాసోక్తులు, స్వభావవిరుద్ధాలంకారములు, యథామూలముగా గ్రహింపఁ బడినవి. కావున నీతని గ్రంథమందేలోపములు నిర్ణయించినను, ఆలోపములు ప్రాయికముగా మూలమున నున్నవనియే నిశ్చయింప వచ్చును. కథాభాగములనుగాని, కథాసందర్భములనుగాని యెచ్చోట నతిక్రమింపలేదు. రసపుష్టికొఱకుఁ చైనఁ జెప్పినట్లు కొలఁదిమార్పులు చేసినను గ్రంథము కేవలము మూలానుసరణముగా నున్నదనియే చెప్పవచ్చును.

శకుంతలాపరిణయము, జైమినిభారతము—ఈరెండు గ్రంథముల రచనాపద్ధతులయందుఁ గొంతభేదము కాన్పించుచున్నది. శకుంతలాపరిణయమునఁ గొంతవఱకు భారతములోని కథను, గొంతవఱకు కాళిదాసుని నాటకములోని కథను జేర్చి యొకవిధమైన స్వతంత్రగ్రంథముగా వ్రాసెనని యిదివఱలోఁ జెప్పితిని. జైమినిభారతమునందట్లుగాక కేవలము మూలానుసరణముగఁ బోయినట్లు తోఁచుచున్నది.

జైమినిభారత మంతయుత్కృష్టగ్రంథమని చెప్పుటకవకాశములేదు. నృసింహరాయలు దీనికిఁ బురాణములలో నపూర్వమని గొప్పప్రశస్తి యిచ్చుటకుఁ దగినకారణములు గనఁబడవు. శ్రీకృష్ణభగవానుల మహిమ యెల్లెడల నావహించియుండుటదక్క వేఱుకారణములు గాన్పింపవు. కవి స్వవిషయమునఁ గాని, గాథా సంప్రదాయమనోహరత్వమునఁగాని, నీతికథా నిర్మాణ చాతుర్యమునఁగాని భారత భాగవతాది పురాణముల కీగ్రంథము సరిరాదు. రసనిరూపణ విషయమందు నిసర్గభావస్వారస్యములేమిని రసాభిజ్ఞుల కచ్చటచ్చట హృదయక్షోభము గావింపుచుండును.† ఇట్టి దోషసంకీర్ణమయిన

---

* జైమినిభారతము (మూలము) సమగ్రముగాఁ జదివినయెడల నాగ్రంథము భారతరామాయణాది ప్రాచీన గ్రంథములతో సమానమైన పురాణగ్రంథము కాదనియు, హిందూదేశమున రాజకీయవిప్లవములు గలిగి హిందూ జనసంఘములు తొంటిశీలమును, కులాచారములను బరిత్యజించి వర్ణసంక్రమము బొందినతర్వాతను, శైవవైష్ణవమతముల యన్యోన్య సంఘట్టనము ప్రారంభించినవెనుకను వ్రాయఁబడిన గ్రంథమనియు తెలియకమానదు. కవిత్వము ప్రాచీనకవులమాదిరిగ నుండదు. సంస్కృతవాఙ్మయ మవసానదశకు వచ్చినతర్వాత వ్రాయఁబడినట్లు గోచరమగుచుండును. గ్రంథ మేవిషయమందును మిక్కిలిశ్లాఘనీయము కాదు.

§ గ్రంథవిస్తరభీతిచేఁ గాఁబోలు, మూలమందున్న కథారసపోషకములగు సంభాషణాదికములు సామాన్యముగా విడువఁబడినవి.

† తక్కిన పురాణములయందువలె కేవలము అవర్య ప్రాయములగు నీతికథలను కల్పించుటయేకాక, ఆనాటి హిందూసంఘమును యథార్థముగా నిరూపించెడు ప్రయత్నము చేయఁబడినది. పాపము! అప్పటి హిందూసంఘము చాల హీనస్థితిలో నుండుటచేత అవినీతివర్ణనము లెక్కువగా నున్నవి.

గ్రంథమును భాషాంతరీకరణముఁ జేయుట క్లిష్టమగు నుద్యమము. మఱియొకకవితప్పులను దాను నెత్తిమీఁదను బెట్టికొని మోయుటయో, లేదా యాకవీశ్వరుని దారిని విడిచిపెట్టి తాను స్వతంత్రముగాఁ బోవుటయో—యీ రెండుపద్ధతులలో నేదో యొకదాని నవలంబింపవలసి యుండును. పాపము, పినవీరభద్రుఁడు మూలకవి తప్పుల నన్నిటిని తనతలపై నిడికొని భరించుటయే యాత్మగౌరవమని యోచించినట్లు కానిపించుచున్నది.

ఈజైమిని గ్రంథమును లక్ష్మీశుఁ డను కన్నడకవి కన్నడభాషయం దనువదించెను. ఆ యనువాదము పినవీరభద్రుని కాలమునకుఁ దరువాత జరిగియుండునని తోఁచుచున్నది. పైఁజెప్పిన జైమినిభారతభాషాంతరీకరణ సమస్య లక్ష్మీశుఁడు రెండవ విధముగాఁ బరిష్కరించెను. అనఁగా రసభావ దోషము లున్నచోట్లఁ దాను విడిచి పెట్టుటయో, లేక చాలవఱకు మార్చివేయుటయో చేసినవాఁ డయ్యెను. ఈమహాకవి భాషాంతరీకరణ మెంతయు ముద్దులు మూట గట్టుచున్నది. మూలగ్రంథము నన్నివిధముల మించినదిగా నున్నది. భావవైరస్య మెచ్చటను గాన్పింపదు. వర్ణనలు బహు మనోహరములు. భావనిరూపణము అనుభవసిద్ధము. ఏయే విషయములో నేయేరసము స్వాభావికమో యాయా రీతిని నభివర్ణింపఁబడినది. పాత్రపోషణము సర్వదా శ్లాఘనీయము. కావున నన్ని విషయములలోను బినవీరన కృతికంటె లక్ష్మీశుని గ్రంథము సర్వాంగసుందర మని నాకుఁ దోఁచుచున్నది. ఇట్టి మనోజ్ఞమగు గ్రంథమును సమయోచితముగా నాంధ్రవాఙ్మయ విద్యార్థులకు నిరూపించుట యుత్తమమార్గ ప్రదర్శకమని భావించి యీ క్రింద నుదాహరించిన సందర్భములను మూలగ్రంథమున నుంచియుఁ, బినవీరన లక్ష్మీశుల గ్రంథములనుంచియు సమానభాగముల నుద్ధరించుచున్నాను.

(1) ద్వారకాపురవాసులఁ దోడ్కొని శ్రీకృష్ణుఁడును, భీముఁడును హస్తిపురమునకుఁ బోవుచు దారిలోఁ దమలోఁ దామిట్లు బావమఱఁదుల పరిహాసముఁ జేసికొనిరఁట. ఈసల్లాప మెంత విరసముగాను, అశ్లీలముగాను నున్నదో చూడుఁడు.—ప్రయాణికులలో నున్న యొక వేశ్యదూతికనుజూచి శ్రీకృష్ణుఁ డిట్లుచెప్పెనఁట:—

శ్లో. స్థూలోదరం భీమసేనం వరం వరయ శోభనే!
త్వంతు శంభలింగచ్ఛాశు భీమం దంతవివర్జితమ్.

అని. పిదప:—

శ్లో. భీమస్తు ప్రత్యువాచేదం రాక్షసీ మేగృహే ప్రియా,
వారయిష్యతి మాయాతు భక్షయిష్యతి త్వాంహిసా;
తస్మాత్ కృష్ణగతాఃసంతు సర్వాః దంతవివర్జితాః,
కృష్ణాభిషక్తచిత్తానాం సర్వత్ర సుఖమేవహి.

ఈభాగమును బినవీరభద్రుఁ డిట్లనువదించెను:—

గీ. కలయఁబడి మూఁపు మూఁపునఁ దలఁగఁ ద్రోయ
రాని సందడి నడచు పౌరవ్రజంబు
నరయుచును వచ్చు వృద్ధవేశ్యాజనంబుఁ
జూపి నవ్వుచు హరి వాయుసుతున కనియె.

ఉ. వీరిఁ బరిగ్రహింపు మిది
వేళ సమానలు నీకు భీమణా
కారకఠోరమన్మథవి
కారగుణంబుల నన్ననవ్వి యు
మ్మారుతి పల్కె నిట్టికొఱ
మాలినజంతలఁ జక్కఁబెట్ట నీ
భారము వన్నె కెక్కు దుర
వస్థలు నీకరలాలనంబునన్.

కాని లక్ష్మీశకవి దీనిని స్పృశించుటయే లేదు.

(2) శ్రీకృష్ణుఁడు పురజనసహితముగా మార్గమం దొక కాసారతీరమున విడి సంధ్యాసమయ మగుటచే నా సరోవరము దర్శింపఁగోరి రుక్మిణీసమేతుఁడై మలయానిల సంచలితారవిందబృందంబుల వీక్షించుచుఁ దనప్రేయసితో నిట్లు సంభాషించెనఁట.

(పద్మినీలత నుద్దేశించి)

శ్లో. ఇమాం త్వం పశ్య సుభగే,
రవిభార్యా మనిందితామ్,
గజైర్గృహీతాం ముక్తాంచ
మరాళై ర్విదళీ కృతామ్.

చంచరీక ద్వయావృతాం
    స్త్రీణాం చిత్తంతు చంచలమ్,
నిజం నాథం వంచయిత్వా
    రమయంతి పరం జనమ్.

అవిలోక్య పరం కాంతం
    మ్లాయంతి చ నిశాగమే,
హృదయే కలుషం గృహ్య
    మత్పదం ప్రస్నవంతి చ.

*    *    *    *

ఇట్లు శ్రీకృష్ణుఁడు స్త్రీశీలమును నిర్హేతుకముగాఁ దెగడినతర్వాత రుక్మిణీదేవి తనవల్లభునితో నిట్లనియె:

శ్లో. హరిం జానాతి నాథం వై
    పద్మినీ పద్మలోచన,
స్వసుతా నాగతాన్ మత్వా
    పుష్ణాత్యేషా గృహాగతాన్,
పుత్రపౌత్రాదికాన్ నాథ
    మత్పదాదీన్ జనార్దన!

*    *    *    *

ధర్మపత్నియు, సాధ్వీమతల్లియు, పతివ్రతాశిరోమణియు నగు రుక్మిణిలో నున్నతణ్ణేఁ, బవిత్రమగు సంధ్యాసమయమున,భూమ్యాకాశములు శాంతమూర్తులై తేజరిల్లుచుండఁ, బ్రకృతిమోహన సరోవరవాఃపూరవినీలకాంతులతో ప్రకాశించుచుఁ, బుండరీక మండమండనోద్దండంబున విలసిల్లుచుఁ, బుష్పంగయనినాదగానమాధుర్యంబునఁ దైలోక్యనాథుని సేవించుచున్న సమయంబున, శ్రీహరిచిత్తంబున నాయత్తంబులగు భావంబు లివియా? అట్టిసమయమున సకలభువన జననీజనకులగు లక్ష్మీనారాయణు లన్యోన్యాత్మానుభవము లిట్లా వెలిపుచ్చుకొనియుందురు? ఈసల్లాపము నాకెంతయు విరసముగా నగపడుచున్నది.

ఈభాగము పినవీరన యీక్రిందివిధముగా భాషాంతరీకరించెను:

సీ. కమలదళాక్షుఁ డంత నిజ
        కామిని రుక్మిణితోడ నిట్లనున్
గమలినిఁ జూచితే ప్రియుఁడు
        గన్గొనరామి మరాళసామజ
భ్రమర కులంబు పైఁ బడఁ గ
        రంబు సుఖించెనుఁ గామ మెప్పుడున్
రమణునికంటె సెన్మిది గు
        ణంబులుగాద లతాంగి కారయన్.

క. అన విని రుక్మిణి విభుతో
ననుఁ దనయునివాహనంబు హంసము సనవా
హన మేనుఁగు దేఁటులయెడఁ
దనుజాభావముగుఁ గానఁ దగ దిటు పల్కన్.

లక్ష్మీశకవి దీనిని గొంత సుకుమారముగను రసవంతముగను మార్చి భాషాంతరీకరించెను.

రాజముఖి నోడి సరోవరద పద్మినిగ
రాజహంస క్రీడెపున్నాగ కేళివి
భ్రాజితమధుపగోష్ఠి సంపమురలిగ
తానరసి యాదపళదెంతో.
స్త్రీజనకె సహజమిదు మేలె కర్దమజాతె
మాజువళిదెయొళిర్ద కృష్ణతెయె నిదుజగకె
సోజిగలె చంచలె యాలాపతియనెణె
సునళేపేళెం దొడితెందళు
దేవనీంపద్మినిగె పళివనారోపిసువు
దావసంపుత రాజహంస పున్నాగమధు
పావళియనోవలాగద మాతె మక్కళొడ
గూడిర్ద్దాడెం ధరయొళు
జీవెనంనిది డాదు దుమంకమిల్లితా
నావిర్ధ్వవిసిదొడెం కృష్ణహృదయకెదోష
మావుదాణ్మంగె నడనరుగిదొడె చంచలెయె
నాపరియె విదనెందళు
పురుష నోర్వంగె నారియరుంటు పలబలీ
ధరయొళంగ నగపతి యొర్వనే గతియెంబ
పరివిడియనరుహిసువడా పీర్వరిల్లదో
ర్వరు మిల్లమిన్ను బరిదె

సరసిజేక్షణ పద్మినియ దూషిసలు బేడ
పరమపావనెయందు శివను త్తమాంగ గీ
శరిసిననెనల్పతిత్రవతె యల్లదిహా శె పే
కెందు రుక్మిణి నుడివళు.

ఆకాలనిగట్టున శ్రీకృష్ణుఁడు విడిది దిగియున్న కాలముననే చుట్టుపట్ల నివసించియున్న గొల్లలు స్త్రీపురుషులు గోపాలశిరోమణిని దర్శించుటకై వన్యఫలాదుల నుపాయనములుగాఁగైకొని ఆయాదవసింహునిఁ జుట్టుకొనిరి. ఈసన్నివేశము మూలగ్రంథమున సామాన్యముగ వర్ణింపఁబడినది. కాని పినవీరభద్రుఁడు దానిని క్రొత్త కల్పనలతోఁ బరిపోషించి చాలరసవంతముగను, మనోహరముగ నుండునట్లు చేసెను. గ్రంథవిస్తరభీతిచే దానినంతయు నిట నుద్ధరించుటకు వీలులేక, ఒండు రెండు పద్యముల మాత్ర ముదాహరించెదను.

సీ. కోరగించెదు కొండగోగుఁబువ్వులచాయ
దీవన్నెగోర్పడం బెట్టు గలిగె
మెఱుఁగుఁజుక్కలచాయ మించు నీతెల్లని
గురువిందపే రెందుఁ గూర్చుకొంటి
నిగుఱు గప్పనిచంద్రునిప్పు కైవడి నున్న
దీకొడ్డిప్రాస నీకెవ్వఁడిచ్చెఁ
బోలసినగబ్బు కంపులు సోడుచుట్టైడు
నీనల్లతిరునామ మెచట దొరకె
జడలు మెడమీఁద వ్రేలెడు జల్లితోఁక
నేడ సవరించుకొంటివి బోడ కోడె
యనుచు నాడెడు మూఢవాక్యముల కలరి
శ్రీధరుఁడు వారిఁ గృప నాదరించె నపుడు.

సీ. తెఱవయొక్కతె జుంటితేనె కానుకచేసి
తలఁపించె నధరామృతంబు చవులు
తరుణియొక్కతె పూవుచెండ నూడిదఁ బెట్టి
హేలాపరీరంభ మెచ్చరించెఁ
బడఁతియొక్కతె బిల్వఫల ముపాయనమిచ్చి
పచరించె ఘనకుచస్పర్శనంబు
నువిదయొక్కతె పింఛ ముపదగా నర్పించి
చూపించెఁ గుంతలాక్షేపణంబు
నెమ్మి నీరీతిఁ జేవర్ణనమ్ము లొసఁగి

ప్రియులసన్నిధి మర్మగర్భితముగాఁగఁ
బ్రౌఢగోపాంగనలు తమ ప్రాఁతవలపు
వెల్లివిరిఁజేసి రిందిరావల్లభునకు.

లక్ష్మీశకవి దీనినంతయు నేలాకో చల్లగ జాఱవిడిచెను. ఈజైమినిభారతమందు భారతవీరులును, దదితరయోధులును సాహసకార్యములను జేయఁగడంగినప్పు డెల్లను ఘోరమైన ప్రతిజ్ఞలనుజేయుచుండుట తఱచు గాన్పించుచున్నది. ఇట్టి వైపరీత్యము వ్యాసభారతమందు కానము. వ్యాసభారతమందుఁ జేసిన ప్రతిజ్ఞలు మహాపురుషుల కుచితమైన భావములతో నలరారియున్నవి. జైమినిభారతమం దట్లుగాక ప్రతిజ్ఞలు నీచమైనవి; అశ్లీలమైన పురుషోక్తులతో కూడి యున్నవి.

వీని నన్నిటిని పినవీరభద్రకవియు యథావిధిగా ననువదించెను. లక్ష్మీశకవి యట్లు చేయక యచ్చటచ్చట స్వతంత్రముగా మార్చివేసెను.

పినవీరభద్రుని భాషాంతరీకరణమునందు మఱియొక విశేషము గోచరమగుచున్నది. మూలమందున్న కథాసందర్భములలో రసప్రత్యాయకముగా నాయానాయకులును, నాయికలును జరిపిన సంభాషణాదులను సామాన్యముగఁ బినవీరభద్రకవి యనువదింపలేదు. కథాసరణి మనోహరముగా నుండుటకు కొన్నికొన్ని క్రొత్తకల్పనలు, క్రొత్తవర్ణనములు జేర్చియుండెనుగాని సంభాషణములను మాత్రము తఱచు విడిచి పెట్టెను. బహుశః గ్రంథసంగ్రహముకొఱ కిట్లు చేసియుండెనని యూహింపవలసియున్నది. సీతావనవాసకథలో సీతాదేవిని వనమునకుఁ బంపకపూర్వము లక్ష్మణభరతశత్రుఘ్నులు తమ యన్నగారి మనసు మరలించి కృతనిశ్చయమును దొలఁగించుటకాయనతో జరిపిన వాదప్రతివాదములను బొత్తిగా విడిచి పెట్టెను. ఇట్లే యితరసందర్భములయందును సంభాషణములను జాలవఱకు భాషాంతరీకరించుట మానుకొనెను.

## శిల్పము, శైలి

వీరభద్రకవి శైలినిగుఱించి కొంతవఱకు శృంగారశాకుంతల విమర్శనమున వచించితిని. అతని శైలియందు

ముఖ్యముగా మృదులశబ్దఫణితి గాననయ్యెడిది. శృంగారశాకుంతలమునఁ దన్నుఁ గూర్చి చెప్పికొనుటలోఁ దాను నన్నయభట్టు, తిక్కనసోమయాజి, నాచనసోముఁడు, శ్రీనాథునివలెను పదముల కూర్పు చేయఁగలనని చెప్పికొనెను. ఈవిధమైన నుతికి నీయన కొంతవఱకర్హుఁడనియే నాతలంపు. తాను పేర్కొనిన యాంధ్రమహాకవులవలెఁ గాకపోయినను సామాన్యకవులకంటె నెక్కువవాక్సారిధి చూపెనని చెప్పనొప్పు. "నృత్యతి యద్రసనాయాం వేధోముఖరంగలాసికా వాణీ"యని వామనభట్టబాణుఁడు చెప్పిన ట్లీకవియు వాగ్విలాసములు సువిశేషముగఁ జూపఁగలిగిన సమర్థుఁడు. ఆకారణముచేతనే కాఁబోలు మనవా రీతనిని గుఱించి పెక్కులు పుక్కిటిపురాణములను గల్పించిరి. సరస్వతీదేవి స్వయముగ నీజైమినిభారతము నొకనాఁటిరేయి వ్రాసెననియు, ఈ కవి "వాణి నారాణి" యని తన వైదుష్యపారంగతత్వప్రభావమును నెఱపుకొనుచుండె ననియు-ఇత్యాదికథలు మనదేశమందున అవిమర్శక పండితావళి చెప్పికొనుచుండిరి.

ఎట్లైనను శ్రీనాథునివలె నీకవియు సరస్వత్యుపాసకుఁ డని తోఁచుచున్నది. ఇతనికి శారదాదేవి కృపాసమృద్ధి ననన్యసామాన్య పాండిత్యగరిమ లబ్ధమైనది. "విద్యా దదాతి వినయం" అను నార్యోక్తి ప్రకారము వైదుష్యవిశేషము వినయసౌశీల్యమును వృద్ధి నొందింపవలసినదే కాని యీ కవివర్యునియం దట్లు జరుగలేదు. ఈతనికి పాండిత్యముకంటె నహంభావము, నౌద్ధత్యము చాల హెచ్చు. కవిసార్వభౌముఁ డగు శ్రీనాథుఁడు ముదిమియం దైనను వినమ్రభావమును కనుపఱుపఁ గలిగెను. ఈ కవివర్యుఁ డట్టి భావపరిణతి నెన్నఁడును బొందిన ట్లగపడదు. జైమినిభారతగ్రంథాంతమున *"కుకవిమల్లకపోల్లసత్కులిశహస్తపల్లవుఁ" డని తన్నుఁ గూర్చి చెప్పికొనెను. ఈయనచే ఱంపపుఁగోఁత నొందిన మల్లన కుకవి యెవరో తెలిసికొనఁ దగినవిషయమే.

జైమినిభారతగ్రంథాదిని నృసింహరాయలు తాను గృతినొంద నిచ్చగించిన గ్రంథ మెట్లుండవలెనో నిరూపించుటకు,

"అల్లన విచ్చు చెంగలువ
లందు రజంబును గప్పురంబు పైఁ
జల్లఁగఁ జల్లనై వలచు
సౌరభముల్ వెదచల్లుభావముల్
పల్లవహస్త చన్నుఁగవ
పయ్యెద జీబుగఁ దోఁచుభాతిగాఁ
గొల్లలుపుట్టి వీరన య
భిజ్ఞుఁడు చెప్పఁగ నేర్చుఁ గబ్బముల్."

అని కవిత్వరసభావముల నుగ్గడించి వీరభద్రకవిపంకఁ దిరిగి, "మామకమనోరథం బెఱిఁగి కృతిచెప్ప నుద్యోగించితివి" అని తన్నుఁగూర్చి యనినట్లు కవి చెప్పికొనెను. తనకవిత్వమునందు రసభావములు బహుమృదువుగాను, సుకుమారముగాను, సౌరభభరితములుగాను నుండునని యాతని యాశయము. కాని అస్మదాదుల యభిప్రాయము వేఱుగా నున్నది. ఉభయగ్రంథములు జాగ్రత్తగాఁ బరిశీలించి చూచితిని గాని భావములయం దెక్కువ విశేషములు కనుపించలేదు.

శబ్దచాతుర్యము ప్రసిద్ధము. కవితాప్రభావ మనర్గళము. రసవికాసము ప్రకీర్ణము. ఈదృశంబులగు సుకవితాలక్షణములు చాలవఱకు గోచరించుచున్నను భావసమృద్ధి మృగ్యము. స్వతంత్రత తక్కువ. పూర్వకవుల యనుకరణమో లేక మాతృకానుసరణమో – యివియే ముఖ్యమైన భాగములలోఁ గాన్పించుచుండును. శ్రీనాథునియందు సహితము ప్రాచీనమహాకవుల ప్రయోగములు ప్రాచుర్యముగ కావ్యప్రవాహమున § గండకీశిలలవలె దొరలుచుండును గాని యా మహానుభావుని యప్రతిమప్రతిభాగౌరవమున కవి పరిచిత ప్రయోగములకును నొకవిధమైన నూతనవికాసము కలుగుచుండును.

---

* పాఠాంతరము :—కుకవిమూర్ధవిలుంఠనే కులిశహస్తపల్లవుఁడు.

§ ఇవియే పూజార్హము లైన సాలగ్రామములు. వీనియందు సువర్ణము గర్భితముగా నుండునని పలువు రెఱిఁగిన విషయమే.

కావున పండిత కవివర్యుఁడగు శ్రీనాథుఁడు స్వతంత్రకవి వలె పరిఢవిల్లుట తజ్ఞులలో ననేకుల యభిప్రాయము.

పినవీరన కవిత్వమం దలంకారములు చాల తక్కువ. శబ్దాలంకారములాశ్వాసాంతపద్యములలోమాత్రము వాడఁబడినవి: తక్కిన కథాభాగములలోఁ గ్వాచిత్కముగ నున్నవి. చదువరుల పుణ్యవశమున ఈకవి తన జైమిని పురాణమును శ్లేషలు, అనుప్రాసములు, యమకాదులతో నింపక సరళమైన మృదువచనరచనతో మేళవించి కఠినపాకము గాకుండఁ జేసెను. శబ్దాలంకారముల నై ముఖ్యముఁ గనుపఱచినను ఉపమాద్యర్థాలంకారములు వాడి యుండవలసినదే. ముఖ్యముగ కాళిదాసమహాకవినాటక రాజమును తెనిఁగించిన మహాకవి ఉపమాద్యర్థాలంకారపు శోభను చేకూర్చియుండఁదగినది; కాని అట్టి యలంకార సౌభాగ్యము ఈతనివలన పలుకులసొంఁతి గడించియుండ లేదు. గద్యశైలి పద్యశైలివలెనే మృదుమధురముగ నుండును. గద్యభాగములందు ముఖ్యముగ అనుప్రాసాది శబ్దాలంకారములు తప్పక వాడఁబడినవి. స్వాభావికశైలిని గద్యములు వ్రాయుటలేదు. ఇట్లు గద్యరచనయందు శబ్దవమత్కృతికనుపర్చుటలో ఎఱ్ఱాప్రెగ్గడ, నాచనసోముఁడు, జక్కన మున్నగు మహాకవులు దారిచూపిరి. ఆదారినే యీకవియు అనుసరించెను.

కవిసార్వభౌముఁడగు శ్రీనాథుఁడు రెడ్డిభూపాలుర యాస్థానమున అనన్య సామాన్య తేజోరాశియై మార్తాండునిపగిది ప్రజ్వలించి యస్తంగతుఁడగుచుండ సహజప్రతిభాశాలియగు పినవీరభద్రుఁడు ఈ మహామహుని కిరణస్ఫురణ కొంతవఱకుసోఁక రాకాసుధాకరునిపగిది మనోజ్ఞ కవితాచంద్రికలు వెదజల్లి యానాఁటి కవిలోకమునకు వందనీయు డయ్యెను. తరువాతి మహాకవులగు పెద్దనాదులు శ్రీనాథుని వాఙ్మయమరీచిపంక్తులఁ గ్రోలియు, వీరభద్రుని మనోజ్ఞమరందసుధారసములఁ గ్రోలియు కవిత్వసత్వమును పోషించుకొనిరి. కావున శ్రీనాథుని కాలములో నాకవిసార్వభౌముని తరువాత పేర్కొనఁదగిన కవివర్యుఁ డీపినవీరభద్రుఁడే యని చెప్ప సాహసించుచున్నాను. * మఱియు ఆంధ్రకావ్యరచనా ప్రణాళిక యందలి వృద్ధిక్షయములను, పరివర్తన పరిణామములను నిపుణముగాఁ బరిశీలించు విమర్శకులదృష్టిలో శ్రీనాథపెద్దనల నడుమఁగల వాఙ్మయాభివృద్ధిభాగము పినవీరుని కావ్యపరిచయము లేకున్నఁ గొఱఁతవడి ఆంధ్రవాఙ్మయచరిత్ర మసంపూర్ణ మగునని నాయాశయము.

---

* జైమినిభారతమును వచనకావ్యముగా సముఖము వెంకటకృష్ణప్పనాయకుఁడు రచించెను. ఈతఁడు మధుర రాజ్యమును పరిపాలించిన తెలుఁగునాయక ప్రభువుల యాస్థానమున 18 వ శతాబ్ది నుండెనని తెలియుచున్నది. వీరి గ్రంథమును సమగ్రముగా నాంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రచురించిరి. వెంకటకృష్ణప్ప నాయకుఁడు చాలవఱకు పినవీరభద్రుని కావ్యమందలి కథాక్రమమును, భాషాక్రమమును ననుకరించి ఆ కవీశ్వరుని పద్యములను అచ్చటచ్చట నుపయోగించుకొనెను.

# పుణ్యపాపములు

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి గారు

బాలకులఁ గాంచె నిద్దఱఁ బ్రకృతిమాత-పుణ్యపాపాహ్వయంబులఁ బొలుచువారి
వారిలోఁ బెద్ద బంగారుసొరువాఁడు-సర్వశుభలక్షణాఢ్యుండు సౌమ్యమూర్తి.

బండికందెనతో బాంధవంబు నెఱపు-మేనివాఁడు; జుగుప్సితంబైనమోము
వాఁడు; సర్వావలక్షణప్రాభవుండు-ఆకనిష్ఠుండు దగు విరూపాంగకముల.

జాతకంబులు వ్రాసిరి శాస్త్రవిదులు-పొలుచుఁ బ్రథముండు పురుషోత్తముఁడుగ ననుచు
రెండవకుమారుఁ డధమాధముండు మఱియు-నన్నఁ బాఱంగఁ దోలుఁ బెద్దయిన ననుచు.

జననంబొందెనొ లేదొ యాద్యుఁడు తగన్ సంప్రాప్తతారుణ్యుఁడై
వినుమార్గంబున నెల్లలోకములకున్ విచ్చేసె బంగారుతే
రునఁ గూర్చుండి తదీయకాంతివితతిన్ రోదస్సు మిర్మిట్లులం
గొనఁగాఁ బర్వఁగఁ గమ్మసంపఁగులనన్ గ్రొత్తావులున్ గుప్పునన్.

ఘనకాండంబులు వ్యోమసీమనవలన్ ద్యోమండలంబెల్ల నా
తని చారిత్రము వానిదివ్యమహిమల్ తత్కీర్తులుం బ్రాఁకె; నీ
యన దైవాంశము; వీనికొల్వు శుభదంబంచుం బ్రజల్ రాజ్య మా
తని కర్పించిరి వానిమేలుబడికిన్ దాస్యంబుఁ గావించుచున్.

బాలారిష్ట పరంపరల్ కలుగుటన్ బ్రాణావశిష్టుండునై
కాళుల్ చేతులు నీచఁబోఁగ నిలువంగాలేక పారాడలే
కోలిన్ మృత్యుముఖంబునం బడుచుఁ దా నొక్కొక్కమాఱు; రీగతిన్
బాలుం డొప్పె ద్వితీయుఁ డప్డు వినుమం దజ్జీవితాశం బ్రజల్.

మందుమాకులు లేకయు మాననీయ-ప్రకృతిమాతయొసంగిన పాలు ద్రావి
తేఱుకొని యొళ్లు సేసి విద్దెములు సేసి-యడుగిడఁగ నేర్చి పెద్దవాఁడయ్యె నతఁడు.

అన్నలోకంబులెల్ల లోఁగొన్నవాఁ; డ-తండు గీసినగీఁతను దాఁటదు ప్రజ;
నిలువ నీడయు నాథుఁ గాన్పింపదనుచు-నతఁడు గుములుచు దృఢనిశ్చయమునఁ దుదకు.

కాంగ్రెసునగరమున



జాతీయపతాకాస్థాపనము



జే. యం. సేనుగుప్తగారు
జాతీయపతాకా స్థాపకులు



కీ. శే. హాకీం అజ్మల్‌ఖానుగారు

## ౪౨వ భారత జాతీయమహాసభ-చెన్నపురి



శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారు, బి. ఏ.

నాయకురాలు



శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయగారు, బి. ఏ.

ఉపనాయకురాలు

స్వచ్ఛంద స్త్రీసేవాదళము

త్రాగుంబోతులు జారచోరులును ధూర్తవ్రాతముల్ కుత్సితుల్
రాగిద్వేషులు మత్సరుల్ తనకు మిత్రశ్రేణి కాఁగా మహా
భాగుండై తగు జ్యేష్ఠసోదరునితోఁ బల్మారు పోరాడఁగన్
వీఁగుం బైఁబడి రూపుమాపఁదలఁచున్ జిత్తంబునం దాతనిన్.

తమ్ముని దుష్టవర్తన కతంబు గడుంగడు నుమ్మలించి చి
త్తమ్మున, వానిమిత్త్రులను ధర్మము నీతియుఁ దెల్పి చెడ్డమా
ర్గమ్ముననుండి త్రిప్పుట కఖండప్రయత్నముఁ జేసెఁగాని హా
స్యమ్మొనరించి వా రపు డసహ్యపుఁ గూఁతలు కూసి రుద్ధతిన్.

ఇట్లు జ్యేష్ఠునిహితబోధ లేపగించి-వాఁడు గూడుపుటాణీయై వారితోడ
బలిమి నేమఱుపాటునఁ బైఁబడంగఁ-దలఁచె; మంత్రాంగ మీరీతి సలిపి తఱిని.

తనసిబ్బందిని వెంటఁబెట్టుకొని యాతమ్ముండు రౌద్రంబుతోఁ
గనులన్ నిప్పులు గ్రక్కుచున్ బొమముడిం గల్పించుచున్ మోమునం
దునఁ గావించుచు సింహనాదములు తోడ్తోఁ బండులం గీఁటుచున్
దునుమన్ గత్తిని నెత్తె సోదరునిపై దుర్దాంతకోపంబునన్.

తమ్ముఁడా! యేల నాదుప్రాణమ్ముఁ దీసె-దేది నానుండి కోరెదో యిత్తు ననుడు
నన్న; తమ్ముండు సర్వరాజ్యం బొసంగి-యడవులకుఁ బొమ్ము! తత్క్షణం బనుచుఁ బలికె.

ఆతని వాలకంబునకు నన్న యులందురి బుజ్జగించుచున్
భ్రాత కొసంగి రాజ్యమున నాలవభాగముఁ, బంపఁ, బోయి పి
న్నాతఁడు క్రమ్మఱం గలహమాడఁగఁ బాతికపాలొసంగె, నీ
రీతిగఁ బావుపావుగ హరించెను రాజ్యమునెల్ల మెల్లగన్.

ఆకనిష్ఠుండు సకలరాజ్యమును బొంది-తనదుమిత్త్రులు రాజ్యతంత్రమును నడప
శత్రుపక్షు మున్మూలించి జరుపుచుండెఁ-బాలనంబు నేకాతపవారణముగ.

శ్రీతరుణీమనోహరునిఁ జిన్మయరూపుని సంస్మరించుచున్
భ్రాత హరింప రాజ్యము నరణ్యముఁ జొచ్చెను జ్యేష్ఠుఁ; డా ముని
వ్రాతము భక్తితో నెదురువచ్చియు స్వాగతమిచ్చి కొల్చి సం
ప్రీతునిఁ జేసి; రర్హులకుఁ బేరిమి గల్గదె కాన కేఁగినన్..?

---

5. 2- 4 ౨౧౫

# నందితిమ్మన్న - పారిజాతాపహరణము - కొన్ని విశేషములు

అడవి శంకరరావు గారు

౧

అల్లసాని పెద్దన్న మనుచరిత్రములో కృష్ణదేవరాయల విజయ దుందుభుల గర్జనముల వలెనే, నంది తిమ్మన్న పారిజాతాపహరణములో ఆనాటి సమరసంరంభముకూడ పాఠకులకు గోచరించుచునే యుండును. కుమారధూర్జటి తన 'కృష్ణరాయవిజయము'లో కృష్ణరాయలకును, బీజపూరు, అహమ్మదునగరు, గోలకొండ నవాబులకును కృష్ణానది యొడ్డున జరిగిన యుద్ధమును, ఆయుద్ధములో కృష్ణదేవరాయల విజయమును వర్ణించుచు, యుద్ధానంతరము—

తే. అటుల జయలక్ష్మిఁ గైకొని హరులఁ గరులఁ
బరుల ధనపంక్తులను దనవశము చేసి
వెలయు శ్రీకృష్ణరాయల విభవగరిమఁ
గాంచి కన్నులపండువుగాఁగ నపుడు.

తే. సరససాహిత్యరచన విస్ఫురణ మెనయ
సారమధురోక్తి మాదయగారిమల్ల
నార్యుఁ డలయలసని పెద్దనార్యవరుఁడు
ముక్కుతిమ్మన్న మొదలైన ముఖ్యకవులు.

క. వినుతించిరపుడు......

అని పేర్కొనియున్నాఁడు.

అల్లసానిపెద్దన్న తరువాత కృష్ణదేవరాయలు నంది తిమ్మన్ననే చాల గౌరవించుచుండినట్లు వీరేశలింగముగారు తమ కవులచరిత్రలో వ్రాసియున్నారు. ఈకారణములచేత తిమ్మన కృష్ణదేవరాయల సైన్యములవెంటఁ జనుచు, చాల దండయాత్రలలో ననుభవము సంపాదించియుండు ననుట నిస్సంశయము. దండయాత్రలకై సమకూర్పఁబడు సైనికబృందములను విజయనగరము వీథులలో తిమ్మన్న పెక్కుసారులు చూచి వారి మనోభావముల గుర్తించియుండుటచేతనే పారిజాతాపహరణములో నీవర్ణనలఁ జొప్పించి యుండును.

౧. యుద్ధప్రకటన

శ్రీకృష్ణుఁడు పారిజాతాపహరణముఁ గావించినాఁడని విని దేవేంద్రుఁడు గోపింపఁగా—

ఉ. ........... .........
.....................
............. ......మొ॥
నైచెనొకో యన మ్రోసె నంత ని
స్సాణము పాకశాసనుహ
జారమునం గదనాభిశంసి యై.

దేవేంద్రుని 'హజారమున' రణదుందుభి మ్రోఁగింపఁబడినతోడనే—

మ. అపు డాబద్ధఖలీనకాశ్వావయ మై
యందూపరిభ్రంశిత
ద్విపమై దివ్యరథాగ్రకేతుపటసం
ఘత్సామిళత్సూతమై

యపరాధూతభుజావలేపభటనీ
　　రాలాప మై, జంభసై
రిపురం బంతయు......
　　ఘూర్ణిల్లెనంట!

కట్టఁబడిన గుఱ్ఱములకు కళ్లెములు బిగించువారును, ఏనుఁగుల గొలుసుల విప్పువారును, రథాగ్రములకు కేతనములఁ గట్టువారును, పరిభవ మెఱుంగమిచే గర్వించి వీరాలాపము లాడువారును పురంబంతటను గనుపట్టిరఁట!

అత్తఱిఁ దత్తఱంబునం దత్తడులం బల్లింపకయ నెప్పళంబున నెక్కంబోవువారును,.........బహువిధ ప్రహరణావిపర్యాసంబున శస్త్రశాలాంతరంబునం గలహించువారును,...గత్తు లంకించువారును, రిత్త జంకించువారును, సంగడీలం జీరువారును, సంగరభేరులం గేరువారును, వాహనంబులఁ దఱుమువారును, సాహసంబుల నఱుమువారు నై వీరావేశంబున రాజద్వారంబునం దొట్టిరి.

సమరోత్సాహము విజృంభించినది. కాని—

తే. గలితశృంఖల లయ్యు నకాలనిద్ర
　గనుఁగవలఁ గ్రాలఁ దమయంతఁ గదలవయ్యె
　దారుణాధోరణప్రయత్నమునఁ గాని
　నముచిమథనునివీట శుండాలఘటలు.

అమరావతిలోఁ గూడ నేనుఁగులకు నిద్ర వచ్చును గాఁబోలు!

క. పొరిఁ బొరి నెగయుచు మ్రొగ్గుచు
　ధరణీస్థలిఁ బొరలఁ బడుచుఁ దలకొని శిక్షం
　బొరసిన వయ్యు హయంబులు
　భరియింపవు కొంతతడవు పల్యాణంబుల్.

యుద్ధవార్త ప్రకటింపఁబడిన తోడనే పయిచిహ్నములు నగర మెల్లెడలఁ గన్పట్టినవి.

౨. యుద్ధప్రయత్నము

పెక్కు వేల సైనికులు సమావేశమగు నవసరమున వారిలో నన్ని తెగలవా రుందురు. కృష్ణరాయలనాఁడేమి, జర్మనీయుద్ధము, చైనాయుద్ధము జరిగిన నేఁడేమి—సైన్యములు సైన్యములే. త్రాగుఁబోతులు,ఆవేశపూరితులు, స్వగృహముల వీడలేక వీడలేక వచ్చువారు మున్నగు వివిధరకములవా రుందురుకదా! ఇందు కొన్ని రకములవారిని తిమ్మన్న వర్ణించినాఁడు—

ఉ. డాసి పురోహరిన్మణివి
　టంకమునం దన మేనినీడ ను
లూకసమదృష్టిఁ జూచి కిను
　కం "బ్రతివీరుఁడ!" యంచు వ్రేసి బా
హాసివిభిన్న మై పడఁ ద
　దర్థముఁ జేకొని వచ్చెఁ గల్పవృ
క్షాసవపానమత్తుఁ డవ్వ
　తాంధసుఁ డొక్కఁడు జన్యకేళికిన్.

త్రాగుడుచే పరవశ మైనవాఁడు పయిన వర్ణింపఁబడిన సైనికుఁడు. కాని రణావేశము చేత నే పరవశు లైనవారిలో—

తే. కారణము లేక యూరకె నారి దెగిన
　విడిచిపెట్టక రణరసావేశ మొదవఁ
　బట్టి కోదండదండంబు పరిఘ గాఁగ
　విసరుచును వచ్చె వేల్పొండు వేల్పుజోదు.

క. గొనయంబు నెక్కఁ ద్రోచిన
　గనయంబున కెక్కకున్నఁ గ్రమ్మిన తమకం
　బున విల్లు విడిచి వేల్పొక
　యనిమిషభటుఁ డనికి వెడలె నడిదముఁ గొనుచున్.

రణదుందుభినిస్వన మాలకించి నంతనే త్రేనియాజ్ఞ శిరసావహించి గృహములు సైనికులు వీడుచుండఁగా—

ఉ. పట్టఁ దలంచెనేని పవ
    పద్మయుగంబు వశంబు గాక, లోఁ
బుట్టినబాష్పగద్గదికఁ
    "బోకు". మనం బలు కత్తలేక, పైఁ
జుట్టినవెయ్యపుంబనను
    చూపులచే సతి వెంట నంటి త
న్పట్టక పట్టఁగా నొకసు
    పర్వుఁడు వచ్చె రణాభిలాషియై.

ఈసైనికుఁడు కృష్ణరాయలఁ గొల్చుచు నిజదేశసంరక్షణార్థము పోరుటకై యేఁగుచున్న విజయనగర సైనికుఁడే. కొన్ని సంవత్సరముల క్రితము జరిగిన గొప్పయూరపు సంగ్రామములో ఇంగ్లీషు సైనికులు లండను నగరములో వివిధ సైనికస్థానములనుండి బయలుదేఱి రణభూమికేఁగుటకై రయిలునెక్కుచుండఁగా వారి భార్యలు,బంధువులు వారిని వీడుకొల్పుట లనేక పత్రికలలో చిత్రముల రూపమునఁ బ్రకటింపఁ బడినవి. ఈచిత్రములు చూచుట కెంతయుఁ గరుణముగ నుండును .అట్లే పయిపద్యములో వర్ణింపఁబడిన సైనికుని భార్య యవస్థయు నున్నది. దేశసంరక్షణోత్సాహ పరవశుఁడై త్వరితముగ నేఁగుచున్న తన ప్రాణనాథునిపాదములఁ బట్టి యాఁపుట కామెకు శక్తి చాలదు. "రణమున కేఁగవల"దని చెప్పుటకుఁ గూడ కంఠము స్తంభించుటచే నోట మాట రాదు. ఇది యెంత కరుణముగ నున్నది!

క. సురవీరుఁ డొకఁడు సతిచే
దురమునకు ననుజ్ఞ వేఁడి తొల్లిటి యలుకం
జిరకాలదుర్లభం బగు
పరిరంభముఁ గాంచి వెడలెఁ బ్రమదం బెసఁగన్.

చ. "నను నని సేయఁ బంపు ఖగ
    నాథుని సొగపసిండి ఱెక్కలు
న్కనఁ గొని కర్ణపూరమున
    నుల్లరభసంబునఁ దెత్తు నేను నీ"
కని తన కడ్డమై నిలుచు
    నచ్చరతొయ్యలి నూఱడించి, పో
రున కరుదెంచు వేల్పుఁ గొమ
    రుం డొకరుం డురువండహస్తుఁడై.

ఈపయిదృశ్యములు జనసామాన్యములోఁగల్గిన సంరంభమును సూచించుచున్నవి. ఇఁక నాయకుల ప్రయత్నములో?—

సీ. గతి మ్రుచ్చిలఁగ వేచుగాలిఁ ద్రావఁగఁ బాము
    నిడినకైవడిఁ గాలికడియము మకర
నలదేవమణికిఁ గావలి యిడ్డ ప్రహరి నా
    గళమున ఘంటికావళులు మెఱయఁ
బన్నగాళికి నెదుర్పడ వెండిఱెక్కలు
    ధరియించె ననఁగఁ బక్కెర సెలంగఁ
బారిజాతాహృతి ప్రభవరోష మనంగ
    గతిరోధజనితఘూత్కృతులు నిగుడ

.............................

    .............రేవంతుఁ డమర
వల్లభునిమ్రోల నుచ్చైశ్శ్రవంబు నిలిపె.

కాలికడియముతోను, గళమున ఘంటికావళులతోను, పక్కెరతోను, ఘూత్కృతులతోను నిలిపిన యీరణఘోటకము మనుచరిత్రలో స్వారోచి వేఁటకుఁ బోవుటకై తేఁబడిన "మహాసైంధవంబును" బోలియున్నది. ఇది విజయనగరరణఘోటకమే! ఈయుచ్చైశ్శ్రవంబువెనుక ఐరావతము "సంగరరమాశుద్ధాంతసౌధంబు" వలె వచ్చినది. దిక్పాలకులు వచ్చినారు. వీరితో దేవేంద్రుఁడు బయలుదేఱఁగానే—

శా. అర్వారోహణచాతురీవిలసనా
        హంకారదుర్వారతన్
    సర్వాంగీణము లైన మైపుటువులున్
        శస్త్రాస్త్రసాహణంబులున్
    గర్వాలాపవిడంబనముల్ మెఱయ జో
        కం జిత్రసేనాదిగం
    ధర్వుల్ వజ్రికిఁ దోడుసూపిరి పుర
        ద్వారప్రదేశంబునన్.

కొంత సేన రాజద్వారమువద్దనుండి బయలుదేఱఁగా, మిగిలిన సేన వారికై పురద్వారమువద్ద వేచియుండి, రాజపరివారము సమీపింపఁగనే వారిని గలిసినది. ఇట్టి యేర్పాటు పెద్దసైన్యములనడకఁ జూచినవానికి మాత్రమే స్ఫురించును. ఇట్లు సైన్యము లన్నియుఁ గలిసినవెంటనే—

ఉ. "వారణభంగి నొండొకటిఁ
        దాఁకెడు నస్త్రముఖంబులన్ ఘణా
    త్కారము లుల్లసిల్ల, బెడి
        దంబుగఁ బుట్టినసందడిన్ బుర
    ద్వారము నిర్గమించె సుర
        వల్లభు సేనలు—"

ఈయుద్ధఘోష కృష్ణదేవరాయల సైన్యములది కాదా?

3. యుద్ధరంగము

తిమ్మన్న వర్ణించిన యుద్ధరంగ మమరావతియో లేక ఉదయగిరి, కొండవీడు, కటకము, రాయచూరులలో నొకటియో, యుద్ధములో విజేత శ్రీకృష్ణుఁడో లేక శ్రీకృష్ణదేవరాయలో యీక్రింది వచనమునుబట్టి విమర్శనదృష్టితో పాఠకులే నిర్ణయించుకొందురుగాక!

వ......గవాక్షిత వక్షులగు యక్షులును,...... బరిచ్ఛిన్నకర్ణనాసాధరులగు విద్యాధరులును, ...... జూర్ణీకృతశిరోమధ్యులగుసాధ్యులును,......ప్రత్యవయవశిథిలితానుబిద్ధులగు సిద్ధులును,...... జర్జరులగు నిర్జరులును,......సాధ్వసోద్రేకంబున భద్రదంతావళంబులడిగ్గనుఱికి మేరుశిఖరంబులు ప్రాఁకియు,...... జోఱుమలు లెఱుంగక మాతంగశవంబులక్రింద నీఁగియు, భగ్నచరణంబులై తల కడవుగం ద్రెళ్లినతురంగకళేబరంబులం గౌఁగిలించుకొని నిర్జీవులునుం బోలె గ్రుక్కుమిక్కనక పక్కఱంబులు పైఁద్రోచుకొనియును......మూర్ఛా పరవశులగు ...చిత్రసేనాదులం ...... పానీయముల సేదఁదేర్చి ఫలకగర్భంబులకుం దార్చి నిజనివాసములకుం జేర్చికొను నాప్తసేవక వర్గంబులకలనను......గవనరంగం బభిరామం బయ్యె.

ఈవర్ణన నేఁటి యుద్ధరంగములకుఁగూడ సరిపోవును. మూర్ఛ నొందినవారిని ఫలకముల మీఁద నివాసములకుఁ దీసికొనుపోవుపద్ధతి నమరావతిలో నంది తిమ్మన్న తన యనుభవమునుబట్టి చొప్పించినాఁడు.

యుద్ధము ముగిసినవెనుక శ్రీకృష్ణుఁడు "గోపురసంస్థితపౌరభామినీజనములు... సేసలు సల్లఁగ నుల్లసితాంతరంగుఁడై, పురబహిర్ద్వారములు దాఁటి రాజమార్గంబున" నిజనగరిఁ బ్రవేశించెను.

యుద్ధఘోష ధ్వనించు పద్యములఁ గొన్నిటి నీక్రింద చూపుచున్నాను:-

చ. తనువున నంధకారపు మ
        దం బొలి మిన్నను భద్రదంతికిన్
    మొనసినఁ జిందరేఁగి తప
        నుండను మావుతుఁ గ్రుంకుమెట్టులో
    య నురల వైచిన న్మొగిలి
        యచ్చట నెత్తుచు గ్రక్కునో యసం

. .........బోడ

కట్టెై సముజ్జ్వలసాంధ్యరాగముల్.

(ఆ. ౨, ప. ౩౨.)

సీ. .................

అలచుక్క లనియెడి వలరాజు గెలుపు వ్రాల్

దెలియఁబూసినమషీ లేప మనఁగ

.....................

నంః కారంబు జగ మెల్ల నాక్రమించె.

(ఆ. ౨, ప. ౩౪.)

తే. తామరల వ్రేటులాడు చోఁ దరుణు లెత్తు

కరరుహాంకితబాహువల్లరులు వొలిచె

చిరునవర్ణావళీపరిస్ఫురిత మైన

పల్లవాస్త్రుజయ స్తంభపటలి యనఁగ.

శాసనములఁ జదువుపద్ధతియు, కృష్ణదేవ రాయల జయ స్తంభములును బయి పద్యములలో నుదాహరింపఁబడినవి.

చ. అరదము నెక్కి కేతనప

టాంచలచంచల మైనతాల్మిలో

.....................

..........................

దిరిగెడుబండికండ్లపగి

దిక్ భ్రమియించుచునంబులోఁడ నా

హరి చనుదెంచె.............

(ఆ. ౧, ప. ౧౧౪.)

ఆనాఁటి విజయనగర వైభవమును సూచించువర్ణన లనేకములు మనుచరిత్రములో వలెనే పారిజాతాపహరణమునను గలవు. వానిలోఁ గొన్నిటి నుదాహరించు చున్నాను.

మ. సరసాలాపములన్

.....................

......నుండ, ఘటికా

పర్యాప్తి ఘంటారవాం

తరనిర్ణీతము లై వినంగఁబడియెన్

మధ్యాహ్నశంఖధ్వనుల్.

(ఆ. ౨, ప. ౩.)

ఘటికాపర్యాప్తిని దెలుపుచు గంటలు వాయించుచుండఁగా మధ్యాహ్న శంఖముల పూరించి శ్రీకృష్ణుని హెచ్చరించిరి. గంటలు కొట్టుట ఆస్థానమర్యాద.

మ. ఆనలినాయతాక్షుగడి

యారమునం దభిసారికాభిఘాం

సానిరతప్రసూనశర

చాపగుణధ్వనులో యనంగ ఘం

టానినదంబు లయ్యెడ వి

నంబడియెం..... ......

.................బ్రన

మప్రహారాపగప్రశంసులై.

(ఆ. ౨, ప. ౫౧.)

మొదటి జామయిపోయినదని కొట్టఁబడిన గంటలు వినంబడినవఁట!

సీ......................

.......................

పరునిమంపలు బరాబరిసేయు కంచుకి

కులముచేతుల వెండిగుదె లనంగ

....................

......................

గ్రమముతో శీతకరమయూఖములు.. ...

.....................బ్రాఁకుదెంచె.

ఈ "వెండి బెత్తముల కంచుకి కులము" స్వారోచి.వివాహమునకై యేఁగుచుండఁగా నకీబులు'గా నున్నవారే. ఇది ఆస్థానమర్యాద.

సీ. చంద్రికపూవన్నె జిలుఁగుదుప్పలువను

దడి యొత్తె నొక్కకాంతాలలామ.

చంద్రకావి రంగుబట్ట లానాఁడు చాల వాడఁబడుచుండినట్లు మనుచరిత్రములోఁ గూడఁ గన్పట్టుచున్నది.

మ. దరమీలన్నయనంబులై గృహబహి
　　ర్ద్వారంబు లన్ యామకుం
　జరముల్ గండమదభ్రమద్భ్రమరికా
　　ఝుంకారసంగీత వి
　స్ఫురణల్ సూపుచుఁ గర్ణతాళనినదం
　　బుల్ మించ నీమాగధ
　స్తోత్రముం బోలుచుఁ జూడ నొప్పె నిబె హ
　　స్తన్యాసముల్ మీఱఁగన్.
　　　　　　　　　　(ఆ. ౨, ప. ౬౧.)

విజయనగరములో ప్రతిజామున గస్తీ తిరుగు ఏనుఁగులు పయిపద్యములో ఉపమానముకొఱ కుదాహరింపఁబడినవి. ఉదయపు జామున తిరుగు గస్తీయేనుఁగుచుట్టును చేరు తుమ్మెదల సంగీతమును, వానిని తోలుకొనుచు చెవులతో నాయేనుఁగు వేయుతాళమును వందిమాగధుల మేల్కొల్పుల సంగీతతాళముల వలె నున్నవఁట!

తే. రాజు వీడెత్తిచనినఁ దారకభటాలి
　యంబరాభోగ నిజశిబిరాంగణమునఁ
　గాలుకొల్పిన పావకజ్వాల లనఁగఁ
　బ్రాచిఁ గనుపట్టె నవసాంధ్యరాగ రుచులు.
　　　　　　　　　　(ఆ. ౨, ప. ౬౫.)

పయిపద్యములో విజయనగరరాజుల రాష్ట్రాంతరపర్యటనపద్ధతి సూచింపఁబడినది.

చ. ...　...　...　...
　　...............య
　త్పనరుహలోచనుండు దగు
　　వారి సుహృజ్జన బంధుకోటి రాఁ
బనిచి, నిజప్రయాణమును
　　బట్టణరక్షయుఁ జెప్పి వారిచే
ననుమతి గాంచి యెక్కె విహ
　　గాధిపు..................
　　　　　　　　　　(ఆ. ౩, ప. ౭౫.)

శ్రీకృష్ణుఁ డమరావతి కేఁగుచు తనపట్టణరక్షణమునకు తగిన కట్టుఁబాటులఁ జేసినాఁడు. శ్రీకృష్ణదేవరాయలు దండయాత్రకై వెడలుచు—

ఉ. ...................
　　............నిజ
　బంధు తతిం బిలిపించి మేటిసం
　భావనఁ జేయుచున్.........

మ. పురసంరక్షణ దక్షు లౌజనులసన్
　　బుద్ధిస్థితుల్ దెల్పి.........

నట్లు "కృష్ణరాయవిజయము" నకుమారధూర్జటి వ్రాసినాఁడు. తాను జూచుచున్న యాచారమునే తిమ్మన్న పారిజాతాపహరణములోఁ జొప్పించినాఁడు.

ఆస్థానపు టాచారముల సూచించు పద్యముల మఱికొన్నిటిని చూపుచున్నాను.

చ. అమరవిభుండు దూరమున
　　　　నంబుజనాభునిఁ గాంచి సంభ్రమో
　ద్గమమునఁ జేతియంకుశము
　　　　ఖంబునఁ గుంభము లూఁది కుంచితా
　గ్రిమచరణంబునన్ మఱిక
　　　　రిన్ డిగి యంసవిలంబికల్పచే
　లము నడుమన్ బిగించుచు ని
　　　　లానిహితాత్మశిరఃకిరీటుఁ డై.
　　　　　　　　　　(ఆ. ౩, ప. ౮.)

ఇంద్రుఁ డేనుఁగు దిగినవినమును,చేలము సడుమునకుఁ గట్టుటయు గమనింపఁ దగినవి. దిశాధినాథులు,కృష్ణుఁడు వాహనముల నెక్కఁగా"హుడుక్కా-ఢక్కా-పటహధ్వానము"లెసఁగినవి. "శతమన్యుఁడు సందడిపో బరాబరులేపఁగ"వైహాయసవీథిని శ్రీకృష్ణుఁడేఁగినాఁడు.

..................

.....................

......దరస్మితం బొలయ
వెన్నుఁడు రాజపథంబు దాఁటి య
య్యనిమిష నాథు గేహబహి
రంగణభూస్థలి డిగ్గ నైన తే
యుని మణిచిత్రవేత్రకర
హుంకృతి దిక్కులు పిక్కటిల్లఁగన్.
(ఆ. 3, ప. 22.)

ఇదికూడ నాస్థానమర్యాదయే.

3

కృష్ణదేవరాయలనాఁటి సాహిత్యవిజృంభణము తిమ్మన్న కొంతవఱకు సూచించినాఁడు. శ్రీకృష్ణుఁడును, సత్యభామయు నమరావతి కేఁగుచుండఁగా మేరుపర్వత మగపడినది. అందు వారికి "ఖచరగణగోష్ఠీస్థానంబులం బఱచిన రత్నకంబళంబులవిధంబున విశాలశిలాతలంబుల నిద్రించు శార్దూలంబు" లగుపించినవి. కిన్నరు "లింద్రునిమీఁది గీతముల్" పలికించుచున్నట్లును,గంధర్వులు"పంకజాసన గేహిన్యుపదిష్టగీతరచనా సర్వంకషప్రజ్ఞులు" గానుగన్పట్టిరి. "మేళముగూడి పాడుచుండు"యక్షులు,"హాస్యరసాధినాయకు" లైన గుహ్యకులు, "విచిత్రకథేతిహాసజ్ఞు లఖిలలోకాధ్వనీను" లగు చారణులు, "వివిధోపయోగ్య కళల నెపుడు నుబుసు" పుచ్చువారు పొడఁగట్టినారు. ఈవర్ణనలో విద్యానగర మనిపించుకొనిన విజయనగర మెంతవఱకు ధ్వనించుచున్నదో ప్రాజ్ఞులగు విమర్శకులు నిర్ణయింతురుగాక!

---

## సందేశము

ప్రణయసంజనితోష్ణబాష్పాంబుధారల సంతృప్తిగాగ మజ్జనమొనర్చి
బాహుద్వయమృణాళపరికల్పితంబైన హారముగ గంతమ్మునందు జుట్టి
ఉదితంబులౌ కటాక్షోత్పలపుష్ప స్రజంబులతో గిరీటంబు నెట్టి
స్వర్ధునీమాధుర్యసంవాహకములైన వాక్సంతతులను గైవార మొసగి
చెలియరో! మదూరునామక సింహపీఠ-సీమ నివసింపజేయుచు జిరవియోగ
సంక్షుభితమైన హృదయరాజ్యంబు నీకు-నప్పగించెద తాళు మీ వంతవరకు.

"ప్రవాసి"

---

స్వచ్ఛంద స్త్రీ సేవాదళము, ౪౨వ భారతజాతీయమహాసభ, చెన్నపురి



శ్రీ కే. నటరాజను గారు, అధ్యక్షులు
అఖిలభారతసంఘసంస్కరణమహాసభ, చెన్నపురి



శ్రీ డాక్టరు ప్రమోదనాథ బెనర్జిగారు, అధ్యక్షులు
అఖిలభారతగ్రంథాలయమహాసభ, చెన్నపురి



శ్రీ పండిత జవాహిర్ లాల్
నెహ్రూగారు, అధ్యక్షులు
అఖిలభారత ప్రజాస్వామ్యవాదిమహాసభ,
చె న్న పు రి



శ్రీ సర్ ఇబ్రహీం రహింతుల్లాగారు,
అ ధ్య క్షు లు
అఖిలభారత పారిశ్రామికమహాసభ, చెన్నపురి



శ్రీ పండిత
మదనమోహన మాలవ్యాగారు,
అ ధ్య క్షు లు
అఖిలభారత హిందూమహాసభ, చెన్నపురి

# భృత్య నీతి

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

[ఏకాంక వచనరూపకము]  (వెనుకటిసంచిక తరువాయి)

## పంచమ రంగము

[ప్రదేశము : వీరబలుని గృహము]

సతి

నాథా, ఇంతరాత్రి వేళ వచ్చితి వేల? మహారాజుచే పోషింపబడుచున్న మనము మహారాజు రక్షణయందు ప్రమత్తులమై యుండవలయునుగదా?

వీరబలుడు

సతీ, ప్రమత్తుడనై యుండలేదు. జాగరూకుడనై యే యుంటిని. మహారాజును రక్షించు నుద్యోగముననే యిటకు వచ్చితిని.

కుమారుడు

నాన్నా, రాజరక్షణకార్యముమీద వచ్చితిరా! ఏమి, శత్రువులెవరైన బురంబుచొచ్చుచున్నట్లు తెలిసెనా? ఆయుధము చాలలేదా? బాణతూణీరము లవసర మయ్యెనా? ఒక్కరే వెళ్లగలరా? నన్నుగూడ సాయము రమ్మనెదరా?

వీరబలుడు

కుమారా, నీసాయమే ముఖ్యముగా కావలెను.

కూతురు

నాన్నా! తమ్ముడే కాదు; నేనుగూడ వచ్చెదను. శరసంధానమునందు నాకుగూడ నైపుణ్యము గలదుకదా! మనచక్రవర్తిని రక్షించుటకంటె మహోత్కృష్టమగు కార్య మున్నదా?

వీరబలుడు

పుత్త్రీపుత్త్రులారా, మహారాజురక్షణకు గావలసినది సమరకౌశలము గాదు, ప్రాణసమర్పణము.

బాలుడు

తండ్రీ, నాప్రాణ మొసగెదను.

బాలిక

నాన్నా, నాప్రాణ మొసగెదను.

సతి

నాథా, పసిపసుగులు, వారిమాటల కేమి? మహారాజును రక్షించుటకు నాప్రాణ మర్పించెదను.

వీరబలుడు

దేవీ, మన చక్రవర్తిని రక్షించుటకు మన యసువు లర్హములు గావు.

సతి

మఱి యెట్టిప్రాణము గావలెను?

వీరబలుడు

దేవీ, ఉదయ మగునరికి మహారాజు నిర్జీవుడగును. ఆతని రక్షింపదలచినచో తలిదండ్రులును, తోబుట్టువును గల యొక రాకుమారుని కాత్యాయనికి బలియీయవలెనని సామ్రాజ్యలక్ష్మి మానవ స్త్రీరూపమున నాకు గన్పడి చెప్పినది. మనచక్రవర్తి నిత్యసహస్రనిష్కభృతిచే మనల బోషించుచున్నాడు.

ఆయనయాదర మనుపమానము. అట్టిసార్వ భౌమునకు నేడు మహావిపత్తు సంభవించినది. ప్రజల కాతడు కన్నతండ్రి. శత్రువుల కాతడు పక్కబల్లెము. అట్టి సత్ప్రభువును రక్షించుట యిహపరసాధనము. మఱియు మనము స్వామి ఋణమును దీర్చుకొను మార్గమును గూడ నదియే. నీ వే మందువు?

సతి

మన మనోధనప్రాణములలో నెవ్వియైన నర్పించి మహారాజును రక్షించుటయే కర్తవ్యము.

వీరబలుడు

అట్టిబాలు డొకడు దొరకవలెనుగదా!

బాలుడు

నాన్నా, బలి కర్హ్మములగు శుభలక్షణము లన్నియు గలిగి మీసొమ్మగు నే నుండ ఇంకను బాలు డెక్కడ నని శంకించెద రేల? నన్ను దేవి కర్పించి మహారాజును రక్షింపుడు.

వీరబలుడు

కుమారా, బ్రతుకవలె ననెడి యిచ్ఛ ప్రాణి సహజము. నీవు బాలుడవు. ఆటలముచ్చటైన దీరనివాడవు; ప్రాణ సమర్పణమునకు మనః పూర్వకముగ నంగీకరింతువో. లేదో అని నా శంక. బలియగు కుమారునియందు మృత్యు భయముగాని, విచారముగాని లేశమాత్రమైన నుండరాదట. ఉన్నచో మహారాజుజీవింపడట.

బాలుడు

తండ్రీ, దేహిని ఉత్పత్తితోడనే మృత్యు వను సరించియున్నది. వేయేండ్లు జీవించినను ప్రాణికి మరణము దప్పదు. కావున దేహధారి మృత్యు భయము జెందరాదు. నాన్నా, నేడు తమ స్వధర్మము నెఱవేర్చుకొనుటకు మంచి యవకాశము లభించినది. నే నీకార్యమునకు దోడ్పడుటకు మూడువిధములుగ సంతోషము గలుగుటచే వాంఛించుచున్నాను. మొదటిది తండ్రియైన తమయాజ్ఞ; రెండవది స్వామికార్యము; మూడవది ఈతుచ్ఛదేహము జరారుజాది బాధలచే నవసి చావకుండ దేవీ ప్రీత్యర్థమై వినియోగపడుట. ఇంతకంటె శ్రేష్ఠమైనకార్య మెద్ది? తండ్రీ, జాగుసేయక యీ మహత్కార్యము నిర్వహించి నన్ను ధన్యుని జేయుడు.

వీరబలుడు

కుమారా, నీవంటి యుత్తమపుత్రుని బడయుటచే నేను ధన్యుడనైతిని. శంకాకులిత మగు నా చిత్తమును వైరాగ్య ప్రబోధ మగు వాక్కులచే దేర్చితివి. సుపుత్రుడ వనిన నీవే! దేవీ, నీవేమందువు? నీవు ప్రసన్నచిత్తవై యుండనిచో బలి నిరుపయోగ మగును. సుమా!

సతి

నాథా, ఈనాశరీరము మీది; ఈబిడ్డలు మీవారు. మీసొంతధనమును మీరు వినియోగించుకొనుటకు నాయనుమతి యేల? సతికి పతితోడి సంబంధము ఇహపరముల దెగనిది. కాన నాసర్వస్వము మీరే; మీకంటె నితర దైవము లేదు. స్త్రీకి దానమువలన గాని, ధర్మమువలనగాని, వ్రతములవలనగాని యెట్టి ఫలము లేదు. పాతివ్రత్యమువలననే సమస్త ఫలములు చేకూరును. ఏస్త్రీ భర్తయాజ్ఞను తిరు

స్మరించునో ఆ స్త్రీకి నిరయము సిద్ధించునని ధర్మశాస్త్రము లుద్ఘోషించుచున్నవి. కాన, జీవితేశ్వరా, కుమారుని దేవి కర్పించి మీస్వధర్మమును నెఱవేర్చుడు. నాకు లేశమైన చింత లేదు. మీధర్మమే నాధర్మము; మీకర్తవ్యమే నాకర్తవ్యము; మీయానందమే నాయానందము.

వీరబలుడు

దేవీ, సహధర్మిణి వనుపించుకొంటివి. కుమారీ, నీ వేమందువు? తమ్మునికొఱకు నీ వేమాత్రము దుఃఖింపగూడదు సుమా!

కుమారి

జనకా, సార్వభౌమునిచే పోషింపబడుచున్న మనము సార్వభౌముని రక్షించుటకై వెనుదీసినచో సార్వభౌమునిఋణ మెట్లు దీర్చుకొనగలము? ఇహమున కీర్తియు, పరమున కైవల్యమును మన కెట్లు లభించును? తమ్ముని ప్రాణమే కాదు, నాప్రాణముగూడ నర్పించెదను. మనము పోయిన విచారించువారు ఒకరిద్దఱే కాని సార్వభౌముడు గతించిన సామ్రాజ్యమంతయు క్షోభిల్లునుగదా! ఇంతమంది ప్రాణులను సంతోషచిత్తులను గావించుటకు ఒక్క మనజీవ మర్పించుట, తండ్రీ. ఎంత సంతోషకరము!

వీరబలుడు

మీవంటి సతీసంతానము లభ్యమగుట నా బహుజన్మతపఃఫలంబుగాని వేఱుగాదు.

సతి

ఇందు స్తుతింపవలసిన దెద్దియు లేదు. మనస్వధర్మమే.

వీరబలుడు

(వినుట నభినయించి) సతీ! అదిగో జాము కోడి కూయుచున్నది. వేగుజుక్కగూడ పొడిచినది. తూర్పు దెసను తెలిచాయలుగూడ గాన్పించుచున్నవి. మన మిపట జాగుచేసిన బలివిధికి విఘ్నము సంభవించును. మహారాజును మృత్యువు సమీపించును. మనము వేగిరముగ కాత్యాయనీ మందిరమున కేగుదము, రండు.

అందఱు

ఇదిగో వచ్చుచుంటిమి.

[అందఱు నిష్క్రమింతురు.]

---

షష్ఠరంగము

[ప్రదేశము: కాత్యాయనీమందిరము.]

రాజు

వీరబలుడేకాక యతని సతీసంతానముగూడ ధర్మనిరతులగుట యత్యద్భుతముగ నున్నది. అదిగో! అప్పుడే వీరబలుడు బలివిధి నిర్వర్తించుటకై సకుటుంబముగ శీఘ్రగమనముతో నేతెంచుచున్నాడు. నే నిం దుండుట దెలిసెనేని ప్రమాదమగును. కాన తొల్లిటివలెనే దాగియుండి, వీరి ధర్మనిష్ఠ నింకను బరికించెదను.

(రాజు నిష్క్రమించును.)

వీరబలుడు

(సతీ సంతాన సహితముగ బ్రవేశించి ఖడ్గసహితముగ చేతులు జోడించి) హే జగన్మాతా, ఆదిశక్తీ, లోకకల్యాణదాయినీ, ఈ

సమస్తవిశాలవిశ్వమునకు నధిపురాలవైన నీకు బలిదాన మర్పింప నెంతవారము? అయినను చంద్రుని కొకనూలుపోగన్న చందమున నీ చిన్నికొమారుని కానుకగా గైకొని మా మహారాజును చిరంజీవిని జేయుము.

(అని సాష్టాంగపడి, లేచి, కుమారుని జూచి) కుమారా! దేవి కభిముఖముగ వచ్చి నిలిచి నమస్కరింపుము.

బాలుడు

హే జననీ, కాత్యాయనీ, నమస్కారము. నా క్షుద్రజీవముల గొని మా ప్రభువు చిరంజీవి యగున ట్లనుగ్రహింపుము.

(అని బాలుడు నిమీలితనయనుడై, చేతులు మోడ్చి భక్తిభావముతో నిలువబడియుండ, వీరబలుడు కత్తితో బాలునికంఠముపై వ్రేయును. బాలుడు నేలపై బడును.)

బాలిక

తండ్రీ, మహాభాగ్యము! నేనుగూడ దేవికి బలి యగుదును. అనుగ్రహింపుము.

(అని తండ్రికి నమస్కరించును.)

వీరబలుడు

రాజు సజీవి యగుటకు కాత్యాయనికి తమ్ముని కానుక చాలును. కుమారీ, నీవుగూడ నేల? వలదు.

కుమారి

నాన్నా, దేవీసన్నిధి కేగుటచే తమ్ము డక్కడ ఒంటరి; నే నిక్కడ ఒంటరిని. నేనుగూడ వెళ్లినచో తమ్ముడును, నేనును గలిసి దేవి యంకమున నాడుకొందుము. మఱియు నేను వెళ్లక పోయినచో నిత్యము మేము కాత్యాయనికై గ్రుచ్చెడి పూలమాలలు తమ్ము డొక్కడే యెట్లు తయారుచేయగలడు? చెట్టుపై కెక్కి, తమ్ముడు పూవులు రాల్ప నే నేరుదును. తమ్ముడు తొడిమల దీయ నేను మాల గట్టుదును. ఆపని నిప్పు డొక్కరే చేయ నాలస్య మగునుగదా! దేవి కోపింపదా! తమ్మునికి శ్రమకాదా! కాన నన్ను నేగిరముగ బంపుడు.

వీరబలుడు

(నవ్వుచు) అది నాపని గాదు.

కుమారి

ఆజ్ఞ దయచేయుడు: నేనే బలియగుదును.

వీరబలుడు

ఇదిగో ఖడ్గము! నీయభీష్టముకొలది దేవికి వినియోగ మగుము.

కుమారి

మహాప్రసాదము.

(అని కత్తి నందుకొని కంఠముపై కొట్టుకొని నేలబడును.)

సతి

నాథా, ఎవరు మనకు ప్రాణముకంటె ప్రియతములో, ఎవరు మన జీవితస్రవంతి యందు ఆనందవీచికలో, అట్టి పుత్త్రీపుత్త్రులు మరణించిరి. ఇక నే నీపుడమిని మనుట యెందులకు? అనుగ్రహించినచో నేను గూడ వారిని జేరబోదును.

వీరబలుడు

దేవీ, నీయిష్టము.

సతి

మహాప్రసాదము. దేవరయనుగ్రహమునకు ధన్యురాలను.

(అని కత్తియందుకొని మెడపైగొట్టుకొని నేల పై వ్రాలును.)

వీరబలుడు

ఎవరివలన నాకు సంతోషమో, ఎవరిపోషణ నాకు ధర్మమో, ఎవరికొఱకు నే నీభృత్యకర్మము నెఱపుచుంటినో, అట్టి నాయాప్తసతీ సంతానము మడిసెను. ఇంక నే నెవరికొఱకీపుడమి జీవింపవలెను? ఎవరికొఱకుద్యోగము సేయవలెను? ఏమియు లేదు. కాన సార్వభౌమునకు దీర్ఘాయువు గలుగునట్లు ప్రార్థించి, నాయసువులనుగూడ నీదేవిసన్నిధినే విడిచెదను. జగన్మాతా, నమస్కారము. నా స్వామి చిరంజీవి యగున ట్లనుగ్రహింపుము.

(అని వీరబలుడుగూడ ప్రాణముల బాయును.)

రాజు

(ప్రవేశించి) అకటా! ఎంతపని జరిగినది! ఏరాజ్యమువాడో, ఏపురమువాడో, ఈరాజపుత్రుడు! తలవనితలంపుగ నాకొలువున జేరి నాకొఱకై సకుటుంబముగ గతించెను! ఆహా! ఏమి భృత్యనీతి! ఆహా! ఏమి క్షాత్త్రధర్మము! ఆహా! ఏమిధర్మనిష్ఠ! ఏమి అపురూపపుత్యాగము! ఆహా! నిక్కమీలోకమున నెందఱు పుట్టుచున్నారు! ఎందరు సమయుచున్నారు! కాని వీరిబోలిన ధర్మనిష్ఠులుమాత్రము జనించుటరిదిగదా! అయ్యో! నాతుచ్ఛప్రాణమునకై వీ రంద ఱసువుల బాసిరే! కనులార గాంచుచుండియు, కాదనుటకు నాకు నోరు రాదాయెనే! ఇట్టి పావనచరితులను, ధర్మనిష్ఠులను బలిచేసి, నే నేమని రాజ్య మేలుదును? ఏమని రాజ్యభోగము లనుభవింతును? ఇట్టి ధర్మాత్ముల శోణితముచే బునీతమైన యీపుడమిని బాలించుటకు నా కర్హత గలదా? లేదు; ముమ్మాటికి లేదు. ఏమైన సరియే, యీధర్మశూన్యమైన పనిని జేయజాలను. ఈకాకిబ్రతుకు బ్రతుకజాలను. ఏపవిత్రకృపాణముచే నీ ధర్మచరితులు ప్రాణములు త్యజించిరో, ఆ ఖడ్గముచేతనే నాకుత్తుక నుత్తరించుకొని యీ పావనచరితుల ననుగమించెదను. శ్రమాదుఃఖ భాజనమగు నీవిశాలసామ్రాజ్యము నేలుట కంటె నీ యాత్మార్పణమువలననే నాకు ముక్తి లభించగలదు; సౌఖ్యము చేకూరగలదు; యశ మతిశయింపగలదు.

(అని వీరబలుని మెడపైనున్న కత్తినందుకొని) కాత్యాయనీ, ఈభక్తుని అనుగ్రహింపుము:

(అని కంఠము తెగవేసికొనబోవును.)

[ఇంతలో కాత్యాయని ప్రత్యక్షమై రాజు చేయిపట్టుకొనును.]

కాత్యాయని

రాజా, సాహసింపకుము, సాహసింపకుము. నీ భృత్యవాత్సల్యమునకు సంతసించితిని. నీమెడ బ్రసన్నురాల నైతిని. నీకోరినవరము లొసగెదను; మృతి ప్రయత్నము విరమింపుము.

రా జు

తల్లీ, నీసందర్శనముచే నాజన్మము ధన్యమై నది. నాపాపములు ప్రక్షాళితములైనవి. నా కోర్కులు ఫలించినవి. కాని, తల్లీ, నా కడ్డురాకుము. నాభృత్యుని నే ననుసరింపవలెను. జననీ, లేగవెంట ఆవు చనుట న్యాయము గదా!

కాత్యాయని

రాజా, నీవు మరణించుటచే నీభృత్యుని ధర్మనిష్ఠ నే వమ్ముచేసినవాడ వగుదువు.

రా జు

ఏల?

కాత్యాయని

నీవు చిరంజీవి వగుటకేకదా ఈ రాజకుమారుడు సకుటుంబముగ నసువుల బాసినది? నీవు మరణించినచో నతని త్యాగ మెల్ల వ్యర్థమే కదా!

రా జు

దేవీ, క్షమింపుము. ఇట్టి భృత్యుని బోగొట్టుకొని నే నీపుడమిని మనలేను; ఈ సామ్రాజ్యమును బాలింపలేను. నే నాతని ననుగమించుటవలననే నాకు వీరస్వర్గము లభించును.

కాత్యాయని

రాజేంద్రా, నీభృత్యవాత్సల్యమున కెంతయు సంతసమును జెందితిని. ఏదేని ఒక్కవరము వేడుము; ఒసగెదను.

రా జు

నాకై యసువు లర్పించిన యీ వీరబల రాజకుమారుడు సకుటుంబముగ పునర్జీవితుండగుట దక్క యీదాసునకు వేఱొకవర మక్కఱ లేదు.

కాత్యాయని

మంచిది. అట్లే యగును. నీవు నీమందిరమున కేగుము.

రా జు

మహాప్రసాదము, తల్లీ.

[అని రాజు నమస్కరించి నిష్క్రమించును.]

వీరబలుడు

(సతీసంతాన సహితముగ లబ్ధజీవుడై, ఆతురతతో) దేవీ, ఏమిచిత్రము! మనము మృతులము గాలేదు? బలివిధానమునం దపచారము కల్గెనో, కాత్యాయని ఆగ్రహించెనో! అయ్యో, మహారాజేమయ్యెనో! మహావిపాదముగలుగుచున్నదిగదా? ఏది త్రోవ? మరల కుమారుని ఖండింతునా? ఏదీ ఖడ్గము? ఏదీ ఖడ్గము? (అని కలయ పరికించి, ఎదుట ప్రత్యక్షమైయున్న కాత్యాయనిం గాంచి) ఆహా! సహస్రసూర్య ప్రభా భాసమానద్యుతులతో విరాజిల్లుచు, మందస్మిత వదనారవిందయు, కృపాంగాపలోకయు నైన యీదేవీమూర్తి యెవరు? నా తల్లి కాత్యాయనియేనా?

(అనికరములు జోడించి నిలువబడిపోవును.)

కాత్యాయని

(వీరబలుని శిరము నిమురుచు) కుమారా! నీ యందపచార మెద్దియు గలుగలేదు. నీస్వామి భక్తికి మెచ్చి నేనే మిమ్ము పునర్జీవితులను గావించితిని. మీచక్రవర్తి సుఖమైయున్నాడు.

నీభార్యబిడ్డలను దోడ్కొని నీ గృహంబున కేగి సుఖంబున నుండుము.

వీరబలుడు

మహాప్రసాదము. తల్లీ, ఈదాసుడు సర్వదా భక్తితత్పరుడును, ధర్మజీవియు నగున ట్లనుగ్రహింపుము.

(అని సకుటుంబముగ నిష్క్రమించును.)

---

సప్తమరంగము

[ప్రదేశము: మహారాజు శయనాగారము.]

రాజు

ఎవ రక్కడ?

వీరబలుడు

అయ్యా వీరబలుడను ఏమి సెలవు?

రాజు

ఆస్త్రీ యెవరో, ఏడ్చుటకు కారణ మెద్దియో విచారించి వచ్చితివా?

వీరబలుడు

చిత్తము. విచారించి, యామెను తగువిధమున నోదార్చి వచ్చితిని. దేవర సుఖంబుగ నిద్రింప వచ్చును.

రాజు

(తనలో) ఇంతటి మహాత్యాగము చేసియు నిసుమంతయైన వివరింపడు. ఆహా! వీరబలు డెంతటి యుదారచరితుడు! ఈసజ్జన శేఖరుని ఋణ మెట్లు దీర్చుకొందునో!

[తెరపడును.]

---

అష్టమరంగము

[ప్రదేశము: రాజసభ. మంత్రిసామంతపరివార సహితముగ సార్వభౌముడు కొలువుతీర్చి యుండును.]

రాజు

అమాత్యవర్యా, వీరబలుని బిలువ నంపితివా?

అమాత్యుడు

చిత్తము! పిలువనంపితిని. వీరబలుని సాహస కృత్యములు వినినకొలది విన గుతూహల మగుచున్నది. తరతరములనుండి దేవర కొలువు సేయుచున్నను మాకు సాధ్యముకాని స్వామి భక్తిని ఆగంతుకుడగు వీరబలుడు చూపి కృతకృత్యుడయ్యెను. ఆహా! ఏమి యతనిభాగ్యము!

రాజు

వీరబలుని ధర్మనిష్ఠకంటె అతని చిన్నికుమారుని పితృభక్తి, దైవభక్తి, స్వామిభక్తి నిరుపమానమై పొడకట్టినది.

అమాత్యుడు

పులికడుపున లేడిపిల్ల పుట్టునా! ఆచిఱుత కూన తండ్రికి దగిన తనయుడు!

రాజు

నిశ్చయము. (వినుట నభినయించి) అమాత్య వర్యా! ఆమంగళవాద్యములు మ్రోగు టెక్కడ?

అమాత్యుడు

సార్వభౌములకు మరణాపద తప్పినందులకు సంతోషసూచకముగ నగరమంతట నుత్సవ

ములు సలుపవలెననియు, స్వామిభక్తితత్పరు డగు వీరబలుని సగౌరవముగ నుత్సవముతో ధర్మాపురునకు దోడ్కొని రావలెననియు శాసించితిని. అవియే ఆమంగళవాద్యములై యుండును.

రాజు

వీరబలుని కర్హమైన సత్కారము జరిపించితివి; సంతోషకరము. అదుగో, వీరబలుడు సమీపించుచున్నాడు. అమాత్యవర్యా, అతని కెదురేగి తోడ్కొని-కాదుకాదు నేనే తోడ్కొనివచ్చెదను.

(అని సింహాసనమునుండి దిగి యెదురేగును.)

వీరబలుడు

సార్వభౌముల కభివాదనము. ఈ దాసు నెందుకు బిలిపించితిరి.

రాజు

(వీరబలుని చేయి బట్టుకొని) వీరబలా! నీవు దాసుడవు కావు; సాటి సార్వభౌముడవు. ఇదిగో, ఈసింహాసన మధిరోహించి, ఈకిరీటము శిరమున ధరించి, ఈ కృపాణమును చేబూని, మాయర్ధరాజ్యమున కధిపతివై, మహారాజ బిరుదమునందుము.

(అని సింహాసనముపై గూర్చుండబెట్టి, కిరీటమును శిరముపై నుంచి, కృపాణము చేతి కిచ్చును.)

సభ్యులు

రాజభక్తి తత్పరుడగు వీరబల మహారాజుకు జయ! భృత్యవత్సలుడగు శూద్రకమహారాజుకు జయ! (అని పుష్పవర్షము గురిపింతురు.)

[తెర పడును.]

---

## మురళి

అనంతపంతుల రామలింగస్వామి గారు

మురళీ, నిన్నని సంతసించెద, సుధర్మల్, తాపసోత్తంసముల్
సరసీజాక్షుని దర్శనార్థమయి విస్తారం బహోరాత్రముల్
గురిగా సత్తప మాచరించినను గోర్కుల్వొందర, రీవన్ననో
హరిహస్తద్వయి నాడిపాడెదవు నిత్యానందకందంబవై.

బాహుశాఖలు, కరపల్లవములు గలిగి-యబ్జనాభుఁడు సురసాలమగుచుఁ దనర
నీవు తద్ఘనతరు నాశ్రయించినావు-మురళి, కలకంఠివగుచు నీవున్నమేమొ!

ధన్యవు, నిన్నుఁ గైకొనుచుఁ దామరసాక్షుఁడు హర్షమొంది, సౌ
జన్యము మీఱ గీతముల సారరహస్యమదెల్ల నీకసా



మహాత్మగాంధిగారు

ఖద్దరుప్రదర్శన ప్రారంభకులు, చెన్నపురి




సేట్ జమ్నాలాల్ బజాజ్ గారు, అధ్యక్షులు

అఖిలభారత ఆర్య వైశ్య మహాసభ, చెన్నపురి



కాంగ్రెసు నగర దృశ్యము

౪౨వ భారత జాతీయ మహాసభ, చెన్నపురి

మాన్యముగాఁగ వాకొనఁగ మాద్రికి మీఱుచు నీవు వానినన్
మాన్యులు మెచ్చఁ బాడి భవమాంద్యము వాపెద నబ్బురంబుగన్.

నీరూపము, నీవంశము- నీరసములునైనను నళినీలోచనుఁ డిం
పారఁగ నిను వీడఁడు, వి-స్ఫారతరప్రేమపాశబద్ధుం డగుచున్.

ఉరమున సిరి, భుజసీమను-ధరణీసతి, నీల యంకతలమునఁ దగినన్
హరి ముద్దుల కిరవగు, దోమురళీ, నీభాగ్య మెన్నఁ బోల దెవరికిన్.

నీయమృతాభనాద మననిన్ వినునంతనె గోగణంబులున్
మేయుట మాని నీసరస మేకొని నిల్చుట, చంటిబిడ్డలన్
బాయుచు నల్లనీసతులు వచ్చుట మున్నగునట్టి కృత్యముల్
ధ్యేయము లయ్యె నాకు మురళీ, భవదద్భుతనాదసంస్మృతిన్.

ఆ యమునాతరంగిణియు, నాపులినంబులు, నాతమాలభూ
జాయతసీమ, లాసురభిశానిలముల్, శరదిందుచంద్రికా
ప్రాయము, స్నిగ్ధశాద్వలతలస్థిత మంజులకుంజపుంజముల్
ధ్యేయము లయ్యె నాకు మురళీ, భవదద్భుతనాదసంస్మృతిన్.

ఆయమలాబ్ద నీలరుచిరాంగుఁడు, విశ్వమనోహరుండు, నా
రాయణుఁ డవ్యయ ప్రకృతి రాధికతో సరినిల్చి యోంకృతి
స్థేయుఁడు నౌచు నంతుమెయి దేవియుఁ దానును బాడుచుండుటల్
ధ్యేయము లయ్యె నాకు మురళీ, భవదద్భుతనాదసంస్మృతిన్.

మురళీ, నీదగువంశమందు జననంబున్ బొంది, నిన్వోలె. శ్రీ
హరిసాయుజ్యఫలంబు నొందుటకు నూహన్ జేతు, నేతత్ క్రియా
వరమున్నా కిడునట్లు శ్రీశుచవిలో వాకొంటకున్ దక్షులె
వ్వారు లే, రీవె సమీపవర్తినివి, నిన్ బ్రార్థింతు వాంఛాప్తికై.

---

# అనర్ఘం

శ్రీ వాసుదేవరావు గారు

౧

సరస్వతి చక్కనిచుక్క కాదు; కాని, అనాకారీ కాదు. సాధారణమైన రూపవతి. ఆమెకు పద్దెనిమి దేండ్లుంటుంది. ఆయీడుకు తగ్గపొడుగూ, ఆపొడుపుకు తగ్గలావూ, ఆలావుకు తగ్గ అంగసౌష్ఠవమూ కలిగివుండేది. దేహకాంతి 'పదియార్వన్నె పసిండి' ఛాయ కాదు. కాని 'కడిగిన నిప్పుకుంప' మాత్రము కాదు. చామన ఛాయ. ఆకండ్లఅందము, ఆముక్కుతీరు, ఆనుదుటిసొగసు — అన్ని అవయవములు దిద్ది తీర్చిన ట్లుండేవి. సర్వాంగమూ పుష్టి కలిగి వుండేది. ఆమెను చూచినవాళ్లందరూ ఈమె పల్లెటూరిపిల్ల అని తెలిసికొందురు. అట్లని యే బ్రాసిగా వుండేదికాదు సుమండీ. పట్టణవాసులతో ఆమెకు బాంధవ్యం కలిగినప్పటికీ, ఆమె కొంతకాలంనుంచి అత్తగారి యింట్లో — గుంటూరులో — కాపరం చేస్తూవున్నప్పటికీ, పట్టణవాసుల నవనాగరీక మామె కింకా పట్టుపడలేదు. అచ్చపు ఆర్యయువతీ లక్షణా లామెయందు వాసం చేస్తున్నవి. తెలుగు బాగా చదువుకొన్నది.

ఈమె పతిప్రాణ. అత్తమామలకు తల్లో నాలిక. మొత్తముమీద వినయవిధేయతలతో ప్రవర్తించే సద్గుణరాశి అనవచ్చు.

ఈమెభర్త వసంతరావు చెన్నపట్నంలో 'లాకాలేజి' లో చదువుతున్నాడు. ఈయన తలిదండ్రులు గుంటూరులో నున్నారు. కొన్నాళ్లకోసమని వసంతం భార్యను చెన్నపట్నం తీసుకపోలేదు. సరస్వతి గుంటూరులో అత్తగారి యింట్లోనూ, చేబ్రోల్లో పుట్టింట్లోనూ వుంటూవుండేది. వసంతమే శెలవలు దొరికినప్పుడెల్లా యింటికి వచ్చి శెలవు ముగిసిన తర్వాత వెళ్లిపొయ్యేవాడు.

దీపావళి పండుగ సమీపిస్తూంది. దీపావళి అల్లుళ్ల పండగకాదా! వసంతం మామగారు లక్ష్మీనారాణప్పంతులుగారు అల్లుణ్ణి పండక్కు చేబ్రోలు రావలసిందని ఆహ్వానం పంపాడు. వసంత మందుకు సంతోషంతో పండక్కు ముందునాడు బయలుదేరి మరుసటినాటి వుదయం చేబ్రోలు చేరుకున్నాడు.

వసంతం బండిదిగటంతోటే మామగారు మందహాసంతో యెదురుగా వచ్చి కుశలప్రశ్న లడుగుతూ ఇంట్లోకి తీసుకపోయినాడు. చిన్నబావమరది నరసింహం బావగారిపెట్టెను తీసుకపోయి గదిలో చేర్చాడు. వంటయింట్లో పనిసందట్లోవున్న అత్తగారు నిమిషంతీరికచేసుకుని బయటికి వచ్చి అల్లుణ్ణి కుశలప్రశ్న లడిగింది. అనంతరం "అమ్మాయీ, నీవుకలంటుతావా — నే నంటనా?" అని 'అమ్మాయి' ని — సరస్వతిని — అడిగింది.

వసంతం "ఎవరూ వద్దు. కాస్సేపుండి మంగలాడిచేత అంటించుకుంటాను. గంటసేపు నిద్రపోవాలె" నన్నాడు.

"నాయనా, ప్రయాణం బడలిక తీరుతుంది. రాత్రిఅంతా నిద్రలేదు కాబోలు! అయినా స్నానం చేస్తే మంచిదే. బడలిక తీరుతుంది. నీయిష్టం. అనకే చేద్దువులే" అన్నది అత్తగారు.

బావ చేతులు పట్టుకుని నరసింహం గదిలోకి తీసుకపోయినాడు. ఆమాటా యీమాటా మాట్లాడి పిల్లవాడు బయటికి వెళ్లి పోయినాడు.

వసంతం డ్రెస్సుతీసి 'ఈజీ' చేర్లోపడి వక 'సిజర్సు' సిగరెట్టు కాలుస్తూ, కండ్లుమూసుకుని వున్నాడు. అంతలో సరస్వతి వకపళ్లెరంలో ఫలాహారపుదినుసులూ, కాఫీ తెచ్చి చిన్నబల్లమీద పెట్టింది. మగనికేసి చూచింది. అతడు కండ్లు మూసుకుని వున్నాడు.

సరస్వతి నిద్రాభంగం చేయడానికి వెరుస్తూన్నదానివలెనూ, మగడు ఫలాహారమేమీ పుచ్చుకోక నిద్రపోతున్నాడే అని జాలిపడుతున్నదానివలెనూ అయి మృదువుగా "నిద్రా?" అన్నది.

వసంత మెలిక్కిపడి కండ్లు తెరచి చూచాడు. ఇద్దరూ చిరునవ్వు నవ్వుతున్నారు. ఇద్దరికండ్లూ ప్రేమాలాపాలకు సాగినవి. నిమిష మూరకున్నారిద్దరూ.

"ఓహో! దయచేశారే రాణీగారు! ఇంతసేపటినుంచీ కనబడక పోవడంవల్ల చాలా బెంగపడ్డాను." అని వసంతం మందహాసంతో నన్నాడు.

"ఆ! అట్లాగా? నిజమే? అబ్బో! ఎంత బెంగపడ్డారు? అంతప్రేమ యెప్పుడు పుట్టింది? దశరా శెలవులకు వస్తామన్నవారు కామా? పోనీలెండి - దీపావళికైనా దయచేశారు— జ్ఞాపకముంచి. అదే పదివేలు! మాయందు పరిపూర్ణానుగ్రహ మున్నదన్న మాటే!" అని అన్నది సరస్వతి ప్రేమతో.

"దశరాకు వస్తానన్నమాట నిజమే—కాని, వీలు కలిగింది కాదు—"

"కలగదు- కలగదు. ఉన్నది మహాపట్నమాయె-" అని సరస్వతి అంటూవుండగా వసంతము సిగరెట్టు పీల్చి పొగ ఆమెపైపు వూదినాడు. సరస్వతి కించిత్కోపంతో - పొగ తోసేసుకుంటూ, "ఈక్రొత్తవిద్య పట్నంలో నేర్చుకున్నారు కాబోలు?" నన్నది.

"ఏది? ఇదేనా?" అనివసంతం సిగరెట్ పీల్చి మళ్లీ వకసారి ఆమెపైపుకు పొగ విడుస్తూ అన్నాడు.

"'ఇదేనా'? అని అంటున్నారు-ఇంకాయేదైనా నేర్చినారా యేమిటి?" అని సందేహిస్తూ అడిగింది సరస్వతి.

"అంతతొందర యెందుకూ? ముందుముందు నీకే తెలుస్తుందికదా!"

సరస్వతి మొహం వివర్ణమయింది. హృదయం సంశయాన్వితమయింది. అయినా ధైర్యం తెచ్చుకుంది. నవ్వు అరువుతెచ్చుకుంది. "ఎట్లాగైతే నేమి- వచ్చారు. అదే—"అని అంటూవుండగా వసంతం "ఆc- వచ్చాను; గాని ఆరమ్యమనోమోహన సుందర—" అని యేమో అనబోయినాడు.

సరస్వతి మొహం చిట్లించుకుంది. "కానియ్యండి ఫలాహారం- కాఫీ చల్లారుతుంది" అన్నది.

"కాఫీ యివ్వడం మొహం చిట్లించుకునేనా? కోప మెందుకు వచ్చింది?"

"ఎవరికి కోపం వచ్చింది? ఆరమ్యమనోమోహన సుందరరూపరాశిని వదలిరావడం కష్టమయి వుంటుంది. కాని, యేమిచేయగలం? రాక తప్పింది కాదు—" అని సరస్వతి మగనిపైని వాక్యం పూర్తిచేసింది. ఆ వెంబడే తల నేలకు వాల్చింది.

వసంతం తటాలనిలేచి ఆమెను చెంతకు లాక్కున్నాడు. మంచంమీద కూర్చుని ఆమె చీరచెరగుతో ఆమె కన్నీరు తుడిచాడు. "పిచ్చిపిల్లా, నీవు పడుతున్న అనుమాన మేమిటి? ఈకన్నీళ్లెందుకు? ఎబ్బే! ఇదేనా నీ తెలివి? ఏమయిందో చెప్పుమా!" అని ప్రేమార్ద్ర స్వరంతో ఆమె నూరడించ సాగినాడు. కాని, సరస్వతి అతని వక్షస్థలంలో తలదూర్చి అట్లే చిన్నబోయిన ముఖంతో వుంది. ఏమీ మాట్లాడలేదు.

"పలుక వెందుకు, సరసూ? ఎందు కిట్లా చిన్న బోయినావు? చెప్పకపోతే నన్ను—"

"వద్దు - ఒట్లువద్దు." అని అంటూ సరస్వతి యించుకధైర్యం తెచ్చుకుని, "ముందుగాఫలాహారంపుచ్చుకుందురూ. కాఫీ చప్పన చల్లారిపోతుంది" అని అన్నది.

"నాకిప్పుడు ఫలాహార మేమీ వద్దు. వట్టి కాఫీ చాలును" అని వసంతము కాఫీపాత్ర తీసుకుని గటగట తాగేశాడు.

తిరిగి వక సిగరెట్ వెలిగించి వసంతం "ఆc, ఇంక చెప్పు"మన్నాడు.

సరస్వతి అనుమానించింది.

"అనుమాన మెందుకు? నీమనసులోని దేమిటో చెపుదు. నిన్ను వదలను."

"మరేమీ లేదు. ఆరమ్యసుందరమనోమోహన-"

"'పట్టణము విడిచి రావడం కొంచెం కష్టంగానే వుంటుంది.' అని అనవచ్చాను. అంతలో నీ వనుమానపడి అపార్థం కల్పించుకున్నావు. మనసును బాధించుకుంటున్నావు. నీ నేమని అనుకున్నావు?"

"ఆరమ్యమనో మోహనసుందర విగ్రహాన్ని—
అని అంటారేమో నను కున్నాను. మరి, దశరా శెలవులు పదేసురోజులు. అప్పుడిక్కడికి వస్తే పది పదేను



రోజులుండి పోవలసి వస్తుంది. దీపావళి కైతే రెండురోజులేకదా. ఎల్లాగో వుండి వెంటనే ఆరమ్యమనో మోహన—"

"ఛా, ఛా, అదికాదు. దశరాకు రావడానికి వీలు చిక్కిందికాదు. కారణం సావకాశంగా చెబుతాను. కాని, యిప్పుడుమాత్రం రెండురోజులేమి? శని ఆదివారాలు కలిసి నాలుగు రోజులుంటానుగాదా?"

"అబ్బా! ఎంతటి ఔదార్యం! ఎంతటి మహోపకారం?"

అంతలో 'అమ్మాయీ' అన్న కేక వినబడ్డది.

సరస్వతి "అమ్మ పిలుస్తున్నది. కొంచెంసేపు బడలిక తీర్చుకుంటే, వంట కావడంతోటే వచ్చి పిలుస్తాను." అని చెప్పి అతని కౌగిట్లోనుంచి అతికష్టంతో విడిపించుకొని యింట్లోకి వెళ్లింది.

౨

సరస్వతి వంటయింట్లోకి వెళ్లినవెంటనే వసంతం మంచంమీద మేను వాల్చినాడు. రెండునిమిషాల్లో అతనికి నిద్ర పట్టింది.

రెండుజాములవేళకు మరదలు తార యితన్ని నిద్రలేపింది. తలంటడానికి మంగలి వచ్చాడని చెప్పింది. వసంత మభ్యంగ స్నానానికి తయారయినాడు. అంతలో పెద్దబావమరిది కృష్ణుడు "ఈవేళకూడా మంగలిచేత తలంటించుకోవలెనా? నేనంటుతాను బావా" అని అన్నాడు. సరస్వతి మగనివంక వకవిధంగా చూచింది. ఆచూపు కర్థం వసంతం తెలుసుకున్నాడు. "ఎవరైతే నేమి? నీవైనా నీతమ్ముడైనా యింకా నీచెల్లెలు తార అయినా నాకు సమానమే. ఇష్టంవచ్చినవాళ్లంటవచ్చు నాకు నిద్ర వస్తున్నది. త్వరలో కానియ్యండి" అని అన్నాడు.

సరస్వతి స్నానాలగదిలో పీటవేసి నూనె గిన్నె చేతపట్టుకుని నిలిచింది. కృష్ణుడు "అక్కయ్యా, నేనంటుతానే" అన్నాడు.

"అబ్బాయి, పొద్దెక్కిందంటున్నారు. నీవైతే ఆలస్యంచేస్తావు. ఈవేళకు నేనంటేస్తాను. అయినా మగపిల్లవాడి కీలాంటిపను లెందుకూ? తోటిమగవాళ్లేమను కుంటారు?" అని సరస్వతి నవ్వుతూ అన్నది.

వసంతం నవ్వుతూనే "ఏమనుకుంటారు? బావమరదీ భార్యతో సమానమేగా?" అనిఅన్నాడు.

సరస్వతి "అయిందీ? ఈలాంటిమాట లనిపించుకోవలెనా?" అనిఅంటూ నూనె వసంతం తలపైపెట్టి అంటుతున్నది. అంతలో తార రుగెత్తుకొనివచ్చి, "అక్కయ్యా, బావకు నే తలంటాలె ననుకున్నానే—" అని ముఖం చిన్నపుచ్చుకొని నేల చూలబడ్డది.

"కానీలే చెల్లీ. ఇంక కనుంచీ నీవు టపాకాయిల సంచట్లో వుండిపోయినావు. పొద్దెక్కలేదూ? అందుకే త్వరగా అంటుదామని వచ్చాను."

"ఆఁ—ఎప్పుడూ నీవే అంటుతావు. ఒక్కసారైనా నన్నంట నీవు—"అని గట్టిగా అని తార యేడ్పుమొహం పెట్టింది. లోపలినుంచి తల్లి "బావను నువ్వు పెండ్లిచేసుకుంటే అప్పు డంటవచ్చులే!" అన్నది.

"ఛీ, నేనేమీ చేసుకో నీబావను. బావాబావ బన్నేరు—"

"తారనుపట్టుక తన్నేరు." అని వసంతం వెంటనే అందుకున్నాడు.

"తన్నడానికైతే తయ్యార్!" అన్నది తార.

"అక్కచెల్లెండ్రు సగం సవతులే" అన్నాడు కృష్ణుడు.

"ఎక్కడా చిక్కకపోతే అక్కమొగుడే దిక్కు" అన్నాడు వసంతం.

అందరూ నవ్వారు. తారకు కోపం వచ్చింది. పాదాలు నేలకు టపాటపా కొట్టుతూ పోయి గదిలో బావ మంచంమీద పడుకున్నది.

వసంతం అభ్యంగ మయింది. భోజనాలప్పుడు మామగారడిగే ప్రశ్నలకు జబాబులెట్లో యిస్తూ బావ మరదలు చేసిన పరిహాసాల కోర్చుకుని యెట్లెట్లో భోజన మయిందనిపించాడు. ప్రయాణం బడలిక. ఆమీద నిద్ర చాలదు. అందుపైన తలనొప్పి! ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడకుండా వున్నాడు. చేతులు కడుక్కోవడమే తడవుగా మంచంమీదపడి నిద్రపోయినాడు. భోజన మ్మందర అంతగా నేమీ తినలేదు. ఇతని తత్తరపాటు, మౌనం చూచి అత్తమామలు అల్లుడలసివున్నాడని అనుకున్నారు. సరస్వతిమాత్ర మన్యథా భావించుకుంది. ప్రొద్దున కాఫీయిచ్చి వచ్చింది మొదలామెమనసు మనసులో లేదు. ఏదో పరధ్యానంతోనే వుంది; కారణ మామెకే తెలియాలె.

కొంచెం సేపటికి సరస్వతి పనిలోపనిగా సందు చేసుకుని గదిలోకివచ్చి చూచింది. బల్లమీద తాను చుట్టి పెట్టిన తమలపాకుల 'కిల్లి' అక్కడే వుంది. మంచంమీద భర్త గాఢనిద్రలో వున్నాడు. సగంకాలి ఆరిపోయిన సిగరెట్ ముక్క తలాడదగ్గర పడివుంది. దాన్ని తీసి పారేసింది. అతణ్ణి లేపుదామనుకున్నది. మంచి నిద్దురలో వున్నాడు. లేపడానికి ధైర్యం కలగలేదు. నిలిచిచూచింది. వెనక్కు తిరిగి వెళ్లిపోయింది.

సరస్వతి యేవోపనులు చేస్తూన్నది. ఏమిచేస్తున్నదో తెలుసుకోవడం లేదు. ఎప్పటివుల్లాసం ఎప్పటి సంతోషం లేదు. మొహాన యెప్పటి కళాకాంతులూ లేవు. కారణం? తల్లిదండ్రులు భోజనమప్పు డడిగిన ప్రశ్నలకు భర్త సరిగా జబాబులు చెప్పలేదు. 'టాలా టోలీ'గా మాట్లాడినాడు. ఎట్లాగోవున్నాడు. భర్త ఎప్పటి ఆనందం ఎప్పటివుల్లాసం కనపర్చలేదు. ఎప్పుడూ ఊరికి రావడంతోనే గంటలకొద్దీ తనతో ముచ్చటలాడుతూ వుండేవాడు. ఈనాడు పదినిమిషాలైనా సరిగా మాట్లాడలేదు. మాట్లాడిన ఆరెండుమూడు మాటలూ అసందర్భంగా అర్థహీనంగా ఉన్నవి. నిజంగా నేదో కారణ ముండాలెనని అనుకున్నది. ఇంట్లో పనిపాటలు తోచలేదు. ఇంక భోజన మెట్లాచేసిందో ఆమెకే తెలియాలె! ఆమెహృదయం నానావిధాలోచనలకు గురి అయింది. రెండుమూడుసార్లు గదిలోకి వెళ్లిచూచింది. భర్త నిద్రపోతూనే వున్నాడు. లేచేజాడ కనబడలేదు విసికింది!

"అమ్మాయీ, జడవేస్తాను రావే ప్రొద్దు పోక వచ్చింది." అని అన్నది తల్లి సరస్వతిని.

"ఈపూట నాకు జడక్కరలేదులే."

"ఎందుకే? తలకు పోసుకున్నతల. వెంట్రుకలు చిక్కుపడివుంటాయి; రా" అని తల్లి బలవంతాన సరస్వతికి జడవేసింది. గులాబిపూవొక్కటి పెట్టింది. సరస్వతి 'వినోలియా వైట్‌రోజ్' సబ్బుబిళ్లతో ముఖంకడిగి చక్కని గుండ్రని కుంకుమబొట్టు పెట్టింది.

"ప్రొద్దు పోకవచ్చిందే కాఫీ, ఫలాహారం ఈయవాయేమిటి?" అని తల్లి అన్నది.

సరస్వతి విసుగుతో "కుంభకర్ణుడిలాగ నిద్రపోతూవుంటే తీసుకెళ్లి యెవరికి పెట్టను?" అని అన్నది.

"నిద్రలేపు ప్రొద్దుపోక వచ్చింది."

"నేను లేపను. తారను లేపమను."

"పిచ్చిచేష్టలు చేయకు. నీవు లేపడంలోనూ, తార లేపడంలోనూ భేదం లేదటే? పోపోయి, నిద్రలేపి, చెంబుతో నీళ్లిచ్చిరా ముందుగా ఫలాహారం పళ్లెం తీసుకపోదువుగాని"

"అమ్మా, యెరగవటే సీమదొరలు. కొళ్లూచేతులూ కడుక్కోవడం కూడానా? పక్కమీదున్నప్పుడే

కళ్లు తెరచీ తెరవకముందే 'కప్పీకప్' చేతి కందీయాలె. కొంతమందికి ప్రాణాలు పోతూవున్నా 'కాఫీ' యిదుగో అనటంతోటే ప్రాణాలు లేచి వస్తాయి."

సరస్వతి కాఫీగిన్నె ఫలాహారప్పళ్లెం తీసుకుని గదిలోకి పోయింది. సాయంత్రం నాలుగున్నర అయింది.

"ఏమిటేన్నిద్ర! ప్రొద్దుపోక వచ్చింది. ఇంకానైనా లేవరాదూ?" అని అంటూ సరస్వతి మగని చేతిమీద తట్టింది.

వసంత మలికిపడి కండ్లు తెరచి చూచాడు. "ఓ! నీవేనా?" అని అన్నాడు నవ్వుతూ.

"ఆఁ. నేనే. పాపం! స్వర్గలోకంనుంచి భూలోకానికి దింపినాను కాబోలు; ఏమిచేయను? పోనీండి. ఇంత కాఫీ పుచ్చుకుని కావలసివుంటే తిరిగి ఆస్వర్గసుఖమనుభవించవచ్చు."

వసంతం సిగరెట్ ముట్టించినాడు.


"ఫలాహారం పుచ్చుకుని ఆనక ఆపాడుసిగరెట్ కాల్చరాదూ?"

"పోనీ, గాని, యిప్పుడు ప్రొద్దెంతయింది?"

"అయిదు కావచ్చింది. ప్రొద్దుకూడా తెలీలేదు. ఇ దేవూరో అదైనా తెలుసునో తెలియదో!"

"నిజమే సుమా! నేనింకా ఆ—"

"నేను వెళుతాను. ఫలాహారం పుచ్చుకుని కాఫీ—"

వసంత మామెను పోనియ్యక పట్టుకున్నాడు. "రాణీసాహేబా, తమరు దగ్గర లేనిదే నేను కాఫీపుచ్చుకోవడం ఈజన్మంలోనేనా? ఈలాంటి దేలోకంలో జరుగుతుంది?" అని అంటూ ఆమెను కౌగిట్లో అదిమి పట్టుకున్నాడు వసంతం.

కొద్దిగ మందహాసం—కొద్దిగ కోపం—(ప్రణయకోపం కాబోలు.) ప్రవర్తిస్తూ సరస్వతి "ఆఁ. ప్రొద్దుటినుంచీలేని ఈ—" అంటూ తప్పించుకోవడానికి ప్రయత్నిస్తూవుంది.

గదితలుపు చప్పుడయింది. "వసంతం" అని పిలుపు వినబడ్డది. రామారావొక్క అడుగు గదిలో పెట్టాడు. వెంటనే వెనక్కు తగ్గాడు.

"yes, yes,come in (రా లోపలికి)" అని అన్నాడు వసంతం.

సరస్వతి ప్రక్కకు తొలిగింది.

"Excuse my intrusion-(నడుమనేను వచ్చినందుకు క్షమించు.) I thought you were alone. (నీ వొక్కడవే వున్నావని అనుకున్నాను.)" అంటూలోనికి వచ్చాడు రామారావు.

సరస్వతి సిగ్గుపడి చప్పున బయటికి వెళ్లిపోయింది.

## 3

రామారావు సరస్వతికి వేలువిడిచిన పెత్తండ్రికొడుకు. రామారావూ వసంతమూ గుంటూరుకాలేజిలో సహాధ్యాయులు. అక్కడినుంచి యిద్దరూ బందరునోబిల్ కళాశాలలో బి. ఏ.లో కడ చేరినారు. అక్కడినుంచి యిద్దరూ చెరొకతోవ పట్టారు. వసంతం చెన్నపట్నం వెళ్లి

'లాకాలేజీ'లో చేరాడు. రామారావు రాజమండ్రి "(టెయినింగుకాలేజిలో చేరి యల్.టి.లో నెగ్గి యిప్పు డు గుంటూరుకాలేజిలో 'ప్రొఫెసర్' అయినాడు. దీపావళిపండగ సెలవులకు స్వగ్రామం చేబ్రోలుకు వెళ్లి నాడు. సాధారణంగా సెలవుదినాలు వసంతంరామారావు లక్కడే గడిపేవారు. అదేమాదిరిగా యీసారీ కలుసు కున్నారు.

రామారావు గదిలోకి వెళ్లి కూర్చున్నాడు. కుశల ప్రశ్నే లయినవి. తరువాత రామారావు "ఏమోయ్ వసం తం, దశరా సెలవులకు వస్తావని చాలాఅనుకున్నాం. మన వాళ్లూ చాల ఆతుర్దాగావున్నారు. వస్తావని రాక రాక పోయినావేమిరా?" అని అడిగినాడు.

"చెబుతాను, గాని నాకొక్క ఉపకారం చేయా లె నువ్వు."

"ఏమిటిదా వుపకారం?"

"చేస్తానంటే చెబుతాను."

"ఏమిటేబలవంత మానుస్నావు?చేస్తాలే – చెబుదూ!"

"Then help me in emptying this Plate" (ఈపళ్లెం ఖాళీ చేయడంలో నువ్వు నాకు సాయం చేయాలె.)"

"ఇదేనా? అహహహ! ఏదో బ్రహ్మాండం మని గిందనుకున్నాను. మీయిద్దరలో తగువు వచ్చిందేమో,అది నన్ను దిద్దమని అంటావేమో ననుకున్నాను."అని అంటూ రామారావు పకోడీముక్క నకటి నోట్లో తురుము కొన్నాడు అది నములుతూ, "Now tell me what made you stay in Madras for Dasara. (ఆఁ, దశరాకు చెన్నపట్నంలోనే నిన్నాపిన కారణ మేమి టో చెబుదూ.)" అని అన్నాడు.

ఇద్దరూ బల్లదగ్గర కుర్చీలమీద కూర్చుని ఫలాహా రం చేయసాగారు.

"నాస్నేహితుల్లో పద్మనాభరావు, రాధాకృష్ణ అని అన్నదమ్ములున్నారు. వాళ్లలో పెద్దపద్మనాభుడు. మేము చాలాపరిచయంగా వుండేవాళ్లము. We used to call him Padma and the younger Radha. (వాడ్ని పద్మాఅనిన్ని చిన్నవాడ్ని రాధా అనిన్నీ పిలిచే వాళ్లం.)ఇద్దరూ female actors(స్త్రీపాత్రధారులు.) పద్మ నా class-mate (తోడి విద్యార్థి). రాధా is studying in the Christian College (క్రిస్టి యన్ కాలేజిలో చదువుతున్నాడు). వాళ్ల యింట్లో దేవీ పూజ మా grand గా (వైభవంగా) జరిపారు. అందు కోసమని నన్ను బలవంతాన్న ఆపారు." అని వసంతం చెప్పినాడు.

"I see-(అట్లాగా!) అదా సంగతి! పోనీగాని అత్తగారి యింటికన్నా అంత వైభవంగా ఉన్నద టోయ్?" అని రామారావు నవ్వినాడు.

"You wouldn't have laughed thus, if you had seen the grand festival (నీవా పూజామహోత్సవం చూచివుంటే యిట్ల నవ్వి వుండవు సుమా!) అక్కడి ఆనందోత్సవం, ఆమహోత్సవం, ఆ arrangements (ఏర్పాటులు) వర్ణించడం చాలా కష్టం. వాళ్లయిల్లు-ఇల్లేమిటి?—భవనంపేరు 'సుందరీ mansion (భవనం)'".

అంతలో గదితలుపు తోసుకుని సరస్వతి లో పలికి వచ్చి ఫలాహారపదార్థాలతో నిండివున్న మరో క్కపళ్లెం బల్లమీద పెట్టి, తలుపు ముందుకు తోసు కుని బయటికి వచ్చింది. మిత్రులిద్దరూ ఏమి మాట్లాడు కుంటున్నారో ఆమె వినలేదు. గదిలోకి వచ్చేటప్పుడు 'పేరు సుందరీ' అని వసంతం అంటూవున్నది విన్నది. మనసులో అనుమానం తోచింది. "ఏమిటో సుందరీ అంటున్నారు. ఈసుందరి యెవరో తెలుసుకోవాలె. ఈచాటుండి వింటా" ననుకున్నది.

వసంతం తనకథ పూర్తిచేయసాగినాడు. "ఆహా! దాని చక్కదనం ఎంతని వర్ణించవచ్చును!" అని అంటూ గారెముక్క నోట్లో వుండడంచేత అరనిమిష మూరకు న్నాడు.

"దాని చక్కదనం వర్ణించడానికి వీల్లేదట! ఎవరి చక్కదనం? సుందరీ చక్కదన మేనా? నేను రావడం తోటే మాట లాపేశారు. అట్లా చూచా రెందుకు? నే నడ్డం పోయానని కామా? ఏదో రహస్యం మాట్లాడు

కుంటున్నారు. ఏమి రహస్యం? సుందరీ రహస్యం! ఇంకా యేమేమి ప్రత్యేలు రాలుతాయో వినాలె" నని ఆలోచించుకుంటూ చెవి తలుపుకు ఆనించి నిలబడ్డది, సరస్వతి.

"అబ్బబ్బ! మహానందం! బ్రహ్మానందం! ఆపది రోజులూ పదినిమిషాల్లాగా గడచిపోయినాయి" అని వసంత మన్నాడు.

"కాస్త తీరికచేసుకుని సవిస్తరంగా చెబుదూ. నీవు చూచినవాడవు. మేము విని అయినా సంతోషిద్దాం" అని రామారా వన్నాడు.

"అన్నిటి కేమిగాని కొన్నిటిని మాత్రమే చెబుతాను. ఆరోజున,అనగా ఆఖరు రోజున, చాలామందిని invite (ఆహ్వానం) చేశారు. నేను వాళ్లను కాదన లేక వుండిపోయినానుగదా. అక్కడికి వెళ్లేసరికి elder (పెద్ద) వాకిట్లోవుండి నన్నుతీసుకెళ్లాడు. Front hall (ముందరిచావడి) చేరేసరికి రాధ మమ్మల్ని కలుసుకుని, అందరంచేరి ఒక గదిలో చేరాము. ఈగదిలో చిత్రపటాలూ, ఎలెక్ట్రిక్ లైట్సు fans (వీవనలు),పడకకుర్చీలు,సోఫాలు చూచినేను 'సుం'అయిపోయినాను. ఆ pictures లో(పటాలలో),వకటి రాధాఫోటో!in femal eattire (స్త్రీవేషంలో) నేను పోల్చుకోలేకపోయాను. ఆవిశాలనేత్రాలూ, ఆకనుబొమ్మలు దిద్దు - ఆఅర్థచంద్రాకారపు నుదురు ఆసుంద్రమైన మొహం- అబ్బ- మాషోకుగ వుంది. చూడ రెండు కండ్లు చాలవు___"

"అబ్బబ్బ! నాకళ్లుకూడా తీసుకునిపోకపోయినావా బావా?" అన్నాడు రామారావు నవ్వుతూ!

"ఇంక బాగుపడ్డట్టే- నన్నడిగివుంటే నాకళ్లు కూడా యిచ్చివుందునే పాపం!" అని అనుకున్నది సరస్వతి.

వసంతం చెప్ప ప్రారంభించాడు: "బనారస్సు ఆకుపచ్చని చీరకట్టి, గమ్మత్తయిన జాకెట్టుతొడిగి, ఇంట్లో వున్న నగలన్నీ అలంకరించుకుని తీసుకున్నఫోటో అది. గంటసేపటికి పోల్చుకున్నాను. మాఆశ్చర్యమేసింది నాకు. అప్పుడు నా కేమయిందోగాని, దగ్గరున్న రాధను చటాలని కౌగిలించుకున్నాను___"

"ఛీఛీ! పాడు-అసహ్యం! ఒక్కతెకాదే-సుందరీ, రాధా,పద్మా___పద్మా___అంటే 'పద్మావతి'కాబోలు! ముద్దుపేరేమో-నన్ను 'సరసూ,సరూ' అని పిలుస్తుంటే లేదా-అంతే అయివుంటుంది. బాగున్నయి పేర్లు! పట్నంలో వుండి చదివేపదువు ఇది___"అని సరస్వతి అనుకున్నది.

"అంతలో పద్మచెల్లెలు-ఆరేండ్ల పిల్ల-గ్లాసెడు బనానాసిరప్ తెచ్చియిచ్చింది. తాగేశాను-మా బాగావుంది."

"అయ్యయ్యో! తానుకూడానా? అదేమిటి?సోడా లెమనేడ్ రకంలోనిది కాదుకదా? అదేమి కర్మమో! చెడుతానుడే అయివుంటుంది. ఇంకేమి కావాలె? తాగటం-తినటం-తిరగటం___"

"అక్కడినుంచి దీపాలు పెట్టేసరికి-పండువెన్నెల-అందుకుతోడుగా ఎలెక్ట్రిక్ లైట్లు-బంగళాలోని తోటలోకి వెళ్లాము. కొన్నికొన్ని తమాషా లయినతర్వాత రాధాపద్మలు ఫిడేలు మద్దెలసహాయంతో సంగీతం ప్రారంభించారు. I told you both Padma and Radha are renowned actors and excellent dancers (పద్మారాధలు ప్రఖ్యాత నటకులనిన్నీ, మంచిన ర్తకులనిన్నీ చెప్పానుగదా.) ఇప్పుడు మొదట సంగీతం; తర్వాత నాట్యం."

"ఇద్దరూ మంచి చక్కని వాళ్లే ననుకుంటాను?" అన్నాడు రామారావు.

"ఆఁ. నోరూరుతున్న దేమో పాపం అన్నయ్య" అని సరస్వతి తనలో ననుకున్నది. విన్నకొద్దీ మగని నడనడిక లామెకు బాగా తెలుస్తున్నవి. దేహం కంపమెత్త సాగింది. కోపం పట్టలేకున్నది.

"ఆఁ-చక్కనివాళ్లా, చక్కని వాళ్లున్నారా! ఇద్దరూ ఇద్దరే! వకరిని మించి మరొకరు! ఎందుకు? ఫోటో చూడు- నీవే నిర్ణయించుకో___"అంటూ వసంతం పెట్టె తెరచి వకపటం తీసి రామారావుకు ఇచ్చాడు. సరస్వతి అంతకంటె ఆత్రంతో తలుపుసందులో నుంచి చూచింది. పటం స్త్రీది! ఇంకేమి కావాలె? తన అనుమానం రూఢి అయింది! పండ్లు కరుచుకపోయినవి. దేహం చెమ్మట

పట్టింది. సర్వాంగమూ గజగజా వణికిపోతుంది! నిలవలేక పోయింది. ఒక్కసారిగా గదిలోకి పోయి ఆ ఫోటోను లాక్కొనిపోయి పొయ్యిలో పడేసి తగలెట్టాలె నను కున్నది. కాని, యిది సమయం కాదని అంతలో పూరు కుంది.

అంతలో రామారావు— "Beauty Certain'y (నిజమే)-దేవతాస్త్రీలకైనా మించిపోతూంది ఈ చక్క దనం"అని అన్నాడు.

"దేవేంద్రుని ఊర్వశీరంభామేనకా తిలోత్తమా దు లేమిపనికివస్తారో చెప్పు."అని వసంత మన్నాడు.

"ఆ-మనం చూచామా యేమిటివాళ్లను! అయినా వాళ్లు ఇంతకంటె చక్కనివాళ్లు కారనే నా opinion (అభిప్రాయం) ఆ, తర్వాత?" అని అన్నాడు రామా రావు.

"తర్వాత నేముంది? సంగీతం-నాట్యం-అయినవి. నాట్యంలోపద్మా,పాటలోరాధ-మేటి.అసలే వాళ్లకూ నాకూఅపరిమితస్నేహం. ఈసంవత్సరంలోఆస్నేహంమరింత వృద్ధమయింది. నిజంగానే సుమా. వాళ్లిద్దరిలోనూ మంచి ఆకర్షణశక్తివుంది. ఆశక్తికి నేను సరిఅయిపోయినాను. అక్కడినుంచి, అన్నీఅయిన తర్వాత అందరూ వెళ్లిపో యినారు. నన్నుమాత్రం పోనీయలేదు. ఆరాత్రిఅంతా అక్కడే గడప నిశ్చయించుకున్నాను. అందుచేతనూ వాళ్ల ఆనందం! ఫలాహారాలు తెప్పించారు. ఆరాత్రి యింకేమి? మహానందం! అలాంటి స్నేహితులను వదలి యేల్లా రమ్మన్నావో చెప్పు! నిజంగా వాళ్లనొక్కనిమిషం కూడా వదలివుండడం కష్టం—"

"కష్టం-కష్టం-మహాకష్టం! సిగ్గేనా లేదేమో చెప్పుకోవడానికి? ఆయన చెప్పుతుంటే మురియడానికి-ఈ అన్నయ్య విని సంతోషించడానికి సరిపోయింది. అవు తుంది ఈరాత్రికి-ఆ ఆనందం-ఆసంతోషం-యేలాటిదో తెలుస్తుంది—" అని సరస్వతి తనలో ననుకున్నది.

"మరి యిప్పు డెట్లా వచ్చావు?" అన్నాడు రా మారావు.

"ఏమిచేయను? తప్పనిసరి అయింది. అప్పుడే రాలేదుకదా యిప్పుడూ రాకపోతే బాగుండదని వచ్చాను. నాపనుపు పూర్తికాగానే నేనక్కడే వుండి ప్రాక్టిస్ చేస్తాను" అని అన్నాడు వసంతరావు.

"అబ్బో! కొంప మునిగిందే! ఇంకేముంది? వడ్డీరు వల్లో! కన్నూ మిన్నూ తెలియడంలేదు. అక్కడేవుం డిపోతారుగా? అదెట్లాగో-చూతాము. బాగానే సాగ నిస్తా నీ ఆటలు!" అని అనుకుంది సరస్వతి.

"ఉంటావా నాలుగు రోజులు? మళ్లీ రేపువస్తా" నన్నాడు రామారావు.

"ఆ. ఆదివారం సాయంత్రం వెళ్లిపోవాలె" నన్నాడు వసంతం.

కృష్ణుడు గదిలోకి రావడం చూచింది సరస్వతి. "ఇంక చాలునుతిన్నది." అని అనుకుని రౌద్రా కారంతో వెళ్లిపోయింది.

స్నేహితులు మరికొన్ని నిమిషాలుమాట్లాడినారు. రామారావు ఇంటికి పోయినాడు. వసంతం, కృష్ణుడూ, నరసింహం-బజారుకు షికారు వెళ్లారు.

## ౪

సరస్వతి యెట్లాగో వున్నది. ఆమె మనసు మన సులోనే లేదు. తల్లి మడికట్టుకుని రాత్రి వంట చేస్తు న్నది. సరస్వతి ఆమెకదీ యిదీ అందిస్తున్నది. మొత్తం మ్మీద పనిచేస్తూవున్నది: కాని, చేసేపనులేమిటో ఆమె కు తెలియడంలేదు. తల్లి యేదైనా వకపని చెప్పవలసి వుంటే మూడుసార్లో నాలుగుసార్లో చెప్పవలసివచ్చేది. అన్నిసార్లు పిలవ్వలసివచ్చేది. చెవుడా? దూరంగా యెక్కడనో వుందా? లేదులేదు. పరధ్యానం. తల్లికి జిల కర కావలసివచ్చింది. సరస్వతిని తెమ్మని చెప్పింది. సర స్వతి పిడికెడు మెంతులు తెచ్చిపెట్టింది. "ఏమిటే అమ్మా యీ, జిలకర తెమ్మంటే మెంతులు తెచ్చావేమే;" అని తల్లి అన్నది. అందుకు విసుగుతో సరస్వతి "పోనీ లేద్దూ-ఏదోవకటి—" అన్నది. "ఎందుకమ్మా యీపూట యె ట్లాగో వున్నావు? ఒంట్లో సుస్తీగావుందా? " అని తల్లి అడిగింది. సరస్వతి తగినసమాధానం చెప్పక, "నీకెందుకు?" అని చటాలున తొలగిపోయి పైటకొంగు కండ్లకద్దుకొంది, తల్లికి కనబడకుండ.

రాత్రి యెనిమిది గంటలయింది. భోజనాలవేళ కానచ్చింది. తల్లి వంటపనులు ముగించుకుని అల్లుడికోసం మగనికోసం కనిపెట్టుకునివుంది. తల్లి వంటపని పూర్తి అయ్యేసరికి సరస్వతి భోజనశాల తుడిచి పీటలు వేసి విస్తళ్లు, కంచాలూ వేసి వుండేది. కాని, యీపూట ఆపనులేమీ చేయలేదు. ఏమూలనో వొదిగివుంది సరస్వతి. "అమ్మాయీ"అని పిలిచింది తల్లి — జవాబులేదు. మూడుసార్లు పిలిచింది. సరస్వతి వచ్చి నిలిచింది. "పీటలు వేయలేదేమి?" అని అన్నది తల్లి. ఎటు తిప్పితే అటు తిరిగే మరబొమ్మలాగ సరస్వతి పీటలు వేసింది. అనంతర మేమి చేయాలెనో తోచక అల్లే నిలిచింది. తిరిగి తల్లి "చెంబు పంచలూపాత్రలూ పెట్టవూ?" అని అనేవరకూ పెట్టలేదు.

తొమ్మిది తొమ్మిదిన్నర అయింది. ఇంట్లో అందరి భోజనాలూ అయినవి. సాధారణంగా భోజనమప్పుడు సరస్వతి నెయ్యి, పెరుగూ వడ్డించడం మామూలు. ఈపూటామెకు తలనొప్పి వచ్చింది. కాబట్టి ఆమె భోజనమప్పుడు వకమారైనా యెవరికీ కనబడలేదు. చాటుగా పోయి కూర్చున్నది. చెల్లెలు తార "అక్కయ్యా, బావయ్యకు కిల్లీచుట్టి పెట్టేటప్పుడు నాకూడా వకటి పెట్టు" మన్నిచెప్పింది. కాబట్టి 'అక్కయ్య తమలపాకులకు సున్నం రాచి కిల్లీలు చుట్టింది. వకటి గదిలో బల్లమీద పెట్టింది. ఆపూట సరస్వతి కదియెందుకోగాని ఆకలి కాలేదు. తల్లి యెంతో బతిమాలితే యెల్లెట్లో భోజనంచేసినట్లు అభినయించింది. ఆపర్వాతిపనుల్లో తల్లికి తోడయింది.

చాలా ప్రొద్దుపోయింది. ఎక్కడివారక్కడ పరుండి నిద్రపోయినారు. తల్లి అలిసివుండడంచేత పెంపలాడే నిద్రపోయింది. పిల్లలు పదకొండు గంటలవరకూ టపాకాయలు మతాబీలు, కాల్చేసంవట్లోవుండివచ్చి పడుకున్నారు. వసంతం వీథిలో బాణాసంచులు కాల్చే వేడుకలు చూస్తూవుండి గదిలోకి వచ్చి పరున్నాడు. ఎంతసేపైనా సరస్వతి గదిలోకి రాలేదు. వంటయింట్లో నుంచి బయటికి కదలదు. చేసినపనే చేస్తున్నది. తోలిచిన పాత్రే తోలుస్తున్నది. అలికినచోటే అలుకుతున్నది. ఇట్లా కాలక్షేపం చేసింది తల్లి నిద్రపోయే వరకు. ఆవెనుక చిలుకొయ్యమీ దున్న వకచీర తీసుకుని అక్కడే పరచుకుని పడుక్కుంది.

సరస్వతికి హృదయంలో నానావిధాలోచనలు పుట్టుతున్నవి-అంతరిస్తూన్నవి. మగడు చెన్నపట్నంలో వుండి చదువుకుంటూ-చేస్తున్న పనులన్నీ - ఆమధ్యాహ్నం అతనినోటివెంటే చెప్పినమాటలన్నీ తలచుకుని,తలచుకుని ఆలోచించసాగింది. మధ్యమధ్య ఆ"ఎంగిలిపీచుముక్కలేమిటో?" తాను వినకూడని మాటలు కాబోలు నన్నది. తాను విన్న తెనుగు మాట కంటె "యింకా పచ్చిగా వున్న వికాబోలు ఆముక్కలు ?" అని భావించుకుంది. తనమగని ప్రవర్తనాన్ని దూషించింది. ఇందుకే తన్ను చెన్నపట్నం తీసుకెళ్లలేదని సంశయించింది. ఇంకా నానావిధాలగ తన్ను, తన అదృష్టాన్ని నిందించుకున్నది. ఆరాత్రి- అదీపావళి అమావాస్యనాటి రాత్రి- బజారులో ఎక్కడచూచినా ప్రమిదల్లో దీపావళు లుంచినారు. సీమటపాకాయలు, తాటాకు టపాకాయలు టపాటపా ధ్వనిస్తున్నవి. ఎక్కడ చూచినా మతాబు వెలుతుర్లే-ఎక్కడ చూచినా తూటాలు కాల్చడమే! ఊళ్లో యింత పట్టపగలుగా వుంది. చీకటి తలదాచుకోడానికి ఊళ్లో సందెక్కడా దొరకలేదు. దిక్కుదిక్కుల చీకట్లూ వక్కచోట పోగై 'మీటింగ్' చేసినవి. 'రిజొల్యూషన్లు, (ఉపపాదనలు) చేసినవి. కొన్ని అమెండ్మెంట్లు (సవరణలు) బయలుదేరినవి. అన్నీ వీగిపోయినవి. అసలు 'రెజొల్యూషన్' ప్యాసయింది. దాని ప్రకారంగా చీకటి అంతా వకటి అయి సరస్వతిహృదయంలో దాక్కున్నది!

సరస్వతి నానావిధ పరస్పరవిరుద్ధవిచారపూర్ణ భారహృదయంతో వంటయింట్లోనుంచి కదలి రాలేదు. అక్కడే మునుగుతూ తేలుతూ వున్నది.

... ... ... ...

అక్కడ వసంతం పడకింట్లో భార్యకోసం మెదురుచూస్తున్నాడు. ఎంతసేపైనా రాదు. ఏమేమో- ఎంతెంతో- ఆమెతో మాట్లాడాలె ననుకున్నాడు. ప్రొద్దటినుంచీ వీలు చిక్కిందికాదు. ప్రొద్దున్న తనకు బడలిక-

ఇంట్లో పనిపాటలావిడకు. మధ్యాహ్నం తనకు నిద్రతో సరిపోయింది. కాఫీ ఫలాహారం వేళకు రామారావు వచ్చాడు; అతనితో సరిపోయింది. సాయంత్రం షికారు. రాత్రి భోజనాలూ, బావమరదులతో తూటాలు కాల్చడం, చుచుంద్రీలు కాల్చడం, తారను చెయ్యిపట్టుకుని కాకరపువ్వత్తులూ, మతాబాలు కాల్పించడం- మొదలను వాటిలో సరిపోయింది. అన్నీ అయినవి, అందరూ నిద్రపోయ్యారు. తానూ మంచంమీద పడుక్కున్నాడు. ఇంతవరకూ సరస్వతి తనకు కనబడనైనా లేదు. "ఇంకా యేమి పని చేస్తున్నదో!" అని అనుకున్నాడు. చెన్నపట్నం విశేషాలు చాలా చెప్పాలె ననుకున్నాడు. నిమిషం యుగంగా గడుపుతున్నాడు. చీమ చిటుక్కుమంటే గదిగుమ్మంకేసి చూస్తున్నాడు. సరస్వతి కాకపోవడంచేత విసుక్కుంటూ హతాశుడై యేమో గొణుక్కుంటూ పడుకుంటాడు. సిగరెట్ కాలుస్తున్నాడు. నానావిధాల బాధ పడుతున్నాడు. సిగరెట్ వెంబడి సిగరెట్ కాలుస్తుంటె చేతి మణికట్టుకు కట్టుకున్న చిన్నగడియారం చూచాడు: పన్నెండుగంట లైనట్లు కనబడ్డది. గుండె లవిసిపోయినవి. ఇంతసేపటివరకూ సరస్వతి యింట్లోనేమి చేస్తున్నది? ఇంకా పనులు కాలేదా? వసంతం మంచం మీదనుంచి లేచి పడకకుర్చీలో వాలాడు. ఆలోచించసాగాడు. కొంచెంసేపటికి తలుపు తెరచిన చప్పుడు కొద్దిగా అయింది. వసంతం దిగ్గున లేచాడు. గుమ్మంకేసి చూచాడు. సరస్వతి వచ్చిందని సంతోష పడ్డాడు. ఒక్క గంతుతో గుమ్మం సమీపించాడు. పట్టరాని కోపం వచ్చింది. తలు పోరగా తోసుకుని లోనికి వచ్చిం దెవరు? సరస్వతికాదు! సరస్వతి పెంచుకుంటున్న పెంపుడు పిల్లికూన. 'మ్యావ్' అన్న దీ యన్ని చూచి! అంత మహోగ్రుడై పోయినాడు వసంతం! ఆపిల్లికూన నొక్కతన్ను తన్నినాడు. మళ్లీ తలు పోరగా తోసుకుని మంచంమీద పడ్డాడు. తన కాశాభంగం గావించిన ఆపిల్లినీ-ఇంతవరకూ గదిలోకి రాని సరస్వతినీ-తన అదృష్టాన్నీ-తిట్టుకున్నాడు. కొంతసేపైన తర్వాత గదిలో వుండడం అసహ్యంగా తోచి వంటయింట్లోకి వెళ్లి భార్యను పిలిచి వద్దామనుకున్నాడు. కాని, "అత్తగా రక్కడ వుంటారేమో? ఏదైనా పని సందట్లో వున్నారేమో?" అని అనుకున్నాడు. పిలవకుండ వుండలేడు- పిలవడానికి సిగ్గు! ఎంతసేపైనా ఆమె తనంత రాదు? ఇంకెట్లా? అనేకవిధా లాలోచించుకున్నాడు. అప్రయత్నంగా 'ఇంక వుండలేనువెళ్తా' నన్నమాట అర్ధస్వగతంగానూ, అర్ధప్రకాశంగానుఅనుకున్నాడు. తటాలున లేచాడు. చూచేసరికి మంచానికి దగ్గరగా సరస్వతి స్థాణువువలె నిలిచివుంది!



౫

"అంత యిష్టం లేనివాళ్లు- ఇక్కడ వుండలేనివాళ్లు-అసలెందుకురావాలె? మనస్సంతా అక్కడ నేవదలిపెట్టి దేహాన్నిమాత్ర మిక్కడికెందుకు తేవాలి? పోనీండి- వెళ్లేవారు వెళ్లనే వెళ్తారు గాని బతిమాలినా వుంటారా? అయినా ఈనడిరేయివేళ యెక్కడికెళ్తారు? తెల్లవారినాక వెళ్లవచ్చునులెండి" అని కంట్లవెంట కడవెడునీళ్లు కారుస్తూ సరస్వతి అన్నది.

వసంతం భార్యను కసితీర గట్టిగా కౌగిట అదిమి పట్టి, "ఏమిచేతగాడం? నన్నింత ఆయాసపెట్టడ మెందుకు?

చిక్కావు. ఇంక తప్పించుకుని పోలేవు. ఇంతసేపటికైనా తీరిందికా భోలు!" అని అన్నాడు.

"నేనెక్కడికి వెళ్తాను? మీరే ఈనడిరేయే వెళ్తావని లేచారు. ఇక్కడెవరూ లేరుగా పాపం! నేనెందుకడ్డం వస్తాను?" అనిఅంటూ సరస్వతి కౌగిట్లోనుంచి విడిపించుకోవడానికి ప్రయత్నిస్తూ అన్నది.

"ఎక్కడికి వెళ్తానన్నాను?"

"ఎక్కడికైతే నేమిలెండి! ఈవూరిలో నేమీ తోచదు. పాపం! అక్కడికే వెళ్తే బాగా తోచుతుంది! ఆనైభవం– ఆఆనందం! ఆతాగడం! ఇక్కడెవరున్నారు? అవన్నీ యెట్లా దొరుకుతాయి? బీదవాళ్ల యిల్లు; నల్లని భార్య. వాళ్లని విడిచివుండడం కష్టమే—"

"ఎవరికి?"

"పాపం! ఏమైనా తెలుసునా? వెర్రివేషం వేస్తే మాత్రం నాకు తెలీదనుకున్నారా? నా కన్నీ తెలుసును. అయినా నేనేమి చేయగలను?"

"ఏమి తెలుసును నీకు?"

" 'ఏమితెలీలేదు నీకు?' అని అడిగితే బాగుంటుంది." అని మొహం చిట్లించుకుని అన్నది సరస్వతి.

"నీతో నెవరేమి చెప్పినారు?"

"ఎవరెందుకు చెబుతారు? మీరు చెప్పవలసింది తా ఉత్సాహంతో పట్టించి చెబుతూవుంటే, రామారావన్నయ్యకు నోరూరుతూవుంటే—"

"ఏమిచెప్పానురామారావన్నయ్యతో? నయమే, రామారావుతో చెప్పానన్నావు–నీతో కాదు కదా—"

"ఇంకా నాతోనూ చెప్పాలే? అంత సాహసమా? నాతోచెప్పుకుంటే నెమ్మదిగా–ఇంపుగా– ఊరకొట్టడానికి నేను రామారావన్నయ్యను గాదు—"

"ఏమిటిదీ ఆగడం? నాకేమీ అర్థం కావడం లేదు? నీకోపమేమిటో బాగా చెప్పరాదు?"

"ఔను–ఆగడమేమరి–అడిగితే ఆగడం–అర్థంకాకపోవడానికేముంది? తెలీదని వేషంవేస్తే సరిపోయిందా?"

"రామారావు నీతో నేమిచెప్పాడు?"

"నయమే–రామారావన్నయ్య నాతోనేమీ చెప్పలేదు– వృథాగా ఆయననెందుకు? నేనే అన్నీ విన్నాను."

"పోనీ– నీవు విన్నదేమిటో చెప్పు—"

"చెప్పక దాచుతానా?" అని సరస్వతి క్రొద్దన తాను మగనికి కాఫీయివ్వపోయినప్పుడు అతడన్న మాటలూ, అతనిమానము, రామారావుతో అతడు అన్న మాటలూ– అన్నీ– ఇంగ్లీషులో మాట్లాడుకున్నమాటలు తప్ప– అన్నీ చెప్పింది. తన అనుమానం కక్కింది. ఆగ్రహం వెళ్లగక్కింది!

అంతా విన్నాడు వసంతం. ఆశ్చర్యమైంది! భార్య కోపకారణ మిప్పుడు తెలిసింది! వకవంక కోపం– వకవంక జాలి– కలిగింది.

"నీఅనుమానకారణం ఇప్పుడు తెలిసింది. సుందరి యెవరన్నావు? 'సుందరీభవనం' అని ఆయింటి పేరు. మధ్యమధ్య మే మింగ్లీషులో మాట్లాడుకున్నమాటలు నీకు తెలీకపోవడంచేత నీకంత అనుమానం కలిగింది! ఇంత అనర్థంచేశావు—"

"అయితే పద్మా, రాధా—"

"పద్మనాభరావని నాతోటి విద్యార్థి పేరు. అతని తమ్ముడు రాధాకృష్ణ. మాకున్న గాఢస్నేహాన్ని బట్టి మే మందరమూ వాళ్లను పద్మా, రాధా అని పిలిచేవాళ్లము. అది స్త్రీలపేర్లుగా నీకు తోచి వుంటుంది."

"ఇంకా తాగుడో?"

"ఏమి తాగినాను? 'బనానాసిరప్' అన్నాను గదా. అది అరటిపండ్లరసం—చునసోడా, లెమనేడ్, మోస్తరుది—" అని సకలమూ ఉన్నది ఉన్నట్లు చెప్పాడు. వినగావినగా సరస్వతికి సిగ్గు కలగసాగింది. పశ్చాత్తాప పడసాగింది. ఏమీ మాటాడలేదు..

"ఇప్పటికైనా నాయందు నమ్మకం కలిగిందా? పిచ్చిపిల్లా, ఎంతఅనర్థంచేశా వీమాత్రానికి! ఇంకాహూ నీకింగ్లీషురానిదేకదా కారణం? ఇంకనైనా నేర్చుకుంటావా?" అని బుజ్జగిస్తూ వసంత మన్నాడు.



"అదికాదు కారణం-" అని సరస్వతి ఊరకున్నది.

"ఊఁ-మరేమిటిది?"

"చాటుమాటున వుండి ఒకళ్ల మాటలు వినడం-" అని సరస్వతి ధైర్యంతో చెప్పి అతని విశాలవక్షస్థలంలో తలదూర్చి యేడ్వసాగింది.

వసంతం "బాగా చెప్పావు-ఇకనైనా నన్ను నమ్మ. ఇంకా, మూడునాలుగునెలలు. ఆతర్వాత మనం వొకరినొకరు వదలకుండ వుండవచ్చును. ఇంక లే-ఇదుగో నీవు నన్ను తెమ్మనికోరిన "కరాచీచీర."- అని పెట్టెతీసి యిచ్చాడు.

సరస్వతికి పట్టరాని సంతోషం కలిగింది. పగలు పడిన ఆయాసమంతా-అనుమానమంతా తీరిపోయింది.

---

# వింత బేరము

మద్దిపట్ల వేంకటరమణయ్య గారు

అబ్దులుకరీ మనునరబ్బియతఁడు తెచ్చె - సర్వశుభలక్షణంబుల జాతిహయము
డంబుమీఱెడు నరుణవర్ణంబుదాని-నమ్ముటకుఁ బాదుషా దివాణమ్ముకడకు
నుదుటిసొంపును గమనంపు నుదుటుఁ జూపి-కలఁక బాఱని వాలుఁగన్నులను జూపి
మెత్తనై నునుపారు నెమ్మేనుఁ జూపి - "పాదుషావారి కిది తగువార్వ" మనిమె

పడును దక్కఁ వవ్వెల కని పాదుషాయుఁ - దగినకిమ్మతు రాఁబట్టఁ దలఁచి యరబి
బేరమును దెగనీయక పెనఁగులాడి - దరుణుఁ డపరాద్రివైపున కొరగువఱకు

కానియు దిగని యాయరబ్బీని గాంచి - విసుగుసెంది తేఁడు, పరాబుఁ బిల్చి, "లెక్క-
పెట్టుకొనవోయి నీరెండువేలు నివిగో - పొమ్ము గుఱ్ఱము విడిచి ఖాయమ్ము మాకు

నక్కఁద్రొక్కి-వచ్చి యొక్కసహాయమంచు - రెట్టిక్రయము గొల్లగొట్టినావు;
ముసలిమానుసూపమునఁ దస్కరునిచేత - మోసపోయినాము పూర్తిగాను

డబ్బె పావనమొక్కొ యరబ్బి కకట! - ఎందు నీయట్టి పిసినారి నెఱుఁగ మేము;
మూటకట్టుకో నీదు దోపుడుధనమ్ము" - ననుచుఁ దూలనాడె నతని నాగ్రహమున

తన్నుఁ గానియట్లు మిన్నకుండి యరబ్బి - సంచిమూతి కట్టె సడలకుండ;
"నాదు కూర్మికెల్ల నాయింటిగరువమ్ము - తేజియొద్ద సెలవు తీసికొనెద" [మచ్చ;
అనుచు వచియించి యాతఁడు హయము డాసి-ముద్దుగొనె ముత్తెమునుబోలు మొగము
మేను దువ్వి చివాలున మీఁది కెగసె; - తివ్వసను బాఱెఁ జూపఱు తెచ్చవడఁగ

ప్రహరిగుమ్మంబుఁ గడచెను బగిళఁ గడచె; - రాజమార్గంబువెంబడిఁ దేజి పఱచె;
డెక్కసడి విని దిగ్గున లేచె విభుఁడు; - నిలిచి రాశ్వికు లేఁబండ్రు నృపునియెదుట.

"పొందు చప్పునఁ బట్టుక తెండు హయము - ముక్కలుగఁ జెండివేయుఁ డామోసగానిఁ
జెండినాతని దాతనిచెంతధనము" - అనుచుఁ బాదుషా వారలు కానతిచ్చె

తరటుసేయుచు గుఱ్ఱాలఁ దఱిమి తఱిమి - వారు డాయఁగాఁ గల్గి రెడారిలోనఁ
బట్టణద్వారమును దాఁటి పఱచువాని - నెఱ్ఱగుఱ్ఱంబు రాహుత్తు నెట్టకేని

చేరువనె యున్నవాఁ డికఁ జిక్కెననుచు - దౌడుసేయింత్రు రిత్తతత్తడులఁ గొల్పి;
ఎన్ని కోసులేఁగిన ముందె మెసఁగుచుండి - రెఱ్ఱగుఱ్ఱంబునుం దానియేలికయును

నెగడెఁ బదియాఁటియలమాత్ర నిడివినేల - జాగిలాల కాలేడికిఁ జిక్క నడుమఁ
దనగృహము నబ్దులుకరీము తఱియువఱకు;-అవల మాయమయ్యెను దృష్టి కందకుండ

తెల్లవాఱెను దిక్కులు తెలివినొందె; - "దొంగదొరకలే దక్కటా! భంగపడితి
మేలిగుఱ్ఱంబునర్క రెంపువేలుఁ బోయె"-ననుకొనుచుఁ జింతతో మేలుకొనియె నృపుఁడు.

అంతలోన దౌవారికుఁ డరుగుదెంచి - విన్నపము సేసె తేనితో వేడ్క గదురఁ
బ్రభువ! నిన్నటిదొరగుఱ్ఱంబు నెక్కి - వచ్చుచున్నాఁ డిట కరబ్బి వడిగ" ననుచు.

"వాఁడె?" యంచు ఱేఁడు వాకిటి కేతెంచె - వామి దిగి యరబి సలాము సేసె;
"దేవరకును దెలిసెఁ దేజినాడెము లెస్స - రెట్టిక్రయము కొల్లగొట్టినానె?

పదిగుఱాలఁ గుంటుపఱచుమీఁదట నైన - దీనిపరుఁగుతీరు తెలిసినదియె?
కాక ప్రభువు సెలవో నాకు మగుడ నొక్క - తడవ వెడారిలోన దౌడుతీయ?

ముసలిమానురూపమునఁ దస్కరుఁడ నంచు-ననఁగరానిమాట లాడినారు;
కొసెదరో హయంబుఁ గొందురో మీడబ్బు - తెలియఁజేయుఁ డీరు తెల్లముగను."

అనుచు టంగువాఱు సడల్చి యరబి నిల్చె - జీనిపై నున్న సంచిని జేతనూని;
"వారువము నుంచి పొ"మ్మనెఁ బాదుసాహి-యాచరణమస్తకంబును నతనిఁ జూచి....

[అనుకరణము]

---

# అంతర్నాటకము

శతావధాని వేలూరి శివరామశాస్త్రి గారు

నాటకసంస్కారము చేయ నెంచిన రసోపాసకబృందమువారందఱూ బ్రాహ్మమతమున సాధారణశాఖకు చెందినవారు; అందఱూ బహుభాషావల్లభులు; అందఱూ స్త్రీపాత్రమును స్త్రీలే అభినయింపఁగోరువారు. వా రెప్పుడూ సంగీతమును ప్రోత్సహింపనూ లేదు; కుంచీకరింపనూ లేదు. పాటలకు ప్రేక్షకులు ఎంత అల్లరి చేసినను లేనిచోట వారొకపాటయేని పాడా లేదు, ఉన్నచోట మానా లేదు. శిలావర్షము కురిసినను వారు ఒక నిముసమేని ప్రదర్శనమును ఆఁపలేదు.

ఆసంఘమున ఎవరును నాట్యమును జీవికకు ఉపయోగించుకొనలేదు. ప్రకటించి ప్రదర్శనమును ఎన్నఁడును ఆఁపలేదు. వారికి తెరలూ మరలూ వాద్యములూ చోద్యములూ ఎక్కువగా లేవు.

వారి ప్రదర్శనములకు మొదటమొదట పామరులు వచ్చుట ఎటులు తగ్గఁదొడఁగెనో పిదప పిదప సహృదయులు వచ్చుట అటులు హెచ్చఁదొడఁగెను. రమ్మనిపిలిచినను పోలీసులురారు.

వారిప్రదర్శనము ఒకచక్రమువలె జరుగును. కన్నుమూయుచో దానియాకు కానరాదు. రాముఁడు ఎప్పుడూ బూట్సులు తొడుగలేదు; చారుదత్తుఁ డెన్నఁడూ జందెము వేసికొనుట మఱవలేదు,

చైతన్యచంద్రోదయము, రామకృష్ణచరిత, కబీరుకథ, శాకుంతలోత్తరరామచరిత మృచ్ఛకటికములు వారిప్రదర్శనములలో ఉత్తమములు. వాడుకభాషలో వ్రాయఁబడిన కొన్నినాటకములను వారు ప్రదర్శించుచుండఁగా కేవల గ్రాంథికభాషావాదులుకూడ చూడరా మొదలిడిరి.

ఆసంఘమునందు కొందఱకు స్వనామములు తుడిచిపెట్టుకొనిపోయి వానికి బదులు రామదుష్యంత చారుదత్తాదినామములు ఖాయమయిపోయినవి.

ఆసంఘమున పాత్రధారణ మొనరింపని గౌరవసభ్యులు పలువురు కలరు. వారు వలయుచో తెరలు లాఁగుదురు; ప్రేక్షకు లగుదురు; వాచకు లగుదురు.

వారిలోముఖ్యుఁడు గోపాలుఁడు. ఆతనికి ఇంటిపేరు ఏమోకాని ప్రకృతము ఐ. సి. యనే ఇంటిపేరు. ఇంకను శంకరుఁడు, బిందుమాధవుఁడు, రాధాకాంతుఁడు, బలభద్రుఁడు, వాసుదేవుఁడు మొదలగువారు కలరు. వీరు డిప్టీకలెక్టర్లు, తహసీల్‌దార్లు, ప్లీడర్లు, భూస్వాములు. స్త్రీలే స్త్రీపాత్రములు ధరింపవలె నని వారి అభిమతము. వారాంగనలను చేర్చికొనరాదని వారి తలఁపు. అందఱూ తమతమ భార్యలను పాత్రధారణ మొనరింపఁ గోరిరి.

ఎవరిభార్యయు అందులకు అంగీకరింపలేదు. బలాత్కరించుట పాడి గాదనుకొని కొందఱు వారికి నయాన భయాన బోధించుచుండిరి. అందు ఐ. సి. యస్. గోపాలుఁడు వ్యగ్రేసరుఁడు. ఐ. సి. యస్. గోపాలుఁడు ఈ విషయమును ప్రణయకలహమునకు దింపెను. క్రమక్రమముగా అందఱి ప్రణయము జారిపోయెను.

౨

ప్రకృతియొక్క శృంగారమందిరాంతరాళమున వెండినీరు తీసిన చాందినీవలె వెన్నెల వ్రేలాడుచుండెను. మల్లెపూలు, ముత్యాలసోగులు, శతపుష్పాపుష్పములు, రత్నహారములు, ఆరముగ్గిన మావిపండ్లు, బంగారుగులోబులు వనదేవతావాసకసజ్జికా ప్రాంతమున గోదావరి చేటికవలె నిలువఁబడి యుండెను.

డాబామీఁద వేణుగోపాలుఁడు ఒకశయ్యమీఁదను, రాధ వేఱొకశయ్యమీఁదను శయనించి యుండిరి. వారి కనులుమూసికొనియే యుండెను. అవయవము లన్నియు మౌనము వహించెను. ఒకరిమూర్పు ఇంకొకరికి వినఁబట్టదు. నిష్కంపములగు రెండుసముద్రములు జంటగా శయనించెను.

గోపాలుఁడు నిద్రించె నని రాధ, రాధ నిద్రించె నని గోపాలుఁడు. ఇటు లనుకొనుట రెండునెలలనుండి.

ప్రణయకలహము ప్రేమయొక్క గొలుసుకట్టు. దానిలో కాలాంకురములు కానరావు. అది అజాయుద్ధమే. యగుఁగాక—మేఘగర్జవలెనేని భయంకరము. అది అద్వైతమునందు పర్యవసించు ద్వైతము. దీని కొలిమిలో గరళము కరఁగి కరఁగి అమృత మగును.

చంద్రికా మారుతముల సమ్మేళనముతో రెండవజాము ముగిసెను. వారిరువురూ చెట్టాపట్టాలు పట్టుకొని మావిపొదరిండ్లలోను గోదావరీ సైకతములలోను శైలశృంగములందును విహరించిరి. గోపాలుఁడు వారి విహారమును కనులు మూసికొనియే చూచెను.

మారుతుని ఆతురోత్కంఠతో మూఁడవజాము ఆరంభమై వెన్నెలపైపాటుతో అంతమొందెను.

గోపాలుఁడు రెప్పలసందునుండి చూచెను. క్రమముగా రెప్ప లెత్తి చూచెను. వెంటనే మూసికొనెను. రెప్పలు అనుకొనెను: కన్నులారా! మేము మీ తలారులము. మీరే దొంగలగుచో మాపని యేమి?

రాధాహృదయము తుకతుకలాడుచుండెను. ఆమె అనుకొనెను: నీకు అవమానజనకమైనను నీ సర్వేశుఁడు ఆజ్ఞాపించినకార్య మనుష్ఠింపుము!

గోపాలుఁడు తనలోతాను దూఱుకొనెను. ప్రణయకలహము కలహముగా మాఱుచున్నది. ఏమని చెప్పను? వేషము వేయనక్కఱలేదు లెమ్మందునా? ఎంత చులకఁదనము! ఇంక నా దోషము లేదందునా? అసలు దోషము లేనిచో దోషసంభావన యెటులు? ముభా



చఢీ తురంగ మచే జహాఁ జంగ తహాఁ ఘుమసాయకే ఖడ్గ బజావే | ముండ కటే అరురుండ నచే జురి జోగిని ఖప్పర స్వోన పురావే | హాథ నమేఁ సమనేరసచే వీరఘుటే రసవీర జగావే | యావిధ భేరుకిరాగినిహై నట జాకో భయానక రూప [లఖావే ||

[జయపుర చిత్రము: దివాన్ బహాదూర్ చతుర్భుజదాసు గోవిందదాసుగారి యనుమతిని]

వగా ఇటులందును —కాలమూ, కర్మమూ ఇటులు ఒనఁగూడినవి!

రాధ ఇఁక చెప్పివైచెద ననుకొనెను. తీయ మావిపై ఒకకోయిల కుహుకుహు మనెను. రాధా! తొందరపడకు మనియా, గోపాలా! తొందరపడకు మనియా ఆ పలుకు? ఊహు ఊహు మని తననే సంబోధించుచున్నటులు గోపాలుఁడు అనుకొనెను.

రాధ దీర్ఘముగా నిట్టూర్చెను. ఆమె పట్టుఁదల యంతెయు ఆవిరిగా ఎగిరిపోవుచున్న దని గోపాలుఁడు తలఁచెను. దైవము హాస్యరసిక మని రాధ అనుకొనెను. ఆమె సలిసప్పుడుకాకుండ లేచి కూర్చుండెను; ఓరకనుబతో చూచెను. చంద్రుడా! నీతో నిఁక పనిలేదు.

గోపాలుఁడు ఇది యంతెయు చెవులతోడనే చూచుచుండెను. అతఁ డించుకయు కదలలేదు. అతని యుచ్ఛ్వాస నిశ్వాసముల తాళమానము తప్పలేదు.

వంచన తొంగిచూచుచుండెను.

రాధ గోపాలునిపై చేయి వైచెను. పులకలచే ఆమె చేయి పూవుదొడఁగెను. ఎఱుఁగనటులు గోపాలుఁడు కనులెత్తెను. రాధ చేతిని మెత్తగా ఆవలికి త్రోసెను. అది వేయి అఘాతముల పెట్టు.

ప్రణయదుఃఖితె కంఠమున పావురమును, కన్నులలో కాఱుమబ్బులును కలవు.

రాధ లోలోపల తలఁచెను —'సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ' అని.

ఆమె గద్గదికతో ననెను: 'నీయాజ్ఞ శిరసా వహించెదను. కాని తమరుమాత్రము నా వేషము చూడ రారాదు.'

గోపాలుఁడు హఠాత్తుగా నవ్వి నిమిషమాత్ర మాలోచించెను. పిదప 'రాధా నాహృదయ మాఱిపోయినది' అని ఆమెను బాహువులతో గ్రుచ్చి యెత్తి 'నీవు నాకు భూషణమవు' అనెను.

ఆకసముపై మబ్బుపట్టకయే అతని బాహువులపై ముత్తెములంత రెండు బిందువులు రాలెను. కౌఁగిలి వీడి అతఁడు మిన్నులు చూచుచుండఁగా రాధ కను లొత్తుకొనెను.

## 3

మనస్సెంత సంగ్రామక్షేత్రము! దొడ్డది కురుక్షేత్రసంగ్రామమా అర్జునమనస్సంగ్రామమా? క్రమక్రమముగా రాధ నాటకభాగములు కొన్ని పఠించెను. ఆమె తొలుత ప్రియంవదా పాత్రమును, అనసూయాపాత్రమును ధరించెను. రసోపాసక బృందమువారు ఐ. సి. యస్. గోపాలుని సాహసమునకు జయపెట్టిరి. రాధను మిగుల గారవముగా చూచుచుండిరి. ఆమె యెన్నఁడును రిహార్సు వెయ్యలేదు.

లోకము తొలుదొలుత ఆమెను దూషించెను; తరువాతఁ దరువాత భూషించెను. రాధ దూషణమునే భూషించెను. పురుషులందఱు అనుకొనిరి—'స్త్రీకి పవిత్రపీఠ మీయఁగా ఆమె తన పవిత్రపీఠమును కాపాడుకొనిన పుణ్యకాలము.'

రాధ ఉత్తరచరితమున సీతాపాత్రము ధరించెను. లోకులు 'అచ్చసీత అచ్చసీత' అనిరి. ఆమె అనుకొనెను—'నాకు ఈపాత్ర మెంతయును పాత్రము.'

ఒకనాఁడు ఇంటికడ గోపాలుఁడు రాధతో ఇటు లనెను—'చూచితివా మన కలహబీజము పెద్దవృక్షమై తియ్యపండ్లు ఫలించినది.'

రాధ—ఏమిటి ఆ తియ్యపండ్లు? ఇవి చివరకు చేఁదెక్కును.

గోపాలుఁడు—అది వట్టి పిచ్చి యూహ.

రాధ—కొందఱకు తమయిష్టమే ప్రేమ; కొందఱకు ప్రేమయే ఇష్టము. కొందఱకు ఇష్టమే స్వాతంత్ర్యము; మఱికొందఱకు స్వాతంత్ర్యమే ఇష్టము.

అంత గోపాలుఁడు ఆలోచించుచు ఊరకుండెను.

అపుడు రాధ యిటు లనెను—మఱచి నావేషము చూడవత్తురేమో! అటు లెన్నఁడు కాఁగూడదు. ఇది ఊర్వశి చేసిన సమయము. మీరు మాత్రము రాఁగూడదు.

గోపాలుఁడు దీర్ఘముగా ఆలోచించెను. అతఁడు ఆమెను ఏకాగ్రదృష్టితో చూచెను.

'ఈరేయి నా ధరింపఁబోవు వసంతసేనాపాత్రమును ఇపుడే చూచెదరా యేమి?' అని రాధ యనెను.

'వసంతసేనా? వసంతసేనే? నీవే నావసంతసేనవు. నావసంతసేనను నే నిపుడే చూచికొందును. నేనే చారుదత్తుఁడను. నీసువర్ణభాండము దాఁచెదను. నిన్ను మీయింటికడ దింపివచ్చెదను. వర్షమున వచ్చిన నిన్ను కౌఁగిలించికొందును......................................

ఆ ఏమి? శకారుని నీమెడ తాఁకనీయక నెట్టివైచెదను. ఏమీ, నాముందు నిలుకడగా నిలువుము! వసంతసేనా! నిన్నుచూపులతో త్రావివైచెదను' అని గోపాలుఁడు రాధను వక్షమునచేర్చికొన దాపులకుఁ బోయెను.

'ఇక్కడే నాటకము చేయకుఁ'డని రాధ వెనుకవెనుకకు ఒదిగెను.

'ఒక్కసారి దాపున నిలువు'మని గోపాలుఁడు బతిమాలుకొనెను.

'నే నీక పాత్రధారణమునకు పోవలయు'నని రాధ యనెను.

గోపాలుఁడు ముందులకు నడిచెను.

మోటారు డ్రైవరు 'అమ్మా' యని ముంగిట కేకవైచెను.

౪

గోపాలుఁడు మంచముపై పడుకొనెను. అతనికి కూర్కురాలేదు. నిదుర పట్టినచో ఒకటి రెండుకలలు;నిదురపట్టనిచో ఒకదీర్ఘస్వప్నము. ఆకలలో నాందిలేదు; నాటక మారంభమయినది. వసంతసేన వచ్చెను. చారుదత్తుఁ డుత్తరీయ మిచ్చెను. దానిని తీసికొన్న వసంతసేనకు పులకలెత్తెను.

స్వప్నములో గోపాలుఁడు జలదరించెను,

చారుదత్తుఁడు వెన్నెలలో వసంతసేనను మేడ దాఁకఁ బంపెను.

కలలో మహోత్కకవులు: బ్రాహ్మణకమును పున ర్జన్మ మంగీకరింపకుండుట లెస్సకాదు. చూచు చుండఁగనే రాధ వసంతసేనయై తనను విడిచి చారుదత్తు నభిసరించుచున్నది.

గోపాలుఁడు 'ఆఆఆ' యని పలవరించెను.

అతఁడు కలలో 'మీరుమాత్రము చూడ రాఁగూడదు' అని వినెను.

అతఁడు గభాలున లేచెను. కుదుటఁబడి కల యంతయు గుఱుతు దెచ్చికొని గడియారము చూచెను. పదకొండు పండ్రెండుల నడుమ. గోపాలుఁడు దుస్తులు వేసికొనియెను. మో టారు డ్రైవరును పిలిచెను. అతనిని నాటక మునకు మోటారు తోలుమనెను. 'అమ్మ గారి ఆజ్ఞ లేదు' అని అతఁడు నిరాకరించెను. నవ్వుకొని గోపాలుఁడే మోటారు నడిపించు కొని పోయెను.

※

చారుదత్తుఁడును విదూషకుఁడును రంగమున నున్నారు. అది వానాకాలము. జలయంత్ర ము రంగమున వర్షించుచున్నది. జనులు అక్కజపడి చూచుచున్నారు.

ఉజ్జ్వలాభిసారికావేషముతో ముత్యాలగొడు గు వైచికొని 'కమలము కేలలేని సిరి', 'కా ముని చేతి మృదుప్రహేతి', 'శోకము మగ నాండ్ర కందఱకు', 'కంజశరాగమపుష్పము', వసంతసేన "సిగ్గు పోడిమిగల కూర్మితో" చారు దత్తు నభిసరింప వచ్చుచున్నది.

మబ్బు లుఱిమినవి.

'గీ. ఉఱుముఁగాక! పయోదముల్ కురియుఁగాక!
పిడుగు పడుఁగాక! యగుఁగాక పుడమి కడలి!
చలియు వేఁడియుఁ జూడరు లలన లకట!
రమణసాన్నిధ్యమున కేఁగు సమయమందు.'

అని అన్నది వసంతసేన.

విటుఁడు వర్షమును వర్ణించి వర్ణించి

గీ. అలిగితివయేని లేదు సౌఖ్యంబు కోప-
గింపకున్నను మదనుండు కీర్తి తేఁడు
అలుగు మలిగింపు మొకవేళ నతనిఁగూడ
కరుణజూపుము! పడయు మాఘునునికరుణ.

అనెను.

సభ్యు లందఱూ రెప్ప వాల్పక చూచు చున్నారు. 'వర్షవర్ణన చాలు. ఇది ప్రబంధ ము కాదు. నాటకము సుమీ. వసంతసేనా, వడిగానడు వడిగానడు' అని యువకు లను చున్నారు.

గోపాలుఁడు లేవబోయి కూర్చుండెను.

వసంతసేన కూర్చుండి పువ్వులు రువ్వుచు— 'జూదగాఁడా! ప్రదోషకాలము సుఖకరముగా నున్నదా?' అని చారుదత్తునితో అనెను.

గోపాలుని హృదయము స్వస్థానమున లేదు. అది కన్నులలో నున్నది. చూపులనుండి దాని విడఁదీయఁజాలము. మన మొకవేళ అందు ప్రవే

శింపఁగలిగితిమేని చిమ్మనఁగ్రోవిలోని నీటివలె వసంతసేనలో పోయి పడుదుము.

చారుదత్తుఁడు——

గీ. కలికి చెవిమీఁద నిడుకొన్న కడిమిపూవు
నుండి జాఱెడు వర్షబిందువులచేతఁ
దడుపఁబడుచున్న దీ పయోధరము రాచ-
బిడ్డ యభిషేక మొనరింపఁబడ్డ రీతి.

అని విదూషకునకుఁ జూపెను.

ఐ. సి. యస్. గోపాలుఁడు లేచి బలవంతముగా మఱల కూరుచుండెను.

వసంతసేన చారుదత్తుని కౌఁగిలించుకొనఁబోవ సన్నాహపడుచుండెను. చారుదత్తుఁడు ప్రత్యాలింగనమున కాయత్తుఁ డగుచుండెను.

వారి యిరువురినడుమకు గోపాలుఁ డొక్క పెట్ట ఉఱికెను.

---

## బిచ్చగాఁడు

నాళము కృష్ణరావు గారు

ఒకచేత జోలెయు, నొకచేత కోల - పుచ్చుక తిరుగాడె బిచ్చగాఁ డొకఁడు
వాడవాడలవెంట పాడుచు నిట్లు :

'అవనితలంబున నాదిభిక్షుకుని - యపరావతారమై యవతరించితిని;
పృథివిలోఁ గలయట్టి వృత్తులలోన - బిచ్చంపువృత్తియె హెచ్చైనవృత్తి;
చెట్టునీడలె నాకు పట్టెమంచములు - చినిఁగుబట్టలె నాకు చీనాంబరములు
పుట్టగోచియె నాకు పట్టుపుట్టంబు - భిక్షాన్నమే నాకు పిండివంటకము
బూదిపూఁతయె నాకు పునుఁగు జవ్వాది - పూరికొంపయె నాకు భూరిసౌధంబు;
రాజ్య మెవ్వారి దైన, రా జెవ్వ డైన - నా కేమిలక్ష్యంబు? నా కేమికొదువ?
రాజశాసనములు రాజ్యాంగవిధులు - ఎన్ని మాఱిన యేని న న్నేమి సేయు?
కఱవుపై కఱవులు కలుగుఁ గా కేమి - పెట్టఁడే యెవఁ డైన పట్టెఁడోగిరము?
సంతత మీశ్వరస్మరణమే కాని - యితరచింతలు నాకు నెవ్వియు లేవు;
అన్యులపదవుల నాసింపఁబోవ - పరులు నాపదవికి వాంఛింపఁబోరు;
లక్షాధికారి యా భిక్షాధికారి - భిక్షాధికారి తా భేదంబు గనఁడు;
భిక్షుకవృత్తియే విశ్వేశ! నాకు - జన్మజన్మముల ప్రసాదింపు మయ్యా,
పాడిపంటలు గల్గి భాగ్యంబు గల్గి - ఎల్లవారలు సుఖియింతురు గాక!'

---

౧

చీకటి పడబోతున్నది. పొలముపని చూసుకొని అప్పుడే నాగేశ్వరరావు ఇంటికివచ్చి వసారాలో కూర్చున్నాడు. తల్లి గౌరమ్మ దగ్గరకు వచ్చి కూర్చున్నది. ఆమెకు నలభై సంవత్సరముల వయస్సు ఉంటుంది. ముసలి దన్న మాటే. ఏమో చెప్పవలెనని ప్రయత్నము చేస్తుంది. కాని చెప్పలేకుండా ఉంది. చివరకు ఎట్లాగైతే నేమి గొంతుచేసుకొని "ఏమిరా నాయనా, ఎల్లుండి దశమి; మంచి రోజు; ప్రయాణానికి బాగా ఉందిట" అన్నది.

"అయితే ఏమంటావు?" అన్నాడు నాగేశ్వరరావు.

"ఏమీలేదు. మళ్లీ ఒకసారి పోన్నూరు వెళ్లి వస్తావేమో నని."

"ఎందుకమ్మా, లాభము లేదు. నాప్రాణము విసుగెత్తి పోయింది. ఆయనవచ్చి ఆ ఊళ్లో ఉండమంటాడు: ఎంత సేపు చెప్పినా. నీ పిచ్చి కాని ఆయన కూతురును ఎంతమాత్రమూ పంపించడు."

"ఏదో సలహా ఆయన ఇస్తాడు. కాని ఎందుకు పంపించడు కూతుర్ని ? ఎల్లకాలమూ ఆయన ఇంట్లో ఉంటుందా కూతురు ? ఆయనకు మటు కాసంగతి తెలియదా?"

"నీకు తెలియదులే. సంగతి చెప్పినా వినవు. ఏం చేసేది?"

"నీవు గట్టిగా పట్టుబడితే ఆయన పంపించక ఏంచేస్తాడు?"

"ఏంచేస్తా డేమిటమ్మా; ఏదో సాకు చెప్తాడు. పోనీ, దానితో రమ్మని చెపుదామూ అంటే అసలు కంటికి కనబడితేగా! కనబడ్డా మాట్లాడదుగా! ఏది చెప్పినా తలకాయ వంచుకొని ఊరుకొంటుంది."

"పాపము దానికేమి తెలుస్తుందిరా; నీవు ఆయనతో మాట్లాడవలెను; కాని, దానితో చెపితే ఏం లాభము? అది అభము శుభము ఎరగనిది. సిగ్గో ఏమో! కాబట్టే నీతో మాట్లాడదు."

"అబ్బ, నాకు తెలియదు. పోనీ నీవుపోయి తీసుకొనిరా."

"బాగా ఉంది. నీభార్యను పంపించమంటూ మీమామగారి దగ్గరకు పోవలసింది నేనా? నీవు వెళ్లి తీసుకొనిరావాలా నాయనా!"

"నన్ను చంపకు. నాకు తెలియదు."

"నీకు తెలిసింది ఏమిటిరా మరి ?"

"ఏమో నాకు అదంతా తెలియదు. నేను పోను."

" అయితే ఇట్లా ఒంటరిగానే ఉంటావా ఏమిటి?"

"ఆఁ."

"అయితే నేను జీవించిఉండగా నీకు సంసారము చేయడానికి ఇష్టము లేదన్నమాట. ఇది

నాకర్మము కామాల్సు. పోనీలేనాయనా నేను చచ్చిపోయినతర్వాతనే నీఇష్టము వచ్చినట్టు నీవూ నీభార్యా ఊరేగండి." అని ఆమెకంట్ల నీళ్లు పెట్టుకోసాగింది.

"సరే. గోలగా ఉంది. మరి ఇప్పుడు నన్నేమి చేయమంటావో చెప్పు చూదాము."

"గోల ఏమిటిరా. నీవు ఈరాత్రికి బయలుదేరి పోన్నూరువెళ్లి మీమామగారితో గట్టిగా చెప్పి నీభార్యను వెంటబెట్టుకొనిరా. ఆయన ఏవో సాకులుచెపితే నీవు ఏవో సాకులు చెప్పు. అంతగా అయితే నాకేదో పెద్దరోగము వచ్చిందనీ, అందుకోసరమయినా భార్యను పంపించమనీ గట్టిగా పట్టుబట్టు......... నీవు వెళ్ళకపోతే బాగుండదు. నిషేకము అయి రెండు సంవత్సరములు కావడమేమిటి: పట్టుమని పదిరోజులయినా అది మన ఇంట్లో ఉండకపోవడమేమిటి? విన్నవాళ్లూ చూసేవాళ్లూ ఏమనుకొంటారో తెలుసునా?"

"సరే. అయితే ఈరాత్రికే ఆఖరుపర్యాయము వాళ్లఇంటికి వెళ్లుతాను. ఆయనపంపిస్తానన్నా సరే; లేక అది వస్తానన్నా సరే. ఇట్లా జరగకపోయ్యేట్లయితే ఇక ఈజన్మకు ఈభార్యాప్రస్తావన నీవు తీసుకొనిరానని వాగ్దానము చేసేట్లయితే వెళుతాను. లేకపోతే లేదు."

"సరే. అట్లాగే. ఇక రాకపోదు, నీవు ఇంత గట్టిపట్టు పడితే."

"అది కాదు. నేను కోరినట్టు వాగ్దానము చేస్తేనే వెళ్లేది. లేకపోతే వెళ్లను."

"అట్లాగేరా నాయనా."

"సరే" నంటే "సరే" ననుకొన్నా రుభయులు. తెల్లవారుజామునే నాగేశ్వరరావు భార్యను తీసుకొని రావడము కోసరము అత్తవారి ఊరు బయలుదేరినాడు.

౨

వెంకయ్య సంపన్నగృహస్థు. స్వార్జితము అనేది ఆటేలేదు. ఆస్తిఅంతా పితృపితామహార్జితమే. ఒక్కతే కూతురు. ఇంక పిల్లలు లేరు. కూతురు పుట్టిన నాల్గుసంవత్సరములకే తల్లి చనిపోయింది. అతనికి అప్పటిలో వయస్సు ముదరకపోయినప్పటికిన్నీ మనస్సు విరిగిపోయినందువల్ల తిరిగీ వివాహాము చేసుకోలేదు. ఇక అతనికి జీవితములో ఆలంబనము కూతురే అయింది. ఇంత కాచిపోయడానికి ఇంట్లో ఒక ముసలమ్మ దూరపు బంధువు ఉంది.

లోకము ఏమంటుందో అనేభయమువల్ల పిల్లదానికి యుక్తవయస్సు రాగానే వెంకయ్య నాగేశ్వరరావు కిచ్చి వివాహాము చేసినాడు. కాని కూతురు అల్లుడితో మరొకచోట ఒకప్పుడు ఉండవలసి వస్తుంది అనే సంగతి తోచేసరికి అతని గుండె నీరై పొయ్యేది; పట్టరాని ఆవేదన కలిగేది. ఈసంగతి గుర్తించే కాబోలు భాగ్యవంతులతో సంబంధము చేయక సామాన్యవసతిగల నాగేశ్వరరావుకు కుర్రదాన్ని ఇచ్చి వివాహాము చేసినాడు.

నాగేశ్వరరావు తండ్రి బెజవాడ సమీపము లోఉన్న రామవరప్పాడుగ్రామములో వ్యవ

సాయము చేసుకొని జీవనముచేసే సామాన్య గృహస్థు. విశేషభూవసతి లేకపోయినా భూగర్భముచీల్చి భూదేవిదాచిపెట్టుకొన్న అమృతాన్ని పైకిలేవనెత్తి సస్యముల కా అమృతాన్ని పంచిపెట్టి జీవనముచేస్తూ ఉండేవాడు. నాగేశ్వరరావు ఆటే పెద్దతరగతులలోకి రాక పూర్వమే వివాహమూ అయినది; తండ్రిమరణించడమూ తటస్థించినది.

సాధారణముగా పెద్దలనూ, చిన్నలనూ, అందరినీ వ్యామోహపెడుతూ ఎందుకూ కొరమాలిన వాళ్లనుగా చేస్తున్న గుమాస్తా గిరి వైపుకు అతనిమనస్సు పోలేదు. చేనికి కరగా వేసి ఎప్పుడో వాటి చిన్నప్పుడు తనతండ్రి ఇన్ని నీళ్లుపోసిన విశ్వాసముచేత కల్పతరువులయిన కొబ్బరిచెట్లు యేటికి యేడాది ఎప్పుడు బడితే అప్పుడు అతను కావలెనను కొన్నప్పుడల్లా పదిరూపాయలు ఇస్తూ వచ్చినవి. ఇందువల్ల అతను వ్యవసాయమే వృత్తిగా పెట్టుకొన్నాడు.

అతనికి ఇరవై సంవత్సరములు వచ్చేసరికి సీతమ్మ రజస్వల అయినది. లోకాచారము ననుసరించి కొంతకాలమయిన తరువాత వెంకయ్య కుర్రదానికి నిషేకముహూర్తము పెట్టించినాడు. నిషేకము జరిగింది. అయితే మొదటనుంచీ కూడా వెంకయ్యకు అల్లుడూ వియ్యపురాలూ వచ్చి తనఇంట్లో ఉండవలెనని సంకల్పము. నాగేశ్వరరావుకు ఇది ఎంతమాత్రమూ ఇష్టము లేదు. పోనీ వెంకయ్యే కూతురుతో సహా వెళ్లి అల్లుడిదగ్గిర ఉండకూడదా అంటే అతను ఇల్లూ వాకిలీ వదిలిపెట్టలేడు. పైగా ఆ ఊరికి అతను కరణము కూడాను. ఒకవేళ ఇల్లూ వాకిలీ భూమీ పుట్రా వదిలిపెట్టి వెళ్లి కూతురుదగ్గిర ఉండవలెననుకొన్నా ఆకరిణీకము వదిలిపెట్టి వెళ్లవలెనంటే మాత్రము మనస్సు ఒప్పుకొనేది కాదు. అది కరిణీకములో ఉన్న మజా.

సీతమ్మకు నిషేకమయి రెండుసంవత్సరములు అయినప్పటికిన్ని కాముడు గుడ్డివాడు అయినందువల్లనో, మరి కొంటెతనమువల్లనో ఆమె హృదయకవాటాన్ని తెరవలేదు; దగ్గరకు అయినా పోలేదు; దూరమునుంచి అయినా చూడలేదు. ఆమె ముగ్ధగా పెరిగిన ముగ్ధ. ముగ్ధ ఏమిటి? వయస్సువల్ల అవయవములలో మార్పు కలిగింది కాని హృదయములో మార్పు కలగలేదు.

నాగేశ్వరరావు హృదయకవాటాన్ని తెరవడమే కాకుండా మరఫిరంగులతో కాల్చివేయ సాగినాడు మదనుడు. పోనీ నాగేశ్వరరావు హృదయము అన్యథా పోయినా ఎల్లా ఉండేదో? అట్లా ఎందుకు జరుగుతుంది? అట్లా జరిగితే పోకు ఏముంటుంది? అతను కూర్చున్నా, నిలుచున్నా, పడుకొన్నా, ఏమి చేసినా సీతే ఆతని హృదయాన్ని ఆకర్షించేది. ఆరూపము, ఆమృదుమధుర కంఠస్వరము, ఆ అమాయికత్వము తప్ప మరొక రూపము, మరొక కంఠస్వరము అతని హృదయానికి ఉచ్చులు పెట్టలేకపోయినవి. ఒకప్పుడు అత్తవారింటిలో ఉందామని నిశ్చయించినా క్షణ

ములో స్వైరస్వాతంత్రమునచ్చి ఊహాలను పాడు చేసేది. ఒకవేళ స్వాతంత్రమును చంపుకొంటే, అప్పటికి వ్యవసాయముమనచ్చి అడ్డుపడేది.

3

ఆతెల్లవారుజామున బయలుదేరి ఉదయానికి నాగేశ్వరరావు అత్తవారిఇంటికి వెళ్లినాడు. ఉచితరీతిని మామగారు అల్లుణ్ణి సత్కరించినాడు. మామగారి ఇంటివాకిలి సమీపించే వరకు ఉన్న పట్టుదల నాగేశ్వరరావుకు మామగారిని చూడగానే కొంచెము సన్నగిలింది. అందులో ఆయన సత్కారములను అందుకొన్న తరువాత సంగతిచెప్పవలసిన పనే లేదు. అయితే ఈదఫా మాత్రము అల్లుడిలాగా ప్రవర్తించడానికి కొంచెము ప్రయత్నము చేయసాగినాడు.

ఆపగలు భార్యతో ఏకాంతముగా మాట్లాడడానికి అవకాశము లేకపోయింది.

సాయంత్రం మప్పుడు మామగారితో వీలుచూసుకొని మెల్లిగా తనువచ్చిన పని చెప్పినాడు. ఆయన మామూలు పద్ధతిలో "సరే తప్పకుండా పంపిస్తాను. ఇకవస్తున్నది శ్రావణమాసము. అమ్మాయికి శ్రావణ మంగళవారముల నోము ఈ సంవత్సరముతో అయిపోతుంది. ఈమాసము వెళ్లిపోయిన తరువాత నేనే స్వయముగా అమ్మాయిని వెంటబెట్టుకొనివచ్చి నీఇంట్లో దిగవిడుస్తాను. నాఇంట్లో ఎల్లకాలమూ ఉంచుకోవడానికి వీలవుతుందా నాయనా మరి? నేను పంపకుండా అంత అవ్యాజ్యుణ్ణా! ఇదివరకెప్పుడయినా పంపనన్నానా? ఏదో సందర్భపడలేదు కాని ......" అంటూ ఉండగానే "నాకదంతా తెలియదు. రేపు మీరు పంపిస్తేగాని వీలులేదు. నోములు అక్కడే నోచుకోవచ్చును" అన్నాడు నాగేశ్వరరావు.

"అట్లా కాదోయి, కోపపడకు. అక్కడ నోచుకోకూడదని అంటానా? ఏదో తల్లిలేనిపిల్ల కాబట్టి ఇక్కడే నోచుకొని వస్తుందని అంటున్నాను కాని; నేను పంపించనని ఎప్పుడన్నా అన్నానా? అట్లాంటి ఉద్దేశ్యమయినా లేదే! అట్లా అన్నా చెల్లుతుందా?"

"మీరు రేపుమధ్యాహ్నముర్రైలుకు మీఅమ్మాయినిప్రయాణముచేసి పంపించితీరవలెను."

"సరే అట్లాగే. కాని నీవే సలహా ఇయ్యి. నాకు ఆడదిక్కు ఏమీ లేదన్న సంగతి నీకు తెలిసిందే కదా. ఇప్పుడు కుర్రదాని వెంట వచ్చేవారు ఎవరూ లేరు. ఒకనెల అయిన తరువాత నైతే దాని పినతల్లిని బ్రతిమాలి వెంట పంపిస్తే ఆమె ఒకవారము రోజులు ఉండి వస్తుంది. అప్పుడు బాగుంటుందని నా అభిప్రాయము."

"అయితే వెంట మరొకరు ఎందుకు?"

"కాదోయి. అది కొత్తగా నీ ఇంటికి వస్తూ ఉండె మరి. అంతా కొత్త. వెంట ఎవరయినా ఉండవద్దటోయి?"

"కొత్త ఏమిటి. ఇప్పటికి......రెండు సంవత్సరములయితే?—మీరు రేపు పంపించి తీరవలెను."

"సరే నీ ఇష్టము; నీ భార్య ఇష్టము. నేను ఎంత చెప్పినా నీవు వినదలచుకోలేదు. సరే, దానితో చెప్పి అట్లాగే తీసుకొనిపో."

ఉభయులూ భీష్మీకరించుకొని ఊరుకొన్నారు. అతనికి వెంకయ్యమీద పట్టరాని కోపము వచ్చింది. ఇక భార్యకు నచ్చజెప్పి ఒప్పించి ఎట్లాగైనా తీసుకొనిపో నిశ్చయించినాడు.

ఒళ్లువంచి చక్కగా పనిపాటలు చేయడము తప్ప శృంగార ప్రబంధము లయినా చదివింది కాదు. సీత రుక్మిణీకల్యాణ మయినా చదువు కోలేదు. ఎప్పుడయినా చదువుకొంటే మొల్ల రామాయణము—అందులో హనుమంతుడి హడావిడి భాగములు చదువుకొనేది. అందు వల్ల నాగేశ్వరరావు ప్రాణానికి ఆమె కేవలము పచ్చివెలగకాయలాగా మింగుడు పడకుండా అయిపోయింది.

త్రేతాయుగములోరామదూతగానూ, ద్వాపర యుగములో అర్జునుడి టెక్కెము మీదనూ, కలియుగములో ప్రపంచమంతటా ఇంటింటా కిరసనాయిల్ డబ్బామీదనూ, కుప్పిగంతులు వేస్తూఉన్న కోతిదేవుడు వారి ఇలువేల్పు.

బహుశః ఆహనుమంతుడే వాలము పెంచుకొని కూర్చుని మదన దేవుణ్ణి రానీయకుండా అద లిస్తూ ఉండవలెను. కాకపోతే వెంకయ్య తిరిగి వివాహము చేసుకోకుండాను, సీత నాగేశ్వర రావుకు స్వయంగ్రాహ మివ్వకుండాను ఉండ డము ఎట్లా సంభవిస్తుంది.

సీతమ్మ మౌనముద్ర ధరించింది. అతను ఏమే మో చెప్పినాడు. బెదరించినాడు, బెదరలేదు. ప్రగల్భాలు కొట్టడము మొదలుపెట్టినాడు. ఆమెను పూలలోపెట్టి పూజచేస్తానన్నాడు. తనపాలిటి దేవతగా తలచుకొంటానన్నాడు. తనగృహమామెకు స్వర్గధామముగా ఉండే లాగు చేస్తానన్నాడు. ఏమేమో అన్నాడు. ఏమిచెప్పినా లాభము లేకపోయింది. ఆమె మౌనముద్రలోనే ఉంది.

ఆలోచించి ఆమెచేత ఒక్కనవ్వు నవ్వించ వలెననుకొన్నాడు. ఎంతో ప్రయత్నము చేసి నాడు. విఫలమనోరథుడయినాడు. తన అసమ ర్థతకు అట్టే పట్టరానిదుఃఖము వచ్చింది. ఇక యాచనకు తయారైనాడు. సీత చెయ్యిపట్టు కొని కౌగిటిలో చేర్చుకొని "నామీద దయ లేదా? నామీద ఇంతకోప మెందుకు? నా ఇం టికి రావా? రావా?" అని ప్రశ్నించినాడు. ఆమె తలవంచుకొనే "వస్తాను" అన్నది. అతను పరవశమయిపోయినాడు. అదను కని పెట్టి "కొద్దిరోజులయిన తరువాత వస్తాను," అన్నది సీత. అతను చిరునవ్వుతో "ఇప్పుడెం దుకు రావు?" అన్నాడు.

"నేనువస్తే మానాన్న దిగులు పడతాడు." అన్నదామె.

"అయితే మీనాన్న పసిపిల్లవాడేం? పాపము పాలుతాగుతున్నాడు!" కోపముగా ఒక్క క్షణము ఊరుకొని "నీవు రేపు పదిగంటల రైలుకు రాక తప్పదు సుమా! పట్టికట్టి అయినా తీసుకొనిపోతాను తెలుసునా?" అన్నాడు.

* * *

తెల్లవారింది. వెంకయ్య ఉదయమే నాగేశ్వరరావు నిద్రలేవక పూర్వమే ఎక్కడికో వెళ్ళిపోయినాడు. ఎనిమిదిగంట లయింది; తొమ్మిది గంట లయింది; తొమ్మిదిన్నర అయింది; పదిగంటలు కావస్తున్నది; ఆయన ఇంటికి వచ్చేజాడ కనిపించలేదు. పదింముప్పావుకు రైలు బయలుదేరుతుంది. క్షణక్షణముకు ఎండ ఎక్కువయినట్టుగానే నాగేశ్వరరావు కోపమూ ఎక్కువయి పోతున్నది. ఇంట్లో ముసలమ్మను వంటకానీయమని తొందర పెడుతున్నాడు. సీతను సామాను సర్దుకోమని తొందర పెడుతున్నాడు. మామగారిని వెతికి పిల్చుకొని రావడానికి ఇంట్లో ఉన్న జీతగాండ్లను తోలినాడు.

పదిగంట లప్పుడు ఒకజీతగాడు తిరిగివచ్చి ఆయన ఒంటిగంటదాకా రావడానికి వీలులేనట్టున్నూ అల్లుణ్ణి భోజనము చేయమని చెప్పినట్టున్నూ చెప్పినాడు.

అతనిఒళ్లు భగ్గున మండిపోయింది. ఒక చెంప ముసలమ్మ "నాయనా, అబ్బాయి వచ్చినతరువాత పోదువుగానిలే నాయనా" అంటుంది. భార్య ఏమీ మాట్లాడదు. భోజనము చేసినాడు. ఒకబండిని తీసుకొనివచ్చి ఇంటిఎదుట నిలువోబెట్టినాడు. భార్యనురమ్మని ఆజ్ఞాపించినాడు. ఆమె యథాప్రకారము మౌనముద్ర వహించింది. ఇటూఅటూ కదలనైనా లేదు, మెదలనైనా లేదు.

ముసలమ్మమాత్రము "నాయనా రాత్రిరైలుకు అబ్బాయితో చెప్పి సీతను పంపిస్తాను. ఉండునాయనా, తొందరపడకు" అంటూ బ్రతిమాలడము మొదలుపెట్టింది. అతనామాటలు వినిపించుకోలేదు. ఆఖరుపర్యాయము భార్యను సమీపించి అత్యంతాదరముతోనూ, కోపముతోనూ, "రావా, రావా," అన్నాడు. కొంచెము తంద్రదశతో "నాన్న ఇంటికి రానీయండి" అన్నదామె. "కాదు. ఇప్పుడే రావాలె. ఆమె ఊరుకొన్నది; జవాబు చెప్పలేదు. ఆమెను రూక్షముగా చూస్తూ "రావూ?" అన్నాడు. జవాబు ఆమె నోటినుంచిరాలేదు. కాని ఆమెకండ్ల వెంట నీళ్లు కారసాగినవి.

నాగేశ్వరరావు బండి ఎక్కినాడు; స్టేషనుకు వచ్చినాడు; బెజవాడబండిలో కూర్చున్నాడు. ఆతనిమనస్సు డోలాయమానము అయిపోయింది. కోపమూ, తన అసమర్థతకు విచారమూ ఎక్కువయిపోయింది. ఏదో ఒక విధముగా మనస్సు సరిపెట్టుకోవడానికి తగినంత మనోదార్ఢ్యము లేకపోయింది. ఇకస్నేహితులనెవరినైనా సలహా అడగవలెననుకొన్నాడు. ఎందుకోసరము సలహా అడగవలెనో అతనికే తెలియదు. అతని మనస్సంతా అయోమయమయిపోయింది.

బెజవాడలో రైలుదిగగానే తన చిన్ననాటి సహాధ్యాయిన్నీ మిత్రుడున్నూ అయిన ఒక లాయరువద్దకు వెళ్ళినాడు. తనదురవస్థఅంతా చెప్పుకొన్నాడు. ఇక నేమిచేయవలెనో చెప్పమని అతన్ని సలహా అడిగినాడు. నాగేశ్వరరావుకు సలహా ఇవ్వడానికి తిరిగి ఒకసారి హిందూలాలో వివాహఘట్టమంతా చదివి-

అందుకు సంబంధించిన మరికొన్ని గ్రంథములు కూడాచూసి చివరకు Restitution of conjgal rights కోసరము దావా తీసుకొని వస్తే భార్యను కోర్టువారు స్వాధీనము చేస్తారని చెప్పినాడు. తనభార్యను రచ్చకీడ్వడము అనే విషయం అతని హృదయాన్ని చాలా బాధించింది. ఇంకొక పద్ధతి లేదా అని ప్రశ్నించే సరికి ఆలాయరు ఆలోచించి తన మైనరు భార్యను Immoral and illegal purposesకోసరము ఇంట్లో అట్టి పెట్టుకొన్నట్టు మామగారి మీద దావా చేయవచ్చు నన్నాడు. అతనికి ఈరెండు పద్ధతులూ నచ్చలేదు.

*

సాయంత్రముకు ఇంటికి చేరినాడు. ఇంటికి వెళ్లగానే తల్లి "కూతుర్ని ఆయన పంపించ లేదుటరా" అని ప్రశ్నించింది. అతి కోపముతో "ఇకముందు ఆప్రస్తావన నాదగ్గిర తేవద్దు పో" అన్నాడు. జరిగిన సంగతి ఏదో తరువాత నిదానముగా చెపుతాడని ఆమె ఊరుకొన్నది.

రాత్రి భోజనముచేసి పడుకొన్నాడు. నిద్ర పట్టలేదు. ఏమేమో యోచనలు చేయసాగినాడు. భార్యనుకానీ మామగారినికానీ రచ్చకీడ్వడము పెద్ద తప్పిద మనుకొన్నాడు. అట్లా చేయడానికి ఎంతమాత్రమూ ఇష్టము లేక పోయింది. ఇక మార్గ మేదో అతనికి గోచరించ లేదు. ఒక వేళ బలవంతముగా భార్యను తీసుకొనివచ్చినా అందువల్ల మరింత దుఃఖమే కాని సంతోషము ఆవగింజ అంత అయినా ఉండదని గుర్తించినాడు. ఆలోచించి ఆలోచించి హృదయము శూన్యమయిపోయింది. మృత్పిండముకు మల్లె అయిపోయినాడు. కొంత సేపు అయినతరువాత ఊపిరి తెచ్చుకొన్నాడు. నిద్రపోవలెనని ప్రయత్నముచేయ సాగినాడు. నిద్రరాదు. ఏదైనాపుస్తకము చదివితే నిద్రవస్తుందేమో ననుకొన్నాడు. పుస్తకము కోసరము అల్మారలో వెతకడము మొదలుపెట్టినాడు. 'భర్తృహరి' తీసినాడు. ఇక నేఘట్టము చదువుదామనేది ప్రశ్న. పుటలుఊరక కొంత సేపు అటూఇటూతిరగవేసి చివరకు "పక్షద్వయ నిరూపణము" ఘట్టముతీసి పద్యము చదవడము మొదలుపెట్టినాడు.

"అఖిలపాతక భయహారియైన గాంగ
వారియందైన యువమనోహారి యగుచు
హారియగు కల్కి కుల్కుమిటారి చన్ను
దోయియందైన వాసంబు నేయవలయు."

ఈపద్యము అతనికి బ్రహ్మానందము కలుగజేసింది. ఆపద్యాన్నే తిరిగి తిరిగి చదివినాడు. ఎంతసేపు చదివినా ఆపద్యమే. మరికొంత సేపటికి పైపద్యములు చదువవలె ననే సంకల్పము కలిగింది.

"కిమిహబహుభిరుక్తైర్యుక్తిశూన్యైః ప్రలాపైః
ద్వయమిహపురుషాణాం సర్వదాసేవనీయమ్;
అభినవమదలీలా లాలసం సున్దరీణాం
స్తనభరపరిఖిన్నం యౌవనంవా వనంవా."

ఈ పద్యముతో "భర్తృహరి"ని మూసి అవతల పెట్టినాడు. ఇక యోజన ప్రారంభించినాడు. "యౌవనంవా వనంవా" అనేది తప్ప మరొకటి తోచకపోయింది.

ఇదివరకంతా యౌవనాన్ని గురించి ఊహాగానము చేస్తూ ఎన్నెన్నో సౌధములను భావవీథిలో కడుతూ వచ్చినాడు. ఇప్పుడా సౌధములన్నీ విచ్ఛేద మయిపోయినవి. ఇక "వనం" విషయమయి ఊహాగానముచేయ మొదలు పెట్టినాడు. ఇక మరొక తలంపు అతని తలలో జొరబడకుండా వచ్చింది. చిత్తస్థైర్యము లేని వాడి కీలోకములో గతి స్నేహితులూ పుస్తకాలు. ఈ రెండు వారివారి పరిస్థితులను గమనించకుండానే తల్లకిందులు చేస్తవి.

ఇక నాగేశ్వరరావుకు 'యౌవనంవా వనంవా' రామనామస్మరణ అయిపోయింది. యౌవనపు ఊహేలేదు. అది అలభ్యమయిపోయిం దని నిశ్చయించినాడు ఇక నెన్నడూ భార్య ప్రస్తావన ఎవరితోనూ చేయలేదు; అతనిలో అతనైనా చేయలేడు. ఎవరయినా ఆ ప్రస్తావన చేయవచ్చినాఅవకాశమిచ్చేవాడు కాడు. తల్లి అయినా తరువాత ఆవిషయము అడగలేక పోయింది. అడిగినా చిరునవ్వుతో ఊరుకొనేవాడు.

రోజురోజుకు వైరాగ్యము ముదర సాగింది. భర్తృహరి అతనికి సుందరకాండ- భగవద్గీత అయిపోయింది. కేవలము పారాయణే చేస్తూ ఉండేవాడు. మామగారి దగ్గిరనుంచి మూడు నాల్గుఉత్తరములు వచ్చినవి. పైన దస్తూరి చూసి ఫలానావారివని గ్రహించి విప్పిఅయినా చూడలేదు. అవి విప్పిచదివితే తనఊహ ఏవిధముగా మారిపోతుందోనని భయము. మూడు మాసము లయింది; నాల్గుమాసము లయింది. భార్య అతనిఇంటికి రానూలేదు; అతని కాగోడవ పట్టనూలేదు. వైరాగ్యములో మునిగి తేలుతున్నాడు. తల్లికీ అతనివిషయము కొంతగోడవగానే ఉండింది.

## ౬

అతనికి తీర్థయాత్రాభిలాష కలిగింది. అదివరకు వ్యవసాయము చాలామటుకు మర్తరపుచేసినాడు. ఇప్పుడు భూములన్నీ మక్తాకు ఇచ్చివేసినాడు. కొంత ధనము అదనముగా పుచ్చుకొన్నాడు. ఇంకా మరికొంత ధనము తీసుకొని ఒక శుభముహూర్తములో తీర్థయాత్రకు తల్లితోసహా బయలుదేరినాడు.

దేశదేశములూ తల్లితో తిరిగినాడు. చిట్టచివరకు నీలాచలము చేరినాడు. అప్పటి కతని ప్రకృతిలో మరొకమార్పుకలిగింది. వైరాగ్యముకుతోడుగా భగవద్భక్తి ఎక్కువయింది. అందులో ఉత్తర హిందూస్థానములో తిరుగుతున్నరోజులలో రాధాకృష్ణతత్త్వము కొంచెం కొంచెము తలకెక్కింది. జగన్నాథము వచ్చేసరికి ఒకవిధముగా ఉన్మత్తావస్థలో ఉన్నాడనే చెప్పవచ్చును. అసలతని తలంపు ఒక కొంతకాలము జగన్నాథములో ఉండిపోయి శ్రీకృష్ణచైతన్యులవారు ప్రతిపాదించిన రాధాకృష్ణభావము నవగాహన చేసుకొనవలెననే.

ఈ మార్పు తల్లి కనిపెడుతూనే వచ్చింది. కాని ఆమె ఏమిచేయగలదు. తొందరగా ఇంటికి కుమారుణ్ణి చేర్చవలెననుకొని ప్రయాణము తొందర చేయసాగింది. నీలాచలము వారు వచ్చేసరికి అక్కడ కలరా అతి తీవ్రముగా ఉంది. గ్రహచారవశమున తల్లికి కలరా తగిలింది. ఆమె జీవిస్తుందనే ఆశ పోయింది. తుద కామె మరణించింది. ఆమెకత నెంతో ఉపచారము చేసినాడు. కాని లాభము లేకపోయింది. యథావిధిగా ఆమె అపరకర్మలన్నీ నెరవేర్చినాడు. ఇక నింటికి వెళ్లవలెననే—అతని కొకచోట ఇల్లు ఉన్నదనే విషయమే జ్ఞాపకము రాలేదు. నీలాచలములోనే నిలచిపోయినాడు.

వంగవైష్ణవమతములలో వైష్ణవసన్న్యాసుల వద్ద నిద్రాహారములు లేకుండా కాలక్షేపము చేయడము మొదలుపెట్టినాడు. భక్తిగ్రంథములు చదవడానికోసరము ఉరియా, బాంగ్లా భాషలు పఠించినాడు. అతనికి శ్రీ కృష్ణచైతన్యులవారు లక్ష్యమయిపోయినారు. ఆ మహామహుడికి మల్లెనే తానూ రాధాదేవి కృష్ణుకోసరము అనుభవించిన విరహబాధ అనుభవించసాగినాడు. అతనే రాధ అయిపోయినాడు. రాత్రింబవళ్లు అదే ధోరణి.

కృష్ణాష్టమినా డుదయము స్నానము చేసి ప్రాతఃసంధ్యావందనము ఆచరించి శ్రీ కృష్ణధ్యానము చేసుకొంటూ కూర్చున్నాడు. అతని కప్పుడు

"ఒంటిదెరుగుచు గోరిక లుజ్జగించి
శాంతిజేకొని పాణిభాజనుడనై ది
గంబరుడనై సమస్తకర్మంబు లెపుడు
మొదలు చెడద్రుంతు పరమేశ, సదయ
[హృదయ!"

అనే పద్యరాజము చెవులల్లో గింగురెత్తడము మొదలుపెట్టింది. లేచినిలుచున్నాడు. పద్యము మరల నొక్కపర్యాయము స్మరించి చూసినాడు. హుటాహుటి వైష్ణవస్వామి దగ్గరకు వెళ్లినాడు. ఆశ్రమము ఇవ్వమన్నాడు. అంతచిన్నవాడికి ఆశ్రమము ఇవ్వడాని కాయన శంకించి కొంతకాల మయినతరువాత ఇస్తానన్నాడు.

హృదయము ఆమాటకు వికలమయిపోయింది. భూమి పుట్రాఅంతా ఆనీలాచలములో ఉన్న శ్రీకృష్ణమఠముకువ్రాసి రిజష్టరు చేయించినాడు. ఒక్కసారి నిశ్చలముగా యోజించినాడు. ఒకరు ఆశ్రమముఇచ్చేదేమి టన్నాడు. ముండనము చేయించుకొన్నాడు. వంగవైష్ణవ సాంప్రదాయము ప్రకారము ధౌత వస్త్రము ధరించినాడు. శ్రీ చైతన్యాలయముకు వెళ్లినాడు. సాష్టాంగ దండప్రణామము చేసినాడు. బయటకు వచ్చినాడు. "ఏడీ శ్రీకృష్ణు డేడి? ముగ్ధలకృష్ణు డేడి?" అన్నాడు. ఎక్కడికో బయలుదేరినాడు. ఎక్కడికి వెళ్లుతున్నాడో అతనికే తెలియదు. వెళ్లిపోయినాడు. ఏమయినాడో!

౭

అల్లుడు ఏమిహడావిడి చేస్తున్నాడో నను కొంటూ ఆరోజు మధ్యాహ్నము పన్నెండు గంటలప్పుడు వెంకయ్య ఇంటికి వచ్చినాడు. సంగతి సందర్భాలు తెలిసినవి.

రెండురోజు లయినతరువాత తన్ను క్షమించ మంటూనూ, నెలరోజులలో తప్పకుండా కూతుర్ని తీసుకొని వెళ్లేటట్టున్నూ ఉత్తరము వ్రాసినాడు. ఉత్తరముకు జవాబు వచ్చి తీరుతుంది అనుకొన్నాడు. అయితే రాలేదు. కొంత ఆదుర్దా ప్రారంభమయింది. ఒక వారమురోజులు ఆదుర్దాపడి తిరిగి మరొకఉత్తరము వ్రాసినాడు. నాల్గుఉత్తరములు వ్రాసినాజవాబు లేకపోయింది. కారణము తెలుసుకోలేకపోయినాడు. పరిపూర్ణముగా కోపమువచ్చింది. తనూ క్షమించమంటూ అనేకసార్లు వ్రాయడము నుంచి అల్లుడికి పొగరెక్కువయిపోయిం దనుకొన్నాడు. తనంటే అలుసుఅయిపోయిం దనుకొన్నాడు. భీష్మీకరించుకొని ఊరుకొన్నాడు. వాడీఅవసరమువచ్చి వాడు దారికి వచ్చినప్పుడే అవిషయము ఆలోచించవచ్చునని మొదలకుండా ఊరుకొన్నాడు వెంకయ్య.

అయితే అతని స్నేహితులు మాత్రమూ ఊరుకోవడము మంచిది కాదని వెంటనే కూతుర్ని తీసుకొనివెళ్లి దిగబెట్టి రమ్మని సలహా చెపుతూ వచ్చినాడు. వెంకయ్యభయము ఏమిటంటే తీరళ్లా కూతురూ, తనూ వెళితే ఇంట్లోకి రానీయకుండా వెళ్లగొట్టి పరాభవము చేస్తాడేమోనని. తను అడిగినప్పుడు కొమార్తెను పంపకపోవడము అతనికి పరాభవము అనే సంగతిమటుకు జ్ఞాపకము లేకపోయింది. పోనీ ఏది ఎట్లా అయితే అట్లా అవుతుందని ఊరుకోనూ లేకపోయినాడు. ఏమీచేయనూ లేకపోయినాడు. ఆలోచించి ఆలోచించి అల్లుడి సంగతి సందర్భములు కనుక్కొనివస్తే కూతుర్ని తీసుకొని వెళ్లవచ్చు ననుకొని ఒకస్నేహితుణ్ణి ఆ ఊరు పంపించినాడు. ఆ స్నేహితుడు తిరిగివచ్చి అల్లుడూ, అతనితల్లీ తీర్థయాత్రలకు వెళ్లిపోయినట్టు చెప్పినాడు. ఇక చేసేది ఏముంది? అయితే ఊళ్లో వాళ్లమటుకు ఇది ఏదో కీడుకే వచ్చింది అన్నారు. కాని వెంకయ్యకు మాత్రము ధైర్యమే! వారు తీర్థయాత్రలనుంచి తిరిగిరాగానే కూతుర్ని తీసుకొనివెళ్లి దిగబెట్టవచ్చు ననుకొని నిశ్చింతగా ఊరుకొన్నాడు.

ఇంతకూ మన్మథుడు ఉత్తకొంటెవాడు. కాకపోతే ఇన్నాళ్లు ఊరుకొన్నవాడు ఈ సమయములో సీతమీద విసురుపుచ్చుకొని పూలు వేసినాడు. ఆమె కింక వెర్రెత్తిపోయింది. సీత కిప్పుడు అహోరాత్రములు పెనిమిటిని గురించిన చింత తప్ప మరొకచింత లేకపోయింది. పెనిమిటిదగ్గిరకు ఎప్పు డెప్పుడు వెళుదామా అని ఉవ్విళ్లూరడము మొదలుపెట్టింది. కొద్దిరోజు లయినతరువాత అసలు పట్టలేకపోయింది. తండ్రితో ప్రస్తావనచేయవలె ననుకొంటుంది: అయితే సిగ్గు. ఏమని మాట్లాడవలెనో తెలియక గిజాటుపడడము మొదలు

పెట్టింది. ఎవరినైనా సలహా అడగడానికైనా మిత్రులు లేరు. పోనీ పెనిమిటికి తన్ను తీసుకొని వెళ్లమంటూ ఉత్తరము వ్రాతామా అనుకొన్నది. ఈ ఊహ మరింత లజ్జావహమయింది ఆమెకు. చివరకు ఒకనాడు ఎట్లాగైతేనేమి తండ్రిదగ్గిరకు చేరింది. ఏదో మాట్లాడవలెనని ప్రయత్నముఅయితే చేస్తుంది. కాని ఏమీ మాట్లాడలేకపోయింది. తండ్రి అది కనిపెట్టి "ఏమమ్మా, ఏమిటి" అన్నాడు.

"అయితే నాన్నా, రామవరప్పాడునుంచి ఉత్తరమేమీ రాలేదు కదూ."

"అవును. అయితేవాళ్లు-మీఅత్తగారూ మీ ఆయనా ఊళ్లో లేరుట. తీర్థయాత్రలకు వెళ్లిపోయినారుట."

"అట్లాగా; ఎన్నాళ్లయింది?"

"అదేమో తెలియదు. మొన్న మనశివయ్యను పంపిస్తే వాడు కనుక్కొనివచ్చి చెప్పినాడు."

"మరెప్పుడు వస్తారో?"

"మనకెట్లా తెలుస్తుంది."

"తెలియదూ?

"తెలిసేమార్గమేమి లేదు."

"ఎందుకు వెళ్లారో తీర్థయాత్రలకు ?"

"అందరూ ఎందుకు వెళుతారో వాళ్లూ అందుకే వెళ్లిఉంటారు."

"కాదు నాన్నా, వారికి మనమీద విరక్తిపుట్టి వెళ్లిపోయినారేమో, ఇక రారేమో; ఎట్లాగా?"

"నీకేం వెర్రా? తీర్థయాత్రలకు వెళ్లినవాళ్లు మళ్లీ రాకుండా అక్కడే కూర్చుంటారా? ఏం మాటలు? వస్తారులే."

"అట్లా కాదు నాన్నా, వారికేదో చాలా కోపము వచ్చి వెళ్లిపోయి ఉంటారు. ఆవేళ వారికెంతో కోపమువచ్చింది. నీవు మూడునాళ్లు ఉత్తరములు వ్రాసినా జవాబు వ్రాయలేదు కదూ."

"అయితే అది నాతప్పా. నీవు వెళ్లిపోకపోయినావు ఆరోజునే ఇప్పుడింత దిగులుపడేదానివి."

"నీవు ఆరోజున ఎందుకు మొఖము తప్పించావు?"

"నాకేదో పనిఉండిపోయినాను. నిన్ను నీపెనిమిటిదగ్గిరకు వెళ్లవద్దని నేను చెప్పినానా?"

"అమ్మయ్యా, ఎంతవాడివినాన్నా! ఎంతమాట అంటున్నావు. నిజముచెప్పు, నేనువెళ్లడము నీకప్పుడు ఇష్టమేనా?"

"నాఇల్లు వదిలిపెట్టడము నా కిష్టములేకపోయినా నీవు నీపెనిమిటిదగ్గిరకు వెళ్లవలెనా అక్కరలేదా?"

"అప్పుడు మాట మాత్రము ఈ విషయము చెప్పావా నాన్నా? నన్ను అన్యాయం చేశావు. ఇప్పుడు వారికెంతో కోపమువచ్చి ఉంటుంది. నేనుపోతే ఇక నా మొఖము చూస్తారా? అయ్యో. నాకొంపతీసినావు నాన్నా. ఇప్పుడు నేను వెళ్లిపోతాను. నీవు ఇంతమాట అన్న తరువాత నీఇంట్లో నేను ఉంటానా? నేను వెళ్లిపోతాను. సాయంత్రమునుంచి వెళ్లిపోతాను. నీజీతగాణ్ణి అయినా వెంట ఇస్తావా? పోనీ నీజీతగాడెందుకు? నాపెనిమిటిదగ్గిరికి నేనే వెళుతాను.

సాష్టాంగపడతాను; క్షమించమంటాను; బుద్ధిగడ్డితిన్నదంటాను; ఇక ఉండను. వెళ్లిపోతాను.

"మీ ఆయన ఇప్పుడు రామవరప్పాడులో లేడు తెలుసునా? ఎక్కడున్నాడో తెలియదు మరి. అంత తొందరపడకు."

"తొందరేమిటి ఎక్కడుంటే అక్కడికే వెళు తాను. ఏతీర్థములోనైనా కలసుకోలేక పోతానా! చూస్తాను."

"అటే తొందరపడకు. కాస్త నిదానించు."

౭

తన్నూ పెనిమిటినీ త్వరగా కూర్చమని హనుమంతుణ్ణి ఇప్పుడు ప్రార్థించడము మొదలు పెట్టింది. పూర్వము అంటే ఎనిమిదిమాసముల కిందట పెనిమిటి తన్ను తీసుకొనిపోకుండా చేయమని హనుమంతుణ్ణి ప్రార్థించింది. ఇప్పుడేమో ఇట్లా ప్రార్థిస్తున్నది. హనుమంతుడేమి ఆమె బంట్రోతా?

ఇప్పుడామె తహతహ లాడడము మొదలు పెట్టింది. తండ్రిమీద ఉపద్రవమయిన కోపము వచ్చింది. తండ్రిని చూసినకొద్దీ కోపము ఎక్కువ కావడము మొదలుపెట్టింది. తండ్రికి ఆప్తుడయిన శివయ్య అనే బ్రాహ్మణుడితో క్షోభపెట్ట సాగింది. పెనిమిటిజాడ కనుక్కొని రమ్మని ఆ బ్రాహ్మణుడిని ఎంతో తొందర చేయసాగింది. ఆబ్రాహ్మణుడు వెంకయ్యతో చెప్పి రామవరప్పాడు వెళ్లినాడు నాగేశ్వర రావుజాడ కనుక్కోవడానికి. ఆయన అతి ప్రయాసమీద సంగతి సందర్భములు విచారించి తిరిగివచ్చి, నాగేశ్వరరావు జగన్నాథ క్షేత్రము చేరినట్టున్నూ, అక్కడ తల్లి మరణించినట్టున్నూ, అతనుఆస్తినంతా ఏదో వైష్ణవమఠముకు రిజిష్టరు చేయించి ఉంటాడనీ ఎందువల్లనంటే భూములపట్టా ట్రాన్సుఫరుకు ఆఊరికరణముగారి దగ్గిరకు వచ్చినట్టున్నూ చెప్పినాడు.

ఈవిషయము వినేసరికి సీతకు మరింత పిచ్చి ఎత్తింది. తాను నీలాచలము వెళ్లి భర్తను చూడవలెనని పట్టుపట్టింది. ఆపూటభోజనము మానివేసింది. తండ్రిని తన యుక్తకాలములో బాధ్యతను బోధించలేదని తెగదూషించడము మొదలుపెట్టింది. ఆసాయంత్రము రైలుకే బయలుదేరింది. తండ్రికూడా ప్రయాణమయినాడు. తండ్రి తనవెంట రాకూడదని శాసించడం మొదలుపెట్టింది. తండ్రికి కూడా విసుగెత్తిపోయింది. చిట్టచివరకు ఆ శివయ్య అనే బ్రాహ్మణుడినే వెంటఇచ్చి కూతురును జగన్నాథము పంపించినాడు.

* * *

వారమురోజులయింది.పదిరోజులయియింది.పదిహేనురోజులయింది. కూతురుక్షేమ సమాచారముఏమీలేదు. కూతురువెళ్లిన మూడో రోజునేవెంకయ్య మంచము పట్టినాడు. అయితే జబ్బేమీ లేదు. అయితే పదహారవనాడుమాత్రము హఠాత్తుగా మరణించినాడు.

* * *

నెలరోజులకు సీతమ్మ వచ్చింది. తమ ఇల్లూ, వాకిలీ, భూమీ, గీమీ అంతా ఔరసుల స్వాధీనమయి ఉన్నవి.

---

పానశాల



చిత్రము ౬ [పద్యము ౫౭]

[వెనుకటి సంచిక తరువాయి]

II

౨౬

విరహారహస్యవేదనలు వీడుఁ దమంతన రేపొ మాపొ; నీ
మఱిన దదృష్టరేఖ; మధుమాసము కాలముఁ గూడివచ్చె; సుం
దరి హృదయానుసారిణి వనంబున నీకయి వేచియుండ నీ
తరుణమునన్ సుఖింపక వృథా పరచింతన లేల మర్త్యుఁడా?

౨౭

మన ప్రియజీవితంబు కుసుమంబులపోలికఁ జంచలంబు గా
పునఁ బువులట్లు కాలమును బుత్తము నవ్వుల నాటపాటలన్;
గొనగొనఁ బాఱు కాలువలకోవలఁ దియ్యనిపాన మాని జీ
వనభరణప్రయాస మొకప్రక్కకు రువ్వుద మోసి ప్రేయసీ!

౨౮

కమ్మని పిల్లతెమ్మెరల కౌఁగిళులం బులకించి వాసనల్
చిమ్ము గులాబి; బుల్బులి హసించు సుమంబుల రామణీయకం
బిమ్ములఁ గ్రోలి మైమఱచు; నేల విలంబము? పాత్ర నింప రా
రమ్ము లతాంగి, యిద్దఱము రాలకపూర్వమె పూలపోలికన్.

౨౯

ముదిరిన కెంపువన్నె మధుపూరముదప్ప మఱేమిగాని యీ
యదనున నంటఁబోకుఁడని హాయిగ బుల్బులి పాడుఁ; బూఁబొదల్
మృదుల సుమాధరంబులను మెల్లగ విచ్చి వచించు "రండి, మా
సదనములందు విందులయి సంతస మొందుఁడు మూఁడునా" ళ్లనన్.

30

వలపుఁ బాలంతి, యీప్రకృతి వన్యపథంబులఁ బూలపండువుం
జలుప నుపక్రమించె; విరసంబగు శుష్కవిరక్తిమార్గముల్

పలుకకు ; మూడునాళ్ల ముచ్చటంబుగదా మనజీవితంబు! పా
యలువడి పాఱు నిర్ఝరము నంటిన పుష్పముబోదరింప్లఁ జూచితే!

౩౧

ఆసవపూర్ణపూ కలశ, మామిషఖండము, వెన్నరొట్టె, ది
వ్యాసమరూప యౌవనగుణాలయ నీణియమీటుచుఁ దినా
యాసముఁ దీర్ప నిర్జనవనాంతరసీమల నబ్బెనేని వ
హ్వా! సులతానుభోగ విభవంబులఁ గోరెడి మూఢుఁ డుండునే ?

౩౨

తలఁపకు లౌకికకార్యకల్పనల గంతవ్యంబు శూన్యశ్వ; మీ
వు లయంబొందిన నట్లె యౌదు; వసువుల్ వోనాటకుఁ మున్నె మా
జులవల్లీ నిలయంబులం జెలులమోజుల్ దీర్చి ఖయ్యామ, త
ల్లలనామండల భుక్తశేషరసముఁ ధన్యుండవై గ్రోలుమా.

౩౩

వాదులు మాని నాసరస వారుణి నానుము, దానితో మహ
మ్మూదు సమస్తరాజ్యరమ పోలదు ! వేణువినోదగీతి దా
వీదు గళస్వనంబటుల విశ్వరసోదయ హేతు నయ్యె శా
తోదరి, నేఁటి సమ్మదము నోడకు రేపను జూదపాటలోఁ.

౩౪

చెలియరొ, నిన్ను నన్ను విరచించినయప్పుడు సృష్టికర్త ముం
దల లిఖియించెనేమొ సురఁ ద్రావి సుఖింపగ నాకు; హృత్తటం
బులు దెగిపాఱు ప్రేమరసపూరము గిన్నెల నింప నీకు; నా
శలు ఫలియింప మద్యకలశంబును, నీవుఁ జిరంబు వెల్గుతఁ.

---

౩౩ పద్యము:—మహమ్మూదు=మహమ్మదు గజ్నవి. ఈతఁడు హిందూదేశముపై పదునేడుమాఱులు దండెత్తి వచ్చి పట్టణములు కొల్లగొట్టెను. దావీదు=ఈతఁడు సాలోమనుతండ్రి. తన మృదుమధుర కంఠస్వనముచే దేవుని సైతము మెప్పించెను.

౩౫

కౌసరు నిర్ఝరంబు సురకాంతలు నాకమునందు నుందు రం
చాసపడంగ నేల చెలియా, తొలిసంజల నీవు వోయు ద్రా
క్షాసవ మానదీజలము నంతటికన్నను దీపుగాదె! నీ
దాసులు పాదుషా లనువదంతియె చాలదె రూపుఁ దెల్పఁగన్.

౩౬

అమృతరసాయనోష్ఠి, స్ఫటికాసవపాత్రము నాకు మాఱు నీ
సుమరదనచ్ఛదంబున నసూయ రగుల్కొన ముద్దువెట్టెఁ; బం
తముమెయి దాని నెత్తురును ద్రావకయుండిన నన్ను ఉగ్రముఖ
య్యమయని పిల్వఁబోకు; తగవౌనె పరాంగన మోవి ముట్టఁగన్.

౩౭

చెలియ, మనోహరప్రణయశీతలతన్ సుఖియించు నామనం
బలమటత్రోఁ దపించు నకటా! భవదీయవియోగకీలలన్;
దెలియదొ, సాఖి యార్తులకుఁ దియ్యనిమందని; ప్రాణముల్ త్వదం
ఘ్రుల విడిపింతు; రమ్ము, బ్రదుకున్ నిలఁబట్టెద నిట్టియాసలన్.

౩౮

వలపులదివ్వె, నీమృదులపాదలతాంతము ముద్దుగొందు; న
న్యల మధురాధరంబు లయినం దులఁదూఁగవు దానితోడ; రా
త్రుల సహవాసకామినయి రోసియు నిన్ గనలేక భగ్నవాం
ఛలఁ జివురించు లజ్జపెలుచం బవల్లెల్లను బుత్తు దీనతన్.

౩౯

లలనా, కోమలమైన నీతనువు నేలన్ లీనమైపోయి య
న్యల నానావిధ భాండభాండికల రూపంబెత్తుఁ; దత్త్వజ్ఞు లీ
చలవృత్తంబును నమ్మఁబోరు; నిరయ స్వర్గానుసంధాన క
శ్మలచిత్తంబుఁ బురాతనాసవమునన్ స్నానంబు గావించుమా.

౩౫ పద్యము:—కౌసరు=స్వర్గమునందు ప్రవహించు తేనె వాఁక.

౪౦

అంతములేని యీభువనమంత పురాతనపాంథశాల; వి
శ్రాంతిగృహంబు; నందు నిరుసంజలు రంగులవాకిళుల్; ధరా
క్రాంతులు పాదుషాలు బహరాంజమిషీడులు వేనవేలుగాఁ
గొంత సుఖించిపోయి రెటకో పెఱవారికిఁ జోటొసంగుచున్.

౪౧

అంబరం బొక చిత్రదీపంబు; రవియు-దీపపుఁ జెమ్మె; లోకంబు తెరపటంబు;
సిడిబొమ్మలు మనుజులు; నిఖిలమునకుఁ - గాలచక్రంబు నిర్ణేత; గతి యనాది.

౪౨

ఆదిమధ్యాంతరహితమై యలరుచుండు-కాలయవనిక భేదింపఁ గలమె మనము!
ఇటకు నెందుండివచ్చె నిం కెటకుఁబోవుఁ-బ్రాణియనుప్రశ్న కెవ్వాఁడుబదులు సెప్పు?

౪౩

సతముఁ దత్త్వవిచారంబు సలిపిసలిపి-మూలసూత్రంబు నెవరైన ముట్టినారె?
నేఁడు నిన్నట్లు; రేపును నేఁటియట్లు!-అందనిఫలంబు చేఁజాఁప నందు టెట్లు?

౪౪

అఖిలశాస్త్రపురాణ తత్త్వాబ్ధు లీఁది-పరమ విజ్ఞానదీపమా పండితుండు
కాళరాత్రిని మార్గంబుఁ గానలేక-యల్ల మామూలుకథఁ జెప్పె యంతరించు!

౪౫

జీవితంబెల్ల బహుశాస్త్రసేవలందుఁ-గడపితి; రహస్యములుకొన్ని గ్రాహ్యమయ్యె;
నిప్పుడు వివేకనేత్రంబు విప్పిచూడఁ-దెలిసికొంటి నాకేమియుఁ దెలియదంచు.

౪౬

పూవుఁ జెక్కిళు లందంబు దావి రంగు-నిక్కు నీటును గలదు వర్ణింపనేల?
భావిభూగర్భ విశ్రాంతిభవనమందు-మృత్యువెట్లు నన్ను నలంకరింపఁగలదొ!

---

౪౧ పద్యము:—చిత్రదీపము=మాజిక్‌లాంతరు.

౪౭

ఏమిప్రయోజనంబు గన నిష్టములేనిదె నన్నుఁ దెచ్చె; నిం
కేమి యశంబు గౌరవము హెచ్చును నన్ సమయింప? దైవలీ
లా మహిమోన్నతిన్ మదిఁ దలంప నసాధ్యము; రాకపోక లే
ల్లా, మనజీవితంబునకు లాభము కేవలజీవితంబెకా!

౪౮

లలనరో, మున్ను నస్థితి జలంబున "నే" నను విత్తు నాటి, య
వ్వలఁ బరివేదనాగ్నిశిఖఁ బ్రాణముఁబోసెను; గాలిపోల్కి ని
య్యాల సకలంబుఁ గ్రుమ్మరుదు; నెచ్చటిమృత్తికతోడఁ జేసెఁ గ్రం
తల కిరవైన యీతనువుఁ, దాఁకినఁ దప్పిన మన్ను దుమ్మగున్.

౪౯

అయయొ! మూలధనంబు హస్తగళితం బౌచుండె నానాఁటికిన్;
వ్యయమైపోయిరి మానవుల్ మరణశయ్యాసుప్తులై; తన్మృతా
లయవృత్తాంత మెఱుంగఁగోరి వయసెల్లన్ వేచుటేకాని యా
రయలేనైతి దివంబునుం డిటకు యాత్రల్ సేయు దేశాటులన్.

౫౦

తన చేఁజేఁత నొనర్చినట్టి యొకపాత్రన్ భగ్నముం జేయ నే
మనుజుండైనఁ దలంపఁ; డంగములు నిర్మాణంబు గావించి మో
హనరూపంబులు, మోవిఁ దేనె, యెదలో నత్యంతరాగంబుఁ గూ
ర్చిన దేవుండు మఱేల యిట్లు నిజసృష్టిం గూల్చు నున్మత్తుఁడై.

౫౧

ధారుణినుండి యుచ్చశని దాఁకఁ గలట్టి కడింది చిక్కులం
బూరితిగా సడల్చితిని; మోసపుఁడక్కుల బందెగాను; దు
ర్వారనిరోధముల్ గడచివచ్చితి; నయ్యును, సాయశక్తులం
బోరి వదల్పకే విసిగిపోయితి మృత్యురహస్యబంధమున్.

౫౨

అనునిమిషంబు భిన్నమగుసంబుధి యీభువనంబు; వాయుతా
డనహతి రేఁగు నూఁగు కెరటాలు మనుష్యులు; వింతగాదె, యీ
మనుగడ పందెముం బఱచు మానవకోటి పరస్పరంబుఁ బై
కొనుచు సహాయహీనతను గూలమునన్ విరమింత్రు భగ్నులై.

౫౩

మానవులైనవా రెపుడొ మ్రందుట నిశ్చితమౌట బాగదా
సైనను దుఃఖమైన సమయానను; సితాసితపక్షమధ్యయా
త్రానియతిం జిరంబుగ సుధాకరుఁడున్ మనమట్టిమీఁద ము
గ్ధానన, సంచరించు; మధుపానము; మానుము తక్కుచింతలన్.

౫౪

సమయపుఁ బాత్ర లోఁతుఁ గన శక్యముగాదు; జగంబు దుర్జన
త్వముపయి నూనియుండు, మగునా, వగ పేలనొ మద్య ముంచఁగన్;
గుములకు వెల్లఁబోకు విషకుండిక మృత్యువు దెచ్చి యీయఁ గా
లముబడి నీవు నేను సకలప్రజ యారుచిఁ జూడఁగానలెన్.

౫౫

మరణభయంబు నాకు నణుమాత్రము లేదు; మదీయజీవ సం
భరణభయంబె మిక్కుటము; ప్రాణము దైవమునొద్ద వడ్డి బే
హారమున కప్పుగొంటి; ఋణమంతయు నిమ్మని తల్పు దట్టినన్
సరసర హేమనిష్కముల సంచులు ముందర విప్పిపోసెదన్.

౫౬.

కాలము రోషసంకులవికారముఁ జూపక పూర్వమే సుహృ
త్పాళులఁ గూడిమాడి జరుపందగు వెన్నెల పానగోష్ఠి; చం
డాలయముండు ద్వారముకడన్ నిలుచుండిన యప్డు తెప్పపా
టాలము సేయునే, గుటికెఁడైన జలంబును ద్రావనిచ్చునే?

౫౭

పరమొ గిరమ్మొ దానితలపై నొకదోసెడు మన్నుఁజల్లి సుం
దరి లవలీకపోలములు దాఁచినముద్దులు దొంగిలించి, సం
బరముగ శీధు వానుము; నమాజులుఁ బూజలుఁ జేయనేల? యె
వ్వరయిన వచ్చినారె మృతివాటిక కేఁగిన పూర్వయాత్రికుల్ ?

౫౮

మాటికి మాటికిం దెలివిమాలి తలంతువు స్వర్గమంచు; న
చ్చోట నిలింపకామినులుఁ జొక్కపుటాసవమున్ గులాబిపూఁ
దోఁటలు నుండునన్న భ్రమతో మనకేలనొ యవ్వి యిమ్మెయిన్
నీటిలఁ; జేతివెన్నవిడి నేతికిఁబోదురు మూఢమానవుల్.

౫౯

కొందఱు దేవకన్యకలకూటమి పంచుగ యంద్రదగాని నే
నందు మనుష్యలభ్యమగు నాసవమే ప్రియమంచు; నన్యమిం
కెందుకు ముందు చేత గ్రహియింపుము రొక్కము; దూర్యరాన మా
నందము గొల్పు దవ్వుల వినంబడియుం; దడవేల మిత్రమా.

౬౦

ఎవఁడో భగ్నమనోరథుం డిహమునే హేయంబుగా నెంచి భా
వవినోదంబుగ నందనంబు, దివి, రంభాభోగ మూహించుకొ
న్న విధానం బగుపట్టు; బైళులఝుకీనాదంబు, ప్రత్యూషవై
భవముల్ సంధ్యలరక్తికన్నఁ గలదే స్వర్గంబు యోచింపఁగన్.

౬౧

అలవడ దస్తినాస్తుల యథార్థత; నాకము సత్యమన్న పె
ద్దలనుడి యొప్పుకొన్నను, బదంపడి నమ్మిక మేమి యందఱా
స్థలమున కేఁగువారలని? చచ్చిన నెవ్వరి కెవ్వరో! వృథా
పలుకు లిఁకేల భూతలము స్వర్గ మొనర్చుమసాఖి, పాత్రికన్.

[సశేషము]

---

# వ్యవసాయచరిత్రము

పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు

## మహమ్మదీయకాలచరిత్రము

[క్రీ. శ. ౧౨౧౧ మొదలు ౧౭౫౧ వఱకు]

ఈకాలమునందు వ్యవసాయము వృద్ధిక్షయము లను, "జ్యోతి స్తిమిర" న్యాయము నొకొక్కప్పుడు పొందుచుండెను. సాంఘిక మత రాజకీయములలో భారతీయులకును, తురుష్కులకును సంఘర్షణము హెచ్చగుటచేతను ప్రాచీనపద్ధతులు లక్షుగంటెను; నవీనములు రాసాగెను. ఇంచుమించు చిన్నాలుశతాబ్దంబులలోను సర్వప్రభువులగు ఫిరోజుషా తుగ్లక్, అక్బర్, మహమ్మదుగవాన్, ప్రతాపరుద్రుడు, కృష్ణదేవరాయలు మొదలగువారు వ్యవసాయాభివృద్ధికి మిగుల పాటుపడిరి. చరిత్రనుబట్టిచూడ నొకొక్క రాజుకాలమున వ్యవసాయాభివృద్ధిచే సుభిక్షమును మఱీయొకకాలమున మహాక్షామమును సంభవించుచుండెను. "మహమ్మదు బిన్ తుగ్లకు" కాలమున మహాక్షామము సంభవించెను. పన్నులెక్కువ చేయుటచే రైతులు పన్నులిచ్చుకొనలేక పాఱిపోగా, దుర్మార్గుడగు తుగ్లకు రైతులు దాగొనిన యడవులకుఁబోయి మనుష్యులను వేటాడి యపఖ్యాతి నొందెను. వాని యనంతరమునఁ బరిపాలించిన "ఫిరోజుషాహా" వ్యవసాయాభివృద్ధికి విశేషముగఁ జెఱువులఁ ద్రవ్వించి, నదులకు నేబది (౫౦) యానకట్టలం గట్టించెను. నేఁటివఱకు చెడిపోకుండఁగనుండిన "యమునా, జీలం, చీనాబు" కాలువలఁ ద్రవ్వించెను. "అక్బరు" కాలమున నేర్పడిన వ్యవసాయాభివృద్ధికరములగు నేర్పాటులే నేఁటి యింగ్లీషు వారి "తరంవారీ"కి మూలమని కొందఱు తలంచుచున్నారు. (కాని నేనిదివరలో వ్రాసిన "శుక్రనీతిసార"ములోని పద్ధతులను "తుగ్లా" యు, "అక్బరు" ననుసరించి వృద్ధిఁజేసియుందురు.) అక్బరు ననుసరించియే షాజహాన్‌కూడ వ్యవసాయాభివృద్ధికర మార్గముల నవలంబించి యుండెను. ఔరంగజేబుయొక్క పేరాస, మతద్వేషము పైపద్ధతుల నతిగమించి రాష్ట్రమునకును, వ్యవసాయమునకును ముప్పు దెచ్చియుండెను. ప్రతాపరుద్రుఁడు మొదలగు కాకతీయులు ఆంధ్రదేశమునందు ముప్పదివేల చెఱువులఁ ద్రవ్వించిరనియు, మైసూరురాజు లారాజ్యమునందు పదునెనిమిది వేల చెఱువులం ద్రవ్వించిరనియు నైతిహ్యము కలదు. ఇదియంతయు వ్యవసాయాభివృద్ధికి నిదర్శనము కాదా? ప్రతాపరుద్రుని యనంతరమున జరిగిన యాంధ్రదేశ విప్లవసమయమునను, హైదరాలీ టిప్పుసుల్తానుల నిరంకుశపరిపాలనాసమయమునను ఆ దేశములయందు వ్యవసాయాభివృద్ధి యెట్లు జరుగును? కృష్ణదేవరాయలకాలమున తుంగభద్రానదికి 'కొఱ్ఱగల్లు'కడ నానకట్టు కట్టఁబడి కాలువలు త్రవ్వఁబడినను, కంభంచెఱువు, సింగసముద్రచెఱువు, ధర్మవరము చెఱువు, బుక్కసాగరము మొదలగు చెఱువులు విజయనగర సామ్రాజ్యమున నిర్మింపఁబడినను, తాళికోటయుద్ధానంతరము జరిగిన యస్వస్థతచే నాఁటినుండి నేఁటివఱకు దత్తమండలములలో క్షామము పోనేలేదు. ఈకాలమున వ్యవసాయకుఁ డొకొక్కప్పుడు బాగుగఁ బండించుకొని సంతోషించుటయు, మఱియొకప్పుడేదేశ్రసురాజులో దండయాత్రకు వచ్చి చేలను దంపునంపలి గుఱ్ఱములకు, యెద్దులకు మేతకుగాను గోసివేసినయెడల దుఃఖించుటయు, రాజకీయసంధిలోఁ బన్ను నీయకుండఁగఁ దప్పించుకొని సంతసించుటయు, దుర్మార్గుఁడగు రాజు వచ్చినపుడు పదిరెట్లుపన్ను గట్టినయెడలఁ దట్ట నెత్తిపై నుంచుకొని పెండ్లాముబిడ్డలతోఁ బాఱిపోవుటయు, గ్రామమునందుండినయెడల బండరాతిని వీపుపైఁ బెట్టుకొని, చేతులకుఁ గాళ్లకు బొండ కొయ్య వేయఁబడుటయు తటస్థించుచుండెడిది. పన్ను నీయనియెడల నెటుల బాధించిరో శ్రీనాథమహాకవి

# ప్రాచీనభారతీయచిత్రకళ-మొగలుచిత్రములు



౧. ౧౫౬౯ వ సంవత్సరమున రంథంభోరుకోటలోనికి అక్బరుచక్రవర్తి ప్రవేశము



౧. ౧౫౬౦ వ సంవత్సరమున గాగ్రోనుగవర్నరు కోటతాళపుచెవులను అక్బరుచక్రవర్తికిచ్చుట

యిట్లు స్వానుభవమునే చెప్పుచున్నాఁడు: ఇది యథార్థమై యుండవచ్చును:—

సీ. కవిరాజుకంఠంబు కౌఁగిలించెనుగదా
పురవీధి నెదురెండ పొగడదండ
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెనుగదా
నగరి వాకిటనుండు నల్లగుండు
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబునఁ
దగిలియుండెనుగదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసుముంజేత
వియ్యమందెను గదా వెదురుగొడియ
కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు తినిపోయెఁ దిలలుఁ బెసలు
బొడ్డుపల్లెను గొడ్డేరి మోసపోతి
నెట్లు చెల్లింతుఁ డంకంబు లేదునూర్లు.

"వీరభద్రారెడ్డి"వంటి సత్ప్రభుపరిపాలనలో నుండునపు డెట్లు దేశము సుభిక్షమైయుండెనో, దేశమెట్లు సస్యాఢ్యమైయుండెనో శ్రీనాథకృత భీమఖండమునందలి "పిఠాపుర, దాక్షారామ" వర్ణనములం జూచిన విశదమగును. ఇంచుమించు నాకాలముననే రాజోపప్లవములచే బాధపడుచుండి "పల్నాటిసీమ" యెంతటి దుర్భిక్షము ననుభవించుచుండెనో, యీక్రింది శ్రీనాథుని చాటుధారవలనం దెలియనగును:

ఉ. అంగడి యూరలేదు వరి
యన్నములేదు శుచిత్వమేమిలే
దంగవలింపుగారు ప్రియ
మైన వనంబులు లేవు నీటికై
భంగపడంగఁ దోడ్పడు కృపా
పరు లెవ్వరు లేరు, దాత లె
న్నంగను సున్న, గానఁ బల
నాటికి మాటికిఁ బోవనేటికిన్.

ఒక్కొకప్రదేశమునందు పరచక్రభయమున జనులు గ్రామములను వదలిపోవుటచే సుక్షేత్రములుకూడ బీడుపడుటయు, వీరక్తిచేతను బాలములను "మరవత్తు" చేసికొనకపోవుటయుఁ దటస్థించుచుండెను. ఆంధ్రదేశమునం దీకాలప్రారంభమునుండి వ్యవసాయము ద్విజులనుండి తొలఁగి రెడ్డిరాజులు మొదలగువారి పాలనమువలననో యేకారణమువలననో ద్విజేతరులపాల్పడెను. కాని యెపుడును మఱపునకు రానివిధముగా బ్రాహ్మణులీకాలముననే పన్ను లేకుండఁగ వ్యవసాయముం జేసికొనుటకుఁగాను ఈనాముభూములను సంపాదించుకొనియుండిరి. కాశీఖండములోని యీక్రిందిపద్యమును గోదావరీప్రాంత బ్రాహ్మణులు మఱవరని చెప్పవలసియున్నది:.

సీ. ధరియింప నేర్చిరి దర్భ పెట్టెడువ్రేళ్ల
లీల మాణిక్యాంగుళీయకములు
కల్పింప నేర్చిరి గంగ సుట్టియవీఁడఁ
గస్తూరికాపుండ్రకములు నొసల
సవరింప నేర్చిరి జన్నిదంబులప్రోలఁ
దారహారములు ముత్యాలసరులు
చెరువంగ నేర్చిరి శిఖలకన్నడుములఁ
గమ్మని క్రొత్త చెంగల్వవిరులు
ధామముల వెండిపైఁడియుఁ దడఁబడంగ
బ్రాహ్మణోత్తము లగ్రహారములయందు
వేమభూపాలుఁ డనుజన్మ వీరభద్రు
ధాత్రి నేలింప గౌతమీతటమునందు.

విశాఖపట్టణపు మండలములో బొబ్బిలి, విజయనగరము, సత్యవరము సంస్థానములలోను, గోదావరీమండలములోని పెద్దాపురము, పిఠాపురము సంస్థానములలోను, కృష్ణామండలములోని మొగలితుర్రు, నూజివీడు, మొదలగు సంస్థానములలోను బ్రాహ్మణులినాముభూములను సంపాదించుకొని బ్రిటిషుప్రభుత్వమునందును స్వల్పముగ పన్ను నిచ్చియే వ్యవసాయముం జేసికొని విశేషలాభము నొందుచున్నారు. బ్రిటిషు ప్రభుత్వమువారు మర్యాదను నిలిపి విఖ్యాతి నొందియున్నారు. మహమ్మదీయ ప్రభువులును మతద్వేషమును పొందియుండినను, రానురాను దామును భారతీయులమే యను తలంపుతో హిందువులకును దమవారితో సమానముగా విశేషముగ జాగీరుల నిచ్చి ఖ్యాతినొందియుండిరి. ఈకాలమున దున్నుట మొదలగువానిలో మార్పేమియుఁ గలుగలేదుకాని ఆవస్తువులు లేకుండిన మే మెట్లు బ్రదుకఁగల మనునట్టి కొన్నివిత్తనము లీదేశమునఁ బ్రవేశ

పెట్టఁబడి విరివిగ వ్యవసాయముఁ జేయఁబడుచు, నేఁడు విదేశపుబిత్తనము లనిపించుకొనక దేశీయములుగాఁ దలంపఁబడుచున్నవి. వానిలో గొన్నిటి వృత్తాంతముమాత్రము వ్రాసెదను.

(1) పొగాకు:—ఇది పారశీక దేశమునుండి వచ్చెనని కొందఱును, పోర్చుగీసువారిచే దక్షిణపు టమెరికానుండి తీసికొని రాఁబడెనని మఱికొందఱును దలంచుచున్నారు. "గురునానక్" 15 వ శతాబ్దమున నుండెను. అతఁ డొకసారిపొగతోటఁ గని యీయపవిత్రపుమొక్కలగాలికూడ సోఁకనంతదూరముగాఁ దొలఁగిపోదునని తోఁట కతిదూరముగాఁ బోయెనను కథ జనశ్రుతిగా నున్నది. పోర్చుగీసువారీదేశమునకు 16 వ శతాబ్దమునఁ గాని రాలేదు. అంతకుఁ బూర్వమునందుండిన పొగాకు పోర్చుగీసువారిచే నెటులు గొనిరాఁబడును? "ఎలిజబెత్తు" కాలమున నింగ్లాండునకు న మె రి కా ను ం డి పొగాకు తీసికొనిరాఁబడెనఁట. ఇంగ్లాండునకు నమెరికా నుండి తీసికొనిరాబడియుండునుగాని మనకుమాత్ర మిది పారశీకమునుండి తేఁబడిన మహాద్భాగ్యమై యున్నదని నాతలంపు. ఎటులైననేమి, ఇది మన దేశపుఁబంటయై, గోదావరి, కృష్ణ మొదలగు పవిత్రనదీ ప్రవాహమధ్యములందలి లంకలలోఁ బెరిఁగి దేశమునందు వ్యాపించి వర్తకులచే వర్తకపుసరకుగాను, వ్యవసాయకులచే వ్యవసాయపుసరకుగాను దలంపఁబడుచున్నది. పూర్వము త్రికాలాగ్నిహోత్రములం జేయు శుద్ధశ్రోత్రియకుటుంబములవారు పూర్వాగ్నిహోత్రములను మానివేసినలోటు లేకుండఁగఁ దత్సంతతివారు దీనిచే సదాగ్నిహోత్రు లగుచున్నారు. నాసికాచూర్ణాదిమహిమ జగద్విదితమే.

(2) నల్లమందు:—మన దేశమునందు 12-వ శతాబ్దమునకుఁ బూర్వమునందుండిన రసాయనగ్రంథకర్తలగు "నాగార్జునుఁడు, భావమిశ్రుఁడు" మొదలగువారు తమ రసాయనతంత్రములలో "అహిఫేన" మనఁబడు మత్స్యవిశేషముయొక్క విషమును వాడియున్నారు. ఈయహిఫేనము పాదరసమును ఘుటికగాఁజేయుట కుపయోగించునఁట. "పాదరసఘుటికాసిద్ధౌషధము" కామోద్దీపకమగునదియని "యలసాని పెద్దన" మనుచరిత్ర 3-వ యాశ్వాసము 25-వ పద్యమున సూచించియున్నాఁడు. తురుష్కదండయాత్రోపద్రవకాలములందు మనరసాయనతంత్రము లడుగంటెను. కాని "అహిఫేన"ముయొక్క స్థానమునందు అరబ్బీదేశస్థులచే వారిభాషయందు "అఫియన్" అనఁబడు విషము మనకు దిగుమతిచేయఁబడెను. "అఫియన్" శబ్దమునకు నాంగ్లేయభాషలో "ఓపియం" అనియు, తెనుఁగుభాషలో "అభిని" యనియు, నల్లనిమందుగాన నల్లమందనియు వికృతనామములు గదా? అహిఫేనము విషము; దానిని మనమిపుడెఱుఁగము గాని యభినియొక్క విషము మనకు ననుభవసిద్ధముగా నున్నది. ఇది లేకుండినయెడలనిలువలేము; అన్నమునైన మానెదము- అనువారు పెక్కులక్ష లీభరతఖండమునఁ గలరు. ఈయభినికి "మాల్వా" దేశమిపుడు పుట్టినిల్లు. ఇదిమన దేశీయులకాహారముగాను, గవర్నమెంటువకు రివిన్యూగాను, 1840 సం॥న జరిగిన చైనాయుద్ధానంతరము మొదలు ఆంగ్లేయవర్తకులకు చైనాలో దిగుమతిచేయు వర్తకద్రవ్యముగాను వృద్ధిపొందినది. చైనావారిని నల్లమందు భాయీలను జేయుచున్నారనియు, విషవర్తకముం జేయుచున్నారనియు, బ్రిటనువారిపై నాగరికదేశీయు లాక్షేపణముం జేయుటచే నిండియా గవర్నమెంటునకుఁ బ్రతిసంవత్సరము 10 కోట్ల రూప్యములు నష్టమువచ్చినను సహించి యావర్తకమును నేఁడు బ్రిటిషువర్తకులు తగ్గించుకొనిరి. కాని భరతఖండమున మాత్రము నల్లమందువలన గవర్నమెంటున కాదాయము పెరుఁగుచున్నదని వాడుక. ఇల్లు, ఒళ్లు గుల్ల చేయు నీపంట యెంతనశించిన నంత సంతసింపఁదగినది. నవీన వైద్యశాస్త్రగ్రంథములను "బసవరాజీ"యాదులలో నీ "నల్లమందు" అతిసారాదిరోగముల కుపయోగపడునని వ్రాయఁబడుట ప్రశంసనీయము.

(3) మిరెపకాయ:— ఇదియును, విదేశమునుండి దిగుమతి చేయఁబడినదే. 16, 17 వ శతాబ్దములలో పోర్చుగీసువారు దక్షిణపు టమెరికాలోనిదగు "చిలీ" దేశమునుండి దీనిని దెచ్చిరఁట. అందువలననే దీనికి నింగ్లీ

షను "చిలీస్" అనిపేరు. మన ప్రాచీనులు కారమునకు మిరియములు, ఇంగువ మొదలగువానినే వాడుచుండిరి. ఈమిరెపకాయ దినుపటిదైన పిమ్మటను వాటి ప్రాముఖ్య మనుగంటి, వీసె 1కి 0-6-0 అమ్మనది రూ1-12-0 అమ్మినను దీనిని వదలలేక దీనినే యాబాలగోపాలము కొనుచున్నాము.

(4) ఫరంగిదుంప:—ఇది ఫ్రాంసుదేశపుదని దీని నామమే చెప్పుచున్నది. ఫ్రాంసుదేశీయులకు "సుఖరోగములు" మెండు. వారీదేశమునకు వచ్చినపుడు తమరోగనివృత్తికిఁగాను ఫ్రాంసునుండి దీనిని దమతోఁ దెచ్చుకొనిరి. అది మనదేశమున నిసుకనేలలోఁ జైరుఁ బెట్టనచ్చును. దీనిని తెనుఁగువైద్యులు "ఫిరంగిచెక్క" యానెదరు. మన వైద్యులు దీని గుణాతిశయమును గనిపెట్టి పైత్యవ్యాధుల కుపయోగించుచున్నారు.

(5) గులాబిపువ్వు:— ఇది పారశీకమునుండి తురుష్కులచేఁ గొని రాఁబడెను. "జహంగీరు" పాదుషా బీవిపన్నీటితో నొక చిన్న చెఱువును నింపి "నూర్జహాను" తోఁ దానిలో పడవషికారుపోయెనఁట. గులాబియత్తరువు విదేశీయమని దాని నామమే చెప్పుచున్నది. ఇంకను, కట్టెపెండలము, బత్తాయిపండు, సపోటా మొదలగు ననేక విత్తనము లీకాలమున విదేశీయులచేఁ దీసికొని రాఁబడి, మన భారతీయులయొక్క మేలునకును, కీడునకునుగూడ నీదేశమునఁ బ్రవేశపెట్టఁబడినవి. "సీమ" అను శబ్దముతో నుచ్చరింపఁబడునవి, అనఁగా సీమచింత, సీమరేఁగు, సీమమిరెప మొదలగున వన్నియు విదేశీయములని తలంపవలసియున్నది. విదేశపు విత్తనములేవి? స్వదేశపువిత్తనము లేవి? అని విమర్శించి యావస్తువుల చరిత్రమును వ్రాయుటకుఁ బ్రత్యేక మొకగ్రంథ మగునని తలంతును.

## పశుపాలనము

ఋగ్వేదకాలము మొదలు పౌరాణిక కాలాంతమువఱకునే "గోమే"ధాది స్వల్పయజ్ఞములలోనో, యే వసిష్ఠునివంటి మాంసప్రియుఁడగు బ్రహ్మర్షి వచ్చినపుడో తప్పగోవధ విశేషముగ లేదు. సంస్కృత మహాభారతము యొక్క యుద్యోగపర్వములోని "నహుషుని" చరిత్రము జూడ గోవధ కూడదని శాస్త్రకాలమునందే కొంత చర్చ బయలు దేరినదని విశదమగును. బౌద్ధకాలమున నది పూర్తిగ నిషేధింపఁబడినది. అందువలన బౌద్ధ పౌరాణిక కాలములలో గోవు లింతింతనరాని యభివృద్ధినొందినవి. భారతీయుల దురదృష్టవశమున భారతీయుల ధనము విదేశముల పాలగుటయే కాక, రాజ్యములు పోవుటయేకాక, భారతీయులు తల్లితో సమానముగను, పవిత్రవస్తువులలో మిక్కిలి పవిత్రవస్తువుగను నెంచుకొనెడి "గోవు" మహమ్మదీయకాలమున నమితముగ నాశముఁ జేయఁబడెను. దేనిని వధించిన మనము మహద్దోషమని తలంతుమో దానిని మహమ్మదీయులు తమ మసీదులలో వధించిన మిక్కిలి పుణ్యమని తలంచిరి. ఇది దేశదురదృష్టహేతువుకాదా? హిందువులకు గోవునం దమితాభిమానమని గుర్తెఱిఁగిన "శివాజీ మహారాజు" తురుష్కులపై దండయాత్రకుఁ బోవునపుడు, హిందువులకు రోషము కలుగుటకుఁగాను నేను గోవులను వధించు తురుష్కులపై దండయాత్రం జేయుచున్నానని చెప్పువాఁడఁట. కాని యీకాలమునను "అమృతమహలు, నంగోలు, పుంగనూరు" మొదలగు చోటులను గోవులు, వృషభములు ప్రసిద్ధికెక్కి ప్రపంచమున నింతటిజాతి పశువులు లేవనిపించుకొనినవి. "టిప్పుసుల్తాను" దండయాత్రల నతిత్వరితముగాఁ జేయుటకు మైసూరు రాజ్యమునందలి యెద్దులే కారణమనియు,నవి రస్తుసామగ్రి నతివేగముగాఁ దీసికొనిపోవుటచేతనే యతడు చుఱుకుగా సైన్యముల నడపించువాఁడనియు ప్రఖ్యాతికలదు. ఎటులైనను మహమ్మదీయకాలమున లోకవిఖ్యాతి నొందిన మన గోబృందము చాలవఱకు తురుష్కుల పట్టుదలచే నశించినదని తలంపవలసియున్నది. స్వదేశప్రభువులు మాత్రము గోసంరక్షణము కొఱకు నాఁడును విశేషముగ పాటుపడుచుండిరి.

ప్రకృతిశాస్త్రము లంతగా నభివృద్ధి నొందినట్లు గాన్పింపదు కాని, విశేషానుభవముచే నీసంవత్సరమిట్లు జరుగును; ఈసంవత్సర మిట్టికష్టములు కలుగును' అని యనుభవముచేఁ గొన్నిగ్రంథము లీకాలమున వ్రాయఁబడెనని తలంపవలసియున్నది. గర్గాదులు కొన్నిగ్రంథ

ములు వ్రాసియున్నారని యిదివరలో వ్రాసితిని. అవి నాకు లభింపలేదు. ప్రతిసంవత్సరము ధాత్వాదిపరీక్షలను పుష్య, మాఘ, ఫాల్గున శుద్ధపూర్ణిమలలోఁ జేయించి దేశీయప్రభువులు ప్రాచీనకాలమునఁ బంచాంగములను వ్రాయించుచుండువారు. ఆంధ్రదేశమున "పిడపర్తి"వారు "పిల్లలమఱ్ఱి"వారు, "నూతలపురి"వారు మొదలగువారు ధాతుపరీక్షలం జేసి, పంచాంగములను వ్రాసి, మహమ్మదీయకాలమునఁ బ్రఖ్యాతినొందిరి. నేఁడును తత్సంతతి వారు పంచాంగముల జేయుచున్నారు కాని ప్రభువాభిమానాదికము లేనందున ధాతుపరీక్షయేమో తలపెట్టనైనఁ దలపెట్టక, శ్రావణమాసముననే ముద్రాయంత్రమునకు పంచాంగమీయఁబడుచున్నది. ఇట్టి నామమాత్ర సిద్ధాంతులు మన తెలుఁగుదేశమున 40 మందివఱకు పంచాంగములఁ జేయుచున్నారు. నేఁటికి 156 సంవత్సరముల క్రితము 'అయ్యలకవి, భాస్కరకవి' యనువారలు కన్నడభాషలోని "రెట్టమతము" ననుసరించి "రెట్టమతశాస్త్ర"మను నైదాశ్వాసముల గ్రంథమును, "ఇంచుమించాకాలముననే 'కోనయామాత్యకవి' "సస్యానంద"మను నాలుగాశ్వాసముల గ్రంథమును, తెనుఁగున ననువాదించిరి. ఈగ్రంథములయందు వ్యవసాయదారున కనుకూలించు భవిష్యత్తులు వ్రాయఁబడియున్నవి. దేనినిసుఱించి యీ గ్రంథము వ్రాయఁబడెనో! రెట్టమతమునం దిట్లు కలదు:

"ఈ ప్రబంధమునకు ననుక్రమణిక యెట్టిదనిన, వర్షాదిహేతువులగు భూజాతపుష్పపరీక్షయు, గోప్రజార్భనాశకునంబును, దూతలక్షణంబును, పక్షిశకునంబును, గర్భర్తులక్షణంబును, మేఘలక్షణంబును, విద్యుల్లక్షణంబును, గర్జితలక్షణంబును, ఇంద్రచాపలక్షణంబును, పరివేషలక్షణంబును, ప్రతిసూర్యాతపవాయులక్షణంబును గ్రహయుద్ధలక్షణంబును, బీజావాపంబును, అర్ఘలక్షణంబును, గ్రహలక్షణంబును, ఆకస్మికలక్షణంబును, గ్రహచారాస్తమయోదయ లక్షణంబులును గ్రహబలఫలలక్షణంబులును, గురూదయాబ్దసంవత్సర ఫలలక్షణంబులును, సంవత్సరాది ఫలంబును వివరించియుండు నందు" ప్రథమాశ్వాసము. ఈగ్రంథమును "రెట్టఁ"డే యేమతానుసారముగ వ్రాసెనో యీక్రింది పద్యమునఁ జెప్పఁబడెను:—

సీ. వరుసగర్గాచార్యవర్యుని మతమున
　　　మతిశాలి హరిభట్టు మతమునందు
ధర కీర్తి ఘనుఁడైన ధన్వుని మతమునఁ
　　　బ్రతిభఁ జెన్నొందు శ్రీపతి మతమున
మేటి యైన వరాహమిహిరార్యుమతమున
　　　సన్మేఘమాలికా శాస్త్రమునను
ఉచిత కీర్త్యభిఖ్యచే నొనరు నారాయణ
　　　భట్టమతంబునఁ బ్రాజ్ఞులైన
జనుల యుక్తిని జ్యోతిషసారమునను
శకునచయమునఁగల యర్థచయము తెలిసి
కృతి యొనర్చిన రెట్టని మతము నేను
వేడ్కఁ దెనుఁగించెదను విను వేంకటేంద్ర!

—ప్రథమాశ్వాసము.

సస్యానందకారుఁడును తన గ్రంథమును గార్గ్య, వరాహమిహిర లల్లాదుల మతము ననుసరించి వ్రాసితిననియు, "ప్రవర్ష నివర్షణంబులు" తెలియఁజేతుననియుఁ జెప్పియున్నాఁడు. గ్రంథము పెరుఁగునని దానిని విడిచి ప్రాచీనుల యనుభవ మెంతవఱకు మనకు సరిపడునో నిదర్శనముకొఱకు గతవత్సరము, ఈవత్సరము, రాఁబోవు సంవత్సరముల ఫలితమును రెట్టమతశాస్త్రమునుండి వ్రాసెదను.

క. వరుస నిక్కాబింగళ సంవ
త్సరమున వర్షములు గలవు జనులు సుఖముగాఁ
బరగుదురు సస్యవితతులు
విరివిగ ఫలియించునండ్రు వేంకటనృపతీ.

గీ. కాళయుక్తివత్సరమునఁ గలుగ దరయ
మునుపు వానలు కొంచెంబు వెనుక వృష్టి
పైరులకు నీతిబాధ లోకపాటి వెలయు
వినుము కొండ్రాజు తిమ్మయ వేంకటేంద్ర.

గీ. రాజులకు పోరు లాదవు వర్షంబు గురియు
క్రూరజనులచేఁ బంటలు కొల్లఁబోవు
వచ్చు తాపంబు సిద్ధార్థివత్సరమున
ననియె రెట్టఁడు సకల విద్యావిదుండు.

కడచిన రెండుసంవత్సరముల చరిత్రము మనకు ననుభవసిద్ధముగానే యున్నది. భవిష్యత్తు ఎట్లు జరుగునో తెలియదు. ఈకాలమున వ్రాయఁబడిన "కాలామృతము", "ముహూర్తమార్తాండము", "ముహూర్తకంఠాభరణము" మొదలగు గ్రంథములలో "హలచక్రము, బీజావాపనము" మొదలగు వ్యవసాయపద్ధతుల కనుకూలించు వానికేకాక వ్యవసాయదారున కనుకూలించు ననేకములగు చిన్న చిన్న పనులకుఁగూడ ముహూర్తనియమములు వ్రాయఁబడి యున్నవి. వాని నిట నుదాహరించుట చాల ప్రస్తుతముగా నుండునని వ్రాయలేదు. ఈకాలమున నిజరములగు పట్టు కృషి, ఉన్నికృషి ప్రసిద్ధినొందెను. 18-వ శతాబ్దమధ్య మున బంగాళాదేశమున పట్టు విశేషముగ వృద్ధినొందెనని రివరెండు టేలీ, నీబరు మొదలగు పాశ్చాత్యులు వ్రాసి యున్నారు. మహమ్మదీయుల కాలమున ఢక్కాముజిలిన్లు, కాశ్మీరశాలువలు, బందరుచీటిగుడ్డలు, బనారసుపట్టు బట్టలు ప్రసిద్ధికెక్కి యూరపుఖండమున కెగుమతి యగుచుండెనని ప్రఖ్యాతికలదు. భోజనపదార్థములలోఁ గొన్నితప్ప ధాన్యాదుల నెగుమతిచేయ వీలులేదని నాటి రాజశాసన ముండుటచేఁ గాఁబోలు, 1750 సంవత్సరప్రాంతమున బంగాళాదేశమున పైసకు శేరుబియ్యము నమ్ము చుండిరఁట. అట్టి చవుకధర లాకస్మా డిప్పుడుఁ గలవనిన నేఁటివారు విచారించుటతప్ప మఱియొకలాభము లేనందున నాప్రశంసను విడుతును. కోళ్లను మహారాజులు పెంచి, భోజనమున కుపయోగించుటయేకాక, వినోదము కొఱకు పందెములను వేయుచుండిరి. కోడిపందెములచేఁ గలహములు ముదిరి సంస్థానాధీశులు కొందఱు మరణించిరి. పెద్దాపురసంస్థానచరిత్రమునఁ గోడిపందెము వేసికొని "ప్రూసపాటివారు, వత్సవాయివారు" నెట్లు కలహ మును బెంచుకొనిరో వర్ణింపఁబడియున్నది. తెనుఁగు దేశమునందేకాక, యరవదేశమునందును గోడిపందెముల వేయుచుండిరి. కాంచీపురవాసియగు "అమ్మళాచార్యుఁ" డను మారుపేరుగల "వరదరాజ" కవికృత వసంతతిలక భాణమునుండి కోడిపందెపుఁ బద్యము నొకదానిని సార్థకముగ వ్రాసెదను.

* ఒకదానికొకటి యెదురుగ మెడలను సాగించి, యందమగు జుట్టులు కలవై, ప్రకాశించుచున్న యెఱ్ఱనికన్నులు కలవై, కోపము కలవై, కోడిపుంజులు ముక్కుతోఁ బొడుచుకొనిన కాట్లనుండి రక్తము కారు నట్లును, రెక్కలచప్పుడు కలుగునట్లును, నెగురుచుఁ, గాళ్లకుఁగట్టిన కత్తులతో శోభించుచున్నవి—(ఇది డింకీ పందెముకాదు).

---

# అమృత మెక్కడ లభియించునయ్యా చెపుమ

పండిత పురాణం సూర్యనారాయణతీర్థులుగారు

గగనమధ్యమునందుఁ గల దొక్కనడబావి దానియొద్దను సన్నదారి గలదు
ఇంద్రనీలములచే నది యేరుపడి మూఁడుబంగారుమెట్లపైఁ బ్రాకిపోవు
నది పట్టి పోఁ జందనాచ్ఛాదితమ్ము లై గోచరించును రెండుకొండ లెదుట
గొప్పపుణ్యము చేసికొన్న ధన్యులుమాత్రమే చాల సులువుగా నెక్కఁగలరు
ముందు బావిలోన మునిఁగి యొడ్డెక్కి యాదారిఁ బట్టి యందుఁ జేరవలయు,
నచట నున్నవారి కమృతమ్ము లభియించుఁ-జందురుండు చేతి కందుఁగనుక.

---

* శ్లో. అగ్రే పక్ష్మళకేసరా మభిముఖం గ్రీవాం ప్రసార్యాయతాం, లోలత్తారకతామ్రములోచనపుటౌ రోషాయితౌ కుక్కుటౌ, చంచూఖండనకీర్ణశోణితరణం దుర్వారపక్షారవం, పర్యాయేణ కృతోత్ప్లుతిప్రహరణైఃపాదై ర్నిబద్ధక్షురైః.

# చెఱకుపంట

ఆర్. దొరైరాజుగారి ఆంగ్లమునకు అనువాదము

రాయలుకమిషను పరిష్కరించవలసినసమస్యలలో మనదేశానికి కావలసినచక్కరను మనదేశంలోనే ఉత్పత్తిచేసుకోవలెననే సమస్య ఒకటి. ఈసమస్య ఒకఇండియాకుమాత్రమే సంబంధించినది కాదు. అది అన్నిదేశాలకు సంబంధించినది. బ్రిటిషుసామ్రాజ్యానికి ఏడాదికి ౫,౮౦౦,౦౦౦ టన్నుల చక్కర కావలసి ఉంది. కాని అక్కడ ౪,౦౦౦,౦౦౦ టన్నులు మాత్రమే ఉత్పత్తి అవుతుంది. కాబట్టి ౧,౮౦౦,౦౦౦ టన్నుల చక్కర లోటు వస్తుంది. ఈసమస్యను తృప్తికరంగా పరిష్కరించడానికి బ్రిటిషుసామ్రాజ్యంలో ఇండియాను మించినదేశ మింకేదీ లేదు. ప్రస్తుతంలో ఇండియా తనకు కావలసిన చక్కరకు ఇతరదేశాల్పై ఆధారపడిఉంది. అందుచేత ముందు తనసంగతిని చక్కబరుచుకొని అవతల సామ్రాజ్యానికి సహాయం చేయగల సంగతిని చూడవలసిఉంది.

ప్రపంచంలో చెఱకుపండే పొలాల్లో ఇంచుమించు సగంవఱకు ఇండియాలోనే ఉన్నవి. ఇండియాలో చెఱకు ఎక్కువగా పైరయినా ప్రపంచంలో అంతా చెఱకువల్ల తయారయ్యే చక్కరలో నాలుగో వంతు మాత్రమే అక్కడ ఉత్పత్తి అవుతూఉంది. జర్మనీలో ఒక్కొక్కమనిషి సరాసరి ౫౦ పౌనుల చక్కర ఉపయోగిస్తారు. బ్రిటిషుదేశంలో ౭౦ పౌన్లు ఉపయో

లభించిన ఫలితములు (ఒక ఎకరముపొలములోని చెఱకుపంట)

అంటు మొక్క చెఱకు




దేశీ చెఱకు

ముప్పదిటన్నులు — పదునొకండుటన్నులు

గిస్తారు. అమెరికాలో ౯౯ పౌనులు ఉపయోగిస్తారు. ఇండియాలో ౨౧ పౌనులు మాత్రమే ఉపయోగిస్తారు. ఇంతతక్కువగా ఉపయోగించినా జనసంఖ్య ఎక్కువ కావడంచేత ఇండియా దేశము ప్రపంచంలో చక్కెర ఎక్కువగా ఉపయోగించేదేశాల్లో రెండవదిగా ఉన్నది. ప్రపంచంలో చెఱకుపండే పొలాల్లో సగంపొలాలు ఉన్నా 'జావా,' 'మారిషసు'లనుండి ఇండియాకు ఏడాదికి 15 కోట్ల రూపాయల వెలగల చక్కెరను తెప్పించుకోవలసిఉంది.

కుంటే ఇండియాలో ఈపరిశ్రమయొక్క వాతావరణం కనుమాసినట్లు కన్పిస్తుంది. దేశానికి కావలసినంతసరుకు దేశంలో ఉత్పత్తికాకుండడంవల్ల దిగుమతులు క్రమంగా హెచ్చేత్రోవలో ఉండి. ఇవీ, ఇంకా కొన్ని చిన్న విషయాలూ మనదేశానికి కావలసినంత సరుకును మన దేశంలోనే ఉత్పత్తిచేసుకోవడానికి సర్వవిధముల ప్రయత్నించవలెనని సూచిస్తూ ఉన్నవి.

ఇటీవల ఇండియాగవరన్మెంటువారీవిషయంలో కొంతశ్రద్ధ కనుపరిచినమాట వాస్తవమే.




ఉష్ణదేశములందలి చెఱకురకములు                                 ఇండియాలోని చెఱకురకములు

ఇండియాకు డబ్బుకూడేమార్గాలు కేవలం శూన్యంగా ఉండేదాంతోగూడా విదేశాలనుండి ఎడతెగని దిగుమతులవలనిబాధ చాలాగాఉంది. మొట్టమొదట ఇండియా దిగుమతికొఱకు ఇతరదేశాలపై ఆధారపడి ఉండవలసిన ఆవశ్యకతను తొలగించుకోవలెను. దిగుమతులు ఎక్కువఅయ్యేకొలదీ ఇండియాలో చెఱకుపండే పొలాలు తగ్గిపోవచ్చును. చెఱకుపైరుచేసే యితర దేశాలలో ఉత్పత్తి ఎక్కువ అవుతూఉండడం తలచు

పైరగుచున్న చెఱకుల మంచిస్రెబలను సర్తించి అభివృద్ధిలోకి తేవలెనన్న ఉద్దేశంతో వారు స్థాపించిన కార్యాలయాలలో కోయంబుత్తూరులో నున్న 'ఇంపీరియలు షుగర్ కేన్ బ్రీడింగ్ స్టేషన్' అను కార్యాలయం ఒకటి. ౧౯౧౨ సంవత్సరం ఇండియాలో వృక్షశాస్త్ర పరిశోధనలకు దారితీసినవారిలో ఒకడగు డాక్టరు సి. ఏ. బార్బరుగారు ఈ కార్యాలయమును స్థాపించినారు. ఈకార్యాలయాన్ని స్థాపించిన కొలది

కాలంలోనే బార్బరుగారు మొక్కలను పాతి చెఱకును పైరుచేయు పద్ధతిని మొదలు పెట్టినారు. ఈ పద్ధతివలని లాభమును ప్రపంచంలో చెఱకుపండే దేశాలు ఇదివఱకే గుర్తించి ఉపయోగిస్తున్నవి. నూటికి ౪౫ వంతుల చెఱకు తోటలు ఉత్తరఇండియాలో ఉన్నవి. ఆ కారణంచేత అక్కడి పరిస్థితులకు అనుకూలించునట్లు ఈకార్యాలయం చాలాసన్నని మొక్కలను తయారుచేయడానికి త్వరగా ప్రారంభించారు. అంటు మొక్కలను తయారుచేయడానికి ఇతరదేశాలవారికి చాలశ్రమ అయి నిండాకాలం

మైన చెఱకునందుకంటే నూటికి ౬౧ లేక ౪౧ వంతులు బెల్లం అధికంగా లాభించింది. ఇదివఱకు పైరుచేయుచుండిన చెఱకువల్ల పరిశ్రమాలయముల (ఫాక్టరీల)కు చాలానష్టము కష్టము కలుగుచుండిన బీహారురాష్ట్రంలో కోయంబత్తూరు చెఱకుమొక్కలు చాలాత్వరగా పంటకు వచ్చే లక్షణాలు కనుపడ్డవి. అందులో కొన్నిరకాలు ఆరువారాలకంటే ముందుగానే పరిశ్రమాలయమునకు తీసికొనిపోవుటకు తయారయ్యేవి.

పారిశ్రామికదృష్టితో చూస్తేమేని దేశీయమైన

౧ సంవత్సరమునకు ఇండియాలో దిగుమతి అగు చక్కెర-దాని విలువ




పట్టినా కోయంబత్తూరులో నాలుగేళ్లలోనే తయారుచేయగల్గినారు. అక్కడ ఈ క్రొత్తమొలకల పద్ధతిని క్రమంగా వృద్ధిచేసి ౧౯౧౮ సంవత్సరంలో మొట్టమొదట ఇండియాలోని అన్ని గవరన్మెంటు చెఱకుతోటలకు పంచిపెట్టినారు. ఉత్తరఇండియాలో కోయంబత్తూరు అంటుమొక్కలను ఉపయోగించిన గవరన్మెంటు చెఱకుతోటలవారంవలు తృప్తికరమైన ఫలితము నిచ్చినవని తెలిపినారు. పంజాబులో కోయంబత్తూరు మొక్కలతో పైరుచేసిన చెఱకునుండి దేశీయ

చెఱకుపంటకంటె ఒకవారము ముందుగ పంటకువచ్చే చెఱకయినను చాలలాభకరముగ ఉండును. త్వరగా పెరిగిపండే చెఱకురకాలను కనిపెట్టి పైరుచేయుటకు ఎక్కువసొమ్మును వ్యయపెట్టడానికి ఉత్తరఇండియాలోని పరిశ్రమాలయముల యజమానులు సిద్ధముగానున్నారని తెలియవచ్చుచున్నది. ఏలయన యుక్తకాలంలో పనిప్రారంభించి మితవ్యయంతో మంచిరకంవలన ఎక్కువగా ఫలంపొందడాని కనుకూలంగా ఉండును. ఇండియాలోని ౨,౭౫౧,౧౧౧ ఎకరములు విస్తీర్ణముగల

చెఱకుతోటలలోఁ౧,౭౫౧,౧౧౧ ఎకరములువిస్తీర్ణముగల చెఱకుతోటలు బీహారుసంయుక్తరాష్ట్రిలలో ఉన్నవి. వాన్నిబట్టియే ఉత్తరఇండియాలో కోయంబత్తూరు మొక్కల నగదువిలువ నిశ్చయించవచ్చును. సంయుక్త రాష్ట్రిలలోని 'తాగ్యా'లో అరడజను కోయంబత్తూరి కొత్తరకాలవల్ల అక్కడిరకాలవల్ల ఒకఎకరంలో ఉత్పత్తి అయ్యే బెల్లంకంటె ఎక్కువతూనికగల మంచిబెల్లం ఉత్పత్తి అయినట్లు కనుగొన్నారు. చెఱకు పెరిగే ఇతరదేశాల్లోకంటే ఇండియాలో చెఱకును పెంచుట చాలకష్ట సాధ్యమని చెప్పబడినను ఒకఎకరములో ఉత్పత్తి ఎక్కువగా కావడం స్పష్టంగా తెలియడంచేత కోయంబత్తూరి కార్యాలయ స్థాపనము వ్యర్థము కాలేదు. అక్కడ అనుసరించే పద్ధతులవలన చెఱకుపండే ఇతరదేశాల్లో కంటె నిస్సంశయముగా త్వరలో లాభము గలుగుతున్నది. ఈకార్యాలయము చెఱకుపైరు చేయు ప్రస్తుత విధానములకు నిలువగల సాహిత్యాన్ని సమకూర్చింది. అందులో కొన్ని కేవలం క్రొత్తత్రోవలుకూడా తీసినవి.

కోయంబత్తూరు కార్యాలయంలో ఉండే ప్రభుత్వమువారి ఇక్షు శాస్త్ర నిపుణుడు (Imperial Sugarcane Expert) చేయుచున్న పరిశోధనల ఫలితాలు ఇండియాలోను,విదేశాల్లోను అందరిదృష్టిని ఎక్కువగా ఆకర్షిస్తున్నవి. మరియు విదేశములలో ఇవేపద్ధతుల ననుసరించి కావించెడి ప్రత్యేక పరిశోధనల ఫలితములకు ఇవి సరిగా సరిపోవుచుండడం వింతగా ఉన్నది. మంచిరకమైన దళసరి చెఱకుమొక్కలను ఉత్పత్తిచేయడానికి బొంబాయి చెన్నపురరాష్ట్రిములలో ఇప్పటికింకా అట్టే ప్రయత్నించలేదు. అయితే ఈసంవత్సరం రెండురాష్ట్రిములలోను అందుకొరకు ప్రయత్నించి ప్రారంభం చేసినారు. ఇక్షు శాస్త్రజ్ఞుడు ఈక్రొత్త పద్ధతిలోను వెనుకటివానివలెనే మంచి ఫలితములే సమకూరగలవని గట్టి నమ్మకము గలిగి యున్నట్లు తెలియవచ్చుచున్నది.

---

## చిత్రలీలాస్తవము ౨

దుర్భా సుబ్రహ్మణ్యశర్మ గారు

ఒకచో మేఘుఁడవై వసుంధరను సస్యోపేతఁ గావింతు వొం
డొకచోఁ గూలుదు పల్లెలుం బురములుం బ్రోద్వేగకృత్ ఝంఝవై
వికటోచ్ఛిత్తియె యింపొ, కాక నిఖిలోర్వీగుప్తియే యింపొ, తా
వక సంకల్ప మెఱుంగ నేరికగు? దేవా, చిత్రచర్యానిధీ!

తరుణీ నందన బంధుమిత్త్రిలకు డెందానం దమిం గూర్చి, దు
స్తర మృత్యూద్ధతిఁ దద్వియోగము నవశ్యంభావి గావించి, యొం
డొరులం వీడఁగలేక వా రడలఁగా నుల్లాసివై కందు వీ
వర రే! యెంతదయార్ద్రిచిత్తుఁడవు, దేవా, చిత్రచర్యానిధీ!

ధనవంతుం గఠినాత్ముఁగా, నృపుని నిర్దాక్షిణ్యుఁగా, బుద్ధిమం
తుని నాచారవిదూరుఁగా, వరవదాన్యుం గైతవాన్వీతుఁగా,
నొనరం జల్పుదుగాని కూర్పవుగదా యోగ్యంబులం, దుష్టక
ల్పన నీకిట్టి యభీష్ట మేమిటికొ! దేవా, చిత్రచర్యానిధీ!

---

# పశుపతి పలయకోట్టయిపట్టగారు

మాగంటి బాపినీడుగారు, బి.యస్.సి. (కార్నెల్), యం.యస్.సి. (కాలిఫోర్నియా)

ఆంధ్రవ్యవసాయకళాశాల నిర్మాణ విచారణసంఘము కోయంబత్తూరు వ్యవసాయ కళాశాలయందు సమావేశమైనపుడు ప్రొఫెసరు బాలకృష్ణమూర్తి గారు ఈరోడ్డు దగ్గర కాంగియము పశువులను పెంచు పెద్ద రైతున్నాడనియు, అది తప్పక చూడవలసిన స్థలమనియు చెప్పినారు. ప్రధానమంత్రి సుబ్బరాయనుగారు విజయవాడ వేంచేసినపుడు కోయంబత్తూరుజిల్లాలో తన బంధువులొకరు వేలయెకరములు భూమిగల పెద్దభూస్వామి యనియు, అతడు పశువులను వందలకొలది విక్రయించుననియు, మీబోటి రైతులు తప్పక చూడదగిన రైతనియు చెప్పియున్నారు. వారే వీరని తెలిసికొని వెళ్ల నిశ్చయించుకొన్న బాలకృష్ణ మూర్తిగారు తంతినంపిరి.

రాయబహదురు నల్లతంబిసరకారయి మనరాదియరుగారు తన పలయకోట్టయిగ్రామమునుంచి యీరోడ్డుస్టేషనుకు తన మోటారు పంపిరి. ఈరోడ్డు మదరాసుకు242 మైళ్లదూరములోను, కోయంబుత్తూరుకు 20 మైళ్లదూరములోను, కూనూరు, ఉదకమండలము, బెంగుళూరుపోవుమార్గముల నడుమ నున్నది.

నేనును, నాతో వచ్చిన సింహళ దేశవిద్యార్థియు, కోయంబుత్తూరు కళాశాలనుండి వచ్చిన పశువైద్యులొకరును కలసిస్టేషనుకు 18 మైళ్ల దూరములో నున్న ఆగ్రామమును రాత్రి 8-30 గంటలకు చేరితిమి. మార్గమధ్యమున ప్రఖ్యాతికెక్కిన మెట్టూరుప్రాజెక్టుకు పోవురోడ్డు తగిలెను. అతిథిశాలయందు సామాను దించి ఆ గృహస్థుదర్శనము చేసితిమి. వారు ఆచుట్టుప్రక్కల మకుటములేనిరాజు; దక్షిణజిల్లాలలో గొప్ప రైతు తాలూకాబోర్డు ప్రెసిడెంటు. అతిథులకు అమిత మర్యాదచూపుటయేకాక స్వయముగా క్షేత్రములలో పచ్చికబయళ్లకు తీసికొనిపోయి చూపును. అతనికి ఇంగ్లీషురాదుగాని వ్యవహారనిపుణుడె మెందు. కార్యదర్శి సహాయముచే కార్యక్రమము కొనసాగించును. కోటలో నున్న గృహమువలె దిట్టమైన ప్రాకారములోనుండును.

మన పసుపతిపద్ధతులు, ఆపురాల్యవలు చూచిన పూర్వప్రభువుల సాంప్రదాయములుగల జమీందారుల కుటుంబములు జ్ఞప్తికివచ్చును. ఉదయమున పదిమంది వెట్టివాళ్లు 'ప్రభూ'యని వంగివంగిచేయుసలాములు, పెద్ద పశువులచావళ్లు, బండ్లు, గుఱ్ఱములు, భోజనసామగ్రియుండుకొటారములు, నౌకరులు, పరుగులెత్తు నౌకరులు, అన్నియు ప్రస్తుత బస్తీజీవనమునకు అలవాటుపడినవారికి ముచ్చటగ నుండును. పాపము మా మల్లెలసోదరులకుటుంబ మొకప్పుడు ఇట్లే యుండెగదా!

పూర్వచరిత్ర: రాయబహదురు నల్లతంబి సరకారయి మనర్రాదియరు సేలం, మధుర, తిరుచినాపల్లి, కోయంబుత్తూరుజిల్లాలలో, అనగా కొంగునాడునందు వెల్లాలసంఘమునకు మతగురువు. వెల్లాలసంఘము ఇచటి కమ్మ, కాపు, రెడ్డి మాదిరిరైతుసంఘము. సుబ్బరాయనుగారు రీసంఘమునకు చెందినవారే. 800 సం. క్రిందట మైసూరుసంస్థానమున సేనాధిపతులు. అప్పటినుంచియు వెల్లాలసంఘమునకు మతసాంఘికవిషయములందు గురువులైరి. వీరికి పశువులను పెంచుట కుటుంబాచారము, వృత్తి అయినది. పట్టగారు అనునది జ్యేష్ఠపుత్రునకు బిరుదుగా వచ్చుచుండును.

కోయంబుత్తూరు సేలంజిల్లాలలో కావేరి ఉపనదులున్నను మొత్తముమీద భూమి లంతసారవంతమైనవి గావు. కొండప్రదేశము; అచటచట రాళ్లమయము. అందినవారికి భూమి విరివిగా దొరకెను. పామరజనులలో పేదరికము మెండు. స్త్రీలదుస్తులు మనకూలిజనమువలె

గాక విచారము కలుగచేయు ఆశ్చర్యస్థితిలో నుండును. వ్యాఘత్వ మింకను ఆప్రాంతములందు ఎంతయో కలదు.

విస్తీర్ణము: మనరైతు 12000 ఎకరములకు భూస్వామి. ఇందు రెండువేల ఎకరములు (2000) కేవలము పచ్చికబీళ్ల క్రింద నుండును. 1500 ఎకరములలో జొన్న, రాగి, ఉలవ పైరుచేసెదరు. 200 ఎకరములు ప్రత్తి, 100 ఎకరములు పొగాకు పండించెదరు. కొన్నిచోట్ల కుటుంబమునకు వలయుమిర్చి, వరి, ఉల్లిపాయలు పండును.

ఈవిస్తీర్ణమున పట్టగారు మకుటములేనిరాజు. తనమాటే శాసనము. గ్రామాదులలో నుండు వారు కుటుంబమున కొక్కరు వంతులవీాద పట్టగారి పనిలోనికి వత్తురు. 300 మంది నౌకరులు, 15 మంది పెత్తనదారులు, ఒకమేనేజరు ఉన్న సిబ్బందినంతయు చాలవరకు తానే ఆతడు స్వయముగా చూచుకొనును. ఏపాశ్చాత్యుడో ఐన సిబ్బందిఖర్చు ఎంతయుండెడిదో!

పశువులదానాకొరకు ప్రతిసంవత్సరము 30000 రూపాయల విలువగల ప్రత్తివిత్తులు కొనెదరన్న, ఈక్షేత్ర మెంతయో తెలియగలదు. ప్రత్తివిత్తులు, వేరుసెనగ పిండి రుబ్బుటకు గానుగ లాడుదురు. వర్షములేని గతవత్సరములలో ఇరువదివేల రూపాయల గడ్డి, యిరువదివేల రూపాయలఉలవలు కొనుచుండెడివారు.

పశుజాతి-కాంగియము:—

పశువులను సాంప్రదాయసిద్ధాంతములవీాద పెంచు అలవాటు అంతగా ఆంధ్రులకు లేదు. మనకున్న ముఖ్యజాతులలో ఒంగోలు, లంబాడిజాతులు ప్రసిద్ధికెక్కినవి. దున్నపోతులలో విజయనగరముప్రాంతమున మన్నెపు



కాంగియము పశుపతి

రాయిబహదురు నల్లతంబి సరకారియిమనరాడియరు పలయకొట్టయి పట్టయిగారు, వెల్లాలసంఘమునకుకొంగు నాడులో మతగురువు; కాంగియము ఎద్దు. కాళ్లు, మోపురపు, నల్లరంగు ప్రత్యేకలక్షణము; ఖరీదు 2000 ఉండును.

పోతులు, గడ్డిపోతులు దొరకును. జాతియనగా ఆ సాంప్రదాయమునకు ప్రత్యేకలక్షణము లుండును. మనలో వివిధసంఘములు, జాతులు ఎట్లు ప్రత్యేకలక్షణములుకలిగియుండునో, పశువులలోను,పంటలలోను అట్లే కత్తిలేని బంగినపల్లి, జహాంగీరు ఎట్లు బజారురకములవలెగాక అంత చెరిగిన ప్రత్యేకగుణములు కలిగియుండునో, పశువులలోను సంకరజాతులు,ప్రత్యేకజాతులు ఉండును. ఉ. ఒంగోలు, మైసూరు, పుంగనూరు, కరాచీ మొదలైనవి. కాంగియముజాతి ఇట్లే ప్రత్యేకజాతి. పలయకొట్టయి కాంగియమునాడులో ఉన్నది.



కాంగియము ఆవు. మొదటిరకము. ఖరీదు 800.

కాన యీపశుజాతికి కాంగియమని పేరువచ్చెను. ఈజాతిఎద్లు, ఆవులు, గుర్రములు ప్రత్యేకలక్షణములు కల్గియుండును. అవేవి?

మనప్రాంతమునకు మైసూరు ఎద్లు వచ్చును. వాటిలో కొన్ని కాంగియం ఎద్లుండును. మదరాసులో కూడ వానిని జూతుము.

కాంగియముకూడ పుట్టగనే ఎరుపురంగుకలిగి, కాళ్లు, కడుపు తెల్లగా ఉండును. మూడునెల లయిన పిమ్మట బూడిదరంగుగా మారును.

ఎద్దుకు తల,కాళ్లు, మూపురము నల్లగానుండును. ఈజాతికి ప్రత్యేకలక్షణము లివి. మగతనము నశింపగానే నలుపుమారి తెలుపెక్కును.

6 నెలలదూడిఆవు కనుబొమ్మలమట్టు నల్లరంగు వచ్చి యీనిన 60 రోజులకు పోవును. ఇవి యీజాతిప్రత్యేకలక్షణములు.

కష్టమునకు ఓర్పుట, శరీరపు బిగి తక్కువమేత, ఎక్కువపని, పొడుగైన గట్టి ఎముకలు, 20 సంవత్సరములైనను కాళ్ల తీరు మారకుండుట అను నివి కొన్నిముఖ్యలక్షణములు బరువు లాగుటకు, మోట తోలుటకు వీటికి పెట్టినదిపేరు.

మన పశుపతి ఏడుతరములలో ఒకరంగు, చిన్నని కొమ్ములు, బిగిశరీరము, గట్టి ఎముక ఉండునట్లు మార్పు లేగల్గెను.

ఇవి పాలకు అంతగా పనికిరావు. పాడి వీరి అవశ్యమే కాదు. అమెరికాలో ఏశ్రైతైనను పశువులను పెంచిన, ఉద్దేశ ముండును. వెన్నవర్తకుడు వెన్న ఎక్కువ నిచ్చు జాతినే కొనును. పాలు విక్రయించువాడు పాలు విశేషముగనిచ్చు జాతులనే పెంచును. అంతేగాని మనవలె పనికిరాని పంచను పోషుచేయరు. ఈ పట్టగారు కూడ ఈపరిశ్రమ, పాడి ఒకేజాతియందుండుట అరుదనియు, లాభకారి కాదనియు తెలిసికొని, పనిచేయు లక్షణములకే పశువులను తయారు చేయుదురు.

జాతిని వెంపొందించువిధానము:—

ఉచితలక్షణము లన్నియున్న అసలైనకాంగియము అబోతు నొకదాని చేరి, 50 కాంగియము ఆవులతో ఆరునెలలు ఒక చీటిలో నవలెదరు. దూడియావులను విడదీసి యీచుకొనిపోకుండ వేర్వేరు బయళ్లలో నుంచెదరు. చెట్లనీడతప్ప పందిళ్లుగాని పాకలుగాని ఉండవు. ఎండవానలకు అవి ఓర్చుకొనును. అవి ఈనుటకూడ ఆబయళ్లలోనే. కాపరి చూచుచుండును. పదిదూడలను పరీక్షించి, తండ్రిలక్షణములన్నియు వాటియందు స్పష్టముగ నున్న (prepotency) ఆబోతుగా నుంచుకొనెదరు. ఆబోతులకు పనికిరానివాటినన్నిటిని ఎద్లుగా విక్రయించెదరు.

పట్టిగారికి తన పశుగణమునందలి ప్రతిదూడ దేనికి పుట్టినదో, అట్లే అన్నిటిసాంప్రదాయము తెలిసియుండును. సాంప్రదాయసిద్ధాంతముమీదనే ఆతడు పశువృద్ధిచేయును. అందుచే తనపశువులశక్తిలక్షణములు ఆతనికి తెలిసియుండును. కల్తీకలిసిన కాంగియము జాతిగుణము లుండవు. ఏకసంతతి కలయిక (inbreeding) లేదు. మూడవయేట ఆబోతు దాటనిత్తురు. 8–వ సంవత్సరము నుంచి పుంస్త్వము కృశించును. అంత వానిని దుక్కి ఎద్దులలో చేర్చెదరు.

పాలంవీూవ పశువులమొత్తము 2000 ఉండును. వీటిఖరీదు 500,000 రూపాయలకు మించును. ప్రతి సంవత్సరము రు. 50,000 ఖరీదుగల పశువులు విక్రయించబడును. అమ్మకమునకు 15 ఆబోతులు గలవు. మంచివి రు. 2000 వరకుఅమ్మును. 500 ఎద్లు, 200 పైనఆవులు గలవు.

పశువులను చక్కగ పెంచుట మనదేశమున కానిపింపదు. పట్టిగారు వీటినన్నిటిని స్వయముగాజూచును. వయస్సును, రకమునుబట్టి వేరువేరుబీళ్లలో వీటిని పెంచె



కాంగియము పశువులు. ఆబోతు, ఆవు.

బాడికి, మోటకు ప్రసిద్ధికెక్కినవి. తక్కువమేతతో ఎక్కువ పనిచేయును. పత్తివిత్తులు గానుగలో రుబ్బెదరు

పడలయి వ్రేలాడుచర్మము, పందమతి,లోతుకళ్లు ఇవిపట్టిగారి సిద్ధాంతముప్రకారము పురుషత్వముపోయిన ముసలిదాని లక్షణములు. సంవత్సరమునకు సగటున ఒక్కొక్క ఆబోతు 100 ఆవులను దాటగలవట.

తరములబడి వీరిచరిత్ర వివరముగా వ్రాసియుంచిన బాగుండెడిది. అట్లు జరుగుట మంచిదని యిచ్చిన సలహా నందుకొనెను.

దరు. రోగనివారణోపాయము లుండును. ఆరోగ్యపద్ధతులును ఆచరణలో నుండును.

అమెరికాలో తప్ప ఇన్ని పశువులను, ఇంత చక్కగా పెంచుట మరెచటను చూడలేదు. మాతాతల నాటి కాలమున, కొల్లేటిలో ఇంజనులులేని దినములలో ఆవులమందలు జ్ఞాపక మున్నదిగాని యిట్టి నేత్రోత్సవమిచ్చు ఆబీళ్లు, స్వాతంత్ర్యము ననుభవించి, స్వభావ

సిద్ధమైన మేత తిని, గాలిపీల్చుచు, అధికారి అంబా యని పిల్చిన శ్రీకృష్ణుడు పిల్లనగ్రోవికి చేరినట్లు చేరి, చెవరించిన లేళ్లవలె గంతెత్తు దృశ్యమును మరచుటను



తిరుపూరుసంతలో మొదటిబహుమతిపొందిన ఎద్దు.

గాంచియుండలేదు. పశువుల బీళ్లలో గోపాలునితో బండిమీద ప్రయాణము, ప్రసూత్యాలయమువలె లేగలు, ఆవులునుండు దొడ్డి, మృగరాజుమాదిరి ఆయావుల మధ్య ఆబోతు, ఆకలి ఎరుగక గంతులెత్తు ఆసూడలు, వాటి తిండిని రుబ్బుటకు ఆగానుగలు, నీటికి నూతులు, బారులు దీర్చిన కట్టుగుంజలు, రకములవారి కంపార్టుమెంటుల బీళ్లు–ఎంత కన్నుల పండువుగ నుండునో కనువారికి గాకపాఠకులకు తెలియజాలదు. స్థానిక సంఘములలో నామినేషనులు, భిక్షమునకు తోడిరైతు లెంతమంది ఈరోడ్డుమీదుగా ఉదకమండలము ఎన్నిసార్లు వేలకువేలు వ్యయముచేసి పరువులెత్తి యుండలేదు. కాని యిట్టిరైతుల పుణ్యస్థలమగు యాత్రచేయుటకు నోచుకొనరైరి. రైతుసోదరులందరు ఒకసారి యీ యాత్రచేసి ధన్యు లగుదురు కాకయని ప్రార్థన.

వీరిని ఆదర్శముగా గైకొని ఆంధ్రదేశమందును ఇట్టిక్షేత్రములు స్థాపించుటకు హెచ్చరించుచున్నాను. రైతులలో పరిశోధకులు లేకపోలేదు. ఇదివరకు వగహాపట్టణమందు (కైకలూరుతాలూకా) కామినేని పట్టాభిరామయ్యగారు అపరాళ్ల విత్తులలోను, కళ్లిచిట్టి అబ్బాయినాయుడుగారు ఎరువులలోను, కానూరి వేంకటాచలపతిగారు సరుకుడుమొక్కలు మరికొన్ని పంటలలోను కొంతపరిశోధన గావించియున్నారు.

ఆంధ్రదేశములందు రైతాంగ మభివృద్ధికి రావలెనన్న రైతులలో స్వయంపరిశోధన సామర్థ్యము పుట్టవలెను. వ్యవసాయశాఖమీద ఆధారపడిన లాభములేదు. జమీందారులు కోడిపందెములలోను, కోర్టులలోను, బోర్డులలోనుమునిగి గుటకలువేయుటకంటె ఆపర్యప్రాయముల గు నిట్టి పశుక్షేత్రములను నెలకొల్పి ధన్యులగుట మంచిది గాదా. విశేషముగ భూమిగల్గి, అవకాశములుగల రైతు సోదరులును మేల్కొనుట దేశక్షేమముగదా!

# హృదయావేదనము

జనమంచి సీతారామస్వామి గారు

ఎందఱు నన్ను మెచ్చిన, మహీస్థలి నెంతటిగౌరవంబు నే
నందిన, నెన్నిసంపదల నందిన, విద్యలవెన్ని నేర్చినన్
డెందము నీపయిన్ నిలుపనేరనిచో బ్రదుకెల్ల వ్యర్థమౌ
నందము సున్నగావున మనంబును సాధ్యముఁ జేయు మీశ్వరా!

జనని యురఃస్థలంబునను జక్కఁగఁ దా శయనించి నిద్దురన్
దనువును సర్వమున్ మఱచి ధన్యతగాంచెడు బిడ్డపోలికన్
మనసును భక్తిలోఁ జొనిపి మైమఱ పొందెడువాఁడె ధన్యుఁ డౌ
ననుపమ సౌఖ్యమన్నమఱి యాతనిదే యనఁ జొప్పు నీశ్వరా!

ఏపలుకాడఁగూడదొ యెఱింగియు నాపలు కాడుచుండి, నే
నేపని చేయఁగూడదొ యెఱింగియు నాపని చేయుచుండి, సం
తాపముఁ జెందుదున్ బిదప నాయవివేకముఁగూర్చి; కాని, నన్
రేఁపెడిఁ దొంటియట్టుల యరిప్రకరం బదియేమొ, యీశ్వరా!

జననీగర్భమునందునుండి యిలపై జన్మించు నవ్వేళ బో
రున నే నేడ్చితి వద్దు జన్మమని వాక్రువ్వన్ సమర్థుండఁ గా
నని భావించియొ; కాని నీకు దయలేదయ్యెన్ జగన్నాయకా
నను సంసారమహాబ్ధిఁ ద్రోచితి విదేనా ధర్మమన్నన్, ప్రభూ!

మనుజుఁడు పూర్వజన్మమున మానక చేసిన దుష్టకర్మముల్
పొనరుచు దుఃఖసంచయముఁ బొందుట తప్పదె యిప్ప డట్టులై
న, నిఁక భవత్పవిత్రతరనామజపాచరణంబుగూడ ము
క్తి నొసఁగఁజాలదన్న యపకీర్తికిఁ బాల్పడకుందువే ప్రభూ ?

---

వెనుకటి సంచికలోఁ బ్రకటింపఁబడిన పద్యములలో "గుణరూపంబులు నీకు లేవనుచు" అను మత్తేభవృత్తము నందలి చతుర్థపాదముగా "నాకేమంచు నుపేక్ష సేయక జగన్నాథా, ననుం బ్రోవవే" అను శార్దూలవృత్తపాదము పడినది. అది గొప్ప ప్రమాదము. దానిని "మనకేమంచు నుపేక్ష సేయకు జగన్మాన్యప్రభూ, రక్షకా" అని సవరించుకొనుఁడని పాఠకుల నందఱను బ్రార్థించుచున్నాను.

యుగధర్మంబులు మార్చుకొందువుగదా యుల్లాసివై ప్రోడవై
తగిన ట్లీవు మహాత్మ; కర్మఫలముల్ దప్పించలీలావిశే
షగతుల్ మాత్రము చూపవేల కట! పశ్చాత్తాపసంతప్తు నె
న్వగలం దీరిచి వే కృతార్థు నొనరింపంగూడదే యీశ్వరా!

పుట్టిననాఁటనుండియును బొట్టకు బట్టకె దేవులాడునే
నెట్టులు నిన్నుఁ గొల్వఁగల? నెప్పుడు హాయిగ నుండుఁ బ్రాణమి
క్కట్టులఁ బాసి? నీపరమకారుణికత్వముఁ జూపవేల? నీ
విట్టు లుపేక్షచేసిన మఱెవ్వరు ప్రోతురు నన్ను రక్షకా!

యోగిని జూచినట్టితఱి యోగిగఁ గాలముఁ బుచ్చఁగోరుదుర్
భోగిని జూచినట్టితఱి భోగమునందె యపేక్ష గల్గెడిన్
త్యాగిని జూచినట్టితఱిఁ ద్యాగమె మేలని తోఁచు నక్కటా!
యేగతినైన సుస్థిరత యించుక గాంచదు చిత్త మీశ్వరా!

భాగవతాది సుప్రథితభక్తిసుధారస పూర్ణకావ్యముల్
బాగుగ నిచ్చలుం జదువువాఁడ ననిర్వచనీయహా ముదం
బేఁ గనువాఁడఁ గాని మది నింకను నిశ్చలభక్తి లేదయో!
యేగతి నీభవాబ్ధిఁ దరియింపఁగ నోపుదునయ్య, యీశ్వరా!

వారిజనాభుఁడో శివుఁడొ బ్రహ్మయొ యెయ్యది నాకు నిష్ట మా
పేరను నిన్నుఁ బిల్చుచును వేఁడుచు మ్రొక్కుచు దుస్సహాంపుసం
సారమహార్తిఁ బాపుకొన సంతతముల్ జతనంబు సేయుదున్
భారము నీదె యింక ననుఁ బారముఁ జేర్పఁగ దీనరక్షకా!

---



3. రంథంభోరు కోట



४. గాగ్రోను కోట



౫. చిత్తూరుకోట



౬. మోధపురపుకోట, రాచనగరు

# మంగళేశ్వరుఁడు

యస్. వెంకటరమణయ్య గారు

౧

ఈతఁడు బాదామిపురమును రాజధానిగ నేర్పఱచుకొని కర్ణాట కుంతల కొంకణ దేశముల నేలిన పాశ్చాత్యచాళుక్యరాజులలో నైదవవాఁడు. ఈతనిచరిత్ర మీఁ్రకింది శాసనములవల్ల దెలియుచున్నది.

(౧) బాదామిగుహాలోని శిలాశాసనము [1] (౨) నేరూరుతామ్రశాసనము [2] (3) మహాకూట శిలాస్తంభశాసనము. [3]

ఈమూఁడును మంగళేశ్వరుని శాసనములు. ఇవిగాక:

(౪) రెండవ పులకేశియొక్క అయ్యవొళెశాసనమును, [4] (౫) ఆరవ విక్రమాదిత్యుని ఏవూరుశాసనమును [5] మంగళేశ్వరునిచరిత్రమునకు సంబంధించిన కొన్ని ముఖ్యాంశములను తెలియజేయు చున్నవి.

తనవంశమునుగూర్చి మహాకూట శిలాస్తంభశాసనమున మంగళేశ్వరు డిట్లు చెప్పుకొని యున్నాఁడు. మానవ్యసగోత్రుఁడును హారితిపుత్రుఁడును చళిక్యవంశసంభూతుఁడును నగుజయసింహుఁడను నరపాలుఁ డొకఁడుండెను. ఆతనిపుత్రుఁడు రణరాగుఁడు. ఆ రణరాగుని తనయుఁడు సత్యాశ్రయ శ్రీపృథివీవల్లభ రణవిక్రమాంకుఁడు. (ఈతనికి మొదటి పులకేశి యనుపేరును గలదు). ఈతని కిరువురుపుత్రులు బలభద్రవాసుభద్రులను బోలువారు కీర్తివర్మ మంగళేశ్వరు లనువారు జననమందిరి.

కీర్తివర్మయు మంగళేశ్వరుఁడును ఒక తల్లిబిడ్డలుగారు; చవతుల బిడ్డలు. ఈ విషయము మహాకూటశాసనములోని యీఁ్రకింది వాక్యమువల్ల దెలియుచున్నది.

"తస్యధ [ర్మ్మ]రతబుద్ధేర్వ్వసుదేవ ప్రతిమప్రభావస్య బలవాసుభద్రోపమగుణౌ సుతౌ సముత్పన్నౌ జ్యేష్ఠ [ః] శ్రేష్ఠగుణ సముదయోదిత పురురణవిక్రమాఙ్కప్రియః......కనీయాన్ ఉరురణవిక్రాన్త మంగళేశ శ్రీపృథివీవల్లభేన్ద్రాభిఖ్యనృపో బభూవ"

"ఆధర్మ్మరతబుద్ధికి వసుదేవునితో సమమగు ప్రభావము గలవానికి (రణవిక్రమునకు) భలభద్రవాసుభద్రులతో తుల్యమైన గుణము గలవారలు పుత్రులు ఇరువురు పుట్టిరి. అందు శ్రేష్ఠములగు గుణములచే నతిశయించినవాఁడు పురురణపరాక్రమాఙ్కుఁడు. జ్యేష్ఠుఁడు ఉరురణ విక్రాన్త మంగళేశ శ్రీపృథివీవల్లభేంద్రుఁడనురాజు కనిష్ఠుఁడును అయిరి."

"సదయస్త్రీమివ మహాపతివ్రతాం బట్వాగకులలలామభూతాం నైకవిధధర్మ్మ ఫలభాగ్యపవిత్రీకృత

1. Ind. Ant. X, P. 59.
2. ,, VII, P. 161.
3. ,, XIX, P. 7.
4. E. Ind. VI, P. 1.
5. Ind. Ant. VIII, P. 114.

శరీరాం స్వగురుపత్నీం దుర్లభా నామధేయాం దేవీ మాహూయ."

"మదయన్తిని బోలు మహాపతివ్రతను, బట్వారికులముయొక్క నొసటిమాణిక్యమును అనేకవిధములగు ధర్మకార్యముల ఫలముచే పవిత్రము సేయబడిన దేహముగలదానిని దుర్లభయను నామధేయము గలదేవిని తన తండ్రి భార్యను పిలచి."

ఈవాక్యములపై ఫ్లీటుగారిట్లు వ్యాఖ్యానము చేసియున్నారు:

"అతడు (మంగళేశ్వరుఁడు) మొదటి కీర్తివర్మకు చవతితల్లి గర్భమునఁ బుట్టిన తమ్ముఁడు. ఏలన యీశాసనముయొక్క ౧౩వ పంక్తిలో దుర్లభదేవిని "స్వమాతరం" అనక "స్వగురుపత్నీం" అని సంబోధించియున్నాఁడు. ౫వ పంక్తిలో తండ్రి వసుదేవునితోడను తనయులిరువురను బలభద్రవాసుభద్రులతోడను బోల్పఁబడియుండుటయు నట్లే సూచించుచున్నది. వసుదేవునికి (=రణవిక్రమునకు) రోహిణి (=దుర్లభదేవి) ని, దేవకి (=?)యు నను నిద్దరు భార్య లుండిరి. బలభద్రుని లేక బలరాము (=మొదటికీర్తివర్మ)ని ప్రథమమున దేవకియే గర్భమున ధరించినను,పిమ్మట నామె గర్భస్థమగు పిండమును యోగమాయ నేర్పుతో మెల్లన తిగిచి రోహిణి కడుపున నిడియెను. తత్కారణమున బలభద్రుడు రోహిణి గర్భమునుండి యుదయమాయెను. అతని తమ్ముడు వాసుభద్రుడు, వాసుదేవుడు, లేక కృష్ణుడు (=మంగళేశుఁడు) దేవకి గర్భమున జన్మించెను. (కాబట్టి బలభద్రుఁడును వాసుభద్రుఁడును అనగా కీర్తివర్మయును మంగళేశ్వరుడును సవతులబిడ్డలు). పురు రణపరాక్రమ ఉరు రణవిక్రాన్త అను బిరుదములలోని 'పురు' 'ఉరు' శబ్దములు ఈవిషయమునే సూచించినను సూచింపవచ్చును. బాదామిగుహాశాసనమున మంగళేశునకు "రణవిక్రాన్తుడ"ను బిరుదుమాత్ర మున్నట్లు చెప్పబడియున్నది. ఇచ్చట పై బిరుదములలోని "పురు" "ఉరు" శబ్దములు కీర్తివర్మ మంగళేశ్వరులభిన్నమాతృత్వమును చూపుటకై తెచ్చి పెట్టుకొన్నట్లున్నవి. సెంటుపీటర్సు బర్గనిఘంటువు ప్రకారము "అధికము" "అనేకము" నను నర్థముగల "పురు" అను వైదికపదము, ఇతిహాసములలోను తరువాతి వాఙ్మయమునందును నామపదములకు (Proper names) ముందు కనిపించుచున్నదనియు; ప్రాతవియును, అసాధారణములును నగు పదములపై యభిమానముగల భాగవతపురాణ కర్త వీని నిట్లే ప్రయోగించి యున్నాడనియు నాకు దెల్పుచు ఈయన్నదమ్ము లిద్దరును చాళుక్యవంశపుకుమారులగు 'పురు', 'ఉరు' అనువారలకు బోల్చబడి యుండురని ప్రొఫెసరు కీలుహారన్‌గారు చెప్పిరి. ఇందువల్ల మంగళేశుని కాలమున "పురు" శబ్దమును విశేషణముగ బ్రయోగించుటకు వీలుకాదని తేలుచున్నది. కాబట్టి యదియొక నామపద (Proper noun మని తెలిసికొన వలయును. "పురు" శబ్దమునకు సమముగ "ఉరు" శబ్దమునకు గూడ నట్లే యర్థము చేసుకొనవలయును. అయితే "పురు""ఉరు" అనువారలు చవతితల్లి బిడ్డలో కారో నేను చెప్ప జాలను."1

ఫ్లీటుగారి చర్చనుబట్టి చూడగా కీర్తివర్మయు మంగళేశ్వరుడును సహోదరులు కారనియు, సవతులబిడ్డలనియు తేలుచున్నది.

### మంగళేశుని రాజ్యాభిషేకము

మొదటి పొలకేశి మరణానంతరము మొదటి కీర్తివర్మ రాజ్యము చేసెను. ఆతని మరణానంతరము మంగళేశ్వరుని రాజ్యాభిషేక మహోత్సవము జరిగెను. అయితే యీ రాజ్యాభిషేకము జరిగిన దెప్పుడు? ఈప్రశ్నకు సమాధానము చెప్పుట సులభమైనపని

1. Indian Ant. Vol. .XIX.P.7

కాదు. ఏలన, మంగళేశునిరాజ్యాభిషేకకాల నిర్ణయము చళుక్యులచరిత్రలోని గూఢతమ మగు సమస్య. ఈ పైప్రశ్నకు మంగళేశుని కాలపు శాసనములు మూడువిధము లగు సమాధానము లిచ్చుచున్నవి.

౧. బాదామిగుహాశాసనమునం దిట్లు చెప్పబడి యున్నది:

"శ్రీమంగళీశ్వరో రణవిక్రాన్తః ప్రవర్ధమానరాజ్యసంవత్సరే ద్వాదశే శకనృపతిరాజ్యాభిషేక సంవత్సరే ష్వతీతేషు పఞ్చాసు శతేషు" "మహాకార్తికపౌర్ణమాస్యాం." ఇత్యాది.

దీనినిబట్టిచూడ మంగళేశ్వరుడు శకాబ్దము ౫౦౦ నాటికి ౧౨ సంవత్సరములు రాజ్యముచేసియుండె నని తెలియు చున్నది. కాబట్టి అతనిరాజ్యాభిషేకసంవత్సరము శకాబ్దము ౪౮౮ లో ననగా క్రీ. శ. ౫౬౬-౬౭ సంవత్సరమున జరిగెనని తెలియుచున్నది.

౨. మహాకూటశిలాస్తంభ శాసనమునం దిట్లున్నది:

"ఉత్తరోత్తరప్రవర్ధమానరాజ్య పఞ్చమశ్రీవర్షే ప్రవర్ధమానే సిద్ధార్థే వైశాఖపౌర్ణ మాస్యాం."

ఇందువల్ల మహాకూటశాసనము మంగళేశ్వరునిరాజ్యకాలమునఐదవసంవత్సరమునకు సరియగు సిద్ధార్థివర్ష వైశాఖపౌర్ణమాస్య నాడు వ్రాయించినట్లు తెలియుచున్నది. అయితే మంగళేశ్వరుని రాజ్యపఞ్చమశ్రీవర్షమునకు సరిపోవుశకాబ్ద మిందు చెప్పబడలేదు. కాబట్టి యీశాసనకాలమును నిర్ధారణ సేయుటకు వీలులేదు. బాదామిగుహాశాసనమున వచించినట్లు మంగళేశ్వరునిరాజ్యారంభము శ. ౪౮౮ సంవత్సరమైనయెడల మహాకూట శాసనము శ. ౪౯౩లో చెక్కించి యుండ వలయును.

వాస్తవము విచారించిచూడ నిది బాదామిగుహాశాసనముకంటెను నేరూరు తామ్రశాసనముకంటెను తరువాతిదిగా తోచుచున్నది. బాదామిగుహాశాసనమున మంగళేశ్వరుని శౌర్యధైర్యాదిగుణములు గణింపబడినవి గాని యాతనిచే జయింపబడిన దేశములు గాని పరాజితు లగు శత్రువులుగాని పేర్కొనబడియుండలేదు. నేరూరుతామ్రశాసనమున తాను శంకరగణునిపుత్రుని గజతురగపదాతి కోశబలసంపన్నుని బుద్ధరాజును వెడలనడచితి ననియు చళిక్యవంశ్యసంభవుని పదునెనిమిది యుద్ధములయందు గెలుపుగొన్న ప్రోడను స్వామిరాజును హతము చేసితిననియు చెప్పకొనియున్నాడు.

"తేన రాజ్ఞా శంకరగణపుత్రం గజతురగపదాతి కోశబలసంపన్నం బుద్ధరాజం విద్రావ్య చలిక్యవంశసంభవం అష్టాదశ సమరవిజయినం స్వామిరాజంచ హత్వా" ఇత్యాది.

మహాకూటశిలాస్తంభశాసనమున తాను ఉత్తరదిగ్విజయముజేసి పైబుద్ధరాజు నోడించి, యాతనిధనమును సర్వమును గ్రహించి; అటు పిమ్మట భాగీరథీకూలమున దనశక్తిజయ స్తంభమును నిలుపగోరి, మొదట ధర్మజయ స్తంభమును నాటుట మేలని తలచి మకు టేశ్వరనాథునికి దనమారుతల్లియగు దుర్లభ

దేవిచే భూదానమును చేయించితినని చెప్పుకొనియున్నాడు.

"సముత్తరదిగ్విజయకృతబుద్ధి ర్బుద్ధరాజు మునిజిత్యలేస్య నముము శేష ముపగృహ్య భాగీరథీసూలేశక్తిజయస్తంభనిరోప ణోత్సుక్యేన మనసాహవమ్మకా జయస్తంభశక్తిః ప్రసమతర మేవ నిరోపయితవ్యే త్యనన్యత్యే తదనుకరణమోగభూతాం మువయస్తీమిజ మహాపతివ్రతాం బట్బూరకుల లలామభూతాం నైకవిధధర్మఫలభాగ్యపవిత్రీకృతశరీరాం స్వసురుపత్నీం దుర్లభనామధేయాన్ దేవీ మాహూయ."

ఈబుద్ధరాజు కలచుర్యారివంశజుడని యీ శాసనములోని ౧౩-వ పంక్తివలన తెలియుచున్నది.

ఇందువల్ల తెలియున దేమన :

బాదామిగుహాశాసనకాలమువఱకు మంగళేశ్వరునకు ప్రఖ్యాతిగల శత్రువులతో పోరాటము కలుగలేదు. బాదామి నేరూరుశాసనకాలములమధ్య కలచుర్యారిబుద్ధరాజును చాళిక్యస్వామిరాజును కలసియో వేరువేరుగనో మంగళేశ్వరునిరాష్ట్రముపై దాడివెడలిరి. ఇరుతెగలకును పోరు సమకూరెను. ఈ యుద్ధమున స్వామిరాజు హతుడయ్యెను. బుద్ధరాజు పరాజితుడై పలాయన మొనర్చెను. నేరూరుమహాకూటశాసనములమధ్యకాలమున మంగళేశ్వరుడు కలచుర్యారిరాష్ట్రముపై దండువెడలి బుద్ధునిపరాఙ్ముఖునిచేసి వాని సర్వస్వమును హరించెను.

కాబట్టి మహాకూటశాసనము నేరూరుశాసనమునకు పిమ్మటను నేరూరుశాసనము బాదామిశాసనమునకు బిమ్మటను లిఖింపబడినవి. అనగా మంగళేశ్వరునిశాసనములలో బాదామిశాసనము మొదటను, నేరూరుశాసనము దానికి దరువాతికాలమునను మహాకూటశాసనము కడపటను వ్రాయింపబడినవి.

మఱియు మహాకూటశాసనము ప్రవర్ధమానరాజ్యపఞ్చమ శ్రీవర్షమునకు సరియగు సిద్ధార్థిసంవత్సరపు వైశాఖపౌర్ణమాస్యనాడు నెలకొల్పబడినది. మంగళేశ్వరుని రాజ్యకాలమున (శ. ౪౮౮-౫౧౩) నొక సిద్ధార్థిసంవత్సరము వచ్చినది. ఫ్లీటుగారి లెక్కప్రకారము అది శ. ౫౨౫కు సరిపోవుచున్నది. అంతకు పూర్వపు సిద్ధార్థి శ. ౪౬౫న వచ్చినది. మంగళేశ్వరుని రాజ్యారంభము శ. ౪౮౯ అగుటచేత నతనిరాజ్యకాలమందలి సిద్ధార్థి శ. ౫౨౫నకు సరియైనదిగానే యుండవలయును. కావున ఫ్లీటుగారు మహాకూటశాసనకాలము శ.౫౨౫ అని సిద్ధాంతీకరించిరి. శ. ౫౨౫ మంగళేశ్వరునిరాజ్యపఞ్చమశ్రీవర్షమైన అతడు శ.౫౨౦న సింహాసనారోహణము గావించియుండవలయును. బాదామిశాసనము రాజ్యాభిషేకవర్షము శ. ౪౮౯ అనుచున్నదిగదా! కాబట్టి యీరెండుశాసనములును ఒకదానితో నొకటి విరోధించుచున్నవి.

(3) ఇంతేకాక కొందఱిమతానుసరణమున సత్యాశ్రయధ్రువరాజయింద్రవర్మగోవాశాసనము[1] శ. ౫౩౨నకు సరిపోవు మంగళేశ్వరుని ౨౦-వ రాజ్యవర్షమున లిఖింపబడినది.

---

1. Jr. Bom. R. ౧,S.X. 365-6.

కాబట్టి మంగళేశ్వరుడు శ. ౫౧౨ మొదలు రాజ్య మేలనారంభించె నని భండార్కారే త్యాదు లనుచున్నారు. బాదామి గుహా శాసనమున రాజ్యారంభము శ. ౪౮౯ అని చెప్పబడియున్నదే యన్న దానికి సమాధాన మిట్లు చెప్పుచున్నారు. శాసనమున మంగళేశ్వరుడే శ. ౫౦౦ లో రాజ్యము సేయుచున్న ట్లున్నను వాస్తవముగ నప్పుడాతడు రాజు గాడు. ఆతనియన్నయగు కీర్తివర్మయే అప్పుడు రాజ్యము సేయుచుండెను. మంగళేశ్వరు డాతనియన్నకు సహాయభూతుడుగ నుండెను. గుహను ఖననముచేసి విష్ణువునచ్చటస్థాపించిన ఫలము తనయన్నదని మంగళేశుడు బాదామి శాసనమున చెప్పుకొని యున్నాడు. కాబట్టి కీర్తివర్మ యప్పటికి బ్రతికియున్నాడనుట నిక్కము. అతనిరాజ్యకాలము శ. ౫౧౨ తో పరిసమాప్తి నందెను. అప్పటినుండియేమంగళే శ్వరుని రాజ్యకాలము పరిగణింపబడవలయును.

పైన జెప్పినరీతిని చరిత్రకారులు మంగ ళేశ్వరుని రాజ్యాభిషేకసమయ నిర్ణయమును గూర్చి భిన్నాభిప్రాయులై యున్నారు. నిజము తెలుసుకొనుమార్గ మేమైన నున్నదో కను గొనవలసి యున్నది. బాదామి గుహాలోని శాసనమున జెప్పినట్లు మంగళేశ్వరుని రాజ్యా భిషేకము శ. ౪౮౮-౮౯ లో జరిగియుండు టయే నిక్కమని నాకు దోచుచున్నది. అందు మంగళేశ్వరుడు తాను రాజ్యము చేయునట్లు చెప్పుకొనియుండుట అందరును అంగీకరించిన విషయమే. గుహను ఖననముచేసి విష్ణ్వాలయ మును స్థాపించిన ఫలము తన యన్నదన్నంత మాత్రముననే యాతడప్పటి కింకను బ్రదికి యుండెనని తేలదు. చనిపోయిన పిమ్మటగూడ నతనికాఫలము చెందవచ్చును. దేవాలయము నిర్మాణముచేసి దేవుని స్థాపించి తత్ఫలమును తన యన్నమీదభక్తిచేత ఆతనికి చెందునని తలచి యట్లు చెప్పినాడు. కావున నీవాక్యము నాధారపరచుకొని కీర్తివర్మ శ. ౫౦౦ నాడు బ్రదికియుండెననియు అప్పుడాతనికి మంగళేశ్వ రుడు సహాయభూతుడుగ మాత్రముండెనని యు చెప్పుట కవకాశము లేదు.

సత్యాశ్రయ ధ్రువరాజ ఇంద్రవర్మయొక్క గోవాశాసనము నాధారమును చేసుకొని శ.౫౩౨ మంగళేశ్వరుని ౨౦వ రాజ్యవర్ష మనియు కాబట్టి యాతని రాజ్యాభిషేకము శ. ౫౧౨-౧౩ లో జరిగియుండవలయుననిపెద భండార్కారనుచున్నాడు. ఇట్టి యభిప్రాయ మున కెడమేమియు లేదని ఫ్లీటుగారు వచించిరి

“గోవాశాసనమునకును మంగళేశ్వరుని రాజ్యాభిషేకమునకునెట్టిసంబంధమును లేదు.” కారణము లేవియన:

(౧) గోవాశాసనమున కాలమును సూచించు భాగము శాసనాంతమున నుండు నొకవిడివాక్యము. ఇట్లు శాసనాంతమున విడి వాక్యమున తమ రాజ్యకాలమునుసూచించుట గాని గోవాశాసనమున నున్నట్లు వర్తమాన రాజ్యవర్షమును జెప్పుటగాని సార్వభౌములగు నృపాలురకు మామూలుకాదు. ఇట్టి శాసన మింకొకటిమఱి ఏకాలమునగాని యివ్వబడెనని

నిశ్చయించిచెప్పుటకు వీలులేదు. అందుముఖ్యముగ గోవాశాసనకాలమున లేదు. ఇంతేకాక సామంతరాజులు తమ రాజ్యకాలమును జెప్పుకొనుమార్గ మిదియే.

(౨) రెండవ పులకేశి హైదరాబాదు శాసనమువల్ల గతించిన శ. ౫౩౪ సంవత్సర మాతని రాజ్యాభిషేకమైన మూడవసంవత్సర మని తెలియుచున్నది. కాబట్టి గతించిన ౫౩౨వ శకాబ్దమున నీరాజ్యాభిషేకము జరిగియుండవలయును. ఇది నిజమైనచో శకాబ్దము ౫౩౨ న వ్రాయించిన గోవాశాసనము రెండవపులకేశిరాజ్యకాలమున నివ్వబడి యుండవలయును. శకాబ్దము ౫౩౨ రెండవపులకేశిరాజ్యకాలపు టిరువదియవ సంవత్సరము కాజాలదు. పైజెప్పినట్లు మంగళేశ్వరుని రాజ్యకాలమును కాజాలదు. కావున గోవాశాసనమున వచింపబడిన రాజ్యకాలము సత్యాశ్రయ ధ్రువరాజ ఇంద్రవర్మదిగా నుండవలయును.

3. భండార్కరుగారి వాదప్రకారము మంగళేశ్వరునిరాజ్యాభిషేకము శ. ౫౧౨-౧౩ న జరిగిన దనుకొన్నను రాజ్యపంచమవర్షమున ననగా శ. ౫౧౭-౧౮ న సిద్ధార్థిరా లేదు. కాబట్టి భండార్కరువాదమునకు మహాకూట శాసనము ప్రతికూలించుచున్నది.

౪. మంగళేశ్వరుని రాజ్యాభిషేకము శ. ౫౧౨-౧౩ లో జరిగినదని నిరూపించుటకు భండార్కరుగారు వేరొకమార్గమును ద్రొక్కియున్నారు. రెండవపులకేశియొక్క అయ్యవాళిశాసనమున కీర్తివర్మయొక్క మరణానంతరము మంగళేశ్వరుడు రాజాయెనని చెప్పబడియున్నది.

తస్మిన్ సురేశ్వర విభూతిగతాభిలాషే
రాజాభవ త్తదనుజః కిల మఙ్గళేశః.

కీర్తివర్మకు ముగ్గురో నలుగురో పుత్రులుండిరి. అందు రెండవపులకేశి జ్యేష్ఠుడు. తండ్రిమరణానంతర మాతడేల రాజ్యము చేయలేదు? ఆతని పినతండ్రియగు మంగళేశ్వరు డేల సింహాసనము నధిష్ఠించెను? అతడు మిక్కిలియు పసివాడగుటచే రాజ్యము నేయుటకు అర్హుడు కాజాలమెను. కావున మంగళేశ్వరుడు రాజాయెను. ప్రొఫెసరు కీలుహారను గారు అయ్యవాళిశాసనమును పరిశోధించి, యందలి ౧౪-వ శ్లోకమునుగూర్చి యిట్లు చెప్పియున్నారు.

"రఘువంశము ౫-౨౭ తో నీశ్లోకమును బోల్చిచూడ పులకేసి తన్ను యౌవరాజ్యమున కభిషిక్తునిగా జేయగోరెనని తోచుచున్నది."

ఇందుచే నాతం డప్పుడు తరుణ వయస్కుడుగ నుండినట్లు తెలియుచున్నది. ఏవూరు శాసన మీయూహకు తోడ్పడుచున్నది. పులకేశి యాతని తండ్రిమరణకాలమున నర్భకుడుగ నుండెను.

"జ్యేష్ఠభ్రాతు స్సతిసతపరే ఽప్యర్భకత్వా ద్దశక్తే
యస్మిన్నాత్మన్యకృతహి ధురం మఙ్గళీశః పృథివ్యాః."

ఇందువల్ల పులకేశి స్వజనకుని మరణకాలమున పిన్నకుఱ్ఱవాడని స్థిరపడుచున్నది. అతనికి తమ్ములు కనీసము ముగ్వురైన నుండు

టచే నాత డప్పటికి కనీసము మూడేండ్ల వాడై యుండవలయును. యౌవరాజ్యమునుకోరినప్పటికి పదునైదుసంవత్సరముల వయస్సును, రాజ్యాభిషేకకాలమున ౨౨ సంవత్సరముల వయస్సును, అయ్యవోళెశాసనమునాటికి ౪౬ వర్షములప్రాయమును, యువనాశ్వాంగు వచ్చినప్పుడు ౧౦యేండ్ల యీడును కలిగియుండెను.

శకాబ్దము ౯౩౨ న మంగళేశ్వరుని రాజ్యాంతమును రెండవపులకేశి రాజ్యారంభమును జరిగినవి. అప్పుడుపులకేశి ౨౨ యేండ్లప్రాయమువాడు. అనగా నతడు శకాబ్దము ౯౧౦ న బుట్టెను. అతనిమూడవయేట అనగా శ.౯౧౩ లో కీర్తివర్మ గతించెను. ఆసంవత్సరముననే మంగళేశ్వరుడు సింహాసనారోహణమును గావించెను.

---

## దాసరి

కవికొండల వేంకటరావు గారు

(గీతిక)

"ఓ! దాసరీ! నీతాంబ్రా కాకుచ్చు లేమిరా?
నీకుడిచెవిపై కుట్టునా ఆకాడ యేమిరా?
తెలియునివ్వు గోట మీట తీగ మ్రోగుటా
తెలియచెప్పు—కుచ్చులేల? యులివులేనిదే
తెలియచెప్పు—కాడయేల? సారమురానిదే.

రంగునూలు కత్తిరించి రాణ కుట్టేవు
తంబుర సివర వ్రేలియాడ దండ మోపేవు
తెలియుదాని సంతనయంత—తెలియచెప్పరా
పలుకులేని దూజకేల? తెలియచెప్పరా!"

[పరుస మాఋను]

"బాబయ్యా! బాబయ్యా! పాట బాబులు వింటారు
బాగోదంటారు తాంబురబుట్ట తమరే మఱి చూచి
అందుకోసమన్ని అలంకరిస్తా తాంబురబుట్టింతో
దానిబుట్టకే దండిగ ముస్తా బటు తగిలిస్తేబా
బీబంగరుకాడ బొబ్బిలిపాగా నాబుట్టకువద్దా?"

---



# తేజోలేఖనము

వింజమూరి కృష్ణమాచార్యులు గారు

(3 వ సంపుటము 12-వ సంచిక తరువాయి)

## గ్యాస్‌లైట్ కాగితములు (Gaslight Papers)

గ్యాస్‌లైట్ కాగితములయొక్క వేగము బ్రోమైడ్ కాగితములకంటె చాలతక్కువగుటవలన ఎర్రదీపముతోగాని, చీకటిగదితోగాని నిమిత్తము లేకుండ మామూలు తెల్లదీపపు వెలుతురులో (దీపమునకు 5,6 అడుగుల దూరమున) నీడగల స్థలమందు డివెలప్‌మెంటు వగైరా పనులన్నియు చేయవచ్చును. కాగితముయొక్క ముందుప్రాతపై దీపపువెలుతురు పడకుండ మూచుకొనిన చాలును. వీటితో పనిచేయుటకు పగటి వెలుతురుగాని, ఎర్రదీపముగాని, చీకటిగదిగాని అవసరము లేకుండుటచే రాత్రివేళ తీరికసమయములలో చిత్రపునకలుల నచ్చువేసుకొనుటకివి మిగుల అనుకూలముగా నుండగలవు. బ్రోమైడ్ కాగితములకు వలెగాక, వీటిలో తేలిక నెగెటివులనుండియు, (డివెలప్‌మెంటు చాలనట్టివి), హెచ్చుడివెలప్‌మెంటు చేయబడిన దట్టమగు నెగెటివులనుండియు తేడాలు లేకుండ సరిగా డివెలప్ చేయబడిన నార్మల్ నెగెటివులనుండియు కూడ తృప్తికరమగు చిత్రముల నచ్చువేసుకొనుటకు వీలగునట్టి విగరస్ (vigorous), సాఫ్ట్ (soft), నార్మల్ (normal) అను మూడుతరగతులు గలవు. ఈమూడుతరగతుల కాగితములకును డివెలప్‌మెంటు వగైరా పనులన్నియు సమానమే.

## అచ్చువేయుట

బ్రోమైడ్ కాగితములపై నచ్చువేయుటకు దెలుపబడిన విషయములన్నియు చాలవరకు గ్యాస్‌లైట్ కాగితములకు కూడ వర్తించును. అచ్చువేయుటకు పట్టు కాలపరిమితి మాత్రము వీటికి బ్రోమైడ్ కాగితములకంటె కొంచెము హెచ్చు కాగలదు. ప్రకాశమానమగు విద్యుత్ దీపమునకుగాని, గ్యాస్‌దీపమునకుగాని ఎదురుగా అచ్చువేయుటకు కొన్ని సెకనులకంటె హెచ్చుకాలము పట్టదు. కొద్దివెలుతురునిచ్చు చమురుదీపములైనచో మాత్రము కొన్నినిమిషములవరకు హెచ్చగలదు. ఈకారణముచే, గ్యాస్‌లైట్ కాగితములపై నచ్చువేయుటకు, ఇతరదీపములన్నిటికంటెను, దీపావళికి బాలురు వినోదముకొరకు కాల్చుమతాబాబద్ద (Magnesium Ribbon) సులువుగను, హెచ్చు తృప్తికరముగను పనిచేయును. మన కెంతపొడుగు బద్ద కావలయునో అంతమాత్ర మెప్పటికప్పుడు వెలుపటికి దీయుచుండుటకు వీలగునేర్పాటుగల సుంద్రనిరేకుడబ్బాలు మతాబాబద్దసహితముగా ఫోటోసామానుల నమ్మువర్తకులవద్ద లభ్యము కాగలవు. వీటికి ఫ్లాష్‌పిస్టలని పేరు.

నెగెటివునకును మతాబాబద్దకును గలదూరమును బట్టియు, నెగెటివునందలి తేడాలనుబట్టియు అచ్చు



౭. ఆగ్రాలోని అక్బరుచక్రవర్తికోటయొక్క సింహద్వారము



౮. అంబరుకోట, రాచసగరు



౯. రాణా ప్రతాపసింగు



౧౦. కుచవనఠాకూరుగారికోట, రాచనగరు



౧౧. జస్వంతరావుహోల్కారుగారి కవచము

వేయుటకు పట్టుకాలపరిమితి మారుచుండును. ఈకారణముచే, సరియగుకాలపరిమితి (ఎన్ని అంగుళముల పొడుగు మెగ్నీషియము బద్దె వెలిగించవలయునో) నిర్ధారణగా తెలియచేయుటకు వీలుపడనేరదు. సరియగు నార్మల్ నెగెటివు నుండి అచ్చువేయుటకు, నెగెటివున కెదురుగా 24 అంగుళములదూరములో సుమారు $\frac{3}{4}$ అంగుళము పొడుగు మెగ్నీషియము బద్దె వెలిగించిన చాలును. దీని నాధారముగా కాలపరిమితికూడ మారిపోవును. ఒకచివర నెగెటివుగల ప్రింటింగ్ ఫ్రేమును, రెండవచివర 24, అం. దూరములో మెగ్నీషియము బద్దెగల డబ్బాను ఉంచి అచ్చు వేసుకొనుటకు వీలగునట్టి సదుపాయముగల బల్లయొక్క చిత్ర మీక్రింద జూపబడియున్నది. ఇట్టిబల్లను సులభముగా ప్రతి తేజోలేఖకుడును స్వయముగా తయారుచేసుకొనవచ్చును.




A. ప్రింటింగ్ ఫ్రేము.　B. మెగ్నీషియము బద్దెగల రేకుడబ్బా.　C. బల్ల.　D. మెగ్నీషియము బద్దె.

గైకొని, $\frac{1}{2}$ అం. మొదలు $1\frac{1}{2}$ అం. పొడుగువరకు, (నెగెటివులనుబట్టి) హెచ్చుతగ్గుపొడుగుల మెగ్నీషియము బద్దెను వెలిగించి, చిన్నచిన్న గ్యాస్‌లైట్ కాగితపుముక్కలపై ప్రథమమున అచ్చువేసుకొని వాటినన్నిటిని డివలప్ చేయవలయును. పిమ్మట ఆడివెలప్ చేసినముక్కలనన్నిటిని పరీక్షించి, వాటిలో తేడాలు లేకుండ సరిగా అచ్చుపడినముక్క కెన్ని అంగుళముల పొడుగు మెగ్నీషియము బద్దె వెలిగింపబడినదో, అదే పొడుగు చొప్పున వెలిగించుచు, నిండు కాగితములపై వలయునన్ని చిత్రముల నచ్చువేసుకొనవలయును. పైవిధముగా ప్రతి నెగెటివునకు సరిపడునట్టి అచ్చువేయు కాలపరిమితులను కనుగొని, నెగెటివులపై నొకమూల వ్రాసియుంచుకొనుట మంచిది. ఇట్లు చేయుటవలన, ఆనెగెటివులనుండి ముందెప్పుడైనను నకలుప్రతులు కావలసియుండినచో, శ్రమ లేకుండ సరాసరి నిండుకాగితములపై నచ్చువేసుకొనుటకు వీలుపడును. అచ్చువేయునట్టి నెగెటివునకును, మెగ్నీషియము బద్దెకును, గలదూర మెప్పుడును 24 అంగుళములకు తేడాయుండరాదు. ఈదూరము మారినచో, అచ్చువేయుటకు పట్టు

## డివెలప్ మెంటుచేయుట

బ్రొమైడ్ కాగితములకువలెనే యీగ్యాస్‌లైట్ కాగితములపైకూడ, డివెలప్ మెంటు చేసినపిమ్మట గాని నెగెటివు నుండి అచ్చువేసినచిత్రరూప మగపడదు. అందుచే అచ్చువేయబడినకాగితములను దీపపునీడయందు డివెలప్ చేయవలసియుండును. బ్రొమైడ్ కాగితములను డివెలప్ చేయుటకు పనికివచ్చు రోడినల్, ఎజాల్, మొదలగు డివెలపరు ద్రావకములు వీటికిని పనికివచ్చును. ఈడివెలపర్ ద్రావకములన్నిటిలో నూతనాభ్యాసకులకు "రోడినల్" మిక్కిలి అనుకూలముగా నుండును. దీనితో ప్లేట్లు, బ్రొమైడ్ కాగితములు, గ్యాస్‌లైట్ కాగితములుకూడ డివెలప్ చేసుకొనవచ్చును.

నార్మల్ గ్యాస్‌లైట్ కాగితములను డివెలప్ చేయుటకు 3 అవున్సుల నీటికి 60 చుక్కలు రోడినల్ కలిపిన ద్రావకము నుపయోగించవలయును. విగరస్ కాగితములకు మాత్రము అవున్సునీటికి 60 చుక్కలు రోడినల్ చొప్పున కలిపినద్రావకము వాడవలెను. ఈ

క్రిందివిధముగా తయారుచేసుకొనినట్టి ద్రావకముగూడ బాగుగాపనిచేయును:

| | | |
|---|---|---|
| మెటోల | Metol | 15 గ్రెయినులు |
| హైడ్రోక్వినన్ | Hydroquinone | 45 ,, |
| సోడా సల్ఫైట్ | Soda Sulphite | 1½ అవున్సులు |
| సోడా కార్బొనేట్ | Soda Carbonate. | 200 గ్రెయినులు |
| పొటాసియం బ్రొమైడ్ | Potassium Bromide | 6 గ్రెయినులు |
| మంచినీరు | | 20 అవున్సులు |

నీటిని కొంచెము వెచ్చగానుండునట్లు కాచి, అందు వరుసనెంబడి మిగిలిన పదార్థములను కరగించ వలయును. బుడ్లలోపోసి కార్కు బిగించి యుంచినచో, 5,6 నెలలవరకు చెడిపోకుండ నిల్వయుండును. విగరస్ గ్యాస్ లైట్ కాగితములను డివెలప్ చేయుట కీద్రావకమును సరాసరి వాడుకచేయవచ్చును. సాఫ్ట్ లేక నార్మల్ కాగితములకుమాత్రము అవున్సు ద్రావకమునకు అవున్సునీరుచొప్పున కలిపి వాడవలెను.

పై డివెలపర్ ద్రావకములలో దేనినైనను కాగితము మునుగుటకు సరిపడునంత, పరిశుభ్రముగా కడిగినట్టి తొట్టెయందు పోసి, అచ్చువేయబడిన కాగితమునందు మందుపూతగలవైపు పైకుండులాగున పడవేయవలయును. కాగితమును ద్రావకములో పడవేయుటతోడనే దానిపై ద్రావక మంతట ప్రవహించునటులు చూడవలయును.

లేనిచో, చిత్రముపై నందవికారమగు మచ్చలు పడగలవు. కాగితములను సరాసరి డివెలపర్ ద్రావకములో పడవేయుటకంటె, వేరొకతొట్టెలో మంచినీరు పోసి, అందు తడిపి, పిమ్మట డివెలపర్ ద్రావకములో పడవేయుట మంచిది. అచ్చువేయబడిన గ్యాస్ లైట్ కాగితములను డివెలపర్ ద్రావకములో వేయుటతోడనే, అతిత్వరితముగా వాటిపై చిత్రరూప మగపడుటకు ప్రారంభించి,30 సెకనులకాలములో పూర్తిగా డివెలప్ కాగలవు. అంతకంటె హెచ్చుకాలముపట్టిన కాగితములకు అచ్చువేసిన కాలపరిమితి సరిగానుండలేదని తెలుసుకొనవలయును. అరనిమిషముకంటె హెచ్చుకాలము డివెలప్ చేయబడిన కాగితములు నల్లబడి చెడిపోవును. అందుచే, చిత్రరూపమంతయు నగపడుటతోడనే (30 సెకనులలోపల) వాటిని ద్రావకమునుండి పైటికి దీసి, సరాసరి యీక్రింది ఫిక్సింగ్ ద్రావకము పోసియుంచిన తొట్టెలో పడవేయవలయును. ఒకటికంటె నెక్కువకాగితముల నెప్పుడును ఒకేపర్యాయము డివెలప్ చేయబూనుకొనరాదు. ఒకకాగితముతర్వాత వేరొకటిచొప్పున డివెలప్ చేయుచు, ఫిక్సింగ్ ద్రావకముగల తొట్టెలో పడవేయుచుండవలయును. ఒకపర్యాయము తొట్టెలో పోసిన డివెలపర్ ద్రావకమునందు 5, 6 కంటె హెచ్చు కాగితములను డివెలప్ చేయరాదు. అంతకంటె హెచ్చు కాగితము లున్నచో ప్రాతద్రావకమును పారబోసి,తిరిగి క్రొత్తదానిని పోసుకొనవలయును.

## ఫిక్సింగ్ ద్రావకము

| | |
|---|---|
| హైపో | 4 అవున్సులు |
| పొటాసియం మెటాబై సల్ఫైట్ | ½ అవున్స |
| మంచినీరు | 20 అవున్సులు |

డివెలప్ చేయబడిన కాగితములన్నిటిని ఫిక్సింగ్ ద్రావకమునందు 10 నిమిషములకు తక్కువకాకుండ నుంచి, పిమ్మట ధారగాపడునీటిలో సుమారు అరగంటకాలము బాగుగా కడిగి తెల్లని బట్టవుడతలపైగాని, అద్దముకాగితములపైగాని ఆరబెట్టవలయును. తడి పూర్తిగా ఆరిన పిమ్మట అట్టలపై నతికించవచ్చును. ఫిక్సింగ్ ద్రావకములో నున్నంతకాలమును కాగితము లొకదాని కొకటి అంటుకొనకుండులాగున విడదీయుచుండవలయును. లేనిచో అవి సరిగా ఫిక్సుకాక వాటిపై మచ్చ లేర్పడును. గ్యాస్ లైట్ కాగితములపై నచ్చువేయబడిన చిత్రములు నిర్మలమగు నలుపు తెలుపురంగులలో చూచుట కింపుగా నుండును.

## 10-వ ప్రకరణము

## ఎన్‌లార్‌జింగ్ (Enlarging)

(చిన్న నెగెటివులనుండి పెద్దచిత్రములను దీయుట)

కేమెరాయొక్క పరిమాణమునకు మించిన పెద్ద చిత్రములను దీయవలయుననిన హెచ్చువెలగల ప్రత్యేకపు సాధనము లుండినగాని వీలుపడనేరదని చాలమంది తలంపు. కాని అది సరికాదు. $4\frac{1}{4}$ అం. × $3\frac{1}{4}$ అం. కొలతగల చిన్న కార్డుసైజు కేమెరాతోసహితము కొన్ని ప్రత్యేకపు ఏర్పాట్లు గావించుకొనినచో నెంతపెద్దవియగు చిత్రములనైనను దీయవచ్చును. చిన్న నెగెటివుల నుండి పెద్దచిత్రములను దీయుటకు ప్రత్యేకపు యంత్రములుకూడగలవు. వాటిని పగటివెలుతురులో పనిచేయునవనియు, దీపపువెలుతురుతో పనిచేయునవనియు రెండు తరగతులుగా విభజింపవచ్చును. క్రిందిచిత్రమునం దీరెండురకముల యంత్రములును జూపబడియున్నవి.

### పగటివెలుతురులో పనిచేయునట్టి ఎన్‌లార్‌జింగ్ యంత్రములు

### (Daylight Enlargers.)

వీటిలో 3, 4 రకములున్నను, చిత్రమునందు జూపబడినట్టి పైపైవలెనుండుఫోకస్ చేయనవసరములేని యంత్రములు హెచ్చుమందిచే వాడబడుచున్నవి. వీటితో చిన్ననెగెటివులనుండి 3, 4 రెట్లు పెద్దవియగు చిత్రములను బ్రోమైడ్ కాగితములపై సులభముగా నచ్చువేసుకొనవచ్చును. ఈయంత్రములకు పైభాగమున నెగెటివు నుంచుటకును, క్రిందిభాగమున బ్రోమైడ్ కాగితము నుంచుటకును వీలగునట్టిఏర్పాటు లుండును. నెగెటివునకును, బ్రోమైడ్ కాగితమునకును మధ్యముగా, యంత్రముయొక్క లోపలిభాగమున నొకలెన్సు ఉండును. వెలుపలనుండి తెరచుటకును, మూయుటకును వీలగునట్టి షట్టరొకటి లెన్సున కమర్చబడియుండును. ఈ రకపు ఎన్‌లార్‌జింగ్ యంత్రములతో చిన్ననెగెటివులనుండి పెద్దవియగుచిత్రముల నచ్చువేయువిధ మీక్రింద తెలుపబడియున్నది.

### పగటివెలుతురులో పనిచేయు ఎన్‌లార్‌జింగ్ యంత్రము




A. నెగెటివు. B. లెన్సు. C. షట్టరు. D. క్రింది భాగమున నుండు మూత. E. మూతలోని అద్దముక్రింద నుంచబడిన బ్రోమైడ్ కాగితము.

ఎన్‌లార్‌జింగ్ యంత్రము నుపయోగింపబోవుటకుముందు దాని వివిధ భాగము లెట్లు పనిచేయునో బోధపరచుకొనుట మంచిది. పిమ్మట, దాని పైభాగమునందలి కాళీలో నెగెటివు నుంచి, యంత్రము నంతను చీకటిగదిలోనికి తీసుకొనివెళ్లి, ఎర్రదీపపువెలుతురులో దానిక్రిందిభాగమునగలమూతను తెరచి, దానిలోనుండు అద్దముక్రింద సరిపడు కొలతగల బ్రోమైడ్ కాగితము నొకదానిని (మందు పూతగలవైపు పైకుండునట్లుగున) పెట్టి తిరిగి మూసివేయవలయును.

పిమ్మట లెన్సును మూసి, యంత్రమును చీకటిగదినుండి బైటికి తీసుకొనివచ్చి, ఎండలేనట్టి నీడగలచోట, నెగెటివు ఆకాశమున కెదురుగానుండునట్లుగ నిలబెట్టి,

దీపపువెలుతురుతో పనిచేయు ఎన్‌లార్‌జింగ్ యంత్రము




A. దీపముగల రేకులాంతరు.

B. దీపపుకిరణములను ఘనీభవింపజేయునట్టి భూతద్దము.

C. నెగెటివునుంచుపట్టము.

D. లెన్సు.

రెండు మూడు నిమిషములకాలము లెన్సును తెరచియుంచి, పిమ్మట మూసివేయవలయును. ఎన్‌లార్‌జింగ్ యంత్రములతో చిన్న నెగెటివులనుండి పెద్దచిత్రముల నచ్చువేయుటకు పట్టు సరియగు కాలపరిమితి వెలుతురు తేడాలనుబట్టియు, చిత్రముయొక్క కొలతనుబట్టియు, బ్రోమైడ్ కాగితముయొక్క వేగమును బట్టియు మారుచుండును. అందుచే ప్రథమమున చిన్నముక్కలపై 1 నిమిషము మొదలు 4, 5 నిమిషములవరకు తేడాలుగా అచ్చువేసి చూచుకొని, సరియగు కాలమును కనుగొనిన పిమ్మట గాని నిండు కాగితములపై అచ్చు వేయబూనుకొనరాదు. సరియగు అచ్చువేయు కాలపరిమితిని తెలియజేయుటకు, చిన్న గడియారములవంటిసాధనములు కూడ గలవు. వాటినుపయోగించువిధమును తెలియజేయుకరపత్రములు వాటివెంట పంపబడును.

[సశేషము.]

---

## *ప్రశ్నలపద్యము

కోట చెంచురామయ్యగారు

పూఁబోఁడులకునెల్ల భూషణం బగు నెద్ది? వైకుంఠవాసుని వర్ణ మెద్ది?
పశుపతిమేనిలోఁ బాల్గొనె నుమ యెద్ది? సురపురి కేఁగెడి తెరువ దెద్ది?
ఒల్లనిపల్కుల నుద్భవిల్లెడి దెద్ది? కలికి వాల్చూపులఁ గలుగు నెద్ది?
భూభుజులకు నెందు ముఖ్యధర్మమ దెద్ది? యదుకులోత్తముమోవిఁ గదిసె నెద్ది?
అన్నిటికిఁ జూడ మూఁడేసియక్కరములు-నాదునిలయము మొదలివర్ణములు గూర్ప
నప్సరోగణసేవితం బదియు దీని-భావ మెట్టిదో తెలిసినవాఁడె ఘనుఁడు.

---

* ఈప్రశ్నలకు సరియైన ఉత్తరములను ౧౯౨౭ సంవత్సరము ఫిబ్రవరి నెల 15-వ తేదిలోపల మొట్టమొదట భారతీ కార్యాలయమునకు పంపువారిపేరు మార్చి భారతిలో ప్రకటింపబడును. —సంపాదకుడు.

# బసవోదాహరణము

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

పరిష్కర్త

పాల్కురికి సోమనాథకవీశ్వరప్రణీతములయిన తెల్గుగ్రంథములలో నేఁటి చరిత్రపరిశోధకు లింతదాఁక దీనిఁ దాఁకలేదు. బసవపురాణ పీఠికలో నేను దీని యాద్యంతములఁ జూపితిని. సంబోధనముతో నెన్మిది యగు విభక్తులతో నెన్మిది పద్యములును, కళికలును, నుత్కళికలును నెల్ల విభక్తులతోఁ గడపటి పద్యమును గల స్తుతిప్రశంసాపర మయిన గ్రంథమున కుదాహరణ మని పేరు. సంస్కృతాంధ్ర కావ్యలక్షణకారులు దీని లక్షణమును నిర్వచించిరి. తెలుఁగునఁ గల యుదాహరణములలోని కెల్ల నిదియే ప్రాచీన మయినది. రావిపాటి త్రిపురాంతకుని త్రిపురాంతకోదాహరణము దీనికంటెఁ దర్వాతి దయినను, దీని కంటె హృద్యతరము. ఇందుఁ గడపటిపద్యమున సప్తమీవిభక్త్యంతపదము, బసవవాచకముగా లేదు. 'నీయందు'అని యా పద్యమునఁ జేర్పఁ గుదురదు. పద్యపాఠము సరిగాదేమో! చతుర్థీవిభక్తిరూపము లిందుఁ బర్యాలోచింపఁ దగినవి. ప్రాఁతకాలపుఁ దెల్గుకృతి గాన యభిమానమున దీనిని బ్రకటించితిని. సంస్కృతకర్ణాటభాషలలో నీకవి రచియించిన లఘుకృతులను శ్రీ బండారు తమ్మయ్యగారు ప్రకటింపఁ దలంపుగొన్నట్లు నాకుఁ దెలిపిరి. అట్లు వారు ప్రకటించినచో సోమనాథుని కృతులెల్ల వెల్లడియయిన ట్లగును.

శ్రీగురులింగతత్పరుఁ డశేషజగన్నిధి శుద్ధతత్త్వసం
యోగసుఖప్రపూర్తి వృషభోత్తమమూర్తి యుదాత్తకీర్తి ది
వ్యాగమమార్గవర్తి బసవయ్య కృపాంబుధి మాకు దివ్యసం
భోగములం బ్రసాదసుఖభోగములం గరుణించుఁ గావుతన్.

కళిక—

వెండియుఁ ద్రిభువనవినుతిసమేతుఁడు మండితసద్గుణమహిమోపేతుఁడు
సురుచిరశివసమసుఖసంధానుఁడు పరమపరాపరభరితజ్ఞానుఁడు
విదితానందాన్వితమనస్కుఁడు సదమలవిపులవిశాలయశస్కుఁడు
శ్రీవిలసితపదచిరతరభద్రుఁడు గావున సాక్షాత్కలియుగరుద్రుఁడు.

ఉత్కలిక—

భువనోపకారా భవమోదవీరా। భక్తిసంయోగా ముక్తిసంభోగా
సౌఖ్యాబ్ధిలోన ముఖ్యుఁడై తాన। వెలయు శుభకరుఁడు ఇల విశ్వగురుఁడు.

చ. వసిగొని యెవ్వఁడేని బసవా యను నీసుకృతాతురాశ్రయం
బెసఁగఁ బఠించెనేని గిరిజేశుని కాతనివక్త్రగహ్వరం
బసదృశగేహ మన్నయవి యార్యులవాక్యము లట్లు గావునన్
బసవనఁ బుణ్యమూర్తిఁ దలఁపం గదె చిత్తమ పాయ కెప్పుడున్.

కళిక—

వెండియును భక్తాభివృద్ధిఁ బెంచినవాని బంధమాయాచారపథముఁ ద్రుంచినవాని
నద్వైతవాక్యసంహారుఁడై చనువాని విద్వత్తముం గెల్చి వీరుఁడైమనువాని [వాని
మీమాంసకులముక్కు మిగులఁ గోసినవాని తామసధ్వాంతంబు తగులఁ బాసిన
పెక్కు దైవంబుల్ల పేరుమాపినవాని నొక్కఁడే రుద్రుఁ డని యుక్తిఁ జూపినవాని.

ఉత్కలిక—

ప్రకృతివాదము దుడిచి వికృతివేషము లుడిచి
సకలవాదుల నోర్చి సుకృతమార్గము దీర్చి
భూమిభారము బాపఁ గా మించుగతిఁ జూప
నెమ్మిఁ జాలినవాని మమ్ము నేలినవాని.

ఉ. జంగమపాత్రుచే సమయసమ్మతుచే భవరోగవైద్యుచే
మంగళమూర్తిచే గరళమర్దనుచే నసమానశౌర్యుచే
లింగకుమారుచే బసవలింగముచే బసవయ్యచేఁ గృపా
సంగతుచేఁ బ్రసాదసుఖసౌఖ్యము నొందెద భక్తిఁ జెందెదన్.

కళిక—

వెండియును వేదోక్తవిలసచ్చరిత్రుచే దండిభవబంధనలతాచయలవిత్రుచే
విధినిషేధాతీతవినుతైకగమ్యుచే బుధజనప్రోద్గీతభువనాగ్రగణ్యుచే
ప్రవిమలశివాచారభవ్యప్రసారిచే భవిజనపరిత్యాగిభక్తిభండారిచే
శివచిన్మయాపరిచ్ఛిన్నప్రమోదిచే పరమార్థతత్త్వానుభవసుఖాస్వాదిచే.

ఉత్కళిక—

సన్నుతులగరిగట్టి మన్ననలతుదముట్టి। ప్రమథకవిలియ కెక్కి విమలసంపదనిక్కి
శివలీలపెంపార భువి బసవఁడనుపేర। మెఱయుసువిధజ్ఞుచే నెఱయుతత్త్వజ్ఞుచే.

చ. అతని ప్రసాదసౌఖ్యమున కంగము కీర్తికిఁ గర్ణముల్ గుణ
స్తుతులకు జిహ్వయుం జరణతోయజసంగతికిన్ మనంబు స
మ్మతగుణ దివ్యమూర్తికి నమస్కృతియున్ విధియించికూడ న
ట్లతులితపుణ్యుఁడైన బసవయ్యకునై ప్రణమిల్లు చిత్తమా!

కళిక—

వెండియును నిర్మలపవిత్రగోత్రునకునై పండితస్తవనీయపాత్రగాత్రునకునై
దురితభంజనకళాధుర్యచరితునకునై సరవి నిష్టవ్రతాశ్చర్యభరితునకునై
సవిశేషవిమలగుణజాలలోలునకునై శివయోగసంధానశీలపాలునకునై
..........................................................

ఉత్కళిక—

లింగచిహ్నలుమోచి దొంగలుండగఁజూచి
కొంగులనుబొదిగొన్న వంగకాయలుమున్న
లింగములుగాఁ దెల్పి జంగమేచ్ఛలు సల్పి
భవరోగహరునకై శివరూపధరునకై.

చ. పాసపరి పోరుదూషకులఁ పొం గణఁగించి వధించి మించి య
వ్విసము ప్రసాదిమై యనుభవించి జగంబులనెల్ల మించి పెం
పెసఁగఁగ దేజరిల్లెడు మహిష్ఠయశోనిధి గాన మెప్పడున్
బసవనదండనాథువలనన్ భజియింతుఁ బ్రసాదసౌఖ్యముల్.

కళిక—

వెండియును జగదేకవీరసత్తమువలన బండారుబసవసత్పండితోత్తమువలన
వీరమాహేశ్వరాన్వితవర్తనువలన ఘోరసంసారసంక్షోభకర్తనువలన [వలన
సుకృతదుష్కృతశుభాశుభవిదూరగువలన సకలనిష్కళతత్త్వసౌఖ్యపారగు
నాదవిద్యాసుధార్ణవవిహారునివలన ఆదివృషభేంద్రాపరావతారునివలన.

ఉత్తలిక—

సారజీవన్ముక్తి కారణం బగుభక్తి। చేకూరుసమ్మత మ్మేకలింగవ్రతము
త్రోవఁ బోం డని పసుపదైవజ్ఞులను మనుప।నోపు ధీరునివలనఁ బాపహారునివలన.

ఉ. దుస్తరకర్మభూసురులు దూషకులై కులమెత్తి పల్కుచుం
నాస్తికులౌచుఁ జూడ శివనాగయగారి గుఱించి వారిశ్రీ
హస్తతలంబునందు విమలామృతధారలు వెల్లిఁ గుర్య నా
ర్యస్తుతినించు నబ్బసవరాజున కే నతిభక్తి సేయుదున్.

కళిక—

వెండియుం డ(?)కారసారవిదితముదితమేళనునకు
పండి నిండి పొలుపు సలుపు భక్తియుక్తిపాలనునకు
భవ్యసేవ్యశరణచరణపద్మసద్మఖేలనునకు
నవ్యదివ్యలలితగళితనాదభేదలోలనునకు
యమనియమనిరంతరాంతరాంగసాంగవర్తనునకు
నమితశమితవిషమవిషయహారిభూరికీర్తనునకు
సత్యనిత్యభోగయోగయంత్రతంత్రదూరగునకు
సత్యనిత్యశుద్ధబుద్ధసత్త్వతత్త్వపారగునకు.

ఉత్తలిక—

మహిఁ బురాతనోక్తభక్తిమహితతత్త్వశక్తియుక్తి
యిమ్ముగొనఁగ లింగజంగమమ్ము ప్రాణలింగమునకు
సమ్మతముగ భువిని వెలసి ప్రమథ లీల సొలసి యొలసి
యున్నగణవిరాజితునకుఁ జన్నబసవపూజితునకు.

చ. అసమగుణాఢ్యునందు శరణాగతవత్సలునందు జంగమ
వ్యసనమహిష్ఠునందు భవవారణకారణమందు భక్తమా
నసపరిపూర్ణునందు గణనాథునియందు దయాపయోధి మా
బసవనియందు మాబసవపాత్రునియందు వసింపు చిత్తమా.



౧౭. కల్యాణరాజు, రథోడునాయకుడు



౧౩. శివాజీ (౧౬౨౭-౧౬౮౦)



౧౪. బాబరు (౧౪౮౩-౧౫౩౦)



౧౫. నాదిర్‌షా (౧౬౮౮-౧౭౪౭)



౧౬. అహమ్మదుషా దురాని (౧౭౨౨-౧౭౭౩)

కళిక—

వెండియును శివార్యునందుఁ జండమదనశౌర్యునందు
దురితభయవిదూరునందు సరసభక్తసారునందు
సుకరశరణసూత్రునందు సకలవిషయజైత్రునందు
భువనసత్ప్రబుద్ధునందు శివగణప్రసిద్ధునందు.

ఉత్కళిక—

శరణజనుల పరువుఁబనుల । తగవు దనువు ధనము మనము
సమసి సంగతముగ లింగ నిజమునందు విజయునందు.

చ. ఎసఁగ లలాటవహ్నిఁ గుసుమేషు దహించిన కాలరుద్ర! మఖ
గసిమసిఁజేసి దక్షునిముఖంబు హరించిన వీరభద్ర! యి
వ్వసుమతిఁ బుట్టి భక్తజనవశ్యుడవైన కృపాసముద్ర! యో
బసవ! భవత్ప్రసాదసుఖభాజనుఁ జేయవె నన్ను నర్మిలిన్.

కళిక—

వెండియును సమస్తలోకవిదిత విమలభక్తిబీజ దండితేంద్రియ ప్రచండతరళవిషమగుణసమాజ
జంగమప్రసాదభోగసారసౌఖ్యశరధిమగ్న లింగసంగతానుభావలీలశరధి నోవిలగ్న
అతులసకలభువనపావనావతారపుణ్యమూర్తి సతతవితతవిమలతత్త్వసారసౌఖ్యజనహతార్తి
భవభయప్రసారదూర భవ్యసులభసుకృతికాయ దివ్యబృందవందితద్వితీయశంభునామధేయ.

ఉత్కళిక—

పరమగురుమతానుకూలభరితసుగుణగతివిలోల। లింగపూజనావిధేయ జంగమార్చకానపాయ
శ్రీనృపేంద్రదివ్యమూర్తి శైవసమయచక్రవర్తి। భక్తిసత్క్రియాధురీణ భక్తిముక్తిదప్రవీణ!

ఉ. నీవు దయాపయోనిధివి, నిన్ను నుతించినఁ గల్గు భక్తి, నీ
చే వరవీరశైవరతి చేకుఱు,నీకయియిత్తుఁ గబ్బముల్
నీవలనం గృతార్థత జనించును నీకు నమస్కరింతు నా
భావమునందు నుండి ననుఁ బాయకుమీ బసవయ్య, వేఁడెదన్.

బసవోదాహరణము ముగిసెను.

---

5.　2-　15　303

# శ్రీ సర్వమంగళేశ్వర శాస్త్రిగారు

నడిమింటి పతంజలిశాస్త్రి, బి. ఏ.

ఈమహాపురుషుని గురించి 1925 డిసెంబరు నెల 'భారతి'యందు కొంత వ్రాసి యుంటిని. ఇప్పుడు మరి కొంత వ్రాయుచున్నాను:

వీరు లలితోపాసకులని యిదివరకే వ్రాసియున్నాను. వీరు లలితాష్టకమును సంస్కృతమున రచియించినారు.

అది యిప్పటి కెచ్చటను అచ్చు పడియున్నట్లు కానరాదు. కాని, అనేకులు దానిని పాడుచుండుట విని యున్నారము.

ఈక్రింది శ్లోకములు మంగళేశ్వరశాస్త్రిగారు తమ తండ్రిగారైన పేరు నయనులుగారిపై చెప్పినవి:

1 శ్లో. శుభతరవరమధ్యాగారవంశ్యప్రధానో
నృపగతబహుమానోయాచకేష్టప్రదానః;
జననుతగుణగాన స్సర్వవిద్యానిధాన
స్సకలకవినుతానః పేరుయజ్వా పితానః.

2 శ్లో. విదితసకలవేద స్తర్కవాగక్షపాదః
పరిహృతపరవాద స్సంస్మరచ్ఛైవపాదః;
సకలబుధవినోద శ్శ్రీసతీసత్ప్రసాదో
యతినుతిగతఖేదో మాతృతాతాదిమోదః.

కంబరపితూరీ:— మంగళేశ్వరశాస్త్రిగారిచరిత్ర వ్రాయు సందర్భమున 'కంబరపితూరీ' గురించి కొంత చెప్పవలసియున్నది. 'కంబర' అనునది యొక గ్రామము. ఇది మంగళేశ్వరశాస్త్రిగారి స్వస్థలమగు నాగూరగ్రహారమునకు దగ్గరగా నున్నది. అప్పటి కంబరనాయకులు కడు భుజబలము గలవారు. వారిలో అప్పారాయడు, వెంకట్రాయడు ముఖ్యులు. వీరు కంబరమొఖాసాదారులు. వీరు నూరుమంది జట్టుతో స్నేహభావము నటించుచు నాగూరగ్రహారము వచ్చి మంగళేశ్వరశాస్త్రిగారు వారికై చేయించిన విందు లారగించిరి. పిమ్మట వారిపై శాస్త్రిగారీక్రింది భూషణశ్లోకముకూడ చెప్పిరట.

శ్లో. అంబరరంజితబాహో డంబరభీతాఖిలారిసంఘాతౌ;
శంబరరిపుజనకాభౌ కంబరనగరాధినాయకౌ జయతామ్.

కాని యాదుర్మార్గులు, తిరిగి తమ యూరికి పోవునపుడు నాగూరగ్రహారమును, చుట్టుప్రక్కల మరికొన్ని గ్రామములను కూడ దోచుకొని పోయిరట. వారిని మంగళేశ్వరశాస్త్రిగారు 'మీరు అన్నవస్త్రములు లేక నశింతు'రని శపించిరట. ఆరీతిగానే మరికొన్ని దినములు పోయిన తర్వాత దొరతనమువారు వాండ్రను నాయకసహితముగా పితూరీదార్లక్రింద ఖైదుచేసి వారిమొఖాసా తీసికొనిరి.

విజయరామ గజపతి సందర్శనము:— మంగళేశ్వరశాస్త్రిగారు తొలిపర్యాయము విజయనగర మహారాజగు విజయరామ గజపతివారిని దర్శించునపుడు వారిద్దరకు నీక్రింది విధముగ సంభాషణ జరిగెనట:

విజయ:— మీ పేరేమి?

మంగ:— మంగళేశ్వరశాస్త్రి.

విజయ:— ఇంటిపేరు?

మంగ:— నడిమింటివారు.

విజయ:— ఏమి, యింటిపే రిట్టిది పెట్టికొంటిరి! (అని రాజుగారు నవ్విరట.)

మంగ:— మహాప్రభో! పూసపాటి చేయకపోయినదా (అని శాస్త్రిగారు జవాబిచ్చిరట.)

విజయనగర మహారాజుల యింటిపేరు 'పూసపాటి'వారని వేరుగ చెప్ప నవసరము లేదు.

సూర్యాష్టకము:— 'ఘృణిస్సూర్య ఆదిత్య ఓమ్' అను సౌరమంత్రాక్షరములు వరుసగా శ్లోకాద్యక్షరములుగా నుండునట్లు మంగళేశ్వరశాస్త్రిగారు సూర్యాష్టకమును రచియించినారు. దీనిని రచించుటకుగల కారణము లివి:

ఇతడు కాశీయం దనేకసంవత్సరములు విద్యాభ్యాసముచేసి, పిమ్మట తనస్వస్థలమునకు మరలినాడు. ఆ కాలమున రెయిల్వేలు లేనికారణమున ప్రయాణమంతయు గుఱ్ఱముమీదనే సాగింపవలసి వచ్చెను. అట్లు వచ్చుచుండ త్రోవలో, నపుడు వర్షకాల మగుటవల్ల, మంగళేశ్వరుని హయ మొకచోట బురదలో కూరుకొని పోయెనట. శాస్త్రిగారు దాని నాబురదలో నుండి బయటకు తీయ ప్రయత్నించుచుండ నది తన బురద తోకతో వారి ముఖముపై కొట్టెనట. ఆదెబ్బ నేత్రములకు విశేషముగ తగులుటచే నప్పటినుండియు వారికి కొద్దిగ నేత్రావరోధము కల్గెనట. లోలంబరాజీయమందు చెప్పినట్లు అతిపసకషాయము సేవించినను ఆయనరోగము తగ్గనందున, సూర్యుని ప్రార్థింప మేలు కల్గునని ఆయన సూర్యాష్టకమును చెప్పెనట. ఇది చెప్పిన పర్యాతచాల వరకు కన్నులు నయమైనవట.

విశాఖపట్టణముజిల్లా కలెక్టరును, గవర్నరుగారికి ఏజంటును అయిన డి. యఫ్ కార్మికేల్ దొరగారు 1865వ సంవత్సరములో వ్రాయించిన విశాఖపట్నం జిల్లా మేన్యూల్‌లో మంగళేశ్వరశాస్త్రిగారిని గురించి యీ క్రింది విధముగ వ్రాయబడి యున్నది:

"నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి లేటు విజయనగరము రాజావారి (నారాయణ గజపతిగారి) కాలములో నీయన గొప్ప పండితుడు, మంచికవి. ఆయన శైలి హాస్యదూషణ రసములుకలది. ఆయనపాండిత్యమెరిగినవా రాయనను అభినవకాళిదాసని పిలిచెడివారు. 'సమాసకుసుమావళి' యన్న గ్రంథ మీయన చేసినాడు. ఈగ్రంథము గవర్నమెంటు పాఠశాలలో విద్యార్థులకు నేర్పబడుచున్నది."

మంగళేశ్వరశాస్త్రిగారు సమస్యలను పూరించుట:—

1. 'తక్రం శక్రస్య దుర్లభం' అను సమస్య పూర్వకాలమునుండియు కలదు. దీని యర్థము ఇంద్రునకు తక్రము (చల్ల) దుర్లభ మైనదని. దీని ననేకు లనేక విధములుగ పూరించి యున్నారు. ఒక సభయందు శాస్త్రిగారిని పూరించమని పండితు లందరు నిర్బంధింప, నాతడీ క్రింది విధముగ పూరించెనట:

శ్లో. అక్రత్వంగం యత స్తక్రం శక్రేణ నహుతం పురా;
నాద త్తమితి వాక్యార్థా త్తక్రం శక్రస్య దుర్లభమ్.

అక్రత్వంగం=క్రతువునకు (తక్రము) అంగము కాదు. అనగా నేయి, పాలు మొదలగు వానితో క్రతువు చేయుదురుకాని, తక్రముతో చేయరు. అందుచే దేవేంద్రుడు తక్రముతో నెన్నడును హోమము చేసియుండ లేదు. నాద త్త మితి వాక్యార్థాత్=ఇవ్వనిదే యేదియు రాదన్న వాక్యార్థమును బట్టి దానితో నింద్రుడు హోమము చేసియుండలేదు గనుక వాని కది దుర్లభమైనది

2. ఈరీతిగనే 'గౌరీముఖం చుంబతి వాసుదేవః' అను సమస్యను కూడ మంగళేశ్వరశాస్త్రిగారీ క్రింది విధముగ పూరించిరట:

శ్లో. నారీశరీరార్ధమనోహరేణ
గౌరీవరేణ ప్రసభం గృహీతః;
ఊరీకృతో మోహనవేషధారీ
గౌరీముఖం చుంబతి వాసుదేవః.

[పార్వతిముఖము వాసుదేవుడు చుంబించెను; ఎట్లనగా అర్ధనారీశ్వరు డమృతము పంచిన జగన్మోహినిని కౌగిలించి నప్పు డన్యోన్య చుంబనమున.]

మంగళేశ్వరశాస్త్రిగారి దూషణకవిత్వము:—

I మంగళేశ్వరశాస్త్రిగారి ప్రియశిష్యుం డను రెడ్డిశాస్త్రిగారు 'నారాయణగజపతీయము' అని యొక గ్రంథముచేసి, అప్పటి విజయనగర యహారాజులను నారాయణ గజపతిగారివద్దకు తీసికొనపోవ నారాజాయనకు దర్శనమైన ఇయ్యలేదట. లోడనే యాతడు మంగళేశ్వరునితో తెలుప నత డీక్రింది శ్లోకమును చెప్పెనట:

శ్లో. గాయన్నటద్ద్విరేఫాళిప్రా ప్తదానో గజాధిరాట్;
శ్రీమన్నారాయణాభిఖ్యగజరాడపి తాదృశః.

ఈశ్లోకమునకు రెండర్థములు కలవు:—

1. గజాధిరాట్=గజరాజు, గాయత్=గానము చేస్తున్నటువంటిన్నీ, నటత్=నాట్యము చేస్తున్నటువంటినీ, ద్విరేఫ=తుమ్మెదలయొక్క, అళి=సమూహముచేతను, ప్రాప్త=పొందబడ్డటువంటి, దానః=మదముకలవాడు.

2. అయితే, యీనాగాయనాగజపతి యెట్టివాడనిన, గాయత్=గాయకులచేతనున్నూ, నటత్=నటులచేతను న్నూ, ద్విరేఫ=నరయాచార్యులు (అప్పటిరాజగురువు, కపటి)గారిచేతనున్నూ, అళి=వేశ్యలచేతనున్నూ, ప్రాప్త=పొందబడ్డటువంటి, దాన=ఈవికలవాడు.

II. ఈక్రింది శ్లోకము మంగశేశ్వరశాస్త్రిగారు తమయొక్క నాగూరగ్రహారమందపుడు ప్రబలియుండెడి యొక దుర్మార్గపు బ్రాహ్మణునిపై చెప్పినది:

శ్లో. పికృటుఃపత్రికాచ్ఛేదః పాత్రతీర్థాపహర్తనాత్;
నాగపుర్యగ్రహారస్య త్రయోనర్థాః కుయజ్వనా.

పికృటుః=దొంగపత్రములు కల్పించువాడు, పత్రికాచ్ఛేదః=ఋణపత్రములను సంగ్రహించి చింపివేయువాడు, పాత్రతీర్థాపహర్తనాత్=సాత్రుడనేవాని భార్యతో సంభోగించినవాడు, నాగపు........జ్వనా=నాగూరగ్రహారమునకీ మూడు అనర్థములున్నూ, యీకుత్సితుడగు బ్రాహ్మణునివలన కల్గినవి.

III. ఈ క్రింది శ్లోకము మంగశేశ్వరశాస్త్రిగారు సుల్లనిల్లి కులమందు పుట్టిన యొకానొక దుర్మార్గపు మనసబుపై చెప్పినది:—

శ్లో. సుల్లనిల్లికులభ్రష్టః భటానోర్కృకృమీమనుః;
అంగనాపాంగనాసక్తః చిరం జీవతు కాకవత్.

(సశేషము)

---

## రాధ పిలుపు

పాటిబండ అప్పారావు గారు

౧

ఓ నా మానసమెల్ల వెన్నవలె నీవేలోయి, కైకొంటి వెం
పైనన్ వెంబడుగోవుఁ జేసితివి దేలా బేలనౌనన్ను? నీ
వేణూత్పన్న మనోజ్ఞరాగముల నుర్వీబంధముల్ పాపితే
లా! నన్నీగతిఁ జేసి కానఁబడవేలా బాలగోపాలకా?

వేణువు నూదుమా! గగన వీథులలోని సువర్ణ తారకో
ద్యానవనీ విహారమునకై యరుగన్ రివురివ్వుమంచు మ
న్మానసరాజహంసి పవమాన విమానముమీఁద—నూఁదుమా
వేణు వికొక్కమారు; పెదవిం గదలింపుము శ్యామసుందరా!

గాలికిఁ దూలి మబ్బుతునకల్ చెలరేఁగెడులీల నెమ్మదిం
దూలు తలంపుపోకడల దుందుడుకెల్ల నొకొక్కచూపునన్.
గాలమువేసి లాగుకొని గానరసామృతవీచికా సమాం
దోళిత భావడోలికను దూఁగెదవే! మురళీ మనోహరా!

తరళయౌవన రసోదయమాన నవనీత మారగించు విలాసపూరుషుఁడవో
నగియించి నిలువెల్లఁ జిగిరించి పుష్పింపఁ బాటవాడెడు మహానాటకుఁడవో
సంసారసంజాత సంతాప ధూమముల్ హరియించు కరుణాంబుధరుఁడవేమొ
మనసుబంగిరు వీణఁగొని ప్రేమరాగముల్ వాయించు లావణ్యవైణికుఁడవో.

చెలిమిచేఁ బేర్మిచే నన్నుఁ జేరఁదీసి-నాజగంబెల్ల నీవె యైనాఁడవోయి,
ఈప్రణయరాగ పరిణామ మెన్నిగతుల-నడపెదవో రాధికామనోనాథ, దేవ!

# సప్తద్వీపములు-పరిశిష్టము

ఓ. వెంకటరంగయ్యగారు, బి. ఏ, బి. యల్.

పుష్య మాస సంచిక యందు ప్రకటింప బడిన సప్తద్వీపవ్యాసమునం దుల్లేఖింపబడిన యాకరములు గాక శ్రీవాల్మీకిరామాయణాంతర్గత కిష్కింధాకాండ యం దొకకొంత గలదు. సీతాన్వేషణమునకై సుగ్రీవుడు వానరుల నలుదెసలకు నియోగించుచు, కిష్కింధను నాభిగ జేసికొనిఅయ్యైదిక్కునగల స్థలజలాదులను "అభాస్కర మమర్యాదం" బనునంతదనుక వర్ణించి, "నజానీమ స్తతః పర"మ్మని ముగింపు చేయుచు వచ్చినాడు. పూర్వదిగ్వర్ణనము ౪౦ వ యధ్యాయమున గలదు. అందు ౩౦ వ శ్లోకమున యవద్వీపము మొదల దగులుచున్నది. అటుపైన ౪౩ వ శ్లోకమున క్షీరోద జలోదములు క్రమముగ బలుకబడినవి. సప్తద్వీప సప్తసముద్రము లీరెంటినడుమ నిమిడియున్నట్లు మధ్యగతశ్లోకవ్యాఖ్యలవలన దెలియ గలదు. వ్యాఖ్యాతృసంప్రదాయ మిట్లులున్నను మహర్షి సప్తద్వీప సప్తసముద్రముల నందు వేర్వేరు చెప్పలేదు. ప్రసంగమునకు కావలయు శ్లోకభాగములు ఈక్రింద జూపబడినవి:—

30. ఉత్తరార్ధము:—యవద్వీప మతిక్రమ్య
శిశిరో నామపర్వతః.
32 ,, తతో రక్తజలం శోణ, మగాధం ...
35. ,, తత స్సముద్రద్వీపాంశ్చ
సుభీమా న్ద్రష్టుమర్హథ.
36. పూర్వార్ధము:—ఊర్మిమంతం సముద్రంచ
క్రోశంతమనిలోద్ధతమ్.
38. ఉత్తరార్ధము:—తతో రక్తజలం భీమం
లోహితంనామ సాగరమ్.
39. ,, గతా ద్రక్ష్యథ తాంచైవ
బృహతీం కూటశాల్మలీమ్.
43. ,, తతః పాండుర మేఘాభం
క్షీరోదంనామసాగరమ్;
గతా ద్రక్ష్యథ దుర్ధర్షా
ముక్తాహార మివోర్మిభిః.
44. ,, తస్యమధ్యే మహా౯ శ్వేత
ఋషభోనామపర్వతః.
47. ,, క్షీరోదం సమతిక్రమ్య తతో ద్రక్ష్యథవానరాః;
జలోదం సాగరశ్రేష్ఠంసర్వభూతభయావహమ్.

ఇందు యవద్వీపమును జంబూస్థానమున బెట్టుకొని ౩౯ వ శ్లోకభాగములోని కూటశాల్మలిని శాల్మలీద్వీపముగ గ్రహించినయెడల, ౩౫ వ శ్లోకోత్తరార్ధమున గల—

"తత స్సముద్రద్వీపాంశ్చ సుభీమా న్ద్రష్టు మర్హథ" లో ప్లక్షకుశక్రౌంచశాకము లనుమేయము చేసికొనవలయును. ఆవల పుష్కరద్వీపమును స్పష్టముగ జెప్పక క్షీరోదజలోదములు చెప్పబడినవిగాన ఈరెంటినడుమ పుష్కరమున్నదని యూహింపవలయును. ఈవిధమున సమన్వయము చేసినయెడల పౌరాణిక సంప్రదాయము వాల్మీకి భూగోళవిజ్ఞానమున కవిరుద్ధము కాగలదు.

ఈవిధమున సమన్వయము చేసినను ౪౩ వసర్గయందు ఉత్తరదిగ్వర్ణనము చేయుతరి ౨౬ వశ్లోకమున వాల్మీకి క్రౌంచగిరిని చెప్పియున్నాడు. పూర్వదిగ్వర్ణనములో క్రౌంచము చేరవలసియుండగ ఉత్తరమున నీక్రౌంచమెట్లు సంభవించినదియు సందేహముగ నున్నది. తూర్పుదిక్కున నుండవలసిన క్రౌంచమును, ఉత్తరపు క్రౌంచమును వేరువేరు పర్వతములనిన వివాదము లేదు. కుమారస్వామి భేదించిన క్రౌంచమే యీయుత్తరపు క్రౌంచ మనుటకు ఆధారముగ "క్రౌంచంతు గిరి మాసాద్య బిలం తస్య సుదుర్గమమ్"అని కూడ వర్ణింపబడియున్నది. క్రౌంచపర్వతము లనేకము లున్నవియా? లేక యిందేమయిన ప్రమాదముండునా యని విచారింపవలసి యున్నది.

వాల్మీకివర్ణన ప్రకారమునకు సప్తద్వీపసముద్రములు కిష్కింధనుండి తూర్పుననే యున్నయెడల, సప్తద్వీపయగు మేదినియంతయు కిష్కింధాప్రాగ్దేశయం దున్న దనవలయునుగదా? అటులగునేని, దక్షిణపశ్చిమోత్తరదిక్కులం జెప్పబడినస్థలజలాదులు ఈపృథివీమండలమునకు జేరినవికా వనదగునా? ఇత్యాదివిషయములను సప్తద్వీపవినిర్ణయముతోపాటు విమర్శింప ఆంధ్రవిద్వద్వరేణ్యుల వేడెద.

---

## కైకపశ్చాత్తాపము

శ్రీ తి. వ. నారాయణస్వామి గారు

సాంద్రకృపాఖనిని సుయశ-స్సాంద్రుని రఘురాము నడవికిం జనుమని విభ్రాన్తి
ర్ముంచించి యేమిసౌఖ్యము - నందితి నం. నలలోన నాఁడిపడితిన్.

మంథరమాటల విని యా - బంధూకాధరవినమ్రభావము విడి ని
ర్బంధితునిం జేసె సుయశో - బంధురు మహిపాలు ననుచుఁ బల్కిరి లోకుల్.

అతిహితుఁడైన భర్తగల యంగన గాంచి యెకళ్లొకళ్లు స
స్మిత వదనారవిందములఁ "జేడెరో ! కాంచితె కైక" నంచు నా
గతిఁ దలపోసి యాడు కులకాంతలపల్కుల నాలకించి యి
ట్లతితరదీనభావమున నాయువుఁ ద్రోయఁగనయ్యె నక్కటా.

ఏలిదమైతిని వసుధా-పాల మకుటపద్మరాగ పాటలితాంఘ్రి
శ్రీల నలరారు ధరణీ-పాలుఁడు స్త్రీజితుఁడటంచుఁ బల్కుటకతనన్.

తరుణియఁట వీరపురుషో-త్తరాత్మజన్యమునఁ బతికిఁ దగుబాసటమై
సగఁజెనఁట యనెడి కీర్తికి-గుఱుతుగ మనఁబోక తెచ్చికొంటి నకీర్తిన్.

స్థిరఁగల సర్వభూపతు లిసీ! యన జానపదుల్ హసింప ని
ర్వైరపడి తోడిచేడె లరవిందహితాన్వయ మింకఁ గైకచే
సరియగునోయటంచును విచారము నందఁగ మూఢనై క్షమా
వరు నలయించి యాఁడికిఁ బొల్పడి చుల్కఁదనంబు నందితిన్.

ఆభరణంబులో మణిమయావసథంబులొ విత్తమో నగం
భేభచయంబొ దాసికలొ ధేనువులో పతిఁ గోర కేను నై
రీభఘటా మృగేంద్రుని శిరీషసుమోపమ కోమలాంగు లో
కాభరణున్ రఘూత్తముని కానల కంపఁగ నేల కోరితిన్.

భరతున కించునోయనుచు భావమునం దలపోసి తీవ్రని
ష్ఠురతరవాక్పరంపరల సూరిజనస్తుతు నాథు నొంచి యీ
వరములపేర రాము వనవాసిగఁ జేసిన నన్నుఁ గాంచి మా
భరతుఁడె సంతసించి హితభావముఁ జూపెనె మిన్నకుండెనే.

ఏల తలంచె మంథర, మహీశుఁ డొసంగిన యవ్వరంబు లే
నేల నృపాలు నొంచి యవనీతలముల్ క్షితిపాలధర్మముల్
దూలఁగఁ ద్రోసివేసితిని దోఁచినరీతిని రాజ్య మీయఁగా
వీలగునే నృపాగ్రణికి? పిరుఁడు జ్యేష్ఠుఁడు రాముఁడుండఁగన్.

ఎంత విచారించె మహీ-కాంతుఁడు నాకరములంటి కన్గ్రింతల పెక్
ముంతలఁ బోసినరీతి దు-రంతంబగు బాష్పజల పరంపర విరియన్.

నాయజ్ఞానముగాక నేఁ అగునె భూనాథార్చితాంఘ్ర్యంబుజ
శ్రీయుక్తుండగు నాజిభూవరుఁడు నిస్సీమానుకంపామతిన్
శ్రేయోదాయకుఁడై చెలంగఁగను వాసిం గాంచ కీరీతి దు
ర్ధీయుక్తిన్ ధరణీసుతాధవుని బాధింపంగ యోచించుటల్.

అరరె! మదాజ్ఞకై పడి జోహారని యద్దమరేయిదాఁక ను
ష్పరిగ యజార మింత యెడఁబాయక కావలియుండు మంత్రు లిం
తరయక నన్ను దూఱుట హృదబ్జమునం గన నాథు నెమ్మనం
బురియఁగఁజేసి బాములిడునూహయె తప్పనికారణం బగున్.

అవురా! భర్తృకృపార్ద్రవీక్షణము పాలై యుండమింజేసి యీ
యవనిన్ మానవపాలి కెంతయును హేయంబయ్యె నాజీవనం
బు, విపశ్చిద్వరు లేతదర్థమెకదా బోధింతు రెవ్వేళలన్
“ధవముక్తా తరుణీ తృణాదపి లఘుత్వం యాతి” యం చిమ్మహిన్.

సత్యమృదూక్తి కేవలప్రశాంతతరంబగు వర్తనంబు నౌ
ద్ధత్యవిరక్తి యన్యజనతాపనివారణ సత్ప్రియత్నముల్

బత్యనురక్తి దేవగురుభక్తి యనేకజనిప్రభూత స
త్కృత్యఫలంబుగాఁ గ్రమవిధిన్ వరియించు సరోజలోచనన్.

పుట్టితిఁ బాలవంటికులముల్లసిలం గడువృద్ధుఁడైనఁ జే
పట్టితి శక్రసన్నిభ నృపాలవతంసుని నాజిభూపు నా
చెట్టయొకింత మానినను జేపడునే ధరలోనఁ గీర్తి యె
ప్పట్టుననైనఁ గాంతలకు భర్తృహితం బఖిలార్థదాయియౌ.

ఏమి తలంచిచూచిన మహీస్థలి నాదగు వర్తనంబు విం
తై మనుజుల్ నిరంకుశ విధంబుగ నిచ్చలు నాడుకొంటకున్
సామెతయయ్యెఁగా "మగఁడు చచ్చినముండకు బుద్ధివచ్చు"నం
చేమును జేసికొన్న కొలఁదే యిటులయ్యె నటంచు నెంచెదన్.

శ్రీవరు నాశ్రయించిన విశేషధనం బఖిలార్థికోటికిన్
భావనబుద్ధితో నొసఁగఁ బాల్పడ వచ్చినవాఁడు చచ్చినన్
బోవునె? నన్నుఁ బోలికఁ బూజ్యమనీషఁ బురంధ్రులెల్ల పృ
థ్వీవలయంబునం బతిహితేచ్ఛఁ జరింతురుగాక నిచ్చలున్.

నాకన్నన్ బతి నష్టుఁడై-యేకాంతకు నుండుటకిది యిట్లయ్యెఁ బతిన్
జీకా కొనరించుటచే-నాకల్పముఁ గ్రూరచిత్త యనఁ బేర్వడితిన్.

ఏచెలికినైన భర్తృహి-తాచరణమె ముఖ్యమని వ్యథాళిఁ గనిన నా
యాచరణోద్భూతఫలం-బీచరితము కాంతలార! మీకుఁ దెలిపితిన్.

---

# తీర్మానములు, ౪౨-వ భారతజాతీయమహాసభ-చెన్నపురి

### ౧

### సామ్రాజ్యతత్వము-ప్రతినిరోధక సమ్మేళనము

1927 సం. ఫిబ్రవరిమాసమున బ్రుసెల్సు నగరమున సమావేశమైన సామ్రాజ్యతత్వప్రతిరోధక మహాసభవారు సామ్రాజ్యతత్వమును ప్రతిరోధించుటకు ప్రత్యేకముగ నొక సమ్మేళనము నేర్పరచినందులకీసభవారు తమ ఆమోదమును వెలిపుచ్చుచు, సామ్రాజ్యతత్వముపై గావింపబడు పోరాటమునం దీసమ్మేళనములతో కలసి పనిచేయుటకై అఖిలభారత జాతీయమహాసంఘమువారు గావించిన నిర్ణయము నామోదించుచున్నారు.

### ౨

### చైనాయెడల సానుభూతి

ఈ మహాసభవారు చైనాప్రజల నభినందించుచు, జాతీయవిముక్తికొరకు వారు సాగించుచున్న పోరాటమునందు సంపూర్ణముగ సానుభూతిని దెలుపుచున్నారు. అఖిలభారత కాంగ్రెసుసంఘమువారు తాము చైనాకు పంపదలచిన వైద్యసహాయకదళమునకు ప్రయాణానుమతిపత్రముల నొసగ నిరాకరించిన ప్రభుత్వచర్యను ఖండించుచున్నారు. చైనాలో తమ సామ్రాజ్యాధికారమును బలపరుచుకొనుటకును, చైనాదేశీయులు స్వాతంత్ర్యము సాధించుకొనకుండ నిరోధించుటకును బ్రిటిషు ప్రభుత్వమువారు తిరిగి భారతీయ పటాలముల నుపయోగించినందులకీ సభవారు తీవ్రముగ నాగ్రహమును దెలుపుచున్నారు.

ఇంకను చైనాలోనున్న భారతీయపటాలములను, పోలీసుదళములను అన్నిటిని వెంటనే తిరిగి స్వదేశమునకు పిలిపింపవలెననియు, సామ్రాజ్యతత్వమును ప్రతిఘటించుటలో చైనీయులు, భారతీయులు ఏకకార్యదీక్షాపరులగుటచే ఇకమీద భారతీయు లెవ్వరును బ్రిటీషుప్రభుత్వమువారి ఏజంటులుగ, చైనాదేశీయులకు ప్రతికూలముగ పనిచేయుటకు చైనాకు వెళ్లరాదనియు ఈసభవారు కోరుచున్నారు.

మెసపటేమియా పర్షియా దేశములనుండియు, బ్రిటిషు కాలనీలనుండియు, ఇతరదేశములనుండియు భారతీయ పటాలములను, పోలీసుదళములను, రాయబారివర్గ రక్షకపటాలములను వెంటనే పిలిపింపవలెనని ఈ జాతీయమహాసభవారు గోరుచున్నారు.

### ౩

### ప్యాసుపోర్టుల నిరాకరించుట

విదేశముల దర్శించుటకు వెడలగోరు భారతీయులలో కొందరకును, భారతదేశమును దర్శింపగోరు భారతీయులకును పాస్‌పోర్టుల నిరాకరించుటలో ప్రభుత్వమువా రవలంబించుచున్న విధానమును సభవారుఖండించుచున్నారు. అనవసరమగు పాస్‌పోర్టుల కర్మకాండమంతను వెంటనే రద్దుచేసి భారతదేశమునకు వచ్చుటకును, తిరిగి వెళ్లుటకును సంపూర్ణముగ స్వేచ్ఛనొసగవలెనని ఈ సభవారు గోరుచున్నారు. పార్లమెంటు సభ్యుడగు సాపుర్జీ సకలత్వాలాగారు భారతదేశమునకుజనుట కొసగబడిన ప్రయాణానుమతిపత్రమును రద్దుచేసి అతనిని తన స్వదేశమునకు వెళ్లకుండ నిరోధించి ప్రవాసితునిగ నొనర్చినందులకు బ్రిటిషు ప్రభుత్వమువారి చర్య నీ సభవారు ఖండించుచున్నారు. తనను బలపరచుటకు రెండవవ్యక్తి యైనను సాధారణముగ గనుపింపని పార్లమెంటుసభయందు ఎంత ప్రాతికూల్యమును, కష్టములను ఎదుర్కొనవలసివచ్చినను నిరంతరము భారతదేశ స్వాతంత్ర్యముకొరకు నిలిచిపోరాడుచున్న సకలత్వాలాగారి ధైర్యసాహసముల నీసభవారెంతయు ప్రశంసించుచున్నారు.

## ౪

## రాబోవు మహాసంగ్రామము

భారత దేశమునందును, ప్రాక్సముద్రములయందును, అందు ముఖ్యముగ భారతదేశమున పశ్చిమోత్తర పరగణాలయందును బ్రిటిషు ప్రభుత్వమువారు గావించుచున్న అసాధారణమగు విస్తారసమరసన్నాహముల నీసభవారపరిమితాందోళిత హృదయములతో పరికించుచున్నారు. ఈసంగ్రామసన్నాహములు భారతీయుల స్వాతంత్ర్య ప్రయత్నములను అణచివైచి భారతదేశమున బ్రిటిషు సామ్రాజ్యాధికారమును దృఢతరముగ నొనర్చుకొనుట కుద్దేశింపబడుటయేకాక ఇందువలన వినాశకరమగు సంగ్రామ మనతికాలమున సంభవించి, ఆ సమయమున విదేశీయులు తమసామ్రాజ్యమును విస్తరింపజేసికొనుటకు భారతదేశమును సాధనముగ నొనర్చుకొనుటకు ప్రయత్నించెదరు.

భారతదేశప్రజలకు తమ ఇరుగుపొరుగువారితో నెట్టివివాదముగాని, పోరసులుగాని లేవనియు, వారితోకలసి శాంతముగ జీవింపగోరుచున్నారనియు, ఏ సంగ్రామమునందైనను పాల్గొనుటయా లేదా యనువిషయమును నిర్ణయించుకొనుటకు వారికి సంపూర్ణమగుహక్కు గలదనియు ఈకాంగ్రెసుసభవారు ప్రకటించుచున్నారు.

ఈ సంగ్రామ చిహ్నములను అంత మొందింపవలసినదనియు, బ్రిటిషుప్రభుత్వమువారు భారతదేశమున సంగ్రామమును ప్రకటించి, తమ సామ్రాజ్యమును విస్తరింపజేసికొనుటకు భారతదేశము నుపయోగించుకొన ప్రయత్నించునెడల, అట్టిసంగ్రామమున పాల్గొనుటకుగాని, ఏవిధముగనైనను సహకార మొనర్చుటకుగాని భారతీయులెల్లరును నిరాకరింపవలసినదనియు ఈసభవారు ప్రకటించుచున్నారు.

## ౫

## బహిష్కరణ తీర్మానము

భారతవర్షముయొక్క స్వయంనిర్ణయ హక్కును కేవలము తృణీకరించి బ్రిటిషుప్రభుత్వము స్టాట్యూటరీ రాయల్ కమిషనును నియమించినందున సమరుకమిషనును సర్వవిధముల బహిష్కరించుటయే భారతవర్షము అవలంబింపవలసిన ఆత్మగౌరవకరమగు ఏకైకమార్గమని ఈజాతీయమహాసభవారు తీర్మానించుచున్నారు. బహిష్కరణ మీక్రిందివిధమున గావింపవలెను:

(ఏ) దేశమునందుండెడి కాంగ్రెసుసంఘములన్నియును.

(౧) కమిషను భారతదేశమునం దడుగిడిన రోజుననే బహిష్కరణమున కనుకూలముగ ప్రజాభిప్రాయప్రకటన ప్రదర్శనమున కేర్పాటులు దేశమం దంతటను గావింపవలెను. కమిషను సందర్శించెడి వేర్వేరుపట్టణములందును అట్టిఏర్పాటులే కావింపబడవలెను.

(౨) కమిషనును సంపూర్ణముగ బహిష్కరించుటకై వివిధరాజకీయపక్షములవారిని బురికొల్ప ప్రజాభిప్రాయమును ప్రచారము మూలమున బలపరుపవలెనని తీర్మానించుచున్నారు.

(బి) భారతదేశమందలి శాసనసభలలోని అనధికార సభ్యులును, వివిధరాజకీయపక్ష నాయకులును, సంఘనాయకులును, తదితరులెల్లరును కమిషనువారియెదుట సాక్ష్యమొసంగరాదనియు, ప్రత్యక్షముగగాని, ఆంతరంగికముగగాని ఎట్టిసహకారము గావింపరాదనియు, కమిషనువారి కొసంగెడి విందులకు హాజరగుటగాని, అందు పాల్గొనుటగాని గావింపరాదనియు ఈసభవారు తీర్మానించుచున్నారు.

(సి) శాసనసంస్థలందుండెడి అనధికారసభ్యులెల్లరును

(౧) ఈకమిషను సందర్భములో నియమింపబడనుండు ఉపసంఘములకు సమ్మతుల నొసంగరాదనియు, అట్టి ఉపసంఘములపై పనిచేయరాదనియు తీర్మానించుచున్నారు.

(౨) మరియు కమిషనువారి పనులకయి అయ్యెడి వ్యయమునకుగాను శాసనసభలం దుపపాదింపబడు గ్రాంటునుగాని, ప్రతిపాదనసుగాని దేని నయినను ఓడింపవలెననియు తీర్మానించుచున్నారు.

(డి) భారతశాసన సంస్థలందున్న అనధికారసభ్యు లెల్లరును తమ సభ్యత్వములు రద్దుగాకుండ నుండుటకు గాని, లేక బహిష్కారోద్యమమును బలపరుచుటకు గాని, లేక మంత్రివర్గము నోడించుటకు గాని, లేక భార



ప్రాత అధ్యక్షులు, క్రొత్త అధ్యక్షులు

౪౨-వ జాతీయమహాసభ-చెన్నపురి

తీయాశయములకు ప్రతికూలమని కార్యనిర్వాహక వర్గమువారు తలంచుచు చేయునట్టి ప్రతిపాదనల నెదుర్చుటకుగాని శాసనసభలకు హాజరుగావలయు నేకాని ఇతరసమయములందు శాసనసభల కరుగరాదు.

(ఇ) బహిష్కారమును బలయుతమును, సంపూర్ణమును గావించుటకయి సాధ్యమైనతావులందు తాము ఇతరసంఘములతోను, పక్షములతోను సంప్రతించి, వారి సహకారమును బొందుటకై వర్కింగుకమిటీవారి కీజాతీయమహాసభవా రధికార మొసంగుచున్నారు.

౬

## సంపూర్ణ స్వాతంత్ర్యతీర్మానము

సంపూర్ణజాతీయ స్వాతంత్ర్యము భారతదేశీయుల

ఆవర్యనుని ఈజాతీయ మహాసభవారు ప్రకటించుచున్నారు.

శిక్షల పాలైనవారి కుటుంబములకు మనఃపూర్వకముగ తమ సానుభూతి నంపజేయుచున్నారు.

౭

## బెంగాలు నిర్బంధితులు

౧౮౧౮ సం. ౩ వ రిన్యులేషనుక్రిందను, ౧౯౨౫ సం.పు బెంగాలు క్రిమినల్ లాసవరణచట్టముక్రిందను నిరపరాధులగు పౌరులను, కాంగ్రెసు సేవకులను విచారణ లేక అంతులేనికాలమునకు కారాగారముల పాల్చేసి, నిర్బంధవిధానము ననుసరించుచున్న భారతప్రభుత్వముయొక్కయు, బెంగాలుప్రభుత్వముయొక్కయు పరిపాలనావిధానమును జాతీయమహాసభవారు తీవ్రముగ ఖండించుచున్నారు. సదరుప్రభుత్వ నిర్బంధవిధానమునకు గురియై మాతృదాస్యవిమోచనకై పలుకష్టములనంది, ప్రస్తుతమిడుములకు లోనగుచున్నట్టివా రందరకును స్నేహపూర్వకముగ ధన్యవాదముల నంపజేయుచున్నారు.

(అ) ౧౯౨౫ సం. బెంగాలు క్రిమినల్ లా సవరణచట్టముక్రింద నిర్మితములైన ప్రత్యేక న్యాయస్థానములచే శిక్షింపబడిన రాజకీయనిర్బంధితులయొక్కయు, విచారణలు లేక నిర్బంధమునందుంపబడిన ప్రవాసితుల యొక్కయు సత్వరవిమోచనమును కాంగ్రెసువారు కోరుచున్నారు.

(ఆ) 1818 సం.పు వంగదేశ సంస్థాన నిర్బంధితుల 3 వ రిన్యులేషన్ క్రింద సర్దార్ శాంతిసింగుగారిని నిర్బంధించినందులకు ప్రభుత్వమువారి చర్యను కాంగ్రెసు సభవారు తీవ్రముగ ఖండించుచున్నారు.

౮

## కాకోరీనిర్బంధితులు

కాకోరీకేసునందు శ్రీయుతులు యస్. రామప్రసాదుబిస్మల్, రాజేంద్రనాథలాహిరి, అమఫ్‌గుల్ల, రోషన్ సింగుగార్లపై విధింపబడిన అమానుషశిక్షలపై ప్రజ లత్యంతాగ్రహము ప్రకటించినను గూడ దానిని లక్ష్యపెట్టక శిక్షలను తగ్గింపకుండుటలో ప్రభుత్వమువారు వహించిన అలక్ష్య భావమునకు ఈ జాతీయమహాజనసభవారు మిక్కిలి విచారమును వెల్లడించుచు,

౯

## జనరలు అవారీగారు

నాగపూరు ఆయుధశాసనోల్లంఘన సత్యాగ్రహ నాయకు లగు జనరలు మంచర్ష అవారిగారును, వారి అనుచరులును దృఢమగు దేశాభిమానమును, స్వార్థత్యాగమును వెల్లడించినందుకు ఈ జాతీయమహాసభవారు అభినందించుచు, అవారిగారు ఆహారనిరసనవ్రతము బూనిన యీ 75 వ దినమున వారియెడల సానుభూతి దెల్పుచున్నారు.

౧౦

## భారత బర్మాదేశముల సంయోగము

బర్మాను భారతదేశమునుండి ప్రత్యేకించుటకు జరుగు ప్రయత్నము లన్నిటిలో ఈజాతీయమహాసభవారనంగీకారమును ప్రకటించుచు, పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్ర నిర్మాణాభిప్రాయము ఖండించుచున్నారు.

భారతీయులకును, బర్మాదేశీయులకును భారత బర్మాసంయోగమును సాధ్యమైనన్ని విషయముల పరస్పరము బలపరచుటకై కాంగ్రెసువారు విజ్ఞప్తి గావించుచున్నారు.

౧౧

## బ్రిటిషువస్తు బహిష్కారము

బ్రిటిషువస్తు బహిష్కారమునకై అఖిలభారత కాంగ్రెసు సంఘమువారు గావించిన తీర్మానమును తిరిగి బలపరచుచు రాష్ట్రీయ కాంగ్రెసు సంఘములనా రీతీర్మానము నాచరణలో పెట్టుటకై తగినఏర్పాటులను గావింపవలయును.

౧౨

## స్వదేశసంస్థానములు-బాధ్యతాయుత ప్రభుత్వము.

భారతవర్ష మందలి సంస్థానాధీశులయొక్కయు, అట్టి ప్రజలయొక్కయు క్షేమములను పాటించిన గాని స్వదేశ

సంస్థానములందు త్వరలో ప్రజాప్రతినిధిసంస్థలద్వారా బాధ్యతాయుత ప్రభుత్వమును స్థాపింపవలయునని తీర్మానించుచున్నారు.

## ౧౩

## దక్షిణాఫ్రికాలోని భారతీయులు

దక్షిణాఫ్రికాయందు యూనియను ప్రభుత్వము వారు భారతీయుల నెక్కువ వాత్సల్యముతో జూచుట కభిలాష గలవారని తెలుపుటకు నిదర్శనముగ నంగీకరింపబడిన ఇండోయూనియను ఒడంబడికను ఈ కాంగ్రెసు సభవారు అంగీకరించుచు, భారతీయనివాసులకు యూనియను ప్రభుత్వమునందు ఓటింగు అధికారముగల యితరప్రజలతో సరిసమానపుగు హక్కు లొసంగినగాని సంతృప్తి నొందజాలమని తమ అభిప్రాయమును దెలుపుచున్నారు. యూనియను ప్రభుత్వము వారువర్ణభేదముల చట్టము, భారతీయులను హోటల్సులో నౌఖరులుగ నియమింపరాదని విధించుచట్టము, మునిసిపలు స్థలముల ప్రత్యేకించు నేటాలుచట్టము మున్నగు జాతిభేదము ననుసరించుకొనియున్న చట్టములను రద్దుపరిచి ఉభయదేశములమధ్య నూతనముగా గల్గిన సఖ్యమును పెంపొందించవలెనని కోరుచున్నారు.

తూర్పుఆఫ్రికాలోను,దక్షిణఆఫ్రికాలోను భారతీయుల ప్రతిపత్తి నధికము చేయుటకు మానవసేవకు లెక్కువ పాటుబడిన దీనబంధు సి. యఫ్. ఆండ్రూసు గారికి కాంగ్రెసువారు హృదయపూర్వకముగ కృతజ్ఞత దెలుపుచున్నారు.

## ౧౪

## తూర్పు ఆఫ్రికాలో భారతీయులు

1. తూర్పు ఆఫ్రికను ఫెడరేషనుకమిషను భారతీయప్రతినిధు లెవరు లేకుండ నియమించి, బాధ్యతాయుత ప్రభుత్వ మనునెపమున అచ్చటి అమాయకులగు దేశీయులను, ఐరోపియనులు చేరకమునుపె పోయి వారితో అనేకశతాబ్దములనుండి సఖ్యముగా నుండిన భారతీయులను అణచివేయుటకు ఐరోపియనుల కెక్కువ అధికారమిచ్చు విధానమును ఈ కాంగ్రెసువారు తీవ్రముగ నిరసించుచున్నారు. 2. టాంగనైకా మాండేటునందు ఐరోపియనులకు మాత్రము ప్రత్యేకముగ ఉన్నత స్థలముల నేర్పాటుచేయుచుండుటవలన చాలప్రమాదము గలదనియు, జాతిసమితివారు ఈవిషయమున శ్రద్ధవహింపవలెననియు కోరుచున్నారు. 3. కెన్యాస్థానికస్వపరిపాలనముగూర్చి ఫీనముకమిటీవారి రిపోర్టు నెయిరోబీ, మొంబాసాలయందు ఐరోపియనులకె లెక్కకుమించి ప్రాతినిధ్యము అన్యాయముగ నొసంగినందున దాని నిరసించుచు, తూర్పుఆఫ్రికా భారతీయులు సరిసమానస్వత్వము కొరకు ఆందోళన పూర్తిగ కొనసాగించెదరని నమ్ముచున్నారు.

## ౧౫

## హిందూముస్లిము సఖ్యము

### ౧ వ రాజకీయపు హక్కులు.

కాంగ్రెసువారు ఇట్లు తీర్మానించుచున్నారు:- ముందు సూచింపబడు రాజ్యాంగవిధానమునందు రాష్ట్రశాసనసభలయందును, కేంద్రశాసనసభయందును సమష్టినియోజకవర్గముల నేర్పాటుచేయవలెను.

రెండు పెద్ద సంఘములకు, శాసనసభలవిషయమున వారివారికిగల న్యాయమగు హక్కులకు ఎట్టి భంగము కలుగకుండుటకై, వారుకోరినచో, సమష్టి నియోజకవర్గములందే,ఆయాసంఘములకు జనసంఖ్య ననుసరించి ప్రతినిధులసంఖ్య ప్రత్యేకించి యుంచవలెను.

పంజాబులో అల్పసంఖ్యాసంఘములకు అనుకూలముగ కొన్నిసౌకర్యములను ఒసంగవచ్చును. శాసన సభాప్రాతినిధ్యము విషయమున అల్పసంఖ్యా సంఘములకు నిర్ణీతసంఖ్యకన్న నెక్కువప్రాతినిధ్యము గావలెనన్నచో, తా మధిక సంఖ్యగానున్న యితరరాష్ట్రములందు ప్రతిపక్షమువారి కట్టి సౌకర్యము నొసంగుటకు అన్యోన్యానుకూలమగు ఒడంబడిక నేర్పరచుకొనవలెను. దానిననుసరించియే పంజాబులోని అల్పసంఖ్యాకులకు సౌకర్యమొసంగబడును. ఉభయపక్షములవారికి రాష్ట్రములందు

ఈ ఒడంబడికననుసరించి ప్రాతినిధ్యమునందెట్టివ్యత్యాసము ముంచబడునో కేంద్రశాసన ప్రతినిధుల సంఖ్యవిషయము నకూడ అట్టి వ్యత్యాసమే యుండును.

పంజాబులో శాసనసభా స్థానముల ప్రత్యేకించుటనుగూర్చి తీర్మానించునపుడు సిక్కులనుగూడ ముఖ్యమయిన అల్పసంఖ్యాక సంఘముగనెంచి వారిహక్కులగూర్చి పూర్తిగ విచారించుటయగును.

పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రమునందు, బ్రిటిషు బెలూచిస్థానమునందు ఇతర రాష్ట్రములలో వలెనే సంస్కరణముల ప్రతిపాదింపవలెనని మహమ్మదీయ నాయకులు గావించినసూచన చాల న్యాయముగ నున్నదని కాంగ్రెసువారు తలంచుచున్నారు. ఇది వెంటనే అమలు జరుపవచ్చును. పరిపాలనా విషయమగు ఇతర సంస్కారములతోసాటు న్యాయపరిపాలనా విధానమునందు గూడ తగిన సంస్కారము ప్రారంభింపవలెను.

సింధును ప్రత్యేకరాష్ట్రముగ వేరుచేయవలెనను సూచనగూర్చి భాషాప్రయుక్తరాష్ట్ర విభజనమునకు తగిన అవసరముగలదని, కాంగ్రెసువారుతలంచుచున్నారు. కాంగ్రెసు నిర్మాణమునందు ఈసూత్ర మంగీకరించబడెను. వెంటనే భాషలననుసరించి రాష్ట్రముల విభజించవలెను; అట్టి యేర్పాటును ఏరాష్ట్రమయినను తాను కోరినచో వెంటనే ఒసగవలెను.

ముందుగ ఆంధ్ర, ఉత్కళ, సింధు, కర్నాట రాష్ట్రములను ప్రత్యేకరాష్ట్రములుగ నేర్పాటు చేయవచ్చును.

స్వరాజ్యవిధానమును తయారుచేయుటలో అంతఃకరణస్వాతంత్ర్యమునకు మనము భద్రమును కలుగజేయవలెను. ఈస్వాతంత్ర్యమును భగ్నము చేయునట్టి చట్టములను జేయుటకు భారతశాసనసభకు, రాష్ట్రశాసనసభకు గూడ నెట్టి అధికారము నుండకూడదు.

నమ్మకము, ఆరాధనము, మతానుష్ఠానము, సాహచర్యము, మతవిద్య, మతప్రచారము మున్నగువానిని, ఇతరులకు అట్టి విషయములలో భంగము కలుగకుండ నెరవేర్చుటకు వ్యక్తులకుగల స్వాతంత్ర్యమే అంతఃకరణ స్వాతంత్ర్యము.

రాష్ట్రశాసనసభయందు గాని, కేంద్రశాసనసభయందుగాని ఏదేనియొక సంఘమునకు చెందిన సభ్యులలో ¾ వంతు సంఖ్య అభ్యంతరము దెలిపినచో, సాంఘికవిషయములకు సంబంధించినతీర్మానములనుగాని, చట్టరూపములనుగాని సభలో చర్చకు దేరాదు; చర్చ చేయరాదు; ఆమోదింపరాదు. "సాంఘిక విషయములకు సంబంధించినవి" అనగా శాసనసభలలోని హిందూమహమ్మదీయ సభ్యులనుండి యెన్నుకొనబడిన జాయింటు స్టాండింగు కమిటీవారు ఆరీతిగా నిర్ణయించునవి.

## ౨ మతవిషయమగు హక్కులు.

కాంగ్రెసువా రిట్లు తీర్మానించు చున్నారు:—
తమ యిష్టమువచ్చినచోట వాద్యములతో ఊరేగింపు జరుపుకొను హిందువులహక్కులకును, తమ యిష్టము వచ్చినచోట గోవులను వధచేయుట లేక బలివేయుటకు గల మహమ్మదీయులహక్కులకును భంగము కలుగకుండ, వీలయినంతవరకు గోవధ విషయమున హిందువుల కోర్కెను మన్నించవలెనని మహమ్మదీయులును, మసీదులయెదుట వాద్యములవిషయమున వీలయినంతవరకు మహమ్మదీయుల అభిప్రాయమును మన్నించవలెనని హిందువులును తమ తమ సంఘములవారికి హెచ్చరికలు చెల్పుచున్నారు.

కావున హిందువులు, మహమ్మదీయులుగూడ ఈవిషయమునందు దౌర్జన్యమునకు గడంగరాదని కాంగ్రెసువారు కోరుచున్నారు.

అన్యమతస్థులను సహేతుకముగ వాదించి, బోధచేసి, ప్రోత్సహించి తన మతములోకలుపుకొనుటకు ప్రతివ్యక్తికిని, ప్రతిసంఘమునకు హక్కుగలదు. కాని యెవ్వరుగూడ బలవంతముగ వారింప యత్నింపరాదు. మోసముచేసి, గాని, భౌతిక ప్రలోభనములజూపి కాని మతాంతరీకరణము లొనర్పరాదు. 18 ఏండ్లలోపు వారిని వారి తలిదండ్రులతో దప్ప విడిగా అన్యమత

ములోనికి చేర్చుకొనరాదు. 18 ఏండ్లలోపువారు అనాథలుగ దొరకినప్పుడు వారిని వారిమతమువారి కొప్పగించవలెను. ఒకమతమునుండి వేరొక మతములోనికి మార్చునపుడు ఆవ్యక్తినిగూర్చికాని, స్థలమునుగూర్చికాని, సమయమునుగూర్చికాని యెట్టి రహస్య ముండరాదు. ఆకార్యము నెరవేరినపిదప అమితోత్సాహప్రదర్శనము లేమియు నుండరాదు.

మతాంతరీకరణముగూర్చి బలవంతముగ, లేక రహస్యముగ జరిగినపనికాని, మోసముచే జరిగినపనికాని, అక్రమముగ జరిగినదనికాని ఫిర్యాదులు వచ్చినను, లేక 18 లోపువారిని అన్యమతస్థులు స్వీకరించినను ఆవిషయమును వర్కింగుకమిటీవారిచే నియమింపబడు మధ్యవర్తులు విచారించి పరిష్కరించవలెను.

౧౬

స్వరాజ్యప్రభుత్వప్రణాళిక

దేశమునందుగల వేర్వేరు రాజకీయపక్షములు స్వరాజ్యప్రభుత్వ ప్రణాళికను తయారుచేయుట కేకమనుట కభిలషించుచుండుటచే, కార్యనిర్వాహకసంఘము వారీసభవారియెదుట నుంచిన చిత్తుప్రణాళికలను, ఇతరులొసగిన సలహాలను సమగ్రముగ నవలోకించి, ఇతర రాజకీయ కార్మిక సాంఘికపక్షములచే నిందునిమిత్తము నియమింపబడు ప్రత్యేకసంఘములతో కలసి చర్చించి, స్వరాజ్య ప్రణాళికను తయారు చేయవలసినదని కార్యనిర్వాహకసంఘమువారిని గోరుచున్నారు. ఆప్రణాళిక యందు ప్రబల పౌరసత్త్వపు హక్కులనుగూడ నిర్వచింపవలెను. ఆవిధముగ తయారుచేసిన ప్రణాళికను చర్చించుటకు మార్చినెలలోగా ఢిల్లీలో ప్రత్యేకముగ నొక కన్వెన్షనును సమావేశ పరుపవలెను. ఆసమావేశమునకు అ. భా. జాతీయోప సంఘసభ్యులు, పై నుదాహరించిన ఇతరసంస్థలనాయకులు, ప్రతినిధులు, కేంద్రరాష్ట్రీయ శాసన సభయందలి ప్రజాప్రతినిధులు ఆహ్వానింపబడవలెను.

౧౭

౧. కార్యదర్శులు

గత వత్సరము కార్యదర్శులుగ నుండి అమూల్యమగు సేవ యొనర్చిన ఎ.రంగస్వామి అయ్యంగారు, వల్లభాయి పటేలుగార్లకు కృతజ్ఞతను దెలుపుటకు దీర్మానించుచున్నారు.

1928 సంవత్సరమునకు— 1. షూయిబ్ కొరేషీ, 2. జవాహిర్‌లాలు నెహూర్, 3. సుభాష్‌చంద్రబోసుగార్లను కార్యదర్శులుగ నెన్నుకొనవలెనని తీర్మానించుచున్నారు.

కోశాధికారులు

1928 సంవత్సరమునకు జమ్నాలాలు బజాజ్, రేవాశంకర జగ్జీవనుగార్లను కోశాధికారులుగ నెన్నుకొనవలెనని తీర్మానించుచున్నారు.

రాబోవు కాంగ్రెసు

రాబోవు కాంగ్రెసును కలకత్తాలో జరుపవలెనని తీర్మానింపబడెను.

# తీర్మానములు, సంఘసంస్కరణ మహాసభ-చెన్నపురి

౧

## స్త్రీల హక్కులు

స్త్రీ పురుషులకు సర్వ పౌరత్వపు హక్కులు, స్వాతంత్ర్యములు సమానముగ గలవను సిద్ధాంతము నీ సభవారు నొక్కి చెప్పుచున్నారు. వివాహ శాసనములు, దత్తస్వీకారము, సంతానముపై నధికారము, దాయార్హత మున్నగు విషయములలో స్త్రీ పురుషులకు పాటింపబడుచున్న విభేదముల నన్నిటిని తొలగింప వలసినదని యీ సభవారు బలముగా శిఫారసు చేయుచున్నారు.

౨

## వివాహ సంస్కరణము

ఈ దేశములో స్త్రీ పురుష లారోగ్యవంతులై, బలాఢ్యులుగ పెరుగుటకు వివాహయోగ్యవయస్సు బాలురకు ౨౧ యేండ్లనియును, బాలికలకు ౧౬ యేండ్లనియును నిర్ణయించుట యత్యావశ్యకము. పురుషులెల్ల రేకపత్నీవంతులై యుండునట్లును,తగిన కారణము లుండినచో విడియాకు లిచ్చుహక్కుండునట్లును నిర్ణయింప వలెనని సలహా యిచ్చుచున్నారు.

లెజిస్లేటివు అసెంబ్లీయందు శారదాగారు ప్రవేశపెట్టిన బిల్లులో నిమిడియున్న ధర్మము నామోదించుచున్నాము. మదరాసు లెజిస్లేటివు కౌన్సిలులో బాల్య వివాహ నిషేధమునకై శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు ప్రవేశపెట్టిన బిల్లును, బొంబాయికౌన్సిలులో దౌలత్ రామగారి బిల్లును నామోదించుచున్నారు. ఈ బిల్లులను గూర్చి విచారించుటకొరకు కమిటీ యేర్పాటు చేయబడినది. సర్ శంకరన్ నాయరు, డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డి, టి. వరదరాజులునాయుడు, సి. వి. విశ్వనాథశాస్త్రి గార్లిందు సభ్యులు. వీరు తమ కనుకూల మైనచో క్రొత్త సభ్యులను చేర్చుకొన వచ్చును. వీరు ఆ బిల్లులను చర్చించి యీ తీర్మానములోని ప్రథమభాగము ననుసరించి, లెజిస్లేటివు అసెంబ్లీలోని సెలెక్టు కమిటీ వారికిని, ముత్తులక్ష్మి రెడ్డిగారికిని, దౌలతురామగారికిని నేమైన సలహాలను, మార్పులను సూచింపవచ్చును.

దేశమంతటను హిందూవితంతువుల కష్ట జీవనమును చక్కజేయుటకు గావింపబడుచున్న ప్రయత్నములయెడల నీసభవారు సంతృప్తిని దెలుపుచున్నారు. (1) హిందూవితంతువులకు స్వతంత్రము, గౌరవనీయమునైన జీవనము గడుపుటకు తగిన విద్యాబుద్ధులు నేర్పుటయు, (2) వారికిష్టమైనచో పునర్వివాహములు జేసికొనుటకు తగినయవకాశము లధికము సేయుటయు సంతృప్తికరములుగా నున్నవి. ఈసంపర్కములో మైలాపూరులోని స్త్రీసేవాగృహము వారు, త్రిచినాపల్లిలోని శారదాగృహము వారు, గుంటూరులోని శారదానికేతనమువారు, బొంబాయి, పూనా సేవాసదనములును గావించుచున్న సేవ నిరుపమానముగ నున్నదని చెప్పవలయును. దేశములోని యితర ప్రాంతములందు గూడ నిట్టి సేవాశ్రమములను స్థాపించి స్త్రీలను లాభకరములైన వృత్తులలో ప్రవేశపెట్టుటకు దోడ్పడెదరు గాక!

హిందూ వితంతువులకు కేశఖండనాది వికృతములు సేసియు, లోక సామాన్య సుఖములు పొందుటకు గూడ నిషేధించియు గావింపబడుచున్న యపచారముల నీ సభవారు ఖండించుచున్నారు. అవసరమైనచో నీ దురన్యాయములను శాసన రూపమున నిషేధింపవలయునని కోరుచున్నారు.

వివాహములలో కట్నములు కోరుట పరమ దుష్టము. దీనివలన నిదివరకే యనేక సంసారముల కపారములైన యార్థిక నైతిక కష్టనష్టములు సంభవించినవి. సంఘసంస్కర్తలెల్లరును నీ దుష్కార్యము నాపుటకై తీవ్రముగా ప్రచారము సేయగోరుచున్నాము.

### ౩
### ఘోషా విసర్జనము

హిందువుల చేతను, మహమ్మదీయుల చేతను నవలంబింప బడుచున్న ఘోషాపద్ధతి స్త్రీల యభివృద్ధికి నాశన హేతువుగాన దానిని తొలగింప వలయు నని కోరుచున్నాము.

### ౫
### సమాన నీతి నియమములు

స్త్రీ పురుషు లందరికిని నీతి నియమప్రమాణములను సమానముగానే విధింపవలయును. మదరాసు విజిలెన్సు సంఘమువారు తయారుచేసిన బిల్లు ప్రకారము వ్యభిచారమును మాన్పుటకై శాసనములను చేయింపవలయునని కోరుచున్నారు.



అఖిలభారత సంఘసంస్కరణమహాసభ-చెన్నపురి

### ౪
### దేవదాసీ సంస్కరణము

బాలికలను, యువతులను, గౌరవములైన జీవనములు గడపుట కవకాశము లేకుండ వారిని దేవాలయములలో దాసీలుగా సమర్పించు పద్ధతి నీ సభవారు ఖండించుచున్నారు. దేవదాసీల నైతికార్థిక సాంఘిక విముక్తికై డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారు శాసనసభలో ప్రవేశ పెట్టిన బిల్లు నీసభవా రామోదించుచున్నారు.

### ౬
### అస్పృశ్యత

హిందూదేశములో నస్పృశ్యత యింకను నిలిచి యుండినచో ననేక దోషము లుత్పాదిల్ల గలవు. హిందువులలో నన్నివర్ణముల వారును నీ యస్పృశ్యతను నశింపజేయవలయును. స్కూళ్లు, కాలేజీలు, హాస్టళ్లు, రాజ

వీథులు, నూతులు, చెరువులు, సత్రములు, దేవపూజా స్థలముల విషయములలో నస్పృశ్యుల పాటింపక హిందూ సంఘములో బలవత్తరమైన నైక్యమును ప్రతిష్ఠింప వలయును. జాతి, మత, వర్ణభేదముల వలన కొందరిని జేరనీయని స్కూళ్లకు, కాలేజీలకు గవర్నమెంటువారు గ్రాంటు నీయగూడదని యీ సభవారు కోరుచున్నారు.

౭

సాంఘిక సేవ, శరణాలయములు

అవివాహితలయ్యు బిడ్డలుగన్న తల్లులను, తలిదండ్రులులేని బిడ్డలను, అంగవికలులై నిష్ప్రయోజకులైన పిల్లలను రక్షణము సేయుటకు గృహములు గట్టించి చేయబడుచున్న ప్రయత్నముల యెడల నీ సభవారు సంతృప్తిని వెలిపుచ్చుచున్నారు.

౮

సాంఘిక శాసనములు

గవర్నమెంటువారు ధైర్యముతో విశాలదృష్టిగొని సాంఘిక శాసనములు సేయవలసిన సమయ మరుదెంచినది. ఇదవరకు సాంఘికశాసనములు చాల మందముగా చేయబడినందుల కీ సభవారు వగచుచున్నారు. ఏకొలది శాసనములో కావింపబడినను నవి యసంపూర్ణములై నిష్ప్రయోజనములైనవి. లెజిస్లేటివు కౌన్సిళ్లు, అసెంబ్లీలును సంపూర్ణముగ జాతీయ సంస్థలైన గాని సరియైన సాంఘికాభివృద్ధిని జేయజాలవు.

౯

భారతీయైక్యము

సర్వమత వర్ణములను జెందిన సభ్యులతో గూడిన యీ సభవారు విశాలము, అతిప్రాచీనమునైన యీ భరతఖండమునందలి జనులందరును జాతీయైక్యమును, సంఘాభివృద్ధిని గోరి, నానామత వర్ణసంప్రదాయముల వారెల్లరు నేకమై కలసి పోవలయునని కోరుచున్నారు.

మత విశ్వాసములకు సంబంధించిన యవకాశము లేనియు లేని సామాన్యపు సివిలు వివాహ శాసనము నొక దానిని చేయవలయునని కోరుచున్నారు.

అన్నివర్ణముల వారును నితరేతరము వివాహ మాడుచో వారసత్వములను గూర్చినయిబ్బందు లేమియు రాకుండ జేయవలయునని శాసన సభ్యులను గోరుచున్నారు.

ఎవరైన మతమును మార్చుకొనినచో నట్టివారి ననాదరింప వలదని సర్వమతస్థులను గోరుచున్నారు. మత విషయములందు విశాలభావము నంది యెవ్వరుపోయినను ఆదరము ఔదార్యము, స్వతంత్రము పూనవలయునని సర్వ మతస్థులను గోరుచున్నారు.

వర్ణవిభేద పద్ధతి జాతీయైక్యమున కున్నయవరోధములలో ప్రధానము. అది సమూలముగ ఛేదింపబడిన గాని జాతీయైక్యము కుదరదు. ఈ వర్ణవిభేదముయొక్క దోషములను వివరించి దానిని నాశనము సేయుటకై యీసభవారు ప్రచారము సేయుటకు దీర్మానించు చున్నారు.

# తీర్మానములు, అఖిలభారత గానమహాసభ—చెన్నపురి

౧

భారత గానకళ నభివృద్ధి నొందించుటకును, ప్రోత్సాహపరచుటకును శాస్త్రమునకును, అనుష్ఠానమునకును సంబంధించిన సమస్యలన్నిటిని పరిష్కరించుటకును చెన్నపురిలో ఒకగానపరిషత్తు నేర్పరుపవలెనని యీ సభవారు సన్మానసంఘమువారిని కోరుచున్నారు.

౨

గానకళనభివృద్ధి నొందించుటకు ప్రతివత్సరమును భారతగానసభలను జరుపుట మిక్కిలి అవసరము.



అఖిలభారత గానమహాసభ - చెన్నపురి

౩

గానసభలలోను గానపాఠశాలలలోను శ్రుతిగాను, ఉపాంగముగానుగూడ హార్మోనియముల నెంతమాత్రమును వాడగూడదు.

౪

గాత్రపాట నభ్యసించువారికి గానశాస్త్రముతోపాటు శారీరశాస్త్రమునుగూడ ముఖ్యముగా బోధింపవలెను.

౫

గానసభలలో ఉపాంగములు చాల హెచ్చుగానుండినచో సారస్యమునకు భంగము కలుగును గాన ఒకఫిడేలును (లేక మరియొక తీగెలుగల ఉపకరణము) ఒక మృదంగము (లేక మరియొక తాళానుగుణ్యమగు నుపకరణము) మాత్రమే యుంచవలెను.

౬

గానమును వ్రాయుటకు స-రి-గ-మ మున్నగు సప్తస్వరములను వాడవలెను.

౭

భరతాచార్యుడును, శార్ఙ్గదేవాచార్యుడును నిర్ణయించిన ప్రకారము పంచమమధ్యములలో 22 శ్రుతులు కలవు. వాని నీసభవారు నిర్ణయించుచున్నారు.

౮

72 మేళకర్తల సిద్ధాంతమే సరియైనదని యీ సభవారు స్థిరపరుచుచున్నారు.

౯

గాయకులు తాము పాడునట్టి పల్లవి, కృతి, కీర్తన మున్నగువానిలోనుండు పదములు (సాహిత్యము) స్పష్టముగాను, నిర్దుష్టముగాను వినబడునట్లు పాడుటత్యవసరమని ఈసభవారు హెచ్చరించుచున్నారు.

---

# వానకోయిల

మిన్నికంటి గురునాథ శర్మ గారు

ప్రీతిఁ జాతక, బడివెళ్లెదు వృథగ- నీతండు ఘనుఁడుగాఁ డిభమదాంధుండు.
ఖ్యాతిగ నీవంటికవులకొసఁగఁడు- మాతంగదానమ్ము మధుపాళిపోలె.

పొందిక విన్మ నాపలుకుపోలిక నెచ్చెలి, వానకోయిలా,
ఎందఱో మింట మేఘులు నసింత్రు స్వభావవిభేద మొప్పఁగాఁ
గొందఱు వృష్టిచేఁ బుడమికుందు నడంత్రు వృథాగ గర్జలం
గొంద ఱొనర్తు రట్లగుటఁ గోరకు చూచినవారి నందఱన్.

ఇమ్మా! ఇమ్మా! జలము ఘ-నమ్మా, నమ్మినఁ జెఱుప ఘనమ్మా! సారం
గమ్మా దప్పిం బడలె తృ-ణమ్మాఁగిన నెట్టివార్త నాపవిఁ బడునో?

ఇచ్చెదవా? లేదా? జల-మచ్చుగ, జలద నిను నమ్మినది చాతక మే
పొచ్చెము గలిగిన దగచే-జచ్చునుగా కొరుల వేఁడ జాలదుసుమ్మా!

నిరవలంబనముగ నింగి నిలిచి నోరు-దెఱచి దీర్ఘకాలమ్ము ప్రార్థించు చాత
కమునకున్ నీటి మాటకేమి? మధురస్వ-నమ్మునైన విన్పింప నర్హమ్మ, యేల?

నిన్నడిగి వానకోయిల-కన్నుల నెన్నింటి నశ్రుకణముల వదలెన్
దిన్నఁగ జలకణముల నీ-వన్నింటిం గూడ నీయనైతివి జలదా!

చాతకపోతకములు దమ-కై తమకమ్ముతోడ వేఁడ నమృతమ్మును జీ
మూతుఁడు సమస్తభూతల-భూతమ్ములుగూడఁ బ్రీతి పొంద నొసంగున్.

వనధి నదుల్ సరస్సునను బల్వలమందు మఱెందునైన జీ
వన మెలయించికొన్నఁ దలవంపులు గల్గెడి చీ యిదెంత నై
చ్యనిరతియం చటుల్ ననక చాతకసంతతు లంబుదా, నినుం
బనవెడు నట్టులెత్తి; తలవంపులమన్కిఁ గవుల్ సహింతురే?

ఎవరిఁ బరులఁ గోరక ఘనుఁ-డవుగద నిక్షేప మేదొ డక్కననుచు ను
న్నవి చాతకములు నోటం-జివర కకట పిడుగె పడునో? చినుకే పడునో?

వాపి స్వల్పనీరము;సరోవరము విషమ-యమ్ము; నీచావగాహమ్ము హ్రదము; పాద
జలము త్రిపథగ; వారిధి క్షారనీర-మగుటనో? నీవు ఘనుని పయ స్సడుగుట.

"అడవిపువ్వులు"

## సోమనాథ వెల్లటూరు



చిత్రకారుడు: శ్రీరమేంద్రనాథ చక్రవర్తిగారు, ఆంధ్రజాతీయ కళాశాల, బందరు.

ఈయన ఆంధ్రవిశ్వబ్రాహ్మణ యువకుడు. ఆంగ్లమునందు కవిత్వము వ్రాయును. ఇంతవరకు "న్యూఫ్లవర్స్" (New Flowers), "డ్రీమరు" (Dreamer) అను రెండు ఖండకావ్య సంపుటిలను ప్రకటించినాడు. అయ్యవి హరీంద్రనాథ చట్టోపాధ్యాయకవి, కజిన్సు పండితుడు, జినరాజదాస, ప్రిన్సిపాలు జాన్సను, మొద

లను పెద్దలచేతను, న్యూయిండియా, జన్మభూమి, మెయిలు, లీడరు మొదలగు పత్రికలచేతను ప్రశంసింపబడినవి. ఇటీవలనే పరిచయమైన అమెరికాదేశ ప్రఖ్యాత కవయిత్రి థామస్ ఆనీపెయిన్ (Thomas Anne Paine) ఈయన నభినందించుచు ఇట్లు వ్రాసినది.



శ్రీసోమనాథ వెల్లటూర్ గారి ఛాయా చిత్రము

"Before me on my table I have many things,—the most pathetic being The pictured scene of the last supper, The saviour with the look of an agonised saint ............The Most poetic being "New Flowers.........I keep it among my precious papers........."

మరియొకమారు:

"Your Dreamer is an open window to your soul thoughts."

ఇట్టులే యీ యాంధ్రయువకవి ఆంగ్ల సారస్వతారామములలో సంచరించి కవితాకన్యకు కర్ణభూషణమై వర్ధిల్లుగాక!

## శ్రీ నెల్లూరు నాగరాజా రావుగారి

నలపాత్రము



బందరు ఆంధ్రనాటక పరిషత్తువారు చిత్రనళీయమున పాత్రధారణమునకై పోటీపరీక్ష నిర్ణయించిరి. అందు జయమునుగాంచిన నలబాహుక పాత్రధారికి స్వర్ణపతకమును బహుమానముగా నిచ్చిరి. శ్రీరావుగారు విజయమునుగాంచి యీ బహుమతిని బడసిరి.

ఇందు పోటీచేసినవారు:—

1. శ్రీ రాధా కృష్ణనాయనుగారు, చెన్నపురి
2. శ్రీ రాయప్రోలు సుబ్రహ్మణ్యంగారు, చిత్తూరు
3. శ్రీ నెల్లూరు నాగరాజారావుగారు, నెల్లూరు

# భారతీయ మహిళామండలి

ఈమె ప్రకృతము కాకినాడలో సబ్ జడ్జిగానున్న శ్రీ సి. వరదరాజులుగారి కుమార్తె. ఈమెకుపదునొకొం డవయేట భర్త మరణించెను. ౧౯౧౭వసంవత్సరమున తండ్రిగారీమెను సాంఘిక నిర్బంధములను పాటింపక చెన్నపురమున స్వార్థరహితయగు శ్రీ సుబ్బలక్ష్మి అమ్మాళుగారి చే స్థాపితమై, యామెను సమర్థముగ యాజమాన్యమున వెలయుచుఇపుడు 'లేడీవిల్లింగ్డను స్త్రీల ట్రెయినింగు కాలేజి' అను పేరనున్న హైస్కూలున విద్యాభ్యాసమునకై ప్రవేశపెట్టిరి. క్రమముగ నీమె ౧౯౨౩వ సంవత్సరము జూలై నెలలో స్కూలుఫైనలుపరీక్షయందు విజయమును గాంచినది. మరుసటి నెలలో క్వీనుమేరీకాలేజిలో నున్నత విద్యార్జనమునకై ప్రవేశించి ౧౯౨౭వ సంవత్సరము ఏప్రిల్ మాసమున చరిత్ర, అర్థశాస్త్రములయందు మొదటితరగతిలో పట్టభద్రయైనది.



శ్రీ సి. సుబ్బులక్ష్మిగారు, బి. ఏ.

తరువాత యల్. టి. చదువుటకు ప్రారంభించి అనారోగ్యముచే ప్రకృతము మానివైచినది. ఆరోగ్యమును సమకూర్చుకొని యీనెల యం.ఏ. పరీక్షకు చదువబోవుచట. ఈమె ఇటీవలవిద్యమానినదిమొదలు ఆంధ్రబాలికలయు; స్త్రీలయు నారోగ్యాభివృద్ధులనుగూర్చి యెంతయు శ్రద్ధతో పనిచేయుచున్నది. ఈమె మొనమొన్న కాకినాడలో జరిగిన ఆంధ్రస్త్రీ రాష్ట్రీయమహాసభకు కార్యదర్శిత్వమును వహించెను. మఱియు నాసభయందు 'ప్రస్తుత విద్యావిధానము' అను నొకవ్యాసమును చదివెను. ఆవ్యాసమున బాలికలకు మత నైతిక విద్యాబోధనము యొక్క యావశ్యకతను గూర్చి యెంతయో చర్చించి పాఠశాలలయందా విద్యలను బోధింప ప్రారంభింప వలయునని యీమె చెప్పెను. ఫిబ్రవరిమాసమున డిల్లీలో జరుగనున్న అఖిలభారత స్త్రీమహాసభకుపై సభాపతులమున నీమె ప్రతినిధిగా నెన్నుకొనబడెను. ఈమె తన జీవితము నంతయు స్త్రీలయొక్క బహుముఖాభివృద్ధికొఱకు వినియోగించి పరిశ్రమింప దలచుకొని యుండుటెంతయు మోదావహము.

ప్రకృతము భారతదేశమున—ముఖ్యముగ మన యాంధ్రదేశమున—స్త్రీలయందు బహుముఖముల విద్య, నాగరకత, ఆరోగ్యము, వ్యాపింపజేయుటకు విద్యావతులు, విశాలభావసమన్వేతలు నగు నారీమణులను, శ్రీ సుబ్బులక్ష్మిగారిని పోలినవారిని పలువురను మనదేశము ప్రసవింపవలయును. భగవంతు డీమెకు దీర్ఘాయురారోగ్యభాగ్య నొసంగుగాక !

# మధుపస్వైరవిహారము

కలువలపల్లి రంగనాథశాస్త్రి గారు

మధుపా! పుష్పిణులైన వల్లికల నిమ్మాడ్కిం బవల్ గూడి, చొ
క్కి ధరన్ సిగ్గిలఁబోక, స్వైరివగుచుం గ్రీడింతు వౌరా, నీ
మధుపత్వంబును, నీదుస్వైరితయు ధర్మ్యంబంచుఁ జాటించి, యీ
విధి నీబోంట్లు చరింతు రెల్ల నెడలన్ వేనోళ్ల శ్లాఘించుచున్.

మల్లిన్ మంజులగాత్రి మాలతిని, రమ్యం గూడఁగాలేవు, త
ద్దౌర్లభ్యంబు లభింప దజ్ఞులకు, మాద్యత్కాంక్షివై పోయినన్
తల్లాభంబు హుళిక్కి, నీకు మధుపా, తథ్యంబు వాక్రుత్తు, నం
చల్లీలం దనరారు ప్రోడకడ నీఝుంకారముల్ సాగునే.

కోమలిఁ దన్విఁ బద్మినిని గూడి మెలంగెడి మేటిజాణ వా
రామవిహారముల్ సలుపు ప్రాజ్ఞరసజ్ఞుఁడ వక్కటక్కటా!
కాముకవృత్తి నల్గడ నఖండపుఝుంకృతి వాగుఁబోతవై
నీమధుపాహ్వయం బిటులు నేఁటికి సార్థముఁ జేసితే, యళీ.

మంజులగానధోరణులు మానితి వారయ నేమికర్మమో
పెంజల మూని గంధఫలి వేఱుగఁ జూతువదేమొ సుధీమనో
రంజనశీల, సద్గుణధురంధరఁ దాదృశఁ గాంతువే యళీ?
కుంజములం జరింప మదిఁ గొంకవుగా పగలైన సుంతయున్!

సుమనస్సంగతి నీకు నిచ్చలు లభించుం గాని, జ్ఞానంబు లే
శముఁ జేకూఱమికిం గతంబు, మధుపా, జన్మాంతరోపార్జితా
ఘము పెంపేసుమి; మూర్ఖతం గలుష మింకన్ సల్పుచున్నావహో
సుమనస్సంగతిసైతమున్ వితయగుం జూడంగ నొక్కొక్కెడన్.

తత్తాదృగ్భవదీయ పూర్వసుచరిత్రంబెల్లఁ బోనాడి, నీ
వృత్తంబున్ వినువారికెల్ల వెగటై, పెంపేద, జిల్లేళ్లు, ను
మ్మెత్తల్, వేములు, ముస్గలున్ వెదకి మేల్ మేలంచుఁ గ్రీడించు చు
న్మత్తుంబోలి చరించుచుంటి మధుపా, మర్యాదలన్ మీఱుచున్.

---



## వ్యక్తిస్వాతంత్ర్యము – ధర్మము

నవంబరు 'సుభాషి' పత్రికలో, గురుభాగవతుల ధర్మారావుగారు (యం. ఏ.) 'సాంఘిక పరిణామం అంటే ఏమిటి?' అనేవ్యాసంలో ఇట్లు చెప్పినారు.

అయితే సంఘసభ్యత, నాగరికత వృద్ధిగాంచినట్లు మనకు తెలియడం ఏలాగు? ఎప్పుడయితే తన జీవనానికి సంఘం అడ్డంకులు కల్పించదో, అప్పుడు వ్యక్తి తనస్వాతంత్ర్యం తనలోపల గ్రహించి ఇతరవ్యక్తులతో సంబంధాలు కల్పించుకుంటూ వాటితో కలిసి ఒక స్వతంత్రతతో కూడుకొన్న అవస్థను ఏర్పాటుచేస్తుంది. అప్పుడు ధర్మం అనేది కేవలం సాంఘికనిర్దేశాలని శిరసావహించడంలోనే ఉండక స్వేచ్ఛాకారణ మవుతుంది. అప్పుడు ఒకరి ప్రవర్తన మంచిదా కాదా? అని నిర్ణయించేది వ్యక్తియొక్క అంతఃకరణ అవుతుంది; కాని సంఘం కాదు. అప్పుడు వ్యక్తి తనలక్ష్యాలని బాగా ఎరిగిఉండి, ఏసాధనాలవల్ల తనలక్ష్యం నెరవేరుతుందో ఆసాధనాలు ప్రయోగించే యెడల తనజీవనం ధర్మజీవనమని గ్రహింపగలుగుతుంది. ఇట్టిపరిస్థితులు సంభవిస్తే వ్యక్తి గౌరవం హెచ్చి, మనుష్యులు తమ ఆత్మవిశ్వాసానికి ఎక్కువ విలువ యివ్వడం, తమ జీవితం ఇతరుల ఉద్దేశములు నెరవేర్చడానికి కాదనిన్నీ, ఏజాతిలో ఉన్నా తమవ్యక్తులకు ఇతరవ్యక్తులతోపాటు సమానగౌరవం కలదనిన్నీ గ్రహించడం కలుగుతుంది. అప్పుడు స్త్రీలు స్త్రీత్వంవల్ల పురుషులకన్న తక్కువకారు. బ్రాహ్మణేతరులు పుట్టుకవల్ల బ్రాహ్మణులకన్న తక్కువకారు. బీదవారు బీదరికంవల్ల ధనికులకంటె తక్కువ అయిపోరు. ఖండాంతరులు ఖండవాసుల కంటె ఖండాంతరత్వంవల్ల తక్కువ అయిపోరు.

---

## సాహుకార్లు

మఱియు నాసంచికయందే శ్రీ. కే. నారాయణమూర్తిగారు (యం. ఏ.) 'మనచేతిపనులింకను ఏల పూర్తిగా నశింపలేదు?' అను వ్యాసమున నిట్లువ్రాసిరి. ఇది సమంజసమనియే చెప్పదగును.

పనివాండ్రకు పెట్టుబడిపెట్టి వారిచే పనిచేయించి వారిసరకులను చవుకగ గొనిపోయి హెచ్చుధరల కమ్మి విశేష లాభములను బొందుసాహుకారులు వారి దారిద్ర్యమునకు కారకులని యనేకుల యూహ. ఈవిషయ మింకొకసారి విపులముగ చర్చింపబడును. ప్రస్తుతము గమనింపవలసిన దేమనగా: మనచేతిపను లింతకాల మీస్థితియందైనను మిగిలియుండుటకు కారణము సాహుకార్ల సాహాయ్యము. భగవంతు డిచ్చిన రెక్కలు తప్ప మరి యేయాస్తియును లేని యాగర్భదరిద్రులగు పనివాండ్రకు పనికల్పించి కొంత ద్రవ్యమును పెట్టుబడిపెట్టి వారిచే బలవంతముగనైనను పనిచేయించునది సాహుకార్లు. వారు తయారుచేయుసరకులను వివిధప్రదేశములకు గొనిపోయి విక్రయించువారు సాహుకార్లు. ఆసరకులకు గిరాకీని, అందుకుతగిన సప్లయిని గల్పించి అందుకు గావలసిన పెట్టుబడిపెట్టి వాని యుత్పత్తి మొదలు విక్రయమువరకును గలవివిధావస్థలకు సంబంధించియుండు

వ్యయప్రయాసల నన్నిటినోర్చి వానినింతవరకు నిలునచెట్టినది సాహుకార్లు. బందరు తాలూకాలోని పెడనగ్రామాదులలో నేయబడులుంగీలు ఎప్పటనో కడుదూరముననున్న సింగపూరు మలాకా మొదలగు ప్రదేశములలో పనిచేయుకూలీ లుపయోగించు చుండుటకు కారణము సాహుకార్లు. గుడివాడ కైకలూరు తాలూకాలలో తయారగుచున్న ఉన్నికంబళ్లను సింహళద్వీపమునందు తేయాకుతోటలలో పనిచేయుకూలీ లుపయోగించుచుండుటకు కారణము సాహుకార్లు. ఉంగ్రాజవరము,రమణక్కపేట,మైలవరము మొదలగు గ్రామములలోని కంచరపని యింకను కొనయూపిరితోనైనను మిగిలియుండుటకు కారణము సాహుకార్లు. వేయేల? వారిసాయమున్నచోట్ల న వి యి ం క ను మి గి లి యు న్న వి; అదిలేనిచోట్ల నవి నశించినవి. ఏలయన: మనమనుకొనునట్లు సాహుకార్లు పనివాండ్ర శత్రువులు కారు. వారిరువురికి గల సంబంధము తోడేలునకు మేకపిల్లకును మధ్య నుండు సంబంధమువంటిది కాదు. పెద్దపులికిని జింకకును మధ్యనుండు సంబంధమువంటిదియును గాదు. ఒకరిలాభ మింకొకరినష్టము కాదు. వారిరువురి లాభనష్టములు నొక్కటేకాని వేరుకాదు. ఒకరికి పనియుండిన నిద్దరికిని లాభించును. ఇద్దరి పరిస్థితులును బాగుపడును.

---

## వార్ధక్యప్రతీకారము

మఱియు నీ పత్రికయందే శ్రీ పారనంది జగన్నాథస్వామిగారు (యం. ఏ., యల్. టి.) 'వార్ధక్యమనగా నేమిటి?' అనువ్యాసమున వార్ధక్య ప్రతీకారము నిట్లనుడివిరి.

ఈవార్ధక్యమునకు ప్రతీకారము ఒక్కటే. శరీర వ్యాపారములలో యౌవనము కల్పించాలని వైద్యులు చేస్తూన్న పరిశోధనల గురించిన్నీ,వాటిఫలము గురించిన్నీ ఇదివరకే సూచించియున్నాను. ఇప్పటికి మనకు తెలిసినంతవరకూ శరీరములో వార్ధక్యము తప్పనిదే అని భావించి ఏమిచేయవలసి యున్నదో చూదాము. అట్టిస్థితిలో వ్యాయామము చాలా యుపయోగకరమైనది. శరీరవ్యాయామము అవసరమే కాని దానికంటె ఎక్కువ లాభకరమైనది మనో వ్యాయామము. ఏదోయొకపని కల్పించుకొని దానిని నెరవేర్చాలనే పూనిక, ప్రయత్నములు వార్ధక్యబాధను తొలగించడానికి దివ్యౌషధములు. ధీమంతులు చాలాకాలము జీవించి ఉండగలుగుటకు ఇదేకాబోలు బలమైన హేతువు. ఇట్టి వ్యాయామము లేకపోవుటచేతనే ముప్ఫయిసంవత్సరాలు పనిజేసివిరామముతీసుకొన్నవారు చాలాకాలము జీవించకుండా ఉన్నారు. ఈవిరామము శరీరసౌఖ్యావహమైనట్లు కనబడ్డా మనస్సుకు ఆనందము కలుగజేసేది కానప్పుడు ఎక్కువహానికరముగా ఉంటూ ఉన్నది. తనకు అవకాశమైన కాలమంతా వినియోగించడానికి ఉచితమైన వ్యాపారము కానరానందున, కాలము తనకు బరువైనట్లు భావించి తాను చేయవలసిన పనిలేదని నమ్ముతూ, తన అవసానకాలము సమీపిస్తున్నట్లు తలస్తూ ఉండడమువల్ల విరామము హానికరము అవుతూఉన్నది. ఇట్లు తనమనస్సే తనకు తెలియని శత్రువు అవుతున్నది. ఏమాత్రమైనా శరీరములో అనవస్థ కలిగినప్పుడు ఇకసరి ఇదే.ఆఖరి రోగము అని బెదరక మానరు. తనవంటి వారినిచూస్తూ తనగురించికూడా ఆలాంటి స్థితినే కల్పించుకొంటారు. ఇవంతా తన వార్ధక్యమును దృఢపరచుకొంటకే ఉపచరిస్తుంది.

ఇందుకుతగిన మందు ఒక్కటే. కాలము బరువు కానట్లు ఎల్లప్పుడూ ఏదోఒక సత్ప్రవృత్తిలో మునిగియుంటూ, సుఖకారులగు భావములతో తన హృదయమును నింపుకొంటూ, దుష్టభావనలు రానీయకుండా మనస్సును నిర్మలవ్యాపారములలో ప్రవేశపెట్టుతూ ప్రవర్తించేవానికి ఈబాధ ఉండదు. ఎల్లపుడూ ధర్మమే హృదయపీఠమును అధిష్ఠించి యుండినట్లయితే వానిమనస్సు శరీరము ఎట్లున్నా, పచ్చగా, నవయౌవనవంతముగా ఉంటుంది. అట్టివారు వార్ధక్యమును ఎరుగక, నూతనావిర్భావములతో నిండినవారుఅవుతూ,యువకులకంటె ఎవిధానా భిన్నులుగా కానరారు. ఇందుకు ఉదాహరణములు కావలసినన్ని ఉన్నవి. కల్పనాపరు

లైన కవులు, తత్వజ్ఞులు, శాస్త్రపరిశోధకులు, వీళ్ళం దరూ ఎనభైదాటిన తర్వాతకూడా యౌవనములో ఉన్నవారివలెనే మనోదార్ఢ్యమును, భావోత్కర్షను, హృదయనైశాల్యమును వ్యక్తపరుస్తూ తమధర్మములను చక్కగాను, తీవ్రముగాను నిర్వర్తిస్తూ ఉంటున్నారు. వారు నిత్యమూ చేస్తూఉండే వ్యాపార ధర్మమునుండి కించిత్తయినా దారితప్పకుండా, ఆపనిని చేస్తూనే రెండో కంటివాడికి తెలియకుండానే విగతజీవులైనట్లు వింటూ ఉంటాము. ఇట్టివారిచర్య సామాన్యవృద్ధులచర్యకు విప రీతముగా ఉంటుంది. గదిలో ఒకమూల దాసుకొనిఉం డక, ఎల్లప్పుడూ మూలుగుతూ ఉండేవారి సహవాసము చేయక, పిల్లలతోనూ, పడుచువారితోనూ సంబంధము ఉంచుకొంటూ, వినోదములను సహిస్తూ, ఆనందిస్తూ దినములను నడుపుతారు. "ఆనందా దేవఖ ల్విమాని భూ తాని జాయంతే" అన్నశ్రుతికి నిదర్శనములై మెసలుతూ ఉంటారు. వారికి వార్ధక్యము లేనందున, వారిని అమృతు లని మనము పరిగణించవచ్చును. అట్టివారిచర్యలూ, వారి ప్రభావమున్నూ వారిశరీరనాశనము తరువాత కూడా వారిని ఎరిగినవారి హృదయములలోనూ, వారిని మన స్సున ఉంచుకొనికల్పించిన గాథలలోనూ సజీవములుగా ఉండుటచేతనైన వారిని అమృతులుగా చెప్పనోపును.

---

## భారతదేశముయొక్క విద్య

'ది యంగ్ మెన్ ఆఫ్ ఇండియా' అనుపత్రిక యందు శ్రీ. ఇ.సి. డెవిక్ గారు ఇట్లు వ్రాయు చున్నారు:

శ్రీ మేహ్యూగారు తమయుపోద్ఘాతమున నయిదు ముఖ్యసిద్ధాంతములను పాఠకులకు చవిచూపి వానిపంకకు వారిదృష్టిని మరల్పకోరుచున్నారు. వానియందు ఆశ, విశ్వాసము, విమర్శనము, పశ్చాత్తాపము నిండియున్నవి. ఆసిద్ధాంతముల నిట్లు సంగ్రహింపవచ్చును.—

౧

మనవిద్య భారతదేశముయొక్క భౌతికరాజకీ యాభివృద్ధికంటె విజ్ఞానాభివృద్ధికి చాల తక్కువగా నుపయోగపడినది. మనము భారతదేశముయొక్క జ్ఞాన మును పెనచుకొనజేసితిమి కాని భారతీయజీవితమున నానందము నభివృద్ధి చేయకపోయితిమి.

౨

ప్రకృతభారతజాతీయభావతరంగము తత్కాల మున ప్రాచ్యపాశ్చాత్యజీవితభావసమ్మేళమును గావిం చుచున్నది.

౩

మతమునుండి విడదీసిన విద్య భారతహృదయమున కెక్కదు; సంఘసంస్కరణాభివృద్ధికిని తోడ్పడదు. హైందవసంఘ సంప్రదాయమున నిమిడియున్న మత విధానములు కేవలము మతమువలననే ఉత్తమరీతిని వ్యాప్తిని జెందగలవు.

౪

భారతదేశమున నున్నతవిద్య కూడినంతవరకు ప్రభుత్వాధికారము నుండి దూరముకావలెను. కాని సార్వజనీనమగు విద్యకు ప్రారంభమును, ద్రవ్యసహాయ మును ప్రభుత్వమువారే కావింపవలెను.

౫

భారతదేశమున రాజ్యాంగముతో సంబంధము లేని ఆంగ్లవిద్యాధికుల సహాయము పరమావశ్యకము. భావికాల మున నయ్యది యుత్కృష్టముగ పరిగణింపబడును. విదే శప్రభుత్వముతో సంబంధము లేకుండునుగాన మఱింత మేలేయగును.

---

## చీనాదేశపు మహిళోద్యమము

శ్రీమతి విద్యావతీ జోషీగారు 'మనో రమ' జనవరిసంచికయందు వ్రాసిన వ్యాసము నుండి యీక్రిందిభాగముద్ధృతము.

నేటి (చీనా) జాతీయాందోళనమున స్త్రీలు త్రికరణశుద్ధిగ తోడుపడుచున్నారు. చాలకాలమువఱకు చీనాదేశమున స్త్రీలు పురుషులకు పెద్ద భారమువలె నుండెడి వారు. బాల్యావస్థ యందు తండ్రి,

యౌవనదశయందు భర్త, వార్ధకమున పుత్రసంతతియు వారిని పోషింపవలసి వచ్చెడిది. కాని యిప్పుడు కాలము మారిపోయినది. స్త్రీలకు సంపూర్ణస్వాతంత్ర్యము లభించినది. ఈకాలమున చైనీయస్త్రీ పురుషునకు గాక దేశమునకు దాసి. "మా అవ్వలు అమెరికా స్త్రీలకంటె ౫౦౦ సంవత్సరములు వెనుకబడినచో, మా బాలికలు ౫౦ వత్సరములు ముందునడతురు." అని శ్రీమతి సన్యాతు సేనుగారు పలికిరి. దేశము వృద్ధిగాంచవలె నన్నచో పురుషులతోపాటు స్త్రీలును ముందుకురాక తప్పదని చీనాకు పరిపూర్ణముగ విశ్వాసము కలిగినది. కావున స్త్రీవిద్యకై విద్యాలయము లేర్పడినవి. స్త్రీలు తమ వీలునుబట్టి రాత్రిగాని, పగలుగాని పోయి చదువుకొనుచుందురు. ఈపాఠశాలలయందు కళలును, రాజకీయమును, ఉద్యోగసంబంధమగువిద్యయును గఱపుదురు. ఈపాఠశాలలయందు విద్యగఱపు నారీమణులు వేతనములు గాని, అలవెన్సులు గాని ఏమియు తీసికొనరు. జాతీయదళమున స్త్రీశిక్షణకై ప్రత్యేకవిభాగ మున్నది. ఈవిభాగమున స్త్రీల యభివృద్ధికై యత్నములు జరుగుచుండును. ఈవిభాగమందలి స్త్రీలు ప్రతిగృహమునకును, ప్రతి కర్మాగారమునకును బోయి స్త్రీలకు సాంఘిక రాజకీయ పరిస్థితులను బోధించుచుందురు. గాయపడిన సైనికుల పరిచర్య మన్నగునవి నేర్పుటకును తగినఏర్పాటుగలదు. చీనాలో స్త్రీలకు మతాధికారము లున్నవి. జాతీయదళ మహాసభయందలి ౧౩౦ సభ్యులలోను ౧౬గురు స్త్రీలు గలరు. చీనాదేశమున స్త్రీసంఘ మభివృద్ధి గాంచుచున్నదనుట నిశ్చయమే కాని యింకను చాల మంది స్త్రీలు గాఢనిద్రలో మునిగియున్నారు. వారింకను వెనుకటి నిద్రాపారవశ్యమునే కొనియాడుచున్నారు. వారినేత్రముల గప్పిన తెర యింకను చాలయేండ్లవరకు నొత్తిగిలదు. కాని చైనీయపురుషులు స్త్రీల యుద్యమమునకు పూర్తిగ ననుకూలురై నచో నిక బానిసమార్గమున కంతరాయమే యుండదు.

---

## ఒక టర్కీ దేశపు స్త్రీనాయకురాలు

'ఆనీహార్డ్' అనునామె 'ది వుమన్ సిటిజెన్' (Woman Citizen) అనుపత్రికకు 'నెజీ ముహిద్దీన్ హానొం' అను తుర్కీదేశపుస్త్రీనాయకురాలినిః గురించి యిట్లు వ్రాయుచున్నది:

ఒకప్పుడు యుద్ధమంత్రివర్గమునకు స్థానమైయుండి నేడు విద్యార్థులకు నిలయమైయున్న యాభవనమును దాటి, పారిసునగరమునబోలె పానీయములను త్రాగుచు గూర్చుండియుండెడి జనసమూహములతో నిండియుండు యుపాహారమందిరములను దాటి, యమ్రభములను నాచిన్ని దుకాణములను, తుర్కిస్థాన్, ఈరాను దేశములనుండి వచ్చెడి వివిధకంబళములతోడను, వివిధస్వర్ణరజతాభరణాదివస్తువులతోడను నిండియుండెడి పణ్యవీథిని గడచి, యంతనొకయిరుకగు వీథిగుండ 'మార్మోరా' తీరమును జేరి, ఈయముల తలుపులతోనున్న యొకసౌధముయొక్క తలవాకిలిదాటి, యిరుకగు మెట్లవరుస నెక్కిపోయి, తుదకు టర్కీ స్త్రీలకు నాయకురాలగు 'నెజీ ముహిద్దీన్ హానొం' గదిలోనికి జేరుకొంటిని.

టర్కీభాషలో 'హానొం' అనగా నాంగ్లములో 'మిసెస్' అని యర్థము. (ఫలానివారిభార్య అని. "నెజీ ముహిద్దీన్ హానొం" అనగా నెజీ ముహిద్దీన్ అనునాయనకు భార్య యనియర్థము.)

ఆమెకై వేచియున్న కాలమున, ఆగదియొక్క నిరాడంబరత్వమును.ఆమె సంస్థయొక్క కార్యనిర్వాహకవర్గమునడుపుచున్న నెజీముహిద్దీన్‌యొక్క చిత్రపటమును జూచు నవకాశము నాకు లభించినది.

ఇంతలో నామె వచ్చినది. నామన స్సిక మరియొకదానిపై బోలేదు. సుందరి; యువతి; సర్వ విధములను సుందరి. పొడవై తీవిగలిగినశరీరము; తీర్చిన అవయవములు; అందముగల కనుబొమలు; ఘనశ్యామ శరీరచ్ఛాయ. కాని యామె నేత్రసౌష్ఠవమున సౌందర్యమే కాక దయ, సంతోషము, సుస్వభావము సు ... సూచితము లగుచుండెను.

మేము ఫ్రెంచిభాషలో ప్రసంగించితిమి. ఈ ప్రాంతమునందంతటను ఫ్రెంచిభాషయే ద్వితీయభాష. అటుపై మధురమగు నిమ్మనీటిని సేవించి (ఫ్రెంచిరెండవ భాష—కాఫీకితరువాత నిమ్మనీరు రెండవ పానీయము!) టర్కీ-అమెరికాల(యునైటెడుస్టేట్సు)లోని యాడువాండ్రవిషయమున బ్రసంగింప మొదలిడితిమి.

స్త్రీల నుద్ధరించెడు ఉద్యమమని చెప్పదగినయొక సంస్థ కధ్యక్షురాలై ప్రముఖురాలై యున్న నెజీము హిద్దీన్ హానాంయొక్క నేటి యీ యౌన్నత్యమునకు గారణము ఆమె కింటివద్దనే ప్రత్యేకోపాధ్యాయులచే విద్య నేర్పించిన యామెతండ్రియే. ఎల్లరుతండ్రు లట్లుగాక యామెతండ్రి కుమారునితోపాటు కూతురుగూడ విద్యావతికావలయునని ఆశించియుండెను. తనకుమారుడు చదివినచదువులనే, యతనికి నేర్పిన వారియొద్దనే యామెనుగూడ చదివించెను. అప్పు డామె ఫ్రెంచి, లాటిన్ భాషలను చదివెను. ప్రాచ్యదేశముల ప్రమాణగ్రంథములను బఠించెను. ఆంగ్లప్రమాణగ్రంథములనుగూడ-ఫ్రెంచి అనువాదములద్వారా-కొలదిగ జదివెను. ఇట్లుండ నొకనా డామె శరీరశాస్త్రపఠనముపై బడెను. పదునైదేండ్లనాటి టర్కీ దేశమును దలంచిన నప్పటి కా కార్య మెంతగ ప్రాతవడియుండునో యూహింపవచ్చును. అయినను అదియే యామెను వైద్యశాస్త్రమభ్యసింప బురికొల్పజాలెను. అప్పటికే యామె న్యాయశాస్త్రమును జదువుచుండెను. ఇప్పు డామె దానికి వైద్యశాస్త్రపఠనమును దోడుపరిచెను. ఆమె యింటివద్దనే చదివినను యువకులవలె విశ్వవిద్యాలయ పరీక్షలలో కృతార్థురాలయ్యెను.

ఆమె పదునెన్మిదేండ్లు నిండకపూర్వమే స్త్రీవిద్యాలయమునకు బరీక్షకురాలుగ నియమింపబడెను.

ఈలోపుగ నామె వ్రాతపని చేయుచుండెను. పదునెన్మిదవయేట నామె టర్కీయువతులను ఇంగ్లండు, ఫ్రాన్సుదేశములకు చదువుకొన బంపవలెనని యొకవ్యాసమువ్రాసెను. ఇది యామె విద్యావిషయిక వ్యాసములలో మొదటివానిలోనొకటి. ఇదిమనకంతగ నచ్చెరువందదగు విషయము కాదు; కాని యువతులను సోమరులుగ ఘోషాయందుంచెడి పద్ధతి కిది విప్లవముగనే కన్పట్టును.

దానిచే నాడుపిల్లల కెట్టిలాభము గలుగలేదు. నెజీ ముహిద్దీనకుమాత్రము ఇంక నధికతరముగ వ్రాయుట కవకాశము దొరకెను. తాను విద్యాలయపరీక్షకురాలుగనుండియే కల్పితపురుషులనామములతో వార్తాపత్రికలకు వ్యాసముల నంపుచుండెడిది.

చిఱుకాలమునకు-టర్కీ-స్త్రీయగుటచేత—అనగా ఇరువదినాల్గవయేట, నామె పెండ్లాడెను. ఆమె కొక కొడుకు.

పెండ్లితోపాటు నూతనారంభములుగూడ నామెకు లభించినవి. ఆమె 'రోడ్ ఆఫ్ విమెన్' (Road of Women) అను పక్షపత్రికను బ్రకటింపనారంభించెను. కెయిరోనగరమునందలి మేడేమ్ షారూపాషా (Madam Charaoui Pasha) యొక్క పత్రికవలె ఫ్రెంచిలోగాక యామెపత్రిక టర్కీభాషలో వెలువడుచున్నది. ఈవిషయమున ప్రత్యేకముగ గమనింపవలయునని నేను కోరుచున్నాను. ఏలయన: ఈప్రాచ్యభాగమునకు బోయి మాచిననేకాని, విద్యాధికులపైనను, ఉన్నతసంఘములవారిపైనను ఫ్రెంచివిజ్ఞానమునకు, ఫ్రెంచి సాంప్రదాయములకు, ఫ్రెంచిభాషకు నెంతటి యధికారము కలదో మనము తెలిసికొనజాలము.

[మూడరన్ రివ్యూ.]

---

## సింధుదేశ ప్రాచీననగరములు-
## ౫౦౦౦ సంవత్సరములనాటి
## భారతీయ నాగరికత

భారతీయ పురాతన వస్తుపరిశోధక శాఖాధికారులగు సర్ జాన్ మార్షల్ గారు15, 22-1-28 తేదీల టైమ్సుఆఫ్ ఇండియా పత్రికలలో ప్రకటించిన వ్యాసములనుండి యీక్రింది విషయము సచిత్రముగ నుద్ధరింపబడినవి.

సింధుదేశపు పల్లపుభూములను, పంజాబు నందును గల మొహెంజోదారో, హరప్ప అను ప్రదేశములయందు పురాతనవస్తు శాఖాధికారులు భూమిని త్రవ్వించి పరిశోధింపగా ఇదివఱకుగల చరిత్రకు అందని అద్భుతవిషయములు కొన్ని బయలుపడినవి. వానిసంపూర్ణతత్త్వమును తెలియుటకై యింకను త్రవ్వి పరిశోధింపవలసి యున్నది.

మొహెంజోదారోవద్ద నీప్రదేశమునుఆరుసంవత్సరములకు పూర్వము శ్రీబెనర్జీఅను (భారతీయుడు) నాతడు కనుగొనెను. అదిమొదలు పలువు రుద్యోగులా ప్రదేశమును త్రవ్వించుచునే యుండిరి. ఈపరిశోధనల ఫలితములను సచిత్రముగా మున్ముందు విస్తరించి ప్రకటింప నున్నారు.

మొహెంజోదారోవద్ద ఇప్పటికి త్రవ్విన ప్రదేశము ౧౩ ఎకరముల విస్తీర్ణముకలది. ఈప్రదేశము కనీసము మూడునగరములకు చెందినది. మూడవనగరమునకు సంబంధించిన కట్టడములు చాల దిట్టముగ నున్నవి. మొదటినగరమునకు సంబంధించినవి దిట్టమయినవి కావు. అన్నియు కాల్చినఇటుకలతో కట్టబడినవి. కట్టడములయందు గచ్చుకు మారు అడుసు ఉపయోగింపబడినది. అక్కడక్కడ లోహమిశ్రితమగు గచ్చుసైత ముపయోగింపబడినది. ఎండలో నెండిన ఇటుకలతో గుణాన్తములు, లోపలిగోడలు మున్నగునవి నిర్మింపబడినవి.

నగరమున వాయవ్య భాగమునగల యొకయెత్తయిన ప్రదేశమునకు చుట్టుప్రక్కలగల కట్టడములు చాల అద్భుతముగ నున్నవి. తరువాతికాలమున నీ ఎత్తయిన ప్రదేశమున నొకబౌద్ధస్తూపము నిర్మింపబడినట్లున్నది. ఆస్తూపముక్రింద నగరమునందలి ప్రధానదేవాలయముండిన ట్లూహింపపగియున్నది. చుట్టుపట్టులగల నిర్మాణావశేషము లన్నియు దేవాలయపరిసరనిర్మాణములనిగ నూహింపదగియున్నవి. వానిలో ముఖ్యమైన దొక పెద్దకట్టడము. అం దొక కొలను గలదు. అది చెంతనుండిన దేవాలయమునకు సంబంధించినది కాదగును. కొలనిపొడవు ౩౯ అ; వెడల్పు ౨౩ అ; నేలమట్టమునుండి దాని లోతు. ౮ అ. దానికి నాలుగుప్రక్కలను,ముందునైపున



మొహెంజోదారోవద్ద వెలువడిన ప్రాచీనగరద్వారము- రెండువైపుల ఇండ్లు క్రిక్కిరిసియున్న రాజవీథి ఇందు కాంచనగును

లిన్నియును, వెనుకవైపున చిన్నగదులునుగల వసారాలు గలవు. ఆ అడుగులకు మించిన మందముగల వెలుపలిగోడలో దక్షిణమున రెండుపెద్దద్రోవలును, తూర్పు ఉత్తరముల చిన్నద్రోవలును గలవు కట్టడము తూర్పుభాగమునగల అరలలో నడిమిదానియందొక పెద్దనూయి కలదు. దానినుండి యీకొలనికి నీరు నింపుచుండవచ్చును. కొలనికి రెండువైపుల మెట్లుకలవు. కొలని లోపట్టము, వెలుపలిప్రక్క తారువంటి యొక జిగురుపదార్థము (బైట్యూమెను) తో ఒకఅంగుళము మందమున పూతపూయబడియున్నది. కట్టుమెట్లను అతుకుటకును నాపదార్థమే యుపయోగింపబడినది. కొలనిలోని నీరు నగరము వెలుపలికిపోవుటకు ఆఱడుగుల ఎత్తుగల ఒకపెద్దజలదారి ఉన్నది. దానికి విలువంపున కట్టినకప్పు గలదు.

మోహెంజోదారోలో బయలుపడిన నిర్మాణావ



మోహెంజోదారోవద్ద బయలుపడిన ప్రాచీననగరముయొక్క ప్రధానదేవాలయముచెంతనున్న కొలను

గోడలు నీరు ఇంకకుండునట్లు జాగ్రతతో, నేర్పుతో గట్టిగ కట్టబడియున్నవి. కొలనిగోడలు ౧౧ అ. మందము గలిగియున్నవి. గోడల లోపలి వెలుపలి భాగములు కాల్చిన యిటుకలతోను, మధ్యభాగము ఎండనెండిన యిటుకలతోను నీరింకకుండునట్లు లోహమిశ్రమయిన గచ్చుతో కట్టబడినవి. గోడలోవైపు భాగమునకు శేషములు, చాలవఱకు ప్రజల నివాస గృహములకును, అంగడులకును సంబంధించినవిగ చూపట్టుచున్నవి. ఇవి మెసపొటేమియా, నైలునదీప్రాంతములలో నాకాలముననుండిన నగరముల ప్రజలకంటె మించిన నాగరికత గలిగి మోహెంజోదారోలోని ప్రజలు తమజీవితమును సుఖమయముగ గడపుకొనుచుండిరను భావమును మఱింత గట్టిపఱుచుచున్నది.

మోహెంజోదారోకు ౪౫౦ మైళ్లమేరను సముద్రమునకు దూరముగనున్న దేశమున హరప్ప అను చోట ఇపుడు మునుపటికంటె లోతునకు త్రవ్వి పరిశోధించినారు. అక్కడ మోహెంజోదారోలో లభించిన వానికంటె ప్రాచీనములయిన వస్తువులు లభించినవి. వానిలో రాగితోచేసిన ఆయుధములతో పనిముట్లతో నిండిన యొక పెద్దరాగిపాత్ర ముఖ్యమైనది. గొడ్డళ్లు, బల్లెపుకోపులు, ఈటెకోపులు, బాకులు, పెద్దకత్తులు, అంపము, ఉలులు మొదలయినవి అందుండినవి. వానిలో కొన్నిటిపైన చిత్రమయలిపిని వ్రాసిన వ్రాత లున్నవి.

ఆలోతుననే ౧౫౦ ముద్రికలు, చిత్రితములను మృణ్మయ శకలములును దొరకినవి. అవి పైసార (నుట్ట మన)యందు దొరకిన వాటికంటెచిన్నవిగను, భిన్న స్వరూపములుగలవిగను ఉన్నవి. వానిలోచడ్డీలను, శిరస్త్రాణములనుదాల్చిన ఏడుగురుమనుజులు వరుసగ నడినుండి యెడమకు పోవుచున్నట్లున్న ముద్రిక చాల ప్రశస్తమయినది. రెండవది యొకమనుజుడు పులిని ఎదిరించుచున్నట్లున్నది. మూడవది ధ్వజమునుకొని పోవుచున్న యొకమనుజుడు గలది. ధ్వజముపైనున్న చిహ్నము పేములతో నల్లిన బుట్టవలె నున్నది. (ఈబుట్ట ప్రాయశః వారి పూజోపకరణము కావచ్చును.) ముద్రికలందు చిత్రింపబడిన జంతువుల కాహారము నిచ్చుట కుపయోగించిన బుట్టను బోలి ఆబుట్ట యున్నది.

ఈపొరలోనే మఱియొక యద్భుతమైన వస్తువు లభించినది. అది రెండుచక్రములుగల రాగితేరు. దాని పైభాగము (కప్పు) త్రికోణాకారమున నున్నది. సారథి ముందు కూర్చునియున్నాడు. ఇది ప్రాచీనతమమైన చక్రయానమున కొక దృష్టాంతము కానోపును.

హరప్పవద్ద బయలుపడిన నిర్మాణభాగములు అత్యంతము ప్రాచీనములగుటచే చాలవఱకు మిగులశిథిలములైనను మోహెంజోదారోవద్ద యిప్పటికి బయలుపడిన వానికంటె చాలమంచిస్థితియందున్న భవనమొక్కటి అక్కడ కలదు. దానిపరిమాణము ఉత్తరదక్షిణములకు ౧౬౪ అ., తూర్పుపడమరలకు ౧౩౬ అ. గలిగియున్నది. అందు ఇరుకుగా కట్టిన రెండువరుసలుగల గదు లున్నవి. ఆరెండువరుసలకు నడుమ నొకతాళ్వారము (త్రోవ) పొడుగున గలదు. ఆగదులు కొట్టడిగదులుగా నుండవచ్చును. లోహనాణకములు చలామణికి రానికాలమున పన్నులకును, వర్తకపు మార్పులకును ఉపయోగించుకొనుచుండిన పెక్కురకముల ధాన్యమును, విస్తారముగ సాగుచుండిన వర్తకములయొక్క సరకులను దాచుకొనుటకై యిట్టిగదులు ఆవశ్యకములుగ నుండి యుండవలెను.

ఈస్థలములయందు లభించిన ముద్రికలపై నున్న భారతీయ గాథలను తెలుపు లేఖనములనుబట్టి వీనికాలము క్రీ. పూ. ౨౮౦౦ సంవత్సరములనదగియున్నది. ఇటీవల మఱొకచోట లభించిన కొన్ని ముద్రికలపై నున్న లేఖనవైఖరినిబట్టి చూడగా వీనికాలము క్రీస్తుకు పూర్వము మూడవసహస్రము లోనికో, ఇంకను పూర్వమునకో కొనిపోవచ్చును. మఱియు మోహెంజోదారోవద్ద లభించినవియు వీనినిపోలియే యున్నవి కాన వీనికాలము క్రీ. పూ. ౩౫౦౦ మొదలు ౨౫౦౦ కు లోపలనని గట్టిగా చెప్పవచ్చును.

ఈనగరములు పుట్టుటకును గిట్టుటకును నెన్ని శతాబ్దముల యంతరముండెనో వీనియందలి భవననిర్మాణవైఖరినిబట్టి తెలుప శక్యముగాకున్నది. మూడునగరములయందలి భవననిర్మాణవైఖరి, పద్ధతులు వేఱువేఱుతీరుల నున్నవి. ఇంతియకాక మూడుపొరలయందును దొరకిన చిన్నచిన్నవస్తువులయొక్క భేదమును గుర్తింపనలవికాకున్నది. ఇన్నిటినిబట్టి యీమూడునగరములు పుట్టి గిట్టుటకు ఆఱుశతాబ్దములకాలము పట్టియుండు ననవగును. అట్లయిన మొదటినగరముయొక్క కాలము క్రీ. పూ. ౨౮౦౦ సంవత్సరములనియు, రెండవనగరముయొక్క కాలము క్రీ. పూ. ౩౦౦౦ సంవత్సరములనియు, మూడవనగరముయొక్క కాలము క్రీ. పూ. ౩౩౦౦ సంవత్సరములనియు నిశ్చయింపదగును. హరప్పవద్ద బయలుపడిన మీదినగరములు ఏకకాలీనము లగును. క్రిందినగరములు మాత్రము అక్కడదొరకిన ప్రాచీనతమములగు ముద్రికలు, ఇతరవస్తువులు మొదలయినవాని స్వభావమునుబట్టి చాల ప్రాచీనకాలమునకు చెందినవిగ తలపవలసియున్నవి.

అసంఖ్యాకప్రజగల యీనగరములకు వ్యవసాయమే ప్రధానజీవనోపాయముగా నుండవలెను. అచ్చటి వ్యవసాయపద్ధతులననుసరించిన వివరములు సరిగా గుర్తింపగానున్నను మోహెంజోదారోలో నుపలబ్ధములయిన గోధుమలు ఇపుడు పంజాబులో పైరగుచున్న గోధుమలను బోలియున్నవి.

మిహ్రానునది సట్లెజ్ నదినుండి తూర్పుగ ప్రవహించుచుండిన హక్ర లేకవహిందా అను పేరుగల నది కావచ్చును. ఇంచుమించుగ నిది 'తూర్పునారా' కాలువప్రవహించుచున్న మార్గముననే ప్రవహించియుండును.

ఆదేశపు ప్రజలకు రొట్టెపాలులతోపాటు పశువులు, గొఱ్ఱెలు, పందులు, తాబేళ్లు, సింధునదిచేపలు,



మోహెంజోదారోవద్ద దొరకిన ముద్రికలు-౫౦౦౦ ఏండ్లకు పూర్వపువి

సింధుదేశమునను, పడమటిపంజాబునను ఇప్పటికంటె నప్పుడు వానలు మెండుగ రియుచుండెననియు, ఆదేశములయందు ఇప్పటివలె ఒక్కటేనదివలనగాక అప్పుడు రెండునదులవలన నీరు పొలములకు పారుచుండెననియు చెప్పుటకు ప్రబలకారణములు గలవు. సింధునది, ప్రాచీనమైనపెదమిహ్రానునది అనునవి ఆరెండునదులు.

ఎండిన సముద్రపు చేపలు, నాహారములుగ నుండెడివి. అచ్చటబయలుపడిన గృహభాగములయందుపలబ్ధములైన నిండుఎముకలు, సగము కాలినఎముకలు నీవిషయమునకు ప్రమాణములు.

ఎత్తయినమూపురములు, పొడవైనకొమ్ములుగల ఎద్దులు, (వీనిఎముకలు చాలగా దొరకినకారణమున ఇవి

అక్కడ మండలుమండలుగ నుండియుండవలెనని తోచు చున్నది. బట్టలు, కుబుసకొమ్మలుగల ఎద్దులు, గొఱ్ఱెలు, పందులు, కుక్కలు, నక్కములు, ఏనుగులు వారు పెంచు కొనుచుండినజంతువులలో కొన్ని. ఒంటెలు, పిల్లులు అక్కడ ఉన్నట్లు కన్పట్టదు. దేశీయమైన యిప్పటినక్కమునవలె వీరినక్క ముండును. అక్కడి కుక్కలలో రెండుజాతు లున్నవి. ఒకటి యిప్పటి ఊరకుక్కవలెను, రెండవది ఇండ్లనుకాయుటకు పెంచుకొను కుక్కవలెను ఉండును.

(సశేషము)

---

## వివాహోచితవయస్సు

'స్త్రీధర్మ' అనుపత్రిక ఇట్లు ప్రకటించుచున్నది.

బరోడాశాసనసభవారు వివాహోచిత వయస్సు బాలురకు ౧౮ సంవత్సరములనియు, బాలికలకు ౧౪ సంవత్సరములనియు నిర్ణయించిరి. కాశ్మీరదేశపు మహారాజుగారు బాలురకు ౧౮ ఏండ్లకును, బాలికలకు ౧౪ ఏండ్లకును పూర్వము పెండ్లి చేయగూడదని యొక శాసనము నేర్పఱిచి అమలులో పెట్టించినారు. భారతీయ సంస్థానములగు గొండాల్, కోట, మైసూరు, ఇండూరు సంస్థానములు ఇట్టి శాసనమునే కావించినవి. రాజకోట సంస్థానము ఈమాసముననే ఒకచట్టమును ఏర్పరిచిరి. అందు పెండ్లియగుటకు తగిన వయస్సు బాలురకు ౧౮ ఏండ్లనియు, బాలికలకు ౧౪ ఏండ్లనియు నిర్ణయించి ఎల్లభారతదేశమునకును మార్గదర్శకమైనది. చీనా, జపాను దేశములలో బాలికలకు ౧౬ ఏండ్లును, బాలురకు ౧౮ ఏండ్లును ఉండవలెను.

---

## రష్యాలో సామ్యవాదము – కారాగారములు

ఈనడుమ శ్రీ జవాహిర్‌లాల్ నెహ్రూగారు మాస్కోకేగి యటనుండి తమసోదరికి వ్రాసిన లేఖయందు స్వానుభవపూర్వకముగ నచ్చటి శాసనపద్ధతిని సంక్షిప్తముగ వివరింప, అందలి సారాంశమును చర్చించుచు మాధురీ పత్రిక (పుష్యసంచిక) యిట్లు వ్రాసినది.

అచ్చటి చెఱసాల చరిత్ర మన్నిటికంటె నింపు గూర్చు విషయము. అచ్చటి ఖైదీలు ఖైదీ కుళ్లాయి, లంగోటా కట్టరు. మెడలో నంబరువేసిన యినుపబిళ్ల వ్రేలాడదు. సాధారణముగ నెల్లరు ధరించునట్టి దుస్తులే వారును ధరింతురు. నంబరుతో పిలువబడక వారు తమ పేళ్లతోనే పిలువబడుదురు. వారి గదులయందు వెలుతురు, గాలి, పరిశుభ్రత యథేచ్ఛముగ నుండును. వారి భోజనము దేశీయులెల్లరు భుజించుదానికన్న భిన్నము గాదు. ప్రతి ఖైదీకిని జీత ముండును. అందు మూడవ వంతు భోజనాదికములకు పోను, మిగిలినది కారాగృహాధికారులు తమకడ జమచేయుదురు. ఖైదీ తన గడువు పూర్తి చేసి విడుదలయైనపుడా జమరొక్కము తని కొసగుదురు. దానితో నతడే దేని పరిశ్రమసాగించుకొని గౌరవముగ జీవనము గడుపుకొన వీలగును. ఈప్రకారము ఖైదీలు తమజీవనములు బాగుపఱచుకొన నవకాశమేర్పడును. అదియేకదా, కారావాసమునకు ముఖ్యాశయము! అక్కడి చెఱసాలలు జనులను మానాభిమాన విహీనులుగను, దుష్టవర్తనులుగను, దుర్మనస్కులుగను జేసెడికార్ఖానాలుకావు. భారతదేశమున నొకసారి చెఱసాలకుపోయిన యపరాధిజీవిత మిక మంటగలసినదన్నమాటయే. అవమానకరములు, అమానుషములు, పాశవికములునైన యిక్కడి చెఱసాల నియమములు ఖైదీలయాత్మల నాశన మొనరించివేయును. అపరాధియై చెఱసాలకు పోయినవాడు పశువై తిరిగివచ్చును. అతని మనసునందలి మార్దవమెల్ల భస్మీభూతమై పోవును. బ్రిటిషువారు లింక నేయితరసంస్కారమును చేయక కారాగృహ సంస్కార మొక్కటి మాత్రమే చేసియుండినను, వారిశాసనపద్ధతి ఉపకారకారకమనుట నిరాక్షేపణీయము.

---

## మరణదండనము

'ది థియసాఫికల్ పాత్' అను పత్రికలో నిట్లున్నది.

హెన్రీ ఫోర్డుగారీ క్రింది విధమున చెప్పినట్లు ఈసంవత్సరపు ప్రారంభ దినములలో వార్తాపత్రికలయందు ప్రకటింపబడెను:

"మానవుని వధించుట దోసము. ఎల్లరును దీని నంగీకరింతురు. అది వ్యక్తికిగాని, సంఘమునకుగాని యెట్టిమేలును సమకూర్పజాలదు. పేదరికమును మాన్పుటకు దానమెట్లో యట్లే నేరమును మాన్పుటకు ఉరిశిక్షయు నెన్నడును బనికిరాదు.

"కాని మనము హంతకుని (నేరస్థుని) చంపగోరుచున్నాము; చంపుచున్నాము. ఆవ్యవహారమును నిర్వహించుటకు అదియొక్కటియే సులభతమమగు నుపాయముగ గల్పించుటయే దానికి గారణము. మనము రెండు సమస్యలను కూడనివిధముననే చేపట్టుచున్నాము. మానవుని దండించుటకు నేనంతగ బాటింపను కాని నేను వానిని చంపుట కొప్పుకొనను. తాను స్వయముగ ఉరి తీయుటకు సిద్ధపడనివాడు ఉరిశిక్షకు సమ్మతి నొసగజాలడు కాని యీ కార్యమును నిర్వహింపగల ధైర్యశీలురగు నాగరకు లుండరని నేనెంచెదను. అట్టిచో నొక పౌరునిద్వారా వధ యొనర్ప ప్రభుత్వము నడుగనేల?

"ఉరిశిక్ష నేరమును మాన్పజాలదని నా నిశ్చయము. అన్యునిజంపుటకు సిద్ధముగనున్నవాడు తనచావును గూడ లెక్కసేయడు. ఒక్కపదియేండ్లకు బూర్వముననే మనము లక్షలకొలది ప్రజలను చంపుట నేర్చుచుంటిమి."

అమెరికా న్యాయవాదులలో విఖ్యాతయును, 45000 మంది సభ్యులుగల నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ ప్రొఫెషనల్ విమెన్స్ క్లబ్ అనుసంస్థ కధ్యక్షురాలును, న్యూయార్కు నివాసినియు నగు లీనా మాడెసిన్ ఫీలిప్స్ (Lena Madesin Philips) అనునామె యీ నడుమ నాసంస్థ సమావేశము ఓక్లండ్ పట్టణమున జరిగినప్పుడు ఓక్లండ్ టైమ్సు పత్రికా ప్రతినిధితో నిట్లు నుడివినది:

"మానవుల నురిదీయుట, విద్యుదాసనములలో చావగాల్చుట, చెరసాలలందుంచి వారిజీవితము వినష్టమొనర్చుట– ఇవి దోషపరిష్కారమునందలి మూఢవిశ్వాసమువలన గలిగినవని నాయభిప్రాయము. ఇట్టియనాగరికతను సమర్థించువారు దోషనిర్ధారణమున విచక్షణ నుపయోగింపవలెనను వారిని మూఢవిశ్వాసపరులని యందురు. సకారణముకాని యావేశమే మూఢవిశ్వాసము. శిక్షయను నెపమున నురిదీయుటయు, చెరసాలలయందుంచుటయు కారణముల నారయక ఫలితములగూర్చి విచారించెడి తెలివిమాలినపని. అది యసహ్యమగు మూఢవిశ్వాసము."

"ఐన నీసమస్యను నేర్పుతో నెదుర్కొనవలయునన్న నేమిచేయవలయును?

"ప్రభుత్వమువారిచే జిత్రవధ యొనర్పించెడి దారుణోదాహరణమును విధ్వస్తమొనర్పవలయును. చెరసాలలలోని మానవులను బోనులలోని క్రూరమృగములవలెగాక మరల వ్యక్తి సంఘసౌష్ఠవములకు దోడ్పడగలుగువారలనుగ గావింపవలయును. కఠినులగు నేరగాండ్రతోపాటు బాలకులను చెరసాలలయందు ద్రోయుట మానవలయును. దోమలు ముసురుకొనియున్న మురికిగుంటలు శీతజ్వరమును పెంచునట్లు నేరమును పెంచునట్టినిరుద్యోగసమస్యను మాన్పవలయును." అని యామెతత్క్షణమే ప్రత్యుత్తర మొసంగెను.

జార్జిబెర్నార్డుషాగారు ఉరిశిక్షను సమర్థించువారిదౌష్ట్యము నిప్పుడు నిందించుచున్నారు. 'లండన్ డెయిలీమెయిలు' పత్రికలో నీనడుమ వారువ్రాసినవ్యాసమునుండి యుద్ధరించిన దీక్రిందిభాగము:

"మానవులను శిక్షించుట మన స్వభావమునకు ప్రతిహింసాతృప్తి నొసంగును. మనము శిక్షించుటకొరకే శిక్షించుచున్నాము. ఒక్క చెడుగునకు మరియొకచెడుగు కలిసిన నొకమేలేర్పడుననికాదు; చెడుగునకు చెడుగేతగియుండునని. దండనము ధనవ్యయము గల్గించును. మనకును, దండితులకును గూడ కీడొనర్చును. కాని అది తగుననియే మన మెంచుచున్నాము.

కారణము? మనస్వభావ మట్టిదగుటయే. దీని కభిమాన వంతులమగు మనము సిగ్గుపడి కారణములను, అందముగల పేరులను నిర్మించుచున్నాము. ప్రతిహింసకు బదులుగ ప్రతిఫల మనుపదమును వాడుచున్నాము. మనక్రౌర్యము మానవులను అపరాధదూరులనుగ నొనర్చుచున్నట్లు మనము నటించుచున్నాము.

దోషనిరోధ మొనరించునది శిక్షయొక్క తీవ్రత కాదు; అది దోషనిరోధము గావింపగలదను నిశ్చయ భావము. ఆనిశ్చయభావము బడయజాలనిదగుటచే దోష నిరోధమనునది ప్రతిహింసాపరత్వమున కొకకారణముగ నుపయోగింపబడుచున్నను నేరములను మాన్పువిషయ మున నది వ్యర్థమని దోషనిర్ణేతలు చాలకాలమునుండియు నంగీకరింపవలసియే వచ్చుచున్నది.

[మాడరన్ రివ్యూ.]

---



బుట్టదోనె

తెలుగుదేశమున కాలువలు దాటుటకు దీని నుపయోగింతురు.

[శ్రీ శనివారపు సుబ్బారావు (నిడదవోలు) గారి ఛాయాచిత్రమునుండి.]

## ప్రాచీన భారతీయచిత్రకళ - మొగలుచిత్రములు

చిత్రము ౧. రంథంభోరుకోట, అక్బరుచక్రవర్తి శిబిరము, కోటయొక్క గవర్నరును స్వాధీనపఱుచు కొనుటకు కోటలోనికి అక్బరుచక్రవర్తి ప్రవేశము నీచిత్ర మున సుందరముగ చిత్రింపబడియున్నవి. రేఖాచిత్రకారుడు: లాల్; వర్ణచిత్రకారుడు: శంకర్.

చిత్రము ౨. క్రీ.శ. ౧౫౬౯లో కోటసంస్థానము నందలి గాగ్రోనుకోట గవర్నరు అక్బరుచక్రవర్తికి కోట తాళముల నప్పగించుచున్నాడు. ఇందు చక్రవర్తి స్పష్ట ముగను, అందముగను చిత్రింపబడి యున్నాడు. వర్ణ, రేఖా చిత్రకారుడు: మాధు (పెద్దవాడు.)

చిత్రము 3. రంథంభోరుకోట. ఇదిరాజపుటానాలో నున్న చిత్తూరు గాగ్రోను కోటలవలె కడుప్రశస్తి గాంచి నది. ఎత్తయిన కొండలు, లోతయిన కనుములుగల పీఠభూ మియందు చంబాల్ నదిలో బనాస్‌నది కలియుచోట నీకోట ఉన్నది. కోటచుట్టును అడవులు దట్టముగనుండి ప్రవేశము దుర్గమముగ నుండును. అక్బరుచక్రవర్తి యీ కోటను వంచించి స్వాధీనము చేసికొన్నను ఒకముట్టడికి ఆగి పోరాడినది.

చిత్రము ౪. గాంగ్రోనుకోట (గాంగ్రారు) రాజ పుటానాలోని కోటసంస్థానమున చౌమేళజిల్లాయందిది నాల్గవపరగణాలో నున్నది. ఇది యాపరగణా ముఖ్య పట్టణము. కలిసింధునది దీని చేరువను ప్రవహించుచున్నది. ఇటుకతోను సున్నపు గచ్చుతోను చాలదృఢముగా నిది నిర్మింపబడినది. చాలప్రాచీనమయినది. కొన్ని గట్టిముట్ట డులకిది ఆగినది. రాజుగర్ కైచీ రాజపుత్రులు ఈకోట తమస్వాధీనమున నున్నపుడు పండ్రెండు సంవత్సరములు సికందర్ లోడి చక్రవర్తిని నిగ్రహించినారు. ప్రఖ్యాతు డయిన జస్వంతరావు హోల్కారుగారి రాణివాసమగు తులసీబాయి తిరుగుబాటుచేసిన తనసైనికులచే నిక్కడ ముట్టడింపబడెను. అప్పటిజనసంఖ్య ౩౪౯౧. అల్లా యుద్దీను కోటలోని నీటినంతను అపవిత్రముచేసి హిందు వులను దుర్ఘటములగు నాప్రదేశములనుండి వెడలగొట్టి

కైచీనాయకుపేసు అచిల్ అనునాలని వద్దనుండి కోట ను లవనశేము చేసికొనెనట.

చిత్రము ౫. చిత్తూరు పర్వతదుర్గమైనకోట. ఇది యెనిమిదవ శతాబ్దముమొదలు ౧౫౬౭ వ సంవత్సరమున అక్బరుచక్రవర్తి దండెత్తి దీనిని పట్టుకొనునంతవఱకు ఆ సంస్థానమునకు రాజధానిగా నుండినది. ౧౩౧౩ వ సంవత్సరమున అల్లాయుద్దీను దీనిని ముట్టడించి దుర్గమునకు దక్షిణముననున్న 'చితోరియ' అనునొక చిన్న గుట్టప్రదేశమును స్వాధీనము చేసికొనెను. ౧౫౩౫ లో గుజరాతురాజగు బహాదూరుషా ఫిరంగులతో ముట్టడించి సైన్యమును గూర్చుకొని స్వయము యుద్ధమునకువచ్చిన రాణిని గెలిచి కోటను తా నాక్రమించుకొనెను.

ఈరెండు యుద్ధములయందును రాజపుత్రవీరులు మూలబలముచేత కోటలోని అంతఃపురస్త్రీలను, వారిపరివారమును ప్రమందించి అరుణవస్త్రములను ధరించి తాంబూలములను చేతగైకొని జయవెట్టుచు రణరంగమున కుఱికి శత్రువులను జెండాడి మృత్యుముఖములను ప్రవేశించి కీర్తికాయులైరి. క్రూరమైన ఈస్త్రీహత్య జోహారందురు. ఇది రాజపుత్రస్త్రీల ఉత్తమలక్షణము. మొదటి ముట్టడిలో సుందరియగు పద్మినీరాణి, ఇతరరాణులు వీరపత్నులు, వీరందఱి స్త్రీపరివారము, ఎల్లజాతులస్త్రీలతోసైతము భూగర్భగృహములను, అంతఃపుర గృహములను ప్రవేశింపగా ద్వారములను బంధించి అగ్నిని రగుల్కొల్ప వారు మృతులయినారు. రెండవమారంత యవకాశము లేమిచే నల్లమందు కొట్టులను తగులబెట్టగ వేలకొలది స్త్రీలు మృతులయినారు. అక్బరు ముట్టడించినపుడు రాణాయొక్క తొమ్మండుగురు భార్యలు, అయిదుగురు రాజపుత్రికలు వారికుమారులు, రాణాకొడుకులు, పసికూనలిద్దఱు, ఎల్ల రాజపుత్ర నాయకుల పత్నులును మృతులయిరట.

భారతదేశమునందలి ఎల్లదుర్గములలోను చిత్తూరు దుర్గము పేరుగాంచినది. అది పర్వతమయమయి ౫౧౧ అడుగుల ఎత్తును, అరమైలు వెడల్పును, నాలుగుమైళ్లపొడవును గలిగియుండును. కోటనడుమ నేటవాలుగ నుండును. అట్లుండుటచే చిన్నచిన్న చెరువులయందును, గుంటలయందును నీటిని సమృద్ధిగ నిలువచేసి కొనుటకు వీలుగ నుండును. చితోరియాతప్ప తక్కినప్రదేశములు ఫిరంగుల సహాయములేక ప్రవేశింప సాధ్యము కాకుండును.

ఈచిత్రము దుర్గాంతర్భాగమునందలి యొకదృశ్యము. ౧౪౩౯ లో మాల్వాదేశపు ఒకటవ మహమ్మదుయొక్క పరాజయమును ప్రకటించుటకై ఖుంభరాణా పరిపాలనమున నిర్మితమైన కిరాత్ స్తంభమను పేరుగల ఒకవిజయస్తంభమిందు కాన్పించుచున్నది. ఈ స్తంభమునకు చేరువనున్న కొండప్రక్క కనుమ పైభాగమున ప్రాచీనులగు రాణాలయొక్క గౌరవార్థము నిర్మింపబడిన గోరీలును, జోహారు జరుగు ప్రదేశములును గలవు. ౧౪౪౦ -౯ సంవత్సరముల మధ్యకాలమున నిర్మితమైన యీ స్తంభమొక గొప్ప విజయచిహ్నము. యుద్ధానంతరమున రెండు పెద్దభేరులను, పెద్ద క్రొవ్వువత్తిదీపస్తంభమును కొనిపోయి అజ్మీరులోని ఖ్వాజాసాహెబ్ ఆలయమున నుంచినారు. అవి ప్రవేశద్వారముచెంత నిప్పటికిని గలవు.

చిత్రము ౬. మార్వారు ముఖ్యపట్టణ మగుయోధపురముయొక్కకోట, నగళ్లు నిందుగలవు. పట్టణమునను, చుట్టుప్రక్కల పెక్కుమైళ్లమేరను ఇంత యున్నతముల గుభవనములు లేవు. చాలమారమున కివి కాన్పించును. ఇసుకరాతితో నివి కట్టబడినవి. వీటిపైన చిత్రములు విరివిగ చిత్రింపబడి యున్నవి. ఇందలి భవనములన్నియు నొకమారే కట్టినవికావు. ఒక్కొక్కరి పరిపాలనమున నొక్కొక్క క్రొత్తభాగము నిర్మింపబడుచు వచ్చినది. ఇవియన్నియు చరిత్రకు అమూల్యములగు నాధారములయి పెక్కు క్రొత్తవిషయములను సమకూర్పగలిగి యున్నవి.

చిత్రము ౭. ఆగ్రాకోటయొక్క సింహద్వారము దానిపరిసర ప్రదేశములు నిందు చిత్రింపబడినవి. దీనిని పురాతనమైన యింకొకకోట యుండినస్థలమున నక్బరుచక్రవర్తి కట్టించినాడు. ఇది ఎఱ్ఱని యిసుకరాతితో కట్ట

బడినది. ఈకొప్పకట్టడము ఇప్పటికిని మంచిస్థితియందున్నది. ఇప్పుడది బ్రిటిషువారి స్వాధీనమున నున్నది.

చిత్రము ౮. ఇందు జయపుర సంస్థానముయొక్క ప్రాచీనరాజధాని చిత్రింపబడినది. ఇది క్రొత్తరాజధాని నగరమున కైదుమైళ్ల దూరమున నున్నది. కోటక్రింది సమతలముననున్న భవనశ్రేణులను, పట్టణమున కుడివైపునను న్న భవనములను నిది మించియున్నది. ఎదుట కొన్నియుద్యానములు, సరోభవనములు, మాళి (మృత్యువు) అనుసరస్సును ఉన్నవి.

చిత్రము ౯. ఇందు రాణాప్రతాపసింహుడు చిత్రింపబడియున్నాడు. ఇతడు ఉదయపూరు, మేవాడు లజాతీయనాయకుడు. రాణాఉదయసింగునకు తరువాత రాజ్యమునకు వచ్చినవాడు. ఇతని రాజ్యపరిపాలన కాలము ౧౫౭౨ మొదలు ౧౫౯౭ వఱకు పెక్కురు రాజపుత్రవీరుల సాయముగల అక్బరుచేత బాధ చెందుచున్న దేశమునకు విముక్తిని గలిగించుటకై యితడు తీవ్రముగ పోరాడెను. తాను మృతి నొందుటకు పూర్వము మేవాడులో చాలభాగమును తన యధీనము కావించుకొనెను. మొఘులకు నితని పుత్రుడు జహంగీరులో సంధిచేసుకొనెను. ఇతనిశిరస్సు కాంతిపుంజమును వెదజల్లుచున్నట్లిందు చిత్రింపబడినది. అల్లికతనుత్రాణమును, ఉరఃకవచఫలకములను, అయోమయహస్తత్రాణమును, శిరస్త్రాణమును, ఇప్పటికిని రాజపుత్రులు ధరించుచున్న తోలు మేజోళ్లను, నడికట్టును అతడు ధరించియున్నాడు. హస్తత్రాణముగల ఒకఈటెను, బల్లెమును, రెండుఖడ్గములను అతడు ధరించియున్నాడు.

చిత్రము ౧౧. మార్వారు లేక మోఘపుర నాయకులలో నొకరయిన కుచవనతాహరుగారి సుందరమందిర మీచిత్రముననున్నది. పైభాగముననున్న కోట యీమందిరమును, చేరువనున్న పట్టణమును రక్షించుచున్నది.

చిత్రము ౧౧. ఇందు ప్రతిమపై నమర్చిన జస్వంతరావు హోల్కారుగారి కవచము చిత్రింపబడినది. ఈ హోల్కారు ఇందూరుకుచెందిన మహారాష్ట్రవీరుడు. ౧౭౬౧వ సంవత్సరమున పనిపట్టు యుద్ధమున నీవీరు డీకవచమును ధరించినాడట. ఈకవచము ఉల్వారునాయకుడగుమహారావు రాజభక్తేశ్వరసింగు స్వాధీనమునకు వచ్చినది. హోల్కారునకు ఒకకన్ను లేనందున నాతని ముఖత్రాణమున నొకకంటికిమాత్రము రంధ్రమున్నది. ఇందలి ఆయుధము లతనివికావు.

చిత్రము ౧౨. మేలట్ కళ్యాణ్‌రా జిందు చిత్రింపబడియున్నాడు. ఇతడు రథోడు నాయకుడు. ఈటె, కొసనుబాకుగల తుపాకి, విల్లు, అమ్ములు, రెండు ఖడ్గములు ధరించియున్నాడు. ఇందలి చిత్రమున శిరస్సు చుట్టునున్న కాంతిపుంజముయొక్క వైఖరి యీచిత్రమీతని మరణానంతరము చిత్రింపబడినట్లు తెలుపుచున్నది. ఇతడెక్కిన గుఱ్ఱమునకు శిరస్త్రాణ తనుత్రాణములున్నవి.

చిత్రము ౧౩. శివాజి (సుప్రసిద్ధుడు.)

చిత్రము ౧౪. బేబరు. మొట్టమొదటి మొగలు చక్రవర్తి (సుప్రసిద్ధుడు)

చిత్రము ౧౫. నాదిర్‌షా. ఇతడు పర్షియాసింహాసనమునధిష్ఠించి ఇండియాపై దండయాత్రవెడలి మొగలుచక్రవర్తియగు మహమ్మదుషాను కార్నలువద్ద ఓడించినాడు. తనసిబ్బందిని ఎదిరించిరను కారణమున ముప్పదివేలమంది ప్రజలను డిల్లీలో చంపించినాడు.

చిత్రము ౧౬. అహమ్మదుషాదురాని (అబ్దాలి). నాదిర్‌షా తర్వాత తూర్పురాష్ట్రములను పరిపాలించినవాడు. ౧౭౫౬లో డిల్లీని కొల్లగొట్టినాడు. తొలుత పంజాబుపై దండువెడలి పోయి తరువాత తనరాజ్యమున జేర్చుకొన్నాడు. ౧౭౫౮ లో పంజాబును మహారాష్ట్రులు ఆక్రమించుకొనిరి. మహమ్మదీయరాజులు దురానితో చేరి మూడవపనిపట్టు యుద్ధమున మహారాష్ట్రులను మూలముట్టుగ రూపుమాపిరి.

[ఇండియన్ ఆర్ట్సు అండ్ ఇండస్ట్రీ జర్నల్ నుండి]

---

రాజ్యచ్యుతుడగు మహారాజు, అతని క్రొత్త ప్రాత వలపుకత్తెలు



నాన్సీ ఆన్ మిల్లరుకన్య

వయస్సు ౨౧ సం. లు. కాలిఫోర్నియాలోని యొకయైశ్వర్యవంతునికూతురు. ఉన్నతవిద్యావతి రాజ్యభ్రష్టుడైన ఇందూరుమహారాజును పెండ్లాడగోరి ఇండియాకు వచ్చియున్నది.



చ్యుతరాజ్యుడైన ఇందూరు మహారాజు

అమెరికాలో నుండగ తీసిన చిత్ర మిది. ఇతని కిద్దరు భార్యలు ఇందూరులో నున్నారు



మంతాజుబీగము

వెనుక చ్యుతరాజ్యుడగు నిందూరుమహారాజును మరులుకొల్పి అతని జీవితమున గొప్పమార్పును కలిగించినది

[22-1-28 టైమ్సు ఆఫ్ ఇండియా నుండి.]

## స్త్రీవిద్య–ప్రస్తుతవిధానము

'వేదిక్ మేగజిను'లో శ్రీమతి చంద్ర వర్తి (బి. ఏ.) గారు ఇట్లు వ్రాసెను:

భారతదేశమున స్త్రీవిద్యావిధానములు పెక్కు తెరగుల నున్నవి. అనేకపాఠశాలలయందు ముఖ్యముగ పాశ్చాత్యవిద్యావిధానము ననుసరించి స్త్రీలకు విద్య నేర్పబడుచున్నది. గవర్నమెంటు పాఠశాలలు, డిస్ట్రిక్టుబోర్డు మునిసిపల్ బోర్డుపాఠశాలలు, ఆర్యకన్యా పాఠశాలలు, అన్నియు నీవిధానమునే అనుసరించుచున్నవి.

భారతీయసాంఘిక పరిస్థితుల కిట్టివిద్యావిధాన మనుచితమని పలువురు తలచుచున్నారు. ఇందలి ప్రధాన లోపము పాఠ్యపుస్తకనిర్ణయమున గలదు. ఇపుడున్న పాఠ్యపుస్తకములయందలి ప్రదేశములయు, సంఘములయు వర్ణనములు భారతీయుల యావశ్యకతకు వ్యతిరేకముల యినవి. అందు బాలికలు చదువువిషయములు వారు స్వయముగ జూడగల్గునవి కానందున వానిని గ్రహించుటకు వారికి చిరకాలము పట్టుచున్నది. వారికి నేర్పబడుచున్న చరిత్రము సత్యస్వరూపము గలది కాదు. అయ్యది వారినుండి మఱుగుపడియున్నది. కావున జాతీయభావము వారియందు శూన్యమగుచున్నది. మఱియు చరిత్ర ముఖ్యముగా గలిగింపవలసిన ప్రాచీనైతిహ్యముల యందలి గౌరవమును గలుగింపకున్నది. ఈవిద్యావిధానము పురుషధర్మముకంటె స్త్రీధర్మము విభిన్నమైనద నువిషయమునుగూడ మఱపించుచున్నది.

సంగీతము, చిత్రలేఖనము, గృహకృత్యనిర్వహణము, గృహవైద్యము, కుట్టుపని మొదలయినవిషయములు బాలికలకు చాల ముఖ్యములైనవి. సంస్కృతభాషయందు భారతీయమతవిద్యయంతయు నిండియున్నది. అందే జాతీయచరిత్రను దెలియుటకు మూలసూత్రములును ఉన్నవి. అట్టిభాష ప్రస్తుతవిద్యావిధానమున నిర్బంధముగాక యైచ్ఛికమయినది. విదేశీయమైన ఆంగ్లము ప్రధానమైనది. విద్యయంతయు తన్మూలముననే కరపబడుచున్నది. కావున నీవిద్యావ్యాపనవిధానము కృత్రిమమును, నిరర్థకమును నగుచున్నది. బాలిక లిట్లు విదేశభాషతో విద్యనభ్యసించుటవలన, యుక్తవయస్కలై తాము జీవితరంగమున నడుగిడుసరికి తమయాపన్నకష్టముల ను కోలుపోవుచున్నారు.

మఱియు నీవిద్యావిధాన మొకపక్షముననే యుద్ధరించునది. సాంఘిక, నైతిక, లౌకికవిషయములను తూలనాడుచున్నది. సాంఘికనియమములను రూపుమాపుచున్నది.

ఆంగ్లభాషా పఠనావశ్యకతను గూర్చి ఆమె యిట్లుచెప్పినది:

ఇంగ్లీషు రాజ్యాంగమున ముఖ్యభాష; దేశవ్యవహారమందే నడచుచున్నది; కాన దాని జదువుటయు నావశ్యకము. మఱియు నాధునికప్రపంచమున నిపుడు ప్రవర్తిల్లుచున్న యెల్లవిషయములును నాభాషమూలమున దెలియనగును. ప్రపంచములో నాంగ్లముననే సారస్వతసంపద యధికముగ వెలయుచున్నది. దానిని కొల్లగొనుటకా భాషను జదువుటావశ్యకము. సర్వథా బాలికలసారస్వతాభివృద్ధికి నాంగ్లభాషను జదువుట పరమావశ్యకముగ బరిగణింపవలెను.

స్త్రీలకు రాజకీయవిద్యయు నావశ్యకమని యీమె యిట్లు నుడువుచున్నది:

బాలికలకు రాజకీయ పరిజ్ఞానము నావశ్యకమయినది. ప్రపంచమందల్ల దేశములలో తమ దేశమునకు గలస్థానము వారు తెలిసికొనవలెను. దేశమునకు వలసిన సౌకర్యములను వారెఱిగియుండవలెను. దేశము సంకటస్థితియందున్నపుడు స్త్రీలు సరిగా సమయమున సాయపడజాలకుండుట గాంచుచున్నాము. వారికి దేశావశ్యకతలు తెలియమియే వారి యాలస్యమునకు గారణము. మొత్తమున ప్రాచీనరమణీమణుల యుత్తమ లక్షణముగ వెలసిన జాతీయశౌర్య మీనాటివారికి లేకున్నది.

---

## కుష్ఠరోగము

ఈ క్రిందివిషయములు పాట్నాలోని ఫెడరేషన్ గెజెటు నుండి ఉద్ధృతములైనవి.

కుష్ఠరోగము సహింపరాని యొకఅంటురోగము. "లెప్ర బాసిల్లస్" అనుపురుగులవల్ల నది పుట్టుచున్నది.

దానివలన వికృతరూపమును, నధికబాధయును గలుగుచున్నవి. అది అతిపురాతన కాలమునుండియు భారతదేశ ప్రజలను పీడించుచున్నది. జాతిమతవిభేదములతో దానికి బనిలేదు. ప్రపంచమందంతటను కుష్ఠరోగులు ముప్పదిలక్షలు గలరనియు, వారిలో ౧౧ లక్షలు చైనాయందును, ౫ లక్షలు ఆఫ్రికాయందును ఒకలక్ష భారతదేశమునందును గలరనియు నంచనా వేయబడినది.

౧౮౮౧ సంవత్సరపు జనాభా లెక్కల ననుసరించి భారతదేశమున కుష్ఠరోగులు ప్రతిలక్షకుండికిని ౫౯ మంది యుండిరనియు, ౧౯౩౧ వ సంవత్సరపు జనాభా లెక్కల ననుసరించి ప్రతిలక్షకును ముప్పదియిద్దరు మాత్రమే కలరనియు తేలుచున్నది.

సాధారణముగా నున్నతసంఘములలోని కుష్ఠరోగులు తమరోగమును దాచుకొన బ్రయత్నింతురు. అయితే భారతదేశమునందు కుష్ఠరోగులు చాలవరకు దరిద్రులగుటచే బిచ్చమెత్తుకొనుచు తమదుర్భరపీడను వీథులయందు ప్రదర్శించుచుందురు.

కుష్ఠరోగి మంచిఆరోగ్యవంతునికి మిగుల నపాయకరమైనవాడు. కుష్ఠరోగము వ్యాపింపకుండ జేయవలయునన్న కుష్ఠరోగుల నందరిని ప్రత్యేకముగా నుంచుటయే యుత్తమమార్గము.

కుష్ఠరోగము కేవలము పరంపరాగతమని చెప్పజనదు. పిల్లలు పుట్టినపు డారోగచిహ్నము లేవియు లేకయుందురు. కాని అదిముఖ్యముగా స్పర్శచే చిన్నదనమునుండి క్రమముగా వారికి సోకవచ్చును. కావున కుష్ఠరోగపీడితులగు తలిదండ్రులకు పుట్టినబిడ్డను కూడినంత చిన్నదనముననే వారితలిదండ్రులనుండి విడదీసియుంచు టావశ్యకము. మఱియు కుష్ఠరోగులు పెండ్లాడ జనదు.

కుష్ఠవ్యాధి వ్యాపించుటకు ఈనాడు అవివేకము, అజాగ్రత, కారణము లగుచున్నవి. కుష్ఠరోగులు ప్రత్యేకస్థలములందు వాసము చేయవలెను. వారిని బజారులయందును, శైత్యోపాటుఫారములయందును బిచ్చ మెత్తుటకై తిరుగనీయరాదు. వారిని వీథులయందు సంచరింపనీయగూడదు. అంగడియందు కూర్చుండి వస్తువుల నమ్మనీయరాదు. ఆహారపదార్థముల నంటనీయజనదు. సన్యాసుల వేషమున దేశమంతట దిరుగనీయ జనదు.

కుష్ఠవ్యాధి యంకురించిన వెంటనే యైన నివారింపదగి యుండును. రోగచిహ్నములను గాంచిన వెంటనే సమర్థుడగు వైద్యునిచే నౌషధమును బుచ్చుకొనవలెను. చికిత్స చిరకాలము పట్టుదలతో చేయించుకొనవలెను. కుష్ఠరోగులు నిరాశతో దుఃఖితులు కానక్కరలేదు. వారికి తగినట్లు వైద్యమును చేయుటకై అనుకూలప్రదేశములందు వైద్యశాల లచిరకాలమున నేలకొల్పబడనున్నవి.

---

### యాదవ ఇరమ్మదేవుని అశ్విశాసనము

ఆంధ్ర హిస్టారికల్ రీసర్చి సొసయిటీ అక్టోబరు (౧౯౩౭) సంచికయందు శ్రీ డి. బి. డిస్కాల్కరుగారు (యం. ఏ., రాజకోట) వ్రాసిన వ్యాసమునుండి.

బొంబాయి రాజధానిలోని అహమ్మదు నగర జిల్లా సంగంనేరుతాలూకా అశ్విగ్రామములో ఈశాసనపురేకులు దొరకినవి. పూనాలోని భారతేతిహాస సంశోధక మండలమువారు తమత్రైమాసిక పత్రిక మూడవ సంపుటమున మరాఠిభాషలో ఈశాసనమును ప్రకటించియున్నారు.

ఇది నాగరిలిపిని చెక్కిన మూడురేకుల సంస్కృతశాసనము. శంకరస్తోత్రముతో శాసనము మొదలుపెట్టుచున్నది. తరువాత దాతవంశవర్ణనము గలదు. అది యిట్లున్నది: ద్వారావతిపట్టణమునుండి తర్లివచ్చిన దృఢప్రహారుడను నొకరాజు చంద్రాదిత్యపురము అనుపట్టణము నొకదానిని ప్రతిష్ఠాపించెను. అతనికొడుకు సూణచంద్రుడు అతడు సిందినేరమున సూణపురమును స్థాపించినాడు. ఆతనికుమారుడు ధాడియప్ప. ఆతని తరువాత క్రమముగా భిల్లమ; శ్రీరాజ, వడ్డిగ, రెండవభిల్లమ అనురాజులు పరి

పాలించిరి. రెండవ భిల్లమభార్య లచ్చి యవ్వ. ఆ యిరువురికి వేసుకుడను కుమారుడు జనించెను. ఆ వేసుకుని కొడుకు మూడవభిల్లమ. ఇతనికి 'మాలిక' అను పేరును గలదు. అతని కుటుంబమున స్యూణచంద్రుడు పుట్టి మూడవ భిల్లమ మరణానంతరము శత్రువుల నందఱను జయించి రాజ్యమును నిష్కంటకము చేసినాడు. అతని కొడుకు ఇరమ్మదేవుడు. ఇరమ్మదేవుడు భువనైక మల్లునకు జయింపరాని సప్తఖండరాజ్యమును జయించి 'పరమర్దికా' అనురాజున కప్పగించెను. అతని భార్య యోగల్ల అనునామె.

చాళుక్యచక్రవర్తి యగు త్రిభువనమల్ల పరమర్దిదేవునియొక్క జయప్రదమైన ప్రభుత్వమున స్యూణదేశమును పరిపాలించు చుండిన మహామండలేశ్వర ఇరమ్మదేవుడు శక. ౧౦౨౧ వ సంవత్సరమున వైశాఖమాస కృష్ణపక్షు ౧౫ సోమవారమునాడు నర్మదా తీరమున నర్మదాపురమను నగ్రహారమును దానముచేసెను.

ప్రతిగృహీతలు ముప్పది యిద్దఱు. వారిలో ముఖ్యుడు కరహారమునుండివచ్చిన కాశ్యపగోత్రజు డగు నాకలపండితుడు. ప్రకృతము కొంకణగోను అను కొంకణగ్రామము దాన మీయబడినది. స్యూణదేశైకసహస్రభాగములలో నొక్కటగు శ్రీనగరముయొక్క లోప అంతర్భాగ మయిన సంగంనెరు తాలూకాలోని దాగ్రామము. శాసనమును పలకరణి హరిశ్చంద్రుడు చెక్కినాడు.

ఇదివఱకు లభ్యములై ప్రకటితములైన యాదవ శాసనములలో నిది నాల్గవది; కడపటిది.

హేమాద్రికృత వ్రతఖండమున స్యూణచంద్రుని కుమారుడగు పరమ్మదేవుని ప్రస్తావన గలదు. ఈపరమ్మదేవుడును ఇరమ్మదేవుడును నిస్సంశయముగ నొక్కరే. (ఇరమ్మదేవుడను పాఠము ప్రాయశః శోరపాటగును.) ఈశాసనములనుబట్టి స్యూణదేశయాదవులు దక్కను చాళుక్యచక్రవర్తులయొక్క సామంతమండలేశ్వరులుగ నుండిరనుటస్పష్టమగుచున్నది. కానియాచక్రవర్తులవారిసామంతరాజుల పట్టికయందు కుటుంబ నామము కానరాదు. క్రీ.శ. 1088–89లో చాళుక్యచక్రవర్తియగు ఆఱవ విక్రమాదిత్యుడు నర్మదానదినిదాటి ఆవలితీరమునగల రాజులను జయించినట్లును, క్రీ. శ. 1098 లో నర్మదా తీరముల తన సామ్రాజ్యముయొక్క ఉత్తరభాగమున నుండినట్లును చరిత్రాధారములవలన తెలియవచ్చుచున్నది. ఈ విషయముల నీశాసనము స్పష్టముగ దృఢపరుచుచున్నది. మఱియు ఈ చాళుక్యచక్రవర్తి సామ్రాజ్యముయొక్క ఉత్తరపుహద్దు స్యూణదేశపు యాదవులచేత సంరక్షింపబడిన నర్మదానది వఱకు కలదనియు తెలుపుచున్నది.

---

## రష్యాదేశము–స్త్రీలు

సామ్యవాదమువలన రష్యాదేశ మిపు డెంతయో యాక్షేపణకు గుఱియగుచున్నది. మన ఆంగ్ల 'ప్రభువులు' దానివిషయమున తప్పులుపట్టుటయే కాదు; చెంకలు వైచుచున్నారు. కాని ఆమునికేతిహాసమున వి. యఫ్. కెల్వర్టన్ గారు దానివిషయమై వ్రాసిన వ్రాత ననుసరించి తెలియును దేమన, నచ్చటి స్త్రీలు భారతదేశమేకాక, సభ్యతగల పాశ్చాత్యదేశములందలి స్త్రీలకంటెను గూడ సుఖముగను, స్వతంత్రముగను నున్నారు. ఆ కెల్వర్టన్‌గా రిట్లు వ్రాయుచున్నారు:—

"పురుషులకువలెనే స్త్రీలకును అధికారములు లభించినవి. ఆర్థికరాజకీయాధికారములు పురుషుల కెట్లో అట్లే స్త్రీలకును గలవు. బహిరంగసభలలో స్త్రీ లుపన్యాసము లిత్తురు. న్యాయస్థానములలో న్యాయాధిపతి పదవులందును వలసినంతమంది స్త్రీ లున్నారు. ప్రసవావసరమందు స్త్రీలు చాల శ్రద్ధతో కాపాడబడుదురు. కాన్పునకు ముందు కొన్ని దినములును, తరువాత కొన్ని దినములును స్త్రీలకెంతయో పరిచర్య చేయబడును. ఒకస్త్రీ యెచ్చటనైన పనిచేయుచున్నచో ౮ మొదలు ౧౦ వారములు జీతమునష్టము లేక సెలవుదొరకును; వైద్యచికిత్సకు సొమ్మీయనక్కరలేదు. ఇంతేకాక, జీతమునకు తోడు తొమ్మిదిమాసములవఱకు పసిబిడ్డపోషణమునకై ధనసహాయము లభించును. తరువాత పనికిపోవుట మొదలుపెట్టిన

మీదట నడుమనడుమ బిడ్డను సవరించుకొనుట కామె కవకాశ మొసగబడుచుండును.

"వివాహవిషయమై పురాతనపు ధార్మిక బంధనములు తొలగింపబడినవి. పెట్టుబడివాదుల లోకములో వలె రష్యాలో స్త్రీపురుషుల యధికారములయందు భేదభావము లేదు. సోవియటు రష్యాయం దొకస్త్రీ వివాహముచేసికొన్నచో నామె తన ఆస్తికాని, తన యేయధికారముగాని తనపతి కప్పగింపనక్కర లేదు. ఇంతేకాదు: మగ డేదేని పనిమీద వేరొకచోటికి కేగినచో స్త్రీ యాతని వెంట నిర్బంధముగా పోనక్కరలేదని యచట నొకచట్ట మున్నది."

సేనాక్షేత్రములందుగూడ వారు పురుషులవెంట గలరని యీవిషయము రష్యాదేశపుయుద్ధమంత్రి యిచ్చిన యుపన్యాసమువలన దెలియుచున్నది. ఆయన ఇట్లుపలికినాడు:—

"స్త్రీలును పురుషులవలె పదవుల గాంచుచు పని చేయుటకు వీలగుసేన యెఱ్ఱసేనయే. సైనిక విద్యాలయములో ఏనమండ్రుగు స్త్రీలు పరిపూర్ణమైన సైనికశిక్షయందుత్తీర్ణులైనారు. ౭౨ స్త్రీలు రాజకీయ సేనాపతిత్వము నిర్వహించుచున్నారు. వాయుయాన విహారులలో నొక స్త్రీకూడ నున్నది."

సారాంశమేమన, కెల్వర్టనుగారి మాటలలో, "సోవియటురష్యాలో స్త్రీలయధికారములన్నియు పురుషుల యధికారములవంటివే. పురుషులు కలలోనైన వారియెడ నెట్టియత్యాచారము సలుపుటకును సాహసింపనేరరు."
['త్యాగభూమి' నుండి]

---

## స్త్రీలపక్షమున

'త్యాగభూమి' మాఘసంచికయందు శ్రీమతి శారదాకుమారీ బిర్లాగారు వ్రాసిన వ్యాసమునుండి:

స్త్రీలను స్వతంత్రల గావించి 'ఫేషనబిల్'గా చేయుట కనేకులు స్త్రీ సంస్కర్తలు వారి యిచ్ఛకు విరుద్ధముగ వారి స్త్రీయోగ్యభావములనుగూడ నాశ మొనరింప యత్నించుచున్నారు. ఇది స్వతంత్రత యను పేర వారికి పరతంత్రత నేర్పుటయే యగును...నిజముగా స్త్రీసంస్కారము చేయదలచినవారు తమస్వార్థమును, వాంఛాపరత్వమును విడిచి, మెల్ల మెల్లన వారి మానసిక ప్రవృత్తిని మార్పవలయును. అయినను, వారి స్త్రీ సహజమగు సిగ్గును, అడకువను, ఆత్మగౌరవమును, గుణగణమును మాత్ర మాదరింపవలయును. ఈ ఆందోళనములో వారు స్త్రీల యాశయముల నుపేక్షింపరాదు. ఆందోళనముగాని, సంస్కారముగాని చేయుతరి వారు స్త్రీల కోర్కులను, ఆవశ్యకములను, ఆశయములను గుర్తింపవలయును.

---

## ఐదవ అఖిలభారతసంగీత మహాసభ—మద్రాసు

మద్రాసునందు ౨౮-౧-౨౭ తేదిని ఐదవఅఖిల భారత సంగీతమహాసభప్రారంభమై జయప్రదముగ కొనసాగెను. శ్రీయుత కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి గారు మహాసభ కధ్యక్షతవహించిరి. ఈమహాసభయొక్క దక్షిణభారతీయవిభాగమునకు శ్రీయుత సి. ఆర్. శ్రీనివాసఅయ్యంగారును, ఉత్తరభారతీయ విభాగమునకు శ్రీ పండితవిష్ణుదిగంబరుగారును అధ్యక్షతవహించిరి.

ఈమహాసభకార్యక్రమము మూడుభాగములుగ వేరుపరుపవచ్చును: చర్చాదికము, గానసభలు, ప్రదర్శనము.

తొలిదినమున మహాసభాధ్యక్షుని యూరేగింపు ముగిసినవెనుక మద్రాసువ్యూజియం థియేటరునందు స్వాగతోపన్యాసమును, ముస్గురధ్యక్షుల యుపన్యాసములును జరిగినవి. ౨౯-వ తేదినుండి ప్రతిదినము మధ్యాహ్నము ౧౨ గం. మొదలు ౪ గం. వరకు వ్యాసపఠనము మున్నగుకార్యక్రమము జరిగెడిది. ఈమహాసభకు సుమారు ౪౧ వ్యాసములు వచ్చినవి. గొప్పగొప్పవిద్వాంసులును, శాస్త్రజ్ఞులును రచించిన విలువగలవ్యాసము లనేకములందు గలవు. పురుషులేకాక స్త్రీలును, భారతీయులేకాక పాశ్చాత్యులునుగూడ వ్యాసములు పంపిరనిన,మన



౧. బాలసరస్వతి

ఇది తరుచుగా హిందూస్థానీవిద్వాంసులలో ధనికులుపయోగింతురు. దక్షిణదేశమునను శ్రీజగన్నాథభట్టోస్వామిగారు ఈవాద్యమునందు మిగుల సుఖ్యాతి గడించియుండిరి.

దేశమున సంగీతాభిలాష యెంత వ్యాపించుచున్నదో వెల్లడియగుచున్నది.

కాంగ్రెసునగరమునందలి సంగీతమహాసభా ప్రత్యేకభవనమున అనుదినము, ఉదయమునను సాయంకాలమునను మంచిగానసభలై దారుజరుగుచుండెడివి. అందు ప్రతిదినము సాయంకాలము ౬ గం. మొదలు ౯ గం. వరకు హిందూస్తానీసంగీతసభలు జరిగెడివి. పండిత విష్ణుదిగంబరుగారును, వారి శిష్యమండలియు పలుసార్లు తమ గానకళానైపుణ్యమును జూపి శ్రోతల నానందింపజేసిరి. సంగీతమునందలి యాధ్యాత్మికప్రాధాన్యమునుగ్రహించిన గాయకశిఖామణులలో శ్రీవిష్ణుదిగంబరపండితు లొకముఖ్యస్థాన మలంకరింతురనియనేకులు తలంచిరి. మద్రాసు ప్రాంతీయు లితరప్రాంతీయసంగీతసంప్రదాయములుగూడ గ్రహించుట కిట్టివిద్వన్మణులసభలు జరుగుటావశ్యకము. ఈభవనమున నేకాక మ్యూజియంథియేటరునందుగూడ ననుదినము ౪ గం మొదలుకొని రెండు మూడుసభలు జరుగుచుండెడివి. దినమునకొక్క రూపాయిమాత్రమే రుసుమగుటచే జనులు తక్కువవ్యయముతో ననేకసభలు సందర్శింపగల్గిరి. కృష్ణప్ప, రామానుజయ్యంగారు, రామకృష్ణయ్యగారు, నాగరత్నమ్మ మున్నగువారి గాత్రము, వెంకటస్వామినాయుడుగారి ఫిడేలువాద్యము, పొన్నుస్వామిపిళ్లెగారి నాగస్వరము మొదలగునవి మహాసభకు వన్నె దెచ్చెను. వీణ, గోటువాద్యము, మురళి, సితారు, రుద్రవీణ, గెత్తువాద్యము, కరమురళి, క్లార్నెటు, సుబ్రబీణ, జలతరంగము, ఘటము, మృదంగము, కంజీర, తబలా, జాలరు, క్వానున్—ఇట్టి వివిధములగువాద్యములపై వివిధవిన్యాసముల సంగీతకళ తాండవించినది.

వానిలో మద్రాసుప్రాంతములకు క్రొత్తగనుండుకొన్ని వాద్యసాధనములచిత్రము లిచట ముద్రితములైనవి.

ఈ మహాసభామండపము వెనుకభాగమునందే ప్రదర్శన మమర్చబడెను. ఈ ప్రదర్శనమును ౨౮-వ తేది మధ్యాహ్నము సర్. సి. పి. రామస్వామి అయ్యరుగారు తెరచిరి. రెండు అణాలుమాత్రమే రుసుమగుటచే ననేకు లీప్రదర్శనమును సులభముగ సందర్శించుట కనువుపడినది. సంగీతప్రపంచమున శాశ్వతప్రాముఖ్యము వహించు ననేకవాద్యవిశేషములు, గ్రంథములు మొదలయిన విందు ప్రదర్శితములయ్యెను. దక్షిణభారతీయగాయకత్రిమూర్తులలో నొకరగు శ్రీశ్యామాశాస్త్రులవారి స్వహస్తలిఖితమగు 'తాళప్రస్తార' మనునమూల్యగ్రంథ మిందుండెను. ఇందలి ప్రస్తారక్రమమును విద్వాంసు లనేకులు సరిగ భేదింపజాలకపోయిరి. ఇది తంజావూరులో శ్రీ శాస్త్రులవారి సంతతివారియొద్దనుండి శ్రీయుత పి. సాంబమూర్తిఅయ్యరు



౨. గెత్తువాద్యము
దీనిని తరుచుహిందూస్థానీసంగీతమున వాడుదురు

గారు తీసికొనివచ్చి యీప్రదర్శనమున నుంచిరి. ఆల్ఫ్రెడ్ వెస్టురాప్పుగారు రచించిన 'Music Comes from the East' (సంగీతము ప్రాచ్య భూమినుండి వచ్చినది) అను లిఖితగ్రంథము లనేకము లిందుండెను. ఇట్టి యముద్రితగ్రంథరాజము లీప్రదర్శనమునకు మెరుగుపెట్టెను. ఇదిగాక హిందూస్థానీ సంగీతమున వాడెడి వాద్యములు చాల నుండెను. దక్షిణ భారతదేశమున దేవాలయములందు వాడునవియు, బైరాగులు, పండారములు, ఆదిబ్రాహ్మణులు నుపయోగించునవియు ననేకవాద్యావశేషము లిట ప్రదర్శితములయ్యెను. మురళీవాద్యమునకు పునరుద్ధారకులగు కీ. శే. శ్రీశరభశాస్త్రిగా రుపయోగించిన మురళియు, ఫిడేలువాద్యమున నఖండప్రఖ్యాతి గడించిన కీ. శే. శ్రీతిరుకాడికావల్ కృష్ణయ్యరుగారి ఫిడేలు మున్నగు వస్తువులు పవిత్రకళాసంపదలకు స్మృతిచిహ్నములై సంగీతకళోపాసకుల యాచార్యభక్తి నుత్తేజింపజేసినవి. ఒక రాతి పిల్లనగ్రోవి, ఒక దంతపు ముఖవీణయు కూడ నిందుండెను. గాయకులయు, ప్రాపకులయు, కీర్తనారచయితలయు ఛాయాచిత్రములు, ముద్రితములగు సంగీతగ్రంథములు ననేకము లీప్రస్నమున నుండెను.

ముఖ్యముగ, ఇందలి సుబ్రవీణ యను వాద్యావిశేషమునుగూర్చి యిట కొంత వివరింపదను. ఇది బెంగుళూరునివాసి శ్రీయుత సి. యస్. సుబ్రహ్మణ్యఅయ్యరుగారు నాల్గయిదు సంవత్సరములక్రిందటనే క్రొత్తగ కనిపెట్టిరి. ఇది పైకొకసాదనైన హార్మోనియమువలె నుండును. దీనిలోపల వీణదండివంటిదండి తీగలతో నమర్చియుండును. పైభాగమున నెడమప్రక్కగల మీటుగజ్జ నెడమచేతితో కదపుటచే లోపలితీగెల నది మీటును. కుడిచేత మెట్లు నొక్కినచో చిన్నిచిన్ని సుత్తులు తంత్రిపైనాయా స్వరస్థానముల స్పృశింప, వీణానాదమువంటి నాద ముప్పతిల్లును. ఇం దొక్కతీగమీదనే రెండున్నర స్థాయులు పలుకును. వీణకుగల నాదసౌష్ఠవాదులును, హార్మోనియమునకుగల వాద్యసౌకర్యాదులు నీ సాధనమున కలిసియున్నవి. ఇది త్వరలో వ్యాప్తిలోనికి రాగలదు. ఇట్టి గొప్పజంత్రమును గనిపెట్టిన



3. దిల్ రుబా
ఇది యొక వంగదేశపు వాద్యావిశేషము.



౪. సుబ్రవీణ



౫. సారింద
ఇది యొక హిందూస్థానీ వాద్యావిశేషము.



౬. ఎస్‌రాజ్
ఇది యొక వంగదేశపు వాద్యవిశేషము.



౭. సితార్
ఇది యొక హిందూస్తానీ వాద్యవిశేషము



౮. రుద్రవీణ
దీనిని తరుచు హిందూస్తానీ సంగీతమున వాడుదురు.

శ్రీ అయ్యరుగారు భారతదేశమున కలంకార ప్రాయులు; దక్షిణభారతమునకు గర్వకారణులు; సంగీతకళోపాసకులకు వందనీయులు.

౧-౧-౩౮ తేదిని, మహాసభలో విషయ చర్చలయందు పాల్గొనిన ప్రముఖులకును, తమ గానకళానైపుణ్యమును ప్రదర్శించిన సంగీత విద్వాంసులకును బంగారుపతకములును, యోగ్యతాపత్రములును సత్కారరూపమున సమర్పితము లైనవి. పిదప మహాసభ ముగిసినది.

ఈమహాసభ దక్షిణభారతదేశమున జరుగుట కిది రెండవసారి. ౧౯౩౩-సం.న కాకినాడయం దిది తొలిసారి జరిగియుండెను. అక్కడకంటె నిక్కడ ననేకవిధముల నిది బాగుగ కొనసాగినది. కాని సత్కారములవిషయమై విద్వాంసుల కసంతుష్టి చేకూర్చునర్యలు జరుగకుండినచో, దీనిప్రఖ్యాతి నిష్కళంకముగ నుండెడిది. నిర్వాహకులింకను మెలకువతో వర్తించినచో నట్టిదివాటిల్లకుండెడిది.

ఈమహాసభయందు చదివిన వ్యాసములను వీరు త్వరలో ప్రకటించినచో మనదేశమున సంగీతకళకు మంచి ప్రోద్బలము చేకూరి, వ్యాసముల ప్రయోజనమును, మహాసభ ఆశయమును ఉచిత రీతి నెఱవేఱగలవు.

ఇట్లు ప్రతివత్సరము నుత్తరోత్తరాభివృద్ధితో ఈమహాసభ జరుగుటకుగాను విరాళములు సేకరించి తగినయేర్పాట్లు చేయుచు, వివిధప్రాంతములయందు శాఖాసంస్థలు, భాండాగారములు నిర్మించి యీలలితకళ నభివృద్ధిలోనికి దీసికొనివచ్చుటకు మహాసభవారు పూనుకొందురుగాక!

---

## అఖిలభారత హిందీసాహిత్యసమ్మేళనము

అఖిలభారత హిందీసాహిత్యసమ్మేళనము ౧౯౩౭ డిసెంబరు ౨౮వ తేదీని మద్రాసులో శ్రీమతి సరోజినీదేవి యధ్యక్షత క్రింద సమావేశమయ్యెను. దేవిగారి యధ్యక్షోపన్యాసము శ్రోతల నుత్తేజింపజేయుచు హిందీ నేర్చుకొనుటకును, నేర్పుటకును వారి మనముల నొక

కర్తవ్యజ్ఞానము నాపాదించెను. 'జాతి స్వాతంత్ర్యము' అని ఒక్కటేభాషయందు కంతకు నొక్కభాష యుండవలసిన యావశ్య సమస్తలోకమునకు నుద్ఘోషించుట వారిపని" కతనుగూర్చి చెప్పు చు, అది యెల్లరకు సుబోధమగు రీతిని హిందీభాషయే కావలయునని శ్రీ దేవిగారు మహాత్మాగాంధిగారి బోధల స్మరింపజేసిరి. "విచారకులు, తత్త్వజ్ఞులు, కవులును రాష్ట్రీయ భాషయందే మోహము గల దని వచించినది యథార్థము. 'మాది ఒక్కటేభాష, ఒక్కటే అభిలాష, ఒక్కటే జీవితాశయము: అది విదేశీయశాసనమున నలుగుచునుండిన మా మాతృభూమికిని, మా ఆత్మకును యని శ్రీ దేవిగారు నొక్కి చెప్పిరి.



శ్రీమతి సరోజినీ దేవిగారు అధ్యక్షురాలు, హిందీమహాసభ

భారతదేశమునకు హిందీని రాష్ట్రభాషను గావించుటయందు నాయకత్వము వహించిన మహాత్మాగాంధిగారి కపారమగు కృతజ్ఞతను వెల్లడించుచును, హిందీప్రచారమును స్వయంపోషకముగను, సుస్థిరముగను, జయావహముగను గావించుటకు వలయు ధనజనసహాయమునుగావింప దేశీయులను ప్రార్థించుచును తీర్మానములు గావింపబడెను.

---




# గ్రంథములు

## నీతిద్విషష్టిక

నాగరాక్షరములతో ఫెదరువెయిటు పేపరుపై ఒక్కగా ముద్రింపబడినది. ప్రకాశకులు బ్రహ్మశ్రీ కనుపర్తి మార్కండేయ శర్మగారు, బృందావనము, కిల్పాకు, మద్రాసు వెల 0—8—0

ఇది బహు ప్రాచీనమును, బహు రసవంతమును నైన నీతిగ్రంథరత్నము. క్రీ. 500 కింకను బూర్వకాలమున దక్షిణ మధురాపురమునఁ బ్రఖ్యాతి గాంచిన సుందరపాండ్యాచార్యుఁడు దీనిని రచియించెను. ప్రాచీన గ్రంథములు పెక్కింటిలో (పంచతంత్రము, హితోపదేశము, సుభాషితావళి మొ.) నీగ్రంథమునుండి శ్లోకము లుదాహృతము లయినవి. తెలుఁగు కవీశ్వరులగు మంచెనకవి, శ్రీనాథకవి సార్వభౌముఁడు, సుమతికారుఁడు నీ గ్రంథమునందలి శ్లోకములఁ దెలిఁగించిరి. శ్రీశంకర భగవత్పాదులు, కుమారిలభట్టును, నీమహావిద్వాంసుని గ్రంథాంతరమును శారీరక మీమాంసా భాష్యమునను, తంత్రవార్తికమునను నుదాహరించిరి. క్రీ. 590లోనున్న జనాశ్రయమహారాజు-కృష్ణాతీరాంధ్రదేశము నేలినవిష్ణుకుండినవంశ్యుఁడు-(మాధవవర్మ) తన జానాశ్రయీఛందమున నీగ్రంథము నుదాహరించెను. ఈగ్రంథమెల్ల నార్యావృత్తములతోనున్నది. మాదిరికి రెండుశ్లోకములు:—

శ్లో. నచ హసతి నాభ్యసూయతి
నపరాన్పరిభవతి నానృతం వదతి,
నాక్షిప్య కథాం కథయతి
లక్షణ మేత త్కులీనస్య.

శ్లో. గన్తవ్యం రాజగృహం
ద్రష్టవ్యా రాజసమ్మతాః పురుషాః,
యద్యపి నభవం త్యర్థా
భవ న్త్యనర్థ ప్రతీకారాః.

బ్రహ్మశ్రీ వేటూరిప్రభాకరశాస్త్రిగారు సంస్కృతభాషలో దీనికి విలువగల యుపోద్ఘాతము వ్రాసిరి. బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు కొన్ని విశేషములతో దాని నింగ్లీషులో వ్రాసిరి. అందు కవిని గూర్చి, గ్రంథమునుగూర్చి మంచిపరిశోధనముగలదు. ఈగ్రంథము పాఠశాలలోఁ జదువు విద్యార్థులకును బాఠ్యగ్రంథముగా నుపయోగింపఁదగినది.

ఆంధ్రదేశపు ప్రఖ్యాత సంస్కృత కవీశ్వరులు రచియించిన గ్రంథములను నాగరాక్షరములతో నిఁక మీఁదఁ బ్రకటింతుమని ప్రకాశకు లిందుఁ దెలిపిరి.

అగస్త్యకవి బాలభారతమును, నరసింహకవి కాదంబరీనాటకమును బ్రకటింపనున్నారు.

సంస్కృతసారస్వతాభిమానులగు ప్రముఖులెల్లరు వీరికిఁ దోడ్పడఁదగుదురు. తెలుఁగు దేశమునఁగూడ నిఁక నీ కావ్యమాల వర్ధిల్లుఁగాక.

## జంతుశాస్త్రము

గ్రంథకర్త బుర్రా సత్యనారాయణగారు, సహాయోపాధ్యాయులు, గవర్నమెంటుట్రెయినింగుస్కూలు, ఏలూరు. ప్రకాశకులు: రామా అండుకో, ఏలూరు. క్రౌను సైజు ౩౧౭ పుటలు; వెల రు. ౧-౮-౦.

దీనినిగూర్చి గ్రంథకర్తగా రీక్రిందివిధమున నుడివినారు: "బోధనాభ్యసన పాఠశాలలో వాడబడుచుండు జంతుశాస్త్ర పాఠానుక్రమణిక ననుసరించి యీపుస్తకము వ్రాయబడినది;" "ప్రతిపాఠమునకు చివర విశేషాంశములు గుర్తింపబడినవి." "అందందు 'అధికపాఠము' లీయబడినవి;" అచ్చటచ్చట 'లోకోక్తులు, పద్యములు' సమయానుకూలముగ నుదాహరింపబడినవి." ఇదియంతయు నిశ్చయమే.

శైలియొక్క మచ్చును పాఠకులకు చవిచూపుట కీక్రిందిభాగము:

"పక్షులలో సామాన్యముగ నేడాది కొకతూరి యీక లూడిపోయి వానిస్థానమున క్రొత్తవి పుట్టుచుండును. ఈదుస్తులమార్పన్నిటిలో నొకేసారిజరుగదు. మగపక్షులలో వివాహ ప్రయత్నములకు పూర్వమును, ఆడుపక్షులలో ప్రసవానంతరమున నిది జరుగుచుండును. మఱియు నీయీకలన్నియు నొకేసారి యూడిపోవు. అట్లయినచో బొత్తుగ నెగురలేక కొంతకాలము శత్రు కంటబడక మఱుగున దాగియుండవలసి వచ్చును. సామాన్యముగ జతలు జతలుగ నూడుటవాడుకయై యున్నది. భూచరములగు పక్షులలో మాత్ర మీకలన్నియు నొకేసారి యూడిపోవును. క్రొత్తయీకలు వచ్చునంతవఱకవి మరుగుస్థలములందు దాగియుండి ప్రాణరక్షణ గావించుకొనుచుండును."

## వృక్షశాస్త్రము

గ్రంథకర్త: బుఱ్ఱాసత్యనారాయణగారు, సహోపాధ్యాయుడు, గవర్నమెంటు ట్రైనింగుస్కూలు, ఏలూరు. ప్రకాశకులు: రామా అండుకో, ఏలూరు. క్రౌను సైజు; 383 పేజీలు. వెల రు. 1-7-0.

వృక్షశాస్త్రనిర్వచనము, వృక్షప్రాధాన్యము, తచ్ఛాస్త్రపఠనావశ్యకత మొదలయినవిషయములను వివరించుచు గ్రంథకర్తగారు పీఠికను వ్రాసినారు. గ్రంథమున వృక్షముల ఉత్పత్తికి కారణభూతములైన బీజములు మొదలుకొని వృక్షములయుపయోగములవఱకు గలవిషయమును 18 ప్రకరణములయందు వివరించినారు. పాఠశాలలోని చిన్నతరగతులవిద్యార్థులకిది ఉపయోగకరము. పరిశోధనలు, పాఠసంగ్రహములు, ప్రశ్నలు, బొమ్మలు నున్నవి. శైలి–మచ్చునకు:

"ఇంకొన్నిటిలో కణుపుకు రెండేసి ఆకులు పుట్టి ఒకదానికొకటి యెదురు బొదురుగా కాడతో చేరియుండును. ఇట్టియమరికకు "అభిముఖచేరిక" (Opposite) అందురు. బిళ్ళగన్నేరు, మద్ది వీనియందు ఆకులట్లే చేరియుండును. జిల్లేడులోకూడ ఆకులట్లే చేరియుండును. అయితే ఒకజత మరియొకజత కడ్డముగా నుండును. ఇట్టి యమరికను "జంటచేరిక" (Decussate) అందురు. మరికొన్నిటిలో నాకులనేకములు పల్లేరములవలె కణుపుచుట్టుపుట్టి విస్తరించియుండును. ఇట్లుండుటను "పల్లేరపుయమరిక" (Whorled) యందురు. గన్నేరు, యేడాకులపాల మున్నగువానిలో ఆకులట్లేయుండును."

## భారతనీతిసారము (భాగము 1)

శ్రీ. తి. అ. స్వామినాథయ్యగారు పద్యములకు తాత్పర్యమును, భారతకవిత్రయ సంగ్రహ చరిత్రమును వ్రాసినారు. క్రౌనుసైజు; 87 పేజీలు వెల. రు. 0-3-0.

ఇందు తెలుగుభారతమునుండి పురుషప్రయత్నము, నీతిమార్గము, అక్రమప్రవర్తన, అనుశ్రీ కల్క్రిందికివచ్చు పద్యముల కొన్నిటినేర్చికూర్చినారు. వానికిసంగ్రహముగా తాత్పర్యమును వ్రాసినారు.

## పరశురామ విజయము (వచనము)

గ్రంథకర్త: శ్రీ. ఇ. శ్రీనివాసవరదాచార్యులుగారు. క్రౌనుసైజు; 113 పేజీలు; వెల రు 1-8-0.

ప్రాచీన సంస్కృతాంధ్ర వాఙ్మయములం దచ్చటచ్చటనున్న పరశురామ విషయికవృత్తాంతము నంతయు నేర్చితెచ్చి యిందు పొందించినారు. శైలి సరళముగా నున్నది.

పైరెండు పుస్తకములకు ప్రకాశకులు: శ్రీరామ కృష్ణబ్రదర్సు, చెన్నపురి.

## అభిమన్యుడు

గ్రంథకర్తలు: వారణాసి శ్రీనివాసరావుగారు యమ్. ఎ., యల్. టి., హోతా వేంకటకృష్ణయ్యగారు.

క్రౌనుసైజు; ౪౦ పుటలు. దీనివెల ౨అణాలు. పెద్దఅచ్చున చదువునపుడు కన్నులకు బాధకలుగకుండ నుండును. కూడి నంతవరకు వాక్యములుకూడ చిన్నవిగనే ఉన్నవి.

### హిందూదేశ చరిత్ర (రెండవపుస్తకము).

క్రౌనుసైజు; ౨౫౬ పుటలు. పి. టి. శ్రీనివాస య్యంగారు (యం. ఏ., యల్. టి.) గారు విరచించి నది. గిడుగు వెంకటసీతాపతి, బి. ఏ., యల్. టి. గారు తెనిగించినది.

'ఈపుస్తకము విద్యాశాఖాధికారులు (Department of Public Instruction) రెండవ ఫారమునకు విధించినప్రణాలికను (Syllabus) అనుసరించి వ్రాసినది. ఇందులోని చారిత్రిక విషయములు చిన్నపిల్లలకు సులభ ముగా బోధపడునట్లు కథారూపముగాను, దేశాభిమాన ముకలుగుటకు అనుకూలమైనవర్ణనలతోను రచించినాము.' అనిగ్రంథకర్త పీఠిక. తర్జుమాకూడ చాలసులభశైలిలో ముచ్చటగానున్నది. అరటిపండొలిచి చేతికిచ్చినట్లు విష యము బాలురకు ఎక్కిలి సులభముగను, విశేషముగను బోధపడును. ఇట్టిపుస్తకములే బాలుర తరగతులకు పఠనీయములుగా నుండవలెను.

### మాక్మిలన్ వారి ప్రథమ శాస్త్రగ్రంథములు (మూడవపుస్తకము)

గ్రంథకర్తలు:(౧) ప్రకృతిశాస్త్ర విషయములు: కాళ్లకూరి సూర్యనారాయణరావుగారు, బి.ఏ., యల్.టి.; (౨) వృక్షశాస్త్రము: దివాన్ బహదరు కె. రంగాచార్యుల వారు; (3) జంతుశాస్త్రము: ప్రొఫెసర్ ఆర్. గోపా లయ్యరుగారు. క్రౌనుసైజు. (౧) ౬౬ పుటలు. (౨) ౫౪ పుటలు. (3) ౪౨ పుటలు. వెల ౧౧ అణాలు.

ఇది మూడవఫారమునకు నిర్ణయించిన సిలబసు ననుసరించి విరచితమైనది. ఉపాధ్యాయులు బోధించుట కును, బాలురు గ్రహించుటకును గూడ చాలనుపకరించు పద్ధతి నీపుస్తకము విషయములను వివరించుచున్నది.

### హిందూదేశ రాజ్యాంగపద్ధతి (సివిక్సు)

(ప్రథమపాఠపుస్తకము). క్రౌనుసైజు; ౨౧౪ పుటలు. గ్రంథకర్త: కె. సీతారామయ్యగారు, బి. ఏ., యల్. టి. ఇది ఏడవకూర్పు. వెల ౧౨ అణాలు.

ఈపైనాల్గు గ్రంథములకును ప్రకాశకులు: మాక్మిలన్ అండ్ కంపెని లిమిటెడ్ వారు, మదరాసు.

### భారతదేశ చరిత్రము

గ్రంథకర్త: అక్కపెద్ది రామకోటి శాస్త్రిగారు; ప్రకాశకులు: వేంకటరామ్ అండ్ కంపెనీ; బెజవాడ. క్రౌనుసైజు ౬౧ పుటలు. వెల ౪ అణాలు.

### ఇంగ్లండుదేశ చరిత్రము (మొదటిభాగము)

క్రౌనుసైజు; ౧౫౧ పుటలు. గ్రంథకర్తలు: యన్. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, బి. ఏ., వి. మల్లికార్జునయ్య గారు, బి. ఏ., యల్. టి. వెల రూ ౧-౧-౧.

నార్మను విజయమునకు పూర్వమునుండి పదునై దవ శతాబ్దాంతమువఱకు గలచరిత్ర మిందు గలదు.

వలయువారు: వి. మల్లికార్జునం, ౧౪, సుంకువారి వీథి, ట్రిప్లికేను, మద్రాసు అని వ్రాయవలెను.

### రాధారమణ శతకము

కృతికర్త: సన్నిధీసు సత్యకేశవరావుగారు, కవితాసమితి, విశాఖపట్టణము. వెల ౨ అ. ఇందు ౧౧౫ కందపద్యము లున్నవి. శైలిసులభముగ నున్నది.

### క్రొత్తస్వరాజ్యం పాటలు

క్రౌనుసైజు ౨౧ పుటలు. గ్రంథకర్త: గరిమెళ్ల సత్యనారాయణగారు. ఇది శారదాగ్రంథమాల లావకుసుమము. భారతీముద్రణాలయము, బరంపురం, గంజాము నందు ముద్రితము. వెల ౬ అణాలు.

ఈగ్రంథసంపాదకుల యభిప్రాయమున ఇప్పటి స్వరాజోద్యోత్సాహంబునకు రాజభక్తిప్రాణము; ఆంగ్లేయ విద్య అన్నము; రాయల్ కమీషనుకు స్వాగతమిచ్చుట రహదారీత్రోవ. 'ఇంతగడబిడలోనూ ఏమరకుండా బిగ్గ పట్టుకొని నిబ్బరంగా కూర్చోవలసిన తరుశాస్త్రం రాట్నమూ, స్వదేశవస్త్రం అను గాంధీగారి కేక అవశ్యాకర్ణనీయమని అతి వివేకు లొప్పుకుంటారో ఒప్పుకోరో కాని, హిందూదేశములో మూర్ఖు లనుకొనబడేవారంతా ఒప్పుకుంటున్నా రనడానికి మహాత్మాగాంధీగారికి సర్వత్రా ఒసగబడుచుండు ఈస్వాగతములూ, సంచులే సాక్షు

లు' అని వీరుపోద్ఘాతమున నుడివినారు. ఈవిషయము లకు సంబంధించినవే యీపాటలు. అట్టిమూర్ఖులు వీరు చెప్పినట్లు 'సర్వత్రా' ఉండగా, 'ఇవి ఆంధ్రప్రజల ఆనందములకు పాత్రము లయియే తీరును' అను వీరి నిశ్చితాకాంక్ష యెంతవఱకు నెఱవేఱునో తెలియదు.

ఇం దెనిమిదిపాట లున్నవి. వాడినది వాడుక భాష. భావములించుక వికటవిమర్శనము వెలిబుచ్చుచున్నవి. ఇందు సాహిత్యనిర్మాతల నేర్పుఅంతగా కనబడదు.

## వచనాంధ్రకాదంబరి

అనువాదకులు: కీ. శే. సత్యవోలు సోమసుందర కవిగారు. ఇది సకలానంద గ్రంథమాలికయందు ౬ వ పుష్పము; కాదంబరీనిలయం, కాకినాడ. డెమ్మిసైజు; ౧౫౦ పేజీలు; వెల రు ౧—౦—౦.

అనువాదసారస్యమునకై మచ్చు:

మూలము: యదితావ దకథయిత్వా అనిపత్య చరణయో రనాఘ్రాతశ్శిరసి అగృహీతాశీః సహసా ఉచ్ఛృంఖలితఏవ తాతేనాంబయా వక్తవ్యమ ప్యపక్రమ్య.గచ్ఛామి; తతోగతస్యాపి మమ కుతఃసుఖం కిం శ్రేయః కుతోవా ఫలావాప్తిః కీదృశీవా హృదయనిర్వృతిః.

అనువాదము: విచారించి చూడఁగాఁ జెప్పకయే, చరణములందుబడకయే యనాఘ్రాతశిరస్కుండనై యాశీర్వచనంబును గ్రహింపకయే సాహసించి విశృంఖల వృత్తి గలవాఁడనై తండ్రితోడను దల్లితోడను జెప్పవగినదానిని విడిచి వెళ్లుచున్నాను; అట్లు వెళ్లిన నాకెట్లు సుఖంబు గల్గును; ఏమిశ్రేయస్సు; ఫలావ్యాప్తి యెట్లగును; హృదయంబున కెట్లు సంతుష్టి గలిగి యుండును?

## పుష్పబాణ విలాసము

అనువాదకుడు: ఊటుకూరి సత్యనారాయణరావు బహద్దరు జమీందారు,ఆర్లపాడు, గంపలగూడెం పోస్టు, కృష్ణాజిల్లా. క్రౌనుసైజు;౧౧ పేజీలు;వెల రు. ౦-౮-౦. ఇందు సంస్కృత మూలమును ఉన్నది.

మూలము: శ్లో॥ కాచిత్ సర్వజనీన విభ్రమపరా
మధ్యే సఖీమణ్డలం
లోలాక్షీ భ్రూవసంజ్ఞయా విదధతీ
దూత్యాస హోభాషణమ్;
అక్ష్ణో రఞ్జన మఞ్జసా శశిముఖీ
విన్యస్య వక్షోజయోః
స్థూలంభావుకయోః స్థితం మణిసరం
చేలాంచలేన వ్యధాత్.

అనువాదము:

చ॥ సకలజనీన విభ్రమశ
శాంకసమాస్య చలద్విలాస భ్రూ
ప్రకటితసంజ్ఞ దూతికిని
బల్కుచెలుల్ సుమిగూడి యుండఁ గా
టుక కనుదోయి దీర్చుచు
కడుంగడుజృంభితమాకుచస్థిత
ప్రకటమణీసరంబు తన
పయ్యెదగప్పుచు భావమేర్పడన్.

అనువాదసారస్యమును దెలియుట కీయొక్కయుదాహరణము.

## నెల్లూరిగాలివాన (పద్యఖండకావ్యము)

గ్రంథకర్త: శ్రీదీపాల పిచ్చయ్యశాస్త్రిగారు. క్రౌనుసైజున ౨౮ పేజీలు: వెల రు. ౦-౨-౦.

రెండునెలలకు పూర్వము గాలివానచే విధ్వస్తమయిన నెల్లూరుపురముయొక్క విషాదస్థితి యిట్లు రసవత్పద్యకావ్యరూపమును గాంచినది.మార్గశీర్ష మాసభారతియందు ప్రకటితములైన యిందలి కొన్నిపద్యముల సారస్యమునుభారతిపాఠకులు చవిచూచియే యున్నారు.

## కౌసల్యాచరిత్ర (వచనము)

గ్రంథకర్త: శ్రీ. చెలికాని సూర్యారావుగారు. శ్రీరామవిలాసగ్రంథమాల, చిత్రాడ, పిఠాపురం. క్రౌనుసైజు; ౯౧ పేజీలు. వెల రు ౦-౬-౦.

రామాయణ ఉత్తరరామాయణాదుల నుపలబ్ధములగు కథాభాగములను పురస్కరించుకొని యీగ్రంథము రచియింపబడినది. శైలి సులభముగ నున్నది.

## అద్వైతామృతసారము

గ్రంథకర్త: శ్రేష్ఠులూరు కృష్ణస్వామయ్యగారు. డెమ్మీసైజు; ౧౬౬ పేజీలు; వెల రు ౧-౪-౧. విలాసము: మేనేజరు, విక్టోరియాజూబిలీముద్రాక్షరశాల, చిత్తూరు.

అద్వైతమతానుసారముగ బ్రహ్మవిద్యాతత్త్వము నీగ్రంథము ప్రతిపాదించుచున్నది. సంస్కృతవాఙ్మయమునగల ప్రాచీనాధునాతనాద్వైత గ్రంథములసహాయమును, స్వానుభవమును పురస్కరించుకొనియీగ్రంథము తేటతెలుగున రచియింపబడినది. ఈగ్రంథమున నుపనిషత్తులనుండియు, శ్రుతులనుండియు, భగవద్గీతాదులనుండియు పరశ్శతములుగ ప్రమాణములు గైకొనబడినవి. బ్రహ్మజిజ్ఞాసువులగు నాంధ్రులకిది ముంగొంగు బంగారము.

## శృంగారకాళిదాసకథలు (ప్రథమభాగము)

శ్రీ కే. కృష్ణస్వామిశర్మగారు సంపాదించినవి. ప్రకాశకులు: జి. యస్. శాస్త్రిఅండుకో, తపాలుపెట్టె నెంబరు ౧౧౧, చెన్నపురి. క్రౌనుసైజు; ౧౪౧ పేజీలు; వెల రు ౧-౧-౧.

భోజమహారాజసభాలంకారమైన కాళిదాసమహాకవియొక్క చరిత్ర యిందు చక్కగ, సరసముగ, సరళశైలిని రచియింపబడినది. ఈకథలు చదువ జదువ నింపులూరించుచుండును. రసపిపాసువు లిందలి చమత్కారరసమున్గ్రోలి యానందింపదగుదురు. మఱియు నట్టిమహానీయుని చరిత్రమునుండి యిప్పటివారు తెలిసికొని తామాచరింపతగిన విషయములు వేనవేలు గలవు. రసవత్తరములగు సంస్కృతాంధ్ర పద్యములు సందర్భానుసారముగ నిందు జేర్పబడినవి.

## ఆకొండివారి వైద్యము

గ్రంథకర్త: శ్రీమధునాపంతుల సత్యనారాయణమూర్తిగారు. క్రౌనుసైజు; ౯౨పుటలు; వెల తెలియదు. విలాసము తెలియదు.

కృష్ణాగోదావరిమండలములయందు చిరకాలమునుండి ప్రశస్తిగాంచిన వైద్యశిఖామణులగు నాకొండివారి యద్భుతచరిత్ర మిందు సప్రమాణముగ గూర్పబడినది. నీతద్వంశీయుడు, కవి పండితవైద్యవర్యుడు నగు శ్రీఆకొండి రామమూర్తిగారు ప్రస్తుతము పోలవరగ్రామమున నివసించుచు నెల్లవిధముల దమపూర్వుల కింతయేని దీసిపోవక రోగిజనకల్పకముగ నున్నారట. గ్రంథకర్త వీరికి మేనల్లుడు, శిష్యుడు, అల్లుడు నయ్యెనట; ఉపోద్ఘాతకర్తయగు శ్రీపానుగంటి లక్ష్మీనరసింహారావుగారును(సాక్షిగ్రంథకర్త) నీయాకొండివారి వైద్య ప్రశస్తిని కొనియాడినారు. ఆకొండివారి వైద్యవిద్యారహస్యముల నీ గ్రంథకర్తగారు మున్ముందు ప్రకటింపనున్నారట. ప్రకటనరూపమగు నీగ్రంథము కంటె దానివలననెక్కుడు ప్రయోజనము గలుగగలదు.

## ఉత్తమస్త్రీలు (మొదటిభాగము)

గ్రంథకర్త: బుక్కపట్టణము రామానుజయ్యగారు. క్రౌనుసైజు; ౭౭ పేజీలు. వెల రు ౧-౬-౧. విలాసము: గ్రంథకర్త,24, సోలైయప్పన్‌వీథి,దేవాంగపురము,ప్రాతచాకలపేట, మద్రాసు.

ఆంధ్రభాగవతము ననుసరించి కొంత కొంత మార్చికూర్చి రుక్మిణీకథను, భారతము ననుసరించి తపతీ సావిత్రుల చరిత్రములను ఇందు గ్రంథకర్తగారు సరసశైలిగల వచనమున వ్రాసిరి. ఇది బాలురకును, బాలికలకును చదువ నుపయోగించును.

## చాటుపద్యరత్నాకరము (౧)

క్రౌనుసైజు; ౨౨౩ పుటలు. సంపాదకులు, ప్రకాశకులు: దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు,కళానిధిగ్రంథమాల, నెల్లూరు. ద్వితీయముద్రణము. వెల రు ౧-౪-౧.

ఇది యాంధ్రలోకమున నిదివఱకే ప్రసిద్ధివడసిన గ్రంథము. సంపాదకులు సరసమైన శైలి నింపుగ గథాసందర్భముల దెలియజేయుచు ననేకవిఖ్యాతకవుల చాటుపద్యము లిందు గూర్చినారు.

'సకలజనసుబోధములును, సరసకర్ణరసాయనములును నగు ఖండకావ్యములు, (ప్రాచీన) ప్రబంధములు, నాటకములు, నవలలు, గద్యప్రబంధములు, ఆంధ్రీకరణములు మున్నగు వివిధగ్రంథములను నాలుగుమాసముల కొకటినంతున బ్రకటించి పాఠకుల కందింపదలచి'

యున్న యీకళానిధి గ్రంథమాల జయావహముగ మా తృభాషాపరిచర్య గావించుగాక !

ఆంధ్రవీరులు (రెండవభాగము)

క్రౌను సైజు; ౧౯౮ పుటలు. గ్రంథకర్తలు: శేషాద్రిరమణ కవులు. ప్రకాశకులు:వెంకటరామ్ అండ్ కో, బెజవాడ. వెల ౧౧ అ.

హిందూదేశ రాజ్యాంగచరిత్రము

డెమీ సైజు; ౧౧౧ పుటలు. గ్రంథకర్త, ప్రకాశకులు: కోన వేంకటరాయశర్మగారు. ఏలూరు శ్రీసీతారామాంజనేయ ముద్రాక్షరశాల యందు ముద్రితము. వెల ౧౨ అ.

విమలానందము(సాంఘికనవల)

క్రౌను సైజు; ౧౧౨ పుటలు. గ్రంథకర్త: ఆంధ్ర విద్యావాచస్పతీత్యాది బిరుదాంకితులు దోమా వెంకట స్వామి గుప్తగారు. ప్రకాశకులు: పి. బుచ్చయ్య శెట్టి అండ్ సన్, జనరల్ మర్చంట్సు అండ్ ఏజంట్సు, బళ్లారి. వెల ౧౨ అ.

బుద్ధపురాణము (ప్రథమఖండము)

క్రౌను సైజు; ౧౧౭౬ పుటలు. గ్రంథకర్త. దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు నీనివెల రు ౪-౧-౧. ప్రకాశకులు లిపిశ్నేని లక్ష్మీనారాయణగారు, మేనేజరు, మానవాధర్మ గ్రంథమండలి, అంగలూరు, కృష్ణాజిల్లా.

ఆంగ్లగ్రంథములు

సౌత్ ఇండియన్ మ్యూజిక్ సీరీస్ప్రైమర్ (స్టేజ్ ౧)

(South Indian Music Series: Primer-Stage I.)

క్రౌను సైజు; ౩౬ పుటలు. వెల ౪ అ.

ఇందు సంగీత ప్రథమపాఠములు సుబోధమగా వివరింపబడినవి. ఎడనెడ పలయుపట్టికలును, ఆంగ్ల హిందూస్థానీ సంప్రదాయ వివరములును గలవు. ఇది మంచిపద్ధతి నున్నది.

దిఫ్లూట్ (ఎ స్టడీ) (The Flute-A Study.)

క్రౌను సైజు; ౩౪ పుటలు. వెల ౬ అ.

మురళి సనాతనచరిత్రమును,వాద్యనియమములును, అభ్యాసక్రమమును ఇందు సంగ్రహముగ వివరింపబడినవి. గ్రంథకర్తగారు స్వానుభవపూర్వకములగు కొన్ని క్రొత్త సిద్ధాంతములగూడ నిందు ప్రతిపాదించినారు. దీనికి రెవరెండ్ హెచ్. ఏ. పాప్లీ గారు తొలిపలుకు నుడివినారు.

ఈపైరెండుగ్రంథములకును రచయిత శ్రీ పి. సాంబమూర్తిగారు బి.ఎ.,బి.యల్.; ప్రకాశకులు:ది ఇండియన్ మ్యూజిక్ పబ్లిషింగ్ హౌస్, జి.టి., మద్రాసు.

మిస్ మేయోస్ మదర్ ఇండియా,

ఎ రిజాయిండర్

**(Miss Mayo's Mother India a Rejoinder)**

ఈపుస్తకము భారతదేశమునంతను మహోద్రేకముపాల్గావించినదియు, 'మిస్ మేయో' అను అమెరికా స్త్రీచే వ్రాయబడినదియు నగు 'మదర్ ఇండియా' అను పుస్తకమునకు జవాబుగ బొంబాయిలోని 'ఇండియన్ సోషల్ రిఫార్మరు, ఇండియన్ డెయిలీ మెయిలుపత్రికా' సంపాదకులును, సుప్రసిద్ధసంఘసంస్కరణవాదులును, గడచిన డిసెంబరుమాసమున మద్రాసునజరిగిన అఖిలభారతసంఘసంస్కరణమహాసభ కధ్యక్షులును అగు నటరాజన్ గారిచే వ్రాయబడినది. దీనిని చెన్నపట్టణములోని జి.ఏ. నటేశన్ అండుకోవారు ప్రకటించినారు. ఫూల్సుకాప్ సైజున 126 పుటలుగలిగియున్నది. పుస్తకమునకు చివర మహాత్మాగాంధి, లాలా లజపతిరాయి మున్నగు ప్రముఖులు మిస్ మేయో పుస్తకముపై నిచ్చిన యభిప్రాయములుగూడ చేర్పబడియున్నవి. వెల 12 అణాలు.

నటరాజన్ గారు ఇండియన్ సోషల్ రిఫార్మరు పత్రికలో వ్రాసినవ్యాసములే ఇట్లు గ్రంథరూపమును దాల్చినవి. ఈవ్యాసములలో నటరాజన్ గారు మిస్ మేయో పుస్తకములోని యసకలవక్రవాత

మును యుక్తియుక్తముగ, సోదాహరణముగ ఖండించి యీయాడుది కేవలద్వేషభావముతోడనే యన్యదేశములలో భారతదేశముపై నసహ్యభావము గలుగజేయు తలంపుతో మాత్రమే వ్రాసినదనియు, నామె చెప్పుకొనుచున్నట్లు భారతీయులపైగల యభిమానముచే గాదనియు చాల చక్కగ నిరూపించినారు. మదర్ ఇండియాను ఇండియాఆఫీసువారే వ్రాయించియుందురను విషయము ఆ పుస్తకములోని యీ క్రిందిమాటలచే సూచింపబడుచున్నది.—

వంగయువకులవిషయమున నామె యిట్లు వ్రాయుచున్నది:

"Many little book-stalls where narrow-chested, anaemic, young Indian students, in native dress, brood over piles of fly-blown Russian Pamphlets."

దుర్బలులగు భారతీయవిద్యార్థులు కలకత్తాలో చిన్నచిన్న పుస్తకములదుకాణములవద్దజేరి బొల్షివిక్కు కరపత్రములను కట్టలు కట్టలుగ నెసరుచున్నవానిని తిరుగవేయుచుందురట. మరల వంగదేశమునుగురించి మరియొకచోట నిట్లు వ్రాయుచున్నది:

వంగదేశము హంతకులకు, నరాజకమునకు నివాసస్థానమనియామె యభిప్రాయము.—

"Bengal is the seat of bitterest political unrest the producer of India's main crop of anarchists, bomb-throwers and assassins."

(Mother, India, p. 118.)

బ్రిటిషువారికి వంగదేశమన్న సింహస్వప్నము. అందుచే వారు భారతవర్షమునెల్లప్పుడు వంగదేశముపై నొకకన్ను, అన్యప్రాంతములపై నొకకన్ను వైచియుంచుచుందురు. ఈభావమునే మిస్ మేయోగూడ ప్రకటించుచున్నది. లేకున్న వంగదేశముపై నామెకు ప్రత్యేకముగ నంతటి క్రోధము కలుగుటకు వేరుకారణమేమియు గన్పింపదు. మిస్ మేయో పుస్తకములో భారతీయుల దేవతావిగ్రహములనుగురించియు, భారతీయవనితలనుగురించియు గాన్పించెడి యసహ్యపుమాటను, సిగ్గుమాలినవ్రాతలను మరల నెత్తివ్రాయుట భాషాదేవత నవమానించుటయే యగును. ఈవిషయమున నటరాజన్ గారు వ్రాసిన వాక్యముల నిందుదాహరించుచున్నాము:

"We are ashamed to write all this; but when a shameless woman, herself too obviously suffering from the sex-complex, proclaims to the world that these things are normal to Indian life we have perforce to do so."

(Rejoinder, p. 80.)

రాజకీయస్వాతంత్ర్యమే సాంఘికాభివృద్ధికి పట్టుగొమ్మనియు, మొదటిది లేనినాడు రెండవదానికి భంగము రాక తప్పదనియు నటరాజన్ గారి యభిప్రాయము. ఈవిషయమున వారిట్లు వ్రాసినారు:

"It is our considered opinion that the acceleration of self-Government in India will accelerate the pace of social progress and that without it social stagnation is not a distant possibility."

ఈయభిప్రాయముతో మేము సంపూర్ణముగ నేకీభవించెదము. సాధారణముగ సంఘసంస్కరణవాదులు సంఘవిభేదము లంతరించి, సంఘసంస్కరణ మభివృద్ధిగాంచిననేకాని రాజకీయస్వాతంత్ర్యముమాట తలపెట్టగూడదనుచుందురు. అది పొరపాటని నటరాజనుగారి యభిప్రాయమే తెలియచేయుచున్నది. సర్వవిధముల యభివృద్ధికిని రాజకీయస్వాతంత్ర్యమే మూలాధారము. అది లేనినాడు మనగతి సర్వవిధముల నధోగతియే.

భారతదేశమున సంఘసంస్కరణము భారతీయసాంప్రదాయానుగుణముగ, భారతీయుల సంస్కృతి ననుసరించియే, జరుగవలయునుగాని యితరులకు దానిని నడుపుహక్కులేదనియు, దానిని భారతీయు లెన్నడును విడువజాలరనియు నటరాజన్ గారు స్పష్టముగ జాటుచున్నారు.

"India must go about her reforms in her own way in keeping with the Historic

continuity of her culture and civilisation. She will not be bullied into it by the calumnies of a Miss Katherine Mayo ......................................We cannot on any account allow the social initiative pass out of our hands into those even of our most friendly outsiders.''

(Rejoinder, pp. 92, 93.)

నటరాజన్ గారి యీపుస్తకము భారతీయులందరును తప్పక చదువదగినది. నూతనవిషయము లనేకములు దీనిని చదువుటచే తెలిసికొనవచ్చును. ఇట్టిపుస్తకమును ప్రచురించిన (జి. ఏ. నటేశన్ అండు కో) వారు ప్రజల కృతజ్ఞతకు పాత్రులు. [ప్ర. రం.]

## పత్రికలు

### త్రివేణి

రెండునెలల కొకసారి వచ్చే ఇంగ్లీషు పత్రిక. ౧౯౨౮ వ సం. జనవరినెలలో ప్రారంభమయింది. సంపాదకులు: శ్రీకోలవెన్ను రామకోటీశ్వరరావు గారు, బి.ఏ., బి.యల్. (బందరు ఆంధ్రజాతీయకళాశాలకు ఉపాధ్యాయులుగా ఉండినవారు.)

ప్రకాశకులు_శ్రీ కే. శ్రీనివాసన్ గారు, బి. ఏ. (ఆనర్సు), మలబారీ హౌస్, వేపేరి, మదరాసు. రాయలుసైజు; ౧౪౧ పుటలు. ఫెదర్వెయిటుకాగితము,సుందరమైన స్వరూపము. చందా ఏడాదికి రు. ౫-౧-౧; విడికాపి వెల రు. ౧.

దేశం అన్నివిధాలా పభోగంకలిగి అభివృద్ధికి రావాలంటే దేశంలో అన్ని ప్రాంతాలసాహిత్యం, కళలు, చరిత్ర మొదలయినవాటిలో విశేషాలుఅందరూ తెలుసుకోవడం చాలా ఆవశ్యకం. ఎవళ్లమట్టుకు వాళ్లు సరిపుచ్చుకుంటే లాభం లేదు. ఇప్పుడు భారతదేశంలో ఆయాప్రాంతాలవారు తమతమ భాషల్లో పత్రికలు ప్రకటించుకుంటూ తమ మట్టుకుతాము కృతార్థుల మనుకుంటున్నారు. అందువల్ల తమకు లాభం ఉండడంవాస్తవమేకాని,ఇరుగుపొరుగుభాషలవారికిఅంతగా లాభంఉండదు.అందరికీ లాభంకలగడానికి దేశసామాన్యభాషలో కొన్ని పత్రికలు ఉండడం అవసరం. వాటివల్ల ఏయేభాషలవాళ్లుఎట్లాఎట్లాఅభివృద్ధిలోకి వస్తున్నారో తెలుసుకొని వాళ్లవాళ్లు ఆయాత్రోవల్లో ముందుకుపోవడానికి వీలుంటుంది: ఈ త్రివేణి మనదేశానికంతటికి అట్లాంటి అవకాశం కల్పించడానికి కంకణం కట్టుకుంది.

త్రివేణి సాహిత్యం, కళలు, చరిత్ర వీనికి చేరిన విషయాల్లో పెక్కుత్రోవల భారతదేశాన్ని పునరుజ్జీవింప చేయడానికి పూనుకుంది. ఈపత్రిక అన్నిదేశాలకు, అన్ని భాషలకుచెందిన విద్యావంతులకు స్త్రీపురుషులకు, స్వదేశవిదేశవిభేదము లేక ఎల్లవిధముల ఆదర్శములుగ నొప్పు విషయాలకు, ఎల్లభాషలలో వెలసిన పద్యాల ఇంగ్లీషుతర్జుమాలకు సహృదయంతో స్వాగతం చెపుతుంది. ఆంగ్ల విద్యాధికులందరు__అందును మనఆంధ్రదేశంలో వారు__ఈమంచి ప్రయత్నానికి చేయూతయిస్తూ తమసామర్థ్యాన్ని, బుద్ధికుశలతను ప్రపంచంలో మారుమోగేటట్టుచేసి ఆదర్శప్రాయులుగా వెలయగలరు.

ఈసంచికయందు శ్రీ సి. జినరాజదాస,యం.ఏ., శ్రీ జేమ్సుహెచ్. కజిన్సు (డి. లిట్.), శ్రీ టి. జి. ఆరావముదను, యమ్.ఏ., బి.యల్ గార్లు కళలను గూర్చియు,రెవరెండు హెన్రీ హీరాస్, యమ్. ఏ., శ్రీ యన్. వెంకటరమణయ్య, యం.ఏ.గార్లు చరిత్రనుగూర్చియు, శ్రీదివానుబహద్దూరు యం.రామచంద్రరావు, శ్రీ యస్.శ్రీనివాసఅయ్యంగారు, ఆనరబిల్ వి. రామదాసు పంతులుగార్లు రాజకీయమునుగూర్చియు, మఱికొందఱు మఱికొన్ని విషయములనుగూర్చియు వ్రాసిన వ్యాసములును, కొన్ని తెనుగుఆరవపద్యముల అనువాదములగుఆంగ్ల పద్యములును గలవు.

శ్రీ ఏ. వి. సుబ్బారావు గారు చిత్రించిన సావిత్రీ సత్యవంతుల త్రివర్ణ చిత్రము పత్రికాముఖమున నలంకారంగా ఉంది. శిల్పమునకు ముగ్గులకు సంబంధించినప్రాచీనచిత్రాలు కొన్నిఉన్నవి.

# సాభిప్రాయవిశేషములు

కాంగ్రెసు ప్రచారము గత మాసమునం దత్యద్భుతముగ దేశమునందంతటను మారు మ్రోగినది. దేశమునందంతటను సైమను కమిషను తెల్ల కమిషనుపేరులు మారు మ్రోగినవి. సర్ జాన్ సైమనుగారు అదృష్టవంతులు. సులభముగ వారిపేరు మూల మూలలను వ్యాపించినది. భరతవర్ష చరిత్రమునందు శాశ్వతముగ నిలువగలదు. సైమను గారు బ్రిటీషు సామ్రాజ్యాభిమానులందగ్రగణ్యులు; కుశాగ్రబుద్ధిగలవారు. లిబరలుకక్షకు జెందినను లేబరుసంఘములను స్తంభింపజేసిన మహానుభావుడు. సైమనుగారును వారి సహచరులును ప్రసాదింప నున్న రాజ్యాంగ సంస్కరణ మే రూపమునుదాల్చనున్నను సంఘనియామకము, నిర్మాణము నిర్ణీతమైన కార్యవిధాన మాత్మగౌరవముగల స్వాతంత్ర్య ప్రియులకు విశ్వాసపాత్రములుగాకున్నవి. సైమనుకమిషను తెల్ల కమిషనుగ నున్నది. కేవలము తెల్లకమిషనే కాకనుఊరుపేరులేనికమిషనుగనున్నది. సభ్యులందరును బ్రిటీషు సామ్రాజ్యాభిమా నాంధులు. తెల్లకమిషనును నియమించుటయందు భారతీయులకు స్వయంనిర్ణయాధికారము లేకున్నది. భారతీయులకు వారి రాజ్యాంగములను నిర్ణయించుట కధికారము లేకుండుటయును, సంగతి సందర్భముల నెరుగని తెల్ల దొరలకు మాత్ర మధికారమును గల్పించుటయును ననుచితమని ధర్మజ్ఞు లంగీకరించుచున్నారు. కార్మికపక్షనాయకుడు రామ్సే మేక్డొనాల్డుగారు సైమనుకమిషనును సమర్థించినను స్టాట్యూటరికమిషను భారతీయ ప్రజామోదమును బడయజాలదు.

స్వతంత్ర లేబరుపక్షము సైమనుకమిషనును నిరసించుచున్నది. డెయిలిహెరాల్డు పత్రిక కమిషను ఏర్పాటుధర్మప్రతికూలమని విస్పష్టము చేయుచున్నది. అమెరికా పత్రికలు బ్రిటీషు రాజ్యతంత్రము నాక్షేపించుచున్నవి. భారతీయ నాయకులందరును తెల్లకమిషనును నిరాకరించుచున్నారు. హిందువులు, మహమ్మదీయులు, పార్శీలు, సిక్కులు, క్రైస్తవులు కమిషను బహిష్కారణమును బోధించుచున్నారు. హిందూనాయకులు లాజపత్రాయి, మోతిలాలు నెహ్రూ, మాలవ్య, మూంజి, కేల్కారు, సేనుగుప్త, జయకరు, శ్రీనివాసయ్యంగారు, ప్రకాశముగారులు మొదలగువారును, మహమ్మదీయ నాయకులు కిచ్లు, మహమ్మదాలి, షౌకతాలి, అబ్దులుకలముఆజాదు, మహమ్మదాలిజిన్నా, యాకూబుహాసన్, డాక్టరు బెజంటు, రాజా రామారాయణంగారులు మొదలగునాయకులందరును బహిష్కారణదండయాత్రను తీవ్రముగను జేయుచున్నారు. మహమ్మదుషాఫి, ఫరూకి, వెంకటరెడ్డినాయుడు, దొరైరాజాగార్లు మొదలగువారు శ్వేతకమిష

నుకు స్వాగతంబునొసంగుచున్నను వారిసంఖ్య యత్యల్పముగ నున్నది.

కాంగ్రెసు, మూస్లిములీగు, ఖిలాఫతుసమితి, జస్టిసుపక్షము, మితవాదపక్షము స్వాతంత్ర్యపక్షము మున్నగు రాజకీయపక్షములన్నియును తెల్లకమీషను బహిష్కారము నాదేశించుచున్నవి. శ్వేతభవనమునందు బర్కెనుహెడు ప్రభువును, డిల్లీనగరమునందు ఇర్విన్‌ప్రభువును చెప్పిన సమాధానము లన్నియును స్వపక్షవాదములు. వారి వాదములందు బ్రిటీషు ప్రభుత్వమునకును బ్రిటీషు పార్లమెంటునకునుగల ప్రాబల్యము భారతీయులకుగాని భారతరాజ్యాంగములకు గాని కనుపడదు. బ్రిటీషు రాజ్యాధికారుల హృదయములందు గాని లక్ష్యమునందు గాని మార్పుగలుగలేదని వారి ప్రసంగములు, కార్యములు విశదము చేయుచున్నవి. వంచనతంత్రమునకును పరిమితిగలదు. ఎల్లపుడును అందరను వంచించుట ఎవరికిని సాధ్యము గాదు. కొంతకాలము మితవాదులను, కొంతకాలము మహమ్మదీయులను, కొంతకాలము బ్రాహ్మణేతరులను, కొంతకాలము నిమ్నజాతులను విడదీయుట సాధ్యమైనను నిట్టికుతంత్ర మెల్లకాలము సాధ్యముగాదు. విభజించి పాలించుటకును మితిమేరలు గలవు. బ్రిటీషు రాజ్యాధికారు లందరకును నొకటోపినె పెట్టుచున్నారు. అనుభవము వలన నందరకును నీ రహస్యము క్రమముగ దెలియుచున్నది. నిరంకుశాధికారులతో చేతులను గలిపి నిర్బంధదండయాత్ర నామోదించిన చింతామణి, రామారాయణం సప్రూ గారులు మొదలగు నాయకులును కన్నులను తెరచి ప్రభుత్వహృదయమును గనుగొనగలిగిరి. ప్రభుత్వవిశ్వాసమునకు పాత్రులైనతాక్కారమును బొందిన ప్రముఖులు స్వదేశమునకు గలిగిన పరాభవమునకు వగచుచు ప్రతీకారమును చేయజాలకున్నారు. అవసరమున్నంతవరకును వాడుకొనుటయును, అవసరము తీరిన వెంటనే పరిహరించుటయును బ్రిటీషు రాజ్యధర్మము.

అధికారవ్యామోహము భారతీయులను స్వధర్మపరాఙ్ముఖులను జేసినది; చేయుచున్నది. ఆరంభమునం దగ్రజాతులనావహించినయధికారపిశాచ మిపుడితరజాతులను పీడించుచున్నది. బ్రాహ్మణనాయకులయుద్యోగలాభములు బ్రాహ్మణసంఘముల ప్రయోజనములకును, బ్రాహ్మణేతరనాయకుల యుద్యోగలాభములు బ్రాహ్మణేతరసంఘముల ప్రయోజనములకును సాధనములుగాక విభేదములకు సాధనములైనవి. ఆదిద్రావిడ నాయకులకును, ఇతరనాయకులకును నిదిగుణపాఠముగాగలదు. కాని ఈయంతఃకలహములు బ్రిటీషు నిరంకుశత్వమును పోషించుచు భారతీయసత్త్వమును క్షీణింపజేయుచున్నవి. స్వప్రయోజన పరాయణత్వము గలుగజేయుచున్న పరమానర్థములు సర్వత్ర ప్రత్యక్షముగ నున్నవి. అయినను స్వప్రయోజనపరాయణులైన స్వదేశీయులకు జ్ఞానోదయము గలుగకుండుట భారత

భూమి నానవహించిన దౌర్భాగ్యస్థితికి నిదర్శనముగ నున్నది. దేశానృతమైన విభేదములే బ్రిటీషు రాజ్యాధికారుల నిర్లక్ష్యమునకు మూలకారణములుగ నున్నవి. తల్లీ, భారతదేశమతల్లీ, నీదైన్యమునకు నీబిడ్డలయజ్ఞానమె కదా మూలకారణము! ఇర్విన్‌ప్రభువు స్వామ్రాజ్య శాసనసభయందు చేసిన ప్రసంగము భారతీయుల విషాదస్థితిని దెలుపుచున్నది.

* * * *

ఇర్విన్‌ప్రభువర్యుని ప్రసంగ మెప్పటివలెనే తియ్యనిమాటలతో నిండియుండి ప్రయోజనశూన్యముగ నున్నది. ఇర్విను ప్రభువర్యుని సద్భావముల నెవరును శంకించుటలేదు. వారి లక్ష్యము బ్రిటీషుసామ్రాజ్యపరముగ నున్నది. భ ర త వ ర్ష ప ర ము గ లే ద ని మా త్రమువారు గ్రహించుట వివేకము. ఇర్విను ప్రభువు పూనినలక్ష్యమునె బ్రిటీషురాజ్యాధికారులును, పార్లమెంటును పూనుచున్నపుడు భారతీయుల సహకారమును గోరుట యను చితము. ఇర్విన్‌ప్రభువునకు సైమనుకమిషను పట్లను, సహకారముపట్లను గల కారణములే భారతీయులకు బహిష్కారముపట్లను గలవు. బ్రిటీషు అధికారవర్గమునకుగల సామ్రాజ్య ప్రయోజనముల కన్నను భారతీయులకు గల స్వరాజ్య ప్రయోజనములు సమాదరణీయములుగ నున్నవి. సైమనుకమిషను భారతీయ స్వరాజ్య విధానమును విమర్శించుటకు వచ్చినదిగాని స్వరాజ్య ప్ర దా న ము చే య ుటకురాలేదు. స్వరాజ్యవిధానమును విమర్శనమును జేయుటకువచ్చిన కమిషనునకు భారతీయుల సాహచర్య మత్యావసరము. భారతీయుల సాహచర్యము, విమర్శనమునందు వారలకు సమానప్రతిపత్తి యున్నపుడు సంభవము గాని సమానప్రతిపత్తి లేనపుడు సంభవము గాదు. ఇర్విను, బర్కెన్‌హెడు ప్రభువులుగాని, బ్రిటీషు సామ్రాజ్యాభిమానులుగాని, సైమను కమిషనుగాని నిర్ణయించవలసిన విషయము భరతవర్ష ప్రయోజనములు గాని బ్రిటీషు ప్రయోజనములు గావు. భరతవర్ష ప్రయోజనములని యంగీకరించునపుడు భారతీయులు లేని సైమనుకమిషను ధర్మవిరుద్ధమై ప్రజావిశ్వాసమునకు పాత్రముగాకున్న విధమును నాయకుల యభిప్రాయమును ప్రజాభిప్రాయమును విశదము చేయుచున్నవి. సైమనుకమిషను ప్రస్తుతము దేశపరిస్థితులను గనుగొనుటకు వచ్చుచున్నను సంకల్పమునందు లేనిఫలము భావికాలమునందు సంప్రాప్తము గాజాలదు. అధికారములేని శాసనసభల యుపసంఘములతో జేసెడి సంప్రతింపులును నిష్ఫలములు. సైమను కమిషనుబహిష్కారమువలనను నష్టము గలుగునని రాజప్రతినిధి చేసెడి బెదరింపులు నిరర్థకములు. ప్రయోజనము లేనిప్రయత్నములు సాహచర్యమునలన ఫలప్రదములు గాజాలవు. ఇర్విన్‌ప్రభువుచేసిన ప్రసంగమువలెనే సైమనుకమిషను నిర్ణయములును సారరహితములుగ నుండునని రాజనీతిజ్ఞులకు దెలిసియున్నది. బ్రిటీషురాజ్యాధికారులు వ్యక్తముచేయుచున్న నిర్లక్ష్యము, తొం

దర, సంయోగాభిప్రాయము భావిఫలమునకు చిహ్నములుగ నున్నవి. భారతీయుల సంయోగాభిప్రాయములును ఈఫలమునే తెలుపుచున్నవి. గతశుక్రవారమునాడు భరతవర్షమునందంతటను జరిపిన హరతాళము భారతీయులసంకల్పమును విస్పష్టము చేయుచున్నది. ఇర్విను బర్కెనుహెడు ప్రభువులకును, సైమను కమిషనుకును హరతాళము యథోచితమైన భారతీయుల ప్రత్యుత్తరముగ నున్నది.

* * * *

స్వాధీనభారతచరిత్రమునందు ప్రభవసంవత్సర మాఘ శుద్ధ ౧౩ శుక్రవాసరము స్మరణీయ దినముగ నున్నది. భారతస్వాతంత్ర్య శృంఖలములను దృఢతరము చేయుటకు తెల్లకమిషను హిందూదేశ ముఖద్వారమైన బొంబాయియందు దిగినది. ఆసేతుహిమాచలపర్యంతముగలభరతవర్షము సైమనుకమిషను నేకగ్రీవముగ నిరాకరించినది. భారతీయులు జాతిమతకులభేదములను విసర్జించి స్వరాజ్యసంకల్పముచేసి హరతాళరూపమునను స్వరాజ్యదేవి నారాధించిరి. ఏడేండ్లకు పూర్వ మారంభమైన సత్యాగ్రహ వ్రతాచరణము తిరిగి తలయెత్తినది. వేలకొలది స్థలములందు ప్రజలు దౌర్జన్యరహితముగ హరతాళములను జేసిరి. నిత్య జీవనోపాధిలేని సామాన్యప్రజలు నిత్యకృత్యములను విడనాడి భారతమాతను యథాశక్తిని సేవించి ధన్యవాదములకు బాత్రులైరి. ప్రజాహృదయమునందు పొంగి పొరలుచున్న స్వరాజ్యోత్సాహమును వారిత్యాగము విశదము చేయుచున్నది. బొంబాయియందు హరతాళము జయప్రదముగ జరిగినది. సైమను కమిషను వచ్చినమార్గముననే వెడలిపోవలయునను గంభీరనాదము బొంబాయినగరము నావరించినది. బొంబయినగరమునిశ్శబ్దరూపమును దాల్చినది. కరాచి, హైదరాబాదులందు, హిందువులును మహమ్మదీయులును హరతాళమును జయప్రదముగ జరిపిరి. లాహోరునందు ప్రబలిన మహమ్మదీయవిభేదముల కనురూపముగ హరతాళము కొంతవరకు మాత్రము విజయమును బొందినది. అనేకస్థలములందు హరతాళము సంపూర్ణముగ విజయమును బొందినవిధమును ప్రజలయుత్సాహము విశదము చేసినది. కలకత్తాయందును, చెన్నపురియందును దౌర్జన్య కార్యములు జరుగుటమాత్రము శోచనీయము.

చెన్నపురియందు ముఖ్యముగ కొన్నిప్రదేశములందు హరతాళమువలనను శాంతికి భంగము గలిగి దౌర్జన్యకృత్యములు జరుగుట శోచనీయముగనున్నది.

కాంగ్రెసునాయకులు దౌర్జన్యమును నిరసించుచున్నారు. ఉద్రేకకారకులు నిందార్హులైనను ప్రాణత్యాగము చేసినధీరులు ప్రశంసార్హులు. మహాసంరంభసమయములందు నిరపరాధులు దుర్మార్గులకును,దురాగ్రహులకును బలియగుట సంతాపకరముగ నున్నది. స్వార్థపరులైన యపరాధులు వెనుకనుండి లాభములను బొందుటయును సంబంధము లేని నిరపరాధులు బలియగుటయును, సంతాపమును

గలుగజేయుచున్నది. ఉద్రేకసమయములందుద్రేకానలమున కాహుతులనువేసి ప్రజారౌద్రమును ప్రజ్వలింపజేసెడి మహానుభావుల నేమన వలయునో తెలియకున్నది. హరతాళదినమునందు చెన్నపురి హైకోర్టుదగ్గరను, ఇతరస్థలములందును జరిగిన దౌర్జన్యములకు గారకులు హరతాళధర్మమును నిరర్థకముచేయుట శోచనీయముగ నున్నది. రాళ్ల ప్రయోగమునకు గుండ్లప్రయోగము ప్రతిఫలమను సిద్ధాంతము నెరిగిన ప్రాజ్ఞు లజ్ఞులను బలిదానము చేయుటయధర్మముగ నున్నది. కలవర సమయములందు తుపాకుల ప్రయోగము బ్రిటీషుప్రభుత్వమునందు పరిపాటియైనది. చెన్నపురియందు శుక్రవారమునాడు ప్రయోగించిన గుండ్లను తిరిగి ఈకథనె స్మరింపజేయుచున్నవి. గూఢప్రవర్తకులైన దుర్మార్గులు శిక్షితులగుటకు బదులు నిరపరాధులు దండనమునకు పాలగుట నిరసింపదగియున్నది. చెన్నపురి హరతాళము క్రొత్తవిషయమును బయలుపెట్టినది.

అల్లరులకు గారకులు వేరైనను బ్రాహ్మణులమీదను పీడంతయును విరిగిపడినది. ఖద్దరుబట్టలు, ఖద్దరుటోపీలు దుర్మార్గుల దురాగ్రహమునకు బాల్పడినవి. ఖద్దరుధారులందరును బ్రాహ్మణు లనుభ్రమ నిరపరాధులను బాధించినది. బ్రాహ్మణులైన ఖద్దరుధారులు ప్రహరణములకు బాలగుచుండిరి. వారు బ్రాహ్మణేతరులని తెలిసినపుడు పరిహాసవాక్యములతో విమోచనమును బొందుచుండిరి. బ్రాహ్మణులు పాపములకెల్లను భైరవులగుట విచిత్రపరిణామముగ నున్నది. మహమ్మదీయ సంఘమునందును, బ్రాహ్మణేతర సంఘములందును గలిగిన విభేదములు బ్రాహ్మణులమీదుగను కొట్టుకొనిపోవుటయును యుక్తముగ నున్నది. దుర్మార్గము చేసినవారికిని, చేయించిన వారలకును ప్రతిఫలము సంక్రమించుట ప్రకృతిధర్మమని కర్తలుగ్రహించుట వివేకము.

హరతాళము శాంతియుతముగ జరుగునపుడు ధర్మబలము సంకల్పమునకు గలుగుచున్నది. హరతాళము దౌర్జన్యముతోగూడినపుడు ధర్మబల మంతర్హితమై పశుబలము ప్రబలుచు ధర్మసంకల్పము క్షీణించుచున్నది. హరతాళసంరక్షకులైన స్వచ్ఛంద సేవకులు సుశిక్షితులైన నిగ్రహానుగ్రహ పరాయణులుగ నుండుట హరతాళ విజయమునకు పరమసాధనముగనున్నది. హరతాళ సేవకులు శాంతికవచధారులైనపుడు ధర్మగ్లాని గలుగజాలదు. దౌర్జన్యము, రాళ్లు, గుండ్లు శాంతికవచధారులను సంచలింపజేయజాలవు. గాంధిమహాత్ముడు సహాయనిరాకరణ ప్రస్థానము నాపుటకుగల కారణములు కలకత్తా, చెన్నపురములయందు సంప్రాప్తములైనదురంతములు వెల్లడిచేయుచున్నవి. దుష్టుల హస్తములందు నిరపరాధులు బొమ్మలై బీభత్సమునకు గారకులగుచుందురు. దుష్టులవలె డంబాచారులును దురంతములకు బాధ్యతను వహించవలసియుందురు. నిష్కారణముగ ప్రకోపమును గలుగజేయుటయు, పరమానర్థములకు మూలమగుచున్నది. సందిగ్ధావస్థయందు ప్రజలును, నాయకులును

స్వీయబాధ్యతలను గ్రహించి ప్రవర్తించుట సకలవిధములను శాంతికిని, విజయప్రాప్తికిని సాధనముగ నుండగలదు.

స్వల్పములైన యల్లరులు హరతాళమునకు కొంత కళంకమును గలుగజేసినను హరతాళ విజయము ప్రజాసంకల్పవిజయమును విశదము చేయుచున్నవి. చెన్నపురియందలియల్లరులకు కాంగ్రెసుప్రచారకులు బాధ్యులుగారని శ్రీమూర్తి సత్యమూర్తిగారు, డాక్టరు వరదరాజులునాయుడుగారు ప్రకటించిన ప్రకటనలు విశదము చేయుచున్నవి. కొందరు ప్రముఖులు హరతాళమునకు విఘ్నమును గలుగజేయుటకు బద్ధకంకణులైయున్న విధమును ట్రిప్లికేనుసభ వెల్లడి చేసినది. నిన్న జరిగినదౌర్జన్యములు కొంతవరకాయుద్యమాంగములుగ నున్నవి. కాంగ్రెసు ప్రచారకులు దౌర్జన్యమును బూనుటవలన పవిత్రమైన హరతాళమునకు కళంకము గలిగినది. ఇట్టికళంకము గలుగకుండునటులు కాంగ్రెసునాయకులును, ప్రచారకులునుముందు శ్రద్ధనువహించి హరతాళమునకు ప్రాణమైన దౌర్జన్యరాహిత్యధర్మమును రక్షించుట పరమధర్మము. భారతీయు లేకగ్రీవముగ సైమను కమిషనుకు జూపుచున్న ప్రతిఘటన స్వరూపస్వభావములు నిరంకుశాధికార వర్గమునకు బుద్ధిని గలుగజేయవలసి యున్నవి. ఫిబ్రవరి మూడవతేదీని జూపిన త్యాగమును, నిగ్రహమును ఫిబ్రవరి 17 వ తేదీనిసయితము చెన్నపురి పౌరులు ప్రదర్శించి మాతృభూమి విమోచనమునకు దోడ్పడుదురుగాత! కాంగ్రెసు సందేశమును పాలించిన ప్రజలందరును నాయకుల కృతజ్ఞతకును, మాతృదేశాశీర్వాదములకును పాత్రులగుచున్నారు. ఆసేతుహిమాచలపర్యంతము జయప్రదముగ ముగిసిన హరతాళము ప్రజాసంకల్పమును విస్పష్టము చేసినది. సైమను కమిషనుకు బొంబాయియొసంగిన స్వాగతమునే దేశమంతయును హరతాళరూపమున నొసంగినది. సైమనుగారును, వారి సహచరులును ఢిల్లీయందేమిచేయగలరో కాలము తెలుపగలదు. స్వరాజ్యసంరంభమునందు ఫిబ్రవరి హరతాళము సకలవిధములను సంస్మరణీయమై స్వరాజ్యప్రస్థానమునకు సాధనభూతముగా గలదు. వర్తమానహరతాళప్రస్థానమునందు పాఠశాలలు, స్థానికసంస్థలుచూపిన స్వాతంత్ర్యప్రియత్వము ప్రశంసనీయముగ నున్నది.

* * * *

కళాశాలలు-స్థానికసంఘములు

పచ్చయప్పకళాశాలాధికారులు ఫిబ్రవరి 3, 17 తేదీలందు కళాశాలను మూసివేయుట కంగీకరించి విద్యాలయాధికారులకు మార్గదర్శకులుగ నున్నారు. రోమనుకాథలికుకళాశాలానిర్వాహకులును, ఇతరక్రైస్తవకళాశాలల నిర్వాహకులును ప్రెసిడెన్సీ కళాశాలాధికారులును హీనభావమును దాల్చుటయును ప్రశంసనీయముగ నున్నది. న్యాయకళాశాలాధికారి 3-వ తేదీని పరీక్షను పెట్టుట కేవల మసం

గతముగనున్నది. రత్నస్వామిగారీమార్గము నేల యవలంబించిరో వారి స్వామిభక్తియే విశదము చేయగలదు. పరీక్షకు 700 విద్యార్థులందును 200 మాత్రమె హాజరైనటులు తెలియుచున్నది. వీరు హాజరగుటయును భారతీయుల నావరించిన భావదాస్యమును విశదము చేయుచున్నది. దేశమునందంతటను విద్యార్థులు చూపిన స్వాతంత్ర్యోత్సాహము భావి స్వరాజ్యభాగ్యోదయమునకు నిదర్శనముగ నున్నది. బాలబాలికలు పాఠశాలలను నిర్భయముగను మానుకొనుట కుత్సాహమును జూపిరి. యువజనసమితి సభ్యులు పరమోత్సాహముతో బహిష్కార ప్రచారమునుజేసి స్వాతంత్ర్యప్రియత్వమును విశదము చేసిరి. అన్నిప్రాంతములందును విద్యార్థులు పాఠశాలలను మాని హరతాళోత్సవమును జయప్రదముచేసిరి. యువజన ప్రబోధముతో స్వరాజ్యప్రస్థానమునందు క్రొత్తవ్యూహా మారంభమగుచున్నది. విద్యార్థులవలెనే స్థానిక సంస్థల నిర్వాహకులు హరతాళవిజయమునకు దోడ్పడి స్వాతంత్ర్య ప్రస్థానమునందు మార్గదర్శకులగుట శుభలక్షణముగ నున్నది.

కలకత్తా, బెజవాడ, కరాచి మొదలగు మ్యునిసిపలు సంఘములు, కార్యాలయములను పాఠశాలలను మూసివేసినవి. జిల్లాబోర్డులు, తాలూకాబోర్డులు, కార్యాలయములను పాఠశాలలను మూసివేసినవి. అనేక స్థలములందు నిరుపేదలు సయితము వారివృత్తులను విసర్జించి స్వరాజ్యకైంకర్యమునకుదోడ్పడుట ప్రశంసనీయముగ నున్నది. చెన్నపురి కార్పొరేషను సభ్యులుచూపినయవజ్ఞత యవమానకరముగ నున్నది. కనిష్ఠసంఖ్య లేక సభాసమావేశము గాకుండుట చెన్నపురి నావహించిన కళంకమునకు నిదర్శనముగ నున్నది. స్వప్రయోజనపరాయణత్వము తాత్కాలికముగ సఫలతనొందినను చిరకాల మిట్టిఫలము నిలువజాలదు. ధర్మము విజయమునుబొందుట సత్యము. గతించినహరతాళము పాఠము నన్ని పక్షములవారును, మతముల వారును, కులములవారును గ్రహించి స్వధర్మనిర్వహణమును యథోచితముగజేసి భగవత్ప్రసాదమునకు పాత్రులగుదురుగాత!

---

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No.7, Thumbu Chetty Street, G. T., Madras.

# విషయానుక్రమణిక

## చిత్రములు

౧. త్రివర్ణచిత్రములు—మీనతరంగిణి, మాలశ్రీరాగిణి.

౨. సాధారణ చిత్రములు—ప్రాచీనభారతీయ చిత్రకళచిత్రములు ౭; సింధుదేశ ప్రాచీన నగర చిత్రములు ౧౧; పానశాల చిత్రము ౧; ప్రాచీన మహారాణులచిత్రములు—౫. క్లియోపాత్రామృత భర్తృసందర్శనము; మల్లయుద్ధచిత్రములు ౪; మురళీసమాహ్వానము; హిందూ మహమ్మదీయ వివాహము-దంపతుల చిత్రములు; ఇతర చిత్రములును.

---

### వెనుకటి సంచికలోని ప్రశ్నపద్యమునకు ఉత్తరము

(హంస పలుకునటులు పూర్వబడినది)

మా న స స రో వ ర ము

మానసము
నలుపు ... ౧. ఆర్. వీరరాఘవస్వామిగారు, ఉపాధ్యాయుడు,
సగము ... బోర్డుఎలిమెంటరీ బాలకపాఠశాల,
సత్యము ... ... చల్లపల్లి, కృష్ణాజిల్లా.
రోసము ... ...
వలపు ... ౨. వేంకట వీరరాజకవులు,
రణము ... కవితాసమితి, విశాఖపట్టణము.
మురళి

---

# మీనతరంగిణి



చిత్రకారుడు: శ్రీ సి. యస్. వాసుదేవనుగారు, నేషనల్ తియసాఫికల్ కాలేజి, అడయారు.




చెన్న పట్టణము, మార్చి ౧౯౨౭

సంపుటము ౪     ప్రభవ సంవత్సరము ఫాల్గుణమాసము     సంఖ్య 3

## సేవాంజలి

శ్రీ వేంకటపార్వతీశ్వర కవులు

౧

ఈపాట లాపాటలే పాడితిని గాని నీచేతిమురళిఁ గా నేరనైతి
ఈబాస లాబాసలే పల్కితిని గాని నీగూటిచిలుకఁ గా నేరనైతి
ఈవాడ లావాడలే చేరితిని గాని నీయింటిబంటుఁ గా నేరనైతి
ఈజన్మ మాజన్మమే యెత్తితిని గాని నీయెత్తుబిడ్డఁ గా నేరనైతి
చీఁకటింటిలోన చేబారలను వైచి-నిన్నుఁ జేరఁదగిన తెన్నుఁ గనక
తల్లడిల్లుచుంటి దయచేసి యిఁకనైన-నాదరింపరాదె యాదిదేవ!

౨

చీఁకటి మసిఁ బూయు చేదొల్పకుండనే వెన్నెల నద్దుకే ల్వన్నె నుంచి
అనలకీలల గుప్ప కను మూయకుండనే యమృతంబు గురియించు నక్షిఁ దెఱచి
భువనవృత్త మెఱుంగుచెవిఁ ద్రిప్పకుండనే విజ్ఞప్తు లాలించు వీనొసంగి
ఖలుల శిక్షించునాజ్ఞల నాఁపకుండనే ఘనుల రక్షించుశాసనముఁ జేసి

అనునిమేషంబు లోకపాలనము సేయు-ప్రభుఁడ వగునీకు నావిచారముఁ దలంప
నామొఱాలింపఁ బాలింప నను గ్రహింపఁ-దెలిపి యెప్పుడు గలదయ్య దేవదేవ!

౩

లలితంపుఁగళల సొంపులు నింపువెన్నెలఁ జిలికించు నిండుజాబిలినిఁ జూపి
చెలువంపుటలరుల పొలపంపువన్నెలఁ బులకించువలపుతీవలను జూపి
సరసంపుఁ బలుకులఁ బరువంపువిరిదేనె లొలికించు శుకపికంబులనుజూపి
మురిపంపుహూపుల నెఱి మించుముద్దులఁ దులకించు చిత్రవస్తువులఁ జూపి
పాలకై తన్నుఁ బీడించి ప్రాఁకులాడు-పిల్లకాయను మఱపించు తల్లిలాగు
ప్రేమ నిన్నుఁ గోరు నను మఱపింతు వేల-సచ్చిదానందలీలాప్రసన్నమూర్తి!

౪

మ్రొక్కి వేఁడుకొలంది మూతి ద్రిప్పుదు గాని బల్మిఁ గైకొన నష్టపడఁగలేవు
వెఱచి వీఁగుకొలంది విక్రమింతువు గాని తేఱిచూచిన నిరోధింపలేవు
విన్నవించుకొలంది మిన్నకుందువు గాని పట్టుపట్టిన మాట నెట్టలేవు
కొలుచుచున్నకొలంది కొండ యెక్కుదు గాని ధాటి సూపిన గీటు దాఁటలేవు
బింక మొకవంక నొకవంక బెరుకుఁదనముఁ-బఱపియిటువంటి మాయలు నెఱపకున్న
నాటకళగట్టదే జగన్నాటకునకు?-సత్కృపాధామ! దేవతాసార్వభౌమ!

౫

ఏఱులాగున నిట్టె పాఱిపోయెదవేమి సుదతులనైనను వెన్కఁ జూడవేమి
మెఱపులాగున నిట్టె మెఱసిపోయెదవేమి నింగినైనను గాలు నిల్పవేమి
గాలిలాగున నిట్టె కలిసిపోయెదవేమి దవులనైనను రూపుఁ దాల్పవేమి
గాములాగున నిట్టె కదలిపోయెదవేమి కనులనైనను శాంతిఁ గాంచవేమి
అర్ఘ్యపాత్రఁ బూని యారాత్రికం బెత్తి-ధూప ముంచి పండ్లదోసి లొగ్గి
యెవరు పిలిచిరయ్య, యెచటి కేఁగెదవయ్య? ప్రణయగుణసనాథ! ప్రాణనాథ!

౬

ఉపవాసమేకాని యెప్పుడైనఁ బుడిసెఁడుజలమైనఁ ద్రాగినజాడ లేదు
ఆయాసమేకాని రేయైనఁ బట్టెఁడోగిరమైనఁ గైకొన్న గుఱుతు లేదు

సంచారమేకాని క్షణమైన రవ్వంత యడుగైన నిలిపిన యచ్చు లేదు
జాగారమేకాని వేగైన గాసంత కన్నైన మూసిన చిన్నె లేదు.
పానకంబు చేసి పరమాన్నమును వండి-మెఱుఁగుపీట వెట్టి విరులు పఱిచి
యెదురు సూచుచుంటి నిల్లు చేరఁగదోయి-ప్రణయగుణసనాథ! ప్రాణనాథ!

౭

ఏ చుక్కతళ్కులో నీచెల్వ మున్నదో చెంగల్వ నడుగనా చెప్పనేమొ
ఏ పువ్వు దేనెలో నీప్రేమ యున్నదో మెలఁ దేఁటి నడుగనా తెలుపునేమొ
ఏ పక్షిపలుకులో నీపాట యున్నదో వినుచూలి నడుగనా వినుచునేమొ
ఏ మింటితెరఁగులో నీమూర్తి యున్నదో సురవేణి నడుగనా చూపునేమొ
నట్టిభ్రమలుగాక వారైన నీరైనఁ-దెలిసినంత తెలుపఁగలరె కాని
నీవు వచ్చి యెదుట నిలిచిన ట్లుండునా-ప్రణయగుణసనాథ! ప్రాణనాథ!

౮

అడుగుదమ్ములు మాయు నందువేమోయి! నాకన్నీటివరద లాకడను లేవె
అంధకారము గ్రమ్ము నందువేమోయి! నావిరహాగ్ని దీప్తు లాదరిని లేవె
అతనుతాపము గల్గు నందువేమోయి! నావలపు గ్రొంకీన లాకెలన లేవె
అశుభవాసన లంటు నందు వేమోయి! నా నిట్టూర్పుగాడ్పు లాతట్టు లేవె
హృదయపద్మాసనంబు నీమెదుటఁ బెట్టి-యుల్ల మలరంగ సేవింపనుంటి నోయి!
వేగ విచ్చేసి కొల్వు గావింపుమోయి!-సచ్చిదానంద లీలాప్రసన్నమూర్తి!

౯

ఐశ్వర్యమును గోరు ననుకొంటివో యేమొ? ఆసల నడఁగింపు మంతె చాలు
అర్ధాసనము వేఁడు ననుకొంటివో యేమొ? అడుగులకడ నిల్పు మంతె చాలు
అపవర్గ మాసించు ననుకొంటివో యేమొ? అజ్ఞాన మెడలింపు మంతె చాలు
అమృతత్వ మర్థించు ననుకొంటివో యేమొ? అభవత్వ మిప్పింపు మంతె చాలు
తిరుగులేని దాత దొరకెఁగదా యంచుఁ-దలకు దగని దడుగఁగల నటయ్య!
ఎదుటఁ బడుము చాలు నీకోరికల కేమి-ప్రణయగుణసనాథ! ప్రాణనాథ!

---

# సూర్యరాయాంధ్ర నిఘంటు విమర్శన ఖండనము

జయంతి రామయ్యపంతులు గారు

శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువులోఁ గానవచ్చెడు కొన్ని పదములను, వాని యర్థాదులను మచ్చునకై ముద్రింపించి విద్యాధికులకుఁ బంపి వానిపై వారి యభిప్రాయములఁ గోరియున్నాము. ఈమచ్చుమాటల పుస్తకము నంపినవారిలో చిలుకూరి నారాయణరావుగా రొకరు. వీరు తమ యభిప్రాయమును మాకుఁ దెలిపియుండలేదు గాని యించుమించు పదినెలలయిన పిదప సూర్యరాయాంధ్రనిఘంటువను శీర్షికతో నొక విమర్శనము గతించిన యాశ్వయుజమాసమందు వెలువడిన భారతిపత్రికలోఁ బ్రకటించినారు. ఈవిమర్శనము కేవలదోషారోపణమే కాని నిజమయిన గుణదోషవిమర్శనము గాదు. "ఈవిమర్శనమును అందరికీ తెలిసేటట్టు ప్రకటించడ మెందుకు? పరిషత్తువారికే పంపుతే వారు ఉపయోగించు కొంటారు" అని కొందఱు మిత్రు లుపదేశించినను నారాయణరావుగా రాయుపదేశమును నిరాకరించి, "దేశములోని భాషాభిమానులందరూ ఈవిషయమై ఆలోచించవలసి ఉన్న" దని తలంచి వ్యాసమును పత్రికలోఁ బ్రకటించినారు. వ్యాసములో "చుఱుకుపాలు కొంచెము ఎక్కువగా పడిన" దని యొప్పుకొనుచు, "చుఱుక్కుమంటేనే కాని చుఱుకు పుట్టదనే ఉద్దేశముతో అట్లు వ్రాసినాను గాని మరియొకటి కా" దని సమాధానము చెప్పినారు. ఈ వ్రాఁతనుబట్టి నారాయణరావుగా రేయుద్దేశముతో నీవిమర్శనము చేసినారో తేటపడఁగలదు. వీరు వ్రాసిన దించుమించుగా నంతయు నసంగతముగాను, పరుషముగాను నున్నను, గ్రాహ్యమయినదానిని గ్రహించుటయుఁ, గానిదానిని విడుచుటయుఁ దగునుగాని విమర్శనమును ఖండించుట యనావశ్యకమని తలఁచితిని. కాని యానడుమ బళ్లారిలో జరిగిన యాంధ్రసాహిత్యపరిషద్వార్షికసభయం దగ్రాసనాధిపతిగారి సెలవుప్రకార మీవిమర్శనములోని కొన్నివిషయములకు నేను సమాధానము చెప్పవలసివచ్చినది. అది విన్న పండితులు నారాయణరావుగారి విమర్శనములోని దోషారోపణము సరియైనదియేమోయని జనులు భ్రాంతిపొందవచ్చుననియు, నట్టిభ్రాంతి గలుగకుండ విమర్శనమును ఖండించుట కర్తవ్యమనియు నొక్కిచెప్పినందున వారిమాట పాటించి విమర్శనములోని దోషములను స్థాలీపులాకన్యాయముగాఁ జూపఁదలఁచినాను. నారాయణరావుగారి వాక్యములలోఁ గొన్ని సత్యేతరములు, కొన్ని పాండిత్యాభావజనితములు. వీనిని పండితులు యథాసందర్భముగా గ్రహింతురుగాక.

నారాయణరావుగారి విమర్శనములోఁ గొంత భాగము "నిఘంటువు బహిరాకారమును" స్పృశించినది యును, మఱికొంతభాగము "దానిలోపలివిషయమును పరిశీలించు" నదియు నై యున్నది. ఈవిమర్శన మెట్లున్నదో చూతము.

౧. నిఘంటునిర్మాణారంభమునకుఁ బూర్వము నిఘంటునిర్మాణపద్ధతినిగూర్చి నేనొకవ్యాసము ప్రకటించితిననియు, నందు కిట్టెలుగారి కన్నడనిఘంటువును, గండర్టుగారి మళయాళనిఘంటువును ఆదర్శములుగా గ్రహించితిననియు, సూర్యరాయాంధ్రనిఘంటువులో మాత్ర మానిఘంటువులఛాయ లేమియు లేవనియు వ్రాసినారు. 1912-వ సంవత్సరములో నే నీవిషయమయి యొకవ్యాసము ప్రకటించినాను. నారాయణరావుగారు స్మరించినవ్యాస మదియేయని తలఁచెదను. ఈవ్యాసములో గండర్టుగారి నిఘంటువును నే నాదర్శముగా గ్రహించినట్లు లేదుసరిగదా, గండర్టుగారి పేరయినను లేదు. ఈవిపరీతజ్ఞానము నారాయణరావుగారి కెక్కడనుండి వచ్చినదో తెలియదు. ఇది చిన్నవిషయమయినను విమర్శననాటకమునకు నాందిగా గ్రహింపఁదగియున్నది.

నేను పదునైదు సంవత్సరముల క్రిందట రచించిన వ్యాసమును నారాయణరావుగా రుదాహరించిరిగదా! రెండుసంవత్సరముల క్రిందట నేను రచించి చెన్నపురిలో జరిగినOriental Conferenceకుఁ బంపినDravidian Lexicography అను వ్యాసమును చదివినచో నారాయణరావుగారు నాయభిప్రాయమును చక్కఁగా గ్రహింపఁగలిగియుందురనియు, విమర్శనములోని యసంగతపు వ్రాఁతలు కొన్నియయిన వ్రాయకుందురనియు నా నమ్మకము.

౨. "ఇచ్చిన సంకేతములు విలక్షణముగా నుండుట" అని ఆక్షేపణము చేయుచు; "పట్టికలో ఇవ్వబడ్డ అధ్యాత్మరామాయణము, ఘటికాచలమాహాత్మ్యము, నరసభూపాలీయము, రుక్మాంగదచరిత్రము, శశాంకవిజయము, సీతారామాంజనేయ సంవాదము, సుమతిశతకము అను గ్రంథములనుంచి ఉదాహరణములు లేవు." అని వ్రాసినారు. ఇది యెంతసత్యమో చూడుఁడు. అధ్యాత్మరామాయణప్రయోగము మచ్చుపదముల పుస్తకమున 35-వ పుటలో 'అందిక' అను పదముక్రింద నున్నది. నరసభూపాలీయప్రయోగము 52-వ పుటలో 'అను' ౧-వ యర్థముక్రింద నున్నది. (ప్రయోగబాహుళ్యము గలచోటను, పద్యోదాహరణ మనావశ్యకమని తోఁచిన చోటను గ్రంథనామము, పద్యసంఖ్యయుమాత్ర మీయఁబడినవని చదువరులు గ్రహింతురుగాక!) రుక్మాంగద చరిత్రప్రయోగము 21-వ పుటలో 'అంటు' అనుపదము క్రింద నున్నది. "కొన్నిపదాలకు ప్రయోగా లివ్వకుండా గ్రంథము, ఆశ్వాసము, పద్యసంఖ్యనుమాత్ర మిచ్చి ఊరకొన్నారు. చూ:......అంటు-రుక్మాం. ౧-౬" అని నారాయణరావుగారే చూపియున్నారు. శశాంకవిజయ ప్రయోగము 49-వ పుటలో 'కానీ' అనుపదము 3-వ యర్థముక్రింద నున్నది. సీతారామాంజనేయసంవాదప్రయోగము 24-వ పుటలో "అందు-అ. క్రి. లభ్యమగు"అను నర్థముక్రింద నున్నది. సుమతిశతక ప్రయోగము 3౧వ పుటలో అనుఘాతవు ౧వ యర్థముక్రింద నున్నది. ఘటికాచలమాహాత్మ్య ప్రయోగము 'ఆనిక' నుపదము 2-వ యర్థము క్రింద నున్నది. ఆయర్థము ప్రకృతపుఁగూర్పున సరిపడకపోవుటచేత ముద్రణసమయమునఁ దీసివేయఁబడినది. అంతకుముందే యచ్చుపడిన సంకేతముల పట్టికలో మరలఁ గొట్టివేయుట కవకాశము లేకపోవుటచేనదిమాత్రము నిల్చియున్నది. అది నారాయణరావుగారికిఁ గనఁబడకపోవుట సహజమే. కాని మిగిలిన 6 పుస్తకముల యుదాహరణము లేల కనఁబడలేదో?

3. సంస్కృతశబ్దము లతిమాత్రముగా నున్నవని యొక యాక్షేపము. అట్లని యూరకోనక "కిట్టెలు, గండర్టుగార్లు తమనిఘంటువులోనికి తమతమ భాషలలోనికి అచ్చముగా చేరిన సంస్కృతపదములనే తీసుకొన్నారు." అని యొకచోట వ్రాసినారు. మఱియాశ నిఘంటువుమాట యెట్లున్నను కన్నడనిఘంటువు విషయమయి యీవాక్య మబద్ధము. ఆనిఘంటువును చక్కఁగాఁ జూచినవా రట్లనరు. కిట్టెలుగారు Monier Williams బృహన్నిఘంటువులోనున్న పదముల నించుమించుగా నన్నింటిని గ్రహించినారు.

మఱియొకచోట, "ఆలాగయితే మనభాషలోనికి ఇంగ్లీషు, ఫ్రెంచి, బుడతకీచు, అరబ్బీ, పారసీ, హిందూస్తానీ, మహారాష్ట్రీము మొదలైనభాషలలోని పదాలు వచ్చినవని, ఆభాషలలోని శబ్దాలన్నీ మనకు ఎప్పుడో ఒకప్పుడు పనికిరాకపోతవా అన్నకారణముచేత ఆయాభాషలనిఘంటువులను తెనుఁగుచేసి, మనబృహత్కోశము లోనికి ఎక్కించుకోవలసినదేనా?" అని వ్రాసినారు. ఆంధ్రభాషాస్వరూపమును, దానికిని సంస్కృతమునకును గల సంబంధమును చక్కఁగా నెఱిఁగియుండవలసిన నారాయణరావుగా రిట్లు వ్రాయుట చిత్రము. ఈవిషయమును Dravidian Lexicography లో నేను చర్చించి యున్నాను. నా. రావుగా రది చూతురుగాక!

౪. "అంకనీయము, అంకిణి, అంకితవ్యము, అంక్యము అనేపదములు ఆప్టేనిఘంటువులో కూడా లేవు" అని వ్రాసినారు ఆప్టేనిఘంటువులో లేనిపదములను జేర్చుట దోషముకాదు. దోషముమాట యటుంచి యీ శబ్దము లాప్టేలో లేవనుమాట యెంతసత్యమో చూతము. 'అంక్యము' అనుపదము ఆప్టేనిఘంటువులో 16-వ పుట

లో "అంక్య A (అంక్ + ణ్యత్) Fit to be branded, marked or counted" అని యున్నది. ఇది గ్రహించినప్పుడు దీనికి రూపాంతరములను 'అంకనీయము, అంకితవ్యము' అనునవియును గ్రాహ్యములే. అవి వలదనుట "పాఠ్యము" అనురూపము గ్రహించి, పఠనీయము, పఠితవ్యము అనురూపములు వలదనుటవంటిది. సంస్కృతనిఘంటువులలో నీరూపములకుఁ బ్రకృతియైన 'అంక్' (అకి) ధాతువు చూపఁబడును గాన దానినుండి సంస్కృతవిద్యార్థు లీరూపముల నేర్పఱుచుకొనఁగలరు. తెలుఁగు నిఘంటువులలోఁ బ్రకృతి చూపఁబడదు. కావున నాంధ్రవిద్యార్థికి రూపము లేర్పఱుచుకొను త్రోవ తెలియదు. కావున నీరూపములు గ్రహించుట యావశ్యకము. మృదంగాదిపర్యాయమగు 'అంక్య' శబ్దమునకు ముందు దానికిఁగల విశేషణార్థము ఆప్టేలో నున్నది. నారాయణరావుగారు వ్రాసినట్లు లేకపోలేదు. ఇంక 'అంకిని' శబ్దమో ఆప్టే నిఘంటువున 16 వ పుటలో 'అంకిన్' అనుశబ్దముక్రింద నున్నది. కనఁబడినో, కనఁబడకయో 'అంక్య, అంకిని' అనుపదములు ఆప్టేలో లేవని వ్రాసినారు.

౫. "'అంగము' ఈపదము దేశ్యమైనప్పుడుండే అర్థములను వ్రాసినారు కారు. కాని 'అంగు' అనేమాటకు "అంగము, విధము" అని అర్థము వ్రాసినారు" అని నారాయణరావుగారు వ్రాసినారు. మచ్చుపదముల పుస్తకము 11-వ పుటలో "అంగము-వి- (క) అంగ-విధము, రీతి." అని ఉదాహరణసహితముగా నున్నది. నారాయణరావుగారి కగపడలేదు కాఁబోలు.

౬. మఱియు నారాయణరావుగారు భారతి 11-వ పుటలో "అఱ (ఱ-అర్ధము) తిట్టుటయందు "అన్" అని ద్రుతసహితముగానుండును" అని వ్రాసినారు. మచ్చుపదముల పుస్తకమున ద్రుతాంతమని వ్రాయనట్టును, తమరు ద్రుతాంతమని తెలుపుచున్నట్టును లోకమునకు వెల్లడి చేయుచున్నారు. కాని మచ్చుపదముల పుస్తకమున "అఱ ప్ర. ద్రు. ౧. ఔపవిభక్తికముల...౨. క్రియలపై... ౩. తిట్టునపుడు క్రియలతుదిని చేర్పఁబడును." అని యున్నది. ద్రుతాంతమని స్పష్టముగా నుండఁగా మఱి యొకవిధముగా వ్రాయుట యెందులకో? ఇట్టి వింకను నెన్నియో కలవు గాని గ్రంథవిస్తరభీతిచే వ్రాయక విరమించుట యైనది.

౭. "నిఘంటు నిర్మాతలు ముఖ్యముగా తమ నిఘంటువును కొనుటకు డబ్బుతక్కువగా ఉన్నవారి విషయములోనూ, దానిని ఉంచుకొనుటకు ఎక్కువగా స్థలము లేనివారి విషయములోనూ, దానిని మోయడమునకు బలము చాలనివారి విషయములోనూ ఆలోచింపవలసిన సంగతి తాము చేయబోయే నిఘంటువు పుటల సంఖ్య అనవసరముగా పెంచకుండవలెనని మనవిచేస్తున్నాను." అని వ్రాసి గ్రంథమును సంకుచితముగా చేయుటకుఁ గొన్ని మార్గములు చూపినారు. ఈమార్గములు మేము యోజింపనివికావు. యోజించియే మేము వలంబించిన నిఘంటు నిర్మాణపద్ధతి కనుకూలములయిన రీతుల ననుసరించినాము. నిఘంటువు ప్రథమసంపుటములోఁ గాననగు పీఠికను జూచినప్పుడిది విశదమగును. పుస్తకము మోయుటకు దేహబలమును, కొనుట కర్థబలమును, చదివి యుపయోగించుకొనుటకు బుద్ధిబలమును గలవారి నిమిత్తమే యీనిఘంటు వుద్దేశింపఁ బడినది గాని యాబలములు లేనివారికొఱకుఁ గాదని చెప్పవలసి యున్నది

౮. "అంగలార్చు" పదమునకు మేము వ్రాసిన యర్థము సరికాదనియు, "గంతులువేయు" నని యర్థమనియు నారాయణరావుగారు సెలవిచ్చినారు. "దుఃఖించు" అనునర్థము "ఆలంకారిక" మఁట! ఆలంకారికమన వీరితాత్పర్యమేమో ? మే మిచ్చిన యుదాహరణములలో—అనఁగా—"గోండ్రని యంగలార్చుచున్, వెన్నఁబెట్టుకొని నేతికి నేతికి నంగలార్వఁగన్, ఆలికి నే నంగలార్చుచు నన్యసతులఁ జూచి గ్రుక్కిళ్ళుమ్రింగుచు......" అను నీస్థలములందు గంతులువేయుట సరిపోవునా ?

౯. 'అంగవించు' శబ్దమును గుఱించి వ్రాయుచు, "ఉదాహరణములో 'అంగవించిరేని' అనేదానికి 'కదియు, సమీపించు' అనే అర్థముకంటె 'విజృంభించు'

అనే అర్థము బాగుంటుందేమో?" అని ప్రశ్నించినారు. ఈశబ్దమునకు నిఘంటువులో నాలుగర్థము లియ్యఁబడి నవి. మొదటియర్థము "కదియు, సమీపించు"నని. ఈయర్థమున కిచ్చిన యుదాహరణము చూడుఁడు:

ఆ. మదము గదురఁజేసి మది మోహమెక్కించి
చూపుదీఁగెలందుఁ జుట్టుకొల్పి
యెట్టి మునులనైన నెట్టనఁ జెడఁజూతు
రంగవించిరేని యబ్జముఖులు.

ఆ. బుద్ధిమంతులైన పురుషుల కంగనా
జనులఁ జేరియునికి చనదు గాన
నీసరోజవదన లిట్లు నన్ గదియక
యుండ నింటికరుగు టొప్పుననుచు.

—పద్మ. 3-౧౭౯.

ఇచ్చట 'విజృంభించు' అని యర్థము చెప్పవలెనఁట! 'కదియు' అనునర్థము పొసఁగదఁట నారాయణరావు గారికి! వీరీపద్యములరెంటిని గలిపి సవిమర్శముగాఁ జదివినారా, లేదా యని సందేహము పొడముచున్నది.

౧౦. 'అ' (౨-అర్థము.) వ్యతిరేకార్థకప్రత్యయము పరమగునపుడు ధాతువుల తుదిఉకారమున కాదేశముగా వచ్చువర్ణము. ఉదా: చేయఁడు, చేయక, చేయమి అని వ్రాసినారు. పైఉదాహరణములలో వ్యతిరేకార్థక ప్రత్యయమేది? 'అ' అనేదే అని చెప్పవలెనుగదా? కాని పైఅర్థములో ఏదో మరియొకప్రత్యయ మున్నట్లు ధ్వనిస్తున్నది." అని-

నారాయణరావుగారు వ్రాసిన వ్రాఁత సరి కాదు. 'చేయక, చేయమి' ఇత్యాది పదములలో చివరవర్ణము ప్రత్యయము. అదిపరమయినప్పుడు ధాత్వంతోకారమున కకార మాదేశమయినది. అకారమే ప్రత్యయమయినచో కవర్ణక మివర్ణకము లేమగును? ప్రత్యయముమీఁది ప్రత్యయ మందురా?

౧౧. 'అ' (౬ అర్థము)నుగుఱించి వ్రాయుచు, "'విభక్త్యేకవచనము—'ఇచట సంధి ఎట్లు సిద్ధించినదో" అని వ్రాసినారు. ఇచట సంధి యెట్లు సిద్ధించినదో యేవిద్యార్థి నడిగినను చెప్పును. ఈమాత్రమయినను తెలియనివారు నిఘంటు విమర్శనమున కేల యత్నింపవలెనో!

౧౨. "అ" 4. (౭-అర్థము) 'నిల్వరయేని' అనుచోట అకారము ఆలంకారికము కాదు. నిల్వనేనిల్వరేని అని యర్థము." అని వ్రాసినారు. ఆలంకారికమన వీరి తాత్పర్య మేమో? ఉదాహృతమయినది "అది సభయే ప్రియం బెసఁగ నార్యులు నిల్వరయేని" ఇత్యాది భారతపద్యము. ఇందు అకారము వాక్యాలంకారముగా నుపయోగింపఁబడినదని మేము వ్రాసినాము. వాక్యాలంకారమనఁగా కేవల పాదపూరకమని భావము. నారాయణరావుగా రిచట అవధారణార్థము చెప్పుచున్నారఁట. అది కుదురదు. పూర్వోదాహృతపద్యపాదమునకు మూలము "న సా సభా యత్ర న సంతి సజ్జనాః" అని యున్నది. ఇం దవధారణార్థకము లేదు. తక్కిన మూఁడుపద్యపాదములలోఁగూడ నవధారణార్థకము లేదు. ఈపద్యమం దవధారణార్థ మసంగతము. ఆర్యులు లేనేలేనిది సభ కాదనుటలో విశేష మేమున్నది? ఆర్యులు లేనిది సభ కాదనిన సరిపోలేదా?

౧౩. "అంచుకయించుక- అవ్య. కొంచెము, ఇంచుక. ఉదా:-ఉ. ఆడనుగాని మాట లొకయంచుకయించుక వీనులొగ్గినా, యాడినమాట లెల్ల వినునర్మిలితో ...పి.శేకుం. ౭-౧౫౯. ప్రయోగాంతరము కనఁబడలేదు." అని మచ్చుపదముల పుస్తకములో నుండఁగా, "అంచుక యించుక:—అనఁగా 'అక్కడకొంచెము, ఇక్కడ కొంచెము' అని అర్థము. కాని, కేవలము 'కొంచెము' అని కాని, 'ఇంచుక' అనికాని యర్థముకాదు." అని నారాయణరావుగారు వ్రాసినారు. ఈపద్యము 'వాచం న మిశ్రయతి యద్యపి మే వచోభిః, కర్ణం దదా త్యభిముఖం మయి భాషమాణే' అను అభిజ్ఞానశాకుంతలము ౧-౩౧వ శ్లోకమునకు అనువాదము. తద్వ్యాఖ్యానమున మొదటి పాదమునకు "మయా సహ న వక్తీత్యర్థః" అనియు, రెండవపాదమునకు "మదుక్తం సాదరం శృణో తీత్యర్థః" అనియు నున్నది. 'నాతో కొంచెమైనను మాటలాడదు' అని చెప్పుటయే కవియుద్దేశమును, సందర్భోచితమును. 'అక్కడ కొంచెము:

ఇక్కడ కొంచెము మాటలాడదు' అనుటలో నర్థ మేమున్నది?

౧౪. "అ"- ఆప్తేనుంచి అన్ని అర్థములు ఎత్తుకొన్నారు. గాని 'అనుత్తమ' మొదలగు వాటిలో 'అ' అర్థభేదమును కలిగించదు అనేముక్కను వదలివేసినారు" అని నారాయణరావుగారు వ్రాసినారు. ఆముక్క వదలి వేయఁదగినది కావున వదలివేయుట యైనది. 'అనుత్తమము' అనఁగా, "దేనికంటె ఉత్తమమైనది లేదో అది." అని సమాసార్థము. ఇందు "అ"కు "లేదు" అనునర్థమేకదా! "ఈశబ్దములోని "అ" అర్థభేదమును కలిగించదు." అని ఆప్తేగారు స్థూలదృష్టితో వ్రాసిన మాట భాషాసంప్రదాయమునకు విరుద్ధము.

౧౫. భారతి 16-వ పుటలో-iv(అ)లో "ఇతర భాషాపదములు సరిగా ఇవ్వకపోవడము. చూ 'అఁక వన్నియ' (త-అంగపడి.) అని వ్రాసినారు. తమిళములో 'అంగప్పడి' అనికాని, 'అంగబడి' అనికాని ఉంటుంది. 'అంగపడి' అని ఉండదు." అని నారాయణరావుగారు శాసించినారు.

ఎంత దృఢముగా చెప్పినారు! మద్రాసు విశ్వ విద్యాలయమువారు ప్రకటించిన తమిళ నిఘంటువు (Tamil Lexicon)న "అంకపడి" అని అఱవలిపిలోను, 'Ankapati' అని ఆంగ్లలిపిలోను ఉన్నది. Winslow గారిచేఁ గూర్పఁబడిన ద్రావిడాంగ్ల నిఘంటువున 'అంగపడి, అంగవడి' అని రెండు రూపములు కలవు. కారొనేషను తమిళనిఘంటువు (Coronation Tamil Dictionary) చూఁడవలెను (ఇందు అఱవ పదములకు అఱవపదములతోనే అర్థము కలదు.) లో 'అంగపడి, అంగవడి' అను రూపములు కలవు. కాని నారాయణరావుగారు చూపిన 'అంగప్పడి' మాత్ర మెక్కడను కనఁబడలేదు. అఱవమున 'క, గ' లకు 'ప, బ' లకు వ్రాఁతలో భేదము కనిపట్టుటకు అవకాశము లేదు. ఆంగ్లలిపిలో "ప" అనియే స్పష్టముగా చూపఁబడినది. ద్రావిడ భాషా విషయమున మాకు సాహాయ్యము చేసినవారుకూడ 'అంగపడి' అనియే వ్రాసినారు. ద్రావిడభాషా విషయమున ఇన్ని నిఘంటువులును అప్రమాణము లనియు, నారాయణరావుగారి వాక్యములు వేదవాక్యము లనియు అనుకొనుట యెట్లు?

౧౬. నారాయణరావుగారు—"అంకము" దీనికి "తొడ" అనే అర్థములో ప్రయోగము లున్నవా?— అని వ్రాసి యున్నారు.

ఈయర్థమందు సంస్కృతవాఙ్మయమునఁగూడఁ బ్రయోగము లున్నవి. కాని తెలుఁగులోఁ బ్రయోగ మిచ్చిన నారాయణరావుగారికిఁ జాలును. ఇదిగో ఆప్రయోగము:

గీ. తండ్రితొడ నెక్క వేడుక దనిరె నేని.

క. నిను నాడిన యాసురుచి వ
చనములు సత్యంబు లగును సర్వశరణ్యం
డనఁగల హరి చరణంబుల
గను జనకునియంక మెక్కఁగాఁ దలఁచేనిన్.

-భాగ. ౮-౨౧౯, ౨౩౧.

కొందఱు కవులు "ఒడి, తొడ" అను నర్థభేదము పాటింపకయే అంకశబ్దము వాడియున్నారు. ఆభావము మాపుటకయియే ఒకసంఖ్యక్రిందనే ఈపదచ్ఛేదమును సూచించు గుఱుతు (;) తో నిఘంటువున నర్థము గ్రహింపఁబడినది. ప్రయోగము నిచ్చిన నిచ్చిరనియు, ఈయకున్నచో నీయ లేదనియు నా? ఇంకను ఇట్టిప్రశ్న లెన్నియో యున్నవి. వానికి సమాధానము వ్రాయుట కాలహరణమగును. అయిన నొక్క "అంకుర" శబ్దమును గుఱించి వ్రాసి మానివేసెదము.

౧౭. నారాయణరావుగారు "అంకురము (౨. ముకుళము, మొగ్గ)—ఈయర్థము శబ్దరత్నాకరములో లేదు. ఇందుకు ప్రయోగమిస్తే బాగా ఉండును." అని వ్రాసినారు.

శబ్దరత్నాకరమున లేకపోయిననేమి? శబ్దరత్నాకరమున నేకాదు, ఆప్తేలోను లేదు. ఇది వాచస్పత్యము నుండి గ్రహింపఁబడినది. అగ్గిమీఁద గుగ్గిలము వేసినట్లు ఆప్తేనుండి గ్రహించినదానికే "వలదు" అను నారాయణరావుగారికి వాచస్పత్యమునుండి గ్రహించినామని

తెలిసినచో మిగులఁ గోపము వచ్చునేమో! ప్రయోగము లున్నవి. సంస్కృతగ్రంథములలో "ప. తుమంసిమఏచూదంసరదిణ్ణో కామస్స గహిదధణు అస్స; పహిఅ జణజువఇలక్ఖో పంచబ్భహిఓ సరో హోహి. ఛాయా: త్వమసి మయా చూతాంకుర దత్తః కామాయ గృహీతధనుషే, పథిక జనయువతిలక్ష్యః పంచాభ్యధిక శ్శరో భవ" శాకుంతల–౬-అం. 3– శ్లో. దీని ననుసరించియే ముకుళార్థము వాచస్పత్యమున గ్రహింపఁబడి యుండును. ఆంధ్రగ్రంథములలో–

ఉ. దళితాంభోజపలాంగుళీతనుశిర
స్త్రాణంబులుం గోపులే
త్పలసచ్చాపము నబ్జసూత్రగుణముం
జూతాంకురాశోకకు
ట్మలజాతి ప్రసవాస్త్రపూర్ణ శరధుల్
మంత్రించి పశ్యాత్మతా
దుల సన్నాహము చేసి మారుఁడు జగ
త్క్షోభంబు సంధిల్లఁగాన్.

కవిరాజశిఖామణి నన్నెచోడకుమారసంభవము ౮–౪౬3

౧౮. " 'అంగజాలలు అనేదానికి ఏకవచనప్రయోగము కనఁబడలేదు' అని వ్రాసినారు. అయితే ఇది నిత్యబహువచన మంటారా; 'బ్రౌణ్యములో అంగజాలవాఁడు= A village drudge' అని వ్రాసి ఉన్నది గదా!" అని నారాయణరావుగారు మఱియొక ప్రశ్న వేసియున్నారు. "అంగజాలవాఁడు" అనినచో వృత్తియందు విభక్తి లోపించినదని చెప్పవచ్చును. ఏకవచనప్రయోగము దొరకినచో గ్రహింపవచ్చు ననెడి భావముతోనే ఏకవచనమునకుఁ బ్రయోగము లేదని వ్రాసినాము. "బహువచన మంటారా?" అని వేఁకే ప్రశ్న ఎందులకు?

౧౯. 'అంగదట్టము' క్రింద వ్యుత్పత్తిగా నిచ్చినదానిని అర్థముగా నిచ్చినారని వ్రాసి 'యీయర్థమున ప్రయోగ మున్నదా?' అని వేసిన ప్రశ్న ఎంత గట్టిప్రశ్నయో చదువరు లూహింతురుగాక.

౨౦. భారతి 15–వ పుటలో–"అఁగుడెంచు=అగు' అని వ్రాసినారు. 'గతించు, కడచు' అని అర్థము వ్రాసినారు. 'ఏనేఁడు'లగుడెంచె, సరోరుహాప్తుఁ డుదయం బగుడెంచెను' అంటే 'ఏనేఁడులు గతించినవి, సరోరుహాప్తుఁడుదయించెను' అని యేపాటిభాషాజ్ఞానము కలవారూ చెప్పరు. ఏనేఁడులయినవి, ఏనేఁడులు కావచ్చినవి, అనేవి ఏకార్థములు కావు. 'అగుడెంచె' అంటే 'ఇంకా కాలేదు; కాని కొంచెము కాలములో అవుతుంది'అని అర్థము" అని నారాయణరావుగారు వ్రాసి యున్నారు. "అగుడెంచు=అగు" అని వ్రాసి, అగుధాత్వర్థములలో నే యర్థము ఇచ్చిన యుదాహరణమున సరిపడునో యది చూపుటకై 'కడచు, గతించు' అనుటకు "ఏనేఁడు లగుడెంచె..." అను నుదాహరణమును, 'కలదియగు' అనుటకు "అంత సరోరుహాప్తుఁ డుదయం బగుడెంచె" నను నుదాహరణమును నిచ్చినాము. రెండవయుదాహరణములో 'ఉదయం బగుడెంచు=ఉదయముకలవాఁడగు' అనఁగా, ఉదితుఁడగు, ఉదయించు, అని తాత్పర్యము. ఆయర్థమును దెలుపుటకే యాయుదాహరణ మీయఁబడినదికాని "గతించు" అనుదానికిఁ గాదు. అందు "అగుడెంచు"నకు "కడచు, గతించు" అనునర్థముతో సంబంధమే లేదు. నారాయణరావుగారి వ్రాఁతలో "అగుడెంచె అంటే ఇంకా కాలేదు కాని కొంచెముకాలములో అవుతుంది" అని యర్థనిర్ణయము చేసినారు. ఈయర్థము పై రెండుస్థలములయందుఁగూడను గుదురదు. భారతప్రయోగములో నైదు సంవత్సరము లయినవనియే చెప్పవలె . లేకున్నచో "అర్జునుఁ డింత కేతెంచున్=ఈపాటి కర్జునుఁడు వచ్చియుండును." అనునది సంగతము కాదు. అర్జునుఁ డయిదుసంవత్సరములు పూర్తియయినఁగాని వచ్చుట సంభవింపదని ధర్మరాజెఱిఁగి యీ వాక్యములు పలికినట్లు కథాసందర్భమున సంస్కృతాంధ్రభారతములు చూచినఁ దెలియును.

ఇఁక నిర్వచనోత్తర రామాయణమున ౬–ఆ. ౧౭-ప.

ఉదాహరణములో వృథగా నుదాహరణము పెద్ది యిచ్చుట యిష్టములేక కొంచెముభాగమే యిచ్చియున్నాము.

ఉ. "అంత సరోరుహాప్తుఁ డుదయంబగుడెంచె... సత్వరుఁడై చనుదెంచె నొక్కొ–నాన్" అనుచోట "ఉద

యము కానచ్చినది" అను నర్థ మెంతమాత్రము పొసఁగదు. ఆపద్యాంతముననున్న "చనుదెంచె" అనుభూతకాలిక్రియచే నైనను ఉదయ మయ్యెననియే గ్రహింపవలయును గదా !

౨౧. నిఘంటువిమర్శనముతోఁ దృప్తిఁ బొందక నారాయణరావుగారు మచ్చుపదముల పుస్తకములోని పీఠికనుగూడ విమర్శింపఁదలంచి, భారతి 17-వ పుటలో నీప్రకారము వ్రాసినారు:

"నియమములు" అని ఇరవై నాలుగు వాక్యములు వ్రాసినారు. (అ) అందులో ఈవాక్యముల కొందికను, అన్వయమును చూడవచ్చును. 'ఆప్రయత్నము మాని... కుండలాకారచిహ్నము లుంపఁబడినవి.' 'అర్థసంఖ్యను గ్రహించినతరువాతనే ద్రావిడాది పదములు...గ్రహింపఁబడినవి' 'ఆపదములలో ముఖ్యములని తోఁచినవి... చూ అని వ్రాయఁబడినది.' 'పదమును స్వతంత్రపదమునుగానే గ్రహించి...ప్రకృతి యనుకొనిన పద మీయఁబడినది' పీఠిక నిఘంటువునకంటె భిన్నమైనది గావున నందలి దోషములు నిఘంటువును బాధింపవు. అయినను నారాయణరావుగారి యాక్షేపమునకు సంగ్రహముగాఁ బ్రత్యుత్తర మీయఁదలఁచినాము. ఈయాక్షేపములోని భావము స్పష్టముగా లేదు కాని నారాయణరావుగారి గురువులయిన గిడుగు రామమూర్తిపంతులుగారి యభిప్రాయము కొంతకాలముక్రిందటి కృష్ణాపత్రికలో నిట్లు వ్రాయఁబడినది:

"ఈనిఘంటునియమములు వివరిస్తూ వ్రాసిన పీఠికలో నాలుగైదు వాక్యములకు అన్వయము కుదరదు. కర్తఅసమాపకక్రియను వేసి దాని సమాపకక్రియకర్మణ్యర్థములో వ్రాసినారు. దీనికి ప్రయోగము కనబడదు"

ఇదియే నారాయణరావుగారి యభిప్రాయము కూడనని తలఁచెదము. రామమూర్తి పంతులుగారికిఁ గనఁబడని ప్రయోగము లివిగో-

ఆ. మొదలి పెక్కు జన్మములఁ బుణ్యకర్మముల్
పరఁగఁ జెక్కు-సేసి పడయఁబడిన
యట్టి యెలుక జనుల కాత్మజమాత్రన
చెఱచు మద్యసేవ సేయ నగునె.

—భార. ఆది. ౩-౧౭౦.

మధ్యాక్కర. తడయక పుట్టిననాఁడె తల్లిచేఁ దండ్రిచే విడువఁబడితి. —భార. ఆది. ౪-౧౦౨.

ఇవి నన్నయభట్టు ప్రయోగములు. ఇఁక తిక్కనసోమయాజిగారి ప్రయోగమును చిత్తగింపుఁడు:

"ఒక్క కారణంబున నుద్ధతులను విరోధులచేతం బతుల సన్నిధిఁ బలవట్టి యీడ్వంబడి వనంబున కరిగి..."

—భార. విరా. ౧-౩౧౩.

ఆ. ధర్మమాచరింపఁదగు మృత్యుచేఁ బల
వట్టి యీడ్వఁబడినవాఁడు వోలె-

పీఠికలోని వాక్యరచనలు రామమూర్తిపంతులుగారికిని, నారాయణరావుగారికిని రుచింపకున్న నుండవచ్చును గాని, రామమూర్తిపంతులుగారివంటి బహుగ్రంథద్రష్టలు ప్రయోగములు లేవనుట వింత.

ప్రాణులలోఁపలన్ సకలవర్గములందును సర్గవృద్ధికిన్
స్త్రీనిని బూరుషుం గన సృజించె విధాతృఁడు భిన్నచిహ్నతన్
మానవజాతియందు నియమంబు ఘటిల్లెను భార్య భర్త నా,
జ్ఞానము పేరిమిన్; బతికి జాయ సహాయ గృహక్రియాదులన్.

భామిని భర్తమేన సగపా లనుచుందురు గాని, భర్త యే
యామె శరీరమందు నొకయర్ధము నారు; మఱిన్ దదర్ధమున్
వామ మటంద్రు గాని కుడిభాగము నా; రటుగానఁ జూడఁగాఁ
గామినితోడె సు మ్మధిక గాదు, సమానయుఁగాదు భర్తకున్.

తను వొక్కటైనఁ, దనదు సృ-జన వైచిత్ర్యమున సలిపె జంతుల జగ
జ్జనకుం డిరుమూర్తులుగా-మన మొకఁడై మెలఁగుటకును మనుగడయందున్.

కరములుఁ గాళ్లుఁ గర్ణములుఁ గన్నులు ఘ్రాణపుటంబులుం బర
స్పర మిరువంక సఖ్యమున సాయములై మయినెట్టు లుండునో
పురుషుఁడుఁ బువ్వుఁబోఁడి యిరువుర్ విడిగాఁ గనఁబడ్డ; నట్లె సం
సరణమునన్ బ్రవర్తిలను స్రష్ట సృజించె విచిత్రచాతురిన్.

కన్నియ దాన మిచ్చెదరు కాంతున, కట్టులు వాని నీరు గా
కన్నెకుఁ గాళులం గడిగి; కట్టడ యిట్టిది గాదు సార్వమం
చన్నను, గాంతువంశమునఁ గన్నియ ఛేరును గాని పెండ్లిచేఁ
గన్నియవంగసంబునకుఁ గాంతుఁడు చెందఁడుగాదె మెయ్యెడన్.

ఆలికిఁ బేరు క్షేత్ర మని యార్యజనంబుల దేవభాషలో;
హాలికుఁ డౌ గృహస్థుఁ డనునాశయ మందు స్ఫురించు; భూమి త
న్మూలమునంగదా కలితదోహద మై, ఫలపుష్ప శోభి నా
నాలతికా తరుప్రకర నందన సస్యసమృద్ధి భాసిలున్.

వనితలుఁ బండితుల్ లతలు భాసిలకుండు నిరాశ్రయంబు లై
యనియెడు సత్యసూక్తి "సతి యాశ్రిత పూరుషుఁ డాశ్రయుం" డటం

5. 3- 2 324

చును బ్రభుభృత్యభావమును సూచన చేయును; జూడఁ దన్మన
స్తను గతులుం దదర్థము యథార్థము సుమ్మని నిర్ధరించెదన్.

పురుషులు శౌర్యాదులకుం-దరుణులు శాంత్యాదులకును స్థానంబులుగాఁ
బరమేష్ఠి సల్పినాఁడని-స్థిరపఱుపవె కలిమి లేమిచేఁ గఱి మీసల్?

మగనా లంత్రపు కులాంగనన్; మగని సామ్రాజ్యంబ యిల్లా లటం
టగుఁ గా దానికి నర్థ; మాతఁడు స్వదేహంబట్లు కాపాడుకోఁ
దగుఁ దద్భాగ్యము; పాల్యపాలకుల సద్ధర్మంబు జాయాపతుల్
మిగులం బాటి యొనర్చుకొం చిరువు రామేరన్ మెలంగన్ వలెన్.

తల్లిని దండ్రి నన్నలను దమ్ముల నక్కలఁ జెల్లియండ్రఁ బు
ట్టిల్లు సమస్తమున్ విడిచి యిల్లను దా నని నమ్మి భక్తిమై
నిల్లము పల్లవింప నెపు డూడిగము సేయుసతిం గుబుద్ధివై
యొల్లనిభూతి కే నరక మున్నదొ పాపఫలానుభూతికిన్?

మగనికి నర్ధదేహ మను మానిని సర్వవిధాల యోగ్యరా
లగుచు గృహక్రియాదుల సహాయగ నుండక బండదైనఁ బెం
డెగు లగు పతివ్రాత మది తీఱనిగోడు ఘటించు వానికిన్
సుగుణము లాఱునుం గలుగు సుందరి కౌ పతి ధన్యుఁ డెంతయున్.

స్తన కలశంబు లిచ్చి, నెఱజవ్వనమై నెల దప్పెనేని వా
నిని బాదలించి క్షీరముల నించువిరించను నంచితాశయం
బునకు విరుద్ధ మంచుఁ దలపోయక యా యజుఁ డిడ్డ బిడ్డలం
బెనుపను విత్తనత్తి నియమింత్రయొ కొందఱు ధాత్రిసుందరుల్.

ఘనుఁడైనం బురుషుండు కాంతకె పురస్కారంబు ద్వంద్వంబునన్
వినమే యాల్మగలున్ వధూవరు లనన్? వియ్యాలవారున్ సుహృ
జ్జనులున్ బంధువులున్ సతీమణులకే సత్కార్య మత్యంతముం
బొనరిం; శ్రీ భరతావనిన్ వనితలే పూజ్యల్ కుటుంబంబులన్.

---

# పితృభక్తి–శ్రీరామగాంగేయులు

మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు

రామాయణ కథానాయకుఁడైన మహావీరుఁడు శ్రీరాముఁడు. మహాభారతవీరాగ్రేసరుఁడు గాంగేయుఁడు. ఈమహాపురుషుల పుణ్యకథ లెఱుఁగనివారు హిందూదేశములో నుండఁబోరు. అయినా వీరిద్దఱి సచ్చరిత్రలలో వీరిని పోల్చి వర్ణింపఁదగిన విశేషాంశముగాఁ గనవచ్చు పితృభక్తినిగూర్చి యీచిన్నవ్యాసము వ్రాయుచున్నాను. ఈవిషయమున వాల్మీకివ్యాసమహాకవు లీపాత్రముల నెట్లు పోషించుచు వచ్చి రనుటయే యీవ్యాసము యొక్క ముఖ్యోద్దేశము.

శ్రీరాముఁడు శ్రీమన్నారాయణావతారము. గాంగేయుఁడు దేవయోని విశేషావతారము. ఇద్దఱును కారణజన్మ మెత్తినవారు. కాని యమానుషములైన వీరి మహిమలతో మన కిందు పనిలేదు. మఱియు, అంధతాపసుఁడిచ్చిన శాపముచే దశరథుఁ డనుభవింపవలసివచ్చిన పుత్రశోకమునకు ఫలముగా రాముఁ డడవికి వెళ్లవలసివచ్చుటయు, వసిష్ఠునిశాపముచే ననుభవింపవలసి వచ్చిన యనపత్యముగా గాంగేయుఁ డవివాహితుఁడు గావలసివచ్చుటయు మన కిందావశ్యకములు కావు. ఆమహిమలను అవరములను, ఆశాపములను అటుంచి, వీరిరువురును మానవులు, క్షత్రియులు, ధీరోదాత్తులు అనువిషయము మాత్రమే గ్రహించి వీరిపితృభక్తి నించుక పోల్చి పరిశీలింతము.

సంతానము లేకలేక పరితపించిన దశరథునకు పెద్దతనమునఁ బుట్టిన కొడుకులలో పెద్దవాఁడు శ్రీరాముఁడు. చాలాసంతానము నష్టముకాఁగాఁ బరితపించిన శంతనునకు చిట్టచివర ప్రాణములతోఁ దక్కిన యేకపుత్రుఁడు గాంగేయుఁడు. అందుచే దశరథశంతనులకు శ్రీరామ గాంగేయు లతి ప్రేమాస్పదులగుట నిక్కము. అట్లే వీరిద్దఱును తండ్రులకు వినయవిధేయులై పరమభక్తులగుటయు నిజము. శ్రీరామదశరథుల భక్తివాత్సల్యములను వాల్మీకి పెక్కుచోట్ల వివరించియున్నాఁడు. వ్యాసుఁడు గాంగేయశంతనుల భక్తివాత్సల్యములను విశేషించి వర్ణింపకపోయినా,

> 'పారవాఙ్ శంతనోః పుత్రః
>
> పితరంచ మహాయశాః,
>
> రాష్ట్రించ రంజయామాస
>
> వృత్తేన భరతర్షభ;
>
> తస్యైవం సమనుజ్ఞాతః
>
> పుత్రమాదాయ శంతనుః,
>
> సర్వకామసమృద్ధార్థం
>
> మేనే చాత్మాన మాత్మనా.'

అని రెండుమాటలతో వాటిపారము గనఁ బఱిచినాఁడు.

## దశరథ శ్రీరాములు

దశరథుఁడు పౌరవృద్ధామాత్యాదుల యభిమతమునుబట్టి శ్రీరాముని యౌవరాజ్యాభిషిక్తునిఁజేయ నిశ్చయించి అతనిని రావించి,తన యాశయమును మహానందముతోఁ జెప్పుచు—

'భవంతి బహువిఘ్నాని
కార్యా ణ్యేవంవిధానిహి,
విప్రోషితశ్చ భరతో
యావదేవ పురాదితః;
తావదే వాభిషేక స్తే
ప్రా ప్తకాలో మతో మమ,
కామం ఖలు సతాం వృత్తే
భ్రాతా తే భరత స్థితః;
జ్యేష్ఠానువ ర్తీ ధర్మాత్మా
సానుక్రోశో జితేంద్రియః,
కింతు చిత్తం మనుష్యాణా
మనిత్య మితి మే మతిః.'

అని యన్నమాటలు రాఁబోవు ననర్థమునకు సూచకములో యన్నట్లుగా తొల్లి కైకేయిని పెళ్లాడునపుడు కేకయరాజుతోఁ జేసిన రాజ్యశుల్క-ప్రతిజ్ఞను స్మరించుకొని, భరతుఁ డయోధ్యలో లేనపుడు నీయభిషేక ముచిత మను తలంపుతో నన్నవికాని దేవాసుర యుద్ధములో కైక కిచ్చినవరము లామె యడుగునేమో యను తలంపుతో నన్నవి కావు.

తరువాత, దశరథుఁడు క్రోధాగారమున నున్నకైకేయి ననునయించుచుఁ గామవశవర్తియై, 'ప్రాణప్రియుఁడు, ప్రాణాధికుఁడు, ప్రాణ క్షేమైన రామునితోడు-నీమనోరథము తీర్చెదను; అదేదో చెప్పు'మనుటయు, ఇంకా మఱెన్నో శపథములు చేయుటయు సత్యమే కాని, అప్పటి యతని కామిత్వము కైక కోపము తీర్చుటకుఁ బూనుకొన్నదే కాని, రామునియభిషేకమునకు భంగము కలిగించే యామెమనోరథము తీర్చుటకుఁ బూనుకొన్నది గాదని తరువాతిచర్యవల్ల నే గోచరించును. ఆమాటలలోఁ గూడా రాముఁడంటే దశరథుని జీవనమే యనియు గోచరించు చున్నది.

ఏముహూర్తమునందు కైకేయి రామవనవాసము కోరినదో, అపుడే ఆమెయందు తగులుకొనియున్న దశరథుని కామపాశము తెగిపోయినది. అపుడే రామునియందు తగులుకొనియున్న ప్రేమపాశము మఱింత దృఢమైనది. అవశమైన యవస్థ తటస్థించినపుడే నిజమైన చిత్తవృత్తి తెలియవచ్చుననుటయు ధ్రువమైనది.

రామవనవాస వరము కోరవద్దని దశరథుఁ డెన్నోవిధములఁ గైకకు బోధించెను; నయమున భయమునఁ జెప్పినాఁడు; ప్రతిమాలినాఁడు. ఏమి లాభము? విషము తాగి చచ్చెదనన్నదిగాని యామె పట్టు విడువలేదు. అపుడు సత్యసంధుఁడు,పరిపాలకుఁడునైన యారాజు చేయవలసిన దేమి? కైకమీఁది కామముచేతనే యామనోరథము తోసివేయలేకపోయినాఁడా?

కైక చచ్చిపోవుననే భయముచేతనా? కాదు కాదు. తన కెట్లయినా మరణమే సిద్ధమనియు, సత్యము చెప్పినా లోకము నమ్మదనియు నతనికిఁ దెలిసినది. ఎన్ని చెప్పినా, "కైకకు లొంగి దశరథుఁడు రాము నడవికిఁ బంపె"నన్న లోకాపవాదము తప్పదని యతఁడు గ్రహించినాఁడు. కాని యేమి చేయును? ఇచ్చినవరము లేదనలేఁడు; ఆడినమాట తప్పలేఁడు; కొడుకును విడువలేఁడు; చివర కేమి చేసెను? "ధర్మబంధేన బద్ధోఽస్మి నష్టాచ మమ చేతనా" అని యూరకున్నాఁడు. అంతే. ఈమాట చెప్పినయెడల, లేక విన్నయెడల రాముఁడు తప్పక యడవికి వెళ్లునని యూరా జెఱుఁగును. కాని యట్లు చెప్పఁగలిగెనా? లేదు. చెప్పఁదలఁచెనా? లేదు. కైక రామునితోఁ జెప్పినపుడు విని సహించెనా? లేదు. ఆమాటలు వినఁగానే—

'ధిక్కష్ట మితి నిశ్వస్య
రాజా శోకపరిప్లుతః,
మూర్ఛితో న్యపత త్తస్మి
న్పర్యంకే హేమభూషితే.'

శ్రీరాముఁడు వచ్చి దుఃఖితుఁడైన తండ్రికి నమస్కరించినపుడు, అతఁడు 'రామా' అన్నాఁడు. అంతే. కన్నెత్తి చూడఁజాలక పోయెను. నోరెత్తి మాటాడలేకపోయెను. "పూర్వము నాకు వరము లిచ్చి యిపు డితఁడు పశ్చాత్తాపపడుచున్నాఁ"డని కైక చెప్పఁగా విని, రాముఁడు, "మాతండ్రిమాటచే నిప్పులో నుఱికెదను; విషము త్రాగెదను; సముద్రములో మునిఁగెదను. అదేదో చెప్పు"మని కైక నడిగి నిజవృత్తాంతము తెలుసుకొని, నిర్వికారుఁడై, నిర్విచారుఁడై—

'అనుక్తోఽప్యత్ర భవతా
భవత్యా వచనా దహమ్,
వనే వత్స్యామి విజనే
వర్షాణీహ చతుర్దశ;
భరతః పాలయే ద్రాజ్యం
శుశ్రూషేచ్చ పితు ర్యథా,
తథా భవత్యా కర్తవ్యం
సహి ధర్మ స్సనాతనః.'

అని యతిధైర్యముతో పితృభక్తి యుట్టిపడఁ బల్కెను. ఆమాటలు విన్న దశరథుఁడో, చెవులు చిల్లులుపడిపోయెనో యన్నట్లు—

'స రామస్య వచ శ్శ్రుత్వా
భృశం దుఃఖహతః పితా,
శోకాదశక్నువ న్బాష్పం
ప్రరురోద మహాస్వనమ్.'

పుత్త్రప్రేమము, పుత్త్రదుఃఖము, మిళితమైనట్లు పెద్దపెట్టున నేడ్చెను.

అంత రాముఁడు విసంజ్ఞుఁడైన తండ్రికిని, కైకకును నమస్కరించి వచ్చి, వెంటనే సీతాలక్ష్మణులతో నడవికి వెళ్లెను.

ఈవిధముగా, పితృభక్తి మూర్తీభావమో యన్నట్లుగా రాముఁడు పితృవాక్య పరిపాలనమునకు స్వార్థత్యాగము చేసెను. ఈ సందర్భమున వాల్మీకి రామదశరథపాత్రముల నుత్తమపద్ధతిని పోషించి తనయసమానకావ్య రచనానైపుణిఁ బ్రకటించెను. ఇంకె—

## శంతను గాంగేయులు

శంతనుఁడు గంగను విడిచినపిదప స్త్రీముఖ మెఱుఁగడు. కాని చిరకాలమునకు దాశకన్య ను చూచి మోహించి, పెళ్లాడఁ గోరెను. దానికి రాజ్యశుల్కా మడ్డము వచ్చినది. ఆవర మివ్వ లేక, సత్యవతీమోహము వదలలేక, వచ్చి, బెంగ పెట్టుకొని తలకట్టుకొని పడుకొన్నాఁడు. గాంగే యుఁడు వచ్చి యతని విచారమునకుఁ గారణ మడుగఁగా శంతనుఁ డిచ్చిన యుపన్యాసము—

"ఏకపుత్త్రుఁ డనపత్యునకు సమానుఁడు. నాకు నీ వొకఁడవే పుత్త్రుఁడవు. నీ వొకఁడవు వందమందిపె ట్టనుటకు సందేహములేదు గాని యుద్ధశూరుఁడవు. లోక మనిత్యము. ఎప్పటి కేమి వచ్చునో, ఏయుద్ధమున నీ వేమగుదువో, వంశము పోవునని సందేహించుచున్నాను. నే నైనా వృథాగా పెళ్లాడఁ దలఁచుకోలేదు. సంతానవిచ్ఛిత్తి యగునను భయముచేత నే పెళ్లి గోరుచున్నాను. ఇదే నావిచారమునకుఁ గారణము' అనుచు నేమేమో చెప్పెను.

అప్పుడు బుద్ధిశాలియైన గాంగేయుఁ డా మాటలు వినియు నిశ్చలచిత్తుఁడై తండ్రీ మనో వేదనకుఁ గారణము తెలిసినందుకు సంతో షించి వచ్చి, యమాత్యుల వలన యావద్వృ త్తాంతము నెఱిఁగి వెంటనే, దాశరాజు వద్దకు వెళ్లి రాజ్యవరమిచ్చి తన తండ్రికి సత్యవతి నిమ్మని కోరెను. అంత దాశరాజు "ఈవరము నీవు జరుపుదువుగాని నీ కొడుకులు జరుపు దురా? నీకొడుకులవలన సత్యవతీ పుత్త్రుని రాజ్యమునకు భంగమురాకుండఁ జూడు' మని మరలఁ గోరఁగా, మహాశూరుఁడైన యా గాంగేయుఁడు మహోదారుఁడై నిర్వికారుఁడై-

"అద్యప్రభృతి మే దాశ!
బ్రహ్మచర్యం భవిష్యతి,
అపుత్త్రస్యాపి మే లోకా
భవిష్యం త్యక్షయా దివి."

అనుచు నవలీలగా ఘోరప్రతిజ్ఞ చేసి, సత్యవతిని దీసుకొనివచ్చి, తండ్రికి సమర్పించెను. ఈసంద ర్భమున వ్యాసుఁడు కొడుకునెదుటఁ దండ్రిచే మోమోటము, సిగ్గు లేకుండఁగా మాటాడించి, శంతనుపాత్రమున కనౌచిత్యము గలిగించెను గాని, క్రియా కేవల ముత్తర మ్మనునట్లు గాంగే యపాత్ర మతిగంభీర మతి సముచితము నగు నట్లు పోషించి పాత్రౌచిత్యకలను వన్నె దెచ్చె ను. ఈవిధముగా జనకుని కోర్కె నెఱవేర్ప భీష్ముఁడు స్వార్థత్యాగము చేసెను.

తండ్రి సత్యమును పాలించుట, తండ్రీ వాంఛ తీర్చుట యను వేఱుకారణములనుబట్టి క్రమముగా సవతితల్లి కొడుకునకు స్వరాజ్యము విడుచుట యను స్వార్థత్యాగము శ్రీరామ భీష్ములకు సామాన్యధర్మమైనది. ఇఁకనో, అడ వికిఁ బోవుట రామునకును, బ్రహ్మచారియై యుండుట భీష్మునకును విశేషధర్మము. ఇపు డెవరిత్యాగ మెంతవఱకు సముచితమై పితృ భక్తి పరాయణత్వమును స్థిరపఱుచుచున్న దన్నవిషయము విచారణీయము.

శ్రీరాముఁడు పదునాలుగేళ్లకయినా మరల నయోధ్యకు రాఁగలఁడు; రాజు గాఁగలఁడు. కాని భీష్మునికి ఆజన్మలో రాజ్యము మరల రాదు సరిగదా; పెళ్లియే లేదు. రాముఁడడవిలో నున్నను స్వతంత్రుఁడు; భీష్ముఁడు పురములలో నున్నను అస్వతంత్రుఁడు. అతఁ డడవిలో నున్నను రాజే; ఇతఁడు రాజ్యరక్షణము చేయుచున్నను సేవకుఁడే. అతఁడు మునివేషధారియైన గృహస్థుఁడు; ఇతఁడు రాజవేషధారియైన శాశ్వతబ్రహ్మచారి. అతఁ డరణ్యములో నున్నను కళత్రసౌఖ్యము లేకపోలేదు; ఇతఁడు కోటలోనున్నను శరీరసుఖమే యెఱుఁగఁడు. ఇఁకనో, రాముఁడు ప్రవాసములో నున్నంత కాలము నేదో యొక నెపమునఁ గైకేయిని నిందించుచునే యుండెను. భీష్ముఁడో సత్యవతీశంతనుల నెన్నఁడు నిందింపలేదు సరిగదా, తుదకు దాశరాజునైనా పల్లెత్తుమాట యన్నవాఁడుకాఁడు. చివరకుఁ దనదురదృష్టమునైనా నిందింపలేదు; కానిండు: ఇది యిట్లుండనిండు——

దశరథుఁడు కైకకు వరములిచ్చిన మాట సత్యము. ఆవరము లీవిధముగాఁ దీర్పుమని యడుగుట కైకతప్పు గాని, తా నెన్నఁడో యిచ్చినవరము లీవిధముగాఁ బరిణమించునని యెఱుఁగకపోవుట దశరథునితప్పు గాదు. ఇంతకును, తనమాట చెల్లింపుమని దశరథుఁడు రామునితోఁ జెప్పలేదు; కైకయే చెప్పినది. ఎవరుచెప్పినా తండ్రిఋణము తీర్చుట కొడుకునకు విధి గాకపోదు. ఆడినమాట తప్పుట దశరథునకు పాడియా? అట్లయిన నతఁ డుభయలోకములకుఁ జెడినవాఁడే. అట్టిస్థితిలో అతఁడు చెప్పకపోయినా, అతఁడు విధింపకపోయినా, ఆ కోర్కె విన్నంతమాత్రముననే పితృభక్తిపరాయణుఁడు, ప్రాజ్ఞుఁడునైన శ్రీరాముఁడు జనకుని వాక్యమును పరిపాలించుట యాశ్చర్యకరముగాదు. శ్రీరాముఁడును త్రికరణశుద్ధిగా నట్లే నెఱవేర్చెను. ఇంతవఱకతఁ డుత్తమముగా నున్నది.

ఇఁకనో, శంతనుఁడు గంగ నెడఁబాసిన పిదప ముప్పైయేండ్ల వఱకు స్త్రీముఖ మెఱుఁగక, అపుడు సత్యవతిని మోహించుటయే తప్పు. పోనీ, మోహింపవచ్చు ననుకొందము. దానిని పెండ్లాడుటకు రాజ్యశుల్క మడ్డము రాఁగా నిజముగాఁ గామపరవశుఁడే యైనచో శుల్క మక్కఱలేని మఱియొక రాజకన్యను పెండ్లాడవలెనుగాని దానికొఱకే తలకట్టుకొని పరుండుట మఱియొక తప్పు. పోనిండు: ఆకన్నెదే యతనికి నచ్చినది. అందుచే దానిపై మోహము విడువలేకపోయినాఁ డనుకొందము. అయితేనేమి? తనకోరిక తెలిసినంతమాత్రముననే మహోదారుఁడైన గాంగేయుఁడు రాజ్యవర మిచ్చి తనకోర్కె నెఱవేర్చుననే దృఢవిశ్వాస ముండుటచేతనే కదా, అతఁ డట్లు లజ్జాదాక్షిణ్యములు విడిచి గాంగేయునివద్ద నపమార్గమునఁ దాను పెండ్లాడుటకుఁ గల యక్కఅను వెళ్లఁగక్కెను? ఆహా! చూడండి! పుత్రునకు రాజ్యము లేకుండఁ జేయు విషయమునఁ గామపరవశుఁడై యపమార్గము తొక్కిన

వాఁడు శంతనుఁడా? దశరథుఁడా? తన పెళ్లి గాంగేయుని రాజ్యమునకు హాని తెచ్చునని శంతనుఁ డెఱుఁగును. కైక నోటనుండి యా చెడ్డమాట వచ్చువఱకును రాముని రాజ్యమునకు భంగము వచ్చు నన్నమాట దశరథుఁ డెఱుఁగఁడు.

తన రాజ్యమునకును తన పెళ్లికిని భంగము గలిగించిన శంతనుదాశరాజులనుగాని, మూల కారణమైన సత్యవతినిగాని గాంగేయుఁ డపుడు గాదుగదా, ఎపుడును పల్లెత్తు మాట యన్న వాఁడు కాఁడనుట ధ్రువము. తన యౌవరాజ్యాభిషేకమునకు సవతితల్లి హాని గలిగించినది గాని, తండ్రి కలిగింపలేదని శ్రీరాముఁ డెఱుఁగును. మఱియు, దశరథుఁడు కైకేయిని పెళ్లాడుటకు కేకయరాజుతోఁ జేసిన రాజ్య శుల్క ప్రతిజ్ఞను శ్రీరాముఁ డెఱిఁగియు, తన్ను యువరాజును జేసెదనని తండ్రి యన్నపుడు, "ఇదేమి న్యాయము? నీ విచ్చిన రాజ్య శుల్కమునుబట్టి భరతునే యువరాజునుగాఁ జేయవలె" నని యన్నాఁడా? లేదు. ఆ రాజ్య శుల్కవరముచే తనయభిషేక మాఁగినదా? లేదు. అట్టియెడఁ దండ్రిని కామాత్ముఁ డనుట తగునా?

గంగదాఁటి వెళ్లిన మొదటిరాత్రి లక్ష్మణునితో నన్నమాటలివి—(అయోధ్యా-౫౩సర్గ.)

'ధ్రువ మద్య మహారాజో
దుఃఖం స్వపితి లక్ష్మణ,
కృతకామాహి కైకేయీ
తుష్టాభవితు మర్హతి;
సాహి దేవీ మహారాజం
కైకేయీ రాజ్యకారణాత్,
అపి నచ్యావయే త్ప్రాణాన్
దృష్ట్వా భరత మాగతమ్;
అనాథశ్చ హి వృద్ధశ్చ
మయాచైవ వినాకృతః,
కిం కరిష్యతి కామాత్మా
కైకేయీవశ మాగతః;
ఇదం వ్యసన మాలోక్య
రాజ్ఞశ్చ మతివిభ్రమమ్,
కామ ఏవార్థ ధర్మాభ్యాం
గరీయా నితి మే మతిః;
కో హ్యవిద్వా నపి పుమాన్
ప్రమదాయాః కృతే త్యజేత్,
ఛందాను వర్తినం పుత్రం
తాతో మా మివ లక్ష్మణ;
అర్థధర్మౌ పరిత్యజ్య
యః కామ మనువర్తతే
ఏవ మాపద్యతే క్షిప్రం
రాజా దశరథో యథా.'

శ్రీరాముఁడు తండ్రికి సంభవించిన కష్టమునకు దుఃఖించుచు, అతఁడు కామపరవశుఁడై కైకేయీవశుఁ డగుటచే నిట్టి యాపదకు లోనుగావలసి వచ్చినాఁడనియు, ఎంత తెలివి తక్కువవాఁడయినా, అఁడుదాని ప్రీతికొఱకుఁ దన కనుకూలుఁడైన పుత్రుని విడిచి పెట్టఁడనియు నేమేమో యించుక పితృనింద చేసి నట్లు కనఁబడుచున్నది.



౧. హైదరాబాదుసంస్థానమునందలి గుల్బర్గాయొక్క పొడవయిన ఫిరంగి



౧. బీజపురముయొక్క మహాశతఘ్ని

ఇంతకుమున్ను చేసిన విమర్శనమునుబట్టి యు, శ్రీమద్రామాయణములోని యీ కథాసందర్భములను బట్టియుఁ జూడఁగా, దశరథుఁడు కామలోలుఁడై యపుడు చేసిన తప్పేమియు గోచరింపదు. రాముఁడు పుట్టకమును పెపుడో యిచ్చినవరము కై కేయీవశుఁడై యిచ్చినదేమైనా, అది యీవిధముగాఁబరిణమించినపుడును, నిజముగా దశరథునికి రామప్రవాస మిష్టము కాకపోయినా, ఊరకుండుటే యతనిప్రవాసమున కిష్టపడుటయని యూహింపవలసి వచ్చినపుడును, సత్యసంధుఁడును; ప్రజాపరిపాలకుఁడు నయినదశరథుఁ డాడినమాట తప్పకుండుట తప్పో, లేక యట్టియిక్కట్టులో 'అప్రతిషిద్ధం సమ్మత' మ్మనున్యాయమున రామ ప్రవాసమునకు సమ్మతించుట తప్పో, కార్యజ్ఞుఁడును, పితృభక్తిపరాయణుఁడును, ధర్మబుద్ధియు నైన శ్రీరాముఁ డెఱుఁగనివాఁడు గాఁడు. అయినా ఇతరులు నిందించుటకుఁ గూడా అవకాశములేని యీవిషయమున నితరులనోటఁ గాకుండా పై నిందావాక్యములను శ్రీరామునినోటనే పెట్టిన యాద్యమహాకవియైన వాల్మీకిమహర్షి యభిప్రాయ మేమో దుర్గ్రాహముగా నున్నది. ఉచితానుచితజ్ఞుఁడు, పాత్రశీలపోషణ నిపుణుఁడు, వశ్యవాక్కునయిన యామహాత్ముఁ డూరక యీసందర్భమున రామునిచే నిట్లు పలికించినవాఁడుకాఁడు. ఇందేదో విశేష ముండియుండవచ్చును. దీని నేదో యొకవిధముగా సమర్థించుటకాక యథాస్థితిగా నున్న దీనియందలి సారస్యమును గ్రహించుటయే మనపని. కావున నిపు డీవిషయమును ప్రాజ్ఞలోకమునకు విడిచి పెట్టుచున్నాను.

---

# కర్షకుఁడు—కవితో

నాదెళ్ల వెంకట్రావు గారు, బి. ఏ.

"సతత నిర్మల వాయు సంస్నాతుఁ డగుచు-విహగసంగీతములు వించు వీనులారఁ
జదలనలమెడు నీలంపు జలదపంక్తిఁ-జూచి యానందమునఁ దలలూఁచి మెచ్చు.
పచ్చనగు చేలనడుమను, బ్రకృతిదేవ్యు-పాసకుండయి హాయిగా బ్రతుకుచున్న
కర్షకుని జీవనంబెంత హర్షదాయ-కంబొకా!" యని దూరసౌధంబునుండి.
కడిఁది నిట్టూర్పు గాడ్పులు విడుచు సుకవి!-నిజముగా నీవె యిట వచ్చి నిలుతువేని
బందయును బాడి దప్ప, ఆనందకలనఁ-గందువో లేదొ యని నాకు సందియంబు;
ఏమెడం గ్లేశపుం జీర యేనిలేని-నిర్మలానందగరిమంబు నీ యమూల్య
భావనాసృష్టియందె లభ్యంబుగాని,-తథ్యముగఁ జూచునెడ యథార్థమున లేఁగ."

---

# ఆంధ్ర దేశంలోని ఆలంకారికులు

పెనుమర్తి వేంకటరత్నముగారు [యువకవిమండలి]

పురాతనకాలంనుండీ, ఆంధ్రులు సాహిత్యైకజీవులుగా కనబడుతున్నారు. శిల్పసారస్వతాదికళలు వారిజీవితంలో ప్రధానభాగం. తెలుగుసాహిత్యం పుట్టడానికి పూర్వమే ఆర్యసాహిత్యంలో (సంస్కృతసాహిత్యం) వారిప్రతిభ బాగా వ్యక్తమైవుంది. అతిప్రాచీనకాలానికే వరరుచి వార్తికం వ్రాసి సంస్కృతవ్యాకరణ ఘంటాపథాన్ని తీర్చి దిద్దాడు. శాతవాహనుడి గాథాసప్తశతి, బృహత్కథాసరిత్సాగరములకు పూజార్హాలైనవి. భవభూతి 'అపి గ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయ'మనేట్లు కరుణగీతం పాడాడు.

సంస్కృతవాఙ్మయంలో ఆంధ్రుడికి మంచిస్థానమే వుంది. అలంకారశాస్త్రంలో వీ రెట్లా వున్నారో కనుక్కుందాము.

౧

అలంకారశాస్త్రానికి మాతృభూమి కాశ్మీరం. అక్కడ మహాప్రతిభాశాలులు పుట్టి తచ్ఛాస్త్రసౌధానికి పునాదులు వేశారు. భరతుడు, భామహుడు, ఆనందవర్ధనుడూ, వామనాచార్యులూ, వీళ్లందరూ కాశ్మీరంవాళ్లే.

ప్రాచీనాలంకారికులలో ఒక్కదండ్యాచార్యులు మాత్రం తెలుగువాడు కనబడుతున్నాడు. అలంకారశాస్త్రం పుట్టిపెరిగింది కాశ్మీరంలోనైనా, ప్రతిభావంతుడు కాబట్టే ఆంధ్రదేశంలో గొప్పఅలంకారవేత్త అయాడు అతడు.

దండ్యాచార్యులు కాంచీపురంలోని ఆంధ్రపల్లవరాజు రాజసింహవర్మ ఆస్థానంలోవాడేమో? ప్రేయోఽలంకారానికి వుదాహరణ యిస్తూ యిట్లా అతన్ని వుదాహరించాడు;

సోమః సూర్యో మరుద్భూమిః
వ్యోమ హోతానలో జలమ్,
ఇతి రూపాణ్యతిక్రమ్య
త్వాం ద్రష్టుం దేవ, కే వయమ్.
ఇతి సాక్షాత్కృతే దేవే
రాజ్ఞో య ద్రాజవర్మణః,
ప్రీతిప్రకాశనం తచ్చ
ప్రేయ ఇత్యవగమ్యతే.

ఇది ప్రమాణంగా అంగీకరింప వీలులేదని చరిత్రజ్ఞు లంటారు. దండికావ్యాదర్శాన్ని సింహళభాషలో 'సియాబాసలకార'అని యెవరో ౯-శతాబ్దంలో భాషాంతరీకరించారట. కాన,దండి యంతకు పూర్వుడు. కన్నడంలో రాష్ట్రకూటాధిపతియైన అమోఘవర్ష నృపతుంగుడు కవిరాజమార్గ మనేలక్షణగ్రంథాన్ని ౯-శతాబ్దం మధ్యకాలాన వ్రాశాడు. ఇందులో కావ్యాదర్శంనుండి కన్నడించినపదా లున్నయి. దండి ౯-వ శతాబ్దానికి పూర్వుడని తేలుతుంది.

ఇతనికావ్యాదర్శం అనుష్టుప్ శ్లోకాలతో వ్రాశాడు. అర్వాచీనాలంకారికుల తర్కకర్కశఫణితి యిందుముదర లేదు. ఇతడు కావ్యాన్ని 'శరీరం తావదిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ' అని నిరూపించాడు. గొప్పఅర్థాన్ని సూక్ష్మంగా చెప్పగల సుకవి. 'దండినః పదలాలిత్య'మ్మని విశ్వతోముఖ కీర్తిని సంపాదించాడు. దశకుమారచరిత్రలో యితడాంధ్రనగరమైన వేంగీపురాన్ని వర్ణించాడు.

## గోపేంద్ర తిప్పభూపాలుడు

ఇతడు ఆంధ్రదేశాన్ని ౧౪-శతాబ్దంలో పరిపాలించిన ఒకరాజు. వామనాచార్యుడి 'కావ్యాలంకారసూత్రవృత్తి'కి కామధేనువనే చక్కనివ్యాఖ్య వ్రాశాడు,

'ఇతనివ్యాఖ్య చదివితే యితనికి వ్యాకరణాదిశాస్త్రాలలో నైపుణ్య మెంత ఉందో తెలుస్తుంది. రాజులలో పెక్కుమంది పండితకవు లున్నారు. ౯-శతాబ్దంలోని తెలుగుకవి నన్నెచోడుడు ఎంతమంచికవి!

## కురవీరాముడు

ఇతడు ధనంజయుడి దశరూపకానికి 'పద్ధతి'అనే చక్కనివ్యాఖ్య వ్రాశాడు. వ్యాఖ్య చాలా లుప్తమైపోయింది. ఉత్తరార్కాడు జిల్లాలో ఉన్న కార్వేటినగరం జమీందారువద్దిర వుండేవాడుట. ఇతడు అనంతభట్టు 'చంపూభారతం' మీదా, వేంకటాధ్వరి 'విశ్వగుణాదర్శం' మీదా వ్యాఖ్య వ్రాశాడు.

## నరహరి, లేక సరస్వతీతీర్థముని

ఇతడు మమ్మటభట్టువ్రాసిన కావ్యప్రకాశికమీద బాలచిత్తానురంజని' అనేవ్యాఖ్య వ్రాశాడు. ఇతడు తనవ్యాఖ్యలో 'స్మృతిదర్పణము, తర్కరత్నము' అనే గ్రంథాలు వ్రాసినట్లు చెపుతున్నాడు. ఆఫ్రెచట్ అనేవార యీనర్హరి మేఘదూతంమీదా, కుమారసంభవంమీదా వ్రాసినవ్యాఖ్యలు కేంబ్రిడ్జియూనివర్సిటీ లైబ్రరీలో వున్నవని చెపుతున్నాడు. ఇతడు తనవ్యాఖ్యలో ఆంధ్రదేశస్థమైన త్రిభువనగిరి తననివాసస్థలం అని చెపుతున్నాడు. ఇది నైజాంరాష్ట్రంలోని 'భోన్‌గిరి' కావచ్చును. ఇతనికాలం క్రీ. శ. ౧౨౪౨ అని తేలుతోంది. వత్సగోత్రంలో జన్మించిన మల్లినాగనాగమ్మలకు పుత్రుడట. సన్న్యాసాశ్రమం పుచ్చుకొని కాశీలో యీవ్యాఖ్య వ్రాశాడు. తురీయాశ్రమంలో సాహిత్యసేవ చేసిన యింకో ఆంధ్రుడు మురారి వ్యాఖ్యాత కనబడుతున్నాడు.

## మల్లినాథుడు

కళింగరాజైన నరసింహుడి కంకితం యిచ్చిన విద్యాధరుడి 'యేకావళి' మీద 'తరళ' అనేవ్యాఖ్య వ్రాశాడు. పంచకావ్యాలకు వ్రాసిన వ్యాఖ్యాతృచక్రవర్తిని యెవ రెఱుగరు?

## విద్యానాథుడు

విద్యాధరు డెట్లాగైతే తన 'ఏకావళిని' నరసింహభూపతి కంకిత మిచ్చాడో అట్లే తన ప్రతాపరుద్రయశోభూషణాన్ని ప్రతాపరుద్రుడి కంకితమిచ్చాడు. నాటకలక్షణాన్ని వివరించడంలో దశరూపక సాహిత్యదర్పణాల తర్వాత దీన్ని పేర్కొనవచ్చును. ప్రతాపరుద్రుడు ఓరుగల్లును ౧౩-శతాబ్దాంతాన ౧౪-శతాబ్దాదిని పరిపాలించిన కాకతీయరాజు. విద్యానాథుడి ప్రతాపరుద్రీయానికి తెలుగులో యెక్కువ ప్రచారముంది, అలంకారశాస్త్రానికి యిది ద్వారభూమివంటిది.

## సింగభూపాలుడు

వెంకటగిరిరాజుల చరిత్రవల్ల సింగమనాయడైన యీసింగభూపాలుడు క్రీ.శ. ౧౩౩౦ లోవాడుగా కనబడతాడు. ఇతడు 'రసార్ణవసుధాకర'మనే గొప్పగ్రంథంవ్రాశాడు; (ఇది తిరువేంద్రం సంస్కృతప్రచురణాల్లో ప్రచురింపబడ్డది.) రేచర్లవంశంవాడు; వింధ్యశ్రీశైలంమధ్యవున్న తెలుగునాడు పాలించాడు; అనపోతనాయుడి కొడుకు;సర్వజ్ఞబిరుదాంకితుడు. ఇతని కంకితంగాఅలంకారోదాహరణరూపమైన 'చమత్కారచంద్రిక' లేక'సింహభూపాలకృతి సుధాసారశీతల' మనేగ్రంథాన్ని విశ్వేశ్వర కవిచంద్రుడు వ్రాశాడు. సింగభూపాలుడి గ్రంథం చాలా మంచి విషయాలు చెపుతోంది. ఈగ్రంథంలో మన మెఱుగని నూతననాటకా లున్నాయి: ౧. అనపోతనాయకీయము; ౨. మాధవీవీథిక; ౩. మాయాకురంగిక; ౪. పద్మావతి; ౫. కామదత్తము; ౬. రామానందము; ౭. కరుణాకందళము; ౮. వీరభద్రవిజృంభణము; ౯. మహేశ్వరానందము; ౧౦. ఆనందకోశము; ౧౧. శృంగారమంజరి; ౧౨. కందర్పసర్వస్వము— మొదలగునవి.

సింగభూపాలుడు ముఖ్యంగా నాటకంగుఱించి వ్రాస్తాడు

## జగన్నాథపండితరాయలు

'డిల్లీవల్లభపాణిపల్లవతలే నీతం నవీనం వయః'అని తనభామినీవిలాసంలో జగన్నాథుడు డిల్లీలో యౌవనం

గడపుకొన్నట్లు వ్రాశాడు. షాజహానుకొడుకు దారా కంకితంగా యీమహాకవి 'జగదాభరణం' అనే కావ్యం వ్రాశాడు. జగన్నాథపండితరాయలు పేరుభట్టు లక్ష్మి దేవమ్మలకు పుత్రుడు; తెలుగుదేశంలో వేగినాటివంశ స్థుడనని ప్రాణాభరణ భామినీవిలాసాదులలో చెప్పుకొన్నాడు. ఇతనిది గోదావరీతీరం: ముంగండ అగ్రహారం. ఇంటిపేరు వుపద్రష్టవారట. ఇది పరంపరగా వస్తున్న గాథ. ఈయన తండ్రి మహాపండితుడు. ఈయన జీవితచరిత్రనుగురించి యెక్కువ తెలియదుగాని కొన్ని కథలు లోకంలో ప్రచలితాలై యున్నవి. అవి విశ్వాస్యాలు కావేమో?

జగన్నాథపండితరాయలు చాలాకావ్యాలు రచియించాడు: ౧. అమృతలహరి. ౨. అసఫవిలాసము; ౩. కరుణాలహరి; ౪. గంగాలహరి; ౫. జగదాభరణము; ౬. ప్రాణాభరణము; ౭. భామినీవిలాసము—ముఖ్యమైనవి. భట్టోజీదీక్షితుల ప్రౌఢమనోరమమీద 'మనోరమాకుచమర్దన'మనేఖండనమున్నూ, అప్పయ్యదీక్షితుల చిత్రమీమాంసమీద ఖండనమున్నూ వ్రాశాడు.

ఇతని గొప్పయలంకారశాస్త్రం 'రసగంగాధరము' అర్వాచీనులలో యింతగొప్ప అలంకారవేత్త హిందూదేశం మొత్తంమీదనే యెక్కడాగూడా లేడు. వ్రాసిన రెండలంకారగ్రంథాలూ అసంపూర్ణంగా దొరకడానికి కారణం ఏమయివుంటుందో?

కావ్యాన్ని 'రమణీయార్థప్రతిపాదక శ్శబ్దః కావ్య' మ్మని నిరూపించాడు. మమ్మట,విశ్వనాథుల కావ్యనిరూపణము లిందు పూర్వపక్షమైపోయినవి. ఇతనికాలంలో యింతగొప్పపండితుడు లేడనడానికి, ఉద్దండపండితులైన అప్పయదీక్షితులనీ, భట్టోజీని ఖండించడమే బలవత్ప్రమాణము.

రస గంగాధరంమీద నాగోజీభట్టు వ్యాఖ్య వ్రాశాడు.

## అనంత రాయలు

"కవిసమయకల్లోల" మనే గ్రంథం వ్రాశాడు. సింగరాచారిపుత్రుడు. ౧౫-శతాబ్దం తర్వాతవాడు. ఇతని యింకొగ్రంథం "కృష్ణరాజయశోడిండిమం" అనేది.

## కచ్ఛపేశ్వర దీక్షితులు

ఇతడు కార్వేటినగరంవాడు. 'రామచంద్రయశోభూషణం' అనేగ్రంథం వ్రాశాడు. రసాద్యలంకారవిషయాలు నిరూపితాలు. ఇందు లక్ష్యశ్లోకాలు కార్వేటి నగరరాజగు బొమ్మరాజుమీద వ్రాయబడినవి.

## గౌరనార్యుడు

"లక్షణదీపిక" అనేగ్రంథం యితనిది. దీనిలో కావ్యస్వరూపము, పరిభాష, కావ్యలక్షణభేదము, కలికోత్కలికలు, ఉదాహరణభేదం, నాయికానిరూపణము అనే ఆరు పరిచ్ఛేదాలు. ఇతడు రేచెర్లవంశస్థులైన సింగయమాధవుడి మంత్రి మిత్రరాజుతమ్ముడు. తండ్రి ఆయమప్రభువు. 'హరిశ్చంద్ర' తెలుగుద్విపదలో వ్రాసినా తడితడేనా? విచారణీయం.

## ధర్మసూరి

ఇతడు 'సాహిత్యరత్నాకరం' అనేగ్రంథం నిర్మించాడు. ఇతని కుటుంబం కాశీలో వేదాంతశాస్త్రిలకు ప్రసిద్ధిగాంచింది! ఇతడు 'నరకాసురధ్వంస'మనేవ్యాయోగం వ్రాశాడు. విద్యానాథునికి పిమ్మటవాడు. విద్యానాథుడు నరులను పొగడాడని నిందించిన పెద్దమనిషి.

## చెరుకూరి కొండుభట్టు

ఇతి 'అలంకారరాఘవం, అలంకారసూర్యోదయం, సాహిత్యరత్నాకరం' అనే మూడు గ్రంథాలు వ్రాశాడు.

## లక్ష్మీధర దీక్షితులు

ఇతడు కొండుభట్టుతమ్ముడూ, శిష్యుడూ కూడాను. ఇతనిగ్రంథాలు 'అలంకారముక్తావళి, రసమంజరి' అనేవి. ఇతనికి 'దక్షిణామూర్తి కింకర' అనేది యింకో పేరు. బాపట్లవద్ద పెద్దచెరుకూరు యితని నివాసస్థలము. ఈతడు 'షడ్భాషాచంద్రిక' అనే ప్రాకృతవ్యాకరణం, గీతగోవిందంమీద 'శ్రుతిరంజని' అనేవ్యాఖ్యానమున్నూ వ్రాశాడు. విజయనగరరాజగు ప్రథమతిరుమలరాయల ఆస్థానంలోనివాడు.

## వసంతరాజు

కొండవీటిని పరిపాలించిన కుమారగిరిరెడ్డి యితడే. నాట్యశాస్త్రం వ్రాశాడు. కాటయవేమన యీతనిని తనరాజుగా వర్ణించాడు. మల్లినాథసూరీ, కుమారస్వామీగూడ యితని గ్రంథాన్ని 'వసంతరాజీయ'మని వుదాహరించారు. ఇందు నాటకప్రకరణంగూడా గలదు. ౧౪-శతాబ్దం పిమ్మట యిది వ్రాయబడి వుంటుంది. కాటయవేముడు తనశాకున్తలవ్యాఖ్యలో యీవసంతరాజీయాన్ని పరామర్శించాడు.

## విశ్వనాథకవి

ఇతడు గోదావరీతీరస్థుడను తిరుమలదేవుని పుత్రుడు; కాశీలో 'సాహిత్యసుధాసింధు' అనే గొప్పగ్రంథం వ్రాశాడు. ఇందు ౮ తరంగాలున్నవి. ఇతనికాలము క్రీ. శ. ౧౬౦౨. ఇతడు 'మృగాంకలేఖ' అనే నాటకంగూడా వ్రాశాడు.

## వీరనారాయణుడు

'సాహిత్యచింతామణి' యితనికృతి. లోపల యితనిపై స్తుతిశ్లోకాలున్నయి; బహుశా ఆస్థానకవులవి అయివుంటయి. ఇతడు కొండవీటిని ౧౪-శతాబ్దాంతాన, ౧౫-శతాబ్దాదిని పాలించిన పెదకోమటి వేమారెడ్డే! ఇతని యింకోపేరు వీరనారాయణుడు. ఇతని కథానాయకుని జేసి అభినవభట్టబాణుడు 'వీరనారాయణచరితం' అనే గద్యకావ్యాన్ని వ్రాశాడు. ఇతడే 'అమరుకాని'కి 'శృంగారదీపిక' అనే చక్కనివ్యాఖ్య వ్రాశాడు. ఈగ్రంథాలు రెడ్డిప్రభుల అసమానవైదుష్యం వేయినోళ్ల ఘోషిస్తున్నవి.

## ౨

ఇప్పటికే పాఠకుడికి చాలా విసుగుపుట్టి వుంటుంది. కాని తత్తత్కర్తలవిషయం కొంచెమేనా తెలియజేయడం తప్పనిసరి అయింది. వ్యాఖ్యాకారులను గూడా ఉదాహరించడానికి హేతు వేమంటే, అవిగూడ ప్రత్యేకగ్రంథాలులాగు ప్రౌఢాలయి వుండడముచేత.

అలంకార శాస్త్రంసజించి వెనుకశతాబ్దాల్లో ఎంతపరిశ్రమ జరిగిందో పక్కమాటు ఆలోచించండి! ఉపరినిర్దిష్టులైన వీరిగ్రంథాలు కొన్ని ప్రచురింపబడక, దొరతనమువారి భాండాగారపుబీరువాలలో మూల్గుతున్నయి. అవి భాషాపుత్రులు ప్రచురిస్తే తెలుగుతల్లికి సంతోషం!

గైర్వాణీవాఙ్మయోద్యానంలోని మనయాంధ్ర పాదపాల అన్వేషించి సౌరభాన్ని గ్రోలడమే ఆంధ్రుడికి నిశితకర్తవ్యం. ప్రతిఆంధ్రుడూ తనపారంపర్యసాహిత్యజీవితాన్ని విమర్శించుకొని సాహిత్యవనవిహారాన్ని అనుభవించమని మనవి చేస్తున్నాను. క్షీరనీరవిభేదం తెలిసిన రాజహంసలకు హృదయపూర్వకస్వాగతం!

---

# సింహగడము

మద్దిపట్ల వేంకట రమణయ్య గారు

"వేరు వెళ్లిన మోసరదారు లార!-ముట్టడింపక కోండణా పట్టవలయు:
ఎవ్వ రోపుదురో యెఱిఁగింపు" డనుచుఁ-గోరెను శివాజిపతి నిండుకొల్వులోన.

కోండణాపేరు తమ వీనుకొనలఁ దాఁక-గగనమును దాఁకుచున్న ప్రాకార మొప్పి
కొండలకుఁ బైని వెలిఁ గొల్పుదండికోట-యట్టె పొడసూపె మొనగాండ్ర యెట్టయెదుట.

దానిఁ బాలించు నమిత ప్రతాపశాలి-సమరముల నారితేరిన శౌర్యరాశి
ఉదయభానుఁ డనెడు క్షత్త్రియోత్తముండు-తన్మనోవీధి నప్రయత్నముగ నిల్చె—

ధరణిధవునాననమ్మునఁ దవిలియున్న-యొక్కరొక్కరిచూడ్కులు నోసరిల్లెఁ
బవన విచలిత పద్మగర్భముననుండి-తొలఁగిపాఱెడు షట్పదంబుల విధాన—

కాందిశీకుల వెన్నాడుకరణిఁ దోఁచె-నామగల యానతము లైనమోములందుఁ
దన్మనః పరిశీలనార్థంబు లైన-నృపుని తీక్ష్ణ విలోకముల్ నెరయు టపుడు—

ఆకుఁ గదలని నిర్వాత మైనచోటు-ననుకరించెను వెక్కసం బగుచు రచ్చ
యూపిరిని బిగఁబట్టి చెయ్వులను దక్కి-యంద ఱాలోచనామగ్ను లగుచు నుండ—

విభునిమాట కుత్తర మియ్య వెఱవ నితరు-లొక్కతానాజియే యందు కుత్సహించె
నీరదార్భటి వినినట్టి నెమ్మివోలె-నాగసర మాలకించిన నాగమట్లు—

"కోండణాదుర్గమును బట్టుకొనెద నెల్లి-బల్లుమని తెల్లవాఱులోపలను దేవ!
పాఁతెదను దానిపై మన కేతనంబు-ప్రాగ్ధరాగ్రంబుపైఁ గెంపు పాఱకుండ—

సెల వొసఁగి పంపుఁడీ నన్ను క్షితిపవరేణ్య!-గెలిచి వచ్చితినా యేనె సలుపువాఁడఁ
గుదిరి సిద్ధమై యున్న నాకొడుకుపెండ్లి-పడితినా పోర నంతకుఁ బ్రభులె కలరు.

దేవరకు జయలక్ష్మి సంధించుకంటెఁ-గొడుకునకుఁ బెండ్లి సేఁతఁ యెక్కువయె నాకు?"
అనుచుఁ దానాజి తత్సభాభ్యంతరమున-నిలువఁబడెఁ గ్రొత్తకంబము మొలచినట్లు—

"మేలు మేలు నీభక్తికి మెచ్చు వచ్చె-పొమ్ము వీరోత్తమా! గెల్పు పొంది రమ్ము
వేపురను మావళాలను వెంటఁ గొనుము-తోడుపడుఁ గాక దురమున దుర్గ నీకు!"—.

అనుచు ముద మాదరమ్ము దొల్కాడఁబల్కి-భోన్సలేకులాంభోనిధి పూర్ణవిధుఁడు
శత్రుభూపాలభయదహస్తమున నందె-భాసురం బైన బంగారు పళ్లెరంబు—

ముందుముందు చరిత్రంపుఁ బుటల నిట్లు-వాసిత మగుఁ దన యశోవికాస మనఁగఁ
గప్పురము గుల్కు తెలనాకుగముల విడెము-నెత్తెఁ దానాజి గగురు మేనెల్ల నిండ—

ప్రకట తేజుఁడౌ నినుని యేల్బడికిఁ బాయు-గగన రాజ్యంబున కరాజకత్వ మొదవె;
కడు స్వతంత్రులై చను నధికారులట్లు-వెలుఁగ సాగెను రిక్కలు విఱ్ఱవీఁగి—

సమయ మను మాంత్రికుండు బెత్తమును ద్రిప్ప-లోక మవశమై నిద్దురలో మునింగె;
వీచి పెనుగాలి యణఁగిన పిదపఁ బోలె-నెల్ల యెడలఁ బ్రశాంతత యిరవుకొనియె—

ఆబహుళ నవమీ త్రియామాంధమందుఁ-గందకముభీకరాంబుల సంద డేమి?
చెట్టుకొనకొమ్మ కెగఁ బ్రాఁకు చీమలట్లు-సాలమున కెక్కుజాడలచా లదేమి?

"మావళాలు మహాప్రభూ! మావళాలు-లగ్గపట్టిరి రక్షివర్గంబుఁ జంపి"
రనెడు కేకలు కోండణాయందుఁ బుట్టె-నుదయభానుని కేళికాసదనవీథి—

ఉలికిపడి తల్పముననుండి యుఱికె రాజు-వర్మశీర్షకంబులు వడివడిగఁ దొడిగె
వాలుటడిదంబు నడుమున వ్రేలఁ గట్టె-కేడెము తగిల్చె బల్లెంబు కేలఁ బట్టె—

అపుడు మ్రోఁగెను రణభేరి యభ్ర మదర-కడలచెవులు గింగు రన శృంగములు మొరసె
ఆయుధాగారమందు ఁగ్రం దధికమయ్యె-చేతనతఁ దాల్చె దుర్గంబు చిటికలోన—

వేగముగ నాంద్రఁ బిగియారఁ గౌఁగిలించి - నిద్దురను గూరుబిడ్డల ముద్దుపెట్టి
త్రోసికొని కోట నైరృతికేసి నడిచె - విభునితోఁ గూడ క్షత్రియ వీరచయము.

స్వీయబల మెల్ల బురుజుపైఁ జేరకుండ-నరులు మేల్కొని పోరికి నురవడింప
దైవనియతికి సుంతయుఁ దల్లడిలక-తాఁకఁ బంచెను దానాజి తనదు సేన—

చికిలి మెఱుఁగుఁ గత్తుల చకచ్చకల ననఁగఁ-బలుచపడి కకావిక లయ్యె మలినతమము;
సగముపైఁ జనె రే యని చాట ననఁగ-సగము తక్కువ యై తోఁచెఁ జందమామ—

ఐదు రెట్లు తమకు వైరు లధికు లైనఁ-బాటి సేయ కఖండదోఃపటిమ మెఱయఁ
జెండు బెండాడఁ దొడఁగి రుద్దండలీల-నుక్కుఁదునక లట్టె మరాటయోధు లెదిరి. [లున్న

కనుపుకొట్టఁగాఁబడి కొట్టుకొనుచుఁ బోయె-ముక్కులును జెక్కులును జెవుల్ మొండెము
బ్రక్కలును డొక్కలును దలల్ పాదములును-వ్రేళులును గేలులును రక్తవేణిలోన.[లును

ఎత్తరులఁ దల మీఱిన యెత్తువలనఁ - దఱచుగా లేచు జముదాడి దాడివలనఁ
జుట్టుఁ గుప్పగూరిన రాజభట్టవలనఁ - గలఁగు తనదుమూఁకల కలకలమువలన—

అతఁడె కావలె మావళాపతి యటంచుఁ - బదవిఘుట్టన నుర్వి గ్రక్కదలుచుండ
వృషభరాజంబుఁ గనువృషభేంద్రమల్లు-పచ్చె నుదయభానుఁడు తనవారు సెలఁగ—

"నీవ తానాజిమాలసురేవ? జాల్మ!-ఇతరుఁ డెవ్వఁ డీదిక్కున నెక్కి వచ్చు?
సాహసము పండి బ్రద్దలౌ సమయ మయ్యె-ఎఱుఁగవా నన్ను రిపుభయంకరుఁగాను?"

అనెడు దుర్గాధినాథునిం గని మరాటి - "అంతటి భయంకరుఁడవా యబ్బ నీవు?
ఎఱుఁగ వెపుడు మహారాష్ట్రహేళివాఁడి-చవిని జూడవు తద్భుజాసార" మనియె—

రాజు పెదవులు చలియించె రాదు మాట;-కటము లదరెను గన్నులింగలము లుమిసె;
నిశితకుంతంబు పెల్లూఁచి విసరివైచెఁ - గండ గట్టిన ప్రత్యర్థికంఠ మెంచి—

ఉరగమును బట్ట వ్రాలెడు గరుడిసరణి - నీఁటె వచ్చుట చూచి మరాటజోదు
చెంగునను దూఁకెఁ బ్రక్కకుఁ జెవిని దూసి-లోతుగా నది ఱాలలోఁ బాఁతుకొనఁగ—

బల్లె మమ్మొని వమ్మొనఁ బార్థివుండు - భీషణకృపాణము బిరాన పెఱికి యుఱికె
దిటముగా వైరి డాలొడ్డి దెబ్బ నాఁపె-నినుపరేకు ఖణే లనునినద మీన—

మొసలివాజముదాడి వీఁపుసను గ్రాల - క్షత్రియుని మస్తకమునందు కంటి నుంచి
తలపడె మరాటి చంచలాత్వరిత గతిని - ఉభయపక్షంబువారుఁ బోరుడిగి చూడ—

ఆమహారాష్ట్రతీవ్రప్రహారకలన - నరశిరస్త్రాణమందు మిణ్గురులు చెదరె
గరగరిక మీఱు గరువంపుఁ గలికికుచ్చు-రుధిరమున రాలి యయ్యెను దూషితంబు—

ఘూర్ణితారక్తనేత్రులు కుటిలభ్రుకుటు - లాయతోచ్ఛ్వాసు లస్రసిక్తావయవులు
నుచ్చలితవక్షులును వివృతోష్ఠు లగుచుఁ - దడవు పోరి రావీరులు దారుణముగ—

ఆత్మనాథులచేయి మీఁదైనయెడల - హర్షసంఫుల్లవదనులై యహహ యనెడు
నుభయసేనలవారిలో నొక్కపెట్ట-నపుడు హాహానినాదంబు లతిశయిల్లె—

జర్జరిత మైనకాయముల్ సరగ విడిచి-యూర్ధ్వగమనోన్ముఖం బయ్యె యోధయుగము
చేయి చేయి కల్పినతోంటిచెట్ట వోవఁ - జెట్టపట్టాలు వేసిక చిత్రలీల—

పడిన దళవాయి కనుకనిపఱచు చుండఁ - దనదుభటులకుఁ జెయి వీచి యనియె నిట్టు
లెల్లభంగులఁ దానాజి కీడువచ్చు - నతనితమ్ముఁడు సూర్యాజి యనెడుజోదు—

"అక్కటా! యిట్లు విశనాడ నగునె మీకు-నాయకుని సర్వదా మిమ్ము నడుపువాని
నేఁడు మీకయి ప్రాణముల్ వీడువాని - ధైర్యహేమాద్రి నహితహస్తములయందు?

పాఱి పోకుఁడు నే నుండ భయము లేదు - ఎందు కిట వచ్చినా రెందు కేఁగుచుంటి?
గడుగొ శశి సల్పె మువ్వంతుఁ యాత్ర యపుడె-ఎక్కడు బురుజుపై మన కెక్కె మింక.

నాయకుప్రతిజ్ఞ యేనియు నడుప వలయు - వేవకుండఁగ మనమేని చావ వలయు
పిక్కబలమును జూపినఁ బక్కుమన రె? - అసువు లిస్సిరో! తీపియే యశముకంటె?—

పగ్గములు కోసివేసితి పందలార! - బవరమునఁ జత్తురో మగవాండ్రవలెను
ఉఱికి చత్తురో స్త్రీలట్టు, లరసికొనుఁడు - దుర్గమును డిగ్గిపోవఁగాఁ ద్రోవ లేదు"—

అనుచు రెండుచేతుల నాతఁ డసులు తాల్చి-స్వామిఁ బాసినయారాచవారిఁ దాఁకి
కుత్తుకలు కోయ సాగెను ఘోరభంగిఁ - బఱచువారి కుద్రేకంబు ప్రబ్బికొనఁగ—

పిదప రేఁగినభీకరకదనమందు - నేదెస వరింప వలయునో యెఱుకపడక
పుష్పబాణంబు కెంగేలఁ బొల్చుచుండ-వెఱఁగుపడి నిల్చె గడెసేపు విజయలక్ష్మి—

దళితసైరులసింహనాదముఖ్రకంపు-కుట్టుసులుబంట్లు బాధచేఁ బెట్టుమూల్గు
రాణివాసపుబోంట్లయాక్రందనములు - వాయసాదులరుతులతోఁ బర్వె దెసల—

మావళాభటభుజపీఠమండనములు - బలుకతారుల కుపహారవర్గ మయిన
క్షత్రియులమేన్నిక్రొత్తరక్తంపుఁజాయఁ-గాంతి నెరసెను ప్రాగ్దిశాంగణమునందు—

కోట సాధించి తానాజి కూలు టెఱిఁగి - కాంక్షితము చేకుఱినకౌతుకంబు మఱచి
వేయికోటలపై టైనవీరవరునిఁ - గోలుపోయితి నని చాలఁ గుందె శివుఁడు—

అవలఁ జాటఁగాఁ బంచె నాయవనిభర్త - పట్టుకొనినసింహబలు జ్ఞాపకముగాఁగ
సింహగడ మనుపేరను జెల్లుఁ గాక-కోండణాదుర్గ మీనాఁటినుండి యనుచు—

---

5. 3- 4 3౯౧

# వినోదవిమర్శము

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

తిక్కనసోమయాజులవారు తమకృతులందు, అందును భారతమునందు, అందుకొనరానంతలోఁతున భావముండునట్లు అలఁతియలఁతి పలుకులతోనే యనేకపద్యముల రచియించిరి.

క. లలితపదహృద్యపద్యం
బులన కథార్థంబు ఘటితపూర్వాపరమై
యలఁతి యలఁతి తునియలఁ గా
హాలసంధించినవిధమున నమరఁగవలయున్.

నిర్వచనోత్తరరామాయణము

పయిపద్యము ముద్రణములందు "అలఁతియలంతి తునియలుగ। హాల సంధించినవిధంబు నమరఁగవలయున్-" అని కానవచ్చుచున్నది. పూర్ణార్ధానుస్వారములకుఁ ప్రాచీనలిపిలో భేదములేకుండుటచే "అలంతి యలంతి తునియ లంగాహల" అని తాళపత్రప్రతులందున్న లిపి రీతినిజూచి ముద్రాపకులు గణములు గుదురని చోట్ల నరసున్నల నిండుసున్నలఁగాఁ జేసి చేసిన యపసంస్కారమది. 'చినిచిన్ని తునియ లగునట్టు నాఁగలి గట్టినవిధము' అనఁగా నర్థసంగతి యేమి? హాలశబ్దము స్త్రీలింగము గాదు. హాలము అనికదా యుండును! ఎందు కిఁక! నేను చూపినపాఠమే సరియగు పాఠము. చిన్ని చిన్ని గొట్టపుఁ దునుకల నదికింపఁగా బాకా యగును. దాని నూఁదిన హృద్యస్వరము వెల్వడును. అట్లే లలితపదహృద్యములగు పద్యములఁ గూర్చిమనోహరముగాఁ గథార్థమును వెలయింపవలెను- అని భావము. ఇట్టిది సోమయాజులవారి డెందము మెచ్చిన కవిత్వసందర్భము. అలఁతి యలంతిపలుకులతోఁ గూర్చినవే, యర్థక్లేశములేనివే యయియున్నను భావము లోఁతందుకొనరాని పద్యములఁ గొన్నింటి నిక్కడ పరిశీలింతును. భారతోద్యోగపర్వములో నీక్రిందిపద్య మున్నది.—

చ. పగ యడఁగించు టెంతయు శు
భం బది లెస్స యడంగునే పగం
బగ వగగొన్న మార్కొనక పల్కక
యుండఁగ వచ్చునే కడుం
దెగ మొదలెత్తిపోవఁ బగఁ
దీర్పఁగ వచ్చినఁ గ్రౌర్య మొందు నే
మిగతిఁ దలంచినన్ బగకు మేలిమి
లేమి ధ్రువంబు కేశవా!

ప్రశస్తవిద్వాంసులును, కీర్తిశేషులును నగు తం. తేవప్పెరుమాళ్లయ్యగారు ప్రకటించిన పాఠ మిది. బహుకాలముననుండి యీపద్యమునర్థమునకై యనేకు లలజడిపడుచుండుటనే నెఱుఁగుదును. పలుచోట్ల పలువురువిద్వాంసులు న న్నీపద్యమున కర్థ మడిగిరి. ఇట్టిపద్యము లింకను భారతమునఁ బెక్కులున్నవి. వాని నాయాసమయములందు వ్రాఁతప్రతులఁ బరిశోధించి సాధుపాఠనిర్ణయము చేసికొని

కొన్నింటి కెట్లో యర్థము చేసికొంటిని. మీఁద నుదాహరించినతీరుననే నాకు ప్రాఁతప్రాఁతప్రతులపాఠము గానవచ్చెను. ఇట్టిపాఠముండిననే దీనికి సముచితమైనట్టియు, స్వారస్యభరితమైనట్టియు నర్థ మేర్పడును. ఈపద్యమునకు నాకుఁ దోఁచిన యర్థమును బలుచోట్లఁ బలువురువిద్వాంసులకుఁ దెలిపితిని. ఈవత్సరపు స్కూలు ఫైనలు టెక్స్టులో నీపద్య మీక్రిందివిధమునఁ గానవచ్చుచున్నది:—

చ. పగ యడఁగించు టెంతయు శు
　　భం; బది లెస్స; యడంగునే పగం
　బగ? పగగొన్న మార్కొనక
　　పల్కక యుండఁగ వచ్చునే? కడుం
　దెగ మొదలెత్తిపోవఁ బగ
　　దీర్పఁ దలంచినఁ గ్రౌర్య మొందు; నే
　మిగతిఁ దలంచినన్ బగకు
　　మేలిమి లేమి ధ్రువంబు కేశవా!

వ్యాఖ్యానప్రాయమయిన మార్కులు ; (సెమికోలనులు)ను, మూఁడవచరణమున 'తీర్పఁగ వచ్చిన' అనుదానికి బదులు, 'తీర్పఁ దలంచిన'అనుపాఠమును నీముద్రణమున జరపఁబడినమార్పులు. తొల్తఁ బ్రకటించినతీరునఁ బద్యమునకు నే నిట్లర్థము చెప్పుదును.

ధర్మరాజు శాంతిఁబొందుటయ కర్జమని యిందు నిరూపించుచున్నాఁడు. పగచేఁ బగ నడఁగించుకొనరా దనుచున్నాఁడు. ఉభయ పక్షములును బగ వీడి పొందిపొసఁగియుండఁ గోరుచున్నాఁడు. రాయబార మరుగు కృష్ణునితోఁ జెప్పుచున్నాఁడు : పగ - అడగించుట- ఎంతయు-శుభంబు=వైరమును రూపుమాపుట మిక్కిలి శ్రేయస్కరము. అది=ఆవైరము, పగన్=వైరముచేత (స్వపక్షము వైరమూనియుండఁగా), అడంగునే=అడంగదుగదా! వైరము పోవలె ననఁగా, ముందు స్వపక్షము వైరము వీడవలెను. స్వపక్షము వైరముపూనియున్నప్పుడు అనివార్యముగాఁ బరపక్షము గూడ వైరము పూనవలసినదగును. కావునఁ బరపక్షము వైరములేకున్నను స్వపక్షము వైరముపూనియుండఁగా వైరము పెరుగునేకాని నశింపదు. అట్లే-పగ=పరపక్షము-శత్రుపక్షము, పగగొన్నన్=వైర మూనియున్నప్పుడు, మార్కొనక పల్కక యుండగవచ్చునే=ఎదుర్కొనక, బదులాడక, స్వపక్షము వైరమువీడియుండఁ గుదురదు. స్వపక్షము వైరమూనినఁ బరపక్షమును వైర మూనవలసివచ్చును. కావ యీ రెండువిధములందును శాంతి చేకూరదు. ఇఁక - రెండుపక్షములును వైరముఁ బూని, కడున్-తెగ - మొదలెత్తిపోవన్- పగఁదీర్పఁగ వచ్చినన్=స్వపక్షము పరపక్షముమీఁదికి దండెత్తిపోయినను, పరపక్షము స్వపక్షముమీఁదికి దండెత్తివచ్చినను, పరస్పరము యుద్ధముసాగి ఇరుపక్షములో, ఒకపక్షమో అడఁగారి, పగపోయి శాంతికల్గినఁగల్గవచ్చును.కాని దాన క్రౌర్య మొందున్=హింసారూపమయిన క్రౌర్య మేర్పడును. కావున సర్వవిధములను పగ పనికిమాలినది- అని పద్యార్థము. దీని కిది వివరణము:-

స్వపక్షము, పరపక్షము అను రెండుస్థానము లందు పగ కలిమి, పగ లేమి అను రెండు ధర్మములను గురులఘువులను బోలెఁ బెట్టి ప్రస్తరించినచో, అత్యుక్తాఛందస్సున రెండక్షరముల గణములు నాలుగేర్పడినట్లు భేదములు నాలుగేర్పడును. ఎట్లనఁగా:

| స్వపక్షము | పరపక్షము |
|---|---|
| పగలేమి (గురువు) | పగలేమి (గురువు) |
| పగకలిమి (లఘువు) | పగలేమి (గురువు) |
| పగలేమి (గురువు) | పగకలిమి (లఘువు) |
| పగకలిమి (లఘువు) | పగకలిమి (లఘువు) |

ఇందు, పగయడఁగించు టెంతయు శుభంబు-అనునది ఉభయపక్షములందు పగలేమికిని; అది లెస్స యడంగునే పగఱ - అనునది స్వపక్షమున పగకలిమికి, పరపక్షమునఁ బగలేమికిని; పగ పగగొన్న మార్కొనక పల్కకయుండఁగ వచ్చునే-అనునది పరపక్షమున పగకలిమికి, స్వపక్షమున పగలేమికిని; కడుందెగ మొదలెత్తి పోవఁ బగఁదీర్పఁగవచ్చినఁ గ్రౌర్యమొందు-అనునది ఉభయపక్షములందును బగకలిమికిని,వాచకములుగాఁ జూచుకొనవలెను. 'ఎత్తివచ్చుట' యనఁగా యుద్ధమునకు దండెత్తివచ్చుట. ఈ యర్థమున సోమయాజులవారి ప్రయోగాంతరము: 'కౌరవులమీఁద నెత్తిరాఁ గడఁగువాఁడు.' (ఉద్యో. 2 ఆశ్వా.) పగగలిగియున్న మూఁడు విధములను దెగడి రెండు పక్షములందును పగలేని నాల్గవపక్షము నిందు ధర్మరాజు ప్రశంసించినాఁడు.ఇట్టిచో టెక్స్టుబుక్కులోఁ బెట్టఁబడిన (;) సెమికోలనులు సరసార్థభంజకములు. పగ యడఁగించు టెంతయు శుభంబు; అది లెస్స; అని వేఱుచేసినచో ప్రథమ వాక్యార్థమునే ఫాడిన పాటగా మరలఁ జెప్పుట యగును. అది సోమయాజుల ఫక్కి కాదు. మఱియు మూఁడవ చరణమున 'పోవ'కు దీటుగా 'వచ్చిన'ఉండవలెను. అట్లున్ననే పద్యార్థము గుదురును. 'తలంచిన' అన్న పాఠము సరిగాదు. నేఁ జూచిన తాళపత్ర ప్రతులలో లేదు; అది తిక్కనగారి తెలుఁగును గాదు. ఏలనఁగా, 'తీర్పఁదలంచినఁ గ్రౌర్యమొందు నే।మిగతిఁ దలంచినఁ' అని మరల నదేపదము వచ్చుచున్నది. రెండుమార్లొకే పదమును దగ్గఱ దగ్గఱఁగా నీతీరునఁ బ్రయోగించుట సరసరచన గాదు. పయిపద్యమునకు నాకు గోచరించిన యర్థమును దెలుపుకొన్నాఁడను. ఇంతకంటె సరసమయినయర్థ మెవ్వరికేని గోచరించినచో వెల్లడింప వేఁడుచున్నాఁడను. ఈపద్యమెల్ల నలఁతియలఁతితునియలగు పలుకులతోఁ గలసి. ఒక్కసమాసమే నిందులేదు. కాని యర్థ మెంతో లోఁతుగా నున్నది.

భారతము లక్ష్మీపతిసోమయాజిగారి భారతవ్యాఖ్యానమున నీపద్యమున కిట్లుటీకగలదు:-

"పగను అడఁచివేయుట శుభము. అది మంచిది. పగచేత పగఅడఁగునా? పగగొన్న-దుఃఖము రాఁగా - యుద్ధముసేయక విన దించక ఉండవచ్చునా? కడుఁ-మిక్కిలిన్నీ, మొదలుతెగ=మూలచ్ఛేదముగా, ఎత్తిపోవ=దండెత్తిపోయినా, పగ దీర్పవచ్చిన క్రౌర్యము వచ్చును. ఏలాగున వివరించినా పగకు మంచి లేదు. ధ్రువంబు=నిశ్చయము." ఈటీక యస్వరసమని నాతలఁపు.

౨

మఱియు, నుద్యోగపర్వ తృతీయాశ్వాసమున నే యీక్రిందిపద్యము గలదు:

మ. తుదిరాజ్యంబు సగంబు గో; మ్మడవియం
దుం బేరు వంచించియున్
బదుమూఁడేఁడులు నీవునుం దిరిగి రా
పాలీకపోవచ్చునే
యది గాదేఁ దెగి బంటవై యఱుము;మా
యల్ వన్నునే ర్పింకఁ జె
ల్లదుసూ నీ; కని యాసుయోధనుని యు
ల్లం బుచ్చిపో నాడుమీ!

తం. తేవప్పెరుమాళ్లయ్యగా రీవిధమున నీపద్యమును ముద్రించిరి. పలువురు ప్రాచీనవిద్వాంసు లీ పద్యము నీతీరుగానే పఠించుట నేను వింటిని. ఈ పద్యమున కర్థ మిది:—

ఇది సహదేవునిపల్కు--"మాయాద్యూతమున నోడించి యధర్మముగాఁ బాండవులఁ బదుమూఁడేం డ్లరణ్యావాసాజ్ఞాతావాసము లందుంచి బాధపడునట్లుచేసి రాజ్యమెల్ల నీవే యనుభవించితివి. కావున వారివలె నీవును బదుమూఁడేం డ్లరణ్యాజ్ఞాతావాసము లొనర్చి వచ్చి యవ్వల రాజ్యములో సగపాలు పంచుకొనుము. అప్పుడు వారు నీవలెఁ బాలొసంగ మనువారు కారు. అంతదాఁక రాజ్యమెల్ల వారే యనుభవింతురు. ఇందు కంగీకరింపవేని-రాజ్యము వీరభోజ్యము గాన-తెగి బంటవై వచ్చి పోరాడి చచ్చిపొమ్ము. ఇఁక మాయలు సాగవు. అని సుయోధనుని యుల్లము చిల్లులుపడునట్లు పల్కుమా" యని సహదేవుఁడు కృష్ణునితో నన్నాఁడు. ఈపద్య మీపాఠముతో నున్నప్పు డీయర్థమే సంగతమగునని నాతలఁపు. తాళపత్త్రప్రతులలో దీనికిఁ బాఠభేదములు గానవచ్చెను.

మ. తుది రాజ్యంబు సగంబు గొం డడవియం
దుం బేరు వంచించియున్
బదుమూఁడేఁడులు నిండ నంటి, రదిరాఁ
బాలీకపోవచ్చునే ?
యది గాదేఁ దెగి బంటవై యఱుము మా
యల్ వన్నునే ర్పింకఁ జె
ల్లదుసూ నీ కని యాసుయోధనుని యు
ల్లం బొల్లఁ బో నాడుమీ!

ఇందుఁ బ్రథమద్వితీయపాదములందుఁ గల పాఠభేదములు సహదేవుని స్వభావమునకు, సంస్కృత మూలమునకు, తిక్కనసోమయాజుల రచనకు నంతగాసరిపడవు. 'తెగి బంటవై యఱుము'అనుచో 'తెగి బంటవై నిలుము'అని పాఠముగలదు. 'అఱుము' పాఠముకంటె 'నిలు

ము'పాఠము యుక్తతరమనుకొందును. 'ఉల్లం బుచ్చి పోనాడుమీ', 'ఉల్లంబొల్లఁ బోనాడుమీ'పాఠములు రెండును సోమయాజుల పలుకు బళ్లే. ఇట్టి యీపద్య మీయేఁటి టెక్స్టుబుక్కులో నిట్లు ముద్రితమయ్యెను:

మ. "తుది రాజ్యమ్ము సగమ్ము"గొం డడవియం
దుం బేరు వంచించియుర్—

(తక్కిన చరణములు తేవప్పెరుమాళ్లయ్యగారి పాఠముతీరున నే కలవు.)

మ. "తుది రాజ్యమ్ము సగమ్ము గొ"మ్మడవి
యందుర్—

ఇత్యాదిగా నున్నచో నెల్లేని నర్థము చెప్ప నగునుగాని యాయనుకరణార్థక చిహ్నములు (" ") సగమ్ము" మీఁద నే యుండుటచే నా కర్థమేమియు గోచరింపలేదు. పయి పద్యము నకు లక్ష్మీపతి సోమయాజులు గారి టీక యి ట్లున్నది:—"తుది=పదునాలుగవయేఁట రాజ్యార్ధభాగమును,కొమ్ము=గ్రహించుము అని నీవు= అనగా, తిరిగి రా=వనవాసాజ్ఞాత వాసములుచేసి రాగా, పాలీకపోవచ్చునే=పాలివ్వక పోవ శక్యమా; అదిగాదేని=ఆలాగు సమ్మతిలేకపోతే, తెగి=తెరపుచేసి,బంటువై =శూరుఁడవై, అఱుము=అఱుముము, మాతోయుద్ధానకు రమ్ము; మాయలుపన్నే కౌశలము యిటుపై నీకుచెల్లదు చూడుమీ అని దుర్యోధనుని ఉల్లంబుచ్చిపో= కడుపు అవినేలాగు, ఆడుమీ."

3

మఱియు మీఁది టెక్స్టుబుక్కులోనే—

ఉ. ద్రోవది బంధురంబయిన
క్రొమ్ముడి గ్రమ్మన వీడ్చి వెంద్రుకల్
దావలచేతఁ బూని యసి
తచ్ఛవిఁ బొల్చు మహాభుజంగ మో
నా విలసిల్లి వ్రేలఁగ మ
నంబునఁ బొంగు విషాదరోషముల్
గావఁగలేక బాష్పములు
గ్రమ్మఁగ డిగ్గన లేచి యార్తయై.

వ. గోవిందుముందట వేణిఁ బెట్టి యిట్లనియె.

క. ఇవి దుస్ససేను వ్రేల్లం
దవిలి సగము త్రెవ్విపోయిదక్కినయవి; కౌ
రవులకడ డీఱుమాటల
యవసరమునఁదలఁపవలయునచ్యుత,నీనిర్.

అను గ్రంథభాగ మున్నది. ఇందుఁ దొలిపద్యమున 'క్రుమ్ముడి' అని యుండవలెను. పెక్కువ్రాఁతలలో న దేపాఠము గలదు. కుఱుముడి= జాఱుముడి యని యర్థము. క్రొత్తముడి కాదు. రెండవవచనమున 'వేణి' యనుపద ముండఁ గూడదు. వ్రాఁతప్రతులలో నాపదము లేదు. గోవిందు ముందటఁ బెట్టినది ముడివీడ్చిన వెండ్రుకలనుగాని వేణిని గాదు. తర్వాతి పద్యమునఁ గూడఁ జూడఁదగును. "కన్నీరు దుడువను బెన్నతివేణి ముడువనుం దగువారి నియోగించి" యను ౧౧౭ వచనమునుగూడఁ జూడఁదగును.

౪

హారవిలాస ద్వితీయాశ్వాస భాగము గూడ టెక్స్టులోఁ గలదు.

అం దీసంస్కారములు జరగవలెను.—

'నేమం బొప్పఁగ రేలునుం బగలునుర్ విశ్వాస పూర్వంబుగర్' అనుచో-

'నేమం బొప్పఁగ రేలునుం బగళులుర్ విశ్వాసపూర్వంబుగర్' అనియు,

'దినములు రేవగల్ ఘృతదధిప్రచురాన్నస మర్పణంబునర్' అనుచో-

'దినములు రేల్ పయోఘృతదధి ప్రచురాన్న సమర్పణంబునర్' అనియును,

'విభూతిమంగళ । తానముచేసి ధౌతపరిధానము గట్టి' అనుచో..

'విభూతిమంగళ । స్నానము చేసి ధౌతపరిధానము గట్టి.' అనియును (ఈయతికై వినోదవిమర్శ మనుపేర, 'భారతి' లోను, 'సుభాషి' లోను నేను వ్రాసినవ్యాసములఁ జూడఁదగును.),

'గారాపుం గొడుకుపాలసు మేలోగిరంబుతోడం గూడ భరితభోజనంబుగా వడ్డించి'అనుచో-

'భరితభాజనంబుగా వడ్డించి' అనియును,

'నీపడ్డపాటు గోడ్డేఱిగా' అనుచో-

'నీపడ్డపాటు గోడ్డేలుగా' అనియు.

శబ్దరత్నాకరకారులు 'గోడ్డేలు' ధాతువుగా గ్రహించిరి- శ్రీనాథుని యవసానకాల పద్యపాఠమునుబట్టి ;—కాని శ్రీనాథుఁడు దానిని దనగ్రంథములందు 'వ్యర్థప్రయాసము; నిరర్థకకృషి' అనునర్థమున విశేష్యముగాఁ బ్రయోగించెను.—శ్రీనాథుని యవసానకాల పద్యపాఠము సరి గాదేమో! 'బొడ్డుపల్లెను గోడ్డేటి మోసపోతి' అనుచో 'బొడ్డుపల్లెను గోడ్డేలు మోసమయ్యె' నని యుండునేమో!

పాఠశాలలలోని విద్యార్థులకును, గొంద ఱువిద్వాంసులకును నుపకరించు నని యీ టెక్స్టుబుక్కు-పాఠముల నిప్పు డించుక పరామర్శించితిని.

క్రమముగా భారతాదులలోని పద్యములను, వాని పాఠములను, వానియర్థములను నిఁక మీఁదఁ బరామర్శింతును.

—— ——

నేను—

ఓయితుషార! యెందుఁ జనె? దుందుము, నాపలుకాలకింపు: నీ
కేయిడుమల్ ఘటించె నిపు డింత శ్రమంపడి పర్వులెత్తఁగా?

తుషారుఁడు—

"ప్రేయసి హింసపెట్టితట రేయిని! జాలఁగ నుగ్రుఁడయ్యె నా
తోయజినీసఖుండు; చను తోడనె" యంచు ననూరుఁ డాడెడున్.

నేను—

కుముదిని, యేటికే యటులు గుందెదు? మోము మటు మూసినావు? లో
కము సకలంబు మేలుకొను కాలమునన్ విపరీత మిద్దియే?
మమరులకెల్ల ప్రాణ మిడునట్టి మహాత్ముని ముగ్ధఁ జేయు నీ
విమలసుహాస మేల నిను వీడెనొ యిప్పు డెఱుంగఁ జెప్పుమా!

కుముదిని—

అమలుని నాదుకాంతుని జనావళి చల్లనివాఁ డటన్న ధ
ర్మము దలపోయకే కడుపుమంటను దీర్చుకొనంగఁ గ్రూరుఁడై
కమలినిభర్త నాపతిని గావరమంది తొలంగఁద్రోసె భా
వ్యమె యిది! యెందు నోరు గలవారల మాటమె చెల్లఁబోలునో!

నేను—

అడిగిన ప్రశ్నకీమె బదులాడదు! మాటికి మందహాస మే
ర్పడఁ దనమోము నిట్టునటు వంచెడుఁ గారణమేమి షట్పదా?

షట్పదుఁడు—

వడిఁ దననాథుఁ డొక్కఁడఁట! వచ్చి కనుంగొనునంట ప్రీతితోఁ
దడఁబడుఁ బద్మినీరమణి తత్ప్రియదర్శనహర్షితాత్మయై.

నేను—

ప్రవిమల గానమాధురుల భావమునం దలపించుచున్న దీ
ప్తి వితతి తాండవింప ముఖవీథిని బాలక, పర్వు లేడకో?

బాలకుఁడు—

భువనములెల్లఁ బ్రోచెడు ప్రభూత్తముఁ గాంచి తదీయపావనాం
శువులను దానమాడి యఘమోక్షముఁ జెందఁగ నబ్ధి కేఁగెదన్.

---



3. అలెగ్జాండరుచక్రవర్తి డేరియసును జయించుట



౪. గజనీ మహమ్మదు సుల్తాను



౩. తైమూర్



౧. అలెగ్జాండరు చక్రవర్తి



౨. అక్బరు చక్రవర్తి



౪. గజినీ మహమ్మదు సుల్తాను



౫. తైమూర్



౬. అలెగ్జాండరు చక్రవర్తి



౭. అక్బరు చక్రవర్తి

రామస్వామి—ఒకకాపు
గవరమ్మ—వానికూతురు
వెంకటి—వానికొడుకు
ముసలిది—ఒకకాపుది
లక్ష్మి—దానికూతురు
సీతయ్య, జోగులు, రావి, రాజులు, గోపాలుడు మొదలైనవారు.

రామస్వామి యిల్లు

[గవరమ్మ ఆయింటి యజమానురాలు. ఆ యింటివెనక సావిట్లో పత్తి పిక్క తీస్తూ కూర్చొంది. వాడిపున్న ముఖము, కృశించి వున్న శరీరమువల్లనే కాకుండా కట్టుకొన్న తురకబొంబాయి చీరె, తొడుక్కొన్న పైను రవికెవల్ల కొంతవరకు, తల దువ్వుకోకుండా వేలుముడి వేసుకొని బుర్రవంచుకొని కూర్చోవడమువల్ల కొంతవరకు ఆమెవయస్సు సరిగ్గా చెప్ప సాధ్యముకాకుంది. పనిమధ్య ఒకమారు తల ఎత్తి చూసేసరికి లక్ష్మి కనబడ్డాది. లక్ష్మి కంటె గవరమ్మ వయస్సులో అటే పెద్దది కాకపోయినా, చూపుకి మాత్రము చాలా పెద్దలాగు అగుపిస్తుంది. లక్ష్మికి సుమారు పద్దెనిమిదిఏండ్లు ఉంటాయి. నల్లజీడిపిక్కలాంటి జుత్తు, తళుక్కుమని మెరిసే పెద్దకళ్లు, చూచే వాళ్లందరినీ ఒక్కమారు ఆకర్షించకమానవు. ఎర్రగన్నేరుఅద్దకం చీరె, గ్లాసుగోమల్లు పొట్టి జాకట్టు ఆమె చామంచాయకు చక్కగా అత్తి ఉన్నాయి. ముచ్చలముడి వేసుకొని, చుట్టూ లేతఆకులు, మధ్యవిడుతూఉన్న మొగ్గలుగల మల్లిగుచ్చాలు పెట్టుకొని వచ్చింది. ఆమె సహజంగా నీటుకత్తె. అందుకుతోడు ఈమధ్య పట్టణంనాగరకతచూసి తిరిగీగ్రామం వచ్చింది.]

గవరమ్మ

(లక్ష్మిని చూస్తూ) లక్ష్మివా! ఎప్పుడువచ్చావు? బాగున్నావా! దా. కూర్చో.

లక్ష్మి

(చిరునవ్వుతో) పదిపదిహేనురోజు లైందివచ్చి. మీరంతా బాగా ఉన్నారా?

గవరమ్మ

పదిహేనురోజులాయి వచ్చి, ఇవ్వాళా మమ్మల్ని చూడడానికి వచ్చేవు. మునపటిలాగు ఎందుకు వస్తావు? నిజమే. ముసలిదే రాలేదు, నీవెందుకు వస్తావు!

లక్ష్మి

ఆలా గనడం న్యాయం కాదు. ముసలిదాని ఒంట్లో బాగాలేదనిగదా పట్టణంనుంచి నేను వచ్చాను.

గవరమ్మ

ముసలిది మరి పనికిరాదా ఏమిటి?

లక్ష్మి

ఎన్నాళ్లు పనిచేస్తుంది. ఎల్లకాలము ఏ బక్క యినా దున్నుతూ ఉండగలదా!

గవరమ్మ

అయితే నీవు నౌఖరీలో ప్రవేశించకూడదూ.

లక్ష్మి

ప్రాణం పోవాలికాని నౌఖరీ చేయను.

గవరమ్మ

బుగతమ్మ అవుతావు కాబోలు.

లక్ష్మి

ఏం. కాకూడదా?

గవరమ్మ

అవును. ఎందుకు కావు?

లక్ష్మి

ఎందుకమ్మా నామీాద నీకంత వెగటు!

గవరమ్మ

ఎందుకా? చెప్పమన్నావా ఏమిటి?

లక్ష్మి

ఊం.

గవరమ్మ

నాకనేకాదు. వాడవలసలో ఎవరికంటికి నీవు వెగటుగా కానరాకుండా ఉన్నావో చెప్పు చూదాము.

లక్ష్మి

ఎందుకనిగదా! నే నేమి చేశాననో!

గవరమ్మ

నీవేమిా చేయలేదు ! నీ వేషము, నీఒయ్యార ము అవి చేస్తున్నాయి. నీమాత్రం అందకత్తె ఎవరూ లేరు అనుకొన్నావా! నీకున్న వయ స్సు మరి ఎవ్వరికీ లేదా! ఎందుకూ ఆలాగు షోకుచేసుకొని వీధులవెంబడి తిరుగుతూ, కష్ట బడ్డ పడుచువాళ్లనే కాకుండా కాలం గడిపిన వాళ్లనుకూడా—

లక్ష్మి

(నవ్వుతూ) ఊ—!

గవరమ్మ

సిగ్గుపడి ఇంటికి పోక నవ్వుకూడానా!

లక్ష్మి

చిత్తం!

గవరమ్మ

ఏమి టా పొగరుబోతు తనము! నీతండ్రి ఒక పెద్దకూలీగా ఉండేవాడనా; వాడు కొంత ఆస్తి సంపాదించి ఉంచి చచ్చిపోయాడనా- ఏమిటి ఆ అతిశయ్యం!

లక్ష్మి

(దండం మొక్కి) ఓహో! బుగతమ్మవు గదూ! మరిచిపోయాను.

గవరమ్మ

వెక్కిరిస్తావేమి? నీలాగు షోకుగా సాని దాని లాగు తిరగక పోతే తక్కువదాని నవుతానా ఏమిటి? నన్నుచూచి ఎవడూ నీతి తప్పడు; పిల్లాది ఎవరూ ముసిముసి నవ్వులు నవ్వరు. ఇంతకూ తప్పు నీది కాదు......ఇక్కడ నిలు చుని నానోటివెంబడి చెడ్డమాటలు తెప్పించ కు; నడు; చాలు.

[లక్ష్మి తిరుగుముఖమైంది. ఎదురుగుండా లో గుమ్మంలోకి రామస్వామి వచ్చి నిలుచున్నాడు.

రామస్వామి పట్నంలో సాహుకారి వద్దకు వెళ్లివస్తున్నాడు. పొందూరు పాటునాలు పంచ కట్టి, శ్రీగాకుళం ఠోరియామజిలీను పొడుగు జుబ్బా తొడిగి, ఉప్పాడ జరీఖండువా వేసుకొని ఉన్నాడు. ఏళ్లలో కొంచెము పెద్దవాడే అయినా కాయశరీరం కలవాడు కాబట్టి నడి వయస్సులో ఉన్నవాడువలె కనిపిస్తాడు. కస రత్తు చేసినశరీరము. ఒళ్లు తళుక్కు ఏమీ తగ్గ లేదు. ఆగ్రామంలో చక్కనివాడని పేరు పడ్డ వాడు: పడుచుపిల్లలు వానివైపు ఒకమారు చూడకమానరు. వెళ్దామని తిరుగుముఖంఅయిన లక్ష్మిని చూచి చిన్నన వ్వు నవ్వి ద్వారానికి అడ్డంగా చేతులు పెట్టి నిల్చున్నాడు.]

రామస్వామి

ఓహో! నీవా!

లక్ష్మి వికసించిన ముఖముతో కళ్లు విప్పి చూస్తూ చూపులు కలిపింది.

పట్నంనుంచి రావడముచేతనా ఏమిటి ఈ కొత్తసొగసు లక్ష్మీ!

లక్ష్మి

పల్లెలో ఉండి నీవేమి తక్కువా మామా!

రామస్వామి

అవునులే. నాయీడువాళ్లకంటె నేను ఎన్నో రెట్లు ఎక్కువే. నాతో సమానంగా పనిచేసే వాడు పడుచువాళ్లలోకూడ లేడు. నిన్న పొలంగట్టుమీంచి నిండుబండీ లాగవలసివస్తే, నేను వెళ్తేనేగాని బండీ నడిచింది కాదు. ఏదీ, రమ్మను చూదాము, సాములోగాని, గరిడీలలో గాని నాతోసమానంగా పనిచేసేవాళ్లు ఉన్నా రేమో. నేను బలవంతపెట్టి లేపితేనేగాని ఒక్క నాడైనా వెంకటిసహా పక్కమీదనుంచి లేవడు పొలంపనికి వెళ్లడానికి. గౌరూ నేనన్నదంతా నిజమేనా!

గవరమ్మ

అయ్యా, అంతా నిజమే అనుకో కాని; ఆగొప్ప లెందుకు?

రామస్వామి

అది కాదు. నాగురించి ఊర్లో అందరూ ఆలాగు అనుకోంటూ ఉండరూ?

గవరమ్మ

అందులో నవ్వుతాలకుఅనేవాళ్లు ఎంతమందో!

రామస్వామి

నవ్వుతాలా! నాతోకలిసి చదువుకొన్న సిమ్మన్న ఇప్పుడు ఏలాగున్నాడో చూచావా? తెల్లగా పండిపోయిన మీసాలు, వంగిపోయిన నడ్డి, లొత్తలుపడ్డ దవడలు, కుంగిపోయినకళ్లు -వాడు నన్నుచూసి తుళుక్కుపడ్డాడు.

లక్ష్మి

కాదా మరి!

గవరమ్మ

నవ్వా, నీవే మెచ్చుకోవాలి.

రామస్వామి

ఏమి అబద్ధమా! మొన్న బురదలో కూరుకు పోయిన బోరాంవాళ్లపోతుఎవరుగదాతీశారు?

గవరమ్మ

చాలును అయ్యా, ఎందుకు అదంతా?

లక్ష్మి

ఏమిమైంది మామా, చెప్పు చెప్పు.

రామస్వామి

వినాయకచెరువు బురదలో పోర్లు గట్టుమీది నుంచి దిగుతూ బోరాంవాళ్ల పెద్ద జోడాలో పోతు దిగిపోయింది. గట్టుమీద సీత లబలబా మని ఏడుస్తూ ఉంది. పదిమంది కూడేరు; కాని ఏమీచేయలేకుండా ఉన్నారు. ఆదారి వస్తూ ఉంటే నన్నుచూచి, చేతులు రెండూ పట్టుకొని ఏడ్చింది. చప్పున జోడు, గొడుగు పారేసి నడ్డి కట్టి దిగేను. రెండు పెద్దరాళ్లు గట్టుమీంచి తెచ్చి పోతుకుదగ్గరగా వేసుకొని దాని మెడ క్రింద చేతులురెండూ పెట్టి ఒక్క మారు అమాంతంగా ఎత్తేను. ఉన్నవాళ్లు కలిశారు; మెల్లిగా గట్టుమొదలికి లాగేము.

లక్ష్మి

మామా, నీవు కలియకపోయియుంటే పాపము ఏమైయుండునో!

గవరమ్మ

నీవు గొప్పలు చెప్పుకొందికి, లక్ష్మి నిన్ను పొగడడానికి జత బాగా కుదిరింది. ఇక చాలించండి. పైవాళ్లు వింటే సిగ్గుసిగ్గు!

లక్ష్మి

మామా, తాళీంవాళ్లు నిన్ను రమ్మనమన్నా రట.

రామస్వామి

నీ కేలాగు తెలిసిందే లక్ష్మీ!

గవరమ్మ

లక్ష్మికి తెలియందొకటా. ఊర్లో పడుచువాళ్లం దరూ దానికి నేస్తాలేగదా!

రామస్వామి

(చిన్ననవ్వుతో) ఏలాగు తెలిసింది చెప్పవూ!

లక్ష్మి

ఆకథ ఏమిటో చెప్పవూ.

రామస్వామి

ఏమీలేదు. భీమవలస గరిడీవాళ్లు సాము యుద్ధానికి వాడవలస తాళీంవాళ్లను ఢీకొట్టా రట. వీళ్లకి ఇప్పుడు తగిన నాయకుడు కుదర లేదట. మొన్నమొన్నవరకు నేనేగదా వాళ్ల నాయకుణ్ణి. ఇప్పుడు మళ్లా నన్ను నడ్డికట్టి వాడ వలస పరువు నిలబెట్టమని కోరారు.

లక్ష్మి

ఒప్పుకున్నావు గదా!

గవరమ్మ

అయ్యా, ముసలివానికి పడుచుచేష్టలు ఏమిటి? ముందర నిన్ను పురిగొల్పుతారు; వెనకాతల నిన్ను వెక్కిరిస్తారు. వయస్సులో ఉన్నవా ళ్లందరూ కూడా ఈలాంటిపనులు చేయరు. కాలంమించిన నీకా ఇవి?

రామస్వామి

కాలం మించింది! లక్ష్మీ, నీవుకూడా ఆలాగం టావా?

లక్ష్మి

బ్రతికిఉన్నన్నాళ్లూ కూడా పడుచుగా ఉండి, సుఖం అనుభవిస్తూఉండాలనే నామతం కూడా మామా !

గవరమ్మ

నరకానికి తీసుకపోయే యముడు నిన్నే పుర మాయించి పంపించుకోవాలి లక్ష్మీ!

రామస్వామి

వయస్సంతా కాల్చుకొని, ఎల్లప్పుడూ ముస లివాళ్లలాగు ధర్మ శ్రవణాలుచేసే ముసలమ్మ కాదనా లక్ష్మిమీద నీ కాకోపం?

గవరమ్మ

అయ్యా, మతిపోయిందా ఏమిటి! ఏమి టామా టలు? లక్ష్మిని చూడగానే తాగినవాడిలాగు అవుతున్నావు. నేనిక ఇక్కడ ఉండను. లక్ష్మి, నీదారిని వెళ్లుఇక; చాలు. (అని మొగం ముడు చుకొని వెనకఇంటిలోనికి వెళ్లిపోయింది.)

లక్ష్మి

గవరమ్మకు కోపం వచ్చింది.

రామస్వామి

వస్తే! ఎవరి కాభయం!

లక్ష్మి

నేను వెళ్తా. (ముందరికి ఒకఅడుగు వేసింది.)

రామస్వామి

ఎందుకు ఆ తొందర. గారు లేకపోతే ఉండ కూడదనా!

లక్ష్మి

మరో మారు వస్తా.

[లక్ష్మి గుమ్మందగ్గరగా రాగానే గుమ్మానికి అడ్డంగా రెండుచేతులు పెట్టాడు. లక్ష్మిపైట సర్దుకొంది. దానిముఖంలోకొత్తరంగు, కళ్లలో కొత్తతళుకు వచ్చాయి. దగ్గిరగా వచ్చిన లక్ష్మి చెక్కిళ్లమీద రామస్వామి చిన్న లెంప కాయ వేశాడు. ఆవేళ్లను పట్టుకొని లక్ష్మి ఆచేయిని దించివేసింది.]

రామస్వామి

గారుఅంటే భయమా! (ముఖములోను, కళ్ల లోను వికారము కనబడ్డాది.)

లక్ష్మి

వెళ్లాలి.

రామస్వామి

ఎవడిల్లు నిండుపాలకుండ అవుతుందో నీవల్ల!

లక్ష్మి

మళ్లా కలుద్దాము. (అని ముఖం తిప్పివేసింది.)

రామస్వామి

నిన్ను చేపట్టే భాగ్యం——

లక్ష్మి

వాడవలసలో నన్నుఎవళ్లూ పెళ్లాడరు. ఒళ్లు విరగా పనిచెయ్యాలి, మాటపడుతూ లొంగి ఉండాలి. నాకు రెండూ చేతగావు.

రామస్వామి

నిన్ను కళ్లారా చూసినవాడెవడూ ఆమాట అనడు. (కళ్లు విప్పి చూశాడు.)

లక్ష్మి

(తుళుక్కుపడి) మామా, చేతులు తీయవు ? వాటిమధ్య దూరైనా పారిపోతా.

రామస్వామి

దా, రెండుచేతులతో ఎత్తుకొని నీఇంటికి దిగ పెట్టుతా.

లక్ష్మి

(వెనకకు ఒక్కడుగు వేసి) ఊరుకో మామా, అదేమిమాటలు అవి. గౌరువింటే—

రామస్వామి

భయము వేస్తున్నాది కాబోలు పాపం!

లక్ష్మి

వెళ్లిపోవాలంటే—

రామస్వామి

ఆ!

లక్ష్మి

గవరమ్మను పిలుస్తా—(ముఖము తిప్పి—)

రామస్వామి

గౌరు అంటే—నా ఇల్లు ఇది. నాఇష్టం.

[లోపలనుండి గవరమ్మ వచ్చింది.]

గవరమ్మ

ఇక ఇల్లు విడిచిపోవాపమిటి! అయ్యో, పడుచు దానితో ఏమిటి ఆయాటలు!

లక్ష్మి

(గవరమ్మ వైపు తిరిగి చిరినవ్వు నవ్వుతూ) పట్నంలో మామ తాగిరాలేదు గదా!

గవరమ్మ

లక్ష్మివచ్చి చాలా సేపైంది. పొద్దు పోతున్నాది.

[లక్ష్మి వెళ్లి పోయింది.]

అయ్యో, ఏమిటావికారము? ఛా, బాగులేదు సుమా.

రామస్వామి

ఏమి,కూడదూ! అలాంటి పిల్లను చూస్తే ఎవ రికి కాదు ఆనందము! ఆమాత్రం వయస్సు నాకు లేకపోలేదు.

గవరమ్మ

మొన్నటివరకు తినడానికి కంచంనిండా కూడు లేక, మనము ఏమైనాఇస్తామాఅని గోచిపెట్టు కొని ఇంటికివస్తూఉండే ఆగుంటకాలంరాగానే రిపరిపమంటే,ఏభైపదిలోపడ్డనీవుకూడా ఆలాగు అవుతూ ఉంటే ఇక అనవలసింది ఏముంది. ఆహా, కాలవైపరీత్యం!

రామస్వామి

చక్కనిపిల్లా, సొగసైనపువ్వూ ఎవరిమనస్సును ఆకర్షించవు! దానిమాటలు వినాలనే ఉంటుంది. దానికళ్లు చూడాలనే ఉంటుంది. దాని—

గవరమ్మ

(కిటికీలోనుంచి చూస్తూ) చూశావా అయ్యా! ఆవంగపెరటికంచెదగ్గిర తమ్ముడిని ఏలాగు చెడి పేస్తున్నాదో! నువ్వు అయినావు, ఇక వాడు. దీనిని ఊర్లోంచి తగిలివెయ్యాలి కాని, లేక పోతే—

రామస్వామి

ఏమిటి?

గవరమ్మ

చూడు ఆకొంగమెడ ఏలాగు ఆడిస్తున్నాదో! వాడిమీదకూడా కురిపిస్తూ ఉంటుంది తన కళ్ల తళుక్కు. వాడుకూడా దానివలలో పడ తాడు. బాగా నేర్చింది ఆవిద్య.

[రామస్వామి ఆకిటికీలోనుంచి అదే చూస్తూ నిలబడ్డాడు. అంతే.]

గవరమ్మ

కేకవేసిపిలిచేస్తాను. వెంకటీ! వెంకటీ!-అయ్యో,

చూసా, లక్ష్మిముఖంలో వికారము. ఎందుకు ఆలాగు తెల్లబోయినట్లుంది.

[వెంకటి నవ్వుతున్నాడు. లక్ష్మి వెళ్లుతూ ఉంది. ఎవరూ ఇక్కడ మాటలాడ లేదు. వెంకటి తండ్రికి అనురూపుడైన కొడుకే. నడి యావనంలో ఉన్నాడు; అదేభేదం. గవరమ్మ ముఖవిలాసాలలో వ్యక్తమయే చికాకు స్వభావము వీనిముఖంలో కనబడదు.]

వెంకటి

అక్కయ్యా, లక్ష్మి మనయింటినుండా ఏమిటి వెళ్లుతూ ఉంది?

గవరమ్మ

ఏమిటి అంటూఉంది? ఏతాం పని మానివేసి దానితో ఏమిటి ఆ మాటలు?

వెంకటి

పట్టణంకబుర్లు చెప్పతూఉంటే వింటున్నాను. ఈసంవత్సరంలో ఎంత మారిపోయిందే.

గవరమ్మ

దానిఊసు మన కెందుకు లెస్తూ.

వెంకటి

చక్కనిచుక్క.

గవరమ్మ

దానికి గర్వము, అతిశయ్యము ఎక్కువైనాయి.

వెంకటి

లక్ష్మిమీద నీకెందుకు అంతకోపం?

గవరమ్మ

ఆకూలిగుంటకోసం మన యింటిలో ఎందుకు ఈలగ్గి? అయ్య పట్నంనుండి ఇప్పుడే వచ్చాడు. ఆకలితో ఉంటాడు. లే. వంట అయింది.

[నిశ్శబ్దం.]

రెండో అంకం

ముసలిదాని ఇల్లు

[ముందరినడవలో లక్ష్మి లంగాఒకటి కుడుతూ ఉంది. వెంకటి వచ్చి చప్పుడుచెయ్యకుండా నిలబడిఉన్నాడు. సూదికి దారం ఎక్కించాలని లక్ష్మి బుర్ర ఎత్తినప్పుడు దానికంట బడ్డాడు.]

వెంకటి

ఒక్కర్తవేనా?

లక్ష్మి

ఎందుకు?

వెంకటి

ఏమీలేదూ.

లక్ష్మి

ఊహూ.

వెంకటి

అనకాపల్లి వెళ్లిపోవాలి.

లక్ష్మి

ఆలాగా.

వెంకటి

ఒక సంవత్సరం అక్కడ ఉండి వ్యవసాయం నేర్చుకోవాలట.

లక్ష్మి

వెళ్తావా?

వెంకటి

నాకు వెళ్లాలని లేదు. నన్ను అడగకుండానే అయ్య అన్నిఏర్పాటులు చేసేశాడు. ఇవ్వాళ మధ్యాహ్నం నాతో చెప్పాడు. నేను వెళ్లనన్నాను. వెళ్లక తప్పదన్నాడు.

లక్ష్మి

ఇంతకు ముందెప్పుడూ ఈసంగతి విన్నట్టు లేదే.

వెంకటి

క్రిందటిసంవత్సరము పంటలుముందు నేను వెళ్తాను అంటే. 'ఎందుకు? అక్కడ వాళ్లు చెప్పేది ఏమిటుంది, నీవు నేర్చుకొనే దేమిటి ఉంది? అక్కడికి వెళ్లివస్తే మరి నాగలి పట్టవు. కబుర్లు చెప్పి అందరిని ధిక్కరిస్తావు'. అని కానిచ్చేడుకాడు.

లక్ష్మి

ఇప్పుడో.

వెంకటి

ఆమాటలన్నీ ముదరకించాను.

లక్ష్మి

అయితే.

వెంకటి

వెళ్లక తప్పదన్నాడు.

లక్ష్మి

సరే.

వెంకటి

(లక్ష్మికళ్లలోకి సూటిగా చూస్తూ) నేను వెళ్లిపోవాలని నీకూ ఉందా.

లక్ష్మి

వెళ్తే? ఎన్నో చూసి వస్తావు; ఎన్నో నేర్చుకొంటావు.

వెంకటి

ఆమాత్రం నాకూ తెలుసును.

లక్ష్మి

సంవత్సరం క్రిందట ఇష్టమైంది ఇప్పుడు ఎందుకుకాదు?

వెంకటి

నీకు తెలియదూ ఎందుకో?

లక్ష్మి

నాకేమి తెలుస్తుంది నీమనస్సులో ఏమవుతున్నాదో.

వెంకటి

తెలియదూ!

లక్ష్మి

నీలాంటి పడుచువాళ్లు గ్రామములో తక్కువైతే ఆటలుపాటలు సరదాకొంత తగ్గుతుంది. నిజమే. కాని వెళ్లడం మానడం నీవంతు; పంపడం మానడం నీఅయ్యవంతు.

వెంకటి

అంతేనా!

లక్ష్మి

అంటే?

వెంకటి

ఈలాగు మోసపుచ్చడానికి నన్నెందుకు అంత ఆశపెట్టావు?

లక్ష్మి

చాలుచాలు. అమ్మ వింటే—దీపం పెట్టాలి. (అని లేచింది.)

[గుమ్మానికి ఎదురుగా చెట్లమధ్య మనిషి కదిలినట్లు అయింది. లక్ష్మి గుమ్మందాటి గడపలోకి వచ్చింది.]

గవరమ్మ

(ముందుగా వచ్చి) వెంకటీ, నీవు ఉంటావను కోలేదు.

వెంకటి

నీవు ఇక్కడికి వస్తావు అనుకోలేదు. ఎందుకు వచ్చావు?

గవరమ్మ

(లక్ష్మివైపు చూస్తూ) మా అయ్య ఏడి?

లక్ష్మి

ఇంకా రాలేదు.

గవరమ్మ

నీఇంటికి రోజూ మాఅయ్య వస్తూఉంటాడట. ఎందుకు?

లక్ష్మి

వస్తూఉంటాడని నీకు ఎవరు చెప్పారో వాళ్లనే అదికూడా అడుగు.

గవరమ్మ

నిన్ను అడుగుతున్నాను.

లక్ష్మి

నీకెవరు చెప్పారు?

గవరమ్మ

వాడవలసవాళ్లు అందరూ.

లక్ష్మి

వాడవలసవాళ్లందరినే అడగలేకపోయినావా?

గవరమ్మ

ఆముసలివాడిని నీవలలో వేసుకొన్నాననా ఈ గర్వము?

వెంకటి

ఇదంతా ఏమిటి, అక్కయ్యా?

గవరమ్మ

లక్ష్మి అంటే నీకూ మతిపోయిందీ!

వెంకటి

ఎవరూ అక్కరలేకుండానే నీకు మతి పోయినట్లుంది.

గవరమ్మ

(లక్ష్మివైపు తిరిగి) పడుచుదానికి నీకు ఆముసలివానితో ఏమిపని!

లక్ష్మి

ముసలివాని నే అడుగు.

వెంకటి

లక్ష్మివ్యాపారము నీకూ నాకూ ఎందుకు అక్కయ్యా?

గవరమ్మ

మొద్దులాగున్నావే. అయితే చెప్తా విను. తండ్రిగా చూసుకోవలసిన ముసలివాడిని తన మరలలో పడేసుకొంటూ ఉంటే, నాకూ నీకూ కాక మరెవరికి?

వెంకటి

కిట్టనివాళ్లు అన్నమాటలు పట్టుకొని ఎందుకు అలాగు అవుతావు?

గవరమ్మ

లక్ష్మిని కాదనమను.

వెంకటి

లక్ష్మి, గారు అక్కయ్య సంగతి నీకు తెలుసును కాబట్టి, మరొకలాగు అనుకోవు.

గవరమ్మ

లక్ష్మిమానం సగం అంగీకారం

[ఈలాగు అంటూఉంటే లక్ష్మి దీపంపెట్టి కుట్టు సామాను జాగ్రత్తపెట్టుకొంటూఉంది. ఇంత లో ముసలిది వచ్చింది.]

ముసలిది

గౌరా! ఏమిఅదృష్టం ఇవ్వాళ. వెంకటయ్యా! కూర్చోరేం!

గవరమ్మ

ముసలమ్మా, నిన్నొకప్రశ్న అడుగుతా, సరిగ్గా జబాబు చెప్పు.

ముసలిది

ఆ.

గవరమ్మ

మాఅయ్య ప్రతిరోజూ మీఇంటికి వచ్చి, లక్ష్మి తో ఏకాంతాలు, గుసగుసలు ఆడుతూఉంటా డట. వాళ్లిద్దరికి మతిపోతే, నీవేనా ఎందుకు బుద్ధిచెప్పవు?

ముసలిది

ఎవరికి చెప్పమంటావు? అయ్యకా? అయ్యకే బుద్ధిలేకపోతే లక్ష్మికి ఎక్కడనుంచి వస్తుంది?

గవరమ్మ

లక్ష్మి నిచ్చి అయ్యకు పెళ్లి చేస్తావట!

ముసలిది

వాళ్లు ఇష్టపడి చేసుకొంటే నేను ఆపాలా?

గవరమ్మ

ఈడనా జోడనా! కులానికా తక్కువ. తిండికా లేదు.

ముసలిది

ఇవ్వాళో రేపో పోయేదానికి నాకెందుకమ్మా అవన్నీ. ఇంతకూ అయ్యను ఎందుకు అడ గవు?...అడుగో అయ్య—వస్తున్నాడు.

లక్ష్మి

[కళ్లు విప్పి చిన్ననవ్వుతో, ముందరికి ఒక అడుగు వచ్చి] ఇంతఆలస్యమా, మామా!

రామస్వామి

ఇక్కడా ఉన్నారు. గౌరూ, నీకోసం ఊరల్లా వెతికేను. ఎవరికీ తెలియదన్నారు. ఆకలితో పట్నంనుండి నేనువస్తే, ఇంటిలో ఏమీ ఉం చక పెత్తనాలికి బయలుదేరావా!

గవరమ్మ

లక్ష్మిని వదిలేసి పట్నం ఎందుకువెళ్లేవు?

రామస్వామి

నోరుమూసుకొని ఇంటికివెళ్లు.

గవరమ్మ

లక్ష్మి ఉండగా నే నెందుకు?

రామస్వామి

అనకాపల్లిప్రయాణం మానేసి ఇక్కడేమి చే స్తున్నావు వెంకటీ?

గవరమ్మ

తమ్ముడూ నేనూ అడగవలసినది ఒకటిఉండి ఇక్కడికి వచ్చాము.

లక్ష్మి

నన్ను అడిగితే మామా, నిన్నేఅడగమ న్నాను.

వెంకటి

నాకోసము గౌరుకి నేను వకాల్తీ ఇవ్వలేదు.

గవరమ్మ

అందరూ అనుకొంటున్నారు...

రామస్వామి

ఎల్లప్పుడూ ఏదో ఒకసాదే. వాళ్లు అనుకొంటున్నారు, వీళ్లు అనుకొంటున్నారు అని. వాళ్లు నాముందర అంటే ఆనోరు కట్టిస్తా పద.

గవరమ్మ

నీకు కోడలుగా ఉండడానికి తగినలక్ష్మిని నీవు పెళ్లి ఆడతావా!

రామస్వామి

ఆడితే!

గవరమ్మ

(గోలుఎత్తుతుంది.)

వెంకటి

అక్కా! ఏమిటి ఇది, ఛా.

గవరమ్మ

(కళ్లు తుడుచుకొని, వెంకటిని దగ్గిరగా లాగుకొని) మా గొంతుకులు కోసివేసి గోతుల్లో పాతేసి మరీ నీప్రయత్నం కానీ.

రామస్వామి

మీరిద్దరూ ఈలా రండి. లక్ష్మి, వీళ్లు నీ పిల్లలు గదూ. (అందరిని ఒక్కమారుగా చూసి) మీరందరూ ఒక్క కుటుంబంగా అనురాగంతో ఉండాలి.

గవరమ్మ

ఆ! ఆ! ఎన్నటికీ పొసగదు. హాని, అపకీర్తి వద్దు వద్దు.

రామస్వామి

లక్ష్మిలాంటితల్లి నీకెక్కడ దొరుకుతుంది?

గవరమ్మ

లక్ష్మి నౌకరీకి వస్తానన్నా నా కక్కరలేదు.

వెంకటి

నోరెందుకు ఆలాగు చెడకొట్టుకొంటావు?

గవరమ్మ

ఇది ఇల్లు కాల్చే కొరివి. రామా! చెడిపోయేము..(అని అంటూ వెళ్లిపోయింది.)

రామస్వామి

నీవైనా ఒక్కమంచిమాట ఆడవా!

(వెంకటి జబాబు చెప్పకుండా వెళ్లిపోయేడు.)

వెంకటి మంచివాడు!

లక్ష్మి

నీకంటేనా!

రామస్వామి

(ముసలిదానివైపు చూస్తూ) పంచమినాడు కొండకు వెళ్దాము.

---

మూడో అంకము

వాడవలస

1. ఒకవీథిలో ఒకచోట

ఒకడు

ఇంకా తెలివిరాలేదా సీతయ్యా?

సీతయ్య

నిన్న కొంచెం కళ్లు విప్పి చూశాడు.

ఒకడు

అయినా అంత విరవీగ కూడదు. దైవానికైనా కళ్లు ఎర్రగా అవుతాయి. ఆ వయస్సు ఏమిటి, ఆగ్రహపుసవారీ ఏమిటి?

సీతయ్య

గవరమ్మ ఆలాగే మొర్రపెట్టేది. దానిమాట పడితేనా!

జోగులు

లక్ష్మమ్మ కూకలువేసేది కాదూ!

సీతయ్య

వరహాలు చచ్చిపోయిన దగ్గిరనుంచి పొలం వ్యాపారం,గ్రామంవ్యాపారాలుతప్ప ఈలాంటి ఆటలలో అట్టే కనబడేవాడు కాడు. ఈ లక్ష్మమ్మ వచ్చిననాటినుండి మళ్లా ప్రారంభించాడు ఈపడుచుపనులన్నీ.

ఒకడు

ఓహో, తెలిసింది. పడుచువాడే సుమండీ అని అందరూ, ముఖ్యంగా ఆపడుచుపెళ్లాం, అనాలని కాబోలు ఆవేషం వేసేవాడు.

జోగులు

వేషం అంటేమాత్రం నేను ఒప్పను. వాడికి ఎప్పుడూకూడా ఆటలన్నా పాటలన్నాచాలా సరదా.

సీతయ్య

గుర్రపుసవారీ చేసివచ్చి గుర్రం దిగుతూ ఉంటే లక్ష్మమ్మ ఇంటిగుమ్మంలోకి వచ్చి పెద్ద మొఖంతో పలకరిస్తే అయ్య సంతోషము పట్టతరం కాకుండా ఉండేది.

ఒకడు

అందుకే కాబోలు, ఒకనాడు రాత్రి వెన్నెట్లో కుర్రకాయలతో కలిసి ఉప్పాపట్టీ ఆడేడట!

జోగులు

అప్పుడేనా గవరమ్మ కూకలు వేయడము; లక్ష్మమ్మ నవ్వడం. ఇంటిలో పెద్దగోల అయింది అని అన్నారు.

రెండోవాడు

మొగుడు పడుచువాడుగా కనబడాలనా?

ఒకటోవాడు

ఇద్దరిగర్వం తీరింది ఇక.

జోగులు

గర్వంలేని మనిషే లేడు. ఏమి చేతకానివాళ్లే విర్రవీగుతూఉంటే, కొద్దోగొప్పో బలం ఉండిన్నీ, బుద్ధిఉండిన్నీ రామస్వామి గర్వంపడ్డాడని మనము హేళనచేయడము అసందర్భంగా ఉంటుంది.

సీతయ్య

నిజం బాబూ. నిజం.

మూడోవాడు

రామస్వామి వేగిరంగా మంచంమీంచి లేచి తిరగాలని రామపీఠం తిరుపీథితీదామా?

సీతయ్య

తప్పకుండా తీయండి బాబూ, లక్ష్మమ్మ ఆఖర్చులంతా భరిస్తుంది.

ఒకటోవాడు

మళ్లా మామా ఆడాలనా!

జోగులు

రామస్వామిసంగతి నీకు తెలియకా. తెలిసినా నీస్వభావమా అది. ఈవారం రోజులనుంచి

గ్రామం అందరమూ పడుతున్న చికాకు చూస్తూ ఆలాగు అనడం నీ నోరే చెడ్డకే. రామస్వామే దృఢంగా ఉంటే ఈపోలీసులు, ఈ రివున్యూవాళ్లు ఈలాగు మనల నందరినీ పీడించుకో తినగల్గుదురా. కారంవీటి జమీందారు గారి టేకుఅడివినుంచి చాలాకలప పోయిం దని మనగ్రామస్థులమీద అనుమానంకొద్దీ పోలీసు వారు చేస్తున్న గొడబకు రామస్వామే లేవగలిగేఉంటే ఎంతోసులభంగానో దాటిపోయి ఉందుము.

రెండోవాడు

ఆమాట నిజం. ఆవిషాయలలో వాడికున్న నేర్పు మన కెవరికీ లేదు. అందుకేగదా గ్రామపెద్ద అని ఎంచుకొన్నాము.

ఒకటోవాడు

ఆ అప్పన్నను కొలుచుకొందాము సరే. కాని మంచివైద్యున్ని పెట్టకుండా రామభజన, అమ్మవారిపండుగ, వెంకటేశ్వరులకొలువు అంటే నిమ్మళిస్తుందా?

రెండోవాడు

ఏమీ, డాక్టరు వచ్చి చూస్తూ పోతున్నాడేమో!

జోగులు

అందరూ వైద్యులే, అందరూ సజ్జనులే!

మూడోవాడు

ఎవళ్లు చూస్తున్నారు సీతయ్యా?

సీతయ్య

కర్ణంబాబు బాపనయ్య డాక్టరుని పడిపోయిన నాడే తీసుకోవచ్చాడు. అతనూ చేతనైందంతా చేశాడు. వెంకటయ్య పట్నంవెళ్తే అక్కడ అందరూ ఈబాపనయ్యను వదిలేసి కొత్తగా ఒకసర్జనుబాబు వస్తే అతని దగ్గిరికే అందరూ వెళ్తున్నారు అని తెలిసిందట. ఆమాట ఇంటికి వచ్చి చెప్పాడు. కర్ణంబాబు కాదన్నాడు. లక్ష్మమ్మ ఆకొత్తతన్ని తెమ్మన మని పట్టు పట్టింది.

జోగులు

అవును. కర్ణంగారికి, ఆబాపనయ్యకు ఇలాకా ఉంది. మనగ్రామంఅంతా గుత్త చేశాడు.

ఒకటోవాడు

ఈపెద్దలున్నారే పార్టీలుచేసి మనడబ్బు కొట్టేస్తూ తాము బాగుపడతారు.

మూడోవాడు

మెల్లిగా వింటే.

జోగులు

ఆభయాలు పోయినాయి. కుర్రవాళ్లందరమూ ఒకటైతే వీళ్లు నలుగురు పెద్దలూ చేసేదేమిటి?

రెండోవాడు

ఆగొడబంతా ఎందుకు ఇప్పుడు?

ఒకటోవాడు

నువ్వొక పెద్దబుద్ధిమంతుడవు దొరికేవు. అంత భయమయితే నువ్వా ఆజట్టులో చేరు, పో.

మూడోవాడు

ఈంద్రపడ్డా, కర్ణంబాబు సామాన్యుడు కాడు.

రెండోవాడు

సీతయ్యా! కొత్తతనా, బాపనయ్యా, ఎవరు ఇప్పుడు వైద్యం.

జోగులు

ఆ నీసర్జనే వచ్చాడు. నిమ్మళంగా అందుకే ఉంది. సరా!

రెండోవాడు

అన్నా, నీకూ కేళే.

సీతయ్య

అతను అన్నట్టే బాబూ.

రెండోవాడు

ఏలాగు మారిందో.

సీతయ్య

కర్ణంబాబుగారి మాటప్రకారం గవరమ్మగారు ఒప్పుకొన్నా, లక్ష్మమ్మ వేంకటయ్యలు ఇద్దరూ ఏకం కాగానే బాపనయ్య మరి రాలేదు.

మూడోవాడు

పదండి. అందరమూ రామస్వామిని చూసి వత్తాము.

---

2. మరొకచోట-మరికొన్నాళ్లకు

రావి

లక్ష్మమ్మ దురదృష్టం!

రాజులు

లేచి తిరుగుతున్నాడేమో.

రావి

ఏమితిరగడం? జారిపోయినమక్క మరి కలియదని డాక్టరుబాబు స్పష్టంగా చెప్పాడు.

రాజులు

అయితే లక్ష్మమ్మ ఇప్పుడు ముసలిమొగుడు పెళ్లాం అయిందన్నమాటా; పాపం!

రావి

ఆలాగని సంరక్షణ ఏమాత్రం తక్కువచేయ లేదు. మునపటికంటె ఎక్కువ ఆదరణతో శ్రద్ధచేస్తున్నాది. అయ్యగది విడిచి పైకి రాదు. పక్కలో కూర్చొని ఏభక్తవిజయమో, ఏభారతవచనమో చదివి వినిపిస్తూఉంటే పెళ్లి అయిన కొత్తరోజులలో చూపించే మోహమంతా అయ్యకళ్లలోను, ముఖంలోను చూపుతూ ఉంటాడు.

రాజులు

నాలుగురోజులక్రిందట వెంకటయ్యతో కలిసి వాళ్లగున్న మామిడితోటలో తిరుగుతూఉంటే చూశాను.

రావి

ఊఁ! ఏదో పనిమీద అయిఉంటుంది.

రాజులు

ఇంతకూ పడుచుది గదులో మూలుగుతూ ఎంతకాలము కూర్చోగలదు?

రావి

ఆదికాదు. ఇంటివ్యాపారము వాళ్లిద్దరే చూడాలిగదూ.

రాజులు

వాళ్లిద్దరికీ మంచి అన్యోన్యమేనా?

రావి

ఆహా! వీళ్లిద్దరికీ ఎంతస్నేహమో, గవరమ్మ లక్ష్మమ్మలకు అంత పడదు.

రాజులు

ఇన్నాళ్లు చల్లగా నడిచినకుటుంబానికి ఏమి రానున్నదో!

రావి

అయ్య జీవించి ఉన్నన్నాళ్లు ఏమీ భయం లేదు.

రాజులు

ఏమో! (సశేషము)

---

# సుప్రభాతము

జనమంచి వేంకటరామయ్యగారు

౧

ఉదయమయ్యెను బాలార్కు-నుదయమయ్యె-సుదినమయ్యెను గనువిచ్చు సుకృతు
చాలమేల్కని, వేకువజామునందుఁ-గన్నుమూసినవారికిఁ గాదుగాని. [లకును;
పుష్పితోద్యానలతలపైఁ బోలె సతని-మృదుకరస్పర్శ ప్రసరించె మెల్లమెల్ల
ముందుగా లేచి స్వాగతం బందియిచ్చు-*తనదుపేరిటి దేశపు తరుణులపయి.

ఏమంత్రను జపియించిరో-నేమము నిష్ఠయును మెఱయ నెలఁతలు దామిం
కేమేమి పూజ లిడిరో-యామిత్రు కృపాకటాక్షు మందుటకు నహో!

దేవకన్యకలట్టు లా తెఱవ లతని-దివ్యతేజంబుఁ దాల్చిరి భవ్యమతిని;
కాని కుంతీమహాదేవి పూనినట్లు-గర్భములయందు మాత్రమే కాదుసుండి.

కాదుసుఁడియింకసుతునినొక్కరునిశక్తి-ధరునిగనఁగోరియునుగాదు—తాల్చిరద్ది
నిత్యకల్యాణులగుచును నెగడుకొఱకె-స్వీయసర్వాంగ పూర్ణజీవితములందె.

ఒకయపూర్వశక్తి యొకనూతనోత్సాహ-మొక యపూర్వనాగరకత గలుగ
నూత్నభావనములు నూత్నవాంఛితములు-డెందములను బొదలి సందడింప.

వీరపత్ను లటంచునుర్ బహువీరమాత లటంచునుర్
ధీర లంచును శాంత లంచును ధీవిశారద లంచు శృం
గార శిల్ప కళాకలాప వికాస భాసురమూర్తు లం
చౌర! పేరువహింతు రీయుదయార్క దేశ వధూమణుల్.

అచ్చరలువోలె నందనోద్యానములను-గుమ్మటములట్టి కేళీగృహమ్ములందుఁ
దల్లులునుబిల్లలును వేడ్క నుల్లసిల్ల-మెలఁగుచుందురు తత్సీమ మెఱుఁగుఁబోండ్లు.
మెఱయుదురువీరునవనవోన్మేషమెసఁగ-విపులయువజనహృదయాభ్రవీథులందు;
వీర శృంగారరసములు వెల్లిగొలిపి-వారు ఘనకార్యములను బ్రవర్తిలుటకు.

కలరే దేవతలంచు నొక్కెడను; స్వర్గంబంచు నెందేని? భూ
తలమే స్వర్గము, మర్త్యులే సురలు, నిత్యక్షేమ సంతోష స
త్ఫల మేదాన లభించునో యదియ తత్కల్పద్రుమం బింక, నీ
యిల స్వాతంత్ర్య మొసంగరాని శుభ మున్నే? మోక్షమే యిచ్చెదుర్.

* జపాను దేశము

ఏ తేజః ప్రసరంబుచేతఁ గనిరో యీజాతి యీపెంపు సొం
పా తేజోవిసరంబు సడ్డుచుఁ బరుం డర్కోపలంబట్లు, వి
ద్యోతంబా నెఱగంట నిప్పుమియ నుద్యోగించి తీవ్రాగ్ని సం
పాతంబుల్ సహియింప కోడి వడలెన్* భల్లూకపుంబ ట్టొగిన్.

జయభేరుల్ మొరయించి రంతట మహోత్సాహంబు సంధిల్ల దు
ర్ణయులై శాంతమహాసముద్రమునకున్ సంక్షోభముం జేసిన
ట్టి యరివ్యూహముఁ జించి చెండి యచటన్ డెక్కెంబు నెక్కొల్పి, నూ
త్నయుగస్థాపకులై యపశ్చిములు తద్బాలార్క దేశోద్భవుల్.

ఆడం జొచ్చిరి, పాడఁ జొచ్చిరి యమందానందవారాశి నో
లాడంజొచ్చిరి యింక సీమదొరలౌరా! యద్భుతం బిద్ది! యే
నాఁడుం జూడము గుండ్లు దేలె నడుగంటన్ బెండు లంచున్ మదిన్
బ్రోడల్గావున "మాకుఁ దోడగుచు నిల్వుం"డంచుఁ గేల్వట్టిరన్.

మును బ్రహ్మర్షిపదంబు నందుటకునై పుణ్యవ్రతంబుల్ సుని
ష్ఠను గావించి కృతార్థతం గనిన విశ్వామిత్రులుం బోలె, భా
జనులై యీజను లగ్రజాతులయు సేర్ష్యాదృష్టికిన్ మైత్రికిన్
ఘనులై యుండ్రు స్వారాజ్యమందుఁ గని మోక్షశ్రీసుఖానందమున్.

జ్యోతిర్మండలి మొందు నూతనముగన్ వ్యోమంబు సీమం దగం
దోతేరన్ విని తద్విశేష మరయం దోడ్తోడ యంత్రంబులం
జేతం బట్టు పరీక్షకుల్ బలెనె, సంసేవింత్రు వై దేశికుల్
ప్రాతస్సూర్యుని ద్వీపమండలముఁ దద్వారాశిమధ్యంబునన్.

చతురంభోధిపరీత భూతల మహాసామ్రాజ్యధౌరేయుఁడై
అతులప్రాభవవైభవోన్నత జయప్రారంభ సంరంభుఁడై
కృతరాగాతిశయ ప్రజాహృదయ నీరేజాసనాసీనుఁడై
క్షితిఁ బాలించును దద్విభుండు మహిత శ్రీభోగదేవేంద్రుఁడై.

---

* (The Russian Bear) రష్యా వారు భల్లూకధ్వజులు. ఇచ్చట రష్యా జపాను యుద్ధము సూచితము.

# తమ్ముడు పెళ్ళికి తర్లివెళ్ళడం

భమిడిపాటి కామేశ్వరరావుగారు

అబ్బే, ఏం లేదండీ! ఓనాడు తెల్లవారీ వారడం తోటే ఉదయం రైల్లో ఊరికే పిరంగిగుండులా ఊడిపడ్డాడు, మా మేనమామ, కాకినాణ్ణించి. ఇల్లా యింకా గుమ్మం దాటి లోపల పళ్లేదు, ఆపళంగా హోత్తెరీ అని దొరకపుచ్చుగున్నాడు మమ్మల్ని! "పెళ్లి పెళ్లి పెళ్లి, వ్యవధి లేదు వ్యవధి లేదు" అంటూను. కాళ్లు కడుక్కోడు, కూర్చోడు, ఆగడు, ఆలోచన తోచనివ్వడు, "శుభస్య శీఘ్రం అన్నాడు. కళ్యాణం వచ్చినా కక్కొచ్చినా ఆగదు. పెద్దలంతా వ్యాపారం అల్లా రైటు చేశారు. ఇహ చూస్తే లాభం లేదు, నడుం కట్టాలి గాని!" అంటాడు. నిజమే ఆమాట. పుట్టడానికి పూర్వంనించీ గూడా అనుకుంటూనే ఉంటాంగా మేనరికం సంబంధం! కాని, మన్లోమాట, మాతమ్ముడూ తమపయవల్ల ఏవో రొండు ముక్కలు చెప్పుగుంటూ ఉన్నవాడేగాని వొట్టి రికామీమనిషి కాడు. వాడికే కోఅంటే కోటి మంది అన్నట్టు వస్తూనే ఉన్నారు, లాంఛనాలు మినహా కట్నం,ఓపిల్లికూనదాకా చెబుతూను. ఏంజరిగితేం,మాకు మొవణ్ణించీ దీనిమీదే ఉంది మనస్సు, కానైతే. అందుకన్నేమా! ఏదో ఆడపిల్ల వాళ్లం మేం అయినట్లు అతగాని ధోరణికి చెబుతున్నా! మేనరికం అంటే కన్యాప్రదాతకి కాస్తంత స్వారాజ్యంగావును! రెండుమూడు దఫాలు విశ్వప్రయత్నం చేశా అక్కడికీ—"చెప్పావు కాట్టయ్యా, కాస్త నిదానించు, గుఱ్ఱం దిగు కొంచెంచురి; ఇల్లా కచ్చల్లో కందులు వేయించితే ఎల్లాగు? వెనకా ముందు చూసుగోనీ. కావలిసిన వాళ్లమేగదా, ఏదోపైసలు చేద్దాంలే!"—అంటూ పెట్టి ఒక్కరవ్వ కసురుసున్నట్టు డబాయిద్దాం అని. అయితే అతనెక్కడ? అబ్బే! ఉఁహుఁ. తను చెప్పేదేదో అదేగాని, తెడ్డెయినా మామాట చొరనియ్యందే! మళ్లీ మాట చెప్పడంసొంపు మాఅందరి దగ్గిరా ఉంది. ఉంటేం? ఏమీ అతడు వినిపించుగోందే! నసేం! పైగా, మేనమామ. ఓవేళమాట్టాడ్డాని కాతడు మాకు తెరపిచ్చినా మేం అతణ్ణి నెగ్గగల్తమా? అమ్మయ్య! ఏదో అభోజనం చేసేటప్పుడు ఆ ఆసామీ ఏం తమాయించాడోగాని, అస్తమానం ఒక్కపరసగా ఉన్నాడూ, మరొక్కవారం ఉంది ముహూర్తం అని కాయితంమీద రాసిచ్చాడు లగ్నం అదీని. సరి ఆమధ్యాన్న వేళ రైల్లో గావును వాళ్లవూరు నిష్క్రమించాడు.

అవునా; ఉన్నమాట అనేస్తే తీరిపోతుందీ,నాకు మాత్రం మాచెడ్డశట్టుగా లేసుకొచ్చింది, చెప్పద్దూ! కాని ఏమిటి చెయ్యడం! పెద్దవాడూ! మరోటీ, అతనన్నదీ నిజమే! శుభశోభనాదులనీ ఏదో చకాపికీగా గబగబా హైరానగా అయిపోతూంటాయిగాని, ముందెంత గుణించుగు కూర్చున్నాసరే వీటిల్లో స్థాయిగా ఉండడం బహుఅరుదు. ఒకసారి నేనుకూడా అర్థ ఆలోచించాను. "ఇక పెళ్లికీ,నడుక్కీ అంటూ ఇంతంతా ఇంతంతా లేరు మనికి చెల్లెళ్లూ తమ్ముళ్లూనూ. చెల్లెల్ని అత్తారింటికి పంపేశాం,తమ్ముళ్లు ఈనరకే సంతాన వంతులయారు; ఎటొచ్చీ ఇహ నాలుగో తమ్ముడు వీడొక్కడున్నూ. వీడుకూడా ఓయింటివా డవడమే గదా మనం కోరేదీనూ. ఊహూ, మంచి చెడ్డలు చెప్పడానికి మాత్రం దగ్గిర పెద్దవాళ్లెవరున్నారు గనకా" అని తలపోసుగుని, నేను మనసు నిబ్బరంచేసుగుని, నాస్నేహితుడు ఒక మేష్టరు మా భవనంలోనే మరోభాగంలో కాపరం ఉంటే ఆయన్ని తక్షణం కలుసుగుని, హైసా అని ఆయనా నేనూ కలిసి పట్టుపట్టుమని కొన్నికొన్ని ఖంజాయింపులు చేసుగుని, రివ్వున వెళ్లి ఉత్తరాలైచ్చి, మా తమ్ముళ్లకీ, పెత్తండ్రిగారికీ, కడమా బంధుకోటికీ, ఈసంగతంతా గోకేసి ఆహ్వానం రాసి, మంచున్న పళాన్ని వాళ్లని యావన్మందినీ యకాయకీని బయల్దేరి వచ్చివాలమని, పెళ్లికి ఓ ఇదెనీ, ఓ అదెనీ ఆడవాళ్లు పురమాయించిన మీదట ఏవో బజార్లో కొనుక్కొచ్చి ఇంట్లో గిరవాటేస్తూ, ఆముహూ

స్తానికే కాకినాడ వెళ్ళడానికి ఆయత్తపడడం వెంటనే ప్రారంభించాం.

పెద్దవాళ్లు కార్యాదులు ఎల్లా కొనసాగించుతో చ్చారోగాని, ఆనాలుగు రోజులూ మా కేమన్నా ఊపిరి సలిపిందా, కాళ్లు విరగదొక్కుకున్నాంగాని! ముహూర్తం అనే మాటలో ఉంది ఎంత సొగసైనా! అదిమానవులే పెట్టుకుని, అదొచ్చి మీద పడిందంటారు. దాని బలిమి ఏంబలిమి? డబ్బు కుదురుతుంది, వీలు కుదురుతుంది, మనసు కుదురుతుంది, చాలామందికి జలుబువొదిలి రోగం కుదురుతుంది, జరిగితీర్తుంది! సంబంధించిన పునిస్త్రీలకి నెలలు నిండడంగాని, సంబంధించిన ముసలమ్మలకి ఏళ్లు నిండడంగాని జరక్కుండా ఉండాలిగాని ముహూర్తం మానవులకోసం ఆగదు. ముహూర్తాలంటూ పెట్టకపోతే, మన్లో ఉండే విధ్యుక్త కార్య నిర్వహణానికి ఒక్క పెళ్లీ పడకనే పోను అసలు! ఈమాట అందరికీ తెలుసు. అంచేత మారపుబంధువులైనా అశ్రద్ధలు చెయ్యరు. చేసినా పాకెన్న దాటనివ్వరు. కావలిసినవాళ్లు పిలుపం దక పోయినా రాక మాన్నే లేరు. నచ్చి తమరికి సరియైన పిలుపే లేదని దెప్పడం గునవడమూనూ. గునవడానికి బాగా సావకాశం ఉండేనిమిత్తమే పెళ్లి అయిదు రోజులంటూ ఏర్పరిచింది అని కొందరి ఊహ. సరి, మా వాళ్లూ నా ఉత్తరాలు చూసుకుని సెలవ చీటీలు రాసి పారేసి, ఆపట్టున చక్కావచ్చారు. క్రితంనాడు మధ్యాహ్నాని కప్పుడే మా పెత్తండ్రిగారూ, వాళ్లవాడూ, పిల్లలూ అంతానున్నూ నిమ్మ నిమ్మళంగా ఒహొక్కరే ఒహొక్కరే నాఅన్నవాళ్లంతా జేరుకున్నారు ఎల్లాగైతేం. ద్వారబంధానికి తోరణంగట్టి, పెళ్లికొడుకుకళ్లకి కాటికా, బుగ్గని చుక్కా పెట్టేటప్పటికి వొస్తుంది కావున పెళ్లికళ. అపళంగా అదివరదాకా సంసారపక్షంగా ఉంటూన్న ఇంటిల్లపాతి జనంలోనూ ప్రతీ నస్మరంతిగా దాకూడా గొడ్డలిపెట్టుగా ఒక గొప్ప మొగపెళ్లివాడుగా మారిపోయి ఊరుకుంటాడు. అక్కణ్ణించి అడుగులు లెక్కడుతూ నడిచేవా డొకడూ, నిద్దరోతూ మాట్లాడేవా డొకడూ, అభోజనం పడుకుంటానని గడ్డంపట్టించుగునే ధీరోదాత్తు డొకడూ, తాను ఛంత్రోతంటే తనికి ఛంత్రోతనే ఘురానావాజమ్మ ఒకడూ, "అబ్బ! వాణ్ణెళ్లమందు, దుక్కలా ఉన్నాడూ!" అని ఎగేసేమందు డొకడూ ఆవిర్భవించడంవల్ల వ్యాపారం తారుమారవుతుంది. కాని, సందడి అంటే అదే సందడిలెండి మరి! "ఈదార్లో తుంగచాప పరిచారెవరూ?"——(ఎవడు చెబుతాడు సమాధానం?) "ఈట ముడ పెట్టి ఎవరి దగ్రా, కాలు బద్దలవుతూనూ?" "ఏమర్రా, మూడుకోతల దంతపుదువ్వెన్న చూడలేదుకదా, మీరెవరూ?" "ఇదుగో, చూడూ! నాపట్టు తాపితాలు ఎక్కడున్నాయి? ఇయ్యి, అవీ మరచెంబూనూ!" "ఈవెధవని తియ్యవే ఇక్కణ్ణించీ! తీసి నీళ్లట్రా" అంటూ అనవరతమూ కేకలు వినబడుతూ, చంటిపిల్లల నుక్కలట్టడాలూ, కాస్తపెద్ద పిల్లల అల్లర్లూ——పల్లకీలో కూర్చోడానికి తగూలూ, గాయికందచ్చినవాళ్లు మొత్తుకున్నా వినిపించుగోకుండా పేకాటలూ, ముసిలి వాళ్ల కూకలెయ్యడాలూ లాంటి వాటితో నిండిఉంటే అప్పటి ఆవైభవం సంసారసౌఖ్యసారం అనచ్చునేమో! చెప్పొచ్చేమక్క, మేమంతా ఇంకా ఆడపెళ్లివారి ఊరెళ్లి వాళ్ళేర్పాటు చేసే విడిదిలో దిగకుండానే, ఇక్కణ్ణించీకుడా తయారుగానే ఉన్నాం. ఇంతంత గలిభీ, హడావిడీ జరిగిపోతూంటే పైవాళ్లమైతే మహా చెడ్డ సొగసుగా చూడచ్చు! కాని ఎవరో ముగ్గురో నలుగురో నడుంకట్టి వ్యాపారం అంతా చక్కపెడుతూ, అడిగినవి ఇవ్వడానికీ, ఇచ్చినవి అమర్చడానికీ, అమర్చినవి ఉపయోగించడానికీ, వెన్ను వాల్చడానికేనా తీరిక లేకుండా దొముకలు పొడుంగావలిసిన వాళ్ళు ఉండితీరాలిగా! ఇక్కడ ప్రస్తుతం నేనల్లాంటి వాణ్ణి. ఇహాను ఆతెల్లారకట్ల అయిదుగంటల రైలుకే ప్రయాణం. అంతా పడుకున్నారు. నేను వీలైనప్పుడల్లా ఓకునుకులాగుతూ లేస్తూ గడిపాను. మాఆవిడమాత్రం——మరి పెద్దలు ఇంట్లో లేరుగామరీ!——రాత్రెల్లా చిమ్మెట్లల్లా ఏదో సవిరిస్తూనే ఉంది; సవిరింపు తెమల్నే లేదు.

ఇక ప్రయాణ సరంజాం కల్లామూలం మావాళ్లు నాలుగు బళ్లు చెప్పొచార్చు. చెప్పొచ్చీ, ఇహ తమ

నిద్దర సంగతేగాని మరి బండీవాళ్ల అతీగతీ కనుక్కోలేదు. వాళ్లూ చాలాసేపు అరిచారట, ఆగారట, ఎంతైనా తంటాలు పడ్డారట. కాని ఛస్తారా ఏమిటి, ఫికర్లేకపోతే! ఆఖరికంగా విసుగేసుగొచ్చి వాళ్లు మాయమై చక్కాపోయారు: ఈసంగతి నాకు నాలుగు గంటలకి మెలుకువ రావడం ఏమిటి, తెలియడం ఏమిటి, రెండూ ఓమాటే జరిగాయి! బండివాళ్ల పిలుపులు వినిపించుగోనందుకు నాకు చర్రుమనిపోయింది— నేనైనా తప్పనిసరివల్ల కోప్పడతాంగుగాని, నేనుమాత్రం వినిపించుగో హాడనూ!— ఆగి, ఇప్పట్లో కడం వాళ్ళ నందర్నీ లేవగొట్టడం శక్యం అయిన పనిలా కనపడక, తీరా రైలు దాటిపోతే (అందర్నీ కదుపుగుని వెళ్లేటప్పటికి), మళ్లీ స్నాతకం అడ్డుతుందేమోగబ్బ అని హడలెత్తి, "పోనీ, కొంతమంది ముందు వెళితే!" అనిపించిందినాకు. సరి, పెళ్లికొడుకూ హదూ— పెళ్లికి పెళ్ళికొడుకూనా అన్నట్టు— నేనూ, మావాళ్లూ వెళ్లి తీరాలిగా! తక్షణం, "రైలు వేళయింది లేవండర్రోయ్" అని ఇంట్లో మేఘధ్వనిఓటి ఖర్చుపెట్టి, మేం ముగ్గురం ముఖ్యం అనుకున్నదీ, చేతికి అందినదీ ఊడిపుచ్చుగుని, రైలుస్టేషన్కి ఎగడ్డాం. కొంతరంగం ధౌడు తీసేటప్పటికి, ఓఒంటెద్దుబండీ కునికిపాట్లు పడుతూ మాకు ఎదురుపడితే అది బేరం లేకుండానే వెక్కి స్టేషన్కి పట్టుకున్నాం. ఎట్లానో బాధపెట్టగా, వాడు ముందుబరువూ, వెనకబరువూ, అసలుబరువు అంటూ మనల్ని గొరుక్కుతినేసి అక్షీఘ్రూ స్టేషన్కి ఈడ్చుగు పోయినాడు. స్టేషన్లో ఊహూకోలాహలం బయల్దేరింది— ఇటోటే అటోటే రొంకుతున్నాయిలెండి, అప్పుడే! మా రైలు కర్ణశూలంనంటిరాతి సిహాళ ఓటి ఎక్కడహూసి తోకముడిచేస్తుందో అనినాకు ఓటే బెంగ! "డబ్బిచ్చేయండి, బాబుగోరు, యెల్తాను!" అని బండీవాడు. నాదగ్గిర చిల్లర్లేదు. "ఉండరా, టికెట్లు కొన్నతరవాత నీడబ్బు నీమొహాన్ని కొడతానూ!" అన్నాను. అంటే వాడు అల్లా ఎల్లాగండీ అని బలవంతపెట్టి, నంచున్నపాట్న కక్కాముని కూర్చున్నాడు. "నీమొహం దగలేసిరిగదరా, నీమొహం దగలెయ్యా!" అనుకుని, గొడుగుంకేను చేతులో, అది వాడి మొహంమీద కొట్టి, "ఇదుచ్చుగు ఏడవరా, డబ్బిచ్చిందాకానూ!" అని నేను నోటుపైకి తీసి పరిగెట్టి కిటికీ దగ్గిర ఉల్టాసీదా అంతపని జరిగి, ఎల్లానో మూడు టిక్కట్లు కొయించాను. మావాళ్లిద్దరూ మించిపోయినట్టు స్టేషన్లోకొచ్చి దిక్కులు చూస్తూ నిలబడ్డారు. ఇంతట్లో నేను చిల్లరట్టుగుని "ఇదుగో రోయ్" అంటూ బళ్లదగ్గిరికి వెళ్లేటప్పటికి, ఏడీ బండీవాడూ! ఈభూప్రపంచంమీద లేకుండాపోయాడు. "నాలుగుంబావలా కిమ్మతు అసలు బుట్టమార్కుది, నిక్షేపంలాంటి గొడుగు, నీపొట్ట వెట్టుగున్నావుట్రా, నీపాడుగు బొగ్గులుగానూ!" అనుకున్నాను. అనుకుని, మావాళ్లమీద కొంచెం చిర్రుబుర్రుమన్నాను, వాడికోసం ఎల్లానూ బయల్దేరిన కోపాన్ని నిరర్థకంగా అంతరించిపోనీకుండాను!

ఇంతట్లో, ఇంటిదగ్గిర నాకేకతోటి మావాళ్లంతా లేగేస్తే తేనిపట్టు రేగినట్టు ఒక్కమాటు చలించారట. ఓముగ్గురు తెగలిరిగి నాలుగు వీధులూను, బ్రహ్మాండంమీద రెండుబళ్ళు సమకూర్చి యింటికి తెచ్చి, వాటిల్లోకి పెళ్లివారిసామాన్నీ పెళ్లివార్నీ ఓటికెలోరవాణా చేసి పారేశారట. ఇహ బయల్దేరపోయే సమయాన్ని కరకమ్మగారు తనతల్లిని తీసుగుని, ఓట్రంకుపుచ్చుగుని, ఓఅరిటిగెల వేసుగుని కాకినాడ నేనూ వస్తానంటూ కాళ్లకి అడ్డంపడిందిట. కరకమ్మ మాకు చుట్టంకాదు పక్కంకాదుఫమ్మండి, మాహావేళీలోనే ఉంటూన్న పారుగావిడ. క్రితం ఆర్నెల్లనించీ ప్రతినిత్యమూ నేను ఆవిణ్ణి చూస్తొచ్చినా, ఎప్పుడూ సంభోధించలేదు. వినడం ఆవిడ దొడ్డమనిషే అని. మనిషి ఊరికే సన్నంగా కదురులా పేనులా ఉంటుంది. నిజమేనండి, ఉత్త అటుగ్గింజ, పాపం! కాని, కట్టె పీలగా ఉంటేం, గాత్రం మాత్రం మహాగట్టిది గావుకేక లెట్టడానికి. కాయశరీరం ఏమో, ఆవిడ అనేక పుష్కరాలకి కోటిలింగాలరేవులో స్నానం చేసింది. ఆవిడికి ఓతల్లి. ఈవిడికి కన్నూకాలూ కొంతవరకే ఉన్నాయిగాని, మడీ ఆచారంమట్టుకు చెక్కపూటుగా ఉన్నాయి. వీరికి ఓట్రంకుపట. అబ్బే, ఎంత ట్రంకండీ, నామొహం! ఉత్త మన పెద్దబాలశిక్ష పుస్త

కంఠంతాయె. పైపెచ్చు ఓచిన్న అరిటిగెల! వీళ్లు ఎక్కడికక్కడికే అని పెళ్ళివాళ్ళతో తెల్లారగట్టే తయారయారు, సమూహంలో కొట్టుకుపోవచ్చుగదా అని. సరే అనుకున్నారట మావాళ్ళు, అనుకుని ఓ రొండు నిముషాల్లో వీళ్లనీ ట్రంకునీ అరిటిగెల్నీ సర్ది ఎక్కడోను బళ్ళు తోలుకుని మేహాలమీద వచ్చిపడ్డారు స్టేషన్కి. సుడ్డిలో మెల్ల, ఇంకామా రైలు కదల్లేదు. వస్తూనే, మా రొండో తమ్ముడు నాదగ్గిరి కొచ్చేసి, "మేస్టారు సాయంత్రం వస్తానన్నాడు. మనికి పన్నెండు టిక్కట్లు కావాలన్నయ్యా!" అన్నాడు. "సరే. మీరెళ్ళి సామాన్తో రైల్లోపడండి!" అని నేను అదివరలో కిటికీదగ్గిర మోచేతితో పిడీల్తో టిక్కట్లు కొన్నవాణ్ణి ఇప్పుడు లోపలికెడితే ఏదోమహా సాడిచేస్తానన్నట్టూనూ, మనికీ ఉద్యోగమేగదా, టిక్కట్ల నుమాస్తా నన్ను మన్నించకపోతే యెరగడా పనసుజాకా అన్నట్టూనూ, గిరుక్కున తిరిగి లోపలికెళ్ళి, "అయ్యా! దయచేసి కాకినాడకి పన్నెండు!" అని జాతిభాషలో అడిగి, ఆటిక్కట్లూ చిల్లరా బహునమ్మకంగా—మళ్లీ పల్లెటూరి గబ్బిలాయికిమల్లే తిరిగీ లెక్కపెట్టుకుంటూ కూర్చోక—జేబులో వేసేసుకుని, ఏదో గొప్ప దిగ్విజయం చేసినట్టు గరాగరీగా ఇవతలకి వస్తూంటే ఒకడు "అయ్యా! ఈటిక్కట్టు ద్వారపూడికేనా చూసిపెట్టండి!" అని నన్ను కనుక్కునేటప్పటికి, నేను "అయ్యో! పిచ్చిపుల్లాయిలా ఉన్నావేమిటి, ఎక్కడో! అక్కడికే!" అంటూ వాడి అతిజాగర్త అసహ్యించుకుంటూ చక్కాపోయి, మావాళ్ళంతా బండీలో పడగలిగినందుకు ఆనందపడి, ఇహ రైలుకూసి సాగవొదిలి ముందుకి సాగేవేళకి నేనూ ఎక్కేసి పెట్టి తలుపేసుకుని, "అమ్మయ్య" అనుకుని లోపలకూర్చొపడ్డాను.

రైలు "ఆఁ నేను వెళ్ళను" అన్నట్టు కొంత హరామీచేసి వెనక్కి కదలడం మొదలెట్టింది. ఆపళంగా రైలువాడు "ఏడిశావు, నడుద్దూ, నీయిష్టంఏముండీ!" అన్నట్టు చెవులు గింగురెత్తేలాగు రైంయ్యిమని గావుకూత ఓటేసి,రైల్ని నసాళం అంటేటట్టు ఒక్కటేశాడు. దాంతోటి పాపం రైలు నెమళ్ళు కక్కుకుంటూ పరిగెత్తడం మొదలెట్టింది. కావలసినంత బలం ఉంది రైలుకి! ఉండేం? అన్ని పుట్ల ఇనపసామగ్రీకూడా ఒక్కసరమానవుడు ఎల్లాచెబితే అల్లా వింది, వొదిలిపోయింది. నాకేమైందీ? రైల్లో పడ్డానికికాదూ సహోళతొక్కుళ్లాటూజరిగిందీ, ఆపుట్టున కిటికీలోంచి కొడుతూన్న ఆప్రభాతమందపవనం ధర్మమా అని కళ్లు ఇట్టేమూతడి ఊరుకున్నాయి. నిద్దర కూర్చునప్పుడు మరీవొస్తుంది. ఒకొక్కప్పుడు కూర్చుంటేనేగాని రానేరాదు, దాంతగలెయ్యా! అల్లాగే కాస్సేపు జోగి, ఓతఢరకా, ఆకుని! పాట్ల షికారులో నేను మరీ జోరుగా కుడిపక్కకి ఒసిలేసరికి గభీమని మెణుకువ చక్కావచ్చి, "ఎక్కడికొచ్చాం?" అన్నాను. అంటే "ద్వారపూడి దాటాం!" అన్నాడు మాపెత్తండ్రిగారివాడు. ఏమోగాని, "ద్వారపూడి" అనేది చెవిని పడ్డంతోటే నాకు మహాభయం వేసిపోయింది చెప్పద్దూ! అప్పుడే రొండోమాటు వినడం మరి ఆనేరు. అనేంజేశానూ మావాడూ! నేను పైన తగిలించిన నాకోటుజేబులో—పొడుంకాయకోసమే అని జ్ఞాపకం—నిమ్మళంగా చెయ్యెట్టాడు. పెట్టేటప్పటికి టిక్కట్ల దొత్తరతగిలింది; యూదా లాఘంగా అది పైకి తీశాడు. అప్పటికి తెల్లగా తెల్లారింది తీసిచూసి, "ఇదే మిత్రా, ద్వారపూడీ!" అని చదివాడు. అయ్యా చెబితే మీరు నమ్మరూ! నాకు ఒళ్ళునీరైపోయి ఉపద్రంగా భయం,దారుణం గాకోపం బయల్దేరాయి. వాడు, సరిఆటిక్కట్టువెనక్కిపెట్టి తరవాత దానికేసి చూసి "ద్వారపూడి" అని మళ్లీ చదివాడు. "టిక్కట్లమ్మే ద్రోహిగా, ఎంతపనిజేశావురా, నీమొహోన్ని జీడెట్టా!" అనుకున్నాను. నాకళ్లు చింతనిప్పులులా ఆయిపోయాయి. మావాడూ ఒకొక్క టిక్కట్టే తీస్తూండడం చిలక్కిమల్లే "ద్వారపూడి, ద్వారపూడి" అని చదువుతూండడం లంగించుకున్నాడూ! అల్లా పన్నెండు టిక్కట్లు ద్వారపూడికని చదివాడు. చదివి,"ఒరేయి, ఇంకాయూడు ఎక్కువఉన్నాయి యెందుకురా?" అన్నాడు. అనీ, అవిమూడూ కాకినాడకని చదివాడు. అంతాకుడా ఊరికే విస్తుపోయి ఊరుకున్నారు. మా రొండోతమ్ముడు నాకేసి తిరిగి "ముందొచ్చిన మీముగ్గురికీ టికట్లు పుచ్చేసుకున్నావా ఏమి

ట్రా, లేదనుకుని నేను పన్నెండు చెప్పాను!" అంటూ సర్దటం మొదలెట్టాడు. "ఏడిసినట్టే చేశావు! ఇంతేపన్లు! దమ్మిడీసాయం లేదు. మాగోడవెందుకు, తరవాతొచ్చిన స్వరూపాల సంఖ్య నేనడిగి లేనూ!" అని నేను లేచాను. "ఒరేయి, నువ్వూ చదువుకున్నవాడివేగదా! నేను 'పన్నెండు' అనేటప్పుడు "నేను ఇల్లా ఇల్లా మాముగ్గురికీ టిక్కెట్లు పుచ్చుకున్నాను. కడంవాళ్లెందరు?" అని నాతో చెప్పి మరీ అడగద్దుట్రా? అది చెప్పదా! పోనీ, ఏవో కొన్నవాడవు ఎల్లానూకొన్నావు గనక చూసుగోవద్దా, అవి ఎక్కడికిచ్చావో?" అంటూ మావాడు అంటున్నాడు. "ఏముంది వొత్తి భడవారకం, తెలివి మద్దెపు దద్దమ్మలు వీళ్లు?" అంటూ పక్రాళ్లమీద నేను, "నీ పెద్దతనం మట్టుకుపు? ఉన్నమాట మనస్సులో పెట్టుగు ఇవయావు?" అంటూ వాళ్లు. ఇంతలో ఆడవాళ్లు, "ఇందులో తక్కువ తిన్నవారెవరు? అందరి ప్రయోజకత్వాలూ ఒక్క టాకీగానే ఉన్నాయి, అడగాలీవే రేమ?" అని ఈసడింపులు మొదలెట్టారు. నాకు రావణాశేచిక్కవేసింది. అంతా స్వజనం అయిపోడం వల్ల ఊరుకున్నానుగాని, లేకపోతే ఒకొక్కర్ని ఇల్లా చీరేసుందును.

కంఠోకంటిపా డెరక్కుండా, గుడ్ల నీళ్లు కుక్కుకుని, ఈసంగతి కప్పెట్టేసి పైకి మామూలుగానే కనపడగలిగితే వ్యాపారం దివ్యచకోరంగా ఉండేది, సరిపోయేది. కాని అబ్బే, మేమా! వాదప్రతివాదనల్లతో పహోరు జోరైపోయింది. వాటిముందు రైలుచప్పుడు చప్పపడిపోయింది. రైలుఆగిందో, నడుస్తోందో, బోల్తా వేసిందోకుడా మాకు నిమిత్తం లేకుండా పోయింది. గొడుగా పాయె. టిక్కెట్లా మూడు దండగాయె. కడంవా ద్వారపూడికి తనులడ్డాడాయె, నాడి ద్వారపూడి దొంగల్దూరా! ఓహైతే ఏముద్దుం! అక్కణ్ణించి 'చాల్లే తెలివి' అంటే 'చాల్లేతెలివి' అనుకుంటూ, 'నీమూలాన్నే' అంటే 'నీమూలాన్నే' అనుకుంటూ, ఒకరిమీదఒకరు నేరం మోపుతూ, అడ్డమైన హడావిడిలోనూ పడిపోయాం. రైలెప్పుడో సామర్లకోట స్టేషన్లో ఆగి ఊరుకుంది. ఉత్తరక్షణంలో శుద్ధ ఖంగాళుతో, లోపల గొణుగులు, పైకి ఉఱుములు, రుసరుస, తీవ్రంగా చూపులు, చేతులో వస్తువు నేలనెట్టికొట్టడం-వీట్లతో అతికోలాహలంగా కొందరం దిగి ఆడవాళ్లనీ పెట్టెల్నీ దింపడం-ఇల్లా మొదలెట్టామో లేదో ఇంకా, ఆపళంగా యమకింకరుడులాగ బాగా ఓ తాడిచెట్టంత మనిషైతే చక్కావచ్చి,-మాసంగతి వాడెల్లా విన్నాడో, వినకుండా పసేపట్టాడో మండావాడు-ఊచి పుచ్చుకు లెంపకాయ లాగినట్టు, "టిక్కెట్, సార్" అన్నాడు నన్ను. ఇంకా మేం దిగీ దిగకుండా ఉన్న అవస్థలో ఆఫీసరునైన నన్ను ఒక అల్పుడు ఇల్లావొచ్చి దుయ్యబట్టుగోనా అని నాకు పట్టరాని రోషం ఐచ్చింది. అయితే మాత్రం, రోషాలు పనికొస్తాయీ, ఆవేశాలు పనికొస్తాయా చేతులారా చేసుగున్నతరవాత, చెప్పండీ! అప్పుడు, నేను టిక్కెట్టు ఉన్నవాడి బాబులా నటిస్తూ ధిమాకీగా చిరునవ్వుతో, "ఉండనయ్యా! దయచే ,దిగనీ ముందూ!" అన్నానువాడు తొందరగా ఇంకోర్ని అడగడానికి విరగడైపోతాడేమో అని. అంటే, అబ్బే! వాడెక్కడొదుల్తాడూ! మమ్మన్నేపట్టుగున్నాడండీ తిన్నగా వచ్చి! ఎల్లా పోల్చాడో, వాడి తస్సాగొయ్యా, వాడిదామరి ప్రజ్ఞ, తక్కినవాళ్లదా?

పెట్టెలు దింపారు. చివరకి కరకమ్మగారి తల్లినికూడా కిందికి సాయం పట్టారు, అనగా రైల్లోంచి. దాంతోటి, అరిటిగెల దింపడం పనికూడా అయిపోయింది-అంటే ఆవిడ ఒళ్లో పెట్టుగు కూర్చుంది కాదూమరి గెలా! ఇంతలో రైలుకాలకృత్యాలు తీర్చుగుని, ఊగిసలాడి, కూసి విరమించింది. మేం, ఇహా, మమ్మల్ని పట్టుగున్న మనిషి దెయ్యాన్ని వొదిలించుగుని, కాకినాడ టిక్కెట్ల గొడవ చూసుగుని ఆ రైల్లో వేరం వెళ్లిపడాలీ అనుకుంటూంటే, ఎంజేసిందీ కరకమ్మగారూ! మాంచి దెయ్యపల్లా చూపూ ఈవిడానూ, "అయ్యో, హయ్యో, అయ్యో, హయ్యో" అంటూ మొదట చిన్నచిన్న కేకలెట్టి, అక్కణ్ణించి, ఏమని చెప్పను, ఓ తరవాయి లేకుండా, ఓకూను స్వరాలుగావు, ఓదీర్ఘాలుగావు, ఓరాగాలుగావు, మాదుంపతెంపి, పెద్దపెట్టున శోకన్నాలు లంగించుగుంది, కొండవిరిగి మీద పడ్డట్టూ! మామూలుగా

నేను కోపిష్ఠినీకాను, ఏతత్పూర్వం ఆవిడతో ప్రసంగించాలేదు. కాని,రంగం మారిందిగా! అక్కడతోటి నేను పళ్లు పటపటా పిండెల్లా కొరుకుతూ, "నువ్వెక్కడ దాపరించావమ్మోయ్, మంచి శనిలాగోయ్! నీకేమి ఏక్షేత్రం వచ్చిందమ్మోయ్, నీకేమి ఉప్పెనవచ్చిందమ్మోయ్,అంత ఏడుపుకోయ్?" అంటూ సుక్కతిరక్కుండా గర్జించడం మొదలెట్టాను. "టికేట్, టికేట్" అంటూ టిక్కెట్లు సైతాను సంపాదించడం మొదలెట్టాడు. "నాభవిష్యం అంతా మట్టికొట్టుకు పోయిందండోయ్! నా వెండిబంగారాలకీ నాకూ ఎడబాపులు వచ్చాయండోయ్! ఇంతమందున్నారు మళ్లీ, ఆస్తి పిట్టలాగ లేచిపోతూంటే పట్టుగోలేక పోయారండోయ్!" అంటూ కరకమ్మ మరీ గోల చెయ్యడం మొదలెట్టింది. పిట్ట కొద్ది, కూత ఘనం అన్నట్టు ఇంతంత పాలికేకలూ నాటు మేకలా ఉన్న కరకమ్మ వెయ్యగలదని నేను లోగడ ఎరుగున్న వాణ్ణే కానైతే. అప్పట్లో పోనీ అది పబ్లీకు స్టేషను గండా కాస్తనడి తగ్గించుతుందేమో అని భ్రమించాను. భ్రమిస్తే! హెచ్చించింది తస్సాగొయ్యా. నాకు వొళ్లు భగ్గుమని రవిలిపోయి ఆ పైవడ్జమంలో నేనూ అందుకున్నాను. అందుకుని, "నీది పోయిందేమిటమ్మోయ్, అసలోయ్! మాతో ఆమాట చెప్పేతగులడవమ్మోయ్! శుభానికి వెడుతూంటే నీ ఏడుపు బాజాలేమిటమ్మోయ్! ఓఘాయిత్యం కూడానూ! నువ్వేమిటమ్మా మాకోయ్! పెళ్లికెడుతూ పిల్లిని చంక నెట్టుగువెళ్లినట్టు నిన్ను పట్టుగొచ్చాశేమిటమ్మోయ్, మావాళ్లోయ్! పెళ్లిలో దెబ్బలాటలు పెళ్లికొడుక్కీ పెళ్లికూతురికీ తప్ప కడంవాళ్లెవరికీ నమ్మోయ్!" అంటూ జ్వాలాతోరణం లా చెలరేగిపోయాను. "నా టముకుపెట్టి రైల్లో కొట్టుకుపోయిందండోయి. అందులో ఉన్న రొండువందలకీ తిలోదకాలైనా యండోయి" అని కరకమ్మ బాహాటంగా ఏడుపు సాగించి, నెత్తి బాదుకుంటూ చెప్పడం మొదలెట్టింది. సరి, యీ యేడుపులో తల్లికూడా మూలుగుతూ మద్దత్తైంది. మద్దత్తై, వణుకుతూ "మందో వాళ్లదో చూసి మరే ఎడవ్వే అమ్మామ్మోయ్, అవసరంగా ఏడిస్తే తరవాత మళ్లీ ఏడవాలి" అంటూ కూతురుతో సలహా.

అక్కణ్ణించి నేను "అప్పచ్చపుమాట లెందుకమ్మా! ఇరవై పెట్టెలు దిగాయికందా మావి, నీకు ఒక్కగాని ఒక్క పెట్టాయిరి (తలగడా అంత)? మమల్ని చంపుకు తినడానికి కాకపోతే, నీకొచ్చిన యేళ్లకి, అదొక్కటే నువ్వు దాటపెట్టుగోవాలీ, చెప్పూ! గాల ఆముసిలిదే పట్టుగుందికదా, నువ్వు చేస్తూన్న ఉద్యోగం ఏమిటి, వెధవ ఉద్యోగం నువ్వూను! "అల్లాగ- ఇల్లాగ అంటూ నేను మండిపడ్డాను. ఏమడుగుతారుకథా! నేనేమో కారాలూమిరియాలూనూ, ఆవిడా తల్లీ! మహాలక్ష్మణా అని ఏడుపులూ పెడబొబ్బలూనూ; పక్క టిక్కెట్లకిటికీవాడు సతాయింపూ! మావాళ్లు "ఊరుకోరా, అబ్బా! ఊరుకోవమ్మా!" అంటూ. ఊహూ లభాయిలూ రభాయిలూనూ!ప్లాట్ఫారం మీద అశేషజనం ఆశ్చర్యంవేసిపోయి నవ్వులకి పడ్డారు. అప్పుడు, మహారసకందాయప్పట్టులో ఉంది వ్యాపారం, అని చెబుతోచ్చారు, పైవాళ్లు!

ఇల్లా నడాడుతూంటే, ఆకాకినాడరైలుకాస్తా ఊడాయించేస్తుందేమో అని చెప్పేసి, మావాడు-నాలరవాలవాడు-వాడివగ్గిర(ఏమాటకామాటే చెప్పుగోవాలి) బాగా కార్యనిర్వాహకత్వం ఉంది!-టిక్కెట్లపంతుల్నికాస్త అసింటాలాక్కెళ్ళి లోపాయికారీగా వాణ్ణి సంతోష పెడతానని వాడికి ఆశపెట్టి వాడిచేత ఇంతమందికీ (సరే,మతిమండినట్టే ఉంది! ముగ్గురికి ఆహారించాయిగా! కడంవాళ్లకే) టిక్కెట్లు తెప్పించి, వాడి కేదో ముట్టచెప్పి, ఓరొండు కరుకురూపాయిలు స్టేషనుమేష్టరు పాదాలదగ్గిర పారేసి, కరకమ్మని తీసిగెళ్లి ఆయనకి అప్పచెప్పి-రాజమండ్రీనించి తమతో కలిసి కాకినాడ ప్రయాణం చెయ్యదలచి కూడా వస్తూన్న ఆమనిషి తాలూకు కిమ్మతయిన ఓట్రంకుపెట్టి వొత్తి అజాగ్రత్తవల్ల చెయిదాటి వాత్తేరుకేసి కొట్టుకుపోయిందనీనీ, అది వెనక్కి తెప్పించిపెట్టి ఆవిడికి అందజేసి పుణ్యం కట్టుకోమనీనీ ఆయనతో అనేసి, బతుకు జీవుడా అని అక్కడ ఆవిణ్ణి వొదిలించేసుగుని, మేం అంతా ఈలోపుగానే ఎక్కినిరీక్షిస్తూన్న పెట్టిలోకి ఇహ రైలు కదుల్తోందీఅనేవేళకి వచ్చిపడ్డాడు. కరకమ్మతల్లి, వాళ్ల బంధువు లెవరో కాకినాడవాళ్ళు కనబడితేనూ, అరిటిగెల ప్రాణపదంగా

పుచ్చుగుని మూలుగుతూ వాళ్ల పెట్టిలోనే కూర్చుంది. సరే, మేం కాకినాడ జేరుకున్నాం మెట్టుకి.

ఆసాయంత్రం రైల్లో వస్తానన్న మా స్నేహితుడు రాత్రి లగ్నం గనక కాస్తకద్దనగానే వచ్చి తరవాత వృత్తాంతం తను చెప్పాడు. అయిదింటికి ఆయన సామర్లకోటస్టేషను ప్లాట్‌ఫారంమీద విహితుల్తో కలిసి మాటాపలుకూ ఆడుకుంటూంటే, గాలిపు కొట్టినట్టు మొహం ఎండిపోయి, కళ్లు బాగా ఇంతలోతుకి దించుకుపోయి కనకమ్మగారు చక్కావచ్చి, ఆయనతో (పొద్దున్న జరిగిన సంగతి సాయంత్రం వచ్చే ఆయనకి కొట్టినట్టైనట్టు) "దొరికిందండి పెట్టి: పట్టుగున్నారు, పాపం! ఏమీ పోలేదు. అరిటిగెల ఎక్కడుందో మీకు తెలుసా" అందిట. "పెట్టేమిటి, అరిటిగెలేమిటి" అన్నాట్ట ఆయన. అంటే, "మాఅబ్బాయి వచ్చాడుగా, మాతమ్ముడూ! మా తమ్ముడికి జీతం! వాడొచ్చి నాపెట్టి పెళ్లిగ్రాపులో తెప్పించాడు." అని మళ్లీ అందిటావిడ. అప్పుడు "అయితే ఏమంటారు? పెట్టేమిటి? అరిటిగెలేమిటి? అబ్బాయేమిటి? ఇదంతా యేమిటి?" అని ఆయన తరిచి తరిచి అడిగిన మీదటగావును, ఆవిడ తన పెట్టి తప్పిపోడం—ఏది!—సంగతీ, సందర్భం, దొరకడం, అరిటిగెల తనుదే అనీ, అది వాళ్లమ్మ ఎక్కడేనా వొదిలేస్తే, పెళ్లివారు జాగ్రత్తచేసుగుని రైలో అత్తం చుడిగట్టుకుని నోట్లో వేసుకుంటారేమో అని తనకి భయమనీ, కూలివాడికి డబ్బులిచ్చేసి మేమే అది తమబసలో పడెయ్యవలిసి ఉంటుందనీ, ఏమిటేమిటో చదివిందిట. కాని, ఆ చవటగెల ఎవడిక్కావాలి? పైగా, ముసిల్ది ప్రాణమేనా వొదుల్తుందిగాని, గెలవొదిలిపెట్టి ఒక్కక్షణమేనా ఉండందే అసలు! సరి, గెల ముసిద్దే పట్టుకుపోయిందని మా స్నేహితుడితో చెప్పేశాం, అక్కణ్ణించి, "ఓరి మన కంగారు బంగారంగానూ" అనుకోడం మొదలెట్టాం.

పెళ్లిసీస దీంతో వొదిలింది మాకూ అన్నట్టు పెళ్లి లక్షణంగానే జరిగింది. అంతా చివరంటా సవ్యంగానే ఉంది. ఆఖరికి, మరోమాట! మేం కాలక్రమాన్ని రాజమండ్రీ వచ్చేసినతరవాత, ఇక్కడ తప్పు టిక్కట్లు ఇచ్చినాయన, పాపం, జ్ఞాపకం చేసుగుని మాకు డబ్బు మదరా ఇచ్చేశాడు. బండీవాడు—పోనీ, బండీఆయన—గొడుగు మాకు వాపసు చేసి తనబేడా పట్టుగెళ్లాడు. కాని, "పెళ్లిగ్రాం తాలూకు ఇచ్చిన రొండు రూపాయలూ మట్టుకు కరకమ్మగారిదగ్గిర వసూలు చెయ్యలేక పోయానుగదా, తస్సాచెక్కా!" అని కొంతకాలం నేను అనుకోవలిసిన అవసరం వచ్చినా, పాపం, ఆవిడా ఇచ్చేసింది. అవాంతరాలూ, ఒడుదుడుకులూ మధ్యమధ్యేగాని, చివరకి, అబ్బే, ఏంలేదండీ!

---

# ప్రియాస్మృతి

గుఱ్ఱం వేంకట సుబ్బరామయ్య గారు, యమ్. ఏ.

('ప్రకృతి కృపణుఁడు')

"కామార్తా హి ప్రకృతికృపణా శ్చేతనాచేతనేషు"

౧

కఠినకారాకవాటముల్ గడెలు వడియెఁ;-దోడ మినుకను దీపమ్ము తొలఁగిపోవఁ
గ్రమ్ము నిరులకు సయిదోడు గాఁగఁ, బర్వెఁ-గనుల మొగుడుచు నిదుర చీఁకటుల గములు.
అనుదినమ్మును గృశియించు నాత్మసార-మశ్రుధారల సోనమై యవనిఁ జెంద,
మృత్యుదేవికిఁ గరము సమీపమయిన కయిదులను బట్టె నామె కింకరి సుషుప్తి.

౨

కాని నామది నేవేళఁ గాచియుండు-అలఁతపడఁతియొ నిదురకు నాఁకనెట్టి
హృదయ మొత్తుచుఁ దేనియ లూదవఁ బిదుకుఁ-జెఱుకుఁ బిండెడు గానుగ చేడెవోలె.
అలఁతచెలియరో, నీ తత్త్వ మంత కనమి-నే నొనర్చిన దూఱు మన్నింపు మమ్మ;
కొలఁది కొలఁదిగ, సన్మైత్రి బలెఁ ద్వదీయ-పూర్ణభావమ్ము నెమ్మదిఁ బొదలెఁ, దల్లి.
చచ్చు నాయాత్మ కెయ్యది స్వర్గభూమి;-కాఱు కన్నీటి జడి కెద్ది కడలిసీమ;
ఆఱు జీవాగ్ని రగిలించు ననిల మెద్ది; - తలఁపు కెక్కుట నీమహత్త్వమునఁ గాదె.
స్థలము కాలమ్మునను గింకరులను గొనుచు-జీవి బంధించు ప్రకృతికిఁ జేవ యణఁచి,
క్షణములోననె, యాత్మలఁ గౌఁగిళులను-గూడ, మార్గమ్ముఁ గల్పించు ప్రౌఢ వీవె.
అట్టి నీదుసహాయత నంది, యేను-భువన విశదంపు మన్మనోభూమియందు,
తలఁపు దీపిక తేటకాంతులను నెఱపఁ,-గలయు దిప్పుడె నాముద్దు వలపుచెలిని.

౩

మించు మందారపర్ణనిర్మిత గృహమునఁ - గరఁగు నెలఱాలవలిపంచ టరఁగుమీదఁ,
వఱదగట్టెడు కరుణంపు వానఁ గురియు-మోము చిఱుకొంగునను గప్పె ముద్దుచెలియ.

మిసిమిమాయించునీమోముముసుఁగుఁద్రోచి-ప్రాణకాంతరో, నామీఁదఁబఱపుచూడ్కి-
తల్లిఁ గోల్పోయి, యాఁకట నల్లలాడు-నిసువు నాహృది నీచేతి కొసఁగువాఁడ.

స్థితులు గతులను కటికంపు చీఁకటి తెఱ-యెసఁగ, మన భౌతికపు దృష్టి ముసుఁగు గప్పెఁ
గఠినప్రకృతియె తొలుత; నింకను ముసుంగుఁ-గప్పి, దానికిఁ దోడ్పాటు గాఁగ నేల.

వీడ వేసవి, ముంగురుల్ పోడిమి విడఁ-గుసుమ సుకుమారతనువున వసి చనంగఁ,
బాణిఁ జెక్కిట నూఁది, యాసీన వగుచుఁ,-గరుణ రూపన, నెమ్మదిఁ గ్రాఁతె, సఖియ.

నీరు వెలివడ్డ నెఱిచేఁప నిసువువోలె,-తొడిమగిల్లిన చివురులేమడుపు లీల,
నిశిత శరహత మవ్వులేడిశిశువు కరణిఁ,-గొన యుసురు వూని, నాకయి మనుదె, చెలియ!

తెఱను వెసఁద్రోచి, యిటు చూడ్కిఁ బఱపి, కనవె-కరఁగి సొంపఱు నీమనోహరునిరూపు;
గరుణ, దైవమ్ము మనకిరువురకు, సఖియ,-వలపు బంధాలతోఁ గార్హ్యబంధము నిడె.

విరససృష్టిని మోమెత్త విసివి, చెలియ,-శిరము డాఁచితె యాత్మ గహ్వరపుటిరుల;
విశ్వ సృష్టి కతీతమౌ ప్రేమదీప్తి-భవ్య కిరణాళి నయ్యెడఁ బరగనిమ్ము.

౪

కలిత నిర్మల తరుణిమ గగనసీమ,-సరస నూతన రమణత చదలితటిని,
జలద బాలురు మెఱుఁగు బాలలనుగూడు-కమ్మతావున, నొండొరుల్ కనమె మొదల.

వెసల నవ్యోఢ నునుదియ్య రసము నింపి,-కమ్మవలపుల బుగబుగల్ గ్రమ్ముకొనఁగ,
మలయు కలకంఠ బాలికా మధురరుతులఁ - జొక్కఁజేయదె నీగానసుధ, పడంతి!

ఉదయరక్తిమఁ దోఁపింప వదనసీమ, - స్వర్గకిరణాళిఁ గనుదోయి సరసమాడఁ,
గనక నవకాంతులల్లిన కందుకమనఁ - గనులఁ గట్టదె నీమేనికాంతి, యపుడు. [వుచు,

కనులఁ దొలుదొల్త నొండొరుల్ గలసినపుడె,-కరఁగి హృదయాలు ప్రేమ పుష్కరముల
భూతమయ తుంగ తట తలంబులను మీఱి,-మిలితమయిపోవెయొండొంటఁగలసి, చెలియ!

పిన్ననవ్వులు దొలఁకు వాల్కన్నుఁగొనల-చూచి చూడని చూడ్కుల చొక్కులొదవ,
విద్యుదాలోకనామృత వృష్టి నెఱపి, - నన్నుఁ బరవశుఁ గావించినావు గావె.

౫

మంజువనసీమ, సుకుమార మారుతముల-వలపుఁ జిలికెడు పూసెజ్జ మెలఁగునపుడు,
మృదుల సుమమని సృష్టి నెంచెదముగాని,-కఱకు ముండ్లను దాల్చుడు తెఱఁగ లేమ!

పువ్వుఁబోఁదల పజ్జ, మావి లేఁజివురు సంజ,-నెఱిసోనల ఫొంతఁ, బండువెన్నెల బయళ్లఁ,
గలసి మెలఁగమె, దైవమ్ము వలపుసూత్ర-ముల నటింపఁగఁ జేయుబొమ్మల వితాన!

కలయ కనుగొన చూపులే వలపుపలుకు,-లలరు చిఱునవ్వు పువ్వులే వలపు కళలు,
వెలయ లలితంపు చెయ్వులే వలపుసొలపు-లవుచుఁ, బరిపూర్ణమోదసంభవముఁగనమె.

మరులు చక్కెరపలుకులై కరఁగినపుడు,-చూపు లమృతంపు ముద్దులై సురిగినపుడు,
లీల లార్ద్రింపు కౌఁగిళ్లఁ దేలినపుడు,-నవధి మెఱుఁగని పారవశ్యమ్ముఁ గనమె.

స్వచ్ఛకమనీయ హృదయ కాసారసీమ-లుదితరాగాంబుతతి కెట్టి యూటపట్లొ,
వెలునడుకొలంది మనప్రేమ వృద్ధి గనుట-విశదమేకాదె నెమ్మది, వెలఁదిమిన్న.

మలయపవన కిశోరముల్ మలయుచుండఁ, బండువెన్నెల నిండిన బయలఁ గూడి
మెలఁగు నప్పటి యింపు చెయ్వులను-మదిని-దలఁపఁ దన్మయత్వమ్ముఁ గనమె.

౬

నిమిషనిమిషమ్ము నవవికాసములు వొలయు-వలపు నిండిన యయ్యాఱు నెలలలోన.
ప్రతినిమేషము గనినట్టి భవ్యవిద్య-జన్మశతములఁ బఠనమ్ము సలుప వశమె.

అమల నవరాగ సందీపితాత్మగృహము-లొండొరుల కున్కి-పట్టులై యొప్ప మిగులఁ,
వికసితాన్యోన్యహృదయజాలక పథములఁ-గనమె విశ్వంపుటెల్లెడఁ బ్రణయదీప్తి.

వలయితాన్యోన్య వనతరువల్లి కాళి, చుంబితాన్యోన్య దిఙ్మండలాంబరయుగి,
భాషితాన్యోన్యతారకా బంధుసమితి,-రమణిరో, స్వీయహృదయ బింబములఁగనమె.

ఒండొరుల సోఁకు తృణమునం దుండువిలువ,-కవల విలసిల్లు చిన్ని జక్కవలచొక్కు,
అలరు నైనను జిదుముటం గల దొసంగుఁ,-గంటి మప్పాడె, వానిపై నంటుకలిమి.

౭

ప్రణయరమణీయ భవదాత్మ భానుకిరణ-పూర్ణవికసితహృదయపద్మండ నగుచు,
మగువ, క్రోలుట మెఱుఁగవే మాతృభువన-మహితచరణాబ్జ నిర్గళన్మధురసమ్ము.

విశ్వమున కెల్ల రాణి యై వెలసినట్టి-భవ్యభారతమాత, హా! బానిసయయి
వగపుఁ గుడుచుట కెంతయు వనటవొంగ,-భావరుజ కొంత గీతాళి బయలువడదె.

ఊఁగులేఁగొమ్మ నుయ్యాల లూఁగి యాడి,-చివురు తీపుల గానమ్ము సేయుపికము
లీల, నునుదియ్యపాటలఁ దేలుచుంటిఁ;-గఱకువేటర్లు ఫొంచుండు టెఱుఁగనైతి.

కొమరు వనసీమలో, నాటకొలఁకుపజ్జ, - దేవకన్యలు చవు లాను తియ్యగీతి,
కాయ చైతన్య మణఁగించు గరళ మయ్యె;-విసమవేళల నమృతమున్ విసము గాదె.
కూర్చునే కూనఁ గన, వనీకుసుమతన్వి - అంగ మెల్లను పువుకన్ను లవుచు వెదకు;
నట్టి కోయిల నుఱ్ఱుత్రాటఁ గట్టివైచి,-ఔర! మృగయులు కఠినమూాఘాత్ము లగుట.

౭

బంధనపువేళ, గుండియల్ భగ్గు రనఁగఁ,-గరఁగి చైతన్య మశ్రుల కాల్వ గాఁగఁ,
బాసి పోఁ జాల, కెంతయో పనవి పనవి,-యెటులు వీడితిమో యేరి కెఱుక, చెలియ!
గాన లాలిత్యమునఁ జొక్కి, మేను మఱచి,-పాలకౌఁగిళ్లఁ బయ్యెదఁ బవ్వళించు
నిసువులను మమ్ము గొంతులు నిసికి వైచి;-ఔర! ప్రకృతిరో, యిట్టి క్రూరాత్మ వీవు.

౯

నాఁటినుండియు మన మది నాటికొనియె-విమల పరిపూర్ణసాత్త్విక ప్రేమ, చెలియ;
మోహకలుషిత కామమ్ము పుటమువడిన-హృదయవిరహాగ్ని, మోహమ్ము వదలి పోవ.
భౌతికాస్థిరమలిన మ్మె వాసిపోయె;-స్థిరతరానంద భరితాత్మ చేతఁ జిక్కె;
ఆర్తి నింకను విడకుండు టరయ, సకియ,-అనుఁగు మనముల వెలతెల్వి చనుటకతన.

౧౦

జగము లెసఁగించి భాసిల్లు గగనమణిని,-చల్లకాంతుల విలుచు జాబిల్లి చెలిని, [లియ!
చూడ్కి మిన్కులఁ జొక్కించుచుక్కగములఁ,-గూర్మి ధ్వంసించునాఁడె వీడ్కొంటిఁ, జె
వలపుఁ గనుచూడ్కి నిగురించు వలపుమిత్రు,-వలపుఁ జల్లుచు వీతెంచు వలిమలచెలి,
లలితపల్లవరహి నించు పలుకుఁజెలిని,-వీడు టయ్యెను, జెలియ, నిను వీడునాఁడె.
రాజు హృదయాగ్ని రగిలింప రావు, సకియ,-కూర్మి యిసుమంతయును లేని క్రూరఘృ
కమరుకన్నుల నెల్లప్డు కరుణఁ గప్ప-నంధకారమ్మె హృదయ సౌమ్యమ్ముఁ గూర్చు [ణులు;
హృదయ మెగఁ గొట్టి నొప్పింప నెపుడు, చెలియ,-దివ్యగోష్ఠీరసఫలముల తియ్య చవులు;
ఉప్పునీళుల తడిసి యుండి యుండనట్టి-యంబళులు సంకటులె గుండె నణఁచి వెట్టు. [పు;
గ్రుచ్చి చెవులను, హృదయమ్ము వ్రచ్చవు, చెలి,-తలఁపుఁ జొక్కించులలితంపు వలపుపిలు
లఱుత రాల్పడు నేప్పుల కఱకుటఱపె-రసపుమందును గ్రోలన దొసఁగు మాన్పు.

దివ్యసంపద లెల్ల నదృశ్య మగుటఁ-బాడువడినట్టి నాయాత్మభవనమందుఁ,
గటికి చీఁకట్లు కప్పి యుండుట నిజమ్ము,-లలితకళ దేఱు నీరూపు వెలుఁగ కున్న.

౧౧

భూతమయముల రెండురూపులను దాల్చి-నిలువు గంటిమి స్థలకాలనియతసృష్టిఁ;
బథము ప్రేమమ్ముగా సృష్టి నధిగమించి, - కొంటి మైక్యత; నింకేమి కొదువ మనకు.
కాయమాలిన్య మెల్లను బాయ మనకు, - సౌఖ్యసంపద నిండారు సత్యభూమిఁ,
బొన్ననీడలఁ, దియ్య పూఁబొదరుటిండ్లఁ, - గమ్మకౌఁగిళ్ల తన్మయత్వమ్ము నిజము. [లు;

౧౨

చమురు వ్యయ పూటఁ, దలఁపు దీపమునఁ గాంతి-తఱుగ, మానసభవి నెల్లఁ బెరిఁగె నిరు
అలఁత పడఁతియు మార్గమ్ము తెలియఁ జూప;-డింక గతియేమి, సెలవిదే యిమ్ము, చెలియ!

౧౩

అకట! ముసుఁగిడె మెడఁ ద్రోయు చనుఁగుసకియ-కనుల శోకంపుఁ గట్టెఱ్ఱకాంతి మెసఁ
అశ్రు లదరెడు పెదవిపై నల్లలాడ,-దీనవదనాబ్జ మిదియె, యెత్తెడిఁ గడంక. [గ,
కాయమా, కాంత కన్నీళ్లఁ గరఁగిపొమ్ము!-తేజమా, కాంత కనుదోయిఁ దేలిపొమ్ము!
చిత్తమా, కాంతముఖరక్తి హత్తిచనుము!-ఆత్మరో, కాంత నెమ్మేన నైక్య మగుము!

౧౪

అయ్యయో! సర్వమును మాయమయ్యె నిపుడు;-చేరువను కోళ్ల కొక్కొరొకో రవమ్ము
ప్రకృతి శాంతికి ఘనజయధ్వాన మనఁగఁ-జాలె దినలక్ష్మి మేల్కాంచు సమయ మగుట.

---

౧

శంప తెలివితేటలుగల చేటి. అది సంకర జాతులలో వివాహములు కుదుర్చును. దానిబంధము ముందు, సూత్రబంధము పిఱుంద.

కులీనులయిన బీదవారి యిండ్ల తనకు వధువును విచారించిపెట్టుమని అకులీనుఁడు శంపకు లోఁగడ చెప్పియుంచెను.

సూర్యుఁడు అస్తమించిన పిదప లక్కి‌-ఇంటితోఁట-కట్టవకడ తనతో కలిసికొని మాట లాడ రమ్మని శంప అకులీనునకు వార్త పుచ్చెను.

అకులీనుఁడు రాజగృహమునకు పంప వలసిన పదార్థముల నన్నింటిని బంటులకు ఇచ్చి వడిగా పంపివైచెను.

కనకలత పూలచే చక్కఁగా అలంకరించు కొనెను. నడుమఁగల చంద్రకాంత చిత్రము వలె గృహోద్యానములోనికి పరిక్రమించెను. కనకలతను గృహోద్యానలత లన్నియు నిశ్చలములై చూచుచుండెను. కనకలత కానిపించు వనదేవత కాఁబోలు.

లతలకు కనకలత ఇచ్చినరాగము కంటె సంధ్య ఎక్కువరాగ మీయలేక పోయెను. చంద్రకాంత పుష్పములు చంద్రుని దెసకంటె కనకలతాముఖముదెసనే ఎక్కువ మ్రొగ్గెను.

అకులీనుఁడు కట్టవబయట నిలువఁబడి యుండెను. శంపకొఱకు చూచెను. అతనికి ఉద్యానమున నడయాడుచుండిన కనకలత కాని పించెను.

కనకలత ఒకతూరి మోమెత్తి చంద్రుని చూచెను. అకులీనుఁడును చూచెను. అతఁడు చంద్రుని చూడక కనకలత - ముఖమునే చూచెను.

కనకలత ఎత్తినమోము వాల్చి అకులీ నుని మోము కాంచి మరి చంద్రుని చూడ లేదు.

తాను చూచుచున్నటులు కనకలత ఎఱుఁగదు; తాను చూచుచున్నటులు అకులీనుఁ డెఱుఁగఁడు.

సౌందర్యము స్త్రీయందే పరినిష్ఠిత మని అకులీనుఁడును, పురుషునియందే పరినిష్ఠితమని కనకలతయు అనుకొనిరి.

కనకలత కొంచెము పరిక్రమించెను. అకులీ నుఁడును పరిక్రమించెను. రెండుఛాయలును కలిసికొనెను.

ఇంటిలోపలి నుండి లకుమ కంచుకుత్తుకతో-కనకలతా! ఎంతసే పక్కడ? రా లోనికి రా!-అని అఱచెను.

కనకలత మెడ మలఁచి చూచుచు లోనికి మెల్ల మెల్లగా వెళ్లెను.

అకులీనుఁడు కను లొక్క-కన్నుగా కన్నొక్క-చూపుగా చూచెను. ఆచూపుల ఆకర్షణమునఁ గాఁబోలు,కనకలత వడిగా లోనికి వెళ్లలేక పోయెను.

అకులీనుఁడు తన వెనువెనుక శంపను చూచి ఉలికి పడెను.

శంప—ఉలికి పాటేల?

అకులీనుని మోము కొంచెము మూసెను. చెమరింపలేదుకాని వేఁడి యెక్కెను. అతనికి ప్రత్యుత్తరము తోఁపలేదు. అది యటుండె, సంభాషణమునకు ఆరంభము కానిపింపలేదు.

శంప—నేను కొంచె మాలస్యముగా వచ్చితిని, క్షమింపవలయును.

అకులీనుఁడు కోలుకొనెను. 'మంచిది; తొందర యేమియు లేదు లే.'

శంప—నేను నేఁడే తిరిగి తిరిగి వచ్చితిని.

అకు—మంచిది.

శంప—విశేషములు తెలుప నక్కఱ లేదా?

అకు—అక్కఱ లే కేమి?

శంప—సావధాను లేనా?

అకు—ఔను.

శంప—నెల్లూర సిద్ధశ్రేష్ఠి కూఁతురు ఉన్నది. పిల్ల కొంచెము చామనచాయ. కన్నులు కాటుక పిట్టలు.

అకు—పిట్టలు మనుష్యుల కేల?

శంప—ప్రొద్దుటూరున సెనగల రామమ్మపిల్ల. పిల్ల మోమున ప్రతిబింబము చూచి కొనవచ్చును.

అకు—అద్దములు లేవా?

శంప—గూడూర బద్దెమ్మ కూఁతు: వెల నాలుగువేలు. ఇంకొక వేయికూడ పెట్టనగును.

అకు—బేసి సరిపడదు.

శంప—చందవోలులో—

అకు—ఈయూర నెవరును లేరా?

శంప—నా యెఱుకలో పెండ్లికి తగువారు లేరు.

అకులీనుఁడు ఉద్యానముమీఁదుగా లకుమ-యిల్లు చూపించెను.

శంప తనపన్నాగము పాఱినదని సంతసించెను. ఆలోచించినటులు ఆలోచించి 'లకుమయా?' అనెను. అకులీనుఁడు వికారముగా నవ్వెను. శంప 'కనకలతయా?' అనెను. అకులీనుఁడు చూచుచు ఊరకుండెను. శంప 'మంచిది' అనెను.

౨

లకుమాదేవి అద్దంకి మహారాజుగారి ఉంపుడుకత్తె. మహారాజ్ఞికి విషము పెట్టినదని తేలుటచే నగరినుండియే కాక మహారాజు మనస్సునుండియు వెళ్లఁగొట్టఁబడెను. లకుమాదేవి వెంటనే లకుమ యాయెను. పిదప లక్క-

మ్మ ఆమెను. తరువాత లక్కి యామెను. ఇపుడు-లక్కి.

లక్కికి పదునెనిమిదేండ్ల యీడుగల కూఁతురు ఒకతె కలదు. అది కన్నకూఁతురు కాదు, కొన్నకూఁతురు.

దానిపేరు కనకలత.

కనకలత చిన్నపుడు గ్రుడ్డిది. లకుమ అనేక వైద్యులచే పలుపాట్లుపడి బాగుచేయించెను. ఆవిశ్వాసముచే కనకలత లకుమలో తల్లిని చూచెను.

కనకలత యిపుడు పద్మాక్షి.

కనకలత పాడుచో కోయిలలు ఆలకించును. అభినయమున అందె వైచినది. అది అర్థము చెప్పఁబూనుచో పదములు కరఁగిపోవును. నగరమునందలి సుందరపురుషుల నందఱను ఒకసారి కనఁగోరితివా, కనకలత పాట పెట్టింపుము.

సుందరులైన ఎల్లప్రాయమువారు దాని రూపము చూడఁగోరి వచ్చి, పాపము, సంగీత మాధుర్యముచే తన్మయులై వంచితులగుచుందురు; గానము వినఁగోరువారు రూపముచే మోసపోవుదురు.

కనకలతాసౌందర్యగీతములు మాయామోహములు; సంగీత సౌందర్యములు మోహ మాయలు.

కనకలతను యువరాజునకు ఉపపత్నిని చేయవలయు నని లక్కి కోర్కి కాని యువరాజు వార్త పంపెను—కనకలత చెల్లెలివావి అని.

లక్కి అనెను— వారాంగనకు వావి యేమి? అసలు వావి యేమి? శ్రీకృష్ణుఁడు భగవంతుఁడు - స్రష్ట - రక్షకుఁడు - నాశకుఁడుకదా! ఆయన పెండ్లాడిన వారందఱు ఆయనచే సృజింపఁబడిన వారేనా? బ్రహ్మకు సరస్వతి యేమివావి? తురుష్కులకు క్రైస్తవులకు ఎట్టివావులు? యువరాజు వెఱ్ఱివాఁడు.

కనకలత కొంచె మాలోచించి, లోలో సద్భావొని—వావిలేదా? అతఁడు అన్నవావి కాదా?-అనుకొనెను.

రాజభయము తీఱినది. లక్కి కనకలతకు ఆదేశించెను—"ఎవరినైనను సరే 'బావా'అని పిలువుము" అని.

ధనికు లొకరొక్కరే తమకుఁ దాము మేము మే మని కన్నెఱికమునకు వార్త లంపసాగిరి. లక్కి- సేనాపతి లకుమయ్య కుమారుఁడు రాజన్నను ఏఱెను.

కనకలత—'సేనాపతిగుండెరాయి. వానికి దినదినగండము. రేయుంబవళ్లు కొలువు'అనెను.

'అన్నివిధముల అటువంటివాఁడే మనకు అపేక్షితుఁడు. విశేషించి అతఁడు బ్రాహ్మణుఁడు. బ్రాహ్మణపూజ మనకు ప్రథమ కర్తవ్యము. పిదప ఇతఁ డెల్లకాల ముండునా? ఇతఁడు కన్నెఱికపు మగఁడే.'

కన—సర్వకాలము ఉండఁడా?

'జగత్తంతయు మాయ'అన్నటులు నవ్వి, లక్కి-- 'నీవు సానివా, సంసారివా?'

కనకలత ఆలోచించెను.

లక్కి——పోసీ! జయపాల-

కన——సరే.

లక్కి——విత్తగుప్త?

కన——సరే.

లక్కి——రామదాసు?

కన——సరే.

లక్కి— మరి యేఁబది పేరులు చెప్పెను. కనకలత ఏఁబదిసరేలు చెప్పెను.

లక్కి--'భేషు! నీవిపుడు సానివి'అని 'అకులీన ?' కనకలత ప్రత్యుత్తరము చెప్పలేదు.

అందఱిలో అకులీనుఁడు ధనికుఁడు. కులగోత్రహీనుఁడు కావున అవివాహితుఁడు. మహారాజుగారి మోక్షీ.

3

శంప లకుమకు అకులీనుని అభిప్రాయము చెప్పెను.

లకుమ ఆలోచించి ఆలోచించి అంగీకరించెను. కన్నెఱికపు ఖరీదు రెండువేల నూటపదార్లు. చిల్లర మల్లరలు అయిదు నూర్లు.

కన్నెఱికమునకు లగ్నము తొందరలో పెట్టవలసినదని లకుమ జ్యోతిష్కుని కోరెను. ఒకనెలలో సుముహూర్తము కుదిరెను.

లకుమ సర్వసన్నాహములు చేసెను. అకులీనుఁడు అయిదువందలు సంచకరము పంపెను.

కనకలతకు ప్రైనం దినము స్వప్నములే.

శంప రాత్రి పనిపాటలు చేయుచు లకుమను కంపస్వరముతో పిలిచెను. లకుమ శంప కడకు పరుగిడెను. శంప తల ఒకప్రక్కకు ఓరగా ఎత్తి, తర్జనిని వెనుకకు చూపి—'ఆలకింపుము! ఆధ్వని! బందిపోటు!'

లకుమ గుండెలలో రాయి పడెను. కనకలతను పిలిచెను.

కనకలత ఆలకించి—'అది సేనాపటహధ్వని. నెలక్రింద మనరాజుగారి సేనలు సరిగా ఈదారినే వెళ్లినవి.'

శంపయు, లకుమయు ఔనౌ ననిరి; వారివారి పనులలోనికి వెళ్లి పోయిరి.

అద్దంకిసేనలు తురుష్కసేనల జయించి వచ్చుచున్నవి. విజయోన్మాదముచే సేన తాండవించుచుండెను. సేనామార్గమునందలి తోఁటలను చూచినచో అలనాఁటి మధువనము గుఱుతు వచ్చుచున్నది. బంటు లెలుఁగుబంటులవలె తాళ్లెక్కి కల్లు త్రావిరి. గ్రామములు కొల్లఁగొట్టిరి. ఆసేన వర్షాకాలపు సెలయేఱువలె అన్నింటిని ముంచి పాఱఁజొచ్చెను.

కనకలత శంపాలకుమలవలె ఇంటిలో కూరుచుండలేదు. దాని యౌవనరక్తము త్కంఠచే ఉచ్ఛ్వసించెను. తలుపు తెఱచి అట్టిట్టు చూచెను.



పియకీ బాతచలావే సహైలీ తిహీ సంగ ఆపనో నహకి యేహై। పుష్పోం సరోరుహ హాథలియే ఈహీ ఖ్యాలహీకీ ఝుత ఆపుహీ యహై। శ్రీఫలచాహ బిమోగభరీ ఈకకామనీ చేత విచిత్రలియేహై। యాబిధ భైరవరాగకీ రాగనీ మాలశ్రీ ఆనంద దియేహై॥

[జయపుర చిత్రము: దివాన్ బహదూర్ చతుర్భుజదాసు గోవిందదాసుగారి యనుమతిని]

మూలబలము గంభీరముగా నడచిపోయెను. కూటువమూఁక వచ్చెను.

ఒకసైనికుఁడు మరొకనినిగిఱి-'ఓసీ,అదిగో-గృహచంద్రిక!'

మరొకఁడు—గ్రామచంద్రిక.

వేఱొకఁడు—దేశచంద్రిక.

ఇఁకొకఁడు—ఇంతపెద్ద పేరేమిటిరా? ఊరబసివి అనరాదూ?

ఒకఁడు కనకలతకు సైగచేసెను. ఇంకొకఁడు రమ్మని పిలిచెను. కొంతొకఁడు కనకలతకేసి రెండడుగులు పెట్టెను. ఒకఁడనెను—'సేన నంతయు పోనిమ్ము-మనము పదుగురము దళపతితో మిగులుదము' అనెను. సేన యంతయు నడచిపోయెను. కనకలత వాహిని ముందరికి ప్రవహించుట చూచి లోపలికి వెళ్లి తలుపు మూసెను. కనకలతచేతిని ఒకబలిష్ఠమగు చేయి పట్టుకొనెను.

రాజుగారిచే బహివెట్టఁబడినది కావున సైనికులకు లకుమ యనిన 'నల్లేరుపై బండి.'

దళపతి ఆజ్ఞచే శంపను ఒకమూల, లకుమను ఒకమూల కట్టివైచి నోట గుడ్డలు గ్రుక్కిరి. కనకలతను దళపతి పట్టుకొనెను.

నగ నుట్ర దోచుకొనిరి. అకులీనుని బజాన్నా అయిదునూఱులు అపహరించిరి. గంతలు కట్టి కనకలతను కాఁజేసిరి.

కనకలతయు, సగముద్రవ్యమును దళపతి వంతు; శేషము సైనికులవంతు.

మఱునాఁడు శంప చావు తప్పి కన్నులొట్టపోయి దళపతి దండనాయక సేనాపతులతో మనవి చేసికొనెను.

దళపతి అనెను—'ఎవరికి చెప్పకుము. నేను కనకలతను ద్రవ్యమును పట్టుకొందును.'

దండనాయకుఁ డనెను—'నాదిభారము. ఇంకొకరికి తెలిపినచో సొమ్ము నీది కాదు.'

సేనాపతి అనెను—'పొక్క నీయకుము. పట్టి యిత్తును. వెల్లడించితివా, ఏదియు నీకు దక్కదు.'

౪

మఱునాఁటి నడికిరేయి దళపతి అలంకరించుకొని ఒకచీఁకటికొట్టు తలుపు తెఱచెను. ఆచీఁకటిలో కనకలతయే దీపము. దళపతి లోనికేఁగి తలుపు మూసెను. ఆజీవద్దీపము నిగళబద్ధమయి యుండెను.

కనకలత అనెను— 'నిన్నటి నుండియు నాకు ఉపవాసము; వాసము చీఁకటికొట్టు. నన్ను నేఁటి కింటికిఁ బంపుము. రేపటిరేయి నీకు ఎదురుచూతును. అక్కడ పట్టుపానుపు; చంద్రదీపిక; పూలతావి; దేశ కాలములు సాక్షులు. ఇచట అధర్మము, ఎవరు చూచినను. మాయింట సర్వము ధర్మము.'

దళపతి ఆలోచించెను. 'మంచిది' అనెను. మరల ఆలోచించెను. 'నిన్నొక తూరి కౌఁగిలింతును' అనెను.

కనకలత ఒడలు జల్లుమనెను—'నీకు నేను చెల్లెల నగుచో?'

దళపతి అనెను—'భోగముదానికి వావి యేమి?'

కనకలత మనస్సు కలుక్కు మనెను.

దళపతి కౌఁగిలిఁ గొనఁబోయెను.

కనకలత—'ప్రేమ నిర్బంధముచే గ్రుళ్లును'అనెను. దండనాయకుఁడు బయట విసురుగా తలుపు తట్టెను.

దళపతి తలుపు తెఱచి—'తమ కొఱకే ఎదురుచూచుచున్నా' ననెను.

దండనాయకుఁడు లోపల ప్రవేశించెను. దళపతి నిష్క్రమించెను. దుర్గముయొక్క ఒక కవాటము కూలెను.

కనకలత అనెను—'నన్ను నేఁ డింటికిఁ బంపుము. రేపురేయి నీ కొఱకు నిరీక్షించుచుందును.'

దండనాయకుఁడు వల్లె యని అనెను—'ఒక ముద్దు బజానా.'

కనకలత అనెను— 'నీవు నాకు అన్న వగువో?'దండనాయకుఁ డనెను:'ఓహో,భోగ ముదానికి వావి?'

కనకలత మనస్సు ఉస్సు రనెను.

దండనాయకుఁడు ముద్దాడఁ బోయెను. కనకలత అనెను—'బలాత్కారమున ప్రేమ జుగుప్స.'

సేనాపతి తలుపు గొట్టి దండనాయకుని పిలిచెను. దండనాయకుఁడు తలుపు తెఱచి, 'తమరినే స్మరించుకొనుచున్నాను?' అనెను. సేనాపతి ప్రవేశించెను. దండనాయకుఁడు నిష్క్రమించెను. దుర్గపు రెండవ కవాటము కూలెను.

కనకలత అనెను—'తమకొఱకు రేపటి రేయి వేచి యుందును.'

సేనాపతి అనెను—'నన్ను నేఁ డింటికిఁ బంపి వైతునా ?'

కనకలత 'చిత్తము' అనెను.

సేనాపతి శృంఖల విప్పెను. ఒక్కసారి కౌఁగిలించుకొనెను. కనకలత విదిలించుకొని-'శాసనముచే ప్రేమ క్రోధ మగును' అనెను.

అకులీనుఁడు తలుపు పగులునటులు కొట్టి—'రాజాజ్ఞ అయినది; తలుపు తెఱువుము' అని గద్దించెను.

సేనాపతి కుక్కినపేను - తలుపు తెఱచెను. దుర్గపు కవాటము లన్నియు కూలెను.

కనకలత అనెను—'ప్రేమయొక్క కృష్ణ పక్షము చూచితిని.'

అకులీనుఁడు కనకలతను చూచెను; కనకలత అకులీనుని. కనకలతకు కన్నీరు ఉరిలెను. అకులీనుఁడు కను లొత్తుకొని ఇరువురు రాజ భటుల నిచ్చి కనకలతను ఇంటికి పంపెను. సేనాపతి నడుఁకుచు నడుఁకుచు ఇంటికిఁ జనెను. అకులీనుఁడు కనకలతను చూచుచు వెళ్లెను.

౫

కనకలతతో పాటు పోయిన ద్రవ్య మంతయు లక్కి యింటికి చేరెను.

లకుమ అకులీనునకు జయవెట్టెను. శంపయు. 'కీర్తింప సమర్థురాలను కాను' అని కనకలత తలంచెను.

'తొలుత పెట్టిన ముహూర్తము బలవత్తర'మని పురోహితుఁడు ప్రస్తావించెను.

ముంజూరులకు చిలుకల పంజరములు వ్రేలఁడీయఁబడెను. కపోతముల గూండ్లు క్రొత్తలాయెను. అమరుకము బల్లపై అమర్పఁబడెను. శృంగార చిత్రములు గోడల నిలిచెను. పానుపు పటగృహ మాయెను. ఉద్యానమంతయు లతావృక్షములచే నవీనప్రియులను భరించెను. కనకలతను శంప అలంకరించెను. పిదప లకుమ దిద్దెను. పిదప కనకలత నిలువుటద్దమున అలంకారము చూచుకొనెను. అంతయు తీసివైచెను. తానే అలంకరించుకొనెను. అలంకారము పరతంత్రము కాదు.

సంధ్య కనకలతకు లత్తుక పూసెను. నక్షత్రములు అక్షింతలు చల్లెను. చంద్రుఁడు తిలకము దిద్దెను.

పురోహితుఁడు వచ్చి ముకురదర్శనము చేయించెను.

అకులీనుని గుమాస్తా లకుమకు రూపాయల సంచులు అప్పగించెను. లకుమ లెక్కించుకొనుచు కూరుచుండెను. శంప కంట నత్తిడుకొని మాఱనివానిని ఏఱుచుండెను.

పేడి బాపిగాఁడు రతీవేషము తాల్చెను. నూచకమ్మ మంగి మన్మథవేషము వేసెను. చేటులు,విటులు, కుట్టనులు, నటులు కామవీర జయంతిక కట్టిరి.

కన్నెఱికములచే కాలము తీఱిన విటులు తాంబూలములు పుచ్చికొనిరి. కనకలత త్రావిన పాయసము అకులీనుఁడు త్రావెను. అకులీనుఁడు త్రావిన పాయసము కనకలత త్రావెను.

ప్రాయపువారు పాటలు పాడిరి.

కుందిగాఁడు హాస్యము చెప్పెను.

పురోహితుఁడు కట్నము కైకొని నడిచెను.

ముత్తైదువలు రైకలు గొనిపోయిరి.

శంప కనకలతచెవులు కొఱికి వెళ్లెను.

లకుమ స్వయముగా తలుపులు వైచి బయట గొళ్లెము పెట్టెను.

కనకలత చేతులు జోడించి అకులీనునితో అనెను— 'నన్ను రక్షించినందులకు నీ కీఁదగినది నాకడ ఏదియు లేదు.'

అకులీనుఁ డనెను—'నావస్తువును నేను రక్షించుకొంటిని.'

'అటు లగుచో నన్ను వివాహమగు'మని కనకలత అనెను.

అకు—వారాంగనకు వివాహమా?

కనకలత మృదువుగా అనెను—'నేను అసలు వారాంగనను కాను.'

అకు— నీ వెవతెవు?

కనక—మాఅమ్మ నన్ను అమ్మటమాత్ర మెఱుఁగుదును.

అకు—అదియు భోగముది కాదని నీకెటులు తెలియును?

కన—ఆసంగతి నా కేల? నేను మాత్రము కాను.

అకు—నీవతమున ఒకమచ్చ ఉన్నదా?

కనక—'ఉన్నది' అనుచు అకులీనుని మోము చూచెను.

అకు—(తల వంచి) ఏల ఆమచ్చ?

కనక—మా అన్న కాల్చెను.

అకు—అతఁ డెచట?

కనక—లకుమ అనుమానముగా చెప్పెను—చచ్చెనని.

అకు—'ఈదౌర్భాగ్యుఁడే నీయన్న. నీకు బాల్యమున కనులు లేవు. నాకు కను లుండియు లేవు.' అనెను.

కామన కాలిపోయెను. వాసరశయ్య మాతృగర్భశయ్య యాయెను. వాత్సల్యము ప్రవహించెను.

కనక—'ఎంత పశువులము? ఇంద్రియ ప్రేమ ఎంత అమావాస్య? ఎంతటి మాయా ముకురము?

'వావి యేమి? ప్రేమ యేమి? విధి యేమి? నిషేధ మేమి? సృష్టిలో దారి డొంక లున్నవా? మానవవాసన ఈయరణ్యమును నఱకి ఇంద్రియోపభోగమునకు ఎన్ని వావులు, ఎన్ని విధులు, ఎన్ని నిషేధములు, ఎంతెంత కూర్చి ఎన్ని కోటలు కట్టినను, ఒక్క చింతాయంత్రముచే చిందఱ వందఱ యయి పోవును.

'అంతయు గుంటచిక్కు. అన్నా! ఏది దారి?'

అకులీనుఁడు ఉద్యానముదెస నున్నదారి తెఱచి—'ప్రేమ దేని యణువో, వావివరుసలు దేని పయిపూఁతలో, సృష్టి యెవరి యేకగర్భమో విచారించుటకు కావలసినంత దారి దొరకినది. ఆవలికి వెళ్లి విచారించుటకు ముందు ఇది దారి; తరువాత ఆలోచించు కొనుటకు అనంత మైనబుద్ధి.' అని ముందు నడిచెను. కనకలత వెనుక నడిచెను.

---

## గాంధిమహాత్ముఁడు

న్యాయపతి వెంకట విజయలక్ష్మమ్మ గారు

[బ్రహ్మపుర మహిళాసభ]

ఏ పుణ్యభూమిలో నేప్రొద్దు దేవతాతతి సమర్చనలచేఁ దనియుచుండు
ఏదివ్య దేశమం దెలమి నారాయణుం డవతరించు నధర్మహరణలీల
నేమహాసీమలో నేవేళ ఘనవేదశాస్త్ర పురాణనిస్వనము వెలయు
నేపావనస్థలం బేపారుభారతీదేవి విహారంపుఁ బూవుఁదోఁట

ఏవసుధ రత్నపేటి భూదేవి కెపుడు-వీరరాణ్మణులకు నేది వెలయుచోటు
అఖిల ధర్మంబులకు పీఠ మయ్యె నెద్ది-అట్టి భరతమాతకు జయం బగునుగాక.

శరణాగతులఁ గావ జగదేకవీరుఁడై యజభవప్రీతిగా నవతరించె
పితృవాక్యపాలనప్రీతి స్వార్థము వాసి యతిమోదమునఁ గానలందు నిలిచె
వనమున కనిపిన పినతల్లిపై నెద కినుక జెందని మేటికీర్తిఁ గాంచె
రామచంద్రునివంటి రాజు గావలె నంచు జను లెన్న రాజ్యపాలన మొనర్చె.

నట్టి శ్రీరామునంశమం దవతరించి-ప్రబలకష్టము లొందుచుఁ బ్రజల సౌఖ్య
వంతులుగఁ జేయఁ దలఁచిన శాంతమూర్తి-గాంధిమాహాత్మునకు నమస్కారశతము.

ఏమహాత్ముని శాంత మిల దుర్జనమదాపహారణలాలస మగునస్త్ర మయ్యె
ఏజగన్నుతునామ మెల్ల దేశంబుల శ్రీరామనామ మై చెల్వు మీరె
ఏగుణోన్నతువాక్య మిద్ధహైందవ దుఃఖ తిమిరాపహారి యౌ దీప మయ్యె
ఏపుణ్యపూరుషుం డేఁగుదెంచిన సర్వజన శుభోదయలీల లినుమడించె
నట్టి జకదేకపూజితు నమలచరితు-నఖిలసౌఖ్య కారణుఁడౌ మహాత్మ గాంధి
నాయురారోగ్య సౌఖ్యసంధాయి యగుచుఁ-బ్రోచుఁగావుత శ్రీరామభూవిభుండు.

అనదలౌ నాఫ్రికా హైందవావళిఁ బ్రోవ కడు నిడుమలఁ గొన్న ఘనుఁ డితండు
కానిబాటలఁ ద్రొక్కి-కలఁత నొందకయుండ దారిఁ జూపినయట్టి ధన్యుఁ డితఁడు
అభిమానశూన్యులౌ నాంధ్రభూప్రజకుఁ బ్రేమామృతం బానఁగిన యనఘుఁ డితఁడు
దేశసేవా మహావేశి యై స్వార్థసన్న్యాసి యై తనరు దివ్యాత్ముఁ డితఁడు
సందియము లేదు వైష్ణవాంశమునఁ బుట్టె-ప్రజలబాధలఁ దీర్పంగఁ బట్టు వట్టె
సకలలోక పూజితుఁడు సాక్షాత్కరించె-రమ్యతరకీర్తి యితఁడె శ్రీరామమూర్తి.

కోఁతిమూఁకలు పెద్ద కొండ లెత్తఁగ చిన్నయుడుత వేసిన దెంత యుదధిలోన
సుగ్రీవముఖ మహాశూరనాయకు లుండ పక్షి చేసిన దెంత ప్రభువరునకు
భక్తు లెల్లరు పంచభక్ష్యాన్నము లొసంగ శబరి యిచ్చినది దాశరథి కెంత
సర్వాంతరాత్ముఁడై జగ మేలువేల్పున కలవిభీషణుసాయ మనఁగ నెంత
ప్రబలవిద్యా వివేకసంపదలఁ బాదలు-దేశసంస్కారకర్త లౌ ధీరు లుండ
నబల లొనరించు సాహాయ్య మనఁగ నెంత-భరతమాతకు నీబ్రహ్మపురములోన.

---

# బంగాళాలో కాపురం

కాళ్లూరి వెంకటరామారావు గారు

నాకు చిన్నతనంనుంచీ మా అంటుమామిడితోటలో వున్న బంగాళాలో కాపురం ఉండాలని మహాకోరికగా ఉండేది. నే నీకోరిక చెప్పినప్పుడల్లా "ఏడిసినట్టే వుంది. బంగాళాలో కాపురం యేమిటి? మహారాజులాగ ఊళ్లో ఉండకుండాను" అని మానాన్న కసురుతూవుండేవాడు. కాని ఆకోరికమాత్రం నాలో అల్లా నిల్చిపోయింది.

ఇంతలో నేను ఇంటరుమీడియేటు చదువుతూ వుండగా మానాన్న చచ్చిపోయేడు. అందుచేత చదువు చాలించి యింటికి రావలసివచ్చింది.

మానాన్న చచ్చిపోయిన రెండునెల్లకి, ఆ విచారం కొంత తగ్గినతర్వాత, నాపాతకోరిక మళ్లా తలయెత్తింది. తక్షణం తోటలో బంగాళాకి వెల్లవేయించి అందులో ప్రవేశించేను.

మా గ్రామానికీ, తోటకీ ఒకమైలుదూరం. ఆ గ్రామం ప్రొప్రయిటరీ మాదే అవడంచేత మాకు నౌఖర్లకీ చాకర్లకీ యేమీ లోటు లేకుండా జరిగేది.

ప్రతిశుక్రవారమూ మా మైసూరు యెడ్లబండీ కట్టుకుని సంతకి వెళ్లి వారానికి కావలసిన సామానులూ కూరనారలూ తెచ్చి యింట్లో పడేసేవాణ్ణి. బంగాళా చుట్టూ పువ్వులు మొక్కలు వేయించి ఎంతో మనోహరంగా చేయించేను.

నాకు వచ్చే రాబడి సరిగా వసూలు చెయ్యడానికి నాకే ఒకగుమాస్తా కావలసివస్తే, నేను వేరే ఉద్యోగంకోసం ప్రయత్నం చెయ్యలేదని వేరే చెప్పాలా?

## ౨

బాలభానుని లేతకిరణాల్లో మా పూలచెట్లమీద పడ్డ మంచుబిందువులు మిలమిల మెరిసిపోతూ ఉండేవి. అనేకరంగులరెక్కలతో సీతాకోకచిలకలు మాతోట్లో ఉన్న పువ్వులతో ఆడుకునేవి. అనేకజాతుల పూలమీదనుంచి వచ్చేచల్లనిగాలి సువాసనలుజల్లుతూ హాయిగా ఉండేది.

అల్లాంటి సమయాన్ని ఉదయాన్నే లేచి, కాఫీ తాగి, మా బంగాళా దక్షిణాన వుపసారాలో పడకకుర్చీలో కూర్చుని 'రైనాల్డ్సునోవల్సు' చదువుకుంటూ ఉంటే, నా కదే స్వర్గంలాగ ఉండేది.

పదకొండు గంటలకి మాఅమ్మ పిలవడమే తడవుగా భోజనం చేసేవాణ్ణి. మధ్యాహ్నం మూడుగంటలకి నిద్రలేచి, ఫలారంచేసి, గుమాస్తా చూపించిన కాగితాలు చూసుకుని మాతోటలో చీకటి పడేవరకూ తిరుగుతూ ఉండేవాణ్ణి.

"ఒక్కమారూ పొలంలో కెళ్లవేమిరా నాయనా? వ్యవసాయం యెల్లా తగులడుతూందో బొత్తిగా అక్కర్లేదట్రా?" అని మాఅమ్మ యెన్నిమార్లు చెప్పినా నాకు పొలమ్మీదకి వెళ్లేబుద్ధి పుట్టేదికాదు.

కాని అసలే వూరుకుంటే బొత్తిగా అనువు చేసేస్తారని సాయంత్రంవేళ ఒక్కొక్కమారు తిరిగి అది బాగులేదనీ యిదిబాగులేదనీ వాళ్లమీద 'హాత్, హూత్' అని కేకలేసేవాణ్ని.

## ౩

నేను యఫ్. ఏ. చదువుతూ వుండగానే నాకు వివాహమైంది. పండుక్కి మా మామగారు వచ్చి నన్ను రమ్మని పిలిచేరు. నేనూ ఒక బంట్రోతుని తీసుకుని రైలు దేరేను.

నేను మా అత్తవారింట్లో ఆసారి ఆరురోజులు న్నాను. అప్పటికి నాభార్యకి పదమూడు సంవత్సరాలుంటాయి.

మావివాహం అయినతర్వాత నేను అదే మా అత్తవారింటికి మొదటిసారి రావడం. చాలాకాలం అయి

వందుచేత నాభార్యను ఒక్కసారి చూడ్డానికి నాకు కుతూహలంగా వుండేది.

అందుచేత ఏపనీ లేకపోయినా యేదోవొక వంక పెట్టుకుని పెరట్లోకీ, యింట్లోకీ నేను తిరుగుతూ ఉండేవాణ్ణి కాని నేనువస్తూన్నట్టు యేమాత్రం సడి గట్టి నాగాని తుర్రున మెరుపుమెరిసినట్లు ఆఅమ్మాయి పారి పోతూవుండేది. అంతేకాని రెండు నిముషాలైనా ఆమె ను సరీగా తనివిదీరా చూడ్దామంటే నాకువీలుకలగలేదు.

"ఎప్పుడూ మొహం యిట్టేచూపెట్టడం, అట్టే తుర్రున పారిపోవడం. ఎక్కడసిగ్గోగాని, నాపాలింటి కొచ్చింది" అనుకునేవాణ్ణి నేను.

మాఅత్తవారింట్లో నాదినచర్య ఏమంటే : ఉద యాన్నే కాఫీతాగి మేడ యెక్కడం, మళ్లీ పదకొండు గంటలకి అన్నం తిని మేడ యెక్కడం, నిద్రపోవడం, మూడుగంటలకి ఫలహారం చెయ్యడం, సాయంత్రం షికారు—ఇవి క్రమం తప్పకుండా జరిగించేవాణ్ణి.

## ४

నాకు మేడమీద గది బసకి యిచ్చేరు. మా మామ గారు కచేరీకి వెళ్లిపోతే ఆమేడమీద నేను ఒక్కడినే ఉండేవాణ్ణి. యేదో నోవలు పట్టుకుని కాలం గడపడం నాపని.

ఆగదిలో నాభార్య తయారుచేసినవి అనేక రకాల కుట్టుపనులు అద్దాలలో కట్టి గోడలకి తగిలించి ఉండేవి. అవన్నీ చూసి ఆమెకు కుట్టుపనిలో ఉన్న తెలివితేటలకి మనస్సులో మెచ్చుకునేవాణ్ణి.

ఇంతలో నాప్రయాణంరోజు వచ్చింది. ఉద యం పదకొండు గంటలకి మామామగారు కోర్టుకి వెళ్ళి పోయేరు. నేనుకూడా మామూలుగా భోంచేసి మేడ మీది కెళ్లేను.

అక్కడ నేను పడుకునే తలదిండుకింద తాంబూలపాకుల చిలకలు యథాప్రకారంగాపెట్టి ఉన్నాయి. అవి నవులుతూ పరుపుమీద కూర్చుని నాపెట్టెవేపు చూ సేసరికి తలుపు తెరచివుంది.

నేను దిగువకు వెళ్లినప్పుడు పెట్టె మూసి వెళ్లినం దుచేత 'యీమధ్యకాలంలో యెవరు తెరిచి ఉందురా?' అని అనుకుంటూ పెట్టెదగ్గిర కెళ్లి ఒక్కొక వస్తువా పై టికితీసి చూస్తున్నాను. అన్నివస్తువులూ సరిగా ఎక్కడి వక్కడ వున్నాయి.

అన్నీతీసేసరికి పెట్టె అడుగున ఒకజేబురుమాలు మాత్రం మిగిలింది. అది నాకంటికి కొత్తగా కనపడడం చేత పైకితీసి పరీక్షించేను.

ఆ జేబురుమాలుచుట్టూ అతిసొగసైన లతలు కుట్ట బడి ఉన్నాయి. ఆ అందానికి నేను మెచ్చుకుంటూ చూసేసరికి ఆ రుమాలుమధ్యనున్న పెద్దలతలో చక్కని అక్షరాలు కుట్టబడిఉన్నాయి. మో॥ రా॥ అనిన్నీ, దాని కిందనే రా॥ ల॥ అనిన్నీ జోడిఅక్షరాలు నాకు అక్కడ కనపడ్డాయి.

'యీజోడి అక్షరాలు ఎవరిపేర్లు? యీ రు మాలు యిక్కడి కెలా గొచ్చింది?' అని నే నాశ్చర్యపో తూ ఆలోచించేను.

మో॥ రా॥ అంటే 'మోహనరావు' అనే నా పే రేకదా అనుకున్నాను. వెంటనే రా॥ ల॥ అంటే నాభా ర్యపేరైన 'రామలక్ష్మి' అయివుండాలి అని తోచింది. ఇంక యీపని చేసిన దెవరో మీరుఊహించుకోవలసిందే.

వ్యక్తురాలు కాక పూర్వం అత్తవారింట్లో భా ర్యలో అనుభవాలు యీకథ చదివేవాళ్లలో చాలామంది తెలుసుకునే ఉంటారు కనుక ఆవిషయమై నేను అధికం చెప్పలేదు. నాభార్య తెలివితేటలు గ్రహించడానికని పై సంగతి ఒక్కటిమాత్రం చెప్పక తప్పిందికాదు.

## ౫

ఇల్లా ఉంటూఉండగా ఒకనాడు సాయంత్రం నేను మామ్మోలుగా తోటలో షికారుచేస్తున్నాను. తూర్పువేపున ఉన్న సపోటాఅంట్లు కొత్తగా వేయిం చడంచేత పరీక్షచేసుకుంటూ నేను విలాసంగా పచారు చేస్తున్నాను. అప్పుడు అప్రయత్నంగా నాచూపులు మాపక్కతోటలో ఉన్న మామిడిచెట్టుకిందికి పోయేయి.

ఆ లేతమావిడి నున్నకింద యిద్దరు అమ్మాయిలు కూర్చున్నారు. అందులో పెద్దపిల్లకి పద్ధాలుగు సంవత్స రాలు వయస్సుంటుంది. చిన్న దానికి పదేళ్లుండవచ్చును.

వాళ్లిద్దరూ సంతోషంగా మాట్లాడుకుంటూ



నవ్వుకుంటూ ఉన్నారు. నేనుకూడా వాళ్లని ఆనందంతో చూస్తూ అలాగ కొయ్యబొమ్మలాగ నిలబడిపోయేను.

మరికొంతసేపటికి వాళ్లిద్దరూ నావేపు చూశారు. అందులో పెద్దపిల్ల దృష్టులతో నాదృష్టు లేకమైపోయే యి. తక్షణం ఆ అమ్మాయి తనచూపులు మళ్లించు కుంది.

వాళ్లు బాగా సాయంకాల మైనతర్వాత యిం టికి పోయేరు. అంతవరకూ నేను వాళ్లని అలా చూస్తూనే వున్నాను.

వాళ్లు వెళ్లిపోవడం చూసి, అక్కడే సపోటా చెట్లకి గొప్పు తవ్వుతూవున్న మాతోటమాలీ లచ్చన్నని పిల్చి, 'ఆ అమ్మాయి లెవర్రా?' అని అడిగేను.

'అగ్గురోరంలో నారాయణశర్మగారి కూతుళ్లు బాబూ! ఆతోట ఆరిదేగామా?' అని వాడు చెప్పగానే సరేకదా అనుకుని యింట్లోకి పోయేను.

౬

రోజూ సాయంకాలం నేను అదేసలానికి వెళ్లుతూవుండేవాణ్ణి. ఆఅమ్మాయిలుకూడా తర్చు వాళ్లతోటలోకి వస్తూవుండేవారు. ఒక్కొక్క నాడు ఆపెద్దఅమ్మాయి ఒక్కర్తే వస్తూవుండేది.

ఒకనాడు నేను మా మాలతీపందిరలో కూర్చుని ఏదో ప్రబంధం చదువుకుంటున్నాను. లచ్చన్న ఆపక్కనే సపోటాచెట్లకి నీళ్లు పోస్తు న్నాడు.

అప్పుడు పక్కతోటలో నుంచి 'లచ్చ న్నా!' అని శ్రావ్యమైన కంఠస్వరముతో ఒక పిలుపు వినపడ్డది. లచ్చన్న తలయెత్తి చూసేడు. ఆఅమ్మాయిలలో పెద్దయామె వాళ్ల తోటలో నిలబడి, 'లచ్చన్నా! మీతోటలో మల్లెపువ్వు లున్నాయేమో కొంచెం తెచ్చిపెడుమా!' అన్నది.

లచ్చన్న లేచి బంగాళాదగ్గిర కెళ్ళి యిన్ని మల్లెపువ్వులు అరిటాకులో పొట్లంకట్టి ఆమెచేతి కిచ్చేడు. ఆమె సరీగా అవి అందుకునే సమ యంలో నేను మాలతీనికుంజంలోనుండి హఠాత్తు గా పైట కొచ్చి, 'లచ్చన్నా! తోటలో పువ్వు లన్నీ యెవరినీ పడగకుండాఅందరికీ పంచిపెట్టేస్తున్నా వట్రా' అని ఆమె వినేటట్టుగా అధార్టి చేసేను.

నిజానికి మల్లెపువ్వు లామెకి యివ్వడం నా కిష్టమే కాని ఊరికే దర్జాకోసం అలాగన్నాను.

రాత్రి యింటికి పోయినతర్వాత లచ్చన్నని వేరే పిల్చి, 'ఒరేయి, లచ్చన్నా! నేను యిందాకా కేకలేసే నని నువ్వు మరోలాగ అనుకోకుమా! నువ్వు ఆఅమ్మాయి కి మల్లెపువ్వు లివ్వడం నా కిష్టమే. మనతోటలో రాలి నేలని పడిపోయి వృథాగా పోయేకంటె యెవరో ఒకరు వాటిని ఉపయోగించడం మంచిదే' అని మంచిమాట్లాడి ఒక అర్ధరూపాయి చేతులో పెట్టేను.

"బాబూ! సిత్తం, నే నెరగనేంటండి? తారయ్యగోరి నాకెనించీ లోగిట్లో కనిపెట్టుకున్నాను. వీ దేశంలో వేవూల కోసినా త్రప రత్తమేను బాబయ్యా! అమ్మగో రిక్కడుంటే ఒక్కపువ్వ పైకి పోనిస్తానా అండీ, పీక లెగిరి పోవాలిగాకీ" అని లచ్చన్న జవాబు చెప్పేడు.

౭

అది మొదలుకొని రోజూ ఆఅమ్మాయి వాళ్లతోటలోకి వస్తూవుండడం, లచ్చన్న పువ్వ లిస్తూవుండడం జరుగుతూ వుండేది. నేను ఆపక్కనీ యీపక్కనీ తిరుగుతూ సాయంకాలానికి ఒక్కసారి అక్కడికి చేరుకుని, ఆ అమ్మాయి చూపుల్లో నాచూపులు కలుపుతేగాని ఉండలేక పోయేవాడిని.

ఒకనాడు ఆమెకి లచ్చన్న పువ్వ లిస్తున్నాడు. ఆసమయంలో నే నక్కడేవుండి ఊరుకోకుండా, 'లచ్చన్నా! పువ్వులేమేనా బాగున్నాయా?' అని అన్యాపదేశంగా అడిగేను. ఆ అమ్మాయి కూడా అది గ్రహించి, 'మా అమ్మా, వదినా, చెల్లెమ్మా యీపువ్వులు చాలా బాగున్నాయని మెచ్చుకున్నారు' అని మృదుమధురంగా అన్యాపదేశంగానే మందహాసంతో జవాబు చెప్పేసింది. ఆజవాబు తెలివితేటలకి నేను మెచ్చుకుంటూ ఆమె వెళ్ళిపోయేదాకా అక్కడే వుండి యింటికి పోయేను.

అది మొదలుకొని హరిహరబ్రహ్మాదులు తల్లక్రిందులుపడినా, భూనభోంతరాళాలు ఏకమైనా సరేగాని, నేను నారాయణశర్మ తోటవైపు రోజూ వెళ్లడం మానేవాణ్ణికాను. ఆఅమ్మాయికూడా విధిగా ప్రతి రోజూ నాకు దర్శన మిస్తూనే వుండేది.

ఇంక వెయ్యి చెప్పడం యెందుకూ? క్రమంగా యిద్దరికీ పరిచయం అధికమైపోయింది. అన్యాపదేశాలు పోయి ముఖ్తంగా మాటలు ప్రారంభ మయేయి.

ఆఅమ్మాయి వాళ్లతోట దాటి మాతోటలో అప్పుడప్పుడు వస్తూ వుండేది. మేమిద్దరమూ అనేకవిషయాల్నిగురించి సంభాషిస్తూవుండేవాళ్లం. ప్రశాంతచంద్రికాకలితనిశాముఖము లనేకములు మా కామాలతీనికుంజంలో సౌఖ్యప్రదంగా గడిచిపోయేయి.

ఉదయం లేచినదే మొదలు 'ఎప్పుడు సాయంత్రం అవుతుంది? ఎప్పుడు ఆమెతో హాయిగా మాట్లాడుతాను?' అనే ఆలోచనలు దొంతరదొంతరలుగా వచ్చి మరొక ఆలోచనకి చోటిచ్చేవికావు. రాత్రి మంచంమీద పడుకుంటే అన్నీ ఆమెనుగురించినకలలే.

రత్తమ్మ మనోహరాకారం నాకళ్లకి కట్టినట్టుగా వుండేది. ఆమెనుగురించిన తలపులు నాకు అమృతప్రాయంగా వుండేవి. ఇలాగ్గా మా స్నేహలత క్రమంగా అల్లుకుపోయి విడిదియ్యడానికి వీలులేనిదై పోయింది.

౮

నేనొకనాడు మామ్మూలువేళకే ఎప్పటిచోటికే వెళ్లేను. ని రత్తమ్మమాత్రం యేకారణంచేతనో రాలేదు. నాకేమీ తోచక తలవంచుకుని అటూయిటూ తిరుగుతున్నాను. అనేక ఆలోచనలు నామనస్సులో కలిగేయి.

క్రమంగా సాయంత్ర మైంది. దక్షిణగాలి చల్లగా, మందంగా వీస్తూ హాయి కలిగిస్తూంది. అనేకరకాల చెట్లు అగాలికి సంతోషంగా తలలూపుతూ ఒకవిధమైన మర్మరధ్వని చేస్తున్నాయి. నిర్మలమైన ఆకాశంమీద కొద్ది చుక్కలతో చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. చంద్రకాంతి పడి మాతోటలోని కొబ్బరిచెట్ల ఆకులు మిలమిల మెరుస్తున్నాయి. నిశ్శబ్దమై ప్రశాంతమై ఆసమయం గంభీరంగా ఉంది.

అప్పటికీ రత్తమ్మ రాలేదు. ఇంక రాదుకాబోలని నేను పోదల్చుకుంటూ నారాయణశర్మ తోటలోకి కడసారి చూసేను. ధవళవస్త్రాచ్ఛాదితయై మేలిముసుగున ఒకవ్యక్తి నావంకకి వస్తూంది. సుపరిచితములైన ఆనడకలను బట్టి ఆవ్యక్తి రత్తమ్మయని నిముషంలో తెలుసుకున్నాను.

అన్యక్తి తిన్నగా మాలతీ కుంజంలోనికి వెళ్ళింది. నేనున్నూ ఆవెనకనే పోయి రత్తమ్మని కౌగిట్లో



చేర్చుకున్నాను. మర్నాడు తన అత్తవారింటికి ప్రయాణమనిన్నీ, ఆప్రయాణపు తొందర్లలో ఉండడంవల్ల రావడం ఆలస్య మైందనిన్నీ రత్తమ్మ నాతో చెప్పింది.

నా విచారానికి మేరలేదని నేను చెప్పాలా? అయితే యేంచెయ్యగలను? నేను అట్టే విచారిస్తే నాకంటే అధికంగా విచారిస్తూవున్న రత్తమ్మ బెంగపెట్టుకుంటుందని ఆమెని ఓదార్చేను.

క్రమంగా రాత్రి అధికమైపోతూ వున్నందున రత్తమ్మ వెళ్ళిపోడానికి తొందరపడుతూంది. అప్పుడా ప్రశాంత సమయంలో చంద్రుడూ, నక్షత్రాలూ, దైవమూ సాక్షిగా ఇకముందెన్నడూ ఒకరినొకరము ప్రేమించుకొనుట మానకూడదని మేము ప్రమాణాలు చేసుకున్నాము. రత్తమ్మ నన్ను వదలలేక వదలలేక వెళ్ళిపోయింది.

అతిభారమైన హృదయంతో కన్నీటితో నేను యింటివేపు నడిచేను. మొదట మేము ప్రేమించుకున్నప్పుడు యీ వియోగముమాట తల్చుకోనేలేదు.

* * * * *

## ౬

రత్తమ్మ అత్తవారింటికి వెళ్ళినది మొదలు నాకు ప్రపంచకం అంధకారమైపోయింది. ఆమె సుందరవదనము నాదృష్టిపథంలో నిల్చి ఎడబాయకుండా ఉండేది. వ్యవసాయంమీద దృష్టిలేదు; వ్యవహారంమీద మనసులేదు. ఏదో వెర్రివాడిలాగ తిరిగేవాడిని.

రోజూ సాయంత్రంవేళ నేనూ రత్తమ్మా హాయిగా గడిపినచోటికి పోయి, ఆసుఖానుభవాలు తల్చుకుంటూ విచారంతో సాయంత్రాలు గడిపేవాణ్ణి. శూన్యమైపోయిన ఆమాలతీని కుంజాన్ని చూసేసరికి నాహృదయం కరిగి నీరైపోయేది. నేటికికూడా ఆప్రదేశాలన్నీ నాకు బహుపవిత్రంగా కనబడతాయి.

చదువుకోడానికని చేతులో పుస్తకం పట్టుకునేవాడినేకాని దృష్టిమాత్రం రత్తమ్మమీదనే ఉండేది. నాకు పరధ్యానం హెచ్చిపోయింది.

ఇంతలో నాకు కార్యం చేసేయ్యాలని మామగారు తొందరపడుతూ ఉత్తరం రాసేరు. మాఅమ్మ సమ్మతి చూసుకొని ప్రస్తుత విచారం కొంత తగ్గుతుందేమో అనే ఆశతో నేనూ అందుకు అంగీకరించేను.

మరికొన్నిరోజులకి రామలక్ష్మి నాగృహలక్ష్మిలాగ మాయింట్లో తిరుగుతూంది. ప్రాణేశ్వరస్నేహలాలనమున నాబాధ కొంత ఉపశమించింది. కాని పూర్తిగా తగ్గలేదు.

రామలక్ష్మి నామీద మిక్కిలి ప్రేమగలపిల్ల. నాసౌఖ్యమే తన సౌఖ్యంలాగ చూసుకునేది.

ఇల్లా ఉండగా ఒకనాడు నేను మాతోటలో ఒకగున్నమావిడిచెట్టుక్రింద కుర్చీ వేయించుకొని కూర్చున్నాను. చేతులో పుస్తకం ఉంది గాని మనస్సు రత్తమ్మమీదనే వుంది.

ఇంతలో నాదగ్గిరకి పోస్టుమనిషి వచ్చి ఒకకవరు అందిచ్చేడు. అతను నాచేతికి ఉత్తరం యిచ్చేవరకూ, అతను వస్తూన్న సంగతి నాకు తెలియనే తెలియదు.

ఉత్తరం పైవిలాసంలో ఉన్న దస్తూరీ నాకు కొత్తగా కనపడ్డది. నేను మెల్లిగా కవరు చింపి లోపల నున్న కాగితం పైకి తీసి చదివేను. అందులో యిలాగ్గా ఉంది.

"శ్రీ.................................

"హృదయేశ్వరా! 19-5-19

"నమస్కారములు. మిమ్మల్ని వదలివచ్చి రమారమి సంవత్సరం కావచ్చింది. మళ్లీ యింతవరకూ మిమ్మల్ని చూడ్డానికి నాపాపిష్ఠికళ్లు నోచుకోలేదు. ఎన్నడు మీదరహాస చంద్రికలలో తేలుతూ మీలో సుఖించే యోగ్యత ఉందో తెలియదు.

"ఇక్కడ నేను పడే బాధలు మీకు చెప్పి మీమనస్సుకి కష్టం కలిగించడానికి నాకు సమ్మతిలేదు. ప్రథమమున అనుకూలించని దాంపత్యమే అతిదుఃఖకరము. ఈయింట్లో నరకబాధ అనుభవిస్తూన్నానంటే నాబాధ మీకు వేరుగా తెలియచెయ్య నక్కరలేదు. క్రమంగా నాకీ జీవనంమీదనే విరక్తి కలుగుతూంది. ఎలాగో మీరు నన్ను రక్షించకపోతే మీపాదాలు తలుచుకుంటూ ప్రాణాలు వదిలేయ నిశ్చయించుకున్నాను. వీలులేక యిన్నాళ్లు మీకు జాబు వ్రాయజాలనైతిని. క్షమించవలెను. సెలవు.

ఇట్లు,
"మీప్రియురాలు, రత్తమ్మ."

౧౦

ఆఉత్తరం పూర్తిగా చదివేసరికి నాగుండెలు కొట్టుకోవడం ప్రారంభించేయి. రత్తమ్మ యెట్టిబాధలు పడుతుందో అని నాకడుపు చెరువైపోయింది. ఆమె కష్టాలు తగ్గించే మార్గం నాకేమీ తోచక అలాగ ఆవుత్తరంవేపు చూస్తూ కూర్చున్నాను.

ఇంతలో యెవరో వచ్చి వెనకనించి నాకళ్ళు మూసేరు. అతిమృదులములైన ఆహస్తములు రామలక్ష్మివని నేను గ్రహించి ఊరికే ఉత్తరం మూసేసేను. రామలక్ష్మి కళ్లమూత వదలివేసి నాచేతిలో ఉన్న ఉత్తరంవేపు చూ



స్తూ, మందహాసంతో, 'నేను చూసేసేనులెండి' అన్నది.

'ఏమిటి చూసేసేవు?'

'ఆవుత్తరం.'

'ఏవుత్తరం?'

'ఆవుత్తరమే.'

'నిజంగానే?'

'నిజంగానే!'

నాకు ధైర్యం తగ్గిపోయింది. అయినా దిటవు తెచ్చుకొని, 'ఏంచూసేవో చెప్పూ చూద్దాం' అన్నాను.

'నేను చెప్పను. మీరే చెప్పండి.'

'నేనూ చెప్పను.'

'ఎప్పటికైనా నాతో చెప్పకుండా మీకు వీలు లేదు.'

'ఊఁ—పోనూ.'

'ఊఁ—సరే—చూద్దాం.'

రామలక్ష్మి చిరునవ్వుతో యింటికి వెళ్ళింది. నేనలాగే చాలాసేపు కూర్చొని ఆలోచించాను. కాని రత్తమ్మకి సహాయంచేసే మార్గం నాకు దొరకలేదు. ఆరోజున నాకు ఖంగారుచేత భోజనం రుచించలేదు.

## ౧౧

రెండు నెలలు గడిచినవి. రత్తమ్మవద్దినుంచి మరి ఉత్తరంలేదు. కాని యింతలోనే రత్తమ్మభర్త మరణించేడనిన్నీ, నారాయణశర్మ కూతుర్ని యింటికి తీసుకొచ్చేసేడనిన్నీ ఒకవార్త తెలిసింది.

'ఇదేమిట్రా? యింతలోనే యీ ఆవాంతరం?'అని ఆలోచిస్తూ ఆనాటి సాయంకాలమే నారాయణశర్మ తోటవైపున్న మాలతీనికుంజములో చాలాసేపు కూర్చున్నాను. రత్తమ్మ వస్తుందేమో అనుకున్నానుగాని ఎంతకీ రాలేదు.

అప్పటినుంచీ నేను ఒక్కడినే ఆ తోట ప్రతి రోజూ బాగా చీకటిపడేవరకూ రత్తమ్మకోసం యెదురు చూస్తూ కూర్చునేవాణ్ణి. వరసగా రెండు నెలలు నేను అదేప్రకారం చేసేను, కాని రత్తమ్మదర్శనం కాలేదు.

ఇంక రత్తమ్మ యెన్నటికీ రాదని అనుకున్నాను. ఆమె జాబుకి నేను జవాబు రాయకపోవడంచేత ఆమెకి కోపం వచ్చిందేమో అనుకున్నాను.

ఒకనాడు చాలాసేపు కూర్చొని, నిరాశచేసుకుని, యింటికి పోదామని బైలుదేరేను. అప్పటికప్పుడే యేడుగంటలు కావస్తూంది. దశమిచంద్రుడు వినిర్మలాకాశాన ప్రకాశిస్తున్నాడు. విశాలగగనతలమున ఒక్క చిన్న తెల్లనిమేఘము మాత్రము మందగతిని ప్రయాణం చేస్తూంది. అంతవరకూ విహంగరావాలచేత కలకలలాడుతూవున్న తోటలో యిప్పుడు గంభీర నిశ్శబ్దం నిల్చింది.

జరిగిన సంఘటనలనీ తల్చుకుంటూ నేను లేచి బైటికి వచ్చి నారాయణశర్మ తోటవైపు చూసేను. ధవళ వస్త్రాచ్ఛాదితయైన ఒకవ్యక్తి ఆవెన్నెలలో మెల్లగ నడచి పోతూంది. ఒక్కనిముషంలో ఆమె రత్తమ్మ అని గ్రహించి పరుగున ఆమెదగ్గిర కెళ్ళి చెయ్యి పట్టుకున్నాను. రత్తమ్మ నిలబడిపోయింది.

నేనామెను మాతోటలోని మాలతికుంజంలోకి తీసుకుపోయేను. ఆమె నిశ్చలంగా అందులో నిలబడ్డాది. ఒక్క చంద్రకిరణం దట్టంగా ఉన్న మాలతీఆకులలోనుంచి దూరి రత్తమ్మ సుందరవదనంమీద పడుతూంది. ఆకాంతిలో ఆమె ముఖాన్ని చూడ్డానికి నాకు వీలు కలిగింది.

విషాదపూరితమై, మ్లానమై, దుఃఖోద్రేకపూరితమై యున్న ఆమె ముఖాన్ని చూసేసరికి నాకు విచారమాగలేదు. నాకండ్లవెంట వస్తూవున్న నీళ్లని ఒత్తుకుని



రత్తమ్మని నాకౌగిట్లో చేర్చుకున్నాను. ఆమెశిరసు నావక్షస్థలంమీద ఆనుకుని కూర్చున్నది.

శీతలములై, మృణాలసదృశములైయున్న ఆమె హస్తములను నాచేతులతో పట్టుకున్నాను. ఆ మధుర స్పర్శసుఖానుభవంచేత నాశరీరం పులకాంచితమైంది.

ఉన్నకొద్దీ రత్తమ్మకి దుఃఖభారం అధికమై పోతూంది. ఆమె కళ్లనుండి అవిరళంగా నీళ్లు వస్తూన్నాయి. నాజేబురుమాలు తీసి ఆమె కన్నీళ్లు ఒత్తుతూ నేనిలాగన్నాను. 'రత్తమ్మా! నువ్వు ఆలాగ విచారిస్తే యేంలాభం చెప్పు? నీవుత్తరం చూసి నువ్వు పడుతూ వున్న కష్టాలు తెల్సుకోనేసరికి నాగుండెలు బద్దలైపోయేవి. ఏంచెయ్యనూ? నీదగ్గర కొద్దామని యెన్నివిధాల ప్రయత్నించినా భగవంతుడు నాకు సహాయం చెయ్యలేదు. నన్ను నీవు క్షమించవలసి ఉంటుంది. నువ్వు యిక్కడికొచ్చేవని విన్నదగ్గరనించీ రోజూ యిక్కడికి వస్తూనే వున్నాను. కాని నీదర్శనమాత్రం యీనిర్భాగ్యుడికికాదు. నామీద నీకు కోపం వచ్చిందనుకున్నాను. రత్తమ్మా! చూడూ, యీప్రపంచంలో యెవరికి కోపం వచ్చినాసరే కాని, నీకు నామీద కోపం వచ్చిందంటే నేను సహించలేను. ఇదివరకు నేను చేసినవన్నీ అపరాధాలే. దయ వుంచి నన్ను క్షమించవూ?'

ఆమె జవాబుకోసం యెదురుచూస్తూ నేను క్షణం ఊరుకున్నాను.

౧౨

రత్తమ్మ మారుపలుకలేదు. ఆమె ఒక్కదీర్ఘనిశ్వాసంమాత్రం విడిచింది. ఆమె నింకనూ నేను దగ్గరగా తీసుకుని మళ్లా చెప్పేను. 'ఇన్నిరోజులనుంచీ నువ్వు నాకు కనపడకపోవడం నాఅదృష్టమే అనుకుంటాను. ఇకముందైనా నాతప్పులన్నీ క్షమించి యథాప్రకారం నువ్వు ప్రవర్తించవలసివుంటుంది. నువ్వు యిప్పుడు స్వేచ్ఛగా యింట్లోకి వచ్చి నాభార్యని ఒకసోదరిలాగు చూసుకుంటూ వుండవచ్చును. నాయిల్లు నీది. నాసర్వస్వం నీదే. ఏం? నీ కిష్టమేనా?—జవాబు చెప్పవూ?'

ఆమె రెండుమూడు నిముషాలవరకూ మాట్లాడలేదు. తర్వాత పొంగిపోతూవున్న దుఃఖాన్ని ఆపుకుని మెల్లిగా డగ్గుత్తికతో జవాబు చెప్పింది:

'మీమీద నా కేవిధమైన కోపమూ లేదు. ఇక్కడ వున్న రోజుల్లో నామీద ఎంతో ప్రేమ వుంచి మీ హృదయంలో నాకింత తావిచ్చిన దయాహృదయులను మీమీద నాకు కోపం యెలా గొస్తుంది? మీరు మాఅత్తవారింటికి రాకపోవడానికి అనేకకారణాలుంటాయి. నే నీవూరు వచ్చినదగ్గరనించీ, ప్రతిరోజూ యీచెట్టుచాటున వుండి మీదివ్యసుఖారవిందాన్ని చూస్తూనేవున్నాను. నేను రానందుకు మీరు విచారించడంకూడా కళ్లారా చూస్తూనేవున్నాను. కాని యీనిర్భాగ్యదశలో, యీపాపపుముఖాన్ని మీకు చూపించడానికి నాకు ధైర్యం లేకపోయింది.'

దుఃఖోద్రేకంచేత రత్తమ్మ మాటలాడలేకపోయింది. నే నామెని కౌగిలించుకుని బుజ్జగించేను. ఆమె మరికొంతసేపటికి సేదదేరింది.

'నే నింకెన్నడూ మీదగ్గరకి రాకుండానేవుందామనుకున్నాను. ఇన్నాళ్లూ ఆపుకున్నప్పటికీ నామనసు యీరోజున నావశం గాలేదు. అందుచేత మీకళ్లబడ్డాను.'

'ఏమిటి రత్తమ్మా! నాదగ్గరే నువ్విలాగ కొత్త చెయ్యడం? సర్వం నువ్వే అని నమ్మకున్న నాదగ్గర నువ్విలాగ ప్రవర్తించడం ధర్మంగా వుందా?'

'ఇన్నాళ్లూ నేను మీకు కనపడకుండా ఉండడానికి యింకో ప్రబలమైన కారణం ఉంది. నేను యెన్ని జన్మాలకైనా తీర్చలేని ఒకపాపపుపని చేసేను. నమ్మిన స్నేహితురాలిని మోసంచేసేను. ఏనిర్మలహృదయం నాప్రాణస్నేహితురాలో, ఏ అమృతురాలిస్నేహభావాలు నా కత్తవారింట్లో ఓదార్పుగా వుండి ధైర్యం కలిగించేవో, ఆమెను నేను మోసగించేను. నానేరము క్షమార్హమైనది కాదు.'

భావోద్రేకంచేత ఆమెకంఠం రుద్ధమైపోయింది. నే నామెకన్నీటిని ఒత్తుతూ కూర్చున్నాను. 'రత్తమ్మా నీమాటలు నా కర్థం కాలేదుసుమా. ఎవరితో మాట్లాడుతున్నానో యెరుగుదువా?' అన్నాను.

'నామాటలలోని అర్థం మీకు వింటూన్నకొద్దీ తెలుస్తుంది. ఏహృదయానికి నాస్నేహితురాలు సర్వాధికారిణియో, ఏహృదయం నాకు అందరానిదో, అట్టి మీ హృదయంలో నేను స్వతంత్రించి అడుగు పెట్టేను. మిత్రద్రోహంకంటె వేరే పాపంలేదు.

'హృదయేశ్వరా! యింకా మీకు తెలియలేదా? మీభార్య రామలక్ష్మి నాకు మాఅత్తవారింట్లో ప్రాణదానంచేసిన స్నేహితురాలు. సర్వప్రపంచకం శూన్యమై కష్టాలతో నిండిపోయినప్పుడు నాకు ఆశావేశము చూపించినది రామలక్ష్మి. ఆమెముఖం చూస్తే సర్వపాపాలు నాశనం అయిపోతాయి.'

'మీరు నన్ను ఆమె పవిత్ర సన్నిధిలోనికి రమ్మని చెప్పుతున్నారు. ఆమహాత్మురాలిదివ్యసందర్శనం చెయ్యడానికి యీనిర్భాగ్యురాలికి అర్హత లేదు. ఆవిడపాదాలు పట్టడానికేనా నాకు యోగ్యత లేదు. పాపభూయిష్ఠమైన నాముఖం చూపెట్టి, ఆమె పవిత్రసాన్నిధ్యాన్ని పాపపంకిలం చెయ్యడానికి నాకు యిష్టం లేదు.

'నేను మొదట యిది మిత్రద్రోహమని తెలియక చేసేను. మీయందు నాకుగల గాఢానురాగము నన్ను ముందువెనకలు చూడనియ్యలేదు. ఇంకనుంచి యెన్నటికైనా యిట్టి పాపకృత్యం చెయ్యలేను. ప్రజ్వలిస్తూవున్న అగ్నిహోత్రాన్ని చేరే శలభములాగు, పవిత్రహవిర్భాగమును సమీపించే శునకంలాగు, మహాసాధ్వీన్నీ, నిర్మలహృదయయున్నూ అయిన రామలక్ష్మి నిరాఘాటంగా రాజ్యం చెయ్యవలసిన మీహృదయంలో నేను అడుగు పెట్టేను.

'ఆమె హృదయం శిరీషకుసుమకోమల మైనది. అట్టి పతివ్రతకు నే నిట్టిద్రోహము చేసినట్టు తెలిసిందంటే నాప్రాణాలు పై కెగిరిపోతాయి. ఆమె మనస్సుకి కష్టం కలిగించడం నా కిష్టం లేదు.

'కనుక ఆమెయున్నూ, మీరున్నూ సుఖిస్తూవుంటే, మిమ్మల్ని దూరంనుండి చూస్తూ నాకాలం అంతా గడిపేస్తాను. మీరు యింక యీనిర్భాగ్యురాలిని మరిచిపోవాలి అని ప్రార్థిస్తాను. రత్తమ్మ అనేనేనకురాలు ఇంక మీకు ఎన్నడూ కనపడను.'

ఆమెకు భావోద్రేకం హెచ్చైపోతూంది. ఆమెవక్షఃస్థలం తరంగసంక్షోభితమైన సముద్రంలాగు కొట్టుకుంటూంది. 'రత్తమ్మా! నీమాటలు నేను వినలేను. మనం నాటిరోజుల్లో చేసుకున్న ప్రమాణాలు జ్ఞాపకం చేసుకో. నావల్లనున్న లోపాలు మరిచిపోయి నన్నేలుకోవాలి—'

రత్తమ్మ—'మీప్రేమ నే నెరుగకపోలేదు. నిరాశానిదాఘవశాన్ని ఎండిపోయి బీటలుపారిన నాహృదయంలో ప్రేమవృష్టిని కురియించినది మీరేకదా! అబ్బా! ఆసౌఖ్యపురోజులు యింక నాజ్ఞాపకానికి తీసుకురాకండి. అవి నాకు కలలో వార్తలు. నాఆశలన్నీ మీమీదనే ఉండేవి. నాప్రేమ అంతా మీమీదనే ఉండేది. అయితే అదంతా నేను తెలియక చేసేను. అమృతమే నాపాలిటికి హాలాహలమైపోయింది. అందరాని ఫలంకోసం నేను ప్రయత్నిస్తూవున్నానని ఒక్కనాడైనా అనుకోలేదు. ఇంక నాకు యీజన్మానికి సుఖం లేదు. మళ్లీ జన్మానికా?—ఏమిటో!—'

'రత్తమ్మా! యెంత అమాయకురాలివి! నీభావాలు ఎంత పవిత్రమైనవి! సరే! రామలక్ష్మి సుగుణాలను నెరిగినవేకదా! ఆమె నిన్ను క్షమించి సోదరిలాగు చూసుకుంటానంటే నువ్వు యింట్లోకి వస్తావా? ఆమె స్వయంగా నిన్ను రమ్మని కోరితే నువ్వు వస్తావా?' అని నేనన్నాను.

ఆమె ఒక్కసారి నాముఖంవంక చూసింది. అంతవరకూ నిరాశాపూరితములైన ఆమె నేత్రాల్లో ఆశాజ్యోతి కనబడ్డాది. తెంపరాని ప్రేమలతను ఆమె ఛేదించడానికి ప్రయత్నిస్తూంది కాని సాధ్యం కాలేదు. అదే సమయంగా నేను 'నువ్వు సందేహించ నక్కర్లేదు. రామలక్ష్మి తప్పకుండా నిన్ను గౌరవిస్తుంది. మీ రిద్దరూ కలిసి హాయిగా ఉండవచ్చును.

'రత్తమ్మా! నాకు నువ్వు లేకపోతే ప్రపంచకమే లేదు. నువ్వు నాకు కనపడకపోతే నా కీప్రాణం

మాత్రం యెందుకూ? ఇంక నువ్వు జవాబుచెప్పాలి. రామలక్ష్మి వచ్చి నిన్ను స్వయంగా క్షమించిపిలుస్తే వస్తావా? రావా? ఈజవాబుమీదనే నాజీవితం ఆధారపడి ఉంటుం దన్నమాట జ్ఞాపకం ఉంచుకో. ఆలోచించి మరీ జవాబు చెప్పు' అన్నాను.

నేను మాటలు ముగించి ఆమె ముఖంవేపు చూస్తున్నాను.

౧౩

అనంతసౌఖ్యప్రదమైన ప్రేమరాజ్యం ఒకవేపూ, దుఃఖప్రపూరితమై శూన్యమైన ఒంటిజీవనం వేరొకవేపూ రత్తమ్మమనస్సును లాగడం ప్రారంభించేయి. భావసంఘర్షణచేతను ఆమెగుండెలు కొట్టుకుంటున్నాయి. ఆమెను నేను మరింతదగ్గరకి తీసుకొని కౌగిలించుకున్నాను. ఆమె మౌనముతో నాపరిష్వంగమునం దుండిపోయినది. ఆమెచూపులు దీర్ఘాలోచనమును సూచిస్తున్నాయి.

'రత్తమ్మా! యేం? జవాబు చెప్పవూ? రామలక్ష్మి వచ్చి కోరితే నువ్వు వస్తావా?' అని నేను నొక్కి అడిగేను.

ఆమె చాలాసే పాలోచించి కృతనిశ్చయురాలైనట్లు దీర్ఘనిశ్వాసము విడిచి ఎట్టకేలకు 'సరే' అన్నది.

నేను ఆనందపరవశుడనై పోయేను. 'అయితే రేపు యీవేళకి నువ్వు యిక్కడికి రావాలిసుమా' అన్నాను.

ఇంతలో మాలతీనికుంజము వెనుకనుంచి ఏదో చిన్నశబ్దము అయింది. తత్క్షణం రత్తమ్మ నాకౌగిట్లోనించి లేచి వాళ్లతోటలోకి పరుగెత్తి చెట్లచాటున మాయమైపోయింది.

"ఆచప్పు డేమిటి చెపుమా"అని నేను పైకి వచ్చేసరికి వెన్నెలలో రామలక్ష్మి దరహాసవదనంతో నిలబడి ఉంది. ఆమె నవ్వుతూ 'నేను వినేసేనులెండి' అన్నది.

'ఏమిటి విన్నావూ?'

'మీసంభాషణ అంతానూ.'

'ఏం విన్నావు?'

'ఏం జరిగిందో యిప్పుడైనా చెప్పరూ?'

'ఏమీ లేదు. ఊరుకుందూ.'

'పోనియ్యండి, నా కేమిటి?'

రామలక్ష్మి యింటికి పోయింది. నేనక్కడే కూర్చొని ముందు వెనుకలు బాగా ఆలోచించుకుని, రామలక్ష్మితో యీవ్యవహారం చెప్పక తీరదని నిశ్చయించుకుని భోజనానికి లేచేను.

తర్వాత గదిలో రామలక్ష్మికి జరిగింది యావత్తూ మొదటినుంచీ చెప్పేసేను. అది అంతా సాంతంగా వినేసరికి ఆమెకికూడా కళ్లలో నీళ్లు ప్రత్యక్షమయేయి.

'మీరు యింతవరకూ నాతో చెప్పకపోయినా యీసంగతు లన్నీ నాకు తెలుసును. తోటమాలీ లచ్చన్న, ఆవేళ మీఉత్తరం, ఈవేళ మీసంభాషణ, మనదాసీ అచ్చి – అందరూ నాకు యీవిషయంలో సహాయం చేసేరు.

'రత్తమ్మఅత్తవారిల్లూ, మాయిల్లూ దగ్గరగా ఉండేవి. పాపం! ఆవిడని తొంభైయేళ్ల ముసిలాడికి కట్టిపెట్టేరు. వాణ్ణి చూస్తేనే అసహ్యమేస్తుంది. ఆఅమ్మాయి కాపురం యెలాగ చేసేదో కాని, దానికి తోడు రాక్షసియేలుబడి ఉండేది ఆయింట్లో. రత్తమ్మ బహు అమాయకురాలు. ఆమెను చూస్తేనే నాకు జాలి వేస్తుంది. ఆవిడమనస్సూ, నామనస్సూ ప్రతివిషయంలోనూ ఒకటి.

'సాయంకాలం ఆవిడచెప్పిన మాటలవల్ల ఆమెకు నాయందుండే ప్రేమ అపారమైనదని తెలుస్తూంది. ఆవిడపశ్చాత్తాపము నిరుపమానమైనది. ఇన్నిటికీతోడు ఆవిడకి మీయందుండే ప్రేమకూడా నాకు తెలిసింది. అలాంటిప్రేమను భేదించడం నాకు కష్టంగా ఉంటుంది.

'రత్తమ్మ నాకు ఒకసోదరిలాగు ఉంటుంది. ఆవిడమనస్సు వెన్నలాంటిది. ఆహృదయంలో కల్మషానికి తావు లేదు. పవిత్రగంగాజల సదృశము లగు ఆమె అశ్రుబిందువు లింక జాలువారకూడదు. రేపు నేనే స్వయంగా వచ్చి ఆమెని తీసుకువస్తాను. నాతోపాటు ఆమెకి మీహృదయంలో సమానభాగానికి హక్కు ఉన్నట్టు నేను ఒప్పుకుంటాను.'

రామలక్ష్మి మాటలు నాకు అమృతపు సోనలైనవి. నాదుఃఖం ఉపశమించింది. ఆరాత్రి అంతా మర్నాటి కార్యక్రమాన్నిగురించి ఆలోచిస్తూ మేము గడిపేసేము.

రామలక్ష్మి ఒక్కచెంగున అక్కడికి పోయి రత్తమ్మని కౌగిలించుకుంది. రత్తమ్మ రామలక్ష్మిపాదాల మీద వాలి కన్నీటితో కడిగేసింది. ఆమె రత్తమ్మని లేవనెత్తి, ధైర్యం చెప్పి తోటలోకి తీసుకొచ్చింది.



రత్తమ్మ దీనస్థితికి రామలక్ష్మికండ్లలోనీళ్లు ప్రత్యక్షమయేయి. స్నేహితురాళ్లిద్దరూ చాలాసేపు ముచ్చటించుకున్నారు.

చాలవరకు బోధపర్చిన తర్వాత రత్తమ్మ యింట్లోకి రావడానికి ఒప్పుకుంది. మేము ముగ్గురం తక్షణంయింటికిపోయేం.

ఇంట్లో దేవుడు పట్టుదగ్గర కెళ్ళి, దైవానికితోడు రామలక్ష్మి సాక్షిగా, నాడు దైవసాక్షిగా తోటలోచేసుకున్న ప్రమాణికాలు తిరుగా మే మిద్దరమూ చేసుకున్నాము.

రామలక్ష్మి రత్తమ్మని చెల్లెలివలె చూసుకుంటూంది. రత్తమ్మ రామలక్ష్మియందు అతిభక్తితాత్పర్యాలతో తిరుగుతూంది.

అన్నట్టు, చెప్పడం మరిచిపోయేను: నారాయణశర్మ మాయింటికి ఆమర్నాడు పొద్దుటేవచ్చి, కూతుర్నిరమ్మని పెద్దకేక లేసి, 'హాత్ హూాత్' అని చీదరించేడు కాని రత్తమ్మ తన సునిశ్చితాభిప్రాయం చెప్పినతర్వాత అతడు నిరాశ చేసుకుని యింటికి పోయేడు.

## ౧౪

మర్నాడు సాయంత్ర మైంది. సంధ్యారాగంలో మాతోట్లోని చెట్లన్నీ బంగారు నీరు పోసుకున్నట్లుగా ఉన్నాయి. మామిడిచిగుళ్లు కెంపుల్లాగ సంధ్యాకాంతిలో మెరుస్తున్నాయి. కోయిలలూ, రామచిలుకలూ తమదినాంతగీతాలు పాడుకుంటూ అడావిడిగా యెగురుతున్నాయి.

అప్పుడు నేనూ, రామలక్ష్మి మామాలతీనికుంజంలో కూర్చున్నాము. మరికొంతసేపటికి రత్తమ్మవాళ్ల తోటలోని మామిడిచెట్టుకిందకి వచ్చి నిల్చుంది. ఆమె ముఖం వాల్చుకొని ఉంది.

నాటిమొదలు నేటివరకూ తండ్రిముఖం కూతురుగాని, కూతురుముఖం తండ్రిగాని చూసుకోలేదు. మాకూ వాళ్లకీ రాకపోకలే లేవు.

నేను అతిసౌఖ్యంగా నాహృదయేశ్వరు లిద్దరితోనూ బంగారాకాపురం నేటికీ చేస్తూనే ఉన్నాను.

అప్పుడప్పుడు మేము ముగ్గురమూ కలిసి మా పవిత్రప్రేమ నాటకానికి రంగస్థలమైన మాలతీనికుంజంలో కూర్చొని, పూర్వపురోజులు జ్ఞాపకానికి తెచ్చుకుంటూఉంటాము.

ఇది చదివేవాళ్లలో యిటువంటి అనుభవాలు యెవరికేనా ఉన్నాయా? నవ్వకుండా చెప్పండీ, చూద్దాం.

---

# పా న శా ల

పానశాల



చిత్రము ౭ [పద్యము ౯౦]

(వెనుకటి సంచిక తరువాయి)

## III

### ౬౨

చకచకలాడు ద్రాక్షఫలసారము, వేణురవంబు, గానముల్
నికటమునన్ నిలింపరమణీమణిఁ బోలిన యెమ్మెలాఁడి! నా
కిఁక మఱి యేమిలోటు? సగమెత్తియ ద్రావలెడి కన్నుఁదమ్ములన్
సకియ, జయింపనే సమయసంకటముల్ త్రుటిలోన, వారెవా!

### ౬౩

నిరతముఁ బానమత్తులము, నీతులు గీతులుఁ దెల్పఁబూన కో
విరసుఁడ, పానపాత్ర నులివెచ్చని ద్రాక్షరసంబుదప్ప మా
సరసపుగోష్ఠి వేఱొకవిచారము లేదు ప్రియాంగనామనో
హర మధునాధరామృతము నానుటో, యాసవ మానుటో కదా!

### ౬౪

వారుణి యానుచుండఁ బ్రతిపక్షులు పల్కిరి, "వద్దు, ఛీ! మత
చారవిరోధి పానకలశం"బని; యయ్యది సత్యమేని ప
హ్వారె! మతాపక్షరుధిరపానముఁ జేసెద; ధర్మశత్రు సం
హారము శాస్త్రసమ్మతము నౌనని చెప్పరె పండితోత్తముల్.

### ౬౫

త్రాగను జాహిదీల మని దంబము గొట్టెద వేల? యంతక
న్నా విపరీతకృత్యము లొనర్తువు నిత్యము; మాయ వేషముల్
భావములోని కల్మషముఁ బాపునె? మానవసంఘరక్తముం
ద్రావెద వీవు; ద్రాక్షఫలరక్తము మాకు రుచించు నెప్పుడున్.

---

౬౫ వ పద్యము:—జాహిదీలు=భక్తులు.

౬౬

తెలివిక డానిజో మ్మొలిగుదిండున మే సరమోపి పుష్పఁ జ
ప్పరములఁ గూరుచుండి మధుపాన వినోద విపంచికారవ
స్ఫురిత ముదాత్ము లైననె రుచుల్ వచియింపఁగ వచ్చుఁ గాని నే
ర్చిరె యల రెంటికిం జెడిన రేవడ లందు మజా నెఱుంగఁగన్.

౬౭

కనుఁగొను: శబ్దరూపరసగంధములన్ సుఖ మైనస్పర్శ మో
హనమగు నీప్రపంచము ననంతముగా సృజియించి ధాత చే
సెనె శిలతోడ మానవుని చిత్తము? ప్రేమమె జీవితోత్స; మీ
వును జననప్రయోజనముఁ బొందవు మూసినఁ బ్రేమవాకిలిన్.

౬౮

కలపయు మట్టి ఱాలనిడి కట్టిన దేవళమందు నీకు నే
ఫలము లభించు? ప్రేమరసభావయుతుండవ యేని కామినిన్
వలచుము; ప్రాణహీనమగు బండలు వేయిటికన్న శ్రేష్ఠమై
యలరుఁ గదా మనుష్యహృదయంబు ప్రతిప్రణయానురక్తులన్.

౬౯

మునుపు మసీదు వాకిటను ముచ్చెలు దొంగిలి పోతిఁ; బ్రాఁతవై
చినిఁగెను; నేఁడునన్ మరలఁ జెప్పులకోసము వచ్చినాఁడ! నె
మ్మనము సెడంగ నియ్యెడ నమా జొనరింపఁగ రాను; నీవు చ
చ్చిన యెడ వీడిపోయెదవు చెప్పులువోలె నమాజు సైతమున్!

౭౦

పాపముఁ జేసి తంచుఁ దలఁపం బనియేమి ఖయామ, దుఃఖసం
తాపము నిష్ఫలం బగు; వృథా వగపిల్లుట మాను; మెవ్వరుం
బాపము సేయకున్నఁ దన మన్నన యెందుకు? కల్మషాత్ములన్
రేపు క్షమించుఁ; బాపము హరించును దైవము; సంతసించుమా.

---

౬౭ వ పద్యము:—జీవితోత్సము=జీవితపు క్రీయూటు (Fountain of life.)

౨౧

మును నే నస్థితి నిద్ర నుండ నిలకుం బోఁ దోలి, దుఃఖంబు లం
దను సౌఖ్యంబుల నందఁ జేసి, మరలం దర్శింతు వారార! పా
పిని శిక్షింతు నటంచు; నీచతురతన్ వేనోళ్లఁ గీర్తింతు రీ
వినయూర్తుల్; మఱి శిక్ష కర్తవుఁడవు నీవే కావె లోకేశ్వరా!

౨౨

కరుణావార్ధివి నీవు; నే నిఁకను దుష్కర్మంబు వర్జించి ని
ర్భర వైరాగ్యముఁ బూన, నీవు కృపఁ జూపం బాత్రు లెవ్వారు? నీ
బిరుదున్ నిల్పుట కే నొనర్చితిని నిర్భీతిన్ సమస్తాఘముల్;
నరకం బంటకయున్న వీలగునె పశ్చాత్తాపముం బొందఁగన్.

౨౩

నీవు కృపాంబురాశి వఁట! నిక్కమ యేని ఇరామతోఁటకుం
బోవఁగ నీక పాపి జనమున్ మరలించుట యేల? భక్తులం
గావఁగ వత్తువేనిఁ గృప గా దది; బేహర; మింద నున్న మీ
యావులకన్నఁ బాల్వలయునా పసిపాప కటన్నసామెతౌ.

౨౪

అంబరు ముంగురుల్ నొసలి యంచుల వ్రేలఁగఁ, జూచినంత మో
హం బెసఁ గొల్పు కోమల లతాంగిని గల్పనఁజేసి నీకు న్యా
యంబె మఱెవ్వరున్ మొగము నారయ రా దని యాజ్ఞ వెట్టఁ; బూ
పంబును జేతి కిచ్చి తినవద్దని చెప్పుట యేల దైవమా!

౨౫

మనుజుని వారుణీం బ్రణయమాధురి సుందరిఁ జేసి భూమి నం
దనమున కంపినాఁడవు; మనంబగుఁ బ్రేరక మెల్లకర్మకున్;
వెనుక నదేల మాతలను వేసెద వీయపదూఱు? నీవె శా
సన, మపరాధియున్, మఱి విచారణకర్తయుఁ; జిత్ర మీశ్వరా!

౨౩ వ పద్యము:—ఇరామతోఁట=నందనవనము.

౪౬

అలరె విమర్శనంబు! కననయ్యె వివేకము! సర్వశాస్త్రముం
దెలిసిన పండితోత్తములనే నిఱుపేదలఁ జేసినాఁడ; వం
జలిని బ్రసాద మై పిడుగు జాలును భక్తుల; కింత యేల, దు
ష్టులకు సుఖంబు సంపదలు చొప్పడు; నింపగు నీకుఁ బాపముల్.

౪౭

కోరిక లన్నియుం గుడుపు గూరవు; సౌఖ్యము దుఃఖ మెప్పు డం
గూరు రసంబుఁ జేఁ దటులఁ గూడియె యుండు; గులాబి కంటకాం
కూరము లంటియుంట మనకుం బరివర్జ్యమె? అంపకోఁతలం
జీరిక తోట దువ్వెనయుఁ జేకొను జవ్వని తావిముంగురుల్.

౪౮

కనుల హిమాంబు బాష్పములు గాఱ నచించె గులాబి, ముద్దుమో
మును నగు సోయగంబుఁ దలపోయక, నన్ను సుగంధకారి క్రా
చు నకట యన్న, బుల్బులియు, సుందరి, సామెత వింటె "నేఁడు విం
దును నొకయేఁడు కుందు;" విధి దుష్ట, మవార్య మటంచుఁ బల్కె-డిఁక.

౪౯

విధి నిబద్ధము లై వచ్చు వెడలిపోవు-నఖిల సుఖదుఃఖములు నీ కయాచితముగ;
జడియఁబోకు రుస్తుముజాలు శత్రుఁ డైన-తాయి సఖుఁ డైన విందులఁ దలఁపఁబోకు.

౫౦

రెండుదినముల కొకతూరి మెండురొట్టె-బోసి ముంతెడు చలినీళ్లు పుట్టెనేని
ఏల నినుబోలువానికిఁ గేలు మోడ్ప?-నొకనికి గులామ వై యెందు కూడిగింప?

౫౧

విసము నమృతంపు మసిబుడ్డ విధి కలంబు-ముంచి లోకులనుదుట లిఖించు మొదట
గరఁగ దఱుఁబేద కన్నీటికాల్వ నదియుఁ-బరమభక్తుని యనుతాపవహ్నిఁ జెడదు.

---

౪౯ వ పద్యము:—రుస్తుముజాలుఁ=జాలు కుమారుఁ డైన రుస్తుము. ఈతఁడు భీమునివంటి బలశాలి. తాయి= ఈతఁడు కర్ణునివంటి దాత; విందుపెట్టుటలో ప్రసిద్ధి చెందినవాఁడు.

౮౨

కాన యెది ప్రాప్తమైనను గారవించు-వలయు వల దని యేర్పరుపంగలేవు;
అంబరంబును నీకు సహాయపడదు,-తానె తలక్రిందుగా వ్రేలుఁ; దడవు నిలువ.

౮౩

ఇల చదరంగ; మందు జను లెల్లరు పావులు, మంచిచెబ్బరల్
వెలుపును నల్పుగళ్లు; కదలించును రాజును బంటుఁ దక్కు పా
వుల విధి యాటకాఁడు; పలుపోకలఁ ద్రిప్పును, గళ్లు మార్చు, న
వ్వల నొకటొక్కటిం జదిపివైచు నగాథసమాధిపేటికన్.

౮౪

మనమున కెక్కినట్టి యభిమానులు మిత్రులుఁ జెల్లినారు; యౌ
వన మధుమాసము౦ గుసుమభారము రాలిచిపోయె; జీవితం
బను సరకంబునందు నడుగంటె మధూళియు; నేదినంబు వ
చ్చెనో మఱి యెప్పు డేఁగెనో దిసింపదు హర్షవిహంగ మిప్పుడున్.

౮౫

పూవులకాఱురాకలకుఁ బోయెడి సీతులకున్ రసోజ్జ్వల
జ్జీవితకావ్య పత్రములఁ జెచ్చెరఁ ద్రిప్పితి; శోకసర్ప ద
ష్టావిలమా హృదంతరము నాసవమున్ బ్రతియోగ మొక్కటే
కాన సమర్థ; మింక ముదికాయము లేఁతగిలంగఁ ద్రావెదన్.

౮౬

విమలమనంబుతోడ మధువిక్రయశాలకుఁ బోతి నిన్న రే
యి; మధురవాణి, సాఖి, హృదయేశ్వరి పాత్రిక నింపి తెచ్చి త్రా
వు మనిన వద్దటంచు సరిపుచ్చితిఁ; గ్రమ్మఱ "నాదు ప్రేమపై
రమణుఁడ, యాన వెట్టితిని ర"మ్మనఁ దెమ్మని యానితిన్ బలే!

---

౮౩ వ పద్యము:—పావులు=ఆటకాయలు.

౫౪

ఆసవ కుండికం బెదవు లానఁగఁ బట్టిన యప్డు దీర్ఘ ని
శ్వాసముతో వచించెఁ దనసంగతి: నాకును నీకుఁ బోలె రో
జాసుమనోధరంబు వికసన్నవహాసము లుండె; జీవముం
బాసిన మానవుల్ మఁగుడి వత్తురె? నీడకు నాదుసఖ్యముల్.

౫౫

ఆకూజాయును నన్నుఁబోలె ప్రణయవ్యామోహముం జెంది కాం
తాకమ్రాలక శృంఖలావలయ బద్ధం బయ్యెఁ గాఁబోలు ముల్;
నాకుం దోఁచుఁ దదీయ కంధరను లగ్నం బైన చేకొండె యో
షాకంఠ ప్రమదోపగూహనమునల్ సంసక్త మంచుల్ సఖి!

౫౬

నిన్నటిరోజు కుమ్మరిని నేఁ గనుఁగొంటి బజారువీథిలో
మ న్నొకముద్దఁ జేసి మడమం జెడఁద్రొక్కుచు నుండ; వానితోఁ
దిన్నగ మందలించె నది దీనత "మెల్లగ నల్లఁ ద్రొక్కు మో
యన్న, యెఱుంగవే నను నొకప్పుడు నీవలె నందగాఁడనే!

౬౦

మానఁగదోయి, యెందనుక మానవమృత్తికఁ దెచ్చి ముంతలుల్
బానలుఁ జేసె దీవు; మఱవం దగ దందఱు నల్లె యాట; య
జ్ఞానముచే నిజం బెఱుఁగఁజాలవు; నేను గ్రహించితిల్: బరీ
దూను శిరంబుఁ గాంచుమ యదో దరిబేశి కరంబుదగ్గఱల్."

౬౧

పొలుపుగ మాట నేర్చినవి మూఁగవి కుండలు రెండువేలు లో
పల నొకమూలనుండి యిటు వల్కె ననుం గని "కుంభకారులుల్,
విలిచినవారు, మమ్ముఁ బురవీథుల నమ్మినవార లేరి? యే
తలమున కేఁగినారలు? వదంతి యెదేనియు విన్నఁ దెల్పుమా."

౬౨

ఎందుకుఁ జూచినన్ గొనక యేఁగెదు? చక్కని గిండిగానొ, న
న్నంగను వ్రేలు చూపి పరిహాసము సేయుదు; రైపు నాది గా
దిందుఁ, గులాలశిల్పి నను నిర్లొనరించె; రచించునప్పుడుం
దందరలాడెనే మొ చెయి త్రావుడు మత్తున నొక్క పొట్టగన్.

౬౩

ఓరీ కుమ్మరి, పిల్పు వచ్చె, వినుమా యొక్కింత నాకోర్కె; నా
గోరీ మృత్తికఁ బానపాత్ర లిటుకల్ కూజాలు జాడీలు సొం
పారం దీరిచి యమ్మవోయి మదిరా పణ్యాంబులన్; గోస్తనీ
సారస్పర్శఁ బునః ప్రబోధితుఁడ నై సత్యంబుఁ జాటించెదన్.

౬౪

కడుగుఁడు నాశనంబుఁ దడిగా మధుధారల; ద్రాక్షపుల్లలుం
బుడకలు పెట్టి యల్లి ననుఁ బూడిచిపెట్టుఁడు; శీధుబిందులన్
నడిసెడి నాదు మృత్తికలవాసన గుర్తగు మీకు; రేపు నన్
బడయుదు రాసవాలయము వాకిటనో, చలికాలిధూళినో.

౬౫

ఉత్తమోత్తమ గురుల శిష్యుండ నైతి-గురువు నైతిని సచ్ఛిష్య కోటులకును;
మరణశయ్య నంత్యార్థము మందలింతు;-ధూళి జనియించితిని గాలిఁ దేలిపోదు.

సంపూర్ణము

---

# మంగళేశ్వరుడు

యన్. వెంకటరమణయ్యగారు, యం. ఏ.

[వెనుకటిసంచిక తరువాయి]

భండార్కరుగారు త్రొక్కినమార్గము బాగుగ నున్నదని యొప్పుకొనుచు, ఫ్లీటు గారు వారివాదము నిట్లు విమర్శించుచున్నారు. వీరివాదము నంగీకరించిన,——

"సింహాసనారోహణమును గావించినప్పుడు ఆతని (పులకేశియొక్క) వయస్సు పదునైదుసంవత్సరము లగును. ఇది హిందూదేశమునందుగూడ రాజు రాజ్యమేలుటకు దగినయీడని సామాన్యముగ నొప్పుకొనదగినది కాదు. అయితే కీర్తివర్మ మరణానంతరము, రెండవపులకేశి రాజ్యభారమును వహించదగని తరుణవయస్కుడగుటచే మంగళేశుడు రాజ్యభారమును వహించెననియు, మరల నాతనికి రాజ్యము సేయువయస్సు రాగనే రాజ్యము నాతని కిచ్చివేసెననియు మిరాజ్ శాసనము దెల్పుచున్నది. అయినను, ఈవిషయము, తరువాతికాలమున నాడుకలోనున్న, వంశపరంపరగవచ్చు, గాథల నాధారపరుచుకొని చెప్పినవిషయము. అయ్యావొళెశిలాశాసనమున నుండు సమకాలపువర్ణనము పైదానికంటె విశ్వాసార్హమైనది. దానిమూలమున మంగళేశ్వరుని రాజ్యాంశకాలమున నాతనికిని, రెండవపులకేశికిని నభిప్రాయభేదము లున్నట్లు మనము దెలియుచున్నది; రాజ్యమును దన పుత్రిని కిచ్చుటకు మంగళేశుడు ప్రయత్నించెను; మంత్రశక్తిసంపన్నుడగు పులకేశిచే గూర్పబడిన బలముచే అతనియత్నము యుద్ధమున భగ్నమవుటయేకాక యతడు ప్రాణములనుగూడ గోల్పోయెను. ఇందువల్ల, తనరాజ్యాభిషేకకాలమునందు ప్రబలమైన సహాయసంపత్తిని సేకరింపదగిన సంపూర్ణయౌవనమును (అనగా యిరువదిమూడేండ్లవయస్సును) రెండవపులకేశి పొందియుండెనని మన మూహింపవచ్చును. దీని నంగీకరించిన నాతనిజన్మవర్షము శ. ౫౧౦ యగును; శ. ౫౨-౨౧ లో నతనితండ్రి గతించినప్పుడు ఇంచుమించు పదివర్షముల ప్రాయము వాడగును."[1]

పైచర్చలను బట్టి చూడ రాజ్యాభిషేకము నాటి పులకేశివయస్సును గూర్చియే భండార్కరుఫ్లీట్లకు అభిప్రాయభేదమున్నట్లగపడుచున్నది. ఆతని జన్మవర్షమును గూర్చికాని, మంగళేశ్వరుని సింహాసనారోహణమును గురించికాని వారి కభిప్రాయభేద మున్నట్లు తోచదు. అయినను, మంగళేశ్వరుడు బాదామిగుహాశాసనమున జెప్పబడినట్లు శ.౪౮౮న సింహాసనారోహణము నేలగావించియుండగూడదో ఎవ్వరును జెప్పలేదు శాసనము లిందుకు విరోధింపవు. నాకుజూడ భండార్కరు మొదలగు పండితు లొకభయముచే పీడింపబడుచుండినట్లు తోచుచున్నది. అది యెద్దియన: మంగళేశ్వరుడు శ. ౪౮౮లో సింహాసనము నెక్కెనని యొప్పుకొన్న నతడు శ.౫౩౨ వఱకుననగా ౪౪ వర్షములు, రాజ్యము జేసిన ట్లొప్పుకొనవలసి వచ్చును. ౪౪సంవత్సరము లొక్కనిరాజ్యకాలమనుటకు గడుదీర్ఘమగుటచే మంగళేశ్వరుని రాజ్యకాలమును సంగ్రహపఱచినట్లు తోచుచున్నది. హిందూస్థానములోనిరాజులు సగటున ౨౦ వర్షములకు మించి రాజ్యము సేయలేదనుట యొప్ప

1. I. A. XIX, p. 13.

కొనవలసిన విషయమే. అట్లనుటచే నెవ్వరును ౨౦ యేండ్లకంటె నధికముగ రాజ్యము సేయ లేదని చెప్పుట సాహసము. ౫౦ ఏండ్లు రాజ్య ముచేసినవా రనేకులు గలరు. ౬౫ సంవత్సర ములు రాజ్యముచేసినవారు కొందరున్నారు. ఇక ౮౮ సంవత్సరములు రాజ్యము సల్పిన వారి విషయ మొకవిశేషముగ జెప్పవలయునా! కావున మంగళేశ్వరుడు ౮౮ వర్షములు ప్రభు త్వము చేసెననుటయసంగతమే మేమియు గాన్పింపదు. కాబట్టి బాదామిశాసనమున జెప్పి నట్లు అతడు శ. ౪౮౭ననే వాస్తవముగ సింహాసనారోహణము గావించెనని నాభావము. యస్. కే. దీక్షితులుగారియభిప్రాయము గూడ నిట్టిదే. మహాకూటశాసనము లోని "ఉత్తరో త్తర ప్రవర్ధమాన రాజ్యపఞ్చమశ్రీవర్షే" అను వాక్యములోని 'పఞ్చమశ్రీ వర్షే' యనునది తప్పనియు, అది 'పఞ్చత్రింశే' యని యుండవలయుననియు జెప్పుచు మహాకూట శాసనము మంగళేశ్వరుని ౩౫ వ రాజ్యవర్ష మున వ్రాయింపబడె ననుచున్నారు.[1] అతని రాజ్యారంభము శ. ౪౮౭-౮ అని యొప్పు కొన్న మహాకూట శాసనకాలము శ. ౪౮౭-౮ + ३५=శ. ५౨३-४ అగుచున్నది. ఫ్లీటు గారిచే నిర్ణయింపబడినకాలము గూడ కొంచె మించుమించుగ దీనికి సరిపోవుచున్నది.

౨

మంగళేశ్వరుడు సింహాసనము నధిష్ఠించి నప్పుడు చళుక్యులరాజ్యము విశేషము విస్తార మైనది కాదు. చళుక్యవంశమున మొదట స్వతం త్రముగ రాజ్యము సేయదొడగినవాడు మంగ ళేశ్వరుని తండ్రి యగు మొదటి పులకేశి. ఇతడు వాతాపీ పురమును జయించినట్లును, హయమేధాదియాగములను జేసినట్లును దెలి యవచ్చుచున్నది.

"తస్యా భవ త్తనూజః పోలకేశి
యః శ్రితేన్దుకాన్తి రపి;
శ్రీవల్లభో ప్యయాసీత్
వాతాపిపురీ వధూవరతామ్."

అని అయ్యావొళెశాసనము.[2] ఏప్రూరుశాసనమునందుగూడ నీవిషయమే వచింపబడి యున్నది.

"తత్తనయః పులకేశి కేశనిషూవనసమోఽభవద్రాజా,
వాతాపిపురీ వరపతి రకలితఖలకలికలంకకలః." 3

మంగళేశ్వరుని శాసనములయందు ఇతడు య జ్ఞముల ననేకములను జేసి ప్రఖ్యాతి వడసిన ట్లున్నది గాని జయములచే కీర్తిని గడించినట్లు వచింపబడలేదు. కావున ఇతడు చేసిన ముఖ్య కార్యము వాతాపిని స్వాధీనము చేసుకొనుటయే. ప్రథమమున నీతడు కదంబరాజుల నా శ్రయించిన సామంతుడుగ నుండి తదనంత రము వాతాపిని సాధించి స్వతంత్రుడైనట్లు తోచెడిని. మొదటిపులకేశికాలమున చళుక్య రాజ్య మొకచిన్నసంస్థానముగ నుండవలయు ను. ఇతని పుత్రుడగు మొదటికీర్తివర్మకాల మున చళుక్యరాజ్యము విస్తరింప నారంభిం చెను. ఇతడు మూడువంశముల రాజులను

1. A., XIX, p. 12 2. E. I., VI. 3. I. A., VIII 10.

జయించినట్లు అయ్యవొళె శాసనమునందు జెప్పబడియున్నది. వీ రెవ్వరన్న :

౧. నళులు

చిరకాలమువఱకు నళవంశము చళుక్య శాసనముల మూలముననే మన కెఱుకపడుచు వచ్చినది. ఇటీవల ౧౧,౧౨ శతాబ్దములనాటి నళరాజుల శిలాశాసనములు కొన్ని కళింగ దేశమునందు దొరికినవి.[1] వానివల్ల నళరాజులు పూర్వసముద్రతీరమునందు ప్రభుత్వము జేసినట్లు తెలియవచ్చుచున్నది. అయితే, కీర్తివర్మ దిగ్విజయము నేయుచు తూర్పుసముద్రతీరమును జేరి యచ్చట రాజ్యము నేయుచున్న నళరాజులను జయించెనని తలంపరాదు. బళ్లారిమండల ప్రాంతమునందు కర్ణాటక దేశమున నళవాడియను విషయ మొక్కటి యుండెను. ఈ నళవాడి కావేరు నళవంశస్థులగు రాజులవల్ల వచ్చెననియు, అచ్చటి నళరాజులనే కీర్తివర్మ జయించియుండవలయుననియు పండితుల యభిప్రాయము.[2]

౨. మౌర్యులు

వీరు సర్వభారత చక్రవర్తులగు చంద్రగుప్తాశోకాదులవంశీయులు. మౌర్యసామ్రాజ్యముచ్ఛిన్నస్థితియం దున్నపుడు దక్షిణమునకు వచ్చి యచ్చటనే నిలిచిపోయిరి. తరువాతి కాలము పశ్చిమతీర దేశములయందు చిన్న చిన్న రాజ్యము లేర్పఱుచుకొని రాజ్యము నేయుచుండిరి. మొదటి కీర్తివర్మచే జయింపబడిన మౌర్యులు కొంకణదేశస్థులు.

3. కదంబులు

వైజయంతీపురమును ముఖ్యరాజధానిగ జేసుకొని కుంతలమునేలిన రాజవంశమిది. పల్లవరాజగు మొదటి (శివ)స్కందవర్మ కాలముననో, దానికి గొంచెము పిమ్మటనో, పల్లవులపై దిరుగబడి వారిని పలుమారు పరాజితులనుగావించి, తుదకు వారితో సంధి గావించుకొని, వారికి సేనానియై, మెప్పించి, వారివల్ల కుంతలమును బడసిన మయూరశర్మయను బ్రాహ్మణు డీవంశమునకు మూల పురుషుడు. కదంబరాజ్యమును చళుక్యరాజులు క్రమక్రమముగ గబళించి నాశనము చేసిరి.

ఈమూడు దేశములను మాత్రమే కీర్తివర్మ జయించినట్లు అయ్యవొళె శాసనమునందలి "నళమౌర్యకదంబ కాళరాత్రి, స్తనయ స్తస్య బభూవ కీర్తివర్మా"యనుశ్లోకము వలన దెలియుచున్నది.[3] ఏహూరు శాసనమునందు సైతము పైమూడుదేశములనే జయించినట్లు చెప్పబడియున్నది.

"నళనిలయవిలోపీ, మౌర్యనిర్యాణ హేతుః,
ప్రథిత పృథుకదంబ, స్తంభ భేదీ కుఠారః."[4]

అయితే ఈతడు పెక్కుదేశములను జయించినట్లు మహాకూటశిలాస్తంభశాసనము పల్కుచున్నది. చూడుడు:

1. Re. Epi. 2. Ibid. 3. Ep. Ind., VI. 4. I. A., VIII, p. 10.

"వంగాఙ్గకళిఙ్గ వట్టూర మగధమద్రక కేరళ గఙ్గ మూషక పాణ్డ్యద్రమిళ చోళీయాళూక వైజయన్త్యాది ప్రభృత్యనేక పరనృపతిసమూహాన యుద్ధేలబ్ధ విజయే."[1]

పైపట్టికయందలి 'వంగాఙ్గకళిఙ్గ' దేశములు సుప్రసిద్ధములు. వట్టూర రాజ్యముదక్షిణదేశములోని దైనను అది యెచ్చట నుండెనో చెప్పుటకు వీలుకాదు. పాటలీపుత్రము రాజధానిగా గల్గిన మగధదేశమును సుప్రసిద్ధమే. అయితే దక్షిణదేశమున నార్కాటు మండలమునకు పూర్వము మగధమని పేరుండెను. అచ్చట పాటలీపుత్తిరమను పట్టణ మొక్కటి యుండెను. ఈ రెంటిలో కీర్తివర్మయేమగధమును జయించెనో చెప్పుటకు వీలుగాదు. మద్రక మెచ్చటిదో యింకను గుర్తింపబడలేదు. పాణ్డ్య కేరళములు సుప్రసిద్ధములు. పాలయవేర్కాడు మొదలు దక్షిణపెన్న పర్యంతము వ్యాప్తమైన దేశమునకు ద్రమిళమని పేరు. దీని రాజధాని కాంచీపురము. పల్లవవంశస్థులగు రాజు లిచ్చట రాజ్యము నేయుచుండిరి. చోళీయ మను దేశము కావేరీ తీరమున నురయూరు రాజధానిగాగల రాజ్యము గాదు. ఇప్పటి దత్తమండలమునకు యువను ఛ్వాంగను చీనాయాత్రికుని కాలమున "చోళీయ"మను నామ ముండిన ట్లందరొప్పుకొన్న విషయమే. మంగళేశ్వరుడు యువనఛ్వాంగుని కంటె నొక్కతరము పూర్వీకుడనుట నిర్వివాదాంశము. కావున కీర్తివర్మ మంగళేశ్వరుల నాటి "చోళీయము" యువన్ఛ్వాంగు నాటి "చోళీయ" దేశమనుటకు సందియము లేదు. 'కొల్లమునకును (Quilon), కన్యాకుమార్యగ్రమునకును మధ్యనున్న దేశమునకు మూషకదేశమనుపేరున్నట్లు తోచుచున్నది'అని ఫ్లీటుగారనుచున్నారు.[2] ఆళుకులుచళుక్యులకు సామంతులైన ఆళుపులే. వైజయన్తీపురము కుంతల దేశముయొక్క ప్రధాన నగరము. దీనికి బనవాసి యను నామాంతరము గలదు. ఇది కదంబరాజులకు రాజధాని.

ఈపైపట్టికవల్ల కీర్తివర్మ భరతఖండమునం దర్ధభాగమును జయించినట్లుతెలియుచున్నది. ఇత డిన్ని దేశములను వాస్తవముగ జయించెనా? లేక తనయన్నయొక్క శౌర్యాతిశయమును బ్రకటించుటకై చెప్పుకొన్న ప్రగల్భవాక్యములా? నాకు జూడ నీపట్టికయంత విశ్వాసార్హముగ దోచలేదు. వంగాఙ్గమగధ దేశములను కీర్తివర్మ జయించెనన్నమాట యతిశయోక్తి. నళవంశనృపాలుర శాసనములు కళింగమున నుండుటచేత "నళమౌర్య కదంబ కాళరాత్రి" యగు కీర్తివర్మ కళింగమును జయించియున్నను ఉండవచ్చును. మద్రక కేరళ పాండ్యమూషక దేశములపై విజయమును సందేహాస్పదమే. ద్రమిళచోళీయాళూకవైజయన్త్యాది నరపతులను జయించి యుండవచ్చును. ఏలన, ఈ దేశములు బాదామిరాజ్యమునకు చుట్టుప్రక్కల నుండినవి. తత్కారణమున నారాజ్యములతో చళుక్యులకు యుద్ధము పొసగి యుండవచ్చును. కావున కీర్తివర్మ

1. I. A., XIX, p.17.

2. I. A., XIX, p. 14

నాటి చళుక్యరాజ్యవిస్తీర్ణమింతయని నిర్ధారణ చేసి చెప్పుటకు వీలులేదు.

అయినను మంగళేశ్వరునిచే జయింపబడిన దేశములనుగూర్చి యెట్టిసందేహమును లేదు. ఈతనిరాజ్యకాలములోని మొదటి పదివర్షములలో నితనికి ప్రసిద్ధులైన శత్రువులతో యుద్ధము పొసగలేదు. ఏలన, బాదామిగుహాశాసనమునం దనేకశత్రువులను నిర్జించితి నని చెప్పకొనెనేకాని ఆశత్రువులనుగాని, వారిరాజ్యములనుగాని పేర్కొని యుండలేదు. అయితే బాదామిశాసనము వేయించిన పిమ్మట చళుక్యులకు కలత్సురి వంశపు రాజులతో కయ్యమారంభమాయెను.

కలత్సురు లెవ్వరు? వీరు దక్కను పశ్చిమోత్తరభాగమున విస్తార మగు రాజ్యము నేలిన రాజవంశజులు.

> "కలచ్చురిశకమువాడబడిన దేశములనుబట్టి చూడ వీరు స్వామాప్నదమునంది లాటదేశమునకు ఉత్తరపు సరిహద్దు గనున్న కొంకణదేశములోని కిం నదివఱకో లేక మాహి నదివఱకో వ్యాపించియున్న విస్తారమగు భూముల నేలిన నృపాలురు"

అని భండార్కరుగా రనుచున్నారు.[1] కలత్సురిరాజులు శక్తిసంపన్నులగుటచేత తమ రాజ్యమును విస్తరింప బ్రయత్నములు చేయుచుండిరి. అట్టిప్రయత్నమునం దేతమసర్వశక్తిని వినియోగ పెట్టుచున్న చళుక్య రాజులతో వారికి కలహము సంప్రాప్తమగుట సహజము. రెండురాజ్యములవారికిని కొంకణమున కలహామారంభమయ్యెను. ఈ కలహామునకు గారణము సరిహద్దులను గూర్చిన యభిప్రాయభేదముగ నుండవచ్చును. కలహామునకు గాలుద్రవ్వినవారు కలత్సురు లనుటకు సంశయము లేదు. కలత్సురిరాజు శంకరగణుని పుత్రుడు బుద్ధరా జనువాడు చళుక్యరాష్ట్రముపై దండువెడలి యందలి కొన్నిభాగముల నాక్రమించుకొన్న ట్లగపడుచున్నది. బుద్ధరాజు మహాబలవంతుడగు శత్రువు. అతడు 'గజతురగపదాతు'లను గలవాడు. "కోశబల సంపన్నుడు"[2] ఇంతేకాక, బుద్ధుడు చళిక్య సంభూతుం డగు స్వామిరాజుతో సఖ్యము జేసి యతనిచేయూత గొని బాదామిచాళుక్యులతో సమరముసేయ సంసిద్ధుడాయెను. ఆ కాలమున స్వామిరాజు మహాశూరుడని పేరు వడసిన ట్లున్నది. ఇతడు "అష్టాదశసమర విజయి" యట![3] ఈ చళిక్యస్వామిరా జెవ్వరో, అతడు చళిక్యవంశజు డయ్యు బాదామి చాళుక్యులతో నేల పోరొనర్చెనో తెలియదు. ఇతనికిని, 'కియూరా' శాసనమునందు[4] వర్ణింపబడిన చళుక్యవంశమునకును ఏదో సంబంధమున్నట్లు తోచుచున్నది. అందు విజయసింహమహారాజును అతనికుమారుడు "...వల్లభరణవిక్రాన్త శ్రీ బుద్ధవర్మ్మరాజు"ను బేర్కొనబడియున్నారు. "...వల్లభరణవిక్రాన్త" యను వాక్యము "పృథివీవల్లభరణవిక్రాన్త" యని యుండవలయును. "పృథివీవల్లభరణవిక్రాన్త" యనునది మంగళేశ్వరునిబిరుదు. సామంతప్రభు

1. I. A., XL, p. 20. 2. I. A., VII, 161. 3. Ibid. 4. I. A., VII, 248-9.

వులు దమ యేలికలనామములను ధరించుట ప్రసిద్ధమైన విషయము. కావున, కియారదాన పత్రములోని చళుక్యబుద్ధరాజు మంగళేశ్వరుని భృత్యుడు. స్వామిరాజునకును, కియారచాళుక్యులకును గల సంబంధ మెట్టిదైనను ఒక్క విషయము నిశ్చయముగ దెలియుచున్నది. చళుక్యవంశమునకు మంగళేశ్వరుని కాలమున ననేకశాఖ లుండెను. కొంతవఱకు శాఖాన్తర వైరము లుండెను. ఇవి నిర్వివాదాంశములు.

ఇట్లు రాష్ట్రముపై నెత్తివచ్చిన శత్రువుల నెదుర్కొని మంగళేశ్వరుడు వారితో యుద్ధము చేసెను. ఈయుద్ధమున స్వామిరాజు హతుడై వీరస్వర్గమునకు బోయెను. బుద్ధుడు పరాజితుడై చేయునది లేక వెన్నిచ్చి పారిపోయెను.[1]

అట్లు పారిపోయిన బుద్ధభూపాలుని విడువక, వెన్నంటి తరుముచు, గొప్ప అశ్వసేనతో[2] మంగళేశ్వరుడు కళత్సురులరాష్ట్రమును బ్రవేశించెను. బుద్ధు డాతని నెదుర్కొని మరల పరాజితుడు కాగా, అతని ధనమంతయు మంగళేశ్వరునికి హస్తగత మాయెను.

ఈవిషయమును గూర్చి మహాకూటశాసనమున నిట్లు చెప్పుకొనియున్నాడు:

"సమ త్తరా ద్విజయకృతే బుద్ధి బుద్ధనృప మవిజిత్య లస్య వసు మశేష ముపగృహ్య"[3]

ఇత్యాది.

ఈవిషయమునే రవికీర్తి మిక్కిలి సొంపుగ వర్ణించియున్నాడు.—

"స్ఫురన్మయూఖై రసిదీపికాశతై
ర్వ్యుదస్య మాతఙ్గతమిస్రసఞ్చయమ్,
అవాప్తవా న్యో రణరంగమందిరే
కటచ్చురి శ్రీలలనా పరిగ్రహమ్."[4]

మఱియు,

"రాజస్త్రీణాం హాసపతి రభూ వ్యశ్చ కాళచ్చురీణాం"[5]

అనుపపూరశాసనవాక్యమువల్ల పైవిషయము స్థిరపడుచున్నది.

కాళచ్చురి రాజులకు కొంకణదేశములోని యుత్తరభాగమును, పశ్చిమసముద్రాంతర్గతములగు ద్వీపములును కైవస మయియ్యుండెను. ఈ ద్వీపములను జయింపక కొంకణముపై నధికారము నిలుపుకొనుట దుస్తరమగుటచేత, మంగళేశ్వరుడు తన నావికాదళముతో వానిని ముట్టడించెను. ఈద్వీపములలో ముఖ్యమైనది రేవతి. ఆతడు నావలచే నిర్మింపబడిన సేతువుపై సముద్రమును దాటి రేవతిం జేరెను. పట్టణము సులభసాధ్యముగ స్వాధీనము గాదాయెను. చాళుక్య నావికాదళము ముట్టడించి కొంతకాలమునకుదానిని లోబరచుకొనెను.[6]

రేవతీద్వీపము కొంకణతీరమందీకాలమున ముఖ్యస్థానముగ నున్నట్లు గన్పించుచున్నది. ఇది చళుక్యరాజులకు లోబడిన రాష్ట్రపాల

1 I. A., VII, p. 161.　2. E. I., VI, p. 1.　3. I. A., XIX, p. 18.
4. E. I., VI, p. 1.　5. I. A., VIII, p. 10.　6. E. I., VI, p. 1. & I. A., VIII, p. 10.

కుని కొకనికి రాజధాని యాయెను. గోవా శాసనదాతయగు ధ్రువరాజ ఇంద్రవర్మ తనదానశాసనమున దన్ను గూర్చి యిట్లు చెప్పుకొనియున్నాడు.—

"శ్రీరిజ...రేవతీ ద్వీపస్థితేన శ్రీపృథివీవల్లభ మహారాజానుజ్ఞాతేన విషయస్థల చతుష్టయాధిపతినా"

ఇత్యాది.

ఇందువల్ల మంగళేశ్వరుడు కొంకణ దేశమును, తత్సమీపసముద్రాన్తర ద్వీపములను జయించుటయే కాక, వానిని చళుక్యరాజ్యమునందు గల్పుకొనె నని తెలియుచున్నది.

తదనంతరము ఉత్తరదేశముపై దాడి వెడలి భాగీరథీకూలమున కీర్తిజయస్తంభము నుస్థాపించుట కుద్యమించి మొదట ధర్మజయస్తంభమును నాటుకొల్పుట మేలని చింతించితి నని మహాకూట శాసనమున మంగళేశుడు వచించియున్నాడు.[1] ఈదిగ్విజయము నడిచెనో లేదో తెలియదు.

మంగళేశునిచే నోడింపబడిన బుద్ధరాజు రెండవపులకేశి రాజ్యారంభకాలమున జీవితుడై యున్నట్లు సరస్వతీశాసనమువల్ల[2] దెలియుచున్నది. కళత్సురిరాజ్యమంతరించలేదు. అందలి రాష్ట్రములను కొన్నింటిని చళుక్యులు స్వాధీనపఱుచుకొన్నను రాజ్యము సంపూర్ణముగ నశించలేదు. క్రీ. శ. ౬౦౯ లో నిచ్చిన సరస్వతీశాసనమున నతడు తన్నిట్లు పొగడుకొనియున్నాడు.—

"ప్రబలరిపు బలోద్యమ్యాతపర్వ విభవ ప్రధ్వంస హేతుః"

మఱియు,

"రాజసామన్త భోగికవిషయపతి రాష్ట్రి గ్రామ మహత్తరాధికారి కాదీన్ సమాజ్ఞాపయతి."

ఇందుమూలమున కళచుర్యరిరాజ్యవైభవము కొంతమట్టుకు దెలియుచున్నది.

మంగళేశ్వరుడు శత్రువులను నిర్జించి సుఖముగ చిరకాలము రాజ్యము చేసెను. అయితే, రాజ్యాంత్యకాలమున నాతని కొకప్రబలమైన శత్రువుతో పోరాటము సంభవించెను. రాజకుటుంబమునం దంతఃకలహము లుత్పన్నములాయెను. మొదటి కీర్తివర్మకు మువ్వురో నలువురో పుత్రు లుండిరనియు, అందగ్రజుని పేరు పులకేశియనియు ఇంతకుపూర్వమే వచించియున్నాను. పులకేశి పెద్దవాడై నిర్వాహకుడై యుండెను. తనపినతండ్రి మరణానంతరము రాజ్యము తనదేయని యాతడు దలపోయుచుండెను. కావుననే తన్ను యౌవరాజ్యమునకు పట్టాభిషిక్తుని జేయవలయునని కోరెను. అసూయచే మంగళేశ్వరు డందు కంగీకరించక దనపుత్రునికే రాజ్యము నొసగ దలంచి, పులకేశిని రాజ్యమును వెడలనడిచెను. అట్లు దేశభ్రష్టుడై, పులకేశి యన్యదేశముల సంచరించుచు, స్వబుద్ధిబలముచేత నన్యరాజుల సహాయము నార్జించి తనపినతండ్రిపై దండువెడలెను. మంగళేశునకు పులకేశితో యుద్ధము కొంతకాలమువఱకు నడిచెను. ఒకఘోరసమ

1. I. A., XIX, p. 18.

2. E. I., VI, 294.

రమున మంగళేశ్వరుడు వధింపబడెను.[1] మంగళేశుని మరణము శ. ౫౩౧-౨ నందు జరిగియుండవలయునని చరిత్రకారు లూహించుచున్నారు. అంతటితో యుద్ధము సమాప్తమాయెను. రెండవపులకేశి బాదామిపట్టణమున రాజ్యాభిషిక్తు డాయెను.

## మంగళేశ్వరుని మతము

ఇతడు వైదికమతాభిమాని యగు వైష్ణవుడు.

"అగ్నిష్టో మాగ్నిచయన వాజపేయ పౌండరీక బహుసువర్ణాశ్వమేధావభృథస్నానపవిత్రీకృత శరీరసామ్ చళుక్యానాం వంశే"

అనుబాదామి గుహాశాసనము[2] లోని వాక్యమాతని వైదికమతాభిమానమును దెల్పుచున్నది. ఇతనితండ్రి యగు మొదటి పులకేశియు నీపై జెప్పినయజ్ఞముల నన్నిటిని జేసినట్లు శాసనములు పల్కుచున్నవి![3] నేరూరుశాసనములో మొదటిపులకేశి పైయజ్ఞముల నన్నింటిని, మహాకూటశాసనములో కీర్తివర్మ "బహుసువర్ణాగ్నిష్టోమ"ములను జేసినట్లువర్ణింపబడియున్నది. దీనినిబట్టి చూడగా మంగళేశ్వరుడు యజ్ఞములను చేయనట్లు తోచుచున్నది. చేయకున్నను తా నట్టిగొప్పవారి వంశమున బుట్టితినని విశేషముగ జెప్పుకొనుటచే నతనికి వైదికక్రియలయందు గొప్పగౌరవము గలదనునూహ పొడముచున్నది.

మఱియు నేరూరుశాసనములో దాను "పరమభాగవతుడ" నని చెప్పుకొనుటయేకాక "కార్తికద్వాదశ్యాం కృతోపవాసే నార్చితవిష్ణునా" యని వచించియుండుటవల్ల నాతడు వైష్ణవు డనియును, ఏకాదశీవ్రతము ననుష్ఠించువా డనియును దెలియుచున్నది. "పరమభాగవతో లయనే మహావిష్ణుగృహం కృత్వా" యనుబాదామిగుహాశాసనములోని వాక్యము గూడ నాతని వైష్ణవమతాభిమానమును జాటుచున్నది. ఇతనికి బాలకృష్ణునియం దభిమానము మెండు. పైజెప్పిన బదామివిష్ణ్వాలయమునందు శ్రీకృష్ణభగవానుని బాల్యక్రీడలన్నియు ప్రతిమారూపమున జెక్కబడి యున్నవి. ఇంతేకాక మహాకూటశాసనమున దనతండ్రినగు దేవునితోడను, తల్లులను రోహిణీ దేవకులతోడను, అన్నను బలరామునితోడను, తన్ను కృష్ణునితోడను బోల్చుకొనుటయు నతడు శ్రీకృష్ణునిభక్తు డనియు, వైష్ణవు డనియును దెలియజేయుచున్నది. అయితే, 'శివ' శబ్దోచ్చారణమాత్రమున చెవులను మూసికొను వీరవైష్ణవుడు గాడు. ఏలన, మకుటేశ్వరనాథునికి గొన్నిగ్రామముల నిచ్చినట్లతని మహాకూటశాసనమువల్ల దెలియుచున్నది. కావున, విష్ణువే ఆదిదేవుడని నమ్మకము గలవాడయ్యు, పరమశివునియం దనాదరణబుద్ధి లేక, ఆ దేవుని గూడ నీత డర్చించుచుండె నని గ్రహింపవలసి యున్నది.

---

1. E. I., VI, p. 1.　　2. I- A., III, 305.　　3. I. A., VII. 161.

పూశిపెద్ది వెంకట రమణయ్య గారు (కవితాసమితి)

౧

ఈలతాంతమును ముద్దిడినాఁడవేమొ - రేకులఁ గెమ్మోవి రేఖ దోఁచెడిని!
తనివార నీతీవఁ దట్టితివేమొ, - చివురులోఁ గెంగేలు చెల్వు దోఁచెడిని!
రేవెల్గు నిటఁ బల్కరించితివేమొ - వెన్నెల నీనవ్వు వెల్గు దోఁచెడిని!
తెరలు నీగాలిసందిటఁ జేర్చితేమొ - తరఁగలఁ బద్మగంధమ్ము దోఁచెడిని!
మదకోకిలమ్ముతో మాటాడితేమొ - పలుకులో లలిత భావాలు దోఁచెడిని!
గానాన నీగుట్టుఁ గరఁగించితేమొ, - సెలయేట నీపాట చెల్వు దోఁచెడిని!
జగ మెల్ల నీదువాత్సల్యంపుజాడ - లెడనెడఁ దోతెంచి యింపు గూర్చెడిని!
ఎం దున్నవాఁడవో యీశ, నే నెఱుఁగ! - కన్ను లుండియు నిన్నుఁ గాంచ లేనేమొ!
నీవేణు మంజుల నినదమ్ముఁ దాటి - నీకర్ణయుగళమ్ము నెఱేఁ జేరుదాఁక
గొం తెత్తి నేఁ బాడికొను బత్తిపాట - విన కెందుఁబోదు వేణుగోపాల!

౨

తరుణార్క రాగానఁ దడి యారలేదు - చిత్రించు నీదు కుంచియ గానరాదు!
కుసుమమ్ములోన రంగుల నిండు లేదు - నీకూర్చికొన్న వన్నెలు గానరావు!
కడఁ బ్రాఁకుతీవ వక్రత దీరలేదు - సరిచేయు నీ వ్రేలిజాడ కన్పడదు!
మలసెడు నీసందెమసక పోలేదు - లీల నీతుడుచుపీలిక గానరాదు!
ఇంతలో మఱపించి యెందుఁ బోయితివి? - ఈవిశ్వమందు ని న్నెందు శోధింతు?
నీవిశ్వమందు ని న్నెటు పట్టుకొందు? - కొనకొని నీవు దాఁగుడుమూఁత లాడ
నినుఁ గానకే నిట్లు నిలువఁగాఁ జాల!

*　*　*　*　*　*

నీవేణుమంజుల నినదమ్ము దాఁటి - నీకర్ణయుగళమ్ము నెఱేఁ జేరుదాఁక
గొం తెత్తి నేఁ బాడ్కొను బత్తిపాట - విన కెందుఁ బోదువో వేణుగోపాల!

## సింధుదేశ ప్రాచీననగరచిత్రములు



౧. మోహెంజోదారోలోని ప్రధాన దేవాలయముయొక్క కొలనిప్రక్కనున్న వీథి
కొలనిలోనికి పోవుమార్గము నిందు ఎడమప్రక్క గాంచనగును.



౬. హారప్పాలో దొరికిన రాగి శస్త్రముల నండిన
ఉపకరణములు నాయుధములు



౫. ఒమ్ముగ సొమ్ములు దాల్చిన ఒకానొక మంటిబొమ్మ

ఈ బొమ్మ దిగంబరముగ నున్నది. ఇట్లు సొమ్ములు నిండుగ పెట్టుకొనియున్నట్లు చిత్రింపబడుట ఆకాలముననుగూడ నాడువారికి నగలపైగల యత్యాసక్తికి నిదర్శనము.

3

మందపవనోర్మికా మాలికావితతి-సందడించెడు పిల్లసవ్వడిలోన
నీవేణురవము విన్పించిన ట్లయ్యె! - కలకలాన్విత విహంగమ కూజితాల
గలగల వోవు సంగతులలోఁ దేలి - నీగజ్జెల సడి విన్పించిన ట్లయ్యె!
సాంద్రవల్లీనికుంజంపు నీడలను - మసలు గాటంపు శ్యామల కాంతిలోన
నీమేని తళ్కు గన్పించిన ట్లయ్యె! - దళిత కుందగుళుచ్ఛధాళధళ్యముల
పెనఁగొన్న యీనూత్న విభవకాంతులను-నీనవ్వు వెలుఁగు గన్పించిన ట్లయ్యె!
ఏ తెరలోననో యింతలో డాఁగి-మురిపింతువే నన్ను మోహనాకార ?
నా కంద రాక యెన్నాళ్లు డా గెదవు? - నీవేణుమంజుల నినదమ్ము దాఁటి
నీకర్ణయుగళమ్ము నెటేఁ జేరుదాఁక -గొంతెత్తి నేఁ బాడికొనుబత్తిపాట
విన కెందుఁబోదువో వేణుగోపాల!

౪

వలపుకోరికల క్రోవలు దీర్చినట్లు-రాధికా తారహారములలోఁ జిక్కి-
మురియు నీ చల్లని మురళీరవమ్ము!-వెల లేని రత్నదీపిక లిడ్డమాడ్కి-
సద్భక్తవీక్షణాంచలముల న్నిల్చి-వెలుఁగు నీ భాసుర వేణుగానమ్ము;
నవవసంతాగ మానందంబువోలెఁ-బ్రకృతి సౌందర్యసంపదలోనఁ గలసి
లలిఁ బారు నీదు పిల్లనగ్రోవిపాట!-నీపాట విన రాని నెలవులే లేవు!
తన్మయతఁగని చైతన్యంబు వాసి-జగ మెల్ల నిద్రించుసమయమ్ములోన
మేల్కని నే లేచి మేలుసంగతుల-నీవేణుమంజులనినదమ్ము దాఁటి
నీకర్ణయుగళమ్ము నెటేఁ జేరుదాఁక-గొంతెత్తి తగఁ బాడికొనుబత్తిపాట
విన కెందుఁ బోదువో వేణుగోపాల!

— —

5. 3- 13 ౪౬3

# నాటకకళ - స్త్రీపాత్రములు స్త్రీలే ధరింపవలయునా?

[రసపాయి]

ఆధునికనాటక ప్రదర్శనములలో నిక స్త్రీలే స్త్రీపాత్రముల ధరింపవలయునట. పురుషుడు స్త్రీపాత్ర మభినయింపరాదా? అభినయింపవచ్చును. (అభినయింపకుండుట మేలు.) స్త్రీకంఠసామాన్యమును మాధుర్యాదిగుణములు పురుషుని కుత్తుక కోసినను కానరావు. వేషమునకు తగు కంఠమాధుర్యము, కంఠమునకు తగు వేషమును కుదిరినచో పురుషపుంగవులచే నభినయింపచేయవచ్చును. "పురుషుడు స్త్రీవేషమును ధరించిన జూడరాదు." అను పెద్దల నియమమునందు విశేషతత్త్వము కలదు. స్వబుద్ధి నాలోచించినను స్త్రీలే స్త్రీపాత్రముల నభినయింపవలసి యుండును. స్త్రీ పురుషపాత్ర మభినయించుచో నెంతగా ప్రయత్నించినను రూపగాంభీర్యమునందును, వాక్సంపత్తియందును, చలననైఖరిలోను, హావభావములయందును ఎంత మెత్తపడునో, పురుషుడును స్త్రీపాత్ర మభినయించుపట్ల పైవిషయములలో నంతమోటుగా నుండును. ప్రకృతిసిద్ధముగా నుండును. కావున భగవంతుని సృష్టిలోనే స్త్రీవ్యక్తి వేరుగను, పురుషవ్యక్తి వేరుగను కల్పింపబడినది. శరీర మాద్యంతము దాచబడినను ఒకపాదముగాని, తుద కొకచేతివ్రేలుగాని చూచి, యది స్త్రీవిగ్రహమో, పురుషవిగ్రహమో చెప్పవచ్చును. విగ్రహము కనబడకున్నను పలుకునుబట్టి స్త్రీయో, పురుషుడో చెప్పవచ్చును. అట్టియెడ నిండువిగ్రహమును మార్చుటగా దలకొక 'విగ్గును', మొలకొక 'చీరను' దవిల్చి రంగమధ్యమున నిల్పి మాటలాడించునపుడన్యథా భావింప నెట్లగును? జ్ఞానస్థానమున భ్రాంతి కలుగదుకదా? ఇందులకయ్యే నాట్యవేదమును భూలోకమున కవతరింపజేసిన భరతాచార్యులును "నాయకం రక్షతీంద్రస్తు నాయికాంతు సరస్వతీ" అని యొకచో ప్రశంసించిరి. ఇట 'నాయికాం' అనుదానికి నాయికావేషధారి యగువానిని అని యర్థము చెప్పినను మఱొకవిధమున వ్యాఖ్యానము చేయ వీలొసంగని వెన్నియో యున్నవి. మఱొకచోట "పురుషైర్బహుభిర్వ్యక్తమల్పస్త్రీకం తథైవచ" అని వ్రాసియున్నారు. నాటకముల విభాగించునప్పుడే పురుషులచే నాడబడు నాటకములనియు, స్త్రీలచే నాడబడు నాటకములనియు, స్త్రీలచేతను, పురుషులచేతను నాడబడు నాటకములనియు నియమించియున్నారు. వాటిని భాణము లందురు. అందు శృంగారమును స్త్రీలచేతనే యభినయింప జేసియున్నారు. యుద్ధములు, ఆర్భాటములు, సాత్త్వలు గల నాటకములను పురుషులే ఆడవలయునని శాసించినారు. ఇంకొకనిదర్శనము స్త్రీలే స్త్రీపాత్రములు ధరించుచుండిరనుటకు: నాటకములనే మూడువిధములుగ విభజించి యున్నారుకదా? అనురూప, విరూప, రూపానురూపములని. అందు అనురూపనాటకములలో పురుషులు పురుషపాత్రములను, స్త్రీలు స్త్రీపాత్రములను ధరింతురు. విరూపనాటకములలో చిఱుతప్రాయపువారు వృద్ధులవేషములను, వృద్ధులు యువకుల వేషములను వేయుదురు. రూపానురూప నాటకములలో స్త్రీభూమికలను పురుషులే ధరించునట్లు తీర్మానించియున్నారు. నీతిగల నటుడెవడును తానుగా స్త్రీకి స్త్రీవేషధారణమందు సహాయపడరాదనిశాసించియున్నారు. దీనిచే మనము నిర్ధారణముచేయవలసిన దేమనగా, స్త్రీలే స్త్రీపాత్రములను పూర్వకాలమందు ధరించుచుండిరని స్థిరపఱుపవచ్చును. ఇట్టి సంఘములకు అనేక కట్టుదిట్టములను నియమించిరి. అట్టి సమాజమునబహుసంఖ్యాకులు పురుషులును, అల్పసంఖ్యాకులు స్త్రీలును ఉండవలయునని వారినియమము. నాయికాపాత్రము తప్పక స్త్రీచేతనే యభినయింపబడవలయునట! ఇందులకు తార్కాణముగ "రూపగుణశీలయౌవనసువర్ణమాధుర్యశక్తిసంపన్నా, విశదా స్నిగ్ధా మధురా పేశలవచనాభిరక్తకం

తీచ; యోగ్యాయా మక్షుభితాలయతాలజ్ఞా రసైస్తు సంయుక్తా, ఏవం విధగుణయుక్తా కర్తవ్యా నాయికాతజ్ఞై." ఇన్ని గుణములుగల స్త్రీయే నాయికగా జేయబడవలయును. ఈసిద్ధాంతమునే బలపఱుచుచు నందికేశ్వరుండును తన యభినయశాస్త్రమున నాయికాగుణవర్ణన సందర్భమున:— "నాతిస్థూలా నాతికృశా నాత్యుచ్చా నాతి వామనా" అని తెల్పెను. పైజెప్పినవన్నియు కేవలము శాసింపబడి యుపేక్షింపబడినవికావు. భరతఖండమున నేనాడు నాటకములు పుట్టినవో నాటినుండియే యివి వాడుకలో నున్నవి. మహాకవి కాళిదాసు తనవిక్రమోర్వశీయనాటకమున దేవలోకమున జరిగిన లక్ష్మీస్వయంవరనాటకములో నూర్వశి లక్ష్మీపాత్రము అభినయించినట్లు దెల్పియున్నాడు. ఉత్తరరామచరిత్రమున నంతర్నాటకమునుగూర్చి అది అప్సరసలచే ప్రయోగింపబడినట్లు భవభూతియు వ్రాసియున్నాడు. వీనినిబట్టి చూడ తఱుచుగా స్త్రీపాత్రములు స్త్రీలచేతనే యభినయింపబడుచుండినట్లు తేలుచున్నది. వీటినెల్ల నాలోచించి, "నాట్యకళావిశారద" బిరుదాంచితులగు బళ్లారివాస్తవ్యులు శ్రీతాడిపత్రి రాఘవాచారిగారు ఒకసందర్భమున నుపన్యసించుచు, "స్త్రీలే స్త్రీవేషములను ధరించుట ఉచితము. ఆయుద్దేశ్యముతో మేము మా కంపెనీవారు ఆమెచ్చారు సమాజమున కొంతమందిస్త్రీలను చేర్చుకొనియున్నాము. పలువురు ఈవిషయమై మమ్మల నాక్షేపించుచున్నారు. అవతారపురుషులే సామాన్యప్రజల యాక్షేపణలకు గుఱియై యుండిరి. కావున మేము మాఆదర్శమునే ప్రధానముగగైకొనియున్నాము. ఇతరులనిందా ప్రశంసలతో మాకు పనిలేదు" అని దృఢముగా వక్కాణించి, ఆనరబులు శ్రీ వి.వి. శ్రీనివాసయ్యంగారిచే నాంగ్లమున రచింపబడిన "సర్ జన్ జెనరల్" అను ప్రహసనమున నిరువురు స్త్రీపాత్రలను స్త్రీలచేతనే యభినయింపజేసిరి. ఆప్రహసనమును వీక్షించిన ప్రేక్షకులకు 'స్త్రీలే స్త్రీపాత్రములు వహించిన నెంత రమ్యముగా నుండును!' అని తోచినది. శ్రీ ఆచార్యులవారు నాటకకళయందు సంస్కరణాభిలాష గలవారై పురుషులతోపాటు స్త్రీలును నాటకకళయందు పాల్గొని కళను సముద్ధరింపవలెనని తెల్పుటయే కాక, నిదర్శనమునుగూడ ప్రదర్శింపజేసిరి. పాశ్చాత్యదేశములందు పురుషులతోపాటు స్త్రీలు సహితము నాటకఖేలనమున పాల్గొనవచ్చును. అది వారి దేశాచారమునకు విరుద్ధముగాదు. కాని మనదేశమున రంగస్థలసంస్కరణము ప్రారంభదశలో నున్న యిత్తరుణమున స్త్రీలు సహితము పురుషులతో గలసి నాటకమాడుటకు ఒప్పుకొనవలయుననుట కొందఱికి రుచింపకపోవచ్చును. క్షణక్షణము కాలచక్రము మారుచుండునుగదా? అని కులాంగనలను పురుషులతోపాటు నాటకములయందు స్త్రీపాత్రములను ధరించునట్లు చేయుట శుభసూచకమా! పాఠక మహాశయులే నిర్ణయింతురుగాక.

---

# చెవిటిమల్లయ్య పెళ్లి

బసవరాజు అప్పారావు గారు

హృదయమా! సంద్రమునకన్న పదిపదింత-లతివిశాలవు గమ్మ! దేవాధిదేవు
డగు మహాదేవు కరుణామృతంపు వాహి-నులను నీలోన కలుపుకోవలెను గాదె!

ఇది మహాదేవు సామ్రాజ్య, మిచట నీకు-నీతిబాధల భయ మించుకేని లేదు;
సకల శుభములు నొందవు నిస్సంశయమ్ము-శివుని పే రశుభాలకు చెంపపెట్టు.

పవను డనుకూలుడౌ; దప్పి వాపికొనగ-కొండవాగులలో నీరు గ్రోలి తమిని,
నిటు నటులు చూడకే కాలు దిటముగాను-మెట్లపై నూని పై కెక్కు, మృదులగాత్రి.

హరహరా, శంకరా, మల్లి కార్జునుండ! చేదుకో, చెవిటిమల్లయ్య, చేదుకొమ్మ
టంచు నుత్సాహమున పైకి నరుగుచుండ్రి-తోడి యాత్రికు లరుగోనె, తోయజాక్షి.

మూట నెత్తిని బెట్టు కామూడుకాళ్ల-ముసలిదే కఱ్ఱ బుచ్చుకు మోహరించి
మెక్కు చుండగ చెప్పెడి దేమికలదు-పడుచుదంపతులము భయంపడగ దగునె?

పూలపాన్పులు పరచిన నేలనైన-కాలు పెట్టిన తోడనే కందిపోవు
నవ్య నవనీతగాత్రి, నీ దివ్యమైన-భక్తియే యూతగా గొని పైకి జనుమ!

పెళ్లి వేడుక జూచిపో బిలిచె నన్ను-చెవిటిమల్లయ్య మాదె పైచేయి సుమ్ము!
పెళ్లి కూతురు భ్రమరాంబ పిలిచె నంచు-పెంకెతన మేలనే ఆడపెళ్లిదాన!

ఈమహాగహనాంతర సీమలోన-నీవు శ్రీగిరి భ్రమరాంబ వేను, మల్లి
కార్జునుడ, యాత్రికుల్ ప్రమథాదు లంచు-సరస మాడుకొనుచు పైకి జంద, మబల.

---

# నాదాహమునకు మీ పానీయము

**దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారు**

ఈక్రింది వ్యాసమును మేస్టరువిలియము, ఇ. జాన్సను 'ఇండియన్ సోషలు రిఫార్మరు' పత్రికలో ప్రచురించెను:

"నేను దప్పిక గొనియుండ నీవు దాహము నిచ్చితివి." డబ్లిను నగరమునందలి యొక దేవాలయపు గాజుకిటికీలో నీవాక్యము చిత్రముగ నల్లికగా చెక్కబడియున్నది. ప్రపంచమందలి సారాయి వర్తక కుటుంబములలో గొప్పదియగు గైలసుకుటుంబమువాడొక డాకిటికీని సమర్పించెను. మధుపాననిషేధబోధనసంపర్క దోషములేని సామాన్యడబ్లిను నగరనివాసికది చక్కని ప్రకటనము. అట్టివాని కది హాస్యాస్పదముకాదు. ప్రపంచమున సారాయి తయారుచేయువారిలో ప్రతివాడు సామాన్యముగా క్రైస్తవుడై యుండుటవలన నావాక్యము నెట్లు నవ్వు పుట్టింపగల్గును?

అచిరకాలముక్రిందట నేను ఢిల్లీలో నాస్నేహితుడైన యొక మహమ్మదీయ న్యాయవాదితో సంభాషించుచుంటిని. అతడు మధుపానమునకు ప్రబలవిరోధి మహమ్మదుబోధనలయందు విశ్వాసముగలవాడు. "ఇస్లాముపలెనే క్రైస్తవమతముకూడ పరిపూర్ణ నిషేధవాదకమత మయ్యేనేని ప్రపంచమునం దెట్టి ఘనకార్యములు నిర్వహింపసాధ్యమగునోకదా!" ప్రపంచమందలి క్రైస్తవజాతులలో మిన్నయగు నమెరికా సారావర్తకమును శాస్త్రసూన్యము గావించెనని నే నంటిని. "అగును. మా నిషేధశాసనము క్రీస్తుని సంసర్గక్రియాసందర్భమున మత్తుద్రవ్యముల త్రాగుట కేర్పాటు చేసియున్నది" అని పల్కెను. దీనితో నాగొంతుకలో రాయి పడెను. సమాధాన మూహింపజాలనైతిని.

ఈజిప్టు మధుపాననిషేధసంఘాధ్యక్షు డగు అహమ్మదుగావోషు అను నామహమ్మదీయ స్నేహితుని కొన్ని వారములక్రిందట అలెగ్జాండ్రియా నగరమున నాతని యింటికడ కలిసికొనుట సంభవించెను. ఒకనాటి సూర్యాస్తమయ సమయమున నాతనితోటలో సగము తేయాకునీళ్లను త్రాగి గిన్నెను క్రింద నుంచెను. 'ఒక్కనిముష మాగుము నమాజునకిది సమయము' అని చెప్పుచు బట్టను పఱచి సాయంకాలపు నమాజు జరిగించెను. నేను నిరీక్షించుచునుంటిని. పిమ్మట సంభాషణసందర్భమున అమెరికా క్రైస్తవదేశమంటిని. "అమెరికా యిపుడు క్రైస్తవదేశము కాదు. అది మహమ్మదీయమాయె" నని యాతడు మెఱుపువేగమున ప్రత్యాక్షేపము చెప్పెను. "అది యెట్లు"ని నేనంతట ప్రశ్నించితిని దాని నాత డీక్రిందిరీతిని సమర్థించెను. "క్రైస్తవమహమ్మదీయ మతములకు ముఖ్యమగు భేదము మధుపానాభిరతిపట్లనే యున్నది. మన మొక్క దేవునే యారాధించుచున్నాము. మనమిరువురము క్రీస్తును ప్రవక్తలను సమముగ గౌరవింతుము. మన నైతిక సిద్ధాంతములు ప్రధానాంశములందు సామాన్యములు. మనరెండుమతములకును ముఖ్యభేదాంశమగు సారాయమునుగూర్చి అమెరికావారు మహమ్మదీయసిద్ధాంతము నవలంబించి భేదమును తొలగించిరి. కావున అమెరికా మహమ్మదీయదేశ మాయె" ఈవక్కాణము చేయుటకన్న దీనికి తగు సమాధానము నాకు స్ఫురింపనందున మిన్నకుంటిని, మహమ్మదుకన్న మానవజాతికి మధుపాన విముఖత బోధించి కృతకృత్యుడైనవాడు ప్రపంచచరిత్రమునం దెక్కడవాడు వేరొకడు లేడు. మనము ప్రగల్భములు కొట్టవచ్చును; ఉత్సాహముతో నుపన్యాంగవచ్చును; గంభీరముగా వాదింపవచ్చును కాని పైవిషయము నిర్వివాదాంశము. ఇంతవరకును, మరియు నిప్పటికిని ప్రపంచమందు క్రైస్తవజాతులే అవమానకరమగు సారావ్యాపారమునకు దుర్గములైయున్నవను నసహ్యవిషయమును క్రైస్తవులమగు మనము దాటివెడల యత్నించుట నిష్ప్రయోజనము.

ప్రపంచమునందు సారావ్యాపారము ప్రబలముగనున్న ప్రతిజాతియందును క్రైస్తవజాతి తప్పక కానబడుచుండును. అట్టి క్రైస్తవము ప్రభుత్వాదరణమతమై

యున్నది. మద్యపానవిముఖులైన ప్రజలపైన మద్యపానమును ప్రవేశపెట్టుచున్నజాతి క్రైస్తవజాతియే. నాగరకత విషయమున "బాల్యావస్థ"యందున్న జాతుల పరిపాలనము నప్పగించిన (League of Nations)లీగుఆఫ్ నేషన్సు వారు రాయధికారములను క్రైస్తవాధికారమునకే అప్పగించిరి. అట్లు తమపాలనమునకు లోబడినప్రజలయాక్షేపణమును నిరాకరించి మధుపాన వ్యాపారమును నారిలాభము లక్ష్యముగా నుంచుకొని వ్యవహరించుచున్నారు. సంపూర్ణమధుపానవిముఖులైన మతములప్రజలు ప్రపంచమున 70,00,00,000 డెబ్బదికోట్లు. వీరిలో 30,00,00,000 మసల్మానులు, 21,50,00,000 హిందువులు. 1,50,00,000 బౌద్ధులు. మిగతవారు సిక్కులు మొదలగువారు. ఇట్టివారినడుమ నౌకలతోను ఫిరంగులతోను క్రైస్తవజాతులు చొరబడి మధుపానమును నేర్పి ఆయభ్యాసమును ప్రోత్సాహపఱచుటకు సర్వవిధప్రయత్నములను చేయుచున్నారు.అట్టి జాతులవారినిజయించి ప్రపంచ మన్నిమూలలను సారావ్యాపారమును నెలకొల్పి అది క్రైస్తవనాగరకతయొక్క విజయమనియు చెప్పెదరు.

తురుష్కవిధ్వంసనభంజనములకొఱకును, వారిపై విజయములకును అపకీర్తిపుట్టగలిగినంత వందనములు దేవునకర్పించువారు టర్కీవిషయము తలపెట్టి యేమి చూడగల్గుచున్నారు? నాల్గుసంవత్సరములక్రిందట టర్కీస్వాతంత్ర్యమును బడయగానే మధుపాన నిషేధశాసనము గావించిరి. తమపాలనముక్రిందనున్న టర్కీభాగములో దానిని వెంటనే అమలులోని కిచ్చిరి. ఫ్రెంచివారు వెడలుటతోడనే సైలీషియాలోను, గ్రీకులు వెడలిపోవుట తోడనే స్మర్నాలోను, మిత్రమండలి సైన్యములు, బాస్ఫరసు జలసంధి వదలుటతోడనే, కాన్‌స్టాంటినోపిలునగరమందు నాశాసనము వ్యాప్తమయ్యెను. అంతట టర్కీకి ప్రమాద మాపాదిల్లెను. టర్కీవారి బహిరంగఋణమును కొంతవరకు నితరక్రైస్తవప్రభుత్వములు ట్రస్టీలుగా వ్యవహరించుచున్నారు. టర్కీదేశపుసారాయపు రాబడి యీట్రస్టీలకు హామీగా నుంచబడెను. దానిమూలమున నీవిదేశాధికారులు ఒత్తిడిగలిగించుటవలన మధుపానవ్యాపారమును పునఃప్రతిష్ఠ చేయవలసివచ్చెను. ఐనను అప్పటినుండియు తమబహిరంగఋణవిమోచనమునకు నితరమార్గముల యోచించి మధుపాననిషేధశాసనమును మరల నమలులో పెట్టుటకు టర్కీవారు ప్రయత్నించుచున్నారు.

ఇక నీజిప్టుసంగతి దలపోయుదము విదేశప్రభుత్వముక్రిందనున్న ప్రజలకు సాధ్యమైనంతవరకు నీజిప్టుసారాశాలలులేని దేశమని చెప్పవచ్చును. క్రైస్తవబ్రిటను దేశమే అచట త్రాగుడును ప్రతిష్ఠాపన చేసి వృద్ధిపొందించెను. దానివలననే కీర్తిశేషులైన జగ్లులు పాచ్ఛా కూడ మొదట త్రాగుటకలవాటుపడి కడపట నీటిబండితోసంతుష్టుడై తనయంత్యదశవరకు నిషేధముకొఱకు పాటుబడెను. అలెగ్జాండ్రియా, కైరో, పోర్టుసయ్యదు, సూయజుపట్టణములందు క్రైస్తవనివాసప్రదేశములలోని దుకాణములకు పాతలైసెన్సులను నిలవబెట్టుటతప్ప యీజిప్టులో నెచ్చటను క్రొత్తసారాలైసెన్సులను జారీచేయక ప్రాతవానిని నిలుపుటకుగాని యీజిప్షియను ప్రభుత్వమువారు నాలుగేండ్లనుండి జరిగించుట మానివేసిరి. దీనిమూలమున సగము లైసెన్సు లిదివరకే రద్దుపడెను. పైనాలుగు మ్యునిసిపలు పట్టణములలో ప్రసిద్ధములైన క్రైస్తవనివాసప్రదేశములందు తప్ప యీజిప్టులో సారాలైసెన్సులుండవు. విదేశప్రభుత్వము వారితో గావింపబడిన యొడంబడికల షరతుల ననుసరించి తమవ్యాపారములకు భంగముండదని సారావర్తకులు తలపోయుచున్నను పైన దెల్పిన క్రైస్తవస్వాతంత్ర్యములను డీకొనుటకుమసల్మానులు సంసిద్ధులగుచున్నారు. పాలస్టీను నగరమున టర్కీషుప్రభుత్వమున్న కాలమునందు "క్రైస్తవయాత్రికుల ఉపయోగముకొఱకు" 25 సారాలైసెన్సు లుండెడివి. ఆదేశము బ్రిటిషువారి పరిపాలనముక్రిందకు వచ్చినవెనుక 300 లైసెన్సు లమలులో నున్నవి. దీనిలో 29 క్రైస్తవులకు, యూదులకును, ఒక్కటిమాత్రము మసల్మానులకు నీయబడినవి. అరబుసమ్మేళనము వారా మసల్మానునొక్కనిగూడ మాన్పించుటకు యత్నించుచున్నారు.

ట్రాన్సుజోర్డానియా దేశము క్రైస్తవబ్రిటిషు పరిపాలనముక్రిందకు వచ్చువరకు నచట సారావర్తకము లేదు. ఇప్పుడచటకు క్రైస్తవనామధారులు చేరి సారా

దుకాణములను ప్రతిష్ఠాపించిరి. అందువలననే యచటి బడాముస్తీ దాని నివారణోపాయమునూహింపుమని నన్ను కోరెను. బ్రిటిషుఅధికారుల కార్పణ్యమునకు గురికా కుండ నిషేధము నెలకొల్పుమార్గములను నాతో సంప్రతించి నెలకొల్పుట కాదేశప్రభుత్వపు ప్రధానకార్యదర్శి యగు అరఫ్ బి. యల్ అరఫ్ప్రభు సంఘమును, కార్యనిర్వాహకసంఘసభ్యులను సమావేశము గావించెను. మధుపానమునిన సేవనించుకొనుమొరాకో అల్జీరియా దేశములలో క్రైస్తవప్రఘించి ప్రభుత్వమువారు త్రాగుడును బలాత్కారముగా ప్రవేశపెట్టి ఆప్రజల మొఱ్ఱలను లక్ష్యముసేయక సముద్రతీరప్రాంతములను ద్రాక్షతోటలతో నింపిరి.

బల్గేరియాలో ప్రజలు నిషేధవిధా. ముపట్ల సుముఖులై యుండగా ఏసుక్రీస్తే సారాయములను తయారుచేసి త్రాగినప్పుడు మద్యపాననిషేధమును ప్రజలుకోరుట ఏసుక్రీస్తు నవమానపఱచుటయని క్రైస్తవమువారు బల్గేరియా దేశమునప్రజాశయముల నెదుర్కొనుచున్నారు. క్రైస్తవమతాధికారులను నిషేధవాదులుగా మరలించుటయే బల్గేరియాలో నిప్పుడు గొప్పసమస్యగా నున్నది. ఇది స్వల్పముగా కొనసాగుచున్నది. బల్గేరియా పార్లమెంటులోని మహమ్మదీయ సభ్యులు మద్యపాననిషేధముకోప్పి బద్ధకంకణులై ఏకముఖముగ నెదుర్కొనుచున్నారు. జ్యూగోస్లావియాలోగూడ నిట్టిక్లిష్టసమస్యయే బాధించుచున్నది. అచ్చట దేశీయమహాజనసభలో మహమ్మదీయసభ్యులు త్రాగుడున కలవాటులేనివారగుటచే సారావ్యాపారమును ఎదుర్కొనుచు కోలాహలముగా వించుచున్నారు. వీరిలో పలువురు గతయూరపుమహాసంగ్రామకారణోత్పత్తిస్థానమైన బోస్నియానుండి వచ్చినవారు. నేనీనడుమ శరజీవోపట్టణము వెళ్ళినప్పుడు అచటి ముసల్మానులాపురమందిరమున నాకొరకు గొప్పసభ గావించిరి. ప్రేక్షకులసంఖ్య హెచ్చినందున 500 మంది లోనకు వచ్చుటకు తావు లేకపోయెను. ఆస్ట్రియాయువరాజగు ఛార్లెసును తుపాకీతో కాల్చి చంపి యైరోపామహాసంగ్రామమునకు శంఖుస్థాపనచేసిన స్థలమును నాకు జూపి మరియొక సంగ్రామము నారంభించుట కిది సమయమని తీవ్రముగా నొక మహమ్మదీయ స్నేహితుడు నాతో నపుడుపల్కెను.

మెసొపొటేమియాను బ్రిటిషువారు పరిపాలించునటుల నానాజాతిసమితివారు తీర్మానించియున్నారు. బ్రిటిషువారచటగావించిన మొదటి ఘనకార్యము బాగ్దాలో పరిశోధనకు సారాబట్టీల నిర్మించి ఆదేశమున దొరకెడు ఖర్జూరమునుండి రమ్ము, విస్కీ, సారా, వైను మొదలగు మద్యపానములను తయారుచేయు మార్గము నాలోచించిరి.

బ్రిటిషువారు హిందూదేశమునుజయించి మొత్తముమీద త్రాగుబోతుతనము నెఱుగని యాదురదృష్టవంతులగు ప్రజలపైన సారావర్తకమును మోపినారు. ఆదేశమున నిషేధములేక స్థానికస్వాతంత్ర్యముకొరకు జరుగుచున్న ప్రతిప్రయత్నమునకు కుత్తుక నొక్కుచున్నది బ్రిటిషురాజ్యమే. బ్రిటిషుపాలనము తొలగిపోయెనేని హిందూదేశమున నొకయేడాదిలో త్రాగుబోతుతనము రూపుమాయును. అమెరికాలో నిషేధము సాధ్యమగుటవలన హిందూదేశమునందుగూడ సాధ్యమగునని నాయుపన్యాసములు వినుటకువచ్చిన వేలకొలది జనులు ప్రతిసభయందును జెప్పుచుండిరి. సారాయముల వ్యాపారమువలన వచ్చెడు నాదాయముకొరకు నీతిన్యాయపరిత్యాగమునకొడిగట్టి త్రాగుడును నెలకొల్పు యూరోపియను పరిపాలనము ఆఫ్రికా, ఏష్యాఖండములలో ప్రబలుచున్న అశాంతికి మూడలిరాయిగా నున్నది.

పశ్చిమయూరపుఖండమునందు—ముఖ్యముగ ఫ్రాన్సుబ్రిటను దేశములలో—నిరుద్యోగసమస్య, యుద్ధఋణముల తొందర మొదలగు కారణములచేత నిషేధవాదప్రయత్నమునకు తాత్కాలిక విశ్రాంతి కల్గినది. దిగుబడి యెక్కువగ నున్నను ఇతరవ్యాపారములలోకన్న సారావ్యాపారమునం దెక్కువమందికి పని దొరకదు. ఈజాతులలో త్రాగుడుకొరకు దుర్వినియోగమగు ధనముతో ముప్పది నలుబదియేండ్లలో వీరియుద్ధఋణముల నన్నిటిని పూర్తిగా తీర్చవచ్చును. వీరు యథేచ్ఛగా త్రాగుట కవకాశ మొసగక అమెరికనులు తమకు రావలసినఋణములను తీర్చమనుటవలన వీరు కొగకొగ లాగుచున్నారు.

మతనాయకత్వముక్రింద స్వీడనుదేశము మంచి దారికే వచ్చుచున్నది. మతనాయకత్వము లేకయే డెన్మార్కులో నిది వృద్ధియగుచున్నది. నార్వేలో నిషేధము భగ్నమయ్యెనని తడివారు పొడివారిని వెక్కిరించుచున్నారు. కాని నార్వేలో నిషేధప్రయత్నమే లేదు. అచటి శాసనములు నిష్ప్రయోజనములయ్యెను. అచట నిషేధము లేకపోవుటచే దానికి పరాభవమే లేదు. కలిగిన పరాభవముచట వాడుకలో నున్న వైను, బీరుపద్ధతులకు కల్గినది. వైను, బీరుసారాయములను పిరాయించి ఓడ్కా (ఒక సారాయము) యొక్క తీవ్రమును తగ్గించుటకు ప్రష్యాదేశమునందు చేసిన ప్రయత్నము వ్యర్థమైనందున నచట మరల ఓడ్కానే వాడుచున్నారు. ప్రజలలో సామర్థ్యము హెచ్చించుటకు నిటలీలో ముస్సోలినీమంత్రి రెండువేల సారా దుకాణములను మూయించెను. ప్రజాభిప్రాయానుసరణముగ స్థానికస్వపరిపాలన శాసనము కావలెనని కోరుచు వాడుకలోనున్న బీరుసారాయ విధానముపట్ల తమ యసంతృప్తిని వెల్లడించుచు 20 లక్షల జర్మనులొక మహజరును పంపినను కార్యకారి కాదయ్యెను. తమ రాజ్యమున పదియవవంతు ప్రదేశమున కేథలిక్కు లిథూవానియావారు సారాదుకాణముల నామమాత్రావశిష్టముగావించిరి.

కెనడాదేశమున కొంతప్రదేశమున స్టాకుహోము నగరమునవలెనే సారావిక్రయపద్ధతి నవలంబింప నిశ్చయించిరి. కాని మా పాపనగరమగు న్యూయార్కునందు వలెనే త్రాగుబోతుతనమునకు దామాషాయీని మాకన్న పదిరెట్లు త్రాగుబోతులను స్టాకుహోము నగరమునపట్టి చెరసాలయం దుంచిరనువిషయమును కెనడావారు మరచిపోయిరి. యూరపుఖండమున క్రైస్తవమతము ప్రభుత్వమతముగా నున్న యనేక చిన్నదేశములలో త్రాగుడును ప్రభుత్వపాలనమం దుంచుట కేర్పఱచిరి. వీరి సంకల్పములకు విరుద్ధముగా సారాయములే ప్రభుత్వములను పరిపాలింప గల్గుచున్నవి. ప్రభుత్వపరిశీలనముక్రింద సారావిక్రయము జరిపినయెడల మితపానము సాధ్యమగునను దుర్భ్రమ యీజాతులవారి నావహించియున్నది.

మా (అమెరికా) దేశపు నిషేధశాసనములు నిష్ప్రయోజనము లయ్యెనని మా దేశమునుండి తరుచుగా వచ్చెడు దయ్యముల కథలను విని యూరపుఖండమువారు గత్తరపడుదురు. ఒక అమెరికా దేశస్థుడు త్రాగి భార్యను కొట్టినయెడల నిషేధము వ్యాప్తమందున్న అమెరికా దేశములోని భర్తలందర్ు సామాన్యముగ నట్టిదేయని ప్రపంచమంతకు తంత్రీవార్తల నంపుదురు. అమెరికాను గుఱించి విశ్వసనీయము కాని యెట్టి విషయమునైన నుదాహరించిన యెడల దానిని యూరపువారు తప్పక నమ్మితీరుదురు.

అయిదుసంవత్సరముల క్రిందట నూతన్నాదర్శము ప్రపంచమంతట వ్యాపించుచున్నప్పుడు పదేండ్లలో ప్రపంచమున త్రాగుడు రూపుమాయునని నేను జ్యోతిషము చెప్పితిని. జ్యోతిషము ప్రమాదకరముగు క్రీడ. నామదింపును సవరించుకొనవలసివచ్చెను. క్రైస్తవప్రపంచమునకు కలుగవలసినంత బాధ యింకను కలుగలేదు. దానికింకను ఎక్కువశిక్ష కావలసియున్నది. ఒక సుబ్బుపుదొంగ సారా బుడ్డి నొకదానిని విక్రయించినప్పుడుకన్న ప్రభుత్వోద్యోగీయులు విక్రయించినయెడల ఫలితము వేరుగ నుండునన్న విశ్వాసముతో ననేకజాతులవారు పరిశోధన నింకను కావించుచున్నారు. కానిసన్నృత్తిని నివారించుటకనేక పురుషాంతరముల యాందోళన మానశ్యకమైన రీతినే మధుపాననివారణము ప్రపంచమున సాధ్యమగుటకింక నొకటి రెండు పురుషాంతరములు పట్టవచ్చును.



౭. మోహెంజోదారోలో దొరకిన పాత్రములు
నడుమ నున్నది యాకాలపు రోమకరాజ్యమునకు చెందినది కావచ్చును. రెండుప్రక్కల నున్నవి తెలుపు, ఎరుపు నలుపు రంగులతో చిత్రింపబడి యున్నవి.



౮. మోహెంజోదారోలో దొరకిన ఉల్లిని బోలిన రాగిపనిముట్లు, చిన్న ఆహారపాత్రములు



౯. మోహెంజోదారోలో వెండిపాత్ర (చిత్రము ౧౧) మున దొరకిన ఆభరణసంచయము
ఆభరణముల అందమైనసేత ఆకాలపుపనివాని గొప్పపనితనమునకు, మంచి నాగరకతకు, కళాప్రాశస్త్యమునకు గట్టి నిదర్శనము. కొన్ని ౫౦౦౦ వ సంవత్సరపు నమూనాలవలె నుండుట వింతనుగొలుపును.



౧౦. ప్రాచీనకాలపు వాస్తుకళాప్రాశస్త్యము

మొహెంజోదారోలో నొకగృహము. ఇందు స్నానపుగది, మరుగుపెరడు గలవు. పాకీవారు ఇంటివెలుపలనుండి ఈ మరుగుపెరటిని శుభ్రముచేయుచుండవచ్చును.



౧౧. ఆభరణము (చిత్రములు ౭, ౮) లుండిన వెండిపాత్ర ఇది

# స్వర్గ్భంగము

మొసలికంటి హనుమంతరావు గారు

(Paradise Lost, Book I)

బలితంపు వేలల నిలుపుం-బలుకుచు, విషమాహావాగ్ర వైరులఁ గవియం
దెలుపుచు, నభయంకర మై-సిలుగుల, నీనోటిఁ బలుకు చెవులం బడిరన్.

కలితనవోత్సాహంబున-విలసితమతు లగుచు రగ్ని విపథి మనగతిం
దొలఁగి స్మృతి, బోరగిలఁబడి-చెలఁగిన—సత్రంబె యంత చెమపా టొదవన్.

అని యాడఁగఁ జనఁదొడఁగెను-బెనురక్కసి తీరమునకుఁ బృథులమున వినా
శనమతి సాంద్రము వర్తుల-మును భారమునైన చర్మ మూపున వ్రేలన్.

అద్దాని విపులపరిధికి-నుద్దీ తలంపంగ రాత్రి యొదవెడివేళన్
నిద్దపు దర్శనకాచము-నుద్దవిడించెసాలిమీఁదనో వలదెరుసనో.

ఒం డమరిచి, యేమచ్ఛల-మండలమునఁ గ్రొత్తనదులు, మహీధరములు, భూ
ఖండములు, టస్కనీచతు-రుండు గనునో యట్టి శీతరుజ్మండల మా.

పెనునావకుఁ దగుకొయ్యగఁ-జను నార్వే కుధర దీర్ఘసాలం బన నో
తనకుంత మూఁతకజ్జుగ-నొనరిచె దుఃఖంపుటడుగు లూగి వేయునెడన్.

అడుగడుగున కది యూనుచుఁ-గడుఁ గాలినయట్టొటు నడుమ, కటకట! దివిలో
బెడఁగైన చిత్రతలమున-నడచిన యానడక తెఱఁగునను ద్రోపదు గా.

అడుగు లిటు గాలుచుండఁగ-నడగాలియుఁ గొట్ట మిగుల బాధాకర మై;
సుడివడక యోర్చి, కీలా-జడనిధితీరమున నిలిచి, సైన్యముఁ బిలిచెన్.

అప్పుడు నిర్వాణపాటనఁ-గుప్పలుతిప్పలుగఁ బడిన గోపుర మూర్తుల్
చొప్పరయ నొప్పె రాకుల-రొప్పెడు కాలమున నెట్టు రాలియలోనన్.

వృక్షచ్ఛాయాశీతల-పక్షము మగు వలంబరోజను భాసిలునదులన్
లక్షలు కోటులుఁగాఁ బడి-నిక్షిప్తము చేయుపర్ణనివహము లనఁగన్.

గోపనునకుఁ జనుజనములఁ-బ్రౌపమ్మునఁ దఱిమి తుదకు బసిరిసు, మెంఫీ
హైపికులు చచ్చి తేలిన-కాపాయోదధిని వాయుకాండము తోఁడెన్.

ఒరయను గలఁగించెను తఱిఁ-జెరగతి నయ్యబ్ధిఁ గ్రమ్మి తేలెడు తెప్పల్
తెలుఁగునను గూడఁ దోఁచిరి-విఱిగి, తఱఁగి, మఱి దొలంగి వికృతి వెలుఁగునన్.

దళముగ నటు గూలిన తన-బలముల, గంభీరబహుళ భాషణ నినదం
బుల కెల్ల నిరయకుహరము-కలఁగి ప్రతిధ్వనులు చేయఁగా నిటు లాడెన్.

"వల్ల భగణ భవులారా!-బల్లిదులారా! రణోగ్రపండితులారా!
సల్లోకాసువులారా!-పెల్లుగ నమరులకు వెఱఁగు పీడయె కలదేన్.

పోయె నయొ నేఁటికొక తఱి-మీయది యగు నమరజగము, మేలగు తత్సా
ఖ్యాయతనతీర శాంతిని-జేయు నని రణాశ్రమంబు చెడ నిలిచెదరో?

భగ్నాయుధ కేతనులై-యగ్ని జలధిఁ జిరబు శిరఫులారా! మీ రు
ద్విగ్నగతి నుండఁగను జయి-మగ్నత సేవింప నిందు మసల శపథమో!

స్వర్గద్వారమునుండి ని-రర్గళజవనానుయాయు లగు తద్భటు లీ
స్వర్గావకాశముం గని-దుర్గతులను గ్రుంగు మనలఁ ద్రొక్కెద రొకఁడున్.

అటుఁ గాక సూత్రి తాశని-పటలముచే జలధిగర్భ భాగంబునకుం
దిటవుగఁ గట్టుదురో ప్ర-స్ఫుటమతి లే లెండు లేక పొండు పతితు లై.

అనుపలుకు లాలకించిరి-మునిఁగిరి సిగ్గునను బకుముల నార్చి చివా
లునఁ గుప్పించిరి దొర కనుఁ-గొనఁ ద్రుళ్లుచు నిదుర లేచు కొలువరులవలెన్.

పడి యుండిన దురవస్థయు-పడుచుండిన వ్యథయు ననుభవం బగుచున్నన్
విడిచి చన రాజ్ఞ లే దని-తడయరు ప్రభునాజ్ఞ చెవులఁ దాఁకినయంతన్.

---

# నన్నయకుపూర్వపు తెలుగు—శిలాశాసనములు

మల్లంపల్లి సోమశేఖరశర్మగారు

మనకిప్పటివరకున్న ఆంధ్రకావ్యములలో నన్నయభట్టారకుని ఆంధ్ర మహాభారతమే మొట్టమొదటిది. దీనిని క్రీస్తుశకము పదునోకండవ శతాబ్ది నడిమిభాగమున వేంగీచాళుక్య వంశజుడైన రాజరాజ నరేంద్రునికి ఆశ్రయుడగు నన్నయభట్టారకుడు రచియించెను. ఆంధ్రమహాభారతమునకు పూర్వపు గ్రంథములేవియు ఇంతవరకు కనిపించకపోవుట చేత నన్నయభట్టారకునికి పూర్వపు ఆంధ్రభాషాస్వరూపమును దెలిసికొనవలెనన్న ప్రాచీనాంధ్ర శాసనములే మనకు శరణ్యములు.

శాసనములలో గూడ శిలాశాసనములే కాని తామ్రశాసనములు మనకు వినియోగించవు. ఏలయన సర్వసామాన్యముగ తామ్రశాసనభాష పూర్వకాలమున సంస్కృతమే.[1] గ్రామములయొక్కయు, క్షేత్రములయొక్కయు సరిహద్దులను దెలుపవలసివచ్చినపుడుమాత్రమే వాటిలో తెలుగుమాట లుండును. ఇక ప్రాచీన శిలాశాసనముల భాష సర్వసాధారణముగ దేశ్యమే. అందువలన నన్నయ భట్టారకునికి పూర్వము వెలసిన శిలాశాసనములను బట్టియే మనము ప్రాచీనాంధ్రభాషా స్వరూపమును, రచనలను దెలిసికొనవలసియుండును. అయితే యీశిలాశాసనములు నన్నయ భట్టారకునికి పూర్వపువి: ఇవికావు అని తెలిసికొనుట యెట్లు అని యొకప్రశ్న కలుగవచ్చును. ఇందుకు సమాధాన మిట్లు చెప్పవలసి యుండును. తెలుగుభాషలో వ్రాయబడిన ప్రాచీన శాసనములలో శకవర్షములు కాని, తిథి, మాస, సంవత్సరాదికములు కాని కాన రాని మాట నిజము. అందువలన అవి యేశతాబ్దినాటివో నిశ్చయముగ జెప్పుటకు సాధ్యముకాదు. అయి

1. ఇచట రెండు తామ్రశాసనములను గురించి చెప్పవలసియున్నది: (౧) ఏడువాడలపాలెపు శాసనము (౨) 'అహదనకరము' శాసనము. బ్రహ్మశ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఏడువాడలపాలెపు శాసనమును రాజరాజనరేంద్ర పట్టాభిషేకసంచికలో బ్రకటించిరి. ఇదియంతయు తెలుగుశాసనమే. నాకు తెలిసినంతవరకు సంపూర్ణముగ తెలుగుభాషలో నున్న తామ్రశాసన మిది యొక్కటియే. ఇది శకాబ్దములు ౯౪౧ నాటిది అనగా క్రీ. శ. ౧౦౧౯ నాటిది: రాజరాజనరేంద్రుని తండ్రియైన విమలాదిత్యుడు రాజ్యముచేయుచుండినప్పటిది. రెండవదియైన 'అహదనకరము' తామ్రశాసనము కొంతసంస్కృతమునను, కొంత తెలుగునను గలదు. దీనిని డాక్టరు ఫ్లీటుదొరగారు 'ఇండియన్ ఆంటిక్వెరి' పత్రికయొక్క ౧౩-వ సంపుటములో ప్రకటించిరి. ఈ తెలుగు భాగ మిప్పటికి నర్థమగుటలేదు. ఈశాసనము వేంగీచాళుక్యభూపతియగు మూడవ విష్ణువర్ధనునిదిగ దోచును. ఇవియే తెలుగున్న రాగిశాసనములు.

నను ఆశాసనములలిపినిబట్టియు, వాటిలోనుదాహృతులైన రాజులయొక్క వంశములనుబట్టియు అవి నన్నయభట్టారకునికి పూర్వపు వగునో కాదో తెలిసికొనవచ్చును. ఎట్లన: కొన్ని ప్రాచీనాంధ్రశాసనములలో వైదుంబరాజుల పేర్లు వచ్చును; మరికొన్నిట బాణరాజుల పేర్లు వచ్చును; ఇంక కొన్నిట వేంగీచాళుక్యుల యొక్కయు, బాదామిచాళుక్యుల యొక్కయు పేర్లు వచ్చును. చరిత్రకు తెలిసినంతవరకు ఈ వైదుంబులు, బాణులు, వేంగీచాళుక్యులు, బాదామిచాళుక్యులు—ఈవంశములవారందరు నన్నయభట్టారకునికి పూర్వము పరిపాలనము నెఱపినవారే. ఈవంశములకు జెందిన రాజులెవ్వరును శాసనములందు పేర్కొనబడని యెడల అప్పుడిక మనకు లిపియే యాధారము. లిపి ప్రమాణముకూడ ఒకవిధముగ బలవత్తరమైనదే. కావున వీటి నన్నిటినిబట్టియే ప్రాచీనాంధ్రశాసనములను గనిపెట్టవలయును.

ప్రాచీనాంధ్ర భాషా స్వరూపమును దెలిసికొన వలయునను కుతూహలముతో సాధ్యమయినంతవఱ కట్టి ప్రాచీనాంధ్రశాసనములను సేకరించి ప్రకటింపవలయునని కొంతకాలమునుండి నేను ప్రయత్నించుచున్నాను. ఈప్రయత్నములో నుండి గౌనర్మెంటు మ్యూజియము (వస్తుప్రదర్శనశాల)లో వేఱు వేఱుచోట్లనుండి తెప్పింపబడిన కొన్ని శాసనశిలలుండగా వాటిని బరిశీలింప ప్రాచీనాంధ్రశాసనము లున్నశిలలు కొన్ని కనిపించినవి. వెంటనే మ్యూజియము అధికారుల యనుమతి పొంది అట్టి ప్రాత తెలుగుశాసనములకు ప్రతిబింబములను దీసితిని.[2] వాటి నిందు క్రమముగా ప్రకటింపబోవుచున్నాను. నేను మ్యూజియములో ప్రతిబింబములను దీసిన శాసనములలో అద్దంకిశాసనముగూడ గలదు. ఇది వేంగీచాళుక్య వంశజుడైన గుణగవిజయాదిత్య భూపతి నాటిది. ఇదివర కీశాసనశిల ఒంగోలుతాలూకా అద్దంకిలో నుండగా ఆంధ్రభాష కీశాసనము చాల ముఖ్యమైనదని మ్యూజియము వారు కొంతకాలము క్రితము దానిని అద్దంకినుండి తెప్పించి మ్యూజియములో భద్రపఱిచిరి. ఈశాసనమును గుఱించి పూర్తిగ దెలిసికొనుటకై ఇంతకుమునుపు ప్రకటితములైన ప్రాత తెలుగు శాసనములనుగుఱించి కొంత తెలిసికోవలసిన యవసరము కలదు. గాన ముందు వాటినిగుఱించి తెలిపెదను.

నన్నయభట్టారకునికి తరువాత మనకు ప్రబంధములే కలవు కనుక అతనినాడును, అతనికి పూర్వమును ఉన్న శాసనములను గుఱించియే మనము తెలిసికొనవలెను. నన్నయభట్టారకునికి సమకాలికులైన కవులగ్రంథము లేవియు దొరకకపోయినను కొంచె మించుమించుగ ఆనాటివే యనదగు రెండు శిలాశాస

---

2. ఈ సందర్భమున మ్యూజియం అధికారులు, అందు ముఖ్యముగ శ్రీయుతులు టి. యన్. రామచంద్ర శాస్త్రిగారు చేసిన సహాయమునకు వారికి నావందనములు సమర్పించుచున్నాను.

నములును, ఒక తామ్రశాసనము[3]ను (సంపూర్ణముగ తెలుగుభాష నున్నది) మాత్రము దొరకినవి. వీటిలో తామ్రశాసనము క్రీ. శ. ౧౦౧౮ నాటిది. మిగిలిన రెండు శిలాశాసనములలో ఒకటి సోమలదేవి శాసనము[4] క్రీ. శ. ౧౦౬౯ నాటిది: రెండవది దీర్ఘాసిశాసనము[5] క్రీ. శ. ౧౦౭౯ నాటిది. ఈ రెంటిలో గూడ మాత్రాగణబద్ధములైన దేశ్యజాతులలో చేరిన సీసపద్యమును, ఆటవెలదియు గలవు; వానికూర్పులోకూడ తెలుగుపదములెక్కువగానున్నవి. నన్నయభట్టారకుని నాటి తెలుగుపుస్తకములు ఏవియు ఇంతవరకు దొరకకపోవుటచేతను, ఈ రెండుశాసనములలోను పద్యము లుండుటచేతను ఇవి ఆంధ్రభాషకు అమితోపకారకములు.

నన్నయభట్టారకునికి పూర్వపు తెలుగు శాసనములు ఇంతవరకు అంతగ ప్రకటింపబడ లేదు. బట్టర్ వర్త్, వేణుగోపాల శెట్టిగార్లు విశేషకృషిచేసి, అప్పటికి వారికి సాధ్యమైనరీతిని నెల్లూరు మండలమునందలి శాసనముల నన్నింటిని మూడుసంపుటములుగ బ్రకటించి మనకు వందనీయులైరి. ఈసంపుటములలో పూర్వపు తెలుగు శాసనములు కొన్ని కలవు. కాని ప్రతిబింబములుసరిగ లేనికారణముననో, శిలలు అప్పటికే పాడయియున్న కారణముననో యథామాత్రముగ ప్రకటించిన వారి శాసనమూలములలో అందందు కొన్ని అపపాఠములు దొర్లినట్లు తోచును; అంతేకాక కొన్నికొన్నిచోట్ల అక్షరములు తెలియరాకపోవుటచేత శాసనమున పాఠమే యేర్పడుట లేదు.

అటుతరువాత ప్రాచీనాంధ్ర శాసనములను సవ్యాఖ్యానముగ విశేషాంశములతో సరియైన పద్ధతిని ప్రకటించుట కారంభించిన గౌరవప్రతిష్ఠలు శ్రీయుతులు జయంతి రామయ్యపంతులు గారివి. నన్నయభట్టారకునికి పూర్వపు తెలుగు శాసనములను బ్రకటించుట పంతులవారు ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో ప్రకటించిన వేంగీచాళుక్య వంశజులైన యుద్ధమల్లుని బెజవాడ శాసనము[6]తోనే ఆరంభము. అటుపిదప వారే బెజవాడ ఇంద్రకీల పర్వతము మీది సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజుల శాసనమును గూడ పరిషత్పత్రికలోనే ప్రకటించిరి; కాని యీ శాసనమున మొదటి నాలుగుపంక్తులు మాత్రమే తెలుగున గలవు.

పంతులవారు ప్రకటించిన యుద్ధమల్లుని బెజవాడ శాసనము పద్యమయ మగుటవలన దానివిలువ మరింత హెచ్చినది. ఆ శాసనమం

3. ఏడువాడలపాలెము శాసనము (ఒకటవ పుట్టునోటు చూచునది.)

4. రాజరాజనరేంద్ర పట్టాభిషేకసంచికలో ఈశాసనమును కీర్తిశేషులయిన శ్రీకొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు పంతులుగారు ప్రకటించిరి.

5. ఈశాసనమును ఎపిగ్రాఫియా ఇండికాలో శ్రీయుతులు రావుసాహేబు గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు ప్రకటించిరి.

6. ఈశాసనమును శ్రీపంతులవారు ఎపిగ్రాఫియాఇండికాలో గూడ ప్రకటించిరి.

తయు దేశ్యజాతులలోనివగు మధ్యాక్కఱలను పద్యములలో చెప్పబడుటవలన అది నన్నయ భట్టారకుని కిపూర్వపు దేశిరచనల తీరుతెన్నులనే కాక అప్పటికి వాడుకలో నుండిన ఛందః ప్రకృతినిగూడ గొంతవరకు తెలుపుచున్నది.

యుద్ధమల్లుని బెజవాడ శాసనమునకు పిదప ఇంతవఱకు ప్రకటితమైన తెలుగుశాసనములు మూడే కలవు: అందు (౧) కడప మండలపు చోళరాజు శాసనము. దీనిని కీ. శే. శ్రీ హెచ్. కృష్ణశాస్త్రి గారు ఇంగ్లీషున ప్రకటించిరి.[7] (౨) పాండరంగని అద్దంకి శాసనము (3) పాండరంగని కందుకూరి శాసనము. ఈ కడపటి రెండుశాసనములను కీ. శే. శ్రీ కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు పంతులుగారు చిత్రాడ ఆంధ్రపరిశోధక మహామండలి పంచమ వార్షికోత్సవమున తమ యధ్యక్షోపన్యాసమున ప్రకటించిరి. ఈకడపటివి రెండును నెల్లూరుమండల శాసనములలోనివే. బట్టర్ వర్తు, వేణుగోపాలశెట్టిగార్లు శాసనములనుసంపాదించునాటికి ఒంగోలుతాలూకా నెల్లూరు మండలముననే యుండుటచేత పై రెండు శాసనములును వారిసంపుటములలో జేరినవి. ఈ రెంటిలో అద్దంకిశాసనము పద్యమయమై యుండునని శ్రీయుత మానవల్లి రామకృష్ణ కవిగారును, శ్రీయుత చిలుకూరి వీరభద్రరావు గారును, కీ. శే. శ్రీ వంగూరి సుబ్బారావుగారును అనుమానించినను యతిప్రాసగణములను బరీక్షించి కందుకూరి శాసనమున సీసపద్యమును, అద్దంకిశాసనమున తరువోజయు గలవని నిశ్చయించి తెలిపిన గౌరవము శ్రీ లక్ష్మణరావు పంతులు గారిది. వారీరెండు శాసనములను సక్రమపద్ధతిని ప్రకటింపదలచి వాటికి క్రొత్తగ ప్రతిబింబములను దీయించుటకు ప్రయత్నించిరి కాని అప్పటికే కందుకూరి శాసనశిల కానరాకుండపోవుటవలన ఆశాసనమును మఱల ప్రకటించు తలంపువారు మానుకోవలసివచ్చెను. పంతులవారి కోరికమీద గౌరన్మెంటు శాసనశాఖవారు అద్దంకిశాసనమునకు మాత్రము క్రొత్త ప్రతిబింబములనెత్తి వారి కొసగిరి. కాని వార్షికోత్సవము కొద్దిరోజు లున్నదనగా ఈప్రతిబింబము వచ్చుటవలన వార్షికోత్సవము నాటికి సరియైన పాఠమును తయారుచేసికొనుటకు వారి కవకాశము చాలకపోవుటచేత వా రిచ్చిన శాసనపాఠమున కొన్నితప్పులు దొర్లినవి.[8]

7. Epi. Ind. Vol. XI

8. కీ. శే. లక్ష్మణరావు పంతులుగారు తరువాత ఈతప్పల నన్నిటిని సవరించుకొని సరియైన పాఠమును తయారుచేసి ఇంగ్లీషున 'A note on the Addanki Inscription of Panduranga' అని ఒకవ్యాసము వ్రాసి ప్రకటనార్థము దానిని ఎపిగ్రాఫియా ఇండికాకు పంపినట్లు విందును. కాని అది యేకారణముననో ఇన్నేండ్లయినను ఇంతవరకు ఆపత్రికలో ప్రకటింపబడలేదు. అదియే కాదు; వారు సజీవులైయుండగనే ప్రకటనార్థము ఎపిగ్రాఫియా ఇండికాకు తయారుచేసి పంపిన బాదపు, తాలపు శాసనవ్యాసములును ఇంతవఱకు ప్రకటింపబడలేదు! కారణమేమో.

తరువాత శ్రీజయంతి రామయ్య పంతులవారు ఈ యద్దంకిశాసనమునకు తమకు స్పష్టమైన ప్రతిబింబము లభించుటచేత సరియైన పాఠమును నిర్ణయింప వీలుకలిగెనని చెప్పి, యీ శాసనమును ప్రతిబింబముతోను, సంపూర్ణ వ్యాఖ్యానముతోను ముందు మరల ప్రకటింతుమని అప్పటికి శాసనమును మాత్రము ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికయొక్క-క్షయసంవత్సర చైత్ర-వైశాఖ మాససంచికలో ప్రకటించిరి; కాని,ప్రతిబింబవ్యాఖ్యానములతో నిప్పటికిని ప్రకటింపలేదు.

నేను మ్యూజియములో నెత్తిన శాసన ప్రతిబింబములలో ఈయద్దంకి శాసనముకూడ నుండుటవలన ఇది ఆంధ్రభాషకు చాల ముఖ్యమైనదగుటచేతను, ప్రతిబింబసహితముగ నింతవఱకు ఇది ప్రకటింపబడకపోవుటచేతను మొట్టమొదట ప్రతిబింబసహితముగ దీనినే ప్రకటించుచున్నాను.

౧

అద్దంకి శిలాశాసనము

ఈశాసనశిల ఒంగోలుతాలూకా లోని అద్దంకిగ్రామమున ఒకపెరటిలో నున్నది. దీనిమీది శాసనము బట్టర్ వర్తు, వేణుగోపాల శెట్టిగార్లచే ప్రకటింపబడిన నెల్లూరుమండల శాసనము లన్నుగ్రంథము రెండవసంపుటమున ౮౯౯ వ పుటలో గలదు. అందున్న యీశాసన ప్రతిబింబమునుబట్టి ఆనాటికే యీశిల ఎగువ భాగము విరిగిపోయినదని నిశ్చయింపవచ్చును. అందువలన శాసనప్రారంభభాగము మనకు దొరకదు. శాసనశిల ఎగువభాగమున సగము నుండి కుడివైపు అయిమూలగ పగులుటవలన కుడివైపున ఎగువ రెండుపంక్తులలో రెండవ పంక్తి చివరి అక్షరములు కొన్ని కనిపించుచున్నవి. మొదటి పంక్తిలోని చివరి రెండక్షరములలో దిగువభాగములు మాత్రమే కనబడుచున్నవి. ఇట్లే శిల దిగువభాగముకూడ పగిలినది. ఇందువల్ల శాసనము చివరి పంక్తికేమియు నష్టము కలుగలేదు కాని 'బ' వర్ణముల ఉత్వములకును, 'అ','ల'ల దిగువభాగములకును గొంతవిచ్ఛేదము కలిగినది. కుడి, యెడమ వైపులమాత్రము శిల నిలువుగ ఏమియు బగులలేదు.

శాసనమంతయు చాళుక్యలిపిని వ్రాయబడియున్నది. ఇందలిలిపి భారతి మొదటి సంపుటము, మొదటి సంచికలో ప్రకటింపబడిన గుణగవిజయాదిత్యుని సాతలూరు శాసనలిపిని బోలి చూచుటకు ముచ్చటగ నున్నది. ఇందలివి పొంకమైన గుండ్రనికత్తు అక్షరములు; చాల పెద్దవి. శాసనశిల చాలచోట్ల గంట్లు పడుటచేత కొన్నికొన్ని యక్షరముల స్వరూపము స్ఫుటముగ లేక 'గజిబిజి'గ నున్నది. ఈశాసనమున అచ్చులలో అ,ఇ,ఎలు మాత్రము వచ్చినవి; హల్లులలో ఖ,ఘలును, ఛ,ఝలును, ఠ,ఢలును, ధ,ఫలును, ష,ళలును రాలేదు. మిగిలినవన్నియు వచ్చినవి. అను నాసికములలో న, ణ, మలు మాత్రమే వచ్చినవి. ఇసంయుక్తాక్షరములలో వచ్చినది; జ అసలే

రాలేదు. శాసనమున వలపలగిలకతో నున్న హల్వర్ణముద్విత్వముం బొందినది (చూ. పం ౩,౭,౮లు). ప్రాచీనవర్ణక్రమపద్ధతిని చ,ట,డలు మాత్రమే వర్గానునాసికములతో గలసియున్నవి; ఒక్కచోట మాత్రము (పం. ౫) 'బఞ్చిన' అనుటకు 'బణ్చిన' అనికలదు. మిగిలినవి అనుస్వారములతోనే ఉన్నవి. ఈశాసనమున అనుస్వారము నాగరలిపిలోవలె అక్షరముమీద గలదు. ఒక్క రెండుచోట్ల తక్క (పం. ౪: ప్రభుం; పం. ౯: పణ్డరంగు) శాసనమునంతెల్ల ఏయక్షరముమీద నుండవలసిన యనుస్వారము ఆతరువాతి యక్షరముమీద నున్నది. ప్రాచీనచాళుక్య శాసనములలో గొన్నిట నీపద్ధతి కనబడును. ప్రాచీనవర్ణక్రమము మారినపుడు వర్గాక్షరములతో గూడిన వర్గానునాసికములన్నియు క్రమముగా అనుస్వారములైనవి; ఇట్లగుటకు మకారమే మొట్టమొదటిదిగ కాన్పించును. మొట్టమొదట మకారపుపొల్లే ఈ యనుస్వారమని నా సమ్మకము. శాసనమున ౬-వ పంక్తిలో 'వఱ్ఱెణ్డు' అనుమాటలో క్రాకారకుబదులు శకటరేఫమువాడబడినది. కొన్నిచోట్ల 'శ'వర్ణమునకు 'స'వర్ణము ప్రయోగింపబడినది (పం. ౯,౧౧). గుణింతమున ఉ,ఊ,ఎ,ఏ,ఒ,ఓలకు వ్యత్యాసమున్నట్లు కాన్పింపదు. ౪(ష్ఠ) అనువర్ణము ౬-వ పంక్తిలో 'గొ౪ల్చియ' అనుమాటలో వచ్చినది.

శాసనభాషయంతయు తెనుగు. శాసనమున మొదటి యెనిమిది పంక్తులు పద్యము; మిగిలిన నాలుగుపంక్తులు గద్యము. ఇందలిపద్యము తరువోజ: ప్రాసలేని రెండుద్విపద చరణములుకలిసిన ఒకతరువోజ చరణమగును. ఇట్లు దీనికి నాలుగుచరణము లుండును; ఉత్పలమాల చంపకమాలలలో వలెనే నాలుగు చరణములందును చరణ ద్వితీయాక్షరము ప్రాసనియతి నుండును. ప్రతిచరణమునందును మూడుచోట్ల విశ్రమస్థానము లుండును అనగా ప్రతిపాదమున నాలుగుచోట్ల యతిమైత్రిగల యక్షరములు రావలయును. ఇది తరువోజలక్షణము. మనశాసనమునందలి పద్య మిందుకు లక్ష్యము.

౪,౬ పంక్తులలో 'ప్రభుం' అన్నచోటను, 'పణ్ణెణ్డుంగొణి' అన్నచోటను అనుస్వారము తేల్చి పలికిననే కాని లేనిచో 'భు', 'ణ్డు' అక్షరములు గురువులై గణభంగమగును. అందువలన ఆయనుస్వారముల నిపుడు అర్ధానుస్వారములుగ గ్రహింపవలసియుండును. అనుస్వారార్ధానుస్వారములకు గలభేదము వాటి ఉచ్చారణలో మాత్రమే ఉండెడిదనియు, ఊదిపలికిన అనుస్వారమనియు, తేల్చిపలికిన అర్ధానుస్వారమనియు నూహింపవలసియుండును.

ఇట్లే 'గవ్వఁబొప్పగ' అనుచోటను, 'కోట్టంబు'లనుచోటను గూడ అనుస్వారమును తేల్చిపలికి లఘువును జేసిననేకాని లేనిచో అచ్చట గణభంగమగును. గవ్వఁబు, కోట్టంబులలోని బిందుపూర్వక బుకారమును తేల్చి చదివినచో మధ్య అనునాసికస్వరము గల్గిన 'గవ్వఁబు', 'కోట్టఁబు' అగును. బ్రహ్మశ్రీ

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'నన్నయకుం బూర్వకాలమున 'ంబు' అను రూపముకూడ నుండెడి' దనియు, ఈ రూపముండుటను బట్టియే మువిభక్తియతి యేర్పడుట సంభవించెననియు తెలుపుచున్నారు. ఈప్రకార మయినచో 'గర్వంబు', 'కోట్టంబు' పదములు గణభంగము చేయనేరవు. 'ంబు' రూపమే తుదకు 'ము' గా మారెనని భావింపవచ్చును. గర్వమ్బు లేక గర్వ్వంబు—గర్వమ్ము— ఈ రెండు రూపములును మన శాసనకాలమునాటికే వాడుకలోనుండినట్లు కాన్పించును. 'ంబు' రూపాంతరమైన 'ము' యించుక తరువాత వాడుకలోనికి వచ్చినదనుకొందును. ఏలయన 'ము' రూపము అప్పటికే వాడుకలో నుండినచో 'ంబు'కు మారుగా ఆరూపమునే లేఖకుడు వ్రాసియుండును: ఇది వ్రాయుట యెంత తేలికో అది వ్రాయుటయు నంతే తేలిక.

అందువలన నేటి వర్ణక్రమము ప్రకారము 'గర్వంబు', 'కోట్టంబు' రూపములను 'గర్వము', 'కోట్టము'లనుగా వ్రాయదగును. ఇందువలన గణములకును భంగమురాదు.

ఇక మఱియొక చిక్కు కలదు. శాసనమున ౭-వ పంక్తిలో 'గొటల్చియ' అనుపదము సలఘుకాని, నగముకాని కాకున్న గణభంగమగును. ఇప్పుడున్నరీతిని అది 'జగ'ము (జగణము + గురువు) అగుచున్నది ఎట్లన: 'ల్చి' సంయుక్తాక్షర మగుటచేత 'ట' (ట్ల) వర్ణము గురువగుచున్నది. శాసనమున స్పష్టముగ గనబడుచుండ నది సంయుక్తాక్షరము కాదనుటకు వీలులేదు. అందువలన దీనిని తప్పించుకొనుట కొకటేమార్గముకలదు. అందువలన ఈపదమునందలి 'ల్చి' ని తేల్చిపలికి 'శిథిలద్విత్వము' చేసినచో అచట గణభంగము లేదు. ఇట్లు సంయుక్తాక్షరములను గణభంగము కాకుండ తేల్చిపలుకవలసిన పట్లు కొన్ని బసవపురాణమున గలవు. బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు తమ చక్కని బసవపురాణ పీఠికలో ఈ శిథిలద్విత్వమును గుఱించి ఒకపేరా వ్రాసియున్నారు. అందుండి కొంత భాగము తీసి యిచ్చట పొందుపఱుచుచున్నాను:

"శిథిలద్విత్వము:—పు. ౧౭౮ 'అట్టయు నీడ్పించి యగత్తవై పించె.' కర్ణాట వ్యాకరణమున 'శిథిలద్విత్వము'ను గూర్చి యొకప్రకరణమే కలదు. తెలుఁగున శిథిలద్విత్వప్రశంస గానరాదు. శిథిలద్విత్వమనఁగా సంయుక్తాక్షరము తేలఁబలుకఁబడుట. దానిచేఁ దత్పూర్వాక్షరము లఘువగును. తెలుగున 'అద్రుచు, విద్రుచు, చిద్రుపలు' అనుపదములు మాత్రమే యిప్పుడు శిథిలద్విత్వములనఁదగినవి గానవచ్చుచున్నవి. కర్ణాట శిథిలద్విత్వములలోఁ గొన్నియైనను తెలుఁగునఁగూడఁ బ్రాచీనకాలమున శిథిలద్విత్వములుగా నుండియుండవచ్చును. 'యగత్తవై పించె'నను నీప్రయోగమందుకు స్ఫోరకము........"

ఈ 'శిథిలద్విత్వములు' మన శాసనకాలమునుండి పాల్కురికి సోమనాథుని నాటివఱకు నుండెనని యిప్పటికి స్పష్టమగుచున్నది.

భాషావిషయమున జూచినచో నీశాసనమునందలి రెండుమూడుమాటలు క్రొత్తగ నున్నవి: (౧) కొటల్చియ (౨) పదువ, (3) బాణ.

(౧) కొటల్చియు:—ఈరూపము అవధారణార్థకమని నాతలంపు. దీనినిబట్టి అసలు రూపము "కొటల్చి" అగును. ఈపదమునకు అర్థమేమియో తెలియుటలేదు. కాని యిందలి "ట"ను "బండిఱ"గ మార్చినయెడల ఈపదమర్థమగుననుకొందును. అప్పుడు దీనిరూపము "కొఱల్చి" యగును. "కొఱల్చు", "కొఱల్చి" యనువాటిని "కొఱలు" ధాతువుయొక్క ప్రేరణరూపములుగ గ్రహింపదగును. "కొఱలుట" అనగా ప్రకాశించుట, శోభించుట యని యర్థము. ఈయర్థమున నిది అకర్మక క్రియ. "కొఱల్చి" యనునది ప్రేరణరూపమగుటంజేసి ప్రకాశింపజేసి, శోభిల్లజేసి, విజృంభింపజేసి అని దానికర్థము చెప్పకోవలసియుండును. "వేంగినాటఁ గొఱల్చి" అనగా వేంగినాటిని శోభిల్లజేసి, విజృంభింపజేసి అని యర్థమేర్పడును.[9]

'కొటల్చి' అనుపదము, 'కొఱల్చి' యగునా ? 'ట' వర్ణము 'ఱ'గ మారిన యుదాహరణయ లేవైన గలవాయని సంశయము తోచక మానదు. కాని 'ఱ'గ మారునని చెప్పుటకు కొంత యవకాశము కలదు. 'ట' వర్ణము తొటుటూరు, పటుకి, ప్టోల్నాణ్డు-ఇట్టి పదములలో గూడ ప్రాచీనశాసనములందు గాన్పించుచున్నది. వీటిలో మొదటిపదమం దావర్ణము 'బండిఱగ' మారినట్లు నిశ్చయముగ జెప్పలేమేమోకాని కడపటి రెండుమాటలందును మారినట్లు నిస్సంశయముగ జెప్పవచ్చును. ఎట్లన, ప్రాచీనకాలమున 'పటుకి' యనబరగిన విషయమే ఇటీవల 'ప్రక్కి'నాడని వ్యవహరింపబడుచున్నది. 'పటుకి' 'పఱ్కి' అయిననేకాని (మఱుగు-మఱ్గు-మ్రగ్గువలె) వ్యతిపాతరేఫ సంయోగమున ప్రక్కి కాదు. అందువలన 'పటుకి'లోని 'ట' బండి ఱగ మారినదనియే చెప్పవలసి యుండును. ప్టోల్నాణ్డను ప్రాచీనశాసనములందలి రూపము నేడు ప్రోల్నాడని మారుటనుబట్టియే ఈపదములోని టకూడ 'బండిఱగ' మారియుండవలెనని తోచును. (ప్టోల్నాణ్డు-ప్టోల్నాండు-ప్రోల్నాడు). అందువలన నీ యుదాహరణముల ననుసరించి 'ట'వర్ణము బండి 'ఱ'గ మారుట కూడగలదని యంగీకరించుచో 'కొటల్చి'యనునది 'కొఱల్చి' యగుట కభ్యంతరము లేదు. అట్లుకాదనిన దానికర్థ మూహింపవలసి యుండును.

9. శబ్దరత్నాకరకారుడు "కొఱలు" ధాతువును అకర్మకముగను, సకర్మకముగను గూడ జెప్పి సకర్మకమయినప్పుడు "పొందు" అను నర్థమిచ్చి దానికి "భారతము, ఆనుశాసనికపర్వము"లోని "ఎ. గీ. శాంతిఁగొఱలి విప్ర, కులము దైవస్వరూపంబగుట మనంబు, నందు దృఢముగ నిల్పి" అను నుదాహరణ మొసంగియున్నాడు. అప్పుడు "బోయకోట్టముల్వణ్డెణ్డుగొణి వేంగినాణ్టిఁ గొఱల్చి" అనుదానికి "బోయరాజులకోటలు పండ్రెండు జయించి వేంగీరాజ్యమున పొండించి" అని యర్థమేర్పడును. కాని ప్రభాకరశాస్త్రిగారు ఈక్రియ సకర్మకము కాదనియు దానికి పొందు, చేరు అనునర్థములు లేవనియు 'శాంతిఁ గొఱలి' అనగా శాంతిచేత కొఱలి అని అన్వయమనియు చెప్పుచుండుటచేత దానిని అకర్మకక్రియగనే భావింపవలసియుండును.

(౨) పదువ అను పదమునకు సమూహము, సైన్యము అని అర్థము చెప్పవలసి యుండును. అయితే 'సమూహము' అను నర్థమున ఈపదము ఉకారాంతముగనే మనకు తెలియును. 'పదువ'యే కాలక్రమమున 'పదు వు'గ మారినదేమో.

'పదువలోని' మధ్యమాక్షరమును, ఏడవ పంక్తిలోని చివరియక్షరమును ఒక్కరీతి నుండుటచేత రెండును 'దు' వర్ణములైన గావలసి యుండును లేదా 'డు' వర్ణములైన గావలసి యుండును. ఏడవపంక్తిలోని కడపటియక్షరము 'డు'వర్ణమయిన ఆపదము'కడుబయ ల్సేసి' అగును. అపుడు అర్థముసరిపడును. అట్లే'పదువ''పడువ' కాగలదు. 'పడువ' అన్న సైన్య మనికాని సమూహ మని కాని అర్థ మున్నదో లేదో. ఎచ్చటనో బాగుగ జ్ఞాపకములేదు కాని శాసనములలో 'ద' వర్ణమునకు 'డ' వర్ణముతోను, 'డ'వర్ణమునకు 'ద' వర్ణముతోను ఉన్న పదములను జూచితిని. ఇదియే సరియైనచో'పదువ' 'పడువ' పదములు సమానార్థకములేయగును. లేదా, ఈపైనుడివిన రెండుస్థలములలో నెచ్చటనో యొక్కచోట లేఖకప్రమాదమని యైన సరిపెట్టుకొనవలసి యుండును.

(3) 'బాణ'—'త్రిభువనాంకుశ బాణ నిల్పి' అని శాసనపాఠము. వేంగిచాళుక్యులు త్రిభువనాంకుశులని బిరుదు కెక్కినవారు. అందువలన ఇచట 'త్రిభువనాంకుశ బాణ' యనగా 'త్రిభువనాంకుశబిరుదముచే విఖ్యాతులైన వేంగీచాళుక్యులబాణ'యని భావము. 'బాణ' అనగా పరాక్రమమనికాని, జెండా యనికాని యూహింతును. కాని బాణకు సరియైనయర్థ మేదో తెలియరాదు.

పైనుడివినవి కాక 'పుఙ్ల', 'అఙ్ల' పదములును పదవపంక్తిలో వచ్చును. ఇవి యిప్పడు పుట్లు, ఆళ్లుగా మారినవి. ఆళ్లుఅన ధాన్య విశేషము. పుఙ్ల అనునదియే గసడదవాదేశమువలన 'వుఙ్ల' అయినది. గట్టిన, వంగ్రెండు ఇవియు గసడదవాదేశమున కుదాహరణములే. 'ఎనుబాది' యని శాసనము గలదు. అది 'ఎనిమిది, కాదగునేమో.'

ఇప్పటి వర్ణక్రమము ప్రకారము మన శాసనము నందలి తరువోజయు, గద్యమును ఇట్లుండదగును:

తరువోజ.—

పట్టంబుగట్టిన♦ప్రథమంబు నేఁడు♦
బలగర్వమొప్పగ♦బైలేచి సేన
పట్టంబు గట్టించి♦ప్రభుఁబండరంగు♦
బంచిన సామ[ం*]త♦పదువతో బోయ
కోట్టము ల్వంగ్రెండుఁ♦గొని వేంగినాఁటి♦
గొఁటల్చియ త్రిభువనాం♦కుశబాణనిల్పి
కట్టెపుదుర్గంబు♦గడుబయ ల్సేసి♦
కందుకూర్బెజవాడ♦గావించెమెచ్చి[.*]

గద్యము.—

పండరంగు పరమమహేశ్వరుండు ఆదిత్య భటారనికి ఇచ్చిన భూమి ఎనుబాది (ఎనిమిది?)

పుట్ల ఆళ్లు పట్టు నేల [।*] ధర్మపురంబున ధర్మువులు [।*] వీని రక్షించినవారికి అశ్వమేధంబున ఫలంబు అగు[॥*]

### శాసనవిషయము

ఈశాసనమున పండరంగడను నతనికి (ఎవరో యొకభూపాలకుడు) తాను పట్టాభిషిక్తుడైన మొదటిసంవత్సరముననే సైన్యాధిపత్యమిచ్చెననియు, అంతట నాసైన్యాధిపతి సామంతసైన్యముతో బోయిబోయకొట్టములు, అనగా బోయరాజులకోటలు పండ్రెండు పట్టుకొని వేంగీరాజ్యమును విజృంభింపజేసి త్రిభువనాంకుశుల (అనగా త్రిభువనాంకుశ బిరుదముగల వేంగీచాళుక్యభూపతుల)పరాక్రమమును (లేక జెండాను)నిల్పి, కట్టెపుదుర్గమును చాల పాడువఱిచి, కందుకూరిని మెచ్చి బెజవాడయంతటి ప్రముఖమైనదిగజేసి, ధర్మవరమున ఆదిత్యభట్టారనికి కొంత భూదానము చేసెననియు శాసనము తెలుపుచున్నది. శాసనవిషయమిదియేయని నాతలంపు. అందువలన నీశాసనము పరమమహేశ్వరుడైన పండరంగుని పరాక్రమకార్యములను దెలుపుటకును ఆతడు కావించిన ధర్మమును దెలుపుటకును పుట్టినట్లు తలంపవలసియున్నది.

### శాసనకాలము

గుణగ, గుణగాంక, గుణక్కెనల్ల అనుబిరుదములచేత కీర్తింపబడు విజయాదిత్యుడను పేరుగలరాజు వేంగీచాళుక్యభూపతులలో నొకడుకలడు. ఇతనికి పండరంగడను సైన్యాధిపతి యొకడుండినట్లును, అతడు మహాపరాక్రమవంతుడైనట్లును ఆభూపతిశాసనములును, అతని తరువాతి రాజులశాసనములును దెలుపుచున్నవి. గుణగవిజయాదిత్యుని శాసనములన్నిటిలో పండరంగడే ఆజ్ఞప్తిగ నున్నట్లు కనబడును: చూడుడు:

ఆజ్ఞప్తి రస్య ధర్మ్మస్య పాణ్డరంగో మహాసుతః,
సో(?)సిధారా సముచ్ఛిన్న విద్విడ్బృందోపనన్దితః.
—సాతలూరు శాసనము.

ఆజ్ఞప్తి రస్య ధర్మ్మస్య పణ్డరంగో గుణాధికః
విజయాదిత్యభూపాలపాదపద్మశిలీముఖః.
—ఈరుటూరుశాసనము.

ఆజ్ఞప్తి రస్యధర్మ్మస్య విక్రమాక్రాన్త శాత్రవః
ద్వితీయ ఇన బీభత్సుః పాణ్డరంగః ప్రతాపవాన్.
—మచిలీపట్నము శాసనము.

సూనుః కడెయరాజస్య పాణ్డరంగో గుణాధికః
విజయాదిత్య భూపాలపాదపద్మశిలీముఖః.
—పోణంగిశాసనము.

ఈవిజయాదిత్యుని విజయములలో కొన్ని పాండరంగనివేయైనట్లు ఒకానొక శాసనమున నిట్లున్నది:

కిరణపుర మధాక్షీ త్కృష్ణ రాజాస్థితం య
స్త్రిపుర మివ మహేశః పాణ్డరంగః ప్రతాపో
తదహిముఖ సహస్త్రై రన్వితస్యా ప్యశేక్యం
గణన మమల కీర్తే స్తస్య సత్సాహ సానామ్.

పండరంగడు గుణగవిజయాదిత్య భూపాలుని సర్వసైన్యాధిపతి యనియు, కడెయరాజు కొడుకనియు, మహాప్రతాపశాలి యనియు ఈ పైనిచ్చిన శ్లోకముల వలన దెలియుచున్నది కావున మన శాసనమునందలి భూపాలుడు

వేంగీచాళుక్య భూపతియైన గుణగ విజయాదిత్యుడేయనియు, ఈపండరంగడు ఆతని సైన్యాధిపతియైన పండరంగడే యనియు మనము నిశ్చయింపవచ్చును. గుణగవిజయాదిత్యుడు వేంగి మండలమును ౪౪ సంవత్సరములు పరిపాలించినట్లు చాళుక్యశాసనములు తెలుపుచున్నవి. ఆతనిపిదప యువరాజవిక్రమాదిత్య తనూభవుడైన చాళుక్యభీమనామాంతరమునం బరగు విష్ణువర్ధనుడు శకవర్షము ౮౧౪ లో సింహాసనమెక్కినట్లు మన కాధారము కలదు; కావున గుణగవిజయాదిత్యుడు శ. ౭౭౦ నుండి ౮౧౪ వఱకు అనగా క్రీ. శ. ౮౪౮ మొదలు ౮౯౨ వరకు పాలించెనని తెలుచున్నది. పాండరంగడు అతని సైన్యాధిపతియే కావున మన శాసనము క్రీస్తుశకము తొమ్మిదవ శతాబ్ది కడపటిభాగము నందలిది అని నిర్ణయింపవచ్చును. ఈశాసనమువలన రాజరాజ నరేంద్రుని (క్రీ. శ. ౧౦౪౨-౧౦౬౩) నాటివాడగు నన్నయభట్టారకునికి రమారమి రెండువందల సంవత్సరములకు పూర్వమే తెలుగులో కవిత్వముండెననియు, అది మాత్రా గణబద్ధమైన దేశ్యజాతిది యనియు నిశ్చయింపవచ్చును.

## స్థలనిర్దేశము

ఇందు వేంగినాడు, కట్టెపుదుర్గము,బోయ కొట్టములు, కందుకూరు, ధర్మవరము అనునవి పేర్కొనబడినవి. గోదావరి నదికిని కృష్ణా నదికిని నడుమనుండు దేశమునకు వేంగినాడను పేరుప్రసిద్ధమే. పూర్వ చాళుక్యులు వేగినాటి వారవుటచేత వారిరాజ్యవిస్తీర్ణము హెచ్చుచు, తగ్గుచువచ్చినపుడెల్ల వేంగినాటి ఎల్లలుకూడ మారుచువచ్చెను. గౌనరుమెంటు శాసనశాఖాధికారులు గుంటూరుమండలమునందలి తెనాలి తాలూకాలోనిక తేవరమే కట్టెపుదుర్గముకాద గునని. కాని, యది ఒప్పనుటకుగాని, తప్పనుటకుగాని మన కాధారములులేవు. పండరంగు జయించిన బోయకొట్టములు నెల్లూరు మండలములోనివి కాని, కడప మండలములోనివి కాని కాదగును. ఆప్రాంతముల బోయ లను వారు కలరనియు, వారు పూర్వముప్రసిద్ధులైన యోధులనియు, పూర్వము పాళెగాండ్రసైన్యములందును, హైదరాలీ సైన్యములందును వీరే యెక్కువగానుండిరనియు, వన్య మృగముల వేటలోవారు కడుసమర్థులనియు 'గెజటీర్ల'లో తెలుపబడియున్నది. కందుకూరు నెల్లూరుమండలములోని ఇప్పటి కందుకూరే. దీనిని బెజవాడయంతటిదిగ జేసెననుటలో,బోయరాజుల కోటలు కిది సమీపమున నుండుటచేతి వేంగీ చాళుక్యరాజ్యమునకు వారివల్ల ఒత్తిడి, ఉపద్రవము కలుగకుండ కాపాడుటకై చాళుక్య రాజ్యమందు దానాడు ప్రముఖములైన పట్టణములలో నొకటి యగు బెజవాడవలెనే దానిని గూడ మొదలి దుర్గముగను, రాజప్రతినిధి స్థానముగనుజేసి ప్రాముఖ్యమునకు దెచ్చినట్లు భావింపవలసి యుండును. ధర్మవరము ఒంగోలు తాలూకాలోని యిప్పటి ధర్మవరమే.

# మూ ల ము*

౧. ........................................[పుర?]

౨. ........................................భూపాలకుణ్డు[1] [॥*]

3. పట్టంబుగట్టిన ప్రథమంబునేణ్డు బలగర్వ్వంబొ

౪. ప్పగ బైలేచి సేన[।*] పట్టంబు గట్టెఞ్చె ప్రభుం

౫. బణ్డరంగు[ం*] బ[ణ్చి][2]న సామ[ం*]త్త పదునతో బోయ[।*]

౬. కొట్టంబు లర్వణ్డెణ్డుం గొణి వేంగినాణ్టిం గొఱల్చియ

౭. త్రిభువనాంకుశబాణ నిల్పి [।*] కట్టెపుదుర్గ్గంబు గడు

౮. బయల్సేసి కణ్డుకూర్బెజవాడ గావిఞ్చె మెచ్చి [॥*]

౯. పణ్డరంగు పరమమహేస్వరుణ్డు[3] అదిత్యబటరని[4]

౧౦. కి ఇచ్చిన భూమి ఎనుబొదివుడ్ల అడ్లు[5] పట్టు నేల[।*] ద

౧౧. మ్మపురంబున[6] దమ్మువులు[7] [।*] విని[8] రక్షిఞ్చినవారికి అస్వ

౧౨. మేదం[బు][9]న పలం[బు][10] [అ]గు [॥*]

---

* నేను తీసిన ప్రతిబింబము ననుసరించి.

౧. ఈపదమునకు పూర్వము 'వ'వంటి అక్షరముయొక్క దిగువభాగమును, దాని వెనుకటి అక్షరముయొక్క ఊర్ధ్వమును కనిపించుచున్నవి. ఈపగిలిపోయినభాగమునందు నిలిచిఉన్న రెండవ పంక్తిలోని చివరిపదమునుబట్టి ఇది కూడ తరువోజగ కాన్పించును. క్రింది తరువోజపంక్తుల సంఖ్యనుబట్టి దీనికిగూడ ౬ పంక్తు లుండవలసియుండును. అట్లయిన ఇంకను నాలుగుపంక్తులు కల శాసనశిలాభాగము విరిగిపోయియుండును. పోయిన తరువోజకును, ఉన్న తరువోజకును ఏకాన్వయముగ కాన్పించును.

౨. ఈ సంయుక్తాక్షరములోని దిగువ వర్ణమును 'చ' ప్రతిబింబమున స్పష్టముగ గానరాకున్నను దానిని తాలిమీద బాగుగ గుర్తింపవచ్చును.

3. ంమహేశ్వరుణ్డు' అని చదువవలెను.

౪. ఆదిత్యభట్టారని' అని.

౫. ఆడ్లు, అని.

౬. ధమ్మ్రపురంబున, అని.

౭. ధమ్మ్రవులు, అని.

౮. హీని, అని.

౯. అశ్వమేధంబున, అని.

౧౦. ఫలంబు, అని.

## వాంఛలు

శ్రీ శివశంకరశాస్త్రి

ఆహాహా అనంతవిపులాశల జిక్కి—పోయి బహుకాల మీమెడద బాధలు చెందె నాథా,
సహియింపలేక కడు సాధనచేసి ఆశా-గహనాంతరంబు విడగల్గితి నేటి కెట్లో.

ఇపు డీమనస్సునకు నెంతయు శాంతియుష్మ-త్కృపచేత సంఘటిలె; దీనునిచిత్తవృత్తుల్
విపరీతమార్గముల వెంట బరిభ్రమంప-కెపుడున్ భవచ్చరితమే స్పృశియించు దేవా.

సకలంబు నీచరణసన్నిధియందు నాథా-ప్రకటంబుగా విడిచి బాధ్యత ద్రోసిపుచ్చన్
అకలంక మయ్యె మన, సాశలు వీడె, కాని-ఇక వాంఛితత్రితయమే నెలవొందియుండున్.

కానైతి గాయకుడ కర్మవశంబుచే వాక్-స్థానంబు మందునకు తావలమయ్యె, నైనన్
నే నెల్లవేళలను నిండుమనంబుతోడన్-నీనామకీర్తనమునే యొనరింతు దేవా.

పాలించుదేవత నుపాసనచేయనీ వా-జ్మాలిన్యమయ్యె అణుమాత్రమువీడ, నైనన్
గాలించి శబ్దములు కావ్యము లల్లుదు న్నీ-లీలాకథామృత విలీనమనంబుతోడన్.

నా కెన్నగా దగిన నైపుణి శిల్పవిద్యన్-స్తోకంబు; కాని మృదుతూలికతో లిఖింతున్
లోకైకనాయక, విలోచనపర్వమైన-నీకమ్ర మంగళ వినిర్మల విగ్రహంబున్.

---

## సుప్తోత్థితుండు

నాదెళ్ల వెంకట్రావుగారు, బి. ఏ.

కొక్కొ రోకో యటంచును కోడి గూసెం-దఱపి వెన్నెలపలుచనై కరఁగఁ జొచ్చె,
దెల్ల వాఱెడిఁ గాఁ బోలు; నెల్లకడలఁ-గాన నయ్యెఁ దదీయ సంజ్ఞాచయంబె!

దివ్యతేజానఁ దూరుపు దిక్కుపడఁతి-ముక్కుపుడకను వెలిఁగెడి ముత్యమటులు
చుక్క యల్లదె! మింటఁ దళుక్కుమనుచు-నిక్కడకు లేవకమె కానుపించె నకట!

విహగ సంతతి మేఁతకై వెడలఁబోలు-వినఁబడియె ఱెక్క ఱెపఱెపల్ వింటినుండి,
మేలుకోవలెఁ గాదె! మామూలుదొర్లు-లాటకొఱ కేను నిఁక దేవుఁడా! యటంచు.

గౌతమీ ప్రాతజల సమాయాత మంద-శీతలోపస్సమీరముల్ ప్రీతి నొసఁగఁ
జాలకున్న, వసార సంసార కష్ట-నిచయవిచలితసమ్మోదనియతి నాకు.

ఖేదమోద విభేద నిర్బాధితంబు-నిర్వికల్పసమాహిత నిష్ఠఁ బోలు
నిదురఁ జెందించి మమ్ము సాఁకెదవు! దేవ!-ఇఁక మఱి లేపఁబోక రక్షింపలేవ?

---

# భారతీయ మహిళామండలి



శ్రీమతి ఆర్. కృష్ణాబాయి గారు,
బి. ఏ., యల్. టి.

ఈమె రాజమహేంద్రవరపు నివాసిని; మద్రాసు యూనివర్సిటి యల్. టి. పట్టమునుబొందిననాయడు తెగ పట్టభద్రురాండ్రలో నీమెయే మొదటిది. ఈమె గొప్ప చిత్రకారిణియునై యున్నది. ఈమెచిత్రములు మద్రాసు ప్రదర్శనమునందుయోగ్యతాపత్రమునుబొందుటయేకాక, పునహా, బొంబాయి ప్రదర్శనములందును పేరు బొంది యున్నవి. ఈమె గానవిద్యావిశారద కూడను. వీణా గానమునందు ఈమె కడు నిపుణురాలు. ఈ నారీమణి ప్రజాహిత జీవితమునందు పాల్గొనుచుండును. ఈ మధ్య మద్రాసునందు సమావేశమయిన బ్రాహ్మణేతర యువక మహాసభ ప్రారంభోత్సవమును ఈమెయే జరపియున్నది. ఈమె వివిధవిషయ పరిజ్ఞానమునకు సూచకముగ మద్రాసు బ్రాహ్మణేతర కేంద్రసంఘపత్రికయందు'కళ-కాంత' అను భాగమునకు సంపాదకత్వమును వహించి యున్నది.



శ్రీమతి శకుంతలా కన్య.

ఈమె కలకత్తా సాధారణ బ్రహ్మసమాజ మత ప్రచారకులను శ్రీయుత బాబూ హేమచంద్ర సర్కారు (యం. ఏ.)గారి పెంపుడు కూతురు. ఈమె ఇంగ్లీషు సంస్కృతములలో యం. ఏ. పరీక్షయందు కృతార్థురా లయినది. ఈమె వంగాలు ప్రధాన విద్యాశాఖాధికారు లొసగెడు నూరురూపాయల విద్యార్థి వేతనమును గైకొని కలకత్తా విశ్వవిద్యాలయ పండితులు డాక్టరు భండార్కరు (యం. ఏ., పి. హెచ్. డి.) గారివద్ద 'ప్రాచీన నారీమణులు' అను విషయమును గూర్చి పరిశోధనలు సలుపుచున్నది. ఈమె గృహకృత్యనిర్వహణమున గడు సమర్థురాలు. ఈ నారీమణి మన ఆంధ్రవనిత యగు టెంతయు మోదావహము.

## అద్దంకి శిలాశాసనము



# పునర్విమర్శనములు

## 'నేపాళ-చోళగ శబ్దములు'

ప్రభవ భాద్రపద భారతిలో శ్రీ తాపి ధర్మారావు నాయఁడుగారు "నేపాళ-చోళగ శబ్దములు" అని వ్యాసము వ్రాసిరి. చేమకూర వెంకటకవి విజయవిలాసమునఁ గృతిపతివర్ణనలోఁ గల పైపదములకు బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయ శాస్త్రులవారు (విజయవిలాస వ్యాఖ్యాతలు) సరిగాఁ డీక వ్రాయ లేదని యందు వారు వారి నిట్లు గేలిచేసిరి: "కావున వ్యాఖ్యాత చారిత్రకవిషయముల నారయవలెననుట ధ్రువము. అట్లుగాని-చోఁ గవీశ్వరుని నసత్యవచస్కుం డనుటయేకాక కవిత్వమంవలి పద్యములనుగూడఁ జక్కఁగఁ దెలిసికొనక వ్యాఖ్యాత కుండు కర్తవ్యమును నిర్వహింపఁజాలక యుండును."— "'చోళగమానభంజనా' యనుటకు బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయ శాస్త్రులుగారు 'చోళదేశమును బొందిన రాజుయొక్క యభిమానమును బోఁగొట్టినవాఁడా' అని వ్యాఖ్య వ్రాసిరి. చరిత్ర నెఱిఁగినవారి కీయర్థము హాస్యాస్పదముగఁ గానవచ్చును. ఏలయనిన, నాయకులే చోళదేశమును బొందినరాజులయి మూఁడుతరములనుండియుఁ బాలనము చేయుచుండినవారుగా నుండ నింక నీమానభంగ మందిన చోళగుఁ డెవ్వఁడు?'— 'నేపాలనృపాలస్థాపనచణునకు' అను పదమునకు 'నేపాలరాజును నెలకొల్పుట యందు నేర్పరి' అనియే శాస్త్రులవారు టీక వ్రాసియున్నారు. ఇఁక సందేహమున కవకాశ ముండదుగదా." అనునవి ధర్మారావుగారి వెక్కిరింపుముక్కలు.

ధర్మారావుగారికట్టి వెక్కిలి యధర్మారావముసు జేసి యనుచితపు వ్రాఁత వ్రాసిరి. విమర్శక మర్యాదను దప్పి శాస్త్రులవారిని దూఱిరి. ఎట్లనఁగా:— శ్రీ శాస్త్రులవారు 1911 వ సంవత్సరమున విజయవిలాసమునకు వ్యాఖ్యానమునురచించి ప్రకటించిరి. ఆకాలమునకుఁ గొమ్ములుదిరిగిన హిస్టోరియన్సు గూడ తంజావూరి యంధ్రనాయకచరిత్రము నెఱుఁగరు. 1912-వ సంవత్సరమున నేను తంజావూరు వెళ్లి, వారముదినములు మాత్ర మక్కడ నుండి, ఉదయమునసుండి సాయంకాలముదాఁక విశ్రమము లేకుండఁ బుస్తకముల శోధించి, యంధ్రనాయకరాజచరిత్ర విషయమున నెన్నో యపూర్వవిషయములను గుర్తించి నోట్సు వ్రాసికొనివచ్చి, మద్రాసు లైబ్రరిలోనున్న యాంధ్రనాయకరాజచరిత్రప్రసక్తములగు బ్రాఁతవ్రాఁతలను బరిశోధించి సంస్కరించి, దానిని బ్రకటించి, దానికిఁ టీకగాఁ దంజావూరినుండి కొనివచ్చిన విషయములనెల్లఁ జేర్చి, "తంజావూరి యంధ్రరాజులచరిత్ర" యను పేర నొక గ్రంథమును బ్రకటించితిని. ఈ గ్రంథప్రకటనము శాస్త్రులవారి విజయవిలాసవ్యాఖ్యా రచనమునకు కొన్ని యేండ్ల తర్వాత జరగినది. నాపుస్తకమున 'చోళగ' 'నేపాళ' విషయములు ప్రసక్తించెను. అనేకుల నడిగితిని. ఎవ్వరును నెఱుఁగకుండిరి. ప్రాచీను లెవ్వరును వానిని గూర్చి చర్చింపరయిరి. వానిని గనుఁగొనుటకు నాకాధారము లప్పటికి దొరకవయ్యెను. అందుచే నేను నాగ్రంథమున "కదనంబులోఁ జోళగని (?) గెల్చినట్టి" అని గ్రంథభాగము నుదాహరించుటలో సంశయార్థక చిహ్నము నుంచితిని. అప్పటికిఁ జరిత్రకారు లెవ్వరు తంజావూరి యంధ్రనాయకరాజులనుగూర్చి హెచ్చువిషయముల నెఱుఁగరు. నా గ్రంథమే క్రొత్తవిషయములు గలది. తర్వాత 1916-వ సంవత్సరమున నేను, శ్రీ మా. రామకృష్ణకవిగారును, మఱి కొందఱును దంజావూరి లైబ్రరి పరిశోధనార్థమై దొరతనమువారిచేఁ బంపఁబడితిమి. అప్పుడు మఱి పెక్కు క్రొత్తగ్రంథములను, క్రొత్తవిషయములను, దాదాపు ఒకసంవత్సరకాల మక్కడనుంటిమి గాన, కనుఁగొంటిమి. అందు ముఖ్యములఁ గొన్నింటి నప్పుడు కృష్ణాపత్రికలోఁగూడఁ బ్రకటించితిని. వరదాంబికాపరిణయాదులనుగూర్చియు, శివాజిమహారాజుకాలమున నేకల విద్వాంసులు గచించిన

శివాజిచరిత్రములఁగూర్చియు నాఁటి వ్యాసములను కృష్ణా పత్రికలోఁ జూడవచ్చును. అప్పుడు మా కీచోళగ-నేపాళ శబ్దముల వాస్తవార్థములును, జరిత్రములును, పోర్చుగీసు వ్రాఁతలును సవిస్తరముగాఁ దెలియవచ్చెను. అప్పుడు నే నాయావిషయముల నెల్ల జాగ్రత్త పఱుచుకొనియు, దంజావూరిరాజులచరిత్రపుస్తకములు ఇంకను మిగిలియుం డుటచే నవియెల్ల నమ్ముడుపోయిన పిదప మరలఁ బ్రకటించునప్పుడు గ్రంథమును చెంపొందించి విపుల పరిశీలనము చేర్పఁదలఁచుకొనియుంటిని. మేము తంజావూరి నుండి కొనివచ్చిన క్రొత్తవిషయము లెల్ల మద్రాసులో నున్న మామిత్రుఁడు రంగస్వామిసరస్వతిగారును జూచిరి. తర్వాత వారును వారు రచించుచుండిన 'స్టోర్స్ ఆఫ్ విజయనగర్ ఎంపైర్' అను గ్రంథమున కుపకరించు వానిని, తంజావూరి యంధ్రరాజులచరిత్రలో నేను బ్రకటింపఁగా మిగిలినవానిని, మేము (లైబ్రరికిఁ గొనివచ్చినట్టి నోట్సునుబట్టి) దంజావూరికిఁ బోయి వ్రాయించితెచ్చుకొనిరి. వారు నే నంతకుఁబూర్వము ప్రకటించిన తంజావూరిరాజులచరిత్రములోని యపేక్షిత విషయములను నాపాఠఁబాట్లతోఁగూడ నట్లట్లే తమ గ్రంథమునఁ జేర్చుకొనిరి; నావాక్యరచనలఁగూడ.—అది యట్లుండె. చోళగ నేపాళ విషయములను సరస్వతిగారు తమగ్రంథమున వివరించి వ్రాసిరి. ఇది 1919 సం. న జరిగినది. ఈగ్రంథమును జూచినవారెల్లరకు నిప్పుడు ధర్మారావుగారు వ్రాసిన విషయములు రెండును బట్టబయలుగాఁ దెలిసినవే. ఇందు ధర్మారావుగారు క్రొత్తగా గుర్తించిన దేదియు లేదు. కాని, వీరు "చేమకూర వెంకటకవి విశ్వాసపాత్రుండు గాకుండునా యను నూహతో సత్యాన్వేషణకుఁ గడంగితిని. నాయదృష్టవశంబున నాకాలమందలికావ్యముల భాగములు కొన్ని లభించెను. అందుఁ బ్రధానములు" అని నేనును, సరస్వతిగారును బ్రకటించిన "సాహిత్యరత్నాకర"రాదిగ్రంథములభాగములను బ్రకటించిరి. ధర్మారావుగారు సరస్వతిగారి గ్రంథము నేని చూచినట్లు చెప్పవలదా? (ఈనడుమ నాకు దర్శన మొసఁగి ధర్మారావుగారు నాతంజావూరిరాజులచరిత్రను దాము చూడలేదనియు, సరస్వతిగారిగ్రంథమును జూచితిననియుఁ జెప్పిరి. తాము స్వయముగా నాయాగ్రంథములఁ బరిశోధించి యెఱుఁగుదుమనియు, సరస్వతిగారిగ్రంథమునుండియే యాయాగ్రంథభాగములఁ గైకొంటిమనియు నొప్పుకొనిరి.) వాస్తవము వారు వ్రాయవలదా? వారివ్రాఁతను బట్టి మాగ్రంథముల నెఱుఁగనిపాఠకులు, 'అబ్బో! ధర్మారావుగారు సత్యాన్వేషణకై యెంతపాటుపడిరో, ఎంత కష్టపడి సంపాదించిరో ఆయాగ్రంథభాగములను!' అనుకొందురుగాదా! అచ్చుపడి ప్రఖ్యాతమైయున్న సరస్వతిగారి గ్రంథమునుండి విషయమును పేరుచెప్పకుండ కాపీకొట్టుటకు 'సత్యాన్వేషణ', 'అదృష్టవశము' ఉండవలెనే కాఁబోలును! దీనికిఁగూడ నా కంతచింత లేదు. 1919 సం. నఁ క్రొత్తగా వెల్వడినదియుఁ, గొమ్మలు దిరిగిన చరిత్రకారులుగూడ నంతకుముందు గుర్తించి యెఱుఁగనిదియు నగువిషయమును 1911సంవత్సరములో రచింపఁబడిన శాస్త్రిలుగారి వ్యాఖ్యానమున జేరలేదని వెక్కిరించినదానికి మిక్కిలి వగచుచున్నాఁడను. ఏయేచరిత్రవిషయము లెప్పు డెప్పుడు గుర్తింపఁబడినవో, వానియానుపూర్వి యెట్టిదో యెఱిఁగిగదా వా రధిక్షేపింపవలసినది. చరిత్రము దెలియదని శాస్త్రిలవారి నాక్షేపించుటకు ధర్మారావుగారు చరిత్రముచరిత్రమును దెలిసికొనియుండవలదా? విజయవిలాస పీఠికలోఁ గవి గుప్తముగా వర్ణించిన విషయము లనేకములు గలవనియు, నాతంజావూరురాజులచరిత్రను జదివినతర్వాతనే వాని గుర్తింపవచ్చుననియు నేను నాగ్రంథముపీఠికలో వ్రాసితిని. అప్పటికిఁ బూర్వము ప్రకటితమయిన శ్రీ శాస్త్రిలవారి వ్యాఖ్యానమును నేనప్పుడు ప్రకటించుచున్న విషయములు లేమికై యాక్షేపించుట యుక్తమా! శాస్త్రిలవారి వ్యాఖ్యారచనాకాలమునకు సుప్రఖ్యాతములుగాని విషయములను వా రెట్లు వివరింపఁగల్గుదురు?

ధర్మారావుగా రిప్పు డీచరిత్రవిషయములు శాస్త్రిలవారివ్యాఖ్యలో సరిగా లేవని మరల విజయవిలాసమునకుఁ దాము వ్యాఖ్యవ్రాసితిమని నాతోఁ జెప్పిరి! మంచిదే; కాని యీ క్రొత్తవ్యాఖ్యలో ధర్మారావుగా రెంతసరిగాఁ జరిత్రవిషయములను సాధించిరో వారు దానిఁ బ్రకటించినప్పుడు చూడఁగలము!

వెంకటరాయశాస్త్రిలుగారు నేఁటి యాంధ్ర విద్వాంసులలో నప్రతిమప్రతిభాభాసురులు. అనేక భాషాకోవిదులు. నిన్నటిదాఁక యాజ్ఞాదైన్యమునకుఁ బాల్పడక (ముప్పదియేండ్లు క్రిస్టియన్ కాలేజిలో మహోపాధ్యాయపదమునందుండియు, చిన్న జీతముతోనుండియు నెన్నఁడును పైదొరలను తమవేతనము హెచ్చింపనేనికోరి యెఱుఁగరట) విద్వద్గౌరవము వెలయఁగా జీవయాత్ర గడపినయాభిజాత్యాభిమానధనులు. అసాధారణ చాతుర్యముతో ప్రతాపరుద్రీయాదినాటకములను, శృంగారనైషధకువలయానందాదివ్యాఖ్యలను, నింక ననేకమహాగ్రంథములను రచించి, సంస్కరించి, ప్రకటించి, క్రిస్టియన్ కాలేజిలో బహుమహాగ్రంథములను రసము చిప్పిలఁగా విద్యార్థులకుఁ బాఠము చెప్పి, సంస్కృతాంధ్రసారస్వతముద్రలను విప్పిచూపినవిద్యారక్షకులు. ఎనుబదియేండ్లవృద్ధులు. దైవదుర్విపాకముచేఁ దమయార్జించిన ధనమెల్ల నష్టమై పోఁగా, ఏకపుత్త్రుఁడు చనిపోఁగా, నిప్పుడు కడువార్ధకమున నన్నవస్త్రములకుఁ గూడఁ గడవనంతటి దారిద్ర్యములోఁ బడిపోవఁ బసిహూనలగుపౌత్రులు, పౌత్రియును, బార్వతీదేవివంటి పత్నియుఁ, గోడలును గలకుటుంబమును బోషించుకొనఁజాలక, కన్నులుగానరాక, యాదరించువాఁడు లేక చీకాకుపడుచుండఁగా, వారిని శుశ్రూషించి విద్యాబుద్ధులను బడసి పదికాలములపాటు ప్రఖ్యాతి గాంచవలసిన వారును, వారినిబట్టి చూడ విద్యావయస్సులచే బాలురు నగు ధర్మారావుగారివంటివారు వారిపైఁ జేయరాని యధిక్షేపములఁ జేయఁబూనుట శ్రేయముగాదు. ఇట్టిచేఁతలు తమకే కాదు ఆంధ్రభాషకే యశ్రేయస్కరములు. శాస్త్రిలవారిజీవిత మిట్టి యిక్కట్టులనుండి యిఁకనైనఁ దప్పి తెప్పిఱిల్లునుగాకయని యీశ్వరుని వేఁడుచున్నాను. వారిచే విద్యాబుద్ధులను బడసినవారు వారిశిష్యులు, వారివైదుష్యగరిమ నెఱిఁగినవారు నందలకొలఁదిగా మద్రాసు ప్రెసిడెన్సీలో నున్నతపదములందు గలరు. వారిలోఁ గొందఱైని పూనిన శాస్త్రిలవారి భావిజీవితమును బాగుపఱుపఁగల్గుదురు. అనేకులు వారి యీనాఁటి యాతురతను, దారిద్ర్యమును నెఱుఁగ రనుకొందును. వారిక్లేశముల నెఱిఁగి చేఁతఁగాక దుఃఖించుచున్న నేను జేయు నీవిజ్ఞప్తిని జిత్తగించి వారిశిష్యులు వారికిఁ దగినవిధమునఁ దోడ్పడుదురుగాకని వేఁడుచున్నాను.

ఈ పైవిషయముల వ్రాసినది ధర్మారావుగారి యధిక్షేపములు శాస్త్రిలుగారికీర్తికి కళంకమును దెచ్చునను వెఱపునఁగాదు; వారిపై నెయ్యఁదాల్పవలసినదని నాయఁడుగారిని వేఁడికొనుటకునుగాదు. వారి వ్రాఁతలు న్యాయ్యములుగా నుండవలెనని హెచ్చరించుటకే. శాస్త్రిలుగారిని, ఆంధ్రభాషను అభిమానించు సంపన్నులు వారి యిప్పటి యిక్కట్టులను దెలిసినచో వారి నాదరింపఁబూనుదు రను కుతూహలమునఁగూడ వ్రాసితిని.

వేటూరి ప్రభాకరశాస్త్రి

---

## ప్రణయాశ్రువులు

కొత్త జగ్గయ్యచౌదరి గారు

ప్రణయ విపంచితంత్రులు బరాబరిగా శ్రుతిలోన లీనమై
తనరఁ బ్రమోదగాన పరతంత్రభరమ్మునఁ దన్మయత్వ జీ
వన కమలాకరంబున నవారణలీలఁ జరించు నీజతన్
గని కనుగుట్టి దైవము వికల్పమొనర్చెను సంధిసూత్రమున్.

లలితమృణాల పల్లవములన్ బురుడించు త్వదీయ బాహువుల్
లల నిమురించి దీర్ఘనిశలన్ హృదయప్రియమైన స్వప్నపుం
గలశపయోనిధిన్ బ్రణయ గానకళాప్లవ సంస్థితుండనై
మెలఁగు నదృష్టసత్ఫల సమీక్షణ మేగతి యింకఁ బ్రేయసీ!!

జలధి చలత్తరంగ కణసంచయలీన విభాకరప్రభా
కలితకలా కలాప మటుగా భ్రమియించెడి మన్మనంబు శాం
తిలు నను నాస దీరె సుదతీజనరత్నమ! నీదు చెల్మిక
ల్ములలతికాసమూహకసమూలవినాశన కారణంబునన్.

తొలకరి మించుఁదీవియలతో నెకసక్కెము లాడు నీతనూ
జ్జ్వల రుచిరాంశుమండలి దిశాముఖసీమలఁ బ్రామి నాట్యమున్
సలుపఁ దొడంగి మద్ధృదయశాంతిపటంబు దహింపుచుండ నో
యలికులవేణి! యేగతి నిరర్థక జీవనయాత్ర సల్పెదన్.

పండిన శాల్మలీఫలము బ్రద్దలువాఱఁగ దానిగర్భమం
దుండెడి దూది తీవ్రపవనోద్ధతిచే గగనోర్విఁ బాఱున
ట్లండజయాన! నాదు హృదయాబ్జదళంబులు విచ్చి వ్రాలి యీ
రెండల వాడి వత్తలయి యేటికిఁ గోటికిఁ బర్వు లెత్తెడున్.

తేటమొయిళ్ల సందడు లుదీర్ణమృదంగదణంధణం ధణా
ర్భాట లయక్రమమ్మున శ్రవమ్మలరింప, మయూరరాజముల్
పాటలఁ బాడుచున్ బురులఁ బై కెగఁబట్టి విలాసనృత్య భో
గాటనఁ దేలు లీలఁ గన నశ్రుకణంబులు జారుఁ గన్గవన్.

కాలము వోక యిర్వుర మఖండముదబ్ధిని మున్గి యాడుచున్
గాలిని మేల్మిసౌధములఁ గట్టి చరించెడివేళ నీదు కెం
గేల మదీయహస్తము లగించుచు సౌఖ్యపరంపరారతిన్
దేలిన వృత్తముల్ ప్రియసతీ!-తలపోయఁగ గుండె నీ రగున్.

నీలసరోవరంబున వినిర్మల భావతరంగ మాలికా
డోలలఁ దేలియాడుచుఁ గడున్ దమిఁ బ్రేయసు బాహువల్లరిన్-
సోలఁగ నుల్లసిల్లి తనసోయగమున్ బ్రకటింపఁ బద్మినీ
బాల తురంగలించెడి ప్రభాతముఖంబుల నిన్నుఁ బాడెదన్.

---



## జీవన మేమి?

[‘వేదిక్ మేగజిను’ నందు సాధు వాస్వానీగారి వ్యాసమునుండి]

గొప్పగొప్ప ప్రశ్నలు చాలావాటికి మనకు భగవద్గీతలో సమాధానం దొరుకుతుంది. ఆ ప్రశ్నలలో ‘జీవనము ఏమిటి?’ అనేది ఒకటి. నేను భిన్నభిన్న వ్యక్తులు దీనికి భిన్నభిన్న సమాధానాలు చెప్పుతున్నారు. జీవనము మాయ అని ఒకసమాధానం. నా అభిప్రాయానుసారం ఈ సమాధానం తప్పు. కాని, దౌర్భాగ్యవశం చేత, నేను సర్వసాధారణంగా ఈ ఆశయం వ్యాప్తమై ఉంది.

భారతదేశంలో అనేకులు మీకు చెప్పే దేమిటంటే—“ఈమనుష్యజీవనమా, ఈఐహిక జీవనమా? ఎబ్బే, ఇది వట్టిమాయ” అని. అనేకమంది నాతో ఇదే చెప్పేరు. “మాయ” అనేది వారి ‘పేటెంటు’ మాట. కాని నావినీతమైన అభిప్రాయంలో ఈ మాయకు భ్రమ అని కాని, మోసమనికాని అర్థముకాదు. ఐనా, అనేక హిందూమిత్రులు ‘జీవనము మాయ’ అని ఆ అర్థంలో అంటున్నారు. చాలాయేళ్లక్రింపట, నేను పంజాబులో ఉన్నప్పుడు, ఒకనాడురాత్రి ఫిరోజుపురంలో ప్రేమగల మిత్రులు కొందరు నన్ను భోజనానికి ఆహ్వానించేరు. అక్కడ, మా భోజనా లయిపోయిన తర్వాత, ఒక పంజాబీ యువకుడు పాడడానికి లేచేడు. చిత్రంలాగున ఆ పంజాబీ యువకునిముద్ర నా కిప్పటికీ జ్ఞాపకం ఉంది. వెన్నెలరాత్రి; పంజాబీయువకుడు తెల్లనితలగుడ్డ చుట్టుకొని ఉన్నాడు; అతనికంఠం చాలా మధురంగా ఉంది. ఆతని హృదయంలో ఒకవేదన ఉందికాబోలు, ఆ వేదనలోనే అత డాగీతం పాడేడు. ఆగీతం నాకు జ్ఞాపకం లేదు; కాని, ఆస్థలానికి కృతజ్ఞతాభరితమైన స్మృతి స్వరూపంగా, అందులో రెండుచిన్నపదాలు నా చెవులలో ఇప్పటికీ గీపెట్టుతున్నాయి: ‘చంద్ రోజ్’ ‘చంద్ రోజ్’ అనేవి. ‘కొద్దిదినాలే’, ‘ప్రతివస్తువూ కొద్దిదినాలుమాత్రమే ఉంటుంది’ అని అర్థం.

ఈ ఆశయంలో సత్యం ఉంది అన్నమాట వాస్తవమే; కాని, నాసోదరులలో చాలామంది దీనిని దుర్వినియోగం చేస్తున్నారనేదికూడా అంత వాస్తవమే. ‘కొద్దిరోజులే; అతి స్వల్పకాలమే!—అందుచేతనే, మేము ఏమైనా చెయ్యడం ఎందుకు? స్థాణువులలాగు నోరుమూసుకొని, చేతులు కట్టుకొని కూర్చుంటే చాలు’ అంటారు వారు. కాని, జీవనానికి ఈ తత్త్వజ్ఞానం తప్పు. శ్రీకృష్ణుడు ‘జీవనం మాయకా’దని చెప్పుతున్నాడు. మన మిక్కడ ఉండేది కొద్దిరోజులనేమాట నిజమే; కాని ఆకొద్దిరోజులు చాలాపవిత్రమైనవి; అవి గొప్ప మహత్త్వం కలవి. మనం మనకర్మ చెయ్యనే చెయ్యాలె. భారతదేశంలో ‘జీవనము మాయ’ అనే ఆశయమే బాగా ప్రబలిఉంది. దీనికి విరుద్ధంగా పశ్చిమాన్ని వేరొక ఆశయం ప్రబలిఉంది. ఐరోపీయులూ, అమెరికనులూ ‘జీవనం భోగం’ అంటారు. ఇక్కడ మనం జీవనం మాయ అంటాము! ఆత్మ సుఖమే జీవనం అంటారువారక్కడ. ‘ఆత్మసుఖాని కర్థమేమి’టని అడిగితే ‘సుఖం అనుభవించండి’ అని చెపుతారు. దీనినే నేను భోగం అంటున్నాను. ఐరోపా అమెరికాల జనులు కోరే దేమిటంటే—“డబ్బుసంపాదించండి, సుఖం అనుభ

వించండి; సుఖానుభవానికి మంచియిళ్లు. నిర్మించుకోండి; మోటారులు కొనండి—సుఖించండి—"ఇంతే. ఒకవైపున 'జీవనము మాయ' అనేది అతి; 'జీవనము భోగ' మనేది రెండవ అతి.

ఈవిషయంలో శ్రీకృష్ణునిసందేశం అమూల్యం. ఆయన చెప్పేడు 'జీవనము ధర్మము' అని. కాబట్టి, జీవనం మాయకాదు; భోగమూ జీవనంకాదు; జీవన మేమో ధర్మమే. 'జీవనమేమి' అనేదానికి ప్రత్యుత్తరం భగవద్గీత మొట్టమొదటిపదంలోనే మీకు దొరుకుతూంది. 'ధర్మక్షేత్రే కురుక్షేత్రే' అనే గీతాప్రారంభం మీకు తెలుసునా! మొట్టమొదట ఆ'ధర్మ'మనే శబ్దమే యీ గొప్ప ధర్మగ్రంథానికంతకీ శ్రుతి. శ్రీకృష్ణుని మహాత్సం దేశాని కంతకీ 'ధర్మ'మే శ్రుతి. జీవనం ధర్మక్షేత్రం; జీవనాని కర్థం ధర్మంయొక్క యుద్ధక్షేత్రంఅని; పాశ్చాత్య అర్థశాస్త్రజ్ఞులు వైరుధ్యమని పిలిచే స్వార్థ పరత యొక్క యుద్ధక్షేత్రం కాదు. కాదు—అది కాదుజీవనం. యుద్ధక్షేత్ర మనేది యథార్థమే కాని స్వార్థపూర్ణహితాల యుద్ధక్షేత్రంకాదు. జీవనంధర్మయుద్ధక్షేత్రం. ధర్మగ్రంథాలలో వ్రాసింది మీకు జ్ఞాపకం ఉంటుంది. భగవద్గీతలో భగవంతుడు తన రథాన్ని రెండుసేనలకి నడుమ నిల్పి గీత అనే మహాసందేశాన్ని ప్రసాదించాడు. ఈసందేశం భగవంతుడు రెండుసేనలకిమధ్య నిలిచిఉన్న రథంలోనుంచి యియ్యడమే దాని మహత్త్వం. నాఅభిప్రాయంవల్ల దీని భావ మేమంటే, మీరు మీజీవనంలో ధర్మం ఆచరించాలెనంటే మీరు మీజీవనరథాన్ని కష్టానుభూతికీ, ప్రలోభనాలకీ నడుమగా నడిపించాలె. మీరు మీధర్మం ఆచరిస్తూ ఉన్నారంటే ఎట్టి దుర్ఘటనకీ భయపడరాదు—అని.

భగవానుడీఉపదేశం ఎవరికి ఇచ్చేడో యెఱుగుదురా? అర్జునుడికి. అర్జునుడు భారతదేశానికి ప్రతినిధిస్వరూపం అని నాకు తరుచుగా తోచింది. భారతదేశంమాత్రం ఎటువంటిది? ఉచ్చదశలో ఉండిన భారతదేశంకాదు—ఇప్పటిలాగే అధఃపతన దుఃస్థితిలో ఉన్న భారతదేశం. మహర్షులకాలంనాటి భారతదేశంకాదు—తరువాతి పతనోన్ముఖమైన భారతదేశం అర్జునరూపంలో ప్రకటితమయింది. అర్జునుడు నేటి భారతంవంటి భారతానికి వాస్తవ స్వరూపం — ప్రతినిధిస్వరూపం. అర్జునుని చరిత్ర విడగొట్టి చూస్తే మీకేమి గోచరిస్తుంది? అర్జునుడు రసజ్ఞుడు; సరే, సాధారణంగా ప్రతి భారతీయుడు మంచి రసజ్ఞుడని ప్రతీతమే. అర్జునుడు రసజ్ఞుడు, కాని కార్యం ఉపస్థితం అయేసరికి "నేను పోరాడను" అంటాడు. ఈదౌర్బల్యమే నేను ప్రతిభారతీయునిలోనూ ఉంది. రసజ్ఞుడే చాలా; అయితే కర్మక్షేత్రంలో మిక్కిలి పేదవాడు. మనదేశంలో అయే ఉత్సవాలలో కావలసినంత ఉత్సాహం ఉంటుంది. మన జండాలు, సభలు, పాటలు, ఉపన్యాసాలు వాదప్రతివాదాలు వెళ్లుతుంటాయి. జనులు గుంపులుగుంపులుగా కూడుతారు. అందరూ అది మన ఉత్సవం అంటారుకాని ఉత్సవంఅవతంతకువు, సంపూర్ణ విరామం. ఉత్సవంఅయేక మనముపనిచెయ్యము! ఉత్సవాలూ, ఊరేగింపులూ కార్యానికివిఘ్నేశ్వరపూజ కావాలె; కాని, విరుద్ధం, మనవారికిఅవే అసలుకార్యం అయిపోతున్నాయి. ఆవేశోద్రేకాలతో ఉత్సవాలు జరిపి మనం ఏదో పెద్దపని చేసివేసేమని భావించుతూ ఉన్నాము మనము; కాని ఉత్సవాలు అసలు పని కావు. ఏడాది పొడుగునా పనిచెయ్యాలె గనుక ఉత్సవంవల్ల ఉత్తేజన కలగాలె. శ్రీకృష్ణుడు అర్జునుడి భావావేశాన్ని నిందించేడు. శ్రీకృష్ణుడు అర్జునుడితో చెపుతున్నాడు—"ఇది నీదౌర్బల్యం" అని. రసజ్ఞత ఉంది మంచిదే, కాని రసజ్ఞతను మనం భావావేశంతో బంధించివెయ్యకూడదు. మనము కర్మ ఆచరించడం అవసరం. దానికి శ్రీకృష్ణభగవానుడు అర్జునుడికి ప్రసాదించిన సందేశం మన కిప్పుడు కావాలె. ఆయన అర్జునుడితో చెవుతున్నాడు: "'ఉత్తిష్ఠ'—లే; వట్టి రసజ్ఞుడవు కావడాని కిది సమయం కాదు; లే. అర్జునా! లే"అని. నేను నాదేశవాసులకి చెప్పేదికూడా ఇదే—

"కర్మ ఆచరించండి, కర్మ ఆచరించండి, కర్మ ఆచరించండి."

———

### ప్రాచీన పద్ధతుల ననుసరించి హైందవ నారీమండల స్వాతంత్ర్యము.

'వేదాంతకేసరి'అనుపత్రికయందు స్వామి యీశ్వరానందగారు హైందవసంఘసంస్కరణమును గూర్చి చర్చించుచు భారతదేశమున స్త్రీపురుషు లొండొరులు స్వేచ్ఛమెయి గలసి మెలసియుండుట, స్త్రీల స్వాతంత్ర్యము అను విషయములగూర్చి యిట్లువివరించినారు.

ప్రాచీనాచారపరాయణు లామాటను తలంపునకు తెచ్చుకొనుటకు సైతము వెఱచుచుండ సంఘసంస్కర్త లెట్టులైనను గావలయును పట్టుపట్టి యున్నారు. ఇందు ప్రాచీనాచారపరాయణులకు వచ్చిన భయమేమి? వారికి తమ సంతానము పావనత్వమును, పారిశుద్ధ్యమును కోలుపోవునన్న భయము. వారి కీభయము పుట్టుకతో పుట్టినది. హైందవ యువతులు తమ జీవిత పరమావధి యగు సతీత్వమును, పవిత్రత్వమును కోలుపోవకయే స్వాతంత్ర్యప్రాప్తికై పాశ్చాత్య స్త్రీలతో నేల చేరరాదు? మహాసతిసీత ఏండ్లకొలది రాక్షససమూహముల నడుమ తన జీవితమును గడపలేదా! సావిత్రి తనపతికొఱకయి ఎన్నిచోట్ల దిరుగలేదు! బ్రహ్మవాదినులగు స్త్రీలాకాలమున నుద్దండపండితులతో వాదప్రతివాదములు సలుపపెక్కు మహారాజ సభలయందు క్రుమ్మరలేదా? హైందవసంఘమున స్త్రీస్వాతంత్ర్యము క్రొత్తది కాదనుటనిట్లు కాంచగలము. కాని, సంస్కర్తలా స్త్రీస్వాతంత్ర్యముతోపాటు మహత్తరమైన సంకల్పశక్తియుండుటను, ప్రాచీన బ్రహ్మచర్య విధానమున అగ్నివంటి పావనత, జితేంద్రియత పోషితమయి యుండుటను మఱచుచున్నారు. ఇట్టి నియమములు పాటింపకున్నచో స్త్రీపురుషులు స్వేచ్ఛగా కలసి మెలసి యుండు టెంతయు హానికరము. ఈవిషయమును పాశ్చాత్యులును క్రమముగ గుర్తింపగల్గిరి. ఇట్లు నియమబద్ధమై యున్నచో శిష్టాచారపరాయణులు స్త్రీస్వాతంత్ర్యమును నిరోధింపబోరు. జాతియొక్క ఆదర్శములు చెక్కుచెదరకుండునేని ఇతర స్థితులయందు సాధ్యమగునంతవఱకు నార్యులకు అవకాశమును గలిగింపవచ్చును. కావున సంఘసంస్కర్తలు స్త్రీలకు, ప్రాచీనకాలముందువలెను, జాతియొక్క ఆదర్శములను బాగుగ బోధించి పదపడి తమకు సంబంధించిన విషయములను పరిష్కరించుకొను బాధ్యతను వారికి వదలివేయవలెను.

---

### గ్రామపునర్నిర్మాణము-పశువైద్యశాస్త్రము

భారతపశువైద్య పత్రికయం దిట్లున్నది.

ఈరోజులలో మనము 'గ్రామపునర్నిర్మాణము' నుగూర్చి చాల వినుచున్నాము. ప్రతివారు నదియే చెప్పుచుందురు. అది వట్టి నోటిమాటయే యగుచున్నది. పెక్కితర విషయములవలె నదియు కార్యరూపమును దాల్చకున్నది. వైస్రాయిగారు దానినిగూర్చి ప్రసంగింతురు; గవర్నరుగారు దానిని ప్రతిధ్వనింప జేతురు. రాజకీయవేత్తలుదానిని ప్రకటింతురు. పత్రికలుదానినినిగోవీధులవెంట బేరము సాగించును. కొనయూపిరితోనున్న రైతు యీప్రఖ్యాతవ్యక్తిమయమైనమునంకవాగ్దత్తరామరాజ్యముకొఱ కెదురుచూచుచుండును. అతడొకనూతనస్వర్గరాజ్యముగూర్చి కలగనుచుండును. అందొక సింహాసనమున దా నధిష్ఠింతు ననుకొనను. కాని త్వరలోనే యతనికి సత్యము వెల్లడియగును. స్వర్గమందు తనకొక సింహాసన మిప్పింతుమనినవారు భూమిపై నొక ముక్కాలిపీటనైన నీయజాలకున్నారని యతడు గ్రహించును. ఈసుకల్పితతత్వముల, నీ నిర్మితకార్య విధానముల నతడసహ్యించుకొన మొదలిడును. మరియొక యుద్యోగము లేని వారి కిది ప్రియకార్యమను తలంపుతో నతడు భావగర్భితమగు చిరునవ్వు నవ్వుకొనును. అతనితలంపు తప్పో, ఒప్పోకాని 'గ్రామపునర్నిర్మాణ'మనునది బజారులలో మారుమ్రోగుచున్న వాడుక పదమయ్యెనేకాని కార్యరూపము దాల్చకుండుటమాత్రము సత్యము. కావలసినది నమ్మకమైన గట్టిపనికాని భూమ్యాకాశములకు విసుగు గలిగించు నిర్వచనములు, వట్టిమాటలు గావు.

'లిన్‌లిత్‌గో కమిషను' యెదుట 'గ్రామపునర్నిర్మాణము'గూర్చి యొసగబడిన సాక్ష్యములను మేమతిశ్రద్ధతో గమనించితిమి. పునర్నిర్మాణమును విశాలవిధానమున పెద్దయెత్తుబడిమీద, ప్రారంభింపవలసిన యావశ్యకతను గూర్చి చాలమంది ప్రసంగించిరి. "జీవితమున నన్ని విధముల నేకకాలమున రయితునకు సేవచేయుట" యేకమిషను వారితో నొకరితరువాత నొకరుగ విన్నవించిరి: "విద్య, ఆరోగ్యము, ఋణవిముక్తి, పంచాయతి, మితపానము (త్రాగుడుమానుట), అన్ని విధముల వ్యవసాయాభివృద్ధి, ఫలసాయముల వర్తకము, సహాయ పరిశ్రమలు" మొదలగున వన్నియు సూచింపబడినవి. కాని యీ నూతన విధానమున, రైతుయొక్క పశుసంపదను కాపాడుటను ముఖ్యాంశమైన పశువైద్య శాఖాభివృద్ధియొక్క యావశ్యకతను గూర్చి యెవ్వరును మాట్లాడలేదు. నివారింపదగిన జాడ్యములచే నేటేట బీదరయితు తనపశువులను గోల్పోవుచుండినయెడల 'ఋణవిముక్తి' యనుమాట కర్థమేమి? పశుపీడవలన దేశమున అనేకపశువులు నశించినచో 'అన్ని విధముల వ్యవసాయాభివృద్ధి' కెక్కడ యర్థముండునా? "పశువైద్యశాఖవలన నిప్పటికి చేకూర్చిన అల్ప ఫలముల" గూర్చి కొందరు ప్రసంగించిరి. ప్రస్తుత పరిస్థితులలో ప్రతి 700 చదరపు మైళ్ల మేరకు, సుమారు 1½ లక్ష పశువుల రోగనివారణమునకు ఒక్కపశువైద్యు డుండినప్పుడు, యింక నెక్కువలాభమునెట్లు చేకూరగలము!

ఎప్పుడైన, నేడైన గ్రామపునర్నిర్మాణవిధానము కార్యరూపము దాల్చిన, నావిధానమున పశువైద్యము ముఖ్యస్థానమును గాంచవలెను. అన్ని రాష్ట్రములలోను పశుభీమాసంఘములు, ప్రతితాలూకాకు నొక పశువైద్యాలయము, ప్రతిరాష్ట్రమునకు పశువులకొఱకు టీకాలు మందుచేయు కార్యాలయమొకటి, ఇంకను ఎక్కువగ పశురోగ నివారణపద్ధతు లవలంబించుమార్గములు, పరిశోధక కార్యాలయములు నుండవలయును. ఇవియన్నియు పశువైద్య శాఖయొక్కయు, శాస్త్రముయొక్కయు నభివృద్ధ్యాది మార్గములు; పరమావశ్యకములు. అది జరుగునంతవరకు మన దేశపు పశుసంపద నాశనమగుటయు, రైతునకు గొప్ప యార్థిక దారిద్ర్యదుఃఖము కలుగుటయు నిశ్చయము. వట్టిమాటల 'పునర్నిర్మాణము'నం దతనిసౌఖ్యము కల్ల. నిజము కానేరదు. మా మొర యరణ్యరోదనము మాత్రము కాకుండునని మా యాశ.

---

## ప్రాచీనమహారాణుల చిత్రములు

### ౨. క్లియోపాత్రా-మృతభర్తృసందర్శనము

### (క్రీ. పూ. 68-30)

ఈమె యసామాన్య సౌందర్యవతి. యాను ఈజిప్టు దేశపుమహారాణి. ఈమె సౌందర్యాతిశయమువలన నాకర్షితుడైన రోమక సామ్రాజ్యాధీశుడగు సీజరు మరణించిన పిమ్మట మార్కు-ఆంటొనీకి ప్రియయై, యతడు ఆక్టావియస్ చేత నోడింపబడి, రాజ్యమును గోల్పోయినపిమ్మట తానొక యలగ్జాండ్రియా దేవాలయాంతర్భాగమున దాగుకొని, తన యబద్ధమరణవార్తను వెల్లడిచేసెను. ఈవార్తను వినిన యామె ప్రియుడు ఆంటొనీ, తానేల జీవించియుండవలెనని కత్తితో పొడుచుకొనెను. ఇంకను అతడసువుల బాయక మున్నే, క్లియోపాత్రా మరణింపలేదనియు, నొక దేవాలయమున దాగియున్నదనియు రూఢివార్త యతని చెవిని సోకెను. ఆసౌందర్యమూర్తిని తనకనులార కడసారి యొకమారు చూచి చనవలెనని యతడు పల్లకియం దామెయుండు స్థలమును జేరెను. మృత్యువొకవైపు పాతని లాగుచుండ నీమె లావణ్య మింకొకవైపు పాతని నాకర్షించుచుండెను. "నేను మృతినొందుచున్నాను. ఈజిప్టు మృతినొందుచున్నది' యను తుదిపలుకులతో నతడు ప్రాణముల వీడెను. తన దాసీలందరతని వియోగమునకు దుఃఖాశ్రువుల కురియుచుండ నామె యతనివంక జూచుచున్నది. పిమ్మట కొన్ని దినములలోనే యామె విషసర్పదష్టయై తన హృదయనాథుని జేరెను.

---

## హిందీప్రచారము-నాటకములు

'హిందీప్రచారక' పత్రికయందు శ్రీదినవహి సత్యనారాయణగారు హిందీ భాషాప్రచారమునకు ధర్మగ్రం

ధములు పఠనపాఠనములును, నాటకప్రదర్శనములును ముఖ్యసాధనములని చెప్పుచు, శ్రీవెంకటరావుగారను నొకరు ఆంధ్రదేశమున సంచారముచేసి తులసీరామాయణము చదివి చెప్పుచున్నారనియు, అది జనులు గుంపులుగ జేరి భక్తితో వినుచున్నారనియు, కొందఱు లేపకు హిందీ తెలియకపోయినను రామాయణములు కొనుచున్నారనియు, ధర్మగ్రంథములకు భారతీయులపై నపూర్వప్రభావము గలదనియు నుదాహరించి, నాటకముల గూర్చి యిట్లు నుడువుచున్నారు :

"నాటకములన్నిటికంటె గొప్పప్రచారసాధనములని నామతము. వాని కెల్లరిపైని ప్రభావము గలదు. ఆంధ్రనాటకరంగమున హిందీ ప్రోద్బలము నేటిదికాదు. సుప్రసిద్ధులు, సుమేరుసింగుపాత్రధారులు కీర్తిశేషులగు లక్ష్మణరావుగారి నీప్రాంతమువా రెవ్వరును మఱవజాలరు. వారు హిందీలో భాషించి తమ పాత్రాభినయసౌందర్యమును పెంపొందించిరి. జనులు వారియెడలను, వారి హిందీభాషణము నెడలను ముగ్ధులగుచుండిరి. వారి కెన్నియో పతకములు లభించెను. మాన్యులు శ్రీవెమురు మూడి శేషగిరిరావుగారు ఈప్రాంతపు సుప్రసిద్ధనటకులలో నొకరు. వీరును హైదర్ జంగు, సుమేరుసింగు మున్నగు పాత్రల ధరించి తమ హిందీభాషణమువలనను, అభినయ కౌశలము వలనను ప్రేక్షకుల పరవశుల జేయుచున్నారు.

ఇప్పుడును తెలుగు నాటకములయందు హిందీ వర్తిల్లుచున్నది... ప్రేక్షకుల కది యర్థమైనను గాకున్నను తుదివఱకు శాంతముగ వినుచున్నారు. దీనివలన దెలియవచ్చెడి దేమి? జనుల మానసిక ప్రవృత్తి హిందీ కనుకూలముగ నున్నది. దానిని లగుమార్గమునకు తీసికొనివచ్చుట ప్రచారకులపని.

నాటకప్రచారమునకు రెండుమార్గములు మంచివిగ నాకు తోచుచున్నవి: (౧) హిందీప్రచారకేంద్రస్థానమున నాటకమండలి యొకటి స్థాపింపవలెను; దక్షిణభారతదేశమునం దంతట నది నాటకములు ప్రదర్శించుచుండవలెను. సాధ్యమగునంతవఱకు నాటకము లైతిహాసికములై చిన్నవిగ నుండవలెను. (౨) ప్రాంతీయనాటకసమాజముల వారిని ప్రోత్సహించి యప్పుడప్పుడు హిందీ నాటకము లాడునట్లు చేయవలెను. దీనివలన హిందీప్రచారము సుకరమయి, రాష్ట్రభాషాదేవి ప్రతి భారతీయహృదయ రంగమునను ప్రతిష్ఠితమగుట, వివిధభాషలు మాటాడు భారతవాసు లెల్లరు నేక హృదయు లగుదురు. హిందీ యొక విద్యుత్తంత్రి. హిమాలయమున నాఘాతము తగిలినచో కన్యాకుమారి పర్యంతము భారతదేశ మెల్ల నొక్కసారి కంపించి పోవును. ఈతంత్రిని దేశమంతటను వ్యాపింపజేయుట యావశ్యకము. అపుడు స్వరాజ్యము బడయుట యేమంత పెద్దవిషయము!"

## హైందవకుటుంబమున మాతృదేవత

శ్రీ వివేకానందస్వామి కాలిఫోర్నియాలో కావించిన ప్రసంగము నివివఱకు నముద్రితముగ నున్నదాని నిపుడు ప్రబుద్ధభారతి ప్రకటించినది. దానినుండి:

అల్లదియే ఆమె. తనకూతురు పెండ్లాడి తనయింటినుండి పోవునట్లు కొడుకుపెండ్లాము తనకూతురుగ తన ఇంటికి జేరును. కాబట్టి కొడుకుపెండ్లాడి తల్లికొకకూతురిని దెచ్చినాడు. రాణులకు రాణియగు నాతల్లి ప్రభుత్వముక్రింద నామె క్రమముగ జేరుచున్నది.

ఇప్పటి కవివాహితుడను, ఆశ్రమస్వీకారమును గావించిన కారణమున ముందును వివాహము కాబోవనివాడను అగు నేనుగూడ- పెండ్లాడుదు నేని నాభార్య నాతల్లి కప్రియముచేయ సాహసించుటకు సహింపజాలను. ఏల? నేను నామాతృదేవతను పూజించుచుంటిని గాదా! ఆమెను కోడ లేల యారాధింపరాదు? నాతల నెక్కి స్వారిచేయుచు నాతల్లిపై నధికారము చెల్లించుట కామె ఎవ్వతె? తాను స్త్రీధర్మము నధిగమించువరకు నామె వేచియుండవలెను. స్త్రీయందు స్త్రీత్వమును నిండారజేయునది మాతృత్వ మొక్కటియే.. కావున నామె తల్లియగునంతవఱకు వేచియుండవలెను. అపు డామెకు నాతల్లి యధికారమువంటి యధికారము కలుగును. హైందవాభిప్రాయానుసార మయ్యదియే.—

ఆమాతృత్వమే—ఉత్కృష్టమైన స్త్రీధర్మము. ఆహా! ఎంత మహదంతరము! ఎంతమహాదంతరము! నాతల్లిదండ్రులు నన్ను బడయుటకై ఏండ్లకేండ్లుగ నుపవాసములు, దైవ ప్రార్థనలు కావించిరి. శిశువు జననము నొందుటకు పూర్వము తలిదండ్రులు ఆశిశువుకొఱకు దైవమును ప్రార్థింతురు. భారతీయ ధర్మశాస్త్ర ప్రణేత యగు మనువు ప్రార్థనాపురస్సరముగ బుట్టినవాడే ఆర్యుడని ఆర్యుని నిర్వచించినాడు. ఆతని మతము ననుసరించి ప్రార్థింపక పుట్టిన శిశువు లఘములనుచున్నారు. శిశువుకొఱకు ప్రార్థన సలుపవలెను. ప్రార్థింపక పుట్టినవారు, నిరోధింపరాని పరాకువేళలందు ప్రపంచమున బడినవారునగు మానవుల వలన నేమి కాగలదు?

అమెరికా దేశపు తల్లులారా! ఇంచుక యోజింపుడు. మీ అ ం త ర ం గ ము ల ను ద మ య ం త ర ం గ ములయందు యోజింపనిండు. మీరు నిక్కముగ స్త్రీలు కానోరెవరా? ఒకజాతి, ఒకదేశము మాట కాదు; జాతీయాహంభావమును గాదు; నశ్వరమైన జీవితమును, నిరంతరము దుఃఖభాజనమయిన జీవితమును డెలిసి విఙ్ఞవీగువా రెవ్వరు? పరమేశ్వరుని అనంతశక్తిముందు మనమెంతవారము? ఇదిగో ఈరాత్రి నేనిట్లు మిమ్ము ప్రశ్నించుచున్నాను. నీరందఱు సంతానముకొఱకు దైవమును ప్రార్థించెదరా? తల్లులు కాగోరి మీరందఱు సర్వేశ్వరునికి వందనముల నర్పింపరా! మాతృత్వముచే మిమ్ము పవిత్రలనుగ పరిగణించుకొందురా? పరిగణించుకొనరా? మీఅంతరంగముల నడుగుడు. మీరు కాదందురేని మీవివాహ మబద్ధము; మీస్త్రీత్వము కల్ల; మీవైదుష్యము బూటకము. ప్రార్థింపక యుదయించిన మీసంతానము ప్రపంచహాస్య మగును.

మన ఎదుట దోచుచున్న భిన్నాదర్శముల నరయుడు.

మాతృత్వముతో గొప్ప భారము పుట్టుచున్నది. అది మూలస్థానము; అటనుండి బ య లు దే రు డు. మంచిది; తల్లి నేల యంతగా బూజింపవలెను? ఏలయన: మంచి చెడుగులయెడ శిశువులకు ప్రవృత్తి గలిగించునది జనన పూర్వము గలుగ నొక ప్రోత్సాహమని మాగ్రంథము లుద్ఘోషించుచున్నవి.

---

హిందీ—ఒక జర్మనుపండితుని అభిప్రాయము

బర్లిను విశ్వవిద్యాలయమున సంస్కృతాధ్యాపకులగు ల్యూడరు దొరగారు కలకత్తా విశ్వవిద్యాలయమున నుపన్యసించుటకు వచ్చి, హిందీ విషయమున నిట్లు చెప్పియున్నారు:—'భారతవర్షమునకు రాష్ట్రభాష (జాతి సామాన్యభాష) కాదగినది హిందీభాష యొక్కటియే. ఇంచుమించుగ భారతీయు లెల్లరును హిందీ తెలిసికొనగలరు. భారతీయాశయములకు విరుద్ధములైన సిద్ధాంతములు హిందీభాషయం దుండవు.'

['హిందీప్రచారక' నుండి]

---

భారతదేశసంస్థానాధీశులు

'ది ఇండస్' అను పత్రికలో శ్రీ. సి. కె. పటేలుగా రిట్లు వ్రాసిరి:

సంస్థానాధీశులు ధనవ్యయము చేయుటకు పెక్కుత్రోవలు గలవు. సాధారణముగనే సంస్థానాధీశులకు సొంతకర్చులకుగాను పంచమజార్జిచక్రవర్తికంటె ఎక్కువ సొమ్ము కావలసి యుండును. బ్రిటీషు రాజ్యాంగమునకు ౧౯౩౩ వ సంవత్సరమునకు అంచనావేయబడిన రాబడి ౧, ౨౧౬, ౬౪౦,౦౦౦ పౌనులలో (ఈమొత్తమును సరాసరి సంవత్సరాదాయముగ పరిగణింప దగును.) ౧౧౦,౦౦౦ పౌనులు చక్రవర్తి దంపతుల సొంతకర్చులకు మినహాయింపు చేయబడినది. ఈమొత్తము రాబడిలో తొమ్మిదింట ౧.౦౧౨౦౦ వ వంతు అగుచున్నది. ఇది యిట్లుండగా భారతదేశ సంస్థానాధీశులు సంస్థానము యొక్క రాబడిలో చాలవఱకు చెరుసగము సొంతకర్చులక్రింద దిగమ్రింగివేయుచున్నారు. వివేకసంపన్నుడయిన బరోడాగైక్వారువంటి మహారాజునకుగూడ సంవత్సరమునకు ఇరువదిలక్షల రూపాయలు జేబు సెలవుకు కావలసి యున్నది. ఇదిగాక యువరాజునకు, రాజకుటుంబమునకు చెందిన ఇతరులకు మఱికొంత సొమ్ము

కావలసియున్నది. గైక్వారు వ్యయించు ౨౦ లక్షల రూపాయలు అతని సంవత్సరాదాయమున నూటికి పదివంతు లగుచున్నది. యువరాజాదుల కిచ్చు సొమ్ము నూటికి రెండువంతు లగుచున్నది. ఇంతతక్కువవ్యయము కావించు వీరివిషయము అపురూపమయినది. సాధారణముగా రాజపుటానా కతియావారులలోని చిన్న చిన్న సంస్థానాధీశులు తమరాబడిలో సగమునకు జేబు సెలవుక్రింద కాజేసెదరు. ఈసొమ్మంతయు ఎట్లు వ్యయమగుచున్నది? నీతిబాహ్యములైన దుర్వ్యాపారముల క్రిందను, నిరంతర పాశ్చాత్యదేశయాత్రలక్రిందను సొమ్మంతయు చెల్లిపోవుచున్నది. ఇది ఘంటాపథముగా నందరకు దెలిసినవిషయమే కాన నిదర్శనము లావశ్యకములేదు. కాని 'మంతాజు బేగము' విషయము ఇంగ్లాండులో జరిగిన అవమానకరమైన "మే, ఏ" గారి వృత్తాంతమును విశేషనిదర్శనములుగా చూపవచ్చును. పెక్కురు సంస్థానాధీశులు తమ రాజ్యాంగ విషయములను విచారించి చక్కజేసికొనక ఏటేట యూరపుఖండయాత్రలక్రింద కాలమును గడపుచున్నారు.

తమసంస్థానములయందలి ప్రజలు దారిద్ర్యపీడితులై శోకపరాయణులై యుండ వారి వలన నిర్బంధముగ లాగికొనిన ధనమును వ్యయించి తాము భోగపరాయణులై గర్వముతో విఱ్ఱవీగుచుండుటకంటె ఘోరమైన విషయము వేఱొకటి కాన్పింపదు. భారతమాతృదాస్యవిమోచనమునకు నడుముకట్టి పోరాడవలసిన సంస్థానాధీశుల యిట్టి యవివేక ప్రవర్తనము లెంతయు విషాదమును గలిగింప మానవు.

---

## ప్రాచీనభారతీయచిత్రకళ - మొగలుచిత్రములు

చిత్రము ౧. గుల్బర్గా కోటకొనకొమ్మన నీవిచిత్రమైన ప్రాతఫిరంగి యున్నది. దీనిపొడవు ఇరువదియారడుగులు. దీనికిగల యిరువదిజతల యినుప ఉంగరములు దీనిని త్రేలదీసియుంచుటకు, ఒకచోటనుండి మఱియొక చోటికి కొనిపోవుటకు ఉపయోగించును.

గుల్బర్గా దక్కను బహమనీరాజ్యమునకు మొదటి రాజధానిగ కొన్ని యేండ్లుండినది. ఇపుడది 'హైదరాబాదు సంస్థానమున నున్నది.

చిత్రము ౨. బీజాపూరునం దొక బురుజుపైన నీగొప్ప ఫిరంగి యున్నది. దీనికి మాలిక్ ఇ మైదాన్ (మైదానమునకు ప్రభువు) అనుపేరు గలదు; దీనినోటికిరుప్రక్కల నొక పెనుభూతము ఏనుగును మ్రింగుచున్నట్లు చెక్కబడి యున్నది. అహమ్మదునగరమున దీనిని పోతపోసిరి. దీని పొడవు ౧౩ అడుగులు దీనిచుట్టుకొలత ౧౩౪ అడుగులు. దీని బరువు ౪౩ టన్నులట. దీనిపై మూడు లేఖనములు గలవు. వానిలో నొకటి చెవిదగ్గరనున్నది. 'మహమ్మదుబిన్ హుస్సేన్‌రూమి' అను నాతడు దీనిని చేసినట్లా లేఖనము తెలుపుచున్నది. రెండవది నోటిదగ్గరనున్నది. అందు దైవప్రవక్త కుటుంబసేవకుడు అబుల్ ఘాజినిజాంషా 956 A. H.(౧౫౫౧)అని యున్నది. మూడవదియు నోటివద్దనే యున్నది. అందు అలంగీరు చక్రవర్తి- ఔరంగజేబు-సాగద్ద గలదు.

ఈఫిరంగికి ౨౧౧ పౌనుల బరువుగల గుండు, ౫౦౦పౌనులు మందు కావలెనట. దీనిని చేయుటకు అపరిమితముగ సొమ్ము వ్యయమయ్యెనట. ఇంతవ్యయము చేసి దీని నేల చేయించితివని కుపితుడై రాజు కోశాధిపతిని దీనిని చేసిన కొలిమిలోనే త్రోయించెనట.

చిత్రము 3. క్రీ. పూ. 333 వ సంవత్సరమున అలెగ్జాండరు చక్రవర్తి డేరియసుతో పోరాడి జయించుట నీచిత్రము సూచించుచున్నది. ఇది రంగురంగుల రాళ్లు, గుల్లలు మొదలయినవి పొదిగి చేయబడిన చిత్రమట. ౧౮౩౧ వ సంవత్సరమున నిది 'పాంపేయి' వద్ద దొరకినది. ఇది క్రీ. పూ. రెండవ శతాబ్దమునందలిదిగా నూహింపబడుచున్నది. ఇట్టి చిత్రములలో నిది యుత్కృష్టమయినదిగ పరిగణింపబడుచున్నది. జయపురపు మ్యూజియమున నొక గోడపై గచ్చు ఆరకమునుపు నీటిరంగుల

తో మఱియొక పెద్ద చిత్రపు ప్రతిని జూచి యీచిత్రము చిత్రింపబడినది.

చిత్రము ౪. గజినీమహమ్మదు సుల్తాను. ఇతడు సుప్రసిద్ధమగు సోమనాథదేవాలయమును విధ్వస్తము చేసినవాడు.

చిత్రము ౫. తైమూర్. ౧౩౯౮ వ సంవత్సరమున ముల్తాను మార్గమున ఇండియాను ప్రవేశించి భయంకరముగ దోచుకొన్నవా డితడు. ఉదయపురపు మహారాణాకడ నుండిన చిత్రమునుండి యిది గైకొనబడినది.

చిత్రము ౬. అలెగ్జాండరు చక్రవర్తి. ఇతడు సుప్రసిద్ధుడు. ఈచిత్రము 'పాంపేయి' (ఇటలీ రాజ్యమునకు రాజధానిగా నుండి, క్రీ. శ. ౭౯ వ సంవత్సరమున నశించి, క్రీ. శ. ౧౮ వ శతాబ్దమున మరల కనుగొనబడినది.) వద్ద దొరకిన చిత్రమునుండి గైకొనినది.

చిత్రము ౭. అక్బరుచక్రవర్తి. ఇతడు సుప్రసిద్ధుడు.

[ఇండియన్ ఆర్ట్సు అండ్ ఇండస్ట్రీ జర్నలునుండి]

---

## స్త్రీవిద్యామహాసభ - తీర్మానములు

నాగపురములో జనవరినెల మూడవవారమున జరిగిన అఖిలభారత స్త్రీవిద్యామహాసభయం దీదిగువ తీర్మానము లామోదింపబడినవి:—

(౧) అన్ని బడులలోను, కళాశాలలలోను నైతిక, ఆధ్యాత్మిక శిక్షణ మవశ్య మొసంగబడవలెను.

(౨) అన్నిమాధ్యమిక బాలికాపాఠశాలలలోను, కళాశాలలలోను గృహనిర్వహణోచిత విద్యలయందు శిక్షణ మవశ్య మొసంగబడవలెను. సంగీతమునందు, నితర లలిత కళలయందును శిక్షణము ప్రోత్సహింపబడవలయును.

(౩) సరియైన వైద్యపరీక్ష యావశ్యకము.

(౪) వీలగునంతవరకు బహిరంగస్థలములయందు శరీరవ్యాయామ శిక్షణము నియతముగ నుండవలెను.

(౫) బాలికలకు వివాహార్హవయస్సు 16 ఏండ్లకు హెచ్చించి శాసింపబడవలెను.

(౬) వీలగునంతవరకు స్త్రీలయుపాధ్యాయులతోడ ప్రాథమిక విద్యాలయము లన్నింటిలోను మొక్కలను పెంచుటకూడ నేర్పింపబడవలయును.

(౭) అన్నిజాతుల బాలికలకును ప్రాథమికవిద్య యుచితముగా విధింపబడవలయును.

(౮) బాలురును, బాలికలును కలసి చదువుప్రాథమిక విద్యాలయము లన్నింటిలోను అధికసంఖ్యాకులగు నుపాధ్యాయులు స్త్రీలేయై యుండవలెను.

(౯) అన్నిబాలికా పాఠశాలలలోను జాతీయపద్ధతులపైని బాలభటోద్యమమును ప్రోత్సహింపవలెను.

(౧౦) విద్యాబోధనయందు శిక్షితులై సమర్థతను పొందిన స్త్రీలే యుపాధ్యాయినులుగ నియమింపబడవలయును.

(౧౧) ప్రతిఘోషా స్త్రీకిని విద్య నేర్పుటకు ఆమె యింటియందుగాని, వీలైనచో పాఠశాలయందుగాని స్త్రీలయుపాధ్యాయులు నియమింపబడవలెను.

(౧౨) అన్ని మాధ్యమిక పాఠశాలలయందును, కళాశాలలయందును స్త్రీల కుచితమైన యారోగ్యశాస్త్రము నేర్పింపబడవలయును.

(౧౩) అన్ని మాధ్యమికపాఠశాలలందును, కళాశాలలందును శిశుసంరక్షణవిధులు నేర్పింపబడవలయును.

(౧౪) సంఘసేవయందును, విద్యావిషయక కార్యములందును స్వయం ప్రయత్నములు ప్రోత్సహింపబడవలయును.

(౧౫) మధ్యపరగణాల దక్షిణమును, మధ్యపరగణాల యుత్తరమును, బీరారును ఏకాంగరాష్ట్రముగా కలుపబడవలయును.

(౧౬) బాలికావిద్యాభివృద్ధికూర్చి యొకస్థాయి కేంద్రసంఘము నియమింపబడవలయును.

---

## స్త్రీల విషయము

శ్రీధర్మపత్రికనుండి యీదిగువభాగము లుద్ధృతములు:—

### భారతాఖిలత

భారతీయమహిళామండలి యైక్యత మొన్న మద్రాసులో జరిగిన స్త్రీలసభయందు సభాధ్యక్షురాలి వలనను, ఉపన్యాసకులవలనను చక్కగా ప్రదర్శింపబడినది. పాట్నా వాస్తవ్యులగు పి. కే. సేన్‌గారిసతి సభాప్రారంభమును గావించెను. పూనానగర నివాసినియగు జానకీబాయి భట్ మహారాష్ట్రిభాషయం దుపన్యసించుచు, ఉదయపుసభ కధ్యక్షత వహించెను. మధ్యాహ్న సభను ప్రారంభించుచు ఇందూరు నివాసిని యగు కైబుసతి హిందీభాషయం దుపన్యసించెను. సాయంకాలమున కాంగ్రెసు మహామంటపమున జరిగినసభకు స్త్రీపురుషు లెల్లరును వచ్చిరి. అందు చెన్నపురికాసన సభోపాధ్యక్షురాలగు శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మిఅమ్మాళ్ గారధ్యక్షత వహించిరి. ఆమె యాంగ్లమందును, అరవమందు నుపన్యసించిరి. ఆంధ్ర, తమిళ, కన్నడ భాషలయందును కొందరుపన్యసించిరి. ఒకమహమ్మదీయవనిత యుర్దూభాషయం దుపన్యాస మిచ్చెను. హిందూపద్ధతిని, క్రైస్తవపద్ధతిని, మహమ్మదీయపద్ధతిని, తుదకందరును కలసి ‘కోటికంఠములగూర్చి’ చేసిన సభాప్రారంభప్రార్థన లీ యైక్యమును మరింత దృఢపరచినవి.

### నార్వేయందు వితంతువుల సమానహక్కు

నార్వేదేశమందు క్రొత్తగా గావింపబడిన యొక న్యాయశాసనము ననుసరించి భార్యపోయిన పురుషునకామెయాస్తియం దెంతహక్కు లుండెనో, యంతహక్కు భర్తలను గోల్పోయిన స్త్రీకిని యాతనియాస్తియందు ఇవ్వబడినది. గృహము నాక్రమించుకొను హక్కుకూడ నిం దిమిడియున్నది. ఈశాసనము 1928 జనవరి మొదటి తేదీనుండి యమలునందు పెట్టబడినది.

---

## నిరుక్తము

[‘మాధురి’లో మహావీరప్రసాద ద్వివేదిగారు వ్రాసిన వ్యాసమునుండి]

“నిర్నిశ్చయేన ఉక్తమ్ నిరుక్తమ్.” నిశ్చయముతో చెప్పబడినది నిరుక్తమని యందురు. భావమేమనగా, వేదములందలి పురాతన శబ్దాదు లేయే యర్థములందు ప్రయుక్తములైనవో అది నిశ్చయపూర్వకముగ నిరుక్తమున నుల్లిఖిత మైనది. నిరుక్తజ్ఞానము లేక వేదములకు సరియగు నర్థము గ్రహించుట అసాధ్యము కాకున్న, కష్టసాధ్యముమాత్ర మగును. కనుకనే యది మహాత్త్వము గలది; కనుకనే యది యొక వేదాంగముగ పరిగణితమైనది.

‘శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం జ్యోతిషం తథా,
ఛందశ్చేతి షడంగానివేదానాం వైదికా విదుః.’

*     *     *     *     *

నిరుక్తమును Philological Explanation of Difficult Vedic Words (కఠినములగు వేదశబ్దములకు భాషాశాస్త్రీయమగు నిర్వచనము) అని చెప్పవలెను. ఆయాశబ్దముల కాయా అర్థములందు ప్రవృత్తికల్గుటకు నిమిత్తకారణము లందు వివేచితములైనవి. అచ్చటచ్చట అవసరమైనపట్ల మంత్రముల యొక్కయు, మంత్రభాగములయొక్కయు తాత్పర్యము వివృత మైనది. వేదములందు ద్యావాదిత్యవరుణాది దేవతలకుకల్గిన పేళ్ళను గూర్చి యొక్కొకచో విస్తృతముగను, నొక్కొకచో సంక్షిప్తముగను మీమాంస యున్నది. అతి పురాతనకాలమున వైదికశబ్దముల కొక కోశము రచితమయి యుండెను. దాని పేరు ‘నిఘంటు.’ ఈనిరుక్తశాస్త్ర మానిఘంటుపై వ్యాఖ్య.

నిరుక్త మైదు విధములు:

‘వర్ణాగమో వర్ణవిపర్యయశ్చ,
ద్వౌ చాపరౌ వర్ణవికారనాశౌ;
ధాతో స్తదర్థాతిశయేన యోగ,
స్తదుచ్యతే పఞ్చవిధం నిరుక్తమ్.’

అనగా క్రొత్తవర్ణములు వచ్చి చేరుట, ఉన్నవర్ణములు తారుమారగుట, వర్ణములు వికార మొందుట, వర్ణములు సమూలము నాశమైపోవుట, ప్రసంగోపాత్తమైన యోగము ననుసరించి ధాత్వర్థములను నిర్దేశించుట— ఇట్లయిదు విషయములు నిరుక్తము. ఈవిషయములే యందు వర్ణితము లౌను. కాని యిది యొక స్థూలవిభాగము. ఇవిగాక వేదార్థబోధకములగు నితరవిషయములు గూడ ఈశాస్త్రమునందు వివేచితము లైనవి.

శబ్దములు ప్రాయికముగా మూడు విధములుగ పరిగణింపబడుచున్నవి— యౌగికములు, యోగరూఢములు, రూఢములు నని. ఒకానొక యోగమున నేర్పడి ఆయోగముయొక్క ద్యోతకార్థముల నిచ్చు— అబల, సరోజము, నీరదమువంటి— శబ్దముల విషయమున శాస్త్రార్థమున కెక్కువతావు లేదు. మేఘమునకు నీరదమని యెందులకు పేరు వచ్చినది? అది నీరము నిచ్చును గనుక. దానియర్థము స్పష్టమే. కాని పిక మనుపేరు కోకిల కేల వచ్చినది? యోగాధార మేమియు దానికి లేదాయె. కావుననే కోకిల యనునర్థమున నది రూఢమైనది. జనులు దాని కాయర్థ మున్నదని పాటించినారు. ఇట్టి శబ్దములవిషయమున నిరుక్తకారుడు కావించిన వ్యాఖ్య చాల ప్రయోజనకరము. దాని సాయముననే వేదముల యథార్థజ్ఞానము సిద్ధించును. అది లేక సిద్ధింపజాలదు. పైని జెప్పినట్లు నిరుక్త మొకవిధమగు భాష్యము. నిఘంటులో వచ్చు వైదికశబ్దముల వ్యాఖ్యయే యందున్నది. కాని నిఘంటునందు ౧౨ అధ్యాయములు మాత్రమే యుండ, నిరుక్తమున ౧౪ గలవు. కావుననే, కడపటి రెండధ్యాయములు పరిశిష్టరూపమున తరువాత జేర్చినవని విద్వాంసుల యనుమానము.

నిరుక్తము మూడుకాండల నున్నది— అవి నైఘంటుక వైదిక దైవతములు. మొదటికాండయందు ఏకార్థవాచకములగు పర్యాయపదముల వ్యాఖ్య గలదు. రెండవదానియందు అప్రసిద్ధ వైదికశబ్దముల వివేచనము గలదు. మూడవదానియందు అగ్ని, యమ, విశ్వేదేవాది దేవపదముల వర్ణనము గలదు.

## సారస్వతవిశేషములు

శ్రీయుతులు మానవల్లి రామకృష్ణకవి (యం. ఏ.) గారు తమ చిరకాలపరిశోధనఫలితము లైన కొన్ని సారస్వత విశేషములను ఆంధ్రహిస్టారికల్ రీసర్చిసొసైటిపత్రికలో ప్రకటించినారు. వాఙ్మయప్రపంచమున నిప్పటికిని సంశయగ్రస్తములు, వివాదగ్రస్తములు నగు విషయములను నిర్ధారించుట కవి యుపకరింపగలవు. వానినుండికొన్ని యిప్పు డీక్రింద నుద్ధృతములైనవి.

### ౧. రుయ్యకుఁడు

అలంకారగ్రంథములయందు పేర్కొనబడుచున్న రుచకుడు రుయ్యకుడు కాడనియు, 'అలంకార సర్వస్వ' కర్త రుయ్యకుడేకాని రుచకుడు కాడనియు కొందఱుపండితుల యభిప్రాయము. రుచకశబ్దము ప్రాకృతమున 'రుఅక' అగును. దానినుండి క్రమముగ 'రుయక' 'రుయ్యక' కావచ్చును. ఇట్లే 'మమ్మట' 'లొల్లట' ఇత్యాదులయందలి 'ట' భట్టశబ్దోచ్చారణమునందలి యవశిష్టరూపమనియు, ఆశబ్ద మొకప్పుడు మమ్మభట్ట, లొల్లభట్ట ఇత్యాదిగా నుచ్చరింపబడి యుండవలెననియు మనము విశ్వసించుచున్నాము. సంస్కృతమునందలి 'భ' ప్రాకృతభాషల 'హ' గా మాఱును, పనపడి క్రమముగ నందలి హకారోచ్చారణమును లోపించును. అప్పుడా శబ్దములు ఇట్లు పరిణమించును–మమ్మభట్ట–మమ్మహట్ట–మమ్మట్ట–మమ్మట. భట్టశబ్దము ద్విరుక్తమగుచుండుట వలన మమ్మటభట్ట, లొల్లటభట్ట అను రూపములు సాధువులు కావచ్చును. కాని భట్టశబ్దము రూపాంతరమును జెంది తనయర్థమును గోలుపోయినపుడు భారతీయభాషలయందు తదర్థద్యోతకమగు మఱియొక పదమును జేర్చువాడుక గలదు. తెలుఁగున సూరమాంబ, వెంకయార్య అను పదములను మనము గాంచుచున్నాము. వానిలోని 'అమ' 'అయ'లు 'అంబా' 'ఆర్య' శబ్దభవములే. అట్లే లొల్లటభట్ట, మమ్మటభట్ట ఇత్యాదులును సాధువులే కావచ్చును.

విసర్గకులపరుచకశబ్దముయొక్క యీవిధయుచ్చారణ పరిణామరూప మంగీకార్యము కాకపోవచ్చును. 'అలంకారసర్వస్వ' వ్యాఖ్యాత యొక్క రిట్లు నుడివియున్నారు.

'రుచకాచార్యోపజ్ఞస్యేయ మలంకారసర్వస్వే;
సంజీవనీతి టీకా శ్రీవిద్యాచక్రవర్తినా క్రియతే.'

గ్రంథాంతమున మరల నిట్లు నుడివిరి.

'శబ్దస్యాసౌ విషమవిషయో దుర్ఘటార్థవ్యవస్థా
వ్యాప్తవ్యాప్తి ప్రకటనపటుర్న్యాయచర్చా గభీరః;
ఇత్థం భూమ్నా రుచకవచసాం విస్తరః కర్కశో ఽయం
టీకాస్మాభి స్సముపరచితా తేన సంజీవనీయమ్!'

రాఘవభట్టు తనశాకుంతలవ్యాఖ్యానమున 'రాజానకరుచక' అనుశబ్దము నుపయోగించినాడు. (పే. ౯౪, పంక్తి ౨ చూ.)

కావున రుచకశబ్దము గ్రాంథికమనియు, రుయ్యకశబ్దము వ్యావహారికమనియు నూహింపబడినది.

## ౨. విద్యారణ్యులు-సంగీతగ్రంథకర్త

విశేషముగ మీమాంసా, వేదాంతశాస్త్ర గ్రంథరచనమున ప్రఖ్యాతిగాంచిన విద్యారణ్యులవారు-సంగీతశాస్త్రమునగూడ గ్రంథరచనముగావించెనన్న విద్వాంసులకు వింతగా దోచును. నానాముఖముల నుశీలియగుటవలన నాతడు తన మంత్రాంగవ్యవహారముల నడుమ లలితకళలయందును మంచి చొరవ గలిగి యుండెననుట వింతకాదు. తంజావూరు రఘునాథరాజు 'సంగీతసుధ' యను గ్రంథ రచనమున తాను ప్రామాణికులుగా గైకొన్నవారినిగూర్చి యుట్టంకించుచు వినయముతో నిట్లు చెప్పెను:

'సంగీతసారం సమవేక్ష్య విద్యా
రణ్యాభిధశ్రీచరణప్రణీతమ్.'

మఱియు రాగభేదములను వివరించునపు డిట్లు నుడివెను:

'నిరూపితా లక్షణతో వివిచ్య
రాగా శ్చతుష్షష్ట్యధికే శతే ద్వే;
కర్ణాటసింహాసన భాగ్యవిద్యా
రణ్యాభిధ శ్రీచరణాగ్రణీభ్యః.'

అని యిట్లు వారి మతమునే అనుసరించినాడు. శ్రుతుల దోషముల నిరూపించుపట్టున—

'దోషాంశ్చ తేషాం ప్రవదామి విద్యా
రణ్యాభిధ శ్రీచరణోపదిష్టాన్.'

అనియు, మరల—

'స్వరూపమేషా మిహ లక్షితానాం
సంగీతసారే విశదీకృతంచ.'

అనియు, ఇంకను ముందు—

'చతుర్విధైః శ్రీచరణై ర్నిరుక్తం
శారీర మేత త్ప్రవిభజ్య సమ్యక్.'

అనియు చెప్పినాడు.

ఈసంగీతసారమును దక్షిణ భారతదేశ మంతటను పఠించెదరు. ఈగ్రంథభాగములను మైసూరి చిక్కదేవరాయలు తన 'భరతసారసంగ్రహము'నను, పర్లాకిమిడి నారాయణదేవుడు తన 'సంగీతనారాయణము' నందును తఱచుగా నుద్ధరించియున్నారు: చిక్కదేవరాయ లుద్ధరించిన వానిలో తానముల సంఖ్యను గూర్చి యిట్లు కలదు!

'ఇత్యేకాశీతిసంయుక్తం
సహస్రాణాంచతుష్టయమ్;
తానానాం పునరుక్తానాం
పూర్ణాపూర్ణైస్సహస్రకమైః;
లక్షత్రయం స ప్తదశసహస్రాణి శతానిచ;
నవత్రింశద్యుతానీతి జ్ఞానోపాయోऽత్ర కథ్యతే.'

ఈసంఖ్యా పరిగణనము అభినవగుప్తుని మతమునకు సరిపోవుచున్నది. బికనీరు మహారాజుగారి లైబ్రరీలో 'సంగీతసార'మను పేరుగల వ్రాతప్రతి యొకటి యున్నది. అందు ౧౬౧ శ్లోకము లున్నవి. గ్రంథకర్త పేరు లేదు. ఔమాపతమున ౨౬౪ రాగములను జెప్పిన నందికేశ్వరుని మతమునే అది నిర్వహించుచున్నది. ఇది విద్యారణ్యకృత గ్రంథైకదేశమో లేక తత్సంగ్రహమో నిశ్చయింప నింకను పరిశీలింపవలసి యున్నది. ఇందలి కొన్ని విషయములు ౧౬, ౧౭ శతాబ్దములలో సంగీతకళ గాంచిన పరిణామమునుగూర్చినవిగ నున్నవి. విద్యా

గణ్యుల యితరగ్రంథములయందు సహజముగగల గొప్ప తనమునంగూను నిది కొంతవఱకు సూచుచున్నది.

---

## సింధుదేశ ప్రాచీన నగరములు - ౫౦౦౦ సంవత్సరములనాటి భారతీయుల నాగరికత.

(వెనుకటి సంచిక తరువాయి)

అడవిమృగములయస్థు లక్కడ పరిమితముగనే కన్పించినవి. ముద్రలపైన తెలుపు పులి, ఖడ్గమృగము, ఏనుగు—ఈమృగములచిత్రములే చిత్రింపబడియుండుట చేత ఇవియే అప్పుట అధికముగా నుండెడివని చెప్పనొప్పును. సింహము లున్నట్టు ఇంతవఱకైన సూచన లేదు.

కదుళ్ళనుండి నూలు తోడుకొనుట కుపయోగించు'పంటె' అను సాధనము మొదలయినవియు, సన్నని నూలుతో నేసిన ప్రత్తిబట్టల పీలికలును అక్కడ అపరిమితముగా గాన్పించినవి. ఇదివఱకు బేబిలోనియనులకు, గ్రీకులకు దొరకుచుండిన ప్రత్తి పెనచుకొనియున్న పింజెలుగల మంచి ప్రత్తి కాదేమోయన్న సంశయముండినది. ఇక్కడ దొరకిన బట్టలనూలునుబట్టి ఆసంశయము తీరినది.

పైజాతులకు చెందినపురుషులు ప్రాచీనసుమేరియను జాతులవలె రెండు బట్టలును ధరించెడువారు—మొలకు దోవతి లేక చడ్డి, పైనశాలువు. శాలువును వారు కుడిచేతిక్రిందనుండి ఎడమభుజము మీదుగా వలెవాటు వేసికొందురు. పురుషులకు దాడి, బుగ్గమీసములు ఉంచుకొందురు. కొందరు దాడిమాత్రము ఉంచుకొందురు. తలవెండ్రుకలను ముందునుండి సవరించి వెనుకవైపున ముడివైచి నాడాతో కట్టిపెట్టుదురు. అప్పుట దొరకిన యొక్కటే స్త్రీప్రతిమ తలవెండ్రుకలు విరియబోసికొన్నట్లున్నది. ఇట్లు వెండ్రుకలను విరియబోసికొనియుండుట యప్పటి స్త్రీల యాచారమగునో కాదో చెప్పజాలము.

నిమ్నజాతులలో పురుషులు బట్టలు కట్టుకొనునట్లు లేదు. స్త్రీలుమాత్రము నడుము చుట్టుపెట్టుకొందురు. అక్కడ దొరకిన సానిదాని చిన్నప్రతిమ బట్టలేకుండనే యున్నది.

ఆభరణముల నన్ని తరగతులవారును విస్తారముగ పెట్టుకొందురు. ఉంగరములను, హారములను స్త్రీపురుషు లుభయులును,కర్ణాభరణములను, గాజులను, ఒడ్డాణములను స్త్రీలుమాత్రమును ధరింతురు. ధనవంతుల ఆభరణములు వెండిబంగారములతోను, రాగిపై బంగరురేకులతాపడముతోను, ఎఱ్ఱరాళ్లు, దంతము, పింగాణము, చిత్రవర్ణములగు పెక్కురాళ్లు మొదలయినవాని చెక్కడముతోను చేయబడినవి. బీదవారు గుల్లలు మొదలయిన వానితో చేసిన నగలను పెట్టుకొందురు. అన్నిరకముల నగలును అప్పుట చాలా దొరకినవి. వానిలో ఒడ్డాణములు, రాగిపై బంగారుపూతపూసిచేసిన ఆభరణములు, అప్పటమైన బంగారపు కర్ణాభరణములు మొదలయినవి చాల అందమయినవి. ఇప్పటి బంగరుపనివాండ్రకు సైతము పేరుదేగలిగినంత ఉత్తమముగ నవి మెఱుగెక్కింపబడినవి.

వెండిబంగారములే కాక, అక్కడ రాగి, తగరము, సీసముకూడ దొరకెడివి. ఆయుధములు, పనిముట్లు, గృహోపకరణములు మొదలయినవి రాగితో చేసినవి. బాకులు, బల్లెములు, కత్తులు, చిన్నగొడ్డళ్ళు, కొడవళ్లు, ఉలులు, పాత్రలు, చిన్నచిన్న బొమ్మలు, నగలు, తాయెతులు, తీగలు మొదలయినవి చాలవఱకు లోహమును సాగగొట్టి చేయబడినవి. పోతపోసినవస్తువులుకూడ అక్కడ లేకపోలేదు. రాగి అక్కడ సులభముగా దొరకును. పడమట బెలూచిస్థానమునుండి, తూర్పున రాజపుటానమునుండి, ఉత్తరమున ఆఫ్ఘనుస్థానమునుండియు నది లభించెడిది. తగరము దొరకుట చాల కష్టము. ఆకొంచెముకూడ పంచిదిదొరకదు. రాగితో కలిసిన 'బ్రాంజి' అను మిశ్రలోహముగా దొరకెడిది. అది గట్టివాదరలుండవలసిన ఆయుధములకు, అనగా మంగలకత్తులు, ఉలులు, అంపములు మొదలయినవానికి, పాత్రలు, విగ్రహములు, గాజులు, బ్రూసలు, బొత్తములు, ఇతరాభరణములు మొదలయినవానికి ఉపయోగించును. ఈబ్రాంజిలోహమున నూటిలో ౭ మొదలు ౧౨ వంతు తగరము కలిసియుండుటచేత రాగికంటె నిది కడు శ్రేష్ఠమయినదయినను దీనితో చేసిన వస్తువులు చాల తక్కువగా అక్కడ

# మల్లయుద్ధము

[౧౯౨౮ వ సం. జనవరి ౨౯ న తేదినాడు పాటియాలాలో జరిగినది]



గామా నిమిషకాలములో జిబ్‌స్కోను ఓడగొట్టి అఖండవిజయమును గాంచెను

---

గామాసోదరులు



పాశ్చాత్య మల్లశిఖామణి యగు పోలాండుదేశీయుడు జిబ్‌స్కో

గామా    ఇమాంబక్షు





భారతీయుడగు 'నిఖిలప్రపంచ మల్లయుద్ధప్రవీణ' బిరుదాంకితుడు: గామా మల్లశిఖామణి

౧౯౧౦ వ సంవత్సరమున లండనునగరమున నీ గామాజిబ్‌స్కోలకు మల్లుపోరుజరిగెను. తొలునాడు మూడు గంటలు పోరినను గెలుపోటములు తెలియమి పోరాటము నానాటి కాపిరి. మరునాడు మరల ప్రారంభించు సమయమునకు జిబ్‌స్కో కనుమఱుగయ్యెను. అప్పుడు గామాకు నిఖిలప్రపంచమల్లవీరుని కొసగుదట్టి(Belt)ని ఇచ్చిరి. ఇప్పుడును గామాయే విజయమునొంది భూపాలు నవాబుగారిచేత విజయగడను బడసెను.



మురళీసమాహ్వానము

వర్ణ చిత్రమునుండి తీసిన ఛాయాచిత్ర మిది.

వర్ణచిత్రకారుడు: శ్రీ చామకూర సత్యనారాయణగారు, రాజమండ్రి.

# హిందూ మహమ్మదీయ వివాహము



అసఫ్ ఆలీ

మహమ్మదీయులు. ఢిల్లీలో బారిస్టరుగా నున్నారు.



గంగూలీకన్య

ఈమె నైనిటాల్ హిందువుడగు గంగూలీపండితునికి మాతురువాలి గలది.

ఈయిద్దఱును హిందూ మహమ్మదీయమతముల మర్యాదగలకుటుంబములకు చెందినవారు. వీరు సివిల్ వివాహ శాసనము ననుసరించి అచిరకాలమున పెండ్లాడనున్నారు.

దొరకినవి. ఇందుకుకారణము తగరము చాలినంత అక్కడ దొరకమియే.

హరప్ప, మొహెంజొదారోలలో యుద్ధాయుధములు చాల తక్కువగా దొరకుటచేతయుద్ధములు చేయ నలవాటు వారి కంతగా లేకుండెనేమో యనవలసివచ్చుచున్నది. దొరకినఆయుధములుచాలవరకు రాగివేయైననురాతితో చేసినకత్తులు, బల్లెపుకొవులుకూడసామాన్యముగాకొన్నిదొరకినవి కానశిలాయుగమప్పటికింకనుపూర్తిగానశింపలేదని తోచుచున్నది. 'చెర్టు' అను నొకరకపు గట్టిరాయి అక్కడ దొరకును. దానితో భారతదేశపు పరిమాణము ననుసరించి తూకపురాళ్లు చేయుదురు. సముద్రతీరములనుండి గుల్లలు, గవ్వలు, శంఖములు అధికముగ నీపట్టణములకు వచ్చెడివి. వానినుండి గాజులు, పూసలు మొదలయినవి చేయుదురు. ఇకను ఇవి కట్టుసామానులయందు చిత్రములను చిత్రించుట కుపయోగించెడివి. నీలి రంగు గలిగిన పింగాణముతో, నగలు చిన్నపూలకూజాలు (పైనపూవులు చిత్రింపబడినవి), తాయెతులు మొదలయిన వస్తువులు చేయబడియున్నవి. ఈపింగాణపుకొసురు ముద్రికలపైన పూతపూసి వానిని సరిదిద్దుటకును ఉపయోగించెడిది.

ఆనగరములవారు తమఇండ్లలో సాధారణముగా మట్టిపాత్రములనే ఉపయోగించెడివారు. వానియొక్క భిన్నభిన్నరూప పరిమాణములు వానిసక్రమాభివృద్ధిని సూచించుచున్నవి. వానిలో కొన్నిటికి పట్టుకొనుటకు వీలుగ చెవులున్నవి. పాత్రములన్నియు ఎఱ్ఱనిరంగుగలిగి సాదాగా నుండును. కాని వానిలో కొన్ని రంగుపూత గలిగినవికూడ ఉన్నవి.

ముదురుపారు ఎరుపురంగుగల తునుకలపై క్షేత్రగణిత నియమముల ననుసరించి వృక్షలతాదులవర్ణములనుబోలియుండుచిత్రములును, విరళముగ మృగచిత్రములును నీలిరంగుతో చిత్రింపబడెడివి. ఇట్టివి చాలఎక్కువగ ఉత్తరబెలూచిస్థానముననను, వజీరుస్థానపు సరిహద్దులను, చాల తక్కువగ సిస్టానులోను లభించినవి.

తెలుపు, ఎరుపు, నలుపు రంగులుకలిసిన వివిధవర్ణాలంకారచిత్రములు కొన్ని మొహెంజొదారోలో దొరకినవి ఇక్కడను, హరప్పవద్దను దొరకిన మట్టిపాత్రలు, ఆభరణములు ఎలాం, మెసపొటేమియా, బెలూచిస్థానములతో నీనగరములకుగల సంబంధమును విశదము చేయుచున్నవి. లేఖనములుగల ముద్రికలు, ఇండ్లపట్టుల దొరకిన యితర లేఖనయోగ్యములగు ఉపకరణములు నక్కడివారికి వ్రాతయందు పరిచయమున్నట్లు తెలుపుచున్నవి. దేనిపైన వ్రాసెడివారో చెప్ప సాధ్యముకాకున్నది. ముద్రికలు మంటివే. కొయ్యపలకలలో, చెట్టుపట్టలలో వ్రాయుటను ఉపయోగించి యుండవచ్చును.

ఇక్కడ దొరకిన ముద్రికలను (వేయింటికిపైగ గలవు) దారమున గ్రుచ్చి మెడకో, మణికట్టుకో తగిలించుకొనుచుండెడివారు. వానిని ఉత్తరములను, బంగీలను సీళ్ళుచేయుటకుగూడ నుపయోగించి యుండవచ్చును. వానిపైన జెక్కియున్న మృగములను దైవభావముతో పరిగణించి వానిని రక్షలుగగూడ నుపయోగించి యుండవచ్చును. వానిపైనున్న చిత్రరూపలేఖనముల నెడమనుండి కుడికి చదువవలసినట్టు కనిపించుచున్నది. అక్షరములయందు సుమేరియను అక్షరములపోలిక కొంత చూపట్టుచున్నది. ఉచ్చారణమున దానిని బోలియుండునని కాని, ఇక్కడిభాష అక్కడి భాషతో సంబంధము గలిగియుండునని కాని చెప్పుటకుతగిన నిదర్శనములు కాన్పింపవు.

అక్కడ చిత్రవిద్య ఇరుగుపొరుగుదేశములయందుకంటె చాల అభివృద్ధిలోనికి వచ్చియున్నది. ముద్రికలపైగల చిత్రములు మూపురములుగల ఎద్దులు, పొట్టికొమ్ములుగల పశువులు నుత్తమములు. రేఖాసారస్యము మొదలయిన విషయములయందు రత్నములపై ప్రదర్శించుచిత్రనైపుణ్యము లకంటె నుత్కృష్టమై నిరుపమానముగా నున్నవి.

పింగాణపు బొమ్మలు అనగా గొఱ్ఱెలు, కోతులు, కుక్కలు, ఉడుతలు మొదలయినవాని ఆకారములనిర్మాణము క్రీ. పూ. మూడునాలుగు సహస్రాబ్దములలోని వానికంటె చాల శ్రేష్ఠముగ నున్నది.

ఇక్కడ దొరకిన సామాన్యమగుకాయి, బంకమన్ను, లోహము మొదలయినవానితో చేసిన మనుష్యాకా

రముగల బొమ్మలు చాల మోటుగ నుండి అప్పటిచిత్ర శిల్పకారులకు మనుష్యరూపనిర్మాణమునందు చాలి నంత యభ్యాసము లేమిని సూచించుచున్నవి. సుమేరి యను మృగచిత్రములతో బోల్పదగిన దొక్కటయిన నిక్కడ దొరకినవానిలో గానరాదు.

ఈనగరముల యందలి శవముల నేమిచేయుచుం డిరో నిశ్చయముగ జెప్ప నలవి కాకున్నది. ఇక్కడ మానవాస్థిపంజరపుంజములు రెండు కాన్పించినవి. ఒకటి వీథిలో నుండినది; ఇంకొకటి ఇంటిలో నుండినది. ఇన్ని పంజరము లొక్కచో నుండుటకు మారివలననో, యుద్ధమువలననో సంభవించిన సంఘాతమరణము కారణ మై యుండవచ్చును. మృతునియొక్క అస్థిపంజరమున కొంతభాగము ఆతనికి సంబంధించిన కొన్ని మృత్పాత్రము లతోగూడ భూస్థాపితము చేసినట్లొక్కచోటమాత్రము నిదర్శనము దొరకినది. ఈమృతకళేబరమును పైవిధమున పూడ్చిపెట్టుటకుపూర్వముశారీరకపరిశోధనమునకుపయో గించిరో (ఇదియసంభవము), లేక, కొంతకాలముపూడ్చి పెట్టియుండిరో తెలియు టసాధ్యము. ఇట్టిపద్ధతి యీ నగరముల యాచార మగునో కాదో నిశ్చయింపరాకు న్నది.

హారప్పవద్ద కాన్పించిన హిందూసమాధినిబోలిన ఇటుకరాతికట్టడములు, సగము కాలిన ఎముకలు, బూడి దతోనిండిన ఒకయొత్తయినతిన్నె—ఇవి యచ్చట శవము లను దహనముచేయు నాచారము సైతముగలదనుటనునిరూ పించుచున్నవి. ఈరెండు నగరములయందును చిన్నచి న్నపాత్రలతో కొన్నిట అస్థులు బూడిదతోనుగూడ నింపిన ఒకవిధమైన రాతిజాడీలు దొరకినవి. ఇట్టివాడుక కూడ అక్కడనుండి యుండవచ్చును. (సశేషము)

---

## కీ. శే. థామస్ హార్డీ గారు

ఇతడు ప్రఖ్యాతాంగ్ల నవలాకారుడు; సుగుణా న్వితుడు; సుకవులలో నగ్రగణ్యుడు. ఇంగ్లాండులో డార్సెటుషైరునందితడు 1840సం|| జూన్ 2 వ తేదీనాడు జన్మించెను. చిన్నతనమునందు గ్రామపాఠశాలలో చదు వుకొని, పిమ్మట కొన్నాళ్లుశిల్పవిద్యనభ్యసించి, 1865లో సారస్వతప్రపంచమున గ్రంథరచనాప్రయత్నములనారం భించెను. 1874 లో 'ఫార్ ఫ్రమ్ ది మేడింగుక్రౌడు' అను నవలారచనతో నీతని పేరు బైటికి వచ్చెను. ఇతని గ్రంథము లన్నిం టిలో మిక్కిలి పేరుగ న్న నవల 'టెస్ ఆఫ్ డర్బర్ విల్లీ' యనునది. ఇతడు పద్యరచనయం దును మిగుల పేరు గాంచెను. 1908 లో నితడుపూర్తిగావించిన 'డైనాస్టస్' అను పద్యనాటకమునప్రధా నవ్యక్తి నెపోలియన్. ఈకవిసామర్థ్యమునకు మెచ్చి 1910లోనితనికి 'ఆర్డర్ ఆఫ్ మెరిట్' బిరుద మొసగబడినది. ఇతడుసర్వమున కదృష్టమేకారణమనువాడు. సర్వమునుపూర్వనిర్ణీతమను వాడు. స్త్రీలతత్త్వముగూర్చియు, ప్రకృతిసౌందర్యమును గూర్చియు, గ్రామజీవితమునుగూర్చియువర్ణించుటయందు సాటిలేనివాడు. ఇతడు1928 జనవరి నెల 11 వ తేదీనాడు తన 87 వయేట కీర్తిశేషుడయ్యెను. ఇతని శవవాహకులలో రుడ్యార్డు కిప్లింగు, సర్ జేమ్సు బారీ, బెర్నార్డుషా, గాల్సువర్దీ, సర్ ఎడ్మండు గాసి గార్లవంటి సుప్రసిద్ధ భాషావిశారదు లుండిరి.



కీ. శే. థామస్ హార్డీ.

---

## నాభామహారాజు

వీరు నాభాను వెడలి నప్పటి నుండియు రాజ విద్రోహ కార్యముల యందు తఱచు పాలుగొనుచుండి రన్నమిషపై వీరి మహారాజాపట్టమును, తత్సంబంధమైన ఎల్ల యధికారములను బ్రిటిషుప్రభుత్వమువారు తొలగించి నారు. వీరి కిదివఱకుప్రతినెలలో ఇచ్చుచుండిన భరణము ఇరువదియైదువేల రూపాయలను పదివేలకు తగ్గించినారు. మఱియు వీరు చెన్నరాష్ట్రమునందలి కొడైకెనాలులో

నివాసము చేయవలసినట్లు ఉత్తరువుచేసి, అక్కడకుతీసి నున్నారు. వీరిపుత్రులు శ్రీతిక్కా సాహేబుగారినిబైవల కొనివచ్చి విడిచినారు. ఇపుడక్కడ వీరు ప్రవాసమున ప్రభుత్వమువారు మహారాజును జేసినారు.

బ్రహ్మదేశము



మహారాజ్ఞి—రాణి



మహారాజు

## ఘటం సుందరం అయ్యరు



ఇది మద్రాసు కాంగ్రెసుదినములలో తీసిన ఒక ఛాయాచిత్రము. ఘటం సుందరం అయ్యరుగారు (ఉమాయల్ పురము) ఘటవాద్యమున ఉద్దండులని యెల్ల రెఱిగిన విషయమే. ఒకమట్టిపాత్ర—కుండ— మీద వీరు వాయించి తమకును, తమచేతికుండకునుగూడ పూజ్యస్థానమును సంపాదించినవారు. వారి ఆపూజ్యచిత్రమేయిది!

---

## కొల్లాపురమున దొరకిన క్రొత్తనాణెములు

డాక్టరు కే. యన్. సీతారాముగారికి ౧౫౦ అపూర్వములగు క్షత్రపులనాణెములు కొల్లాపురమున దొరకినవి. ఇవి రుద్రదమునుని, అతనికుమారుని, మనుమని సూచించుచున్నవి. వీరు పశ్చిమక్షాత్రపులుగా చూపట్టుచున్నారు. వీరు కతియవాడును పాలించినవా రగుదురు. నాణెములు కొల్లాపురమున దొరకుటవలన వీరి రాజ్యము కొల్లాపురమువఱకు వ్యాపించినదన వచ్చును. నాణెము ముఖమున రాజుయొక్క చిత్రమో, విగ్రహమో యుండును. క్రింద గ్రీకుభాషను అతని పే రుండును.







వెనుకవైపున స్తూపమో, లేక ఏదేని బౌద్ధచిహ్నమో ఉండును. క్రింద ఆకాలపు బ్రాహ్మిలిపిని లేఖన ముండును.

[26-2-28 టైమ్సు ఆఫు ఇండియా]

---

## ఆంధ్ర దేశ చరిత్ర పరిశోధనము

రెవరెండు ఫాదరు హీరాసుగారికి తెలుగుదేశచరిత్ర పరిశోధన గావించుటకై శ్రీయుతులు విఠోబా కే. పుపాలాగారు (బొంబాయి పురవాసులు) రు. 300 ఇచ్చి, మఱియు నొక సంవత్సరమువఱకు నెలకు రు. 30 వంతున ఇచ్చుటకు వాగ్దానము చేసినట్లు తెలుగుసమా

చార (బొంబాయి)పత్రిక ప్రకటించి సంతసమును గలిగించినది. ఆంధ్రదేశముతో సంబంధము లేకున్నను బొంబాయి పురవాసులు ఆంధ్ర దేశచరిత్ర పరిశోధనమునకు ధనసహాయము చేయుటయు, ఫాదరు హీరాసుగారు పరిశోధన సలిపి చరిత్ర వ్రాయుటయు నాంధ్రులకు సంతోషావహము. ఈవిధమున ఆంధ్ర దేశమునందలి చరిత్ర పరిశోధకులకు తగినంత ప్రోత్సాహ మాంధ్ర దేశమున లభింపకుండుట విచారకరము. చాలకాలమునుండియు ఫాదరుహీరాసుగారు మన దేశచరిత్రమునకై కావించుచున్న యుపకార మెంతయు కొనియాడదగినది. వారిపరిశోధనఫలితము లిటీవలనే 'ఆరవీడువంశము' అనుపేర గ్రంథరూపమును దాల్చినవి.

మన దేశమున కీ. శే. శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు, వయోవృద్ధులగు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు చరిత్రపరిశోధనమునకు మార్గదర్శకులై యాంధ్రులకృతజ్ఞకు పాత్రులైరి. వారు వ్యయప్రయాసములకోర్చి కావించినపరిశోధనలఫలితములే యిపు డాంధ్రులు 'మనచరిత్ర'యనుకొనితృప్తిచెందియుండునది. తరువాత చరిత్ర రచనా ప్రయత్నములు బాగుగా నసలు సాగక మొక్కవాటై యుండుట ఆంధ్రులకు తమ చరిత్రపట్ల గల యభిమానాతిశయమును చెప్పక చెప్పుచున్నది! ప్రత్యేకాంధ్ర రాష్ట్రముకొఱకు వేయి చేతులతో పోరాడుచున్న యాంధ్రులు తమకు ప్రాభవమునుగూర్చు తమ దేశముయొక్కయు, తమపూర్వులయొక్కయు నుత్కృష్టచరిత్రనామూలాగ్రము తెలిసికొనుట విధి యగును గదా!

వయోవృద్ధు లయ్యును అనలీలగ చరిత్రనిర్మాణము నింకనుసాగింపగల శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారితో పాటు ఇప్పుడును మన దేశమున, ఉత్సాహముతో, పట్టుదలతో ప్రాచీనశాసనాదుల పరిశోధించి చరిత్రమును సమగ్రముగ సమకూర్పగల సమర్థులు శ్రీయుతులు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు మొదలయినవారు కొంద ఱున్నారు. చరిత్రపరిశోధన మపరిమిత ధన వ్యయ మూలకము గాన వారికి ధనసహాయ మత్యావశ్యకము. శ్రీమంతులు, నుదారులు నగునాంధ్రులు దీనిని గుర్తెఱిగి తమ యౌదార్యమును గొంత తమపూర్వులచరిత్ర వంకకు ద్రిప్పి పరిశోధకుల కావశ్యకమయిన ప్రోత్సాహము నొసంగి మూలమూలల మఱుగుపడియున్న దేశచరిత్రమును వెలువరించి తమ ప్రత్యేకజాతీయతను లోకమునకు జాటుదురు గాక.

---

వార్విక్ షైర్‌లో దొరకిన

త్రినేత్ర మహామృగము

౧౦౦,౦౦౦,౦౦౦ యేండ్ల పూర్వపుదట

[11 ఫిబ్రవరి, ౧౯౩౮ స్ఫియరునుండి]

దిఇ ఇంగ్లాండు దేశములో వార్విక్ షైరు రెడ్ ట్రై యాంగిల్ రాళ్లగనులలో త్రవ్వుచుండ బయల్పడినది. చిత్రపటమున నామహామృగముయొక్క సంపూర్ణమైన యస్థిపంజర మున్నది. సుమారు ౭౧ యేండ్లక్రితముకూడ

నింకొకచోట నిట్టిపంజరములే కనుగొనబడెను. ఈచిత్రములో నున్న మృగముయొక్క అస్థిపంజరమున ప్రక్కయెముకలును, కర, పాదముల యెముకలును పోయినవి. వెన్నెముకసంబంధమైన యన్నియెముకలు మాత్రము సంపూర్ణముగా నున్నవి. వెన్నెముకపొడవు ౧౬ అడుగులు.



ఇది యాకారమున బల్లి లేక యూసరవెల్లివలె నుండును. నడుమను తాబేలువలెనుండి యిటునటు పెద్దసర్పమువలె నుండుటయు గలదు. ఇది పొడవైన గట్టిమెడ గలది. దీనితల చిన్నది. గట్టిగా సూదిగా నున్న దంతములు దీనికి గలవు. తిన్నని చేపతొక్కవలె నుండు చిన్నతోకయుండును. శరీరమున కిరుప్రక్కల నొక్కొక్కజలతెడ్లవంటి యవయవములు గలవు. వీటితో నిది నీటిలో నీదగల్గెడిది. ఇట్టి జంతువులు లోతులేని నీటిలో నుండెడివి. కడుపునకు రాళ్లు మొదలగువాని దెబ్బలు తగులకుండుటకు వీనికి కొన్ని యెక్కువ ప్రక్కయెముకలు గలవు. దీని మూడవకన్ను నడునెత్తిపై నుండును. సాధారణముగా నీజంతువులలో నధిక సంఖ్యకు ఈమూడవకన్ను మిగుల పెద్దదిగా నుండును. కొన్ని యస్థిపంజరములలో కడుపుండుచోట కొన్ని రాళ్లుకనుగొనబడినవి. అవి దీని యాహార మరుగుట కుపయోగపడునవందురు.

---




## దక్షిణాఫ్రికా

ఈపుస్తకము శ్రీయుత దిగవల్లి వెంకటశివరావు గారిచేరచియింపబడి విజ్ఞానచంద్రికా గ్రంథమండలివారిచే ప్రకటింపబడినది. క్రౌనుసైజున 214 పుటలు గలిగి చక్కని కాలికో బైండుతో నలరారుచున్నది. విజ్ఞానచంద్రికా గ్రంథమండలి కార్యనిర్వాహకులు, సువిఖ్యాతులు నగు అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు పీఠిక వ్రాసినారు. గ్రంథము వెల రు 2-0-0. బారిష్టరుగను, దక్షిణాఫ్రికా భారతీయనాయకుడుగను, గాంధిమహాత్ముని చిత్రములు రెండు గ్రంథము నలంకరించుచున్నవి.

ఈగ్రంథము వలసబోయిన భారతీయులనుగూర్చి తెలియజేయుశాస్త్రము లెవ్వియు నాంధ్రభాషయందు లేని లోపమును గొంతవరకును దీర్చినదని చెప్పవచ్చును. గ్రంథకర్తగారు ఎల్లరకు దెలియునట్లు సులభమగు శైలిలో వ్రాసినందులకు అభినందనీయులు. ఇట్టి గ్రంథముల యొక్క శైలి యెంతసుబోధముగ నుండిన నంతమంచిది.

పీఠికలో పంతులుగారు వ్రాసినట్లు, దక్షిణాఫ్రికాచరిత్రలో భారతీయులకు ముఖ్యమగు స్థానముకలదు. అందుచే భారతీయుడగు వానికి దక్షిణాఫ్రికానుగురించియు, నచటవలసబోయియున్న తన సోదరభారతీయుల యవస్థను గురించియు దెలిసికొనవలసిన యావశ్యకతయు, విధియుగూడ గలవు. ఆంధ్రమహాజను లీయంశమును బాగుగ గుర్తించి యీగ్రంథమున కర్హమగు నాదరము నొసంగుదురుగాక.

భారతీయప్రజలు—ముఖ్యముగ రాజకీయనాయకులు- ఏమరక నిరంతర శ్రద్ధతో గనిపెట్టు చుండవలసిన ముఖ్యసమస్యలలో నీదక్షిణాఫ్రికా సమస్యయొకటి. ఎడతెగక వినవచ్చుచుండెడి వలసబోయిన మన సోదరుల దైన్యవార్తలను తీరుమానముల తీవ్రతతో మాత్రమే యెదుర్కొనవలసి వచ్చుచున్నది. కార్యరూపమున మనము వారి కెట్టిసాయమును జేయజాలకున్నాము. బ్రిటిషు ప్రభుత్వము వారు మన సంరక్షకత్వ భారమును వీడరు. మనకు సంపూర్ణమగు సంరక్షణము నొసంగనుజాలరు. "అయ్యా; మా దేశపు ప్రభుత్వభారమును మాకు వదలివేయుడు. కష్టమో సుఖమో మేమే యనుభవించెదము." అని మనమన్నప్పుడు "మీకింకను మైనారిటీ తీరలేదు. పసివాండ్రగు మిమ్ములను గేవల కష్టమయమగు నీప్రపంచమున నిస్సహాయులుగ వదలివైచి భగవద్ద్రోహమున కొడిగట్టజాలము" అని వారుసమాధానమిడుదురు. "మా పోషణభారమంతయు మీదికదా! మీసామ్రాజ్యములోనే మాపై నిట్టి దౌర్జన్యము జరుపబడుచుండ చూచుచు నూరకుండుట మీకు న్యాయమా?" అని యేమితవాదియో యడిగినప్పుడు, "మేము చేయగలదేమున్నది? మీరును జూచుచునే యున్నారుకదా! మాసామంతరాజ్యములలోనే యైనను ఆంతరంగిక వ్యవహారములలో బ్రవేశించుటకు మా కధికారము లేదు" అని తత్క్షణమే జవాబు విసరివైతురు.

బ్రిటిషుప్రభుత్వమువారును, బర్కినుహెడుప్రభువుగారును భారతదేశములోని 6 కోట్లమంది నిమ్నజాతుల ప్రజలకు సంరక్షకత వహించి పుణ్యము గట్టుకొనుచున్నామని డంబములబలుకుచున్నారు. దక్షిణాఫ్రికా,తూర్పుఆఫ్రికామున్నగుదేశములలోని భారతీయుల కష్టముల

దీర్ఘపట్ల నీ సంరక్షకభావ మంతరించును. వారి యున్న తాదర్శము లన్నియు నేమూలలనో యదృశ్యములగును. అప్పటి భారతీయుల యవస్థ భారతదేశమందలి యస్పృశ్యులయవస్థ కేమాత్రము దీసిపోవలేదన్న నంపతిశయోక్తి లేదు. ఈయంశముఆంగ్లప్రభుత్వమువారికి దెలియనిదియు గాదు. ఆంగ్ల ప్రభుత్వము వారు భారతీయుల యభివృద్ధికెన్నడును భారతదేశమునగాని, యన్యదేశములయందుగాని తోడ్పడరు. ముందుగ భారతీయులు స్వదేశమున సంపూర్ణ స్వపరిపాలనమును బడసిననే యిట్టి యవమానముల నుండి తొలగగలుగుదురు. ఇంగ్లండుతోగాని, బ్రిటిషు సామ్రాజ్యమందలి యితరసామంతరాజ్యములతోగాని సమానమగు నధికారమును బొందవలయునన్న మనము బ్రిటిషుసామ్రాజ్యమునుండి తొలగిపోవలసియే యుండునుగాని, సామ్రాజ్యాంతర్గత స్వ పరిపాలన మనునది యూహింపరాని విషయమని పండితజవహర్లాలునెహ్రూగారు నుడివినదానిలో నెంతయో సత్య మున్నది.

దీనికి కారణములు రెండు:(1) తెల్లవానికి విరుద్ధముగ నల్లవానికి, న్యాయమే యైనను, సాయము జేయరాదు. ఇది నేడు సామాన్యముగ బ్రపంచమునందలి తెల్లజాతులన్నియు-బ్రిటిషువారితో సహా-నల్లజాతులవారి యెడ నవలంబించుచున్న సామాన్య సిద్ధాంతము. (2) ప్రస్తుతక్లిష్ట పరిస్థితులలో ఎప్పటికప్పుడే సామ్రాజ్యమునుండి లేచి పోయెదమని బెదరించుచున్న దక్షిణాఫ్రికాతోగాని, యితర సామంతరాజ్యములతో గాని, భారతీయుల విషయమున నొత్తిడి గలుగజేసి, విరోధము దెచ్చిపెట్టుకొనుటకు బ్రిటిషుప్రభుత్వమువారు సాహసింపరు. కాబట్టియే నిరంతరమగు నెనిమిదేండ్ల పోరాటమునకు ప్రతిఫలముగ సమకూడిన గాంధిస్మట్సు ఒడంబడికను దక్షిణాఫ్రికా ప్రభుత్వమువారు ఎన్నిసారులు మూలకు ద్రోసినను హిందూదేశములోని యాంగ్లప్రభుత్వమువారుకాని, బ్రిటిషుపార్లమెంటువారుకాని దక్షిణాఫ్రికాప్రభుత్వమును మందలించుటకు వెనుకాడిరి. తుదకు 1924 సం॥మునను, తరువాత దక్షిణాఫ్రికాప్రభుత్వమువారు తమదేశమున భారతీయులను నివసించుటకవకాశము లేకుండజేసి వారిని సంపూర్ణముగ వెడలనడుపునుద్దేశముతో నివేశనముల చట్టము(Class Areas Bill), గనులశాసనము(Mines and Works Act),ఆసియాచట్టము (Asiatic Bill) మొదలగు భారతీయుల జీవనమునకే భంగము గలుగజేయునట్టి చట్టములను నిర్మింప నిశ్చయించుకొన్నప్పుడు, భారతీయులు తమ కప్పుడు చేసిన యుపకారముల నన్నిటిని ద్రోసిపుచ్చి ద్రోహమునకు బాల్పడినప్పుడు, ఇచటి భారతీయుల నిరంతరాందోళనమునకు లొంగి యెట్లో బ్రిటిషు ప్రభుత్వమువారు దక్షిణాఫ్రికాప్రభుత్వమువారితో రాయబారము లొనరించి రౌండుటేబిలు సమావేశమును ఏర్పాటు చేసినారు. ఏదియో యొక రాజీనామా కుదిరినది. దీనికే దక్షిణాఫ్రికా యొడంబడికయని యీనడుమ ప్రసిద్ధివచ్చినది. చాల బాగున్నదని బ్రిటిషుప్రభుత్వ వారు గొంతెత్తి చాటినారు. ప్రస్తుతపరిస్థితులలో నీరాజీనామాకు మనము సంతసింపవలసినదేయని మనరాజ్యాంగవేత్త లభిప్రాయపడినారు. గాంధిమహాత్ముడుగూడ నంతసంతృప్తికరము కాకున్నను, దీనిలో మనము సంతోషము ప్రకటింపవలసినది లేశ మేమియు లేకున్నను, దీని నంగీకరింపదగునని చెప్పినాడు. రాజీనామాషరతుల ననుసరించి, గాంధిమహాత్ముని సూచనతో నేకీభవించుచు బ్రిటిషుప్రభుత్వమువారు శ్రీనివాసశాస్త్రిగారిని తమ యేజంటుగ దక్షిణాఫ్రికాకు బంపినారు.

ఐన నీయొడంబడిక భారతీయుల కెంతవరకనుకూలముగ నుండునన్న సంశయము బాధించుచునే యున్నది. గ్రంథకర్తగారు "ఇది యిట్లుండగ నిజముగ దక్షిణాఫ్రికా హృదయము మారలేదని యనుమానము కలుగుచున్నది." అని వ్రాసినారు. ఈయనుమానమున కాధారము ఒడంబడికలోనే కలదు. ఈయొడంబడికలో మొదటిషరతే యిట్లున్నది: "న్యాయముగ, ధర్మముగ, పాశ్చాత్యజీవితపద్ధతిని కాపాడుకొనుటకు దక్షిణాఫ్రికావారికి హక్కుకలదని యుభయప్రభుత్వములు నంగీకరించుచున్నవి." పాశ్చాత్యజీవితపద్ధతి(Western standard of Life)అననేమి? దానికిని ఈయొడంబడికకుగల సంబంధమెట్టిది? అను నంశము మాత్ర మెచ్చటను నిర్ణయింపబడలేదు. ఈ షరతు భా

రతదేశమున వైస్రాయిగారి నీటో సర్టిఫికేషన్ అధికార ములవలెనే మిసుల ననర్థదాయకముగ బరిణమింపనచ్చును. ఈయభిప్రాయమును బలపరచుటకు నేటివరకు భారతీయులకు బ్రతికూలములగు ప్రబలాభిప్రాయములు దక్షిణాఫ్రికానుండి ప్రతిధ్వనించుచునే యున్నవి. తూర్పు ఆఫ్రికాలోని భారతీయుల యవస్థనుగూర్చి యీనడుమ మరల వెలువడిన యాందోళనము దక్షిణాఫ్రికా విషయమున భారతీయులకుగల భీతిని మరింత వృద్ధిబొందించుచున్నది. సాధారణముగ తెల్లవారికి నల్లవారి యెడ గల "విశ్వమానవభ్రాతృత్వ" భావము దీనినిబట్టి విస్పష్టమగుచునేయున్నది. "గాంధిస్మట్సు ఒడంబడికయొక్క గతియే దీనికిని గలుగునేమోయని భారతీయుల కనుమానము కలుగుచున్నది." అని దక్షిణాఫ్రికాలోని పాశ్చాత్యప్రముఖుల యభిప్రాయమునుబట్టి గ్రంథకర్తగారు సూచించినారు. ఇట్టి పరిస్థితులలో నీయనుమానమున కెంతే నవకాశము కలదు. ఈయనుమానము యథార్థమేయై యొడంబడిక యుల్లంఘింపబడినను అం దాశ్చర్యమందవలసినదేమియు లేదు. దక్షిణాఫ్రికా ప్రభుత్వముయొక్కయు, బ్రిటిషుప్రభుత్వము యొక్కయు బూర్వచరిత్రలు దీనికి సాక్ష్య మొసంగుచునే యున్నవి. ఇంక శ్రీనివాస శాస్త్రిగారివంటి ప్రముఖుడగు భారతీయ రాజ్యాంగవేత్త మన యేజంటుగ నచ్చట నున్నాడు గదాయన్న తలంపుతోడనే మనము తృప్తినంది యుండవలయును.

ఇట్టితరి గ్రంథకర్తగారు అనేకములగు పుస్తకములు, మాసపత్రికలు, వార్తాపత్రికలు మున్నగువాని సాయమున నత్యంతోపయోగకరముగ నీగ్రంథము రచియించి యాంధ్రమహాజనుల కృతజ్ఞతకు బాత్రులైనారు. ఇందు దక్షిణాఫ్రికాలోని యాదిమవాసులను గురించియు, పాశ్చాత్యుల యాక్రమణమును గురించియు, నటుపై భారతీయులచటి కాకర్షింపబడిన విధము, బోయరుయుద్ధము, జగద్విఖ్యాతమగు గాంధిమహాత్ముని సత్యాగ్రహోద్యమము, గాంధిస్మట్సు ఒడంబడిక, దక్షిణాఫ్రికాప్రభుత్వమువారి దౌర్జన్యము, దక్షిణాఫ్రికా యొడంబడిక, మున్నగువాని గూర్చియు 1927 వ సంవత్సరాంతమువరకుగల దక్షిణాఫ్రికా చరిత్రమును తేటతెల్లములగు మాటలతో గ్రంథకర్తగారు వర్ణించినారు. తుదను తూర్పుఆఫ్రికాలోని భారతీయులనుగురించియు నొక ప్రకరణమును వ్రాయుట చాల సమంజసముగ నున్నది.

దీనిని బ్రకటించిన విజ్ఞానచంద్రికాగ్రంథమండలి యాంధ్రదేశమునకు సుపరిచితమే. ఆంధ్రచరిత్ర విజ్ఞాతలలో నగ్రేసరులగు కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారిచే స్థాపింపబడి యనేకగ్రంథముల బ్రకటించియు, తన పక్షమున నేటేట నాంధ్రభాషా పరీక్షల జరిపియు, నీగ్రంథమండలి యాంధ్రలోకమున కమూల్యమగు సేవ నొనరించి యున్నది. కేవల తాత్కాలికోపయోగకరములగు నవలలను, కథలను ప్రకటించుటకాక చారిత్రకములు, శాస్త్రవిషయికములు నగు గ్రంథముల నాంధ్రప్రపంచమున కర్పించుటయే యీగ్రంథమండలి ప్రధానాశయమై యుండెను. ప్రస్తుతకార్యనిర్వాహకులగు కాశీశ్వరరావు పంతులుగారు కూడ నీయాశయమున కధికముగ జేయూతనొసంగుచున్నందుల కభినందనీయులు. మొదటినుండి నేటివరకు గ్రంథమండలి పక్షమున బ్రకటింపబడిన పుస్తకములే దీనికి నిదర్శనము. ఇతర దేశములందును, భారతదేశమందును స్వార్థపరులగువారిచే భారతీయులకు ప్రతికూలముగ గావింపబడుచున్న యసత్యప్రచారమును ఖండించుటకు దగు గ్రంథములు చాలగ వెలువడవలసిన యావశ్యకత కలదు. "మీరు కేవల మజ్ఞులు. మాపూలముననే మీరింతవరకు బాగుపడినారు." అని నిరంతరముగ ప్రభుత్వపాఠశాలలలో భారతీయవిద్యార్థుల కొసంగబడు విషమయములగు దురుపదేశముల నణగద్రొక్కవలయునన్న దేశభాష లన్నిటిలోను పురాతనాధునాతనభారతీయ చరిత్రమును ఉన్నదున్నట్లుగ దెలియజేయు గ్రంథములు చాలగ బ్రచారములోనికి రావలయును. విజ్ఞానచంద్రికాగ్రంథమండలి కాశీశ్వరరావుపంతులుగారి యాధిపత్యమున నిట్టి పుస్తకముల ననేకములుగ వెలువరించి దేశాభ్యుదయమునకు దోడ్పడుగాక. ఆంధ్రమహాజను లీయావశ్యకతను బాగుగ గుర్తించి యర్హమగు నాదార్యము జూపి విజ్ఞానచంద్రికా గ్రంథమండలికి సర్వవిధముల దోడ్పడుట వారి విధి యని సవినయముగ మనవిజేయుచున్నాను.

ప్రతివాది భయంకరం రంగాచార్యులుగారు.

## ఆంధ్రవచనభారతము

### సభాపర్వము (మొదటిభాగము)

శ్రీకలువె వీరరాజు ప్రణీతము; ౧౭ వ శతాబ్దపువచనగ్రంథము. ఏతద్గ్రంథప్రకాశకులగు శ్రీవెంకటేశం పంతులవారికీకవి రచించిన సభాపర్వము,భీష్మపర్వము మాత్రమే తాళపత్ర లిఖితములు లభించినవట. ఇందలి గద్యశైలి యతిమధురముగ ప్రవహించుచున్నది. దీనిని టెక్స్టుబుక్కు కమిటీవా రామోదించియున్నారు.

క్రౌనుసైజు ౭౨ పుటలు. వెల ౮ అ. మూడవ ముద్రణము. రాజమహేంద్రవరము గవర్నమెంటు ఆర్ట్సు కళాశాలలో ఆంగ్లవాఙ్మయ ప్రధానబోధకులగు ఎన్.కే వెంకటేశం పంతులుగారిచే ప్రచురింపబడినది. సోల్ ఏజెంట్సు: మెస్సర్సు రామా అండు కో., బుక్ సెల్లర్సు అండ్ పబ్లిషర్సు, ఏలూరు, పశ్చిమగోదావరి.

## సీతారామరాజు మరణకారణము

దండోరా: అనుబంధము ౧. క్రౌనుసైజు ౨౭ పుటలు. గ్రంథకర్త: ఖండవల్లి రాజారావుగారు. మేనేజరు దండోరాకచేరీ, రాజమహేంద్రవరము. వెల౮ అ.

ఇదియొక చిన్న నాటిక. శ్రీరామరాజు మరణమునుగూర్చి ప్రభుత్వమువారు గావించిన ప్రకటనమును విమర్శించుచు వచ్చిన యద్ధుప్రశ్నలకు ప్రభుత్వమువారు సరియగు సమాధాన మీయమిచే ప్రకటనము అసత్యభూయిష్ఠమనియు, శ్రీరామరాజు బ్రదికి యున్నాడనియు ననేకు లనేకాధారములపై నభిప్రాయ పడుచున్నారు. ‘శ్రీరామరాజు పట్టుపడినాడు. పారిపో బ్రయత్నింపగా నతనిని చంపివైచితిమి’ అని ప్రభుత్వము ప్రకటించిన వాక్యములు పరస్పరసంబంధముతో లేవనియు, ప్రభుత్వమువారు కాదన్నను, ఆనడుమ నేదియో లోపించి నదనియు నభిప్రాయపడి, ‘ఆలోపించినసంగతి యేమా యని’ యూహించి తమకు ‘తట్టిన’ట్లు గ్రంథకర్తగారు తెలియజేసినారు. ఇందు ప్రస్తావనగాక అయిదేరంగము లున్నవి. ఇందు గ్రంథకర్తగారు చదువరుల హృదయముల నాటునట్లు తమయూహను ప్రకటించిరి. తమయూహకుగల యాధారములనుగూడ వీరు నాటకమున వ్యక్తపఱచియే యున్నారు. ఇది కేవలము రాజకీయప్రయోజనముగల నాటిక. నాయికానాయకాదులతో దీనికి ప్రసక్తిలేదు. కాని, శ్రీరామరాజు మరణవిషయమున ననుమానములు గలవారికిని, లేనివారికినిగూడ నిది యింపుగనే యుండును. ఇట్లు నిర్భయముగ విషమరాజకీయసమస్యలగూర్చి సారస్వతమును ప్రకటింపబూనుకొన్న దండోరాకచ్చేరీ ప్రశంసనీయమైనది. గ్రంథకర్తల విషయము వేఱ చెప్పనేల?

## ఈ దిగువ గ్రంథములు మాకు చేరినవి:

### తెలుగు

#### వినాయకసావర్కారుజీవితము

క్రౌను ౧౯౬ పుటలు. గ్రంథకర్త: ముదిగంటి జగ్గన్నశాస్త్రిగారు, రాజమండ్రి. వెల రు ౧.

#### మునిమాపు

గ్రంథకర్త: సహదేవ సూర్యప్రకాశరావుగారు, రాజమహేంద్రవరము. డెమ్మీసైజున ఫెదరువెయిటు కాగితములపైముద్రితము. పుటలపై నంకెలు లేవు. రు ౧.

#### నవకుసుమాంజలి

డెమ్మీసైజు ౧౭౬ పుటలు. గ్రంథకర్త: జనమంచి వేంకటరామయ్యగారు, రాజమండ్రి. వెల రు ౧-౮-౧.

ఇం దిరువది కంటె నెక్కువగ ఖండకావ్యము లున్నవి.

#### విశ్వకర్మయును, ఆయన సంతతియును

డెమ్మీసైజు ౧౨౧ పుటలు. ఇది ఆల్ఫ్రెడ్ ఎడ్వర్డ్ రాబర్ట్సు దొరవారి యింగ్లీషు గ్రంథమునకు తెలుగుసేత. సంపాదకులు: భవశేశ్వరపు సోమలింగాచార్యులుగారు, ఇన్నీసుపేట, రాజమండ్రి. దీనివెల తెలియదు.

### అనుభవవేదాంతసారసంగ్రహము

క్రౌను ౩౨ పుటలు. వెల తెలియదు. ప్రకాశకులు: శ్రీకృష్ణవిలాస్, తెనాలి.

### కౌసల్య (పురాణకథ)

క్రౌనుసైజు ౯౧ పుటలు. గ్రంథకర్త: చెలికాని సూర్యారావు. శ్రీరామవిలాసముద్రాక్షరశాల, చిత్రాడ, పిఠాపురముపోస్టు. వెల రు ౦-౧౧-౦.

### స్త్రీపురుషరహస్యములు

ఫూల్స్కేపుసైజు ౬౧ పుటలు. గ్రంథకర్త: ఆర్. కె. తోలేటి. డి ప్రివెన్షను సొసైటీ, విశాఖపట్టణము. రు ౧-౮-౦.

### రాఘవశతకం

డెమ్మీసైజు ౧౭ పుటలు. గ్రంథకర్త: 'మురింగంటి వెంకటనరసింహాచార్యులు'గారు. సీతారామాముద్రాక్షరశాల, నర్సాపురమున ముద్రితము. రు ౦-౨-౦.

### భక్తరత్నామణి

క్రౌనుసైజు ౫౨ పుటలు. గ్రంథకర్త: వాసిరెడ్డి నాగేశ్వరరావుగారు. ప్రకాశకులు: సుందరరామ్‌కంపెని, బెజవాడ. రు ౧-౫-౦.

### వీరగాంధర్వము

క్రౌనుసైజు ౬౫ పుటలు. గ్రంథకర్త: బూమారు రామానుజులురెడ్డిగారు. దీనివెల రు ౧-౮-౦.

ఇదియొక చరిత్రాత్మక నవల. ప్రతులు వలయువారు "ఎ. కె. చెంగల్వరాయచెట్టిగారు, బుక్ సెల్లర్ అండ్ పబ్లిషర్, తిరుత్తని, చిత్తూరుజిల్లా" అని వ్రాయవలెను.

### హత్యావినోది

క్రౌనుసైజు ౧౧౮ పుటలు. గ్రంథకర్త: కర్లపాలెం కృష్ణారావుగారు. ప్రకాశకులు: పసుపులేటి వెంకట్రామయ్య అండ్ బ్రదర్సు, రాజమండ్రి. వెల రు ౧.

ఇదియొక డిటెక్టివునవల.

### మల్లికార్జునరాయతారావళి

గ్రంథకర్త: కోగంటి దుర్గా మల్లికార్జునరావుగారు (బాలకవి), అంగలూరు, కృష్ణాజిల్లా. ఇదియొక కందపద్యముల నక్షత్రమాల. వెల ౧-౧-౩.

### సుమతీతారావళి

గ్రంథకర్త: కోగంటి దుర్గా మల్లికార్జునరావుగారు (బాలకవి), అంగలూరు, కృష్ణాజిల్లా. ఇదియొక కందపద్యముల నక్షత్రమాల. వెల ౦-౧-౩.

### కాళికాంబాస్తవము

ఫూల్స్కేపుసైజు ౧౪ పుటలు. గ్రంథకర్త: అయిలం కాశీపరప్రసాదరావుగారు, శ్రీకాకుళము. పోస్టేజీ పంపినవారలకిది యుచితముగా నంపబడును.

### హోమియోపతివైద్యము

క్రౌనుసైజు ౬౯ పుటలు. గ్రంథకర్త: డాక్టరు సూర్యదేవర సంజీవరాయణం, యం. డి. అండ్ హెచ్. యస్., తుమ్మపూడి, గుంటూరుజిల్లా. వెల ౧౨ అ.

### ఆంధ్రవీరులు (రెండవభాగము)

క్రౌను ౧౯౪ పుటలు. గ్రంథకర్తలు: శేషాద్రిరమణకవులు (శతావధానులు). ప్రకాశకులు: వెంకటరామ్ అండుకో, బెజవాడ. వెల ౧౨ అ.

### శ్రీమహాదేవలింగశతకము

౧౧౭ గీతపద్యములు. గ్రంథకర్త: జినగ వీరయ్య సేనాపతిగారు. ముద్రాపకులు: పంచానన బుక్ డిపో, సోంపేట, గంజాం. వెల ౧ అ.

### సాహిత్యమీమాంస

డెమ్మీసైజు: ౨౧౫ పుటలు. శ్రీపండితరామదహినమిశ్రకావ్యతీర్థుని హిందీగ్రంథమున కిది తెనుగుసేత. గ్రంథకర్త: శ్రీపాదకామేశ్వరరావుగారు. ప్రకాశకులు: చెఱుకువాడ వేంకటరామయ్యగారు, అభినవాంధ్రగ్రంథమాలా కార్యాలయము, రాజమండ్రి. వెల: మేలుప్రతి రు ౧-౮-౦; సాదాప్రతి రు ౧-౪-౦.

### సర్వమతసారము-మోక్షమార్గము

క్రౌను ౩౯౧ పుటలు. కాలికో సైండు. గ్రంథకర్త: పోకా వెంకటకృష్ణదాసుగారు. వెల రు.౧-౪-౦. 'టి. రంగనాయకులుగారు, రవానా తిప్పసముద్రము, బాపట్లతాలూకా, వేంపాలెంపోస్టు' అను చిరునామాకు వ్రాసి గ్రంథము తెప్పించుకొనవచ్చును.

### గాంధిశతకము

౧౮౭ సీసపద్యములు. కర్త: భాగవతుల నృసింహశర్మగారు- వేంకుజుక్క-గ్రంథమాల,పూడి పెద్దివారివీథి, బరంపురం, గంజాంజిల్లా. వెల ౪ అ.

### శివయోగసారము (నాల్గవసంపుటము)

డెమ్మీసైజు ౧౧౭ పుటలు. గ్రంథకర్త: కొలనియాది గణపతి దేవుడు. ప్రకాశకులు: శైవప్రచారిణీ గ్రంథమాల, వరంగల్. వెల: చందాదారులకు రు ౧; ఇతరులకు రు ౧-౪-౦.

### ప్రభాతము

క్రౌను ౧౬ సైజు; ౨౭ పుటలు. కర్త: తుర్లపాటి గోవర్ధనరావు. భవానిముద్రాక్షరశాల, బెజవాడయందు ముద్రితము. వెల ౪ అ.

### కాశీసారము

శంకరాచార్యప్రణీతమునకు విద్వాన్ ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారి యాంధ్రీకరణము. ౫౧ పుటలు. వెల ౨ అ. శైవప్రచారిణీముద్రాక్షరశాల, వరంగల్.

### గీతాగేయము

గ్రంథకర్త: అల్లూరి రాజేశ్వరకవిగారు, నారుమళ్ళు, పాఖాల.

### కథావళి

డెమ్మీసైజు ౧౩౪ పుటలు. గ్రంథకర్త: పోడూరి రామచంద్రరావుగారు, బి. ఏ., బి. యల్. సరస్వతీగ్రంథమాల, కాకరపఱ్ఱు. వెల ౧౨ అ.

### ఇంగ్లీషు-తెలుగు నిఘంటు

(ఇంగ్లీషుపదములకు తెలుగు అర్థము కలది.) ఎనిమిదవ ముద్రణము. కర్త: కీ. శే. పి. శంకరనారాయణగారు, యం. ఏ.

ఇది జేబులోనికి ఇముడునది; ౧౧౧౧ పేజీలున్నవి. వెనుకటిముద్రణములకన్న నిందు పదజాల మధికముగ నున్నది. హైస్కూళ్ళలో చదువుకొను బాలురకు ఇది చాల ఉపయోగకరము. దీనివెల రు ౧-౪-౦ మాత్రమే. ప్రకాశకుడు, పుస్తకవిక్రేత: పి. రాజగోపాలరావుగారు, 29, స్ట్రాంగను ముత్యాలమొదలివీథి,మదరాసు.

## సంస్కృతము

### స్తోత్రరత్నావళి (ప్రథమభాగము)

(టీకాతాత్పర్యసహితము.) గ్రంథప్రకాశకులు: క. మార్కండేయశర్మగారు.

ఇందు శంకరాచార్యకృష్ణద్వైపాయనాదికృతములగు సంస్కృతస్తోత్రము లనేకములు బ్ర. శ్రీ. పండిత పురాణం సూర్యనారాయణతీర్థులవారు రచించిన మంచి టీకాతాత్పర్యములతో నున్నవి.

డెమ్మీసైజు ౯౧ పుటలు. వెల ౧౨ అ. మానేజరు, స్వధర్మప్రకాశిని, నెం.౭౨, పూనమల్లి హైరోడ్, బృందావనం, కీలుపాకుపోస్టు, మద్రాసు,

### పంచలక్షణీసర్వస్వమ్ (నాగరిలిపి)

క్రౌనుసైజు ౧౫౧ పుటలు. వెల రు ౧-౪-౦; దేశాంతరీయులకు రు ౧-౮-౦.

### తర్కసంగ్రహసర్వస్వమ్ (నాగరిలిపి)

క్రౌనుసైజు ౧౪౨ పుటలు. వెల ౨ రు.

పైరెండుగ్రంథములకునుకర్త: కురుగంటి శ్రీరామశాస్త్రిగారు, తర్కపండితులు-తెనాలి, గుంటూరుజిల్లా, మద్రాసు ప్రెసిడెన్సీ.

### భగవదజ్జుకమ్ (నాగరిలిపి)

బోధాయన విరచితము. క్రౌనుసైజు ౩౫పుటలు. ప్రకాశకులు: వావిళ్ళరామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, మద్రాసు. వెల తెలియదు.

### కేదారేశ్వరవ్రతకల్పము

క్రౌను ౫౧ పుటలు. శైవప్రచారిణీ కార్యాలయము, వరంగల్. వెల ౪ అ.

### ఆహ్నికకాండః

(ధర్మసంగ్రహే.) డెమ్మీ ౧౩౨ పుటలు. గ్రంథకర్త: ముదిగొండ నాగలింగశాస్త్రిగారు. శైవప్రచారిణీగ్రంథమాల, వరంగల్. వెల రు ౧-౪-౦.

---

# సాభిప్రాయ విశేషములు

భారతరాజ్యాంగముల దుర్దశను సైమను కమిషను వేయివిధములను విశదము చేసినది. బర్కెనుహెడు ప్రభువు పాడిన పాటలు వేదవాక్యము లైనవి. ఆయన చేసెడి బెదరింపులు, ధిక్కారతిరస్కారములు సామ్రాజ్య దురభిమానులకు దగియున్నవి. నిస్సహాయస్థితి యందున్న ప్రజలను బెదరించుటకును, ధిక్కరించుటకును బర్కెనుహెడుప్రభువునకు గల ప్రజ్ఞావిశేషములు లోకప్రసిద్ధములు. ఐర్లాండునందు సాయుధరాజాభిద్రోహమును బూనదలచిన ఎఫ్.ఇ.స్మిత్తుగారుభారతీయులనునిర్బంధించుటకుబూనుటఆంగ్లప్రకృతికిసహజముగనున్నది. సర్వాంగసంబద్ధులైనభారతీయులనునిరసించుట, నిందించుట, పరిహసించుట అధికార ప్రమత్తులకు సులభము. భారతరాజ్యాంగాదిష్ఠాతల కిట్టి ప్రమత్తత సహజముగ గలుగుచున్నది. "విన్నన్న చెప్పినది వేదవాక్యము" అను సామెత భారతరాజ్యాధికారులపట్లను చక్కగను చెల్లుచున్నది.

బ్రిటీషు రాజ్యాధికారులు, పత్రికానిర్వాహకులు, బ్రిటీషుప్రజలు పక్షభేదము లేకయేకాభిప్రాయమునె ప్రతిధ్వనించుచుందురు. శ్వేతభవనము పాడినపాటనే రెయిజీనాయును, టైమ్సు మెయిలుపత్రికలును, భారతీయ దాసులును పాడుచుందురు. భేదాభిప్రాయములు, కుతర్కములు, వితండవాదములు భారతీయదాసులందు గలుగును గాని తెల్లదొరలందు గలుగజాలవు. బర్కెనుహెడుప్రభువు, రామ్సెమాగ్డొనాల్డుగారు, ఇర్విన్ప్రభువు, కర్నలుగిడ్నిమొదలగు తెల్లదొరలు భారతీయులకు సమానావమానమును చూపెడివిధమును సైమను కమిషను విశదము చేసినది. అవమానమును సహించెడి పహాలానాలు, రావులు, నాయుడులు, మిత్రలు, సింగులు బయలుదేరుట సంతాపకరముగ నున్నది. సైమను కమిషను భారతీయులకు కొంతవరకైనను జ్ఞానోదయము గలుగజేయుట భగవదనుగ్రహమునకు నిదర్శనముగ నున్నది.

*　　*　　*　　*

## సైమనుకమిషను—స్వాగత బహిష్కారములు

సైమను సప్తకసంచార మధికారాచ్ఛాదనము క్రింద సాగుచున్నది. సైమను సప్తకమును భారతీయులు జాతిమతపక్షభేదము లేక బహిష్కరించుచున్నవిధమును గత మాసచరిత్రము విశదముచేయుచున్నది. హరతాళములు, నల్లజెండాలు, నిర్గమన ధ్వనులు, బహిష్కారసభలు దేశమునందంతటను ప్రత్యక్షమైనవి. మూడవ ఫిబ్రవరినాడు భరతవర్షమునందంతటను జరిపిన హరతాళము వివేకము గలవారికి స్వధర్మనిర్వహణ మార్గమును విశదము చేయుచున్నది. తెల్లకమిషనుకు బాం

బయి జరిపిన మర్యాదనే దేశ మంతయును జరిపినది. బొంబయియందు వలె ఇతర స్థలములందను అధికారులును, వారి యనుచరులును స్వాగతంబు నొసంగి తెల్లవారి యహంకార ప్రవృత్తిని విశదముచేసిరి. కోట్లమంది ప్రజలు నగరములందును, పట్టణములందును, గ్రామములందును జరిపిన హరతాళములు, బహిష్కారప్రయోగములు ప్రజాప్రవృత్తినివిశదముచేయుచున్నవి. ప్రభుత్వము ప్రదర్శించిన సహకారప్రహసనములు సహజములో, ప్రజలు ప్రదర్శించిన బహిష్కారప్రయోగములు సహజములో లోకమునకంతయును తెలిసియున్నది. దురహంకార దురభిమానాంధకారములు ప్రబలునపుడుజ్ఞానోదయము దుర్లభమగుచున్నది.

సర్ జాన్ సైమనును, బర్కన్హెడ్ ప్రభువును, బ్రిటిషుప్రజలును హృదయపూర్వకమైన స్వాగతమున కానందించినను యథార్థస్థితి హాస్యముగ నున్నది. భారతీయులు సహకారమును జూపినను, బహిష్కారము నవలంబించినను, సమానమైన ఫలము గలుగు ననువిషయము సర్వత్ర తెలిసియున్నది. చిరకాలము వరకును రాజ్యాంగ సంస్కరణము లందు మార్పులు గలుగజాల వని న్యూ స్టేట్సుమను పత్రికయును, ఇతరపత్రికలును బోధింపవలసిన యవసరము లేదు. భారతీయులకు దెలిసిన బహిరంగరహస్యమునె సైమను సప్తకనిర్మాణమును సంచారమును విశదము చేయుచున్నది. ఈస్వల్పవిషయమును గ్రహించుటకువిశేషమైన రాజ్యాంగపరిజ్ఞాన మవసరము లేదు. ఇదిసామాన్యులకు సైతము తెలిసిన విషయము. కాని దేశసేవయందు జీవితమునుధారవోసిన మదన మోహనమాలవ్యా, లాలాజి, జిన్నా, జయకరుగార్లు మొదలగువారలను నుద్యోగాపేక్షాపరాయణులుగ నాక్షేపించుట యవివేకము! స్పెండరుగారి బెదిరింపులును నిరర్థకములు. భారతస్వాతంత్ర్యమునకు సాధనములు గాని సంస్కరణములను సైమనుకమిషను నిర్ణయించినను, నిర్ణయింపకపోయినను, ఫలము సమానము. సామ్రాజ్య శాసనసభయందు జరిగిన చర్చ ఈవిషయమును విస్పష్టము చేసినది.

* * * *

శాసనసభలు - బహిష్కారము

సామ్రాజ్య శాసనసభయందు జరిగిన చర్చ భారతీయ నాయకుల స్థిరాభిప్రాయములను విశదము చేయుచున్నది. కాంగ్రెసు పక్షము, స్వాతంత్ర పక్షము, మితవాద పక్షము హిందూపక్షము, మహమ్మదీయపక్షము, సైమను సప్తకబహిష్కారము నామోదించినవి. సహకారభావమును సూచించి నిందలకు పాలైన జయకరుగారుకూడ బహిష్కారమును సమర్థించుట ప్రాజ్ఞులకు సంశయమును గలుగజేయవలసియున్నది. సైమనుకమిషను పక్షమునను సర్ జాన్ సైమను తెలిపిన భావములు భారత సభ్యులకు సమానప్రతిపత్తిని విచారణ సంఘములందు గలుగజేయజాలవు. సైమనుకమిషను సభ్యులు పుల్లయ్యతోను, మల్లయ్యతోను సంప్రతింపవచ్చును. చెన్నపురియందును, ఇతర ప్రాంతములందును జేసిన సంప్రతింపులు బర్కె-

నుహెడు ప్రభువు కల్పించిన ప్రహసనమునకు నాందిని సూచించుచున్నవి. ప్రజాపక్షసభ్యులు భట్టిప్రోలు సూర్యప్రకాశరావుగారు, బాలసుందరము మొదల్యారుగారు వ్రాసిన లేఖలు ప్రహసనమున ప్రథమాంకమునందలి భావమును విశదముచేయుచున్నవి. సైమను సప్తకమునందు భారతదేశస్థితిని తెలిసినవారుగాని, తెలిసికొన దలచినవారుగాని కనుపడరు. ప్రహసనమునందైనను ప్రదర్శనము తోలుబొమ్మలాటగ నున్నది గాని వ్యక్తిత్వముగల మానవప్రదర్శనముగను గనుపడదు. బర్కెనుహెడు ప్రభువును, వారి ప్రతినిధులును భారతీయ నాయకులను పిల్లలవలె లాలింపదలచుట యవివేకము.

ఎనుబదేండ్లు మానవసేవయందుగడపిన శ్రీమతి బెజంటమ్మగారును, సత్యాగ్రహ దీక్షాపరాయణులైన గాంధిమహాత్ముడును, భారతధర్మనిర్వాహకుడైన మాలవ్యగారును, ఆర్యధర్మప్రవర్తకుడైనలాజపతిరాయిగారును, మహమ్మదీయనాయకులైన జిన్నాగారును, న్యాయశాస్త్రదక్షులైన పండిత నెహ్రూ, శ్రీనివాసయ్యంగారులును బాధ్యతలేనిపిల్లవాండ్రుగాజాలరు. మహాత్యాగముచేసిన జీవితమును దేశసేవకై వినియోగించిన నాయకుల హితోపదేశములు పరిహాస పాత్రము లగుచున్నపుడు బ్రిటీషు రాజ్యాధికారుల యోచనలను వితర్కించుటయును నిరర్థకము. సైమను సప్తకమునకును, భారతీయప్రతినిధులకును సంస్కరణవిచారణయందు సమానప్రతిపత్తి దుర్లభమైనపుడు భారమునంతయును పార్లమెంటు బాధ్యతగల సైమనుసప్తకము వహించుటయె యుక్తముగ నున్నది.

భారతీయ ప్రతినిధులు సామ్రాజ్య శాసనసభయందును, మధ్యరాష్ట్రి శాసనసభయందును సంయుక్తరాష్ట్రి మద్రాసు శాసనసభలయందును జేసిన బహిష్కార తీర్మానములు ప్రజాభిప్రాయమును సువ్యక్తము చేయుచున్నవి. సైమను కమిషనును నెదుర్కొనిన నల్లజండాలును, హరతాళములును, బహిష్కారాందోళనమును భారత ప్రజాహృదయమును సువ్యక్తముచేయుచున్నను కార్యరహితమైన ప్రజాభిప్రాయమును బ్రిటీషు రాజ్యాధికారులు నిర్లక్ష్యము చేయుచున్నారు. భారతీయుల నిర్లేపత్వమును, బ్రిటీషు రాజ్యాధికారుల ప్రాబల్యమును సైమనుకమిషను వ్యవహారములు వేయిముఖముల విశదము చేయుచున్నవి. చెన్నరాష్ట్రి వ్యవహారములు భారతీయుల నిస్సహాయస్థితిని ప్రత్యక్షము చేసినవి.

* * * *

## సైమనుకమిషను-చెన్నరాష్ట్రిము

ఫిబ్రవరి మూడవతేదియందు జరిగినహరతాళము సకలవిధములను సంస్మరణీయముగ నున్నది. ప్రజలయందుగల యంతర్విభేదములు నిరంకుశప్రభుత్వమునకు స్వేచ్ఛా విహారమున కవకాశములను గల్పించుచున్నవి. హరతాళము ధర్మప్రదర్శనమున కేర్పడినది గాని దౌర్జన్యప్రదర్శనమున కేర్పడలేదు. దౌర్జన్యకార్యములతో గుండ్లప్రయోగములు, నిర్బంధ

శాసనప్రయోగములు ప్రత్యక్షమై కార్యాచరణము వెనుకబడుచుండును. మద్రాసునందు హరతాళదినము జరిగిన దౌర్జన్య కార్యములకు బాధ్యులను నిర్ణయించుటదుస్తరముగ నున్నది. దౌర్జన్యమునకు బాధ్యతను ఎవరికి వారు తప్పించుకొనుచు వేరొకరి మీదను మోపుచున్నారు.

బ్రాహ్మణులను, ఖద్దరుధారులను కొట్టుటకు బూనినవారు కాంగ్రెసు ప్రచారకులు గారని ప్రాజ్ఞు లంగీకరింపగలరు. కాంగ్రెసు ప్రచారకులు దౌర్జన్యవిధానమును నిరసించినవిధమును అధికార ప్రచురణ మంగీకరించుచున్నది. బాధ్యతలేనిగుండాలు దౌర్జన్యములకు గారకులైనను అధికారులయుపేక్షయే నిరపరాధుల దుఃఖవేదనకు గారణంబని పరిస్థితుల నెరిగినవారు విశ్వసించుచున్నారు. అధికారులు దౌర్జన్యకార్యముల నుపేక్షించుటయేకాక అనుగ్రహించినారను విశ్వాసము వ్యాపించినది. అధికారులచర్య ఈ విశ్వాసమును బలపరచుచున్నది. చెన్నపురి ప్రభుత్వము 144 శిక్షనును కాంగ్రెసునాయకులమీద ప్రయోగించి వారి నిర్దోషత్వమును, ప్రభుత్వపక్షపాతమును విశదము చేసినది. దౌర్జన్యమును బోధించని ప్రచారకులమీదను దౌర్జన్యాస్త్రమును ప్రయోగించుటయును, దౌర్జన్యకారకులను యథేచ్ఛగ విడుచుటయును మద్రాసుప్రభుత్వ మవలంబించిన యన్యాయ న్యాయనిబంధనప్రయోగమునకు నిదర్శనముగ నున్నది. చెన్నపురియందు ప్రభుత్వమవలంబించిన నిర్బంధవిధానము వారి నిస్సహాయస్థితిని విశదము చేయుచున్నది.

సైమనుకమిషనుతో చెన్నపురియందు సైనికులు, ఫిరంగిదళములు, రక్షకభటులు ప్రవేశించిరి నగరమంతయును రక్షకభటమయమై బ్రిటీషు రాజ్యాంగస్వభావమును, సైమనుసప్తకమునకు ప్రత్యక్షము చేసినది. బ్రిటీషురాజ్యాధికారము ధర్మబలము మీద గాక ఆయుధ బలము మీద నాధారపడియున్నవిధమును సైనికులు, రక్షకభటులు విశదము చేసినపుడు భారతీయుల సామ్రాజ్యభక్తిని ప్రశంసించుటగాని, శంకించుటగాని సర్ జాన్ సైమనువంటి ధీమంతున కనుచితము.

సామ్రాజ్య భక్తి ప్రేమ మూలముననుగలుగగలదు గాని నిర్బంధము వలనను గలుగజాలదు. ప్రజాసంఘప్రతినిధులు సైమనుగారికి దెలిపినటులు ఆత్మగౌరవము గల భారతీయులందు బ్రిటీషుసామ్రాజ్యభక్తు లుండజాలరు. స్వార్థపరాయణులు "చిత్తము చిత్తము దొరగారు!" అన్నంతమాత్రాన వారు ప్రభుభక్తిపరాయణులని నమ్ముట బుద్ధిమాంద్యము గాని వివేకము గాదు. అధికారవర్గము సైమనుసప్తకమునకు కన్నులకు గంతలుకట్టి యూరేగించుట విచిత్రముగ నున్నది.

సైమను సప్తకము గంతలసందులనుండి కనుపడెడి సంకుచితమైనభరతవర్షమే విశాలమైన భరతవర్షమని నమ్ముటయును విచిత్రముగనున్నది. తెలిసిన నాటకమునందు విచిత్ర

ములకెప్పుడునునవకాశములుగనుపడవు. చెన్నపురియందు ఫిబ్రవరి 26 వ తేదీని జరుప బడిన హరతాళము పరమసంశయాత్ములకు సైతము కన్నులను తెరువజాలి యున్నది. కన్నులను తెరిచియును జూడనివారిని దేవుడైనను చూచునటులు చేయజాలడు. సైమనుకమిషను వచ్చినది. అధికారులు తలపెట్టకపోయినను వచ్చిన విధముననే ఈనూసాంతమునందు స్వదేశమునకు బోవుచున్నది. స్వదేశమునం దైనను ఈయేడ్గురుపెద్దమనుష్యులును వారినిజానుభవమును మంత్రివర్గమునకును, బ్రిటీషుప్రజలకును వ్యక్తము చేయుటకు పరమేశ్వరుడు సాహసధైర్యములను ప్రసాదించుగాత!

* * * *

రాజ్యాంగములు - ప్రజాశక్తి

వర్తమాన ప్రజాస్వామ్య యుగమునందు రాజ్యాంగవికాసము ప్రజాశక్తిమీద నాధారపడియున్నవిధమును సర్వజనాంగీకారమును బడసినది. సైమనుబహిష్కారవిజయము భారతప్రజాశక్తిని విశదముచేయుచున్నది. బలవంతము లేక జాతీయహరతాళప్రదర్శనములను దౌర్జన్యరహితముగను, జయప్రదముగను జేయగల భారతీయులు రాజ్యాంగపరిజ్ఞానము లేనివారనుట యసంగతముగ నుండును. ఆంధ్రరాష్ట్రమునందు గుంటూరుమండలమున సైమను బహిష్కరణోద్యమమునకు గలిగినవిజయము ప్రజలకుగల రాజ్యాంగపరిజ్ఞానమును, శక్తిని విశదము చేయుచున్నది. తెల్ల కమిషనును గుంటూరునుండి గ్రామగ్రామమునకును వెంబడించిన నల్లజెండాలు, బహిష్కారఘోషలు ప్రజాశక్తిని విశదముచేయుచున్నవి.

గుంటూరుమండలమునం దసహాయోద్యమము గలుగజేసిన ప్రబోధమునకు సైమనుబహిష్కారవిజయము లక్ష్యముగ నున్నది. రెండు దినములలో ప్రజానాయకులు ప్రతిఘటనము లేకుండనుబహిష్కారవిధానమును సఫలముచేయగలిగిరి. అధికారులును, సహకారులును నిర్విణ్ణచేతస్కులై తటస్థభావమును వహించిరి. అధికారులకు గుంటూరు మండలమునందలి నిరాకరణోద్యమప్రస్థానములు సంస్మరణమునకు వచ్చి 144 వ శాసనప్రయోగమును విరమించియుందురు. గుంటూరు మండల మాంధ్రదేశగౌరవమును గాపాడినది. చీరాలయందు మ్యూనిసిపలు సన్మానపత్రమునకు బదులు నల్లజెండాలు తెల్ల కమిషనును సత్కరించినవి. చెయిరుమను 'బ్రతుకు జీవుడా' యనుచు వెనుకకు బట్టవలసి వచ్చినది. ఆంధ్రప్రజా హృదయము సైమనుసప్తకమునకును, నిరంకుశవర్గమునకును సువ్యక్తమైనది. సైమనుసప్తక మధికారవర్గము ప్రయోగించిన సమ్మోహనాస్త్రమునుండి మేల్కొనుటకు వారి గుంటూరు మండలానుభవము వినియోగపడునని నమ్ముచున్నాము.

మద్రాసు నందు ప్రజాశక్తి స్తంభించుట శోచనీయముగ నున్నది. అధికారవర్గము 144 నిర్బంధ శాసనము ప్రయోగించి ప్రజాంగములను స్తంభింపజేసినది. నాయకుల సంశయములు, వారి యంతశ్ఛేద

ములు నిశ్చేష్టతను గలుగజేసినవి. దేశసే వను జేయుటకు చెన్నపురి కాకస్మిముగను సంప్రాప్తమైన పుణ్యకాలము గడచిపోయినది. ఈనిశ్చేష్టత కధికారులకన్నను ప్రజలే యధి కముగను బాధ్యులుగ నున్నారు. నిరంకుశ వర్గము నిర్బంధములను ప్రయోగించుటయం దు జూపెడి సామర్థ్యమును ప్రజలు ప్రతిఘటిం చుటయందును జూపవలసి యుందురు. నిర్బం ధప్రతిఘటనమున కవకాశములు సంప్రాప్త మైనపుడుప్రతిఘటనసామర్థ్యము వృద్ధియైనకొ లదియును స్వరాజ్యప్రస్థానము సులభసాధ్య మగుచున్నది. సహాయనిరాకరణోద్యమము వ్యక్తిశాసనోల్లంఘనముతో నారంభమైనసమష్టి శాసనోల్లంఘనమునందు పరిణమింపవలసి యు న్నది. చెన్నపురిప్రభుత్వముప్రసాదించిన144-వ శాసన శ్రీముఖ మట్టియవకాశములను గలుగ జేసినది. ప్రజానాయకుల యుపేక్షకు మద్రాసు వాతావరణమును, ఫిబ్రవరి 3-వ తేది బీభత్స మును గారణాబులుగ నున్నవి. ముఖ్యముగ ప్రతిపక్షు లవలంబించిన బ్రాహ్మణదండ యా త్ర సంశయములకును, నిశ్చేష్టతకును మూల కారణముగ బరిణమించినది.

దేశక్షేమపరాయణు లందరును నిరంకుశ ప్రభుత్వమునుప్రతిఘటించునపు డంతర్విభేదము లనుమరచుటపరమధర్మముగ నున్నది.గంధర్వు లు దుర్యోధనాదులను బంధించి తీసికొనిపోవు నపుడు ధర్మరాజు చేసిన ధర్మోపదేశము వర్త మానకాలమునందును మననార్హముగ నున్న ది. శత్రువులను ప్రతిఘటించుటయందు కౌరవ పాండవభేద మంతరించిన విధమున స్వరాజ్య సంపాదనమునందు జాతిమతకులభేదము లంత రింపవలసి యున్నవి. భారతీయు లందరును నీ ధర్మమును వెంటనే గ్రహించిచెన్నపురియందు సంప్రాప్తమైన దౌర్జన్యములకును, నిశ్చేష్టత కును,మరలనవకాశములను గలుగజేయకుందు రుగాత! వర్తమానకాలమునందు గతమునకు వగచుటవలనను ప్రయోజనము గలుగదు. ముందుచేయవలసిన దానిని యోచించుటయే ప్రయోజనకరము. ప్రజాశక్తి విజృంభించుట కును స్వరాజ్యసంపాదనము సాధ్యమగుట కును విదేశవస్తుబహిష్కారము ముఖ్యసాధన ముగ నున్నది. విదేశవస్తుబహిష్కారమునందు వస్త్రబహిష్కారము ప్రధానముగనున్నది. బ్రి టీషువస్త్ర బహిష్కారము సాధ్యమగునపుడు స్వరాజ్యము సులభసాధ్య మగుచున్నది.

* * * *

బ్రిటీషువస్త్రబహిష్కారము

కాంగ్రెసు తీర్మానములందు బ్రిటీషువ స్తుబహిష్కారము ప్రత్యక్షాచరణమునకు సా ధనముగ నున్నది. బ్రిటీషువస్తువులందు వస్త్ర బహిష్కారము ప్రయోగయోగ్యముగ ను న్నది. భారతీయులు 60 కోట్ల రూప్యముల బ్రిటీషువస్త్రములను బహిష్కరించుటకు దీక్ష నుబూనునపుడు స్వరాజ్యదీక్ష సులభసాధ్య మగుచున్నది. వ్యాపారవిజృంభణముతో నా రంభమైన బ్రిటీషుసామ్రాజ్యము వ్యాపార క్షయముతో నంతము నొందుట సహజము. గాంధిమహాత్ముని ఖద్దరుదీక్ష యీమార్గమునే

యవలంబించుచున్నది. వంగదేశమునందు సుభాసుచంద్రబోసుగా రుపక్రమించిన బ్రిటీషు వస్త్రబహిష్కారము ఖద్దరు దీక్షనే బోధించుచున్నది. ప్రజానాయకులు వారి లక్ష్యమును సైమను సప్తకమునుండియును, శాసనసభల నుండియును మరల్చి, ఖద్దరు దీక్షమీద లగ్నము చేయుట స్వరాజ్యసంపాదనమునకును, ఆత్మావలంబనమునకును పరమసాధనముగ నుండగలదు. స్వరాజ్యము భారతీయుల సంపాదన వలన రాగలదనియును, బ్రిటీషుప్రభుత్వదానమువలన రాజాలదనియును సైమనుకమిషను వ్యవహారములు విశదము చేసినవి. ఆంధ్రమహాజనులును కలకత్తాయందు సుభాసుచంద్రబోసుగారు నడుపుచున్న విదేశవస్త్రబహిష్కారప్రస్థానమును తీవ్రముగను నడుపుచు కార్యశూరులై సైమనుసప్తకమునకును, బ్రిటీషు రాజ్యాధికారులకును జ్ఞానోదయమును గలుగజేసి ధన్యవాదములకు పాత్రులయ్యెదరుగాత!

* * * *

శాసనసభలు-ప్రజాప్రయోజనములు

శాసనసభలు ప్రజా ప్రయోజనములకు నిరర్థకము లను విషయము నిత్యానుభవము ధ్రువపరచుచున్నది. చెన్నరాష్ట్రశాసనసభ యందు 36 లక్షల ప్రజల కొక సభ్యుడు వంతున ప్రతినిధులు గలరు. ప్రాతినిధ్యము సంతృప్తికరము గాదని ప్రపంచ రాజ్యాంగముల యనుభవము విశదము చేయుచున్నది. సంతృప్తికరమని యంగీకరించినను అధికార శూన్యమైన ప్రాతినిధ్యము ప్రజా ప్రయోజనములకు నిరర్థకముగ నున్నది. ద్వంద్వ ప్రభుత్వము విద్య, స్థానికసంస్థలు, పరిశ్రమలు, బాటలు, అడవులు, మద్యము మొదలగు శాఖలను ప్రజాయత్తము చేసినది. కాని ఈ శాఖలందు గతించిన ఎనిమిదేండ్లయందును జరిగిన యభివృద్ధి అత్యల్పముగ నున్నది. గ్రామ సీమలకు బాటలు యథాస్థితియందున్నవి. ఆంధ్ర విశ్వవిద్యాలయము స్థాపింపబడినది. అవసరమైన ద్రవ్యము లేదు. విద్యాప్రవృత్తియందు మార్పు లేదు. గృహపరిశ్రమలయందుగాని, యంత్రపరిశ్రమలయందుగాని యభివృద్ధిగలుగ లేదు. మద్యపానాభ్యాసము తగ్గుదలజూపుట లేదు. స్థానిక సంస్థలందుగల నియామకాధికారము కక్షలకు, కలహములకు సాధనంబై ప్రధానమంత్రిమంచి నాటకముల నాడించుట కవకాశములు గలుగుచున్నవి.

చెన్నరాష్ట్రము నందు గత సంవత్సరాదాయము 1676, వ్యయము 1558 లక్షల రూప్యములు. నిలువ 118 లక్షలరూప్యములు. ఈనిలువకున్వ్యయముచేయని మొత్తమును చేర్చినపుడు 318 లక్షలు నిలువ తేలుచున్నది. బాటలు, విద్య మొదలగు శాఖలకు నిర్ణయించిన మొత్తములైనను వ్యయపడకపోవుట కేవలము మంత్రుల యసమర్థతను దెలుపుచున్నది. గతించిన ఏడేండ్లయందును రాష్ట్రాదాయము 141 లక్షలును, వ్యయము 297 లక్షలును వృద్ధిని బొందినవి. రాష్ట్రాదాయమునందు 675 లక్షలు ఉద్యోగస్థుల వేతనాదులకు వినియోగపడినది. ప్రజాయత్తశాఖకన్నను అధికారాయత్తశాఖకు వ్యయ మధికమగుచున్నది. వ్యయమునందు 717 లక్షలు కావేరి మెట్టూరు నిర్మాణమునకు వినియోగపడవలసి యున్నది. ఈనిర్మాణము పూర్తి కానంతవరకును నితరనిర్మాణములను నిలుపుదల జేయుట యనుచితముగ నున్నది. లాభదాయ

కములైన యితరనీటిసౌకర్యములను ప్రారంభించుట వివేకముగనుండగలదు. న్యాయాంగమంత్రి తెలిపిన సమాధానము సంతృప్తికరముగాదు.

కృష్ణా, తుంగభద్రా నిర్మాణములు ముప్పదేండ్లక్రితమే నిర్ణయింపబడినవి. వాటి నుపేక్షించుట యన్యాయము. ఆంధ్రరాష్ట్రావసరము నీ యన్యాయము వ్యక్తము చేయుచున్నది. రాష్ట్రకప్పమును తీసివేసినను పన్నులను తగ్గించుటకుగాని, ప్రజోపయోగకార్యములను జేయుటకుగాని ఏర్పాటులు జరుగలేదు. రాష్ట్రాదాయమునందు ముఖ్యమైన భూమిసిస్తును వృద్ధిచేయుటకు తిరిగి ప్రయత్నములు జరుగుచున్నవి. రాజ్యాంగవిధానమునందును, ఆదాయవ్యయ నిర్ణయములందును సంపూర్ణ పరివర్తనము జరుగవలసినయవసరమును బడ్జెటులెక్కలు విస్పష్టము చేయుచున్నవి. ప్రజా విశ్వాసమును, స్వపక్షవిశ్వాసమును, పరస్పర విశ్వాసమును లేని మంత్రి వర్గము మంత్రి పదవులను పట్టుకొని వ్రేలాడుట యసహ్యముగ నున్నది. విశ్వాసరాహిత్యమునకు బట్టినగతి శాసనసభాసభ్యుల విభేదములను దెలుపుచున్నది.

రాష్ట్రీయాదాయవ్యయములు చెప్పెడి కథనే సామ్రాజ్యాదాయవ్యయములును విశదముచేయుచున్నవి. గతసంవత్సరనికరాదాయము 13170 లక్షలు; వ్యయము 12874 లక్షలు; నిలువ 296 లక్షలు తేలినది. నిలువ రాష్ట్రకప్పములను తగ్గించుటకును, అప్పును తగ్గించుటకును వినియోగించుట సంతృప్తికరముగ నున్నది. క్రొత్తపన్నులను వేయవలసిన యవసరము లేక ఆదాయవ్యయములు సరిపోవుట సంతృప్తికరమైనను బీదలభారమును తగ్గించుటకు ఉప్పుపన్నునుగాని, పోస్టుకార్డుల ధరనుగాని తగ్గించుట కేర్పాటులను జేయకపోవుట యుక్తముగ గనుపడదు. రైలు రాబడి 636 లక్షలు పెరిగినది. మూడవ తరగతి రేట్లు స్వల్పముగమాత్రమె తగ్గింపబడినవి. రాబడియందు 5492 లక్షలు సైనికవ్యయమునకు వినియోగపడుచున్నవి. గతించినయెనిమిదేండ్లయందునుపన్నులు45కోట్లుపెరిగినవి పన్నులమితముగ పెంచిఆదాయవ్యయములను సరిపుచ్చుటక్షేమకరము గాదు. సుంకములు, పన్నులు ప్రజాజీవితమును దుర్భరము చేయుచున్నవి. సైన్యవ్యయము దేశవికాసమును దుస్తరము చేయుచున్నది. సర్ బేసిలుబ్లాకటుగారు బడ్జెటును జూచి సంతృప్తిని బొందినను భారతీయులు సంతృప్తిని బొందజాలరు. అనుకూలమైన మారకము, రైలురాబడి సంతృప్తికి గారణంబైనను ఇది బ్లాకటుగారి గారడిదై యున్నది. స్వరాజ్యావసరమును రాష్ట్రముల యాదాయవ్యయములును, సామ్రాజ్యాదాయ వ్యయములును వేయినోళ్లను చెప్పక చెప్పుచున్నవి. స్వరాజ్యమున కార్థికస్వాతంత్ర్యమును, సైన్యాధికారమును మూలాంకురములుగ నున్నవి. భారతీయులు స్వరాజ్యప్రాప్తికై కలిసి పనిచేయవలసిన యవసరమును బడ్జెటు లెక్కలు తెల్లము చేయుచున్నవి.

---

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No.7,Thumbu Chetty Street, G.T,Madras.

# విషయానుక్రమణిక

## చిత్రములు

త్రివర్ణ చిత్రములు:—బావిపజ్జ పల్లెటూరి పడతుకలు; రాణాప్రతాపసింహ.

ఏకవర్ణ చిత్రములు:—శ్రీ జయపురం మహారాజుగారు; శ్రీ వెలగపూడి రామకృష్ణ చౌదరిగారు; ప్రాచీనశిల్పచిత్రములు; టూటను ఖమను సమాధిచిత్రములు ౫, కీ. శే. సింహప్రభువు, కృషీవలుడు; కలికాలపు కలివి-[illegible]యంత్రమానవుడు, సైమను సప్తకము, హెన్రీఫోర్డు, తామస్ ఎడిసన్, ఇతరచిత్రములును.



సెట్టి లక్ష్మీనరసింహము గారు

శ్రీవిభు వరకరుణను శ్రీ
దేవి భవనములను సమ్మతిఁ మెలఁగంగా,
నీవిభవాబ్దంబున నా
నా విభవము లొందవుత జనంబులకెల్లన్.

ప్రభవానంతర మందున్
విభవాభ్యుదయంబు కలిగె విశ్వంభరకున్
శుభకరమిది యగుటను సౌ [బుల్
ఖ్యభరితులయి భావి మనుదురుగాత జనం

కాలమహాత గర్భంబునఁ గలిగినట్టి
సంతతికి లెక్క లేదు; వత్సరమునకొక
బిడ్డ; పెట్టిన పేరులె పెట్టవలెనె:
ఈవిభవ యన్నియువదియో యెవరికెఱుక?



విరియఁ బూచిన వేఁపవిరులు మామిడికాయ
ముక్కలతోఁ గ్రొత్తపొత్తు కలిపె;
భవనాంతరంబుల బ్రాహ్మణోత్తములు పం
చాంగ శ్రవణము సల్పం గడఁగిరి;
వనరమామాధవోద్వాహంబునందు సా
నాయిమేళము చేసె కోయిలగమి;
సంరంభమున భక్తజనులు శ్రీరామ లీ
లా సమారంభాభిలాషులైరి;
"వచ్చె మరలఁ గ్రొత్తవత్సరం, బిది మహో
త్సవదినం", బటంచుఁ దమ హృదంత
రముల సంతసించి ప్రజలు చెలంగిరి:
ముదముల పెనుగాది గద యుగాది?

---




చెన్నపట్టణము, ఏప్రిల్ ౧౯౨౮

సంపుటము ౫ విభవ సంవత్సరము చైత్రమాసము సంఖ్య ౪

# దక్షిణానిలము

పెమ్మరాజు లక్ష్మీపతి గారు

వసుమతి జుట్టు నపారపారావారలీలాతరంగడోలికల నూగి
పరచిన పచ్చకంబళములు దాళువా వరిచేల నటునిటు దొరలిదొరలి
నిర్మలంబగు నేటినీటిపై నూనూగు కెరటముల్ మొలవంగ బరువులెత్తి
పువ్వునవ్వుల మవ్వమొలయు పూగొమ్మ లేగొమ్మలతో గుసగుసలువోయి
యట్టె నన్నెత్తికొనిపోయి యరయరాని - యొకమహానందవార్ధితీరోజ్జ్వలప్ర
దేశమున బారవైతు విడేటికోయి, - లాలితాపూర్వకేళీవిలాసమూర్తి!

తరళోత్ఫుల్లవిచిత్రవర్ణయుతసంధ్యాకాలశోభల్ దిగం
తరరంగంబున రంగవల్లికలు దిద్దన్ నాట్యకేళీకళా
భరణంబై రసరాజ్య మెల్లదిశలన్ బాలించుచున్నాడు సుం
దరమందానిలరాజనందను డమందానంద సంధాయియై.

అల్లన నుండియుండి తగ ఘ్రాణము లేచెనకో చనంగ జల్
జల్లన జల్దరించెదవు చాగురె! మేన గులాబినీరముల్

చల్లినలీల పూలుఁ వెదచల్లినయట్ల సుధాతరంగసం
ఫుల్లవిలాసముల్ భువనమోహనలీలల బ్రాకునట్లుగన్.

దిరిసెనపూలతెప్పలను దేల్చెదవో, విరజాజివీవనల్
సురభిళశైత్యసారపరిశోభితసాంద్రపటీరనీరశీ
కరములు నద్దెసల్ గలయఁగ్రమ్మగ వీచెదొ! యో యదృశ్యసుం
దరమృదుదేహ, యోహృదయతస్కర, యోజగదేకమోహనా!

సలలితదేవతావసనజాలమునాజను నింద్రజాలపున్
వలువలపై నలల్దొలుక బైపయి నారగఁగప్పెదేమొ, యీ
యిలకలమేరయంతయు నదృశ్యమనోజ్ఞతరంగమాలికా
విలసిత మయ్యెఁ జిప్పిలు నవీనసరోజమధుద్రవార్ద్రమై.

అంటనియార్ద్రచందన మొయారముగాఁగ నలందెదార మే
నంటినమాత్ర స్వర్గమున కల్లన నెత్తెదవా కడాని నీ
రంటిన సంజక్రొంబసిడిరంగుమిసల్ దొలుకాడ నద్దిరా
పంటవలంతి నందములె పండెనుగా కనువిందొనర్చుచున్.

ఏయానందసుధాబ్ధివీచికలపై నేస్త్రీలు నర్తించువా
రోయీ! యీమెయి వొంగి వాయులహరీ రూపంబునన్ భూమిపై
హాయింగొనార్చుచు వీచుచుంటి వహహా! యానంద మేమందు నౌ
రా! యొయ్యారము! హాయిరే సొగసు! సౌరభ్యంబు సేబాసహో!

భూమిసమస్త మీయెడ సముజ్జ్వలమైన సుధాసముద్రవీ
చీమయలాస్యరంగమున జిందులు ద్రొక్కుచునున్నదోయి, ది
వ్యామలకోమలాబ్జదళమట్టులు నోయమృతార్ద్రమంజుల
శ్రీమహిళామణీరసికశేఖర, స్వైరవిహారభాసురా!

చరదురుభూజశాఖల రసాలశలాటువు లూగుచుండె, సుం
దరలలనాజనాలకవితానములీల జలించుపత్రముల్
సరుగుడు చెట్లజాలు సరసధ్వనులీనెడు తావకీనభా
స్వరరసవద్విహారము సెబాసనుచున్ దలలూచి మెచ్చుచున్.

లలితకళావిలాసము లిలాతలమెల్ల నలంకరింప బు
వ్వులు వికసిల్లె చిత్రములుబోలె శకుంతసతీవితాన కో
మల కలగాన మొప్ప సుకుమారసమీరుడు గొండ్లిసల్పు, నీ
యిలపయిగాక స్వర్గమది యెచ్చట నున్నది శూన్యసీమలోన్.

ఉ. పూరజమాచు నిన్ గలిసిపోదునో? యీ మృదులాచ్ఛమల్లికా
సౌరభమౌదునో, యదిగో! శ్రావ్యతరధ్వను లీనుచున్న వం
శీరవమై కరంగుదునో? చెప్పు మికే తెర గాచరించి యో
స్వైరవిహార, నిన్గలియువాడనో యీ సుముహూర్తమందునన్.

శా. ఊహాపోహల నస్తి నాస్తి యనుచు న్నూహించు సందేహసం
దోహంబుల్ చెదరంగ ఏచెడు 'నథాతో బ్రహ్మజిజ్ఞాస' నా
'సోహ' మ్మంచును దాటు నొక్కబిగి నీసోపానముల్ తత్త్వస
న్నీహారోన్నతశైలరత్నశిఖరానీకప్రదేశంబుపై.

చ. అనృతము దుఃఖమున్ జడమునంచు విసం బుమియంగనౌనె? మో
హనమృదులార్ద్రమందమధురానిలమున్ బ్రకృతీకపోలచుం (?)
బనసుఖపారవశ్య మది స్వర్గముకాదె, ముహూర్తమాత్రమే
యనుకొనియుంటినేని యిక నవ్వల నేనెవరో యదెవ్వరో?

మ. అనుమానింపకు మాలసింపకుము లభ్యంబైనసౌఖ్యంబు జే
కొనుమంచున్ వచియించు నీప్రకృతిపై కోయంచు దీర్మానమా
నని యామోదము దెల్పె నాసికము, విశ్వాంగీకృతంబయ్యె బో
యిన వెన్కన్ విలపింతునేమొ ఫలమున్నే యప్పు డావంతయున్!

ఉ. ముందున కేగుచో వెనుకబోపు జగం బిటులుండునంతకున్
ముందని వెన్కయంచు దలపోయుట తప్పునొ, నిల్చి, యీమహా
నందసుధారసంబు చవినందినవారికి లేదు మృత్యు వీ
ముందును వెన్కకౌ గమనముల్ దమయంతన నాగిపోయెడిన్.

ఉ. ప్రాకృతయోగసాధనల బ్రాణములన్ బిగబట్టి జీవి న
ఱ్ఱాకల బెట్టి యెట్టి శుభమందగనౌ, లహరీప్రమోద కే
ళీకమనీయమైన నునులేతసమీరము సోకునంత వ
ల్మీకమునుండి కుండలియు లేచెడు దా ఫణమెత్తియాడుచున్.

చ. ఘనమగు దేహవాసనలు గాలికి దూలిచనంగ వెన్కని
ల్చినమదియెల్ల నొక్కట సజీవలయాచ్ఛగభీరవారిధిన్
మునుగ, శరీరమే మరచి పోవుటకంటెను మోక్షమేది? యిం
కను మది శంకయేల, నునుగాలియలల్ పయినాడ నాడెదన్.

---

# భవభూతిరసము-కాళిదాసుని పాత్రౌచిత్యము

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

సీతను గూర్చిన వాత్సల్యమును జనకుని యందు సమృద్ధిగ సాధింపఁదలఁచిన భవభూతి కవిబ్రహ్మ శ్రీరామునివలన సీతకుఁగలిగిన ఘోరాపదను స్మరించుచు శోకవిహ్వలుఁడగు జనకుని, నుత్తరరామచరిత్ర నాటకమున మనకుఁ జూపుచున్నాఁడు. సీతకుఁ గలిగిన ఘోరాపదను విని జనకమహారాజు గార్హస్థ్యమునుండి విరక్తుఁడై వానప్రస్థాశ్రమమునఁ బ్రవేశించి చంద్రద్వీప తపోవనమునఁ దపస్సు చేసికొనుచున్నాఁడు; మాంసాహారము మానినాఁడు. ఎల్లప్పుడును హృదయమును బాయకున్న సీతాశోక మాయనను ఎండఁబాఱిన చెట్టును తొఱ్ఱలోఁ జేరిన నిప్పువలెఁ గాల్చివేయుచున్నది. కూతునకుఁగల్గిన దురితము హృదయమునఁ బుండుచేసి నాటుకొని ధారావాహియైనశోకమును బుట్టించుచున్నది. అది యాయపుఁబట్టులను అంపమువలెఁ గోసివేయుచున్నది. విరమించునట్లులేదు.

ఈ ముసలితనమునకుఁదోడు దుఃఖము; దానికిఁ దోడు తపస్సులు. వీనిచే మిగులనెండుచుండియు నా యీపాడు దేహము పడిపోకున్నదనుకొనుచు విషాదమందుచున్నాఁడు. నరకముల పాలగుదునను భయ మాత్మహత్యాప్రయత్నమునుండి జనకుని మఱల్చుచున్నది. ఎన్నియేండ్లు గడచినను బ్రాంతపడక సుస్పష్టముగఁ గన్పట్టుచు దుఃఖసంవేగము శమింపదయ్యె. నిశ్శంకగా నేడ్చుటకైన వీలులేకపోయె. నీ నిర్మాణభాగ మిట్టిది యనుకొనుచు లజ్జాశోక పరవశుఁ డగుచున్నాఁడు జనకుఁడు. సీతయొక్క పవిత్రత ననుసంధానము సేయుకొలఁది జనకుని కొకప్పుడు పుత్రిక యనుభావముపోయి యామెయెడ భక్తికలుగుచు వచ్చెడిదట. అట్టిసీతయోగ్యత జనకుని శోకసమృద్ధి కిప్పు డుద్దీపన విభావమగుచున్నది.

"ఆసన్నప్రసవవేదన యగు సీత నొంటిగ నడవిలో వదలి లక్ష్మణుఁ డింటికిఁ బోయెను." అనువాక్యము లవుని సరసవాక్కునుండి వినునప్పటికి జనకునికి దేహము తెలియలేదు. శోకనిమగ్నుఁ డయ్యె. సీతా! ఏకాకినివైన నీశరీరకుసుమమున కెట్టి దైవదుర్విలాస పరిణామము కల్గెను? పరాభవమును, ఘోరారణ్యవాసమును, ప్రసూతిబాధయు, దాపరించి యుండఁ, గ్రూరమృగములు చుట్టుకొనుచుండ, నన్నుఁ బలుమాఱు స్మరించి యుందువు. అక్కటా! పౌరులెంత నిర్దయులు? రాముం డెంతటి యవిమృశ్యకారి!

పిడుగుకంటె యీఘోరహింసను, ఆచె తలపోయఁగా శాపముచేఁ గాని, చాపముచేఁ

గాని గోపమును బ్రజ్వరిల్లఁజేయవలసిన యవసరముగనేకన్పట్టుచున్నది. అని యాజ్ఞవల్క్య శిష్యుఁడు శాపమునకో యుద్ధమునకో సిద్ధమగుచున్నాఁడు. చూడుఁడు. "కర్మణైవహి సంసిద్ధిమాస్థితాజనకాదయః" అని భగవద్గీతలలోఁగూడ మహాజ్ఞానిగాఁ బేర్కొనఁబడిన జనకునంతటివాఁ డిట్లు శోక మోహములకు వశుఁడయ్యెననుట పాత్రౌచిత్యమునకు లోపము వాటిల్లఁజేయునో యనుశంక గల్గుచుండలేదా?

కాని దీనిచే రసమున కత్యంత సమృద్ధి సమకూరకపోలేదు. ఇట్టివి రసపక్షపాత వశులగు కవుల స్వారసరచనలు. అభిజ్ఞానశాకున్తల నాటకమున శకుంతల పతిగృహమున కేగునప్పుడు కణ్వుఁడుసైత మిట్లే దుఃఖితుఁడగుచున్నాఁడు. సీత మృతినొంది యుండునని జనకుఁడు దుఃఖించుచున్నాఁడు. శకుంతల తన యాశ్రమమును బాసిపోవుచున్నదని కణ్వుఁడు శోకించుచున్నాఁడు. కావున జనకుని శోకముకన్న కణ్వునిశోకము శిథిలీయముగనే కన్పట్టుచున్నది. ఐనను గవు లీసందర్భములలోఁగణ్వ జనకులయందు సాధింపఁదలఁచుకొనినది కరుణ రసమే. కాన సమానమైన రచనా పథమందే కాళిదాస భవభూతు లిచ్చటనడచుచున్నారు. ఇట్టిచోఁ దారతమ్యము వీరి శైలిభేదమునే సూచించును.

యాస్యత్యద్య శకుంతలేతి హృదయం
సంస్పృష్ట ముత్కణ్ఠయా
కణ్ఠస్తంభిత బాష్పవృత్తికలుష
శ్చింతాజడం దర్శనమ్;
వైక్లబ్యం మమతావ దీదృశ మహో!
స్నేహాదరణ్యౌకసః
పీడ్యన్తే గృహిణః కథంను తనయా
విశ్లేషదుఃఖైర్నవైః.

శకుంతలా ప్రయాణమును దలఁచుకొను కణ్వుని హృదయ ముత్కంఠచింత మున్నగు వ్యభిచారిభావములకు వశమైనది. బాష్పము, ప్రళయము మున్నగు సాత్వికభావములు పొడముచున్నవి. జనకునియందైన నింతకన్న శోక సమృద్ధిభవభూతిచే నెక్కుడుసాధింపఁబడలేదు. శోకసూచకమైనవాగ్వినియోగము మాత్రమే యెక్కువగఁ గూర్పఁబడినది. శ్రోతలకు గర్భభేదమగు మాటలచే రసప్రవాహమును వెల్లిగొల్పు చుంటయును, అన్యోన్యపాత్రల చేష్టలు మున్నగువానిచేతను, దేశకాలపరిస్థితుల నమర్చుటచేతను రససంపూర్తిని నిర్వహించుటయును ఆయాకవులపోకడలలోని భేదములు.

కాని యిచట నొక భేదము గన్పట్టుచున్నది. కణ్వుఁడు 'వైక్లబ్యం మమ తావదీదృశ మహో!' అనుకొనుచున్నాఁడు. తన కట్టి శోకమును,అట్టి యుత్కంఠయు,అట్టి చింతయుఁ గల్గుటనుగూర్చి యమ్ముని యాశ్చర్య మందుచున్నట్లు"అహో" అనునవ్యయము సూచించుచున్నది. విస్మయ మారీతిగ నప్పుడు గల్గుటకు నిర్వికార చిత్తతయను శమము స్థాయిగనుండవలెను. అట్టి శాంతరసస్థాయిభావమగు శమము నెలకొనియుండుట చేతనే వికారహేతువు శకుంతలా స్నేహమునఁ గల్గుచున్నను

మనస్సును వికృతినందనీయనిధీరత కణ్వునిలో భాసిల్లుచున్నది. తరంగముల వలెఁ బైకొనుచున్న శోకవికారములను కణ్వుఁడను శాంతి సముద్రము మ్రింగివేయుచున్నది. అట్టి పరిస్థితిలోఁ దన సహజశాంతి ప్రవాహమున కెదురు నడుచుచున్న శోకవికార తరంగముల యుత్పత్తిలయములను జూచి కణ్వమహర్షి విస్మరచిత్తుఁడగుట యుక్తముగ నున్నది.

లేక శోకమోహ పరవశుఁ డగువానికి, "వృత్తిసారూప్య మితరత్ర" అనినట్లును, "యో యచ్ఛ్రద్ధ స్స ఏవ సః" అనినట్లును, ఆ మోహశోకాదివికారముల నైక్యమంది తలక్రిందులగుచు తాదాత్మిక వాంఛాపూర్త్యన్వేషణవ్యగ్రుఁ డగుచుండుటయే కాని వానినిగూర్చి యాశ్చర్యమందునంతటి విశ్రాంతి యుండదు. "అన్యత శ్చతథా వీరాత్" అనుటచే వీరరసమువలన నద్భుతము గల్గవచ్చును. వైరాగ్యవీరత శత్రువులయిన వికారములను బరిమార్చుచుండుటం గూర్చియైన విస్మయము కల్గుటొప్పు.

మఱియు నిటఁ గరుణరసము ప్రధానమైనచో, దాని యంగములైన యుత్కంఠా చింతలు వాచ్యములు కాఁగూడదు.

శాంతరసము ప్రధానమైనచో, దానిని ప్రబలము సేయుటకుఁ గైకొనఁబడిన కరుణరస సంచారిభావములు వ్యంగములైన సూచ్యమైన శాంతికి వ్యవధాన మేర్పడుఁగాన రసికజనరంజనము తొందరగాఁగాదు. వాచ్యములగుటయే మంచిది. కావున వాచ్యములైన యుత్కంఠాదు లిచ్చటఁ గణ్వునియందు నొలకొనిన శాంతరసము సూచించుటయందే పర్యవసాన మందుచున్నవి.

ఇట్లు రసములు సాధించుటచే మహాకవిగారి సముచిత సరససంధాన చాతురి వెల్లడి యగుచున్నది. స్థిరమైన శాంతరససిద్ధి కణ్వుని యౌచిత్యమును బోఁగొట్టక నిల్పుకొనుచున్నది. కరుణరస ప్రతిఘటన ప్రబలముగ సూచితమై యప్పుడు కావలసిన కరుణ రస సమృద్ధిని దక్కువగాకుండఁజేయుచు వాత్సల్య పోషణ మొనర్చుచున్నది. మైత్రీకరుణా ముదితోపేక్షలభావన ఋషి కనుచితముకాదు.

ఆప్రసంగమునకుఁ గావలసిన కరుణరసమును అంగముగఁ జేసియు, మహర్షి యౌచిత్యమును నెలకొల్పఁ గలిగిన శాంతరసము నంగిగఁ జేసియు ధ్వని ప్రస్థానమునఁ దాండవమాడించిన మహాకవి కాళిదాసుః యౌచిత్యపక్షపాతము నిరర్గళ ప్రతీతి వహించుచు "అనౌచిత్యా దృతే నాన్య ద్రసభంగస్య కారణమ్" అనెడి లాక్షణిక గ్రామణులకు మార్గదర్శి యగుచున్నడు.

---

# ప్రణయలేఖ

కోమాండూరు కృష్ణమాచార్యులు గారు

స్వస్తి రాణాప్రతాపాన్వవాయజలధి-చంద్ర, రాజేంద్ర, భవదీయ చరణయుగము
ఫాలతలమునఁ జేర్చి యీ పద్మనయన-వ్రాయులేఖార్థములు దయాపరత వినుము.

మొగలుసామ్రాజ్య విషవృక్ష మూలకంద-మార్యమత సౌధవార్ధి కౌర్వానలంబు
వైదికాచారఫలవృక్ష పరశుధార-మోహినీమానధనపశ్యతోహరుండు
క్రూరుఁడగు పాదుషా యలంఘీరుఁ డిపుడు-సకల సైన్యసమేతుఁడై సంగరమున
రూపనగరపుకోటను రూపుమాపి-నన్నుఁ గొనిపోవ నిదె వచ్చియున్నవాఁడు

వీరభటతుంగభంగవిభీషణంబు - భయదకుంజరమకరవిభ్రాజితంబు
ఉత్తమాశ్వికఝంఝానిలోద్ధతంబు-నైన మ్లేచ్ఛబలాంభోధి యల్పమైన
ద్వీపమునుబోలె ముంచు మదీయదుర్గ-మార్య, యనుమాన మావంతయైన వలదు.

ఉత్తమక్షత్త్రవంశమం దుద్భవించి-మానవతినైన యొకకాంత మనుజనాథ,
హవ్యవాహనశిఖలకు నాత్మదేహ-మర్పణము సేయుఁగాని మ్లేచ్ఛాధమునకుఁ
దరుణినై రాజపుత్రు లౌదలలు వంప-నుభయలోకవిదూరనై యుండునెట్లు.

లలితకీరాంగనకు బిడాలంబుఁదగునె-కలరవాంగన కొకయులూకంబు దగునె
కమలవల్లికి కంటకద్రుమము సనునె-భ్రమరతరుణికి పిచుమందసుమము సనునె
హరిణకన్యక నృకమున కర్హయగునె-రాజసింహుని కర్హ యీ రాజవదన
గోవుమాంసంబు దినుతురుష్కునకుఁదగునె.

భానుకులదీప! నీరాణివాసమందు-లలిత లభిజాత లఖిలకలాప్రపీణ
లెందఱో యుందు రైన నుపేక్షవలదు-ఆడుకూయిని జెనియొగ్గియాలకింపు
మార్త నసహాయ నబల ననన్యశరణ-నాత్మనాథునిగా నిన్నె యహరహంబుఁ
దలఁచుచుండినదాన నుదారచరిత!

మానసింహుఁడు మున్నుగా మనుజపతులు-దుష్టమ్లేచ్ఛాధములపాదధూళిఁ ద్రుంగి
మౌళిమాణిక్యమకుటముల్ మైలపడఁగ-చంద్రసూర్యాన్వవాయసంజాతలైన
విమల రాజన్యకన్యల వినుతమతుల-నల తురుష్కులయిండ్ల భోగాంగనలుగ

నిలిపి క్షత్త్రియతేజంబు నీటఁ గలిపి-సంతతముఁ దాము ఖుష్‌రోజు సంతలందు
నాత్మవనితల మానంబు నమ్ముకొనుచు-సడుపుకూడు భుజించిరి పాపమతులు.

నిర్గమనమార్గశూన్యంబు దుర్గమంబు-నైన యక్బరు పాదుషా యాలయమున
చక్రవర్తియె యేకాంతసమయమందు-రతిసుఖము వేఁడ నిజకఠారంబు వెలికి
సార్వభౌమ విశాలవక్షఃకవాట-పాటనోద్యోగమున నున్న పరమసాధ్వి
దివ్యసుందరి పృథ్వీరాడ్దేవి యొకతె-క్షత్త్రకులభూషణంబగు క్షత్త్రియాణి.

రఘు దిలీప భగీరథ రామచంద్ర-భూమిపాలురనుండియుఁ బూజ్యమైన
ఉత్తమక్షత్త్రియాన్వయం బుర్వి నిపుడు-మ్లేచ్ఛసంపర్కమునఁ జేసి తుచ్ఛమయ్యె.
బాప్పరావలువంశాబ్జభానుఁడైన-యొక్క రాణాప్రతాపసింహుం డఖర్వ
శౌర్యమంగీకృతారినిశాతఖడ్గ-ఖండితాచ్ఛిద్ర కర్ణరక్తప్రవాహ
వాహినులలోన దుర్యశఃపంకమెల్ల-క్షాళన మొనర్చి యూర్జితక్షాత్రతేజ
మవని వెలిఁగించె రాజమార్తాండుఁ డతఁడు.

అట్టి మహనీయువంశాబ్ధి నవతరించి-కవచ ఖడ్గాది యుద్ధోపకరణచయముఁ
దాల్చియున్నట్టి క్షత్త్రియోత్తముఁడ వీవు-రాజసింహమ, రణరంగరామచంద్ర,
ఒక్కయబలావనము నీకు వెక్కసంబె?

యవనులందఱు జయము నిక్కువ మటంచు-మధుర మైరేయ పాన విమత్తు లగుచుఁ
గామినీగోష్ఠిఁ గన్నులు గాన రిపుడు-పర్వతాకీర్ణమైన యీపత్తనమున
భవదనీకాస్త్రదావపావకశిఖాలి-కింధనప్రాయమగుఁ గాక యీబలంబు
హల్దిఘాటున యువరాజహస్తిపైకి-శీఘ్రగత శిశోదియా వంశసింహ మొకటి
శాతకుంభనఖాంకురోపేత మగుచు-విక్రమించుట విందుము వీరపురుష!
భవ్యచారణసుకుమార భణితులందు-అట్టి వంశక్రమాగతంబైన శౌర్య
మధిప, నీలోన నవ్యక్తమగుచు నిలిచె-దాని వెలిపుచ్చుటకు నిదె తరుణమబ్బె
బాప్పరావలుఖడ్గోగ్రభానుఁ డిపుడు-మరల భువనైకపూజ్యుఁడై వరలుఁగాత!

ఖడ్గమాత్రద్వితీయుఁడౌ క్షత్త్రియునకు-మూఁడులోకంబులయినను నీడుగావు
అల జనస్థానమునఁ బిశితాశనులను-ఖలుల ఖరదూషణాది రాక్షసుల నొకఁడె
చాపమాత్రద్వితీయుఁడై సమరభూమి-ఖండితులఁ జేసె రాఘవాఖండలుండు
ఆహవంబున రిపులఁ జెండాడి యాడి-ధాతునిర్ఝరసహిత భూధరముభంగిఁ

బుష్పితోన్నతకింశుక భూజమట్లు-చాపకోటిని ధరనూఁది శ్రాంతుఁ డగుచు
రణరసాఖండమున నున్న రాఘవునకు-జానకీగాఢకుచపరిష్వంగ మపుడు
ఖరశరవ్రణసంధానకరణి యయ్యె-యాదవాన్వయజలధిసుధాకరుండు
రాధికావల్లభుఁడు భోజరాజసుతను-రుక్మి మున్నగు రాజుల రూపుమాపి
బాలఁ బరిణయమాడఁడే బాహుశాలి

నరకదనుజాస్త్రఘాతవినష్టచేష్టి-తాత్ముఁడగు వల్లభునకు సత్యాకుచోత్త
రీయవాయువు పీయూషపేయ మయ్యె-అబలలైనను సుక్షత్త్రియాభిజాత
లరుల నిర్జించి పురుషుల నరయఁగలరు.

యాదవానీకవారాశి నాక్రమించి-దైవతాధిపసూనుఁ డుద్దండవృత్తి
వాసుదేవుని చెలియలి వనరుహాక్షిఁ-దాను గొంపోవఁడే సుభద్రాకుమారి.

వీర, యష్టవిధోద్వాహవిధులయందు-రాజులకు నొప్ప గాంధర్వరాక్షసములు
మధురతమములు వీరసమ్మతము లగును-తగుదునని వ్రాయుటయుఁ గాదు ధరణినాథ!
పంకమగ్నద్విపేంద్రంబుపగిది నున్న-జనకు నసహాయతయు మానధనము వోక
భావి దుస్థితియును నీదుపైని వలపు-తుచ్ఛమ్లేచ్ఛాధమునిపొందు నచ్ఛకీర్తి
క్షాత్రధర్మంబుఁ గామినీచాపలంబు-వంశగౌరవమును రాజవంశతిలక!
ఇన్నియునుగూడి చిత్తంబు నెరియఁ జేయ-నిది యకార్యము కార్యమం చెఱుఁగలేక
స్త్రైణజనులకు (?) భూషణప్రాయమైన-సహజశాలీనతను వీడి శంకదక్కి-
ఇట్లు వాచాటనైతి మహీతలేంద్ర!

రణమహాయజ్ఞదీక్షావిరామమందు-యవనరక్తౌఘనిర్ఝరాంబువులలోన
నవభృథార్ద్రశరీరుండవైన నిన్ను-గాఢకూర్పాసఖండనక్షమకఠోర
పీవరస్తనయుగ్మనిష్పీడ్యమాన-వక్షునిగఁ జేసి ధన్యనై వరలుదాన

ఈ వృథేక్షవహించితివేని నాథ, వినుము దెల్పెద హవ్యవాహనుఁడు దక్క-
అన్యుఁ డొకమర్త్యుఁ డీదేహ మంటు నెట్లు-ఆజ్యధారావివర్ధమానాంగుఁ డగుచు
జ్వాలమాలాకులాభీల జటిలుఁడగుచు-సప్తజిహ్వాంచలోల్లిఖితస్వస్తి
యగుచు వైహాయసంబెల్ల నాక్రమించి-దక్షిణావర్తశిఖల నదభ్రమూర్తి
వెలుఁగు వైశ్వానరోగ్రకీలల మదీయ-దేహకుసుమంబు వ్రేల్చి సతీత్వ మంది

యవనవీరులగుండియ లవియుచుండ-సద్గతికి నేగుదాన నిశ్శంకవృత్తి
కజ్జలాశ్రుల నీ పత్త్రకంబుమాసె-కన్నుగవ బాష్పపూర్ణమై కానరాదు.
హస్తకంపంబుచే వ్రాయ నలవిగాదు-జడత హృదయంబు పాషాణసదృశ మయ్యె
శరణ మన్యమెఱుంగ నీచరణదాసి-నీటనైనను బాలమున్నీటనైన
ముంచినను దేల్చినను నీవె పుణ్యమూర్తి-ప్రార్థనాంజలి ఘటియించి పరమభక్తి
వేఁడుచుంటిని భువనైకవీర, నిన్నుఁ-జిత్తమెటు లటు సేయుము జీవితేశ,
ఏకలింగవిభుండైన యిందుధరుఁడు-జన్యమున నిన్ను నెపుడు రాజన్యతిలక,
మనుచుఁగావుత విజయసంపద లొసంగి.

---

## ఆర్తుఁడు

మక్కపాటి వేంకటరత్నకవి గారు

హర్షాశ్రుధారఁ బాద్యం బొసంగెద నీకు-దయచేయుమయ్య బృందావిహారి,
విమలభక్తిరసాయనము నర్ఘ్యమిచ్చెద-స్వీకరింపుము రుక్మిణీకళత్ర,
అకలుషచిత్తసింహాసనంబు ఘటింతు-వేంచేయు మో శిఖిపింఛహారి,
పరిపక్వ మగు నాత్మఫలరాజ మర్పింతు-నారగింపుము దుర్భరార్తిహరణ,
నాకు నీకంటె నాప్తులు నీకు నన్ను-వంటి దయనీయు లింక నెవ్వారు గలరు?
సత్వరంబుగ నన్ను గటాక్షంబు సేయఁ-బోలదే నీకుఁ గరుణాప్రపూర్ణహృదయ?
దారుణార్తి నైదాఘవాతముల సుడిసి-తావకీనదయారసధార నానఁ
జిత్త మెప్పుడునుం బ్రతీక్షించుఁ గృష్ణ-జలదధారకు వానకోయిలవిధాన.
శర ణన్న ద్రౌపదీసతినిఁ గావఁగలేదె-మితిలేని వస్త్రసంతతు లొసంగి
కరిరాజు భూరిదుఃఖమును బాపగలేదె-కడపి నక్రమును జక్రంబుచేత
గోపికాజనముల గోడడంపఁగలేదె-గోవర్ధనముఁ గొనగోట నిల్పి
మునిజనంబుల తాపమును దొలంపఁగలేదె-విసుమాపు దుష్టరాక్షులఁ గూల్చి
భక్తిసేయనో మొఱలిడు పటిమలేదో-సక్తి పొసఁగదో నీపదాబ్జములు చిత్త
సరసి నిల్పనో కర్మపాశములు ద్రెంపి-యేల ననుఁ గావరావు గోపాలదేవ?

---

# సంస్కృతప్రాకృతభాషలు

శ్రీ పరవస్తు వెంకటరామానుజస్వామి గారు, యం.,ఏ.

మన హిందూదేశమునందలి సంస్కృతప్రాకృతాది భాషలకును 'యూరప్' ఖండమునందలి 'గ్రీక్, లాటిన్ ఇంగ్లీష్, ఫ్రెంచ్' మొదలగు భాషలకును ధాతువుల లోను, ప్రత్యయములలోను వ్యాకరణవిషయములలోను విశేషసంబంధ మగపడుటచే నివి యన్నియు నేకభాషాజన్యములనియుఁ, గాఁబట్టి వీని నన్నిటిని ఒకభాషాకుటుంబమని వ్యవహరింపవచ్చుననియు భాషాశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఈకుటుంబమునకు 'ఇండో-యూరపియన్' భాషాకుటుంబమని నామకరణముచేసిరి. ఈకుటుంబములోని భాషలలోనెల్ల సంస్కృత భాష ప్రాచీనతమమైనదగుటచేఁ బూర్వము భాషాశాస్త్రజ్ఞులు దానినే మూలభూతమగు భాషయని తలంచుచుండిరి కాని క్రమముగాఁ బ్రబలకారణము లగపడుటచే నీయభిప్రాయమును వారు మార్చుకొని సంస్కృతము, 'గ్రీకు, లాటిన్' మొదలగు భాషలన్నియును మూలభూతమగు మఱియొక భాషనుండి జన్మించినవని తలంచి యట్టిదానిని 'ఇండో-యూరపియన్' మాతృభాషయని వ్యవహరింప సాగిరి. ఆకాలమునందే హిందూదేశములోని ప్రాకృతాది భాషలకు సంస్కృతము మూలమని తలంచుచుండిరి. ఇట్లు వారు తలంచుటకు మనవారిచే రచియింపఁబడిన ప్రాకృత వ్యాకరణములే ముఖ్యములగు నాధారములు.

ప్రాకృతవ్యాకరణములలో నెల్లఁ బ్రాచీనతమమైనదగు వరరుచియొక్క ప్రాకృతప్రకాశమునందుఁ బ్రాకృతభాషలన్నియు సాక్షాత్తుగాఁగాని, పరంపరగాఁగాని సంస్కృతమునుండి జనించినవని చెప్పఁబడి యున్నది. ఈగ్రంథమున వరరుచి మహారాష్ట్రీ, శౌరసేనీ, మాగధీ, పైశాచీయను నాలుగు భాషలకు వ్యాకరణమువ్రాసెను. మహారాష్ట్రీ భాషానుశాసనము చివరను "శేషః సంస్కృతాత్" (౯-౧౮) అను సూత్రమును వ్రాసియున్నాఁడు. దీనికి భామహుఁడీక్రిందివిధముగా వ్యాఖ్యానము చేసియున్నాఁడు. "ఉక్తాదన్యః శేషః ప్రత్యయసమాస తద్ధితలిఙ్గవర్ణకాదివిధిః శేషః సంస్కృతాదవగన్తవ్యః." శౌరసేనీ పరిచ్ఛేదప్రారంభమున "శౌరసేనీ॥ ప్రకృతిః సంస్కృతమ్" (౧౨-౧-౨) అని చెప్పియున్నాఁడు. మాగధీ, పైశాచీ భాషలను వర్ణించు పరిచ్ఛేదములను "ప్రకృతిః శౌరసేనీ" (౧౧-౨; ౧౦-౨) అను సూత్రములతోఁ బ్రారంభించియున్నాఁడు. ప్రాకృతవ్యాకరణకర్తలలో నెల్ల ముఖ్యుఁడగు హేమచంద్రుఁడు కూడ నిట్టి యభిప్రాయమునే కలిగియున్నాఁడు. అతని ప్రాకృతవ్యాకరణప్రారంభమున "ప్రకృతిః సంస్కృతమ్ తత్ర భవం తత ఆగతం వా ప్రాకృతమ్" (౮-౧-౧) అని వ్రాసియున్నాఁడు. ఇట్లే మిగిలిన ప్రాకృతవ్యాకరణకర్తలు కూడఁ బ్రాకృతభాషలన్నియు సంస్కృతజన్యములని చెప్పియున్నారు. వీరందఱును వర్ణాదేశవర్ణలోపవర్ణాగమాది సాధనములచేఁ బ్రాకృతభాషాపదములను సంస్కృతపదములనుండి సిద్ధింపఁజేసియున్నారు. కాని విమర్శింపఁగా వీరి యభిప్రాయము సరిగానున్నట్లు తోఁచుటలేదు. సంస్కృతప్రాకృతభాషల తత్త్వములను బరిశీలించి ప్రాకృతభాషలు సంస్కృతభాషాజన్యము లనుట సమంజసము కాదనియు, నంతకంటె సంస్కృతము ప్రాకృతభాషాజన్యమనుట న్యాయమనియు భాషాశాస్త్రజ్ఞు లభిప్రాయపడియున్నారు. వారట్లు తలంచుటకుఁ గారణములను గొంతవఱకీక్రిందఁ బొందుపరచుచున్నాను. కాళిదాసాది మహాకవులచే గ్రంథములలో వ్యవహరింపఁబడినట్టిదియుఁ బాణినిచే ననుశాసింపబడినట్టిదియు నగు భాషను సంస్కృతమనియుఁ గ్రీస్తుశకమునకుఁ బూర్వము మనదేశమునందు వ్యవహారములో నుండినట్టివియు, నాటకాదివాఙ్మయమునఁ బ్రయోగింపఁబడినట్టివియుఁ, బ్రాకృతవ్యాకరణములలో వర్ణింపఁబడినట్టివియునగు భాషలను బ్రాకృతభాషలనియు భాషాశాస్త్రజ్ఞులు వ్యవహరించుచున్నారు.

వ్యవహారములో నుండు భాష యేదియైనను విశేషకాలము స్థిరముగా నుండక కాలక్రమమున మార్పులను బొంది భాషాంతరములుగాఁ బరిణమించునను విషయమును భాషాశాస్త్రజ్ఞులందఱు నంగీకరించియున్నారు. గ్రాంథికభాష మాత్రము స్థిరపడియుండుటచే వికారములను బొంద నేరదనికూడ వారిసిద్ధాంతము. అందుచే సంస్కృతభాషనుండి ప్రాకృతభాషలు జన్మించినవని– అనగా సంస్కృతభాష మారి క్రమముగాఁ బ్రాకృతభాషలలోనికి బరిణమించినదని – యంగీకరించుటకు సంస్కృతము వ్యావహారిక భాషగా నుండెనని రుజువు చేయవలసి యుండును. సంస్కృతము వ్యావహారికభాషగానుండెనని తలంచుటకు నవకాశమున్నదా లేదా యని విమర్శింపవలసి యున్నది. పతంజలి తన మహాభాష్యమున సంస్కృతము సర్వజనవ్యవహారములో లేనట్లును, శిష్టులుమాత్రమే దానిని వ్యవహరించుచున్నట్లును మిగిలినవారుసంస్కృతేతరభాషను వ్యవహరించుచున్నట్లునుచెప్పియున్నాఁడు. "కైః పునరుపదిష్టాః। శిష్టైః" (౬–౩–౧౦౯ సూత్రముపై భాష్యము) "శిష్ట ప్రయోగా దాణపయత్యాదీనాం నివృత్తి ర్భవిష్యతి" "లోకేషి కృషర్థ్యైకసిం ప్రయుజ్ఞతే దృశ్యర్థేచ దిశిమ్" (౧–౩–౨ సూత్రముపై భాష్యము) "గావీ, గోణీ" (భా.౧–౧–౧) "అణపయతి, కసి, వట్టతి, వఢతి" (భా. ౧–౩–౨) అను పదములు సామాన్యజనులు వ్యవహరించు భాషనుండి యుదాహరింపఁబడినవి. ఇవి యన్నియుఁ బాళీభాషాపదములు. అందుచే నా కాలమున (ప్రాకృత) భాష సామాన్యజనులచే వ్యవహరింపఁబడుచుండినట్లు స్పష్టపడుచున్నది. శిష్టులు మాత్రము సంస్కృతమును మాటలాడఁ గలిగియుండిరి. శిష్టులనఁగా నెవరు? వైయాకరణులు; అనగా వ్యాకరణ శాస్త్రము నభ్యసించినవారని పతంజలియే చెప్పియున్నాఁడు. "కేపునః శిష్టాః । వైయాకరణాః" (౬–౩–౧౦౯ సూత్రముపై భాష్యము) వారైనను వ్యాకరణము నభ్యసించుటచేతనే సంస్కృతము మాటలాడఁ గలిగియుండిరి. వ్యాకరణము నభ్యసింపనిది సంస్కృతమున మాటలాడుటకు రాదని పతంజలి చెప్పియున్నాఁడు.

"శిష్టజ్ఞానార్థాష్టాధ్యాయీ...నూనమస్య దైవానుగ్రహ స్వభావో వా యోఽయం నచాష్టాధ్యాయీమధీతే యే చాత్రవిహితాః శబ్దా స్తాంశ్చ ప్రయుజ్క్తే"(౬–౩–౧౦౯ సూత్రముపై భాష్యము) వ్యాకరణసహాయమున సంస్కృతమును నేర్చినవారు (శిష్టులు)కూడ నన్ని సమయములయందును సంస్కృతము నుపయోగించుట లేదట. యజ్ఞకర్మలయందే సంస్కృతమున వ్యవహరించుచుండిరి. "యర్వాణస్త ర్వాణో నామర్షయో... యజ్ఞే పునః కర్మణి నాపభాషన్తే" (భా. ౧–౧–౧–) సామాన్యవ్యవహారమునకు పాళీ(ప్రాకృత) భాషనే యుపయోగించుచుండిరి. మఱియు సంస్కృతము వ్యవహారములో నుండినయెడల వ్యాకరణము నభ్యసింపనివారు వ్యాకరణవిరుద్ధములను సంస్కృత (నప) శబ్దములను ప్రయోగింతురుగాని భాషాంతర శబ్దములను బ్రయోగింపరు. పతంజలి వ్యాకరణశాస్త్రప్రయోజనములలో నపశబ్దములను బ్రయోగింపకుండుట యొకటియని చెప్పి ("బ్రాహ్మణేన నమ్లేచ్ఛితవై నాపభాషితవై! మ్లేచ్ఛో మా భూమేత్యధ్యేయం వ్యాకరణమ్." భా. ౧–౧–౧) యీ యపశబ్దములకు "హేలయః, గావీ, గోణీ" మొదలగు ప్రాకృతరూపముల నుదాహరించియున్నాఁడు. తెలుఁగుభాషయందు "వస్తాడు, పోతాడు,నుయ్యిలు, నాలికె" మొదలగునవి యపశబ్దము లగును. గాని "బరుత్తాను, పోసుత్తాను, బావిగళు, నాలిగె" మొదలగు భాషాంతరశబ్దములపశబ్దములు కానేరవుకదా! ఇంగ్లీషు భాషలో comed, goedఅను మొదలగునవి యపశబ్దములగునుగాని "వచ్చెను, వెళ్లెను" అను మొదలగునవి కానేరవుగదా! అట్లే సంస్కృతమున "గచ్ఛతే, ఏధతి, హరిస్య" అను మొదలగునవి యపశబ్దములగునుకాని "గావీ, అణపయతి వట్టతి" అను మొదలగు భాషాంతరశబ్దము లెట్లగును? పతంజలి సంస్కృతశబ్దములను పాళీశబ్దములను నెఱుఁగును గాని సంస్కృతములోనే వ్యవహారవశమువలన గలిగిన యపశబ్దముల నెఱుఁగడు. పతంజలికి నపశబ్దమునగా పాళీ (ప్రాకృతము)యని తాత్పర్యము. సంస్కృతము సామాన్యవ్యవహారములోనే యుండినయెడల నపశబ్దములు పతంజలికిఁ దెలిసియుండును.

పతంజలిమహాభాష్యమునుబట్టి యీ క్రిందివిషయము లూహింపఁదగియున్నవి. (౧) పూర్వము మనహిందూదేశమున సామాన్యజనులు పాళీభాష నుపయోగించుచుండిరి. (౨) శిష్టులుకూడ లోకవ్యవహారమున కాభాషనే యుపయోగించుచుండిరి! మతసంబంధమగు కర్మలలో మాత్రము సంస్కృతము నుపయోగించుచుండిరి. (3) శిష్టులుకూడ వ్యాకరణశాస్త్రసహాయముననే సంస్కృతమును నేర్చుకొనుచుండిరి. కాబట్టి వేదమునుండి భేదమును జూపు నుద్దేశముతో యాస్కపాణినులు సంస్కృతమును భాషయని వ్యవహరించిరికాని లోకములో వ్యవహరింపఁబడుచున్నదని చెప్పుటకై కాదు.

సంస్కృతము వ్యవహారములో నుండలేదనుటకు దేశాంతరీయుల గ్రంథములుకూడ నిదర్శనము లగుచున్నవి. క్రీస్తు జన్మించుటకు నాలుగైదు వందల సంవత్సరములకుఁ బూర్వము 'గ్రీక్' దేశస్థులు మనదేశమునకు వచ్చియుండిరి. వారి యాకాలపు గ్రంథములలో మనదేశములోని పట్టణనామములును, పురుషనామములును గనఁబడుచున్నవి. వానిని వారు సామాన్యజనవ్యవహారమునుండి గ్రహించి యుండవలయును. అవి యన్నియును ప్రాకృత భాషారూపములకు సరిపడుచున్నవి. కాని సంస్కృత రూపములకు సరిపడుట లేదు. ఉ. "సంద్రకొత్తుస్" ప్రా. చంద్రగొత్త, చంద్రకొత్త; సం. చంద్రగుప్త), "సోఅనెస్" (ప్రా. సుఅణ్ణ; సం. సువర్ణ) "పాలిబోత్ర" (ప్రా. పాడలివుత్ర, పాడలివొత్ర, సం. పాటలీపుత్ర( "ఏరణ్ణోబోఅస్" (ప్రా. హిరణ్ణబాహ, సం. హిరణ్యవాహ;)"పుకలాఒతిస్ (ప్రా. పుకలావతి, సం. పుష్కరావతి) ('రాయల్ ఏష్యాటిక్ సొసైటివారి ౧౯౧౪ సం.రపు పత్రికకు ౮౧ పుట). ఇందుచే 'గ్రీక్, దేశస్థులు మనదేశమునకు వచ్చిన కాలమున ప్రాకృతభాషలు వ్యవహారములో నుండినవి కాని సంస్కృతము వ్యవహరింపఁబడు చుండలేదని తెలియుచున్నది. పాణినికాత్యాయనుల కాలముననే 'గ్రీక్' దేశస్థులు మనదేశమునకు వచ్చియుండిరి. వారికాలముననే కాక యెన్నడును సంస్కృతము వ్యవహారములో లేదని యీ భాషయొక్క స్వరూపమే తెలుపుచున్నది. వ్యావహారిక భాషయందు పదములు విడిగానుండును గాని వానికి సంధిచేయఁబడి యుండదు. దీర్ఘసమాసములు వ్యవహారమునకుఁ బ్రతిబంధకములు ఇట్టి కారణములచే సంస్కృతభాష యెన్నఁడును వ్యవహారములో నుండలేదనియు, వైదికభాషను సంస్కరించి వైదికకర్మల నాచరించు కాలమున నుపయోగించుటకు మన యార్యులు యేర్పరచిన భాషయనియుఁ జెప్పవచ్చును. వ్యావహారికభాష కానప్పుడది వికారములను బొందుట కవకాశము లేదు. ప్రాకృతభాషలు కాని, తదితరభాషలేవియును గాని దానినుండి జన్మించినవని చెప్పుటకు వీలు లేదు.

సంస్కృతభవములు కాకపోవుటయే కాక ప్రాకృత భాషలు సంస్కృతమునకంటె ప్రాచీనములనుటకు గూడఁ గొన్ని నిదర్శనములు గలవు. ప్రాకృతభాషలకు సహజములగు వర్ణవికారములతోఁ గూడిన పదములు సంస్కృతమునఁ గొన్ని కలవు. అవి సంస్కృతభాషలోనికిఁ బ్రాకృతభాషలనుండి ప్రవేశించినవని యంగీకరింపవలసియున్నది. పట్టణ, క్రోష్టు, గోవింద, నారిష, విచ్ఛిత్తి, దురుత్తర, రుక్ష, మసృణ మొదలగు పదములు ప్రాకృత భాషా పదములైనట్లు వాని స్వరూపములే చెప్పుచున్నవి. మరియు పాణినీయధాతుపాఠములో ప్రాకృతధాతువులు విశేషముగా నున్నవి. వైదికభాషయందే ప్రాకృత భాషా సంప్రదాయముల ననులంబించిన పదములు కొన్ని కలవు. గేహ: గృహ, కుట: కృత, నిఘంటు: నిర్గ్రంథ, సుగ్గులు: సుంసులు, పడ్భిః: పద్భిః, గభస్తి: గ్రభస్తి, భుజ్: భ్రుజ్ మొదలగు పదములు వేదమున పైనుదాహరించినట్లు ద్వివిధముగా బ్రయోగింపఁబడి యున్నవి. వీనిలో మొదటి రూపములు రెండవవానినుండి ప్రాకృతవర్ణవికారముల ననుసరించి కలిగినవని స్పష్టముగాఁ జెప్పవచ్చును. మరియు, త్వమ్ వరేణ్యమ్, తుర్యమ్, మర్త్యాయ, స్వధ్వరమ్ మొదలగు పదములు వేదమున నప్పుడప్పుడు 'తుఅమ్, వరేణియమ్, తురియమ్, మర్తిఆయ, సుఅధ్వరమ్' అను రీతిగా వర్ణాగమములతో నుచ్చరింపవలసి యుండును. ఇది కూడఁ బ్రాకృతభాషోచ్చారణ రీతులలో నొకటియని మన మెరుగ

దుము. అందుచే వేదకాలమునందే ప్రాకృతభాషలు ప్రారంభమైనవని చెప్పవచ్చును.

ఋగ్వేదాది వైదికగ్రంథములలో మనకగపడు భాష గ్రాంథికభాష కాని వ్యావహారికభాష కాదు. వైదికయుగమునందు వైదిక భిన్నములగు మరికొన్ని భాషలు వ్యవహారములో నుండినవి. వానికిని, వైదికభాషకును విశేషభేదము లేకపోవచ్చును. కాని ప్రాకృతభాషలలో నగపడు వర్ణవికారములు కొన్ని వైదికయుగమునందే ప్రారంభమై యాకాలపు వ్యావహారికభాషలో నగపడుచుండెను. కొంతకాలమున కా వ్యావహారికభాష విశేషవికారములను బొంది పాళీభాషగా నేర్పడెను. అప్పుడీ భాషకును, వైదికభాషకును విశేషభేద మగపడుటచే మన పూర్వుల ప్రాకృతజనులచే వ్యవహరింపబడుచున్న యీ భాష వైదికకర్మలలో నుపయోగింప యోగ్యము కాదని తలంచిరి. దీనికి బౌద్ధమత ప్రచారముకూడఁ గొంతకారణము కావచ్చును. బుద్ధుఁడు తనమతమును ప్రాకృతభాషలో జనులకు బోధించెను. బౌద్ధమతగ్రంథములు కూడ పాళీ(ప్రాకృత) భాషలో వ్రాయఁబడినవి. అందుచే మనవారు వైదికభాషను సంస్కరించి మతసంబంధములగు కర్మలలో నుపయోగించుటకు సంస్కృతభాష నేర్పరచిరి. ఈసంస్కారము వైదికయుగమునందలి గ్రాంథికభాషకంటె వ్యావహారికభాషకు జరిగెననుట న్యాయ్యము. వ్యవహారములోనున్న భాషను ప్రాకృతభాషయని వ్యవహరించుటలో నసమంజస మేమియును లేకపోవుటచే వైదికయుగమునందలి యీ సంస్కరింపఁబడిన భాషనుగూడఁ బ్రాకృతమని(మూలప్రాకృతమని) వ్యవహరింప వచ్చును. ఆ(మూల) ప్రాకృతమును సంస్కరింపఁగా సంస్కృతభాష యేర్పడినది. అది స్వాభావికములగు పరిణామములను బొంది పాళీ(ప్రాకృత) భాషలోనికి మారినది. అనగా సహజముగా వైదికయుగములోని(మూల) ప్రాకృతభాష నుండి పాళీ (ప్రాకృత) భాష జన్మించినదనియు, కృత్రిమముగా సంస్కృతభాష యేర్పరుపఁబడినదనియుఁ దాత్పర్యము. పాళీ (ప్రాకృత) భాష సంస్కృతభవము కాదనియు, వైదిక యుగములోని (వ్యావహారిక) భాషతో సంబంధించి యున్నదనియుఁ జెప్పుటకుఁ గొన్ని నిదర్శనములు కలవు. పదములకు సంధి వైదికభాషయందువలెఁ బ్రాకృతభాషయందుఁగూడ వైకల్పికము. డకారము ఋగ్వేదమునందువలె ప్రాకృతభాషలలోఁగూడఁ దరచుగా ల (ళ)కారములోనికి మారుచుండును. కొన్ని ప్రాకృతపదములకుఁ దత్సమానార్థకములగు సంస్కృతపదములకంటె వైదికపదములతో అధికసంబంధ మున్నట్లు స్పష్టముగా నగపడుచున్నది. ఉ. ఖంభ; (వై. స్కంభ; సం. స్తంభ;) ఎత్థ (వై. ఇత్థా; సం. అత్ర) మరియు సంస్కృతమునఁ బ్రయోగింపఁబడనట్టియు వేదమునందగపడునట్టియుఁ గొన్ని ప్రత్యయములు ప్రాకృతమున సర్వసామాన్యముగాఁ బ్రయోగింపఁబడు చున్నవి. ఉ. పుత్తాసో (వై. పుత్రాసః; సం. పుత్రాః). పుత్తేహిం (వై. పుత్రేభిః; సం. పుత్రైః) మరియు ప్రాకృతములోని "తవే, తఏ" అను తుమున్నర్థకప్రత్యయములును "తూణ, ఊణ" అను క్త్వార్థకప్రత్యయములును వైదికభాషలోని యేతదర్థకప్రత్యయములతో సంబంధించియున్నవి. కృధాతువు వేదమునందువలెఁ బ్రాకృతభాషలో 'కుణ' అను రూపమును బొందుచున్నది. ఇట్టి సామ్యములున్నను ప్రాకృతభాషలు వైదికభాషనుండి జన్మించినవని చెప్పుటకు వీలు లేదు. వైదికభాషయందుగూడ నగపడని రూపములు కొన్ని ప్రాకృతభాషలలో (గలవు). ప్రాకృత వ్యాకరణములలో బోధింపఁబడిన పదాదేశములలో ననేకములు వైదికవాఙ్మయమునం దగపడుట లేదు. ధాత్వాదేశములుకూడ నట్లేయున్నవి. మరియుఁ గొన్ని ప్రాకృతభాషలలో క్త్వాప్రత్యయము 'దాణి'యను రూపమును బొందుచున్నది. ప్రథమైకవచన మేకారాంతముగా నున్నది. ఈ పదములును, ప్రత్యయములును వైదికయుగములోని వ్యావహారిక భాష (మూలప్రాకృతము)లో నుపయోగింపఁబడినవని తలంపవలయును. పై యాధారములచేఁ బాళీ(ప్రాకృత) భాష వైదికయుగమునందుఁ బ్రాకృతజనులచే వ్యవహరింపఁబడుచుండిన భాషనుండి జన్మించినదని నిశ్చయింపఁ బడినది. ఈ భాష పాణిన్యాది వైయాకరణుల కాలమునకు వైదికభాష నుండి విశేషముగా మారి పాళీభాషగా నేర్పడుటచే

శిష్టులు దీనిని వైదికకర్మలలో నుపయోగించుట కిష్టపడక వైదికకర్మలు ప్రారంభమైన వైదిక యుగములోని భాష(ల)ను సంస్కరించి సంస్కృతభాష నేర్పరచిరి. అందుచే సంస్కృతము పాళీ(ప్రాకృత)భాషయొక్క పూర్వావస్థయగు (మూల) ప్రాకృతభాషనుండి యేర్పడినదని చెప్పవలయును.

కాబట్టి సంస్కృతవైదిక ప్రాకృతభాషలకుండు సంబంధము నీక్రిందివిధమున చూపవచ్చును.




వైదికయుగమునందు వేదములలో నగపడు భాషనుండి కొంచెము భేదించియుండిన (మూల) ప్రాకృతభాషయొకటి వ్యవహారములో నుండినది. అది కాలక్రమమున సహజమైన మార్పులను బొంది మొదట పాళీ(ప్రాకృత)భాషలోనికిని, దరువాత నుత్తరహిందూదేశమున వ్యవహరింపఁబడుచున్న 'హిందీ, బెంగాలీ' మొదలగు భాషలలోనికిని మారినది. హిందువు లీభాషలను గర్మలయందుపయోగించుట కిష్టపడక వైదికమూలప్రాకృతభాషలనుండి సంస్కృతము నేర్పరచిరి. ఇదివ్యావహారికభాష కాకపోవుటచే నెంతకాలమైనను మార్పును బొందక యట్లే నిలిచియున్నది. శిష్టులుమాత్రము దీని నుపయోగింపగలిగియుండిరి. ఇప్పటికిని నియ్యది యిట్లు వ్యవహరింపఁబడుచునే యున్నది అంతియేకాని సంస్కృత మెన్నఁడును సర్వజనవ్యవహృతభాషగా నుండ లేదు. యాస్కపాణినులు బోధించిన స్వరాదినియమములన్నియును గర్మాచరణసమయమునం దుచ్చారణమునకేకాని సామాన్యవ్యవహారమునకుకాదు. అట్లే యైనచో వైదికప్రాకృతావస్థలకు సంస్కృతము మధ్యావస్థ యనవలసియుండును. అట్లు తలంచుటకు పైనివర్ణింపబడిన వేకాక కాలవిషయికమగు మరియొక యనుపపత్తికూడఁ గలదు. వైదికవాఙ్మయమునందలి ప్రాచీనభాగము(ఋగ్వేదసంహిత) క్రీ. పూ. 14వ శతాబ్ద ప్రాంతమున రచియింపబడినది. యాస్కపాణినులు క్రీ. పూ. 5వ శతాబ్దముననను, 4వ శతాబ్దముననను జీవించియుండిరి. క్రీ. పూ. 3వ శతాబ్దమున నశోకుని శిలాశాసనములు స్థాపింపఁబడినవి. ఇవియన్నియును సామాన్యజనులకుఁ దెలియుటకుఁగాను పాళీ భాషలో వ్రాయఁబడియున్నవి. కావున నాకాలమున పాళీభాషవ్యవహారములో నుండినదను విషయము నిశ్చయము పైని ప్రదర్శింపబడిన నిర్ణీతకాలములు సామాన్యముగా నందఱిచేతను నంగీకరింపఁబడినవి. భాషలయందు విపరిణామము లన్నికాలములయందును సమానముగానుండునుగాని యొకకాలమున శీఘ్రముగాను, మరియొక కాలమున నాలస్యముగాను కలుగుచుండవు. వైదికసంస్కృతప్రాకృతములు మనభాషయొక్క యవస్థాభేదములైనయెడలనవిమూఁడును సమానకాలవ్యవధానముగలవిగా నుండవలయును. వైదికభాష సంస్కృతములోనికి మారుటకుఁ బైనుదాహరింపఁబడి నకాలములననుసరించి 8, 9 వందల సంవత్సరములు పట్టినట్లు తెలియుచున్నది. అంత విశేషకాలమునఁ గలిగినమార్పు చాలస్వల్పముగానున్నది. వైదికసంస్కృతభాషలకు విశేషభేదములేదు. తరువాతను నూఱు నూటయేఁబది సంవత్సరములలో సంస్కృతము పాళీభాషలోనికి మారినట్లు కనఁబడుచున్నది. సంస్కృత పాళీభాషలకు విశేషభేదముకలదు. ఇదివరలో 800 సంవత్సరములలో స్వల్పముగా మారినభాష 150 సంవత్సరములలో నింతయధికముగా మారుట యసంగతము. కాబట్టి వైదికపాళీ భాషలకు సంస్కృతము మధ్యావస్థ కానేరదు. యాస్కపాణినుల కాలమున సంస్కృతము సర్వజన వ్యవహారములో నుండినదని యంగీకరించుటకును వీలు లేదు.

ఇంకను ప్రాకృతవ్యాకరణకర్తలు ప్రాకృతము సంస్కృత జన్యమని చెప్పుటకుఁ గారణము విచారింపవలసి యున్నది. ప్రాకృతభాషలలోని యనేకపదములకు

సంస్కృతభాషాపదములతో సామ్యముకలదు. సంస్కృతభాష ప్రాకృతభాషకు మూలమగు (మూల) ప్రాకృతభాషనుండియే యేర్పరుపఁబడినది. ఆ(మూల) ప్రాకృతములోని ముప్పాతికపదములు సంస్కృతమునఁ గలవని చెప్పవచ్చును. వైదికభాషకూడ వైదికయుగములోని గ్రాంథికభాషయగుటచే నా(మూల)ప్రాకృతముతో విశేషముగా సంబంధించియుండును. సంస్కృతభాషనువలె వైదికభాషనుగూడఁ బ్రాకృతము పోలియున్నది. కాని ప్రాకృతవైయాకరణులు ప్రాకృతభాషలను బవిత్రమగు వైదికభాషతో సంబంధింపఁజేయుట కంగీకరింపకపోవచ్చును. ప్రాకృతజనులచే వ్యవహరింపఁబడుటయేకాక బౌద్ధులచే నాదరింపఁబడు ప్రాకృతభాషలను వైదికభాషతో సంబంధింపఁజేయుట యధర్మముకాదా! అందుచే వారు ప్రాకృతము సంస్కృతజన్యమని చెప్పసాగిరి. వ్యావహారికేతరభాషనుండి భాషాంతరావిర్భావమసంభవమను విషయమును వారు గమనింపలేదు. మూలప్రాకృతభాష నశించియుండుటచేతను నందలి విశేషభాగము సంస్కృతమునఁ జేరియుండుటచేతను బ్రాకృతము సంస్కృతజన్యమని చెప్పుటకు వారికవకాశముకలిగెను. కాని కొన్ని పదములకు సంస్కృతసంబంధ మగపడకపోవుటచేవానిని సంస్కృతపదముల కాదేశములుగా విధించిరి. ఈయాదేశములే ప్రాకృత వ్యాకరణకర్తల మార్గము సరియైనది కాదని సూచించుచున్నవి. ఘురశబ్దముగృహశబ్దమునకును[1] హెట్ఠశబ్దము అధస్శబ్దమునకును,[2] హిత్థశబ్దము త్రస్తశబ్దమునకును,[3] కూరశబ్దముఈషచ్ఛబ్దమునకును[4] ఆదేశములట! లట్ఠిశబ్దము యష్టిశబ్దభవమట![5] మృక్ ధాతువు మల,[6] మఢ, మడ్డ[7] మొదలగు రూపములను బొందవచ్చునుగాని పన్నాడ, పరిహట్ట[8] మొదలగు రూపముల నెట్లు పొందునో! ఉగ్ఘుస, లుంఛ, ఫుంఛ, ఫుంస (ఫుస, ఫుస,) లుహ(హుల)[8] యనునవి మృజ్ ధాతువున కాదేశములట! ఇట్టి పరస్పరవిరుద్ధశబ్దములకు సంబంధమును గల్పించుటకుఁ బూనిన ప్రాకృతవైయాకరణుల సిద్ధాంతము నిజమగునా! ప్రాకృతభాషకు మూలమగు భాషకు సంస్కృతముకంటె దగ్గరగానుండుభాష యగపడకపోవుటచే నదియే ప్రాకృతభాషకుఁ దల్లియని చెప్పిరిగాని తత్త్వమది కాదని యెఱుంగవలయును. సంస్కృతభాషయే పాళీ(పాకృత)భాషకు పూర్వావస్థయగు మూల ప్రాకృతమునుండి జన్మించినదని చెప్పవలయును.

---

1. ప్రాకృతప్రకాశ. ౮-౩౨, హైమవ్యాకరణము. ౪-౨-౧౪౪.
2. హైమవ్యాకరణము. ౪-౨-౧౪౧.
3. హైమవ్యా. ౪-౨-౧౩౬.
4. హైమవ్యా. ౪-౨-౧౨౬.
5. ప్రాకృతప్రకాశ. ౨-౩౨. హైమవ్యా. ౪-౧-౨౪౭.
6. ప్రాకృతప్రకాశ. ౪-౫౦.
7. హైమవ్యా. ౪-౮-౧౨౬.
8. హైమవ్యా. ౪-౮-౧౦౫.

## శూన్యభవనము

పి. అన్నాజీశర్మ గారు

హృదయమోహనమైన యాగృహమునందె - శోకవాసనయేని పై సోకకుండ
జరిపితిమి జీవితవసంతస్వప్నకేళి - బ్రేమసంతృప్తికోర్కెల వెంబడింప.

ప్రేయసీపాదధూళి పవిత్రమైన - యాగృహమె నామనశ్శాంతి కాకరంబు
భూతలస్వర్గమై దీప్తిఁబొందలునదియె - మప్పినదినాకు మొదటి ప్రేమంపుఁదీపి.

నాయెదను, నన్ను నాజీవనమునుగూడ - స్మరణమాత్రాన దివ్యహర్షమ్మొసంగి
యమలమొనరించు నాసౌధ మరసినపుడు - నాముదమ్మున కావలిసీమ లేదు.

సురుచిరానందచంద్రికా స్ఫురితమగుచు - నాదుకనులకు పండువొనర్చునట్టి
యాగృహస్మృతి నాహృదయమ్మునందె - దాచుకొందును మరణమ్ముదాకగూడ.

రాగరంజితప్రేమ సూత్రమ్ము తోడ - నాయెదనుప్రేయసీ పాదనళినములకు
గట్టిగాఁగట్టుకొన నెన్నిగతుల నేను - ఆనిలయమందు శ్రమజెందినానో! యకట!

ఆమనోహరవృత్తాంతమంత యిపుడు - నామదినిదోచె నేని నిస్సీమమైన
బాధచే నిలువెల్లను భగ్గుమనును-కూలిపడిక్రుంగిపోదు పాతాళమునకు.

ఆగృహముశూన్య మిపుడు నాయాశవలెనె!-అకట! యామాటతలచుకొన్నంతమాత్ర
వెడలుఁ గన్నీరు, గుండె గుభిల్లుమనును- శోషిలును మేను, ప్రాణా లుసూరు మనును.

ఏనెరుంగుదు నావలెనేగృహంబు - గూడశోభావిహీనమై పాడువడియె
కాని, యేజన్మజన్మాంతరానుమేయ - బాంధవమొ! దాని నేనెడఁబాయలేను.

ప్రణయగంభీరవృత్తిఁ బూర్వంబురీతి - దినదినముపోదు నాగృహమ్మునకు నేను
మేనెరుంగకయే నిర్నిమేషదృష్టిఁ - గాంచుదునుగాని చెలిజాడగానరాదు.

నిత్యనూతనసమ్మోద నియతినొసఁగు - నాసుఖస్మృతిమరవలే నకట, నేను
పొగిలిపొగిలి ప్రాణమ్ములుపోవుదాక - తప్పనాశూన్యభవన ప్రదక్షిణముల.

దివ్యభక్తిని వినయవిధేయతలను - ప్రత్యుషస్సుల నాగృహద్వారమందు
సురభిళములైన హృదయప్రసూనదళము - లొక్కటొక్కటిగా జేర్చుచుందు నేనె.

దేవి నటియించినట్టి యాదివ్యగృహమె - యిపుడుగూడ జీవితశాంతి నిచ్చునీవి
శాలజగతీతలంపు టందాలజూపి-సఫలమొనరించు నాప్రేమసంశ్రయమును.

---

# చేమకూరవాని సారంగధర చరిత్రము

ఆంధ్రవిశారద తాపీ ధర్మారావు గారు, బి.ఏ.

చేమకూర వేంకటకవిప్రణీత విజయవిలాస కావ్యంబునకు వ్యాఖ్యానంబు వ్రాయుచుండిన యప్పు డక్కవిపుంగవుని కవితాగుణంబుం గూర్చి విశేషంబుల నారయ దలంపున నాతని సారంగధర చరిత్రమును గూడఁ జక్కఁగఁ బఠింపవలసివచ్చుటం జేసి యట్టు లొనర్చుచుంటిని. సారంగధర చరిత్ర పఠనమునకు నాకుఁ జిక్కిన పుస్తకములలో సవ్యాఖ్యానముగ నున్న దొక్కటి బ్ర. శ్రీ. మహోపాధ్యాయ వేదము వేంకటరాయ శాస్త్రి (ఇప్పుడు కళాప్రపూర్ణులు) గారిదియే. ఆ సవ్యాఖ్యాన గ్రంథమును స్థాలీపులాకన్యాయముగఁ జూచినంత నా కవిధీరుని కవితాచమత్కారమును, శిల్పవిధానమును, కళాప్రాగల్భ్యమును దెలియఁబఱచు నొండొకవ్యాఖ్యాన మత్యవసరమనునూహ నాకుఁ బొడమెను. నా విజయవిలాసవ్యాఖ్యానము పూర్తియయిన యనంతర మీ సారంగధరచరిత్రమును వ్యాఖ్యాతృదృష్టిని జదువ నారంభించితిని. గ్రంథమునందలి భావాతిశయము, 'క్షితిలో నీమార్గ మెవరికిఁ గాదు సుమీ' యన నర్హమగు రచనానైపుణియు ప్రస్తుతమున్న వ్యాఖ్యానమందుఁ బ్రకటితము గాకుండుటయే కాక కొన్ని చక్కని ముద్దుపద్యముల కర్థములు గూడ, నెంతయు నసంతృప్తికరముగ నుండుటయుఁ గాంచితిని.

ఉప్పనైనట్టి చక్కెర లప్పలేడె?
చేఁదువగ గల యమృతంపుఁ జెలమ యెనయొ?
పుల్లనుండెడి తేనె కరుళ్లు సరియె?
వనిత, కడుదియ్యనౌ నీదు వాతెఱకును. II 204.

అను పద్యమునకు శ్రీ వేంకటరాయశాస్త్రిగారు వ్రాసిన టీక.

“వాతెఱకున్=అధరమునకు, ఉప్పనైనట్టి=గొప్ప; చేఁదువగ=ముంచుకొనుక్రమము; పుల్లన్=పుడకయందు, కరుళ్లు=తెట్టెలు. చిత్రాంగి మోవిముందఱ చక్కెర భక్ష్యము లుప్పనివనియు, అమృతపుఁజెలమ చేఁదు అనియు, తేనెతెట్టెలు పులుపుగా నుండుననియు భావము” అని యున్నది.

ఇందుఁ గవికిఁ గల యూహ వాతెఱకు సాధారణముగ నుపమానములుగ నుండు చక్కెరభక్ష్యములను, అమృతపుఁ జెలమను, తేనెతెట్టెలను సకారణముగ నిరసించుట. అందుల కాయుపమానముల స్వభావగుణముల నెత్తికొని, యాగుణములయందు శ్లేషవలనఁ జెడ్డరుచిని దోఁపింపఁజేసి, వానిని (ఆయుపమానములను) తృణీకరించుచున్నాఁడు. తేనెతెట్టెలు సాధారణముగఁ బుల్లను (పుడకను) ఆశ్రయించుకొనియుండుటచేఁ బుల్లనుండుట సహజము. ఆ 'పుల్లనుండుట' యందు పులుపురుచి శ్లేషవలనఁ గానవచ్చుచున్నది. కావున దీయనగు వాతెఱకు సరికాదు. అట్టులనే 'యమృతపుఁ జెలమ' చెలమ (చిన్న ఊటబావి) యగుటచేత ముంచుకొనుట (చేఁదుట) దానికిఁ గలదు. ఆ 'చేఁదువగ' యందుఁ జేఁదురుచి కానవచ్చుటచేత నిరాకరణీయము. ఇట్లు లీరెండుచరణములను గానవచ్చు కవిభావము 'ఉప్పనైనట్టి చక్కెర లప్పలేడె' యను చరణంబునఁ గూడఁ జెప్పవలయుఁ గదా! అందునను బ్రక్రమమే ప్రధానముగ నెంచు నీచేమకూరవాని కవిత్వమునందట్టులు చెప్ప యత్నింపకున్న దోసము గూడ నగునని నన్ను మన్నింతురుగాక! కాని శ్రీశాస్త్రిగారు “ఉప్పనైనట్టి=గొప్ప” అని మాత్రము వ్రాసిరి. అది యెట్టులు చక్కెరలప్పలకు స్వభావసిద్ధమో తెలుపరైరి. ఎట్టులు 'గొప్ప' యను నర్థము లభించునో యూహింపవలయును.

నా యూహము చక్కెరలప్పలనిన చక్కెర వేసి చేసిన యప్పములు, అతిరసములఁ బోలు భక్ష్యవిశేష



శ్రీ జయపురం మహారాజుగారు

ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు రెండు లక్షలరూపాయలను, ఇర్విన్ ప్రభువుగారిపేరట గా. యస్. ఆర్. దాసుగారిపేరట స్థాపింపనున్న పాఠశాలకు లక్షరూపాయలను విరాళ మొసగిరి. ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు ప్రోఛాన్సలరుగా నియమింపబడిరి.



శ్రీ వెలగపూడి రామకృష్ణచౌడరిగారు, ఐ. సి. యస్.

జయపుర సంస్థాన మంత్రి.

ములు. ఇయ్యవి ఉప్పఁగ ఐనవి; ఉప్పుటవలన నయినవి. ఉప్పుటయన ఆవిని ఉడికించుట లేక ఉడికించుట అను నర్థము. ఈ ఉప్పుధాతువునుండియే మనకు ఉప్పుడు బియ్యము, ఉప్పుపిండి లోనగుపదములు వాడుకకు వచ్చినవి. కావున ఉప్పుటచేత (ఉడికించుటచేత) నగు చక్కిలములు అప్పలు ఉప్పనివని కవి తూలనాడెను.

బ్రౌనుదొరగారు తమ ఆధిపత్యమునందు పండితులచేత నీ సారంగధరచరిత్రమున కొకవ్యాఖ్యానమును వ్రాయించిరి.(1830లో)అందేమియుండునోయని ప్రాచ్యలిఖితగ్రంథాలయమునఁజూడ, నచ్చటఁగూడ శ్రీశాస్త్రిగారువ్రాసినయట్టులనే 'గొప్ప'యను నర్థమున్నది. ఆపండితులు టీకనువ్రాయ నుద్యమించిరే కాని విపులముగా వ్యాఖ్యానమును దలపెట్టలేదని యెంచితి. శ్రీశాస్త్రిగారు తామెంత "స్వరచితవ్యాఖ్య" యనియు, 'విపుల వ్యాఖ్య' యనియుఁ జెప్పికొనినను తాము వ్రాసిన సారంగధరచరిత్ర వ్యాఖ్య సాధారణమగు లఘుటీకయే కాని వేఱుకాదన సాహసించి, నేనిద్దానికి వ్యాఖ్యానము వ్రాసినాఁడను.

అట్లు వ్రాయుటకుఁ దగుసౌకర్యముగ నుండుటకని ముద్రితాముద్రితగ్రంథములకై వెదుకవలసివచ్చినది. ప్రాచ్యలిఖితగ్రంథాలయమునను గ్రంథములంజూచి పాఠభేదములతోనా నేర్చిన యట్టులు వ్యాఖ్య వ్రాసితిని. ఇట్టులుండ నామిత్రులు,భాషాభిమానులు నగు డాక్టరు బుఱ్ఱా శేషగిరిరావు పంతులుగారొక్కనాఁడు తమకడఁ దాటాకుపత్ర సారంగధరచరిత్ర మొక్కటి నాలుగాశ్వాసములుగల గ్రంథము కలదనియు, నావ్యాఖ్యాన సదుద్యమమున కద్దియెక్కుడుగ నుపకరింపనచ్చుననియుఁ జెప్పి, వలయునన్న నాతాళగ్రంథము నిచ్చెదమని నాయందపరిమితాదరంబున నుడివిరి. పెన్నిధిఁగన్నచందమున నత్యంతోత్సాహపూరితుండనయి, వారితోఁగూడఁ బోయి నేను 'భారతీతీర్థ'యందలి తాటియాకుకట్టల నెమకఁ బొచ్చితి. అదృష్టవశంబునఁ దెలిసియుఁ దెలియని యక్షరములతో 'సారంగధర చరిత్రము' అని వ్రాసియున్న యొక్క కట్ట మాకు లభించెను. అద్ది చెదలుదినియుండుటచేత నత్యంతశిథిలావస్థయం దుండుటయేకాక యనాదరణ కారణమున పత్రములన్నియు నొకదాని నొకటియంటి కొనుచుకొని గ్రంథమంతయు నొక్క గట్టికఱ్ఱవలె నుండెను. ఎట్టులయిన దానిని సాధింపవలయునను నభిలాషతో నాగ్రంథమును దీసికొని యట్టి యమూల్యగ్రంథము నిట్టియవస్థకుఁ దెచ్చిన శ్రీ భారతీతీర్థవారు తుంపవ్యాలు గ్రాఁజాలరని డాక్టరు శేషగిరిరావుగారితోఁ జెప్పి, నాకృతజ్ఞతను దెలిపితిని. అటనుండి వేమనా మామిత్రులగు కవిరాజ మల్లాది విశ్వనాథశర్మగారితోఁ గూడ బ్ర. శ్రీ. ఆదంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మగారిని దర్శింపఁబోయితిమి. సాంఖ్యాయనశర్మగారును గ్రంథముం జూచి 'పెట్రోలు'తో పత్రముల విడఁదీయు ప్రయత్నముచేయ నుపాయముఁ జెప్పి నాయుద్యమమును బ్రోత్సహించిరి.

నేను చూచినయంతవట్టు ముద్రితములలోఁగాని, యముద్రితములలోఁ గాని, ప్రాచ్యలిఖిత పుస్తకాలయమునగాని, వెలుపలను గాని యున్ని సారంగధరచరిత్రములును మూఁడాశ్వాసములుగనే యున్నవి. విజయవిలాస ప్రకృతింబట్టిచూచినను సారంగధర మూఁడాశ్వాసములుగనే యుండ నొప్పునని తోఁచును. కావున నిది మోసమగునేమో యను సందేహముతో మెల్లన నాగ్రంథమందలి తుది తాటియాకును మెల్లనవిడిచిచూచ నందిట్లు నున్నది.

*    *    *    *    *

గద్య. ఇతి శ్రీ సూర్యనారాయణ వరప్రసాద లబ్ధ సారస్వతసుధారస కంజాత యశోలతాంకూర చామకూర లక్ష్మణామాత్యతనూజ సమారాధిత బుధజనసమాజ, వేంకటరాజ ప్రణీతంబయిన సారంగధర చరిత్రంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము. ప్రభవ సంవత్సరాశ్వయుజ కృష్ణపంచమీ శుక్రవారమువరకు నిష్ఠల లక్ష్మీపతి సారంగధరచరిత్ర నాలుగాశ్వాసములు వ్రాసి మందపాటి లక్ష్మనరసయ్యకు చెప్పెను."

చతుర్థాశ్వాసంబనుట ప్రమాదమేమో యని సందేహించిన, నీ నిష్ఠల లక్ష్మీపతివ్రాత చక్కనిదయి నిర్దుష్టముగ నున్నదగుటయు, చతుర్థాశ్వాసము అనుట మాత్రమేకాక తెలుఁగునఁగూడఁ 'సారంగధరచరిత్ర నాలుగా

శ్వాసములు' అని వ్రాయుటయు నాసందేహమును నిర్మూల మొనర్చుచున్నది. కావున నా ప్రభనలో వ్రాసిన గ్రంథము నాలుగాశ్వాసములు గలదనియే యూహించవలయును.

మిక్కిలి శ్రద్ధతో ననేకవిధముల మహాప్రయత్నమును జేసి యెంత యప్రమత్తుఁడనయియున్నను, శైథిల్యాతిశయంబు కారణమున నా కీనాలుగాశ్వాసములును జక్కఁగఁ జదువఁదగు సదృష్టము లభించునట్టులు దోఁపకున్నయది. ఎద్దియేని యొక్క పత్రభాగమున నక్కరంబులు పొడచూపినను, ఆపత్రమును దీసి త్రిప్పునప్పుడది పొడిపొడియయి రెండవప్రక్కనుండు నక్కరములఁ జదువవల నొసఁగకున్నది. ఎందఱు శాస్త్రవేత్తలనడిగిన నుపాయాంతరము నెఱిఁగింపఁ జాలకున్నారు.

ఇప్పటికి నేను గ్రంథాదిని జూడఁగలిగిన యంత వఱ కీతాళసంపుట సారంగధరచరిత్ర

"శ్రీ లెల్లప్పుడొసంగ ..........." అనుపద్యముతో నారంభమయి, ప్రస్తుతము విజయవిలాసమునఁ జూడఁదగు నవతారిక పద్యములను గలిగియున్నట్లు తోఁచుచున్నది. ఏలయనిన,

"తమ్ములు విప్పునప్పుడు........."
"మతముల్ పాటించి ........."
"శ్రీగౌరుల్ ..............."
"ఆమూర్తమాంబ ............"
"రించె నేరాజు మేలు తేజి......"
"నగిరీటి యంతవా..........."
"టలనేర్పులా ..............."
"దయఁ మనుపురీతుల్........."
"య్యెడ నిభరాణ్ముఖో ......"
"ఘోరా ర్తిగళర క్త ........"
"సింహాసనము మాట ........."
"కీర్త్యాదార్యాధరితా ........"

అను పద్యభాగాక్షరము లటనట గానవచ్చుచున్నవి. ఇయ్యవి యెల్ల విజయవిలాసావతారిక పద్యములే యని చదువరు లెఱుంగుదురు. ఇంక, షష్ఠ్యంతముల భాగమునకావల నీతాళగ్రంథమున నొక్క నూతనపద్య నాకుఁ గానవయ్యెను.

"శ్రీకంఠున్ మునివంద్యునిన్ నిగమసం
సేవ్యునిన్ హరున్ శంకరున్
లోకాధీశుని భక్తవత్సలు దయా
ళున్ రాజచూడామణిన్
భూకాంతాను......విషధరున్
భోగీంద్ర భూషాంచితున్
నాకేశప్రముఖామరార్చితును మా
నాథున్............

అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నారచియింపం బూనిన .........."

ఇందొక్క సందేహము. విజయవిలాసకావ్యముం బట్టి చూచిన రఘునాధరాజునకును గవికిని నిష్టదైవము శ్రీరాముఁడని తెలియును. అట్టులయ్యు నవసరమును నీషష్ఠ్యంతానంతరమున నీశివస్తుతికిఁ గారణమేమగునో? ఇయ్యది చేమకూర వానిదా! కాక లేఖకుఁడగు నిష్ఠల లక్ష్మీపతి దయియుండునా? లేఖకునిదే యయినయెడల నీతఁడు తనపద్యరచనాసామర్థ్యముతో మఱియొక్క యాశ్వాసమును వ్రాసి యిందిమిడ్చియుండునా? అట్టులయినఁ గథనెట్లు సాఁగించియుండును? ఈసందేహములను నివృత్తి చేసికొనుటకు మహావిఘ్నమును గల్గించునట్టులు నాకడనుండు గ్రంథమునందలి యీభాగము శిథిలాతిశిథిలముగ నున్నది. ముట్టినయంతఁ బొడియగునట్టి యవస్థనుండుటచే నట్టి సాహసమునకుఁ బూనఁజాలకున్నవాఁడను.

కావున నాంధ్రభాషాభిమానులకు నేను గరముల జోడించి యిట్టులు విజ్ఞాపన మొనర్చుచున్నాఁడను. "భాషాభిమానులారా! తమయెడ సారంగధర చరిత్రము చేమకూర వేంకటకవి కృతము నాలుగాశ్వాసములు గలదిగా నుండినఁ దత్ క్షణము నాయందనుగ్రహించి యావార్త నాకెఱుంగఁ జేయుఁడు. నాకట్టి గ్రంథము పఠనార్థ మల్పకాలం బెరవొసంగు నభిప్రాయముండినఁ గృతజ్ఞతతో నందికొనెదను. అట్టులు నాయమూల్యగ్రం

థము నొసఁగఁ దలఁచనిపట్టున, నాకద్దానియునికి నీభారతీపత్రికావతంస ముఖంబున నెఱిఁగించిన నేనే తమ చోటికివచ్చి గ్రంథమును జూచికొను నేర్పాటులఁ జేసికొనెదను. ఇట్టి సాహాయ్యము నాకొనర్చినందులకుఁ దామెవ్వరేని ప్రతిలాభమునుం బొందనెంచిన నట్టి దానికిని నేను సంసిద్ధుఁడనయి యున్నాఁడను. నాయం దనుకంప వహించి దీని కతి శీఘ్రకాలమునఁ బ్రత్యుత్తర మొసంగిన, నాకడ సిద్ధముగనున్న మూఁడాశ్వాసముల సారంగధరవ్యాఖ్యానమునయినను ముద్రించు నేర్పాటుఁ జేసికొనెదను. కరుణింపఁ బ్రార్థింతురు."

---

# ప్ర కృ తి మూ ర్తి

హా రి త కృ త ము

"సరసిజోద్గత మాధుకరయుగిఁ బేరంట మామతించెడు చలాపాంగదృష్టి
రక్తిఁ బల్లవ నికరమ్ము రమ్మనిజీరు నధరమ్ముపై మందహాసరుచులు
స్వర్ణదీవీచికాజాలమ్ము లాలించు నార్తలోకశరణ్య మమృతకరము
తీర్థయాత్రాఫలాప్తికి మూలకందమా నఖిలవిశ్వైకసింహాసనంబు
దేవి, నాకొక్కపరిఁ జూపి తెలివిఁ దెలిపి - పారలౌకికపథము నద్వైతసిద్ధి
నందఁజేయు" మటంచు నహర్నిశంబుఁ - బ్రకృతిమూర్తిని భాగ్యదేవత భజింతు.

*   *   *   *

జలధిఁ గ్రుంకిడి దులిపి కాషాయ మాఱఁ - గట్టి, ప్రాతర్విధేయాహ్నికము ముగించి,
ప్రకృతిశాస్త్రమ్ము సాధింపఁ బయనమయ్యెఁ - బ్రాచి విడి బాల భాస్కరబ్రహ్మచారి.

*   *   *   *

అర్థులకు నాదృతిఁజూపు నలమహీజ - రాజి విమలగృహస్థధర్మమ్ము నేర్పు
సర్వభూతస్వభావ సుస్వైరవిహృతి - నఖిలజీవాళి నేర్పు నభ్యాగతులకు
దివ్యశాంతిభావముఁ బ్రసాదించునౌర! ప్రేమమహిమస్వరూపిణి విశ్వజనని.

*   *   *   *

సెలయేటియలల నుయ్యేలలూఁగి వీతెంచు నాలిపయ్యెరగాలి మేలితేట
కడుపాఱ నమ్మపా ల్గుడిచి, పచ్చికబీళ్లఁ దమి లేటిపిల్లల దుముకులాట
తలిరుజొంపముల సందిళులలో నరవిరి మొగ్గల దాగురుమూతలాట
చివురులమెసవి కచ్చెకు రెచ్చికొనరు కోయిల మొనగాండ్ర మేల్కొలుపుబాట
పెండ్లినడకలరాయంచ పేరటాండ్రు - సరసి నీఁదునయ్యాట ముచ్చటలమూట
భోగ్య మాశ్రమసీమ సౌభాగ్యమిచట - వాస మొనరించుఁ బ్రకృతివిలాసలక్ష్మి.

---

## లక్ష్మి

పారనంది జగన్నాథస్వామి గారు

(వెనుకటి సంచిక తరువాయి)

### నాల్గోఅంకము

### రామస్వామి ఇల్లు

### (1)

గవరమ్మ

(తలుపుతీసి) దద్దా, వచ్చా. అయ్యా నీకోసం గంటాయి చూస్తూ ఉన్నాడు.

గోపాలుడు

బాగా ఉన్నాడటే.

గవరమ్మ

ఏమి ఉండడము. లేచి తిరగలేడు గదా.

గోపాలుడు

ఏమి అన్యాయం. పడుచువాళ్ల లాగు ఆడడం, తిరగడం అంటే వాడికిఎంతో సరదా. పాపం మంచంమీాద పరుండి ఉండడమంటే ఎంత బాధగా ఉందోగదా.

గవరమ్మ

ఏదోమెల్లిగా ఇంట్లో కర్ర పట్టుకొని ఇటూ అటూ తిరుగుతాడు.

గోపాలుడు

పద, చూదాము పద.

గవరమ్మ

తన బాధమాట ఎత్తడు. ఎప్పుడూ ఏదో ఒక ఆలోచనే.

గోపాలుడు

పడుచుపెళ్లాం సంగతి ఏలాగుంది.

గవరమ్మ

దివ్యంగా వెలుగుతూఉంది. అది ముద్దులు ఆడుతూ కబుర్లుచెప్పుతూ ఉంటే అయ్య పరవశం అవుతూఉంటాడు.

గోపాలుడు

వాడికి కష్టంలోకూడా అదిఆలాగుసుఖపెట్టితే మనం సంతోషించ వలసిందే గదా.

గవరమ్మ

ఆఁ!

గోపాలుడు

అదంతా వేషమా ఏమిటి.

గవరమ్మ

అదంతా చెప్పితే—

గోపాలుడు

పోనీలే. పద. ఎందుకు రమ్మనమన్నాడో ఏమైనా తెలుసునా?

గవరమ్మ

స్పష్టంగా తెలియదు. బహుశా ఏదోఏర్పాటు చేస్తాడు కాబోలు.

[రామస్వామి గదిలోకి వెళ్లేరు. గోడవైపు ముఖంవిప్పి పడుకొన్నాడు. చప్పుడు విన్నా తిరగలేదు.]

గవరమ్మ

అయ్యా, దద్ద వచ్చాడు.

రామస్వామి

(తిరగకుండా) ఎవరూ?

గవరమ్మ

దద్ద. గోపాలుడు దద్ద.

[రామస్వామి తిరిగేడు. గోపాలుడు చూస్తూ ఆశ్చర్యపోయేడు. ఈ ఆరునెలల్లో అంత ముసలివాడై పోయాడు.]

రామస్వామి

వచ్చా; దా.

గోపాలుడు

నీరసంగా ఉందా.

రామస్వామి

నీరసమే ఏమిటి?

గోపాలుడు

తిరగగలుగుతున్నావు కదూ.

రామస్వామి

ఏం తిరగడం.

గవరమ్మ

అయ్యా, దద్ద ఉంటాడు. నేను తవిటమ్మయింటికి వెళ్లి ఇప్పుడే వస్తా.

(అని వెళ్లిపోయింది)

రామస్వామి

నాకు బాగాజ్ఞప్తి ఉన్నప్పుడే వ్యవహారం అంతా చక్కబెట్టి ఉంచుట మంచిదిగదా అని నీకు కబురు పంపేను.

గోపాలుడు

మక్క జారినంత మాత్రాన ఇంత తొందర ఎందుకు?

రామస్వామి

నీకు తెలియదు. ఇది మక్కజారడమే కాదు. గుండె జారిపోయింది.

గోపాలుడు

ఆ!

రామస్వామి

అవునూ. కాబట్టే వీలు వ్రాసి ఉంచుతా.

గోపాలుడు

ఎందుకు? వెంకటయ్య ఉన్నాడు కాదు.

రామస్వామి

నేను లక్ష్మిసంగతి చూస్తున్నా. దానిని పెళ్లాడి తెచ్చేను; ఏం సుఖపెట్టేను. నా తరువాత అన్నం బట్టకి దానికేమీ వెల్తిలేకుండా చేయడం నావిధికాదూ. దానిమాట తలచుకొంటే—

గోపాలుడు

సరే.

రామస్వామి

అందుకోసం భూమిలో సగం నావంతు దానికి వ్రాసిఇస్తా.

గోపాలుడు

పిల్లలకో. గవరమ్మగతి ఏమిటి?

రామస్వామి

వెంకటి బలమైనవాడు మంచిపనివాడు. వాడి వంతువాడు బాగుచేసుకోగలడు. అది వాడికి చాలును. నాచరంలో సగం గవరమ్మకు ఇస్తా.

గోపాలుడు

మిగతాసగం.

రామస్వామి

చెప్తా.

గోపాలుడు

లక్ష్మి మారుమనువుకు వెళ్తే.

రామస్వామి

అదేమిటి. ఆలాగు వెళ్లదు.

గోపాలుడు

చూడూ. అది చిన్నది. మంచికాలంలో ఉం ది. దానికితోడు ఆస్తా ఇస్తున్నాము. నీతరు వాత నీలాంటి చక్కనివాడు నీకంటె చాలా చిన్నవాడు ఒకడు దానిమీద కన్ను వెయ్య డా. అప్పుడు ఎవరు కాదనేది ?

రామస్వామి

ఆలాగు చెయ్యదు నాలక్ష్మి. నేనంటే దాని కెంతో ప్రేమ.

గోపాలుడు

మరొక సంగతి నీవు ఆలోచించాలి. అందరూ కలిసి ఒక్కఇంట్లో ఉండడము జరగదు; జరి గినా మంచిదికాదు.

రామస్వామి

గౌరూ, వెంకటీ ఇద్దరికీ ఎప్పుడూ అన్యోన్యమే. లక్ష్మితో నేను చెప్తా మనస్సు నొవ్వకుండా ఉండేటట్లు వర్తించమని. లక్ష్మికీ వెంకటికీ పొత్తుకదా.

గోపాలుడు

వాళ్లిద్దరూ కనబడరు ఏరీ ?

రామస్వామి

ఇంటి వ్యవహారం వాళ్లేకదా చూచేది. అందు కోసం పోతుల జోడా కొనమని ఆదివారం సంతకు పంపేను.

గోపాలుడు

పడుచువాళ్ల నిద్దరిని పెట్టి పంపేవా ?

రామస్వామి

చూసేవూ. వాళ్లిద్దరికీ ఎంత పొత్తు కుదురుతే అంత బాగుగా ఉంటుంది నాసంసారం. అంతే కాకుండా ఎల్లప్పుడూ నా మంచం దగ్గిరే కూర్చొని దాని సుఖమంతా నాకోసం ధార పోసేస్తూ ఉంది. ఒక్కమారు తిరిగివస్తే దానికి ప్రాణం వచ్చినట్లు అవుతుంది. దాని ఆనందం కూడా నాసుఖమేకదా.

గోపాలుడు

కాని వయస్సు మంచిది కాదు.

రామస్వామి

(లేవబోతూ) ఏమిటీ !

గోపాలుడు

వయస్సువల్ల వచ్చే ప్రమాదాలు ఆబుషులకే తప్పేవు కావు.

రామస్వామి

నీవు చెడ్డే ఆలోచిస్తావే.

గోపాలుడు

చెడ్డా ! నీగురించిగాని, నీపెళ్లాంగురించి గాని నే నేమీ చెడ్డ అనలేదు.

రామస్వామి

అనలేదూ ! నాపెళ్లాం సంగతి ఎరగవూ, నా కొడుకు సంగతి ఎరగవూ.

గోపాలుడు

ఎరుగుదును.

రామస్వామి

ఏమిటి ఎరుగుదువు. ఎరిగే అన్నావాళ్లు ఎరిగితే అదేదో చెప్పు. చెప్పవ్రా. ఎందుకు చెప్పవు?

గోపాలుడు

ఎందుకు ఆలాగవుతావు. ఎవ్వళ్ల గురించీ నే నేమీ చెడ్డగా తలంచలేదంటూ ఉంటే.

రామస్వామి

వాళ్లమీద నాకు చాలానమ్మకము. తెలుసునా.

గోపాలుడు

తెలుసునోయి.

రామస్వామి

సంతకేకాదు; పోతులకోడా కొనడానికేకాదు; నిర్జనంగా ఉండే అడివిలోకి అయినా పంపుతాను. తెలుసునా.

గోపాలుడు

అబ్బా, నేరకపోయి అన్నాను.

రామస్వామి

వాళ్లంటే నీకు తెలియదు. ఏలాగు తెలుస్తుంది? నేను మళ్లా పెళ్లాడితే మీ కందరికీ హాస్యంకదూ. (తలఊస్తూ ఆదే కళ్లువిప్పి చూస్తూఉంటాడు.) నావంట్లో బాగాలేదు... వాళ్లింకా రాలేదేమి? వేళఅయిందే...తల తిరుగుతున్నాదే...వయస్సు మంచిది కాదని అన్నావు. ఏమన్నావు...

గోపాలుడు

నేను వెళ్తా. నేరకపోయి నోరు జారనిచ్చాను.

రామస్వామి

(మంచముక్రిందనున్న కర్రతీసి పట్టుకొని)
ఇంకా రాలేదూ! ఆ. (అని ఆ కర్రతో నేల మీద గట్టిగా కొట్టి) అబ్బా! (అని మంచం మీద పడిపోయేడు.)

[నిశ్శబ్దం]

గోపాలుడు

కొంచెం పడుకో. [అని వంటిమీద చేయి వేస్తే ఆచెయ్యి తోసివేసి గోడవేపున్న కిటికీ లోనుంచి అదేచూస్తూ ఉంటాడు. గోపాలుడు మెల్లిగా వెళ్లిపోతాడు.]

(2)

[రామస్వామి లేచి, కర్రమీద ఆనుకొంటూ మెల్లిగా గదిలోంచి నడవలోకి వస్తాడు. గవరమ్మ వీధితలుపుతోసుకొని లోపలికి వస్తుంది. ఊగిపోతున్న తండ్రిని రెక్కపట్టుకొని అక్కడున్న బల్లమంచంమీద కూర్చోపెట్టింది. ముఖముపై స్పష్టముగా కనబడుతున్న మనోవికారము చూస్తూ]

గవరమ్మ

అయ్యా, అయ్యా.

రామస్వామి

ఇంకావేళ ఉందా.

గవరమ్మ

ఈలాగు లేచిపోతూఉంటే, గుండె నిలిచి ఏలాగుంటుంది. డాక్టరు కోపంబడడూ.

రామస్వామి

ఇంకా రాలేదేం?

గవరమ్మ

పద, గదిలోకి పద.

రామస్వామి

(వణుకుతో) ఇంకా ఏమిచేస్తూ ఉంటారు.

గవరమ్మ

నామాట వినవూ.

రామస్వామి

ప్రొద్దు ఉండగానే రమ్మనమన్నానే. ఆలాగే అన్నారు కారూ.

గవరమ్మ

అన్న ప్రకారం చెయ్యాలనే అంటారా అన్ని మాటలూ ఆందరూ?

రామస్వామి

లక్ష్మి అలాంటిదికాదు. నీవూ ఆగోపాలుడూ నన్ను పిచ్చి ఎత్తించాలని కుట్ర చేశారా ఏమిటి?

గవరమ్మ

వస్తారు. పద; గదిలోకి పద.

రామస్వామి

(గుమ్మములోంచి చూస్తూ) ఏదీ, వస్తున్న జాడ కానరాదేమి?

గవరమ్మ

సంతలో ఏదో చూస్తూ,...

రామస్వామి

రాత్రి అయితేనే కాని రారంటావూ.

గవరమ్మ

మబ్బులు వేస్తూ చల్లగా ఉంది; మెల్లగా నడుస్తూ, పోతులు తోలుకొంటూ వస్తూ ఉంటారు.

రామస్వామి

నీవు అబద్ధం ఆడుతున్నావు.

గవరమ్మ

సరేనులే పద.

[నిశ్శబ్దం]

రామస్వామి

చుల్లా చూడు, నాకళ్లు మసకగా ఉంది...ఏం, చూడవూ.

గవరమ్మ

చూస్తూ ఉన్నాను......పద. గదిలోకిపద.

రామస్వామి

తలుపువేసి. వాళ్లువచ్చినా తీయకు. తెలుసునా.

గవరమ్మ

నీవు ఈలాగు రావడం తప్పు.

రామస్వామి

నేను చేసినదంతా తప్పే.

గవరమ్మ

తప్పు ఎవరం చేయము? తప్పుచేయడం తప్పుగాదు. అది పట్టుకొని పదం పాడినట్లు ఊగులాడడం తప్పు. ప్రతీతప్పువల్ల ఒప్పు ఎక్కువ అవుతూ ఉంటుంది. పద.

రామస్వామి

మళ్లీ చూసి చెప్పు. వస్తున్నారేమో చూడు.

గవరమ్మ

ఆ. అదిగో వస్తున్నారు.

రామస్వామి

నాకు అగుపడలేదే.

గవరమ్మ

వాళ్ల నవ్వుతాలు నాకు వినబడుతున్నాయి.

రామస్వామి

నాకు వినబడవేమి?

గవరమ్మ

లేవనెత్తుదనా? లే

[రామస్వామి లేచి నిలబడలేక వణుకుతూ చతికిలబడ్డాడు]

ఇంతనీరసమైనావు ఏమి? నాడి ఎందుకు ఆలాగు కొట్టుకుంటున్నాది.

రామస్వామి

(అదేచూస్తూ) ఈమా రెప్పుడైనా ఎక్కడికైనా వెళ్లవలసివస్తే వాళ్లిద్దరూ కలిసి వెళ్ల కూడదు తెలిసిందా. ఏమంటావు?

గవరమ్మ

సరే. ఆలాగే.

రామస్వామి

ఏమంటావు. కావాలంటే నీవూ వెంకటీ కలిసి వెళ్లండి.

గవరమ్మ

నడవగలవా? లేకపోతే ఈమంచంమీద పక్క తెచ్చి వేతునా?

రామస్వామి

ఏమంటావు.

గవరమ్మ

ఎందుకు ఆలాగు వణుకుతున్నావు. ఈస్థితిలో వాళ్లు నిన్నుచూస్తే...నాకది ఇష్టములేదు

రామస్వామి

గొరూ, వయస్సు మంచిదికాదట. నిజమే!... అబ్బా, చాలా ఆయాసంగా ఉంది. పరుండబెట్టె పద గదిలోకి కర్ర ఏది...అంతా అబద్ధంసుమా...నేనిక్కడికి వచ్చాననీ, వాళ్ల కోసం చూస్తూ ఉంటిననీ వాళ్లకు తెలియ కూడదు సుమా! తెలిసిందా. పద.

గవరమ్మ

బండీ చప్పుడు అదిగో. పద.

రామస్వామి

అయ్యో; నాకు కళ్లు చెవులు ఉన్నాయే. నేను గుడ్డివాడనుకానే. నాకు చెవుడు లేదే. నేను ఉండగానే ఛా. నమ్మను. అంతా అబద్ధం. కుట్ర. ఒట్టి అసూయ; ఒట్టి ఓర్వలేని తనం. అంతే...కాదూ.

[గదిలో మంచంమీద పరుంటాడు. గవరమ్మ పైకి వచ్చివేస్తుంది. ఆమెమనస్సు పరిపరివిధాల కొట్టుకోపోతూ ఉంటుంది. ఆలాగే ఇంట్లోపనులు చూసుకొంటూ ఉంటుంది.]

(3)

[లక్ష్మిచేతిలో ఒక ఈతకాడలరంగులబుట్ట, ఆ బుట్టలో పొట్లాలు, ఎండబడ్డముఖం, పరధ్యానంగా ఉంటూ ప్రవేశిస్తుంది.]

లక్ష్మి

[తిన్నగా వెనక ఇంట్లోకి వచ్చి] గొరూ... ఆలస్యమైందా.

గవరమ్మ

ఎందుకని?

లక్ష్మి

ఏదో అదీ ఇదీ చేస్తూ ఉంటే వేళ అయిపో యింది.

గవరమ్మ

ఊఁ!

లక్ష్మి

తోవలో వంతెన దిగుడులో బండీ ఇరుసునీల పడిపోయిందని, దానికోసం వెతికి వెతికి, ఆఖరికి కొత్తదొకటి చెక్కి పెట్టి వచ్చాము.

గవరమ్మ

ఏమిటి కొన్నారు.

లక్ష్మి

మామకోసం ప్రత్యేకంగా లంక పొగాకు చుట్టలు కట్టించి తెచ్చాను. భద్రాద్రి రామ దాసు పాటల చరిత్ర వచ్చింది; అదొకటి కొన్నాను.

గవరమ్మ

అవును, అయ్యకి ఇప్పుడు పదాలే కావాలి.

లక్ష్మి

చూదుగాని, నేనొక్క పదంపాడితే. నేనూ వెంకటీ పాడుకొంటూ వచ్చాము గదా. వెంకటి ఎంత బాగాపాడతాడు గదా, గారూ, నీవు పాడుదూ,అన్నీ మరచిపోతావు.

[అవి అన్నీ పట్టుకొని రామస్వామి గదిలోకి వెళ్ళింది. బండీ, ఎడ్లు నౌఖరీవాడికి అప్పచెప్పి వెంకటి వచ్చాడు.]

వెంకటి

అక్కయ్యా, ఆలస్యమైందే.

గవరమ్మ

మీా ఇద్దరికీ ఆలస్యం ఏమిటి? ఏమి, బండీకి ఏమైనా అయిందా ఏమిటి?

వెంకటి

ఏమిటయింది?

గవరమ్మ

లక్ష్మి అందికదా.

వెంకటి

ఆ, ఏమంది.

గవరమ్మ

ఇరుసునీల పడిపోయిందని చెప్పింది.

వెంకటి

అదా; నీలపడిపోతే వెతికేము; దొరికిందిగదా; తెచ్చిపెట్టేము.

గవరమ్మ

పాతదిపోతే కొత్తది చేయించామని లక్ష్మి చెప్పిందిగదా.

వెంకటి

లక్ష్మి ఏది?

గవరమ్మ

అయ్యదగ్గిరికి వెళ్ళింది.

వెంకటి

ఏంతసేపైంది వెళ్లి? అయ్య కులాసాగా ఉన్నాడా?

లక్ష్మి

(ప్రవేశించి) గారూ, మధ్యాహ్నం ఏమైనా అయిందా ఏమిటీ.

గవరమ్మ

ఏమి?

లక్ష్మి

మునుపు ఎప్పుడూ ఈలాగులేదే. ఎప్పుడు గది లోకి వెళ్లినా పక్కమీద కూర్చోమని, చేతులు, వీపు అన్నీ నిమిరి, నవ్వుతూ ఏవేవో కబుర్లు అడిగేవాడు...ఇప్పుడు ఒక్కమాటైనా లేదు; అడగలేదు సరేకదా, చుట్టలు ఇస్తే పుచ్చుకోలేదు; పుస్తకం చింపేశాడు. నావేపు ముఖమైనా తిప్పేడు కాడు. ఎందుచేతే... చెప్పవూ.

గవరమ్మ

నేను ఏమిచెప్పేది...ఒకవేళ ఆలస్యమైందని...

లక్ష్మి

ఎంత ఆలస్యమైంది. దీనికా ఇంత గొడబ. కాదు; ఏదో ఉంది; చెప్పవూ.

వెంకటి

ఎంత ఆలస్యమైంది? సంతేమి దగ్గిరా. పని పూర్తికావద్దూ.

గవరమ్మ

మన కోగంట రోగికి ఒక యుగం కాదూ.

లక్ష్మి

అది కాదు. నేను సొమ్ము చేతికిస్తే పుచ్చుకో లేదు. నావైపు చూడనైనా చూడలేదు. చెయ్యివేస్తే విసిరేసేడు;ఏదోజరిగింది చెప్పవూ.

వెంకటి

ఎవరైనా వచ్చి వెళ్లేరా.

లక్ష్మి

నావల్ల తప్పు ఏదో చెప్పి, మరిన్నీ...

వెంకటి

పోనిత్తూ లక్ష్మీ; రోగి, పిచ్చివాడు, ముసలి వాడు ఒకటి.

లక్ష్మి

మునుపు ఎప్పుడూ లేనిది ఇప్పు డెందుకు రా వాలి.

వెంకటి

ఇన్నాళ్లు దాకా దాగి ఉందికాని లేదని కాదు.

లక్ష్మి

కాదు. వెంకటీ కాదు. ఏదో ఉంది.

వెంకటి

నేను వెళ్లి చూసివస్తా.

గవరమ్మ

లేపకుమీ. చాలా ఆయాసపడి ఉన్నాడు. వద్దు సుమా!

వెంకటి

నిద్రా. చూసివస్తా.

గవరమ్మ

మీారు రాలేదు గదా అని ఆగిఉన్నాను. కొన్నారి వాళ్ల ఇంటికి వెళ్లి రావాలి. ఇప్పుడే వస్తా. కొంచెం వంటపని చూస్తూ ఉండుమీ. [గవరమ్మ వెళ్లింది. లక్ష్మి గోడను చేరబడి కూర్చొంది. వెంకటి చప్పున వచ్చేడు.]

వెంకటి

లక్ష్మీ...

లక్ష్మి

చాలా బాధగా ఉంది. అయ్యకి అనుమానం వేసింది.

వెంకటి

ఎందుకని.

ల క్ష్మి

నీతో తిరుగుతూఉన్నంత సేపూ ఆసుఖాన్ని ఏదో కదులుస్తూ ఉన్నట్లు గుండెలో అయేది. చెప్పాలని అనుకొన్నాను కాని నీసరదాకూడా తగ్గిపోతుందని ఊరుకొన్నాను.

వెంకటి

(ఆతురతతో) అదేమిటి లక్ష్మీ!

[నిశ్శబ్దం]

ల క్ష్మి

నీవు ఇక్కడనుంచి వెళ్లిపోవాలి.

వెంకటి

ఆ! అదేమిటి?

ల క్ష్మి

నాకూ, నీకూ, అయ్యాకూ అందరికీ క్షేమం. నీవు వెళ్లకపోతే—మరొకమార్గం లేదు.

వెంకటి

(లక్ష్మి చేతులుపట్టుకొని) ముత్యాలపేరు తెంపి వేసినట్లు సుఖమాలను తెంపేస్తున్నావా.

ల క్ష్మి

(నిట్టూర్పుతీసి) సుఖం అందరికీ ఉండాలంటే, కొందరం బాధపడక తప్పదు. ఈరోజు సుఖం పోగొట్టుకొంటే, ఆ తరువాత అంతా సుఖం ఉంటుంది.

వెంకటి

నాకు అర్థంకాలేదు.

ల క్ష్మి

(ఉస్సుమంటూ) అర్థమా కాలేదు. అబద్ధం. అర్థంకావడానికి ఏముంది. నీ మనస్సుకూ నా మనస్సుకూ తెలుసును. ఏలాగోకాని అయ్యా మనస్సుకుకూడా తెలిసింది. గారు పోల్చింది. నీవు వెళ్లిపోవాలి. లేదా నేను—

వెంకటి

ఆగు. (రెండుచేతులతో లేవనెత్తి)

ల క్ష్మి

మనస్సులో ఉన్నబాధ పొర్లిపొర్లి వస్తూ ఉంది. కాని చెప్తామంటే గొంతుకదాటి రాకుంది. మాటలకు ధైర్యంలేదు కాని చెవులలో స్పష్టంగా వినబడుతూ ఉంది. ఎప్పుడు చెప్దామని మొండికెత్తినా, నీచూపులు జ్ఞప్తికి వచ్చి మొండికెత్తినగుండె కరిగి మెత్తనై పోయేది.

వెంకటి

లక్ష్మి, ఏదీ ఒక్కముద్దు. మనము చేసిన దానిలో తప్పు ఏమీలేదే. సామెతలోని సవతితల్లి లోకంలో ప్రతీచోటా ఉండదు కదా.

ల క్ష్మి

మన మిద్దరం సామెతలోలాగే ఉంటే, ఈ ఇంట్లో కలిసే ఉందుము కాబోలు. చూశావా; కొన్నిచోట్ల అనురాగంకంటె విరోధమే మేలు.

వెంకటి

వద్దు లక్ష్మీ; అబ్బ.

లక్ష్మి

(చెయ్యితీసుకొంటూ) నామాట వినవూ.

వెంకటి

నామనస్సు బొంకలేదు.

లక్ష్మి

నామనస్సు బొంకింది.

వెంకటి

ఏలాగు పొమ్మనగలిగేవే, లక్ష్మీ.

లక్ష్మి

ష్...ష్...ష్...

[నిశ్శబ్దం]

ఆవేళ గున్నమామిడిక్రింద నీకిచ్చిన ముద్దే ఈ ముప్పుకు ఆరంభం. మరిచెప్పలేను వెళ్లు. నీవు ఎక్కడున్నా నిన్నూ...

వెంకటి

నేను పోలేను.

లక్ష్మి

(వెంకటి కాళ్లమీదపడి) నామాట వినవు.

వెంకటి

(లేవనెత్తుతూ) ఏదిమంచో చెప్పలేకున్నాను.

లక్ష్మి

(వెంకటిగెడ్డంమీద చెయ్యివేసి) వెళ్లవూ.

వెంకటి

సరే. ఇదే ఆఖరిముద్దు. మరొకటి.

లక్ష్మి

వద్దు. (వెనుకకు తగ్గింది)

[వెంకటి చేతులు పట్టుకోబోతూఉంటే లక్ష్మి ఎదురుగుండా చూసింది. ముందరి నడవ వెనక గుమ్మంలో రామస్వామి కర్రమీద ఆనుకొని వణుకుతూ కనపడ్డాడు. అదేచూస్తూ ఉన్నాడు. నిశ్శబ్దం. ఒకరిముఖం ఒకరు అదే చూసుకొన్నారు.]

వెంకటి

లక్ష్మీ, వెళ్తున్నా.

రామస్వామి

నేను వచ్చిందాకా అయినా ఆగలేరూ.

వెంకటి

అయ్యా,

రామస్వామి

నేను చావడానికి సిద్ధంగా ఉంటే—ఛీ, పాపీ! నాచెవులు, నాకళ్లు ఇంకాఎందుకుఉన్నా యో!

వెంకటి

చెప్పేది అంతా వింటే—

రామస్వామి

నాకే శక్తిఉంటే—(అని కర్రఎత్తబోయి, గజగజ వణికి, గోడమీద చేరబడి)

[నిశ్శబ్దం]

వెంకటి

నీవు చూసింది అబద్ధం. మాకుకూడా చేతనై ఉంటే, ఈసుడిలో పడకపోయి యుందుము. ప్రవాహంలోపడ్డ గడ్డిపరకవలె......

లక్ష్మి

అదే నిజం మామ.

వెంకటి

నీవు చూసింది మేము చేసింది పాపమేలయితే ఇదేమొదటిది ఆఖరిదికూడా. లక్ష్మి కోరింది నేను ఒప్పుకొన్నాను; ఇప్పుడే, నీవు రాకుండా ఉంటే

ఈపాటికే, నేను ఇల్లువిడిచి పోతున్నాను. మరి ప్రమాదంలేదు. ఇకలక్ష్మినీ, నాలక్ష్మి నీవేఎరుగుదువుఆమాట, మరి చూడను గదా అనిబలవంతంగా ఒక్కముద్దు శాశ్వతముగా అదినిలిచి ఉంటుందని...

రామస్వామి

వెధవా. సిగ్గుమాలినపాపీ. ఫో.

వెంకటి

వెళ్తున్నాను. ఒక్కటే మాట. లక్ష్మివల్ల ఏమీ తప్పలేదు. ఇదివరకే దాని సుఖాన్ని నాశనం చేశావు. ఇకనైనా దాన్ని సుఖపెట్టు. లక్ష్మీ!

[లక్ష్మి బుర్ర ఎత్తలేదు. లక్ష్మివేపే చూస్తూ వెళ్లిపోయేడు. నిశ్శబ్దం. వాడిపోయిన తీగెవలె నిలుచుంది లక్ష్మి. నిలబడ్డ శవమువలె గోడను అంటిపెట్టుకొని నిలబడ్డాడు రామస్వామి.]

రామస్వామి

(లక్ష్మి ఎందుకో బుర్రఎత్తింది.) నిన్ను ఎప్పుడైనా ఒక్కమాటైనా ఆడి నొప్పించానా. నీకు కావలసినది లేదన్నానా?

లక్ష్మి

లేదు.

రామస్వామి

అయితే ఎందుకు ఆలాగు మారేవు.

[జబాబులేదు]

రామస్వామి

ఎందుకు...ఆలాగు...మారేవు...

[జబాబులేదు]

రామస్వామి

ఎందుకూ...ఆలాగూ...మారేవూ...

లక్ష్మి

నేనూ మారలేదు.

రామస్వామి

అబద్ధం.

లక్ష్మి

నీయందు ఉండేభావం మారలేదు. నమ్ము, మాను, నాకు తెలుసును.

రామస్వామి

ఆ!

లక్ష్మి

కలలో పడ్డాను. వలలో కొట్టుకొన్నాను. కల అయిపోయింది. వలలోంచి ఎగిరిపోయేను. ఆ సింహాద్రి అప్పన్నే సాక్ష్యం.

రామస్వామి

ఊ!

లక్ష్మి

నన్నేమి చేయకుమీ.

రామస్వామి

పొమ్మంటే వాడివెనకాతలే పోదామనా?

లక్ష్మి

వెళ్లేమాటే ఉంటే, నీవా, అడ్డేది?

రామస్వామి

ఇదా వయస్సు!

లక్ష్మి

అలాంటి చెడ్డదానిని కాను.

రామస్వామి

గదిలోకి పో.

లక్ష్మి

(నడుస్తూ) నిండురక్తం; చంపకుమీ.

రామస్వామి

ఇటుచూడు.

[లక్ష్మి తిరిగింది. అలాగేచూస్తూ నిలబడ్డాది]

నీలాంటి సొగసైన గుండెలో అలాంటికుటిలం ఏలాగు ఇమిడి ఉందో అని ఆశ్చర్యపోతున్నాను.

లక్ష్మి

నీదయ. ఏమన్నాసరి. (అని కొంగుపట్టింది).

రామస్వామి

నడువు. నీచర్యవల్ల నాకు నా కుటుంబానికి ఈగ్రామంలోను, ఈలోకంలోను వెక్కిరింతగా ఉండకుండా ఉండేటట్లు నీవుతిరగాలి. నీవు ఈ ఇంట్లోనే ఉండాలి. విన్నావా. ఈగదిలోనే...

లక్ష్మి

ఇన్నాళ్లూ ఇంత దయచూపిన నీకు చేతులు వస్తాయా?

రామస్వామి

అందుకేకదూ ఈబహుమతి.

లక్ష్మి

(కాళ్లమీదపడి) నావల్ల నిజంగా తప్పలేదు.

రామస్వామి

ఆహా! నిజం. తప్ప అంతా నాదే.

[లక్ష్మి వెళ్లిపోయి తలుపులు వేసుకొంది. రామస్వామి అక్కడనే చతికిలపడి, రెండు చేతుల్లో బుర్రపెట్టుకొని కూర్చొన్నాడు. గవరమ్మ వచ్చింది].

గవరమ్మ

ఏదో అయింది. కొంపమునిగింది. అయ్యా, అయ్యా, తమ్ము డెటు ఆలాగు వెళ్లిపోతున్నాడు. నీ వేమిటి ఇక్కడ ఈలాగు ఉన్నావు.

రామస్వామి

వాడు మనవాడు కాడు.

గవరమ్మ

అయ్యా. ఒక్కతమ్ముడు అయ్య!

రామస్వామి

నీవల్లే.

గవరమ్మ

నావల్లా!

రామస్వామి

ఊహ్! తెలిసి చెప్పేవు కావు.

గవరమ్మ

ఆహా! మొదటేచెప్పేను. అయ్య! లక్ష్మి!

రామస్వామి

గది చూపించాడు.

గవరమ్మ

దీపం తెస్తాను.

రామస్వామి

చీకటేఅంతటా. చీకటిలోనే ఉంటా. మేఘాలు వర్షంలేకుండా, నల్లగా ఆకాశమంతా కారుకమ్మి ఉన్నాయి.

---

## హార్మాజాను

మద్దిపట్ల వేంకటరమణయ్య గారు

పారశీకరాజ్య భద్రాసనంబుకై-మూఁడవపరి రేఁగుపోరు ముఁగిసె;
సాటిలేని కడిమి శత్రుల నుఱుమాడి-విజయ మొందె యవను భీకరాసి—

తమ్ము నెదరించి కడు విక్రమమ్ము సూపి-ఓడిపోయి పట్టువడిన వాఁడి మగనిఁ
బారశీకుని హార్మ్మజాకా పేరివాని-శిరము నఱకంగఁ దెచ్చిరి తురక భటులు—

"ఊరకే చచ్చిపోవుచు నుంటి దప్పి-గ్రుక్కెఁడుదకంబు నాకుఁ ద్రాగుటకు నిచ్చి
అవల మీయిచ్ఛ వచ్చినయట్లు చేయుఁ"-డనుచు హార్మ్మజా నెల్గెత్తి యడిగె వారి—.

కేలనూనియుఁ చెలిసీటిగిండి తాను-నోటి కెత్తక నిల్చె నప్పాట ఖైది
విచ్చుకత్తులతోఁ దన వెనుక ముందు-నిలుచు భటపాళిఁగాంచి సందేహమంది—

"పెదవి తడుపకుంటి వెఱపేదియో చెప్పు-పొడుతు రనియొ దొంగపోటు నిన్ను?
పిఱికికండ లేనివీరుఁ డెన్నఁడు నట్టి-పాడుపనికిఁ బాలుపడఁడు సూవె.

ఆఁపినాము శిక్ష నాగిండిలో నీరు-త్రావుదనుక నీకుఁ జావులేదు;
పాపుకొనుము దప్పి భయ మేమియును లేక"-యనుచు తేఁడు ఖైది కభయ మిచ్చె—

ఆక్షణంబ గిండి యవనిపై దొరలంగ-జాఱ విడిచి హార్మ్మజాను పల్కె—
"దీనిలోనినీర మానువెన్కను గదా-నాకుఁ జావసతిరి నయముమీఱ—.

పంపువెట్టుఁ డిపుడు భటసకాయంబున-కిలను నోలుకుసలిల మెత్త"నంచు;
చిటికసేపు విభుఁడు చేష్టలుడిగియుండె-ఊయలట్లు డెందమూఁగులాడె—

పిదప నుడివె సాహేబు గంభీరముగను-"కాను సాహసికుండ! నీవనినయట్లు
ఆడి తిరుగ రెన్నఁడుఁగాని యవనిపతులు-పాలనము సేయఁబడుఁగాక ప్రభువు మాట—

త్రాగి చావు మంటిని మున్ను దానినీరు,-త్రాగియిప్పుడు స్వేచ్ఛగా బ్రదుకు మింక"
ననుచు వే ఱొక్కగిండితోఁడను జలమ్ము- ఖైది కిప్పించెఁ గారుణ్య కలితుఁ డగుచు—

(అనువాదము)

---

# ప్రాచీన శిల్ప చిత్రములు

[కృష్ణాజిల్లా గుమ్మడిదుఱ్ఱువద్ద దొరకినవి]




౧. గుమ్మడిదుఱ్ఱువద్ద నున్న గొప్ప బౌద్ధస్తూపముయొక్క పీఠముచుట్టు చెక్కబడియున్న ఉబ్బెత్తు చిత్రఫలకములలో నొకటి.



౨. గుమ్మడిదుఱ్ఱు బౌద్ధస్తూపముల చుట్టునున్న చిత్రశిలాఫలకములలో
నొకదాని వివరములను దెలుపు చిత్రము



3. గుమ్మడిదుఱ్ఱు బౌద్ధస్తూప పీఠముచుట్టు ఉబ్బెత్తు చిత్రములు గల చూరురాళ్లలో నొకటి.
ఈ క్రొత్త చిత్రములయందు గాంధార దేశ (వాయవ్యపరగణాలు)
చిత్రవైఖరి వ్యాపించియున్నను భారతీయశిల్పవైఖరియే యిందు ముఖ్యముగ పొడకట్టుచున్నది



౪. గుమ్మడిదుఱ్ఱు స్తూపమునడుమ నొకమట్టికుండలోదొరకిన బంగారుదండ; అందముగ నున్నది

[హిందీ మాధురీ పత్రికనుండి]

# ౧

సుమారు రెండుశతాబ్దములు గడచిపోయినను చింతాదేవి పేరు మాయలేదు. బుందేల్‌ఖండమునందొక గట్టుననేల నిప్పటికిని మంగళవారమునాఁడు వేనవేలు స్త్రీపురుషులు చింతాదేవిని బూజింప వచ్చుచుందురు. నాఁడానిర్జనప్రదేశము గ్రామ్యగీతములచే మ్రోగుచుండును. గట్టునెల్ల గుట్టలు రమణీయములగు రంగురంగుల వస్త్రములచే గంతిలుచుండును. దేవియాలయమొక యెత్తైన గుట్టపై నున్నది. దానికలశముపై కాగుర రంగు జండా వాయుమార్గమున కగపడుచుండును. గుడి చాల చిన్నది. ఇద్దఱు మనుష్యులైన పట్టరు. లోపల విగ్రహ మేమియు లేదు. ఒక చిన్న వేదికమాత్ర మున్నది. క్రింద నుండి యాలయమునకు రాతిమెట్లున్నవి. సమ్మర్దమున జనులు క్రిందఁ బడకుండుటకై యిరుప్రక్కల రాతిగోడ కలదు. ఇక్కడనే చింతాదేవి సతియయ్యెను. లోకాచారము ననుసరించి యామె తనభర్త కళేబరముతోఁ జితి యెక్కలేదు. తనభర్త చేతులు జోడించుకొని యెదుట నిలిచియుండెను. ఆమె యతనివంకఁ గన్నెత్తి చూచనైన లేదు. ఆమె తనపతి శరీరముతోఁగాక ఆతని యాత్మతో సతి యయ్యెను.

# ౨

యమునాతీరమున 'కాలపి' ఒక చిన్న నగరము. చింతాదేవి ఆనగరమందలి యొక బుందేలవీరుని పుత్రిక. చిన్నతనముననే తల్లి స్వర్గస్థురాలగుటచే తండ్రియే యామెను పెంచవలసివచ్చెను. అది యుద్ధసమయము. యోధులకు నిద్రాహారములుగూడ స్వప్నములవీఁదనే. చింతాదేవి బాల్యమును తండ్రితో సమరక్షేత్రమునఁ గడచెను. తండ్రి యామె నొకగుహయందో చెట్టుచాటుననో దాఁచి, యుద్ధరంగమున కేఁగుచుండును. చింతాదేవి నిశ్శంకముగఁ గూరుచుండి మట్టితో దుర్గములు నిర్మించుచు, చెఱఁగొట్టుచునుండెను. బొమ్మరిండ్లే ఆమెదుర్గములు. ఆమెబొమ్మలకు వస్త్రములు లక్ష్యములేదు. మట్టిబొమ్మలను దండుగా జేసి యామె యుద్ధరంగమున నిల్పుచుండెను. ఒక్కొకప్పుడామె తండ్రి సంధ్యాసమయమునకైన మరలి రాఁడు. కాని భయము చింతాదేవి చెంత కేని చేరదు. ఆమె విజనస్థలమున అన్నపానములు లేక రాత్రియంతయు చక్కఁ గూరుచుండునే. ముంగిసలయందు నక్కలయందుఁ గథ లామె యెన్నఁడును విని యుండలేదు. వీరవరుల ఆత్మోత్సర్గకథాకీర్తనములును, అదియు యోధాగ్రేసరుల ముఖముఖమున వినిన యామె యాదర్శవాదిని యైపోయెను.

ఒకసారి మూఁడుదినములవఱకు చింతాదేవికిఁ దనతండ్రి వార్త తెలియలేదు. ఆమె యొక కొండగుహయందుఁ గూరుచుండి మనమునఁనే యెవ్విధమునను శత్రుభేద్యముగాని దుర్గ మొండు నిర్మించుకొనుచుండెను. పగలెల్ల నామె యాదుర్గస్వరూపమును ధ్యానించును; రాత్రి యాదుర్గమునే కలఁగాంచును. మూఁడవనాఁటి సాయంతనము ఆమె జనకుని మిత్రులు కొందఱు వచ్చి యామెయెదుట నేడువసాగిరి. "నాన్నగారేరీ? మీరందఱు ఏడ్చుచున్నారేమి?" యని చింతాదేవి యాశ్చర్యముతో నడిగెను.

ఎవ్వరును సమాధానము చెప్పరైరి. అందఱు గుండె బాదుకొని యేడ్చుచుండిరి. చింతాదేవి తనతండ్రి వీరస్వర్గ మలంకరించెనని తెలిసికొనెను. ఆపదుమూడేండ్ల బాలిక కండ్లనుండి ఒక్కనీటిబొట్టయిన రాలలేదు. ముఖమేమాత్రము వికలత గాంచలేదు. ఒక్కనిట్టూరుపైన వెలువడలేదు. ఆమె నవ్వి యిట్లనెను:—"వారు వీరగతి నొందిన మీరు విలపింతురేల? వీరవరుల కింతకంటె గొప్ప మరణమేముండును? వారివీరత్వమున కింతకన్న గొప్ప బహుమానమేమి లభింపఁగలదు? ఈసమయము, విచారింపఁదగినదికాదు. సంతోషింపఁదగినది.

ఒకయోధుఁడు చింతిల్లుచు నిట్లు పలికెను:— "నీవిప్పు డెక్కడ నుందువు! ఇదియే మాచింత." అని.

చింతాదేవి గంభీరముగ నిట్లనెను:—"దీనికై మీరు చింతింపకుఁడు. నేను నా తండ్రికిఁ దగినకూఁతురను. వారు గావించినదే నేనును గావించెదను. మాతృదేశమును బగవారి చేతినుండి విడిపించు కార్యమున వారు ప్రాణములర్పించిరి. నాయెదుట నున్న దీహూడ నదియే యాదర్శము. పోయి మీ భటులను సన్నద్ధులఁ గావించుకొనుఁడు. నాకై యొక గుఱ్ఱమును, ఆయుధములను సిద్ధపఱుపుఁడు. ఈశ్వరకటాక్షమున్నచో, నెల్లరకు నేనగ్రగామినినై యుండఁగలను. నే నొకవేళ వెనుకంజవేయుట మీ కన్నులఁబడినచో నొక్కకత్తివేటుతో బరిమార్పుఁడు. ఇదియే మీకు నా విన్నపము. చనుఁడిఁక నాలస్యము వలదు."

చింతాదేవి వీరవచనముల విని 'యీ సుకుమారకుమారి తనసంకల్పమున దృఢచిత్తురాలై యుండఁగలదా' యని యోధులు సందియమందిరి.

3

ఐదువత్సరములు గడచెను. చింతాదేవి కీర్తి దశదిశల వ్యాపించిపోయెను. పగతుర పదపాటవము వెల్లగిలిపోయెను. ఆమె సజీవమగు విజయమూర్తిగ నుండెను. గుండ్లకును, దూపులకును నెదుట నామె నిర్భయముగ నిలుచుండుటఁ జూచి యుద్ధభటు లుత్తేజితు లగుచుండిరి. ఆమె చూచుచుండ వారెట్లు వెనుకంజవేయఁగలరు? కోమలాంగియగు జవ్వని ముందునకు సాగుచుండ నే పురుషుని పాదములు వెనుకకాడఁ జూచును? సుందరీమణుల సమక్షమున యోధుల విక్రమము జేయమగును. కాంతామణివచనములు వీరుల కాత్మోత్సర్జన గుప్తసందేశములు. ఆమె ముఖచర్య యొండు భీరువులందైనఁ బౌరుషమును బ్రవహింపఁజేయును. చింతాదేవి యశస్తేజములు నల్గడలనుండి విక్రమశాలురగు శూరుల నాకర్షించి సేనను గైసేసెను. ప్రాణముల లెక్కగొనని యోధపుష్పంధయములు నలుదెసలనుండి యేతెంచి యీ కుసుమమున విహరింపఁ దొడఁగెను.

ఈ వీరులలో రత్నసింహుఁ డనే రాజపుత్రయువకుఁ డొకఁడు.

చింతాదేవి సైనికు లెల్లరు కృపాణధనులు; మాటకై ప్రాణము లర్పించువారు; ఆమె సంకేతమాత్రమున నగ్గిలో దుముకువారు; ఆమెయానతి యైనచో నాకసమందలి చుక్కలనైన నొక్కుమారుగ నేలఁ గూల్ప సిద్ధపడువారు. అందు రత్నసింహుఁ డందఱిని మించియుండెను. చింతాదేవియు లోలోన నతనిఁ బ్రేమించుచుండెను. రత్నసింహుఁడు తక్కినయోధులవలె నుద్ధతుఁడు, వాచాటుఁడు, గర్వితుఁడును గాఁడు. మిగిలినవారు తమతమ ఘనతలను నిరర్గళముగ నుగ్గడించుకొనువారు; వారియాత్మస్తుతి కద్దులేదు. వారేమొనర్చినను చింతాదేవికిఁ బ్రదర్శించుటకే. వారిలక్ష్యము కర్తవ్యము గాదు, చింతాదేవి. కాని రత్నసింహుని వర్తనమమాత్రము ప్రశాంతముగ నుండెను. ఆత్మస్తుతి లేదు సరికదా, తాను యథార్థముగ నొకసింహమును దునిమివచ్చినను, దానిప్రసంగమైన నెత్తఁడు. అతని వినయశీలత సంకోచనీయ నతిక్రమించిపోయెను. ఇతరుల ప్రేమయందు విలాసముండెను. రత్నసింహుని ప్రేమ తపస్త్యాగముల విలసిల్లుచుండెను; తక్కినవారు హాయిగ నిదురించుచుండ, రత్నసింహుఁడు చుక్కల లెక్కబెట్టుచు, రాత్రి పుచ్చుచుండును. ప్రతియోధుఁడును 'చింతాదేవి నాకే లభించును; రత్నసింహుని కాశ యడుగంటినది; కావున నే యతని కెవ్వరియెడను రాగద్వేషములు లేవు,' అని భావించుచుండును. చింతాదేవియెదుట వారెల్లరుఁ బలుకు చిలుకపలుకులఁ జూచి వారివాక్చాతుర్యమునకు రత్నసింహుఁ డచ్చెరువందుచుండును. అతని నిరాశాంధకార మంతకంతకు పేరుకొనిపోవుచుండెను. ఒక్కొకపు డతఁడు స్త్రీమనోరంజకములగు గుణముల నీశ్వరుఁడు తనకేల ప్రసాదింప లేదని వగచుచుండును. అతనిమనోవ్యథ యెవ్వరికెఱుక? అతఁడు లోలోననే వేసారి యూరకుండును. ఆడంబర మాతనిచేతఁ గాదాయె.

సగము రాత్రి దాఁటిపోయెను. చింతాదేవి తనశిబిరమున నిదురించుచుండెను. దుర్లభమగు జయముఁబడసిన వెనుక నింత భుజించి సైనికులు మైమఱచి పడియుండిరి. ఎదుట నొక దట్టమగు నరణ్యముండెను. అరణ్యమున కవ్వలి తట్టున శత్రుదళమొకటి విడిసియుండెను. చింతాదేవివారి రాక నెఱిఁగి పరుగుపరుగున నచ్చటికి వచ్చి, యుదయ

మున వారిపై దండెత్త నిశ్చయించుకొని యుండెను. తన రాక శత్రువులకుఁ దెలియదని యామె నమ్మిక. కాని పొరపడినది. ఆమె సైన్యములో నొకఁడు శత్రువులతోఁ జేరి, యిక్కడివార్త లక్కడ కప్పటికప్పు డందించుచుండెను. ఇకఁ జింతాదేవిచింత బాపుకొందమని వారొకకుట్రఁ బన్నిరి. ఆమెను జాటుగ హత్యసేయుటకై ముగ్గురు భటులు బయలుదేఱిరి. ముగ్గురును ఘాతుకమృగములవలె నడుగుచప్పుడు గాకుండ నరణ్యము దాఁటి వచ్చి, చెట్లమాటున నక్కి చింతాదేవిశిబిర మేదియాయని యోజించుచు నిల్చిరి. సైన్యమంతయు గాఢనిద్రాపరవశమై యుండెను. వారికిఁ దమకార్యసిద్ధియందు సుంతయు శంక లేకపోయెను. చెట్లమాటు వెలువడి వారు మువ్వురును మొసళ్లవలెఁ బ్రాఁకుచు చింతాదేవిశిబిరము దెసకు సాగిరి.

సేనయంతయు నొడలెఱుఁగక నిద్రించుచుండెను; పహారా సిపాయిలు మిక్కిలి డస్సియుండుటచే నిదుర కొరగిరి. ఒక్కవ్యక్తిమాత్రము శిబిరమువెనుక చలిచే ముడిఁగి కూర్చుండియుండెను. అతఁడు రత్నసింహుఁడు. అతనికి నేఁడిది క్రొత్త గాదు. వాడుకయం దాతనిరాత్రు లిట్లే, చింతాదేవి శిబిరము వెనుకఁ గూరుచుండుటయందే కడచిపోవుచుండును. ఆదుర్మార్గులయలికిడి విని యతఁడు చటాలునఁ గత్తిదీసి నిలిచెను. చూచుసరికి ముగ్గురు మనుష్యులు వంగివంగి నడచుచు వచ్చుచుండిరి. ఇపు డేమి చేయఁదగును? అఱచినచో సైన్యమున కలజడిపుట్టి అంధకారమున నొకరినొకరు నఱుకుకొని చత్తురు. ఒంటరిగ మువ్వురితోఁ బోరుటకా ప్రాణభయము. ఆలోచించుటకు వ్యవధి లేదు. శీఘ్రకాలమున నెదిరిగరువ మడంపఁగల సామర్థ్య మాతనికిఁ గలదు; కావున వెంటనే కత్తి దూసి యతఁ డామువ్వురపైఁ బడెను. కొన్నినిముసములు ఖడ్గములు తాండవించెను. పిదప నంతయు సద్దణఁగెను. అటు వారు మువ్వురు నిహతులై పడిపోయిరి; ఇటు రత్నసింహుఁడును గాయములు తిని స్మృతి తప్పి పడియుండెను.

ఉదయమున చింతాదేవి ఆ నలుగురుమానవుల నా స్థితియందుఁ గాంచెను. గుండె గుభేలుమనెను. చెంతకుఁ బోయి చూడ ముగ్గురుపూరుషులును మరణించియుండిరి; రత్నసింహునకుమాత్ర మూపిరి యాడుచుండెను. జరిగినదంతయు గోచరించెను. నారీత్వము వీరత్వముపై విజయము నొందెను. తండ్రి మరణించినపు డొక్క బాష్పబిందువైన రాలని యామెకండ్లనుండి యశ్రువుల జడివాన గురిసెను. రత్నసింహునిశిరము తనతొడపై నిడికొని, హృదయమందిరమున రచించిన స్వయంవర మండపమున నామె యాతనికంఠమున జయమాల వైచెను.

౪

ఒక్కనెలపాటు రత్నసింహునికండ్లు విడలేదు; చింతాదేవికండ్లు మూఁతపడలేదు. చింతాదేవి ఒకక్షణమైన నతని విడిచిపోవుటలేదు. తన వ్యాపారముపై దృష్టిలేదు; శత్రువులు పైఁబడుదురేమో యను చింత లేదు. తన సకలైశ్వర్యములు నామె రత్నసింహునికై బలిదాన మొసంగెను. నెల గడచినపిదప రత్నసింహుని కన్నువిడెను. చూచుసరికిఁ దాను మంచముపైఁ బడి యుండుటయు, నెదుట చింతాదేవి విసనకఱ్ఱఁ జేకొని నిలిచియుండుటయు నతనికిఁ గానవచ్చెను. నీరసమగు కంఠస్వరముతో నతఁ డిట్లనెను —

"చింతా, విసనకఱ్ఱ యిటు తే; నీకు శ్రమ—"

చింతాదేవి హృదయ మిపుడు అఖండస్వర్గసుఖము ననుభవింపసాగెను. ఒకనెలక్రిందట నెననివిశీర్ణశరీరమునకుఁ దలవైపునఁ గూరుచుండి యామె నైరాశ్యమున విలపించుచుండెనో, ఆతఁడు నేఁడు మాటాడుటఁజూడ నామె సంతోషమునకు మేరలేకపోయెను. ఆమె స్నేహార్ద్రస్వరమున నిట్లనెను:—

"ప్రాణనాథా! ఇది శ్రమయైనచో నిఁక సుఖమేది?"

'ప్రాణనాథా' యనుసంబోధనమున విలక్షణమగు సమ్మోహనశక్తి యున్నది. రత్నసింహునికన్నులు తళుక్కుమనెను; జీర్ణముప్రదీప్తమైపోయెను; ఒక నూతనజీవనము రక్తనాళములఁ బ్రవహింపఁ జొచ్చెను. ఆజీవన మెంత యుజ్జ్వలము! ఆనందంతయుత్సాహము, ఎంత మాధుర్యము, ఎంతకులుకు, ఎంతజాలి నిండియుం

డెను! రత్నసింహుని ప్రత్యంగము నదర జొచ్చెను. అపారపరాక్రమ మాతని భుజములు నావహించినట్లయ్యెను. జగన్నాయకత్వము దాల్చుటకును, ఎగసి వినువీథి నందుకొనుటకును, ఉద్దండపర్వతముల భేదించివైచుటకును అతనికి సామర్థ్య మొదవిన ట్లగుచున్నయ్యెను. తన కోర్కు లన్నియు నీడేరిన ట్లతనికిఁ బరమసంతృప్తి యొకక్షణకాలము గలిగెను. ఆక్షణమున పరమశివుఁడే వచ్చి యెట్టయెదుట నిలిచినను, నాతఁడు చూచి, వరమేమియుఁ గోరక, మొగము ద్రిప్పి యూరకుండి యుండును. ఎట్టిసంపదయెడను, ఏవస్తువునెడను ఇప్పుడతనికి సుంతయుఁ గాంక్ష లేదు. లోకమునఁ దన్ను మించిన సుఖియు, భాగ్యశాలియు నుండఁడని యతనికి గర్వ మొదవసాగెను.

చింతాదేవి యింకను దనమాట ముగింప లేదు; ఆ ప్రసంగముననే యిట్లనెను:—"కాని, నిక్కముగ నావలన మీ రెంతయో బాధపడవలసివచ్చినది!"

రత్నసింహుఁడు లేవ యత్నించుచు నిట్లనెను:— "తపము లేనిదే సిద్ధి చేకూరదు."

చింతాదేవి యతనిని దన హృదుహస్తములతోఁ బరుండఁబెట్టుచు నిట్లనెను:—"ఈసిద్ధికై మీరు తపము సేయలేదు; అసత్య మేల యాడెదరు? మీరు కేవల మొకయబలను గాపాడితిరి. నాస్థానమున వేఱొకస్త్రీ యుండినను మీ రిట్లే ప్రాణమొడ్డి రక్షించియుందురు; నా కానమ్మిక యున్నది.—మీతో నిజము చెప్పుచున్నాను. నేనాజన్మాంతము బ్రహ్మచారిణినై యుండెదనని ప్రతిన గైకొనియుంటిని; కాని మీయాత్మత్యాగము నా ప్రతిజ్ఞను విచ్ఛిన్నము చేసినది. నేను వీరులయొడలలోఁ బెరిగినదానను; ఏపురుషపతంగుఁడు తన ప్రాణములతోఁ బోరఁగల్గునో యాతనిచరణములనే నాహృదయకుసుమ మర్పించుదును. రసికుల హాసవిలాసములకును, లంపటుల రూపరేఖలకును, నల్లుల కు స్త్రీసేవలకును నా దృష్టియందింతయు విలువ లేదు. వారియభినయవిద్య నొకవినోదముగాఁ గాంచుచుందును. మీహృదయముననే నేను సత్యమగు నాత్మార్పణము గాంచి, దాసి నగుచు పోతిని,—నేటినుండియే కాదు, చాలదినములనుండి."

౫

మొట్టమొదటి ప్రణయరాత్రి. ఎటఁ జూచిన నిశ్శబ్దము. ప్రేమికు లిరువురిహృదయములందును గోర్కులు తెరఁగలు వేయుచుండెను. నలుదెసలఁ జెలిమికోలుముల వెన్నెల చిమ్ముకొనియుండెను. దాని నసువెలుంగుల యందు వధూవరులు ప్రణయాలాపము లాడుకొనుచుండిరి.

అప్పుడే వార్త వచ్చెను శత్రుదళ మొకటి దుర్గము దెసకు విజృంభించి వచ్చుచున్నదని. చింతాదేవి ఉలికిపడెను; రత్నసింహుఁడు నిశ్చేష్టుఁడై నిలిచిపోయెను. పిదప నతఁడు మేకున వ్రేలాడుచున్న ఖడ్గము నందుకొనెను.

చింతాదేవి కాతరదృష్టితో నతనివంకఁ జూచి "కొందఱు మనుష్యులఁ బంపుఁడు వారిటికి; మీరు పోనేల?" యనెను.

రత్నసింహుఁడు తుపాకి బుజానఁ బెట్టికొనుచు నిట్లనెను:—

"ఈసారి పెక్కుమంది వత్తురేమో యని శంకించుచున్నాను."

చింతా:—"అట్లయిన నేనుగూడ వచ్చెదను."

రత్న:—"వలదు. వారు నిలువఁజాలరని నాకు స్థైర్యమున్నది. ఒక్కఘాటితో వారి నెత్తిపాఱవైచెదను. మనప్రణయరాత్రివిజయరాత్రియగుట పరమేశ్వరుని యిచ్ఛ."

చింతా:—"ఏమో కాని, మనసు కలతఁజెందుచున్నది. పోనిచ్చుటకు ప్రాణ మొప్పుట లేదు."

రత్నసింహుఁ డీకోమల మగు ప్రేమానురోధమునఁ గరఁగిపోయి, చింతాదేవిని గౌఁగిలించుకొని "ఉదయమగుసరికి మఱలివచ్చెదను ప్రియా!" అనెను.

చింతాదేవి మగని కంఠమున బాహువు లిడి, కన్నుల నీరు నింపి, నిట్లనెను:—"మీరు చాలదినములకుగాని రారని భయమగుచున్నది. నామనస్సెంతయు

మీమీఁద నుండును—చనుఁడు—అనుదినము వార్తమాత్ర మంపుచుండవలయునుసుండీ!— ఒకటి: మిమ్ము బతిమాలెదను, అవసరము కనిపట్టియె దాడి సలుపుచుండుఁడు. శత్రువులఁ జూచుటతోడనే మైమఱచి మీఁదఁబడుట మీకలవాటు. అవసర మెఱిఁగి వర్తింపుఁడని మాత్రమే నే వేఁడునది దయ సేయుఁడు; ఎట్లేగుచున్నారో అట్లే తిరిగిరండు!"

చింతాదేవిహృదయము భయవిహ్వల మగుచుండెను. అందుఁ దొల్లి విజయకాంక్షమాత్రమే యధివసించుచుండెడిది; నేఁ డందు భోగలాలస ప్రధానత వహించెను. సింగమువలె గర్జించి శత్రుహృదయముల గడగడ వడఁకించినదైన యా వీరబాల నేఁ డెంత దుర్బలయయ్యెను. రత్నసింహుఁడు గుఱ్ఱ మెక్కు—సరికి ఆమె యతనిక్షేమమునకై లోలోన దేవికి మ్రొక్కు—కొనఁదొడఁగెను. దూరమున చెట్లయందు వతఁడు మఱఁగుపడువఱకు నామె యతనిఁ జూచుచుండి, పిదప దుర్గమందలి బురుజులన్నిటిలోఁ బెద్దదాని నెక్కి— గంటలకొలఁది అట్లే ఆదెసకుఁ దేఱిమాచుచు నుండిపోయెను. అక్కడ నేమియులేదు; పర్వతము లప్పుడే రత్నసింహుని దాచివైచినవి. చింతాదేవికి మాత్ర మాతఁ డెదురుగాఁ బోవుచున్నట్లే తోఁచుచుండెను.

ఉషఃకాలపు టరుణకాంతి చెట్లలోనుండి తొంగిచూడ మొదలిడెను: ఇప్పటికి చింతాదేవి మోహవిస్మృతి వదలెను; అంతయు శూన్యమని తెలిసెను. ఏడ్చుచు బురుజు దిగి సెజ్జపై మొగము కప్పుకొని యామె రోదనసు మొదలిడెను.

౬

రత్నసింహునితో వందమందియైన నుండిరో, లేరో కాని ఉన్నవారందఱు నుత్సాహభరితులు; ఎట్టిసమయమైన, ఎంత యెదుర్కొ—నిన సరకు సేయనివారు; తమప్రాణములకు శత్రువులు. ఉల్లాసభరితులై వారొకవీరరసపూరితమగు గీతమును బాడుకొనుచు స్వారిచేయుచుండిరి.

వీరవేషము వేసినారలు
గౌరవము నిలుపుఁడు సిపాయిలు!
వైరమును మదిఁ బదనుపెట్టుఁడు
వ్యర్థములు శస్త్రాస్త్రముల్.

ఈవీరనాదములతోఁ బర్వతములు ప్రతిధ్వనించిపోయెను. అశ్వముల పదఘట్టనములు తాళము వేసెను. రాత్రిగడచిపోయెను. సూర్యుఁడు తనయరుణనేత్రములఁ దెఱచి యావీరులపైఁ దనస్వర్ణకాంతి వర్షింపఁదొడఁగెను.

సూర్యప్రకాశమున దగ్గఱనే యొకకొండపై శత్రుశిబిరము కాననచ్చెను.

రత్నసింహుఁడు తలవంచెను; విరహవ్యాకులమగు హృదయము నడచికొనెను; మందగతిని బోవుచుండెను. అడుగు ముందునకు సాగుచుండెను. కాని మనసు వెనుకకు లాగుచుండెను. పుట్టిన యిన్నాళ్ళకు చెడుతలంపు లతనికి నెఱపుగొలుపసాగెను. యుద్ధమునఁ బర్యవసాన మేమగునో, యెవరు చెప్పఁగలరు? తాను విడిచివచ్చిన ఆ యమేయస్వర్గసౌఖ్యస్మృతులు ఉండియుండి యతని మనమును పిండివైచుచుండెను. చింతాదేవి సజలనయనములు జ్ఞప్తికి వచ్చి, గుఱ్ఱమును వెనుకకు మఱల్తునా యనుకోర్కి— పుట్టుచుండెను. సమరోత్సాహ మంతకంతకు తఱిఁగిపోవుచుండెను. అప్పుడొకసిపాయి సమీపించి యిట్లనెను:—

"అయ్యా! చూడుఁ డాకొండపై శత్రువులు విడిసియున్నారు. ఇపుడు మీయభిప్రాయ మేమి? తత్క్షణము దండెత్తుటయే మాకోరిక. నిదురించుచున్నారు. కావున నెంటనే పాఱిపోవుదురు. జాగుచేసినచో వారును సన్నద్ధు లగుదురు; పదను చెడిపోవును. వేయిమందికి తక్కు—వ యుండరు."

రత్నసింహుఁడు చింతాక్రాంతుఁడై శత్రుశిబిరము వంక చూచి, "సరే, బాగున్నది." అనెను.

సిపాయి:—"దండెత్తుటయే యందుమా?"

రత్న:—"మీయిష్టము. చాలమంది యున్నారు; ఇదె యాలోచింపుఁడు."

సిపాయి:—"భయము లేదు. ఇంతకంటె గొప్ప సేనల తఱిమినారము."

రత్న:—"నిజమే; కాని—తొందరపడి అగ్నిలో దుముకుట మంచిదికాదు."

సిపాయి:— "ఏమంటిరి! యోధులజీవనమే అగ్నిలో దుముకుటకు. మీయాజ్ఞ తడవు; ఆపై మామగఁటిమి చూతురుగాని!"

రత్న:—"చాల బడలియున్నాము. కొంచెము సేపు విశ్రమించిన బాగుండును."

సిపాయి:— "వలదు; మనజాడ తెలిసినచో వారింక దారిఁ బట్టుదురు."

రత్న:—"అట్లయిన దాడియే సలుపుఁడు."

ఒక్కక్షణములో యోధులు గుఱ్ఱముల దౌడాయించి, ఈఁటెల సవరించికొని, శత్రుదళముపైఁ బడ నేఁగిరి. కాని కొండ యెక్కుసరికి శత్రుసేన అప్రమత్తమై యున్నదని వీరికి విదితమయ్యెను. వీరితలంపే ప్రమాదము. శత్రువులు పేల్కని యుండుటే కాక దుర్గముపై దాడివెడలుటకు సన్నద్ధు లగుచుండిరి. వారెదురుగ వచ్చుచుండుట గాంచుసరికి తప్పు తెలిసినది; కాని యిఁక నప్పు డెదుర్కొనక వేఱుపాయము లేకుండెను. రత్నసింహుని విషయమున నెవ్వరికిని సంశయము లేకుండెను. ఇంతకన్న విషమతరతరుణములందు నయితము తనపరాక్రమాతిశయముచే జయలక్ష్మిని జూఱకొన్న రత్నసింహుఁడు నేఁడు తనలక్షణము చూపకుండునా? నేత్రములన్నియు రత్నసింహుని వెదకసాగెను; కాని యెక్కడ నతనిజాడ లేదు. ఎక్కడకుఁ బోయెనో యెవ్వరికిని దెలియదు.

'అతఁ డెచ్చటికిఁ బోఁగలఁడు? తనసహచరుల నీయవస్థయందు విడిచి యతఁ డెచ్చటికిఁ బోఁగలఁడు? అసంభవము. తప్పక యిచ్చటనే యున్నాఁడు. జయోపాయము లాలోచించుచున్నాఁడు.'

క్షణములో శత్రువు లెదురుపడిరి. అంతసేన యెదుట ఈకొలఁదిమంది యేమి చేయఁగలరు? అందఱును రత్నసింహునిఁ బిలుచుటయే: 'ఎక్కడ కేఁగితివి? నూ కేమియానతి? వారప్పుడే వచ్చిపడిరి; నీ వింక నూరకుందు వేల? మాకు మార్గముఁ జూపుము! మాయుత్సాహము పెంపొందింపుము;' అని

ఇప్పటికిని రత్నసింహుఁ డగపడలేదు. తుదకు శత్రువులు మీఁదకు వచ్చిరి. యుద్ధ మారంభమాయెను. బుందేలులు ప్రాణము లఱచేతఁ బట్టికొని పోర మొదలిడిరి. ఒక్కని కొక్కఁడే భారమైయుండ, నొక్కఁడు పదిమందితోఁ బోరు టెక్కడ? అది యుద్ధము గాదు. ప్రాణముల జూదము. బుందేలులకు నిరాశ ప్రబలిపోయెను. వారు కసిగా పోరాడిరి; వెనుకంజ వేయలేదు. వారిలో నిఁక సుంతయైనను సమ్మేళనము లేకపోయెను. ఎవ్వరిమట్టునకువారు సాధ్యమయినంత ముందునకుఁ బోవుచుండిరి. పర్యవసాన మేమగునని యెవ్వరికిని చింతలేదు. ఒకఁడు శత్రుపఙ్క్తులఁ జీల్చుకొనుచు సేనాపతి చెంత కరిగెను. వేఱొకఁ డతని యేనుఁగుపై నెక్కఁబోవుచు ప్రేటుదిని కూలెను. వారి యసాధారణ సాహసమునకు శత్రువులుగూడ 'సెబాస్' యనుచుండిరి.

ఆవీరులు కీర్తి గడించిరికాని జయము గడింపలేదు. ఒక్క గంటలో రంగస్థలమున తెర జాఱెను. వినోదము సమాప్తమయ్యెను. పెద్దతుపాను వచ్చినది, వృక్షములను పెకలించుకొనుచుఁ బోయినది. సమ్మేళన ముండినచో ఈకొలఁదిమందియే శత్రువుల నురుమాడుటకు చాలియుందురు. కాని సమ్మేళన సూత్రధారుఁడు జాడలేఁడయ్యెను.

జయించిన మహాతులు ప్రతిశవమును శ్రద్ధతోఁ జూచిరి. రత్నసింహుఁడనిన, వారికి గన్నెఱ్ఱ. వారిగుఱి యంతయు వానిమీఁదనే యుండెను. రత్నసింహుఁడు బ్రతికియుండ, వారికి నిద్రపట్టదు. వారు పర్వతోపలము లన్నియు గాలించివైచిరి. కాని రత్న ప్రాప్తికాలేదు. జయము చిక్కినది. కాని యసమగ్రము.

౭

చింతాదేవి హృదయమున నేఁ, డేమో కాని, వివిధసందేహము లుప్పతిల్లసాగెను. ఆమె యెన్నఁడు

నింత దుర్బల కాలేదు. బుందేలుల కపజయమేల కలుగునో యామె కారణము చెప్పఁజాలదు కాని, ఆభావ మమాత్ర మామె వికల మానసమును వీడదాయెను. ప్రేమానుభవమున కామెకు లేశ యుండినచో! చిన్నతనముననే తల్లి మరణించు నాఁటి తండ్రితో నడవులన్నియుఁ దిరుగవలసి వచ్చునా! గుహాలయందును లోయలయందును వసింప వలసివచ్చునా! ఆకౌమార్యము మాత్ర మెంత కాలము?— తండ్రియు నామెను దిగవిడిచి యేఁగెను. అప్పటి నుండియు నొక్కదినమైన నామె సుఖముగఁ గూర్చుండలేదు.

ఆమె దుర్బల హృదయమున నిపు డొక విచిత్ర భావ ముప్పతిల్లెను. పరమేశ్వరుఁ డామె మనోహరుని సురక్షితముగ నిలుపేర్చినచో, నాతనిఁ గొంపోయి యే దేనొక దూరగ్రామమున బసచేసి, పతిదేవుని యారాధమున జీవనము సార్థక మొనరించుకొన నెంచెను; ఈ యుద్ధమునకు స్వస్తి చెప్ప నెంచెను. నారీభావ మామెయందు నేఁడే జాగృత మయ్యెను.

సంధ్యాకాల మాయెను. సూర్యుఁడొక పరాజిత యోధునివలెఁ పశ్చిమదిశ యేదేనొక మాటు కొఱకు వెదకుచుండెను. రిక్త హస్తముల తోడను, శూన్య పాత్రముల తోడను నిరాయుధుఁడగు యోధుఁడొకఁ డామెయెదుటికి వచ్చి నిలిచెను. చింతాదేవికి పిడుగు పడినట్లయ్యెను. ఒక క్షణమట్లే కూర్చుండెను. పిదప లేచి, వ్యగ్రుఁడగు సిపాయి యొద్దకు నచ్చి ఆత్రముతో:

"ఎవరెవరు మిగిలిరి?" అని యడిగెను.

"ఎవ్వరును మిగుల లేదు." అని సిపాయి చెప్పెను.

"ఎవ్వరును మిగుల లేదు! ఎవ్వరును మిగుల లేదు!!"

చింత తలపట్టుకొని నేలపైఁ గూలఁబడెను. సైనికుఁడు మరల నిట్లనెను:— "మరాఠులు సమీపించినారు."

"సమీపించినారా!!"

"మిక్కిలి సమీపించినారు!"

"అయిన త్వరగా చితి పేర్పుఁడు! వ్యవధి లేదు"

"ఇంకను మేమున్నాము గదా, వారి ప్రాణములఁ దీయుటకు!"

"అది మీ యిష్టము. నాకర్తవ్యమున కిదే సమాప్తి."

"దుర్గము మూసి నెలలతరబడి పోరాడఁగలము మేము!"

"అట్లయిన పోయి పోరాడుఁడు. నేనెవ్వరితోడను పోరాడ నక్కర లేదు."

ఒక దెసనుండి యంధకారము వెలుఁగును ద్రొక్కుకొనుచు వచ్చుచుండెను. వేరొక దెసనుండి మరాఠులు తరంగాయితములగు సేనను ద్రొక్కుకొనుచు వచ్చుచుండిరి. దుర్గమున చితి సిద్ధమగు చుండెను. దీపములతోపాటు చితియు వెలిఁగెను. సమస్తాలంకారములు సింగారించుకొని చింతాసతి అసాధారణ శోభల వెదజల్లుచు ప్రసన్న వదనముతో, అగ్నిమార్గమున పతిలోక యాత్ర సలుపుటకై పోవుచుండెను.

౮

చితి చుట్టును స్త్రీపురుషు లెల్లరు కూడిరి. శత్రువులు దుర్గము చుట్టుముట్టినను, ఎవ్వరికి నాగొడవ లేదు. దుఃఖ పరితాపములచే నెల్లరి ముఖములును వ్యాకులతతో నవనతములై యుండెను. నిన్న నీయంగణమునందే కళ్యాణ మండపము కై నేయఁబడెను. ఇపుడు చితి పేర్చిన చోటనే నిన్నను హోమకుండ ముండెను. నిన్నను గూడ నిట్లే యగ్ని శిఖ లెగయు చుండెను. ఇట్లే జనులును మిగూడి యుండిరి. కాని నేఁటి దృశ్యమునకును నిన్నటి దృశ్యమునకును నెంత యంతరమున్నది! ఔను, స్థూల నేత్రముల కంతరము గన్పడును; కాని వాస్తవమున నిది ఆయజ్ఞమునకే పూర్ణాహుతి; ఆప్రతిజ్ఞకే నిర్వహణము.

గుఱ్ఱపు డెక్కల చప్పుడు వినవచ్చెను; దాన నెవ్వఁడో యొక సిపాయి వేగముగ స్వారిచేయుచు వచ్చుచుండుట తెలియ వచ్చెను. క్షణములో ధ్వని విరమించెను. ఒక సైనికుఁడు పరుగు పరుగున నంగణము

లోనికి వచ్చెను. అందఱు నాశ్చర్యమునఁ జూచిరి.— అతఁడు రత్నసింహుఁడు!

రత్న సింహుఁడు చితి కడకుఁబోయి వ్రతఱచ్చ కొనుచు నిట్లనెను.

"ప్రియా! నేనింకను బ్రతికియే యున్నాను! ఇదేమి పని!"

చితి యిప్పుడే వెలుఁగు చుండెను. చింతాదేవి చెంగు పొడుగునను జ్వాల వచ్చుచుండెను. రత్నసింహుఁ డున్మత్తుని వలెఁ జితిలోనికి జొరఁబడి, చింతాదేవి చేయిపట్టుకొని లేవఁ దీయఁ బోయెను. అందఱు నన్ని వైపులనుండి చితిలోని కాష్ఠములు లాగివేయ మొదలిడిరి. చింతాదేవి మాత్రము పతివైపు కన్నెత్తి చూడనైన లేదు. తప్పుకొమ్మని చేతితో సంజ్ఞ చేసెను.

రత్నసింహుఁడు నెత్తిమొత్తుకొని యిట్లనెను:— "హా ప్రియా! ఇది యేమి? నావైపు చూడవేమి? నేను జీవించి యున్నాను!"

"నీపేరు రత్నసింహుఁడే. కాని నీవు నా రత్నసింహుఁడవు కావు" అని చితిలోనుండి ధ్వనివచ్చెను.

"నావైపు చూడుము; నీదాసుఁడను, నీయుపాసకుఁడను, నీపతిని నేనే సుమా!"

"నాపతిని వీరస్వర్గము నొందినాఁడు"

ఆహా! యిట్లు నన్నుఁ జెప్పను! ఓమహాజనులారా, యెట్లయిన నగ్ని నార్పుఁడు. ప్రియా, నేనే రత్నసింహుఁడను! గుర్తించుట లేదా?"

అగ్ని జ్వాల చింతాదేవి ముఖమున కంట నెక్కి వచ్చెను. అగ్నియందుఁ గమలము వికసించెను! చింతాదేవి స్పష్టముగ నిట్లు చెప్పెను:—

"చక్కఁగ గుర్తించుచున్నాను; నీవు నారత్నసింహుఁడవు కావు. నారత్నసింహుఁడు వాస్తవిక వీరుఁడు! తుచ్ఛదేహము రక్షించుకొనుటకై యిట్లు క్షత్రియ ధర్మమును బరిత్యజింపఁడు. ఏపురుషునికి నేను చరణదాసినైతినో యాతఁడు దేవలోకమున భాసిల్లుచున్నాఁడు! రత్నసింహు నపకీర్తి పాలు సేయకుము. ఆతఁడు వీరరాజపుత్రుఁడు; రణక్షేత్రము నుండి పాఱిపోవు భీరుఁడు కాఁడు."

తుదిమాట ముగియుట తోడనే యగ్ని శిఖ చింతా శిఖ నధిష్ఠించెను. ఆ నిరుపమ సౌందర్యరాశి, ఆ ఆదర్శ వీరత్వము నుపాసించుసతీమణి క్షణములో నగ్నిరాశియందు లీనమై పోయెను.

హతబుద్ధియై రత్నసింహుఁ డీదుఃఖమయ దృశ్యము నీక్షించుచు నూరక నిలిచిపోయెను. పిదప, నొక పెద్ద నిట్టూర్పు పుచ్చి, హతాత్తుగ నాక్షితి యందే దుమికెను.

[అనువాదకుఁడు: కొంపెల్ల జనార్దనరావు]

---

# విభీషణుండు

కలువలపల్లి రంగనాథ శాస్త్రిగారు

వననిధి దాటి రాఘవుఁడు వానరసైన్యముతోడ లంకఁ జొ
చ్చినవిధ మానుపూర్విగను శీఘ్రము చారులు విన్నవింప నె
మ్మనము గలంగి రావణుఁడు మంత్రులఁ గన్గొని సంగరాంగణం
బున రిపుగెల్వ నోపువెరవు న్వచియింపుఁ డటంచుఁ బల్కినన్.

నెఱఁగులగు మంత్రు లరినోర్చు వెరవులోలిఁ-దమకుఁదోచినగతి బహుధావచింప
వారివారించిపల్కె నవ్వారిగాగఁ-విమలగుణభూషణుండు విభీషణుండు.
"ఓయిరా, సోదర, దానవ-నాయక, రావణుఁడ, నెమ్మినాదుహితోక్తుల్
న్యాయపథంబును విడువక-శ్రేయస్కా-ముండవగుచుఁ, జెవిఁజొన్పతగన్.

కనకమృగంబుఁబట్టు తమకంబున రాముఁడు చాలదవ్వుగాఁ
జనుటయు నాగుణాకరుని జాడఁ గనంగ సుమిత్రపట్టియున్
వెనుకొనిపోవఁజూచి తఱివేచి, దశానన, మాయజోగివై
వనరెడుసీతఁ బల్మిఁ గొనివచ్చితి వియ్యది శూరధర్మమే.

నీతిఁ దొఱంగి యిట్లు రజనీచరనాయక, సాధ్వియైన యా
సీతను ముచ్చిలించితి వినీ, రణభీముఁడు రాముఁడల్లదే
కోతులఁ గొండముచ్చు లెలుఁగుల్ బలుసేనగ సేకరించి నీ
చేతిబలంబుమాపి తనచేవను జూపఁగవచ్చెఁ జూడుమా!

చేవ యెసంగఁగన్ సమరసీమ నెదుర్పఁగలేక నెమ్మదిం
గేవలమర్త్యుఁగాఁ దలఁచి కీడులుపల్కుచు రామభద్రునిన్
రావణ, కండకావరమునన్ జనకాత్మజ దొంగవోలె, మా
యావిధిఁ దెచ్చియుం గటకటా! వగపొంద వికేమి చెప్పదున్.

పావనియైన జానకిని బల్మిసి బట్టఁగఁ జూచుపట్టునన్
లావరి పోటుకాఁడు నగు లక్ష్మణుఁడచ్చట నుండెనేని, నీ
చేవయు గీవయున్ సరకుసేయునె, ప్రాణముతోడ వత్తువే
రావణ, వేయునేటికిఁక రామునిమ్రోలను నిల్వనేర్తువే.

వీరమ్మన్యుఁడ, నిన్నుఁ బొనిసచివుల్ వేనోళ్లఁ గొండాడఁగన్
వీరాలాపము లాడెదేమిటికి నీబీరంబు తోరంబుగన్

ఘోరం బెద్దయుఁ జూపి శత్రువితతిం బోఁకార్పకున్నన్ మహా
ధీరుల్ మెత్తురె, హాస్యభాజనముగాదే యిద్ది యూహింపఁగన్.

మానవమాత్రుఁ డీతఁడని మాటికి మాటికి నీసడించుచున్
వీని నెదిర్చి గెల్చుటొకవింతమె యంచుఁ దలంచి నైజ దు
ర్మానము పేర్మి, మూర్ఖులగు రక్కసులెల్ల నుతింపఁ జూపె దో
దానవనాథ, రావణ, హితంబగు పల్కు వినంగఁ జెల్ల దే.

జడమతివౌచు నుద్ధతిని సత్యపరాక్రముఁడైన రామునిం
బొడిచెదనంచు వెళ్ళెదవు పోరికి నాయితమౌచు, నయ్యయో,
పుడమిని దుష్టులం దునుమఁ బుట్టిన విష్ణుఁడు గాని వాసికై
పడఁగలపాట్ల కగ్గమగు పార్థివమాత్రుఁడుగాఁడు రావణా!

వానరుఁ డొక్కరుం డిటకువచ్చి, యశోకవనంబుఁ గూల్చి దు
ర్మాన బలాఢ్యులైన బలురక్కసులం బొరిమాల్చి, యంత లం
కానగరంబుఁ గాల్చి, జనకప్రభునందనతోఁ ప్రసంగమున్
జానుగ సల్పి పోయె రఘునాథుని గెల్వఁగ నీకు శక్యమే.

నలువకు మన్మఁడయ్యు నిజనాశన కాలము డగ్గఱం గడుం
జెలఁగి మదాన్వితుండగుచుఁ జేసిన చేతకు సానుతాపుఁడై
తలఁకు వహింపఁడంచు సతతంబును సజ్జను లేవగింపఁ గాఁ
దలఁగని నిందపాలయితి, తప్పనె, నీతలవ్రాఁత రావణా!

వాయువు మేఘబృందములఁ బాఱఁగఁ దోలెడుమాడ్కి నీదు బ
ల్మాయల రూపుమాపి తన లావును బీరముఁ జూపుచున్ మహా
సాయక జాలముల్ వఱపి సర్వనిశాట సమన్వితంబుగన్
మాయలమారివైన నిను మార్కొని రాముఁడు గీటడంచెడున్.

తలఁపఁగ రాదు లోఁతివనితం గదియన్ మదినైన, వారలన్
బలిమినిబట్టు కూళలకుఁ బాటిలు నారకబాధ లెన్నఁగాఁ
దలమె, సమస్తధర్మముల దారులెఱింగిన నీకు నింతగాఁ
దెలుపఁగనేల నీతెలివితేటలు మాసెనె దానవాధిపా!

బ్రదుకఁ దలంచితేని విను రావణ, రాఘవు నాశ్రయింపు మీ
పొదలును, సర్వభద్రములుఁ బొల్పెసలారును, రాజ్యలక్ష్మియున్
సుదతు లనుంగు బిడ్డలును సోదరు లాప్తులు, మంత్రులుం బదిం
బదిగ సుఖంబుఁగాంచి కడువర్ధిలఁ జాలుదు రెల్లకాలమున్.

అనఘాత్ముం డగు రామభద్రునకు నిల్లాలైన వైదేహి న
ప్పనఁగావించి తదీయపాదకమలద్వంద్వంబుపై వ్రాలి, ప
మ్మిన దైన్యంబున వేఁడినన్ మనుచుఁ జుమ్మీ మ తప్పులన్ సైచిన
మ్మినవానిన్ విడనాడ కా విభుఁడు నెమ్మిం జేకొనున్ రావణా!

గాటపుటల్క మేటి విలుకాఁడగు రాముఁడు వాఁడిముల్కులన్
సూటిగ నీదుమేనఁ గడుసోఁకఁగ నేసిన నొచ్చి కుందుచున్
సాటివచింపరాని బలుశౌర్యము నచ్చిననాఁడుగాక, నా
మాటలు నమ్మదే దురభిమానభరంబున, నేఁడు రావణా!

నమ్ము, మదీయపథ్యవచనమ్ము, మహీసుత నెంటఁగొంచు రా
రమ్ము, రఘూద్వహుండయిన రామునిపాలికి, నిన్నుఁగాచు, లే
లెమ్ము, కృతాపరాధముల లెక్కఁగొనండు, దయాకరుండు శ్రే
యమ్ము, లభించుసుమ్ము, వినయమ్మును జూపెదవేని రావణా!"

తమ్ముఁ డనేకరీతుల హితమ్ము వచింప భరింపరానికో
పమ్మున, రావణుండు సచివప్రకరంబువినంగ, సుతయున్
సమ్మతిలేమిఁ దెల్పుచు మనంబుఁ గలంగ, నిరాకరించుచున్
నెమ్మిఁదొఱంగి గర్వమున, నిక్కుచు నాతనిఁజూచి యిట్లనున్.

తమ్ముఁడవయ్యు దాయల ప్రతాపము లూరక సన్నుతించి, భా
వమ్ముఁ గలంచి వారిఁగొలువం బురిగొల్పెదు, నన్ను నంతదై
న్యమ్ము వహింప నేమిటికి నా కరిపక్షముఁ బూను నీదుచం
దమ్ము నెఱింగి, యింక నిను దగ్గఱఁజేర్చినఁ గీడుమూడదే.

ఇమ్ముగఁ దొంటిచందమున, నిచ్చట నీవు వసింపరాదు, పో
పొమ్ము, దురాత్ముఁడా యనుచు, బుద్ధికిఁ దోఁచినభంగి, నల్క, శే
ద్రిమ్మరి తేఁడు నల్క నలదీనశరణ్యుఁడు రాముఁగొల్వ మో
దమ్మున నేఁగె, మంత్రులును దాను విభీషణుఁ డాక్షణమ్మునన్

పలువతనమ్మునన్ సుపథవర్తనమున్ విడనాడి మంచిచె
డ్డలు దెలియంగఁ బ్రాజ్ఞనికటంబున కేఁగు తలంపు లేక వి
చ్చలవిడి నిచ్చలున్ మెలఁగఁ జాగుజడాశయులైన మోఱకుల్
చలము దొఱంగి నమ్రులయి సాధుహితోక్తుల నాలకింతురే.

---

# దత్త

శతావధాని వేలూరి శివరామ శాస్త్రి గారు

లోకమున అన్నము లేకపోవుచో ఒకి లోపమని ఒప్పుకొందును వస్త్రము లేక పోవుచో ఒకలోపమని అంగీకరింతును ధనము లేకపోవుచో ఒకలోపమని సమ్మతమే. మగఁడు లేకపోవుటకూడ ఒకలోపమని ఇయ్యకొందును గాని పిల్లలు లేకపోవుట ఒకలోపమా? మేనక పిల్లలు లేకపోవుట ఒకలోపముగా భావించు కొనును. ఇంతియకాక పైఁగా గునుపు. ఎవరి మీఁద ఈగునుపు?

ఇది నిక్కముగా లోపమేనా? అని ఎన్నాళ్లు ఆలోచించినను నాకు తెగలేదు. పిల్లలులేకపోవుట ఒక లోపమా? అనియు పిల్లలు కలుగుట ఒకలోపపూరణమాఁ?అనియు నేను తరిచి తరిచి అడుగుచో మేనక రెండు కనులతోను చూచి ఊరకుండెడిది. ఈ విష యమును 'ఇంకా' వారినీవీరినీ అడుగవలెనని నాకు ఉండెడిది

'బ్రహ్మానందం' నాకెంత స్నేహితుఁడో అతనిభార్య వెంకమ్మకూడ నాకు అంత స్నేహి తురాలు. ఆమె చదువుకొన్నది. అందుచే ఆమెను 'వెంకయ్యా' అని ఁఁడువా రందఱు లోలోపల అనుకొందురు. ఆమెను 'వెంకయ్యా' అని పిలుచువారిలోఁగల ఉత్తమగుణాలు వెం కమ్మకడ లేవు. పురుషులు రాఁగానే లేచి జనానాలోకి పరుగెత్తి తొంగితొంగి చూడదు. ఆమె నిర్భయముగాఁచూచును. నిర్భయముగా మాటాడును. ఆమె లోపల లొటారము పైకి బొటారము కాదు. లోపల ఎంతో బయటికిని అంతే. బయటికి ఎంతో లోపలా అంతే.

ఒకనాఁడు నేను అడిగినాను—'వేం! పిల్లలులేకపోవుట కూడ ఒకలోప మని అని పించునా? అనిపించె నేని అది యెటువంటి లోపము?' అని

వేం అన్నది_'ఈకూడ' స్త్రీజాతీ-జాతికీ మానభంగము. నిజముగా నీమీఁద 'డిఫర్ మేషన్'చార్జి తీసికొనిరావచ్చును.మగవాండ్రే జడ్జీలుగా ఉన్న ఈకోర్టులలో న్యాయము కలు గుట కష్టము కాఁబట్టి ఆమాట అటులుండనీ! నేను ఒకసంగతి అడిగెదను. దానికి సమాధా నము చెప్పు. భార్య లేకపోవుట పురుషునికి లోపమేనా?'

'ఈసంగతి నాకు బొత్తుగా అనుభవి తము. నాకు పదవయేట పెండ్లిచేసిరి. నాకు పదియేనవయేటనే మేనకను పంపిరి. లోఁగడ నాకు అది లోపమని తెలియదు.' అని నేను లోలోపల తలపోయుచు రెండు గ్రుడ్లు అప్ప గించి కూర్చున్నాను.

'ఏమిటీ మాటలాడవు? అవును. నీకు ఆలోపము తెలియదు. నీవు ఆఁడుదానివై ఉన్న పుడు నిన్ను మగవానిని చేసిరి. సరి కాని

మావారి నడుగుచో 'తూచా'లతో తెలియును. మావారికి ముప్పదియేండ్లు వచ్చినదనుక వివాహము కాలేదు. ఆయనకుఁ గల మూఁడువేల రుపాయల ఆస్తీని అమ్మి తుదకు నన్ను చేసికొన్నారు. ఇది నేను చెప్పుచో లెస్స కాదు. వారిముఖమున వినవలయును. సరి. అప్పటినుండియే నన్ను తనయింటికి పంపమని మానాయనకు జాబులు. ఎందుల కాఁ ద్రాఁత? ఇఁక నేను పెద్దదాన నైనతరువాతి సంగతి ఆయనయే చెప్పవలయును. 'ఇటులు వెంకమ్మ అనుచుండఁగా బ్రహ్మానందం ముసిముసినవ్వులతో గదిలోనుండి వీథిలోనికి ఒక చే అంగ పెట్టినాఁడు. వెంకమ్మ వెంటనే—'మీసం గతియే. ఇటు దయచేయుఁడు 'ఇటు దయచేయుఁడు' అని అనుచుండఁగనే అతఁడు అంతర్ధానము చేసెను. 'ఆయన ఆదారినే కోర్టుకు పోయి ఆఁడువారిమీఁద డిఫమేషన్ తెచ్చునటులున్నారు. జడ్జీలు మీపక్షీయులేగా' అన్నది వేం.

నాకును కష్టముగానే ఉన్నది. ఇపుడు బ్రహ్మానందంమీఁద నాకు సానుభూతి కలిగినది. నేను బ్రహ్మానందమును తీసికొని వత్తునని మిషపెట్టి వెళ్లిపోవుదు ననుకొంటినిగాని వెంటనే వేం—'పర్వతాలూ! పిల్లలు లేకపోవుట లోపమా? అను ఈప్రశ్న—అది లోపమగుచో ఎటువంటి లోపము? అను ఈప్రశ్న—నన్నడుగుటకు వచ్చితివి! ఆఁగు ఆఁగు! అక్కడనే ఉండు!' అనుచు లోపలికివెళ్లి (అప్పుడే దొడ్డిదారిని అక్కడికి మేనక వచ్చినదేమో అనుకొన్నాను) మేనక చేయిపట్టుకొని నాయెదుటికి తీసికొనివచ్చి 'ఇదిగో ఈమె నడుగు!' అని అన్నది.

మేనక నాప్రశ్నకు కన్నులతో నిరీక్షించుచున్నది. దీనివలన ఇపుడే వచ్చినదనుట విస్పష్టమయినది. నాకు కొంచెము ధైర్యమువచ్చినది. పిల్లలు లేకపోవుట లోపమే కాబోలునని నేననుకొని లోఁగడనే తెలిసికొనకపోవుట, విశేషించి నాయంత నేను తెలిసికొనక పోవుట ఇవి యన్నియు నాలోపముగానే భావించి, వేం నామీఁది ఉత్తరీయమును లాఁగికొనుచున్నను బయటఁబడి ఇంటికిఁ జేరి ఎంత వేగముగా వచ్చితినో గుండియలవలన ఎఱిఁగి కొంటిని. వేం తప్పక మేనకకు మాసంభాషణము చెప్పునని నిర్ధారించుకొంటిని. గది తలుపు బిగించుకొని ఆలోచించి ఇటులు సూత్రీకరించి కొంటిని—'పిల్లలఁగనువారికి - వారికే తెలియవలయును గాని మగవారికి మాకెటులు తెలియఁగలదు?' అని. ఇటులు నిశ్చయించుకొని నా యీనిశ్చయమును మేనకకు ఎఱుఁగనటులు వినిపించుచో చాల ఓదార్పుగా ఉండుననుకొని ఒకటి రెండు సారులు నాలో నేనే లోపల అనుకొన్నటులూ, బయటికి అనుకొన్నటులూ అనుకొన్నాను. మేనక వెంటనే ప్రత్యుత్తరముగా (అంతయు సరిగా నావలెనే) ఇటులు అనుకొన్నది.—'భగవంతుఁడు గర్భధారణము మగవారి మెడకే కట్టినచో అపుడు వారికే లెస్సగా తెలిసి రాఁగలదు'అని. 'స్త్రీజాతికోపము శాపముగా మాఱునేమోరా, భగవంతుఁడా' అని అనుకొ

న్నాను. ఈమాటతో ఇఁక దత్తు చేసికొన నిర్ణయించుకొన్నాను. పిల్లవానిని దత్తుచేసి కొందమని నేను; పిల్లదానిని చేసుకొంద మని మేనక.

కుఱ్ఱని పెంచుకొనుచో వార్ధకమున అక్కఱ అవచ్చుట ఒకటి; చచ్చిన పయి తద్దినములు పెట్టుట రెండు; ప్రకృతము సున్నను ఒకటి చేయుట మూఁడు. ఈ మొదలుగా పురుష దత్తతనుగుఱించి ఉపన్యసించుచుండువాఁడను.

వార్ధకమున వాకిటికి లాఁగుట ఒకటి; పిదప ఏబస్తికోపోయి కొన్నాళ్లకు తిరిగివచ్చి అక్కడ తద్దినము పెట్టితినని అపలపించుట రెండు; ఈరీతిగా ప్రకృత లోపమును ద్విగుణీకృతము చేయుట మూఁడు. అని దేనికికి దానిని ఖండించి, ధనాశచే అల్లుఁడు హమేషా 'అక్రీత దాసుఁడు' అను తన పేరును సార్థకపఱిచికొనుట ఒకటి; కూఁతుతో అల్లుఁడు కలిసి ఒకరికిద్దఱు అక్కఱకువచ్చుట రెండు; కొడుకు గోడండ్రు ఎంతవిరోధింతురో అల్లుఁగూఁతులు అంతప్రేమించుట మూఁడు, అని ఈ మొదలుగా స్త్రీదత్తతను గుఱించి మేనక ఉపన్యసించెడిది. ఇటులు ఎన్నాళ్లకును మా తగవు తెగలేదు.

నాకెపుడును వేదాంతములు చదివికొనుట, పత్రికలకు వేదాంతోపన్యాసములువ్రాయుటయు పని. అష్ట దిగ్బంధనములతో, అంగరక్షతో సతతము నాగదిలో కూర్చుండువాఁడను. ఆయింటి నిశ్శబ్దతను ఎలుకలు మాత్రమే అపుడపుడు భగ్నము చేయుచుండెడివి. Rat-killer వల్ల వాటిపీడయు ఇపు డంతగా కానరాదు.

ఇటులు గుహాగంభీరమైన మాగృహము ఇపుడు క్రమక్రమముగా సహస్రకంఠములతో ముఖరితము కాఁజొచ్చినది. ఇంటఁగల ప్రతి పదార్థమును క్రిందనో మీఁదనో పడి ఆధ్వనితో శ్రుతి కలుపుచున్నది.

ఇదివఱ కెన్నఁడును లేని ఈవిషయము నాకు చోద్యముగా నున్నది. చాల కాలము నుండియు మాటాపలుకూ లేని ఆ శూన్యారణ్యము అంత రణగుణధ్వనిని వడ్డీతోకూడ టకాయించి అప్పు తీర్చుకొనుచున్నటులున్నది.

మెల్లగా మెల్లగా నడిచి వెళ్లి నాగది తలుపు తీసి చూచితిని. మేనక ఒడిలో దుర్గ



“దుర్గా! భయము లేదు; అన్నము తిన్నావా!”

కు స్తీలు పట్టుచున్నది. నన్ను చూచి మెఱుపు తగిలినటులు ఒక్కసారి ముణుచుకొని పోయినది. మఱి మాటాడలేదు. అంత శాంతి మా యింట అదివఱ కెన్నఁడును అనుభూతము కాలేదు. దుర్గ బిఱియపడుట కాదుకాని భయపడిన దనవలయును. శుష్కవేదాంతపఠనము వలన కలిగిన నాయుదాసీనత అంతయు అపుడా పసిపిల్లవల్ల మట్టిలో కలిసిపోయినది. 'దుర్గా! భయములేదు, అన్నము తిన్నావా?' అని నేననఁగా దుర్గ మూసికొన్న చేతులవ్రేళ్లను ఎడముచేసి కాటుక కన్నులతో నన్ను చూచినది.

దుర్గ ఈనాఁడు ఈరీతిగా వ్రేళ్లసందుల నుండి దోబూచులాడినపిదప నేటి కిది ప్రథమ పాఠమనుకొని నేను మఱల తలుపు మూసికొంటిని. మూసికొనిన వెంటనె కందిరీఁగల పట్టు కదిలినది. 'పిన్నీ! ఆయస యెవరు? ఆయన నీకేమౌతాఁడు?' అని ప్రశ్నించి మేనక నవ్వఁగనే 'మా అమ్మకు మానాన్న ఔతాఁడా?' అని ఈ మొదలుగా ప్రశ్న పరంపరను శరపరంపరగా పరఁగించినది.

నాకు పిల్లలనినచో ఇష్టము బహు-ఇష్టమే కాని నాకే పిల్ల లుండుట అనునది అనిష్టము మహా-అనిష్టము. ఒకవేళ నాకే ఉండుచో ఈచెప్పఁబోవు నియమములతో ఉండుచో వారిని ఉంచుకొనుటలో ఏమియు ఆతంకము లేదు. ఏడువఁగూడదు. లోలోపలఁగూడ ఏడ్వఁగూడదు. అట్లని ముసలి మోములతో కూర్చుండరాదు. కలకలలాడుచు నవ్వుచుండవలయును. ఎత్తుకొమ్మని యేడువఁ గూడదు. ఒకవేళ యెత్తుకొని వెంటనే దింపినచో దిగక చంకనంటుకొని లబలబలాడరాదు. వెంటనే హసన్ముఖముతో దిగిపోవలయును. పప్పులు పెట్టుమని, బిళ్లలు పెట్టుమని వేధింపరాదు. శరీర ధారణకుమాత్రమే ఆహారమని తెలిసికొనవలెను. పెట్టినది గుటుక్కున మ్రింగి గప్‌చిప్‌మని నోరు మూసికొనవలెను. వారి ముక్కు నోరు మొదలగునవి నిత్య నిర్మలములుగా ఏ శుద్ధియు సక్కఱలేక యుండవలయును. నా కోరికి చొప్పున వారికి నిద్ర రావలయును. ఆఁకలి కావలయును. నా కాగితములు చింపరాదు. వానిమీఁద వ్రాయరాదు. సిరాపోయరాదు. విశేషించి మా యింటి నిశ్శబ్దతను బహుభద్రముగా కాపాడవలయును. ఇట్టివింకను చెప్పకయే తెలిసికొనఁదగినవి చాల ఉన్నవి.

అన్నము తినువేళ పిల్లలు ఏడ్చునో అది నాకు జీర్ణము కాదు. నా సంగతి తెలిసిన తల్లులు వారిని చాటులకు తీసికొనివెళ్లి నోరు మూసి వినఁబడని దెబ్బలు కొట్టుచో తొడపాసెము పెట్టుచో, నేను మెలకువగా తెలిసికొని—'తల్లులు చక్కగా కంటారుకాని మళ్లీ వాళ్లే చంపేస్తారు' అని అనువాఁడను.

నాయుద్దేశమున పిల్లలు ఏడువకుండ ఉండవలయుననున దొకటి. వారికి మాటలు రావు కావున తమ ఆఁకలి దప్పులు తెలుపుకొనుటకు 'ఏడుపు కావలయును'అనుఅంశము

శుష్క వేదాంతపఠనము మానిన పిదప నిన్న మొన్ననే తెలిసినది. అల్లరిమానవలయునను నది ఇంకొకటి. "మనస్సు గాలివలె పట్టరానిది. దానిని నిగ్రహింపవలెను. అని మాటి మాటికి చెప్పు గీతావాక్యములు పిల్లలనుగుఱించినవే" అని నాతలంపు. కాని, నా మనస్సును నేను చూచుకొన్నతరువాత నేనే మిథ్యాచారుఁడ నని తెలిసికొంటిని. పెద్దలను గౌరవింపరనునది మఱియొకటి—ఎంతవారినైనను 'నీవు నీవు' అని వేయుదురు; విశేషించి పిల్లాపీచూ లేని నన్ను కూడాను. ఇప్పుడు దుర్గ నన్ను 'ఏమండీ' అని పిలుచునో 'ఏమిరా' అయిపోయినది.

ఇటీవల ప్రతిదినము ప్రక్క ప్రక్కల పటహధ్వనులలో మెలఁగుట నాకు అలవాటు కాఁజొచ్చినది. క్రమక్రమముగా నాయెదుటనే తప్పెటలూ తాళములూ. 'నిగ్రహఃకింకరిష్యతి?'

సమయమునకు దుర్గ రానిచో ఇపుడు నేనే పిలుచుచుంటిని.

ఒకనాఁడు తండ్రి చూచుచున్నాఁడని కాఁబోలు నాచేయి పట్టుకొని నాతో వచ్చుచున్న దుర్గ నాచేయి నలిగిన పూవువలె వదలి వైచి ప్రక్కసందులోనికి తప్పుకొన్నది. మరొకనాడు 'ఒకనాఁడు చూచినాఁడు కదా!' అని కాఁబోలును చేయిమాత్రము వదలి నాతో వచ్చినది. ఇంకొకనాఁడు తండ్రి చూపులతోఁ గంటకిత యయినను నాచేయి వదలకయే నాతో వచ్చినది. నేను కాఫీ పుచ్చుకొనుటకు కూరుచుంటిని. దుర్గ దూరముగా నిలువఁబడి అదే పనిగా చూచుచున్నది. అల్లరిపిల్ల చేతిలో గిన్నెను ఎగురఁగొట్టునేమో యని భద్రముగా పట్టుకొని యుంటిని. దుర్గ 'అదేమిటి?' అని అడిగినది. 'కాఫీ' అంటిని 'కాఫీ రాసుకుంటారుగాని తాగుతారా?' అన్నది. ఇది 'తాగే కాఫీ' అని ఉదాహరణము చేసి చూపించుచుంటిని. దుర్గ మరికొంచెము దూరము జరిగి నిలువఁబడినది. అడుగునా? యని కని పెట్టుకొని కూర్చుంటిని. ఊరక చూచును కాని అడుగదు.

'కొంచెము కాఫీ పుచ్చుకొందువా?' అని నేనే అడిగితిని. పిల్లల భాషలో 'అదేమిటి?' అనుదానికి 'అది కావలయును' అను అర్థము నాకపుడు గోచరించినది. గిన్నె చేతి కందించితిని. 'నాన్న కోపంచేస్తాఁడేమో'అన్నదిదుర్గ.

నాకు కొంచెము ఆలోచనకు అవకాశము. "పరాయివాళ్లము కాఁబట్టికదా ఈపిల్ల సమేతూ ఇటులు అనుచున్న"దని నాకు అపుడు విషాదము కలిగినది. నన్ను అర్థము చేసికొన్నది కాఁబోలు! మేనక నాకన్నులకేసి చూచినది. మేనక మనస్సు నాకు తెలిసినది నామనస్సు మేనకకు తెలిసినది. మన స్సంతయు ఒకటే జాతి. మేనక కన్నీళ్లతో పెరటిలోనికి వెళ్లినది.

దుర్గ చేతిలో గిన్నె ఆరీతినే ఉన్నది. 'ఇక్కడికి వచ్చావని మీ నాన్న కెట్లా తెలుస్తుంది లే!' అన్నాను నేను.' 'అల్లింటికి ఎందుకెళ్లావ్' అని నిన్న అడగ లా?' అన్నది దుర్గ.

నాకు కొంచెము ఆలోచన అంకురించి నది కాని ఇట్టే తుంపివైచితిని.



"నన్ను అర్థముచేసికొన్నది కాఁబోలు! మేనక నాకన్నుల కేసిచూచినది"

'కాఫీ చల్లారితే బాగుండదు. తరువాత ఆసంగతి ఆలోచిద్దాం. ముందర కాఫీ తాగు!' అన్నాను. నిజమే ననుకుంటూ కాఫీ గిన్నె ఒక్కసారే ఎత్తి నోటిలో పోసికొన్నది. కాఫీ ముక్కులలో నిండఁగా కన్నులలో కొంత, కన్నులు నిండఁగా చెవులలో కొంత సర్దుకొన్నది 'Economy' తెలిసినట్లు. దుర్గ ఒక్కసారిగా ఉక్కిరి బిక్కిరి అయినది. మేనక చరాలున వచ్చి దుర్గను ఎత్తుకొని దగ్గించి తుమ్మించి తానుగూడ కొంత గడబిడ ఆరోపించుకొన్నది. దగ్గులు తుమ్ములు అయినతరువాత దుర్గ—'నా కిఁక కాఫీ అక్కఱ లేదు. కాని నీకే యిత్తా మాయింటికి రా!' అన్నది.

ఆమఱుసటినాఁడు దుర్గ రాకపోవఁగా చాలసే పెదురు చూచితిని. చూచి చూచి వారి యింటికే వెళ్లితిని. దుర్గ తండ్రి వాకిట కూర్చుండి యున్నాఁడు.

ఒక మనుష్యుడు మఱియొక మనుష్యుని చూచినంతమాత్రమున మాటాడవలసిన విధి యెచటను లేదు కాని ఎదురుగా కూర్చుండి ముఖము కేసిచూచుచుండుచో అతఁడు వెనుజూపు పెట్టునేని ఇఁక మాటలాడుట యెట్లు? పాఱిపోవు కోయిలను వెంటాడి పలుకరింతుము; ఎదురుగా నున్నను అప్రసన్నునితో మాటలాడఁజాలము. సహస్రకంఠములతో శబ్దించు సాగరమును తీరమున నిలిచి పిలిచితి మేని 'ఓ' యనును. అక్కఱలేనిదే అతి గభీరముగ కూర్చున్న మానవునితో మాటాడఁ గలుగుట అరిది.

నేనొక వాత్సల్యదైవమును అతని దేవాలయమున చూడఁదలఁచికొని వెళ్లితిని. కాని తలుపులు తాళాలు పెట్టఁబడెను.

నేనే మెల్లగా తలుపు తెఱచికొన ప్రయత్నించితిని. ఏనుఁగు బలముతోఁగాని ఆతలుపు కొంచెమేని కదలలేదు.

నా చెప్పిన దెల్లయు ఆలించి ఆయన అనెను—'మాఅమ్మాయి అసలే కొండకాటి గాఁడుపిట్ట! మీరు దానిని మరి కొంచెము వాగించుచున్నారు! ఇది అతి పరిచయ మను కొందును' అని

5.    4-    7    ౫౭3

నాయంత నేను త్రోసిన తలుపు బల్లు మని నామీఁదనే పడినది. నావేదాంతమపుడు నాకు లెస్సగా ఉపయోగించినది. గతవిషయ మఖిలము మేనకతో చెప్పికొంటిని. నా విషా దముకూడ అది అనుభవించినది.

ఇదివఱకు మాయింటికి అలంకారప్రాయ ముగా ఉన్న మౌనము ఇపుడు భీకరముగా ఉన్నది. ఇపుడు మాయింట నందికేశ్వరుఁడు పటహములు వాయింపఁడు. భృంగి హాస్యము లుక్తిచెప్పఁడు. కౌమారి ముద్దుమాటలు అనదు. దుర్గ నర్తింపదు. ఇల్లిపుడు గొడ్డువోయినది.

మఱల ఎప్పటి ఆట. నావేదాంతములూ నేనూ. కొన్ని మాసములు కడచన్నవి. మేనక 'మాదుర్గ తపస్సు చేసికొనుచున్న' దని కలవ రించెడిది.

మావీథిలో పేరంటము. ఇపుడు పొరు గింటికికూడ అడుగు పెట్టని మేనక పిలువని పేరంటమునకు వెళ్లినది. మంగళధ్వనులతో చెవులు చిల్లులు వోయినవి. నాకు దుర్గ గుఱు తు తగిలినది. వెంటనే వ్రాఁతకోఁతలు కట్టి పెట్టి దుర్గను తలపోసికొనుచుంటిని.'పేరంటము నకు వెళ్లుచో, దుర్గ కనఁబడునుగదా' అని అను కొంటిని. నాకు స్త్రీలమీఁదఁ గొంచెము చులు కఁదనము. ఇపుడు పోయినది. ఇంట నేనొక్కఁ డనే. నామనస్సున ఒక్క దుర్గయే. ఈదుర్గ వెనుకటి దుర్గ కాదు. ఒక కోరచూపు బెత్త ముచే నా బాహుపంజరములోనికి వచ్చుటకు భయపడు దుర్గ.

కొంతసేపటికి నాగది తలుపులమీఁద ఒక మృదుస్పర్శ కలిగినది. నాహృదయపద్మము మీఁద ఒక ఆశాభృంగము వాలినది 'బా బాయ్' అని పిలుపు. నా ఒడలు గగురు పొడి చెను.

మఱల బాబా అని పిలుపు నేను మా టాడలేదు. దుర్గ బిగ్గఱగా అఱచినది వెఱ్ఱి కేకలు వేసినది. పేరంటమునకు వెళ్లక పొరు గున నెవరేని ఉన్నయెడల 'లోపల ఉన్న వాఁడు ఏకారణముననో ఈపాటికి అయిపోయి ఉండునని తలుపుల ఉతకలు ఎత్తి పాఱవైచి యుందురు దుర్గ పిల్ల యగుటచే లోపల నేను గట్టిగా బ్రదికి ఉన్నాననియే, తనను పరీక్షించు టకో నిషేధించుటకో తలుపు తీయలేదనియే.

నేను మాత్రము తలుపు తీయలేదు. పర్వతరాజ శాస్త్రుల్లుగారూ! అని ఋషభ స్వరములో; పర్వతరాజుగారూ! అని గాంధార ములో; పర్వతాలూ! అని మధ్యమములో; రాజూ! అని పంచమములో; పర్వతరాజూ! అని ధైవతములో; బాబా! అని నిషాదములో; ఈస్వరము లన్నియు నామనోద్వారమును తెఱచెనుగాని తలుపు తెఱవఁబడలేదు.

ఇఁక ఒకటే స్వరము మిగిలినది. అది ప్రేమస్వరమునకు అపరాంగ మయిన రోదన స్వరము ఆస్వరముతో 'కొంచెం తలుపు తెఱవవయ్యా! ఒక్కసారి చూచి పోతా నయ్యా! ఎంతోసేపు కూచోనయ్యా!' అన్నది దుర్గ.

నాపరీక్ష కడ ముట్టినది. నూటికి నూఱు మార్కులు వేసితిని. ఇంతకు ముందే మేనక దొడ్డిదారిని లోనికి వచ్చి ఇదియంతయు ఆల కించుట నే నెఱుఁగను.

మెల్లగా గడియ తీసితిని. నేను ఏమా త్రేము భద్రముగా నిలుచుండకపోయినను తలుపులు రెండూ నామీఁద విసురుగా పడునవే. దుర్గ ఎగిరి ఒక్కసారి నాకంఠము కౌఁగిలించుకొన్నది అది తనంతట తాను నాకు దత్తు అయినట్లు. ఆహా! సంతానవంతు లెంత భాగ్యవంతులో! నా కపుడు ఒకానొక ఆనందము కన్నులలో బాష్పధారలుగా పరివర్తిత మయినది. కంఠమున వెక్కులుగా పరిణమించినది. నన్ను చూచి దుర్గ ఆవురు మన్నది.

మాకన్నీరు ఆఁపుటకు కాఁబోలును మాముందు దుర్గ తండ్రి నిలువఁబడి యుండెను.



దుర్గ ఒకతూరి వెనుదిరిగి చూచెను. తోడిమె ఊడినపూవు. నాసందిటనుండి మధుబిందువువలె నేలకు జాఱెను.

నేను దుర్గతండ్రి కేసి కోరచూపులు చూచుచు నిలువఁబడితిని. దుర్గ శిక్షిత హరిణివలె ముందులకు నడచెను; తండ్రి వెనుకముఖ రమయిన వీణ గవుసెనలో నడిచి పోయెను.

మేనకకు నాకును కొన్నాళ్లు వెన్నెల లేదు. మా కేదో తప్పుచేసినటు లుండెను. మఱచిపోయిన మృతపూనమును మా యిల్లు క్రమ్మఱ అలవఱిచికొనెను.

పదినాళ్ల పదఁపడి మాయావేదాంతము మాని భక్తివేదాంతములు చదివితిని. అన్ని దేశములవారి భక్తిని తెరిచితిని. భక్తి భరత ఖండము సొమ్మే.

తొల్లి అన్నిటికంటె జ్ఞానమే ప్రధానమని నావాదము. ఇపుడు ఆస్థానమును భక్తి ఆక్రమించినది. పండితులతో వాదించుటకుఁ గాదు-సాధనకు. వాదింపఁదలఁచినచో—త దేవ కర్మజ్ఞాని యోగిభ్య ఆధిక్య శబ్దాత్ [౧ అధ్యా-౨ ఆహ్నిక- ౨౨ సూత్ర] అను శాండిల్యుని భక్తిమీమాంసలో పండితులకు రంగస్థలము దొరుకును.

భక్తిలో పడితిని. ప్రతిబిచ్చగానిపాటలోనూ కవిత్వమే. వ్యాకరణాది దోషములు పాపములవలె మనస్సునకు తట్టుట లేదు. సంగీత సామగ్రితో పనిలేదు. భక్తిరసముకల ఆపాట సర్వాంగ సుందరము.

తెల్లవారుజామున మాయంటి ప్రక్క పూర్ణమ్మగారు మీరాబాయిపాట తెలుఁగున పాడుచున్నది—

కృష్ణమ్మా! గోపాలబాలా! కృష్ణమ్మా!
కాళ్లాకు గజ్జెలు గట్టి
వేళ్లా కుంగ్రాలు వెట్టి
గోళ్లాకు ఎఱుపులు తిరుగ—
గోరింతాకు పెట్టెద రారకృష్ణమ్మా!

ఈపాట వినుటతోడనే శ్రీకృష్ణుని మీరాబాయి దత్తు చేసికొన్న దని తోఁచినది. ఆమఱునాఁడు వంగీయుల దుర్గాపూజ చదివితిని వారు దుర్గను కూతురుగా తమ పుట్టింటికి తెచ్చి పూజించికొందురు ఓ! ఎట్టి భావన!

నేను బంగారము కొనితెచ్చి మేనకకు ఇచ్చితిని. మేనక దుర్గా ప్రతిమ చేయించెను. నేను అలంకారములు చేయించితిని.

ఇపుడు అనునిమిషము మాదత్తకుమారి మమ్ము వదలినను మేము వదలము. ఇఁకొక తమాషా. నానియమములన్నియు ఇపుడు తలక్రిందు లయినవి. ఇపుడు నేను మా దుర్గను 'ఏడువవేమి' అని అందును 'అది పెట్టు; ఇది పెట్టు' అని అడుగవేమి? అని యేడ్తును. నా కాకితములు చింపవేమి? ఇల్లంతయు మోఁగి పోవునటులు నృత్యము చేయవేమి? అని బతిమాలుకొందును. నీవు పలికినదాఁక అన్నము తిన నని పట్టుపట్టి ముక్కుమూసికొని కూరుచుండుచుందును.



జ్ఞాతిని మోసగించి రభసంబునఁ గూల్చితిమంచు నెంతయున్
జేతమునందు గుందిననుఁ జేరి యుధిష్ఠిరుఁ డూఱడింప నీ
ఖ్యాతిశయంబునం దగదటం చతని న్నదలించుచు న్ననుం
ఘాతకుఁడంచు దూఱెదవు పైపయి; సిగ్గిలఁబోక మాధవా!

న్యాయవిదుండవు నీవె యిట నాలముఁ గాంచుచు నిల్చియుండ న
న్యాయము గల్గఁబోదని మనంబున నెంచుటఁ జేసి యక్కటా!
మాయలమారి! నీకపటమార్గము లేఁ గననైతి; నాయధః
కాయముఁ గాచికో నయితిఁ, గయ్యమొనర్చితి; భంగ మొందితిన్.

మాయలమారివై దురభిమానము నాత్మవహించి యెంతయున్
జేయఁగరాని కృత్యములఁ జేయఁగ బోధమొనర్ప వారలున్
రోయక యాలకించుచు నిగూఢమనస్కతఁ జేయుచుండు రో
న్యాయవిదూర! నీకరమునందలి బొమ్మలు గారె? పాండవుల్.

ఆలమునఁ బాండవులకు జయంబుఁగోరి-సిగ్గు విడినాడి పోనరింపఁ జేసినాఁడ
వక్కటక్కట! యెన్నియో యక్రమములు-మూఢగోవింద, నీముల్లె మునిఁగినట్లు.

ఆయుధమున్ ధరింప ననినంచు వచించి యరాతి భల్లముల్
గాయముఁ జీల్పఁ గ్రోధమున గంతులు వైచుచు నీతిమాలి గాం
గేయునిఁ గూల్పఁ జక్రమును గేల ధరించి చరించి తెల్లరున్.
రోయ నిసీ; నిన్ను గనఁగ రోఁతకదా" యదువంశ పాంసనా!

తొడరి శిఖండి నెదుట నిల్పి భీష్ముని బీభత్సుచేతఁ జంపించినావు
కుంభజుఁ జంపింపఁగోరి ధర్మజుచేత మించి యనృతము లాడించినావు
అర్జునుచే నాలమందు భూరిశ్రవుఁ జేయి ఖండింపఁగాఁ జేసినావు
ప్రొద్దును డాచి యర్జునుచే జయద్రథు వంచించి శిరముఁ ద్రుంపించినావు
పూని రథమెత్తికొనియెడువానిఁ గూల్ప-దురితమని సంశయించెడు నరుని బ్రోత్స
హించి రాధేయుఁబట్టి కూల్పించినావు-బవరమునఁ జేరి ధూర్తగోపాల, నీవు.

సజ్జను లేవగింతురని జంకవు కొంకవు సుంతయే; నిసీ
లజ్జ పరిత్యజించి సమరం బొనరింపఁ గడంగుచోఁ ద్రుటిం
ముజ్జగముల్ జయింప నగు; మూర్ఖత మమ్మిటు గూల్పఁజేసి నీ
విజ్జగతిం గడించు నదియెద్ది? యకీర్తియ కాక; కేశవా!

ఆలమున ననుఁగూల్చి మీ రనుభవించు భాగ్య,-మది, పరిజనమును బాంధవులును
నాశమందఁగఁ బాడ్వడినట్టి ధరయె; కల్లలకుఁబుట్టినిల్లగుగొల్లవాఁడ!

చెలఁగి సామంతులు సేవింప సామ్రాజ్య మేకచక్రంబుగా నేలినాఁడ
ననుజులు బాంధవు లాదిసర్వులతోడ నఖిలసౌఖ్యంబుల నందినాఁడ
ననుపమలీల మహానందమును బొంద ధనమిచ్చి యర్థులఁ దనిపినాఁడ
సర్వసుఖంబులు సమకూర్చి మిగులఁ బ్రేమించి పాలితుల మెప్పించినాఁడ
సాంగముగ నాల్గువేదముల్ చదివినాఁడ-సురలలరఁ బెక్కు-జన్నముల్ నెఱపినాఁడ
నరుగ నున్నాఁడ దివికి మీయక్రమముల పాలఁబడి క్రుంగితుదకు గోపాలకృష్ణ!

నీతి దొఱఁగి యకృత్యముల్ నెఱపి నెఱపి, కోర్కె నెరవేర్చుకొంటి వకుంఠితముగ
రాణసెడి పాడుగోరు నీరాష్ట్రమింకఁ బ్రీతి ధర్మజు నెత్తిని బెట్టుమయ్య!

---

## ఓమర్ ఖయ్యాము

పెనుమర్తి వెంకటరత్నముగారు

ప్రత్యుషఃఫుల్లకౌసుమ ప్రకరమునకు-సంజలోపలఁ బ్రళయలాస్యములు మ్రోఁగు
జీవితగభీరవార్ధి వీచీవితాన-వివిధవ్యంగ్యార్థ రాహస్యవేత్తవీవు!
ఆదినాంతసశీధిగహ్వరములోన-నేమికలదో! మెఱింగిన సామి యెవఁడు?
ఏమియుండెనో! గగనపురీమహీజ-పుష్పమాధ్వీపిపాసలఁ బొలియనేలొ?
ఆయరేబియావ్యాప్తవనాంతరముల-సృష్టిపరమార్థములు పఠించిన, భవద్గ
భీర వేణూద్గమ శ్రుతిపార మదిర!-దిగ్దిగంతమందానిలోద్రిక్తమగును!
గడచినదినమ్ము నేఁటిలోఁ గలసిపోవు-నీవు నిత్యుఁడవే! మహీ దేవదూత!

(అడవిపూవులు)

---

# చింతలపూడివారి సంభావన

బొడ్డపాటి సీతాబాయిగారు

అమృతరావు పేరు విననివా రెవ్వరూ బెజవాడలో లేరు. ఎందుచేతంటే సంఘసంస్కారులలో మొదటిపేరీయనది. దానధర్మాలు-అంటే చందాలు మొదలనువాటిలో పెద్దమొత్తంగల పేర్లల్లో వుంటుంది అమృతరావు పేరు. వీటి అన్నిటికీ మించినది ఉద్యోగపు పలుకుబడి. డిప్టీకలెక్టరంటే సామాన్యమా? ఈయన ఇపుడు బెజవాడలో డిప్టీకలెక్టరు చేయుచున్నాడు. ఈవూరిలో ఆంధ్రవిశ్వవిద్యాలయం అదీ వుందనీ, నాలుగురాళ్ళకీ కూడికయనీ ఇక్కడే స్థిరపడుటకు నిశ్చయించుకొని ఈయనగవర్నరుపేటలో పెద్దబంగాళా కట్టుకునివున్నాడు. భార్యపేరు విమల. ఈమె మొదట భర్తగారితో ఏకీభవించకపోయినా, అతిబాల్యవివాహములవల్ల గలుగు అనర్థకములు, దినదినాభివృద్ధి పొందుచున్న బాలవితంతువుల సంఖ్యాభివృద్ధి మనస్సున నాటునట్లు భర్త బోధించగా ఏమైనా సరే యుక్తవయస్సు రాకుండా ప్రేమకు పెండ్లి చేయరాదనుకునేది. మాణిక్యమ్మ పూర్వోత్తరపు మనిషి. ఆమె కీనవీనాచారాలూ, కొమారుని పూర్వాచారఖండనోపన్యాసాలూ అవీ అంటే అదో మోస్తరుగా వుండేది. పాపం! ఏంజేస్తుంది? ఒక్కడే కుమారుడూ, వృద్ధాప్యము, వినిపించుకోనట్లు వూరుకునేది. అమృతరావు కొమార్తెకు అయిదవయేటనే అక్షరాభ్యాసము చేసి కాన్వెంటుస్కూలుకు పంపించాడు. ప్రేమకిప్పుడు పదియవఏడు. సెకండుస్టాండర్డు చదువుచున్నది ఇంగ్లీషుచక్కగా మాట్లాడగలదు. వూలుకుట్టు మొదలగునవి బాగావచ్చును. కొద్దిగా తండ్రిపోలిక. వాళ్ల బామ్మ 'నాతల్లికి శాస్త్రాల్లో చెప్పినట్టు ఎక్కడవుండే అందం అక్కడవుంది. అదృష్టవంతురాలు. జమిందారుణ్ణి పెళ్లాడుతుం'దని ముద్దులాడేది. కొమారునిమాటలు జ్ఞాపకము వచ్చినప్పుడల్లా "ఏమే ప్రేమా, డాక్టరువు అవుతావుటే; మాకందరికీ మందు లిస్తావమ్మా; డాక్టరీ అయితే బాగానేవుంటుంది. సుబ్బరంగా ఆడవాళ్లకి ఆపత్కాలమందు పురుషుల సంపర్కం లేకుండా పురుడూ, పుణ్యమూ చూడొచ్చు. ఏమో నేను పెద్దదాన్నైనాను; ప్రేమ పెండ్లి కూతురౌతే చూడాలని వుంది." అనేది. 'అమృతరావుగారికి సంఘసంస్కారాలంటే చాలా అభిమాన'మనీ, 'అభిమానమే కాకుండా కూతురికి పెండ్లి చేయకుండా డాక్టరీ చదివించుతాడట. చాలామంది ఈలా చెప్పినవారే తీరా సమయం వస్తే పదేండ్లయినా నిండకుండా పెళ్లి చేస్తారు చూద్దాంగదా'అని వూళ్ళోవారంతా అనుకునేవారు. ఏపదిమంది ఒకచోట కూడినా అమృతరావు ప్రస్తావనే. ఆయన హోదా, సంఘసంస్కరణాభిమానమూ, దాతృత్వమూ, మొదలగునవి వర్ణించేవారూ రసించేవారూ, ఖండించేవారూ, తటస్థంగా వూరుకొనేవారూ ఈప్రకారంగా నాలుగు భాగాలయ్యేవారు. ఇది ఈలావుండగా ఒకరోజు మామూలు ప్రకారం అమృతరావు కాఫీపుచ్చుకొని, సొంతంగా క్షౌరంచేసుకొని చాకలి అచ్చన్న 'స్నానానికి నీళ్లు తోడానండి బాబూ' అని చెప్పగా, స్నానంచేసి కుర్చీలోకూర్చుని వార్తాపత్రికలు తిరగవేయ మొదలిడెను. ఇంతలో డఫేదారు టపా తేగా పుచ్చుకొని ఒకటొకటే చింపిచూచెను. అందులో ఒకకవరు 'అమృతరావుగారు, డిప్టీకలెక్టరు, బెజవాడ.'అని యుండగా నిదానించిచూచి దానిని కూడా విప్పి చదివెను. అందిట్లున్నది:

"బి. అమృతరావుగారికి,

నిన్ను కాకినాడకు ప్రైజరీ డిప్టీకలెక్టరుగా ట్రాన్సుఫరు చేయడమైనది; గనుక ఈనెలాఖరున కాకినాడలో రంగయ్యనాయడుగారినుండి ఛార్జి పుచ్చుకోవలెను."

అని కృష్ణజిల్లా కలెక్టరుగారగు హెచ్ జాన్సనుదొరగారిద్వారా వచ్చిన ఈబదిలీ ఆజ్ఞాపత్రము చూచుటతోనే అమృతరా వొకవిధమైన ఆశ్చర్యవిచారములకు లోనయ్యెను. ఆంధ్రవిశ్వవిద్యాలయము బెజవాడలో పెట్టెదరని విన్నప్పటినుండి ఆంధ్రుకోటచే ఇక్కడ స్థిరనివాసమునకు వసతు లేర్పర్చుకోవలెనని విశ్వప్రయత్నములుచేసి ఇక్కడికి రాగలిగెను. వచ్చినట్టుగానే మంచిస్థలము

కొని పెద్దబంగాళాకట్టి అందులో గృహప్రవేశమయ్యెను. ఇంటిలో ఇంకనూ స్థిరపడనైనాలేదు. ఏవిశ్వవిద్యాలయపు ఆశపెట్టుకొని బెజవాడలో వుండ నిశ్చయించుకొని పాతికవేలు ఖర్చుపరిచి ఇల్లుకట్టెనో ఆవిశ్వవిద్యాలయము బహునాయకత్వము వలననూ, ఐకమత్యములేమిచేతనూ దానిసూత్రము పట్టుకుని నలుగురూ నాలుగుప్రక్కలకీ లాగగా ఆసూత్రము కాస్తా తెగి ఆలయ మనంతపురికి గాలిచే ఎగిరిపోనున్నది. ఈసంగతి తెలియగానే అమృతరావు మనస్సు నిరుత్సాహము పొందెను. శాసనసభలో ఏమైనా 'ఇక్కడనుండి కదుపరా'దందు రేమో అని ఆశించెను. ఆ ఆశ ఇంతవేగిరము తీరు నట్లు లేదు. కొందరు సభ్యులు నాలుగుప్రదేశములూ చూచి ఇక్కడ వుంచుటకో, లేక ఎక్కడికైనా మార్చుటకో అప్పుడు నిశ్చయించెదరట. 'రెడ్డొచ్చెమొదలిడు' మనునట్లు మొదటికి వచ్చినది.

ఈసంగతి మొదటే తెలిస్తే ఇక్కడ స్థిరపడకే పోవుదునని ఒకమాటూ, పోనీ విశ్వవిద్యాలయ మెట్లు శంకుస్థాపనచేసి ఇంకోవూరికి మోసికొనపోవుదురో నేనూ అల్లే నాబంగాళా మొదలగువాటిని మార్తునా అంటే ఐరోపాలోవలె ఇండ్లను త్రిప్పెడియంత్రము లిక్కడ లేవేయని ఒకమాటు ఈలా డోలాందోళిత మనస్కుడై యున్న సమయములో పులిమీదపుట్రవలె సంవత్సరమైనా క్రొత్తయింటిలో వుండకుండా బదిలీఅయిందనే విచారముతో, ఇక్కడికివచ్చి ఏడాదైనా కాలేదే? అప్పుడేబదిలీయా? అనే ఆశ్చర్యముతో కొంతసే పూరకే కూర్చుని గడియారము పదకొండు కొట్టగా టపా డఫేదారుని సద్దుమని, బదిలీకాగితము పుచ్చుకుని లోపలికి వెళ్లి తల్లికీ భార్యకీ ఈసంగతి చెప్పేడు. వారున్నూ మతిపోయినట్లయి, 'ఎక్కడికాకినాడ? ఎక్కడి బెజవాడ? ఎక్కడి కేదరి. ఇప్పుడేగా ఇక్కడికి మార్చారూ? ఇంతట్లోకే మళ్లీ మార్పా? ఎవరు కట్టగల రీప్రయాణపు సామానులు? ఏది లేకపోయినా జరగదాయె! అన్నీ పట్టుకువెళ్లాలి. క్రొత్తఇంటిలో ఎవరినేనా కాపురముంచుతే పాడుచేస్తారు. తాళం పెడితే జాగ్రత్తలేదు. మొక్కలన్నీ ఎండిపోతాయి. పశువులుకూడా కొంటిమి. వాటి నేమిచేయుట? అయ్యో! ఈపాడుబదిలీ ఇప్పుడే రావాలి' అని ఏదో దేశాంతరపు బదిలీలాగ బెంగతో మాటలమీద మాటలు అత్తాకోడలూ చెప్పుతూంటే అమృతరావు కేమీ తోచక కొంతసే పాలోచించి 'కచేరీకి పైమవుతూం'దను కొనుచూ వీరిమాటలు వినుచూ పడకటింటిదగ్గఱనుంచున్న వంటబ్రాహ్మణునితో 'రామయ్యా వేళవుతోంది వడ్డించూ' అన్నాడు. వెంకి అరిటాకులో వండినవన్నీ వడ్డించి వంటింటిగుమ్మంలో నుంచున్న రామయ్యను చూచి 'రామయ్యా, ఈవాళ వంటేమీబాగుండలేదోయి' అన్నాడు. 'చిత్తం, నేను రోజులాగే వండానండి, ఎందుకు బాగులేదో బాబూ' అంటూ మజ్జిగ వడ్డించాడు. భోజనముచేసి అమృతరావు హాల్లోకివచ్చి భార్య ఇచ్చిన తాంబూలము పుచ్చుకొని కచేరీబట్టలు ధరించుచుండగా, మాణిక్యాంబవచ్చి "అయితే అమృతూ, వెళ్లక తప్పదుట్రా; పోనీ సెలవుపెడుదూ; సుభంగా ఇంట్లో వుందాం. కొంతకాలం" అంటు. ఇంతలోకే కాన్వెంటుస్కూలునుండి పన్నెండు గంటలైనందున ప్రేమ ఇంటికి వచ్చి తల్లి, తండ్రి, బామ్మముఖములయందు మార్పున్నూ వారిమాటలున్నూ గ్రహించి "రామయ్యా, ఏం మాట్లాడుకుంటున్నా"రని అన్నం తినకుండా అడిగింది. "నాన్నగారికి కాకినాడ బదిలీ అయింది. ఇల్లూ వాకిలీ వదలి ఏలారా అని అనుకుంటున్నారు. నువ్వన్నం తిను ప్రేమమ్మ" అన్నాడు రామయ్య. "అబ్బా వుండు రామయ్యా"అని తండ్రిదగ్గరకి పరుగెత్తి "నాన్నగారూ మీకిష్టముంటే కాకినాడ వెళ్ళండి. నేమట్టుకు రాను, బాబూ. నాకు పరీక్షలొస్తున్నాయి. అక్కడ ఈలాంటి కాన్వెంటూ, ఇంతమంచి సిసటర్లూ, మదరూ దొరకుతారా ఏమిటి?" అని మూతి ముడుచుకుంది. "నీకిక్కడే వుండాలని వుందా. అయితే నువ్విక్కడే వుందూగాని లే అమ్మ, అన్నంతిన్నావా" అన్నాడుతండ్రి. "వెళ్లవే, మేంగూడా వస్తాంపద" అన్నారుతల్లి బామ్మ. "మీరింకా భోంచెయ్యలేదూ వెళ్లండి. రాత్రి ఆలోచిద్దాం నాకూ వేళవుతూం"దని తొందరగా అమృతరావాఫీసుకి వెళ్లిపోయాడు. విమలా, మాణిక్యమ్మ, ప్రేమా భోంచేస్తూ బదిలీనిగురించే మాట్లాడుకుంటూ అర్థాకలిగా లేచారు.

# టూటను ఖమను సమాధి చిత్రములు — మఱికొన్ని



చిత్రము ౧. టూటను ఖమను హృదయ నిక్షేపస్థలము

సాయంకాలము అమృతరా వింటి కెప్పుడు వస్తాడా అని అత్తాకోడలూ కనుపెట్టుకుని వున్నారు. అయిదుగంటలకు రావలసిన అమృతరావు ఆరుగంటల కింటికి వచ్చి కచేరీబట్టలు మార్చుకొని అవశిష్టా లన్నీ తీర్చుకొని హాల్లోకివచ్చి కూర్చున్నాడు. ఇంతలో ప్రేమవచ్చి "నాన్నగారూ,ఇంగ్లీషులో నేనేఫస్టు పదింటికీపదిమార్కులండీ; నిట్టింగులో నే ఎక్సలెంటూ; అన్నిసబ్జక్టుల్లోనూ ఈవాళ నేనే ఫస్టు! నాన్నగారూ"అని చెప్పింది. "అన్ని సబ్జక్టుల్లోనూ నువ్వే ఫస్టుటే! మాబాగా వస్తున్నాయే, ప్రేమా, మార్కులూ!" అన్నాడు తండ్రి. ఆమాటలకు పొంగిపోతూ హాల్లో ఉత్తరపుమూలనున్న బొమ్మరింట్లో కూచుని ఆడుకుంటూంది ప్రేమ. గృహప్రవేశమునాటికే బొమ్మరిల్లు కట్టించుకుని తండ్రితోకూడా తాను బొమ్మరింట్లో గృహప్రవేశ మయింది. కూతు రెంతచెపితే అంతే అమృతరావుకు. ఎప్పు డేది కావాలంటే అది తప్పకుండా తెప్పించేవాడు. అందుచేతనే కచ్చేరీచావిట్లోనే నాబొమ్మరిల్లుండాలంటే సరేనని కట్టించాడు. మాణిక్యమ్మ వచ్చి అయితే "అమృతూ, బదిలీనిగురించి ఏమాలోచించా"వంది."ఇంక ఆలోచించుట కేమీ లేదు.తప్పక వెళ్లవలెను. కలక్టరుగారిద్వారా పట్నమునకు జవాబుకు సొమ్ముకట్టి టెలిగ్రామిచ్చాను. వెళ్లితీరవలెనని బదులు వచ్చినది." "పోనీ అబ్బాయీ, సెలవు పెట్టకూడదుట్రా" అంది. "వీలులేదు. మొన్ననేగా నాకున్న సెలవంతా పుచ్చుకున్నానమ్మా! ఇంక హక్కులేదు. జీతం నష్టంమీద పుచ్చుకోవాలి. నాకు చార్జి వప్పగించి వెళ్లిన డిప్టీ కలెక్టరు ఆనందరావుకికూడా ఇక్కడ ఇల్లు కట్టుకున్నాడన్న నెపముమీదనే ట్రాన్సుఫరు చేసారు. ఇతనేకాదు; ఇంకా చాలామంది ఉద్యోగంలో వుండగా ఇల్లు కట్టుకుంటే వారికికూడా బదిలీ అయింది. అదే మోస్తరుగా నాకూ అయింది. సరే కాని, కాకినాడ నేనొక్కడినే వెళ్లనా, మీరందరూ వస్తారా?" అన్నాడమృతరావు. "నామాటకేమి? విమల నడుగు; అది ఏమంటుందో" అని తన ప్రక్కనున్న గుమ్మంలో నుంచుని తల్లికొడుకుల సంభాషణ వినుచున్న కోడలినిచూచి "పిల్లా, మన్నీ తీసుకువెళ్లడమా, లేక ఒక్కణ్ణే వెళ్లనా అంటున్నా డబ్బాయి; నీఅభిప్రాయ మేమిటే?"అంది. "ఏంజెప్ప నత్తయ్యా, ఈమాటు బసలాయింపు అయినప్పటినుంచీ నాకేమీ తోచటంలే"దంది విమల. "నాబొమ్మరిల్లూ అవ్వీవిడిచి నేమట్టుకు రాను బాబూ"అందిప్రేమ. "రేపు మొగుడొచ్చి రమ్మంటే ఈబొమ్మరిల్లూ, ఈసిట్టర్లూ, మదరూ అక్కర్లేకుండా కాకినాడకేకాదు ఎక్కడికి రమ్మంటే అక్కడికి పరుగెత్తా"వందిబామ్మ. "ఏమిటి బామ్మ, ఏమిటి బామ్మ; అసలు నేపెళ్లాడితేగా; పోమ్మా; ఈలాంటి మాటలు మాట్లాడకా" అని చంద్రకాంత పూలుకోసుకోడానికి పరుగెత్తింది ప్రేమ. "నీకష్టసుఖా లాలోచించుకుని ఏదో నీవే నిశ్చయించాలిగాని మేమేం జెప్పగల, మబ్బాయీ" అంది ముసలావిడ."ఈమాటుకి రామయ్యను తీసుకుని నేనొక్కణ్ణే వెళ్లి అక్కడ ఇల్లూ, వాకిలీ చూచి తర్వాత మిమ్మల్ని తీసుకెడదామని అనుకుంటున్నాను. అప్పటికి పిల్ల పరీక్షలూ అయిపోతాయి. కొత్తయింట్లో కొంతకాలం మీరున్నవారూ అవుతా"రన్నాడు అమృతరావు. "సరే బాగానేవుం"దంది తల్లి.కొత్తఇంట్లో కొంతకాలంవుండొచ్చుగదా అన్న సంతోషంతో, భర్తనివిడిచి ఉండాలిగదా అన్నవిచారంతో మాట్లాడలేకపోయింది విమల.వంటబ్రాహ్మణుడు 'వంటైం'దనేవరకూ ఏడుగంట లైనట్టే తెలియలేదు వీరికి, మడిగట్టుకుని అందరూ వడమటింటిలో భోజనమునకు కూచున్నారు. "ఏం రామయ్యా, నువ్వు నాతో కాకినాడకు వస్తావా" అన్నా డమృతరావు. "రాకేంజేస్తాడూ"అంది ముసలామె."ఏమో అతనిష్టము. మనలా గతను రెక్కలమ్ముకో లేదుగదా" అంది విమల. "తమసెలవై తే అలాగే వస్తానండి బాబూ" అన్నాడురామయ్య. "అయితే రెండురోజుల్లో వెళ్ళాలి, సిద్ధంగావుం"డన్నాడు యజమాని. రామయ్య మాట్లాడలేదు. "ఏం రామయ్యా, మాట్లాడ"వనగా'చిత్త'మంటాడుగాని చెప్పడు."జీతమెక్కువ గావాలెనేమో? అందుకనే ఈనసు"కంది విమల."మొన్ననేగాదుటోయి,పది హేనునుండి ఇరవై చేసాను?" "చిత్తం,చాలాదూరం.పాతికేనా ఇస్తేనేకాని వీలులే"దని ఖచితముగా అన్నాడు వంటబ్రాహ్మణుడు."నీఅవసరమా నాఅవసరమా అని; ఇదనీకాలం.

ఇరువదిమూడిస్తాను. ప్రయాణమునకుసిద్ధపడు" అన్నాడు అమృతరావు.'తమచిత్తం',అన్నాడురామయ్య."ముక్కున్నవారి కందరికీ పడిసెమున్నదే. నంటమనిషి వున్నవారి కందరికీ వున్న అవస్థ ఇది" అంటూ అందరూ లేచారు. తనకు బదిలీగావచ్చిన డిప్టీకలెక్టరు శ్రీనివాసయ్యంగారికి చార్జి వప్పచెప్పి కచ్చేరీవారు చేసిన ఆంప కపువిందులో సన్మానమంది, సాంఘిక సభలలో ప్రశంససొందెను. అమృతరావు ఇంటివద్ద సద్దినసామానం తయూరా చూచి."ఎందు కింత సామా" ననగా "బాగుంది; ఏది కావాలంటే ఏమొస్తుంది" మనం పట్టుకెళ్లకపోతే అందిభార్య. ఈదిన మమృతరావుగారిల్లు సందడిగానున్నది. అచ్చన్నపరుపు కట్టుచున్నాడు. రామయ్య సామానుబండిలో వేయించుచున్నాడు. గుమాస్తాలు మొదలగువారు స్టేషనుదాకా వచ్చెదమనుచున్నారు. అమృతరావు తల్లికి నమస్కరించి దీవెనలంది, భార్య అనుజ్ఞ పుచ్చుకొని తల్లివద్ద నుంచున్న ప్రేమను ముద్దుపెట్టుకుని "ఉత్తరంరాస్తావా ప్రేమా" అనేటప్పటికి ఏడ్వ మొదలుపెట్టింది. "ఏడవకమ్మా, ఇదిగో" ఈపదిరూపాయలూ పుచ్చుకుని మేనక్షీ సావులో ఆవేళ చూసిన పెద్దసెలులాయదు భొమ్మకొనుక్కో, పిచ్చిపిల్లా; ఇందా,వుత్తరం రాయేం" అన్నాడుతండ్రి. తానుఇదివరలో అడిగిన పెద్ద బొమ్మ కొనుక్కోమని ఇచ్చిన పదిరూపాయలు చూచుకుని సంతోషిస్తూ " మీాఅడ్రసేమిటి " అంది కళ్లుతుడుచుకుంటూ. "రభాద్వాజుల అమృతరావుగారు,

ట్రెజరీ డిప్టి కలెక్టరు,

కాకినాడ (గోదావరిజిల్లా).

అనిరాస్తే సరి" అంటూ బండెక్కాడు అమృతరావు. అందరూ స్టేషన్దాకా వెళ్లి బండి కదిలేవరకూ వుండి సెలవు పుచ్చుకుని ఎవరియిండ్లకు వారు వెళ్లారు. అమృతరావూ, రామయ్యా చామర్ల కోటలో దిగి కాకినాడ బండి ఎక్కి కాకినాడ స్టేషనులో దిగేటప్పటికి డవాలీ బంట్రౌతులూ, ముఖ్యమయిన కచ్చేరీ వుద్యోగులూ ఎదుర్కొని రామారావు పేటలో నున్న చింతలపూడి అచ్యుతరామయ్యాగారింటికి తీసుకువెళ్లి వారిని వీరికీ, వీరిని వారికీ ఎరుకపరచి కొంతసేపు ప్రయాణమునుగురించి, చార్జి పుచ్చుకోవడమునుగురించి మాట్లాడి కచ్చేరికి వెళ్లవలసినవారుగాన క్రొత్త డిప్టీకలెక్టరుగారి వద్దను, అచ్యుతరామయ్యగారివద్దను సెలవు పుచ్చుకుని వారివారి గృహములకు వెళ్లిరి. అచ్యుతరామయ్యగారి వడ్డిమంగలి బాలాజీ "స్నానానికి నీళ్లు తోడానండి బాబూ" అని చెప్పగా అచ్యుతరామయ్యగారు దేశపరిస్థితులను మాటలాడుట చాలించి "తమరు స్నానం చెయ్యం డమృతరావుగారూ, ప్రయాణపు బడలిక తీర్చుకున్నాక సావకాశంగా మాట్లాడుదాం" మనగా అమృతరావు రామయ్య ఇచ్చినపంచె,తువ్వాలూ పుచ్చుకుని బాలాజీ దారి చూపగా స్నానాలగదిలోకి వెళ్లి స్నానాది అవశ్యములు తీర్చుకుని వచ్చాడు. "మడి గట్టుకోవచ్చు"నని పిలుపు రాగా పోయి పడమటింటిలో భోజనముచేస్తూ బెజవాడనుగురించి అచ్యుతరామయ్యా, కాకినాడనుగురించి అమృతరావూ ఆంధ్రవిశ్వవిద్యాలయ కార్యస్థానము గురించి వుభయులూ మాట్లాడుకుంటూ భుజించి లేచారు. బాలాజీ తాంబూలము తయారుచేసి ఇచ్చి 'పక్కలు పరిచా'నని చెప్పగా "అయ్యా తమరు కాస్సేపు విశ్రమించండి. చాలాబడలివుంటా"రన్నా డచ్యుతరామయ్య "చిత్తం,దానికేమి లెం"డంటూ విశ్రమించా డమృతరావు. మధ్యాహ్నము కాఫీ ఫలహారం పుచ్చుకుని కాస్త తిరిగివద్దామా" అన్నాడు అమృతరావు. 'పదం'డంటూ అచ్యుతరామయ్యా అమృతరావూ కలిసి షికారువెళ్లివచ్చారు. రాత్రిభోజనములవేళ అమృతరావు ఆరువేల నియోగియ నీ, ఇంటి పేరు భారద్వాజులవారనీ తెలుసుకుని తమ యిరువురకూగల దూరపు బంధుత్వము మూడుమాటల్లోదగ్గరకి తెచ్చాడచ్యుతరామయ్య."అవును; మాఅమ్మ చెపుతూ వుంటుంది, చింతలపూడివారు మనకు బంధువులని ఏం తెలుస్తుంది దూరానవుంటే" అన్నాడు అమృతరావు. మరుసటిదినము గుమాస్తాకి కబురుపంపి "మన బంగాళాలో ఏదేనా ఖాళీవుందా క్రిష్ణయ్యా; కొత్తగా వచ్చిన డిప్టీకలెక్టరుగారికి కావాలి" అనిఅచ్యుతరామయ్య అడుగగా గుమాస్తా చిత్తం మనదక్షిణపు వైపు బంగాళా ఖాళీగానే వుందన్నాడు. అమృతరావా ఇంట్లోదిగి ట్రెజరీడిప్టీకలెక్టరు రంగయ్యానాయడుగారి

నుండి చార్జి పుచ్చుకుని క్రొత్తస్నేహితులతో, క్రొత్తబంధువులతో పాతకాపైనాడు.

చింతలపూడివారంటే లక్షాధికారులని ప్రసిద్ధి. గోదావరిజిల్లాలో వీరి నెరుగని వారే లేరు. రామారావుపేటలో నాలుగురోడ్డులకూ ఉన్న పెద్దతోటయూ, నాలుగిళ్లభవంతీ, మేడా పూర్వోత్తరపు మోస్తరైనప్పటికీ తాతముత్తాతలయందుండెడి భక్తిచే అచ్చొచ్చినఇల్లనీ ఆయింట్లోనే ఉన్నాడచ్యుతరామయ్య. సూర్యారావుపేట, రామారావుపేట, పాతకాకినాడ, ఎలివిన్ పేటలలో చాలాబంగాళాలు కలవు. గోదావరిజిల్లా అన్నిప్రాంతములలోనూ చింతలపూడివారి భూములే. తోటలు సరేసరి. తరాలనాటి భాగ్యము. అచ్యుతరామయ్య మహోయుక్తిపరుడు. సొమ్ము అనవసరముగా పాడుచేయక తనకూ, తనకుటుంబమువారికీ గౌరవప్రఖ్యాతులకై ఎంతైనా పాటుపడువాడు; ఈవిషయంలో ఎంతైనా వ్యయంచేసేవాడు. మంచి మాటకారి. సాధారణంగా అందరూ అయ్యే చనకబియ్యే ప్యాసైనాడు. స్నేహపాత్రుడు. తెలున్నవాడు. ఎవరు క్రొత్తగావచ్చినా ముందు అచ్యుతరామయ్యగారి అతిథులౌటయూ, ఆయనచెలిమి కోరుటయూ, వెళ్లేటప్పు డాయనచేయువిందు లారగించి సన్మానము పొంది వెళ్లుటయూ వాడుక. అందుచేతనే మన అమృతరావుకూడా వీరింటి అతిథి అయ్యెను. ఇదిగాక బంధుత్వము కలిసినవాడౌటచేతను, స్నేహాభిలాషి గనుకను, ఒంటరిగా వుండుటచేతను పండుగపుణ్యాములందేకాక శనివారాదివారములుకూడా అమృతరావచ్యుతరామయ్యగారింటనే భోంచేయుచూ కులాసాగా వుంటున్నాడు. అచ్యుతరామయ్యగారి భార్య విజయనగరపు దివాంజీగారగు కసింకోట జోగారావుగారి కొమార్తె. ఆమె అత్తవారింటికి వచ్చేటప్పుడు ఓవడ్డిమంగలినొకరునీ, ఓదాసీదాన్నీ, తలదువ్వుట మొదలగుపనుల కొక బ్రాహ్మణవితంతువునీ పుట్టింటివారు అరణమిచ్చారు. చిట్టెమ్మ అందమైనమనిషే. ఆమె ముస్తాబంతా తూర్పుపద్ధతి. మిక్కిలి భోగాభిలాషి. ఎప్పుడూ చేయనిశ్రృంగారం మాయనిమడతాను. దాసీది నీళ్లుపోయుట, రమణమ్మ జడవేయుట, బాలాజీవేసినతివాశీపై తీవిగా వంకైందనేవరకూ కూర్చుండుట ఇవియే ఆమె నిత్యకృత్యములు. చిట్టెమ్మ నాలుగుదేశపునగలూ గంగిరెద్దువలె అలంకరించుకొనును. ఆమె కాపసిమిలోహము, భార మెట్లులేదో? పనిపాటలు చేయ నక్కరలేదు సరికదా ఈఏటా ఆఏటా పిల్లలేమో అంటే. వరప్రసాదిలాగ మోహను డొక్కడే కుమారుడు. ఆతనికిప్పుడు ఇరువయిఏండ్లు. యం. బి., బి. యస్. డాక్టరీకి చెన్నపట్నం విక్టోరియా హాస్టలులో వుండి చదువుచున్నాడు. 'వూళ్లో అమ్మలక్కలంతా చింతలపూడి చిట్టెమ్మగారికంత పోకమ్మ, అనుకునేవారు. ఆమెకు పోకకేమి!' కలిగినపుట్టిల్లూ లక్షాధికారులు అత్తవారూనూ.

ఒకరోజున "పిల్లడిపెళ్లిమాటేమినిశ్చయించా" రందిచిట్టెమ్మ. "ఇంకనూ ఏమీ నిశ్చయించలేదు. మోహనుడు వస్తాడుగా వాడేమంటాడో చూదా"మన్నాడచ్యుతరామయ్య.

చి—వాడిమొహం వాడికేమిటి తెలుస్తుంది. మనమే ఏదో స్థిరపరిచేసెయ్యాలిగాని. అ— చాలా సంబంధాలున్నాయి గాని మన అమృతరావుగారికొక కుమార్తె వుందిట; ఆపిల్లనిస్తే బాగుండును.

చి—ఆయనతనకూతుర్ని చేసుకోమంటున్నాడా ఏమిటి? పిల్లనిచూడకుండా, ఎందరుపిల్లలో, ఏమిటో తెలియకుండా అమృతరావునిచూసి పిల్లను చేసుకోవాలంటారా ఏమిటి?

అ—కాదేఅతని కొక్కర్తెకూతురుట; పిల్లకి పదిసంవత్సరాలు. వీరితండ్రిగారి ఊరు గుడివాడ; తండ్రి యాస్తి దాయాదులు కలుపు కున్నారు. అమృతరావు తల్లివంక సాలుకు రెండువేలు వచ్చేభూములూ, వల్లూరులో ఇల్లూను. ఇదిగాక బెజవాడలో పాతిక ముప్ఫైవేలు చేసే ఇల్లు మొన్ననే కట్టేడుట. ఇతనేమో డిప్టీకలెక్టరు చేస్తున్నాడుగదా. ఇంకా సంపాదిస్తాడు. పిల్ల తండ్రిపోలిక. బాగానే ఉంటుందిట. ఈయూవత్తు ఆస్తికీ ఆపిల్లే అధికారురాలవుతుంది. మన అబ్బాయికి చేసుకుంటే ఆయాస్తి మనకు కలుస్తుంది.

చి—సరి బాగుంది; మీకు ఆస్తిలావుగా లేదు. వాళ్ల ఆస్తికి ఆసించడానికి. మన కే పదిమందు

న్నారు?. మోహను డొక్కడేగా నలుసు లాగ. వాడి కీలక్షయూపాయ లాస్తి ఎక్కీలొక్కీని.

అ—ఎన్ని ఏళ్లయినా నీలావు నీవుమానలేదే.

చి—బాగుంది ఎప్పుడూ వేళాకోళమే కాని పిల్లడిపరీక్ష లెప్పుడూ? ఇక్కడికెప్పుడువస్తాడు.

అ—వచ్చేనెల్లో వస్తాడు.

"ఈ సెలవులోపిల్లడిపెళ్లి చేసేయాలంది"చిట్టెమ్మ. "సంబంధం కుదిరితేనాఅడ్డులే"దన్నాడచ్యుతరామయ్య.

అమృతరావు కాకినాడకి వచ్చి ఆరుమాసము లైంది. ఇక్కడి పరిస్థితులూ, అచ్యుతరామయ్యగారి స్నేహమూ వారి ఆస్తీ, ఏకపుత్రత్వమూ, లెక్కింప శక్య ముగాని వెండి బంగారములూ, దివాణములాగ పరిచారి కాగణమూ చూచి అతనిలో కొంతమార్పు ఏర్పడి దిన దినాభివృద్ధి అవుతూంది. పిల్ల పెండ్లిచేయుటయా లేక అవివాహితగా నుండుటయా అని ఆలోచించాడు. వివాహము చేసినట్లయి తే తన ప్రతిజ్ఞకు భంగమని. లోకు లుకాకులవంటివారు పొడుచుకు తింటారు. ఊరివారికి భయపడి అన్ని విధాలా అనుకూలమైన సంబంధం వదు లుకుంటే మళ్లీ ఇట్లాంటి సంబంధం దొరకదు. 'కాళ్ల ముందరిబేరం కాశీవెళ్లినా దొరక'దందురు. ఇదిగాక 'అమ్మ అస్తమానమూ, ప్రేమపెళ్లి చూడాలని వుందిరా' అంటూవుంటుంది. ఆమె పెద్దదైంది. ఏమైనా తీర్చగ లంగాని మాతృఋణము తీర్పలేము. అమ్మకోరినట్లు ప్రేమ పెండ్లి చేసి ఆమె ఋణమునుమాత్రము తీర్చుకుంటాను. ఎవరేనా అడిగితే 'ఎప్పటికయ్యది ప్రస్తుత మప్పటికా మాటలాడి' అని సుమతిచెప్పినట్లుగా అప్పటి కేదో తగి నట్లు చెప్పెదను. ఒకవేళ ఏదేనా అబద్ధమాడినా "వారి జాక్షులందు వైవాహికములందు ప్రాణవిత్తమానభం గమందు రజితగోకులాగ్ర జన్మరక్షణమందు బొంకవచ్చు నఘముపొందదధిప! " అని శుక్రాచార్యుడు చెప్పనే చె ప్పాడు గనుక ఏదేనా అబద్ధమాడినా వివాహవిషయం గనుక తప్పులేదు." అని ఈవిధంగా తర్కవితర్కాలు చేసి సమాధానపరుచుకుని పిల్లకు పెండ్లి చేయుటకు నిశ్చ యించుకున్నాడు. అప్పటినుండీ చింతలపూడివారి సంబం ధముకై ప్రయత్నించి అచ్యుతరామయ్యగారికి అయి దువేలువరకట్నం కావాలని తెలుసుకుని, ఆయన తనకు మిక్కిలి స్నేహితుడూ, బంధువూ గనుక పరస్పరంగా మాట్లాడితే ఏరెండువేలకో వప్పుకుంటా డనుకున్నాడు. కాని 'ఎక్కడేనా బావా అనుగాని వంగతోటలోమట్టుకు బావా' అన్నట్లు సొమ్ములో: తనికెంతమాత్రమూ మొగ మోటము లేదని అమృతరావెరుగడు. మధ్యవర్తులద్వారా కొంతబేరము జరుపుతూనే వున్నాడు. దాసీది వచ్చి "అమ్మగోరూ, ఈయాల అబ్బాయిగో రొత్తారంటగా దండీ"అని పొంగి పోతూ అడిగింది. "అవునేమెలుబండికి రావాలి." "సిట్టిబాబిప్పు డెంతపెద్దోరైనా నాసేతుల్లో పెరిగాడాబాబు. నాకత్తమానం సూడాలనుంటుంది. బేగల్లి పనిచేసుకొత్తా"నంటూ వెళ్లింది అప్పి. ఈలాగే అందరూవచ్చి అడుగుతూంటే, అవునని రోజూకంటే త్వరగా ముస్తాబై తివాసీమీద కూర్చుని కొమారునికై ఎదురు చూస్తూంది చిట్టెమ్మ.

మెయిలు సూర్యారావుపేటలో ఆగింది. సెకం డుక్లాసుబండిలో నుండి కళ్లజోడూ క్రాపుతలా, సిల్కుసూటూ ధరించిన ఇరువదిఏండ్ల యువకుడుదిగెను. "అదుగోఅబ్బా"యంటూ అచ్యుతరామయ్యగారు ముం దుకు నడువగా అమృతరావూ, కృష్ణయ్యా మొదలగువా రాయన ననుసరించారు. మోహనుడు తండ్రికి నమస్క రించాడు. "ఈయన కొత్తగావచ్చిన డిప్టీకలెక్టరుగారు. మనకు బంధువులుకూడా" నంటూ అమృతరావుని ఎరుక కపర్చగా అమృతరావు మోహనులొండొరులు కరస్ప ర్శచేసి కుశలప్రశ్నలు వేసుకున్నాక అందరూ పట్నం లోని విశేషాలూ, మెడికలకాలేజీనిగురించి, కొశ్చను పేపర్లనుగురించి మాట్లాడుతూ ఇంటికి వచ్చారు. తను వ్రాసిన ఆన్సర్లనుబట్టి మొదటివాడుగా పేసౌతానని తోటివిద్యార్థు లన్నారుగాని రెండవవాడుగా కావచ్చు నంటూ, తనకై ఎదురుచూచుచున్న తల్లివద్ద కతిచురుకు గానడిచాడు మోహనుడు. ఆనాడు మాడవశేనివార మాటచే కాబోయే అల్లుని పంక్తిని భోంచేసి వారిం టనే విశ్రమించా డమృతరావు.

చిట్టెమ్మ, అచ్యుతరామయ్యా కొమారునితో మాటవరసని ఎండాకాలపు సెలవులలో వివాహము చేయదలచితిమనియూ, అమృతరావుగారి విషయములో తామెరిగిన సంగతులూ చెప్పి ఆయనకొమార్తెను స్థిరపరచెదమని చెప్పగా, తనమనస్సులో మంచి చదువుకున్న సక్కనిపిల్లని పెండ్లాడాలని వున్నప్పటికీ ఆమాటచెప్పక "అప్పుడే ఏంతొందర నాన్నగారూ, చదువు పూర్తి అయ్యేదాకా పెండ్లిమాట తలపెట్టకం"డన్నాడు. "అదేమిటి బాబూ, అలాఅంటావు? నీచదువు కాపిల్ల అడ్డు తగులుతుం దనుకున్నావా ఏమిటి? నీచదువంతా అయ్యేదాకా కాపరానికిరాదులే. పదిపదకొండేండ్ల చిన్నపిల్ల" అంది చిట్టెమ్మ. ఆమాటకిసిగ్గుతోతలవంచుకున్నాడు మోహనుడు. అతనికి తల్లిదండ్రులయెడల మహాభక్తి. తనకుచదువుకున్న పెద్దపిల్లని వివాహమాడవలెనని వున్నప్పటికీ తల్లిదండ్రుల ప్రీతికై తన కయిష్టమైన బాల్యవివాహమున కిష్టపడదలచుకున్నాడు. మాసం అర్ధాంగీకారమని తల్లితండ్రులు సంతోషించారు.

మామూలుగా అమృతరావు అచ్యుతరామయ్యగారింట్లో వున్నప్పుడు టపాకూడా అక్కడికే వచ్చును. నేటి టపాలో వచ్చిన ప్రేమవ్రాసిన వుత్తరము తనలో చదువుకొని అచ్యుతరామయ్యగారి కివ్వగా ఆయన ఈప్రకారం గట్టిగా చదివాడు.

"ప్రియమయిన తండ్రిగారికి

మీవుత్తర మందినది. నాపరీక్షలు అయినవి. సెకండుస్టాండర్డునుండి థర్డుస్టాండర్డుకు మొదటిదాననుగా పేసైనాను. నాకుమొదటితరగతి బహుమానము వచ్చినది. మంచి ప్రవర్తనకుగాను రివరెండు మదరు ఇంకొకబహుమానమిచ్చినది. మీరు ఎప్పుడు వచ్చెదరు? అమ్మ, బామ్మ బాగాయున్నారు.

మీ ప్రియపుత్రి

ప్రేమ."

"దస్తూరీ చూడమా ఎంతబాగావ్రాసిందో" అంటూ తండ్రి ఇవ్వగా మోహను డందుకొని 'మైడియ్యరు పప్పా' మొదలు 'యువరులవ్వింగుడాటరు' వరకూ చూచి చాలా బాగుందని అమృతరావుకి ఇచ్చాడు.

తను అనుకున్నమొత్తం రమారమీ వచ్చింది. ఇదియే అచ్యుతరామయ్యకు కావలసినది. చిట్టెమ్మకోరి కప్పె పిల్ల ఫోటో తెప్పించి చూచారు. నాలుగువేలు వరకట్నమూ, ఆడుపడుచు లేదుగనుక అయిదురోజులూ అయిదువందలూ వియ్యపురాలికీ నిర్ణయించుకుని, వైశాఖమాసములో ముహూర్తంనిశ్చయముచేసుకుని సెలదినములు సెలవుతీసుకుని అమృతరావు బెజవాడ వచ్చాడు. చింతలపూడివారి ఆస్తీ,అల్లుని తెలివితేటలూ, చక్కదనం వర్ణించి తల్లికీ, భార్యకీ చెప్పేడు. మనమరాలు పెళ్లి చూడడం గలిగిందిగదా అని మాణిక్యాంబ అపరిమితానందం పొందింది. కాని విమలకు మట్టుకు కోపం వచ్చింది. "ఇంతవరకూ అతిబాల్యవివాహాలు కూడదని మాకందరికీ నూరిపోసి, సభలలో ఉపన్యాసా లిచ్చి, ఇప్పుడీలా పదిఏళ్లేనా నిండని మనపిల్లకు పెళ్లి కుదుర్చుకువచ్చారు. లోకులే మనుకుంటారూ? అంత మనోనిశ్చయం లేనివారు మొదటనే మెదలకుండా వుంటే ఎవ్వరూ ఏమీ అనరూ లోకంతోపాటేను. అందరూ ఆడవాళ్లు కోరుతూంటే ఆపోరు పడలేక చేశా మంటూంటూరు.ఇప్పుడు మిమ్మెవ్వరు పోరారనిఈలాచేశా"రంటూ పెద్దదండకం ప్రారంభించింది. "లోకులమాటకేమి వూరుకుందూ; ఈఅదును తప్పితే ఈలాటిసంబంధ మిక దొరకదు. ఎవ్వరేమనుకున్నా నాకేమీ లక్ష్యములేదు. గాలిదుమారంలాగ చెలరేగి వాళ్లేవూరుకుంటారు." "అయితే అబ్బాయీ, కట్నమేమాత్రము వప్పుకున్నావు" "నాలుగువేలు. అయిదువందలు వియ్యపురాలికీని," "అబ్బా కట్నం ఎక్కువ. కాని మహోన్నతసంబంధం. లక్షాధికారులు చింతలపూడి వారు. నేచెప్పలే; వారు మనకు బంధువులనీ"అంది, "వరకట్నంకూడా వప్పుకున్నారుగద; ఏవేవి చేయనన్నారో అవన్నీ చేస్తూవున్నా"రంది విమల. అమృతరావుగారి కూతురికి పెళ్లని వూరంతా తెలిసింది. సంస్కారసభలు కూడాయి. అమృతరావు ప్రవర్తనని నిందించారు. సంఘానికి అమర్యాద తెచ్చాడన్నారు. ఈసంఘంలోంచి అతనిని తొలగించినట్టు తీర్మానాలు

చేసి పెద్దవుపన్యాసా లిచ్చి పేపర్లలో వ్యాసాలు వ్రాశారు. సంస్కారనాయకులు. "మనమనుకోలేదండీ, సమయమొస్తే కష్కర్తిపడతాడనీ" అని జనసామాన్య మనుకున్నారు. ఇంకా కడుపుబ్బు తీరని ఒకరిద్దరు అమృతరావుగారినే అడిగారు. "ఇదేమయ్యా"అని "ఏం జెయ్యమంటారూ ఆడవాళ్లు రాత్రీ పగల్లు రాసుకుతింటూం టే ఎవరుపడగల రీపోరు. స్త్రీలకు అయిష్టకార్యముచేసి వారితో మనం కాపురంచేసి నెగ్గగలమా." అని సమాధానం జెప్పేడు. "అవును లేండి విశ్వామిత్రుడంతటివాడు మేనక మాయల్లో పడిపోయితపస్సే దగ్ధం జేసుకున్నా" డంటూ సమాధానపరుచుకున్నారు. మంచిదినం చూచి పెళ్లిపనులు ప్రారంభించి ముగించారు. బంధువులకీ, స్నేహితులకీ శుభలేఖలు పంపేరు.

నేటిదినము సాయంకాలము నుండియూ, అమృతరావుగారిఇల్లు పచ్చని తోరణములతోనూ, గ్యాసులైట్లుతోనూ, బాజాభజంత్రీలతోనూ, పెక్కువన్నెల చీరలూ, ఆభరణములూ ధరించిన స్త్రీలతోనూ క్రిక్కిరిసి అతి సందడిగా నున్నది. పురుషులు వారికిష్టమగు దుస్తులను ధరించిరి. కొందరు విలువవస్త్రము లున్నప్పటికీ విడనాడి మహాత్మాజీ ప్రసాదమగు ఖద్దరు దుస్తులు ధరించి కళ్లజోడు బాగుగా మెరయునట్లు తుడిచిపెట్టుకుని పెళ్లిపందిరిలో ఆసీనులైరి. పెళ్లిపెద్దలు కొందరు జారిపోవుచున్న వస్త్రమును చక్కజేసి కొనుచూ మహా సందడిగా అటునిటు తిరుగుచుండిరి. కొడుకు నేయించి తెప్పించిన జరీదొండకాయలంచు తెల్లపట్టు పంచెకట్టుకొని అతివోపికగా కట్టుపెత్తనం జేస్తున్నది. మాణిక్యాంబగారు ప్రేమ పట్టుచీర గట్టుకుని కళ్యాణంబొట్టు పెట్టుకుని గౌరీతపస్సుకి కూచుంది. పౌరోహితుడు సత్యనారాయణ కన్యావరణాలు చదువు తున్నాడు. వియ్యంకుడూ, ఆయన మామగారగు కసింకోట జోగారావుగారు ఇంకా వారితరపు బంధువులు పెళ్లిపీటదగ్గరగా కూర్చున్నారు. వియ్యపురాలూ ఆమెతల్లీ మొదలగువారు స్త్రీలసభలో అగ్రస్థాన మలంకరించారు. కన్యాదాతలు పెళ్లికొడుకుతో పీటలమీద కూర్చున్నారు. ముహూర్తసమయం సమీపించినందున పెళ్లికుమార్తెను తీసుకరమ్మని అచ్యుతరామయ్యగారి పౌరోహితుడు తిరుపతయ్య కేకవెయ్యగా పెళ్లికుమార్తె మేనమామ గంపతో ప్రేమను ఎత్తుకువచ్చి దింపాడు. సరిగా యెనిమిది గంటలకు మంగళప్రదమైనట్టియూ వివాహనూచకమైనట్టియూ మంగళసూత్రమును ప్రేమమెళ్లో గట్టిగా మూడుముళ్లూ వేసి తనసహధర్మచారిణిగా స్వీకరించాడు మోహనుడు. స్థాలీపాకసమయాన్ని తన ఆశతీరా మోయలేనన్నినగ లలంకరించి భామవేషంలా తయారుచేసింది కోడలిని చిట్టెమ్మ. మనమరాలూ మనమహా నమస్కరించరాగా పొంగిపోయి తన భూమిలోనుండి అయిదువందలు వచ్చే భూమి రాసి ఇచ్చింది. మాణిక్యాంబ ఇతరు లిచ్చిన కట్నాలతో కానుకలతో చింతలపూడివారి కోడలయింది ప్రేమ.—

లగ్నం తరవాతసదస్యపుసందడియేసంగతి. బ్రాహ్మణ్యము పందిరినిండానూవుగింజవేస్తే రాలకుండాకూచున్నారు. సదస్యమంతా అయ్యేటప్పటికి ఆలస్యమౌతుందని పెళ్లివారంతా కాస్త ఎంగిలిపడ్డారు. పెళ్లికూతురికీ పెళ్లికొడుక్కీ కాస్త ఫలహారం పెట్టి సదస్యం ప్రారంభించారు. సదస్యపుతంతు పూర్తిఅయినాక పండితులు వారివారి పాండిత్య సామర్థ్యములు సభవారిఎదుట విశదీకరించారు. అప్పుడు తిరుపతిభట్లు" అయ్యా, అచ్యుతరామయ్యగారూ, తమ రీలా దయచేయండి అగ్రతాంబూలం, పండితతాంబూలాలూ తమరు దగ్గరుండి యిప్పించాలని పిలువగా ఆశీర్వచనంగానిచ్చి పిల్లలిని లేపతీస్తె వాళ్లు కాస్త ఎంగిలిపడతారు. ఇక్కడికే ప్రొద్దుపోయింది. తర్వాత మన ఫలప్రదానాలూ అగ్రతాంబూలాలూ సాయంత్రందాకా ఇవ్వవచ్చు"నన్నాడు. అచ్యుతరామయ్య చిత్తమంటూ సభాతాంబూల మివ్వడానికి పెద్ద లెవరంటే ఎవరని పౌరోహితులు వెతికారు. శేషావధానులుగారు పెద్దలని ఆయనకివ్వబోగా, రామసోమయాజిగారంటూ శేషావధాని వెనుకకుతగ్గాడు. అన్నివిధాలా అర్హతగలవారు మనచంద్రమౌళి శాస్త్రిగారుండగా మాకూ మాకూ ఏమిటంటూ సోమయాజి పలుకగా చంద్రమౌళిగారికి అగ్రతాంబూల మివ్వ స్థిరపర్చారు.'మీఅందరికంటే పెద్దవాడినా.నాయందు మీకం

దరికీ అల్లా ఆపర ముండబట్టి నన్ను పెద్దని చేశారంటూ శాస్త్రీగారు అగ్రతాంబూల మందుకుని జారిపోకుండా గట్టిగా పట్టుకుని వెనుకకు కూర్చున్నాడు. వీరేశలింగం గారికి శైవతాంబూలమూ, తిరువెంగళయ్యంగారికి వైష్ణవతాంబూలమూ, వ్యాసరాయాచారిగారికి మధ్వతాంబూలమూ ఇచ్చి ఆశీర్వచనపన్నా చదివి మంగళహారతి ఇప్పించి వధూవరులను లేవతీశారు. వేళదాటుటచే కాస్త ఎంగిలిపడి ప్రేమ బామ్మవళ్ళో కూర్చుంది. మోహనుడు తాతగారితో ఇష్టాగోష్టిమాట్లాడుతున్నాడు.

అక్కడ పందిట్లో ఇచ్చినఫలప్రదానాల్లో పండూ ఆకులూ వక్కలేగాని వారికంటికి కింపైన పైసా లేదు. ఇదేమాయని యొకరిమొగ మొకరు చూచుకుంటున్నారు. తక్కిన పండితోత్తములు తమ టరను ఎప్పుడువచ్చునా, ఎప్పుడు చేతినిండా దొరుకునా, ఎప్పుడు భుజములమీద దుశ్శాలువ పడునా, ఎప్పుడుకుండలములు చెవులకు వ్రేలాడదీయుదురా, ఎప్పుడు చేతులకు సింహతలాటం మురుగులు తొడుగుదురా అనెడి ఆత్రములో వూపిరి బిగబట్టుకుని కూచున్నారు. పరదేశిబ్రాహ్మణ్యమునిననో వారికి ముందు ఉదరపూజ ప్రథమకర్తవ్యము. తదుపరి ఏమేనా చేతులో పడితే బ్రహ్మానందమే. ఇప్పటికి రెండుఝాములైంది. ఎప్పటికీ సంభావనమాట తెమలకుంది. ఎప్పుడు బొజ్జనిండా భుజించెదమా యని పక్వాన్నముల పరిమళములు వచ్చినప్పుడల్లా గుటకలు మింగుతూ వున్నారాబడుగుబ్రాహ్మలు: 'నేనీవూళ్ళో వుద్యోగంగా వున్నప్పుడేనా తలపెట్టానుగానీపెళ్ళి. ఎవరేనా జబరుదస్తీ చేస్తే బంట్రౌతులచేత ఆపు చేయిస్తును. ఇంతమందిజన మున్నారు. ఏలా ఆసగలడు. ఎలా నెగ్గుకువస్తాడా.' అని సంభావనసమయంలో వియ్యంకుడికి సాయం జేయాలని నడుంగట్టుకున్నారు అమృతరావు, ఆయనభావమరిదీని." చిట్టిబాబు"నువ్వు కాస్త నిమ్మళించూ, మీనాన్నకి కొంచెం సాయంజేస్తానూ, మీదపడేస్తారీ అపాత్రపుబ్రాహ్మ"లంటూ జోగారావు వచ్చాడు. ఆమాటా నిజమే. చింతలపూడివారంటే ఆంధ్రదేశంలో ఎరుగనివారు లేరు. ఇదిగాక అమృతరావు డిప్టీకలెక్టరుగనుక పెద్దసంతర్పణ చేస్తాడు; తృప్తిగా భుజించవచ్చుననీ, అచ్యుతరామయ్యగారనాదినుండీ భాగ్యవంతులుగనుక కరువుదీరా సంభావనిచ్చెదరనీ అపారంగా వచ్చిరి బ్రాహ్మణ్యం. మన అచ్యుతరామయ్యగారు మట్టుకు వదురూ, బెదురూ లేకుండా చీమ కుట్టినంత గాబరాయేనా పడక నుంచొని బ్రాహ్మణోత్తముల నొకపరి కలయచూచి, "అయ్యా, పండితోత్తములారా, బ్రాహ్మణులారా, ఇదివరలో ఎప్పుడైనా మా చింతలపూడి వారివద్ద నుంచి సంభావన పొంది సత్కరింపబడ్డవారుంటే దయయుంచి ముందుకు రాగోరెద"నని గంభీరముగా పలికెను. పలుకుటయే తడవుగా నేనంటే నేనని శాలువలవారూ, మురుగులవారూ, కుండలాలవారూ, ఇంకా కొందరు పండితులూ వారి అనుచరులూ ఒకరినొకరు త్రోసుకుని ముందు వరుసలో వదరుగా నిలబడి వారు వారు పొందిన బహుమాన విశేషములను ద్విగుణీకరించి వర్ణింపుచుండిరి. అచ్యుతరామయ్యగారు సాంతముగా విని "అయ్యా, బ్రాహ్మణశ్రేష్ఠులారా, మీమీయోగ్యతలనుబట్టి మీగౌరవానుగుణ్యముగా మాపూర్వీకులే మీ అందరికీ తగిన సంభావనలిచ్చి సత్కరించియున్నారు. గాన ఇప్పుడు వేరే నేనివ్వనవసరము లేద"ని మూడువాక్యములలో వారికి సంభావన ముట్టజెప్పేడు. అందరూ తెల్లపోయి ఏమనుటకూ తోచక ఒకరినొకరు చూచుకుంటూ కొంతసేపటికి సాహసించి 'అచ్యుతరామయ్యగారూ, మీతాతగారు ఇంద్రుడంతవాడు; మహాదానకర్ణుడు. ఆయన దయచేసిన వీదుశ్శాలువలూను,' అని యొకడూ, 'మీతండ్రి చంద్రుడంతవాడు. మీపుట్టుకకిచ్చారు నాకీకుండలా' లంటూ ఇంకొకడూ చెప్పి అటువంటి సంస్థానంలో పుట్టిన మీరు మాత్ర మేమి తక్కువ? తమకుతోచిన తృణమో పణమో దయచేయ, మని మనవిచేసుకున్నారు. ఆముందరివారు అచ్యుతరామయ్యగారి పూర్వీకులచే సంభావన నందినవారుగాన ఇప్పుడియ్యలేదు. మనమున్ననో ఇంతకుపూర్వము పుచ్చుకోని వారము గనుక మనలని బాగాసత్కరిస్తాడని'వుప్పొంగిరి. అందులో కొందరు'తోటి కూడా మాటామల్లే ఏమీ లేదేమిరా' 'అంటే ఆపక్కనాడు తెస్తున్నాడేమోరా

అని ఒకరితోనొక రనుకొంటూ సంభావ నందడానికి వీలుగా నుంచున్నారు వెనుకనున్నవారు 'అయ్యో ఎందు కొస్తిమి ముందరివరుసను; వెనుకకు దిగడినా బాగుండెడి' దని ముందరి కొచ్చినవారు చింతించుచుండిరి.

ముందుకొచ్చినవారి మనవులు చెవినిపెట్టక వెను కపంక్తివారి నుద్దేశించి "అయ్యా,ఇప్పటికే చాలా ఆలస్య మయింది; క్షమింపుడు. ఈ యెండలో ఇంతసేపుంచి మి మ్మి విసికించి నందుకు వందన సహస్రములు. మీ రర్హు లుగారనియో, మరి యేకారణముచేతనో మీకు సంభావ ననివ్వ మావారు నిరాకరించిరి. మాపూర్వీకులచే నిరాక రింపబడ్డ వారు మాకున్నూ నిరాకరింప తగ్గవారే. కాన మావల్ల మీకేమి సంభావన ముట్ట"దంటూ కొడుకువగ్గరికి చక్కా వెళ్లాడు అచ్యుతరామయ్య. ఇంకేముంది? పంది రంతా గొల్లుమని గందరగోళం బయలుదేరింది: "పెళ్లి కొడుకు తండ్రి ఇంతబాగా సంభావనిచ్చాడు; ఇంక పెళ్లికూతురు తండ్రి చేసే సంతర్పణ ఉందిగా బోలు అదీవుళ్లక్కే తెంపండిరా తోరణాలూ" అంటూతోర ణాలపై చెయ్యివేసారాక్షుధార్తులగు పరదేశి బ్రాహ్మ ణ్యం. ఇంతసేపూ జరుగుతూవున్న సంభావనా చిత్రము చూచుచూ, చిత్ర ప్రతిమవలెనునున్న అమృతరావు జో గారావుగారిసాయముతో "అయ్యలారా, తోరణములు త్రెంపకండి. నామనవి విని నేచేసెడి సంతర్పణయందు తృప్తిగా భుజించి, నేనిచ్చెడి అల్పసంభావన స్వీకరించి మీరు తృప్తులై నన్ను ధన్యుణ్ణి చేయం"డని చేతులెత్తి ప్రార్థింపగా దక్షిణాశ గల పండితులు "చాల్లేనయ్యా చేశావుపెండ్లి_నీపెండ్లీనీవూనూ" అంటూ లేచిపోయారు. అన్నార్తులగు విప్రులందరూ తమాయించి"అయితే కానీ మరి" అన్నారు. తత్క్షణం పందిరంతా బాగుచేయించి విస్తళ్లువేసి వడ్డింపించి త్రవకుతో చినది చెంబులలో వేశా డమృతరావు. తృప్తిగా భోంచేసి బొజ్జలు తడుముకుంటూ 'మాబాగాచేశాడురా సంతర్పణ; పాపంఅమృతరావుగా' రంటూ,త్రేన్చి ఇంతకాలంనుంచి పెండ్లిండ్లకు వెళ్లుతూ వున్నాము కాని యీ చింతలపూడి వారిసంభావనంటిది చూడలేదంటూ ఎవరిదారిని వారు వెళ్లా రాబ్రాహ్మలు. అప్పటినుండీ 'చింతలపూడివారి సంభావనలాగుందే' అన్న మాట ఆంధ్రులందరికీ వాడుకపద మైంది.

---

## విదురుఁడు ధర్మజునితో

వేమూరి సీతారామశాస్త్రి గారు

అన్నా! వట్టియమాయకుండవు గదన్నా!, నమ్ము; మాయంధరా
జన్నాఁ గోముఖపుండరీక; మతఁడీర్ష్యాయత్తుఁడై యెద్దివా
కొన్నాఁ మేలనియే తలంచెద; వనుంగుం దమ్ములన్నిన్ను నేఁ
బన్నం బూన్పఁగ వారణావతముఁ బంపంబూనె నూహించితే?

తెల్లనివెల్లను బాలని - నల్లనివెల్ల జలమనుచు; నమ్మెద వీ వే
కల్లయుఁ గపట మెఱుంగవు - ప్రల్లదుఁ గౌరవుని నేమఱం గాదుసుమా.

ఈయెడ మీరలున్నఁ దమ కింతయుఁ బేర్ప్రతిష్ఠ లుండవం;
చేయపకారముం జలుప నే మొకయడ్డుగ నున్నవార మం;
చాయఘరాశి, యాకీశవుఁ డాపలుగాకి సుయోధనుండు మీ
కీ యనిమిత్తహానిపయిన మేర్పఱచెం; బరిణామ మేమొకా!

శిలా



రాణా ప్రతాపసింహ

చిత్రకారుడు: శ్రీ గుంటిమెడ వెంకటసుబ్బారావుగారు, ఛత్రపురము.

ఇం దేదే నెప మొక్కఁడుండవలెఁ జు మ్మేనాఁటి కానాఁడు నా
డెందం బందినయంశ మెల్లఁ దగుమాడ్కి న్నీకెఱింగింతు; నే
చందానన్ సహజన్ములన్ జనని లెస్సం గాచికొందో? మనం
బం దెం గొందల; మింత యేమఱకుమన్నా! నిర్దయం దేనియున్.

నమ్మక నమ్ముచుం బరిజనవ్రజముం బ్రియసామవాక్ప్రియో
గమ్మునమాత్రఁగాక యధికంబగు త్యాగముకల్మి నెల్లెడన్
సమ్మదమందఁ జేయుచు, విషజ్వలనోరగముఖ్యహింస్ర జా
లమ్ము దెసం బ్రమాదముఁ దలంగి మెలంగఁగఁబోలు ధర్మజా!

ఎన్నఁడుగాంతునో కవల నియ్యనిలాత్మజు సవ్యసాచిఁ, గొం
తి, న్నిను వెండి; ప్రాణ మట నిక్కము మే నిట నాకుఁ; దండ్రి తాఁ
బిన్నటనాఁడ పోయినను విద్యయు బుద్ధియు నబ్బియున్న మీ
యున్నతికోర్వఁడాయెనటె యుక్కివుఁ డంధుఁడు బిడ్డప్రేరణన్.

చెప్పెనుబో! సుయోధనుఁడు సిగ్గఱి; బిడ్డలఁగన్నవాఁడె; పై
తెప్పలు సైతమున్నరయు వృద్ధుఁడె, యుద్ధమనస్కుఁడే, యెటుల్
దప్పఁదలంచె మీవలనఁ దా ధృతరాష్ట్రుఁడి కందు నెట్టులే
ముప్పుఘటిల్లునో? యుఱక పుట్టఁగ లేదు ప్రయాణ మిత్తఱిన్.

దుష్టచతుష్టయం బొకటఁ దోఁచుటఁ జేసి యిటుల్ మనంబునన్
గ్లిష్టత నందఁ గావలసెఁ; గేవలముం గనుమ్రోలనున్న నే
నష్టియుఁ గూర్ప నోడుదురు, నాయన! యింకట నీదుధర్మ మే
కష్టపరంపరల్ దలఁగఁ గావలె, సౌఖ్యముఁ గూర్పఁగావలెన్.

వెంటనె పోయిరండు, పదవిన్ శుభ మబ్బెడుఁగాక మీకు నె
ప్పంటికిఁ గృష్ణుఁడే సకలభద్రవిధాయి ధ్రువం బటేని యా
కంటకుఁడైన కౌరవుని గారడిలోఁపడ కుంద్రుగా, కెటం
గంటిని తెప్పవోలె మిముఁ గాతురుగావుత మెల్ల దేవతల్.

---

5. 4- 9

# ఆంధ్రలిపి సంస్కారము

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

నేఁడు వాడుకలో నున్న మన తెనుఁగులిపి మనకు మిక్కిలి చిక్కులు గలిగించునదిగా నున్నది. పసిబాలురకు లిపినేర్పుటలో క్లేశము గలదు. గ్రంథముల నచ్చొత్తించుటలో క్లేశము గలదు. టైపురైటింగునిర్మాణమున కసౌకర్యము గలదు. అంతేకాక వర్ణోచ్చారణ రీతికిఁగూడ విరోధము గలదు. ఇవియెల్లఁ జిన్నచిక్కులు గావు. వీనిని గొంత వివరింతును:

౧

బాలురకు నేర్పుటలో క్లేశము

అచ్చులలో హ్రస్వదీర్ఘములగు అ, ఆ,లు ఈ షద్భేదము గల సమాన లిపులై యుండఁగా, ఇ, ఈ లు పోలికయే లేనివిగా నున్నవి. అందు ఇ, చవర్ణాంత్యానునాసికమగు ఞతో పోలిక గలది. ఋ, ౠ లు - ఋ, ౠ ల పోలిక గలవై రెండుకొమ్ములు గలిగి పొందిక లేక మోటుగా నున్నవి. ఒ ఓ ఔ లు జతో పోలిక గలవి. ఇఁక హల్లులలో కవర్గమెల్లఁ బోలికయేలేని భిన్నభిన్న లిపులతో నున్నది. ఖ కు తలకట్టు లేదు. ఘ 'ఫ ఫు, ష, ఘు' అక్షరముల పోలిక గలది. చవర్గమున చఛలు పోలిక గలిగియున్నవి. కాని జ ఝ లు భిన్నములుగానే యున్నవి. జ కు తలకట్టు లేదు. అది ఒ ఓ ఔల పోలిక గలది. ఝ రు, ఘ వర్ణముల పోలిక గలిగి రెండుకొమ్ములు గలిగి యసందర్భముగా నున్నది. ఞ ఇకారముతోఁ బోలిక గలది. టవర్గమున ట, ఠ లు పోలికలేనివి. డఢలు చ ఛల వలెఁ బోలికగలవి. ణ తలకట్టు లేనిది; క,చవర్గముల యంత్యానునాసికములు, ఙ, ఞ లు చిహ్నము గలవైయుండఁగా ణకు అది లేదు. దీనితర్వాతి వర్గానునాసికము లగు న,మ,లకును నాచిహ్నము లేదు. తవర్గమున, త మాత్రము భిన్నమై తర్వాతి మూఁడక్షరము లగు థ ద ధలు పోలిక గలిగి యున్నవి. న నతోఁ బోలికగలది. పవర్గమున ప ఫ లు బ భ లును బోలియున్నవిగాని బకు తలకట్టు లేదు. మకు కొమ్మున్నది. ఇది వ పోలిక గలది. దీనితో భేదము గల్పించుటకు గాను వకుఁ గొమ్ము ముడ్డిక్రింద ఈయవలసెను. ప,ఫ లకుఁ గూడఁ గొమ్మిచ్చుటలో నిట్టిచిక్కే కలదు. య కొమ్ము గలది. ర ఱ లు-ల ళ లు - శ ష లు-పోలిక లేనివిగా నున్నవి. స నతోఁ బోలిక గలది. హ వ తోఁ బోలిక గలది.

ఉచ్చారణమునఁ బోలిక యుండుటను బట్టి లిపిలోఁగూడ బోలికయుండఁదగిన యక్షరములు, క ఖ లు-గ ఘ లు-జ ఝ లు-టఠలు తథ-ర ఱ లు, శ ష. స లు పోలికలేనివై, పూర్వోక్త విధమున నుచ్చారణమున నేమాత్రము నుబోలికలేని యక్షరములు గొన్ని పోలిక

గలవై యుండుటచేతను, వరాక్షరాదులు సరియయిన నిర్మాణక్రమము లేనివిగా నుండుట చేతను, బాలురకు లిపిని నేర్పుటలో మిక్కిలి చిక్కు గలదు. చ కు ముడ్డిక్రింద ఒత్తిచ్చిన చో ఛ అగునని చెప్పుటకు వీలులేదు. కఖ-టఠ-తథ-లు అట్లు లేవు గాన, సాజాత్యబోధము కుదురదు. ఇంత వరుస, వావి లేని లిపిరూపములను భిన్నభిన్నముగా నేర్చుకొనుట కష్టమే కాదా? మఱియు, నివిగాక, అచ్చుగుణితము వేఱుచిహ్నములతో నేర్చుకొనవలెను. హల్గుణితము వేఱుచిహ్నములతో నేర్చుకొనవలెను. ఈ గుణితములలోఁగూడఁ బెక్కు చిక్కులు గలవు. ఇవి కొంత ఉచ్చారణరీతికి విరుద్ధముగాఁగూడ నున్నవి. హల్లుపై అజ్గుణితమును జేర్చునప్పుడు తలకట్టు అకార మున్నప్పుడు మాత్రమే ఉండఁదగును. తక్కిన యచ్చులు చేరునప్పు డుండరాదు. క,కా,కి,కీలు సరిగా నున్నవి. కాని, కుకూలు తప్పుగా నున్నవి తలకట్టు, కొమ్ము రెండును ఉండఁగూడదు. 'కృ కౄ'లకును ఇట్టిచిక్కే కలదు. ప్రైమరీ స్కూళ్ల పంతులవార్లు కొందరు, 'కృ,కు కకార అకార, ఋకారములు 'కృ' అని వర్ణక్రమము చెప్పుటను వింటిని. వారట్లు చెప్పుట వింతగాదు. వట్రువసుడి ృ, వ ఒత్తులవలె హల్లుగాఁ దలఁపఁబడునని యేకదా కొందఱు లాక్షణికులుగూడ అదియున్న హల్లు తక్కిన యచ్చులతోనున్న యాహల్లుతోఁ బ్రాస మునఁ జెల్లునని చెప్పిరి! కనుక, కొమ్ము, కొమ్ముదీర్ఘము—వట్రువసుడి, వట్రువసుడి దీర్ఘము, ఉన్నప్పుడు హల్లుకు తలకట్టు ఉండుట అక్రమము.

ఇక హల్గుణితములో 'వాక్స్వాతంత్ర్యము' అనుపదము వ్రాయునప్పుడు 'క్స్వా'లో కకార సకారములు హల్మాత్రములు. వకారము ఆకారముతో గూడినది. క్స్వాను విడఁదీసినచో 'క్, స్, వా' అగును. కాని మనము లిపిలో ఆకారమును కకారము మీఁదనే ఉంచుచున్నాము. సకార వకారములను క్రింద ఒత్తులనుగా ఉంచుచున్నాము. బడి పంతుళ్లును గొందఱు పండితులునుగూడ 'కాకు దీర్ఘమిస్తే కా. కాకింద సావత్తిస్తే క్సా క్సాకింద వావత్తిస్తే క్స్వా' అనియు, 'కకార ఆకార సకార వకారములు క్స్వా'అనియు వర్ణక్రమముచెప్పుచున్నారు. ఇది తప్పు గాదా! నాగరాక్షరములు ఈవిషయమున ఉచ్చారణ రీతి ననుసరించి సరిగా నున్నవి. ఆలిపిలో సంయుక్తాక్షరమునఁ గడపటి హల్లుమీఁదనే యచ్చుండును. తత్పూర్వము గల్గు హల్లులు అర్ధాక్షరచిహ్నములుగలవిగానే ఉండును. బాలురకు లిపి నేర్పుటలో నిట్టిచిక్కులు గలవు. అలవాటు పడియుంటిమి గనుక నేఁడు మనకివి యంతగాఁ జిక్కుగూర్చునవిగాఁ దోఁపక పోవచ్చునుగాని బాల్యమునఁ దొలుత నేర్చుకొను నప్పుడు మనల నెల్లరనుగూడ నీచిక్కులుబాధించియే యుండుట వాస్తవము. ఎంత యలవాటయినను ప్రౌఢులనుగూడఁ గొందఱ నీ చిక్కులు బాధించుచునే యున్నవి. తొలుత నేర్చుకొను నప్పుడు బాలురెల్లరును బాధ పడుచునే యు

న్నారు. ఈబాధ సరకుగొనరాని దనరాదు. అక్షరాలువడిగాఁగాకపోవుటచే బాలురెండవో బండవాటి చదువున సన్నగిలుచున్నారు; బడి యన్న భయపడుచున్నారు. ఈ లిపిక్లేశములు వారి హృదయప్రసాదమును జెఱుచుచున్నవి. అక్రమపు క్లేశములకుఁ బాల్పఱిచి వారిని బాధింపరాదు.

౨

అచ్చులో కష్టములు

ఇప్పుడున్న లిపిరీతినిబట్టి ముద్రణమున వేఱువేఱు లిపిసంకేతములు ఇంచుమించుగ అయిదునూఱులు కావలసియున్నవి. వాని నీ క్రింద జూపుచున్నాఁడను:—

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ
ౡ ౡా ఎ ఏ ఐ ఒ ఓ ఔ
ఇవి ౧౬.

క కా కి కీ కు కూ కె కే
కొ కో కౌ క్ ఇవి ౧౨.

ఇట్టివి క-మొదలు క్ష-వఱకు గల ౩౬. అక్షరములకు మొత్తము-౪౩౨.

ౘ ౘ ఎ ఒ ల ఎ ౨ ౭ ౦
౨ ౫ ౫ ౯ ౯ ౬ ౬ ౪ ౬
౧ ౧ ఒ ౷ ౼ ౷ ౼ ౧ ౼
ఖ ఖు వా ఎ ౹ ౹ ౹ ౹
ఙ యు ఞ ౦ ౮ ౯ ౮ ౮ ౯ అ ఙ
౫ ౦ ౦ ఇవి-౪౯.

సంకేత బాహుళ్యముచే సాధారణముగా డెమ్మీసైజులో నాల్గుఫారములకు సరిపడుమైపును గొనవలెనన్న రూ ౪౫౦ లు విలువ యగును. ఇదే విలువకు ద్రవిడ లిపిలో ౮ డెమ్మీఫారముల మైపు వచ్చును. ఇట్లు ధర తక్కువ యగుటకుఁ గారణము అఱవలిపి సంకేతములసంఖ్య మిక్కిలి తక్కువగా నుండుటే. అందు ౨౪౫ మాత్రమే లిపి సంకేతములు. క్రొత్తగా కంపోజిటర్లు తెలుఁగచ్చుకూర్పును నేర్చుకొనుట కాఱు నెలలు పట్టును. ఒకనెలలో అఱవపు టచ్చుకూర్పు నేర్చుకోవచ్చును. ౫౦౦ గళ్లలోనుండి సంకేతముల నేర్పవలసియుండుటచే తెలుఁగు లిపిని గూర్చుటలోఁగూడఁ జాలజాగగును. గంటకు ఒకగాలీ అఱవముకూర్పఁగలుగఁగా, తెలుఁగున అరగాలిమాత్రమే కూర్పఁగల్గుదురు. ఇట్టి కారణములచే తెలుఁగుకంపోజిటర్లు విరివిగా దొరకరు. తక్కినభాషల కంపోజిటర్లకంటె వీరికి జీతము హెచ్చు. ఇదిగాక అచ్చుకూర్పులో సౌందర్యము తక్కువ. ఒత్తక్షరమున 2, 3, 4 లిపి చిహ్నములు ఒకదాని క్రిందఁ నొకటిగాఁ జేర్పవలసియుండుటచే బంతులు తీర్చినట్టు సాగవు. 'వాక్స్వాతంత్ర్యము' అను పదము అచ్చుకూర్పున అందముగా నుండదు. అక్షరము క్రింద నక్షరముఁ జేర్పవలసియుండుటచే 'ఫుల్ బాడీ, ఆఫ్ బాడీ' యను భేదములతో వేఱు తీరులయక్షరముల నెక్కువగాఁ బోఁత పోయవలెను. ౫౦౦ లిపిసంకేతములను నిర్మింపవలసియుండుటచే వ్రాఁతమోడి, పరిమాణము భిన్నభిన్నములుగా నుండునట్లు అనేక విధములగు లిపిభేదములను గల్పింప సాధ్యపడకున్నది.

ఇప్పుడు ప్రధానముగా గ్రేట్‌ప్రైమరు, ఇంగ్లీషుబాడీ, అను రెండు తెలుఁగుల లిపులే గ్రంథముద్రణమున కుపయోగపడుచున్నవి. ఇంకను రెండుమూఁడు తెలుఁగులున్నను, నవి హెడ్డింగులకును, ఫుట్‌నోటులకును మాత్రమే పనికివచ్చునుగాని గ్రంథ ముద్రణమునకుఁ దగవు. మద్రాసులో అఱవమున డెమ్మీఫారము ముద్రణమునకు నాలుగురూపాయలు చార్జి చేయఁగా తెలుఁగున నదేమాదిరి ఫారమునకు ఆఱు, ఎన్మిది రూపాయలు చార్జి చేయుచున్నారు. ఇట్టి వింక నెన్నో చిక్కులు తెలుఁగు ముద్రణ విధానమునఁ గలవు. ఇంతకుముందు మొదటి ప్రకరణమునఁ జెప్పిన వ్రాఁతచిక్కులెల్ల నీముద్రణమునకును గలవు.

3

టైపురైటింగు

అచ్చునకే యిన్నిచిక్కులుండఁగా నిఁక టైపురైటింగు కుదురునా? ఇంగ్లీషున, అఱవమున ఉన్నట్లు లిపిసంకేతములు, ప్రక్కప్రక్కనే (ఒకదానిక్రింద నొకటి యుండరాదు) యుండుట, ఆ సంకేతములుగూడ నలువదింటికంటె మించకుండుట, ఉన్నగాని టైపురైటింగు సాధ్యము గాదు. కాన యిప్పటి లిపిరీతికి టైపురైటింగు కుదరనే కుదురదు.

౪

సంస్కార మెట్లుండవలెను?

మీఁద వివరింపఁబడిన చిక్కులెల్లఁ దొలఁగునట్లు అనఁగా బాలురకు సులభముగా నేర్పఁదగియుండునట్లు, అది విస్పష్టముగా నొక నిర్మాణవిధానముతో నుండునట్లు, ఉచ్చారణరీతికి భిన్నము గాకుండునట్లు, అచ్చులో సౌకర్య మేర్పడునట్లు, టైపురైటింగుకుఁ గుదురునట్లు సంస్కరించుట సాధ్యమేని యది యవశ్యకర్తవ్యము గాదా? తాతలు త్రవ్విన నూయిగదాయని యందుండి యుప్పనీటినే యెప్పుడును ద్రాగుచుండఁదగునా దగ్గఱనే మంచినీటిబావి త్రవ్వఁదగియుండెనేని? అదిగాక, నేటి లిపిరీతిమాత్రమే మంత నిశ్చలము! అయిదువందలయేండ్ల పూర్వమునఁ గల లిపికిని మననాఁటి లిపికిని నెంతేని భేదము గలదు. నేఁటిలిపికూడ బహుపరిణామములఁ బొందుచు వచ్చుచున్నదే.

లిపిలో నిప్పుడున్న కీళ్లను దొలఁగించుకొనుట ఆవశ్యకమే కాని, వానిఁ దొలఁగించుకొనుటకై చేయుమార్పులలో నున్న మేళ్లుగూడఁ గొన్నియుండుటయగునేని యావిధానమంగీకారార్హము గాఁగూడదు. మఱియు నామార్పులు సులువుగా జరపఁదగినవై యుండవలెనుగాని మూలచ్ఛేదులుగాను, సర్వము తార్మారుపఱుచునవిగాను, అమితవ్యయాపాదులుగాను, జనసామాన్యమునకు ఆరంభమున నేని ఉక్కిరిబిక్కిరిగా అర్థముగానివిగా నుండునవిగాను గారాదు. అట్టివానివలన అలజడి, అశాంతి, యేర్పడును. నేఁటి తెలుఁగక్షరములనే తీసివేసి వానికిబదులు ఇంగ్లీషక్షరములనో, నాగరాక్షరములనో పెట్టుదమను వారు కొందఱు గలరు. ఈసూచన లనర్థ

దాయకములు. ఆ మార్పులు సులువైనవి గావు. ముత్తైపుసరులను జాచిపట్టినట్లు తెలుఁగు వ్రాఁతబంతులు గుండ్రనివ్రాలు గలవై యంద ముగా నుండును. ఇది మనలిపికున్న యున్నత సుగుణము. దీనిని గోల్పోరాదు. ఇంగ్లీషు నాగరలిపుల కీయందము లేదు.

మఱియు, చేసిన సంస్కారము, ఇప్పు డున్నలిపికి అలవాటు పడియున్న వారి కెల్లరికి, క్షణములో గుర్తింపఁదగినదై, యనుకరింపఁదగి నదై యుండవలెను. అది వ్రాఁతలో,అచ్చులో, టైపులో, మూఁడిటను భేదము లేక ఒకేతీరు గా నుండవలెను. వ్రాఁతలిపి వేఱు అచ్చులిపి వేఱు, టైపులిపివేఱు అన్నట్లుండరాదు. మహా రాష్ట్ర గుర్జర దేశములందు నాగరిలిపి కిట్టి చిక్కు గలదు. అందు వ్రాఁత మోడిలిపి వేఱు. అచ్చులిపి వేఱు. అట్టి విభేదము మనకుఁ గల్గ రాదు.

౫

సంస్కారవిధానము

మీఁద వివరించిన దోషములెల్లఁ దొలఁ గునట్లును, గుణములెల్లఁ గూడియుండునట్లును గుదిరియున్నదని నేను విశ్వసించిన సంస్కార విధానము నిక్కడ చూపుచున్నాఁడను.

అచ్చులు:

అచ్చులలో అకార మొక్కటి తక్కఁ దక్కిన యక్షరముల నెల్ల విడిచిపెట్టవలెను. అకారముమీఁదనే దీర్ఘము, గుడి మొదలగు అజ్గుణితచిహ్నములను (చిత్రము ౧ చూచు నది.) జేర్చినచో అచ్చులెల్ల నేర్పడును. అకార మును మాత్ర మట్లే యుంచునది. హల్లుల మీఁద నీఅకారము '✓' తలకట్టు రూప మును బొందును. ఆకారాది స్వరములు హల్లులమీఁద నున్నప్పుడే గుణితములగును గాని అకారముమీఁద నున్నప్పుడు గావు- అచ్చులకు గుణితము లేదుగాన.

అ,ఆ,ఇ,ఈ,ఉ,ఊ,ఋ,ౠ,ఌ,ౡ,ఎ,ఏ, ఐ,ఒ,ఓ,ఔ. అనువిధములఁ గల బదునాఱు లిపులకును, ఈ చిహ్నముల నుంచవలెను. (చిత్రము ౨ చూచునది.)

అచ్చుల చిహ్నములెల్ల అక్షరముల శిర స్థానమున నుండవలెను; హల్లులలో నవి తల కట్టిచ్చు చోట నుండి యుపక్రమింపఁబడును గాన. ఈకారణముచే ఉ,ఊ,ఋ,ౠ,ఌ, ౡ చి హ్నములు క్రొత్తవిగాఁ గొంతమార్పఁబడినవి. ఇట్లు మార్పఁగా-బాలురకు ఒక్క అకారము మాత్రము నేర్పి తర్వాత దీర్ఘము,గుడి మొద లగు అజ్గుణితపు చిహ్నముల నేర్పినచో నచ్చు లెల్లవచ్చును.కకారాదులమీఁద నిఁక వేఱుగా అజ్గుణితమును నేర్పఁబనియుండదు. ఒక్క తల కట్టు మాత్రమే నేర్పవలసియుండును. దీర్ఘము, గుడి మొదలగు గుణితపు చిహ్నములు అచ్చు లలో నేర్పుటచే నాచిహ్నములెల్ల హల్లులపై నజ్గుణితస్థానములం దుండును. కావున పదునైదు భిన్నాక్షరముల నేర్చుకొనవలసిన బాధతగ్గి నది. ముద్రణమునఁ గూడ అచ్చులలో పదు నైదుచిహ్నములు తగ్గిపోయినవి.

ఁ, ం, ః, అరసున్న, నిండుసున్న, విసర్గము పూర్వమువలెనే ఉండవలెను.

### హల్లులు

హల్లులలో క, చ, ట, త, ప, వర్గములు సమానలిపి నిర్మాణముగలవిగా నిట్లు మాఱవలెను. వర్గ ప్రథమాక్షరమునకు ప్రక్కను ఒత్తిచ్చినచో ద్వితీయాక్షరమగును. వర్గ తృతీయాక్షరమునకు ప్రక్కను ఒత్తిచ్చినచో వర్గ చతుర్థాక్షర మగును. వర్గప్రథమాక్షరమునకే తలకట్టుస్థానమున నుండి కుడిప్రక్కకొక్కగీత 7 అంకెవలె సాగినచో వర్గ పంచమాక్షర మగును. అకారముతోఁగూడిన హల్లుల కెల్లఁ దలకట్టుండవలెను. తలకట్టు అక్షరమునంటియే యుండవలెను. అనఁగా, ప,స,లు తలకట్లతో నంటియుండవలెను. ఇట్లు తీర్చఁగా వర్గాక్షరము లిట్లేర్పడును. (చిత్రము 3 చూచునది.)

ఇందు బాలురకు వర్గ ప్రథమ తృతీయాక్షరములను బదింటిని మాత్రమే వ్రాయనేర్చుకొనుటలోఁ బ్రయత్నమగును. ఒత్తుగలయక్షరములను ఒత్తి పలుకవలెనన్న విషయము తృటిలో బాలుర హృదయమున నాటి నెలకొనును. క నేర్చినవానికి, దాని ప్రక్కనే ఒత్తుగీత గలయక్షరమును ఖ నుగా గుర్తించుట, ఉచ్చరించుట కడు సులభము. వర్గ ద్వితీయ చతుర్థాక్షరములెల్ల నిట్లే సులువుగా నేర్వఁదగినవగును. భిన్నభిన్న రేఖలతోఁ గ్రొత్త లిపులను దిద్దుట, యుచ్చారణమును జ్ఞప్తియం దుంచుకొనుట యను కష్టము లుండవు. తలకట్టుకుఁ గుడిప్రక్కనుండి ఇంగ్లీషు 7 అంకెవంటిగీఁత గీచిన ననునాసికాక్షరమగునని చెప్పి యుచ్చారణము నేర్పినఁ జాలును. దీనినిబట్టి యిరువదియైదు వర్గాక్షరములలోఁ బదిమాత్రమే దిద్ది నేర్పవలసినవి; తక్కినవి కడుసులభముగా జ్ఞాపకమునఁ బెట్టుకొని రెండుగీఁతల భేదముతో వ్రాయఁదగినవి యగును. వర్గాక్షరములెల్ల నొక్కనిర్మాణక్రమము గలవగును.

ఇట్లు మార్పఁగా ముద్రణమునఁ గూడ నిర్వదియైదు వర్గాక్షరములలోఁ బదునైదక్షరములు తగ్గిపోవును. వర్గ ద్వితీయ చతుర్థాక్షరముల నచ్చునఁ గూర్పవలసినప్పుడు, వర్గ ప్రథమ తృతీయాక్షరములఁ గూర్చి వానిప్రక్కనంటి యొక్క నిలువుగీఁత (I) అంకెను జేర్చిన సరిపడును. వర్గపంచమాక్షరమునకు, వర్గప్రథమాక్షరము తలకట్టునొట్టునట్టి 7 అంకె వలె క్రొత్తగా నిర్మించినదానిని చేర్చినఁ జక్కఁబడును.

### ఇఁక అంతస్స్థములు–ఊష్మలు

యకుఁగల కొమ్మును దొలఁగింపవలెను. రకే ప్రక్కను ఒత్తిచ్చినచో బండి ఱ అగును. లకు తలకట్టుండవలెను. లకే ప్రక్కను ఒత్తిచ్చినచో ళ అగును. వను, పను గాఁ జేసితిమి గాన వ స్థానమునఁ గ్రొత్త యక్షరమేదేని చేర్పవలెను. శ యథాపూర్వమే. శకు ప్రక్కను ఒత్తిచ్చినచో ష అగును. సస్థానమున న యుంచునది. హ స్థానమున నేఁటి ళను ఉంచునది. హ తలకట్టు, దీర్ఘము

గలిగియున్నదిగాన దానిని దొలఁగింపఁదగును. క్షకారము కష సంయుక్తాక్షరము గాన దానికి వేఱురూప మనావశ్యకము. ఇట్లు తీర్చఁగా నంతస్థస్వములు, ఊష్మలు ని ట్లేర్పడును. (చిత్రము ర చూచునది.)

ఈమార్పువలన యాదిళాంతమగు పది యక్షరములలో మూఁ డక్షరములు తగ్గినవి. ఒక నిర్మాణక్రమ మేర్పడినది. ఎల్లవర్ణములను ఒక్కచోనుంచి చూపుదును. (చిత్రము ౫ చూచునది.)

౩ః౪ గుణితము

అజ్గుణితము: అజ్గుణితచిహ్నము (చిత్ర ము ౧ చూచునది.) లెల్ల అచ్చులు నేర్చుకొనుటలోనే వచ్చినవిగాన బాలుర కిఁక హల్లులలోఁ దలకట్టు అకార స్థానీయ మనియును తక్కిన యచ్చులకెల్ల అకారముమీఁదఁ బెట్టిన గుర్తులే పెట్టిన సరిపడుననియుఁ జెప్పి క్షణములో అజ్గుణితమును నేర్పవచ్చును.

ముద్రణమున, తలకట్టు, దీర్ఘాది స్వర చిహ్నములు, వేఱువేఱుగా నిర్మించి (కన్నడ లిపికిఁబోలె) చేర్పవలెను. (చిత్రము ౬ చూచునది.) దీనిచే ఒక్కొక హల్లునకును అజ్గుణితముక్రింద నిప్పుడు పోయఁబడుచున్న ప్రత్యేకాక్షరములు పదేసి పదేసి తొలఁగిపోవును. దీనిచే అచ్చుపోఁతలోఁ గలయమిత భారము తప్పిపోవును.

హల్గుణితము: ఉచ్చారణరీతికి విరుద్ధము గాకుండ లిపిరీతి యుండవలెను గాన, హల్సంయుక్తాక్షరములందు కడపటి హల్లు మీఁదనే అచ్చు ఉండవలెను. కడపటి హల్లే పూర్ణాక్షరముగా నుండవలెను. తత్పూర్వపు హల్లులు తలకట్టు లేనివిగా (అనఁగా హల్మాత్రములుగా) నుండవలెను. (చిత్రము ౭ చూచునది.) ఒక యక్షరము క్రింద నొక యక్షరము నిలికించుట యను విధానము మానవలెను. లిపులెల్లఁ బ్రక్క ప్రక్కలనే ఉండవలెను. అనఁగా నిట్లు-దివ్యధ్వని-అను పదమును, 'దివయ ధవని' అని వ్రాయవలెను. రెండిటికంటె హెచ్చుగా హల్లులు సంయుక్తములై యున్నప్పుడు మాత్రము, కడపటి హల్లుగాక తత్పూర్వపు హల్లులు, తలకట్టు లేనివిగా నుండునుగాన, ఒకదాని క్రింద నొకదానిని బెట్టవచ్చును. ఎట్లనఁగా-వాక్స్వతంత్ర్య అనుపదమును - 'వాక్సవాతంత్రియ' అని వ్రాయవచ్చును. ఇట్టిమార్పువలన బాలురకు, హల్గుణితపు ఒత్తులను నేర్చుకొనవలసిన శ్రమము తొలఁగును. ఉచ్చారణరీతి ననుసరించి లిపిరీతిని నేర్చుకొనుట యగును.

ముద్రణమున నీమార్పు బహు సుఖావహము. బంతిలో నక్షరములెల్లఁ దీర్చినట్లుండును. అడుగడ్డునకు అక్షరముక్రింద నక్షరము వచ్చి బంతి వంకరపోదు. 'హాఫ్ బాడి, ఫుల్ బాడి' పైపుల గజిబిజి యుండదు. రెండింటి కంటె నెక్కువ హల్లులు సంయుక్తమైనప్పుడు మాత్రమే తలకట్టులేని హల్లులు అక్షరము క్రింద నక్షరముగా నేర్పడును. అది యసా

అ ఆ ఇ ఈ ఉ ఊ

ఋ ౠ ఌ ౡ ఎ ఏ

ఐ ఒ ఓ ఔ

క ఖ గ ఘ ఙ

చ ఛ జ ఝ ఞ

ట ఠ డ ఢ ణ

త థ ద ధ న

ప ఫ బ భ మ

య ర ఱ ల ళ

వ శ ష స హ

చిత్రము ౧.

క కా కి కీ కు కూ

కృ కౄ క్ల క్ౡ కె కే

కై కొ కో కౌ

చిత్రము ౨.

చిత్రము ౩.

ధారణముగా నెక్కుడనో వచ్చును. కాన యంతచిక్కుండదు. కాని యిక్కడ నసౌకర్యమువలెఁ దోఁచఁదగిన విషయ మొకటి యున్నది. ఏదనఁగా - సంయుక్తాక్షరములు హల్లుక్రింద హల్లుగాఁ గాకుండఁ బ్రక్కప్రక్కగాఁ గూర్చుటచేత నిప్పటిలిపి యాక్రమించుకొను స్థలముకంటె నీమార్పు లిపి హెచ్చుస్థల మాక్రమించుకొనును గదా అనునది. ఇది యోచింపఁదగిన దే:-ఒకానొక యాంగ్లాభిమాని ప్రముఖుఁడు, ఆంధ్రలిపిని దొలఁగించి తత్ స్థానమున నాంగ్లలిపిని చొప్పింతుమేని నూఱుపుట లాక్రమించుకొను గ్రంథమును ఏఁబదిపుటలలో, సమకూర్పవచ్చునని కొన్నియేండ్లక్రిందట వాటించుట వింటిని. ఇంగ్లీషక్షరములు నిలువునిలువుగానుండు గీఁత లగుటచే స్వల్పస్థలమునఁ బెక్కక్షరములను గూర్పనగునని యా లిపిజ్ఞు లనిరి. అట్లు తలఁచువారుండఁగా నే నిపుడు పేర్కొను లిపి సంస్కారము ఇప్పటి లిపికంటె హెచ్చు స్థల మాక్రమించునదిగా నుండు నేని యది ప్రాజ్ఞసమ్మతము గాకపోవచ్చును. కాని యీ సంస్కారము నిజముగా నట్లు హెచ్చుస్థల మాక్రమించుకొనదు. ఎట్లనఁగా ఇప్పటి లిపి యచ్చులో నక్షరముక్రింద నక్షరము పెట్టుట వ్రాఁతలో సరిపడుచుండుట వాస్తవమే. వ్రాఁతలో నించుకంతస్థలము హెచ్చుతగ్గు లగుటలో జిక్కుండదు. అచ్చులో స్థలము పెరుగుట మాత్రమే చిక్కు. అచ్చులో లిపి క్రింద లిపి నుంచినట్టు కన్పట్టునే కాని, వాస్తవమునకు (హాఫ్ బాడీతప్ప) ప్రక్కనే ఉండును. వానిని గూర్చుటలోఁ గొంచె మించుమించుగా విడఁబఱిచి వ్రాసిన నెంతస్థల మాక్రమించుకొనునో యంతస్థలమును ఆ 'స్పేసు' ఆక్రమించుకొనుచున్నది. బంతి వంకరపోవుచున్నది. అట్టి సంయుక్తాక్షరములుగల బంతికొఱకయి కొన్ని 'లెడ్లు' ఎక్కువ వేయవలసివచ్చుచున్నవి. కాన వీనిని గలపి కట్టుకొనినచో నంతగా నీమార్పు హెచ్చుస్థల మాక్రమించుకొనునది గాదని యేర్పడును. మఱియు, ఋ, ౠ, ఘ, ఝ, మ, య, ఱ, హ, లలో జరపఁబడిన మార్పుల వలని స్థలలాభము కొంతగలదు. కావున నిది యంత యనర్థావహముగాదనినాతలంపు. అఱవ లిపి యీవిధమున నే కలదు. అందు లిపి క్రింద చేరదు. దానివలన వారి కెట్టి యసౌకర్యమును లేదు.

ఈమార్పుచే హల్లుల యొత్తులు ్య, ్వ, ్ల, ్ర, మొదలుగునవి అక్కఱలేకపోవును. అజ్గణిత చిహ్నములను వేఱుగాఁ బోఁతపోసి తలకట్టులేకుండఁ బోసిన హల్మాత్రముల మీఁదఁ జేర్చుటకు వీఁలుగలుగును. సంయుక్తాక్షరమందలి హల్మాత్రములు తలకట్టు లేకుండఁ బూర్వమునుండి కడపటి హల్లు అచ్చుతోఁ గూడియుండుట గుదురును.

మొత్తము లిపియెల్ల నిట్లు మార్పఁగా నచ్చుకై పోఁతపోయవలసిన రేఖాచిహ్నములు ముప్పదియైదు మాత్రమే యగును. వర్గద్వితీయ చతుర్థములకు, గ,ఱ,ష,లకుఁ బెట్టవలసిన ఒత్తుగీఁత యొక్కటి, వర్గాను నాసిక

ములకుఁ బెట్టవలసిన 7వంటి గీఁత ఒక్కటిగల వు. ఈ రెంటిని జేర్చుకొనఁగా ముప్పదియే డగును. ఇప్పుడు ముద్రణమునకై యుపయోగింపఁబడుచున్న చిహ్నములుగి౦౦లలోఁ౯౩ తగ్గిపోయినవి. ముద్రణమున కీమార్పు అమితోపకారముగదా!

ఈమార్పునుబట్టి టైపుమిషనును సృష్టించుట కడుసుకరముగదా!

నాకుఁదోఁచిన మార్పును వివరించితిని. ఇందలి సాధకబాధకములను, ఆంధ్ర దేశమందలి ప్రాజ్ఞులఁ బరిశీలించి వెల్లడింపఁగోరెదను. కొన్ని చిల్లర లిపులు—

దంత్యములగు చజలకు వేఱులిపు లక్కఱలేదు. ఇప్పుడు వాని నెవ్వరును నుపయోగించుటలేదు. రేఫమునకుఁ బూర్వపులిపిలో వలపలిగిలక యను చిహ్నమును ౯, నకారమునకు ౯ అనుచిహ్నమును గలవు. ఈ లిపు లభిమానింపఁ దగినవి. కాని వలపలిగిలక 'వర్గము' అను విధమున వ్రాయఁబడును. ఇది 'వర్గము.' అనువిధమున మార్చుట ఉచ్చారణానుగుణము. అప్పుడది డాపలిగిలక యగును.

వర్గాను నాసికాక్షరసంకేతములు వ,హ, మార్పులు మొదలగువానిలో నేను చూపిన క్రొత్తచిహ్నములకంటె ననుకూల మయిన చిహ్నములు గోచరించె నేని తెలుపఁదగును. ఇంకను నీలిపి సంస్కారవిషయమును నాంధ్ర దేశపుఁ బ్రాజ్ఞు లెల్లరును బర్యాలోచించి చర్చించి సభలుజరపి తమకు గోచరించిన గుణదోషములను సంస్కార విశేషములను ఆంధ్ర పత్రికా భారతీపత్రికాదులందుఁ బ్రకటించినచో వానినెల్లఁ జేర్చుకొని నా యుద్దేశములకుఁ బునరాలోచనము జరపి సర్వ సమ్మతమయిన విధాన మేర్పడెనేని దానిని బ్రచారమునకుఁ దెచ్చుటకుఁ దగిన ప్రయత్నము సాగింతును.

---

## *ప్రశ్నల పద్యము

కోట వెంచు రామయ్య గారు

నాతి, నీహృదయేశు నామంబుఁ జెపుమన్న నంగుళితో నుదు రంటి చూపె
పల్లవాధరి, నీదు వల్లభుకులమన్న గగనభాగంబు బట్టి కలియఁజూపె
కలికి, నీనాథుని కలిమిబలిమి యన్నఁ జేతుల రెంటినిఁ జేర్చి చూపె
విరిబోఁడి, నీపతి వృత్తియెద్ది యటన్నఁ గేల్మోడ్చి హూళిపైఁ గీలుకొలిపె
ధవునివర్ణ మన్నఁ దారాధిపునిఁ జూపె-జనకుఁ డెవ్వ డన్న జడముఁ జూపె
దీనిభావ మరసి తెలియుఁడీ మీరలు-విబుధవర్యులార, వేడ్కతోడ.

---

* ఇందలి ప్రశ్నలకు సరియైన ఉత్తరములను ౯౯౦ వ సంవత్సరం ఏప్రెల్ నెల 15వ తేది లోపల మొట్ట మొదట భారతీకార్యాలయమునకు పంపువారిపేరు మేనెల భారతిలో ప్రకటింపబడును. —సంపాదకుడు.

# పల్లవవంశము—వీరకూర్చవర్మ

యన్. వెంకటరమణయ్య గారు, యం. ఏ.

## ౧

దర్శి శాసనము[1] ముఖ్యమైనది. అది యింతవఱకు చక్కగా గమనింప బడలేదు. ఇందుకు గారణ మది శాసనశకల మగుటయే. ఆదాతయొక్క ముత్తాతను బేర్కొని యంతటితో నిలిచిపోయినది. తునుకమైనను అది ముఖ్యమైనదే. ఈక్రిందివ్యాసమున, దానిలోని కొన్ని యంశములను బరీక్షించి, యది పూర్వపల్లవ చరిత్రములోని సంశయాస్పదము లగు కొన్ని విషయములలోని సంశయములను దొలగించగలదని చూపుచున్నాను.

శాసనము యొక్క భాష సంస్కృత మగుటచే నది చాల పురాతనమైనది కాదనుట నిశ్చయము. అది దాతయొక్క ముత్తాతయగు నొక మహారాజ శ్రీవీరకూర్చవర్మను బేర్కొనుచున్నది. ఈరాజెవ్వరైనదియు నిర్ధారణచేసి చెప్పుటకు వీలులేదు. పల్లవవంశమున నాతనిస్థలమునుగూర్చి పండితులు భిన్నాభిప్రాయములను దెలియజేసి యున్నారు.

ఉరువపల్లి[2] శాసనపుదాతయగు యువమహారాజ విష్ణుగోపుని యొక్కయు, ఆతని యన్నయగు సింహవర్మయొక్కయు తాతయగు వీరవర్మయు, నీవీరకూర్చుడును నొక్కరే యని డాక్టరు కృష్ణస్వామి అయ్యంగారు చెప్పుచున్నారు.[3] హోసకోట కృష్ణశాస్త్రిగారును ఒకప్పుడిట్లే యభిప్రాయపడియుండిరి[4] కాని, యిటీవల నీ యభిప్రాయమును మార్చుకొని, వాస్తవముగ వీరకూర్చుడు మిక్కిలిపురాతనుడగు పల్లవరాజని చెప్పియున్నారు[5]. "పల్లవులు" అను గ్రంథము 22 వ పుటలో "దర్శిలో దొరకిన శాసనము వీరకూర్చుడను రాజుండెనని నిర్ధారణ చేయుచున్న"దని యొప్పుకొని యున్న జి. జె. దుబ్రేగారు 'దక్కను పురాతనచరిత్ర' యందాతని బేర్కొననుగూడ లేదు. ఈపురాతనచరిత్రమునే చదివెడివారికి, వీరకూర్చుడను రాజుండెనని తెలియుట కవకాశము లేదు.

ఈవీరకూర్చుడెవ్వడు? ఈపేరుగల ప్రాచీన పల్లవరాజులు ఇద్దరు వాయలూరు శిలాస్తంభ శాసనమున[6] (దుబ్రేగారి పట్టికలోని ౯,౧౧ పేర్లు: పల్లవులు, పుట 20) పేర్కొన బడి యున్నారు. వెలూర్పాళెము శాసనమున[7] నతడు చూతపల్లవుని కుమారుడనియు స్కందశిష్యుని తండ్రి యనియు చెప్పబడి యున్నది. అతడు కాశాకుడిశాసనమునందు గూడ పేర్కొనబడి యున్నాడు. అయితే,

1. E. I. Vol, I. P. 369
2. I. A. V, P.20
3. పల్లవులు
4. S. I. I. II, Part V
5. E. I. XIX
6. E. I. XIX
7. S. I. I. II, Part V
8. S. I. I. II, P. 349

యివన్నియును మిక్కిలి ప్రాచీనములుగావు. అతని పేర్కొనుశాసనములలో గడుపురాతన మైనది దర్శిశాసనము[1]. ఇది వీరకూర్చవర్మ యొక్క మునిమనుమనిచే నివ్వబడినది. వీనినన్ని టినిబట్టి విచారించగా, ఒకానొకకాలమున వీర కూర్చ లేక వీరకూర్చవర్మ యను పేరుగల పల్లవరా జొక్కడుండె నని తెలుచున్నది. అయితే పల్లవవంశజులగు నితరరాజులతో నత నికిగల సంబంధ మెట్టిదో నిర్ధారణ సేయుటకు వీలుకాదు. ఈవిషయమును గూర్చి చక్కని సాక్ష్యమేమియు దొరకకున్నది. అతని వాయ లూరు, కాశకుడి శాసనములలో పేర్కొనబడియున్నను, వీనియందలి రాజుల పేర్ల కొండొంటితో సంబంధము లేకపోవుట చేతను, కొన్ని పేర్లు కల్పితము లగుటచేతను, పల్లవవంశవృక్షమునందు ఇతనిస్థల మిది యని నిర్ధారణచేసిచెప్పుటకు వీలులేకున్నది. వాయ లూరు శాసములోని పల్లవరాజుల పట్టికను జూచినవారి కందఱికి అందువచ్చిన పేరు మరల వచ్చుటయేకాక నాలుగైదుపేరులు సమూహ ముగ మరలమరల వచ్చుటయు విదితమగును. ప్రాచీనపల్లవశాసనములలో గాన్పించని నామ ములు కొన్ని కాశకుడిశాసనమున గాన్పించు చున్నవి. కావున పైపట్టికలు విశ్వాసార్హములు గావు. నమ్మదగిన ఇతర శాసనముల సాక్ష్య మున్నగాని వానిలోనిపేర్లు వాస్తవచరిత్ర పురుషులపేర్లని యంగీకరింప రాదు.

వేలూరుపాళెపు తామ్రశాసనము నా లుగుతరముల రాజకుటుంబమును పేర్కొను చున్నది. వీరకూర్చ, స్కన్దశిష్య, కుమార విష్ణు, బుద్ధవర్మలు. ఇట్టి పట్టికయే వాయ లూరు శాసనమున గాన్పించు చున్నది. వీర కూర్చ, స్కన్దవర్మ, కుమారవిష్ణు, బుద్ధ వర్మలు. ఇటువంటి జాబితా చెన్దలూరుశాస నమునగూడ గాన్పించుచున్నది. స్కన్దవర్మ కుమారవిష్ణు (౧) బుద్ధవర్మ కుమారవిష్ణు వు (౨)లు. ఈశాసనముల నాధారపఱచుకొని




లను ౫ తరములరాజులును నొకప్పుడు రాజ్య ముచేసి రని చెప్పుట యుక్తము. అయితే, వేలూర్పాళెపుశాసనమున వీరకూర్చునికుమా రిని పేరు స్కన్దవర్మ యని యుండక స్కన్ద శిష్యుడని యున్నది. స్కన్దశిష్యు డనుపేరు స్కన్దవర్మ యనుదాని నామాంతరమే యని యంద రొప్పుకొన్న విషయ మగుటచేతను, మాకావిషయమున ఎట్టి యాక్షేపణయు లేక పోవుటచేతను స్కన్దశిష్య స్కన్దవర్మ లను

1. E. I. 1, P. 369

నవి యొక్క పురుషుని పేర్లేయని యంగీకరించుచున్నాము.

౨

ఉరువపల్లి శాసనమునందు చేర్కొనబడిన యువమహారాజ విష్ణుగోప, మహారాజసింహవర్మలయొక్క ముత్తాతయగు వీరవర్మయు, వీరకూర్చుడు నొక్కరేనని డాక్టరు యస్. కృష్ణస్వామి అయ్యంగారు రభిప్రాయపడుచున్నారని యిదివఱకే వచించియున్నాము. కొన్ని ముఖ్యము లగు కారణములబట్టి విచారింప నది కేవల మంగీకరింపదగని యభిప్రాయముగ దోచుచున్నది. ౧. పల్లవరాజుల శాసనములలో, వీరకూర్చ, వీరవర్మలపేర్లు తారుమారులేక వేర్వేరు పురుషుల నామములుగ వర్ణింపబడియున్నవి. వాయలూరు శాసనమున వీరకూర్చునిపేరు రెండుమార్లు(౫. ౧౧) చెప్పబడి యున్నను, వీరవర్మపేరు వేరుగ (౨౩) జెప్పబడి యున్నది. కాశకుడిశాసనము వీరకూర్చ వీరసింహు లను నిద్దఱు రాజులను చేర్కొనుచున్నది. వీరవర్మయనుదాని నామాంతరమే వీరసింహ యనునదియని వాదించినను వీరకూర్చ వీరవర్మలు భిన్నపురుషులే యగుచున్నారు. ౨. పలక్కడ, దశనపుర, తామ్రపలలోనుండి దానశాసనముల నొసంగిన పల్లవరాజు లందఱు, వీరవర్మవంశజులే. ఓంగోడు(౧), (౨)శాసనములును,ఉరువపల్లి, మంగదూరు, పీకిర, చూరశాసనములును వీరవర్మనే పేర్కొనుచున్నవిగాని వీరకూర్చుని పేర్కొనకున్నవి. వీరవర్మయొక్క వంశజులందఱును, తమవంశముయొక్క మూలపురుషునిపేరు వీరవర్మ యనుచున్నారే కాని వీరకూర్చుడని భ్రమపడియైన చెప్పియుండలేదు. 3. ప్రాచీన పల్లవరాజుల శాసనములను పరిశీలించి చూచితిమేని, వీరకూర్చ వీరవర్మలు పల్లవచరిత్రలోని వేర్వేరుయుగముల యందు జీవించియున్న వేర్వేరుపురుషు లని తేలగలదు. ఆశాసనము లెవ్వియన్న,—

i. హిరహడగల్లి శాసనము.[1] దాత శివస్కందవర్మ. పల్లవుల శాసనములయందు పురాతన మైనవానియం దిది యొక్కటి. "సర్ వాల్టర్ ఎలియటుచే సంపాదిత మైన విజయబుద్ధవర్మ రాణియొక్క అక్షరములు ఈ శాసనపుటక్షరములను బోలియున్నవ"ని డాక్టరు బర్జెసుగారి యభిప్రాయము. ఈశాసనాక్షరముల పోలికగల యక్షరములు గల మయిదవోలు శాసనము[2] మిగుల ప్రాచీన మైనది.

ii. దర్శిశాసనము.[3] డాక్టరు హూల్ట్షుగారీశాసనాక్షరములు కడుపురాతనములని చెప్పియున్నారు

iii. విజయస్కందవర్మయొక్క ఓంగోడు ౧. శాసనములోని యక్షరములు మహా. కృష్ణశాస్త్రిగారి మతప్రకారము "ఉరువపల్లి, మంగదూరు,పీకిరశాసనాక్షరములను బోలియున్నవి.

1. E. I. I. P. 2
2. E. I. VI, 84
3. E. I. I, 369..

iv. ఉరువపల్లి శాసనాక్షరములు స్వచ్ఛమైన పెట్టెతలలు గలవి.* క్రీ. శ. 446-వ సంవత్సర మీదానశాసనకాలమని మన మెఱిగిన విషయమే. ఈపై నాలుగుశాసనములను, దర్శిశాసనకాలమును నిర్ణయించుటకై శోధింపదొడగితిమి. ఉరువపల్లిశాసనదాత యువమహారాజు విష్ణుగోపుడు. ఓంగోడు (౧) శాసనదాత యితని తండ్రియగు విజస్కందవర్మ. కావున నీరెండుశాసనములును క్రీ. శ. ౫-వ శతాబ్దపు పూర్వార్ధమునకు జేరుచున్నవి. హిరహడగల్లిశాసనము పల్లవచరిత్రపు ప్రారంభయుగమునాటిది. దర్శిశాసన మెప్పటిది? ఈప్రశ్నకు, పైనాలుగుశాసనములలోని యక్షరముల నొండొంటి పోల్చితిమేని, సమాధానము రాగలదు. దర్శిశాసనమును మొదట హిరహడగల్లి శాసనముతోడను నటుపిమ్మట ఓంగోడు (౧) ఉరువపల్లి శాసనములతోను బోల్చిచూతము. దర్శిశాసనలిపి హిరహడగల్లి లిపికంటె నర్వాచీనమైనదిగను, ఓంగోడు (౧) లిపికంటె ప్రాచీనమైనదిగను, ఉరువపల్లి లిపికంటె ప్రాచీనతరమైనదిగను గన్పించుచున్నది. ఇట్లు శాసనముల యక్షరస్వరూపమును బోల్చిచూడ దర్శిశాసనము, హిరహడగల్లి ఒంగోడుశాసనముల మధ్యకాలమున వేయింపబడినట్లు తెలియుచున్నది.

ఇక, యీశాసనములలో వచ్చునకై కొన్ని యక్షరముల నొండొంటితో పోల్చిచూతము. ఈ క్రింద నున్న చిత్రము అక్షర

| అక్షరములు | నాసిక | జూనాగడ | కొండమూడి | కొల్లేరు | మైదవోలు | హిరహడగల్లి | దర్శి | ఒంగోడు ౧ | ఉరువపల్లి | ఒంగోడు ౨ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క | | | | | | | | | | |
| గ | | | | | | | | | | |
| జ | | | | | | | | | | |
| ణ | | | | | | | | | | |
| త | | | | | | | | | | |
| బ | | | | | | | | | | |
| ర | | | | | | | | | | |

* డుబ్రాయల్ దక్కనుపూర్వచరిత్ర, పుట ౯౩.

ములను, మార్పును సూచించును. హిరహడగల్లి శాసనములోని "క" బ్రాహ్మి శాసనములలోని 'క'వలెనే యున్నది. దర్శి శాసనములోని "క"కును దీనికిని విశేషము భేదము గాన్పింపదు; కాని యక్షరముయొక్క క్రిందినుండి యెడమవైపునకు దిరిగి యూర్ధ్వముగ బోవుగీటు పొడవుగ నున్నది. ఒంగోడు (౧) శాసనములో నీయక్షరమింతకంటె చక్కగ తీరియున్నది. ఒంగోడు (౧) శాసనము ఉరువపల్లి శాసనమువలె స్వచ్ఛమైన పెట్టె తలల యక్షరములతో వ్రాయబడిన దని యూహించుటకు కారణ మున్నది. 'క' తలపై నొక పెట్టెయున్నది. అక్షరముయొక్క క్రింది భాగము వర్తులముగాక మూలలు తీరి ద్విభుజముగమారి యున్నది. ఉరువపల్లి "క", ఒంగోడు (౧) 'క'వంటిదే; కాని తలపైని పెట్టెయు క్రింది ద్విభుజము పెద్దవి. ఒంగోడు (౨) 'క' యిప్పటి అరవ'చ' ను చాలవఱకు పోలి యున్నది.

హిరహడగల్లి 'గ' ఇప్పటి తెలుగు 'గ' ను చాలవఱకు పోలియున్నది; దానికి తలకట్టు లేదు; అక్షరము కుడివైపునకు వంగి యున్నది. ఎడమ కాలు కుడిదానికంటె కురుచ. ఎడమకాలి క్రిందిభాగము కొంచము లోపలికి వంగి గుడికట్ట బోవునట్లున్నది. దర్శిశాసనములోని 'గ' తెలుగు ౧ ని బోలి యున్నది. అయితే గ యొక్క యెడమ కాలుక్రింద కుడివైపునకు గుడి తిరిగియున్నది. ఒంగోడు (౧) (౨) శాసనములలోని 'గ' కు గుడిలేదు. ఉరువపల్లి "గ" యం దీగుడి లేదు. దానికాళ్లు సమముగను, విలంబముగ నొకదాని వైపు మరొకటి తిరిగియు నున్నవి. ఇంకను తలకట్టు లేకపోయినను దానిస్థలమున నొకఅడ్డ గీత యున్నది. దీనికిని మన తెలుగు కన్నడపు 'గ'లకును వ్యత్యాసమువిశేషము గాన్పించదు. దర్శిశాసనపు 'గ' కాలియందలి గుడి ఈయక్షరపు పూర్వ స్వరూపమును జ్ఞప్తికి దెచ్చు చిహ్నము; నూతనమైనమార్పుగాదు. మయిదవోలు శాసనములో[1] దీని కుడికాలు యెడమ దానికంటె దీర్ఘమై యెడమ వైపునకు వంగి వర్తులరేఖయై యంత్యమగు చున్నది. ఎడమ కాలు కుడిదానివైపునకువంగియున్నది. కొండమూడి శాసనమున[2] 'గ' మైదవోలు 'గ' వలె నున్నను, దర్శి 'గ'వలె దాని యెడమ కాలికొన లోపలి ప్రక్కకు తిరిగి గుడిగమారి యున్నది. రుద్రదాముని జునాగడ[3] శాసనములోని 'గ' దర్శి'గ'ను సర్వ విధములను బోలియున్నది. కావున నీగుడి క్రొత్తగ దర్శి శాసనకాలమున పుట్టినదికాదనుట స్పష్టము. పురాతనకాలమందు 'గ'కట్టి గుడి యుండెను. అది కాలక్రమమున లోపించెను; కావున నీగుడి పురాతన చిహ్నమే.

హిరహడగల్లి 'జ' యించుమించుగ ఇంగ్లీషు పెద్ద E వలె నున్నది; కాని మూలలు

1. E. I. vi. 84.
2. E. I. vi. 315.
3. E. I. viii. 36.

వర్తులవముగ మారినవి. జునాగడశాసనమున అది ఇంగ్లీషు పెద్ద E వలె నున్నది. దర్శిహిర హడగల్లి "జ"లకు విశేషము భేదము లేదు. కాని, క్రిందిభుజముయొక్క కొన సూక్ష్మమగున ధోముఖరేఖగ మార్పునందిన ట్లున్నది. ఒంగోడు (౧) 'జ' యొక్క పైభుజము వక్రరేఖగ మారియున్నది. క్రింది భుజమున ఇప్పటిమన 'జ' వలె పొక్కిలి యేర్పడి యున్నది. ఉరువ పల్లి 'జ' పై భుజమొక ఋజురేఖ. క్రిందిభుజమున పొక్కిలిచక్కగ తీరియున్నది. ఒంగోడు (౨) 'జ' కును యిప్పటి మన 'జ'కును భేదము విశేషము గాన్పించదు.

హిరహడగల్లి శాసనపు 'ణ'మఱిమెచ్చ టను గాన్పించదు. బ్రాహ్మీ,పల్లవశాసనముల 'ణ'కును దానికిని జాలభేదము గలదు. దర్శి 'ణ'కును,అంత్యయుగపుబ్రాహ్మీ'ణ'కును భేద ము లేదు. ఒంగోడు (౧) ఉరువపల్లిశాసనముల లోను దానిస్వరూప మట్లే యున్నది.ఒంగోడు (౨) శాసనమున నది చక్కగ తీరి యించు మించుగ నిప్పటి తెలుగు'ణ' వలె నున్నది.

హిరహడగల్లిలోని 'త' తలకట్టు లేని యిప్పటి తెలుగు'గ'వలె నున్నది. తలమీాద కుడివైపున కొరిగిన నిలువుగీటొకటి యున్నది. ఇది, ఉషవదాతయొక్క నాసిక శాసనము[1] లోని'త'ను బోలియున్నది. హిరహడగల్లి దర్శి 'త'లకు సంబంధ మున్నట్లు గాన్పించదు. దర్శి 'త'కును అమరావతిప్రాకృత శాసనములలోని 'త'కును భేదములేదు. ఒంగోడు (౧) శాసనమున నీయక్షరముయొక్క త్రోక వంకగీటుగ ముగియక ఋజురేఖగ మారియున్నది. దాని శిరమున పెట్టెయున్నట్లు తలచుట కవకాశము గాదు. ఉరువపల్లి 'త' ఒంగోడు (౧)'త' వంటి దే; కాని త్రోక కురుచ; పెట్టెపెద్దది. ఒంగోడు (౨) శాసనములో మేకు తలకొక్కెము వలె మారియున్నది.

ప్రాచీనపల్లవశాసనములయందు రెండు విధములగు "బ"లు గాన్పించుచున్నవి. బ్రాహ్మీ 'బ'రూపమున చతురస్రము (Square) హిర హడగల్లి 'బ' దీనివికారము. అక్షరముయొక్క క్రింది యెడమమూల, క్రిందికి వంగిన సూక్ష్మ సమరేఖయొకటికలదు. పై కుడిమూల వర్తులగ మారి యెడమవైపునకు బోయి యక్షరము యొక్క యెడమ భుజముపై తాకి వ్రాలి యున్నది. ఒంగోడు (౧), ఉరువపల్లి 'బ'లుపై దాని వికారములే. దర్శి 'బ' యించుమించుగ నిప్పటి తెలుగు 'ఐ' కారమువలె నున్నది. ఒంగోడు (౨) 'బ' దీనియొక్క వికారము. హిర హడగల్లి 'బ'కంటె దర్శి 'బ' యర్వాచీనమైన దని మనమనుకొనరాదు. ఏలన, అది విజయ దేవవర్మ యొక్క కొల్లేరు ప్రాకృత శాసన మున[1] గాన్పించుచున్నది. కావున దర్శి "బ" హిరహడగల్లి 'బ' యంతటి ప్రాచీనమనుటకు సందేహము లేదు.

'ర'నుగూర్చి విశేషము చిక్కు లేదు. హిరహడగల్లి శాసనమున ఇది యింగ్లీషు J వలె నున్నది. దర్శియం దక్షర స్వరూపము

1. E. I. viii.

1. E. I. IX.

కొద్దిగ మారుటచే యక్షరము కురుచగను, తోక పొడవుగను గన్పించుచున్నది. ఒంగోడు (౧) శాసనమున నది యింగ్లీషు J వలె నున్నది. కాని తలపై పెట్టెయున్నది. తోకకు వర్తులరూపముపోయి మూల లేర్పడియున్నవి. ఉరువపల్లి 'ర' ఒంగోడు (౧) 'ర' వంటిదే. పెట్టెయును, మూలలును మిక్కిలి చక్కగ తీరియున్నవి. ఒంగోడు (౨) శాసనమున నీయక్షరము రమారమి మన ప్రస్తుతపు తెలుగు 'ర' ను బోలియున్నది.

పై జేయబడిన క, గ, జ, ణ, త, బ, ర, అను నేడక్షరముల పరీక్షవల్ల హిరహడగల్లి యక్షరములకంటె దర్శి యక్షరములు తీరియున్నవనియు, దర్శికంటె ఒంగోడు(౧) ఉరువపల్లి, ఒంగోడు (౨) అక్షరములు చక్కగ తీరియున్నవనియు తెలియుచున్నది. కావున దర్శి శాసనము హిరహడగల్లి శాసనముకంటెవెనుకను, ఒంగోడు (౧) ఉరువపల్లి, (౨) శాసనముకంటె ముందరను వ్రాయింపబడి యుండవలయును.

వీరవర్మను బేర్కొను శాసనములలో ప్రాచీనతమమైనది ఒంగోడు (౧) శాసనము. ఇతడు క్రీ. శ. 446 వ సంవత్సరమున జీవించియున్న యువమహారాజు విష్ణుగోపుని యొక్క తాత యగుటచేత, క్రీ. శ. 385 మొదలు 410 వఱకు రాజ్యము చేసియుండెనని మన మూహింప వచ్చును. అక్షరములపోలికలను బట్టి ఒంగోడు (౧) శాసనముకంటె దర్శి శాసనము ముందటిదని తీర్మానించుకొని యున్నాము. కాబట్టి దర్శి శాసనదాతయొక్క ముత్తాత యగు వీరకూర్చవర్మయు, ఒంగోడు (౧) శాసనదాతయగు విజయస్కన్దవర్మ తండ్రియగు వీరవర్మయు నేకపురుషులు కాజాలరు. వాదమునకై దర్శి ఒంగోడు (౧) శాసనములు సమకాలపువని యొప్పుకొన్నను వీరకూర్చవర్మ వీరవర్మ కంటె రెండు పురుషాంతరములు ముందుండి యుండవలయును. అనగా నతడు ఒంగోడు శాసనమునందు బేర్కొన బడ్డ కుమారవిష్ణుని సమకాలికుడుగ నుండవలయును. అప్పటికిని వీరకూర్చ వర్మయు వీరవర్మయు నొక్కరేయని చెప్పుటకు సాధ్యము గాదు.

దర్శి శాసనము వీరవర్మ తండ్రియగు స్కన్దవర్మగాని లేక అతని సమకాలికుడగు మఱియొక పల్లవ వంశీయుడుగాని వ్రాయించి యుండవలయును. దర్శి శాసన లేశము, వీరవర్మ సంతతివారు ప్రాయికముగ శాసనముల నొసగుస్థలములయందొక్కటియగు విజయదశనపురమునందివ్వబడినదిగాని తచ్ఛాసనదాత స్కందవర్మయే యని తోచుచున్నది.

వీరవర్మ, వీరకూర్చవర్మ లొక్కరనిచెప్పుటకు వీలుకాదని నిరూపింప బడినది. కావున నీవీరకూర్చ వర్మ హిరహడగల్లి శాసనదాత యగు శివస్కన్దవర్మ యొక్క తండ్రిగాని మఱి యన్యుడుగాడు. పురుషాంతరమునకు ౧౨౫ సంవత్సరముల చొప్పున

గణించిన రమారమి క్రీ. శ. ౨౮౫ సంవత్సర ప్రాంతమున వీరకూర్చుడు జీవించి యుండ వచ్చునని తోచుచున్నది.

3

అయినప్పటికిని తమచే పరమ ప్రమాణములుగ నంగీకరించిన శాసనములయం దాతఁడు పేర్కొనఁబడియున్నను, దూ్ర్బేగారురచించిన పల్లవవంశవృక్షమున[1] వీరకూర్చుని స్మరింప కున్నారని వచించియున్నాము. అట్లు సేయుటకు గారణ మాయన వచించి యుండ లేదు. వారికిగలిగినసంకట మిదియని తోచుచున్నది. వీరకూర్చుడు ప్రాచీనపల్లవరాజని చెప్పబడియున్నను, అట్టివాక్యములు సంస్కృతశాసనములయందు మాత్రము గాన్పించుచున్నవి. ప్రాకృతశాసనములయం దాతని పొడమైన గాన్పింపదు. ఇంతేకాక యతనిపేరు దర్శిశాసనలేశమున నున్నది. పల్లవ వంశవృక్షమున దీని నాధారపర్చుకొని వీరకూర్చుని నిరికించుటకవకాశము దొరకలేదు. కాబట్టి దర్శిశాసనమాతనికి కాలిబంధకమైనది. ఆ బంధకమును దొలగించుకొను నుపాయ మరసి, దానిని స్మరింపక చల్లగ జారవిడిచినాడు. మఱియు, సర్కారువారి తరఫున బనిసేయు శాసన పరిశోధకమహాశయులుచేసిన ప్రాకృతసంస్కృత శాసనముల కాలములకు దాదాపు రెండుశతాబ్దములు మెడమున్నదను నపసిద్ధాంతముగూడ నాతని బెడత్రోవకు ద్రిప్పినది.

వెంకయ్యగారు ప్రాకృత శాసనములను "క్రీ. శ. ౪ వ శతాబ్దారంభ కాలమునకు"[2] జేర్చుచున్నారు. ఇట్లనుచున్నాడు: "క్రీ. శ. ౨౩౬ వ సంవత్సరమున కడపటి యాంధ్ర రాజగు మూడవపులుమాయి రాజ్యకాలము సమాప్తినందెను. అందుచేత పల్లవులు ఆశతాబ్దాంతమున స్వతంత్రులై యుండవచ్చును.ఒకవేళ వారికాలమునకుముందే స్వాతంత్ర్యస్థాపనమును జేసియుండినను నుండవచ్చును." "ఈ వంశపు సంస్కృతశాసనములు తరువాతి కాలపువి......సంస్కృత శాసనముల నొసగిన రాజు లెప్పుడుండిరో తెలియదు. అయితే స్థూలముగ వారు ౫, ౬ శతాబ్దముల నాటి వారని చెప్పవచ్చును."[3]

ఇది తాత్కాలికపు సిద్ధాంతముగ మొదట బరిగణింపబడినను తరువాతివారికది వేదవాక్య మాయెను. హా. కృష్ణశాస్త్రి గారు దీనిని స్థిరీకృతమగు సిద్ధాంతముగ నమ్మి తదాధారమున గొన్ని యపసిద్ధాంతములను బయలువెట్టిరి.[4]

పై సిద్ధాంతము నంగీకరించుట వలన దూ్ర్బేగారు పల్లవవంశవృక్షపు బోదెను అనవసరముగ దీర్ఘీకరించవలసినవారైరి. వారు త్రొక్కిన మార్గము సమంజసముగ నుండలేదు. పల్లవ వంశవృక్షరచనను ప్రాకృత శాసనములలోని రాజులపేర్లతో నారంభించిరి. అంతవఱకు బాగుగనే యున్నది. వారికి విష్ణుగోపునిదగు

1. Anc. Hist., Deccan, P. 70.
2. Arch. Rep. 1906-7, P. 222
3. I bid. P. 223, 4
4. S. I. I. Vol, II. Part V

గట్టిరి. సముద్రగుప్తుని యలహాబాదు శిలా స్తంభశాసనములో[1] కంచి రాజగు నొక విష్ణుగోపుడు పేర్కొనబడి యుండుట వాస్తవమే. అయితే బుద్ధ్యాంకురుని యనంతర మొక విష్ణుగోపుడు రాజ్యము చేసినట్లు పల్లవశాసనముల వల్ల దెలియవచ్చుటలేదు. వాయలూరు శాసనమున[2] ప్రాచీనపల్లవ రాజులలో విష్ణుగోపుని పేరు చెప్పబడి యున్నది. అయితే ప్రాకృత శాసనములలోని రాజులెవ్వ రాతనికి ముందు రాజ్యము జేసిన ట్లీశాసనము పల్కదు. స్కన్దవర్మ యను పేరుగల రాజు విష్ణుగోపుని కుమారుడనిగాని, తరువాత రాజ్యము జేసిన వాడనిగాని పల్లవశాసనములయం దెచ్చటను లేదు. విష్ణుగోపుని మూలమున ప్రాకృత సంస్కృతశాసనములకు దూబ్రేగారు సంబంధమును గల్పింప బ్రయత్నించిరి; ఈప్రయత్నము క్రమమైనది గాదు. ఆయన హిరహడగల్లి శాసనదాతయగు శివస్కందవర్మయు, చెన్దలూరుదానపత్రోక్తమైన రాజ వంశమునకు మూలపురుషుఁడైన స్కన్దవర్మయు భిన్న పురుషు లనుచున్నాడు! వాస్తవము విచారించగా వారొక్కరేనని తెలియగలదు. బ్రిటిషు మ్యూజియంశాసనములోని బుద్ధవర్మ చెన్దలూరు శాసనములోని మొదటి కుమారవిష్ణువుకు సమకాలికుడుగాని ముత్తాతగాడు. ఇది వేలూర్పాళెపు శాసనమునకు[3] సమ్మతమే. అందు కుమారవిష్ణువు పల్లవవంశ స్థాపకుడగు వీరకూర్చని మనుమడని వచింపబడియున్నది.

ఇంతవఱ కెవ్వరిచేతను గమనింపబడనిదియు, అనేకములగు ప్రమాదముల కాస్పదమైనదియు నగు నొక్కవిషయము నీసందర్భమున జెప్పవలసియున్నది. వీరకూర్చుడను పల్లవకుమారుడు. నాగరాజుకుమార్తె నుద్వాహము చేసుకొనుటవల్ల పల్లవవంశమునకు రాజ్యలాభము గలిగెనను విషయమందఱు పండితు లొప్పుకొన్నదే. తత్పూర్వమున పల్లవులెట్టి స్థితియందుండిరో మన మెఱుగము. ఆంధ్రపల్లవవంశముల మధ్యమున నాగజాత్యుద్భవు లగు నాంధ్రభృత్యరాజులు దక్కను దక్షిణహిందూదేశములపై ప్రభుత్వము చేయుచుండిరి. ఈయాంధ్ర భృత్యరాజులు చూటు (చూడ)కులులు. చూటులకడ నుండియే దక్షిణరాజ్యలక్ష్మి పల్లవులను జేరెననుట యందర రంగీకరించినవిషయమే. వేలూర్పాళెపు శాసనప్రకార మిది వీరకూర్చుడు నాగకుమారిని బెండ్లాడుటవల్లనని దెలియుచున్నది. పై శాసనమున వీరకూర్చని తండ్రిపేరు చూతపల్లవుడని చెప్పబడియున్నది. ఈచూతపల్లవుడు చరిత్రపురుషుడని యనేకగ్రంథకర్తల నమ్మకము. ఇది నిజముగాదు. చూతపల్లవుడు చరిత్రపురుషుడుగాడు; చూటుపల్లవవంశముల సంయోగమును సూచించు కల్పితమూలపురుషుడు. మన మాతని కల్పిత పురుషునిగనే గణింపవలయును. అతనిపేరుగాని, అతనివలెనే కల్పితపురుషులగు నతని పూర్వీకులపేర్లుగాని ప్రాచీనపల్లవ ప్రాకృత సంస్కృతశాసనముల

1. Fleet Gupta Inscriptions 2. Dubreuil 'The Pallavas' 3. S. I. I. Vol. II, Part V

యందెందును గానరావు. మనము చరిత్రను కల్పనాకథలనుండి వేరుపర్చవలయును. అట్లు చేసినగాని మనకు సత్య మెరుకపడదు.

ఇక ప్రాకృత సంస్కృత శాసన యుగ ముల మధ్య మెడమున్న నది రెండు శతాబ్ద ముల దీర్ఘకాలము గాదనియు, రెండు పురు షాంతరముల హ్రస్వకాలమనియు నిరూపించె దము. ఇదివఱకే వీరకూర్చ, వీరవర్మల మైక్య మును స్థాపించుట కానిపనియని చెప్పియున్నా ము. శాసనములయం దగపడు వీరకూర్చ డొ క్కడే. అతడు కడు ప్రాచీనుడు. హిరహడ గల్లి శాసనదాతయగు శివస్కన్దవర్మ తండ్రి. ఈమతము నంగీకరించిన, దర్శిశాసనపు దాత పైశివస్కన్దవర్మయొక్క మనుమ డగును. అట్లగునేని సంస్కృత శాసనయుగము శివ స్కన్దవర్మయొక్క మనుమని కాలమున నారంభమగును. ఈ రెండుపురుషాంతరములను రెండుశతాబ్దముల వఱకు వ్యాపించి యుండె ననుట కేవల మసంభవము.

పైజెప్పిన విషయము శాసనసమ్మత మైనది. వాస్తవమారయ (పల్లవ) ప్రాకృత శా స న ము లు సంస్కృతయుగారంభమున లిఖింపబడినట్లు తెలియుచున్నది. ఈ ప్రాకృత శాసనములలో సంస్కృతపదములు, వాక్య ములు, శ్లోకములు గన్పించుచున్నవి. క్రీ. శ. ౪-వ శతాబ్దారంభ పుదని వెంకయ్యగారిచే జెప్పబడిన హిరహడగల్లి శాసనమున నొక సంపూర్ణసంస్కృత వాక్యము గలదు.

"స్వస్తి గోబ్రాహ్మణలేఖకవాచక శ్రోతృభ్య [ఇతి."

బృహత్ఫలాయనసగోత్రజు డగు మహా రాజు జయవర్మయొక్క కొండమూడిశాస నపు లిపి శివస్కన్దవర్మయొక్క మయిద వోలు శాసనపు లిపిని బోలియున్నది. ఈ కొండమూడిశాసనమున 'మహేశ్వర', 'బృహ త్ఫలాయన' యను రెండుసంస్కృతపదము లున్నవి. ఇంతేకాక ముద్రచుట్టును "బృహ త్ఫలాయనసగోత్రస్య మహారాజశ్రీ జయ వర్మణః" యను వాక్యము స్వచ్ఛమైన సంస్కృతభాషయం దున్నది. చారుదేవిచే నొసంగబడిన బ్రిటిష్ మ్యూజియముశాసనము[1] యొక్కలిపి హిరగడగల్లిశాసనమును బోలి యున్నది. అందు సంస్కృతశాసనముల కడ పట తరచుగ గాన్పించుశ్లోకములలో నివిరెం డున్నవి.

బహుభిర్వసుధాదత్తా
బహుభిశ్చానుపాలితా;
యస్యయస్యయదాభూమిః
తస్యతస్యతదాఫలమ్.
స్వదత్తాం పరదత్తాంవా
యోహరేతవసున్ధరామ్;
గవాం శతసహస్రస్య
హన్తుః పిబతి కిల్బిషమ్.

ఇంకొక ప్రాకృతశాసనమున గూడ నిట్టి సంస్కృతశ్లోకములు, "షష్టింవర్ష సహస్రాణి", "బహుభిర్వసుధా దత్తా" యనునవి కన్పట్టు

1. E. I. VIII, P. 143

చున్నవి. ఈ శాసనదాత శాలంకాయన గోత్రజుడగు విజయదేవవర్మ. ఈ సందర్భమున హుల్ట్జుగారివాక్యములు గమనింప దగినవి. "గుహాశాసనములలో బ్రతిద్విత్వమును ఏకాక్షరముతోడనే వ్రాయబడియుండగా, ఈ శాసనములోని యక్షరగుణితము, యీవిషయమున, పాలీగ్రంథములను, చారుదేవియొక్క బ్రిటిషు మ్యూజియ శాసనమును బోలి యున్నది."[1]

పల్లవ, బృహత్ఫలాయన ప్రాకృతశాసనములు, శాసనములభాష సంస్కృతముగ మార్పు జెందుచున్న కాల మప్పటివి. ప్రాకృత శాసనములలోని సంస్కృతపదవాక్య శ్లోకములు సత్వరము సమీపించుచున్న సంస్కృతయుగ సూచకములు. మొదటి రెంటియందును పదములు, వాక్యములు మాత్రమే కన్పడుచున్నవి. తక్కినవానియందు శ్లోకములుసైత మగపడుచున్నవి. ఈమార్పు ఒక పురుషాంతరములోపల జరిగినది. సంస్కృతభాష శాసనములనుండి ప్రాకృతమును నెట్లు నెట్టివేసినదియు మఱియొక యుదాహరణమువల్ల మనకు బోధపడగలదు. ఆనందగోత్రజు డగు దామోదరశర్మ యనునత డొకశాసనము[2] నిచ్చియున్నాడు. సర్కారువారి శాసన పరిశోధనశాఖాధ్యక్షుడు పై శాసనకాలమును గూర్చి "క్రీ. శ. మూడునాల్గుశతాబ్దములనాటి ప్రాచీన పల్లవరాజుల ప్రాకృతశాసనముల కాలమునకును, దీనికాలమునకును విస్తారము దూరము లేదు."[3] అని వచించియున్నాడు. శాసనపుభాష సంస్కృతము; అయినప్పటికిని దానియందు కొంతభాగము ప్రాకృతమున వ్రాయబడి యున్నది.

"మూడు తెగల బ్రాహ్మణులు, ప్రతిగ్రహీతలు వారి గోత్రములతో గూడ జేర్కొనబడి యున్నారు: ౧౧ కొండిన్నులు (అనగా కౌండిన్యగోత్రజులు), ౩ కస్సవులు (అనగా కాశ్యప గోత్రజులు);......౧ ఆగస్తి (అనగా అగస్త్య గోత్రోద్భవుడు.) గోత్రముల నామములవలెనే ప్రతిగ్రహీతల పేర్లుగూడ ప్రాకృత రూపమున వ్రాయబడియున్నవి. రుద్దజ్జ (రుద్రార్య), ఖందజ్జ (స్కన్దార్య), అగ్గిజ్జ (అగ్న్యార్య), సవరజ్జ (శబరార్య), భద్దజ్జ (భద్రార్య) ఇత్యాదులు."[4] ఈ శాసనమునందు శాసన భాషగ నంతరించుచున్న ప్రాకృతముయొక్క కడపటి చిహ్నములను గనుగొనుచున్నారము. రమారమి యొక్క పురుషాంతరములోపల సంస్కృతమున నే శాసనములు వ్రాయు నాచారమారంభమాయెను.

ప్రాచీన కదంబ శాసనములను శోధించి చూడగా నీ విషయమే తేలుచున్నది. వీని యందు మిక్కిలి పురాతనమైనది మలవల్లి స్తంభశాసనము.[5] పూర్వము మైసూరుశాసన

1. E. I. IX, P. 57
2. Epi. Rep. 1920-21, Madras
3. Ibid.
4. Madras Epi. Rep. 1920-21.
5. E. C Vol. VIII, Shikarpur Tq. P. 264

పరిశోధనశాఖయందు బనిసేయుచున్న డాక్టరు ఎ. వెంకటసుబ్బయ్యగారు ఈ శాసనమునుజక్కగపరిశోధించి అందుపేర్కొనబడినస్కన్దవర్మకాదంబుడు గాడనియు, తత్కారణమున నాతనిపేరు కదంబరాజుల పేర్లలో నుండి తొలగించ వలయు ననియు తీర్మానించి యున్నారు.[1] ఈతని పరిశోధనవల్ల గలిగిన ఫలమేమన, మలవల్లి శాసనము వేయించిన దాతను మన మెఱుగక పోవుటయే. పైసిద్ధాంతము నాధారముచేసుకొని, ఈశాసనపు దాత మయూరవర్మయని దూబ్రే గారు వాదించుచున్నారు.[2] ఈవాదమునకు బలము నొసగు నంశములు కొన్నికలవు. శాసనము ప్రాకృత భాషయందు విరచితమగుటచే, నది ప్రాచీనమనుట నిజము. ఇంతేకాక శాసనపులిపి యదే స్తంభముపైనుండు చూటుప్రాకృత శాసనలిపిని బోలియుండుటచేత డాక్టరు రాప్సన్ వంటి పరిశోధకుడు, "బనవాసిరాజ్యము చూటుల కడ నుండి కదంబుల హస్తగతమాయె" నని చెప్పియున్నారు.[3] డాక్టరు రాప్సన్ చెప్పినది సరిగాదని కదంబ కకుస్థవర్మ యొక్క తలగుండ శాసనమువల్ల దెలియుచున్నది. అందు తన ముత్తాతయగు మయూరవర్మ రాజ్యమును పల్లవులకడనుండి పడసి వారికి సామంతుడాయెనని వచించియున్నాడు.[4] కాబట్టి మలవల్లి స్తంభముపై నున్న రెండు శాసనములును డాక్టరు రాప్సన్ గా రను కొన్నంత సమీపకాలపువి గాదనుట నిక్కము. అది యట్లుండనిండు.

మయూరవర్మ మలవల్లి ప్రాకృత శాసనపుదాతయనుట సరికాదు. ఈశాసనములోని ప్రాకృతశ్లోక మీ యూహతో విరోధించుచున్నది.

ఉక్తంఖందో:—

విస్సకమ్మా బహ్మదెజ్జం సేకదంబేసు బుజ్మతే;
విసత్తుచాతు వెజ్జం సిద్ధితం నిగమవిదితంచ.

దీనిమీఁది వెంకటసుబ్బయ్య గారి వ్యాఖ్యాన మీక్రిందిది:—"ఈశ్లోక మెచట నుండియో కొనివచ్చినది గాన శాసన కాలమునకు పూర్వమే వ్రాయబడియుండవలయును. కావున శాసన కాలమునకు చాలముందే కదంబులు బ్రహ్మదేయములనిచ్చి కీర్తి గడించి రనుటయు సహజము గాదు."[5]

"శాసనకాలమునకు చాలముందే కదంబులు బ్రహ్మదేయముల నిచ్చికీర్తి గడించి"నట్లయిన కదంబవంశమునకు మూలపురుషుడైన మయూరవర్మ మలవల్లి శాసనము నొసగిన దాత కాజాలడు. దానిదాత మయూర వర్మ తదనంతరము రాజ్యాధిపత్యమును వహించిన రాజులలో నొక్కరై యుండవలయును. ఈశాసనపుకడపటి రెండువాక్యములును(ఒక్కపదము

1. I. A. XLVI, P. 154
2. Anc. Hist. of the Deccan, P. 99
3. The Catalogue of Ind coins Intro. P. 54
4. E. I. VIII, P. 24.
5. I. A. XLVI, P. 154.

దప్పుసంస్కృతమునందున్నవి. "జయతి లోకానాథోనన్దతి. గోబ్బ్రాహ్మణసిద్ధిరస్తు, శ్రీరస్తు." వీనివల్ల పల్లవబృహత్ఫలాయనప్రాకృతశాసనములవలె నిదియు శాసనములభాష సంస్కృతమునకు మాఱ్పు చెందుచున్న కాల మప్పటిదని తెలియవచ్చుచున్నది. ఇచ్చటగూడ సంస్కృతయుగ మచిరకాలముననే యారంభ మగుచున్నది. మయూరవర్మ మునిమనుమడగు కకుత్స్థుని శాసనములభాష సంస్కృతము. పేరులేని శకముయొక్క యెనుబదియవ సంవత్సరమున వ్రాయించిన హాల్సి తామ్రశాసనపు భాష సంస్కృతము. ఈశకము మయూరశర్మ రాజ్యాభిషేకసమయమున నారంభింపబడినదని యనేకులయూహ. కావున, హాల్సిమలపల్లి శాసనముల కెడము 30 లేక 40 సంవత్సరముల కంటె నెక్కువగ నుండజాలదు.

ఈ పైచర్చవల్ల ప్రాకృతసంస్కృతయుగము లొండొంటి వెంట నంటి వచ్చినవని తెలియుచున్నది. సంస్కృతప్రాకృతశాసనముల మధ్యకాలము గడునల్పము. రెండుపురుషాంతరములకంటెనెక్కువకాదు. ఈయల్పకాలముననే సంస్కృతముశాసనములనుండి ప్రాకృతమును త్రోసివేసెను. పేరులేని దర్శిశాసనపుదాత సంస్కృతయుగమున నుండినను, అతని ముత్తాతయగు వీరకూర్చవర్మ ప్రాకృతమునందుండి యుండవచ్చును. ఈ వీరకూర్చవర్మ హిరహడగల్లి శాసనదాతయగు శివస్కన్దవర్మయొక్క తండ్రియనుటకు సంశయము లేదు. అందు వచింపబడిన మహారాజ బప్పసామియే యితడనుట నిక్కము.

---

## కోకిల

సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు

౧

ఆ వసంతునాస్థానగాయకవతంస! - స్వాగతము నీకుఁ గోకిలా! స్వాగతంబు
చాలఁగాలంబునుండి దర్శనము లేదు-క్రొత్తరీతులు నేర్వంగఁ గోర్కెపుట్టి
చనితివే? యల్లకిన్నరాంగనలకడకు-గానమునఁ గ్రొత్తలేమైనఁ గాంచినావె?
పాడు మొకపాటఁ జెవ్వులపండువుగను.

౨

నిరుటియాదినముల వింటినీదుపాట-గున్నమామిడిదగ్గఱఁ గూరుచుండి
మరల నటువంటిపాట భూమండలమున-వినమిఁ జెవ్వులు త్రుప్పుపట్టెను సఖుండ!
గున్నమామిడిఁ జూచుచునున్నయప్పు-డెల్ల నానాఁటినీపాట స్మృతికివచ్చి
తియ్యత్రేఁపులు మిక్కిలిఁ ద్రేన్చుచుందు.

౩

కుంజతలమందు నొంటిగాఁ గూరుచుండి-మోహగీతంబులను బాడుముగుదవోలెఁ
దనహృదయవల్లికకు దోహదములు సేసి-ప్రకృతితరుణి పూయింపఁ బుష్పవ్రజంబు
మధురకావ్యంబు వ్రాసి పల్మారు దానిఁ-దానె తనలోనఁ జదువుసత్కవియుఁ బోలెఁ
బలుచని మొగిళ్ల చేతఁ గప్పఁబడి రేక-పిండుఁ బైఁబైకిఁ బఱచుసూర్యుండువోలె
వనతటంబున విహరింపవచ్చు విరహిబృందములఁ బట్టి పీడింప బెట్టిదముగ
నురుల దిక్కులఁ బన్నెడుమరుఁడువోలె-జీవితరహస్య మెఱిఁగిన జీవివోలె
దుఃఖములు దాఁకిచూడని దొరయుఁబోలె-తలఁచుచున్నట్టు లెవ్వరో! త్వర వహించి
పాటపయిపాట శరపరంపరగఁ దమిని-మఱచి విశ్వంబు గీతంబు మఱచి నిన్నె
మఱచి పాడుచునుందువు మరియు మరియు-నెంత పాడిన నించుకే నెలుఁగురాయ
దెట్టిపుణ్యంబు తొలిఁ జేసిపుట్టినావొ?-యంతకంతకు మధురమై యడరుఁగాని
పాడినదె పాడుచున్నను బ్రజలువిసుఁగ-కాదియందున విననట్లె యాదరింత్రు
తనివిదీఱక నీపాట వినఁగ మరియుఁ-'గో'యనుచు నిన్నుఁ గవ్వించి కూయుచుంద్రు
నిజముగా నదృష్టంబన్న నీది గాదె?

౪

భవ్యముగ మావిఁ గూర్చుండి పాడుచుండ-నీదుగీతామృతంబు ఘనీభవించె
నేమొ! లేకున్నఁ దద్రుచి మెట్లుగలుగు-మావిపండ్లకుఁ దీవెలుం ద్రావె నేమొ!
లేనిచో నేల? పువ్వులం దేనె లూఱు?-వాతములు మున్గెనో కానిపకుమందు
నంత చల్లఁగ వీచునే హాయిగదుర?

౫

నీదుమృదుళరవంబెల్ల నిక్కువముగ-గానమా? నూత్నదంపతుల్ కలసి చదువు
చారుశృంగారకావ్యమా? సహజమధుర-వాక్యమా? యీసకలమునా? ప్రతివచింపు
మాకు రాదేల? నీవలె మధురరుతము-ఏమహాత్ముల సేవించి యీదృశమగు
హృదయసమ్మోహవిద్య నార్జించినావు?

౬

వినఁగవినఁగ భవద్గానమును నపూర్వ-భాషయందున్న ప్రకృతికావ్యంబునందుఁ
గ్రాలురసఘట్టములను బారాయణంబు-సేయుచున్నట్లు నాకుఁ దోఁచెదవు పికమ!

నీవులేకున్న ఋతువులు నిశ్చయముగఁ-బ్రియుఁడుపర దేశముననున్న ప్రియలు సుమ్ము
నీవులేకున్న దేశంబు నిశ్చయముగ-వాక్కుపడిపోయిన సమగ్రపండితుండు.

---

# కలికాలపు కలివి

## యంత్రమానవుడు



యంత్రమానవుని మెదడు, కరణేంద్రియములు.

'ఆర్. జె. వెన్స్లె' అను నమెరికా దేశీయు డీయంత్రమానవనిర్మాణవిధానమును కనిపెట్టినవాడు. న్యూయార్కు నగరమున నిటీవల పెద్దసభయెదుట దీనిని ప్రదర్శించినాడు. టెలిఫోనులో మనమాజ్ఞాపించిన వివిధకార్యములను తనంతట నీయంత్రమానవుడు నిర్వహించినాడు. ఈ యద్భుతయంత్ర సామర్థ్యమును ప్రేక్షకులు విశ్వసించిరి.



'సైమను' సప్తకము - నడుమనున్న వారు సైమనుగారు

ఇందున్న దొరసాని సప్తకములో నొక్కరగు 'స్ట్రాత్ కోనా' గారి భార్య, వీరందఱి పేర్లు. సర్ జాన్ సైమను, అధ్యక్షుడు; వైకౌంట్ బర్న్‌హామ్, మేజరు ఆట్లీ, కర్నల్ లేన్‌ఫాక్స్, లార్డు స్ట్రాత్ కోనా, గా. కేడోగన్, హార్ట్సుహార్న్



౧. హెన్రీ ఫోర్డు — మోటారుకారులను కనిపెట్టిన అమెరికా కోటీశ్వరులు ౨. తామస్ ఎడిసన్ — గ్రామఫోను యంత్రమును కనిపెట్టినవారు వీరిద్దఱు బాల్యమిత్రులు. కరస్పర్శను కావించుకొనుచున్నారు.

## ౨. ధర్మవరము శాసనములు

మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు

ఒంగోలు తాలూకా ధర్మవరమున నన్నయ భట్టారకునికి పూర్వపు తెలుగుశాసనములు రెండు కలవు. ఇవికూడ 'నెల్లూరుమండల శాసనములు' అనుగ్రంథమున రెండవసంపుటము ౯౬౬-౯౬౭ పుటలలో నీయబడినవి. బట్టరువర్తు, వేణుగోపాలశెట్టిగార్లు శాసనములు తీయునాటికి ఈశాసనశిలలలో నొకటి ధర్మవరగ్రామమునందలి మల్లికార్జునస్వామివారి ఆలయము దక్షిణపుగోడ కాన్చియు, రెండవది ఆగ్రామము తూర్పుననున్న సర్వే నెం ౩౮౧ రు పొలమునను ఉండినవి. వీటిలో మొదటిశిలాశాసనము విజయాదిత్యునినాటిదనియు, రెండవది చాళుక్యభీమమహారాజుదనియు నే నూహించుచున్నాను.

ఇవి రెండునుగూడ తెలుగుభాషకు చాల ముఖ్యమైనవి. ఎందువల్లనన: విజయాదిత్యుని నాటిశాసనమంతయు 'గ్రాంథిక గద్య పద్ధతి' నుండి నాటిగద్యరచనముల ధోరణిని దెలుపుచున్నది. రెండవశిలాశాసనమున పద్యమును గద్యమునుగూడ గలవు. ఈ రెండుశాసనములును ఈవిధమున ఆంధ్రభాషాచారిత్రమునకు అత్యంతముఖ్యము లైననయినను ఇంతవఱకు భాషాభిమానులు కాని, పండితులుకాని వీటిని వలసినంతశ్రద్ధతో పరిశీలించి, పరిశోధింపకపోవుటవిచారకరము. ఇందుకు కారణము లేకపోలేదు. నెల్లూరుమండల శాసనసంపుటములలో ఈ శాసనములు రెండును పైనుంచి క్రిందికి వ్రాయుటకు బదులుగా క్రిందినుంచి పైకి వ్రాయబడి తలక్రిందుగా నున్నవి. అందువలన మామూలు మాదిరిగ జదువువానికి పంక్తి పంక్తికి అందు పొందు గానరాక శాసనములు అర్థముకావు. అదియునుగాక ఆసంపుటములలో నిచ్చిన యీ శాసనమూలములలో చాల యక్షరములు—ప్రతిబింబమున, స్ఫుటముగ లేక పోయిక కావచ్చును—విడిచివేయబడినవి. ఉన్న యక్షరములలో నైనను చాలతప్పులు పడినవి. ఈకారణమున ఈ రెండుశాసనములలో, పట్టుమని ఆరంభమునుండి కడవరకు ఒక్కపంక్తినైన పాఠమేర్పడుటలేదు. ఇటువంటిస్థితిలో నివి భాషాభిమానులయొక్కయు, పండితులయొక్కయు దృష్టి నాకర్షించకపోవుట వింతకాదు. వీటిలో విజయాదిత్యభూపతినాటి శాసనమునకు ప్రతిబింబమునుబట్టి దిమ్మకూడ చేయించబడి ఆగ్రంథమునందు ముద్రింపబడినను అది చాలచిన్నదిగ నుండుటచేత రాతిమీదనే అసలు చిన్నవిగ చెక్కబడ్డ అక్షరములు, అందు మరియు చిన్నవై దిమ్మనుబట్టి చదువుటకు అసలే తెలియరాకున్నవి.

ధర్మవరమునందలి యీ శాసనశిలలు రెండును ఇటీవల మ్యూజియమునకు వచ్చి

యుండుటచేత మంచి ప్రతిబింబములనుదీసి చదివినచో నెల్లూరుశాసన సంపుటములలో నిచ్చిన పాఠములకంటె మేలైనట్టియు, సరియైనట్టియు పాఠముల నిచ్చుటకు వీలుండునేమోయని వాటికికూడ ప్రతిబింబములను దీసి చదివితిని. తత్ఫలితముగనే సంపూర్ణముగ గాకపోయినను చాలవరకైనను శాసనపాఠము కుదిరి, వాటి ప్రాముఖ్య మెరుకపడి వాటిని మఱల ప్రకటింపవలసిన యావశ్యకత కలిగెను. ఇంతవఱకు ఎవ్వరును గుర్తించని విజయాదిత్య భూపతి నాటి శాసనమున చక్కని అద్భుతమైన గద్యమును, భీమమహారాజు శాసనమున ఇంతవఱకు ఎవ్వరును అనుమానించనైన అనుమానించని సీసపద్యమును దెలిసికొనినంతనే నాకు చాలసంతోషము కలిగినది.

కీ. శే. శ్రీ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణ రావు పంతులుగారి కోరికమీద గౌనర్మెంటు శాసనశాఖవారు అద్దంకి, ధర్మవరము శాసనములు మూటికి మఱల ప్రతిబింబములను దీసి, వారి శాసననివేదికలో వాటిని పునర్విమర్శించిరి. ఆవిమర్శనమును బట్టిచూచినచో వారి శాసనపాఠముల గొన్ని పొరపాటులు దొర్లి యుండవచ్చునని నాకు దోచినది; ఎందువల్ల ననగా వారి విమర్శనములలో నాశాసనపాఠములనుబట్టి నేనర్థము చేసికొన్నదానికి భిన్నమైన యర్థము స్ఫురించుచున్నది.[1]

మూడవ విజయాదిత్యునినాటి శాసనము

ఈ శాసనము తెల్లని పాలశిల మీద మామూలుగ పైనుంచి క్రిందికిగాక తలక్రిందుగ క్రిందినుంచి పైకి చెక్కబడినది. అందువలన శాసనములోని కడపటి దగు పదునోకండవ పంక్తి రాతిమీద నెగువ మొదటి పంక్తిగ గన్పట్టును. ఈపంక్తికిపైన అనగా శిల ఎగువ భాగమున అయిదు పడగల సర్పముయొక్క

1. శాసనశాఖవారి శాసన నివేదికలో (౧౯-౨౩) విజయాదిత్యునినాటి శాసనము (౧౯౨౨-౨౩ వ సంవత్సరపు శాసనములలో ౨౪౧ వ నెంబరుది; భీమమహారాజుశాసనము ౩౯ వ నెంబరుది. శాసన శాఖాధికారులు ఈధర్మవరము శాసనములలో ఉన్నదని వ్రాసిన పండరంగునూరుకాని, పండరంగవూరు కాని ఈ శాసనములలో దేనిలోను గానరాదు. విజయాదిత్యునినాటి శాసనమున బెజయరాజు పండరంగని, అల్లుమ పెద్ది పెర్గడను (ఏదో విజయమునకై) పంపినట్లు కలదని శాసనశాఖాధికారులు వ్రాసియున్నారు కాని శాసనమున నేను చదివినంతవరకు అట్టి యర్థమునచ్చు పంక్తులేవియు లేవు; పైగా అసలు పంపబడిన వాడే బెజయరాజు. అదియునుగాక శాసనమున అల్లుమపెర్గడ అనియే కలదుగాని అల్లుమ పెద్దిపెర్గడ యని లేదు. విజయాదిత్యునినాటి శాసనముచెక్కబడిన శిల చాలచెడిపోయినను చదువుటకు దెలియవచ్చు పంక్తులనుబట్టి అందు గొంత భాగమయినను పద్యమయమని శాసన శాఖాధికారులు వ్రాసిరి కాని అందు నాకు పద్యమెక్కడను గానరాలేదు సరికదా శాసనముననే అది 'గద్యంబుల' నున్నట్లు కలదు.

ఇక రెండవ శాసనమున బెజయ, గుణక్కేనల్ల పదములుండుట వలన శాసనశాఖాధికారులు దీనిని విజయాదిత్యునినాటిదిగ భావించిరి కాని "సర్వలోకాశ్రయ శ్రీ............క్యభీమ మహా రాజుల విజయరాజ్య సంవత్సరంబు"లని శాసనము మొదటిరెండుపంక్తులలోనే యుండుటచేత ఇది భీమమహారాజు శాసనమని నేను తలంచుచున్నాను.

శిరోభాగము చెక్కబడియున్నది. శాసన శిల దిగువభాగము విరిగిపోయి నందున శాసనము నందలి మొదటిపంక్తి చెడిపోయి శాసన ప్రారంభము కానరా కున్నది. పదునొకండవ పంక్తితో శాసనము పూర్తియగుట లేదు; అసంపూర్తిగ నున్నది. అందువలన శాసనశిల రెండవవైపునగూడ ఏదైన వ్రాతకలదేమో యని యిటీవల త్రిప్పిచూడగా దిగువభాగమున నాలుగుపంక్తుల వ్రాత కనబడినది. రాయికొంత బెల్లు ఊడిపోవుటచేత అక్షరములు కొన్ని పోయి ఆనాలుగుపంక్తులైనను పూర్తిగ పాఠమేర్పడుటలేదు. కానిఆపంక్తులలో శాసనముపూర్తియైనట్లు మాత్రము తెలిసికొనగలము. మొదటి ప్రక్కగూడ శాసనశిల పొరలుపొరలుగ లేచి పోవుటచేత అక్షరము లచ్చటచ్చట చెడిపోయినవి. కొన్ని యక్షరము లందందు అసలే పోయినవి.

లిపి : భాష

శాసనమంతయు చాళుక్యలిపిని వ్రాయబడి యున్నది. అక్షరములు గుణగ విజయాదిత్యుని తామ్రశాసనము లందలి యక్షరములనే పోలియున్నవి. ఎక్కడనో 'బ' మొదలైన ఒకటిరెం డక్షరములలోతక్క మిగిలిన శాసనాక్షరములకు అద్దంకిశాసనాక్షరములకు గూడ అంత భేదము కనబడదు. కాని యీలిపి అద్దంకిశాసనలిపికంటెను ప్రాంకముగ నున్నది. శాసనమున చాలచోట్ల 'శ' వర్ణమునకు 'స' వర్ణము వ్రాయబడినది.

శాసనభాషయంతయు తెలుగు. శాసన శిల రెండవభాగమునగల నాలుగు పంక్తులలో 'గద్యంబుల' అనియుండుటవలన శాసనమంతయు 'గద్యంబు'న వ్రాయబడినట్లు స్పష్టము. అది బిగువయిన సంస్కృత సమాసములతో నొప్పుచు ముచ్చటయిన మధురశైలి నుండి ఆనాటి 'గద్యరచన'కుదాహరణముగనున్నది. 'నెమియించి' యనునది నేమించు యొక్క రూపాంతరము.

శాసన కాలము

శాసనము మొదటి రెండు పంక్తులలో 'విజయాదిత్య పాదపద్మ భ్రమరాయమాన శ్రీమత్కడేయరాజు' అని యుండుటంజేసి యిది విజయాదిత్యునినాటిదని తలంచుచున్నాను. ఈవిజయాదిత్యు డెవరు?

వేంగీచాళుక్య శాసనములనుబట్టి మనకు కడేయరాజు అను పేరు గలవారలు ఇరువురు కలరని తెలియుచున్నది; ఒకడు మూడవ విజయాదిత్యుని సైన్యాధిపతి యగు పాండరంగని తండ్రి.

రెండవవాడు మూడవ విజయాదిత్యుని సోదర (యువరాజవిక్రమాదిత్య) పుత్త్రుడైన మొదటి చాళుక్య భీమమహారాజు శాసనములలో ఆజ్ఞప్తిగ వచ్చునతడు. మొదటి చాళుక్య భీముని బెజవాడతామ్రశాసనమున నత డిట్లు వర్ణింపబడియున్నాడు.

ఆజ్ఞప్తి రస్య ధర్మస్య
కడేయరాజః ప్రతాపవాన్;

పితామహో భవదస్య
పాండరంగః పరంతపః.[1]

ఇందువలన చాళుక్యభీమమహారాజు శాసనములలో ఆజ్ఞప్తిగనచ్చు కడెయరాజు పాండరంగని మనుమడని స్పష్టమగుచున్నది. మన శాసనమునందలి కడెయరాజు 'విజయాదిత్య పాదపద్మ భ్రమరాయమాను' డగుటవలన నతడు పాండరంగని తండ్రియైనట్లు నిశ్చయింప వచ్చును. పాండరంగని తండ్రియైన కడెయ రాజు విజయాదిత్యుని నిమిత్తము యుద్ధరంగమున దనప్రాణములను ధారపోసెనని విజయాదిత్యుని పోణంగితామ్రశాసనమున నిట్లుకలదు:

పరచక్రేణ యుధ్వాజౌ
దత్తప్రాణస్య భూభృతే
సూనుః కడెయరాజస్య
పాండరంగో గుణాధికః
విజయాదిత్య భూపాల
పాదపద్మ శిలీముఖః.[2]

ఈకారణములచేత మనశాసనమునందలి కడెయరాజు 'విజయాదిత్య పాదపద్మ భ్రమరాయమానుడు' కావున మనశాసనము మూడవ విజయాదిత్యునినాటిదని నిశ్చయింపవచ్చును; అనగా అద్దంకి శాసనమును ఇదియు సమకాలీనములే: క్రీ. శ. ౮౪౮-౮౯౨ నాటివి.

శాసన విషయము

శాసనమున మూడవపంక్తిలోని మొదటి రెండుమూడక్షరములు పోయినందున మొదటి రెండుపంక్తులకును తరువాతి శాసనమునకును గల సంబంధము తెలియవచ్చుటలేదు. ఇంతవరకు పోకుండ నిలిచియున్న శాసనమును బట్టి చూడగా ప్రారంభమున చాలపంక్తులు పోయియుండవలెనని తోచుచున్నది.

శాసనముయొక్క ఆద్యంతములు పోయినందున శాసనవిషయము విస్పష్టముగ దెలియవచ్చుటలేదు. ఏదియో ధర్మనిర్వాహణము చేయవలసియుండగా—గుళ్లు, ప్రాకారములు మొదలైనవి నిర్మించుట, కలశమెత్తించుట-ఇటువంటి ధర్మకార్యములు కాదగునేమో—అట్టిపనికి కా?డెయగారి కొడుకు బెజెయరాజు చాల సమర్థుడని అయ్యపయ్య, [?పెద] పండరంగులు, అల్లుమప్రెగ్గడలు, గిరణము పండరంగు—వీరందరు సమ్మతించి అతనిని పంపగా అతడు వెళ్లి బెజెయేశ్వరమున 'కలశ నిర్వాహణము (లేక ?నిర్వచనము)' చేసి గుళ్లు, ప్రాకారము, మఠము మొదలైనవి నియమించెనని ఇప్పటివరకు నిలిచియున్న శాసనము యొక్కభావమని నే నూహించుచున్నాను. బెజెయరాజుయొక్క యీ ధర్మకార్యములు తెలుపుటకే యీ శాసనము పుట్టియుండవచ్చును.

శాసనమున 'కలసనివ్వా-నంబునేసి' అని కలదు. అది 'నిర్వాహనంబునేసి' అనినైనకావదగును; లేదా, 'నిర్వచనంబునేసి' అనినైన కావదగును. 'నిర్వచనంబు' అన్నచో 'కలశ'ఎట్లుండ

---

1. Ep. Ind. V. P. 132

2. M. E. R. 3 of 190-09.

వలెనో దానిని నిర్ధారణచేసి, తీర్మానము చేసి అని యర్థము చెప్పుకొనదగును. మత సంప్రదాయములనుబట్టి కలశలలో భేదము లుండునని విందును. 'నిర్వచనంబు' కాక 'నిర్వహనంబు' అన్నచో కలశ ఏర్పాటు చేసి అని యర్థము చేసికొనవలసియుండు ననుకొందును. ఆకాలమున 'కలశ'కు ప్రాముఖ్య మెక్కువగ నుండినట్లు యుద్ధమల్లుని బెజవాడ శాసనము ననుసరించికూడ దెలిసికొనవచ్చును.

శాసనమున పేర్కొనబడ్డవారు

అయ్యాపయ్యాయు, [?పెద] పండరంగులును, అల్లయమ్రపెగ్గడలును, పండరంగును బెజెయరాజును శాసనమున పేర్కొనబడిరి. వీరి కొండొరులకు గల సంబంధము శాసనమునుబట్టి తెలియవచ్చుటలేదు. బెజెయరాజు మాత్రము 'పెగ్గడకా...గారి కొడు'కని శాసనమునగలదు. అతడుకా[?జెయ]గారి కొడుకు కాదగునేమో.-ఈకాజెయగారు ప్రెగ్గడ లనుట వలన -ఈయనయు, కజెయరాజును ఒక్కరే యగుదురేమో. అట్లయినచో నీ బెజెయరాజు పాండరంగని సోదరుడగును. విజయరాజు అనుదాని ప్రాకృతరూపమే బెజెయరాజు. ఎట్లయినను పాండరంగ, విజయరాజుల సౌదర్యమును గురించి నిర్ధారణగ జెప్పలేము. అయ్యాపయ్యా చౌషష్టికలావిశారదు డనియు, [?పెద] పండరంగులు సకల శాస్త్రార్థపారగులనియు శాసనమున జెప్పబడి యుండుటచేత ఆనాడు పేరు గొప్పపండితులని యూహింపవలసి యున్నది. ఇటువంటి పండితులచే ధర్మనిర్వహణోద్యోగమ్మునకు నియోగింపబడిన బెజెయరాజు కూడ చాల సమర్థుడై యుండవలెను. అతడు కూడ సమస్తరాజ్యభర నిరూపిత మహా మంత్రాధిపతి యనియు, మహేశ్వర పక్షపాతి యనియు దేవబ్రాహ్మణగురుభక్తిపరుడనియు, శక్తిత్రయ సంపన్నుడనియు వర్ణింపబడియున్నాడు. మూడవ విజయాదిత్యునినాటి సుప్రసిద్ధరాజకార్యప్రవీణులలోను, ప్రధాన రాజకీయోద్యోగులలోను బెజెయరాజు ఒకడుగ నుండవలె ననుట నిశ్చయము. బెజెయరాజు గుళ్లు, ప్రాకారము,మతమును గట్టించిన బెజెయేశ్వరము ధర్మవరమో తత్ప్రాంతగ్రామమో కాదగును. ఈ శాసనము ధర్మవరములోనే కనబడుటచేత ప్రాయికముగ నది ధర్మవరమే అయియుండవచ్చును. ఇటువంటి ధర్మకార్యములకు ప్రసిద్ధి కెక్కుట చేత ఆబెజెయేశ్వరమునకే ధర్మవరమను పేరు రూఢమయ్యె నేమో.

# మూ ల ము[1]

## (౧. మూడవవిజయాదిత్యునినాటి శాసనము)

### మొదటిప్రక్క

౧. ..................................[వి] జయాది [త్యపాదప]

౨ [ద్మ] భ్రమరాయమాన శ్రీమత్కడెయరాజు గుణగణాభరనుణ్ణు [ద]న

3. 'కౌనిఈస్వ(శ్వ)రున[కుం]గాత్రికేయుణ్డుంబోలెచౌషష్టికల(లా)విసా(శా)రదు[ణ్డ]

౪. య్న [అ]య్యపయ్యయు సకల[శా]స్త్రార్థ[పా]రగులయ్న పె[?ద]

౫. పణ్డరంగులు అల్లుమపెగ్గడలుంగర[న]మ్మునపణ్డరంగును ఈఢ

౬. మ్మని[ర్వ[హ*]నోద్యోగమ్మున[కు] బృహస్పతి సమానులయ్న పెగ్గడ కా[?డెయ]

౭. గారి [కొడు]కు [బె]జెయరాజు సమ[ర్థు]ణ్డని ఆత్మానృతంబునంబన్చినప్ర

౮. సా[దం]బని సమస్తరా[జ్యభ]రనిరూపిత మహామన్త్రాధిపతి [మ*]

౯. [హే]శ్వరపక్షపాతి దేవబ్రాహ్మనగురు[భ]క్తిపరుణ్డు స(శ)క్తి[త్రయ]

౧౦. సంపన్నుణ్డు మయ బెజెయరాజు బెజెయేశ్వరంబుగలన(శ) నిర్వ[?హ*]

౧౧. నంబుసేసి దిన(శ)గుడ్లుం బ్రాకారంబు మటంబును నెమియించి

### రెండవ ప్రక్క

౧౨. ...........[?బున్వా]...........వచ్చినవ(వా)రు

౧౩. ...........దంబు[సల్పి]నవ(వా)రుది......[ం]బుగద్యంబుల

౧౪. నలన(?శా)స్వ(?శ్వ)తంబు...........[యను]

౧౫. ఇ (ఈ) భూమిలోన

---

౧. నేనుతీసిన ప్రతిబింబము ననుసరించి.

# మూలము [౧]

## ౨. భీమమహారాజుశాసనము

౧. స్వస్తి సర్వలోకాశ్రయ........[క్ష్మ]భీమమహారా[జుల ౧*]

౨. జయరాజ్యస[ం*]వత్సరంబు...[?యే]నగునేణ్టి(ట్టి)ఉత్త[రా]యనస[ంక్రా*]

౩. [న్తి*]స్తితి ధమ్మావురమ్మున......[స్వస్త్య]నేకగు[ణ]గణాలంక్రి (కృ)త [స*]

౪. [మ*]స్తమహి(హీ)మణ్డలప్రకాశితకీర్తి శ్రీమా(మ)త్పణ్డరంగు॥ .[౩] ల .[౪] నె .[౫]

౫. స్నేలునలరామనిభుతోఁబనెడజె[నబో*]యల నడవిసా[?స్పె][।*]లోహాస[నం]

౬. బెక్కిరాహాను నొడిచిన వల్లభుకొల్పున నెల్ల నెఱుంగ[।*]కన్నరాభూ[పతి]

౭. వెన్నాజిలోం జూపె సంకిలా(ల)ణ్డను[?తే]ని [?బి*][ంక]ముడి[చా][।*] [ద]ణ్డ వైవచ్చిన [బెణ్డై]

తా.క. ౧. రాయి అరిగిపోయినప్పటికి, స్వల్పముగ పొరలు లేచిపోయినప్పటికి, గంట్లు పడినప్పటికి సుస్ఫుటముగ గాకపోయినను ఒకవిధముగా నైన కనబడు అక్షరములు ఈ [ ] కుండలీకరణమున జూపబడినవి.

౨. తప్పుకాని సరియైన ఈపదములు ఈ ( ) కుండలీకరణమున జూపబడినవి

౩. మూలములో లేనివి ఈ [*] కుండలీకరణమున జూపబడినవి.

---

౧. నేను తీసిన ప్రతిబింబము ననుసరించి. ఈశాసన వివరములు రాబోవు సంచికలో ప్రకటింపబడును.

౨. 'పదియేనగు' అనునేమో.

౩. ఈయక్షరమున పత్వము కలదు: అసలు అక్షరము 'ద' అనునో యేమో. తలకట్టు స్ఫుటముగ గనబడుట లేదు.

౪. ఈవర్ణము 'మా' వలె నున్నది. 'మా' కూడ కావచ్చు.

౫. ఇచ్చట 'న' వర్ణమునుబోలిన గుర్తున్నదని అనుమానము. తలకట్టు కనబడుచున్నది. అసలు అక్షర మేదో స్పష్టముగ జెప్పలేను.

౬. ఈవర్ణమును మొదట 'స్తే' గ చదువవలెనేమో అని అనుమానించితిని కాని పదునొకండవ పంక్తిలోని 'నల్లాతణ్డయ్య' లోని 'న' వత్తుకూడ ఇట్లే యుండుటచేత ఇది 'స్నే' అనుననియే నిశ్చయించితిని.

౭. ఇచ్చట రాయి పొర లేచిపోవుటచేత ఈయక్షరము 'స్పె' అనునో కాదో నిశ్చయముగ జెప్పలేను కాని పోలిక అట్లే యున్నది.

౮. [న*]చోటనిం జేకొనికాచె భూ[లోకం] బెలుంగ[।*] కిరనపురము డహాల ని

౯. రుతంబు దలెనాండు[।*] నచలపురము[?సొం-ి]చ్చె నచలితుణ్డు [।*] వల్ల భు

౧౦. ణ్డు గుణకెనల్లుణ్డు [వన్చి] నం[।*]బణ్డరంగ చూరె పణ్డరంగు॥ [?నాంబంర]ర[గిం*]

౧౧. నరెయమజెవొ నాన్ని నల్లాతణ్డయ్న అయ్యపరాజు తమ్ముణ్డు బెజెయ

౧౨. రాజు ఈపురము నీశానంబున గుడి నిల్పె నడియ ? సేంయకున్న సే.ి

---

౮. ఇచట 'లా' దీర్ఘము స్పష్టముగ గనబడుచున్నది. అయితే రాయిగంట్లలో ఎడమవైపు ఏదో కొమ్ము న్నట్లు తోచుటచేత అది 'లో' అని నిశ్చయించితిని.

౯. 'కి' ని అంటి దిగువ భాగమున క్రిందివైపు అర్థచంద్రాకృతిగ గీటు కనబడుటచేత దీనిని 'క్కి' గ చదివితిని. ఆయర్థచంద్రాకృతిచిహ్నము రాతిపగులేకాని 'క' ద్విత్వము కాదన్నయెడల దీనిని 'చేకి' గాగాని 'ఛకి' గాగాని చదువవచ్చును. ఈశాసనమున గుణింతమున ఎ, ఎలకు వ్రాతలో భేదము పాటింపబడలేదు.

౧౦. క్రింది సంయుక్తాక్షరము 'వ' వత్తు అయినచో మొదటిపంక్తిలోని 'సర్వ్వ' లోని 'వ' వత్తువలె నుండవలెను. అట్లుండనందున దీనిని 'కొల్పున' అని చదివితిని

౧౧ 'బింకముడిచె' అనుదానిలో 'బి' తక్క మిగిలిన వర్ణము లన్నియు ఏయస్ఫుటముగనైన అరిగిపోయి యు గాన్పించుచునే యున్నవి. రాయి మరిగియు, గంట్లు పడియు, పొరలు లేచియు చెడిపోయిన చోట్లనున్న యక్షరములను శాసనశిల దగ్గర గంటలకొలది కూర్చుండి నీటితో రాతిని కడిగి కడిగి గుర్తింప గలిగితిని.

౧౨. ఈయక్షర మేదో స్ఫుటముగ దెలియుటలేదు. సవర్ణమువలె నున్నట్లు తోచినది. తరువాతి యక్షరము 'చ్చె' అగుటచేత ఇది 'సొ' యగునని తలచితిని.

౧౩. ఈయక్షరము నిదానించి చూడగా 'నా' పోలిక నున్నది.

౧౪. ఈయక్షరము చాల చెడిపోయినది. దీని ఎగువభాగము 'బ' పోలిక నుండుటచేత దీనిని 'బ' అని వ్రాసితిని.

౧౫. 'గ' వర్ణము స్పష్టము. గుడిభాగమున రాయిపొర లేచినది. నిదానించి చూడగా ఆభాగమున గుడి యుండునేమో అని అనుమానము తట్టినది.

౧౬. 'స' వర్ణము స్పష్టముగ గనబడుచున్నది. ఏత్వ మున్నదా లేదా యని యనుమానము.

౧౭. ఇచ్చటినుండి మూడక్షరములు కలవు. మొదటిది 'చ' వలె నున్నది. తరువాతి రెండక్షరములు ఏవో తెలియరావు.

---

# ధర్మవరము శాసనము

రెండవప్రక్క




విజయాదిత్యునినాటిది

# ఆదిమాంధ్రులు

మంగిపూడి వెంకట శర్మ గారు

ఆంధ్రజనులార, నామాట లాగ్రహింప
కాలకింపుడు మీ కిందు మేలు కలదు
ఆదిమాంధ్రుల నికనైన నాదరించి
చేరదీయక యుండిన చేటు గలదు.

మనమతంబునందు మనినంతకాలము
గౌరవంబు లేని కారణమున
వార లన్యమతమువారల శరణంబు
జొచ్చి మనల వీడుచున్నవారు.

క్రైస్తవంబులోన గలసిపోయిరి లక్ష-
లాది మంది మనబలంబు తరుగ
ఇచ్చ గలిగె నేటి కిస్లాములో గూడ
జేరిపోవ తెలుగు సీమయందు.

వంచకులు గలరు కొందరు
పంచమనాయకులలోన వారివలన నే
మించును కలహము లిచ్చట
మించుగ కనుగలిగి మీరు మెలగగవలయున్.

హిందూమహమ్మదీయుల
యం దుదయంబైన కలహ మది దుర్భర మై
్రమందించు చుండె దేశము
హిందూక్రైస్తవుల కలహ మిక మన కేలా.

ఉత్తరహిందూస్థానము
మత్తతచే నాశ మయ్యె మతకలహముచే
నిత్తెలుగు సీమ నరు లా
యత్తము పడ నేల యట్టి యాహవములకున్.

మతకలహము మన తెలుగున్
క్షితి పుట్ట దటంచు నమ్మ జెల్లును యందం
ద తొలితల మెత్తగా లే
దె తిరిగి జని యింప వనుట ధీలక్షణమే.

నిప్పుకొండ పగిలి నింగియు నేలయు
నేక మైనదాక లోకమునకు
నిప్పుకొండ యునికి నేరరాని విధంబె
మొదట నీసమస్య బోధపడదు.

ఆదిమాంధ్రులు దేవాలయముల కరుగ
నుత్సహించుచు నున్న వా రొకటి రెండు
చోట్ల చెప్పియో చెప్పకో చొచ్చినారు
కాని యీకోర్కి ప్రబలంబు కాకపోదు.

మొన మొన్నను రాజోలున
నొనగూడిన యాదిమాంధ్రు లొకకొందరు చ
ర్చను నడపిరంట యిస్లా
మున కలియగ కొలమువారి బురికొలుపంగన్.

మనకనుల యెదుటనే సై
మను కమిటీ యండ జేరి మననుండియు చీ
లినవారి జూడమే యిం
కను నేమి నిదర్శనంబు గావలె నిచటన్.

ఆదిమాంధ్రు లనగ నన్నదమ్ములె కాని
తేరవారు కారు తెలిసి చూడ
వారి హక్కు లిచ్చి వారితోడున స్వరా
జ్యము గడింపరయ్య, యాంధ్రులార!

అలభారతు లందరిలో
తెలివి గలుగువారు తెలుగుధీరు లనుచు నీ
యిల యెల్ల బాగడ మీరే
తొలుత సనాతనులపొత్తు తొలగక నిలుడీ.

సమ్మెలు కట్టింపగ య
త్నమ్ములతో నున్నవారు నాయకులే కా
లమ్మున కెది పొసగునో యే
బాములున్నదో కాలగర్భమున నెవ డెరుగుః .

రాగల కష్టము ముందుగ
నే గనుగొని దాని దీర్ప నేరుచు శాంతో
ద్యోగులె సుఖించుచుందురు
బాగుపడరు దూరదృష్టి బడయని మూఢుల్.

ఆంధ్ర దేశమునందలి యాదిమాంధ్ర
వర్గముల కెల్ల గలుగు లోపమ్ము లరసి
బహుళ సౌకర్యములు గూర్చి భాయి యనుచు
నొండొరులు ప్రేమమెయి నొప్పచుండరయ్య!

---

# నేను నేను కాను

నాళము కృష్ణరావు గారు

[ఆంగ్లమున కనువాదము]

కేలం గోలయు నెత్తిపై మీలబుట్ట-పెట్టుకొని యేగె సంతకు వృద్ధురాలు;
కొంత సేపటి కామెకు కునుకు రాంగ-ఒరిగె నాబాటదరి నున్న తరువుక్రింద.

బండం డొక్కండు ముదుసలియండం జేరి-నున్నంగాం దలవెండ్రుక లన్ని గొఱిగి
మొగముమీందను దలనిండ ముగ్గు పూసి-బొగ్గుపొడితోడ నెడనెడ బొట్లు పెట్టె.

దృష్టిపిడుతను బోలి వికృతిని గొలుపు-నామెశిరమును బొడంగని యక్క-జమున
గుంపులుగం గూడి జను లెల్ల గొల్లు మంచు-కడుపు చెక్కలు గా నవ్వం గడంగి,రంత.

అలికిడికి నుల్కిపడి తోనె మెలంకువ గని-తలయు మొగమును జేతులం దడవికొనుచు
తల్లడంబును చిడిముడి మల్లడిగొన-మదినిం దలపోసె నీరీతి ముదివెలంది.

అమ్మచెల్లరో! యిది యేటియబ్బురంబొ?-నేను నే నగుదునో కానో? నేన యైన,
తోంకయూడించు నాకుక్క, కాక యున్న-మొఱిఁగి నామీందం గొకపెట్ట యుఱికి కఱచు.

ఇట్లు చింతించి ముదుసలి యింటి కరిగె,-బొంయి బొం యని యాకుక్క బొబ్బరించె;
ఉలికిపడి యామె వెనుకకు నొదింగి యొదింగి-'అక్కటా! నేను నేను కా' నంచు నేడ్చె.

---

# యశశ్శరీరు లగు దివాన్ బహదూర్

# కిళాంబి రామానుజాచార్యులవారు, M. A. B. L., D. Litt.

వేంకటనాథ వేదాంతదేశికాచార్యులు గారు

“ పౌరుషజ్ఞాన కీర్తులఁ బరఁగెనేని, వానిసంపద యొకపూట యైనఁ జాలు ”

"One crowded hour of glorious life, Is worth an age without a name." Scott.



మహా విద్వత్కవులును, విజయనగర మహారాజా వారి యాంగ్ల కళాశాలకును, (1887—1920) గీర్వాణ కళాశాలకును (1900—28) గత ప్రధానాచార్యులగు (Ex-Principal) శ్రీమత్కిళాంబి రామానుజాచార్యులవారు ఫాల్గుణ శుద్ధ చతుర్దశి సోమవారము నాఁడు (5 మార్చి, 1928) పగలు 12 గంటల 55 నిమిషములకు స్వర్గతులైరని తెల్పుట కెంతయుఁ జింతిల్లుచున్నాను. “ అనాయాసేన మరణం వినా దైన్యేన జీవనం ” మ్మను సూక్తికివీరులక్ష్యభూతులు; ఇట్లు41సంవత్సరములువిద్యా దానముచేసినమహనీయుని మఱియొక్కని భారతదేశమునఁ గానము. శిక్షావిధానమునఁ జండశాసనులు (Iron disciplinarian). సౌజన్యమునకు వీరు పెట్టినది పేరు. వీరికి వయస్సు 75 సంవత్సరములు. ఆంధ్రులలో వీరు భీష్ముని వంటివారు. ‘ సుకాలమువలె ’ మన పూర్వ పుణ్యాతిరేకమున నిట్టి మహనీయు లుద్భవించుచుందురు. వీరు చూపిన నందుకొనిపోవు నిశితధిషణాధురంధరులు. ఆంగ్లాంధ్ర గీర్వాణసాహితీనిష్ణాతులు. అపారప్రాచ్య విజ్ఞానసంపన్నులు. “ విద్యతోడుత వినయంబు నుదిరియుంట, పసిఁడికిని దావియబ్బిన భాతియగును.” అను సుభాషితమునకు వీరు ప్రబల లక్ష్యము. ఆంధ్రదేశమున నున్నత పదస్థులు, విద్యావంతులు నగు వారిలో వీరితో నాచార్యాంతేవాసి సంబంధము లేనివా రరుదు.

“ Some are born great, some achieve greatness, and upon others greatness is thrust.” ఈసూక్తిలోని “ Some achieve greatness ” అను భాగమునకు మన ఆచార్యులవారు ప్రబల లక్ష్యము. వీరు స్వయంకృషిచేతను, దమ యప్రతిమ ప్రతిభాపాటవము చేతనే యాదర్శ పురుషులైరి. “ It is nobler to become great than to be born great.” గుణలుబ్ధయగు లక్ష్మి సుగుణరాశియగు వీరి నాశ్రయించుటలో నేమి యాశ్చర్యము గలదు! సౌజన్యక్రీతయగు లక్ష్మితోపాటు వీరిని విద్యకూడ నాశ్రయించినది.

శ్లో. యత్రాస్తి లక్ష్మీ ర్వినయో నతత్ర
అ...గతో యత్రనతత్ర లక్ష్మీః;

ఉభౌచ తౌ యత్ర నతత్రవిద్యా
నైకత్ర సర్వోగుణ సన్నిపాతః.

ఈ సూక్తి వీరియంద సత్యమగుచున్నది.

శ్లో. పాండిత్యం ప్రథితాన్వవాయ జనుమః
ప్రాయః క్షమాం యోగినో
(దాక్షిణ్యం ధరణీపతేశ్చ) నియతం
దాతుః ప్రియం భాషణమ్;
విద్యాపారదృశో జనస్య వినయం
విత్తోన్నతస్యాపదం
సౌలభ్యం మహతశ్చ, హేమ సుమన
స్సౌరభ్య మాచక్షతే."

వేంకటాధ్వరి: ప్రద్యుమ్నానందనాటకము.

సువర్ణసుమమునకు సౌరభ్య మబ్బినరీతిఁ వైలక్షణములు శ్రీఆచార్యులవారియం దమరియున్నవి.

దుర్లభమగు సకారసప్తకముగూడ (సంప త్సరస్వతీసత్యం సంతానం సదనుగ్రహః, సత్తాసుకృత సంభార స్సకారా స్సప్త దుర్లభాః) వీరియం దొప్పియున్నది. వీరి పాండిత్యము సర్వంకషము. (Manysided or encyclopaedic) వీరికీర్తి దిక్కూలంకషము. ఈక్రింది శ్లోకముకూడ వీరియం దన్వర్థమగుచున్నది.

"శ్లో. నానామ్నాయపరిశ్రమం కలయతాం
నాస్త్యేవ శాస్త్రేషు ధీః;
సత్యో రప్యనయో స్తయో ర్నసులభా
సాహిత్యక్షతా సాహితీ;
అప్యేతాసు సతీషు నాస్తివినయో
నాచారభక్తిక్షమా
చాతుర్యస్సవ సాచసనతా
శ్చాలంబ్య ఖేలం త్యముమ్."

విశ్వగుణాదర్శము.

"శ్లో. సాధూనా ముపకర్తుం
లక్ష్మీం ద్రష్టుం విహాయసా గన్తుమ్
నకుతూహలకస్య మన
శ్చరితంచ మహాత్మనాం శ్రోతుమ్."

భట్టబాణుఁడు (హర్ష చరితము, III ఉ.)

ఈమహనీయుని చరిత్రము నించుక యరయుదము. వీరిది ఆత్రేయగోత్రము. వీరి వంశమునకు మూలపురుషుఁడు "కిడాంబి ఆచ్చాన్." ఈయన, విశిష్టాద్వైతమతోద్ధారకులగు శ్రీభగవద్రామానుజాచార్యులవారి యంతరంగశిష్యుఁడు. ఈ "ఆచ్చాను"నకుఁ బ్రణతార్తిహరాచార్యులని నామాన్తరము గలదు. ఈవంశముననే సుప్రసిద్ధప్రపన్నశిరోమణియు, గవి తార్కికసింహసర్వతంత్రస్వతంత్ర బిరుదాంచితులునగు వేదాంతదేశికులవారికి మేనమామయు, నాచార్యులునగు నాత్రేయరామానుజు (వాది హంసజలదాచార్యు) లవతరించిరి. శ్లేష యమకచక్రవర్తియు, సాహితీరత్నపటలీనికషాయమాణములగు విశ్వగుణాదర్శము, లక్ష్మీసహస్రము, కరిగిరి చంపువు, ఉత్తరరామచరిత చంపువు, శ్రీనివాసవిలాస చంపువు, ప్రద్యుమ్నానందనాటకము, సుభాషితకౌస్తుభము మొదలగు కావ్యములు రచించిన వేంకటాధ్వరి మహాకవియు నీవంశోత్పన్నుఁడే. ఇట్టి విశ్రుతాభిజన ప్రతిష్ఠగల వంశమున మన యాచార్యులవారు ప్రమాదీచ సంవత్సరమున (5 మే 1853) నవతరించిరి. వీరి నివాసస్థలము మొదటఁ బశ్చిమగోదావరీ మండలమునందలి పెంటపాడను నగ్రహారము వీరి జననీజనకులు సింగరంబా తాతాచార్యులు. అప్రతిమ ప్రతిభాభాసురలగు మన యాచార్యులవారు బాల్యముననే యాంధ్రమునను, గీర్వాణకావ్యనాటకాలంకార వ్యాకరణములయందును గూలంకష వైదుష్యము సంపాదించి, పదునాఱవ యేట నష్టావధానము, శతావధానము, నేడెనిమిది భాషలలో వ్యస్తాక్షరి చేయుట మొదలగు నశ్రుతదృష్టపూర్వ ప్రజ్ఞాపాటవముచేఁ బండితులఁ గూడ నద్భుత మున ముంచుచు నానందమునఁ దేల్చుచుండిరి. వీరేకసంథాగ్రాహులు. విద్వాన్ అభినవపండితరాయ మాడభూషి వేంకటాచార్యులవారు ('భరతాభ్యుదయ' రచయితలు) అవధానములు చేయుదురని విని, మన రామానుజాచార్యులవారుగూడ నతిబాల్యముననే, (లక్షణజ్ఞానములేని సమయముననే) యవధానములు చేయుటకుఁ బ్రారంభించిరఁట! ఇది మనకు విరుద్ధముగఁ గనుపించినను "పోప్" (Pope) అను నాంగ్లకవి ("I lisped in

numbers for the numbers came.") వాక్యము నుదాహరించినచో దప్పక దీని నొప్పుకొందుము.

వీరి పదునాఱవయేట వీరిజనకులు స్వర్గస్థులైరి. పిమ్మట, 1873 లో, వీరు జననితో విజయనగర గమనోన్ముఖులై వచ్చుచు, మార్గమధ్యమునఁ 'గడియ' గ్రామములో నాగి, నాఁటి పిఠాపురపు రాజావారగు శ్రీరాజా రావు వేంకటగంగాధర రామారావుగారి సన్నిధిలో నవధానము చేసిరి. అప్పుడు పృచ్ఛకులు ముప్పదియొవ మండుగు రగుటచేఁ గాబోలు శ్రీరాజావారు వీరికి 38 రూప్యముల నొసఁగి సన్మానించిరఁట. తరువాత వీరు విజయనగరమురాఁగా నీయవధాన పాటవమే యభినవ భోజుఁడగు నానందగజపతీంద్రుని కటాక్షము నాకర్షించినది. ఆవిద్యాభోజుని కటాక్షముచేతనే వీ రాంగ్లవిద్య నభ్యసించుటకు మొదలిడి, యొకసంవత్సరము లోపున (1874 లో) ప్రవేశపరీక్ష (Matriculation Examination) లో నుత్తీర్ణులైరి. తరువాతఁ జెన్నపురిలో F. A., B. A., పరీక్షలఁ గ్రమముగా విజయము గాంచి, 1880 లో నాంగ్ల గీర్వాణములలో M. A., పరీక్షలో నుత్తమ కక్ష్యలో నుత్తీర్ణులైరి. 1883లో B. L. పరీక్షలో లబ్ధవిజయులైరి. 1884 లో మహారాజు వీరి నాంగ్లకళాశాలకు (Vice-Principal) పదవియందు నియోగించిరి. 1887 లో నసదృశధిషణా సంపన్నులును విద్యాసాగరులునగు ప్రిన్సిపాల్ చంద్రశేఖరశాస్త్రిగారు దివంగతులు కాఁగా నాచార్యులవారాపదవి నలంకరించిరి. నాఁటినుండి 8-11-1920 వఱకు నింగ్లీషు కాలేజికిని, 1900 మొదలు 27, జనవరి 1928 వఱకు గీర్వాణకళాశాలకును వీరు ప్రధానాచార్యులుగాఁ బని చేసిరి. ఇంతదీర్ఘకాలము విద్యాసౌజన్యదాన మొనరించిన మహనీయుఁ డీభారతవర్షమున మఱియొకఁడు లేఁడు. 1894 మొదలు 1921 వఱకు వీరు చెన్నపుర విశ్వకళాపరిషత్తులో సభ్యులుగా (Fellow of the Madras University)నుండిరి.వీరుకొంతకాలము M. A.పరీక్షకుఁ (గీర్వాణశాఖకు)బరీక్షకులుగానుండిరి.1911లోఢిల్లీ దర్బారుదినమున వీరికి "రావుబహదూర్" (Rao Bahadur) బిరుదమును 1918 లో "దివాన్ బహదూర్" (Divan Bahadur) బిరుదము నొసంగఁబడినవి. ఈమహనీయునిఁ జెన్నపుర విశ్వవిద్యా పరిషత్తు తగురీతి సన్మానింపలేకపోయెను. ఆలోపమును దీర్చుటకై "యాంధ్రవిశ్వవిద్యా పరిషత్తు" నిరుడు వీరికి "సాహిత్య విద్యా ప్రౌఢసరస్వతి" (Doctor of Letters: D. Litt) యను బిరుదమును సమర్పించి ధన్యత నొందెను. ఈమహాశయుఁడు విద్యావ్యాసంగవ్యగ్రుఁ డగుటంజేసి యథోచితకావ్య సంతానముం బడయఁడయ్యె. నామరూపములు లేని సంస్కృతపు వీథిబడి నీమహనీయుఁడే యుత్తమ గీర్వాణ విద్యాలయముగా నొనరించెను. 1912 లో నిడుదవోలులో జరిగిన సారస్వతమహాసభకు, 1914 లోఁ గాకినాడలో జరిగిన యాంధ్రసాహిత్య పరిషత్తునకు, 1915 లో బ్రహ్మపురము (Berhampore) లో జరిగిన యాంధ్రభాషాభివర్ధనీ సమాజ వార్షిక సభకు నగ్రాసనాధిపత్యము వహించి వీరొసంగిన మహోపన్యాసములు, వీరి ప్రాచ్య విజ్ఞానద్యోతకములై యొప్పుచున్నవి. వీరు చెన్నపురము నుండి విజయ నగరమునకు వచ్చిన మొదటి సంవత్సరమున "తెలుగు హార్ప్" ("Telugu Harp") అను నాంగ్ల వార్తా పత్రికను స్థాపించి కొంతకాలము ప్రచురించి, పిమ్మటఁ గారణాంతరములచే నాపివేసిరి.

శ్రీ ఆచార్యులవారు రచించిన గ్రంథములు.

1. "వారన్‌హేస్టింగ్స్" చరిత్రమున కాంధ్రీకరణము. (Telugu translation of Macaulay's essay on "Warren Hastings")

2. "నిమ్నజాతియొక్క ప్రకృతస్థితి" "(The present condition of the Low Castes")

3. "మతవిద్య"("Religious Education")

4. "దేశభాషలు" ("Vernaculars")

పై మూఁడు నాంగ్ల వ్యాసములు.

5. 1907 లో శ్రీ బొబ్బిలిమహారాజావారిచే రచింపఁబడిన,

1. "రామాయణ మహాభారత విమర్శనము"

2. " హిందూ మతములు"

అను రెండు గ్రంథములకు నాచార్యుల వారాంగ్ధమునం జక్కని యుపోద్ఘాతముల వ్రాసిరి.

6. " శ్రీ ఆనంద గజపతి మహారాజ చరితము " (1911. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలోం బ్రకటితము.)

7. " బేకన్ " మహావిద్వాంసుని యుపన్యాసముల కాంధ్రీకరణము. (Telugu translation of " Bacon's Essays") ఇది యానంద దంతీంద్రుని కోరికపై రచింపంబడినది. ఈగ్రంథ మముద్రితము. కొన్ని యుపన్యాసములు " శ్రీరామానుజాచార్య స్మారకసంచిక"లో ముద్రింపంబడును.

8. " కవిత్వ తత్త్వవిమర్శనము " బ్రహ్మపురాంధ్ర భాషాభి వర్ధనీ వార్షిక సభలోం జదువంబడినది. ఇది ముద్రింపం బడినది. స్మారక సంచికలోం గూడం జేర్పంబడును.

9. " చీపాకు నామకోద్యాన వర్ణనము " ఇది 27 శ్లోకములు గల సంస్కృత ఖండకావ్యము. ఇది వీరు చెన్నపురమునం బట్టపరీక్షకుం జదువు దినములలో రచింపంబడెను. ఇది చెన్నపురైక దేశమును, రమణీయ రాజకీయమందిర సంశోభితమునగు "చీపాక్"(Chepauk) అను ప్రమదవన వర్ణనము.

శ్రీ ఆచార్యులవారి యాంధ్రగీర్వాణ కవితా ప్రాశస్త్య ద్యోతకములగు కొన్ని పద్యముల నీదిగువను ట్టంకించెద.

1. సంస్కృతము:—

" కాష్ఠాభిరాక్రాంత మదన్వతాపి<br>
హూమాతటైన్యార్ణవ సంగవత్యా,<br>
అనోకహాళీ విరళం తథాపి<br>
సుచ్ఛాయ మాక్రీడ మిదం చకాస్తే.

2. రథశకట తురంగా శ్రాంతియాత్రా సముద్యన్<br>
మృదులశబలపాం సుచ్ఛన్నపార్శ్వా వనీజా,<br>
తటనితత సుగంధా సాంద్రసౌ గంధికాట<br>
ధ్యుమకిరణవళత్సు ప్రాంశు మాహాసమూహా.

3. సవిధనిలయ హూణాస్త్రైణఖేలా ప్రసక్తాః<br>
బకమద కలహంసా స్పష్టవాణ్మాధురీ శ్రీః;<br>
దినముఖపరిఖేల ద్బాల సారంగ యూథా<br>
తనునమిత శరాసాకారిణీ భాతి పద్యా."<br>
—"చీపాకునామకోద్యాన వర్ణనమ్ " 5, 6, 7 శ్లో.

4. నగా స్సుమాగ్రాః కలనిస్స్వనాః ఖగా<br>
ధరా హరి ద్వస్త్రనిచోళితాంగీ;<br>
లోకో౽యమానంద సముద్ర మగ్నో<br>
వసంతమాసే పరివర్ధమానే!

II. ఆంధ్రము:—

5. "క. ఇదె వచ్చె వసంత దినం<br>
బిదె కోయిల గూయం దొడంగె నెల్లెడ సుమసం<br>
పదనగముల విలసిల్లెను<br>
మదనావృతమనుచు జగము మఱచెను దనుదాన్."

6. "గీ. కవివరు కవిత్వ ముత్తరుకరణి ముట్టం<br>
బరిమళం బియ్యవలెంగాని చెఱకు మాడ్కి<br>
నోట నిడి పండ్లు కటయని నొక్కంగాని<br>
రస మొకింతయు రాకున్న రమ్యమగునె."

7. "ఉ. కమ్మని తావిమట్టుం బర<br>
గన్ వికసించెడి పువ్వుమాడ్కిం జి<br>
త్తమ్మలరార మందగతిం<br>
దాగెడు వాయువుభంగి, మాఘమా<br>
సమ్మునం గంటి కింపొసంగు<br>
చంద్రునిరీతి, హిమానిబాధచేం<br>
దిమ్మిరిగొన్న యప్డు రవి<br>
తేజముపోలిక, హెచ్చుచీకటుల్<br>
గ్రమ్మినచోటం గాంతివిస<br>
రంబగు చంచలంబోలిం, దృష్ణచేం<br>
గ్రుమ్మరువేళ శీతల స<br>
రోవరతోయము భాతి, నెండలోం<br>
ద్రిమ్మరి శాంతి చెందినత<br>
రిన్ జెను మ్రాకులనీడపోల్కి ని<br>
క్కమ్మగ సత్కవిత్వ మన<br>
ఘా! ప్రముదాప్తినిజేయు నెల్లెడన్."

గ్రంథరూపమును దాల్చకపోయినను వీరి శ్లోకములు, పద్యములుఁ బరస్సహస్రములు గలవు; అందుఁ జాలభాగము గ్రంథస్థము కాకపోవుటచేఁ బ్రకృతము దుర్లభము.

"శ్లో. రూపసంపన్నమగ్రామ్యం
ప్రేమప్రాయం ప్రియంవదమ్;
కులీన మనుకూలంచ
కళత్రం కేనలభ్యతే."

ఈశ్లోకస్థ లక్షణము లన్నియు శ్రీఆచార్యుల వారి సతీమణియం దొప్పియున్నవి. అట్టి నారీరత్నము ధర్మపత్నిగాఁ బడసిన యాచార్యులవారిదా యదృష్టము, లేక యట్టిమహనీయునిఁ బతిగాఁ బడసిన యానారీమణిదా యదృష్టము? ఉభయులు నతిమాత్రాదృష్టవంతులు. ఆహా! గర్భశోకమనిన నేమో యెఱుఁగని దంపతులు! ఏమి వీరి యదృష్టము!

గుణరూప విద్యాసంపన్నయగు ధర్మపత్ని, జనకుని మఱపించు పుత్త్రిలు, సుశీలరూప విద్యాన్వితలగు కొమార్తెలు, సున్నతపదము నలంకరించు జామాతలు, ఓహో! ఏమి యీమహనీయుని యఖండపూర్వపుణ్య పరిణామము!

మా యాంధ్రగీర్వాణ సాహిత్య పరిషత్తువారు "శ్రీరామానుజాచార్యస్మారక సంపుటము"ను ("Sri Ramanujachariar's Memorial Volume") బ్రకటింపఁగను ప్రయత్నములఁ జేయుచున్నారు. ఆసంపుటమున మాపరిషదధ్యక్షులగు శ్రీమాన్ యీయున్ణి వేంకటవీరరాఘవాచార్యులవారు, శ్రీ రామానుజాచార్యచరితమును విపులముగా వ్రాసి ప్రకటింపఁదలఁచుట చేనిట నేను విస్తరింపనైతిని. ఆంధ్రమహాశయులు చేయూత నొసఁగినచో నీసంపుటము త్వరలోఁ బ్రకటింపఁబడును.

„ Self reverence, Self-Knowledge, Self-control,
These three alone lead life to Sovereign power".

—Tennyson

ఈసూక్తికి నాచార్యులవారు ప్రబలోదాహరణము. శ్రీఆచార్యులవారికి శ్రీమన్నారాయణుఁడు పునరావృత్తిరహితమగు మోక్షముం బ్రసాదించుఁగాక!

---

# విప్రయోగి విప్రలాపాలు

పండిత పురాణం సూర్యనారాయణ తీర్థులు గారు

విచిత్రనామా ! వినుము సరాగనేత్రుఁడ నయి-దివ్యదృష్టినిసైత మైతినిజుమన్న !
కనుక నే దూరమున నున్నకాంత నెదుటఁ-జూచుచున్నాను దివ్యచక్షుండఁ గానొ ?
అత్తరుణీవియోగములో - నిత్తెఱఁగున నేడు పొక్కుటే శరణ మ్మై
నెత్తికొని పోవు చచ్చిన - మిత్తి యిఁ కెన్నఁటికొ చెప్పుమీ నాకు సఖా !
మనసు నపుంసక మ్మనుచు మక్కువతోఁ బ్రియురాలి పాలికిం
జని యిటఁ దోడితె మ్మని వెసం దనుఁ బంపినఁ బోయి దానితో
డన గమియించుచున్నది కటా ! ఇదొ నామెద నీరుగాఁగఁ బా
ణిని నను మోసపుచ్చుటకె నిక్కముగా నటు వ్రాసె మిత్రమా !

ఆరమణీలలామ విరహమ్మున కంతగఁ జింత నొంద; బల్
దూరమునందె యుండి కడు దుఃఖిత యౌటకుఁ జింత నొంద; శృం
గారిణి వేగ వచ్చినది గా దని కుందను; గాని దాని సం
డారిన నిండు జవ్వన మహా! వృథయౌటకుఁ జింత నొందెదన్.

ఆ వెలఁదిని స్మరియించిన - జీవితమం దాస యెట్లు చిక్కునో చెపుమా;
ఆవెలఁది మఱచి బ్రదికిన - జీవితపున్ వ్యసన మేమి చేయు వయస్యా!

చిఱునగవుతోడఁ గించి - త్తరళము లగు కనులతోడఁ దనరుచు నా సుం
దరి నన్నుఁ జూచుచూపుల - నిరతమ్మును జూచుచుండు నిక్కముగ సఖా!

తదయోగమ్మునఁ బుట్టిన - మదనాగ్ని తదీయచింత మంటలచే న
న్నుదహించుచున్న దని యా - సదయాదాక్షిణ్యచెవి వెసం బడనిమ్మా.

రంకు కన్నుల నొప్పమరాళగమన - తనకటాక్షమ్ముచేత నే త్రాళ్ళఁ గట్టి
లాగినట్టులు నామదిన్ లాగికొనియె - నెంత మరలింత మన్న రాదేమి వింత!

సూర్యుఁడును జంద్రుఁ డున్నారు చుక్క లున్న-వగ్ని యున్నది దీపమ్ము లలరుచున్న
వెన్ని యుండిన నేమి యావన్నెలాఁడి - కన్నె లేమినిజగ మంధకార మయ్యె.

మండువేసవి మట్టమధ్యాహ్నసూర్యుఁడై కందింపుచున్నాఁడు చందమామ
దావాగ్నికీలలై దహియించెదున్ మేను మలయాచలపుమందమారుతమ్ము
సూదుల తోరణమ్మై దేహ మదరంటఁ బొడుచుచున్నది జాజిపూలమాల
ఉముకనిప్పును మించి యుడికించుచున్నది నింపైన మంచిగందంపుఁ బూత
చిమ్మచీకటి గాఁగఁ దోఁచెడు వెలుంగు-కటకటా! ప్రేయసీవియోగక్షణమ్ము
కల్పముగఁ దోఁచు దుర్దైవఘటనఁజేసి-ప్రాణ మారార! కొండంత భార మాయె.

ఆరమణి చన్నుఁగొండల-లో రకమగునగ్గి గలదు లోలత నెపుడున్
దూరముగ నుండి కాల్చును-సార మెఱిఁగి ముట్టుకొన్నఁ జల్లఁగ నుండున్.

అది తనకటాక్ష మిచ్చి నామదిఁ గొనినది-అన్న, నేఁ జిత్త మిచ్చి మారాగ్నిఁ గొంటి
నది యెటుల్ దానికడ వృద్ధి నందుచుండె-నటులె యిది నాకడను వృద్ధి నందుచుండె.

చాటుననె యుండి యావింత వేఁటకత్తె-భ్రూధనుర్వల్లరిని వక్రముగ నొనర్చి
శితకటాక్షాశుగములచే జిఱుకఁ గొట్టె-గటకటా, నాహృదయము నక్కటిక యేది.

ప్రకృతిచంచలమును గుర్తుపట్టరాని-దై యొసంగెడి నా చిత్త మట్టిదాని
నెట్టు కొట్టఁగలిగెనోక్కొ యించువిల్తుఁ - డొక్కసారిగఁ దనదు సర్వేషు లేసి.



కీ. శే: సింహా ప్రభువు

౧౯౨౮వ మార్చి ౫వ తేదినాడు కీర్తిశేషు లయిరి.




కృషీవలుడు

చిత్రకారుడు: శ్రీ వై. సుబ్బారావుగారు, రాజమహేంద్రవరము, ౧౯౨౮

మరునిజయలక్ష్మి జగదలంకరణ మైన - లేఁడికన్నుల యామాయలాఁడి యింక
నెపుడు దయచేయునో కదా కృపఁ దలంచి-ప్రాణ మల్లాడుచున్న దా జాణకొలఁకు.

భంజనమంజులమై తగు-కంజాతము నట్టె చూడఁగనె జ్ఞప్తికి వ
చ్చుం జంచలలోచనమై - రంజిల్లెడు నల్లముద్దరాలిమొగ మహా!

అద్దాని ముద్దుమొగమును - పెద్దకనుంగవయు రంకువీక్షణములు నేఁ
దద్దయుఁ దలఁచుచు నెట్లో-ప్రొద్దు గడపుచుంటి నిచటఁ బాలుపుగ సఖుఁడా!

నూనముగ నసహ్యమ్మే-యైనను తద్విరహ మది రసాయనమాయెన్
కానియెడ యుగాభ్యధికము-లై నెగడెడి యీదినము లహా! యెటు కడచున్?

యోగవియోగమ్ములను వి-యోగమె మంచి దని నేను యోజింతును సం
యోగమున నది యొకర్తె వి-యోగమ్మున లోక మంతయుం దన్మయ మహా.

దైవవశమ్మున నే నా-దేవి నెడసి యేడ్చుచున్నదినములలోనే
రావలెనా కట్టఁడి యగు - నీవర్షాకాల మార్తి యుగురోత్థింపన్.

ఆనారీమణి నాకు మ-హానందము విరహ మిచ్చినది గద యందున్
మానసము నేఁచు విరహ-మ్మానందమునలనఁ బోదు ప్రాణము సఖుఁడా!

ఆనెలంతయనెడిచెర్వులోన నాదు-స్వాంతమును గన్ను నొకసారి పడియెఁ జుమ్ము
మనసు బరు వౌటచే నందు మునిఁగిపోయెఁ - దేలికై గన్ను మీఁదనే తేలుచుండె.

అది కంటఁ బడిన మొదలుగ-మదనేషుభయమునఁబోలె మన్మానస మా
మదవతిని శరణు చొచ్చిన-యది యెంత మరల్త మన్న నది రాదాయెన్.

కంటియెదుటినుండి కాంత తొలంగదు - రాత్రి వేగిపోదు రాదు నిద్ర
మరుఁడు కొట్టుచుండు మాడ్చెడుఁ జందురుం-డార్తుల కెదురా సహాయసమితి.

ఆకృతి గలచోట గుణాల్ - పోకగ నుండు నని కవులు బొంకిరి కాదే
నాకోమలి నామనసును - గైకొని విరహాగ్ని చేతఁ గాల్చునె చెపుమా.

అష్టమీచంద్రవిభ్రాజ దళికదేశ - లేఁడికన్నుల నొప్పుపూఁబోఁడి సఖుఁడ!
అలరువిల్కాని నారాచయష్టివోలె - నామనస్సున నాటిన దేమి సేతు?

భగవత్కృపచే నా కా - మగువ దొరకెనేని దాని మాధవునట్టుల్
బిగికౌఁగిటఁ జేరుచుకొని - సొగసుగ హృదయమున నుంతుఁ జుమ్మా సఖుఁడా!

---

# ప్రపంచజ్ఞానము

కొత్తపల్లి సూర్యారావు గారు

ఈనడుమ నొకనాఁడు ప్రపంచజ్ఞాన మను పేరఁ బంచమహాభూతములను గూర్చి విచారించి పృథివీజ్ఞానము, ఆపోజ్ఞానము, తేజోజ్ఞానము, నీరీతిగా నైదాశ్వాసములలో నొకపుస్తకమురచింపఁ దలఁచి—ఈజగంబెల్ల నేనిమిత్తమై పుట్టినది. మనుష్యాది ప్రాణులకొఱకుఁ బుట్టినదా ప్రపంచము కొఱకు మనుష్యాది ప్రాణికోటి పుట్టినదా, దానికిదియేల దీని కదియేల—ఆకాశమువంటి ప్రాణులకొరకా యాకాశము కొఱకు మనవంటి ప్రాణులా—వీనికి వానికి నేమి సంబంధము—తేలెందుకు, పామెందుకు—అడవి ప్రాణులకొఱకా—అయినచో నందు సింహాది దుష్టమృగము లేల, దుష్టమృగముల నిమిత్తమే నా మృగములలో మృగములకు—సర్వ సామాన్యముగా నన్నింటిలో నైరమేమి మైత్రియేమి. నక్షత్రమండలము, గ్రహమండలము నివి యెవ్వరి కొఱకు, ప్రాణులకొఱకా? యేమిలాభము. ప్రాణులు నక్షత్రాది మండలముల కొఱకా? ఉపయోగమేమి. సృష్టియెట్లు కలిగెను. నిప్పు, నీరు నెట్లు కలుగుచున్నది. ఈరీతిగాఁ బంచభూతములం గూరిచి యొకకొంత—నానెట్టి పుస్తకము వలెనే యుండునట్లు రచింప నూహించి కొందఱు మిత్రులతోఁ జెప్పితిని. వినిన వారలలోఁ గొందఱు పద్యములు వలదని, పద్యములే యుండవలయునని, వచనమే కావలయునని—అది సులభశైలి నుండవలయునని చెప్పుచు వారివారి యూహలంబట్టి వానివాని యుపపత్తులం దెల్పుచు నా ప్రపంచజ్ఞానములో వలెనే వాదమునకు దిగిరి. అందుచేతఁ బీఠికా ప్రాయముగఁ గొన్ని పద్యములును, మిగిలినది వచనమును గూర్ప నుద్దేశించి సృష్టికంతకును శక్తిస్వరూపిణి జగదంబయే కారణమను నిశ్చయమున,

ఉ. అంబ, నుతింప శక్యమె త్వ
దద్భుతశక్తిని బ్రహ్మ విష్ణుఁడుం
ద్ర్యంబకుఁడుఁ భవచ్ఛిశువు
లట్టిరు లోకములెల్ల నీదు గ
ర్భంబున నెల్వడు న్మనుఁ గ
రంగును నట్టినె పుట్టగిట్టఁ జె
ప్పం బనియేమి కీటకము
వంటి ననుఁ శతజన్మ దుష్టునిఁ.

మ. జగదంబా, నియమింతు వీవు త్రిజగ
త్సంభార సంహారకా
ర్యగతిఁ దక్షుల వారె కర్తలని యా
హాలేశతఁ లోకమెం
చు గురుత్వంబు నియోగు లాత్మ వశమా
చుం దెల్పఁ దద్వాక్యము
ల్సుగమార్థంబులు నీపరోక్షమున ని
ల్వుఁ దాని నాజ్ఞాకృతిఁ.

శా. నీదాఁకం జనఁ దెల్లమా నిజము మ
న్నింతీవు నీబిడ్డలఁ
రాదారిం జననీక సందులను జే
ర్పన్వారికే లాభమో
మోదం బందఁగ లేరొ యీరసమె తా
ముం జెందు మోదంబులోఁ
బాదం బర్థము తగ్గునో యధికృతు
ల్పాటించు నేర్పట్టిదే.

ఉ. వావులు బాంధవమ్ము పర
భావము మిత్రత లేదు నీకు సం
భావన సామరస్యమును
వత్సలతాదులు నీదు నైజ మీ
ప్రావకు రాఁగ నందఱును
బల్లకి యెక్కిన మోచువారలే

రీ? వగలేదటంచుఁ గికు
రింతురు నీదు నియోగులెల్లరున్.

మ. కల డందు ర్జగదంబ నీదుసుమనః
కంజాళి కాంతుండు నీ
కలఘుత్వం బతఁడేల దేఁడు కలుగం
గానీ విరాడ్రూపుఁ డా
లలిగాకున్న నజాండమీనుదువె చె
ల్లా నీకు నీసాటియే
కలదే యన్యము మా తరంబె తెలియన్
గర్భంబు వర్జ్యంబులన్.

శా. ఈవేవాణివి నీవె లక్ష్మివిని, నీ
వేనీవు మాయంబ నీ
వే వాణీపతివి రమాపతివి న
య్యీశుండ వీవే యనం
గైవారం బెవఁడోపుఁ జేయుటకు
లోకంబెల్ల నీరూపమే
యై విశ్వేశ్వరి వైతి నిన్ననిన వాఁ
డౌ బ్రహ్మ విద్వర్యుఁడున్.

అను పద్యములం గూర్చితిని. మాగ్రామమును చెందు ర్తి వెళ్లి తిరిగి వచ్చునపుడు

మ. ఎటుపుట్టింతువో లోక మక్కడనె త
ల్లీ నీకు మాకంతరం
బెటుచూడం బెఱనోట లేదు కన నూ
హింపంగ దుస్సాధ్య మా
కిటు కెల్లం దెరచాటు చేసితివి ద
క్కన్ దాన నీమాన మ
క్కట చేనిడ్డ నెఱుంగ నేరమగుటం
గాపాడె మా మానమున్.

అనుదానిని మార్గములో నూహించుకొనుచు నడచు చుండ నపు డక్కడ దారిప్రక్కను దుమ్మచెట్లమీఁద నీక్రింది పురుగు గూఁడులు కనఁబడినవి. నా తలంపులో సృష్టిచమత్కృతి మఱింత యచ్చెరువు పుట్టించినది.

దీనిని పట్టుపురుఁగు కుటుంబములోఁ జేర్పఁజూచి తిని. న_త్తగుల్ల కుటుంబములోఁ జేర్చుట కెక్కువగా నుపపత్తులు కనఁబడినవి. పట్టుపురువుమాట రాఁగానే,



దానిచిత్రము. అవతారవిశేషము నన్నుఁ జిక్కులఁ బెట్టినవి. న_త్త స్వతస్సిద్ధముగా గుల్లలోనే పుట్టి దాని లోనుండి యీవలకు వచ్చుచు ముడుఁగుచు నుండును. తాఁజేలు కుటుంబమునకు నీకుటుంబమునకు భేదము న్నది. నాగ్రంథము పూర్తిగా రచించుటయే కలిగిన యెడల నందీభేదము చర్చింపఁబడును. దాని నేయాశ్వా సములో_అనఁగాఁ బృథ్వీజ్ఞానములోఁ జేర్తునో ఆపో జ్ఞానములోఁ జేర్తునో. మెట్టతాఁజేళ్లుగూడనున్నవి. ఇది యటుండనిండు. న_త్తగుల్లకుటుంబములో నేచేర్చి యీపు రుగును గూర్చి కొంత చర్చింపవలసి యున్నది. ఈపు

రగు నల్లచీమంత యుండును. కాలుసేతులు లేవు. పాత్రమునకు ఘృత మాధారమా ఘృతమునకుఁబాత్ర మాధారమా యనినట్లు పురుగునకుగూఁడా గూడునకుఁ బురుగా యాధార మనుశంక పుట్టును. కొన్ని పిట్టలు మామిడిచెట్టుమీఁది యొక కొమ్మలోని యాకు నింకొక కొమ్మలోని యాకును దొప్పవలెఁ జేర్చి యంటించి యందు గ్రుడ్లు పెట్టుచుండుట గలదు. ఆపనిలో ముక్కును గాలునుపిట్ట కాధారము. పైఁగా మగపిట్టయొక్కటి సాయపడును. కత్తితోఁ గోసినఁగాని విఱుగని ముండ్లు పెఱిచి పదిపండ్రెండొక్కచోటికిఁజేర్చి కాలుసేతులు లేని దెట్లు గానంటించును. దానినడుమఁ దానెట్లు కూర్చుండును? మూతిమాత్రమే మీదికాడుచుండును. తక్కినది గూఁటిలో నంటుకొని యుండును. ఇంతబరు వీడ్చుకొనుచు గొమ్మనంటుకొని ప్రాఁకుచు నాహారము సంపాదించుకొనుచుఁ గాలము గడపుచుండును. ఇట్టి పురుగులు కొన్ని నచ్చినవి కనఁబడినవి. ఎవరెస్టుశిఖర ప్రయాణముచేసి విశేషములు కనిపెట్టుచున్న వారివలె నేను నీపురుగువిశేషముకనిపెట్టవలయునని కొంతసేపు చెట్టుకడఁ గూర్చుంటిని. తెల్లవాఱుసరికి పొనులో నొకతీఁగ మూరెడు సాఁగును. దగ్గఱనుండి చూచుచున్న నెదుగుట కనఁబడదు. ఈతీఁగ సాఁగుటలోని రహస్యమువలెఁ గొనలుసాఁగుచున్ననాయుత్సాహ మీచిన్న పురుగు రహస్యము కనిపెట్టలేకపోయినది. దీనినెట్లు తెలిసికొందునా యని విచారించుచుండఁగా గొల్లప్రోలు రైలుబండికై వచ్చుచు దారిలో నిట్టివిచారములో దిగిన నన్నే కుటుంబములోఁ జేర్చుకొనవలెనో యని యున్మాదసహస్రములోనికి రావలసివచ్చినది.

ప్రజ్ఞాధురీణులగు పలువు రింతకుమున్నే దీనిని గాంచియే యుందురుగావున నెట్లు ముండ్లు విఱుచునో యెట్లు జోడించునో-ఇవి తుమ్మముండ్లసునా కావా, కావేని తుమ్మచెట్లమీఁది కేల రావలయును. యోజింపఁగోరెదను. కొందఱుమఁ దెల్పఁగా దీనితల్లి దీనినిగూర్చుండఁబెట్టి ముండ్లు చుట్టు నంటించునని చెప్పిరి. తల్లియు నట్టిదేకదా! ఊహలను గొట్టివేయక యోజింపఁగోరెదను. ప్రపంచములో నేవస్తువుగాని నిరుపయోగముగా సృష్టింపఁబడియుండదుగదా యిదియేమి యుపయోగము. అని యూహింపఁగా, నుపయోగము లేకపోలేదురా వెఱ్ఱివాఁడా నీ విద్దానిని బెద్దచేసి పత్రికలకుఁ బంపి నీ తెలివి వెల్లడిచేయుటకుఁ బనికిరాలేదాయని లోకు లనినట్లు తోఁచినది. ఇది సృష్టిలోని చిత్రమునా కాదా. ఒక్కదొర కోఁతులభాష నేర్చికొని వానితో మాటలాడినాఁడట. ఒక్కదొర మిడినల్లులను ముప్పదింటిని పెంచి వాని చేతులలో నిముడునట్లు తుపాకులు చేయించి పటాలము సిపాయిలచేతఁ జేయించినట్లు కవాతు చేయించినాఁడట. ఇవి సృష్టిచిత్రములలోఁ జేరునా చేరవా. అం దెంతసృష్టిచిత్ర మున్నది. యెంతమానవుని నిపుణత యున్నది. నిపుణత యెవరిచ్చినది. సృష్టియేగదా! నాగ్రంథమే వ్రాయుటకు మొదలిడి పూర్తిచేయఁబడియైనా దానిలోఁ జూచెదరుగాక. ఉన్మాదసహస్రమువలె నదియు జనాదృతిం గాంచకపోయినఁ బోవుంగాక; ఎవరియత్నము వారు మానరాదు.

తాము తాము చేయుచున్న పనులు తమకుఁ దమకు గొప్పనివలె నగపడును. కావున స్వల్పవిషయములవలెఁ బైకిఁ గాన్పించినను సృష్టిచిత్రములను గొన్నిటిని సంపాదించి పత్రికలకు నావలెనే పంపుచుండ వలయునని లోకమును గోరుచున్నాఁడను. కొందఱకైనవి క్రొత్తగా నుండకపోవు. అందఱకును గ్రొత్తయైనవిషయ మెవ్వరును దెలుపలేరు. పదిమంది యీవిషయమై పత్రికలలోఁ జర్చకు మొదలుపెట్టిరా, పత్రికాధిపతులును బ్రకటింప సాహసింతురు. మొదట నసహ్యించుకొనిన విషయము లిపుడెన్నెన్ని జనసామాన్యాదరముం గాంచి విరివిగాఁ బ్రకటింపఁబడుచున్నవో యెఱుఁగవచ్చును. అన్నిటికిని విమర్శ యుండవలయును. అన్నియుఁ బ్రపంచజ్ఞానములో నిముడునవియే.

---

# హృదయావేదనము

జనమంచి సీతారామస్వామి గారు

(సంపుటము ౫, సంచిక ౨ తరువాయి)

ఇలపయి మేము పుట్టుసరికెంతయుఁ బ్రేమను బాలమర్చిత
ల్లులకును, మమ్ముఁ బెంచుగతులుల్ స్ఫురియింపఁగఁజేసి నిత్యముం
జలుపుదు వింతయంతయనఁ జాలనిమేలును మాకు; కాని, మే
మలసులమై నినుం దలఁపమక్కట! కర్మమదేమొ! రక్షకా!

తనువు ననుగ్రహించితివి తావకసేవకుఁగాదె? కాని, నీ
కనికర మున్నఁగాని యెటుకల్గును మాకటువంటి భాగ్యమే
ననయము దుష్పథంబుననె యంధుఁడనై చరియించుచుంటి నా
మనవిని జిత్తగించి యిఁక మక్కువతోనను భక్తుఁజేయవే.

ఏరిని వేఁడకుండ దినమేగెడుసుస్థితి లేదటంచు, నేఁ
గోరిన గ్రంథముల్ కొనుటకుందగు విత్తములేదటంచు, సం
సారపయోధి నీదుటకుఁ జాలిన ధీరత లేదటంచు, వే
సారెదు నన్నుఁ బ్రోవఁగదె సత్ఫలదాయక! లోకనాయకా!

ఎక్కడఁజూచినన్ గపటమే యభివృద్ధిని జెందు నయ్యయో!
యొక్కఁడు లేఁడు నీతిమనుచుండెడివాఁ డొకవేళ నున్నచో
స్రుక్కవలెన్ దరిద్రతను సుంతయు నాదరమొంద లేక; నా
కక్కజమౌను యోగ్యుఁడగు నాతనిపాట్లు దలంప నీశ్వరా!

ఏయుద్యోగమొ చేయఁబూనకయె, తానెవ్వారిఁ బ్రార్థింపకే
మాయల్పన్నక యీ కలిన్ నరుఁడు సంసారాంబుధిన్ దాటలేఁ
డే యౌరా! యిటువంటి చిక్కఁబడుట నీలీలార్థమే? మైన, నీ
చేయీబాధఁ దొలంచు బాధ్యతయుఁ దండ్రీ! సర్వలోకేశ్వరా.

వచ్చు క్షణంబులోఁ దమకు వచ్చునవస్థ యెదో యెఱుంగ లే
కచ్చపుఁ జీకటిన్ మునిఁగి యారట మొందుచునుండియున్ గటా!
క్రచ్చర వాయుహర్మ్యములు కట్టుచు, సుక్కుచమూల్యకాలమున్
బుచ్చెదరేల వ్యర్థముగఁ బూరుషులెందఱొ లోకనాయకా!

అనుపమ మాధురీభరితమై, పరమాద్భుత శక్తియుక్తమై,
మునిజనకీర్తనీయమయి, భూరి యశోవిభవాభిరామమై,
తన రెడు నీదునామము సదా స్మరియించుచు, నీకు నిష్టమౌ
పనులనె నిర్వహించుచును వర్తిలఁజేయవె మమ్ము రక్షకా!

పరిపూర్ణంబుగ నిన్ను నమ్ముటె సుఖోపాయంబు; నైనన్ బ్రభూ,
పురుషుం డెప్పుడుఁ జేయఁగల్గు జతనంబుల్ సర్వముం జేసి నీ
కరుణన్ గోరవలెంగదా యనుచు నేఁ గర్తవ్యముల్ సల్పుదున్;
బరమాత్మా, కృషియెల్లఁ దప్పక ఫలింపం జేయవే యీశ్వరా!

---

# ఏగంటివారివచనము

దేవులకెల్లనుదే వగుపార్వతి దేవితల్లి మాకూ
కావునమాహేశ్వరుఁ డగు రుద్రుఁడు కన్నతండ్రి మాకూ
అరయగపూర్వాచార్యులునడపిన దదియెవ్రతముమాకూ
గరిమను గురు డొసగిన శివదీక్షయ కారణ మదిమాకూ
నిరతము భూతిత్రిపుండ్రము దాల్చుట నియమకంబుమాకూ
పురహరునేత్రోద్భవరుద్రాక్షలు భూషణములు మాకూ—దేవులకెల్లను.

ప్రతిదినమును శివతత్త్వవిచారము పరమార్థము మాకూ
క్షితి శివయోగీశ్వరజనగోష్ఠియు కీర్తన మదిమాకూ
అతిశయముగ లింగార్చన సేయుట యదియె వ్రతము మాకూ
అతులితపరమషడక్షరిమంత్రము ఆత్మజపము మాకూ—దేవులకెల్లను.

భవిజనకృతశాస్త్రజ్ఞానంబది పరిహార్యము మాకూ
ప్రవిమలషడ్విధలింగానుభవము భావార్పణ మాకూ
అవిరళలింగనివేదితద్రవ్యము అవధానము మాకూ
కువలయమున నేగంటీశ్వరుడే గురుదేవుడు మాకూ—దేవులకెల్లను.

---

# చిన్నిపువ్వుతేనె

[24-2-1816 తేదిని సర్వేయర్ జనరల్ మెకంజీదొరగారికి వారిగుమాస్తా పిఠాపురం సంస్థానపు గ్రామాదులలో శాసనచరిత్రాది విశేషవిషయములను సంపాదించడముకొరకు సంచరిస్తూ విచారించి వ్రాసిపంపిన యీ చిన్ని పూవుతేనెకైఫియతు "చెన్నపట్నం గవర్నమెంటు ఓరియంటల్ లైబ్రరి"లో 15-3-16 నెంబరు పుస్తకములో ఉన్నది. దీనిని సి. పి. బ్రౌనుదొరగారు లోకల్ రికార్డ్సు వాల్యూం 60 లో తిరిగి వ్రాయించినారు. మూలము కొంత చెదలుతినుటచే బ్రౌనుదొరగారి నాటికే కొంత వ్రాత చెడిపోయినది. రెండుపుస్తకముల ను సరి చూచి అక్కడక్కడపోయిన వాక్యములను కలయగూర్చి దీనినిక్కడ ప్రకటించినారు. ఇందులో చెప్పబడిన చిన్నిపువ్వుతేనె పిఠాపురసంస్థానమునతప్ప ఇతరత్ర ఎక్కడను కనబడదు, వినబడదు. పిఠాపురప్రభువులు దీనిని ఇప్పటికీ అతిజాగ్రత్తతో సేకరిస్తూ ఉంటారట! సర్వసాధారణముగా ఇది సమకూరదట!—

వే. ప్ర.]

రాజమహేంద్రనగరమునకు తూర్పుగా యిరవైక్రోసులదూరాన పిఠాపురం ఉన్నది. ఈపిఠాపురమునకు తూర్పుగా ఆరుక్రోసులదూరమునవుండే పొన్నాడ తొండంగి వేమవరం యీగ్రామాదులను యింకా కొన్ని మధిరాగ్రామములను అంటికోనఅనే ఒక అడివివున్నది. ఈకోన అనేఅడవి ఉత్తరదక్షిణాలుగా పొడుగు పది కోసులు ఉన్నది. ఈ అడివికి తూర్పున పావుకోశెడు దూరము వుండివుండడముగా సముద్రంవున్నది. ఈ అడివికి పడమరగా యీపైనచెప్పబడ్డ గ్రామములు పొన్నాడ తొండంగి వగయిరాలు, అడివిని పట్టివున్నవి. ఈగ్రామాదులకు తూర్పుగావుండె సముద్రముసందున యీకోన అనే అడ్విపెడల్పు అక్కడక్కడా మలుపులుగా క్రోశెడువెడల్పు కొంత అరకోశెడువెడల్పు కొంత ముప్పావుక్రోశెడు వెడల్పు యీలాగున వెడల్పు కలిగి పదికోసుల పొడుగు గలిగివున్నది. ఈకోన అనే అడివి.......................అనగా ఆవులు యెడ్లున్ను యివి గ్రామములలో వుండే పశువులకంటె మిక్కిలిబలముకలిగి వుంటున్నవి. ఇంతేకాకుండా కొమ్ములు తిన్నగా వంకరకాకుండా వుంటవి. కోనయందు మనిషిచప్పుడు వినగానే యీ అడివిగోవులు ఇంకా మనిషిదూరముగా వుండగానే లేళ్లుగంతులువేశి పారిపోయినట్టుగా పారిపోతున్నవి. ఇదిగాక యీ అడివియందు విస్తరించి దోమలు వున్నందువల్ల పగలు యీ అడివిగోవులు యీఅడివియందు తిరిగి అడివిలోవున్నగడ్డిమేశి యీఅడివిని అంటివున్న పొన్నాడ తొండంగి వేమవరం వగయిరా గ్రామాదుల చేలల్లో పడి చేలు మెయ్యడమున్ను కలదు. ఈలాగునపగలు అడివియందు సంచరించి రాత్రిళ్లు అడివిలోదోమలు వున్నందువల్ల అడివిలోపడుకోక సముద్రము సామీప్యముగా వుండివున్నందున సముద్రముదరికివెళ్లి కెరటాలు తగిలేటట్టుగా నీళ్లదరివిపరుండటవి. ఈలాగున సముద్రపుదరిని పరుండడమువల్ల మాటుకాచి చెట్లచాటునవుండి కల్కటర్లు మొదలయినదొరలు తుపాకిని వేశిచంపుతారు. ఈలాగున తుపాకితో వేశినప్పుడు ఒకటిరెండు పడడమున్ను............న్నవి. ఇదిగాక యీఅడవియందు వుండే వృక్షజాతముల పేర్లు, పుశిణిగిచెట్లు, దొర్నిగచెట్లు, గోల్గుచెట్లు. ఈచెట్లు చిన్నవి. పొదలుపొదలుగా ఉంటున్నవి. ఇవిగాక కుంకుడుచెట్లు అక్కడక్కడా విస్తారముగాగలవు. ఈ కుంకుడుచెట్లు మొదుళ్లు చుట్టువారుకొని వలయంపదిహేను

జానలు, పదిజానలు వుంటున్నవి. ఇదిగాక యీకోన అడివిని పాలవృక్షములు అతివిస్తారం కలవు. ఈపైని వ్రాశినవృక్షములు యెక్కువనయినా వుంటున్నవికాని యీ అడివిఅంతా పాలచెట్లు బహుమిక్కుటమై వున్నవి. ఈపాలచెట్లు మొదులు వలయంచుట్టువారుకొని యామైజానలవలయం గలవిగాకొన్ని నలభైజానలు వలయము గలవిగా కొన్ని ముప్పయిజానలు వలయముగలవిగా కొన్ని ఉన్నవి. ఈలాగంటి వలయములున్ను అతివిస్తారమైన పొడుగున్ను కలిగిన పాలవృక్షములు అనేకముగా అక్కడవున్నవి. ఈలాగంటి వలయముగల పాలచెట్లు మొదటియందు మాను రెండునిలువులపొడుగు కలవి కొన్నిన్ని నిలివెడున్నర పొడుగు కలవి కొన్నిన్ని ఉంటవి. ఈపాలచెట్ల మొదటిమానులు తొర్రలుగలిగి బోలుగా వుంటవి. ఈ అడివిలోవున్న పాలవృక్షములన్నింటికి మాని మొదటిలోపల తొర్ర వలయం చుట్టువారుకొని పదిహేనుజానలు కొన్నిన్ని పది: నలు ొన్నిన్ని కలవు. ఈతొర్రలు పొడుగు నిలివెడు నిలివెడున్నర కలిగివున్నందున మనిషి కులాసాగా కూర్చుండి వుండవచ్చును. ఇదిగాక యీలాగంటి వలయముగలవిన్ని లోపల విస్తరించి తొర్రలు కలిగివున్నవిన్నీ వృక్షములను ఈ అడివికి సామీప్యమయ్ని గ్రామానులవారు కొట్టి వరిపంటలు మొదలైన పంటలు పండేదినములయందు ఆపాలచెట్ల యొక్క మొదల్లుతొర్రలు వున్నందున ఘట్టిగా వుంటవి అని యేటికాలువలకేమి, చెర్వులకవములకేమి, తూములుగా వుండేబట్టు తీసుకునివచ్చి వేస్తున్నారు. ఈలాగంటి యీపాల అడ్వియందు బహువిస్తారమయినటువంటి తేనేతుట్టెలు కలవు. ఈ తేనెతుట్టెలు విస్తరించి కావడముచేతనున్ను యీ అడివియందు పుంకుడుచెట్లు వున్నందువల్ల కాయలు విస్తరించి కాయడముచేతనున్ను యీ కోన అడివికి పడమరను అంటివున్న పొన్నాడతొండంగి వేమవరం వగయిరా గ్రామాదులలో నివాసంగా కాపరం వున్నరహితులు మొదలయినవారేమి యింకా ఇతరమైనవారేమి యీకోన అడ్విన్నిపయిన వ్రాయబడ్డ గ్రామాదులున్నపల్లుకుబడిలోవుండె పిఠాపురం జమీంవారుడివద్ద యిజారాచేస్తున్నారు. యిజారా చాయడములో రెండేశి, మూడేశి సంవత్సరములకు యిజారాచేశి అడివిలో అయ్యే తేనె మరిన్ని పుంకుడుకాయలు వగయిరాలను గురించి యిజారాదారుడు అడివియందు తనతాలూకు మనుష్యలను వుంచి బందోబస్తుచేసుకుని పయినివ్రాశినతేనె పుంకుడుకాయలు యివిన్నియింకా అడివియందు పిశిణిగపండ్లున్ను, గొల్లుపండ్లున్ను పండుతవికనుక అవిన్ని లగుమాత్రము ఖరీదులకు అమ్మకోవడమున్ను కద్దు. పయిని వ్రాసినతేనె పుంకుడుకాయలు మొదలయినవి, యీఅడివి సమీపగ్రామాలకు యేమి, పిఠాపురము సామర్లకోట మొదలయిన కసుబాలకుయేమి పంపించి యిజారాదారుడు అమ్మకము చేయిస్తాడు.

ఈలాగంటి యీ అడ్వియందు చిన్నిపువ్వుతేనె అనే తేనె అయ్యేక్రమం.—ఈపైన చెప్పబడ్డ కోన అడివిలో తేనెతుట్టెలు పెట్టే తేనెటీగలలో చిన్నయీగలు గలవు. ఆ యీగలుపైన వ్రాశినపాలచెట్లలోపలవుండే తొర్రలలో గూండ్లుగా వుంటున్నవిగనుక ఆగూళ్లయందు యీచిన్నయీగలు నివాసము వుండడముకద్దు. మరిన్నీ ఈ కోన అడ్వియందు చిన్నిచెట్లు అనేచెట్లు గలవు. ఆచెట్లు నిలివెడుపొడుగు వుండీవుండడముగా ఉండును. చిన్నిచెట్టు మొదలువలయము జానెడు ఉండును. ఈ చిన్నిచెట్టు ఆకు జమ్మిచెట్టు ఆకు రీతిగానే వుండును. ఈచిన్నిచెట్టుకు చిన్నవిన్ని తెల్లనివిన్ని పువ్వులు గలవు. ఇదిగాక వరిపంటలు పండేదినములయందు వరిచేలు ఈనుతూవుండే సమయమందు వరిపువ్వారు అనే పేరుగల వరిపువ్వు వుంటుంది. పయినచెప్పబడ్డ తేనెటీగలలో చిన్నయీగలు యీవరిపువ్వారున్నూ కోన అడివియందువుండే చిన్నిచెట్లపువ్వున్ను తీసుకొనిపోయి కోన అడివియందువున్న పాలచెట్ల తొర్రలలో చిన్నయీగలు వుండే గూళ్లయందు ఉంచుతవి. ఈలాగున పాలచెట్ల తొర్రలయందు వున్న గూళ్లయందు వరిపువ్వారున్ను చిన్నిచెట్లపువ్వున్ను వుంచి ఆపైని తేనెటీగలలో ఈ చిన్న తేనెటీగల పిల్లలుపెడతవి. ఇదిగాక కోన అడ్వి యిజారాచేసిన యిజారాదారుడి తాలూకు అడ్వియందు పది అయిదుమంది పాకలు వేసుకుని కని

పెట్టివుండడముకద్దు. ఇంతేకాకుండా ఆషాఢమాసములోనున్ను మార్గశిరమాసములోనున్ను ఈ కోనఅడివి పలుకుబడిలో ఉంచుకొన్న పిఠాపురము జమీందారు తాలూకా మనుష్యులు ఆషాఢమాసములోనున్ను, మార్గశిరమాసములోనున్ను ఘాటువెళ్లి యీకోన అడ్వియందు వుండి యిజారాదారుడి తాలూకు అడ్వినిపాకలు వేసుక్కొనికావున్న మనుష్యులచేత పాలచెట్ల తొర్రలయందు యీ చిన్న తేనెటీగలు వుంచిన చిన్నిపువ్వున్ను, వరిపువ్వారున్ను యీచిన్న తేనెటీగలు పిల్లలుయెదిగి వరిపువ్వారు చిన్నిపువ్వులు తినకముసుపే చిన్న తేనెటీగలను కొట్టించి జాగ్రతచేయించి తీయిస్తున్నారు. ఈలాగున తీయించినదిన్ని తేనెటీగలలో చిన్న తేనెటీగలు పాలచెట్లయందు వుండే తొర్రలయందు పెట్టినదిన్ని చిన్నివరిపువ్వారున్ను చిన్నిచెట్లపువ్వున్ను కలిశిందిన్ని అదే చిన్నిపువ్వుతేనెవాడుక కలది. ఈచిన్నిపువ్వుతేనె అనేది యేలాగంటివంటే: సురేకారపువుప్పుపల్కుల వలెనే చిన్నచిన్నపల్కులుగా శేరుశేరున్నర తూనికగల గడ్డగట్టి తెల్లగా వుంటున్నది. ఇది అతిమధురమైన రుచిగలిగివుంటుంది. ఇది చైత్రమాసములోనేమి, వైశాఖమాసములోనేమి, నడివేసవికాలములో మనుష్యులు రెండుమూడు డబ్బులయెత్తు పుచ్చుకుంటే దేహమునకు మిక్కిలి చలవగలిగివుంటుంది. ఈచిన్నిపువ్వుతేనె అనేది సంవత్సరాన్కు రెండుసార్లు అవుతుంది. మొదట ఆషాఢమాసములో అయ్యే చిన్నిపువ్వుతేనె కొంచెము పల్చగా వుండడమున్ను రుచికరం అనగా విస్తరించి తీపికలిగివుండదు. ఇదిగాక ఆషాఢమాసములో యెన్మిది తొమ్మిది వీశెలు పర్యంతము అవుతుంది. జాగ్రత్తపెట్టితే అయ్యేస్థలములయందు ఈ తేనె యెన్మిది తొమ్మిది వీశెలు అయివుంటుంది గాని లేకపోతే అయిదు ఆరు నాలుగు వీశెలు అవుతుంది. ఇంతేకాకుండా ఆషాఢమాసమునందు నరిపంటలసమయము కానందున వరిపువ్వారువుండదు గనుక కోనఅడ్వియందు వున్న చిన్నిచెట్లు అనే చెట్ల పువ్వులుమాత్రమే యీచిన్న తేనెటీగలు తీసుక్కొనివచ్చి పాలతొర్రలయందు వుండే గూళ్లలో పెట్టితుట్టె చేస్తవి గనుక వరిపువ్వారు లేనందున ఆషాఢమాసములో అయ్యే తేనె గడ్డతక్కువగా కావడమున్ను వరిపువ్వారు లేనందున రుచి తక్కువగా వుండడమున్ను కలదు. మార్గశిరమాసములో అయ్యే చిన్నిపువ్వుతేనెకు యీమార్గశిరమాసమునకు లోగానే, కార్తికమాసములోనే వరిపంటలు పండేదినములు గనుకనున్ను యీకోన అడ్వికి సమీపముగా వున్న పొన్నాడ తొండంగివగయిరా గ్రామాదులందు విస్తరించి వరిపండుతుందిగనుక కార్తికమాసములో చేలు యీనుతూవుండే సమయమందు యీచిన్న తేనెటీగలు వరిపువ్వారు తీసుక్కొనివెళ్లి చిన్నిచెట్లపువ్వులతో కూడా తేనెతుట్టెలు పెట్టడముచేత మార్గశిరమాసంలో దొరికే చిన్నిపువ్వుతేనె బహుబాగా వుంటుంది. విస్తరించి మాధుర్యము కలిగివుండడమే కాకుండా మార్గశిరమాసములో అయ్యే యీచిన్నిపువ్వుతేనె గడ్డ మణుగు మణుగున్నర బాగా అవుతుంది ఈలాగంటి చిన్నిపువ్వుతేనె తేనె అనేవాడికమాత్రమెకాని తేనె వలె పల్చగానున్ను యెర్రగానున్ను వుండదు. పయినిచెప్పినప్రకారం గడ్డకట్టివుంటుంది.

ఈలాగున అడ్వియందు ఆషాఢమాసములోనున్ను, మార్గశిరమాసములోనున్ను ఘాటువుంచి చిన్నిపువ్వుతేనే మరియెవరిస్వాధీనముకాకుండా జాగ్రత చేయించి యీ కోన అడ్విపలుకుబడిలోకి వచ్చేపిఠాపురపు తాలూకా జమీందార్లయినరావువారు యీ చిన్ని పువ్వుతేనె తెప్పించుకొని యిక్కడవుండేటి యెవరెవరు దొరలకేమి యీపిఠాపురపు తాలూకా జమీందారుడి ముఖ్యముగా కావలశినటువంటి రాజబంధువులు మొదలయినవారికి యేమి తగుమాత్రము పంపించి లోతక్కువవారు ఖర్చుచేసుకుంటారు. ఈ కోన అడివికి సమీపముగానున్ను అడివికి పడమరగానున్ను వున్న పొన్నాడ తొండంగి వేమవరము వగయిరా గ్రామాదులయందు వరి మొదలయిన పంటలుపండుతుంది సరేకదా! తొండంగిలో విస్తరించి పుట్లతరబడి నువ్వులు పండుతవి. యీతొండంగికి సమీపముగావున్న గ్రామాదులవారేమి యింకా యీతొండంగి చుట్టుపట్టు తాలూకాల గ్రామాదులవారేమి యెవరెవరు వర్తకులు యీతొండంగివచ్చి నువ్వులు కొనుక్కొని యెక్కడెక్కడ కసుబాస్థలాలకు

5. 4- 15

రవానాచేసుకోవడముకద్దు. ఈకోన అడ్వి బహుదట్టమయిన అడివి. ఈలాగంటి యీకోనఅడ్వియందు పెద్దపులి నచ్చివుండను గనుక అడ్వియందు మిక్కుటముగా అడ్వీగోవులు సంచరిస్తువుంటవి. ఈఅడ్వీగోవులు వున్నందువల్ల అడ్వియందు తిరిగేమనుష్యులకు యెంతమాత్రము భయము లేకుండా నిర్భయంగా రాత్రిపగళ్లు సంచరిస్తూవుండడముకద్దు. ఇలాగంటి కోనఅడివిని యిప్ప కలపవాడ కలప, అద్యేవృక్షములు లేవు. గొప్పచెట్లుగా వుండేవి తుమ్మచెట్లు కొన్నిన్ని చింతచెట్లు వేపచెట్లున్ను కలవు. తలిమ్మా అంతా తుప్పఅడివి.

పైన వ్రాశిన చిన్ని పువ్వుతేసె అనేది జమీందారుడు మనసువుంటె అన్యులైనవారికి యిజారాకు యివ్వడము గాని లేకుంటే అమానాను వుంచి తామే జపుచేయడము గాని కలదు. అమానాను వుంచి జాగ్రతచేయించడమే తరుచుగాని యిజారాకు తరుచుగా ప్రతిసంవత్సరమున్ను యివ్వడము లేదు.

---

## అశాంతి

శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి గారు

కనికరము లేనిదుఃఖవేదనల సెగల-పొగల వెలిజిమ్ము వలపుటూర్పులభరమ్ము
మోసికొని నేను నాలోన మూల్గు కొనుచు_గాలివోలె సమస్తావకాశములను
ఎడతెరపి లేక తిరుగాడి బడలినాను.

దారుణపు జీవితంపు ఎడారిలోన-తీరని పిపాస నేదారి తెన్ను లేక
నేనె నాదుఃఖబాష్ప శోణితపుఘురుల-ఏవిసుగు వేసటలు లేక త్రావినాను.

కడుపు గాల్చెడుమండుటాకటను రేగి--కోర్కు లొండొంటినె గ్రసించుకొనెడుకొలది
ఒడ లెరుంగక కాలమృత్యువును నేనె-కొంచెముగ కొంచెముగ కబళించినాను.

కాని ప్రేమోన్మాదమైన నాయెదలోని బరువు-దీర న్నాబ్రదు కూపిరి తేరుకొనగ
కనికరపుచూపు చిరునవ్వు తునుకమైన-కటికకర వయ్యె పాడులోకాన నాకు.

ఏకడల మిన్ను మనుచుక్కయేని లేని-యీనభము క్రుంగి కూలిపోయెడువిధాన
కారుమబ్బులె కాదు చీకటులె కాదు-క్రమ్ముకొన నిమ్ము కరడులు గట్ట నిమ్ము.

వలపు తీపి యెరుంగని వట్టిరాతి-గుండె లోకమ్ము నిప్పులు గురియనిమ్ము
హృదయ మున్నంతవరకు నాప్రేమకాంక్ష-బ్రతికి యున్నంతవర కేడ్చి బ్రతుకుచుండు.
ఏ వెలుగు నన్ను తనదరి కీడ్చుకొనునో?-ఏ తలపు దారి జూపునో!...

---



శ్రీమతి వసుంధరాకన్య యం.ఏ.

సుప్రసిద్ధ సంఘ సంస్కర్తలగు బ్రహ్మశ్రీ, ఆదిపూడి సోమనాధరాయకవీంద్రుని పుత్రికయగు శ్రీమతి వసుంధరాదేవి చెన్నపురి ప్రెసిడెన్సీ కాలేజియందు రశాయన శాస్త్రమును చదివి యం.ఏ. పరీక్షయందు త్తీర్ణయాయెను. ఇంగ్లండునందు చదువుటకు మద్రాసు గవర్నమెంటువారు సం॥ 300 పౌనులచొప్పున మూడు వత్సరములు విద్యార్థివేతన మిచ్చిరి. దానిని గైకొని యీమె లండను నందలి బెడ్ఫర్డు కాలేజియందు రసాయన శాస్త్రమున బి.యస్.సి. పరీక్షకు చదువుచున్నది. ఈమె వయసు 22 వత్సరములు.



శ్రీ నాయగంకన్య, బి.ఏ., ఎల్.టి.

ఈమె క్రిశ్చియను కళాశాలయందుపాధ్యాయగానున్నది. ఈమె ద్రావిడ యువతి. చెన్నపురి కో-ఆపరేటివ్ అసిస్టంటు రిజస్ట్రారగు శ్రీ సి. డి. నాయగంగారి పుత్రిక. ఈమె ౧౯౦౮వ సంవత్సరం మార్చి నెలలో తంజావూరునందు జరిగిన యువమహాసభను ప్రారంభించినది.



శ్రీమతి అహమ్మదుషా,
యం. యల్. సి.

ఈమె సంయుక్తపరగణాల శాసనసభాసభ్యురాలుగా నియమింపబడిన ప్రథమ యువతీమణి. ఈమె భర్త యూరపునకు వెళ్లుచుండగా నాయన స్థానమున నీమె నియమితయైనది.



శ్రీమతి గుడిసేవనాగమణిదేవిగారు

కళావంతుల సంఘమునకు జెందిన గుడివాడ బోర్డు బాలికా పాఠశాలా ప్రధానోపాధ్యాయులగు శ్రీ గుడిసేన సుబ్బయ్యగారి సతీమణి. ఈమెయు స్వయముపాధ్యాయిగా నున్నది. సంఘసంస్కరణమున జాల కుతూహలముతో పనిచేయుచుండును. ఆంధ్ర భాషయం దీమెకు సుపరిచయముగలదు; పత్రికలయం దీమె యప్పుడప్పుడు వ్యాసములను కొన్నిగ్రంథములను వ్రాసినది.



శ్రీమతి పి. బి. కాలేగారు
యం.యల్.సి.

ఈమె మధ్యపరగణాల శాసనసభాసభ్యురాలుగా నియమింపబడినది.

## లలితభక్తుఁడు

కాశీభట్ట కృష్ణరాయశాస్త్రి గారు

తర్కము హెచ్చెఁ దప్పె మతి దైన్యము చిత్తమునందు నిల్చె నీ
యర్కసహస్రతేజ మది యల్పము నేనెఱుఁగ వృథాన్యసం
పర్కనిరర్థకాహమిక పట్టి యొకింతయు వీడిపోదు నే
మార్కొనలేను నిన్ను బ్రతిమాలెదఁ గావఁగదే జగత్ప్రభూ!
కూలితి ఘోరసంసృతిని గొబ్బునఁ బ్రోవుమటన్న దీనర
క్షాలలితుండ వాగజము నప్పుడు గావఁదలంచి వేగమే
మేలొనఁగూర్పవచ్చితివి మే నది చెమ్మటఁ దోఁగ నట్టు లీ
బాలిశుఁ బ్రోవరావలదు బంగరుమే నది కందునేమొకో.
నీదురూపము ప్రత్యేకనీలమేఘ-సన్నిభంబుగఁ గన్పట్టఁజాలునేమొ
నాదుప్రజలలో భూతసంతానమునను - బ్రేమపరమరూపంబు దర్శింపనిమ్ము.
శంఖచక్రహస్తముల లక్షణముగల్గి - యున్న నీరూపు పాస్యమై యుండుఁగాక
భూతజాతంబునందెల్లఁ బొలుపుమిగులు-నీయఖండరూపంబు సంధింతు నెడఁద.



## సారస్వతవిశేషములు

### 3. జయమంగళ

[వెనుకటి సంచిక తరువాయి—పే. ౫౦౨]

ఈ పేరుగల భిన్నభిన్న వ్యాఖ్యానములు పెక్కులు శంకరవిరచితములుగానున్నవి. ఆభిన్నభిన్న వ్యాఖ్యానముల భిన్నభిన్న మాతృకల గద్యలయం దిట్లు "శంకరవిరచితే, శంకరార్యవిరచితే, గోవిందభగవత్పాదశిష్య భగవచ్ఛంకరాచార్య విరచితే, శంకరపరివ్రాడ్విరచితే" అని వేఱువేఱువిధముల నాతనిపేరు చూపట్టుచున్నది. ఈగద్యముల వలన జయమంగళవ్యాఖ్యాత యెవ్వరో సరిగా తెలియరాదు.

'భట్టికావ్య' వ్యాఖ్యాన మొకటి 'జయమంగళ' అను పేరుగలది, మల్లినాథునివ్యాఖ్యానముసకంటె చాల పేలవమైనది కలదు. తద్వ్యాఖ్యాతపేరు పెక్కు మాతృకలయందుఁ బెక్కు తెఱఁగులఁ జూపట్టుచున్నది అతనికిఁ బాండిత్య మంతగా నున్నట్లు తోఁపదు. 'సాంఖ్య సప్తశతి' వ్యాఖ్యానమగు 'జయమంగళ' 'గౌడపాదుల' వ్యాఖ్యానముకంటెను, 'వాచస్పతి మిశ్రుని' దానికంటెనుగూడ కేవలము నికృష్టమయినదిగా నున్నది. గద్యయందు వ్యాఖ్యాతపేరు 'శంకరాచార్యు'డని యున్నది. వాత్స్యాయనుని కామసూత్రవ్యాఖ్యాన మగు 'జయమంగళ' యొక్కకర్తృత్వము తుదకు శంకరునికే ఆరోపింపబడినది. యశోధరుఁడు కేవలము వ్రాయసముమాత్రమే యయ్యెను. ఆవ్యాఖ్యానమున వ్యాఖ్యాత పెక్కువాఙ్మయశాఖలయందుఁ దనకుఁగల పాండిత్యాతిశయమును వెలయించియున్నాఁడు. కామందక వ్యాఖ్యానమగు జయమంగళ చాల ఉత్కృష్టమయినది. అందు వ్యాఖ్యాత యిపుడు రూపుమాసిన పెక్కు అర్థశాస్త్రగ్రంథముల యందుఁ దనకుఁగల చక్కని ప్రవేశమును చూపించినాఁడు.

'కౌటిలీయార్థశాస్త్ర' వ్యాఖ్యానమగు 'జయమంగళ' యిప్పటికి లభించియున్న నాలుగర్థశాస్త్రవ్యాఖ్యానములలో నుత్తమమయినది. అర్థశాస్త్ర, కామందక వ్యాఖ్యానములయందు సామాన్య గ్రంథభాగములు గలవు. వ్యాఖ్యానింపవలసిన విషయ మొక్కటేయగుటచే నట్లుండుట వింతగా నేరదు.

డాక్టరు గణపతిశాస్త్రిగారు 'కామందక' వ్యాఖ్యానము 'జయమంగళ' శంకరాచార్యునిదని చెప్పసంశయించి ఇప్పటివఱకు బరిశీలించిన వ్యాఖ్యానమాతృకలలో లేని శంకరవర్యునిదని చెప్పుచున్నారు.

ఇన్ని 'జయమంగళ'లును కేరళదేశమున వ్యాప్తిలోనున్నవి. అన్నియు నచ్చటనే లభించినవి. విమర్శకులకుగల సంశయమును దీర్చుటకై ఏకనామకములైన యీ భిన్నవ్యాఖ్యానముల కర్తలు పూజ్యపాదులగు శంకరాచార్యులు ఒక్కరే అనఁబోకుండుటకై కేవలము వ్యాఖ్యాతయేకాక 'గోవిందభగవత్పాద' శిష్యులనగు శంకరాచార్యుల కొఱకు కేరళదేశ గ్రంథములఁ బరిశీలింపవలసియున్నది. అట్టివానిని గనుఁగొన యత్నింతము.

వాత్స్యాయన కామసూత్ర వ్యాఖ్యానమున

రక్తజాః కృపయ స్వాత్మోః

.......... యథాబలమ్.

(కామసూత్ర:—౧, భా. ౨.)

అనుదాహరణమువలన పదవశతాబ్దమువాఁడను కొక్కోకుని యొక్క 'రతిరహస్య' ముట్టంకింపబడినది. ఈకొక్కోకుఁడు 'నాగరసర్వస్వ' కారుఁడను 'శాక్యభిక్షుని' కన్నఁదరువాతివాఁడని నాతలఁపు. కావున వాత్స్యాయనసూత్రవ్యాఖ్యయను 'జయమంగళ'నుపదియవశతాబ్దమునకుఁ దరువాతిదానినిగా నిశ్చయింపవచ్చును. 'పాతంజలయోగదర్శనము' యొక్క 'వ్యాసభాష్యము'పై 'యోగభాష్యవివరణ'మను నొక వ్యాఖ్యానము గలదు. అది గోవిందభగవత్పాదుల శిష్యుడగు శంకరాచార్యులు రచియించినది. ఒకానొక గద్యమున నావ్యాఖ్యానమునకు 'భగవత్పాదీయ'మను పేరును జోడకట్టుచున్నది. కాన శంకరులే ఇన్ని 'జయమంగళ'వ్యాఖ్యానముల కర్తయగునను భ్రమ పాఠకులకు జనియింపవచ్చును. 'భాష్యప్రదీప'మను పేర శంకరాచార్యకర్తృకముగానున్న 'శాబరభాష్య'వ్యాఖ్యానమొకటి యిటీవలనే లభించినది. ఒకానొక గద్యము దివరసంక్తిని బూర్తిచేయుటకుఁ గాను, వ్రాయసము 'పయ్యూరు భగవత్పాదవిరచిత'మని వ్రాసియున్నాఁడు. ఈగ్రంథము పదుమూఁడు పదునాలుగుశతాబ్దముల మధ్యకాలముననో తరువాతనో కేరళమునఁ బ్రఖ్యాతిగాంచియుండిన 'పయ్యూరిపట్టేరి' వద్ద నుండినదిగా నుండును. కావున 'భాష్యప్రదీపము' 'పయ్యూరు' కుటుంబమునకుఁ జెందిన శంకరాచార్య విరచితమని నిర్ణయింపవలసియుండును. 'యోగభాష్యవివరణము' ఎల్ల దర్శనములయందును వ్యాఖ్యాతకు గలపాండిత్యప్రకర్ష నుబ్రసరించుచున్నది. మఱియు వ్యాఖ్యాశైలిని, రచనావిధానమును బరికించినచో 'భాష్యప్రదీప' కారుని రచనము వలెనే చూపట్టుచున్నది. దీనిని బలపఱుచుట కొక యుదాహరణము.

పయ్యూరు వంశమున, 'ఋషి'యను పేరుగలపండితుఁడొకఁడుండెను. అతనికి 'మీమాంసక చక్రవర్తి' యను నామాంతరముగల 'పరమేశ్వరుఁ'డను పుత్రుఁడుండెను. ఆతని నామమును 'ఉద్దండుఁ' డతివినయముతోఁ దన 'కోకిల సందేశ'(1) 'మల్లికా మారుత'(2) ములయందుఁ జేర్కొన్నాఁడు. ఈ పరమేశ్వరుఁడు పెక్కు మీమాంసా గ్రంథములకు వ్యాఖ్యానములను రచియించియున్నాఁడు. అవి 'కాశిక' 'మండనమిశ్రస్ఫోటసిద్ధి' 'శాబరభాష్యము' 'న్యాయకణిక' తత్త్వబిందు మొదలయినవి. మండనమిశ్రుఁడు 'స్ఫోటసిద్ధి'లో ౨౬ వ శ్లోకముక్రింద 'కుమారిలుని' 'శ్లోకవార్తికము' నుండి కొన్ని (౭౧౨-౭౧౪) శ్లోకముల నుదాహరించినాఁడు.

వానిని వ్యాఖ్యానించుటలోఁ బరమేశ్వరుఁడు ప్రాచీన పాఠమును బురస్కరించుకొని ప్రధానచర్చను మార్చుచున్నాఁడు. ౭౧౩ వ శ్లోకమును గూర్చి యాతఁడిట్లు నుడువుచున్నాఁడు.

"తత్పూర్వం ప్రతిపాదనాదితి పాఠో రత్నాకరకాశికయోః। నిబంధనకారేణ తు 'పూర్వం తత్ప్రతిపాదనాదితి' పాఠోఽంగీకృతః। గవాదేః పూర్వం గకారాదేః ప్రతిపాదనాదిత్యర్థః వ్యాప్తిస్తు యత్పూర్వం యత్ప్రతిపాద్యతే తత్తస్య ప్రతిపాదకమ్. యథా: ప్రదీపారోహణం ప్రతిపాద్యస్య ఘటస్యేతి పూర్వవద్దృష్టవ్యా. ౨౬ వ శ్లోకముయొక్క వృత్తియందు మండనమిశ్రుఁడు 'పూర్వం తత్ప్రతిపాదనాత్' అనుపాఠమును బఠించినాఁడు. ఉంబేకుఁడు సైతము తన 'శ్లోకవార్తిక' వ్యాఖ్యానమున నదేపాఠమును గైకొన్నాఁడు. తరువాతికాలమున 'భర్తృహరికి' విరుద్ధముగ మీమాంసకుల గౌరవమును కాపాడుటయందుఁగల కొన్ని యుపద్రవములచేతఁ బాఠాంతరము కైకొనఁబడి యుండవచ్చును.

ఇచట పరమేశ్వరుని వ్యాఖ్యానము 'స్ఫోటసిద్ధి' మతమును సమర్థించుటలో 'స్ఫోటసిద్ధి' యొక్క మతమును, సమర్థించుచున్న 'యోగభాష్య వివరణ' మతమునే మౌనముతో నంగీకరించుచున్నది. కాని, శంకరుఁడు, తన 'శారీరకభాష్యము' నందలి దేవాధికరణమునఁ దన్మతమును నిరసించుచున్నాఁడు. ఈ విమర్శాసామ్యము యోగవివరణమునఁ జెప్పినట్లు తన పినతండ్రియో లేక ఆచార్యుఁడో అగు శంకరాచార్యుని

(1) తస్మీమాంసాద్వయకులగురోః సద్మ పుణ్యాం మహర్షేః.

(2) ఉక్తంచ మీమాంసక చక్రవర్తినా ఋషిపుత్ర పరమేశ్వరేణ.

యభిప్రాయములచేఁ బరమేశ్వరుఁడు ప్రేరితుఁ డయ్యె నను నమ్మకమును గట్టిపఱుచు చున్నది. మఱియు శంకరాచార్యులు పరమేశ్వరునికి, విద్యాగురువును అగుచున్నాఁడు యోగ భాష్య వివరణమున (చెన్నపుర ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారమున నున్న మాతృక ౨౮౧ వ పేజి చూచునది.) 'స్ఫోటసిద్ధి' కనుకూలముగా నున్న పాఠములతోఁ గూడిన శ్లోకములే వ్యాఖ్యాతము లయినవి. ఉదాహరణమునకై అందలి శంకరుని సూచన: 'తస్మాద్ద్వయమపి శ్లోక ఏకం పఠితవ్యః—ప్రతిషేధేత యః స్ఫోటం వర్ణధీ రమనంతరమ్; దృష్టబాధో భవేత్తస్య శశిచంద్ర నిషేధవత్; వర్ణధీ వర్ణధీ రేసా,తజ్జ్ఞానానంతరోద్భవాత్.' పరమేశ్వరుఁడీసూచన ననుసరించి తనస్ఫోటసిద్ధి వ్యాఖ్యానమును సాగించినాఁడు. పరమేశ్వరుఁడు వ్యాఖ్యానించిన 'న్యాయకణిక' యం దొకగద్య మిట్లున్నది. "ఇతి శ్రీమదృషి గౌరీవందన శ్రీమద్భవదాస పితృవ్య శ్రీమచ్ఛంకరపూజ్య పాదశిష్య పరమేశ్వరకృతౌ, స్వదితం కరణ్యాం తృతీయః శ్లోకః"

మఱియొకచోట:

"కాలప్రత్యక్షతావాదమేనం వ్యాఖ్యా దృషేస్సుతః."

భవదాసపితృవ్యస్య ప్రసాదాదేవ కేవలాత్,
కాయవాఙ్మనసాం సమ్యక్ ప్రహ్వీభావేనశంకరే;
అన్యథా ఖ్యాతిభావేఽపి సవ్యాఖ్యాతుం సముద్యతః"

అని యున్నది. దీనినిఁ బట్టి 'శంకరులు' పరమేశ్వరుని బంధువులలో నొకరనియు, విద్యాగురువనియు తేలుచున్నది. మఱియు 'పరమేశ్వరుని' యెనమండ్రు సోదరులలో నొకఁడగు 'వాసుదేవుఁడు' తన 'శివోదయ' మను గ్రంథమునఁ దన వంశ వర్ణనము గావించుచు, నందు శంకరుఁడు తన పితృవ్యులలో నొకరని చెప్పినాఁడు. 'పయ్యూరు' కుటుంబమువారు వేదాంతశాస్త్ర ప్రవీణు లయినను . మీమాంసశాస్త్ర పునరుద్ధరణమును గూడ గావించిరి. ఇంచు మించుగ భాట్టప్రాభాకర మతములకు సంబంధించిన ఎల్ల మీమాంసగ్రంథముల నీకుటుంబమువారు వ్యాఖ్యానించి యున్నారు. పరమేశ్వరుని యింకొక సోదరుఁడైన నారాయణుఁడు మండనుని భావనా వివేక విభ్రమ వివేకములకు వ్యాఖ్యవ్రాసి యున్నాఁడు.

పరమేశ్వరుఁడు తనస్ఫోటసిద్ధివ్యాఖ్యానాంతమునఁ జెప్పిన ఈక్రింది శ్లోకమునందు పయ్యూరుకుటుంబమునకు మండనమిశ్రుఁడో అతని శిష్యుఁడో మూలపురుషుఁడుగ నుండవచ్చునని సూచించుచున్నాఁడు.

'మండనాచార్యకృతయో యేష్వాలిప్తంత కృత్స్నశః;
తద్వం శ్యేన మయా ఽ ఙ్వ్యేసారచితా౽౽ధ్యదేవతాః.'

అతఁడు 'తత్త్వబిందువున'కును వ్యాఖ్యానము వ్రాసినాఁడు. అతని మనుమఁడో చిదానందుని 'నీతితత్త్వావిర్భావము'నకు వ్యాఖ్యానము వ్రాసినాఁడు. అనంతము వాఁడైయైన 'విష్ణువు' అనునాతనిదగు 'నయతత్త్వసంగ్రహము'నకాతని జ్ఞాతియగు 'నారాయణుఁడు' వ్యాఖ్యను రచించెను. అతని పితృవ్యుఁడగు భవదాసుఁడు కల్పసూత్రగ్రంథములకుఁ బెక్కువ్యాఖ్యానముల రచించినాఁడు. ఇట్లు పరిశీలింపఁగా భాష్యప్రదీప, యోగభాష్య వివరణములు రెండును వాసుదేవో త్తరీతిని 'గోవిందభగవత్పాద' శిష్యుఁడగు శంకచార్యకృతము లగుట నిశ్చయము. అన్ని 'జయమంగళ' నామక వ్యాఖ్యలను మనము ఈ శంకరుని రచనములుగనే ఊహించుచున్నాము.

---

## తపస్వులా, రాజనీతిజ్ఞులా ?

శ్రీ టి. యల్. వాస్వానిగారి ఉద్రేకపూరితమగు నుపన్యాసమును 'వేదిక్ మేగజిను' ప్రకటించినది. జాతీయభాగ్యోదయ జాతీయ స్వభావములకును, బ్రహ్మచర్యమునకును పెక్కుతెఱఁగులగల సంబంధము నందు వివరించుచు వాస్వానిగా రిట్లనుడివిరి.

మనము భారతదేశ పునర్నిర్మాణము నెట్లు కావింపవచ్చును? అనుప్రశ్నమునే దేశమునందలి వివిధస్థలముల యువకులు నన్నుడిగిరి. పెద్దలగు మనరాజనీతిజ్ఞులలో కొందఱు- ప్రభుత్వమునుండి, గ్రేటుబ్రిటను నుండి

యధికారము నూడ జేరికొన్నచో నూతనభారతదేశనిర్మాణము కాగలదని తలచుకొందఱు - ఉండుట నేనెఱుగుదును. కాని నేనట్లు తలపను. రాయలు కమిషనుల యందును, కౌన్సిళ్ల చర్చల యందును, పార్లమెంటు పత్రములయందును విశ్వాసముగల వారు కొందఱుందురు. నావిశ్వాసము మాత్రము విభిన్నమైనది. తపశ్శక్తిచేతనే, నూతనభారతదేశవినిర్మాణము కాగలదని నేను వినయముతో మనవిచేయుచున్నాను. తపస్వులే కాని రాజనీతిజ్ఞులు విముక్తమగు భారతదేశమును నిర్మింపజాలరు. 'ఎల్లప్రపంచమునకు మహాత్మ్యందేశము నొసగగల భారతదేశము - ప్రపంచోపదేశకమగు భారతదేశము - భావికాలమున మానవసేవ కుపకరింపగల భారతదేశము - నిక్కముగ విముక్తమగు భారతదేశము క్రొత్త వెలయగలుగునది బ్రహ్మచర్యముయొక్కయు, పావనతాజ్ఞానములయొక్కయు, తపశ్చర్యయొక్కయు, శక్తిచేతగాని, రాజ్యాంగసభలయందలి చర్చలచేతగాదు; పార్లమెంటుసభలయందలి వివాదములచేతగాదు.' అని నేను విన్నవించుచున్నాను. కావున నాతుది పలుకులనాలకింపుడు:—మీరు మీతపశ్శక్తిని పెంపొందింపుడు. తపస్సు సకలప్రపంచములను సృష్టించెనని మనప్రాచీనగ్రంథము లుద్ఘోషించుచున్నవి. 'తొలుదొల్త ప్రపంచమే లేదు. అపు డనంతశక్తియుక్తుడగు నీశ్వరుడు తపస్సు చేసినాడు. దానివలన నెల్ల ప్రపంచము లుప్పతిల్లినవి'అను నీవిషయము నాగ్రంథములయందు మనము చదివితిమి. ఆతపస్సే నూతనజాతినిగూడ సృజింపగలదు. యువకవతంసములగుమీరు - దేశమందలి భిన్నభిన్న ప్రదేశముల వారలగు మీరు - బ్రహ్మచర్యముయొక్కయు, తపస్సుయొక్కయు శక్తితో పెంపునొందుదురేని, నూతనభారతదేశము-విముక్తభారతదేశము-సంప్రాప్తించు దినమునకై మనము చిరకాలము వేచియుండ నక్కఱ లేదని అప్పుడు నేను తలతును. తపస్సు, ఆత్మార్పణము, ధైర్యము, జితేంద్రియత, బ్రహ్మచర్యము, వీనియందే జాతీయాభివృద్ధికి మూలసూత్ర ముండునది.

'ఓ ప్రభూ! మమ్ము నుపహారముగా నంగీకరింపు' మని దైవమును ప్రార్థింప నెందఱు భారతీయయువకులు సముకట్టియున్నారని నన్ను నేను పలుమారులు ప్రశ్నించుకొంటిని. నామాటను నమ్ముడు. మాటలచేతను, సభలచేతను, పత్రలిఖితములగు ప్రతిపాదనములచేతను, నూతనభారతదేశనిర్మాణము కాజాలదు. 'ఓప్రభూ! మమ్ము నుపహారముగ నంగీకరింపు'మను ప్రార్థనములతో, నాశాపూరిత హృదయములతో నలరారు యువబ్రహ్మచారుయు, యువతపస్వులయు సమూహములచేత నూతనభారతదేశనిర్మాణము కాగలదు.

అట్టి యువకుల నీనాడు భారతమాత యాశించుచున్నది. దారిద్ర్యపరిపీడితులయి భారతదేశవిముక్తి నాకాంక్షించుచు, వారు ఒక్కచోటనుండి యింకొకచోటికి దేశమంతట ప్రసన్మరుదురు. గ్రామగ్రామమునకు సంచరించుచు అచ్చట తమయాగమనమునకు వేచియున్న ప్రజాసమూహమునకు భారతమాతయొక్కయు, భారతీయప్రాచీనఋషిసత్తములయొక్కయు సందేశమును చాటుదురు. నిక్కముగ నట్టియువకులు ధన్యాత్ములు. ఏలయన వారినే యీశ్వరుడు భారతమాత భాగ్యోదయమునకు సాధనములనుగ స్వీకరించును. మఱియు నాధన్యులే భారతమాతృ పవిత్రాలయనిర్మాణ కుశలులగు శిల్పాచార్యులు గాగలరు.

---

## భారతీయరాజపుత్రికలు

'డమ్మండు హే' (అమెరికాదేశీయురాలు) అనునామె ౧౦-౩-౨౮ స్ఫియరులో ఇట్లుప్రకటించినది :

'సాన్ ఫ్రాంకిస్కో' వారసుదారురాలగు 'మిస్ నాన్సి ఆని మిల్లరు' రాజ్యచ్యుతుడగు ఇందూరు మహారాజు సర్ తుకోజీరావు హోల్కారు గారిని పెండ్లాడు కోరికతో హిందూమతమును స్వీకరింప సంసిద్ధురాలుగ నున్నది. ఇది యిట్లుండ, భారతీయసంస్థానముల రాజపుత్రికల దుఃఖమయ జీవితమును ప్రకటింప బురికొల్పుచు నానేస్తురాండ్రగు భారతీయయువతులు వ్రాయునుత్తరములు ప్రతి తపాలోను నాకు వచ్చుచున్నవి. "స్వేచ్ఛా

దారలై ఏకాంతవాస శిక్ష ననుభవించుచున్న యాస్వర్ణపంజరబద్ధలను కైదీల" దుర్గతుల నాయుత్తరములు విస్తరించి చెప్పుకొనుచున్నవి. పెక్కురు కైదీల కాస్వ

నూతన దంపతులు



శర్మిష్ఠా తుకోజీరావు హోల్కారులు

ర్ణపంజర' ప్రాప్తియు లేదని యాయుత్తరములు తెలుపుచున్నవి. హీనభాగ్యయగు నొకరాజయువతి యిట్లు వ్రాసినది:

"భారతీయరాజపుత్రులకు పట్టినగతియు వారు తమ పేరుకీర్తులను లెక్కింపకుండుటయు నాదైవమునకే యెరుక. ప్రపంచమంతయు నున్నతభావ ప్రేరితమై యున్నతస్థితిని గాంచ బ్రయత్నించుచుండ నిందరు రాజపుత్రు లేల నధోగతి పాలగుచున్నారు? వారి రాజ్యాంగవ్యవహారములయెడ నశ్రద్ధ చేయుచున్నారు. వారి ప్రజలు వారియెడ కుపితులై యున్నారు. కాని వారికది యేమిలెక్క? మమ్ము వారు గృహోపకరణములుగ బరిగణించుచున్నారు. వీథులయందు దిరుగుచున్న బిచ్చగాండ్రస్థితికంటె నికృష్టమయిన స్థితికి మమ్ము గొనితెచ్చినారు. మేము మాయజమానుల చేతిబొమ్మలము.

'మిస్ నాన్సి ఆనిమిల్లర్'=



పెండ్లికి పూర్వము
అమెరికాలో

శర్మిష్ఠాదేవి



పెండ్లికి తరువాత
భారతదేశమున

వారు ఇష్టమున్నవాకు బట్టలు గట్టుదురు. లేకున్న వాని నూడదీసి చించి పారవేయుదురు!! వెనుకటిరషియను బానిసలకంటె మేము నీచమయిన దశయందున్నాము" ఎప్పుడు ఇదే ధోరణి. కాని నానేస్తురాండ్ర భర్తలకు, బంధువులకు నారోపించిన చెడునడతలలో నెల్ల భారతీయరాజపుత్రులకును పాలుగలదనుట కేవల మన్యాయము.

---

## కీ. శే., రా.బ. హొసకోట కృష్ణశాస్త్రిగారు

వీరు భారతీయ శిలాశాసన కార్యాలయ ముఖ్యాధికారిగా నుండి ౧౯౨౮ వ సం. సెప్టెంబరు నెల ౧౫ వ తేదినాడు ఉద్యోగమునుండి విరమించి ౧౯౩౦ వ సం. ఫిబ్రవరి ౭ వ తేదీనాడు కీర్తిశేషులైరి. వీరి నివాసస్థలము బెంగుళూరికి చేరువనున్న హొసకోట. వీరు కర్ణాటకులయినను, తెలుగు, అరవము, ఇంగ్లీషు, సంస్కృతము మొదలయిన బహుభాషలయందు మంచి పండితులు. వీరు పట్టభద్రులై నలుపది రూపాయల వేతన

ముపయి ౧౮౯౧ సంవత్సరమున చెన్నపురి శిలాశాసన కార్యాలయమున నుద్యోగములో ప్రవేశించిరి. వీరికి మొదటినుండియు శిలాశాసనములన్న నెంతయో కుతూహలము. వీరి సంస్కృతపాండిత్య మపారమయినది. తమ సామర్థ్యముచేతనే క్రమముగ నాకార్యాలయమున



కీ. శే. రా. బ. హొసకోట కృష్ణశాస్త్రిగారు

నున్నతస్థానముల బడయుచు తుదకు వీరు శిఖరము నధిరోహించిరి. వీరు పరమ సాధువులు; నిగర్వులు; దృఢశరీరులు; ధర్మపరులు. ౧౯౨౦వ సంవత్సరమునుండి వీరు 'ఎపిగ్రాఫియా ఇండికా' అను శిలాశాసన విషయిక మాసపత్రికకు సంపాదకీయకార్యమునంతయు నిర్వహించుచుండిరి. వైదేశికులగు 'థామస్ స్విన్‌కోనూ'గారు పేరునకు మాత్రమే సంపాదకులుగ నుండిరి. ౧౯౧౬ మొదలు ౧౯౨౧ వరకు వీరు వ్రాసిన శిలాశాసనశాఖాకార్య నివేదికములు శాసనవిషయిక చర్చలతో చారిత్రక విజ్ఞానపరిపూరితములుగ నున్నవి. ౧౯౨౧ వ సంవత్సరమున నాకార్యాలయమునకు వీరు ముఖ్యాధికారులై తోడనే రావుబహదూరు బిరుదమును బడసిరి. వీరు ఉదకమండలము చెంతనున్న 'ఫరన్ హిల్' అను తమ సొంతబంగళాయందే కార్యాలయమునుగూడ నుంచుకొనియుండిరి. ఉద్యోగమును మానుకొనిన పిదప వీరు బెంగుళూరునందలి స్వగృహమున నివసించుచుండిరి. అపుడు ప్రజోపయోగకరములగు కార్యములను మిగుల నుత్సాహముతో చేయుచుండిరి. ఉత్తరకర్ణాటదేశమునకుస్వయముగపోయి వీరు బాదామి, ఐహోళె, బిజాపురము, ధారవాడ మొదలయిన స్థలములయందలి శిలాలేఖనములు ప్రకటితములు కాకుండుటకు విచారించి అచ్చటి ప్రతిగ్రామమునందలి శిలాలేఖనములను ప్రకటింప నిశ్చయించి ౧౯౨౪ జూన్ మాసమున నాకార్యమును ప్రారంభించిరి. ఆర్కియాలజీ డైరక్టరు జనరల్ వార్షికనివేదికయందు విజయనగరరాజ్యమును గూర్చి ఉత్తమములగు మూడు వ్యాసములను ప్రకటించిరి. 'దక్షిణభారతదేశ స్త్రీపురుష దేవతావిగ్రహము'లను గ్రంథమును వీరు రచియించి యందు విగ్రహనిర్మాణము, ప్రతిష్ఠావిధానము మొదలయిన విషయములను వేదములు, ఆగమములు మొదలయిన ప్రాచీనగ్రంథములనుండి యుద్ధరించిన ప్రమాణములతో చక్కగా చర్చించిరి. వీరు ఇంకను పెక్కు చిన్నచిన్న చరిత్రోపయోగములగు గ్రంథములను రచియించిరి. ఈమహనీయుని జీవితము దేశోపకారక మైనది. వీరి కార్యమంతయు భారతదేశచరిత్ర భాండాగారమున కమూల్యరత్న సంచయమయినది. ఇట్టివారి జీవితము ధన్యము; చిరస్మరణీయము.

[జయకర్ణాటకనుండి]

---

## అబ్దుల్ రహిమాను-మంతాజుబేగము

ఇపుడీ యాలుమగలు అనురాగమడుగంటి వివాదము చెలరేగి కోర్టున కెక్కియున్నారు.



---

## ఆఫ్ఘనుస్థానపు రాజదంపతులు




వారు యింగ్లండును జేరుటకు పూర్వము తీసిన ఛాయాచిత్రములు.

---

## చిలకమర్తి లక్ష్మీనరసింహము గారి షష్టిపూర్తి

[రాజమహేంద్రవరమున ౧౯౨౮ మార్చి ౧౧-వ తేదినాడు జరిగినది]

పాండితీమండితులై విలసిల్లిన ప్రాచీన ప్రభువులు పండితమండలి నాదరించి పోషించి వాఙ్మయవృక్షమున కెంతయు దోహదమొనరించిరి. గడచిన రెండుశతాబ్దములలో నట్టి ప్రభువతంసములు లేమిచే దోహదముగాంచక యావాఙ్మయవృక్ష మట్లే నిలిచిపోయినది. ఈదురవస్థ విదేశీయప్రభుత్వమూలక మయినది. ఇప్పుడున్న సంస్థానముల ప్రభువులయందు వాఙ్మయాభివృద్ధిని గోరువా రరుదుగనుండుటకు మిగుల చింతిల్లవలసియున్నది. ఇట్టి స్థితిని జాతీయాభివృద్ధితోపాటు భాషాభివృద్ధికిని బూనుకొనవలసినభారము కేవలము ప్రజలపైఁబడినది. ఈకాలమున నీకార్యము ప్రజలకు విధియైనది.

౧౯ వ శతాబ్దము చివరను కీ. శే. శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగా రాదరణపోషణములు కఱవైనను మంచి పూనికతో వ్యయప్రయాసములకోర్చి, పండుపాఱి యున్న ఆంధ్రవాఙ్మయ వృక్షమునకు మఱలఁ గొంత దోహద మొనర్చిరి. తత్ఫలితముగ నావృక్షము గద్య, నాటక, ప్రహసనాదిపుష్పములఁ బెక్కిటిని గ్రొత్తపుష్పించినది. అట్లే తరువాత శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముపంతులుగారును నావృక్షము నింకను బ్రోదిసేసి యట్టి పూవులనే పెక్కిటిని బూయించిరి. ఇపు డాపూవుల కమ్మనితావు లాంధ్రదేశ మంతటను నిండారవ్యాపించి స్థిరముగ నెలకొనియున్నవి. విదేశీయ విద్యాప్రవాహమున మునిఁగి కొనయూపిరితో నుండిన యాంధ్రవాణిని మరల నుద్ధరించి యాధన్యాత్ము లిరువురు విదేశీయ విద్యావ్యామోహితమై తెన్నుగానకయున్న యాంధ్రలోకమునకు మార్గదర్శకులైరి. ఇపు డాంధ్రలోకమునకుఁ గన్నులు విడినవి; స్వీయభాషపై నభిమానము రేకెత్తుచున్నది. ఏయాంధ్రునివాణి యందును నానూతనసాహిత్య నిర్మాతలు పూయించిన పూవుల తావులే వలచుచున్నవి.

పయిఁ జెప్పఁబడిన యాంధ్ర సాహిత్య నిర్మాత లిరువురిలో శ్రీ వీరేశలింగము పంతులుగారి నాంధ్రలోకము సముచితరీతి నాదరించి సత్కరింపఁ జాలమికి విచారించవలసియున్నను ఇపుడు శ్రీలక్ష్మీనరసింహము పంతులుగారినైన నిట్లు సత్కరించి తనధర్మమును గుర్తించి నిర్వర్తించుకొనుట కెంతయు నానం

దింపవలసి యున్నది. ఈ షష్టిపూర్తి మహోత్సవము నిరంతరాయముగా నిర్వహింపఁ బూనుకొన్న కార్యసంఘము వారును, వదాన్యులగు భాషాభిమానులును ధన్యవాదములకర్హులు.

ఆంధ్రదేశమున నిట్టి సత్కారమును బడయదగినమహనీయు లింకనుగలరు:శృంగారనైషధాముక్తమాల్యదాదికావ్యములకు సర్వంకష వ్యాఖ్యానములు మొదలయిన గ్రంథరత్నములతో నాంధ్రవాణి నలంకరించినపండితాగ్రణి బ్ర. వేదము వేంకటరాయ శాస్త్రి గారు (మహోపాధ్యాయ, కళాప్రపూర్ణ); రసవత్కావ్య నిర్మాణ ధురీణులు, శతావధాని, యాంధ్రవాణికిన్నిక్రొత్త వెలయించిన కవిపండితవతంసము బ్ర. చళ్లపిళ్లి వేంకటశాస్త్రిగారు;చిరకాలము ననంతముగఁ బరిశోధనలు సలిపి యాంధ్ర దేశచరిత్రను రచియించి యాంధ్రుల కర్పించి వారి హృదయములఁ బ్రత్యేక జాతీయ



భావములతో నింపి మించిన శ్రీ చిలుకూరి వీరభద్రరావు గారు. కాలక్రమమున నిట్టివారెందఱో యాంధ్ర దేశమున వెలయఁగలరు. ఇట్టివారి నెల్లరను ఆంధ్రలోక మప్పుడప్పుడు గుర్తించి సత్కరించి వారియెడను దమ కృతజ్ఞతనుదెలుపుచుండుట ధర్మము. మఱియు పైఁ

శేర్కొన్న ముప్పురనుగూడ శ్రీ లక్ష్మీనరసింహముగారినివలెనే సత్కరించు ప్రయత్నముల నాంధ్రలోక మచిరకాలమున నేకావించునని యాశించదగును.

---

### అట్లాంటిక్ మహాసముద్రమును దాటుటకై నిర్మింపబడిన నీటమునుగని పడవ



న్యూయార్కుకు వెళ్లుటకై 'థేమ్సు' నదియందు నిలిచియున్నది. ఇది డచ్చిపడవ. పొడవు ౨౦ అడుగులు మాత్రమే. ఇది నీటిలో మునుగకుండనుండుతీరున చేయబడినది. రోటర్‌డాము (హాలండు రాజధాని) నుండి లండనుకు వచ్చినది. ఇందున్న నలుగురు సాహసికులను నావి అట్లాంటిక్ సముద్రమును నలువదిరోజులలో దాట ప్రయత్నము చేయుచున్నారు. ప్రయాణకాలమున పొట్టి తరంగముల వాయువార్తావిధానమునుగూర్చి పరిశోధనలు సలుపుదురట.

---

### యువకుల పట్టణనివాస ఫలము

'త్రివేణి' (ఆంగ్లపత్రిక) మార్చి సంచికయందు, శ్రీడాక్టరు బి. పట్టాభి సీతారామయ్యగారు, 'హైందవ కుటుంబము: పునఃప్రదర్శితము' అను పేరున, నొక చక్కని వ్యాసమును, ప్రకటించినారు. అందు హిందూ కుటుంబము యొక్క సత్యస్వరూపమును, ఉత్తమ ధర్మములను, గొప్పదనమును, చక్కగా వివరించినారు. విద్యాభ్యాసమను పేరనైన యువకుల చిరకాల పట్టణవాసము యొక్క దుష్ఫలముల నందిట్లు పేర్కొన్నారు.

"ఇది యిట్లుండగా ఆధునిక పరిస్థితులు హైందవ కుటుంబమునందలివారికి పరస్పరము గల యనుబంధములను త్రెంచివేయుచున్న విధమును కొంత పరికింతము. విద్యను ముగించి కళాశాలను వీడి తనయింటికి—పల్లెటూరికి—వచ్చిన యువకున కా పల్లెటూరు లాతిలాతిగా దోచును. అచట నాత డొక వైదేశికునివలె ప్రవర్తించును. పట్టణనివాసము, పూటకూలి భోనపుటి కలు నాతనికి గొప్ప చెరుపును దెచ్చి పెట్టును. అనగా నాతని దన యన్నదమ్ములు, అక్కచెల్లెండ్రనుండి దూరము కడుదూరము చేసివేయును. పల్లెటూరి ప్రాత పద్ధతులు, వాంఛలు గల సోదరులతో నాతనికి సామరస్యము కుదురదు. పెండ్లాడిన అక్కచెల్లెండ్ర నాతడు చూచి పెక్కేండ్లయి యుండును. ఆమె పిల్లలను చూచియే యుండడు. అతనికి కళాశాలలో సెలవు దొరకక తోబుట్టువులయు వారిపిల్లలయు పెండిండ్లకును బోయి యుండడు. మేనత్తనుగాని, పినతల్లినిగాని వారిభర్తమృతికి పిదప చూచియుండడు. వారికి-మేనమామలకు, తండ్రి సోదరులకు-ఎవరికేగాని పిల్లలెందరో, వారికి పెండిండ్లు అయినవో వారేమి చేయుచున్నారో, తెలియనే తెలియజాలడు. విద్యాభ్యాసమును ముగించి కళాశాలను వీడి యిల్లు చేరిన పిదప నాతడు మరల నీ చుట్టరికములకయి, తడవి తెలసికొనవలెను. అయితే చిరకాలమునుండి యాతనియందు ప్రచ్ఛన్నముగ డాగియుండినయనురాగ మచిరకాలమునందే మరల నుద్దీపనమును గాంచగలదు.

---

## గణపతి విగ్రహము—కాకినాడ



పిఠాపురం మహారాజాగారి కళాశాలలో జూనియర్ బి. ఏ. తరగతియందు చదువుచున్న కె. కనకయ్య యను విద్యార్థి చేసిన సుందర మృణ్మయవిగ్రహము. విగ్రహము పొడవు అం. ౨౨. పీఠముతో కూడా అం. ౩౧. పైన సుద్దపూసి తెల్లగా చేయబడినది.

—భా. పట్టాభిరామయ్య, యం. ఏ., యల్. టి.

---

## టాల్‌స్టాయి జీవితమున నొకదినము

'పెస్టర్ లాయడ్' పత్రికయందు స్టెఫాన్ జ్వీగ్‌గారు టాల్‌స్టాయి జీవితమం దొకదినమును వర్ణించి వ్రాసియుండిరి. అందిట్లుకలదు:

మరల నొకసారి యావృద్ధుడు నిద్రబోవుటకు ముందు ఖాళీగానున్న తన చదువుకొను గదియం దిటునటు పచారు చేయును. తన్ను గూర్చి తుది తీర్మానమ నతడు చేసుకొను వరకు, కడచిన యిరువదినాలుగు గంటలలోని ప్రతిగంటకాలమును పూర్తివివరములతో గట్టిగా పోల్చి చూచుకొనువరకు నతడు నిద్రింపడు. అతని దినచర్యపుస్తకము (డయిరీ) బల్లపై తెరచి యున్నది. అందలి తెల్లని పత్రము మనోనేత్రము వలె నతనివైపు చూచుచున్నట్లున్నది. అతడా దినమున ప్రతిక్షణమును తిరుగ వేసుకొని దానిని విమర్శించును. ఒక నికృష్టుడగు చిన్నవాడొకనికంటె నెక్కువయిచ్చి సాయము చేయక తాను విడిచిపెట్టిన పేదరాలినిగూర్చి యాతడు తలపోయును. బిచ్చగాండ్రయెడల తాను తాలిమిలేక ప్రవర్తించిన సంగతి నతడు జ్ఞప్తికి దెచ్చుకొనును. భార్యయెడల తనకున్న కఠినభావముల నతడు జ్ఞప్తికిదెచ్చుకొనును. తనయాదర్శాను గుణప్రవర్తనమున నైన యీ భంగపాటుల నాతడింతయైన విడువక తన పుస్తకమున వ్రాసిపెట్టుకొని దినచర్య వృత్తాంతము నిట్లు ముగించును. "ఇంకను లోపభూయిష్ఠమే, తిరుగ వికలాత్ముడనే, వలసినంత మేలు కావింపలేదు. విశాలమగు మానవప్రపంచమునకు బదులు నా పరిసరముల నుండు వారిని ప్రేమించుటయను కష్టతరమైన పనిని చేయుట కింకను నేను నేర్చుకొనలేదని మరల నొక్క నిదర్శనమును జూపితిని. దేవా, నాకు తోడ్పడుము; చేయూత యొసగుము." అంత మరల నతడు మరునాటి తేదీని, 'సజీవుడనై యుందునేని' యను నభిప్రాయమును సూచించు మూడు మర్మసంకేతాక్షరములను పుస్తకమున నెక్కించును.

ఇప్పు డతనికార్యము పూర్తియైనది. ఇంకొక దినము తుదివరకు జీవించినాడతడు. నమ్రుడై యాతడు తన పడకగదిలోనికి వెళ్లి బరువైన జోళ్లను విడిచి, దుస్తులు మార్చుకొని, శయ్యపై పరుండి మరల మృత్యువును గూర్చి యాలోచించును. ఆ రెక్కలుగల యాలోచనలు! అవి యింకను అతని మెదడులో మిడిసి మిడిసి యెగురు చున్నవి. కాని చీకట్లు క్రమ్ముచున్న యడవులలోని సీతాకోక చిలుకలవలె నవికొంచెము కొంచముగా తొలగిపోవును. అతని హృదయకవాటము చెంత కునుకుపాటు తారాడును.

అదియేమి? అతడు తటాలున మేల్కొనుచున్నాడు. అది యడుగుల చప్పుడు కాదా? ఔను

ప్రక్కగదిలో దొంగతనముగా మెల్లగా నైచిన యొక యడుగు. అతడు శయ్యనుండి తేలికగాను, చప్పుడుకలుగ కుండగను దిగ్గునలేచి బీగము చెవివేసెడు రంధ్రమున తన ప్రకాశవంతములగు కండ్ల నానించి చూచును. ఔను, ఒక దీపము. ఎవరో యొకదీపమును తీసికొని లోపలికి వచ్చి యతని మేజాసొరుగును గాలించి వెదకుచు, నతని దినచర్య పుస్తకము పుటలను తారుచు నతనియాత్మ రహస్యముల లోనికి తొంగి చూచుచున్నారు. ఆమె యతనిభార్య, సోఫియా ఆంన్డ్రీవ్నా;తీరని జిజ్ఞాస! అతని యాత్మ గాంభీర్యము లోనికి, నతని హృదయపు గాఢ సునిత్వము లోనికి దూర్చి చూడవలెనను నా తురత యన్ని వైపుల పరివేష్టించి యున్నది. అతని చేతులు కోపముచే గడగడ వణకుచున్నవి. తటాలున తలుపు తెరచి, భార్యను బాగుగ చీవాట్లు పెట్ట వలెనని యత డు ప్రయత్నముగ ప్రేరితుడై తలుపు తెరచుటకు గడియపై చేయినైచును. కాని చివరకు నతడు శాంతు డగును. 'బహుశః యిది కూడ నాకొకపరీక్షయే కాబోలును' అను కొని తిరుగ నతడు మెల్లగ పడకకు చేరును. కాని నిదురించుటకు కాదు. లెవ్ నికోలెవిచ్ టాల్ స్టాయి తన కాలపు వారిలోన మిక్కిలి గొప్పవాడును మిక్కిలి ప్రజ్ఞానిధియు నగువాడు, తనయింటనే వంచితు డై, సంశయముచే పీడింప బడుచు, అనిర్వచ నీయమైన యేకాంతమున మునిగి, యటుపడి యున్నాడు."

---

## సర్ అణ్ణామలై శెట్టిగారు

వీరిదివఱకు మీనాక్షికళాశాల కొఱకు పదునైదు లక్షలు ధనము నొసంగియున్నారు. ఇపుడు మీనాక్షి విశ్వవిద్యాలయ మనుపేర నొక విశ్వవిద్యాలయమును చిదంబరమున నెల కొల్పుటకై ఇరువదిలక్షలు ధనము నిచ్చుటకు సంసిద్ధులై యున్నారు. భారతదేశమున నింత యౌదార్యముతో సారస్వతాభివృద్ధికి మహో పకారమును గావింపదొరకొన్నవా రెవ్వరు



సర్ అణ్ణామలై శెట్టిగారు

నింతవఱకు కాన్పింపరు. ఇందువలన తమిళ వాణి నలుమొగముల పెంపొందుట కెంతయు నవకాశము కలిగినది. ఇట్టి వదాన్యుల నాంధ్ర దేశమున బెర్కొనుభాగ్యము గల్గునేని యాం ధ్రవాణి బహుముఖముల పరిపుష్టి నొందగ లదు ఆంధ్రదేశమునందలి శ్రీమంతులు సై తము శ్రీ అణ్ణామలై శెట్టిగారి ననుసరించి యాంధ్రవాణిని పెంపొందింతురుగాక!

---

## గుమ్మడిదుఱ్ఱు—నాగార్జునకొండ బౌద్ధస్తూపములు

[క్రీ. శ. రెండు మూడు శతాబ్దముల నాటివి.]

"పురాతన వస్తుపరిశోధనశాఖవారు కృష్ణాజిల్లా లోని గుమ్మడిదుఱ్ఱువద్ద బౌద్ధస్తూపశిల్పములను, గుంటూరు

జిల్లాలోని నాగార్జునకొండవద్ద బౌద్ధస్తూపములు, విహారములు త్రవ్వించి వెలువరిచినారు. గుమ్మడిదుఱ్ఱు వద్ద వెలువడిన శిల్పములు ఇప్పటికి దొరకిన ఉత్తమప్రాచీన బౌద్ధస్తూపచిత్రములతో నెంతయు దులదూగగలవి. ఇందలి శిల్పవిధానము భారతీయ శిల్పవిధానములయందుత్తమమనబడి కేవల మొక్క యమరావతి యందే కాన్పించుచున్న యద్భుతశిల్పచిత్రములను బోలియున్నవి. ఇక్కడ విశాలమైన పీఠభూమిని త్రవ్వగా ఒకపెద్ద స్తూపము, రెండు చిన్న స్తూపములు, బౌద్ధవిహారములయు, తత్సంబంధములయిన యితరభవనములయు శిథిలనిర్మాణములు, మఱియు నితర నిర్మాణములును బయలుపడినవి. పెద్దస్తూపమున పీఠముమాత్రమే నిలిచియున్నది. ఆపీఠముపై అమరావతి, జగ్గయ్యపేటలయందుండు స్తూపములయందువలెనే ఉబ్బెత్తుచిత్రములు బూడిదరంగుగల చలువరాతిపలకలపై చెక్కబడియున్నవి. అట్టిరాతిపలకలక్కడ 3౮ చిక్కినవి. ప్రతిదానిపైనను స్తూపచిత్రములే చెక్కబడి యున్నవి. స్తూపస్థూణము (Drum) పై బుద్ధుని జీవిత మందలి పట్టులను, జాతక కథలను వివరించు ఉబ్బెత్తుచిత్రములయందు చెక్కిన స్తూపములన్నియు పెద్దస్తూపమువలెనేయుండి దానికి అలంకారముగ నున్నవి. ఇవియేకాక క్రీ. శ. రెండు మూడు శతాబ్దులనాటి బ్రాహ్మిలిపి ప్రాకృతశాసనములుమూడు, ఆంధ్రరాజుల సత్తునాణెములు, శిథిలమైన యొక వెండి డబ్బి, ఒకఅందమైన బంగారుదంతు ఒకకుండలో నుండినవి. ఈకుండ ప్రధానస్తూపమధ్యమున దొరకినది.

ఈస్తూపము పెక్కువందలయేండ్లుపయోగమున నుండెనని మధ్యయుగపు నాగరలిపిలోనున్న బౌద్ధలేఖనములు గల ౧౨౮ ముద్రికలు తెలుపుచున్నవి.

నాగార్జునకొండ ఇప్పటికి త్రవ్వినదానిని బట్టి 76 అడుగులవ్యాసము(Diameter)గలస్తూపము యొక్కయునికి తెలియవచ్చినది. నడిమికట్టడము చుట్టు నిలిచియున్న మూడుగోడలు, నాలుగుద్వారముల కాధారముగానుండు అయిదు స్తంభములు మాత్రము గలవు. ఈ స్తంభములలో కొన్నిటిపై చరిత్ర కత్యంతము నుపకరించు బ్రాహ్మిలిపి దీర్ఘ శాసనములు గలవు. ఇదివఱ కంతగా చరిత్ర కెక్కని యిక్ష్వాకువంశపురాజుల నవి పేర్కొనుచున్నవి: వారు కృష్ణానది దిగువప్రాంతముల యాంధ్రదేశమును క్రీ. శ. రెండు మూడు శతాబ్దములయందు బరిపాలించినవారుగా నుండవలెను. టాలెమి తనభూగోళమున 'బనవాసి' యని పేర్కొన్న 'వనవాస' దేశ మీశాసనములయందుదాహృతమైనది. మఱియు నీస్తూపమునకు మహాచైత్యమను పేరనియు, నిందు బుద్ధునియస్థిశకలములు ప్రతిష్ఠింపబడి యున్నవనియు నీశాసనములు తెలుపుచున్నవి: స్తూపమునంతయు త్రవ్వితీసిన నింకొన్ని బయలుపడగలవు.

[సశేషము]

ఈవిషయమును ప్రాచీనవస్తుపరిశోధకశాఖాధికారియగు సర్ జాన్ మార్షల్ దొరగారు టైమ్సుఆఫ్ఇండియాపత్రికలో (౧౯౨౮ మార్చి నెల ౨౯-వ తేదినాటిది) సచిత్రముగా ప్రకటించియున్నారు. అందుగలచిత్రము లీసంచికయందు జేర్పబడినవి. అవి ప్రాచీనశిల్పకళాకౌశల్యమును వేనోళ్ల జాటుచున్నవి. ఈ యమూల్యశిల్ప సంచయమును వెలువరించిన ప్రాచీనవస్తుపరిశోధకశాఖనా రాంధ్రులకృతజ్ఞత కెంతయు బాత్రులుకాదగుదురు. కాని యీ వస్తుసంచయము నాంధ్రులయందుబడికి దూరముచేసి చెన్నపురమునకు, కలకత్తాకు కొనిపోవు ప్రయత్నములు చేయుచున్నారని వార్తలు తెలుపుచున్నవి ఇది మిక్కిలి విచారమును గలిగించుచున్నది. ప్రభువులు దేశముపై నభిమానము గలిగియుండవలెను. దేశప్రాచీనచరిత్రను, గౌరవమును, దేశీయులకు దెలియజేసి వారియభివృద్ధిని కాంక్షించుచుండవలెను. ప్రభువులును దేశీయులైననే యట్టి సౌకర్యములు ప్రజలకు లభింపగలవు. విదేశప్రభుత్వముక్రింద సర్వస్వాతంత్రములు కోలు

పోయిన భారతీయు లట్టిభాగ్యమును బడయ జాలమి వింతగాదు.

ఆంధ్ర దేశమున దొరకి, ఆంధ్ర దేశప్రాచీనచరిత్రకు మిగుల నుపకరించు నీయనర్ఘ శిల్పసంచయము నాంధ్ర దేశముననే యుంచుట న్యాయ్యము. ఇదివఱకు వెలువడిన గోలీస్తూప చిత్రములను ప్రభుత్వమువారు చెన్నపురి మ్యూజియమునకు చేర్చినారు. భట్టిప్రోలువద్ద దొఱకినవానిని విదేశములకు జేర్చినారు. అపుడూరకుండబట్టియే యిపుడాంధ్ర దేశము వీనిని సైతము గోలుపోవుటకు మార్గమేర్పడె నని తలపవలసియున్నది.

ఆంధ్రవిశ్వవిద్యాలయమునకై పోరాడి ఏదో యొకమూల తమపేర ప్రత్యేకవిశ్వవిద్యాలయమును బడసినఆంధ్రులు, ప్రత్యేకాంధ్ర రాష్ట్రమునకై బహుముఖముల ప్రయత్నములు గావించుచున్న యాంధ్రులు, తమదేశ ప్రశస్తిని చాటుచున్న యీ యమూల్యశిల్ప చిత్రసంచయము తమకు దూరమైపోవుటను సైచియుండజనదు.

భారత దేశము తనపూర్వప్రశస్తిని చాటు అమూల్యములగు శిల్పచిత్రములను, గ్రంథములను, ఇతరవస్తువులను పెక్కిటి నిదివఱకే కోలుపోయినది. అవి విదేశములపాలయినవి. విదేశీయు లవి 'తమపరిశోధనఫలితము' లని విఱ్ఱవీగుచున్నారు భారతీయులు చేయునదిలేక గ్రుక్కిళ్లు మ్రింగుచు నూరకున్నారు.

ఆంధ్రులు గుమ్మిడిదుఱ్ఱు, నాగార్జున కొండలవద్ద దొఱకిన యీ శిల్పచిత్రములవిషయమున నిపుడు వెంటనే జాగ్రతపడవలెను. ప్రభుత్వప్రయత్నములు కొనసాగకుండ నా యమూల్యసంచయ మాంధ్ర దేశమధ్యస్థమగు బెజవాడపురమునందలి మ్యూజియమున జేరులాగున జూడవలెను. చేయిదాటినచో లాభము లేదు. బెజవాడ అవిచారమూలకముగా అనంతపురమును జేరనున్న విశ్వవిద్యాలయ ప్రధాన కార్యాలయమునకు సముచితమైన నగరము; భావిప్రత్యేకాంధ్రరాష్ట్రమునకు రాజధాని కాదగిననగరము. కావున నచ్చటికే యీచిత్రములును చేరవలయును. దీనికై యాంధ్రులు సత్వరము సర్వవిధముల ప్రయత్నించి తమకు ప్రాపింపనున్న అనర్థమును దొలగించుకొనవలెను.

---

## పొగాకు అలవాటువలని దోషములు

తలనొప్పి, వికారము, కండరముల దౌర్బల్యము నాడి శీఘ్రముగ కొట్టుకొనుట, కండ్లు,తల తిరుగుట, దృష్టి మాంద్యము గల్గుచుండును.

పొగాకును ఏ రూపముగ వాడినను ప్రమాదకర మే. శరీరమును పుండుగ జేయును. అయిదు లేక ఆరు ధాన్యపు గింజల ఎత్తు పొగాకును మ్రింగిన వమనము వచ్చును. విడవకుండ చుట్టలను త్రాగినచో నోరు పుండగుట, గొంతుకలో మంటపుట్టుట, కంఠ ద్వారములో పుండుగా. నుండుట, ఉదయపు పూట దగ్గు, నాలికపూయుట, గొంతుకబొంగుపోవుట, రొమ్మపడిసెము ప్రాప్తమగును. ముఖ్యముగ సిగరట్లను పీల్చువారి కీఅవస్థ ఏర్పడును.

పొగాకునుగాని చుట్టలనుగాని గొట్టములో పెట్టి సంవత్సరములకొలది గాల్చువారి నాలికమీదనొక కండ బయలుదేరును. దీనినే కంతియనెదరు.

పొగాకువర్తకులలో వ్రణములచే చావు తక్కువట. పొగాకు పొగ క్రిమిసంహారక మనెదరు. అయితే కొద్దిగ వాడినపుడే ఈగుణము గలుగును.

నొప్పిని బోగొట్టుటకు, ఉపశమనమును గలుగ జేయుటకును ప్రజలు చుట్టలను త్రాగెదరు. మొదట ఉత్సాహముగ నున్నను పిదప మందగించును. చుట్టలను త్రాగుటచే ఆకలిపోవును. కడుపులో పేగులు పుండగును. చుట్టకాల్చుచున్నంతవరకు నీరు నోటియందు స్రవించును. చుట్టగాల్చినపిదప నోరెండిపోవును. కండ్లు జబ్బుజేసి దృష్టిచెడును.

చుట్టలను గాల్చుటచే కడుపులో వ్రణమేర్పడును. దానినే 'డ్యూడునలు అల్స'రందురు.

పొగాకును వాడుటచే నాడి నిమిషమునకు 5 నుండి 10 మార్లు మామూలుకంటె ఎక్కువగా గొట్టుకొనును. విస్తారముసిగరట్లను త్రాగుటచే హృదయము సరిగా ఆడదు. హృద్రోగ మేర్పడును.

క్రొత్తగా కాల్చువారుగాని, విస్తారముగ గాల్చువారుగాని తరుచు రక్తభారము నాడియందు ఏర్పడుటచే బాధపడి పోటుకోర్వలేక చనిపోవుచున్నారు.

ఎంతమితముగా గాల్చు వ్యక్తియొక్క హృదయమయినను జబ్బుగనేయుండును. అమితముగ చుట్టలను గాల్చిన రక్తనాళములు చెడును. విస్తారము గాల్చువారి హృదయముచెడి చనిపోయెదరు.

విస్తారముగ చుట్టలను గాల్చువారికి నిదురయు పట్టదు.

---

## టూటన్‌ఖమను సమాధిచిత్రములు మఱికొన్ని

౧. టూటన్‌ఖమను సమాధియం దాతని హృదయము శిక్షింపబడిన స్థలముపై నీనిర్మాణము గలదు. టూటన్‌ఖమను మూడువేలయేండ్లకు పూర్వ ముండిన గ్రీకురాజు ఇందలి శిల్పనిర్మాణకౌశల్య మిదివఱకు కనుగొనిన శిల్పనిర్మాణములయందుకంటె నత్యుత్కృష్టముగా నున్నది. చుట్టు సర్పఫణములు చెక్కబడిన పైమూత నెత్తగా నాలుగుజడలు కాన్పించినవి. బహిరావరణముయొక్క మునుభాగఫలక మొకనైపునకు జరగిపోవును. అప్పుడు టూటనుఖమను శిలామయ శవపేటికయొక్క బంగారు నమూనాలు నాల్గిటిలో రెండుమాత్రము కాన్పించును, మానవుల కిప్పటివఱకు నుపలబ్ధమయిన ప్రాచీన స్వర్ణకారకౌశల్యమును మించునట్లివి చేయబడి యున్నవి. ఇందు కాన్పించుచున్న చిత్రమయలేఖనములు చక్రవర్తుల స్వభావమును వెల్లడించునవట.

౨. చక్రవర్తి హృదయ మున్నపేటిక స్వర్ణవితానముకలది. నలువైపుల నాల్గుగ్రీకుదేవతలు సంరక్షణార్థము చెక్కబడి యున్నారు.

3. మృతచక్రవర్తి సంరక్షణార్థమై యుంచిన శ్వానముఖము, మానవాకారము గల గ్రీకుదేవత. ఇచ్చట మేకతోలు కప్పుకొన్న నక్కవలె నిర్మింపబడియున్నది. ఇది హృదయమున్న సమాధి కెదుట నున్నది.

౪. సమాధ్యాలయాంతర్భాగము; ఆచ్ఛాదన వస్త్రరహితము.

౫. టూటనుఖమను సమాధిపై నుంచినయోడలు దీనిపై నాతడు మరణయాత్ర గావించినది.

---




# గ్రంథములు

## సాహిత్యమీమాంస

ఇది శ్రీపాద కామేశ్వరరావుగారిచే తెలిగించబడి అభినవాంధ్రగ్రంథమాలవారిచే ప్రచురించబడిన యుత్తమవిమర్శగ్రంథము. సంస్కృత కావ్యములందును నాటకములయందును వ్యక్తమగు ఆర్య ధర్మములను గ్రంథకర్త చక్కగా వర్ణించినారు. రామునివంటి ధర్మవీరులును, సీతవంటిపతివ్రతలునునగు స్త్రీపురుషుల పాత్రలనుసృష్టించి వారిచరిత్రలను మిక్కిలి హృద్యముగా వర్ణించి, నవరసములను పోషించుచు, ధర్మానురక్తిని లోకమునందు వెదచల్లుచున్న ఆర్య సాహిత్యమునందలి లక్షణములను వివరించినారు.

సమస్తలోకవ్యాపారము లందును అలౌకికమగు ధర్మమును వీక్షించి దానిని వెల్లడించుటయే మనశాస్త్రములు, కావ్యములు, నాటకములు మొదలగు వానియుద్దేశము. ఇట్టి యుద్దేశమును మరచి లేక వేరుపరచి ఆర్యసారస్వతమును విమర్శించుట మిక్కిలి అయుక్తము. ఆంగ్లసాహిత్యమునకు ధర్మదృష్టి ప్రధానముకాదు. వారి సంఘమునందు కాన్పించు లక్షణములే వారిసాహిత్యమునందును కాన్పించును. గొప్పశక్తి, లౌకిక ఆనందము, అసంపూర్ణమైన నైతికాదర్శము, యివియే వారివాఙ్మయము నెడల ఆకర్షణకు కారణములు.

అనుదినమును ఆంగ్లేయసాహిత్యము యొక్క సంపర్కము హెచ్చుచున్న యీకాలమున, సహజస్వరూపమునందు భిన్నములగు రెండింటిని పోల్చి చూచుట అత్యవసరము. ఆంగ్లేయ వాఙ్మయమును శ్రద్ధతో చదివి, దానియందు శిక్షితులైన పాఠకులు తగినజ్ఞానమును విమర్శనాశక్తియు లేకుండనే తమప్రాచీనగ్రంథములను నిగసించుటయు, స్వాభిమానము చేతను తమ వాఙ్మయమును పొగడుచు, నితరగ్రంథములను దూషించుటయు పైరెండు దోషములను మనముచూచుచునేయున్నాము. అట్లుకాక, సహేతుకముగాను, శాస్త్రబద్ధముగాను విమర్శించుటలో గ్రంథకర్త అవలంబించిన పద్ధతి అనుసరణీయము, వర్ణనీయము.

ఆర్యసాహిత్యమునకును ఆంగ్లేయ సాహిత్యమునకును విశేషమగు తారతమ్యముకలదు. భిన్నసంఘములందుదయించి భిన్నధర్మములను ప్రకటించుచు దైవికముగా కలిసి సంయోగసంఘర్షణలకు కారణభూతమగుచున్న యీరెండింటికిని అన్వయము సాధించుట కష్టసాధ్యము. కాలము గడచి, పరస్పరసంబంధము క్రమపద్ధతిని హెచ్చిన కొలదియు, కలయిక సాధ్యముకాగలదు. కాని అట్టి కలయికవలన లోకమునకును హిందూజాతికిని మేలు కలుగవలెననిన, మన యుత్తమగ్రంథములందలి భావమును నిత్యమును స్మరించుచు అనుభూతము చేసికొనుచుండుటయే కర్తవ్యము. వాల్మీకిరామాయణము; కాళిదాసు, భవభూతి, నాటకములు, వ్యాసుని పురాణములు వీనివిలువ యొకకాలము, నొకయుగము నాటిదికాదు. వానియందు చిత్రింపబడిన యాదర్శములు, కీర్తింపబడిన ధర్మములు సహృదయులగు మానవుల మానసములందు నిత్యమును రాజ్యము చేయుచునే యుండును.

గ్రంథముయొక్క శైలి సరళముగా నున్నది.

[అ. రా.]

## వినాయక సావర్కారు జీవితము

ఈ గ్రంథము ముదిగంటి జగ్గన్నశాస్త్రిగారిచేరచింపబడినది. ఫేదరువైటుకాగితములతో క్రౌనుసైజున 119 పుటలను గలిగియున్నది. వెల రు 0-12-0 లు. వలయువారు 'ముదిగంటి జగ్గన్నశాస్త్రి, రాజమహేంద్రవరము' అని వ్రాసి తెప్పించుకొనవచ్చును.

గ్రంథకర్తగారు పీఠికలో శ్రీసావర్కారుగారిని గూర్చి వ్రాసిన "జగమెరుగని బ్రాహ్మణునకు జందెమేల" యనుమాట సార్థకమే. సావర్కారుగారి కీర్తి దేశదేశములను వ్యాపించినది. వారికీర్తికి వారురచియించిన "భారతీయ స్వాతంత్ర్య యుద్ధము (Indian War of Independence) అను పుస్తకము శాశ్వతమగు సాక్ష్యము. 1857 సం॥ నాటి "సిపాయీల తిరుగుబాటు" (Sepoy Mutiny) తిరుగుబాటు కాదనియు, బ్రిటిషు ప్రభుత్వపు దురాచరణములచే భారతీయుల మనసుల రగుల్కొన్న స్వాతంత్ర్యేచ్ఛా విజృంభణము నకుఫలితమగ బ్రవర్తిల్లిన స్వాతంత్ర్యయుద్ధమనియు వారు నిదర్శన పూర్వకముగ నామహాగ్రంథమునజాటిరి. ఈగ్రంథము దేశమునం దెచ్చటను వ్యాప్తిలో లేకుండునట్లు ప్రభుత్వమువారు కట్టుబాటులను గావించివైచిరి. నేడు సాధారణముగ నెందును మనకది లభింపదు. దాని ప్రతియొకటి దక్షిణ అమెరికాలో రు 150-0-0 లకు విక్రయింపబడెనన్న, నాగ్రంథము గడించిన కీర్తి యెంతయో చదువరు లూహించుకొందురుగాక.

భారతదేశము దాస్యమున మునిగియున్న యీకాలమున నీరసమైయున్న భారతీయుల యాత్మశక్తిని బ్రజ్వలింపజేసి వారిస్వార్థత్యాగ పరాయణతను బెంపొందించి, స్వాతంత్ర్యోద్యమోన్ముఖులను గావింపదగు ప్రచారము నిరంతరముగ జరుగవలసిన యావశ్యకత యెంతేనిగలదు. అట్టిప్రచారములో మహోన్నతములగు నాశయములకై తమ జీవిత సర్వమును నిష్కలుషమగు భక్తితో నర్పించుకొన్న మహనీయుల జీవితచరిత్రములను, దేశమందంతటను, మూలమూలల, సకలభాషల, వ్యాపింపజేయుట యొక ప్రధాన కార్యక్రమము.

వినాయక దామోదర సావర్కారుగారివంటి వారీ ప్రపంచమున నెందరో యుండరు. వారిదేశభక్తి తేరి చూడరాని వెలుగుల నెగజిమ్ముచుండును. వారి స్వార్థత్యాగ మప్రతిమానము. వారి ధైర్యసాహసము లమేయబలసంపన్నములు. వారివాదనపటుత్వము సుతీక్ష్ణము, అద్భుతము.

పీఠికలో గ్రంథకర్తగారు "మేమిందు చారిత్రాత్మక విషయములను మాత్రమే స్థాలీపులకన్యాయముగ క్రోడీకరించి సంగ్రహముగా జర్చించితిమి. ఇందు సావర్కారు తన వదినెగారికి విషమస్థితులలో వ్రాసిన రెండు ఉత్తరములను, భారతదేశమునకు ఖయిదీగా 1910 సం॥న తీసికొని రాబడునాడు స్నేహితులకు వ్రాసిన యుత్తరమును, 1921 సం॥లో మృత్యుదేవతతో బోరాడుచు నామె నాహ్వానించిన యాహ్వానము మొదలగునవి చేర్పబడెను. ఇతరవిషయములు 1018లో బ్రకటింపబడిన కౌలటుకమిటీవారిని వేదిక బరేంద్రకుమారఘోషు (అరవిందఘోషు సోదరుడు,) వ్రాసిన "నాప్రవాసకథనము" "బారిస్టరు సావర్కారుజీవితము" "అండమానుప్రతిధ్వని" మొదలగు వాటినుండి సేకరింపబడెను" అని వ్రాసియున్నారు.

ఇట్టి చరిత్రాత్మకమైన యీగ్రంథమును బఠించి యాంధ్రులు భారతీయుల కెల్లరకు నిరంతరస్మరణీయులగు శ్రీవినాయక దామోదర సావర్కారుగారి జీవితౌన్నత్యమును గ్రహించుకొందురుగాక.

గ్రంథముయొక్క శైలి మొదటినుండి తుదివరకు నెల్లరకు దెలియునట్లు తేటతెల్లములగు మాటలతో నొప్పియున్నది. గ్రంథకర్తగారు శ్రీసావర్కారుగారి జీవితములోని విషయములను సంపూర్ణముగ దెలియజేయు గ్రంథమునుగూడ రచించి యాంధ్రలోకమున కొసంగుదురుగాక.

—ప్ర. రం.

## మునిమాపు

ఈపుస్తకము ఫేదరువైటు కాగితములపై క్రౌనుసైజున ముద్రింపబడియున్నది. పుటలసంఖ్య యెందును గానరాకుండుటచే నెన్నిపుటలో లెక్కయీయజాలము.

గ్రంథకర్తగారు సహదేవ సూర్యప్రకాశరావుగారు. గ్రంథకర్తగారు రచియించిన "భావగీతముల" సంపుటీకరణమే యీగ్రంథరూపము దాల్చినది. ఈపుస్తకమునకు మొదట "శ్రీకృష్ణశాస్త్రి"గారు,

"ఈమునిమాపులో నేమో విషాదమో
సందేహమో నన్ను జ్వాలయై దహియించు
వెలుగులో చీకట్లో వీని కౌగిళ్ళలో
కనలు నేనల్లనల్లని వేడిరక్తాలు"

అను నొక పద్యముతో గ్రంథమును ప్రశంసించియున్నారు. ఇది గ్రంథమునకు "పీఠిక"యో "తొలిపలు"కో వ్రాయు నాచారమున నూతనపద్ధతికాబోలు.

తరువాత గ్రంథకర్తగారు

"బ్రతుకు బ్రతుకెల్ల శిథిలమై పడటగలియ
వీథివీథుల దిరుగాడు బిచ్చగాడ
నీప్పుడుపదాంకితమ్ముగా నేమొనర్తు
లలితహృదయ ప్రసూన దళమ్మె కాక"

యని తమగ్రంథమును వాగ్దేవి కంకితముగ నొనర్చినారు.

గ్రంథకర్తగారికి కవికుండవలసిన ప్రశంసనీయమగు భావనాపటుత్వము కలదు. మొత్తముపై శైలిలో మంచి మార్దవమున్నది. ఈ గీతములలోని సరసతను శైలియొక్క మృదులత్వమును జూపుటకై కొన్నియుదాహరణము లిచ్చుచున్నాము.

"మధుసుధాజ్యోతిరానంద మగ్నమైన
బ్రతుకు మలినదుఃఖాశ్రుకర్దమమొనర్చి
భావనాచాలితోత్తుంగభంగవీథి
పర్వులెత్తగాజేసి యున్మత్తురీతి."

("ప్రణయాంకము" నుండి)

"ఆమెకంటి క్రొన్నీటి ముత్యాలతళుకు
జిలుగు వెలుగులో నిలువెల్ల పులకరింప
ప్రతిఫలించిన ప్రణయ ప్రపంచమెల్ల
గాంచినాడను వలపూర కరవుదీర"

("ఆమె"నుండి)

"జీవితామృతమెల్ల వర్షించినైచి
పేదవడెను విషాదపయోదమట్లు
నాసమస్తమ్ము నీకర్పణమ్మొనర్చి
ఊర్పు చిరుగాలికే తూలుచుంటి సకియ"

("వియోగవీథి"నుండి)

"మృత్యుదేవతా, ఉన్మత్తనృత్యమూర్తి,
ప్రళయకాల నీలాభ్రగర్జాకరాళ
గానరావాన లోకాలు కనలిపోవ
కుటిల నిబిడాంధ మెగజిమ్ముకొనుచువచ్చి
నవ్యగాఢ పరీరంభణమ్మొసంగి
నేదదీర్చి నీహృదయాన జేర్చికొనుము."

("ఆహ్వానము"నుండి)

దీనిలోని "ప్రళయకాల......" అను పెద్దసమాసమునకు తుదిని "గానరావమున" అనుదానికి "గానరావాన" యనియు "లోకములు" అనుటకు "లోకాలు" అనియు ప్రయోగింపబడినది. ఇట్టి ప్రయోగములు వ్యాకరణదూష్యములు కాకపోయినను, పదముల సాధుత్వమునకు కొంతవరకు భంగముగలిగించుచున్నవేమోయని మాయభిప్రాయము. గ్రంథమున నిట్టి ప్రయోగములు చాలగలవు ఇవి యొకప్పుడు సరసములుగ నుండును. మరియొకప్పుడు విరసములే యగును. ముఖ్యముగ దీర్ఘములగు సమాసములతుదిని ఇట్టిప్రయోగములు వెగటుగ నుండునని మాయభిప్రాయము.

మొత్తముపైగ్రంథము అచ్చుమొదల్కొని, కవి భావచిత్రణమునరకు సంపూర్ణమగు నూతనత్వము దాల్చియున్నది. వెల రు 1-0-0

"సహదేవ సూర్యప్రకాశరావుగారు, రాజమహేంద్రవరము" అనివ్రాసిన గ్రంథమును బడయవచ్చును.

—ప్ర. రం.

## అపరాధిని

ఇది శ్రీయుత వేదుల సత్యనారాయణశాస్త్రి గారిచే వంగభాషనుండి యనువదింపబడి యాంధ్రప్రచారిణీగ్రంథమాలవారిచే ప్రచురింపబడిన డెమ్మీసైజు 232 పుటలుగల నవల. గ్రంథకర్తగారు మూలగ్రంథమును స్వయముగ ననుసరింపక మరియొకరిచే నాంధ్రభాషలో నీకథ విని దీనిరచించినట్లు కృతిసమర్పణముచే తెలియు

చున్నది. ఇందు రతీకాంతుని చిన్నతనపు దుడుకుచేతలను దయామతితో కప్పిపుచ్చి సరయూబాల వాని దుండగముల వృద్ధియగుటకు కారణమయ్యెను. పసితనమున బాలు రొనరించు దుష్టకార్యముల సహించుట పెద్దల యపరాధమని మనకీ నవలవలన నొక నీతి యేర్పడుచున్నది. స్త్రీలకుఁ గల సహజకరుణా స్వభావము చక్కఁగ వర్ణింపబడినది. గ్రంథశైలి సరళముగ నున్నది. ఇది పఠనీయగ్రంథములయం దొకటి కాని ఇందొకటి రెండు విరుద్ధములున్నవి. పుట 3 "పల్లెటూరియందు......కంటగింపుగ నుండెడిది." ఈ వాక్యములచే శ్యామబాబునకు పల్లెటూరియం దేహ్యభావమున్నటులుస్పష్టమగుచుండగా అదేపుటలో "దసరా సెలవులకు—పల్లెటూరికిపోయి రెండుమూడునెలల గడిపి వచ్చుచుండును" అని యున్నది. 3-వ పుటలో రాధాగోవిందమిత్రునకు......తన కొడుకు వకీలు కావలయునని,...మనుమరాండ్రను జూచి..,ఆ కోరికలు తీరుటచే ప్రశాంత మనస్కుఁడై మరణించినాడు" అని యుండుటచే అప్పటికే శ్యామబాబు సంతానవంతుడు కావలెనుగదా? కాని 5వ పుటలో "యేబదియేండ్ల యీడున......ఆడుపిల్ల కలిగి" అని యున్నది. ఈయన్యోన్య విరుద్ధము లెట్లు పొసగును?

—కో. నా.

## వీరగాంధర్వము

ఇది శ్రీయుత బూదూరు రామానుజులు రెడ్డిగారిచే రచియింపబడిన చరిత్రాత్మక నవల. క్రౌనుసైజున 65 పుటల గ్రంథము ఆంధ్రభోజుఁడగు శ్రీకృష్ణదేవరాయని విజయములం దొకటి యగు రాయచూరు ముట్టడిని ప్రధానముగఁ బెట్టుకొని కేవల కల్పితకథచే శృంగారవీర రసముల నొకించుక చవిఁజూపిరి. శైలిసులభముగనున్నది. పాఠశాలబాలురకు పఠనీయార్హముగనున్నది. కో. నా.

## ఆంధ్ర వీరులు

ఇది ఆంధ్ర మహాపురుషుల పవిత్రజీవితముల కీర్తించు వచనకావ్యము. దీనిని రచియించినది ఆంధ్ర సారస్వత నిష్ణాతులగు శేషాద్రి రమణకవులు. బెజవాడ వెంకటరాం అండుకో వారు ప్రచురించిరి. ఈగ్రంథము నందలి పీఠికను పరిశీలించితి మేని దీనిని రచించుటలో కవులకు నాలుగు ముఖ్యోద్దేశ్యములు గలవని సువ్యక్తమగును, అవి యేవన.

1. ఆంధ్రుల హృదయమున నాంధ్ర ప్రతిభ నుద్యోతకము చేయుట.

2. ఆంధ్రుల వికాసము, రాజ్యవిస్తృతి, పతనమును, ఆంధ్రమహాపురుషుల జీవిత చరిత్రరూపముగ ప్రదర్శించుట.

3. 'విస్తృతమగు నాంధ్ర దేశమునం దుద్భవించిన మహనీయుల త్యాగదీక్ష, కౌశలము ప్రపంచ మందలి యేజాతీయనాయకునకుఁ దీసిపోవదని' చెప్పుట.

4. ఆంధ్రులందుఁ బ్రసిద్ధులైన పురుషుల జీవితములు కథలుగ వ్రాసి బాలురకు విద్యార్థిదశలోనే మాతృదేశాభిమానము గలిగించుట.

ఈనాలుగు ఉద్దేశ్యములు ఎట్లీగ్రంథమున సిద్ధి నొందినవో ఒక్కింత పరామర్శింతము

ఇవి జాతీయ పునరుద్ధారణ దీక్షాదినములు.

'ఈ. జాన దేశగౌరవము చక్కఁనదిద్ది మహాంధ్రమండలీ
భారము శ్లాఘనీయముగఁ బాలనఁ జేసినమానరాష్ట్రిముల్
హరిమి నాశఁజేయ, తెలుఁగుం బుడమిం గయిసేయ'

నేడొక విపుల ప్రయత్నము జరుగుచున్నది. ఈయుద్యమమునకు ప్రాణమువోయుట గ్రంథకర్తలకు విధియని ఆంధ్రమహాసభాధ్యక్షుఁడు ఉయ్యూరు జమీందారుని ఆజ్ఞప్తికాపునే దేశారాధకులగు శేషాద్రిరమణకవులు 'ఆంధ్రుల హృదయమున ఆంధ్రప్రతిభ నుద్యోతకము' చేయుట యొక ఆదర్శముగ నిడుకొనినారు. జాతీయపునరుద్ధారణ సోపానములలో ప్రాక్తనవైభవ పునశ్చరణము మొదటిది. రక్తతర్పణము లందిన చాణుక్యుని రాజనీతి నైదుష్యము కృష్ణాస్రవంతి విజయగీతములు వినిపింపగా శాతవాహన రాష్ట్రిమును ఆలించి పాలించిన గౌతమి పుత్రుని ప్రతిభ ఆంధ్రశౌర్యమునకు మూర్తియై కళింగము మొదలు కన్యాకుమారివఱకుగల దేశమును ఏలిన కులోత్తుంగచోడదేవుని ప్రజ్ఞ; నూనూగుమీసాల నూత్నయౌవనమున సుఖములఁ దిగనాడి రణభూమి

తనకు మరణశయ్యగా స్వీకరించిన బాలచంద్రుని అప్రతీపమగు ప్రతాపమును; 'ఇదంబ్రాహ్మ మిదం క్షాత్ర' మను ధర్మసూక్తికి తార్కాణమైన ఖడ్గతిక్కని అవక్ర పరాక్రమమును, రుద్రప్రతాపమున కాకతీయాంధ్రసామ్రాజ్యమునకు నియంతయైన ప్రతాపరుద్రుని ప్రతిభా ప్రాగల్భ్యములును బలగర్వులగు పరరాజులకు అనాశ్వాసంబుచేసి అవార్యమగు వీర్యమును, తీరుతీయములుగల తెనుగుభాషను భూషించి పోషించి అస్తోకంబగు వివేకమును వెల్లడించిన కృష్ణదేవరాయల ప్రజ్ఞాపాండిత్యములును; మృత్యుముఖమున నివృత్తినొందిన రామరాజు తంత్రజ్ఞత; ధర్మసంస్థాపనార్థము ఆత్మార్పణము గావించిన యాచమనాయని స్వార్థరాహిత్యము; గోలుకొండరాజ్యమును ఏకహేలగా పాలించిన మంత్రి మాణిక్యాలు అక్కన్న మాదన్నల శేముషీ దురంధరత్వమును తేలికయైన శైలిలో కీర్తింపబడియుండుటచే ఈగ్రంథము ఆంధ్రుల హృదయమున ఆంధ్రప్రతిభనుద్యోతకము చేయుట నిశ్చయము.

ఇక రెండవయాదర్శముసంగతి ఒకయుగమందలి మహాపురుషుల జీవితమే ఆయుగపు చరిత్రయగును. కావుననే ఆంధ్రరాజ్య వికాసమును, విస్తృతిని, పతనమును ఆయాయుగములందుండిన ఆంధ్రమహాపురుషుల జీవితరూపమున శేషాద్రిరమణకవులు ప్రదర్శించిరి. ఆంధ్రజాతీయతయు, రాజ్యమును గౌతమీపుత్రునికాలమున వికసించి కులోత్తుంగప్రతాపరుద్ర కృష్ణదేవరాయలకాలమున మహత్తరమగు నభ్యున్నతిని, నెఱవుగొల్పు విస్తృతిని అంది రామరాజుకాలమున ఎట్లు క్రుంగుడు పోయినవో ఏతద్గ్రంథపాఠకులకు సువ్యక్తమగును. విశేషమేమన: మహాపురుషుల జీవితముల మూలకముగ దేశచరిత్రమును బోధించుపద్ధతి ఉత్కృష్టమైనది. ఆంధ్రవీరులందు అవలంబింపబడిన పద్ధతి అట్టిదే.

విస్తృతమగు నాంధ్రదేశమునం దుద్భవించినమహావీరుల త్యాగదీక్ష, కౌశలము ప్రపంచమందలి ఏనాయకునకుఁ దీసిపోవదని చెప్పుట శేషాద్రిరమణ కవులకు ఈగ్రంథమును రచించుటలోగల మూడవ ఉద్దేశ్యము. ఆంధ్రవీరులను తుదిదాక చదివినవారలకు మనలోకూడ మహాసామ్రాజ్యము నేలినవారు, విశాలరాజ్యక్లేశముల లెక్కింపక వివేకముతో మంత్రాంగము నెఱపినవారు, కుమారవీరులు, మహాసామ్రాజ్య సంస్థాపనాచార్యులు, ఆత్మార్పణము జేయగల త్యాగదీక్షితులు ఉన్నారని స్పష్టపడి తీరును.

ఇక నాలుగవ ఆదర్శ విషయము. ఇది మిక్కిలి ముఖ్యమైనది. బాల్యమే దేశాభిమానమును విత్తుటకు మంచికార్తి. చాణుక్యునివంటి రాజ్యాంగధురంధరుని, గౌతమీపుత్రునివంటి చక్రవర్తిని, కులోత్తుంగచోడునివంటివిజేతను, బాలచంద్రునివంటి కుమారవీరుని, ఖడ్గతిక్కనవంటి యసహాయశూరుని, ప్రతాపరుద్రునివంటి రుద్రప్రతాపుని, కృష్ణరాయలవంటి ప్రభువతంసమును, రామరాజువంటి తంత్రజ్ఞుని, యాచమనాయనివంటి స్వార్థత్యాగుని, అక్కన్నమాదన్నలవంటి మంత్రి మాణిక్యలను ప్రసవించిన ఆంధ్రభూమియే తనకును మాతృభూమి అని తెలిసికొని ఏఆంధ్రబాలుఁడు ఆపోనిగర్వము, తృప్తిలేని అభిమానము నొందకుండును. చిన్నటనాటనే దేశాభిమాన పూరితుఁడైనవాఁడు పెద్దకాలమున దేశారాధకుడగు వాఁడై జన్మభూమికి పేరు పెంపులు వెలయింపకుండునా ?

ఇట్టి ఉన్నతమైన ఆదర్శములతో గ్రంథమును రచియించిన శేషాద్రిరమణకవులు స్తుతిపాత్రులు. ఒకటి రెండు దోసఁగు లీగ్రంథమున దొరలినవి. దీపకర్ణికథ గౌతమి పుత్రుఁడు దేవాంశసంభూతుఁ డనుటకు నిదర్శనముగా ఉదాహరింపబడినది. కాని ఆకథకును గౌతమి పుత్రునకును ఏమియు సంబంధములేదు. అది గౌతమి పుత్రుని వంశమునకు మూలపురుషుడగు శాతవాహనునకు సంబంధించినది. ఖగరాటవంశమును నహపానుని వంశమును వేఱని కవులు భావించినట్లు కనబడుచున్నది. కాని నహపానుఁడు ఖగరాటవంశీయుడని చరిత్రవిదుల నిశ్చయము. ఇట్లే సవరింపదగిన మఱికొన్ని చిన్నిప్రమాదములను విస్మరించితిమేని ఈగ్రంథము ఆంధ్రబాలురు అవశ్యముగా పఠింపవలసిన గ్రంథములలో నొకటి అని నానిశ్చితాభిప్రాయము.

ఉ. శ్రీ

ఆంధ్రవీరులు చదివిన దరిమిలాన ఆంధ్రవీరారాధనము (బెజవాడ మారుతీరాం అండుకోవారు ప్రచురించిన) అను నొకగ్రంథమును చూచితిని. ఆంధ్రవీరులందు ఎవరి చరిత్రలై తే కీర్తింపబడినవో ఆవీరులచరిత్రలేఆంధ్ర వీరారాధనములో కూడ కీర్తింపబడినవి. మొగమోటము లేకుండ వ్రాయవలసినచో ఈరెండు గ్రంథములును ఒకదానికొకటి నకలుగా నున్నవనక తప్పదు. బెజవాడలో వెలువడిన ఈగ్రంథములలో ఏది ముందు పుట్టినదో రాజమండ్రిలోనున్న నేను చెప్పజాలను. ఒకరు వ్రాసిన వ్రాతలే తిరిగివ్రాసి గ్రంథకర్తలును, ఒకరు ప్రచురించినదానినే తిరిగి ప్రచురించి ప్రకటనకర్తలును సారస్వతాభివృద్ధిని అరికట్టుచున్నారు. ఇట్టి అరిష్టమును వదల్చుకొన మనము ప్రయత్నింపవలసియున్నది.

ఆండ్ర శేషగిరిరావు, బి. యె.

## కథావళి

ఇది సరస్వతీగ్రంథమాల ౧౬ వ పుష్పము. శ్రీపోడూరు రామచంద్రరావు బి. ఏ., బి. ఎల్ గారిచే వ్రాయబడినది. శ్రీకాకరపర్తి సత్యనారాయణగారిచే సంపాదితము. పశ్చిమగోదావరీమండలమునందలి తణుకుతా॥ కాకరపఱ్ఱు అగ్రహారము ఈగ్రంథమాల జన్మస్థానము. డెమ్మీ 1/8 ఆకృతి ౧౩౪ పుటలు వెల ౦-౧౪-౦.

ఇందు ౭ కథలుగలవు. 'జీర్ణవస్త్రములు' అను కథలో వ్యావహారికభాష వినియోగింపబడినది. కడమకథలు గ్రాంథికభాషలో నున్నవి. కథకుఁ డన్నట్లు ఇది ప్రథమప్రయత్నము. శైలిసరళము. కానిసంవిధానచాతుర్యము చాలదు. విషయమును బ్రసాదింపగలంత భాషయు జాలదు. వ్యాకరణదోషములు పెక్కులు గ్రాంథికభాషారచనలో నగపడుచున్నవి. కథలన్నిట వ్యావహారికభాషయే వినియోగించియుండినయెడల అనువుగ నుండునని కొందుము. వాక్యరచనా నైపుణియు, సన్నివేశనిర్మాణకౌశలము, పాత్రపోషణాప్రజ్ఞయు నీకథలలో గనబడవు. ఈకథలు "భారతీ" ముఖమునకొన్ని కాంచినవియ. ఈకథకునకు ఉత్సాహమునకుఁదగిన సంస్కృతి యలవడ వలెను.

'హరిత'

## రాధామాధవము

గ్రంథకర్త అట్లూరి వేంకటసీతమ్మగారు, అంగలూరు, ముద్రాపకులు, ప్రకాశకులు; కింగ్ అండ్ కంపెనీ బెజవాడ.

ఇదియొక సాంఘికనవల. క్రౌను 1/16 సైజు, 313 పేజీలు, వెల రు 1-4-0.

## దేశిరాజు పెదబాపయ్యగారి జీవనస్మృతి

కర్త: కామరాజు హనుమంతరావుగారు, బ్రాహ్మధర్మప్రచారకులు, రాజమహేంద్రవరము.

క్రౌను 234 పుటలు వెల రు 1-0-0.

సుప్రసిద్ధబ్రాహ్మధర్మదీక్షావలంబియు, సంఘసంస్కర్తయు, పరమభక్తుఁడును, శాంతస్వభావుఁడును, సాధుపుంగవుఁడును, విశుద్ధవర్తనుఁడునగు కీ. శే. దేశిరాజు బాపయ్యగారి నెరుగని సంస్కారాభిలాషులుండరు. వీరు బాపట్ల వాస్తవ్యులు. జననము వృషసం॥ ఆశ్వయుజశుద్ధషష్ఠి; మరణము ప్లవంగసం॥ ఫాల్గుణశుద్ధసప్తమి. వీరి యైహిక జీవనపరిమితి 27 యేండ్లైయైనను ధర్మజీవనపరు లందరి హృదయములందును వీరాదర్శపురుషులుగ నెన్నటికిని జీవించియుండగలరు. నమ్మినదానిని, ధర్మమని విశ్వసించినదానిని యాచరించి, బ్రాహ్మసమాజమున చేరుటవలన సంఘమునుండి బహిష్కరింపబడి, పెండ్లియాడి ప్రేమించిన భార్య తనవద్దకు పంపబడకపోవుటచే సంసారసుఖము ననుభవింపక, యౌవనముననె యారోగ్యము చెడుటవలన చాలబాధపడి యంతయు నీశ్వరార్పణముజేసి, యాతని యిచ్ఛయే నెరవేరుగాకయని యాప్రకారము జీవితయాత్ర గడపిన ధీరుఁడును, వీరుఁడునైన బాపయ్యగారినిగురించిన చరిత్ర, యతని మరణానంతర మిరువదియేండ్లయినను అతనిబంధువుఁడును, బాల్యస్నేహితుఁడును, సహధర్ముఁడును; బ్రహ్మధర్మప్రచారకులునగు హనుమంతరావుగారు వ్రాయుట యెంతయు సమంజసముగ నున్నది. బాపయ్యగారు 'మానసోపాసనయందు నిష్ఠాగరిష్ఠులై యజ్ఞోపవీతమును త్యజించి మానసరామునే ఆరాధించుచుండెడివారు. సర్వసౌభ్రాత్రమును సాధించుటకయి

వర్ణభేదములను త్యజించెను. దేశభక్తిని నిర్మలముగనుంచుటకు విదేశవస్త్రములను విసర్జించెను. ప్రకృతి సౌందర్యము బాపయ్యగారి సత్ప్రవర్తనయందె చూడగలిగియుంటిమని చెప్పుటలో యెంతమాత్రమును అతిశయోక్తి లేదు. వీరు బి.ఏ., యల్.టి ప్యాసయి కొన్నిమాసములు రాజమండ్రి కాలేజిలో ఆంగ్లేయతత్వశాస్త్రమును బోధించుచుండిరి కాని వీరికిక్కడ అగౌరవము కలుగుటచే ఆయుద్యోగమునకు రాజీనామా యిచ్చిరి.' పిమ్మట ధర్మప్రచారముచేయుటయందే కాలముగడపిరి. వీరి జీవితప్రభావమువలనను, సహవాసమువలనను, ఉపన్యాసములు, వ్రాతలు చదువుటవలనను ఆంధ్రదేశమున ననేకమంది ధర్మజీవమున ప్రవేశించిరని నిస్సందేహముగ నుసువవచ్చును.

ఈగ్రంథము ప్రతియాంధ్రుడును చదివి, వారి జీవితమువలనను, అందందు చేర్చి ముద్రింపబడిన వారి ప్రసంగములు, వ్యాసములువలనను చాలలాభము పొందగలరని నుడువవగును. ఈపుస్తకము మొదటచేర్చిన బాపయ్యగారి ఛాయాచిత్రమును, తుదిని చేర్చబడిన వీరి సమాధి చిత్రమును వీరి మరణము చెన్నపురి యందైనను, రాజమహేంద్రవరమున వీరి జ్ఞాపకార్థమును, గౌరవార్థమును వీరేశలింగంపంతులుగారు వీరి యస్థికలను భూస్థాపితముజేసి యచట సమాధి గట్టించిరి. పుస్తకప్రాశస్త్యమును పెంపొందించుచున్నవి. బాపయ్యగారు, శ్రీకోపల్లె హనుమంతరావు, దిగుమర్తి హనుమంతరావుగార్లవంటి యాంధ్రదేశపు మణి. జ.బ్ర.

### రూపవతి

గ్రంథకర్త్రి: శ్రీమతి అట్లూరి వేంకట సీతమ్మగారు, అంగలూరు.

ఇదియొక చరిత్రాత్మకనవల. క్రౌను 1/16 సైజు, 212 పేజీలుగలది. వెల రు 1-0-0.

### విషమరహస్యము

గ్రంథకర్త: వారణాసి భానుమూర్తిగారు. ప్రకాశకులు: భాగవతుల నరసింహశర్మగారు, ప్రొప్రైటర్ 'వేగుజుక్క' గ్రంథమాల, పూడిపెద్దివారి వీథి, బరంపురం (గంజాం)

ఇదియొక అపరాధపరిశోధక నవల. వంగభాష నుండి యనువదింపబడినది. కథాసంవిధాన నైపుణ్యము మనోజ్ఞముగ నున్నది. ధారాళ మగు శైలిచే పాఠకులకు పఠనీయముగ నున్నది. వేగుజుక్క గ్రంథమాల 26 వ కుసుమము. డెమ్మి 1/8 సైజు 226 పుటలుగలది.

వెల 1-0-0.

### నీతిపదవి-భాగము 1

కర్త: శ్రీ గొల్లపూడి శ్రీరామశాస్త్రిలుగారు. ఇది విద్యావినోదినీ గ్రంథమాల 7 వ గుచ్ఛము. క్రౌను 1/16 సైజు 80 పుటలు గలది. వెల రు 0-8-0.

### నీతిపదవి-భాగము 2

గ్రంథకర్త: శ్రీ గొల్లపూడి శ్రీరామశాస్త్రిలుగారు ఇది విద్యావినోదినీగ్రంథమాల 8 వ గుచ్ఛము. క్రౌను 1/16 సైజు 162 పుటలుగలది. వెల రు 0-14-0. పైరెండు గ్రంథములు దొరకుచోటు:- మేనేజరు విద్యావినోదినీ గ్రంథమాల, చిత్తూరు.

### శ్రీమదాంధ్రకార్తిక మాహాత్మ్యము

పురాణము. గ్రంథకర్త: బ్రహ్మశ్రీ అనిపెద్ది జగన్నాథశాస్త్రిగారు, కొవ్వూరు బోర్డు హైస్కూలునందాంధ్రపండితులు. డెమ్మి 1/8 సైజు 170 పుటలుగలది. వెల రు 1-0-0.

### మానవుల పూర్వావస్థ-త్రిమూర్తులు పుట్టిన విధము

గ్రంథకర్త ప్రకాశకులు; యేటుకూరు సీతారామయ్యగారు, యేటుకూరు, గుంటూరుపోస్టు. క్రౌను 1/16 సైజు; 19 పుటల చిన్ని పుస్తకము. వెల 0-4-0.

### శ్రీసూర్యసిద్ధాంత సంసిద్ధ విభవ, శుక్ల, ప్రమోదూత, ప్రజోత్పత్తి సంవత్సరముల పంచాంగమ్

పిన్నంరాజు వెంకటసుబ్రహ్మణ్యశర్మ సిద్ధాంతిగారు గుణించినది.

డెమ్మీ 1/8 సైజు 148 పుటలుగల వర్ష చతుష్ట యపంచాంగ మిది. ముందు గాయత్రీ త్రివర్ణ చిత్రపట ము చేర్చబడియున్నది. వెల రు 0-12-0 వలయువారు "క.మార్కండేయ శర్మగారు, ఎడిటరు స్వశర్మప్రకాశిని 82 పూనమల్లి హైరోడ్డు, బృందావనం, కీలుపాకు, మదరాసు" అని వ్రాయవలయును.

రానున్న మూడు సంవత్సరముల వివరములను ఇపుడే తెలసికొనగల సౌకర్య మీ పంచాంగమున గలదు.

### దాశరథివిలాసము

గ్రంథకర్త కొత్తపల్లి లచ్చయకవి. శ్రీచెలి కాని సూర్యారావుగారిచే ప్రకటింపబడినది. డెమ్మీ 1/8 సైజు 366 పుటలుగల ప్రబంధ రాజమిది. వెల రు 2-8-0. చక్కని సంపుటము. వలయువారు "శ్రీరామ విలాస ప్రింటింగ్ వర్క్సు, చిత్రాడ, పిఠాపురము" (తూర్పుగోదావరి) లేక "మేనేజరు, ఆంధ్రసాహిత్యపరిషత్తు"కాకినాడ యని వ్రాయవలయును.

---

# పత్రికలు

### కుమారబోధిని

ప్రకాశకులు:—శ్రీ సి. కుమారస్వామి నాయుడుఅండ్ సన్స్ మద్రాసు. సంపాదకులు: హరిసుబ్బారావుగారు. వివరములు: క్రౌనుక్వార్టో 24 పుటలు. ఇదియొక సచిత్ర విద్యావిషయిక మాసపత్రిక. విద్యాభిలాషులగు బాలబాలికలకును, స్త్రీలకును ఉపయోగించు సర్వతోముఖజ్ఞానసంబంధములగు వ్యాసములు కథలు, పద్యములు, పాటలు నిండు ప్రచురింపబడును. ప్రతిసంచికయు ప్రార్థనపద్యములతో నారంభమగుట ప్రశంసనీయము.

సంపుటము 2, 11-12 సంచికలును, సంపుటము 3, 1 వ సంచికయును-ఫిబ్రవరి, మార్చి, ఏప్రిలు నెలలవి-మాకందినవి.

జి. బ్ర.

### గృహలక్ష్మి

ఇదియొక నూతన సచిత్రమాసపత్రిక. మొదటి సంచిక మార్చినెలలో వెలువడినది. డాక్టరు కె. యన్. కేసరిగారిచే స్థాపింపబడి చెన్నపురి, ఎగ్మూరులోనున్న 'లోధ్రప్రెస్సున' ముద్రింపబడుచున్నది.

"ఇందు ముఖ్యముగ నారీమతల్లుల యాయురారోగ్యముల పెంపొందించువిషయములు చర్చింపబడును. జీవితయాత్రయందు స్త్రీపురుషులు సమాన వ్యక్తులని నిరూపించుటయే మాయాశయము. శరీరమనోబలముల యందు స్త్రీలు పురుషులకంటె తక్కువవారు కారని నిరూపించుటయే మాసంకల్పము......ఎల్లభంగుల స్త్రీ యుద్యమమునకు దోడ్పడుటయే మా పత్రికయొక్క ముఖ్యోద్దేశము. ఇది యశాస్త్రీయముగాదు; విజాతీయ మునుగాదు......" అని స్వవిషయమందు సంపాదకులు వ్రాసిరి. దీన నీపత్రికోద్దేశము స్పష్టమగుచున్నది. మహావాది వెంకటరత్నముగారి "ద్రౌపది గుణశీలములు" మైద వోలు పద్మావతిగారు వ్రాసిన "డాక్టరుచెసంటు" అను వ్యాసములు స్త్రీగౌరవమును చాటునవియై యున్నవి. 'వస్త్రాభరణముల నాగరికత'యను మైద వోలు చెంగయ్య పంతులుగారి వ్యాసము నాగరికతా చరిత్రను తెలియపరచుచు నాలోచనను పురికొల్పునది. 'సువాసన తలనూనెలు' 'చనుబాలు' 'శిశుపోషణ' 'స్త్రీసాముద్రికము' 'సౌందర్యపోషణము' శిశురోగము లుఅను వ్యాసములును స్త్రీలకుపయుక్తములు. శ్రీమతి కవుతా లక్ష్మీదేవిగారు వ్రాసిన 'దయార్ద్రహృదయ' యను నొక కథ యున్నది. వైద్యసంబంధ వ్యాసములును కొన్నిగలవు. 'వివిధవిషయములు' 'ఆలోచన' యను శీర్షికలక్రింద స్త్రీలయున్నతికి సంబంధించినకొన్ని విశేషములును, సంఘసంస్కారము మొదలగువానిపై నభిప్రాయములును గలవు. 'నవవర్షము' అను చక్కని త్రివర్ణచిత్రమును, డాక్టరు బెసంటు, శ్రీఆదిపూడి వసుంధరాదేవిగార్ల ఛాయాపటములు, నితరచిత్రములును గలవు. సం॥ చందా రూ. 4. విడిసంచిక 6 అ.

రెండవసంచికయు వెలువడినది.

గతసంచికా శేషములగు 'వస్త్రాభరణములు, నాగరికత', మైదవోలు చెంగయ్యపంతులుగారు వ్రాసినదియు; మహావాది వెంకటరత్నము గారు వ్రాసిన 'ద్రౌపది గుణశీలములు'; 'స్త్రీసాముద్రికము'ను గలవు. 'హిందూసంఘమునందు స్త్రీదాసియా' 'తురుష్కదేశము స్త్రీయుద్యమము', 'కీ. శే. పార్వతమ్మగారు' (వి. యన్. శర్మగారు వ్రాసినది,) 'భార్య' 'న్యూజీలండు ద్వీపమున తల్లులు-పిల్లల యారోగ్యవృద్ధికరసంఘము' మొదలగు వ్యాసములు స్త్రీలోకమున కుపయోగములు.

'గూఢవీలత' 'ఆహారము' 'సౌందర్యపోషణ-శిరోజములు-సౌందర్యము: శరీరమర్దనము' అను వ్యాసములు ఆరోగ్యము-వైద్యమునకు సంబంధించినవి.

క. యశోదాదేవిగారి 'నాకుక్కపిల్ల' రామచంద్రుని వెంకటప్పగారి 'వీరమాత' మైదవోలు పద్మావతిగారి 'పద్మిని' యనమండ్రకామాక్షమ్మగారి 'సంభాషణ'యుని కథలు.

స్త్రీలయభివృద్ధినిగూర్చి 'వార్తలు'గలవు. 'ఆలోచన'యందు సంపాదకీయములగు రాజకీయ సంఘసంస్కారాది విషయములపై నభిప్రాయములు గలవు.

మొత్తము క్రౌను 80 పుటలు. 'తుపాను' అను చక్కని త్రివర్ణ చిత్రము మొదట చేర్పబడియున్నది. కీ. శే. పార్వతమ్మగారి సంబంధములగునవి 3 ఛాయా చిత్రములును, అజంతాచిత్తరువును, 3 హైందవనారీమణుల చిత్రములును, 2 ఇతర చిత్రములును గలవు.

జ. బ్ర.

---

# వటపత్రశాయి కృష్ణుడు

సుబ్రహ్మణ్య భాగవతులుగారు

కరారవిందేన పదారవిందం ముఖారవిందే వినివేశయంతమ్;
వటస్య పత్రస్య పుటే శయానం బాలం ముకుందం మనసా స్మరామి.

సనకసనందనాదు లనిశంబును నా పదపంకజంబునన్
ఘన మకరందమున్ గొనుచు గాంచరు తృప్తి నదెట్టు లుండునో
యనుచు కరాంబుజంబున ముఖాంబుజమందు పదాంబుజంబు గై
కొను వటపత్రశాయిని ముకుందుని బాలుని సంస్మరించెదన్.

---

# సాభిప్రాయ విశేషములు

సర్ జాన్ సైమనుగారు, సహచరులు రెండు నెలలు విశాలమైన భరతఖండము నందు సంచారముచేసి స్వస్థలమునకు వెడలిరి. సర్వము గ్రహింపగలిగిరి. సామాన్యముగ జేసెడి 3 వారముల సంచారము కన్నను కన్నులకు గంతలనుగట్టుకొనిచేసిన 8 వారముల సంచారమధిక ప్రయోజనకరము గదా! మచ్చునకు దక్షిణ ప్రాంతమును ఉత్తర ప్రాంతమును పరీక్షించిరి.ఒకప్రాంతమునందుబ్రాహ్మణబ్రాహ్మణేతర విభేదములు, రెండవ ప్రాంతమునందు హిందూమహమ్మదీయ విభేదములు సైమను సప్తకమునకునోరెత్తుటకును,తిరుగుటకునుఅవకాశములను గలుగజేసినవి. కమిషనుగనుగొనదలచినది భారతీయుల విభేదములనుగాని వారి సంయోగముగాదు. చెన్నపురియందుబహిష్కారావసరములకై బ్రాహ్మణబ్రాహ్మణేతర విభేదములు తాత్కాలికముగ నంతరించినను నిరంకుశ ప్రభుత్వ మవలంబించిన మిత్రభేద తంత్రము పండినది. సైమను కమిషను బహిష్కరణము నామోదించిన మద్రాసు శాసన సభ మంత్రివర్గమును పోషించుట వింతల యందు వింతగ నున్నది. సైమను సప్తకమును బహిష్కరించుటకు కాంగ్రెసు స్వతంత్ర జస్టిసు పక్షము లంగీకరించినవి. బహిష్కరణ ప్రస్తావమున కనుకూలముగ 68 మందిసభ్యులు సమ్మతుల నొసంగిరి. ముత్తయ్యా మొదలి, సేతురత్నయ్యరు, కృష్ణనాయరు, రాజా రామారాయణంగారులు, రంగనాథం మొదలి, ఆరోగ్యస్వామిగార్లతో పాటు బహిష్కరణమున కనుకూలముగను సమ్మతుల నొసంగిరి. గోషెన్ప్రభువు రంగనాథముగారిని ఆరోగ్యస్వామి గారిని నిర్బంధముగనుపంపివేసి ముత్తయ్యా మొదలిగారిని, సేతురత్నయ్యరుగారిని మంత్రులుగను నియమించిరి.

ఆరోగ్యస్వామి, రంగనాథము గారులు యథోచిత సహకార సిద్ధాంతమునునమ్మిన స్వతంత్ర పక్ష సభ్యులు. సేతురత్నయ్యరు ముత్తయ్యా మొదలి గారులు సహకారమును నిరాకరించిన కాంగ్రెసు పక్ష సభ్యులు. కాంగ్రెసు ప్రతిజ్ఞను భంగపరచిన స్వధర్మ విఘాతకులను లాలించి సత్కరించుట నిరంకుశ ప్రభుత్వమునకు పరిపాటియైన మాయ తంత్రము. ఆ తంత్రమునందు చిక్కుకొనుటయును, దేశద్రోహమునకు గడంగుటయును స్వదేశీయుల భ్రష్టత్వమునకు నిదర్శనముగ నున్నది. నిరంకుశవర్గము దేశాభిమానులను లాలించియును, సత్కరించియును నిర్బంధించియును స్వధర్మ పరాఙ్ముఖులను జేయగల విధమును

మద్రాసుప్రభుత్వ వ్యవహారములు విస్పష్టము చేయుచున్నవి. నిరంకుశప్రభుత్వము చెప్పెడి మాటలకును, చేసెడిపనులకును సంబంధము గనుపడదు. మంత్రులు బాధ్యతగల ప్రజాప్రతినిధులు. మంత్రులు స్వధర్మమును నిర్వహించుటకు స్వపక్షవిశ్వాసమును, ప్రజా ప్రతినిధుల విశ్వాసమును గావలసియున్నవి. శాసనసభల యందు బలపోషణములులేని స్వతంత్రపక్షము మంత్రిత్వమును స్వీకరించినది. ఆ మంత్రులు నిలుచుటకు జస్టిసుపక్ష పోషణముగాని కాంగ్రెసుపక్ష పోషణము గాని యవసరమైనది. ఆరంభమునందు కాంగ్రెసుపక్ష పోషణము మంత్రులను రక్షించినది. ఇపుడు జస్టిసుపక్ష పోషణము గాపాడుచున్నది.

దంద్వప్రభుత్వమును నాశనముచేయుటకు ప్రతిజ్ఞను బూనిన రెండుపక్షములును ద్వంద్వ ప్రభుత్వమునుపోషించిధర్మమార్గమునువిడనాడినవి. రాజా రామారాయణంగారు కాంగ్రెసుపక్షమవలంబించినయనుచితమార్గము నవలంబించుటవలనను వారియాచరణము ధర్మయుక్తముగా జాలదు. జస్టిసుపక్షముద్యోగాధికార లాభమునకు దేశము నధోగతిపాలు చేసినది. రాజా రామారాయణంగారు స్వపక్షలాభమునకును, బ్రాహ్మణేతర పక్ష లాభమునకును బ్రాహ్మమంత్రుల నాడించుటవలనను జస్టిసుపక్షమునకును, దేశమునకును నపారమైన నష్టము సంప్రాప్తము గాగలదు. లాభము గలుగబోదు. ఉద్యోగములకై దేశ ద్రోహము చేసెడివారి వలనను దేశమునకు గాని, పక్షములకుగాని, ధర్మమునకుగాని ప్రయోజనము గలుగజాలదు. దేశమంతయును సైమను కమిషను బహిష్కారధ్వనులతో మారుమ్రోగుచున్నపుడు, సైమను కమిషను బహిష్కారమును చెన్నరాష్ట్రసభ యామోదించినపుడు దానికి విఘాతమును గలుగజేయుట ఆత్మనాశనమునకు సాధనముగాని యాత్మోద్ధరణమునకు సాధనము గాదు. దేశమంతయును నిరంకుశాధికారాయత్తమై క్షీణించుచున్నపుడు జస్టిసుపక్షమునుక్షీణించునుగానిబలియజాలదు.

జస్టిసుపక్షులక్ష్యము బ్రాహ్మణ ప్రతిషేధముతో సంతృప్తిని బొందుటవలనను బ్రాహ్మణేతరులవికాసము గలుగజాలదు. బ్రాహ్మణుల యుద్యోగములుబ్రాహ్మణ సంఘవికాసమునకు వినియోగపడియుండలేదు. సర్ రామస్వామయ్యరుగారి న్యాయాంగాధికారము బ్రాహ్మణుల యభ్యుదయమునకు వినియోగపడ లేదు. కృష్ణనాయరుగారి న్యాయాంగాధికారమును బ్రాహ్మణేతర సంఘము నుద్ధరింప జాలదు. ఉద్యోగాధికారాపేక్ష దేశ వినాశనమునకు దోడ్పడుచున్న విధమున కంతర్విభేదములె పరమప్రమాణములుగ నున్నవి. పక్షముల యధర్మాచరణమును వ్యక్తుల యధర్మాచరణమును మీరిపోయిన విధమును సుబ్బరాయనుగారి మంత్రివర్గము విశదము చేయుచున్నది.

* * * *

సుబ్బరాయనుగారి మంత్రివర్గము

సుబ్బరాయనుగారిమంత్రివర్గము పరమాసహ్యమును గలుగజేసినది. సుబ్బరాయను

గారు స్వప్రయోజనార్థము మంత్రిపదవిని పట్టుకొని వ్రేలాడుట నీతిబాహ్యముగ నున్నది. స్వపక్షసభ్యులు కొందరు వేరుపడి విశ్వాస రాహిత్యమును వ్యక్తముచేసిరి. శాసన సభలోని ప్రజాప్రతినిధులు సైమనుకమిషను బహిష్కారణమును నిర్ధారణచేసిరి. సుబ్బరాయనుగారు శాసనసభాభిప్రాయమును స్వయముగ నిరసించిరి. సభాభిప్రాయమును శిరసావహించిన ఆరోగ్యస్వామి, రంగనాథముగార్లను నిర్లక్ష్యము చేసి నిరంకుశవర్గమున కభయము నొసంగి మహాపరాధ మొనరించిరి. నిరంకుశాధికారులు గోరునటులు సైమను వర్గముతో గలిసి పని చేయుట కంగీకరించి మిత్రద్రోహము, దేశద్రోహము, ధర్మద్రోహము చేసి రాజ్యాంగ జీవనమును కళంకపూరితము చేసిరి. ధనాధికార పిశాచముల ప్రభావమును సుబ్బరాయనుగారి యుద్యోగకాంక్ష విశదము చేసినది.

సేతురత్నయ్యరుగారు కాంగ్రెసుపక్షమున జయమొంది స్వతంత్ర పక్షమునను జేరిరి. సైమనుబహిష్కరణమునకు సమ్మతి నొసంగి మంత్రిపదవిని స్వీకరించి సైమను కమిషనుకు తోడ్పడుట కంగీకరించిరి. మిరాశీదారైన సేతురత్నయ్యరుగారి కధికారపిశాచము పట్టినది. స్వాగతములు, విందులు, సెలూనులు, బుజ్జగింపులు, తెల్లదొరల ప్రసన్న వదనములు, అయ్యరుగారికి చిత్తవికారమును గలుగజేసినవి.

ముత్తయ్య మొదల్యారుగారి చరిత్రము మంత్రిపదవి చరిత్రమె. జస్టిసు పక్షమునందు ప్రయోజనము గలుగక కాంగ్రెసు పక్షము నందు జేరిరి. కాంగ్రెసుపక్షమునందు వినాయకులై మంత్రిపదవిని గడించిరి. కాంగ్రెసుపక్షప్రతిజ్ఞ సైమను వర్గ బహిష్కరణము దేశప్రయోజనములు ధనాధికారముల సమక్షమునను నిరర్థకములైనవి. మంత్రిపదవుల విషయమై రాజ్యాంగ పరిజ్ఞానమును, ధర్మనిర్వహణమును ననవసరమైనది. రాజా రామారాయణం గారి ప్రాపకము, నిరంకుశవర్గప్రాపకము మంత్రుల నేర్పాటు చేయుటకును తొలగించుటకును నేర్పడినవి. శాసనసభాధికారము శూన్యముగ నున్నది. సిద్ధాంతమునం దేర్పడిన ద్వంద్వ ప్రభుత్వమైనను ఆచరణమునందు శూన్యముగ నున్నది. అధికారుల ప్రాపకము, నియోజితుల ప్రాపకము మంత్రివర్గమును పోషించుచున్నవి. శాసన సభాపోషణము పేరునకుమాత్రము గలదు.

* * * *

అధికారవర్గము

నిరంకుశాధికారదుర్గము నిర్భేద్యముగ నున్నది. విన్నన్న చెప్పినది వేదమను రీతి నధికారుల యాటపాటలు చెల్లుచున్నవి. మోయరుగారు నియోజితసభ్య లధికారగీతమున కనురూపముగ నాడవలయు నని సిద్ధాంతము చేసినారు. నిరంకుశవర్గపోషణము గల యే ముగ్గురో మంత్రులై బొమ్మలవలె నాడగలరు. అధికారుల కిది పరమానందమును గలుగజేయుచున్నది. పాపము నోరులేని ప్రజల నధికారవర్గ మీవిధముగనె రక్షించుచున్నది.

అధికసంఖ్యాకులైన బ్రాహ్మణేతరులకును నీ రక్షణమె ప్రశంసాపాత్రముగనున్నది. గోషెను ప్రభువును కార్యనిర్వాహకసభ్యులును చూపిన యధర్మము నిరంకుశవర్గస్వభావమును విశదము చేయుచున్నది. అధికారహృదయమును పీడించుచున్న పిశాచప్రభావమును వేంకట్రామ శాస్త్రిగారి యుదంతము వేయినోళ్లను చాటుచున్నది.

వేంకట్రామ శాస్త్రిగారిని న్యాయాంగ సభ్యునిగ నియమించివారిని సంప్రతించకనువారి ముఖ్యాధికారములను తీసివేయుట తెల్లదొరల దురభిమానమును విశదము చేయుచున్నది. దాసోహమ్మను వారల కభయము నొసంగుటయును, స్వతంత్రులను నిరాకరించుటయును నిరంకుశప్రభుత్వమునకు పరిపాటియైన మహాతంత్రముగ నున్నది. అధికారులు యోచించి యోచించి సౌమ్యస్వభావముగల వేంకట్రామ శాస్త్రిగారిని నియమించిరి. పర తంత్రులకు ముఖ్యముగ భారతీయులకు పరిపాటి యైన ఉద్యోగభిక్షతో వారిని వంచనచేయను సంకల్పించిరి. ఈసంకల్పమునకు భారతీయ సోదరులెందరు మంత్రాంగము చేసిరో భగవంతున కెరుక. ఆత్మగౌరవములేని యాచకులు నిస్సారపువస్తువులకు కుక్కలవలె తోకలాడించుచు నానందించెడి విధమును భర్తృహరి చేసినగంభీరవర్ణనము ప్రస్తుతపరిస్థితులకు దగియున్నది. ఉద్యోగాధికారములకై ఆత్మగౌరవమునువిడిచి మందహాసము చేయుచు, వంగి సలాములు చేయుచు తెల్లనల్లదొరల వెంటబడుట భారతీయుల పతితస్థితిని వేయినోళ్లను జాటుచున్నది. వెంకట్రామశాస్త్రిగారీమహాసమ్మోహమును విడిచి వారి యుద్యోగమునకు రాజీనామా నిచ్చి వారి యాత్మగౌరవమును భారత జాతీయాత్మ గౌరవమును ముఖ్యముగ బ్రాహ్మణుల యాత్మగౌరవమును కాపాడి ప్రజలకృతజ్ఞతకు బాత్రులైరి. వెంకట్రామశాస్త్రిగారిత్యాగము షేక్స్పియరు మహాకవి ఓథెల్లొముఖమున

"నాయొక్క ధనము నపహరించిన వాడు చెత్త నపహరించుచున్నాడు. నాయొక్కగౌరవము నపహరించినవాడు . నా సర్వస్వము నపహరించుచున్నాడు"

అని తెలిపినభావమును సంస్మరింపజేయుచున్నది. వెంకట్రామశాస్త్రిగారు 6000 రూప్యముల జీతమును పోగొట్టుకొనినను నిత్యమైన కీర్తినిగడించి స్వాతంత్ర్యసంపాదనకు మార్గదర్శకులుగ నున్నారు. ఆత్మగౌరవముగల భారతీయులెవరును వారు విడిచిపెట్టిన నిస్సారమైన యుద్యోగమును గైకొనజాలరు. కాని ఉద్యోగ వ్యామోహము, బ్రాహ్మణ ప్రతిఘటనము నందలమందికాశను గల్పించినవి రాజారామారాయణంగారు లబ్ధావకాశమును బిగియించి కృష్ణనాయరుగారికిన్యాయాంగాధికారమును సమకూర్చిబ్రాహ్మణేతరులమన్ననలకుపాత్రులైనను, ఆత్మగౌరవమును జాతీయగౌరవమును మలినముచేసిరి జలప్లావనశాఖను, రక్షణశాఖను(Irrigation and Police Departments) తిరిగి సంక్రమింప జేకొని నైనను కృష్ణ నాయరుగారి కుద్యోగమునిప్పించుట న్యాయముగ నుండెడిది. గోతిదగ్గర నక్కలవలెను ఉద్యోగ శవములకై నిరీక్షించెడి దేశమునందిది యసంభ

వము గదా! పతితులైన భారతీయులు పాతకు లగుట సహజమైనను న్యాయప్రవర్తకులైన యధికారులు పాతకులగుట యనుచితముగనున్నది. చెన్నరాష్ట్రమునందధికారు లవలంబించిన మాయాతంత్రము బ్రిటీషు ప్రభుత్వమునకు సహజమైన రాజ్యనీతిని, వారి బలాబలములను విశదము చేయుచున్నది.

గోషెను ప్రభువును, వారి మంత్రులును నవలంబించిన రాజ్యతంత్ర మధికారవర్గమునకు సహజమైన ధర్మ విపర్యాసమును భారతీయులకు సహజమైన దుర్బలత్వమును విశదము చేయుచున్నది. చెన్నరాష్ట్రమునందు గోషెన్ప్రభు వవలంబించిన తంత్రము సకలవిధములను న్యాయవిరుద్ధముగ నున్నది. శాసనసభ సైమనుకమిషను బహిష్కరణమును నిర్ణయించినది. ఆ నిర్ణయమును పోషించిన సభ్యులను మంత్రులనుగను, కార్యనిర్వాహక సభ్యులనుగను నియమించి సభావ్యవహారములను నడిపించుట న్యాయవిరుద్ధమని రాజ్యాంగధర్మము వ్యక్తము చేయుచున్నది. గోషెన్ప్రభువునకును వారి యనుచరులకును ధర్మాధర్మములతో ప్రమేయము లేదు. సైమనుకమిషను బహిష్కరణమును భేదించుటయును, నిరంకుశాధికార ప్రాబల్యమును స్థాపించుటయును వారిసంకల్పము. మంత్రులును గోషెన్ప్రభువును కన్నులు మూసుకొని వారిసంకల్పము సఫలమైనదని యానందించినను లోకమును దైవమును ధర్మమును వంచింపజాలరు. ప్రజాభిప్రాయమును, నాయకుల యభిప్రాయమును బహిష్కరణమున కనుకూల మని ప్రాజ్ఞు లంగీకరించుచున్నారు. ఆంగ్లాభిమానపూరితము లైన పయొనీయరు పత్రికయును నితర పత్రికలును బహిష్కరణప్రాబల్యము నంగీకరించుచున్నవి. ఫెన్నెరుబ్రాక్వేగా రీవిషయమును విస్పష్టము చేసిరి. సర్ జాన్ సైమనుగారి ప్రగల్భవాక్యములందును సంశయభావములు వ్యక్తమగుచున్నవి. సర్వత్ర తెలిసిన సత్యమును మరుగుపరచుటకు గోషెన్ప్రభు వవలంబించిన కుతంత్రము రాజ్యాంగధర్మమును, నీతిమార్గమును ధ్వంసముచేసినది. శాసనసభను విచ్ఛిన్నముచేసి క్రొత్తశాసనసభను సమావేశము చేయుట న్యాయసమ్మతమై యుండియుండును. గోషెను ప్రభు వవలంబించిన కుతంత్రమును పోషించిన మంత్రులు సభ్యులు నాయకులు దేశద్రోహపాతకమునకు ఒడికట్టుకొని నిరంకుశాధికారవర్గమున కభయము నొసంగిరి. ఇకనైనను భగవంతు డీమహానుభావులకు జ్ఞానోదయమును గలుగజేయుగాత!

సంయుక్తరాష్ట్రములందు మధ్యరాష్ట్రములందు మంత్రులును, గవర్నరును నవలంబించిన మార్గమును చెన్నరాష్ట్ర మవలంబించుట ధర్మమై యున్నది. చెన్నరాష్ట్రము భరతవర్షమునందు మాలిన్యస్థలమని బెజంటమ్మగారు తెలిపిన భావము సత్యముగ నున్నది. మద్యపాననిషేధవిషయమునను, విద్యావిషయమునను మంత్రివర్గ మవలంబించినదుస్తంత్రము వారిపతితస్థితిని దెలుపుచున్నది: సైమను కమి

షనుబహిష్కారము నామోదించిన శాసనసభ ఆకమిషను ఖర్చుల నామోదించుట హేయముగ నున్నది. భారతీయుల పరాధీనతయె పరమానర్థములకును గారణంబుగ నున్నది. ప్రజల నిస్సహాయస్థితియె నాయకుల యవినయమునకును నిరంకుశాధికారుల నిర్భయత్వమునకును గారణముగ నున్నది. ఈ పరమార్థమును గ్రహించి ప్రజలు స్వీయశక్తినిగ్రహించి నాయకులకును, అధికారులకును జ్ఞానోదయమును గలుగజేయుటకు పాటుపడవలసి యుందురు.

* * * *

సామ్రాజ్యశాసనసభ

సామ్రాజ్యశాసనసభయందు నాయకులు చూపిన ధైర్యస్థైర్యములు ప్రజాభిప్రాయమును విస్పష్టము చేయుచున్నవి. నాయకులుమోపిన నేరారోపణములకు నిరంకుశ వర్గమున కాగ్రహముగలిగినను నిరుత్తరస్థితి గలిగినది. శాసనసభ నిరాకరించిన సొమ్మును రాజప్రతినిధి ధ్రువపత్రముఖమునను సమర్థింప గలిగెను. శాసనసభ నిరాకరించిన సైనిక వ్యయమును, రైలువ్యయమును రాజప్రతినిధి సమర్థించెను. నెహ్రూగారునిర్భయముగ అధికారుల నిరాదరణమునకు పరివర్తనము ఫలమని విశదము చేసెను. అధికారవర్గము పటేలుగారికిని అనధికారుల సభ్యులకును జూపిన యగౌరవము నిరంకుశాధికారుల నిర్లక్ష్య స్వభావమును విశదము చేయుచున్నది నిరంకుశాధికారమును ప్రతిఘటించుటకు శక్తిలేనినాయకు లేమిచేయగలరు? హిందూ మహమ్మదీయ విభేదములు ప్రజాశక్తిని స్తంభింప జేసినవి. దేశమునందు ప్రజాశక్తిని విజృంభింపజేయుటకు నాయకులు కార్యవిధానము నేర్పాటుచేయదలచుట శుభసూచకముగ నున్నది.

వంగదేశమవలంబించుచున్న విదేశవస్త్ర బహిష్కరణము ప్రజాశక్తిని విజృంభింపజేయుటకుపరమసాధనముగనున్నది. ఆంగ్లేయ వస్త్రవ్యాపారమును స్తంభింపజేయుటకు దేశమంతయును నేకముఖమున పనిజేసిన ప్రజాశక్తి విజృంభించుట కవకాశము లేర్పడగలవు. గాంధిమహాత్మునకును బట్టలయంత్రాలయముల యజమానులకును జరిగిన సంప్రతింపులు విఫలములగుటయందు విచిత్రముగను పడదు. దేశహితార్థము సర్వత్యాగము చేసిన గాంధిమహాత్ముడు పరమ విశ్వాసమును బూని యంత్రాలయాధికారులు వారి లాభములను దేశహితమునకుతగ్గించుకొనవచ్చుననినమ్ముట సహజము. ధనస్వామ్యము లిట్టిపని బుద్ధిపూర్వకముగ నెప్పటికిని జేయజాలరు. విదేశయంత్రాలయములపోటీలకు తాళజాలకను, గత్యంతరములేకను నష్టమును ననుభవింప గలరు.

దేశమునకాత్మవిశ్వాసబలము జనసామాన్యమువలన గలుగగలదుగాని విద్యావంతుల మూలమునను, ధనవంతుల మూలమునను గలుగజాలదు. అసహాయోద్యమానుభవ మీ సత్యమును వెల్లడిచేసినది. సహాయ నిరాకరణోద్యమము క్షీణించుచున్నందులకు చింతిలువారు గలరు. దాని నుద్ధరించుటకు గాంధి

మహాత్మునితో గలిసిపనిచేయువారుమాత్రము స్వల్పముగ నున్నారు. నాయకు లందరును శాసనసభలను నిరసించుచున్నారు. కాని నిర్మాణకార్యవిధానమునందు బుద్ధిని లగ్నము చేయజాలకున్నారు. ఖద్దరుఉద్యమము విదేశ వస్త్ర బహిష్కరణము పరస్పర సంబంధమును గలిగియున్నవి. నాయకు లీ యుద్యమములను సఫలముచేయుటకు పాటుపడిన దేశ దైన్యమును తొలగించుటకు మార్గ మేర్పడ గలదు. ఆంధ్ర రాష్ట్రకాంగ్రెసు సంఘాధ్యక్షులు ప్రకాశము పంతులుగారు నాయకులలక్ష్యము శాసనసభల నుండి క్రియారంగమునకు మారవలసినయవస రమును వారి యనుభవానంతరము విశదము చేసియున్నారు. దేశహితైక పరాయణులు- ముఖ్యముగ నాంధ్రులు- వ్యవసాయ పరాయ ణులై స్వధర్మ నిర్వహణమును జేయవలసి యుందురు.

* * * *

ఆంధ్రరాష్ట్రము

ఆంధ్రరాష్ట్రస్థితి సకలవిధములను దుర్భ రముగ నున్నది. ఆంధ్రోద్యమాంగము లన్ని యును కృశించి బలహీనముగ నున్నవి. ఆంధ్ర విశ్వవిద్యాలయము మూడేండ్లకు పూర్వము స్థాపితమైనను పోషణము లేకపుట్టినరీతినె నిలిచి యున్నది. స్థలాభిమానము పెచ్చుపెరిగి విశ్వ విద్యాలయ ప్రయోజనమును నిరర్థకము చేసి నది. స్థలాభిమానము ఆంధ్రప్రయోజనమును, విద్యాప్రయోజనమును సంకుచితము చేసినది. అనంతపురము, బెజవాడ, రాజమహేంద్ర వరము, విశాఖపట్టణము ప్రధాన కేంద్రస్థాన గౌరవమును బడయుట కెత్తులను పై యెత్తు లను పన్నినవి. బెజవాడయందుగల కార్యస్థాన మును మార్చుటకు చేసినతంత్రము లంతఃకల హములకు గారణంబులైనవి. ఉపసంఘము తెలిపిన నిర్ణయములు నిర్ణయములుగ నున్నవి. ఎప్పటికప్పుడు శాసనసభయందు ఉపసంఘ నిర్ణయములను పరిష్కరించుటకు స్థలాభిమా నులు వెనుకంజవేయుచు నిజప్రయోజనమును స్తంభింపజేయుచున్నారు. సెప్టెంబరు సమా వేశము వరకును విషయనిర్ధారణమును విర మించుట "ఆలస్య మమృతం విషం" అను నార్యోక్తిని సంస్మరింప జేయుచున్నది. కాల యాపనమునను, ధనాగమనము లేకను విశ్వ విద్యాలయ ప్రయోజనము దూరస్థమగుచు సంశయములకు గారణంబగుచున్నది. "క్షణశః కణశశ్చైవ విద్యామర్థంచ సాధయేత్" అను నార్యోక్తి వ్యక్తులకువలెను, సంస్థలకును నన్వ యించుచున్నది గుంటూరు,కృష్ణాజిల్లాబోర్డులు మొదటవాగ్దానముచేసిన విరాళములనునిలుపు దలచేసినవి. ప్రభుత్వము కార్యస్థానము నిర్ణ యము గానంతవరకును ద్రవ్యము నొసంగు టకు నిరాకరించినది. విద్యాభివృద్ధి కాంధ్ర దేశమునకు వినియోగ పడవలసిన ద్రవ్యము నైనను వినియోగించుట కధికారులు నిరాక రించుచున్నారు. ఈవిషమస్థితికి ప్రభుత్వ నిరా దరణమువలె ఆంధ్రనాయకుల యంతఃకలహ ములును గారణంబులుగ నున్నవి. అనవసర ముగ శ్రీపిఠాపురం మహారాజుగా రఖ్యాతి

పాలై ఉపాధ్యక్షపదవిని వదులుకొనుట సంతాపకరము. ఆపదవికి జయపూరు మహారాజు గారు నియమింపబడుట యుక్తముగ నున్నది. మహారాజుగా రాంధ్రత్వాభిమానమును బూనుదురుగాత! శ్రీయుత రామలింగా రెడ్డి గారిని, సుబ్రహ్మణ్యంచెట్టిగారిని తిరిగి యెన్ను కొని సినేటు స్వధర్మనిర్వహణమును జేయుట సంతృప్తికరముగ నున్నది

ఆంధ్రరాష్ట్రనిర్మాణ ప్రయత్నములును ఆంధ్రవిశ్వవిద్యాలయ నిర్మాణమువలెనే ప్రభుత్వాదరణమును బడయకున్నది. చెన్నరాష్ట్రశాసనసభ చేసిన ఆంధ్రరాష్ట్రతీర్మానమును ప్రభుత్వము బుట్టదాఖలుచేసినది. ఆవిషయమై ప్రభుత్వ మేవిధమైన ప్రయత్నములనుజేయుట లేదని ప్రభుత్వసభ్యు లొప్పుకొనిరి. అధికారుల చిత్తవృత్తిని మరల్చుట కెవరికిని సాధ్యము గాదు. ఆంధ్రు లాంధ్రరాష్ట్రవిషయమై ప్రబలమైన యాందోళనమునుజేయవలసిన యవసరమును దేశపరిస్థితులు విశదము చేయుచున్నవి. ఆంధ్రోద్యమాశయములను సఫలము చేయుటకున్న తాధికారములం దాంధ్రులకు స్థానము లేకున్నది. మంత్రులునుకార్యనిర్వాహకసభ్యులును ఆంధ్రేతరులుగ నున్నారు. మోచర్ల రామచంద్రరావుగారు వయోవృద్ధులని పనికి రానపుడు వయోవృద్ధులైనకృష్ణనాయరుగారెటులు పనికి వచ్చిరో తెలియకున్నది. ప్రభుత్వమునందువలెనే ప్రజలయందును ఆంధ్రనాయకులకు పలుకుబడిలేని విధమును కాంగ్రెసుసంఘముల స్థితిగతులు విశదము చేయుచున్నవి.

గాంధిమహాత్ము డాంధ్రుల యంతర్విభేదముల విషయమై తెలిపిన సంతాపము పరమ విచారమును గలుగ జేయుచున్నది. సహాయనిరాకరణోద్యమ ముచ్చదశయందున్న సమయమునను ఆంధ్రుల ప్రతిభయును నుచ్చదశ నధిష్ఠించి గాంధిమహాత్ముని యాశీర్వాదమును బడసినది. సహాయనిరాకరణోద్యమమునీచదశయందున్నపు డాంధ్రుల ప్రతిభయును నీచదశను బొందినది. దేశమునం దంతటను నాయకులు బయలుదేరిరి. ఒకరిమాట యొకరికి సరి పడకున్నది. కాంగ్రెసు సంఘములు లేవు. సంఘములందు సభ్యులు లేరు. ప్రజలకు వారి కర్తవ్యము గోచరము గాకున్నది. అన్ని సంఘములందును నుద్యోగాధికారాభిలాష తీవ్ర రూపమును దాల్చుచు కలహ కారణములను బెంచుచున్నది. కాంగ్రెసుముగిసిమూడుమాసములైనను కాంగ్రెసుపని జరుగకున్నది. నిర్మాణ కార్యవిధానమును బ్రిటీషువస్తు బహిష్కరణమును జరుపుటకు ప్రయత్నములు జరుగుట లేదు. కాంగ్రెసువ్యవహారములకన్నను తంతుకారవ్యవహారములు కొంత సంతృప్తికరముగ నున్నవి. గాంధి మహాత్ముని కార్యనిర్వహణ దీక్షయె దీనికి గారణమై యున్నది.

ఆంధ్రరాష్ట్రమునందు తంతుకార సంఘ వ్యవహారములు తమిళనాడునందువలె సంతృప్తికరముగగనుపడవు. ముఖ్యకారణములు ధనాభావమును,సంయోగాభావమును నని గ్రహింప

దగియున్నవి. గాంధిమహాత్ముని ఆంధ్రదేశసంచారము నానాటికి వెనుక బడుచున్నది. మహాత్ముని సంచారములేక ద్రవ్యము సమకూడుట దుర్లభముగ నున్నది. తంతుకార సంఘము నకు బాకీపడియున్న బాకీలను చెల్లించుటకు ప్రజానాయకు లలసత్వమును జూపుచున్నారు. తంతుకారసంఘప్రచారకులును పరస్పరవిశ్వాసములేకను ఖద్దరు ప్రచారమును చేయజాలకున్నారు. ఈవిభేదములకు కల్తీఖద్దరు తోడ్పడి ఖద్దరుప్రచారమును స్తంభింప జేయుచున్నది. ద్రవ్యాభావము, సంయోగాభావము, కల్తీ ఖద్దరు ఖద్దరు ప్రచారమున కాటంకములుగ నేర్పడినవి.

ఇట్టి సంకులస్థితి యందు రాజ్యాంగములందును, ఖద్దరురంగమునందును నితర పనులందును ప్రజలు పూనికనుబూని చేయవలసిన కార్యము సంశయాస్పదముగనున్నది. దేశము నావరించిన విశాలావస్థ సర్వత్ర ప్రత్యక్షమగుచున్నది. దేశావృతమైన మాంద్యమును పోగొట్టుటకు ప్రజానాయకులు కార్యశూరులు గావలసిన యవసరమును దేశము సహస్ర ముఖముల చాటుచున్నను చిరకాలాభ్యస్తమైన వాగాడంబరమె ప్రజానాయకుల దృష్టి నాకర్షించుచున్నది. వర్తమానమాంద్య దశ యందు ప్రజానాయకులు వారి లక్ష్యమును బ్రిటీషువస్త్ర బహిష్కరణమువిూదను, ఖద్దరు ఉద్యమమువిూదను లగ్నముచేయుట కార్యసిద్ధికి సాధనముగనున్నది. ఆంధ్రమహాజనులీ పరమార్థమునుగ్రహించి స్వయంసహాయవ్రత పరాయణులై కార్యరూపమున సంకల్పసిద్ధిని బడయుటకు భగవదనుగ్రహమునకు బాత్రులగుదురు గాత!

---

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No.7, Thumbu Chetty Street, G.T, Madras.

# విషయానుక్రమణిక

# చిత్రములు

త్రివర్ణచిత్రములు:—కర్షకుడు; బీదవాని గుడిసె; కోడిపుంజు.

సాధారణ చిత్రములు:—బర్మా వెండిపనిచిత్రములు ౮; అమరావతిచిత్రములు ౪; భూగర్భమునుండి క్రొత్తగ వెలువడిన శిల్పచిత్రములు ౮; ఇతరచిత్రములును.




చెన్నపట్టణము, మే ౧౯౨౮

సంపుటము ౫    విభవ సంవత్సరము వైశాఖమాసము    సంఖ్య ౫


## సీతాంజనేయము


సెట్టి లక్ష్మీనరసింహము గారు


ఆహా! యెంతటి చల్లనైన నుడి! యన్నా పావనీ, నాదు సం
దేహం బాఱఁగ పల్కుమా మరలః మచ్చిత్తేందు కాంతోల్లస
న్నీహారాంశు నిభుండు నావిభుఁడు తా నిక్కంబుగా నాపయిన్
మోహంబున్ విడనాడకుండ ననుఁ గన్గొమ్మంచు నిన్నంపెనా?

నా విభుఁడు, నాప్రభుఁడు, నాదు దేవుఁడు నను-వెదుక నిన్నంపె నను నుడి వీనులందుఁ
బడి, మడియఁ నున్నయట్టి నాప్రాణపు మొలకలకు నమృతరసపు జడిగాఁగఁ దేలె.

దయితుని క్షేమంబును, నాప్రియునికి నాయెడలఁ గలుగు ప్రేమంబును నీ
క్రియఁ దెలియవచ్చుటం బతి-వియోగసాగరము నీఁద వీలు ఘటిల్లెన్,

"చచ్చితి లక్ష్మణా", యని నిజంబుగ భర్తృగళ స్వరంబుతో
వచ్చిన కేక నాకు వినవచ్చినదాదిగ సోకుమూకచే

నొచ్చెనో నాథుఁడంచును మనోగతసంశయ మొందు కల్గి నే
నిచ్చలుఁ గుందుచుందు: నది నేఁటికిఁ దీఱెను నీదు మాటలన్.

"అమ్మా, యన్నకు వచ్చినట్టి భయమే? మమ్మేటి శ్రీవిష్ణు వే
సుమ్మా, దైత్యుల మాయలం బడకు", మంచున్ లక్ష్మణుండన్న, నే
నమ్మంజాలక యమ్మఱంది నతి నిందావాక్యముల్ పల్కి పా
పమ్ముం జేసితిఁ, దత్ఫలం బనుభవింపన్ యోగ మిట్లుంటచే.

మఱంది మాటలటుండ, నేనెఱుఁగనె పురహరధనుష్ఖండనుఁడు, ఖరాద్య సురదండ
నప్రచండ దోర్దండమండనుఁడు నైన-మామక మనోవిభుని మహిమంబు మున్న?

అప్పటి కేమిమాయ కనులం దకటా! పొగమంచు కైవడిం
గప్పెనో కాని, లక్ష్మణుని గానకు గెంటుమె కా కలంచు న
న్నెప్పుడు దాఁటకుండ విధియించిన గీఁతను దాఁటివచ్చి యీ
త్రిప్పుల పాల నేను బడితిం; జెడిరిన్ శని నెత్తిఁ దన్నుటన్.

శని వేఁటే మఱియేల? భిక్షుకుని వేషంబూని యేతెంచి, గీఁ
తను నే దాఁటిన యంత నే పదితలల్, దట్టంపుమీసంబు, లె
ఱ్ఱని గ్రుడ్లిర్వది చేతులున్, నిడుదకోఱల్, జుంజురుల్ వెండ్రుకల్
తనరన్ రావణుఁడొందె నష్టమశని స్థానంబు నాపాలికిన్.

వాని వెడరూపుగని పయి-ప్రాణంబులు నాకుఁ బైకిఁ బాఱెమె యుండన్
నే ననుభవింపవలసిన-నానాకష్టముల బలము నన్నిల నిలిపెన్,

నా కష్టంబులు లోకమందు మఱి-యే నారుల్ పడంబోరు; ము
ల్లోకంబుల్ వడఁకింపఁజాలు పతి యాలున్ నేను; రాకాసి తేఁ
డేకాన్నిమ్మటువంటి నన్ బలిమిమై నిట్లీడ్చునా లంకకున్?
కాకుల్ గ్రద్దలు పీకఁగా వలదె తత్కాయంబు నీపాటికిన్?

గ్రద్దమైన జటాయు వా ఖలుని కాయ-మును నఖంబులఁ బీకఁగాఁ బూనుకొనెను
గాని, 'పాపీ చిరాయు'వన్కారణమున, నా యభాగ్యంబునను జావఁడాయె వాఁడు.

ననుఁ జెఱగొన్న యా దనుజనాథుని పాపపుఁ జేతులెప్డు కూ
లునో? మరుఁగొంది నగ్గని ముడుంగని పాపపుఁ గన్నులెప్డు ప్రే

లునో? ననుఁ గాఱులాడుటకు లోఁగని పాపపు నాల్కలెట్లు వ్రీ
లునో? యలపాపి మేను చితిలోఁబడి బగ్గున నెట్లు కాలునో?

అంత దనుకను బగ్గుబగ్గనుచుఁ గాలుచుండుఁగాని, నాదుఃఖాగ్ని యుడుకు చెడదు: నడుమ నడుమ నద్దానికిఁ బుడకలయ్యె-రావణుఁడు వచ్చియనిన దుర్భాషణములు.

కుతకుత మండుచుండుఁజుమి కోపమహాగ్నియు దుఃఖవహ్నితో
జతయయి, వాఁడు పల్కు పరుషంబులు విన్నతఱిన్ మహానల
ద్వితయమిదేల కాల్పదు మదీయశరీరము? నన్ మహాపతి
వ్రత నిటుఁక్షోభ పెట్టియును వాఁడును భస్మముకాఁ డదేటికో?

అటులు నేఁజావకున్న నేమాయె? తల్లి-భూమిదేవి నాకన్నీటిబొట్లు పడిన యపుడు వానిలోనికిఁ గొన్నయట్లు నన్నుఁ-గూడఁ దనలోనికిం జేర్చుకొనఁగరాదె?

ఆకరణిన్ ధరంబడిన యశ్రువు లొక్కటి రెండు మూడు నా
ల్గా? కనులే ద్రవించినటు కంటికిమంటికి నేకధారగా
శోకము నేనుబొందుట, నశోకవనంబిది నేతిబీరకా
యే కద? తోడుఁబుట్లగుట నేడ్చుచు నున్నవి చెట్లు నిచ్చటన్.

భర్తృవిహీనహా బ్రదుకఁ బాయుట కాదిని నిశ్చయించి యుం,
గర్తృత యిందు నిక్కముగఁ గాంతుని కున్నది గాని నేను సం
పూర్తిగ నస్వతంత్ర నను బుద్ధిని బ్రాణములన్ భరించి, త
న్మూర్తిని సంతతంబును మనోగతదృష్టులఁ జూచి మ్రొక్కుదున్.

క్రొమ్మెఱుంగుల మ్రింగు గుబురు మబ్బుల రంగు మించి చాల వెలుంగు మేనితోడ,
నిండు పున్నమనాఁటి పండువెన్నెలసాటి నాఁదగు తగుపాటి నగవుతోడ,
తేనియల్ దిగజాఱు తెలిదామరల మీఱుచును గనికరమూఱు కనులతోడ,
మగఁటిమిసిరికింద మందిరమ్మన సుందరమ్మయిన వెడంద ఱొమ్ముతోడ,
మూర్తిమంతుఁడై మన్మనోముకురమందు-నావిభుండు ప్రత్యక్షమై, "దేవి, భయము
వల" దనుచుఁ దెలుప నిబ్బరంపడుచునుంటి-నావిభుని క్షేమమునుగూర్చి నన్నుఁగూర్చి.

విభుని క్షేమంబెఱుంగు టవ్విధినె కాదు-నేలఁ బొరలి, కేలుదగిలి, నీళ్లఁగడిగి
యును జెడక నానొసట నిల్చియున్న యట్టి-కుంకుమపుబొట్టు జంకు పోఁగొట్టుచుండు.

ఆబొట్టును, బలికట్టిన-యీబంగరు తాళిబొట్టు, నివి విడిచినచో
నే బిట్టుగాఁగ నేడ్వం-గాఁబడు కన్నీటిబొట్లు కలవిఁక నాకుఁ.
మఱచితిన్ మఱచితి; మఱియొక్క నగయును,-నాకుఁ గలదు: శోభనంపు రాత్రి
నే నెఱుంగకుండ నా నెఱులందు-నఱుండు పెట్టినది శిరోమణి యిది.

అంబరవీథి నన్గొని దశాననుఁడేగినవేళ ఋశ్యమూ
కంబున మిమ్మె కావలయుఁ గంటిని నే నవు డాత్మభూషలె
ల్లం బతి కిత్తురంచును నిలం బడవైచి, పరాకుచేత దీ
నిం బడవైవ మానితిని: నేడిది పంపెద నానవాలుగన్.

రమణుం డంపిన యుంగరంబిది శిరోరత్నంబుగాఁ దాల్చి జీ
వములన్ నిల్పెద: శ్రీసమేతముగ మత్ప్రాణేశు పుణ్యంపు నా
మమునన్ వర్ణములెన్ని దీనఁ గలవో, మాసంబు లింకన్ని యే
సుమి నాకున్ మితి పెట్టె రావణుఁ డిటంచున్ నాథుతోఁ జెప్పుమా.

నాదేహంబును వాఁడు వ్రేలి మొననైనన్ ముట్టలేఁడంచు నన్
ఖైదుంబెట్టిన యాది నేనెఱుఁగుదుం; గానం దనుం గాంచి ఋష్మో
మీఁదన్ నేఁ బడియున్న యప్పుడును నామేనంటకుండంగ న
న్నాదైత్యుండు ధరిత్రితోఁ గలిపి తీయన్ లేచె చెట్టున్ బలెన్ ?

అటులు రథంబు మీఁదికి దశాస్యుఁడు నన్గొని వచ్చి లంక కి
చ్చటికిని దెచ్చునప్పుడు దిశల్ ప్రతిశబ్దములీన భర్త పే
రటవిని నిండె; నేఁ బలికినట్టిది కాదది: భార్య యట్లు ప
ల్కుట యుచితంబు కాదనెడి కోవిద వాక్యము నే నెఱుంగనే?

అది మొదలుగాఁగ నెపుడున్-మదనుచ్చరిత పతినామమయనాదము నా
పెదవుల వెలువడినటులగు-హృదయధ్యానము వెలుపటికే తెంచెననన్.

గోళ్లతోనైనఁ జిక్కును దీయకున్న నా-నిడుదపెన్నెఱులెల్ల జడలుగాఁగ
పయినుండి మేదినిపై కేకధారగా-గాఱు కన్నీరు మిన్నేఱుగాఁగ
అనలకణంబట్టు లలరు కుంకుమబొట్టు-నెన్నొసటంగల కన్నుగాఁగ
స్నానంబులేమి నెమ్మేనునఁ గడు దట్ట-ముగఁ బొదవినధూళి బూదిగాఁగ

ఈశునకు వెలిగా సగమా శరీర-మమరఁ దారకనామమంత్రము నిరంత
రము జపించెడి సతినని రావణుండు-భయపడియెనేమొ తాశివభక్తుఁ డగుట ?

అరచేతి దళసరికన్న హెచ్చుగ మేనునం దట్టకట్టియున్నట్టి మన్ను
తెరతెరలై నిరంతర మేకధారఁగా గాఱుచు నున్నట్టి కంటినీరు,
బడబానలంబులై వడిని నాయెడఁద సదా కుతకుతమండు శోకవహ్ని
యుడుకు డెందమునుండి వెడలెడి యావిరియును బోని వేఁడినిట్టూర్పు గాలి
నాకనుల చూపు కను వట్టి యాకసంబుఁ-గలిసి పంచభూతంబులై వెలసి, నాదు
మేను నిలిపియుండఁగనోపు: లేనిమెడల-నంతరింపదే నాకాయ మాంజనేయ ?

ఈదృశమైన మద్విధము నెల్లను దెల్లముగాఁగ నీవిఁకన్
నాదు మనోధినాథుని మనంబు కరంగ నెఱుంగఁ జెప్పి, త
త్పాదపయోరుహద్వయముపైని మదీయశిరంబుఁ జేర్చి, యీ
మాదిరిగాఁగ నంటిననుమా హనుమా, యనుమానమేటికిన్ ?

"సెగకంటి దేవర సింగిణిన్ విఱిచినట్టిది మీబలంబు మీకెదురు గలదె ?
లక్ష్మణుతో వచ్చి లంకలో విజయలక్ష్మినూత్నవరులరై మెలఁగ వలదె ?
ననుఁ దెచ్చి దనుజుండు మనియుండ మీకీర్తి రమ మొగమ్మున మసిరంగు నలఁదె;
సింగ మేన్గును జీల్చుభంగి మచ్చిత్తదాహకుని గూల్చు పని మీయొకని తలదె;
రణమునందు వేవేగ రావణు వధించి-చిరవియోగ దుఃఖితను నన్ జేకొనుఁ"డని
తనకు నేవిన్నవించితి ననుచు నీదు, ముఖమునం దెల్పు హనుమంత, పుణ్యవంత!

---

# మేఘసందేశము

**దీపాల పిచ్చయ్యశాస్త్రి గారు**

మేఘసందేశకావ్యమున నాకుఁ గొన్ని సందియములు కలుగఁగా, తన్మూలములు, కవివ్యాఖ్యాతల నెరసులనియే నేనెన్నుకొని మిన్నకున్నచో వారియెడల నపచార మొనర్చినవాఁడ నగుదునని జడిసి, సహృదయులగు ప్రాజ్ఞులు, వాని సాధుతాసాధుతలను నిర్ణయింతు రను విశ్వాసముతో ప్రభవ సంవత్సరాది సంచికయందు వానిని వెల్లడించితిని.

అందులకు భారతీ భాద్రపద సంచికయందు శ్రీయుత బులుసు వెంకటరమణయ్యగా రనువారును, 1927 అక్టోబరు 30 తేది యుగంధరపత్రికయందు శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల వేంకటాచార్యులుగా రనువారును కొన్ని సమాధానములను వ్రాసిరి.

అందు. *వెంకటరమణయ్యగారి యుపన్యాసము నసమగ్రమనియు, వారు పన్నినయుక్తులు దుర్బలములనియుఁ దెలుపుచు శ్రీమాన్. నేలటూరు రామదాసయ్యంగారు, యం. ఏ., యల్. టి., అనువారు, భారతీపుష్య సంచికలో నొక దీర్ఘవ్యాసమును ప్రకటించినారు. ఆవ్యాసమున, పయిపండితు లిరువురు నొసఁగిన సమాధానములకన్నను విశేషసమాధానము లేమియు లేవుగాని, ప్రతివిమర్శనము నపేక్షించు వ్రాఁతమాత్రము మెండుగాఁ గలదు. ప్రతివాక్యమును విమర్శించుచో గ్రంథము విస్తరిల్లి పాఠకులకు విసువుపుట్టించునుగాన రామదాసుగారి వ్యాసమునఁ బ్రకృతములయిన కొన్నివిషయములనుమాత్రము సంగ్రహముగా విమర్శింతును.

## I. ఇంద్రధనువు

'బొమ్మకొరడు' వర్ణనమున నయ్యంగారి వ్రాఁత యిట్లున్నది:—

"తూర్పునం దోఁచు నింద్రధనురాకారమును, ఖండమునేని అఖండమునేని, మేఘునికి ఆభరణీకరింపవలయునేని మేఘునికి తూర్పుపయనము చెప్పి, దానిని 'నెలవంక' 'చందురువంక' అనుపేరుల నెలయు నాభరణముగా, ఈశ్వరుని తలనుండు దానింగాని, సరస్వతి తలనుండుదానింగాని మించినదానింగా నుత్ప్రేక్షింపఁదగును. మఱి యాగోపవేషునికేని, ఇతరులకేని బర్హముతో అట్టి నగను రచించుట దృష్టశ్రుతచరము గాదు." అని.

ఈప్రసంగము కేవల మప్రసక్తము. ఐనను, అయ్యంగారి యూహలోని పొరపాటును చూపుకొఱకే యీ సమాధానము.

బర్హముతో అట్టినగను రచించుట దృష్టచరమును గాదు; శ్రుతచరమునుగాదు. కాని, ఇంద్రధనువు నెలవంకవలె నుండుట దృష్టచరమా? శ్రుతచరమా?

ఇంద్రధనువు తెలుఁగు (౧) ఒకటివలె నుండును. (Welcome Arch) వలె నుండును. ఇఁక నెలవంకయో, గణప్రస్తారమునఁ జూపఁబడు గురుచిహ్నము (◡) వలె నుండును. మఱియు, "అ". అను నక్షరపుఁ దొలిరూపమువలె నుండును. నెలవంక తలక్రిందుచేయఁబడిన యింద్రధనువువలెను, ఇంద్రధనువు తలక్రిందు చేయఁబడిన నెలవంకవలెను ఉండును. ఒకదాని కొకటి కేవలము విపరీతము. నెలవంకకు శృంగములుమీఁది కుండును. ఇందులకు పేరులలో చందమామపేరు. మసీదులపై నెలవంక, సుందరులు ధరియించు (నెలవంక) తిలకము. శాసనములలోని చంద్రఖండము మున్నగునవి యెన్నియో తార్కాణములు. శిశుపాఠపుస్తకమున,చంద్రకళాభివృద్ధినిచూపు చిత్రమునుచూచినను ఇది తెలియును. పెక్కుపలుకు లేల? నెలవంక ఇంద్రధనువువలె తలక్రిందగు

* రామదాసుగారు వేంకటాచార్యులవారి వ్యాసమును తిలకింపరో; తిలకించియు వారివాక్యములు, తమకనుకూలింపవని తలఁచిరో,—ఆచార్యులవారిని తమవ్యాసమునఁ దడవక జాఱవిడిచిరి.

§ బాలేందు పరిధిశృంగావర్త...(ఆంధ్రశబ్దచింతామణి). విదియచంద్రునిమాడ్కి నెలయు నత్వము (◡—ఇది అకారము)—అప్పకవీయము చూచునది.

ట భూలోకమువారి యనుభవముకాదు. ఈశ్వరుని తల యందును, సరస్వతి తలయందును, ఇంద్రధనువుంబోలు నెలవంక నెలకొనియుండఁగా రామదాసుగారు చూచి యుందురా! ఎంతచిత్రము?

* ఇంద్ర ధనుర్విషయమున వెంకటరమణయ్యగారు వ్రాసిన దసమగ్రమనియు, తా మేమో సమగ్రముగా వ్రాయుదుమనియు వచ్చిన రామదాసుగారు తూర్పున నున్న ఇంద్రధనువును, తలక్రిందు చేసిరేకాని, వలసిన ఉత్తరమునకుఁ గొనివచ్చినదిగాని సంజీవనీచేటికావాక్యములకు సమర్థనము కల్పించినదిగాని లేదు.

## II. మేఘము, రాజహంసలు

మహాకవి, మేఘహంసల సమానదేశగమనమును నిమిత్తముగాఁ గొని "రాజహంసాస్సహాయాః" అను రచనమును గావించెను. 'సహాయాః' అనుపదమునకు§ 'సయాత్రాః' అనునర్థము నూది వ్రాసిరేకాని - సహాయులు అనునర్థమును, కవియగు కాళిదాసుగాని వ్యాఖ్యాతయగు మల్లినాథుఁడుగాని భావింపలేదు.

ఆసయాత్రతను సమర్థించుటకే వ్యాఖ్యాతలు (మల్లినాథేతరులు) "విరుద్ధానామపి హంసానాం సహాయతోక్తిః" అని ముందుగ వ్రాసియు, "హంసానాం పరమం మేఘగర్జితమితి ప్రసిద్ధం" అని యొప్పికొనియు, నవిల నెంతెంతో వ్రాయవలసి వచ్చెను. అట్టిపట్టున, హంసమేఘవిరోధము నించుకయు సూచింపక—"మేఘుఁడా! వారికి నీవు ఉపకారివి. వారే నీసాంగత్యమును కోరి నీతో వత్తురు. నీవు వారిని ప్రార్థింపవలసినది లేదు" అని విశేషించి పదప్రయోజనమును వ్రాయుచో, పాఠకునకు సందేహము కలుగ కెట్లుండును?

మేఘుఁడు హంసల కుపకారి యని చెప్పవలసివచ్చుచో—బాధించియైనను, భయపెట్టియైనను వానికిఁ బ్రియతమమగు మానసమునకుఁ దఱుమువాఁడు గావున ఉపకారి— అని చెప్పవలయును. అట్లు చెప్పుట చమత్కారమగునుగాని నిక్కముగా మేఘుఁడు హంసల కుపకారి యనుట కాదు. మేఘబాధవలన హంసలకు గలుగు నిజనివాసస్థానభూత మానసగమనలాభము కీడువలనఁ గలిగినమేలు. ఉద్యోగమూడిన దొరగారికి గలుగు నిజదేశగమనలాభము వంటిది. అంతియకాని మేఘుని యనుగ్రహమునఁ గలిగిన మేలుకాదు. కావున వారికి పరస్పరము గాటంపుచెలికారము నుడువుట కూడదు. శ్రీశాస్త్రులవారి పదప్రయోజనమునకు సమాధానము నెట్లో చెప్పికొందుముగాక.—

"హంసలు కావ్యలోకముననేకాని లోకమున లేవు; అంచ, ఉఱుమున కులుకదు; జలదమునకు జడియదు; హంసమేఘద్వేషము కవిసమయసిద్ధము కాదు; ఆరెంటికిని మైత్రినిగూడఁ జెప్పవచ్చును" అను మొదలగు నూతనసిద్ధాంతములతో రామదాసుగారు తొడఁగిన వాదమున కే మనవచ్చును?

(1) హంసలు లోకమున నున్ననేమి? లేకున్ననేమి? ఉన్నట్లు కవులు భావించిరి. కాళిదాసు మేఘుని

---

* వేంకటరాయ శాస్త్రిగారు వ్రాసినది తృప్తికరముగ లేదు. ... ఎదుట అనగా - 'మేఘుఁడు వెళ్లఁబోవుమార్గమందు ఉత్తర దిక్కునం' దని మల్లినాథుఁడు వ్రాయలేదు. ఎదుట అనేదానితో 'నీయొక్క' యని సమన్వయింపలేదు. శ్లోకతాత్పర్య మేమనఁగా:—మనయెదుటను గనుకనే ఏతత్ అనునది స్వరసతః కుదురును. ఏ యింద్రధనుః ఖండముచేత నీయొక్క శరీరము కృష్ణునియొక్క శరీరమువలెనే కాంతిని బొందఁగలదో అట్టి యింద్రధనుః ఖండము మనయెదుట బుట్టుచున్నది. గనుక వర్షాకాలము త్వరగావచ్చును. గనుక నీవు త్వరగా వెళ్లవలసియుండునని తాత్పర్యము. (న. చ. వేంకటాచార్యులుగారు, యుగంధర.)

§ 'సహాయాః' అనుస్థలమునందు 'సయాత్రాః' అని నిఘంటుప్రదర్శనపూర్వకముగా కష్టించి వ్యాఖ్యానముచేసిన మల్లినాథసూరి స్నేహాభాస వచ్చునేమో యని భయముతో విరోధమునే స్థాపించినాఁడు. (న. చ. వేంకటాచార్యులుగారు, యుగంధర.)

చేతఁబోలె, సుతిరొకకవి హంసచేత సందేశమునుగూడ బంపెను. అవి లోకమున నున్నను లేకున్నను కవులు వర్ణించునెడల, వానికిని బమోదములకును నెయ్యము చెప్పిరా? అన్యము చెప్పిరా? అనుటయే మనకుఁ బ్రకృతము. అవి బాతులవంటివో, కోతులవంటివో పరిశీలించి నిర్ణయించుట కిదిరేమి జంతుశాస్త్రమా?

(2) హంస, మేఘమునకు జడిసికాదు. పరుగెత్తుట—అనిచెప్పుట కెంతో శ్రమపడి రామదాసుగారు, విక్రమోర్వశికిఁబోయి పురూరవుని పిల్చికొనివచ్చిరి. కాని పాప మాతఁ డున్మత్తుఁడు. కావుననే, జలదావృతము లయిన దిక్కులనుగని మానసమునకు బయలువెడలెడు హంసలనుచూచి—

"మానసోత్సుకము లయిన యీపక్షులు సరస్సునుండి ఎగిరిపోకమునుపే వీనివలన ప్రియావృత్తాంతమును తెలిసికొనవలయు" ననుచు...క. నాకొమ్మనిమ్మ హంసము, కైకొంటి తదీయమైన కాంతగతంబుల్...అని యడిగెను. అతఁ డడుగుచుండఁగనే అదివరకే పోవ నుంకించుచున్న ఆహంస మెగిరిపోయినది. అప్పుడు పురూరవుఁడు—"ఇది, దొంగలను దండించువాఁడు రాజు అని భయముచేత ఎగిరిపోయినది"—అనెను.

ఆమాటను ఉంకించికొని యయ్యంగారు - పురూరవుఁడు. (హంస) *తనదండనకు భయపడిపోయెననెఁగాని మేఘగర్జకు బెదరిపోయె ననలేదు. కాన హంస మేఘగర్జకు జడియదని యుపన్య సించిరి. ఏమాత్రము కార్యజ్ఞానము కలవానికైనను పురూరవునిది ఉన్మత్తప్రలాపమని తెలియకపోదు. ఉన్మత్తప్రలాపములతో పుటలు పూరించుటయు నుపపత్తియగునా?

(3) " హంసమేఘ వైర మందందు ఆయాకవియుత్ప్రేక్షితము కాని, ప్రకృతిసిద్ధమేనియు, దాటరాని కవిసమయ సిద్ధమేనియు కా"దనియు కాళిదాసునకు హంసమేఘ ద్వేషమున తాత్పర్యము లే"దనియు, వారివాదము.

హంస మేఘ ద్వేషమున కాళిదాసునకుఁ దాత్పర్యమే లేనియెడల§ 'కతిపయదిన' కొలఁది దినములే యుండుట మేఘములవలని ఉపద్రవముచేతను—అనుశాస్త్రిలవారి వివరణ మెట్లు సంగతపడును? 'హంసమునకు మేఘ ముపద్రవకారి'యని గురుపాదు లుపపాదింపఁగా 'హంసమేఘములకు వైరము ప్రకృతిలోనే లే' దని శిష్యపాదులు సిద్ధాంతముచేయఁ బెనఁగుట యెంత సరసముగా నున్నది? కాక ఉపద్రవము సేయుటయు మైత్రికొక లక్షణమని యయ్యంగారి భావమా?

మేఘము హంసకు ఖేదమును, నెమలికి మోదమును గలిగించును. కావుననే కవులెల్లరును విరోధమును చెప్పుచో మరాళ మేఘములను, మైత్రిని చెప్పుచో మయూర మేఘములను జెప్పవలయునట్లు సమయము చేసికొన్నారు. 'ఇది కవిసమయమే యైనచో సాహిత్యదర్పణమున నేలలే"దని రామదాసుగారి సందేహము. కవి సమయములన్నియు, నెవ్వరును సంపూర్ణముగాఁ జెప్పలేదనియు, వానినన్నిటిని సాకల్యముగా నరయుటకు కావ్యజ్ఞతయే సాధనముకాని కతిపయాలంకృతిగ్రంథపరిశీలన మాత్రము చాలదనియు సమాధానము. సమయములు చెప్పుచోట కొన్ని గ్రంథములలో, కవిలోకసుప్రసిద్ధమగు కమలార్కమైత్రియే చెప్పఁబడలేదే? తావన్మాత్రమున కమలార్కులకు విరోధమును కల్పించినను కల్పింపవచ్చునని వారు వాదింతురా?

ఏపుస్తకములో నీవిషయము లేదో—అద్దానింగూర్చి యెవరేని—ఎట్లేని చెప్పవచ్చుననియా? వీరి వాదము. తక్కగ్రంథముల నరయవలదా? సంప్రదాయ మెఱుఁగవలదా? కవు లెల్లరును వాడుట యే కవిసమయమన:—ఆకవులు చెప్పవలసినచోట నెల్లరును హంస

* పురూరవుఁ డన్నాఁడు గనుక—ఆతని ప్రియురాలి 'కాంతగతమును' హంస దొంగిలించినదియు నిక్కమందురు కాబో లయ్యంగారు?

§ 'కతిపయదినస్థాయిహంసాదశార్ణాః' - అనుస్థలమందును, బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిలవారు వ్రాసినట్లు వ్రాయుట నాకు దృప్తికరము గాలేదు. (న. చ. వేంకటాచార్యులుగారు, యుగంధర.)

మేఘములకు విరోధమునే చెప్పిరి. ఇంతయేల? హంస మేఘములకు మైత్రియుం జెప్పవచ్చు ననిరిగదా! మిత్రములుగా నారెంటి కలయిక చెప్పఁగూడునని ఒక్క పండితునిచేతనైన ననిపింపఁగలిగిరా?

హంస మేఘములకు విరోధము ప్రసిద్ధమని లోకికాగ్రగణ్యుఁడగు కంకంటి పాపరాజకవిచేతఁ జెప్పించితిని. ప్రకృతితత్త్వవేత్తృతయందు రామరాజభూషణుని తలఁదన్నిన అయ్యలరాజు రామభద్రకవిచేతఁ జెప్పించితిని. కవితాప్రజ్ఞచే యతిని విటునిగను, విటుని యతిగను మార్ప నేర్పుగల ప్రౌఢయగు సంకుసాల నృసింహకవిచేఁ జెప్పించితిని. అభినవవాగనుశాసనునిచే, కూచిమంచి తిమ్మకవిచేఁ జెప్పించితిని. కవియు, పండితుఁడును, ప్రభుఁడును నగు శ్రీకృష్ణరాయలచేఁ జెప్పించితిని కడకు జగత్త్రియ మెవ్వని యుచ్ఛిష్టమో, ఆకవి భట్టబాణుని ముఖమున నైతము చెప్పించితిని. ఆ మహామహుల వాక్యములనుగూడఁ జెవిఁబెట్టక హంసమేఘమైత్రి నెలకొలుపు తలఁపున నెంతో శ్రమపడిరి. కాని తుద కేమియయ్యెను?

(4) ఆషాఢము ఘర్మమనియు, కాదుకాదు, వర్షయనియు అవ్యవస్థితముగా నొకసిద్ధాంతమునుజేసి, ఆషాఢమునఁ బొడము మేఘము తొలిమేఘమనియు నవజలధర మనియు, అది హంసల కుపకారియనియు-విచర్యకులనిరి.

వర్షాకాలము శ్రావణశుక్ల ప్రతిపత్తు అను స్టేషను నుండి బయలువెడలి భాద్రపదబహుళామావాస్య అను స్టేషనులో నిక్కన ఆగిపోవు రైలుబండి కాదు. కావుననే లోకజ్ఞులగు పెద్దలు ఆషాఢమును, ఆశ్వయుజమునుగూడ యథోచితము వర్షలోనే చేర్చిరి.

ఇంతకును, సందేశములోనిది మలిమేఘముకాదు; తొలిమేఘమే యగునుగాక. అయినంతమాత్రమున రామదాసుగారి కగునది యేమియును లేదు. తొలిమేఘమయినను హంసకులమునకు భయావహమేకాని, ముదావహముకాదు. తిలకింపుఁడు.

పాండురంగ మాహాత్మ్యము

క. సలిలంపు వృష్టజలధర
ములు పూనిన యూతకోల మొత్తములక్రియన్
దొలువాన కాసు లెసఁగెన్
గలహంస కులంబులెల్లఁ గలఁగంబడఁగన్.

కరకలవర్షించునవి తొలిమేఘములే. (నవజలధరములు) అందులకును ప్రమాణము కావలయునందురా? ఇదిగో—ఆముక్తమాల్యదలో

గీ. కృతపయఃపాన నవమేఘ పృథుకములకు
రాలె నొయ్యన వడగండ్ల పాలపండ్లు
మఱిబలాకా ద్విజాళి సంప్రాప్తి గలిగెఁ
బెరుగఁ బెరుగంగ ధ్వనియు గంభీర మయ్యె. ఆ. 4.

నవమేఘపృథుకమునకే వెఱచి మరాళములు పఱచిన ట్లాకావ్యముననే:—

క. ఉఱుము విని యలకకైదివి
వెఱఁబఱచు మరాళపటలి విడిచినఁ బడున
క్కఱచిన బిసలవ విసరము
తెఱఁగున వడగండ్లు ధవళదీధితి రాలెన్. ఆ. 4.

మఱియొక యుదాహరణము:—

క. నిర్ఝరగతిఁగరకాసం
వర్షంబులు రాలె నంత ధరపై జలదా
విర్భావమగ్నహంసీ
గర్భస్రవకండపిండఖండము లనఁగన్.

—విక్రమరసాయనము. ఆ. 6.

(కరకలనుగురియు) తొలిమేఘ మావిర్భవించినంతనే హంసలకు గర్భస్రావములుగూడ కాఁగినంతటి భయము కలుగునని పయిపద్య ముద్ఘోషించుచున్నది. రామదాసుగారేమో, అంచలకుఁ దొలిజలద ముపకారి యని వాదించుచునే యున్నారు.

"నవజలధరః సన్నద్ధః" అని 'నవ' మని విశేషించి రూఢిచేసినాఁడు. తాను కవికులగురువుగదా— అని యయ్యంగారు-నవం-దెచ్చికొనిరి గాని-నవయును బాధించునదే చూడుఁడు.

ఉదపాదిప...నవ జలధరరవభయచకిత కలహంసకుల
కోలాహలకోమలో...ఘూషణనినాదః.

—కాదంబ.

కలహంసకులమును జడిపించిన బాణుని మేఘము వలెనే కాళిదాసుని మేఘమును (కరకలను వర్షించు) నవజలధర మే. (తాః కుర్వీథాస్తుములకరకా వృష్టిపాతావకీర్ణాః పూ. మే. 58). కావున హంసలను బెదరింపక యేః విడచును?

ఇట్లు పెద్ద లెల్లరును తొలిమేఘము (నవజలధరము) అంచల కపకారి యనుచుండఁగా రామదాసుగారు ఉపకారియని సిద్ధాంతింప దొరకొనుట కానిపనికదా!

ఆషాఢము వర్షలోఁ జేరుచో, నా మేఘము వర్షామేఘమును అగును. అగుచో నది యంచలను దప్పక బెదరించియే తీరునుగదా!

(5) హంసమేఘ వైరనిర్ణాయకములుగా మదుదాహృతములగు పద్యములలో నొకటియగు.

క. నిర్భరగతిఁ గరకాసం
దర్భంబులు రాలె నంత ధరపై జలదా
విర్భావమగ్నహంసీ
గర్భస్రవసండపిండఖండము లనఁగన్.

అనుపద్యములోని–అనఁగన్–అను ఉత్ప్రేక్షా వాచకము హంసమేఘ విరోధములేమిని తెలుపుచున్నదని విమర్శకులు మఱికొంత ప్రసంగముఁగావించిరి.

ఆపద్యములోని ఉత్ప్రేక్షావాచకము కరకలు, అండపిండ ఖండములు కావని తెల్పునేకాని మేఘహంస, తద్విరోధాదికము లబద్ధములని తెలుపనే తెలుపదు. ఇది అలంకార తత్త్వజ్ఞులకు విప్పి చెప్ప నక్కఱలేదు. తక్కిన పద్యములలోని ఉత్ప్రేక్షావాచకములను గూడ నిట్లే అన్వయించు కొఁగదురేని విమర్శకులు–ఉదాహృత పద్యములు హంసమేఘముల విరోధములేమిని తెలుపుచున్నవనిగాని–ఆరెంటికిని వైరమేకాంతముగా సిద్ధింపదనిగాని యనరు. మఱి ఉత్ప్రేక్షావాచకములు లేని

"పరమహంసలఁబాఱఁదఱుమని ఘనుఁడు"

"అరిహంసనసంసదభ్రాగమంబు"

"అపూర్వ నిర్వహితృహంసకునాఘన"

మున్నగు వాక్యముల కేమి యర్థము? హంసలు లేవనియా? మేఘములు లేవనియా? ఆరెంటికిని విరోధము లేదనియా?

(6) ఆదికవివాల్మీకి, ఊరక "సంప్రస్థితా మానసవాసలుబ్ధాః" అనిమాత్రమే చెప్పెను. గాని...మేఘభయమును జెప్పఁడాయెను. కనుక గాయంచలకును, మేఘునకును వైరము లేదు—అని రామదాసుగారిది మఱియొకయుక్తి

ఆదికవి అంతమాత్రమైనను, అనెనుగాని మఱి యెందఱో కవులు, ప్రావృడ్వర్ణనమున, హంసలమానసగమనము నే చెప్పిరి. ఇంత యెందులకు, వర్షర్తులక్షణనిర్ణయమును గావించుచోఁ గావ్యాలంకారచూడామణి కర్త.

క. తటిదటన మేఘపటలీ
ఘటితాంబర శక్రచాప కరకాప్రాత
స్ఫుట ధారాసారాది వి
కటతఁ నుతింపంగవలయు ఘనకాలమునన్.

అని చెప్పెనేకాని హంసలసంగతి చెప్పకపోయెను. కాబట్టి వర్షర్తువున హంసలు మానసమునకుఁ బోవుట అబద్ధమనవచ్చునా? హంసమానసగమనమును వర్ణించుట ఆయాకవుల పొరపాటందురా? అట్లనుట సరికాదు. వాల్మీకిగాని, మఱియొక కవిగాని హంసమేఘవిరోధమును దనకావ్యమునఁ జెప్పియేతీఱవలయునని ప్రభుశాసనములేదు. చెప్పినఁ జెప్పవచ్చును; చెప్పకపోయినను, బోవచ్చును. అందువలనఁ బ్రత్యవాయము పుట్టదు. కాని, చెప్పుచో హంసమేఘములకు వైరమునే చెప్పవలయును గాని మైత్రిని జెప్పఁగూడదనిమాత్రము కవిసమయము. కావుననే గదా! కవులెల్లరును, ప్రసక్తమైనచోట, నేకగ్రీవముగా తద్విరోధమునే చెప్పుట. మైత్రిం జెప్పకపోవుట. జలధరసమయే మానసం యాంతిహంసాః—అని కనిపట్టి రామదాసుగారు శాస్త్ర ముదాహరించినారు. కాని, ఆ యంచలపోకకు కారణముగా కవు లేసమయమును నిబంధించికొనిరో వారరసిరా? కాక హంస లట్లుపోయి

నట్లే గ్రంథమునఁ జెప్పఁబడినను—అవి పురూరవుని చండనకు భయపడిపోయినట్లే వారు తలఁచుచుండిరా? పురూరవుఁడు లేని గ్రంథములలో హంసాపగమప్రస్తావమే కూడదాయేమి? చూడుఁడు. ఎందరెంద రీహంసమేఘవైరమును ఎట్లెట్లు విస్పష్టము కావించిరో!

—మృచ్ఛకటిక.

శ్లో. *ఆలోకితం గృహశిఖండిభి రుత్కలాపై
ర్హంసైర్వియాసుభి రపాకృత మున్మనస్కైః;
ఆకాలికం సపది దుర్దిన మంతరిక్ష
ముత్కంఠితస్య హృదయంచ సమం రుణద్ధి.

అపాకృతమున్మనస్కైః=అనుచో రామదాసుగా రేమిగా నర్థముచేసికొందురో?

శ్లో. *ఏతత్తద్ధృతరాష్ట్రవక్త్రసదృశం
మేఘాంధకారంనభో
హృష్టో గర్జతి చాతిదర్పితబలో
దుర్యోధనో వా శిఖీ;
అక్షద్యూతజితో యుధిష్ఠిర ఇవా
ధ్వానంగతః కోకిలో
హంసాస్సంప్రతి పాండవా ఇవవనా
దజ్ఞాతచర్యాం గతాః.

పాండవులసవలె హంసలకు నజ్ఞాతచర్య ఘటిల్లినది; మేఘాంధకారమున. అజ్ఞాతవాసమును హంసలకుఁ గల్గిన యభ్యుదయమే యందురేమో విమర్శకులు?

శ్లో. ఏహ్యేహీతి శిఖండినాంపటుతరం
కేకాభిరాక్రందితః
ప్రోడ్డీయేవ బలాకయా సరభసం
సోత్కంఠ మాలింగితః;
హంసై రుజ్ఝితపంకజై రతితరాం
సోద్వేగముద్వీక్షితః
కుర్వ న్నంజనమేచకా ఇవదిశో
మేఘస్స ముత్తిష్ఠతి.

ఇందు హంస సోద్వేగముగా వీక్షించుట జలదాగమనమున కడలియో? అలుకయో?

పోనిండు ఇవి కాళిదాసకవికిఁబూర్వుఁడైన కవ్య(?)కుని పలుకులు. ఈవలివా రేమనిరో చూతము.

"శ్లో. రామాకర్షణభగ్న కార్ముకభువా
ధ్వానేనరోదోరుధా;
దృప్తక్షత్రయశస్సితచ్ఛదకులే
జీమూతనాదాయితమ్"—రామాయణచంపువు.

(వ్యాఖ్యా:—దృప్తాః మదోద్రిక్తాః యేక్షత్రాః క్షత్రియాః... తేషాంయశ ఏవ సితచ్ఛదకులం హంసశ్రేణీతిరూపకం, తస్మిన్ విషయే జీమూతనాదేన, జలధరగర్జితేనేవాచరితం జీమూతనాదాయితం తస్యాలన్నివారకత్వాదితిభావః) అని జీమూతనాదమునకు, సితచ్ఛదకుల మడలు ననెను మహాకవిభోజుఁడు.

శ్లో. "దయితోఽసి తత స్తతః పృథివ్యా
మయిజీమూత! జనస్యజీవనేన;
విషయాదపి గచ్ఛతః కిమేతాన్
ధ్వనిభిర్భీషయ సీహ రాజహంసాన్."

అని మఱియొక మహాకవి. ఉఱుమునకు హంస భయపడుటను మిగుల చమత్కరించి చెప్పినాఁడు.

శ్లో. తతోఘనా విర్భవనా ద్భియేవ
స్రోత్రామలం మానస మస్యభేజే;
కర్ణాంతరక్రౌంచపథేనశోభా
యశోమరాళోయదుకన్యకాయాః—భారతచంపువు.

(వ్యాఖ్యా!—...ఘనానాం మేఘానాంతత్కాలస్యవా ఆవిర్భవనాత్ ఉదయాత్ భియా భయేన.) దిగంతరలుఠత్కీర్తియగు, ననంతకవికుంజరుఁడును, మేఘావిర్భావము హంసకు భయావహమనెను.

శ్లో. *పృథ్వీతాపం సపది శమయ న్దేవకీ దక్షిణస్యాః
ప్రాదుర్భూత స్సపది మురజి న్నీలమేఘో నిశీథే;
హర్షోత్కర్షం విబుధ శిఖినాం వర్ధయ న్నా సురశ్రీ
హంసశ్రేణ్యాః కిలకలయితుం దూరదేశప్రవాసమ్.

—భాగవతచంపువు.

అసురులను హంసలను శ్రీకృష్ణుఁడను మేఘమువలన దూరదేశప్రవాసము చెప్పఁబడెను. అది విరోధమువల

ననో మైత్రివలననో రామదాసుగారే నిర్ణయించుకొన వలయును.

ఉ. భేకశుభప్రదం బనలభీయ మనేకపక్షిణికాసరా
నీక శరీరతాపహ మనీరతటాక, నదీ, నదాది, నీ
రాకరహర్ష కారణ మహఃపతిదీప్తి నిరోధి* కంధరా
లోకనహృష్టభీతశిఖిలోకమరాళముసోనదో బినక్.

హంసవింశతి—ఆ. 5.

శా. సర్వద్వీపనదీ ప్రపూరిత పయస్సంబంధ ధారాధరా
ఖర్వధ్వాన భయోత్పతిష్ణు బిస భుగ్రాజి... ఆ. 4.

ధారాధరధ్వానము హంసలను భయపెట్టి ఉత్పతిష్ణువులను జేయుటయు మైత్రివలన నేనా?

నక్షత్రచిహ్నితములను పై యుదాహరణములవలననైనను, మయూరమేఘములకు మైత్రి యెట్లు కవిసమయమో మరాళమేఘములకు వైరమును, అట్లే కవిసమయమని రామదాసుగారు తెలిసికొందురుగాక. ఇంకను ప్రయోగములు వలయునా? ఇదిగో—,

క. ఆరాజధానికధిపతి
యై రాజిలు వసునృపాలుఁ డతఁ డసి ధారా
ధారాధర ధారాజల
భారాహత రాజహంస పద్మోదయుఁడై.

వసుచరిత్ర—ఆ. 1.

ధారాధరధారాజలపాతము పద్మము నెట్లు చిందరవందర చేసి బాధించునో అట్లే హంసమునుగూడ బాధించునని పద్యము చెప్పుచున్నదిగదా.

క. నిరతంబు రాజహంసల
బరువెత్తఁగఁ జేయు నౌర పటుచటులభవ
త్కరకరవాల కరాళ
స్ఫురితాంభోదము నృసింహభూపాలమణీ!

—కావ్యాలంకారసంగ్రహము.

పైపద్యము ప్రతాపరుద్రీయమున శ్లిష్టకేవల పరంపరితాలంకారోదాహరణమునకై రచింపఁబడిన

"ప్రతాపరుద్రదేవస్య మండలాగ్రవిధుంతుదః;
అఖండవిక్రమోద్దామో గ్రసతే రాజమండలమ్."

అను శ్లోకమున కనువాదము. శ్లోకమున విధుంతుదరాజమండలములు చెప్పఁబడఁగా, పద్యమున నంభోదరాజహంసలు చెప్పఁబడెను. విధువిధుంతుదుల కట్టిమైత్రియో, హంసమేఘములకు నట్టిమైత్రియే యనుట. నీయాలంకారిక రచనమును గనినైన ఆరామదాసుగారెఱిఁగికొందురుగాక.

సీ. మదఘూర్ణదురుసంకమదవులీమసకున
ద్వీపముహోద్ధతిఁగౌనుఁ దీగ నులియ
ఘనసారపుండ్రకగ్లాబింబనికటమున
ర్మహిమా ప్తిమోముదామర చలింప
నాసికానూత్న గంధఫలియూరుపుఁదావి
నధరదంతప నమత్తాళి విరియఁ
గింకిణీక్వణ న శింకిలగర్జితస్రస్త
కాంచిఁ ంచలగతి యంచ జడియ.

* * * *

—పాండురంగమాహాత్మ్యము.

తీగకు ద్వీపమును, తామరకు సోముఁడును, మత్తాళికి గంధఫలియు, నెట్టి మిత్రములో, అంచకు, నభ్రమును, అట్టిమిత్రమే—అని యీపద్యము తెలుపుటలేదా?

క. "గురుశరములు సితపక్ష
స్ఫురణంబున నంచపింజ లొలుపు వహించెన్
నరుబాణతతి ఘనావలి
కరణి మిగుల నొప్పె నల్ల గఱుల చెలువునన్."

—విరాటపర్వము. ఆ. 5.

అని సమయజ్ఞుఁ డగు తిక్కన మహాకవి గురుశరములను అంచపింజగను; నరుశరములను అభ్రమండలిగను వర్ణించుటలోఁ గల చమత్కారమును, ఆకళింపుచేసికొందురేని, అయ్యంగారు హంసమేఘవైరము కవిసమయము కాదను తమవాదమును మానుకొందురని నానమ్మకము.

శ్లో. లక్ష్మీవిద్యుల్లలితవపుషం తత్ర కారుణ్యపూర్ణం
మాశైషీ స్త్వం మరకతశిలా మేచకం వీక్ష్య మేఘమ్;
శుద్ధై ర్నిత్యం పరిచితపద స్తావృశై ర్దేవహంసై
ర్హంసీభూత స్సఖలుభవతా మన్వవాయాగ్రజన్మా.

—హంససందేశము.

స్వమతగురువులును, మహాపండితులును నగు వేదాంత దేశికుల వాక్కు-నేని అయ్యంగారు ప్రమాణముగాఁ గొనరా?

శ్లో. చిత్రంచిత్రం జృంభతే కృష్ణమేఘే
కం సంప్రాప్తా ప్రాపలోపం సమృద్ధిః,
ఆసేద్యుక్తం హానిదాఘ ప్రశాంతిః
హంసో హింసాం మానసే కీర్తిరుత్థా.
—విశ్వగుణాదర్శము.

వ్యాఖ్యా:—హంసః పక్షీ; అసురశ్చ. హింసాం మానసే ప్రాప్తవా నితియత్. వార్షి కావసరస్య హంస హింసాకరణత్వం ప్రసిద్ధం.

"మేఘము హంసను హింసించునది" యని, శ్లేషయనుక చక్రవర్తి మహాకవి వేంకటాధ్వరి తేల్చెనుగదా! ఇంతకన్నను బలవత్తరసాక్ష్యమేమి కావలయును? మఱియు—

1. తొలకరిఁ గలఁగు నువ్వ

2. వానజాలిపులుఁగు

3. తొలకరినూఁకు. —(లక్ష్మీనారాయణీయము.)

ఇట్లు నిఘంటువులయందే హంస వర్షకు జంకుపక్షి యని నిర్వచనము కనుపట్టుచుండఁగా—అంచ వర్ష (మేఘ మున)కు కలఁగదనుటయు మీఁదుమిక్కిలి వర్షా (మేఘ) హంసములకు విరోధమునుచెప్పుట, ఐచ్ఛికముగాని, ఆవశ్యకము కాదనుటయు నెఱుఁగమిగాక యేమగును!

గ్రంథవిస్తరభీతిచే మానవలసివచ్చెఁగాక హంసమేఘవిరోధమును దెల్పు నుదాహరణములు పరశ్శతములు.

రామదాసుగారూ! ఆంధ్రకవులేకాక సంస్కృత కవులును గద్యకవులేకాక పద్యకవులును, కవులేకాక ఆలంకారికులును, కవులు నాలంకారికులే కాక, వ్యాఖ్యాతలును, నిఘంటుకర్తలును, అధునాతనులేకాక సనాతనులును, అల్పులేకాక అధికులును, వారువీరననేల యెల్లవారును హంసమేఘములకు విరోధము నిర్నిరోధముగా నిరూఢము గావించుచుండఁగా, తారెట్లు—మేఘహంస ద్వేషము ప్రకృతిసిద్ధము కా దంటిరి? ఎట్లు కవిసమయము కాదంటిరి? హంసలు మానసమున కేకారణమునఁ బోయినను, మేఘభయమువలననే పోయినట్లు వర్ణించుటే కవిసమయమనియు, హంసమేఘములకు విరోధమునే కాని నెయ్యము నుడువఁగూడదనియు నిన్ని ప్రమాణముల వలన నేర్పడుచుండఁగా—వానికి నెయ్యముంగూడఁ జెప్ప వచ్చునను తమసమాధి యెంతవికలముగా నున్నది? ఇంద్రధనువునుబోలె హంసమేఘవిరోధమునుగూడ తల్లక్రిందు చేయనెంచితిరా యేమి!

## III. ప్రక్షిప్తములు

"తత్సందేశం జలధరవరో దివ్యవాచా చచక్షే"

"శ్రుత్వావార్తాం జలదకథితాం తాంధనేశోఽపిసద్యః"

అనుశ్లోకములు రెండును కథాసౌందర్యమును చెఱచు ప్రక్షిప్తములని నేనంటిని. రామదాసుగారును సమ్మతించిరి. కాని "అవి ప్రక్షిప్తములని పెద్దలు చిరకాలముగా చెప్పుచునే యున్నారనియు, శ్రీశాస్త్రిలవారు తమ యుపోద్ఘాతమున 'ధారాసిక్త, తత్సందేశ, శ్రుత్వావార్తామ్' అనుశ్లోకములు ప్రక్షిప్తములని యుదాహరించినారనియు నొకకొంత అసత్యమును లిఖించిరి.

శాస్త్రిలవారు,ఉపోద్ఘాతమున ధారాసిక్త *ఇత్యాఖ్యాతే, శ్రుత్వావార్తామ్,అనుశ్లోకములనుగూర్చి వ్రాసిరి గాని, 'తత్సందేశ'మునుగూర్చి వ్రాయలేదు. కాని నుదుభక్తిఁ జాపుటకో యన రామదాసుగారు,ఆమాటిలో 'ఇత్యాఖ్యాతే' తొలఁగించి, 'తత్సందేశ'మును జొనిపి, ఆపాపమును, శాస్త్రిలవారికే అంటగట్టిరి.

ప్రతిభాధికులను శ్రీ శాస్త్రిలవారు, కథావిరుద్ధ శ్లోకప్రక్షిప్తతను గురుతింపజాలనివారన నెవఁడు సాహసించును? కాని ఆరెండు శ్లోకములను పూర్వకథా విరుద్ధములని వారు తమ వ్యాఖ్యానమునఁ దెలుపలేదని మాత్రము నేనంటిని.

---

* శ్రీశాస్త్రిలవారు నంబరు 39 వేయఁబోయి 56 వేసిరో! లేక 'తత్సందేశం' అని వ్రాయుటకుబదులు, 'ఇత్యాఖ్యాతే' వ్రాసిరో?

దానికి రామదాసుగారు, "వ్యాఖ్యలో కథావిరుద్ధములని తెలుపకున్న నేమి? వానికి ప్రాముఖ్యమునిచ్చి, మూలకథతోఁ జేర్చి, పదప్రయోజనాదిసారస్యవివరణము వ్రాసిన నేమి? శ్రీశాస్త్రిలవారు శిష్యులకు మాకు, ఇవి ప్రక్షిప్తములని, ముప్పదియేండ్లనుండి సోపపత్తికముగా నేర్పినారు"అని యొక నిస్సారపు వ్రాఁత వ్రాసిరి. అట్టివ్రాఁతయు, ఆక్షేపమున కొక సమాధాన మని విమర్శకులకు రామదాసుగారు తలఁచుట మిగుల నచ్చెరువుగదా!

"ముప్పదియేండ్లకుమును పే అవి కథావిరుద్ధప్రక్షిప్తములని శాస్త్రిలవారెఱిఁగియుండియు, ఇరువదియైదేండ్ల క్రిందట ప్రతిపదార్థతాత్పర్యపదప్రయోజనాదులతో మిగుల విపులముగా రచించిన తమవ్యాఖ్యానమున ఆవిషయ మించుకయుఁ దెలుపక గ్రంథమును ముద్రించిరనుట-రామదాసుగారు శాస్త్రిలవారి జాగరూకతను, వ్యాఖ్యానవైఖరిని కొంచెపఱచుమాట కాదా?

ఆరామదాసుగారు, "ఆశ్లోకములు ప్రక్షిప్తములని ఈ ప్రభవనామసంవత్సరమున సిద్ధాంతముచేయుట పిష్టపేషణము కాఁబోలునని యేమో చమత్కరింపఁబోయిరిగాని అది యర్థములేనిమాట. ఏమయినను రసలుబ్ధులగు శ్రీమదయ్యంగారికి "మర్దనం గుణవర్ధనమ్" అను విశ్వాసము కలిగియుండుట శ్రేయమే.

"మఱి ప్రక్షిప్తములైనను కవనసౌభాగ్యము కలిగి వ్యాఖ్యయుఁ గలిగియున్న విడువ నిచ్చ పొడమకుండును. ముద్రింపఁబడును. అందులకేమి"—అని రామదాసుగారందురుగాని, "కవితాశిల్పము నెఱిఁగినవారట్లన"రని ప్రాజ్ఞు లందురు. కథాస్వరూపమును చెఱుపని, ధారాసిక్తాది ప్రక్షిప్తముల కొన్నిటికైనను కావ్యమున చోటు దొరకునుగాని, కథాబాధకమగు నొక్కపదమునకైనను, మెలకువగల కవికావ్యమున చోటు దొరకదు. కథాబాధకములగు (పద్యములుగాదు) పదము లెట్లో కథాగర్భమును జొచ్చినను, ప్రమాదవశమున గర్భగతను జొచ్చుమక్షికలవలె నెప్పటికేని వెలువడవలసినవే కాని ఇముడునవి గావు.

గ్రంథమును పుష్కలము గావించిన శాస్త్రిలవారిమాట నే నుదాహరించిన తెఱంగున అసత్యము కలదనియు, అది శ్లోకములంగూర్చి...వ్రాసినమాట కాదనియు, వ్యాఖ్యానములం గూర్చినమాట యనియు విమర్శకులొక కొన్నిపంక్తులు వ్రాసిరి.

శాస్త్రిలవారి వాక్యము బొంబాయి ముద్రణములో లేనివ్యాఖ్యానమును, తన్మూలశ్లోకమును, తమప్రతిలో చేర్చుట కన్వయింపదా? అన్వయింపకపోవుఁ గాక, ఆశ్లోకమును జేర్చుట పుష్కలతకుఁ గాదందురా? కాకున్న మఱియెందులకు? "పూర్ణశ్లోకములకును ఒక ప్రతిలో లేనివ్యాఖ్యను పూర్ణముగా నే వేఱొకదాని నుండి గ్రహించుట ముద్రణమును పుష్కలము గావించుటయే"—అని రామదాసుగారే లిఖించిరే! అటులయిన నే నుదాహరించిన తెఱంగున నసత్యమెందున్నదని నే నడుగవలదా?

అతివిస్తరమెందులకు? ఇంద్రధనూరాజ హంస ప్రక్షిప్తములనుగూర్చి యింతయే నాకు ప్రష్టవ్యము. నా యీ యుపన్యాసము నుపసంహరింపక మును పే వ్యాసరచనమున నాయుద్దేశమును విజ్ఞులకు విన్నవింపందలంపు.

మల్లినాథపాదులు, వేంకటరాయపాదులు మున్నగువారు మహాపండితులు; అలోకసామాన్య ప్రతిభానిధులు. వారు కావించునవి ఘనకార్యములు. అట్టి మహాకార్యములందు, రసాలఫలమున నాడీలేశములపగిది ప్రమాదము లుండును. భ్రమప్రమాదములు మానవ సహజములు. అందును బ్రమాదము పండితులకు వదలించుకొనరాని చుట్టము. కావుననే "ప్రమాదో ధీమతామపి"—అనుచో అపిచ ఏవకారార్థః. (పండితులకే పొరపాటు) అని లోకజ్ఞులగు విద్వాంసులు చమత్కరించియు నున్నారు. పెద్దలు పొనరించిన పనులలో సందియములు పొడమి పిన్నలడుగుదురేని వానికనువగునంతవరకు సమాధానము చెప్పవలసిన బాధ్యత పెద్దలయం దున్నది. గురువులు కావించు పొరపాటులను సమర్థించు శిష్యులమనీషాబలమును కొనియాడఁ దగినదే; కాని దాసపాదులవలె, నసత్యములు లిఖించియు, నపార్థములు కల్పించియు, సమర్థింపఁ జొనఁగులాడి తమ కాగోరంతపొరపాటును కొండంతచేసి

లోకమున వెల్లడించుటమాత్రము తగనిపని. ఆపారపాటు లెట్లో సవరింపఁబడకున్నమాత్రమున లోకపూజ్యులగు నాప్రసిద్ధపండితుల యశశ్చంద్రికలు తఱఁగిపోవునా? ఆజగన్మాన్యుల పవిత్రనామసుమలు, సారస్వతభవ్యభవన భిత్తికలయం దింతకుమున్నే రత్నములతో చెక్కఁబడి యున్నవి.

శ్రీశాస్త్రిలవారు– 'ఇప్పుడు కళాప్రపూర్ణు'లని రామదాసుగా రందురుగాని వా రింతకుమున్నే కళాప్రపూర్ణులు. గ్రంథఖనులలో నిగూఢములయియున్న పరమార్థములను, ప్రతిభాంజనసాహాయ్యమున, చక్కఁగా గుర్తించి, గ్రహించి, వెలువరించి, పాఠకలోకమున కందించి పఠితృజనకృతజ్ఞతాపాత్రులయిన మహామహులు. వేయేల? సంస్కృతగ్రంథములకు మల్లినాథులువోలె, ఆంధ్రగ్రంథములపాలికి శాస్త్రిలవారు పుట్టువంది రన్నను– అతిశయోక్తికాదు.

ఇఁక మేఘకావ్యమో; 'మాఘే మేఘే గతం వయః' అని సంస్కృతవ్యాఖ్యాతృ చక్రవర్తిచేఁ గొనియాడఁబడిన మహాకావ్యము.

కావ్యకర్తయో, కవికులగురుఁడు మెలఁకువతో, పదప్రయోగౌచిత్య మించుకయు చెడకయుండ కావ్యసృష్టి గావించు కవికులమునకు గురుఁడు.

అంతటి కవికులగురువు రచించిన మహాకావ్యమున, అట్టి అపరమల్లినాథులచే వ్యాఖ్యాతమైన యుత్తమ కావ్యమున, ప్రకృతివిరుద్ధములగు వర్ణనలకును, కథావిరుద్ధములగు ప్రక్షిప్తములకును చో టేల కలుగవలయు? వాని సౌందర్య మేల చెడవలయు? తన్మూలమున పాఠకులకు సందేహము లేల పొడమవలయు?

ప్రకృతివిరుద్ధవర్ణనలు చక్కఁబఱుపఁ బడుఁగాక
ప్రక్షిప్తములు తొలఁగింపఁ బడుఁగాక
కథాసౌందర్యము చెడకయుండుఁగాక
పాఠకులకు సందేహములు పొడమకుండుఁగాక.

అన్నతలఁపున నావ్యాసమును వెల్లడించితినిగాని, నాయీ విమర్శమువలన శ్రీశాస్త్రిలవారి యశోధనమునఁ బాలుగొందమన్న తలఁపునఁగాదు. కావున శ్రీశాస్త్రిలవారు నామనవి చిత్తగింతురుగాక. తదనుయాయులు నాయెడఁ గూర్మి నింతురుగాక.

---

## "వగచి శరణంటి నీపాదయుగళమంటి"

కోట చెంచురామయ్యగారు

౧

తెలియకయ కొన్ని, కొన్నింటి దెలిసి, పెక్కు- తెలిసి తెలియక, యఘముల సలిపినాఁడఁ,
గరుణఁ దిలకించి మన్నించి కావు మనఘ!-వగచి శరణంటి నీ పాదయుగళమంటి.

౨

ఆత్మజుం డెట్టిఁడైనను సానురాగ-హృదయుఁడై కాంచు జనకుని రీతిఁగనుము,
కావె జనకుఁడ వీవు లోకమున కరయ!-వగచి శరణంటి నీ పాదయుగళమంటి.

౩

తజ్ఞు నరయు టదెంత ? యల్పజ్ఞు నన్ను-దరికిఁ జేర్చిన సత్కీర్తి పొరయుదీవు;
పాలనము సేయరాదె కృపాలవాల?-వగచి శరణంటి నీ పాదయుగళమంటి.

---

# కాళిదాసకవి కార్తికేయభక్తుఁడా?

బులుసు వేంకటరమణయ్య గారు

కాళిదాసమహాకవి కాళికాభక్తుఁడైనను, గార్తికేయభక్తుఁడైనను—అతని యిలువేల్పునుగుఱించి, విమర్శింపఁబాల్గొనుట యనుచితము. విమర్శకునిచర్చ యే విధముననైనను, లోకోపయోగకరమై యుండవలెను. కాని, యేదో యొకటి చర్చింపఁబూనుట యనవసరము. కవియొక్క యిష్టదైవతమును గూర్చిన విమర్శనము, లోకోపకారమనుట యసంగతము. మఱియుఁ బుక్కిటి పురాణములవలనఁ గానిండు, పూజ్యులవలనఁ గానిండు—పురాతనమై ప్రబలి వాడఁబడు వాడుకను-ద్యజించి క్రొత్తసృష్టిచేయుట యనవసరము. కాళిదాసమహాకవి కార్తికేయభక్తుఁడే యని, కొందఱు నిర్ధారణచేసిన పిదప, యూరకుండు టంగీకార మగుననియు, నందువలనఁ బ్రాచీనుల వాడుకకు భంగము కలుగవచ్చుననియు, నెంచి యీ వ్యాసమును వ్రాయఁ గడంగితిని.

లోకము నందలి పరంపరాగతములగు కథలు కేవలము కల్పితములని నిరాకరింపఁ దగదనియుఁ, గాళికాలయమున శయనించిన మన కవీంద్రుని నోటిలోఁ గాళీమహాదేవి వీరసము నింపుట నతని కీలలితకవిత యలవడెనని "స్తస్యైన కశ్చి త్కవయాంబభూవ తాంబూల సారేణ పరోజనన్యాః" అని నీలకంఠకవి గ్రంథస్థముకూడఁ గావించియున్నాఁడనియు శాస్త్రిగారే యంగీకరించిరి గదా! మఱి యెప్పటిఁ గుదురలేదు? కాళికాదాసుఁడైనచోఁ గాళీదాసుఁడై యుండవలెనఁట! కాళిదాసుఁడన సరిపడదఁట!

"జ్యాపోస్సంజ్ఞాచ్ఛందసోర్బహుళమ్" అను పాణిన్యనుశాసనము సామాన్యవిషయముగాక యందందుఁ గన్పట్టు క్వాచిత్కప్రయోగములకు సాధుత్వము గల్గించుటకుఁ బుట్టినదనుట సాహసైకమూలము; నిరాధారము. ఈ యనుశాసనము క్వాచిత్కవిషయమని యంగీకరించినచో "బహుళ-వా-అన్యతరస్యామ్-" అను మొదలగు వికల్పార్థక పదములుగల సూత్రములును, శాకల్య, శాకటాయన, గార్గ్యాచార్య, స్ఫోటాయన భారద్వాజాదిముని నామములుగల సూత్రములును, తదితరములగు(వ్యాఖ్యానములలోఁ గ్వాచిత్కములని నిరూపింపఁబడిన) కొన్ని సూత్రములును గ్వాచిత్కము లగుటయు, నందువలన వ్యాకరణము సంకుచితమగుటయు సంభవించును.

పై యనుశాసనము క్వాచిత్కమని శాస్త్రిగారు సులభముగ ననిరేకాని కవి కార్తికేయభక్తుఁడని యాతని పేరున నిముడ్చుట కెంతటి యాయాసముపాలైరో చూడుడు.

"కాళస్య-శివ స్యాపత్యంపుమాన్ కాళీ-కార్తికేయః తస్యదాసః - కాళిదాసః" అని విగ్రహమట! తొలుతఁ బ్రసిద్ధములగు నిఘంటువులఁ బట్టిగాని, కావ్యములఁబట్టిగాని యాలోచించినచోఁ బూర్వముగ నొక శబ్దము లేకుండిన కాళశబ్దము శివవాచక మగుట సామాన్యముగఁ బొసఁగనేరదు. చూడుఁడు — మహాకాలః, కాలకంఠః, మొ॥ మఱియుఁ గాలశబ్దమునకు సామాన్య శైవపరముగ నగము ప్రసిద్ధము. అట్టి సందిగ్ధమగు పదమును దీసికొని 'తస్యాపత్యంపుమాన్ కాళీ'యనియర్థముచెప్పుట మఱియు వింతగ నున్నది. కాళీయనునది యీకారాంతమును,—స్త్రీవాచక మగు కాళికాదేవియందుఁ బ్రసిద్ధమైన రీతిగ, నకారాంత పుల్లింగమునఁ గుమారార్థమునఁ బ్రసిద్ధమై యుండలేదు. ఏ నిఘంటువులోఁ గూడఁ జెప్పఁబడలేదు. (కాళీయనిన శీఘ్రముగ — శీఘ్రముగ నేమి? ఏయర్థము స్ఫురించునో చదువరులే యూహింతురుగాక!) ప్రకృతి యగు కాళ పదమే సందిగ్ధమగునపుడు కాళీపదమును గూర్చి వేఱుగఁజెప్ప నక్కఱయే లేదు. కాళిన్‌శబ్దమునకు సమాసమున నకారలోపమును జేసికొనినఁ (ద్రావిడ ప్రాణాయామమురీతి) గుదురునేమో? ఇందు (కాళిదాస పదమున) శాస్త్రిగా రెంతటిశ్రమపడఁ బాలైరో యాలోచింపుఁడు, "జ్యాపోస్సంజ్ఞాఛందసో ర్బహుళమ్" అను

దానిచే హ్రస్వము చేసినంత మాత్రమునఁ గుదురు నీపద మునకు విపరీతార్థమును గల్పింపఁదలఁచిన నింతటి కష్టము గలిగినది. వారిరూపసాధనమున నేమైన లాఘవముండినఁ గదా యద్దాని నంగీకరించుట. తల్లిదండ్రు లుంచిన నామము నేమైయుండిన నుండవచ్చును. కాళీదాసుఁ డనుటచేఁ బిదపఁ గాళిదాసుఁడు కావచ్చును. ఇందు దోష మే మున్నది?

కాళిదాస మహాకవికి వాల్మీకియెడ దృఢతరభక్తి గౌరవములు గలవనుట నిర్వివాదాంశము; కాననే మహాకవి మహర్షి రామాయణ బాలకాండమున వ్రాసిన రీతినున్న కుమారసంభవకథనే తీసికొని పురాణాంతర సాపేక్ష లేకయే కుమారసంభవమును రచించెను.

కాళిదాసు తొలుదొల్త కుమారసంభవమును రచించె నని చెప్పి శాస్త్రిగారు కవికిఁగల కార్తికేయ భక్తిని సమర్థింపఁ దలఁచిరి గాని కుమారసంభవము తొలు దొల్త రచింపఁబడెననుట కాధారము లేదు. ఒకయెడ "అస్తికశ్చిద్వాగ్విశేషః" అను సాంప్రదాయానుకూల ముగఁ గుమారసంభవమే కవియొక్క తొల్లిటి కృతియని శాస్త్రిగా రనుకొనినను—దానింబట్టి కవి యిష్టదైవము కాళీదేవి యనెడి కథనుగూడ విశ్వసింపవలసి వచ్చును. మహాకవికి వాల్మీకియెడఁగల భక్తిచేఁ దద్రచిత రామా యణానుసారముగ రఘువంశరాజుల వర్ణనచే విలసిల్లు రఘువంశమునే తొలుతరచించెను.

రఘువంశమునే తొలుదొల్త రచించె ననుటకు మఱి యొక యుక్తికలదు. కవి తా రచించుఁ దొల్లిటి గ్రంథమునఁ బీఠికరూపముగఁగాని, దనసైచ్ఛాను సంధానమునఁగాని తనయసమర్థతను (ఆరోపితమైనను) జెప్పుకొనును గాని మొదటికృతిలో నేమియుఁ జెప్పుకొనక రెండవదానిలోఁ గాని, మూఁడవదానిలోఁగాని తనపీఠికను వ్రాయుట యనుచితము. మనకు రఘువంశ ప్రథమ సర్గారంభమననే—

"క్వసూర్య ప్రభవోవంశః క్వచాల్పవిషయామతిః;
తితీర్షు ర్దుస్తరం మోహా దుడుపే నాస్మి సాగరమ్.
మందః కవియశః ప్రార్థీ గమిష్యా మ్యుపహాస్యతామ్;
ప్రాంశులభ్యే ఫలే లోభా దుద్బాహురివవామనః.
అథవా కృతవాగ్ద్వారే వంశేఽస్మిన్పూర్వసూరిభిః.
మణౌ వజ్రసముత్కీర్ణే సూత్రస్యేవా స్తిమేగతిః.
(రఘువంశము, 1 సర్గ. 2, 3, 4శ్లో.)

అను శ్లోకములచే మహాకవి పీఠికారూపముగఁ గొంత చెప్పెనని మన మూహింప వచ్చును. పిదప (మేఘసందేశ మును రచించిన పిదపఁగాని రచించుటకుఁ బూర్వమునఁ గాని—యేది యెట్లయినను మనకు విరుద్ధముకాదు) మఱి యొకకావ్యమునకుఁ గథావస్తువును రామాయణ ప్రసిద్ధ మైనదానినేవెదకుచు—బాలకాండలోని,

"కుమార సంభవశ్చైవ ధన్యః పుణ్యస్తథైవచ"

ఈమొదలగు శ్లోకములచేఁ గుమారసంభవము రచించు టకు యోగ్యమగు కావ్యమని యెంచి వాల్మీకి మతాను సారముగ నతనియందలి భక్తిచే దానినే రచించెను. కాన నీకథకు స్కాందపురాణము మూలమనుటయు నసం గతము. స్కాందపురాణమునఁ గుమార విజయాదికము వర్ణితమగుటచేతను, గాళిదాసకృతకుమార సంభవములోని మొదటి యెనిమిది సర్గలే కాళిదాసకృతములను సిద్ధాంత మంగీకరించినప్పుడే కుమారసంభవమను పేరు కావ్యము నకు సరిపడియుండుటచేతను, వాల్మీకి మహర్షి చెప్పిన కథ కుమారసంభవాంతమే యుండుటచేతను, గవి వాల్మీకి కృతరామాయణము ననుసరించియే కుమారసంభవమును వ్రాసెనని యంగీకరింపవలెను. కాళిదా సెనిమిది సర్గలే రచియించెనని పండితప్రసిద్ధమగు సిద్ధాంతము.

కాళిదాసు కార్తికేయభక్తుఁడే యైనచో స్కాందపురాణమునంత నేల ఆధారముగఁ దీసికొనకుం డును? తమ స్వామిప్రభావాదులం దెలుపక జననాంత మువఱకే యేల కావ్యమును రచింపవలెను? కుమారభక్తుఁడే యైనచోఁ దారకాసుర విజయాంతమువఱకుఁ గథను రచిం పకయుండునా? భక్తుఁడయ్యుఁ బ్రభావమును వర్ణింపకుం డుట యుచితమగునా? కానఁ బురాణైకదేశమగు స్కంద సంభవకాండ సాహాయ్యమునఁ గావ్యమును రచియించె ననుట యుచితము కానేరదుగదా!

వర్ణ్యమున కత్యధికము, నుదారమునగు నవర్ణ్యము తో సామ్యము నాపాదించునెడ నవర్ణ్యమునఁగల గౌరవ

ము లేటతెల్లము కాఁగలదుకాని, అంతమాత్రమున నవర్ణ్య మునఁగల భక్తి ప్రకటితమగు ననుకొనుట విచారణీయము. కార్తికేయుఁడు ప్రసిద్ధమహాపురుషుఁడగుటఁ దజ్జన్మాదిక సామ్యము ప్రకృతోత్కర్షానహామగును. అందువలనఁ గవికిఁ గార్తికేయుని యెడఁగల గౌరవము ప్రకటీకృత మగును గాని తనకుఁగల కార్తికేయ భక్తిత్వము వ్యక్తము కాఁజాలదు.

లోకకంటకుఁడగు తారకాసురునిదండింప నెవ్వరి శక్యము గాకపోవుటచేఁ బితామహుఁడు పార్వతియెడ నీశ్వరునకు మక్కువగలుగున ట్లొనర్పవలెననియు, వారల కుద్భవించిన కుమారుఁడే తారకుని సంహరించుననియు, దేవతలకుఁ జెప్పెను. మఱియుఁ గుమారుఁడు తక్క తక్కిన వారెవ్వరును దారకుని సంహరింపలేరని—

"సంయుగే సాంయుగీనం త ముద్యతం ప్రసహేతకః?
అంశాదృతే నిషిక్తస్య నీలలోహితరేతసః"

అను శ్లోకమునఁ జెప్పఁబడినది. స్కందుఁ డింతటి మహా పురుషుఁడు కావుననే తత్సామ్యముకొఱకుఁ దన్నామ మును, దచ్చరిత్రమును దీసికొని యుండవచ్చును. ఆ యభి ప్రాయముననే " స్ఫురసరిదివ తేజో వహ్నినిష్ఠ్యూతమై శమ్॥ యో హేమ.......రసజ్ఞా॥, బ్రాహ్మేముహూర్తే ...... కుమారమ్॥, ఉమా ...... శరజన్మనాయథా॥" ఈమొదలగు సందర్భములు కుదురఁ గలవు. మఱియుఁ గొన్నియెడలఁ గుమారసామ్యమునకు. మఱియు నెక్కుడుగ నౌచిత్యము కన్పట్టుచున్నది.

"అథ్యైన మద్రేస్తనయాశుశోచ
సేనాన్య మాలీఢ మివాసురాస్త్రైః॥"

ఇట్టి యెడఁగల చమత్కృతిం గనుఁడు. గిరిపుత్రిక పుత్రనిర్విశేషముగ దేవదారు వృక్షమును బెంచుకొను చుండెను. అట్లయినను దనపుత్రుఁడగు కుమారునికంటె నం దెక్కుడుమక్కువయుండుట కవకాశములేదుకదా? తన సుతునియందున్న ప్రేమకంటెఁ జాల తక్కువగనే కూరిమి యుండుట సహజము. అట్టి చెట్టుయొక్క పట్టను మదపు టే నుఁగులు కపోలముల రాచి యూడఁగొట్టినప్పుడు తనకన్న కుమారుననిలో శత్రువులు బాధించిన నెట్లు విచారించెనో యట్లే విచారించెను. ఇట సేనాని యను కుమారుఁడు పార్వతీకుమారుఁ డగుటచేఁ దత్సామ్యమున దేవదారు వృక్షములయెడఁ గల మక్కువ యెక్కువ యని లేటతెల్ల మగును.

ఇట్లు కొన్నియెడల నీ కుమారసామ్య మున్నను సాక్షిప్రాయమని యెఱుంగవలెను.

మఱియు మహాకవికాళిదాసు కార్తికేయభక్తుఁడే యైనచోఁ గ్రింది కాళిదాసోక్తియే సరిపడదు.

" ప్రాలేయాద్రేరుపతట మతి
క్రమ్య తాంస్తా న్విశేషాన్
హంసద్వారం భృగుపతియశో
వర్త్మ యత్క్రౌఞ్చరంధ్రమ్,
తేనోదీచీం దిశమనుసరే
స్తిర్యగాయామశోభీ
శ్యామఃపాదో బలినియమనా
భ్యుద్యతస్యేవవిష్ణోః."
(మేఘ సందేశము ౧ సర్గ. ౫౭ శ్లోకము.)

ఈశ్లోకమునఁ గ్రౌంచపర్వతమును భేదించినవాఁడు పరశు రాముఁడనియు, నందువలన నతనికిఁ గీర్తి లభించెననియు వర్ణింపఁబడినది. కాని న్యాయ్యమును బట్టిచూడ నాకీర్తి కుమారునిదే. స్కందుఁడు తొలుత బాణప్రయోగమును (దన శక్తినంతటిని వినియోగించి) జేసెననియుఁ బిదప కొంచెము పట్టుగలిగియుండఁ బరశురాముఁడు దానిని విడగొట్టెననియుఁ బ్రసిద్ధము; కావుననే యమరసింహుఁడు క్రౌంచమును భేదించినది కుమారుఁడేయని "కుమారః క్రౌంచదారణః" అని తననిఘంటువునఁ జెప్పుకొనెను. * న్యాయ్యము నాలోచించిన లోకమును గుమారుఁడే క్రౌంచభేదకుఁడని యంగీకరించుచున్నది. ఇయ్యదియే సుప్రసిద్ధమగు కింవదంతి. కాళిదాసు కుమార భక్తుఁడే యైనచోఁ దనస్వామియొక్క ప్రభావమును వర్ణింప వలెను. ఇందుఁ బ్రభావము వర్ణింపకపోవుటయటుండ— ప్రసిద్ధమును, యథార్థమును, గుమార ప్రభావప్రతిపాదక మనగు క్రౌంచభేదనగాథను గుమారపరముగఁ జెప్పక యాకీర్తి పరశురాముని దనియును, దానిని భేదించిన

నాఁడు పరశురాముఁడనియు, (కోడలిపనిలో నత్తగారు జారెను. కార్తికేయభక్తుఁ డిట్లుచెప్పుట యుక్తమను నట్లు తోఁచుటలేదు.

క్రౌంచక్రౌంచం ఖురళి విహరత్కార్తికేయేషు జాత చ్ఛిద్రచ్ఛద్మశ్రవణపదవీచారిణీంచారశౌర్యైః। శశ్వద్గీతాం భువనమహితాంకాకతీంద్రస్య కీర్తిం క్రౌంచద్వారాభృచ్ఛ్యవతి మహాలో విస్మయాన్నిశ్చలాంగః ॥ (ప్రతాపరుద్రీయే)

ఇట్లనేకములు గలవు. లాలితపదము లనేకము లున్నను సుమారపదము పలుసారులు వాడుటచేఁ సుమారభక్తుఁ డనవచ్చుననుట యుక్తిసారము. కవులుఁ దమ కుపకరించు పదములనే దీసికొనుట సహజము. "ఆ కుమారకథో ద్ఘాతం కాలిగోప్యో జగు ర్యశః," ఈ మొదలగు చోట్లఁ సుమారపదమే యుక్తముగను మాధుర్యవిలసితముగను నున్నది. లేక "బాల" మొదలగు శబ్దములనే చొప్పించిన చో ఛందోభంగము కలుగకుండుటకై పదాంతరముకూడఁ జొప్పింపవలసియుండును. కాన నట్టియెడ సుమారపదము వాడుటకుఁ బ్రయోజనాంతరము చెప్ప వలసుపడదు.

మహాకవి కాళికాభక్తుఁడనుటకును, మన కవీంద్రుని నోటం గాళీదేవి వీటీరసము నుంచుట నీలలితకవిత యల వడెననుటకును

" చేటీభవన్నిఖిలఖేటీకదమ్బవనవాటీషు నాకపటలీ,
కోటీరచారుతరకోటీమణీకిరణకోటీకరంబితపదా;
పాటీరగంధికుచశాటీకవిత్వ పరిపాటీమగాధిపసుతా;
ఘోటీకులాదధికధాటీముదారముఖవీటీరసేన తనుతామ్.

ఈ మొదలగు దేవీదశశ్లోకములు సత్ప్రమాణములు. సర్వాధికకవితాసమర్థుఁడగు మహాకవి రసమును జిప్పిలుచు, యమకభూయిష్ఠములై హృద్యములగు నీదశశ్లోకములను రచింపక యన్యుఁడు రచించెననుట సాహసముకాఁగలదు.

మహాకవి కాళీభక్తుఁడు కాఁడనుటకు శాస్త్రిగారు చూపిన యుక్తులు సరిగానుండునట్లు తోఁచుటలేదు. అట్లే కార్తికేయభక్తుఁడని చెప్పుటకును బ్రమాణములు వారి వ్యాసమునఁ గాన నచ్చుట లేదు. అందుననే నేనిట్లు వ్రాసియుంటిని. ప్రమాణాంతరము చూపి సాధించిన నభిప్రాయము మార్చుకొన వలనుపడును.

---

## విరహిణి

ఒక యాంధ్రవనిత

ఏమెడ నుంటివో యెచ్చోటికేగితో నీజాడలను జూడ నేరనైతి;
ఏ తరుచ్ఛాయలం దేవేళ నిలుతువో నీ జాడలను జూడ నేరనైతి;
చలువ పూపొద నొంటి నిలచి సైపగలేక నీ జాడలను జూడ నేరనైతి;
"హా! నాథ" రమ్మంచు నందందు వెదకియు నీ జాడలను జూడ నేరనైతి
వీనులారగ నీ వేణుగానసరణి-వినుటెపుడో! నిన్ను కనులార గనుటమెపుడో?
విమల సుజ్ఞాన మానసవీథులందు-దాగియుంటివో యేమొ విరాగివగుచు?

గీ. కిసలయముచేత మేనెల్ల కృత్రిమముగ-జేసి 'యా' దీసి 'మా' వ్రోసి చింతలేక
సలలితం బగు 'కి' ద్రుంచి సాగుడిచ్చి-సదయ! హృదయము జేసెనా సామిబ్రహ్మ?

గీ. అనుచు నేడువసాగె నాయతివ రాధ-విపులదుఃఖాబ్ధిలో మున్గి ప్రియునికొఱకు
కనుల దుఃఖాశ్రుగణములు కారనొడగె-విధిని దూరదు మాధవు వీడలేదు.

---

# వినోదవిమర్శపరామర్శము

శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి గారు

'వినోదవిమర్శ' మను పేరితోఁ బ్రభవ ఫాల్గుణ భారతిలో బ్ర. శ్రీ. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తిక్కనసోమయాజి కవిత్వమందలి స్వారస్యములు చూపుచుఁ జక్కని పాఠములను, వాని యర్థములును బ్రకటించినారు. అది యాంధ్రభాషకు మహోపకారము. పూర్వము భారతాదిగ్రంథములు వ్రాసికొన్నపుడు, నిరక్షరకుక్షులు తెలియక వ్రాసిన తప్పులు కొన్ని, అక్షరాస్యులు తమ కర్థము కాకపోవుటచేత దిద్దినవి కొన్ని, విమర్శకుల కావేళకు స్ఫురింపకపోవుటచేత సవరించినవి కొన్ని, ఎట్లయిన నేమి మాఱుపాఠముల పాలయిన భారతాదిగ్రంథముల యథార్థరూపము గ్రహించుట కొన్నిపట్టులఁ గష్టముగానే యున్నది. అట్టివానిని బరామర్శించి ప్రకటింపఁబూనిన బ్ర. శ్రీ. ప్రభాకరశాస్త్రిగారియెడల నాంధ్రలోకము కృతజ్ఞత చూపఁదగును.

వారి వినోదవిమర్శారంభమున భారతోద్యోగపర్వమందలి "పగయడఁగించు టెంతయు శుభంబు" అను (3 ఆశ్వా. ౭౧) పద్యమునకు నర్థమును వివరణమును వ్రాసి "పయిపద్యమునకు నాకు గోచరించిన యర్థమును తెలుపుకొన్నాఁడను. ఇంతకంటె సరసమైన యర్థ మెవ్వరికేని గోచరించినచో వెల్లడింప వేఁడుచున్నాఁడను." అని వ్రాసినారు. ఆపద్యమున కర్థము నాకు మఱొకవిధముగా గోచరించినది. అది సరసమయినదగునో కాదో ప్రభాకరశాస్త్రిగారును, పాఠకులును నిర్ణయింపవలయును. గాని నేను నిర్ణయింపఁజాలను. నాకుఁ దోఁచిన యర్థమును వారి యనుజ్ఞాప్రకారము వెల్లడించుచున్నాను.

ఈ పద్యమున ననేకపాఠములు గలవు. నాకు లభించిన వ్రాఁతప్రతుల పాఠములును, ముద్రితగ్రంథపాఠములును ముందు చూపఁబోవుచున్నాను. ప్రభాకరశాస్త్రిగారు కీ. శే. తం. తేవప్పెరుమాళ్లయ్యగారు ప్రకటించిన పాఠమునే గ్రహించినారు. నేనును ఆపాఠమునే గ్రహించి యర్థము వ్రాయుచున్నాను.

చ. "పగ యడఁగించు టెంతయు శు
భంబది లెస్స యడంగునే పగం
బగ నగకొన్న మార్కొనక
పల్కక యుండఁగవచ్చునే కడుం
దెగ మొదలెత్తిపోవఁ బగఁ
దీర్పఁగవచ్చినఁ గ్రౌర్యమొందు నే
మిగతిఁ దలంచినం బగకు మే
లిమిలేమి ధ్రువంబు కేశవా!

అవతారిక.— శ్రీకృష్ణుని రాయబారిగాఁ బంపునపుడు ఆతనితో ధర్మరాజు పలికినపలుకు లివి. ఈవాక్యములకుఁ బూర్వము "పెనఁకువ, గాని యుపాయమునఁ బగఅఁగడదేర్చుధృతిం, బూనినడచు నెవ్వఁడు డెం,దానం జెయివెట్టుకొని యతఁడె నిద్రించుఁగా." అనియు, "పగయ కలిగెనేని పాము న్నయింటిలో నున్న యట్లకాక... వలవదధిక దీర్ఘవైరివృత్తి." అనియుఁ జెప్పినాఁడు. అధిక దీర్ఘవైరివృత్తి గూడదన్నపుడు పగయడఁగించు కొనరాదా యనుప్రశ్నమున కవకాశము గలుగుచున్నది. దానికి సమాధానముగా పగ యడఁగించుట మంచిదేయని చెప్పుచు పగయడగించు సామాన్యసాధనములను, వానియందలి దోషములను ఇందుఁ జెప్పుచున్నాఁడు.

పగ=వైరము, అడఁగించుట=శాంతిపఱచుట, నశింపఁజేయుట, ఎంతయు=మిగుల, శుభంబు=క్షేమకరము. అదిలెస్స = (పగ అడఁగింపఁగలిగినచో) నది శ్రేష్ఠము. అంతకంటె మంచి దున్నదా? దీనివలన ధర్మరాజునకుఁ బగ నణఁచుటలో నున్న యత్యాదరమును, అణఁగించుట కష్టమనుభావమును సూచింపఁ బడుచున్నవి. ['విషస్య విషమౌషధ' మన్నట్లు పగచేతనే పగ నణఁపరాదా యంటే] పగం బగయడఁగునే=పగచేత పగశాంతింపదు.

పగ లోపల రాజుచున్నచో ఏనాటికైనను తనకో, శత్రువునకో చావు తప్పదని హృదయము. [పోనీ ఊర కుండరాదా. పగదానియంతట నదియే నశించునంటే] పగ = (శత్రుస్మరణమువలనఁ గలుగు) మానసికతాపము, మనోవ్యథ, కొన్నన్=పొందినపుడు, మార్కొనక=పల్కక యుండఁగ వచ్చునే=శత్రువుపై దండెత్తిపోక యూర కుండ శక్యమా? ఎదుర్కొనక, బదులాడక యుండవచ్చునా అనియుఁ జెప్పవచ్చును. [ఊరకుండుట శక్యముగానపుడు శత్రువును సమూలనాశము సేయరాదా యంటి వేని] కదుర్=మిగుల, తెగ=శత్రుపక్షము, మొదలెత్తిపోవన్=ఉన్మూలితమగునట్లు, వేళ్లు పెల్లగిల్లిపోవునట్లు, (మొదలెత్తున కీయర్థమున శ్రీనాథుని నైషధప్రయోగము ౬ ఆ. ౭ పద్యము.

"ధరణిపుఁ జక్కికట్టెదురఁ దా
　　మరసాక్షికిఁ జేట్పడ్డతం
బొరసెపనోమరాగ పరి
　　పూర్తినోకించుక సేపు నిర్ఝర,
స్మరశరపుంఖసంఘటిత
　　షట్చరణప్రమదాగరుచ్ఛటా
స్ఫురదనిలావతారమున
　　బోరనఁ దామొదలెత్తెనో యనన్."

పగఁదీర్పఁగవచ్చినన్=పగ నణఁగింపఁ బూనినచో, క్రౌర్యమొందున్ = క్రూరత్వము గలుగును. ఏమిగతిఁ దలంచినన్=ఏవిధముగా నాలోచించినను, పగకు మేలిమి లేమి ధ్రువంబు = పగగలిగియున్నచో క్షేమము లేదు హానియే సిద్ధమగుట నిశ్చయము.

అనఁగా పగచేతనే పగనణఁపఁబూనినచో ఏనాటికైనను తనకో శత్రువునకో చావు తప్పదు.

ఊరకుండుచున్న మానసికతాపము బాధించుచున్నది. అది చావుకంటె నెక్కుడుబాధ. శత్రువును సమూలనాశము చేయుదమన్న నది క్రూరకృత్యమగు. కావున పగవలన హానియేకాని మంచిలేదు. అని చెప్పి ముందుపద్యమున "కావున శాంతిఁబొందుటయు కర్జము తానది యట్టులుండె" అని చెప్పుచున్నాఁడు ధర్మరాజు.

దీనికి మూలమయిన సంస్కృత భారతభాగము (ఉద్యో. ౭౨ అ.) చూచినచో తిక్కనసోమయాజి భావము తేటపడును.

"నచాపివైరం వైరేణ కేశవవ్యుపశామ్యతి,
హవిషాగ్నిర్యథాకృష్ణ! భూయఏవాభివర్ధతే.

కృష్ణా! పగచేత పగ అణఁగదు. ఆజ్యముచేత అగ్ని అణఁగక మరంత మండునట్లు పగ అణఁగక మరంత పెరుగును.

అతోన్యథా నాస్తిశాంతి ర్నిత్య మంతరమంతతః,
అంతరంలిప్సమానానా మయం దోషో నిరంతరః.

ఏరికైనను ఛిద్ర మపరిహార్యము. కావున తనకో, శత్రువునకో చావు గలుగకుండఁగా శాంతి కలుగదు. ఛిద్రములు వెదకువారికి నాశదోషము తప్పదు.

పౌరుషే యోహిబలవా నాధిః హృదయబాధనః,
తస్యత్యాగేనహిశాంతి ర్మరణేనాపివాభవేత్.

హృదయబాధకమైన మనోవ్యాధి విడిచినచో శాంతి గలుగును. లేదా మరణమున శాంతి గలుగును.

అథవామూలఘాతేన ద్విషతాంమధుసూదన,
ఫలనిర్వృత్తి రిద్ధా స్యా త్తన్నృశంసతరంభవేత్."

లేదా శత్రువులను సమూలనాశము చేసినచో శాంతి కలుగును. అది మిగులఁ గ్రూరము.

పై శ్లోకముల తాత్పర్యమును అన్వయభేదముతో నొకపద్యమున నిమిడ్చిన తిక్కనసోమయాజి ప్రావీణ్య మెంతయుఁ బ్రశంసనీయము. ఈ పద్యమునకు భారతము లక్ష్మీపతి సోమయాజిగారు రచించిన వ్యాఖ్య ప్రభాకరశాస్త్రిగారు భారతిలో నెత్తిచూపినారు. చదువువారి కనువుగ నుండునట్లు ఇచ్చట వ్రాయుచున్నాను.

నేను పనిచేయుచున్న శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యస్థానమందున్న ప్రతిలో నున్నరీతిని వ్రాయుచున్నాను.

"పగను అణచివేయుట శుభము. ౧. అది మంచిది. ౨. పగచేత పగ అడగునా. ౩. పగగన్న దుఃఖము

రాఁగా (ఇక్కడ "పగఁగొన్న దుఃఖమురాఁగా" అని ప్రభాకరశాస్త్రిగా రిచ్చిరి.) యుద్ధముసేయక, వివదించక, ఉండవచ్చునా. ౪. కడుఁ మిక్కిలిన్ని మొదలు తెగ - మూలచ్ఛేదముగా ఎత్తిపోవ - దండెత్తిపోయినా పగదీర్పఁగవచ్చినా క్రౌర్యము వచ్చును. ౫. ఏలాగు విచారించినా (ఇట 'వివరించిన' అని ప్రభాకరశాస్త్రిగా రిచ్చిరి.) పగకు మంచిలేదు. ధ్రువంబు నిశ్చయము."

ప్రభాకరశాస్త్రిగా రీవ్యాఖ్య యిచ్చి "ఈ టీక యస్వరసమని నాతలంపు" అని వ్రాసినారు. "అది మంచిది, దుఃఖమురాఁగా" అనుభాగముతక్క మిగిలినది శాస్త్రిగారు గ్రహించినారు. "మొదలుతెగ" అనుచోట 'కడుఁ - తెగ - మొదలెత్తిపోవఁ......' అని సముదాయముమీఁద వ్రాసి తెగ, మొదలు అనువాని యర్థము, నన్వయమును స్పష్టపఱపరైరి. ఇట్లు చెప్పుటకంటె శాస్త్రిగారి వ్యాఖ్యగూడ నిచ్చట నిచ్చుట మంచిదని తోఁచుచున్నది. (పత్రికానిర్వాహకులు మన్నింతురుగాక.) "ధర్మరాజు శాంతిఁబొందుటయ కర్జమని యిందు నిరూపించుచున్నాఁడు. పగచేఁ బగయణఁగించుకొనరాదనుచున్నాఁడు. ఉభయపక్షములును బగవీడి శాంతిపొసఁగియుండఁగోరుచున్నాఁడు. రాయబార మరుగు కృష్ణునితోఁ జెప్పుచున్నాఁడు: పగ - అడఁగించుట - ఎంతయు - శుభంబు = వైరమును రూపుమాపుట మిక్కిలి శ్రేయస్కరము. అది = అవైరము, పగఁ = వైరముచేత (స్వపక్షము వైర మూనియుండఁగా), అడంగునే = అడంగదుగదా! వైరముపోవలె ననఁగా, ముందు స్వపక్షము వైరము వీడవలెను. స్వపక్షము వైరము పూని యున్నప్పుడు అనివార్యముగాఁ బరపక్షముగూడ వైరము పూనవలసిన దగును. కావునఁ బరపక్షము వైరము లేకున్నను స్వపక్షము వైరము పూనియుండఁగా వైరము పెరుగునేకాని నశింపదు. అల్లే పగ = పరపక్షము - శత్రుపక్షము, పగఁగొన్నఁ = వైర మూనియున్నప్పుడు, మార్కొనక పల్కక యుండఁగవచ్చునే = ఎదుర్కొనక, బదులాడక, స్వపక్షము వైరము వీడియుండఁ గుదురదు. స్వపక్షము వైరమూనినఁ బరపక్షమును వైరమూనవలసివచ్చును. కాన యీ రెండువిధములందును శాంతి చేకూరదు. ఇఁక - రెండుపక్షములును వైరముఁబూని, కడుఁ - తెగ - మొదలెత్తిపోవఁ - పగఁదీర్పఁగవచ్చినఁ = స్వపక్షము పరపక్షముమీఁదికి దండెత్తిపోయినను, పగపక్షము స్వపక్షముమీఁదికి దండెత్తివచ్చినను, పరస్పరము యుద్ధముసాగి, ఇరుపక్షములో, ఒకపక్షమో అడఁగారి, పగపోయి శాంతి కల్గినఁ గల్గవచ్చును. కాని దాన క్రౌర్యమొందుఁ = హింసారూపమయిన క్రౌర్యమేర్పడును. కావున సర్వవిధములను పగ పనికిమాలినది అని పద్యార్థము." అని వ్రాసి వివరణము వ్రాయుచు స్వపక్షపరపక్షములం దున్న పగ కలిమి పగలేముల యందు గురులఘుభావము లారోపించి ఛందస్సులోనికి దింపి తుదికత్యుత్కృష్టపద్యము సంపాదించిరి.

వీరియర్థమున "లెస్స" దేనితో నన్వయించునో, అర్థమేమియో చెప్పలేదు. అది వాక్యాలంకారము గాన ప్రభాకరశాస్త్రిగారు వ్యాఖ్యలో నియ్యలేదనుకొనెదమన్న నది తిక్కనసోమయాజి ఫక్కిగాదు. అణఁగునే యనుదానితో నన్వయించినచో సరసార్థము రాదు. మఱియు, స్వపక్షము దండెత్తిపోవఁగా, పరపక్షము దండెత్తిరాఁగా అని యన్వయించుటకుఁ బదసామగ్రి లేదు. అది సంస్కృతభారత భావానుసారమును గాదు. ప్రభాకరశాస్త్రిగా రస్వరసమని తలఁచిన లక్ష్మీపతి సోమయాజిగారి టీకలో ఇదే యర్థమున్నది. అది తిక్కనసోమయాజిగారి భావమయియుండదని నా యభిప్రాయము.

ఈసంవత్సరపు స్కూలుఫైనలు టెక్స్టులో పగయడఁగించుటెంతయు శుభం; బదిలెస్స; అని సెమికోలను గుర్తులు పెట్టి ముద్రించిరనియు, ఆగుర్తులు సరసార్థభంజకములనియు వ్రాసి "పగయడఁగించుటెంతయు శుభంబు; అదిలెస్స; అని వేలుచేసినచో యగును. అది సోమయాజుల ఫక్కికాదు" అని ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిరి. "అది లెస్స" అనిచెప్పుట పాడినపాట గాదు. ధర్మరాజునకు శాంతియందుగల యత్యాదరమును పగయణఁగించుటయందలి కష్టమును సూచించుచున్నది. అదిగాక శుభము అన్నపదముకంటె లెస్స యనుపదమున

విశేషార్థ మున్నదిగదా. ఈ పదర్థభేముతోఁ జెప్పినది మరలఁ జెప్పుట సందర్భానుసారముగా గుణమే. అట్టివి తిక్కనసోమయాజికవిత్వమున లేకపోలేదు. ఉద్యోగ–3 ఆ. ౭౨. పద్యమునఁ క. ఒడఁబఱిచి......పొంది పొసఁగియుం, డెడి నట్టి తెలుఁగు సేయుట, గడుమే లది గౌరవము సుఖంబును చేయుఁ౯." అట్టి తెలుఁగుసేయుట కడుమేలు. అది = అట్టి తెలుఁగుసేయుట, గౌరవమును సుఖంబును జేయును. ఈరెండువాక్యముల నెంత భావ భేదమున్నది? ఇట్టివి యింకను గలవు.

మఱియుఁ 'పగఁదీర్పగవచ్చిన' అనుచోట "పగ దీర్పఁదలంచిన" అన్న పాఠము పై టెక్స్టులో మార్చినా రని వ్రాసి 'తలంచిన' అన్న పాఠము సరిగాదు. నేఁజూచిన తాళపత్త్రప్రతులలో లేదు. అది తిక్కనగారి తెలుఁగును గాదు. ఏలనఁగా, 'తీర్పఁదలంచిన గ్రౌర్యమొందు నే మిగతిఁ దలంచినన్' అని మరలనవేపదము వచ్చుచున్నది. రెండుమార్లొకేపదము దగ్గఱదగ్గఱఁగా నీతీరునఁ బ్రయోగించుట సరసరచన గాదు అని వ్రాసినారు. ఆంధ్రసాహిత్యపరిషత్కార్యస్థానమునుండి నేను తెప్పించిన పాఠములలో 'తలంచిన' అనుపాఠ మొక తాళపత్త్రగ్రంథమున నున్నట్లున్నది.

ఆపాఠమును గైకొనినయెడల నీపద్యము నర్థము ప్రభాకరశాస్త్రిగారు చెప్పిన స్వపక్షపరపక్షముల రాకపోకల యన్వయమున సరిపడకపోవచ్చును. రెండుమార్లొకేపదము దగ్గఱదగ్గఱ గావచ్చుట విరసమే యైనచో నట్టిదోషము మనము గ్రహించినపాఠమున 'వచ్చిన' అనుచోటఁగూడఁ బట్టునేమో? పాఠభేదప్రసంగములోనికి దిగినచో, త్రోవ, తెన్ను కనఁబడదు. ఒక్కొకపాఠమున నొక్కొకస్వారస్యముండును. "పగ చూడఁగించు చెంతయు నెపంబిడి లెస్స" అని యొక ప్రతిలో నున్నది. ఏదైన నెపము కల్పించి పగ యడఁగించుట మంచిది. ఏల? పగపగచే నడంగదుగాన...... అనిన సరసముగానే యున్నది. దీని కేమిగాని కీర్తిశేషులయిన తం. తేనప్పెరుమాళ్ళయ్యగారు సర్వతోముఖపాండిత్యముతో బహుగ్రంథశోధనముగావించి భారతాది గ్రంథములు ప్రకటించియుండకున్నచో మనము మహారణ్యమధ్యమం దుండియుందుము. ఆ మహానుభావుని యెడల నాంధ్రలోకము కృతజ్ఞతఁ జూపఁదగును.

ఆంధ్రసాహిత్యపరిషత్కార్యస్థాన గ్రంథసంఖ్య 2644.

"పగయడఁగించు 1నెంత్తయు ను
భంబ్బది 2లెస్సయడంగ్గనే పగ౯
3బగవగ కొన్ని 4మార్కొనక
పల్కకయుండ్డగవచ్చునే కడు౯
5దెగ మొదలెత్తిపోవ బగ
దీర్పకయుండిన 6గార్యమొంద్దు నే
మిగతి 7దలంచ్చినం బగకు
మేలిమి8 లేమిధ్రువంబు కేశవా.

1. "చెంతయునెపంబిడి" మఱొకప్రతి. 2. (క) "లెస్సయడంగునేని యప్పగ" (చ) "లెస్సయడంగునే వగ౯" (ట) "లెస్సయడంగునేనియు౯" 3. "పగఱగొనంగమార్కొనక" 4. (క) "మార్కొనంగబల్కగను౦" (చ) మార్కొనకపల్కగ" 5. "తెగవడినెత్తిపోవ" 6. "క్రౌర్యమొందు" 7. (క) "దలంచిచూచినను" (చ) "జరించినంబగకు" 8. (క) "మేలిమిలేదు" (చ) "మేలిమియౌట"

అచ్చుప్రతులలోఁగూడఁ గొన్ని పాఠభేదములున్నవి. గ్రంథవిస్తరభీతిచే వ్రాయుట మానినాఁడను. పాఠకమహాశయులారా! నేను వ్రాయుటకును వీరు చదువుటకు నిదే యొక్కనయైనది. వినోదవిమర్శమందు రెండవపద్యమగు తుదిరాజ్యంబన్న దానిలో పాఠభేదములెన్నోయున్నవి. పెరుమాళ్లయ్య గారు ప్రకటించిన పాఠమునకుఁ బ్రభాకరశాస్త్రిగారు వ్రాసినదే సమంజసార్థము. సుప్రసిద్ధము. విమర్శములో మూఁడవపద్యము నందున్న క్రొమ్మడి, ద్రుమ్మడి అనుపదముల పాఠములు, వాని వ్యుత్పత్తులు మరొక చిన్నవ్యాసమున భారతిలోనే ప్రకటింపఁదలంతు.

---

# గిరికుమారీ !

చల్లా లక్ష్మీనారాయణశాస్త్రి గారు

పరమోదగ్రత పూనముద్ర నిడియున్ బంచాగ్ని మధ్యన్ దప
స్స్ఫురణన్ రాజిలు శైలరాజతనయన్ జూడన్ మదిన్ గోరి శూ
లి;రహిన్ వృద్ధమహీసురాకృతిని శైలేశాత్మజాతాతపః
పరిపాకోజ్జ్వల వన్యభూమి కరుగన్ వాంఛించి సన్నద్ధుఁడై.

నుడులందున్ దడఁ బుట్టఁగన్ ముఖమునందున్ దేజమున్ దోఁప నె
క్కుడు మాంద్యంబు లభింప దృష్టికి మదిన్ గోపంబు రెట్టింప ని
ల్కడఁ దప్పన్ నడుమున్ వడంక నడుగుల్ దార్కొమ్రుఁ జెందన్ బలం
బుడుగన్ దండము నూఁది శంకరుఁడు వృద్ధుండోయనన్ వచ్చెడిన్.

ఇటులు వేంచేయు శివుని వీక్షించి గౌరి-వృద్ధుఁడంచునుఁ దలపోసి వినయమొప్ప
నర్ఘ్యపాద్యాదివిధులచే నర్చనంబు,-సలిపి కూర్చుండ నియమింపఁ బలికె ముసలి.

ఎవ్వతెవీవు నీదు కులమెయ్యది ? నీ తలిదండ్రు లెవ్వరో
జవ్వని! యిట్టులుంట సరసంబె! ప్రచండపుటెండ నీదు మే
నివ్విధి వేఁపఁ బాడియె యిసీ పెరవారలు నీదు సేఁతకున్
నవ్వరె, యాటపాటల ననారత మింతటఁ బ్రొద్దుఁ బుచ్చుమా !

తపముసాలించుబాల ! కుందనమువంటిఁ, మేనుకసిగంద నీరీతి మెలఁగనేల ?
నంచుఁ బలికెడి వృద్ధువాక్యములు వినుచు, గౌరి యిట్లాడె వినయంబుఁ గడలుకొనఁగ.

తప్పటడుగులువైచు నందనునిఁ గాంచి-యొసఁగి చేయూత సాయమింపెసఁగఁ జేయు
తండ్రిగతి సాయమొనరింపఁదగును మీర, లట్లొనర్పక నిటువల్కనగునె తండ్రి!

పలుకు లిఁకేల ? తండ్రి హిమవంతుఁడు, మేనక తల్లిగాదె; ని
ర్మలచరితా, భువిన్ "గిరికుమారి !" యటంచు సతంబు లోకులున్
బిలుతురు నన్ను, నారదుని ప్రేరణచే గిరి కల్లుఁడౌటకే
నెలమిఁ దపంబొనర్ప మదినెంచితి శంకరుఁగోరి నిచ్చలున్.

దురితవ్రాతలతాలవిత్రము, మునిస్తోమాభి వంద్యమ్ము, దు
ర్భరసంసారకరాళవార్ధితరణోపాయమ్ము సత్సంపదా

కరమున్ జ్ఞాననిధి౯ ప్రదాన, మవివేకధ్వాంతసూర్యోదయం
బరవిందాక్షనుతమ్ము శూలధర పాదాంభోజ మే నెంచెదన్.

అనుచు బాలేందుమౌళి పాదారవింద-సుందరయుగమ్ముఁ జిత్తంబు నందఁ జేర్చి
భక్తి నిగుడంగఁ బార్వతి పలికినట్టి-పలుకులాలించి కపటోక్తిఁ బలికె ముసలి.

"ఎంతటి వెఱ్ఱిదానవో యిసీ! విషభక్షకుఁ డాభవుండు, నీ
గొంతుకఁ గోయ నెంచె మునికుంజరుఁ డోలలితాంగి! బాపురే!
సుంతయు నీవెఱుంగ విది జుట్టుకు జుట్టుకు ముళ్ళువెట్టి తా
వింతలుఁ జూచు నారదుఁడు వెంగలి, నీగురువయ్యెనే కటా!

అతివ! క్రొమ్మావి కెంజిగురాకుఁ బోని,-తేనియలుఁ జిల్కు నీమోవి నాని గరళ
కంఠుఁ డూర్పుల వాతెఱఁ గమలినటులు, జేయకుండునె నామాట చెవినిఁబడునె!

పొట్టకుఁ గూడులేక విసమున్ భుజియించు టదేమి లెస్స; తా
గుట్ట వసించుఁ గట్టుకొనగుడ్డయులేమి మదేభ చర్మమున్
పుట్టముఁగట్టు భూతగణముల్ దనుఁగొల్వ నొకప్డు పుట్టముల్
గట్టఁగ లేమి సిగ్గరి దిగంబరియై తిరుగాడుఁ గోమలీ!

బూడిదఁబూయు దేహమునఁ బూయఁబటీరము లేదె, హారముల్
వేడుకఁ బూన లేవె; మెడ వ్రేలెడుఁ బన్నగపంక్తి యింతి! నీ
కీడగు జోడుగాదు లభియించెడి దేమిఁక "జోగిజోగియున్
గూడిన బూదెరాలెన"ని కోవిదులాడెడి పల్కు కల్లయే!

నిక్కము దాపనేల? తరుణీమణి! గంగనుఁ బెండ్లియాడెఁ; దా
నెక్కుడు గష్టమంది నివసించుటకే నిలులేమి నెత్తిపై
కెక్కియుఁ దాండవింపఁ దొడఁగెన్ జడలేరు; తలంప నీవుఁ బె
న్మక్కువఁ జంకనెక్కుమిఁక మానుడు లేటికి దూరు నీచెవిన్

రమణీ! కోపముఁజెందవేని హితమున్ రవ్వంత యాలింపు, ని
క్కము దాపన్ బనియేటికిన్ "భవతి భిక్షాందేహి" యంచున్ గపా
లముఁ గేలన్ ధరియించి భైక్షుకునిలీలన్ శూలి యింటింటికిన్
భ్రమణంబున్ దగసల్పు, నట్టిధవునిన్ వాంఛించితే! యింతకున్.

చెలియరో! చెప్పఁబూనినది చెప్పితిఁగాని మఱొక్కమాట నీ
చెలువుఁడు నల్లరాయి, యిఁకఁ జెప్పెడిదేమి గళంబునంద యా
శిల ధరియించి కాపుర మిసీ! యెటు సేసెదో నీకు భర్త నే
నెలమినిఁగూర్తు"నంచు వచియించినఁ బార్వతిపల్కె నల్కతోన్.

బూడిదఁ బూయుఁగాక, విసమున్ భుజియించునుఁగాక పాములన్
వేడుకఁబూనుఁగాక మురిపెంబునకై జనుఁగాక, బూచులన్
గూడి చరించుఁగాక, మదకుంజర చర్మముఁ దాల్చుఁగాక; యా
బూడిదఁ బూయురుద్రుఁడె ధవుం డిది నిక్కము నిక్క మింతకున్.

అమలచరిత్ర! చంద్రిక హిమాంశునిఁ బాసినఁబాయుఁగాక; దు
ర్విమలత ఛాయ, భాస్కరుని వీడిన వీడును గాక; మించు మే
ఘమునుఁ దొఱంగినన్ దొఱఁగుఁగాక; మదీయ మనోగతుల్ల స
ద్విమలచరిత్రు శంకరుని వీడఁగనేర్తునె వేయి సెప్పినన్.

బిరబిర గౌరి యీఁగతినిఁ బిట్టలుకన్ వచియించి రోషవి
స్ఫురదరుణ ప్రభన్ వఱలు మోమొకవంకకుఁ ద్రిప్ప; మోవిపై
దరహాసితంబు నింపెసఁగఁ "దన్వి శిలన్ మెడ గట్టుకొమ్ము నే
నరిగెద"నంచు రుద్రుఁడు ముదంబున మెల్లనసాగు చంతలోన్

నెఱిమేన జీరాడు కరిచర్మపరిధాన మరుదార నిజదీప్తి నతిశయిల్ల;
సరసంపు సంజ కెంజాయ తళుక్కులమించు ఘనజటాజూట సంగతి దలిర్ప;
ఘనసార పంకసంకలితాంగ సౌందర్య మనఘ విభూతిచే నినుమడింప;
బాలచంద్ర ప్రభాభాసమానాంగియై నిర్జరాపగ హాళి నెగడుచుండ;
ప్రమోల భయలీల బూచులమూక లెగయ-నాగసంతతి మేనఁ దాండవముసల్ప;
రంకెలను వేసెడి బసవరాజునెక్కి,శంకరుఁడుఁ దోఁపఁ గన్గొని చకితయగుచు.

కరచంచన్మణి కంకణప్రకర నిక్వాణంబు సంధిల్ల, దు
ర్భరవక్షోజ యుగంబుఁ బెల్లదర; గాత్రక్షోభ మేపార; బి
త్తరిచూపుల్ నిగుడన్ ద్రపాస్ఫురణ ముగ్ధత్వంబుఁ బాటించి గా
రి, రహిన్ బ్రక్కకునేగె రుద్రుఁడు "కుమారీ!" యంచు డాయంజనన్.

---

# పదునేనవశతాబ్దమందలి వాఙ్మయము

యస్. శ్రీకంఠశాస్త్రిగారు, యం.ఏ.

## ౧. ప్రథమఘట్టము ౧౪౦౦-౧౪౧౬

దాక్షిణాత్య రాజకీయచరిత్రయందు పదునేనవశతాబ్ద మెంత విఖ్యాతి గాంచియున్నదో, సాహిత్యాది కలాకౌశల చరిత్రయందు నదేరీతిగా ముఖ్యస్థలార్హమైన దనుటకు సందేహము లేదు. ప్రాచీనభారత సంస్కృతిరక్షణార్థము విద్యారణ్యులచే విసర్జింపబడిన విజయనగర సామ్రాజ్య మొక శతాబ్దకాలమున నౌత్తరేయుల హావళి దప్పించియు నాసేతుకృష్ణా పర్యంతమును రాజ్యమును విస్తరించియు, నేకఛత్రముగ బ్రవర్ధిలుచుండెను. ఇమ్మడి హరిహరరాయని కాలమునందే దేవభాషయందునే కాక దేశభాషలందును విస్తార మగు వాఙ్మయము బయలుదేరుచుండెను. ఏతన్నిదర్శనముగ శిలాలేఖనములందును, ఇతరగ్రంథములందును గీర్తింపబడిన కవులను భాష్యకారులనుచూపవచ్చును. హరిహరుని కాలమునందు బ్రకటింపబడిన వేదభాష్యము నామమాత్రముగ సాయణాచార్యులచే రచియింపబడె నని ఖ్యాతి గాంచినను, నారాయణ వాజపేయయాజి, పండరిదీక్షిత, పెద్దవిద్యావల్లభ, నరహరి సోమయాజి, మంత్రసిద్ధి ఇత్యాది మహోపాధ్యాయులు, ఘనపాఠులు నగువారిచే వ్రాయబడెననియు, హరిహరునికి "వేదభాష్యప్రకాశకః" "రాజకల్యాణ శిరశ్శేఖరః" "సిద్ధసారస్వతేత్యాది బిరుదావళీవిభూషితః" ఇత్యాది బిరుదములు గల్గెననియు శాసనములచే దెలియును. హరిహరు నాస్థానమునందు ముఖ్యులగు కవులు మంగరస, డిండిమ, చెన్నుభట్ట, ఇరుగప్పదండనాథ, చౌండపాచార్య, విద్యారణ్య, నరహరి త్రియంబక, క్రియాశక్త్యాదులు గాక హరిహరునికిగూడ "రాజవ్యాస", "రాజవాల్మీకి" బిరుదు లుండుటచే తానును కవిత్వము చెప్పగలవాడని యూహింపవచ్చును. ఈతనికాలమునందు సామ్రాజ్యము దోరసముద్రము, చంద్రగిరి, ముళువాయి, తంజి, మంగళూరు, బారకూరు, తెరకణాంబి ఇత్యాది పట్టణముల పర్యంతము వ్యాపించియుండెనని తెలియవచ్చుటచే నింతవిస్తారమగురాజ్యమునం దపారవాఙ్మయము బయలుదేరె నను టాశ్చర్యము గాదు.

ఈ శతాబ్దపు వాఙ్మయ చరిత్రమును నాల్గుఘట్టములుగ విభజింపవచ్చును. క్రీ. శ. ౧౪౦౦-౧౪౧౬ వరకు హరిహరుని మరణానంతరము విప్లవము గల్గెనని బోధపడుటచే, రాజ్యమునందు శాంతి సుఖములులేక వాఙ్మయము క్షీణించెనని చెప్పవలయును. క్రీ. శ. ౧౪౧౬-౧౪౨౨ వఱకు ఇమ్మడి దేవరాయనికాలమునం దత్యుచ్చస్థితి

బొందె ననవలెను. క్రీ. శ. ౧౪౪౬-౧౪౬౫ వరకును, మల్లికార్జునుని రాజ్యకాలమునందు ముసల్మానులహావళిచేతను, నంతర్భేదములచే తను, విరూపాక్షునిద్రోహముచేతను రాజకీయ పరిస్థితి లెస్సగ లేకుండినను వెనుకటి ఘట్టము నందు బయలుదేరిన వాఙ్మయప్రవాహము క్షీణింపకపోయినను అత్యంతాభివృద్ధి చెంద లేదు. క్రీ. శ. ౧౪౬౫-౧౫౦౦ వఱకు సాళువనరసింహుని రాజ్యకాలమునందును దత్పూర్వము బాహ్యాభ్యంతరములచే రాజ్యమునందు శాంతి లేకపోవుటవలన ఇమ్మడిదేవరాయని కాలమునందున్న యత్యున్నతావస్థనుండి సాహిత్యప్రవాహము శోషించిపోయెను.

ప్రథమభాగమందు ముఖ్యముగ నిమ్మడి బుక్క-దేవరాయ, దేవరాయ, విజయరాయల కాలములం దెట్లు సారస్వతము ప్రవర్తిల్లెనో సూచింపబడును. వెనుకటి ఘట్టమగు హరిహరునికాలమున వాఙ్మయమునకును,ఇమ్మడి దేవరాయనికాలము వాఙ్మయమునకును బోల్చి చూడ గణనీయులగుకవు లెవరును లేరని చెప్పవలెను. తత్కాలీనవిజయనగరచరిత్రము విశదముగా నెవరిచేతను వ్రాయబడకుండినను, రాజకీయస్థితిని బరీక్షించుట సాహిత్యవిచారణావశ్యక మగుటచే సూక్ష్మముగా సూచింపబడును. హరిహరు ననంతరము నిమ్మడి దేవరాయనికాలమువరకు విరూపాక్ష, ఇమ్మడి బుక్క, దేవరాయ, విజయదేవరాయలు క్రమముగా రాజ్యపాలనముచేసిరని శిలాలేఖనముల వలన దెలియుచున్నది. ప్రథమవిరూపాక్షుడు కొన్నిదినములుమాత్రమే సింహాసనము నాక్రమించి సోదరు డగు ఇమ్మడిబుక్కనిచే బరాజితుడయ్యెను. క్రీ. శ. ౧౪౦౬ నందు ఇమ్మడి బుక్కడు గతించినందున ప్రథమదేవరాయడు సింహాసనము నధిష్ఠించెను. తన్నందనుడగు విజయుడు క్రీ.శ. ౧౪౧౩-౧౪౧౯ వఱకు రాజ్య మేలెనని శాసనము లుద్ఘోషించుచున్నవి.

రాజకీయాంతఃస్థితి ఈరీతి నుండగ, బాహ్యోపద్రవములును లేకపోలేదు. బహమని సుల్తాను డగు ఫిరోజ్‌షహా మతావేశమున కాఫరులపై ప్రతివర్షము జిహాద్ చేసెద నని ప్రతిజ్ఞచేసి ఇరువదినాలుగు దండయాత్రలు గావించెనని "బుర్హాన్-ఇ-మాసీర్" (Burhan-i-Masir) అను గ్రంథము చెప్పుచున్నది. ప్రతివర్షము ముప్పదిరెండులక్షలు టంకముల కప్పమును విజయనగరమువారు చెల్లించుచుండిరనుమాట యెంత విశ్వసనీయమో తెలియదు. పూర్వనిర్దిష్టగ్రంథమునందే ఫిరోజుని చరమావస్థయందు బూనిన దండయాత్రలు నిష్ఫలములయ్యెనని తేలుచుండును. ప్రథమదేవరాయనికాలమునందే ఆంతరికద్రోహ మధికముగ నుండెనని కన్నడకవియగు మధురునిచే వ్రాయబడిన శాసనమొకటి చెప్పును. (South Indian Inscriptions, Vol.IV.) దేవరాయడు తత్సన్నిహితాపాయమును మంత్రియగు లక్ష్మణామాత్యునిసహాయముచే దప్పించుకొనెను.

స్ర. స్వామిద్రోహర్ కెలంబర్ మసగిమసెద బా
        ల్గుండు చండప్రతాపో
    ద్దామశ్రీదేవభూవల్లభన గృహమహా
        ద్వార మం ముత్తె మత్తిం
    న్నేమాతే మాత్రినిమున్నురుబిత రుబి నూ
        రంకమంస్వామికార్య
    క్కాడెందుర్వేళ్వ రుత్సాహమనధటదం
        లోకదొళ్ లక్షణాంకం.

ఈకాలమునందు ముఖ్యమయిన కవులు కన్నడమున మధుర, మల్లణ, అభినవచంద్ర, కవిమల్ల, దేవరాజ లక్ష్మీధరామాత్యులు; సంస్కృతమునందు శోణాద్రిడిండిమ, నరహరి, చౌండపాచార్య, విష్ణుసూరి, సాయణాచార్య మాధవాదులు; తెలుఁగున నన్నిరామాత్యుఁడు, రావిపాటి త్రిపురాంతకుడు. ప్రథమ దేవరాయడు సాహిత్యాభిమాని యగుటచే "విజయ విద్యాదేవరాయ"డను పేరుగాంచెను. ఇమ్మడి బుక్కనికాలమునందును, ఈతని కాలమునందు ను కవులకును, రాజమంత్రులకును నన్యోన్యసం బంధము గల్గియుండెననుటకు నిదర్శనము లనే కముగా నున్నవి. వైదికమతోద్ధారకుండును, కర్ణాటకరాజ్య ప్రతిష్ఠాపనాచార్యుండును నగు శ్రీవిద్యారణ్యులయొక్కసోదరియగుసింగాంబకు పుత్రుడే ప్రథమదేవరాయని యమాత్యుడును, మధురకవిపోషకుండునునగు లక్ష్మణామాత్యుఁడు. బుక్కనికాలమునందు ముహూర్తదీపిక రచించిన విష్ణుసూరి మాధవసూరి పుత్రుం డును, మల్లపమండలాధీశ సభాసదుండును నయియుండెను.

(శ్రీ)మాన్మల్లపభూపః స జయతి జగతీ
        భూషణీ భూతధామా
    పారావారావగాఢక్షితిధర శిఖర
        ప్రస్ఫుర త్కీర్తిపూరః;
    కింబ్రూమోఽస్య ప్రతాపం నరపతిచరితా
        క్రీంద్ర రక్షాతిదక్షః
    శ్రీభర్తుర్వ్యాసభూమి ర్వితరతి జలధి
        ర్యస్య రత్నాని నిత్యమ్.

ఇదియగాక కన్నడమున "సౌబగినసోనె" యను గ్రంథమును రచించిన దేవరాజు కుమా రకంపని నందనుం డని తెలియవచ్చుచుండును. శోణాద్రిడిండిముడు కుల కవిగా నుండెను. ఇమ్మడిబుక్కని కుమారుడగు వీరభూపతికాల మునం దుండిన చౌండపాచార్యుడు బుక్కని "యునబుక్క భూపాలస్య రాజవ్యాసవాల్మీకేః కర్మ బ్రహ్మాధ్వనీనస్య" యని సంబోధించి యున్నాడు. ఇట్లు పోషకులకు పోషితులకు నెంత యన్యోన్యసంబంధ ముండెనని తోచు చుండును. రాజవ్యాసేత్యాది బిరుదులు హరి హరునికులమునం దేయుండినను ఇమ్మడిబుక్కా దులుగూడ తమ సాహిత్యాభిరుచిచే తద్బిరుద ములను ధరించియుండిరి. ఈ కాలమునందు శోణాద్రి డిండిమకవికిని, లక్షణకవి బిరుదాంకి తుండగు కవిమల్లునకును వాగ్వాదము నడిచె ననియు మల్లన యోడిపోయెననియు డిండిముని "కవిమల్ల గల్లతాడనపటు" అను బిరుదుచే తెలియును. ఈకవిమల్లుడు మన్మథవిజయగ్రంథ కర్తయగుమల్లుడో మఱియొకడో తెలియలేదు. ఏతద్గ్రంథముశృంగారరసాధిష్ఠితమని తెలియుట

యేకాక దేవరాయడు కూడ "అమరుక"మును కన్నడభాషలో రచించెను. ఈకవులందుముఖ్యముగా మధురుడే యున్నతస్థానార్హు డనబడును. హరిహరుని దండనాథు డగు ముద్దప ఆజ్ఞానుసారముగా ధర్మనాథపురాణమును కన్నడభాషయందు రచించినను, దేవరాయని మంత్రి యగు లక్ష్మణామాత్యపోషితుం డయి తత్ప్రశంసాత్మకమగు శాసనమును రచించెనని చూపబడినది. విజయనగరసామ్రాజ్యమునందు జైనమత సంప్రదాయస్థులగు కవులందు నానార్థరత్నమాలా కర్తయగు ఇరుగప్ప దండనాథుడును, ధర్మనాథ పురాణకర్తయగు మధురుడును ముఖ్యులు. లక్ష్మణామాత్యుడును కవిత్వపటిమ గలవాడని క్రింది పద్యములు వ్యక్తపఱచుచున్నవి.

మ.వి. గణనామ్మాత్రమె దేవరాయనరనా
థాస్థానదొళ్ మానవా
గ్రణిగళ్సైన్ తె విచారిపాగళు పథా
సంశుద్ధియిం బుద్ధియిం
గుణదిం గౌరవదిం పొదల్దిరెసెవ ము
ద్రామాత్య యౌగంధరా
యణ చాణక్య సుమంత్రరొళ్దెసెగె వం
దం మంత్రిలక్ష్మీధరం.

పొగళర్ పొంపుళివోద పెంపిన యశో
లక్ష్మీధరం బల్లవ
ర్బగె గొళ్ళింపిన సొంపువెత్త కవితా
లక్ష్మీధరం రాజనీ
తిగె నేర్పాద మహాప్రధానపదవీ
లక్ష్మీధరం ధాత్రియోళ్
నెగళ్దిం నిర్మలరామచంద్రతనయం
సన్మంత్రిలక్ష్మీధరం.

స్వామిద్రోహర కెలంబరం మసగిమసెద బా
ళ్గిందు చండప్రతాపో
ద్దామశ్రీదేవ భూవల్లభనగృహమహా
ద్వారమం ముత్తెమత్తిం
న్నేమా తేమాత్తినిం మున్న రబితగుబినా
రంకమం స్వామికార్య
క్కా మెందు ర్వేళ్వరుత్సాహమనధటదం
లోకదొళ్ లక్ష్మణాంకం.

శాసనములను రచియించినకవు లనేకులలో దావణగెరె శాసనమునురచించిన బాయణాచార్యుడును, దేవరాజమిశ్రుడును ముఖ్యులు. దేవరాజమిశ్రు డాస్థానకవిగా నుండి, దేవరాయనిపుత్రుడగు రామచంద్రు డుదయగిరిరాజ్యము నేలుచు చెన్నుభట్టునకు దానమొసగినప్పుడు తచ్ఛాసనమును రచించెను. ఈ చెన్నుభట్టే ప్రాయః సర్వజ్ఞవిష్ణుతనయుడును, దర్కభాష్యకారుడునునయియుండవచ్చును. ఈకాలమునందే మాధ్వగురువులు, స్మార్తగురువులు ననేకగ్రంథములను రచించిరి. ఇంతేకాక వాగ్వాదములుకూడ జరిగెనని తెలియవచ్చును. పరివ్రాజకాచార్యులగు ఆనందసరస్వతీతీర్థశ్రీపాదులు, తచ్ఛిష్యులగు అమృతేంద్రతీర్థ, అమృతప్రజ్ఞ, నారాయణగిర్యాచార్యులు శాసనములం దుద్ఘోషింపబడియున్నారు. సమకాలీనులగు మాధ్వాచార్యులు, అక్షోభ్యతీర్థకరసంజాతులు టీకాచార్యులునగు జయతీర్థశ్రీ

పాదాచార్యులు,సాయనమాధవులతో వాగ్వాదము చేసిరనియు, తద్వాగ్వాదమునందు జయతీర్థులు జయమొందిరని మాధ్వులు, మాధవాచార్యులే గెలిచిరని స్మార్తులు చెప్పుదురు. ఇదేవిధముగ నక్షోభ్యులు,

> అసినా తత్వమసినా పరజీవ ప్రభేదినా,
> విద్యారణ్యమహారణ్య మక్షోభ్యముని రచ్ఛినత్;
> అక్షోభ్యంక్షోభయామాస విద్యారణ్య మహామతిః.

విద్యారణ్యులతో వాదముచేసి గెల్చిరో లేదో తెలియుట దుస్సాధ్యమయినది.

సర్వదర్శనసంగ్రహ కర్తయగు మాధవుడు సాయణాచార్యుల ద్వితీయపుత్రుండని యు, సంగీతసాహిత్యకలాప్రవీణుడనియు దెలియును.

> తత్సంవ్యంజయ కంపణవ్యసనినః
> స్సంగీతశాస్త్రే తవ
> ప్రౌఢిం మాయణ గద్యపద్యరచనా
> పాండిత్య మున్ముద్రయ;
> శిక్షాం దర్శయ సింగణ క్రమజటా
> చర్చాసు వేదే ష్వితి
> స్వాన్ పుత్రా నుపలాలయన్ గృహగతః
> సమ్మోదతే సాయణః.

ఇదేకాలమునందు విజయనగరరాజులకు కులగురువులగు క్రియాశక్త్యాచార్యులందు త్రియంబక క్రియాశక్తిగురువులు కంపరాయచరితను వ్రాసిన గంగాదేవికిని, 'సాబగినసోనె' కర్తయగు దేవరాజునకును, విజయభూపతికిని పరమగురువులయి యుండిరని దెలియును. దేవరాజు త్ర్యింబకాచార్యులచే గన్నడాశుకవిత్వమును నేర్చెనని చెప్పుటచే ఇతడు దేవభాషయందేకాక దేశభాషయందును పాండిత్యము గలవాడని తేలుచున్నది. ఈ త్ర్యింబకక్రియాశక్త్యాచార్యుల యనుమతిచే, విజయభూపతి శక ౧౩౩౨ వికృతి సంవత్సరమునందు తమ గురువుల నామాంకితముగా క్రియాశక్తిపుర మను అగ్రహారమును గట్టించి దానముచేసెనని త్రియంబకాభిజ్ఞాముద్రాంకిత మగు తామ్రశాసన మొకటి చెప్పుచున్నది.

సింహావలోకనంబుగా నీకాలమును బరీక్షించిన నొకడైన యుద్దామకవి బయల్దేరక యుండుట కనేకకారణము లగపడును. సాహిత్యసముద్రమునందు తరంగముల నిమ్నోన్నతస్థితులకు రాజకీయవాతావరణమేమూల కారణము. రాజవిప్లవములచేతనో లేక యితర కారణములచేతనో ఈ సాహిత్యచరిత్రఘట్టముచ్చస్థానార్హము గాకపోయినను, రాబోవు ఇమ్మడి దేవరాయకాలిక సాహిత్యమునకు పీఠికారూపముగ ఉండుటవలనను వెనుకటి ఘట్టమునందు నుద్భవించిన సాయణమాధవ, వేదాంతదేశిక, అక్షోభ్యతీర్థాదుల వాగ్వాద ప్రతిధ్వనులు ప్రతిబింబితము లయి యుండుట వలనను ఈకాలము ప్రాశస్త్యార్హమయినది.

౨. ద్వితీయఘట్టము ౧౪౧౯-౧౪౪౬

బాహ్యోపద్రవకారణములచే సంకుచితమయిన విజయనగరసామ్రాజ్యము ఇమ్మడి

ప్రౌఢదేవరాయడు సింహాసనారోహణము గావించిన దినమునుండి ప్రవర్ధిల్ల సాగెను. మహమ్మదీయ పక్షపాతియగు ఫెరిష్టయను చరిత్రకారుడు విజయనగరమువారు బహమనీ చక్రవర్తులచే పరాజితులయి కప్పము చెల్లించుచుండిరని వ్రాసినది విశ్వసనీయముకాదని శాసనములు, యితర చరిత్రకారులు చెప్పుచుండుటవలనను దేవరాయని సమర ప్రాబల్యము నూహింపవచ్చును. ఏతత్కాలమునందే విజయనగరమునందు ప్రవాసము చేసిన అబ్దుర్ రజాక్ అను మహమ్మదీయుని వ్రాతలందును, శ్రీకృష్ణదేవరాయల యనంతరము చరిత్ర వ్రాసిన న్యూనిజ్ అను పోర్చుగీస్వానివలనను ప్రౌఢదేవరాయడు ప్రబలచక్రవర్తి యని బోధపడును. ఈకాలమునందు కర్ణాటక సామ్రాజ్యము సింహళద్వీపము, తుత్తుకుడి, పెగ్గు, తెన్నాసిరమ్, బర్మా మొదలయిన ద్వీపాంతర దేశములను లోబఱుచుకొని యుండుటే కాక, క్రీ. శ. ౧౪౨౨ సంవత్సరమునందు దేవరాయడు దన దండనాయకుడగు లక్కణామాత్యుని గోలకొండమీద దాడిపంపి తద్దుర్గమును సాధించి యనేకులను కారాగారబద్ధుల గావించెనని తెలియును. ఇదిగాక రాజమహేంద్రవర రెడ్డిరాజ్యమునందు దురాచారప్రవర్తకుండగు రాచమరెడ్డిని కొండవీడు నగరమునుండి వెడలగొట్టి గజపతిరాజులను, అల్లాడరెడ్డి మొదలయినవారలను వశపఱచుకొని సమస్త రాజ్యమునందును సుఖము శాంతి యుప్పొంగుచుండువిధమున రాజ్యపాలనము చేసెను.

యేవాఙ్మయమయిన సభ్యచ్ఛ్రియస్థితి బొందుటకు దేశమునందు శాంతిసుఖము లవశ్యమని సర్వదేశీయ సాహిత్యచరిత్రలు చాటుచున్నవి. జనులకు విరామ మధికమగుకొలది లలితకళాపరిశ్రమ హెచ్చును. అందులకు ఈ కాలమునందుండిన వాతావరణము సామ్రాజ్య పరిస్థితియు, వాఙ్మయప్రపంచమునందును, కళాలోకమందును నవనవోన్మేష మగు ప్రతిభావ్యాపారమునకు బహ్వానుకూలముగనుండెను. యేకాదశ ద్వాదశశతాబ్దములందు చాళుక్య కాలచూరి రాజులకాలమున బసవేశ్వర, చెన్నబసవేశ్వర, యేకాంతదరామయ్యాదులచే బ్రతిపాదింపబడిన నూతన వీరశైవమత ప్రవాహ ముల్లోలకల్లోలముగా దక్షిణ భారతఖండమునంతయు నావరించుకొని మతసంప్రదాయములందే కాక వాఙ్మయప్రపంచమునందును పెక్కుమార్పులు గావించెను. పదుమూడు పదునాల్గుశతాబ్దులందు ఈ వీరశైవోత్సాహమను సముద్రతరంగములు దిగిపోవదొడగెను. దీనికి పదునాల్గవశతాబ్దియందు వీరవైష్ణవ,స్మార్త మాధ్వమతముల ప్రసిద్ధపురుషులయిన వేదాంత దేశిక, అక్షోభ్యతీర్థ జయతీర్థ, సాయణ, విద్యారణ్య, విద్యాశంకర, కాశీవిలాస, త్రియంబక విలాస క్రియాశక్త్యాదులే కారణముగ నుండవచ్చును. ఏమయినను పదునేనవ శతాబ్దమునందు వీరశైవమతము పునరుత్సాహముతో దేవరాయని సభాస్థానమునుండి బయలుదేరి దేశభాషలందు నూతనావేశమును గావించెను.

ప్రౌఢదేవరాయని వైభవమును, నైశ్వర్యమును గాంచినవారందరు నాతడింద్రసమానుడని ప్రశంసించియున్నారు. చెన్నబసవపురాణమునందు ఇంద్రుడే ఈశ్వరాజ్ఞానుసారముగా వీరశైవమతమును విస్తరించుటకు ప్రౌఢదేవరాయడని యవతరించెనని చెప్పియున్నది. మఱియు ప్రమథగణంబు లతనియాస్థానమునందు నూటొక్క విరక్తులుగా జనియించిరి. వారలలో ముఖ్యులు: మహాలింగదేవుఁడు, తోంటదసిద్ధలింగార్య, లక్కణదండనాథ, జక్కణ, కుమారబంకనాథ, చామరస, కల్లుమఠప్రభుదేవ, కరస్థళవీరణ్ణ, కరస్థళనాగిదేవ, శ్రీగిరీంద్ర, మగ్గెయమాయిదేవ, గురుబసవ, బత్తలేశ్వర ఇత్యాదులు. క్రీ. శ. ౧౪౭౯ శాసన మొకటి దేవరాయని పరమశైవాగమసంపన్నుడనుటచేతను, అతనిగురువు కాశ్మీరశివాచారకర్మఠుడగు చంద్రభూషణ క్రియాశక్తి యయినందునను, స్నేహితాప్తసచివు లగు లక్కణజక్కణాదులు పరమవీరమాహేశ్వరాచారపరులగుటచేతను దేవరాయడు వీరశైవమతాభిమాని యని మన మూహింపవచ్చును. ఇట్లు వీరశైవులకు రాజప్రోత్సాహమే కాక, మహామాండలికులు, మంత్రివర్యులునయిన లక్కణచామరసాదులు వీరశైవు లగుటచేత అత్యంత ప్రాముఖ్యముగల్గెను అయినను దేవరాయడు వైష్ణవాదిమతములనుబాధింపక నన్నిటియందు నభిమాన ముంచియుండెను. అతని వైష్ణవగురువగు కందాళపెద్ది యనువాడు శ్రీరామాయణపఠనము చేయుచుండెను. కాక దేవరాయడే హంపియందు జీర్ణమయియుండు హజారరామస్వామిదేవాలయమును గట్టించెనని యొక్క శాసనము చెప్పుచుండును. మఱియు రామచరిత్రాత్మకమగు "మహానాటకసుధానిధి" యను కావ్యమును కూడ ప్రాయః ప్రౌఢదేవరాయడే రచించియుండవచ్చును. అయినను వీరశైవమతమే యతిప్రాబల్యమును గాంచెననుట నిర్వివాదాంశము.

ఈవిరక్తులందు ముఖ్యులయినవారిచరిత్ర సంపూర్ణముగా వ్రాయుటకు వీలులేనందున క్రింద సంక్షేపముగా సూచింపబడును. కల్యాణదుడనియు, ప్రభువనియు బిరుదుగాంచిన మగ్గెయమాయిదేవుడు వీరశైవులకు నరకబాధ లేదని వాదించి విజయనగరమునందు ఛాయారహితమగు స్తంభమును స్థాపించెనట. కన్నడమునందు శతకత్రయమని వ్యవహరింపబడు శివాధవ, శివావల్లభ, ఐపురీశ్వర శతకములను రచించి, సంస్కృతమునందును గురుశిష్యసంవాదరూప మగు "విశేషార్థప్రకాశిక" మను గ్రంథమును వ్రాసెనని తెలియవచ్చుచున్నది.

శ్రీమదైపురసోమేశ
లింగాయా లింగరూపిణే
లింగాంగైక్యస్వలింగాయ
నమస్తే లింగమూర్తయే.

నమశ్శబ్ద ముమా సాక్షాద్
శివశబ్దః శివః స్వయమ్

అయ శబ్ద స్తయో ర్యోగః
సోమతత్త్వ ముపాస్మహే.

*    *    *    *

అతః పరం ప్రవక్ష్యామి
విశేషార్థప్రకాశకమ్,
శివసిద్ధాంత తంత్రోక్తం
సంవాదం గురుశిష్యయోః.
స్వానుభూతి విభవావగాహినా
మాయిదేవవిభునా మహాత్మనా;
శ్రీ శివానుభవసూత్రముత్తరం
తంత్రముక్త మితి శోభనం పరమ్.

ఇతి శ్రీ శివసిద్ధాంతతంత్రే విశేషార్థ ప్రకాశకే గురుశిష్య సంవాదే.............. ......అవసానవిధిర్నామ పంచమాధికరణమ్. ఈతని యితరగ్రంథములు ప్రభుగీత, షట్‌స్థళ గద్యము; మగ్గెయ మాయిదేవవచనము, యేకోత్తర శతస్థళషట్పది ఇత్యాదులు. మఱి యొక విరక్తుడు వీరశైవమత స్థాపనాచార్యు డని ఖ్యాతిగాంచిన గురుబసవడు సప్తకావ్యము(?)లనబడు మనోవిజయ కావ్యము,వృషభ గీత, సద్గురురహస్యము, స్వరూపామృతము, శివయోగాంగ భూషణము అనుగ్రంథములను రచించెను.

లక్ష్మణామాత్యుడు ప్రసిద్ధ దండనాయకుండేకాక!కావ్యనాయకుండు నయియుండెను. ఇతని ప్రోత్సాహముచే ననేక వీరశైవ గ్రంథములు వ్రాయబడెనని సాహిత్యచరిత్రయందు చెప్పబడినది. తానుగూడ (ప్రాయః కుమార బంకనాథాదుల సహాయముచేత) "శివతత్త్వ చింతామణి" యనుగ్రంథమును రచించి యున్నాడు. దానియందు

ధరె గధికమూరురా
యరగండన ప్రతిమ
బిరుదాంక గజవేంటె
కార దేవేంద్ర భూ
వరన మహాదైశ్వర్య శరధిచంద్రోదయ ను
దార కరుణాధారను
నిరుపమిత సప్తాంగ
రాజ్యవర్ధన కళా
ధర నమలకీర్తియుత
లక్కణ్ణ దండేశ.

యని చెప్పుకొని యున్నాడు. ఇతని లౌకిక వ్యవహారము లపారముగ నుండుట వలన నిక్కడ విస్తరించుటకు వీలు లేకపోయినను ఉత్తరదేశీయులగు గోలకొండ మహమ్మదీయులను, దాక్షిణాత్యులగు సింహళద్వీపవాసులను జయించుటేకాక ముళువాగిలందు రాజప్రతినిధిగానుండి స్వనామాంకితం బగు వరహాములను ప్రచురించెననుటచే ఈతని ప్రాముఖ్యము దెలియును.

జక్కణాచార్యు డను విరక్తాగ్రేసరుడు దేవరాయని ప్రధానిగానుండెను. హరిహరుని కాలమునందే మంత్రిగా నుండెనని యొక శాసనమువలన తెలియుటచే కడు వృద్ధుడయి యుండవచ్చునని యూహింపవచ్చును. గుబ్బి మల్లణార్యకృతమగు వీరశైవామృత పురాణ

మునం దితడు వీరశైవగ్రంథ రచనార్థముగ నపారసంఖ్యముగవరహాములను వెచ్చముచేసె నని చెప్పబడినది. 'నూరొందుస్థల' మను గ్రంథము నురచించి 'భక్తభాండారి' యను బిరుదువహించెను. తత్కారణమునం గుమార బంకనాథ, మహాలింగదేవులను కవు లితనికి సహాయము చేసిరని తెలియవచ్చు చున్నది. జక్కణాచార్యుడు ప్రౌఢదేవునికి వీరశైవమతోపదేశము చేసి లింగాంగిగాజేసెనని ప్రౌఢదేవరకావ్య మను గ్రంథము చెప్పుచున్నది. తదనంతరము జక్కణార్యుడు చామరసునికి మంత్రిత్వము నిప్పించి ఇహలౌకికవ్యవహారములను వదలెను. ఈ జక్కన తెలుగునందు విక్రమార్కచరిత్ర మును రచించిన జక్కనకంటె భిన్నుడని యూహింపవలెను.

దేవరాయమహారాయ ధీవిధేయ
మంత్రివల్లభ చామనామాత్యదత్త
చామరఛత్ర శిబికాదిసకలభాగ్య
చిహ్నముల నొప్పె జన్నయసిద్ధ మంత్రి.

పై పేర్కొనబడిన చామయామాత్యుడు సాహిత్యచరిత్రయం దొక్క ముఖ్యపురుషుడు. గురురాజచారిత్రమునందును భైరవేశ్వర కావ్యకథాసూత్రరత్నాకరేత్యాది గ్రంథము లందును గీర్తింపబడియున్నాడు. ఈతని ముఖ్య గ్రంథమగు ప్రభులింగలీలయొక్క రచన విషయకముగా ననేకకథలు చెప్పబడినవి. ఈ గ్రంథము చేత నితనికి నన్యమతకోలాహల, 'వీరశైవాచార సారోద్ధార' యను బిరుదులేకాక, మంత్రిత్వముగల్గెను. ఈ గ్రంథమును వ్రాసిన యల్పకాలమున పిడుపర్తిసోమనచే దెలుగుభాషయందును, శివప్రకాశదేశికునిచే దమిళమునందును భాషాంతరీకరింపబడెను.

హరిహరునికాలమునందు మాధ్వ శ్రీవైష్ణవ స్మార్తమతానుయాయులగు అక్షోభ్యతీర్థ వేదాంతదేశికసాయణమాధవుల వాగ్వాదములెట్టి సాహిత్యమునందు బ్రతిబింబితములయ్యెనో అదేరీతిగా నీకాలమునందు వీరశైవ వీరవైష్ణవులసంస్పర్ధచే వాఙ్మయము నందును నూతనగ్రంథములు బయల్దేరదొడగెను. అయితే మతసంబంధస్పర్ధయేకాక సాహిత్యలోకము నందును కవులు సార్వభౌమత్వమును బొందుటకు యత్నించిరనుట కుదాహరణము లనేకములుగలవు. ఇదంతయు బరిశీలించిన తాత్కాలికవాఙ్మయపరిస్థితి దృగ్గోచరమగును. ప్రథమోదాహరణముగ మతసంబంధమగు జక్కన ముకుందపెద్దులవాగ్వాదములబరిశీలించెదము. పూర్వనిర్దిష్టమగు సిద్ధాదృశ్య కవికృత ప్రౌఢదేవర కావ్యమున నీకథ విశదీకరింపబడినది.

ఛప్పన్న దేశదొళగిదకె సమవాదపుర
విప్పదే దుర్లభవెనుత్తె బుధరిందె నుతి
గొప్పి రాజిసువ విద్యానగరవాళువం
[ప్రౌఢభూవరచంద్రను.

కప్పుగొరళన భక్త జక్కణాచార్యజన
దొప్పినలి మంత్రితనమం నడిసు తిరలు మ
ల్లిప్పరా కంధాళపెద్దయాచార్య రెం
[తెంబవైష్ణవగురుగళు.

జనపంగె నవమాన భారత వబోధిసుత
లను నయది మెరవణిగెయం మాడి సుఖ
[మిరలు
మనసిజారియభక్తజక్కణాచార్యనదు
[నోడితన్నయచిత్తది.

ఘనవీరశైవక్కె ముఖ్యవిప్పగ్గుగుత్తోందు
మెనె సాంప్రదాయకశ్రేష్ఠనాద కుమార
కను బంకనాధనెం దెంబగురుపదవనె
[నెలెగొళిసుతె.

ప్రమథగణప్రభు దేవ పేళ్దవచనంగళిగె
క్రమదియేకోత్తరశతస్థళద సూత్రగళ
రమణీయమాగివర్ణక పుస్తకగళిందె
[వ్యాఖ్యానగళ మాడుతే
ధరెయొళచ్చరియెనిసిమెరెయిసిదరిరుళుయే
[కోత్తరశతస్థళవనూ.

వైష్ణవాచార్యు డగు ముకుందపెద్దియు నవమాసములు భారతమును ప్రౌఢదేవునికి బోధించి తదనంతరము విజయనగరవీథులందు రాజచిహ్నసహితముగా మెరవణి చేసెనట: తత్ప్రతీకారముగా జక్కణాచార్యుడు అల్లమ ప్రభుకృతైకోత్తరశతస్థలసూత్రములకు వర్ణక క్రమముగా వ్యాఖ్యానమును రచించి రాత్రి యందుత్సాహముతో దద్గ్రంథమును మెరవణి చేయగా నది చూచి కందాళపెద్ది "యేమి యా డంబరము! యెవరయిన చనిపోయిరా లేక యె వరిదయిన జన్మోత్సవమా" యని రాజాస్థానము నందు మరుసటిదినము హాస్యముచేయగా, జక్కణాచార్యుడు భక్త్యంగన ముక్తిశిశువును ప్రసవించెనని చెప్పి యల్లమసూత్రములకు వైష్ణవు డుచితార్థము చెప్పలేకపోవుటచే, దేవరాయనిచే ప్రార్థితుడై జక్కణార్యుడే శివశరణులకథలను బోధింపదొడగెను. ఇంతలో చామనామాత్యుడు మృతజనులచరిత్ర యగు మహాభారతముకంటె నుత్కృష్టము, నక్షయము నగు వీరమాహేశ్వరుడగు నల్లమ ప్రభు చరిత్రను ప్రభులింగలీలకావ్యముగ నొక పక్షముదినములఅవధిలో రచించెదనని పూను కొని, వీరభద్రుని ప్రసాదప్రాబల్యముచే దిన మొకటికి నూటపదొకొండుపద్యముల మేరగా ఏకాదశదినములలో ముగించి దేవరాయని కొప్పగించెను. తద్గ్రంథతత్త్వమును వైష్ణవులు దెలియక ఖిన్నులయియుండ జక్కణార్యుడే బోధింపగా దేవరాయడు శైవమతదూషకులను వెల్లడించి, జక్కన్నకు రత్నాభరణములను రుద్రకంకణములను ఒసంగుటయేకాక చామ య్యకును మంత్రితనమిచ్చె నట. ఇట్లు వీరశైవ వైష్ణవమతములు స్పర్థించుటచేత నపారవా ఙ్మయమునకు కారణ మయ్యెను.

ఈకాలమునందు వీరశైవమతమునకు, వైష్ణవమతమునకు నుండిన వైషమ్యము వీర శైవస్మార్తమతములందు గానరాదు. కావున చామరస కుమారవ్యాసులవాదము, శ్రీనాథ డిండిమభట్టులవాదము, సాహిత్య చరిత్ర కే చేరును.

ప్రౌఢదేవరాయడు చామరసునకు, నతని బావమఱిదియగు కుమారవ్యాసునకు కన్నడ

మున భారతమును రచియింప నాజ్ఞాపించెను. ఇద్దరుకవులును వ్రాసి తీసికొనిపోయి రాజుముం దిడినప్పుడు రసజ్ఞులు చామయభారతపు తాళ పత్రములను బిదుక రక్తము స్రవించినందున తద్గ్రంథమే యుత్కృష్టమని తీర్మానించిరి. కుమారవ్యాసుడు ఖిన్నుడయి య్యాగ్రంథ మును గాల్చి బూడిదచేసిపూసికొనవలెను; లే కున్న ఆత్మహత్యచేసికొనెద నని తలంపగ నతనిభార్య యన్నయగు చామరసునిగ్రంథ మును దొంగిలించి కాల్చివేసెనట. చామ రసుడు తద్వృత్తాంతము విని యమర్త్య లగు అల్లమాదులచరిత్రను ప్రభులింగలీలగా రచించెను. దేవరాయ డావృత్తాంతము నంత యు నాకర్ణించి కుమారవ్యాసునికి కనకాభి షేకము చేసెదనను ప్రతిజ్ఞ మాని, చామ రసునికే తన్మర్యాద గావించెనని వీరశైవగ్రం థము లగు సిద్ధనంజేశగురురాజచారిత్రమునం దును, శంకరకవికృత చోరబసవచరిత్రయందు ను చెప్పబడినది.

కుమారవ్యాసుడు స్మార్తుడును వీర నారాయణభక్తుడును నయియుండెనని గదుగు భారతమున చెప్పబడియుండుటచే వీరశైవుల తో సంబంధము గావించియుండెననుట సందే హాస్పదము. ఆంధ్రదేశమునందు పోతనభాగ వత మెంత సర్వజనాదరణీయముగ నున్న దో కర్ణాటకమునందు గదుగుభారతము నంత ఖ్యాతిజెందియున్నది. అతిపాండిత్యమును ఛందో లంకారవ్యాకరణనియమములకు గౌరవమును జూపకపోయినను, ఇతనికి కవిత్వధాటి నిరర్గళ ముగ ప్రవహించి సమయోచితసందర్భసంసూ క్తులచే నిబిడీకృతమయినది. ఈయాశుకవిత్వ పటిమచేతనే పదిపర్వముల నత్యల్పకాలమున నే రచించెను.

శ్రీనాథ డిండిమభట్టుల వాగ్వాదము సాహిత్యచరిత్రయందు ముఖ్యస్థానార్హ మయి నది. అరుణగిరినాథ డిండిముడు దేవరాయనికి ప్రీతిపాత్రుడై 'ముల్లండ్రి' యను గ్రామమును దేవరాయపురమను నామాంకితంబుగ నగ్ర హారముగావించి యనుభవించెనని యొకశాస నమువలన దెలియుచున్నది. వంశపరంపరగా డిండిములవారు విజయనగరసభాపతులును, శాసనకర్తలును, కవిసార్వభౌమ బిరుదాంకితు లును విద్యానాథులును అయియుండిరనియరుణ గిరినాథకృతమగు"విభాగరత్నమాల"చెప్పును. ప్రాయః తద్గ్రంథోక్తమగు 'మూలాండ' యను గ్రామము శాసనమునందుచెప్పిన 'ముల్లండ్రి' యయి యుండవచ్చును.

మూలాండవాస్తవ్య మహాజనానాం
కాలాంతరేపి స్వకులావగత్యై;
వేలాం ఖలాద్భేస్సు వివేకపత్ర
మాలాంసుహృత్కంఠగతాం సృజామి.

అరుణగిరినాథకృతమగు సోమవల్లీ యోగా నంద ప్రహసనము హాస్యరస ప్రాధాన్య మగు యేకాంకదృశ్యము. తద్గ్రంథమునందు స్వవిష యము నిట్లు చెప్పకొనియున్నాడు.

పూర్వం పూరితరేతసః శిఖిముఖే
శర్వాదభూద్యస్తతః

శౌరేః శ్రీవపుషః సరోజజనుషః
పశ్చాత్సుతా కామినః;
స్వారాజా త్తదనంతరం మునివధూ
జారాదపి ప్రోద్ధత
శ్చండాంశో ర్బడబాద్భృతాత్ సదిశతు
శ్రేయాంసి హాస్యోరసః.

నాంద్యంతే సూత్రధారః (పరితోవలోక్య) అత్రఖలు నిరంకుశ కితవనిక్షిప్తమధూచ్ఛిష్టయష్ట్యాకృష్ట బాహుమూలరోమసవ్యథ లజ్జిత కుపిత బాలవిధవాజన కోలాహల ముఖరితదిఙ్ముఖే మహోత్సవే:—............

(విమృశ్య)అస్తిఖలు నరేంద్రాగ్రహార నాయకమణేః సామవేదసాంయాత్రికస్య అష్ట భాషా కవితా సామ్రాజ్యాభిషిక్తస్య, బల్లాళరాయ కటకకవికుల గర్వపర్వతపవేః నాగనకవి నాగకేసరిణ, శ్రీకవిప్రభోః పౌత్రః, పుత్రః శ్రీ రాజనాథదేశికస్య బ్రహ్మాండభాండ పిచండ మండలిత విజయడిండిమరవ చండిమ్నః శ్రీకంఠాగమశిఖండ మండనమణేః శ్రీ డిండిమ ప్రభోః దౌహిత్రః శ్రీ మదభిరామనాయికాస్తనంధయః సభాపతి భట్టారకాచార్య భాగినేయః శ్రీడిండిమ కవి సార్వభౌమ ఇతి ప్రథిత బిరుదనామా సరస్వతీప్రసాదలబ్ధ కవితాసనాథః శ్రీమా నరుణగిరినాథః తేన కృతేన సోమవల్లీ యోగానందనామ్నా ప్రహసనేన సభాని యోగ మనుతిష్ఠామి.

అంత్యమున—

కాలాంభోదా యువానో
ఝులఝులనినదైః పూరితాశావకాశైః,
సాథోవర్షాభిజాతై
ర్విదధతు వసుధా ముల్ల సత్సస్యగర్భామ్;
..................స్వయమురసిముఖే
వ్యాహరేత్ సామరస్యమ్,
దీర్ఘాయుర్దేవరాజో
ప్యవతు వసుమతీ చక్ర మాచంద్రతారమ్.

శ్రీనాథుడు వినుకొండవల్లభామాత్యుని సహాయముచేత రెడ్ల రాజ్యమునుండి విజయనగరమునకు వచ్చి రాజాస్థానమును ప్రవేశింప ప్రయత్నించి భగ్నమనోరథుఁడై బహు దినములు కష్టపడెనని కర్ణాటక రాజ్యలక్ష్మిని సంబోధించిన పద్యము చెప్పుచున్నది:

కుల్లాయుంచితిఁ గోకసుట్టితి మహా
కూర్పాసముం దొడ్గితిన్
వెల్లుల్లిన్ దిలపిష్టముం మెసవితిన్
విశ్వ స్తవడ్డింపఁగాఁ
జల్లాయంబలిద్రావితిన్ రుచులు దో
సంబంచుఁ బోనాడితిన్
తల్లీ, కన్నడరాజ్యలక్ష్మి, దయలే
దా నేను శ్రీనాథుఁడన్.

తుదకు ఆతడు రాజకుల గురువు లగు చంద్రభూషణక్రియాశక్త్యాచార్యులసహాయమువలన డిండిమకవిని వాగ్వాదమునం దోడించి యతని కంచుఢక్కను బగులగొట్టి, కవి సార్వభౌమ బిరుదు నొందె ననియు, ప్రౌఢదేవరాయడు దన ముత్యాలశాలయందు గనకాభిషేకమును గావించెననియుఁ దెలియుచున్నది.

దీనారటంకాలఁ దీర్థమాడించితి
దక్షిణాధీశుముత్యాలశాల
..............................
బగులఁగొట్టించి తుద్భటవివాదప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచుఢక్క
చంద్రశేఖరక్రియాశక్తిరాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమబిరుద

మఱియు,

కర్ణాటక్షితినాథహాటకసభా
గారాంతరాకల్పిత
స్వర్ణస్నానజగత్పవిత్రకవిరాట్

అని సంబోధించుకొనియున్నాడు. శ్రీనాథుని శిష్యుడగు దగ్గుబల్లిదుగ్గయ్య "కవిసార్వభౌము డై కర్ణాటవిభుచేత కనకరత్నాభిషేక ములు గనిన శ్రీనాథసుకవి" యని ప్రశంసించి యున్నాడు

ఈ వాదము లన్నియు నాకాలము నందు నూతనోత్సాహ ముత్పన్న మయి యుండెననియు చూపుచున్నవి. ఆ సేతు కృష్ణాపర్యంతము నుండిన సామ్రాజ్యమున నింక వాఙ్మయసమూహము గల్గు టాశ్చర్యావహాము గా దని తలంచినను వెనుకటిఘట్టమునకుఁబోల్చిచూచిన తారతమ్య మగపడును. వీరశైవ వైష్ణవకవులే ప్రముఖు లుగా గానవచ్చినను అన్యమతావలంబులు నుండిరి. జైనదండనాథు డగు ఇరుగప్ప కడు వృద్ధుడయినను క్రీ. శ. ౧౪౨౨-వ సం. నందు శ్రవణబెళ్గొళమున పండితార్యశ్రుతమునియను నాతనికి దానమొసంగె నని యొక్క శాసనము వలన దెలియును. విఖ్యాతుడగు నేమిచంద్ర సిద్ధాంతికుడు దేవరాయని యాస్థానమునందు తార్కికులనెల్ల వాగ్వాదమునం దోడించి జయపత్రమును బడసెనని దెరకణాంబిబొమ్మ రసు చెప్పియున్నాడు.

మండళేశ్వరప్రౌఢరాయన
కండు తత్సభెయల్లి రంజిప
తండతండదవాదివిద్వానుగళ మదదుళిదు.
కొండుజయపత్రవను భూగె ప్ర
చండతార్కికరత్నసద్గుణ
మండనాంగగె నేమిచంద్రగె శిరవ మొగ్గి
[పెను.

వీరుగాక భాస్కరకవి పెనుకొండయం దుండు శాంతీశ్వరబస్తియందు క్రీ. శ. ౧౪౨౪ సం. న 'జీవంధరచరితె'యను కావ్యమును వ్రాసెను. జినదేవణ్ణయనువాడు 'శ్రేణికచరితె'ను వ్రాసె ను. ప్రాయశః ఈకాలమునం దనేకగ్రంథము లను రచించిన జైనకవి కల్యాణకీర్తియనువాడు క్రీ. శ. ౧౪౩౯ యందు జ్ఞానచంద్రాభ్యుదయ కామనకథె, యనుప్రేక్షె, జినస్తుతి, తత్త్వభేదాష్టకేత్యాదిగ్రంథములనువ్రాసెను.

జైనులు మతవిషయకముగా బుక్క రాయ వైష్ణవులతో సంధిచేసిననాటినుండి బాధపడకపోయినను వీరశైవ వైష్ణవ మతము లట్లు భక్తిరసప్రధానము గాకపోవుటచే సామాన్యజనాదరణీయము గాక క్షీణించుచుం డెను. మునుపటికాలమున దేశవ్యాపారమంత

యు ముక్కాలుపాలు జైనవణిజులచే నడచు చుండి, విజయనగరకాలమునందు వీరశైవుల పాలామెను.ఆర్థికసహాయ మిట్లుండుటవలనను, వీరశైవులు రాజకీయాధికారములం దగ్రస్థాన ములనొందుటవలనను వీరశైవవాఙ్మయమే తల యెత్తుకొనెను. లక్కణామాత్యుడు గ్రంథ కర్తలకు లక్షవరహాములుమేరగా సహాయము చేయుచుండె నట. గుబ్బిమల్లణార్యుడు "లక్కణదణ్ణాయకులు భండారిజక్కప్ప (జక్క ణ) కల్లెహాద కేతిసెట్టి వీరందరు లక్షసంఖ్య విత్తము వెచ్చముచేసి గ్రంథముల వ్రాసినది హెచ్చుగాదు. నిస్పృహుండుగా కావ్యము వ్రాసిన మల్లణార్యునిభాగ్యమే భాగ్యము"ని యన్నాడు.

సింహావలోకనక్రమంబున నీయర్ధశతాబ్ద వాఙ్మయమును బరీక్షించిన ననేకనూత్నభావ ములు తోచును. విజయనగర సంస్థాపన సమ యమునందు బూనిన యనేక ప్రతిజ్ఞలం దొకటయిన దేశభాషోద్ధరణము పూర్ణఫలము నందుట కొక శతాబ్దము గావలసి వచ్చెను. మాధవమంత్రి యభిప్రాయముగా"యేషాంతు హీనజాతీనాం పురాణే ష్వనధికారః తేషా మపి స్వదేశభాషాభిరేవ తత్త్వవిద్యాయా మధి కారః" యనుట హైందవసంస్కృతి చరిత్ర యం దొక ముఖ్యఘట్టసూచకమయినది. దేవ భాషయందేపామరులకును దత్త్వబోధన విహిత మని విధించకపోయినను స్వదేశభాషయందైన నధికారముగలదని యొప్పుకొనుట సంస్కరణ పురోగమనమును చూపును! రాజకీయచరిత్ర యందు విజయనగరము వెనుకటి సామ్రాజ్య ములవలె జానపదస్థితినిమాని "నాగరికసామ్రా జ్యము" (City state) చూపువిధమున నీ సా హిత్యప్రపంచము నందును నూతన భావపథ మును ద్రొక్కినది. దాక్షిణాత్య చరిత్రయం దదినఱకు నేచక్రాధిపత్యము నంతస్వవిశిష్టత్వ మును బొందలేదు. చోళచాళుక్యహోయి సళసామ్రాజ్యములు ప్రాయః కర్ణాటక ద్రవిడ దేశములందే ప్రబలముగ నుండుటవలన జనసంస్పర్శకంతయవకాశముకలుగలేదు.విజయ నగరము నామమాత్రముగా కర్ణాటకరాజ్య మనబడినను దాక్షిణాత్యభాషలనుపయోగించు జనులందరు సామ్రాజ్యమునకు జేరినవారగుట చేతను, వారి సుఖసంపదభివృద్ధియే చక్రవర్తు లధ్యేయ మయియుండినందునను ఆయా భాష లకును ప్రోత్సాహము నిచ్చుచుండెను.కావున ద్రవిడభాషాప్రపీణులు నార్యభాషావిదులు పర స్పరవాదసంఘట్టమునందు కుతూహలము పడు టాశ్చర్యము గాదు. ఈ సంఘట్టన ఫలము ముందటిఘట్టమున వ్యక్తమగును.

ద్రావిడభాషలకు నార్యభాషలకు నిట్లు పరస్పరమైత్రి గల్గజేయుట దేవరాయనిధ్యేయ మయియుండెను. అయపారమహిమాస్పదుం డును,విఖ్యాతైశ్వర్యవంతుండును సర్వసారస్వత మకరందమధువ్రతాయమాన మానసుడును నైన యీరసికతల్లజుని ప్రోత్సాహ ఫలము సంస్కృతాంధ్ర ద్రవిడ కర్ణాటక వాఙ్మయచరి త్రలం దుద్ఘోషింప నర్హమయినది.

---

విన్నకోట వెంకటరత్నశర్మ గారు

# సంక్షిప్తసమరము

(పాండవవిజయము)

౧

సైంధవుం డొక్కనాఁడు మదాంధుఁడై,
ధర్మమూర్తులు కుటీరంబునన్ లేనిసమయంబుఁ
గాంచి:

౨

వారల గృహమ్మునం జొర, వారిజాక్షి
వారిజదళాన శీతలవారి నొసఁగి
'అన్న! మనయింట సేమమేనా?' యటన్న
నతఁడు దుష్టప్రసంగమ్ము నందుఁ జొచ్చి

౩

పాండవుల దూషణ మొనర్చి, స్వబల వైభ
వంబు నూరింత లెచ్చుగాఁ బాడి, 'తన్ మ
నోజకేళిఁ దేల్చు' మని, 'వినూత్న భూష
ణాంబరము లిత్తు' నని పల్క నా సుశీల

౪

'పోర! మూర్ఖావతంస, నీబుద్ధి తెలిసి
వచ్చె నిటువంటి పలుకులు పలుకఁ బోకు
మ న్మనోవిభుల పరాక్రమ మ్మెఱుంగ
వుర! నిలిచెదేని, అనుభవంబును లభించు!'

౫

సారపరమపతివ్రతాచారధీర
ద్రుపద రాట్పుత్రి పల్కు పల్కునకు నలిగి
పోలఁతి మైబట్టి స్యందనమ్మునన పెట్టి
వెలఁది గొల్లుమనన్ మనోవిభులు వచ్చి

౬

అతని త్రుళ్లడఁగింపగా, నా యజాత
శాత్రవుం డపారకృపారసమ్ము నించి
వాని విడిపించె; నప్పరాభవదవాగ్ని
భగ్నహృదయుఁ జేసెను సైంధవుని గరంబు

౭

గురుబలంబుల కారుణ్యగురుత కతనఁ
గురుబలంబుల హృదయాలు కూలిపోవఁ
బరమ శస్త్రాస్త్ర వివిధసంపత్తు లాది
కీడులం జెన్నియే నొసఁగూడె మేళ్ళు

౮

తీరె, తీరనివనవాస దీక్ష; తీర
నున్న దజ్ఞాతవాసమహోగ్ర దీక్ష
ఎలమి మీపాల గోపాలకృష్ణమూర్తి
గలఁడు, మనవాఁడు కొంత శాంతిలఁగవలయు

౯

అనుచు భీముని సమ్ముఖంబునన ధర్మ
పుత్రునిన్ ప్రేమమీఱ ధౌమ్యులు వచింప
'మీ కటాక్షంబు మాకు శోభాకరంబు
సాధుజనగణ్యా! భూమి నిర్జరవరేణ్యా!'

౧౦

కాననమ్ము దహింపఁగాఁగల దవాగ్ని
ఆకులం బిందెపోలెఁ దా నడఁగు లెట్లు
మానవతి మానరక్షణంబ యగు లెట్లు
అనుచు శంకింతు మానసంబున మహాత్మ!'

౧౧

తమ్మిచెలికాని మనుమఁ డీదారివలికి
ఎలమి భక్తిపూర్వక నమస్కృతు లొనర్చె
సేవికాకృత్య ధర్మముల్ చెప్పి కొన్ని
వారి విడనాడనుండ నప్పార్థివుండు

౧౨

అగ్నిహోత్రంబు ధౌమ్యుల కప్పగించి
ప్రబల శస్త్రసమితిఁ గళేబరమునందుఁ
గట్టి, నుతిపెట్టి, పెట్టె నగమ్ముపైన
విరటు కొల్వున కిష్టులై వెలయుచుండ

౧౩

రాచదేవేరితమ్ముండు కీచకుండు
ద్రుపద తనయను గోరి తుందుడు కొనర్ప
వాని పొగరెల్ల నణఁచి, అ వ్వాయుసుతుఁడు
నెరియఁ బాలియించె గుప్తభంగిని నెసంగి

౧౪

దీన దుర్యోధనుఁడు బుద్ధినూని, విరటు
ప్రోల ధర్మాత్ము లుందు రంబుధి వెలసి (?)
వారి అజ్ఞాతభంగి రభాసానర్చి
ముప్పతిప్పలు పెట్టి సమ్మోద మొంద

౧౫

విరటు గోవ్రాతముంబట్టె, భీష్మ, ద్రోణ
కర్ణ వీరాదిసహితుఁడై కడఁగివచ్చి
నాఁటి కౌశనాఁడుముందె అజ్ఞాతవాస
మంతరించె నటంచుఁ దా నరయఁబోక!

౧౬

అట బృహన్నల నిజరూప మవధరించి
నిజభుజోద్దండ గరిమ కన్పింపఁజేసి
వెలయు గాండీవరవము విన్పింపఁజేసి
వారిజాక్షుని దన మనసారఁ దలఁచి

౧౭

గురుపదంబుల శస్త్రపుం గుములు గూర్చి
కురుపదంబుల నపుడు గగ్గోలొనర్చె
బొమ్మపొత్తిక కుక్షిపములను జేర్చి
విరటుపుత్రుఁడు కరము నివ్వెర వడంగ
నాలమందల మరలించె నా క్షణమున!

౧౮

ఎల్లరకు వీరిచందంబు తెల్లమయ్యె,
సజ్జనావళి హృదయాలు చల్లనయ్యె
అంత విరటుని కభిమన్యుఁ డల్లుఁడయ్యె
గ్రుడ్డివాని పుత్రుని గుండె గుటుకు మనియె!

౧౯

నంద నందనుఁ డప్పు డానందవార్ధిఁ
గార్చె! కుంతీమహాదేవి కరము హర్ష
మందె, నుత్తరాసతి సిగ్గునందె; మారు
తాత్మజుండును నై దంత లయ్యె నంత

౨౦

గడచి గట్టెక్కినార మిక్కాలమునకుఁ
దావకానుగ్రహము! పెదతండ్రిగారు
మామకార్థార్థమొసఁగి, కుమారులబలెఁ
బ్రీతి వీక్షించుటే పదివేలు మాకు!

౨౧

ఇందులకు నిష్టపడరైతిరేని, ఏని
పద మొసంగుట కైదూళ్లవఱకునైన
జీవనోపాధి కలుగఁగఁ జేసె దేనిఁ
జాలు; నెత్తురన్నముఁ దినఁజాలఁ దండ్రి!

౨౨

గడచిపోయిన గొడవలు గడచిపోయె
దానిఁ ద్రవ్వంగ నేటికి ధరణినాథ!
బిడ్డ వినకున్న, నీవు చెప్పి వినిపించి
తేని యెల్లరకును సేమమేకదయ్య!

౨౩

అనుచుఁ దనవాక్యములుగాగ మనవి చేయు
మనుచు శ్రీకృష్ణభగవాను ననిచె ధర్మ
రాజతండును రాయబారమ్మునర్పఁ
గరము నుత్సాహమంది అక్కడకుఁబోయి

౨౪

ధర్మజుని వాక్కులందునఁ దనరు నక్ష
రాలఁ బూసలగ్రుచ్చినట్ల వచియించె
గాని చెవిఁబెట్టునట్లుగాఁ గానఁబడమిఁ
దావచించెను స్వాతంత్ర్యతాపథంబు!

౨౫

కొడుకుఁ గర్ణముఖ్యులుమాత్ర కూర్చువార
లా? సహోదరుని కుమార్లలంతివార
లా? స్వతంత్రించి యైదూళ్ల నైన నీయఁ
జాలవా? కురుక్షయమె నీ సమ్మతంబా?

౨౬

అనిన దుర్యోధనాదు లత్యంత రోష
భూషిత కషాయులై, విరాట్పురుషురూపు
మాపు యత్నమ్మొనర్ప నమ్మాయలాఁడు
అంబరం బంత విశ్వ రూపంబుఁ జూపి

౨౭

గ్రుడ్డికిం గన్నులిచ్చెఁ గన్గొనఁగ నచట
హర్షముం జెందినారు భీష్మాదు లెల్లఁ
బోవఁ బోవుచు శ్రీకృష్ణమూర్తి కర్ణుఁ
బిలిచి యేకాంతముననఁ దాఁ బలికె నిట్లు

౨౮

బావ! రాధేయుఁడవుగావు నీవు; పాండు
నృపతి నీతండ్రి, తల్లి కుంతీలలామ!
చెలఁగు చతురబ్ధివేష్టితక్షితికిఁ బట్ట
భద్రుఁడవగుము! చేరు మప్పాండుసుతుల!

౨౯

కృష్ణ, ఎవరికూడును భుజియింపుచుంటి
జీవమిడి వారి ఋణముఁ దీర్చెదనుగాక!
సర్వ మెఱుఁగుదు నీదారిఁ జను మటన్నఁ
బోయి పార్థసారథి యయ్యె మోహారమున!

౩౦

ఇరుతెగలు సిద్ధమయ్యె సంగర మొనర్ప
నాత్మ నశియింపదనుచు నిత్యమ్మటంచు
గానఁబడు నెల్ల భగవదధీన మనుచు
గీత. లుపదేశ మొనరించె కృష్ణమూర్తి

౩౧

గురులకడ ధర్మసుతుఁడు గైకొనియె నాజ్ఞ
శస్త్రముల రాసిడులు హెచ్చె సమరభూమి
గ్రీష్మభానుప్రతాపుఁడై భీష్ముఁ డలర
నప్పు డడ్డువడె శిఖండియను ఘనుఁడు!

౩౨

కెంపు గనుఁగవఁ దళుకొత్తి క్రేళ్ళువారి
తురగముల నేనుఁగులను నెత్తుటను దేల్పఁ
బిఱికిపందలు పొంచి, గన్మఱుఁగులోనఁ
గూలిచిరి పాపము కిరీటికొడుకు నంత!

౩౩

యమసుతుం డార్చె ఘోరద్రోణానలమ్ము
నరుఁడు రాధేయుని పస నణంచె; క్రూర
మతుల దుశ్శాసనుల గదాహతిని గొట్టి
భీమసేనుండు తనపొట్టఁ బెట్టుకొనియె

౩౪

ప్రబల యోధానుయోధు లీభంగిఁ గ్రుంగ
గడమవారలగొడవలు దడవనేల?
రహిఁ గురుక్షేత్రమున రుధిరస్రవంతి
విధవయిల్లాండ్ర వాకిళ్ల విరిగిపాఱె!

౩౫

ఉత్తరాగర్భమొండె అభ్యుదయమొందెఁ
జక్రి సత్కరుణావిశేషముకతాన!
దక్కఁగల యుపపాండవుల్ ధరణిఁబడిరి
బాడబుని తీవ్రకోపాగ్నివశతఁ జిక్కి

౩౬

ధర్మసుతునకు రాజ్యపుం ధర్మమర్మ
ముల నెఱిఁగించి భీష్ముండు పుడమిఁబాసె
మహితసన్మార్గవర్తివంశమునఁ బుట్టి
పాండుతనయులు సన్మార్గవర్తులైరి

౩౭

తమ్ములంగూడి అశ్వమేధ మ్మొనర్చె
భూమిసురులకు ధనధాన్యముల నొసంగి
హృదయపంకేరుహముల శ్రీకృష్ణుఁ జేర్చి
ప్రజల సేవించె నంత ధర్మప్రభుండు!

౩౮

అభ్రగంగాప్రవాహంబునందుఁ గర్ణ
గోచరుండయ్యె నొక్కండు; గోవధూటి
నోచుకొన్నట్టినోముల ఫలమనంగ
నృత్యమొనరించుచున్ గెరటాలలోన!

---

# అనుమానపిశాచము

దినవహి సత్యనారాయణ గారు

౧

—వదినా! చూచితివా స్త్రీల కెంత సాహసమో?

—ఆశ్చర్య మేమి మనోహరం? ప్రేమ ప్రభావమే అట్టిది. అ దెంతటి కార్యముల నైన చేయించును.

మనోహరరావు మందహాస మొనర్చెను. కృష్ణవేణి యాతని క్రేగంటజూచెను.

అప్పుడే యింటకాలిడిన శ్యామలరావు చెవుల నీమాటలు పడెను. తమ్ముడు మంచముమీద పరుండి నవల చదువుచుండుటగాని, సమీపమున గూర్చుని తనభార్య ఆలకించుచుండుటగాని యాతనికి క్రొత్త కాదు. కాని యామె నోట వెలువడిన మాటలు, ఆ క్రేగంటి చూపు, తమ్ముని మొగమందలి యా మందహాసరేఖ—ఆతని మనమునకు కష్ట



అప్పుడే యింటకాలిడిన శ్యామలరావు చెవుల నీమాటలు పడెను.



ఆ క్రేగంటి చూపు, తమ్ముని మొగమందలి యా మందహాసరేఖ—

ముతోచెను కష్టమే కాదు. హృదయమును మానసపిశాచగ్రస్త మయ్యెను. తీయ నున్న కండువా తిరిగి సర్దుకొని వెంటనే వీథిగుమ్మము నైపునకు మరలెను.

కృష్ణవేణి తొందరగ లేచి

—ఫలహారము చేయరా? అనెను.

—చేయుట కేమిలే మరల వత్తునని శ్యామలరావు వెడలిపోయెను.

మనోహరరావు మంచముమీద నుండి లేచి చదువుచున్న నవలనుమూసి బల్లమీద నుంచి గోడకు తగిలించియున్న "టెన్నీసు బేటు" తీసికొని

—వదినా! బంతిఆటకు వేళ నైనది. పోయివత్తు నని యిల్లు వెడలెను.

కృష్ణవేణి మనస్సు పరిపరివిధముల పో దొడగెను. భర్తమోము కళదప్పి యుండగ చూచినది ఆమె యీనాడే. ఇంటికి నచ్చుట తోడనే నవ్వుచు పల్కరించుట, పేరు పెట్టి పిల్చుట, ఆహేళనలు ఏమియు నేడు కాన రావు— "సేవకవృత్తి కడు నీచమైనది. పై యధికారులేమైన ననిరేమొ? లేనా, వారిప్రాణ మిత్రులలో నెవ్వరికేని ఏ యాపదయు వాటి ల్లదు కదా?"—అని యెన్నియో కుశంకల జేసికొనుచు ఆలోచించుచుండును గాని యేమి యు నిశ్చయింప నేరకున్నది.

శ్యామలరావునకు రాజమహేంద్ర వర మున తాలూకా కచ్చేరిలో పని. నెల కొక యేబదిరూపాయల నిత్తురు. మనోహరరావు తని పినతండ్రి కుమారుడు. వారలకు భూవ సతి చాల తక్కువ. పై దళుత లేదు. మొదటి నుండియు అన్నగారిసహాయమువలననే చదువు కొనుచున్నాడు. ప్రస్తుతము మనోహరరావు ఆర్ట్సు కాలేజీలో బి. ఎ. క్లాసులో చదువు చున్నాడు. మొదట కొన్నిదినములు హాస్ట లులో నుండువాడు. అన్నగారి కీయూరు బదలీ అయి వారిచ్చటికి వచ్చిననాటినుండియు వారి యొద్దనే యుంటున్నాడు. భూవసతి చాల తక్కువయగుటచేతను, కావలసినవారందఱు వారల చిన్నతనములోన నేమరణించుటచేతను శ్యామలరావునకు ఉద్యోగములో ప్రవేశించు వరకు పెండ్లి కాలేదు. మనోహరరావు ఇంకను అవివాహితుడు. కృష్ణవేణి కాపురమునకు వచ్చి యిప్పటి కెన్నో నెలలు కాలేదు. వారి పుట్టినిల్లు కాకినాడ. అచ్చట గవర్నమెంటు బాలికాపాఠశాలలో ఆరవతరగతివరకు చదివి నది. ప్రకృతపు విద్యావతులగు క్రొత్త కోడం డ్రకువలెనే నవలలచదువుట ఆమెకు నొక వ్యసనము. అందుచే మనోహరరావు వదినె గారికి కావలయు పుస్తకములను స్నేహితుల యొద్దనుండియో, గ్రంథాలయములనుండియో తెచ్చి యిచ్చుచుండును. ఇచ్చుటయే కాదు; ఆమె వినోదార్థము ఆమెకు తఱచు చదివి వినిపించు చుండును. తాను చదువుచుండుటకన్న మఱల చదివి వినుపించుచుండుటలో కృష్ణవేణి కొక విధమగు ఆనందము కల్గుచున్నమాట మాత్ర ము వాస్తవము.

దాంపత్యజీవిత మందలి సుఖమునకు మూలాధారము అన్యోన్య ప్రేమ. ఆ ప్రేమ దంపతులలో నెవ్వరియం దణుమాత్రము జంకినను నిక గార్హస్థ్యజీవనమున సుఖ మనుమాట కల్ల.



అచ్చట నున్న మెట్లపై నొంటరిగ కూర్చుని యాలోచింప దొడగెను__

శ్యామలరావు తిన్నగా గోదావరి గట్టునకుపోయి అచ్చటనున్న మెట్లపై నొంటరిగ కూర్చుని యాలోచింప దొడగెను__ 'అకటా! స్త్రీహృదయము దుర్గ్రాహ్యము కదా! కృష్ణవేణీ! నీవు నన్నుహృత్పూర్వకముగ ప్రేమించుచుంటివని పొరపడితినే! ఎంతపని చేసితివి? నీయాచిరునగవు,ఆహావభావ ప్రకటన-అంతయు కృత్రిమమా! "అంగన నమ్మరాదు" అను పెద్దల సుద్దులయం దెంత సత్యము కలదు. మనోహరమా యిట్టిపని కొడిగట్టుట! నాకు భృత్యుడై చరియించుచుండువాడే! నే నన్న దైవమువలె చూచు నాతమ్ముడు!__కాదు__ కాదు__నేనే పొరపడితిని. వదినా మఱదులు గదా! వారలయందు పరియాచకము సహజమే! దానికై అనుమానించు చున్నా నేమి? పెద్ద నిట్టూర్పువుచ్చి__ అనుమానమే కాదు. నిజము. ముమ్మాటికిని నిజము. ఆ చూపులు ప్రణయసూచకములు. అందు గూఢార్థ మవశ్య మున్నది. ఇంతవరకు వా రేదోష మొనర్పకున్నను త్వరలో నొనర్పనున్నారని వారల చూపులు, వారల నవ్వులు తెలియజేయుచున్నవి__నన్ను నేనే దూషించుకొనవలెను. లేకున్న నింత చనవు వారల కెవ్వ రిమ్మని చెప్పిరి?'

సూర్యుడు గ్రుంకెను. జారసమాగమ కాంక్షిత యగు గౌతమీసతి శీతకరు కరస్పర్శనమున కులుకుచుండెను. దక్షిణానిలుడు వారల తట్టుచు హెచ్చరించుచుండెను. కాలమహిమను ప్రేక్షకులకుగూడ వారి చెయిదములు మోదావహములుగ నున్నవి. కాని చంద్రాగమమున పరుగెత్తుకొని వచ్చి నిశాకాంత శ్యామలరావు హృదయగహ్వరమున దాగెనేమో యనునటు లాతని హృదయము తమోభాజనమై యున్నది.

'నే నిప్పు డేమి చేయవలెను? ఈ ఆలోచనలో నొక్కొక్కమా ఱాతనిమో మెట్టివాఱును. ఒక్కొక్కపరి మొగము చిట్లించును. మఱియొకసారి "అబ్బా"యని పెద్ద నిట్టూర్పు పుచ్చును. ఆతని మనఃక్షేత్రమున కోపము, అసహ్యత, సంతాపము నొండొంటితో కలహించుచున్నవి. ఆముఖలక్షణములు తజ్జన్యములే. భార్య ననుమానించుచున్న వాని హృదయబాధ మనము తేలికగ తెలిసికొనజాలము. ఇంటిగుట్టుబయటబడరాదు ఇదియే మాత్రము వెల్లడించినను పెద్ద యల్లరి యగును. ఇంతకును ఇందలి సత్యము నాకును బోధపడలేదు. మాతమ్మునితో—"ఇంటియొద్ద నీకు చదువు చక్కగ జరుగదు. పరీక్షలు సమీపించుచున్నవి. నీవు పోయి హాస్టలులో నుండుము"ని చెప్పెదను. వాడు నామాట కెదురాడడు. నాకు వీరిలక్షణముల నింకను పరీక్షింపనవకాశమును చిక్కును. ఇదమిత్థమని నిశ్చయించుటకును వీలగును.'

అనుకొనుచు లేచి యింటికి వచ్చెను.

* * * *

తానును, తమ్ముడును భోజనమునకు కూర్చునిరి. భార్య నేమియు పల్కరింపలేదు. ఆమె కారణము నూహింపలేక సంకోచించుచు మెల్లగ వడ్డించుచున్నది. ఇంత శ్యామలరావు తమ్ముని వైపునకు దిరిగి

'మనోహరం! పరీక్షకు గట్టెతివిగదా! ఇక మీ పరీక్ష లెన్ని దినము లున్నవి?'

'—నిండా మూడు నెలలు లేవు.'

'సమీపమునకు వచ్చినవే. నా కొకటి తోచుచున్నది. నీకిక్కడ చదువు జరుగదు. అదిగాక హాస్టలులో నున్న విద్యార్థులతో కలసి చదువవచ్చును. ఏదో గట్టిగా పట్టుబడితే యీసంవత్సరము నెగ్గవచ్చును. మన కష్టములును గట్టెక్కును.'

'నేను నక్కడకు వెళ్లుచు విద్యార్థులతో కలసి చదువవలెననియే అనుకొనుచున్నాను.'

'అక్కడకు నిక్కడకు తిరుగుచున్న కాలము వ్యర్థాగా పోవును. హాస్టలులోనే మేల యుండరాదు?'

'అబ్బే, అంతఅవసరము లేదు.'

'మఱొకవిధముగ ననుకొనకుము. అందుకగువ్యయము నేను భరింతును. ఈబంతియాటలనుమాని అక్కడనేయుండి గట్టిగచదువుము.'

'రేపే నీ పుస్తకములను వానిని తీసికొని హాస్టలులోనకు వెళ్లియుండుము.'

మనోహర మెదురు చెప్పలేదు. మరునాడాతడు తన సామానును తీసికొని హాస్టలులో ప్రవేశించెను.

## 3

రెండుదినములు గడచినవి. భర్తకోపమే మాత్రమును శాంతింపలేదు. సాయంకాలముల యింటికి ఫలహారమునకు వచ్చుట గూడ శ్యామలరావు మానినాడు. మానవతి యగు

స్త్రీ భర్తకొట్టినను, తిట్టినను సహించునుగాని పతివిముఖతను మాత్రము భరింపజాలదు.

రాత్రి తొమ్మిదిగంట లయినది. కృష్ణవేణి భర్తపాదముల నొత్తుచు

'ఎందుకండి ఈకోపము? నేనేమి తప్పు జేసినాను?'

భర్త మాటాడలేదు.

'ఏమండీ! నామీద ఒట్టు. నాతప్పేమి?'

'అవును నీ తప్పేమి?'

'అయ్యో! అంతకోపమునకు నేనేమిచేసితిని? ఏదేని తెలియక చేసిన చెప్పరాదా? దోషమున్న దిద్దుకొందును.'

'దోషమున్న దిద్దుకొందువు! కాదూ? అవును నీదోషమేమి? మీాకిద్దఱకు చనువిచ్చినందులకు నాదే దోషము.'

భర్త అనుమానకారణము స్ఫురించెను. స్ఫురించుటయేకాదు. ఆమె హృదయముపై నది యొకగొడ్డలి పెట్టువలె పడెను. ఆమె వెక్కివెక్కి యేడ్చుచు పతిపాదములపై వ్రాలి "అయ్యో! ఎంత పొరపడితిరి?" ఆతని నాపుత్రుని వలె.........

'ఛీ! ఛీ! నోరుమూయుము. ఈబుడిబుడి దుఃఖముల కేమి? నేనేమి గ్రుడ్డివాడ ననుకొనుచున్నావా? మీా చూపులు, మీా నవ్వులు గ్రహింపలే దనుకొనుచున్నావా? స్త్రీల విశ్వసించుటయేదోషము—పో!పో!' యనికాలితో నొక త్రోపు త్రోసెను.

ఆయబల నిశ్చేష్ట యయ్యెను.

'భర్తకుకాని దానినయినతర్వాత నాకెందుకీబ్రతుకు! గోదావరిలో మున్గి ప్రాణము గోల్పోవుదును.'

కాని ఆమె కాపురమునకు వచ్చి కొలది దినములే యయ్యెను. భర్తతో గూడి అనన్యసుఖాంబుధి నోలలాడవలెనని యెంతో యాశించినది. నిజము తెలియకమానదు. కాలము నానిర్దోషత భర్తకు ప్రకటించి న న్నాతని కృపాదృష్టికి పాత్రురాలిని జేయునను ఆశ యొకటిఆమెను ఆయాత్మహత్యనుండి వారించుచు వచ్చెను.

దినము లిట్లెన్నియో గడచినవి. శని వార ఆదివారములలో మరదివచ్చి వెళ్లుచుండెను. కాని భర్త యనుమానము నాతని కడ నామెయెత్తి పల్కలేకుండెను. "నవల నేమైన చదువుదునా?" యన్న "వద్దు. పరీక్ష చదువు పాడుచేసికొనకు"మనియు, లేదా "నాకీరోజున తలనొప్పిగా నున్నది, ఈమారు చదువుదువుగాని" అనియు కృష్ణవేణి మనోహారముతో చెప్పి పంపివేయుచుండును.

అతడువచ్చి వెళ్లుచుండుట పతియనుమానము నెక్కువ చేయుచుండెను.

కొన్ని దినము లయినతర్వాత కృష్ణవేణి యన్నగారు కోర్టుపనిమీాద రాజమహేంద్రవరము వచ్చెను. భోజనము లయిన తర్వాత శ్యామలరా నాతని బిల్చి

'బావా! నన్ను మరల ఎక్కడకు బదలాయింతురో తెలియదు. [illegible]షమునకు

వచ్చినాము. మీచెల్లెలి నొకసారి తీసికొని వెళ్లుము. పదిరోజులు వారల తల్లియొద్ద, తమ్ముల వద్దనుండి వచ్చు' ననెను.

నారాయణరావు సంతోషముతో 'సరే' ననెను. కృష్ణవేణి మొగమున సంతోషమును లేదు, దుఃఖమును లేదు. ఏదో మఱచిపోయిన దానివలె అన్నగారివెంట పుట్టినింటికి వెళ్ళెను.

౪

కృష్ణవేణి పుట్టినింటికి వచ్చి యిప్పటి కారునెల లయినది. భర్త కెన్నియో ఉత్తరముల వ్రాసెను కాని యొక్కదానికి నాతని యొద్దనుండి ప్రత్యుత్తరము లేదు. భర్తకు దన యెడ గల్గిన అనుమానమునుగూర్చి మిథ్యాభిమానము తల్లితోనైన జెప్పనీయలేదు. తనంతటదాను ధైర్యముచేసి భర్తకడకు పోవుటకు సాహసింపలేదు. మెల్లగ నామె హృదయమున పతియెడ నొక విధమగు ద్వేషము కలుగ జొచ్చెను. ఇక నిస్పృ డామె కచ్చటకు పోవు తలంపుగూడ కల్గుటలేదు.

మనోహరరావు మరియొక ఆదివారము అన్నగారింటికి వెళ్లెను. వదినెగారు రాలేదు. అన్నగారు వండుకొనుచుండెను.

'అన్నయ్యా! వదిన యెక్కడ?'

'మీవదినా? పుట్టినింటికి వెళ్లినది.'

'మీ కేమైన సహాయము సేతునా?'

'నా కేసహాయ మక్కఱలేదు. నీవుపోయి చదువుకొమ్ము. మీవదిన వచ్చినతర్వాత వత్తువుగాని. పాప మామె యింటికడ నొంటరిగ నుండజాలదు.'

మనోహరరావున కన్నగారి మాటతీరు వేఱుగ నున్నటుల బోధపడెను గాని యందలి వ్యంగ్యార్థమును గ్రహింప నేరడయ్యెను.

దినము లనేకములు గడచినవి. మనోహరము పరీక్షలయి యింటికి వచ్చినాడు. వదినగారు రాలేదు. అన్నయ్యనైఖరి మారినది. తన్ను చూచిననే మొగము చిట్లించుకొనుచుండెను. పనిలో సాయపడపోవ 'వ'ద్దని గదుము చుండెను. ఆతని కేమియు బోధపడుటలేదు. ఎంత యాలోచించుచున్నను అన్నగారియందలి మార్పునకు కారణ మాతని బుద్ధికి పొడకట్టలేదు. ఒకనాడు శ్యామలరావు



తమ్ముని పిలిచి—'మనభూములమీద నొక మారు వెళ్లి గతసాలు బకాయి వసూలుచేసి కొని ర'మ్మని చెప్పెను.

బర్మా వెండిపని



చిత్రము ౫.

'సరే' నని మనోహర మాచ్లెల్లవార గట్ల బండిలో బయలుదేరి కాకినాడలో దిగి తిన్నగా నీలపెల్లిపోయి అచ్చట రెండురోజులు ముకాముచేసి బకాయిలో కొంత వసూలు పెట్టుకొని తిరిగి వచ్చునపుడు వదినగారి పుట్టి నింట నాగెను.

లోకమర్యాదలయి స్థాయిపడినతరువాత మనోహరము వదినెగారితో 'వదినా! ఈమూ రిన్నినాళ్ళు ఆగినారేమి? మాకు వంట బాగుగా నలవాటు కావలెననియా?'

కృష్ణవేణి యొక్క నిట్టూర్పు విడిచెను. మాయమర్మముల నెఱుగజాలని మనోహరి రావున కామె యేమని జవాబు నిచ్చును?

'మీ అన్నగారు ఖులాసాగానున్నారా?'

'ఖులాసాగానే యున్నారు. కాని వదినా మీరాలాగున నున్నారేమి? అన్నగారివైఖరి మారినది. మీరు విచారగ్రస్తులయి యున్నా రేమి? అన్నయ్య మిమ్మేమైన ననెనా? మీ రెన్నడు నిన్ని దినములు పుట్టినింట నుండ లేదే! అన్నయ్య మిమ్మువిడచి—'

'ఏమి చెప్పుదును మనోహరము' అని కృష్ణవేణి పెద్దపెట్టున నేడ్చెను.

మనోహరమునకు కన్నులనీరుగ్రమ్మెను. గద్గదస్వరమున—వదినా? ఏమిటది?

'మనోహరం! ఏమి చెప్పుదును?'

మీ అన్నయ్య...... మనలను...... సంశ... యించుచున్నారు.'

'అయ్యో! అయ్యో!'

అని గ్రుడ్ల నీరు నింపుకొనుచు మనోహరము గోడకు జేరగిలబడెను. తాను మంచము మీద బహుంకి నవల చదువుచుండుట, వదినె గారితో సంభాషణ, అన్నగారువచ్చిఫలహార మైన చేయకుండ వెడలిపోవుట,తన్ను హాస్ట లున కంపుట, ఆదృశ్యము లన్నియు నొక్క మారు కన్నుల కగుపడి అన్నగారి ప్రవర్తన మందలి విపరీత పరివర్తనకు కారణ మాతనికి నేడు హృద్గోచర మయ్యెను. కొండొకవడి యాలోచించి, దుఃఖించిన లాభములేదనుకొని వదినగారి నోదార్చి—'అమ్మా!వదినా!మీరు దుఃఖింపకుడు. నేను తిరిగి వెల్లుండివచ్చి మిమ్ము నన్నగారియొద్దకు తీసికొని వెళ్లుదును. మీ యందాయనకు సంశయము తొలగిపోవును.



మీ అన్నయ్య...మనలను...సంశ...యించు చ్నునారు.'

మీరు సుఖులై యుందురు. నామాటనమ్ముడు. ఇప్పటికి నాకు సెలవిండు.' అని వదినగారిపాదములకు నమస్కరించి కృతనిశ్చయత దెలుపు చూపులతో నామె నొక్కపరి నవలోకించి మనోహరము రాజమండ్రీ వచ్చివేసెను.

*

ఆమరునాటి సాయంకాలము గోదావరీ తీరమున శ్మశానమున కవ్వల నొక యిసుక తిన్నెపై మనోహరరావు తన పైయుత్తరీయమును బఱచుకొని పరుండి ఆలోచనలో మునిగెను.

'అకటా! ఎంతపనిజరిగె. అన్నయ్యతో నిక నెట్లు చెప్పగల్గుదును? వారిని చూచునరికే నానోట మాట రాలేదు. అక్కడకును "నేను నిర్దోషిని అన్నయ్యా! వదినెను రక్షింపు"డని కాళ్ళు పట్టుకొంటిని—ప్రత్యుత్తరము లేదే!—ఎంతపని!—వారల దాంపత్యజీవనమునకు నేను వేరుపురుగునైతినా! దైవమా! నాతల్లి నాపసితనముననే పోయె. అక్కసెలియండ్రా లేరు. వదినెగారి చరణములకడజేరి "నాబ్రదుకులో కోమలత్వమను పాఠమునేర్చ కొనదగును" "వల్లె" అని సంతసించితిని. మేమెక్కువ చనువుగ నున్నమాట సత్యము. మేమేమి చదువుచు వచ్చినను లాలసోపహత చేతస్కులము కాలేదే! రామా! రామా! ఆతలంపే మాకు కలుగలేదే! తుదకిట్టి పరిణామమా! "ఈపి లేనిచోట గంటువెట్టు" స్వభావముగల ప్రజ పొరపడిన పొరపడవచ్చునేమొ! కాని నాస్వభావము, మావదినె సచ్ఛీలత పూర్తిగానెఱిగిన మాయన్నగారా!—రామా! ఇక విచారించిన లాభములేదు. సర్వసుఖములతో నొప్పవలసిన సంసారమొకటి నామూలమున నేల గూలుచున్నది. వారిరువురి సుఖజీవనమే నేగోరునది—అన్నగారి సంశయనివారణకు నే నీతుచ్ఛప్రాణములనైన బలి నిత్తును—ఆత్మహత్య పాపముకాదా! అవుగాక!—నేను జీవించియుండుటవలన నెవ్వరికి లాభము!—అన్నగారి కొకవేళ మాయందు సంశయము తొలగిపోయినను నేను వారి మొగము చూచు టెట్లు?—నన్ను చూచినపుడు ఆవెనుకటిస్మృతి ఆయనను మాత్రము బాధించుచుండదా!—ఇంతకును నేను బ్రదికి యెవ్వరి కుపకారము! తలిదండ్రులా లేరు. అన్నిటికిని అన్నగారినే నమ్మితిని. వారా విముఖులైరి. నేను నిర్దోషి నని గ్రహింతురను కొందు. అయినను నాయందు వారి కానాటి ప్రేమయుండునా! వదినగారిని చూడకుండుటెట్లు? చూచినను స్వచ్ఛహృదయముతో వెనుకటియట్లు ఆమె మోము చూడగల్గుదునా? సంశయము, భయము నన్ను బాధించుచుండదా?—అబ్బా! నాకీజీవితమువలదు—పరమేశ్వరా! ఈదీనుని రక్షింపుము. ఇదియే నాకడసారి ప్రార్థన'—అని యిక నేదోయాలోచనలో మరియొక పదినిముసములు వెచ్చించి లేచి చేతిగడియారమువంక చూచి 'ఇంకను కాకినాడ బండికి సమయమున్నది—వదినెగారిని రేపటిబండిలో తీసికొనివచ్చి వారుభయులు

నొక్కచో గూర్తును. అంతటితో నీప్రపంచ రంగమందుండి యీపాత్ర నిష్క్రమించును.' అని యాలోచించుచు కాలేజీవైపునకు వెళ్లి పోయెను.

*　　*　　*　　*

మరునాడు తొమ్మిదిగంట లయినది. శ్యామలరావు వంట చేసికొనుచుండెను. కష్టించి సుఖింపవచ్చును గాని సుఖించి కష్టింపనేరము. తన యాజ్ఞానువర్తియగు భార్య అడుగులకు మడుగు లొత్తుచు చేసి పెట్టుచుండ హాయిగ భోజనము చేయుచు వచ్చిన శ్యామలరావునకు ప్రొయ్యి యొద్ద ఇప్పుడు చెప్పరాని విసుగు జనించుచున్నది. అదేమొకాని అగ్నిహోత్రుడు స్త్రీల యాహ్వాన మంగీకరించినంతత్వరితముగ మన యాహ్వాన మంగీకరించునట్లు కనబడడు. బుడ్డెడు కిరసనాయిలు పోసినను, పెట్టెడు అగ్గిపుల్లలు తగులబెట్టినను నొక్కొకపరి ఆ హవ్యవాహనుడు ప్రసన్నుడే కాడు. స్వహస్తపాకమున కష్టము దోచుచుండెను. భార్యవ్రాసిన యుత్తరముల మనసుకలగెను. మనోహరము ప్రవర్తన తిలకించినకొలదియు శ్యామలరావునకు "ఈతడునిర్దోషి. నే నెంత పొరపడితిని" అనిపించుచుండును. కాని ఇక నామె నెట్లు పిలిపింపవలెనో చింతింపలేక కాలయాపన మొనర్చుచుండెను. ఇంతె మనోహరరావు వచ్చి యాతని పాదముల బడెను. శ్యామలరావు హృదయమున జ్ఞానోదయ మయ్యెను. ఆతని హృదయగహ్వరమున జొచ్చిన తమము విడ నారంభించె. ఈనాడట్లు వంటచేసికొనుచు శ్యామలరావు—'కృష్ణవేణి వ్రాసిన యుత్తరములకు పాషాణహృదయములైన ద్రవింప వచ్చు— అయ్యో! నే నింత కఠినహృదయుడనైతినేమి? నా సంశయమే నన్నావేశించినట్లున్నది. కృష్ణవేణీ! నిన్నూరకనే అనుమానించితినా! మనోహరము, నా దక్షిణభుజమనదగు మనోహరము, నిన్న నా పాదములబడి "అన్నయ్యా! వదినను స్వీకరింపుడు; మేము నిర్దోషులము" అనివెక్కి వెక్కి యేడువ నాగుండె నీరయ్యనే కాని "రమ్ము, నాయనా!" అని యాతని కౌగలించుకొననైతినే! ఈపిశాచమును నాహృదయమందుండి పోదోలుటెట్లు?—ఆతడు నిన్న సాయంకాల మెచ్చటకు పోయెనో! ఇంతవరకు భోజనమునకునైన రాలేదు. ఎందులోనైన మునిగిప్రాణములు గోల్పోవడుగదా! తమ్ముడా! రమ్ము! నిన్ను నే నవమానించిన నాటికి నేటికిగల నీ శరీరస్థితియే నీవు నిర్దోషివని చాటుచున్నది. మీవదినె యుత్తరములు ఆమె ప్రేమ స్వరూపమును వెల్లడించుచున్నవి. నామనసు కొలదిదినములనుండి మారుచున్నను ఏలనో! ఇంకను సంపూర్ణముగ నిష్కల్మషహృదయుడ గానేరనైతిని! కాదు, నీవు నిన్న నన్ను పవిత్రహృదయుని జేసితివి. రమ్ము! భోజనమునకు రమ్ము మీవదినను రప్పింతును' అని పిచ్చివానివలె భావములందు నిల్కడలేకయాలోచించుచుండ వీథిగుమ్మముకడ బండి యాగిన చప్పుడు వినబడినది. అంత లేచి శ్యామలరావు వీథిచావడి లోనకు వచ్చెను. మనోహరమును తన భార్య

యు గుమ్మములో కాలిడిరి. శ్యామలరావు వారలజూచి తెల్లబోయెను. కృష్ణవేణి నిశ్చేష్టయై పతిమోము చూచుచుండెను. ఇట్లు రెండుమూడు లిప్తలకాలమయ్యెనేమొ! గోడ నానుకొని నిల్చియున్న మనోహరరావు గుభాలున నేలగూలెను. రెండుమూడు వాంతులయినవి. కన్నుల తేలవైచెను. 'తమ్ముడా!' యని శ్యామలరావును, "మనోహరం' మనోహరం!" అని కృష్ణవేణియు నాతని కిరుప్రక్కల జేరి కూర్చుని యాతని మరణయాతన గాంచుచుండ కష్టముపై రెండుచేతుల జోడించి అన్నగారివంక నొకమారును, వదినగారివంక నొకమారును, మనోహరము తనదృష్టుల బఱపెను. మరి పదినిముషములకు మనోహరము కాదు. వట్టికట్టె మిగిలినది.

"అయ్యో! తమ్ముడా! నా యనుమాన పిశాచము నిన్నుకబళించెనా!" యనిశ్యామలరావు వాపోవ జొచ్చెను.

"అయ్యో! మా కొఱకు నీవు బలియైతివా తండ్రీ! ఎంతపనిచేసితివి" యనికృష్ణవేణి యేడ్వ నారంభించె.

* * * *

మనోహరరావు కోటుజేబులో రెండు కాగితములు కనబడినవి. అందులో నొకదాని మీఁద—కొన్నిదినములనుండి నాకీజీవితముపై నసహ్యము కల్గుచున్నది. కాన కాలేజీ లేబరేటరీలోనుండి పొటేషియమ్ సినైడ్ తెచ్చి మ్రింగి నాప్రాణముల నా చేతులతో త్రుంపుకొంటిని. నా మరణమునకు నేనే కర్తను.

14-10-23 }
రాజమండ్రి } ఇట్లు:
ఖానుఖేల మనోహరరావు.

రెండవదానిపై

పూజ్యులగు అన్నగారి దివ్యపాద పద్మముల సన్నిధికి:—మనోహరరావనేక నమస్కారములు. నన్ను మీరు చిన్ననాటి నుండియు పెంచి పెద్దవాని జేసితిరి. దానికి కారణాంతరముల యీజన్మమున మీ ఋణము తీర్చుకొనజాలనందులకు చింతిలుచున్నాను. నేను మ. స. వదినెగారిని, మిమ్ములను నా తలిదండ్రులనలె భావించి పూజించితిని. దానికి దైవమే సాక్షి. తెలియక నే నేమైన చేసిన క్షమింపుడు. పరమపతివ్రతాశిరోమణియగు వదినెగారి పాద పంకేరుహములకు నాభక్తి పూర్వక ప్రణామములు.

అన్నయ్యా! ఏమనివ్రాతును. మీరుభయులు కలతలేని గార్హస్థ్యజీవన సుఖమనుభవింతురు గాత యని నాప్రార్థన.

14-10-23 }
రాజమండ్రి } ఇట్లు విధేయుడు:
మనోహరము.

---

## తలపోఁత

మిన్నికంటి గురునాథశర్మ గారు

నీకుం బెండిలి సేసి నీ తనయుఁ దెప్పించి ముద్దాడఁగా
నీకున్ సారెఁ బంపి నీమగనికి న్నెయ్యంబు నిండింపఁగా
నీకుం గూటికి లేమి లేనిపగిది న్నిత్యం బొసర్పంగ నే
నాకాంక్షించితి నే యయో, యెచట మాయం బైతివే యింతలో.

ని న్నేవేళ స్వజాతిసంఘ మెట కేనిం దోడుకొం చేగునో ?
ని న్నేవేళఁ గఠోర ఘాతుకమృగానీకంబు మ్రందించునో ?
ని న్నేవేళ ధనుర్ధరుల్ దునుమ నన్వేషింతురో యంచు నే
నున్నాఁడ న్నినుఁ జేర్చి ప్రాణముల నయ్యో, యిప్పు డెం దేగితే.

ఏవాఁడైన మృగవ్యదుర్వ్యసనుఁడై యేతెంచి జేఁ డిమ్మ్యెడం
దా వీక్షించి ననున్ సభక్తిమెయి నుండంగం దదీయాసిఁ ద్రా
సావేశంబునఁ గాంచి మై గగురుపా టంద న్నను న్వీడి ద
వ్వై వెళ్లన్ యతనించు నీ బెదరుచూపు ల్నన్మనం బేర్చెడున్.

బెబ్బులికూఁత లెందయిన వీనులసోఁకుడు మై సెమర్పఁగా
గబ్బ కనుంగవం దొరఁగఁగా బెళుకారెడి చూపు దాటు త
బ్బిబ్బయి డెందమేడ్తెఱఁగ విన్నదనంబు మొగంబు నిండఁగా
దబ్బన నాయొడిం బడెడి దానవు నీ విపు డెందుఁ బోయితే?

గడ్డము లాగి పైకొనెదు గంతులువై చెదు నేను బట్టఁబో
నడ్డమువత్తు స్నానమునకై చనుచోఁ దడికావిగుడ్డ గ
న్పడ్డ నెలేని నారవయివం గమకింతు కమండలూదకం
బిడ్డ గ్రహింతుగాని యొకమేటికిఁ బో విపు డెందుఁ బోయితే?

నీయందంబును నీవిలాసమును నీనేత్రద్యుతి స్ఫాయమున్
నీయొయ్యారము నీబెడంగు నడకల్ నీభక్తి నీప్రేమ మే
చాయ న్నేమఱవం దలంచినను నాశక్యంబు గాకుండె నా
నా! యెందేఁగితి గట్టిగుండెగలదానా, నన్ను వంచింపఁగన్.

నిద్దపుఁజూపులు న్నడకనేరుపుల్గ మృదుదేహకాంతులుం
బెద్దయుఁ గాల మేను గని పెంచితిఁ బ్రాణము నిల్పి నీపయిఁ
ముద్దులు మూటగట్టు నినుఁబోలినదాని జగానఁ గానకీ
వద్దిర మోసగించి యెటకైనను బోయెదవం చెఱుంగమిఁ.

నీమృదుదేహకాంతి స్తోమమే యీశ్వర స్వరూపంబు నా ప్రాణమునకు
నీవినిర్మల చంచలావలోకనములె యక్షరాలు నా ప్రాణమునకు
నీ యనుత్తమగుణానీక ప్రశంసయె ధ్యానయోగంబు నా ప్రాణమునకు
నీయన్నపానాది నిర్మాణకృషియె సమ్యక్తపోవృత్తి నా ప్రాణమునకు
నేను నీవ, నీవ నేనయియుంట జీ- వేశ్వరులకభేద మెఱ్ఱుఁగొనుట
యే యటంచు నెంచి తిన్నాళ్లు- నీపోక నరయనైతి బేలనైతి నకట.

నీతో నాటలుపాటలు- నీతో స్నానాన్నపాన నియమవ్రతముల్
నీతో సర్వస్వంబని చేతంబునఁ దలఁచి తిట్లు సేయందగవే?

ఎపుడే నాకు ననిష్టమైన పనుల్గ స్వేచ్ఛాప్రవృత్తిం బొన
ర్చి పరీక్షావిధినే గ్రహించి ప్రతిఘూచ్ఛన్నాస్య మందు న్వివ
ర్ణపుఁ జిన్నెల్ వెడలింపఁగాంచి భయవిభ్రాంతిం దడంబాటు మై
చపలాక్షీ! నను వేఁడికొందు దరహాసం బూను పర్యంతముఁ.

నను వీక్షింపక నిల్వలేవు క్షణమైనన్ నేనెదేఁ గైతవం
బునఁ బ్రచ్ఛన్నుఁడఁగా మొగంబు తళుకుల్ పోవుం; జలార్ద్రింబులోఁ
గనుఁగొల్కుల్, సఖులెన్నిపిల్చినను బల్కంబోవు నేఁ డేవిధం
బునఁ బ్రాణంబుల బిగ్గఁబట్టి చని తీవు న్నిర్దయ స్వాంతతఁ.

సంగడికాండ్రతోడుతఁ బ్రసంగము లెయ్యవియేని సల్పుచుం
డంగ నపాంగ పంక్తులను నాపయినిల్పి మదుక్తిపాళి కు
ప్పొంగెడు భక్తియో? వినయమో? బలుప్రేముడియో? విలాసమో?
యింగిత మేనెఱుంగ నిపు డేమయిపోయెఁ దదీయవైఖరుల్.

నీమెడ మల్లెపూసరులు నిండుగ నింపితి మధ్యభాగముం
గోమలమాలతీ కుసుమగుచ్ఛములం గయిసేసితిఁ సుమ

స్తోమము గొన్ని యూఁదలను జొన్పితి నంఘ్రులఁ గొన్ని నిల్పితిం
బ్రేముడి నిన్నుఁ గన్గవ నిరీక్షణ సేసితిఁ గర్వు దీరఁగన్.

చేసితి నెన్ని సేవలనో! చెప్పఁగ నేటికిఁ దల్లిదండ్రులం
బాసిన దానవంచు బసిపాప వటంచు సుదర్శనీయవం
చేసిలుఁగుల్ నినుం జెనకనీక తపంబది మూరివోవ వి
శ్వాస విహీనురాల! పలుబాముల పాలయి పెద్దకాలమున్.

నీవందించినఁగాని, త్రావనని పానీయంబు నాహారము
న్నీవే పెట్టినఁగాని మెక్కనని నేనీయంకముం గాసి ని
ద్రావేళన్ శయనింపనంచని యజస్రంబుం దపంబూను నీ
వీవేళ న్ననువీడి యొంటరిగ నెట్లే కాలముం ద్రోయుటల్.

నాకోపంబునకున్ భయంపడెదు, నానైపుణ్యముం జూడఁగా
నాకాంక్షించెదు నాబెడంద కుసుమీయం జూతు నాప్రేముడిం
గైకోఁ బూనెదు నాశ్రమంబునకు శోకం బాత్మలోఁ గందు నా
కేకాలంబు నిరోగతం దలఁతు నిన్నే మర్వఁగా నేర్తునే?

సమయంబుం గనిపెట్టి మెట్టెటులో కాషాయాంబరంబైన ని
త్యము పారాయణచేయు గ్రంథమయినం దర్భాసనంబైన దం
డమునైన న్విల సత్కమండలమునైనన్ డాచి నావేఁడికో
లుమెయిం బొంగి యొసంగు నిన్మఱువ నెట్లు న్నేరఁగా నయ్యెదన్.

ఎమ్మెయి నేను ధైర్యము వహింపఁ దలంచిన నే నిమేష కా
లమ్ముననో గబుక్కునఁ దలంపునఁ జేరి చురుక్కున న్మనో
బ్జమ్మును వ్రక్కలించెదవు బాపురె! యింకెటు నీవియోగ భా
రమ్ము సహింతు దుర్బలతర ఛదహృత్సరసీజ కర్ణికన్.

నెట్టన కాలికి బలపము, గట్టుకొని తోరంగి నిసువుకంట న్వాత్తిం
బెట్టుకొని యహర్నిశముం, గట్టా, గాలించి నిన్నుఁ గానం గానన్.

చుఱచుఱఁగాఁడ బిత్తరపుఁజూపులఁ జూచెదు నిల్చి ముందల
న్మరిపెము గుల్కఁ తళ్కు జిగిబుగ్గ గనంబడ నోరవాకిటం
బెరసి యడంగి యొంటి కనుబెళ్కులఁ జోపెదవార! యిన్ని వై
ఖరులఁ జెలంగి యాడుచుఁ బెకల్చితి మద్ధృదయాలవాలముల్.

ఇమ్ముగ నాఁటుబిడ్డలపయిం గల దీర్ఘ బలిష్ఠ మోహ పా
శమ్ము విరాగ మానస నిశాత కుఠార కఠోరధార చే
నమ్మెయిఁ ద్రుంచి తుత్తునియలై తొరఁగ న్మునినైన నాకునుం
గ్రమ్మె భవద్వియోగ భవగాఢతర వ్యథ యేమిచోద్యమో?

నాచెడ్డబుద్ధి "ఛీ, ఛీ వాచంయములకు నిదేమి వైఖరి తగద
య్యా! చెడెద"వనియుఁ ద్రుటిలో వైచును దుర్భరవియోగబాధాంబు నిధిన్.

తీయనివస్తు వేదయినఁ దెచ్చి ప్రియంబున నీకొసంగఁబో
డాయవు కైకొన న్మఱి యెడందఁ దలంతువు తాఁభుజింప క
య్యో; యితఁడెప్డు నాకొసఁగుచుండు నఁటంచును నేభుజించి నీ
కై యొసఁగన్ భుజింతు చపలాక్షి! యివన్నియు మర్వ శక్యమే?

కూడదు కూడ దీవగపు కూళలత్రోవను బోకుమయ్య, కా
పాడుము హానివృత్తి నిలువాసి ముముక్షుత నచ్చినట్టి నీ
వేడ? పునఃప్రపంచ విషయేచ్ఛ యదేడ? యొకింత వెన్కకుం
జూడుము మొద్దు డింపియును జూతువె దుంగను మోయ వెండియున్.

అనియుం దలంతును; మఱియుం జింతింతును.

పరులకుఁ జెప్పి యేడ్వ నొకపాటి వ్యథాభరమైనఁ దగ్గునం
చరసిన నోయి వెఱ్ఱిభరతా, జడదారికి దేటిత్రోవ యూ
ర, ఋషికిఁ జింతలా? యిహపరంబుల కేటికి దూరమయ్యె దం
డురా? యని సిగ్గుఁ జెందదను దోఁపదు నా కిఁక నేమి సేయుదున్

---

# శిశిరాంతము

తేకుమళ్ల రామచంద్రరావు గారు, బి. ఏ., (ఆనర్సు)

బంగాళాఖాతమునకు దక్షిణముననున్న సుధాంబరద్వీపము ఆంధ్రసామ్రాజ్యమునందలి ద్వీపములలో నొక్కటి. హిందూశాంతమహాసముద్రప్రాంత దేశములకు బోవు పెద్దపెద్దయోడల కీ సుధాంబరము ముఖ్యమగు రేవు. ఆద్వీపవాసులు వర్ణమున నల్లనివారైనను చూచుట కందముగనే యుండిరి. వారికి మంత్రములపైనను మాయపైనను పిచ్చినమ్మకము మిక్కుటము.

"ఆంధ్రమాత" యను నోడ యాంధ్రదేశమునుండి బయలుదేరి యొకనాఁటిసాయంతన సమయమున సుధాంబరము చేరెను. ఆయోడ నాయకుఁడగు నాగస్తంభుఁడు సుధాంబరద్వీపముపై నడుగిడి అచ్చటి సస్యములవంకను, సౌధములవంకను, అచ్చటచ్చట నెగురుచున్న యాంధ్రసామ్రాజ్యపతాకములవంకను చూడసాగెను. చూడఁ జూడ నొకవిధమగు తృప్తియు, సంతసమును నాగస్తంభుని హృదయసీమ నాక్రమించుకొనసాగెను. కూమార వర్తకసంఘమువారి కొలువున నాగస్తంభుఁ డోడ నాయకుఁ డగుటచే వారిచ్చు నుపకారవేతనమును తీసికొనుచు తన యోడలపని యైనపిమ్మట జీవితశేషమును గడపుటకు సౌందర్యరాశియగు సుధాంబర మాతనికి నచ్చినది. ఆద్వీపమున నొక చక్కనియిల్లు కట్టుకొని, దానిచుట్టును సౌరభమును వెదచల్లు పూలతోఁటను నాటించి భూలోకమున స్వర్గసుఖముల ననుభవించుతలంపే మనుజున కానంద మొసఁగదు? నాగస్తంభుఁడు రేవునకుఁ బరిసరముననున్న ప్రదేశమును గలయఁ జూచెను: అచ్చటి కృష్ణవర్ణులను, తెల్లగోధుమరంగుగల యాంధ్రులను, వృక్షరాజములను, సౌధాదులను ఆతఁడు విలోకించెను.

నాగస్తంభుఁ డనాగతవిధాతయే యైనచో సుధాంబరమునకుఁ బోయి యుండెడివాఁడు కాఁడు. ఆతని కాలోచనలతోఁ బ్రొద్దుపుచ్చుటకు కాలము లేదు. పీడకలలు, పిచ్చినమ్మకములు, భీకరరాత్రులు నన నేమియో నాతఁ డెఱుఁగఁడు. ఇదియే యాతని కథలోని విశేషమునకుఁ గారణము.

రేవు చేరుటతోడనే కూమార వర్తకసంఘము వారి సుధాంబరమునందలి ప్రతినిధియగు బింబగుప్తునకు కనుపడవలసి యుండుటచే నాతఁ డుండు ప్రదేశమునకు నాగస్తంభుఁడు దారితీసెను. నాగస్తంభునివలె నాతఁడును దన స్వస్థలమగు నాంధ్రదేశమును విడచి సామ్రాజ్యభాగములగు దూరద్వీపములందు నివాస మేర్పచుకొన్నవాఁడు. వారిరువురును. కబురులు చెప్పుకొనుటలో సుధాంబరమునందలి విశేషములు బైటపడసాగెను కాని నాగస్తంభుఁ డేలనో వానిని వినుచున్నట్లు లేదు. కాని తమవర్తకసంఘమువారిదేయైన "గౌతమి" యనునోడ వారముదినములు కందరద్వీపమున నాగిపోయినదనియు, మరునాఁడు సుధాంబరము చేరుననియు వార్త వచ్చినదని బింబగుప్తుఁడు చెప్పునప్పటికి నాగస్తంభుఁడు పరధ్యానాధీనమై యుండిన మానసమును సావధానమొనరించెను.

"ఆయోడనాయకు నెఱుఁగుదువా?"

ఎఱుఁగనని యర్థము వచ్చునట్లు నాగస్తంభుఁడు తలపంకించెను,

"మరచితిని; నీవు కూమార వర్తకసంఘమున క్రొత్తగ ప్రవేశించితివి కదా? 'గౌతమి'కి నాయకుఁడశ్వనీపుత్రుఁడు. నీవలెనే యాతనికిని దాదాపిరువది యెనిమిదేం డ్లుండును. ఆతనితో చిన్ననాటినుండియు పెరిగిన మాధరి మిగుల రూపవతి. ఆమె యీతనికి ప్రధానము చేయఁబడి చాల కాలమైనను ఏకారణముచేతనో యశ్వనీపుత్రుఁ డింతవఱకు వివాహముమాట తలపెట్టలేదు. ఆరూపవతి యెవ్వరితోడను జోక్యము గలిగించుకొనకుండ నీద్వీపముననే నివసించియున్నది. ఇచ్చటివి శేషములలో నిదిముఖ్యమైనది."

సంధ్యాసమయము సమీపించుచుండగా నాగస్తంభుఁడు బింబగుప్తునితో సుధాంబరపు వీథులగుండ నడచు

చుండెను. త్రోవలో నింటికేగుచున్న మాధరిని వారు కలసికొనిరి. బింబగుప్తుఁడా స్త్రీపురుషుల నొకరికొకరి నెఱుకపరచెను. వారొక యరగడియసేపు సంభాషించిరి కాని యామెమాత్ర మంతగ మాటలాడలేదు. ఈ యర గడియలో నామెతండ్రియు తాతలును నోడల నాయకు లనియు, నామె తల్లిదండ్రులు పరలోకగతులైనప్పు డామె చిన్నబాలికయగుటచే నశ్వినీపుత్రునితల్లి పెంచె ననియు, నాయవ్వ యవసానకాలమున మాధరిని, అశ్వినీ పుత్రునిఁ దనకడకుఁ బిలచి వివాహము గండని చెప్పె ననియు నాగస్తంభుఁడు తెలిసికొనెను.

ఇంతలో మాధరి నివసించినగృహము సమీపించెను. ఆయింటిచుట్టునున్న తోఁటలోని వృక్షాగ్రములు శిరములను పంకించి చల్లటి గాలిని వీచుచుండెను. మాధరి నాగస్తంభునివంక దృష్టి సారించెను. సాంధ్యమందానిల పరిష్వంగమున నాగస్తంభుని యొడలు పులకించెను. సుధాంబరద్వీపము నెట్లు మనఃపూర్తిగ ప్రేమించెనో మాధరినిగూడ నాగస్తంభుఁ డట్లేమనఃపూర్తిగ ప్రేమించెను.

"నేను నివసించు గృహమిదియే. లోనికివచ్చి కూర్చుందురా ?"

"నేను శీఘ్రముగఁ బోవలసిన పనియున్నది. నాగస్తంభుఁడు నీయాతిథ్యము నంగీకరించునని సెలవుగొని బింబగుప్తుఁడు వెడలిపోయెను.

వా రిరువురు గృహద్వారముకడ కరిగిరి.

"తలుపు తెరువఁబోవునపుడెల్ల నా కొకవిధమగు భయము గలుగుచుండును. దయ్యములపై నాయతిథికి నమ్మక మున్నదా?"

"దయ్యములా? లేదు."

మాధరి తలుపు తెరచెను. లోపలనంతటను గాఢాంధకారము నిండియుండెను. "చెకుముకి యెక్కడ పెట్టితినో" యనుమాట లామె భయకంపితమగు స్వనముతో నుచ్చరించెను.

ఇంతలో చెకుముకిని కొట్టి నిప్పుచేసి మాధరిదీపికను వెలిగించెను. ఆదీపకళికాకాంతిలో భయోత్పాతముచే పాలిపోయిన ముఖపద్మముతో, కంపించుచున్న తనూలతతో నామె నిలిచియుండెను.

"మాధరీ, మనమిరువురమును దప్ప నింకెవ్వరు నిక్కడ లేరే; ఏల భయపడెదవు?"

ఆమె యేమియు ప్రత్యుత్తర మిచ్చుస్థితిలో లేకుండెను. "నిజమేకాని___" యనుచు నామె యొక తలుపు తెరచెను. అవతలి గదియందొక పందిలి మంచమును దానిచుట్టు నొక దోమ తెరయుఁ గానవచ్చెను. "ఈగది లోనే నేను పరుండును. రాత్రులం దీ తలుపును తీసి యుంతును. ఇచ్చట నీదీపము బాగుగ వెలుఁగుచునేయుండును. అశ్వినీపుత్రుఁడు నెల కొకసారి యిచ్చటికి వచ్చుచుండును. తక్కినసమయములం దెల్ల పుడును, నిచ్చటికనేక యోజనములదూరముననున్న కంబర ద్వీపముకడనుందును; కాని యప్పుడప్పు డాతఁ డా బల్లను పట్టుకొని తదేక దృష్టితో నావంకఁ జూచుచుండును".

"ఆతనికి వివాహము కాలేదు గదా?"

"లేదు. ఆతఁడు కనఁబడుటతోడనే నేను లేచియాతని సమీపింతును; కాని యాతఁ డెందును కనుపించఁడు."

నాగస్తంభున కేమి యాలోచనతోఁ దినదో కాని యాతఁడు తలపంకించెను. ఆతని నేత్రయుగళమునందు కనికరమును ప్రేమయు వెల్లివిరియుచుండెను.

మాధరి యాతనివంకఁ జూచెను. "నాగొడవలతో నాయతిథి హృదయశాంతికి భంగముగలిగించితిని కాబోలు. నేఁటియుదయముననే తోఁటలోని ద్రాక్షపండ్లరసమును తీసితిని. అది కొంచెము తెత్తునా?"

"వలదు. వలదు. నేనుపోవుటకు వేళయైనది."

"లేదు. ఇప్పు డస్తమానముదాటి యారుగడియలైన కాలేదే."

నాగస్తంభుఁడు మారుమాటాడక ఆసనాసీనుఁ డయ్యెను. ద్రాక్షరసము తెచ్చుటకు మాధరి లోని కరిగినప్పు డాతఁడు దశదిశలకును తనదృష్టిని సారించెను. ఆ గృహమునకు సుఖము దూరమని యాతఁడు గ్రహించెను.

మాధరి ద్రాక్షరసమును గొనితెచ్చెను. ఆమె యతిథి యేనిముసమున వెడలిపోయి తనను భయము వాతఁ బడవేయునో యని యామె తత్తరపడుచుండు టచేఁగాఁబోలు నామె నడకయు, మాటలును, చేఁతలును ఆమనోభావమునే ప్రకటించుచుండెను. తోఁటలోని ద్రాక్షతీగ లొకదానికొకటి యల్లుకొన్నట్లు వారిరువురి దృష్టు లొకదానినొకటి పెనవైచికొనియుండెను.

"మాధరీ, నేను ప్రపంచమున నంతటను తిరిగితిని. కాని దయ్యముల నెచ్చటను చూడలేదు."

"నాఊహాలు—నామనస్సు—"

నాగస్తంభుఁడామెవంక తదేకదృష్టితోఁ జూచుచుండెను.

"అశ్వినీపుత్రా!"

"మాధరీ, వణకిపోయెద వేమి? భయములేదు. ఏమున్నది?"

ఇట్లనుచు నాగస్తంభుఁడామె చేతి నందుకొనెను

ద్వారముకడ నింతవఱకును నిలచిన యొక యాకృతి బల్లకడ కరుదెంచెను.

"అశ్వినీపుత్రా!"

"నేనిప్పుడు వత్తునని, పాపము, మీకు తెలియదు."

ఈమాటలు వినునప్పటికి నాగస్తంభునకు సంశయ విచ్ఛేద మయ్యెను. నిజముగ నశ్వినీపుత్రుఁడే యచ్చట నిలిచెనని యాతఁడు రూఢిచేసికొనెను

అశ్వినీపుత్రుఁడు మొదట నాగస్తంభునివంకఁ జూచెను. తరువాత మాధరివంకఁ జూచెను. పిమ్మట తెరచియున్న పడకటింటివంకఁ జూచెను. ముఖమున నొక వివపు చిరునగవుతో "నేను మీకు దిగ్భ్రమ కలిగించితినా" యనెను.

నాగస్తంభుఁ డించుక చలించెను. ఆచిరునగవున కర్థమేమి?

"తమ నామాక్షరములెవ్వి?"

"నాగస్తంభుఁడు."

అశ్వినీపుత్రుఁడు తనవలెనే కుంకుమరవర్తక సంఘ చిహ్నములుగల వస్త్రములను ధరించిన నాగస్తంభుని వంకఁ జూచెను. అంతటితో నాగస్తంభుఁడు లేచి నిలువఁబడెను. మాధరియు వర్ణవిహీనమగు వదనముతో, చేతనాహీనమగు శరీరముతో నాసనముపై నొకమూట వలె గూర్చుండెను. నాగస్తంభుఁ డాప్రదేశమును విడచి తనయోడకుఁ బోయెను.

నాగస్తంభుఁడు రేవుచేరునప్పటికి 'గౌతమి' రేవులో నుండెను. అశ్వినీపుత్రుని హృదయమునందలి యూహ లిప్పుడు నాగస్తంభునకు ద్యోతకములగుచుండెను. మాధ మతి కనుమానమే యాహారము. ఆతఁడు మాధరి నన్యాయముగ నవకతవక ప్రశ్నలడుగునుగాఁబోలు. ఆమె పాలిపోయిన వదనమా క్రూరుని మనోవీథి నావంతయు కరుణ జనింపఁ జేయఁ జాలదు కాఁబోలు. ఇట్లాలోచించుచు చేయునదిలేక నాగస్తంభుఁడు తనరెండు పిడికిళ్లతోను జుట్టుపీకికొనెను. నోరెత్తుటకిసుమంతయు నశ్వినీపుత్రుఁ డెడమీయ నప్పుడు నాగస్తంభుఁ డేమి చేసియుండఁగలఁడు?

ప్రాతస్సంధ్యాకాలమున నాగస్తంభుఁ డోడదిగి యూరఁ ప్రవేశించి, మాధరీగృహద్వారముకడ నిలిచి యూహాసముద్రములో మునిఁగిపోయెను. కాని ఆతని కెవ్వరును కనఁబడలేదు, ఆతనికేమియు వినఁబడలేదు.

'ఆంధ్రమాత' సుధాంబరమును విడచి సముద్రయాన మారంభించెను. మఱల మూఁడు మాసములవఱకు నాగస్తంభుఁడాద్వీపమునకుఁ బోలేదుకాని యామూఁడు మాసములలో మాధరి యాతని హృదయమున స్థిరనివాస మేర్పరచుకొనెను. ఆమె జీవితము విచారకరముగ పరిణమించినదని యాతఁడు తెలిసికొనెను. సుధాంబరములో నాగస్తంభుఁడు మఱల బింబసుప్తుని కలసికొనెను. 'గౌతమి' మూఁడు దినముల క్రిందట సుధాంబరమును విడచెననియు, అశ్వినీపుత్రుఁడు క్రోధోద్రేకఁ డయ్యెననియు, మాధరి జ్వరబాధ ననుభవించు చున్నదనియు, ఆద్వీపవాసులగు కృష్ణవర్ణు లందరు నాయిల్లు దయ్యముల కొంపయని యం దడుగిడకున్నారనియు బింబసుప్తుఁ డాతనికి తెలిపెను.

"మాధరి కేమాత్రము సుఖము లేదని నాకు తోచు చున్నది."

నాగ స్తంభుఁ డీమాటకుఁ బ్రత్యుత్తర మీయక లేచి నిలచెను.

"నీవెప్పుడైన వయ్యమును చూచితివా?" యని బింబసుప్తుఁ డడిగెను.

"లేదు. నీవో?"

"ఈ వయ్యములకొడవయే మాధరిని మరణము పాలుచేయుచున్న ట్లున్నది."

"ఇప్పు డామె కెవరు సాయముచేయుచున్నారు?"

"మనవర్తకసంఘపు టారోగ్యాధికారి భార్య."

నాగ స్తంభుఁడు మాధరిపడకయొద్ద నాసనాసీనుఁ డయ్యెను. ఆతనికన్ను లామె ముఖమునుండి మఱలలేదు. "మాధరి యొక్కమారు కన్నులు తెరచిన చాలును. నే నామెను ప్రేమించుచున్నానని చెప్పవలెను. ఆమె కిది తెలియకున్న నిఁక నెట్లు?"

ఆమె యుచ్ఛ్వాసనిశ్వాసములతో నామెపైకప్పిన దుప్పటికూడ కదలియతికోమలమై కన్పడుచుండెను. కాని నాగ స్తంభుఁ డీయందచందముల నవలోకించుట లేదు. ఆతని హృదయమున గాఢమగు ప్రేమకుఁ దప్ప మఱొక యూహకుఁ జోటు లేదు.

ఆమె కన్నులు తెరచి నాగ స్తంభుని జూచెను. ఆమె యధరపల్లవముల మందారుణరోచులు మందహాస రోచులలో లీనమై పోయెను. ఆమె దృఙ్మాలికలు నాగ స్తంభునిచూడ్కులతోఁ గలయికఁ జెందెను. ఉత్తరక్షణ మునసే యామెకన్నులు మూఁతలు పడెను. కాని యామె యర్థమును నాగ స్తంభుఁడు గ్రహింపకపోలేదు. మాధరి హృదయపూర్వకముగ తనప్రేమ సామ్రాజ్యమునకు నాగ స్తంభుని పట్టభద్రుదు నొనర్చినది. నాగ స్తంభుఁడు చివాలున వంగి యామెపెదవులను ముద్దిడుకొనెను.

ఇంతవఱకు మఱచిన సంగతులు నాగ స్తంభున కిప్పుడు జ్ఞప్తికి రాఁజొచ్చినవి. అశ్వినీపుత్రునితల్లి యవ సానకాలమున నశ్వినీపుత్రుఁడు చేసిన వాగ్దానమునకు విరుద్ధముగ కందరద్వీపమున బిలవతియను సంకరజాతి స్త్రీతో నాతఁడు కాలముపుచ్చుచున్న సంగతి కొలఁది కాలముక్రిందట నాగ స్తంభునకుఁ దెలియవచ్చెను.

నాగ స్తంభుఁడు మాధరిముఖమువంక నొకసారి దృష్టిమఱలించెను. ఆమెవదనము మందహాససుందరమై యుండెను. నాగ స్తంభుని హృదయమున విద్యుచ్ఛక్తివలె నొక్కయూహ జనించెను.

"మాధరి యిఁకభయపడుటలేదు. దాని హృద యమున ప్రేమకు తప్ప నింకొకటికి చోటు లేదు."

వైద్యుఁ డరుదెంచెను. "రోగి నిద్రించుచున్నది. జ్వరము పోయినది."

'ఆంధ్రమాత' మఱల సుధాంబరమునువిడచి వెడలి పోయెను. నాగ స్తంభుఁ డశ్వినీపుత్రుని దుష్కృత్యములను దలపోసి మాధరి నాతఁడు బలాత్కరించి వివాహ మగునని వగచుచుండెను. ఎట్లున్నను చిన్ననాఁడే యశ్వినీ పుత్రు నకు ప్రధాన మైనందున మాధరిని చూడ నొల్లక సుధాం బరమునకు వచ్చినప్పు డెల్ల తొందరగ నవసరములగు పనులను చక్కబెట్టుకొని నాగ స్తంభుఁను వెడలిపోవు చుండెను. కాని యొకనాఁడు సుధాంబరమున 'కాంధ్ర మాత' వచ్చినప్పు డోడలోని యుద్యోగి యగు వృషభ దత్తుఁడు మాధరిచే తన కీయఁబడిన యొక యుత్తరమును నాగ స్తంభున కిచ్చి యిట్లనెను.

"అశ్వినీపుత్రుని మీరు కలసికొని దీనిని స్వయ ముగ నిండని మాధరియను నామె వేఁడుకొన్నది."

నాగ స్తంభుఁడు దాని నందుకొనెను. దానిపై నశ్వినీపుత్రుని పేరును, 'గౌతమి' పేరును వ్రాయఁబడి యుండెను.

'ఆంధ్రమాత'యు 'గౌతమి'యు నొక రేవునఁ గలిసికొనెను. మాధరి వ్రాసిన యుత్తరమును తీసికొని నాగ స్తంభుఁడు 'గౌతమి' లోని కరిగి యశ్వినీపుత్రుని సమీపించెను.

"నీకు మాధరి వ్రాసిన యొక యుత్తరమును తెచ్చి నాను."

అశ్వినీపుత్రుఁ డుత్తరముకొఱకు చేతులు చాప లేదు. చేతులను వీపువెనుక గట్టిపై చికొని యొకవిధమగు వికృపు చిరునగవుతో నిట్లనెను.

"నాకు బోధపడినది. మీరనుకొన్న పని కవాంతర ములు కల్పింపఁజాలక పోలేదు."

అతికష్టంబులో నాగస్తంభుఁడు కోపము నణచి కొని మఱల యుత్తరము నాతని కీయబోయెను.

"నీవే చదువుకొనుము. నీకొఱకే యిది వ్రాయఁ బడిన"దని యశ్వినీపుత్రుఁడు వికారహాసము చేసెను.

"నీకు మతిభ్రమము గలిగిన ట్లున్నది. నీవన్నమా టకు నీతల పదునాలు చెక్కలు చేసినను పాపము లేదు."

"నీ తల? ఎక్కడ నున్నావో జ్ఞప్తికిఁ దెమ్ము"

నాగస్తంభుఁడు పిడికిలితో నశ్వినీపుత్రుని గడ్డ ముపై నొక్కపోటు పొడిచెను. దానితో నాతఁడు వెనుకకుఁ బడిపోయి యొక యడ్డకొయ్యను పట్టుకొని తూలుచు మసకబారిన కన్నులతో నాగస్తంభుని వంకఁ జూడసాగెను. ఇంతలో సంకరవనితయగు బిలవతి ప్రవేశించి కారణ మేమని యడిగెను. నాగస్తంభుఁ డామెవంకకుఁ జూచి మారుమాటాడక వెడలిపోయెను. ఆతఁడు వెనుకకుఁ దిరిగి, బిలవతి తన రెండుచేతుల నశ్వినీపుత్రుని చంకలక్రిందఁ జొనిపి యాతని లేవనెత్తుటను చూచెను. మూఁడు నాలుగు దినములవఱ కశ్వినీపుత్రుఁడు లేవనే లేదు.

అశ్వినీపుత్రునకు బిలవతికిని గల యన్యోన్య సంబంధమునుగూర్చియు నా సంకరజాతివనిత యెల్లప్పు డోడలో నుండుటను గూర్చియు వర్తకసంఘమువారి కెఱుక పరుపవలెనని వృషభవర్తుఁడు నాగస్తంభునితో ననెను. కాని, యట్లు చేయవద్దని నాగస్తంభుఁ డానవెట్టెను.

"కాని యాతఁడు సంకరజాతివాఁడేమో యని నా యనుమానము."

"నిజముగా?"

"ఆతఁడు పగలెల్ల నల్లమందుమత్తులోఁ బడి యుండును. ఆతఁ డోడనాయకత్వమున కేమాత్రమును దగఁడు."

కూరూరవర్తకసంఘపు టధ్యక్షుఁ డోడలను, రేవుపట్టణములందలి కార్యస్థానములను సంవత్సరమున కొకసారి పరీక్షించవలసియుండెను. ఆపరీక్షార్థమై యే కారణముననో కాని నాగస్తంభుని యోడలోనే పోవ నాతఁడు నిశ్చయించుకొనెను. ఎప్పుడు సుధాంబరము చేరుదుమా యని తొందరపడుచున్న నాగస్తంభున కీవార్త పిడుగై వీనులఁ బడెను. ఈనూతనపరిస్థితులలో 'నాంధ్రమాత'కన్న "గౌతమి"యే సుధాంబరమునకు ముందుగఁ బోవుననుటకు సందియము లేదు. నాగస్తంభుని చిరాకునకు మేర లేదు. తనశక్తిసామర్థ్యములపై నాధారపడుట నేర్చిన నాఁటినుండియు తన్ను రక్షించుమని యే యపరశక్తిని ధ్యానించుట మానెనో యాభగవంతుని నేఁడు నాగస్తంభుఁడు "తండ్రీ, నేను సుధాంబరము చేరువఱకు మాధరిని కాపాడు"మని ప్రార్థించెను.

'ఆంధ్రమాత' రేవునుండి బైటపడునప్పటికి 'గౌతమి' నభస్సముద్ర సంగమస్థానమును దాఁటి మనోవేగముతో వెడలిపోయెను. నాగస్తంభుఁడు ముండ్లపొదపై నున్నట్లుండెను. ఆతనికి మనస్సు మనస్సులో లేదు. అశ్వినీపుత్రుఁడు మాధరిని కలసికొన్నట్లును, యామె తన్ను ద్వేషించుచున్నందున నాయబలను ముద్దుకొన్నట్లును నింక నిట్టిస్వప్నములు రేయుంబవ ళ్లాతని హృదయాగ్నిని రగులుచుచుండెను.

నలువది దినములు గడచినవి. 'ఆంధ్రమాత' బంగాళాఖాతమును దాటి హిందూమహాసముద్రమునఁ బ్రవేశించెను. నాగస్తంభుఁ డిక నోపికపట్టఁజాలకపోయెను. అధ్యక్షునికడ కాతఁడరిగి "త్రోవలో నెక్కడ నాగకకాయొకిని సుధాంబరము చేరుకొందమా ?" యని యడిగెను.

అధ్యక్షుఁ డీ యుపపాదనను నిరాకరించి యింక నాలుగైదుద్వీపముల మీదుగ పోను ద్దేశించితినని తెలి

పెను. నాగ స్తంభుఁ డొక తెచ్చిపెట్టుకొన్న చిరునగవుతో నెడలిపోయెను.

నాఁటి సూర్యాస్తమయానంతర మేడుగడియల కధ్యక్షుఁడు నాగస్తంభుని గలసికొని పై సంభాషణ లోనికి దిగెను.

"సుధాంబరమునకుఁబోవ నాయకుఁడు తొందర పడుచున్నట్లున్నాఁడు. స్వంత వ్యవహారసంబంధములగు కారణము లేవైన నున్నవా?"

అధ్యక్షుఁ డిట్లు మాటలాడుటకుఁ గాగణము నరయక "అవును ఒక కారణమున్న"దని నాగస్తంభుఁడు జవాబిచ్చెను.

"నాయకునకు వివాహమైనదా?... ఎవరితోనైన ... అదియంట్లుండె. సంఘమునే మనస్సున నుంచికొని తన విధ్యుక్తధర్మమును ప్రప్రథమమున నెరవేర్చువాఁడే నాయకుఁడు. ఇంకొక సంగతి చెప్పవలసియున్నది. నాయకునిగూర్చి వారు ఫిర్యాదులు వచ్చియున్నవి."

"ఫిర్యాదులా?"

"అవును. గోప్యముగ చెప్పఁబడిన విషయములను బహిరంగ పరుపఁజాలను. యువతులు రాక్షసులుచేసి నట్లు పురుషుల విధ్యుక్త ధర్మనిర్వహణమున కవాంతరములు కల్పింతురు."

"యువతులా? అధ్యక్షుని యుద్దేశము నాకు బోధపడుటలేదు."

అధ్యక్షుఁడు గొంతు సవరించుకొని నెడలిపోయెను. నాగస్తంభుఁ డచ్చటనే దిగ్భ్రమతో నిలువఁబడెను. అశ్వనీ పుత్రుఁడే యీ యావ గ్రహకును కారకుఁడని యాతని కిప్పుడు తెలియవచ్చెను. మాధరి గతియేమి?... పెక్కు దుఃఖములు వచ్చిన పక్కన నవ్వుచున్న లోకోక్తినిబద్ధిగ నాగస్తంభుఁడు నవ్వుకొనెను.

నాఁటి యర్ధరాత్రమున నాగస్తంభుఁ డోడలోని తన గదిలోఁ గూర్చుండి సముద్రపటమును చూచుచుండెను. అందెబ్బని చుక్కలు లేవులు. "రేపే 'గౌతమి' సుధాంబరము చేరును. ఈలోపుగ తుపానురాగూడదా?"

గదితలుపు మెల్లగ త్రోయఁబడుచుండెను.

"ఎవరు వారు?"

అశ్వినీపుత్రుఁడు ద్వారముకడ నిలచియుండెను. అతని వస్త్రములన్నియు తడిసి, చినిగి, రక్తసిక్తములై యుండెను. నాగస్తంభుఁడు కూర్చున్న చోటనుండి కదలునప్పటి కావ్యక్తి మాయమైపోయెను. కాని తలుపు మాత్రము తెరువఁబడియేయుండెను. ఆతని హృదయము జల్లుమనెను. తన యూహా జనితమైన స్వప్నమేకాని నిజమగు వ్యక్తిదర్శనము కాదని నాగస్తంభుఁడు దృఢమనస్కుఁ డగుటకుఁ బ్రయత్నించెను. కాని యది నిజమగు వ్యక్తి దర్శనమే యని హృదంతరాళమునుండి యొకధ్వని యాతని శ్రవణములందు మారు మ్రోగుచునే యుండెను. తదేకదృష్టితో నాగస్తంభుఁడు ద్వారము వంకనే చూచుచుండెను. మఱల నశ్వినీపుత్రుఁ డాద్వారముచెంత నిలచి యుండెను.

"నీకేమి కావలయును?"

అశ్వినీపుత్రుఁడు మారు పలుక లేదు. కాని యేదో సంగతి విశదీకరింప నిశ్చయించినట్లు నాగస్తంభునకుఁ దోఁచెను. అశ్వినీపుత్రుఁడు పెదవులు తెరచెను. ఆతఁడు నిలచిన ప్రదేశమున నొక నీటిమడు గయ్యెను. ఇంతలో నాతఁడు మాయమయ్యెను.

నాగస్తంభుఁ డొకసేవకుని బిలచి క్రిందినీటిని తుడువు మని చెప్పెను. క్రింద చూచునప్పటికి నాగస్తంభునకు నీ రగుపడలేదు. సేవకుఁడు తిరిగివచ్చినప్పుడు, "నేనే నీటిని తుడిచితిని. నీవు పొ"మ్మని సేవకు నాతఁడు పంపివైచెను. ఆమడు గేమైనది?

తెల్లవారి ప్రొద్దుగ్రుంకినది. ఆపగటికాలమున నాగస్తంభుఁ డీయుదంతమును మఱచిపోవుటకు విశ్వప్రయత్న మొనరించెను.

అర్ధరాత్రి గడచి మూఁడుగడియ లగుసరికి నాగస్తంభుని గదితలుపు తెరువఁబడెను. ముందువలె నేదో చెప్పఁదలఁచిన ట్లశ్వినీపుత్రుఁడు ద్వారముకడ నిలచియుండెను.

"నీకేమి కావలసివచ్చితి"వని నాగస్తంభుఁడు ప్రశ్నించెను.

నిజముగ నశ్వినీపుత్రుఁడే యచ్చట నిలచెననియు, దయ్యము గాదనియు నాగస్తంభుఁడు నిశ్చయించెను. అశ్వినీపుత్రుఁ డొక్కయడుగు ముందునకు వైచెను. సముద్రపటము నందుకొనుటకు చేయిచాచెను. కాని నాగస్తంభుఁ డాతని స్పృశింపఁబోవ నాతఁ డదృశ్యుఁ డయ్యెను. ఓడలో నన్నిమూలల దీపములు వెలుఁగుచుండెను. అశ్వినీపుత్రుఁ డెక్కడ?"

నాగస్తంభుఁడు వృషభదత్తునికొఱకు కబురంపెను. ఆతనితో సంగతుల నన్నిటిని చెప్పెను. ఆయుద్యోగి ముఖము నాగస్తంభుని శత్రువులపై కోపముచే నెఱ్ఱబారెను.

"ఇట్టివి జరుగుచుండుట యసాధారణము గాదు. దుర్మార్గులగు పిరికిపందలు తమశత్రువులపై నిట్లే పగ తీర్చుకొందురు."

"'గౌతమి' యీపాటికి సుధాంబరము చేరియే యుండును...?"

"బహుశః చేరియుండదనుకొందును. అశ్వినీపుత్రుని యొడలంతయు నీటితోను, రక్తముతోను తడిసి యుండెను కదా! గౌతమి కేమైన ముప్పు వాటిల్లిన దేమో!"

నాగస్తంభుఁడు ద్వారమువంకఁ జూచెను. తలుపు తెరువఁబడెను. దీపకళిక కాంతిలో నశ్వినీపుత్రుని శరీరము మాడువలె నగుపడెను. ఆతఁ డించుమించుగ వస్త్రహీనుఁడై యుండెను. ఆతనిజుట్టు జడలుకట్టుకొని యుండెను సలిలధార లాజుట్టులోనుండి ముఖముమీఁదికిని, చెక్కిళ్లమీదికిని, భుజములమీదికిని జారుచుండెను. ఆతఁ డేమియు మాటలాడలేదు.

"సముద్రపటము కావలెను కాఁబోలు, ఏదీ?"

ఇంతలో నడుగుల చప్పుడు వినఁబడెను. ఆవ్యక్తి చిటుకలో మటుమాయమయ్యెను.

సేవకుఁడు మామిడిపండ్లను దెచ్చి నాగస్తంభుని ముందుంచెను.

"ఆయన యెవరో క్రొత్తమనుష్యుఁడు మీ కీపండ్ల నిమ్మని పంపినాఁడు."

"ఆయన యెవరు?"

"కాలఁదిగ వస్త్రములను ధరించి జడలుకట్టిన జుట్టులోనుండి కాఱుచున్న నీటిని తుడిచికొనుచు నచ్చట నిలచిన పురుషుఁడు."

"ఈ నిశిరాత్రివేళ నీ కేమియు పని లేదా? పోయి పరుండుము."

సేవకుఁ డసంతృప్తితో వెడలిపోయెను.

ఉషఃకాలమున నొక పెద్దతుపాను సముద్రము నల్లకల్లోలము గావించుచుండెను తెల్లవారిన రెండు గడియలకాతుపా నెటువచ్చిన దటు సమసిపోయెను. కాని జీమూతమాలిక లభ్రపథమున నింకను వ్రేలాడుచునే యుండెను. హిందూ మహాసముద్రతోయములు శాంతములై యచంచలములై యుండెను.

ఉదయమున నైదుగడియ లయ్యెను. వృషభదత్తుఁడు నాగస్తంభుని గదిలోని కరుదెంచి కూర్చుండెను. నిముసములో నాతనిముఖము వెలవెల బోయెను. "తలుపు"–

అశ్వినీపుత్రుఁ డీసారి గదిలోనికి నడచివచ్చెను. ఆతనిదేహ మిప్పుడు తడిగను, రక్తమయముగను లేదు. ఆతఁడు నిలచిన ప్రదేశమున నీటిమడుగు కాలేదు. కాని యాతఁడు చూచుట కసహ్యుఁడుగ, జ్వర పీడితునివలె నుండెను. ఆతఁడుసముద్రపటమునంకకు చేతులు చాచెను. వృషభదత్తుఁడు దిటవుచెడి లేచునప్పటి కశ్వినీపుత్రుఁ డదృశ్యుఁ డయ్యెను.

నాగస్తంభుఁడు సముద్రపటమువంకకుఁజూచెను. ఆపటమున సముద్రమధ్యమున నొకక్రొత్త యెఱ్ఱనిచుక్క యుండెను. "ఇదెక్కడినుండి వచ్చినది?"

"గౌతమి యీప్రదేశమున మునిగి యుండునా?"

ఆ యెఱ్ఱచుక్క వృషభదత్తుని వేలికి తగిలెను.

"తడిగానున్నదా?"

"ఇది రక్తబిందువు."

అధ్యక్షుఁడు మధ్యాహ్ననిద్రానంతరమున లేచెను. తామ్రద్వీపముకడ నుండవలసిన యోడ మహాసముద్ర మధ్యమమున నుండుటఁజూచి కారణమేమని నాగ స్తంభు నడిగెను.

“‘గౌతమి’ కేదో విపత్తు సంభవించినది.”

“మహాసముద్రమునంతను వెదకింప నాయకుని తలంపు కాబోలు! ‘గౌతమి’ కేకీడును గలుగదు. అశ్వినీ పుత్రుఁ డితరులవలె పిచ్చినమ్మకములతో ప్రొద్దుపుచ్చు మందబుద్ధికాఁడు.”

నాగ స్తంభుఁడు కోపప్రకంపిత గాత్రుఁడయ్యెను.

“ఈ యోడకు నేనధికారిని. ఇతరుల కింద జోక్యములేదు.”

“ఓడనాయకులను కారాగార బద్ధులను చేయఁ గలను.”

“ప్రయత్నించవచ్చును.”

అధ్యక్షుని మాటవిని నాగ స్తంభుని బంధించువాఁ డెవ్వఁడు ‘నాంధ్రమాత’యం దగుపడలేదు. అధ్యక్షుఁడు లజ్జావనత వదనుఁడయ్యెను.

పటమున నెత్తుటిచుక్క కనఁబడిన ప్రదేశమున సముద్రతరంగములపై నొకపడవయూఁగులాడుచుండెను. ‘ఆంధ్రమాత’ యాపడవను సమీపించెను. అం దిరువురు సేవకులును, రోగపీడితుఁడైన యశ్వినీపుత్రుఁడును బిల వతియు జీవములతో నుండిరి. అశ్వినీపుత్రునిలోనికిఁ గొంపోయి పరుండఁ బెట్టిరి. ‘గౌతమి’లో నగ్ని పుట్టుటచే నాయోడ మునిఁగెనని బిలవతి చెప్పెను.

అధ్యక్షుఁడు నాగ స్తంభునిదిక్కు మొగ మయ్యెను. “ఇదంతయు నాయకున కెట్లు తెలిసినది?”

“కొన్ని సంగతులు తెలియకనే తెలియుచుండును. వానిలో నిది యొకటి.”

బిలవతి సంభాషణ నందుకొనెను. “ఇంతకం బె చిత్రములైన విషయములే జరిగినవి”

“అనగా?”

మంత్రగాని ముఖము చూచిన నెట్టియేవగింపు గలుగునో బిలవతిముఖముచూచిన నట్టియేవగింపే కలుగుట లో నాశ్చర్యము లేదు. చేతినశ్వినీ పుత్రుని వంకకుఁ జూపుచు “ఆనాయకునడుగుఁ”డని యామె పలికెను.

అశ్వినీపుత్రుఁ డేకాంతముగ నాగ స్తంభునితో మాటలాడ గోరిన ట్లతిబలహీనమగు స్వనముతో తెలియఁ బరచెను. ఇతరులు వెడలిపోయిరి. అశ్వినీపుత్రుఁ డొక వికృతహాస మొనర్చుచు స్మృతితప్పిపోయెను.

నాగ స్తంభుఁ డప్పటనే నిలచెను. ఆతని మనస్స నం దిప్పుడొక క్రొత్త యాలోచన యంకురించెను. “బిల వతియే యశ్వినీపుత్రునిపై ప్రేమచే నాతని జీవింపజేసి నది. ఎటులైన మిత్రభేదము గలిగించినచో నశ్వినీ పుత్రుఁడు మరణించుటయేకాక నామీదికిని మాధరిమీ దికిని దాడికివచ్చుచున్న యాకృతులు సంహారమగును.”

నాగ స్తంభుఁడు బిలవతి మున్నగువా రున్నచోటి కేగెను. “ఇఁక గొన్ని దినములలో సుధాంబరము చేరుదు ముగదా? నీవేమి చేయుదువు?”

“ఏమో, నాకు తెలియదు. అశ్వినీ పుత్రునకుఁ దెలియును.”

“నీకును ఆతనికి సంబంధమేమి?”

“నన్ను విడచి యశ్వినీ పుత్రుఁ డెచ్చటికి పోఁ గలఁడు?”

“ఆతని యింటికిఁగూడ పోఁజాలడా? అచ్చట నశ్వినీపుత్రునింట నాతనికి ప్రధానమైన మాధరియున్నది. ఆతఁ డామెను చాలమారులు చూచుట నీకెఱుక లేదా? నీవచ్చుటకుఁబోయిన నామె యూరకుండునా?”

బిలవతిముఖమున కోపచిహ్నములు బయలుదేరె ను. “ఎంతదురాత్ముఁడు! ఎంతటిమోసగాఁడు!” అనుచు బిలవతి యచ్చోటు వాసెను. ఒక విగడియ నేపాగి నాగ స్తంభుఁ డామెను వెంబడించెను.

అశ్వినీపుత్రుఁడు కన్నులు తెరచికొనియుండెను. బిలవతిని చూచుటతోడనే యాతని నేత్రగోళములం

నీ యశశ్చంద్రికల నెఱి నింపినావు
విశ్వరూపంబుఁ జూపుచు విశ్వమెల్ల
నేఁచుచున్నావు నేఁడు మఱింత రేఁగి
యన్నదమ్ములలో భేద మావహిల్లఁ
బాడియే వారి నిడుముల పాలుసేయ.

లలి నయస్కాంత మినుమును లాఁగుకరణి
నరులనెల్లను వేగ నీ దరికి లాఁగి
కమిచి వెన్నెల సంద్రముఁ గలఁచు రీతి
నొక్కచోఁ గలఁచెదు మన ముక్కు మీఱి
మలయ పవన శరచ్చంద్రములను బోలి
కొన్నివేళల నలరింతు కూర్మిమీఱ
నెండ సూర్యోపలమ్ము మండించు భాతి
నొక్కచో మార్తు స్వాంతము నక్కజముగ

* * * *

పర్వ సమ్మోహనాస్త్రంబు భాతి నైంద్ర
జాలికునిరీతి విశ్వమ్ము జాలిమాలి
యవశముగఁ జేయ నిదమిత్థ మని నిజంబు
నిర్ణయింపంగ నేరక నీతిమాలి
భారతీమైకమత్యమ్ము పాడగుటకుఁ
బరులు తమపైని దండెత్తి వచ్చుటకును
జక్రవర్తి సమూహమ్ము చచ్చుటకును
నీవ కారణమని యంద్రు కోవిదులును

* * * *

దేశములనెల్లఁ ద్రిమ్మరి దీక్షపూని
నీదు నైజంపు నాకృతి నిఖిలలోక
హర్ష సంధానశక్తి నహార్య వైభ
వమ్ము వేసమ్ము మహిమమ్ము నమ్మఁ దెల్పి
భారతీయుల కవ్యాజభక్తిఁ గల్గఁ
జేయు నీపుత్త్రకులు దివి చేరినారు;
నిన్నుఁదెల్పెడి ధర్మనిర్ణేత లకట!
దివిని జేరుటఁ దత్సముల్ భువిని లేమి
తగినవారలు ధనకాంక్షఁ దవిలి తమదు
కృత్యము మఱచి కరము కుక్షింభరులయి
కాలమంతయు సుఖముగాఁ గడుపుచుంట
నీకు మా కిట్టి దుర్దశ నేఁడుగల్గె.

* * * *

కాల పరిణామవశమునఁ గల్గి రకట
మతమనఁగ నేమొ యెఱుఁగని మానవులును
మతము గితము లేదిది వట్టి మాయ యంచు
మతమున నసహ్యాపడి మందు మాన్యమతులు
మనమతము బాగులే దన్య మతము కరము
జనుల కుపయోగకరమని చాటువారు
నైహికసుఖంబె శాశ్వత మనెడివారు
గురుల మించిన శిష్యులు కోట్లకొలఁది.

వేదవేదాంతవర్ణిత విమలరూప!
తమదు కృత్యము మఱచిన యమలమతులు
నీ వనఁగ నెట్టిదానవో యెఱుఁగనట్టి
యజ్ఞులే నిన్నుఁ దెల్పుదు రది యశక్య
ముట్టికెగురంగ లేనమ్మ యూర్ధ్వలోక
మునకు నె ట్లెగురంగఁజాలును? స్థిరముగ
నింక లోకమ్మునం దకలంకగౌర
వమ్ము నార్యులచే నందు వాంఛ నీకుఁ
గల్గె నేనింక నినుఁదెల్పఁ గల్గు సుతుల
నీదు కలరూ పెఱింగిన నిపుణమతుల
మతము ధర్మము నెలకొల్ప మహి నొసర్పు
మఱియు వీడుము నీదగు మాయరూపు.

* * * *

కలిబలంబున గంగను గలిసినట్టి
కర్మధర్మజాతంబును గాచి యతుల
తత్త్వవిజ్ఞానధనమును దయ నొసంగి
ప్రజలదేశంబు రక్షింపుఁ భవ్యరూప!

# బాల

పూడిపెద్ది వెంకటరమణయ్యా గారు (కవితాసమితి)

కామాక్షిని అందకత్తెలలో మొదటిదానిని గా లెక్కపెట్టవలసిన దేను. అందులోనూ నూత్నయౌవనమేమో, నవ్వినప్పుడామె ముఖం మూడువంతులు విడ్డ మల్లెపువులా గుంటుంది. బరువుబరువుగా మడతలు తూగి పాదాలమీద నటిస్తూన్న పట్టుచీరతో, చివురుమీద నీటిబొట్టులాగా మెఱ్ఱిన వ్రేలిని వజ్రపుపోడి ఉంగరంతో, వదులుగా వ్రేలి వెనుకనుండి చెక్కిళ్లిటూ అటూ ముద్దు పెట్టుకుంటూన్న జడలోని మల్లెదండతో, పిరుదులు చుట్టివచ్చిన పయ్యెదచెరగులోని జాల్తాఱులో ఉయ్యాలా ఊగుతూందా అన్నట్టు ఆచిన్నినడుంమీద తూగుతూన్న ఆ శరీర భారం మోస్తూన్న నడకతో కామాక్షి సుందరమ్మ దగ్గరకువచ్చి కూర్చుంది. విడుతూన్న పువ్వు ప్రక్కనున్న ఫలవంతమై వాడిపోయిన పువ్వులాగు కామాక్షి ప్రక్కను సుందరమ్మ కనబడుతూంది. సుందరమ్మ అరవై యేళ్ల పెద్ద. ఆరితేరిన నాయిక. సంసార వ్యాపారాలలో గురుత్వం వహించి కామాక్షిని తీర్చి దిద్దేది. అలా ఒయ్యారంగా తన్ను చేర వచ్చిన మనుమరాలిని చూచి సుందరమ్మ తనలో "గర్వం త్రోవలో గతకలు లావు. నూత్న ప్రణయగర్వం అద్దంలో నీడలాగు కామాక్షి ముఖంమీద యెలా ప్రతిఫలిస్తూందో! అప్పుడే యీామె ప్రణయం తారాజువ్వలాగు అంతరిక్షాన్న మెగురుతూందే! ఇంకా క్రొత్తకాదూ! నాచిన్నతనంలో ఇలాగు నేనెగిరి పడ్డపాట్లెన్నో వున్నాయి; అవి ఒకొక్కటే కామాక్షికి చెప్పాలి." అనుకొని క్రీగంటను కామాక్షిని చూచి నవ్వుతూ "ఏం మనుమరాలా! యీ వుదయం మహా వికాసంగా కనబడుతున్నావే? మా మనుమడేమేనా నూత్నాలంకారాలు తెచ్చేడా యేమిటి?"అన్నాది సుందరమ్మ. అవ్వ అలా అడగగానే కామాక్షి ముఖం యెఱ్ఱపడ్డాది. కొంచెం వణుకుతూన్న కంఠస్వరంతో "అవ్వా! నీకు వలె



"విడుతూన్న పువ్వుప్రక్కనున్న.........సుందరమ్మ కనబడుతూంది"

నాకుకూడా మంచి పురుషుడే లభించినట్టు నీతో చెప్పడానికి వచ్చేను. నువ్వు చెప్పినట్టు పురుషుడే స్త్రీకి వివిధాలంకారాలున్నూ, అందులోనూ నా కథానాయకుడు నీ నాయకుడు లాగు కాక, మంచి రూపసి సుమా! అవ్వా!" కామాక్షి అలా అనగానే సుందరమ్మ త్రుళ్ళి పడ్డది. "ఏమన్నావు? కామా?" అని గద్దించి కామాక్షి నడిగింది. "మాతాతను నాకు తెలియకలా అన్నాను. అయితే అవ్వా! అత డందగాడేనా?" అని కామాక్షి ప్రశ్నించింది. సుందరమ్మ ఆ ప్రశ్నవిని కళ్లు విశాలంగా విప్పి కామాక్షిని చూస్తూ "అమ్మకచెల్ల! వాని వికచాంబకముల్ శతపత్ర జైత్రముల్!" చారెడేసి కన్నే కామా! మన్నెదొరలాగాయన యెక్కడుంటే అక్కడల్లా వెలుగేనే! ఆజానుబాహువే! కమ్మచ్చున దీసిన ట్టాశరీరసౌందర్యం అంతా తీర్చి ఉండేది! అలా అని మార్దవానికి లోపం లేదుసుమా! ఆ విశాలవక్షంమీద నే నిలా తల వాల్చేసరికి నా ప్రాణాలన్నీ నాముఖం అనే పడవలో యెక్కడకో ప్రయాణం చేస్తూన్నట్టుండేది నాకు! ఆవక్షం పాలసముద్రంలా గిలా మిలమిల లాడిపోయేది. ఆతని వెచ్చని యూర్పులు నాకన్ను తెరచాపలను ఇలా ఇట్టే ముందుకు వంచేసరికి నా మొగం పడవలో నా ప్రాణాలయిదూ ఒక్కటయిపోయిన ట్టనిపించేది. అ దెక్కడదీ! ఆ లాలిత్యానికీ యిప్పటివాళ్ల లాలిత్యాలకీ యెంతో భేదం వుంది. నేను గాలికౌగిటిలో నలిగిన మొగ్గలాగు మీతాతగారి కౌగిటిలో క్రొత్త శోభను పొందేదాన్ని" అనే సరికి కామాక్షి నవ్వుకుంటూ "కావచ్చును గాని, అవ్వా! నాగరికత అంటే యేమిటో యెరుగని ఆ రోజుల్లో మా తాత కంత సున్నితం యెలా వచ్చింది? నీవంటే ఆడుదానివి, ఆ మీద కావ్యాలూ గట్రా చదువుకున్నావు కాబట్టి యే వరూధిని లాగో తైతక్కలాడేదాన వనుకుందాం. కాని మాతాత మాటేమిటి? ఇప్పటి లాలిత్యం ఇప్పటి సున్నితం, ఇప్పటివిలాసాలూ ఆరోజుల్లో యెలావచ్చేయి?" అన్నది. "లాలిత్య విషయంలో మీ తాతనుమించిన చేయి లేదనుకుంటాను. ఒకనాడు నా కాయన మనుచరిత్రం పాఠం చెబుతున్నారు. "వదనప్రభూతలావణ్యాంబుసంభూత" అనేపద్యం ఆయన ధన్యాసీ రాగంతో చదివేసరికి అప్పటి ఆయనముఖవిలాసం చూచి నిలువు నీరయిపోయేను. అప్పు డాయన మూర్తీభవించిన పెద్దన్న పద్యంలాగే కనబడ్డారు! చెప్పకేమి? ఆకాస్తసేపయినా వరూధినిలాగు నేను దూరంగా నిలబడలేక పోయినాను సుమా! కామా! అయితే అందులో ఒకరహస్యం వుంది చెప్తాను విను. ప్రణయవిషయంలో మగవాడిమాట అటుండనీ. ఆడుదిగానీ ఒకతీక్ష్ణమైన చూపు వాడిమీద ప్రసరించిందా అంటే దానితో వాడు చెల్లాచెదరై పోవలిసిందేను. దానిచూపులో యేదో వుం దనుకుంటాడు. ఆ చూపట్టే త్రాగేస్తామంటాడు. అందులో యేదో లాలిత్యం ఉం దనుకుంటాడు. మైమరచి పోతాడు.

వాడల్పసంతోషే. కామా! ఆడుదుండే, పురుషుని కౌగిటిలో విరహవేదన నటిస్తుంది. అనురాగంలో అనుమానం కలిపేస్తుంది. స్వర్గసుఖంలో అసంతుష్టి ప్రకటిస్తుంది. మల్లె పువ్వు వాసనలో మంటలు చూస్తుంది. కోకిల పాటలో కోలవర్షం కురుస్తూం దంటుంది. పురుషు డెంత మంచివాడయినా సరే ఆడుదానికిమాత్రం యేదో అనుమానం కొట్లాడుతూ వుంటుంది. ఈ సందర్భంలో నాకో చిన్నకథ జ్ఞాపకం వచ్చింది చెప్తాను విను.

నేను క్రొత్తగా కాపురానికివెళ్లిన రోజులవి. మీ తాతగారి నాయనమ్మ యింట్లో మాకు సంరక్షణ కుండేది. నాకు అత్తగారి బాధలేదు. ఓ! నేనారోజుల్లో యెలావుండేదా న్ననుకున్నావు! కామా!నన్ను చూడడానికి రెండుకళ్లు చాల వనేవారు మీ తాతగారు. నేనూ అలాగే వుండేదాన్ని. ఒకనాడు తారనై తక్కులూ తార్లూ చూపించేదాన్ని. ఒకనాడు యామినీపూర్ణతిలకనై ప్రణయ వ్యాసాలు రచించేదాన్ని. ఒకనాడు సుభద్రనై శుశ్రూషల్లో మునిగిపోయేదాన్ని. ఒకనాడు హైమవతినై తపస్సు నటించేదాన్ని. ఇంకొకనాడు వరూథినినై వలపు ద్రిమ్మరించేదాన్ని.నా వేషాలకు హద్దుండేదికాదు.మీతాతగారు మాత్రం యెప్పుడూ ఒకలాగే వుండేవారు. ఆయన వలపులోతు యెప్పుడూ ఒక్కలాగే వుండేది. ఒరదీసిన కత్తిలాగు నా వలపిలా మిలమిలలాడుతూ వుండేది.

ఇలాటి సమయంలో ఒకమాటు మంచి తమాషా అయింది. అది తలుచుకుంటే నాకే నవ్వువస్తూందే కామా! ఆకథ నీకుపాఠంలాగ వుంటుంది చెప్తాను విను.

ఆనాడు పౌర్ణమి. తెల్లవారుజామున నాలుగుగంటల వేళయింది కాబోలు. పెరటి వెనుక కాపురమున్న మంగలివెంక డప్పుడే లేచి సన్నాయి పాడుతున్నాడు.రాగం చెవిలో చల్లగా పడుతూంది. నాకు న్రిద బాగానే తెలివివచ్చింది గాని పాట వింటూ అలా కళ్లు మూసుకు నే పడు కు న్నా ను. వాడు పాడుతూన్న రాగం చక్రవాకమో, నాదనామక్రియో తెలిసింది కాదు. ఆరాగ మేదో పోల్చుకోడానికి కొంత సేపు తంటాలు పడ్డాను గాని నాకేమీ అందింది కాదు. మీతాతగారు సంగీతవిద్వాంసుడు సుమా! ఆయన పాడితే యిలా కిన్నెరలుమ్రోగేవి! కామా! సంగీతశాస్త్రం కూడా చాలా బాగా చదువుకున్నారే. నా కిప్పు డున్న యీ సంగీత జ్ఞానం ఆయన ప్రసాదమే. కొన్నాళ్లు నా కన్నిరాగాలూ ఒక్కలాగే వినిపించేవి. తెల్లవాళ్ల మొగాలలాగు పోలిక తెలిసేది కాదు. అప్పు డప్పుడే రాగాలు పోలిక పట్టడానికి ప్రయత్నం చేస్తున్నాను. అందుచేత అలా కళ్లు మూసుకునే 'అదేరాగమండీ?'అన్నాను. ఇంకా న్రిదలో వున్నారు గాబోలు జబాబు లేదని కళ్లువిప్పేను. కిటికీలోనుండి వెన్నెల మంచంమీద పడుతూంది. ఆవెన్నెలలో మీ తాతగారి విగ్రహం కనబడలేదు. పరుపు

మీద దుప్పటీ,ఆయనకట్టుకున్న పంచ, ఆమీద ఆయన శరీరచ్ఛాయ, ఇవన్నీ వెన్నెలలో కలిసిపోయా యనుకొని కళ్లు విశాలంగా విప్పి చూసేను. ఆయన నాకు కనబడలేదు. ఒక్క-సారి నాకు ఒళ్లంతా జల్లుమన్నాది. ఇంకా అనుమానం తీరక మంచమంతా తడిమి చూచేను. ఆయనలేరు! ఎక్కడికి వెళ్లేరా అని అటూ యిటూ చూసేను. తలుపు తీసుకుని యివతలకువచ్చి చూసేను. వీధితలుపు గడియతీసి తలుపుదగ్గరా చేరవెట్టివుంది. అది చూడగానే నాకు కొండశిఖరంనుండి క్రిందపడ్డట్టనిపించింది. కాళ్లలోనుండీ వణుకువచ్చింది. ఒళ్లంతా చిటచిటా మండింది. అంతలో అప్రయత్నంగా కళ్లనుండి నీళ్లు జలజలా రాలేయి. నిశ్చేష్టనై అలా నిలబడిపోయాను. చేయూతకు గడ్డిపోచయినాలేక పెద్ద జలప్రవాహంలో కొట్టుకొనిపోతూ న్న ట్టనిపించింది. మీతాతగా రెప్పుడూ అలాటి సమయంలో యిల్లు కదలడం మామూలు లేదు. పున్నమ రేయి! పండువెన్నెల! తెల్లవారుజాము! నవ యౌవనంలో వున్న అందగాడు! ఒంటిగా అలాటి సమయంలో కంట పడ్డట్టయినా యే ఆడుది ముఖం పెడపెట్టుకుంటుందనుకున్నాను. నాహృదయం కరగబోసి ప్రణయ ముద్రలో అచ్చుపోసుకున్న నా మన్మథ విగ్రహం అలా అందరి చూపుల్లోనూ, చేతుల్లోనూ నలిగి పోతే నేను చూడగలనా? ఇలాటి ఆలోచనలన్నీ నామనస్సులో సంచరించేసరికి కామా! ఇక నాకు శరీరంపయిని స్పృహ తప్పిపోయింది.

తెల్లవారింది. అరుణోదయ ప్రభలు క్రమంగా వెలవెల బారుతున్నాయి. నేను కూడా తెలివితెచ్చుకుని తెల్లబోయేను. చప్పున గదిలోకి వెళ్లి నిలువుటద్దం దగ్గర నిలబడ్డాను. చెదరివున్న నా ముంగురులలో నా ముఖం మాయమయిపోతే బాగుండు ననిపించింది. నా నీడమీద నాకు మితిలేని జాలికలిగింది. కన్నీటి ధారలతో పైటచెరగంతా తడిసి పోయింది. తిరిగి పైకివచ్చి నిలబడ్డాను. ఆ ఉదయ మంద మారుతాలలో విషజ్వాల లెగిసేయి. నానిట్టూర్పులలో నిప్పుకణా లెగిరేయి. కళ్లనుండి క్రాగుతూన్న జలధారలు కారేయి. అలా యేడ్చి



"అలా యేడ్చియేడ్చి కన్నులు విప్పేసరికి యెదుట మీ తాతగారు నిలబడ్డారు"

యేడ్చి కన్నులు విప్పేసరికి యెదుట మీతాతగారు నిలబడ్డారు.ఆపెదవిమీద మెగురుతూన్న

చిఱునవ్వు రేఖ నాహృదయాన్ని శూలంలాగు తాకింది. నేను చూడలేక తల వంచుకున్నాను. నీదేవూరని మైనా అడగకుండా మీతాతగారు పడకగదిలోకి వెళ్లి శాలూ చిలుక్కొయ్యను తగిలించి పైకి వచ్చేరు. అప్పుడే ప్రాతస్నానం చేసేరు. క్రొత్తగ కనుబొమలనడుమ కుంకుమ రేఖ ఒకటి పెట్టుకున్నారు. ఆ రేఖ ఆడుదాని వ్రేలితో తీర్చి దిద్దినట్టు మహాఅందంగా కని పించింది. ఆ కుంకుమరేఖాకాంతులలో నేను మరింత వాడిపోయేను. మీతాతగారు మూడో కన్ను తెరుస్తున్నా రనుకున్నాను. నన్నూ, నాముఖవిలాసాలూ ఆయన అట్టే మెగా దిగా చూచి చిన్ననవ్వు నవ్వుకొని వెళ్లి వీథిఅరుగు మీద కూర్చున్నారు. తిరిగీ నా ఒంటరితనం నన్ను బాధించడం మొదలుపెట్టింది. ఆయన నామెదుట నిలబడితే మహాసముద్రంలో పడ్డ ట్టయింది. ఆయన నామెదుట లేకపోతే పెను చీకటిలో పడ్డట్టయింది.

ఆ ఒకరోజునే కాదు. ఇలా ప్రతిరోజూ నాతో చెప్పకుండా యే రెండుజాముల రాత్రి దాటేకో వీథిలోకి వెళ్లిపోయేవారు. మీతాత గారు. ఇంట్లో వున్నప్పు డయినా మనసు విప్పి మాటలాడనైనా మాటలాడేవారు కారు. నాకు క్రమక్రమంగా బెంగ లావయిపోయి కర్పూరంముక్కలాగు చిక్కిపోయేను. నేను కూడా మీతాతగారితో కలివిడిగా మాట లాడడం మానేశాను. జ్ఞానంలేకుండా గృహ కృత్యాలు నిర్వహించుకుంటూ మూగదాన్నై పెదవి కదపకుండా అంటీ అంటనట్టు ఆయన పరిచర్య చేసుకుంటూ అలా కొన్నాళ్లు మసలే సరికి నేను వేదాంతినిగా మారిపోయిన ట్టని పించింది. స్వర్గంగాని నరకంగాని వ్యక్తి చెప్పు చేతలలోనే వుంది సుమా కామా!

ఇంతలో దసరా వచ్చింది. మామూలుగా నన్ను పంపమని మావాళ్లు కబురు పంపేరు. మీతాతగారు "పండుగకు మీవాళ్లింటికి వెళ తావా?" అని నన్నడిగేరు. నాకుకూడా జీవన విధానంమీద విసుగుపుట్టింది. కొద్దిరోజులయి నా తల్లిచాటున కొంత సేద దేరుదా మనుకొని వెళ్లడాని కొప్పుకొన్నాను. మీభోజనంమాట యేమిటనేనా అడక్కుండా బయల్దేరేను. పుట్టి నింటికి వెళ్లేను. బండీలోకూర్చున్నది మొదలు నాకళ్ల మెదుట జారుజారుశాలూ వల్లెవాటుతో చిరునవ్వు మొగంతోమీతాతగారూ, ఆయన సమీపానో, సందిటిలోనో నవ్వుతూన్న ఒక స్త్రీవ్యక్తి తాండవం ఆడుతూ వుండేవారు. ఆయననుండి దూరమైనకొలదీ నాకు వ్యథ లావయిపోయింది. ఏలాగో దసరా యేడు రోజులు గడిపేను. విను కామా! ఈకథ తమా షా అంతా యిక్కడే వుంది. తలుచుకుంటే నాకు నవ్వు వస్తూంది.

ఆవేళ విజయదశమి. ఉదయాన్న లేచి న దగ్గరనుంచీ మీతాతగారూ ఆ స్త్రీవ్యక్తి తప్ప నాకు మరేమీ కనబడలేదు. ఆ విగ్ర హాలు నాకు కనబడ్డప్పుడల్లా నాకళ్లనుండి నిప్పులు రాలేవి. ఇంతలో నాకుకొంచెం జ్ఞానో దయం అయింది. నేనిలా యేల బాధపడాలి?

ఆయనను తన ప్రవర్తనకు తగిన సమాధానం చెప్పండని యేల ఆయనను మొల కొంగులో చెయ్యివేసి నిలబెట్టకూడదూ?

నాకీ భయం యెందుకూ? ఆయనను ఇలాటి సమయంలో విడిచివుండడం ఆయన యీ అవక తవక ప్రవర్తనకు చేయూత యివ్వడం అవుతుంది. నేను కాలికి కాలు కట్టుకుని కూర్చుంటే ఆయన యేం చెయ్యగలరు? నే నిలా దూరంగావుంటే లాభంలేదు. అని ఆలోచించుకుని ఆవెంటనే మీతాతగారి దగ్గరకు ప్రయాణం అయ్యేను. మా అమ్మా, యిరుగుపొరుగులవాళ్లూ కూడా పండుగపూట వెళ్లిపోవద్దన్నారు. నాకు వెళ్లిపోకతీరదని చెప్పి బయల్దేరేను.

రాత్రి యేడున్నర లేక యెనిమిదిగంటలు అయి యుంటుంది. మాయింటి గుమ్మందగ్గర నాబండీ నిలబడ్డది. వీథి అరుగుమీద మంగళతూర్యాలు వాగుతున్నాయి. గుమ్మాన్న మామిడితోరణం క్రిందపసుపూ బొట్లూ వున్నాయి. లోపల ముత్తయిదువలు బ్రాహ్మణులు కూడా వున్నారు. నాకేమీ తెలిసింది కాదు. నన్ను పుట్టింటి కంపకంపెట్టి మీ తాతగారు శోభనాలతో కులుకుతున్నారని నాకొడలు మండింది. లోపలకు వెళ్లకుండా గిరుక తిరిగి వెళ్లి ఊరిబావిలో పడిపోదా మనుకున్నాను. ఆయనతో క్రొత్తభార్యతో సుఖంగా కాపురం చేసికొండని చెప్పి మరీ చావ నిశ్చయించుకొని నట్టింటికి వెళ్లేను. ఇరుగుపొరుగు వాళ్లందరూ నట్టింట క్రిక్కిరిసి వున్నారు. మహాలక్ష్మి పీటపూలతో కలకలలాడుతూంది. ఎదుట పీటమీద పొరుగు సీతన్నగారి సుబ్బమ్మ పదిపండ్రెండేండ్లపిల్ల కలకలలాడుతూ కూర్చుంది. అక్కడ పళ్లెంలోపళ్లూ, పసుపూ, చీరా, రవికెల గుడ్డా అన్నీ వున్నాయి. ఆ పిల్ల కెదురుగా పీటమీద మీ తాతగారు కూర్చున్నారు ఆయన ప్రక్కను గడ్డాల లింగమూర్తి యేమిటో



"ఎదుట పీటమీద పొరుగుసీతన్నగారిసుబ్బమ్మ పదిపండ్రెండేండ్లపిల్ల కలకలలాడుతూకూర్చుంది"

చదువుతూ కూర్చున్నాడు. ఇవన్నీ చూసేసరికి కామా! నాకు కండ్లు పగిలిన ట్లనిపించింది. అంతా అంధకారం అయిపోయింది. వీరావేశం యెత్తినట్టు నా కొడలు కంపించింది. చెమట శరీరాన్ని యేరులై పారింది. అంతట నేను మేఘగర్జనంలాటి కంఠస్వరంతో గట్టిగా కేకవేసి పెరటి నూతివైపు పరుగెత్తేను. ఆ తరువాత యేమయిందో నాకు తెలియలేదు.

నేను తిరిగి కళ్లు విప్పేసరికి మంచంమీద పండుకొని వున్నాను. మీ తాతగారు విసనకర్రతో నాకు విసురుతున్నారు. ఆయన నన్ను చూడగానే నాకు తిరిగీ కళ్లు మూతలు పడ్డాయి. వణుకుతూన్న కంఠంతో ఆయన "సుందరం! నే ననుకున్నట్టే అయిం"దన్నారు. నేను మాటాడలేదు. నా తలమీద పన్నీరు చిలికి తడిగావంచాతో నాకన్నులాయన మెల్లిగా తుడిచేరు. నేను దిగ్గున లేచి మంచంమీద కూర్చుండి "ఏమిటిది" అని అడిగేను. ఆయన నవ్వుతూ "శ్రీవిద్యోపాసన బాల ఉపదేశం పొందాను. నవరాత్రోత్సవం చేస్తున్నాను. ఇది కడపటిరాత్రి కాబట్టి కన్యకాపూజ చేస్తున్నాను. ఇవన్నీ నీకు ముందుగా చెపితే బెడిసికొడుతుందీ వద్దంటావని నీకు చెప్పేను కాను. నీకు తెలియకుండా చేద్దామనుకున్నాను గాని సాగిందికాదు" అన్నారు. నేను కళ్లు విశాలంగా విప్పి 'నిజమేనా?' అని మీ తాతగారిని



"మీ తాతగారిని కౌగలించుకోబోయెను.
'ఆ! దీక్ష!' అని ఆయన వారించేరు"

కౌగలించుకోబోయెను. "ఆ! దీక్ష!" అని ఆయన వారించేరు.

బాగుందా, కామా! ఇందుకే మనవాళ్లు భార్యాభర్తలు ఒకరిదగ్గర ఒకరు మనస్సులు దాచుకోకూడ దంటారు. నీవెప్పుడూ యేసంగతీ కూడా మా మనుమని యెదుట దాచకుమా! కామా!" అని సుందరమ్మ చెప్పేసరికి ఆ మాటలు కామాక్షి విని "అయితే అవ్వా! సుబ్బమ్మవ్వ నీ సవతా?" అని విరగబడి నవ్వింది.

---

# శాంతిరాముఁడు

శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ గారు

శ్రీరమానాథ పాద రాజీవ చింత-నామృతాస్వాదనహృదయ ప్రమత్తుఁ
డతుల భాగవతోత్తముఁ డయిన బ్రహ్మ-మానససుతుండు నారద మౌనివరుఁడు
విశ్వరక్షకు గోలోక విష్ణుఁ జూడ-నేగుదెంచెడు తఱిని మధ్యే పథమున
దుష్ట వన్యమృగాకులావిష్ట భీక-రోరగాన్విత ఘోర కాంతార భూమి

నొక్క భూరుహచ్ఛాయ రేయుంబవల్లు-తనువు గృశియింప శల్యగతంబు గాఁగ
ప్రాణములు కేవలము వాయుభక్షణమున-ఘోరతమమహా తపస్సు కఠోరవృత్తిఁ
జేయుచుండెడు నొకయోగి శేఖరుండు-ఆశ్రమున సంయమీంద్రుతో ననియె నిట్లు.

విమల కరుణాళు గోలోక విష్ణుఁగూర్చి-నిరతిమతి భక్తితోఁ దీవ్రనిష్ఠ ఘోర
మగు తపము సేయుచుంటి మహాత్మ భక్త-వత్సలుని చిత్తమందు రవంత యేని
దాసునకుఁ దావు గలదో? నాతప్పిదముల-సైఁచునో హరి కరుణారస హృదయమున
ఇంక నెన్నఁడు శ్రీగోకులేశ్వరుండు-తన యనూన కృపా సుధాధారఁ జిలికి
కాచి రక్షించునో యెఱుఁగంగఁ గోరి-నాఁడ ననుచునుగో లోకనాథుతోఁడ
నామనవిగా మునీంద్ర! విన్నప-మొనర్చు మనిన సమ్మతినొంది బ్రహ్మర్షి తమతి
పరమభాగవతోత్తముం డరుగుచుండ-ననతిదూరంబునందె మహాప్రమోద
వీచిఁ దోఁగుచు నున్మత్తు వితము సతము-జ్ఞాన పత్రిని ద్రావెడి శాంతిరాముఁ
డబ్జసంభవసూతి కిట్లనియె; "పూజనము భజన లేని నాదు గజ్జాయి తడియు
నేమొ? గోలోకమున నిందిరేశుఁ గాంచి-యడుగుమీ, నారదా!" యన నబ్బురమున
వల్లె; యని యంతఁ జని భగవానునిఁగని-భక్తిగదురంగ సాష్టాంగ వందనములఁ
జేసి వినతులొనర్చి యాసిద్ధయోగి,-శాంతిరాముఁడు పలికిన సరణినెల్ల
విన్నవించెను గోలోక విష్ణుతోఁడ.

సంయమీంద్రుదు వచస్సుల సాంతముగను-వినెడు తఱి మౌని శాంతిరాముని గురించి
చెప్ప; నాక్షణ మందె యచ్చెరువు గాఁగ-శౌరి కన్దోయినుండి యవారిగాఁగ
బాష్పవర్షముఁ గురియఁ గృపావిభూతిఁ-బల్కె నిట్టులువత్స ప్రపంచమందు

సరళ విశ్వాసభక్తికి శాంతిరాముఁ-సాటిలే రెవ్వరు శతధా సత్యమిద్ది
నవ్య నవనీత మృదుల మనఃప్రవృత్తి-నన్ను స్మరియించునెడల ననంత భక్తిఁ
దన్నుమరపొంది తన్మయత్వమును జెంది-లీనమైపోవునోయి నాలోన సతము
శాంతిరాముని భక్తి విస్తారజలధి-తరచిచూడ నెవ్వరికి సాధ్యంబు గాదు
కమలజోద్భవ! యోగిశేఖరుఁ డెవండొ!- యెంతచూచిన జ్ఞప్తిరా దింతయేని
నని వచించె నౌరా! పరమాత్ము మదిని-నవిరళప్రేమభక్తి నిత్యము భజించు
వారలకు ముక్తి గొంగుబంగారము గద?

కరము తనువు గృశింప ముష్కరపు ఘోర-సాధనలు చేర్చునే జగన్నాథు దరికిఁ
నిర్మల ప్రేమవాత్సల్య నిబిడపూర్ణ-మానసమొకండె కాదె? ప్రధానమరయ.

అంత నారదముని రమాకాంతువలన-సెలవుఁగొని ముదార్తిం జేరి శాంతిరాముఁ
పరమభాగవతోత్తమా! వందనములు-అనుచు శ్రీహరి మధురవాక్యములఁ దెలుప
నాలకించి మహాప్రమోదాబ్ధి మునిగి నుబ్బి-తబ్బి బ్బులగుచు నహో యటంచు
చంకలనుఁ గొట్టుకొనుచు నీసరణిఁబాడ-సాగె "నవిచలసరళ విశ్వాస భక్తి
నెవరు భగవాను మదిని ధ్యాసించు చుంద్రు?-వారి గన్నాయిప్రభుడు కన్నీరుతోడ
నిటులె? తనియించుచుండు సుమ్మా! మునీంద్ర!. సత్యమిది; సత్యమిది; త్రిధాసత్యమిద్ది
అవ్యయానంద సామ్రాజ్య దివ్యపదము-ననుభవింపంగ సాధ్యమా! యందఱకును?

చిత్త మతిపరిపక్వముఁ జెందవలయు-నిత్యపరిపూర్ణతను మది నెగడవలయు
సర్వభూత దయాళుత్వ సాధువృత్తి-"నాత్మవత్సర్వభూతాని" యనఁగ వలయు
స్వచ్ఛమానసమున నహింసావ్రతంబు- పరమధర్మంబు గాఁగ నొనరుపవలయు
తత పరోపకారార్థ మిదంశరీర-మనెడు నార్యోక్తి సార్థక మందవలయు.

భక్తపరతంత్రు శ్రీపాద పద్మయుగళి-నిశ్చలముగ మనఃపీఠి నిలుపవలయు
దీనమందారు మధురమూర్తిని సతంబు-నిర్మలాంతరంగమున వర్ణింపవలయు
అనుపమాన కృపానిధి ఘనయశంబు-శ్రావ్యతరముగ గానంబు సలుపవలయు
విమల చారిత్రు మంగళ విగ్రహంబు-ననుకొనినయంత ప్రత్యక్ష మందవలయు
నంతియేకాని స్థిరబుద్ధి నందలేని-ఉన్నత సరళవిశ్వాస మొందలేని
చిత్తనైర్మల్య సంశుద్ధి చెందలేని-కఠిన తపముల రాదు నిక్కంబు ముక్తి.

---



# "యావజ్జీవం హోష్యామి"



పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

౧

"అబ్బాయి నెత్తుకోవాలి"

"తెల్ల వారిందా?"

"గంటయిం దప్పుడే"

"ఏడిసినట్టుగానే వుంది జవాబు; తొరగా రా"

"అక్కడ కాపరం వుంటా ననుకున్నారా యేమిటండీ?"

"ఆశమ్మలూ బోశమ్మలూ చేరతారు కాదూ మరీ?"

"అయితే?"

"కబుర్లు మొదలు పెట్టకుండా బుగ్రవంచుకని రమ్మంటున్నాను"

"నేను మొదలు పెట్టను లెండి"

"వాళ్లు మొదలుపెడితే అందుకుంటావా?"

"మీరు వద్దన్నారా మరీ?"

"ఇప్పు డంటున్నాను. ఎవర్నీ పలకరించకు. ఎవరేనా పలకరిస్తే పలక్కు"

"పలికేదాకా పలకరిస్తే?"

"అంత అవసరం యేం వచ్చిందని అడుగు"

"దాని పే రేమిటో?"

"నీ మొఘం... .."

"మొఘం కడుక్కోండి యింతట్లోవస్తాను"

"ఇదిగో యిదే చెప్పడం. ఇవాళ తొరగా వంట కావాలి"

"ఏమి టా తొందరా?"

"రాత్రి యెలా భోంచేశానో జ్ఞాపకం వుందా?"

"అయితే నేను వచ్చాటప్పటికి పొయ్యిలో నిప్పు వెయ్యండి"

"ఇల్ల లక్కుండానే?"

"అంత తొందర తై తే యెలాగా మరీ? అంతకీ వల్లకాకపోతే పొయ్యిమట్టుకు పామెయ్యండి"

౨

"ఏం వండుతా వీ పూట?"

"ఏం వండ మన్నారూ?"

"ఇంటో యేం వున్నాయీ?"

"దొండకాయలు పండిపోయేలాగ వున్నాయి కోసుకరండి"

"వెధవదొండకాయలు వద్దంటూంటే తగలేశావు పాదు"

"అరిటిపువ్వు వండనా?"

"ఛీ"

"మునగాకు తెండి ఆషాఢమాసం వెళ్లిపోకుండా"

"అంతకంటే గడ్డి నయం"

"దానిమీద అంత కోరికవుంటే అదే తెండి పోనీ"

"..........,..."

"పోనీ మీకు గోంగూరా పప్పూ వెయ్యనా?"

"నీకో?"

"ఉల్లి పాయల—"

"ఎన్నిమాట్లు బుద్ధి చెప్పినా అవి మానవు. ఎవరేనా విన్నా చూసినా తలవంపులు"

"ఏం మునిగిపోయిం దేమిటి?"

"నువ్వు ఇంకపూర్వం యీ యింటిలో వుల్లి పాయ లెవరేనా యెరుగుదురా?"

"నేను కాపరానికి వచ్చిన కొత్తరికం మీయమ్మ చాలామాట్లు వండిపెట్టారు నాకు"

"అక్కడ అలవాటనీ"

"ఎలా ఐతే నేమీ? మీయమ్మ వండి పెట్టారు"

"తెలిసింది. నీకోసం వండింది మాఅమ్మ"

"నాకోసమే. కాదన్నా నా రేమిటి నేను? ఎవళ్లేమయిపోయినా సరే నేను మానలే వండీ అవీ"

"దిక్కుమాలిన అలవాటుకాని పుట్టింట యెలా యేడ్చినా—"

"సుఖ మల్లె నిండింటో కూచుని అలా యేడ్పులు పెడబొబ్బలూ తెచ్చిపెట్టుకుంటా రెందుకూ? మీనోట్లో శని వుంటే మీరు మానెయ్యండి అవి తినడం. నేను మానలేను. మానను"

"వాట్లని తినవచ్చు నని యేశాస్త్రంలో వుంది?"

"శాస్త్రా లెవరి క్కావాలీ? పాడుం పీల్చ మని దేల్లో వుం దేమిటి?"

"..........."

"మాట్లాడరేం? ఎవళ్ల అలవాటు వాళ్లదీ. ఏవూరు పద్ధతి ఆవూరుది. మీ కీ పట్టింపు లెక్కడ వచ్చాయో గాని యీవూళ్లో అంతా తింటారు"

"రహస్యం"

"మీరూ రహస్యంగానే తినండి. మునిగిపోయిం దేమిటి?"

## 3

"ఏమట్టుకు వచ్చింది వంట?"

"అన్నం వార్చాలి"

"ఇంకా అక్కడే వున్నావూ?"

"అన్నట్లు మరిచిపోయి తీరా మడికట్టుకున్నాను. బియ్యం కొలిచి పట్టుకురండీ"

"ఇంకా యెసట్లో బియ్య మేనా పొయ్య లేదా యేమిటే?"

"ఎసరు కాగితేనా ?"

"మరి వార్చా లన్నా వేం ?"

"అత్తిసరు మెతుకులు తినడం నావల్ల కాదు సుమండీ"

"ఛా! బుద్ధిలేనిదానా!"

"ఆలా రంజుకుంటూ వెళ్లిపోతే కాదు మరి. దానీ పేనుగు అంట్లు పట్టుకు వెళ్లి చెరువుదగ్గిరే కూచుంది తొరగా రమ్మనండి వెళ్లి"

"యెస రేనా పెట్టలేదా యేమిటే?"

"గిన్నెలు లేందే నన్నేం చెయ్యమంటారండీ?"

"పొయిలో నిప్పేనా వేశావా?"

"ఇప్పుడే కాచుటండీ పొయ్యలికానూ? కాస్తేనా ఆరాలా అక్కర్లేదా? ఇంతకీ యెక్కడదొరికాయో గాని మీకు చెక్కపేళ్లు, పచ్చిముద్దలు. బుడ్డెడు కిరసనాయిలు పోసినా తగులడ్డం లేదు"

"ఏమీ లేందే మడి కట్టుకున్నా వెందుకూ మరీ?"

"వద్దన్నం తినకుండా నేనుండలేను బాబూ?"

## ౪

"ఏం చేస్తున్నావూ?"

"మీ రేం చేస్తున్నారూ?"

"ఏమి టా మాట?"

"ఏం లోటు వచ్చిం దేమిటి?

"నాకర్మమూ నీయోగమూనూ. అయితే అయింది గాని యెవరూ వచ్చారుట మన యింటికి?"

"మామరిది వచ్చి యిప్పుడే వెళ్ళాడు. ఎంతో సేపు కనిపెట్టుకున్నాడు మీకోసం పాపం"

"ఏ మరిదీ?"

"మా లచ్చి మొగుడు. సుందరం"

"వున్నాడా వెళ్లాడా?"

"వుండడానికి కలాగా పాపం? ఇంటికే వెళ్ళాడు"

"ఏం పనిమీద వచ్చాడూ?"

"ఈవేళకి మూడోనాడు సత్యనారాయణవ్రతం చేసుకుంటారట వాళ్లు. పిలవడానికి వచ్చాడు"

"సరే; ప్రయాణం కాబోలు"

"మాన్తా ననుకున్నారా యేమిటి లేకపోతే! రేపు పొద్దున్న వాళ్లు మన యింటికి రావాలా?"

"వెళ్ళకపోతే నువ్వేడుస్తావు. వెడితే నే నేడవాలి. కాస్తేనా ఆచారమూ వల్లకాడా? ఆగుడ్డలతో తింటాడు నానాగడ్డీనీ"

"ఏం మృదువైన నోరూ? అంత యేడుస్తూ వెళ్లడం యెందుకూ మీరూ? యింటో కూచోండి అత్తిసరు వేసుకు తింటూను. ఎవళ్ళేమైపోయినా సరే, నేను మాత్రం వెళ్లకమానను. అంత ఆచారమే కావలిస్తే మీరు మా చిన్న మరిదిగారింటికి వెళ్లండి. అవుపేడ కలిపి మరీ యిస్తుంది కాళ్లు కడుక్కోడానికి నీళ్లు వాళ్ల అమ్మ."

"కానైతే యిరవై యేళ్లవాడే గాని బాపన్నని చూడూ యెంత ఆచారంగా వుంటాడోనూ? బ్రాహ్మణ జన్మ యెత్తినందుకు అలా—"

"చెప్పబోయి చెప్పబోయి బాపన్న నే చెప్పాలి దిక్కుమాలిన రూపం యెక్కడ వచ్చిందోగాని కారు నలుపూ, మసిబొగ్గు నయం. ఆరూపానికి తోడు వల్లమాలిన చేదస్తం కూడానూ"

"నలుపూ యెరుపూనా యేమిటి లెక్క? అతగాడు మొగంనిండా వీభూది పెట్టుకుని కూచున్నాడంటే—"

"అయ్యో అందం! ఏజన్మలో చేసుకున్నామో నేనూ మా వెంకీ. పాపం చేసుకొని పుట్టాం. లేకపోతే మాకర్మం యిలా కాలదు"

"ఎప్పుడూ సుందరం కోసమే యేడ్చావు. చేసుకున్న పెళ్ళామేనా యింతగా కొట్టుకోదు"

"ఆడదై పుట్టేక అతన్ని చూసి ఆనందించకుండా యెవత్తి వుండగలదూ? చంద్రవంక లాంటి నుదురూ, తుమ్మెదరెక్కల్లాంటి క్రాపింగుజుట్టూ—మీసాలు తీసేసుకుంటాడు కనక మరీ ముద్దొస్తూ వుంటుం దామొగం. ఇక కంఠం యెత్తి పద్యం చదివాడంటే కిన్నెరలు మోగిపోవూ?"

"చాలించు యీపాటికి. యెవళ్లైనా వింటే తలవంపులు కూడానూ"

"తలవంపుల కేమి కర్మం వచ్చిందీ? అందంగావుంటే యెవత్తి మరిదిని యెవత్తి మెచ్చుకోకుండా వుండగలదూ? మీరూపం విరూపాక్షరూపం అయిపోయినందుకు విచారించక అతగాడంటే అలా రుంజుకుంటారేం? నావాళ్ల నంటే నే నూరుకోను -నాచెల్లెళ్లంటే వొకటే నామరిదినంటే వొకటేనా?"

"మరి నువ్వు బాపన్న నెందుకన్నావూ?"

"అనకపోతే ముద్దెట్టుకుంటాను పాపం, మిమ్మల్నీ అతన్నీని. వీభూది మానమనీ, క్రాపింగు పెట్టుకోమనీ, చొక్కాలు తొడుక్కోమనీ, తొరగా తొరగా పని చేయించుకుంటూ వుండమనీ, దిక్కుమాలిన పొగాకుతో తమలపాకులు నవలడం మానమనీ, మాచెల్లెలు చిలక్కి చెప్పినట్లన్నివిధాల చెపుతూ వుంటే కాస్త మానగూడదూ అతనూ? అంత నిర్లక్ష్యమా?"

"అలాచేస్తే యేడిసినట్టుగానే వుంటుంది సరసం"

"అతని సరసం మీరన్నట్లుండడం చేతనే అనీనాలాగే సుందరాన్ని చూసి ఆనందిస్తూ వుంటుంది. అతనేనా పాపం మేమంటే ప్రాణం యిస్తాడు. మొన్న పిల్లాడి బారసాల కిట్టే వెళ్ళాటప్పటికి మూడువేల మల్లి పువ్వులు తెచ్చాడు ప్రత్యేకంగా మాముగ్గురికీని. చెల్లెళ్లకిద్దరికీ చెరోవెయ్యా తెచ్చాడు, అందమూ చందమూ అతనికి తెలిసిన ట్లెవరికి తెలుసునూ? బండైతే కుదుపని యిట్టె మోటారు కుదిర్చి పంపించాడు మాకారు కామూ మమ్మల్నీ? మేం కోరిన చీరలు తెచ్చాడు పాపం. మధ్యమధ్య మా లచ్చే ధుమధుమ లాడుతూ వుంటుంది కాని నెత్తిమీద పెట్టుకుంటాడు మమ్మల్నతను"

"చాల్లే యీపాటికి సంతకం"

"వినలేకపోతే చెవులు మూసుకోండి మీరు"

"వినాలేనూ మీ వేషాలుకూడా చూడాలేనూ. ఇక అత్తగాడితో వేళాకోళా లాడిమూడు చీల్చేస్తాను నిన్ను"

"ఏమిటే? ఎల్లుండి వెడతాను కాదూ? చేతనైతే రండి చీలుద్దురుగాని. నామీద మీరు చెయ్యి చేసుకున్నా రంటే వూరుకుంటాడేం అతనూ? మీకేం విషం పెట్టాడనీ అత నంటే ఆలా వుడికి పోతారూ? అతను పలకరిస్తె మొగం అలా తిప్పుకుంటారు. ఏమీ? మొగం చెల్లకా? కొరివిదెయ్యంలాగ పుట్టినందుకు మూలపడి మూలుగుతూ కూచోలేక యింకా ఊడిసిపడతారేం? చాల్లెండి నేర్చుకుపోయారు. పాడుకళ్లు మిటమిటలాడి పోతాయి యేంపాపమో గానీ. మొన్న మాచెల్లెలితో సరిగ్గా మాటే వల్లేకపోయారుట మీరు. ఏం చేసిం దదీ? మావెంకి కొప్పు మానేసి జారుముడి వేసుకుంటే మీకేం పోయిందీ? నిక్షేపం లాగ మా సుందరం వూ రందర్నీ పిలిచి, చిన్న కార్యం అయినా భోగంమేళం పెట్టి ముచ్చటగానూ, వైభవంగానూ కొడుక్కి బారసాల చేసుకుంటూ వుండగా—మాలచ్చి అతనికి తగ్గ వేషం వేసుకుని పీటలమీద కూచుని వుండగా——కొప్పులు పెట్టుకునీ, మడికచ్చాలు పోసుకునీ, మూసివాయినపు ముత్తైదువుల్లాగ తిరగమా అతని యెదుట మేమూ? చూసినవాళ్లు గడ్డిపెట్టరూ? మీరంత చూడలేకపోతే యే వీధి అరుగు మీదేనా కూచోలేకపోయారా? వూరుకోండి యీపాటికి. అనాథలాగ యింట్లో కూచోక నంట అయిందాకా యెక్కడికేనా వెళ్లిరండి"

"వోసి నీయిల్లు వల్లకాడు గానూ! నాకెక్కడ దాపరించావే నువ్వూ?"

"ఇంకా గబగబా నడిస్తే బాసుంటుంది ...... ......నన్నంటే నే నూరుకుంటానేం? అబ్బో చెలిగేస్తాను. నాకు పిసాళం యెత్తుకొచ్చిం దంటే మొగుడయ్యాది దేవుడయాది తూర్పారబట్టేస్తాను......అన్నట్టు మరిచిపోయాను. కంసాలిదుకాణంమీదికి వెళ్ల వలసింది... ... ఇప్పుడైతే యేమీ? ఈవెళ్లడం వెళ్లడం అక్కడికి వెడితే సరేసరీ; లేకపోతే వెళ్లేదాక అన్నమే పెట్టనూ"

౫

"ఇదిగో, ఓయ్! ఏం చేస్తూన్నారూ? ఎక్కడికి వెళ్లేరమ్మా యింతట్లోనూ? ఎక్క డున్నారండీ?"

"............"

"వెడితే వెళ్లారు. కాస్త తలుపు చేరవేసి వెళ్లకూడదూ? కుక్క చొరబడితే యేంచేస్తురో? ఇదిగో. ఓయ్! మాట్టాడరేం? లేరు. ఎక్కడికో దాటారు ఏమండోయ్?"

"............"

"ఏకోటయ్యశాస్తుర్లు దగ్గిరికో, ఏపళ్లం భొట్లు దగ్గిరికో వెళ్లి పోసుకోలు కభుర్లు చెప్పుకుంటూ కూచోడమే కాదూ? పూర్వపువాళ్లు ఆమట్టి కాస్తా సంపాదించి వుండకపోతే ఈ ప్రయోజకత్వానికి తాగడానికి గంజేనా లేకే పోవును. దిక్కుమాలిన సమ్మంధం తెచ్చి పెట్టిందమ్మా మాఅమ్మ నాకూ? ఏమండోయ్!"

"వచ్చె వచ్చె. ఎందు కాబొబ్బలూ?"

"బొబ్బలా? వంటయిందాకా తొండలు విడిపించారు. ఇంతట్లోకే వెళ్లాలా పెత్తనాలికీ?"

"నేను పెత్తనాలికి వెళ్లేనో కంసాలిదుకాణం మీదికి వెళ్లేనో తెలుసునా నీకు?"

"దుకాణంమీదికి వెడితే వెళ్లాటప్పుడు నాతో చెప్పారా? ఏం, అంత రహస్యమేమీ? అస లెక్కడికో బయలుదేరారు. అవతలివాళ్లు కనబడకపోతే దుకాణం మీద కూచున్నారు కామోసు"

"ఎలాగయితే యేం? నీపనే చూశానుగాదూ?"

"చూశారే యెలాగయితేం. ఏదీ? కంటె, యేమట్టుకు వచ్చిందీ?"

"వంటయిందా?"

"కంటెమాట చెబుదురూ"

"మెలికలు వేశాడు"

"మొన్న నే వేశా డన్నారుకాదూ?"

"ఇవాళ సాపు చేస్తున్నాడు"

"ఎప్పు డిస్తా నన్నా డూ?"

"తొ౦రగానే యిస్తాడు. వంటయిందా?"

"ఎల్లుండి మా చెల్లెలిగారి యింటికి వెళ్లాలి ఇవ్వాలని చెప్పారా?"

"తొ౦రగా భోజనం పెడితే వెళ్ళి అక్కడే కూ మంటాను"

"రోజూ పెట్టడం లేదా యేమిటి?"

"స్నానం చెయ్యమంటావా?"

"తొ౦రగా యివ్వాలని చెప్పి వస్తురూ వెళ్లి!"

"భోజనం చేశాక వెళ్లనూ?"

"ఈలోపున మరో పని చేస్తాడు"

"చెప్పి వస్తే మానాడా?"

"అదేమి టండీ దేవతలికి పంచాంగం చెబుతారూ? ఒక్కమాటు వెళ్లి రండి, అంతట్లో పులుసు పోసుస్తాను"

"పులుసుజోలి నాకెందుకూ? నేనేం తింటానా చేస్తానా?"

"ఇందాకా వొప్పుకున్నారు కాదుటండీ?"

"ఏడిశావు"

"మన కెప్పుడూ యేడుపులూ పెడబొబ్బలూనూ నాకు వస్తువుచేయించవలసి వచ్చాటప్పటికి నవనాడులూ కుంగిపోతాయి. ఆడదాన్ని యిన్నివిధాల యేడిపించాక యిక యెంత చదువుకుంటే యేమిటికి?"

"ఇప్పు డేం లోటు చేశానూ? కంటి___"

"తీరా కంసాలికి బంగారం యిచ్చిపోయా నని యేడుపూ. చాల్లెండి నేర్చుకుపోయారు. చూసిచూసి వస్తువు చేయించా లేరు. పెట్టుకుంటే రెండుకళ్లతోటే చూడాలేరూ. ఇంత కుచ్చితబ్బుద్ధీ, విమ పుకళ్లూ యెక్కడా చూడలేదూ"

"దిక్కుమాలిన దండకానికి మొదలూ. ఛా! నీబత్తుక్కాలా"

"నాబత్తు కెందుకు కాలాలీ? మీవాళ్లంతా యేమైపోయారూ! నన్నన్నా రంటే బాగా జరగదు"

"నోరు మూసుకో యెవళ్లేనా వినిపోతారు"

"వింటే నాకేం భయమా? ఎవళ్లనేనా తీసుకు రండి. గడ్డి యెవళ్లకి పెడతారో చూస్తాను"

"ఏమిటే?"

"కోమటే, కొత్తజెల్లమూనూ. నే నేం తప్పుమాట అన్నాననీ అలా కళ్లెర్ర చేసుకుంటారూ?"

"…………………"

"ఇంకా చూసుకోండి కోరమాపులు. ఇంటో కూచుని ఆడదానిమీదే కాదూ అఘాయిత్యం చెయ్యడమూ. వీధిలోకి వెడితే గజగజలే"

"ఏమిటే యీ అల్లరీ?"

"అదే నేనూ అడుగుతున్నాను. ఒక్కమాటు దుకాణంమీదకి వెళ్లి రమ్మంటే యింత రవ్వా?"

"ఇప్పుడే కాదూ అక్కణ్ణుంచి వచ్చానూ?

"ఇక్కడే కాదూ దుకాణం? మలుపు తిరగాలి ఇంతేనా? అదిగో సుత్తిదెబ్బలు వినపడుతూనే వున్నాయి. కంటి కంత గట్టిగా సాగకొట్టడానికేం వుందీ? మీరిలా మొగం తిప్పడంతోటే దాని నలా పారేశాడు. విచారించకండి. అది యింతట్లో నామెళ్ళోకి రాదులెండి"

"నువ్వు మనిషివా దున్నపోతువా?"

"ఏలాంటివాళ్ల కలా కనబడతాను"

౬

"అభిషురించాను"

"అఘోరించలేక పోయావు"

"పీటమీదకి వచ్చాటప్పటికి వస్తాయి రుసరుసలు. తిన్నగా కూచుని తినడం చూడలేదు నేను"

"ఆకులో యేం పెట్టావూ తినడానికి? "

"నన్నేం చెయ్యమంటారూ? నిత్యేపం లాంటి పులుసు పనికిరాకపోయె…………"

"ఇం కేమీ లేదూ వండడానికి?"

# అమరావతి శిల్పచిత్రములు



౧. శుద్ధోదనుని సభ



౨. మాయాదేవి, శుద్ధోదనులు

"అదా యిదా అని అడిగితే గడ్డనీ, చెత్తనీ, తుక్కునీ, సూకరాలు పోయారు గాని ఫలానా వండ మని చెప్పారా?"

"ఇంకేమీ లేదూ వండడానికీ?"

"ఏం తెచ్చి పెట్టారూ మీ రింట్లో?"

"పెండలం యేమైపోయిందీ?"

"దాని మొఖం మండేరి. రుచా పచా! ఇంతకీ పెండలం పెండలం అనడమేగాని బెల్ల మేదీ?"

"ఆవ పెట్టరాదూ?"

"మీ కేం చెబుతారు. పదిరోజుల కిందట మా తమ్ముడు వచ్చినప్పుడు నాలుగు ముక్కలు వేయిద్దా మని యిట్టే తరిగాను. ఇంకా పోలేదు దురదలు. ఎక్కడో రాతుసిపెండలం తెచ్చారు."

"దొడ్లో తోటకూర వుంది కాదూ?"

"ఛా! చీడ పట్టలేదూ?"

"కాడలో?"

"ముదిరిపోలేదూ?"

"పప్పుపులుసు వండరాదూ?"

"రెండు పులుసు లెందుకూ?"

"వుల్లిపాయలు మానేస్తే"

"మీ కేం, చెబుతారు"

"నీకూ నాకూ గూడా పనికివచ్చేవి అనేకా లుండగా—"

"ఏం వున్నా యీ? కాకరకాయ చేదూ. దొండ కాయ విషం. పొట్లకాయ గబ్బు. వంకాయ పైత్యం. కంద వేడి. అరటికాయ అరగదు. బీరకాయ మొఖం మొత్తింది. ఆనపకాయ నిరుచప్పన. గుమ్మడికాయ పడదు ఏం అట్టే పెట్టారూ వండడానికీ? ఎంతసేపూ పెండల మూ పప్పుపులుసూ. దానిమొఖం కాల్చెయ్య. పెండలం దురదగధా? పప్పుపులుసులో వొక్క వుల్లిపాయ ఐనా అడ్డం వెయ్యనివ్వరు కదా?"

"..........."

"పీటమీద కూచుని అంతా జపం చేసుకుంటారు. మీ కెక్కడ దాపరించాయమ్మ యీతిట్లూ యీతిమ్మ లునూ?"

"శేపణ్ణుంచి నేను వొండుకుంటాను నువ్వు కూచుని తిను"

"వో! ఇంతకంటేనా? మూడో మేలు"

౭

"చాప వేస్తున్నా రెందుకూ?"

"వొక్కకునుకు........"

"దుకాణం మీదకి వెళ్లరూ?"

"క్షణంలో లేవనూ?"

"అన్నంపెట్టేదాకా నిలవనిచ్చారుకారు. నాలుగు మెతుకులూ వొంటపట్టేటప్పటికి పెద్దమ్మ ఆవహించింది"

"నువ్వు పెట్టిన పంచభక్ష్యపరమాన్నాలూ తినే టప్పటికి"

"ఇలాంటిమొఖాలికే అలాంటివి"

"..............."

"రాత్రి తెల్లవార్లూ నిద్రపోవచ్చు. వేషాలు వెయ్యక దుకాణం మీదికి వెళ్లండి"

"శంభులింగం భోజనం చెయ్యాలా?"

"మీకు మల్లే గోళ్లుగిల్లుకుంటూ కూచో డతను ఈపాటికి దుకాణం తెరుస్తాడు వెళ్లండి"

"వెళ్లి తిండి తిను. నువ్వు లేచాటప్పటికి నేనూ లేస్తాను"

"దానికీ దీనికీ సమ్మంధం యేమిటీ?"

"నీ నగల వుబలాటమేనా నాకష్టమూ సుఖమూ చూడడం వుందా?"

"దుంగ లెత్తేనా దూలాలెత్తేనా? పొడుం పీల్చు కుంటూ కూచోడమే కాదూ అక్కడ?"

"................."

"లేవరేం?"

"................."

"వినపడమూ?"

"..................."

"మిమ్మల్నే. ఏమండోయ్! ఇలా చూడండీ"

"..................."

"పడుకోవద్దు. ఇదే చెప్పడం"

"..... ............."

"మానరు కామూ? వెళ్లరూ"

"ఇంత మొండి కెత్తితే యెలాగమ్మా వేగడం"

"......................"

"ఇంతేనా యింతకంటె యేమేనా చేస్తారా? ఇదిగో ఓయ్! నల్లరాయీ! ఏమండోయ్! మిమ్మల్నే. వెళ్లనని చెప్పడానికేనా నోరులేమూ?"

"..................."

"నాకు జవాబు చెప్పకుండా యెలా నిద్రపోతారో చూస్తా కామూ? మొండివాడు రాజుకంటే బలవంతుడుట. పెళ్లామనీ, బిడ్డలనీ, అచ్చటనీ, ముచ్చటనీ, మంచనీ, చెడ్డనీ యేమేనా తెలుస్తేనా? పెళ్లాడగానే సరా? వెర్రివాడికి పెళ్లాం వొస్తే గిల్లిగిల్లి చంపాడుట. మానాన్న వొద్దుమొర్రో అంటూంటే మాఅమ్మ తగలపెట్టిందీ సమ్మంధం. అనుక్షణమూ దాని జీవానికి పడి యేడుస్తూనే వున్నాను నేను. రామరామా! బెల్లంకొట్టిన రాయిలాగ పలక్కపోతే యింకేమిటే చెయ్యడం? అసలీవంశమే యిలాంటిదీ. తాతముత్తాతల దగ్గిర్నుంచీ వస్తోందిట పెళ్ళాన్ని యేడ్పించడం యీదిక్కుమాలిన యింటో. లోకంలో అనేకమంది వున్నారుగాని యింత కొయ్యతనం యెక్కడా లేదూ. చెవిటివాడి ముందర శంఖం వూదితే దాన్ని కొరకడానికి నీతరమా నీయబ్బ తరమా అన్నట్టుంది యీసడసం. అయ్యో! సిగ్గు బిడియమూ లేకపోతే సరీ. ఎన్నన్నా దున్నపోతుమీద వాన కురిసినట్లే"

"వోసి నీయిల్లు___"

"మీయిల్లే. మీబతుకే. అదేదో మీకే"

"నోరు మూస్తావా ముయ్యవా?"

"మీచేతు లేదేవుడికి మీదు కట్టుకున్నారూ?"

"..................."

"ఇప్పుడేనా లేవండి మించిపోలేదు"

"పడుకోనివ్వవూ?"

"కంటి చేయించరూ?"

"..................."

"నామాట వినండి. ఇవాళా రేపూ కష్టపడితే కంటి అయిపోతుంది. తరవాత మీయిష్టం వచ్చినంత సేపు నిద్రపోవచ్చు. మళ్లీ శిస్తులు వచ్చేదాకా దావుగల్లీ కోసం తొందర పెట్టను. వేసంగిలో పుస్తెల నాను చేయిస్తానని మీనోటితో మీరేఅన్నారుకాదా?పదిరోజులాలస్యమైనా దానికోసం తొందర పెట్టను. లేవండి"

"వొక్కక్షణం నిద్రపోకపోతే తలనొప్పివస్తుందే"

"మళ్లీ అదే మాట"

"వూరికే పడుకున్నానని పేరూ. నువ్వుఅన్నం తిని వచ్చాటప్పటికి యిక్కడ వుంటే అడుగు"

"మీరు వెళ్లాకే తింటాను నేను అన్నం"

"వోసి నీపట్టుదల___"

"అయ్యో మీమొండితనం___"

"నన్ను వేపుకుని తినకు. నీకంతేనా పుణ్యంవుంటుంది. ఇంటోకి వెళ్లు"

"నాపుణ్యం బుగ్గయింది కనకనే మీయింటో పడ్డాను. నాకిలాంటి యోగం వుండడంచేతనే నెత్తిమీద పెట్టుకునేవాళ్లు యెందరు వచ్చినా మాఅమ్మ వాళ్లనందర్నీ కాదని నాగొంతు కోసింది. అసలు పెళ్లిలోనే రోత పుట్టింది నాకు; పొడుంబుర్రా,పిలకజుట్టూ చూశాటప్పటికీ"

"..................."

"మీకే చెప్పడం, వినపడదూ?

"..................."

"అయింది. ఇక దీపాలు పెట్టాకే కళ్లుతెరవడం. కుంభకర్ణుడి అంశ అంతా పట్టింది. 'మంచి మనిషితో

మాటా, మంచి పశువు కోదెబ్బా' అన్నారు. మనిషి జన్మం యెత్తగానే సరా?"

"ఇందాకణ్ణుంచి చూస్తున్నాను. వొక్కటే మాస్తరుగానే తోడేస్తున్నావు పేసులు. నాకక్కడ దాపరించావే నీమొగం కాలా......దుకాణంమీద పసుకుంటాను వెళ్లి. తన్నుకు చావు"

"నాకేం చచ్చేదాకానూ. మా పనుల్లో అర్థాయుష్యపేనుసు లెవరూ లేరు. మమ్మల్నన్నవా ళ్లెవళ్లూ ముందుకు రాలేదు. ఇదిగో చెబుతున్నాను. అప్పలమ్మని పంపి కనుక్కుంటాను. అక్కడేనా సరే నిద్రపోయారంటే రాత్రి మీరు వండుకోవలసిందే అన్నం, వెళ్ళండి. మీ వేషాలు సాగనిస్తా ననుకున్నారు పాపం"

౨

"కంటి పని కట్టిపెట్టించారా యేమిటి?"

"అలా అన్నావేం?"

"అప్పుడే వచ్చారేం?"

"రాకూడదూ?"

"అడక్కూడదూ?"

"మంచినీ ళ్లేనా తాగవద్దంటే?"

"మొదటే అలాగ చెప్పరాదూ?"

"ఇంతట్లో యేం మించిపోయిందీ?"

"వొక్క క్షణం వూరుకుంటే సరీ తెలుసును."

"ఏడిశావు."

"ఏమిటే! మహా చురుగ్గా వుంది యివాళ వ్యవహారం"

"చాలించు. కసిన్ని మంచినీళ్లు పట్టుకొనిరా"

"చూడండి కాస్సేపు"

"ఏం? వర్జ్యం వచ్చిందా యేమిటి?"

"వర్జం వుంటే మీరే బాధపడతారు కడుపునొప్పితో నాకేం!"

"మరి యింకెందుకూ ఆలస్యం"

"వక్కక్షణం చూడండి"

"కంఠం ఆరుకుపోయి యింటికి వస్తే చూడొమంటా వేమిటే?"

"అప్పలమ్మ రావాలి"

"నా మంచినీళ్లకీ అప్పలమ్మకీ సమ్మంధం యేమిటే?"

"అంతానూ"

"అదేమిటే నీ మొహం మం——"

"మాటలు మిగిలా రంటే వూరుకోను. మీ రక్కడ కూచుని నిద్రపోయారో లేదో తెలవకుండా మంచినీ ళ్లెలా యిస్తా ననుకున్నారూ? దిగండి నుంచి"

"వోసి నీబతుక్కాలా! యింత మొండి కొత్తా వేమిటే యివాళా? దెయ్యం పట్టిందా యేమిటే!"

"దెయ్యమో భూతమో మిమ్మల్నే పట్టింది. మీ రీవేళ బండ కత్తితే నేను మొండికత్తనూ! గోళ్లు గిల్లుకుంటూ దుకాణం మీద కూచోడానికే మీ కంత కష్టమైతే చాకిరీ అంతా చెయ్యడానికి నాకెంత కష్టంగా వుండనూ? మీరు నా బతుక్కాలా లంటే నేను మీ సిగ్గు చిమడా లననూ?"

"నువ్వే యివ్వా లన్న మాట యేమిటే? నేనే తెచ్చుకుంటాను వెళ్లి"

"తెచ్చుకోండి నాకేం భయమా? పొయ్యిగూడా అలికేస్తే సంతోషిస్తాను. చివరి కలాగా అది మీమీదే పడుతుంది యివాళ. ఇదిగో. దుకాణం మీదకి వెళ్లి వచ్చిన గుడ్డలతో ముట్టుకుంటారు కామోసు నిండు బిందె. మళ్లీ ఆచారానికి పట్టు పగ్గాలుండవు. ముట్టుకోండి. నాకేం? రాత్రికి అవే మంచినీళ్లు......నూతికి వెళ్లారు. కావాలి శాస్తి. పరుగెత్తలేక భలాదూ రన్నట్లు కోపం అంతా చేదమీద చూపిస్తున్నారు. నాకేం? పగిలిపోతే పుచ్చినట్లు తామే తెచ్చుకుంటారు మళ్లీనీ. ఈపేను గెక్కడికి వెళ్లిందో గంటయింది వెళ్లి......"

* * * *

"సిగ్గు లేకపోతే సరీ నవ్వడానికి"

"చేతగాని పని చేసుకున్నందుకు మీరు సిగ్గుపడాలి గాని నాకేం?"

"సాగుతోంది ఆంద్రబ్బ. ఎందు కెందు కని వూరుకుంటూంటే నె త్తెక్కుతున్నావు''

"కాళ్లకింద బెట్టి. రానేద్దా మని వుంది కామోసు పాపం. అబ్బో! మీతాతలు దిగి రావాలి. ఇంక రెండేళ్లు పోనివ్వండి అబ్బాయి నప్పగిస్తాను''

"వాణ్ణి కూడా పాడుచేస్తావు నువ్వు. కాస్త నిర్భాగ్యు డున్నాడు. అప్పుడే వుల్లిపాయలు మప్పేశావు"

"మీ నోట్లో శని వున్నాడు కనక తినడానికి మీకు యోగం లేదు. వాడి కేం? వుల్లిపాయలు కాక పోతే నల్లవుద్ధరి తినండి మీరు నాకేం? శుభం అంటూ పిల్లాణ్ణి తిట్టుకుంటా రేమిటే? పాడునోరూ. పెళ్లి పందిట్లో కూచుని తద్దినమ్మంత్రా లేకరువుపెట్టే రకం. మానాన్న పేరుపెట్టా నని యీ వుక్రోషం అంతానూ. రానివ్వండి మా నాన్నని చెబుతానూ"

"దిక్కున్నచోట చెప్పుకో"

"ఏమిటే? ఏం చూసుకునీ ఆ భరవసా యివాళా? ఈగుడ్డలో వండుతా నుండండీ. యీరాత్రిమీరు వండు కుంటే వచ్చి ముట్టుకుంటాను కూడాను. ఆదిక్కేమిటో అప్పుడుగాని తెలవదు. తొందర పడకండి. వో! ముక్కు బారెడు చేసుకుంటేనూ మూతి ముడుచుకుంటేనూ నాకు భయంలేదు. వెళ్లండి వుద్ధరిస్తారా యేమిటే?"

౬

"తలుపు తలుపు"

"............"

"ఏం చేస్తున్నావూ, వినపడమూ?"

"............"

"వోయ్ ఇదిగో నిన్నే. ఎక్కడున్నావూ?"

"............"

"ఇంటో వుందా యెక్కడి కేనా వెళ్లిందా? కోపం వస్తే వొళ్లు మండబెట్టుకుంటుంది. మడి కట్టుకుందో లేదో. అనాచారరోగం వచ్చి పడిందిగాని అమృతంలా వుంటుంది యేం వండినానూ. కోపం రానంతసేపూ ప్రాణం యిస్తుంది కాని ఆ మంచి మాత్రం యెంతోసేపు వుండదు. కోపం యెలా వస్తుందో, యెందుకు వస్తుందో, యెప్పుడు వస్తుందో తెలవకుండా వచ్చి గజగజ లాడించేస్తుంది......ఎక్కడున్నావూ! వినపడమూ? వోయ్! లోపలే వుంది గొళ్లెం. యేం చేస్తూ వుందోగానీ అబ్బాయీ"

"............"

"నాయనా"

"......"

"బుల్లేడా!"

"......"

"కుర్రాడా!"

"......"

"రామచంద్రం!"

"......"

"దిక్కుమాలిన కర్మం కోపమో వినబడకపోవడమో. ఏం—చే—స్తు—న్నా—వూ?"

"ఎందుకా బొబ్బలూ?"

"తలుపు తియ్యి, ఎక్కడికి పోయావూ?"

"ఎవళ్లతోటేనా లేచి పోయా ననుకున్నారా యేమిటి?"

"ఏం చేస్తున్నా వంటే యేమి టా దిక్కుమాలిన గొడవా?"

"మాట్లాడితే దిక్కుమాలడ మేమిటే? పలక్కపోతే కాస్సేపు అరుగుమీద కూచోకూడదూ? అయితే అయింది మడికట్టుకోండి త్వరగాను"

"ఏం?

"ఏం యేమిటి?

"ఏ మంటున్నాను''

"తెలిసింది. ఏం యేమిటి?

"నేను మడి కట్టుకోవడం యెందుకూ?''

"ఇందాకానే చెప్పాను''

"అంతే?''

"ఒక్క దెబ్బని"

"నిద్రపోవడం నిజమే. కాని శంభులింగం పని మానలేదు. నమ్ము"

"కనక గొడవలు పెంచక తొరగా వంట కాని వ్వండి. వినండి"

"నిజం చెప్పినా నమ్మవూ?"

"నిజాని కెక్కడికి? అన్నివిధాల బతిమాలినా మీరు వినగలిగేరా?"

"బుద్ధి తక్కువ వచ్చింది. నేను నిద్రపోయినా అతను పని మానలేదు"

"మీరు చూశారా?"

"మేలుకున్నంతసేపూ——"

"సరే. అప్పుడుకూడా కళ్లు మూసుకుపోవాలా యేమిటి? పోనీ యెంతసేపు నిద్రపోయారో చెప్పండి"

"క్షణం. అరగంట కంటే యెక్కువ లేదు"

"దానికి శిక్ష మీరు రెండుగంటలు పొడుం పీల్చకుండా వుంటారా?"

"చంపేసే వన్నమాట"

"ఏం? అంత నొప్పిగా వుందా? ఇందాకా నే నెంత బాధపడ్డానో. ఒళ్లు మండుకుపోయిందే. కాస్తే నా: జాలేసిందా మీకు? నయాన్ని భయాన్ని——ఎంత చిలక్కి చెప్పినట్లు చెప్పినా గిజా అన్నారు గాని విన్నారా?"

"అలా అనుకోకు. కొంచెం శాంతించు.వుండి వుండి ఒకొక్కమాటు చ్రురుమంటూ వుంటావు; గాని లేకపోతే నీయంత మంచిది లేదు. దిక్కుమాలిన ఆచారం దగ్గిర వస్తోంది నీకూ నాకూ జగడం"

"ఆచారం దిక్కుమాలిందని తెలిసివుండిన్నీ అనంటే అలా——కడుపు మాడ్చుకుంటూ రెందుకూ?"

"స్మార్తమ్ముక్కలు చెప్పుకోవడంచేత అలా అలవాటైపోయింది. మీనాన్న యింగ్లీషు చెప్పించక పోయె. నాకు మరో వృత్తి చేతకాకపోయె"

"ఈయిల్లు తెగనమ్ముకొని సుందరంగారి వూరు పోదాం పదండి. వాళ్ల యింటిపక్క నున్న డాబా అమ్మకానికి వచ్చిందిట. సుందరాన్ని బతిమాలి తన బట్టల వర్తకంలో మీకు వాటా యిప్పిస్తాను పదండి"

"నువ్వంతదానవు కాదని కాదు. ముందు సంగతి అలా వుంచు. నేనునిన్ను తిట్టినా——ఆ తిట్లు హృదయం లోనుంచికాదు——ఏదో ఒళ్లు మండి——నాదీ తొటుకు మంటే. ఒక్క క్షణం నిద్ర పోయాను; గాని నువ్వు కంటికి పెట్టుకుని కలకల్లాడుతూ——నువ్వుండంగా వుంటే అది నాకు ముచ్చట కాదూ? నామాట విను. నన్నే డ్పించకు"

"ఈ నక్కవినయాల కేం లెండి. నాతిక్క మీకు తెలిసిందే. వంటచేస్తారా, పొడుంకాయ నాచేతి కిస్తారా? రెండే పద్ధతులు"

"తప్పదూ?"

"ఊహుఁ"

"అయితే పొడుంకాయ పుచ్చుకో"

"తెండి"

"నువ్వు వంట చేశాటప్పటికి నేను చెరువుకి వెళ్లి సంధ్యావందనం——"

"కట్టిపెట్టండి. సుమ్మం కదలడానికి వల్లకాదు. వీధిగుమ్మంకూడా తొక్కి చూడనివ్వను. మడి కట్టు కున్న తరవాత చేసుకోవచ్చు జపాలన్నీ నీ"

"అంత అనుమానం——"

"అనుమానం కాకపోతే యే మనుకున్నారూ? కదిలే రంటే మాట దక్కదు"

"సరే మరీ. వంట అయినాక యిస్తావా పొడుం కాయా?"

"భోజనా లయితే గాని యివ్వను"

"ప్రాణాలు కొరికేశా వన్నమాట. అయితే మరి కానియ్యి"

"వూరికే కూచోడం యెందుకూ? దొండపాదుకి నాలుగు బిందెల నీళ్ళు పొయ్యండి"

"............"

"లేవ రేం? నీళ్ళు పోస్తేనే వ్రతం చెడెను"

"తోడతానులే. నువ్వు వెళ్లి మడికట్టుకో"

"ఇంటోకి రండి తలుపు వేస్తాను"

"కోపం వస్తే వొళ్ళు తెలవదు. పట్టు వొస్తే ముందూ వెనకా చూడవు. తోచినంత పనీ చేసి తీర తావు. ఈ కళంకం వొక్కటే లేకపోతేనా—మరి నీ యిష్టప్రకారమే నడుచుకుంటాను పద"

"అలా దారికి రండి"

## ౧౦

"ఈ పూటేనా యేమేనా చెయ్యకపోతే తినడం యెలాగో చెప్పు నువ్వు"

"చెయ్య డానికి తీరుబడి యేదీ? దీపాలుపెట్టే దాకా మడికట్టుకోవడం యెవరో తేలకపోయె. అన్నం వార్చేటప్పటి కింత రాత్రయింది. ఏ కూరేనా చేద్దా మంటే—"

"పెసరపప్పు పచ్చడేనా చెయ్యరాదూ?"

"లేందే"

"కందిపప్పో?"

"ఎంతసేపటికీ నలగదు బాబూ"

"పోనీ మజ్జిగేనా పోగచకూడదూ?"

"నిన్న నయింది కాదూ?"

"ఇప్పు డేం తిన మంటావో చెప్పు కోప్పడక"

"వింటారా?"

"............"

"చెప్పమని మిడుతూ మిడుతూ అలా చూస్తా రేం మరీ? ఆ త్తేరీ యిలా చెప్పడమే మని యెగిరిపడక బాగా ఆలోచించుకోండి"

"................"

"ఝాము రాత్రయింది. సగం వూరు మాటుమ ణిగిం దప్పుడే. ఇక మీరు వీధిలోకి వెళ్లనూ వెళ్లరు. మన యింటికి కవరూ రానూరారూ. ఇంతట్లో అమాం తంగా బ్రాహ్మణ్యం పోదు. కాస్త పులుసు—"

"ఉల్లిపాయల పులుసే!"

"చేదా? ఏప్పుడూ రానంత రుచి వచ్చిం దివాళ. జిహ్వ సెందుకు చంపుకుంటారూ? నాలుగు తమలపాకు లిస్తాను వేసుకోండి యివాళకి. గప్‌చిప్. తెల్లారేటప్పటికి యేమీ వుండదు. నామాట వినండి"

"................."

"ఏమంటారు? వెయ్యనా?"

"ముందు పీక పిసికేసి తరవాత వెయ్యి"

"ఎంత సరసంగా వుం దీమాటా? తింటే తినండి లేకపోతే మానండి. నన్నేం వుద్ధరిస్తారా? చెప్పినకొద్దీ మరీనీ. నాకోటే మీకోటే నేను చెయ్యలేను. దిక్కు మాలిన వ్రతాలు పట్టి కడుపు కాల్చుకోవడం నాచేత కాదు. చల్లేనా కావాలా అక్కర్లేదా? పొద్దున్న పద కొండింటికి తిన్న మెతుకులు. నాకాక లేస్తాంది. తొర గా తెమల్చండి"

"పొద్దున్న మూడు అరటిపళ్లు తెచ్చాను. అవ్వే నా పడెయ్యి విస్తట్లో"

"కూచున్నాయి"

"ఏం చేశావూ?"

"మూడుగంటల వేళ కడుపులో చురచుర లాడితే అబ్బాయీ నేనూ నోట్లో వేసుకున్నాం. అట్టెపెట్టమని చెప్పలేకపోయారూ మరీ?

"పెరుగుందా?"

"ఇందాకా అబ్బాయికి వడ్డిస్తూ వుంటే అంట చెయ్యి తగిలింది"

"పోనీ పాలు పట్టుకురా"

"ఇంకా దాలి మీద పెట్టలేదు. పచ్చివి పని కొస్తాయా?"

"యింతసేపటిదాకా యెందుకు పెట్టావు కాదూ?"

"కారణం చెబితే మాత్రం యిప్పుడు మీకు పాలు వస్తాయా?"

"పోనీ చల్ల పుల్లగా వుంటుం దేమో నిమ్మ కాయేనా అట్టే పెట్టావా?"

"వుప్మాలోకే చాలింది కామా"

"ఎందుకు చేశావూ వుప్మా?"

"సుందరంగారియింట్లోవున్నన్నాళ్లూ పొద్దున్నా మధ్యాహ్నం కూడా కాఫీవుప్మాలు పుచ్చుకొని అతను వొస్తే వూరికే పంపనా?"

"ఎంతసేపురా నువ్వూ నీవాళ్లేగాని నామాట చూడనక్కర్లేదూ?"

"మేం యేదిపడితే అది తింటాం. అంచేత మా కన్నీ వస్తాయి. నేనమ్మా మహా చదివి గుట్టలు పెట్టానని అది పనికిరా దిది వల్లకా దని ముక్కు మూసుకు కూచుంటే మీ కెలా వస్తాయీ? పైగా యేమీ— అన్నమేనా సరిగా పెట్టడం లేదని నన్ను యాగీ చెయ్యడమా? ఏదీ, నేను చేసిన వన్నీ తినండీ. మీ కేమేనా లోటు జరుగుతుం దేమోనూ"

"మాలకూడు తిన మంటావా?"

"వుల్లిపాయ మాలకూడా. బంగాళాదుంపలు కిరస్తానీవాళ్లవా? కేబేజీ చెడిపోయిందా? గోంగూర పచ్చడిలో లెక్క రెండు వెల్లుల్లిరేకలు పడేస్తే బ్రాహ్మ ణ్యం బుగ్గయిపోతుందా? వుప్మా తింటే దేవతార్చన డెక్కడుతుందా? కాఫీ పుచ్చుకుంటే జంధ్యాలు మైలడి పోతాయా? దిక్కుమాలిన ఆవుపేడ ముట్టుకోలేక విస్త రంటలు తీసినచోట పసుపునీళ్లతో కడిగితే అనాచారమా?

"నీకు పుణ్యంవుంటుంది కాని మాట్లాడక చల్లేనా మరికాస్త పొయ్యి"

"మరి కాస్త కాకపోతే అంతా పోసుకోండీ. మా నాన్న ధర్మమా అని నిక్షేపం లాటి గేదివుంది కదా?"

"పూటకి మానెడుపాలకి తక్కువ యివ్వదు పాపం. నాకుమాత్రం ప్రతీపూటా పెరుగు—"

"పాలికాపాడు సుగ్గిస్క వేసి దానికి పెట్టడానికి వల్లకాకపోయె. ఎక్కడ చావనండీ?"

"వాడిచేత వేయించడం మానేవా?"

"మీరు చెప్పినట్లల్లా వింటే మట్టి కొట్టుకు పోవాలి. మజ్జిగ చాలా, యింకాస్త పొయ్యనా?"

"గిన్ని యిక్కడ పెట్టు"

"అలాగే పెడతాను పోసుకోండి. నా కాకలి దహించుకు పోతోంది. వడ్డించుకుంటాను బాబు నేనూ"

"ముప్పైయ్యేళ్లు నిండాయి. ఇంకాకంచం పెట్టుకు తగులడాలా?"

"పింగాళీ పళ్లా లింతకంటే బాగుంటాయి, ఎప్పటి కప్పుడే మరిచిపోతున్నాను. ఈ మాటు సుందరం చేత తెప్పించుకోవాలి"

"దొరసానిలాగ సిగరెట్టుకూడా కాల్చు"

"మీ పాడుం కంటేనూ తప్పా అదీ?"

౧౧

"ఏవీ యిందాకా తమలపాకు లిస్తా నన్నావు లెక్క అయిదాకులూ వొక చెక్కా తెచ్చిపెట్టూ"

"పులుసు వేసుకుంటే యిస్తా నన్నాను కాని తీరి కూచుంటేనా?"

"పులుసుకీ తాంబూలానికీ సంబంధం యేమిటి?"

"అంతానూ. కాకపోతే మాత్రం ద్వాదశిపూటా తాంబూలం యేమిటే మీకూ?"

"పగలు రెండు ఝాములకే వెళ్లిపోయింది ద్వాదశి"

"పంచాంగం చూసుకుని వచ్చారు కామోసు సిద్ధంగాను. మీ బ్రాహ్మణ్యం పాడుచేసిన పాపం నా కెందుకూ? ఇక అమావాస్య వెళ్లాకే మీకు తాంబూ లాలు. ఆకు లెన్నో లేవు బాబూ ఇవాళ. మీ కిస్తే సుందరంగారి యింటికి వెళ్లీదాకా నాకు చాలవు"

"నాకు లేకుండా నీకు రోజూ తాంబూలం యేమిటే?"

"మీ పాదముకీ నాతాంబూలానికీ చెల్లూ"

"ఏడిసినట్టుగానే వుంది. తాంబూలం తెమ్మంటే దున్నపోతులాగ అలా పడుకుంటావేం?"

"తెల్లవార్లూ కూచుని తిట్టుకోండి"

"అబ్బాయిని వుయ్యాలలో పడుకోబెట్టావా యేమిటే?"

" ఎక్కడైతే యేమి? నాకు నిద్ర వొస్తోంది నన్ను మాట్లాడించకండీ యింక"

"ఏం యివాళ యింత పెంకలాడే నిద్రా?"

"ప-గ-లు-ని-ద్ర-పో-లే-న్"

---

## ప్రత్యక్ష లీల

విద్వాన్ కోపల్లె శివకామేశ్వరరావు గారు

నీ పదభక్తి కంటకవనీ పథికుల్ జొనరించునో సుమ
ప్రాపకహానో యెంతటి త్వరన్ నినువేఁడిన నేమి తెల్ప క
ట్లా పరువంపుఁ జిర్నగవులందలి మాధురి కానఁగొల్పు దా
హా! పరువెత్తనేర నిఁక నామృగతృష్ణలవెంట మానినీ!

దీనతావార్ధి తితీర్షుల కీమణిసేతువు మార్గసంధాత యగును
దృష్టాతమోబిభిదిషుల కీచాంద్రమస జ్యోత్స్న నిస్త్రింశసరణిఁదాల్చు
నీహాతపన విసహిష్ణుల కీయంబుజము శిశిరశిశిరచ్ఛాయ లొసఁగు
నార్తి వ్యామార్త్రి జిహాసుల కీసహస్రమయూఖుఁ డుదయ భాస్వరతఁ గూర్చు
ననుచు భవదీయ మృదులపాద నఖమణి మ-యూఖశీతలచ్ఛాయామోదయోప బృంహి
త సుఖసేవాపరత దరిద్రాణ దుఃఖుఁ-డ నగు దంచుఁ దలఁపఁ గన్పడ విది తగునొ.

అదియేమో యటులుల్ దిరస్కరణ విద్యానైల్యముల్ జూపుచు
న్నది నీహాసవిలాస; మంబువులిటుల్ హాలాహలంబౌనొ; యిం
త దురంతవ్యథ నిక్కమున్నదొ భవద్దాస్యంబునన్ గోర్కెచి
చ్చెదఁదాఁగొల్పఁగ నోక్క కన్పడెదు; నీ యీలీల కర్థంబెదో.

వల; దేలా నన్నిత్తి-ప్పలఁ బెట్టెదవు తరుణీ, విముగ్ధేక్షణ శృం
ఖలలన్ బూవుల హార-మ్ములటంచు మెడఁ దవిలించి పారిపుచ్చెదవా?

లాలనతోడి మెల్పు పదిలంబుగఁ బల్కిన నోరి ముత్తెముల్
చాలునో, నీవచస్సుమమరంద పిపాసకు నారు పెన్నదుల్
బోలదో, నన్నువంటి జడబుద్ధులె నీకయి యాలపింత్రో, లే
దా లవ మైన నీ హృదయ మార్ద్రము కాదో యెఱుంగఁ జెప్పుమా.

దూరదూరస్థితవయి నీతోడిదాన-ననుచు నాసఁగొల్పెదు చెయ్వులటులుసూపి
లలన, నామనీషా నిర్మలతహరించి- యీనిరంతరధ్వాంత గూహితునిఁ జేతె!
పూవునుండి యొండుపూవు దరియు తెమ్మె-రలఁ ద్వదీయమూర్తి రాణమెసఁగుఁ
గాని, కాల్నిలుపవొకటఁ గాంత, స్వైరిణ్య-పాంగవిద్ధబుద్ధి నైతి నేను.

భయమగుచున్న దయ్యయొ యభాగ్యుఁడ ధర్మువు వీడి తొక్కఁ ని
ర్భయము ప్రతిష్ఠ యామె యనురాగ కటాక్షలతాలతాగ్రమై
న యెడ లభించునన్ పలుకు నాయెడ సార్థకమయ్యె నంచు; నీ
చెయిఁగొని యున్న త న్విడచి, చేతుల కందక కానుపింతువా!

ఆ చిఱునవ్వు మాటుఁ గొని యయ్యవె నాయెదపూవుఁ జింప నో
హో చనుదెంచె నీకనులనుండి శిలీముఖ పంక్తు; లింత బా
ధాచణమైన నీవలపు దక్కినఁజాలు నటంచు ముందుగా
నాచెయి సాగెదున్ వెతఁ బెనంగొని యుండఁగఁబోలు మాధురుల్.

---

# వ్యోమవధ

భోగరాజు నారాయణమూర్తి గారు

(ఏకాంక నాటకము)

## పాత్రలు

| పురుషులు | స్త్రీలు |
|---|---|
| కృష్ణుఁడు | యమున |
| బలరాముఁడు | శారద |
| వ్యోముఁడు—(కృష్ణునిజంపుటకుఁ గంసునిచేఁ బంపఁబడిన రాక్షసుఁడు) | మల్లిక |
| | మధుర |
| శ్రీదాముఁడు—గోపబాలురలో ముఖ్యుఁడు. | గోపికలు |

### 1 వ రంగము

[ప్రదేశము- బృందావనము; ప్రవేశము- వ్యోముఁడు]

వ్యోముఁడు

ఆహా! నే నెంత యదృష్టవంతుఁడను? మా కేశి బావ కృష్ణునిచేఁ జంపఁబడుట నాపుణ్యాము ఫలించుట. అతఁడు తురగాకారమున నొక్కమారు కృష్ణునిపైఁ బడుట వట్టి యవివేకము. రాక్షస మాయాప్రభావంబెల్లఁ బ్రకటించిమోసపుచ్చి యాబలరామకృష్ణులఁ దుదముట్టింపవలసియుండెను. నేనట్లే కావించి మా కంస మహారాజు మెప్పవడసెదంగాక! ప్రభువును నేనర్థించు పారితోషికము లీబృందావనమును ప్రేపల్లెయు. గోపికాసామ్రాజ్యమునకెల్ల నేనే పట్టభద్రుఁడనై యుండున్న సుందరాంగన లందఱితో నమందభోగము లనుభవించుమహాభాగ్యము నాజాతకమున నుండఁబట్టి యే కేశికడ తేరినాడు.........ఏమిది? కేశింజంపి యింత సేపైనను గృష్ణుని జాడ లెందును గానరావేమి?

(తెరలో)

ఇవిగో జాడలు! శారదా! మల్లికా! మధురా! ఇవిగో యశోదకొడుకు పరుగిడిన యడుగుల జాడలు! రండు! రండు!

[ప్రవేశము—నేలనడుగులజాడలఁ బరికించుచు యమున—శారద—మల్లిక— మధుర.]

యమున

సీ. "ఈచరణంబులే యిందునిభానన!
సనకాది మునియోగ సరణినొప్ప

శారద

యీపాదతలములే యెలనాఁగ! శ్రుతి వధూ
సీమంతవీథులఁ జెన్నుమిగులు

మల్లిక

యీపదాబ్జంబులే యిభకులోత్తమయాన!
పాలేటి రాచూలి పట్టుఁగొమ్మ

మధుర

లీసుందరాంఘ్రులే యిందీవరేక్షణ!
ముక్తికాంతా మనోమోహనమ్ము

యమున

లీయనుగుల రజమె యింతి! బ్రహ్మేశాది
దివిజవరులు హాళి దిశలఁ దాల్తు;

శారద

రఖిలలోకజాల మాక్రమించుచు మున్ను
బలి నడంచె నివియె పద్మనయన!"

వ్యోముఁడు

(తనలో) ఇందుకే మోహము గ్రుడ్డిదందురు. ఆనల్లని వికారాకారముపై వీరికిట్టి మోహావికార మెట్లు జనించినదో నాకు నవ్వు వచ్చుచున్నది.

మల్లిక

యమునా! ఇం కెంతని వెదుకఁ గలము? నంద నందన వియోగానల దందహ్యమాన మానసులమై యెట్టులో సగము రాత్రి గడపఁ గలిగితిమి. ఇంక నీనిశా శేషమును గడపుటకు సాధన మాలోచించి చెప్పుము.

యమున

మల్లికా! నాకొక్క యుపాయము దోఁచుచున్నదే. ఇ య్యమునాతటినీ తటలతాకుటీరముల మనము నలువురమును గృష్ణలీలాప్రదర్శనము గావింతుమేని మన మెఱుఁగకుండ నిట్టె తెల్లవారును.

అందఱు

బాగున్నదే! బాగున్నదే. ఔనౌను.

శారద

బాగున్నది కాని నాటకప్రయోగము మిక్కిలి కష్టసాధ్యము. ఇంతకు మనప్రయోగమును జూచి యానందించువా రెవ్వరు?

వ్యోముఁడు

(నవ్వుచు) నే నున్నాఁడను గానా?

మల్లిక

చూచువారా?

ఉ. ఆవులు లేళ్లు నీ వన వి
హంగచయంబులుఁ బ్రేక్షకావళుల్
గాన యహర్నిశల్ తెరలు
గా నెసఁగన్ దెరలెత్తి దించువా
రావనజాప్తశీతకరులై చెలు
వొందఁగ నాట్యశాల బృం
దావనసీమగా మనము
నాటకమాడుద మంబుజాననా!

మధుర

మల్లికా! ఎంతచక్కఁగాఁ జెప్పితివే. నిజముగాఁ గృష్ణవేషమును వేయుటకు నీవే తగినదానవు.

యమున

నల్లకాదు. నాయక వేషమును నేనుసికొందును.

మధుర

యమునా! సంగీతమున మల్లిక కున్న పాండిత్యము నీకు లేదే. రసభంగము చేయక నా మాట విను.

శారద

మధురా! నాటకమునకు సంగీతమే ముఖ్యమని యవివేకుల మతము. విస్ఫుటవాక్కు, రసాభినయము లేని రాగాలాపము నాటక లక్షణము కాదు.

మల్లిక

అబ్బా; ఎందు కీవివాదము? యమునా! కృష్ణవేషమును నీవే ధరింపుము నా కక్కరలేదు.

వ్యోముడు

(తనలో నవ్వుచు) మీలో మీరేల తగవులాడెదరు; కృష్ణవేషమును నేనే తాల్చి మీయందఱిచే నాటకమాడించెదను తొందరపడకుడు.

శారద

మల్లికా! నాటకమేదో నిశ్చయింపక పాత్రధారణము నెట్లు నిర్ణయింపవచ్చును?

మధుర

ఔను—నిజమే. కృష్ణుని జన్మమునుండియుఁ బ్రారంభింతమా?

శారద

అబ్బా! కష్టమే. ఆమహామహుని జన్మరహస్యము లెవ్వరెఱుఁగుదురు? గొప్పకై తెలియని దానిని బూనుకొనుట కంటెఁ దెలిసినది కొంచెమే యయినను రసవంతముగఁ బ్రదర్శించుట మంచిది.

మల్లిక

పోనిమ్ము. శారదా! పూతనం జంపుటయు శకటాసురుం గూలఁదన్నుటయుఁ దృణావర్తునిఁ బరిమార్చుటయు మున్నగు కృష్ణ లీలలు ప్రయోగార్హములు కావా?

శారద

కావననుగాని సామాజికుల సామర్థ్యమునుబట్టి నాటకమును నిర్ణయించుకొనవలయునుగాని పెద్ద పలుగులు పలుపెత్తరాదు. ప్రస్తుతము మనమున్న వారము నలువురమే. వలసినన్ని పాత్రలులేక కథ............

యమున

అబ్బా! ఈవిమర్శనము చాలించి కథయేదో నీవే చెప్పరాదా?

శారద

మహేంద్రగర్వభంగమను పేర శ్రీకృష్ణుని గోవర్ధనోద్ధారణకథావిధానము ప్రదర్శనార్హమని నాయుద్దేశము.

అందఱు

(అంగీకారసూచకముగఁ దలలూఁపుచున్నారు)

మల్లిక

శారదా! కృష్ణవేషమును నీవే యుంచుకొని తక్కినపాత్రల నిర్ణయింపుము.

శారద

నిర్ణయించుట కేమున్నది? ముఖ్యమైనపాత్రలు కృష్ణుఁడు, దేవేంద్రుఁడు. నీవు దేవేంద్రుఁడవు కమ్ము. మధురయు, యమునయు నవసరోచితముగఁ దక్కినవాని నభినయింతురు.

మల్లిక

సరే! యింకఁ బ్రారంభింతము. మీరు దూరముగఁ బొండు.

(తక్కిన ముప్వురు నిష్క్రమింతురు)

మల్లిక

(ముందుకువచ్చి) ఏమి యీకృష్ణుని కండకావరము?గోపాలక ప్రముఖులైన నందాదులందఱు నా యనుగ్రహమును బడయ నింద్రయాగంబొనరింప సమకట్టియుండ, నీ దుష్టగోపాలకుండు దురుపదేశములతో వారి ప్రయత్నములు వారించి, నాయాగమునకు భంగము గలిగించి నన్నెంత పరిభవించినాఁడు? ఈ కూళతనంపు గొల్లకొలంబున కెల్ల నేనిప్పుడే ప్రళయంబు గల్పించెద. (ప్రక్కకుఁజూచి) ప్రళయకాల ప్రవర్తకంబులైన యో సంవర్తక మేఘంబులారా! మీ రిటురండు.

[నల్లని ముసుఁగులతో మధురయు, యమునయుఁ జేరియొక ప్రక్కనుండి ప్రవేశింతురు.]

ఇద్దఱు

విజయోస్తు, విజయోస్తు మహేంద్రా! ఏమి యాజ్ఞ?

మల్లిక

ఓమహామేఘంబులారా!విధివశమున నాకిప్పుడు గొప్ప పరాభవము సంభవించినది

మ "పెరుగుల్ నేతులు ద్రావి క్రొవ్వి భువినా
భీరుల్ మదాభీరులై
గిరిసంఘాత కఠోర పత్ర దళన
క్రీడా సమారంభ దు
ర్భర దంభోళిధరుం బురందరు
నను౦ బాటించి పూజింప క
గ్గిరికిం బూజలు చేసి పోయి
రిదెపో కృష్ణుండు ప్రేరేపఁగన్.

ఇద్దఱు

ఆహాహా! ఎంతసాహసము! ఎంతసాహసము!

మల్లిక

కావున మీరు సత్వరంబుగ నేగి నిజస్వరూపములతో నావ్రేపల్లెపై నెల్లకడలఁ దాండవమాడుచు నుద్దండ దిగ్వేదండ తుండ నిభాఖండ వారి ధారాపాతంబులఁ బోతరించిన గోకుల వ్రాతమునెల్ల నిర్మూలముగావించి రండు. ఐరావతముపై నేనును మీ వెను వెంటనే బయలు దేరెదను పొండు.

ఇద్దఱు

చిత్తము, దేవా! చిత్తము. (నిష్క్రమింతురు.)

(మల్లిక తలయూపుచు సగర్వముగా నిష్క్రమించును)

వ్యోముఁడు

ఈనాటకములో నేనుఁగూడ నొక యంతర్నాటకమును బ్రయోగింతునా? బలరామకృష్ణులు రాకమునుపే నేనును గోపాలక వేషముదాల్చి యీగోపికల మోసపుచ్చి యీకొండ గుహాలో దాఁచినేసెదను. రామకృష్ణులనుసూక్ష్మముగాఁ గడతేర్చుట కిదియొక సాధనమగును. గోపికల వెదకు మిషపై మెల్లగాఁ వారి నెచ్చటికేనిం దీనికొనిపోయి యొక్కొక్కని నాకస్మికముగఁ దుదముట్టింపవచ్చును.ఎంతమంచి యుపాయము స్ఫురించినది? నావంటి బలవంతుఁడైన బుద్ధిమంతున కేకార్యము సాధ్యముగాదు? అదిగో! కృష్ణవేషమును బ్రకటించుటకై శారదవచ్చుచున్నది. ఇంక నేనును నా వేషమును దాల్చి

న్నానాటకమునుగూడ నారంభించెదను.(నిష్క్రమించును)

[ప్రవేశము శారద]

శారద

అబ్బబ్బా! ఈమేఘాడంబరమెంత భయంకరముగనున్నది? (ఆకసమును జూచుచు) ఏమియీ మెఱుపులు! ఈ ఝంఝామారుతము లోకము నెత్తుకొనిపోవునాయేమి! ప్రపంచమును ముంచివేయుచుండిన యీవడగండ్ల వానవలన నేమి కడగండ్లు మూడునోకదా? ఈమహోపద్రవమునకుఁ గారణ మేమైయుండును? (ఆలోచించి) తెలిసినది! తెలిసినది! ఓరీ మదాంధా! మహేంద్రా! తొందరపడకుము! నీకుగర్వభంగముకాఁగలదు.

(తెరలో) కృష్ణా! రక్షింపుము! రక్షింపుము.

శారద

(తిరిగిచూచి) ఆయ్యయ్యో! ఈమహావర్షపాతంబునఁ జిక్కి గోపికలును, గోపాలురును భయాతిశయంబున నన్ను శరణు చొచ్చుచున్నవారు. ఇప్పు డీగోవర్ధనగిరి నాకేలందాల్చి మదాంధుఁడైన జంభారి యొనరించిన మోసము నుండి వీరిని రక్షింపవలయు. (ముందుకేగి) ఓగోపికా గోపాలక రత్నములారా! మీరందఱుఁ బరుగుపరుగున మీ మీగోగణంబులతోవచ్చి యీపర్వతముక్రింద నిర్భయముగ నుండుఁడు. (కొంచెమూరకుండి)అయ్యయ్యో రారేల? ఈమహాపర్వతము మీపై జారవిడిచెదనేమో యని జడియుచున్నారా?

శా. బాలుం డీతఁడు కొండ దొడ్డది మహాభారంబు సైరింపఁగాఁ
జాలండోయని దీనిక్రింద నిలువన్ శంకింపఁగాఁ బోలఁదీ
శైలాంభోనిధి జంతుసంయుత ధరాచక్రంబు పైఁబడ్డ నా
కేలల్లాడదు బంధులార! నిలుఁ డీక్రిందన్ వినోదంబునన్."

[ప్రవేశము- గోపాలక రూపముతో వ్యాసుఁడు.]

వ్యాసుఁడు

అమ్మా! శారదా! శ్రీకృష్ణుఁ డీ సమీపమున గోపాలురతోఁ గ్రీడించుచు నీయందఱిని వెదకి తోడుకొని రమ్మని నన్నంపెను

శారద

ఆఁ-కృష్ణుఁడా? ఎచ్చటనున్నాఁడు? యమునా! మల్లికా! మధురా! కృష్ణుఁడే కృష్ణుఁడే!

[ముప్వురు పరుగునఁ బ్రవేశింతురు]

(ఆతురతతో) ఏఁడీ? ఏఁడీ? కృష్ణుఁ డెక్కడ? అంతభాగ్యమున్నదా?

వ్యాసుఁడు

ఈపర్వత సమీపమున సెలయేటియొడ్డుని నిసుక తిన్నెలపై గోపాలురతోఁ గ్రీడించుచున్నాఁడు. నావెంట రండు.

[గోపికలు వ్యాసునివెంట సంభ్రమముతో నిష్క్రమింతురు]

2-వ రంగము.

[ప్రదేశము - బృందావనము - ప్రవేశము - కృష్ణుఁడు, బలరాముఁడు, శ్రీదాముఁడు, మఱికొందఱు గోపాలురు.]

శ్రీదాముఁడు

కృష్ణా! బలరామా! గోపికలజాడల నరసి తక్కిన మన గోపాలకులెల్లరును వచ్చువఱకు మన మిచ్చట విశ్రమింతము.

బలరాముఁడు

కృష్ణా! శ్రీదాముఁడు చెప్పినట్లుచేయుటకంటె మనకేమి కర్తవ్యమున్నది?

(అందఱు కూర్చుందురు.)

కృష్ణుఁడు

అన్నయ్యా! ఈ నిండువెన్నెలలో నీ యిసుక తిన్నెపై విశ్రమించి నంతనే ప్రాణము లెంత హాయిగ నున్నవి?

బలరాముఁడు

సోదరా! సాయంకాలము నుండియు నీబృందావన భూపరిసంచారమున నిక్కిలి స్రుక్కియుండుటయేకాక యందుపైఁగలిగిన కేశిదానవ వధోద్యోగము నీకింతటి శ్రమకుఁగారణమైనది.

గీ. క్రూరపలలాశి కేశినిఁ గూలనేసి
జగములకు మేలుగూర్చిన జాణవనుచు
శీతలోపచారంబుల శీతకరుఁడు
నిన్నుఁ గడుభక్తిఁ గొల్చుచు నున్నవాఁడు.

కృష్ణుఁడు

అన్నయ్యా! నిజముగా నా కేశిదానవుఁడు దేవ దానవ మానవ లోకములకెల్ల మహా భయంకరుఁడు.

ఉ. భీకర వత్స దానవునిఁ బీచ మ
డంచితి నాబకాసురుం
దాకివధింపఁ గంటి యమునంగల
కాళియుఁ బారఁదోలితిన్
ఆకొను సింగమట్లు వృషభా
సురుఁగూల్చితిఁగాని వీరిలోఁ
బ్రాకట ధైర్య శౌర్య బలరా
శినిఁ గేశిని మెచ్చితిం జుమీ.

బలరాముఁడు

కృష్ణా! అప్పుడప్పుడు నారదుఁడువచ్చి కంస సందర్భ ప్రసంగమునఁ గేశింగూర్చి ప్రసంగించు చుండుట నీకు జ్ఞాపకమున్నదా?

కృష్ణుఁడు

అయ్యా! లేకేమి? జగద్భయంకరుండైన కేశి మాట యటుండ నారద ప్రసంగమువలన మఱి యొకవిశేషమిప్పుడు నాకుజ్ఞప్తికివచ్చుచున్నది.

ఉ. కంసుని సేనలో గణన
గాంచిన వాఁడఁట! సాధుదేవతా
హింసల నద్వితీయుఁడఁట!
మెల్లవిధంబులఁ గేశి దానవో
త్తంసున కీడు జోడునఁట!
తద్రణభీముని వ్యోముఁ గూడ నా
కంసుఁడు పంపకుండుటకుఁ
గారణమేమొ యెఱుంగ నగ్రజా!

బలరాముఁడు

ఔను. ఆవ్యోమాసురుఁడు గూడఁ బ్రబలమాయా బలుండనియే వినుచున్నాము. అంత్యకాలము సమీపించినంతనే కంసప్రేరితుఁడై వాఁడును రాఁగలఁడు. తొందరయేల?

శ్రీదాముఁడు

ఆహా! నాఁటి దండకారణ్యమునందుఁ బోలె నేఁడు బృందావనమునందు రక్కసులు ప్రవేశించుచున్నారు. రామా! కృష్ణా! రామలక్ష్మణులంబోలె ధనుర్ధరులై మీ రింక నిరంతరము నప్రమత్తులలై యుండవలయును.

బలరాముఁడు

కృష్ణా! కాలమెంతలో మారినదోయీ!

సీ. సమద దానవ భుజా శాఖ లెక్కుటగాని
చెట్లెక్కు నాటలు చెల్లవింక
వీరదానవకోటిఁ బారఁ దోలుటగాని
పసులఁ దోలుచునుంట పొసఁగదింక
అసురపంక్తులఁబట్టి యాడించుటయె కాని
చలిదిపంక్తులయాట సాగదింక
జయసూచకంబైన శంఖారవము గాని
పిల్లఁగ్రోవిరవంబు చెల్లదింక
సంగరోచితవేషభాషలును గాని
గొల్లవేషంబు లీపైని గూడవింక
కదనరంగ విహారముల్ గాని మనకు
వనవిహారంబు లీపైని దనర వింక.

కృష్ణుఁడు

అన్నయ్యా! మీరుసెలవిచ్చినది నిజము. మన బాల్యక్రీడా వినోదము లెంతలోఁ గట్టిపెట్ట వలసివచ్చినది!

గీ. బాల్య యౌవనాదికములో ప్రాయములవి
యెఱిక లున్నవి తుఱ్ఱున నెగురఁగలవు;
ఎగుర తెక్కలు నడువఁ గాళ్లేని లేక
యకట! పీడించుచుండు వార్ధక మొకండె.

(అని మెల్లఁగా బలరాముని ప్రక్క మేను వాల్చును.)

బలరాముఁడు

కృష్ణా! నీబాల్యక్రీడ లన్నింటిమాట కేమిగాని, పిల్లనగ్రోవి నల్లన పెదవుల కడం జేర్చి యందు నీవు పాడుచుండు బ్రహ్మగంధర్వగీతము మాత్రము మా కెప్పటికిని మఱపునకు రాదు. ఎంత విన్నను దనివి తీఱదు.

శ్రీదాముఁడు

బలరామా! కృష్ణున కిప్పు డించుక నిద్రపట్టినట్లు తోఁచుచున్నది. మన మీతనికి నిద్రాభంగము గాకుండ——

బలరాముఁడు

ఔను. దూరముగ నుండియే మాటాడుకొందము.

(శ్రీదాముఁడు-బలరాముఁడు దూరముగఁ గూర్చుందురు)

బలరాముఁడు

శ్రీదామా! ఈకమ్మ తెమ్మెరలును, బికాలాపములును వేకువం బ్రకటింపుచున్నవి.

మ. కలనన్ దైత్యుల నుక్కడంచుచు జగ
త్కల్యాణ సంధానుఁడై
పలు భంగుల్ విహరించు కృష్ణునియెడం
భక్తిం బ్రదర్శించుచున్

కోడిపుంజు.



రంతుల్ మానుము కుక్కుటాధమ దరిద్రక్షుద్రశూద్రాంగణప్రాంతో లూఖలమూలతండులకణగ్రాసంబుచేఁ గ్రొవ్వి దు,
ర్దాంతాభీలవిశేషభీషణఘణాంతర్మాంససంతోషితస్వాంతుండైన ఖగేంద్రుకట్టెదుర నీజంజాటముల్ సాగునే?

శ్రీమతి శివలెంక కామాక్షమ్మ చిత్రించిన చిత్రము.

గలకంఠమ్ముల జోలఁ బాడుటకు నా
జ్ఞాపించి ప్రత్యూషశ్రీ
తల మందానిలుఁ డాత్మహస్తములతోఁ
దానిట్టు జోకొట్టెడున్.

శ్రీదాముఁడు

ఔను. అందుచేతనే కృష్ణున కింతలో నింత గాఢమైన నిద్ర పట్టినది. (ప్రక్కకుఁజూచి) మిత్రమా! మన మంపిన గోపాలకులలో నొక్కఁడు మాత్రమే వచ్చుచున్నాఁడు. తక్కిన వారెక్కడ నున్నారో? గోపికలు గానరాలేదు కాఁబోలు!

[ప్రవేశము-వ్యోముఁడు.]

బలరాముఁడు

ఓయీ! గోపికలు కానరాలేదా? తక్కిన మన వారందఱు నెక్కడ నున్నారు?

వ్యోముఁడు

అయ్యా! ఏమని చెప్పఁగలను? ఈ బృందావన మంతయు వెదకివెదకి వేసరితిమి. గోపికల జాడలేదు. పాపము మన గోపాలకు లెల్లరుఁ జింతించుచు నొకచోఁ జతికిలఁబడి మిమ్ముఁ దోడుకొని రమ్మని నన్నంపినారు.

బలరాముఁడు

సరియేకాని యంతవిచారింపవలసిన పనియేమి? వారు వ్రేపల్లెకుఁ బోయియుందురు. నీవుపోయి వారిని విచారింపవలదని చెప్పుము. కృష్ణుఁడు మేల్కొని నంతనే మేము గూడ వచ్చుచున్నాము.

వ్యోముఁడు

వారందఱు మీ కొఱకత్యాతురతతో నెదురు చూచుచుందురు. కృష్ణుఁడు మేల్కొనువరకు నే నిందుండెదను. మీరైన నేగి వారినిఁ గలిసికొనుఁడు.

శ్రీదాముఁడు

వలదు. వలదు. బలరామా! రాక్షస సంచారము ప్రబలమైయున్న యీ దినములలో మనము కృష్ణు నొంటరిగా విడిచిపోరాదు.

కృష్ణుఁడు

(త్రుళ్లిపడి లేచి) ఓరోరి దానవాధమా! వ్యోమా! ఇంకెచ్చటికిఁ బోఁగలవురా? (అని తటాలున వచ్చి వ్యోముని బట్టుకొనును)

బలరాముఁడు

ఆఁ-ఆఁ-కృష్ణా! అదేమి,అదేమి. ఇప్పుడు వ్యోముఁ డెచ్చటనుండి వచ్చినాఁడు? నీవు నిద్రలోఁ గల గంటివా యేమి?

వ్యోముఁడు

(తనలో) కొంపతీసి నన్నితఁడు పోల్చుకొనలేదుకదా?

కృష్ణుఁడు

(వ్యోముని విడిచి) అన్నయ్యా! వ్యోముఁడీ ప్రాంతమునకు రాలేదా?

బలరాముఁడు

లేదు. లేదు. వ్యోమునిం గూర్చి ప్రసంగించుచు నీవు నిద్రించుటచేత నీకట్టి కలవచ్చినదేమోకాని యిప్పుడు వచ్చినవాఁడు మన గోపాలుఁడు గాని వ్యోముఁడుగాఁడు.

కృష్ణుఁడు

ఆలాగునా? అట్టులైనఁ గలగంటిఁ గాఁబోలు!

వ్యోముఁడు

(తనలో) అమ్మయ్యా, ఇప్పటికి నాగుండె కుదుటఁబడినది. ఇంక నా ప్రయత్నము కొనసాగినట్లె. (ప్రకాశముగా) కృష్ణా! నీకేమి కల వచ్చినది ?

కృష్ణుఁడు

వ్యోమాసురుఁడువచ్చి మన బృందావనమునఁ బ్రవేశించి గోపికలనెల్ల నొక కొండ గుహలో దాఁచివేసినాఁడట!

వ్యోముఁడు

(కోపముతో) ఆఁ- ఆఁ- దుర్మార్గుఁడు! దుర్మార్గుఁడు! ఎంతసాహసము చేసినాఁడు?తరువాత?

కృష్ణుఁడు

(నవ్వుచు) అట్లుదాచివేసి గోపాలక వేషముతో నన్నుఁ గడతేర్చుటకై మెల్లఁగా నిచ్చటకు వచ్చినాఁడఁట!

వ్యోముఁడు

అహ్హా హ్హా హ్హా! రాక్షసులు కామరూపులు కదా? తరువాత, తరువాత?

కృష్ణుఁడు

వచ్చినంతనే యమ్మాయగోపాలుఁడువ్యోముఁడని నేను గ్రహించి—

వ్యోముఁడు

(భయాశ్చర్యములతో) ఆఁ?—

కృష్ణుఁడు

తటాలున నిట్లు వాని నడుమును బట్టి, (అని వ్యోముని నడుముపట్టి)యిట్లుగిరగిరఁద్రిప్పి(అని వ్యోముని గిరదిరం ద్రిప్పి) కడకీరీతి నేలం గూల నేసితినఁట! (అని వ్యోముని నేలగూలవేయును)

శ్రీదాముఁడు-బలరాముఁడు

(నేలఁగూలిన వ్యోమునిఁజూచి, గుండెలు బాదుకొనుచు) ఏమి యాశ్చర్యము? ఎంత భీకర స్వరూపము?

కృష్ణుఁడు

అన్నయ్యా! వీఁడెవఁడో యిప్పుడైన గ్రహింపఁ గలిగితిరా?

బలరాముఁడు

కృష్ణా! ఈమాయగోపాలకుఁడు దుష్టదానవుఁడని నీవెట్లు గ్రహింపఁగలిగితివోయి! సర్వజ్ఞుఁడవగు నీవెఱుఁగని దేమున్నది? ఎంత గొప్ప గండము గడచినది?

శ్రీదాముఁడు

సామాన్య గండమా? నిజముగా నీ రాత్రివంటి రాత్రి యిదివఱకెన్నఁడును సంఘటిల్లలేదు. (చేతులుమోడ్చి) వాసుదేవా! నీవు మహాయోగీశ్వరేశ్వరుండవు. భక్తత్రాణ పరాయణుండైన పరమేశ్వరుండవు.

"మ. గురుపాఠీనమవై జలగ్రహమవై
కోలంబవై శ్రీనృకే
సరివై భిక్షుఁడవై హయాననుఁడవై
క్ష్మాదేవతా భర్తవై
ధరణీనాథుఁడవై దయాగుణగణో
దారుండవై లోకముల్
పరిరక్షించిన నీకు మ్రొక్కెద మిలా
భారంబు వారింపవే"

కృష్ణా! దుష్టభంజనమును శిష్టరంజనమును గావింపనుద్దేశింపఁబడిన నీయవతారకలనవలన సకలజగంబులకుఁ గల్యాణంబు లగుఁగాక!

కృష్ణుఁడు

శ్రీదామా! అట్లే యగుఁగాక!

## ప్రభు ఋణము

ఆరవిల్లి నరసింహాచార్యులు గారు, బి. ఏ. (సారస్వతసమాజము)

(గీ త మా లి క)

౧

కాలపురుష ధనుర్ముక్తకాండవితతి - రక్తసిక్తాంగుఁడై గ్రహరాజు పశ్చి
మాద్రిఁ దలదాచుకొనుటకై యరుగుచుండె - కాని యీ ఘనుఁ డట్టులు గాక, కదన
రంగమున ఖడ్గసన్నిధిఁ బ్రభువుకొఱకు - మేను వాల్చెను—సామంతుఁడైన నేమి!
తనువుదాల్చిన యట్టిక్షాత్రమ్మొ, మూర్తి-దాల్చు ప్రభుభక్తి-యీతఁడే దైవసముఁడు.

౨

పన్హాళాదుర్గము శివాజిప్రభువు విడచి - వచ్చు టెఁగతి నెఱిఁగె నెవ్వర మెఱుఁగము!
ఎదురుగాఁ బోయి స్వాగతమిచ్చె నంత - (బీజపుర సేన లణఁగెను పేరులేక
అడుగు తడబడు తొందర పడఁగనేల) - 'జయ మహారాజ' యని మేము సందడింప
నాపి సేనాధిపతిఁ బ్రియమారఁ బిలిచి - తండ్రి! శ్రీబాజి ప్రభువును దనయుకన్న
ప్రియముతోఁ జూచి కంటిని ఱెప్ప పోలె - కాచితివి నీ ఋణముఁ దీర్పఁగలనె చెపుమ!

సిద్ది బల్లాలు సేనలఁ జేర్చి ముట్ట-డించి కోట బందీలఁ గావించ వారి
యాగడ మణంచి యవకాశ మబ్బఁజేసి - శ్రమపడితిరయ్య, నీవు, వీరాగ్రగణ్యు
లైన యీమహారాష్ట్ర సైన్యాళి: యింక - రాజగడమున కొంత విశ్రాంతిఁ గొనఁగ
రమ్మనఁగఁ గేలుమోడ్చి, 'విశ్రాంతిప్రజల - కొసఁగనిండు ప్రభూ: శత్రు విసరములను
పరగణా వెళ్లఁగొట్టి మీ పాదపద్మ - సేవ కరుదెంచు నీవృద్ధ సేవకుండ'
టంచు సర్ధోక్తి సవ్వడి యాలకించి - 'వారె వెన్నాడివచ్చుచున్నారు వైరు
లడ్డగించెద నేను మీ రాఁగరాదు - కోటఁ జేరుఁడు: తెలుపుఁడు కొమ్ము నాఁడి
క్షేమమును: తామసించినఁ జిక్కు-వచ్చు' - నన్నఁ బ్రభువేగ జివ్వున—అంతలోన
బీజపుర సేన లరుదెంచె రోజుకొనుచు.

౩

'త్వరపడుఁడు లోయ నరికట్టి తాకుఁ డరుల-ప్రాణముల నిచ్చి రాజుఁ గాపాడఁదగిన
తరుణమిది మన దేహముల్ ధన్యములుగ - శ్రీభవాని యనుగ్రహించెడును నేఁడు

౪

పొడువుఁడీ నెట్టుఁడీ వెన్క కడుగు కదుపఁ - బోకుఁడీ రక్తమును ధారవోసి రాజుఁ
బ్రజల దేశముఁ బ్రోవుఁడీ రక్తధారఁ - గఱకుఁదనమును వీడదు 'ఖడ్గ: మొక్క
శ్రీశివాధిపు సేవకు చేత ఖడ్గ-ముండ మీశక్యహాని? పోకుండ నిలుపుఁ
డామెడ సెబాసు! ప్రాణాల కాసపడెడి - యోధుఁడున్నె శివప్రభునోలగమున.

౫

చూడుఁ డటు శత్రువుల్ తలసూపలేక - విరిగి పరువెత్తుచున్నారు విడువరాదు
దారి: ప్రభువును బట్ట మీ తరము గాదు - ఎవఁడు! మీ నాయకుం డాతఁ డేలరాఁడు
తన గుడారము వీడి:—శాత్రవ కళేబ-రముల దారిని గప్పడీ ప్రభుఋణమ్ము
దీర్పుఁడు జయ భవాని! యేతీరునైన - అడ్డుపడుఁ డయ్య, చిరయశం బందుఁడయ్య.

౬

దారి యేల యొసంగ! శాత్రవకఠోర - కంఠరవములు క్రొత్తలా కరమునందు
ఖడ్గముండఁగ మీ రేగగలరె సింహ-మెన్ని హరిణంబులకు లొంగు నెంతసంఖ్య
యున్న మాకేమి? బెదురు మాయూర లేద'-టంచు గంభీర రవమున నరిహృదయ వి
దారణముఁగఁ బల్కుచు రక్తధార లొలుక - నెల్లెడలఁ దానయై మమ్ము హెచ్చరించి
శాత్రవావళి గుండెలు జార చిత్ర-గతులను జరించి మేమెన్నిగతుల వేఁడ
నిలిచి శ్రమదీర్చికొనకుండ నృపుని క్షేమ-సూచక ధ్వాన మాలించి 'శూరులార,
శ్రీశివప్రభుక్షేమంబు శృంగనాద-మునను దెల్పిరి మనవారు: మనకె జయము
ధన్యజీవిని: మన కుల దైవమైన - శ్రీ శివప్రభుక్షేమంబు చెవులఁబడియె'
ననుచు ధర వ్రాలి ప్రాణంబు లట్టె విడచె.

౭

చెదరి పరువెత్తెడి విపక్షసేనలన్ని - తిరిగె నాతఁడు పడువెన్క తెగువఁజూప
కాని మన వీరు లీధీరుకాయ మరుల - పాలుగా నిచ్చగింపక ప్రాణములను
సరకుగొనకుండఁ బోరి దుస్సహగతి రణ-మున నెదుర్కొని తెచ్చి రీయనఘుకోటఁ
జేరవచ్చితి మదె శివాజీప్రభుండు-గాంచుచున్నాఁడు కన్నీరుగార్చు ప్రభువు
నూరడింపుఁడు: దేవ! మేమోపినంత - చేసితిమి స్వామిభారమ్ము మోసి యతని
ఋణముఁ దీర్చితి మింక మా కేమివలయు! - ప్రభుఋణము దీర్చికొనఁగ నెవ్వరికివశము?

---

# అరసున్న

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

(ఆంధ్రభాషావతారముననుండి)

తెలుఁగుభాషకుఁ దోడిభాషలగు ద్రవిడ కర్ణాటములందుఁగాని, ప్రకృతులగుసంస్కృత ప్రాకృతభాషలందుఁగానియరసున్న లేదు గదా! అట్టిచో నిది తెలుఁగున నెప్పుడుపుట్టినది? ఎట్లు పుట్టినది? భాషాలక్షణములను బరిశీలించుచుఁ బూర్వపూర్వకాలమునకుఁ బోనుపోను ద్రవిడ కర్ణాటాంధ్రభాషల భేదము తక్కువతక్కువై మూఁడు నొక్కటిగానే యున్న కాలముగూడ నొకప్పు డుండుటను మనము గుర్తింపఁగలము. ఈమూఁడుభాషలకును కాలము కడవను కడవను భిన్నభిన్నరూపములు పెంపొందె ననుటకుఁ బ్రబల సాధనములను బ్రకరణాంతరమునఁ జెప్పితిని. ఇట్లు పరిశీలింపఁగా నన్నయకుఁ బూర్వకాలమున నీయరసున్న యున్నదనుట కాధారము నాకుఁ గానరాకున్నది. నన్నయాదులనాళ్లనుండియే యరసున్న వెలయఁజొచ్చినట్టు వారి గ్రంథములఁబట్టి గుర్తింపనగుచున్నది. సహజముగాఁ బదమందున్న ఒక యక్షరమునకో కొన్ని యక్షరములకో ఆదేశమై వచ్చినదిగాని నాసిక్యహల్లు ఇతరహల్లుతో సంయుక్తమయినప్పు డేర్పడిన హల్ ద్విత్వము శిథిలముకాఁగా నందలి శిథిలానునాసికమే యరసున్నగా నన్నయాదులకాలమున నుండి మాఱెనని చెప్పఁదగును. దీని కించుక వివృతి:—

ద్రవిడ కర్ణాటభాషలలో సంయుక్త హల్లులు పూర్వాక్షరమునకు గురుత్వమును గల్పింపకుండఁ బెక్కులు గలవు. అట్టివానిలో పెక్కింటి ద్విత్వము తెలుఁగుఁదనము వేర్పడి యేర్పడిననాఁటికి మాసిపోయినది. తెగళ్గుం నెగళ్గుం ఇత్యాదులు తెగడుఱ్, నెగడుఱ్ - ఇత్యాదిరూపములఁ బడసినవి. హల్ద్విత్వములో ద్వితీయహల్లు లోపించినప్పు డిట్టిరూపము లేర్పడినవి. మొదటిహల్లు లోపింపఁగా నేఁటి మన యరసున్నయైనది. మెఱుమ్=మెఱుపు. దీనిమీఁద బహువచనప్రత్యయ మగు 'కళ్' గలయఁగా 'మెఱుమ్గళ్' అయ్యెను. 'కళ్' ప్రత్యయమే తెలుఁగుఁదనమునుబడయునాఁటికిఁ బెక్కుశబ్దములమీఁద 'గులు' గాను, 'గలు' గాను 'కులు' గాను 'కలు'గాను మాఱి, తొలి యక్షరములగు 'గు' 'గ' 'కు' 'క'లు ప్రాతిపదికమునఁగలసి బహువచనప్రత్యయముగా, 'లు' మాత్రమే మిగిలెను. అడుగులు, నుడుగులు, గొడుగులు, వెలఁగలు, ఈఁగలు, కొలఁకులు, వలఁకుతు, చిలుకలు, ఎలుకలు ప్రభృతు లిట్టివే. క్రమముగా మెఱుమ్గళ్, మెఱుమ్గుళ్, మెఱుమ్గుళు మెఱుమ్గులు అనురూపము లేర్పడెను. ఇక్కడ వికల్పముగా శిథిలద్విత్వ మేర్పడుటచే మకారమును ఊఁది పలుకుట, తేల్చిపలుకుట యను భేదముచే రెండు రూపము లేర్పడినవి.

ప్రాకృత సంప్రదాయమునుబట్టి వర్గానునాసికములకు సున్నపెట్టుట యేర్పడఁగా మెఱుంగులు అనురూపమేర్పడెను. ద్విత్వము శిథిలము కానప్పుడు ప్రాయికముగా 'మెఱుంగ్గులు' అను లిపియును శిథిలమయినప్పుడు 'మెఱుంగులు' అను లిపియును ఉండెను. లిపిలో అరసున్న వ్రాఁత మున్నూ తేండ్లకుముందు లేనేలేదు. ఈబహువచనరూపమునుండి ప్రత్యయావయవమగు 'గు' ప్రాతిపదికమునఁ జేరఁగా మెఱుంగు, మెఱుఁగు అని యేకవచన రూపములు పుట్టెను. నన్నయనాఁటి కీపరిణామము ప్రబలమయి శిథిలద్విత్వమను వ్యవహారము శిథిలము కాఁజొచ్చినది. ప్రాకృత సంప్రదాయము చొప్పున వర్గానునాసికము తొలిహల్లుగాఁగల సంయుక్తాక్షరములందు అనునాసికమునకు బదులు సున్ననుంచు సంప్రదాయముపెంపొందఁజొచ్చినది. కర్ణాటకభాషలోఁగొన్నిశబ్దముల ద్విత్వమునకు నిత్యముగాను గొన్నింటికివైకల్పికముగాను శైథిల్యముగలదు. అట్టి పదములు మన తెల్గుఁదనమును బొందునాటికిఁ, గొన్ని యశిథిలద్విత్వములుగానే నిలిచినవి. కొన్నింట ద్విత్వములోపించి మొదటిదో, రెండవదోఏదో ఒకహల్లే నిలచినది. కొన్నింట ద్విత్వము విడఁబడి నడుమ నచ్చుగూడినది. కొన్నింట నాసిక్యముగాని తొలిహల్లు లోపించి తత్ స్థానమున నాసిక్యహల్లేర్పడినది. కర్ణాటకశిథిల ద్విత్వములకును దెలుఁగు శిథిలద్విత్వములకును, గొన్ని భేదములు గలవు.

మీఁదఁ బేర్కొన్న పదములలో వెలఁగలు, ఈఁగలు, కొలఁకులు, వలఁకులు అను వానిలో నిట్లే అరసున్నలు పుట్టినవి. వెలఁగ చెట్టునకు అఱవమున 'వెలమ్' అని పేరు. 'వెలమ్‌గళ్' నుండి వెలఁగలు వచ్చెను. ఈఁగలు - ఈపదములో 'ఈ' ప్రాతిపదికము,-కళ్ ప్రత్యయము, కలసి పరిణామములఁ బొంది తెలుఁగుఁదనము వచ్చునాఁటికి ఈఁగలు బహువచనరూపముగాను, ఈఁగ ఏకవచన రూపముగాను నయ్యెను. అఱవమున ఈఁగకుఁ బేరు 'ఈ' అనియే. బహువచనమున నది ఈగళ్ అగును. కాని యందు శిథిలద్విత్వ తల్లోపాదిక మేదియు లేదుగదా 'ఈఁగలు' అని తెలుఁగున నరసున్న యెట్లు వచ్చెను? అని ఆక్షేపము తోఁచును. పరిశీలింపఁగా నిందు శిథిలద్విత్వము కలదని యేర్పడును. మక్షికకు 'ఈ' అను పేరు అది చేయు ధ్వనిని బట్టి వచ్చెను. దానిధ్వనియగు ఈకారము యచ్చులలోనిదగు తాలుజన్య మయిన ఈ మాత్రమే కాదు. ఈ ఈకారము ప్రధానముగా నాసిక్యముగూడ నగును. ఒక రేదేని చెప్పుచున్నప్పుడు వినువారు 'ఊఁకొట్టుట'లో ఊకారముకూడ నిట్లే ఓష్ఠ్యము మాత్రమే కాక నాసిక్యముగూడ నగును. ఈఁగల ధ్వనిని, ఊఁకొట్టుటను నుచ్చరించునప్పుడు ముక్కుతో నుచ్చరింపవలసి యుండును. ముక్కు మూసి కొని వీని నుచ్చరింపఁ గుదురదు. కావున ఈఁగలధ్వనిలోని ఈకారమునకును ఊఁకొట్టుటలోని ఊకారమునకును అంతమునఁగల నాసి

కృధ్వని గళ్ పరమయినప్పుడు కవర్గాను నాసిక మగు జ్ గా వినవచ్చును. అప్పుడు ఈఙ్ గళ్ ఊఙ్ కొట్టు పదములు వచ్చును. పూర్వోక్తవిధమున నివి వికల్పముగా శిథిలద్విత్వములై యను నాసికస్థానమున సున్నలఁబొంది ఈంగలు,ఊం కొట్టు-ఈఁగలు,ఊఁకొట్టురూపములఁ బడసినవి.

కొంతకాలమునకు దీర్ఘముమీఁది సున్న నూఁదిపలుకుట మాసి తేలఁబలుకుట నిలిచెను. కాలక్రమమున ఈంగలు ఊంకొట్టురూపములు పోయి ఈఁగలు, ఊఁకొట్టు రూపములే నేఁటికి మిగిలినవి. ఈపటికాలమున నిఁక నీయరసున్నలుగూడ నంతరింపనున్నవి. నన్నయకుఁబూర్వకాలమునను, నించుక తర్వాతి కాలమునను గూడ నేఁటి యర్థానుస్వారము అనునాసిక సంయుక్తాక్షరముగా నుండుటను నాసంయుక్తాక్షరము పూర్వాక్షరమునకు గురుత్వమును గూర్పక శిథిలముగా నుండుటను బెక్కు శాసనములు నిరూపించుచున్నవి. నన్నయకుఁ బూర్వపుశాసనములలో శ్రీసోమశేఖర శర్మగారు ప్రకటించిన పండరంగ శాసనమందును, శ్రీరామయ్యపంతులుగారు ప్రకటించిన యుద్ధమల్ల శాసనమందును, నీతీరును జూడవచ్చును. నన్నయకుఁ దర్వాతివానిలో దక్షిణ హిందూదేశ శాసనసంచయము 4 వాల్యూంలో ననేక పద్యశాసనము లిట్టితీరులవి గలవు. మాదిరి కొకటి రెండుపద్యములఁ జూపుచున్నాఁడను.

క్రీ. 1065 వ నాఁటి శాసనము:—

గీ. సకల వసుమతీశ మకుటలసద్రత్న
 కిరణరుచి విరాజి చరణుణ్డయిన

క్రీ. 1128 వ నాఁటి శాసనము:—

క. సూరి కవిస్తుతు ణ్డనఘుండు
 చారుచతుర్థాన్వయాబ్ధిచంద్రుణ్డు గులని
 స్తారకుణ్డు సుజననిధి రిపు
 వారణగజరిపుణ్డు బుద్ధవర్మ్మ జనించెను.

ఈ పై పద్యమున అనునాసికసంయుక్త హల్లు ఒకచోట ననునాసికస్థానమున సున్నతో నుండుట గానవగును. ఇది యనునాసికములు సున్నలుగా లిపిలో మార్పుచెందుచున్న కాలము. సున్నలుంచుట యింకనుఁ బ్రబలముగా లేదు. స్తుతుణ్డు అనియున్న విధమునఁ గాక, తర్వాత 'అనఘుండు, అని 'ణ్డు'కు బదులు 'ండు' ఉన్నది.

నేను మీఁదఁ జేర్కొన్నవిధమునఁ దెలుఁగునఁ గల యరసున్నలు ప్రాయికముగా సంయుక్తహల్లోపమువలన నేర్పడినవిగాఁ గుదురుచున్నవి. అరసున్నలు గల శబ్దముల నిఁక నీవిధమున సమన్వయించి చూచెదను.

ప్రొఫెసరు శేషగిరిశాస్త్రిగారు పూర్వము 'అర్థానుస్వారమునుగూర్చి యొక గ్రంథము రచించి ప్రకటించిరి. పదియేనేండ్లకు ముందు నేను దానిని చూచితిని. ఇటీవల నాకది యెక్కడను గానరాలేదు. దీనిని నేను వ్రాయుటలోఁ బూర్వమెప్పుడో యాగ్రంథము చదువుటవలనఁ గలిగిన జ్ఞానవాసన యేమేని పనిచేసియుండవచ్చును. కాని వారిగ్రంథమున అర్థానుస్వారము పుట్టుటకు నే నిప్పుడు చెప్పిన ప్రక్రియయున్నట్టులేదు. అక్షర లోప

స్థానీయముగా అరసున్న వచ్చెనని వారు వ్రాసి యుందురని స్మరించుచున్నాను. ద్విత్వశైథిల్యాదికమును వారు గుర్తించియుండరు. ఆంధ్రశబ్దతత్త్వమని వారు ప్రకటించిన వేఱొక గ్రంథమిప్పుడు నేఁజూచితిని. అందు వారు కొలఁకులు మొదలగు శబ్దరూపములు 'కళ్' ప్రత్యయము కలయుటచేత నేర్పడినవని నిరూపించిరి. బహుకాలమునకుఁ బూర్వము వారు కొంత ప్రశస్త పరిశోధనము నెఱపి గ్రంథములఁ బ్రకటించిరి. కాని వానిమీఁద నింక నెంతో మంచి పరిశోధనము పెంపొందవలసి యున్నది. వారి గ్రంథములకుఁ బునర్ముద్రణమేని లేదు.

---

## ప్రేమోపాసన

కే. అన్నమరాజశర్మ గారు

రాధికాకృష్ణు లనుట ధరాతలంబు-నిండెనే కాని నామీఁద నెనరులేదు
నీదు నిర్మల ప్రణయాబ్ధి నీఁదఁగోరు-భక్తురాలిని వెతపెట్టఁ బాడి యగునో?

దివిజమోహన! హృదయమందిరము నందు-నీ మనోహరమూర్తిని నిలుపనిమ్ము
ఆత్మ నైవేద్య మర్పించి యహరహమ్ము-విరహకర్పూర గుళికను వేల్చుకొనెదను.

రాధ నపరాధముంజేసి నాథ! యిట్టి-కట్టడి విరాళి జీవంబు గడుపుచుంటి
తావకీనాంఘ్రి రజమింత తనరెనేని నాగృహంబె నిజంబుగా నాక మగును!

మందహాసాంకురంబుఁ గందళించు-వదనముం గాంచఁ దహతహం పడుచునున్న
అబలనగు నన్ను శిక్షింప నగునె? వలపు-శరములం బూని వనమాలి! కరుణమాలి.

నా కపోలంబు లంటి యనర్గళముగ-నిర్గమించెడి కన్నీళ్ల నీదు చరణ
కమలములఁ బోసి ప్రీతిమై కడుగఁ దలఁచి-స్మృతిపథంబున నిన్ బ్రతిష్ఠించి కొంటి.

ముగ్ధహృదయను నన్ను సమ్మోహవార్ధి-భంగములఁ ద్రోసిపోవఁగ బ్రతుకఁగలనె.
రమణ! నీ దివ్యనామాక్షరముల నెమ్మి-నెడఁదఁ దలఁచుచుఁ బ్రాణమ్ము విడుతుఁగాక!

---

# సముద్రగుప్తశాసనము - కళింగచరిత్ర

బుర్రా శేషగిరిరావుగారు (ఆంధ్రభారతీ తీర్థప్రధాని)

సముద్రగుప్త చక్రవర్తి శాసనములో పేర్కొనబడిన దాక్షిణాత్యదిగ్విజయములు మూడువంతులు కళింగములోనివే యనియు, నాచక్రవర్తి బహుశః కళింగమును దాటియుండనే లేదనియు హిందూదేశచరిత్ర విమర్శకుల నవీనాభిప్రాయము. దీనికి శాసనమందలి "కౌరాలకమంట రాజ", "కాంచేయక విష్ణుగోప" యను నిర్వచనములు ప్రతిబంధకములుగానున్నవని కొందరందురు. "కౌరాలక" అనుదానిని "కైరలక"అని దిద్ది చదువవలె ననియు, అట్లు చదివినచో నవి కేరళదేశీయప్రభునని సమన్వయించవచ్చు ననియు, "కంచి" యనునది పల్లవరాజధానిగా దక్షిణాపథమందు ప్రసిద్ధి గాంచినదగుటచేత "కాంచేయక" యనుటచే నా పట్టణాధీశ్వరుడని సమన్వయమనియు నీ శాసనమును మొదట ప్రచురించిన ఫ్లీటుమహాశయులు క్రీ. వె. 1888 సం. వ్రాసిరి. అప్పటినుండి నేటివరకు ననగా నీ 40 సంవత్సరములును ఈ సమన్వయమే సరియని శాసనపరిశోధకులము తలచుచు వచ్చితిమి కాని సముద్రగుప్తుడు కళింగమును దాటి కంచి, కేరళము వరకును పోలేదనుటకు సరిపడు సమన్వయము కళింగమందలి గ్రామనామములలో కొంత యీమధ్య కనుపడినది. పరిశోధకుల విమర్శనార్థము భారతికి మండనాయమానముగ ప్రకటింప సాహసించుచున్నాను.

"కౌరాలక" అను శాసనములోని యసలు పాఠమునే గ్రహించినయెడల దానినుండి "కురాల"అనుపదము లభ్యమగును."కురాల" అనగా "కురాలయ"మని నాయూహ. "కేరళ" యనునది "కేరాల" యను దాని హ్రస్వరూపమనియు, "కేరాల" యనునది "కేరాలయ" (చేరాలయ) యను దాని హ్రస్వరూప మనియు సులభగ్రాహ్యము. ఇట్లే దేవళ< దేవాల*< దేవాలయ అని రూపనిష్పత్తి కేర (చేర) జాతిస్థానము "కేరాళ" (కేరళ)మైనట్లే "కురు" జాతిస్థానము "కౌరాలయ" లేక "కౌరాల" మగును. ఇందు విపరీతపరిణామ మేమియు లేదు. అయిననో నిక "కురు" జాతినిలయములు కళింగమందున్నచో వాటినుండి "కురురాజ్య"ము కళింగమం దుండినట్లును దాని కధిపతియగు మంటరాజు "కౌరాలక మంటరాజనియు" సిద్ధించును.

---

* కళింగమందు కురుజాతిస్థానములగు గ్రామములు నేటికిని కొన్ని కనబడుచున్నవి. పూర్వము ప్రసిద్ధిగాహాడ నుండెను.

పూర్వపు విజయనగర (కళింగ) మహా రాజుల స్తోత్రపద్యములలో నొకదానియందు ప్రభుని ప్రతాపముచే"కురుగౌడల నాపదపుట్టె నాగరా పెటపెటలాడె" అని యొక పొగడ్త కలదు. అప్పటి కళింగమందు కురు, గౌడలను తెగలవారు కొంత ప్రతిభావంతులై యుందు రని తోచును. ఇక కురుజాతిస్థానములగు గ్రామ ముల విస్తర మిట్లున్నది:—

విశాఖపట్టణముజిల్లా

పార్వతీపురంతాలూకా-కురుపాం.
బిస్సంకటకం ఏజన్సీ-కురుహాటి.
గుణుపురం ఏ. కురుగూడ. కురుశీలగుడ, కురుశిలి.
జయపురం ఏ. కురుకుట్టి, కురుకుట్టిగుడ.
కొరాపుట్టి ఏ. కురుమల.
మల్కనగిరి ఏ. కురుకుండి, కురుకుంటిపల్లి
నవరంగపురం ఏ. కురుశెల్ల, కురుమకతు, కురుపా.
పాడ్వా ఏ. కురుదేలు.
రాయిగడ ఏ. కురుబోయి, కురుగులగుడ, కురుకటి, కురుకుట్టిగొల్ల.

గంజాముజిల్లా

అస్కా-తాలూకా-కుర్లంగి, కుర్లా.
బరంపురం తా. కురుపల్లి.
గుంసూరు తా. కుర్లంగి, కురులదు.
పర్లాకిమిడి తా. కుర్లండ.
బల్లిగుడ ఏ. కురులిల్లి, కురుగడ.
పర్లాకిమిడి ఏ. కురుగుబ్బ.
రామగిరి ఏ. కురుబ, కురుసు, కురుము, కురుతల.
ఉదయగిరి ఏ. కురుకుట్ట, కురుమింగియ.

ఈ గ్రామములలో మొత్తముపైని గంజాం మండలములో 6 న్ను విశాఖపట్టణ మండలములో 1 న్ని వెరశి 7 గ్రామములు తప్ప మిగిలినవన్నియు ఏజన్సీప్రాంతమందే ఉండుటచేత నీ కళింగాంతర్భూతమగు కురు రాజ్యము సముద్రగుప్తశాసనములో చేర్కొన బడిన మహాకాంతార రాజ్యమువలె వన్యరాజ్యము (Forest Kingdom) గా నుండియుండు నని యూహించుట కవకాశము కనబడుచున్నది. ఇట్టి కురురాజ్యము నేలియుండిన మంటరాజేంద్రుని "కౌరాలకమంటరాజ"ని నిర్వచించుటలో శాసనలేఖరి పొరపాటుగా వ్రాయలేదని యే నా నమ్మకము.

ఇట్లే "కాంచేయక" యనునదియు కళింగ మందలి గ్రామనామములచే సమన్వయమగు చున్నది. ఎట్లనగా,

గంజాములో

అస్కా-తాలూకా-కంచిపల్లి, కంచిఖండి.
ఛత్రపురం తా. కాంచీపురము.
సూదల తా. కంచరయ్యు.
టెక్కలి తా. కంచిపూరు.

అను గ్రామనామములు అన్నియు పల్లవు నాటిలో కనబడుచుండుటచేత నీ కాంచీపుర రాజ్యము పల్లవురాజ్యమే యన దగియున్నది. ఇట్లు కళింగమందు కౌరాలక కాంచేయక రాజ్యము లంతర్భాగములుగా వర్ధిల్లుచుండి క్రీ. శ. 4 శతాబ్దమధ్యమున సముద్రగుప్తుని దాడికి లోనైయుండును. ఈ సమన్వయ మీ శాసనమునుగూర్చి డూబ్రాయిలుపండితులు చేసిన వ్యాఖ్యానమును బలపరచుచున్నది.

---

## శ్రీదక్షిణామూర్తిస్తోత్రము*

సుబ్రహ్మణ్య భాగవతులు గారు

మౌనవ్యాఖ్యా ప్రకటితపరబ్రహ్మతత్త్వం యువానం
వర్షిష్ఠాంతే వసదృషిగణై రావృతం బ్రహ్మనిష్ఠైః;
ఆచార్యేంద్రం కరకలిత చిన్ముద్ర మానందమూర్తిం
స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తి మీడే.

మౌనుల్ వృద్ధులు బ్రహ్మనిష్ఠులగు శిష్యుల్ చేరగా మౌనమే
వ్యాఖ్యానంబుగ బ్రహ్మతత్త్వమును దెల్పన్ పిన్నయై చేత చి
న్ముద్రం గైకొని మోమున న్ముదముతో నానందచిన్మూర్తి స్వా
త్మారాముండగు సద్గురూత్తముని గొల్తున్ దక్షిణామూర్తినిన్.

విశ్వందర్పణ దృశ్యమాన నగరీతుల్యం నిజాంతర్గతం
పశ్య న్నాత్మనిమాయయా బహిరి వోద్భూతం యథానిద్రయా;
యస్సాక్షా త్కురుతే ప్రబోధసమయే స్వాత్మానమేవాద్వయం
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే.

తనలో నద్దములో పురంబువలె గాంచంబోలు విశ్వంబు నా
త్మను వీక్షించుచు మాయచే బయట నిద్రం జూచుచందాన, నె
వ్వడు జ్ఞానంబున స్వాత్మ నద్వయముగా సాక్షాత్కరించున్; నమ
స్కృతి గావించెద నాగురూత్తమునకున్ శ్రీదక్షిణామూర్తికిన్.

బీజస్యాంత రివాంకురో జగదిదం ప్రాఙ్నిర్వికల్పం పునః
మాయాకల్పిత దేశకాలకలనా వైచిత్ర్యచిత్రీకృతమ్;
మాయావీవ విజృంభయత్యపిమహా యోగీవ య స్స్వేచ్ఛయా
తస్మై శ్రీగురుమూర్తయే నమఇదం శ్రీదక్షిణామూర్తయే.

మును బీజంబున మొక్కచందమున మార్పుల్ లేకయున్ మాయచే
తను కల్పించిన దేశకాలబహుచిత్రంబౌ ప్రపంచంబు నె
వ్వడు యోగీంద్రుని గారడీనివలెనే యాడించు స్వేచ్ఛన్; నమ
స్కృతి గావించెద నాగురూత్తమునకున్ శ్రీ దక్షిణామూర్తికిన్.

---

* ఈ పద్యములు యతిప్రాసలు పాటింపక వ్రాసినవి. ఇట్టి రచనము లాంధ్రవాఙ్మయాభివృద్ధి కెంతవఱకు తోడ్పడగలవో?
—సంపాదకుడు.

యస్యైవస్ఫురణం సదాత్మక మసత్కల్పార్థగం భాసతే
సాక్షాత్తత్త్వ మసీతి వేదవచసా యోబోధయ త్యాశ్రితాన్;
యత్సాక్షాత్కరణాద్భవే న్న పునరావృత్తి ర్భవాంభోనిధౌ
తస్మై శ్రీగురుమూర్తయే నమఇదం శ్రీదక్షిణామూర్తయే.

జడమును బొంది వెలుంగు నెవ్వని ప్రకాశంబే సదాత్మంబు; భ
క్తుల బోధించు నెవండు 'తత్త్వమసి' యంచున్ వేదవాక్యాళి; నె
వ్వాని సాక్షాత్కృతిచే భవాబ్ధిమరలం జేరంగరాదో; నమ
స్కృతి గావించెద నాగురూత్తమునకున్ శ్రీ దక్షిణామూర్తికిన్.

నానాచ్ఛిద్ర ఘటోదరస్థితమహా దీపప్రభాభాస్వరం
జ్ఞానం యస్యతు చక్షురాదికరణ ద్వారా బహి స్స్పందతే;
జానామీతి యమేవభాంతమనుభా త్యేత త్సమస్తం జగత్
తస్మై శ్రీగురుమూర్తయే నమఇదం శ్రీదక్షిణామూర్తయే.

బహురంధ్రంబుల కుండలో వెలుగు దీపజ్యోతిరీతిన్ బహి
ర్గతమౌ నెవ్వని జ్ఞాన మింద్రియములద్వారా; సమస్తంబు నీ
జగమే వెల్గునె వెంటనంటి యెపుడున్ తెలియంగా వెల్గుచుండున్; నమ
స్కృతిగావించెద నా గురూత్తమునకున్ శ్రీ దక్షిణామూర్తికిన్.

దేహంప్రాణ మపీంద్రియాణ్యపిచలాం బుద్ధించ శూన్యం విదుః
స్త్రీబాలాంధజడోపమా స్త్వహమితి భ్రాంతా భృశం వాదినః;
మాయాశక్తి విలాసకల్పితమహా వ్యామోహసంహారిణే
తస్మై శ్రీగురుమూర్తయే నమఇదం శ్రీదక్షిణామూర్తయే.

జడబాలాంధులు పోలె భ్రాంతియుతు లీదేహంబొ ప్రాణంబొ చం
చలమౌ బుద్ధియొ శూన్య మింద్రియములో 'నే'నంచు వాదింతు; రె
వ్వడు మాయావృతశక్తిచే గలుగు భ్రాంతిన్ బాపజాలున్; నమ
స్కృతి గావించెద నా గురూత్తమునకున్ శ్రీదక్షిణామూర్తికిన్.

రాహుగ్రస్తదివాకరేందుసదృశో మాయాసమాచ్ఛాదనాత్
సన్మాత్రః కరణోపసంహరణతో యోఽభూత్సుషుప్తః పుమాన్;

ప్రాగస్వాప్స మితిప్రబోధసమయే యః ప్రత్యభిజ్ఞాయతే
తస్మై శ్రీగురుమూర్తయే నమఇదం శ్రీదక్షిణామూర్తయే.

కరణంబుల్ పనిమానగా నెవడు రాహుగ్రస్త చంద్రార్క తు
ల్యుడు మాయావరణంబుచేతను సుషుప్తుండైన సన్మాత్రుడై:
మును నిద్రించితినంచు నెవ్వ డెఱుగుర్ మేల్కాన్న వేళ్ల; నమ
స్కృతి కావించెద నాగురూత్తమునకున్ శ్రీదక్షిణామూర్తికిన్.

బాల్యాదిష్వపి జాగ్రదాదిషుతథా సర్వాస్వవస్థా స్వపి
వ్యావృత్తా స్వనువర్తమానమహ మిత్యంతస్స్ఫురంతం సదా;
స్వాత్మానం ప్రకటీకరోతి భజతాం యోభద్రయా ముద్రయా
తస్మై శ్రీగురుమూర్తయే నమఇదం శ్రీదక్షిణామూర్తయే.

శిశుతాదుల్ మఱి జాగ్రదాదులటులే యన్యోన్య భిన్నంబులౌ
సకలావస్థల వెంట నంటుచు సదా 'నే'నంచు లో వెల్గుచుః
తెలుపున్ స్వాత్మనెవండు భక్త తతికిన్ చిన్ముద్రచేవేళ్ల; నమ
స్కృతి గావించెద నాగురూత్తమునకున్ శ్రీ దక్షిణామూర్తికిన్.

విశ్వం పశ్యతి కార్యకారణతయా స్వస్వామిసంబంధతః
శిష్యాచార్యతయా తథైవ పితృపుత్రా ద్యాత్మనా భేదతః
స్వప్నే జాగ్రతివా యఏషపురుషో మాయాపరిభ్రామితః
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే.

గురువుల్ శిష్యులు, కార్యకారణములున్ స్వస్వామి సంబంధముల్
జనకాదుల్ సుతులంచు భేదములతో మాయాపరిభ్రామితుం
డగు నెవ్వాడు జగంబు గాంచు కలలో మేల్కాన్న వేళ్ల; నమ
స్కృతి గావించెద నాగురూత్తమునకున్ శ్రీదక్షిణామూర్తికిన్.

భూరంభాం స్యనలోఽనిలోంబరమహ ర్నాథో హిమాంశుః పుమాన్
ఇత్యాభాతి చరాచరాత్మకమిదం యస్యైవమూర్త్యష్టకమ్;
నాన్య త్కించన విద్యతే విమృశతాం యస్మాత్పరస్మాద్విభోః
తస్మై శ్రీగురుమూర్తయే నమఇదం శ్రీదక్షిణామూర్తయే.

భువి యాకాశము వాయు వగ్ని జలముల్ చంద్రార్కులున్ పూరుషుం
డను విశ్వంబు చరాచరం బెవనికిన్ మూర్త్యష్టకంబో; విచా
రణ గావించిన నేపరాత్పరుని కంటెన్ వేరులేదో; నమ
స్కృతిగావించెద నాగురూత్తమునకున్ శ్రీదక్షిణామూర్తికిన్.

సర్వాత్మత్వ మితి స్ఫుటీకృతమిదం యస్మా దముష్మిన్ స్తవే
తేనాస్యశ్రవణా త్తదర్థమననాత్ ధ్యానాచ్చ సంకీర్తనాత్;
సర్వాత్మత్వ మహావిభూతిసహితం స్యా దీశ్వరత్వం స్వతః
సిధ్యే త్తత్పున రష్టధాపరిణతం చైశ్వర్య మవ్యాహతమ్.

సకలం బాత్మయటంచు నీస్తవమునన్ స్పష్టంబుగా జెప్పగా
బడుటన్ విన్న తదర్థమున్ దలప ధ్యానింపంగ కీర్తింపగా
సకలాత్మత్వ మహావిభూతి కలితంబౌ నీశ్వరత్వంబు గ
ల్గు తనంతన్ మఱియింక నష్టవిధపూ నైశ్వర్య మవ్యాహతిన్.

చిత్రంవటతరోర్మూలే వృద్ధాశ్శిష్యా గురు ర్యువా;
గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు చ్ఛిన్నసంశయాః.

మఱ్ఱిచెట్టుమొదట చిత్రంబుశిష్యులు-పెద్దవారు గురువు పిన్నవాడు;
గురువుచేయుబోధ మౌనంబు; శిష్యులు-సంశయంబు రహితమైనవారు.

---

## దుర్గతులకు లభించునే స్వర్గసుఖము?

పురాణం సూర్యనారాయణతీర్థులుగారు

సాయం సమయమందు పైరుగాలి బీచిలో నందన సౌఖ్యమ్ము లందవచ్చు
మోటారుపై నెక్కి నీటుగా మఱిమఱీ మఱి పురమ్మెల్లఁ గ్రుమ్మరఁగ వచ్చు
దినదిన మ్మొక్కొక్క తెగ యాట బైస్కోపు చిత్రచరిత్ర వీక్షింపవచ్చు
ఒకరి లక్ష్యమ్ము వేఱొకరికి నేమాత్ర నుండ నక్కఱలేక యుండవచ్చు
భూతలస్వర్గ మగు చెన్నపురములోనఁ-గాఁపురమ్మున్నవా రెంత కఠినమైన
తప మొనర్చినవారో కదా! మఱేమి-దుర్గతులకు లభించునే స్వర్గసుఖము?

---

# గృహస్థునిధర్మము

కె. రంగాచార్యులు; యం.ఏ., బి.యల్.

ఆనందుఁడను నే నీ రీతిగ వింటిని:

ఒకప్పుడు కోలియను రాజదేశంబునఁ గక్కరపట్ట మను గ్రామమందుఁ గోలియనులలో భాగవతుఁడు నివసించుచుండెను.

ఆకాలమున ధీగాజానుఁడను కోలియనుఁడు భాగవతునికడకుం జని భక్తిపురస్కారముగఁ బ్రణామంబులాచరించి యొకప్రక్కకుఁ దిరిగి కూర్చుండెను. అట్లాసీనుండై ధీగాజనుఁడను కోలియనుఁ డీరీతిని భాగవతునితో విన్నవించెను.

"పవిత్రప్రభూ! గృహస్థులుగ మేము పంచేంద్రియవిషయాసక్తులమై కాలమును గడుపుచున్నారము. దారాపుత్రాదిసంరక్షణచేఁ బుణ్యావహములగు కార్యముల నొనర్చుటకుఁ దగినయవకాశముఁ గనుఁగొననేరకున్నారము. కాశీదేశోద్భవంబగు చందనంబుచేతను, నితర సుగంధిద్రవ్యములచేతను దేహంబులు సుపరిమిళితంబులుగ నొనర్చుచున్నారము. మనోహరంబులగు సువాసనలుకల వివిధసౌరభంబులచేఁ గూర్పఁబడిన మాలలచే దేహంబు లలంకరించుకొనుచున్నారము. పరిమళముగల లేపంబులు దేహంబునఁ బూసికొనుచున్నారము. సువర్ణ రజతంబులఁ గలిగి కనకముత్యమణిమయంబులగు నాభరణంబులచే దేహంబుల నలంకరించుకొనుచున్నారము.

పూజ్యప్రభూ! గృహస్థులగు మావంటివారికి నిహపరంబుల సుఖప్రదాయకంబగు ధర్మంబుండినదాని మాకనుగ్రహింపుము. అనిన నా మహానుభావుం డిటులు వాక్రుచ్చెను. "వ్యగ్గపజ్జుఁడా! ఈనాల్గు ధర్మములను నాచరించిన గృహస్థులీలోకమున సచ్చరితులయి సంచరించుచుఁ బరమున నానందమయమగు జీవనము ననుభవింతురు. ఈనా ల్గెవ్వియనిన!:

1. అభినివేశము, 2. ధనసంరక్షణ, 3. సత్యంబగుమైత్రి, 4. మితవ్యయము.

"ఓవ్యగ్గపజ్జుఁడా! అభినివేశమననేమి? ఈప్రపంచమున గృహస్థుఁడు జీవనార్థము, కృషి, వాణిజ్యము పశుపాలన, ఆయుధశిక్ష, కుంభకారత్వము, కమ్మరిపని, మఱి యే వృత్తి నైన న వ లం బిం చి యా శిల్పములయం దతికుశలుండై యేతద్వృత్త్యాచరణయందు రతుండైయుండి జీవనోపాధిని సంపాదించుకొనుచుఁ గార్యమెద్దానినైన నొనర్చుటకు యుక్తంబగు కాలముకొఱకు వేచియుండి యట్టియుక్తమయిన కాలమునఁ దత్కార్యమును గావించినను, వలసతలేక యుక్తంబగు కాలమున నట్టికార్యమును దా నపేక్షించుచుఁ జేయింపించినను నట్టివాఁ డోవ్యగ్గపజ్జుఁడా! వివేకముతో యోచింపుచు నాచరించును. అతిదీర్ఘయత్నంబుచేతను, నవిరతోద్యోగంబుచేతను నిట్టి ధనార్జనయుఁగాని, జయసంపాదనయుఁగాని యభినివేశమని పిలువంబడుచున్నది.

"ఓయీ వ్యగ్గపజ్జుఁడా! ధన సంరక్షణ యననేమి? వ్యగ్గపజ్జుడా! గృహస్థుఁ డవిరతోద్యమంబుచేతను, భుజాంగశక్తి చేతను, భూదర్శితాధిక ఖేదంబుచేతను, సుచరిత్రంబుచేతను ధనంబు నార్జింపవచ్చును. అపు డిటు లాతఁడు చింతింపవలయును. "మదార్జితంబగు నేతద్ధనంబును, జోరులవలనను, నగ్నివలనను, జలప్రళయమువలనను, నధికారి భయంబువలనను, మాత్సర్యయుక్తాప్రియబంధువర్గంబు వలనను రక్షించెదను." అతిశ్రమతో నీరీతిగ నార్జింపఁబడిన ధనమును రక్షించుట ధనరక్షణంబని చెప్పఁబడుచున్నది.

వ్యగ్గపజ్జుఁడా! సుమిత్రత యననేమి? ఓయి వ్యగ్గపజ్జుఁడా! ఈలోకంబున గృహస్థుఁ డెవ్వండైనను గ్రామంబునందుఁగాని, పల్లెయందుఁగాని వసించుచు ధర్మానుచారియై, సుశిక్షితబుద్ధి యుక్తుండై, యాత్మజ్ఞానసంపన్నుండై, దృఢభక్తియుక్తుండై, లెస్సగ గాథాస్థధర్మముల నాచరింపుచు, దానపరుండై, సర్వశాస్త్రతత్త్వజ్ఞుం

హైడియుండు నింకొక కుటుంబితోఁ గాని, వానిపుత్రునితోఁగాని సహవాసంబుఁ గావించి వానితో సంభాషింపుచుండియు, మన్నించుచుండియు నట్టి గృహస్థుఁడు ధర్మాచరణపరుండై, సుశిక్షితబుద్ధియుక్తుండై, యాత్మజ్ఞానపరాయణుండై,వృద్ధభక్తియుక్తుండై, గాఢాస్థధర్మాచరణశీలుండై, శాస్త్రజ్ఞానసంపన్నుండై పుణ్యంబు నాచరించుచుఁ బాపంబు విసర్జించును. ఓయి, యిదియే సుమిత్రత.

"ఓయి వ్యగ్గపజ్జుఁడా! మితవ్యయంబన నేమి? ఓయి! ఈలోకమున వివేకముతో సంచరించును, ధనార్జనకష్టంబుల నుగ్రహించి యార్జితవిత్తవ్యయవిషయికమార్గంబు నెఱిఁగి మితవ్యయియై వ్యయముగావింపఁబడ్డదానికంటె రెండింతలు ధనమును సన్మార్గప్రవర్తనచే నార్జింపుచు నమితవ్యయమునుగాని, యత్యల్పవ్యయమును గాని కావింపకుండిన నీరీతిగ నార్జింపఁబడిన ధనంబు నాశంబుఁ జెందక సురక్షితంబగును.

వ్యగ్గపజ్జుఁడా! వర్తకుఁడుగాని వానిసేవకుఁడు గాని తుల నుపయోగించి తులాపాత్రమున భారంబునుంచినఁ దత్తులాపాత్రంబుక్రిందఁ గ్రుంగ రెండవతులాపాత్రంబు సమానభార రాహిత్యంబున మీఁదకుం జనుటఁ గనును. ఈరీతిగనే గృహస్థుఁడు ధనార్జనకష్టంబును నమితవ్యయానౌచిత్యంబును విచారించి యాదాయంబును గుర్తెఱింగి యాదాయానుసారముగ వ్యయమును గావింపవలయును. తనకుఁ దగినట్లు వ్యయముఁ గావింపుచు ధనమును సంరక్షింపవలయును: ఈరీతిగ గృహస్థుఁడమితవ్యయమును విసర్జించి మితవ్యయమును గావింపవలయును. అట్లైన వానిధనంబు నాశంబుఁ జెందక సురక్షితంబగును.

ఓయీవ్యగ్గపజ్జుఁడా! ఆదాయముకంటె నెక్కుడు ఖర్చొనర్చు గృహస్థు కపిత్థఫలములఁ దినఁగోరి శాఖల నల్లలాడించి పక్వాపక్వఫలంబులఁ బడఁగొట్టి సంచయంబుఁగావించి పక్వఫలముల భుజియించి యపక్వఫలంబులఁ బారవేయు మనుజునిఁ బోలియుండును. అట్టి దుర్వ్యయంబును మానవులు నిందింతురు.

వ్యగ్గపజ్జుఁడా! గృహస్థుఁ డెవ్వండైనను లోభియై యార్జిత ధనంబును యుక్తముగ వ్యయంబుఁ గావింపక మృతిఁజెందినఁ దనజీవితకాలంబున ధనమును సువినియోగము గావింపనందులకు నట్టివాఁడు నిందాపాత్రుండగును.

ఓయి వ్యగ్గపజ్జుఁడా! గృహస్థరీతిగ నత్యధిక ధనార్జన కష్టంబులను, నాదాయమును మించిన విత్తవ్యయానౌచిత్యంబును లెస్సగఁ బరిశీలింప వలయును. కుటుంబి "మదార్జిత విత్తంబును నే నమిత వ్యయంబుఁ గావింపక మదపేక్షితార్థంబులకై మితవ్యయంబుఁ గావించెద" నని యోచింప వలయును. ఓయివ్యగ్గపజ్జుఁడా! ఏతద్రూపవిత్త వ్యయంబును మితవ్యయంబని చెప్పుదురు.

ఓయీవ్యగ్గపజ్జుఁడా! అనవరతోద్యమంబుచే న్యాయోపార్జిత విత్తంబు వినాశంబుఁ జెందుటకు మార్గంబులు నాలుగున్నవి. అవి యెవ్వియనిన?

(1) అధర్మ వ్యభిచారలోలుపత్వము.

(2) సురాపానాసక్తత.

(3) ద్యూత క్రీడాసక్తి.

(4) అధార్మిక మిత్ర సహవాసాసక్తి.

"ఓయీ వ్యగ్గపజ్జుఁడా! సునేతు బద్ధ సరోవరంబు చతుఃపోషణ స్రోతసులును, జతుర్ముఖంబులును గలిగియుండి చతుఃప్రవేశ మార్గంబులు నరికట్టంబడిన చతుర్ముఖంబుల నుండియు జలప్రవాహ సౌకర్యార్థము మృత్తిక తీయంబడి శుభ్రపఱుపఁబడిన జలప్రవాహావరోధంబుఁ గావింపుటకుఁ బ్రవాతంబు లేకుండిన, సరోవరంబు ప్రవహించి యయ్యది శూన్యంబగును. అటులే యోయీ వ్యగ్గపజ్జుఁడా! వ్యభిచారలోలుండును, సురాపాన లగ్న మనస్కుండును, ద్యూతక్రీడా పరాయణుండును, నధార్మిక మిత్రసహవాస ప్రియుండును, సౌన్నత్యములో నుండి యున్నప్పుడు దుష్టులతో సహవాసముఁ జేసి వారితో నతిమైత్రితోఁ గలసి మెలసి యుండునట్టి వానివిత్తంబు క్షయంబు నొందును. వ్యగ్గపజ్జుఁడా! అనవరతోద్యోగంబుచే సంపాదిత విత్తంబు సురక్షితంబై వృద్ధిం జెందు మార్గంబులు నాలుగున్నవి. అవియెవ్వి యనిన ?

(1) అధర్మ వ్యభిచారాసక్తి విరామంబు.

(2) సురాపాన విముఖత.

(3) ద్యూత క్రీడా విరామంబు.

(4) సజ్జన సాంగత్యము.

ఓయీ వ్యగ్ఘపజ్జుఁడా! సరోవరంబు సుసేతుబద్ధంబై చతుఃపోవణ స్రోతస్సులను, జతుర్ముఖములను గలిగియుండి చతుఃపోవణ ద్వారములనుండి జలప్రవాహ సౌకర్యార్థము మృత్తిక తీసివేయంబడియుఁ, జతుర్ముఖంబులును, గప్పివేయంబడిన మఱియు జలప్రవాహావరోధము గావించు ప్రవాహంబు లేకుండిన సరస్సునందుం నుదకము క్షీణింపక వృద్ధిఁజెందుటచే సరోవరంబు జలపూరితం బయి యుండును.

ఓయీ వ్యగ్ఘపజ్జుఁడా! ఈ రీతిగనే వ్యభిచార, సురాపాన, ద్యూతక్రీడా, దుష్టజనసహవాస వివర్జితుండైన నరుని ధనంబు వృద్ధిఁ జెందును. ఓయీ వ్యగ్ఘపజ్జుఁడా! ఈనాలుగు ధర్మంబుల నాచరించుటచే గృహస్థుఁడు ప్రపంచమున సచ్చరితుండై జీవించుచుఁ బరలోకమునను నానంద మయుండగును.

ఓయి, వ్యగ్ఘపజ్జుఁడా! ఈనాలుగు ధర్మముల ననుసరించుటచేఁ గుటుంబి పరలోకమున సుజన్మముం గాంచి వైకుంఠానందమును జెందును. ఆనాల్గును నెవ్వియనిన?

(1) భక్తి (2) విద్యాచరణము (3) దానము (4) వివేకము. ఈలోకమున గృహస్థుఁడు భక్తియుక్తుండై యుండిన బుద్ధ భగవానునియొక్క యత్యుత్కృష్ట జ్ఞానమునందు విశ్వాసముఁ గలిగి యుండును. ఈరీతిగ నాలోచింపుచు నర్థ విశ్వాస యుక్తుండగును. "బుద్ధ భగవానుఁడు సకల పాప వ్యతిక్రమణంబుఁ గావించినాఁడు. ఆత్మోద్యమంబుచే సమస్తవస్తుకారణ జ్ఞానంబును సమూలముగఁ బొంది నాఁడు. అందరి యెడలఁ బ్రియమునలుచు మానవకోటిఁగూర్చి యనంతప్రేమ ప్రేరితంబులగు కర్మల నాచరించి నాఁడు. ప్రపంచమును గూర్చి సర్వమును దెలియును. మనుజులఁ బాపంబునుండి మరలించి సత్పథానుసారులుగఁ జేసినాఁడు. దేవమానవులకు నుపదేశకుం డయినాఁడు. ఘనంబులగు చతుర్గుణతత్త్వములఁ గనుఁగొని యాధర్మనుల నితరులకు బోధించెను. వివిధరాగంబుల జయించి కామదహనంబుఁ గావించినాఁడు" ఇటులు జింతించుకొనుచు బుద్ధదేవుని యుత్కృష్టజ్ఞానము నందు విశ్వాస ముంచ వలయును. ఇదియేయో వ్యగ్ఘపజ్జుఁడా! భక్తియని చెప్పఁబడుచున్నది.

ఓయీ వ్యగ్ఘపజ్జుఁడా! విద్యాచరణ మననేమి? ఈలోకమున గృహస్థుఁడు జీవహింసఁ గావింపక, యదత్తంబగు దానిఁ బరిగ్రహింపక, యధార్మిక స్త్రీసంగములోలుండుగాక, సురాపాన వివర్జితుండై యుండిన యట్టి వానిచర్య విద్యాచరణమని చెప్పఁబడు చున్నది.

ఓయివ్యగ్ఘపజ్జుఁడా! దాన మననేమి? ఈలోకమున గృహస్థుఁ డెవ్వండైనను నత్యధికకామయుక్తుండై, స్వార్థ పరాయణుండై యితరుల సంపదను గని యసూయఁజెంది "ఈనాధన మితరులకుఁ జెందకుండునుగాక" అని యూహించునో యట్టిది దానశీలత్వంబు గాదు. ఇతరులఁ గూర్చి జాలిఁబడుచు నితరులకుఁ దనకుఁ గలిగినటు లీయ నిచ్చగించియు నితరులు గోరినపు డిచ్చుచు నితరుల తన యైశ్వర్యసహభాగస్కులుగ నొనర్చిన నది వితరణ మని చెప్పఁబడును.

ఓయీ వ్యగ్ఘపజ్జుఁడా! వివేక మననేమి? ఈప్రపంచమున గృహస్థుఁ డాధ్యాత్మికజ్ఞానసంవర్ధనంబును,నర్థసిద్ధియుఁ గాకుండఁగఁ జేయు నజ్ఞానమును బోఁగొట్టికొని జ్ఞానంబును సంపాదించి యిహమున సమస్తవస్తువులును నశాశ్వతములని దృఢముగ నెఱిఁగియుండి స్కంధ నిర్వాణమును గుఱించి చింతనంబుఁ గావించునోయెయ్యది సముపార్జ్వఁబడుటవలన మనుజుండు నిర్మింపఁబడుచున్నాఁడో యట్టిదియే వ్యగ్ఘపజ్జా! వివేకమని పిలువంబడుచున్నది.

ఓయీ వ్యగ్ఘపజ్జుఁడా! ఈచతుర్గుణ ధర్మంబుల నాచరించిన గృహస్థులీ రాఁబోవు లోకమున సుజన్మముం బొంది స్వర్గసౌఖ్యములం జెందుదురు.

# దారుకుని దైన్యము

బల్లారి కృష్ణప్ప గారు

తెగువమై రుక్మిణీదేవిని హరియించి ద్వారకానగరంబుఁ జేరు నాఁడు
బలిమిమై బాణుని బాహువు ల్ఛేదించి, మనుమనిఁ దోడ్కొని మఱలునాఁడు
అల్లుని పెండ్లికై యరణంబులను గొని విరటుని వీటికి వెడలునాఁడు.
హితముమై విదురుని యింట నంటలు మెక్కి హస్తిపురంబున కరుగు నాఁడు
సంభ్రమముతోడ ననుపుతో జడిమతోడ-నైపుణంబున నరదంబు నడుపు నన్నుఁ
గాంచి కౌఁగిటఁ జేర్చిన కన్నతండ్రి!, నేలఁ గూలితె శబరుని కోలచేత.?

మాతన్ బ్రీతిగఁ గొల్వనో? జనకునిన్ మన్నింపనో తాతకున్
ఖ్యాతిన్ గూర్పనో త్రేతలన్ మనుపనో కంసాదులన్ గూల్పనో,
గీతార్థంబు కిరీటికిన్ దెలుపనో కృష్ణాఖ్యతో వెల్గి, యీ
రీతిన్ భూసతిఁబొందఁ గోరితె, మురారీ! దానవారీ! హరీ!

బెడిదమై కప్పిన చెడుగాలివానచే మందలు కొండలం బందునపుడు
మడిసిన బుడుతల మఱలఁ జూడఁ దలంచి దీనమై దేవకి తెలిపినపుడు
నడురేయి దుర్వాసుఁ డిడు మోగిరంబని పాండవాగ్రజునితోఁ బలికి నపుడు
బ్రాహ్మణబాలుని బ్రదికింపఁజాలక వెఱచి ఫల్గునుఁ డగ్ని నుఱుకు నపుడు
నగవు మోమునఁ దళుకొత్త నగము నెత్తి,-బాలకులఁ దెచ్చి, యన్నంబుఁ జాల నొసఁగి
వెఱపుదీఱిచినట్టి నీవిపులశక్తి-యెందుఁ బోయెను? లోకేశ! యిందిరేశ!

దురితాత్ముఁడు శబరుఁడు, నీ-చరణము హరిణం బటంచు శర మడరించెన్
దెరు వింకెయ్యెది? కాలం-బరు దెంచెను దేవ! దేవ! యానతి యీవే.

శ్రీనృహరీ! హరీ! యనుచుఁ జింతన సేయుచు సంస్మరించుచున్
ధ్యానము సేయుచున్ మఱల దైవము దూఱుచు నిన్నుఁ జీరుచున్
గాననమందె కూలుదును గాని, దురాత్ములఁ గొల్వఁ బోదునే
జేనెఁడుపొట్టకై మఱుఁగు నీమను గప్పెడు గోఁచిబట్టకై.

---

# పిఠాపురము ప్రాశస్త్యము

విద్వాన్ గరిమెళ్ల సోమన్నగారు యం.ఏ., యల్.టి.

ఆంధ్రదేశమున మిక్కిలి పురాతనమగు పట్టణములలో పిఠాపురమొకటి. సముద్రగుప్తుని దక్షిణదండయాత్ర వర్ణితంబయిన అలహాబాదు స్తంభలిఖితములో పీఠపురము పేర్కొనంబడినది. ఈశాసనము రమారమి పదునేనువందల యేండ్ల క్రిందటిది. పిఠాపురము రెండువేల యేండ్ల ప్రాయముగలదనుటకు సందియము లేదు.

పీఠపురమా లేక పిష్టపురమా దీని తొలిపేరు అన్న సంశయము విస్పష్టము కాకున్నది. పీఠముయొక్కయు పిష్టముయొక్కయు సార్థక్యములనరయవలసియున్నది. పీఠికాంబదేవత యుండుటచే ఈపేరు వచ్చెనని కొందరు అందురు. ఈపురము పుణ్యక్షేత్రముగ చిరకాలంబునుండి పరిగణింపబడుచున్నది. పాదగయా క్షేత్రమనియు కుక్కుటేశ్వర క్షేత్రమనియు, మాధవస్వామి క్షేత్రమనియు ప్రాచీనవ్యవహారము మెండుగగలదు. ఈపురములోని పెద్దవీథినడుమ నున్న సన్న్యాసిరాళ్ళనంబడు జైన విగ్రహములు లేక బౌద్ధవిగ్రహములు ఈదేశపు మతములోని విపర్యయములను సూచించుచున్నవి.

ప్రాచీనకవి పావులూరి మల్లనకు గణితశాస్త్ర రచనకు బహుమానముగ పిఠాపురముతో కలిసియున్న నవఖండవాడయను గ్రామ మీయఁబడెను. మల్లన ఏడెనిమిదివందల యేండ్లకు ముందటివాఁడు.

అప్పటినుండియు నీపురమున వైదుష్యము పోష్యముగనే నెగడుచున్నది. ఇది దీని స్తంభముహూర్తము మహిమ కావలయును. కూచిమంచి తిమ్మకవికి ఈపట్టణముతో సంబంధముండెను. ఈపట్టణమునకు ఆఱుమైళ్ళదూరమునన్న సొన్నాడయను చిన్నగ్రామము ఒకప్పుడు మహాపట్టణమై పిఠాపురమువఱకు వ్యాపించియుండెడివని చెప్పుదురు. పిఠాపురములో సొన్నాడబయలు అనంబడు నొక ప్రదేశము కలదు. సొన్నాడ వర్తకులకు ఈబయలు వ్యాపారస్థానముగ నుండియుండును.

సొన్నాడ సముద్రప్రాంతగ్రామము. ఇప్పుడు ఇందు రెండు మూఁడువందల యిండ్లుమాత్రమే కలవు. గ్రామముచుట్టును రెండు మూఁడుమైళ్ల వఱకు ఇసుకదిబ్బలు ఎక్కువగ కనంబడును. సొన్నాడ ఉచ్చదశయందున్నపుడు ఈ యిసుక దిబ్బలు లేవనియు దాని ఔన్నత్యముయొక్క అంత్యదశకు గొప్పఉప్పెని వచ్చి పట్టణమునంతటిని ఇసుకచే కప్పివేసెననియు చెప్పుదురు. సొన్నాడ చుట్టుప్రక్కలను ఎచ్చట త్రవ్వినను గృహోపకరణములు బయలు వెడలుచుండును. ఇసుక రాసులు ఎత్తుగనుండుటచే ప్రదేశమునంతటిని త్రవ్వించి శోధించుటకు వీలు లేకున్నది. సొన్నాడకు దరిని మసీదువంటి ఒకకట్టడముకలదు. ఇదియొక నబాబు తనప్రియురాలి జ్ఞాపకార్థము కట్టించెనఁట. ఈమసీదు ఏడంతస్థులుగనుండి ఇసుకలో కప్పఁబడినందున అయిదాఱు అంతస్థులు అడుగంటినవందురు. ఈకట్టడము అందముగను విశాలముగను కనఁబడును.

పిఠాపురముయొక్క ప్రస్తుతస్థితి బహువిధముల ఒప్పియున్నది. దీని పరిసర ప్రదేశము ఫలవంతమును జలాఢ్యమునగుటచే పిఠాపురమున వివిధ సస్య సంభారములు మెండుగ కన్పట్టుచుండును. జలసమృద్ధిచేతనే అరఁటి, కొబ్బరి ఈప్రాంతమున ఎక్కువగ పెంపఁబడుచుండును. మామిడి, పనస, నారింజలు, బత్తాయి, సీతాఫలము, రామాఫలమును ఈపురమున విస్తారముగ దొరకును. ఫలసమృద్ధియు శాకసమృద్ధియు ఈగ్రామమునందువలె నితర గ్రామములో లభింపవు. పిఠాపురమునకు ఆఱుమైళ్ళదూరమున నున్న ఉప్పాడనుండియు, సమీపగ్రామములనుండియు మిక్కిలి సన్ననినేత వస్త్రములు పిఠాపురములో విక్రయింపఁబడును. కంచు ఇత్తడి వెండి మున్నగు లోహములతోడి పనులు ఇందు నేర్పుగ చేయఁబడును. పిఠాపురము కంచు చెంబులు ప్రసిద్ధిగాంచినవి. డాక్టరు ఏలినుగారి వైద్యప్రసిద్ధియు పట్టణప్రసిద్ధిని బల

పఱుచుచున్నది. మిషను ఆస్పత్రిలో నిరంతరము రెండు నూఱుడువందల స్త్రీలు చికిత్సఁబడయుచుందురు. దూరస్థల ములనుండియు ఇచ్చటి మిషను ఆస్పత్రికి రోగులువచ్చి మిషను మతబోధను సహించుకొనుచు చికిత్సపొందుదురు.

ఇప్పటి పిఠాపుర మహారాజుగారిచే రెండు పుర మందిరములు—పురుషులకొకటి, స్త్రీలకొకటియును—రమారమి లక్షరూపాయల వ్యయముతో ఇటీవల నిర్మిం పఁబడి పౌరుల యుపయోగార్థము ఏర్పఱుపఁబడినవి. ఇవి విశాలములుగను, విపులముగను, వినోదకరముగను, వివిక్త ముగను ఉండుటచే పౌరులకు మహోపకారకములు కాఁగ లవు. ఇవి ఈపట్టణమునకు భూషణములై యున్నవి. పుస్తక ములు పత్రికలు వినోద సామగ్రియు ఇందు చేర వలసి యున్నది. పిఠాపురమునందలి హైస్కూలులో రమా రమి ఏఁబదిపంది పంచమబాలురు చదువుచున్నారు. వీరు అన్ని ఫారములలో నున్నారు. వీరికి శ్రీమహారాజుగారు ఒకసత్రము నేర్పఱిచిరి. బసయును, భోజనమును ఇందు ఉచితముగ నొసంగఁబడును. ఈవిద్యార్థులకు పుస్తకములు గుడ్డలునుకూడ శ్రీమహారాజుగారు యిచ్చెదరు. వీరికి సదాచారములు అలవడుటకు పెక్కుసాధనములు యేర్పా టుకావింపఁబడెను. రెండువేళల భగవత్ప్రార్థన, స్నాన ము, వ్యాయామము మున్నగునవినియామకమయియున్నవి. అవకాశము లున్నయెడల సర్వజనులును—జాతిభేదము లేక—ఉత్తమపదవికు రాఁగలరు అనుసత్యము ఈసత్రమున బుజువగుచున్నది. దారిద్ర్యము, దాస్యము, దైన్యములో నను సుడులలోఁబడి యెడతెగక నిరంతర గ్రాసవాసో హైన్యంబులంబొందుచుండుపంచమాదిజాతులయెడ కృపఁ జూపకుండుట నికృష్టత్వముయొక్క పరమావధి కదా.

ఈపంచమబాలురు మహారాజసత్రమున శుచిగను సౌఖ్యముగను కాలమును గడపుచున్నారు. దేశములోని ధనికులు ఇట్టిసత్కార్యమునకు బూనుట దేశము నుద్ధరించు టయగును. పిఠాపురమున మహారాజసత్కారమును బడసి గొప్పవిద్వాంసులు విద్యాదానమును చేయుచున్నారు. వేదాంతశాస్త్ర విశారదు లగు చెంమహారి నరసింహశా స్త్రిగారు నిరంతరముగ శిష్యులకు వేదాంతగ్రంథములను నేర్పుచు ఆంధ్రదేశమున వేదాంతశాస్త్రమును పునరు ద్ధారణమును జేయుచున్నారు. తర్కశాస్త్రపారంగతు లగు శ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రిగారు, విశిష్టాద్వైత విద్యాసంపన్నులగు రంగాచారిగారును, వ్యాకరణపారదృ శ్వులగు వేదుల సూర్యనారాయణశాస్త్రిగారును వారి వారి యభిమతశాస్త్రములను శిష్యుల కుపదేశించుచుం దురు. సాంగయజుశ్శాఖాధ్యాయియు, తర్కవ్యాకరణ వేదాంతవేత్తయు వేదార్థ నిరూపణ సమర్థులును నగు వడలి లక్ష్మీనారాయణశాస్త్రిగారు ఈపట్టణమునకొక అమూల్యాలంకారము. సంగీత విద్యా సర్వజ్ఞులగు తుమ రాడ సంగమేశ్వరశాస్త్రిగారును మహారాజాదరమును గొని యీపురమున నివసించుచు గాన విద్యావిస్తారమును గావించుచుందురు.

సూర్యరాయాంధ్రనిఘంటు నిర్మాణమున నియు క్తులగు పండితులు—రమారమి పదిమంది ఉభయభాషా కోవిదులు—ఏతత్పురవాసులయియున్నారు. ఉరుదు భాషయందును ఆంధ్రభాషయందునుగూడ సరస కవన ముచేయు ఉమరలీషా సాహెబుగారును, ప్రఖ్యాతిక వియు లోకవ్యాపారసాక్షియగు పానుగంటి లక్ష్మీనర సింహరావుగారును ఈనగరపు వాస్తవ్యులు.

పిఠాపురము సంస్థానము పురాతన మైనది. ఔదా ర్యాది సద్గుణములకు తావలంబయినది. ఇప్పటి మహా రాజుగారు ఔచిత్యము నెఱింగి సర్వకార్యముల మెలంగు దురు. ఈయన దీనబంధువు. మార్దవము, ఆర్జవము, వివేకము, వైదుష్యమును ఈయనకు మండనములు. ధనసంపత్తితో నీసుణసంపత్తి కూడియుండుట మహాభాగ్యముగదా.

పిఠాపురమునకు మంచినీళ్ళ వసతులు చాలవు. పురమధ్యమున సందులు గొందులును మిక్కిలి ఇఱుకుగను అశుచిగను ఉన్నవి. పెద్దవీథి యన్నదియును విశాలముగ లేదు. తిన్నగ లేదు. కొంత ద్రవ్యవ్యయముచే ఈలోప ములు సవరణ అగును. కొళాయిలు ఏర్పాటుఅయినచో పట్టణమునకు అమితసౌఖ్యము కలుగును. ప్రజాహితైషి ణులగు శ్రీమహారాజుగారు పట్టణమునకు ఈభాగ్యము ప్రసాదింపదగుదురు.

# ఆరాధనము

మద్దిపట్ల వేంకటరమణయ్య గారు

అడుగఁదలఁచియు మఱపుచే నుడుగుచుందు - నెన్నిదినముల నుండియో యేను దల్లి!
చెప్పవచ్చునేనియు నాకుఁ, జెప్పఁగదవె - యెవరొ వీ రీవు మిగులఁ బూజించువారు.
పవలు రే యీవు సేవించు పటము లెవరి? - వింత భక్తికి గుఱియైరి యెవరు వీరు?
కర్ణభూషలు శుభదాయకంబులు నగు - వీరి నామంబు లెయ్యవి? వినఁగ వలతు.

అమ్మ! యేటి కీచిత్రపటాళిమ్రోల - మోముపై మోడ్పుఁగేల్వట్టి మోకఱింతు?
కన్నులను మూసికొని యేమి కారణమున - నిశ్చలధ్యానలీనవై నిన్నె మఱతు?

మేన నెల్లను బులకలు మేదురముగఁ - గన్నుఁగొలుకుల బాష్పముల్ గడలుకొనఁగ
ఫాలతలమునఁ జెమట ముత్యాలు నిండ - గడియల కొలంది నేటికిఁ గడపె దిచట?

ఎఱిఁగి యెఱుఁగని క్రియలఁ దత్తఱము బెరయఁ-దెలిసి తెలియనిపలుకులం దొలఁకవణఁకు
పలు తలంపుల గరిడియౌ స్వాంతమమర - మెలఁగెదవు వీరు వేల్పులా తెలుపు తల్లి!"

అనుచు నౌత్సుక్య కలితుఁడై యడిగినట్టి - యాత్మ నందను అజిత సింహాభిధేయుఁ
జేరఁగాఁ దీసి యశవంతసింహు దేవి - యనియె నీరీతి నాతఁ డూఁకొనుచునుండ.

"తండ్రి! నీచిన్ననాఁటి వృత్తాంతమంత - తలఁపునకు వచ్చునే నొడల్ జలదరించు
గుండియల్ తటతటమంచుఁ గొట్టుకొనును-చెమ్మటలు గ్రమ్ముఁ జిత్తమ్ము బమ్మరించు.

మీ పితలు మహారాజులు మేనుబాయ - అఫ్గనుస్థానమున నుండి యంతమేము
సకల సైన్యంబుతో నెకామెకి కుమార! - ఢిల్లికిని వచ్చినాము కడింది వగను—
దుర్గదాసాది సచివులు తోడుతోన - ఆ యలంఘీరు దర్శనం బాచరించి
విన్నపము సేసి రత్యంత వినయసరణి - నీకు మార్వారుపై నున్న నిండుహక్కు—

ఏమి చెప్పెదు నంత ఢిల్లీశు నాయ - మేను నెలలేని నెళ్లని కూన నిన్నుఁ
దనకు నప్పగింపంగ నుత్తరువు సేసె; ఎంత కఠినమో ఔరంగు హృదయ మకట!
తన జనానా నతండు నిన్ బెనుచునంట - అనుమతింతువేని తురక వగుట కీవు
దాన మిడునంట పెరిఁగి పెద్దైన వెనుక - పైతృకంబైన నీ మాఱువారు నీకు—

పారతంత్ర్యంబుచేఁ గల్గుబాధ లెల్లఁ - బట్టపవలు లాగునఁ బొడఁగట్టె నాకు;
తాను దన సమస్తంబు భూజానివశము - స్వీయమని యున్న దే బానిసీనికొండు?

చెనఁటి తురకకు నిన్నియ్యఁ జెయ్యిరాక - జరపుచుండిరి మనవారు సాకు చెప్పి;
మేము తప్పించుకొని పోదుమేమొ యనుచు-భవనమునకుఁ జుట్టు నతండు ఘారయుంచె.
ఎంత చెడ్డ రోజో యది, యెక్కనేమొ - పది గడెలపాటు ప్రొ; ద్దంత వచ్చిపడియె
నవని యీనిన చందాన యవన సేన - మేము వసియించు మహాలు సమీపమునకు—
అంతరంబు సమంబుగా నడుగులిడుచు - వింట వేయి సూర్యులఁ బ్రభవింపఁజేయు
బహువిధాయుధా లూని కాల్బలము వచ్చె-నొకబుజంబు నొకబుజంబు నొరయుచుండ.
టకటక ధ్వను లీనుచుండంగ రథ్య - హేషల కతానఁ బ్రతిశబ్ద మియ్య దిశలు
మోరయార్పులఁ గల్లెముల్ మొరయుచుండ - నల్లనల్ల గుఱ్ఱపు దళం బరుగుదెంచె—
కోటకడనుండి మన మేడ గోడదాఁక - నొక్కట భటప్రవాహంబు పిక్కటిల్లె;
ఆ పవుఁజుదారున కనుజ్ఞయయ్యె నంట - నిన్ను నన్ను బంధువుల బంధించి తేర.
భూరిఘోరమ్ము సామ్రాజ్యపుఁ బిపాస - తన గొడుగుసీడఁ బరభూమి తనరు దనుకఁ
దలఁపఁగూడని తలఁపులం దలఁపఁజేయు - సలుపఁగూడనిచేఁతలఁ సలుపఁజేయు—
ఋణము తీఱెను నాకు నీ కింకననుచు - నక్కన గదించుకొని నిన్ను వెక్కివెక్కి
యపుడు నే నేడ్చి నేడ్చిన కంతు కలదె? - ఇట్టులుండుదు మనుకొంట నే ఋణమ్మొ?
కాని రహతూరు శూరశిఖామణు లగు - మన చమూనాథులకు నాప్త మంత్రులకును
జీమకాలంత ధైర్యంబు చెదరలేదు - నిన్ను రక్షించు కార్య వినిశ్చయమున—
ఆ విపత్తు దాఁటుట తెలియంగ రాక - తలఁకు నా వీనుల కమృతధార లగుచు
వినఁబడియె నిట్లు పటురోష భీషణములు - పౌరుషాలాపములు రచ్చపట్టునుండి—
'కునుకు పట్టఁగనీక నన్ గుతిలపఱచు - విషమపు సమస్య యీ త్రుటి విడియెఁ జక్క-
నంధకారంబునందు నల్లాడు నాకు - వెలుఁగు గాన్పించె మ్లేచ్ఛుని వెడఁగుఁజేష్ట—
ఏను జచ్చిపోయితి నంచు నెంచినాఁడొ? - లేరని తలంచెనో రహతూరు లెల్ల?
కన్నుగప్పెనో రాజ్యాశ కాక వీఁడు - దండు బంపునే రాజసంతతిని బట్ట?
చూచెదనుగాక యెవఁడు 'గెల్చునో' యటంచుఁ-దోయదము భంగి నుఱిమెను దుర్గదాసు
బాహులేయుని కెనవచ్చు బల్లిదుండు - దివిజ గురువున కీడైన ధీయుతుండు—
'ఇట్టి సిబ్బంది యుండి రక్షింపలేమె - ప్రభు కుమారుని దుర్మార్గు బారినుండి?
పెంచితిమి మేను లేలిక పెట్టి పోయ - ఋణము నీఁగెడు మేల్కాల మేగుదెంచె—

ధర్మ నిర్వహణంబుకై తనువు విడుట - కాలిచెంగటఁ బెన్నిధిఁగనుట కాదె?
పోదుగా మన తాతతండ్రులు గమించి - ప్రకటముగఁజేసినది రాచబాట మనకు—

దలకమాదారి లోకంబు పొగడురీతి - కందము జయంబొ స్వర్గమో కడిమిమెఱసి'
యని వచించెను సాహసోదగ్రుఁ డగుచు - యోధకులభూషణుఁడు రఘునాథభట్టు—

కత్తి చేఁబట్టు నప్పుడే కడకునొత్తె - దేహమందలి ప్రీతిని బాహుజుండు
దాఁచుకొంద మటన్నను దాఁచఁగలమె - ఈశ్వర! యుగాంతపర్యంత మీయొడళ్లు?

శృంఖలలు ద్రుంగి స్వేచ్ఛను జెందుఁగాక - మాదు సంతతి యేనియు మాన్యలీల;
తన్మహోన్నత పావనస్థానమునకు - మెట్లగుంగాక మాదు నెమ్మేను లన్ని.'

అనియెఁ జంద్రభానుఁ డరిభయంకరుండు. - 'మొద్దుబాటి, యే పోరును బూసఁగకునికి
ప్రేలెడును బ్రక్కఁ బెక్కు దినాలనుండి - కైదువులు కేవలంబు సింగారమగుచు.

బయలుటికి నల్పు నీక ద్వేషత్వాటనంబు, - పదునుదేఱును దచ్ఛల్యపటలి నొరసి,
పోతరించిన జీబుకు బుద్ధిరాఁగ' - ననియె రణచోరదాస సేనాధిపుండు—

తగవు ధర్మంబు నేయెడఁ దప్పిచనవొ - ఆ యెడను క్షత్రియులు పిల్లులట్టివారు
తగవు ధర్మంబు నేయెడ బెగడు గుడుచు - నాయెడను బ్రేటువడిన సింహములె సుమ్మి.

స్నానసంధ్యాదికము లంత సరగ జరపి, - దేవతార్చావిధానంబు తీర్చి భక్తి,
నసురహర్తకు హరికి సాష్టాంగమెరఁగి, - చెలఁగి తులసీదళంబును సిగను జెర్వి,

హృదయగతుఁడైన హరి నెఱేఁగించుమాడ్కి - నఱుత ప్రేల సాలగ్రామ మవధరించి,
అఖిల దిక్కులఁ బరిమళం బలమికొనఁగఁ - దనువునిండను వీరచందన మలంది.

వెడఁదఱొమ్మునఁ గవచమ్ము బెడఁగు నింపఁ - బసుపుబట్టలు బంగారు మిసలు నెఱపఁ,
గన్నుఁగవ క్షాత్రతేజంబు గడలుకొనఁగ, - సమరదీక్షితు లైన యా శౌర్యధనులు.

చుట్టుఁ బ్రళయంబు చెలరేఁగు పట్టునందు - హాయిగానుండు వటపత్రశాయి చాయఁ
గిలకిలను నవ్వి యాడు నీకెలని కొకరి-వెంట నొకరు వచ్చిరి బిలబిలను దండ్రి!

దరవికస్వర జలజాతదళము లట్లు - విడిసి విడియని నీ లేఁతవ్రేళు లంటి,
ప్రత్తికాయల పగిది నేత్రములు విప్పి - ముగ్ధతను జూచు నీ మ్రోల మోఁకఱించి.

అదియె కడసారి చూపౌట నధిక రక్తి - గట్టిగా నొండొకళ్లను గౌఁగిలించి,
ఆయితము చేసి నిల్పిన హయము లెక్కి - వదలి రొక్కుమా జా స్వామిభక్తిపరులు.

[సశేషము]

---

# ఆంధ్రలిపి సంస్కారము

పా. ల. నారాయణగారు

మ-రా-రా-శ్రీ, వేటూరి ప్రభాకర శాస్త్రిగారికి

అయ్యా, తాము కడచిన నెల "భారతి"లో "ఆంధ్ర లిపి సంస్కారము"ను గురించి వ్రాయించిన వ్యాసము చదివినాను. ఆనందమైనది. అచ్చుల సంకేతములు విడదీసినంతమాత్రముననే అచ్చులో చాలవరకు వ్యయప్రయాసలు తగ్గిపోవును. మీరు సూచించిన మార్పులు చదివిన మీదట నాకు కొన్ని ఆలోచనలు తట్టినవి. అవి ఈ క్రింద రెండు పద్ధతులుగా వ్రాసినాను. ఆలోచించగోరుతాను. జనానుమోదమువడసి, ఈ సంస్కారము పూర్ణముగనో లేక కొంతభాగమో ఆచరణలోనికి వచ్చునరకు మీరు దీనిని వదలక ప్రచారము చేయుచుందురని నమ్ముచున్నాను.

మొదటిపద్ధతి:—ఇది ఉచ్చారణయందలి ఒక్కొక ధ్వనికి వ్రాతయందుకూడ ఒకే సంకేతముండుట మంచిది. అనేక సంకేతములుండుట మంచిదికాదు, అనునియమము మీద ఆధారపడియున్నది.

(1) మీరు 16 అచ్చులకు 16 సంకేతము లుంచినారు. బాగున్నదికాని, వర్గములయందలి ద్వితీయ చతుర్థ పంచమాక్షరములకును, శకటరేఫ ళకార షకారములకును ఈ 18 అక్షరములకు బదులు అదివరలో వచ్చిన అక్షరములే నిలువుగీట్ల సహాయముచే ఈ అక్షరము లేర్పడునట్లు చేసినారు. 35 సంకేతములకు బదులు 18 తగ్గి పదునేడే అయినవి. దీనివలన సంకేతముల సంఖ్యతగ్గి కొంతలాభము కలిగినను ఉచ్చారణయందు ఒకధ్వనిగల అక్షరమునకు వ్రాతయందు రెండేసి సంకేతము లుండుటచేత, అచ్చుకూర్చువారు ఒకధ్వనికి రెండుసార్లు రెండు సంకేతములు ఏరి కూర్చవలసివచ్చినది. కలయికలోగూడ ఇట్లే టైపు కొట్టువారు రెండుసార్లు కొట్టవలసి వచ్చినది. పనిలో సులువు కాలేదు. కాలముకూడ ఎక్కువపట్టును. అందుచే ఒకధ్వనికి ఒకేసంకేత ముండునట్లు చేయుటమంచిది. అట్లు చేసినయెడల అచ్చుల సంకేతములు 16—హల్లులకు 35—అర్ధానుస్వార, పూర్ణానుస్వారవిసర్గలకు 3—మొత్తము 54 సంకేతములు. ఇంతేకాక ముందు ముందు అన్యభాషా పదములుకూడ తెలుగులో చేర్చుకొనవలసిన అవసరము కలుగును. అందుకు ఇప్పుడు కొన్ని అక్షరములు లోటుగానున్నవి. ఉదాహరణము:—bat, father అను ఇంగ్లీషుమాటలలోని a f అను ధ్వనులను తెలుపు ఏ. కార ఫ. కారములు—ఖా. ఇదా, గ. మ్ గీన్ అను ఉర్దూ పదములలోని ఖ. గ. అను ధ్వనులను తెలుపు ఖకార గకారములునై—అను హిందీపదములోని అనుస్వారహల్లును నై తెలుపు సంకేతమొకటి. ఈ 5 ధ్వనులకు 5 సంకేతములు. మొత్తముమీద 59 సంకేతములు. ఇట్లు చేసిన యెడల, ప్రతి ధ్వనికి ప్రత్యేక సంకేత మొక్కటే యుండును. ఈ విషయమై నిర్దుష్టముగా నుండును.

ఇక టైపురైటర్ విషయమై—ఇప్పుడు ఇంగ్లీషు టైప్‌రైటర్ మీద 26 పెద్దక్షరములు, 26 చిన్నక్షరములు, అన్నీ 52 అక్షరములున్నవి. తెలుగు టైప్‌రైటర్ మీద 59 ఉండవలసివచ్చును. దానికంటె దీనియందు 7 సంకేతములు ఎక్కువ. అది అంతకష్టముకాదు ఈ పక్షములో ఋఋౡౡలు తీసివేసి వాటిపని ఇతరఅక్షరములవలన సరిపెట్టుకొనవచ్చును. అప్పుడు 55 సంకేతములే యగును. మీరు అకారము ప్రత్యేకము ఉండవలెనన్నారు. దానిపని ✓ (తలకట్టే) చేయుచున్నది గనుక, దాని అవసరముండదు.

(2) మీరు అచ్చుల చిహ్నములు హల్లుల నెత్తి మీద నుండవలెను, హల్లులు మాత్రము పక్కపక్కనే యుండవలెనని వ్రాసినారు. నెత్తిమీద, కింద అక్షరము లుండు పద్ధతి టైపున కెంతమాత్రము పనికిరాదు. ఇంగ్లీషులోవలె అచ్చులు, హల్లులు రెండూకూడా పక్కపక్కనే ఉండవలెను. అప్పుడే బంతిలో అక్షరములెల్ల తీర్చినట్లుండును. అప్పుడే సంస్కరణము వలని సమస్త లాభములు చేకూరును. ఎక్కువస్థల మాక్రమించుకొనునని సంశయింప బనిలేదు. మనువు నిలువులో ఆక్రమించు

కొన్నేస్థలం ఇప్పుడు అడ్డంలో ఆక్రమించుకుంటుంది. అదీగాక, హెచ్చుస్థలం ఆక్రమించుకొన్నను, ఈ పద్ధతి వల్ల కలిగే ఎక్కువలాభములను చూచుకొని, ఈకష్టమును సహించవలసినదే. అన్నీ లాభము లెప్పుడూ ఉండవు. పనిచేయుకాలము, పడుశ్రమ కలిసివచ్చునప్పుడు కొంచెము ఎక్కువచోటు ఆక్రమించుకొన్నందువల్ల విచారింపవలసిన పనిలేదు.

(3) మీరు ఋ ౠ ఌ ౡ జ ఞ ణ న మ య ల వ స హ, ఈ 14 అక్షరములకు రూపములలో కొన్ని మార్పులు చూపినారు. మనము రూపములు మార్చే అక్షరములు సాధ్యమయినంతవరకు వెనుకటి అక్షరముల పోలిక నిలుపుతే మంచిది. గనుక, వానికి బదులు వరుసగా ృ, ౄ, ౢ, ౣ, జ, ఞ, ణ, ౖ, ు, య, ౯, వ, స, వా, అని ఉంచుతే కొంచెమెచ్చుతగ్గ మనము ఇదివరలో వాడుకుంటూఉన్న సంకేతములే యగును. ఈ తరమువారికి రాబోవుతరములవారికి వెనుకటి గ్రంథములు చదువుటలో కష్టముండదు.

ఇక రెండోపద్ధతి:—ఇది ఒకధ్వనికి అనేక సంకేతములు అంగీకారమయి ఆపద్ధతివలన ఎక్కువలాభ ముంటుందనే పక్షమున సూచించుచున్నాను.

(1) మీరు చెప్పిన నిలువుగీట్లు ఇంకను కొంచె మెక్కువగా వ్యాపింపజేయవచ్చును. ఎట్లనగా, నిలువుగీట్లు హ్రస్వాచ్చులకు తరువాత నుంచి వానిని దీర్ఘాచ్చులను చేయవచ్చును. సాదు హల్లులకు తరువాత నుంచి వత్తుహల్లులుగా చేయవచ్చును. ర,ల,శ,ల తరువాత నుంచి వరుసగా ఱ,ళ,ష, లనుగా చేయవచ్చును.

(2) వర్గములలో మొదటి అక్షరముల తరువాత, ౨ అంకెనుగాక, ౫ అంకెనుంచి వర్గములలో ౫-వ అక్షరముగా చేయవచ్చును.

(3) నేను కొత్తగా చేర్చవలెనన్న 5 అక్షరములు, ఆయా అక్షరసంకేతముల పక్కను ఒక పూర్ణవిశ్రామ చిహ్నమునుంచి ఏర్పరుచుకొనవచ్చును.

పయిన చెప్పిన మొదటి పద్ధతిప్రకారం అక్షరమాల

17 అచ్చులు—అ ✓, ఆ ⸺, ఇ ౩, ఈ ౩ీ, ఉ ౧, ఊ ౧ా, ఋ ృ, ౠ ౄ, ఌ ౢ, ౡ ౣ, ఎ ⸺, ఏ ⸺, ఏ ⸺., ఐ ⸺, ఒ ౧ా, ఓ ౧ో, ఔ ⸺.

38 హల్లులు—క ౬, ఖ ఖ, ఖ. ఖ., గ ౧, గ. ౧., ఘ ఘ, జ జ, చ ౨, ఛ ౨, జ జ, ఝ ఝ, ఞ ఞ, ట ట, ఠ ం, డ డ, ఢ ఢ, ణ ణ, త అ, థ థ, ద ద, ధ ధ, న ౨, ప ౨, ఫ ౨, ఫ. ౨., బ ౨, భ ౨, మ ౨, య య, ర ౮, ఱ ౮., ల ౯, ళ ౪, వ వ, శ ౪, ష ష, స స, హ వా.

రెండవ పద్ధతిప్రకారం అక్షరమాల

17 అచ్చులు వరుసగా— ✓, ✓।, ౩, ౩।, ౧, ౧।, ృ, ృ।, ౢ, ౢ।, ⸺, ⸺।, ⸺।., ఐ, ౧ా, ౧ా।, ⸺.

7 కవర్గు—౬, ౬।, ౬।., ౧, ౧, ౧।., ౬౫ వరుసగా క, ఖ, ఖ., గ, గ., ఘ, ఙ

5 చవర్గు—౨, ౨।, జ, జ।, ౨౫ వరుసగా చ, ఛ, జ, ఝ, ఞ.

5 టవర్గు—ట, ట।, డ, డ।, ట౫ వరుసగా ట, ఠ, డ, ఢ, ణ

5 తవర్గు—త, త।, ద, ద।, త౫ వరుసగా త, థ, ద, ధ, న.

6 పవర్గు—ప, ప।, ప।., బ, బ।, ప౫ వరుసగా ప, ఫ, ఫ., బ, భ, మ

10 మిగిలినవి—్య, ౢ, ౢ౹, ౢ, ౢ౹, ్వ, ్శ, ్శ౹, ్స, ౣ వరుసగా య, ర, ఱల, ళ, వ, శ, ష, స, హ.

ఈ పద్ధతి ప్రకారం

అచ్చుసంకేతములు 9, హల్లు సంకేత ములు 17 నిలువుగీ టొకటి. అనుస్వార విసర్గ అకు 3, మొత్తం సంకేతములు 30.

---

## మాయావిడంబనము

నాదెళ్ల కృష్ణానందం గారు

సృష్టివైచిత్ర్య మెంత విస్పష్టముగను-గనబడుచునున్న గనుచున్నగాని దాని
నిజమెఱింగిన రీతిగా నిముసమైన-నడువడొక్క- డిదేమాయనాటకంబొ.
తాను భూమిపయింబుట్టె జ్ఞానమెఱుగు-నాటి కెన్నడెఱుంగని నాతి వచ్చి
యూరుపేరును లేని కుమారుగనగ-వీరు నావారటంచును గేరు నొకడు.
వాయు వశమున గుమిగూడి వారిదములు-చెదిరి నలుదిక్కు-లకు బారు చెన్నుగాగ
నిట్లువచ్చిన యాల్సుతు లల్లె పూర్వ-సంచితంబున బోవ శోకించు నొకడు.
ఆది తుది లేని కాల వియత్పథమున-లోతు తెలియంగ రాని యీలోక వనధి
మెఱుపుమెఱసిన వ్యవధిలో మేను వాన-చినుకు పరిమాణమని యనుకొన డొకండు.
అమితకాలమునుండి మహాద్భుతముగ-బరిణమించుచు జీవ సంభరిత మగుచు
బ్రళయమొందుచు దోచు ప్రపంచమందు-నేడు బుట్టి యిదెంతను వా డొకండు.
కష్టసుఖములు కోరక కర్మవశత-వచ్చిపోవుట లెఱుగనివా డెవండు
కష్టములు కోరకయెవచ్చు గతిని సుఖము-లొందగా గోరుకొన కూరకుండ డొకడు.
చచ్చువారల గని తాను జత్తుననుచు-దెలిసితెలియని రీతిగా దిరుగుగాని
చేయి విదుపడు ధనము నార్జించుపట్ల-విసుగుగొన డార్తిగొని యీశు వేడ డొకడు.
మదిని దలచునదొకటి పైమాటయొకటి-చేయగావచ్చు నాటికి జేయుటొకటి
కాని త్రికరణశుద్ధిగా గార్యమొకటి-యిలనుజేసిన ధీరుండు గలుగడొకడు.
ఇన్నిటికి మూలమెల్లర నెఱుకబాపి-వింతవింతగ మార్చుచు వివిధమైన
మమతలను కూర్చునట్టిదే మాయ దీని-దెలిసి తిఱిగెడు వా డాదిదేవు డొకడు.

---

# పునర్విమర్శనములు

## ౧. సూర్యరాయాంధ్ర నిఘంటువు - మచ్చుపదములు

క్రిందటి ఆశ్వయుజమాస 'భారతిలో' నేను వ్రాసిన నిఘంటువు మచ్చుపదముల విమర్శనమును ఖండిస్తూ మ. రా. రా. జయంతి రామయ్యపంతులుగారొక వ్యాసమును వ్రాసినారు. జనులయందు కలుగగల భ్రాంతిని పోగొట్టడమునకు తామా ఖండనమును వ్రాసినారట. ఆ భ్రాంతి వీరిఖండనమువల్ల ఎంతవరకు పోతుందో చూడవలసి ఉన్నది.

వారు తమవ్యాసములో నన్ను రెండువిధములుగా అధిక్షేపించినారు: (౧) నేను పండితుడను కానని (౨) నేను గిడుగు రామమూర్తిపంతులుగారి శిష్యుడ నని ఈరెండింటివల్లను నాకు ఎట్టి చిన్నతనమున్ను లేదు. నేను పండితుడను కాను. నిత్య విద్యార్థిని. నాఅభిప్రాయములు పొరపాట్లయితే వెర్రివెర్రిగా వాటిని సమర్థించుకొనడమునకు పూనుకోను. అవినిజముగా పొరపాట్లయితే సవరించుకొంటాను. నేను గిడుగు రామమూర్తి పంతులుగారి శిష్యుడ ననిపించుకొన్నందుకు గర్వపడుతున్నాను. ఆంధ్రభాషాపరిశోధనమందు ఆంధ్రదేశమునకు వారు పెట్టినది భిక్ష.

శ్రీరామయ్య పంతులుగారు "పుస్తకము మోయుటకు దేహబలమును, కొనుట కర్థబలమును, చదివియుపయోగించుకొనుటకు బుద్ధిబలమును గలవారి నిమిత్తమే యీనిఘంటు వుద్దేశింపఁబడినది గాని యాబలములు లేనివారికొఱకుఁగాదని చెప్పవలసియున్నది" అని నిఘంటుప్రకటనోద్దేశమును సంక్షేపముగా విశదీకరించి ఆంధ్రులను రక్షించినారు. కాని, వారీవాక్యమును కోపసమయములో వ్రాసిఉందురు. పైతమతీర్పును కొంచెము పునర్విచారణమునకు తెత్తురుగాక అని అర్జీ దాఖలు చేసుకొంటున్నాను.

నిఘంటువులో ఎక్కువవిషయమును తక్కువస్థలములో ఎట్లిముడ్చవచ్చునో చూపుతూ నేనుచేసిన సూచనలకు, "ఈమార్గములు మేము యోజింపనివి కావు. యోజించియే మేమవలంబించిన నిఘంటు నిర్మాణపద్ధతి కనుకూలములయిన రీతుల ననుసరించినాము" అని వారు ఖండనము వ్రాసినారు. తక్కిన భాషల శాస్త్రీయనిఘంటుకారుల పద్ధతిని నేను సూచించి ఉంటిని. అది సరియైనది కాదనిన్నీ, తామవలంబించిన పద్ధతియే మేలయినదనిన్నీ వారు సమర్థించుకోవలసి ఉండెను. కాని, ఒక్కదమాయింపుతో ఈవిషయమై నేనుచేసిన విమర్శనభాగమును త్రోసివేసినారు. వారినయ; మనమేమి చేయగలము?

నేను చేసిన ఆక్షేపములలో అనేకములను విడిచిపెట్టి స్థాలీపులాకన్యాయమనే వ్యాజమున కొన్నిటిని మాత్ర మెత్తుకొని ప్రత్యుత్తరమిచ్చినారు. నేనుకూడా ఆ స్థాలీపులాకన్యాయము నేఅనుసరించివారి ఖండనములోని కొన్ని ముఖ్యవిషయములను మాత్రము విమర్శింప బూనుకొన్నాను. ఎక్కువగావ్రాసి పంతులుగారి ఆగ్రహమున కేల పాత్రుడ కావలెను? "చాలులే చెప్పవచ్చినావ"ని ఏల గద్దించుకోవలెను? అయినా, వారు శోధించిన మెతుకులకంటె ఎక్కువమెతుకులనే పట్టిచూస్తాను.

శ్రీ రామయ్యపంతులుగారు నిఘంటు నిర్మాణపద్ధతి విషయమై ౧౯౧౨వ సంవత్సరములో వ్రాసినవ్యాసమును, ప్రాచ్యపరిషత్తుకు పంపిన వ్యాసమును నేను చదివియే ఉన్నాను. అందులో వారు గండర్టుగారి మళయాళ నిఘంటువును స్మరించకుండా నే ద్పు గా వదలివేసినారనికూడా నాకు తెలుసునుకాని, దాక్షిణాత్య భాషా నిఘంటువులలో నిర్మాణపద్ధతివిషయమున గండ

ర్టుగారి మళయాళ నిఘంటువు అత్యుత్తమమైనది. కాల్డువెల్ దానిని "that truly scientific dictionary" అని తన కంపేరెటివ్ గ్రామరులో మెచ్చుకొన్నాడు. ఇతరులకు కూడా అది అట్లే కనిపిస్తుంది. కిట్టెలు కన్నడ నిఘంటువుకంటె నిర్మాణ పద్ధతి విషయములో అది మేలయినదని చెప్పవలెను. రామయ్యపంతులుగారు కిట్టెలు నుదాహరించినప్పుడు గండర్టునుకూడా ఉపలక్షణముగా గ్రహించినారనుకొన్నాను. ఎవరయినా అట్లనుకొంటారనుకొంటాను. ఇకమీదనయిన గండర్టు అవలంబించిన విధానములో ఏమైనా మేలున్నదేమో పరిమన్నిఘంటు నిర్మాతలు యోజిస్తారని తలుస్తాను. "ఓ! మేముదానిని చూచియే వదలియే పెట్టినా"మంటే ఆమాటకు తిరుగే లేదు.

"ఇచ్చిన సంకేతములు విలక్షణముగా ఉండుట" అనే శీర్షికక్రింద కొన్ని గ్రంథములనుండి ఉదాహరణములు లేవు అనే ఆక్షేపణకు "ప్రయోగబాహుళ్యముగల చోటను, పద్యోదాహరణ మనావశ్యకమని తోచినచోటను గ్రంథనామము, పద్యసంఖ్యయుమాత్ర మీయఁబడినదని చదువరులు గ్రహింతురుగాక" అని కుండలీకరణము చేసి హెచ్చరించినారు. ఉదాహరణములు లేవని నాయాక్షేపముగాని అంకెలు లేవనికాదు. నిఘంటువులో ఆశ్వాస పద్యసంఖ్యలు నిష్ప్రయోజనములు. ఆయాపుస్తకములను చూచుకొనడమునకు తీరిక లేకకదా నిఘంటువును విప్పడము.?

సంస్కృత శబ్దములవిషయమై "కిట్టెలు, గండర్టుగార్లు తమనిఘంటువులలోనికి అచ్చముగాచేరిన సంస్కృత పదములనే తీసుకొన్నారు" అని నేను వ్రాసిన దానికి "మళయాళ నిఘంటువుమాట యెట్లున్నను కన్నడ నిఘంటువు విషయమయి యీవాక్య మబద్ధము. ఆ నిఘంటువును చక్కగాఁ జూచినవారట్లనరు. కిట్టెలుగారు Monier Williams నిఘంటువులోనున్న పదముల నించుమించుగా నన్నింటిని గ్రహించినారు," అని ప్రత్యుత్తరము వ్రాసినారు. మళయాళ నిఘంటువుమాట యెట్లున్నదో గండర్టుగారివాక్యములనే ఇక్కడ ఉదాహరిస్తాను.

"To determine the amount of *Sanscrit* words to be received into a Malayalam Dictionary has been a task of even greater difficulty. As this Dictionary is *not* intended for the use of *Sanscrit students*, the rule followed in compiling it has been to include only those words and meanings that were found in *bona fide* Malayalam productions; to sift reduce the enormous mass of mythological and botanical names and synonyms, many of which are confessedly very doubtful; to record merely the principal signification of words confined to poetical usage; and to devote particular attention only to those terms which are generally accepted as fairly 'domiciled' in Malayalam and which have in the course of naturalization received various applications not to be met with in pure Sansckrit (e. g. అధ్యాయం, అవసరం).

"మళయాళనిఘంటువులోనికి సంస్కృతపదములను ఎంతవరకు చేర్చుకొనడము అని నిర్ణయించడము, అంతకంటె (తమిళపదముల నెంతవరకు చేర్చుకొనడము అనేదానికంటె) కష్టమైనది. ఈనిఘంటువు సంస్కృత విద్యార్థుల ఉపయోగముకోసము కాదుగనుక దీనిని నిర్మించడములో ఈక్రిందిసూత్ర మవలంబింప బడ్డది. అచ్చ మళయాళగ్రంథములలో కనబడే సంస్కృతపదములనే తీసికొనడము; పౌరాణికవిషయములను, వృక్షశాస్త్రవిషయములను (వీటిలో చాలమట్టుకు స్పష్టముగా సందేహాస్పదములు గనుక) వాటిలో ఏవి ముఖ్యములో వాటినే ఉంచి తక్కినవాటిని వదలిపెట్టడము; కేవల పద్యభాషలో వచ్చు సంస్కృతపదముల ప్రధానార్థమును మాత్రమే ఇవ్వడము; మళయాళభాషలో స్థిరవాస మేర్పరచుకొని, అచ్చ సంస్కృతములో లేని అర్థములను పొందిన పదములను గురించి ఎక్కువశ్రద్ధ తీసుకొనడము (ఉదా. అధ్యాయం, అవసరం).

కిట్టెలు తన కన్నడనిఘంటువులో గండర్టుకంటె ఎక్కువ సంస్కృతపదముల నిచ్చినమాట సత్యమే కాని,

"Monier Williams బృహన్నిఘంటువులో నున్న పదముల నించుమించుగా నన్నింటిని గ్రహించినారు" అన్నమాట శుద్ధాబద్ధము. కిట్టెలునిఘంటువులో లేకుండా మానియర్ విలియమ్సు సంస్కృతనిఘంటువులో ఉన్న సంస్కృతపదములు ఎన్నో ఉన్నవి. వాటిపట్టికను ఇచ్చట చేరుస్తే భారతికి కాగితముఖర్చు ఎక్కువ అవుతుందని మానివేస్తున్నాను. ఈ సంస్కృతపదముల విషయమై కిట్టెలు నిఘంటువు పీఠికపుట XL VII లో "but write regard to Samskrita......it is not anticipated that in reading certain Kannada classics the want of a Samskrita Dictionary will not be felt occasionally' సంస్కృతవిషయమున మాత్రము కొన్ని కన్నడకావ్యములను చదివేటప్పుడు, అప్పుడప్పుడు సంస్కృతనిఘంటువు అవసరముపడదు అని చెప్పవీలులేదు," అని వ్రాసియున్నాడు. అంటే, కావలసినదానికంటె తక్కువ సంస్కృతపదజాలమునే తీసుకొన్నా డన్నమాట. కాని, నేను కన్నడనిఘంటువును చూడలేదంటారు. కిట్టెలు, గండర్టు, మానియర్ విలియమ్సు వ్రాసిన నిఘంటువులు నిత్యమూ దగ్గరలేకపోతే నాకు తోచనే తోచదు. "ఆంధ్రభాషాస్వరూపమును, దానికిని సంస్కృతమునకును గలసంబంధమును చక్కఁగా నెఱిఁగియుండవలసిన నారాయణరావుగా రిట్లు వ్రాయుట చిత్రము," అని రామయ్యపంతులుగారు వ్రాసినారు. ఆంధ్రభాషాస్వరూపమును గురించిన్ని, దానికిని సంస్కృతమునకున్న గలసంబంధమును గురించిన్ని నాకు ఎంతో కొంత తెలుసును. కావ్యభాష ఒక్కదానినిచూచి ఆంధ్రభాషాస్వరూపమును నే నేర్పాటు చేసుకోలేను. కావ్యభాష నాకు ఆంధ్రభాష అంతాకాదు. కావ్యభాష సంకుచితమయినది. మిక్కిలీ మితప్రయోజనము గలది. అది జీవద్భాష కాదు. ఒకరీతిగా అది కృతకభాష. దానిని ప్రబంధకవు లెల్లెట్లో నిలబెట్టడమునకు ప్రయత్నించినారు. అది సర్వాంగసంపూర్ణమైనది కాదు. నాదృష్టికి ఆంధ్రభాషాస్వరూపము మరొక్కరీతిగా కనబడుతున్నది. ఆస్వరూపములో కావ్యభాష ఒక అంగము మాత్రమే. రామయ్యపంతులుగారికి అదే సంపూర్ణస్వరూపముగా కనబడవచ్చును. అందుచేతనే వారు సంస్కృతమున కక్కువ ప్రాముఖ్యము నిమ్మంటున్నారు.

ఇక వీరు సమర్థించుకొన్న పదముల అర్థము విషయమై కొంచెము ఆలోచించుదాము.

1. అంకవన్నియ—అనే పదముక్రింద త. అంగపడి, అంగవడి, అని నిఘంటుకారులు వ్రాసినదానిలో 'అంగపడి' అని తమిళములో ద్విత్వరహితముగా పదమధ్యమున పరుషాక్షర ముండదనిన్నీ, పరుషముగా ఉండవలెనంటే దానికి ద్విత్వము వస్తుందనిన్నీ, ద్విత్వము రానప్పుడు 'ప' అని వ్రాసినా దానిని 'బ'గా ఉచ్చరించవలెననిన్నీ నేను వ్రాసినాను. తమిళభాషా పదముల పరుష సరళాక్షరముల ఉచ్చారణమున కిది మూలసూత్రము. ఈ విధి తెలియకపోతే తమిళ శబ్దములను సరిగా ఉచ్చరించలేము. ఆ భాషలో పరుష సరళాక్షరములకు వ్రాతలో ఒక్కటే గురుతుండడముచేత, రెండింటికిన్ని దానికే త్రాడుకొని, సందర్భోచితముగా ఉచ్చరించుకోవలెను. ఈసంగతి శ్రీరామయ్యపంతులుగారికి తెలియనిదికాదు; కాని, ఎట్లయినా తమ నిఘంటువును సమర్థించుకోవలెనని ఏమేమో వ్రాసినారు. మద్రాసువిద్యాలయమువారి తమిళనిఘంటువులో రామయ్య పంతులుగారు వ్రాసినట్లు 'అంకపడి' అని ఇంగ్లీషున వ్రాయలేదు. 'అంకపటి' అని ఉన్నది. దానిలోని 'టి'ని వీరు 'డి'గా చదువడము సరియే. 'డి' అని ఎందుకు చదివినారో అందుకోసమే 'ప'నుకూడా 'బ'గా చదువవలసి ఉండెను. ఆకారణముచేతనే, 'అంకపటి'లోని 'అంక'ను 'అంగ' అని మచ్చుపదములలో సరిగానే ఉదాహరించినా, ఖండనములో తిరిగీ 'అంక'అని వ్రాసినారు. తమిళ నిఘంటువును వ్రాసినవారు అక్షరముల స్వరూపముబట్టియే ఇంగ్లీషున వ్రాసినారుగాని, వాటి ఉచ్చారణమును బట్టి వ్రాయలేదు. మరి ఒక్కసారి మద్రాసు విశ్వవిద్యాలయ తమిళనిఘంటువును చూస్తే ఈసంగతి తెలుస్తుంది. ఇంగ్లీషు అక్షరాలతో వ్రాయని తమిళనిఘంటువులలో 'అంకపటి' అనియే ఉంటుంది. దానిని 'అంగబడి'అని చదువుకో

వలెను. ఒక్కప్పుడది 'అంగవడి' అనికూడా అవుతుంది. నిఘంటువులు తమ వాదమునకు సహకారులని రామయ్య పంతులుగా రనుకొన్నారు కాని, ఐనవి కావు. ద్రావిడ భాషావ్యాకరణమును గాని, కాల్డువెల్లు కంపేరెటివ్ వ్యాకరణమునుగాని చదువుతే 'అంగపడి' అనే ఉచ్చారణము తప్పని తెలుస్తుంది. ద్రావిడభాషా విషయమున వారికి సహాయముచేసినవారు 'అంగపడి' అని వ్రాస్తే, అదితప్పు. చెన్నపట్టణములో కొంతమంది అరవ వారిని 'அங்கபடி'అని వ్రాసి చదువుమనగా అందరును 'అంగబడి' అనే చదివినారు. ఈ 'బ'కారోచ్చారణమును కొందరు తేలికగా వకారమువలె చేస్తారు. 'ప' కారమునకు ప్రత్యేకాక్షర మరవములో ఉన్నది.గనుక 'அங்க வடி' అనిన్ని, బకారమునకు అక్షరములేదు గనుక 'அங்கபடி' అనిన్ని, నిఘంటువులలో కనబడుతుంది. అయినా 'அங்கபடி' ని 'అంగబడి'అనియే చదువుకోవలెను.

2. అంగలార్చు—దీనికి 'గంతులువేయు' అని వ్యుత్పత్త్యర్థమును వ్రాసి, తరువాత దానినుంచి పుట్టిన ఇతరార్థములను చూపవలసి ఉండెనని నేను సూచించినాను. దీనికి 'అంగ'అనునది మూలపద మని చెప్పినాను. 'ఆర్చు' అనుదానికి ఆర్పుతోగాని దుఃఖముతోగాని సంబంధము లేదని చెప్పినాను. ఆలంకారికమంటే మూలార్థమునకు భిన్నముగా దానినుండి పుట్టినదని నాఅభిప్రాయము. వ్యుత్పత్త్యర్థమును విస్మరించడము నైఘంటుక పద్ధతికి విరుద్ధము; తామేర్పరచుకొన్న విధానమునకున్ను విరుద్ధము.

3. అంగవించు—దీని అర్థము విషయములో కూడా వ్యుత్పత్త్యర్థమునుచూపెట్టకపోవడమనేదోషము పట్టినది. మొదిపద్యములో అంగవించిరేని' అనిన్ని, క్రిందిపద్యములో కదియకయుండవ్' అనిన్ని ఉన్నంతమాత్రముచేత 'అంగవించు' అంటే కదియు అని అర్థము చెప్పడము తగదు. 'మదము గదురఁజేసి, మదమోహ మెక్కించి, చూపుఁదీఁగెలందుఁ జుట్టుకొల్పి' మాటలతో అంగవించిరేని అనేమాటను కలిపి చదువుతే 'కదియు' కంటె ఎక్కువ అర్థము వస్తుంది' ఆపద్యమును తిరిగీ తామే కొంచెము స్థిమితముగా చదువుకొంటే సందేహము విడిపోతుంది.

4. చేయక, చేయమి — వీటిలో క, మి, అనేవి వ్యతిరేకార్థకప్రత్యయములనిన్నీ, అవి పరములైనప్పుడు ధాతువుతుది ఉత్వమునకు అత్వము ఆదేశముగా వస్తుందనిన్నీ అర్థము వచ్చే వాక్యమును నిఘంటుకారులు వ్రాసినారు. 'అ'త్వ మొక్కటే వ్యతిరేకార్థబోధక మని నేను వ్రాసినాను. దాని నాక్షేపిస్తూ 'క, మ' అనేవి ఏమవుత వని రా. పంతులుగారు ప్రశ్న వేసినారు. అవి విశేషములను కల్పించే భావార్థకప్రత్యయములనిన్నీ, వ్యతిరేకార్థముతో వాటికి సంబంధము లేదనిన్నీ నాసమాధానము. (పేర్) పేర్మి, (కలు) కల్మి, (పో) పోక, మొదలయినవాటిలో క, మి, లు భావార్థక ప్రత్యయములు. వీటికి వ్యతిరేకార్థము లేదు. 'పోక' అనేది వ్యతిరేకక్త్వార్థకముకూడా అవుతుంది. అప్పుడది 'పోవక' అనేదాని సంక్షేపరూపము అట్లే 'రామి' 'రాక' మొదలయినవికూడా సంక్షేపరూపములే. వాటిలో వ్యతిరేకార్థబోధకమయిన 'అ' కారము లీనమయి ఉన్నది. అయితే 'చేయక' అనే వ్యతిరేక వ్యతిరేక భావార్థకరూపమే వ్యతిరేకక్త్వార్థకరూప మెట్లవుతుం దని ప్రశ్న రావచ్చును. వ్యతిరేకక్త్వార్థకరూపముయొక్క తత్త్వమదే అని మా సమాధానము.

5. 'నిల్వరయేని'—అనేదానిలో అకారము అవధారణార్థకమని మామతము. ఇతరస్థలములలో ఇటువంటి సందర్భములలో నన్నయ క్రియలపై అత్వమును అవధారణార్థముననే ఉపయోగించినాడు. ఇచ్చట గణము కుదురక నన్నయ కక్కుర్తి పడినాడని చెప్ప సాహసింపరాదు. సంస్కృతములో ఉన్నదున్నట్లే నన్నయ తెనిగించినాడని చెప్పడమునకున్ను వీలులేదు. రామయ్య పంతులుగారిచ్చిన ఒక్కశ్లోకపాదమును తెనిగించడములోనే నన్నయ ఎన్నిమార్పులు చేసినాడో చూడండి. "నసాసభాయత్రనసంతి సజ్జనాః"అనేదానిని సరిగా తెనిగించవలెనంటే "ఎచ్చట సజ్జనులు లేరో అది సభకాదు" అని వ్రాయవలసి ఉండెను. కాని నన్నయ 'అది సభయే

అని మొదట ప్రశ్నించినాడు. "ప్రియంబెసఁగన్" అని మూలములో లేనిదానిని చేర్చినాడు. 'సంతి' అన్నదానికి 'నిల్వరయేని' అని అన్నాడు. 'సజ్జనాః' అనేపదమునకు 'ఆర్యులు' అన్నారు. ఇది మూలమునకు సరియైన తెలుగుసేత కాదు. అందుచేత 'నిల్వరయేని'అనే దానివల్ల ఒక విశేషార్థమును బోధించడమునకే నన్నయ 'నిల్వరు'అనే క్రియమీద అవధారణార్థకఅకారమునుచేర్చినాడు కాని, కక్కుర్తికోసము కాదు. 'ఆర్యులు లేనిది సభకాదు'అని చెప్పితే సరిపోలేదు. బోడిగా వున్నది.

6. 'అంచుక యించుక'—'ఆడదుగాని మాటలొకయంచుక యించుక వీనులొగ్గినా, యాడినమాటలెల్ల విను నర్మిలితో—'అని పినవీరన్న పద్యము. దీనికి అభిజ్ఞానశాకుంతలములో మూలము "వాచంనమిశ్రయతి యద్యపి మేవచోభిః, కర్ణం దదాత్యభిముఖంమయి భాషమాణే" అనేది. "అంచుకయించుక" అనేదానికి మూలములో సరియైనపదమేదీ లేదు. అయితే,పినవీరన్న దానిని నిరర్థకముగా కక్కుర్తికోసమయిన ఉపయోగించిఉండవలెను, లేదా మూలమునకు మెరుగుతెచ్చుటకైనా ఉపయోగించి ఉండవలెనుకదా. మెరుగుకోసమే వేసినాడని నా యభిప్రాయము. "నాతో కొంచెమైనను మాటలాడదు" చెవులు నిక్కబెట్టుకొని నేనాడినమాటలన్నీ వింటుంది—అని రామయ్యపంతులుగారుచెప్పిన అర్థము విరసముగాను, అస్వారస్యముగాను ఉన్నది. 'అక్కడ కొంచెము ఇక్కడ కొంచెము మాటలాడదు'అని నేనువ్రాయనులేదు, పినవీరన్న అభిప్రాయముకూడా అది కాదు. "ఆడదుగాని మాటలు" అనే దగ్గరవాక్యమును విరుపు చేయవలెను."నాయాడినమాటలెల్ల ఒకయంచుకయించుక వీనులొగ్గిఅర్మిలితోవినున్"అనిఅన్వయముచేసుకోవలెను. మాటలోమాటకలుపదుగాని అక్కడక్కడ(అప్పుడప్పుడు) చెవులొగ్గి నా మాటలను అర్మిలితో వింటుంది—అని చెప్పడములో కాళిదాసుకంటె పినవీరన్న శృంగారాభినయములో రవంత వ్రాసి చూపించినాడు. మాట్లాడకుండా మొద్దువలె మొగమువేసి అదేచూడడము శృంగారచేష్ట కాదు. విననట్టునటించినా అప్పుడప్పుడు మాటలకు చెవులొగ్గడము శృంగార విలాస మవుతుంది. అందుచేత, రామయ్యపంతులుగారి ఖండనము సరియైనది కాదు.

7. "అంగదట్టము, మి. వి. (క. అంగదట్ట)—శరీరముకప్పు ముదుగుబట్ట—పావడ, గాగర" అని వ్రాసినారు. పైదానిలో "శరీరముకప్పు ముదుగుబట్ట" అనే దానిని వ్యుత్పత్తిగా ఇచ్చినారట. అది అర్థముకాదట. అది వ్యుత్పత్తిఅని తెలుసుకొనడమునకు సంకేత మేమీ ఇవ్వకుండా "ఇదియెంతగట్టి ప్రశ్నయో చదువరు లూహింతురుగాక"అని వ్రాసినది ఎంతగట్టి ఖండనమో ఆచదువరులే ఊహింతురుగాక.

8. తక్కినఖండనముకూడా ఈరీతిగానే ఉన్నది. ఈఖండన భండనములతో కాలము వ్యర్థముచేసుకొనడము నాకిష్టము లేదు. మాటకు మాట తెగులు, నీటికి నాచు తెగులు. వ్రాసినదానిని సద్భావముతో గ్రహించ నిశ్చయించుకొననివారితో వాదము పెంచుకొనడము వృథాప్రయాసము. "ఇవన్నీ మేము యోజింపనివికావు. అట్లుండవలెను కావుననే అట్లు వ్రాసినాము. దేహబలము, అర్థబలము, బుద్ధిబలము కల వారికే మానిఘంటు వుద్దేశింపబడినది" అను వాదమునకు దిగినవారికి సమాధానము చెప్పడము కష్టము. అయినా, భాషావిషయములు గనుక రెండుసంగతులు మాత్రమువ్రాసి విరమిస్తాను.

9. "ఏనేఁడు లగుడెంచె నర్జునుండేఁగి—యింతకేతెంచు" అనేదానిలో 'అగుడెంచె' అనేదానికి 'ఏనేఁడు లయినవి, పూర్తి అయినవి' అని రామయ్యపంతులుగారర్థము చెప్పుచుంటారు. "ఏనేఁడులు కావచ్చినవి—ఇంకా పూర్తి కాలేదు, కొంచెముకాలములో అవుతవి" అని నేనర్థము చెప్పుకొనవలె నన్నాను. "కథాసందర్భమున సంస్కృతాంధ్రభారతములు చూచిన తెలియును" అని రామయ్యపంతులుగారు హెచ్చరించినారు. సంస్కృతభారతమును చూడగా, జటాసురవధపర్వము తరువాత—

స సమానీయ తాన్ సర్వాన్
భ్రాతౄన్ నిత్యబ్రవీ ద్వచః

ద్రౌపద్యా సహితాః కాలే
సంస్మరన్ భ్రాతరం జయమ్;
సమాశ్చతస్రోఽభిగతాః
శివేన చరతాం వనే;
కృతోద్దేశః సబీభత్సుః
పంచమీ మభిత స్సమామ్.

అనేశ్లోకములు ఉన్నవి. వీటికి తెనుగు ఆంధ్రభారతములోని పద్యములు. ఇందువల్ల ఐదేండ్లు గలించిన వన్న అర్థము వస్తుందేమో పండితులూహింతురుగాక. ఇదిగాక తమ అర్థమును సమర్థించుకోనెంచి 'అర్జునుఁ డింత కేతెంచున్' అంటే 'ఈపాటికర్జునుఁడు వచ్చియుండును' అని అర్థము వ్రాసినారు. ఇందులో 'ఇంతకు' అనేదానికి 'ఈపాటికి' అని అర్థముచెప్పడ మొక తప్పు. 'ఇంతలో, కొద్దికాలములో' అని చెప్పవలెను. "ఏతెంచున్" అంటే "వచ్చియుండును" అని అర్థము వ్రాయడము రెండో తప్పు. "వస్తాడు" అని కేవలభవిష్యదర్థమును చెప్పవలెను. ఇంగ్లీషులో "He will come presently" అనే దానికిన్ని, "He would (might have come by this time" అనేదానికిన్ని ఎంత అర్థభేద మున్నదో పై రెండర్థములకున్ను అంత భేద మున్నది. 'ఏతెంచున్' అనేదానికి 'వచ్చియుండును' అనే అర్థము నవీనమైనది. నన్నయ ఆ 'would have come' అనే అర్థములో ఆక్రియారూపమును వాడడు. ఆ అర్థమిప్పుడు మనవ్యవహారములో ఉన్నది. చూడండి. "నీవు వాడిని పిలిచినావా?—లేదు.—అయ్యో, ఎందుకు పిలువలేదు? పిలుస్తే వచ్చునే; పోయి పిలువు, వస్తాడు"—ఇక్కడ "వచ్చును" అంటే "వచ్చి ఉండును" అనే అర్థమున్ను 'వస్తాడు' అంటే కేవలభవిష్యదర్థమున్ను ఉన్నవి. ఇప్పటి వ్యావహారికార్థమును నన్నయవాడిన క్రియారూపమునకు రామయ్యపంతులుగారు ముడిపెట్టినారు.

10. "అంత సరోరుహాప్తుఁ డుదయంబగుదెంచె... సత్వరుఁడై చనుదెంచె నొక్కనాన్"—ఇందులో అగుదెంచె అనేది "కడచు గతించు" అనే అర్థమునకు ఉదాహరణము కాదట. 'కలదియగు' అనే అర్థమునకుదాహరణమట. అట్లయినా సూర్యోదయముఅయినదనేకదా అర్థము సూర్యోదయముకా లేదని నేనుచేసిన ఆక్షేపము. 'అగుదెంచెన్' అన్నదానితరువాత 'చనుదెంచెన్' అని రూపములో భూతకాలమును తెలియజేసే క్రియ ఉన్నదానికి వర్తమానార్థమునే చెప్పుకోవలెను. 'సత్వరుడై చనుదెంచుచున్నాడో' అన్నట్లుగా సరోరుహాప్తు డుదయింప ప్రారంభిస్తున్నాడు' అని పైదాని కర్థము. ధాతువుపై 'తెంచు' అనుప్రయుక్తమయినప్పుడు దానికి రెండు విధములయిన అర్థభేదములను కలిగిస్తుంది. (1) ధాతువు తెలిపేకార్యము పూర్తి కాక కొద్దికాలములో పూర్తి అవుతుందని సూచించడము (2) ధాతువు తెలిపే కార్యము అభిముఖమగుటను సూచించడము. అగు, అగుదెంచు—అనేజంట మొదటిదానికి ఉదాహరణము. వీఁచు, వీతెంచు—అనేజంట రెండోదాని కుదాహరణము. 'అయ్యెన్' అంటే 'అగుదెంచెన్' అనిన్నీ, 'వీఁచెన్' అంటే 'వీతెంచెన్' అనిన్నీ అర్థము చెప్పకూడదు. 'ఏపాటిభాషాజ్ఞానము కలవారూ (ఇట్టి అర్థమును) 'చెప్పరు' అని నేను వ్రాసినదాని అభిప్రాయమిదే.

11. పీఠికలో తాము వ్రాసిన వాక్యములలో కర్త అసమాపకక్రియకువేసి దాని సమాపకక్రియ కర్మణ్యర్థములో వ్రాయడమును గురించి నేనుచేసిన ఆక్షేపము నెత్తుకొని, నామీదనేకాకుండా నాగురువుగారయిన రామమూర్తి పంతులుగారి మీదికికూడా ఏదో పెద్ద విషయమును కనిపెట్టినట్లు 'ఇదిగో' అని ససంభ్రమముగా నన్నయ తిక్కనలనుంచి నాలుగుదాహరణముల నిచ్చినారు. నన్నయ తిక్కనల ప్రయోగము లున్నవనుకొన్న వీరిశైలి ఎట్లు నిర్దుష్టమవుతుందో తెలియరాకున్నది. ఏనాటి పలుకుబడి ఆనాటిదే. అది మారినప్పుడు మారినపలుకుబడినే వాడడము భాషాసంప్రదాయము నన్నయ ప్రయోగ మొకటి తిక్కన ప్రయోగ మొకటి పెద్దనప్రప్రయోగమొకటి, (తరిగొండ) వెంకమ్మప్రయోగమొకటి—ఈరీతిగా వివిధకాలముల ప్రయోగములను గుదిగ్రుచ్చి వ్రాసినది అతుకులబొంత అవుతుందిగాని శైలి అనిపించు కోదు.

అయినా, నన్నయ తిక్కన ప్రయోగములలో కర్త అసమాపకక్రియకు సంబంధించిఉండగా సమాపక

# భూగర్భమునుండి క్రొత్తగ వెలువడిన శిల్పచిత్రములు



౧. త్రవ్వబడుచున్న పహారపుర దేవాలయము. బంగాళమున చాల పురాతన మైనది. బంగాలీ కళలకు, చరిత్రమునకు నిది విలువగల విషయములను సమకూర్చుచున్నది.



౨. నాలందాస్తూపముయొక్క అయిదవ పునర్నిర్మాణ సోపానమార్గమున నున్న బుద్ధునియొక్కయు, బోధిసత్వులయొక్కయు చిత్రములు. ఇవి గచ్చుతో చేయబడినవి.



3. నాలందాస్తూపముయొక్క అయిదవ పునర్నిర్మాణము.

ఇది క్రీ.శ. ౭వ శతాబ్దమున హ్యూయెన్ త్సాంగ్ వచ్చినపుడు సుప్రసిద్ధవిశ్వవిద్యాలయముగనుండెను.
అది మొదలు ౧౧-వ శతాబ్దమువఱకును పెంపొంది యుండెను.
ఇది ఆఱుమారులు వేర్వేరు సమయములయందు పునర్నిర్మాణమును గాంచినది.
స్తూపముయొక్క అయిదవ పునర్నిర్మాణము ౧౩౦,౦౦౦ ఘన అడుగుల
ఇటుకకట్టడమును త్రవ్వితీయగా నిది కాన్పించినది.

క్రియను కర్మణిప్రయోగముగా ఉన్నదేమో ఆలోచించుదాము. "మొదలి పెక్కుజన్మములఁ బుణ్యకర్మముల్, పరగఁ బెక్కు చేసి పడయఁబడిన యట్టిరెయిలుక" అన్న దానిలో'చేసి' అనేదానికి కర్త ఏమవుతుంది. 'జనులు' అని చెప్పవలెనంటారు. కాని, ఇది సరికాదు. 'చేసి' అంటే 'చేయడమువల్ల, చేయడముచేత'అని చెప్పుకొనడమే సమంజసమైనట్లు తోస్తుంది. 'చేసి'అనేది 'చేయుటంజేసి' 'వచ్చుటంజేసి' అనునట్టి వాటిలో ఇట్టి అర్థమును కలిగివున్నది. అట్టి అర్థమునే 'పెక్కు చేసి' అనేదానికిన్ని చెప్పుకోవలెనుగాని, నన్నయ ఇట్టి భాషామర్యాదా విరుద్ధమైన ప్రయోగమును చేసినాడని తలంచడము తప్పు.

"తడయక పుట్టిన నాఁడ తల్లిచేఁ దండ్రిచే విడువఁబడితి" అనే ప్రయోగములో 'తడయక' అనేది ఒక అవ్యయము. మిన్నక, ఊఅక, వంటిది. 'పుట్టిన నాఁడ తల్లి చేఁ దండ్రిచే తడయక (శీఘ్రముగా)విడువఁబడితి'అని అన్వయమును, అర్థమును చెప్పవలెను.

తక్కిన రెండు ప్రయోగములలోని 'తలవట్టియీడ్వఁబడు' అనేది ఒక నానుడి. (idiom), అది తమ వాక్యరచనకు ప్రయోగముగా ఉపచరిస్తుందనుకొనడము ఉత్తభ్రమ. నీటిలో మునిగిపోతున్నవాడు ప్రక్కమ పోతూవున్న గడ్డిపోచనైనా పట్టుకొని కాపాడుకోవలెనను కొంటాడట.

—చిలుకూరి నారాయణరావు.

---

## కోనసీమ గురుశిష్యప్రశంస

పుల్లెల శ్రీరామశాస్త్రి గారు

కనుఁగొనఁ గల్పవృక్షముల కైవడి సత్ప్రభువుల్ గుణోత్తము
ల్ధనమును విద్యయ న్ఫలములం ఘటియింపఁగ బాలకీర వా
గ్వినుతులు సెల్ల నెల్లపుడు బెం పలరారుటఁ గోనసీమయే
యన నమలాపురంబు చెలువందు ధరాస్థలి స్వర్గతుల్యమై.

అమలపురం బటంచు జనులంద అనంగను గొంద అందుఁ బెం
పుమిపుల న్రామకామలక భూరుహసంతతి గల్గుతోఁట లిం
పమరుటచేత న్రామపుర మందురు కాదనరాదు గాని నే
నమలపురంబె యందు నెనయర్గురుశిష్యుల సత్ప్రవర్తనల్.

మామిడిపండునం దెసఁగు మవ్వపుబీజమొకండె సత్యమ
ట్లామలకంబునం దలరు నారయవిత్తులు పెక్కులొక్కటన్
బ్రేముడియందు దుష్కపటవృత్తులు నెక్కొని యుండునట్లు ని
ష్కాముల యట్లు చింత లోగిఁ గన్పడుఁ దత్సములుండ్రు శిష్యులున్.

నరుఁడిల నెంత పాటువడినన్ ఘనునిచ్చలు నాశ్రయించినన్
దొఱకును వానిభాగ్యమునఁ దోడెముగాఁగ ఫలంబ దెట్లనన్
గరిపతి మస్తకాంతర వికాసి ఫలంబును బొంద నక్క కే
వెరవునఁ బొల్పెడున్ విపినవీథి మృగేంద్రసమీప మబ్బినన్.

మును పల రామలక్ష్మణులు ముగ్ధులు వోలె నటించి గాధిజున్
ఘన భయభక్తులం గొలిచి కాంచిరి శ్రేయము; కల్గఁజేసి రా
మునికిని గౌరవంబు; వరబుద్ధులు శిష్యులు నైజ సద్గుణం
బునఁ గురుఁగొల్చి మేల్వడసి పొల్చుట వంద్యమగుం గదా భువిన్.

వేసముఁగాంచి చెంచనుచుఁ బెల్కుఱ మాటలఁ బల్కి పైపయిన్
రోసముమీఱ ముల్కులను ద్రోవగనేసి తుదిన్ శరాసనున్
వేసి నిరాయుధుం డగుచుఁ బేర్చి పయింబడుచున్న యన్నరున్
భాసుర సత్కృపన్ మనుచు భర్గుఁడు బాలురనెల్ల నేలుతన్.

సముచిత బోధనంబునను శంకలఁదీర్చి కళావిశేషముల్
క్రమముగఁ జెప్పి సమ్మతిని గాలము బుచ్చుచునుండు సద్గురూ
త్తము నిజశిష్యు లాదట ముదంబునఁ గొల్చుట వింతయే ఫల
ద్రుమమును జేరి చిల్కలు రుతుల్ వెలయంగను గొల్చియుండవే.

పాలసులం దొఱంగి తమపాఠములం బఠియించుపొంకెఁ బ్రా
ల్మాలక సుంతయేని నెఱి మానక రోసము నుజ్జగించి స
చ్ఛీలమునన్ సుధీజన విధేయతఁ గాలముద్రోయుచున్న యీ
బాలుర దేవదేవుఁడు కృపామతిఁ బ్రాజ్ఞులఁ జేయుఁగావుతన్.

గురుకులావాసమున, విద్యకుదురుపడిన-యట్లు వేఱొండువిధమున నలరదెందుఁ
గాన శిష్యులు గురులను గలసిమెలసి-తాముతరియించి యితరులఁదనుప హితము
ఎల్ల సుధీమణులెంచిన-పుల్లెల శ్రీరామశాస్త్రి పొసఁగ నొసంగెన్
సల్లలిత పద్యనవమణు-లుల్లసిలన్ గురులు శిష్యు లుర్వీస్థలిలోన్.

---

# ౨. పునర్విమర్శనమునకుఁ బ్రత్యుత్థానము

భారతి ప్రభవ ఫాల్గుణమాస సంచిక యందు శ్రీయుత వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిన నేపాళ చోళగ శబ్దముల మీఁది పునర్విమర్శనమును గూర్చి విని, వాంఛనీయమగు నూతన విషయమేమయిన వ్రాసిరో యను నాసతో, నాపత్రికఁ జూడఁ గొండొక యత్నమొనర్చి, తుదకు దానిం గాంచితిని. కాంచినంత నా మానసము చివుక్కురన నే నెంతయుఁ జింతించితిని. వారు వ్రాసినవ్యాసము కేవలము విమర్శనార్థము కాదనుట స్పష్టము. నిమిత్తాంతరంబులచేత విషయ విమర్శనేతర లాభాసక్తచిత్తులయి వారు వ్రాసిన వ్యాసము నుదాసీనభావంబునఁ జూచి యూరకుంటయే సమంజసమని తోఁచెను. వ్యాసముం జదివిన నెట్టి వారలకయిన, నద్ది విషయ విమర్శనోద్దేశమున నే వ్రాసినదికాదనియుఁ, దాము తంజనగరంబునఁ జేసిన మహోద్యమంబును బ్రకటించుటకును, గళాప్రపూర్ణ బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారి ప్రస్తుత దీనావస్థను బాప నాంధ్రజనులకు విజ్ఞాపనము సేయుటకును, విశేషించి, నాకు విమర్శక మర్యాదలను దెలుపుచు నించుక కరుణించుటకును వ్రాసిన యది యని పోడకట్టకమానదు. శ్రీ ప్రభాకరశాస్త్రిగారి కీర్తిప్రకటనము నాకత్యంత ప్రియము. శ్రీ వేంకటరాయశాస్త్రిగారి దారిద్ర్యాపనోదనము నాకు మిగుల ముదావహము. అట్లగుటం జేసి శ్రీ ప్రభాకరశాస్త్రిగారివ్యాసమును నేను గాదన నేల? వలయుననిన, నేనుగూడ శ్రీ ప్రభాకరశాస్త్రిగారిని 'పండితకవు'లని యుద్ఘోషించుటయే కాక, చారిత్రకపరిశోధనలయం దాఱితేఱిన భాషాసేవాధనులని ముక్తకంఠముగఁ బలుక సంసిద్ధుఁడనే యగుదును. ఇట్టి వ్యాసంగమే తమ జీవితముగఁ బడయు శ్రీ ప్రభాకరశాస్త్రిగారి నడిగినఁ జారిత్రక సందేహములు దీఱునుగదా యని, యుద్యోగాంతరముల జీవయాత్రఁ గడపుచుండుటచే శ్రీశాస్త్రిగారికుండు సౌకర్యభాగ్యమునకు నోఁచుకొనని నేను, పెక్కుసారులు విశ్వసించుటయుఁ గలదు.

ఇంక బ్ర.శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారి దారిద్ర్యమునుగూర్చి యన్ననో; తమ గ్రంథరత్నములచే నాంధ్రభాషామతల్లిని సర్వాలంకారశోభితాంగిగా నొనర్చిన శ్రీశాస్త్రిగారివంటి శేముషీసంపన్నులు నేఁడున్న వస్త్రములకుఁగూడఁ గడవనంతటి దారిద్ర్యములో నుండుటయు, ననేక సాలంకృతవ్యాఖ్యానిధానముల నాంధ్రమల్లినాథుండన మనసారస్వత సుందరాంగికి సమర్పించిన యాపాండిత్య ధనుఁడు నేఁ 'డావరించు ప్రోఁడు లేక చీకాకుపడుచున్నాఁడు'యను విని మిగులఁ జింతించుచున్నవాఁడ. అట్టివారి కిట్టి యవస్థనుం బట్టఁ జూచియు నౌదాసీన్యము నందినయెడల నాంధ్రమహాజనులు పాయఁగ రాని మహాకళంకము నందుదు రనుటకు సందియంబుండదు.

శాస్త్రోపస్కృత శబ్దసుందరగిరః
శిష్యప్రదేయాగమా
విఖ్యాతాః కవయో వసంతి విషయే
యస్య ప్రభోర్నిర్ధనాః;
తజ్జాడ్యం వసుధాధిపస్య సుధియ స్త్వ
ర్థం వినాపీశ్వరాః
కుత్స్యాస్స్యుః కుపరీక్షకై ర్నమణయో
యైరర్ఘతః పాతితాః.

(భర్తృహరి)

నేఁటి యాంధ్రమహాశయు లట్టి యపయశంబునకుఁ బాల్పడువారు గాఁజాలరని త్రికరణశుద్ధిగ నమ్ముచున్నాఁడ. శ్రీవేంకటరాయ శాస్త్రిగారి హృదయశల్యము బాప సహృదయు లెద్దియయిన నుద్యమంబుఁ జేసి

నచో, నేనామహామహోపాధ్యాయుల శిష్యబృందము లోనొకనిగ నుండనోఁచుకొనకున్నను, నాకుందగిన విధమున వారి ఛాత్రులతోఁబాటు సాహాయ్యము నొనర్ప సంసిద్ధుఁడనని తెలుప నుత్సహించుచున్నాఁడను.

కాని, శ్రీప్రభాకరశాస్త్రిగారు, తమ పునర్విమర్శనములో దమ యసాధారణరచనా నైపుణితోఁ బ్రాసంబును గూసువిద్యగఁజేసి వ్రాసిన 'వెక్కిరింపుముక్కలు' 'కేలిసేసిరి' లోనగు పదములు నాకు హృదయశల్యంబులయి యపరిమిత వేదన నొసంగుచున్నవి. శ్రీప్రభాకర శాస్త్రిగారు నావాక్యంబుల కన్యాయంబగు నొక్క యర్థముఁ గల్పించి, యా యర్థమే నాకుంగలదనియెంచి, శ్రీవేంకటరాయశాస్త్రిగారిని నేను గేలిసేసితినను నపవాదు నాతలనుమోపిరి. శ్రీవేంకటరాయశాస్త్రిగారినిఁ గేలిసేయు నూహము నాకు మిగుల దవ్వు. ఈనిందను నాపై నారోపించుటచే, నాస్వవిషయము నించుకఁ దడవ వలసి వచ్చినందులకుఁ జింతించుచున్నాఁడను. కాని, కేలిసేయుటయే నాయభిమతమయియుండిన, నాకనువు నొసంగుచు ననేకపద్యవ్యాఖ్యానముల నవకాశము బాహుళ్యముగలుగ నీచారిత్రక విషయము నాధారముచేసికొని యా యాయూహను సాధింపఁదలంతును? నే నీవిజయవిలాసవ్యాఖ్యానమునుంగూర్చి నెల్లూరు, బెజవాడ, కాకినాడ,విశాఖపట్టనము,విజయనగరము,బరంపురము లోనగు ప్రధానపట్టనములలో, దినములవరుస, నుపన్యాసము లొనర్చుచుఁ బోవునపుడు, వ్యాఖ్యాన భేదములను, దోషాదోష విమర్శనమును, స్వారస్యాధిక్యనిరూపణము నుగూర్చి తారతమ్యముల నుగ్గడించితినేకాని, యెచ్చట నేని వారినిఁ గేలిసేసిన పాపంబున కొడిగట్టలేదని విశ్వసించుచున్నాఁడను. ఈవిషయంబున నేను ముచ్చటించిన విద్వాంసులగు శ్రీయుతులు గుర్జాడ సుబ్రహ్మణ్యశర్మ గారును, వడ్డాది సుబ్బారాయుడు గారును, కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రి గారును, మారేపల్లి రామచంద్రకవి గారును, ఆచంట సాంఖ్యాయనశర్మగారును, కేతవరపు వేంకట శాస్త్రిగారును, వఝల చినసీతారామ శాస్త్రిగారును, త్రిపురాన సూర్యప్రసాదరావు దొర గారును నాకట్టి తలంపులేదని చెప్పఁగలరని నమ్ముచున్నాను. వ్యాఖ్యానముల యందలి లోపాలోపములను విమర్శించుటఁ గేలిగా భావించుట సరస విమర్శకుల పద్ధతి కానేరదు. విషయవిమర్శనమున వయస్సును, సంపదయు, నభిమానమును గణించుట పక్షపాతబుద్ధి యగును. ఈయభిప్రాయమునే నేను బలింబదిగ నుపన్యాసావసరంబులయం దచ్చుపడ "శ్రీవేంకటరాయశాస్త్రిగారు తమవ్యాఖ్యానోపోద్ఘాతమునఁ జెప్పినచొప్పున విద్వన్మిత్రులు దమ్ము గోరియుండుటకును, తాము పరిక్లేశమును వహించి సకల సౌకర్యసంపన్నంబుగ వ్రాయంజేసిన యుద్యమంబునకును, విశేషించి యానెక్కుని గ్రంథమునఁ గవి చూపనెంచిన యందములకును జాలినంత సమగ్రముగ రస చమత్కారాది ప్రకటనము వ్యాఖ్యానమునఁ గానవచ్చుటలేదని నేనీ ప్రయత్నమును జేయుట వారినిఁ దృణీకంచుతలంపునఁ గాదు. శ్రీవేంకటరాయశాస్త్రులవారు చతురమతులే * అయినను,స్ఫురించుటయనున దొక్కరి సొమ్ము కానేరదు. ఎట్టివారికయినఁ జక్కని భావములు స్ఫురింపవచ్చును. ఒక్కనికే యొక్కనాఁడు స్ఫురింపని యర్థ మింకొక్కనాఁడు స్ఫురించుటయుఁగలదు. ఇట్టి యవకాశముబ్బుట చేత నా వ్యాఖ్యానమునఁ బాత్ర పోషణోద్యమమును, కవి సహజ గుణవర్ణనమును, కాలవ్యవస్థా ప్రకటనమును గూడఁ జేయ వలను గలిగిన"దనియే చెప్పుచుంటినిగాని, వారినెన్నడును గేలిసేసి యెఱుఁగను. వ్యాఖ్యాతల కర్తవ్యముల నుగ్గడించుపట్టున నేను వ్రాసిన వాక్యంబులను నిందాగర్భంబులుగ భావించి, శ్రీ ప్రభాకరశాస్త్రిగారు శ్రీవేంకటరాయశాస్త్రిగారి గౌరవమును గాపాడఁబూనినట్లు లింతటి యుద్యమంబు నొనర్చిరి.కాని, లేని దూఱు నాపాదించి, వారిగౌరవమును గాపాడునట్లు చేయునిట్టి ప్రయత్నంబులు మదకు నిష్ప్రయోజకము లగుటయేకాక యాత్మాభిప్రాయవ్యాఘాతములుగఁ గూడఁ బరిణమింపఁ

* సుప్రసిద్ధులగు నొక్క పండిత కవిపుంగవుండు నావ్యాఖ్యానమునుగూర్చి యిట్లు వ్రాసెను.

"చతుర మైనవేంకటరాయశాస్త్రిబుద్ధి, కందనట్టియందములు నీవ్యాఖ్యఁజూపి
చూపినాఁడవు మాకు నీసూక్ష్మబుద్ధి, ఔర! యాంధ్రవిశారదుండగుదువీవు."

గలవు. ఇంతకును, శ్రీ వేంటకరాయశాస్త్రిగారి పాండిత్యౌన్నత్యము లాంధ్రదేశ వాఙ్మయము లందు సుస్థిరంబులయి, యిట్టి సముద్ధరణారంభ సంరంభము నపేక్షింపవను నమ్మకము గలదు.

ఇంకఁ బునర్విమర్శన హేతువులలో మూఁడవది:—నేను వ్రాసిన వ్యాసమును జూచి యాంధ్రమహాజనులు "అబ్బో! ధర్మారావుగారు సత్యాన్వేషణకై యెంత పాటుపడిరో ఎంతకష్టపడి సంపాదించిరో ఆయా భాగములను" అని యనుకొందురేమో యనునది శ్రీప్రభాకరశాస్త్రిగారికి మిగుల బాధాకరముగనున్నది. వారికట్టి భయముండు నగత్యమేమియు లేదు. అట్టి యనర్హప్రశంసకు నాకద్దియేని స్వత్వముండిన నద్దాని నీక్షణంబునఁద్యజించుచున్నాను, నింక శ్రీ శాస్త్రిగారు స్వస్థచిత్తు లగుదురుగాక. కాని యొక్కమాట. అదియే యుద్యోగము నదియే జీవితమునునయి తంజావూరికిఁ బోయి యటనుండిన విషయములను—కొమ్మలు దిరిగినవారికి దెలియనివానిని—వ్రాయుటయే మహాకష్టముగ నెంచుచుండిన శ్రీ ప్రభాకరశాస్త్రిగారించుక విశాలదృష్టి నిటు మాచెదరుగాక. (ఈస్వవిషయోచ్చారణమును బాఠకమహాశయులు మన్నింపఁగోరెదను.) సారస్వతప్రసక్తి లేని యుద్యోగంబుల నాంధ్రదేశంబులఁ గాలంబు గడపుచు, భాషాభిమానమాత్రంబున నిట్టి గ్రంథవ్యాఖ్యానరచనోద్యమంబునకుం బూని, యంపలి విషయవిజ్ఞానంబునకెంతయో కాలమును, ధనమును వెచ్చించి, పలయు గ్రంథములనుఁ జెన్నపురసారస్వత సమాజము (మద్రాస్ లిటరరీ సొసయిటీ) నుండియు, మిథిక్ సమాజమునుండియుఁ దెప్పించుకొని చారిత్రక విషయంబుల నెఱుంగుచు, నొకటిరెండు పదముల కర్థము సమన్వయముగాకుండుటచేత లోలోన "నిన్ని విషయముల నాస్తవము నేవ్రాసిన యీచేమకూరకవి యీ రెండుపదములనుమాత్ర మసత్యము వ్రాయునా?" యను బలీయమగు సందేహములకు లోనై, సరియగు నర్థ మొక్కటి యుండవలయునని నిశ్చయించి, దాదా పాఱుమాసములు నేపాళదేశచరిత్రమును దక్షిణహిందూస్థాన చరిత్రమును నాకవకాశ మున్నయంతవట్టు చూచి చూచియుఁ, బెక్కు గ్రంథములు నాకు సులభముగాకుండుటకు వగచియు, విద్యార్థికుల సామీప్యము లేకుండుటకు నాయదృష్టదోషంబుల నిందించియు నుండియుండి, తుదకు నిజమును తెలిసికొనఁగలుగుటగూడఁ గష్టముగఁ బరిగణింపఁదగునని శ్రీప్రభాకరశాస్త్రిగారివంటి సరసహృదయులు, భావింపవచ్చును గదా! నాపడిన యవస్థకు సత్యాన్వేషణ ప్రయత్నమనక మఱేమి యనవలయునో యెఱుంగమి మన్నింపఁ దగును. అట్టి ప్రయత్నము బహుకాలము చేసిన యనంతరము వాంఛితార్థము సమకూడినట్లో నా యదృష్టవశంబున లభించిన దనినఁ బాతకమగునా? కష్టమనిన 'నుదయము నుండి సాయంకాలము దనుక' నెదుటనున్న విషయములను వ్రాయుటయేకాని యితరము గానేరదా? నాకా విషయములు లభించిన నాఁడు నేను జెన్నిథింగాంచిన స్వేదచందంబున నానందతరంగములఁ దేలుచుంటినని నాస్తవంబున కావంతయు దూరముగాదు. చేఁజిక్కిన విషయమంతయు నావ్యాఖ్యానమున రా నవకాశముండదు గదా యని యాపదములనుగూర్చి వ్యాసమును వ్రాసితిని. నీ నూతన విషయము నాంధ్రులకు దెల్పవలయునని యుత్సహించుటయే కాని, సరస్వతిగారి పేరు దాఁచవలయునను నుద్దేశము నాకావంతయు లేదు. విజయనగరమున 'నాయదృష్టవశమున లభించిన' యీవిషయమును గూర్చి యపరిమితోత్సాహంబుతో వ్రాయుచుండిన యప్పుడు బ్రహ్మశ్రీ గొర్తి సూర్యనారాయణశాస్త్రిగారు లోనగు వారలకు వారి గ్రంథమును జూపియు, వారలచేఁ జదివించియు నుంటిని. చెన్నపుర ప్రచురణమగు నీగ్రంథము నితరులెవ్వరు నెఱుంగ కుందురని యెంచుకొను నంతటి యవివేకము నాకు శ్రీశాస్త్రిగారు కట్టకుందురుగాక.

తాము తంజావూ రాంధ్రరాజుల చరిత్రమును వ్రాసినంతనలుకు నాయకుఁను గుఱించి యేమియు 'గొమ్మలుదిరిగిన' వారికిని దెలియకుండెనేమో? కాని, గజిటీయరులును, మాన్యూలును, శాసనవ్యాసములును దెప్పించుకొని నానేర్చిన యంతవట్టు పుష్కరిణీ పత్రికయందుఁ బ్రచురించియుంటిని.

అప్పుడు నాకుఁ దెలియవచ్చిన నీ నేపాళచోళగ శబ్దములే. అయినను శ్రీప్రభాకర శాస్త్రిగారి గ్రంథమునుఁజూడకుండుట యొక్క మహాలోపముగావచ్చును. కాని సారస్వతేతరోద్యోగంబున ననాంధ్రదేశమందుండు నేను క్షంతవ్యుఁడ నగుదునను ధైర్యంబు గలదు. కాని, యిన్నిపట్టణములలో నాంగ్లాంధ్రసంస్కృతగ్రంథ పరిచితులతో నెందఱితోడనో నేను సంప్రతించియున్నను వారలలో నొక్కరయిన శ్రీప్రభాకరశాస్త్రిగారి గ్రంథమునుగూర్చి చెప్పకుండుట నెట్లు మన్నింపనగునో తెలియకున్నది. ఇంతకు నొకవేళ నాగ్రంథమే నాకు లభించియుండినను బ్రస్తుతాంశములగు నీ నేపాళచోళగలనుగూర్చి యందేమియు నిదమిత్థమని యుండుటఁ గానము. శ్రీప్రభాకరశాస్త్రిగారి కప్పటి కాపదములు బోధపడలేదనియే వారపుడు నిపుడును స్పష్టముగ వ్రాసిరి. ఇట్టి పరిస్థితులందు శ్రీశాస్త్రిగారీ సందర్భమున 'నాపీఠిక' 'మాగ్రంథములు' లోనగు విశేషార్థద్యోతకముల వ్రాయు నగత్యము మృగ్యముగదా.

శ్రీవేంకటరాయశాస్త్రిగారి వ్యాఖ్యలోఁ జారిత్రకవిషయములు సరిగ లేవనియు నందువలన మరల వ్యాఖ్యానము వ్రాసితిననియు నేను దమతోఁ జెప్పినట్లు శ్రీప్రభాకరశాస్త్రిగారు వ్రాసిరి. వారు నామాటలను దప్ప వినియుందురు. నావ్యాఖ్యానమునకుఁ గారణమీ చారిత్రకవిషయమే కాదు. చక్కని గ్రంథమగు విజయవిలాసమునకుఁ జక్కని వ్యాఖ్య యాంధ్రంబున లేదు. చమత్కారము, భావప్రకటనము, రసపాత్రాది పోషణము, కవిస్వభావగుణములు లోనగునవి నాకుఁ బ్రధానములు. చారిత్రకవిషయములఁగూడఁ జదువవలసి వచ్చెను. అందు వ్యాఖ్యానమున కనవసరమగు విషయములను బుస్తకరిణీ, భారతీ పత్రికలయందుఁ బ్రచురించితిని. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు 'చారిత్రకవిషయముల నెట్లు సాధించిరో చూడఁగల'మని నన్ను తాడించినందుల కెంతయు సంతోషించుచున్నవాఁడ. చారిత్రకమననే కాక భావాది సర్వవిషయములను నిట్టి విమర్శనమే నాకు వాంఛితమును సమంజసమును. అట్టి విమర్శనము కొఱకే, నావ్యాఖ్యానమును వ్రాసినపిమ్మట నేనెంతయో ధనవ్యయమునకోర్చి యాయాపట్టనముల సభలఁ జేసి పండితులయెదుట నాయభిప్రాయములను బెట్టి వారి విమర్శనము నపేక్షించియుంటి. అట్టి విషయవిమర్శనము లేకదా భాషాసేవ కుపకరించునవియు, వానిని వ్రాయువారికి యశస్కరములునునగు. కావున శ్రీప్రభాకరశాస్త్రిగారి తర్జనమును మహదనుగ్రహముగ భావించి నా తల నిడుకొనియున్నాను. వారొనర్పఁబోవు విమర్శనమువలన నాచేమకూరవాని గ్రంథమునందలి యందములింక నాంధ్రవాఙ్మయంబునఁ బ్రకటితము లగునుగాత మని యాంధ్ర సరస్వతినిఁ బ్రార్థించుచున్నాఁడను.

నేను శ్రీ వేంకటరాయశాస్త్రిగారి నధిక్షేపించితినని నిష్కారణముగ భావించి, నేను విమర్శకమర్యాదను మీఱితినని నన్ను నిందించిన శ్రీప్రభాకరశాస్త్రిగారు తమ 'పునర్విమర్శనము'నందుఁ జూపిన విమర్శక మర్యాదావిధానము లాంధ్రమహాశయుల కందఱకును సంతత సంస్మరణీయములయి యుండకపోవని విశ్వసించుచున్నాఁడను. అపనిందాకారణంబునఁ 'జపము విడిచి లొట్టలలోఁబడ'వలసివచ్చి, పాఠకుల కాలమును, భారతీపత్రికాధిపుల వ్యాసస్థలమునుగూడ నొకింత వ్యయమొనరించినందులకు క్షమింపఁ బ్రార్థింతును.

—తాపీ ధర్మారావు.

# మాకందము

గర్భాం అప్పారావు గారు, బి. ఏ.

ప్రకృతి సౌందర్యలక్ష్మీ తపఃఫలో త్త-మంబవు సకలోత్కృష్టతమంబు నీదు
జన్మ మిలను మాకందమా! సకల జన మ-నోహరంబు నీ యాకృతి; నుతికి నెక్క-
దగిన నీ యంతరంగ మార్దవ్రిత వహించు-కుముద నిభ శిరీష కుసుమ కోమలములు
ప్రణుత రాగ సంభరితముల్ పల్లవములు-తార నవనీత సమములు కోరకములు
అమృత సమరస సంపూరితములు ఫలము - లెట్టి పున్నెమొ నీది? నీపుట్టు నేల
కటికి ఱానేల; రానేల క్ష్మారుహా వ-తంసమా! నీకు నింత మార్దవగుణంబు?

తలుచుగా శీతవాతపోతములచేత - నలరు నీవిటపచ్ఛాయలందు నిలిచి
నందగోపాలబాలుఁ డానందమతిని - మురళి కరపల్లవమ్ములఁ బూని యోష్ఠ
పల్లవములఁ గల్గించిన వర మృదు రమ-ణీయ గానామృత తరంగిణీ తరంగ
డోలికలఁ గడు నీ విటపాలి యూగి - పల్లవించెనో యేమొ! నీఫలములట్టి
గానరస గర్భితము లేమొ! కానలేము; - అరయ నాగానమునఁ దన్మయత్వ మొంది
నీవు నిలువెల్ల నార్ద్రమై నెగడితేమొ! - కాక భవదీయ పల్లవ ఖాదియైన
పరభృతమ్మున కెట్లబ్బె పరమగాన - మాధురీ మహిమ రసాలమా! వచింపు
అతిథి సత్కారమునఁ గూడ నధికగుణము - నీకుఁ దగియుండు చూతావనీరుహంబ
ఎండలో నీవు నిల్చియు నెండడస్సి - సొమ్మసిలియున్న పాంథునిఁ జూచి తావ
కీన కరపల్లవమ్ముల వానిఁ జీరి - నిలువ నీడ నొసంగెదు నియతిఁ బూని;
తిరుగుబోతు మిళిందమున్ దరికిఁజేర్చి - రాగమును గూర్తు వీవు మరంద మొసఁగి
శీతల ప్రదేశము వీడి చేరవచ్చు - కోయిలను నాదరింతువు కూర్మి చూపి;
చేరి ఫలభంగము లొనర్చు చిలుక నలుక-నవలఁ ద్రోయవు సరసత్వ మగుపఱచెదు;
కర్మఫలము వాంఛింపక కార్యములను-జేయుదువు కాన మానవుల్ జేరఁదీసి
నీకు సహకారిఁ జేయకు నీతిదప్పి - యుండుఁ దానెంత పురుషోత్తముండె యైన
పాఱఁదోలు ద్విజ తతుల; ఫలముఁజూపి-కోరి ధనము రాఁబట్టు నీపేరు చెప్పి
కాన సహకారమా! సహకారియేల?-మఱువకుము సహకారమా! మఱువవద్దు
ఆయురారోగ్య సంపద లలరునీకుఁ-వందనంబు మాకందమా! వందనంబు.

---

# ౩. విమర్శ విమర్శము

శ్రీయాంధ్రవిశారద తాపీ ధర్మారావు నాయఁడుగారు సారంగధరచరిత్రమును, దానికి శ్రీ వేంకటరాయశాస్త్రిగారు వ్రాసిన టిప్పణిని ఉద్దేశించి, కడచిన భారతిలోఁ బ్రకటించిన వ్యాసమును జూచితిని. ధర్మారావుగా రందు వ్యాఖ్యానించిన సారంగధరచరిత్ర పద్యమునకు శాస్త్రిలుగారి టిప్పటి లఘువుగా నాయాయర్థ విశేషములను దెలుపునదిగనే కలను. కాని "ఉప్పనైనట్టి చక్కెరలప్పలీడె" అనుచో ముఖ్యార్థమందు, "ఉప్పనైనట్టి అనుదానికి "గొప్ప" అని అర్థము వ్రాయుట ప్రామాదికమే. కాని దానిఁ దప్పుగాఁ జెప్పుచు ధర్మారావుగారు స్వయముగ వ్రాసిన టీకగూడఁ దప్పుగా నున్నదని చెప్పవలసివచ్చినందుకుఁ జింతిలుచున్నాను. ధర్మారావుగారిట్లు వ్రాసిరి. "నా యూహము చక్కెరలప్పలనిన చక్కెరవేసి చేసిన యప్పములు; అతిరసములఁబోలు భక్ష్య విశేషములు" అని. ఈటీక సరిగాదని నాయూహము. కైకొన్న వస్తువు కానరాకయుఁగూడ నుండునట్లు వ్రేళ్లు దగ్గఱించి ముడిచి మూసిపట్టిన హస్తమునకు గుప్పిలియనియు, తత్పరిమాణపు వస్తువునకు గుప్పెఁడు అనియు, అట్టిదే మూయకుండఁ బట్టిన హస్తమునకుఁ బుడిసిలి యనియుఁ దత్పరిమాణపు వస్తువునకుఁ బుడిసెఁడనియు, చేయి బోరగించినను పట్టిన వస్తువు క్రింద బడకుండునట్లు వ్రేళ్లతోఁ గమియఁబట్టిన హస్తమునకు పట్టు అనియు, తత్పరిమాణపు వస్తువునకు పట్టెఁడుఅనియు, కైకొన్న వస్తువు చేయి బోరగించినఁ గ్రిందఁబడునట్లు వ్రేళ్ల నంటఁ జాచి పట్టిన హస్తమునకుఁ జేర యనియు, తత్పరిమాణపుఁ బదార్థమునకుఁ జేరెఁడు అనియు, చేతిని బోరగించుచోఁ గైకొన్నవస్తువు క్రిందఁబడునట్లు వ్రేళ్లించుక దొప్పవాటిగా వంచి విరియఁదెఱచి చాచిపట్టిన హస్తమునకు లప్పయని యు, తత్పరిమాణపు వస్తువునకు, లప్పెఁడు అనియుఁ జేళ్లు. లప్పతోఁగొనువస్తువు పొడిపొడిగాఁ బిండిగాగాని ద్రవముగాఁగాని యున్నచో విడఁదెఱచి చాచి పట్టిన వ్రేళ్ల సందునుండి జాఱిపోవును గాన,యది ముద్దగా నొక్కియుంచునదిగా నుండవలెను. ఆధారాధేయములకు అభేదోపచారముచే, గుప్పిలి, పుడిసిలి, పట్టు, చేర, లప్ప, పదములు తత్పరిమాణపు వస్తువులకుఁగూడ వాచకము లగును. ఇట్లు చూడఁగా ప్రస్తుతపద్యమున, చక్కెరలప్ప లనగా చక్కెర ప్రధానద్రవ్యముగా నుంచి (ఉప్పిచేయునది గాన చక్కెరమాత్రమే యగునేని ద్రవించిపోవును) ముద్ద పదనుగాఁ జేసిన మధుర భోజ్యపు లప్పపరిమాణము లని యర్థమగును. ప్రకరణ సాహచర్యాదులను బట్టి యింత యర్థమిక్కడ పుట్టుచున్నది గాని లప్పలను పదమునకు చేతిలప్పపట్టు, తత్పరిమాణపు వస్తువని యర్థమేకాని అప్పములనికాని యతిరసములఁ బోలు భక్ష్యములని కాని యర్థము లేదు. చక్కెరలు + అప్పలు అని భేదమేని అదిసరిగాదు.

"మంచు లప్పల మించు మండెంగ మడుపులు"

అని శృంగార నైషధమునఁ గలదు.

ఇక్కడ మంచుతోఁజేసిన లప్పలను భక్ష్యవిశేషములని యర్థముకాదు.

మండెఁగలు లప్పపరిమాణము గల మంచుముద్దల వలె నున్నవనియే యర్థము. "లప్పలతోఁడఁ గ్రొంజెరుగు లక్ష్మీనవజ్ఝలయింట నూకకున్" అని క్రీడాభిరామప్రయోగము. క్రొత్త (పులియని–కమ్మని) పెరుగు లప్పలతో నక్కడ వడ్డింతురని యర్థము. 'కస్తురిలప్పలు' అన్నప్పుడుగూడ కస్తూరి ప్రధానద్రవ్యముగా నుంచునట్లు తయారుచేసిన లప్ప పరిమాణముగలపరిమళద్రవ్యపు ముద్దలనియే యర్థము. వాఁడు లప్పెఁడుజున్ను తిన్నాఁడు. ఆవు లప్పెఁడుపేఁడ వేసినది. ఇత్యాదివ్యవహార మిప్పుడును గలదు: శబ్దరత్నాకరకారాదులీ లప్పపదమునకు,ఔపచారికముగా 'రాశి' యని యర్థము వ్రాసిరి. తెలుఁగున నుండి యింగ్లీషుభాష పుట్టిన దనువాదము వారి కీపదము కొంత యుపకరించును. 'లప్ప'నుండియే (లంప్)

Lump అను పదము పుట్టినదని వారు పరిగణింప వచ్చును గదా.

మానవమాత్రునకుఁ బ్రమాదములు కలుగకపోవుట యసాధారణము. కాని యవి కలుగుటలో తర తమ భావము లుండును. "పుటకు డెబ్బదిపదార్కొండు తోటుకులుఁడు వారు వీరును నోకతీరువారు గారు" అన్నట్లు వేంకటరాయశాస్త్రిలుగారు మొదలగు ప్రతిభానిధులకుఁ బ్రమాదము లసాధారణముగా అల్పముగాఁ గల్గుచుండును. అస్మదాదు లడుగడుగునకు నధికముగాఁ గల్గుచుండును. క్లిష్ట విషయమును స్పష్టముగా క్లుప్తముగా చక్కఁగా సంప్రదాయశుద్ధముగా వ్యాఖ్యానించుటలో నేఁటి తెలుఁగువారిలో శాస్త్రిలుగా రగ్రగణ్యులని నా నమ్మకము. ఆంధ్రదేశమున నిజముగా వా రభినవ మల్లినాథులే. అట్లయినను వారి వ్యాఖ్యానగ్రంథములందుఁ గూడ నందందుఁ గొన్ని ప్రమాదములు దొరలకపోలేదు.

శృంగారనైషధము తుదిపట్టున చంద్ర వర్ణన పద్యము,

మ. ఉడువీథీ హరినీలరత్నమయ పా
త్రోత్సంగభాగంబునన్
గడు గారామొనరన్ ఝషాంకునకు నం
కచ్ఛాయయన్ కమ్మనూఁ
బిడితోఁగూడ సుధాంశుబింబమును స
ర్పిఃపాయసాహారమున్
గుడుపంబెట్టెనొ బంతి పాళ్లకును జా
కోరంబు లేపారఁగాన్.

అను శాస్త్రిలవారి సవ్యాఖ్యాన ముద్రణమునఁ గలదు. 'నూఁబిడి' సర్పిః 'పాయస' పదములు అర్థసంగతికై శాస్త్రిలుగారు సంస్కరించి చేర్చినవి. తక్కినపాఠము పారంపర్యాగతము, తాళపత్ర దృష్టమును చకోరపక్షులు తర్వాత తాము బంతిని భుజించుటకై ముందుగా నన్మఘునకు ఆకాశమను నింద్రనీలపుఁ బళ్ళెరమున, కళంకమను పిడికెఁడు కమ్మనూవులతోఁగూడిన చంద్రబింబమను నే యభిఘరించిన పరమాన్నమును, గుడువఁబెట్టెనా యేమి? అని పద్యార్థము. శాస్త్రిలుగా రీపద్యవ్యాఖ్యానము నుపలబ్ధపాఠముఁ బట్టి యెంత సారస్యము సాధింపనగునో యంత సారస్యమును సాధించి హృద్యాతిహృద్యముగా రచించిరి! ఆనంద ముద్రణాలయము వారి కొఱకై బ్రహ్మశ్రీ కేతవరపు వెంకటశాస్త్రి గారు రచించిన వ్యాఖ్యానమున నీపద్యమున కర్థముఁ గొంచెమించుమించుగా వెంకటరాయ శాస్త్రిలుగారు వ్యాఖ్యానించినట్లే యున్నది. అందుఁ గొన్ని పాఠభేదము లున్నవి."కడుగారామొనరన్" అని వెంకటరాయశాస్త్రిలుగారి పాఠముండఁగా, 'కడుగారామునరే' అని వెంకటశాస్త్రిలుగారి పాఠము. ఈవిందును "రేన్=రాత్రియందుఁ", బెట్టినట్లు వీరి వ్యాఖ్యావిశేషము. మఱియు,"నంజనూటిడితోఁగూడ-నేయింబాయస" అని వీరి పాఠములు.నూవులపిండితోఁ జేసిన భక్ష్యవిశేషమని దాని టీక. తక్కినదెల్ల వేంకటరాయశాస్త్రిగారి వ్యాఖ్యానమును బోలియే కలదు. కాని పయి రెండు గ్రంథములు ముద్రితములయిన తరువాతఁ బ్రాఁత వ్రాఁతప్రతులఁ బరిశీలింపఁగాఁ బయిపద్యమున కిట్లు ప్రశస్తపాఠము దొరకెను.

మ. ఉడువీథీ హరినీలరత్నమయ పా
త్రోత్సంగభాగంబునన్
గడుగారామున రే ఝషాంకునకు నం
కచ్ఛాయ యన్ కమ్మనూ
టిడితోఁగూడ సుధాంశుబింబమును నే
యిం బాయసాహారమున్
గుడువం బెట్టెనొ బంతిపాళ్లకును జా
కోరంబు లేతేరఁగాన్.

ఇదిగదా శ్రీనాథునిపాఠము! ఇందు, విందునెట్టినది పక్షులయిన చకోరములుగాక రే=స్త్రీయగు నిశాదేవి! గొప్పవారిని విందుకుఁ బిలిచి, ప్రశస్తపదార్థముల నారగింపఁబెట్టునప్పు డాపదార్థముల స్వారస్య మెఱిఁగిన వారిని తమకును విందారగింపవచ్చినవారికిని పరిచితుల నితరులను గూడ సహపంక్తి భోజనమునకుఁ బిలుచుట కలదు. అవిధమున నిక్కడ చకోరములు బంతికుడుపునకై వచ్చినవి. 'గారామునరే' 'చాకోరంబు లేతేరఁగాన్'అను ప్రశస్త పాఠములు దొరకక

పోవుటచే వెంకటరాయశాస్త్రులుగారికిని 'గాంగామునరే' యనుపాఠము దొరకినను, 'చాకోరంబు లే తేరఁగాక' అనుపాఠము దొరకకపోవుటచే వెంకటశాస్త్రులుగారికిని నీహృద్భాగ్యమును గుర్తింపఁ గుదురవయ్యెను. నూటిడి, యనుచో నూవులతోఁజేసిన యిడి యని యర్థము. ఇడి యను భక్ష్యమును శ్రీనాథుఁడు కాశీఖండమునఁ జేర్కొన్నాఁడు.

మఱియు,

గీ. మిసిమి గల పుల్లఁజెరుగుతో మిళితములగు
నావ పచ్చళ్లు చవిచూచి రాదరమునఁ
జుఱ్ఱుమని మూర్ధములు దాఁకి యొఱ్ఱిదనము
పొగలు వెడలింప నాసికా పుటములందు.

దీనికి వేంకటరాయశాస్త్రులవారు "ఆవ పచ్చళ్లు (కర్త) చుఱ్ఱుమని నసాళమంటి, ముకుఁ జెమరలందు, ఎఱ్ఱిదనమును, పొగలను, వెడలించుచున్నవి అనియర్థము వచ్చునట్లు వ్యాఖ్యానించిరి.

కేతవరపు వెంకటశాస్త్రిగారును ఇట్లే వ్రాసిరి. పద్యపాఠము వైవిధ్యమనను న్నప్పు డింకొకవిధముగా నర్థ మేర్పడ నేరదు గదా! కాని యిక్కడ ప్రశస్తమయిన పాఠమొకటి గలదు

గీ. మిసిమి గల పుల్లఁజెరుగుతో మిళితములగు
నావ పచ్చళ్లు చవిచూచి రాదరమునఁ
జుఱ్ఱుమని మూర్ధములు దాఁకి యొఱ్ఱిదనము
పొగలు వెడలింప నాసికాపుటములందు.

ఇందు, పద్యము పూర్వార్ధమొక వాక్యము. ఉత్తరార్థము వేఱొకవాక్యము. ఈపాఠమును బట్టి చూడఁగా మూర్ధములు దాఁకినది యావపచ్చళ్లుగాక, ఒఱ్ఱిదనము=కారపుగాటు, అగుచున్నది. ఒఱ్ఱిదనము నసాళమంటి ముకుఁ జెమరలందు పొగలు వెడలించినది, అని ఉత్తరార్థము టీక.

సాధుపాఠములు గల తాళపత్ర ప్రతుల సాహాయ్యము చాలినంత లేకపోవుటచే నిట్టి సరసార్థములు గొన్ని పయివారి వ్యాఖ్యానములందుఁ బొందుపడక పోవలసెను. మఱియు, ఆముక్తమాల్యదా వ్యాఖ్యానమున—

ఉ. ఎన్నిమఁగూర్తు నన్నవిను
మేమును దాల్చిన మాల్యమిచ్చు న
ప్పిన్నది రంగమందయిన
పెండిలి సెప్పము మున్నుగొంటి నే
న న్ననదండ యొక్క మగ
వాఁ డిడ నేను దెలుంగురాయఁడక్
కన్నడరాయ! యక్కొడుమన
గప్పు ప్రియాపరిభుక్త భాక్కృఢక్.

అనుపద్యమున మున్ను గొంటి నేన న్నన దండ యొక్క మగవాఁడిడ నేను దెలుంగురాయఁడక్ అనుదానికి "పూర్వము నేను కృష్ణావతారమందు సుదాముఁడను మాలాకారు డీయఁగా పూలదండను మగవాని చేతినుండి కొన వలసివచ్చెనుగదా యని మనస్సులో నేవగించుచు కయికొంటిని" అని శాస్త్రులవా రర్థము వ్రాసిరి. ఆముక్తమాల్యదకుఁ బ్రాచీనవ్యాఖ్య లనేకము లున్నవి అన్నింటను నిట్లే యర్థము గలదు. కాని యిక్కడ శ్రీకాకుళపుఁ దెలుంగు రాయనికథ (స్థలమాహాత్మ్యమునఁ గలదు.) యను సందేయము. ఆ స్వామి యర్చకుఁడగు వైఖానసుఁడు రాజుగారు స్వామి కైంకర్యముకై పంపెడు పూదండలెల్లఁ దన లంజె కిచ్చుచుండువాఁడట! ఇది విని రాజొకనాఁడు పరీక్షింప స్వామిదర్శనమునకు వచ్చెను. అర్చకుఁడు లంజె కొప్పున నున్న పూదండను గొనివచ్చి స్వామి కలంకరించి, తత్ప్రసాదముగా రాజు కొసఁగెను. రాజు గొనిపోయి పరిశీలింపఁగా నందు నిడుపైన తలవెండ్రుక లగపడెను. రాజ ర్చుకు నడిగెను. అతఁడు స్వామికి వెండ్రుకలు గలవనెను. రాజుపరిశోధించెను. భక్తత్రాణపరాయణుఁడగు స్వామికి మర్నాడు రాజు చూడవచ్చునప్పటికి వెండ్రుకలు మొలచియుండెను. చల్లపల్లి సంస్థానమునఁ బ్రఖ్యాతములుగా రెండు పుణ్యక్షేత్రములు గలవు: పెదకళ్లేపల్లి, శ్రీకాకుళము, అనునవి. చల్లపల్లి జమీందారులు వాని ధర్మకర్తలు. బోడివాఁడు, బొచ్చువాఁడు, (నాగేశ్వరస్వామి, ఆంధ్రనాయకస్వామి.) తమ యిలువేల్పులని యా సంస్థానమున పూర్వులు పలుకుచుండెడివారట! స్థానికమయిన యీగాథ యెల్లరకు వెల్లడిగాఁ దెలియఁదగినది గాదు. నేనక్కడివాఁడ నగు

టచే నెఱిఁగియుంటిని. ఇది చెప్పనందుకు ప్రాచీన వ్యాఖ్యాతలపైఁగాని, శాస్త్రిలవారిపైఁ గాని యెఱుంగమి వెట్టఁదగునా? ప్రాచీన వ్యాఖ్యాతల తప్పుల నెన్నింటినో శాస్త్రిలవారు తమ యాముక్తమాల్యద వ్యాఖ్యలో సంస్కరించిరి. అయినను జరాభారముచేతను, ఆ యా వ్యాఖ్యాతల మీఁది నమ్మకము చేతను నక్కడక్కడ సంస్కరింపవలసినవానిఁ గొన్నింటిని శాస్త్రిలవారు విడిచిరి.

"పసలేదు నిలరోరి పాతకులారని దేవాయుధంబులు ఱువువారు" (7 ఆశ్వా) అను చరణమునఁ బ్రాచీన వ్యాఖ్యాతలు, దేవాయుధము లనఁగా యజ్ఞోపకరణము లని వ్రాసిరి. శాస్త్రిలుగారు దానిని గ్రహించిరి ముద్రణ మయిన తర్వాత దేవాయుధము లనఁగా—తిట్లు, శాపనార్థములు, అని యర్థమగుట గుర్తింపఁబడెను. ఇట్టి వక్కడక్కడ కలవు.

విజయవిలాసమునకు ధర్మారావు నాయఁడుగారిదివఱకే సంపూర్ణవ్యాఖ్య రచియించి పెక్కుపట్టణము లందుఁ దద్విశేషముల నుపన్యసించిరట. కాన, యాగ్రంథమునకు శాస్త్రిలవారు రచించిన టిప్పణిలో దొరలిన ప్రమాదముల నిక్కడఁ జేర్కొనకుండెదను. ఏలన ధర్మారావుగారిచే నుపన్యస్తముల నేనెఱుఁగను. నేను దెలుపునవి వారు గుర్తించినవి కావచ్చును. క్రొత్తవి కావచ్చును. వారు గుర్తించినచో, మేము వెల్లడించినవే పేర్కొనె ననుటకేని గుర్తింపనిచోఁ గ్రొత్తగా నందిచ్చిన ట్లనుటకేని, కారణముగల్గును. సారంగధర చరిత్ర వ్యాఖ్యను ధర్మారావుగా రింకను నుపన్యసింపలేదు గాన దానిఁగూర్చి పేర్కొనవచ్చునుగదా!

శ్రీశాస్త్రిలవారు విజయవిలాస సారంగధరచరిత్రములకు టిప్పణులను తమయొద్దఁ బనిచేయుచున్న యొక గ్రంథకర్త, అప్పయపంతులుగారి వ్రాఁతటీక ననుసరించి వ్రాసికొనివచ్చి యిచ్చిన లఘుటీకను సరిపఱిచి రచించిరట! అట్లు సరిపఱుచుటలో నా లఘుటీక లోని ప్రమాదములు కొన్ని యపరిశీలితములుగా నట్టె విడువఁబడియుండు నని శాస్త్రిలవారు నాతో ననిరి. అది యట్లే యైయుండు

ను. ఏలనఁగా, ఉప్పసైనట్టి—అనుపదమునకు గొప్ప—అని జూలూరి అప్పయపంతులుగారి టీకలో నుండఁగా (అట్లున్నట్లు ధర్మారావుగారు వ్రాసిరి.) శాస్త్రిలుగారి టిప్పణిలోఁగూడ నదే కలదు. శాస్త్రిలుగారు స్వయము ఇట్లు వ్రాయుదురని నేను నమ్మఁజాల నయ్యెదను.

క. వలపుసటు, నావులానహి
పలుకు లసత్యముఁ.........
తలదడపి బాసఁజేసిన
జలజాక్షుల నమ్మరాదు సారంగధరా!

అని శాస్త్రిలవారి సారంగధరచరిత్ర ముద్రణలో పద్యమున్నది. తలదడపి=స్నానముచేసి అని టిప్పణితో నున్నది. ఇట్టి పద్యము సుమతి శతకమునఁ గూడఁగలదు. ఇందు తలదడవి' అను పాఠముండవలెను. ఇట్టి ప్రమాదములింకను గొన్ని సారంగధర చరిత్ర టిప్పణిలో గలవు.

శాస్త్రిలవా రింతకు ముందే యిట్టివానిని బెక్కింటి నాకళించి యుంచిరి. పునర్ముద్రణమున సరిపఱుపఁ దలఁచియుండిరి. వారు కడు వృద్ధులగుటచేతను, ఇప్పటి స్థితిలో వారింతలో పునర్ముద్రణలు సాగింపఁజాలకుండుటచేతను, ఆయా సంస్కారముల నిప్పుడు ప్రత్యేకముగా నొకచోట ముద్రించి వెల్లడింపనున్నారు. అందును బొందక ప్రమాదము లింకను అన్యులకు గోచరింపవచ్చును. వాఙ్మయాభ్యున్నతియముకై సద్విమర్శనము సల్పు తలఁపుతో నట్టివానిని వెల్లడించువారికి సహృదయులు కృతజ్ఞులై యుందురు.

ఆక్షేపింపను గూడఁ గూడని పట్టున శాస్త్రిలుగారి నధిక్షేపించి నందుకును నిజముగాఁ దమ కపూర్వవిషయముల నొసఁగిన యాకరములను జేర్కొనక పోయినందుకును ధర్మారావుగారి చోళగనేపాళశబ్ద విమర్శనమునకు నేను బదులు వ్రాయవలసెనుగాని కడచిన భారతిలో సారంగధరచరిత్ర పద్యమునుగూర్చి మర్యాదను దప్పక యుక్తముగా వారు చేసిన విమర్శము వంటివిమర్శమునకు నేను కడు జిజ్ఞాసువునై యుందును.

ఇక సారంగధరచరిత్ర వ్రాఁతప్రతినిగూర్చి వారు వ్రాసినదానిఁ గూర్చి యించుక:—

సారంగధరచరిత్ర పీఠికను గూర్చి మా మిత్రులగు శ్రీ సోమశేఖరశర్మ ప్రభృతులకు ధర్మారావుగారి విమర్శము రాకకుఁ గొన్ని నెలల ముందే నేను విన్నవించుకొని యుంటిని. శాస్త్రులవారును తత్పీఠికా విషయ సాంకర్యము నాకళించియున్నారు.

ధర్మారావుగారి దగ్గఱనున్న తాళపత్ర ప్రతి నింతవఱకింకను తెఱచిచూడఁ గుదురకున్నచో నొక్కతూరి నాకుఁగూడఁజూపఁ దగుదురు. నాకందలి విషయ లక్కఱలేదు, గాని సులువుగా దానిని విడఁబఱచి, చదువఁ దగునట్లు చేయఁగల్గుదు నేమో! అట్టివానిని గొన్నింటిని సరిపఱచి చదువఁ గల్గితిని గాన తెలుపుచున్నాను.

—వేటూరి ప్రభాకరశాస్త్రి.

---

# ఆరోగ్యము

వేమూరి సీతారామశాస్త్రి గారు

ధనమున్నన్, గృహమున్నఁ, బుత్త్రిలు కళత్రంబున్న, సామ్రాజ్యశో
భనమున్నన్, మది కేదిలేక యుదయింపం బోదు మోదమ్ము; సా
ధన జాతమ్ము లవమ్ములేకయును నిత్యస్ఫూర్జితానంద తో
యనిధిం దేల్పఁగఁజాలు నెయ్య దదె వో యారోగ్యభాగ్యం బనన్.

జడిమ న్మాన్పును; బూన్చు సంతసను; నుత్సాహమ్ముఁ గల్పించు; మై
వడఁకుం దీర్చును; గూర్చు ధైర్యము; మనోవైక్లబ్యముం బాపు; ముం
దడుగేయించు నశేషకార్యముల; నీ యామేల్లు నానేల? పె
ల్లడం జేయుఁ బరమ్మిహమ్ముఁ; గనుఁడీ యారోగ్య సౌభాగ్యముల్.

ప్రాతఃస్నానము, ధౌతవస్త్రధృతి, శుభ్ర స్పర్శనాహారముల్
స్వాతంత్ర్యమ్ముఁ, బురాణగోష్ఠియు, సుధీ సాంగత్యమున్ బ్రహ్మచ
ర్యా తాత్పర్యము, శౌచనిష్ఠ, నయవిద్యాసక్తి, సంతృప్తియున్
భ్రాతల్! హేతులు సుండనామయత కీరల్ శ్రద్ధ నూహింపుఁడీ.

కామము క్రోధమున్ మొదలుగాఁగల యాంతర శత్రుకోటి కిం
తే మొనయంగఁ దావిడక యేమెడ కామెడఁ దృప్తి శాంతియున్
బ్రేమయు నార్జవంబు, ఋతనిష్ఠయుఁ బూనుఁడు దానఁజేసి చి
త్తామయముం దొలంగి సతతామల సౌఖ్యముఁ గాంతురో జనుల్.

శ్రుతులు, స్మృతుల్ పురాణములు శోధనచేయఁగ ధర్మకర్మ ప
ద్ధతు లెవి యేవి కన్పడెడుఁ దత్సకలమ్ము ననామయత్వ సం
స్థితికిఁ బ్రధానసూత్రమయి దీప్తివహించు; యథావకాశ మా
హిత కృతు లాచరింపుఁడిదె యేల? భజింతురు పెక్కుభద్రముల్.

---

# జాబులవ్రాత

టి. శివశంకరం గారు

ప్రపంచ నాగరక సంసర్గముచే మనదేశమందలి విజ్ఞానావధి సర్వతోముఖముల విస్తరిల్లుచుండుట విచారపరులకు తోచకపోదు. దేశాటనము, పండితభాషణము, రాజసభాప్రవేశము విజ్ఞానవ్యాప్తికి సాధనముల నంటి మనపూర్వీకులు గ్రహించిన విషయము. రైళ్లు, మోటారుబండ్లు, యిదివరకే కొలదికిమించి తోడుపడుచుండెడివి. వీనితోపాటు ఆకాశవిమానముల పర్యటనము వ్యాపించుచుండుట మరియొక యాశ్చర్యము. రూటర్ తంతిసంస్థచే వేలకొలది మైళ్ల దూరములో జరుగు పండితసంభాషణమును గూర్చి మరుసటి దినమో, అథవా, మూడవదినమో మనమున్నచోట వార్తాపత్రికల యందు చదువబూనుట పాతసంగతి. (Wireless Sets) "వయర్ లెస్ సెట్స్" అను పేరితో తంత్రీరహిత యంత్రములు కొన్ని బయలు దేరుచున్నవి. వీనిమూలమున అమెరికా, ఆస్ట్రేలియావంటి దూరదేశములయందు జరుగు సంగతిని, ఉపన్యాసములను, ఆక్షణమే విని యానందించుచున్నాము. ఈయంత్రములు కలకత్తా బొంబాయివంటి గొప్పనగరములయందు వాడుకలో నున్నవి. కొలది కాలములోనే పల్లెటూళ్లకు సహితము వ్యాపించును. "టెలివిజన్" (Tele-Vision) అను మరియొక యంత్రము కనిపెట్టబడ నున్నది. దీనిచే సంజయుడు భారతయుద్ధమును దూరమునుండి చూడగలిగినట్లు దేశాంతరముల జరుగు సంగతులు సమక్ష మప్పుడప్పుడే గోచరమగుట, రాజసభలయందలి చర్యలు, వాదప్రతివాదములు, దినపత్రికల మూలమున తెలిసికొనుచున్నాము. ఇట్టి పరిస్థితులకు తగినట్టు వస్తుప్రపంచమును, భావప్రపంచమును, మన కనులయెదుట క్షణక్షణమును విస్తరించుచున్నది. ఇట్లు విస్తరించుకొలది ఆలోచనాసరణి, భావవ్యక్తియు, క్రొత్తదోవల వెతకును. ఇట్టి యత్నమందు క్రొత్తక్రొత్త భావములు జనించుకొలది దేశభాషల పదసంచయమందే కాక వాక్యరచనయందును వికల్పము లేర్పడును. ఇట్లున్నను వచనశైలియందు అతిశయోక్తివంటి యలంకారములకు గాని, కఠినమగు సంస్కృత దీర్ఘసమాసములకుగాని అవకాశము కాదు. లలితమగు చిన్నపదములతో కూర్చయయినవాక్యముల మూలమున గొప్పసంగతులు సుబోధకమగునట్లు భాషాశైలి తనంతట తాను కుదురుచు వచనరచనకు క్రొత్తయాదర్శముల చూపుచున్నది. ఇట్టి నూతనశైలి దేశభాషలయందు నెలకొనుట శ్లాఘ్యము.

విదేశ నాగరక సంసర్గముచే పైవివరించినతీరున దేశభాషా వాఙ్మయము వివిధమైన మార్గముల మార్పు జెందుచున్నది. ఒక్క యంశమునందు మాత్రము ఇంకను మార్పు కలుగలేదు. ఆంగ్లేయ వాఙ్మయమునందు జాబులు వ్రాయు శైలికి గరిమయే లేదు. విజ్ఞానవ్యాప్తికి జాబులవ్రాత మరియొక సాధనమను రహస్యము మనమింకను కనుగొనలేదు. వార్తాపత్రికల వ్రాతలవలె గాక గ్రంథస్థములగు వ్రాతలవలె గాక, ఒకరికొకరు వ్రాసుకొను జాబులయందు జీవకళయు మనస్సునకు విందుగొల్పు లాలిత్యమును మంచి విజ్ఞాన వినోదముల నాపాదింపవచ్చును. ఆంగ్లేయులు యీచతురతకు పుట్టినిల్లన నొప్పుదురు. మనదేశమందు ఒక వారము ఇంగ్లాండుకు పోస్టు చేయబడు యిట్టి లలితములైన జాబులసంఖ్య లక్షకు తక్కువ యుండదు. వీనిని సివిల్ సర్వీస్ ఉద్యోగస్థులు, ఆర్మీ ఆఫీసరులు, మిషనరీలు, వర్తకులు, ప్రయాణీకులును వ్రాయుచుందురు. ఇట్టి జాబులు వారమున కనీసము లక్షవంతున ఒక్క సంవత్సరములో విజ్ఞానవ్యాప్తి కెంతటి సాధనమగునో చదువరు లూహింపవచ్చును. ఇట్టి జాబులు వ్రాయు పద్ధతి మనదేశమందు నెలకొనుపట్ల విజ్ఞానాభివృద్ధికి గొప్ప సహకారముగ నుండును. బడి వదలిన పిమ్మట పెద్దపెరిగిన స్త్రీపురుషుల విజ్ఞానమును (Adult and Female Education) వ్యాపింపచేయుటకు ఇంత

కన్న సామాన్యసాధనము వేరొకటి యుండదు. మనలో హితోపదేశమును వ్రాసిన విష్ణుశర్మ కథల జెప్పి వివేకమును బోధించెనో, యాపని యాంగ్లేయులు జాబులు వ్రాసి చేయుదురు. గొప్పవారు వ్రాసిన జాబులు సేకరించుటయు, వాని మూలమున వారి జీవితములు వ్రాసికొనుటయు వారియందాచారమై యున్నది. మోర్లి (Morley) ప్రభువు 'Reflections' అను పేరితో హిందూదేశమును గూర్చి వైస్రాయిగా నున్న మింటో ప్రభువునకు అపుడపుడు వ్రాసినట్టి జాబులు పుస్తకరూపమున ప్రచురింపబడి యున్నవి. రాజనీతిని బోధించుటకు యిట్టి వ్రాతల వెల యపారము. రైట్ ఆనరబిల్ శ్రీనివాసశాస్త్రిగారు గోక్లేయొక్క జీవితచరిత్రమును యిట్లే వ్రాయ బూని యున్నారు. అయితే అది ఆంగ్లభాషయందే వ్రాయబడ నున్నది. ఆంధ్రభాష యందు జాబుల వ్రాతకు ప్రత్యేకమైనశైలి భాషాభిమానులు ఇంకను నెల కొల్పవలసి యున్నది.

ఇప్పటి పరిస్థితుల యందు విద్యార్జన మునకై బాలురును, విత్తనమునకయి పెద్దవారును పెరవూటుల యందు ఎక్కువగ వాసము చేయుచున్నారు. ఆకారణముచే మిత్ర బంధువర్గములకు వ్రాయవలసిన యవకాశము లెక్కువగ నున్నవి. విద్యార్థులు తమ తండ్రులకు వ్రాయు జాబులలో నూటికి తొంబది వంతున పైకము పంపమని తగాదాలతో యుండునే గాని, తమ జీవితమెట్లు? సహపాఠులమైత్రి ఎట్టిది? యుపాధ్యాయుల సౌజన్యమేమి? తాము నేర్చుచుండు విజ్ఞానపు తెరవేది వీనిని గూర్చి యేమియు వ్రాయరు. చెల్లెలకు కొడుకు గలిగె నపుడు అభినందించి వ్రాయుటెట్లో కళాశాల విద్యార్థికి కూడ తెలిసియుండుట యపరూపము. దుఃఖములు సంభవించినపుడు, ఓదార్చి ధైర్యమొసగునట్టి వ్రాత బడిలో మాకు నేర్ప లేదందురు. తమ తలిదండ్రులు పలుమార్లు శక్తికిమించిన త్యాగముతో బిడ్డను చదివించుటకు పడరాని కడగండ్లు పడుచున్నను విద్యార్థులు వారమున కొక్కతూరి యైనను తమ పెద్దలకు నెమ్మది నిచ్చుమాట వ్రాయుదురా అని సందేహము. ఒక్కొక్క విద్యార్థియు, వారమున కొకతూరి తన యింటికి తల్లికో చెల్లెలికో జాబు వ్రాయుచున్నాడను కొందము. ఒక్కొక్క జాబునందును తాను నేర్చుచుండు కొత్తవిషయములను చిన్నమాటలతో వివరించి వ్రాయుననుకొందము. సముదాయమున యిట్టివ్రాత ఒక్క సంవత్సరమునకు విజ్ఞానము నేమాత్రము వ్యాపింప జేయునో యూహింప వచ్చును. ఈప్రయోజనము యొక్క పరిమాణమింత యని గ్రహింతు మేని, యీయుద్యమము వెల యూహింపనగు. మచ్చునకై యొక మనోదాజాబు యీక్రింద వ్రాయబడి యున్నది. ఇది యొక కళాశాల విద్యార్థి తన చెల్లెలికి వ్రాసిన ట్లూహింప బడినది.

చేయూరు

ఫాల్గుణ శుద్ధనవమి

జానకి,

ఈజాబును నిన్న సాయంత్రమే వ్రాయ మొదలుపెట్టి ముగియకమునుపే నాసహపాఠులతో పాఠములు చదువ వెళ్ళవలసి వచ్చినది. మేమందరము నేను క్రికెట్ ఆటకు పోయి యుంటిమి. మాయాట యుత్సాహమున యింటికి మరలు వరకు శ్రమయే తోచలేదు. నేనొక్కడే 150 రన్లు చేసితిని. మా యాటను చూచుటకు అనేకులు వచ్చి యుండిరి. అమ్మయును నీవును వచ్చిచూడ లేదే యని పలుమార్లు మనస్సునకు తోచినది.

రేపుసాయంత్రము మాఉపాధ్యాయులు కొందరును నాక్లాసులో చదువు నామిత్రులును కలసి ప్రక్కనున్న ఇంద్రగిరియను కొండనెక్కి విహరింప దలచుకొన్నాము. ఆకొండయొక్క యెత్తు అక్కడి శీతోష్ణ స్థితి కొలుచుటకు మాకళాశాలలో యంత్రమున్నది. వానిని తీసికొని పోవుచున్నాము. నేను ఊరికి వచ్చినప్పుడు సమక్షము నీకాచిత్రము వివరించి చెప్పెదను. నేను ఊరినుండి వచ్చినప్పుడు అమ్మయు నీవునుచేసి యిచ్చిన చక్కిలములలో సుమారు 20 వరకు మిగిలి యుండెను. దానిని నాస్నేహితులు యిపుడే తినివేయ చూచిరి కాని నేను దానికి సమ్మతించ లేదు. రేపటి ప్రయాణమునకై యెత్తిపెట్టి యున్నాము.

చిన్నిబాలి (పనికత్తె కొడుకు) బడికిపోవుచున్నాడా? నీవే స్వయముగ వానికి పద్యములు చెప్పించుచుంటివే. ఎన్ని పద్యములను నేర్పినావు? వానికై కట్టెగుఱ్ఱము నొకటి కొని పెట్టి యున్నాను. వచ్చునపుడు తెచ్చెదను. అమ్మను నిన్ను చూచి ఏండ్లే గడచినట్టున్నది. ఉగాది పండుగ వరకు సెలవు దొఱకదు. ఇందులో నాయనగారికి వేరేజాబు వ్రాసియున్నాను. అలసట తీరి నెమ్మదిగా కూర్చున్నప్పుడు వారిచేతికిమ్ము అమ్మకు నానమస్కారములు చెప్పుము.

ఇట్లు మీ అన్న,

రమణ.

---

# హెచ్చరిక

తుమ్మల సీతారామమూర్తి చౌదరి గారు

ఎంతటివాఁడవోయి నిను నేమనవచ్చు నఖండకీర్తి యా
శాంతముల న్నిటింపఁగ మహామహిమం దనరారినట్టి స
త్సంతతిలో జనించి యవిచారమతిఁ నగుఁబాటు చెయ్దముల్
పొంతలకేగుచుంటి విది పోలినకార్య మఁటయ్య, సోదరా!

చెల్లరె! సర్వదేశముల జీవధనంబుల ధారవోసి య
ల్లెల్లరు స్వేచ్ఛకై పెనఁగు నీసమయంబున దాస్యవృత్తిచే
నుల్లము పల్లవింపఁ గడునుబ్బుచు నీవిధి నెంచకుంటి నీ
తల్లియవస్థఁ బాపవలదా? తలదాచెదవేల, సోదరా!

ఖద్దరుగట్టి బీదలకు గంజినిబోయుఁడు, భారతార్థికా
పద్దశ దీనఁబాయు"నని పల్కెడు గాంధిమహాత్ము బోధకుఁ
దిద్దెదు పంగనామమును "దేలికయు న్నెఅనీటులేని యీ
మొద్దులఁ దాల్చు"టెట్లనుచు మూర్ఖుఁడవైతి గదయ్య, సోదరా!

"మాలలనంటరాదు కసుమాలపుజాతి" యటంచు వారి నీ
లీల బహిష్కరించి మతిలేక "దురాత్ములు దక్షిణాఫ్రికా
నేలెడువారు హైందవుల నెంతయు నీచులఁగా గణింతు"రం
చేల విచారమందెద విసీ! నిను నేమనువాఁడ సోదరా!

స్వార్థపరాయణుఁడవయి స్థానికసంఘములందుఁ జేరి సూ
త్రార్థము మార్చి దానికి నపార్థము సూపుచు రచ్చకెక్కి స
ర్వార్థము ధారవోసి పురుషార్థము లెవ్వియులేక లేకిపై
వ్యర్థుఁడవై చరింతు విదియా? మగపాడి యఁటన్న సోదరా!

మీసము దువ్వుచుం బగఱ మీసరమంతయుఁ దూల "నాత్మ సం
త్రాసము వీడి మీ జనని దాస్యముఁ బాపఁగ రం"డఁటంచు ప
న్యాస పరంపరం గురియు దంతియకాని యొకింతచేయ వీ
వేసముఁజూచి లోకమున విజ్ఞులు మెత్తురఁటయ్య సోదరా!

"మనము మహమ్మదీయులును మచ్చరముల్ విడనాడి కూడి నె
మ్మనముల భేదభావముల మాని చరించుట మే"లఁటంచు నీ
వనయము హెచ్చరించి యిసుమంత వివేకములేక యింట నీ
యనుజులతోడఁ బోరెద వహో! యిది నింద్యముగాదె? సోదరా!

నీతిని జాతినిన్మఱచి నీవణుమాత్రము సిగ్గులేక, ప్ర
ఖ్యాతి నడంచి బుద్ధిబలకాయబలంబుల రూపుమాపి నీ
చేతికిఁ జిప్పనిచ్చు మధుసేవకు లోఁబడి రచ్చలందు "మా
తాతలు సోమపీథు" లని దర్పములాడెద వేల సోదరా! (సశేషము)

---

## తాళీవని

పెనుమర్తి వేంకటరత్నము గారు

ఈ సమున్నత తాళభూమీరుహమ్ము-లే యుగాల నాటివో? యిపు డనూన
నిశ్చలాస్పంద ముకుళిత నేత్రములను-తలచుచున్నవి! యుగయుగమ్ముల చరిత్ర!
జనన దేశమునుండి నిశ్చలతపొందు;-పూర్వచాంచల్యమ్ము విస్మృతి పొందినట్టి
జీవులో యేమొ? గాలి వీచినను గాని-పలుకనే పల్క వీ రహః ప్రణయమేమొ?
ఈ యుగయుగాంత జీవు లెన్నెన్ని మార్లు-ఆశలను బెంచుకొనిరో! దిగంతములకు
ప్రాకలేని యాసల తలపై ధరించి-ఇల నిలంబడు శీతోష్ణములు సహించి!

---





౪. ఒకసుందరమైన రజతకరండమువీాద రజతిమయ బోధివృక్షము. కరండమునకు నలువైపుల నాలుగుబుద్ధ విగ్రహములు చెక్కబడినవి. ఒక్కొక విగ్రహముకడ నొక్కొక శిష్యునిచిత్రముకలదు. శాసన లేఖనము కొంతిపాళీ, కొంత పయ్యూభావలయందుకలదు. ఈకరండ ముండిన స్తూపము క్రీ.శ. 6,7 నకు చెందినది.

౫. ధేనుకాసురవధ, పహరిపుర దేవాలయ పీఠభాగముననున్న శిలాచిత్రము. ఈచిత్రముల యలంకార వైఖరి సుందరముగా నున్నది. పయ్యూభావయందున్న శాసన మొకటి యిందు చెక్కబడియున్నది.







౬. నాలందా యొద్ద త్రవ్వితీసిన పెక్కు సుందరలోహవిగ్రహములలోనొకటి. ఈవిగ్రహము అష్టాదశభుజయగు తారాదేవిది. ఇందలిపనితనము, విగ్రహవిన్యాసము అందముగానుండి ప్రాచీనకాలపు చిత్రకారులసామర్థ్యమును చాటుచున్నది.

౭. బుద్ధవిగ్రహము. నీగ్రోవానియాకారమున నున్నది. ఇదిపురాతనప్రోమునగరమునరజతకరండము(చూ.చి౪.)లోదొరకినది. ఆకారము ఇదివరకు దొరకిన విగ్రహములకంటె భిన్నమైనదిగ నున్నది.

౮. రాధాకృష్ణవిగ్రహములు–పహరపుర దేవాలయపీఠభాగమున చెక్కబడిన ఈ బ్బైత్తు చిత్రములలో నొకటి

1



2



3



4



5



6



7



8



9



1. తండ్రి వైదికుడు. కొడుకు వైదికుడు. వేదము, సంస్కృతము చదువుచున్నాడు. 2. తండ్రి వైదికుడు. కొడుకు చదువుటకై చెన్నపురికిపోవ నున్నాడు. 3. సొమ్మకై తండ్రికి ఉత్తరము వ్రాయుచున్నాడు కొడుకు. 4. తండ్రి: నా ఇనాములను అమ్మవలసినదేనా? తల్లి: తప్పకుండా; కుఱ్ఱవాడు బి. ఏ. ప్యాసు కావలెను. 5. అర్థమంతయు వ్యర్థమైనది. 6. చివరకు బి. ఏ. అయినాడు. 7. వెళ్లిపో: ఉద్యోగం లేదు, సద్యోగం లేదు. 8. వైదికుడగుకొడు కిపుడు పెద్ద అయినాడు. అతని ఇల్లు; అతని పొలము; అతని పుస్తకములు; అతని పశువులు; అతని పిల్లడు; ఆహా! ఆనందమయ జీవనము! 9. పొలము లేదు; ఇల్లు లేదు; పని లేదు; తలితండ్రులు ముదుసళ్లు; తిండికే లేదు. కట్టా! కడగండ్ల జీవనము.

భారతదేశము వ్యవసాయప్రధాన మైనది. గ్రామములవంక మరలుడు!!

చిత్రకారుడు: కంచి శివరామమూర్తిగారు.



## అమానుల్లాఖాన్ రాజు–విద్యాభివృద్ధి

ప్రస్తుత ఆఫ్గనిస్థానపురాజు విద్యావిషయమున చేసిన సేవనుగూర్చి 'దిఎడ్యుకేషన్ ఔట్లుక్' పత్రికయందు వి. బి. మెట్టాగారు వ్రాయుచున్నారు:

1919 సం॥లో అమానుల్లాఖాను సింహాసన మధిష్ఠించినపుడు ఆఫ్గనిస్థానమున విద్య చాలా వెనుకబడిన స్థితియందుండెను. మసీదు బడులలో ముల్లాలు (మహమ్మదీయ పురోహితులు) బాలురకు వ్రాత, చదువు, లెక్కలు, కొరానును బోధించుచుండిరి. ఆధునికవిద్య కొరకు 1910 సం॥లో కీ. శే. అమీరుహబీబుల్లాఖాను స్థాపించిన యొక కళాశాలయుండెను. ఈకళాశాలలో భారతదేశ విశ్వవిద్యాలయములలో, విద్యాభ్యాసమొనరించిన భారతీయోపాధ్యాయులు గణితశాస్త్రము, ప్రకృతిశాస్త్రము, ఇస్లాము మతచరిత్ర బోధించువారు. ఈరాజుగారి తల్లి 1912 సం॥లో కాబూలునం దొక విద్యాలయమును పెట్టించెను; అందు బాలికలకు ప్రాథమికవిద్య యొసంగబడుచుండెను. అప్పుడాదేశములో నేవియు కళా, శిల్ప, పరిశ్రమల విద్యాలయములు లేకుండెను.

ఇప్పటి రాజుగారు దేశమందరును తమతమ బిడ్డలను పాఠశాలలకు పంపింపవలసినదని కోరుచు ప్రకటన పత్రికలను ప్రతిపట్టణములోను, గ్రామములోను అంటించిరి. ప్రభుత్వోద్యోగులందరును తమ బిడ్డలను పాఠశాలలకు పంపితీరవలెనని ఆజ్ఞాపింపబడిరి; వారట్లు కావింపనిచో వారికి జరిమానా విధింపబడుటయో లేక ఉద్యోగమునుండి తొలగింపబడుటయో జరుగునని ప్రకటింపబడినది. అన్ని పట్టణములలో ప్రాథమికవిద్యాలయములు స్థాపింపబడినవి. కాబూలునందు మరిరెండు మాధ్యమిక పాఠశాలలు స్థాపింపబడినవి; అందు ఒకదానిలో ఉపాధ్యాయులు ఫ్రెంచివారు. మరొకదానిలో జర్మనీవారు. ప్రాథమికవిద్యయు, మాధ్యమికవిద్యయుగూడ ఉచితముగనే బోధింపబడుచున్నవి.

ఈరాజుగారు స్త్రీవిద్యగూర్చి చాలపాటుపడిరి. కాబూలులోనున్న బాలికాపాఠశాలయందు తానురాజ్యాధిపత్యమునకు రాకపూర్వము 300 మందియే విద్యార్థు లుండినచోట నేడు 2,500 మంది యున్నారు. ఇతర పట్టణములలోకూడ బాలికాపాఠశాలలు స్థాపింపబడినవి. రాజకుటుంబములోని కొందరు నారీమణులును, గొప్పకుటుంబములవారి కుమార్తెలు కొందరును ప్రభుత్వ వ్యయముపై విద్యకొఱకు ఐరోపాకు పంపబడిరి.

ప్రకృతిసిద్ధమగు స్వరూపములను ప్రతిబింబించుటను కురాను గ్రంథము నిషేధించుట వాస్తవమైనను, ఈరాజు కాబూలులోను, యితరపట్టణములలోను శిల్పకళాశాలలను స్థాపించెను. అందు సాధారణ, వర్ణ, చిత్రరచనము, శిల్పవిద్య నేర్పబడుచున్నవి. కాబూలునం దొక పురాణవస్తుప్రదర్శన, శిల్పవిద్యాప్రదర్శన, శాల నెలకొల్పబడెను.

ఇప్పటికింకను ఆఫ్గనిస్థానములో సాంకేతికవిద్యాశాలలు (కార్మికవిద్యలను నేర్పునవి) లేవు, కాని ప్రభుత్వమువారి కర్మాగారములోనికి వెళ్లి వివిధవస్తువు లెట్లు

తయారు చేయబడుచున్నవో చూచుటకు ప్రజల కవకాశము గలదు. గనుల పరిశ్రమ, ధాతుశోధనము, (లోహ) విద్యుత్ యంత్రగతిశాస్త్రము నభ్యసించుటకు చాలా మంది విద్యార్థులను ప్రభుత్వమువారు యూరపు అమెరికాలకు పంపిరి. కాబూలునందు ఒకజాతీయ విశ్వవిద్యాలయమును సంస్థాపించుట కిపుడు ఆఫ్ఘను ప్రభుత్వమువా రాలోచించుచున్నారు.

---

## నూతనచారిత్రకపరిశోధనలు

ఈమధ్య బీహారు జిల్లాలోని నలందాలోను, రాజషాహిజిల్లాలోని పహర్‌పూరులోను బయల్పడిన మధ్యకాలములోని రెండు సుప్రసిద్ధమగు కట్టడములచే నాటి బౌద్ధమతపరిస్థితులు కొన్ని తెలియుచున్నవి.

జీ. ఏ. పేజిగారు గొప్ప స్తూపము నొకదానిని భూమిలోనుండి త్రవ్వి కనిపెట్టిరి. ఈపని నిర్వహించుట యందు వీరు మిక్కిలి నిపుణతను జూపిరి. దీనికి తూర్పు భాగమున నొక విశాలమగు తరుపంక్తియు, బారుతీరిన మఠములును పశ్చిమమునకూడ నిదేమాదిరి శిథిలమఠములును కలవు. ఇవన్నియు మొత్తమున నెనిమిది. ఇయ్యవి 7–12 శతాబ్దములమధ్య నెన్నియోసారులు తిరిగి కట్టబడినవి. అంతియేకాక ఒకదానిపై నొకటిగ దాదాపు తొమ్మిది కట్టడముల కట్టినట్లుకూడ నిదర్శనము కలదు. హ్యూయన్‌త్సాంగ్ తాను నలందాలో చూచిన మఠములు నాలుగంతస్తులు ఎత్తున నున్నవని వ్రాసియున్నాడు. ఇయ్యవి పరశురామప్రీతియై యుండును. ఇందట్టి చిహ్నములు కాన్పించుచున్నవి.

ఇందులో విలువగల వస్తువులేకాక, రాగి, కంచుతో చేయబడిన 8, 9 శతాబ్దములనాటి విగ్రహములు కలవు. అవియు నాటి శిల్పకళలను స్పష్టపరచుచున్నవి. వీటిలో హిందూదేవతల విగ్రహములు పెక్కుకలవు. వీటిచే బ్రాహ్మణమత మెంతవరకు బౌద్ధమతము నాక్రమించినదో విదితమగుచున్నది. చిత్రములు కొన్ని యీ సంచికయందు గలవు.

[౧౯౩౭ సం. ఏప్రిలు ౭న తేది టైమ్సు ఆఫ్ ఇండియానుండి.]

---

## అమెరికా, ఇంగ్లాండు దేశములకు యుద్ధమా ?

చార్లెస్. సి. ప్లంకెట్ అను నొక అమెరికను ఉపసేనాపతి న్యూయార్కు పట్టణమున నొక విందు సందర్భమున నిట్లు నుడివినాడట.

“నాచరిత్రజ్ఞానము సరియైనదైనచో, యుద్ధమునకు మనము నేడున్నంత సమీపముగ మున్నెన్నడు నుండలేదని నేను చెప్పగలను. ఏలయన, మనము నేను వర్తకవ్యవహారమున పోటీపద్ధతి నవలంబించి ఇతరజాతులను మూలకు ద్రోసివైచుచున్నాము. ఇట్టి విధానము యుద్ధము గల్పించుట తప్పదు.

“మీరు మీ వర్తకపు సామానులతో సముద్రముపై సంపూర్ణాధికారము వహించుటకు పోటీ చేయుచున్నంతకాలము, యుద్ధమునకు బోవుచున్నారన్న మాటయే. మీ రీగతిలో గూరుచుండుట యెంతసత్యమో యిదియు నంత సత్యమే. మనము నేడవలంబించుచున్న మార్గమునే యనుసరించుచుందుమేని యుద్ధము తప్పదు.

“గ్రేటుబ్రిటనుతోనే కానిండు, లేక మరి యే యితరజాతితోనైన గానిండు, మనకు యుద్ధము సంఘటించుచున్నది ”

ఇంతటితో సభ నిలిచిపోయెనట. తరువాత “మీ యభిప్రాయము గ్రేటుబ్రిటనుతో యుద్ధము సంభవించుననియా ?” యని యడుగ నాయన వెంటనే స్పష్టముగ నిట్లు చెప్పెనట. “అవును, గ్రేటుబ్రిటను అనియే నా యభిప్రాయము. కాకున్న నష్టపడిన మరి యేయితర జాతియైన గావచ్చును. ఆరంభముననే గ్రేటుబ్రిటను యుద్ధమునకు దిగకున్నను ముందుకు నేదియో యొకచిన్న దేశమును ద్రోసి, మెల్లగ దాను దానివెనుక జేరును.”

ప్లంకెటుగారు ప్రకటించిన యీయభిప్రాయము లండను న్యూయార్కులలోని రాజకీయ రంగములలో చాల సంక్షోభమును గలిగించినదట. నానాజాతిసమితి సార్థకమగుటకు మార్గ మిదియే కాబోలు !

---

## భారతదేశమున స్త్రీవిద్యయొక్క యాదర్శము.

ఆర్. కృష్ణాబాయి, బి.ఏ., యల్.టి. గారు, 'బ్రాహ్మణేతరయువక (Non-brahmin Youth) పత్రిక'లో భారతదేశమున స్త్రీవిద్యయొక్క యాదర్శములనుగురించి వ్రాయుచు నిట్లు నుడువుచున్నారు.

"నష్టమైన విజ్ఞానమును, కళను, మతమును మరల నుద్ధరించి, భారతీయ వనితల వ్యక్తిత్వమును గాపాడుటయే నిజముగ నిప్పుడు కావలసినది. కావున విజ్ఞానమూలముగ మనసునకు శిక్షణ నొసంగి, యాత్మజ్ఞానముచే దాని పరిపూర్ణత్వమునందు నట్లు చేయుటయే ఇప్పుడనుసరణీయమగు బోధనపద్ధతి. వందలకొలది యేండ్లు మనవారి నిరాదరమునకు పాత్రమై భారతీయ వనితాత్వమదృశ్యమై యున్నను విదేశీయుల దండయాత్రలు తుపానులవలె నొకదానివెనుక నొకటిగ నార్యావర్తమును ముంచివైచి యెన్నియో మార్పులకు లోబరచినను భారతీయ వనితాత్వముయొక్క పునాదిరాయి యట్లే నిశ్చలముగ జెక్కుచెదరక నిలిచియున్నది. మన యాడువాండ్రు గూడ మగవారి కార్యవిధానమునే యనుసరించి వారితో బోటీచేయకుండుటయే దీనికి గారణము. ఆడుది నేటి యీస్వాతంత్ర్యసమానత్వములను నభిప్రాయములచే బరవశయై, స్వదేశపు భావిసౌభాగ్యము, భావ్యభివృద్ధియు, దనచేతనున్న వన్న యంశమును మరచిపోవునేని అది చాల శోచనీయమగు విషయము. సంసారమునకు బయట నిర్వర్తింపదగు కార్యము లాడుదానికి లేవని నాయభిప్రాయముకాదు. ప్రపంచ మంతయు నామె కార్యరంగమే. ఆమె ప్రత్యేకోత్సాహమునకు లక్ష్యమగు కార్యరంగ మేదియైనను, స్త్రీ తనవ్యక్తిత్వమును గోల్పోయి, జీవితమును నిష్ఫలిణమొనర్పకుండుగాక. మనము మరియొక జాతి ననుకరింపకుందుముగాక. మననాగరకత పురాతనమైనది. మనపూర్వచరిత్ర కీర్తిమయము. మన పూర్వ చరిత్రమునకు మనము గర్వింపవలసినదే. అట్టి గర్వమునకే యాలవాలమగు భవిష్యత్తునే మనము గోరుదుము. మన భవిష్యద్యశస్సు నేటి మన గృహములపై నాధారపడి యుండును.

తమ గృహకార్యముల జక్కబెట్టుటకై కొందఱి దాసీల సృష్టించి, తమ బిడ్డలకు స్తన్యమిచ్చుటయన్న నేమో యెరుగని వనితారత్నములు పైవాక్యముల శ్రద్ధతో గమనింతురుగాక.

---

## సంపూర్ణ మద్యపాన బహిష్కార మసాధ్యమా ?

సారాయమును కొద్దికొద్దిగ బుచ్చుకొన్నను నష్టమే కలుగునని వ్రాయుచు డాక్టరు కోర్ట్‌నీ. సి.వీక్స్. యమ్. ఆర్. సి. యస్., యల్.ఆర్.సి.పి., గా రిట్లు వ్రాయుచున్నారు.

"మద్యపానము ఆరోగ్యవంతమగు జీవితమునకెన్నటికిని దోడ్పడజాలదని, ఉన్న వ్యాధుల విషయమునగూడ నది యిదివరకు ననుకొన్నంత యావశ్యకము కాదనియు వైద్యులు సంపూర్ణముగ గుర్తించినారు. ఏబది వత్సరములకు బూర్వము లండను నగరమున మితపాన వైద్యశాల (Temperance Hospital) స్థాపింపబడినప్పుడు ఒక వైద్యపత్రిక "భగవంతుడే రోగులను రక్షించుగాక" యని నుడువగలిగెను. అప్పుడు సారాయము సాయములేక రోగముల మాన్పుట యసంగత మని పించెను. ఐనను నాడు మొదల్కొని యావైద్యాలయమున 50,000 రోగులు చికిత్సనందియున్నారు. వీరిలో 190 మందికి మాత్రమే వైద్యభాగముగ సారాయము పయోగింపబడినది. 1875 వ సం||మున రాయల్ విక్టోరియా ఇన్‌ఫర్మరీ (న్యూ కాజిల్ ఆన్ టైన్) అను ఆసుపత్రి సగటున ప్రతిరోగికిని 2 పౌ. షి 9 ల మద్యపదార్థములను వాడియుండెను. 1925 సం||న సారాయము అప్పటి

కన్న నాలుగున్నర రెట్లు వెల యెక్కువైనను, సగటున రోగి యొక్కంటికి 5¼ పెన్నీల విలువగలిగిన దిమాత్రమే యుపయోగింపబడినది. నలుబది యేండ్లకు బూర్వము వెస్టరన్ ఇన్‌ఫర్మరీ (గ్లాస్గో) అను ఆసుపత్రిలో సగటున ప్రతిరోగికిని 104 డ్రాముల సారాయ మొసంగబడెను. పోయినయేట ప్రతిరోగికిని సగటున వాడినది మూడు డ్రాములే.

"ఈ క్రిందియంకెలు ఇప్పుడే స్టాకుహోం విశ్వవిద్యాలయములోని వైద్యశాస్త్ర పండితునివద్దనుండి నాకందినవి. 1900–వ సంవత్సరమున స్టాకుహోం ఆసుపత్రిలో 3,934 రోగులకు 40,000 ఔన్సుల సారాయ ముపయోగింపబడెను. 1926 సం॥లో 5334 రోగులకు 3500 ఔన్సులు వాడబడినవి. అనగా: ఒక్కొక్క రోగికి 96 డ్రాములనుండి, యించుమించుగ నాలుగు డ్రాములకు తగ్గినదన్నమాట.

"వైద్యప్రపంచములో విశేషముగ నీమార్పునకు గారణమేమి? సారాయము శరీరనిర్మాణమునకు గాని శరీరపోషణమునకుగాని యుపయోగింపదు. పరిమితముగ గొన్ని తీవ్రవ్యాధులసందర్భమున, నాహారముగ నది యుపయోగపడవచ్చును. కాని మత్తువస్తువుగనుండి ముఖ్యములగు నితరవ్యాపారములకు అది కలుగజేయునష్టము, దానివలన గలుగు లాభములకన్న నెంతయో యధికము. ఈసంగతిని వైద్యులు అనుభవపూర్వకముగను, ఆచరణ మూలకముగను గనిపెట్టుటయే పైమార్పునకు గారణము. రాజకీయవైద్యకళాశాలకు (Royal college of Physicians) అధ్యక్షులయిన సర్ హంఫ్రీ రోల్‌స్టన్‌గారు నుడివినట్లు దాని ప్రభావము లాభములకన్న అపాయములనే యెక్కువగ గలుగజేయుచున్నది."

"హృదయమునకు, మెదడునకు, నితర ముఖ్యవ్యవహారములకును, సారాయము, అభివృద్ధికరమను ప్రాత తలంపు సాధారణప్రజలలో నింకను ఊగులాడుచున్నను వివేకశాలురగు వైద్యులు దానిని విడిచిపెట్టినారు. సారాయము ముఖ్యముగ మత్తుపదార్థము. అలవాటునుబట్టియు, మామూలు వాడుకనుబట్టియు, సాధారణభాషలో 'ప్రోత్సాహకరము' అనుమాట యిప్పటికిని గన్పించుచున్నను, అది మత్తుపదార్థ మనియే అన్ని గ్రంథములలోను అంగీకరింపబడినది. మత్తుపదార్థమగుటచే సారాయము, మెదడుయొక్క ఉన్నత ముఖ్యభాగములను– వేనిమూలమున మనస్సునకు వివేకయుతమగు నిర్ణయమును విచక్షణకు నిగ్రహమును సమకూరుచున్నవో, వేనిని చెందించుకొనుట కఠినతమమగు కార్యమో– యట్టి యున్నతముఖ్యభాగములనే జడములుగ, వికలములుగ జేసి స్తంభింప జేసివైచుచున్నది.

మద్యపానము దైనికాహారములో నొక భాగముగ గల పాశ్చాత్యదేశమునందు దాని విషయమున నిట్టియభిప్రాయము ప్రబలియున్న కాలమున, మద్యపానము విధినిషిద్ధముగ గల మన దేశములో సంపూర్ణనిషేధ మసాధ్యమని బ్రిటిషుప్రభుత్వ చెప్పుటలో గలరహస్యము జదువరులు బాగుగ గుర్తింతురుగాక.

---

## ఇంగ్లండుదేశమున జర్మనీపరిపాలనము

హెచ్. డబ్లియు. నెవిన్సన్ అనునాయన, కొన్ని యేండ్లకు బూర్వము "నార్తు అమెరికన్ రివ్యూ" అను పత్రికలో 'దాసపతనమున' (Under the Yoke) అను వ్యాసము నందు ఇంగ్లండుదేశము జర్మనీవారికి వశమైనట్లుగ భావించి, యట్టి దాస్యమున ఇంగ్లండుదుర్దశ యీక్రిందివిధముననుండునని వర్ణించినాడు.

"జర్మను రాజప్రతినిధుల యధికారము క్రింద ఇంగ్లండు నాలుగుభాగములుగ విభజింపబడును. స్కాట్లండు, వేల్సు, ఐర్లండుదేశములలో జర్మను రాజప్రతినిధు లుందురు. జిల్లా యధికారులుగనుండి పన్నులను వసూలుచేయుచు, పోలీసుశాఖ నిర్వహించుటకు జర్మనులు నియమింపబడుదురు. ప్రభుత్వ నియమితు లయిన

కొలదిమంది బ్రిటిషు జమీందారులతోడను, సేవకులతోడను గూడుకొనిన జర్మనుసభ యొకటి ప్రతిరాష్ట్రమును బరిపాలించును. సేనాధిపతి, కోశాధికారి మున్నగు ముఖ్యపదవు లన్నియు జర్మనులతో నిండియుండ, నెల్లప్పుడును జర్మనులే యధికసంఖ్యాకులుగ గల యొకసంఘములో గూర్చుండి యొకజర్మనురాజప్రతినిధి విండ్సరు, బకింగుహాం రాజభవనములలో సభల జరుపును. తమ పరిపాలకులయొక్క యాధ్యాత్మికశ్రేయస్సును గోరుచు, నింగ్లీషు వారు ల్యూధరన్ దేవాలయములను (Lutheran Churches) పోషింపవలసి యుండును. లండను మున్నగు నగరములకు లార్డుమేయరులుగ జర్మను లుందురు. జర్మనుభాషయే దేశమందంతట రాజకీయ భాషగ నుండును. న్యాయస్థానములలో దుబాసీలుండిన నుందురుగాక. ప్రభుత్వపుపరీక్ష లన్నియు జర్మనుభాషలో జరుపబడును. ప్రభుత్వమున గొప్ప గొప్ప యుద్యోగముల నాశించువారు చదువుకొనుటకై జర్మనీకి పోవలసి యుండును.

"ప్రధానములగు వార్తాపత్రిక లన్నియు జర్మను భాషలో బ్రకటింపబడును. టైమ్సు మున్నగు విద్రోహపు బత్రికలపై కట్టుదిట్టమగు కాపలా యుంచబడును. జర్మను ప్రభుత్వమును విమర్శించిన, నది రాజద్రోహమగును. ఇంగ్లీషుపత్రిక లన్నియు నిర్బంధింపబడును. ఇంగ్లీషుపత్రికాసంపాదకు లందరును దుర్భరములగు జరీమానాలకు గాని, తీవ్రములగు కారాగారశిక్షలకుగాని పాల్పడవలసియుండును. ఇంగ్లీషువక్తలెల్లరు, కారణము చూపబడకయే, విచారణలేకయే ఆరన్‌కీస్(Ornkeys) ప్రాంతములకు దేశాంతరవాసమునకు బంపబడుదురు. మిల్టను, వర్డ్సువర్తు. బర్కు, మిల్, మోర్లేప్రభువు, మున్నగు స్వాతంత్ర్యారాధకుల గ్రంథములన్నియు నిషేధింపబడును. షిల్లర్, హైన్, కారల్‌మార్క్సు, మున్నగు జర్మను లేఖకుల గ్రంథములు కూడ నిషేధింపబడును.

"రైలుబండ్లలో నింగ్లీషువారు రెండవమూడవ తరగతుల బండ్లలోనే ప్రయాణము చేయవలయును. మొదటితరగతిలో బ్రయాణముచేసిన, జర్మనువారి యౌద్ధత్యమునకు లోబడవలసినదే. బహుశః ఏజర్మను అధికారియో వచ్చి వాండ్రను క్రిందికి లాగివైచును. ప్రభుత్వభవనములన్నియు జర్మనుపద్ధతిని నిర్మింపబడును. ఇంగ్లండులోని దుకాణము లన్నియు జర్మనువస్తువులలో మునిగిపోవునట్లుచేయు నొక వర్తకపు విధానముచే ఇంగ్లండుదేశపు బరిశ్రమ లన్నియు నణచివైవబడును. ఇంగ్లండువకు గల నైపుణ్య మంతయు మాయమైపోవును.

"ఆయుధధారణము నిషేధింపబడును. స్కాట్లండు, పశ్చిమోత్తరరాష్ట్రములలోని సామాన్యప్రజలందరును జర్మనుఅధికారులక్రిందనున్న దేశీయసైన్యములో చేరునట్లు ప్రోత్సహింపబడుదురు. ఏ బ్రిటిషు అధికారియు లెఫ్టినెంటు పదవికన్న పైకిబోగూడదు. ముఖ్యపదవులన్నియు జర్మనులకై ప్రత్యేకించి యుంచబడును. స్వయంసేవకదళములు రాజద్రోహపు సంఘములుగ బరిగణింపబడును. జర్మనులు కొందరు లీస్టరుషైరులోనికి నక్కలను వేటాడుచు బోయినప్పుడు ప్రజలు పవిత్రమగు నాజంతువు వధింపబడుట కడ్డువచ్చిరేని గ్రామస్థులగు ప్రధానులు కొందరు ఉరిదీయబడుదురు. అట్లురిదీయునప్పుడు కొందరు కొరడాదెబ్బలను దినవలసి యుండును.

"మనకు జర్మనుప్రభువుఁ దేవుడు
మనుచు గావుత నెప్పుడున్,
మన విదేశపుబ్రభువు చిరజీ
వనముతో నలరారుతన్."

అనుచు జాతీయగీత మారంభ మగును.

"బ్రిటనుతల్లీ,పరిపాలింపుము" (Rule Britannia) అనుపాట రాజద్రోహముగ నెంచబడును.

"ఈటన్, హారో మున్నగు బ్రభుత్వవిద్యాలయము లన్నియు, ఆక్సుఫర్డు కేంబ్రిడ్జి కలాశాలల భవనములతో సహా మూసివైచి, జర్మనులు వానిని సైనికస్థానములుగ మార్చెదరు. విద్యార్థులు పట్టణములలోని తమ బసలకుబోయి, యైశ్వర్యము విషయమున నందరు నిదివరకుకన్న నెక్కువ సమానముగ నొకరితో నొకరు తులదూగుచుందురు.

"జర్మనుభాష యంత యందమైన భాషకాదు. ఐన, నదియు నొకవాఙ్మయమే. ప్రభుత్వవ్యవహారము

లన్నిటిలోను, వ్రాతకును, సంభాషణమునకును జర్మను భాషనే యుపయోగించునట్లు ఇంగ్లీషువారు నిర్బంధింపబడుదురు. జర్మను సారస్వతమును గూర్చియు, జర్మను చరిత్రమునుగూర్చియు వారు కొంత నేర్చుకొందురు. తెల్లరొట్టెకన్న నెక్కుడు ఇష్టమైన నల్లరొట్టెను దినుటగూడ వారు నేర్చెదరు. సరే—జర్మనుసామ్రాజ్య సంరక్షణమునకును, తమ దేశమునందున్న జర్మను సైన్యములకును, దమ తీరములకు గావలియున్న యుద్ధనావలకును, ఇంగ్లీషు వారందరు దుర్భరముగ ఖర్చుల భరింపవలసియుండుననుట వేరుగ జెప్పనక్కరలేదు."

పై వర్ణనమును జదివినవారి కెల్లరకు నేటి మన భారతదేశముయొక్క దురవస్థ స్పష్టముగ గోచరించును. నేవిన్సనుగారు గూడ దీనిని వ్రాయునప్పుడు హిందూదేశమునే యుద్దేశించి యుండవచ్చును. ఐనను నేడు పండ్లుతోముకొనుట మొదలుకొని పరమేశ్వరు నారాధించుటవరకు సర్వవిధముల నాంగ్లేయుల ననుకరించుటకే భారతీయులు తమ శక్తిసామర్థ్యముల వినియోగించుచున్నారు. రాజకీయముగ, సాంఘికముగ, నార్థికముగ, విద్యావిషయికముగ నేవంకజూచినను భారతీయులు పాశ్చాత్యులకడ బానిసతనమునకే పరువిడుచున్నారు. ఎంతశోచనీయము! ఎంత యవమానకరము!!

---

## ఆధునిక భారతీయగ్రంథములు

పండిత దివాన్ చంద్ శర్మ యం.ఏ. గారిట్లు వ్రాయుచున్నారు:

నే నన్నివిధముల పుస్తకాలయములను చూచితిని. దీనిచే, భారతీయులకు సరియగు విజ్ఞానాహారమొసంగబడుటలేదని నిశ్చయించుకొనవలసి వచ్చినది. విద్వాంసులగు కొలదిమందినిగూర్చి నేను చెప్పుటలేదు. తెలియనివారిని, తెలిసియు దెలియనివారిని మాత్రమే మనసున నుంచికొని నేనీమాట చెప్పుచున్నాను. వీరు చదువున దేమి?—సంక్షోభకరములు, భావోద్రేకజనకములు నగు కథలు; నీచోద్దేశములను, తుచ్ఛాశయములను వర్ణించుక్లిష్టపద్యములు; అసత్యములతో నిండిన జీవితచరిత్రలు, గ్రంథకర్త మతమునకే యెక్కువ శ్రేష్ఠత్వము నిచ్చునట్టియు, మానవస్వభావములోని యౌదార్యము నుద్దేశింపక, యందలి ద్వేషమును, నీచతమము లగు దురాశలను బురికొల్పునట్టియు గ్రంథములు. ఇట్టి యహితకరమగు విజ్ఞానాహారమును గ్రోలుటచే, భారతీయు లనుభవించెడి శోచనీయము లగు ఫలితము లెల్లరకు సువిదితములే.

దీనికంతకు కారణమేమి? మొదటికారణము: మన సాధారణసారస్వతము అసహజ మయినది. అది విదేశీయము. దానిని గొనివచ్చి మనదేశమున నాటనలయునని మనము ప్రయత్నించుచున్నాము. చాలవర కది నిస్సారమగు ననుకరణము. అన్యవాఙ్మయముల యనుకరణము. తుదకు దీనిఫలిత మేమగుచున్నదనగా; ఒకవిధమైన యసహజత్వము, ప్రత్యేకత్వము, దాని నావహించుకొనుచున్నవి. అందుచే నది చాలినంత లోతుగ బారుకొని పోజాలకున్నది. రెండవకారణము: మన సాధారణసారస్వతమున ఉదారాశయత్వము లేదు. భావౌన్నత్యము కానరాదు, భావసూచనములో నిగ్రహము తక్కువ. మోటుగ, నసభ్యముగనుండును. మనయీ సారస్వతము స్వప్రయోజనమునకు సత్యమును, స్వాభిప్రాయములకు భావతీక్ష్ణతను, రంజకత్వమునకు సరళత్వమును బలియిడుచున్నది. మనసాధారణభాష, పామరజనులందరిచేతను జదువబడుభాష సంపూర్ణముగ యసహజమైపోవుటయే తుదకు దీని యనివార్యమగు ఫలితము. ఈసారస్వతములో భారతీయుల స్థితిగతులు ప్రతిబింబించుటలేదు. ఇందు భారతీయుల జీవితములు వర్ణింపబడుటలేదు. కుటీరములలో నివసించుచు, పొలములలోను, గనులలోను పనిజేయుచు బొట్టబోసికొను భారతీయ ప్రజలను మన యీ సారస్వతము మరచిపోవుచున్నది. అందుచే ప్రస్తుతము మనకు గావలసినది మనభాషయొక్క

పునరుద్ధారణము. భారతీయగ్రంథకర్తలు స్వదేశీయుల యభిప్రాయములతో, వారిజీవితముతో నెక్కుడు పరిచయము గలిగించు కొందురుగాక. జీవితము నున్నదున్నట్లు పరీక్షించి తెలిసికొని, తమశక్తికొలంది దానిని వర్ణింతురుగాక. ఈవిధముగ, భారతీయులకుత్తేజము గలిగించు భావములను వారిని కార్యదక్షులనొనర్చు నాశయములను, వారి నెదుర్కొను సమస్యలను, వారి నవమానితులజేయు దౌర్బల్యములను వారి నుద్ధరించు నాదర్శములను, వారి ననగద్రొక్కు లోటుపాటులను, మనగ్రంథములలో వర్ణించుటకు దగు ప్రయత్నముల గావింపవలయును.

---

## విదేశములలోని భారతీయులు

ఏప్రిల్ మాసపు 'ఇండియన్ రివ్యూ' పత్రికలో విదేశములయందలి భారతీయుల సంఖ్య యీక్రిందివిధమున వివరింపబడినది.

| దేశము పేరు | భారతీయుల జనసంఖ్య | జనాభా తీసికొబడిన సంవత్సరము |
|---|---|---|
| (బ్రిటిషుసామ్రాజ్యములో) | | |
| సింహళము | 820000 | 1926 |
| బ్రిటిషుమలయా | 660000 | ,, |
| హాంకాంగు | 2555 | 1911 |
| మారిషస్(Mauritius) | 264527 | 1921 |
| సిచెల్లీస్ | 332 | 1911 |
| జిబ్రాల్టర్ | 50 | 1920 |
| నైగేరియా | 100 | 1920 |
| కెన్యా | 26759 | 1926 |
| ఉగాండా | 5604 (ఆసియా వారు) | 1921 |
| నయాసాలాండ్ | 515 | 1921 |
| జాంజిబార్ | 12841 | 1921 |
| టాంగనయికా | 9411 | 1921 |
| జమైకా | 18401 | 1922 |
| ట్రినిడాడ్ | 121420 | 1921 |
| బ్రిటిష్‌గయానా | 124938 | 1921 |
| ఫిజీద్వీపములు | 60634 | 1921 |
| బసుటోలాండ్ | 179 | 1911 |
| స్వాజీలాండ్ | 7 | 1911 |
| ఉత్తరరొడీషియా | 56 (ఆసియా వారు) | 1921 |
| దక్షిణరొడీషియా | 1250 ,, | 1921 |
| కనడా | 1200 | 1920 |
| ఆస్ట్రేలియా | 2000 | 1922 |
| న్యూజీలాండు | 606 | 1921 |
| నెటాల్ } | 141336 | 1921 |
| ట్రాన్స్‌వాల్ } | 161 13 45 | 1921 |
| కేప్‌కాలనీ } | 339 6498 | 1921 |
| ఆరంజ్ ఫ్రీస్టేటు } | 100 | 1921 |

బ్రిటిషుసామ్రాజ్యములో మొత్తము 2294724

| (ఇతర దేశములు) | | |
|---|---|---|
| అమెరికాసంయుక్త రాష్ట్రములు | 3175 (ఆసియా వారు) | 1910 |
| మడగాస్కర్ | 5272 ,, | 1917 |
| రియూనియన్ | 2194 | 1921 |
| డచ్‌ఈస్టిండీస్ (సే) | 50000 భారతీయులు | |
| సురినాం | 34957 | 1920 |
| మోజాంబిక్ | 1100 (ఆసియా వారు, అర్ధజాతుల వారు) | తెలియదు |
| పెర్షియా | 3827 | 1922 |

ఇతరదేశములలో మొత్తము 100525

మొత్తముపై విదేశము లన్నిటిలోనుగల భారతీయులసంఖ్య 2395249.

---

## నేటినవలలు—కల్పనానిగ్రహము

బుక్‌మన్ (Bookman) పత్రికలో డీన్ ఇంజిగారు నేటి నవలలనుగూర్చి యిట్లు వ్రాయుచున్నారు:—.

నేడు నవలకుగల పలుకుబడి చాల నపాయకరమని నానిశ్చితాభిప్రాయము. దాని రచనలో నిగ్రహము లేక పోవుటకాదు దీనికిగారణము. అనిగ్రహమును నేనంతగ లెక్కసేయను. మానవస్వభావమును నీచముగ జిత్రించుట నది పెంపొందించుచున్నది. ఇదియే పై యనర్థమునకు గారణము "కీర్తిదాయకము, హితకరమునగు నింగ్లీషు నవలల సాంప్రదాయమునకు మరలవలయునని నేను హృదయస్ఫూర్తిగ వాంఛించెదను. చిత్రకారునివలెనే గ్రంథకారుడును సునిశ్చితమగు నొక యాదర్శము గలిగి యుండవలయును. బొమ్మలో చిత్రింపబడరాని నీచతమములగు వస్తువులు కొన్ని కలవు. మానవునిస్వభావమునను, జీవితసంఘటనములలోను గూడనట్లే కలవు. గొప్ప కల్పనాశక్తిగల లేఖకుడు, ప్రాపంచికజీవనము యొక్క ప్రయోజనమును తత్వమును ఉచితభావమున నరయగలవాడై యుండవలయును. అతిమానుషములగు సంఘటనములను, ఈప్రయోజనముతోడను తత్వముతోడను సమన్వయమొనర్చి యతడు చిత్రింపవలయును. తనసారమునంతను, తనశాశ్వతత్వమునంతను ఐహికసంఘటనము లో బ్రతిబింబింపజేసెడి శాశ్వతప్రయోజనములగు సౌమనస్యమును, సత్యమును, సౌందర్యమును, గ్రంథరచయిత అరయజాలడేని నతడు వ్రాత మానివైచిన మంచిది. ఏలయన ఇంక మనకు నేర్పదగినదేమియు నతనివద్ద లేదు. ఏవి యువకుల హృదయముల నిప్పటికిని బ్రదీప్తముల గావించుచున్నవో, యేవి వికలహృదయమగు నేటి మానవబృందము పునరుద్ధరింపబడుటకు అనన్యసాధనభూతములై యున్నవో యట్టి యాశాప్రేమవిశ్వాసములను గ్రంథరచయిత హేయములగు ననుభవముల జిత్రించి, విధ్వస్తములుగ నొనర్చివైచుచున్నాడు. "లక్ష్యము లేనిచోట బ్రజలు నశింతురు." తన దేశమును సోదరప్రజలను బ్రేమించుచున్నానని చెప్పుకొనువాడు, ఇట్టి లక్ష్యమునుండి యువకులనెడ బాపునేని యది నీచమగు మాయయని చెప్పనగును.

---

## కవి

కాశీ వ్యాసాచార్యులుగారు

పసిడి మిసిమించు తారకావళుల తోడ-నంచితమగు సువర్ణప్రపంచమందుఁ
బుట్టి తనరారి సత్కవి పుంగవుండు-మంచిచెడ్డల తారతమ్యం బెఱింగి;
చావుబ్రతుకులలో రహస్యంబుఁ దెలిసి-తాను దానన నెవ్వండొ తరచి చూచి
నిరసనగుణంబునే చూచు నిరసనమునఁ;-బ్రేమయందుననే నిజ ప్రేమఁ గొలుపు
ద్వేషభావంబు మీఁదనే ద్వేషమూను-చిన్మయాత్ముని సృష్టి విచిత్రమెల్ల
తెరచిపెట్టిన పొత్తంబు కరణి యతని-కనుల చెంగట విశదంబుగాఁ గనఁబడు;
అతఁడు జనుల కలభ్యమైనట్టి కీర్తి-రాజమార్గంబు పైని నర్తనము సతముఁ
జేయుచుండుఁ బ్రతిధ్వనించెడి సుగతుల-కాంతి మయ కనక పత్ర పుంఖములతోడ
నలరు తన్మహనీయ నూహాశుగములు - సర్వాలక్ష్యైక గాములై పర్వుచుండు.
(టెన్నిసన్ కవి యాంగ్ల పద్యమునుండి)

---




# గ్రంథములు

## మహాభారతయుద్ధము

ఈనాటకము రాయల్ సైజున 96 పుటలను గలిగి యున్నది. గ్రంథకర్తగారు కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులుగారు; వెల రు 1-0-0. వలయువారు గ్రంథకర్తగారి పేర రాజమహేంద్రవరమునకు వ్రాసిన బడయగలరు.

శ్రీమన్మహాభారతాంధ్రీకరణ దీక్షితులగు గ్రంథకర్తగారిని నేడు క్రొత్తగ నాంధ్రలోకమునకు బరిచితులగావింప నక్కఱలేదు. శాస్త్రిగారు, అవతారికలో వ్రాసినట్లు "భారతమంతయు నొక్కరేయి బ్రదర్శించుటకర్హమగునట్లు ముఖ్యవిషయములను విడువక" సరసముగ నీమహాభారత యుద్ధనాటకమును రచించినారు. మహాభారతము బోలుకథను, సంపూర్ణముగ నొక్కనాటి ప్రదర్శనమున కనుకూలముగ, రచించుట కష్టసాధ్యము. కావుననే వారికి 'రంగములు పెట్టుట యిష్టముగాకున్నను అట్లుచేయక తప్పినదికాదు.' శాస్త్రిగారి శైలి చక్కదనమునకు వారి శ్రీకృష్ణభారతమే సాక్షి.

(ప్ర.రం.)

## ప్రాచీన హిందూదేశ రాజ్యాంగచరిత్రము

ఈగ్రంథము సాహిత్యవిశారద కోన వెంకటరాయశర్మగారిచే రచియింపబడినది. డెమ్మిసైజున 110 పుటలు గళిగియున్నది. వెల రు 0-12-0 వలయువారు గ్రంథకర్తగారి పేర పశ్చిమగోదావరిజిల్లా ఏలూరుకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

మనపూర్వులు సింహాసనస్థుడగు నేలికయొక్క నిరంకుశప్రభుత్వమునే కాని నిజమగు ప్రజాప్రభుత్వమునెన్నడు ననుభవించియుండలేదనియు, బ్రజాప్రభుత్వధర్మముల నీనాటికి భారతదేశమున దాము నెలకొల్పితిమనియు దరచుగ నాంగ్లేయులు మనల బరిహసించుచుందురు. శర్మగారీగ్రంథమున నీవాదము బూటకమనియు, మనదేశమునగూడ ప్రజాప్రభుత్వ ముండెననియు, సోదాహరణముగ నిరూపింపగలిగిరి.

గ్రామనిర్మాణము, ప్రభుత్వకార్యములు, మంత్రులు, సైన్యవ్యవస్థ, నాగరకము, ప్రభుత్వాదాయము, రాజు, శాసనసభలు, అనుక్రమణికలతోడి యెనిమిది ప్రకరణములలో చాణుక్యుడు మున్నగు భారతీయ ప్రముఖులయొక్కయు, హుయానుత్సాంగు మొదలగు నైదేశిక ప్రముఖులయొక్కయు గ్రంథములనుండి, యనేకచారిత్రకవిషయములను సమకూర్చి వేదకాలము మొదల్కొని, మొఘలుపరిపాలన మంతమొందునరకు, హిందూదేశమున నములులో నుండిన ప్రభుత్వవిధానములును, తేటతెల్లములగు మాటలతో గ్రంథకర్తగారు వివరించియున్నారు.

ఆయాయంశముల బ్రోవొనర్చి కూర్చుటలో నచ్చటచ్చట కొంచెము వరుస తప్పినది. రాబోవుకూర్పులో గ్రంథకర్తగారీలోటు దీర్తురుగాక.

మొత్తముపై గ్రంథము మిగుల నుపయోగకారిగ నున్నది.

(ప్ర. రం.)

5, 5- 20 ౮-౨౭

## 'ఇంటా బయటా'

ఇది సుప్రసిద్ధ కవీంద్రుడగు రవీంద్రనాథ ఠాగూరిగారి బంగాళీనవలకు ఆంధ్రీకరణము. ఆంగ్లమున Home and Abroad అనేనవల. శోభనాదేవి, కారుమూరి నైకుంఠరావుగార్లనువదించిరి. కవికులచంద్రుడగు మహాకవి వ్రాసిన యీ 426 పుటల గ్రంథమును గూర్చి చర్చించుటకుగాని, దానియందిమిడియుండు భావములను విశదీకరించుటకుగాని యీ కొంచెము స్థలమున సాధ్యముకాదు.

ఈగ్రంథము సాంఘిక రాజకీయ సమస్యలనాధారముచేసుకొనియున్న యొక చక్కనినవల. ఇందుముఖ్యపాత్రలు ముగ్గురు. ఒకభార్య, భర్త, వారి స్నేహితుడొకడు. ఈ కథనుడ నీముగ్గురువ్యక్తులు తమతమ అవస్థలనుండి వేరువేరుగా చెప్పినది, కలిపియల్లినది.

ఇంటను, బయటను, దేశములోను, ప్రపంచములోను, గృహవిషయములందును, బాహ్యసంఘమునందును మానవవ్యక్తికి-స్త్రీకిగాని, పురుషునకుగాని ఉండవలసిన స్వేచ్ఛ, నిజమైనట్టి, స్వచ్ఛమైనట్టి స్వేచ్ఛయొక్క ఆవశ్యకతను మూలవిషయముగా గొని వ్రాయబడిన దీనవల.

ఈస్వాతంత్ర్య సంపాదనేచ్ఛతో లోకమున వ్యవహరించునపుడు వ్యక్తికి కలుగుకష్టనష్టములు, జయాపజయములును తెలియజేయు కథ యీనవలలోని వస్తువు.

దేశముయొక్క స్వాతంత్ర్య సంపాదనములో దౌర్జన్యము జబర్దస్తీపద్ధతులు అవలంబించుట ఎంతమాత్రము పనికిరాదనియు; స్వాతంత్రేచ్ఛ ప్రజలలో పూర్ణముగా కలుగజేసి, తను ధర్మమునుశాంతియుత మార్గముల స్వాతంత్ర్యము సంపాదింపవలెననియు నట్టిదే స్థాపితముగా నుండగలదనియు, సత్యధర్మములకు విరుద్ధమైగాని న్యాయపథమునుండి తొలగినదిగాని యైనట్టి మార్గమున సంపాదింపబడు స్వాతంత్ర్యము మన కక్కరలేదనియు నిందు కవి బోధించుచున్నాడు.

కేవలావేశపూరితులై, అత్యుత్సాహముతో బలవంతముగా ప్రజలను దేశభక్తిపూరితులను జేయుట, స్వదేశీదీక్షితులనుజేయుట, యీకవికి అయిష్టములగు విషయములు. కేవల మొక దేశమునకేగాక యావత్ప్రపంచమునకు కావలసిన స్వేచ్ఛాస్వాతంత్ర్యములకై మానవజాతి పాటుపడవలెననియు నీకథవలన సూచిత మగుచున్నది.

కథ యతి మనోహరమై, యింపుగా నున్నది. పాత్రములయందు మంచి భావదీప్తిని కలుగజేయగలదు. చక్కని ఉన్నతమైన భావములకు సముద్రముగదా రవీంద్రుని రచన!

భాషాంతరీకరణము అతి సరళముగాను, స్వేచ్ఛగాను, సహజముగ నున్నది. చక్కని యింపైన వాడుక భాష యుపయోగింపబడినది. ఠాగూరిగారి భావముల కేమాత్రమును నష్టము కలిగియుండలేదనియే చెప్పవచ్చును.

ఇది విశ్వభారతీగ్రంథమాల యేజన్సీ 323 తిరువత్తూరుహైరోడ్, తండియార్ పేట, మద్రాస్‌వారిచే ప్రచురింపబడినది. ఇందు ఠాగూర్ గారి పట మొకటి ముందు చేర్చబడియున్నది. క్రౌన్ 16 సైజు; 426 పుటలు మంచి కాగితముపై చక్కని యచ్చు; మంచి బైండు. వెల 3-0-0. జ. బ్ర.

## 'పోష్టాఫీసు'

ఇది రవీంద్రకవీంద్రుని నాటకమునకు కారుమూరి నైకుంఠరావుగారి యాంధ్రీకరణము.

ఇందు ప్రధానపాత్ర మొకబాలుడు. అతడు మనుష్యుడు ప్రయోగించుశిక్షలు, కట్టుబాట్లవల్ల లోపున నున్న జీవనావేగము పూర్తిగా చల్లారనివాడు. జిజ్ఞాసు హృదయుడు, అనురాగపూర్ణుడు. అతని చిన్నతనపు అకల్మషపుచేష్టలు, కోరికలు, భావములవలన అట్టివాని నభివృద్ధిపొందించుకొనిన, మనుష్యుని జీవనపూర్ణవికాస మెట్లుండగలదో కవి చూపించుచున్నాడు. కథ అతి సులువైనదిగాను, సాధారణమైనదిగాను కన్పడుచున్నను ఇందలి భావములు కడునుత్తమమైనవి.

మనుష్యజీవనము ఆవేదనవలన, ముక్తజీవనపథగామిగా యెట్లగుటకు యత్నించునో కవి యందు తెలియ బరచుచున్నాడు.

బాలుని ముద్దులొల్కు పదములు యింపుగొలుపుచుండును. భాష సరళమై, ఆనందము నొడగూర్చుచున్నది.

ఇందు కథాసందర్భమగు నొకపటమున్నది. క్రౌన్ 16 సైజు; 84 పుటలు. వెల 0-10-0. విశ్వభారతీ గ్రంథమాల యేజన్సీ 323 తిరువత్తూరు హైరోడ్, తండియార్పేట, మద్రాసు.

—జ. బ్ర.

## 'స్తిల్‌మాండ్ మేజస్ట్రేట్'

ఇది బెల్జియమ్‌దేశపు కవి, మారిస్ మేటర్‌లింక్ ఫ్రెంచిభాషలో వ్రాసిన 'బర్గోమా స్తెరిద స్తిల్‌మాంద్' అనేనాటకానికి తెలుగు. ఈకవి 1911 సంవత్సరంలో నాటకరచనకు నోబెల్ ప్రైజ్ అనే బహుమానము పొందినవాడు.

ప్రకాశకుడు: కారుమూరి వైకుంఠరావుగారు.

ఇందలికథ: బెల్జియమ్ దేశముపైకి జర్మనులు ఆక్రమించుకొనుటకు వచ్చి, యుద్ధముచేయుటకు, దేశపు గ్రామములను లోబరుచుకొనుటకు, పన్నిన యొక యధర్మపు పన్నాగము. విశ్వాసపాత్రుడును, అమాయకుడును, సత్యవంతుడు నగు నొకతోటమాలి, తమ జర్మను సేనలోని యొక యుద్యోగిని చంపెనను నొకయబద్ధపు నేరము పెట్టి యతనికి మరణశిక్ష విధింపవచ్చిన జర్మన్ మేజర్ లెఫ్టినెంటుల దౌర్జన్యమును సహింపనేరక, ఆతోటమాలి యజమానుడు, నేరముచేసినది తననౌకరు కాదన్నందుకును, అతనికి ఘోరశిక్ష విధించుటకును నిరసించినందుకు నాతనికి పెద్దమొత్తము జరిమానాగను, దేశము నాక్రమించుకొన్నందుకు తమకు చెల్లించవలసినపన్ను కొంతమొత్తమును, తోటమాలికి ప్రాణదానము చేయవలసిన యెడ నతనిబదులు ఆతోటయధికారి (ఒక మేజస్ట్రేటు) నే దండనకు పాలొనర్చుటయు. ఈమేజస్ట్రేటుకు స్వయం అల్లుడైన యొకజర్మనుడుకూడ నాసైన్యములో ముఖ్యోద్యోగిగా నుండియు, అతడును యీదౌర్జన్యమునందును అధర్మమునందును తోడ్పడి మామగారి కేవిధముగను తోడ్పడక పోవుటయేగాక మామగారినికూడ నధర్మమునకు మెడలు వంచ ప్రయత్నించును. మామగారు, మేజస్ట్రేటు ధర్మపరుడు, న్యాయమూర్తి. అతడు అమాయకుడగు తననౌకరు ప్రాణముకొఱకు తనప్రాణము నర్పించును. అతనితో బాటతని కొడుకును కూతురును కూడ నీయధర్మమునకు తమ నిరసనము తెల్పుచు నాతనితో పాటు ప్రాణములర్పింప సిద్ధమగుదురు.

ఈకథయందు స్వార్థపరుల విచక్షణలేని యన్యాయప్రవర్తనలును; స్వార్థరహితుల, ధర్మకాంక్షాపరుల న్యాయైకవర్తనయు, పరోపకారనిరతియు చక్కగా చూపింపబడినవి.

వాడుకభాషలో సుబోధకముగా వ్రాయబడినది. కథలో విశేషము లేకపోయినను భావము లుత్తమమైనవి. 147 పుటలు. పుస్తకము మొదట మేటర్‌లింక్ కవి ఫోటోగ్రాఫ్ పటమొకటి చేర్చబడియున్నది. వెల రు 1-0-0. విశ్వభారతీ ఏజన్సీ, 323 తిరువత్తూరు హైరోడ్డు, తండియార్పేట, మద్రాస్.

—జ. బ్ర.

## 'స్వాతంత్ర్యలక్షణము'

ఇది సుప్రసిద్ధ ఐరిషుస్వాతంత్ర్యవాదియగు టెరెన్సుమేక్స్వినీగారి 'ప్రిన్సిపిల్స్ ఆఫ్ ఫ్రీడమ్' అను ఆంగ్ల గ్రంథమునకు శ్రీవోగేటి వేంకటసుబ్బయ్యశాస్త్రి బి.ఏ., గారి యనువాదము. మెక్స్వినీగారు స్వాతంత్ర్యసమరమున తన ప్రాణముల నర్పించిన సంగతి మన మెన్నటికిని మరువజాలనిది. ఐరిషుదేశస్వాతంత్ర్యాందోళన దౌర్జన్యసహితమై యుండినను, స్వాతంత్ర్యేచ్ఛ యడుగున నుండు నుద్దేశములు భారతదేశస్థులవానితో నేకీభావమును పొందియే యున్నవి. ఉత్కృష్టధర్మావలంబనచేగాక ఆశ్చర్యకరమగు త్యాగము సాధ్యముకాదని యిందు ధృవమగుచున్నది!

శాంతియుతమైనట్టియు, ధర్మసంయుతమైనట్టియు నన్నివిధముల మార్గములచేతను దేశస్వారాజ్యమును సంపాదింప బూనుకొన్న భారతీయులకు గాంధీమహాత్ముడు బోధించు ధర్మసూత్రము లీగ్రంథమందును గాననగును. స్వాతంత్ర్యముయొక్క ముఖ్యావశ్యకతను, నిజమైన స్వాతంత్ర్యస్వరూపమును, నిందు మెక్స్వినీగారతిస్పష్టముగ విశదీకరించిరి. మెక్స్వినీగారి యీయుత్తమగ్రంథము దేశస్వాతంత్ర్యాభిలాషు లెల్లరకు నుపయోగకరముగ నుండగలదు.

ఇందు స్వాతంత్ర్యతత్త్వము; ఆంగ్లేయసామ్రాజ్యమునుండి విడిపోవుట; ధర్మబలము; మిత్రులు-శత్రువులు; బలము-దానిరహస్యము; కర్మయోగము; భక్తి; వీరపత్ని; పొలిమేర; సారస్వతము-స్వాతంత్ర్యము, మతము; మానసికస్వాతంత్ర్యము; సైనికవ్యవస్థ; సామ్రాజ్యము; యుద్ధము-ఆక్షేపణలు; మొదలగు విషయములుచర్చింపబడినవి.

'మనకు స్వాతంత్ర్యము ఆడంబరమునకై గాని, యిరుగుపొరుగు రాజ్యములవలె పరాక్రమవంతుల మగుటకుగాని, మనస్థితి బాగడుకొనుటకుగాని కాదు. ఇంత కన్న గొప్పకారణములు మనలను పురికొల్పుచున్నవి. అవి యాధ్యాత్మికములు. స్వాతంత్ర్యమునకై మన యంతరాత్మలు పరితపించుచున్నవి. ఆత్మస్వాతంత్ర్యమునకై ప్రయత్నించని వ్యక్తిగాని, జాతిగాని కలుగబోదు' అని మెక్స్వినీగారు వ్రాసినది పుస్తకప్రవేశమునందు ముద్రింపబడియున్నది. టెరెన్సు మెక్స్వినీగారి ఛాయాచిత్రమొకటి గూడ నిందు దొలుత చేర్పబడియున్నది.

అనువాదము సులభశైలిలో నున్నది. ఈగ్రంథము ప్రతియాంధ్రుడును చదువదగినది.

సైజు క్రౌను 16. పుటలు 248. వెల 1 మాత్రమే. వలయువారు:—వోగోటి వెంకటసుబ్బయ్య శాస్త్రిగారు, బి. ఏ., సహాయసంపాదకులు, ఆంధ్రపత్రికా కార్యాలయము, మద్రాసు అని వ్రాయవలయును.

## 'శ్రీ తులసీరామాయణము'

మహాభక్తుడును, కవియు, విరాగియునై యుండిన గోస్వామి తులసీదాస కృత హిందీపద్యరామాయణమును మాతృకగా గొని తెనుగున రచియింపబడిన నిర్వచనకావ్యమిది. ఇదివరకు బాలకాండమును, అయోధ్యాకాండమున ప్రథమభాగమును వచ్చినవి ఇది అయోధ్యాకాండమున రెండవభాగము, పాదుకా పట్టాభిషేకము. గ్రంథకర్త భాగవతుల నృసింహశర్మగారు హిందీరామాయణములోని భక్తిరసమును పూర్తిగా నిందు దెచ్చుటకు మిక్కిలి పాటుబడుట ప్రశంసార్హము. విఖ్యాతమగు రామునికథగల గ్రంథమునుగూర్చి చెప్పుట కేమున్నది? పద్యము లతిచక్కని పాకములోనుండి, హాయి నిచ్చుచున్నవి.

ఈగ్రంథము వేగుంజుక్క గ్రంథమాల—27-వ ప్రచురము. 121 పుటలుగలది. వెల రూపాయి. భాగవతుల నరసింహశర్మగారు, 'వేగుంజుక్క-గ్రంథమాల' పూడిపెద్దివారివీథి, బరంపురం (గంజాం) అని వ్రాసిన బడయగలరు. —జ. బ్ర.

## The Vizagapatam Medical College Magazine.

ఇది యర్ధసంవత్సరమున కొకసారి ప్రకటింపబడు పత్రిక. మొదటిసంపుటము, ప్రథమసంచిక ఫిబ్రవరిలో ప్రకటింపబడినది మాకుచేరినది. ఇది విశాఖపట్నం వైద్యకళాశాలవిద్యార్థిసంఘమువారిచే స్థాపింపబడినది. ఈశ్వర మార్తాండశాస్త్రిగారు సంపాదకులు. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ఉపాధ్యక్షులగు రామలింగారెడ్డిగారి తొలిపలుకుతో నారంభమయి ఉన్నతవైద్యవిద్య యభ్యసించుచున్నవారు, ఉత్తీర్ణులైనవారు, వ్రాసిన యనేకవ్యాసములు వైద్యముగూర్చియు, శస్త్రచికిత్సను గూర్చియు నున్నవి. వైద్యసంబంధమగు వార్తలు, విశేషములు, సంపాదకీయవ్యాఖ్యావళి, వైద్యవిద్యాలయ విషయములు, వ్యాయామవిద్యాసంఘవిశేషములు మొదలగునవి గలవు. డాక్టర్ సర్ పి. సి. రే గారు వారివిద్యాలయమున ప్రాచీన హిందూరసాయనశాస్త్రము-వైద్యమును గూర్చి యొసంగిన యుపన్యాసపురిపోర్టు నిందు జేర్చబడినది. 'వినోదములు' ఒకపుట చేర్పబడియున్నది. 'పొగాకు దురలవాటు'నుగూర్చి ప్రొఫెసరుడిక్సనుగారొసంగిన యుపన్యాససార మిందు పొందుపరుపబడినది. 'భారతి'యందు గతసంచికలో ప్రకటింపబడిన 'పొగాకు వలని దోషములు' దీనిలోనిదే. వైద్యమందు ప్రవేశములేని యితరులందరును కూడ చదువదగునది. 'The Confusing factor' అను మార్తాండశాస్త్రిగారి వ్యాసము ఆలోచనను పురికొల్పునట్టిది.

ఇందు మద్రాసు గవర్నరు, సర్ పి. సి. రేగారు మొదలగువారిచిత్రములు కొన్నియు నున్నవి. మొత్తము

క్రౌను ¼ సైజు 115 పుటలుగలది. విద్యార్థులకు చందా సం॥ రు 2-0-0. —జ. బ్ర.

## కృతజ్ఞత అను కిళాంబి రామానుజాచార్య నిర్యాణతారావళి

గ్రంథకర్త శ్రీయుత భోగరాజు నారాయణ మూర్తిగారు. ధారాళమైన శైలిలో తమ యాచార్యుని యందు గలభక్తి, శ్రద్ధలు పద్యరూపమున వెలిబుచ్చిరి. తమ యభివృద్ధికి హేతుభూతుఁడైన పండితోత్తముని నిర్యాణముచే కలిగిన హృదయావేదనము స్పష్టముగ వెలి పుచ్చిరి. దీనివెల 0-1-0. విజయనగర గంధర్వమహల్ వారిచే ప్రచురితము. —కో. నా.

## పుష్పాంజలి

గ్రంథకర్త: చేబ్రోలు సూరన్నగారు. అంజలీ గ్రంథపరంపర ౧ టవ ప్రచురణము. క్రౌను 16 సైజు 50 పుటలు. వెల 0-8-0

ఈఖండకావ్యముల సంపుటము తేలికగను హృద్య ముగను నుండు గీతములచే వెలయుచున్నది. పూర్ణముగ ఛందోబద్ధమగు కవిత్వము కాకపోయినను పద్దెములు కర్ణపేయములుగ నున్నవి. విశేషభాగము భగవద్గుణాను వర్ణనము. భక్తిరసప్రధానము. ఇందు ఉపాసనాదికములు మృదుతరములు. రవీంద్రకవీంద్రుని "సత్యకాము"డనుకథ కనువాదము చక్కగ నున్నది. మొత్తమున నీగ్రంథము సరసము. —కో. నా.

## గీతాశ్రయము

శ్రీయుత ఇస్కుర్తి తిరుపతి రాయఁడుగారిచే రచియింపఁబడినది. క్రౌను 16 సైజున 25 పుటలగ్రంథ ము. ఇందలి గీతములు సులభశైలిని వ్రాయఁబడినవి. పాఠశాలలయందలి విద్యార్థులయుపయోగమునే గ్రంథ కర్తగా రాసించినను దైవచింతనమగుట, భక్తులకందఱ కును నుపయోగము. ఇది శతకసాంప్రదాయ మనుసరించి "అట్టి జగదేకమూర్తి నేనాశ్రయింతు"నను మకుటముతో పద్యములన్నియు గూర్పబడినవి. —కో. నా.

## గండికోట

శ్రీ బాలభారతీ గ్రంథనిలయమువారి యనుబంధ గ్రంథమాలయం దిది మొదటిది. కృతికర్త: శ్రీయుత జే. సుబ్బయ్యగారు. కడపజిల్లాలోని గండికోట పూర్వ వైభవమును స్మరించుచు వ్రాసిన గీతమాలిక. సరళమగు శైలిని చదువరుల మనమాకర్షించుచున్నది. ఈగ్రంథము కర్నూలు జిల్లాలోని చాగలమర్రి గ్రామమున పై గ్రంథ నిలయమువారికడ 0-4-0 లకు దొరకును. —కో. నా.

## విభవ సిద్ధాంతపంచాంగము

శ్రీయుత జవ్వాజి సుబ్బారాయగుప్త సిద్ధాంతి గారు గుణించినది. డెమ్మి 1/8 సైజు 68 పుటలు గలవు. జ్యౌతిషవిషయములు కొన్ని చేర్పబడినవి. వలయువారు వాసవీ గ్రంథనిలయము బేస్తవారపేట అని వ్రాయ వలెను. —కో. నా

## ఓంకారలింగశతకము

శ్రీయుత బళ్ల. వెంకన్నగారిచే రచియింపబడిన శతకము. భగవంతుని విషయమగు పద్యములు బాగుగనే యున్నవి. దీనివెల 0-2-0. వలయువారు బళ్ల వెంకన్న అండ్ సన్ బుక్కుసెల్లర్ కాకినాడ అని వ్రాయవలెను. —కో. నా.

## నళిని

ఇది గంధర్వగ్రంథమాలయందలి ప్రథమసారిక. గ్రంథకర్తలు శ్రీయుత వేంకట కాళిదాసకవులు. ప్రేమ యొక్క బలీయతను చూపుచు ప్రకృతివర్ణనలతో నల రారుచున్న యొక్కచిన్నకథ. శైలి మృదువుగ నున్నది. గ్రంథకర్తలు చక్కగ కథను నిర్వహించి పాఠకుల కానందము కలిగించినారు. దీనివెల 0-8-0. చందాదారు లకు 0-4-0. —కో. నా.

## ప్రేమజాబులు (మొదటిభాగము)

గ్రంథకర్త శ్రీయుత అయినాపురపు సుందర రామయ్యగారు. డెమ్మిసైజు 100 పుటల గ్రంథము. వెల

0-12-0. దీనిలో భార్యాభర్తలు వ్రాసికొను లేఖలు మెండుగ నున్నవి. కొన్ని ప్రశ్నపద్యములుకూడ గలవు. లేఖలన్నియు పద్యరూపముననే యున్నవి. ఎవరియందెవరి కేవిధమగు ప్రేమకలుగవలెనో యది కలిగింపఁజేయుట కియ్యది వ్రాసినట్లు గ్రంథకర్తగారు వ్రాసి యుండిరి. కాని యాయుద్దేశ్యము పద్యరూపమున నున్న జాబులకంటె వచనరూపముననున్న సర్వసామాన్యముగ నర్థమగుటచే నెక్కువగ సఫలమయ్యెడిదేమో. ఎటులైనను పద్యములుకూడ మిక్కిలి సులభశైలిలో వ్రాయఁబడియుండుటచే వచనమువలెనే యర్థము కావచ్చును. గ్రంథకర్త ప్రయత్నము ప్రశంసనీయము. —కో. నా.

## నిర్మలానందము

గ్రంథకర్త, శ్రీయుత బులుసు. వెంకటరమణయ్యగారు. డెమ్మిసైజున 63 పుటల నాటకము. వెల 0-8-0. ఈగ్రంథమున కైవల్యము కేవలము యత్యాశ్రమమువలననే గాక గృహస్థాశ్రమమువలనఁ గూడఁ గలుగవచ్చుననియు, నిశ్చలధ్యానమే ముక్తిమార్గమనియు బోధించునటుల కథ కల్పింపఁబడినది. ప్రదర్శనమునకంటె పఠనమున కిది మిగుల నుపయోగకారి యని తలఁచెదను. కపటయోగుల మాయానటనము, ఉత్తమసతీధర్మములు లెస్సగ చిత్రింపబడినవి. ప్రస్తుతము విద్యార్థియగు నీయువకుని కవిత్వము, భావాభివృద్ధి సూచకముగ నున్నది. —కో. నా.

---

# పంచరత్నములు

దేవరకొండ జగన్నాథరావు గారు, యం. ఏ.

ఆఁడువేషంబు గైకొని యాడు నటుఁడు-పురుషుఁ డగుఁగాని యాఁడుదై పరగు టెట్లు
కచ కుచాదులు దొలఁగించి కాంచునంతఁ-బురుషరూపంబు నిక్కమై పొలుచు నచట.

అట్లె జగదాకృతిని దోఁచు నాత్మ యెప్పు-డాత్మయే కాని యన్యమై యమర దెందు
కడఁగి నామరూపంబులు గడకుఁ ద్రోచి-కాంచ నంతయు నాత్మయై కానఁబడును.

కఱ్ఱయేనుఁగు రంగులఁ గ్రాలుచున్న-దారువే కాని యేనుఁగై తనర దెందు
బాలు రదిచూచి గజమని భ్రాంతిఁగొన్న-పెద్దవారికి దారువై వెలయు నదియె.

కల్లజగ మిది సత్యమై కానుపింపఁ-గల్లయగుఁగాని సత్యంబు గాకయుండు
మూఢజనములు నిజమని మోహమంద-ఘన వివేకులు మిథ్యగాఁ గాంతు రెపుడు.

తాను దేహాదిక మటంచుఁ దలఁచునతఁడు-మూఢుఁ డగువాని కెన్నఁడు ముక్తిలేదు.
సచ్చిదానంద రూపంబు జ్ఞాని యెపుడు-తానుగా నెంచి ముక్తుఁడై తనరుచుండు.

---

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No.7, Thumbu Chetty Street, G.T, Madras.

# విషయానుక్రమణిక

---

# చిత్రములు

త్రివర్ణచిత్రములు:—శ్రీ వేణుగోపాలుడు; విరహిణి రాధ;

ఏకవర్ణచిత్రములు:—బర్మా వెండిపని చిత్రములు ౮; ఆకస్మికఛాయాచిత్రములు ౫; ఇతరచిత్రములును.

---




చెన్నపట్టణము, జూన్ ౧౯౨౮

సంపుటము ౫ విభవ సంవత్సరము జ్యేష్ఠమాసము సంఖ్య ౬

# దీపారాధన

శ్రీ శివశంకరశాస్త్రి గారు

(కుంభమీరు దుర్గమున. ఆత్మగతము)

ఝాలా రాజకుమారి

ఇటు సంఘటిల్లు నని యెంచగనైతి, నే డీ
కుటిలాత్మకుండునను కోటకు జేర్చెన య్యో
ఇటనుండి ముక్తి లభియించుట యెట్లొ! నన్నో
నిటలాక్ష, వేగ కరుణింపు మనాథనాథా.

పరు లేవిధంబునను పాదము పెట్టలేరీ
ధరణీధరాగ్రరచితం బగు దుర్గ రేఖాం
తరసీమ! నా కిపుడు దారిని జూపగా నో
గిరిపుత్రికారమణ, కేవల మీవె దేవా.

హృదయేశు గూడి సుఖియించెదనంచు లోలో
ముద మొందుచుండ కనుమూసెడునంతలో నీ
యదయుండు మాకునకటా, యెడబాటుగూర్చెం
దుద కేమి కాగలదొ తోచుట లేదు దేవా.

భయ మెత్తుచున్నది నృపాలుని మూహయేమో
వయ సెంతయో చనినవానికి కాంత యేలా
నయవృత్తి బోవిడిచి నన్నొకవేళ కేళీ
ప్రియుడై విలాసినిగ బెగ్గిలజేయు నేమో.

5. 6- 1 ౮33

పరిణీత గాననెడి భావముతోడ దన్నుఁ
వరియింపు మంచు బలవంతము చేయునేమో
ధరణీధవుం, డకట ధైర్యము జారిపోయెఁ
తరుణీవిలాపమున ధార్ష్ట్యము తగ్గునేమో.

అనుకంప లేక యిత డారడి పెట్టుచో నే
తనువుం దొరంగుటయె ధర్మముకాని నాథుం
డనయంబు నాకయి మహావ్యథ చెందునయ్యో
వనితాత్వ మెందులకు వచ్చెను నాకు దేవా.

సదయుండె కాని మెడ ఝ్మాపతి కుంభరాణా
కెదు శేరి రాకొమరు లీభువి నన్ను బ్రోవఁ
హృదయేశ, యెట్లయిన నే నిరతంబు యుష్మ
త్పదపంకజ ద్వయమె భక్తిని సంస్మరింతుఁ.

కుంభరాణా (ప్రవేశించి)

ఆలీసమూహావృతమై మధుపానగోష్ఠిఁ
కేళీమనోహర నికేతనసీమ సంతో
షాలాపముల్ సలుప కన్యమనస్కవై యి
ట్లేలా మఱియ నయనేందిర వర్తిలంగఁ.

గాసిల్లు నీ మృదులగాత్రము లేవనేలా
నీ సన్నిధానమున నిల్చినవాడు యుష్మ
ద్దాసుండు గాని వసుధారమణుండు కా డో
వాసంతికాకుసుమవల్లరి సన్నిభాంగీ.

చేసన్న కన్గొనుచు శీఘ్రమె నీ యనుజ్ఞల్
దాసీజనంబు తలదాల్చునె సౌఖ్యమే నా
ప్రాసాదమందు తెలుపం గదు వేడుచుంటి
న్నీ సంశయం బుడిగి నిక్కము రాజపుత్రీ.

నీవాజ్ఞ యిచ్చునెడ నిష్ఠురకార్య మైనఁ
మేవాడభూపతి నిమేషమునం ద్వదీయ
సేవాపరత్వమున జేయును సుమ్ము దేవీ,
వేవేగ తెల్పగదవే భవదాశయంబుఁ.

వ్రీడాభరంబునను విహ్వలచిత్త వైతో
వీ డింత సేపటికి విస్మృతి దక్క నన్నుం
జూడంగ వచ్చె విరసుం డని యెంచినావో
నే డాయవచ్చితిని నిర్భర మైన ప్రేమఁ.

న న్నన్యగా దలప న్యాయముకాదు బాలా
మన్నింపగా దగును మానిని జాగుచేతఁ
ఎన్నండు కౌగిట ధరింతును నిన్నటంచు
నున్నాడ నేను కడు నుత్సుకతఁ లతాంగీ.

ఎలా ముఖంబు పయి కెత్తక యేక నిష్ఠ
న్నేలం గనుంగొనెదు నీరజపత్రనేత్రా,
చాలుఁ త్యజించి యిక సంశయబుద్ధి బాలా,
ఆలోకనంబున కృతార్థుని జేయ వేలా.

ని న్నెంత వేడినను నిర్దయురాల నన్నుఁ
మన్నింప నేమిటికి మౌనము వీడి, పోనీ
క న్నెత్తి ఒక్కత్రుటికాలముగాని చూడ
కున్నావు సిగ్గొ భయమో మరి విభ్రమంబో.

లంబాలకా, యిపుడు లజ్జ దొరంగవేని
సంబాధితం బగును సాంద్రభుజోపగూహ
నంబందు భూరి కఠినంబుగ నీ యురంబు
బింబాధరంబు పరిపీడితమౌను సుమ్మీ.

రాజకుమారి

తగునే యిటుల్ పలుక ధార్మికు లయ్యు దేవా
జగమందు ధర్మము ప్రచారము చేయువారే
మగువం గనుంగొనిన మాత్రమునఁ స్వకీయ
మగు నిగ్రహంబు విడనాడుట వింతకాదా?

కుంభరాణా

తాపమ్ము వాసెను సుధామధురమ్ము లైన
నీపల్కు నీచెవుల నిల్వగ మంజువాణీ,
ఆపాదమస్తపులకావృత దేహ మోహో
చూపట్టు కుట్మలితశోభి కదంబమట్టుల్.
నా కేమి వింతయు కనంబడలేదు సుమ్మీ
లోకైకసుందరి త్రిలోచనుడైన నిన్నా
లోకించుపక్షమున లోల మనస్కుడౌను
వే కౌగిలీయగదవే స్తనభారనమ్రా.

రాజకుమారి

అకటా కటూక్తు లిటు లాడగజెల్లునే కా-
ముకులట్లు పెద్ద లతి మోహముతోడ మీరల్
సకలావనీరమణ చక్రమహాధిపుల్ సే
వకురాలితో సరసవాక్కులు యుక్తమౌనే.

కుంభరాణా

నీ విట్టు లెంచదగునే హృదయేశ్వరీ, నీ
సేవాపరాయణుడ సేవ్యుడగాను దేవీ
నావాక్కు లీయెడనె నమ్మి ప్రసన్నురాలు
కావేని నీచరణకంజము లంటువాడన్.

రాజకుమారి

వల దిట్టిమాట ప్రభువర్య, రవంతయు న్నా
పలు కాలకింపరు కృపానిధు లయ్యు నయ్యో
తలిదండ్రులం గొలుచుదానిని మీరు దేవా,
బలిమిన్ హరించితిరి భావ్యమె యిట్టిచేష్టల్.

కుంభరాణా

ఆర్యోక్తి తత్పరులమై నిరతంబు వీర
మర్యాదలం దరచు మమ్ముల దూర నౌనే
శౌర్యోన్నతుల్ మిగుల శ్లాఘన చేయునట్టి
కార్యంబె చేసితిమి కాదు మరొండు ముగ్ధా.
దోషం బటంచు నను దూరగవచ్చు నన్య
యోషన్ హరించునెడ యోగ్యులుకాని కన్యా
భూషామణీ, యిపుడు భోగ్యవె నీవు మాతో
భాషింపలేవు నయపద్ధతి సూక్ష్మబుద్ధిన్.

రాజకుమారి

అసమానశూరులు మహాకవులున్ విపశ్చి
ద్రసికాగ్రణుల్ వయసు దాటినవారు దేవా,
అసమంజసం బనక ఆశ వహింపనేలా
కసుగందనట్టి యొకకన్య మిమున్ వరింపన్.

కుంభరాణా

ఆహా లతాంగి పరిహాసము చాలు; అస్మ
ద్దేహంబునన్ వళులు దేరవు; కేశరాశి
కే హానియుం గలుగ; దేమి కొరంత లేదే
బాహాబలంబునను, ప్రాయము పోయె నొక్కో.
నీమీద నోతరుణి నిర్భర నిష్కలంక
ప్రేమంబుచేత నిను పెండిలియాడు కోర్కి
నామానసంబున ఘనంబుగ నిల్చెగాన
భామా, ఒసంగు భుజబంధనసమ్మదంబున్.

రాజకుమారి

బహుపూజ్యురా లయిన పట్టపుదేవి యుండన్
మహివల్లభా, యితరమానిని నామె యెట్టుల్
సహియించు? దేవర విచారణ చేసినారా
బహుభార్య లుండునెడ బాటిలుబాధ లెల్లన్.

కుంభ రాణా

ఆ సంశయంబు విడనాడుము రాజపుత్రీ,
కాసంత యేనియును గౌరవహాని నీకుం
బ్రాసాదమం దెపుడు బాటిల దింత యేలా
నాసార్వభౌమపదనాయకురాల వీవే.

రాజకుమారి

అరయంగ నే తగుదునా తమదండ నుండన్
కరుణార్ద్రమానసులు గావున దేవ, నన్నుం
రితంబుగా జనకధామము జేర్ప యుష్మ
రాంబుజంబులకు సాగిలి మ్రొక్కుదానన్.

కుంభ రాణా

సమత్పరిథిత దోర్బల నిర్జితంబౌ
హాస్థలికి చయ్యన రాణి జేతున్
నీచరణసన్నిధి నుంతు, ఇంకన్
గర్వంబు వీడి నను కామిని, యేలుకొమ్మా.

రాజకుమారి

నరనాయకా, వలదు నా కివి యేవి మిమ్మున్
వరియింపజాల—అవివాహితవృత్తి నుండన్
త్వరితంబుగా జనకధామము జేర్ప యుష్మ
చ్చరణాంబుజంబులకు సాగిలి మ్రొక్కుదానన్.

కుంభ రాణా

ఆలోచనా రహిత మర్థవిహీనమౌ నీ
యాలాపధోరణికి అచ్చెరువొందుచుంటిన్
బాలా, పదింబదిగ బల్కగనేల నిన్నున్
వైళంబ యిమ్మెడ వివాహము చేసికొందున్.

రాజకుమారి

ఉభయాభినిష్ఠమయి యున్న దె ప్రేమ, మీరల్
విభవాభిరాములును వీరవతంసు లయ్యున్
ప్రభువర్య, దీనయగు బాలను వేచ నౌనే
అభయం బొసంగి సదయంబుగ బంపు డింకన్.

కుంభ రాణా

ఏ హేతువో తెలియ దింత విరక్తికిన్ నే
నూహింపలేక వెత నొందుచు నున్నవాడన్.

రాజకుమారి

తెలియంగలేరె జయదేవుని కావ్యగీతి
కలకున్ మనోజ్ఞ "రసికప్రియ" నామవృత్తిన్
వెలయించినట్టి బహువిశ్రుతభావుకుల్ నా
తలపోత? మీకు విశదంబుగ దెల్పనేలా.

కుంభ రాణా

ఊహింపజాలను గుణోన్నతచిత్త, నీపై
మోహాతిరేకమున ముగ్ధుడ నౌటచేతన్.

రాజకుమారి

ఎదిరించుచుంటి నని యెంచగబోకుడీ నా
హృదయంబు వేరొకరి కిచ్చితి మున్నె దేవా.

కుంభ రాణా

పెక్కుల్ వచించితిని ప్రేమను నీమతంబున్
నిక్కంబుగా నెరుగనేరక రాజపుత్రీ.

రాజకుమారి

విదితంబు చేసితిని వ్రీడ దొరంగి యస్మత్
హృదయంబు పంపవలె నింతట నన్ను దేవా.

కుంభ రాణా

చిక్కు_య్యె ఇక్క_డకు జేర్చితి నిన్ను నాకై
ఇక్కా_ర్యమున్ సలుప హీనత నాకు బాలా,
నీకేమియుం గలుగనేరదు నమ్మి లోపం
బోకన్యకా, యిచట నుండు సుఖంబుతోడన్
ఏకారణం బయిన నేర్పడి బుద్ధిమారన్
చేకొమ్ము నన్ను సరసీజదళాయతాక్షీ.

[నిష్క్రమణము]

రాజకుమారి

భయ మెట్లొ తీరినది ప్రస్తుత "మేకలింగు"
దయచేత రాజాజ్ఞవిధంబుగ యోగ్యుడైనన్
భయదంపు దుర్గమున బంధితనైతి నయ్యో
ప్రియుడెంత నాకొరకు బెగ్గిలుచున్నవాడో.

శుకమట్లు పంజరము జొచ్చితి ప్రాణనాథా,
ఇక నెంత కాలమున కీచెరవీడి నే మీ
నికటంబు చేరుదునో నెవ్వగ బ్రహ్మదేవుం
డకటా దయారహితుడై లిఖియించెనేమో.

అనిశంబు నాదు హృదయాలయమందు నాథా
అనురాగదీపశిఖ ఆరక ప్రజ్వరిల్లున్.

కనుగొంచు నాయెడద కాంతు డెరుంగునట్టుల్
వెనుదీప మగ్రమున పెట్టుదు రాత్రివేళన్.

మదిలో నిరంతరము "మందురుదుర్గపాలు"
పదపద్మముల్ నిలిపి భక్తిని పూజచేతున్
బ్రదికించుకొండు తమభార్యనటంచు తెల్పం
గదె దీపికా, హృదయకాంతున కెట్టులైనన్.

---

## దుఃఖ ధోరణి

అడవి శంకరరావు గారు

దుఃఖ సంకీర్ణ కష్టంపు ధోరణులను - 'స్వప్నమాత్రమె జీవిత వైభవ మ'ని
చెప్ప వత్తువు, భవదీయ చిత్త వృత్తి - నే ప్రపంచ మానముగా గుణించు కొనుచు !
సరస సౌభాగ్య కల్యాణ సౌఖ్య గీతు - లాలపింపంగ ననువైన యౌవనమును
నిరతమును శోకరాగాలనే నదింప - మేళవించెదేల సజీవ మృతిని గోరి ?

శాంతవహా నుషఃకాల' పూజాంతమందు-మిహిరు మొగసాల గుమికూడి మేల్కొలుపులఁ
బాడు పక్షుల మంగళధ్వనులు, కాఁకు - చీఁకటుల రాక నెట్లు సూచించు చెపుమ ?

సౌధశ్రేణీ సురక్షిత సౌఖ్య మత్త - కుందములఁ జూచి కేకిసల్ గొట్టినవ్వ
గడ్డిపువ్వుల సయ్యాట గానరవము - క్షుద్ర మానవ హృదయ సంక్షోభ మణఁచు.

హృదయమను సానమీఁద సర్వేశ్వరుండు-దుఃఖమను చెక్క_నొక్కి_ యత్యుత్సుకతను
ద్రిప్ప కొలఁది, సుగంధమే తేల్చి, సాన - యరిగి పోకుండఁ బట్టిన యతఁడె ఘనుఁడు.

'నేఁడు, తేప'ను మెట్లపై నిత్య కృషిని - జీవితాదర్శ శిఖరముల్ చేరువారిఁ
గాంచి యైనను నీ పట్టు గట్టిపడదు ! - పతనమే నీవు వాంఛించి పాటుపడెదో ?

---

# హర్షనైషధము-శృంగారనైషధము

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

సంస్కృతమున నైషధశృంగారకావ్యప్రబంధము కవికులాద్యదృష్టాధ్వపాంథుం డొనరించినది. దాని నశేషమనీషిహృదయంగమంబుగా శబ్దం బనుసరించియు, నభిప్రాయంబు గుఱించియు, భావం బుపలక్షించియు, రసంబు పోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు, మాతృకానుసారంబున భాషానైషధకావ్యంబుగ మార్చినవాఁడు కవిసార్వభౌముఁడు. ఇట్లుద్ధతులైన మహాకవు లిరువురొక్క యితివృత్తమునం దమ వాణీవిలాసములం బ్రసరింపఁజేయునెడ నొక్కొక్కఁ డొక్కొక్కచో నొక్కొక్కని మించిపోవుచుండుట తటస్థింపక మానదు.

కావుననే యౌచిత్యం బాదరించెదనని ప్రతినవట్టినవాఁ డయ్యు శ్రీనాథుం డొక్కొక్కచో మాతృకలోని యౌచితిని దన తెనుఁగులోనికిఁ దీసికొనిరాలేక పోవుచున్నాఁడు. ఒక్కొకచో మాతృకలోని రసమును బోషింపలేకపోవుటయే కాదు, తద్రససిద్ధిని దా నందఁజాలక సుడివడుచున్నాఁడు.

కొన్నియెడలఁ దన చిన్నారి పొన్నారి నుడికారములలోఁ జేర్చి క్రొత్తభావములతోఁ గూర్చి నూతనౌచిత్యముల సమర్చి యసదృశరసప్రవాహములం దేల్చి మాతృకలోని వస్తువును నిస్తులముగ పావనించుచున్నాఁడు. ఇది, ప్రతిపద్యము విమర్శించి శ్రీనాథప్రతిజ్ఞ యను పేరున గ్రంథము వ్రాయఁదగి యున్నది. ప్రస్తుతము నా కన్గొనిన కొన్ని యంశములను సహృదయులకు ని వే ది ం చి గుణమున్న గ్రహింప వేఁడెద.

శ్రీహర్షుని యస్పృశ్యత

శ్లో. వాసఃపరం నేత్రపహం ననేత్రం
కిము? త్వమాలింగయ తన్మయాఽపి,
ఉరోనితంబోరు కురు ప్రసాద
మితీవ సా తత్పదయోః పపాత. ౭-౮

ఉ. నేత్రమనేను, జీరయును
నేత్రము; చీరకు నాశ్రయింపఁగాఁ
బాత్రతగల్గె నాకు నిటఁ
బాత్రత లేదని నామసామ్యమై
చిత్రికతెంబునన్ బలిమిఁ
జేకొనినట్టులు రాజుదృష్టి యా
క్షత్రియకన్యచారుకటి
చక్రము నూరుయుగంబు దాకొనెన్.
—౩-౧౫౭.

ఇట మాతృకానుసరణము లేదు. రసౌచిత్యాదులేవైన సంపాదింపఁ బడినవా? లేదు. చూపు పాదములమీఁదఁ బడుటకు హేతువు త్పేక్షింపఁబడుచున్నది కావున యాచకత్వసంభావనయే నలదృష్టికుచితము. 'ప్రసాదం

కురు' అనుట యాచ్ఞకు సంబంధించినది. ఆంధ్రీకర్త ప్రాభవమునే నలదృష్టి కీయఁదలఁచి పాద పతనమును దొలఁగినాఁడనిన "పాత్రతగల్గె. పాత్రత లేదు" అనుమాటలు ప్రతిగ్రహార్హతను దెల్పునవి. ప్రాభవమునకు సముచితములు కావు. క్షత్త్రియకన్య యగుటయు ముట్టడింపఁ బడుట కేకాక యాచ్యతకును మిగుల నను గుణమే.

"యాచ్ఞామోఘా వరమధిగుణే"

కాన యిప్పట్టున శ్రీహర్షుని పోకడయే మించి యున్నది.

శ్లో. అస్యాం వపుర్వ్యూహవిధానవిద్యాం
　　కిం ద్యోతయామాస నవాం స కామః,
ప్రత్యంగసంగస్ఫుటలబ్ధభూమా
　　లావణ్యసీమా యది మా ముపాస్తే.

—２-౧౨

క. వితత ప్రతిప్రతీకా
ద్భుత రూపవిలాస విభవభూషితయగు నీ
రతిబోటి తేటపఱుచుఁ
జతురానన హస్తశిల్ప చాతుర్యంబుల్.

—3-౧౫౭

ఈ తెలుఁగున మాతృక చాలమాఱినది. మాతృకలోని చమత్కారము రాలేదు. ఈ నిర్మాణమునకుఁగర్త మన్మథుఁడగుటయే సమంజసము. రతి బోటిమైన నేమి? ఎవరైన నేమి? లావణ్యసీమ యుపాసన చేయుచున్న దను నంశమును దొఱంగుట చే శ్లోకము లోని జీవకళ యెగిరిపోయినది. మూలమున సీమపదము సర్వోత్కృష్టలావణ్యమును గనఁ బఱచుచున్నది. ఉపాసకునియాత్మ యుపాస్యాధీన మయినట్లు లావణ్యసార మెల్ల దమయంతి కధీనమైయుండె ననుటాదిగ బహుముఖములఁ బ్రసరించు లక్షణామూలధ్వని ప్రపంచపరిష్కారము లేకున్నఁ గావ్యమెట్లగును?

శ్లో. తరఙ్గిణీ భూమిభృతః ప్రభూతా
　　జానామి శృఙ్గారరసస్య సేయమ్;
లావణ్యపూరోఽజని యౌవనేన
　　యస్యాం తథోచ్చైస్స్తనతా ఘనేన.

—２-౧౧.

తే. యౌవనాంభోధరోద్భూతహావభావ
వారిధారాఽభిపూర్ణశృంగారతటిని
యబ్జభవసృష్టివిద్యారహస్యభూమి
నిఖలలావణ్యసీమ యీనీరజాక్షి. 3-౧౫౫.

శబ్దార్థశ్లేషమయమైన యీ మాతృకకు దెనుఁగు సేఁతదుష్కరము. కవిసార్వభౌముఁడు యత్నించిన సాధ్యమయ్యెడిదేమో! భూమిభృత్పదము దొఱఁగి యబ్జభవసృష్టిని బెట్టుట మాతృకానుసరణలక్షణము గాదు. "ఉచ్చైస్స్తనతాఘనేన" అను నాయపుఁబట్టుల నుజ్జగింపవలసినప్పుడు భాషాంతరీకరణము మానుటే యుక్తమనుకొనువారు నుందురు.

శ్లో. ఆఘూర్ణితం పక్ష్మల మక్షిపద్మం
　　ప్రాంతద్యుతి శ్వైత్యజితామృతాంశు;
అస్యా ఇవాస్యా శ్చలదింద్రనీల
　　గోలామలశ్యామలతారతారమ్.

—２-౨౯.

క. చలదింద్రనీలగోళా
మలకోమలతారతారమండలములు ప
క్ష్మలములు ప్రాంశు శ్వేతం
బులు చపలములౌర! మెఱుఁగుఁబోఁడినయ
[నముల్. —3-౧౬౪.

నేత్రములకుఁ బద్మసామ్యమును భావించి పద్మములకు శత్రుజయమువలన గొప్ప చెప్పఁదగినట్లు కన్నులకును జంద్రజయమువలన గొప్ప చెప్పఁదగునని చమత్కరించి, కనుఁగొనల తెలుపును శ్రీహర్షకవి వర్ణించె. ప్రాంత ద్యుతిచేతనే జయించెనని యుపమేయము గొప్పను బలపఱిచెను. ఇదియెల్ల విడచి "ప్రాంశు శ్వేతద్యుతి" యనుపాఠ మాదరించి శ్రీనాథకవి తెచ్చినబాగు కన్పట్టదు.

శ్రీనాథుని స్వతంత్రత

శ్లో. అంతఃపురాంత స్సవిలోక్య బాలాం
కాంచి త్సమాలబ్ధు మసంవృతోరుమ్;
నిమీలితాక్షీగ పరయా భ్రమన్త్యా
సంఘట్ట మాసాద్య చమచ్చకార.
—౬-౧3

చ. ప్రిదిలినసీవిఁ జేల సవరించు త
లోదరి నోర్తుఁ గాంచి, లోఁ
గదిరినపాపభీతి బడిఁ
గన్నులుమోడ్చ నొకళ్లొకళ్లకై
యెదురుగవచ్చివచ్చి యొక
యిద్దఱుముద్దియ లొత్తి రవ్విభుఁ
మదగజరాజకుంభముల
మచ్చరికించు కుచద్వయంబులన్.
—3-౮౬

నలుగుపెట్టుకొనుటకుఁ జీరవిడిచిన స్త్రీ శ్రీహర్షునికి గోచరించినది. శృఙ్గారనైషధ కర్తకో వదలినపోకముడిని జేలసవరించుకొను విలాసిని గన్పట్టినది. నలుఁడు కనులుమూసికొనినప్పు డొకతె యచ్చటఁదిరుగుచు నతని నొరసికొనెనని శ్రీహర్షకవి భావించెను. శృఙ్గార నైషధకవి కాశృఙ్గారము చాలలేదు. ఇరువురు జవ్వను లెదురుగవచ్చుటంజేసి వారిద్దఱికుచ కుంభముల సంఘట్టనయను మహాసౌభాగ్యము నలునకు లభించినదని మురిసికొనుచున్నాఁడు. ఇం దాంధ్రీకర్త రసికత యభినందనపాత్రము కాదా ?

అంతఃపురే విస్తృతవాగురోఽపి
బాలావలీనాం వలితై ర్గుణౌఘైః;
న కాలసారం హరిణం తదక్షి
ద్వయం ప్రభు ర్బద్ధు మభూ న్మనోభూః.
—౬-౧౯

ఇరులు గెలిచిన యంతఃపురేందుముఖుల
కురులు మరుఁడను వేఁటకాఁ డురులు సేసి
మరులుగొలుపంగలేఁడయ్యె మనుజవిభుని
సరులులేని దృక్కంజనశాబకముల. 3-౯౦

ఇందు నలుని కన్దోయిని హరిణముగా శ్రీహర్ష మహాకవి భావించెను. శ్రీనాథమహాకవినలునిదృక్కులను కాటుకపిట్టలతోఁ బోల్చినాఁడు. దృక్కులకు హరిణసామ్యము కన్నఁ గాటుకపిట్టలపోలికయే మిగులఁదగునని తోఁచెడిని. ఇదిగాక సంస్కృతమున నారికేళపాకమున నున్న శ్లోకమును ద్రాక్షాపాకరమ్యముగఁ దెలుఁగు సేసినాఁడు కనిసార్వభౌముఁడు.

ఏతం నలం తం దమయన్తి! పశ్య
త్య జ్యార్తి మి త్యాలికులప్రబోధాత్;
శ్రుత్వా స నారీకరవర్తిసారీ
ముఖా త్స్వ మాశఙ్కిత యత్ర దృష్టమ్.
—౬-౬౦

ఉ. వీఁడె నలుండు విశ్వపృథి
వీవలయైకవిభుండు వచ్చుచు
న్నాఁ డని భీమభూమిపతి
నందన నూఁఅడిలంగఁబల్కు పూఁ
బోఁడులమాట నేర్చికొని
ప్రోది శుకాంగన యట్లుపల్కినన్
తేఁడిది నన్ను నేక్రియ నె
ఱంగెనొకో యని యెంచె నాత్మలోన్.
—3-౧౦౮

మూలములోని శారికను శుకాఙ్గనగా మార్చుటయే కాక శంకనుగూడ శృంగారకవి మార్చివేసినాఁడు. నన్నిది కనుగొనెనా? యేమి యని దేవరహస్యము చెడుటను గూర్చిన యూహ గలిగిన దన్నచో; దేవతల మహిమ యెడ నలునకు సంశయము న్నట్లగును. అది యమ్మహాపురుషున కుచితము కాదని యెంచి కాబోలు శ్రీనాథమహాకవి "నన్నిది యెట్లు తెలిసికొనెనో!" అనివిస్మయమందినట్లు నలునిఁ జూపుచున్నాఁడు. అమోఘమైన దేవతల వర మట్లుండ దీనికి నేనెట్లు కన్పట్టితినో యను విస్మయము నలుని పరిజ్ఞాతృత్వముతోడి యుల్లాసవిలాసములను దెలుపుచున్నది.

అంబాం ప్రణత్యోపనతా నతాఙ్గీ
నలేన భైమీ పథి యోగ మాస,
సభ్రాంతిభైమీషు న తాంవ్యవిక్త
సా తంచ నాదృశ్యతయా దదర్శ.
—౬-౫౮.

ఉ. ఎంతయు డాయనేగియు మ
హీశుఁ డెఱుంగఁగ నేరఁడయ్యె వి
భ్రాంతి విదర్భరాడ్దుహితృ
పఙ్క్తులలోన మృగాక్షినప్డు; డ
య్యింతి యెఱుంగదయ్యెదిగ
ధీశచతుష్టయదత్తశాంబరీ
ధ్వాంతనిగూఢుఁడైన వసు
ధాధవునిన్ నికటస్థలంబునన్ – 3-౧౧౦

ఇం దదృశ్యుఁ డనుమాటకు "దిగధీశ చతుష్టయ దత్తశాంబరీ ధ్వాంతనిగూఢుఁడు" అని పెంపుఁజేయుట "నలప్రణాళీమిళదంబుజాక్షీ సంవాద పీయూష పిపాసవః" అను సంస్కృతము నాంధ్రీకరించు పట్టునఁగల "నలనాళీకమృణాళనాళలతికానవ్యప్రణాళీమిళ, ల్లలనాలాపకథాసుధానుభవ లీలాలోల చేతస్కులై" అను రమణీయవిస్తరీకరణమును స్మరణమునకుఁ దెచ్చెడిని.

శ్లో. లిపి ర్న దైవీ సుపఠా భువీతి
తుభ్యం మయి ప్రేరితవాచకస్య,
ఇన్ద్రస్య దూత్యాం రచయ ప్రసాదం
విజ్ఞాపయన్త్యా మవధానదానైః.

ఇది దేవేంద్రుని దూతి యింద్రసందేశమును దమయంతికి విన్నవించు సందర్భము. దీని ప్రారంభ మిట్లుండుట శ్రీనాథున కిష్టముగా లేదు.

"సీ. అవధారు దేవి! దివ్యకిరీటకోటిసం
దానితవికచమందారదామ
సందోహమకరంద బిందుధారాధౌత
సందీప్తచరణారవిందుఁడైన
సంక్రందనుండు నాస్వామి నన్నాయింద్రు
గారాబునంచారిగా నెఱుంగు."

అని సందేశమునకు ముం దుపోద్ఘాతమును జిత్రించి పెద్దన్నచే గురూపదేశముగఁ గైకొనఁబడిన "ఓమిహికాంశువంశకలశోదధి కౌస్తుభరత్న! భూపతిగ్రామణి!" యను ప్రేయోగుణాస్పదమైన సంబోధనను దలఁపించుచున్నాఁడు. ఇదిగాక దేవతాలిపి యిక్కడివారికిఁ దెలియదు కాన నీ కింద్రుఁడు ప్రణయలేఖ్యమును బంపక నాచే సందేశ మంపెనని, కబు రంపుటకుఁ గారణముఁ జూపించుటచేఁ దృప్తిచెందక, దేవతాలిపి నీకుఁ దెలిసియుండిన నెన్ని ప్రణయలేఖ్యములు ముగ్ధమధురవైదగ్ధ్యసూచకములై నీకు వచ్చియుండునో! అని తనస్వామి యొక్క యౌత్సుక్యవైదగ్ధ్యములను జాటుచున్నది దూతి యని యాంధ్రనైషధకవి యెంత వింతగ సంతరించెనో చూడుడు.

ఉ. చంచలనేత్ర! దివ్యలిపి
సంతతిభూజనముల్ పఠింపలే
రంచును మానెఁగాని నఖ
రాగ్రమునన్ లిఖియించి నీకుఁ బు
త్తెంచుఁజుమీ మహేంద్రుఁడు
మదీయకరంబున దేవతావనీ
కాంచనకేతకీకుసుమ
గర్భదళంబునఁ గార్యపద్ధతుల్.
—3-౧౨౨.

ఇందుఁ వాసవుసి వరించినచో లభించెడి నందనవన రామణీయక సమృద్ధిని గూడఁ దటస్థోద్దీపన విభావసామగ్రిగా సూచించుచు దమయంతికిఁ దనస్వామిమీఁద ననురాగము గలిగింప నెంచుట దూతి కెంతయు సముచితము.

శ్లో. సతీవ్రతైః స్త్రీవ మిమం తు మంతు
మస్త్రర్వరం వ్రజిణో మార్జితాస్మి;
—౬-౧౧౦.

ఉ. స్వర్పతి చిత్తవృత్తి గలు
షత్వమునందునో యన్న భయంబు నా
కేర్పడలేదు విన్ముదివి
జేశ్వర దూతిక! సప్తతంతుభా
గార్పణ మాచరించి కర
మాదరణంబున నేను రాజకం
దర్పుఁడు నైషధాధిపుఁడు
దన్ను నుపాస్తియొనర్పఁ గల్గుటన్.
—3-౧౪3.

సతీవ్రతములచేత, వాసవునియెడ నే నిప్పు డొనరించు నపచారమును మాపుకొందు నని దమయంతి పలికెనని శ్రీహర్షకల్పన. సతీవ్రతములు భర్తసాహచర్య ముండినను లేకుండినను ఆచరింపఁదగినవి. అట్టి వ్రతములకన్నఁ దనరాజకందర్పునితోఁ గలసి మెలసి యుండి చేయు గృహస్థధర్మములే ప్రస్తుతసందర్భమున దమయంతి కెంతయు రుచించుచున్నవి. ఇది కనిపెట్టి శ్రీనాథమహాకవి దమయంతిచేత "నైషధాధిపుడును నేనునుగూడి దేవేంద్రుని సేవించెదములే" అనిపించినాఁడు.

శ్లో. బ్రహ్మాద్వయస్యాప్యనుభవత్ప్రీమోదం
రోమాగ్రపర్వాగ్రనిరీక్షతేఽస్యాః;
యథాచితీర్థం తదశేషదృష్టా
వథ స్మరాద్వైతసుఖం తథాఽసౌ.
—౭. 3.

గీ. మానవతిమూర్తి యాపాదమస్తకముగఁ
దివుట వీక్షించి నిషధపృథ్వీకళత్రుఁ
డపుడు బ్రహ్మాద్వయప్రమోదాతిశాయి
మన్మథాద్వైతసుఖవార్ధి మగ్నుఁడయ్యె.
—3-౧౭౪.

రోమాగ్రము గన్పట్టినంతనే బ్రహ్మానందము గలిగె. దమయంతి సకలావయవదర్శనమైనపుడు స్మరాద్వైతసుఖముకల్గు టుచితమే కదా యను శ్రీహర్షకల్పనలో రోమాగ్రదర్శన మనునది యెక్కువసరసముగఁ దోఁచమిచేఁ గాఁబోలు నాంధ్రనైషధకర్త మార్చివేసినాఁడు. “అశేషదృష్టా” అనుమాట కా పాదమస్తకముగ వీక్షించి యను సర్వలోకక్షుణ్ణమైన తెలుఁగుసూక్తి నుపయోగించి ద్రాక్షాపాకరమణీయతఘటించిన కవిసార్వభౌముఁడు బ్రహ్మోద్వయప్రమోదాతిశాయిమన్మథాద్వైతసుఖవార్ధిమగ్నుఁడయ్యె ననుట విచిత్రమా?

శ్లో. నేయం మృదుః కౌసుమచాపయష్టిః
స్మరస్య ముష్టిగ్రహణార్హ మధ్యా;
తనోతి న శ్శ్రీమదపాంగముక్తాం
మోహాయ యా దృష్టిశరౌఘవృష్టిః.
—౭-౫౮.

తే. అతివముష్టి ప్రతిగ్రహార్హావలగ్న
సందియములేదు వలరాజుచాపయష్టి
అట్లుగాకున్నఁ గురియంగ నెట్లు నేర్చె
ప్రకృతిశాతకటాక్ష నారాచవృష్టి.
—3-౧౬3.

చూపులను శరవృష్టిని జేయుఁగాన దమయంతి మన్మథచాపయష్టి యనిన శ్రీహర్షోక్తికన్న చాపయష్టి గానిచో నీదృష్టి శరౌఘవృష్టి యెట్లు? అను శ్రీనాథోక్తిలో నర్థపుష్టి గన్పట్టు.

శ్లో. జంబాలజాలాత్క మకర్షి జంబూ
నద్యా న హారిద్రనిభ ప్రభేయః;
అ ప్యంగయుగ్మస్య నసంగచిహ్నా;
మున్నీయతే దంతురతా యదత్ర.
—౭-౧?.

తే. సాటిజంబేటిజంబాలజాలమునకుఁ
బాటినూత్నహరిద్రావిభంగమునకుఁ
దరము సౌదామనీదామధామమునకుఁ
గరముఁబోలుపొందు దీనియంగములకాంతి.
—3-౧౫౬.

దమయంతి నెమ్మేనిపసిమి వ్యక్తపఱుపఁదలఁచియు, అంగ్గసంధులలోఁగూడ నెమ్ములు గన్పట్టనట్టు లవయవములు మాంసలములై యుండెనని చెప్ప నెంచియు, మాతృకాకర్త క్లిష్టకల్పనఁ దెచ్చిపెట్టినాఁడు. ఆ చిక్కులోఁబడక యాంధ్రనైషధకర్త విశృంఖలముగ స్వతంత్రభావనను మూఁడగు పాదంబునఁ బొందుపఱుచుచు మొదటి రెండు చరణముల మాతృకాపర్యవసానమును దేల్చి వేయుచున్నాఁడు. ఎవరి యలంకారములు వారికే యుండుఁగాక. నారికేళపాకమును ద్రాక్షాపాకముగ మార్చుట సోమరిపోతులు కొందఱయ్యలకుఁగూడ నుపకారముసేఁతకదా:

# సుల్తాను మహమ్మదు

చింతా శంకరదీక్షితులు గారు

"శోకరాజ్యమందు నాకున్న హక్కున - కెవ్వరడ్డు, చూత మేడ్వకుండ
చూడ దలచినాడ, సుల్తాను మహామదు - నేటిరాత్రి యెంత పాటుపడిన."

అనుచు నెలుగెత్తి శోక విహ్వాలత ననుచు - విమలచిత్తత, సింహాసనమున, నొకడె,
ధర్మచింతగూర్చున్న, సుల్తానుసభను - జేరె నొకపౌరు డతిభీతచిత్తవృత్తి.

అతని గాంచి సుల్తాను మహమ్మ దనిమె - "శోక మతి పవిత్రము; దానిచొప్ప, నేను
రాజు, రాజునువలెనె మర్యాదసేతు - చెప్పికొనవెంచినది వేగ జెప్పుమోయి."

"దుష్టభూతము, భవదాశ్రితుం డొకండు - మద్గృహము జొచ్చి యిల్లు సామానునెల్ల
తనవిగా నెంచి పెక్కుబాధలను బెట్ట - దలకొనియె మమ్ము న"ని శోకతప్తుడనిమె.

"ఉన్నవాడె యింక నుద్యోగి నీయింట - చెప్పుమోయి జాగు చేయనేల?
చూడవత్తు" ననుచు సుల్తాను మహామదు - ప్రీతి నతని నాదరించి యడిగె.

"'తెచ్చెద సుల్తానును నే, జెచ్చెరజని, నిన్నుబట్టి చీల్పించెద నీ
మచ్చరము చూపి, నిలుమీ, వచ్చెద, నిదె పోయి' యంచు బలికి వెడలితిన్,
అట్లు వెడలిన నన్ను, వెంటాడె నతడు - పెద్ద యికిలింతతోడ, నీవీథివరకు,
ఆకలియు, వేదనయు నన్ను నార్చుచుండె - దైవమవు నేడు, నాకు సుల్తాను! నీవు."

అనెడు నాతని నోదార్చి "అరుగుమోయి - ఇంటి కంపెద, వలసినవెల్ల నేను,
మరల నా పాపి వచ్చిన మాట దెలుప - నగును సుల్తాను మహామదు"కనుచునంపె.

భీతనేత్రద్వయంబుతో, వివశమైన - వర్తనముతోడ గద్గదస్వరముతోడ
తిరిగి మూణ్ణాళ్ల కాపౌరు డరుగుదెంచి - తెలిపె సుల్తానునకును నిందితుని రాక.

మారుమాట లేక మహామదు నలుగురు - దీర్ఘకాయులై విధేయులైన
భటుల, ఖడ్గములను బట్టుకరండని - బాధితాత్మువెంట బయలుదేరె.

చేరి రిందరు గబగబ పౌరునిల్లు, - ఆలకించిరి దుష్టవాక్యమ్ము నొకటి,
పలు భయంబులతోడ, వివర్ణమైన - పడతి మోమొండు గనిరి, గవాక్షమందు.

అనియె సుల్తానుమహామ "దీవరిగి, లోని - దీపమార్పుము; లోపలి స్త్రీజనంబు
వెలుపలికి నంపు మాపాపివెంట బడిన - తత్క్షణమ, వత్తుమచటి కిందఱము మేము."

ఇల్లు జొచ్చెనతడు గల్లంతు పుట్టెను - బల్లలొకటి రెండు పడియెగ్రింద
అంధకారమయ్యె, నంతయు లోపల, - భీతచిత్త లిల్లు వెడలి రంత.

పరుసముల తోడ వెంబడి వచ్చిగాని - క్షణములోపల వాడిఖడ్గంబు లతని
దుష్టతనుబాపి, వేడి నెత్తురును ద్రావి, - రోదనముజేయు పాపిని ద్రుంచివైచె.

తిరిగి వెలిగించి రింటిలో దీపములను - తెచ్చి, ప్రభునాజ్ఞ భటు లొకదీప మెత్తి,
ప్రాణహీనమా నా కళేబరము దరికి - జేరి, వంగి మొగము బరీక్షించి చూచి

మోకరించెను సుల్తాను, భూమిమీద, - దేవదేవుని మది సంస్తుతించె కొంత
నోటబలికె నదేమొ సంతోషవార్త - వరలె గన్నుల నానందబాష్పములను.

భక్తితాత్పర్యములతోడ, బలుకకుండ - ఊరకే నిల్చి రిటునటు నున్నవారు,
పిదప, ప్రభునాజ్ఞ భటు లిల్లు వెదకి, వెదకి - తినుపదార్థము లొక కొన్ని తెచ్చియిడిన

దాన నాకలి శ్రమయును దాహమార్పి - ఇంటి యజమాని బిలిచి, "నీ కెట్టిబాధ
లుండబో విక సుఖముగా నుండుమోయి" - అనుచు దీవించి చననెంచు నవసరమున.

ఆత్రహీనుడగుచు, నాశ్చర్యమగ్నుడై - కన్నులందు బాష్పకణము లొదవ
శోకమెల్ల మఱచి సుల్తానుమహమదు - పాదములకు బరమభక్తి మ్రొక్కె.

"అడిగితినటంచు గోపంబు నందకుండ - స్వామి! నా మనంబున గల సందియములు
దీనుడగు నన్ను, గరుణించి తీర్పవలయు - మనవి గొనుడం"చు బౌరు డిట్లనియె నపుడు.

"మొదట దీపమార్పి, పిదప దెమ్మననేల? - మోకరింపనేల ముఖముజూచి?
బీద తిండి నింత పేరాస దిననేల? - భక్తునింట, దెలుపవలయు దండ్రి."

అనెడు పౌరుని మొఱను దయార్ద్రబుద్ధి - నాలకించి, సుల్తానుమహమ్మదనియె,
"చెప్పెదను వినుమోయి, యేచిత్ర మిందు - గానరా దివి స్వాభావికములె కాని.

ఆది నేనాడు వింటి నీ రోదనంబు - నాడు మొద లింతదుష్టుడౌ వాడు నాకు
సన్నిహితు డేల కారాదు? కన్నకొడుకె - యైన గావచ్చు, నని భీతినందియుంటి.

ఎవ్వరైనను బ్రభుధర్మ మెరుగుదేను - కాని పితృచిత్తభీతి, చీకాకుపరుప
దీపమార్ప నాజ్ఞాపించితిని, మఱియు - ధర్మనేత్రంబులకు, నడ్డుదగులకుండ.

జరుపవలసిన ధర్మంబు, జరుగుపిదప - పాపి పరుడంచు దెలిపె దీపంబు నాకు
భయభరముతోడ నేనె, యీశ్వరవిధాన - మాచరించుట మ్రొక్కితి నతని కపుడు.

నాడు వినియున్న నీ యార్తనాదమునను - మూడు దినములనుండియు మూలబడిన
ఆకలిని దీర్చికొంటి గార్యాంతమిపుడు - నీగృహంబున; దాన సంతృప్తిగంటి.

పొందబో విట్టి బాధ లిముందు నీవు - సౌఖ్యముగ నుండుమోయి, నీ జనముతోడ
పోయివచ్చెద న"ని నగుమొగముతోడ, - జనియె సుల్తానుమహమదు సదనమునకు.

---

# రాముఁడు—రామాయణము

కవికొండల వెంకటసత్యనారాయణమూర్తిగారు

రాముని గూర్చియు, రామాయణమును గూర్చియు పలువురు పలువిధములగు నభిప్రాయముల వెలిపుచ్చుచున్నారు. 1-రాముడును రామాయణమును భారతయుద్ధమునకు పూర్వమని కొందఱి యభిప్రాయము. 2-రాముడు భారతయుద్ధమునకు బూర్వపువాఁడేకాని రామాయణరచనమాత్రము భారతయుద్ధమునకు పిమ్మట యని కొందఱి యభిప్రాయము. 3-రామునికంటెను రామాయణగ్రంథము మునుపటిదని కొందఱి యభిప్రాయము. 4-రాముడును, రామాయణమును గూడ భారతయుద్ధమునకు పిమ్మట యని కొందఱి యభిప్రాయము. 5-రామాయణము భారతయుద్ధమునకు పిమ్మటిదనియును, అది పారాయణయోగ్యమగు నొక మంత్రగ్రంథముగా వాల్మీకి రచించెననియు, నందలి రామకథమాత్రము స్వకపోలకల్పితమనియును కొందఱి యభిప్రాయము.

పై విషయము లన్నియును చర్చనీయాంశములే. అందుచే పైవిషయములను బలపఱచుటకు నాకు లభించిన గ్రంథాధారముతో కొంతవఱ కిచట చర్చించెదను. ఈచర్చయొక్క యుద్దేశము ఈ నాయభిప్రాయమే సత్యమని చదువరులకు దెలియజేయుట కాదు. ఈచర్చలో గల సారమును, నిస్సారమును పరిశోధనాభిలాషులగు పండితులు లెస్సగా తిలకించి యాయా భాగములపై వారికి లభించు నితరసాధనములతో సత్యమును వెల్లడించు సదుద్దేశముతో చక్కని విమర్శకు గడంగెదరని యాశించుచున్నాను. విమర్శమువల్లనే ప్రధానగ్రంథమున కెక్కువ వన్నె వచ్చునని పండితుల యభిప్రాయము. అందుచే పండితు లిట్టిపనికి బూనుకొనుటకై నే నీ వ్యాసమును వ్రాయుటకు దలపెట్టితిని.

## విషయప్రవేశము

ముందు రామాయణము యొక్కయు, తత్కర్తయగు వాల్మీకియొక్కయు కాలమును పరికించిన పిమ్మట రాముని కాలమును పరికించుటకు పూనుకొందము.

## రామాయణభాష

రామాయణములోని భాషనుగూర్చి ముందుగా చర్చింతము. రామాయణము సమపాదయుక్తమైన శ్లోకములతో కూడికొనియున్నది. ఇది ప్రాకృతభాష లెస్సగా సంస్కరింపబడినపిమ్మట వ్రాయబడిన సంస్కృతభాష. దీనికిముందు వ్రాయబడిన వేదమంత్రములు, ఋక్కులు, బ్రాహ్మణములు, సూత్రములు కంటె నిది భిన్నమగు భాషను, భిన్నమగు ఛందస్సును కలిగియున్నది. అందుచే నీరామాయణము వేదములకంటెను, బ్రాహ్మణములకంటెను, సూత్రములకంటెను పిమ్మట వ్రాయబడినదని చెప్పవలసివచ్చును. అథర్వవేదము, ఐతరేయబ్రాహ్మణము, బృహదారణ్యకము మున్నగు గ్రంథములలో పరీక్షితుని గూర్చియు, పరీక్షితు వంశమును గూర్చియు చెప్పబడియుండెను. అందుచే నీ అథర్వవేదము బ్రాహ్మణములు, ఉపనిషత్తులు పరీక్షితునకును, పరీక్షితుని కుమారుడగు జనమేజయునకును గూడ పిమ్మట వ్రాయబడెనని చెప్పవలసివచ్చుచున్నది. ఏలయన: వానియందు జనమేజయుని దిగ్విజయమును, నాతని రాజ్యపరిపాలనములోని ధర్మమునుగూడ లెస్సగా వర్ణింపబడెను. ఇవి యన్నియును పరీక్షితునకును జనమేజయునకును పిమ్మట వ్రాయబడినచో వీనికి పిమ్మట వ్రాయబడిన రామాయణమును పరీక్షితునకును జనమేజయునకును పిమ్మటనే వ్రాయబడియుండవలెను. జనమేజయ పరీక్షితులు భారతయుద్ధమునకు నెంతో కాలము పిమ్మటివారు కావున రామాయణమును భారతయుద్ధమున కంతకంటెను నెంతో యెక్కువకాలమున వ్రాయబడియుండవలెను.

## రామాయణములోని విషయములనుబట్టి

ఇఁక రామాయణములోని విషయములను బట్టి రామాయణకాలమును నిర్ణయించుటకు ప్రయత్నింతము.

1. రామాయణమున యుద్ధకాండమున 120 వ సర్గయందు శ్రీరాముడు రావణుని సంహరించినపిమ్మట

బ్రహ్మ రాముని స్తుతించు సందర్భమున "నీవే విష్ణువు, నీవే కృష్ణుడవు" అని పెక్కుచోట్ల "కృష్ణ"శబ్దము వాడబడెను. మఱియొకచోట "పరిగృహ్యగిరిందోర్భ్యాం వపుర్విష్ణోర్విడంబయన్" యని శ్రీకృష్ణుని గోవర్ధనోద్ధరణము వర్ణింపబడెను. దీనినిబట్టి రామాయణరచన శ్రీకృష్ణునకు పిమ్మటయని చెప్పవలసివచ్చునుకదా? శ్రీకృష్ణునకు పిమ్మట యనగా భారతయుద్ధమునకు పిమ్మట యనియేకదా యర్థము?

2. రామాయణమున అయోధ్యాకాండమున 64వ సర్గమున నిట్లు వ్రాయబడెను.

శ్లో. యాం గతిం సగరశ్శైబ్యో దిలీపో జనమేజయః;
నహుషో ధుందుమారశ్చ ప్రాప్తాస్తాం గచ్ఛ పుత్రక!

పై శ్లోకమున జనమేజయుని నామముకూడ కానవగుటచే రామాయణరచన జనమేజయునకుగూడ పిమ్మట యని రుజువగుచున్నది.

3. రామాయణమున యవనులు, శకులు, పహ్లవులను గూర్చియు, వారి యుద్ధములను గూర్చియు నిట్లు వ్రాయబడెను.

శ్లో. విశ్వామిత్రార్దితాన్దృష్ట్వా పహ్లవాంచ్ఛతశేస్తదా;
భూయఏవాసృజల్లోకాచ్ఛకాన్ యవనమిశ్రితాన్.

శ్లో. తైస్తైరాసీత్సంవృతా భూమి శ్శకై ర్యవనమిశ్రితైః;
ప్రభావద్భి ర్మహావీర్యై ర్హేమకింజల్కసన్నిభైః.
(బాల. ౬౫ సర్గ. ౧౧-౨౧)

పైశ్లోకముల ననుసరించి యవనులు, శకులు మున్నగువారు మనదేశమున బ్రవేశించి యుద్ధములు చేయుచున్నప్పుడుగాని, లేక పిమ్మటగాని రామాయణము వ్రాయబడెనని తేలుచున్నది. ఈయవనులును, శకులును మనదేశమున క్రీ. పూర్వము రెండవశతాబ్దము మొదలు క్రీ. శ. రెండవశతాబ్దమువఱకును కనబడుచున్నారు. వీరందఱును పశ్చిమోత్తరముల సరిహద్దుల నుండి హిందూస్థానమునకు వచ్చి పంజాబు ప్రాంతమున రాజ్యమును స్థాపించుకొనిరి. వీరి రాజ్యమునుగూర్చి కూడ కిష్కింధాకాండమున సుగ్రీవుడు సీతను వెదకుటకై వానరులను పంపుసందర్భమున నుత్తరదేశమున మ్లేచ్ఛ, శూరసేన, కాంభోజ, యవన, శక, దేశములున్నట్లు చెప్పెను. పైవిషయములనుబట్టి రామాయణము క్రీ. శ. నకు ఒకటి రెండుశతకముల పిమ్మటనే వ్రాయబడెనని చెప్పవలసివచ్చునేమో?

4. రామాయణమున అయోధ్యాకాండమున రాముడు జాబాలితో ప్రసంగించు సందర్భమున నిట్లు వ్రాయబడెను.

శ్లో. యథాహి చోర స్సతథాహి బుద్ధ
స్తథాగతం నాస్తిక మత్రవిద్ధి;
తస్మాద్ధియ శ్శంక్యతమః ప్రజానాం
ననాస్తికే నాభిముఖో బుధ స్స్యాత్. అ.కా. స.౧౦౯-౩౪

అనగా బుద్ధుడు, తథాగతుడు, నాస్తికుడు చోరుని వంటివా రనియు, ప్రజచే శంకింపబడినవాడెల్ల నాస్తికుడేయనియు, నందుచే పండితు డగువాడు వాని కెదురుగ బోరాదనియును భావము. పై శ్లోకము బుద్ధమతద్వేషమును సూచించుచున్నది. బుద్ధమతావలంబకులగు మౌర్యవంశపు రాజులు నశించినపిమ్మట బ్రాహ్మణ పరిపాలనములో బౌద్ధమతమును క్షీణింపజేయుటకును బ్రాహ్మణమత మభివృద్ధి గాంచుటకును ప్రబలప్రయత్నములు గావించుచున్నదినములలో నీశ్లోకము వ్రాయబడినట్లు కనబడుచున్నది. అనగా క్రీ. పూ. 185 వ సం. తో మౌర్యవంశ మంతరించెను. పిమ్మట శుంగులును, కాణ్వులును పరిపాలనమునకు వచ్చిరి. వీరి కాలములో (అనగా క్రీ. శకమునకు ఒకశతాబ్దము ముందు వెనుకలలో) నీరామాయణరచన జరిగియుండవలెను. ఈకాలములోనే పాణిని మున్నగు వ్యాకరణకర్తలు, భాషాసంస్కర్తలు పెక్కురు బయలువెడలి వెనుకటి గీర్వాణభాషను సంస్కరించి కావ్యములు మున్నగునవి వ్రాయ నారంభించిరి. అందిరామాయణ మాదికావ్యము. ఇక్కడకు రామాయణకాలమును, వాల్మీకికాలమును దాదాపుగా క్రీస్తుశకారంభమునకు పిమ్మటనే యని సూచించితిని. ఈసందర్భముననే వాల్మీకి నివాసస్థానమునుకూడ కనుగొనుటకు ప్రయత్నింతము.

## వాల్మీకి నివాసస్థానము

వాల్మీకి నివాసస్థానము పశ్చిమోత్తర హిందూస్థానమున సింధుసరస్వతులకు నడుమప్రదేశమై యుండవలెను. ఏలయన వాల్మీకి కిష్కింధకాండమున సుగ్రీవుడు సీతాన్వేషణార్థము కపులను నాలుగుదిక్కులకును బంపు సందర్భమున నా నాలుగుదిక్కులందునుగల దేశములను, నదులను నీవిధమున పేర్కొనెను.

1 తూర్పుదిక్కున—సరయువు, గంగ, కౌశికి, యమున, సరస్వతి, మాళవ, విదేహ, కాశి, మగధ, కోసల మొ.

2 దక్షిణదిక్కున—వింధ్య, నర్మద, గౌతమి, కృష్ణవేణి, అవంతి, విదర్భ, వంగ, కళింగ, అంగ, ఆంధ్ర, పుండ్ర, చోళ, పాండ్య, కేరళ, కావేరి మొ.

3 పశ్చిమదిక్కున—సురాష్ట్రము, బాహ్లీకము, శూరము, భీమము, సింధు, ప్రాగ్జ్యోతిషము మొ.

4 ఉత్తరదిక్కున—మ్లేచ్ఛ, శూరసేన, పుళింద, ప్రస్థర, భరత, మద్రక, కురు, కాంభోజ, యవన, శక, బాహ్లిక దేశములు మొ.

పై నుదహరింపబడిన నాలుగు దిక్కులయందును గల నదులకును, దేశములకును నడుమగల ప్రదేశము సింధుసరస్వతుల నడుమ ప్రదేశమని తేలుచున్నది. అనగా నార్యులు మొట్టమొదట మనదేశమున వాసస్థానముగా నేర్పఱచుకొనిన సప్తసింధుప్రాంతము. సుగ్రీవుడు వానరులకు చెప్పిన పై నాలుగుదిక్కులకును నడుమనున్న సింధుసరస్వతుల నడుమప్రదేశము కిష్కింధ కానేరదు కదా? లేక, రామాయణ కథానాయకుడు శ్రీరాముని వాసస్థానమగు నయోధ్యయు కానేరదుకదా? ఇది యీ రెంటికిని భిన్నమగు మూడవప్రదేశము. ఇది తాను నివసించు ప్రదేశమై యుండవలెను. వాల్మీకి కిష్కింధకు నాలుగు దిక్కులంగల నదులను, దేశములను చెప్పుటకు మాఱుగా పొరపాటున తన స్థానమునకు నాలుగు దిక్కులంగల నదులను, దేశములను వర్ణించుకొనెను. వాల్మీకి తన రామాయణమున యవనులయొక్కయు, శకులయొక్కయు యుద్ధమును వర్ణించుటకూడ తా నాప్రాంతమునకు దగ్గర వాడగుటయే యొక కారణమై యుండవచ్చును.

## రామునికాలము

రాముడు భారతయుద్ధమున కెట్లు పూర్వుడు?

1. రాముడు 24 వ త్రేతాయుగమునాటివాడనియును, భారతయుద్ధము 28 వ ద్వాపరయుగమున జరిగెననియును బ్రహ్మాండాది పురాణములు చెప్పుచున్నవి. దీనినిబట్టి శ్రీరాముని యవతారానంతరము నాలుగు మహాయుగములకు పైని భారతయుద్ధము జరిగినట్లు స్పష్టపడుచున్నది.

2. మఱియు రాముని వనవాసకాలమునకు దక్షిణదేశమంతయు నరణ్యమయమై రాక్షసులకాటపట్టయి అక్కడక్కడ ఋష్యాశ్రమములు మాత్రము కలిగియుండెను. రామరావణయుద్ధములో రామునికి తోడ్పడినవారెల్ల మోటుజాతివారగు వానరులు, ఋక్షులు మున్నగు నాటవికజాతి.

3. భారతయుద్ధకాలమున దక్షిణదేశమంతయు నించుమించుగా జనాకీర్ణమై యుండెను. భారతయుద్ధసమయమున కురుపాండవులకు తోడ్పడిన రాజులు నాగరికత వహించిన దేశాధీశ్వరులు. భారతయుద్ధకాలమునకు అక్షౌహిణులసంఖ్య, యుద్ధములలో సైనికులను వ్యూహములుగా పన్ను నేర్పు మున్నగునవి వర్ణింపబడెను. రాముని కొలువుననున్న వసిష్ఠుడును, రామునకు విలువిద్య నేర్పిన విశ్వామిత్రుడును భారతయుద్ధమునకు పూర్వులుగాని పిమ్మటివారు కారు.

4. రామునికాలమునాటికి మనుజుల కాయుఃపరిమాణ మెక్కువగా నుండెడిది. రాముడు పదివేలేండ్లును, దశరథుడు అరువదివేలేండ్లును జీవించిరి. భారతయుద్ధకాలమునాటికి మనుజుల యాయుఃపరిమాణము తగ్గినది. శ్రీకృష్ణుడును, ధర్మజుడును నూటయిరువదియైదు సంవత్సరములు చిల్లరమాత్రమే జీవించిరి.

5. వాల్మీకిరామాయణానుసారము వైవస్వతునకు రాముడు 35 వ తరమువాడు. భాగవతాదుల

ననుసరించి ధర్మరాజు వైవస్వంతునకు 48 వ తరము వాడు. దీనినిబట్టి ధర్మజుడు రామునకు 13 తరములు దిగువవాడు.

పైని చూపబడిన యన్ని కారణములచేతను రాముడు భారతయుద్ధమునకు పూర్వు డని చెప్పవలసి యున్నది.

## పూర్వపక్షము

కాని పైని చూపబడిన అన్నికారణములకును బలమగు పూర్వపక్షముగూడ కలదు. కావున నిటపై వానిని పూర్వపక్షము చేయ ప్రయత్నించెదను.

1. శ్రీరాము డిరువదినాలుగవ త్రేతాయుగము నాటివా డైనచో వైవస్వతమన్వంతర ప్రారంభము మొదలు నీయిరువదినాలుగు మహాయుగములకును నీక్రింది లెక్క తేలవలెను.

మహాయుగ మనగా 4320000 సం.

24 మహాయుగములకు 24

17280000
8640000
103680000

ఇందులో నిరువదినాలుగవ మహాయుగములోని ద్వాపరకలియుగసంఖ్య 1296000 సంవత్సరములును తీసి వేసినను మిగిలినసంఖ్య—

103680000
1296000
102384000

పదికోట్ల యిరువది మూడులక్షల యెనుబదినాలుగువేల సంవత్సరములు తేలినది. ఈ 102384000 సంవత్సరములలోను వైవస్వతమనువు మొదలు శ్రీరాముని వఱకు గల తరముల సంఖ్య 35 గా వాల్మీకి చెప్పెను. అనగా సగటున నొక్కొక్కని జీవితకాలము.

35)102384000
2782400 సం.

ఇరువదియేడులక్షల యెనుబది రెండువేల నాలుగువందల సంవత్సరములకు పైనగాని తక్కువయని చెప్పవీలు లేదు.

ఒక్కొక్క డింతింతకాలము జీవించెనని యే పౌరాణికుడును చెప్పలేదు. చరిత్రకారులును నియ్యది విశ్వసింపరు. ఈ యుగసంఖ్యను పూర్వు లే లెక్కకొలఁ కేర్పఱచుకొనిరో కాని చరిత్రకుమాత్రము పనికిరాలేదు. (ఈసంఖ్యనుగూర్చి "మన్వంతరములు—యుగములు" అను శీర్షికక్రింద వేఱొకవ్యాసమును వ్రాయసెంచితిని గావున దానిగూర్చి యిట విస్తరింపను.)

కావున నీయుగములసంఖ్యతో నిట చర్చించుట మాని తరములసంఖ్యతో రామునికాలమును చర్చించెదను.

* రాముడు మనువునకు 35 వ తరమువాడని వాల్మీకి బాలకాండమున సీతాకళ్యాణ సందర్భమున వ్రాయుచు నీక్రింది వంశవృక్షమును పేర్కొనెను.

| | |
|---|---|
| 1 మనువు | 19 భగీరథుడు |
| 2 ఇక్ష్వాకు | 20 కకుత్థ్సుడు |
| 3 కుక్షి | 21 రఘువు |
| 4 వికుక్షి | 22 ప్రవృద్ధుడు |
| 5 బాణుడు | 23 శంఖనుడు |
| 6 అరణ్యుడు | 24 సుదర్శనుడు |
| 7 పృథుడు | 25 అగ్నివర్ణుడు |
| 8 త్రిశంకుడు | 26 శీఘ్రగుడు |
| 9 యువనాశ్వుడు | 27 మరువు |
| 10 మాంధాత | 28 ప్రశుశ్రుకుడు |
| 11 సుసంధి | 29 అంబరీషుడు |
| 12 ధ్రువసంధి | 30 నహుషుడు |
| 13 భరతుడు | 31 యయాతి |
| 14 అసితుడు | 32 నాభాగుడు |
| 15 సగరుడు | 33 అజుడు |
| 16 అసమంజుడు | 34 దశరథుడు |
| 17 అంశుమంతుడు | 35 రాముడు |
| 18 దిలీపుడు | |

* ఇది 6 వ కారణమునకు సమాధానము.

పైని పేర్కొనబడిన వారందఱును నొకరికొకరు పుత్రులని పేర్కొనబడెను. ఇదియే సమగ్రమగు వంశవృక్షమగుచో వేదములలో నుదహరింపబడిన హరిశ్చంద్రుడు పురుకుత్సుడు మున్నగు సూర్యవంశపురాజులు అనేకు లిందు లోపింపబడిరి. అందుచే నియ్యది సమగ్రమగు వంశవృక్షము కానేరదు. బ్రహ్మాండాది పురాణములలో నుదహరింపబడిన పూర్తియగు సూర్య చంద్రవంశజుల వంశవృక్షమిటు వ్రాసెదను.

1 వైవస్వతమనువు

| | | |
|---|---|---|
| 2 | ఇక్ష్వాకు | బుధుడు=ఇళ |
| 3 | వికుక్షి | పురూరవుడు |
| 4 | కకుత్‌స్థుడు | ఆయువు |
| 5 | పృథుడు | నహుషుడు |
| 6 | పృషదశ్వుడు | యయాతి |
| 7 | అంధ్రుడు | పూరుడు |
| 8 | యువనాశ్వుడు I | జనమేజయుడు |
| 9 | శ్రావస్తుడు | ప్రాచీన్వాంశుడు |
| 10 | బృహదశ్వుడు | ప్రవిరోధనమన్యువు |
| 11 | కువలయాశ్వుడు | చారువు |
| 12 | దృఢాశ్వుడు | సుద్యుపుడు |
| 13 | హర్యశ్వుడు | బహుగతుడు |
| 14 | నికుంభుడు | శర్యాతి |
| 15 | సంహతాశ్వుడు | సంయాతి |
| 16 | కృశుడు | రౌద్రాశ్వుడు |
| 17 | ప్రసేనజిత్తు | ఋతేపువు |
| 18 | యువనాశ్వుడు II | అంతిసారుడు |
| 19 | మాంధాత | సుమతి |
| 20 | పురుకుత్సుడు | రైభ్యుడు |
| 21 | సంభూతుడు | దుష్యంతుడు |
| 22 | అనరణ్యుడు | భరతుడు |
| 23 | హర్యశ్వుడు | వితథుడు |
| 24 | సుమతి | మన్యువు |
| 25 | త్రిధన్వుడు | బృహత్క్షత్రుడు |
| 26 | త్రయ్యారుణి | సుహోత్రుడు |
| 27 | త్రిశంకువు | హస్తి |
| 28 | హరిశ్చంద్రుడు | అజమీఢుడు |
| 29 | రోహితుడు | ఋక్షుడు I |
| 30 | చంచుడు | సంవరణుడు |
| 31 | వినయుడు | కురువు |
| 32 | రుకుకుడు | పరీక్షితు I |
| 33 | బాహుడు | జహ్నువు |
| 34 | సగరుడు | సురథుడు |
| 35 | అసమంజసుడు | సార్వభౌముడు |
| 26 | అంశుమంతుడు | జయత్సేనుడు |
| 37 | దిలీపుడు | రథికుడు |
| 38 | భగీరథుడు | అయుతాయువు |
| 39 | శ్రుతుడు | క్రోధనుడు |
| 40 | నాభాగుడు | దేవాతిథి |
| 41 | అంబరీషుడు | ఋక్షుడు II |
| 42 | సింధుద్వీపుడు | భీమసేనుడు |
| 43 | అయుతాయువు | ప్రతీపుడు |
| 44 | ఋతుపర్ణుడు | శంతనుడు |
| 45 | సర్వకాముడు | విచిత్రవీర్యుడు |
| 46 | సుదాసుడు | పాండురాజు |
| 47 | సౌదాసుడు | అర్జునుడు, ధర్మజుడు |
| 48 | అశ్మకుడు | అభిమన్యుడు |
| 49 | మూలకుడు | పరీక్షితు II |
| 50 | శతరథుడు | జనమేజయుడు II |
| 51 | ఇడబిడుడు | శతానీకుడు |
| 52 | కృశకర్మ | సహస్రానీకుడు |
| 53 | దిలీపుడు | అశ్వమేధజుడు |
| 54 | రఘువు | అధిసీమకృష్ణుడు |
| 55 | అజుడు | నిచకుడు |
| 56 | దశరథుడు | ఉప్తుడు |
| 57 | రాముడు | చిత్రరథుడు |

పై వంశవృక్షమును బట్టిచూడ రాముడు మనువునకు 57 వ తరమునాడు. చంద్రవంశములో నితనికి సమకాలికుడు చిత్రరథుడు. ఈ చిత్రరథుడు భారత

వర్ష వాసులకును రాకపోకలును, సంబంధములును తెగిపో యినవి. అందుచేతనే రాము డుత్తర పుణ్యభూముల కర ణ్యావాసమున కరుగలేక దక్షిణభూములకు వెళ్ల వలసి వచ్చెను. అందుచే భారతయుద్ధవీరు లగు పాండవులకు మరికొన్ని శతాబ్దములపిమ్మటగాని రాముడు జన్మించి నట్లు కానరాదు.

## కుశలవులు

ఇక సీత వాల్మీకియొక్క యాశ్రమమున నుండు టయు, నచ్చట సీతకు కుశలవులు జన్మించుటయు, వాల్మీకి కుశలవులచే రామాయణమంతయు గానము చే యించుటయు నిశ్చయమేయైనచో వాల్మీకితోపాటు కుశలవులును సీతారాములును కూడ క్రీస్తుశకమునకు పిమ్మటివారని చెప్పకతప్పదు.

## జనకుడు

రామునకు మామగారని చెప్పబడు జనకుని కా లమునుగూర్చి యించుక సూచించెదను. రాముని తండ్రి యగు దశరథుడు జనకునకు సమకాలికుడు. వాజసనేయ సంహిత (శుక్లయజుర్వేదము) కర్తయు, బృహదారణ్య కోపనిషత్తున ప్రధానపురుషుడును నగు యాజ్ఞవల్క్య జనకునిసభలో మిక్కిలి పేరెన్నికగన్న ఋషి. జనకునిసభ లో నొకసారి "క్వా పరీక్షితా అభవన్?" అను ప్రశ్న వచ్చినట్లు బృహదారణ్యకోపనిషత్తులో గాననగుచు న్నది. అనగా పరీక్షితులగతి యేమయ్యెనని ప్రశ్న. దా నికి ప్రత్యుత్తరముగా అశ్వమేధయాగము చేసినవారంద ఱును నేగతికిబోయిరో వారును నాగతికే పోయిరని యాజ్ఞవల్క్య పల్కెను. దీనినిబట్టిచూడ పరీక్షితుని వంశ జులరాజ్యము జనకునకు కొన్నితరములు ముందుగనే నశించినట్లు కాననగుచున్నది. అంతియకాక యాజ్ఞవల్క్య యు యాజ్ఞవల్క్య సమకాలికు డగు ఉద్దాలకుడును జనమేజయుని సర్పయాగము చూచుటకు వెళ్లినట్లును, జనమేజయునకు వేదములు చెప్పినట్లును విష్ణుపురాణాదు లుచెప్పుచున్నవి.

కాని యీజనకుడును, సీతతండ్రియగు సీరధ్వజు డను నామముగల జనకుడును నొక్కడేయగునా యని ప్రశ్నింప నీజనకునికాలమున కేకయదేశమున నొక 'అశ్వ పతి' యను పేరుగల యొకరాజున్నట్లు వేదములలో గాన నగుచున్నది. ఈయశ్వపతి భరతునకు మేనమామయైనట్లు రామాయణమున కలదు. అందుచే యాజ్ఞవల్క్యనాటి జనకుడును సీత తండ్రి యగు సీరధ్వజుడను జనకుడును నొక్కడే యగునని తోచుచున్నది.

## రాముడు కల్పితపురుషుడు

ఇంతవఱకును రామాయణము క్రీస్తుశకమునకు పిమ్మట వ్రాయబడెననియును, రాముడును భారతయు ద్ధమునకు పిమ్మటివాడే యనియు చెప్పబడెను. ఇక మనము మఱియొకవిషయ మాలోచింపవలసియున్నది. రాముడు భారతయుద్ధానంతరమువాడే యైనచో పురాణము లట్లేల చెప్పలేదు? వాల్మీకి రాముని త్రేతా యుగపురుషునిగా జేయుటకు కారణమేమి? దీనినిగూర్చి యింతవఱ కెవ్వరును నిదమిత్థమని నిర్ణయింపకపోవుట యేకాక పూర్వగ్రంథములలో నెల్ల రామాయణమును పరమ పవిత్రమైనదానినిగా మనపూర్వులు భావించుటకు కారణమేమి యనికూడ మనము కొంతవరకు విచారింప వలసియున్నది.

రాముడు నిజముగా భారతయుద్ధమునకు కొన్నితరములు పిమ్మటివాడైనను లేక కొన్నితరములు పూర్వపువాడైనను నావిషయమును వేద సంహితల యందుగాని బ్రాహ్మణములయందు గాని, సూత్ర ములయందుగాని యుదహరింపబడియే యుండును. సూర్య చంద్రవంశజులలో ననేకరాజులు వేదములం దు దహరింపబడియుండగా నింత ఖ్యాతి వహించిన ప్రఖ్యాతపురుషు డగు రామచంద్రు డేల వేదగ్రంథము లయం దుదహరింపబడలేదు? ఈవిషయము రాముడు కల్పితపురుషుడా లేక నిజముగా నిక్ష్వాకువంశమునకు జెందినపురుషుడా యని సందేహము కలుగజేయకమా నదు.[1] ఋగ్వేదమునమాత్ర మొకచోట దశరథునియొక్క

1. ఋగ్వేదము (I-126-4)

నామము పేర్కొనబడెను. వేఱొకచోట[2] రాముడు 'వారణాసి' రాజని పేర్కొనబడెను. వారణాసి యనగా కాశీ. ఇతఁడైనను ఇక్ష్వాకువంశజుఁడని గాని, సీతకు పతియనిగాని, రావణుని సంహరించెననిగాని యెక్కడను చెప్పబడలేదు. వీరివృత్తాంతమేమియును వేదగ్రంథముల వలన మనకు తెలియనే తెలియదు. అందుచే నీరామునకును వాల్మీకిరచించిన ఇక్ష్వాకువంశజుఁడగు రఘురామునకును నేమియు సంబంధములేదు. అందుచే నీ రఘురాముఁ డెక్కడినుండియో వాల్మీకిచే రామాయణరచనకై కొనితేబడిన నూతనపురుషుఁ డని తోపకమానదు.

వాల్మీకి మొదట నీరామాయణము వ్రాయునప్పుడు కూడ తా నొకచరిత్ర వ్రాయవలెననిగాని ఒకయవతార పురుషుని వర్ణింపవలెననిగాని యుద్దేశించినట్లు కానరాదు. బ్రాహ్మణ మతోద్ధరణకాలమున నొక పవిత్ర మగు మంత్రగ్రంథమును కావ్యరూపమున వ్రాయవలెనని యాతఁడు సంకల్పించియుండును. అందు కనుగుణముగా నాతఁడు 'సప్తతంతువు' వలె సప్తకాండములుగా నొనరించి గాయత్రీమంత్రయుక్తముగను, బీజాక్షరయుక్తముగను, వేదమంత్రాక్షరయుక్తముగను, నీ రామాయణము రచించెను. ఈరామాయణమునం దంతటను తాను వ్రాయదలచుకొనిన మంత్రయుక్తమగు నాధ్యాత్మికగ్రంథమున కనుకూలమగు నామములను, కథయును నిర్మించుకొనెను. రామునియొక్కయు సీతయొక్కయు నామములందు వాల్మీకి చాల విశేషము కనబరచెను. అందు గొన్ని స్థాలీపులాకన్యాయమున నిట జూపెదను.

## రామాయణము-మంత్రసమ్మితము

రామాయణమునకు గాయత్రి అధిష్ఠానదేవతగా నొనరింపబడెను. గాయత్రికి 24 అక్షరములు కలవు. రామాయణమును 24 వేలశ్లోకములుగా రచియింపబడి ప్రతి వెయ్యిశ్లోకముల ప్రథమాక్షరములును కలిపి చదివిన గాయత్రీమంత్ర మగునట్లు వాల్మీకి యొనరించెను. రామాయణము "తపస్స్వాధ్యాయనిరతం—" యనుశ్లోకముతో ప్రారంభింపబడెను. దీనిప్రథమాక్షరము "త". గాయత్రీమంత్రముయొక్క ప్రథమాక్షరముకూడ "త". ఇట్లే ప్రతి వేయిశ్లోకముల మొదటియక్షరములును కలిపి చదువుకొనిన గాయత్రీమంత్ర మగును.

ఈ విషయమును వాల్మీకియే తన గ్రంథమున నిట్లు వ్రాసెను—

శ్లో. చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్,
ఏకైకమక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్.

రఘురాముని చరితమును శతకోటిగా వ్రాసితినని చెప్పెను. "శతము" సంఖ్యాస్థానములో మూడవది గావున శత మనగా మూడు అని యర్థము. "కోటి" సంఖ్యాస్థానమున నెనిమిదవది గావున "కోటి" యనఁగా ఎనిమిది యని యర్థము. శతకోటియనగా మూడెనిమిదులని యర్థము. ($3 \times 8=24$) అనగా రామాయణమును 24 భాగములుగా చేసితినని భావము.

మఱియు

శ్లో. ఇదం రామాయణం కృత్స్నం,
గాయత్రీ బీజ సంయుతమ్.

అనుటవలన రామాయణము గాయత్రీమంత్రాత్మక మని స్పష్టపడుచున్నది.

## రామాయణము సాంఖ్యము

'కాదిన'వాది సూత్రములచొప్పున నక్షరములకుగల సంఖ్యలను బట్టిచూడ రామాయణమున గొన్నిచిత్రములు కనఁబడుచున్నది.

రా + మ = 2 + 5 = 7

| | |
|---|---|
| అవతారసంఖ్య | 7 |
| రామాయణకాండసంఖ్య | 7 |
| యుద్ధదినసంఖ్య | 7 |
| రామాయణయుద్ధమున ముఖ్యపురుషులసంఖ్య | 7 |
| పారాయణమునకు ముఖ్యముగ నియమితమైన సర్గలసంఖ్య | 7 |
| వ్యాహృతులు | 7 |

2. ఋగ్వేదము (X-93-14)

వాల్మీకి బాలకాండమున ప్రథమసర్గ 100 శ్లోకములనిచెప్పి యాసంఖ్యను మొదటిశ్లోకమున నీవిధమున జూపెను.

6 1 4 1 1 0 2 6 6 1 4 4 4
త ప స్స్వా ధ్యా య ని ర తం త ప స్వీ వా గ్వి
8 4 2 0 2 8 1 2 1 2 7
దాం వ రం నా ర దం ప రి ప ప్ర చ్ఛ
4 5 1 5 0 1 3 4
వా ల్మీ కి ర్ము ని పుం గ వమ్. =100

ఈనూరుసంఖ్య ప్రథమసర్గశ్లోకసంఖ్యగా నున్నది. సీతారాములు వియోగములేక కూడియుండుట అయోధ్యాకాండమందు మాత్రమే చెప్పబడెను. తక్కినయన్ని కాండములయందును గొంతకాలమైనను వియోగము చెప్పబడెను. కాబట్టి యీ రెండునామములసంఖ్యలు కలుపఁగా

సీత = 67
రామ = 52
119

అయోధ్యాకాండమున సర్గలసంఖ్య 119. ఇట్లే సాంఖ్యశాస్త్రము ననుసరించి పెక్కుచిత్రములు రామాయణమునం గలవు.

## రామాయణము - అధ్యాత్మము

ఇక రామనామములో గల యక్షరములంగల విశేషములు పరికింపుడు.

ఉ. "మా" యన పంచవింశతిత
మంబది యాత్మకు సంజ్ఞ, రెండునై
"రా"యన నిర్వదేడవది
గ్రాలుగదా పరమాత్మసంజ్ఞ నా
రాయణుఁ డాతఁడే, ప్రణవ
మంపలి "యు" త్తన నిర్వదాలునౌఁ
గా, "య" తలంపనౌఁ బురుష
కారము సూచన సేయు లక్ష్మిగన్.

మఱియు—"ఓం నమో నారాయణాయ"యను నష్టాక్షరీమంత్రములోని "రా" యను నక్షరమును, "నమశ్శివాయ" యను పంచాక్షరీమంత్రములోని "మ" యను నక్షరమును చేర్చి రామ శబ్దము కల్పించి దానికి ప్రాముఖ్య మిచ్చినట్లును, అందుచేతనే యీ 'రామ' మంత్రము శైవులకును, వైష్ణవులకును గూడ జపించుటకు యోగ్యమైనదనియును కొందఱు చెప్పుదురు. ఈ'రామ' మంత్రమును శివుఁడు పార్వతి కుపదేశించినట్లు కొన్ని పురాణములు చెప్పుచున్నవి. ఈ'రామ' మంత్రమునకు 'తారక' మంత్ర మనియును పేరుకలదు.

పై విషయముల నన్నిటిని బట్టిచూడ రామాయణములోని కథానాయకుడగు రామునియందుగల మాహాత్మ్యము కంటెను "రామ" శబ్దమునందుగల మాహాత్మ్య మెక్కువగా కానవచ్చుచున్నది. అందుకే 'రామ' శబ్దము మహామంత్రమైనది. ఈ 'రామ'నామము తప్ప మఱియే యితర అవతారముయొక్క నామముగాని యింతపరమ పవిత్రశబ్దముగా పరిగణింపబడలేదు. అందుచే రాముడు చరిత్రపురుషుడనిగాని దేవుడనిగాని చెప్పుకొనుట కంటె "రామ"నామము మహామంత్రమని చెప్పుకొనుట లెస్స. "ఓం"కార మెట్లు పరమపవిత్రముగా భావింపబడుచున్నదో 'రామ' నామమును నట్లే పరమపవిత్రముగా భావింపబడుచున్నది. పురుషుడును-ప్రకృతియు నెట్టివియో రాముడును సీతయు నట్టివారుగనే వాల్మీకి రచించెను. ఇంకను నీ రామశబ్దమును గూర్చి సీతారామాంజనేయసంవాదకారుడు విపులముగాదర్శించి సిద్ధాంత మొనరించెను.

ఈరామాయణ మధ్యాత్మము కావుననే అనేక పండితు లీరామాయణమున కంతటికిని పరమాత్మ పరముగ నర్థమును చెప్పుచున్నారు. ఈరామాయణము చరిత్రాత్మకము కాదనియును, కేవలమాధ్యాత్మికమనియును నిదివఱకే పెక్కుండ్రు మునులు తెలిసికొనినట్లు వారు రచించిన అధ్యాత్మరామాయణము వాసిష్ఠరామాయణము, శతకంఠరామాయణము, విచిత్రరామాయణముల వలన మనకు తెలియుచున్నది. అన్ని రామాయణములలోను నామములు మాత్రమే సరిపోవును గాని కథలు పరస్పరవిరుద్ధములే. ఒకరామాయణములో నుదహరింప

బడినరీతి కథ వేఱొకదానియం దుండదు. ఏందుచేత? ఇది చరిత్రాత్మకము కాకపోవుటచేత వారికి కథ ప్రధానముకాదు. అందలి పరమార్థబోధయే వారికి ప్రధానము.

కావున దీనివలన మనమిట్లు గ్రహింపవలసియున్నది. రాముడు 24 వ త్రేతాయుగమునాటివాడును కాడు. 28 వ కలియుగమునాటి వాడును కాడు, భారత యుద్ధమునకు బూర్వుడును కాడు. పిమ్మటివాడునుకాడు. మనువునకు 57 వ తరమువాడును కాడు. 35 వ తరమువాడును కాడు. ఇతడు కేవలము వాల్మీకి తరమువాడు. వాల్మీకిచే "పరమాత్మ"గా నిరూపింపబడిన పురుషుడు. పురుషు డనగా ప్రకృతి పురుషులలోని పురుషుడు. "సీత" కేవలము "ప్రకృతి"కి మాఱుగా నేర్పరుపబడిన స్త్రీ. ఇంతకంటెను రామాయణమున చరిత్రాత్మక మేదియును లేదు.

వాల్మీకి రాముని మొదట ఇక్ష్వాకు వంశమున జేర్చుటచే మిగిలిన పౌరాణికులును నితనిగ్రంథము ననుసరించి రాముని నిక్ష్వాకువంశమున జేర్చిరి. ఈ చేర్చుటలో పౌరాణికులు పడిన శ్రమకు మితిలేదు. ప్రతి పౌరాణికుడును, అజుడు- దశరథుడు- రాముడు అను మూడు నామములే వరుస తప్పకుండ వ్రాసెనుగాని అజుని తండ్రిని చెప్పవలసివచ్చినప్పుడు ఎవరిదారిని వారే పోయిరి. ఒకపౌరాణికుడు అజునితండ్రి నాభాగుడని వ్రాసెను. మఱియొక పౌరాణికుడు అజునితండ్రి రఘువని వ్రాసెను. మఱికొందరు మఱికొన్ని నామములను వ్రాసిరి.

ఏదెట్లయినను పురాణము లన్నియు రామాయణమునకు పిమ్మట వ్రాయబడినవగుటచే దాదాపుగా నన్ని పురాణములయందును రామకథ చేర్చబడినది.

---

# రామసేవ-హనుమంతుఁడు

పొన్నలూరి సూర్యనారాయణశర్మ గారు

కొలిచితిఁ గొన్ని యేఁడులు రఘుప్రవరుండగు రామపాదముల్
ఫల మొకయింత యాసపడు భావముఁగాంచక ; యట్లుకొల్చి త
ల్లలితపదారవింద మధులాలసతం దనివొంద నైతి : నా
సలుపు సపర్య లాతనికిఁ జాలవొ నర్క విడిపోమె నక్కటా.

యదువంశంబునఁ గృష్ణుఁడయ్యెనని యావ్యాసుండు దాఁబల్కె న
య్యది సత్యంబయినంత నేమగుఁ ? దదీయఖ్యాతి మచ్చిత్త మిం
పొదవం జేయదు ; యోగిమై మునిమనంబుల్ గోపికాచిత్తముల్
కుదుటం బెట్టెనెకాని రాము నటు నాకుం గూర్చెనే హర్షముల్.

ఆతఁడు భూపుఁడయ్యు సకలావనిఁ బోవిడి యయ్యశోధరా
మాతఁ దనూజు డించియు నమానుష భూతదయాళువై జన
వ్రాతము బుద్ధి మార్చెడు నవార్యమనీషుఁడు బుద్ధుఁడైననుం
బ్రీతివహింపఁజాల శ్రుతివిత్తము రాముని మెచ్చునట్లుగర్.

కాయం బా రఘునాథు సేమమునకై కష్టింప భూమీసుతర్
శ్రీ యొప్పాఱఁగఁ గూర్చి యాతని మనశ్చింతర్ వెసం బాపితిర్

మాయామానుషవిగ్రహుండో మఱి యస్మత్త్రీప్రభక్తిస్ఫుర
త్కాయుండో యతఁ డెవ్వఁడో తెలియఁగాఁ గాంక్షింప నాకేటికిన్.

ధనముల్ గోరను; రత్నసంచయము డెందంబందు నాసింప; భూ
మిని దాసీనివహంబు గోవులను నెమ్మిం గోర; నాకేల యా
ఘనసంసారపు లంపటత్వములు? మత్కాయంబు తత్పాదసే
వన కర్పించితి; నాతఁ డిట్లు ననుఁ ద్రోవంజాలె నిర్మోహుఁడై.

తర్కవ్యాకరణాది శాస్త్రచయ ముద్ఘాటించితిన్; యోగసం
పర్కప్రస్ఫుట చిత్తనిర్మలత నాపాదించితిన్; గాని త
త్కార్కశ్యంబున నేమొ రామపద సంధానస్ఫురద్భక్తి నా
కోర్కుల్ దీఱఁగఁ జిత్తముల్ నెఱయ దుత్కూలోత్సుకత్వంబునన్.

అంగదుండుదొట్టి యస్మత్సమీపబాంధవులు ఫలముఁగోరి దైవఘటన
నతని మెచ్చుకున్న నమ్మహామహునకుఁ-గొఱఁత గలదె? యేను వెఱవనేల?

వాలిని గీటడంచి రఘువంశ్యుఁడు భానుజు నేలె: నాసతో
వాలి తదీయరాజ్యమును బట్టఁడు; రాఘవుఁ డంగదున్ మహా
శీలుని యౌవరాజ్య పదసిద్ధు నొనర్చుట రాజ్యలోభమో
వ్రాలిన ధర్మలోభమొ యెవండు నిజంబుగ నిశ్చయించెడిన్?

మనువంశంబునఁ బుట్టి వేదములు ధర్మంబుల్ సమస్తాంగముల్
మనుపంజాలి, ధనుఃప్రచాలనము ధర్మధ్వంసకశ్రేణిపై
వినియోగించిన రాముఁడే యిటుల నుర్విన్ ధర్మముల్ మాపిన
న్మను నే లోకము? లొప్పనే కులము? లుండ న్నేర్చునే ధర్మముల్?

ఎఱిఁగి మెఱుఁగ కాతనిపై - నెరసులు ఘటియించు నవమనీషులతో న
క్కఱలేదు సమాధానము - విరివిగనిడి వానినెల్ల విరియింపంగన్.

గురుఁ డపురా వసిష్ఠమునికుంజరుఁ డాతని; కంతకంటెనుం
గురుఁడఁట గాధిపట్టి యధికుండు శరాసనవిద్య; నిట్టు లి
ర్వురు గురులాతనిన్ వెలయఁ బొందిక నెంతయు దిద్ది తీర్చుటన్
ధరణి రఘూద్వహున్ మిగులు దైవము గల్గునె మెట్టివేళలన్.

జలధరశ్యామహా లలితతనూకాంతి డంబంబు నేత్రపర్వంబునొసఁగ
సౌదామనీలత చందాన వైదేహి యసమానలీలఁ జెల్వారుచుండఁ

కైకయీసుతుఁడు లక్ష్మణుఁడు శత్రుఘ్నుఁడు ఛత్రచామరము హస్తములఁదాల్ప
సామంతభూకాంతసంతతి మౌళిరత్నమ్ములు నీరాజనమ్ములొసఁగ
బాదపీఠి నేను బదములొత్తఁగ ముని-జనము వేదములను జదువుచుండ
నతులదీప్తితో ననర్ఘసింహాసనా-సీను రాముఁ దలఁతుఁ జిత్తమందు.

గురుఁడగు నవ్వసిష్ఠమునికుంజరుఁ డాతని కేమిబుద్ధులం
గఱపెనో నిర్గుణత్వమును గాంచినవాఁడు రఘూద్వహుండు; త
ద్గురునిది యేమిపోయె? నధికుండు నరుంధతిభర్త వేదవి
ద్వరుఁడు తనంతవానిగ నతం డొనరించెనె నన్ను నెన్నఁగన్.

కైలాసాచలకూటపీఠమున రాగద్వేషశూన్యాత్ముఁడై
ప్రాలేయాచల కన్యకాకృతపరీరంభుండునై గౌరికిన్
శ్రీలీలల్ వినిపించుచో రఘువరున్ శ్రీరామువర్ణించి యా
శైలాపత్యము మెచ్చఁగాంచునఁట యాశ్చర్యంబుగా నెంతయున్.

రామదేవుని గుణరత్నముల్ వర్ణించి, వాల్మీకిసుకృతియై వన్నెకెక్కె
దాశరథి విరహదశనువర్ణించి యా, భవభూతి ధరఁ గవివర్యుఁ డయ్యె
భావనాపటిమ యేర్పడఁగ రామునిఁగొల్చి, బమ్మెరపోతరా జిమ్ముఁ గాంచె
శతసంఖ్యకృతులఁ గౌసల్యాత్మజు నుతించి, త్యాగయ్య భక్తమూర్ధన్యుఁడయ్యె
గౌశికుఁడు వసిష్ఠుఁడు నాదిగలుగుమునులు-చెలఁగి శ్రీరాము నాశీర్వచింపఁగనిరి
రామభక్తిసామ్రాజ్యధూర్వహులువారు-తత్పదాంబుజరజమునన్ ధన్యుఁ జేయు.

వారలమాట నేను నుడువంబనియేమి? యయోధ్యయందు నా
శ్రీరఘువంశ్యుఁ డొందు నభిషేకముఁ గన్నులఁ గాంచినాఁడఁ; ద
ద్భూరిగుణంబులందుఁ గల పొందిక యెందును జూడవచ్చునే?
యారఁ ననుం దొరంగి చనె నాతఁడు హేతువులేక యెంతయున్.

కాంచినపురములఁ గలయంగ వెదకితిఁ, గౌసల్యసుతు నందుఁ గాంతుననుచుఁ
గనినస్రోతోవహల్ గడఁకమై వెదకితి, దశరథాత్మజుఁ డందుఁ దగులుననుచుఁ
జూచినకానలఁ జొఱఁబాఱి వెదకితి, శ్రీరాము నందుఁ గాంచెదనటంచుఁ
గాన్పించుశిఖరి శృఙ్గములపై వెదకితి, నుర్వీజపతి యందు నుండునంచు
యోగమహిమచే నాతండ్రి నొనరఁగలసి-ప్రాణిహృద్గుహాలకుఁ జొఱఁబాఱివెదకి
యుంటిఁగాని శ్రీరాము నేనొకటనైనఁ-గనఁగనైతిఁ దచ్చరితంబువినుట దక్క.

సరయూర్మికలును నిర్ఝరతరంగిణియు నా శ్రీరామదేవు వర్ణించి పాడుఁ
గాళిందియును మహాగౌతమీనదియు నా రారాజు కీర్తి వర్ణనము సేయు

విపులపంపయుఁ గృష్ణవేణియుఁ గావేరి యారామభద్రుని నరసి పొగడు
దక్షిణోదధి సముద్భట భంగఘోషముల్ శ్రీరామచంద్రుఁ బూజించిపలుకఁ
బరభృతకుహూకుహూగానపఙ్క్తులందు-భ్రమరఝుంకారములయందు వైణికాళి
వల్లకులయందు నదిగో నాయుల్లమలర-రామదేవుని దివ్యకీర్తనము వెడలె.

రామాయణపారాయణ-మే మహనీయు లొనరింతు రెప్పుడు, నే ద
వైవ్వ మసలియు నటఁజేరి శ్ర-వోముదముగ విందు రాఘవుఁ భక్తిమెయిఁ.

రామదేవుని దివ్య హర్మ్యముల కెదుర - న్నాప్రపన్నత మెచ్చి పుణ్యాత్ములచట
నిలువ నీడయొసంగి మన్నించుచున్న-వారు; వారలు సుఖమొందువారు సతము.

అడుగులొత్తెదను రామా, రాఁగదే నన్ను దయఁజూడవే నీకు దండమిడుదు
ఫలము లిచ్చెదను దేవా, రాఁగదే భక్త సంప్రీతిఁజూపవే సరస నిలిచి
తులసిమాల లొసంగుదును రామ, రాఁగదే తృప్తిఁజూపవే దండఁజేరి
పాడెద భవదీయభవ్యచారిత్రముల్, వినఁగదే! రాఁగదే విపినములకు
నద్దికొనెదఁగన్నులకునీయడుగుదోయి-నిన్ను మూఁపునమోసెదనిన్నుఁగొలుతు
నిన్నుఁగాంతు నిన్ విందు నినుఁ దలంతు-రామ, శ్రీరామ, జానకీరామ, రామ.

జనని, విదేహరాట్తనుజ! చయ్యన నామొఱయాలకించి మీ
జనములతోడ నీవు రఘుసత్తముఁడున్ దయచేసి మత్సమ
ర్చనములఁగొండు! మీర లనురాగమునం గనుఁడీ! యరణ్యరో
దనముల వానిఁజేయక కృతార్థునిజేయుఁడి! కీర్తిఁ గాంచుఁడీ.

భాగీరథీప్రాంతవనముల నాతని, రాకకై యున్నాఁడు నాకుభవుఁడు
హిమభూమిధరభూమి నీతనికోసమై, కన్నెట్టుకున్నాఁడు కౌశికుండు
గౌతమీనదికిఁ జెంగటన "రామా" యంచుఁ, గుందుచున్నాఁడు దా గోపనాఖ్యుఁ
డల్ల కావేరీమహారామముల "రామ, దయఁజూడుమనువాఁడు త్యాగరాజు
ఊరకొనక యింటింటను నూరనూర-నెమకుచున్నాఁడ నెచటఁగాన్పించు ననుచు
మాయవస్థలు తెలిపి రామావనీంద్రుఁ, బనుపరే కృప వైకుంఠవాసులార!

ఆతఁడు మాకు ద్రవ్య మిసుమంతయు నీయఁగవద్దు; తమ్ములన్
సీతమతల్లినిం గొని విశిష్టరఘూద్వహచిహ్నధారియై
యీతఁడె వచ్చెనేని యదియే పదివేల్; కనులారఁ జూచి మా
చేతములందు సమ్మదముఁ జెంది సుఖింతుము కొంతకాలమేన్.

---

# అరవమునందలి ఴ అను వింతయక్కరము తెలుగునగలదా?

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి గారు

### పీఠిక

ద్రావిడభాషలో ఴ అను వింతయక్కరమొకటి కలదు. ఇది ష, ళాదిధ్వనుల సమ్మేళనము గలిగి విలక్షణముగా నుండుటచే దీనిని వింతయక్కరమని కీ. శే. కొ. వేం. లక్ష్మణరావుపంతులవారు వాడియుండిరి. ఈవింతయక్కరము ద్రమిళమళయాళములలో నిప్పటికిని గలదు. కర్ణాటభాషలో బూర్వ ముండెడిది కాని యిప్పుడు లేదు. ఇది తెలుగులో నెప్పుడును నున్నట్లు గాన్పింపదు. ఏమన, ద్రమిళమళయాళకర్ణాటభాషలలోని లక్ష్యగ్రంథములందును లక్షణగ్రంథములందును గూడ నిది యున్నరీతిగా నాంధ్రలక్ష్యలక్షణగ్రంథములలో లేదు. మనలో నన్నపాథర్వణకేతన లతిప్రాచీనులగు లక్ష్యలక్షణగ్రంథకారులు. వీరు వ్రాసిన వ్యాకరణగ్రంథములందుగాని కావ్యములందుగాని యీ విలక్షణాక్షరము పొడకట్టదు. కాన నిది యాంధ్రమున లేదను వాడుక పుట్టినది. ఇట్లుండ యుద్ధమల్ల శాసన పరిశీలనములో నిద్దానిని కొందఱు కనిపెట్టితి మనుచున్నారు. ఆశాసనములోని డస్సి అను పదమునందలి మొదటి యక్కరమును అడిసిన, అడిపుట అను శబ్దములందలి ద్వితీయాక్షరములును శాసనమునందలి యితర డకారములవలె లేక వేఱురూపము కలిగియున్నవి. అడ్డుగీటు లేని శకటరేఫ మెట్లుండునో యట్టిరూపము (ఱ) నీయక్షరములు దాల్చియున్నవి. అయినను నీశాసనపరిశోధనము గావించిన బ్రహ్మశ్రీ మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులుగారు వీనిని 'డ'లుగనే చదివిరి. పిమ్మట నీయది "ఎపిగ్రాఫియా ఇండికా" అను పత్రికారాజములో ప్రచురింపబడినది. ఆపత్రికాసంపాదకు లీయక్షరత్రయమును నరవమునందలి విలక్షణాక్షర (ఴ) ధ్వని కలదానినిగా జదివిరి. వారివ్రాతలం గని లక్ష్మణరావుపంతులవారరవమునందలి వింతయక్షరమును, ధ్వనియును యుద్ధమల్లశాసనకాలమునాటికి దెలుగునగూడ నుండెడివనియు దరువాత లోపించిన వనియు యుద్ధమల్లశాసనమునందలి పై పదత్రయమును విలక్షణాక్షరయుతము కాని డకారయుతము కాదనియు దెలుపుచు నొక వ్యాసమును వ్రాసి యాంధ్రసాహిత్యపరిషత్పత్రికలో బ్రచురించిరి. వారి వ్యాసముపై నే నొక విమర్శనమువ్రాసి యాపత్రికా రాజములోనే ప్రకటించితిని. అందు యుద్ధమల్లశాసనమునందలి పై పదత్రయమును డకారముతో గూడియున్నదికాని వింత యక్కరముతో గూడియుండలేదనియు వింత యక్కరము తెలుగున నెన్నడును లేదనియు సప్రమాణముగా లిఖించితిని. దానిపై మరల లక్ష్మణరావుగారి శిష్యులగు మ.రా.రా. శ్రీ కానూరి వీరభద్రేశ్వరరావుగారు పునర్విమర్శనము వ్రాసి లక్ష్మణరావుగారి వాదమునకు నండ నొసంగిరి. ఇదియంతయు లక్ష్మణరావుగారు సురక్షితముగ జీవించియున్న కాలముననే జరిగినది. పిమ్మట శ్రీవీరభద్రేశ్వరరావుగారి వాదమును ఖండించుచు నేనొక వ్యాసమును వ్రాసి పరిషత్పత్రికయందే ప్రచురించితిని. దానిపై నిదివఱకు డకారవాదులుగా నున్న శ్రీ జ. రామయ్య పంతులుగారెదురుతిరిగి యుద్ధమల్లశాసనమునందలి వివాదస్థపదత్రయమును వింతయక్కరముతో గూడినదే కాని డకారయుతము కాదనియు, తాము మొదట బరిశీలనము బాగుగ జేసియుండక డకారయుతమని తప్పువ్రాసితిమనియు, యుద్ధమల్ల శాసనాంతము వఱకే వింతయక్కరము తెలుగు లిపిలో నుండెడిదనియు వాదించుచు నొక వ్యాసమును వ్రాసి పరిషత్పత్రికలో బ్రచురించిరి. అందుపై మా యుభయులకు వాదోపవాదములు కొంతవఱకు నడచినవి.

ఈవివాదము విద్యావిషయికమైనదియు, భాషా చారిత్రముతో సంబంధించినదియు కావున భాషాభిమానులెల్లరును దీనియందలి సత్యాసత్యములదెలిసికొన యత్నింపదగియున్నది. కావున నాంధ్రభారతి విశేషమం

డెలుపు నీఘనవిషయము పత్రికా రాజమగు నీభారతిలో శ్రీరామయ్యపంతుల వారి వాదమును విమర్శించి యాంధ్రాక్షర సమామ్నాయముయొక్క విలక్షణాక్షర విరహితత్వమును బుజువుచేయుచున్నాను. భాషా చారిత్రము నందభిమానము గల వారీవ్యాసము నామూలాగ్రముగ జిత్తగింతురుగాక!

నేను శ్రీ రామయ్యపంతులవారి వాదమును విమర్శించుచు వ్రాసిన వ్యాసముపై బునర్విమర్శనముగావింప బూని శ్రీపంతులవారీ క్రింది ప్రకటనమును బ్రారంభమున గావించిరి.

“బ్రహ్మయ్యశాస్త్రిలుగారు ప్రకటించిన వ్యాసములోని సారాంశములన్నిటికిని సమాధానము నా ప్రథమ వ్యాసమందేయున్నది. వాని నిచట నుదాహరించుట పిష్టపేషణమగునుగాన నట్లుచేయక వారివ్యాసమందలి పొరపాటులను గొన్నిటిని గనుపరచి విరమించెదను”

ఈవ్రాత వింతను బుట్టించుచున్నది. ప్రధానాంశములకు సమాధానము తమ మొదటి వ్యాసములోనే యున్నయెడల తా మీద్వితీయవ్యాసమును వ్రాయుట యనవసరము. నావాక్యరచనములో గల పొరపాట్లను విమర్శించుటకు మాత్రమే దీనిని వ్రాసిరట. నాయట్టి వాని వ్రాతతప్పుల నెత్తిచూప పంతులవారివంటి వారు గడంగవలసినదికాదు. అట్లుచేయుట వట్టియాకదంపగును. అందువలన లోకమునకువచ్చు లాభ మేదియునుండదు. ప్రధానాంశచర్చయే ముఖ్యమును, లోకమునకు లాభదాయకమునునై యుండును. తమ మొదటి వ్యాసముపైని నేనెప్పుడో తెల్పబోవు ప్రధానవిషయికమైన యాక్షేపణమునకు సరియగు సమాధానములు ముందుగా మొదటి వ్యాసమునందే కలవనుట యాశ్చర్యదాయకమైయున్నది. పంతులవారీరీతిగానెట్లు వ్రాసిరో కాని నా వ్యాసము వలన దేలుసారాంశములకు వారి మొదటి వ్యాసములో సమాధాన మెంతమాత్రమును లేదు. చదువరుల యుపయోగార్థమై యాప్రధానాంశముల నిచట మరల జూపుచున్నాడను.

## సారాంశ ప్రశంస

ఒకధ్వనికి రెండు సంజ్ఞలు ఎన్నడు నుండవనియు, నుండినను నొక్కచోటనే యొకలేఖకునిచేతనే యెన్నడును వ్రాయబడవనియు, యుద్ధమల్ల శాసనములో డకారమును దెలుపుసంజ్ఞ వేఱొకటియుండగ నందేయున్న యడ్డుగీటులేని శకటరేఫాకృతినిగూడ డకారధ్వనినిదెలుపునదిగా భావింపరాదనియు,నయ్యది భిన్నధ్వనిని దెలుపు భిన్నాక్షరమై యుండుననియు ప్రతివాదులు వాదించుచున్నారు. ఇది వారివాదమునకుమూలకీలకమైయున్నది. ప్రతివాదుల వాదమంతయు దీనింబట్టియే పుట్టినది. ఈ ప్రధానాంశమునే నేను నావిమర్శనమునందు బూర్తిగ జర్చించి ప్రతివాదులమతమును ఖండించియున్నాను. ఎట్లన, నాగరలిపియందుగల యొక్కశాసనమునందు లకారాదులకు రెండుసంజ్ఞ లుండుటను నేను జూపియున్నాను.* కన్నడశాసనములలో వింతయక్కరమున కీరెండు రూపములు లేకకాలమునవే యున్నట్లు కనబరచియున్నాను. ఇతర లిపులమాట మనకేల యందులేని మన తెలుగులిపియందే ఒకధ్వనికే రెండుసంజ్ఞ లుండుట కలదని బుజువుచేసియున్నాను. కకారమునకు రెండు సంజ్ఞలు కలవు. అచ్చులోని దానివలెనుండు కకారమొకటి; మూడంకవలెనుండు కకారము మఱియొకటి. నకారమునకు రెండు సంజ్ఞలు గలవు. అచ్చుదానివలె నుండునది యొకటి. నిలువుగీటువలె నుండునది యొకటి. పకారమునకు రెండు సంజ్ఞలు గలవు. తలకట్టు విడిగ నుండునది యొకటి. వకారముపై బొట్టుంచుటచేనైన దొకటి. సకారమునకు రెండు సంజ్ఞలు గలవు. తలకట్టు వేఱుగ నుండునది యొకటి. నకారముపై బొట్టుంచుటచేనైన దొకటి. డకారమునకు రెండు మూఁడు సంజ్ఞలు గలవని పంతులవారే

---

* శ్రీ గిడుగు వేంకటసీతాపతి పంతులు (బి. ఏ., యల్. టి.) గారు అనంతవర్మ చోడగంగదేవుని కొర్నిశాసనములు శక 1003 (భారతి ౨-సంపు. ౮ సంఖ్య.) శాసనములో నకారమునకు రెండుసంజ్ఞ లున్నట్లు వ్రాసియుండిరి. ఇది నాగరలిపిలోనున్న శాసనము.

యంగీకరించి యున్నారు. ఇంతయేల? మనవారు చెప్పు వింతధ్వనికే రెండుసంజ్ఞలు కలవని ప్రతివాదులే వ్రాసిరి. ఇక హల్లులలో నొకధ్వనికి రెండుసంజ్ఞ లుండవనుట వింతకాదా? ఒక్కచోటనే యుండుట కలదాయందురేని అదియును గలదని నేను ఋజువుచేసియే యున్నాను. ఎట్లన: వీరేశలింగము పంతులుగారు తమస్వీయచరిత్రములో భార్యకు కృతియిచ్చు సందర్భమున రెండు కకారములును వాడిరి. 'క్ష' యను నక్షరమున మూడంకెవలెనుండు కకారమును దక్కినతావుల నా పుటయందే యచ్చునందున్నరీతి కకారమును వాడియుండిరి. ఇది సంయుక్తాక్షరముతో నంతర్భూతమైనందున వచ్చినమారురూపమని పంతుల వారు ప్రయత్నించిరికాని యట్లు చెప్పుట కవకాశములేదు. ఏమన, సంయుక్తములో నడుగుననుండు నక్షరరూపము మారునుగాని పైన నుండునది మారదు. అచ్చులో విడిగనుండు కకారమును, క్షకారము అను సంయుక్తాక్షరములో పైననుండు కకారమును నొకవిధముగనే యున్నవి కాని మార్పులేదు. కావున సంయుక్తాక్షరములో నంతర్భూతమైన కారణమున నచ్చిన మార్పనుటకు వలనుపడదు. అదిగాక కం. వీ. పంతులుగారి చేవ్రాలులోనున్న కకారము మూడంకవలెనుండు కకారముగా నున్నది. ఇది ప్రత్యేకముగా నున్నదికాని సంయుక్తములో నంతర్భూతమై లేదు. ఈవ్రాలును గృతియిచ్చు వాక్యములసమీపముననే యున్నది కాన వీరేశలింగముగా రొక్కచోటనే రెండుకకారములును వాడిరనుటకు సందియ మెంతమాత్రమును లేదు. ఇంతయేల, నొకధ్వనికే రూపభేదము లున్నప్పుడు లేఖకులు వానిని స్వేచ్ఛగా నొక్కతావుననే వాడుచుందు రనుటకు సంశయింప బనిలేదు. ఎల్లరును వానిని ఇచ్చవచ్చినట్లు వాడుదురు. వారిమాటయు వీరిమాటయు నేల? మనరామయ్యపంతుల వారే తాము వ్రాసిన వ్రాతలలో నొక్కధ్వనికే రెండు సంజ్ఞలు వాడితీరిరి. నాయొనర్చిన మంగతాయిపై వీరు తమయభిప్రాయ మును వ్రాయ చేసియుండిరి. వీ రందులకై వ్రాసిన వాక్యములలో పైజూపబడిన నకారద్వయము వాడబడి యున్నది. చదువరుల యుపయోగార్థమై యా వాక్యముల నీక్రింద నిచ్చుచున్నాడను.

"బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రులు గారు రచించిన "మంగతాయి" యను నాటకము చదివినాను. సాంఘికాచారసంస్కారవాదులలో కొందఱు దాంభికులు గలరనియు, వారిదాంభికత్వమును బయలుపఱచుట యుచితమనియు దలచి శాస్త్రులుగా రీగ్రంథము రచించినట్లు తోచుచున్నది. కవిత్వము ధారాళముగాను సరసముగాను నున్నది.

జ. రామయ్య."

ఇందు పదుమూడు నకారము లున్నవి. వానిలో పైన చుక్కగల నకారము లైదును వంపులేని నిలువు గీటువలె నున్నవి. తక్కినవి నంపుగల నకారములై యున్నవి. శ్రీ పంతులవారు 'న' అను ధ్వనినే రెండు విధముల వ్రాసిరి. కావున నొకధ్వనికే రెండుసంజ్ఞ లుండవనియు, ఉన్నను నవి యొకతావుననే వాడబడవనియు బ్రతివాదులుచేయు సిద్ధాంతము పూర్ణముగా బూర్వపక్షమైపోయినది. ఈరీతిగా బ్రతివాదులు వేసికొన్న పునాదియే కదిలిపోయినది. ఇంకను యుద్ధమల్ల శాసనమునందే ఉకారమునకు మూడురూపములును, ఏత్వమునకు రెండురూపములును, ఓత్వమునకు రెండు రూపములును, క్రారకు రెండురూపములును వాడబడి యున్నవి. కావున నందు డకారమునకు రెండురూపము లెట్లు వాడబడియున్నవని శంకించుటకు బ్రతివాదులకు సందెంతమాత్రమును లేదు.

ఇక మనపూర్వాంధ్రలిపి కర్ణాటాంధ్రలిపి యనియు, రెండు భాషలకును నొక్కటియే వాడబడు చుండెడిదనియు నీ లిపిలో గర్ణాట భాషయందలి వింతయక్కరము వ్రాయవలసి వచ్చినప్పుడు అడ్డుగీటు లేని శకటరేఫాకృతియే వాడబడుచుండెడిది గాన నట్టియాకృతియే తెనుగు శాసనములలోగూడ గాన్పించినప్పుడు రెండు భాషలకును గల సంబంధమునుబట్టియు లిప్యైక్యమునుబట్టియు దెలుగునందు గలది కన్నడమునందలి వింత యక్కరమనుకొనుటయే యుచితమని ప్రతివాదులు వాదించుచున్నారు. ఈవాదముగూర్చి మచ్చటించు కొందము. రెండు భాషలకును సంబంధమున్న

మాట సత్యము. ఐనను రూపసాదృశ్యముగల సోదరు లెప్పుడును సర్వవిధముల నొక్కరూపమున నుండక యెట్లు గొన్నిట భేదించియుందురో యారీతిగనే కర్ణాటాంధ్రములు రెండును సాదృశ్యమును, భిన్నతయును గూడ గలిగియున్నవి. కొన్ని యుదాహరణముల మఱల నిచ్చెద అనుస్వారము కర్ణాటాంధ్రలిపిలో గాన్పించి నప్పు డక్షర రూపమునందు భేదమించుకయు లేకపోయినను, భాష కర్ణాటమై యుండుచో దానినిబూర్ణానుస్వారముగా నుచ్చరించితీరవలెను. భాష యాంధ్ర మగుచో నారీతి నుచ్చరించుటకు వలనుపడదు. ఒకచోట బూర్ణానుస్వారముగా నెంచి దానిని బూర్ణముగా నుచ్చరింప వలెను. మఱికొన్నితావుల నర్ధానుస్వారముగా నెంచి యుచ్చరింపక విడువవలెను. ఎట్లన: యుద్ధమల్లశాసనము లో విస్తర శ్రీ యుద్ధమల్లుండని యున్నది; కాని దానిని మల్లుండని యుచ్చరింప వలనుపడదు. రామయ్యపంతుల వారు మల్లుడనియే చదివిరి. మల్లుండని చదువలేరు. ఈశాసనమే కర్ణాట భాషలోని దయిన యెడల వీరట్లు చదువగలరా? అందు బూర్ణానుస్వారము నుచ్చరించి తీరవలెను. ఇంకను నీశాసనమందుగల రాజాశ్రేయుండను పదమునందలి జకారమును తాలవ్యముగాను, బెజవాడ యను పదమునందున్న జ కా ర మును దంత్యముగాను మన ముచ్చరించితీరవలెను అక్షరరూపమునందుమాత్రము భేదమించుకయునులేక యిదియే కర్ణాటభాషయందున్నచో నిందున్న జకారము లన్నిటిని తాలవ్యములు గానే చదువవలెగాని దంత్యములుగా జదువుటకు వలను పడదు. లిపి యొక్కటియైనను నక్షరధ్వను లాయా భాషల సాంప్రదాయము ననుసరించి భిన్నముగా నుండు నని మన యుద్ధమల్లశాసనమువలననే తేలుచున్నది. కాబట్టి కర్ణాటాంధ్రలిపియందు గల అడ్డుగీటులేని శకట రేఫాకృతికి కర్ణాటభాషయందున్నప్పు డేధ్వనియున్నదో యాధ్వనియే తెనుగుభాషయందున్నప్పుడు నుండి తీరవలెనని సిద్ధాంతముచేయబోవుట యెంతమాత్రమును ధర్మముకాదు. నే నీవిధముగాచేసిన పయియాక్షేపణ ములకు వేనికిని రామయ్యపంతులుగారు తొలివ్యాసములో సమాధాన మింతయు నీయలేదు. ఇవి ప్రతివాదులవాదము యొక్క పునాదినంతను ధ్వంసముచేయు నంశములుకాని సామాన్యములు కావు. వీనికి సమాధానముల నీయకయే "(బ్రహ్మయ్యశాస్త్రి)లుగారు ప్రకటించిన వ్యాసములోని సారాంశము లన్నిటికిని సమాధానము నా ప్రథమవ్యాస మందే యున్నది" అని వ్రాయుట కవకాశ మెట్లుకలిగినదో తెలియవచ్చుటలేదు. ఆసమాధానము లెచ్చట నున్నవో దయయుంచి చూప వినయపూర్వకముగా వారిని వేడుకొనుచున్నాడను.

ఒకధ్వనికే రెండుసంజ్ఞ లుండుట మనలిపిలో కలదు. కావునను, విశేషించి యుద్ధమల్లశాసనలిపియందే యజ్ఞ్వియమునసే కాక హల్వియమున గూడ గాన్పించుచున్నది కావునను, నొకయక్కరమునకు కర్ణాటకభాషయం దే ధ్వనియున్నదో యాధ్వని తెలుగు నందును నుండుటలేదు కావునను, యుద్ధమల్లశాసనము లోని యడ్డుగీటులేని శకటరేఫాకృతులకు వింతయక్కరపు ధ్వనిని తెలుపుదు మనుట యొప్పిదముగా గాన్పించుట లేదు. అదిగాక యట్లుచెప్పిన హానికూడ వాటిల్లు చున్నదని నేనిదివఱకే యజువుచేసియున్నాను. ఎట్లన,

## హేత్వర్థకప్రశంస

యుద్ధమల్లశాసనములో "నీయొట్టు లస్సినలి నురై" అని యున్నది. ఇందలి 'ఒస్సి' శబ్దమును 'డస్సి' యని చదివిననే యర్థము కలదు కాని ఒస్సి యని చదివిన నర్థము లేదు. ఏమన, ఒయ్యుధాతువు ద్రావిడభాషలయందు వే ని య ం దు ను గాన్పించుట లేదు. ఈ యంశమును ప్ర తి వా దు లు నంగీకరించిరి. ఇంక శాసనమునందలి డయ్యు ధాతువుయొక్క త్వార్థకరూప మనుకొనుటకు సందియమేమున్నది? దానిని ఒస్సిఅని చదువుకొనవలసి యుండుటకు వీరేమి యుపపత్తుల గన్పఱచిరి? అవి ఏవియును వీరు చూపలేదుకాని తొమిది యకర్మకమగు డయ్యుధాతువనియు, నిచటసకర్మకముగా వాడబడినదనియు వ్రాసిన వ్రాతను నేను విమర్శించి యిచటకూడ నిది యకర్మకమే యనియు హేత్వర్థకమనియు వ్రాసిన దానినిమాత్ర మించుక విమర్శించిరి. సమాపకాసమాపకక్రియ లేకకర్తృకము

లైనప్పుడును, కార్యకారణ సంబంధము కలిగినప్పుడును మాత్రమే హేతుక్త్వార్థక మన్వయించుననియు నీరొట్టు డస్సి మలినులై యున్నచోట నవిలేవనియు కావున నిది హేతుక్త్వార్థకమనుటకు వలనుపడదనియు సకర్మకముగా చెప్పితీరవలెననియు వీరు వ్రాసిరి. ఇదిసరియగు వ్రాత కాదు. హేతుక్త్వార్థక విషయములో నీచర్చ యనవసరము. అదియటులుండ, నిచట కార్యకారణ సంబంధ ములేకపోలేదు. "నీరొట్టు డస్సి మలినులై"యని నప్పు డెవరియెడల నీరొట్టు డస్సినదో అనగా శిథిలమయినదో వారు మలినులైయని యన్వయము. "వీరివలన నారొట్టుడస్సినచో సంబంధమేర్పడును" అని పంతులవారు వ్రాసియునుగూడ వాక్యమట్లన్వయింపదనిరి. కాని వాక్యమట్లన్వయింపకపోదు.

కవి కుల సార్వభౌముఁడగు కాళిదాసు తన రఘువంశములో

శ్లో॥ దిలీపానంతరంరాజ్యే
　　　తంనిశమ్యప్రతిష్ఠితమ్;
పూర్వంప్రధూమితోరాజ్ఞాం
　　　హృదయేగ్నిరివోత్థితః.

అని లిఖించియున్నాఁడు.

దిలీపానంతరమున రఘుమహారాజు పట్టాభిషిక్తుఁడైనాడని విని శత్రురాజుల హృదయములయందురవులుచున్న సంతాపాగ్ని మండుటకు ప్రారంభించినదని దీని భావము.

ఇట వినిన వారు శత్రురాజులు. మండుచున్నది సంతాపాగ్ని. రఘువు పట్టాభిషిక్తుడైనాడని వినుటచే నాతడు తమ్మను సంహరించునను భీతి నెవరు పొందిరో యట్టి శత్రురాజుల హృదయములందు సంతాపము ప్రజ్వలించెనని దీనిభావము. 'నిశమ్య'యను ల్యప్పుమూలముగా నింతభావము చెప్పుకొనుట కవకాశము చిక్కుచున్నది. మఱియును నైజయంతీవిలాసములో

"కాకులు రావిపండ్లు దిని కాఱుశిలామయ దేవ మందిరా, నీకములందు రావులుజనించును"అనియున్నది. కాకులు రావిపండ్లు దినుటచే కారుశిలామయ దేవమందిరా నీకములందు రావులు జనించునని దీనిభావము. ఇచట కాకులు రావిపండ్లుదిని దేవమందిరానీకము లందు రెట్టవేయగా నాకారణమున వానియందు రావులు జనించునని సమన్వయించుకొనవలెను. ఇంత సమన్వయమునకు హేతుక్త్వార్థక మవకాశ మిచ్చుచుండగా ఒట్టు డస్సి మలినులై యన్నప్పుడు ఒట్టెవరివలన డస్సినదో వారు మలినులైరనుటకు అవకాశము లేకపోలేదు. మన తెలుగున నిట్టి సమన్వయముగల హేతుక్త్వార్థక యుత వాక్యము లనేకములు గలవు. 'వర్షము కురిసి చెఱువు నిండె' అని మనము పల్కుదుము. కురిసినదివర్షము; నిండినది చెఱువు. వర్షమువలన నేలపైబడిన నీరు లోనికి ప్రవహింపగా చెఱువునిండినదని తేలుచున్నది. మైల వచ్చి మలినులైనవారు గుడిలోనికి రాగూడదు. వచ్చినది మైల. మలినులైనవారు మనుష్యులు. ఇట్లే తెలిసికొనునది.

కావున నిచ్చటి డయ్యుధాతు వకర్మకమనియు, డస్సి యనునది దాని హేతుక్త్వార్థక రూపమనియు నెంచుకొని వాక్యమును చక్కగ నన్వయింపజేసికొనుటకు ఏవిధ మగు నభ్యంతరమును లేదు. అది యటులుండ బంతులవారు తెలిపినట్లుగా నిచట సకర్మకముగా నాడబడినదనినను నస్మద్వాదమునకే వినియోగించునుగాని ప్రతివాదుల విలక్షణాక్షర వాదమున కెంతమాత్రమును వినియోగింపదు. ఈశాసనమునయున్న డస్సియను పదము సకర్మకమైననేమి? అకర్మకమైననేమి? డకారధ్వనియుత డయ్యుధాతువుయొక్క క్త్వార్థకమని నప్పుడే వాక్యమర్థవంతమగుచున్నది కాని విలక్షణాక్షరయుతమనుచో నర్థవంతమగుటలేదు. అట్టి యర్థమును ప్రతివాదు లెవరును చూపగలిగియుండలేదు. ఇంక నేలవిడిచి సాముచేయుట వలని ప్రయోజనమేమి? ఒకధ్వనికే రెండు సంజ్ఞలుండునని నేను సహేతుకముగా రుజువుచేసియున్నాను. ఆంధ్రకర్ణాటలిపిలోని యక్కరముల రూపమునకు కర్ణాటభాషలో నున్నప్పుడొక యుచ్చారణమును, నాంధ్రభాషలో నున్నప్పుడు మఱియొక యుచ్చారణమును కలిగియుండుటను జూపియున్నాను. యుద్ధమల్ల శాసనమునందలి 'డస్సి'యను

శబ్దము డకారయుతమనినవర్థసమన్వయము కలుగుటయు, విలక్షణాక్షర యుతమనిన వాక్యము నిరర్థక మగుటయు నేను జూపియున్నాను. ఇందున్న అటసిన, అటుపుట అను పదములు మన తెనుగునందలి అడుచు ధాతువుతో సంబంధించినవే యనియు, అడిచిన, అడుపుట లేయనియు నట్లుచెప్పుకొనిన నర్థసమన్వయమున కేవిధమగు లోప మునులేదనియు నేను వ్రాసియున్నాను. దానిపై బం తులవారు ఏ విధమగు నాక్షేపణమును జేసియుండలేదు. యుద్ధమల్ల శాసనమునందున్న యడ్డుగీటు లేని శకటరేఫా కృతి డకారధ్వనికలదియేకాని మఱియొకటి కాదనుట కింతకన్న వేఱు ఋజువేది కావలయును?

## ప్రతివాదుల మతముంబట్టి యీ యక్కర మాంధ్రమున నెంతకాలమున్నది?

అడ్డుగీటు లేని శకటరేఫాకృతి మన తెనుగులిపిలో వాగను శాసనుని కాలమునందునను దర్వాతనుగూడ గాన్పించుచుండగా లక్ష్మణరావుగారి పక్షమువారుగూడ నట్లే వ్రాసియుండగా శ్రీ రామయ్యపంతుల వారు తాము మొదట నట్లు వ్రాసియును గూడ నిటీవల నింతయక్కరము యుద్ధమల్ల శాసనమువఱకు మాత్రమే నిలిచినదనియు నన్నపాదుల నాటికీయక్కరము నశించి పోయినదనియు వ్రాసిరి. ఇది వింతను బుట్టించుచున్నది. వీ రీవిషయమై యిప్పటి వ్యాసములో నిట్లు వ్రాసిరి.

"యుద్ధమల్లశాసనమునందును, అంతకు బూర్వము పుట్టిన కొన్ని శాసనములలోనుమాత్రమే యీయక్షరము కనబడుచున్నదనియు, యుద్ధమల్ల శాసనకాలము పిదప బుట్టిన శాసనములలో నెచ్చటను గానవచ్చుటలేదనియు, కావున నన్నయభట్టారకుని నాటి కది యంతరించియుం డుననియు నావాదము. ఈవాదమును బాధించు ప్రమాణ ములు నాకు గనబడలేదు."

ఇది సరికాదు. యుద్ధమల్లుని శాసనమునకు బిదప బుట్టిన శాసనములలో నెక్కడను వింత యక్కరము తమకు గాన్పింపలేదట. కాన నీయక్కరము తరువాత లేదందురట. ఇది ధర్మమా? తమతోడి విలక్షణాక్షర వాదులగు లక్ష్మణరావుగారి పక్షమువారీ యక్కరము నన్నయభట్టు తరువాతనుగూడ గనబడినదని శాసనపరి శోధనముచేసి వ్రాసియున్నారు. తమకు గాన్పింపని యెడల వారినడిగియైన తెలిసికొనవలదా? అది యట్లుండ. బెజవాడలోని యింద్రకీల పర్వతమునిూది శాసనములో 'ఏటు' శబ్దమునం దిది గలదని లక్ష్మణరావుగారు వ్రాసిరి. అది పంతులవారియుద్ధమల్లశాసనమునకు దరువాతిదే, ఈ శాసనము రామయ్యపంతులుగారు ప్రకటించెనదేకాదా ఇంకను లక్ష్మణరావుగారు ౯౪౫ మొదలు ౯౭౦ వఱకు పరిపాలనము చేసిన విజయాదిత్య ద్వితీయామ్మరాజు యొక్క కలుచెఱ్ఱ శాసనమునం దిది కలదనిరి. దానిని పరిశీలింపవలదా? ఇది యుద్ధమల్ల శాసనముకంటె నూ ఱేండ్లు తరువాతిది. నేను నావ్యాసములో నారాయణ భట్టు కూతురకు సప్పమ్మ వేసిన శాసనములోనగువానిలో నీయక్షరమున్నదని వ్రాసియున్నాను. వానినైన విమ ర్శించి పిమ్మట తమవాదము నిలుపుకొనవలదా? ఇంత యేల, యుద్ధమల్లశాసనమున కీవలగూడ గొన్ని శతాబ్ద ములవఱకు నీయక్షరరూపము మన తెలుగులో గలదని మన రామయ్యపంతులవారి యిప్పటి వ్రాతలవలననే రూఢిపడుచున్నది. అట్టిదానిని మన రామయ్యపంతుల వారే తమప్రథమవ్యాసములో నుదాహరించియేయున్నా రు. తమవ్యాసములో (సం.౧౫, సంచిక౪. పరిషత్పత్రిక సంపుటము) పుట 11 లో ద్వితీయచాలుక్యభీముని మచిలీ పట్టణపు శాసనమందు మేటాంబా శబ్దమందు నీ వింత యక్కరము గలదనిరి. ద్వితీయచాళుక్యభీముడు ౯౩౪-౯౩౫వఱకు పరిపాలించె. మన రామయ్య పంతులవారి యుద్ధమల్లున కీద్వితీయ చళుక్యభీము డర్వాచీనుడుకాని ప్రాచీనుడుకాడు. మన రామయ్య పంతులవారి యుద్ధ మల్లుని (గుణగ విజయాదిత్యుని) తరువాత రాజ్యమునకు వచ్చినవాడు తాళరాజు. అతనితరువాత విక్రమాదిత్యుడు. అతనితరువాత మూడవభీముడు. తరువాతివాడు ద్వితీయ యుద్ధమల్లుడు. తెరువాత మన రామయ్యపంతులవారిచే మేటాంబాశబ్దమును తన మచిలీపట్టణ శాసనములో వ్రాయించినవాడని తెలుపబడిన ద్వితీయచళుక్యభీముడు రాజ్యముచేసెను. తమ యుద్ధమల్ల శాసనముకంటె తరు వాతబుట్టిన శాసనములలో నీ యక్కరముండుటను తమ

వ్యాసములో తామే చూపించిరి. కావున యుద్ధమల్ల శాసనపు తరువాత శాసనములలో నీయక్కరము లేదను వాదమెంతమాత్రమును నిలువజాలదు. ఈశాసనము శ్రీ రామయ్యపంతులవారు తలచినరీతిగా యుద్ధమల్ల శాసనముకంటె ప్రాచీనముకాదు; చాల తరువాతిది.

మఱియు నన్నయభట్టునకు దరువాతి వానిలో గూడ నీయక్షరరూపము కాన్పించుచున్నది. కావున పంతులవారి యిప్పటి వాదము సరికాదు. ఈయక్కరమిదివఱ డకారధ్వని కలదైనదని మొదట వీరు తలంచినట్లు తెలుపు వ్రాతలు కలవు. కాని తామీరీతిగా వ్రాసినట్లు జ్ఞాపకము లేదనుచున్నారు. తమవాక్యముల ననువాదించుటలో లక్ష్మణరావుగారో, వీరభద్రేశ్వరరావుగారో మోసగించి లేని పోని మాటలు వ్రాసినట్లు తేల్చినారు. లక్ష్మణరావుగారికి తాము వ్రాసిన యుత్తర మాంగ్లమున వ్రాయబడియున్నట్లు తేల్చిరి. దానిని భాషాంతరీకరించుటలో లక్ష్మణరావుగారి పక్షమునుండి తప్పువ్రాత వచ్చినటులెంచిరి. పంతులుగారిట్లు చెప్పుదానిని నేను కాదనజాలనుగాని లక్ష్మణరావుగారికిగాని, వీరభద్రేశ్వర రావుగారికిగాని తమవాక్యముల వ్యత్యస్తముచేసి యాంధ్రీకరింప నవసరము కాన్పింపదు. వారును నాంగ్లమున మంచి పండితులు. ఆంగ్లవాక్యముల దెలిసికొనలేనివారు కారు. అదిగాక మనపంతులవారి వాక్యములని వారిచ్చినవి కేవలానువాదములని సూచించు నర్ధచంద్రరేఖలు కూడ వాక్యారంభమునను నంతమునను నీయబడియున్నవి. మనము ఒకపని నొకవిధముగా జేసి కొంతకాలమైనతర్వాత మఱియొక విధముగా జేసినట్లు భ్రాంతినంది యళీక జ్ఞాపకము పాలగుచుందుము. ఎంతవారికైన నీభ్రాంతి యప్పుడప్పుడు కలుగును. ఆరీతిగా మనపంతులవారు తెలుగున వ్రాసి యాంగ్లభాషలో వ్రాసినట్లిదివఱ భ్రమపడుచున్నను భ్రమపడుచుండవచ్చును. తామిట్లే వ్రాసియున్నామని యూఢిగా సిద్ధాంతము చేయలేక మన పంతులవారును నట్లువ్రాసియుందుమాయనియు, నట్లెట్లు వ్రాయుదుమనియు, నట్లువ్రాసినట్లు జ్ఞాపకము లేదనియు సందేహాస్పదులనుచున్నారు. కాన నళీక జ్ఞాపకమునకు లోనైరేమో యను సందేహము కలుగుచున్నది. లక్ష్మణరావుగారి పక్షమువా రుదాహరించిన యనువాదములో

"ఈయక్షరమునకు మొదట కన్నడములోవలెనే తెలుగునను ఴ ఉచ్చారణ బహుశః ఉన్నను యుద్ధమల్లుని శాసనమునకు నదివఱకే యప్పటినుండి యిది డకారమునకు అభేదభావముతో నితర డకారముతో పాటు వాడబడుచుండెను అని నా యభిప్రాయము. నేను ఇందును గురించి వ్యాసము వ్రాయనున్నాను."

అని యున్నది. నేనిందునుగురించి వ్యాసము వ్రాయుదును అను వాక్యములనుబట్టి లక్ష్మణరావుగారు మన పంతులవారి వ్యాసము వచ్చిన తరువాత నావశ్యకమేని నేను జవాబువ్రాసెదను—అని వ్రాసినట్లు కాన్పించుచున్నది. దీనింబట్టి మనపంతులవారు లక్ష్మణరావుగారికి నుత్తరము వ్రాయునాటికి 'డకార వాదులు' గానే యున్నట్లు కాన్పించుచున్నది. లేకున్న లక్ష్మణరావుగారు జవాబువ్రాయుటకై మనపంతులవారి వ్యాసము వచ్చునంతకును నిరీక్షింప నవసరముండదు. తమవాక్యముల తప్పుగా నిచ్చిన వెంటనే మన పంతులవారు దానిని ప్రతిఘటించవలసియుండును. అట్లు చేయలేదు. మన పంతులవారు ఈయక్షర విషయమై తమకును లక్ష్మణరావుగారికిని నుత్తర ప్రత్యుత్తరములు జరిగెననియు తాము వారికిచ్చిన సమాధాన మొకటికలదనియు జెప్పుచున్నారుగదా. వీరిప్పుడిచ్చు వాక్యములే మొదట వ్రాసినవిగా భావించి వానిని బరిశీలించి చూచుకొందము. తామువ్రాసితి మన్న వాక్యము లీక్రిందివైయున్నవి.

"అక్షరము పోలిక డకారముకంటె విలక్షణముగానుండుట నిర్వివాదమనియు, నుచ్చారణముకూడనొలుత విలక్షణముగానేయుండి కాలక్రమమున మాఱియుండుననియు, యుద్ధమల్లునికాలము నాటి కాయుచ్చారణము మాఱినదో లేదో పరిశీలించినగాని నిర్ణయింపరాదనియు నేను బ్రత్యుత్తర మిచ్చితిని."

అని మొదటి సమాధానములో వ్రాసిరి. రెండవ సమాధానములో నీక్రిందిరీతిని లిఖించిరి.

"యుద్ధమల్లుని నాటికే వింతయక్కరమునకు డకారోచ్చారణము వచ్చినదని నిశ్చయించి వ్రాసినట్లు జ్ఞప్తి

లేదు. అట్లు వ్రాసియుండనని నానమ్మకము. అట్లు నిశ్చయించుట కిప్పుడుగూడ నాధారములు లేవు. అప్పుడెట్లు నిశ్చయింపనగును. ఆయక్షరము ధ్వనిమాఱిన మాఱియుండ వచ్చునని వ్రాసియుందును".

ఈ రెండు వ్రాతలం గన మన పంతులవారికి వింత యక్కఱపుధ్వని మాఱియుండుననుతలంపు లక్ష్మణరావుగారికి యుత్తరము వ్రాయునాటికే కలిగియుండినట్లు తేలుచున్నదిగదా! ఇది మాఱియుండుననుతలంపును తామప్పుడు తెచ్చిపెట్టుకొనుటకుమాత్ర మేమైన నవకాశము గలదా? లక్ష్మణరావుగారి కట్టి తలంపు కలుగ లేదే వీరి కేల కలుగవలె? ఏమి యాధార ముండుటచే నట్టి తలంపు కలిగినది? దానికిని నేయాధారమును లేదుగదా? నిరాధారముగా నట్లు తలంచినవారు నిరాధారముగా యుద్ధమల్లశాసనమునాటికే యీ యక్షరపుధ్వని మాఱిన దనను నూహను బొందుటకు మాత్రము నవకాశము లేదా?

"శకటరేఫమును మన మిప్పుడు లఘురేఫమువలె నుచ్చరించుచున్నాము. ఆలాగుననే ఱకారమును డకారమువలె యుద్ధమల్లుని కాలమందుగాని, వేఱొక కాల మందుగాని జనులుచ్చరించి యుండవచ్చును. కాని యట్లుచ్చరించిరని సిద్ధాంతీకరించుట కాధారములు లేవు."

అని రామయ్యపంతులుగారు తమ రెండవసమాధానములో మఱియొక వాక్యమును వ్రాసిరి. సిద్ధాంతీకరించుట కవకాశము లేకున్నను యుద్ధమల్లశాసనమునాటి కక్షరధ్వని మాఱినదని యూహించుటకైన నవకాశమున్నదని యంగీకరించిరిగదా. దీనింబట్టి యుద్ధమల్లశాసనమునాటి కీయక్షరధ్వని మాఱినదను నూహ రామయ్యపంతులవారి హృదయమున గలదని తేలుచున్నది.. అక్షరధ్వని మాఱినదను తలంపు ప్రతివాదుల హృదయమందు జనించెనను విషయమే మాకు గావలసినది.

"ఆయక్షరమున కుచ్చారణము కాలక్రమమున మాఱినదన్నమాత్రమున శాస్త్రులు గారి వాదమునకు వచ్చిన లాభమును లేదు. పిదప మాఱినను దొలుత నాయక్షరమునకు విశేషోచ్చారణ మున్నదనియేకదా దాని భావము. దీనికి శాస్త్రులుగా రంగీకరింతురా ?"

అని పంతులుగారు వ్రాయించిరి. ఈవిషయమై పంతులవారు సరిగ నాలోచింప లేదు. నూతనముగా విలక్షణాక్షరవాదు లగుటకు బూర్వము మనపంతులవారి తలపు లెట్లుండెడివనునది యిచట విచారణీయాంశము గాని యస్మల్లాభాలాభములు విచారణీయాంశములు కావు. అది యటులుండ; యీ యక్షరధ్వని యిటీవల మాఱి డకారధ్వని కలదైనదని ప్రతివాదు లంగీకరించిన నాకు లాభము లేకపోలేదు. ఒకప్పుడైన నీ వింతయక్కఱము డకారధ్వనిని దెలుపుటకై వాడబడినదని తేలుచో బూర్వమునగూడ నీధ్వనినే కలిగియుండెడినని తలంపక వేఱొకలాగున తలంప నవకాశము కాన్పించుట లేదు. అస్మదాదుల మీయక్కఱము మొదట వింత ధ్వనికలిగి తరువాత మాఱి డకారమైనదని తెలుపువారము కాము. ఎప్పుడును డకారధ్వనికలదనియే మావాదము. ప్రతివాదులన్నచో మొదట నియ్యది వింతయక్కఱపు ధ్వని కలిగియుండి కాలక్రమమున డకారధ్వనిగలది యైపోయినదని వాదించువారు. ఎప్పుడైన నొక్కప్పుడీవింతయక్కఱము డకారధ్వని కలదైనదని యంగీకరించు ప్రతివాదులు పూర్వశాసనములలో మాత్రము వింతధ్వని కలిగియున్నదని సిద్ధాంతము చేయుటకు తమ కేయాధారమున్నదో చూపవలెను. అట్టి యాధార మేదియును మనపంతులుగారు మున్నుగువారు చూపియుండలేదు. కావున నిది సర్వకాల సర్వావస్థలందును డకారధ్వని గలదిగనే యున్నట్లు డస్సి మున్నగు పదములంబట్టికూడ నిర్ణయించుకొనవచ్చును. ఇదిమా వాద గమనిక. దీనిని పంతులవారు సహేతుకముగా ఖండింపకయె తమ యిచ్చవచ్చిన సిద్ధాంతములను జేయుట ధర్మముకాదు.

తలకట్టు డకారముంగూర్చి

· మనపంతులవారు డకారధ్వనిని దెలుపుటకై మన తెనుగులిపిలో ఢొ.ఴి.ఴ అను సంజ్ఞలుగలవని యంగీకరించిరి. ఇట్టివీరికి ఱ అనునది డకారధ్వనిని దెలుపునదిగానుండుటకు అంగీకారముగుట లేదు. ఇదివింత. అడ్డుగీటు లేనిశకటరేఫాకృతిగలిగి తలకట్టు మాత్రము పైనుండు

టచే దానికి డకారధ్వనికలుగునట. అదిలేకున్న కలుగ దట. ప్రాచీనకాలములో తలకట్టంత ప్రధానముగానుం డెడిదికాదు. గకారాదులు తలకట్టు గలిగి యుండియు లేకయుండియునుగూ. పూర్వశాసనములలో వాడబడె డివి. అట్లే యీవిలక్షణాక్షర విషయమునను జూచు కొనవగును. అద్దంకిశాసనములో 'గొండల్లదము' అను పద మొకటి కాన్పించుచున్నది. అందలి ద్వితీయాక్షరమును లక్ష్మణరావుపంతులుగారు డకారముగా చదివిరి. ఈచదు వుట యీవివాదము బయలువెడలిన తరువాతనే జరిగినది. దీనినిప్పుడు రామయ్యపంతులవారు విలక్షణాక్షరముగా నెంచి గొఱలిచి యని చదువుదు మనుచున్నారు. లక్ష్మణ రావు గారికి డ కా ర ము గా దోచినది వీరికి వింత యక్కరముగా దోచినది. వీరికి మొదట డ కారముగా దోచినది లక్ష్మణరావుగారికి వింతయక్కరముగా దోచి నది. విలక్షణాక్షరవాదులే యేది వింత యక్కరమో, యేది డకారమో చెప్పలేక తబ్బిబ్బగుచున్నారని దీని వలన దేలుచున్నది. ఇక నీవిలక్షణాక్షరవాద మెంత బలము కలిగియున్నదో దీనింబట్టి చదువరులే గ్రహించు కొనవచ్చును. లక్ష్మణరావుగారు చదివినట్టుగా 'గొండ లందము' అని చదివిన నర్థముకలదు. శ్రీరామయ్యపంతు లుగారు చదివినట్టుగా గొఱలిచి యని చదివిన నర్థము గాన్పించుటలేదు. పరిషత్పత్రిక -౫సంపుటము ౧ సంచి కలో మన పంతులవారీశాసనపంక్తుల నిచ్చి యందు దీనిని గొఱల్చి యని చదివిరేకాని యర్థమేమో సెలవిచ్చి యుండలేదు.* వ్యాఖ్యానము మఱెప్పుడో వ్రాయుదు రట. కానిం డది వ్రాసినప్పుడు చూచుకొందము. ఇప్ప టిమట్టు కొకయంశము తెల్పదగియున్నది. నెల్లూరుశాస నములను గ్రంథములో నీశాసనప్రతిబింబ మీయబడియు న్నది. అందు మన పంతులవారు చదివిన 'ఱ'కు పైన తల కట్టున్నట్టు జ్ఞాపకము. ఐనను దీనిని బంతులవారు వింత ధ్వని గలదానినిగా జదివిరి. ఇదియొక వింత. ఏమన, అడ్డుగీటులేని శకటరేఫాకృతిపై దలకట్టుండిన నయ్యది డకారమగునుగాని వింత యక్కరము కానేరదని మన పంతులగారే సిద్ధాంతీకరించిరి. ఆయక్కరమట్లున్నది కావుననే లక్ష్మణరావుగారు డకారముగా జదివిరి. దానిని బంతులవారు వింతయక్కరముగా నెట్లు తెలి సిరో తెలియవచ్చుటలేదు. దీనిపై తలకట్టు లేదంచు రేమో చూడవలసియున్నది. నెల్లూరిశాసనములను గ్రంథ ములోనున్న పటములో తలకట్టు విస్పష్టముగా నున్నట్లు జ్ఞాపకము. తమ నూతనప్రతిలో నట్లులేదేమో ఆయం శమును పంతులవారు తెలిపియుండలేదు. సందేహాస్పద ముగా నున్నయంశముల విస్పష్టముగా దెలుపక యర్థ మొసంగవలసిన తావుల నర్థమీయక తమసంచికలో నీ శాసనముంగూర్చి గచ్ఛద్వ్యాఖ్యానమును గావించిరి. ఇట్టి వానివలన బ్రయోజనము లేదు.

## అద్దంకిశాసనకాలప్రశంస

ఈశాసనముంగూర్చి మన పంతులుగారు నాకీ రీతిని బోధపఱచిరి.

"నాప్రథమవ్యాసములో 'పండరంగుని యద్దంకి శాసనములో' గొఱలిశబ్దమందు 'ఱ' వర్ణమున్నదని వ్రాసి నాను. శాస్త్రులుగా రుదాహరించిన తరువోజశాసనము నదియు నొక్కటే. తరువోజపద్యములో నుండుటచేత తరువోజశాసన మయినది. అద్దంకి గ్రామమందుండుట చేత నద్దంకిశాసనమయినది. పండరంగుని ధర్మమును బ్రకటించుటచేత పండరంగుని శాసనమయినది."

పండరంగుని యద్దంకి శాసనమున తరువోజశాసన మేయని నేను తెలిసికొనలేక పోతినని మృదువుగా దెలిపి నారు. నేనీయద్దంకి శాసనము తరువోజశాసనముగా దలం చుట కవకాశము కలుగుటలేదు. ఏమన, మనపంతుల వారివాదముంబట్టి చూడ తరువోజశాసనమునకును యుద్ధ మల్ల శాసనమునకును కాలవ్యత్యాసము తెలుపుట కంత మాత్రమును నవకాశము కలుగుటలేదు. మన పంతులవారు తమ యద్దంకి శాసనము యుద్ధమల్లుని బెజవాడ శాసనము కంటె రమారమి ౧౧౦ సంవత్సరములు ముందువని వ్రాసిరి. అది తరువోజ శాసనమే యగుచో నట్లుతెలు

---

* భారతి సంపుటము ౨, సంచిక 3 లో నీయద్దంకిశాసనము సప్రతిబింబముగా విమర్శింపబడినది.—సంపాదకుడు.

పుట కవకాశము లేదు. ఏమన, తరువోజ శాసనము గుణగ విజయాదిత్యునికాలములో పుట్టినదట. యుద్ధమల్ల శాసనము నాకాలముననే పుట్టినదట. ఈయుద్ధమల్లుడు గుణగవిజయాదిత్యుని సోదరుడే. ఇతడు ప్రత్యేకముగా గుణగ విజయాదిత్యుని యనంతరమున రాజ్యముచేసి యుండలేదు. అన్నతో కలసి రాజ్యముచేసినట్లుగా మన పంతులుగారు వ్రాసిరి. గుణగ విజయాదిత్యుడు క్రీ. శ. ౮౪౮–౮౯౧ వఱకు రాజ్యముచేసెను. కావున నాకాలముననందే యీ రెండు శాసనములును పుట్టియుండవలెను. యుద్ధమల్ల శాసనము ౯వ క్రైస్తవ శతాబ్దము నాటిదని మన పంతులవారు వ్రాసియున్నారు. అద్దంకి శాసనము నాకాలమునాటిదే యనుచున్నదికదా. గుణగ విజయాదిత్యుని కాలమునందే పుట్టిన నీ రెండు శాసనములకును కాలములో నూఱేండ్ల వ్యత్యాసమెట్లుండగలదు? అట్లుండుట కవకాశ మింతయును లేదు. అందుమూలముచే దరువోజ శాసనముకంటె మనపంతులవారి యద్దంకి శాసనము భిన్నమైనదని తెల్పవలసివచ్చుచున్నది. తాము కనిపెట్టిన యక్కరములకును, శాసనములకును కాలనిర్ణయముచేయు సందర్భములో సంపూర్ణముగా స్వేచ్ఛ ననుసరించి లేని ప్రాచీనతను ప్రతివాదులు గల్పించుచున్నారు. వీరు అద్దంకి శాసనమునందలి యక్కరమునకు దలకట్టున్నదో లేదో అర్థమేమో తెలుపుచు శాసనపటమును దయ మీఱ త్వరగ బ్రకటింతురుగాక!

## శబ్దమణిదర్పణ ప్రశంస

కర్ణాటక లక్షణకారుడగు కేశిరాజు తన శబ్దమణి దర్పణములో 'ట'కారస్థానమందు డకారము పుట్టినదని వ్రాసినట్లుగా మనపంతులుగారు తమ మొదటి వ్యాసములో వ్రాసిరి. ఆత డట్లు చెప్పియుండలేదు. డకారస్థానమందు టకారము వచ్చునని చెప్పె. కావున నా విమర్శనములో "ఈయక్షర లక్షణమును కన్నడశాస్త్రకారులిచ్చినదానిని దెలుపుటలో బంతులవారు కొంత తప్పు దారిని ద్రొక్కి"రని వ్రాసితిని. అందుపై వా రీక్రిందిరీతిని లిఖించిరి.

'ట' కారోత్పత్తినిగుఱించి కర్ణాటశబ్ద మణిదర్పణకారుని మతము నను పరుసదించుటలో నేను బొరపడి తప్పు వ్రాసినానని శాస్త్రిలుగారు వ్రాసినారు. నేను వ్రాసిన దానిలో 'ట' కారస్థానమందు డకారమును అనునది "డకారమందు 'ట'కారమును" అనుటకు అచ్చుతప్పు. ప్రక్రమమును బట్టియు, వాదసందర్భమునుబట్టియు నిది కేవల ప్రమాదమని గ్రహింపగలిగి యుండినను శాస్త్రిలుగారట్లు గ్రహింపక యది నాయజ్ఞానముచే గలిగినదోషముగా బరిగణించిరి."

పంతులవారు వ్రాసినది కేసిరాజు వ్రాసినదానికి వ్యతిరేకముగ నుండుటచే తప్పుదారిని ద్రొక్కి-రని వ్రాసితిని. అట్లు వ్రాయుట పమయం దజ్ఞత నారోపించుటగా బంతుల వారు తీసికొనిరి. అట్లు తీసికొనుట ధర్మము కాదు. వారు ప్రమాదముచే దప్పుదారి ద్రొక్కి రని నాతలంపుగాని, అజ్ఞానముచే నట్లు చేసిరని నాతలంపు కాదు. ఎవరివాద మెట్లున్నదను విచారము వచ్చినప్పుడు ఒకవాదము తప్పని తేల్పవలసివచ్చును. అంతమాత్రముచే నజ్ఞత నారోపించుటగా భావింపరాదు.

మఱియును డకారస్థానమందు 'ట' కారము పుట్టిన దను లక్షణకారమతముం బట్టి కోడి మున్నగురూపములు మొదటివనియు వాటినుండి తరువాత కన్నడమున కోట, కోళి అను పదములు పుట్టినవనియు తెలుగున మొదటిరూపమే నేటికిని నిలిచినదనియు నేను వ్రాసియుండగా దానిని బంతులవా రీక్రిందిరీతి నధిక్షేపించిరి.

"దీనింబట్టిచూడ డకారమే కన్నడములో నొత్తి పలుకుటచే వింత యక్కరమైనట్లు తేలుచున్నది. కావున దెలుగునందుగల కోడి, ఏడు మున్నగునవియే మూలపదములు. అవి క్రమముగా గొన్నినాళ్లకు కోటి, ఏటు అనురూపములై అటుపిమ్మట కోళి, ఏళు మున్నగురూపములు గన్నడమున నందినవి. తెలుగులో మొదటినుండియు మొదటిరూపమే నిల్చియున్నది." అని శాస్త్రిలుగారు వ్రాసిరి. ఇది వింత వాదము. డకారము పుట్టినచోటనే యధిక ప్రయత్నముచేత టకారము పుట్టినదనగా తొలుత డకారము పుట్టి యది కొంతకాలమయిన పిదప టకారముగా మాఱినదనియా? లఘ్వలఘువులలో

లఘువులు ముందును అలఘువులు తరువాతను బుట్టినవని యెట్లు చెప్పవచ్చును."

ఇయ్యది సరికాదు. కర్ణాట లక్షణకారులు డకారాదులే ఱకారాదులైనవని వ్రాసియుండిన కారణమున కోడి మున్నగు రూపములు మొదటివంటేని కాని వారు డకార ఱకారాదుల నొక్క యక్కరముయొక్క లఘ్వలఘురూపములే యనుటచేతకాదు. ఈవిషయమై నాగవర్మ తన వ్యాకరణములో నిట్లు వ్రాసినాడు.

సూత్ర. లరడైరేళళఱాః

వృత్తి॥ ప్రయత్నాశ్రయాత్ లరడైరేళళఱ ఇతి దేశీయాక్షరేభవన్తి। తేషాంవిభాషయా పృథక్పృథక్ ప్రయోగ నియమార్థమయ మారమ్భః ॥ తద్యథా మొలె మొళె, కలె కళె, మొర మొఱ, కోడె కోఱె। కడల్। కఱల్। ఇత్యాది.

తాత్పర్యము. లరడయం బక్షరగళిగె, ళఱఱయెం బక్షరగళు ఆదేశవాగి దేశ్యపదగళ్లు ప్రయోగిసువదు.

La ra la in the indigenous words stand . ....

for la, ra, da, (their use is optional.)

పైనీయబడిన సూత్రము, దానివృత్తి, టీక, భాషాంతరీకరణము బరిశీలించిచూడ లకారమే ళకారమగుననియు, రకారమే ఱకారమగుననియు డకారమే ఱకార మగుననియు విస్పష్టముగా తేలును. కావున నేను కోడిశబ్దము మొదటిదేయనియు కోఱి కోళి శబ్దములు తరువాతివనియు వ్రాసితిని. డకారమునకు ఱకార మాదేశముగా వచ్చునని సూత్రింపబడుటయే కాక కోడె యను పదమే కోఱెయను పదమైనదని యుదాహరణ మిచ్చుటచేత డకారమున్న పదములే క్రమముగా ఱ కారాదులతో గూడిన వైనవని స్పష్టము కాగలదు. రామయ్యపంతులవారు డకార ఱకారము లొకధ్వనియొక్క లఘ్వలఘురూపములని వ్రాసిరి. అట్లనరాదు. అంతస్థములగు యరలలు లఘ్వలఘురూపములు గలిగియుండునుగాని కేవల వ్యంజనములగు డకారాదులు లఘ్వలఘురూపములు గలిగియుండవు. కర్ణాట లక్షణకారు లెవరును వీనిని లఘ్వలఘుభేదము గలవానినిగా జెప్పియుండలేదు. కావున నీసందర్భమున రామయ్యపంతులవారు వ్రాసిన దింతయు సరిగలేదు.

## కర్ణాటాంధ్రసాజాత్యప్రశంస

"అన్యభాషాసామ్యముచేతనాంధ్రశబ్దరూపనిష్పత్తిచేయగూడదను శాస్త్రిలుగా రీసందర్భమందాంధ్రకర్ణాటకముల సాజాత్యసంబంధము నంగీకరించుట విశేషమే."

అని పంతులవారు మృదువుగ నెత్తి పొడిచిరి. నేను కర్ణాటాంధ్రముల సాజాత్యమును మొదటినుండియు నొప్పుకొనినవాడనేకాని నేడుమాత్రమే యొప్పుకొనినవాడను కాను. అవిరెండును సోదరభాషలని నేను మొదటినుండియును వ్రాయుచునే యున్నాను. అంతమాత్రముచే రెండు సోదరభాషలును బరిపూర్ణముగా సమాన లక్షణము గలవని చెప్పకూడదని కూడ వ్రాయుచున్నాను. ఈసందర్భములో నన్యభాషాసామ్యముచేత నాంధ్రశబ్దరూపనిష్పత్తి నెంతమాత్రమును చేసియుండలేదు. మనలో కోడియను శబ్దము గలదు. కర్ణాటకమునను నీకోడిశబ్దము గలదు. కాని యందది "లరడైరేవ ళఱాః" అని తెలిపినరీతిగా కోఱి, కోళి అయిపోయినది అని తెలిపితిని. తెలుగు అట్లు కాలేదని తెలిపితిని. ఇక నన్యభాషాసామ్యముబట్టి నే నాంధ్రశబ్దరూపనిష్పత్తి చేసితిననుట కవకాశ మేది? కావున నీపట్టున పంతులవారు వ్రాసినది ప్రమాదము కాక తప్పదు.

## పంతులవారి యభినవవాదప్రశంస

అడ్డుగీటులేని శకటరేఫ రూపము తెలుగులో క్రీ. శ 13 వ శతాబ్దమువఱకు నున్నదని లక్ష్మణరావుగారి పక్షమువారు వాదించుచుండగను, నన్నయ కీవలకూడ నీయక్షరరూపము నట్లు దక్షిణదేశశాసన ప్రకటనకారులు వ్రాసియుండగను కుప్పమ్మ శాసనాదులలో నే నీయక్షరము చూపియుండగను యుద్ధమల్లశాసన కాలానంతరమున బుట్టిన దగు ద్వితీయచళుక్యభీముని మచిలీపట్టణ శాసనమునం దీయక్కరము కలదని తామే నాకిచ్చిన సమాధానమందే వ్రాసియుండియును గూడ తాము నన్న

యభట్టారకాదులనాటి కీయక్కరమును, ధ్వనియును నెగిరిపోయిన వను వాదమును పంతులవారు నేడు క్రొత్తగ దెచ్చిపెట్టుటచే నిది సమయానుసరణముగ దెచ్చిపెట్టిన యభినవవాదమని వ్రాయవలసివచ్చినది. తాము మొదట 'డకారము వాదులు లక్ష్మణరావుగారు తమపేర నుత్తరము వ్రాసినపిమ్మటగూడ తమ మొదటివాదమును విడువజాలక యుద్ధమల్ల శాసనమునాటికే ధ్వనిమాఱిన దను నూహకైన లోనైనవారు. ఇట్టివారు నేడు వింత యక్కరమును దానిధ్వనియును యుద్ధమల్ల శాసనమువఱకే యుండి తరువాత వెంటనే నశించిపోయిన వను నభినవవాదమును దెచ్చి నన్నయభట్టారకాదులనాటి కీయక్కరమును, ధ్వనియును లేనేలేవుకావున వారు తమ లక్షణగ్రంథములలో దీనివిషయమై ముచ్చటించి యుండ లేదని యభినవముగా వ్రాయుచున్నారు. ఇది వింత వాదముకాదా? యుద్ధమల్ల శాసనములోని 'టస్సి' శబ్దమునకు దామేగతిని గల్పించి యాశాసనమువఱకు ట కారము తన ధ్వనిలో నిలిచినదని వ్రాసిరి?

## ఉపసంహారము

సమస్తలిపులందును నొకధ్వనికే రెండు సంజ్ఞలుండుట కలదు. వాని నొక్కచోటనే వాడుటయునుగలదు. తెనుగులిపిలో నట్టివనేకములుగలవు. అట్టిరూపభేదముల నన్నిటినివాడ యుద్ధమల్లశాసన లేఖకు డభిలాషకలవాడు. కావున డకారమునకు దనకాలముననున్న రెండు సంజ్ఞలనువాడియున్నాడు. లిపికర్ణాటమునకును నాంధ్రమునకును నొక్కటియే యైనను ఆయాభాషల సాంప్రదాయమునుబట్టి యక్షర సంజ్ఞలు కన్నడ భాషాశాసనములలో నున్నప్పు డొకధ్వనిని ఆంధ్ర భాషాశాసనములలో నున్నప్పు డొకధ్వనిని, గలిగియున్నవి. కాన నిందలి ధ్వనులనుబట్టి యందలి ధ్వనులనుగాని యందలి ధ్వనులనుబట్టి యిందలి ధ్వనులనుగాని నిర్ణయింపరాదు. యుద్ధమల్లశాసనములో నున్న టస్సి అను పదము డస్సి అని చదివిన నర్థవంత మగుచున్నది. టస్సి అని చదివిన నర్థశూన్య మగుచున్నది. అటసిన అటపుట యను పదములు అడిసిన అడిపుట యనిచదివిన నాంధ్రభాషాసాంప్రదాయమునకు సరిపోయి యున్నవి. ఈయాశను పంతులవారును ఖండించియుండలేదు. ఈయక్కరము డకారధ్వని కల్గియుండుటను ప్రతివాదులే యంగీకరించిరి. యుద్ధమల్లశాసనమునందున్న అడ్డగీటులేని శకటరేఫాకృతికి వింతధ్వనియే కలదు కాని డకారధ్వని లేదని సహేతుకముగా ప్రతివాదులు రుజువుచేయలేకపోయిరి. కర్ణాటాది లాక్షణికులు తమభాషలో వింతధ్వనిగల వింతయక్కర మున్నదని తెలిపిన రీతిగా నన్నయాది యాంధ్రలాక్షణికులు తమ కాలము నాటి కీయక్షరరూపము శాసనాదులందున్నను దానిని విలక్షణాక్షరముగా చెప్పియుండలేదు.

కాబట్టి అడ్డగీటులేని శకటరేఫాకృతి తెలుగు భాషలో నున్నప్పుడు డకారమునొక్క మారురూపమే కాని అరవమునందలి వింతధ్వనివంటి ధ్వనిగల భిన్నాక్షరము కాదు అనునది న్యాయమగు సిద్ధాంత మగుచున్నది. సత్యనిర్ధారణార్థమై విషయవిమర్శనముచేసి పెద్దలు వ్రాసినవాక్యములలో నిదిసరియైనదనియు నిది సరికానిదనియు వ్రాయవలసివచ్చినందులకు నన్నాంధ్రలోకము మన్నింప బ్రార్థించుచు 'సత్యమేవ జయతి నానృతమ్'అని నుడువుచు నింతటితో విరమించుచున్నాడను.

---

# కవిప్రబోధము

మం. వెంకటశర్మ గారు

ఓ తెలుగుం గవులారా - మీ తెలివికి తగ్గ కర్జమే యిది దేశం
బే తెన్న పోవుచున్నది - యే తెరువున మీరలుంటి లెరుగన్ వలదే.

జాతీయత నశియించెను - స్వాతంత్ర్యము జారిపోయె సంపద లెల్లన్
వేతెన్నుల బడిపోయెను - నీతులు నియతులును ధర్మ నిరతులు చెల్లెన్.

భోగములు పోయె తొలి వై - భోగములును పోయె త్యాగములు పోయె నయో
యోగములు పోయె బహు విధ - రోగములే మిగిలె నీ నరుల దశ యేమో.

మతమెల్ల మంటగలసె ప్ర - కృతి శాస్త్రము లెల్ల సమసె కృశియించె మహో
న్నతశిల్ప మెల్ల నిక మన - మతులకు భోగప్రవృత్తి మాన్యమె చెపుడీ.

తెలుగుం జదువుల ముద్దియ - తొలి కోర నోములకు గలుగు దుష్ఫల మనగా
వెలయుచు నున్నది వాఙ్మయ - మల రైళ్లను వాలలాడు నదె స్వేచ్ఛ మెయిన్.

కాలోచిత వాఙ్మయమును - కాలజ్ఞుండై సృజించి జ్ఞానము గలుపన్
బోలు కవిబ్రహ్మ విలా - సాలసుడై చెడిన నాడె సంఘము చెడదే.

తల తోక లేక యాచితి - కలికమునకు గానరాక కలి పోషక రీ
తులు గలిగి చెలగు నాటక - ముల నవలల కర్తలే యిపుడు కవులకటా.

కాఫీహోటళ్ల ఖర్చుకె - కాపీరైటిచ్చు దొడ్డ కవు లుదయింపన్
లోప మికేమిటి దేశము - పాపం బిటు బద్ధలయ్యె ప్రారబ్ధమునన్.

సిగరెట్టు ఖర్చు కొక్కఁడు - సిగ గొరిగించు కొను ఖర్చు చెల్లగ నొకడున్
తగవు మరచి గ్రంథము ల - ల్లగ నమ్మగ నింక కైత లలిగను టరుదే.

శృంగార కట్ట నొక్కఁడు - గోంగూర నొకండు కైతకును వస్తువు గా
గం గైకొందురు కొందరు - వెంగలితనమో వివేకవిధమో యెరుగన్.

నవలలని నాటకము లని - చవులూరెడు ప్రకటనములు సాగించి ప్రజన్
వివిధముగ మోసగించెద - రవురా యీ కవుల కేమి యాగడ మొక్కో.

ఒక్కఁడొక పుస్తకంబును - చక్కఁగ రచియించి ధనము శాశ్వత యశమున్
దక్కించు కొనుట కోర్వక - టక్కరులై యనుకరించుటలు తగవగునే.

ఒకరు వ్రాసిన విషయ మింకొకరు వ్రాయ - బూను టది తప్పిదంబు గాబోదు గాని
పుస్తకము పేరు రూపము పుటలు నచ్చు - నొకరకము జేసి వంచించు టుచితమగునె.

బూతులు వ్రాసిన కొందురు - నీతులు వ్రాసినను కొనరు నిజముగ ప్రజలీ
లో తెరిగి నీతి పేరిట - బూతే రచియింతు రీ యపూర్వకవు లిసీ.

ఏపుస్తకమున జూచిన - నే పత్రిక యందు గన్న నేహ్యాపురీతుల్
తోపగ నీతి విహీనపు - పాపపు సంగతులె తెలియబడు నిసిరిసిరో.

చేతికి సులువుగ నందిన - వ్రాతలె చదువుదురు ప్రజలు పామరు లగుటన్
నీతులో బూతులో తెలియగ - చాతుర్యము లేని శుద్ధ జడమతు లగుటన్.

చేపపిల్ల కీత చెప్పంగ వలయునా - బూతు నేర్పవలెన మూఢునకును
సుకవి యైనవాడు సుజ్ఞానమును దెల్పి - ప్రజల తనుప మనుపవలయుగాక,

పండితులు దీని నెరిగియు - ఖండింపరు లోకచర్య గణియింపరు వా
రుండియు లేనటులైరీ - చండితనము మాన్ప నెవరు చాలుదు రొక్కో.

---

## ధనవంతునికే గౌరవము

నాదెళ్ల వెంకట్రావు గారు, బి. ఏ.

సౌరభంబున నినుఁ బోలఁ జాలకున్న,-వర సువర్ణాప్తిఁ దనరుట వలనఁ గాదె!
అల గులాబిని సుమరాజ్ఞి యనుచు సతముఁ-బ్రస్తుతింతురు జనులు, సంపంగి పూవ!

ఘనుల దానంబుచేత జీవనముఁ గనుట - నిరువురకుఁ దత్త్వమున భేద మెనయకున్న,
జీవనాధార గరిమ, సరోవరంబు - పదుగురకు మాన్యమగుఁ గాదె! పల్వలంబ!

అంబరవిహార మనతికాలం బెయైన - వసు విశేషంబుచేఁ గాదె! వాస్తవముగఁ
జుక్కలన్నిఁట రాజౌను శుక్రుఁ డనుచు - నెక్కువ ప్రసిద్ధిఁగాంచుట రిక్కలార!

---

# విశ్వభారతీ గ్రంథమాల

పారనంది జగన్నాథస్వామి గారు, యం.ఏ.,యల్.టి.

గృహప్రవేశము-పోస్టుఆఫీస్-స్టిలమాండ్ మేజస్ట్రీట్

ఆంధ్రసారస్వతప్రపంచము గ్రంథమాలలతో నిండియున్న సమయాన ప్రారంభమైన మాలలకు పుష్పములు దొరకక మాలాగ్రథసులు తహతహలాడుతున్న ఎండాకాలమున, మధ్యమధ్య గ్రుచ్చబడ్డపూవులు కొన్ని దుర్వాసన కలవిగా నుండుట సంభవిస్తున్న రోజులలో, తయారైన మాలలకు వరులు దొరకక వాడిపోతున్న అవస్థప్పుడు, ఈనూతనమాల నొకదానిని నెలకొల్పయత్నిస్తున్న వైకుంఠరావుగారి ఉత్సాహాన్ని ఎట్లు ఆమోదించవలెనో తెలియకున్నది. ఈవిపులమైన ఆంధ్రప్రపంచానికి సేవచేయదలచుకొన్నవారు అతి సంఖ్యాకులు మాత్రము కారని ధైర్యముతో చెప్పగలము. ఏఆంధ్రప్రచారిణీగ్రంథమాలో, ఏసరస్వతీగ్రంథమాలో తప్ప మిగిలినవి నామమాత్రములై యున్నందున, ఈక్రొత్తగా బయలువెడలేదానిని చాలాకాలము నిలపాలనే ప్రయత్నముతో ప్రారంభించి యుంటారని మనము నమ్మవచ్చును. ఈనమ్మకమును పుట్టించే హేతువొకటి ఉంది; అది ఈ మాలలోని పుష్పముల విశేషమే.

వీరు గ్రంథమాలకు పెట్టిన పేరునుపట్టి చూసినా ఇదివరకు ప్రచురించిన గ్రంథాలనుపట్టి చూసినా, వీరి కరపత్రములలో చెప్పిన మాటలనుపట్టి చూసినా, వీరి ఆశయము ఒకటి తేలికగా తెలుస్తుంది. పుష్పములకొరకు వెదుకుటలో వీరు ఒక్క ఆంధ్రదేశమందున్న ఉద్యానవనములలోనే తిరగరనిన్నీ, ప్రపంచమందు ప్రసిద్ధికెక్కిన ఉద్యానవనాలన్నీ వెదకుతారనిన్నీ తెలుస్తున్నది. వారి పుష్పాలందుచేత ఎప్పుడూకూడా ఒకదానికంటె ఒక్కటి తగ్గకుండా సువాసనకలిగియుంటవని మనము నమ్మవచ్చును. ప్రపంచమంతా తిరిగి సమకూర్చినపుష్పాలు ఒక్కదేశంలో దొరికినవాటికంటె ఎక్కువ రామణీయకములై యుంటవని మనము ఆశించవచ్చునుగదా. ఒక్క ఉద్యానవనమునుండే జాగ్రత్త చేయవలెనని నియమముంటే, సరిగ్గా అన్నివేళలకు ఒకటి తరువాత ఒకటి క్రమభంగము లేకుండా దొరకడము దుస్సాధ్యము; విశ్వమంతా ఉపయోగించేటప్పుడు ఆకొరత ఉండదు. ఇంకొక విశేషము. ఇతరగ్రంథమాలలోని గ్రంథములు కవులు మాలకొరకు ఇప్పుడు తయారు చేసేవి; ఈమాలకో అట్లుకాదు, ఇదివరకప్పుడే ప్రపంచ సారస్వతములో పేరుపడిన కవివర్యుల ఉత్తమగ్రంథాలు ఉపయోగమవుతాయి. ఏగ్రంథమునకు ఈమాలలో స్థానము ఇవ్వదలంతురో, ఆగ్రంథాన్ని చక్కగా పరిశీలించి, దానికీర్తివాసనను తృప్తిగా ఆఘ్రాణించి, అప్పుడు దానిని మాలలో కుప్పుతారు. అందుచేత మాలలోనికి వచ్చేది మంచిదిగానే ఉండితీరును. ఉత్తమగ్రంథములే అయియుంటవి. ఈసౌకర్యము లుండబట్టే ఈమాల నిర్విఘ్నముగా కొనసాగగలదు.

ఈమాలకు చేసిన నామధేయము గురించి రెండు మాటలు చెప్తాను. విశ్వాదరణీయములైన గ్రంథాలద్వారానే విశ్వకళ్యాణము, విశ్వసౌహృదము, విశ్వభ్రాతృత్వము సమకూడగలవని పెద్దలందరి అభిప్రాయమైయున్నది. అది సమంజసమేకదా. అట్టి ఉదారాశయముతోనే రవీంద్రనాథఠాకూరు శాంతినికేతనములో విశ్వభారతిని స్థాపించినాడు. ఆ విశ్వభారతి నామము ఉపయోగించే ఈగ్రంథమాలాస్థాపకులు ఆవిశాలాశయముతే తమ గ్రంథమాలాస్థాపనను పురికొల్పినవని విశదపరుస్తున్నారని నాఅభిప్రాయము. లేదా విశ్వమందలి భారతిని ఉద్గ్రంథములద్వారా ఆంధ్రసోదరుల అందుబడిలోనికి తెచ్చే ఆశయముండుటచేత విశ్వభారతినామము చేశారని చెప్పినా చెప్పవచ్చును. ఎట్లయినా ప్రయోజనము ఒక్కటే.

ఈవిధంగా ఇప్పటికి వెలువెడలిన గ్రంథాలు నాలుగు, మూడు రవీంద్రనాథునివి; ఒకటి మేటర్ లింక్ కవివరునిది. వీటిలో మూడు నాటకాలు, నాల్గోది రవీంద్రుని నవల. ఆనవల గురించి ప్రత్యేకముగా వ్రాయదలచుకొని మిగిలిన మూడింటిని ఆంధ్రపాఠకమహాశయులకు ఎరుకపరచెదను.

గృహప్రవేశము, పోస్టుఆఫీస్ రెండూ రవీంద్రనాథుని చిన్నచిన్న నాటకాలు. మూడేసి పటములు గాక 132, 84 పుటలు గలవి. ఇవి ఆజగత్కీర్తి సంపాదించిన కవిశ్రేష్ఠుని నాటకమణులలో రెండు. ఈగ్రంథముల విమర్శించుట అనగా రవీంద్రుని రచనా నైపుణ్యమును చర్చించుట అన్నమాట; అది అనవసరము ఇక్కడ. నాటకములు చదివితీరవలసినవని నొక్కి చెప్పగలను. గృహప్రవేశము అనేదానికి ఇంగ్లీషు తర్జుమా లేదు; కాబట్టి ఇంగ్లీషు చదువగలిగే ఆంధ్రులుకూడా ఈభాషాంతరీకరణము చేసిన శోభనాదేవి నైకంఠరావు గార్లను అభినందించవలసినదే. ఈనాటకకథకు బీజము ఇంగ్లీషులో తర్జుమా అయి మాషి అన్న పేరుతో ఉన్న రవీంద్రుని ఒక చిన్నికథ. కథ చాలా సంగ్రహముగాను నాటకము విపులముగాను ఉన్నది. కథలో లేని పాత్రలను భావాలను నాటకములో ప్రవేశపెట్టి నాటకమునకు క్రొత్త ప్రాముఖ్యము కవి తెచ్చిపెట్టాడు. వివాహముయొక్క చరితాన్నిగ్రహించలేని చిన్నబిడ్డను భార్యగా చేసేవారందరూ, చేసుకొనేవారందరూ ఈనాటకాన్ని సహృదయముతో చదివితే బాల్యవివాహములను నిరసించక మానరని ధైర్యముతో చెప్పగలను. బాల్యవివాహఖండనముగా ఠాకూరుగారు ఈనాటకాన్నివ్రాశారని నాఅభిప్రాయముకాదు; నాటకంలో అట్టి చర్చ కూడా ఉండదు. ఠాకూరుగారు గొప్ప శిల్పికదా అలాగు ఎందుకు చేస్తారు! నాటకంలో ఉండేది మానవహృదయమందు ఉద్భవించే భావాలపరంపర. జ్యోతిన్ ఒకయువకుడు మణీ అనే రంభవంటి బాలికను పెండ్లాడి ఆమెయందు తన ప్రేమ యనే గృహాన్ని నిర్మించ ప్రయత్నిస్తాడు. కాని మణి హృదయములో ప్రేమ ఉద్భవించనందున ఆమె ఆగృహాన్ని ప్రవేశించలేదు. ఆమె ప్రవేశించనిది గృహనిర్మాణము పూర్తిజెందదు. ఆ గృహము కట్టుటకు జ్యోతిన్ తన సర్వస్వమును వినియోగిస్తాడు. జ్యోతిన్ రోగియై మంచం పట్టి ఉన్నప్పుడు ఈప్రేమ శూన్యతవల్ల రోగముకంటె ఎక్కువ తీవ్రముగా బాధపడుతూ ఉంటాడు. అదే రోగమంతా అనీ, రోగం దానివల్లే తీవ్రమయిందనిన్నీ కూడా సూచితమవుతుంది. జ్యోతిన్ పడుతున్న బాధ చూస్తే జ్యోతిన్‌ని చిన్నప్పటి నుండి పెంచి పెద్దచేసిన బాలవిధవ వాని పినతల్లి ఈసంగతి చక్కగా గ్రహిస్తుంది. తన ఆస్తినంతను వాని కోసము ధారపోసేసింది. మణి ప్రేమ రూపమైన ఇంటి కోసము ఆమె ఆస్తినంతా జ్యోతిన్ అమ్మివేస్తూఉంటే, అప్పులపాలు అయిపోతూవుంటే పిన్ని జ్యోతిన్ యెడల తనకుగల ప్రేమను ఎక్కువ చేసుకొంటూ ఉంటుంది. ప్రేమే ఆమె పురుషార్థం; ఆవిధంగా దానిని సాధించుకొంటుంది. జ్యోతిన్ పడుతున్న ఆవేగానికి శాంతి నివ్వాలని మణి ప్రేమగురించి అసత్యాలు కల్పించి జ్యోతిన్‌కు చెప్తూ ఉంటుంది. వైద్యుడు అంగీకరించలేదు కాబట్టి మణి రోగిగదిలోకి రాలేదుకాని, అనుజ్ఞఇస్తే గదివదలకుండా మణిహర్యాని ఉండేదే అని జ్యోతిన్‌కి నమ్మకము పుట్టించేమాటలు చెప్తుంది. పువ్వులు, మొక్కలు, నాటకాలు, సినీమాలు, చీరలు, నగలు—వీటిగురించే ఎల్లప్పుడూ తాపత్రయం పడుతూ ఉండే పిల్ల గురించి పిన్నికల్పించే ప్రేమాసత్యాలకు మితి లేదు. జ్యోతిన్‌బట్టలు మరొకరు ఉతికితే మణిఒప్పదు; జ్యోతిన్ పథ్యము మరెవ్వరినీ చేయనివ్వదు; జ్యోతిన్ కప్పుకొన్న శాలువుమీద నగిషీపువ్వులు మణే అల్లింది; జ్యోతిన్‌కోసం జావకాస్తూ చేతిమీద వేడిపాలుపోసేసుకొని పుండు చేసుకొన్నా, జ్యోతిన్ సేవమానదు.ఈలాగు ఎన్నాళ్లు అసత్యాలవల్ల ప్రేమ నిర్మిస్తుంది? ఎన్నాళ్ళు అసత్యం దాగుతుంది? తన చెల్లెలి అన్నప్రాశనోత్సవానికి మణి పుట్టింటికి వెళ్లిపోయింది. జ్యోతిన్ అవసానకాలమందు మణిని చూడాలని పలవరిస్తే పిన్ని భరించలేక, క్రొత్త అసత్యం కల్పించలేక గది దాటి

వెళ్లినప్పుడు, సేవకుడు నిజం చెప్పకూడదని తెలియక చెప్పివేశాడు. జ్యోతిష్ గృహమూ పూర్తిజెందలేదు.

నాటకముయొక్క ఆధిక్యము అంతగా కథలో లేదు. కథద్వారా ప్రకటింపబడే భావాలు మానవహృదయం, శాశ్వతమైన ప్రేమయొక్క లక్షణం, ఈ మొదలైన సూక్ష్మసూచనలు, ఇవి విశ్వవ్యాప్తమైనవి. ఇవి శాశ్వతంగా ప్రవర్తిస్తూ మనుష్యుని భౌతికసంపదనుండి ఆధ్యాత్మిక సంపదకు తీసుకొనిపోతవి. ఆపిన్నికి శాంతి నిచ్చినది ఆ అనాదియైన ప్రేమ; ఎంతస్వార్థరహితమైనదో అంతశాంతి నిచ్చేది. ఇవన్నీ నాటకము చదివి తెలుసుకోవలసినవి. వర్ణనాతీతము.

2. పోస్టుఆఫీస్ చాలామందికి తెలిసేఉంటుంది; దీనికి ఇంగ్లీషుతర్జుమా చాలాకాలము క్రిందటనే బయలు వెడలి ఉన్నది. ప్రేమ యెట్లు మానవహృదయానికి ఔన్నత్యము తెచ్చేనో, అట్లే మానవజీవితానికి బీజధర్మమైనది స్వాతంత్ర్యము. ఈధర్మాన్ని ప్రకటించే చిన్ని నాటకం ఈ పోస్టుఆఫీస్. దీని నాయకుడు ఒకచిన్నకుర్రవాడు అమల్. వాని ముద్దుమాటలు విన్నకొలదీ, వానిలో లీనమై యుండిన స్వాతంత్ర్యధర్మము ఎట్లు వ్యక్తమవుతూ ఉంటుందో తెలుస్తుంది. అమల్ కి జబ్బుచేసిందని భావించి వాని పెంపకతండ్రి వైద్యుని పిలిపిస్తే, వైద్యుడు ఔషధముగా నిరోధము కల్పిస్తాడు. గాలిగాని, వెలుతురుగాని తగలకూడదని అతని వైద్యము. ప్రపంచమందు వ్యక్తమవుతున్న వైశాల్యము, అపారత అమల్ ని ఆకర్షిస్తవి. గది కిటికీలో కూర్చుని చూస్తూ వీధిలో పోతూఉండేవాళ్లను పిలిచి మాట్లాడుతూ, వాళ్ల వాళ్ల దినకృత్యములను కనుక్కొంటూ, తన రోగ ప్రతీకారమైన స్వాతంత్ర్యమును చిన్నిచిన్ని కోరికల ద్వారా వ్యక్తపరుస్తూ ఉంటాడు. ఆగ్రామతలారిద్వారా ఆ ఊరు పోస్టుఆఫీస్ సంగతి కనుక్కొంటాడు; పోస్టు ఆఫీస్ద్వారాగదా అందరికీ వార్తలు వస్తవి. దాని ద్వారాగదా స్వాతంత్ర్యవార్త అందరికీ అందాలి. ఆవార్త అందరికీ అందజేసే పోస్టుబంట్రోతు అవుతానంటాడు. ఆవార్త పంపేరాజు (ఈశ్వరుడు కాబోలు) కోసం ఎదురు చూస్తున్నానంటాడు. పైకి చనిపోయినాడు; కాని ఆ ఊరు పిల్ల సుధ మరిచిపోలేదు అని చెప్పిన తుదిమాటలవల్ల అమల్ కు మరణము లేదని మనము భావిస్తాము కాని ఆరోగములోనుంచి, ఆవైద్యములోనుంచి అమల్ మరి లేవడు. అవసానకాలానికి రాజు వైద్యుణ్ణిపంపితే ఆ రాజవైద్యుడు వస్తాడు. అమల్ ని వదలక కూర్చొ అమల్ యొక్క శాశ్వతమైన పదవిని నిరూపిస్తాడు.

ఈనాటకము; దాని కథ ఎంతచిన్నవో, దాని ఆశయము అంత విపులమైనది. ఎంత నిర్వచనమైనా చేయవచ్చును. అధ్యాత్మికతత్వమంతా, సూక్ష్మజీవన సూత్రాలన్నీ దీనినుండి తీసి ప్రకటించవచ్చును. అంత సూచనాశక్తి ఉంది ఆకవికి.* ఈ నాటకములో ప్రవేశించే ప్రతీపాత్ర ఒక సూత్రప్రాయుడు.

ఠాకూరు ప్రతిమాప్రియుడు. తన ఆశయాలను ప్రతిమలద్వారా వ్యక్తపరుస్తాడు. ప్రధానమైన రెండు మానవధర్మాలు జీవితసూత్రాలు ఈరెండునాటకాలలో ప్రతిమలద్వారా చాలా సున్నితముగా విశదపరిచాడు.

3 మేటర్ లింక్ కవి వ్రాసినది మూడోనాటకము. ఈ కవికి పాశ్చాత్యదేశములో ముఖ్యముగా ఫ్రాంసులోఉన్న ఖ్యాతి ఇంత అంత కాదు. ఇతనికి కూడా రవీంద్రుని కిచ్చిన నోబెల్ బహుమతిని ఇచ్చియున్నారు. ఈ కవికూడా ఆధ్యాత్మికసూత్రాలను ప్రతిమలద్వారా, కథలద్వారా నిర్వచించే స్వభావముగలవాడు. మానవ హృదయాన్ని విప్పి విశదపరుస్తాడు. ఇప్పుడు తర్జుమా అయియున్న నాటకము సంగ్రామానంతరము వ్రాసినది. సంగ్రామము కలుగజేసే ద్వేషము ఎంత క్రూరమైనదో వ్యక్తుల హృదయాలను ఎట్లు మలినముగా చేసివేస్తుందో ఈకథలో ఆ కవి నిరూపించాడు. జర్మనీసేనానాయకుడు బెల్జియన్ మేజస్ట్రేట్ ను ఒకరిని పట్టణ

* కవికిగల సూచనాశక్తిని విమర్శించి పాఠకలోకమునకు కొంతయైన చవిచూపుటకు విమర్శకులు ప్రయత్నింపక జారవిడుచుట విచారకరము.
—సంపాదకుడు.

5. 6- 6 ౮౭౫

మందు భయప్రదర్శనార్థము తన ఆజ్ఞాక్రౌర్యమునకు బలి ఇస్తాడో, ఆ మేజస్ట్రేట్ అల్లుడు జర్మన్ యువకుడు; సేనానాయకుని ప్రధానసహకారి; ఆసమయాన తనమామ నిర్దోషి అని తెలిసి ఎట్లు వ్యవహరిస్తాడో కవి చక్కగా వర్ణిస్తాడు. బలి కావాలంటే మేజస్ట్రేట్ తనప్రాణాన్ని అర్పిస్తాడు గాని నిర్దోషియని యెరిగియుండి ఒకతోట కాపు వాణ్ణి, తనస్థానే చావనియ్యడానికి అంగీకరించడు. ఏమి ఔదార్యము, మానవగౌరవము! దేశాభిమానము ను ఎక్కువచేసే ఈరోజులలో ఈనాటకానికి ముఖ్యస్థానము ఇచ్చుట శ్లాఘనీయము. దేశముపేరుచెప్పి యుద్ధక్రౌర్యమునకు తావిచ్చి మానవలక్షణాలను అణగద్రొక్కే ప్రపంచనాగరికతకు మేటర్‌లింక్ ఆశయము వెగటుగా ఉన్నా మానవసౌహృదాన్ని పెంపొందించాలన్న నాగరికతకు ధ్వజమెత్తినది అవుతుంది.

కొన్నివిధాల సామ్యము వ్యక్తపరిచే ఇద్దరి కవివర్యులను ఈగ్రంథములద్వారా సరిపోల్చి విమర్శించుటకు అనుకూలసమయము కల్పించినది విశ్వభారతిగ్రంథమాల! ఇవి కాకపోతే ఏవి విశ్వభారతీ గ్రంథములు కాగలవు?

ఈగ్రంథమాలకు విశేషలక్షణమైన భాషాంతరీకరణము గురించిన్నీ, వీరుపయోగిస్తున్న భాషనుగురించిన్నీ కొంచెమే వ్రాయగలను. భాషాంతరీకరణము ఎట్లు ఉండవలెననేది ఒక విషమప్రశ్న. కవియొక్క ఆశయము వ్యక్తపరుచుటలో వ్యాఖ్యానము చేయవచ్చునా కూడదా? మూలములోని వాక్యరచన, శైలి, అర్థగాంభీర్యము, భావసూచకత్వము, ప్రతిమలనిరూపణ వీటి పోలికలు తర్జుమాలో ఎంతవరకు ఉండాలి? అభిప్రాయము వస్తేచాలునా? మూలాన్ని అన్నివిధాల అనుకరించాలనే నియమము ఉండాలా? ఇట్టి వివాదాంశములకు ఈమాలా గ్రంథములు లక్ష్యము లవుతవి. ఈచర్చ మరికొన్ని గ్రంథాలు వెడలిన తరువాత పరీక్షింపవచ్చునని నా అభిప్రాయము.*

ఈగ్రంథాలన్నిటిలోనూ వ్యావహారిక భాష ఉపయోగించినారు. పాఠశాలలో పఠనీయపుస్తకాలుగా ఉంపించే ప్రయత్నము చేయాలంటే గ్రాంథికభాషలో వ్రాయాలికాని దేశమందు వ్యాప్తికావాలంటే వ్యావహారిక భాషేకదా ఎక్కువ ఆదరణీయమైనది. ఇంతకూ ఈగ్రంథాలకు భాషాపాండిత్యప్రకటన కాదు ప్రధానము; భావముల ప్రకటన. దానికి ఉచితమైనది సజీవమైన భాష. దానినే సలక్షణముగా వాడినారు. కొన్ని చోట్ల కొంతకొంత సంస్కరణకు అవకాశమున్నా మొత్తముపైని భాష బాగానే ఉన్నది. జీవకళను వ్యక్తపరచాలని జీవభాష వాడినందుకు గ్రాంథికవాదులు భాషఈర్ష్యకోసము ఈ పుష్పాలను వాడకొట్టరని ఆశించెదను. ఠాకూరుగారు వాడిన బంగాళీభాష యెట్టిదో తెలుసుకొంటే గ్రాంధికవాదుల ద్వేషము తగ్గవచ్చును. ఇంతకూ భాష ఒకసాధనము. దాని ఉపయోగము భావముల వ్యక్తపరుచుట. ఆ దృష్టితో ఈ మాలకు సర్వాదరణము సమకూరుగాక! విశ్వభారతి గ్రంథమాలా సుస్థిరోభవ.

---

* ఏగ్రంథమున కాగ్రంథము వేఱుగుచుండును కాన ఆయాగ్రంథములయందలి గుణదోషముల నప్పటికప్పుడే విమర్శించిచూపుట సముచితముగ నుండును.

—సంపాదకుడు.

# కవి - అభినవస్వర్గము

సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి గారు

విశ్వమున లేని భాషలో విస్తరించి-చేతనాచేతనంబులు చెప్పుకొనెడు
స్వస్వజీవితకథలు ప్రశాంతముగను వినివచింతువు మాకుఁ గవీ! నమస్సు.

దివ్యదృష్టి వహించితో? దేవతావ-రంబుఁగంటివో? పరులనేత్రంబులకును
గోచరింపనిక్రొత్తలు గోచరించు-గోచరింపని మధురిమ గోచరించు.

సృజియింపఁ జదుర వీక్షితిమండలమునందుఁ బ్రకృతికాంత యసూయపడ సపత్నిఁ
గట్టఁగాఁజాలు దాకాశగంగఁ జరింప మేలిమిబంగారుపూలతెప్పఁ
జదువఁగాఁగలుగుదు జంతుసంతతిచిత్త మందలిభావరహస్యలిపినిఁ
జూపింపఁగలవు నీసూక్ష్మదర్శినిచేత దిక్కులకావలి దేశములను
గడిమిఁజేయంగలవు నేలవిడిచిసాము-నెగురుదువుఱెక్కలును లేక గగనవీథి
భూమిలోపలి కీఁదుచుఁ బోవఁగలవు-ఎచటనేర్చి తీవిద్య? యోయీ! కవీంద్ర!

రూపములులేనివానికి రూపములును-రూపములుగల్గువాని కరూపతయును
గల్పనము సేయఁగలవు; పెక్కగాలిపటముఁ-జేసి శైలంబు నెగురవేసెదవు మింట.

నడచుచున్నఁ గ్రింద గగనంబునఁ బువ్వులతేరిమీఁద నె
ల్లెడ విహరించుచున్న యటులే యగపట్టెద; నెల్లమందితో
నుడుగక కూడి పూసికొనియుం దిరుగాడుచునున్న నెప్పుడున్
మడుఁగును గట్టుకొన్నటులె మాకుఁ గనంబడుదయ్య! సత్కవీ!

ఏడుపులో నానందము-గాడుపులోఁ బుష్పవృష్టిఁ గల్పించెడు నీ
జాడలకు నిర్ణయింపఁగ-లేఁడెవఁడును బ్రతిఫలంబు; లేఁడు నిజముగన్.

ఊపిరాడంగనీయని యాపదలకు-మిగుల నుక్కిరిబిక్కిరి యగుచునున్న
వ్రాయుచు రసప్రపూర్ణ కావ్యములఁ బెక్కు-మఱచి మఱపింతు వానందపరత జగము.

అనృతముగాదు నీపలుకు నట్టిదొకింతయు సూనృతంబుగా
నును; మరినీయొనర్చునది దుష్కృతమున్ సుకృతంబుగాని కా

దును; తగనీవు తెల్పునది దొడ్డయనీతియు నీతియేని గా
దును; నీకుఁ బుణ్యపాపములు త్రొక్కవు నీగడపన్ గవీశ్వరా!

సర్వసాధారణంబుగా సంభవించు-పుణ్యపాపలోకాలకుఁ బోవు నీవు
సత్కవులకై సృజింపించె స్వర్గ మొండు-బ్రహ్మరాణి యాశ్రితపక్షపాతమునను.

వేయితంత్రులుగల వీణియమీటుచుఁ బాటఁబాడుచునుండుఁ బ్రకృతిలక్ష్మి
పదివేల రేకుల బంగారుతమ్ములు గలిగిశోభిల్లు శృంగారతటిని
లక్షసంఖ్యాకకళాశ్రేణిఁ గురియు చానందంబు సంధించుఁ జందురుండు
పదిలక్షజాతుల ఫలపుష్పదళములం దనరారుచుండును దరుచయంబు
తోఁట మాలీలుగా మన్మథుండురతియుఁ-బాలుచు 'శృంగార వన'మను పూలతోఁట
యెల్లవస్తువు లచ్చట సృష్టికర్త - వ్రాయు వరవడి తలకట్టు వ్రాలుసుమ్ము.

నవరత్నశిఖవుల నయనోత్సవంబైన మవ్వంపుఁ బువ్వులు పురగికోసి
బాగైన యింద్రచాపపుఁ దూఁగుటుయ్యాల లందు రివ్వున వలయముగ నూఁగి
మెఱుఁగారు తొలుకారు మెఱుఁగుల పొదరిండ్ల ముత్తంబులకు నొక్కమొగిని మూఁగి
పరిమళవాహినీ వార్తరంగములందుఁ గేరింతగొట్టుచుఁ గ్రీడసలిపి
అచటఁ దమకై నిరీక్షించునట్టి దివ్య-కన్యకారత్నములతోడఁ గవులుకూడి
యనుభవించుచు నత్యంతమైన సౌఖ్య-మపునరావృత్తి నాస్వర్గమందు నుంద్రు.

చెలువంపుంగనిమై విరాజిలెడు నాశృంగారపుం దోఁటలోఁ
గులుకుంబ్రాయపు బోంట్లతోఁ గలిసి చెక్కుంజెక్కునన్ రాయఁ గం
ఠలతం గేలఁ బెనంచి రమ్యముగ నా నా నర్మసల్లాపముల్
వలపుల్ చిమ్మఁగ ముద్దులంగొనుచునన్ వర్తిల్లె దోసత్కవీ!

కోటిమణుఁగుల పుణ్యంబుఁ గూడఁబెట్టు-ధార్మికుండేని నెల్లవిద్యలను నూఱి
త్రాగిన బుధుండు నేని సత్యముపచింతు - సత్కవీ! నిన్నుఁబోలంగఁ జాలఁడెపుడు.

తినఁగా నన్నముఁ గట్టం-గను బట్టయునుం, బరుండఁగా మంచంబుం,
గనకున్నను లేఁడుసుమీ! - నినువంటి యదృష్టశాలి నిజమునకుఁ గవీ!

ఈమె జ్యోతిశ్శాస్త్రజ్ఞులలో నుత్తమోత్త ముఠాలు; స్త్రీయైన నీమె శాస్త్రము నా మూలాగ్రముగ నేర్చి పేరుగన్న విదుషీమణి. తనకాలమందలి విద్వాంసు లందరికన్న మిన్న యని ప్రఖ్యాతి గన్నది. జ్యోతి శ్శాస్త్రజ్ఞులకు ఖనకృత శ్లోకముల పరిచయమె కాని, యామె యెవతెయో మాతా పితృలెవ్వరో నేరికి దెలియదు. అనార్యులగు రాక్షసు లీమెను బెంచి రనియు, జ్యోతిశ్శాస్త్ర పారంగతు లగు నారాక్షసులే యీమె కాశాస్త్ర రహస్యము లుపదేశించిరనియు దెలియబడు చున్నది. నిశ్చయముగ, మన భారత దేశ మార్యాక్రాంతమగు సమయమున మన ఋషులకన్న ననార్యులే జ్యోతిషమున నధిక ప్రజ్ఞ గలవారుగా గనబడుచున్నారు.

ఖన యత్యద్భుతమైన మేధా సంపన్నురాలు. ఆమె జ్ఞాపకశక్తి నిరుపమానము. ఆమెది కుశాగ్రబుద్ధి. ఆటలయం దామె కాలమును వ్యర్థపుచ్చుట లేదు. శ్రద్ధాభక్తులతో నీమె జ్యోతిశ్శాస్త్రమును పెంచిన తండ్రియొద్ద జదివి యచిరకాలములోనే దాని యం దధిక ప్రజ్ఞను గడించెను.

ఖన యున్న అనార్యజనుల గ్రామము లోనే యొక ఆర్యబాలుడు గూడ రాక్షసులచే బోషింపబడుచుండెను. ఈ బాలుడు మిహిరుడని పిలువబడుచుండెను. ఇతడుగూడ జ్యోతిశ్శాస్త్రమును జదివి గొప్ప విద్వాంసు డనిపించుకొనెను.

ఈబాలుడు అనార్యులగు రాక్షసులకు దొరికినవాడు. ఒక దినమున గొందరు రాక్షసాంగనలు స్నానార్థము సమీపమున నున్న నదికిబోగా వారి కొకకడవ నీటిలో దేలివచ్చుట కనబడినది. అందుండియొక శిశురోదనము వారి నాకర్షించినది. వారా కడవనుబట్టి యొడ్డునకు జేర్చిరి. దానిలో చక్కని చిన్న మగశిశువు కొలది దినములక్రిందటనే జన్మించినవాడు గానబడెను. వా రాబిడ్డను దమ గృహము నకు దీసికొని పోయిరి. నాటినుండియు మిహిరుడు రాక్షసులలో నొక్కడై తన్ను నదీప్రవాహమునుండి కాపాడి దెచ్చిన స్త్రీల యాదరణముచే దినదినాభివృద్ధి జెందుచుండెను. ఇట్లు దైవికముగ నేకగ్రామమందు వసించుచున్న ఖనా మిహిరులు రాక్షసుల యాదరణమున బెరిగి వారియనుమతి దంపతులైరి.

ఖన తలిదండ్రు లెవరో మన మెరుంగము కాని మిహిరునివంశము మనకు దెలియబడు చున్నది. విక్రమాదిత్యుని యాస్థానమందలి నవరత్నము లని పేరుపొందిన విద్వాంసులలో నొక్కడగు వరాహుడే మిహిరునితండ్రి. వరాహునకు జ్యోతిష మభిమానశాస్త్రము. దానియం దాతనికి నమ్మక మధికము. వరాహునకు పుత్రుడు జన్మించినతోడనే జాతకము

వ్రాసి యాయుర్భాగమును గణితముచేసెను. గణితములో కొంచెము పొరబడుటచే నూరు సంవత్సరముల యాయుర్దాయమునకు బదులు పది సంవత్సరములుగా నాతడు తెలిసికొనెను. పది సంవత్సరములు మాత్రమే బ్రతుకు కొడుకు తనకు కలిగెనని తెలిసికొని వరాహుడు మిక్కిలి విచారము నొందెను. పది సంవత్సరములు పెంచి పెద్దవానిగజేసి వాని వలన కష్టసుఖమును బొంది తరువాత వాని చావు చూచుటకన్న వెంటనే జన్మించిన శిశువును విడనాడుట అంత విచారకరముగ నుండ దని వరాహు డూహించెను. ఈ కారణముచే శిశువు నొక కుండలోనిడి సమీప నదీప్రవాహములో నాభాండమును విడిచెను. ఆకుండ లోని శిశువెట్లు రాక్షసులచే బెంపబడెనో మన మెరుగుదుము

ఖనా మిహిరుల వివాహానంతరము, వా రార్య దేశమునకు బోవ సమకట్టిరి. రాక్షసుల యనుజ్ఞను పొంది వా రుభయు లార్య దేశమునకు ప్రయాణమైరి. రాక్షసులు వీరి యుపయోగార్థము కొన్ని జ్యోతిష గ్రంథముల నొక పరిచారికకిచ్చి వారి వెంబడిబంపిరి. ఆ పరిచారిక రాక్షస దేశాంతమువరకును వారితో వెళ్లు నట్లును, జ్యోతిశ్శాస్త్రమందు ఖనా మిహిరులకు చాలినంత పాండిత్యము లేనట్లు ఆమె తెలిసికొనిన యెడల వారి కాపుస్తకము లిచ్చు నట్లును, లేనియెడల తిరిగి యా పుస్తకములను రాక్షసుల యొద్దకే తెచ్చి యిచ్చునట్లును, రాక్షసులచే నియమింపబడి పంపబడెను.

రాక్షస దేశాంతమునకు వారు సమీపింపగనే, పరిచారిక మిహిరుని జ్యోతిశ్శాస్త్ర పరిజ్ఞానమును పరీక్షింపగోరి, ప్రసవ వేదనలో నున్న యొక గోవు నచటజూచి, యా గోవెట్టి వర్ణముగల వత్సమును కనునని ప్రశ్నించెను. మిహిరు డందులకు ప్రత్యుత్తరముగా నాగోవు తెల్లని రంగుగల దూడను కను నని చెప్పెను. కొంచెము కాలము వారు నిరీక్షించునప్పటి కాగోవు నల్లని రంగుగల వత్సమును కనెను. ఇందుచే నాపరిచారిక వారికి జ్యోతిశ్శాస్త్ర జ్ఞానము చాలదనియు, పుస్తకముల జదివి నేర్చికొనవలసిన విషయము లనేకము లున్న వనియు నిర్ణయించి వారి కాపుస్తకములకట్ట నప్పజెప్పి వారి విడిచి తనదారి నామె రాక్షస దేశమునకు మరలి పోయెను.

ఇన్ని సంవత్సరములు కష్టపడి చదివినను జ్యోతిశాస్త్రమం దీపరిచారికకు గల జ్ఞానము నయినను సంపాదింపలేకపోతిననియు, సామాన్యమగు నీ చిన్న గణితము కూడ చేయలేక పోతిననియు తలంచి మిహిరుడు వ్యసనపడెను. ఇన్ని సంవత్సరములు కృషిచేసి చదివినను జ్యోతిశ్శాస్త్రమును తెలిసికొనలేనప్పుడు ఈ పుస్తకములు మాత్రము నన్ను జ్యోతిశ్శాస్త్రవేదినిగా జేయగలుగునా యని మిహిరుడు నిశ్చయించుకొని యాతాళగ్రంథముల నేటిలో విడిచెను. అప్పు డతనిభార్యయగు ఖన కొంచెము దూరములో నాతని వెంబడించుచుండెను. అప్పుడామె తనభర్త చేయుచున్న యా మూర్ఖపు పనినిజూచి వెంటనే నదిలోనికురికి రెండు

పుస్తకములను మాత్రము కాపాడగలిగెను. మిగిలిన గ్రంథమంతయు గంగపాలాయెను.

అట్లు ఖనామిహిరులు ఆర్యదేశమును బ్రవేశించి వెళ్లుచుండగా, మార్గమధ్యమున వేటకై వెడలిన విక్రమార్కచక్రవర్తిని వారు కలసిరి. విద్యాభిమానముగల చక్రవర్తియని వారాతని దెలిసికొని యాతని సమక్షమున కేగిరి. చక్రవర్తియు వారి నించుక బరీక్షించి, జ్యోతిశ్శాస్త్ర మందసమానులని తెలిసి కొని దనవెంట నగరునకు వారి దీసికొని పోయెను. వెంటనే తన యాస్థానజ్యోతిషపండితు డగు వరాహుని చక్రవర్తి రప్పించి ఈబాల దంపతుల వాని యధీనము గావించి, వారి కెట్టి లోపము గలుగకుండునట్లు చూడుమని వాని నాజ్ఞాపించెను. ఇప్పు డా ముసలిపండితు డగు వరాహుడు, మిహిరుని తన కన్నకుమారుడని తెలిసికొని పట్టరాని సంతోషమును బొందెను. కొడుకే గాక రూపవతియు, విదుషీమణియు, నగు కోడలుకూడ తనకు గలిగినందుకు వరాహుడు మితిలేని యానందమును బొందెను.

ఇట్లానందముతో వారెల్ల నొక్క యేడాదిగడపిరి. విక్రమార్కచక్రవర్తి మిహిరుని యసమాన జ్యోతిషజ్ఞానమును దెలిసికొని వాని మిక్కిలి గారవించుచుండెను. మిహిరుడే యపారజ్యోతిశ్శాస్త్రవేది యనుకొనిన, అతని భార్య ఖన యా శాస్త్రమం దతని మించిన విదుషీమణి. తన భర్తయగు మిహిరుడు గాని, మామయగు వరాహుడుగాని చేయలేని గణితమును సునాయాసముగ నామె వారికొరకు చేయుచుండెను. ఈరీతిగ నామెకీర్తి దేశమంతయు వ్యాపించి చిట్ట చివరకు చక్రవర్తియగు విక్రమార్కునకు గూడ శ్రుతమయ్యెను.

ఒకదినమున రా జగు విక్రమార్కుడు వరాహుని దన యాస్థానమునకు రప్పించి యాకాశమందలి నక్షత్రములసంఖ్య గణితము చేసిచెప్పుమని యడిగెను. రాజుగారి ఈగొప్ప ప్రశ్నకు ప్రత్యుత్తరము జెప్ప నాత డొకదినము గడువడిగెను. రాజందుకు సమ్మతించి వరాహు నింటికి బంపెను. వరాహు డెంత ప్రయత్నించినను ఎన్ని జ్యోతిషగ్రంథముల శోధించినను రాజుగారి ప్రశ్నకు సదుత్తరము నెరుగజాలక పోయెను. ఆకాశమందలి నక్షత్రసంఖ్య నెరుంగుట కాతని కశక్యమాయెను. ఇందుచే నాతడు విచారగ్రస్తుడై కళాకాంతులు తరిగి దీనుడై యుండెను. తుదకతని విస్తారమగు కీర్తి శాశ్వతముగ భగ్నమగునని తలంచెను.

మామయగు వరాహుని యాందోళనమును ఖన యెరింగి చిన్న మందహాసము చేసి యిట్లనియె: "తండ్రీ! నీ వెందు కాందోళన పడియెదవు? విక్రమార్కుని ప్రశ్నకు ప్రత్యుత్తరమును నేను గణనముచేసి కనిపెట్టెదను. నీవు సుఖమున నుండుము. తత్తర పడకుము." చెప్పినరీతి నామె వెంటనే గణితము చేసి యాకాశమందలి నక్షత్రసంఖ్యను కనుగొనెను. మరునాటి యుదయము వరాహుడు

రాజాస్థానమునకు జని, నక్షత్రముల నిజసంఖ్య నుదెల్పి సభ్యులనెల్ల నాశ్చర్య మగ్నుల గావించెను. రాజుమాత్రము వరాహుని నమ్మలేదు. వరాహుని ప్రజ్ఞను, శాస్త్రపరిజ్ఞానమును రాజెరుంగని వాడుకాడు. అందుచే రాజాతని నొక్కి యెవరా గణితముచేసి నక్షత్రసంఖ్యను కనుగొనిన వారని యడిగెను. తుదకు నాతడు విధిలేక తన కోడలగు ఖన యీగణితము చేసి యిచ్చినదని యథార్థమును జెప్పవలసివచ్చెను. రాజు మితిమీరిన యానందమును జెంది తన యాస్థానమున ఖన పదియవ రత్నమని సెలవిచ్చెను.

ఈ వార్త విని వరాహుడు పిడుగు పడ్డవానివలె నిశ్చేష్టుడాయెను. తానెట్లు తన కోడలిని రాజాస్థానమునకు దీసికొని వెళ్లగలడు? ఆమె యొకస్త్రీ. అదిగాక వివాహితయై తన భర్తతో కాపురముచేయు కులస్త్రీ. ఇట్టి కులీన, రాజాస్థానమున కరుగుచుండిన కులబాహ్య యగుట నిశ్చయము. ఇట్టి మానభంగకరమును, వ్రీడాకరము నగు కార్యముకన్న మృత్యువే మేలని వరాహుడు నిశ్చయించుకొనెను. ఏ నాలుకమూలమున ఖనా విదుషీమణి కీర్తి జగత్తున వ్యాపించినదో, ఏ నాలుక తన సత్కుటుంబ గౌరవమునకు కళంకము తేబోవుచున్నదో, అట్టి యా నాలుకను కోసివేసి యామె మానమును, తనకుటుంబ గౌరవమును కాపాడ నిశ్చయించుకొనెను. ఇట్టి మనోనిశ్చయముతో వరాహుడు రాజాస్థానమునుండి గృహోన్ముఖుడాయెను. వెంటనే పుత్రుడగు మిహిరుని బిలిచి రాజాస్థాన వార్తల నెల్ల నెరింగించి కోడలి నాలుకను ఖండింప నాజ్ఞనిచ్చెను. భార్యాభర్తలిరువురును జ్యోతిశ్శాస్త్ర మూలమున వారి కీశిక్ష విధింపబడునని యెరుంగుదురు. ప్రేమాత్మక మగు మందహాసముతో ఖన తన నోరు విప్పెను. భర్తయగు మిహిరుడు దారుణమగు ఖడ్గమున నామె నాలుకను త్రుంచెను. కొలదికాలములో నామె తన నాలుకనేకాక ప్రాణములను గూడ సంతోషముతో నెడబాసి కుటుంబమునకు రాబోవు కళంకమును పోగొట్టెను. ప్రియతమ యగు భార్యావియోగమున మిహిరుడును కొలదికాలములో నామెను స్వర్గమున కలసికొనెను.

---

బర్మా వెండిపని



చిత్రము ౧౩

స్మృతివిమర్శన చింతావిశేషములును-కరుణ సంశయోత్సాహ వికాసములును
ప్రమదసళ్ఛయాశ్చర్య విధానములును-మోమునస్ఫురింపఁ గుదిఁదలపోసె నిట్లు.

అద్భుతమిది యెంతయుఁ బరమాద్భుత మిది యక్కటా శంకరునియాలయంబులెల్ల
శూద్రులును వేదచోదిత శుద్ధధర్మ-విమతులునగు చాముండజంగముల కయ్యె.

వీరచాముండ జంగమబృందము లొన-రించు పూజావిధాన మెంతేనిఘోర
తరము వేదబాహ్యమునయి తనరుచుండె-దాన ద్విజులకు హరుఁగడు దవ్వుసేసె.

దానితత్త్వము గమనింప ధర్మవిధుల-గరళకంఠునిర్మాల్య మగ్రాహ్యమయ్యె
నతని నర్చించుటయు లోపమయ్యెఁ దుదకు-నాలయమున కేగినఁ దానమాడనయ్యె.

శ్రుతులు"రుద్రోమహర్షి"యంచునువచించు-జ్ఞానమోక్షంబులనొసంగుసామియతఁడె
యయ్యెఁ గాలవిపాకము ననుసరించి-యిట్టి విపరిణామముకగ్గె బెట్టిదముయి.

సకలవేదాంతములకు వాచ్యతరుఁడెవ్వఁ-డీచతుర్వేదములు నుతియించు నెవని
ధ్యానగమ్యుఁడునెవఁడు బ్రహ్మర్షులకును-వేల్పు లసురులు నరులు సేవింతు రెవని.

త్రిభువనంబులు నెవ్వనిప్రియమగు నెల-వెల్లరూపంబు లెవ్వని యేకమూర్తి
యెవ్వఁ డాదిమధ్యాంత విహీనతేజ-మెవ్వఁ డఖిలశరణ్యుఁడు నెవఁడు పరుఁడు.

కాలుసేయి మున్నయిన వికారములును-జిత్తము మనంబు నాది విశేషములును
గ్రోధశాంత్యాదులగు సర్వగుణగణములు-నవ్యయుండగు నెవ్వనియందు లేవు.

అట్టిదేవదేవుఁడు బరమాత్ముఁడు నగు-శంకరున కిట్టి దుస్థితి సంభవించె
భర్గుఁడిపుడు నిర్భాగ్యులపాలిటఁబడి-వైదికులకుఁ జేరఁగరానివాఁడునయ్యె.

కాని ద్విజుల యీయజ్ఞాభిమానమునను-శ్రుతులు యజ్ఞమె విష్ణువంచునుఁ బలుకుట
వైదికులకు జనించెను భవునియెడ ను-పేక్ష నిట్టులమై దాన నింతయయ్యె,

తనరు వేదవేదాంతములనుఁ బఠించి-రహిఁ దదంగానుగతిఁ దదర్థము గ్రహించి
ఆవిధి సమాశ్రయించి తా రాచరించి-యితరులకు నట్లు చెప్పిచేయించువారు.

సర్వదర్శనతత్త్వ విస్తరవిదులగు-వైదికులు శ్రీమహేశతత్త్వంబుఁ దెలియ
లేరె స్వర్గసుఖంబుపైఁ గూరిమిఁగొని-కర్మమోకర్మమని కొట్టుకాడుచుండ్రి.

వేదవేదాంతముల యర్థవిధుల కెల్లఁ-గేంద్రతరతత్త్వమైన శ్రీకృత్తివాసు
వైభవంబు నెఱుంగనివారుఁ గలరె-జన్మములమీఁది పెనుసపేక్షయె యిదెల్ల.

అనుభవం బనుభావ్యము ననుభవించు-వాఁడు ననుటాదియగు వికల్పములు లేని
యాత్మ సాయుజ్యసుఖముపై నాస లేమి-యాసుఖంబు గ్రహింపమియంతె కాక.

"నే""నది""సుఖంబు"ననుభేద నియతితోడి-విషయసౌఖ్యానుభూతితో వ్యాపృతము
స్థూలదృష్టి లక్ష్యంబుగా శ్రుతివచించు-స్వర్గసుఖమునఁగల యపేక్షయె యిదెల్ల.

కానఁ దుచ్ఛసుఖంబుపైఁగల యపేక్ష-విప్రు లీశంకరుని సేవ విడిచి రింకఁ
బూర్వసంస్కారమున నిల్చె ముక్తికాంక్ష-హరుని సేవయు శూద్రులయందుఁ గొంత.

జంగములవిద్య నానాఁటసమయుచుంటఁ-గాలదోషంబునను జేఁడుగలుగమినిఁ బ్ర
వీణు లట్టులునై వారు విధిఁదొలఁగిరి-కావున శివాలయము లిట్లు గహనమయ్యె.

జ్ఞాననిష్ఠులై నిలిచిన శైవవిప్రు-లేని తమసర్వసమదృష్టి దీనిమొకల
శ్రద్ధఁగైకొని విధులనుజక్క-సేయఁ-బూనకుండిరి దాసిచేఁ బుట్టెనింత.

పైని స్వోత్కర్షపరులగు వైదికు లన-భిజ్ఞులైనశూద్రులఁ దమవిద్య బలిమి
వేదబాహ్యులు పాషండవాదులు నని-యనిరి పతితుని రాల రువ్వినవిధమున.

క్షత్రియాచార్యవరుల ప్రచారమునఁ గు-లాభిమానముచే రాజులంద ఱకట
జైనబౌద్ధమతంబుల సంశ్రయించి-యీవిపరిణామమును సవరింపరైరి.

ఆమతంబులఁ జేరనియట్టికొంద-ఱునుమతంబున స్వాతంత్ర్యమును దృజించి
వైదికులచేతి బొమ్మలపగిదిఁ దిరిగి-యీమహావిప్లవము గమనింపరైరి.

శైవులైన యొకరిద్దరు క్ష్మావరులును-వైష్ణవులు బౌద్ధు లాదిభూపతులదాడి
కతనఁ దన్మతాచార్యుల మతకరినడ-కలను గలగుండువడి చీనఁగడఁగరైరి.

కాన నింతటనేని యిద్దానినిసరి-సేయకుండిన శైవముచెడును, జ్ఞాన
మార్గము నశించు, ముక్తిసంపత్తిమఱపు-వడును, సర్వముదారుమార్పడు నిజమున.

పశుపతిపదారవింద సేవాపరుండ-దత్ప్రసాదాధిగత మహత్తరవిభవుండ
నార్యవిహితుండ విమలవిద్యామహితుఁడ-దెంపుడిగి యీయడరు సైరింపఁగలనె.

వేదవేదాంగచోదిత విమలమంత్ర-ములు ద్విజులు విష్ణుదేవునిఁ బూజసేయు
రీతి శంకరుఁగూడ నర్చించునట్లు-చేయయత్నింతుఁ గార్యసంసిద్ధికొఱకు.

శైవపారమ్యవాద శాస్త్రములుగలవు-పండితులు నాకు నిష్టులై పరగుచుండ్రి
కడఁగియుంటిని నేను శంకరుఁ డనుగ్ర-హింపకుండునె యిది ఫలియింపకున్నె.

ఈసిరులు నీమహారాజ్య మీవిభవము-నీతెలివి యీశరీరము నీమతియును
హరుఁడొసంగినవేఁగద యాతనియెడఁ-బ్రవినియోగించి సార్థకపఱతు నిఁక.

ధనము నిధనము శివుని కర్పణపడమిని-రాజ్యము దురాజ్య మభవు నర్చనములేమి
నరుఁడు వానరుఁ డీశు కింకరుఁడుగామి-మనియు వామని శంభుసేవనుఁ బడయమి.

నిపుడె మనపురోహితుతోడ నీవిషయముఁ-జెప్పి కరణీయమునుఁ గార్యసిద్ధికురవు
నరసికులవృద్ధులను బుధనరులఁ బిలువఁ-బంచిపూజించి దీనియోచించెద నిఁక.

మనుకొని యిఁకెట్టులేని నాపురుషకార-మునకు సాధ్యము నగునటకును బ్రయత్న
మనుబూనర్చెదఁగాక యంచును వినిశ్చ-యించి యాలోచనంబుఁ జాలించియంత.

అర్చనము ముగియించి యనర్ఘమణుల-నెసఁగు బంగరుచౌకులో నిష్టలింగ
మూర్తినుంచిపేరెదఁ దాల్చె భూవిభుండు-విభుని శంభుని మదినిలిపినవిధమున.

అంతఁ బేరోలగ మందుండి బ్రాహ్మణోత్తముల రప్పించి సాదరము వారి
గౌరవించియుఁదన కోరికఁదెలుప వా రందఱుఁగడుదవ్వు నరసియరసి
తమలోననష్టగోత్రములవారికి శివారాధనదీక్ష సక్రమత నొసఁగి
నేమింప వారికి స్వామికి వేర్వేఱ నటపురక్షేత్రపాత్రాదులిచ్చి
పాలుపుమీఱు పంచారామ ముఖములగు శి-వాలయంబుల నన్నిటి నాగమవిధి
సంస్కరించి బ్రాహ్మణపూజ జరిపి బ్రాహ్మ-ణులనుబూజించె ముక్కంటి పుడమిఱేఁడు.

---

## సదాచారుఁడు

శతావధాని వేలూరి శివరామశాస్త్రి గారు

౧

ఇది దురాచార మని యెల్లరు వాదించినను మా పితృపితామహుల ఆచారమే సదాచారమని పట్టుపట్టి ప్రతీకుఁడు తన కుమారుఁడు నకులునకు పదమూఁడవయేట పెండ్లి చేసెను. పెండ్లికూఁతురు శుభాంగి నకులునికంటె ఒక రోజు చిన్నది.

ఆ మఱుసటియేటనే శుభాంగికి పుత్రుఁడు కలిగెను. వానికి నామకరణము చేయుటలో పితామహునకు, పితామహికి చాల వివాదము కలిగెను.

తన పేరే పెట్టవలయు నని ప్రతీకుఁడు; అది నాకు చెప్పరాని పేరు అని అతనిభార్య. ఇట్టి వివాదము, సంవాదము అయినపై తుదకు చంద్రుఁడను పేరు ఖాయపడినది.

మూఁడునెలల చంద్రుని శరీరము ఇపుడు అమ్మమ్మనాయనమ్మలు, మాతామహపితామహులు లోనగువారు చేయించిన నగల బరువు మోయుచున్నది. ఇఁక మేనమామ మాట చెప్పనక్కఱయే లేదు. అసలు బరువు ఆతనిదే. ఈ బిడ్డఁడు ఇంత బరువుమోయ పరలోకమునందు పుణ్యమే యున్నదో పాపమే యున్నదో కాని ఆ యున్న దేదో పుట్టకు పుట్టు ఉండి యుండవలయును.

ఊరివా రందఱకు అతఁడు బంగారు పిచ్చుక.

నకులునకు తనకుమారుని నలువురిలో చూడను, ఎత్తికొనను కడు సిగ్గు. కాని ఆతని యాత్మ కను లక్కఱలేకయే కాంచును. చేతు లక్కఱలేకయే ఎత్తికొనును.

చంద్రుని యాహారములు అనేక విధములు. తల్లిపాలు, దాదిపాలు, ఆలపాలు, వెన్న, మీఁగడ— ఇవి నీటు. కండెన్‌స్‌డ్ మిల్కు—బిస్కతులు లోనగునవి చాటు.

ఇతఁడు ఈ యాహారములచే, నగల బరువుచే ఇసుమంతయు పెరుఁగలేదు కాని తల్లిచూపులచే పెరిఁగెను; దాది చేతులలో వర్ధిల్లెను; తాతఱొమ్మున పొడవుసాగెను; అమ్మమ్మ ముద్దులచే చిగిరించెను; తాత-ఉపలాలనములచే ఒడలుచేసెను.

అతని ఆహారము వయసుతోపాటు వృద్ధి యామెను: అన్నము,పప్పు,కూరలు,పచ్చళ్లు, నేయి—ఇత్యాదులు.

ఇవన్నియు చంద్రుని జీర్ణకోశమును విశాలపఱచినవి. ఒండొండ పోరు లేకుండ ఇవన్నియు ఒకచోట నివాస ముండవలయుఁ గదా! మేఘములు పరవళ్లు తొక్కుటకు ఆకాశము ఎంతవిశాలమై యుండవలెను ?

ఈ యాహారము లన్నియు ఒక అతిథిని తెచ్చెను. ఆతని కాంచినది మొదలు చంద్రుఁ

డు కనులు మూసికొని పరుండును. ఈ యతిథి ఉన్నంతవఱకు ఆహారము లన్నియు చేతులు, మూతులు కట్టుకొని నిలువఁబడి పోవును. లోపల నున్న పదార్థము లన్నియు చిఱుతపులి నోటిలోనికి తానుగా నేఁగు గుఱ్ఱమువలె ఆ యతిథినోటిలోని కేఁగును. అతఁ డెల్లప్పుడు అగ్రస్థాన మాక్రమించును. ఏలయనిన అతఁడు ఈశ్వరాంశసంభూతుఁడు. సుగృహీతనామధేయుఁ డగు అతనిపేరు జ్వర భట్టారకుఁడు. అతఁడు పది పదియేను నాళ్లు ఉండి బట్టా, పాతా పుచ్చుకొని మరి వెళ్లును.

ఇతని ఆసనా చూచుకొని భూతములు రాఁదొడఁగెను. గ్రామమున బలవన్మరణము, అ కా ల మ ర ణ ము చెందినవా రందఱు దయ్యములై వారి యింటనే తిష్ఠ. ఏ యతిథులు వచ్చినను వారియింటనే విందు. పరగృహము లకుఁ బోవు అతిథులను గూడ వారు తమ యింటికే ఆహ్వానించి అర్ఘ్యపాద్యము లిత్తురు. ఆ యా యతిథులు సంపూర్ణసత్కారములను పొంది పోవుచుందురు. ఒకరి తరువాత ఇంకొ కరు మఱల సత్కారము గొనవచ్చుచుందురు. వారు కేవలము సత్కారము గొని నిష్క్రమించుట లేదు. అతనికి బంగారు తాయెత్తులు సత్కరించి మరి పోవుచుండిరి. ఆ తాయెత్తు లన్నియు ఇదివఱ కుండిన నగలు పెట్టిన పిల్లల వలె నుండెను.

చంద్రుని కిపుడు ఏడేండ్లు. ఆతని శరీరము రాతిని భేదించుకొని వచ్చిన మొలకవలె నుండెను. ఇపు డాతని యాహారమును వివరించుచో నతని తలిదండ్రులు, విశేషించి ప్రతీకుఁడు శపించును. కథయంతయు తినుబండా లపు బండాల మగును. కాన లఘువుగా తేల్చెదను—నాలుగు గుర్రముల బలముగల ఒక మరను అతని ఉదరమున పెట్టవలయును.

చంద్రుని మోము ఎల్లపుడు ఆలోచన గ్రస్తమయియుండును. ఈ నగలబరు వెటులు మోయుదును? ఈ వస్త్రముల నెటులు ధరింతును? ఈ తాయెత్తులను ఎటులు ఒత్తుకొన కుండఁ జేసికొందును? ఈ మొదలయిన వెన్నియో కలిసి ఆ చింత చింతకాయలు కట్టుకొని పోయినది ఆ చింతకాయ లన్నింటిలోను రోగబీజములు.

ప్రతీకుఁడు శుష్కవేదపాఠకుఁడు మాత్రమే కాదు; మంచి అనుభవవైద్యుఁడని పేరు మోసినవాఁడు. అతనికి చేవ్రాలుపెట్ట చేత కాకున్నను అతనిచేతిలో వ్రాలుమాత్రము దొడ్డదని పెద్దప్రథ. నిదానము చదువుకొనకున్నను అతనికి నిదాన మెక్కువ. అతఁడు మందులు ఎక్కువ ఉంచుకొనలేదు; ఎక్కువ ఏదీ పనికిరాదని ఆతనికడ మూడేమందులు:నల్లమందు, ఎఱ్ఱమందు,మూఁడవ పరమౌషధము లంఘనము. రోగముల జాతు లన్నియు ఈమూఁటికే విభజింపఁబడి యుండెను. అతఁడు ధనమీయని వారికి ముఖ్యముగా ఈ మూఁడవమందే వాడును. అతఁడు నడుమ నడుమ వేదమునుండి కారికలుచదువును. 'అజా మేకాం లోహిత

(శుక్ల) కృష్ణామ్' గ్రామవైద్య మంతయు అతనిమీఁదనే జరుగుచుండెను గాని ప్రకృతము ఆ పల్లెటూరు కూడ బస్తీనుండి ఇంగ్లీషు వైద్యులను రావించుకొనుచుండెను.

ప్రతీకుఁడు తనను బిల్చువారికడ ఆయుర్వేదమాహాత్మ్యమును, చరకుఁడు సుశ్రుతుఁడు మొదలగువారు ధన్వంతరికి అపరావతారములని వేదమునుండి కొన్ని వాక్యములను ఉదాహరించుచుండును.

ప్రతీకుఁడు పథ్యము నిర్మించుటలో అసమానుఁడు. ఆ పథ్యమువలన రక్తమాంసము లెన్నటికిని వృద్ధియయి ఆధిక్యదోషమును చేయవు.

చంద్రునకుమాత్రము 'ప్రతీకుఁడు తాత' యని మైనను అతని మందునెడ ప్రీతి లేదు. పెరటిచెట్టు మందుకు రాదు. ప్రతీకుఁడు మందీయఁగనే చంద్రుఁడు రివ్వున ముఖము కేసి విసురుకొనువాఁడు. ఆ మందు నోటిలోనికి పోయెనో జుట్టులోనికే పోయెనో ఇవన్నియు దాఁటి పెరటిలోనికే పోయెనో తెలిసికొనుట చాల కష్టము.

౨

ప్రతీకునింట సదాచారుఁడు అనువాఁడు ఒకఁడు కలఁడు.

సదాచారుఁడు మొదట మొదట సత్ ఆచారుఁడు. పిదప సదా ఆచారుఁడు.

ఈ సదాచారుఁడు ప్రతి ద్వీపములో ప్రతి జాతిలో ప్రతి సంఘములో ప్రతి మనుష్యునిలో ఒకొక్కరీతిగాపుట్టి ఒకొక్కరీతిగా మాఱి తర్కమును అవహేలచేసి విశ్వాససింహాసన మెక్కి శాసించుచున్నాఁడు. అతనికి దరిద్రుఁడును మహారాజును ఒకటే. అతని శాసనమున దయయు, కోపము ఒక్కటియే. దానికి ఇనుమును వెన్నవలె కరుఁగును; మోడును చిగుర్చును.

అతనిని కొందఱు మొద వందురు. మరి కొందఱు ఆవుమొగపు పులి యందురు. కొంద ఱతనిని మొదట మొదట కప్ప యందురు; ఇపు డిపుడు కప్పకూఁత పామందురు.

మహానదుల మూలమైన తెలియును గాని సదాచారుని అనుపాను లెవరికిని తెలియవు. ఇతఁ డెపుడు పుట్టెను? ఎక్కడ పుట్టెను? అను శంకయే యింతవఱకు ఎవరికిని తట్టలేదు.

ఇతఁడు పురాణబాలకుఁడు. స్మృతులు ఈ వృద్ధకుమారుని దేశకాలానుగుణముగా పెంచినవి. ఇతనికి స్మృతులు తల్లియగుచో వేదము తండ్రి. ఇతఁ డెంతపురాణబాలకుఁడో అంత నిత్యయౌవనుఁడు.

మహానదిలో అనేక-ఉపనదులు వచ్చి కలిసినట్లు సదాచారునిలో అనేక-ఇతరాచారములు వచ్చి కలిసెను. ఉపనదులు సంగమించిన తావులలో నీరు వేఱువేఱుగ కానిపించుచునే యుండునుగాని పోనుపోను ఆ జడచిక్కు విడఁదీయుట చాలచిక్కు.

ఏకాలమున అర్థవాదములే యథార్థవాదము లాయెనో, ఏకాలమున భీతులే

దేవతలాయెనో, ఏకాలము సర్వమును అదృష్టముమీఁదనే పట్టుకొని నిలిపియుంచెనో, ఆ కాలమున ఈ యితరాచారములు సదాచారమున కలగాపులగ మయిపోయెను.

సదాచారుఁడు పిల్లికాని, విధవకాని యెదురాయెనా వెనుకకు పోవును. తుమ్ముచో లోలోపల తిట్టుకొని కార్యమారంభింపఁడు గూబ అఱచుచో ఎవరో చత్తురని శంకించును.

ఆదివారమునాఁడు ఉసిరికాయ పచ్చడి తినరాదనును. మంగళ శుక్రవారములలో ఇతరులకు దమ్మిడీయైనను ఈయఁడు. శని సోమలలో తూర్పునకు, గురువారమున దక్షిణమునకు, ఆదిశుక్రలలో పడమటికి, బుధమంగళలలో ఉత్తరమునకు వెళ్లనీయఁడు. బుధవారమునాఁడు పులినేని బయలుదేరనీయఁడు. ప్రతి శనివారమునాఁటి ప్రాతఃకాలము పాపకాలము. మంగళవారమునాఁడు తాటాకులపాక కుట్టనీయఁడు. వైదికునిచే నియోగి యింటి పాకము తినిపింపఁడు.

అతని శాసనము చాల క్రూరము. ఏ యవయవము దోషము చేయునో ఆ యవయవమును ఖండించును! యజ్ఞము చేయువానికి వేదము రానిచో దానికి పశువును చంపుట శిక్ష.

ఇట్టివి పెక్కులు సదాచారునికి ఎడమచేయి. అతని కుడిచేయి సుశీతలము. అది బహిరుష్ణము,అంత శ్శీతము.ఆ హస్తమునందలి రేఖలు ఏ పురుషునకును లేవు.

ఈ సదాచారుఁడు తన కుడి యెడమ చేతుల నడుమ ప్రతీకుని కౌఁగిలించుకొనెను. ప్రతీకుఁడు ఎక్కువ ఎడమచేతి పట్టులోనే యుండెను.

సదాచారుని కన్నులు మూసి దురాచారుఁడు ఆ యింట ప్రవేశింపక పోలేదు. పాల నెపముతో తేనీరు కాఫీలు చంద్రుని లోనికి జాఱుచుండెను. వెన్నయను పేర బిస్కతులు చాకొలేట్. ఇంగ్లీషు మందుకాని ఇంగ్లీషు మాటకానిఇంతవఱకు ప్రతీకునిజాగరూకతచేత ఆ ప్రదేశముకు తొంగియైన చూడలేదు.

ఇరుగు పొరుగు పిల్లలను, ముఖ్యముగా విశ్వంభరుని జూచి తల్లి శుభాంగి చంద్రునకు క్రాపింగు పెట్టించెను. ప్రతీకుఁడు ముమ్మాఱు శిరోముండనము చేయించి మరి విడిచెను. దానితో కూఁకటికూడ కూయిడెను.

ప్రతీకుఁడు నకులునితో ఒకనాఁడు ఇట్లనెను—'చంద్రుని యెడ చిన్నఁబోయినది.'చిన్నఁబోవుటో పెద్దబోవుటో నకులునకు తోఁప లేదు. ప్రతీకుఁడు—'ఏడేండ్లు నిండినవి. గర్భాష్టమములలో ఉపనయనము చేయవలెను' అనెను.—'వాఁడసలే జబ్బువాఁడు, ప్రొద్దుననే స్నానము చేయవలెను; జందెము బుజమెక్కుననుమాటయేకాని సంధ్యావందనమా, చట్టుబండలా?' అని నకులుఁడనెను.—'నాకు ఆ మేటనే ఐనది. నీకు ఆ మేటనే చేసితిని. వానికిని ఈ మేటనేకావలయును. ఇందులకు పూర్వాచారము పరిత్యజింతుమా?' అని ప్రతీకుఁడనెను.

వాద ప్రతివాదములు అయినవి. ప్రతీకుని మాటయే మంత్రమైనది. చంద్రునకు వడుగు అయినది.

చంద్రుఁడు ప్రొద్దుననే స్నానము చేయును. ప్రతీకుఁడు సంధ్యావందనము చెప్పను. చంద్రుఁడు 'దానికర్థమేమి? దీనికర్థమేమి?' అని యడుగును. ప్రతీకుఁడు 'వచ్చినతరువాత చెప్పెదనులే' అనును.

చంద్రునకు సంధ్యావందనము ఎన్నాళ్లకును రాలేదు. అతఁడు ఊరిలో నున్నవారి నందఱను అర్థ మడుగును. తమకు అర్థము వచ్చినటులు ఎవరును చెప్పలేదు. చంద్రునకు విసువు కలిగెను.

ఒకనాఁడు ప్రతీకుఁడు మనుమని దండించెను. 'నాకు అర్థము చెప్పనిది రాదు' అని చంద్రుఁడు అనెను. 'మే మందఱము ఇటులే చెప్పికొంటిమి. మీ నాయనయు ఇటులే చెప్పికొనెను. నీవును ఇటులే చెప్పకొనవలయును. ఊఁ, చెప్పకొనుము.'

ప్రతీకుఁడు ఇటు లనినంతనే చంద్రుఁడు సంధ్యావందన మంతయు గడగడ ఏకరువు పెట్టెను. ప్రతీకుఁడు పరవశుఁడై 'ఇఁక నీకు వేదము మొదలుపెట్ట వచ్చును' అనెను. చంద్రుఁడు—'దానికి అర్థ మున్నదా?' అని అడిగెను. 'ఎక్కడి పిల్లఁడవురా? వేదమునకు అర్థ మేమిపిరా?' అని ప్రతీకుఁ డనెను 'అట్లగుచో నేను చెప్పకోను' అని చంద్రుఁ డనెను. ప్రతీకుఁడు—'వట్టీ కలికాలము, వట్టీ కలికాలము' అనుకొని పిదప 'భట్టవల్లిలో వారములు చేసి వేదము చదువుకొందువా?' అనెను. 'విశ్వంభరుఁడు అమలాపురములో చక్కఁగా కాపురము పెట్టి ఇంగ్లీషు చదువుకొనుట యేమి? నేను వారములు చేసికొని అర్థములేని వేదము వల్లించుట యేమి?'అని చంద్రుఁ డనెను. 'ఓరి అభాగ్యుఁడా! మాలలలో కలిసెదవా? చూడు రేపటినుండి చితుకవేసి సంత చెప్పెదను' అని ప్రతీకుఁడు గదమాయించెను.

చంద్రుఁడు అతనివద్దనుండి లేచిపోయెను. ఎక్కడెక్కడనో తిరిగి తిరిగి యింటికి వచ్చునరికి రాత్రి ఆయెను. అతఁడు రాత్రి అన్నము తినలేదు.

నాయనమ్మ బతిమాలుకొనెను. తల్లి బతిమాలుకొనెను. తండ్రి ఉపలాలించెను. అతఁడు అన్నము తినలేదు.

తుదకు ప్రతీకుఁడు కోరచూపులు చూచుచు—'వెఱ్ఱివెఱ్ఱి కళలు! అందఱు బతిమాలుచుండఁగా రెచ్చి పోయితివి! లే! లేచి సంధ్యావందనము చేసికొని రెండు మెతుకులు తిను' మని గద్దరించెను.

చంద్రుఁడు ముసుఁగు పెట్టుకొని పడుకొనెను. ప్రతీకుఁడు రెండు కొట్టి సంధ్యావందనమునకు కూర్చుండఁ బెట్టెను.

'నాకు జ్వరము తగిలినది. నేను సంధ్యావందనము చేయలేను' అని చంద్రుఁ డనెను.

ప్రతీకుఁడు చేయిచూచెను. 'నీకు దొంగజ్వరము; రెండు తన్నుచో పోవును'అని భయపెట్టుచు వెళ్లిపోయెను.

3

ఆ మఱునటి ప్రొద్దున ఉసురుసురు మనుచు ఒక అతిథి చంద్రునింటికి వచ్చెను. వెంటనే చంద్రుఁడు అభ్యుత్థానము, అభివాదనముచేసి అర్ఘ్యపాద్యము లిచ్చి ప్రాణమును బిగఁబట్టుకొనెను. ఆ యతిథి అతి పరిచితుఁడగు జ్వరభట్టారకుఁడే.

అతని వెనువెంటనే దయ్యములు, భూతములు ఒకటొకటిగా వచ్చెను.

ప్రతీకుఁడు చేయి చూడవచ్చెను. చంద్రుఁడు చేయి ఈయలేదు.

ప్రతీకుని మనస్సు ద్రవించెను. 'రాత్రి నేనుదొంగజ్వరమంటినే' యని నొచ్చుకొనెను. కన్నుల నీరు తెచ్చుకొని చంద్రుని ఉపలాలించెను కాని అతఁడు చేయి చాఁపలేదు. ప్రతీకుఁడు ఒడలిపై చేయివైచి ఎంతోసేపుంచలేకపోయెను. అతఁడు పరికించి పరికించి మశూచిగా నిర్ణయించెను.

చంద్రునకు ఆరేయి నిదురలేదు. తలనొప్పి తోపాటు దప్పి యొకటి. ఆరాత్రి యెట్టులో కడచెను.

మఱునాఁడు చంద్రుఁడు—విశ్వంభరుని యింటికి మామూలుగా వచ్చు ఇంగ్లీషువైద్యుని తీసికొనిరమ్మని తల్లితో పోరు పెట్టెను. శుభాంగి నోరిమీఁద చేయివైచికొని యూరకుండెనుగాని చాటుచాటుగా తనఅన్న జటావల్లభునితో కబురుపంపు ప్రయత్న మొనరించెను.

అమలాపురమున వైద్యముచేయు టన్న ఆయుర్వేదవిశారద బిరుదాంచితుఁ డగు రామశాస్త్రిని తీసికొని రావలయునని నకులున కున్నదికాని తండ్రినిచూచి జంకు.

గృహవైద్యము విడిచి అన్యవైద్యము తలఁచుటయే ఓగాత్యము. అందులో నగరవైద్యమా? తనకు అటువంటి ఉద్దేశము కలుగుటయే అమంగళమని అతఁ డనుకొన్నాఁడు.

ప్రతీకుఁడు ఎట్లో కష్టపడి చేయిచూచెను. అతనికి కాళ్లాడలేదు. కర్మవిపాకము తిరుగవేయించెను. నూవులు, పూవులు, కుంకుమము, రాంకవము మొదలగువానిని తెప్పించి దానముచేసి ఇఁక తగ్గిపోవచ్చునని అనుకొనెను.

ముదుసండ్రు ప్రతీకునకు మరియొక విధముగా తోడుపడకుండ ఊరక కూరుచుండలేదు. సోదె చెప్పించిరి. సోదె చెప్పినదానికి ఒక చీరయు, ఒక రైకయు, దాని కొడుకునకు లాగుగుడ్డ రుమాలును ఇచ్చిరి. కోడిపిల్లను దిగదుడిపించి పొలిమేరలో పాఱవేయఁ బంపిరి. అచట పాఱవైవఁ బంపఁబడినవాఁడే దాని నింటికి తీసికొని వెళ్లెను. మంచము చుట్టును కల్లు సురాళింపించి పాఱఁబోయించిరి.

ఈ యుపచారములకు జ్వరభట్టారకుఁడు ఉబలాటపడలేదు. అతని త్రోవ అతనిదే వాని త్రోవ వానిదే.

'ఇది లోపలిపోఁత. అమ్మవారు దాఁగి యున్నది. ధూపదీపనైవేద్యము లీయవలెను,

అని ప్రతీకుఁ డనుచుండఁగా చంద్రుఁడు 'నాకు ఇంగ్లీషు మందు కావలెను. అర్థమున్న మందు కావలెను. నేను దాఁగలేదు. బయటనే ఉన్నాను' అనెను.

ఇది సంధిజ్వరముకాని అమ్మవారు కాదని అమ్మలక్కలు అడిపోసిరి. ఇంటిల్లిపాది ఆ మాటనే నిర్ధారించిరి. తుదకు ప్రతీకుఁడు కూడ అటులే అభిప్రాయపడెను.

ప్రతీకుఁడు చేయి చూడఁబోవుచుండఁగా ఎవరో తుమ్మిరి. అతఁడు పిఱికిమొగముతో చేయి విడిచిపెట్టి వాకిటికి వెళ్లెను.

'రోగమే తుమ్మినది. అసలు తుమ్ములకే మందు తాతను కొంచెము ఆవలికి వెళ్లనుని విశ్వంభరునిగారి యింటికి వచ్చి ఇంగ్లీషు వైద్యుని తీసికొని రండని చంద్రుఁ డనెను.

వాకిట పచారు చేసి కొంచెము కాలము దాఁటిన పిదప ప్రతీకుఁడు లోనికి వచ్చి రోగి చేయి చూడఁబోయి సందేహించెను. వెంటనే పంచాంగము చూచెను 'వర్జ్యము వర్జ్య'మను కొనుచు మంచము ప్రక్క కూరుచుండెను.

'జ్వరమునకు వర్జ్యమూ లేదు. తాతకు మతీలేదు' అని చంద్రుఁ డనెను ఆమాటలలో ప్రతీకుని కేదో సత్యము ఉన్నటులు గోచరించెను. అతఁడు తెల్లబోయి కూరుచుండెను.

ఆ సమయముననే జటావల్లభుఁడు ఇంగ్లీషువైద్యుని ఎవరికిని తెలియకుండ తీసికొని వచ్చెను. అంత హఠాత్తుగా ప్రవేశించిన ఆ దురాచారమును సాహసించి ప్రతీకుఁడు ప్రతిఘటింప లేకపోయెను. అతఁడు సహింపలేక నోరు తెఱచెను. అందు విధవలు, ఒంటిబ్రాహ్మణులు, తుమ్ములు, కాకులు, గూబలు మొదలగునవి కానిపించెను.

అతనిని చూచినంతటనే చంద్రుఁడు లేచి కూరుచుండెను. వైద్యుఁడు పరీక్షించి మందిచ్చి వెళ్లిపోయెను.

ఆ మఱునాఁడు రోగనిదానము విషయమున, ప్రతీకునకును ఇంగ్లీషు వైద్యునకును నిదానముగా వివాదము జరిగెను.

ఆ వివాదము నంతయు చంద్రుఁడు వినెను. ఆ మఱునాఁడు చంద్రునకు మరికొంచె మెక్కువ చేసెను. ప్రతీకుఁడు మందు ఈయఁగా చంద్రుఁడు ఆ మందులను అతని మీఁదనే పాఱవైచెను. ప్రతీకుఁడు ఇంటిలోనికి పోయి ముడుపులు కట్టెను. చంద్రుఁడు లోలోపల ఇంగ్లీషుచదువు మీఁద ముడుపు కట్టుకొనెను.

సెలవులు కావున విశ్వంభరుఁడు స్వగ్రామమునకు వచ్చెను. వచ్చినవెంటనే బాల్యమిత్రుని చంద్రుని చూడవచ్చెను. చంద్రుఁడు అంతజ్వరములోను లేచి కూర్చుండి—'ఏ క్లాసు చదువుచున్నావు? మీకు పాఠాలకు అర్థములు చెప్పెదరా? తాత నాకు అర్థము తెలియని •వేదము చెప్పెదనని పట్టు పట్టినాఁడు. నేను మీ యింటిలోనుండి చదివికొందును. నన్నుఁగూడ తీసికొని పోదువా? బియ్యము మా అమ్మ నడిగి తెచ్చెదను లే. ఇంగ్లీషు బడిలో పడనిది నాకు ఈ జ్వరము నెమ్మ

దింపదు' అనెను. విశ్వంభరుఁడు 'నిన్ను తప్పకుండ తీసికొని వెళ్లెదను' అనెను.

'కొంప తవ్వి బిగ్గరగా అనకుము. మా తాతవి పాముచెవులు' అని మంచముపై పడి పోయెను. ఈమాట లన్నియు వినుచుండిన వైద్యుఁడు ఉపచారములు చేసి మందు లిచ్చెను. చంద్రుఁడు కొంచెము కుదుటఁబడెను.

ఈ సంగతి ఇంటిల్లిపాది వినిరి. తలిదండ్రు లింగ్లీషు చదువు ఒప్పుకొనిరి. తుదకు ప్రతీకునిచేఁగూడ వైద్యుఁడు ను,వ్యాధియు ఒప్పించెను.

చంద్రునకు క్రమక్రమముగా ఆరోగ్యము కలిగెను. ఆరోగ్యము కలిగిన వెంటనే చేసిన పని యేమనఁగా విశ్వంభరుని సాహాయ్యకమున తాతగారి ఎఱ్ఱమందులు, నల్లమందులు నేలలో పాఁతర వేసెను. మూఁడవమందును మాత్రము ఏమియు చేయలేకపోయెను.

ప్రతీకుఁడు చేయునది లేక చూచుచుండఁగా కొలఁది రోజులకే చంద్రుఁడు విశ్వంభరునితో అమలాపురము వెళ్లెను.

---

# మగనలాలు మృతినిగూర్చి మహాత్ముని విచారము

ముడుంబ నరసింహాచార్యులు గారు

(మంజరీ గేయము)

అకట ! నా స-ర్వస్వమునకును
హక్కు-దారుడు-గాగ నెవ్వరి
నెంచితినో, యా-మగనలాల్ నా
కింక కఱవయ్యె.

మదిని నాకపు-డపుడు తోచెడి
మంచియూహలు-వినుచు తడవుగ
కార్యరూపము-దాల్ప జేసెడు
కర్మఠుడు వోయె.

నన్ను విడువగ-నొల్ల కిరువది
నాలుగేండ్లును-దోడి నీడై
వర్తిలిన నా-యన్న కొమరుని
మూర్తి నను వీడె.

కన్నులుగ, నా-కాలు సేతులు
గనగ, నిచ్చలు-నుపకరించిన
యీడు లేని, శు-భాంగకల్పుం
డింక లేడయ్యె.

బ్రహ్మచర్యా-శ్రమ, మనోజ్ఞము;
కదరు సిర్మా-ణానుకూల్యము;
స్వానుభవమున-వెల్లడించిన
సాధుసత్తముడు.

స్వీయపుత్రుల-కన్న నాకతి
ప్రియతరుడు; వి-శ్వాసపాత్రుడు;
ఆశ్రమాభ్యుద-యానురక్తుం;
డమలచరితుండు.

నన్ను వంచన-నేయడెన్నడు,
నా యనుజ్ఞకు-నెదురుసెప్పడు,
ఒదపె నత్యు-త్సాహ మాతని
యున్కిచే నాకు.

శాంతమూర్తుల-సతతకార్యా
చరణదీక్షయె-నాకుప్రాణం;
బదియపోయిన-నా మహాత్వం
బదృశమా గాదె.

నా శరీరము-నాదు ప్రాణము,
నాదు సర్వ-స్వముగ, నమ్మిన
మిత్ర సత్తము-మృత్యుదేవత
మ్రింగి వైచినది.

ధవుని మెడబా-యెదను మఱిమఱి
దలచి వగగొను-నెట్టి కోడలు;
మించె, నా వై-ధవ్య దశకిక
మేర యున్నదియె ?

నెమ్మదిని గల-దైవ విశ్వా
సమ్మె, నను బ్రతి-కించె; నది లే
కున్న మతిపో-కున్నె ? హితుమృతి
విన్న తత్‌క్షణమె.

దేవ ! నీ కృ-త్యముల మర్మము
దివ్యమైనను-నేరరన, మే
మెంచ గలమా ?-నీదు చేష్టల
మంచి చెడ్డలను.

ఈ జగన్నా-టకము రక్తి వ
హింప నవసర-మైన మార్పులు
దేవ ! నీపొన-రింప మేమవి
తెలియనే లేము.

ఏదిచేసిన మా శుభమ్మున
కే యొనర్చు, ద-యాళుడవు; నీ
కృతము లెఱుగని-జనములే మహి
నెతల జిక్కెదరు.

భారతాభ్యుద-యమ్ము గూర్చెడి
పట్ల, నీకొక-సాధనమ్ముగ
దేవ ! నన్నొన-రించుకొనుమా
తీరు నా కోర్కి.

మాతృ బంధ వి-ముక్తి గోరెడు
మము గృపామతి-జూడు మయ్యా,
శౌరి ! నీపొనరించు మార్పుల
తీరు మాకేల ?

---

# ముద్దుకృష్ణ

రాయసం వెంకటశివుఁడు గారు

ప్రొద్దుననుండియు ముద్దుకృష్ణ, మేడ గవాక్షమునొద్దనే కూర్చుండి యుండెను. ఆకసమున తొలుదొల్త నొకటి రెండు మబ్బుజీరలు గానిపించి చూచుచుండఁగనే యిటునటు వ్యాపించెను. "నేఁడు వాన కురియదుగదా" యని యాయువకుఁడు వెఱఁగొందెను. అతఁడనుకొనినట్టుగనే కొంచెము తుషారము పడెను. అంతనతనిసంశయమును శమింపఁజేయుటకో యనునట్టుగ గగనమున వెలుతురు గానిపించెను. ఇఁక భయపడనక్కఱలేదని యాపిన్నవాఁడు ధైర్యమందెనుగాని వెంటనే తిరిగి యాకాశము మేఘావృత మయ్యెను. ప్రాతఃకాలము నందలి తుంపరవంటిదిగాక ఇపుడు వంచివాన కురియఁదొడంగెను. చేయునదేమియు లేక ముద్దుకృష్ణ కిటికీనుండి చూచుచుండెను.

గగనమంతయు కారుమబ్బు క్రమ్మియుండెను. వర్షము కురియుచుండుటచేత జనులు తమ కుటీరముల నిలచి యుండిరి. అందువలన వానసద్దుతప్ప గ్రామమున మఱియేసద్దును గానరాకుండెను.

సంతతధారగ నిపుడు కురియుచుండెడి వర్షము ముద్దుకృష్ణ మనోరథములను ముంచివేసెడి వెల్లువ వలె వానికనుల కగపడెను. హోల్లుహోల్లుగ వీచెడి వాయువు వానికోరికల నెగురఁజిమ్ము మహావాయువుగఁ గానిపించెను! ముద్దుకృష్ణ కీయలజడియేల?

ఈ మిన్నూరు గ్రామము మొన్నమొన్నటి వఱకును ఈప్రాంతములందు ప్రసిద్ధి కెక్కియుండెను. మిన్నూరిరెడ్లు కులశేఖరులని ఖ్యాతులనందిరి. మెట్టమాగాణిసేద్యములకు మిన్నూరివారు వాసికెక్కియుండిరి. ఎంతటి ధనవంతులైనను వారు ప్రాలుమాలిక లేక తమ రైతులతోఁ గలసి పాటుపడుచుందురు కావుననే వారియైశ్వర్యము స్థిరముగ నుండెను. ఇంతలో ప్రస్తుతము దేశము నావరించిన మిథ్యానాగరకతా ప్రభావమున మిన్నూరి రెడ్లలో సోమరితన మంకురించెను. వరిసాలములు, మాగాణిపైరులును వీడి యామహనీయు లిపుడు కాఫీశాలలు, నాటకశాలలును తమ విహారరంగములుగఁ జేకొనిరి. అంతకంతకు పట్టణనివాసము ముంచర మిన్నూరుసేద్యము దివిటీక్రింద దీపమయ్యెను! శ్రమకోర్చి పని చేయునలవాటు విడిచి కాలు కదల్చుటయె నీచమని వారు తలంచిరి. కావుననే మోటారుమీఁద విహారము, వేశ్యలతో వినోదమును వారికి విడరాని విధు లయ్యెను. వారిలోఁ గొందఱికి రానురాను నెల్లూరు నివాసమె కుగ్రామనివాసముకాఁగా వారు చెన్నపట్టణమునకుఁ దమ పీఠమును తరలించిరి. ఇట్లు నగరవిహారములను, పట్టణభోగములను మరగిన యా రెడ్లు శీఘ్రకాలములోనే యప్పులవారి చేతులలోఁ బడిరి.

మిన్నూరి మల్లారెడ్డిని, సోదరులను ఎఱుఁగని వారెవరు? సకలైశ్వర్యములకును ఉనికిపట్టని ఖ్యాతుల నందిన వారియాస్తి కాలక్రమమున సాహుకారుల చేతులలోనికిట్లు వచ్చెను. ఇట్టి యవస్థ సైఁపక ఈ కుటుంబములోని కొంద అకాలమరణము నొందిరి. తక్కినవారు ఉక్కుచెడి తలా యొక చోటను తలదాఁచుకొనిరి. వీరు తమ వైరులమీఁదఁ దెచ్చిన యభియోగమున చెన్నపురమున నిన్ననే తుదితీరుపు చెప్పియుందురు. పర్యవసానము తంత్రీముఖమునఁ దెలియు నేర్పాటులు ముద్దుకృష్ణారెడ్డి చేసికొనెను గావున ఆ సమాచారము వినుటకతఁడు ఉవ్విళులూరుచుండెను. తంతి తెచ్చువారు దూరమున నుండఁగఁ గనిపెట్టుటకే ముద్దుకృష్ణ ప్రాతఃకాలము నుండియు గవాక్షమునొద్దఁ గనిపెట్టుకొని యుండెను. ఆవార్తవిూఁదనె మనసుంచిన యాతనికి వాయువర్షముల తాకుఁడంతగఁ దోఁపకుండెను. "గాలి బలమగుచున్నది; మేడదిగి రమ్మ"ని యెన్నిమాఱులు క్రిందినుండి యతనికి వార్త వెళ్లినను, లెక్కచేయక యతఁడచటనే వేచియుండెను.

చినికిచినికి గాలివాన యగునన్న చొప్పున సూర్యాస్తమయ సమయమునకు పరిస్థితులు ఘోరమయ్యెను.

గ్రామమందలి పూరియిండ్లు ఎగిరిపోఁజొచ్చెను. చెట్లకొమ్మలు విఱిగిపోసాగెను. చిన్న కుటీరముల నుండువారి గతి చూడగా ముద్దుకృష్ణునకుఁ జిరకాల మిత్రుఁడగు బావాజీసంగతి స్ఫురణమునకు వచ్చెను. ఇంతలోనే తన్ను క్రిందికిఁ దోడుకొనిపోవుటకుఁ బైకి వచ్చిన పరిచారకుని చేతి లాంతరు తాను జేతబూని, "వలదు, వలదు!" అని యింటనుండువారు వారించుచున్నను జమ్ముగూడ నెత్తి నిడుకొని ముద్దుకృష్ణ వీథినిబడెను.



"వలదు,వలదు!" అని యింటనుండువారు వారించుచున్నను జమ్ముగూడ నెత్తినిడుకొని ముద్దుకృష్ణ వీథినిబడెను.

౨

మిన్నూరునకు ఆ ప్రక్కనుండిపోవు పెద్ద బాట చేరవనే యుండును. గ్రామమునుండి యచటికి పొలము గనిమలమీఁదనుండి నడచిపోవలయును. ఈ సన్ననిత్రోవను నడచునపుడు పలుమారు వానికాలు జారుచుండెను. దారిప్రక్కలనుండిన చెట్లకొమ్మలు విఱిగి వాని పాదముల కడ్డముగఁ బడుచుండెను. వర్ష బిందువులు గాలివేగమున రాళ్లవలె వాని దేహమును మోఁదుచుండెను. వీనినేమియు లెక్కసేయక ముద్దుకృష్ణ పెద్దబాటచేరి, కొంతదూర మనడచి బైరాగి కుటీరముఁ గాంచెను. "దేవుజీ, దేవుజీ" అను పలుకులు విని బావాజీ తలుపుతీసి "ముద్దూ! ఏమి నీ సాహసము? లోనికిరా. ప్రాణములు పోఁగొట్టుకొనుటకే వచ్చినట్లున్నావు!" అనెను. ముద్దుకృష్ణ వానితో "దేవుజీ? ఈనాఁడు గాలివాన మిగుల బలిష్ఠముగా నున్నది. మీయిల్లు నిలువను. కాబట్టి మీరు నాయింటి కిప్పుడే రండి!" యనెను.

చిఱునవ్వునవ్వి బావాజీ "ముద్దూ! నీ వీవానలో నెందుకు వచ్చితివి? నా ప్రాణముల కేమివచ్చెను. గడువు దగ్గరపడినవానికిఁ గాపుగడ లేల? తడిసిపోవుచున్నావే! లోనికిరా!" అని వాని నాహ్వానము చేసెను.

ముద్దుకృష్ణుడు ఎటులైన బావాజీని తనయిల్లు చేర్చి రక్షింపవలెనని కోరిక. బాబాజీ మాత్రము "నా జీవముల కేమి! ముద్దూ! నీ రక్షణమును గుఱించియే ఆలోచించుచున్నాను. లోనికిరా! నీకేది శ్రేయమో యైదు నిముసములలోఁ జెప్పెదను," అని బాబాజీ పిన్నవానిని తొందరపెట్టి వానిని లోనికి బలాత్కారముగ లాగి మంచముమీఁదఁ గూర్చుండఁబెట్టెను.

ఒకింతసేపు ముక్కుచివరశ్వాసమును వ్రేళ్లతో జూచి, బావాజీ, "నీవు మంచిపనియే చేసితివి. ముద్దూ నేఁడు తుపానుగాలి గాఢముగఁ గొట్టుచున్నది. మేడలు మిద్దెలు కూలిపోవును. నీ వివటనే యుండిన నీప్రాణములు దక్కను." అని చెప్పెను.

"దేవుజీ! ప్రాణములయందు తీపి నాకు నేటితో తీఱిపోయినది! మీబోఁటి మహనీయులు సజీవులైయుండిన నాకుఁ జాలును. మీ రక్షణోపాయ మేమో నాకుఁ జెప్పుఁడు. నా ప్రాణములు గాలికి వదలివేయుదమనియే నాకోరిక!" అని ముద్దుపలికెను.

"హరిహరీ! ముద్దూ! పసితనముననే నీకేల యీ విపరీత విరక్తి? చాలుచాలు! ఇక్కడనుండుటయే నీకు శ్రేయము. ఇక్కడనుండి కదలకు!" అని బావాజీ వాని చేతిని బట్టుకొనెను.

"దేవుజీ! మీ యాజ్ఞ మీఱుటకు మనసొప్పదు. కాని యేమిచేయను? మీరక్షణమె నాకు పదివేలు! ఇంక నేనన్ననో, అప్పులవారిచేత అవమానపడి యంతరించుట కంటె వాయునరుణుల వాతఁబడి మడియుటయె మంచిది కదా!" అని ముద్దు తనచొక్కాను లాగికొని, ఇపుడు తలుపును మాటిమాటికిని మోదు జడి నెదుర్కొని "సెల విండు, పోయివచ్చెదను దేవుజీ!" అని బైటికి దుమికెను. బావాజి యేమి సేయుటకును దోఁపక, ఖిన్నుఁడై, "ముద్దూ! మహాబలు నిట్లు నీ వెదుర్కొనుట మృత్యువు నెదుర్కొనుటయే! ఒక పక్షమున పరోపకారమనకే యిట్టి సాహసము కూడునుగాని అన్యచింత కనుచితము సుమీ!" యని హెచ్చరించెను.

బావాజీ, తన యీ కడపటి మాటలు ముద్దుకృష్ణ కర్ణరంధ్రములు చొచ్చెనాయని సందియమందెనేకాని అవి వాని హృదయఫలకమునుగూడ భేదించుకొని పోఁజా లియుండెను! తన వ్యాజ్యముపోయి పరిస్థితులు వ్యక్తమగుట, ప్రేమగౌరవముల కాస్పదమగు బావాజీ నీకష్ట సమయమున రక్షణస్థానమును జేర్పలేకపోవుట ఇవి యన్నియు తన జీవితమునకు వైఫల్యమాపాదించు శత్రువులని ముద్దుకృష్ణ యెంచుకొని తనతలంపులకుఁ దలయూఁచు నట్లుగనే యిపు డీప్రచండవాయువు వీచుచున్నదని తల పోసి, ప్రాణములు గోలుపోవుట కిదె యదనని మొదట నుద్యమించెను! ఐనను గురూత్తముఁడగు బావాజీవాక్కులు వాని బుద్ధిని పున్యాచింతనమునకు ద్రిప్పుట కారంభించెను. దైవసంఘటనము లెంతటి యద్భుతములని తల పోయుచు ముద్దుకృష్ణ యా కుటీరము వెడలి, బైట నాలుగడుగులు వేసినతోడనే యతని కమితమగు బడలిక గలిగెను. పరోపకార మిసుమంతయైనఁ జేసి మఱి యసువులు వాసెదనని యా యువకుఁడు మీఁదఁబడు చెట్ల కొమ్మలను ద్రోసివైచుచు, కాలికడ్డమువచ్చు రాళ్లను తొలఁగించుచు వేవేగముగ పెద్దబాటను బోవుచుండెను.

ఇట్లు కొంతదూరము నడువగా, వానికొక మానుష శబ్దము వినవచ్చునట్లు తోఁచెను. కొంచెము పొంచి మెల్లగ నడుగులు పెట్టుచుండగా, వానిపాదమున కేదో మెత్తగదగిలెను. అంత చేతనున్నలాంతిరులోని దీపము



"ఇక్కడనుండి కదలకు!" అని బావాజీ వాని చేతిని బట్టుకొనెను.

పెద్దది చేయగా రెపరెపమని కొట్టుకొని యాఱిపోవుచున్న దీపపువెలుగున మనుష్యుని దేహ మతనికిఁ బొడఁగట్టెను. ఆ శరీరమున వేడిమి కానవచ్చుటచేతను, నాసిక నుండి శ్వాసము నడచుచుండుటచేతను జీవముండుట గుర్తెఱిఁగి, ముద్దుకృష్ణ వానిని దన బుజములమీఁద వైచుకొని వచ్చినదారినె వెనుకఁదిరిగి యడుగులు పెట్టెను.

ఎంతసేపు నడచినను వానికి బావాజీ కుటీరము కానరాదయ్యెను. మోమునను, కన్నులను జడివానగొట్టు చుండినను, అపుడపుడు ఆకసమునఁ దోఁచు మెఱుపుల సాయమున నెట్టకేల కాతఁడు బావాజీ నివాసముచేరెను. కాని యందలి కుటీర మిపుడు నేలపాలయ్యెను. "అయ్యో! మృతు లొకరి కిద్దరగుచున్నారే!" యని యలజడిపడి, క్రింది కొఱిగి పోయిన కుటీరముమీఁద మోఁది, "దేవుజీ, దేవుజీ!" అని యాపిన్నవాఁడు బిగ్గరగ నఱచెను. అంత కొంతవడికి, లోనుండి యొక హీన

స్వరము వినవచ్చెను. తాటియాకులకప్పు నొకింత సడలించి బావాజీ, "ఏమిబాబా! లోనికిరా!" అని పలికెను. ఏటులో సందు చేసికొని, ముద్దుకృష్ణ తాను ముందుగ లోనికిఁ బోయి, తాను దెచ్చిన మానవ కళేబరమును పిమ్మట లోనికిఁ గొనిపోయెను.

పైకప్పు పడి పోయినను, లోపల మాత్రము బావాజీ గృహము వెచ్చగ నుండెను. బావాజీ కరదీపికను జూపఁగా, మెట్ల మీఁద నడచి, ముద్దుకృష్ణ ఒక సొరంగము సొచ్చెను. అం దొకమూల మంటవేసి యుండెను. పడిపోయి యుండిన యా మనుష్యుని దేహము వారు గుడ్డలతోఁ దుడిచి, యుష్ణోపచారములు చేసిరి. కాఁగుచుండు పాలలో నొకింత చూర్ణము గలిపి బావాజీ వానినోటఁ బోసెను. ఆమనుష్యుఁ డంత తెలివి నొంది కదలి, మాటాడఁజొచ్చెను.

చీకటిలోఁ బడి యుండిన యా మనుష్యుఁడు, తాను, చెన్నూరు చెన్నారెడ్డి సేవకుఁడననియు, తన యజమానుని కోడలి కానాఁడు ప్రసవ మాసన్న మగుటచేత మంత్రసానిని బిలుచుకొని పోవుటకై పొరుగూరికి బయలుదేరి, మార్గమధ్యమున గాలివాన తాఁకుటచే పడిపోతి ననియుఁ జెప్పెను. చెన్నారెడ్డిపేరు వినఁగనే ముద్దుకృష్ణహృదయము తటతట కొట్టుకొనెను. రెడ్డి యాప్రాంతపు భూస్వాములలోఁ బేరెన్నిక గన్నవాఁడు. ముద్దుకృష్ణకుఁ బరిచితుఁడు. అతని యింటి కనేకపర్యాయములు వ్యవహారపుఁ బనులచేత, ఆ యువకుఁడు రాక పోకలు సలుపుచుండెడివాఁడు. కాని యిటీవల ముద్దుకృష్ణ యచటికిఁ బోవుట కంతగ నిష్టపడకుండెడివాఁడు. దీనికిఁగారణము లేక పోలేదు. రెడ్డి మనుమరాలు శ్యామల. శరీరసౌకుమార్యముతో సమానమగు బుద్ధివికాసము గలిగియుండిన యా సుందరి, విద్యావతి యనియు, వినయ సంపన్న యనియు చుట్టుపట్టుల నెల్ల విఖ్యాతి నందెను. ముద్దుకృష్ణ తన సొంతపనులమీఁద చెన్నారెడ్డి దర్శనము చేసినపుడెల్ల, ఆ ముద్దియ ముఖసందర్శనభాగ్యముఁ గాంచుచుండును. ముద్దుకృష్ణ పట్టపరీక్షయందు గెలుపొందిన వాఁడు; రెడ్డియువకులలో కుశాగ్రబుద్ధి గలవాఁడు; సమాన సుగుణావళి యున్నచోట్ల ప్రేమ స్నేహములు పెరుగునని పెద్దలు చెప్పుదురు. కావుననే శ్యామలా ముద్దుకృష్ణులు, అచిరకాలములోనే, ఒకరియెడ నొకరు అవ్యాజ ప్రేమ గలవారైరి.

చెన్నారెడ్డికి మాత్రము, విద్యాప్రేమములను నూతనకాలపు విషయములనిన తలనొప్పి. దీనికిఁ దోడు, ముద్దుకృష్ణ చితికిపోయిన సంసారస్థితిని జూచి పలుమారు రెడ్డి పరిహసించుచుండువాఁడు. ముసలి రెడ్డికి ధనమే ముఖ్యదేవత. ధనవంతులు కానివారలు నరనామమున కర్హులు కారని యాతని మతము! కావుననే రెండు మూఁడు మారులు తన మనుమరాలిని, ఈ ధనవిహీనుని నెయ్యము వీడుమని రెడ్డి హెచ్చరించెను. తా నాయువకునితో మాటాడుచుండునపు డిటీవల, కారణములేకయే రెడ్డి వానియెడల నిరసన భావముఁ జూపించెను. ఇది చూచి, రసజ్ఞతలేని యా పురుషుని గృహమునకు ముద్దుకృష్ణ రాకపోకలు చాలించెను.

ఇతఁడు చెన్నారెడ్డి పరిచారకుఁడని తెలిసికొనినపుడు, వానియెడల ముద్దుకృష్ణ మనస్సునను దయారస మింకిపోవునట్లు కానఁబడెను! కాని, ద్వేషాంకురములఁ గోసివైచి, ఇపుడు వారి స్థితిగతు లొకింత వ్యత్యస్తమగుటచేత, ఆప్రభు పరిచారకుల యెడల కనికరముఁ బూని, "ఓయీ! నీవు జరూరుపనిమీఁద వచ్చినను, బడలిక పడితివి కావున, ఇక్కడనే నిలిచి యుండుట శ్రేయము. నేను బోయి, మంత్రసానిని రెడ్డియింటికిఁ దోడ్కొని పోయెదను." అని ముద్దుకృష్ణ పలికెను.

ఈసారి ముద్దుకృష్ణ తుపానుగాలిలోఁ బోవుట బావాజీ కెంతమాత్రము నిష్టము లేదు. ఎవరికిఁ గాని యిపుడు బైట కాలు పెట్టుట శక్యము కాదు. మహారావములతో వాయుదేవుఁడు కనఁబడిన పదార్థము లన్నిటిని మోఁది బ్రద్దలు చేయుచుండెను. వానికి సాయపడి, వరుణుఁడు, భూమి తలమును వర్ష జలమున ముంపఁ జూచుచుండెను. రచ్చఁబడి విచ్చల విడిగ పాంథజనులను మోదు బందికాండ్ర వలె, ఈ రెండు భూతములు భూతజాలమంతటిని కొట్టి కోలాహలము చేయుచుండెను. ఈ యిరు

వురు మహాబలులను ధిక్కరింపఁ గల జగజెట్టు లెవరును జగతిని గానరానటులు దోఁచెను!

సత్యము మాత్రే మది కాదు, బలములలో బాహుబలము పటుతరమైనను, దానిని మించునది మేధాబలము. బాహ్యబలమును ధిక్కరింపఁగలది యంతర్బలము. జంతుజాలమునకు, వృక్షజాతికి, తుదకు జడప్రపంచమునకును యమస్వరూపమగు నీప్రచండవాయు వర్ష సమయమందు తలయెత్తి నిలువఁగలవాఁ డొక మనుష్యుఁడే. రౌద్రస్వరూపిణియు, పశుశక్తియుక్తయు నగు ప్రకృతికాంత నీసమయమున ధిక్కరించి సంచరింపఁ గలవాఁడు, సత్వగుణప్రధానుఁడును, దయాశీలుఁడును నగు మనుజుఁడే. ముద్దుకృష్ణ. శత్రుమిత్రు లనుభేదము పాటింపక, ఆపన్నయగు నా యబల సంరక్షణార్థమై యా జడివానలో, బావాజీయొద్ద సెలవుగైకొని, వాని దీవనలతో కుటీరము వైటికి వచ్చెను. మంత్రసాని యుండు గ్రామము వానికిఁ దెలిసినదే. అది చేరువనే యున్నను, ఆ సమయమున మాత్రము చేర నశక్యమగు ప్రదేశము. దారిలో పడుచు లేచుచు ముద్దుకృష్ణ యెట్లు నడచి యా పల్లె చేరెనో యతనికే తెలియదు. ఆ యూరఁగల యిండ్లలో ననేకములు నేలఁబడిపోయెను. ఊరివారికైనను, ఆసమయమున మంత్రసానియింటి నానవాలుపట్టుట ప్రయాసకరము. ఎట్టకేల కాతఁ డొక యింటియొద్ద కేగి తలుపుతట్టి "కోటమ్మా?" యని బిగ్గరగ బిలిచెను. మంత్రసాని యట్టి సమయమున రాలేదని యింటివారు చెప్పివేసినను ఆ యువకుని మాట తీసివేయఁజాలక, కోటమ్మ బయలు దేరెను. రాత్రి పదిగంటలయ్యెను. అప్పటికి తుపాను అతి తీవ్రముగ నుండెను. వైట నిలుచుండుటయె దుష్కరము. శివకోపము పెట్టునట్టుగ నలుదెసలనుండియు రాళ్లు,కొమ్మలును వచ్చి శిరముపైఁబడుచుండెను. నడచుచుండువారిని, తెక్కలు లేకున్నను ఎగురఁజేయు ప్రభావముగల వాయుదేవుఁ డాతటి సర్వస్వతంత్రుఁడై జగతిని సంచరించుచుండెను. కొంత నడచునప్పటికి కోటమ్మకు బడలిక రాఁగా, ముద్దుకృష్ణ యామెను బుజములమీఁద వైచుకొనిపోయెను. ఆయువకుఁ డపుడు నడచిన మైలును పదిమైళ్లువలెఁ దోఁచెను. ఎట్టకేల కతఁడు గమ్యస్థానము చేరునప్పటికి చెన్నారెడ్డి యిల్లు చిందఱవందఱగ నుండెను. మేడ పైయంతస్థు గూలిపోయెను. గదులమీఁదనుండి పెంకులు జారి పడుచుండెను. ఇంటనుండు వారందఱును రెండుమూఁడు చిన్నగదులలోఁజేరి ప్రాణములు దక్కించుకొనుచుండిరి. ఇంతలో గర్భవతికి నొప్పులు ప్రబలమయ్యెను. ఎన్నికష్టముల కోర్చుకొనినను, ఈ కష్టము దాటఁగూడనిదికదా! ఈవిపత్సమయమున దమకు వైద్యుఁడుకాని,మంత్రసానిగాని లభ్యమగునాయని యింటివారు ఇష్టదేవతలకు మ్రొక్కులిడుచుండిరి.

ఎవరో పిలువగ వారపుడు తలుపుతీసిరి. తాను జీవితము మీద నిరాశ చేసికొన్నను, కోడలికి సుఖప్రసవ మెట్లు చేహరునాయని పలవించు చెన్నారెడ్డి కన్నులకు



చెన్నారెడ్డి కన్నులకు మంత్రసానిని తన భుజములనుండి
· దించుచున్న ముద్దుకృష్ణ యాకారము
గజేంద్రవరదుని యాకృతివలె... బొడ్రోలెను.

మంత్రసానిని తనభుజములనుండి దించుచున్న ముద్దుకృష్ణ యాకారము గజేంద్రవరదుని యాకృతివలె తట్టి, వాని

మీఁదతనకదివఱకుగల దురభిప్రాయమునుబాఱఁద్రోలెను. ముద్దుకృష్ణ మాత్రము, అతనిపొగడ్తలఁ జెవిపెట్టక మంత్రసానికి జవ చేరు నుపాయము చేసెను. అంత నామె సాహాయ్యమున రెడ్డికోడలు కొన్నినిముసములకె సుఖప్రసవ మయ్యెను.

౪

ఇప్పటికి రాత్రి పదునొక్కగంట లయ్యెను. గాలివాన కొంత తగ్గునట్లు తోఁచినను, అట్లు జరుగ లేదు. వాయుదేవుఁడు దిశలుమాత్రము మార్చెను. ఇదియైనఁ గొంత యుపశమనముగ దోఁచినను, వేఱు దిక్కునుండి జగత్సంహార కార్య మారంభమయ్యెను. ఇదివఱకు పడని యిండ్లు చెట్లునిపుడు కదలిపోఁజొచ్చెను. తాను మిక్కిలి బడలియున్నను, ముద్దుకృష్ణ, గృహస్థునితో, "అయ్యా! మీ పసువుల కొట్టము లదరిపోవుచున్నవి. వానిలోని పశువుల సంగతి యేమి?" అని ప్రస్తాపించెను. చెన్నారెడ్డికి తన పసువులే ప్రాణములు. ఐన నలెడిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "నాయనా! మనప్రాణములె యిట్లు అరచేతులలోఁ బెట్టుకొని యున్నాము. ఇంత 'భవంతి'లో మనకె తలదాఁచుకొనుట కష్టముగనున్నది. ఇంకపశువుల నెట్లు కాపాడఁగలము? వానిసంరక్షణము పరమాత్మునికే విడలివేయుదము!" ఇట్లు వారనుకొనుచుండఁగనే, గుభాలుమను చప్పుడయ్యెను. "అదిగో నాపశువులు మంటిలో గలసిపోవుచున్నవే!" అని యెలుఁగెత్తి రెడ్డిపలికి, నేలకొరిగెను. ముద్దుకృష్ణ ధైర్యముతో లాంతరు చేతబూని, "అయ్యా! మీ మనుష్యు లెవరైనఁగలరా? కొడవలి యెక్కడ?" అని యడిగెను. తలమాసి పున్నయ్య కొంచెము మత్తుతో మూలఁబడియుండెను. ముద్దుకృష్ణ, వానినొక కాలిత్రోపుతో లేపి, వానిని దోడుకొని, ఇంటివారు వలదనుచుండగనే, పెరటిలో నడుగిడెను. కాని గాలి తీవ్రముగ వీచి వారి నింటిలోని కెన్ని మారులో దొరలించెను. కాలహరణమునకు జింతించి, సాహసించి యాయిరువురును కొట్టముల దిశకేగిరి. వానిలోఁ గొన్ని నేలపాలయ్యెను. మిగిలినవి యూఁగుచు మిక్కిలి యపాయకరమగు స్థితియందుండెను.

వారిపుడొకకొట్టమునఁ జొచ్చిరి. ప్రాణోపద్రవ కాలమున బిగ్గరగనఱచుచు, తమ్ము బంధించినత్రాళ్ళలో బెనఁగులాడుచుండు పశువులత్రాళ్ళను, పున్నయ్య లాంతరు చూపుచుండగ ముద్దుకృష్ణ కొడవలితోఁ గోసివైచెను. కొన్నిపశువులు ఓపికలేక, తమ త్రాళ్లుకోసివేయనీయక గింజుకొనుచుండెను. ఎట్లో యాయిరువురును రెండవ కొట్టములోని పని ముగింపనున్నప్పుడు గాలి తీవ్రత బలమయ్యెను. కొట్టము గుభాలునఁ గూలెను. ముద్దుకృష్ణ తప్పించుకొనెనుగాని, తలమాసి కాలికి గాయము తగిలెను. ఇంకఁ దా నిలువఁజాలనని వాఁడు లాంతరచటనె పడవైచి యింటిలోనికిఁ బరుగెత్తెను.

చేయుచుండు పని కిట్లు విఘ్న మాపాదిల్లుటకు ముద్దుకృష్ణ వగచి, తానొకఁడే పశురక్షణకార్యము నిర్వహింపఁజూచెను. ఇంతలో నింటిలోనుండి యెవరో లాంతరుతో వానిదెసకు వచ్చుచుండిరి.

నడకనుబట్టి యది స్త్రీయాకారమని తోఁపఁగా, ఇంతవర్షమున నే స్త్రీ రా సాహసించు నని యతఁ డాశ్చర్యపడెను. ఆమె యొక జవ్వని. ఆ తరుణి ధరించిన చలువవలువ, వర్ష దేవుని యీర్ష్యచేఁ దనచక్కఁదనమును గోల్పోయియు, యజమానురాలి యంగసౌందర్యమును గాపాడి తన సౌశీల్యమును స్థిరపఱుచుకొనెను. వర్ష జలసిక్తమగుటచే జెంపల నంటియున్న కురులు, ఆ యంగన ముఖపద్మము నానవాలుపట్టకుండ జేయుచుండినను, ఆ సుకుమారి చిఱునగవును, కన్నుల నునుకాంతియును, తమస్వామిని గుట్టు బయలుపెట్టుచుండెను. వాయు వర్షములచే గాసిపడు జనుల సేవదీర్చుటకు భూతలమున కేతెంచిన దేవకన్యకవలె నాకాంతి కనఁబడెను. అంత ముద్దుకృష్ణ, "శ్యామలా! గాలివానలో నీ కీసాహసమేల? కఠినహృదయు డగు వర్ష దేవునికి నీకోమలదేహము ముద్దనుకొంటివా? వెంటనె లోనికి మరలిపో!" అని పలికెను.

కాని శ్యామల మాత్రము, "నాథా! నే నింతసేపును మీకష్టము నూరక కిటికీనుండి యాతురతతో కనిపెట్టు నప్పటికంటె చినుకులలోఁబడి మీకు సాయము చేయ వచ్చిన యిప్పుడె, హాయిగ నున్నది! పరోపకారుల పరి

చర్యల మరగిన మాకు ఇంటిపనులమీఁద నీసడింపేకదా! ఐనను నేనువచ్చినది మీకుతోడ్పడుటకుఁ గాదు. నాముద్దుదూడల సంరక్షణమునకే! ఊఁగుచున్న యాకొట్టములో నావెల్లదూడయును,పడిపోయిన యీ పాకలో నా నల్లలేఁగయు నున్నవి. వీనిని ముందు విడిపింపవలయును!" అని పలికెను.

అంతట శ్యామల లాంతరు చూపగా ముద్దుకృష్ణ ఆయా కొట్టములలోనికి బోయి, దూడలను విప్పివేసెను. తనకుఁ బ్రియములగు గోవు లివి యని మాటవరుసకా స్త్రీ యనెనేకాని, గోజాతిమీద నంతయు ఆ జవ్వనికవ్యాజప్రేమము గలదు. కావుననే బోరున గురియు నా వర్షమున నా తరుణు లిరువురును పశుగణమును మృత్యుముఖమునుండి తప్పింపఁగలిగిరి.

పడిపోయిన కొట్టములనుండి చనిపోవు పశువుల యఱపులు వారి వీనులకు వినవచ్చుచుండెను. అట్టి ప్రదేశములకుఁ బోయి యా యిరువురును, తమ చేతుల కందినంతవఱకును పశువుల మెడ పలుపులు గోసివైచిరి. కాలు స్వాధీనముగనుండిన యావులు తప్పించుకొని పారిపోయెను. లేవలేకుండువానిని ముద్దుకృష్ణ చైటి కీడ్చివైచెను. కాని యన్నిటికి నతఁడిట్లు సాయముచేయనేరకుండెను. కొట్టముమస్య పడిపోయి, తల చితికి, రక్తము స్రవించుచుండ, నాలుక వైటవేసి, నిలువుగ్రుడ్లుపడిపోయిన గోవులనుజూచి శ్యామల విలపించెను. ఇట్టి ఘోరదృశ్యములు, ఆ మృదుహృదయ కన్నులఁ బడుటకు ముద్దుకృష్ణ కిష్టము లేదు. ఏ పురుషుఁడైనఁ దనకీతరుణమున సాయపడినచో, శ్యామల నింటిలోనికంపివైచి, యవసానదశనుండి పెక్కుగోవులను దాను దప్పింపఁగలనని యా యువకుఁడు తలంచుచుండునపుడె, ఇంటిలోనుండి వచ్చెడి మనుష్యునిచేతనున్న లాంతరతనికన్నులకు బొడగట్టెను. "బాబా! ఎక్కడనున్నావు? బ్రదికియుంటివా!" అను నార్తనాదము వాని వీనులకుఁ దట్టెను. ఇట్లు ముద్దుకృష్ణ నేమ మారయుచు వచ్చినది బావాజీ.

ఆ ప్రళయకాలమున, స్వసౌఖ్యమునువీడి, గోసంరక్షణమును చేయుచుండెడి యా తరుణులను జూచి, బావాజీ ఆనందపరవశుఁడయ్యెను. ఆ ముదిత శ్యామల యగుట తెలిసికొని బావాజీ, "బాబా! ఇపుడుగదా నా కన్నులు ధన్యతనొందెను! సౌజన్యమున మీ రొకరికొకరు తీసిపోరు. ఒకరికొక రెంతయు తగియున్నారు. ఇప్పుడీ మాటలకేమి గాని, యీ వానలోఁ దడిసి, యీ మోటుపనులు చేయుట ఈ కోమలి కనుచితము! నేను నీకు తోడ్పడెదను!" అని చెప్పివేసి, యామె నింటిలో దిగవిడిచి వచ్చెను.

అంత బావాజీ, ముద్దుకృష్ణ చేతనున్న కొడవలిని దీసికొని "నాయనా! నీవు శ్రమపడి యున్నావు. నాకు దీపము చూపించుము. నేను పశువులనువిడిపించెదను" అని పలికి, గోసంరక్షణ కార్యమునకు దిగెను.

ఇట్లు వారు తమ పని పూర్తిచేసికొని, పారిపోవుచును, పడిపోవుచును నుండు పశువులను దప్పించుకొని ఎట్టకేలకు నింటిలో నడుగిడిరి. శీతవాతముచే కొయ్యబారిన వారి దేహములకు సేకము గలుగుటకై రెడ్డినుంటవేసెను. వారు కట్టుకొనుటకు పొడివస్త్రము లిచ్చెను. అప్రార్థితముగ నీయిరువురు పురుషులును తమ కీకష్టకాలమున సాయము చేయుట తలపోయఁగా, రెడ్డికి మతిభ్రమణము గలుగునట్టు లుండెను. ఇట్టి దయార్ద్రహృదయత మానవులకు సాధ్యమా యని యతఁడు నిర్విణ్ణుఁడయ్యెను.

ఇప్పటికి రాత్రి యొంటి గంటయయ్యెను. వాన జోరు తగ్గిపోయెను. "మన మింటికేల పోఁగూడదు?" అని ముద్దుకృష్ణ యనఁగా, బావాజీ వానిని వారించి, "నాయనా! నీవు మిక్కిలి డస్సిపోతివి. నీ ప్రాణము లీనాఁడు నిలిచి యుండునని నేననుకొన లేదు. నేఁడు నీ గండ మితరుల మీఁదుగా పోయినది! నీకిఁక భద్రమే. కాని కొంచెముసేపు నిద్రించితివా స్వస్థపడుదువు." అని బావాజీ బ్రతిమాలినను, యువకుఁడు వినక, "దేవుకీ! ఈ లోక సంక్షోభసమయమున కూర్కెవరికిఁబట్టును? ప్రాణభయముచేత ప్రజలు నిరాహారులై యీరేయి జాగరణము చేయుచున్నారు. చంటి పిల్లలు సయితము తమ తల్లుల యొద్ద పాలు ద్రావ మఱచిరి! ఇట్టి విపత్సమయమున

జనుల వెతల దీర్చుటయే జీవిత పరమార్థము గదా. నాకు నిద్రావిశ్రాంతులతో పని లేదు. మీ సెలవుగైకొని పోయి వచ్చెదను. మీ రిచట విశ్రమించి, వేకువనె యింటికిఁ బొండు. నేనడుగుట మఱచితిని! మీ రీ గాలివానలో నిల్లెల వెడలివచ్చితిరి?" అని ప్రశ్నించెను.

బావాజీ "నాయనా! పసివాండ్ర కెపుడును వారి ధోరణియెకాని, వేఱు ప్రసక్తి లేదు. పెద్దవాండ్రమగు మాకి గూడ మానవ హృదయములే సుమీ! జడివానలో బయలు వెడలిన నీకొఱకు, లేఁగను బాసిన గోవువలె నేఁ బరితపించితిని. వెఱ్ఱిదుఃఖము నా మనస్సు నావహించెను. నిశ్చేష్టితుఁడ నైతిని. కొంతసేపటికి మోహము తెలిసికొనిన నా అంతర్నేత్రము నెదుట, రక్త ప్రవాహము మధ్యమున, మృత్యువు సన్నిధిని, తాండవమాడు నీయాకారము పొడఁగట్టెను. ఇఁక నా కాళ్లాడినవి కావు. సారంగమున నిద్రించు మనుజునితో పనిమీఁదపోయి వచ్చెద నని చెప్పి, నేనిల్లు వెడలితిని. నిన్నుఁ జేరవలె నని మనస్సున నెంతె వ్యామోహమున్నను, కాలిలో సత్తువ లేదు. ఐనను, గాఢాంధకారమునఁ బడి, మహాబలు నెదుర్కొని, యీ యూరి మొగమైతిని. అడుగడుగునకును అడ్డంకులె. రాళ్లురప్పలు, గతుకులు గండ్లు, తప్పించుకొని, యెట్లో యిచటికి వచ్చి నిన్నుఁ జూచి ప్రాణములు నిలువఁబెట్టుకొను నాశ ప్రేరింపఁగా నేను నడచితిని. ఇట్లు వేగముగ నడుగులు వేయుచుండఁగ నా కాలొకపడిపోయిన చెట్టునకుఁ దగిలి నేనేలఁ బడిపోతిని. ఎట్లో తెప్పిరిలి, మరల పైనము సాగించి, యిచటఁ జేరితిని. ఇఁక కార్య సాఫల్యమైనది!"

వీరి సంభాషణముతో వేకువ సమయ మయ్యెను. ఇప్పటికి వానయు, గాలియుఁ బూర్తిగ నణఁగి పోయెను. ఇఁకఁ బోయి వచ్చెదమని బావాజీ, ముద్దుకృష్ణలు చెన్నారెడ్డి యొద్ద సెలవు తీసికొని ఇంటిదెసఁబట్టిరి.

౫

ఇపుడు రస్తామీఁద బాహాటముగ నడువ వీలు లేదు. అసంఖ్యాకములగు చెట్లు, కొమ్మలును, దారికడ్డముగఁ బడియుండెను. అట్టిచోట్ల నడకసాగుట యసాధ్యము. ఎటులో నడచి బావాజీముద్దుకృష్ణలు, పడిపోయిన బావాజీ కుటీరమునొద్దకు వచ్చిరి. లోనికి వచ్చి కొంచెము సేపు అలయిక తీర్చుకొని మఱి పొమ్మని బావాజీ చెప్పినను, తన యింటి సేమమును, ఊరి సమాచారమును గనిపెట్టవలయునని ముద్దుకృష్ణ వెడలిపోయెను. ప్రభాతసమయమునఁ గలకలనవ్వుచుండెడి మిన్నూరు గ్రామమిపుడు పాడువారియుండెను. పడిపోయిన చెట్లు, కూలిపోయినయిండ్లు, . చనిపోయిన జీవరాసులును జూచి ముద్దుకృష్ణ కన్నుల నీరు గ్రమ్మెను. సగము జీవముతో నఱచుచుండు గోవులను, కొనయూపిరితోఁ గొట్టుకొనుచుండు సన్న జీవములను జూచి, చేయునదేమియు లేక యా యువకుఁడు శోకించెను. పేదవారలు తమకుటీరములు కూలి, తమయాస్తియంతయు నేలపాలగుటకు విలపించుచుండిరి. భాగ్యవంతులకును వనట లేకపోలేదు. తమ కొట్టములు గూలి పశువులు మగణించినవనియు, గాదెలుపడి ధాన్యాదులు మంట గలిసెననియు భూస్వాములు పలవించుచుండిరి. గాలివానకు గాసినొందని గృహస్థు లచట నెవరును లేరు. నష్టపడినవారి యోగక్షేమ మరయుచును, కష్టదశ నున్నవారికిఁ జేతనైనసాయము చేయుచును ముద్దుకృష్ణ తనయింటి దెసకుఁ బోయెను. ఇపుడతని యిల్లెచ్చట నున్నది? ఆ గ్రామమందలి గృహములలో మేటి యనఁదగు వారి మేడ, ఆనవాలుపట్టుటకు వలనుపడని విధమున నేలపాలయ్యెను!

శిథిలమైన యాగృహము నొద్దఁ జేరి, యచట ప్రభాతభాను నెదుట నిలుచుండునపుడు, పాపము ముద్దుకృష్ణకుఁ గన్నుల నీరు క్రమ్మెను. "ఆహా? దైవ మీకుటుంబమున కింతటి యాపద తెచ్చిపెట్టెను! మా పరిస్థితులవలెనే మాగృహమును జితికి నేల పాలయ్యెను. అప్పుల వారిచే కాఁగల కార్యము గాలివానయె తీర్చినది! దైవ సంఘటనలు దాటఁ గూడనివిగదా? ఐన వగచిన పని యేమి?" అని యతఁడు ధైర్యము తెచ్చుకొని, ఇపుడు తన సేమమెఱిఁగి సంతసించిన యింటి వారలకుఁ దా నింటి పనులందుఁ దోడ్పడెను. ఎట్టి విపద్దశలయందైనను సజ్జనులకు సత్కార్యాచరణమున కవకాశములు గలుగుచునే యుండును. తన యిల్లు పోయినను, నష్ట

గాచె నిలిచి యుండుట కతఁడెంతయు సంతోషించెను. ముద్దుకృష్ణ మనసున నపు డొక సత్కార్యాచరణమును సంకల్పించు కొనెను. సర్వస్వము కోలుపోయి యల్లాడుచుండెడి యా గ్రామమందలి పేదవారల నతఁడు రప్పించి, కొన్నిదినముల వఱకును వారికిఁగావలసిన వస్తు వారికిచ్చెను. ఈ స్వల్పసాహాయ్యమే యా పేదలకు పదివేలుగ నుండెను.

ముద్దుకృష్ణ కిపుడు తన యాఁతివారల నుద్ధరించుటయె ముఖ్యకర్తవ్య మయ్యెను. తన పెరఁటిలోను తోఁటలలోను బడిపోయినచెట్లు, ఇండ్లు కట్టుకొనుటకై పేదల కతఁ డిచ్చివేసెను. అందు వలన నందఱికిని మేలు సమకూరెను. చెట్లు పడుటవలన నడచుటకు వలనుపడని ప్రదేశములు శీఘ్రమె బాగుపఱుపఁబడెను. తమ కిన్ని విఘ్నములఁ దోడ్పడిన యా పరోపకారియెడ నందఱికిని గౌరవానురాగములు మిక్కుటమయ్యెను. గ్రామమంతయు వెంటనే పరిశుభ్రమయ్యెను. కావుననె మిన్నూరు గ్రామమున కుళ్లినయాకులు, చనిపోయిన జంతు కళేబరములు తక్కిన ప్రదేశములందువలె వారముల కొలఁది నేల నిలచియు, నీట మురిగియు దుర్గంధములు వెదఁజల్లియు రోగవ్యాపనమునకు తావియ్యక శీఘ్రమె భూగర్భమునఁ జొచ్చి, భావికాలపుసస్యముల కుపకరించు నెరువుగఁ బరిణమింప మొదలిడెను.

౬

తుపాను సంభవించిన కొన్ని దినముల వఱకును మిన్నూరు గ్రామమున ముద్దుకృష్ణకు తలయెత్తుట కైన తీరిక లేనంత పని గలిగి యుండెను. కావుననే మనసున నెన్నిమారులో బావాజీని గుఱించి యతఁ డనుకొనినను పోయి యాయన దర్శనము చేయ వలను పడకుండెను. ఒకనాఁ డతఁడు తీఱిక చేసికొని, బావాజీని జూచెను. బావాజీ మంచమునుండి లేవలేక పోయినను, చిఱునవ్వుతో ముద్దుకృష్ణను కుశల ప్రశ్నము చేసెను. గాలివాన రాత్రి తగిలిన దెబ్బవలన బావాజీ కాలు వాచెను. ఇన్ని దినములవఱకును ఆయనసేవ మారయకుండుటకు ముద్దుకృష్ణ నొచ్చుకొనెను. బావాజీ వానినివారించి, "ముద్దూ! నీవు గ్రామమునకు చేయు సేవా సమాచారము నాకుఁ దెలిసి సంతోషించితిని. ఈతాపత్రయముచేతనే నీ ముద్దు మొగమున ముదిమి గానవచ్చుచున్నది! నీ పరోపకార బుద్ధి గాలివాన రాత్రియె నా కగపడినది. ఒడలుదాఁచుకొనక ప్రజాసేవ చేయుచుండుము. ఇదియె నిజమైన పౌరుషము. దీని వలననే నీకు శత్రుసంహారమును, మిత్ర సంపాదనమును జేకూరును. శత్రువు లనిన జ్ఞప్తి వచ్చినది మీవ్యాజ్యము సమాచార మేమైనఁ దెలిసినదా?"

ముద్దుకృష్ణ "చిత్రముగా నున్నది. ఏ సమాచారమును దెలియలేదు. ఒక స్నేహితుఁడైనను దెలియఁ బఱచినాఁడు కాఁడు. తంతియుఁ జాబును గూడ లేవు!"

బావాజీ:—"మన కిదివరకు బాగా తెలిసినది కాదు. గాలివానకు తంతి తీఁగలు తెగిపోవుటవలన తంతి వచ్చుచుండుట లేదు. ఆ కారణముననే రయిలు కూడ లేదు. కావున జాబులు లేవు. దీనికై నీవు పరితపింప నక్కఱ లేదు. మీరు మంచి దినములు తిరిగి చూతురు.



"దేవుజీ! గెలిచినాము!"

ఈమాటలు బావాజీ పెదవుల నుండఁగనే తపాలుజవాను జాబులను తంతిని దెచ్చి ముద్దుకృష్ణ చేతనుంచెను. తంతి విప్పుకొనుచునే యా యువకుఁడు ఒక గంతిడి, "దేవుజీ! గెలిచినాము!" అని యానందాశ్రువులు దాల్చుచు, బావాజీని కౌఁగిలించుకొనెను.

బావాజీ వాని నభినందించి "ఎంతబాధపడితివి బిడ్డా! నేఁటితో మీ కుటుంబపు బాధలు పరిసమాప్తినొందినవి. ఎల్లకాలము నమవస నిశలేనా? నిండు వెన్నెలలు కురియుచుండఁగా శీఘ్రమె రారాజును బోలిన నీకీర్తి ధగధగ మెఱయఁగలదు! లేలెమ్మ!" అని కన్నతండ్రి కొమరుని లాలించునట్టుగ నాయువకుని లాలించెను.

అంత వారిరువురు నిట్లు సంభాషించిరి. ముద్దుకృష్ణ "దేవుజీ! ఈ తంతిలోను జాబులలోను గల సమాచారములు సత్యమేనా! మా సంసారమున కెన్నఁటికైన సౌఖ్యదినములు వచ్చునా? ఆ నెల్లూరి వారి చేతులలో నుండి మాకెపుడైన విముక్తి కలుగునా?"

బావాజీ—ముద్దూ! నీవేల యింకను సందియపడుచున్నావు? కాలచక్ర మెపుడును ఒకరీతినే తిరుగదు. నెల్లూరునగర మెట్లు నష్టపడినదో మనకుఁ దెలిసినదిగదా. చూచి వచ్చిన చెంగారెడ్డి చెప్పినాఁడు, పాడుపడి సకలదుర్గంధములకు మూలకందమైన యా నెల్లూరు నగరమునకంటె కుగ్రామ మగు మన మిన్నూరె మిన్నగనున్నదని చెప్పెను. కావుననే, పిల్లలు కూడ

'నెల్లూరు నేల పాలైతే,
మిన్నూరు మిన్ను ముట్టును!'

అని వీథులలో పాడి సంతసించుచున్నారు.

"ముద్దు—దేవుజీ!

'నెల్లూరు నేల పాలయితే మిన్నూరు మిన్ను ముట్టును!'

అను సామెత కింకేమైన అర్థము చేయవచ్చునా? మావిరోధులు నెల్లూరులో నిపుడు పొందిన నష్టమునకును మాకిపుడు లభించిన లాభమునకును, ఏమైన సామ్యము చెప్పుకొనఁగూడదా!"

బావాజీ—"అర్థముల కేమి కొదువ? అన్వయము చేసికొను వారి చమత్కృతిని బట్టి పదముల సారస్యము తేటపడుచుండును! దీనికేమిగాని, నీకు సిరిలోపాటింకొకశుభముకూడ సమకూరునట్లున్నదోయి ముద్దూ! నీకు చెప్పమఱచితిని. నీకొఱకు రెండుమూఁడుసారులు చెన్నారెడ్డి కబురుపంపినాఁడు. తుపాను రాత్రినుండియును నీపేరు వారియింట రామస్మరణ యైనదని చెప్పుచున్నారు. పిమ్మట విశూచి ప్రబలినపుడు చెన్నూరుగ్రామమునకు నీవు సేవాసమితివారిచేఁ జేయించిన సహాయమువలన చెన్నారెడ్డి నీకత్యంతప్రియుఁడైనాఁడు. నీకేవో పెద్ద బహుమతి రెడ్డి యీయనున్నట్టుగ వినుచున్నాను. అన్నిటికేమిగాని, నీకొసఁగ బహుమాన మిచ్చిన సర్వోత్తమము సుమీ?"

ముద్దు: "అదియేది, దేవుజీ?"

బావాజీ: "మఱచితివా, ముద్దూ! నీహృదయేశ్వరి శ్యామలయె!"

౭.

ఇంత గాలివానకొట్టి ఇన్ని దురవస్థలకు దీనజనులు లోనయినపుడుగాని, చెన్నారెడ్డికి ముద్దుకృష్ణ యెడల దురభిప్రాయము పోలేదు. అనాదిగా నెల్లూరు చెన్నూరు రెడ్లకు, మిన్నూరువారిమీద వైరములు గలవు. కాలానుగతముగ నవి సమసిపోయెడివె. కాని, పౌరుషమె ప్రధానమైన యా రెడ్డికులశేఖరులకు పూర్వవైరముల పెనచుచుండుటయె తమ కులధర్మమని తోఁచి, వారు, తదనుగుణముగ నడచుకొనుచుండిరి. ఐనను, చెన్నారెడ్డి మనసునకు ముద్దుకృష్ణ ప్రజ్ఞానుగుణములు నచ్చి ఆ యువకునకు మంచి యరణముతో దన మనుమరాలి నొసంగ నిపుడతఁ డుద్యుక్తుడయ్యెను. ఇంతలో ముద్దుకృష్ణ సంసారస్థితిగతులు వ్యాజ్యపు తీర్పుమూలమున బాగుపడుట కూడ తటస్థించెను. కావున శ్యామలా ముద్దుకృష్ణల పరిణయపుసమాచారము జనులు విని మిక్కిలి సంతోషముతో,

"నెల్లూరు నల్లూరు నేలపాలైనపుడు,
చెన్నూరు మిన్నూరు చెలిమితోనుండు!"

అని పాటలు పదములు పాడుకొని, వినోదింప సాగిరి.

ముద్దుకృష్ణ తన మనోహారిణి శ్యామల తనకులభించుట కెంత ముదమందినను, తను పండల మిట్టి కష్టదశ యందుండునపుడు తాను వివాహభోగము ననుభవించుట యనుచితమని నమ్మి, తా నొకవత్సరము వఱకును పెండ్లి మాట తలపెట్టనని నిశ్చయము చేసికొనెను. దీనివలన స్వజన కవిజన హృదయములకు గొంత యాశాభంగము గలుగునటు లయ్యెను. కాని, బావాజీ యొకనాఁడు ముద్దుకృష్ణను బిలువనంపించి, "బాబా! నిన్ను గుఱించిన నా కోరిక లన్నియు నీడేరెను. నే నిపుడు దూర దేశయాత్ర కట్టవలసి యున్నది. కన్నతండ్రివలె నీపెండ్లి కన్నులారగాంచి మఱీ పోవలెనని యున్నది!" అని పలికెను. బావాజీ యభీష్ట లేశమును జెల్లింపఁ గలుగుట ముద్దుకృష్ణకు మహాప్రసాదము. కావున శీఘ్రకాలములోనె శ్యామలా ముద్దుకృష్ణుల పరిణయ మతి వైభవముగ జరిగెను. ముద్దుకృష్ణ సంతోషము మిన్నుముట్టునట్టుండెను. బావాజీ యానందమునకు మేరలేనట్టుగ దోఁచెను.

౮

ఒకనాఁడు బావాజీ ముద్దుకృష్ణకు వర్తమాన మంపెను. తుపానురాత్రినుండియు బావాజీకి దేహస్వాస్థ్యము తప్పియుండెను. నాఁటిరాత్రి తగిలిన దెబ్బవలన నతని కాలు వాఁచెను. ఎన్ని చికిత్సలు చేసినను ఆవాఁపు తీయకుండెను. జ్ఞానవైరాగ్యవిషయములంకాదేక వైద్యమునందును ప్రవీణుఁడని బావాజీ యా ప్రాంతములందు ప్రసిద్ధి కెక్కెను. ఇఁక యోగవిద్య యాతని సొమ్మే. ఇన్ని విద్యలుండియు బావాజీ తనకాలు నెమ్మదిపఱచుకొనలేకుండుటఁ జూచియందఱు నాశ్చర్యపడిరి. బావాజీ కీప్రాంతము లందుండుట కిఁక నిష్టము లేదనియును, కొలఁది కాలమున నే హిమాచలప్రాంతములకో వెడలి పోనున్నాఁడనియును పలువు రనుకొనిరి. ఇట్టి వారిలో ముద్దుకృష్ణ యొకఁడు.

కుటీరము సొచ్చి బావాజీని చూచినంతనే యేలయో కానిముద్దుకృష్ణ కానాఁడు దుఃఖము పొంగిపొరలి వచ్చెను. బావాజీ కాలు పొంగియుండెను. ఆయన ముఖమున ధవళిమఁ గానబడెను. పెదవులయందు రక్తిమ లోపకుండెను. ముఖము వివర్ణత నొందియుండెను.

దైన్యముచేఁ దడఁబడిన గొంతుతో ముద్దుకృష్ణ, "దేవుజీ! ఏల మీరిటు లున్నారు? మీ యారోగ్యము క్షీణించుచున్నదే. మనస్సు వ్యాకులతనొంది యున్నదే. మీసేవ చేయుటకు నేను సంసిద్ధుఁడను." అని చెప్పెను.

బాబాజీ: "బాబా! ఈశ్వరానుగ్రహ మిట్లున్నది. నేనిఁక జీవింపను. నీతోఁ గొన్ని రహస్యపు మాటలు చెప్పి మఱీ ప్రాణములు విడిచెదను."

బావాజీ కిపుడు బలహీనత హెచ్చుచుండెను. ఆవేదనతో దుఃఖ ముప్పొంగుచుండెను. కంఠస్వరము హీనమయ్యెను. అతని శయ్యయొద్దకు ముద్దుకృష్ణ వచ్చి వినుచుండెను.

బాబాజీ: "నేను మిన్నూరి రెడ్లవంశమువాఁడను." అని యారంభించినతోడనె, ఆశ్చర్యమున ముద్దుకృష్ణ లేచి, "నేనెన్ని మారులో అట్లే అనుకొంటిని. కాని, చెప్పండి." అనెను.

బావాజి: "మల్లారెడ్డి జ్యేష్ఠ పుత్రుఁడను—"అని యతని నోటినుండి రావేగమె, ముద్దుకృష్ణ ఒకగంతుతో బోయి, రోగిని గౌఁగిలించుకొని, "తండ్రీ! ఏల నీవింత కాలమువఱకును నీ సంగతి మఱుగుపఱిచితివి? జనకుని వలెనే నిన్ను హృదయమున భావించుకొంటిని. ఇంకను చెప్పండి!" అని పలికెను.

బావాజి: "మన కుటుంబపు స్థితిగతులు తారుమారగుచుండుటచేత, నాకింటివిూఁద రోఁత జనించి, దేశములపాలై పోతిని.

ఉత్తరహిందూస్థానమేగి, కొందఱు మహనీయుల యనుగ్రహమున యోగశాస్త్ర మభ్యసించి, వైద్యశాస్త్ర రహస్యము లనేకములు గ్రహించి, దేశసంచారముచేసి, చిరకాలమునకు మరల నీప్రాంతముల కేతెంచితిని. అప్పటికి మనపెద్ద లనేకులు గతించిరి. చిన్నలలో పలువురు కుత్సితవృత్తులఁ దగిలి, కుటుంబ ధనమును కొల్లపెట్టుచుండిరి. నీవు బాల్యమువనుంటివి. సన్న్యాసినైనను కుటుంబ



రాధ—విరహిణి

చిత్రకారుడు: చామకూర సత్యనారాయణగారు, రాజమహేంద్రవరము

గౌరవమును, నీపురోవృద్ధినిగోరి, ఇచటనేనిలిచియుండుట కుద్యమించితిని. అట్టిచో, ఏపుణ్యక్షేత్రములు నేదర్శించుటకుఁ బోయినను, మనస్సుమాత్ర మిచటనే యుండుననుట స్పష్టము. కావున నిచటనే ప్రచ్ఛన్నముగనుండి, నీ సేవ మారయుచు, లేనిపోని సంబంధములుమాత్రము కలిగించుకొనక, నామార్గమునేఁ జూచుకొనుచుండుట లెస్సయని మనస్సును సమాధానపఱచుకొంటిని.

"పూర్వము నన్నెఱింగిన పెద్దలు గతించుటవలన నన్నీనూతనాశ్రమమున నెవరును గుర్తింపఁజాలరైరి. అందువలన మెల్లఁగ నిచట కుటీరము వేసికొని ఒకకన్ను నీ మీఁదను,ఒకకన్ను పరమాత్మునిమీఁదను నుంచి దినములు గడుపుచుంటిని. మెల్లమెల్లఁగ నీతోస్నేహము కలిపితిని. ఎప్పటికప్పుడు నీమనస్సు గ్రహించి, అది సన్మార్గమునఁ జరించునటులు పదిలపఱచుచుంటిని. ఇదియె నా ముక్తిమార్గ మనుకొంటిని. చెప్పుట కేమి యున్నది? ఇప్పటికి నా యైహికకష్టములు తీఱినవి. నామనస్సు కుదుటఁబడినది. ఇఁక మృత్యుముఖము నపేక్షించుచున్నాను."

తండ్రికొడుకు లిరువురి కన్నులనుండియు నశ్రుకణములు సంతత ధారగ నొలుకుచుండెను. అంత పుత్త్రుఁడు తీఱనిమోహమున జనకుని కౌఁగిలించుకొని, "నాయనా! కొన్నిదినములైనను నే నీనూతన బాంధవ్యసౌఖ్య మనుభవింపగూడదా? మీ మరణమున కింతటి యాకస్మికత్వ మేల?" యని యడిగెను. బావాజీ, "నాయనా, అజ్ఞానముచే నీ వడుగుచున్నావు! నా గడువు సమీపించినది గావుననే, మనసంబంధ మిప్పుడు బయలుపడిన దనుకొనఁ గూడదా? భూలోక నివాసముతోఁ దనివిఁ జెందితిని. అది యెంత దీర్ఘమైన నంత దుఃఖావహము!

"తుపానురాత్రిలో నాకు జీవితము దెస విముఖత్వము గలిగెను. వైధవ్యదశ నందినటులైన ప్రకృతిసోదరి నీ కన్నులతో నేఁ జూడనొల్లను! నశించిన గృహములు, భవనములును మరల వెలయఁగలవుగాని, దీర్ఘకాలము పెరిఁగి లోకమున కలంకారభూతములై ఒక్కపెట్టున నశించిన యా మహావృక్షములు తిరిగిరావుగదా. పెక్కండ్రు జనులను, నోరులేని జీవరాసులను ఈ తుపాను తన పొట్టఁ బెట్టుకొనెను. సోదరసమానులగు వీరందఱితో నేనేలఁ బోఁగూడదు? వారిది నిర్బంధమరణము, నాయది స్వచ్ఛందము!

"వ్యామోహమునఁబడక, నన్నిఁక వదలివేయుము. ధరణిని జిరకాలము ధర్మమునకై ధైర్యమునఁ బోరాడుము. నిరతము నీకు జయమగుఁగాక-శ్రీహరి"—

మాటలు పూర్తిగాక మున్నే, బావాజీగొంతులో గురకపుట్టెను. చూపు వికారమును బొరసెను. బావాజీ పరమపదము నందెను.

మిన్నూరు బాట దగ్గఱ నూతనముగ పెద్దసమాధి వెలసినది. అచట నొకమఠము స్థాపించి ముద్దుకృష్ణారెడ్డి, శాశ్వతముగ దానిని జరుపుటకై యేర్పాటులు చేయుచున్నాఁడు.

---

# ద్రోణుని కౌటిల్యము

చన్నాప్రగడ పూర్ణచంద్రరావు గారు

కుంభజన్ముండవైనంతఁ గొదువయేమి?-బ్రహ్మకులభూషణుండవు, పావనుఁడవు
శస్త్రగురుఁడవు, శాస్త్రవిశారదుఁడవు-శిష్యవత్సలుఁడవు, శేముషీమదగ్ర
గణ్యుఁడవు; కాని, లోప మొక్కండుగలదు-నిర్మలము, నిష్కళంకము, ధర్మయుతము
నగు భవచ్చరితంబునం దరసిచూడ-లోపమాత్రంబు కా దతిలోకపాప
పంకసంకలుషితమౌ కళంకమద్ది-న్యాయమనియెద, దుమ్మెత్తిపోయఁబోకు
నచ్చఁజెప్పెద నది కప్పిపుచ్చఁబోకు-నిక్కమో, కాదో, నీమది కెక్కెనేని
యందలి నిజానిజంబుల నరయుమయ్య, పిన్ననాఁ డున్న నెయ్యంబు విడచె నంచు
ద్రుపదుపై దోష మొక్కటి రూఢిపఱచి-పట్టిపగదీర్చుకొన వానిఁ బట్టితెచ్చు
ఘనుఁ డెవండొక్కొ నాశిష్యగణమునంద-టంచుఁ దలపోసి యందు సమర్థుఁ డొక్క
పార్థుఁడేయని నిశ్చయపఱచి యతని-నద్వితీయాస్త్ర విద్యారహస్యవేది
యగునటులు శిక్షగఱపితి, జగతి నీకు-సాటియగు మేటిలేఁడు, ముమ్మాటికనుచు
దంభములు పల్కితివిగదే కుంభజన్మ!

అల్ల జగదేకవీరుఁడైనట్టివాఁడు-అర్జునుం డొకనాఁడు వాహ్యాళివెడలి
మగుడి నీయెడ కరుదెంచి మొగము వ్రేల-వైచి, నీతోడ నేమనిపల్కినాఁడు?

... ... ... ...

అయ్య! గురువర్య! నను భువనైకవీరుఁ-గా నొనర్చితినంటివి కల్లయయ్యె
నన్ను నిన్నును దలఁదన్ని యున్నవాఁడు-ఉన్నవాఁ డొకచో నొకపిన్నవాఁడు
అన్న నామాటలాలించి యతనితోడ-నరిగి గురువర్య, యెవ్వని నరసినావు?

... ... ... ...

అధికభక్తిని మృద్విగ్రహం బొకండు-దారచించి, యదే భరద్వాజుఁ డద్దె
తనకుఁ గూర్చుగురుండని తలఁచి తలఁచి-నిశ్చలమనస్కుఁడై మది నిన్నె నమ్మి
యొక్కబయలునఁ దనవిలు నెక్కువెట్టి-అనుపమానాస్త్ర విద్యారహస్యమెల్లఁ
ద్రిభువనస్థలులను సన్నుతించునట్లు-నస్త్రసంధాన మొనరించునట్టివాని
వీరరసమెల్ల మూర్తీభవించువాని-సాధుశీలుని యొక్కనిషాదరాజ

మాణవకు నేకలవ్యుని మహితయశుని-గని, పులింగన్న హరిణంబు ననుకరించి
భీతచిత్తుండవై వేఱు చేతకాక-అసహనాంకురములు మది నాక్రమింప
కల్మషరసంబు పై కుబుకంగనీక-కపటచిత్తుం డవగుచు రక్కసునిపగిది
కపటమాహేంద్రజాల మొక్కండు రచించి-యతనిచెంతకుంజని పరమాప్తుభంగి
పల్కితివి ప్రేమరస ముట్టిపడెడునట్లు-ఓ నిషాదకుమార ! రమ్మోయి, నీదు
భవ్యతరశర విద్యాప్రభావ మరయ-నచ్చెరువు దోఁచె నినుఁ జాలమెచ్చుకొంటిఁ
దావకీనాస్త్రగురుఁ డెవ్వరో వినంగ-తహతహం జెందుచుండెఁ జిత్తంబు మిగుల
జెప్పఁ గదవయ్య, నీదు దేశికునిపేరు-అనుచు నీవాడునుడుల గూఢార్థ మెఱుఁగ
నేరక, నమాయికుఁడుగాన, నెమ్మితోడఁ-జెప్పెదను బ్రాహ్మణోత్తమ, చిత్తగింపు
తండ్రియు, గురుండు, దైవము తలఁప నాకు-భవ్యచరితుండు కుంభసంభవుఁడు గాదె ?
అతనిమూర్తినె హృదయంబునందు నిలిపి-నిరత మాతని మదిని ధ్యానించుకొంచు
గంటి శస్త్రాస్త్రకళల నన్నింటిననుచు-ముకుళితాంజలియై నీదుమ్రోల నిలిచి
పలుక, సెహబాసు, మెచ్చితి వత్స ! నిన్ను-కుంభసంభవుఁడే నీకు గురుఁడయేని
అల్లకలశజుఁడను నేనె యగుదుఁగాదె-నాకు గురుదక్షిణయొసంగుమీ కుమార !
యంచు నీవాడ నతఁడుహర్షించి దేవ !-ఘనముగా నిచ్చెదను గురుకట్న మిపుడె
తావకీనమనోవాంఛితంబుఁ జెపుఁడు-ధనమొ? ధాన్యమొ? వస్తువాహనచయంబొ?
పసుగణమొ? భూములో? యేదివలయునీకు-నదియొసంగెద, ననఁగ నేమంటివయ్య !
వలదు నీవన్న వేదియు వలదు నాకుఁ-గోరితి నొసంగుమీ కశాంగుష్ఠములను
అనుచు నీవన, నతఁడు నితాంతభక్తి-అన్నమాటకు వె న్నీయనట్టివాఁడు
గాన తానన్నమాటకుఁ గట్టువడియె-గాని, లేకున్నచోఁ దనకన్ను లెఱ్ఱఁ
జేసి, హా !! యట్లనా !! యని చేయిచఱచి-హుంకరించిన ప్రాణాలుచంకఁబెట్టి
తోఁకజాడించి పోవకుండువె ? గురూజి ! వానిమించునుపాయ మెవ్వాలనులేక
ఎట్టిదుష్కృత్యమున కొడిగట్టితయ్య,-కుడువనా ! త్రావనా !! యెందుకొఱకు ? వాని
వ్రేలు లిమ్మనికోరితి విప్రవర్య !-ఏకలవ్యుని గురుభక్తి లోకమెల్ల
నెట్లుకీర్తించుచున్నదో యెఱుఁగుమయ్య,-నీదుకౌటిల్య మట్టులనే జగత్తు
ఎటులు గర్హించుచున్నదో యెంచుకొనుము-ధర్మసూక్ష్మ మెఱింగిన ధరణిసురులె
హేయకృత్యంబులకు వెనుదీయకున్న-నెన్నివిధములఁబడి తన్నుకొన్నఁగాని
బ్రాహ్మణద్వేష మిద్ధపైఁ బ్రబలకున్నె !)

---

# శాంతి

శ్రీమతి సి. లక్ష్మి

౧

అమరనాథుని ఆంతరజ్ఞానము, కడసారిమాటు అతనిని బొంబాయినగరము వెడల పురికొల్పెను. కాని, కలకత్తాయందు ఊపిరి సలుపకుండ పనులున్న సమయమునందు, ఆ ప్రదేశమును వదలి, బొంబాయి ఏలవెడలెనో, అతనికే తిన్నగా బోధపడుచుండుటలేదు. ఒక దినమంతయు ఉన్మత్తునిభంగి, బొంబాయి వీథులన్నియు తిరిగి మరునాడు— శుక్రవారమునాటి సాయంకాలమున, అమరనాథుడు, "టాజ్ మహల్" అను పేరుగల, వంటపూటింటికి వెళ్లెను. అచట తేనీరుగ్రోలిన పిదప, అచటికి సమీపముగానే యున్న సముద్రతీరమునకు బోయి, ఒంటరిగా, ఒకస్థలమున ప్రకృతిసౌందర్యమును తిలకించుచు, ఆలోచనామగ్నుడై విశ్రమించియుండెను. నిర్వీరుడైన భాస్కరుండప్పుడే అస్తమించుచుండ, ఆకాశమంతయు నూతన శోభతో విలసిల్లుచుండెను. శుకపికాదులు తమ తమ కులాయంబులు జేరుకొనుటకై వడివడిగా పోవుచుండెను. ప్రకృతిసౌకుమార్యము, విశ్వమునందేకాక, మన అమరనాథు హృదయపీఠమునగూడ అధిష్ఠించియుండెను. ఇట్టిసమయమున అతిలావణ్యవతియగు నొకయువతీమణి రూపము, అమరనాథుని జ్ఞాననేత్రమునకు గోచరింప, ఒకటి రెండశ్రువులరాల్చి, అమరనాథు డారూపమునే రెప్పవేయక చూచుచుండెను.

మన యువకుడు ఇంగ్లాండునుంచి వచ్చి చాలాదినములు గాలేదు. ఇట్టి పరధ్యానమనస్కుడగు అమరేంద్రుడు కలకత్తాయందు గొప్పవర్తకమును జేయుచుండెను. ఇటీవల నూతనముగా చిత్రపటముల వ్యాపారముగూడ పెట్టుకొనియుండెను. వృద్ధుడగు గంగోపాధ్యాయుడు, వర్తకమునందు, అమరనాథునికి సహాధ్యాయిగానుండెను. ఇతనికి బుద్ధిబలముకన్న శరీరబలమే వేయిమడుంగు లధికము. కాన, అమరనాథునికి, ఈతనివల్ల మరి యే సాహాయ్యము లేకపోయినను, నలయునపుడెల్ల ధనసాహాయ్యము మాత్రము కలుగుచుండెడిది. గంగోపాధ్యాయునికి, అమరనాథుని నడవడిక ఏమియు అర్థమగుటలేదు. కాని తనకు ధనలాభము వచ్చునంతకాలము అతనెటులున్న నేమియని, ఆతని విచిత్రప్రవర్తనను గురించి, ఎక్కువగా, గంగోపాధ్యాయుడు ఆలోచించుటలేదు. పని ఎక్కువగానున్న సమయములందే, అమరున కొక బాలికా ముఖారవిందము, కట్టెదుటనిల్చి, తన్నచటకో రమ్మనుమన్నట్లు పిలువ వినినవాడై, ఎట్టి అవసరమైన పనియున్నను సరే, కలకత్తావదలి, తత్క్షణమే ఆబాలికామూర్తిని వెదకుకొనుచు, నూతనపట్టణములకు బోవుచుండెడివాడు. ఈవిధముగా, ఒకమారు "డార్జిలింగు"నకును, మరియొకమారు, హిమాలయప్రాంతములకును, ఇంకొకమారు ఇంద్రప్రస్థనగరమునకును, ఇంక నెన్నియో ప్రదేశములకు, అమరనాథుడు పోయియుండెను. కాని, తిరిగి వచ్చునపుడొకమారు కన్న ఇంకొకమారు దుఃఖాక్రాంతుడైయుండుటయేకాని, అమరనాథుడు పునఃస్థైర్యమును పొందుటలేదు.

ఇంతవరకు వృద్ధగంగోపాధ్యాయుడు అమరనాథుని ఏమియు అనలేకపోయెను. కాని ఈ మారు, అమరనాథుడు బొంబాయివెళ్లుట మిక్కిలి పొరపాటుపని అని అతని సహాధ్యాయి తలచుచుండెను. ఏలయన, వార్తాపత్రికలవల్ల నాలుగైదు నౌకల విదేశవస్తువులతో వర్తకులు వచ్చుచున్నారని తెలియుటచే, గంగోపాధ్యాయుడు రాబోవు ధనలాభమును తలచుకొని ఉప్పొంగిపోయెను. ఇట్టి సమయముననే మరల మన అమరనాథుని కాతని దేవీమూర్తి, సాక్షాత్కరించి కోకిలను నిరసించు గాత్రముతో తన్నచటికో పిలిచినట్లయిన, వెంటనే, అమరనాథుడు కలకత్తాను వదలి బొంబాయి నగరమునకు వెడలిపోయెను.

సంధ్యాసమయంబున, అమరనాథు డావిధముగా సముద్రతీరమున తన దేవీమూర్తిని దర్శించుచు, తన్మయత్వము నొందియుండెను. భాస్కరుడు పూర్తిగా, అపరవారిధిని గ్రుంకిపోయెను. సంధ్యాచీకటులు నలుదె

సల గ్రమ్మకొనజొచ్చె. అట్టితరి, అమరనాథుని దేవత గూడ అంతర్ధానమయి, ఆతని హృదయాకాశమును చీకటిగా జేసివైచెను. పశ్చాత్తాప వహ్నిచే, హృదయము దహింపబడుచుండ, అమరనాథుడు నలుదిక్కుల బరికించిజూచి, తనమనస్సే ఇదివరకన్యాయముగా ఒక జీవిని బాధించినందులకై తన్నిటులు యాతనపెట్టుచున్నదనియు, ఎండమావుల వంటి ఇట్టి ప్రేమను నమ్మి ఇక నెప్పుడును స్వగృహమును, స్వదేశమును వదలి రాగూడదనియు, దృఢప్రతిజ్ఞ చేసుకొనెను.

అమరనాథుడు "టాజ్ మహలు" చేరునప్పటి కప్పుడే, గాఢాంధకారము నలుదెసలు దట్టముగా గ్రమ్మకొనియె. విద్యుద్దీపము లెల్లెడ వెలిగింపబడెను. అమరనాథుడు భోజనశాలకుబోయి, తనకొరకై ఏర్పాటుచేయబడిన స్థానమున భోజనమునకై ఆసీనుడాయెను. ఇంతలో, ఉదయము మెయిలులో వచ్చిన ఇతర అతిథులందరు బిరబిర లోనికి వచ్చి వారివారి స్థలములయందు కూర్చొనసాగిరి. అమరేంద్రు డాశ్చర్యములో వారినందర జూచుచుండెను. అమరనాథుని మేనమామ కూతురును; ప్రాణస్నేహితురాలునుఅగు శిరీషకుమారి, తనభర్తయగు ప్రతాపసింహునితోగూడ లోనికి వచ్చి, అమరనాథుని చూడకయే ఆతని ప్రక్కనే కూర్చుండిరి. శిరీషకుమారి ప్రతాపసింహు నివలెగాక అల్పసంతోషి. సదా మందహాసవదనారవిందయై, చూపరుల మనంబులు రంజిల్లజేయుచుండెను. శిరీష తటాలున ప్రక్కనున్న అమరేంద్రుని మాచి, వికసితవదనారవిందయై, "అమరా! ఇది యేమి తలవని తలంపుగా నీ దర్శనభాగ్యము మాకు నేడబ్బె. బొంబాయియందు నీకేమైన పని గలిగినదా! సిల్వియా క్షేమముగా నున్నదా" అని ఒకదానివెంటనొకటిగా, ఊపిరి యాడకుండ ప్రశ్నించి ప్రత్యుత్తరమునకు నిరీక్షింపకయే, మరల "అమరా! మేము విరోపా అమెరికాదేశములందు, ఈ ఎనిమిదిమాసములును మిక్కిలి సౌఖ్యముగా, గడపితిమి. ఎన్నిమారులు నీకు ఉత్తరములు వ్రాసినను ఒక్కదానికైనను ప్రత్యుత్తర మియ్యవైతివి. నేటి ఉదయముననే ఇచటికివచ్చితిమి. మిథునపుర పుష్పవనములలో నున్న మా పర్ణ కుటీరమునకు, ఆదివారము బయలుదేరి పోవుచున్నాము. అమరా! నే నెన్నివిధముల ఎన్నిమారులు మా గృహమున కొక్కమారు రమ్మని నిన్ను బ్రతిమాలుకొనుచున్నను ఇంకను నీకు మాపై, అనుగ్రహము జనింపలేదు. ఈ మారైనను వచ్చెదవా రావా చెప్పుము. వత్తునన్నగాని, ని న్నీమారు విడువము"అని శిరీష నిర్బంధింప, అమరనాథు డాశ్చర్యముతో ఆయువతినిజూచుచు, "శిరీషా! శిరీషా! అంతగట్టిగా మాట్లాడకుము. ఇతరులకు కూడ మాటలాడుటకు, కొంచె మవకాశమిమ్ము. ఇచట మనము మాత్రమే లేము" అని ప్రతాపుని వైపునకు దిరిగి—"ప్రతాపా, ఇంత మాటకారి యగు శిరీషతో పాపము నీ వెటుల వేగుచున్నావో కదా. నాకైన ఒక్క దినములోనే పిచ్చి యెత్తిపోవును సుమీ" అని నవ్వుచు బల్క శిరీష ఆ మాటలను చెవినిబెట్టకయే మరల అమరనాథునితో, "అమరా, దీనికి సమీపముగా మేమొక్క మేడను, అద్దెకు దీసికొని యున్నాము. రేపు నీవు తప్పక అచటికి రావలయును. నాస్నేహితు రాండ్ర నందరిని చూచినయెడల నీవు మిక్కిలి సంతసింతువని నే తలచెదను. వారందరూ హైందవ బాలికలే సుమీ! అమెరికా విశ్వవిద్యాలయములయందు సుతీర్ణలైన వారు. వీరికైన జూచుటకు నీకు కుతూహలము గలుగుటలేదా" అని పల్క మిక్కిలి ఉత్సాహముతో అమరనాథుడు "శిరీషా అంతగా నన్నడుగవలయునా, అటులనే తప్పక రేపు సాయంకాలము మీ సదనమునకు వచ్చెదను కాని బాలికలందరిని నీ వెచట కలుసుకొంటివి. వారు యిచ్చటికి దేనికొరకై వచ్చిరి?" అని యడుగ శిరీష ఇట్లని చెప్ప సాగెను. "ఈ బాలికలందరు ఒక సమూహముగా హిందూదేశ సమస్యల నెల్ల తర్కింప, ప్రతి గ్రామమునకు బోవునిచ్ఛతో ఇచటికి వచ్చిరి. హిందూ జాతీయ గుణములను గురించియు, లలితకళల ప్రాముఖ్యమునుగురించియు నీతో వితర్కించుటకు వారు చాలా ఇష్టపడెదరని నే ననుకొనెదను. అమరా, నీకుమునుపటివాగ్ధాటియున్నదా? ఏమి నేను జెప్పువాక్యములు వింటివా లేదా? ఇంకను మునుపటి పరధ్యానము నిన్ను వదలలేదా? నీ కనురెప్పలేల పెట్టెలవలె బరువుగా నున్నట్టు కాన్పించుచున్నవి? అమరా! నల్లమందేమైన సేవించితివా యేమి?" అని

శిరీష పల్క దద్దరిల్లి అమరనాథుడు "శిరీషా,ఏల అట్లనుచుంటివి" అనెను. దానికి జవాబు చెప్పకయే శిరీష "అమరనాథా, శాంతి ఆబాలిక లందరిలోను చుక్కలలో చంద్రునివలె యుండును. ఆమె వయస్సునకు హెచ్చగు విద్యయు, విద్యకు తగిన సౌందర్యము, సౌందర్యమునకు తగిన వినయము, వినయమునకు తగిన దైవభక్తి గలిగిన సుగుణవతి. ఆమెను చూచిన ఎట్టివారైన ఆమెను ప్రేమింప కుండ నుండజాలరు." అని ఇంకను ఏమియో చెప్పుచుండెను గాని పాపము, అమరనాథుని వీనుల "శాంతి" అను నామము సోకినంతనే, నిశ్చేష్టుడయి ఏదియో జ్ఞప్తికిరా అట నిలవలేకపోయెను. కాని వెంటనే అచ్చోట బాసినయెడల శిరీష తన్ననుమానించునని అతి కష్టముతో తన భావముల పైకి గాన్పింపనీయక ఆమె శాంతిని గూర్చి చెప్పుచున్న మాటలన్నియు మిక్కిలి ఆతురతతో వినుచుండెను. "అమరా, శాంతి నిజముగా ప్రేమనిధి. అనేక జాతీయకన్యల నేనుకలుసుకొంటిని గాని వారియందు భారత రమణులయందున్న ఏదోయొక ఆకర్షణశక్తికొరతవడియున్నది. అమరా!అదియేదియో నేచెప్పజాలను. ఆచెప్పజాలనిదేదియో అదియే స్త్రీకి నిజమైనభూషణమని నే భావించెద. నేను మొదటిసారి శాంతిని కలుసుకొనినపుడు, "ప్రపంచము తన స్త్రీయోగ్యతను పోగొట్టుకొనినపుడు ఆ యోగ్యత తీర్థవాసివలె ఈ భారతరమణి పాదసన్నిధి కేతెంచెననినే మరల భావించితిని" అన, అమరనాథుడు తన హృదయవేదనను పైకి గాన్పింపనీక, ఎంతయో శ్రద్ధతో వినుచున్నవానివలె నటించుచు, "శిరీషా,ఎట్టికవులైనను,ఇట్టివర్ణనచేయజాలరు సుమీ. నీమాటలు నిజముగా మిక్కిలిప్రశంసనీయములు" అని చిరునవ్వుతో బల్క, "అమరా, ఓర్పు వహింపుము. ఆమెను రేపు నీవు కలసికొనినపుడు నా మాటలయందలి నిజానిజములు నీకే తెలియును" అని,మే మామెను ఇటలీ దేశమునందు కలుసుకొంటిమి. అక్కడనుంచి మేము ఇచటికి కలిసియే వచ్చితిమి. ఆమె అమెరికాదేశమునందు విద్యను ముగించినదట. అమరా, ఆ దేవీమూర్తి వదనమందు నే నిదియని చెప్పజాలని ఏదోయొకశక్తి నాకు గాన్పట్టుచున్నది. ప్రపంచమున, సంసారమునందును వైరాగ్యముగలిగి శాంతిలేని హృదయములతోనున్న మీ వంటి వారందరు నావద్దకు వచ్చినయెడల శాంతిని ప్రసాదింతునని చెప్పుచున్నదో యనునటువంటి ఉత్కృష్టమైన శాంతి సరళముల సూచన ఆమె ముఖకమలమున గాన్పించును."ఈపలుకులకు అమరనాథు డేమియు చెప్పలేక మూగవానివలె ఆమె మాటల వినుచుండెను. శిరీష కుమారి ఒకనిముసమాగి మరల "అమరా, ఆమె సౌందర్యము వర్ణనాతీతము. చంపక, విరజాజి, మల్లె, గులాబీ మొదలగు పుష్పరాజముల పరిమళము మిశ్రమమైన ఎటులుండునో, ఆమెయందము అటులుండునని అనవచ్చును. మంచిగంధపు వాసనతోగూడినమందమలయానిలముసర్వేంద్రియముల కెట్టి హాయినొసంగునో, ఆమె సొగసు గూడ అట్టిదియే. మాధుర్యనిర్మలత్వములు ఒకదానియందొకటి లీనమై ఆమె సౌందర్యముగా మారియుండును. ఆమె నయనములు తామరరేకులవలె సొగలు గాకపోవచ్చును. కాని అవి నిశ్చయముగా, ధవళకాంతిమయమగు పరిశుద్ధాత్మను వెలిపుచ్చు తారకచిహ్నములని చెప్పవచ్చును"అనెను.అమరనాథునిమనోవేదన మితిమీరుచుండెను. వేయివిధముల దాని నణప బ్రయత్నించుచు, అమరనాథుడు, "శిరీషా, ఆ యువతిని నీవు మోహించుటలేదు గదా! కాని ఆమె నీవలె మాటకారి గాదని నే ననుకొనెద" అని హాస్యమునకై పలుకునట్లు నటించెను. శిరీషయు మెల్లగా "లేదు అమరా, ఆమె నావలె మాటకారి కాదు. ఆమె ఉచ్చరించునది కొన్నివాక్యములే ఐనను, అవి మిక్కిలి భావగర్భపూరితములుగా నుండును. ఇక ఆమెపై నాకు మోహమంటివా వినుము" అని ప్రతాపునివైపునకు దిరిగి, "నాథా, నేనిపుడు చెప్పబోవునది మీకు నాపై అసూయ కలిగింపదని నేనమ్మెద. నేనే పురుషజన్మమెత్తినట్లైన, ఆమె నన్ను ప్రేమించినట్లైన, ఆసేతుహిమాచలపర్యంతము, నాకంటె అదృష్టవంతుడు—ఏవిషయమునందైనను గానిమ్ము—మరియొకడుండబోడని, నిశ్చయముగ, నిర్ణయముగ, నిస్సందేహముగ చెప్పగలను." అనెను.

ప్రతాపసింహుడు, శిరీష ఎంత మాటకారియో అత నంత మౌనవ్రతముగలవాడు. అమరనాథుని ఓర్పంత

యు కొంచెకొంచెముగా సన్నగిలుచుండెను. లేనిఉత్సాహముతో మరల "శిరీషా, నీకేమి వెర్రియా, నీవు వచించునదంతేయు పరిహాసమునకై గాదా. నిజమేనా"అని అమరనాథుడు పల్క శిరీష "అమరా, నేను బల్కినది ముమ్మాటికి సత్యమే.మరియొకమారు చెప్పెదను వినుము: శాంతిదేవిని ప్రేమించువాడును, ఆమెచే ప్రేమింపబడువాడును, ఈభారతవర్ష మున-అంతయేల ఈ చతుర్దశభువనములందునుకూడ ధన్యుడు. వానికి సమానుడగువాడు మరియొక డెందును ఉండడని ఘంటాపథముగ చెప్పగలను" అన నిశ్చేష్టుడైయున్న అమరనాథుని నోటినుండి, అతనికి తెలియకుండగనే, "వాడు బుద్ధిహీనుడై, అటువంటి దేవీమూర్తి పవిత్రప్రేమను సిరిరా మోకాలొడ్డినట్లు నిరసించిన తప్ప" అనుమాటలు వెడలెను. శిరీష కీ మాటలేమియు బోధపడలేదు. "అమరనాథా, నీవిప్పుడేమిపల్కితివి?" అని గంభీరస్వరముతో శిరీష అమరుని అడుగ, "అటువంటి ప్రేమను నిరసించినవాడు, నరపశువు అంటిని" అని జవాబిచ్చెను. శిరీష కొంచెము కోపముతో "ఏది ఎటులున్నను,అమరా, అటువంటి బుద్ధిహీను లీప్రపంచమున నున్నారని నేననుకొనను" అన నిర్భయముగా అమరనాథుడు, "అటువంటివారు ఉన్నారని చెప్పుటయేకాక, తా నటువంటివారిలో ఒకరిని ఎరుగుదు"ననికూడ చెప్ప శిరీష పరిహాసమునకై "అటులైన అమరా, ఆ మనిషి నీవే కావచ్చునని నే ననుకొనెదను' అని పల్కెను. విచారపూరితమగు చిరునవ్వుతో "సరియే; శిరీషా! రేపు మీగృహమునకు వచ్చి, నీ వింతగా కొనియాడుచున్న నీదేవీమూర్తిదర్శనము జేసెద"ననిపల్కెను.

౨

నేడు అమరనాథుడు తన అంతరజ్ఞానములు మతిభ్రమణముచే కాన్పించుచున్నవేమో యనుకొనుచున్న తన దేవీదర్శనములును, ఉన్మత్తునియొక్క చర్యలు కావని తెలుసుకొనెను. శాంతి తన కెంతదగ్గరనున్నదో, తెలుపుటకును, వారిని విచిత్రముగా సమావేశము చేయుటకును, సర్వేశ్వరుడే శిరీషకుమారిని దూతికగా బంపెనని అమరనాథునికి తోచెను. ఈ లోకమునం దస్తమించినదనుకొనుచున్న తన శాంతి, సజీవయై యున్నదని తెలిసిన పిదప, కండ్లు తనివిదీర ఆమెను చూచుటకన్న ఈప్రపంచమున మరి యేకోరికయు అమరేంద్రునకు లేకపోయెను. కాని, ఆమెను ప్రత్యక్షముగా చూచుసమయము తటస్థించి నపుడు, సంతోషముగా నుండుటకు బదులు అమరనాథుడు విచారముతో క్రుంగిపోయెను. శాంతి నిర్మలదృక్కులు జ్ఞాపకమునకు వచ్చునపు డెల్లను అవమానకరమైన తన పూర్వ చరిత్ర జ్ఞప్తికి వచ్చుచు ఆతనిని పశ్చాత్తాపదగ్ధహృదయునిగా జేసి వేయుచుండెను. అట్టితరి పిరికితన మాతనియం దావహించి, శాంతిని గలుసుకొనుటకు ధైర్యములేని వానినిగాగూడ జేయుచుండెను. మరల కొన్ని నిముసములకే ఈ భావములన్నియు పటాపంచలయిపోయి, శాంతిని అచిరకాలములోనే చూడ గలుగుదునుగదా అను సంతోషము ఆతని హృదయమును నింపివైచి అతని నానందవారిధి నోలలాడించుచుండెను. ఆనాటిరాత్రి భోజనమైన పిదప అమరనాథుడు తన శయ్యపై ఆసీనుడై యుండ, తన పూర్వ చరిత్ర అంతయు మెరపువలె ఒక్కమారు ఆతనికి జ్ఞప్తికి వచ్చెను.

పదిసంవత్సరముల పూర్వము, శాంతీ అమరనాథుల ప్రథమ సమావేశమైనది. శాంతి అప్పటికి సంపూర్ణయౌవనవతిగాదు. 11 వత్సరముల ముగ్ధ. ఆమె మాటయందుగాని, ప్రవర్తనయందుగాని, సహజసౌశీలతయు, కోమలత్వము తప్ప వెదకిచూచినను వేరొండు ఆమెయందు గాన్పింపదు. అట్టి బాలికామూర్తియే అమరనాథుని హృదయపీఠిక మొదట నధిష్ఠించెను. అప్పటి ముద్దులొలుకు ఆమె మాటలును, సరళభావమును వెదజల్లెడి ఆమె అప్పటి చూడ్కులును, నేడు అమరనాథుని హృదయమును బాధింపసాగెను. సంవత్సరములు గడచిపోయినవి. కాని, స్మృతిశక్తి మాత్రము క్షీణింపలేకపోయెను. అట్టి ప్రేమదినములు గడుచుకొలది అంతకంతకు అతిశృంగారముగా పరిణమించుచుండెను. విచారముతో సమ్మిళితమై, నానాటికి పావనమగుచుండెను. కలకత్తా విశ్వవిద్యాలయమున అమరేంద్రుడును, శాంతి సహాధ్యాయులుగ నుండిరి. ఏనాడు ఒం

ద్దొరులు అట కలుసుకొనిరో, ఆనాడే వారి కన్యోన్యానురాగ ముదయించెను. అనేకదినములు, వారొండొరులు కలసి మెలసి యుంటచే శాంతి అమరనాథుని సుగుణనిధిగా పూర్తిగా తెలుసుకొనినదై ఎన్నడైన అట్టివాని చెట్టపట్టుభాగ్యము తన కబ్బునా యని విచారించుచుండెను. తనపై ఎట్టి యనురాగ మున్నదో, ఆ విధముగనే స్వదేశముపై గూడ అమరనాథునికి మిక్కిలి అభిమానమున్నదని ఆమె తెలుసుకొనెను; దినములు గడచుకొలది అమరనాథునికి శాంతియందలి గాఢప్రేమయే దేశాభిమానముగను, దేశాభిమానమే శాంతిపై అనురాగముగను పరిణమించెను. వాటిని, అమరనాథుడు విడదీయజాల డయ్యెను. శాంతికి అమరనాథుని దివ్యమంగళవిగ్రహమునే కన్నుల తనివి దీర జూడవలెననియు, ఆతని మృదు మధురవాక్కులనే సదా వినవలెననియు తప్ప మరి వేరుకోరిక లేకపోయెను. "డెస్డిమోనా" కేమాత్రము తీసిపోని శాంతి "ఒథెల్లో" కెనయగు తన అమరనాథుని వాక్సుధారసము గ్రోలుచు, హిందూదేశచరిత్రయందు ఏదో యొక ఘోరసంగ్రామమున అమరనాథుడు మిక్కిలి ప్రఖ్యాతి నొందుననియు, ఆతని మూలమున తానుకూడా ఏదియో గౌరవ పదవి నలంకరింపగలననియు తలచుచుండెను. కాని రాబోవునున్న దెట్టిపోరో నిర్ణయింపజాలకుండెను. అమరనాథుని స్నేహము లభింపని పూర్వము శాంతి యెన్నియోమారులు తన భావికాలమునుగూర్చి తలపోయ సమకట్టినను, పరిణయము తప్ప మిగిలిన విషయములే ఆమె తలంపునకు వచ్చుచుండెడివి. ఇప్పుడో, అహర్నిశలు అమరనాథుని నామస్మరణ తప్ప మరియేమియు ఆమెకు రుచింపదయ్యె.

ఒకానొక దుర్దినమున అమరనాథుడు విచారాక్రాంతుడై ఆమెకడ కరుదెంచి గద్గదకంఠముతో మెల్లగా "శాంతీ, నన్నేదియోపిశాచ మావహించి నన్ను విదేశములకు సర్వసంగ పరిత్యాగినై పోవ ప్రేరేపించుచున్నది. సర్వవ్యాపి యను సర్వేశ్వరుడుగాని, మనుష్యమాత్రుడుగాని మన్నింప అర్హతలేని క్రూరకృత్యమును నీ యెడ నేజేయ సమకట్టుచున్నాను. ఎన్నడులేని నా అంతరాత్మయే నన్నిట్టి పని జేయ ప్రేరేపింప నే నేమి చెప్పగలను. కాని శాంతీ, నా మనోహారిణీ, నేను నిన్ను ఎడబాసి పోవునంతమాత్రమున నీ ప్రేమపాశములను ఖండింతునని తలంపకుము. ఇదివరకుకన్న వేయి మడుంగులధికముగా నిన్ను ప్రేమించెద. ప్రేమగాదు, నిన్ను అహర్నిశలు నా హృదయ సింహాసనమున నధిష్ఠింప జేసి యారాధించెద. నీవు తప్ప నాకిక వేరుదైవము లేదు" అని చెప్పుచు, ప్రత్యుత్తరమును నిరీక్షింపకయే అశ్రుపూరితములైన నేత్రముల దుడుచుచు కొనుచు బిరబిర వెడలిపోయెను. శాంతి కిదియంతయు స్వప్నమువలె దోచెను. వెంటనే చైతన్య విహీనయై భూమిపై బడిపోయెను. కొంతవడికి, తెప్పిరిలి లేచి జరిగినదంతయు జ్ఞప్తికి దెచ్చుకొని కన్నీరు మున్నీరుగా దుఃఖించెను. అమరనాథుని కఠినహృదయు డనికాని, కపటాత్ము డనికాని శాంతి నిందింపలేదు. అమరనాథునిపై శాంతి ప్రేమ తుచ్ఛమైన మానవసంబంధమైనది కాదు, అది కళంకరహితమైనది. పవిత్రమైన పరలోక సంబంధముగు ప్రేమ కాన ఉదారహృదయముతో తన ప్రాణనాథుడు చేసిన పనియం దిసుమంతయు తప్పులేదని ఆమె తలచెను. బుద్ధిని బృహస్పతిని, ఓర్పున భూదేవిని బోలు శాంతి "నా జీవితేశ్వరునకు, ఏదో కార్యనిర్వహణమం దుత్సాహము గలిగినది. కావుననే, అతనికి స్వేచ్ఛయందు కూడ ఇచ్చగలిగినది. నాఅమరుని సంతోషమే, నాకును సంతసమొసగూర్చును గాన, నిజముగా మనోవాక్కాయకర్మలతో నే నతని ప్రేమించితినేని ఆతనికార్యములకెన్నటికి ఎట్టి ఆటంకమును పెట్టరాదు" అని తలపోసి, సెలవు పుచ్చుకొనునప్పటి ఆశీర్వచనవాక్యములుగా "అమరనాథా! నీవు నాయెడల ఎట్టి అపచారమును జేయలేదు. ఆలోచించినయెడల ఎంతయో ఉపకారమొనర్చితివి. నా జీవితమంతయు, కోటిసూర్య ప్రకాశమానమగు ధవళకాంతితో నింపితివి. నా యీ పవిత్ర ప్రేమయే నిన్నెట్టి ఘోరారణ్యములయందైనను అంగరక్షకునివలె రక్షించుచుండును. అమరా, నా కొక్కవరమును మాత్రము ప్రసాదింపుము. అదియేదన; యీ దీనురాలగు శాంతిని మరువకుము. ని న్నీజన్మమున మరల సందర్శించుభాగ్యము కలదో లేదో నే చెప్పజాల. ఏది

ఎటులైనను దినములతోఁగూడ క్షీణించినటువంటియు, ముదిమి చావులవలన భయములేనటువంటిదియు నగు గాఢప్రేమతో నిండిన నాహృదయమును నీ కర్పణము చేయుచున్నాను. అల్పమని నిరాకరింపక స్వీకరింతువని తలచుచు విరమించుచున్నాను" అని లేఖ వ్రాసి అమరనాథునికి పంపియుండెను. ఈ వాక్యములే, అమరనాథుని హృదయమున లోతుగా నాటిపోయెను. శాంతిపై నానాటికి అతని ప్రేమ శుక్లపక్షచంద్రునివలె, దినదినాభివృద్ధి నొందసాగెను. దేవతాస్వరూపిణి యగు తన శాంతితప్ప మరి ఇతరు లెవ్వరు అట్టి ఉత్కృష్టభావములతో నుండజాలరని అమరనాథుడు నమ్మియుండెను. వారొకరినొకరు ఎడబాసినపిమ్మట దినము లే విధముగా గడచినవో, అమరేంద్రునకు తిన్నగా జ్ఞప్తి యందులేదు. కాని హృదయవేదన భరింపరానిదైనపుడు అమరనాథుడు హిందూదేశమును వదలి ఇంగ్లాండునకు వెడలి పోయెను. ఎప్పటికైనను, శాంతియెడ ఆ విధముగా ప్రవర్తించినందులకు తానేమాత్రము కారణము కాదనియు, ఏదో పిశాచము తన్నావహించి అటులు చేయించినదనియు అతని సంపూర్ణవిశ్వాసము. అట్టి తన ప్రవర్తన తప్పనియు అసత్యమైనదనియు కర్మఅనియు, దుష్టత్వమనియు, మరియు వేయివిధంబుల తన్ను తాను నిందించుకొనుచుండెను.

ఇంగ్లాండునందు కొన్ని నెల లటులనే గడపి తుదకు ఎంత దూరాలోచనచేయక శాంతిని ద్రోసి పుచ్చెనో అట్టివిధముగానే సిల్వియాయను ఆంగ్లియను కన్యను, అనాథబాలిక యని కనికరించి, పరిణయంబాడెను. కొలది దినములు మాత్రమే వారిరువురు సౌఖ్యముగా నుండజాలిరి. వెంటనే పశ్చాత్తాపవహ్నిచే, అమరనాథుని హృదయము దగ్ధము కాజొచ్చెను. శాంతి దేవీమూర్తిని తనహృదయసీమ నారాధించుటవలనను, ఆమెనే అహర్నిశలు స్మరించుటచేతను తప్ప మరి ఎందువలనను అతనికి శాంతికలుగుటలేదు. అమరేంద్రు డింగ్లాండునకు పోయినపిమ్మట శాంతి కూడ అమెరికాకు వెడలిపోయెను. కాన ఆమె నిశ్చయముగ ఎచ్చట నున్న సంగతి ఇంగ్లాండునుంచి వచ్చినపిమ్మట అమరనాథునికేమియు తెలియలేదు. కాని, తన అంతరజ్ఞానమునకామె ఎచ్చటెచ్చట నుండునని తోచుచుండెనో ఆప్రదేశములకెల్ల పోవుచుండెను. ఆవిధముగనే అమరనాథుడు బొంబాయికికూడ వచ్చియుండెను.

## 3

ఎన్నియో వత్సరముల క్రిందట జూచిన అమరనాథు నానాడు శాంతి, శిరీషకుమారి ఇంటికి రాత్రి విందునకై వచ్చినపుడు జూచి సర్వోత్కృష్టమైన ఆనందమున పరవశురాలై పోయెను. అమరనాథుడు మరునాడు శాంతి నివసించుచున్న గదికి బోవ శాంతి అనుజ్ఞగైకొని అచటనుండి అచిరకాలములో వెడలిపోయెను. మరునాడు అమరనాథుడు ప్రియురాలిని సందర్శింపబోవు ప్రియునివలెగాక కొలదికాలములోనే తనకు సాక్షాత్కరింపబోవు తన ఇష్టదైవమును చూడబోవు భక్తునివలె ఆమె సదనమునకు వెడలెను. శాంతియు, తన నాథుని పాదధ్వని వీనులబడ తటతట కొట్టుకొను గుండియలతో ఆతని నెదుర్కొనబోయెను. అమరనాథు డామెను వీక్షించిన తత్క్షణమే తటాలున ఆమె యెంత వలదని వారించుచున్నను వినక ఆమెపాదములపై నొరగి ఆమె పాదధూళిని శిరసావహించెను. శాంతి గద్గదకంఠయై పొంగి పొరలివచ్చుచున్న దుఃఖము నతికష్టముతో నణచుకొనుచు అస్పష్టవాక్కులతో "అమరా, నన్నిట్లేల అవమానపరచెదవు" అని పల్కెను. అమరనాథు డేమియు చలింపక పరమభక్తునివలె లేచి నిలువబడి, "శాంతీ, నీ విటులు పల్కదగదు. నేజేసిన ఘోరాపరాధమునకు ప్రాయశ్చిత్తముకానిదే నీవంటి దేవీమూర్తిసన్నిధి నిలువ నర్హుడనా? నేజేసిన అపరాధమునకు ఈలోకమున తగిన ప్రాయశ్చిత్తమే లేదని నేతలచెద. కాని నీపాదారవిందముల స్పర్శయే దహించుకొని పోవుచున్న నాహృదయమున కొకింత చల్లదన మిచ్చుచున్నది" అని పైనచెప్పలేక అశ్రుపూరితనయనములతో ఆమెపై దృక్కులు నిగిడించి ఊరకుండెను. శిరీషయు అట్టిస్థితియందే యుండెను. కాని లేని ధైర్యమును దెచ్చుకొని "అమరా, నీ వెట్టి అపకారమును నాయెడ యొనరింపలేదని ఇదివర

కే నీకు తెల్పియుంటినిగదా. మరియొకమారు చెప్పెదను వినుము. నీవేమియు నాయెడ యెట్టి తప్పిదమును చేయలేదు. కాన నీవేల ఇట్లు అపరాధమనియు, పాపవిమోచనమనియు, ప్రాయశ్చిత్తమనియు, పలుమారు పల్కుచున్నావు. నీ ఈవాక్యములు నన్నెట్టి దుఃఖసాగరమున ముంచుచున్నవో నీ వూహింపగలవా?" అన అమరేంద్రుడు ప్రేమపూరితవీక్షణంబుల నామెపై బరపుచు, నిరుత్తరుడయ్యె. మరల శాంతియే "అమరేంద్రా! నిన్నటి దినము, శిరీషకుమారి గృహమున నీదర్శనభాగ్యము నాకొదవునని నే కలనైన దలపలేదు. దినములు గడచుకొలది మీరు నన్ను మరచుచున్నారేమో అని తలచుచుంటినిగాని, నన్నింకను మీరు జ్ఞప్తియందుంతురనికూడ నే నెంచుటకు సాహసించలేకపోతిని" అని చెప్పుచుండ "శాంతీ! నీవటులు తలచినందున నీయందేమాత్రమునుతప్పు లేదు. కాని ప్రియతమా! నిన్నెల్లపుడు ప్రేమింతుననియు, ఆరాధింతుననియు, ఇదివరకే నీతో నే జెప్పియుంటినిగదా. దానిమాట నటుంచి శాంతీ! మనమొండొరుల నెడబాసినది మొదలు నేటివరకు జరిగిన, సంగతులన్నియు నాకు వినుపింపవా? నిన్నెడబాసినది మొదలు నిన్నటివరకు నీసంగతి నా కిసుమంతయైన తెలియలేదు" అన శాంతి నిట్టూర్పువిడచి "అమరా! నాచరిత్ర అతిసంగ్రహముగా చెప్పుటకేమియును లేదు. ఐనను విన కుతూహలుండవుగా నున్నావు గాన నా దీన చరిత్ర నాలకింపుము. ఆవిధముగా బల్కి, నాడు నన్నువదలి వెడలిపోయినపుడు నిజముగా నీవు నన్నెడబాసితివని నే నమ్మక ఏ నిముసమున కానిముసము నీరాకకై ఎదురుచూచితిని. నాపై నీప్రేమ, నాకొరకై నీ వనుదినము దెచ్చుచుండెడి మనోహరములైన ధవళకుసుమంబుల పరిమళము వంటిదని తలచితినిగాని, కొంత తడవైనపిమ్మట అవి వాడినట్లే నీప్రేమయు క్షీణించునని నే దలచనైతి. అచిరకాలములోనే నీవు నావద్దకు తప్పక వత్తువని నమ్మియుంటిని. అట్టి సమయమున నీవు సిల్వియాయను బెల్జియను కన్యను వివాహమాడినటులు నాకు తెలియ నేనించుకంతయైన అసూయ నొందక "శ్రీమన్నారాయణుడు నాఅమరనాథునికి సంసారమునందు సకలసౌఖ్యములొసగూర్చుగాతయని" ప్రార్థించి, నీస్నేహమువలన పొందిన ఉత్తమనియమములన్నిటిని, ఆజన్మాంతము బ్రహ్మచారిణినై నా దినచర్యయందు ఆచరణయందుపెట్ట దృఢనిశ్చయురాలనైతిని. కాని 1919 సంవత్సరము ఏప్రిలు నెలవరకు నీపై నా నిజమైన ప్రేమజూపుటకు నాకు తరుణము లభింపలేదు. ఆ సంవత్సరమున, అమృతసారులో ఆంగ్లేయులు భారతీయుల బెట్టిన బాధలు నీవు వినియే యుందువు. అట్టితరి నా హృదయము హిందూదేశసేవకై పాటుపడ నుత్సాహముతో నిండిపోయెను. అపుడే నీకు ప్రీతియైన మాతృదేశసేవయందే, నాజీవితశేషమంతయు గడుప సర్వేశ్వరునియెదుట ఘోరప్రమాణము చేసితిని. నాడుమొదలు భారతమాత ముద్దుబిడ్డలెల్లరు హాయిగా నుండుటకై సాధ్యమైనంతవరకు కృషిచేయుచుంటిని. అపుడే హిందూదేశ సమస్యలగురించి, విమర్శనముచేయు నుత్సాహముతో దీనిని చేయుటకు ముందు ఇతరదేశ చరిత్రల తెలియుట అవసరమని తోచుటచే అమెరికాకు బోయి అచట విశ్వవిద్యాలయమున జేరితిని. ఇదియే నాచరిత్ర. కాని నీవు నన్నింకను మరువలేదను సంగతి నాకు తెలిసియుండిన ఇన్నిదినములు ప్రస్తుత జీవప్చవమువలెగాక గొంచెమైనను సంతోషముతో నుండియుండెడిదానను." అని పైన చెప్పలేకపోయెను. సావధానముగా అన్నియువిని, అమరేంద్రుడు "శాంతీ! అహర్నిశలు నీమూర్తితప్ప, నీ విషయమగు ఆలోచనలు తప్ప తదితరములు నాహృదయమునందు ఈక్షణమువరకును లేవని భగవంతునికే తెలియును. కాని సిల్వియాను పరిణయం బాడినట్లు ఏవెటులు తెలిసికొంటివనిమాత్రము ఆశ్చర్యము గలుగుచున్నది. అవును; నిన్నడుగనేల?నన్ను నేనే అనేకమారులామెను నేనేల పరిణయం బాడితినని ప్రశ్నించుకొని నిరుత్తరుడనయి యుంటిని. సిల్వియాయెడ గొప్ప అపరాధమును చేసితినని మాత్రమే తెలుసుకొనగలిగితిని. శాంతీ; ఏమైననేమి? ఇక నాకథ వినుము. అన్నిటి నావిధముగా గందరగోళముగా జేసినైచి ఏమియు పాలుపోని నాదీనావస్థయందు, నీనామస్మరణయే భక్తునికి తారకనామమువలె హృదయశాంతిని గలిగించుచుండెడిది. కాని

అదియే విశ్రాంతిని వెడలగొట్టినది." అన "అమరనాథా! నేనేల నిన్ను చంచలచిత్తునిగా జేసితి" నని శాంతిపల్క అమరనాథుడు "శాంతీ! నిన్నెన్నిదినములు నేను దేవతామూర్తివని భావించి పూజించితినో అంతవరకు శాంతచిత్తుడనై యుంటిని. అప్పుడప్పుడు, ఇహలోకసంబంధమగు ప్రేమచే నా హృదయము నింపబడ నిన్నెపుడు మరల దర్శింతునాయనియు, లేఖయైన లిఖింతునా యనియు, వివిధములగు ఆలోచనములతో నా హృదయశాంతిని బాఅద్రోలి విరహాగ్నిని మ్రగ్గుచుండెడివాడను." అని ఇంకను ఏమో చెప్పబోవుచుండ శాంతి అటులైన తన కొక్కమాఱైనను ఇన్నిదినములు ఏల లేఖలంపలేదని ప్రశ్నింప అమరనాథుడు మరల "శాంతీ! నేనేమిచేయుటకును సాహసింపజాలనైతి. నా కఠినత్వమునకు నీవు నన్నెటులైన మరచిపోవ ప్రయత్నించుచున్నావేమో యని తలచి, స్వలాభప్రియుడనై ఆరుచున్న అగ్ని నేనేల నీహృదయకుహరంబున రాజజేసి మరల నిన్ను భరింపరాని మనోవేదనయందు మ్రగ్గజేయవలయు ననెడి ఊహతో నీకు లిఖింపలేదు. కాని అహర్నిశలు కనులు తెరచియున్నను, మూసికొనియున్ననుగూడ శాంతీ, నీ రూపమే, ఒకమారు మూర్తీభవించిన ప్రేమదేవతవలెను, మరియొకమారు నాపై ప్రేమయంతయు బారద్రోలి ముడుపనికురులతో, మలినవస్త్రధారిణివై సాక్షాత్కరించిన శోకదేవతవలెను ఇంకొకమారు నాహృదయమును మొదట హరించిన ముగ్ధబాలికవలెను, ఐంద్రజాలికు డెట్లు తలచినపుడెల్ల వలయు వస్తువుల నెల్ల నిర్మించి కలుగ జేయునో, ఆ విధముగా నా జ్ఞాననేత్రమునకు, ప్రత్యక్షమగుచుండెను. నీ దీనవదనము తిలకించినపుడెల్ల నీ కోమలహృదయమును తుత్తునియలుగా జేసిన కఠినాత్ముడననియు, నిన్నికపై గోరుట అందని మ్రానిపండ్లకు ఱ్రులు సాచుటయే యనియు వేవిధముల తలపోయుచు పరితపించుచుండెడివాడను."

ఇటులు కొన్నివత్సరములు గడువ నీ రూపము నా జ్ఞాననేత్రమునకే కాక, స్థూలశరీరమునకు గూడ గోచరింప సాగెను. నీ వెటకో రమ్మనుచున్నట్లు నీ ధ్వనిగూడ స్వచ్ఛముగా వినబడుచుండెడిది. వెంటనే నా అంతరాత్మ ననుసరించి పలుమారు వివిధదేశములకు నిన్ను సందర్శింపవలెనని గంపెడాశతో బోయి భగ్నమనోరథుడనై మరలివచ్చుచుంటిని. ప్రస్తుత మిచటికి నాఅంతరాత్మ ప్రేరేపణవలన నేసుమీ వచ్చితి" నని "కాని శాంతీ, పూర్వము నామనస్సే నన్నిటులు పిచ్చివానివలె ఆడించుచున్నదని నే తలచుచుంటిని. కాని అది నిజముకాదు. తప్పక మన సూక్ష్మశరీరములు ఇంతవరకు సమావేశమగుచునేయున్నవి. నాస్థూలకాయముతో వాటిని వీక్షింపగల్గిన నా అదృష్టమే అదృష్టము. అట్టిశక్తి నాకొసంగిన పరమేశ్వరునకు నాకృతజ్ఞతానందనశేఖరంబు లిదె అర్పించుచున్నాను" అనుచు అమరనాథుడు కరముల జోడించి నిమీలితనేత్రుడై నిలువబడ శాంతి విస్మయాశ్చర్యములతో "అమరా, నేనుగూడ భగవంతుని కెంతయో కృతజ్ఞురాలను. ఎప్పటికపుడు నీ సంతసమే నా సంతసమని యెంచిన నేను, నీవు దేశమునకై జేయ నుత్సాహపడుచుండెడి పనులన్నియు నే జేయ సమకట్టి నా పూర్వచరిత్ర మరువ ఎంతయో ప్రయత్నించితిని. కాని నేనేదైన పురాతన నగరమును పరీక్షించునపుడుగాని, క్రొత్తదేశమందొంటరిగా సంచరించునపుడుగాని, చిత్రకళానైపుణ్యమును జూచుచున్నపుడుగాని, మరి యే దేశచరిత్రయైనను పఠించునపుడుగాని, నాకు తెలియకయే నా మనస్సు నీయందు లగ్నమై, నన్నపారదుఃఖవారిధిని ముంచుచుండెడిది. అట్టితరి, కన్నీరుమున్నీరుగా విలపించుచు, గద్గదకంఠముతో "అమరా" యని దిక్కులు పిక్కటిల్ల పిలచుచు నన్నేల మొదట, స్వర్గసింహాసనము నధిష్ఠింపజేసి మరల పాతాళలోకంబునకు గూల ద్రోసితివని విలపించుచుండెడిదానను. బహుశః అట్టిసమయములందే నా ఆర్తధ్వని నీ వీనుల జొచ్చి నీ అంతరాత్మ నన్ను వెదుకుటకై నిన్ను నలుదెసల కనిపియుండును. కడసారిమాటచే నే నట్టియవస్థను ఇటలీదేశమున లోనైతి. జినెవాయం దొకానొక నిండు పున్నమరేయి సముద్రతీరమున ఆసీనురాలనై యుండ ఇటలీ దేశమందలి వేరువేరు కలహముల నణచివైచి అచట ఐకమత్యము స్థాపించి తుదకు ఇటలీనంతయు ఒక్కదేశముగా జేయ సమర్థత స్వార్థత్యాగముచే తనభర్తయగు "కెవోరు"నకు

గలిగించిన మానవతీ శిరోమణిచరిత్ర జ్ఞప్తికివచ్చెను. ఆమె వలెనే నేనును నాతోచిన సాహాయ్యము నా దేశమునకు చేయగలుగుదునుగదాయని సంతసించితిని. కాని కనురెప్ప పాటు కాలములో నా యూహలన్నియు పటాపంచ లాయె. ప్రకృతియే నన్ను మోసగించినదని అంతవరకు నే నెరుగజాలనైతి. అపుడు ఉన్మత్తురాలివలె ఇదివర కెన్నడును పిలువనంతటి గట్టిగా నిన్ను పిలిచి పిలిచి విసిగి వేసారి, తుదకు బిట్టు వాపోవుచు అచటనే మూర్ఛిల్లిపోతిని. తెలివి వచ్చునప్పటికి కాకులు కావుకావు మని కూయుచుండెను. "అమరా, ఎన్నియోమారులు స్వప్నమున నీతో సమస్తసౌఖ్యముల ననుభవించుచుంటిని. కాని మెలకువవచ్చినపుడు హృదయకంటకము మాత్రము పూర్వమువలెనే నాటుకొని యుండెడిది." అని పల్కుచు శాంతి మనోధైర్యమును విడనాడి చంటిబిడ్డవలె వెక్కివెక్కి ఏడువసాగెను.

*      *      *      *      *

పది సంవత్సరముల పిమ్మట శాంతీఅమరనాథులు కలుసుకొనిరి. అన్యోన్యానురాగమును తెలుసుకొనిరి. కాని ఇరువురును పూర్వమువలె నుండుటకు వీలు లేదను సంగతికూడ ఇరువురి అంతరాత్మలకును తెలిసియే యుండెను. కొంతసేపిద్దరు మౌనము వహించిరి. ఇటులుకొన్ని నిముసములు గడచిపోయెను. అపుడు మెల్లగా అమరనాథుడు "శాంతీ, పరమేశ్వరుడే మనయిరువురకు నేడిట్టి విచిత్రసమావేశము గలిగించెను. ప్రకృతిగూడ మన గాఢప్రేమను త్రుంచలేకపోయినదిగదా. కాన మరెవ్వియు ఈ ప్రపంచమున మనల నిరువుర నిక ఎడబాటుచేయజాలవు. శాంతీ, మన మిరువుర మేల ప్రాణస్నేహితులవలె నుండరాదు? అపుడు మన మిరువుర మేకీభవించి, మాతృదేశసేవ జేయుదుము. నే నిప్పుడు జీవచ్ఛవమువలె నున్నాను. నా జీవితమందలి ఉత్సాహము లన్నియు నశించినవి. శాంతీ, నీ మృదుమధురవాక్కులు ఎండిపోయిన నా మనస్సును మరల చిగురించునట్లు చేయుచున్నవి" అని పల్క శాంతి శిరస్సు పైకెత్తకయే, "అమరా, అటులు మన మిరువురము ప్రియమిత్రులవలె నుండుటకు వీలుండిన మన మింతవిచారింప బనియేలేదు. అటులుండుటకు వీలు లేదు. కాని అమరా, ఇట్టి సుదినము మన కీజన్మమునందు మరి యొకటి లేదు. అదిమాత్రము జ్ఞప్తియందుంచుకొనుము. కాలయాపనచేయక, నన్నిక మరువ ప్రయత్నించుచు, నీవు నీ ప్రాణేశ్వరియగు సిల్వియావద్ద కేగుము" అను శాంతి పలుకులు, అమరనాథుని వీనులకు ములుకులై తోప, "శాంతీ" నేడేల నీవు నాపై కాఠిన్యము బూనుచున్నావు? పవిత్రప్రేమతో మన మిద్దరము ప్రాణస్నేహితులవలె నున్నమాత్రమున, మానవకల్పితమైన చట్టములను గాని, దైవనిర్మాణమైన శాసనములనుగాని అతిక్రమించుట లేదుగదా. కాన దాన భయమేమి?" అని అమరనాథుడు పొంగిపొరలివచ్చుచున్న దుఃఖమును అణచుకొని పల్క శాంతి లేనిధైర్యముతో "అమరా, నే నేల అటులు విన్నవించితినో నీకు బోధపడలేదా? మన స్నేహమున కేమాత్రమవకాశమున్నను నేను నెనుదీయుదునా? మన అన్యోన్యానురాగము స్నేహితుల కొకరిపై నొకరి కుండుదానివలె గాక విశాలమైనది. ఉత్కృష్టమైనది. స్నేహమునందు ప్రేమకు హద్దు గలదు. కాని మన పవిత్రప్రేమ భూనభోంతరాళములెల్ల నిండి ఇంకను మిగిలియున్నది. కాన, మన మెన్నివిధముల ప్రయత్నించినను మనకొకరిపై నొకరికున్న స్నేహభావము అచిరకాలములోనే అంతరించుననుట నిక్కము. దానివలన, అనేకనష్టములు కలుగును. అంతయేల? సర్వనాశనముగూడ కలుగుట కవకాశమున్నది. కాన, నాపై కినుకవహింపక అమరా, నీవు సిల్వియావద్దకు బోయి, మాతృదేశసేవ నీ కోపినంత చేయుము. భగవంతుని యెదుట ఘోరప్రమాణమొనర్చిన రీతి, నాజీవితమును మాతృదేశసేవయందే గడపెదను. నాకొరకై, అమరా, నీ వెన్నటికిని విచారింపకుము." అని పల్కుచుండ, అమరనాథునికి హఠాత్తుగా తలపై పిడుగుపడినట్లాయె. కొంతవడికి తెప్పిరిలి 'శాంతీ! అటులైన ఇక నీ దర్శనభాగ్యము నాకు లభింపదా! పూర్వవేదన పొందుమని నన్ను త్రోసివేయుచున్నావా ?' అన, శాంతి "అమరా, అటులెన్నటికిని తలంపకుము. ఇది మన కంత్యసమావేశముగాదు సుమీ. మరల మన మిరువురము పరలోకమున తప్పక కలుసుకొనెదము.

గత వత్సరంబులన్నియు, మన మొకరి నొకరము గాఢముగా ప్రేమించుచుంటిమి. నేడు అట్టి పవిత్రప్రేమ కుసుమగుచ్ఛము మనయందు నానాటికి వికసించుచున్న దని తెలుసుకుంటిమి. ఆగుచ్ఛమును అటులనే వికసించియుండనిమ్ము. అదియే ఉత్కృష్టమైనది సఫలముకాని మనోరథమే చాలాకాలముండును. అమరా, ఇపుడు చూడుము. ఎట్టి కోమల పుష్పమైనను, హృదయమునం పదిమి సిగపై ధరించిన, కొలది నిముసములకే వాడి పోవుచున్నదిగదా! అప్పుడు మన కెంతయో పరితాపము గలుగుచున్నది. కాన అట్టి ప్రేమ దుఃఖమునకు కారణమేకదా! ఇవియన్నియు అమరా, బాలికగా నున్నపుడు నీవేకదా నాకుబోధించితివి. నేడేల నీవు వికలమతివై యున్నావు? ఒక్కమారు భారతదేశ దుస్థితిని తిలకింపుము. భారతమాతవిలాపము నీ వీనుల జొచ్చుట లేదా? అమరా! నాకు హిందూదేశమున ప్రస్తుతమువలె గాక, క్రొత్త వంశపరంపర లుండవలెనని తోచుచున్నదిగాన మనమిరువురమట్టి నూతనసంతతికి ప్రథములుగానుందము. మనము నిర్వర్తించవలసినపని మిక్కుటముగా నున్నది. భారతమాత ఇక నొక్కత్రుటికాలమైనను సహింపజాలదు. మన మొండొరులు కలిసియున్నపుడు గలుగు ఆనందము ఆపనిని నిర్వహించుటయందుగలుగ గలదు"అనిశాంతి ఉత్సాహపూరితహృదయవలెనటించుచు పల్కెడి మాట లనుపాశములచే అమరనాథుడు పూర్తిగా బంధితుడాయెను. ఈ గడచినదినములు ఆమెయందు గొప్పమార్పును కలిగించెనని తలచుచు అమరనాథుడు "శాంతీ, నీయాజ్ఞానుసారముగా దేశసేవ చేయ ఇకముందు ప్రవర్తించెదను. కాని నీయుత్సాహమంతయు నశించి చాలదినములయినది. నిరుత్సాహము నన్నేమియు చేయనీయదేమో అనిమాత్రము భీతి జెందుచున్నాను" అని ప్రత్యుత్తరమివ్వ శాంతి మరల "అమరా, నీ వంత నిరుత్సాహముగా నుండరాదు. మన అన్యోన్యప్రేమ పాపభూయిష్ఠమైన సాధారణ తుచ్ఛప్రేమ అని తలచుచున్నావా? ఎన్నడును అటులు భావింపకుము. మనప్రేమ నిర్మలమైనది. నిష్కళంకమైనది పవిత్రమైనది. అది పరలోకసంబంధమైనది గాని ఈ తుచ్ఛలోక సంబంధమైనది మాత్రము గాదు. ఇట్టి మన ప్రేమ మనల నెల్లపుడు ఉత్సాహపూరితహృదయులనుగానె చేయుచుండును. అదియేకదా అబలనగు నా హృదయమును ధైర్యస్థైర్యములతో నింపినది. ఇన్నివిధముల పల్కుచుండుటచే అమరా, నాకు నిన్ను నెడబాసి యుండుట సులభసాధ్యమని ఎంచకుమా. అహర్నిశలు నీ నామామృతమేననీ్నధరపై, ఇంకను జీవింపజేయుచున్నది. కాని ఇకపై నా హృదయకుహరమునం దొకమూల నాకు నెలవున్నదను తలంపే నన్నెట్టి కష్టములనైన భరింపదగినదానినిగా జేయగలదు. కాన అమరనాథా, గడచిన చరిత్ర మరచిపో ప్రయత్నించి ప్రస్తుతము నీవున్న బెంగాలుదేశమున సంఘసంస్కరణముచేయ శీఘ్రముగా బొమ్మ"అనిపల్క అమరనాథుడేమియు చెప్పలేక అశ్రుపూరితనయనములతో అటనుండి వెడలిపోయెను. ఇంత వరకు శాంతి భరింపరాని తన హృదయవేదనను తన హృదయమునందే పైకి గాన్పింపనీక గుప్తపరచియుండెను. కాని అమరనాథు డచ్చోటువాసి పోయినవెంటనే శాంతి "అమరా" యని ఒక్కకేకవైచి భూమిపైబడిపోయెను.

౪

అమరనాథుడు శాంతిచెంచినచొప్పున కలకత్తా నగరమునకు మరునాటి మెయిలులో వెడలిపోయెను. లేని ఉత్సాహమును దెచ్చుకొనుచు ఎన్నియో విషయములయందు పనిచేయ మొదలిడెను. కాని సఫలీకృతుడు కాకపోయెను. ఏలయన అతని జీవితమందలి ఉత్సాహమంతయు చాలకాలమై అతని విడనాడి మరియొక నెలవునకు బోయెను. ప్రస్తుత మతని హృదయము శూన్యముగానుండెను. శాంతిని పరిణయమాడ లేకపోతినిగదా యను ఆలోచన తప్ప మరి ఇతరములేమియు అతని తల కెక్కుటలేదు. తుదకు వ్యాపారమునందు కూడ అతని ఉత్సాహ మణగిపోయెను. ఒకానొక దినమున సర్వసంగపరిత్యాగియై హిమాలయప్రాంతముల జీవితశేషము గడుప అమరనాథునికి బుద్ధిపుట్టెను. అటులు చేయుటకు సిద్ధపడుచుండ కొన్నివత్సరములక్రింద సాక్షాత్కరించిన శాంతి దివ్యమంగళ విగ్రహము అతనికి

ప్రత్యక్షమవుటచే ఆమెనుమరలఎచటనున్నదో కనుగొనునభిలాషతో అమరనాథుడు దేశాటనముచేయ మొదలుపెట్టెను. మార్గమున శిరీషకుమారి నొకమారు చూచుటకై అమరనాథుడు శేహరనపురమున ఆగి ప్రతాపసింహుని ఇంటికి వెళ్లెను. అమరనాథుడు శిరీషను సోదరికన్న ఎక్కువగ ప్రేమించినను ఆమెతో తన జీవితరహస్యమెప్పుడును జెప్పియుండలేదు. శిరీషకుమారి ఈనాలుగైదు మాసములలో అమరనాథునియం దెంతయో మార్పు గనిపెట్టెను. మునుపటివలె అమరనాథుడు మాట్లాడుటలేదు. ఒక్కొకప్పుడు పిచ్చివానివలె అర్థములేని వాక్యముల నుచ్చరించుచుండెను మరియొకప్పుడు గూఢార్థవాక్యములు పెక్కులు పల్కుచుండెను. ఆతని ముఖము పాలిపోయియుండెను. అట్టిసమయమున గూడ ఆతని లావణ్యము చిత్రకారుని మనస్సును రంజిల్లజేయుచుండెను. కాని, అమరనాథుని అప్పటి స్థితి శిరీషవంటి ప్రాణస్నేహితుల హృదయములను వ్రక్కలు జేయుచుండెను. శిరీషా ప్రతాపసింహులు అమరనాథుని కెటులైన సంతోష మొనగూర్చుటకై, ఆతనిని ఫలపుష్ప తరుగుల్మలతాదులతో నిండియున్న తమ తోటకు దీసుకొని పోయిరి. కాని అమరనాథు డావనమందు నిద్రలో నడచువానివలె సంచరింప దొడగెను. శిరీష ఎటులైన, అమరేంద్రుని అద్భుత ప్రవర్తనకు హేతువు కనిపెట్ట దృఢమనస్కురాలై, ఎన్ని విధములనో ప్రయత్నించి చూచెను కాని భగ్నమనోరథయై పోయెను. తుదకు స్త్రీసహజమగు కోమలత్వముతో "అమరా! నేనెన్ని విధంబుల బ్రతిమాలుకొనుచున్నను నీ విచారకారణము చెప్పకున్నావు. నీసోదరినగు నాకు నాజీవిత రహస్య మెరిగించరాదా" యని కన్నుల నీరుపెట్ట అమరేంద్రుని వెన్నవంటి హృదయము కరగి, ఆమెకు తనచరిత్ర యంతయు ఏదియుదాచక చెప్పివైచి బాలకునివలె వెక్కివెక్కి రోదనసేయసాగెను. శిరీష అతని నోదార్చి ప్రస్తుత మెచటికి బోవు చున్నా"వని అమరనాథునడుగ "శాంతిని వెదకుచు బోవుచున్నా"నని అమరనాథుడు బదులు చెప్పెను. ఇదివరకు శాంతీ అమరనాథుల నెటులు సమావేశము చేసెనో, అవిధముగనే శిరీష వారిని మరియొకమారు సమావేశపరచి మరల ఎడబాటు నొందకుండ జేయవలయునని ఆలోచించుచు అమరనాథుని కొన్ని దినముల వరకు తన యింటనే ఉంచి వైచెను. అంతగా ప్రేమించుచున్న అమరనాథుని కోరికను ద్రోసి పుచ్చిన శాంతి కఠిన హృదయయని శిరీషకు దోచెను.

శిరీష శాంతిని శేహరనపురమున సమాజాభివృద్ధికై పనిచేయ తత్క్షణమే రమ్మని వ్రాయ నిశ్చయించుకొనెను. కాని అంతయు సిల్వియాలోనే ఉన్నదనియు, ఆమెనే శేహరనపురమునకు రప్పించినయెడల శాంతి అమరేంద్రులకు సులభముగా సమావేశము చేయవచ్చుననియు ఆలోచించి శిరీష, వెంటనే కలకత్తా యందున్న సిల్వియాకు తత్క్షణమే, శేహరనపురమునకు బయలుదేరి రావలెనని తంతివర్తమాన మంపి ఆమె నచటికి రప్పించెను. సిల్వియా మునుపటివలె లేదు. ఆమెవదనము విచారమును వెల్లడించుచుండెను. ఆమె నయనములయందు పూర్వపు తేజము మాయమైనది. ఆమె సంసారమును పరిత్యజించిన బాలబుషివలె చూపరులకు కాన్పట్టుచుండెను. శిరీష సిల్వియాతో శాంతి అమరేంద్రుల స్థితిగతులనెల్ల ముచ్చటించి మెల్లగా "ప్రియసోదరీ, సిల్వియా, ఈవిషాదనాటకమును సంతోషముగా పరిణమింప జేయుటకు నీకు దప్ప మరి ఇతరుల కెవ్వరికిని అలవిగాదు. మీరు ముగ్వురు గూడ నాకు ప్రియమిత్రులవుటచే మీ ఆనందమే నాకును ఆనందము. నీవు తలచినట్లయిన సిల్వియా, తప్పక అంతయును సంతోషముగా పరిణమింపగలదు. కాన దానికి ప్రయత్నింపవా" అనిపల్క సిల్వియా చిరునగవు నవ్వుచు "శిరీష కుమారీ! నన్నిపుడేమి చేయుమనెదవో నీవే ఖచితముగా జెప్పుము. ఎట్టి పనియైనను గానిమ్ము, నేను దీయుదానను గాను సుమీ" అని వక్కాణింప శిరీషయు "అటులైన యెడల సిల్వియా, ఈ గడియ మొదలుకొని శాంతిని ప్రాణ స్నేహితురాలివలె నైనను, లేక అమరనాథుని స్నేహితురాలిగా నైనను చేయు ప్రయత్న మారంభింపుము. అటుగానియెడల అమరనాథుడు అచిరకాలములోనే ఈలోకమునందు దస్తమింప గలడు." అని చెప్పెను. ఈ మాటలువిని సిల్వియా నిమీలితనేత్రయై పరమేశ్వరుని ఈ కార్య నిర్వహణమందు తనకు తో

డ్పడ ప్రార్థించుచున్నదో యనునట్లు చేష్టలుదక్కి కొన్ని నిముసము లట్లే నిలువబడి యుండెను. ఇంతలో ఏదో సిల్వియా స్మరణకురా వెంటనే కనులదెరచి "శిరీషా! దీనికై ఇంత ఆలోచన యేల. నీవు గనుక నాకు తోడ్పడిన యెడల వారిరువురి సమావేశము ఈ క్షణమే చేయగలుగుదును. నేను మొదట అమరనాథుని ఇంగ్లాండునందు కలుసుకొనినపుడే పైకెంత ఆనందముగా నున్నవానివలె నటించుచున్నను, ఆతని విచారపూరిత దృక్కులచే అతనేదియో రహస్యవేదన ననుభవించుచున్నాడని గ్రహించితిని. అపార కరుణార్ద్ర హృదయుడగు, ఆతనిని నే గాఢముగా ప్రేమించితిని. అప్పటి కప్పుడే నాభర్త ఐరోపా మహాసంగ్రామమునకు బోయియుండెను. సజీవుడై, తిరిగి నా నాథుడు వచ్చునో రాడో యను విచారముగానే దినములుగడుపుచుండ ఒకానొకదినము నా నాథుడు రణమున మరణించెనను వార్త నా చెవులబడెను. పంచప్రాణములకన్న నెక్కువగా అమరనాథుని ప్రేమించుచున్నదాననౌటచే నాకు పరిణయం బైనదను సంగతి ఆ మహాభాగునికి విన్నవించిన నిరాకరించునేమో యను భయమున ఆ సంగతి ప్రస్తావింపకయే అమరనాథుని వివాహంబాడితి. నెలదినములక్రితమే విదేశపు రేవులలోనుండు ప్రభుప్రతినిధి నాభర్త రణమున గాయముల నొందుటచే చికిత్సాలమునకు బంపబడెననియు పిమ్మట చిత్తచాంచల్యముగూడ గలిగినదనియు, ప్రస్తుత మన్నియు పూర్తిగా నయమగుటచే నాకొరకు వెదకుచున్నాడనియు వర్తమాన మంపియున్నాడు. ఈ నాజీవిత రహస్యము అహర్నిశలు కంటకమువలె నన్ను వేధించుచున్నది. కాన శిరీషా, నీవు నాకును అమరనాథునికిని జరిగిన పరిణయము శాస్త్రయుక్తమైనది కాదని ఋజువుపరుప నేర్పాటు చేసినయెడల మిక్కిలి సంతసముతో నా జీవితేశు సన్నిధికి నే నేగుదాన. శాంతిదేవియును, అమరనాథుడును ప్రాణమిత్రులవలె గాక దంపతులే కావచ్చును. కాని నేను వారియెడ జేసిన అపరాధమును దయతో మన్నింప వారి పదములంటి ప్రార్థించుచున్నదాననని మాత్రము శిరీషా, వారితో విన్నవింపుము." అనిన శిరీష మనంబున మిగుల నుప్పొంగి, సిల్వియా చేయుమనిన పన్నియు చేయుటకును ఆమెకు కూడ సౌఖ్యమును జేకూర్చుటకును వాగ్దానము చేసెను.

* * * * *

శాంతి అమరనాథుని బొంబాయి యందు కడసారి దర్శించి సంభాషించినపిదప తన తండ్రితోగూడ దక్షిణహిందూస్థానమునకు బోయి అచట తన తండ్రికేదో పని యుండుటచే కొన్ని నెల లచటనే ఆగవలసి వచ్చెను. శాంతికి అమరనాథుని సంగతి యేమియు తెలియుట లేదు. మన శిరీషకుమారి సిల్వియాతో పై సంగతులన్నియు ముచ్చటించు సమయముననే సుమారు రెండువేల మైళ్ల దూరములోనున్న శాంతి "సంఘసంస్కరణ"ను గూర్చి ఉపన్యసింప దినమంతయు వివిధ గ్రంథరాజముల నుండి పెక్కురు మహాత్ములు వక్కాణించిన నీతివాక్యముల నేరి వ్యాసమును సిద్ధపరచెను. సాయంకాల సమయంబున కా వ్యాసము ముగియ ఐర్లండుదేశపు మహాకవిచే రచింపబడిన పద్యమొకటి హిందూదేశమునకుగూడ చాల బాగుగా అన్వయించుటచే దానిని వ్యాసాంతమున వ్రాయసాగెను. ఈ పద్యము కడపటివరుసయే శాంతి అమరనాథునికి ధైర్యోత్సాహములు గలుగుటకై కడసారి వారు సమావేశమైనపుడు నుడివియుండెను. ఇప్పుడా సంగతి హఠాత్తుగా శాంతికి జ్ఞప్తికిరాగా "బెంగాలునకు సంఘసంస్కరణకై శీఘ్రముగా పొ"మ్మని చెప్పుచున్న తన ప్రేరేపణవాక్యముల వినుచు, కన్నీటిబిందువులతో వక్షఃస్థలమెల్ల తడుప స్తంభితుడైయున్న అమరేంద్రుని దివ్యమంగళవిగ్రహము ఆమెకు సాక్షాత్కరించెను. పూర్వచరిత్రయంతయు ఒక్కమారుగా ఆమె స్మరణకు రాగా ఆమె హృదయము అపారమగు గాఢప్రేమతో నిండిపోయెను. కాని ఏదియో ఆపద కూడ రానున్నదని ఆమె అంతరాత్మ ఆమెకు చెప్పసాగెను. దేశసేవాతత్పరురాలైన శాంతి పగలంతయు దేశోద్ధరణ విషయమై పనిచేయుచుండి సంధ్యాకాలమున తీవ్రమగు వేదనతో మాతనుగోల్పోయిన పసిశిశువువలె రోదనము చేయసాగెను. కొన్ని నిముసము లిటులే గడచిపోవ కన్నులదుడుచుకొని శాంతి వ్యాసమును చేతనుంచుకొని వసారాపై ఇటునటుపచారుచేయుచు సమీపముననేయున్న

మహాజలనిధిని తిలకించుచుండెను. సముద్రఘోష ఆమె వీనులకు "అమరేంద్రుని దర్శనము నీ కిక దుర్లభము—దుర్లభము–దుర్లభము" అనునట్లుగా వినబడుచుండెను. ఆమె చేతిలో కాగితములకట్ట ఆమెకు తెలియకుండగనే జారి నేలపై బడెను. ఇంతలో పవిత్రప్రేమతో నాథుని పాదారవిందములు సేవించుయువతీరత్న మాతని యెడ బాసినప్పు డుచ్చరించు ఆర్త నాదమువలె శాంతి హృదయకుహరమునుండి దిక్కులు ప్రతిధ్వనింప ఆమెకు తెలియకుండగనే ధ్వని యొండు బయల్వెడలెను. అస్పష్టవాక్కులతో శాంతి "అయ్యో, కర్కశహృదయనై నిన్నే నేలపంపివైచితి? అమరా, నన్ను మన్నించి నీ దర్శనభాగ్యము నాకు లభింపనీయవా, రావా, నావద్దనుండవా!" అని దీనాలాపముల బల్కుచు విలపింపసాగెను. ఇట్టితరి శిరీష శాంతికి వెంటనే శహరనపురమునకు బయలుదేరమని తంతి వార్తనంప తండ్రియగు లలితబాబు ఆమెను వెంటనిడుకొని వచ్చి, శోకించుచున్న తన ముద్దుబిడ్డను గని ఆశ్చర్యముతో కారణమడుగ శాంతియు "తండ్రీ, నాకే ఎన్నడునులేని విచారము గలుగుచున్నది. నా మనస్సు కీడునే శంకించుచున్నది." అని పల్కుచు శిరీషపంపిన తంతిని చూచి తన్నేల తత్క్షణమే శిరీషరమ్మనెనో గ్రహింపలేక శాంతి వెంటనే శహరనపురమునకు బయలుదేరెను. శిరీష శాంతిని జూచి అమందానందభరితురాలై ఆలింగనము చేసుకొని లోనికి తోడ్తెచ్చి జరిగిన సంగతులన్నియు విశదముగా ఆమెకు వినిపించెను. పిమ్మట శిరీష సిల్వియా అమరనాథుల, శాంతి సన్నిధికి తోడ్తెచ్చెను. సిల్వియా నేటి ముఖమై ఖరి అమరేంద్రుడుగాని, శిరీషగాని, శాంతిగాని ఇదివరకెన్నడు ఆమెయందు జూచియుండలేదు. ఆమె వదనము దీనముగ నున్నను ఏదో నూతనశోభతో విరాజిల్లుచుండెను. జ్యోతిర్మయమగు ధవళకాంతి ఆమె ప్రతి అవయవము నుండియు ప్రకాశించుచుండెను. సిల్వియా మెల్లన శాంతికడ కరుదెంచి ఆమె దక్షిణహస్తమును అమరనాథుని కరమునం దునిచి "సోదరీ, శాంతీ, మీ నిజప్రేమను, పరీక్షింప లీలానాటకసూత్రధారియగు పరమేశ్వరుడు మిమ్ముల కష్టపరంపరలచే నొప్పించి మీ ప్రేమకుమెచ్చి తుదకుమిమ్ముల నిట జేర్చియున్నాడు." అని అమరనాథునివైపు తిరిగి "అమరనాథా! నేజేసినఅపరాధముల మన్నింపుము" అని అశ్రుపూరిత నయనముల నొత్తుకొనుచు మరలవారిరువుర నుద్దేశించి "భగవంతుడు మీనూతనసంపతుల కాయురారోగ్య ఐశ్వర్యముల నిచ్చి అచంద్రార్కము వర్ధిలజేయుగాత. ఎన్నివేల జన్మంబులకైనను మీ రొకరినొకరు స్వప్నమందైనను ఎడబాయకుందురుగాత" అని మనఃపూర్తిగా ఆశీర్వదించి ఆగదిని వదలి బిరబిర ఈవలకు వచ్చివేసెను. శాంతి భయాశ్చర్యములతో నిశ్చేష్టురాలై నిలచిపోయెను. అమరనాథుడన్ననో సిల్వియా వదనమును తిలకించుటకే అసమర్థుడై పోయెను. శిరీషకుమారి మాత్రమే ఇట్టి భయానకనాటకాంతమును ఆనందింప గలిగెను.

సిల్వియా గది యీవలకు వచ్చిన వెంటనే శిరీషకుమారి కూడ ఈవలకువచ్చి పైనగొళ్లెముపెట్టి శాంతీ అమరనాథుల నా గదియందే నిర్బంధితులగాజేసి తాను సిల్వియా ననుసరించెను. సిల్వియా వెంటనే ఏదియో చెప్పరాని వేదనకు లోనై తన శయ్య్య చేరబోవుచు, మార్గమందే నోట నురుగులు గ్రక్కుచు పడిపోయెను. శిరీషయు ఆమెను శయ్యజేర్చి ఆమె పూర్వచరిత్ర స్మృతికి రాఅటులు మూర్ఛిల్లెనేమో యని తలచుచు శైత్యోపచారములు చేయ సాగెను. కాని అవి అన్నియు బూదిలో పన్నీరువలె నాయెను. వైద్యుడు చూచి శిరస్సునందు రక్తనాళ మొకటి తెగిపోయిన దనియు సంజీవి యైనను అమెను జీవింప చేయ జాలడనియు చెప్పి అచ్చోటు వాసి వెడలిపోయెను. కొంతసేపటికి సిల్వియా కనులు విప్పి చూడ సాగెను. శిరీష మెల్లన అమె శిరస్సు తన మస్తకమునం దునిచికొని "సోదరీ, సిల్వియా, నీ ప్రాణనాథు నిపటికి రమ్మని తంతినంపనా" అని యడుగ సిల్వియా మెల్లన "శిరీషకుమారీ, అనవసరముగా నాకొరకై శ్రమ నొందకుము. నానాథుడు అచిరకాలములోనే ఇపటికి రాగలడు" అనిపల్క శిరీషకామాటలు బోధపడక, నీవిచట నున్నావని ఆయన కెట్లు తెలియునని సిల్వియాను మరల ప్రశ్నించెను. ఆయాస మంతకంతకు సిల్వియా కధికమగుచుండెను. అస్పష్టవాక్కులతో సిల్వియా శిరీషతో "నా ప్రాణనాథునికి తెలియని రహ

స్యము లీ పృథివియందుండవు—శిరీషా! నానాథుని పాద ధ్వని నా వీనుల సోకుచున్నది. ఏమి నీకు వినవచ్చుట లేదా! అదిగో దివ్యమంగళవిగ్రహుడగు నా ప్రాణవల్లభుడు నన్ను తన కౌగిలియందు జేర్చుకొనుటకు శీఘ్రముగా నరుదెంచుచున్నా"డని వక్కాణించి తిరిగి కన్నులు మూసివేసెను. శిరీష కీ గూఢార్థ వాక్యము లేమియు అర్థము కాలేదు. కొన్ని నిముసములకు నోట నురుగులు మొదలగు దుర్గుణములన్నియు సిల్వియాయందు తగ్గిపోయినవి. శిరీష సిల్వియా కిక ప్రాణభయము లేదని సంతసింపసాగెను. ఇంతలో కరముల రెంటిని జోడించి అస్పష్టవాక్కులతో సిల్వియా "పతితపావనా—దయార్ద్రి—హృదయా—స్వర్గసిం—హాసనమున—నధిష్ఠించియున్న—నా తండ్రీ! నే—నసత్య—ము—పల్కినందు—లకై—నన్ను—మన్నింపుము.—ఇది—వారి—సౌఖ్యము—కొరకై పల్కితి"నని కొంచెము సేపాగి మరల "అమరా,—నన్ను—మన్నింపుము—ఈదీను—రాలిని—మరు—వకుము—అ—మ—రా" యనుచు కనులు మూసివైచెను. శిరీష కుమారికి సిల్వియా మాటల యర్థము ఇప్పుడు బాగుగా బోధపడ సంభ్రమాశ్చర్యభయ విషాదములతో దిక్కులు ప్రతిధ్వనిల్ల "సిల్వియా"యని ఒక్క కేక వైచెను. చేతులుకాలిన పిదప ఆకులుపట్టుట వలన లాభమేమి? చిరునవ్వు ముఖమున తాండవమాడ చూపరులకు సిల్వియా సుఖ స్వప్నంబులగాంచుచు సుషుప్తియందున్నదో యనునట్లున్నను ఆమె అప్పటికపుడే పరమేశుని పాదకమలముల సన్నిధిని జేరిపోయెను.

*    *    *    *    *

నేడే శాంతి ముద్దు బాలికయగు సిల్వియాకు రెండవ సంవత్సరము ప్రవేశించినది. శాంతీ అమరనాథులు సిల్వియా మరణమునకై విచారించి ఆమె స్వార్థత్యాగమును వేనోళ్ల బొగడుచు, తమ ప్రథమ సంతానమగు చిన్నిబాలికకు సిల్వియా యని నామకరణ మొనర్చిరి. శాంతీ అమరనాథులు దేశసేవకై మిగుల పాటుపడుచు, జీవిత శేషమంతయు ఆనందవారిధి నోలలాడుచు గడపుచుండిరి.

---

# కృష్ణయ్యా

కోటమర్తి నాగేశ్వరశర్మగారు

గొల్లడై పుట్టితే నేమీ
కృష్ణయ్యా
నల్లన్నివాడైతె నేమి

కన్నులా కమలాలు
పన్నులా ముత్యాలు
ముద్దులూరెడి జగన్మోహనాకారుండు. గొ.

నరకబాధల దూల్చి
దురితకర్మల గూల్చి
నరనాథుడై జగన్మాన్యుడై మించాడు. గొ.

మొలకనవ్వుల జూపి
పొలతులను కడు వేపి
చలియింపకే బ్రహ్మచారి యనిపించాడు. గొ.

దుండగీడన్నాను
చండితనమున్నాను
కరుణ గలవాడనే ఖ్యాతి నార్జించాడు. గొ.

కోరినా రూపాలు
తీరుగా ధరియించి
రూపరహితుడనంచు ఋషుల నమ్మించాడు. గొ.

---

# ఔరంగజేబు-వింతచరిత్రాంశములు

శ్రీమతి పులవర్తి కమలావతిదేవి గారు

ఔరంగజేబు, షాజహాను యొక్కయునతని భార్య ముంటాజ్ మహాలు యొక్కయు మూడవ కుమారుడు. ఇతడు ది. 24 అక్టోబరు 1618 సంవత్సరమున పంచమహాల్ తాలూకాలో దిన్‌హిదు అనే గ్రామములో నుద్భవించెను. ఈయూరిప్పుడు బొంబాయి రాజధానిలో గోధ్రారైల్వే లైనుమీద నున్నది. ఔరంగజేబు చాల ధైర్యవంతుడు. చిన్నప్పుడీతని ధైర్యసాహసము క్రింది కథవలన దెలియనగును. షాజహానున కేనుగుల పోరాటమనిన నెంతో యిష్టము. ఒకనాడు యమునా నదియొడ్డున నాగ్రాకోట కెదుట ది. 28 మే 1633 సంవత్సరములో యేనుగుల పోట్లాట జరుగుచుండెను. జనులెల్లరు నిసుకవైచిన రాలకుండున ట్లావినోదమును తిలకించుచుండిరి. షాజహాను పాదుషా నలుగురు కొమరులును రంగస్థలమునందలి లోపలి యావరణమునం దుండి యా గజయుద్ధమును తిలకించుచుండిరి. గెలిచిన యేనుగు చాల మదించి యున్నందున ఔరంగజేబుమీదికి పరుగెత్తి వచ్చుచుండెను. ఔరంగజేబు సమీపమున నున్న యాతని సోదరులు ముప్వురు బ్రతికియున్న బలుసాకైన దిని బ్రతుకవచ్చునని యెంచి యా మదవారణమును గాంచి భీతచిత్తులై కాలికి బుద్ధిచెప్పి పారిపోయిరి. యువకుడగు ఔరంగజేబు, సుకుమారాకారుడగు ఔరంగజేబు, కాలాగ్నివలె చెలరేగి తనపైబడనున్న యా మత్తగజమును గాంచి యించుకైన చలింపలేదు. ఒక్కయడుగైన వెనుకంజ వైవలేదు. నిర్భయముగ తన యశ్వముపై గూరుచుండి యా రాకొమరుడు నిర్వక్రపరాక్రమమున దనపై బడనున్న యాదంతిని తనవాడియైనబల్లెమున నొక్కపోటు పొడిచెను. ఆ పోటువలన నా యేనుగునకు రిమ్మతెగులెత్తి యౌరంగజేబు గుఱ్ఱమును తొండముతోడ జుట్టి గిరగిర ద్రిప్పి యావల పారవైచెను. ధైర్యవంతుడైన యా రాజసుతు డొక్కయదటున తన వారువము నుండి భూమిపైకి లంఘించి ప్రాణోపద్రవకరమగు నా మహాపాయమునుండి తప్పించుకొనెను. అంతతోనైన నా ధైర్యహిమాచలు డూరకుండక మరల నాదంతితో బోరగడంగెను. ఇంతలో సాయుధులగు భటు లుర్వీధవ కుమారుని రక్షణార్థ మరుదెంచిన కతంబున నా యేనుగు పారిపోయెను. ఔరంగజేబుయొక్క పరాక్రమమును గాంచిన ప్రజలు జయజయ నినాదంబుల నొనరించిరి. షాజహాను కుమారుని జూచి మెచ్చుకొని యతనిమెత్తు బంగారు నాణెముల నతనికి బహుమతిగా నొసంగెను. 13 తేది డిసెంబరు 1634 సంవత్సరములో ఔరంగజేబుకు పదునారు వత్సరముల ప్రాయమున్నపుడు పాదుషా సైన్యములో పదివేల గుఱ్ఱపుదళమున కధిపతిగా నియమించిరి. ఔ

రంగజేబా సంవత్సరముననే విక్రమజిత్తనువాని పైకి దాడివెడలి వానిని జయించెను. 14వ తేది జూలై, 1636 సంవత్సరము మొదలు 28 మే, 1644 సంవత్సరము వరకు ఔరంగజేబును దక్కనుదేశమునకు ప్రతినిధిగా చక్రవర్తి నియమించెను. దక్కనురాజప్రతినిధియగు నౌరంగజేబు రాకొమారుడు తన ముఖ్యపట్టణ మగు ఔరంగాబాదునకు జనుచు త్రోవలో బరంపురం గవర్నరగు సయఫ్ఖాను యింటికేగెను. ఇతడౌరంగజేబునకు మేనత్త మొగుడు. మేనత్తపేరు సాలెహాఖాను బేగం. అతడు మేనత్తను చూడగోరి బరంపురమున నాగెను. మేనత్త గృహమే గనుక నతడు జనానాలోనికి ముందుగా కబురు పంపించకుండగనే లోపల ప్రవేశించెను. జనానావారు యప్పుడుద్యానవన వినోదములతో కాలక్షేప మొనరించుచుండిరి. హీరాబాయి యను నొకసుందరయువతీ వతంసము పండ్లభారముతో వంగిన యొక మామిడివృక్షమును తన కరపల్లవములతో వంచిపట్టుకొని, పంచమస్వనమున, మధురరుతములతో, వినువారల కెల్లహాయిజనింప, యొడలు గగుర్పాటు చెంద నొకచక్కనిపాటను, విపంచీ స్వరముకన్న మధురమైన స్వరముతో పాడుచుండెను. ఔరంగజేబాపూర్ణశశాంక వదనను గాంచినతోడనే మోహపరవశుడై మూర్ఛనొందెను. రాకొమరుడు మూర్ఛాగతుడైనంతనే మేనత్త భయకంపితురాలై పరుగెత్తుకొని వచ్చి యతనిని లోనికి దీసికొనివెల్లి సమస్తోపచారముల జేయ దొడంగెను. వైద్యుని కొరకు కబురంపిరి. నాల్గుగడియల కౌరంగజేబునకు మరల స్పృహ వచ్చెను. "నాయనా! ఇది యేమిరోగము? ఇదివర కెపుడైన వచ్చినదా?" యని మేనత్తయడుగ నాతడు మాటాడక యూరకుండెను. చాల సేపు మేనత్త ప్రార్థించినమీదట ఔరంగజేబు మేనత్తతోనిట్లనెను. "అత్తా! నీతో చెప్పుట వలన నేమిప్రయోజనము? నీవేమి యార్చెడి దానవా? తీర్చెడి దానవా?"యన నామె యిట్లనెను. "నీ కోరిక దీర్చుట కన్న మాకేమి కావలయును."

అప్పుడు ఔరంగజేబు తాను హీరాబాయిని మోహించిన సంగతి తెల్పెను. మేనత్త వెళ్లి భర్త కాసంగతి నెఱుక పరచెను. ఔరంగజేబు జనానాయందలి ఛత్రబాయిని తన కొసంగినయెడల హీరాబాయి నిత్తునని యతడు జవాబు పంపెను. ఔరంగజే బట్టులే యొసంగి హీరాబాయిని యథావిధిగ పరిణయమాడి జైనబాడిబేగం అని నామకరణం బొనర్చి తనతో గూడ గొంపోయెను. కాని పాపము! నడియావనమున హీరాబాయి పరలోకగతురాలయ్యెను. కొంతకాలము వరకు ఔరంగజేబునకు హీరాబాయి యందలి ప్రేమాతిశయమున మతిపోయి నట్లుండెడి వాడు. అతడు కొంతకాలము వరకు ఫకీరు వలె నివసించుచుండెను. హీరాబాయియే బ్రతికి యుండి ఔరంగజేబు చక్రవర్తిపద మధిష్ఠించిన పిమ్మట హిందూరాజ్య చక్రవర్తినియై యుండినయెడల, ఔరంగజేబు చరిత్ర మరియొక దారి ద్రొక్కియుండెడిది.

---

# కాకమా!

శ్రీమతి న్యా. వేం. విజయలక్ష్మమ్మ గారు

సకలజీవాంతరాత్ముఁడై సర్వలోక-ములకు భర్తయై లోకైకమూర్తియైన
యాదిదేవుఁడే దాని నాహారముగ నొ-సంగెఁ గాకమా, నీకది చాలదొక్కొ!

వలసినది తిని, నీయిచ్చవచ్చినట్లు విమలతరమైన యాకాశవీథియందు
హాయిగాఁ బగలెల్ల విహారలీలఁ-దేలి కాకమా, గూట నిద్రింపలేవె?

ఎల్లయిండ్లలోదూఱి, యందెవ్వరేమి-సేయుచుందురొ, యేమున్నదో యటంచుఁ
జూడ నీకేమివచ్చెనో క్షుద్రజాతి-కాకమా, నీకుఁ జీవాట్లుకాకయున్నె?

ఏలయఱచెద వూఱక చాలునింక-నెదుటివారల యుబుసు లవేల నీకు?
నీబ్రతుకుతీరుఁ గన్గొననేర వకట! గ్రుడ్డికాకమ, నిన్నెవ్వ రడ్డువారు?

చెట్టుపైనున్న యఱగంటసేపు నీదు-ఱెక్కలను సవరించి బల్ టెక్కుమీఱఁ
జూపుచుందువు నీవగు సొబగులెల్ల; నెఱుఁగుదుము, కాకమా, యేల విఱుగఁబడెదు?

వీథిలో రాలు నెంగిలివిస్తరాకు-మెతుకు లేఱికొనుచుఁ దినుబ్రతుకు నీది;
నీ యునికితీరు తెలిసికోనేర వకట! చెడుగు గాకమ, నీకేల సిగ్గులేదు?

పక్షు లున్నవికా, బహువృక్షతతుల, నెచటనున్నవో, యెట్టివో, యెఱుకపడవు;
కావుకావని గడపల దేవులాడ-నీకు నేటికిఁ గాకమా, నీతిమాలి?

అతుల ఋతురాజమగు వసంతాగమమునఁ-గోయనుచు మావికొమ్మపైఁ గూరుచుండి
హాయిగాఁ బల్లవంబుల నారగించు-కోకిలం బేమిచేసెనో కూళకాకి?

చెంగుచెంగున నెగురు నీ రంగునడలు-ముఱువుబెఱయఁగఁ ద్రిప్పు నీమోముసొంపు
వలపుసొలపులఁ దెలుపు చూపులబెడంగుఁ-గాంచితిమి కాకమా, బుద్ధిగను మిఁకైన.

---

# సముద్రగుప్తశాసనము-కళింగచరిత్రము

బుఱ్ఱా శేషగిరిరావుగారు (ఆంధ్రభారతీ తీర్థప్రధాని)

[వెనుకటి సంచిక తరువాయి]

## ౨

### వేంగీ - పిష్ఠపురములు

సముద్రగుప్తుని దాక్షిణాత్య దిగ్విజయముల లో నల్లాబాదు శాసనములో వేంగీ పిష్ఠ పురముల రాజ్యాధిపతులు పేర్కొనబడి యున్నారు. "కాంచేయక", "కైరాలక" రాజుల వలెనే వీరును గోదావరిమండలములో ప్రసిద్ధి గాంచిన వైంగేయక పైష్ఠపురకులని ఫ్లీటు పండితుల యాశయము ప్రకారము పలువురు సిద్ధాంతపరచుకొని యున్నారు గాని గ్రామ నామములను బట్టి యీ వేంగీ పిష్ఠపుర రాజ్యములును కళింగాంతర్భాగము లనియే యూహింప నవకాశము కలిగి దుబ్రాయీలు పండితుల వాదమును బలపరచుచున్నది.

గంజాం మండలములో—

కూదలతాలూకాలో పిఠాపురం
పర్లాకిమిడి ఏజన్సీలో పిష్ఠపురం

గ్రామములు ఇంచుమించుగా మన్యప్రాంతములలో కనబడి పల్లపుతాలూకాలలో కనబడకుండుటచే పిష్ఠపురీదేవి యనుశక్తి నారాధించిన బౌద్ధరాజులు తొలుత నీప్రాంతములలో రాజ్యాధిపతులైయుండి. గుప్తసామ్రాజ్య విస్తరణానంతరము దక్షిణముగాపోయి గోదావరిజిల్లాలో పిఠాపురమను నొకయూస్థానమును తమ పూర్వరాజ్యస్థానముపేర కట్టుకొని రాజ్య మేర్పరచుకొని యుందురనుట సమంజసమై యున్నది. మన్యప్రాంతముల నుండి పల్లపునాడులకు ప్రజలు వలసబోవుట ప్రజావిస్తరణములకు సామాన్య మగు ధర్మమై యున్నది.

ఇక వేంగినిగూర్చిన సమన్వయము :

గంజాంమండలం ఇచ్ఛాపురం తాలూకాలో వేంగైసాయి
సోంపేట ఏజన్సీలో వేంగాసాయి

అను గ్రామము లీమండలములో వేంగీరాజ్యపు జాడలు చూపుచున్నవి. మరియొక చిత్రము. గోదావరి మండలములోని వేంగీరాజ్యము చాళుక్యుల పాల బడుటకు పూర్వము చాలా కాలము సాలంఖాయనుల యేలుబడిలో నుండినట్లు కీ. శే. శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారు ప్రచురించిన సాలంఖాయన శాసనములవల్ల తేలినదిగదా. ఈ సాలంఖాయనులజాడ

గంజాం మండలములో

రాయగిరి ఏజన్సీలో-సాలింకోయి

అను గ్రామనామము సూచించుచున్నది. వీటిని బట్టికూడా వేంగీరాజ్య మొకటి సముద్రగుప్తుని కాలములో కళింగములోని మన్నెరాజ్యమై

యుండుననుట స్ఫురింపజేయుచున్నది. ఇంకొక విశేషము అల్లాబాదు శాసనములో "కౌస్థలపురక ధనంజయ" యని మరియొక దాక్షిణాత్య భూపతి నిర్వచనము గలదు. ఫ్లీటు పండితులు దీనిని "Dhananjaya of Kusthala-pura" అని యనువదించిరి. ఇది "కుస్థల"గాని "కోస్థల" గాని కావచ్చును. ఇట్లు "కుస్థలపుర మని" తేల్చినను ఇది యెచ్చటిదో ఫ్లీటుపండితులు తేల్చలేదు. ఇతరులును తేల్చలేదు. కళింగమండలి గ్రామనామములలో వెతుకగా

గంజాంమండలము-బరంపురంతాలూకాలో కోస్థిపట్టు
విశాఖపట్టణ మండలం - నవరంగపురం ఏజన్సీలో కోస్థిలిగుడ

అను గ్రామములు మాత్రము కనబడుచున్నవి. వీటిలో కోస్థిలి-గుడ అను గ్రామ నామములోని మొదటిభాగము కోస్థల నివాసులచే నేర్పరుపబడిన వలనను స్ఫురింపజేయుచున్నది ఈ నవరంగపురము, జయపురము రాజ్యములో బస్తరు మన్యరాజ్యము నంటియుండుటచేత నీ కోస్థలరాజ్యము నన్యరాజ్యమై సముద్రగుప్తునికాలమునకు ధనంజయుడను నృపాలుని యేలుబడిలో నుండియుండును. ఈయంశములు శాసనపరిశోధకుల విమర్శకై ప్రచురించితిని.

కళింగాంధ్రక్షత్రియులు

సముద్రగుప్తుని అల్లాబాదుశాసనములో

"ఉద్వేలోర్జితబాహువీర్యరభసా
దేకేనయేనక్షణా
దున్మీల్యాచ్యుతనాగసేనగ
..............
దండైర్గ్రాహయతైవకోటకులజం
పుష్పాహ్వయేక్రీడతా
సూర్యేనే——————
తట——————"

అని యున్నది. దీనిలో వట్టిగీతలుగల భాగము అరిగిపోయినది. దీనినిబట్టి ఫ్లీటుపండితులు సముద్రగుప్తుడొక నదీతటముననున్న పుష్పపురమున కోటవంశజులను రాజుల నోడించి యా పట్టణమును రాజధానిగా చేసుకొనెనని యూహించిరి. కాని యీ సమన్వయము కోటవంశజు లెవరో తేలినగాని స్థిరపడనేర దనియు వ్రాసిరి. పుష్పపుర మేదియని కొంత చర్చచేసి రెండభిప్రాయములను తేల్చిరి. "పుష్పపుర", "పుష్పపురీ","కుసుమపుర"యనునవిపూర్వము పాటలీపుత్రము, ప్రస్తుతము పాట్నాయనునగర మునకు నామాంతరము లనియు, యువాన్‌త్సాంగు గ్రంథములో నీనగరము కుసుమపుర మనియు, పాటలీపుత్ర మనియు గూడ చేర్కొనబడిన దనియు, అయినను పాటలీపుత్రమునకు పుష్పపురమను నామ మతి ప్రాచీనకాలములో నింతవరకీశాసనభాగములోనే కనిపించుచున్న దనియు, నీకారణములచే సముద్రగుప్తుని రాజధాని పాటలీపుత్రమని నిర్ణయింపదగు ననియు ఫ్లీటుపండితుల యూహ. కాని ఇది స్థిరపరచుటలో గణనీయము లగు నంశములు ఫ్లీటుపండితు లుదాహరించి యున్నారు.

(1) స్కందగుప్తుని కాలమువరకు ఈ వంశమువారి శాసనములు పాటలీపుర ప్రాంత మున నెచ్చటను కనబడలేదు.

(2) రెండవ చంద్రగుప్తుని శాసనముల లో నీ పాటలీపుత్ర ముదాహరింపబడినను ఇది కనబడు రెండుచోట్లను దీనిని చంద్రగుప్తునితో కలుపుటకుగాని ఇది యాతని రాజధానిగా సమన్వయించుటకుగాని వీలు లేదు.

(3) యువాన్‌త్సాంగు గ్రంథములోనే పుష్పపురమను పదము పర్యాయముగా చెప్ప దగిన వేరొక కుసుమపురము చెప్పబడియున్న ది. దీనికిని పాటలీపుత్రమునకును చాలా దూర ము. అది కాన్యకుబ్జరాజ్యముయొక్క పూర్వ రాజధానిగా నీ చీనాయాత్రికు డూహించి వర్ణించి యున్నాడు. ఇచ్చటగాని, ఈ ప్రాంత మందుగాని కుసుమపురమను రాజధాని యుం డుట యీవంశపు పూర్వశాసనములు చాలా వరకు దొరకిన స్థలములతో సమన్వయపడు చున్నది.

కౌశాంబిలో గాని, అల్లాహాబాదులో గాని సముద్రగుప్త చక్రవర్తి ప్రశస్తిస్తంభ ముండు టతోగూడ నిది సమన్వయించును. ఇట్టియంశ ములనుబట్టి సముద్రగుప్త చక్రవర్తి రాజధాని యైన పుష్పపుర లేక, కుసుమపుర మనునది పాటలీపుత్రమే యని ఫ్లీటుదొరగారు సిద్ధాం తము చేయలేదనియే మనము గ్రహించవలె ను. కాని పలువురు చారిత్రకు లిది సిద్ధాంతమే యని యనుకొనుచున్నారు. ఎట్లయినను ఈ పుష్ప (కుసుమ)పురమునకు కోటవంశపురాజు లకును సంబంధము కలదనియు నది విడినగాని యిదమిత్థమని సిద్ధాంతము చేయజాల మనియు ఫ్లీటుపండితులే యంగీకరించి యుండిరి.

ఈ పత్రికయందలి సూచనలు గ్రాహ్యము లగుట కీసముద్రగుప్త శాసనమును గూర్చిన విమర్శాపూర్వోత్తర మింతవరకు సంగ్రహ ముగా దెలుపవలసివచ్చినది. ఇక ప్రస్తుత తర్కము ననుసరింతును.

కళింగమందును ఆంధ్రమందును చిర కాలముగా నివాసము లేర్పరచుకొని యుండిన సూర్యచంద్రవంశజు లగు క్షత్రియులలో నొక గాథ నేటికిని చెప్పుకొందురు. శా.శ.514 నకు పూర్వ ముత్తరాపథమునుండి కోట, వర్నాట, కాకతి, పరిచ్ఛేదులను నాలుగువంశములవారు నాలుగు వివిధగోత్రములవారు (వసిష్ఠ, కవుం డిన్య, కాశ్యప, ధనంజయ,) రాజ్యార్థులయి దక్షిణాపథమునకు వచ్చినట్లును పరిచ్ఛేది వంశ జులు, వసిష్ఠగోత్రులు వారికి నాయకులై చతుర్గోత్రవందనీయులై పూసపాటివా రను పేర బరగినట్లును కళింగాంధ్రమండలములందు వీరు రాజ్యము లేర్పరచుకొనినట్లును ఈ పూర్వోత్తరపుగాథ ప్రబలముగా నున్నది. ప్రస్తుత శాసనమున గలయట్లు కోటవంశ్యులు సముద్రగుప్తునిచే నుత్తరాపథమున పరాజితు లై రాజ్యము గోల్పోయి యుండినయెడల వారును, వారి మిత్ర బాంధవులును దక్షిణాపథ మునకు రాజ్యములు కొట్టుకొనవచ్చియుందు

రని నమ్ముటలో విపరీత మేమియును లేదు. అమరావతిలో రాజ్యముచేసిన కోటవంశము వా రాంధ్రక్షత్రియులలో చాలా కుటుంబ ములకు నసలు కోవమైయున్నారు. వీరు తప్ప ఉత్తరదక్షిణాపథములలో వేరొకకోటవంశము వారు కనబడరు. కాగా నీ ఆంధ్రకోటవంశము వారే సముద్రగుప్తశాసనములోని వారని నా నిర్వాచనము. ఇది సరికాదనుటకు కారణములు విమర్శకులు చెల్పుదురుగాక!

ఇక నీకోటవంశమువారి కాది నుత్తరా పథమున పుష్ప (లేక కుసుమ) పురము రాజ ధానిగా నుండినయెడల నాపేరిట వారి సంతతి వారు కళింగాంధ్రములలో నేర్పరచుకొని యుందురనుట సమంజసముగదా! ఇట్లు పే ేర్పరచుకొనియుండినట్లు కళింగమందలి గ్రామ నామములలో నిదర్శనములు కానవచ్చు చున్నవి. ఎట్లనగా—

గంజాంజిల్లా—

ఛత్రపురంతాలూకా, కుసుమపూరు.

బరంపురం తా. కుసుమి, కుసుమపురం.

విశాఖపట్నంజిల్లా—

బొబ్బిలితాలూకా, కుసుమూరు.

బిస్సంకటకం ఏజన్సీ, కుసుమగుడి, కుసుమపదర.

జయపురం ఏజన్సీ, కుసుమగూడ, కుసుమపుట్టి.

కొరాపుట్టి ఏజన్సీ, కుసుమగూడ, కుసుమపదర, [కుసుమపుట్టి.

నవరంగపురం ఏజన్సీ, కుసుమబందు, కుసుమపల్లి.

పాడ్వా ఏజన్సీ, కుసుమగరువు, కుసుమపుట్టు, కుసుమ పలస, కుసుమపద్ర, కుసుమగుడ.

పొట్టంగి ఏజన్సీ, కుసుమ.

రాయిగడా ఏజన్సీ, కుసుమఖాటీ, కుసుమెల్ల.

ఈ గ్రామనామములను బట్టి కళింగ మం దలి తొలుతటి కోటవంశపు వలసలును, రాజ్య మును కళింగమన్యములం దేర్పడియుండినట్లును అటనుండి వారు కాలక్రమేణ దక్షిణాపథమం దు కృష్ణానదీతీరమున నమరావతికి రాజ్య స్థానము మార్చుకొన్నట్లును తోచును.

ఇట్లే పరిచ్ఛేదులలో ప్రసిద్ధిగాంచినవారి వంశము పూసపాటివారు. వీరి యింటిపేరుకు పూషాపాడనియు పూషపాటియనియు నామాం తరములు సాహిత్యగ్రంథములలోను, చాటు పద్యములలోను కనబడుచున్నవి. దీనికి సూర్య వంశమని కొందరు నిర్వాచనము చెప్పుదురు. కృష్ణజిల్లాలో పూస-పాడు గ్రామములో పూస-అనుదానికి నిర్వాచనము సుగమము కాదు. ఇది పూన్-బాడి అను ప్రాకృత మని యు, నిది "పుప్పవాటి" అనగా పుష్పపురము నకు పర్యాయపదన మనియు నా సమన్వయ ము. ఇది సరిమైనచో పరిచ్ఛేదులు పుష్ప పురమునుండి తొలుతవచ్చిన క్షత్రియులలో నొకశాఖయని తేలును. కోటవర్ణాటకాకతి పరిచ్ఛేదులు తొలుత పుష్పపురము నుండి దక్షిణమునకు వచ్చిన గాథలో కొంత నిజ ముండినట్లు తేలును. పూసపాడు కట్టుటచే పరిచ్ఛేదులకు పూస పాటివారను పేరు వచ్చి నట్లు వసిష్ఠగోత్ర క్షత్రియులను గూర్చిన సీస మాలికలో నిట్లున్నది:

"అతని తనూజుఁ డాతతబలోన్నతుఁడు మా
ధవవర్మనృపతి ముత్తాతఁబోలి
జనకునాజ్ఞను సప్తశతి సాంగముగ రామ
దేశికుచే నుపదేశమొంది
కనకదుర్గాకటాక్ష ప్రాప్తవిభవుఁడై
మళియసింగనిబోర్ర మందఁ జేసి
చౌబళహస్తిమల్లు బలాధిపుని రక్త
ధారచే పరదేవతను భజించి
వసుదగింద్రియశకవత్సరంబుల జయ
వాటికాదుర్గ వైభవము గాంచి
గగనవాణీవాక్యగౌరవంబున పూస
పాటిభూమిని పురీవరము గట్టి
వాసిగాంచుట పూసపాటి వారను యింటి
పేరుగాంచిరి రాచపెద్దరికము."

ఈ సీసమాలిక శా. శ. 1406 సం. అనగా క్రీ. శ. 1484 ప్రాంతమందు రాజమార్తాండ శ్రీ పూసపాటి తమ్మిరాజ (సుత) రాచిరాజుగారిచే చెప్పబడినది ఇందలి లెక్క ప్రకారము పరిచ్ఛేదవంశములో సుప్రసిద్ధులై కనకదుర్గా వరప్రసాదులైన మాధవవర్మ మహీపతి పూసపాడను పురీవరమును శా. శ. 548 అనగా క్రీ. శ. 626 (A.D.) యందు నిర్మించినట్లు తేలును—

కాని క్రీ. శ. రమారమి 1640 ప్రాంతమందు శ్రీమన్మహామండలేశ్వరమహీమండల రాయ మన్నెసుల్తాను శ్రీపూసపాటి తమ్మభూపాల విరచితమైన "శ్రీకృష్ణవిజయ" కావ్యమందు మాధవవర్మ నృపతి బెజవాడ రాజధానిగా రాజ్యమేలినట్లును, నిడదవోలు చెంత నొక గొప్పదుర్గము కట్టినట్లును మాత్రము కలదు. వీరికాలమున కంతకుపూర్వగాథలు విస్మృతములై యుండనోపును. కాగా మాధవవర్మనృపతి నిర్మించిన పూసపా డాతని పూర్వులు కళింగమందు నిర్మించిన "పూస్‌బాడి" లేక "పుష్పవాటి" పురవరమునకు జ్ఞాపకార్థము కానలెను ఈతడు తననాడు కళింగమును తిరిగి జయించినట్లు సాహిత్యగ్రంథాధారము గలదు. శ్రీ కృష్ణవిజయములో కూడా—

గీ. "అట్టి బలములు తన వెంట నంటికొలువ
బూర్వవైరుల నందర బుడమి గలిపి
ధరణియేలె నేకాతపత్రంబుగాఁగ
వైభవోన్నతి మాధవవర్మనృపతి"

అని యున్నది.

అప్పటి పూస్‌బాడి లేక పుష్పవాటి రాజ్యము జాడలు చూపు గ్రామములు నేటికిని కళింగమందు కలవు. "కోటవంశమువారు కుసుమపుర మనుచు గ్రామములు కట్టుకొన్నట్లే పరిచ్ఛేదులు పుష్పవాటి, పూస్‌బాడి, పూసపాడు అను వాసస్థానములు తమ పూర్వస్థానము జ్ఞాపకార్థ మీప్రాంతములలో కట్టుకొనియుందు రనుటలోను విపరీత మేమియు లేదు. ఈ గ్రామనామము లిట్లున్నవి:

గంజాం—

రామగిరి ఏజన్సీ, పూస్-పంగ.

విశాఖపట్నం—

రాయిగడా ఏజన్సీ, పూసబాడు.

పార్వతీపురం ఏజన్సీ, పూసబాడి, పూసనంది.
మల్కనగిరి ఏజన్సీ, పూసపల్లి, పూసగూడెం.
జయపురం ఏజన్సీ, పూస-పురీ, పూసపురిగుడ.
బిస్సంకటక ఏజన్సీ, పుస్సా-గుడ.

వీటిలో జయపురం ఏజన్సీలో గల పూస-పురీ, ఇతరత్ర గల పూస-బాటి గ్రామములున్న ప్రాచీనతమ కళింగ పూసపాటి రాజ్యమును కోటవంశమువారి రాజ్యమును బోలిన మన్నె రాజ్యముగా నిరూపించనై యున్నది. ఇట్లు సముద్రగుప్త శాసనములోని కోటవంశ, పుష్ప పురముల తర్కము కళింగ చరిత్రను కొంత విశదీయుట కాధారపడుచున్నది.

---

# ఆంధ్ర భారతి

యోగానందకవి గారు

శ్రీలి నా యిర్వదియేండ్లప్రాయమున నీతోరంపు ప్రేమామృతం
బాలుకం బల్కులు పైకిఁ జిల్కితెటుల ల్లోయమ్మరో, త్వత్కృపా
కలనాపాంగతరంగపాత్రుండ నిటం గానమ్మ, కైకొమ్మ యు
త్కలిక స్మత్కవితాంతరంగ నతి యాంధ్రశ్రీరతీ భారతీ!

నరసెర్ల శీర్షము శ్మశ్రుజాలము భవన్నాట్యాంతరంగంబునం
దురుబుద్ధి న్నడయాడఁ జాలుదునె భావోద్రేకరంగత్తరం
గరమాలింగిత మానసుండనయినం గ్రమాంగి, నేనిప్డు రా
మరమారామనితాంతసంస్మరణ సమ్యగ్గామి నో భారతీ!

నినుఁ జేపట్టినదిట్ట బ్రహ్మ త్రిజగన్నిర్ణేత సత్త్రాత ము
జ్జనకుండుం జనకుండు భూజనులకుర్ల స్వర్గప్రజాజ్యేష్ఠుండుర్ల
బెనుమిన్కుల్ గనినట్టి ప్రోడయుఁగదా పెక్కేల వాక్కుల్ జగ
జ్జనయిత్రీ, మెదిలోటు నీకు విలసత్సంపద్వతీ, భారతీ!

కవితావృద్ధుల వాతెఱ న్నిలుచుచోఁ గల్యాణసంపన్న వా
దవని న్నీకుఁ గొఱంత యింతయును రా దాత్మేప్సితాలంకృతుల్
ఛవిగాఁ గోరిన యన్నియు న్నిరుపమాసక్తి న్సుధోక్తిం దను
చ్ఛవి నిండార నిడంగలారు సుమనస్సంతాను లో భారతీ!

---

# ప్రాచీనాంధ్ర శాసనములు

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

౧

## ఇంచుమించు రెండువేలేండ్లక్రిందటి తెనుఁగు

భట్టిప్రోలు, అమరావతి, గంటసాల, జగ్గయ్యపేట మొదలగు స్థలములందలి బౌద్ధస్తూపముల నిర్మాణవిధానములను, అక్కడిశాసనములను, నే నీనడుమఁ బరిశోధించుచుంటిని. మధ్యాంధ్రదేశముననున్న యాస్తూపములలోనిశాసనాదులందు, ఆంధ్రభాషకు, ఆంధ్రదేశమునకు సంబంధించిన యపూర్వవిషయము లేమేని యగపడునేమోయని నాయాశ. భట్టిప్రోలిస్తూపము క్రీ. పూర్వము ఇంచుమించుగా మున్నూఱేండ్లకింకను మునుపటిదనియు, అమరావతీస్తూపము క్రీ. పూర్వ మిన్నూఱేండ్లకు నిర్మితమై క్రీ.తర్వాత నిన్నూఱేండ్లదాఁకఁ బెంపొందింపఁబడుచు వచ్చినదనియు శాసనలిపిరీతులనుబట్టి, యితరసాధనములనుబట్టి చరిత్రపరిశోధకు లూహించుచున్నారు.

పైస్తూపములు పడఁగొట్టఁబడి పాడయియుండుటచే ననేకశాసనములు శిథిలములై విఱిగి వేర్వాసిపోయినవి. ఆయాశాసనముల స్థానములను వెనుకముందులను, వానికి సంబంధించిన శిల్పచిత్రములను సర్వత్ర స్పష్టముగా గుర్తింపఁ గుదురకున్నది.

1905, 1906 సంవత్సరములలో అమరావతీ స్తూపపుదిబ్బలను దొరతనమువారు మూఁడవతూరి త్రవ్వించిరి. అందుదొరకిన శిల్పచిత్రశాసనాదులను మద్రాసు మ్యూజియమునకుఁ గొనివచ్చిరి. అందు గొన్నిటి నీనడుమనే మ్యూజియము నధికారులు ప్రదర్శనార్థములుగా బయల్పఱిచిరి. స్థలము చాలకపోవుటచే కొన్ని యింకను భూగృహమున గుప్తములై యున్నవి కాని వానిలోని శాసనములను 1920 సం॥ ఎపిగ్రాఫియా ఇండికాలో రమాప్రసాద చందాగారు రా. బ. హెచ్. కృష్ణశాస్త్రిగారితోడ్పాటున ప్రతిబింబములతో సవ్యాఖ్యానముగాఁ బ్రకటించిరి. ఆ శాసనములలోని కెల్ల నాకు ముఖ్యముగా ముచ్చట గొల్పినది మూఁడక్షరములు గల యీ క్రిందిశాసనము.

ఈ శాసనము ఒకగొప్ప నిలువుఱాతి బండమీఁదనున్నది. దాని నిలువుకొలత 3-అడుగులు. అడ్డకొలత 26 అంగుళములు, చిక్కదనము 11 అంగుళములు. ఈ శాసనమునకు వెనుకగాని,ముందుగాని,క్రిందఁగాని,మీఁదఁగాని యింక నక్షరములులేవు. ఈశాసనము ఱాతినడుమ నుండుటచే వెనుకఁగాని, ముందుగాని యక్షరములుగల ఱాతితో సంధిగలదేమో దానిఁబట్టి చేరవలసినయక్షరము లుండునేమో యని యనుమానించుట కవకాశము లేదు. ఈఱాతిభాపైగము గొప్పశిల్పచిత్రము గలదిగా

శాసనము



ఇది మద్రాసుగవర్నమెంటు మ్యూజియము భూగర్భగృహమున నున్నది. నాకోరికపై అక్కడి ఆర్కియాలాజికల్ అసిస్టెంటు రామచంద్రశాస్త్రిగారు దాని ప్రతిబింబము నెత్తియిచ్చిరి. దానిఁబట్టి యీ దిమ్మ చేయఁబడినది.

నుండవలెను. అది విఱుఁగఁగొట్టఁబడినది. ఆవిఱుఁగఁగొట్టఁబడిన శిల్పచిత్రమేదో యిప్పు డున్న జాతినిబట్టి గుర్తింపఁ గుదురదు.

జాతిమీఁది యక్షరము లివి:—

“నా గ బు”

ఈ యక్షరము లించుమించు క్రీ. శ. 2 శతాబ్దినాఁటి బ్రాహ్మి లిపి యక్షరములు. పై శాసనమును బ్రకటించిన రమాప్రసాద చందాగారు దీనిని ఇంగ్లీషులిపిలో “Naga·bu” అని ప్రకటించిరి. వారు ‘నాగ’ వేఱుపదముగాను, ‘బు’ వేఱు పదముగాను, ‘నాగబు’ సమస్తపదముగాను దలఁచి యట్లు వ్రాసిరి. దానిని వారు శిల్పకారునిపేరు గావచ్చు ననిరి. అది పాళీభాషాపదమనియే వారు తలఁచియుందురు. నేను జూచినంతలో పాళిభాషలో నిట్టిపదము కానరాలేదు.

ఇది తెలుఁగు ప్రత్యయాంతమయిన తత్సమపదమని నా తలఁపు నాగబు = అనఁగా నాగంబు, పాము, అని యర్థము. విఱుఁగఁగొట్టఁబడిన మీఁది శిల్పచిత్రము గొప్ప సర్పమై యుండును. మహత్తరములైన పడగలతో నతిసుందరములైన సర్పచిత్రములు అమరావతీస్తూపమునఁ బెక్కులు గలవు.

ఈ శాసనపు లిపిరీతిని బట్టి, అమరావతీ స్తూపనిర్మాణమును గూర్చి యిప్పటివఱకు వెలసిన యూహలనుబట్టి, చూడఁగా, నీశాసనము, క్రీ. శ. రెండవ శతాబ్దికిఁ దర్వాతిది గానేరదు.

పయిశాసనపదము “నాగబు” తెలుఁగు పదమను నాతలఁపు సర్వాంగీకృతమయి, నిరాక్షేపమయి నెగడెనేని, క్రీ. శ. తర్వాత రెండు శతాబ్దులనాఁటికి, సంస్కృతపదములు తెలుఁగు ప్రత్యయములతో తెలుఁగున వ్యవహరింపఁబడుచుండెడివనియు, తెలుఁగుభాష స్వతంత్ర వ్యవహారమునకు, లిపికి అలవడెననియు, ప్రథ

మావిభక్తి ప్రత్యయరూపము 'బు' కూడ అప్పటికే వెలసెననియు నిరూపిత మగును. 'ఎడ్డ' అను పదమునకు ద్విత్వశైథిల్య, తద భావ, పూర్వహల్లోప, పరహల్లోపములచే, ఎడ్డ (ద్విత్వశైథిల్యము '[శ్రీరామేశ కవీశ్వ రాదు లెడ్డనీశ్రీపాదముల్, చూ. కుమా. నన్ని చోడ) ఎడ్డ (శైథిల్యాభావము) ఎడ (పూర్వ హల్లోపము) ఎడ (పరహల్లోపము) అను రూపము లేర్పడినట్లుగా, నాగమ్బు అను పదముకూడ నాగమ్బు (శైథిల్యము, కొట్టమ్బు ల్వణ్డుఅణ్డుగొని చూ. అద్దంకిశాసనము) నాగ మ్బు (శైథిల్యాభావము.) నాగబు (పూర్వ హల్లోపము) నాగము (పరహల్లోపము) అను రూపములఁ బొందెను. (అజవమున శునాంబు, కొంబు, ఒడంబు ఇత్యాది శబ్దముల పోలికను అమహచ్ఛబ్దములకు 'ంబు' ప్రథమావిభక్తి ప్రత్యయముగాఁ దొలుత నుండెను. 'నాగమ్బు' రూపము చాలఁ దర్వాతికాలమున వెలసినది. దీనిఁగూర్చి హెచ్చు చర్చించుట కిది చోటు గాదు

నన్నయనాఁటినుండి మనకు ఆంధ్రపద్య గ్రంథములు దొరకుచున్నవి. శాసనములం దంతకుఁ బూర్వకాలమున నొక్కపద్యమేని, యొక్కపద్యపాదమేని దొరకినను భాషాచరి త్రపరిశీలనమున కది యత్యంతోపకారకమే. 9, 10 శతాబ్దులనాఁటి వట్టివిప్పటికిం గొన్ని దొరకియున్నవి. మఱియు నింతవఱకు క్రీ. 8, 9 శతాబ్దుల నాఁటివి తెలుఁగువచనశాసనములు ను గొన్ని దొరకియున్నవి. అట్టి శాసనము లంత కింకను బూర్వకాలపువి దొరకెనేని యవి యనర్ఘరత్నములే యనఁదగునుగదా! అందును రెండువేల యేండ్లనాఁటిదగు నమరావతీస్తూప మున నట్టిది దొరకెనేని యిఁకఁజెప్పెడి దేమి? అక్కడ తెలుఁగుభాషయొక్క యక్షర మాత్రము దొరకినను నది లక్షరూపాయలు దొరకినట్లు మురియఁదగినదే.

## ౨

## లక్ష్మీపురపు శిలాశాసనము

### శాసనోపలబ్ధి

ఈశిలాశాసనము కృష్ణాజిల్లా దీవితా లూకా లక్ష్మీపురమను గ్రామమున నొక బ్రాహ్మణునియింటి దొడ్డిలో నుండఁగా నా యింటివారికి బంధువగు క్రొత్తపల్లిగ్రామకర ణము ఆ లక్ష్మీపురమునకు 4 మైళ్లదూరము నున్న స్వగ్రామమగు క్రొత్తపల్లికిఁ గొనిపోయి తనయింటి యావరణమున నుంచుకొనెను. ఇప్పటికి 4 ఏండ్లకుముందు నేను నామాతుల శ్వశురగ్రామమగు గంటసాలకుఁబోయి యక్క డ నామేనమామగారివలన నీశాసనస్థితిని విని గంటసాలకు 2 మైళ్ల దూరమున నేయున్న క్రొత్తపల్లెకుఁగూడఁ బోయి శాసనమును జూచి ప్రాఁత యాంధ్రపత్రిక కాగితములమీఁద నప్పటికప్పు డేదోవిధముగా మసిఁబూసి ప్రతి బింబములఁ గొనివచ్చితిని. వానిఁబట్టి యది తెలుఁగుభాష, ప్రాచీనతమము, అనిమాత్రము గుర్తింపఁగుదిరెను. ప్రతిబింబము మిక్కిలి యస్పష్టముగా నుండుటచేతను శాసనము బం

తులు క్రిందినుండి మీఁదికిఁ దల క్రిందుగాఁ జెక్కఁబడియుండుట యప్పుడు గుర్తింపఁ గుదురక పోవుటచేతను నప్పుడు శాసనవిషయమేమియు గోచరింపకపోయెను. ఇటీవల సరియయిన సాధన సామగ్రితో మన్మిత్రులగు శ్రీమాన్ దివి నరసింహాచార్యులుగారిని బంపి మంచి ప్రతిబింబములను దెప్పించుకొంటిని. శ్రీనరసింహాచార్యులుగారు ప్రతిబింబములఁ గొని వచ్చుటకుఁ గ్రొత్తపల్లికిఁ బోఁగా శాసనశిల క్రొత్తపల్లి నుండి గంటసాలకో మచిలీపట్టణమునకో కొంపోఁబడిన ట్లక్కడివారు చెప్పిరట! గంటసాల మచిలీపట్టణములకు వెళ్లి యెట్టకేలకు వారాతాయియున్న చోటును గనుఁగొని, చక్కఁగాఁ బ్రతిబింబములను దీసి నాకుఁ బంపిరి. వారి సాహాయ్యమునకు నేను గడుం గృతజ్ఞుఁడను. ఇప్పు డీశాసనశిల మచిలీపట్టణమున శ్రీ. రొయ్యూరి శేషయ్యపంతులుగారియింట నున్నదట! తొలుత నీశాసనశిల దొరకిన లక్ష్మీపురము గంటసాలకు సరిగా దక్షిణముగా మూఁడు మైళ్లలోను, కళ్లేపల్లికి సరిగా నుత్తరముగా మూఁడుమైళ్లలోను, మచిలీపట్టణము ననుండి చల్లపల్లి కిఁబోవు రోడ్డుమీఁదనున్నది.

శాసనయోగ్యత

ఇంతవఱకుఁ బ్రకటితములయిన తెలుఁగు శాసనము లన్నింటికంటె నీశాసనము ప్రాచీనతమము. బర్గస్ దొరగారు "ద్రవిడసంస్కృత శాసనములు" అను గ్రంథమునను ఫ్లీటుదొరగారు శాసనప్రతిబింబముతో ఇండియన్ ఆంటిక్వరీ XIII వ సంపుటమునను ప్రకటించియు, తెలుఁగుభాగము దురవబోధముగ నున్నదని ఇంగ్లీషుపరివర్తనముచేయక విడిచిపెట్టినట్టియు, కీర్తిశేషులగు కె. వి. లక్ష్మణరావుపంతులుగారు నీమనుండి మరల బ్రతిబింబములఁ దెప్పించి చదివి, చిత్రాడగ్రంథాలయ వార్షికోత్సవ సభాధిపత్యోపన్యాసమునను, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు రాజమహేంద్రవర రాజ నరేంద్రపట్టాభిషేకపుసంచికలోను అర్థావబోధ మెవ్వరికయిన నగునో యని తెలియఁగోరి ప్రకటించినట్టియు అహదనకరశాసనమునకంటె నీశాసనము ప్రాచీనము అహదనకరశాసన కీర్తితుఁడగు విష్ణువర్ధనుఁడు చాళుక్యవిష్ణువర్ధనులలో నాలుగవవాఁడో, అయిదవవాఁడో అగునని ఫ్లీటుదొరగారు తలఁచిరి. మూఁడవవాఁడగునని శ్రీసోమశేఖరశర్మగారు దలఁచిరి. మూఁడవవిష్ణువర్ధనుఁడు మనయీప్రస్తుతశాసనమునఁ జేర్కొనఁబడిన మంగిదొగరాజునకుఁ గుమారుఁడగును. నాలుగవ విష్ణు వర్ధనుఁ డా మూఁడవవిష్ణువర్ధనుని మనుమఁడు. అయిదవ విష్ణు వర్ధనుఁ డాతనిమనుమఁడు. మూఁడవవిష్ణువర్ధనుఁడు క్రీ. 712 నుండి 749 దాఁకను, నాల్గవ విష్ణువర్ధనుఁడు క్రీ.768 నుండి 799 దాఁకను, ఐదవ విష్ణువర్ధనుఁడు క్రీ. 840 నుండి 844 దాఁకను రాజ్య మేలిరి. మూఁడవవిష్ణువర్ధనుని తండ్రియగు మంగిదొగరాజు క్రీ. 675 నుండి 699 దాఁక రా జ్య మే లె ను. మనప్రస్తుతశాసన మాతనిపాలనకాలమున వెలసినది గాన అహదనకరశాసనమునకంటెఁ దప్పక ప్రాచీనమేయగును. క్రీ. ఏడవశతాబ్ది యుత్తరా

ర్థమున తెలుఁగుభాషతో నెలకొల్పఁబడిన దగుట యీ శాసనమునకుఁ గల గొప్ప యోగ్యత. ఇందుఁ జరిత్రోపయుక్తమగు విషయము గానరాదు. కాని భాషాచరిత్ర పరిశోధనమున కిది యత్యంతోపకారకము.

శాసనశిలా, లిపి, రీతులు

ఈశాసనము తెల్లని పాలఱాతిమీఁదఁ జెక్కఁబడినది. అది యమరావతీస్తూపపుఁ దెల్లఱాలను బోలినది. అమరావతి, భట్టిప్రోలు, గంటసాల మొదలగు స్థలములందలి బౌద్ధస్తూపములలోని మేలయిన పాలఱాలే కృష్ణా, గుంటూరుమండలములందలి పెక్కు శివాలయములలోఁ గానవచ్చుచున్నవి. క్రీ. 3-వశతాబ్దమువఱకుఁ గూడ నాయాబౌద్ధస్తూపములు శైవమతములవారిచే శిథిలపఱుపఁబడుచు నందలి మేలిఱాలతో శివాలయములు నిర్మింపఁబడుచు నుండినట్లు తలఁపఁదగును. పెదకళ్ళేపల్లిశివాలయమున బౌద్ధులయర్థధర్మచక్రములుగలపాలఱాతిస్తంభములు పెక్కులు గానవచ్చును. అమరావతిలోని యమరేశ్వరాలయమునఁగూడ స్తూపశిలలు గలవు. ఇట్లు పెక్కుశివాలయములందుఁ గలవు. ప్రస్తుతశాసనశిలగూడఁ దొలుత స్తూపపుఱాయి యయి యుండవచ్చును. ఇది ఇంచుమించు మూరకుఁ దక్కువవెడల్పును, రెండుమూరల పొడవును, నాల్గంగుళముల చిక్కఁదనమును గల్గియున్నది. ఱాతికి రెండువైపులను శాసనము గలదు. రెండువైపులనుగూడ శాసనపుఁ బంక్తులు క్రింది నుండి మీఁదికిఁ జెక్కఁబడినవి. రెండవవైపున 18 వ బంతిమాత్రము దేని యొఱపిడిచే తనో సంపూర్ణముగా రూపుమాసినది. శాసనాక్షరములు ప్రాచీనచాళుక్య లిపి రీతిని మంగియువరాజునాఁటి తామ్రశాసనాక్షరములను సరిగాఁ బోలియున్నవి. మఱియు నీశాసనపుఁ దెలుఁగుభాషయు, లిపిరీతియుఁ గడప నెల్లూరుమండలములందు దొరకిన చోడబాణ వైదుంబరాజుల (అందుఁ గొన్ని యేని 7, 8 శతాబ్దులవి గావచ్చును.) ప్రాచీనాంధ్రశాసనముల భాషతోను, లిపితోను గొంతపోలికగలిగి యున్నవి. ఆపోలికల నిందు ముందుఁ గొంత నిరూపింతును.

ఈశాసనమున హల్లులకుఁ గొమ్ములు మూఁడుదెఱఁగులుగా నున్నవి. మొదటిబంతిలో 'జు' 'ము'లవలె నింకఁ బెక్కుచోట్లఁగల హల్లుల కొమ్ములకును, ఆఱవ పదునాఱవ బంతులలోని 'కు' 'రు'ల కొమ్ములకును, ఎన్మిదవ, తొమ్మిదవ, పదోకొండవబంతులలోని 'ఢ్లు' 'ద్రు' 'తు'ల కొమ్ములకును భేదము చూడఁదగును. మూఁడవబంతిలోని కడపటియక్షరమస్పష్టముగా నున్నది.

శాసనవిషయము

తూర్పుచాళుక్యరాజగు మంగియువరాజు రాజ్యమేలుచుండఁగా నాతనిక్రింది చిన్నియేలికయో, మండలాధిపుఁడో, యుద్యోగియో అగు విట్టాజు రాజ్యమునకడువండ్లులగ్రామమున మిరియంపు బోళజయనువానికొఱకయి జెంగఱియ

నువాఁడు పదునేనుము ఆళ్ల విత్తనాలు పట్టునట్టి రెండుపట్లభూమిని పడసెననియు ఆభూమికిఁ దూర్పు సీమాచిహ్నములు దుర్గాదేవి నేలయును, ఉఱువుటూరి బోల రెండుట్టి (రెండుపట్ల భూమిని)యు ననియు ఈ రెండుపట్లభూమిని జెఱచువారు కలరేని వారు వారణాశిలో వేయి కపిలగోవులను, వేయిగుళ్లను, వేయిచెఱువులను, వేవురుబ్రాహ్మణులను జంపినపాపమును గుడుతురనియు, శాసనార్థముగా నాకుఁ దోఁచినది. 'యస్య యస్య యదాభూమి' రిత్యాది సర్వశాసన సాధారణశ్లోకము కడపట నున్నది.

ఈ శాసనము లక్ష్మీపురమున నుండుట చేతను, శాసనములో 'ఉఱువుటూరు' పేర్కొనఁబడియుండుటచేతను, మఱియు 'కడువండ్లుల' 'కోడాలి' యనుపేర నేఁడు వ్యవహరింపఁబడు గ్రామమేమోయని యనుకొనఁదగి యుండుట చేతను, నీశాసనమునందు ఒసగఁబడినదిగాఁ జెప్పఁబడినభూమి పయిగ్రామములకుఁ జేరువగా నున్న దే యగునని తలఁపఁదగును. ఈశాసనమునఁ బ్రస్తుతుఁడగు మహారాజు మంగియువరాజు బెజవాడరాజధానిగాఁ రాజ్యమేలుచుండఁబోలును. శ్రీ జయంతి రామయ్యపంతులుగారు ప్రకటించిన యా మంగియువరాజు దానశాసనమున నాతడు "విజయవాడ"నుండి దాని వెలయించినట్లు గలదు.*

ఈ శాసనమునఁ గొన్నిపదముల కర్థము స్పష్టముగా నాకుఁ దెలియకున్నది. ఒక్కొక్కపదమును గ్రహించి శబ్దనిష్పత్తినిగూర్చియు అర్థమునుగూర్చియు నాకుఁదోఁచిన వివరణములను జెప్పెదను. ఈ శాసనమునకుఁగాని, యందలిపదములకుఁగాని, నేను జెప్పిన యర్థమును, వివృతియు నిరాక్షేపము లనునమ్మిక నాకే లేదు. పాఠకు లింకను బరిశోధించి విశేషములు గోచరించినఁ దెలుపఁగలరని విశ్వసించుచున్నాఁడను.

స్వస్తిశ్రీ—ఇదిమంగళార్థకము వైదికమతమువారి గ్రంథములయు, లేఖములయు నారంభమునఁ బ్రయోగింపఁబడును. బౌద్ధుల గ్రంథములయు, లేఖములయు, నారంభమున 'సిద్ధమ్' అని యుండును.

మంగిదోగరాజు—మంఘిదోగ; మంగియువ, మంగిదుగ, మంగిదోవ, మంగిదువ, రూపములుగూడఁ గలవు. నేఁటి 'మంగయ్య, మంగమ్మ' పేళ్లకు నీపేరికి సంబంధము గలదేమో! నేఁటి యీ పేళ్లను 'అలర్మేలుమంగై' 'అలమేలుమంగమ్మ' పేరి సంగ్రహరూపముగాఁ గూడఁ జెప్పఁజెల్లును. మంగిప్రోఁడి యీ మంగియువరాజుపేర వెలసియుండవచ్చును.

ముడ్లు—'మంగిదోగరాజులముడ్లు' అనునది షష్ఠీసమాసము. తొలుత నేను 'రాజుల తర్వాత 'త' అనునక్షర మొక్కటి వ్రాఁత పొరపాటుచే లోపించెనేమో! 'రాజులతముడ్లు' అని యుండవలెనేమో అని తలపోసితిని గాని పరిశోధింపఁగా నట్లుగాదనియు 'ముడ్లు'అని మే

* చూ. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక 2-వ సంపుటము, 2-వ సంచిక.

యుండవలెననియుఁ దెలిసెడి. చరిత్రపరిశోధకు లింతవఱకు మంగియువరాజునకు విట్టరాజుపేరి వానిఁ దమ్మునిగ నెఱుఁగరు. 'ముష్లు' అనుపద మితరశాసనములందును నిట్టి వాక్యసందర్భములందే కానవచ్చెను. అట్టివానిఁ జూపుచున్నాఁడను. అహదనకరశాసన. 27 పంక్తిలో:-

"[1]పసిణ్డిముష్లు వెటన్దల చరువయ్య." మఱియు శాసనపరిశోధక శాఖవారి 1904 సం॥ శాసనసంచయములో 406 సంఖ్యగల శాసనమున, "[2]శ్రీస్త్రైయరి కొడుకు మర మయ ముష్లు," ఈశబ్దము రూపనిష్పత్తిగూర్చి సంపూర్ణచర్చ అహదనకర శాసనమునఁ జేయుదును. అర్థమువూత్ర మిక్కడ:—మంగిదొగ రాజులముష్లు = మంగిదొగరాజులక్రింది యధికారి లేక చిన్న మేలిక అనియర్థముగావచ్చును. పసిణ్డిముష్లు=అనుచోటఁగూడ స్వర్ణా (భాండాగారా)ధికారి యని యర్థము గావచ్చును. మూఁడవ యుదాహరణమునఁగూడ రాజు చేసిన ధర్మమును రక్షించు నధికారులను జెప్పు సందర్భమున నాపద మున్నది.

విట్టజుల—'విట్టరాజుల' అని యుండవలసినది. తెలుఁగుభాష ఏనాఁటనుండి శాసనాదులలోఁ గానవచ్చుచున్నదో ఆనాఁటనుండియు శకటరేఫవివేకము సరిగా నుండకపోవుటయే గానవచ్చుచున్నది. 'రాజు'లో బండిఱా వ్రాతసరిగాదు. పెక్కుశాసనములలో నది సాధురేఫముగాఁగూడ వ్రాయఁబడినది. ఈశాసనము వ్యవహారభాషలో నున్నదిగాన యది ప్రమాదముగాఁ బరిగణింపఁగా దనఁగాదు. ప్రౌఢపద్యమయశాసనములందుఁగూడ నిట్టిశబ్దిబ్బుఁ గలదు. నన్నయకుఁ బూర్వకాలమునాఁటిదగు [3]నన్దంపకశిలాశాసనమునఁ దరువోజలో "కొట్టంబుల్వెట్టెను" ఇట్టివాని నెన్నింటినేని చూపవచ్చును. మఱియుఁ బ్రాచీనశాసనము లందు హ్రస్వదీర్ఘముల లిపిభేదము నంతజాగ్రత్తగాఁ బాటించుట గానరాదు. కావున 'విట్టజు' అనుదాని 'విట్టజు'గా మనము గ్రహింపవలెను.

ప్రథమరాజ్యంబున — ఈ పదమే యర్థమునఁ బ్రయోగింపఁబడెనో స్పష్టముగా నిరూపింపఁజాలకున్నాను. మంగియువరాజు నూఁతులపట్టు తామ్రశాసనమునందు 'ప్రవర్ధమానవిజయరాజ్యసంవత్సరే' అని కలదు. మఱి యాకాలపు శాసనములందుఁ బెక్కింటఁగూడ నట్లుగలదు. కాన 'ప్రవర్ధమాన' పదమున కిది వాడుకలోఁగల రూపవికారముగా ననుకొనవచ్చును. లేక 'ప్రథమరాజ్యంబున' అను పదమేని కావచ్చును. బటర్‌వర్త్ వేణుగోపాలసెట్టిగార్లు ప్రకటించిన నెల్లూరుజిల్లా పొదలిడివిజన్

1. దీనిని జదివినవారెల్లరు 'పసిణ్డిముష్లు' అని చదివిరి. వచ్చెనెల భారతిలో ఈయహదనకర శాసనమును నేను అర్థవివరణముతో పరలఁ బ్రకటింపనున్నాఁడను. సంపూర్ణచర్చ నక్కడ చేయుదును.

2. శాసనము చాలశిథిలమై అస్పష్టముగా నున్నది. అప్రకటితము. గవర్నమెంటు ఎపిగ్రఫీ ఆఫీసులో దీనిని జదివితిని. ఇది అముద్రితము.

3. ఈశాసనమును శ్రీసోమశేఖరశర్మగారు భారతి (౧౧ వ సంపు. 3 వ సంచిక)లో ప్రకటించిరి.

శాసనములందు "స్వస్తిశ్రీ విష్ణువర్ధనమహారాజులాకు ప్రవర్ధమాన విజరా[జు] ప్రథమరా[జ్యం]బున శివాప్పరాజుళ్" అని కలదు. ఇందు ప్రవర్ధమాన 'ప్రథమరాజ్య' పదములు రెండును గలవు. రాచటికపుఁ బ్రథమవత్సర మను నర్థమున 'బ్రథమరాజ్య' మని ప్రయోగమేమో! 'ప్రథమ'కు 'ప్రతమ' అనుట నేఁడును అఱవదేశమునఁ గలదు. సంస్కృతభాషాప్రచార ప్రాబల్యము, తదుచ్చారప్రాబల్యము ఆకాలమున నంతగా లేకపోవుటచేఁగాఁబోలు 'ప్రతమ' పదము అనార్యోచ్చారానుగుణలిపితో నున్నది. 'రాజ్యంబున'అనువిధమున'మ్బు'కు బదులు 'ంబు' వ్రాయుటకూడ నప్పటికిఁ గలదు. కాని యిక్కడ నొక్క విశేషము (శాసనప్రతిబింబము చూచునది.) 'రాజ్యంబున' అని 'జ్య' తర్వాతనుండవలసిన బిందువు 'బు' తలమీఁదనున్నది. ఈతీరు, ఇంచుమించుగా దశమశతాబ్ది శాసనముల నఱకును గలదు. బిల్హణకవి శ్లోకమున నీవిషయము గలదు:—

శ్లో. బిందుద్వంద్వతరఙ్గితాగ్రసరణిః కర్తా శిరో
బిన్దుకం, కర్మేతి క్రమశిక్షితాన్వయకలా
యే కేఽపి తేభ్యోఽఞ్జలిః; యేతుగ్రన్థసహస్ర
శాణకషణత్రుట్యత్కళఙ్కైర్గిరా, ముల్లా
సైః కవయన్తి బిల్హణకవి స్తేష్వేవ సన్న
హ్యతి.

ఈతఁడు విక్రమాంకదేవుని యాస్థానకవిగాన చాళుక్యలిపినే యిందుద్ఘాటించినాఁడు.

ఈశాసనకాలమునకుఁ గొన్ని సంయుక్తాక్షరములందలి తొలి యను నాసికమునకు లిపిలో బిందువు (చుక్క (.) సున్న (౦) గాదు.) రూపాంతరముగానుండెడిది. కావున 'రాజ్యంబు' అనువిధమునను 'మిరియమ్బు' అను విధమునను లిపిగలదు. చుక్కక్రింద 'బు' వ్రాయుట యనఁగా మకారముక్రింద 'బు' వ్రాయుటే కాని కొన్ని శాసనములలో చింత, పుంత ఇత్యాదిలిపులలోఁ గొన్నింట 'త'కును బూర్వము బంతినడుమగాక మీఁదితట్టున నే బిందువుండుటకూడఁ గాననగును. ఈ బిందువిన్యాసమునుగూర్చి వేఱుగాఁ గొంతపరిశోధనము జరపవలసి యున్నది.

కడువండ్లుల—ఇది గ్రామనామముగావచ్చును. ఈ పదమున 'ఙ్లు' అస్పష్టముగా నున్నది. అది 'ఙ్లు' 'జ్లు' కూడఁగావచ్చును. ఈశాసనము దొరకిన లక్ష్మీపురమునకును శాసనమునఁ బేర్కొనఁబడిన వేఱొకగ్రామమగు ఉఱువుటూరికిని నడుమ 'కొడాలి' యనుగ్రామ మొకటి గలదు. ఈ'కడువండ్లు' నేఁటి కొడాలిగ్రామము గావచ్చును. అది యీశాసన మీనడుమనున్న క్రొత్తపల్లెకు మైలునరదూరములో నున్నది.

రెన్డువటి—ఈపదమునర్థ మస్పష్టము. ఇట్టిపద మితరశాసనములందును నాకుఁగానరాలేదు. రెండు + పట్టి, పదముల ద్విగుసమాసము గావచ్చును. ఇరుగేలు, అన్నట్టు

ఈసమాసము ఏకవచనాంతముగాను నుండును. సమాసమునఁగూడఁ సంఖ్యావాచకముల మీఁది కచటతపలు గసడదవ లగును గాన రెండు + పట్టి రెండువట్టి అగును. ఈశాసనమున నీపదము రెండువటి, రెండువట్టి, రెండుట్టి అనురూపములతో నాలుగుచోట్లఁ గలదు. ఇందేరూపము శబ్దనిష్పత్తిరీతికి సన్నిహితమో! ఉచ్చారణవికారములవలని తర్వాతి రూపము లేవో! అర్వాచీనభాషలో నీపద మెట్టిరూపము నుబొందినదో! సరిగాఁగుర్తింపఁజాలకున్నాను. ఇది భూసామాన్యార్థకము గాని, దానార్థకముగాని, భూపరిమాణార్థకము గాని, భూవిశేషార్థకము గాని యగుచో నిక్కడ నర్థము సరిపడును. ఇప్పటికి నేను 'రెండువట్టి'పదమును శబ్దనిష్పత్తికి సరిపడుదానిగాఁగొని రెండుపట్టులభూమియనియర్థము చేసికొంటిని శాసనమున నిక్కడి కొకవాక్యము ముగిసినట్లు నేను దలఁచుచున్నాఁడను.

మిరియమ్ము బోళజకు—ఇది షష్ఠీతత్పురుషము. నేఁటి భాషాపరిశోధకప్రవరులు కొందఱు విభక్తిముకారమునకు పు, ంపులు, కర్మధారయసమాసముననే వచ్చునుగాని షష్ఠీసమాసమున రావందురు. షష్ఠీసమాసమునఁ గూడ వచ్చునని సూత్రించిన చిన్నయసూరిపై నెఱుంగమి వెట్టుదురు.[1] బసవపురాణపుఁ బీఠికలో నీ యెఱుంగమి యాక్షేపించువారిదిగాని చిన్నయసూరిగారిది గాదని తెలుపుటకై తిక్కనసోమయాజులవారి భారత ప్రయోగములను 'కయ్యపువెరవు'—ఇత్యాదులను ప్రాసగతములను జూపితిని. ప్రాసేతరస్థలములం దసంఖ్యాకములుగలవుగాని వాని వారు పాటింపరని ప్రాసగతములఁ జూపితిని. దాని మీఁద మరల నాప్రయోగము తిక్కనకాలమున కేర్పడినదిగాని నన్నయనాఁట లేదనియు, నన్నయ ప్రయోగింప లేదనియు వాదము మాఱెను. నన్నయ భారతభాగమునఁ బ్రాసస్థలమున నట్టి ప్రయోగము గాన రాలేదు. ప్రాసేతరస్థలములను వారు పాటింపరు. నన్నయ తననాఁటి శబ్దరీతులనెల్ల యతిప్రాసగతములఁ గావింపఁ బనిగొనెనా? ఈశాసనమందలి 'మిరియమ్ము బోళజ' పదము నన్నయ

---

1. ఆంధ్రదేశమం దాంధ్రవాఙ్మయపరిశోధన భిక్షము పెట్టి యాంధ్రులకు భాషాప్రపంచమున బ్రదుకుఁదెరువుఁ జూపిన చిన్నయసూరియు, సీతారామాచార్యులు నఱవదేశమువారని నింద. వేలుతప్పులు వ్రాసిరని వెక్కిరింపు! ఆక్షేపించువారుతా రెక్కడివారో? వీను కెన్నితప్పులున్నవో! చూచుకొన్నఁగదా! అల్పవువేతనముతో భుక్తి గడపుకొనుచు నితరలాభముల నెఱుఁగక యాయుష్కాలమెల్ల నాంధ్రభాషాభ్యుదయమునకై ధారవోసిన మహనీయులను చిన్నయసూరిని, సీతారామాచార్యులను దెగడుచున్నవారినిగూర్చి నేను మిగుల వగచుచున్నాను. చిన్నయసూరిగారు సూర్యోదయకాలమునకు స్నానముచేసి కూర్చుండి ఒకటి రెండేని ప్రయోగవిశేషముల గుర్తింపక భుజింపఁబోయెడువారు గారట! ఇప్పటివలెఁ దగినంత గ్రంథసామగ్రి దొరకని కాలమున, సరియయిన సాధనములు లేని కాలమున ఒక్కచేతిమీఁద నిఘంటువులను, వ్యాకరణములను రచించిన పయి పండితద్వయమును దలఁచుకొన్న నా హృదయము జలువరించును. పండితులను దెగడుటన్నఁ గొందఱ కిప్పుడు పరమాన్నముగా నున్నది.

నాఁటి కింకను నన్నూ తేండ్లకుముందే షష్ఠీస మాసమున 'ంపు' ఉండుటను నిరూపించుచు న్నది. మఱియు నీసమాసమందలి 'మిరియమ్ము' తన ప్రథమావిభక్త్యంతరరూపము 'మిరియ ము' అని యుండుటను గూడ నిరూపించుచు న్నది. అట్టి రూపములను 7, 8, 9 శతాబ్దులవి కాఁదగిన మఱికొన్ని శాసనముల నుండికూడఁ జూపుచున్నాఁడను. నెల్లూరిశాసనములలో పేజి 1073 నన్నూరుశాసనమున "చిన్నములు" 1151 పుట, బుడమనరాయలపాడు శాసన మున "దేశము" విభవ చైత్రభారతిలో శ్రీ సోమశేఖరశర్మగారు ప్రకటించిన ధర్మవర శాసనమున "బింకము, పురము"

'మిరియంపు' అనునది నేఁడు మన 'యింటిపే' రనఁబడుపే రనఁదగును. అది యి ప్పుడును షష్ఠీ సమాసముననే యుండును. వంగిపురపు శేషాచార్యులు, శ్రీ కాకుళపు సుబ్బారాయఁడు ఇత్యాదులు చూడఁదగును. మిరియాలవారని యింటిపేరివారు తెలుఁగు దేశమున నేఁడు నున్నారు.

'బోళజ',—'భోజ'పదమునుండి'బోళ' పదము పుట్టియుండవచ్చును. ఆపదమునకు భూస్వామి యని యర్థము. ఆర్యపదమునకుఁ బ్రాకృతరూపము 'అజ్జ'. అది నామపదము తోఁ గూడి వ్యవహారమున 'అజ'గా మాఱి నది. 'అజ' నేఁటి 'అయ' అయినది. 'అజ్జ' 'అయ్య' అయినది. తెలుఁగు శాసనములలో 'ఆర్య' పదము అజగా నున్న రూపములు 'బోళజ' వంటివి అరుదు. శివస్కందవర్మ ప్రాకృతశాసనమునఁ గలవు. బోలు=బోయలు అనునర్థమున శాసనప్రయోగములు గలవు.

తెంగరి—ఇది తేఁగరియని చదువవలె నో, 'తెంగరి' యని చదువవలెనో తెలియదు. మనుష్యునిపే రనుకొన్నాను.

పెడశిన— ఇందు 'ప'కు తప్పగా 'ఎత్వ ము' వ్రాయఁబడినది. (శాసనముచూచునది) వ్యాకరణసంస్కారమునుబొందియిట్టిపదములు 'పడసిన' ఇత్యాదివిధములఁ బ్రయుక్తము లగు చున్నవి. కాని నేఁడును వాడుకభాషలో 'పడ శిన, చేశిన, వ్రాశిన, 'తెలిశిన' ఇత్యాదివిధమున నే వ్రాఁతయు, ఉచ్చారమును ఉన్నది.

పదేన్దుంబు—పదునైదుతూములు గలది. పదేను + తూంబు - సమాసమున పదేన్దుం బుగా నయినది. అర్వాచీనపుఁ దెనుఁగున 'తూంబు' తూముగాను 'పదేన్దుంబు' 'పదేన్ద ము' గాను మాఱినవి.

అడ్లపట్టు—అడ్లు (కోద్రవ ధాన్యము) పట్టు నట్టిది. అనఁగా పదునైదుతూముల కో ద్రవధాన్యము విత్తులుగాఁ జల్లఁదగి నంతది (నేల) యని యర్థము. ఆనాఁడు భూపరిమాణ ము నీ విధమునఁ జెప్పుట గలదు. మంగి యువ రాజు మాముఁలపట్టుశాసనమున "యి...ద్వాదశ ఖండికాకోద్రవ ...... క్షేత్రం......దత్తమ్" అనియు 2 అమ్మరాజు శాసనమున "ద్వాదశ ఖండికోద్రవ బీజావాపక్షేత్ర ముదకపూర్వం" అనియుఁ గలదు. మఱియు బటర్వర్తు వేణుగో పాలసెట్టిగార్లు ప్రకటించిన నెల్లూరి శాసనము

లందు (607 పుట) నెల్లూరు తాలూకా పెట్లూరు వీరభద్రస్వామిగుడి గోడమీఁది శాసనమున "ఇచ్చినది పన్దుంబు ఆడ్లపట్టు నేను" అని రెండు తడవలు వచ్చెను: (677 పుట) కనిగిరి తాలూకా నలజనంపాటి శాసనమున[1] "ఆఱ్లపట్టు క్షేత్రంబును...ఇచ్చిరి." అని తత్ప్రకాశకులు చదివిరి. నేను 'ఆడ్లపట్టు' అని చదువుదును. మఱియు 291 పుట దర్శిడివిజను బోడనంపాడు శాసనమున "పళ్యంబు ఆడ్లపట్టు వావి" ఇత్యాది. (1151 పుట.) పొదలిడివిజను బుడమనరాయలపాడు శాసనమున,-- "నాలుగువుట్లు ఆడ్లపటు నే (నుఇ) చ్చి[రి]." ఇత్యాదులు పెక్కులున్నవి. ఈయుదాహరించిన శాసనములందు "ఆడ్లపట్టు" ఉండఁగా మనప్రస్తుత శాసనమున 'ఆఱ్లుపట్టు' ఉన్నది. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు సప్రతిబింబముగా ప్రకటించిన[2] అద్దంకి శిలాశాసనమునఁ గూడ నిట్లే "ఎనుబొదివుట్ల ఆఱ్లుపట్టు నేల" అని కలదు. చోడి శబ్దమునకు బహువచనము చోడ్లు, చోళ్లు, అనియు 'ఆడి' శబ్దమునకు బహువచనము 'ఆడ్లు' 'ఆళ్లు', అనియు నేర్పడి యుండుననని నాతలంపు. 'చోడి ఆడి' ధాన్యవిశేషవాచకములు. ప్రాచీనకాలపుఁ దెలుఁగుదేశపు శాసనములందు భూపరిమాణము ఆళ్లవిస్తీర్ణముల చల్లుటనుబట్టి యుండుటచే నాకాలమున నాంధ్రదేశమున ముఖ్యమయిన పైరు పంట 'ఆడి' యని తలఁపఁదగును. నేఁడున్న కృష్ణా గోదావరీ బహుకుల్యా సారణీ ప్రవాహసౌభాగ్యము నాఁడు లేదుగాన ఝిల్లీభోగములు, మొలకొలుకులు, వంకసన్నాలు, జీలకఱ్ఱసన్నాలు నాఁడు పండకుండ వచ్చును. తెలుఁగుదేశమున 'ఆడి' పంట యుండినట్లే అఱవదేశమున 'చోడి' పంట యుండెడిది గాఁబోలును! చోడిపండెడు దేశమగుటనుబట్టి యాదేశమునకు చోడమనియు, ఆడి పండెడు దేశమగుటను బట్టి యీదేశమునకు ఆంధ్రమనియుఁ గూడఁ బేళ్లేర్పడి యుండవచ్చును. ఇది యూహామాత్రము. కోద్రవధాన్యమునకుఁ దెలుఁగున 'ఆరుగ' లనియుఁ బేరుగలదు. 'ఆరిగ' లనియు నేఁటి వ్యవహారము గలదు.

ద్రుగ్గాదేవినేల — దుర్గాదేవి యనుటకు ద్రుగ్గాదేవి యనుట. అఱవదేశమున నేఁడును సంస్కృత శబ్దోచ్చార పరిచయము తక్కువగుటచే సంస్కృతము రానివారు 'సంబంధము' అనుటకు 'సంభంధము' అనుటకలదు. సులువుగా నుచ్చరింపరాని యక్షరమును సరిగా జాగ్రత్తగా నుచ్చరించుటకై ముందుగాఁ బూనిన యధికపుఁ బూనికిలో నాక్లిష్టోచ్చారమది యుచ్చరింప వలసినచోటి కింకను ముందే యుచ్చరిత మగును. మఱిత్రోఁ ద్రోవ నరుగు

1. ఇది 'ఆడ్లపట్టు' అనియే చదువవలెనని నా నమ్మకము. ఈసందర్భమునఁ దెలుప వలసిన విషయము చాలఁగలదు. దాని నెల్ల అహదనకర శాసన వివరణమునఁ జెప్పుదును. ఈచర్చ కక్కడ ప్రసక్తి యధికముగా, ముఖ్యముగాఁ గలదు.

2. భారతి 5-వ సంపుటము వ-3 సంచిక చూచునది.

వారు ఎంగిలియాకునుజూచి దానియావలికంగ వేయుటకై యది యింకను దూరమున నుండఁగానే జాగ్రత్తపడి వేసినయంగ దానిమీఁదికే పడుటవంటి దిది. మర్గు మ్రగ్గు, పుర్వు ప్రువ్వు ఇత్యాది శబ్దములలో ద్వితీయరూపములి ట్లేర్పడినవే. దుర్గాశబ్దము పూర్వకాలమున ఇకారాంతముగాఁ గూడ నుండెడిది. 'తన్నో దుర్గిః ప్రచోదయాత్' అనివైదికప్రయోగము.

క. చరణసరోరుహ రాగ
స్ఫురణన్మహిషునిశిరంబువోలుపుగసంధ్యా
భ్రరుచి నెనయ మెట్టిన స
త్కరుణాన్వితదుర్గివరముగాటయకొనగున్.

—గణపతిదేవునినాఁటి పద్యశాసనము.

'నేల'—'నిలం' అని యఱవమునఁ బేరు. నేల, నిలం రెండును 'నిల్' ధాతువున నుండి పుట్టినవి. నిల్ నుండి ముందుపుట్టినరూపము నిలం, తర్వాతఁ బుట్టిన రూపము 'నేల' కాఁదగును. సంస్కృతమునఁ గల 'ఇలా' శబ్దము ఈ శబ్దములనుండి యేర్పడినదికూడఁ గావచ్చును. భూమి పర్యాయపదములు సంస్కృతమునఁ బెక్కులు గలవు. అందుఁ గొన్ని యీవిధముగా నార్యావర్తమునను దక్షిణాపథమునను గల దేశభేదముల దేశిభాషల నుండి సంస్కృతమునకుఁ జేరినవి గావచ్చును: నదులు, పర్వతములు, వృక్షములు, ఆభరణములు, ఆచారములు మొదలగునవి కొన్నికొన్ని దేశములందే వ్యవహారముగలవై దేశిభాషలలోఁ బేళ్లు గలవై యుండును. అందుఁ గొన్ని యావశ్యకతను బట్టి సంస్కృతభాష యాదేశములందు వ్యవహృత మగునపుడు అందుఁ జేరి యుండవచ్చును. గోదావరీ, కావేరీ పదములు తొలుత దేశిభాషా పదములయి తర్వాత సంస్కృతమునఁ జేరియుండవచ్చును. పయి పదముల లోని కడపటి రెండక్షరములు 'ఏఱు' అనునది వాచక పదపు సంస్కృతవికారములు గావచ్చును. గోదావరికి 'గోదా' అనియు వ్యవహారముగలదుగాన కడపటి రెండక్షరములు 'ఏఱు' వికారమగుట పొసఁగును. 'గోలా' 'గోలేయూ' అని గోదావరికి ప్రాకృతపుఁ బేళ్లు. కావేరీపదములోని కడపటి రెండక్షరములు 'ఏఱు' పదము వికారము లనుటకు 'కావేటికాల్వ'లను వ్యవహారము సాధకము. 'మలయము' (పర్వతము)అనుపేరు ద్రవిడ దేశిపదమే. తాళహింతాళ పదములు తాడు ఈందాడు అను తెనుఁగు పదముల సంస్కృత వికారములు. 'గోరంట' పదపు సంస్కృత వికారమే కురంటక పదము. 'గోరంట' యను పేరు గోరు + అంట, అను పదముల కూడికచేఁ బుట్టినది. ఆచెట్టు చిగుళ్లు నఖరంజకములు. (దాని నూరి గోళ్ల కంటించుకొందురు) గాన యాచెట్టుకు గోరంట యని పేరయ్యెను. అది సంస్కృతీకరింపఁగా 'కురంటక' మయ్యెను. పూర్వకాలమున (నేఁడును దక్షిణదేశమున) కర్ణాభరణములఁగాఁ దాటియాకు చుట్టల నుంచుకొనెడివారు. కనుకనే కర్ణాభరణములకు 'కమ్మ' లని పేరయ్యెను. కమ్మయనఁగాఁ దాటియాకు. సంస్కృతమున శ్రీశంకరాచార్యులవారు దేవీస్తుతిలోఁ 'అవటుతటఘటితత

చూళీ తాడిత తాళీపలాశ తాటంకామ్' అని వర్ణనము చేసిరి. కమ్మలకు సంస్కృతమున 'తాటంక' మని పేరు. తాటంక పదము తాటాకు పదపు సంస్కృత వికారమే యని నా నమ్మకము. ఇంక నీవిపులపరిశీలనము విడిచి శాసనమునకుఁ జేరవత్తును.

ఉఱువుటూరిబోళ—ఊఱువుటూ రిప్పుడు ఉరుటూరను పేర గుడివాడ తాలూకాలో పామర్తి (పూర్వము పబర్తు పాంబర్తు)కి దగ్గఱగా నున్నది. గుణగవిజయాదిత్యుని తామ్రశాసన మీయూరి దొకటిగలదు. ఆశాసనమందును ఉఱువుటూ రనుపేరే కలదు.

తూఱ్పు—ఇది తూఱుధాతువు కృదంత రూపము. మూఱుధాతువుననుండి మూఱుపు మూఱ్పు పుట్టినట్టే తూఱుధాతువున నుండి తూఱుపు తూఱ్పు పదములు పుట్టినవి.

ఱచువరు—ఱచ్చువారు చెఱుచువారు. ఱయ్యుధాతువు ప్రేరణరూపము ఱచ్చు, దీనినిగూర్చి శ్రీజయంతి రామయ్యపంతులుగారు యుద్ధమల్లశాసనమునఁ గొంతవివృతి వ్రాసిరి.[1] 'ఱయ్యు ఱచ్చు' లే డయ్యు, డచ్చులుగా మాఱినవి. 'వ్రయ్యు వ్రచ్చు' లు గూడఁ గలవు. శాసనములం దవి ఱయ్యు ఱచ్చులు ప్రయోగింపఁబడు పట్టుననే ప్రయోగింపఁబడును. కావున వాని కర్థభేదములేదు. 'వ్రయ్యు' ఱయ్యునుండి పుట్టియుండవచ్చును. ఎపిగ్రఫి ఆఫీసువారి 1904 సంవత్సరపు 406 సంఖ్యగల ప్రాచీనశాసనమున 'వ్రచ్చు'ను గూడఁ జూచితిని. నన్నయకుఁ బ్రాచీనకాలపు శాసనములలో నిట్టిపట్టులందు 'వక్రంబువచ్చువారు' 'ప్రతిరవలు వచ్చువారు' అనికూడఁ దఱచుగాఁ బ్రయోగములు గలవు.

కళరేని—ఉండిరేని. 'కళరు' నన్నయనాఁటికే 'కలరు'గా మాఱినది. దేశిపదములలో నేఁడు 'ల'గా నుచ్చరింపఁబడునక్షరము నన్నయకుఁ బూర్వకాలమునఁ బెక్కుపట్టుల 'ళ' గా నుండెడిది. అంతను బహువచనరూపము గళ్ లోని 'ళ్' గాన, 'ళ్' 'ళు' రూపములతోనుండెడిది. ఈశాసనమందే 'కవిలాళు' 'చెఱువుళు' చూడఁదగును.

వేగవిలాళు—వేయికపిలగోవులు. సహస్రమను నర్థమున వే, వేయు ప్రాచీనరూపములు. వేయి అర్వాచీనరూపము. బటర్వర్తు వేణుగోపాలసెట్టిగార్లు (నెల్లూరుజిల్లా శాసనములు 1155 పుట) పోడలిడివిజన్ బుడమరాయలపాడు గంగమ్మగుడిశాసనమున వేయు ప్రయోగములఁ జూడఁదగును "వెయుగుళ్లువు వెయు చెఱువుళు వేయుగవిలాళు, వేవురు పాఱను వేవు (ళ్?) కన్న్యళను ... చ్చినవి (స్త్ర్య?) అయ్యెదు." మఱియు రావుబహదూర్ హెచ్ కృష్ణశాస్త్రిలుగారు ఎపిగ్రాఫియా ఇండికా XI వాల్యుంలో ప్రకటించిన సత్యాదిత్యచోడుని చిలుముకూరి తెలుఁగుశాసనమున 'వే' ప్రయోగములఁ జూడఁ

1. శ్రీజయంతి రామయ్యపంతులుగారు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక 1-వ సంపుటమున ప్రకటించిరి.

పగును. "దే (డ)ని సల్పినవానికి వే[1]గుడ్లుపు వసెఱుపుళు వేవాస్థూన్ను నిల్పినపుణ్యంబు." కపిలశబ్దమునకు 'కవిల' వికృతి. సంస్కృత మున నది గోవాచక మయినపుడు ప్రథమా విభక్తిలో నాకారాంతముగా నుండును. వికృతిలోఁగూడ నాయాకారాంతపు టుచ్చార మాకాలమున నుండెడిదని యిది తెలుపుచు న్నది. ఇట్టితీరుగు త్తితాలూకా దిమ్మగుడిశాస నమునఁ గూడఁ గానవచ్చెను. [2]"సికుళతుఱిఇర శర్మాగ ఱికిన్" 1. 'వే'సంఖ్యావాచకము గాన దానిమీఁది 'క' 'గ'గా మాఱినది. 'వేగవి లాళు' అయినది.

వేడ్లుము = ఇందు 'వే' తర్వాత 'గు' అనునక్షరముండవలెను. శాసనము చెక్కిన వాఁడు ప్రమాదమున దాని విడనాడెను. వేగు డ్లుము, అనగా వేఁబు దేవళములను అని య ర్థము. 'గుడ్లు' తర్వాతి 'ము' సముచ్చయా ర్థకము. అఱవము 'ఉమ్' సముచ్చయార్థ కము. అది గ్రాంథికపుఁ దెలుఁగుఁదనముఁ బడయునాఁటికి 'ఉన్'గా మాఱినది. ధనముం ధాన్యముం, అఱవము. ధనమున్ ధాన్య మున్, తెనుఁగు. ఈశాసనకాలమునాఁటికిఁ దెలుఁగునఁగూడ సముచ్చయార్థమున 'ఉమ్' ఉండెడిదని యీ రూపము తెల్పుచున్నది. గుడ్లు + ఉమ్ గుడ్లుమ్ అయినది. దానిపై అజంతత్వపుఁ జికిలిచే గుడ్లుము అయినది. ఇట్లే 'గుడ్లు' గుడ్లను అయినది. 'గుడ్లు వు' అను రూపము గూడఁ బ్రాచీనాంధ్ర శాసనములందుఁ గలదు. అది యిందింతకు ముందు దాహృతమయిన బుడమరాయులపాటి శాసనమునఁ జూడఁదగును. సముచ్చయార్థ మున 'వు' కర్ణాటోచ్చారపుఁ దీరు గావ చ్చును. 'గుడి' పదపు బహువచనము గుడ్లు. అది నన్నయాదుల గ్రాంథికభాషలోఁ, గుళ్లుగా మాఱినది. తొలుత దానిరూపము కుడి = (దేవుని) నివాసము. తెలుఁగున నేఁడు గకా రాదులుగా నుండుపదము లనేకములు ప్రాచీ నకాలమున కకారాదులే. కాలి, గాలి, కుంట గుంట, కడప, గడప ఇత్యాదుల నెన్నింటినేని చూపవచ్చును. 'కుడి' శబ్దము కుటీశబ్దభవ ము గావచ్చును. కుటీశబ్దము కుడిశబ్దపు సం స్కృతీకరణమేని కావచ్చును.

వేశెఱుపుళు=వేసెఱుపుళు అనుట న్యా కరణసంస్కారపుఁ దీరు. కర్ణాటకమున 'కెఱె' యనఁగా చెఱువు, 'కెఱె'బహువచనము'కెఱె గళ్', కెఱెగుళ్, కెఱెవుళ్, అయ్యెను. ద్రవిడ కర్ణాటరూపములలోఁ బదాదినుండు కకారము తెలుఁగురూపములలో చకారముగాఁ బెక్కింట మాఱును.కళిగళ్ =చిలుకలు, కై, చేయి, కెం, చెం, (కెందామర, చెందామర) ఇత్యాదులు

1. 'వేసుడ్లుము' అని చదువవలెను. శాసనమున అట్లే కలదు. 'గుడ్లువు' అని కృష్ణశాస్త్రిగారు పఠించిరి. ఇతర శాసనములందు గుడ్లువు (మీఁది బుడమరాయలపాటి శాసనము చూడుము.) ఉండుటను జూచి శాస్త్రిగా రిక్కడఁగూడ నట్లే కాఁదగుననుకొనియుందురు.

2. ఇది అముద్రితము. ఎపిగ్రఫీ ఆఫీసువారి శాసనసంచయమునఁ గలదు.

చూడఁదగును. ఈలీరున కెతెవ్రుళ్, చెఱువ్రుళ్, చెఱువులు చెఱువు రూపము లేర్పడెను.

వేవురు—వేయిమంది. వే=అవర్, కలసి వేవురు అయ్యెను.

పఱాను—పాఱను అనుటకు స్వరవ్యత్యయముచే వచ్చిన ప్రామాదికరూపము. 'పాఱను'అనియే పెక్కుశాసనములందుఁ గాంచు. మఱి కొన్నింట 'పఱాను' కూడఁ గలదు. పాఱను = అనఁగా బ్రాహ్మణులను అని యర్థము. బ్రాహ్మణునకు అఱవమున 'పార్ప్పాన్' అనిపేరు. అనఁగా 'ద్రష్ట' 'తజ్జ్ఞుఁడు' అనియఱవవారర్థము చెప్పుదురు. అది దేశిపదమని వారందురు. 'పార్ప్పాన్' నేఁడు 'పాపాన్' అని వ్యవహారమున నున్నదందురు. తెలుఁగున 'బాపఁడు' అను రూపమున్నది. అది బ్రాహ్మణశబ్దవికృతియని మనతలఁపు. తెలుఁగులో బ్రాహ్మణశబ్దపువికృతి బాపఁడు అయినట్టే అఱవమున ('బ'లేదుగాన) పాపాన్ అయి ఆతద్భవ పదమే దేశిపదతాభిమానము గల వ్యాకర్తలచే 'పార్ప్పాన్'గా సంస్కరింపబడినదేమో అని నాయనుమానము. ఇది యిట్లుండెః—బ్రాహ్మణశబ్దపు వికృతిగాఁ బుట్టినదో యెట్లుపుట్టినదోకాని తెలుఁగున బ్రాహ్మణుఁడు అనునర్థమున 'పాఁడు'అనియో 'బాఁడు' అనియో ఒకపద మున్నది. శ్రీనాథుని క్రీడాభిరామమందలి యీక్రింది పద్యమును బరిశీలించినఁ దెలియఁగలదు:—

వ...ఎదురుగా నేతెంచు నొక్కబ్రాహ్మణుఁగని,

ఉ. వీఁడిదె తెల్లనాకులను
 వీడెము సేయుచు వీథివచ్చుచు
న్నాఁడు మడించి తిండిలిని
 నాఁడు సుమీ యిటమీఁద నేడకో
తేఁడఁగఁ బోయెడిన్ గరణ
 దేశపు జాణగ నుండఁబోలు నీ
బాఁడు, పణోపహారపరి
 పాటి గనుంగొనవచ్చు వీనిచేన్.

వ్రాఁతప్రతిలో 'బాఁడు' కలదు. దీనికి 'పాఁడు' అని ప్రాచీనరూపము గావచ్చును. లేక యిందు 'బాఁడు''పాఁడు' అనుటకుఁ బ్రామాదికపు వ్రాఁత గావచ్చును. 'పాఁడు' శబ్దమునకు బహువచనరూపము 'పాఱు'గాఁ గానవచ్చుచున్నది. ఇట్లనుటకు నేనింతకుముం దుదాహరించిన శాసనములపట్టులే లక్ష్యములు గాఁజాలును. తెలుఁగు కృతులలో పాఱుఁడు, పాఱువాఁడు, పాఱుత, రూపములుగలవుగాని యవియెల్ల నర్వాచీనకవులవి. ఎఱ్ఱాప్రెగ్గడ భారతారణ్యపర్వ శేషమునను, హరివంశమునను పాఱువాఁడు, పాఱుఁడు రూపములఁ బ్రయోగించెను. అటుతర్వాతికవులు ప్రయోగించిరి. కాని నన్నయతిక్కనల కృతులలో నారూపములున్నట్టు నాదృష్టికి గోచరింపలేదు. ఒకవేళ వారట్లు ప్రయోగించినను నేను జెప్పువిషయము నన్నయ కింకను నన్నూఱేండ్ల పూర్వపుదిగాన నాకాలమున ప్రథమాబహువచనాంతమగు 'పాఱు' నన్నయాదులనాఁటికిఁ

ప్రాతిపదికముగా మాఱిన దనవలసియుండును. మొదటికి నన్నయ తిక్కనలును వారినడిమి కాలపు వారును నగు కవులట్లు ప్రయోగించి యుండరనియే నానమ్మకము. మఱియు నిక్కడ నింక నొక్క విశేషము: ఇంతకుముందు ఎపి గ్రాఫియాఇండికా XI వాల్యూంలో కీర్తిశేషు లగు హెచ్. కృష్ణశాస్త్రిగారు ప్రకటించిన సత్యాదిత్యచోళుని చిలుముకూరి తెలుఁగుశాసనమున "వేవాన్రూఱ్ళునిల్పినపుణ్యంబు" అని చదివినపట్టునకు అర్థము బోధపడ లేదని శాస్త్రి గారు వ్రాసిరి. అది వారుచదివినట్లే అయినను లేక "వేవాన్డూఢ్ళ" అని యయినను దాని కర్థము వేయిబ్రాహ్మణ గ్రామములని; వే + పాన్రు + ఊఱ్ళు = వేయి బ్రాహ్మణగ్రామములు; లేక వే + పాన్డు + ఊడ్లు వేయిబ్రాహ్మణ గ్రామములు. పాన్డుశబ్దమున నకార మరసున్న గామాఱి బ్రాహ్మణవాచకముగాను, నకారము లోపించి 'పాడు' అయి బ్రాహ్మణగ్రామ (అగ్రహార) వాచకముగాను వేర్పడి యుండ వచ్చును. ఇప్పుడు గ్రామనామములు పెక్కులు 'పాడు' పదాంతములుగా నున్నవి. ఈ'పాడు' పదమునకుఁ బూర్వము బ్రాహ్మణాగ్రహార మనియే యర్థమేమో! నేఁడు పాడుపదము బహుకాలము గ్రామమున్నచోట బూడిదవన్నెగా మాఱిన మంటిదిబ్బపట్టునకుఁ బేరుగా వ్యవహారమున్నది. క్రీ. 6, 7, 8 శతాబ్దుల నాఁటి శాసనములలోఁగూడ గ్రామనామములకీ'పాడు'పదాంతత్వము గలదు. 'పాడు' పదమునకు పాటిమట్టి దిబ్బయే యర్థమేని యానాఁటికే గ్రామములు చెడి పాటిదిబ్బ లేర్పడె నన వలెను. గ్రామనామములతుది 'పాడు'పదమున కర్థమేదయినను పయిచిలుముకూరి శాసనములోని పదము 'పాన్రూఱ్ళ' పాన్డూడ్ళ బ్రాహ్మణాగ్రహారవాచకమే యనుటకు సందేహింపఁబనిలేదు. సంఖ్యావాచక మగు 'వే' పదమునకుఁ దర్వాత నున్నదిగాన 'పా' 'వా' అయినది.

చమ్పిన—ఇది చచ్చుధాతువు ప్రేరణభూతార్థకధాతుజన్యవిశేషణము.

చన్నంగు = దీని తర్వాతిబంతి చెడిపోయెను. అందు "డుచువారు." అను నక్షరములును ఇంక నేవో ఒకటిరెండక్షరములును ఉండియుండును. దీనికి "పాపము ననుభవింతుడు" అని యర్థము గావచ్చును.

అఱవమున 'శినమ్' అనుపదమునకు పాపమని యర్థము. పాపార్థకముగాఁ దెలుఁగున 'చన్న' పదముండెడిదేమో! పయిబంతి చెడిపోవుటచే నిక్కడ శబ్దరూపమిట్టిదనికూడ సరిగా గుర్తింపఁ గుదురకున్నది. 'చన్దంబు' అనియేని యక్కడిలిపి గావచ్చును.

## లక్ష్మీపురపు శిలాశాసనము—మూలము

1 స్వస్తిశ్రీ మ[1]గిదొగరజులముడ్లు[2]
2 విట్టజుల ప్రతమరా
3 జ్యంబున కడు[3]వం [డ్లు?[4]]
4 ల ఇచ్చిన రెన్డువటి
5 మిరియమ్పుబోళ
6 జకు[5] తెంగరి పె[6]
7 డశిన రెన్డువట్టి
8 పదేన్డుంబు ఆ(7)డ్లుప
9 ట్టుద్రుగ్గాదేవి నేలయు
10 ఉఱువుటురిబోళ
11 రెన్డుట్టియు తూఱ్పు

రెండవప్రక్క

12 ఈరెన్డుట్టి ఐచు(8)వరు
13 కళరేని బారనాసి
14 వేగవిలాళువే[9]డ్లు
15 ము వేశెఱువుళు
16 వేవురు ప[10]ఱాను
17 చమ్పినచన్న ం[11]గు
18 [12]... ... ... ...
19 యశ్యయశ్యయ
20 తాభూమితశ్యశ్య
21 తశ్యతథాపలం
22 స్వదత్తా పరద
23 తావాయో......
24 పవసున్దరా

---

1. మంగి అని యుండఁదగును.
2. ట్లు అనియేని కావచ్చును.
3. 'దు' కూడ కావచ్చును.
4. అస్పష్టము. 'జ్లు' కూడఁ గావచ్చును.
5. 'క్కు' అనియుఁ గావచ్చును.
6. 'ప' ఉండవలెను.
7. 'ఆ'కు డాపలితలమీఁదకూడ ఎత్వపు గీఁతవంటి గీఁత కలదు.
8. బచ్చు ఉండవలెను.
9. 'వేసడ్లు' అనియుండవలెను.
10. 'పాఱను' ఉండవలెను.
11. అస్పష్టము. చన్వం, నన్ధం అనియేని కావచ్చును.
12. ఈపంక్తి మాసిపోయినది.

## లక్ష్మీపూజ

శ్రీమతి రాజేశ్వరిగారు

శ్రీమహిళాలలామ, సరసీరుహధామ, త్రిలోకమంగళ
స్తోమ, నిజాననేందుజితసోమ, సతీజన జన్మభాగ్య ర
క్షామహనీయసంకలితకామ, పయోంబుధి గర్భజన్యమా
రామ భజింతు నామది నిరంతరతత్పదకంజభృంగినై.

అఖిల భువనాంతరంబుల నమరియుండి, త్వత్పదాంబుజధ్యాన తత్పరత నున్న
వారలను నొక్కకంటఁ గాపాడుదువని, ధ్యాన మొనరింతు హృదయవాస్తవ్యమాత!

స్థిరముగా నెందు నిల్వక తిరుగునిన్ను-దేవి! భక్తిశృంఖలల బంధించినాను
పరమమోద ముప్పతిల నావాహనంబుఁ-గూర్చినా నందు నిల్కడఁ గొనుము తల్లి!

పాలమున్నీటిలో వటపత్త్రశాయి-ప్రక్కసంతతభర్తృసేవాధురీణ
వై మెసఁగునీకు నర్ఘ్యపాద్యము లొసంగు-దానఁ గైకొమ్ము సన్మానధననిధాన!

రాజవదనా, విమలగౌతమీజలాభి-షేక మొనరింప నిదె యమర్చితిని గొనుము
క్షీరసారగర్భపవిత్రకమ, నీకు-జలముకన్న నేమిత్తు మజ్జనమొనర్ప?

నిరతధౌతపీతాంబరధరుఁడనంగఁ-బరగు లోకపాలకునకు భార్య వీవు
నీకుఁ బరిధాన మేమని నిర్ణయింతు-దయను గొనుమమ్మ, యిదిగో వస్త్రయుగళమ్ము.

అవని నాద్యంతరహితుఁ డైనట్టిభర్త-నిత్యమంగళాలయవగు నీకు దొరకె
నీదు శుభకంఠసీమ దీనిని గ్రహింపు-శుభముఁ గూర్పఁగ మంగళసూత్ర మిదిగో.

అఖిల భోగభాగ్యములకు నాకరమవు-రత్నసహజపు సిరులపరంపరలకు
మూలమవు నీవు కాంచనభూషణములు, నీకు లెక్కయె నీదయ మాకుఁగాక.

పద్మకేళీనివాసంబు బయలువెడలి-నట్టి సురభిళమూర్తివి యంబ, నీకుఁ
జందన మలందుః టాచారచర్యగాని-కమలనాభునిజాయకు గంధమేల?

పుష్పమందున నివసించు పుణ్యవీవు-పుష్పబాణుండు నీ ప్రియపుత్త్రుఁ డెలమిఁ
గాః వివిధకోమల సుమకలితహస్త-పుటముతో నీపదాబ్జముల్ పూజసేతు.

లలితాంభోజనిశాంతనాట్యనవలీలాదేవి, తుభ్యంనమః
కలకంఠీశుభశోభనాదిఘటనా కళ్యాణి, తుభ్యంనమః
కులనారీజనమంగళప్రణయభాక్సౌభాంగి, తుభ్యంనమో
విలసత్సుందరరూప విభ్రమకళావిస్ఫూర్తి, తుభ్యంనమః.

భక్తిపరవశత్వమున నెవ్వారికైన-నభిమతార్థము లొనఁగూడు నంటదేవి;
భక్తి నేనిడునగరుసాంబ్రాణి ధూప-మును గ్రహింపుము వరసితాంభోజసద్మ!

సాగరమునకు లవణదర్శనమురీతి-నిఖిలదేదీప్యమానకాంతి ప్రదాంగి
వైన నీకు దీపముఁ బట్టినానుదేవి, - నీదుజ్యోతిర్లవంబు కన్పించుకొఱకు.

పరమపావన క్షీరసాగరకిశోరి-వాదివిష్ణువక్షఃప్రదేశామలమణి
వైన నీకు నే నాచమనాంబులొసఁగి - శుచినిధానము నెటు పరిశుద్ధి సేతు?

శర్కరాక్షీరయుత పాయసంబు మొదలు-గాఁగలుగు భోజ్యవస్తువుల్ కమలధామ,
నీకిదే నివేదింతు నా నిర్మలాంత-రంగభక్తిమాధురినిఁ జూపంగఁ దలఁచి.

నిరతభవదీయ పాదసాన్నిధ్యకింక-రాంతరంగ ప్రసన్నిర్మలాంబువూపి
తద్రవీభూత భక్తి నాఁ దల్లినీకు-విమలపానీయ మిదె సమర్పించుచుంటి.

హస్తజలజాతములను బాదాంబుజముల-నీవు ప్రక్షాళనమొనర్పనేల దేవి,
కాలు నేలనుబెట్టవు కరములందు - నీశుపదములు తప్ప స్పృశింపఁబోవు.

నైజభవదీయ బింబోష్ఠ నవ్యరక్తి - మాత్రసౌభాగ్యసురభిళవ్యాప్తి కస్మ
దర్పితంబగు తాంబూల మబ్జవదన,-చంద్రునిం దివ్వెఁ జూచిన చక్కిఁ చెలుపు.

త్వత్పదద్వయ దివ్యసందర్శనంబు - అంబ నాపూర్వజన్మపుణ్యమున దొరకె
నేతదంచిత సేవాప్రభూతపూత-మంగళము నాకు దయసేయు మాశుభాంగి!

లోకకళ్యాణప్రదాయిని,-నీకిదే కర్పూరహారతి
నీకటాక్షనిపాతశోభా-లోకనమె కాంక్షించెదర్.

రాజవదనా, కొనుమిదే నీ-రాజనజ్యోతి స్సుగంధము
రాజితంబుగ నన్నుఁ గను-మవ్యాజకరుణాదృష్టులర్.

సకలైశ్వర్యనిధాన వీవు, భవదాజ్ఞాదత్త సంపల్లవా
ధికసంతృప్తులమేము; నిట్టియెడ మంత్రీభూత సౌవర్ణపు
ష్పకృతైశ్వర్యము మేము నీకిడుట యాశ్చర్యాస్పదంబయ్యుఁ ...
ర్ణకళావేదికి నూలుపోగను విధానర్ గొమ్ము పద్మాలయా'

# మజ్జిగనుబోలు మందేది ముజ్జగమున

పురాణం సూర్యనారాయణతీర్థులుగారు

(తక్రచికిత్స—మాధురినుండి)

## ౧. విషయప్రవేశము

ప్రాకృతికమయిన సంసారరంగమునందు పరమపురుషాసక్తచిత్తయు, ప్రౌఢయు నగు ప్రకృతినటి తన ధ్యేయపురుషుని తనయం దనురక్తునిగాఁ జేసికొనుటకును, అతనికి చిత్రవిచిత్రములయిన అద్భుతాభినయములను చూపించి తన్ను స్వాధీనభర్తృకనుగా జేసికొనుటకును సర్వకాలసర్వావస్థలయందును ప్రయత్నించుచుండును. ముగ్ధుఁడగు ఆపురుషుని చిత్రవిచిత్రములైన వస్త్రాలంకారాదులచే నలంకరించి తా నతనిని చూచి చూచి హద్దు మితిలేని సంతోషమును పొందుచుండును. ప్రసన్నునిగా చేయుటకై ప్రకృతిదేవి, అతని కే విధమయిన సుఖమునకును లోపము కలుగకుండుఁగాక యని చాల ప్రశస్తముగా సుఖసామగ్రిని సిద్ధముచేసియుంచుచుండును. ఏప్రదేశములో, ఏసమయమున, ఏవిధమయిన వస్తువుల కావశ్యకము తోఁచునో ఆప్రదేశమునందే, ఆసమయమునందే తదనుకూలమయిన వస్తువులనే సిద్ధముగా ఉన్నట్లు చూచుకొనుచుండును. అనావశ్యకములయిన వస్తువులసూచన తనదూతలద్వారా అయినవెంటనే అది తానుగానే ఆ వస్తువులను తొలఁగించుటకు ప్రయత్నింప మొదలిడుచుండును. ఏ కార్యము చేయువిషయమున తనకు శక్తి చాల దని తెలిసికొనునో అందులకై స్వరచితములును, తనకు సమీపమునందే ఉన్న నియొనను అనేక సాధనముల సాయమునుపొంది అశక్యములయిన కార్యములను చేయుటకు తన్నును సమర్థురాలినిగా చేసికొనుచుండును. ఆ సాధనములకోసము దూరస్థములయిన దేశముల మొగముపయిపు చూడ నవసరము దానికి లేదు. ఉదాహరణార్థము మన శరీరమే చాలియున్నది.

ప్రకృతిదేవి యీసౌధమును ఎంతో వింతమాదిరిగా తయారుచేయించి యుంచినది. దీనిని చూచితీరవలయును గాని చెప్పుటకు సాధ్యపడదు. ఈ దివ్యభవనములోఁ గూర్చున్నవాఁడై పురుషుఁడు తన—అఖండసామ్రాజ్య మేలుచున్నాఁడు. ఇంద్రియము లాపురుషునికి పరిచర్య చేయుచున్నవి. బుద్ధి అతనికి మంత్రియై సేవలో లోపమునుకలుగకుండఁ జూచుచున్నది. మనోరథారూఢుఁడై పురుషుఁడు ప్రకృతివిహితము లయిన విషయముల నుపయోగించుకొనుచు వేఱుగా నున్నవాఁడయ్యును ప్రకృతిమయుఁడుగానే తోఁచుచున్నాఁడు. ప్రకృతిదేవి స్వయముగా తన నియమముల కనుకూలించునట్లు ఈ శరీరదుర్గమును రక్షించుటకై తగినసామగ్రిని ఇంద్రియములద్వారా సంపాదించి సారభాగమును గ్రహించి అనావశ్యకములయిన మలాదులను బయటికి వెలువరించి శరీరదుర్గమును సాపుచేయుచు రక్షించుచున్నది. ఈ శరీరమున కెద్దాని సాయమును అక్కఱలేదు. ఒకవేళ, ఇంద్రియముల ప్రమాదమువలన ఈ శరీరదుర్గములో అనావశ్యకవస్తువులస్థితికాని, అనుచితవ్యవహారముల ప్రచారముగాని జరిగియుండెనిపక్షమున ఈ శరీరదుర్గము రోగాదు లనెడి శత్రువులద్వారా నియమితసమయమునందు నష్టపరుపఁబడియుండును. ఈశరీరముతో అనుచిత వ్యవహారముగాని, దీనిలో అనావశ్యకవస్తువులు తగనిపరిణామములో ఒకచోఁ జేరుటకాని జరిగినప్పుడు వానిని తొలఁగించుటకై ప్రకృతిదేవి తన్నును అసమర్థురాలినిగా తెలిసికొని తన శక్తిని వృద్ధిపొందించుకొనుటకై యేయేసాధనములను తయారుచేసికొనుచుండునో, వానిలో తక్రము (మజ్జిగచల్ల) కూడ ఒకసాధనము. ఇది శరీరమునందలి వికారముల నన్నింటిని తొలఁగించుటకై ప్రాకృతికశక్తి వృద్ధిచేసి తాను తనశక్తిచేతను శరీరములను దృఢముగాను కాంతిమయముగను చేయుచున్నది.

మజ్జిగవలన సామాన్యముగా సమస్త రోగములు తొలఁగింపఁబడఁగలవు. ప్రతినిత్యము మజ్జిగ త్రాగు

మనుజులు డాక్టరులయు, దేశీయవైద్యులయు గుఱికి లక్ష్యము కారు. తక్రసేవకు లెప్పుడును నీరోగులుగను, నిరలసులుగను, తేజశ్శాలులుగను, బలవంతులుగను ఉందురు. ఆయుర్వేద వైద్యాచార్యులు దీనిగుణములపైని ముగ్ధులయిపోయి దీనిని అమృతముతో పోలిచియున్నారు. వారు దీని నిట్లు వర్ణించియున్నారు.

"శ్లో. న తక్రసేవీ వ్యథతే కదాచి
న్న తక్రదగ్ధాః ప్రభవన్తి రోగాః,
యథా సురాణా మమృతం ప్రధానం,
తథా నరాణాం భువి తక్ర మాహుః."

(భావప్రకాశ)

(తా. తక్రమును సేవించువా రెప్పుడును శారీరకమయిన బాధలను పొందరు. మజ్జిగచేతను కాల్పఁబడిన రోగము రెండవసారి అంకురింపదు. దేవతలకమృత మెట్లు ప్రధానమో మనుష్యులకు మజ్జిగ అట్లు ప్రధానమైనది.) వైద్యాచార్యులు తక్రముతాలూకుగుణముల నిట్లు వ్రాసి తమ అనుసంధానమునకు పూర్తిగా జాగా యిచ్చినారు. పాశ్చాత్యులయిన వైజ్ఞానికులు నేఁటివఱకును తక్రము గుణములనుగాని, దీనివలని లాభమునుగాని తెలిసికొనలేక వంచితులయి యున్నారు. కాని, పరాసుడాకుదొర(ఫ్రాన్సుడాక్టరు)శ్రీయుత మేచనీకఫ్మహాశయుని అనుసంధానమువలన ఇప్పుడిపుడు వారికిని తక్రముతో సమానమైన పాచకవస్తువు మఱియొకటి లేదని లెస్సగా విశదమయినది. ఈనడుమనే ఉద్యమశీలురగు కొందఱు డాక్టర్లు కలిసి మిక్కిలి పరిశ్రమకు పాలయి అనుసంధానముచేసి, ఆయుర్వేదీయానుసంధానముతాలూకు గుణములను గానముచేయుచు, తక్రమాహాత్మ్యమువిషయమున ఆయుర్వేదాచార్యులను సమర్థించినారు నీరోగయు,బలవతియును అయిన ఒకానొకతె 120 సంవత్సరముల ఆయువులో అనఁగా, పూర్ణావస్థను పొందినతరువాతను మృతినొందుటచూచి పైడాక్టర్లు ఇది పూర్ణాయువుగనుండుటకు విశేషకారణ మేమయియుండును? అని అనుసంధానముచేయుట కారంభించినారు. ముట్టునుదకు సదాకాలము తక్రసేవన చేయుచుండుటవలననే దీని ఆయువు 120 సంవత్సరములవఱకును నిలిచిన దని నిశ్చయించినారు. దానికి మజ్జిగపైని ఇంతంత ప్రేమకాదు. ముంతెఁడుమజ్జిగ చేతికి చిక్కువఱకును దానికి నెమ్మది లేకుండెడిది. ఎంత ప్రయత్నించినను తన యూరిలో తక్రము దొరకకుండెనేని తానుగా ముంత చేతఁబట్టుకొని చుట్టుప్రక్కల గ్రామములకేని పోయి దండి తెచ్చికొనుచుండెడిది. పాపము! ఆ ముసలిది కేవలము మజ్జిగకోసము ఒక్కొక్కప్పుడు మూఁడేసి గ్రామములుకూడ తిరుగుచుండెడిదఁట. ఇంతవఱకు చదివిన ప్రకరణమువలన పాఠకమహాశయుల మనస్సులకు తక్రమును అమృత మనుట అతిశయోక్తికాదని విశదమయి యుండుననుకొనుట తప్పు కాదుకదా! ఇటు చిత్తగించితిరా? ఎవరోకాని ప్రాచీన సంస్కృతకవి తక్రగుణములపయిని మోహితుఁడయిపోయి యెంత చక్కగా వర్ణించియున్నాఁడో:—

"శ్లో. కైలాసే యది తక్రమస్తి గిరిశః
కిం నీలకంఠో భవే
ద్వైకుంఠే యది కృష్ణతా మనుభవే
దద్యాపి కిం కేశవః,
ఇంద్రో దుర్భగతాం క్షయం ద్విజపతి
ర్లంబోదరత్వం గణే
ట్కుష్ఠిత్వంచ కుబేరకో దహనతా
మగ్నిశ్చ కిం విందతి."

(యోగరత్నాకరము.)

(తా. కైలాసమున మజ్జిగ ఉండినపక్షమున ఈశ్వరుఁడేల యింతవఱకును నీలకంఠుఁడయి యుండును? అనఁగా అతనికంఠమునుండి విష మెప్పుడో దిగిపోయి యుండుననుట. వైకుంఠములో తక్రము లభించినచో విష్ణుఁ డింతవఱకును నల్లని శరీరముగలవాఁడయి యుండునా? చల్ల త్రాగి యెప్పుడో గౌరాంగుఁడయిపోవునుగదా? మరియు స్వర్గములో చల్ల లభించినపక్షమున ఇంద్రుఁడు తన దుర్భగత్వమును, చంద్రుఁడు తన క్షయరోగమును, ఎప్పుడో పోఁగొట్టుకొనియుందురే. గణపతి తన పెద్దకడుపును చల్ల త్రాగి తగ్గించుకొనును. కుబేరుఁడు తన కుష్ఠరోగమును (బొల్లిని) మాన్పుకొనును. వేయేల? అగ్నిభట్టారకుఁడును తన దహనత్వము నెప్పుడో యీ మజ్జిగ త్రాగి పోఁగొట్టుకొనకుండునా?) ఇందులో - కవి చమ

త్కాగమువాట అట్లుండఁగా, నిజ మాలోచించినచో మజ్జిగ యుండినచో వైరోగము లుండుట కష్టమే కాదు, అసంభవముకూడను. ఇది కవితాలాప అతిశ యోక్తి కాదు. మరేమన? కని యీరోగములవయిపున ఇషారా చేసియున్నాఁడు. ఏమనియా? తక్రసేవనము వలన ఈ రోగము లన్నియు నిస్సందేహముగా నష్టము లయిపోవునని. మజ్జిగయందున్న యీ యెల్లగుణములను ఆయుర్వేదవిశారదు లెఱుఁగనివారు గారు. ఇంకను దీని గుణములు ముందు వర్ణింపఁబడును.

ఒకానొకరాజు వయోవృద్ధయిన వైద్యుని పిలి పించి "అయ్యా! తమరు దయయుంచి అనుభూతమయిన ఒకవస్తు వేదేని యున్నపక్షమున నాకుఁ జెప్పితిరేని యది నేను సదా సేవించుచుండెదను. ఆవస్తువు రుచికరముగాను, భుజించినపదార్థముల నన్నింటిని జీర్ణముచేయఁజాలినది గాను, నాకేవిధమైన రోగమును కలుగనీయకుండునది గాను ఉండవలెను" అని అడిగినాఁడు. రాజుగారిమా టలు విని వైద్యుఁడిట్లన్నాఁడు. "మహారాజా! నా కింత వయస్సు చెల్లినది. నా కనుభవమయినంతలో ఇపుడు తాము కోరిన అన్నింటికిని ఉపయోగించునది ఒక్క మజ్జిగయే ముఖ్యమయిన దని మనవిచేసికొనుచున్నాను. మజ్జిగతో సమానముగా గుణ మిచ్చునది నాబుద్ధికి ప్రపం చములో రెండవవస్తువు గోచరముకాలేదు. కాఁబట్టి, దేవర దీనినే సేవించుటను ప్రారంభించునది. అది యెట్లనఁగా

"శ్లో. భోజనాన్తే తు రాజేంద్ర! తక్రం స లవణం పిబ,
తస్యోపరి జలం కించి త్తస్యోపరి న కించన."

(తా. "భోజనానంతరము ఉప్పుకలిపిన మజ్జిగకొంచె ము త్రాగినపైని మంచినీళ్లు త్రాగునది. అటుపై నాదినమున మఱియేమియు పుచ్చుకోఁగూడదు.) ఇది నా యభిప్రా యము. తరువాత దేవరచిత్తము" అని చెప్పియున్నాఁడు.

వాస్తవ మాలోచించినచో తక్రములో ఉన్న ప్ర ధానగుణ మిది— ఆమాశయములో నున్న భోజనపదార్థము నంతను జీర్ణింపఁజేసి, అతి లఘుపదార్థమగుటచే తాను జీర్ణమైపోవును. దీనిభారము జఠరాగ్నిపైని పడదు. కను కనే సంగ్రహణీరోగములో తక్రముతో సమానముగా వెంటనే గుణమునుగలిగించు వస్తువు మరియొకటి కనుప డలే దందురు. "న తక్రతుల్యం గ్రహణీవికారే" అని వైద్యగ్రంథసమ్మతము. సంగ్రహణిలో పాచనశక్తి పూర్ణ ముగా నష్టమయిపోవును. అట్టిస్థితిలో ఒక్క తక్రము గాక తేలికయైన మరియే వస్తువు తిన్నను దానిభార మెంతోకొంత జఠరాగ్నిపైని పడకతీరదు. అందుచే విరేచనములు కట్టుటలో చాలాకాలము పట్టును. పట్టుట యేకాదు కట్టుటకూడ కష్ట . ఎంతపురాణించిన సంగ్ర హణియైనను తక్రద్వారా తొలఁగింపఁబడఁగలదు. తక్ర ముతో సమానముగా పాచనముచేయు నౌషధము మరి యొకటి లేదు. అది దేనిపైనిబడిన దానిని తప్పక భస్మ ము చేసివేయును. నీతినిపుణుఁడయిన చాణక్యుని కథ యెవ్వ రెఱుఁగనిది? ఒకప్పుడు చాణక్యునితండ్రి గంగా స్నానమునకుఁ బోవుచుండఁగా, అతనిపాదములో దర్భ ముల్లు గ్రుచ్చుకొన్నదఁట! అందువలన వ్రణమయి తుద కతఁ డందువలననే చనిపోయినాఁడఁట! క్రోధావతార మగు చాణక్యుఁడు దర్భ తన తండ్రిమరణమునకు కారణ మగుటను గ్రహించి, అది మొదలుకొని దానిని భూమి నుండి నిర్మూలించుటకు నిశ్చయించుకొన్నాఁడఁట! ఎక్క డనెక్కడ దర్భదుబ్బు కనుపడునో అక్కడ దానిని పెల్లగించి యచ్చట చల్లపోయుచుండెడివాఁడఁట! అత నికి తక్రగుణము లెస్సగా తెలియును. దర్భ పెల్లగించి దాని మూలస్థానమున మజ్జిగ పోసినచో మఱి యంకురిం పకుండ దానివేళ్లు భస్మమయిపోవునని యతఁ డెఱుఁగును.

గోవులను బఱ్ఱెలను సదా పాలన పోషణములు చేయుచున్నవాండ్రయినను బీదకాపులు పాలనేతుల రుచి బొత్తిగానే యెఱుఁగరు. వాండ్రు పాలయినను అమ్మకొందురు, లేదా పెరుగుచేసి నేయి తీసియైనను అమ్మకొందురు. కాని, ఆ మజ్జిగమాత్రము త్రాగుచుం దురు. అయినప్పటికిని నేయి, పాలు ఉపయోగించుకొను వారికంటెను తక్రసేవకులు బలవంతులు, హృష్టపుష్టులు సోమరితనము లేనివారునునై యగపడుచుందురు. కను కనే మజ్జిగ త్రాగెడి కృషీవలులు పగలస్తమానము పరి శ్రమ చేసినతరువాతను సైతము అలసట పొందరు. ఎవర యితే గద్దీజాతిని చూచియున్నారో వారికి విశేష

ముగ చెప్ప నవసరముండదు. పాలు నేయి ఉపయోగించువారు వాండ్రవలె తగినపరిశ్రమ యెప్పుడును చేయజాలరు. వాండ్రతో సమానముగ హృష్టపుష్టులగువారు చాలకొలఁదిగానే దృష్టిగోచరు లగుదురు. మఱియు నీరోగులుగానే ఉండఁజాలుదురు. ఒకానొకధనవంతున కిద్దఱు భార్యలుగలరు. ఇద్దఱికిని ఒక్కొక్క కొడుకు పుట్టినాఁడు. కాలవశమున చిన్నబిడ్డఁడు బాల్యమున నుండఁగానే వాని తల్లి స్వర్గస్థురా లయిపోయినది. అందువలన వాఁడు నిరాలంబుఁడయి తనసవతితల్లి కాశ్రితుఁడై జీవయాత్రను గడపుకొనుచుండెను. పెద్దవాని తల్లి సవతికొడుకుపైని ఈర్ష్య గలది యగుటవలన వాని కెప్పుడును మజ్జిగతోడి కుత్సితభోజనము పెట్టుచుండెడిది. తన కుమారునకు మాత్రము నేయి, పాలు మస్తుగాపోసి పొట్టనింపుచుండెడిది. అయినప్పటికిని నేతితోను, పాలతోను పెరుగుచుండెడి పెద్దకొడుకుస్వాస్థ్యముకంటెను తక్రసేవకుఁడయిన చిన్నకొడుకు స్వాస్థ్యమే బాగుగా నుండుట చూచి "నాభార్య తన కొడుకుకంటె చిన్నకొడుకు తల్లి లేని కారణమునను నిరాధారుఁడన్న కారణమునను వాని పైనే హెచ్చుగా ప్రేమ ఉంచుచున్న"దనియు, "కావలసినంత పాలు నేయి వానికి పోయుచున్న" దనియు "కనుకనే చిన్నవాఁడయినప్పటికిని వీఁడు పెద్దవానికంటెను బలవంతుఁడుగా నగపడుచున్నాఁ"డనియును తండ్రి యనుకొనుచుండెడివాఁడు. ఒకనాఁడు తన యిద్దఱుకొడుకులను రహస్యముగా వేఱువేఱుగా పిలిచి "మీరిద్దఱును ఎంతెంత పాలు నేయి భరింపఁగలరు?" అని యడిగినాఁడు. "అద్దసేరు నేయి, రెండుసేర్లవఱకు పాలు భరింపఁగల"నని పెద్దకొడు కన్నాఁడు. చిన్నవాఁడు—"నాయనా! నేను నేయి పాల రుచియే యెఱుఁగనే, అట్టిస్థితిలో ఇంత భరింపఁగల నని యెట్లు చెప్పఁగలను?" అన్నాఁడు. "అటులేని నిత్యము నీ వేమి తినుచున్నా"వని తండ్రి యడుగఁగా, "మజ్జిగ రొట్టె" అని చిన్నకొడుకు చెప్పినాఁడు. కాని తండ్రికి వాని మాటలయందు నమ్మకము లేకపోయినది. "లోకసామాన్యముగా వీఁడును తనసవతితల్లిపైని ఈర్ష్యావశమున దోషారోపణ చేయుటకే యిట్లు చెప్పుచున్నాఁడు. అట్లే కానిపక్షమున వీఁడు పెద్దవానికంటెను పుష్టశరీరుఁడును, బలవంతుఁడును ఎట్లు కాఁగలఁడు?" అని యాలోచించుకొని రహస్యముగా కనిపెట్టుటకు ప్రారంభించినాఁడు. తుదకు చిన్నకొడుకు చెప్పినదే నిజమని తెలిసికొన్నాఁడు. అప్పుడు తండ్రి స్వయముగా వానికి కావలసిన పాలు, నేయి యేర్పాటుచేసి తక్రసేవను విడిపించినాఁడు. కాని కొన్నాళ్ళకు వాని యారోగ్యము మార్పుచెంద మొదలిడినది. క్రమముగా పెద్దవానివలెనే రోగగ్రస్తుఁ డయిపోయినాఁడు. అప్పుడు తండ్రి యీ వృత్తాంతమంతయు నొకమంచి వైద్యునితో చెప్పి "యిప్పుడు వీనికి మజ్జిగకుబదులు లెస్సగా నేయి,పాలు,మీఁగడ తినిపించుచున్నాను. కాని వెనుకటివలె బలవంతుఁడుకాక యెప్పుడుచూచినను రోగిగానే కనుపడుచున్నాఁ". డని కూడ చెప్పినాఁడు. అప్పు డావైద్యుఁడు పిల్లవాండ్ర తండ్రికి మజ్జిగతాలూకుమాహాత్మ్యము చెప్పుచు "అధికముగా నేయియుపయోగించుటవలన ఆఁకలిమందగించును. అందువలన పాలు జీర్ణము కాఁజాలదు. హెచ్చుపాలు జీర్ణ మగుటకై తీక్ష్ణమైన జఠరాగ్ని యావశ్యకము. ఇట్లుండఁగా, హెచ్చునేతితోపాటుగా ఇగురఁగాఁచిన పాలు మీఁగడ నిత్యము హెచ్చుగా నుపయోగించువారు తదనుకూలముగా పరిశ్రమకూడ చేయుచుండవలయును. అట్లు కష్టపడకున్నచో తప్పక రోగగ్రస్తులు కాకతీరదు. మీరు మీ బిడ్డల కారోగ్యమును గోరుదురేని వారిచేతను తక్రసేవనమే తప్పక చేయించుచుండుఁడు. దానిని సేవించుచున్నప్పుడు నేయి, పాలు మొదలయిన యే వస్తువులు సేవింపించుచున్నను అవి యన్నియు జీర్ణమయిపోవును" అని చెప్పినాఁడు. అదిమొదలు తండ్రి తనయిద్దఱుబిడ్డలకును మజ్జిగ త్రాగించుచుండుటకు ప్రారంభించినాఁడు. అందువలన వాండ్రిద్దఱును హృష్టపుష్టులై యారోగ్యముగా నున్నారు. కాఁబట్టి బలకారకములయిన పాలు, నేయి మొదలయిన వస్తువు లెప్పుడైతే సరాసరిగా జీర్ణమగుచుండునో అప్పుడే వాటి పరిణామముకూడ సరాసరిగా నగపడుచుండును. అట్లు కానిపక్షమున వాటివలన హాని కలుగకతీరదు. జఠరాగ్ని ప్రజ్వలించునప్పుడే బలకారకవస్తువుల ప్రభావము కనుపడును. దీనినిబట్టి దీపనవస్తువులే బలకారకములని చెప్ప

నను అనుచితము కాదు. కారణమేమనఁగా బలమును కలిగించుటకు కారణము జఠరాగ్ని ప్రజ్వలించుచుండుటే. అది మందగించినప్పుడు నేయి, ఇగురఁగాచిన పాలు మొదలయిన వెప్పుడును లాభదాయకములు కాఁజాలవు. పాలు మొదలయిన బలకారకపదార్థములు దీపన పాచన వస్తువులసాహాయ్యము వినాగా అధికముగా సేవింపరాదు. తక్రముమొదలయిన దీపన పాచన పదార్థములు దేని సాహాయ్యము అక్కఱలేకుండనే సేవింపనచ్చును. తక్రమును కొందఱు రోగులు పదునాలుగేసి సేర్లవఱకును ఏ యౌషధములసాహాయ్యము అక్కఱలేకుండనే సేవించుచుండుట చూడఁబడినది. ఏవిధమయిన దీపనపాచనౌషధములసాయ మక్కఱలేకుండనే పాలుకూడ మజ్జిగ త్రాగినంత త్రాఁగఁగలుగుదురా? ఎప్పటికిని త్రాఁగఁజాలరనుట నిశ్చయము. తక్రగుణానుభవముగల ఒకానొక కవి "తక్రం శక్రస్య దుర్లభమ్" అను శ్లోకపాదమును తయారుచేసి వ్యంగ్యరూపమున తక్రయుక్తమయిన మనుష్యలోకమునెదుట అమృతమయమయిన స్వర్గము నెంత మనోరంజకముగా అనాదరము చేసినాఁడో చూడుఁడు. అమృత మున్నప్పటికిని ఇంద్రునకు మజ్జిగయం దాశ యుండిపోయినదఁట! కాని, అతని కది దుర్లభమయినదఁట! ఏమనఁగా అమృతము తక్రగుణములను పొందఁజాలక పోయినది. అమృతమునందు జరామరణములను పోఁగొట్టు శక్తిమాత్ర మున్నది కాని రోగములను పోఁగొట్టుశక్తి లేదు. అట్లే ఉన్నపక్షమున చంద్రునకు క్షయరోగము, కుబేరునకు, కుష్ఠరోగము, ఇంకను స్వర్గములో ఇతరరోగములును ఎందు కుండవలయును? మజ్జిగలో జరామరణ రోగనాశకములగు మూఁడుశక్తులును ఉన్నవి. తక్రసేవకులు జర అనఁగా ముదిమివలనఁగలిగెడి రోగములవలన ముక్తులగుటయేకాక, అకాలమరణమునుగూడఁ దప్పించుకోఁగలరు. ఇట్టి స్థితిలో రోగముల విషయమున చెప్పవలసిన దేమున్నది? తక్రసేవకుల చుట్టుపట్టులకు సయితము రోగములు రాఁజాలవనుట అతిశయోక్తిగా భావింపఁగూడదు. దానియం దట్టి అద్భుతశక్తి యున్నది. అందుకనియే దానిపేరు విన్నప్పుడెల్ల దేవేంద్రునికి నోరూరుచుండునఁట. ఆశమాత్రమే కాని తన కతని కది దుర్లభమే అని వాడుకయే అయిపోయినది. ఏమా? తక్రము మనుష్యలోకములోనే దొరకును గాని స్వర్గములో దొరకనే దొరకదుగదా! అందువలన స్వర్గలోకముకంటెను భూలోకమే యెన్నోరెట్లు గొప్పది. వెనుకఁ జూపిన శ్లోకపాదములో ఈభావమంతయు నింపించి కవి తనకు తక్రసేవనమువలన లభించిన గుణములను ప్రజల కాలింగించి యున్నాఁడు. ఈకవి కేదేని దుర్జయమయిన రోగ ముండెడిదో యేమో? అది యితరౌషధములవలఁ గుదురక మజ్జిగవలననే కుదిరినదో యేమో. అటులే కానిపక్షమున ఇంత భావపూర్ణముగా ఇట్టి శ్లోకపాదమును తయారుచేసి యుండఁడు. ఈపాదమునే సమస్యగా గ్రహించి అంతః*ర్లాపికాద్వారా పూర్తిచేయుచు, ఎవరో ఒకకవి-అతఁడును వైద్యుఁడయి యుండవచ్చును-భోజనానంతరము ఏవస్తువు త్రాఁగఁదగినది, అని ప్రశ్నించుకొని "తక్రమ్" అని సమాధానము చేసికొని భోజనాంతమున తక్రసేవన విధిని స్పష్టీకరించినాఁడు. అందుచేతనే భోజనపదార్థములలో మజ్జిగపులుసు, మొదలయినవి మనవారు తయారుచేసి యుపయోగించుచున్నారు. కాన్యకుబ్జ బ్రాహ్మణుల యిండ్లలో పెండ్లి మొదలయిన కార్యములలో భోజనముల సమయమున మజ్జిగలో నానవేయఁబడినపదార్థములు భోజనపంతియు ముగిసిన తరువాతనే వడ్డించెదరఁట! ఎందుకనఁగా, దానివలన అదివఱకు భుజించిన పదార్థములలోనికి కొంత మజ్జిగ చేరుననియు, తిన్నదంతయు జీర్ణమయిపోవుననియు వారి నిశ్చయము. మజ్జిగ కేవలము గుణకరమయినదే కాక రుచికరమయినది కూడ నన్న సంగతి మనమందఱమును ఎఱుఁగనిది కాదుగదా. చంద్రవరదాయీ అను హిందీకవీశ్వరుఁ డెప్పుడో ఒక్కొక్కఛందస్సువ్రాసి తక్రమాహాత్మ్యమును గొప్పచేసినాఁడఁట! ఆ పద్యముల ననుసరించి హిందీవారు పలురకము లయిన భోజనపదార్థములను తక్రమిశ్రమములుగా చేయుచుందురఁట. తక్రమాంసము క్వథిత(కడి)తక్రవటకములు మొదలయిన ప్రయోగము లాయుర్వేద శాస్త్రములో విధిపూర్వకముగ నెన్నియో వర్ణింపఁబడియున్నవి. ఈవ్యాసము

* శ్లో. భోజనాన్తే తు కిం పేయం జయన్తః కస్య వై సుతః, కథం విష్ణుపదం ప్రోక్తం తక్రం శక్రస్య దుర్లభమ్.

తాలూకుసిద్ధాంతము మనుష్యలోకములో సర్వరోగనాశకము, అతిసులభము, రుచికరము, ఎట్టి యవస్థలోనయినను హాని కలిగింపనిదియు నగు తక్రముతో సమానమయినది రెండవ సరళచికిత్స దృష్టిగోచరము కాలేదనుటయే. దీనియం దిట్టి మహాగుణము లెన్నియో ఉన్నవి కనుకనే ఆ గుణములను వర్ణించుచు ఒక్కొక్క రోగము పైనను తక్రప్రయోగవిధి శాస్త్రానుసారముగ ముందు వర్ణితమైనది.

## ౨. తక్రభేదము

కాఁచినపాలలో పుల్లనిపదార్థముల సంయోగము వలన ఏర్పడిన పెరుగును కవ్వముతో చిలికి తయారు చేసినదానికి తక్రము (మజ్జిగ-చల్ల) అని పేరు. ఇది రచనాభేదమునుబట్టి అయిదువిధములుగా వ్యవహరింపఁబడుచున్నది. ఘోలము, మథితము, తక్రము, ఉదశ్విత్తు, ఛచ్చిక అనివాటికి పేళ్లు. మీఁగడతోఁగూడిన పెరుగు నీరు కలుపకుండనే చిలికినదానికి ఘోల మని పేరు. మీఁగడ తీసివేసి నీరు కలుపకుండ చిలికినదానికి మథిత మని పేరు. పెరుగునకు నాలుగవవంతు నీరు కలిపి చిలికినదానికి తక్ర మని పేరు. సగపాలు నీరు కలిపి చిలికినది ఉదశ్విత్తు. హెచ్చునీరు పోసి పెరుగుచిలికి వెన్నతీసివేయఁగా మిగిలిన దానికి ఛచ్చిక యని పేరు. తక్రముతాలూకు గుణములు యోగరత్నాకరమను వైద్యగ్రంథములో నిట్లు వివరింపఁబడియున్నవి:—

"శ్లో. క్షుద్వర్ధనం నేత్రరుజాపహంచ
ప్రాణప్రదం శోణిత మాంసదంచ,
ఆమాభిఘాతం కఫవాతహన్తృ
త్వష్టౌ గుణా వై కథితా హి తక్రే."

అనఁగా ఆఁకలిని వృద్ధిచేయుట, నేత్రరోగముల నశింపఁజేయుట, బలమునిచ్చుట, రక్తమాంసములను వృద్ధిచేయుట, ఆమమును, కఫమును, వాతమును నశింపఁజేయుట అను నివి తక్రముతాలూకు ప్రధానగుణములు. మఱియు, ఘోలమనుపేరుగల తక్రములో చక్కెర కలిపి సేవించుటవలన మామిడిపండువలనఁ గలుగుగుణములను కలిగించును. మామిడిపండు వీర్యవర్ధకము, స్నిగ్ధము అనఁగా రూక్షతను పోఁగొట్టునది, సుఖమును బలమును కలిగించునది, గురుత్వముచేయునది, వాతనాశకము, రుచికరము, శరీరకాన్తిని, ఉత్తమముగాచేయునది, శీతలము, హృదయప్రియము, పిత్తమును పుట్టకుండఁజేయునది, స్త్రీ విషయమున హర్షదాయియు నగును. పైనిచెప్పిన గుణము లన్నియు చక్కెరకలిపిన ఘోలమునందుఁ గలవు.

మథిత మను తక్రము—వాతపిత్తమును, కఫపిత్తమును నశింపఁజేసి హృదయప్రియమై యుండును.

తక్రము—అనఁగా స్వలక్షణ సంపన్నమయిన తక్రము మలబద్ధకము, కషాయము, పులుపు, పాకములోను, రసములోను మధురము, లఘువు, ఉష్ణవీర్యమును అగ్నిని ప్రజ్వలింపఁజేయునది, వీర్యవర్ధకము, తృప్తికారకము, వాతనాశకము, గ్రహణి మొదలయిన రోగములలో పథ్యము. తక్రము తేలిక యగుటవలన మలబద్ధకమగును. పాకములో మధుర మగుటవలన పిత్తానుత్పాదకము-అనఁగా పిత్తమును కుపితముగా చేయనిది. ఆమ్లము, ఉష్ణవీర్యము, దీపనము, వృష్యము, ప్రీణనము అగుట వలన వాతనాశకము. కషాయము, ఉష్ణము, వికాసి, రూక్షము అగుటవలన కఫనాశకము. ఈ ప్రకారముగా త్రిదోషములను శాంతింపఁజేయును. ఇట్టి తక్రమువిషయముననే "దీనిని సేవించువా రెప్పటికిని రోగగ్రస్తులు కారు. దీనిచే కాల్పఁబడినరోగము రెండవసారి మరల అంకురింపదు" అని పైనవ్రాయఁబడెను.

ఉదశ్విత్తను తక్రము—కఫకారకము, బలకరము, ఆమమును అతివేగముగ నశింపఁజేయునది.

ఛచ్చిక అనుతక్రము—శీతలము, లఘువు, వాతనాశకము, తృషను, పిత్తమును నశింపఁజేయునది, కఫకారకము. ఉప్పుకలిపి సేవించుటవలన జఠరాగ్నిని ప్రజ్వలింపఁజేయును.

తక్రములో ఏప్రకారముగా జలము వెన్న కలిసియుండునో అదేప్రకారముగా గుణములలో సయితము భేద ముండును. ఏతక్రములోనుండి సంపూర్ణముగా వెన్న తీసివేయఁబడునో ఆతక్రము తేలిక యగుటవలన పథ్యముగుచుండును. ఏతక్రములోనుండి కొంచెము వెన్నతీసివే

యఁబడునో అది వెనుకఁజెప్పఁబడిన తక్రముకంటెను గురువు, వీర్యవర్ధకము, కఫకారకము నగుచుండును. ఏతక్రమునుండి కొంచెమేనియు వెన్న తీసివేయఁబడకుండునో ఆతక్రము వెనుకఁజెప్పఁబడిన తక్రముకంటెను గాఢము, భారము, పుష్టికారకమునయి కఫమును కలిగించును. ఇదేప్రకారముగా జలముయొక్క హెచ్చుతగ్గులనుబట్టికూడ తక్రగుణములో మార్పు కలుగుచుండును. దీని భేదములు పైని వ్రాయఁబడియే యున్నవి.

## మందాది దధివలనఁ గలిగిన తక్రముగుణము

"యాన్యుక్తాని దధీన్యష్టౌ తద్గుణం తక్ర మాదిశేత్"

అని భావప్రకాశములోఁ జెప్పినచొప్పున ఏవిధమయిన పెరుగునుండి యేతక్రము తయారు చేయఁబడునో ఆతక్రములో ఆపెరుగున కనుకూలమయినగుణమే ఉండునని చెప్పవచ్చును.

(1) ఏపెరుగు పాలతో సమానముగా అవ్యక్తమయినరసముగలదియై యుండి కొంచెము గాఢముగ నుండునో ఆపెరుగు మందము అని పేరుగలది యగును. దీనినుండి తయారయినతక్రము మలమూత్ర ప్రవర్తకము; త్రిదోషవర్ధకము, దాహకారకము అని చెప్పఁదగును.

(2) ఏపెరుగు లెస్సగా పేరుకొనియుండునో, దేనిలో తియ్యఁదనము స్పష్టముగా వచ్చియుండునో, పులుపించుకయు తెలియరాకుండునో, దానికి స్వాదు అనిపేరు. స్వాదు వను దధినుండి తయారయిన తక్రము, అభిష్యంది–అనఁగా గురుత్వమును కలిగించునది, సంభోగశక్తివర్ధకము, మేదస్సును, కఫమును కలిగించునది, వాతనాశకము, పాకములో మధురము, రక్తపిత్తమును స్వచ్ఛపఱచునది యగును.

(3) ఏదధి పుల్లగా, తియ్యగా కషాయరసయుక్తమై యుండునో దానిని స్వాద్వమ్లమందురు. దానినుండి తయారయిన తక్రముతాలూకుగుణము సామాన్య తక్రమున కుండెడిగుణమే యుండును.

(4) ఏపెరుగు తియ్యఁదనముపోయిపులుపెక్కునో దాని కమ్లమని పేరు: దీనినుండి తయారయిన తక్రము అగ్నివర్ధకము, పిత్తమును, రక్తమును, కఫమును వృద్ధిచేయును.

(5) ఏపెరుగు భుజించుటవలన పండ్లు జివ్వుమనునో, ఒడలు గగుర్పొడుచునో, కంఠములో మంట పుట్టునో దాని కత్యమ్లమని పేరు. దీనినుండి తయారైన తక్రము అగ్నిదీపకము, రక్తవికారమును, వాతపిత్తములను అధికముగా కలిగించునదియు నగును.

## ఆవుమజ్జిగ

గోతక్రము పవిత్రము, అగ్నివర్ధకము, బుద్ధిని వృద్ధిపఱచునది, అర్శోరోగమును, త్రిదోషమనఁగా వాతపిత్తకఫములను శాంతింపఁజేయునదియు నగుటయే కాక, గుల్మము, అతిసారము, ప్లీహము అర్శము, సంగ్రహణి అను రోగములలో హితకారకముకూడ నగును.

## గేదెమజ్జిగ

మహిషీతక్రము కఫమును కలిగించును. గాఢముగనుండును, వాఁపును కలిగించును, గురుత్వమును చేయును, బలకారకమగును, వాతపిత్తమును తొలఁగించును.

## మేఁకమజ్జిగ

ఛాగీతక్రము చిక్కగా తేలికగా నుండుటయే కాక త్రిదోషనాశకము; గుల్మము, అర్శస్సు, సంగ్రహణి, క్షయము, దుర్బలత, శోఫము (వాఁపు) పాండురోగము, అనువీటిని తొలఁగించును.

## తక్రవిశేషముయొక్క గుణము

పచ్చిమజ్జిగ అనఁగా మరగఁబెట్టనిది ఆమాశయమునందలి కఫమును, ఆమమును నశింపఁజేయును. కంఠములో కఫమును కలిగించును.

మఱగఁబెట్టిన మజ్జిగ పీనస, శ్వాస, కాస మొదలయిన రోగములలో విశేషముగ లాభదాయకము.

## దోషవిశేషమునుబట్టి తక్రప్రయోగము

వాతప్రధానమయిన రోగములలో సొంటి, సైంధవలవణముకలిపిన పుల్లనిమజ్జిగ ఉత్తమమయినది. ఘోలమనుపేరుగల తక్రములో ఇంగువ, జీలకఱ్ఱ, సైంధవలవ

ణము, కలిపి త్రాగినపక్షమున అత్యంతము కుపితమయిన వాయువును శాంతింపజేయును. ఇంతేకాదు, మూలవ్యాధిని, అతిసారమును, పోఁగొట్టును. రుచికరము, పుష్టికరము, బలవర్ధకము, వస్తిశూలనాశకముకూడను. పిత్తమువలనఁ గలిగినరోగములలో చక్కెరకలిపిన తియ్యనిమజ్జిగ విశేషించి లాభదాయక మగును. కఫముపెరిగినచో సొంటి, పిప్పలి, మిరియాలచూర్ణము కలిపినతక్రము గుణదాయకము.

## తక్రసేవనమునకు ప్రధానవిషయము

తక్ర మన్నిఋతువులలోను సేవింపఁదగినదే అయినను శీతఋతువు తక్రసేవనమునకు ముఖ్యసమయము. అరోచకము కలిగినప్పుడును, రక్తనాడులు కఫాదుల ద్వారా అడ్డుపడినపుడును, అగ్నిమాంద్యము కలిగినపుడును, వాతాదిరోగములలోను తక్రము అమృతముచేయుపని చేయును. విష, వమన, విషమజ్వర, ప్రసేక, పాండు, మేదోరోగ, సంగ్రహణి, మూలవ్యాధి, మూత్రకృచ్ఛ్ర, భగందర, ప్రమేహ, గుల్మ, అతిసార, శూల, ప్లీహ, ఉదరరోగ, అరుచి, శ్వేతకుష్ఠ, శోథ, తృషా, క్రిమిరోగాదులలో తక్రము ప్రధానౌషధము.

కేవలము ఉష్ణకాలములోను క్షత, దౌర్బల్య, మూర్ఛా, భ్రమ, దాహ, రక్తపిత్తములలోను ప్రధానముగా తక్రసేవనమును చేయించరాదు గాని, తక్కిన సమస్తరోగములలోను తక్ర మొక్కటియే పరమౌషధము.

## జ్వరము—తక్రము

సమస్తరోగములలోను జ్వరముకంటెను కఠినమయిన రోగ మింకొకటి లేదు. తఱచుగా జ్వరము రాకుండ ఏప్రాణికిని ప్రాణము పోదు. ప్రతిరోగము తాలూకు రాజ్యమునందును జ్వరదేవుని జెండా యెగురుచుండును. ఆహారవిహారములలో అణుమాత్రమయినను హెచ్చుతగ్గులు కలిగినచో వికరాళమయిన జ్వరముతాలూకు కాలమూర్తి యెదుటనే ప్రత్యక్షమగుచుండును. గొప్పగొప్పమహారథులను విశాలశరీరులను క్షణమాత్రములో ధరాశాయులను చేసివేసి వారిబలముతాలూకుమానమును మర్దించుచు, తనచక్రవర్తిత్వమునకును, శాసకత్వమునకును ప్రత్యక్షప్రమాణమును చూపించుచుండును. నిర్దయమగు జ్వరము వచ్చినవారిని చంపుటలో నించుకయినను సంకోచమును పొందదు సరికదా నిర్బలుఁడు దొరకినచో తాను మరింత భీషణమయినమూర్తిని ధరించుచుండును. దీనులు, హీనులు, బాలకులు, వృద్ధులును దీనికి సామాన్యాహారమే కాని యెవరయితే ప్రాకృతికమయిన రాజ్యమునుండి పరారీ చిత్తగింతురో వారిజ్వరమునకు మిక్కిలిగా భయపడవలసియే యుందురు. ప్రకృతిదేవి తాలూకు ఆజ్ఞనతిక్రమించినప్రాణులకీజ్వరము దండనస్వరూపము. ప్రాకృతికరాజ్యములో ఉన్నవారయి తన్నియమానుకూలముగా సంచరించువారి జీవనమార్గము నిష్కంటకము. జ్వరాదిరోగములు వారికి దూరమునుండియే చేతులుజోడించుచు వారిజీవనముతాలూకు శాంతిమయమార్గమును చూపించుచుండును. ప్రకృతినియమముల నతిక్రమించినవారు జ్వరాక్రాంతు లగునపుడు ప్రకృతిమాతను శరణుచొచ్చినంతమాత్రముననే అతివేగముగా జ్వరమునుండి ముక్తులయి తీరుదురు. అట్టివారి కేవిధమయిన ఔషధాదులసాయమే అక్కఱయుండదు. కనుకనే మనశాస్త్రకారులు జ్వరాదిరోగములచే నాక్రమింపబడినపుడు లంఘనమునే ప్రధానముగా నంగీకరించియున్నారు; తుదకు దోషము పక్వమగువఱకును ఔషధమునే నిషేధించియున్నారు. అంతేకాదు; కేవలముప్రకృతిమాతపయిననే భారము వదలివేయవలయునన్న సిద్ధాంతమునే స్థిరపఱచినారు. ఇపుడిపు డీసిద్ధాంతముతాలూకు అనుకరణమును గొప్పగొప్పడాక్టరులుకూడఁ జేయుటకు ప్రారంభించినారు. అమెరికాలో ఉపవాసచికిత్సను గుఱించి పెద్దపెద్దకాలేజీలుకూడ నేర్పఱుపఁబడియున్నవి. 90-90 లంఘనములుచేయించి కొంచెము పథ్యము పెట్టించుచున్నారు ఇచ్చట నీభూమికను వ్రాయుటకభిప్రాయ మేమనఁగా, ఎంతవఱకు జ్వరములో ఔషధమిచ్చుట కవసరముండదో అంతవఱకును రోగికి నేమియు నీయక ఉచితసమయమున (అనఁగా, దోషము పక్వస్థితిని పొందినయనంతరము "వాతికే సప్తరాత్రేషు దశరాత్రేణ పైత్తికే, శ్లైష్మికే ద్వాదశాహేన జ్వరే యుంజీత భేషజమ్" వాతజనితమయిన సంతతజ్వరములో

ఏడేసిరోజులకుఁదర్వాతను, పిత్తమువలనఁ గలిగిన సంతత జ్వరములో పదేసిదినములఅనంతరమునను, కఫమువలనఁ గలిగినసంతతజ్వరములో పండ్రెండేసిదినములతరువాతను) తక్రమును పూర్వోక్తవిధి ననుసరించి దోషానుకూలముగా తయారుచేసి ఆఱుమాషములయెత్తు అనఁగా ఒకచెమ్చా తో ప్రారంభించి క్రమముగా కాలమును, బలమును అనుసరించి హెచ్చింపవలెను. జ్వరము శాంతించినపయిని పథ్యమువిషయమున వ్రాయవలసిన దేమున్నది? ఔషధమునకా ఔషధము, ఆహారమునకా ఆహారము, పాచనములోనా రామబాణము చేయుపని చేయును. విషజ్వరములోనో తక్ర మమృతముచేయుకార్యమునే చేయును. ఇందులో అన్నస్థానమున తక్రమునే సేవింపఁజేసినచో అన్నివిధములయిన విషమజ్వరములు దూరమయిపోవును. ఇందుకు కారణము: దుష్టములయిన ఆహారవిహారముల వలన దూషితమయిన దోష మామాశయములో కుపితమయి జ్వరమును కలిగించును. ఆమాశయమును శుద్ధముగా చేయుటకై తక్రమును మించిన మఱియొకవస్తువు లేకపోవుటయే. ఏమా? తక్రము లఘు వగుటవలన తాను పచనమయిపోవును. దీనిపాచనభారముమాత్ర మామాశయముపై నుండదు, సరికదా, ఆమాశయగతమయిన దుష్టదోషములను పచనముచేయుటకై దీనికంటె హెచ్చయిన రెండవయౌషధ మింకొకటి లేదు. చాతుర్థికజ్వర మన్నింటికంటెను ఘోరమయినది. ఇది సంవత్సరములకొలఁదిని పిండమును విడుచునదిగాదు. కాని తక్రసేవకులదర్శనము చాతుర్థికజ్వరమునకు దుర్లభము. ఇట్లుండఁగా నింక ఆంతరికతార్తీయాకాది జ్వరములవిషయమున చెప్పవలసిన దేమున్నది? తక్రకల్పమును చేయుమనుజులు శారీరకసుఖమును, స్వర్గలోకసుఖమును, మనుష్యలోకములోనే అనుభవించుచుందురు. కారణ మేమనఁగా, వారు శారీరకములయిన జ్వరాదివ్యాధులనుండి సర్వదా ముక్తులయియుండుటయే.

బాదమపప్పు నూఱి మజ్జిగలోకలుపుకొని త్రాగుటవలన అన్నివిధములయినవిషమజ్వరములు శాంతించును. మఱియు మారేడు పద్మాక్షములు మజ్జిగలో కలుపుకొని త్రాగిననుకూడ విషమజ్వరము శాంతించును.

## అతిసారము—సంగ్రహణి

అతిసారరోగముకూడ చాల ప్రబలమయిన రోగమే. ఇది ఉత్పన్నము కాఁగానే మనుజునియవయవము లన్నియు శిథిలము లయిపోవును. ఇందులో దోషములు కుపితము లయినప్పుడు రక్తాదిసమస్తద్రవధాతువులున్న జాఠరాగ్నిని మందముచేసి వాయుద్వారా ప్రేరితములయి మలముతో బయటికి వచ్చుచుండును. అగ్ని మందగించుటవలన నీరోగములో అన్నాదులగు గురుపదార్థములను సేవించినపైని అవి సరిగా పచనముకాక దీనివేగము మఱింత వృద్ధియగును. ఒకప్పుడు ఆమము, ఒకప్పుడు పసరు, ఒకప్పుడు పచ్చగాను విరేచనము లగుచుండును. వేఱుగా మూత్రము జారీయగుట బందగును. వాయువు బయటికి రాదు. కడుపులో గుడగుడ లాడుచుండును. ఇట్టి స్థితిలో తక్రమునకంటెను హెచ్చుగా హితముచేయు రెండవవస్తువు కనుపడకున్నది. ఏమా? ఇది ఆహారమునకా ఆహారము, ఔషధమునకా ఔషధముకూడనగును. ఇది తేలిక, రూక్షము అగుటవలన అతిశీఘ్రముగా తాను పచనమయి జలధాతువును శుష్కింపఁజేసి మలమును బంధించును. అందువలన తత్క్షణమే విరేచనములుఁకట్టిపోవును. ఆమవిరేచనము లగునప్పుడు మాత్రము తక్రము వినాగా ఆహారమగుచు ఆమమును కాల్చివేసి వేగముగా మలమును కట్టించునట్టిది మరొకవస్తువే లేదు. కారణ మేమనఁగా, ఆమాతిసారముమాత్ర మన్నాదుల అజీర్ణమువలననే ఉత్పన్నమగుచుండును. ఇందులో మఱి యేవస్తువయినను ఆహారార్థము భుజించినవెంటనే అజీర్ణము మఱింత వృద్ధియగును. అందువలన విరేచనములు, కడుపులోని గుడగుడ నిలిచిపోవుటకుబదులు మరింత వృద్ధియగుచునేయుండును. ఆమాతిసారములో అర్ధచెటాకుగాని ఒకచెటాకుగాని ఆముదము త్రాగించి తరువాతను తక్రసేవన మారంభింపఁజేయుటవలనను, మూఁడుదినములు, ఇంగువ, జీలకఱ్ఱ, లవణము కలిపినతక్రము త్రాగించుటవలనను ఎంతపురాణించిన ఆమాతిసారమయినను శాంతించును. ఇది వైద్యులయనుభవములో ఉన్నప్రయోగముకూడను.

ఇంద్రయవ, తుంగముస్తలు, నాగకేసరములు, లొద్దుగచెక్క, సొంటి, మోచారసము అను వీనిని చూర్ణ

ముచేసి యెఱ్ఱని దేశీయశర్కరతో కలిసినది కొంచెము తక్రములో ఆఱుమాషములు సేవించుటవలన చాలా పురాణించిన అతిసారముకూడ శాంతించును. లేదా తక్రాదిచూర్ణమయినను ఈయవచ్చును. తక్రము మరిగించి కోవా చేయునది. తర్వాత నందులో పైని వ్రాయఁబడిన ఔషధములు, రెండు జీలకఱ్ఱలు, అజవాయన ఓమము, వేఁచిన యింగువ, అజమోదము, వాయువిడంగములు, చిత్రమూలపు వేరు, మారేడిపండు నురుజు, మామిడి టెంకలోని నురుజు, భంగు అను నీ వస్తువులు సమభాగములు తీసికొని నీటికి సరాసరిగా పైకోవా కలిపి ఒక్కతులము చూర్ణము సేవించుటవలన అతిసారము శాంతించిపోవును. ఈచూర్ణమిూవ్యాసమును హిందీలో వ్రాసిన మధుసూదనదీక్షితు లనువైద్య మహాశయుని తండ్రిగారి యనుభవమయిన ప్రయోగమఁట!

## తక్రార్కము

తక్రమును ఆవిరిద్వారా అరకుతీసి దానిని జలము త్రాగుటకు బదులుగా త్రాగినచో చాలా లాభించును.

## సంగ్రహణి

సంగ్రహణి యెంతో మిక్కిలి భయంకరమయిన రోగము. దీనిలో చిక్కుకొన్న మనుజుఁ డెంతో శ్రమపడి కాని దీనినుండి తప్పించుకోఁజాలఁడు. ఇది యతిసారమునకు ముందర, ఉదరముచెడి వృద్ధియయిన స్వరూపము. అతిసారములోఁగాని, అతిసారము నివృత్తమయిన పైనిగాని అగ్ని మందముగ నుండును. అట్టి మందాగ్నిలోనే అపథ్యవస్తువులను సేవించుటవలన మిగిలిన అగ్నికూడ నష్టమయిపోవును. అందువలన సంగ్రహణి (అన్నమును ధరించు నాఱవకళ) దూషిత మయిపోవును. దుష్టమయిన గ్రహణిలో అన్నమును ధరించుశక్తి యుండఁజాలదు. అందువలన అన్న మేమాత్ర మయినను సంగ్రహ మయినపుడు విరేచనములు ప్రారంభమగును. ఈకారణముచేతనే సంగ్రహణీరోగములో నెంతవఱకు బలానుసారముగా అన్నసంగ్రహ మగుచుండునో అంతవఱకును అనఁగా ౧౧-౧౨-౧౫ దినములవఱకును మనుజుఁడు చక్కఁగా నుండును. తుదకు విరేచనములు ప్రారంభించును. గ్రహణి తాలూకుబలము తగ్గుట కారంభించిన కొలఁదిని వేవేగముగ విరేచనము లగుచుండును. తుదకు సరాసరిగా విరేచనమగును. ఏమాత్రము తిన్నను అది యదేప్రకారముగా బయటికి వచ్చుచుండును. రక్తము మొదలయిన సమస్త ద్రవధాతువులతోఁ గూడ పోవుచుండుటవలన అస్థిచర్మావశిష్టుఁడై మనుజుఁ డుండిపోవును. ఇఁక నేమున్నది? తుదకు తన ప్రాణములను విడుచుకొని దీనినోటను పడిపోవును. ఇటువంటి మహాభయంకరమయిన రోగమున కేకమాత్రౌషధము తక్రమే అని మఱవఁగూడదు. తక్రచక్రవర్తిగారి గొడుగునీడను చేరియున్నవారిని సంగ్రహణివంటి భయంకరరోగ మేమియుఁ జేయఁజాలదు. అనఁగా, తక్రముతాలూకు రాజ్యములో ఇటువంటి దోపిడిగాండ్రుండఁజాలరు. సంగ్రహణివంటి రోగములనెడి దోపిడిగాండ్రవలన బాధింపఁబడుచున్నవారికి తక్రమును శరణుచొచ్చినంతనే సంపూర్ణముగా శాంతి లభించును. అటుతర్వాతను ఆదోపిడిగాండ్రు వారివైపు యావజ్జీవము కన్నెత్తి చూడనైనను చూడఁజాలరు.

## తక్రకల్పము

సంగ్రహణి తటస్థించినవెంటనే తక్రమును దోషానుకూలముగా తయారుచేసి దానిలో జీలకఱ్ఱ, లవణము, ఇంగువ మొదలయిన తగిన ఔషధములు కలిపి దానిని సేవించుట క్రమముగా ప్రారంభించి, అన్నమును క్రమముగా విడిచిపెట్ట వలయును. ఇంత యేల? జలము త్రాగవలసినపుడు సయితము తక్రమే త్రాగునది. ఎంత తక్రము త్రాగుటకు వీలో అంతవఱకును త్రాగునది. ఇరువది సేర్ల వఱకును తక్రము త్రాగువారు గలరు.

## మూలవ్యాధి

ఈరోగము మనుష్యు నెట్లు నిర్బలునిగాఁ జేయునో యెఱుఁగుదురా? గోదుములలోపల పుట్టెడి పురుగు వాటి నెట్లెందులకును పనికిరాకుండఁ జేయునో ఇదియు మనుజుల నట్లే చేయును. ఇది చాల దుర్జయమయినరోగమన్న సంగతి యనుభవించువారే యెఱుఁగుదురు. ఇది యంకురించినతోడనే రోగితాలూకు ఇంద్రియము లన్నియు శిథిలము లయిపోవును. దీనిలో చర్మము, మాంసము,

మేదస్సు దూషితమయినపయిని మలద్వారములో మాంసాంకురములు బయలుదేరును. ఈయంకురము లావగింజలంతలేసిగా ప్రారంభించి క్రమముగా పెరిగి పెద్దవగును. కొందఱ కొకటి, కొందఱకు రెండు, కొందఱకు మూఁడును పెరిగిపోవును. కొందఱ కామొలకలనుండి రక్తము మేఁకను కోసినారా అన్నట్టుగా ధారగట్టి ప్రవహించును. ఒకానొక దురదృష్టవంతునకు మూఁడుమొలకలును పొంగిపోయి యొక్కటిగా నయిపోవును. అట్టివానికి మల ప్రవృత్తిమాట అటుండఁగా వాయువుకూడ లోపలినుండి బయటికి రాఁజాలదు. అట్టి స్థితిలో వ్రేళ్ళతో మలము తీయవలసివచ్చును. ఇదిపుట్టినతర్వాతను గుల్మము, ప్లీహము, ఉదరము, జ్వరము, మూర్ఛ, తృష, అరతిదాహము, శ్వాసము, కాసము, హృల్లాసము, అరుచి, పీనస, ప్రమేహము, మూత్రకృచ్ఛ్రము, క్లైబ్యము, మందాగ్ని, ఛర్ది, శిరోజాడ్యము మొదలయినవి పెక్కు ఆనుజన్య వ్యాధులు కలుగును. రక్తార్శస్సులో రక్తము హెచ్చుగా పోయిన తర్వాతను రోగిస్వరూపము పచ్చని కప్పలాగున నయిపోవును. బలము, వర్ణము, ఉత్సాహము నష్టమయిపోవును. ఇట్టి దుర్జయవ్యాధియనెడి గట్టికోటను ధ్వంసముచేయుటకు తక్రమే కంచుఫిరంగి. దాని ప్రహారమువలననే అది ధ్వంసమై నామావశేషమగును. కావున తక్రమును సామాన్యమయినదానినిగా ఉపేక్షింపక ప్రతివారును సేవించుచు నీరోగులయి సర్వసుఖముల ననుభవించుచుందురు గాక యని కోరెదము.

---

# ప్రభాతగానము

శ్రీ. శ్రీ. (కవితాసమితి)

అస్మదీయపరిఫుల్ల హృదంతరాళ
సంస్థిత పవిత్రతర భావసముదయ ప్ర
దర్శనోత్సుకమతినౌచుఁ దమకమెసఁగ
దేవి! నీ సన్నిధికి నేగుదెంచినాఁడ!
అత్యుదగ్రగతమిస్రదుర్వ్యావృతి ప్ర
భిన్నమానైక శక్తి సంపన్ననిశిత
భానుకిరణ ప్రశస్తమై ప్రాచి తోఁచె
సమయమయ్యెను నీ పూజ సలుపుకొఱకు.

ఏ యనంత ప్రభావ దుర్జ్ఞేయమాన
మానితాచ్ఛ పరంజ్యోతివో నితాంత
నిస్తుల గుణాఢ్యవో యట్టి నిన్ననంగ
గందళించిన హృదయారవిందసుమమ
భక్తిపూర్వకముగ సమర్పణమొనర్తు
మహిత భవదీయరూప సంపద్విలాస
నిర్మలాంచిత మందాకినీ తరంగ
సమవగాహనోపార్జిత విమలపుణ్య
మహిమ కారణ గళిత కల్మషుఁడనైతి
నిమునకాలము నిన్ను ధ్యానింప నిమ్ము.

దీర్ఘహర్ష ప్రదాయక దివ్యభావ
గీతికా నవ్యరాగ సంకీర్తనమున
నైక్య మయ్యెద త్వన్మనోహర దిగంత
విశ్రుతశ్లోక పరిశుభ్రవీచికలను.

---

# అర్ధాంగి

లింగం వీరభద్రయ్య చౌదరి గారు, బి. ఏ., (ఆక్సుఫర్డు)

"వాగర్థా వివసంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే:, జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ."



లింగం వీరభద్రయ్యచౌదరిగారు

మహాకవి కాళిదాస కృత రఘువంశకావ్యము లోని పై శ్లోకము, భార్యాభర్తల యన్యోన్యమును, మానసికముగ వారి యైక్యమును దెల్పుచున్నది. పార్వతి తన శరీరములో నర్ధభాగము శంకరున కిచ్చి శాంకరి యైనది. శివదేవుడు తన యర్ధశరీరము శాంకరి కిచ్చి యర్ధనారీశ్వరు డైనాడు. పార్వతీ పరమేశ్వరులకు నిజమునకు వేరువేర రెండుశరీరములుండవచ్చును కాని వాక్కునం దర్థమువలె, నర్థముతో గూడియుండు వాక్కువలె, వారిద్దఱు మానసికముగ నేకశరీరు లైనారు. తన ప్రేమచేతను, భక్తి (devotion) త్యాగముల చేతను, పార్వతి పరమేశ్వరుని యం దర్ధభాగము సంపాదించి పరమేశ్వరి యైనవిధముగ, భార్య, భర్త ప్రేమను సంపాదించి, యతని కష్టసుఖములలో బాల్గొని, యతని యర్ధాంగి కావలసియున్నది. అట్లయినప్పుడే స్త్రీపురుషుల సంబంధము (relationship) ధన్య మగును.

అర్ధాంగి గుణ, లక్షణము లిదమిత్థ మని నిరూపింప వీలులేదు. కాని ప్రేమ, అన్యోన్యము, అవసరము. తెలివితేటలు, గ్రహణశక్తి, ఇంగితజ్ఞత, వ్యవహారదక్షత యుండిన బాగుగనుండును. సౌందర్యలావణ్యములు, చాకచక్యము, రంజింపజేయుశక్తి, మృదుమధురవాక్కులు నుండిన శ్రేష్ఠము. నిజమున కివన్నియు నవసరము లేదు. వాగర్థప్రతిపత్తిని, కలిసి మెలిసియుండిన, భార్య యెట్టిదైనను, 'తాను మునిగినది గంగ, తాను వలచినది రంభ' యను సామెతప్రకారము, భర్త, నిజమున కామె పై జెప్పిన గుణములను గలిగియుండిన విధముగనే యామెయెడల వర్తించును. మఱియు గొందఱు భర్తల కాదర్శమైన భార్య, పెద్దన్నగారి సంసారపక్షపు, "అనుకూలవతి నాదుమనసులో వర్తించు కులకాంత" ఇంత వండి, యింత తనకు దనపిల్లలకు బెట్టి, సంసారమీదున దైన జాలును. తదితరము లాయాసకరములు. కాని, పురుషు డెంతమాత్రము రసజ్ఞు డైనను, వాంఛాపరు డైనను, తన యర్ధాంగి సురుచిర రూపలావణ్యరాశిగను, మృదుమధురభాషిణిగను, నవయౌవనోపేతగను, ప్రేమపూరిత హృదయగను, శేముషీసహితగను, ఇంగితజ్ఞురాలుగను నుండ నభిలషించును. అట్టియామె దొరికిన 'ధన్యోఽస్మి' యనుకొనును. లేనియెడల

ప్రేమ పేరను, దానెంత యాదరించుచున్నను, గౌరవించుచున్నను, 'ఆనందో బ్రహ్మ మటన్న ప్రాజదు' వమలులోనికి దెచ్చుకొనలేదు.

భర్తమనస్సు గుర్తెఱుగు టర్ధాంగికి ముఖ్యధర్మము. భర్తస్వభావమెట్టిదో, యతని యుద్దేశ్యములు, ఆశయము లెట్టివో, అతని కేది ప్రియమో, యప్రియమో, అతనిమనస్సు రంజిల్లు విధమేదో యామె యవగాహనము చేసికొనవలెను. భర్త నర్థముచేసికొననిభార్య, అతనియం దెన్నడు సానుభూతి చూపలేదు. సానుభూతిలేని దతని కష్టసుఖములలో సీత, సావిత్రి, దమయంతి, చంద్రమతుల వలె నామె పాలు గొనలేదు. సత్య, ద్రౌపది, గాంధారులవలె భర్తకు దోడుపడలేదు ద్రౌపది, కుంతులవలె భర్తను కార్యోన్ముఖునిజేయలేదు. మఱియు, పురుషునకు స్త్రీసాంగత్య మవసరము. అతనిలో నున్న రత్యున్మాదము (sex instinct) తృప్తి కావలసియున్నది. స్త్రీపురుష సంగమమును(sexual intercourse)సౌందర్యవంతముగను,ఆనందమయముగను,ఉత్తమముగను జేయగలుగునది యొక్క స్త్రీయే. పురుషుడు రసపిపాసి. కాని రససేకరణ మతని చేత గాదు. అన్నియు సమకూర్చిపెట్టిన యనుభవించి యానందించును. అశక్తు డగు (helpless) పురుషుని ప్రేమవాహినిలో దేల్చి, యతనికి సంగమమున బరిపూర్ణ తృప్తి నిచ్చుటకు దా నతని యర్ధాంగి యైనప్పుడే స్త్రీ సమర్థురాలు కాగలదు. అప్పుడే భార్యాభర్త లిద్ద ఱేకత్వము బొంది, 'కుంభగత ప్రదీపకళికా శ్రీదోపనేకాగ్రతా, నిర్వృతిం' జెందుదురు. అప్పుడే దాంపత్యసౌఖ్యము మూర్తీభవించును. వివాహబద్ధజీవితము (married-life) ధన్య మగును. నిర్మలమై, నిశ్చలమైన దాంపత్యసౌఖ్యమునకు, సీతారాములు తార్కాణము. వారి నిష్కళంకప్రేమ, నిర్మలానోన్యము, మనస్సుల కలయిక మన కందఱకాదర్శపాత్రములు. వారి యగాధప్రేమను, వా రొకరిలో నొకరు లీనమైన విధమును దలచుకొనిన పట్టరాని (painful) యానందము మనస్సున నుప్పొంగును. వారి ప్రేమకు మూల మేది? సీతయొక్క యర్ధాంగిత్వమే. ఆమె యతనిరూపములో దనరూపమును, అతని మనస్సులో దనమనస్సును, అతని ప్రేమలో దనప్రేమను గలిపివేసినది. అతని యదృష్టము తనయదృష్టము; అతనిదుఃఖము తనదుఃఖము. అతని హావభావములు తన హావభావములు నొకటి చేసినది ఇవన్నియు నేల? అతనిలో దానైక్యమైపోయినది. ఆ సంయోగములో సీతయెవరో, రాము డెవరో, యెవరు చెప్పగలరు? సీతారాముల ప్రేమచరిత్ర, మన భారతజాతి గాథలలో నుత్కృష్ట మైనది. దానిని మించినది గాని, దానికి సరియైనదిగాని మఱొకటి లేదు. సావిత్రీ, సత్యవంతుల చరిత్రముగూడ హృదయాహ్లాదకరమైనదే. వారి ప్రేమలోగూడ పరవశతను గలిగించు మైకమున్నది; సౌహార్ద మున్నది; ఐక్య మున్నది. వారి దాంపత్యధర్మము, స్త్రీపురుషుల కుండు సంగమకాంక్ష, దానితృప్తి,

ఎంత యింపైనవి! ఎంతధన్య మైనవి! వారి ప్రేమ, మానవస్వభావమును బవిత్రము చేయు శక్తి గలది. నిర్మలప్రేమబద్ధులైన దంపతులకు సంగమ మొక్కటియే ప్రధానము కాదు. వారి కది తమ హృదయమున బొంగి పొరలు ప్రేమయొక్క బహిఃప్రదర్శనము (outward-expression) దాని యంత్యము. స్త్రీ, పురుషుని చెంత జేరి యతని సరససల్లాపములతో నుపలాలించి, కౌగిళ్లలో బరవశుని జేసి, మోహసముద్రమునముంచి అరచేత వైకుంఠముజూపి, నాహృదయము నీది, నాప్రేమ నీది, నాయావనము నీది, 'నన్నేలుకోరా, నాసామి' యను భావము వెల్లివిరియ జేసిన రతికేళి (sexual-act) అంత యెక్కుడుగ నవసరము కాదు. భర్తజీవిత మానందదాయక మగును, ధన్య మగును. కాని, సంగమకాంక్ష (sex love) ఆడుది, మగవాడను భేదములేక ప్రతిజీవికి సహజము. అట్లుండుట ప్రకృతియాజ్ఞ, తప్పదు. ఐన, నిజమైన యర్ధాంగి యట్టి యింద్రియ ప్రేమను (physical love) తననిర్మలప్రేమచే, సానుభూతి (sympathy) తో, బవిత్రము చేయగలదు.

తన యింద్రియములు తృప్తిజెంది, హృదయ మాహ్లాదపూరితమై, జీవిత మానందమయమైనప్పుడు, పురుషుడు తనహృదయగతమైన శక్తులను దెలిసికొనగలడు. తన నిజసత్వము (real stature) గ్రహించగలడు. అప్పుడే తనశక్తు లేకార్యమున కెక్కుడుగ నుపయోగపడునో యెఱుగగలడు. మఱియు, తనజీవితములోని యాశయములు, తనజీవితాదర్శములు గుర్తెఱింగి, వాని సఫలతకొఱ కుత్సాహముతో, సమ్మకముతో, మనఃపూర్తిగ పాటుపడగలడు; విజయము జేపట్టగలడు. పేరుకీర్తులు సంపాదించి, తనజన్మసార్థకము చేసికొనగలడు. భర్త తనయాశయముల ననుభవములోనికి దెచ్చికొని గొప్పవాడైన, వాని అర్ధాంగియైన భార్య మిక్కిలి సుఖించును. భార్యాభర్తలు తృప్తులైన, వారి గృహజీవితము (home life) ఆదర్శపాత్ర మగును. మన యార్ష సంఘమున గృహము మిక్కిలి ప్రధానమైనది. ఆర్యనాగరికతలో గార్హస్థ్య మత్యుత్తమ మైనది. దాంపత్యసౌఖ్యము గార్హస్థ్యమునకు జీవము. మఱియు, గృహజీవితము సంతోషప్రదమైన, పిల్లలు హాయిగ బెరుగుదురు. వారి విద్య, వారి నడవడిక, తగినపద్ధతుల ననుసరించి యుండును. బాలబాలికలు భవిష్యజ్జాతిగాన, వారు విద్యావంతులై, బుద్ధిగలిగి, యారోగ్యముతో సంతోషవంతులుగ నుండిన నట్టి బిడ్డలగన్న తల్లిదండ్రులు సంఘమునకు, దేశమునకు నమూల్యమైన సేవజేసినవారగుదురు. ఇంతియకాదు. పిల్లలు జెల్లలతో సుఖంబుండిన గృహము నాగరికత యంతటికి బట్టుగొమ్మ.

పైన వ్రాసినదానిబట్టి, భార్యమాత్రమే శాయశక్తుల బ్రయత్నించి, యర్ధాంగియై భర్తను సుఖపెట్టవలె ననియు, భర్తగూడ సర్వవిధముల బ్రయత్నించి భార్యను తన యర్ధాంగిని జేసికొని యామెను సుఖపెట్టవలె

నని కాదనియు, పాఠకు లూహించుకొన కుందురుగాక. అట్టి సందేహమున కీ వ్యాస శీర్షిక నుదాహరించిన కాళిదాసుని శ్లోకమును, దాని ననుసరించి వ్రాయబడిన వాక్యములు నెడమీాయవని నా నమ్మిక. కాని, భార్యా భర్తలసౌఖ్యమునకు, స్త్రీపురుషులు వ్యక్తిత్వ మును బొంది, తమతమ యాశయముల నాచరణలోనికి దెచ్చుకొనుటకు, తమ జీవి తము ఫలప్రదముగ జేసికొనుటకు, విశే షించి, పురుషుడు తనశక్తుల నుపయోగించి జాతికిగాని, దేశమునకుగాని, చివరకు ప్రపంచ మున కంతటికిగాని, తాను చేయగలిగినంత సేవ, యుపకారము చేయుటకు, పిల్లలభివృద్ధి నొందుటకు, గృహ మానందనిలయ మగు టకు, స్త్రీ యర్ధాంగి కావలసి యున్నది. స్త్రీ, పురుషుని యర్ధాంగియైనగాని మానవ జీవితము ఫలవంతముగాదు. నాగరికత సార్థ కము గాదు.

---

## మనస

మామునూరు నాగభూషణరావు గారు

దారుణమహోగ్ర హృదయవేదన దురంత
లోక వారాశిలో దేలు నా కవోష్ణ
రుధిర మంజుల నాళ సంపదల లోని
రక్తకాంతులు విరిగి ధావళ్యమొంద
ఎచటి కీ లీల గొంపోదు వీవు మనస?

సర్వవైభవ సంతోషసార సంక
లిత రసామృత సంసారలీల లెఱుగ
అమిత క్రూర భయానకమ్మయిన దుఃఖ
పూరిత మహాంధ కలుష ప్రసారములను
ఏల చవిజూపు సంకల్ప మిటులు మనస?

చండ నైదాఘ తప్త వాసరములందు
నిండుకోరిక జరియించుచుండు నాకు
నిభృత శారదచంద్రికా నిశలలోన
కలువపూవులు దండలు గట్టి వైచి
లలిత మంజుల మలయానిలంబు విసరి
ఏలత్రిప్పెదు నన్ను నీవిటులు మనస?

ఎండమావుల జలమంచు నెద భ్రమింప
జేసి, చెంగటికాసార శీతలామ్బు
తాంబుపూరంబులను ద్రావన గ్లోసర్చు
దుష్ట సంకల్పమేలనో దుడుకు మనస!

అందియందని ఫలముకై యఱ్ఱుసాచి
అందలేదని దుర్వ్యథ లొందుకంటె
పటుతర గభీర శోక సంపదలయందె
మంజులానంద మొసగూర్చు మార్గములను
వెదకి కనుగొనవేలనో వెఱ్ఱి మనస?

లలిత సంతోష నిలయంబులను గనంగ
ముక్కుమూసుక తపములో మునుగనేల?
అళిని రావించు మల్లెపూ వలపులందు
కాఱుమబ్బు లేచుపుల చీకటులయందు
ఉన్నత ప్రేమ ప్రియుల వియోగమందు
కూడులేని దరిద్రుని కుండయందు
తప్పెఱుంగని ప్రభువిచ్చు మెప్పులందు
ఒప్పనుచు జేయు సేవకు తప్పులందు
వ్రాయనేరని విజ్ఞాని భావమందు
అణగి యున్నది ఆనంద మందె మనస?

[తొలిపూతనుండి]

---

# ఏది మంచి వయసు?

నిడమర్తి సత్యనారాయణమూర్తి గారు

[ప్రతిజంతువు సుఖజీవనము నభిలషించి జీవితము గడపును. అటు చేయుట కష్టములు వచ్చినపుడు నిస్పృహ జెందక పట్టుదలతో వానిని నిరోధింపజూచును. ఈపట్టుదల ఉత్తమ జంతువగు మానవునియందమితముగ గోచరించుచున్నది. యుగయుగములనుండియు ప్రోగుపడియున్న యనుభవము నాధారముగా గొని క్రొత్తపరిస్థితులకు సరిపోయిన విధానము నవలంబించి మనుష్యుడు జీవయాత్ర నెమ్మదిగ గడుపును. ఇట్లు చేయుటలో పలువురకు పలు విధములగు పరిస్థితు లేర్పడుటయు, దానివలన అనుభవము మారుటయు దటస్థించును. అందుచే మానవుని జీవితమున నేకాలమెక్కుడు ఫలప్రదమును సంతోషకరమును నగు విషయ మొక్కొక్క వ్యక్తి కొక్కొక్క విధముగ గోచరించును. 'టి. పీస్ వీక్లీ' అను వారపత్రికయందు పలువురుప్రసిద్ధపురుషు లిద్దానికి నీవిధముగ జవాబిచ్చియున్నారు.]

## హ్యూ వాల్పోలు

నా అనుభవమును బట్టి క్రొత్తగా వచ్చిన వయసు గడచినదానికన్న మంచిదిగా గనుపించుచున్నది. వయసుముదిరినకొలది అనుభవము హెచ్చుచుండుటచే దేహారోగ్యము సరిగా నున్నచో జీవితము నానాటికి ఎక్కువ ఫలప్రదమగునని నే ననుకొనుచున్నాను. ఒకవేళ అనారోగ్యముగ నున్నను ఇతరులను చూచుచుండుటవలన మనకు విచారముకన్న ఆనందమే హెచ్చుగనుండును. ఇష్టము వచ్చిన పనిచేయుట కవకాశము, నిజమైనస్నేహితులు, సరియైన దృష్టి యున్నంతకాలమును జీవితములో నన్ని కాలములును సమానముగ సంతోషకరములుగ నుండును.

## ఆర్థరు మోరిజను

అరువదినాలుగు వత్సరముల అయిదురోజులు చాల మంచి వయసని నాకు తోచుచున్నది. కారణ మేమందురా? ఇది వ్రాయు సమయమున నా వయసది.

## అలెకువా

మానవజీవితములో ఏది మంచికాలమో నేను చెప్పలేను. ఇప్పుడు నా వయసిరువది తొమ్మిది. నిరుటికంటె ఈయేడు నాజీవిత మెక్కువ రుచికరముగా నున్నది. నిరుడాముందటి సంవత్సరముకన్న రుచికరముగా నున్నది జీవిత మీవిధముగా గడవగలదని నా యాశయము.

## మే ఎడ్జింటను

ముప్పదియైదు డేబదియైదు మధ్య దైహికముగను, మానసికముగను మానవజీవితము మిక్కిలి ఫలప్రదమైనది. ఏండ్లు గతించిన కొలదిని జవసత్త్వములు మారుచుండునుగాని యీకాలమున అవి క్షీణింప మొదలిడవు.

యౌవనమునందలి యందచందముల పై మెరుగులు తగ్గిపోవును. కాని చూచుటకు అంతే అందమును ఆకర్షణీయమును నగు ప్రౌఢత్వ మలవడును.

మానసికశక్తి, చిత్తవృత్తి నిరోధము, ఆత్మజ్ఞానము, ఇంద్రియనిగ్రహము అలవడిన వయసు ప్రతివారియందును మిక్కిలి వాంఛనీయమైనది.

ఇది లేనిచో నెరయౌవనము మాత్రమే వాంఛనీయము.

## రాబర్టు హిచెన్సు

నేను మీకు జవాబు నీయజాలను. బాల్యము సుఖప్రదమైనది గాదని మాత్రము చెప్పగలను. చిన్నతనమునం దిష్టము వచ్చినపని చేయుట కాటంకము లున్నవి. ముప్పదియైదు మంచి వయసు. నేనది దాటితిని. నావయ సిపు డరువదియైదు. ఐనను నేను గోల్ఫు, టెన్నిసు ఆడుదును. స్వారిచేయుదును. యాత్రలకు పోదును. ఇవి యన్నియు నానందదాయకములే.

నాకిపుడు కొన్నినిషేధములు కలిగినవి. చుట్ట, మద్యపానము మానవలసివచ్చినది. నేను యౌవనవంతుడ

నని తిరుగజాలను గాని ముసలివాడను మాత్రము గానని చెప్పగలను. అందుచేత అరువది రెండు వత్సరముల వయసు గూడ మంచిది గానే నాకు గాన్పించుచున్నది.

## రోజు మెకాలే

అది వారివారి పరిస్థితుల ననుసరించియుండునని నా యభిప్రాయము.

[దీనిని జదివినయనంతరము జీవితమును కేవలభౌతిక భావముతో గాక ఆముష్మిక చింతతో జూచు మన వారీప్రశ్నకు వేరు విధములగు జవాబులను తప్పక ఇత్తురని యెంచి పలువురకు వ్రాసియున్నాను. కాని అందు చాలమంది జవాబీయక పోవుటచే తగినంత సామగ్రి చేకూరలేదు. ఇచ్చిన వారి యభిప్రాయములను దిలకించినచో నాయూహ నిష్ఫలము కాలేదని చదువరులు గ్రహింపగలరు. ఈరెండు విధములగు జవాబులందున్న గుణాగుణములను గ్రహించి అస్మద్దేశజులు అనుశ్రుతముగ వచ్చుచున్న తమ యాదర్శముల నేమరక జీవితమును ఫలవంతముగ జేసికొన్నచో వారేకాక సమిష్టిమీద జాతియంతయు శక్తిమంతమును గుణవంతము నగునని నా యభిప్రాయము. మనవారిజవాబుల నిక నుదహరించుచున్నాను.]

## కూచి నరసింహము గారు

మీ రడిగిన విషయమై భగవంతుడు నాకు దోపించిన యభిప్రాయమును సంగ్రహముగ వ్రాయుచున్నాను. శైశవావస్థయును, ద్వితీయ శైశవావస్థయ ననదగు అతి వార్ధకావస్థయును కేవల పరాధీనములు గనుక అందలి సుఖదుఃఖములు పోషకుల యోగ్యతాయోగ్యతలను బట్టి యుండును.

సుశిక్షతోగూడిన బాల్యయౌవనములు సుఖకరములు; భావిఫలదాయకములు. యమనియమాత్మకమైనచో నడివయసు బహు సత్ఫలదాయియగు ప్రధాన వయస్సు. బాల్యయౌవనములలో నాటిన పైరప్పుడు పంటకు వచ్చును. స్వహితపరాఙ్ముఖత్వ పూర్వకమైన పరోపకారాద్యుదారసత్క్రియలకు పుష్కలమైన దేహబల బుద్ధిబలము లుండును. వానికి దోడుగా జిత్తమునం దవ్యాజమైన దైవభక్తియే యున్నచో బరుసవేదిచే బరుసలోహములు బంగారము లగునట్లు ఆభక్తిచే జీవయాత్ర లోబడు కష్టములు సుఖముగానే బరిణమించును. సుఖీభవ.

## చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు

మానవుని జీవితములో పదిమొదలు ఇరువదియైదు వత్సరముల వరకు ఫలప్రదము, సంతోషకరమునై యున్నది. బాల్యము ఆనందదాయకమైనను జ్ఞానముతో గూడుకొని యుండక పోవుటచే దానిని బరిగణింపగూడదు. కాని 10 మొదలు 16 వరకు అవివాహితముగా నున్నచో కాలమునంతయు జ్ఞాన సంపాదనకొఱకును, జీవితాధారమును సముపార్జించుకొనుటకును వినియోగము చేయును. సంసారమును గూర్చికాని, స్వపోషణార్థముగాని యెక్కువ విచారము సాధారణముగా అగత్యము లేదు.

## దేవులపల్లి అప్పలనరసింహము గారు

నిత్యకల్లోల లోలమగు మనుష్యజీవితమందు మంచి వయస్సిదియని నిర్ణయింప నెవ్వరితరము? వ్యక్తికొక్కరీతిగా బొడగట్టును. అజ్ఞానము, అశక్తికలిగియుండు బాల్యము ముగ్ధత్వము చేతను, పాపరహితత్వము చేతను దేవత్వ సమమని నీతిశాస్త్రము చెప్పుచున్నది. స్వర్గమిట్టి వారలతో నిండియుండునని క్రీస్తుచెప్పెను. యౌవనము శక్త్యుత్సాహములతో తరుచుగా గూడియుండును. గాని జ్ఞానశూన్యముగా నుండుటచేత తప్పుచేతలకు లోనగుచున్నదనుట సర్వవిదితము. వార్ధక్యము జ్ఞానముకలిగియున్నను లోకానుభవమునకు శక్తిని గలిగియుండదు. తనకు పనికిరాదు. యోచింపగా యౌవనమే ప్రశస్తమైన కాలమని తోచును. కొంచెము విద్య,కులమర్యాద, జీవనోపాధియున్నచో యౌవనముననే మనుజుడు సుఖింపవచ్చును. ఇతరులను సుఖపెట్టవచ్చును. జ్ఞానము సంపాదింపవచ్చును. గొప్ప ఆశయముల నలవడ జేసుకొని వాని ననుసరింప యత్నింపవచ్చునని నాయభిప్రాయము.

### రాయసము వెంకటశివుడు గారు

ఒకవిధముగా జూచినయెడల మానవజీవితములో నన్నియాశ్రమములును ఫలప్రదములును సంతోషకరములునై యుండవలసినవే. కాలాధినాధుడగు భగవంతుడు నిష్పక్షపాతబుద్ధిగలవాడు. లాభసౌఖ్యము లెల్లెడలను వెదచల్లియే యున్నాడు. ఆలాభములను గుర్తెరుగకయు, ఆసుఖములను క్రమముగ ననుభవింపకయును మనమే యంధకారమున జెరలాడుచున్నాము. ఐనను లోకానుభవము హెచ్చినకొలదిని జీవితము ఎక్కువ ఫలప్రదముగను, సంతోషకరముగను గాగలదు. ఇది ముఖ్యముగ సజ్జనునిపట్ల నిజము. ఒక నాయభిప్రాయమే నిజమని చెప్పువాడనుగాను.

### పాలపర్తి నరసింహము గారు

మంచి వయసేదియో నేను నిశ్చయించి చెప్పనేరను. సుఖాసుఖముల వివేచనచేయగల బుద్ధి కలిగినప్పటినుండియు మనవయసు మంచిదనియే నా అభిప్రాయము. వయస్సును ఆరుభాగములుగా విభజింతము. 5 సంవత్సరములలోపల శైశవము; 5_14 వరకుబాల్యము; 14_18 కౌమారము; 18_30 యౌవనము; 30_55 మధ్యమము; 55 పైకాలము వార్ధక్యము. నేనిపుడు మధ్యవయఃకాలములో నున్నాను. కౌమారముదాటి యౌవనములో ప్రవేశించిననాటనుండియు మనము జీవితముయొక్క గౌరవము గుర్తింప మొదలిడుదుము. మధ్యవయస్సులో నడుగుపెట్టి నప్పటి నుండియే మనము జీవితాదర్శములను అనుష్ఠానములో పెట్టి వాని ఫలాఫలములను అనుభవింప నారంభింతుము. పర్వత శిఖరమునువలె జీవితాదర్శమును దూరమునుండి గుర్తింపదొడంగి నప్పటి నుండియు నాకొకవిధమైన సంతోషము కలుగుచునే యుండెను. నాయాదర్శములను జీవితములో బ్రవేశపెట్టుట కెప్పుడు స్వతంత్రత లభించునా యని నేను త్వరపడుచునే యుంటిని. ఇది యౌవనములో నే పొందిన సౌఖ్యము, తరువాత శక్తికొలది ఆదర్శముల ననుష్ఠింపుచు తన్మూలమున గలుగు కష్టసుఖముల ననుభవించుచున్నాను. ఈకాలము గూడ నాకు సంతోషకరముగనే, జీవింపదగినదిగనే యున్నది. ఇప్పుడు నాకు 42 సంవత్సరములు. ఇప్పటివరకు తిరిగి నన్ను నాజీవితమును జీవింపుమన్న సంతోషముతో జీవింపగలను. ఈశ్వర విశ్వాసముతో మనము జీవింప నేర్చుకొన్నచో మనజీవితములోని వయఃకాలములన్నియు ఆనందప్రదములనియే నే దలంచుచున్నాను.

### తల్లావఝుల శివశంకరశాస్త్రిలుగారు

మానవుడు ఏదో లక్ష్యము మనస్సులో పెట్టుకొని, వస్తుతత్త్వము సమగ్రముగా గ్రహించక, ఈషద్భ్రాంతిలో ఉండి ఫలము లభ్యము అనే ఆశతో సాధనచేసే సమయము జీవితములో సుఖప్రదము. అప్పుడే కవిత్వముగాని, శిల్పముగాని, సంగీతముగాని, శాస్త్రముగాని, జగత్కల్యాణప్రయత్నముగాని ఆవిర్భవిస్తుంది. దీనికి వయస్సుతో పనిలేదు.

### పార్నంది జగన్నాధస్వామిగారు

మంచికాలము నడివయస్సు అనగా 30_45 వరకూ అని నా అభిప్రాయము.

### చింతా దీక్షితులు గారు

దుఃఖముతో మిళితముగాని సంతోషము ఇంతవరకూ నా అనుభవములో లేదు. జీవితములో సుఖమూ దుఃఖమూ, వెలుగూ నీడా వలె వుండడము నా అనుభవము. కాబట్టి జీవితములో యేఅవస్థా పూర్తిగా సుఖకరమనిగాని, పూర్తిగా దుఃఖకరమనిగాని చెప్పవీలు లేదు. నా అనుభవమునుబట్టి ఏకాలము ఫలప్రదమో వ్రాయజాలను. భగవంతునిమీద యెప్పుడూ మనస్సు లగ్నమై వుండేభాగ్యము ఎవరికి లభిస్తుందో వారి జీవితము ఫలప్రద మనవచ్చును నాకంతటి భాగ్యము చేకూరలేదు. ధనార్జనము, బిరుదులు తాత్కాలికమైన కీర్తి యిటువంటివాటినిబట్టి జీవితము ఫలప్రదమని అనుకోరాదని నా అభిప్రాయము.

# జన్మభూమి

చావలి సుబ్బారాయుడు గారు

పుట్టినప్పటినుండియు ముదము గదుర
పలుతెలుంగుల సౌఖ్యంబుఁ బడసినాఁడ
దేశయాత్రాభిలాషినై తిరిగితిరిగి
సజ్జనుల గోష్ఠి నెంతయు సలిపినాఁడ
చక్కనైనట్టి సౌధరాజములఁ గనిన
పేరుగాంచిన పౌరులతీరుఁ గనిన
సొంపుమీఱిన వివిధవస్తువులఁ గనిన
ప్రౌఢిగాంచిన మాటనేర్పరులఁ గనిన
కలిమిఁ బెంపొందు భోగవంతులను గనిన
పతుల సేవింపఁదగు పతివ్రతలఁ గనిన
పరమధార్మికులైన భూవరులఁ గనిన
పొలుపుగాంచిన మావితోఁపులను గనిన
కవులు వర్ణించు పిల్లవాయువులఁ గనిన
ముక్తినొసగెడి పుణ్యభూములను గనిన
నెన్నఁదగినట్టి సౌఖ్యంబు లెన్ని గనిన
జన్మభూమికిఁ జాలిన సౌఖ్యమున్నె?
స్వర్గసౌఖ్యంబునకు సాటి సౌఖ్యమిచ్చు
ననెడి నాయోక్తి గణుతింప వ్యర్థమగునె?

ఎచ్చటెచ్చట తిరిగిన నేమికనిన
నేది పొందిన నిసుమంత యింపులేదు.
మాతృభూమిరో! తావక మహిమ మేమి
చెప్ప, జెన్నంగి కొబ్బరిచెట్లతోడ
చాల పరిపక్వ పనసవాసనల తోడ
పాంథ మార్గశ్రమను బాపి పరగుదీవు.
లలిత గోదావరీసలిలంబుచేత
పెంపఁబడు పోకవృక్షముల్ పెచ్చుపెరిగి
గగనవైచిత్ర్యములఁ గాంచు కలిమిఁ బడయఁ
బోవుచును జన్మభూమిపైఁ బొదలు ప్రేమఁ
బాయఁగాలేక శిరములవంచి నిన్నుఁ
గాంచుచుండెను కోర్కెలఁ గట్టిపెట్టి
జడ పదార్థంబులే యట్లు జన్మభూమి
పైని బ్రేమను విడకున్న మానవాళి
మఱవనేర్చునె? నిన్ను జన్మస్థలంబ!
కష్టముల నీశ్వరధ్యాన గరిమ విడిన
విడువఁజాలరె నీమీఁది ప్రేమ నెపుడు
జన్మభూమిరో! యిల నీకు సాటిగలదె?

---

# ఆకస్మిక ఛాయాచిత్రములు

(SNAP SHOTS)



౧. లంబాడి



౨. స్వామిభక్తి



3. మధ్యాహ్నస్నానము

కె. యస్. ప్రసాదరావుగారు, విడవలూరు.



౧. గాలిగోపురం-మంగళగిరి

కే. వి. గోపాలశాస్త్రిగారు, గుంటూరు.



౨. గొల్లపెండ్లిలో గావుతేవ

చక్రవర్తుల వెంకట్రావుగారు, దంగేరు.

# సప్తద్వీపావసుంధరా

తిలకశిష్యుడు

శ్లో. జమ్బూప్లక్ష కుశక్రౌంచ శాక శాల్మలి పుష్కరాః; లవణేక్షుసురాసర్పిర్దధిక్షీర జలార్ణవాః.

ప్రాచీనపద్ధతిని ప్రాథమికవిద్యాభ్యాసము లైన భారతీయుల కెల్లరకును సప్తద్వీపభాగములు బాల్యముననే వాచోవిధేయములై యుండును. వీని విషయము భాగవతమందు పంచమస్కంధమున (తెలుగు ద్వి. ఆ. సంస్కృతమున ౧౬, ౧౭, ౧౮, ౧౯, ౨౦ అధ్యాయములందు) వివరింపఁబడియున్నది. భారతము ఆరణ్యపర్వమందును, విష్ణుపురాణమందును వీనివిషయము గలదు. ఈ ద్వీపములు వరుసగా నీ సముద్రము లావరణములుగాఁ గలవనియు ఏకోత్తర వృద్ధిగా నొక ద్వీపముకంటె దాని నావరించియుండు సముద్రముకంటె మరొక ద్వీపము, సముద్రవిస్తీర్ణమున రెండింతలనియు, జంబూద్వీపము మున్నగా నొక్కొక్కటియు భాగములుగా విభజింపఁబడి యున్నవనియు, వానిని వర్షము లందురనియు, వానిఁ బాలించిన రాజపుత్రుల పేర వాని కా పేళ్లేర్పడెననియు, నాయా ద్వీపస్థ ప్రధానవృక్షబీజములు కారణముగా నాయావాని కా యభిధానములు లభించెననియు నా గ్రంథములం గలదు. మఱియు, ప్రతిద్వీపాంతర్గత వర్ష సంఖ్య, ఆయా వర్షీయ నదీనద పర్వత సరోవరాదిక వివరము, ఆయా దేశీయ చాతుర్వర్ణ్యనామములు, ఇష్టదైవముల పేళ్లు నందుగలవు. భారతవర్షమందలిచాతుర్వర్ణ్యనామములకువలె బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులనికాక వేర్వేఱు ద్వీపముల చాతుర్వర్ణ్యముల వారికి వేర్వేరు నామములు.

ప్లక్షద్వీపమందలి చాతుర్వర్ణ్యములవారికి హంస పతంగోర్ధ్వాయాన సత్యాంగులని పేర్లు. "యాసాం జలో పస్పర్శన విధూతరజస్తమో హంసపతంగోర్ధ్వాయన సత్యాంగ సంజ్ఞాశ్చత్వారో వర్ణాః." ఇటులె తదితరద్వీపాయన చాతుర్వర్ణ్యమునకు వేర్వేరు నామములు గలవు. దీని ననుసరించి విచారించుచో లవణసముద్రావృతమై యిప్పటి భూగోళజ్ఞులచేఁ గాంచఁబడినభూభాగమంతయు జంబూద్వీపాంతర్గతముగానే కాన్పించుచున్నది. జంబూద్వీపము తొమ్మిదివర్షములు ఇలావృతవర్షమందు మధ్యమం దుండునది. ఈ యిలావృతమందె మేరుపర్వతము. ఇయ్యది స్వర్ణమయము. దీని యవలంబనముననే యధో ర్ధ్వాది లోకములుండును. మంగోలియాదేశీయమైన యాల్టాయి పర్వతము మేరువుగా వర్ణింపఁబడెనేమో. ఇల మంగోలియా దేశమో. భాగవతమున నీ జంబూద్వీపముంగూర్చియు ముఖ్యముగా నిందలి భారతవర్షముం గూర్చియు మూడధ్యాయములు గలవు. శేషించిన ద్వీపములవిషయ మొకయధ్యాయమందే సంగ్రహింపఁబడినది. భారతవర్షమున కుత్తరము హిమవత్పర్వతము. దక్షిణమున సముద్రమని సీమానిర్ణయము గలదు గాని, ప్రాక్పశ్చిమముల నీ మేరలు నిరూపింపబడలేదు. ఈ జంబూద్వీపానుబంధములై మఱియెనిమిది యుపద్వీపములు గలవు ఇయ్యవి జంబూద్వీపముతో (భారతవర్షముతో) నొకప్పుడు కలసి యుండి సగరపుత్రులు కారణముగా వేఱుపడినటులందేకలదు. "జమ్బూద్వీపస్యచ రాజ న్నుపద్వీపానష్టౌహైక ఉపదిశన్తి సగరాత్మజై రశ్వాన్వేషణ ఇమాం మహీం పరితో నిఖనద్భి రుపకల్పితాః తద్యథా స్వర్ణప్రస్థ శ్చన్ద్రశుక్ల ఆవర్తనో రమణకో మన్దర హరిణః, పాఞ్చజన్యః సింహలో లఙ్కేతి" ఇందు సింహళము భారతవర్ష సంబంధముగా నిప్పటి భూగోళజ్ఞులు నిర్ణయించిరి. మన రామాయణ కథాసంబంధముగలది సింహళము గాదనియు, ఇందుఁ జేర్కొనఁబడిన లంక యది గావచ్చుననియు మన మాలోచింపవచ్చును. ఇప్పటి భూగోళజ్ఞుల పరిజ్ఞాన మీలంకావిషయమందే యిటు లుండ సప్తద్వీపముల విషయమై వీరి పరిజ్ఞానముఁ గూర్చి చర్చింప నక్కఱలేదు. ఈ జంబూద్వీపమునందలి భారతవర్షము గాక శేషించిన వర్షములు ఇలావృత, రమ్యక, హిరణ్మయ,

కురు, హరి, కింపురుష, కేతుమాల, భద్రాశ్వవర్షంబులు. మన భూగోళజిజ్ఞాసువులు 'సప్తద్వీపావసుంధరా' అను టం గూర్చి చర్చించుటకుఁ బూర్వము పైవర్షము లిపుడే యేపేర్ల నున్నవో, మన భాగవతాది గ్రంథములందు గల యీ దేశ సీమానిర్ణయము, తదంతర్గత నైసర్గికస్వరూప వివరణము, ప్రకృతదేశ, లేక ఖండవిభాగమునకు, నైసర్గిక వివరణమున కేమేని పోలికగలదో లేదో చర్చించి వివరించి యున్నారేమో యీ విధేయునికిఁ దెలియదు. భారతవర్షమున నిప్పుడును వ్యవహారమునందుఁగల పర్వతముల, నదీనదముల పేర్లే పైగ్రంథములందుఁ గలవు. మిగిలిన దేశీయుల భాషాదికములు మాఱిపోయినందుననో, వేఱైయున్నందుననో ప్రకృతము విదేశీయములై వ్యవహారమందుండు నదీనదముల పర్వతాదుల నామములకును, భాగవతాది గ్రంథస్థనామములకును సమన్వయము సామాన్యజన సాధ్యముగాకున్నది. "సప్తద్వీపావసుంధరా" విషయముగా నిటీవల భారతీపత్రికయందును, (ఉభయ శ్రీ ఒంగోలు వేంకటరంగయ్య పంతులవారి యాంధ్రానువాదము) తెంగుశూరునందు పౌరాణికగాథా పరిశోధనాదికముగా ప్రకటితమగు నాంగ్ల చాతుర్థిక పత్రికయందును (బ్ర. శ్రీ. వే. వేంకటాచలయ్యగారి వ్యాసములు) గావింపబడిన విమర్శనము, ప్రత్యక్షవాదులైన పాశ్చాత్యులకును, మన స్వర్గాదులవలె నీసప్తద్వీపాదికములును నాగరకతతెలుఁగని మనవారి యూహాప్రపంచకల్పితములని పరిహసించువారికిని, మోదావహము గావచ్చునేమోగాని, మన ప్రాచీనగ్రంథములందును, వానిని రచియించిన వారియందును విశ్వాసము గలిగి ప్రత్యక్షవాదము కూపకూర్మన్యాయము వంటిదని భావించువారికి ఖేదావహమే యనుటలో భిన్నాభిప్రాయము లుండనేరవు.

పై జేర్కొనబడిన సప్తద్వీపములును, వాని కావరణములైన సముద్రములును నేకోత్తరవృద్ధిగా నొకదాని కంటెనొకటి రెట్టించియున్నటులు మనవారు కంఠోక్తిగ వ్రాసియుండ నయ్యవి వారు నుడివిన యేదియో యొక ద్వీపమందు (జంబూద్వీపమందే) లేదా రెంటియందు నంతర్గతములనుట లెటులు సమంజసమో విమర్శకులే వివరింపవలసియున్నారు. ఇప్పటివారి ద్వీపనిర్వచనమునకును, మనవారి దానికిని భేద మేమియు గానరాదు. అందుచే ద్వీపశబ్దవిచారము నిర్వివాదాంశమే. నానావిధ సాంయాంత్రిక సాధనములు, వ్యోమయానములు తోడ్పాటుగా నేము పర్యటనము సేయు నాగరకప్రపంచమువారట్టి ద్వీపములు, సముద్రములు లేవనుట కారణముగా నిటులు విమర్శించి ప్రాచీనభారతీయుల విదేశీయపరిజ్ఞాతృత్వము నిరూపించిరని సంతసించుటతోఁగూడ గావించిన యాభాసమునకై సంతపించుటయు ఘటించు చున్నది. రెండవదే మెండైనను గానచ్చును. మొఱకుదొంతువలె నీటను నూటివడిన బాటలందే పై సాంయాత్రిక సాధనముల గమనాగమనములు సాధ్యములు. ఆ దారులు తీరమునకు నెంతో దూరముగా నుండనేర వందురు. ఈ కాలీనులైన భూగోళజ్ఞులు వారి కవగతమైన భూభాగమంతయు విభజించిన పూర్వాపరపశ్చిమార్ధగోళములమధ్య మిక్కిలి దూరముగూడ మనవారు జమ్బూద్వీపాదికముల మధ్య నుండు దూరములో గలాంశ మేని గానరాదు. బొంబయినుండి ఇంగ్లండులోని డోవరురేవునకు నాలువేలమైళ్ల దూరముండును (ఆఱునందలయోజనములు). అటనుండి యమెరికా కంతయే దూరమైయున్నను కొంత న్యూనాధిక్యము లున్నను, నేచోటును దరులం దాఁకక నౌకాప్రయాణము తిన్నగా సాగినను, మన దేశమునుండి ఇంగ్లాండునకును, నటనుండి యమెరికాకును గల నీటిబాటలయొక్కగాని, తదితరజలమార్గములయొక్కగాని యోజనమానము వేలసంఖ్యకు లోఁబడియే యుండును. ఇప్పటివారు గనుగొనిన భూమి నంతయు జుట్టివచ్చినను గొన్ని వేలయోజనములు దూరమే యుండును. ఒక జంబూప్లక్షద్వీపములమధ్య దూరమే మనవారు లక్షలయోజనములని వ్రాసిరి. ఆపై నేకోత్తరవృద్ధిగా రెట్టింపు.

"యోవాయం ద్వీపః కువలయ కమలకోశాభ్యన్తరకోశో నియుతయోజనవిశాలః సమవర్తులో యథాపుష్కరపత్రమ్. జంబూద్వీపోఽయం యావత్ప్రమాణవిస్తారస్తావతా క్షారోదధినా పరివేష్టితో యథా మేరుర్జమ్బూద్వీపాఖ్యేన లవణోదధిరపి తతో ద్విగుణవిశాలేన ప్లక్షా

ఖ్యేన పరిక్షిప్తా యథా పరిఖా" (భా. ౧౬-౨౦ అ.) ఇటులే శేషించిన ద్వీపసముద్రములం గూర్చియుఁ గలదు. మన యనుభవములో దేశనదీశైలాదికముల మానము లోక వేళ నేఁడు భేదముగానుండిన నయ్యది చిరకాలభేదము ననే వృద్ధిక్షయములు, తదితరపరివర్తనములు కారణము లనుకొనుట సమంజసము. కాని వారి వ్రాఁతలకే ప్రోఁత గలిగించు విమర్శనములు (అన్ని ద్వీపములు ప్రస్తుతము వారికి గోచరించిన భూమండలమందే ఇమిడియున్న వనుట లోనయినవి) సాధువులగునా యని సంశయము. ఆధునిక భౌతికపరిశోధనము ప్రబలు కొలఁదియు కొన్ని యంత్రముల సాధనములు గలవారై చంద్రమండలము జనసంకీర్ణమని యిటీవలవారును తెలియగలిగినటులే యద్భుతాద్భుత సాధనములసాహాయ్యమున నీద్వీపాదికములంగూడ గననోపినవారు గల్గుదురేమో! ఇప్పటికేమో మన స్వర్గాదులవలె నివియు మానవాగోచరములె యనవలయును. స్వర్గాదికముల యాస్తిక్యమునకు తపస్తేజోవిశేషభూషణులైన నారదాది మహర్షుల వాక్యములను స్వప్రమాణములుగా విశ్వసించువారు భాగవతాదిగ్రంథములందలి సప్తద్వీపాదికముగానున్న వారివాక్యములను ప్రమాణముగాఁ గొనుట ప్రమాదము గానేరదు. జగన్మిథ్యావాదము ననుసరించుచో స్వర్గాదులే కాక దృశ్యమానప్రపంచము భాతిఁ బ్రస్తావనమందలి ద్వీపాదులును హుళక్కియే. మనము గాంచులవణసముద్రమువలెనే ఇక్షునామకాదిసముద్రములును జలమయములే. దానిని బట్టి లవణసముద్రమున కీపేరు గలిగినటులె యాయా వాని చవులంబట్టియే యాయా పేర్లు ప్రాపించినవి. ఇలావృతవర్షీయమేరుప్రత్యంతపర్వతముల పైగల సరోవరములవిషయమై యిటులున్నది. "ప్రాదాశ్చత్వారః పయోమధ్విక్షురసమృష్టజలాయదుపస్పర్శిన ఉపదేవగణా యోగైశ్వర్యాణి స్వాభావికాని భరతర్షభ ధారయన్తి (భాగ.పం. స్కన్ధ.౧౬ అ శ్లో.౧౩.)

ఈ ద్వీపముల ప్రస్తావనము రామాయణమందు గొంత భిన్నముగానుండిన మాత్రానం బ్రాపించు పరస్పరవ్యాఘాతముగూడ కాన్పింపదు. రామాయణమందీ ప్రస్తావనము భూగోళనిర్ణయ విషయముగాఁ గాదు. సీతాన్వేషణార్థులై నలుదెసలకు వెళ్లు వానరులకు సూచించు మార్గముల వివరించుసందర్భము సుగ్రీవస్థానమైన కిష్కింధ, దానిసమీపమందలి మాల్యవత్ పర్వతము, జంబూద్వీపాన్తర్గతమైన భారతవర్షమందలి విషమన్తులాకృతి, పైద్వీపము నావరించియుండు ద్వీపములు, సముద్రములు దానికి నలుదెసలందు నుండియే తీరును. దానంజేసి క్రౌంచ, పుష్కరాది ద్వీపములవిషయము ప్రాగ్దక్షిణపశ్చిమోత్తర దిశలకరుగువారికి మార్గకథనమందుండి తీరవలయు. పునరుక్తదోషాపనోదనమునకై కాఁబోలు వాల్మీకి కొంత సంక్షేపించెను. క్రౌంచాది ద్వీపములవిషయము రెండుమూడు దిక్కులనుంబోవు వారికి సుగ్రీవుఁడు చెప్పినటులుండు వాల్మీకోక్తిచే ద్వీపముల సమవర్తులత్వము, పరస్పరావరణత్వము స్థిరపడుచున్నవి. మేరువు నాభిస్థానముగాఁ గల యీ ద్వీపసప్తకములో గడపటిదియై మానసోత్తరపర్వతము వర్షద్వయసీమగాఁగలపుష్కరద్వీపమే మానవసంచారయోగ్యమైన భూమ్యవధియనియు, నాపై మంచినీటి సముద్రము చుట్టును దర్పణోదర సమానమైన భూమి గలదనియు, నిందుఁ జేరినపదార్థంబు మరలఁ బొంద నశక్యంబగుటం జేసి యయ్యది నిర్జనంబనియు నాపై లోకాలోకపర్వతము గలదనియు, లోకమునకు అలోకమునకు మర్యాదాద్రియై యుండుటం జేసియె దీని కీపేరనియు, దాని కావల నంధకారమయమనియు భాగవతమందుఁ గలదు. రామాయణమందలి సుగ్రీవనిర్దిష్టమార్గకథనము నంగల జీవులకు దుష్ప్రవేశ్యమైన నిర్జనభూమియు, నంధకారము నీయవియె కావచ్చును. ఎల్లదెసల కేఁగువారికిని పైఁ జెప్పిన భూమ్యంధకారములం గడపట నుడువుటయు, భూమియొక్క వర్తులత్వమును, ద్వీపసముద్రములొండొంట నావరించియుండుటను దృఢీకరించుచున్నది.

"యావన్మానసోత్తరమేర్వోరన్తరం తావతీ భూమిః కాఞ్చన్యా దర్శతలోపమా, యస్యాం ప్రహితపదార్థో న కథంచిత్పునః ప్రత్యుపలభ్యతే తస్మాత్సర్వసత్త్వపరిహృతాఽఽసీత్ ॥ లోకాలోక ఇతి సమాఖ్యా యదనేనానులేన లోకాలోకయో రన్తర్వర్తినా వ్యవస్థాప్యతే"—(భాగ. ౫ స్కం. అ. ౨౧). మన దశావతారాదికథలు జంబూద్వీపాన్తర్గతములైన భారతేతరవర్షములకును సంబంధించినటులున్నవి. ఇలావృతవర్షేష్టదైవము కేవలము

శివుఁడే. అనగ చాతుర్వర్ణ్యమువా రెల్లరు శైవులే. మనబసవేశ్వరానుయాయులు వీరే కావచ్చును. గంగావతరణకథయు నీవర్షసంబంధమైనదియే యై యున్నది. (భాగ. ౫ స్క. ౧౭అ.) భద్రాశ్వవర్షవాసులు హయగ్రీవోపాసకులు, నృసింహావతారము, ప్రహ్లాదచరిత్ర యీవర్ష సంబంధములు. కేతుమాలవర్షము, లక్ష్మీనారాయణస్థానము. మత్స్యావతారకథ రమ్యకవర్ష సంబంధము. హిరణ్మయవర్ష సంబంధమైనది కూర్మావతారకథ. కురువర్షములోనిది యజ్ఞవరాహావతారకథ. కింపురుషవర్షైకదైవము శ్రీ శ్రీరామమూర్తి (భాగ. ౫ స్కం. ౧౯ వ అ.) జంబూద్వీప భాగములైన నవవర్షములలో భారతవర్షము మాత్రమే కర్మభూమి. ఇచట వారే వైదికక్రియానుష్ఠాతలు. మిగిలిన వర్షములన్నియు భోగభూములు. ప్రాక్తనకర్మఫల మనుభవింతురే కాని, వారు వేదోక్తక్రియల నాచరింపరు. దానం జేసి, యచటి వారు క్రమముగాఁ గర్మభ్రష్టులై మ్లేచ్ఛవ్రాత్యజాతుల వారైరి. భాషయు నపభ్రంశమైనది. (పరిత్యక్తవైదిక క్రియులె మ్లేచ్ఛాది జాతులని మనువు) దానం జేసియే కాఁబోలు పైకథలు, దైవికోపాసనలు కర్మభూమియైన భారతవర్షీయము లైనవి. తదితర వార్షికులు మ్లేచ్ఛులు, వ్రాత్యులు కాఁగా వారి కనుకూలమైన విధముగా వారి యపభ్రంశభాషలతోఁ బైకథల నన్నిటినో, కొన్నిటినో గ్రంథములుగా వ్యావహారికములుగాఁ జేసికొని యుందురేమో. రమ్యకవర్షమే యిప్పటి రోమకదేశమని యంగీకరించుచో, మన మత్స్యావతార కథ కడియాళమే వారి వైదిక (బైబిల్) గ్రంథమందలి నోవహా వృత్తాంతముగా నచ్చును. ఇటులే యితరములను మార్చి యుందురు. జంబూద్వీపాంతర్గతములైన యన్ని దేశముల వారును ప్రారంభమున నించుమించుగ నిప్పటి భారతీయార్యుల పూర్వీకులు గానో తత్సంబంధీయులు గానో యుండి యొండొండ్ల దేశముల రాకపోకలవారే కాక సాహచర్యము గలవారునై యుండియుందురు. మనువునాఁటికే యానాఁటి వారు కర్మభ్రష్టతకారణముగా మ్లేచ్ఛవ్రాత్య జాతులవారైనందున భారతీయార్యులప దేశాంతరగమనము నిషిద్ధమైనది.

ఈ ద్వీపసముద్రవిభాగము ప్రియవ్రతుఁడను రాజు యొక్కయు, వాని పుత్రపౌత్రాదుల యొక్కయు పాలనమందేర్పడినటు లున్నది. ఈప్రియవ్రతుఁడు ప్రథమమనువైన స్వాయంభువుని పుత్రుఁడు; ధ్రువునకుఁ జిత్తండ్రి. ధ్రువస్థానము జ్యోతిశ్చక్రమున నిర్ణీతమగుటకుఁ బూర్వమే యీ విభాగము సిద్ధించినటులున్నది. భాగవతానుసారముగాఁ బ్రవృత్తమగు మహాయుగ మిరువదెనిమిదవది. కృతాదియుగ చతుష్కసకృదావృత్తి యొకమహాయుగము. యుగసంధులతోడ నీయుగచతుష్కము దైవమానమున పండ్రెండువేల సంవత్సరములని భారత భాగవతప్రమాణము. ప్రవృత్తమగునది వైవస్వతమన్వంతరము. దీనికవ్యవహితపూర్వమై గడచినది స్వాయంభువ మన్వంతరము. స్వాయంభువపుత్రుఁడైన ప్రియవ్రతుఁడు, వాని పుత్రపౌత్రప్రపౌత్రులును, ప్రథమ ద్వితీయ తృతీయ మహాయుగములలోని వారై యుందురు. దైవమానవమానముల భేదములుగా లెక్కించినను ఇప్పటికీ ద్వీపవిభాగము రమారమి ముప్పదిలక్షల సంవత్సరముం క్రిందటి మాటగా నుండును. ప్రపంచమంతయు నెంతో మారి యుండును. ఆ ద్వీపాదికము లన్నియు బంగరుస్వప్నమంటివానివలన నప్పులపాలైనవియో, లేక యప్పటిగుర్తులం బట్టి గుర్తింపరానివైనవేమో! జంబూద్వీపవిస్తీర్ణ మెంతో లవణోదధి విస్తీర్ణమంతేయని భాగవతప్రమాణము. ఇప్పటి భూవిస్తీర్ణమునకంటె నిప్పటిలవణోదధి విస్తీర్ణము మూఁడింతలధికముగా నన్నాఁటి భూగోళజ్ఞులు నిశ్చయించిరి గదా. ఆ ద్వీపములపై లవణసముద్రము విజృంభించి వానిలోఁ గొనెనేమో; కాదన గలవారెవరు? సముద్రమందు నియతగతి దప్పిన నౌకాదులు పర్వతముల తాఁకుటచే భిన్నములై ముప్పులపాలగుట వినుచున్నారము. ఈ పర్వతాదులు పైద్వీపసంబంధము లేమో! ఈనాఁటి భూగర్భశోధనలచే నెన్నియో వింతలు వెల్లడియగుచున్నవి. జలగర్భశోధనము సాధ్యమై సాగినచో నీ ద్వీపాదులం గూర్చియు నెఱుఁగనగునేమో. ఒక శతాబ్దమందే యెన్నియో నైసర్గిక పరివర్తనములు గలుగుచు వాని నిదమిత్థమని నిర్ణయింపసాధ్యము గాకుండ లక్షల సంవత్సరముల క్రిందట మనవారు నిర్ణయించిన భూగోళస్థితి యథాసంభవముగా నేఁడు గానరాదని కననేరమిఁ బాటింపక వారి వ్రాఁతలు స్వప్రమాణములు గావను నర్థముగా విమర్శించుట సమంజసమా యని సంశయము.

గర్దభేశ్వరు గాంచి సింగంబుగాగ
స్వీయ కృత్రిమభావకూర్చికలతోడ
దాని జిత్రించుకొనుచు సంతసమునొంది
మేలుకొని కలల మునుంగు మేటి బుద్ధి
శాలి కవిబిరుదాంకితజనుని మాన
సాంతరావని యచలసత్యార్థవిమల
వాహినీతుంగభంగసంప్లావితమయి
పూత కర్తవ్య దీపికాపూర్ణకాంతి
సంతతుల గ్రోలి యాత్మసంజాతదివ్య
మధురగంభీరసందేశ మహిత వాణి
భువనముల ముంపజాలు నమోఘశక్తి
పావనత దీక్షరాజమై పరగునట్టు
లోయి సన్న్యాసి, పాడుమీ యొక్కపాట!

పటుతరాహంకృతిచ్ఛటాపటలనిరత
విహరదౌద్ధత్యమయశక్తివితతిపూర్ణ
జృంభితాంభఃప్రవాహసంరంభములను
శీర్ణమయి గడగడలాడు క్షేత్రమట్లు
ద్వారమును జుట్టు నా యస్థిపంజరమ్ము
కనులవీడి గర్జించు రక్తంపుటమ్ము
లాత్మకౌబేర్యమునకు సాక్ష్యమ్ములొసగ ,
దొంగవెఱపు కట్టించిన దొడ్డగోడ
ప్రభుని సౌభాగ్యమునకు పారాలొసంగ
పట్టపగలె నిద్రించెడి పరమలోభి
మనసురాయి యమృతపుతుంపరల జిమ్మె
నోయి సన్న్యాసి, పాడుమీ యొక్కపాట!

జననిని ధరిత్రి శోణితజలధి ముంచి
జీవికోటి ప్రాణము లరచేతగొన్న
తన యమేయబలాసహ్యాతంత్రమహిమ
భీకరాకృతి గన్గొని వెఱపు మిగుల
కడుపునిండగ నొకనాడు బిడికె డన్న
మైన నెఱుగని నిరుపేద 'అన్న'మన్న
మధురమధురాతురాంతరమధుతరంగ
గణము పైబడ నెట్టిన మునుగకుండ
గాలజలనిధి మునుగుచు దేలుచున్న
గాంచియును జూపు లింతయు వంచకుండ
పెద్దనేనను 'రాజ్యాంగవేత్త' మోము
వికటగాంభీర్యమును గోటి శకలములుగ
నుప్పు మని యొక్క మాఱుగా నూదివైచి
భవదమోఘ మహాత్యాగ భానుమాత్ర
కరుణసారథ్యమును గూర్చి మెరయ మాన
సంపు బంధము బూర్తిగా సడల విడిచి
ఓయి సన్న్యాసి, పాడుమీ యొక్కపాట!

---



## పొగాకు దుర్గుణములు



కోట లక్ష్మీనారాయణగారు

1. చుట్టలు మొదలగునవి కాల్చువారు కొన్నికొన్ని స్థలములలో, దొరకనపుడు చపలచిత్తులగుచుందురు.

2. ప్రత్యక్షముగా ధనమును దహింపఁజేయు దురభ్యాస మనవచ్చును.

3. ధూమపానము చేయువారి పెదవులయందలి సహజారుణ కాంతులు నశించిపోయి నల్లఁబారును.

4. హస్తములు చెడువాసన గొట్టును. కాల్చియార్పిన మాలిన్యములు వస్త్రములలో దాఁచిన నవి దుర్గంధవాసనా వాసితము లగును. అట్టి మహనీయులు పెద్దల సమీపింపఁ గొంకుచుందురు.

5. కాల్చినవెంటనే నోటివాసన పోవుటకని మఱియొక దురభ్యాసము తెచ్చికొందురు. అదియే తాంబూలము లేక "మిఠాకిల్లీలు" వాసనద్రవ్యములు నములుట. వీనివలన నజీర్ణరోగము లావేశించును.

6. చుట్టకాల్చినతత్క్షణమే కొన్నినిముసముల వరకు గుండె దడదడమని కొట్టుకొని రక్తప్రసరణము త్వరితము చేయును. పిదప మందగించును. దానినిఁబట్టి హృదయము బలరహితమగును. అట్టివారు పనిపాటు లొనరింప నశక్తులగుదురు.

7. లోనికి ధూమమాఘ్రాణించుటవలనఁ బరిశుద్ధవాయువునకు బదు లీమురొవాయువును పీల్తురు. అది కండరములకుఁ బోవును. అందుచేత నవి యెదుగక గిడసబారి వెలవెలఁబోవును.

8. శ్వాసాశయములోని గాలిగోలములలో నీచెడుగాలి చేరుటవలన వాని యావరణపు గోడలపైఁ గాలక్రమముగాఁ జిన్నచిన్న మచ్చలేర్పడును. అవి క్రమముగా నెదిగి చర్మమును గొరికి రంధ్రములు చేయును. అనంతరము శ్వాసాశయరోగముల కాలవాలమగును.

9. పొగాకు రసము మ్రింగినచోఁ జీర్ణకోశములోఁ జేరి యొక్కసారి జఠరరస మూరునట్లు చేయును. ఆరసము చెడును. పిమ్మట మనము భుజించినచో మరి జీర్ణద్రవము తయారు కాఁజాలదు. అజీర్ణము పుట్టును.

10. హృద్రోగము వలెనే మనోరోగములు గూడ నంకురించును.

11. ఆలోచనాశక్తి యడుగంటును.

12. చంచలస్వభావు లగుదురు.

13. కుష్ఠు మున్నగు చర్మవ్యాధులు కలుగును.

14. చుట్టలు కాల్చుటవలన నెన్నియో జనుపనార యంత్రములు, బట్టలయంత్రములు విధ్వంసములైనవి. బొగ్గు గనులుగూడ బాడయినవి. అందువలన లక్షలకొలది ప్రాణములు నష్టమయినవి.

15. ప్రతి మానవుఁడును దన యార్జనలోఁ గొంత యీ వ్యసనమునకు వెచ్చించుచున్నాఁడు. ఆ ధనమును గుటుంబ సంరక్షణాదికార్యముల కుపయోగించునే.

16. స్వతంత్రాలోచన పోవును. పొగాకునకు దాసులగువా రన్యులకు బానిస లగుచున్నారు. మనో ధైర్యము మందగించును.

17. విదాహము పుట్టును.

18. జిహ్వకు రుచిగ్రహణశక్తి నశించును.

19. ముఖకాంతి పోయి నల్ల బారును.

20 మూర్చాది రోగము లంకురించి యాజన్మాంతము పీడించి పిప్పిచేయును.

21. కాల్చునపు డగ్నికణములు పడి విలువగల వలువలు తగులబడును. ఒక్కొకప్పుడు ప్రాణాపాయము గూడ ప్రాప్తించును.

22. పొగాకువిషము దేహమంతట వ్యాపించును. వారికి జనించు సంతతి కావిషము సంక్రమించి యాయుః క్షీణము చేయుట, బలహీన మొనరించుట చేయును. అందువలన భావిసంతత్యభివృద్ధికిఁ గంటకులమయి దేశ నాశనమునకు మూలబీజములను మనలో నుంచుకొను చున్నాము.

23. ఈయలవాటుగలవారి బిడ్డ లకాలమృత్యువు వాతఁ బడుచుందురు. అందులకు మనమే మూలమని తలంపక యజ్ఞానముచే దుఃఖింతుము.

24. నపుంసకత్వము కలిగి పురుషత్వము కోలు పోదురు.

కో. ల.

---

## ఈడెన్ దేశమున స్త్రీలు

బుఖారెస్టునందు ఒకస్త్రీ సౌధము (సదనము) నిర్మింపబడుచున్నది. బాల్కను దేశ మొత్తమునను, ముఖ్యముగా రుమేనియా యందును ప్రచారములో నున్న స్త్రీలయుద్యమమున కది స్మారకచిహ్నముగా నుండ గలదు. యూరపుసం దాక్షేయ భాగమునందలి స్త్రీ యుద్యమమున కది ప్రేరేపకముగ నుండగలదు. మేరీ రాణియు, కాంటాకు జీను రాకుమారియు, దానికి నాయకురాండ్రు. స్త్రీలు తమ యెల్లచిక్కులయందును, సమస్యలయందును యీ 'స్త్రీసౌధము'న సహాయము, సహాయమును పొందగలరు. వివాహముగూర్చి కాని, వివాహవిచ్ఛేదము గూర్చిగాని, భర్తవలన తాను పడుపాటులగూర్చిగాని, యామెకు సలహా కావలసిన యెడల నచ్చట నామెకు నిపుణులగు న్యాయవాదులు చిక్కుదురు. ఆమె యనారోగ్యముగా నుండు నెడల నచట నామెకు వైద్యులు గలరు. పనిలోనున్న (ఉద్యోగములోనున్న) స్త్రీలకు అతిచౌకధరల కచట శుభ్రమైన భోజనము లభించు హోటలు గలదు. ఉపన్యాస మందిరము నందామె గృహవిద్య, తత్సంబంధమైన విషయములపై చక్కని యుపన్యాసములను వినగలదు. ఈ స్త్రీసమాజమునం దొక పెద్ద గ్రంథాలయమును, నొక స్త్రీ కృతి వస్తు ప్రదర్శన శాలయుగూడ ముఖ్యాంగములుగ నుండును.

(స్ఫియరునుండి)

---

## * నీతివాక్యాలు

౧. నిద్ర, సోమరితనం వల్ల బంగారమంటి రైతు పాడైపోతాడు. దగ్గువల్ల దొంగ నశిస్తాడు. అంపవికారం చేత భోగంపడుచు అడుగంటుతుంది. దాసిముండవల్ల సర్వసంగపరిత్యాగియైన సన్యాసి నాశనమౌతాడు.

౨. ముసలియెద్దును కొన్న రైతు, సన్నని గుడ్డ కొన్న సంసారి (కుటుంబీకుడు) తమనాశనం తామే కొని తెచ్చుకుంటారు. పైగా గుడ్డ చాలకాలం మనలేదని, ఎద్దు సరిగా దున్నలేదని అదృష్టాన్ని ఆడిపోసుకుంటారు.

౩. నరాలను నమిలేసేచెప్పులు, మాట్లాడే సమయంలో అడ్డువచ్చే ఆలు, తొల్చూలిపుట్టిన ఆడపిల్ల, అరకకు చాలని వ్యవసాయం, నెత్తిబానుల తోబుట్టువులు–

---

* ప్రయాగ, కాశీ మొదలగు హిందీప్రాంతాలలో పల్లెటూరిజనులు, ముఖ్యంగా రైతులు దినమూవాడుకొనే హిందీసామెతలు. వీటి అసలుస్వరూపం చినచిన్న గీతాలుగా ఉంటవి.

ఇవన్నీ ఓర్చుకుందామన్న వీలుకానంత దుఃఖాన్ని కలుగ జేస్తవి.

౪. నౌకరు దొంగవాడైనా, రాజు కటికివాడైనా (నిర్దయుడైనా), వాళ్ల మీద విశ్వాస ముంచ గూడదు.

౫. తరుణంలో అందరికంటె ముందు విత్తనాలు చల్లేవాడు, యుద్ధంలో మొట్టమొదట పోరాడేవాడు ఎప్పటికీ అపజయం పొందరు.

౬. బండి వెనుకటి ఆరాబును బట్టి పోతుంది. కుపుత్రుడు మంచిచెడ్డ లాలోచింపక పూర్వుల ననుస రిస్తాడు. కవి, సింహము, సుపుత్రుడు వీరు ముగ్గురును దేశ కాలముల ననుసరించి తమ మార్గం నిశ్చయించుకుంటారు.

౭. రాజు కష్టివాడై, మంత్రి ముసలివాడైతే వారిద్దరికి సుతి కలియదు.

౮. పెయ్యదూడ, వ్యభిచారం జేసేఆలు — ఈ రెంటి వల్ల రైతుకు ఉపయోగం ఉండదు. దూడవల్ల పొలం పని సాగదు. ఆలువల్ల ఇంటిపని జరగదు.

౯. భోజనం అయినతర్వాత మూత్ర విసర్జనం చేసేవాడికి, ఎడమప్రక్క నిద్రపొయ్యేవాడికి వైద్యుడి తో పనేలేదు.

౧౦. ఎద్దులేక వ్యవసాయంచేసేవాడు, భార్య లేకుండ గృహస్థధర్మం నడిపేవాడు, కాలుదువ్వి కయ్యం పెట్టుకునేవాడు, ఇటువంటి వ్యర్థులు ఎక్కడా ఉండరు.

౧౧. క్షత్రియుడు భ్రష్టుడవటం రోకలిధనుస్సవటం అసంభవం.

౧౨. పోటుమాపుమాచే దున్నను, మందసరి (సోమరిపోతు) ఎద్దును, చదువుసంధ్యలమీద యిష్టంలేక పోకులు జేసుకొనుటలో సర్దాగల కుంకకాయను, దుర్గుణాలుగల భార్యను తప్పక వదిలెయ్యాలి. ఒకవేళ తప్పించుకోవడమునకు వీలులేకపోతే రాజ్యసుఖాన్నైనా వదిలేసి సన్యాసం పుచ్చుకుంటే సుఖం ఉంది.

౧౩. ఊరిదగ్గర పొలముండి, నాలుగరకల వ్యవసాయముండి, గృహకృత్యాలు నేర్పుతో జరుపుకొనే నేర్పుగల భార్య ఉండి, సమృద్ధిగా పాలిచ్చే ఆవుండి, కందిపప్పు, వరిఅన్నం, వాట్లోకి సువాసనగల కాచిననెయ్యి, నిమ్మకాయల రసము, పెరుగు, చక్కెర ఉండి, సుందరమైన స్త్రీ వడ్డిస్తూ ఉంటె రైతుకు యిక్కడనే వైకుంఠం ఉంది. పెద్దలు ఉన్నదనే మరో వైకుంఠం మిథ్య.

౧౪. చేలగట్లు ఎత్తుగా, వెడల్పుగా ఉంటే రెండింతలపంట లాభిస్తుంది.

౧౫. స్వంతంగా దున్నేవాడి వ్యవసాయం ఉత్తమం. దగ్గరఉండి దున్నించేవాడి వ్యవసాయం మధ్యమం. "దున్నేవాడు ఎక్కడరా" అని అనేవాడి వ్యవసాయం అధమం.

౧౬. వ్యవసాయం చేసేవాడు వ్యాపారం జేస్తే దేనిలోను లాభం రాదు.

౧౭. మూడెద్దులు, ఇద్దరుభార్యలు కలవాడి తిప్పలు భగవంతునికెరుక.

౧౮. తనతల్లి చేతిమీదుగా నడిపించనిది భోజన సుఖం లేదు. భాద్రపదవాన లేనిది చేనికి సుఖంలేదు.

౧౯. కొంగకూర్చోటంవల్ల చెట్టుకు, సన్యాసి అడుగుపెట్టటంవల్ల యింటికి, కలుపువల్ల చేలకు, లోభియైన రాజువల్ల రాజ్యానికి నాశనం కలుగుతుంది.

౨౦. ఫాల్గుణమాసంలో అయిదు మంగళవారాలువచ్చినా, పుష్యమాసంలో అయిదు శనివారాలువచ్చినా, క్షామదేవత తాండవమాడుతుంది.

౨౧. దున్నేసమయంలో ఉలికిపడి మొండికేసే యెద్దు, అన్నిసమయాల్లో దుమదుమ లాడే భార్య ప్రాణానికి శత్రువులు.

౨౨. కొండరకలు వ్యవసాయానికి పనికివస్తవి. ఒక్కఅరక కూరనార వేసుకొనడానికి మాత్రమే ఉపయోగిస్తుంది. కాని వ్యవసాయానికి లాభంలేదు. ఒక ఎద్దుకంటె గడ్డపార అన్నివిధాల శ్రేష్ఠం.

౨౩. ఇతరులచేత వ్యాపారం చేయించేవాడు, పరులచేత వ్యవసాయం సాగించేవాడు, పరుణ్ణి చూడ

కుండా కూతురికి పెండ్లి చేసేవాడు, పరుల జాగాలో మూలధనం పాతిపెట్టేవాడు—వీరు రొమ్ముబాదుకొని విలపిస్తారు.

౨౮. ముగసాలలో నిద్రించే భార్య, యుద్ధంలో దుఃఖించేరాజు, రాత్రిపూట పేలపిండి తినేవాడు— ఈ ముగ్గురివల్ల ఎవ్వరికి ఉపయోగం లేదు; వ్యర్థులు.

౨౯. సుష్టిణ్ణి విందుకు పిలిస్తే ఇద్దరికి సరిపొయ్యేలాగు వంట తయారుచేయాలి. అతనుగాక అతనికి దోవమాపేవాడొకడుంటాడు. వారిద్దరికి తయారు చేయాలి.

[అబ్బరాజు వెంకటరంగారావు]

---

## పాపమా? పుణ్యమా?

ఈ శీర్షిక క్రింద జ్యేష్ఠమాసపుత్యాగభూమి పత్రికలో సుకుటవిహారివర్మగారిట్లు వ్రాయుచున్నారు.

"శ్రీయుత కంచన్‌లాల్ మగనలాల్ ఖాండ్వాలాగారి లెక్కప్రకారము, భారతదేశమున 15 సం॥లకు లోబడిన వితంతువులసంఖ్య యీక్రిందివిధముగ నున్నది.

| వయస్సు | హిందువు | మహమ్మ | మొత్తము |
|---|---|---|---|
| 1_12 నెల | 866 | 109 | 975 |
| 1_2 సం॥ | 755 | 64 | 819 |
| 2_3 సం॥ | 1564 | 166 | 1730 |
| 3_4 సం॥ | 3987 | 5809 | 9796 |
| 4_5 సం॥ | 7603 | 1281 | 8884 |
| 5_10 సం॥ | 77585 | 14276 | 91851 |
| 10_15 సం॥ | 18[illegible]507 | 36264 | 22[illegible]032 |

ఇట్లు బాలవితంతువుల సంఖ్య మిక్కుటముగనుండుటకు ఫలితముగ వ్యభిచార మధికమగుచున్నదనియు, కాశీ, మధుర, మున్నగు పుణ్యస్థానములుగూడ నీకారణమున పాపవాయువుపూరితములగుచున్నవనియు సుకవివర్మగారు తమ వ్యాసము నిట్లు ముగించుచున్నారు.

"ఈయవస్థ, మరేమైనగానిండు, ధర్మముగాని పుణ్యముగాని యెన్నడును గాజాలదు. ఈస్థితిలో విధవావివాహ ముపయోగకరముకాదా? విధవావివాహముచే పత్నీత్వమన్న నేమోయెరుగక, యల్పస్థలాలసలైయున్నవారి రహస్య దుష్కర్మలు కట్టుబడజాలవా? తగ్గిపోవుటలో సందేహములేదు. ఇట్టిస్థితిలో నిది (విధవావివాహము) పాపమను టెట్లు? చెడ్డపనియే యైనచో—ఈసమయమున నది యెట్లునుకాదు—చెడును అల్పమేయగును. పైనుదహరించిన గొప్పచెడుగును నివారించుటకై యల్పమగు నీయకార్యమును మన మంగీకరించిన నందు దోసమేమేమియు లేదు. సిద్ధాంతరీత్యా వితంతూద్వాహమును మనము పుణ్యకార్యముగ నాదర్శముగ స్వీకరింపకున్నను ప్రస్తుతపరిస్థితులలో వ్యవహారరీత్యా, అది పాపమెన్నటికి గాజాలదు. లజ్జాకరమనుగాను నాయభిప్రాయమున నిదియొక రాజీపద్ధతి; పైనజెప్పిన దురాచారముల విధ్వస్తముల గావించుట కిది రామబాణము. నిష్కపటభావమున మనము దీని నంగీకరింతుమేని మనయవస్థ బాగుపడగలదు."

పండితు లుదారహృదయులై సావధానముగ నీవిషయమును విచారింతురుగాక.

---

## స్వరాజ్యోద్యమము

పండితజవాహర్లాల్ నెహ్రూగారు పంజాబురాష్ట్రీయ మహాసభాధ్యక్షోపన్యాసమున నిట్లు నుడివిరి:

కాని అన్నింటికంటె ముఖ్యమయిన సంగతియిది. మనస్వరాజ్యము సామాన్యులయొక్క, పేదలయొక్క రాజ్యమై యుండవలయును. ఇప్పటివరకు విద్యాధికులే స్వరాజ్యసమరమున పాల్గొనిరి. సామాన్యప్రజయొక్క జీవితముసంగతి, వారుండవలసినదానిసంగతి, వచ్చినప్పుడు అది యటుకనుమాపుమేరనుంచి వేయబడినది. కాని రేపేయింగ్లీషువారికి బదులుగ నాయ

గొప్పగొప్ప పదవులలో భారతీయుల నుంచినను కోట్ల కొలది నున్న నిరుపేదలగు కూలివాండ్రకు, రైతులకు, పనివాండ్రకు, నేమిలాభము కలుగును? నిజమగు సర్వసమత్వముగల ప్రజాప్రభుత్వము స్థాపింపబడినప్పుడే వాండ్రకు నిజమగు మేలు చేకూరగలదు. విద్యాధికుల స్వార్థపరత్వమునుబట్టి చూచినను వారికి సామాన్యప్రజను కూడ నంచుకొనుటయే వాంఛనీయము. ఏలయన: వాండ్ర సాయములేక విద్యాధికులు ప్రభుత్వము నేమియు జేయజాలరు. స్వరాజ్యమువలన దమకుతప్పక మేలుకలుగునని విశ్వసించినప్పుడే పేదవాండ్రు ఈసమరమున బాల్గొందురు. అందుచే వాండ్రకిట్టి విశ్వాసమును గలుగజేయుటకై వాండ్రప్రస్తుతికష్టములను తగ్గించి భావిహితమును సమకూర్పగల విధానములను మన కార్యక్రమమున జేర్పవలయును."

---

## భావియుద్ధమున భారతీయుల కర్తవ్యము

అందే రాబోవు ప్రపంచ మహాయుద్ధమును గూర్చి ముచ్చటించుచు నాసందర్భమున భారతీయులకర్తవ్యమునుగూర్చి యిట్లునుడివిరి.

"భావియుద్ధమునకై కూడ మనముకూడ సంసిద్ధులమై యుండవలయును. యుద్ధమెట్లును దప్పదు. ఆసందర్భమున మిల్లుబట్టల వెలల వైపరీత్యము చేతను విదేశ వస్త్రముల యభావము చేతను ఇబ్బందిపడ నక్కరలేకుండ ఖద్దరు నభివృద్ధి చేసికొనవలయును. ఆంగ్లేయులకు మన ధన జన సాహాయ్యమును బొందుట యసాధ్య మగునట్లు చేయుట మన రెండవ కార్యము. మనమాయుద్ధమున బాల్గొనుటకుగాని సాయపడుటకుగాని నిరాకరింపవలయును. ఈ కార్యమున మనకు ఇబ్బందులు చాల సంభవించును. కాని ధైర్యముతో మనము వానినెదుర్కొని లోబడకుండునందుమేని మనకు విజయము నిశ్చయము. మన దేశము చిరానుభూతము లగు నీ బానిసతనపు గొలుసులను తెంచుకొని స్వాతంత్ర్యము బడయగలము."

---

## ఖద్దరువలని ఆర్థికలాభములు

శ్రీయుత సి. రాజగోపాలాచారి గారు కలకత్తాలో మేనెల 1-వ తేదీని యుపన్యసించుచు నిట్లు నుడివిరి:—

"మీరు ఖద్దరు దుకాణమునకేగి, ఐదు రూపాయలిచ్చి ఖద్దరు వస్త్రములు కొనినయెడల, ఆ ధన మేమగుచున్నదో తెలుసుకొనుటకు మీరు కోరుచుందురు. రూ. 1-13-6 ప్రత్తిని పండించిన రైతునకు పోవును. కృషీవలునిపైనే మీ జీవనము, మీ వృత్తియు, మీ సుఖము నాధారపడియున్నవి. రూ. 1-3-0 నూలువడుకువారికి పోవును. ఈపైకము వానికి, లేక ఆమెకు, తనజీవితము మరికొంత యానందమయ మగుటకు తోడ్పడును. ఈపని లేనియెడల కుటుంబమునకు భారముగా నుండవలసిన యనేకపేదవాండ్రు మీరు ఖద్దరున కిచ్చు పైకమునందలి యీవంతువలన తమ్ము తాము పోషించుకొనుచున్నారు. విదేశములలో పల్లెటూరి పడతుకల మానమర్యాదలకు సురక్షణము లేని, యే తేయాకుతోటలలోనో, ఫ్యాక్టరీలలోనో పాటుబడుటకు పంపివేయబడు నవసరముండి పెక్కురు పడతుకలు రక్షింపబడుచున్నారు. ఈ పని యంతయు నేర్పాటు చేయుటకును- రైతులు, నూలువడుకువారు, నేతగాండ్రు, బట్టలను కొనువారు- వీరలలో పరస్పరము సహకారమును కలుగజేయుటకును పనిచేయు ప్రచారకులు పంచుకొనుటకు ఒక భాగము- నాల్గణాల తొమ్మిదిపైసలు- వినియోగపడును. వేయిమంది యువకులీపనిచేయుచున్నారు. వారు ఒక్కొక సంవత్సరమునకును 25 లక్షల రూపాయిల విలువగల వస్త్రములను తయారు చేయించుచున్నారు. ఇంకొక రెండణాలతొమ్మిదిపైసలు చిల్లరఖర్చులకు పోవును. మీరు యెనిమిది గజముల ఖద్దరుకుకై వెచ్చించిన యైదు రూపాయిలు నీ విధముగ నీ పేదదేశముయొక్క యుపయోగముకొరకు పంచిపెట్టబడుచున్నది. కాని దీనికి బదులు, మీరు విదేశపు వస్త్రములు కొనినయెడల, దవ్వబిళ్లలవలె నీ యైదురూపాయలును పూర్తిగా దొర్లి సముద్రమునుచేరి, యోడలనిండుగా విదేశములకు పంపివేయబడి, భారతదేశమునకు తీరని నష్టమును దెచ్చిపెట్టుకొనెను.

---

## గ్రీష్మములో ఒకరాత్రి



## భారతదేశమున పత్రికానిర్వహణము

"భారతీయ పత్రికలను పీడించుచున్న దేది?" అను విషయముపై డాక్టరు సుధీంద్రబోసుగారు (యం.ఏ. అమెరికా సంయుక్తరాష్ట్రముల అయోవాసంస్థానిక విశ్వవిద్యాలయోపాధ్యాయులు) 'ప్రబుద్ధభారత'పత్రిక యేప్రిలు మాససంచికయం దొకవ్యాసమును వ్రాసిరి. భారతీయవార్తాపత్రికలు చాలవరకు, ఏఫోర్డుకారులవలెనో, యేబీఖాసెస్ మాత్రలవలెనో, ఒకేమచ్చుగా, మార్పు సహింపలేనివానివలె, ఎదుగుబొదుగు లేకయున్నవనియు; ఈపత్రికలన్నియు నొకేవిధముగ తయారీ, ఒకేఅధికారరాజాజ్ఞలు, ఒకేవిధముగ అసోసియేటెడ్ ప్రెస్ వారి సరఫరాయినసరుకు, వేర్వేరు శీర్షికలుగల నొకేవిధమగు రాజకీయవిషయిక ప్రధాన వ్యాసముల యేర్పాటును, గల్గియున్నవనియు బోసుగారి యభిప్రాయమగుచున్నది. ఉపసంహారమున వారిట్లు వ్రాసిరి:—

"భారతదేశమున పత్రికానిర్వహణము పాండిత్యముగల వృత్తిగా, నింకను తొలియానమునసే యున్నది. అది యింకను తనగొప్పదనమునకు దగినంత గౌరవాదరణములను బడయలేదు. దాని కిపుడు ముఖ్యముగా వార్తాపత్రికానిర్వహణవృత్తికే ప్రత్యేకముగా తమకాలమంతయు వెచ్చించి తమ సంపూర్ణోత్పాదన సామర్థ్యమును వినియోగించు సుశిక్షితు లనువారు కావలసియున్నారు. అది వారిశక్తియందలి ప్రత్యంశమును, వారిజీవితములోని ప్రతినిముసమునుకూడ నుపయోగించుకొనగల యంత పెద్దపని."

---

## ఉరితీయుట శిక్షయగునా?

'డెయిలీ హెరాల్డు' పత్రికలో వ్రాయుచు 'డేన్ గ్రిఫిత్ సుగారు' ఉరితీయుటను గూర్చి వ్యతిరేకముగ పదికారణముల చెప్పిరి:—

1. సాంఘికములు, వ్యక్తిగతములు నను హత్యాకారణముల నది యుపేక్షించుచున్నది.

2. మనము హంతకుని నాశనము చేయుచున్నాముగాని హత్య నశింపలేదు.

3. ఉరిశిక్షలయు, హత్యానేరములయు లెక్కలను బట్టియు, అనుభవమునుబట్టియు, నీశిక్షవలన హత్యానిరోధము కాలేదని రుజువగుచున్నది.

4. అది క్రూరమగు మాత్సర్యక్రోధములను సంతృప్తిపరచి, సంఘమును మృగప్రాయము చేసినదైనను.

5. అది మనతోటివారగు ఉరితీయువానిపైనను, జైలుఉద్యోగులపైనను మిక్కిలి హత్యసకృత్యమును మోపుచున్నది.

6. నిర్దోషులగు హంతకుని బంధువుల నది మిగుల బాధించును.

7. అది యేవిధమునను సంఘమును హత్యలనుండి కాపాడుటకు నేకమాత్రమార్గము కాజాలదు.

8. ఒకవిధముగా నదియు నొకహత్యయే— అధికారనిర్ణీతహత్య.

9. ఇతరవిషయములలో నెల్ల నభివృద్ధినొందిన మన కిది యవమానకరముగ నున్నది.

10. అదిమొక తిరుగులేనిఖండనము. ప్రమాదమున హంతకుడుకాని వానికి విధింపబడిన శిక్ష, సవరణమునకుగాని, పరిహారమునకుగాని యెన్నడును నవకాశము లేనిది.

---

## విద్యయొక్క ప్రాచీనాదర్శము

'వేదిక్ మేగజిన్' లో టి. యల్. వాస్వానిగా రిట్లు వ్రాయుచున్నారు:—

ప్రాచీనభారతదేశమున విద్య కేవలము పుస్తకపఠనములో దీరునదికాదు. అది మానవస్వభావానుగుణముగను, ఉపయోగ యోగ్యముగను ఉండెను. మానవునిహస్త మాతనిహృదయమువలెను, శిరస్సు (బుద్ధీంద్రియము)వలెను, పవిత్రమైనది కాదేమి? హస్తపరిశ్రమల

పవిత్రతను మనము మరల సంగ్రహింపవలెను. హస్తపరిశ్రమలు, గృహపరిశ్రమలు మనవిద్యాశాలలయందు నేర్పవలెనని నేను కోరుచున్నాను. ఉపవననిర్మాణము, చిత్రవిద్య, జానపదగేయములు, నాటకకళ, నాట్యశాస్త్రము మొదలయినవిగూడ నేర్పవలెను.

వ్యాయామక్రీడల నేర్పువిషయమయిగూడ నొక్కి చెప్పవలెను. వ్యాయామక్రీడ లనగా నీనాటి విద్యార్థులు కోరు 'సుకుమారము' లయిన క్రీడలు కావు. శరీరమునకు పుష్టిని, బలమును పెంపొందించు కఠినతరము లయినవి. తలనొప్పిని గలిగించు పుస్తకములకంటె నవి విద్యార్థులకు నధికముగా నుపకరించునవి. అవి వారల కారోగ్యమును బ్రసాదించును. ప్రతిమానవవ్యక్తికిని 'ఆరోగ్యము సహజస్వత్వ' మని ఒక గొప్పవైద్యుడు నిక్కముగ వచించినాడు. ఈ 'సహజస్వత్వమును' మన విద్యార్థులు పరీక్షలకు బలియిచ్చుచున్నారు. ఈ విద్య జీవకళావిధ్వంసకమైనది. వ్యాయామక్రీడలు సహజసార్వజనీనస్వాతంత్ర్యమునుగూడ సమకూర్పగలవు. దరిద్రులు, ధనికులు నను విద్యార్థులు కలసి వ్యాయామక్రీడలు కావించునపుడు వారలలో బుట్టిన బూటకపు విభేదములు అంతరించును. మఱియు వానివలన స్వీయశక్తిని గుర్తింపగలుగును.

జ్ఞానము, సేవ రెండును ప్రాచీనాశ్రమములందు తోడునీడలుగ ప్రవర్తిల్లుచుండినవి; కాన, ప్రతివిద్యాశాలయును సేవయొక్క సత్యస్వరూపమును గుర్తింపగోరెదను. విద్యయొక్క పరమావధి విషయవివేకము గాదు; బుద్ధినైపుణ్యము గాదు; స్వార్థపరత్వము గాదు. అరిస్టాటలుపండితుడు నుడివినట్లు సేవయే విద్యయొక్క పరమావధి! 'మాతృపాదములచెంతనే స్వర్గము గల' దని అరేబియాదేశపుప్రవక్త నుడివినాడు. 'చిన్నవారల పాదములచెంతనే స్వర్గము గల' దని నేను సవినయముగా విన్నవించుకొనుచున్నాను. కావున వారిని శక్తి—బలము, సేవ, త్యాగము వీనిని ప్రసాదించు—విద్యాశాలలయందు సుశిక్షితులగావింపుడు. ఈనాటిచిన్నిబాలురే సుమా భావికాలనిర్మాతలు కాబోవువారు!!

---

స్మరసంహారము



కామస్తు బాణావసరం ప్రతీక్ష్య
పతంగవద్వహ్నిముఖం వివిక్షుః,
ఉమాసమక్షం హరబద్ధలక్ష్య
శ్శరాసనజ్యాం ముహురామమర్శ.

కుమారసంభవం, సర్గ 3.

చిత్రకారుడు: శ్రీ కంచి శివరామమూర్తిగారు.

---

## అమెరికాఖండమునందలి పట్టణములు-విద్యావిషయిక వ్యయము

'న్యూయార్కుటైమ్సు' పత్రిక యిట్లు వ్రాయుచున్నది:—

అమెరికనుపట్టణము లిప్పుడు లెక్కకయ్యెడు సంపూర్ణవ్యయమున మూడవవంతు విద్యకొరకు వ్యయించుచున్నవని వ్యాపారశాఖయొక్క ప్రకటనమున్నది.

౧౯౨౫ వ సంవత్సరమున ౩౦,౦౦౦ కంటె అధికమగు జనసంఖ్యగల ౨౫౧ అమెరికనుపట్టణములు విద్యాశాలలకొరకువెచ్చించినమొత్తము ౧౦౬,౧౫౯,౯౫౩ డాలర్లు. అనగా ఆపట్టణముల మొత్తము వ్యయమున నూటముప్పదిఏడువంతులు—మనిషి ఒక్కనికి ౧౮.౫౧ డాలర్లు అనుట.

౩౦,౦౦౦ కంటె అధికమగు జనసంఖ్యగల పట్టణములు ౧౯౧౯ వ సంవత్సరమున ఒకమనిషికి ౯.౩౦ డాలర్లు వ్యయించినట్లు అంచనావేయబడినది.

౨౫౦ పట్టణములు, ౧౯౨౬ వ సంవత్సరమున, అంతకుపూర్వపు సంవత్సరములలో విద్యాలయముల శాశ్వతాభివృద్ధికొరకు ౯౬౨,౦౦౦,౯౯౦ డాలర్లువెచ్చించి ఋణపడినట్లు తెలిసినది. ఆపట్టణములే ౧౯౧౯ వ సంవత్సరమున విద్యాశాలల అభివృద్ధికొరకయి ౩౨౫,౦౦౦,౦౦౦ డాలరులుమాత్రము అప్పుపడియుండినవి.

౧౯౧౯ వ సంవత్సరమున ౨౫౦ పట్టణములు విద్యాశాలలభవనములు, తోటలు, ఇతరోపకరణములు మొదలయినవానికిగా ౮౫౦,౧౬౮,౦౦౦ డాలరులు పెట్టుబడిపెట్టియుండగా ౧౯౨౬ వ సంవత్సరమున నా పెట్టుబడి ౨,౧౧౨,౦౦౦,౦౦౦ డాలరులవరకు పెరిగినవి.

ఒకడాలరు రమారమి మూడురూపాయలకు సమానము. ఇందులో ఎన్నవపాలు మనపురపాలకసంఘములు విద్యాభివృద్ధికొఱకు వెచ్చించుచున్నవి.?

(మాడరన్ రివ్యూ)

## భారతదేశమున విదేశీయ ప్రభుత్వము

"విదేశీయప్రభుత్వ మొకప్పుడుపకారబుద్ధియు, సమర్థతయుకలదియైనను, నది విషాదకరముగ పర్యవసించుటకు కారణ మది విదేశీయమగుటయే. అది మనలో నైక్యముకాజాలదు. అది బహిఃస్థితముగానే యుండిపోవును. అందుచేత నాంతరవ్యవహారములలో జోక్యము కలిగించుకొను నప్పు డది విషాదముకలిగించునదగుచున్నది." అని సి. యఫ్. ఆండ్రూసుగారు 'ఫారిన్ అఫైర్సు' పత్రికలో వ్రాసిరి. బ్రిటిషుప్రభుత్వము భారతదేశమున నిరంతరము అభివృద్ధిమార్గమున కష్టముగ నున్నదని ఇంగ్లాండులోనివారికి బోధపడుట మిక్కిలికష్టమని వారునుడివిరి. వారివాక్యములు:—

"ఈ యుభయదేశముల యన్యోన్యసంపర్కభావమున యుత్తమరాజనీతి నైపుణ్యము స్తంభించుచున్నది. ఏలయన నిట్టిస్థితిలో రాజనీతినైపుణ్యము ప్రవర్తింపజాలదు. విదేశప్రభువులయినవారియెడ నెల్లరు నయిష్టమును కనుపరుచుచుండుటను, బ్రిటిషువారు గ్రహించి జాగ్రతగా పరిపాలించుటకు ప్రయత్నింతురు. గొప్పసంస్కారములను సాహసించిచేయుటకు వారు ధైర్యమును కోల్పోవుదురు. రాజా రామమోహనరాయలు, బెంటింక్ ప్రభువుల యన్యోన్యసహకారమువలన సతి (సహగమనము) రూపుమాసినది. భారతదేశమున ప్రభుత్వము వారిచే నిర్వహింపబడిన యట్టిసంస్కరణ మదియొక్కటియె. కాని యది యసాధారణులగు నిద్దరుపురుషశ్రేష్ఠుల శుభకరమగు నైకమత్యమువలన. కలిగినది. అది సాధారణసూత్రమును రుజువుచేయు వినాయింపు".

కాని ప్రస్తుతము భారతీయసంస్థానములయందు గాంచనగు న్యాయవిషయమున ప్రాథమిక స్వత్వాభావమును, పౌరస్వాతంత్ర్యాభావమును స్వారాజ్యముబడసి భారతదేశమున నింకను త్వరితముగ తొలగింపబడునా? ఆండ్రూసుగారు చెప్పుచున్నారు:—

"ప్రస్తుత ప్రభుత్వవిధానమున నీయన్ని యానైక్యములను పరివర్తనములను, శీఘ్రగమనము నొందుట కంటె మందగమనమునొందిననుట నా యనుభవములో

నిది. స్వరాజ్యాభాసముగ శాసనసభలమూలమున సంస్కరణము లొసంగినపుడు వెంటనే యొకింత 'త్వరితాభివృద్ధి' కనుపించినమాట సత్యమే. కాని యీసంస్కరణము లత్యల్పికరములును, అర్ధాంగీకారములు నగుటచే నతిసమర్థులగు నుత్తమతరగతి భారత రాజనీతిజ్ఞులు కొందరు వానిని కొంతకాలము ప్రయత్నించిచూచియు, నవి ముఖ్యముగా నాచరణాసాధ్యము లని విడిచిపెట్టుట తటస్థించెను. ఏదో యభివృద్ధికి దారితీయుననుకొన్న యీ ప్రారంభోత్సాహము నేడంతరించిపోయినది. బ్రిటిషుప్రభుత్వము పెడలగల యవిశ్వాసము మనయీసలనెల్ల భంగమొనరించినది. ఇండియను సివిలుసర్వీసులోని యొక ప్రతిభాశాలి నాకిట్లు చెప్పియుండెను. 'ద్వంద్వప్రభుత్వమును గూర్చి యెక్కువగా మనము చెప్పగలిగినది-దానిని నడిపించుట పూర్తిగా నసాధ్యము-అనియే. దానిస్వభావమునుబట్టియే యది యింకను మరింత బాధ్యతాయుత, విధాయకమైన కార్యమునకు మనలను ముందుకు నెట్టుచున్నది; నేటి సర్వ స్వాంఘికాభివృద్ధికి గల ప్రతిబంధకములలో పెద్దది పాలక పాలితుల నడుమ నున్నట్టిమై యున్న సంపూర్ణావిశ్వాసమే. ఇట్టి సంపూర్ణాననుకూల పరిస్థితులలో నెట్టి పరిపూర్ణ సానుకూల సంఘ సంస్కారమును సాధ్యముగాదు. దీనికితోడు నీ యన్ని గొప్పవిషయములలోను పరుల యుపస్థితి యుపకారముకంటె నొక యాటంకముగనే యేర్పడుచునే కలిగినది. విదేశీయుడగు మూడవవాని జోక్యము లేనియెడల కొంతవరకు కొంచెమెక్కువ కలహము కలుగవచ్చుననుట సత్యమే. కాని స్వస్వాధీనముకొఱకును, అభివృద్ధికొఱకు నత్యంతముగ నంతరంగిక ప్రేరణ ముండుటయు గలదు. ఏలనన ప్రారంభము బాధ్యతతోగూడ ప్రాప్తించునదిగాని, పరాధికారమువలనగాదు. ఎంతైనను, విదేశీయుని జోక్యము చివరకు మృతప్రాయమే. అది యెన్నడును జీవము నొసగజాలదు."

'వరల్డ్ టుమారో' యను పత్రికయం దీవిషయమైయే వ్రాయుచు నాండ్రూసుగారు, బ్రిటిషువారు భారతదేశమున సాంఘికశాసనములను చేయుటలో చాల నాలస్యము చేయుచున్నారని నేర మారోపించుచు నిట్లనిరి:—

"కాని, భారతదేశమున పూర్వము బ్రిటిషుపరిపాలనముయొక్క విలువ యెట్టిదైయుండినను, ఆపాలనాకాలము త్వరలో సమాప్తి నొందనున్నదను విశ్వాసము నాయందేమి గ్రహచారమోకాని, దృఢపడుచున్నది. సంస్కరణములు కొంతైనను ముందుగా కలిగినవికావు. నిజమే యవి యత్యంతాలస్యముగ నున్నట్టు విచారకరము. మరియు నవి తిసెనంతే లాభకారులును గావు. ఇంతకంటె మిగుల ఫలవంతమును నూర్పు- అదియు సర్వ రముగ- చేయవలెనన్న నెపెల, నెట్టివిధమైన సక్రమపరిణామము నెంతమాత్రమును సాధ్యము కాజాలదు.

(ఇండియన్ రివ్యూ)

---

## తెల్లసేనల ఖర్చు

ఈ విషయమును గూర్చి వైశాఖ మాసపు మనోరమ పత్రికలో నిట్లున్నది:—

" ఇంగ్లండు తన నావిక వైమానిక భూమిపర సైన్యములకై మొత్తము మీద తన . యాదాయములో నూటికి 14 వంతున ఖర్చు పెట్టుచున్నది. అమెరికా $7\frac{1}{2}$ వంతునను, ఫ్రాన్సు 10 వంతునను, ఇటలీ 10 వంతునను, జపాను $10\frac{1}{2}$ వంతునను ఖర్చు పెట్టుచున్నవి. ఆఫ్ఘనిస్థానమున గూడ నింతేఖర్చు కాని దాని సైన్యముతో యూరపు దేశముల సైన్యము లేనియు సాటిరాజాలవు. హిందూదేశపు ప్రభుత్వము తన యాదాయమున నూటికి 42 వంతున సైన్యములకై ఖర్చుపెట్టుచున్నది. అట్లయ్యు భారతదేశము దుర్బలతమముగనే తలంపబడుచున్నది. దేశీయాంగ్లేయ సైన్యము ఖర్చు చూడుడు:

| | | రు. |
|---|---|---|
| 4000 | ఆంగ్లేయాశ్వికదళమునకు | 500000 |
| 15000 | దేశీయాశ్వికదళమునకు | 800000 |
| 40000 | తెల్లకాల్బలమునకు | 1600000 |
| 97000 | స్వదేశపు కాల్బలమునకు | 600000 |

| | | |
|---|---|---|
| 60221 | ఆంగ్లేయరోగి సైనికులకు | 7040560 |
| 194664 | స్వదేశీయరోగి సైనికులకు | 5000000 |
| 520 | తెల్లసైనికుల పిల్లల విద్యకు సైన్య వ్యయమునుండి | 376520 |
| 574 | దేశీయ సైనికుల పిల్లల విద్యకు | 76000 |
| | వేరు వేరు పట్టణముల విద్యాలయ ములలోని యాంగ్లేయ బాలకులకు | 1156000 |
| | భారతీయుల పిల్లలకు | 110450 |

ఇదిగాక ఆంగ్లేయ సైనికుల కొరకు ప్రత్యేకముగ స్టాఫ్ కాలేజీ (staff College) యున్నది. అందు ముప్పది మంది విద్యార్థులు మాత్రముందురు. వారికై రు. 730120 లు ఖర్చు అగుచున్నది. అనగా ఒక్క యాంగ్లేయ సైనికునికి ఉన్నత సైన్య విద్యకై ప్రతి సంవత్సరము భారతదేశపు ఆదాయమునుండి రు. 24337 లు ఖర్చగుచున్నవి!."

హిందూదేశమున నాంగ్లేయ ప్రభుత్వమువారు భారతీయుల విద్యపై ఖర్చు పెట్టుచున్న ధనమును పై వ్యయముతో బోల్చి చూచుకొని, తరువాత మనము ఆంగ్లేయులు మనకొసంగిన 'శాంతి'ని గురించియు, రైళ్లను గురించియు నాలోచించు కొందుముగాక!

---

## ప్రపంచమున నన్నిటికంటె గొప్ప హోటలు

ప్రపంచమున నన్నిటికన్న పెద్ద హోటలు చికాగోలో నున్నది. ఎవ్వడైన తనగదిని దినదినము మార్చుకొనుచు, నందలి గదులన్నిటిలోను నివసించివచ్చుటకు 8 సం॥ లు పట్టునట! అమెరికాలోని మిక్కిలి గొప్పవగు 4000 పట్టణముల నటుంచి యితరము లగు అన్ని గ్రామములలోని, పట్టణములలోని ప్రజలు నందు హాయిగ నివసింపవచ్చునట. హోటలులో 7000 కుర్చీలు, 134000 పళ్లెములుగలవు. ఇందలి వెండిసామాను మరియొకచోటికి బంపవలసిన మూడు బండ్లు పూర్తిగ నిండిపోవును. ఇందలి కంబళ్లనన్నిటిని వరుసగ పరచినచో 60 మైళ్లవరకు శయ్య లేర్పడును. నాట్యభవనమున నొక్కసారిగ 3000 మంది నాట్యమాడవచ్చును. భోజనశాలలో 5284 మంది యొక్కసారుగ భుజింపవచ్చును. 15000 గ్రంథములతో నొక పుస్తకభాండాగారము గలదు. ఇచ్చట మొత్తముమీద 3000 మంది పనివాండ్రు కలరు. భవనము యొక్క నాలుగంతస్తులు భూగర్భమున నున్నవి. 25 పైన నున్నవి. ఈ స్థలము కొని భవనము కట్టుటకు సుమారు రు. 724000000 అయినవి!

(మనోరమ)

---

## ఇంగ్లీషా? హిందీయా?

ఏభాష ద్వారా విద్యార్థులకు బోధనము జరుగవలయునన్న యంశమునుగూర్చి సాధు వాస్వానిగారు హరిద్వారములోని గురుకులమున నుపన్యసించుచు నిట్లు నుడివిరి:

"ఇంగ్లీషు మనల నితరప్రపంచముతో గలుపుచున్నది. దానిద్వారా మనము నేటి వైజ్ఞానికరాజకీయ సామాజికశాస్త్రములను, పాశ్చాత్యనాగరకతను దెలిసికొనగలుగుచున్నాము. కాని యింగ్లీషును మాధ్యమిక భాషగ (Medium Language) జేసికొనకయే మన మాలాభము బొందవచ్చును. ఇంగ్లీషు చదువుడు. విన దాని నొక విదేశభాషగ జదువుడు. మన మాతృభాష హిందీ ఇంగ్లీషు దానిస్థానము నాక్రమింపజాలదు. జర్మనీ పోలండు దేశమును జయించినప్పుడు ఆదేశమునందలి జాతీయ భావములను సమూలముగ పెరికివేయవలయునన్న పోలండు విద్యాలయములలో జర్మనుభాషను మాధ్యమిక భాషగ చేయుటయే యత్యుత్తమసాధనమని జర్మనీ తలచెను. అట్లే చేయబడినది. మాతృభాషలో ప్రార్థనగీతములబాడిన పోలండు విద్యార్థులను జర్మను ఉపాధ్యాయులు నిర్దయులయి దండించిరి. మానవుని యాలోచనా జీవితములతో భాషకు దృఢమగు సంబంధము కలదు. ఒక పరభాషను మాధ్యమిక భాషగ జేసినప్పుడు విద్యార్థియొక్క స్వతంత్రాలోచనాశక్తి తప్పక క్షీణించిపోవును. విద్యార్థులు విదేశీయుల యాలోచనలను ఆచారవ్యవహారములను అనుకరించుటకు మొదలిడుదురు. వారి మానసికవికాస మంతరించిపోవును."

5.    6-    20    ౧౦-౨

ఇంగ్లీషులోనేకాని మాతృభాషలో మాటలాడుట యవమానకరమని తలపోయు విద్యార్థిసోదరులు వాస్వానీగారి యుపదేశములోని రహస్యమును గ్రహించుకొను గొంచెము ప్రయత్నింతురుగాక.

(త్యాగభూమి)

---

## తెలుగుపత్రికలు

'సమదర్శిని' విభవ సంవత్సరాది సంచికయందు శ్రీ చల్లా శేషగిరిరావు పంతులుగారు (ఆంధ్రపత్రికా సంపాదకులు) వ్రాసిన చక్కని వ్యాసము 'తెలుగుపత్రిక' లనుపేర నొకటి ప్రకటితమయినది. అందు పత్రికల నిర్వాహకులు, సంపాదకులు, పాఠకులు, తెలిసికొని మననము చేసికొని ఆచరణమునకు దేవలసిన సూక్తులు గలవు. వానిలో నుత్తమము లనదగిన కొన్నిటి నీక్రింద గాంచనగును.

...పత్రికా నిర్వహణమునకు ధన మత్యంతావశ్యకము. కేవలము చందాలవలననే పత్రికలు వానిపొట్టనవి పోసుకొనుననిగాని, వెంటనే లాభము చేకూరుననిగాని తలంప వలనుపడదు. కొంతకాల మయినను వేచియున్నగాని, పత్రికలకు శాశ్వతపు చందాదారులుగాని, ప్రకటనలుగాని సమకూరవు. అంతవరకయినను పత్రికాధిపతి స్వంతద్రవ్యము ఖర్చుపెట్టకతీరదు. ఆంధ్రదేశమునందిది మరింత యవసర మగుచున్నది. దేశోపయోగముకొఱకై కొంతవరకయినను త్యాగము సలుపగలవారె యిక్కార్యమునకు గడంగవలయును...............

.........కనీస మొక్క సంవత్సర మయినను పత్రికను పోషింప శక్తిలేనివారు, యిట్టిప్రయత్నములకు బూనుట న్యాయము గాదు. పత్రికలు కొన్ని సంవత్సరపు చందాలను వసూలుజేసియు మధ్యనే యాగిపోవుచున్నవి. ఇట్టివాని మూలమున నూతనముగ వెలువడు పత్రికలకు చందాదారులుగ జేరుటకు పలువురు వెనుదీయు చున్నారు. విశ్వాసము విశ్వాసమును పెంచును. వ్యవహారధర్మమునకిది మూలము. ఒక్కసంవత్సరముపాటయినను, పత్రికలను నిర్వహించి, ఆ పిమ్మట శక్తిలేనిచో వానిని నిలిపివైచినను అపకీర్తి గలుగదు. అందుచే చందాదారులిచ్చినసొమ్ము సద్వినియోగ మగునను నమ్మకము ప్రజలలో నేర్పడునటుల జూచుట పత్రికా నిర్వాహకుల కనీసధర్మము.

...వీరు సయితము కొంత త్యాగమునకు సంసిద్ధులై, పత్రికాభివృద్ధినే జీవితాశయముగ బెట్టుకొని కృషిసలుపవలయును. సంపాదకుల సామర్థ్యమునకు, తగిన వేతనములు లభించుననిగాని, ఇతర జీవిత శాఖలలో గలుగు లాభములు పత్రికలద్వారా చేకూరుననిగాని తలంచుట వ్యర్థము. ఆంధ్రదేశములో నిట్టి ఆశల కింకను తగిన పరిస్థితులేర్పడలేదు....నిష్కామసేవ ఎవరికయినను అవసరమయినయెడల, పత్రికా సంపాదకుల కిది ముఖ్యావసరము. పత్రికలు వివిధోద్యమములను పైకి దేవలసి యుండును. వీనిని నిర్వహించు నాయకులనుగూడా పైకి దేవలసియుండును. వీరి కనేక విఘ్నముల తోడ్పడవలసి యుండును. ఉద్యమాభివృద్ధియే సంపాదకుని నిజమగు లక్ష్యము. దాని సాఫల్యమువలననే; వీరికి సంతుష్టి గలుగవలెను..................................

......సంపాదకు లెంత శ్రద్ధతో బనిచేసినను, వారివలన ఏమాత్రము లోపమువచ్చినను, ఎవరి యభిప్రాయములను వారు విమర్శించినను, వారిపై నాగ్రహము జనించును. అంతటితో పత్రికను చాలించుకొందు మని భయపెట్టువా రుందురు. ఈరీతిని సంపాదకుని కెదుర్కొను ఆశాభంగములకు కొదవ యుండదు. దూషణభూషణములను, గౌరవాగౌరవములను పాటింపక, నిష్కామబుద్ధితో సేవజేయు సంపాదకుడే తుదకు విజయము గాంచగలడు. సంపాదకపీఠ మలంకరించుట, ఇతర సేవలకన్నను తక్కువగాదు. ప్రచారకులు, వక్తలు, శాసనసభ్యులు, మున్నగువా రెంత ప్రజాప్రబోధము గావించుచున్నారో, సంపాదకులు అంతకన్న తక్కువప్రబోధము గలిగించుటలేదు. అందుచే సంపాదకస్థానము సహజ గౌరవార్హ మనియే ఎంచవలయును...............................

......హరికథాకాలక్షేపము జేయువారలకువలె సంపాదకులకును పెక్కువిషయములగూర్చి కొంతవరకయినను రూఢిజ్ఞాన ముండవలయును. ఒకటి రెండు విషయముల గూర్చి వీరికి ప్రత్యేకపరిజ్ఞాన ముండవలయును. ఆంధ్ర పత్రికల సంపాదకులకు కనీసము మూడుభాషలలోనయినను ప్రవేశముండవలయును. పెక్కుపత్రికలు రాజకీయ విషయముల గూర్చియే ప్రధానముగ వ్యవహరించుచుండుటచే, ఆంగ్ల భాషాపరిచయ మత్యవసరమగుచున్నది. ఆంధ్రభాషలో చక్కని వ్యాసశైలి యలవడవలయునని వేరుగ జెప్పనవసరము లేదు. పెక్కు శబ్దములను సంస్కృతమునుండి గైకొనవలసి యుండుటచే సంపాదకులు సంస్కృత భాషామర్యాదలను గ్రహించి యుండుటవసరమగును..............................

......తాను దెలుపదలచిన సంగతిని చదువరు లెట్టుల సులభముగ గ్రహింపగలరని, సంపాదకుడు ముందుగ యోచించును. అట్టి పదములనే అతడు ఏరుకొనును....

......సంపాదకులు ఎట్టి క్లిష్టవ్యవహారముల నయినను త్వరితముగ గ్రహించు నేర్పుగలవారుగ నుండవలయును. పూర్వాపరసందర్భములను వెంటనే సమన్వయము జేసికొను శక్తి గలిగియుండవలెను. రాజకీయ విషయములనే కాక, భాషావిషయములను, చిత్రకళలను, ఆర్థికవిషయములను, సాంఘిక మతవిషయములను మున్నగు వానినెన్నిటినిగూర్చియో వ్యాఖ్యానము జేయుటకు సంపాదకునకు సామర్థ్యముండవలయును. ఇంతసామర్థ్యమున్నను, తీవ్రమగు విషయములగూర్చి వ్యాఖ్యానము జేయవలసియున్నపుడు, సరళ పదప్రయోగ మవసర మగును. వ్యక్తుల లోపముల జూపుటతో కాలము గడపుటకన్నను పత్రికలు ఉద్యమాశయముల వ్యాపింపజేయుట వలన ఎక్కువ ప్రయోజన ముండును. పత్రిక లితరులపై కయ్యమునకు కాలుదువ్వుటవలన ప్రయోజన ముండదు.

......ఇంగ్లీషు పత్రికలలో వలె తెలుగు పత్రికలలో వార్తలు లేవేమని యడుగుచుందురు. డబ్బు ఖర్చుపెట్టి వార్తలను తెప్పించినను వీనిని భాషాంతరీకరించి గాని ముద్రించుటకు సాధ్యపడదు. ఇంగ్లీషుపత్రికలలో,వార్తలకు శీర్షికనుబెట్టి, వచ్చిన తంతివార్తలను వచ్చిన విధమున ముద్రణమునకు బంపవీలగును. లండను 'టైమ్సు' మున్నగు విదేశవార్తాపత్రికలలోగల వ్యాసములను,కత్తెర సహాయముతో చింపి అచ్చువేయవచ్చును. ఇటులనే పలువుర ప్రసిద్ధపురుషుల వ్యాసములను ఉపన్యాసములను ఇంగ్లీషుపత్రికలలో ప్రచురించుట కష్టముగాదు. తెలుగుపత్రికలలో నటుగాక స్థానికవార్తలు సైతము భాషాంతరీకరించి ప్రచురింపవలయును. ఇంగ్లీషు సంక్షిప్త లిపిలో వ్రాసిన ప్రసంగములను తెలుగులో తర్జుమాచేసి ప్రచురింపవలయును. కాంగ్రెసువారమునందు ఎన్నిప్రసంగములను, తీర్మానములను తర్జుమా చేయవలయునో తెలుపనక్కరలేదు. ఈరీతిని తెలుగుపత్రికలను సౌష్ఠవముగ కొనసాగింపదలచుచో, అనువాదకులయుపాధ ముండవలయును..............................

......కొందరు పెద్దలు ఆంధ్రభాషలో ఉపన్యసింపగలిగియు, వ్రాయగలిగియు, వెలుపలివారికి తెలియుటకు ఆంగ్లభాషలోనే వ్రాయుటయు, ఉపన్యసించుటయు సామాన్యముగ జరుగుచుండును. ఏ ఇంగ్లీషు పైపుపత్రికయో తెలుగుపత్రికలపైగూడ పడవేయబడుచుండును. కష్టపడి అనువదించి ప్రచురించిన పిమ్మట, తమభావములను పత్రికలు సరిగ వ్యక్తపరుప లేదని, వీరు నిరసించుచుందురు..............................

......మహారాష్ట్రి, బెంగాలీ, హిందీ, మున్నగు దేశభాషలలో ప్రచురింపబడు దైనిక వారపత్రికలు, తెలుగుపత్రికలకన్నను ఎక్కుడుసామర్థ్యము జూపకున్నను ప్రజలు వాని నభిమానించి పత్రికలను విరివిగ దెప్పించుకొనుచున్నారు. తమిళదేశమునందుగూడ ఆంధ్రదేశమునందుకన్నను హెచ్చు అభిమానము కనుపించుచున్నది. ఆంధ్రదేశములో పత్రికాపఠనాసక్తి విస్తరించుచున్నను డబ్బిచ్చి పత్రికలను దెప్పించుకొనువారి సంఖ్య చాల తక్కువగ నున్నది. పత్రికలకు చందాదారుల సంఖ్య హెచ్చినగాని, అవ్వి జీవింపజాలవని ప్రజ యింకను గుర్తింపకున్నారు.

పత్రికలుగూడ ప్రస్తుతహీనస్థితికి బాధ్యతవహింపక తప్పదు. అన్ని పత్రికలును ఒక్క రీతి వార్తలనే ప్రచురించి, ఒక్కరీతివ్యాఖ్యానములనే గావించుటకు

మారుగ, భిన్నవిధముల ప్రబోధింపవచ్చును. కొన్ని పత్రికలు స్థానికవార్తలకును, మండలవార్తలకును, ప్రాముఖ్యము నొసగవచ్చును. ఇతర పత్రికలలో గనుపింపని విశేషములను ప్రచురింపవచ్చును. స్థానిక నాయకుల చాకచక్యమును ప్రచురింపవచ్చును. వారి ఛాయాపటములను ముద్రింపవచ్చును. కొన్నిపత్రిక లొక్కొక్కశాఖకు ప్రత్యేక ప్రాముఖ్య మీయవచ్చును. ఈరీతిని, కొన్ని రాజకీయపత్రికలు, కొన్ని సాంఘిక పత్రికలు, కొన్ని ఆర్థికపత్రికలు, మరికొన్ని వ్యవసాయపత్రికలు వెలువడి తమ తమ ధర్మములను నిర్వహించుచో, అన్ని పత్రికలును, జీవింప వీలగును. గతానుగతికులవలె, అన్ని పత్రికలును ఒకమార్గమునే ద్రొక్కదలచుచో మాత్రము ఏవియు ముందుకు పోజాలవు......................

......పత్రికలు ప్రజలహక్కులను రక్షించుట కెటుల పాటుబడుచున్నవో ప్రజలు పత్రికల హక్కులను రక్షించుట కటుల పాటుబడుట యవసరము. అన్యోన్యాశ్రయపు విలువ నుభయులును గ్రహించినగాని, ఏ దేశమయినను ముందుకు బోజాలదు. పత్రికలను పోషించుటకు దేశము సంసిద్ధమయినపుడే ప్రజలకు స్వాతంత్ర్యసిద్ధి గలుగును......................................

* * * *

......ఒక్క సంగతిమాత్రము జెప్పి ముగించెదను. పత్రికలు ప్రజాభిప్రాయమును వ్యక్తీకరింపవలయునా, లేక పత్రికాసంపాదకుల యుద్దేశ్యములను మాత్రమే తెలుపవలయునా, అను ప్రశ్న గలదు. ప్రజాభిప్రాయమును ప్రతిఫలింపజేయుచు, పత్రికలు ప్రజలను ముందుకు నడిపి గమ్యస్థానమునకు జేర్చుటకుగూడ ప్రయత్నింపవలయును. రెండుధర్మములును నెరవేరుచుండని యెడల పత్రికల ప్రయోజనము తగ్గును. వ్యక్తులను విమర్శించినపుడు, వారి లోపముల నన్నిటిని ఏరి బయల్పరచుట పాడిగాదు. వ్యక్తులు బహిరంగముగ జేయు కార్యములను, దేశశ్రేయమునకు భంగముగ నున్నపుడు మాత్రమే, ఖండించుట న్యాయము. అంతియ గాని, వ్యక్తుల నెటుల నయినను అగౌరవపరచి వారి పరువుప్రతిష్ఠలను అంతమొందించుటకు ప్రయత్నించుచో, పత్రికల ప్రతిష్ఠగూడ అడుగంటును. పత్రికలు ఆదర్శములను ప్రధాన సూత్రములను ప్రతిపాదించుచో, ప్రజలలో ప్రబోధము గలుగును....

......పత్రికలు ఉన్నతమార్గముల ద్రొక్కుచు, నీచపువ్రాతలకు గడంగక, ఒరుల మనములను నొప్పింపక, సహనము జూపుచు విశాలబుద్ధితో ప్రవర్తించుచో, శాశ్వత ప్రయోజనము గలిగింపగలవు. అటుగాక, పరులను వ్యక్తిపరముగ దూషించుచు, ద్వేషము వ్యాపింపజేయుచు, అసహనము తరుచుగ చూపుచో కొంతకాలమవి యొక పక్షమువారి యభిమానమును చూరగొనగలిగినను, త్వరలో క్షీణింపగలవు. పత్రికా సమావేశములు తరుచుగ గూడుచు, పత్రికల హక్కులను, వాని బాధ్యతలను నిరూపించుచుండుట లాభకరము.

---

## నేటి ఆంధ్రులు-ఆంగ్లభాషాపిశాచము

ఆంధ్ర భారతి మూడవ సంపుటము రెండవ సంచికయందు శ్రీ కొల్లూరు ధర్మారావుగారు బి.ఏ., 'బ్రహ్మలోకంలో భాషా కాంగ్రెస్' అనే వ్యాసంలో యిట్లు నుడివినారు :

ప్రస్తుతం భూలోకంలో ప్రభుత్వంతోపాటు భాషలోకూడా యింగ్లీషువాడి బావుటాయే ఎగురుతూంది. సంస్కృత జన్యంఅయిన ప్రాచ్యభాషలకి కూడా యింగ్లీషుధనరు తగిలి అవి మార్పుజెందుతున్నాయి. అట్లా మార్పుచెందుతూన్న వాట్లో ముఖ్యమైంది తెలుగు. ఇంగ్లీషువారిని, వారిభాషను, వారి ఆచారాలనూ, బోధపర్చుకోడంలో ఆంధ్రు లనేకవిధాల పొరపాటుపడుతున్నారు. ఆంగ్లేయులికి స్వదేశాభిమానం, స్వభాషాభిమానం చాలాయెక్కువ. వారి నవలల్లోను, నాటకాల్లోను, కథల్లోను, జాతీయత వెల్లివిరిసిపోతూ వుంటుంది. Shakspeare తాలూకు చారిత్రక నాటకాలు తీయించి చూడండి; ఇంగ్లాండు అంటే భూలోకవైకుంఠం అన్నాడు. వాళ్ల Ivy, వాళ్ల oak, వాళ్ల snowdrifts, మొద

లైనవే. వాళ్లు వర్ణిస్తూవుంటారుకాని, హిందూదేశపు ప్రకృతి శృంగారం వూసెత్తరు. ప్రతీదీ nationalise చేసుకునే పద్ధతిగా వ్రాస్తారు. ఇప్పుడిప్పుడాంధ్రులు కూడా ఆంధ్రత్వాన్నత్యాని కీర్తించమని తమ్ముళ్లోన్ని చెల్లెల్లోన్ని address చేస్తూ జాతీయగేయాలు వ్రాస్తున్నారు. అది ఆనందించదగిన సంగతి కాని, యింకా కథకులికీ నవలారచకులికీ మాత్రం పాశ్చాత్య్య సూచకమైన బంగాళాలు, క్రోటన్లు, ఏదీకానివేళ టీ త్రాగుడులూ, అడుగడుక్కీ కాగితపు సీమచుట్టలు ముట్టించడాలు, యివే బుద్ధికి పొడగడుతున్నాయి కాని, ఒకరూ "నా" అనుకోదగిన జాతీయాచార వ్యవహారాలు గ్రంథాల్లో పునరుజ్జీవింప జెయ్యకుండా వున్నారు. అయినకాడికి పైడాబుకు ఇంగ్లీషువాళ్ల లాగు పేర్లు తెగ్గొట్టుకు పెట్టుకోడం యిప్పుడు ఆంధ్రులికి బాగా పట్టుకున్న వెర్రి! అందులోనైనా, బుద్ధి వుపయోగించారేమో అంటేసున్న. అనాదిగా వస్తూన్న గృహనామం విడిచిపెట్టి, ఒక్క పేరు మట్టుకే రాసుకోడం ఇప్పుడు ఆంధ్రలోకంలో ప్రబలంగా వున్న వ్యాధి. Shakespeare, Milton, Wordsworth మొదలైన ఇంగ్లీషు కవులంతా పూర్తిగా పేరు రాసుకోక, పై ఒక్కొక్క ముక్కే రాసుకోడం ఆంధ్రులు చూసేరు; వాతబెట్టుకొన్నారు. కాని "Shakespeare" మొదలైనవి కుటుంబాల పేర్లే. "William" మొదలైన అసలుపేర్లు త్యజించేరు. అందరూ ఇంగ్లీషుకవులూ అలాగే. "సుపుత్రః కులదీపకః" నాయనా నువ్వు కీర్తిగడిస్తే ఫలానా వంశంలో పుట్టినవాడవని చెప్పి నీవంశప్రతిష్ఠ నిలబెట్టాలి. అలాచేస్తూన్నవారు వంగదేశీయులొకరు. William Shakespeare లో William విడిచిపెట్టేడు కదా అని, ముందొచ్చేయింటిపేరు మంటగలిపి తన పేరుమాత్రం రాసుకుంటూన్నారు ఆంధ్రులు. వంశప్రతిష్ఠ నిర్మూలంచేసే యీ దురాచారం జాతీయప్రతిష్ఠని రక్షిస్తుందా?

ఇహ, కవులమాట—ఛందం, కళా, అంటే యేమిటో యెరగనివాళ్లు కవులై పోతున్నారు. ఓహో, ఆంధ్రలోకంలో యెక్కడ చూసినా భావకవులు. ప్రణయకవులు, మర్మకవులు—అంతరంగంలో లేనిభావం, అనుభవంలో లేనిప్రణయం, అర్థంలేని mysticism. ఇంటికొక Shelley, Keates లు కుక్కమూరిపోయారు. Browning కంటె నారికేళపాకం వెలిగించేవాళ్లు లెక్కకి మీరిపోయేరు. ఈ నారికేళం మాత్రం పిశాచ హస్తగతం అయిపోతూంది.

---

## రాజకీయవిషయిక ప్రధానవ్యాస లేఖకుడు

జార్జి బెర్నార్డుషాగారు 'టైమ్ ఆండ్ టైడ్' పత్రికకు వ్రాసినలేఖనుండి యీ దిగువభాగము ఎత్తివ్రాయబడుచున్నది. ఇందురాజకీయ విమర్శనములను గూర్చియు, దైనికపత్రికలలో ప్రధానవ్యాసములను వ్రాయువారి పనినిగూర్చియు చర్చింపబడియున్నది:—

యుద్ధసమయమునం దొకముఖ్యసేనానిని నేనిట్లడిగితిని "అసలు యుద్ధమునకు ఎంతదూరముముందు వ్యూహరచనాది కార్యకలాపము లేర్పాటుచేయనగును." అని "ప్రథమదళమునకు అర్ధకిలోమీటరు (సుమారు 547 గజములు) ముందుగా" నని యతడు జబాబు చెప్పియుండెను. యుద్ధమారంభమైనపుడు దానిగూర్చి నేనొకవ్యాసమును వ్రాసితిని. దానికి అవసరమైన సాధనపత్రములకొఱకు వెదకి తంటాలుపడి, వానినిగూర్చి చర్చించి దానియందు చేరియుండు సమస్యలనువిడదీసి పరిష్కరించుటకు నాకు రెండునెలలకాలము పట్టినది. అప్పటికిని యది శీఘ్రముగా ముగింపబడినదనియే చెప్పవలెను. ప్రారంభించిన తరువాత నేను విడిచిపెట్టకుండ ముగింపదలచితిని; కాని యుద్ధము ముగిసిపోయిన కొంతకాలము తరువాతివరకు నొక వ్యాసమును ఎందుకైన నుపయోగించుటకు కావలసినంత దిట్టముగా ముగింపజాలకపోతిని. ఈలోపున ప్రతిదినమును వార్తాపత్రికలు డజన్లకొలది కూర్పులచ్చుపడి చిమ్ముకొని వచ్చుచుండెను; ప్రజలు వాని నత్యాతురముతో నుద్రేకముతో చదువుచుండిరి. వానియందలి ప్రధానవ్యాసములు, ప్రత్యేకవ్యాసములు — వార్తలు, యుద్ధరంగమునుండి వార్తలును (పత్రికాకార్యాలయ యుద్ధరంగములు) అతితొందరగా పోవుచుండిన మోటా

రుబండి పైబడిన కోడిపిల్లల సమూహపు అల్లరియటుపుల స్వభావమును విలువయు గల్గియుండెను.

ప్రతిదినమును జరుగుచున్న విషయముయొక్క అతిశయమైన స్థితియే యాయుద్ధమైయుండెను. గంట గంటకును వార్తలు వచ్చుచుండును. వచ్చినంతనే వార్తలపై చరిత్రయొక్క తీర్పును (అభిప్రాయమును) ప్రధాన వ్యాసలేఖకుడు సరఫరాచేయునని తలంపబడుచుండును. ఇంకొకవిధముగ చెప్పవలెననిన, వార్తాహరులు వార్తాహరులే, వార్తలువార్తలే; కాని ప్రధానవ్యాసలేఖకుడు వంచకుడును, వాని తీర్పులు నిరర్థకములునగుచున్నవి. తదనుగుణముగా, తాను వ్రాయు సమస్య లెన్నడును పరిష్కరింపబడుచున్నట్లు లేవను సంగతిని చదువరులు కని పెట్టజాలనంతగా వారి మనసులకు నాటునట్లుగా నద్భుతావహమగు పద్ధతిని సమస్యలను త్వరగా ప్రతిపాదించు సామర్థ్యమును ప్రధానవ్యాసలేఖకుడు వృద్ధిపొందించు కొనవలెను.

ఇట్లు కొన్ని సంవత్సరములైన తరువాత ప్రధాన వ్యాసలేఖకుడు యింకేమియుచేయ నసమర్థుడైపోవును; ఇందువలననే యనేకగ్రంథకర్తలకంటెను పత్రికానిర్వాహకుడు మంచిరచయితయైనను, వానిజన్మమున నొకగ్రంథమైనను వ్రాయజాలడనుట సామాన్యవిషయమైనది.

పత్రికా నిర్వాహకుని కార్యము వార్తావిశేషముల సేకరణమును ప్రచురణమునుగాని, రాజనీతి తత్వవిచారముకాదని, పైమాటల తాత్పర్యము. ఈ పరిమితిని గ్రహింప నారంభించితిమేని మనముచేయవలసియున్నది: లార్డు పాల్మర్‌స్టన్‌గూర్చియు, ప్రాచ్యదేశముల సమస్య గూర్చియు లండనుపత్రికా ప్రధానవ్యాసములుగా లేఖకులు పూర్వకాలపు తరహాగా వ్రాయుచుండిన యుత్సాతమైన కబురులుమానుట. బూటకపు రాజకీయ విషయిక ప్రధానవ్యాసముల నసలే పూర్తిగా విసర్జింపవలెను; కాని యుపన్యాసవేదికల పైనను, రంగస్థలములందును సరసముగ ముచ్చటగనుండు పెద్ద ధర్మప్రసంగములుగాని, పెద్దపెద్ద యుపన్యాసములుగాని, దీర్ఘవ్యాసములుగాని ప్రజల కిష్టముండదనుట యింతమాత్రమును కారణము కాదు. వారు సహింపజాలనిది:—చెప్పుటకేమియు లేని వారి డాంబికమైనసోదెలు, వెఱ్ఱిముఖముల వక్తృత్వము, పిచ్చివాని చప్పనిమాటలు, నిరర్థకశబ్ద పాండిత్యముగల వాని ఉపాలంభమును. వార్తలు, వింతలు, విశేషములు, అందుండి యిందుండి యెత్తిచెప్పిన చిన్నచిన్నవాక్యములును వారు మెచ్చుకొందురు; ఏలన నవి సామాన్యముగా దీర్ఘోపన్యాసములకంటె చాల నయము. కాని, నిజముగా కావలసినదాని నివ్వగలవారెవరైన నుండిన రానిండు, జనులకు చాలినంతగాచెప్పుటకు వారివద్ద నేమియు నుండదు.

దైనికపత్రికా కార్యాలయములు ఖైదులవంటివని కూడ గమనింపుడు. మిక్కిలి తెలివితేటలుగల సంపాదకుడైనను తాను పనిచేయవలసిన గంటలలో జరుగు రాజకీయ సభలు, విజ్ఞానశాస్త్ర విషయకోపన్యాసములు, సంగీత ప్రదర్శనములు, తుదకు విందులు మొదలగు వానినుండి కూడ సంబంధములేక వేరుగానుండుట వలన నత్యల్పకాలములో ప్రపంచముతోడి సంబంధమును కూడ గోల్పోవును. దైనికపత్రికకు అధమము ముగ్గురు ముఖ్యసంపాదకు లుండవలెను; ఒక్కొక్కరు నొకదినము కార్యాలయమున పని చేయుచు రెండుదినములు ఖాలీగానుండవలెను. సంపాదకులు ఒకమూలకూర్చొని ఏకాంతవాసులయి యుండుటచే ప్రస్తుతము పత్రికలువర్తమానకాలమున కిరువదియేండ్లు వెనుకబడియున్నవి. వీరికంటె వైర్ లెస్ సెట్లు (తీగలేని విద్యుత్యంత్రములు. వీనివలన నెక్కడెక్కడ నేమిజరుగుచున్నది ఒకేమారు తెలియవచ్చుచుండును, వినబడుచుండును) సహాయముగల లైట్‌హౌస్ ఉద్యోగులకు ప్రపంచమున నేమేమి జరుగుచున్నదో యెక్కువగా తెలియునవచ్చును.

(రివ్యూ ఆఫ్ రివ్యూస్)

---

## భారతదేశపు రవానా సమస్యలు

బ్రిటిష్ ఎంపైర్ రివ్యూనందు, వ్రాయుచు మేజర్. టి. సాల్‌కీల్డుగారు భారతదేశమునకు

బ్రిటిషువారు వచ్చి యేర్పడిన యప్పటినుండియు సరకులరవానా గూర్చిన చరిత్రమును వివరించిరి:—

“మేము భారతదేశము నాక్రమించుకొన్న మొదటిరోజులలో కలకత్తానుండి కాన్పూరుకు సైనికదళములు గంగానదిమీదుగా రవానాయగుచుండెను కాని, కలకత్తానుండి పెషావరునకు చేరునప్పటికి మూడుమాసములుపట్టెడిది. 1852 సంవత్సరమున, నిప్పుడు కలకత్తానుండి పశ్చిమోత్తర పరగణాలకు గంగా సింధూ మైదానమునెంబడి ఢిల్లీమీదుగాబోవు సరాసరి రహదారిమార్గము, మీరటువరకే నిర్మింపబడియుండెను. ఈ పరిస్థితులవలననే 1857 వ సంవత్సరమున కలిగిన సిపాయీల తిరుగుబాటు సమయమున మనుష్యులును, మందుగుండు సామానులును ఒకచోటినుండి యింకొకచోటికిబోవుట కంతకష్టమైనది. కాని యానాటితరువాత భారతదేశమున నెన్నోయుత్తమములగు రోడ్డులు నిర్మింపబడియున్నను, యుద్ధసంబంధమగు కపటోపాయ ప్రయత్నములకొఱకును, క్షామనివారణ ప్రయత్నములకొఱకును సైనికుల యావశ్యకములప్రాబల్యమువలన మారిన దృక్పథము ననుసరించి యధికారు లాలోచింపదొడగిరి. దేశముయొక్క యార్థికజీవనమున నెల్లవారును గలసిమెలసి యుండుటకును, ఆధునిక వ్యాపారావసరముల యక్కఱలకు చాలుటకును దగిన రహదారుల యావశ్యకము మొన్నమొన్నటివరకు నుపేక్షింపబడి యుండెను.”

రహదారిమార్గముల పునర్నిర్మాణమును గూర్చి యీలేఖకు డిట్లనుచున్నాడు:—

కేంద్రప్రభుత్వమువారును, రాష్ట్రీయప్రభుత్వమువారును తమ్మునెదురుకొనుచున్న యనేకార్థిక సమస్యలలో రోడ్లనిర్మాణము నొక మిగుల నావశ్యకవిషయముగా తలపవలెను. సరాసరి మార్గముల యభివృద్ధి యెంతయు కావలసియున్నది; రైల్వేలకు క్రొత్తశాఖామార్గము లావశ్యకములు. రాకపోకల వ్యాపారముయొక్క త్వరాభివృద్ధిగలిగినట్టియు,మార్పుల నొందుచుండునట్టియు స్వభావమున కనుగుణముగ పెద్ద పురపాలక సంఘములవారు తమ పట్టణములయందలి బాటలను వృద్ధిచేయుటకు నింకనెక్కువ ప్రయత్నములు చేయవలెను. భారతీయులు ప్రయాణరామణీయకతను చవిచూచి, యింకను ప్రయాణమునం దౌత్సుక్యము కలిగియున్నారు. కాన నీనాటి రాకపోకలవిధములు, ప్రయాణసౌకర్యములును భారతదేశమును తలక్రిందులుచేయును. రాజకీయపక్షస్థుల శక్తిసామర్థ్యములను ఆచరణలో పెట్టదగిన ప్రయోజనమార్గములుగా మార్చగలిగినప్పుడు దేశమునకు సంభవింపదగిన సంపద యథార్థమైనదే యగును; ఈ మార్పులో, భారతదేశపు సమస్యలనేకము-ఆర్థికవిషయము మూలముగా గలవి-పరిష్కృతము లగును. కాని తెలివిలో, విశాలమగు రహదారిమార్గ నిర్మాణాలోచనలు విశాలదృష్టిని పురస్కరించుకొని కావించినయెడల నవి మిగిలిన యన్నిటికంటె నీయత్యంత వాంఛనీయమైన పరిస్థితిని గలుగజేయుటకు మిగుల తోడ్పడును.

ప్రధాన, సహాయమార్గములకు రెంటికిని, భారతదేశమున రోడ్డు మోటారుసర్వీసులు సహాయకములుగను శాఖలుగను వర్తించును. కాని, కడు విశాలముగనున్న భారతదేశమున రోడ్డు ప్రయాణమునకును, రైలుప్రయాణమునకును పోటీ జరుగుట కవకాశములేదు. అందుచేత భారతదేశము తెలివితేటలుగలిగి పరస్పర సహకారబుద్ధితో సమానావశ్యకతను గుర్తించి రెండురకముల రవానామార్గములను వృద్ధిచేసికొనగలుగును. ఈ దేశములోవలె (ఇంగ్లాండువలె)పోటీదారుల వైరము నెదుర్కొనుటెన్నడు నగత్యముండదు. ఎట్లయినను భారతదేశ మభివృద్ధి చెందవలెననిన దాని భావ్యభివృద్ధి, సంతుష్టి, సౌఖ్యము, విజయము, దాని రవానా విధానముల సత్వరాభివృద్ధిపై నాధారపడియున్నవి. ఇట్టివ్యాపార సంబంధమైన ప్రయత్నము లన్నింటిలోను ప్రజలప్రయత్నములను భారతప్రభుత్వమువారు ప్రోత్సహింపవలయును. ప్రజలకిపుడత్యంతావశ్యకమయినది విద్య కావునను, రవానాయే నాగరికతకావునను, నాగరికత-దాని నవీనార్థమున-విద్యకావునను, భారతదేశమును చీకాకుపరచుచున్న సమస్యలన్ని

టిలోను గొప్పదానియొక్క పరిష్కార మిదేయని వారు జ్ఞప్తియం దుంచుకొన వలెను.

ఆనర్ సు; 1917 లో మహామహోపాధ్యాయ యనుబిరుదు నొసంగబడినవి.

---



కీ. శే. మహామహోపాధ్యాయ పండిత యం. లక్ష్మణసూరిగారు

తిరునల్వేలిజిల్లా పూనల్ వేలి గ్రామములో 1859 సంవత్సరమున జన్మించిరి. వీరితండ్రిగారును మంచిసంస్కృతపండితులు. కుమారుడు తండ్రిపేరును నిలిపి, తాను సారస్వతమున గొప్పపేరు సంపాదించుకొనెను. వీరు 1896 లో తంజావూరు కళాశాలయందు సంస్కృత పండితులుగ నుండిరి. పిదప 1907 నుండి 1920 వరకు చెన్నపురి పచ్చయప్ప కళాశాలలో నుండిరి. వీరు సులభశైలిలో సంస్కృత గ్రంథముల వ్రాయుటయందు కడు నిపుణులు. నాటకములు, గద్యపద్యాత్మకమగు గ్రంథములు, భాష్యములు, వ్యాఖ్య లనేకములు వ్రాసిరి. వీరి రచనములు కొన్ని విదేశభాషలలోనికి తర్జుమాయైన వట. వీరికి 1911 లో దర్బార్ అండ్ సర్టిఫికేట్ ఆఫ్



కీ. శే. పుదుక్కోట మహారాజావారు

మేనెల 28 వ తేదీని వీరు ప్యారిస్‌లో మృతి నొందిరి. రెండుపర్యాయముల శస్త్రచికిత్సయు నిష్ఫలమైనదట. వీరికి చనిపోవునప్పటికి 53 ఏండ్లుండెను. వీరికి 5 గురు సోదరులు గలరు. అందుపెద్దవారే రీజెంటుగా నున్నారు. రాజాగారు 1915 సం॥ ఫింకు అను మెల్బోరను (ఆస్ట్రేలియా) లోని యొక ఎల్. ఎల్. బి. కుమార్తెను వివాహమాడిరి. 1916 సం॥ వీరికొక కుమారుడు గలిగెను. 1922 సం॥వీరెల్లప్పుడును విదేశములందే యుండిపోదుమని ప్రకటించిరి.

వీరి శవమును ఇంగ్లాండులో హిందూ కర్మకాండ ప్రకారము దహనమొనర్తురు.

---



కీర్తిశేషులు
బ్రహ్మశ్రీ నోరి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు.

పండితశిరోభూషణ మనదగు శ్రీ వ్యాకరణాచార్య నోరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు విభవ సం॥ జ్యేష్ఠ శుద్ధ షష్ఠి 25-5-28 వ తేది రాత్రి కాకినాడ జగన్నాథపురములో వారి స్వగృహమందు మృతినొందిరి. చనిపోవు నాటికి వీరికి సుమారు 70 సం॥ వయస్సుండును. నిరుపమ పాండితీ మండితులు, బహుభాషావిశారదులు. లోకమాన్య బాలగంగాధరతిలక్ మహాశయులు రచించిన గీతారహస్యమును మహారాష్ట్రభాషనుండి చక్కని తేటతెనుగులోని కనువదించి యాంధ్రభాషకు గొప్ప సేవజేసి ప్రసిద్ధిగాంచిరి.

---

## ఆకాశప్రభుత్వము

విద్వాన్ వారణాశి సూర్యనారాయణశాస్త్రిగారు

వుపిత సీమకుం దారకామండలాళి - కాకరంబైన యాకాశలోకమునకుం
జక్రవర్తి నవగ్రహ చక్రవర్తి - శశకుమారధరుండు ప్రెసాయిగారు
వారి చాతకములకు మంజూరు సేయ - సభకు విచ్చేయుచున్న పర్జన్యదేవు
మెయిలు బట్రోతున కెడందం బూను పట్ట - మమరచాపంబు గర్జమాహ్వానరవము
పరమసాధ్వి యరుంధతి పాలుగొనుచు - వరల సప్తర్షిసభ్య విభ్రాజితమయి
వర్ధిలుచునున్న దివి యూనివర్సిటీకి - ఛాన్సిలరు బ్రహ్మ, ధృవుండు వైస్ ఛాన్సిలరంట
గగన మను పాఠశాల నక్షత్రతతికి - విద్యగఱపు శశాంకు వైశద్యగరిమ
మాదిరి పరీక్షచేసి రిమార్కువ్రాయు - కాలునకుం దోకచుక్క వజ్రాలకలము
శాంతమై సమమై సువిశాలమైన - అభ్రరంగస్థలంబున నాటలాడు
భవ్యతర శీలు రగు నుడు బాలకులకుం - బూర్ణచంద్రుండు బాలు నంభోధి గోలు.

---

# భారతీయ మహిళామండలి



శ్రీమతి డాక్టరు వీరశింగి చిన్నప్పగారు, యం. బి., బి. యస్.



శ్రీమతి ఇ. కల్యాణికుట్టిఅమ్మ, యం. ఏ.

ఈమె 9 యేండ్లయి మదరాసు కార్పొరేషను నందు శిశుసంరక్షణ శాఖకు సూపరింటెండెంటుగ నుండెను. ఇపుడు సింహళద్వీపమునందు శిశుసంరక్షణ ఆరోగ్యశాఖయందు దాయీలకు శిశుసంరక్షణ మొసంగుటకై ప్రత్యేకోద్యోగిగ నియమింపబడెను. ఈమెసేవను ప్రశంసించుచు ప్రభుత్వమువారీమెకు కెయిజరి హిందుపతకము నొసంగియుండిరి. ఈమె మంచివక్తయు, వ్యాసరచయిత్రియు.

---

కాలికటు పురపాలక సంఘాధ్యక్షులగు ఇ. నారాయణనాయరుగారి కుమారిత, యవివాహిత, యగు నీమె చెన్నపురి విశ్వవిద్యాలయమునందు యం. ఏ. పరీక్షలో మొదటితరగతిలో రాజధానియందరికంటెను త్తమస్థానమునందు త్తీర్ణురాలయ్యెను.

---




# గ్రంథములు

## బుద్ధపురాణము

గ్రంథకర్త: దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు. క్రౌను సైజున ౧౨౩౦ పుటలు. వెల రు. ౪-౧-౧. విలాసము : మేనేజరు, మానవాదర్శగ్రంథమండలి, అంగలూరు, కృష్ణాజిల్లా.

ఈ గ్రంథము మానవాదర్శగ్రంథమాలయందలి ప్రథమపుష్పము. క్రీస్తుపూర్వ మారవశతాబ్దమున భారతదేశమున నవతరించి సర్వతోముఖముగ నహింసాధర్మమును బ్రతిపాదించి వెలయించిన మహాత్ముడగు బుద్ధదేవుని జీవితచరిత్ర మీ గ్రంథమున ప్రధానస్థానమును గైకొనినది. అట్లే యా మహనీయుని ధర్మోపదేశములు—బుద్ధగీతయను పేర వెలసినవి.—(బౌద్ధమతవాఙ్మయమునకు మూలగ్రంథములగు త్రిపిటకములలో నభిధమ్మపిటకమునందలి దగు 'ధమ్మపదమే' యీ బుద్ధగీత.) పాళీమూలముతోడను, ప్రక్కని తెనుగువివరణముతోడను రెండవభాగముగ నిందు వెలసినవి. ఇంతియకాక యీ రెంటిని మించిన 'పరిశిష్టము' మూడవభాగమయినది. ఈమూడును దేని కదియుత్కృష్టమయ్యును పరిశిష్టభాగము విశేషవిమర్శనముగలదగుటచే మూటిలో ముఖ్యమనదగియున్నది. వైదికవాఙ్మయమునుండియు, శాస్త్రగ్రంథములనుండియు, పురాణేతిహాసాదులనుండియు, భగవద్గీతనుండియు ఆంగ్లమతగ్రంథములనుండియు, మహాత్మాగాంధి, తిలకు, వివేకానంద మొదలయిన కారణజన్ముల రచనములనుండియు ఇతర మతగ్రంథములనుండియు వెలసినన్ని విమర్శనముల నుద్ధరించి చూపుచు భరతఖండమున వెలసిన భిన్నభిన్న మతధర్మములకును, బౌద్ధమతధర్మములకును సమన్వయము గల్పించి తనసిద్ధాంతములను స్థాపించుటయందు గ్రంథకర్తకావించిన పరిశ్రమ మింతింత యనరానిది. గ్రంథాదిని సృష్టిపై చిత్ర్యములను, వేదశాస్త్రాదివాఙ్మయమును విమర్శించుచు బుద్ధునియొక్కయు, తన్మతముయొక్కయు ప్రాశస్త్యమునుచాటు ౧౨౧ పుటల పీఠికగలదు. మొత్తమున ఈయుత్కృష్టగ్రంథము గ్రంథకర్తయొక్క బహుగ్రంథపరిశోధనమును, అనంత పరిశ్రమమును జాటుచున్నది.

బుద్ధదేవుని సదుపదేశములు భారతీయులకు బరమాదరణీయములు. అట్టి మహాపురుషుని జీవితమును, ధర్మములను, ఉపదేశములను గరతలామలకముగా వివరించుచున్న యీ గ్రంథము నాదరముతో జదువుట భారతీయుల కావశ్యకమని వేరుగ జెప్పబనిలేదు.

వచనరచనమైన యీ గ్రంథముయొక్క శైలి సరళముగ నున్నది. విసుగు జెందక యింతపెద్దగ్రంథమును రచియించి యాంధ్రలోకమున కర్పించిన గ్రంథకర్తగారికి మిగుల గొనియాడదగినది. ఆంధ్రలోకము వీరిపరిశ్రమను సఫలము గావించుగాక. వీరు రచియింపనున్న యితర బౌద్ధగ్రంథముల నచిరకాలమున నాంధ్రులకు లభింపు భాగ్యమును దైవ మనుగ్రహించుగాక!

## రామదాసస్వామి

గ్రంథకర్త: నిష్టలరామమూర్తి క్రౌనుసైజున ౧౭౧ పుటలు వెల రు ౧-౮-౦ ప్రకాశకులు: గుప్తబ్రదర్సు, బుక్ సెల్లర్సు, విశాఖపట్టణము.

రామభక్తాగ్రేసరుడను శివాజీమహారాజునకు గురువును, అతను సక్రవర్తియగుటకు గారణభూతుండును, రామభక్తాగ్రేసరుడును నగుసమర్థరామదాసస్వామి పవిత్ర జీవితమిందువర్ణితమైనది. ఈజీవితము తొలుత మహారాష్ట్రభాషను వెలసినది. పిదపడి భారతమాతృస్వాతంత్ర్యమునకయి తపములు ధారవోయుచు పలుబాధలనందుచున్న శ్రీయుత కిరణచంద్రముఖర్జిగారిచే వంగభాషలోనికి బరివర్తితమయినది. దానినుండి యుత్పన్నమయిన యాంధ్రవచనానువాదమిది. రామదాసస్వామి కేవల మొకమహాపురుషమాత్రుడేకాడు—గొప్పరాజనీతివేత్తయూడను. ఈ పురుషవరుని పవిత్రజీవితచరిత్రము నాంధ్రులెల్లరు నవశ్యముగ దెలిసికొనవలసినది. ‘ఇప్పుడును, స్వామివంటి మహాపురుషులుందురేని శివాజివంటి భారతీయచక్రవర్తులకు గొరంత యుండ’వని శ్రీ కిరణచంద్రముఖర్జిగారు తమ తొలిపలుకున (ఆంగ్లమునవున్నది) నుడివినమాట సత్యము. రచనము సరళముగ నున్నది.

## చంద్రమతి

గ్రంథకర్త: చెలికాని సూర్యారావుగారు, శ్రీరామవిలాసగ్రంథమాల, చిత్రాడ. క్రౌనుసైజున ౧౬౪ పుటలు. వెల రు ౧-౧౧-౦.

పురాణములయందు పతివ్రతాతిలకమని పేరుగాంచిన చంద్రమతీసతీమణి సచ్చారిత్ర మిందు తేటతెలుగు వచనమునవర్ణితమయినది. శంకరకవి, గౌరన మంత్రి మొదలయిన ప్రాచీనకవులరచనములనుండి యచ్చటచ్చట నితివృత్తమునకు సరిపడుపద్యములిందు పొందింపబడియున్నవి. ఇది పయిపేర్కొన్నగ్రంథమాలయందలి ౪౬ వ కుసుమము.

## నేటికాలపుకవిత్వం

గ్రంథకర్త: పండిత ఉమాకాంత విద్యాశేఖరులు. డిమ్మిసైజున ౨౪౬ పుటలు. క్యాలికోబైండు వెల రు ౨-౮-౧.

ఇది కృత్రిమదేశికబల సంపన్నులయిన అధునాతనకవిసార్వభౌములపై నెత్తిన యుద్దండ దండయాత్ర. ౧౯౨౬ వ సంవత్సరము ఏప్రిలుమాసమున చెన్నపురాంధ్రసభయందు గ్రంథకర్త యీగ్రంథస్థవిషయముల నుపన్యసించినారు. ఆయుపన్యాసములు ఆంధ్రపత్రికయందు ప్రకటితములైనవి. వాని విస్తృతస్వరూపమే యీగ్రంథము. భారతీయ సుసాధనసంపన్నమయిన యీదండయాత్రయందలి జయాపజయములమాట యెట్లున్నను కవితాతత్త్వజిజ్ఞాసువు లెల్లరు—ముఖ్యముగా కవులుగా గోరువారు—దీనిని జదువవలయును. గ్రంథకర్త సంస్కృతాంధ్రవాఙ్మయములయందలి లక్షణాలంకారగ్రంథముల నుండియు, కావ్యముల నుండియు, వైదిక వాఙ్మయగ్రంథముల నుండియు ప్రమాణముల నుద్ధరించి యీగ్రంథమున కవిత్వతత్త్వమును చక్కగా విమర్శించియున్నారు.

## దయాంభోనిధి

గ్రంథకర్త: పట్టి రామరావుగారు, గంధర్వమహల్, విజయనగరము. డెమ్మిసైజున ౭౬ పుటలు. వెల అ. ౪.

ఇందు భక్త్యతిశయమున గ్రంథకర్త వివిధవిధములం బరమేశ్వరుని స్తుతించినాడు. ‘శ్రీదయాంభోనిధీ’ అను మకుటముగల ౨౧౬ వృత్తము లిందుగలవు.

## కల్హారగంప

గ్రంథకర్త: పులికొండ పరబ్రహ్మముగారు, చినపారుపూడి, పామర్రుపోస్టు. డెమ్మిసైజున ౨౩ పుటలు. వెల రు ౦-౩-౧.

గ్రంథకర్త అప్పుడప్పుడు నాయాయి విషయములం గూర్చి చాటువులుగా రచియించిన పద్యము లిందు సంతరింపబడినవి. విషయవిమర్శనము చమత్కారముగ నున్నది. కవిత ధారాళముగను, సరసముగను ఉన్నది.

## శ్రీలక్ష్మీనృసింహస్తోత్రము

గ్రంథకర్త: పాలపర్తి సూర్యనారాయణగారు, హెడ్ మేస్టరు, ఆళ్లగడ్డ కర్నూలుజిల్లా. క్రౌను ౧౬ పేజీలసైజున ౨౦ పుటలు. వెల రు ౦-౪-౦

శ్రీశంకరాచార్యకృత సంస్కృతమూలము, అందొక్కొక్క శ్లోకమునకు సరియైన తెలుగుగీతపద్యము, తాత్పర్యము గలదు.

## గీతాశ్రయము

గ్రంథకర్త: ఇస్కుర్తి తిరుపతిరాయడు. క్రౌను సైజున ౫౫ పుటలు. వెల రు ౦-౪-౦

సత్యసాధనినుండి పునర్ముద్రితము. దైవమాహాత్మ్యమును ప్రపంచించు ౧౨౨ గీతిము లిందున్నవి. ప్రతిగీతమునకును 'అట్టిజగదేకమూర్తి నేనాశ్రయింతు' అనుమకుటముగలదు. శైలి సరళముగా నున్నది.

## ఓదార్పు

కర్త: గరికపాటి మల్లావధానిగారు; శ్రీగాంధిఆంధ్రజాతీయ మహావిద్యాలయము పండితులు, ఏలూరు. గ్రంథకర్త తనశిష్యుడగు మద్దుల వెంకటసత్యనారాయణమూర్తి యొక్కస్మృతి నుద్దేశించివ్రాసిన చిన్నశోకకావ్యమిది. మనస్సును గరగించునది. ఫూల్ స్కేపు సైజున ౯ పుటల చిన్నిపొత్తము.

## భద్రాద్రిరామ వేణుగోపాలతారావళులు

గ్రంథకర్త: చెళ్లపిళ్ల సుందరరావుగారు, డెమ్మి సైజున ౧౬ పుటలు. వెల రు ౦-౨-౦

భద్రాద్రి రామస్వామిని పెనికేరు వేణుగోపాలస్వామిని స్తుతించు సీసపద్యతారావళు లిందుగలవు.

## మాధవశతకము

గ్రంథకర్త: ఇనగంటి పున్నయ్య చౌదరిగారు, అప్పికట్ల, అప్పికట్లపోస్టు, గుంటూరుజిల్లా. క్రౌనుసైజున ౨౪ పుటలు. వెల రు ౦-౪-౦

'మాధవా' అనుమకుటముగల విష్ణుస్తుత్యాత్మకమగు వృత్తశతకము. ౧౦౮ పద్యములు. కవిత్వము నిర్దుష్టముగ ధారాశుద్ధిగలిగి ప్రాచీనశతకరచనముల ఫక్కిని ప్రౌఢముగను, రసవంతముగను నున్నది.

## గురుశిష్యసంవాదము

డెమ్మిసైజున ౮౨ పుటలు వెల రు ౦-౧౨-౦

శ్రీ తెనాలి చంద్రయసురుసాన్నిధ్యమున శ్రీగంగా వెంకటరత్నముగారు తెలిసికొనిన వేదాంతరహస్యము లీయాగ్రంథరూపమును దాల్చినవి. గురుశిష్యసంవాదరూపమయిన వచనరచనము. గ్రంథము చివరను పెక్కుగేయములును గలవు.

విలాసము: కాండూరి సుబ్బారాయకృష్ణమూర్తి, బెజవాడ.

## శ్రీకృష్ణరత్నములు

గ్రంథకర్త: బాలకవి కృష్ణారావుగారు, డెమ్మిసైజున ౫౮ పుటలు. వెల రు ౦-౨-౮. ఇందు ఎనుబది యొక్క నీతిగతపద్యములున్నవి. నీతులు సదృష్టాంతములుగ నుద్ధృతములయినవి. ప్రతిపద్యమున 'రమ్యగుణధుర్య పాపయరాజవర్య' అను మకుటమున్నది.

## స్తవరత్నములు (సంస్కృతము)

గ్రంథకర్త: నాగపూడి కుప్పుస్వామయ్యగారు, తిరుపతి. క్రౌను ౧౬ పేజీలసైజున ౮౩ పుటలు. వెల ౮ అ.

ఏతద్గ్రంథరచయిత నిదివఱ కాంధ్రపండిత కవిగనే యెంచిగిన యాంధ్రలోకమున కీసంస్కృతకృతి యాశ్చర్యమును గలిగింపకమానదు. ఇందు పదునాలు దేవదేవీస్తవములున్నవి. కవిత్వము లక్షణసమంచితమై హృదయంగమముగనున్నది. ప్రాచీన స్తోత్రరత్నముల కీ స్తవములు కిని తీసిపోవునవి కావు.

మచ్చునకు:

శ్రీకృష్ణస్తోత్రమున:

శ్లో. భూరిప్రేమ్ణా గృహీత్వా కతి చిపిటకణాన్
బాల్యమిత్రాదకార్షీత్
నిర్వ్యాజోద్వేలదీవ్యత్పరమకరుణయా
హేమచేలం కుచేలమ్,
క్రమశోమాంబరాభ్యాం కనకమణిమయ
స్రగ్ధరాం తస్య పత్నీం
భర్మప్రాసాదరమ్యం విమహితసదనం
యః కృపాబ్ధిం తమీడే.

శ్రీ వేంకటేశ్వర స్తోత్రమున :

శ్లో. శక్యా హి గాంగసికతాగణనా తథైవ
సాముద్రవాఃకణతతేరుడుసంచయానామ్;
త్వత్పాదసేవనగతాఖిలసంకటానాం
శక్యాం తు నైవ గణనం ఖలు వేంకటేశ!

ధన్యమణిహారమున :

శ్లో. నిత్యం సత్యే ప్రణిహితమతి
ర్వీతరాగిత్వవృత్తిః
ఇష్టానిష్టే ష్వ్వచలితమనా
యద్యహం స్యామజస్రమ్;
ఉద్వేగ స్స్యాద్ హృది తనుభృతాం
నైవమత్తః కదాచిత్
ఆనందాప్తిర్మనసి యది మే
కోఽస్తిధన్యో మదన్యః,

## ఆంధ్రప్రశస్తి : రసవత్ఖండకావ్యసంపుటి

గ్రంథకర్త: విశ్వనాథ సత్యనారాయణగారు 'రసతరంగిణి' గ్రంథమాలలోనిది ప్రథమసంఖ్యగల గ్రంథము. వెల రు. ౧-౧-౧ విలాసము : విశ్వనాథ వెంకటేశ్వర్లు, కృష్ణాపత్రికా ఆఫీసు, మచిలీపట్టణము. (కృష్ణా)

## జీర్ణ విజయనగర చరిత్రము

ఆంధ్రగ్రంథమాలలో ౯-వ సంఖ్యగల యీ గ్రంథము వెలువడినది; విక్రయమునకు సిద్ధముగ నున్నది. ఆంధ్రగ్రంథమాల, 7 తంబుశెట్టివీథి, చెన్నపురి. వెల రు. ౧-౮-౧.

---

# పత్రికలు

## సమదర్శిని - విభవసంవత్సరాది సంచిక

క్రౌను ౮ పేజీలసైజున ౧౫౦ పేజీలు.
వెల రు. ౧-౦-౧ మాత్రము

తెలుగుదేశములో సంవత్సరాదిసంచికలు ప్రచురించే అచారాన్ని ఆంధ్రపత్రిక తలపెట్టి క్రమంగా కొనసాగిస్తూఉంది. ఇటీవల రెండేండ్లక్రిందట 'సంక్రాంతి సంచిక' అనుపేర కృష్ణాపత్రిక ఒకసంచికను ప్రకటించి అట్లే యేటా ప్రకటిస్తానని వ్రాసికూడ ఏలనో మానివేసింది. ఇటీవల ౧౫ సం॥రం క్రిందట శ్రీ పింజల సుబ్రహ్మణ్యం శెట్టిగారి యాజమాన్యమున ఉదయించిన 'ఈ సమదర్శిని' పత్రికకూడ ఇపుడు తన మొదటి సంవత్సరాది సంచికను ప్రచురించింది. ఆంధ్రదేశీయులగు బ్రాహ్మణ బ్రాహ్మణేతర మహాశయులు పలువురురచియించిన వివిధవిధ సారస్వతశాఖలకు జెందిన వ్యాసాలను, కథలను, పద్యాలను, ఈ సంచిక ప్రకటించింది. ఇందలి వ్యాసాలన్నియు ప్రత్యేకప్రత్యేకంగా పేర్కొనదగినవి. చెన్నపురి బ్రాహ్మణేతర ప్రముఖులగు శ్రీ ఏ. రామస్వామి మొదలియారుగారును, ఏ.లక్ష్మణస్వామి మొదలియార్ గారును వ్రాసిన చక్కనివ్యాసాలు రెండున్నవి. బ్రాహ్మణేతరుల అభ్యుదయాభివృద్ధుల నుద్దేశించి వెలయుచున్న యీపత్రిక తనతొలిసంచికను బ్రాహ్మణేతర నాయకుడయి వాసిగన్న శ్రీ సర్ పిట్టి. త్యాగరాయశెట్టిగారి స్మరణార్థము ప్రకటించడం చాల సముంజసంగా ఉంది.

సంచిక ముఖపత్రముపైనున్న శ్రీ త్యాగరాయశెట్టిగారి సుందర త్రివర్ణచిత్ర మీసంచిక సౌందర్యమును పెంపొందిస్తూఉంది. శ్రీ ప్రమోదకుమార చటోపాధ్యాయుల 'పార్వతీపరమేశ్వరులు' మరియితర వంగీయ త్రివర్ణ చిత్రములు ౪, కీ. శే. మాగంటి అన్నపూర్ణాదేవి త్రివర్ణ చిత్రము ఇందుగలవు. బ్రాహ్మణ బ్రాహ్మణేతర నాయకులయు, ప్రముఖులయూ చిత్రములు ౧౫౦ ఇంకు వాటి వివరణాలతో ఉన్నవి. ఈ సంచిక తెలుగు పత్రిక లిదివరకు కాంచని క్రొత్తతీరున మున్నటగాఉంది. ఫెదర్ వెయిటు కాగితం, అచ్చుకూర్పు విధానము, వ్యాసాలు, చిత్రాలు, ప్రకటనాలు, అన్నీకలిసి యీ సంచికకు నూతనశోభను తెచ్చినవి. ఈసంచిక క్రొత్తదనమున ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచికలకన్న మిన్నగానున్నది. సర్వాంగసుందరంగా ఈసంచికను వెలయించిన శ్రీ సుబ్రహ్మణ్యంశెట్టిగారు ఎంతయు అభినందింపదగువారు.

ఈసమదర్శినీ పత్రిక అచిరకాలముననే దినపత్రికయై ప్రతియేటా ఇట్లే సంవత్సరాదిసంచికలను ప్రచురిస్తూ దేశసేవను కావించుచుండ సర్వేశ్వరుడనుగ్రహించుగాక

---

# సాభిప్రాయ విశేషములు

ప్రపంచము మహాప్రసవవేదన ననుభవించుచున్న విధమును ప్రపంచప్రవృత్తి విశదముచేయుచున్నది. ప్రపంచమునకు పరిపాటియైన ఆసురబలము యథాప్రకారము రాజ్యము చేయుచున్నది. మహాసంగ్రామము గలుగజేసిన దుఃఖవేదన శ్మశాన ప్రసూతి వైరాగ్యములవలె తాత్కాలికమైనది. యూరపు రాజ్యము లెప్పటివలె సంగ్రామ ప్రస్థానమునకు ప్రయత్నములను జేయుచున్నవి. ప్రబల రాజ్యభంజన సిద్ధాంతము నింగ్లాం డవలంబించుచున్నను ఆటలు సాగకున్నవి. రుష్యా, చీనా, అమెరికా రాజ్యములపట్లను నింగ్లాం డవలంబించిన రాజ్యతంత్రము నిర్వీర్యమైనది. గ్రేటుబ్రిటను స్థాపించిన ప్రపంచవ్యాప్తమైన మహాసామ్రాజ్యము సంగ్రామానంతరము పెరిగినను సామ్రాజ్యమును బంధించిన పాశబంధములు శిథిలములగుచున్నవి. ప్రముఖములైన వలసరాజ్యములు స్వాతంత్ర్య మార్గము నవలంబించుచున్నవి కనడా, ఆఫ్రికా, స్వాతంత్ర్యస్థితిని బడయుచున్నవి. ప్రపంచమునం దంతటను గ్రేటుబ్రిటను పన్నిన ఆర్థికబంధములు శిథిలము లగుచున్నవి. ఆర్థికబలమున కమెరికా కేంద్రస్థానమైనది. ఫ్రాన్సు, జర్మని, ఇటలి ఇంగ్లాండు మొదలగు యూరపు రాజ్యములన్నియును అమెరికా కప్పువడి యున్నవి. ఎత్తుపడియున్న స్థితియందు సైనికబల వ్యాపనము సకల రాజ్యములకును దుర్భరముగ నున్నది. అయినను గ్రేటుబ్రిటను, ఇటలి, ఫ్రాన్సు, సైన్య వ్యాపనమునకు, సంగ్రామములకు, సంసిద్ధముగ నున్నవి. సంగ్రామానంతర మీరాజ్యములు నిస్సహాయస్థితియం దున్న రాజ్యములను కబళించినవి. మొరాకో స్వాతంత్ర్యమును విధ్వంసముచేసి మూడురాజ్యములును చేరి స్వప్రయోజనార్థము టాంజీరు ఒడంబడికను జేసికొనినవి. స్వప్రయోజనము, పరపీడనము నను యూరపురాజ్యముల రాజ్యనీతి, సంగ్రామానంతరమైనను మార్పు చెందక నిలిచియున్నది. విల్సను మహాశయుడు ప్రతిపాదించిన స్వల్పరాజ్య సంరక్షణ సిద్ధాంతము యూరపురాజ్యములకు కొంతవర కన్వయించిననుతదితర రాజ్యముల కన్వయించని విధమును ప్రపంచచరిత్రము వేయినోళ్లను వెల్లడిచేయుచున్నది. శ్వేతజాతు లాచంద్రార్కము ప్రపంచాధికారమును గలిగియుండుటకు తెల్లజాతులు విశ్వప్రయత్నము చేయుచున్నవి. ఈప్రయత్నములందు బ్రిటీషు రాజ్యనీతిజ్ఞులు నాయకత్వమును వహించుచున్నారు. కాని వారి ప్రయత్నములు నిరర్థకములని ప్రపంచ పరిస్థితులు విశదము చేయుచున్నవి.

* * * *

**రుష్యాపరివర్తనము**

యూరపునందు ప్రబలమైన రుష్యారాజ్యము సంపన్నమైన బ్రిటీషు రాజ్యవిలయమును గోరుచున్నది. రుష్యాను సాధించుటకు బ్రిటీషురాజ్యము చేసిన ప్రయత్నములు నిష్ఫలములైనవి. బ్రిటీషురాజ్యనీతిజ్ఞులు రుష్యాను సాధించుటకు పన్నిన తంత్రములన్నియును నిరర్థకములైనవి. దండనోపాయమైన సైన్యప్రస్థా

నము పరాజయమును బొందినది. సాధనమైన ఆర్థికప్రస్థాన మపజయమును బొందినది. భేదోపాయమైన కుతంత్రములు నిరర్థకములైనవి. సామోపాయము మాత్రము శేషించియున్నది. ధనస్వామ్యత్వమునకు నాయకమణియైన బ్రిటనునకును, ధనస్వామ్యత్వమును నాశనము చేయుటకు కంకణమును గట్టుకొనిన రుష్యాకును సామోపాయము వర్తమాన పరిస్థితులందు సాధ్యముగాదు.

రుష్యా మానవసంస్థాపనలందు మహాపరివర్తనమును జేయుటకు బూనుకొని యున్నది. ఫ్రెంచిపరివర్తనము ప్రతిపాదించిన మానవస్వాతంత్ర్యమును మానవసౌభ్రాతృత్వమును, మానవసామ్యత్వమును నిత్యవ్యవహారములందు ప్రవర్తింపజేయుటకు రుష్యా సమకట్టినది. బుద్ధభగవాను డుపదేశించిన ప్రేమతత్త్వమును ప్రాపంచిక మానవ వ్యవహారములందు ప్రవర్తింప జేయుటకు సమకట్టినది. రుష్యాలక్ష్యము భౌతికపరిస్థితులందు లగ్నమగుచున్నటు లాధ్యాత్మికపరిస్థితులందు లగ్నముం గాకున్నది. "సర్వేజనా స్సుఖినో భవన్తు" అని సంకల్పమునందు కోరుచున్నను వ్యవహారమునందు సాధ్యము గాకున్నది. ప్రపంచమునందు ధనవంతులు ధనహీనులను ప్రేమించుటకు బదులు పీడించుట పరిపాటియైనది. ధనరహితు లన్నవస్త్రములులేక మహాదుఃఖవేదన ననుభవించుచున్న విధమును మన మనుక్షణమును కన్నులార గాంచుచున్నాము. వారి తరణోపాయమునకు సాధనములు శ్రీమంతుల దయాదాక్షిణ్యములమీద నాధారపడియున్నవిగాని మానవధర్మములమీద నాధారపడియుండలేదు. లోకమునందు శ్రీమంతులు కొలదిగను దరిద్రు లనంతముగను నున్నారు. రుష్యారాజ్యము శ్రీమంతదరిద్రభేదమును,యజమానికార్మికభేదమును, రైతు కూలివాని భేదమును నిర్మూలముచేయుచున్నది. సోవియటుభావము దారిద్ర్యగ్రస్తమైన ప్రపంచమునందంతటను వ్యాపించుట సహజము. ముఖ్యముగ పరమదారిద్ర్యగ్రస్తమై,జాతిమతభేదముల కాలవాలమైన భారతవర్షమునందు సోవియటు సిద్ధాంతములు త్వరితగతిని వ్యాపించుట సహజము. దేశమునందు వ్యాప్తములైన శాఖాభేదములు,కులభేదములు,జాతిభేదములు, పారతంత్ర్యము సోవియటు సిద్ధాంతముల వ్యాపకమునకు స్వాగతము నొసంగగలవు. బ్రిటీషుప్రభుత్వము సోవియటుభయవ్యాజముతో స్వదేశసంస్థానములను బ్రిటీషు రాజ్యమును స్థిరతరముగ బంధించుటకు విశ్వప్రయత్నములను జేయుచున్నది.

సైమనుకమిషను, బట్లరుకమిషను రాజ్యాంగసంస్కరణములు, ఈనాటకప్రదర్శనములోని కొన్ని రంగములు. భారతభూమికి సంప్రాప్తము గానున్న మహావిప్లవము దుర్గ్రాహ్యము. హిందుమహమ్మదీయసంరంభము, బ్రాహ్మణబ్రాహ్మణేతరసంరంభము, అగ్రజాతినిమ్నజాతిసంరంభము, నిరంకుశప్రభుత్వప్రజాసంరంభము, గలుగజేయనున్న మహాదుఃఖమును సంభావించుటయైనను సాధ్యముకాకున్నది. ఈ అంతర్విభేదములు బ్రిటీషు నిరంకుశత్వమును స్థిరతరముచేయుచున్నవి. మానవప్రయత్నములు నిరర్థకములుగ గన్పట్టుచున్నవి. సకలమును దైవాధీనమైయున్నది. రుష్యారాజ్యము ఆరంభించిన సోవియటు సంస్థాపనలు విజయవంతములై మానవదుఃఖనివృత్తి

కిని, శాంతిస్థాపనమునకును, సాధనములైన మానవధర్మసంస్థాపనమందు నూతనయుగారంభము సాధ్యము గాగలదు. కోటీశ్వరులు రాజ్యము చేయుచున్న యుగమునందు భగవత్సంకల్ప మెటుల పరిణమించునో కాలగర్భమునందు కలదు.

*  *  *  *

చీనాసంరంభము

రష్యాయందు వలె చీనాయందును బ్రిటీషురాజ్యతంత్రము పరాజయమును పొందినది. జపాను అమెరికా రాజ్యముల సహాయము లేకను బ్రిటీషు మరఫిరంగులు, సైన్యములు, యుద్ధనావలు, వాయు విమానములు, నిరుపయోగములైనవి. గ్రేట్‌బ్రిటను కోట్ల రూప్యములను వ్యయముచేసి మరలిపోవలసి వచ్చినది. చీనాస్వాతంత్ర్య సంరంభమునందు బ్రిటీషు రాజనీతిజ్ఞు లవలంబించిన తంత్రము వారి స్వభావమున కనురూపముగ నున్నది. ఉత్తరభాగమును దక్షిణభాగము మీద లేవదీసి స్వప్రయోజనమును సాధించుటకు ప్రయత్నము చేసినది. ఇతరరాజ్యము లవలంబించిన తటస్థభావము బ్రిటీషు తంత్రములను విఫలము చేసినది. అయినను చీనారాజ్యము నందు సమయము వచ్చినపుడు ప్రవేశమును కల్పించుకొని స్వప్రయోజనములను సాధించు కొనుటకు వేచియున్నది. ప్రపంచమంతయును బ్రిటీషురాజ్యనీతిని శంకించుచున్నది. తూర్పు ప్రాంతములయందు బ్రిటీషు ప్రాబల్యమును సూర్యధ్వజము సంపూర్ణముగా నరికట్టినది ఏకజాతికిని ఏకమతమునకును జెందిన మహా బలసంపన్నములైన చీనాజపానురాజ్యములకు సంయోగము గలుగునపుడు తూర్పు ప్రాంతములందు బ్రిటీషుప్రాబల్యముతోపాటు శ్వేతజాతుల ప్రాబల్యము నస్తమింప గలదు. మానవ ధర్మాభ్యుదయమునకును, ప్రపంచ శాంతికిని, చీనాస్వాతంత్ర్యమును, చీనాజపాను సంయోగమును పరమావసరములుగ నున్నవి.

*  *  *  *

మహమ్మదీయ ప్రబోధము

దూరస్థప్రాగ్దేశములందు సూర్యధ్వజము వలె సన్నిహిత ప్రాగ్దేశములందు చంద్రధ్వజము బ్రిటీషుప్రాబల్యమునకు ప్రతిబంధకముగ నున్నది. మహమ్మదీయరాజ్యము లన్నియును మేల్కాంచి స్వాతంత్ర్యమును ప్రకటించుచున్నవి. బ్రిటీషురాజ్యనీతిని యథోచితముగ ప్రతిఘటించుచున్నవి. తుర్కీ సంపూర్ణస్వాతంత్ర్యము ననుభవించుచున్నది. పారసీకము, అఫ్గనిస్థానము బ్రిటీషుఅధికారపాశములను నిర్మూలము జేసినవి. పారసీకమునకును, అఫ్గనిస్థానమునకు, తుర్కీకిని సంధి ఏర్పడినది. అఫ్గన్ అమీరునకు యూరపురాజ్యములు, ముఖ్యముగ గ్రేట్‌బ్రిటను చూపిన గౌరవ సన్మానములు విస్మయమును గలుగజేసినవి. ఇంగ్లీషువార్తాపత్రికలు వందిమాగధులవలె నమీరును పొగడినవి. పదేండ్లక్రితము అఫ్గనురాజు దీనిలో దశాంశమైన గౌరవమైనను పొందియుండడు. ఇతర ప్రాంతములందు బ్రిటీషురాజ్యమునుండి జారిపోవుచున్న ప్రాబల్యమును నిస్సహాయస్థితియందున్న భరతవర్షము మొదలగు దేశములందు స్థిరతరము చేయుటకు బ్రిటీషు రాజ్యనీతిజ్ఞు లవలంబించుచున్న వర్తమాన రాజనీతి విశదము చేయుచున్నది. బర్కెనుహెడ్డుప్రభువుగారి ప్రలాపములు ఇందులకు నిదర్శనములుగ నున్నవి.

*  *  *  *

బట్లరుకమిషను

బట్లరుకమిషనుచర్యలు అతి గోప్యముగ నున్నవి. హిందూదేశమునందు 627 స్వదేశ సంస్థానములు గలవు ఆ సంస్థానములకును బ్రిటీషుప్రభుత్వమునకునుగల సంబంధము చిరకాలముక్రిందట వారివారి యావసరములనుబట్టి నిర్ణయింపబడినది. కాలము మారినది దేశము వృద్ధిబొందెను. బ్రిటిషుప్రజలు విద్యాసంపదలను బడసిరి. ప్రభుత్వము సంస్థానాధీశులను కారణాంతరములవలన తొలగించుటకు అధికారమును గలిగియున్నది. అయినను సంస్థానాధీశులు వారి సంస్థానములందు నిరంకుశాధికారమును గలిగియుండుట కవకాశములుగలవు. మైసూరు, బరోడా మొదలగు సంస్థానములందు సంస్థానాధీశుల నిరంకుశత్వము కొంత నియమింపబడినను దేశమునం దంతటను సంస్థానాధీశులు యథేచ్ఛగ పరిపాలించు చున్నారు. మైసూరు మహారాజువంటి సాధుప్రభువులరుదుగ బుట్టుచుందురు. వారి శాంతదయాశౌచభావములు వారిని పూజాపాత్రులను జేసినవి. కాని వర్తమానమునందు సుపరిపాలన యుగము పోయి స్వపరిపాలన యుగమేర్పడినది. బ్రిటీషుఇండియాప్రజలు ప్రజాపరిపాలనమును బడయుటకు మహాప్రయత్నములను జేయుచున్నారు. బ్రిటీషుఇండియా యందు బాధ్యతాయుత పరిపాలనమును సంస్థానములందు నిరంకుశపరిపాలనమును సాధ్యములుగావు. బ్రిటీషుఇండియాయును, సంస్థానములును ఒకమార్గమున నే నడచినగాని సంయుక్తభారత సామ్రాజ్యముగానేరదు. కాని బట్లరుకమిషను ఈ మహాప్రయోజనమును సమకూర్చుటకు ఏర్పడలేదని వ్యవహారములు విశదము చేయుచున్నవి. సంస్థానాధీశులు తమ యధికారమును సంరక్షించుకొనుటకును, వృద్ధిచేయుటకును కోరుచున్నారు. బ్రిటీషుప్రభుత్వము స్వీయాధికారమును సంస్థానములమీద స్థిరతరము చేయుటకు కోరుచున్నది. సర్ లేలి విల్సనుగారు నిరూపించిన త్రివర్గప్రభుత్వ మీ సంకల్పసిద్ధి కనుకూలముగ నున్నది. వారి విధానము బ్రిటీషుఇండియాకును, సంస్థానములకును విభేదములను స్థిరతరము చేయుచున్నది. బ్రిటీషుఇండియా నడుమనున్న సంస్థానములు మహాప్రవాహమునందు మునిగిపోవుట సంభవముగాని స్వాతంత్ర్యమును గలిగి నిలిచియుండుట సాధ్యముగాదు. సంస్థానముల ప్రత్యేకత్వము బ్రిటీషుప్రయోజనములకు వినియోగపడునుగాని సంస్థానముల ప్రయోజనములకుగాని, భరతవర్ష ప్రయోజనములకుగాని వినియోగపడదు. స్థిరోపసంఘము ప్రబలమైన బ్రిటిషు ప్రయోజనములను సంరక్షించినటులు బలహీనములైన సంస్థానములను సంరక్షింపజాలదు. స్వదేశసంస్థానాధీశులు వారి యధికారలాభములను విసర్జించి బ్రిటీషుఇండియాతో కలిసిపనిచేయనంతవఱకును దేశమోక్షము దుస్తరము. బ్రిటీషుప్రభుత్వము స్వదేశసంస్థానములను విడదీసి స్వాతంత్ర్యభారతమును దుస్సాధ్యముచేయుట సహజము. సంస్థానాధీశులు బ్రిటీషు మారోపాయములను శిరసావహించుచు భారతస్వాతంత్ర్యమును దూరస్థముచేయుట యవివేకము సంస్థానములందు ఒకతాలూకా వైశాల్యముగల సంస్థానములు గలవు. అవియును ప్రత్యేక లాభములు కోరుట దేశాభ్యుదయమునకు ప్రతిబంధకము. బట్లరుకమిషను పంపిన ప్రశ్నావళికి నిరువది సంస్థానములు మాత్రము సమాధాన మిచ్చుట

కంగీకరించినవి. సర్ లేలీ స్కాట్ 160 సంస్థానములపక్షమున సమాధానము చెప్పుటకు నియమింపబడెను. వీరిసమాధానమే రూపమును దాల్చునో కాలము విశదము చేయగలదు. కాని పర్యవసానము దేశదాస్యవిమోచనమున కనుకూలముగ నుండదను నభిప్రాయము ప్రబలుచున్నది. జపానురాజ్యమునందువలె ప్రభువులు, కులీనులు వారిస్వాతంత్ర్యలాభములను విసర్జించి మహాత్యాగము చేయుటయే భారతమాత నుద్ధరించుటకు సత్యసాధనమని భారతపుత్రులందరును గ్రహించవలసియున్నది. ఈ త్యాగము మహాదుఃఖానుభవానంతరము గలుగుట భగవత్సంకల్పముగ నున్నది.

* * * *

సైమనుకమిషను

బ్రిటీషు ఇండియా ప్రజలకు సైమనుకమిషనుతోగల సన్నిహితసంబంధము బట్లరుకమిషనుతో లేదు. సర్ జాన్ సైమనునకు భారతదేశపరిస్థితులను చూచిన తరువాతనైనను వివేకము గలుగకుండుట శోచనీయము. అన్నిరాజకీయపక్షములవారును సైమనుసప్తకమును బహిష్కరించిన విధము శిలాక్షరములతో వ్రాయబడినది. ఢిల్లీయందు నాయకులను భేదించి బహిష్కరణోద్యమమును పాడుచేయుట కధికారులు చేసిన ప్రయత్నములను చమన్ లాల్‌గారు వెల్లడిచేసినారు. ఈ సందర్భమునందు జిన్నాగారు చూపిన స్థిరసంకల్పము ప్రశంసనీయముగ నున్నది. దేశమునం దన్నిపక్షములవారును సైమనుసప్తకమును బహిష్కరించుటయం దేకాభిప్రాయులై యున్నారు. కాని మధ్యమధ్య సహకారభావమును ప్రకటించెడి నాయకులు బయలుదేరుచుందురు. వారి భావపరివర్తనమునకు స్వలాభము నిమిత్తముగాని దేశప్రయోజనము నిమిత్తముగాదు. ఇటువంటి మహానుభావు లన్నిదేశములందును పుట్టుచునే యుందురు.

ఉపసంఘములను నియమించుట కధికారవర్గము చేయుచున్నప్రయత్నములు గర్హ్యములుగ నున్నవి. లాలాలజపతిరాయిగారు హెచ్చరించినట్లు సైమనుసప్తకమునకు సహాయముచేసెడి భారతీయనాయకులు దేశద్రోహదోషమునకు గురియగుచున్నారు. రాజా నరేంద్రనాథునివంటి స్వార్థపరులు దేశమునకు అవమానమును గలుగజేయుచున్నారు. అన్నిపక్షములవారును స్వలాభములను విడనాడి దేశగౌరవమును గాపాడవలసిన యవసరమును సైమనుగారి ప్రసంగములు, బర్కెన్ హెడ్డుగారి ప్రసంగములును విశదముచేసినవి. సర్ జాన్ సైమనుగారు కమిషనులో నేవిధమైన మార్పును గలుగజాలదని ఇంగ్లండునందు పునః ప్రతిపాదనము చేసిరి. అయినను కొందరి నేవో భ్రాంతి వదలకుండుట శోచనీయముగ నున్నది. రామ్సే మాక్డనాల్డుగారు తెలిపినట్లు భారతీయోపసంఘములను నియమించుట నిరుపయోగము.

ఈ సందర్భమునందు జస్టిసుపక్ష వైఖరియును సందిగ్ధముగ నున్నది. జస్టిసుపక్షము సైమనుసప్తక బహిష్కరణమును నామోదించినది. తదనుగుణముగ శాసనసభలయందు ప్రవర్తించినది. ఉపసంఘనియామకమునందు జస్టిసుపక్ష మవలంబింపనున్న మార్గము గుహ్యముగ నున్నది. చెన్నపురి ప్రభుత్వవర్గము జస్టిసుపక్షనాయకుల చేఁదీసి ఉపసంఘ

నియామకమును జేయించుటకు విశ్వప్రయత్న మునుజేయుచున్నటులు ప్రబలవదంతులు గల వు. ఉదకమండలమునందు గూడిన సభయందు శ్రీ పానగల్లు రాజాగారును, రామస్వామి మొదల్యారుగారును నీ విషయముపట్ల మూకీ భావమును వహించిరి. కాని వారి పక్ష మవలం బించెడి మార్గమును కాలము విశదము చేయ గలదు.

సైమనుకమిషను బహిష్కరణ విషయమై భరతవర్షమునం దభిప్రాయము బలతరమగు చున్నది. తెల్లకమిషనును మార్చుటకు వీలు లేదని సైమనుగారు వెల్లడిచేసిరి. మార్గాంత రములను నాయకులు వారి సంస్కారముల కనుకూలముగ నిర్ణయించుచున్నారు. ఆ మా ర్గములందు పయొనీరుపత్రిక నిర్ణయించిన సాధ నము విశేషాకర్షణమును బడసినది. సామ్రా జ్యశాసనసభలు "ఒక కమిషను నియమింప బడవలె"ననియును "ఆకమిషను సామ్రాజ్యాధీ శుని సమ్మతిని బడసి, సైమనుకమిషను వలెనే స్వాతంత్రముగ విచారణ సలుపవలయు"నని యును సూచించుచున్నది. ఈ విధానమునే రామస్వామి మొదల్యారుగారు కొనియాడుచు దాని లాభములను ఉదకమండలసభయందు విశదము చేసిరి. పార్లమెంటు నియమించిన కమిషనునకును, సామ్రాజ్యశాసనసభలు నియ మించిన కమిషనునకును తారతమ్యము గలదని అందఱును అంగీకరింప గలరు. విచారణ యం దును వ్యవహారక్రమమందును, సంప్రతింపుల యందును తెల్లనల్ల కమిషనులభేద మేర్పడుట సహజము. భారతీయ కమిషను రిపోర్టునకు, పార్లమెంటునందు సైమను కమిషను రిపోర్టు నకుగల ప్రతిపత్తి గలుగజాలదు. అన్నియును సమకూడినను సైమనుకమిషనునుండి భార తీయులను బహిష్కరించిన అవమానాగౌరవ ములు నిలిచియే యుండును. సైమనుకమిషను నుండి భారతీయులను బహిష్కరించిన దో షము బ్రిటీషురాజనీతిజ్ఞుల మీద గలదు. ఆ దోషమును సవరించుకొనవలసిన భారము పార్లమెంటుమీదను బ్రిటీషురాజనీతిజ్ఞుల మీ దను గలదుగాని భారతీయులమీద లేదు. ఈ సందిగ్ధస్థితియందు నాయకులకు సైమనుకమి షను బహిష్కరణమే శరణ్యముగనున్నది గాని మార్గాంతరము గనుపడదు. భారతీయు లందఱును సైమనుకమిషను బహిష్కరణవ్రత మును స్వీకరించి భారతమాత గౌరవమును గాపాడుట యవసరము.

* * * *

నానాపక్షసభ

గతమాసమునందు ఢిల్లీయందు గూడిన నానాపక్ష సభా వ్యవహారములు సంతృప్తికర ముగ నున్నవి. వివిధజాతులకును, మతముల కును, కులములకును నిలయమై సువిశాలమైన భరతవర్షమునందు స్వరాజ్యసమస్యను నిర్ణ యించుట సుకరముకాదు. ముఖ్యముగ పరా ధీనస్థితియందున్న దేశమునందు ఇది దుస్త రము. విదేశీయాధికారులు ప్రత్యేకలాభము లను గల్పించి జాతులను, సంఘములను, వ్యక్తు లను విడదీయుట సుకరము. హిందూమహమ్మ దీయవిభేదములు, బ్రాహ్మణబ్రాహ్మణేతర విభే దములు విదేశీయప్రభుత్వమునకు దోహదంబు నొసంగి కాపాడుచున్నవిధమును దేశవ్యవహా రము లనంతముఖముల ఘోషించుచున్న వి. అభిమానము పారతంత్ర్యమునకు సమ్మ తించును గాని త్యాగమునకు సమ్మతింపదు.

కాని వర్తమాన మరణావస్థయందు సకల సంఘములకును స్వాభిమానమును విడిచి త్యాగమును బూనవలసిన యవసరము విశదమైనది. హిందూమహమ్మదీయ నాయకులు ప్రత్యేకనియోజకవర్గమును విడనాడి సంయుక్తనియోజకవర్గము నామోదించుట శుభప్రదముగ నున్నది. జనసంఖ్య ననుసరించి మహమ్మదీయులకు స్థానములను సంరక్షించుటకు అంగీకరింపకుండుట శోచనీయము. డాక్టరు అన్సారీగారు చెప్పినటులు హిందూ మహమ్మదీయులకు అన్యోన్య విశ్వాసము బలపడినపుడు మహమ్మదీయులకు స్థానసంరక్షణావసరము తొలగిపోవును. సింధుదేశమును ప్రత్యేకరాష్ట్రముగ నిర్మించుటయందు హిందూనాయకులు చూపుచున్న అభ్యంతరము ప్రశంసార్హము కాదు. భాషాప్రయుక్తరాష్ట్రవిభాగసిద్ధాంతమును అంగీకరించునపుడు దేశక్షేమమును గమనించుట ధర్మము గాని హిందువుల ప్రయోజనములనుగాని, మహమ్మదీయుల ప్రయోజనములను గాని గమనించుట నిరుపయోగము. అనేక భాషలుగల దేశమునం దిట్టిలోటుపాట్లు సహజముగ గలుగుచుండును. నివారణోపాయము పరస్పర విశ్వాసముగాని ప్రత్యేకలాభములను పొందుటగాదు. హిందూనాయకులును,మహమ్మదీయ నాయకులును వారి లక్ష్యమును సాంఘిక ప్రయోజనములనుండి దేశప్రయోజనములయందు లగ్నము చేయునంతవఱకు దేశమునకు తరణోపాయము దుస్సాధ్యము. తల్లి పరాధీనయై కృశించుచున్నపుడు పిల్లలు ప్రత్యేక లాభములను బొందియు సుఖింపజాలరు. తెల్లకమిషను హిందూమహమ్మదీయ నాయకులకు కొంతవఱకు ఈగుణపాఠము నేర్పినందులకు సంతసింపవలసియున్నది. భారతీయు లందఱును నిత్యజీవనమునందు ఈసత్యమును గ్రహించి మాతృదేశము నుద్ధరింతురు గాక! స్వరాజ్యాంగవిధానమును నిర్మించుట కేర్పడిన యుపసంఘము తనవిధిని నిర్వహింపగలదు. కాని ఆ యంగవిధాన మన్ని పక్షములవారికిని సంతృప్తిని కలిగింపజాలదు. వర్తమానకాలమునందు స్వరాజ్యసంపాదనమునకు సాధనము భారతీయుల కార్యశూరత్వము గాని నాయకుల స్వరాజ్యాంగ విధాన సామర్థ్యము కాదు. భారతీయ స్వాతంత్ర్యము ప్రజాశక్తిమీఁద నాధారపడి యున్నది. తెల్లకమిషనులు, నల్లకమిషనులు యెన్నియో వచ్చిపోవచ్చును; రాజ్యాంగములు మారవచ్చును. ప్రజాశక్తి విజృంభింపనంత వఱకు నంతర్దాస్యమునుండియును, పరదాస్యమునుండియును దేశమునకు తరణోపాయము గలుగజాలదు. దేశక్షేమపరాయణు లందఱును వారి లక్ష్యమును ప్రజావికాసమునకు వినియోగించి కృతార్థు లగుదురు గాక !

---

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No.7, Thumbu Chetty Street, G.T, Madras

